# విజ్ఞాన సర్వస్వం

సంపుటం-5

## విశ్వసాహితి



కొమర్రాజు వెంకట లక్ష్మణరావు
విజ్ఞాన సర్వస్వ శాఖ
తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు - 500 004

# విజ్ఞాన సర్వస్వం

## ఐదవ సంపుటం

# విశ్వసాహితి




సంపాదకులు

ఆచార్య కొత్తపల్లి వీరభద్ర రావు

ఆచార్య డి.వి. కె.రాఘవాచార్యులు

ఆచార్య ముదిగొండ వీరభద్ర శాస్త్రి

సంగ్రాహక సంపాదకులు

శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

డా. పి.చంద్రశేఖర్ (సహాయకులు)

శ్రీ టి.నాగరాజ శెట్టి (సహాయకులు)

సమన్వయ సంపాదకుడు

డా. కె.ఆనందన్

*1994*

**VIJNAANA SARVASWAM (VOL.V) - VISWA SAAHITI**

*(Encyclopaedia in Telugu (Vol.V) : World Literature)*

| | |
|---|---|
| *Editors:* | **Prof. K.Veerabhadra Rao**<br>**Prof. D.V.K.Raghavacharyulu**<br>**Prof. M.Veerabhadra Sastri** |
| *Compiling Editors:* | **Sri B.Srinivasacharyulu**<br>**Dr. P.Chandra Sekhar** *(Assistant)*<br>**Sri T.Nagaraja Chetty** *(Assistant)* |
| *Co-ordinating Editor:* | **Dr. K.Anandan** |
| *Artist:* | **Sri G.V.Amareswara Rao** |

*Published by :*

*Publication No.:150*

*December, 1994*

*Copies: 2000*

*For Copies :*
*REGISTRAR*
*TELUGU UNIVERSITY*
*Lalitha Kala Kshetram,*
*Public Gardens,*
*Hyderabad - 500 004.*

*Price : Rs.100/-*

*Laser Set at :*
**KOMARRARAJU VENKATA LAKSHMANA RAU**
**VIJNANA SARVASWA SAKHA**

*Offset Print at :*
LAKSHMI PRINT & PACKS
Lakdikapool, Hyderabad. Tel : 314991

ఆచార్య పేర్వారం జగన్నాథం
ఎమ్.ఏ., పి హెచ్.డి.

ఉపాధ్యక్షులు
తెలుగు విశ్వవిద్యాలయం
లలితకళా క్షేత్రం, పబ్లిక్ గార్డెన్స్
హైదరాబాదు - 500 004

# ప్రవేశిక

మానవుడు విశ్వమానవుడుగా ఎదిగేందుకు విశాల హృదయంతోపాటు వివిధ విజ్ఞాన విశేషాలు కూడా ఎప్పటికప్పుడు సమకూర్చుకోవలసిన అవసరం ఉంది. ఈ అవసరం గుర్తించిన ప్రాజ్ఞుడు కనుకనే ఎనభైయేళ్ళ క్రిందట శ్రీ కొమర్రాజు వెంకటలక్ష్మణరావు ఆంధ్ర విజ్ఞానసర్వస్వ రచనకు శ్రీకారం చుట్టారు. ఒక్క వంగభాషలో తప్ప సర్వభారతీయ భాషల్లోను విజ్ఞానసర్వస్వ రచనకు కొమర్రాజు వారిదే ప్రథమ ప్రయత్నం. ముచ్చటగా మూడు సంపుటాలు విడుదల చేసిన తరువాత 1923 లో ఆయన కన్నుమూశారు. అటు తరువాత ఆ మహాకార్యాన్ని శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు గారు కొనసాగించాలని ప్రయత్నించినా అది పూర్తిగా కార్యరూపం ధరించకుండానే వారు కూడా 1938లో దివంగతులైనారు. వ్యక్తులెంత దృఢసంకల్పులైనా సంస్థల కుండే సౌకర్యం వ్యక్తుల కుండకపోవచ్చు. అదృష్టవశాత్తు విజ్ఞానసర్వస్వ నిర్మాణానికి స్వచ్ఛంద సంస్థగా తెలుగుభాషా సమితి ముందుకు వచ్చింది. భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించి, నవమాసాలు నిండబోయే శుభసమయానికి అనగా 1948 మే మాసంలో తెలుగుభాషా సమితి విజ్ఞానసర్వస్వ నిర్మాణ ప్రయత్నాలు చురుకుగా ప్రారంభించింది. 1956 వరకు మద్రాసులోను, అటుపిమ్మట హైదరాబాదులోను కార్యస్థానాన్ని ఏర్పరుచుకొని, ఒక పావుశతాబ్ది కాలంలో 14 సంపుటాలు విడుదల చేయగలిగింది. 1983లో తెలుగు సంస్కృతి *(దేశము-చరిత్ర)* సంపుటం విడుదలైంది. అటు తరువాత తెలుగుభాషా సమితి 1985లో ఆవిర్భవించిన తెలుగు విశ్వవిద్యాలయంలో విలీనం కావటం జరిగింది. విలీనమైన తరువాత విశ్వవిద్యాలయంలోని విజ్ఞానసర్వస్వ శాఖ విజ్ఞానసర్వస్వ రూపకల్పనకు ఆద్యుడైన కొమర్రాజువెంకటలక్ష్మణరావు పేరుతోనే వ్యవహృతం కావటం అందరికీ తెలిసిందే.

ఇది తెలుగు విశ్వవిద్యాలయంలోని విజ్ఞానసర్వస్వ శాఖ పూర్వరంగం. తెలుగుభాషా సమితి చేసిన మహాకృషిని సద్వినియోగం చేసుకుంటూ తెలుగు విశ్వవిద్యాలయం 1987లో తెలుగు సంస్కృతి ద్వితీయ భాగాన్ని పరివర్ధిత సంపుటంగాను 1992లో దర్శనములు-మతములు లఘుసంస్కరణలతో కూడిన ద్వితీయముద్రణగాను విడుదల చేయడం జరిగింది.

ప్రస్తుతం తెలుగు విశ్వవిద్యాలయం విశ్వసాహితి అనే సంపుటాన్ని విడుదల చేస్తున్నది.

లోగడ 1961లో తెలుగుభాషా సమితి విజ్ఞానసర్వస్వసంపుటులలో ఆరవదిగా విశ్వసాహితి అనే విడుదల చేసింది. అందులో ప్రధానంగా నాలుగు భాగాలున్నాయి. 1. భాషా విభాగం 2. లక్షణ సారస్వత విభాగం. ఈ మూడూ సమీక్షావ్యాస సమన్వితాలు, నాల్గవ విభాగంలో అకారాది ముఖ్య వివరించబడినాయి. మొత్తం సంపుటిలోని భాషాసారస్వత విభాగాలలో 18 భారతీయ భాషాసా గూర్చి 23 భారతీయేతర విశ్వభాషాసారస్వతాలను గూర్చి వివరించడం జరిగింది. లక్షణ విభాగంలో కావ్యాలంకార లక్షణ విశేషాలు వివరించబడినాయి. ఈ విశేషాలన్నింటినీ మూడు సువిస్తృత సం వివరించాలనే దృష్టితో ప్రత్యేకంగా *విశ్వసాహితి, భారత భారతి, సాహిత్య దర్శనం* అనే సంభావించబడినాయి. వీటిలో *విశ్వసాహితి* అనే సంపుటం సంపూర్ణరూపం సంతరించుకొని ప్రస్తుత అవుతున్నది. విశ్వసాహితిలో భారతీయేతరమైన విశ్వసాహిత్యాలు దాదాపు 67 అకారాద్యనుక్రమణికా వివరించబడినాయి. ఆంధ్రభాషాసాహిత్యాది విశేషాలు తెలుగు సంస్కృతి సంపుటాలలో సు వివరించబడినాయి. అదేవిధంగా ఆంధ్రేతర భారతీయభాషలకు సంబంధించిన అంశాలు భారత ప్రత్యేక సంపుటిలో చేర్చడం జరుగుతున్నది. కనుక వాటిని విశ్వసాహితిలో చేర్చలేదు.

తెలుగువారికి ప్రపంచ భాషలను గూర్చి, సాహిత్యాలను గూర్చి చక్కని అవగాహన కలిగించ విజ్ఞానసర్వస్వ సంపుటం ఉపకరించగలదు.

ఎంతో శ్రమకోర్చి దీనిని సమగ్రసుందరంగా తీర్చిదిద్దిన సంపాదకులకు, వ్యాసకర్తలకు, సం మా విజ్ఞానసర్వస్వ శాఖ ఉద్యోగులకు నా హృదయపూర్వక శుభాభివందనలు.

వివిధ సాహితీ విజ్ఞాన విశేషాలను తెలుగు మాధ్యమంలో అందించాలని సంకల్పించిన తెలుగు లయం కృషిని విజ్ఞులు ప్రోత్సహించడం మాత్రమేకాక, తగు సలహాలు సూచనలు కూడా అంద ఆశిస్తున్నాం.

ప్రస్తుత ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రులు - మాన్యశ్రీ నందమూరి తారకరామారావుగారి మేధాపు ముద్దుబిడ్డ తెలుగు విశ్వవిద్యాలయం ఈ శుభసందర్భంలో ఈ సంపుటాన్ని విడుదల చేయగలుగు ఎంతో ఆనందిస్తున్నాం.

యథాపూర్వంగా ఈ విజ్ఞానసర్వస్వ సంపుటం కూడా అందరి ఆదరాభిమానాలు చూరగొంటుం స్తున్నాం.

పేర్వారం జ

హైదరాబాద్
డిసెంబర్ 20, 1994

# విజ్ఞప్తి

విజ్ఞానసర్వస్వ సంపుటాలలో పూర్వపు తెలుగుభాషాసమితి అనుసరించిన విధానం ప్రయోజనకరంగా ఉందని భావించి దానినే కొనసాగించడం జరుగుతున్నది. ఏదైనా ఒక విజ్ఞానరంగాన్ని, కొన్ని సందర్భాలలో దానికి సన్నిహితంగా ఉన్న మరికొన్ని విజ్ఞానరంగాలను ఒక క్షేత్రం (Unit) గా గ్రహించి, దానికి సంబంధించి ఒక సంపుటం లేదా అవసరసమైతే ఎక్కువ సంపుటాలు వెలువరించాలన్నది ఈ విధానం. ప్రతి క్షేత్రంలోనూ మొదట విహంగవీక్షణంగా ఆ విజ్ఞానక్షేత్రానికి ఉన్న చారిత్రక ప్రాధాన్యాన్ని వివరిస్తూ సమీక్ష పొందుపరచడం, ఆ తర్వాత విపులంగా తెలుసుకోవాలనే పాఠకుల నిమిత్తం ఆ క్షేత్రానికి సంబంధించిన వివిధ అంశాలను అక్షరక్రమంలో ఆరోపాలుగా ఇస్తూ వివరించడం ఈ విధానం. ఇందువల్ల ఈ సంపుటాలను సంప్రతించే పాఠకులకు అధిక సౌకర్యంగా ఉండగలదని మా విశ్వాసం.

మొట్టమొదట 1961లో తెలుగుభాషా సమితి ప్రకటించిన విశ్వసాహితి సంపుటాన్ని మూడు సంపుటాలుగా (*విశ్వసాహితి, భారతభారతి, సాహిత్య దర్శనం*) ప్రచురించ తలపెట్టాము. సమితి ప్రచురణగా వెలువరించినపుడే (అప్పటి ఆరవ సంపుటం) ఆచార్య దివాకర్ల వేంకటావధాని సంపాదకులుగాను, శ్రీ చీమకుర్తి శేషగిరిరావు సంగ్రాహకులుగాను ఉండి విశేష శ్రద్ధాసక్తులతో ఎంతో ప్రామాణికంగా ఆ సంపుటాన్ని తీర్చిదిద్దారు. ఆ సంపుటం ప్రతులు చెల్లినందున కొన్ని సంవత్సరాలుగా లభ్యం కావడం లేదు. దానిని సవరించి, పెంచి, విస్తృత పునర్ముద్రణంగా మూడుసంపుటాలలో వెలువరించాలని తెలుగు విశ్వవిద్యాలయంలోని కొమర్రాజు వేంకట లక్ష్మణరావు విజ్ఞాన సర్వస్వశాఖ ప్రతిపాదించింది. ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు, ఆచార్య డి.వి.కె.రాఘవాచార్యులు, ఆచార్య ముదిగొండ వీరభద్రశాస్త్రి సంపాదకులుగాను; శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు సంగ్రాహక సంపాదకులుగాను; డా.పి.చంద్రశేఖర్, శ్రీ టి.నాగరాజ శెట్టి సహాయకులుగాను వ్యవహరించి ఈ సంపుటాన్ని పరిష్కరించి ఇచ్చారు. ఈ కృషిలో విజ్ఞాన సర్వస్వశాఖ ఆఫీసర్-ఇన్-ఛార్జ్ అయిన డా.కె.ఆనందన్ సమన్వయ సంపాదకులుగా వ్యవహరించారు. ఇందుకు సంపాదకులకు, సంగ్రాహసంపాదకులకు, సమన్వయ సంపాదకులకు, వ్యాసరచయితలకు, విజ్ఞాన సర్వస్వశాఖలోని ఉద్యోగులకు విజ్ఞానసర్వస్వశాఖ కృతజ్ఞతాభివందనాలు అర్పిస్తున్నది.

విజ్ఞాన సర్వస్వశాఖ ప్రకటించే ప్రచురణలన్నీ ఆధునిక తెలుగుభాషలో ఉండాలనే విధాన నిర్ణయానికి అనుగుణంగా ఈ సంపుటంలోని వ్యాసాల శైలిని వీలైనంతవరకు సంస్కరించడం జరిగింది. విజ్ఞాన సర్వస్వశాఖ ఆరు సంపుటాలను ఒకేసారి చేపట్టి తుదిరూపమిచ్చే ప్రయత్నంలో భాగంగా మేమిప్పుడు తొలిసంపుటమైన విశ్వసాహితిని ప్రచురించగలుగుతున్నందుకు సంతోషంగా ఉన్నది. త్వరలోనే మిగతా ఐదు సంపుటాలు (*భౌతికశాస్త్రం, రసాయనశాస్త్రం, తెలుగు సంస్కృతి 3వ సం.., భారతభారతి, జ్యోతిశ్శాస్త్రం*) సిద్ధమవుతున్నాయి. మా కృషిలో ఆయావిజ్ఞాన రంగాలలో నిష్ణాతులైన వారి సహకారం ఎంతో ఆవశ్యకం. అటువంటి సహకారం మాకు సంతృప్తికరమైన రీతిలో లభించటం మా అదృష్టం. అయితే కృషికి పట్టే కాలవ్యవధిలో మాత్రం అంతో ఇంతో జాప్యం కావడం అనివార్యమవుతున్నది.

కాగితం ధరలు, ముద్రణ వ్యయం పెరిగినప్పటికీ విజ్ఞాన సర్వస్వ సంపుటాల వంటి పరామర్శ గ్రంథాలు పాఠకులకు అందజేయవలసిన అవసరాన్ని గుర్తించి సంపుటం ధరను గణనీయంగా తగ్గించి రూ.100/-లకే ఇవ్వాలని మా విశ్వవిద్యాలయం నిర్ణయించింది.

ఈ సంపుటం మా శాఖలోని కంప్యూటర్ల మీదనే లేజర్‌సెట్టింగ్ చేసినవారు శ్రీమతి విజయలక్ష్మి, శ్రీ జి.సుబ్బారావు.

ఈ సంపుటం తయారీలో సహకరించిన వారందరికీ మా కృతజ్ఞతలు.

హైదరాబాదు
17-12-1994

జి.చెన్న కేశవ రెడ్డి
శాఖాధిపతి,
కొమర్రాజు వెంకటలక్షణరావు విజ్ఞాన సర్వస్వ శాఖ

# సంపాదకీయం

తెలుగు విశ్వవిద్యాలయంలో విలీనం కావడానికి ముందు తమ 16 సంపుటాల ప్రణాళికలో తెలుగు భాషా సమితి వారు ప్రచురించిన 14 సంపుటాలలోనూ ఆరవది *విశ్వసాహితి* సంపుటం. ప్రపంచ భాషాసాహిత్యాలూ, వాటికి సంబంధించిన వివిధ సిద్ధాంతాలూ అన్నీ ఒకే సంపుటంలో ఆ ప్రణాళికలో వచ్చాయి. కాని తెలుగు విశ్వవిద్యాలయంవారు తమకు అందుబాటులో ఉన్న వనరుల దృష్ట్యా తెలుగు భాషా సమితివారి ప్రణాళికను మరింత విస్తృతపరిచి సమితి ఒకే సంపుటంలో వివరించిన వివిధ విషయాలను వేరువేరు ప్రత్యేక సంపుటాలలో వివరించాలని నిర్ణయించారు. ఆ నిర్ణయానికి అనుగుణంగా వెనుకటి భాషా సమితి వారి *విశ్వసాహితి* సంపుటాన్ని *భారత భారతి* (భారతీయ భాషా సాహిత్యాలు), *విశ్వసాహితి* (భారతీయేతర భాషాసాహిత్యాలు), *సాహిత్యదర్శనం* (భాషా సాహిత్య సిద్ధాంతాలు, విమర్శనరీతులు) అని మూడు ప్రత్యేక సంపుటాలుగా ప్రకటించాలని నిశ్చయించి, వాటిలో *విశ్వసాహితి* సంపుట సంగ్రాహకత్వ, సంపాదకత్వ బాధ్యతలను మాకు ఒప్పగించారు.

సమితి విధానాన్నే కొనసాగిస్తూ తెలుగు విశ్వవిద్యాలయం కూడా ప్రతి సంపుటంలోనూ సమీక్షా భాగం, అకారాది వ్యాస వివరణ భాగం, చివర సూచి ఉండాలని నిర్ణయించింది. సమీక్షా భాగంలో భారతీయేతర భాషాసాహిత్యాల వివరణను భౌగోళిక విభాగాన్ని అనుసరించి ఆసియా, యూరప్, ఆఫ్రికా, ఉత్తర అమెరికా, దక్షిణ అమెరికా, ఆస్ట్రేలియా ఖండాల భాషా సాహిత్యాలను వేరు వేరు అధ్యాయాలలో వివరించాలనీ, ప్రతి అధ్యాయంలోనూ అకారాది క్రమం పాటించాలని సంపాదక సమితి నిర్ణయించింది. పాకిస్థాన్, బంగ్లాదేశ్‌లలోని సాహిత్యాలు మారిన రాజకీయ పరిస్థితుల ననుసరించి భారతీయేతర సాహిత్యాలే అనవలసి వచ్చినా అక్కడి ఉర్దూ, బెంగాలీ భాషలు భారతీయ భాషలే కావడంవల్లనూ, భారతదేశం నుంచి ఆ దేశాలు విడిపోయిన తరువాత అక్కడ వెలసిన సాహిత్యాల విలక్షణ స్వభావాన్ని వివరించే గ్రంథాలు ఏవీ లభించకపోవడంవల్లనూ వాటిని ఆసియాఖండ సాహిత్యాలలో వివరించడం జరుగలేదు. ప్రత్యేకంగా అభివర్ణించదగిన వివిధ ఖండాలలోని జాతీయ సాహిత్యాల నిర్ణయంలో చాలావరకు మేము ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా మార్గాన్నే అనుసరించాము.

ఇంగ్లీషులిపి (రోమన్‌లిపి) ఉచ్చారణ విధేయమైన లిపి కాకపోవడంవల్ల వివిధ దేశాల రచయితల పేర్లను మన దేశంలో వేరువేరు వర్ణక్రమాలలో వ్రాస్తూ ఉండటం, పలుకుతూ ఉండటం పరిపాటి అయింది. ఈ సంపుటానికి సంబంధించినంతవరకయినా ఏకరూపమైన వర్ణక్రమాన్ని పాటించడం సముచితంగా ఉంటుందనే ఉద్దేశంతో వివిధ భాషాసాహిత్యాలలో కొంతవరకు పరిచయం ఉన్న నాగార్జున విశ్వవిద్యాలయం ఆంగ్లశాఖాచార్యులు డా.డి.వి.కె.రాఘవాచార్యులను ఈ సంపుటంలో చేర్చే వివిధ రచయితల పేర్ల ప్రామాణిక వర్ణక్రమాన్ని సూచించవలసిందిగా అభ్యర్థించి ఆయన సూచించిన వర్ణక్రమాన్నే ఈ సంపుటంలో పాటించాము. చాలావరకు

# సంపాదకమండలి

సంపాదకులు :

**డా.కొత్తపల్లి వీరభద్రరావు**
179, వెస్ట్ నెహ్రూ నగర్,
సికిందరాబాదు-500 026.

**కీ.శే. డి.వి.కె.రాఘవాచార్యులు**
3-29-18/1 పార్క్ రోడ్, కృష్ణనగర్,
గుంటూరు-522 006.

**డా.ముదిగొండ వీరభద్ర శాస్త్రి**
2-2-2/7, ప్రశాంత్ నగర్,
హైదరాబాదు-500 044.

సంగ్రాహక సంపాదకులు :

**శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు**
1-9-34/5/1, రామ్‌నగర్,
హైదరాబాదు-500 048.

**డా.పి.చంద్రశేఖర్ (సహాయకులు)**
లెక్చరర్, విజ్ఞాన సర్వస్వ శాఖ, విజ్ఞాన వికాస పీఠం
తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు-500 004.

**శ్రీ టి.నాగరాజ శెట్టి (సహాయకులు)**
సంగ్రాహక సహాయకుడు, విజ్ఞాన సర్వస్వ శాఖ, విజ్ఞాన వికాస పీఠం
తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు-500 004.

సమన్వయ సంపాదకుడు :

**డా.కె.ఆనందన్**
రీడర్, జానపద కళల శాఖ, లలిత కళా పీఠం
తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు-500 004.

| | |
|---|---|
| గు.శం. | డా.శంకరరావు, గుమ్మా<br>97-2 ఆర్.టి., సంజీవరెడ్డి నగర్,హైదరాబాదు, 500 038. |
| చ.తి. | డా.తిరుపతిరావు, చన్నాప్రగడ<br>221, 9వ మెయిన్ రోడ్డు, 2వ క్రాస్ రోడ్డు<br>న్యూ మైకో లేఅవుట్ క్వార్టర్సు, అరకెరే, బెంగుళూరు, 560 076. |
| చంద్ర. | డా.చంద్రశేఖర్,పగడాల<br>లెక్చరర్, విజ్ఞాన సర్వస్వ శాఖ, విజ్ఞాన వికాస పీఠం<br>తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు - 500 004. |
| చక్రపాణి | శ్రీ చక్రపాణి, కె.<br>ఆంగ్లోపన్యాసకుడు, ఆంధ్ర సారస్వత పరిషత్ ఓరియంటల్ కళాశాల,<br>తిలక్‌రోడ్,హైదరాబాదు-500 001 |
| చిం.వెం. | శ్రీ వేంకటేశ్వర్లు, చింతా<br>ఆంధ్రోపన్యాసకుడు, నాగార్జున జూనియర్ కళాశాల,<br>సంజీవరెడ్డి నగర్, హైదరాబాదు, 500 038. |
| చీ. శే.రా. | కీ.శే. శేషగిరిరావు, చీమకుర్తి<br>1-9-34/4/E, రామ్‌నగర్, హైదరాబాదు-500 048. |
| జయలక్ష్మి | శ్రీమతి జయలక్ష్మి, పి.<br>221, 9వ మెయిన్‌రోడ్, 2వ క్రాస్ రోడ్,<br>అరకెరే, బెంగుళూరు - 560 076. |
| జి.అ.నా. | శ్రీ అశ్వత్థ నారాయణ, జి.<br>53,నేతాజీ రోడ్, II బ్లాక్, టి.ఆర్.నగర్<br>బెంగుళూరు- 560 028. |
| జె.ఇ.షాప్. | శ్రీ షాప్, జె.ఇ.<br>నెదర్లాండ్ ప్రభుత్వ రాయబారి కార్యాలయం, న్యూఢిల్లీ. |
| జో. సూ. ప్ర. | ఆచార్య సూర్యప్రకాశరావు, జోస్యుల<br>బి 4/60 హనుమాన్ ఘాట్, వారణాసి- 221 001. |
| డి.మా.రా. | శ్రీ మాణిక్యాల రావు, డి.<br>ఆంగ్లోపన్యాసకుడు, అభ్యుదయ ఓరియంటల్ కళాశాల,<br>జియాగూడ, హైదరాబాదు. |

| | |
|---|---|
| *ఫి. అ.రా.* | శ్రీ ఫియా అనుమన్ రాజధాని<br>బాంకాక్. |
| *బొ.శ్రీ* | శ్రీ శ్రీనివాసాచార్యులు, బొమ్మకంటి<br>1-9-34/5/1, రామ్‌నగర్,<br>హైదరాబాదు. 500 048. |
| *భవాని* | శ్రీమతి దుర్గాభవాని, ఎమ్.<br>2-2-2/7, ప్రశాంత్ నగర్, హైదరాబాదు- 500 044. |
| *భారతి* | శ్రీమతి భారతి, టి.<br>ఆంగ్లోపన్యాసకురాలు, శ్రీ పద్మావతీ మహిళా విశ్వవిద్యాలయం,<br>తిరుపతి - 517 502. |
| *భార్గవి* | డా.భార్గవీ పి.రావ్<br>70, యం.ఐ.జి., న్యూ సంతోష్‌నగర్, హైదరాబాదు - 500 659. |
| *మ.మొ.ఖా.* | ఆచార్య మొయిద్‌ఖాన్, మహమ్మద్.<br>అరబిక్ శాఖాధ్యక్షులు, ఉస్మానియా విశ్వవిద్యాలయం,<br>హైదరాబాదు - 500 007. |
| *మ.సూ.మూ.* | కీ.శే. సూర్యనారాయణ మూర్తి, మల్లాది<br>ఆంధ్ర ఉపన్యాసకులు, ఆర్ట్స్ అండ్ సైన్స్ కళాశాల, గద్వాల. |
| *మంజుశ్రీ* | డా.రమాపతిరావు, అక్కిరాజు<br>140/B, సంతోష్‌నగర్‌కాలనీ, సైదాబాద్,<br>హైదరాబాదు, 500 659. |
| *మల్లేశం* | శ్రీ మల్లేశం<br>ఆంగ్లోపన్యాసకుడు, గవర్నమెంట్ డిగ్రీ కాలేజ్,<br>సిద్దిపేట, మెదక్ జిల్లా. |
| *ము.వీ.* | డా.వీరభద్రశాస్త్రి, ముదిగొండ<br>2-2-2/7, ప్రశాంత్ నగర్,<br>హైదరాబాదు-500 044. |
| *రషీద్.* | శ్రీ రషీద్ గులాం దస్తగీర్<br>పారసీ భాషా శాఖాధ్యక్షులు, ఉస్మానియా విశ్వవిద్యాలయం,<br>హైదరాబాదు, 500 007. |

# విషయానుక్రమణిక

# భాష - సాహిత్యం

**భాష :** 'భాష్' (మాటలాడు) అనే సంస్కృత ధాతువు నుంచి నిష్పన్నమైన 'భాష' అనే తెలుగు పదమూ, 'లింగ్వా' (నాలుక) అనే లాటిన్ పదం నుంచి ఏర్పడిన 'లాంగ్వేజ్' అనే ఇంగ్లీషు పదమూ రెండూ సమాజంలో ప్రజలు భావ వినిమయం చేసుకొనేందుకు వాడే ఉచ్చరిత ధ్వనుల సముదాయాన్ని సూచిస్తాయి. ఒకవ్యక్తి తోటివ్యక్తికి తన భావాన్ని తెలిపేందుకు నోటితో ఉచ్చరించే ధ్వనుల సముదాయం భాష. మొట్టమొదట ఏ భాష రూపం అయినా ధ్వన్యాత్మకమే. భాషలు పుట్టిన తరువాత కొన్ని వేల ఏళ్ళకి లిపులు పుట్టాయి.

శిశువు జన్మించిన తరువాత ఒకటి రెండు ఏళ్లలో తన చుట్టూ ఉన్న జనం ఉచ్చరించే ధ్వనులను వింటూ వాటిని అనుకరించాలని ప్రయత్నిస్తూ సహజంగానే ఆ భాషను నేర్చుకొంటాడు. అలా నేర్చుకొనే భాష ఆ శిశువుకు మాతృభాష అవుతుంది. క్రమంగా పెరిగి పెద్ద వాడైన తరువాత పుస్తకాల ద్వారా గాని, ఇతర భాషా ప్రాంతాలలో కొంతకాలం జీవించడం వల్ల గాని అతడు మరెన్నో భాషలు నేర్చుకోవచ్చు. అలా నేర్చుకొన్నవన్నీ అతనికి ద్వితీయభాష లవుతాయి గాని మాతృభాషలు కాలేవు. ఒక్కొక్కప్పుడు చాలా అరుదైన సందర్భాలలో ఇంట్లో తల్లి ఒక భాషా వర్గానికీ, తండ్రి మరో భాషా వర్గానికీ చెందిన వారైనప్పుడు శిశువు ద్విభాషా వ్యవహర్త కావడం, అతనికి ఆ రెండూ మాతృభాషలే కావడం జరుగవచ్చు.

జంతుజాలంలో మానవులలోనే కాక ఇతర ప్రాణులలో కూడా మౌఖికధ్వనుల ద్వారా గాని, తేనెటీగలలో వలె ఆంగిక విన్యాసాల ద్వారా గాని పరస్పర భావ వినిమయం చేసుకొనే పద్ధతి ఉన్నా, మానవుని భాషలో వలె ఆ భాషలలో అనంతమైన సృజనావకాశం కనిపించదు. మానవ భాష అత్యంత సూక్ష్మాతి సూక్ష్మమైన అనుభూతులను కూడా ప్రకటింపజాలినట్టిది.

**మాండలికాలు :** ఒక భాష మాట్లాడే వ్యక్తులలో ఏ ఇద్దరూ పూర్తిగా ఒకే విధంగా మాట్లాడరు. అలాగే వివిధ ప్రాంతాలలోని ప్రజలు మాట్లడే భాషలలోనూ తేడాలు గోచరిస్తాయి. ఇలా వేరు వేరు ప్రాంతాలలో వేరు వేరు భేదాలతో మాట్లాడబడుతూ ఉండే ఆ భాషా ప్రకారాలను ఆ భాష తాలూకు మాండలికాలు (Dialects) అంటారు. ఈ మాండలికాలు భౌగోళిక భేదంవల్లనే ఏర్పాటు కానక్కర లేదు. ఒక్కొక్కప్పుడు ఒకే ప్రాంతంలో నివసిస్తున్నా వివిధ వృత్తులు అవలంబించే వారి భాషా రూపాలలో తేడాలు ఉండడం, అవి వృత్తి సంబంధమైన భాషా భేదాలుగా పరిగణించబడడం జరుగుతుంది. స్థూలంగా మాండలికాల మధ్య ఎన్ని తేడాలు ఉన్నా, ఒక మాండలికం మాట్లాడే వారికి ఇతర మాండలికాలు బోధపడుతూ ఉన్నంతవరకూ అవి అన్నీ ఏక భాషగానే పరిగణించబడుతాయి. భిన్న మాండలికాలు మాట్లాడే ప్రాంతాల మధ్య దూరం ఎక్కువవడం వల్ల గానీ, ఆదాన ప్రదానాలు తగ్గిపోయి వాటి మధ్యా అనుబంధం పూర్తిగా తెగిపోవడం వల్ల గానీ, ఒక ప్రాంతంలోని మాండలికం మరొక ప్రాంతం వారికి అర్థం కానంత భిన్నంగా మారిపోవడం సంభవించవచ్చు. అప్పుడు అవి వేరు వేరు భాషలుగా పరిగణించబడినా, ఒకే భాషా కుటుంబానికి చెందిన భిన్న భాషలుగా గుర్తించబడుతాయి.

**ప్రమాణ భాష :** చాలా భాషా సమాజాలలో రాజకీయ విద్యా, వ్యాపారాదులవల్ల ప్రాముఖ్యం వహించిన ఒక పట్టణం లేక ప్రాంతంలో ఉన్నత శ్రేణి వారి వాడుక/ చదువుకొన్న వారి వాడుక ఆధారంగా ప్రమాణభాష (Standard language) ఏర్పడి మాండలిక ప్రయోగాలను కలుపుకొంటూ వ్యాప్తమవుతుంది. మాండలికాలకంటె ప్రమాణ భాషా ప్రయోగానికి వ్యాప్తి ఎక్కువ. సాహిత్య రచన, విద్యా బోధన, రేడియో, టెలివిజన్ మొదలైన వాటిలో కార్యక్రమాలు, కోర్టులు మొదలగు వాటిలో వ్యవహారాలు నడపడం ప్రమాణభాషలోనే జరుగుతాయి. ప్రమాణ భాష ఎక్కువమంది ప్రజలకు సమ్మతంగా ఉంటుంది.

**సాహిత్యం :** భాషలో మానవుని బౌద్ధిక వ్యాపార ఫలితాలను తెలియ చేసే రచనల కంటె భిన్నంగా మానవుని అనుభూతిని ప్రకటించే రచనలను 'సాహిత్యం' అనవచ్చును. సాహిత్యేతర రచనలలో శబ్దానికీ, అర్థానికీ మధ్య ఘనిష్ఠ మైన సంబంధం ఉండదు. ఒకే అర్థాన్ని భిన్న

శబ్దాలలో కూడా వ్యక్తీకరించ వచ్చును. 'సహితయోః శబ్దార్థయోః భావః సాహిత్యం' అని సాహిత్య శబ్దానికి వ్యుత్పత్తి. ఏ రచనలో శబ్దార్థాలకు మిక్కిలి ఘనిష్ఠమైన సంబంధం ఉంటుందో అది సాహిత్యం. దీనిలో అర్థం కేవలం బౌద్ధికమైన భావరూపం కాదు; రసరూపంగాను, ధ్వనిరూపంగాను కూడా ఉంటుంది. సాహిత్యంలో అర్థమూ, దానిని ప్రకటించే శబ్దమూ పార్వతీ పరమేశ్వరులవలె నిత్య సంపృక్తాలై ఉంటాయి. అందుకే కాళిదాసు అంటాడు:

*వాగర్థా వివ సంపృక్తౌ వాగర్థ ప్రతి పత్తయే/*
*జగతః పితరౌ వన్దే పార్వతీ పరమేశ్వరౌ//*

ఈ శ్లోకంలోని వాగర్థాలు, సాహిత్యంలో- ముఖ్యంగా కవిత్వంలో- అవినాభావంగా కలిసి ఉండే శబ్దార్థాలు.

సాహిత్యాన్ని తెలుగులో 'సారస్వతం' అని అనడం కూడా పరిపాటి. 'సారస్వతం' అనగా సరస్వతీ సంబంధమైనది అని అర్థం. సంగీత, సాహిత్యాలు సరస్వతీదేవికి స్తనద్వయం వంటివి అనీ, వాటిలో ఒకటి (సంగీతం) ఆపాత మధురం కాగా, మరొకటి (సాహిత్యం) ఆలోచనామృతం అనీ చాటుతుంది ఈ క్రింది శ్లోకం:

*సంగీత మపి సాహిత్యం*
*సరస్వత్యా స్తన ద్వయమ్/*
*ఏక మాపాత మధురం*
*అన్యదాలోచ నామృతమ్//*

సాహిత్య శబ్దానికి ఆంగ్ల పర్యాయం అయిన 'లిటరేచర్' అనే శబ్దం లాటిన్ భాషలోని 'లిటరే' (వర్ణమాలలోని వర్ణాలు) అనే పదం నుంచి నిష్పన్నమైంది. అనగా - చక్కగా కూర్చిన వర్ణాలు కలది, అంటే 'అక్షర రమ్యత కలది' అని అర్థం చేసుకో వచ్చును. పాశ్చాత్యదేశాలలో ప్రాచీన కాలంలో వేరు వేరు సాహిత్య ప్రక్రియలకు సంబంధించిన సాహిత్యాలను 'పొయెటిక్ లిటరేచర్', 'ప్రోజ్ లిటరేచర్' అని వేరు వేరు భాగాలుగా వ్యవహరించేవారు. అరిస్టాటిల్ వ్రాసిన *పొయెటిక్స్* అనే గ్రంథం గ్రీక్ పురాణాలు మొదలైన వాటినుంచి కూడా ఉదాహరణలు ఇచ్చినా, ప్రధానంగా 'ట్రాజెడీ' (విషాదాంత రూపకం) పరిశీలనకే పరిమితమైంది. 'లిటరేచర్' అనే పదం వ్యుత్పత్తి అర్థంలో లిఖిత సాహిత్యానికే పరిమితం అయినా, మౌఖిక సాహిత్యాన్నీ, జానపద సాహిత్యాన్నీ కూడా 'లిటరేచర్' లో భాగంగానే గ్రహిస్తున్నారు.

సంస్కృతాలంకారికుల దృష్టిలో కావ్యం పద్యరూపం కావచ్చును; గద్యరూపం కావచ్చును (*కావ్యం ద్విధా- పద్యం, గద్యం చేతి*). ఇంగ్లీషు మొదలైన పాశ్చాత్య భాషలలో పద్య రూపంలో ఉన్నదే కవిత్వం అనీ, గద్యం దానికి విరుద్ధ మైన దనీ ఒక భావన ఉంది.

మానవుని భావ ప్రకటనకు వాడే ఒక రూపం సాహిత్యం. మాటలలో ప్రకటించిన అన్ని భావాలూ సాహిత్యం కానేరవు. ఒక క్రమ పద్ధతిలో అమర్చినా, లిపి బద్ధం చేసినా, అన్ని భావాలూ సాహిత్యంగా పరిగణించబడవు. ముఖ్యంగా భోగట్టాను తెలియచేసేవి, సాంకేతిక విషయాలను బోధించేవి, పాండిత్యాన్ని చాటేవి సాహిత్య పరిధిలో చేరే రచనలు కావని చాలామంది అభిప్రాయం. కొన్ని సాహిత్య ప్రక్రియలు సాహిత్యకళకు సంబంధించినవని సాధారణంగా అంగీకరిస్తారు. అయితే ఆ ప్రక్రియలలో కొందరు ప్రతిభావంతులైన రచయితలు విజయం సాధించినప్పుడే అవి నిజంగా సాహిత్య రచనలు అవుతాయి. తమ ప్రయత్నాలలో వారు విఫలం అయితే అవి సాహిత్యం అనిపించుకోవు. సాహిత్య కళలో ప్రతిభను నిర్వచించడం కంటె గుర్తించడం తేలిక!

పాశ్చాత్య సాహిత్య విమర్శకుల దృష్టిలో మిక్కిలి స్వచ్ఛమైన, ప్రగాఢమైన సాహిత్య ప్రక్రియ భావగీతం (lyric). భారతీయ ఆలంకారికుల దృష్టిలో మాత్రం సాహిత్య ప్రక్రియ లన్నిటిలోను ఎక్కువగా ఆస్వాద్యమైంది నాటకం. "నాటకాంతం హి సాహిత్యం" (సాహిత్యంలో పరాకాష్ఠ నాటకం), "కావ్యేషు నాటకం రమ్యం" (కావ్యాలలో మిక్కిలి రమ్యమైంది నాటకం) వంటి సూక్తులు ఈ అంశాన్ని చాటుతున్నాయి.

**పాశ్చాత్య సాహిత్య సిద్ధాంతాలు :** తొలి ఈజిప్షియన్‌లకూ, సుమేరియన్‌లకూ కూడా ప్రత్యేక సాహిత్య సిద్ధాంతాలు ఉండి ఉండవచ్చును. కాని అవి నష్టం అయిపోయాయి. గ్రీక్ పౌరాణిక యుగం నాటినుంచి నేటివరకు పాశ్చాత్య విమర్శరంగంలో పరస్పర విరుద్ధాలైన రెండు సాహిత్య సిద్ధాంతాలు ప్రచారంలో ఉన్నాయి. ఒకటి: అభివ్యక్తి సిద్ధాంతం (Expressive theory), రెండు: నిర్మితి సిద్ధాంతం(Constructive theory).

రచయిత తన ప్రగాఢమైన ఆత్మానుభూతులను అభివ్యక్తం చేసేది సాహిత్యం అని అభివ్యక్తి సిద్ధాంతం ప్రతిపాదించగా, ఒక సాంకేతిక నిపుణునిలాగ, ఒక ఇంజనీరులాగ, ఒక వంటల వానిలాగ నేర్పుతో రచయిత ఒక రచనను కూరుస్తాడనీ, దానివలన పాఠకునిలో కళానందం (aesthetic response) కలిగి నట్లైతే అది సాహిత్యం అవుతుందనీ నిర్మితివాదం ప్రతిపాదించింది.

గ్రీక్ తత్త్వవేత్త, విద్వాంసుడు అయిన అరిస్టాటిల్ (క్రీ.పూ. 384-322) నిర్మితి సిద్ధాంతానికి మొట్టమొదటి ప్రవక్త. ఆయన వ్రాసిన *పొయెటిక్స్* అనే గ్రంథంలో కొంత భాగం మాత్రమే లభించింది. దానిలో 'ట్రాజెడీ' (విషాదాంత రూపకం), 'ఎపిక్ పొయెమ్' (మహాకావ్యం) లను గూర్చిన వివరణ మాత్రమే ఉంది. ఈ గ్రంథం సాహిత్యం అనే వంటకాన్ని వండేవారికి ఉపయోగించే సూచనల గ్రంథంగా ఉందని కొందరు నిరసించారు. నిజానికి అరిస్టాటిల్ ట్రాజెడీ నిర్మాణం ఎలా ఉండాలి అనే అంశాన్ని ఒక భవన నిర్మాత ఒక దేవాలయ నిర్మాణాన్ని పరిశీలించే విధంగానే చర్చించాడు. అయితే ఆయన పూర్తిగా వస్తు దృష్టి మాత్రమే కలవాడని కూడా మనము చెప్పలేము. సాహిత్యంలో అభివ్యక్తికి సంబంధించిన అంశాలను సూచించడానికి ఆయన వాడిన పదాలు వేర్వేరు వ్యాఖ్యానాలకు అవకాశమిచ్చి వివాదాలకు దారితీశాయి.

మొదటి శతాబ్దినాటి 'ఉదాత్తతను గూర్చి' ('On the sublime', 3 వ శతాబ్దంనాటి లాంజినెస్ రచనగా దీనిని భావిస్తున్నారు.) అనే గ్రీక్ గ్రంథం అరిస్టాటిల్ జవాబు చెప్పని "గొప్ప సాహిత్యపు గొప్పతనం దేనిని బట్టి నిర్ణయించబడుతుంది?" అనే సమస్యను గూర్చి చర్చించింది. ఆ గ్రంథంలో చెప్పబడిన ప్రమాణా లన్నీ ఇంచుమించు పూర్తిగా అభివ్యక్తికి సంబంధించినవే. అరిస్టాటిల్ విశ్లేషణ దృష్టితో సాధారణ సూత్రాలను ప్రతిపాదించగా, లాంజినెస్ దని చెప్పబడే ఈ గ్రంథం మరింత నిర్దేశాత్మకంగా ఉంటూ, అనేక ఉదాహరణలను కూడా ఎత్తి చూపింది. అయినా ఈ గ్రంథంలోని విమర్శ సిద్ధాంతాలు చాలా వరకు తన ఇష్టానిష్టాలను సాధారణీకరించే సూత్రాలకు (Impressionistic generalities) పరిమితం అయాయి.

ఈ విధంగా పాశ్చాత్య సాహిత్య విమర్శ ప్రారంభం అయే నాటికే ఈ 'నిర్మితి', 'అభివ్యక్తి' సిద్ధాంతాల మధ్య వివాదం సాగుతూ ఉంది. రచయిత, లేదా కళాకారుడు ఒక వంటలవాని వలెనో, ఇంజనీరు వలెనో ఒక ప్రణాళిక ననుసరించి ఒక కావ్యాన్ని నిర్మించి, దాని ద్వారా ప్రేక్షకులలో కళానందం ఉద్బోధించే మాంత్రికుడా? లేక తనను తాను వ్యక్తం చేసుకొని తన వ్యక్తిత్వంలోని ప్రగాఢమైన వాస్తవాలకు రూపకల్పనచేసి, పాఠకుల అంతరాంతరాలలో కూడా అలాంటి వాస్తవాలే ఉండడం వల్ల వారిలో కళాత్మకమైన ప్రతిస్పందనను కలిగించగల నిపుణుడా? ఈ ద్వైధీభావమే పశ్చిమ యూరప్ సాహిత్యచరిత్ర అంతటిలోనూ స్కొలాస్టిసిజమ్-హ్యూమనిజమ్‌ల మధ్య, క్లాసిసిజమ్-రొమాంటిసిజమ్‌ల మధ్య, క్యూబిజమ్-ఎక్స్‌ప్రెషనిజమ్‌ల మధ్య కనిపిస్తూ వచ్చింది. నేటికీ మన సమకాలీన కళాకారుల, రచయితల నిర్ణయాలలో కూడా ఈ ద్వైధీభావం నిలిచి ఉంది. అయితే, నిజానికి సాహిత్యం, లేక కళారూపంలో 'అభివ్యక్తి', 'నిర్మితి' లక్షణాలు రెండూ ఉంటా యని విమర్శకులు గుర్తించకపోవడం దురదృష్టకరం!

**ప్రాచ్య సాహిత్య సిద్ధాంతాలు :** ప్రాచ్య జగత్తులోని సాహిత్య సిద్ధాంతాలలో ఎక్కువ వైవిధ్యం గోచరిస్తుంది. భారతదేశంలోని అలంకార శాస్త్ర సిద్ధాంతాలు సునిశితమైన సాంకేతిక చర్చలతో కూడినవి. వంటకాల తయారీకి సూచన లిచ్చే పుస్తకాల వంటివి కూడా కొన్ని లేకపోలేదు. మరికొన్ని తాత్త్విక చర్చలతో కూడినవి. భారత దేశంలో సంస్కృత సాహిత్య చరిత్రలోని స్వర్ణయుగం (320-490) లో 'నిర్మితి', 'అభివ్యక్తి' అనే రెండూ ఒకే సత్యం తాలూకు రెండు ముఖాలుగా రచయితలు భావించేవారు. చైనా విషయంలో కూడా ఈ మాట వర్తిస్తుంది. వారి సాహిత్య విమర్శ గ్రంథాలూ, ఛందో లంకార గ్రంథాలూ పశ్చిమదేశాలలో వలె కేవలం ఉపయోగకరమైన సాంకేతిక గ్రంథాల స్థాయికి చెందినవిగానే పరిగణించబడుతాయి. వారి సాహిత్య విమర్శ అభివ్యక్తి లక్షణాలకు ఎక్కువ ప్రాధాన్యం ఇస్తూ, లాంజినెస్ వ్రాసిన ఉదాత్తత మీది గ్రంథం స్థాయిలో సాగింది. జపాన్‌లో శైలికీ, రూపానికీ సంబంధించిన అంశాలకు చాలా ప్రాధాన్యం ఉన్నమాట నిజం (ఈ విషయమై జపాన్‌వారు ప్రదర్శించిన విచక్షణ ప్రపంచంలోనే మిక్కిలి సునిశితమైంది). రచయిత, పాఠకుడు కూడా ఈ దేశంలో అతి సూక్ష్మ భావ వివేచనకూ, ప్రగాఢమైన అనుభూతికీ ఎక్కువ ప్రాధాన్యం ఇస్తారు. అందుచేతనే సుశిక్షితుడు కాని పాఠకునికి అవి అందుబాటులో ఉండవు.

బా.శ్రీ.

# ప్రపంచ భాషలు - వాని వ్యాప్తి

ఈనాడు ప్రపంచంలో మొత్తం మూడువేలకు పైగా భాషలు వాడుకలో ఉన్నట్లు అంచనా. కొన్ని భాషల విషయంలో అవి ప్రత్యేక భాషలా లేక మరొక భాష మాండలికాలా అనే విషయం తేల్చడం సాధ్యం కావడం లేదు కాబట్టి, భాషల సంఖ్య ఇంత అని నిర్దుష్టంగా చెప్పడం కష్టమైన పని. మానవుడు మాట్లాడే ప్రతి భాషా ఇంకొక భాషకన్నా విలక్షణమైనదే అయినా అన్ని భాషలకు వర్తించే కొన్ని సామాన్య లక్షణాలున్నాయి.

**భాషలవర్గీకరణం :** ప్రపంచంలోని భాషలను కొన్ని సముదాయాలుగా వర్గీకరించవచ్చు. ఈ వర్గీకరణకు ఉపయోగించే పద్ధతులు రెండున్నాయి. 1. ఆనువంశిక వర్గీకరణం (Genetic classification), 2. లక్షణాత్మక వర్గీకరణం (Typological classification)

**1. ఆనువంశిక వర్గీకరణం :** ఇది చారిత్రక వర్గీకరణం (Historical classification) పరస్పర సంబంధం ఉన్న కొన్ని భాషలు ఒకే మూలభాషనుండి పరిణామం చెంది ఉండవచ్చు ననే ఊహపై ఆనువంశిక వర్గీకరణం ఆధారపడుతుంది. ఇట్టి వర్గీకరణకు ప్రాచీన లిఖిత గ్రంథాలు ఆధారం. ఒక్కొక్కప్పుడు ఆ మూలభాష తాలూకు రికార్డులు లభ్యం కాకపోతే వాటిని సోదర భాషల (Sister languages) సహాయంతో పునర్నిర్మించడం జరుగుతుంది. అలా పునర్నిర్మించిన భాషలను 'మూల భాషలు' (Parent Proto languages) అంటారు. వివిధ భాషల మధ్య కనిపించే సంబంధాలను గుర్తించడానికి తగినన్ని ఆధారాలు ఉండడం వలన ప్రపంచ భాషలను ఈ ఆనువంశిక విధానం ద్వారా నేడు కొన్ని భాషా కుటుంబాలుగా (Language Families) విభజించారు. అవి:

| భాషా కుటుంబం | భాషల సంఖ్య |
|---|---|
| ఇండో - యూరోపియన్ | 132 |
| సెమిటో - హెమిటిక్ | 46 |
| ఊరల్ - అల్టాయిక్ | 66 |
| జపానీస్ - కొరియన్ | 2 |
| సీనో - టిబెటన్ | 115 |
| మలయో - పాలినేషియన్ | 263 |
| ద్రవిడియన్ | 26 |
| సూడానీస్ - గినియన్ | 435 |
| బంటూ | 83 |
| హాటెన్‌టాట్ - బుష్‌మన్ | 6 |
| అమెరికన్ - ఇండియన్ | 1,230 |
| ఎస్కిమో - అల్యూట్ | 24 |
| కకేషియన్ | 26 |
| ఏషియాటిక్ | 29 |
| ప్రాచీన ఏషియాటిక్ | 12 |
| ఆస్ట్రేలియన్ | 96 |
| ఇబెరో - బాస్క్ | 2 |
| బురుషస్కీ | 1 |
| అండమానీస్ | 12 |
| ఆస్ట్రో - ఏషియాటిక్ | 52 |
| పాపువన్ | 132 |
| టాస్మేనియన్ | 5 |
| లా - టి | 1 |

ప్రపంచంలో ఎన్ని భాషా కుటుంబాలున్నాయి అన్నది జటిల మైన ప్రశ్న. ప్రసిద్ధ భాషల విషయంలో సమస్య లేదు గాని చారిత్రకాధారాలు లేని కొన్ని ఆఫ్రికన్ భాషలు, అమెరికన్ ఇండియన్ భాషలలో భాషా కుటుంబ నిర్ణయం చెయ్యడంలో పండితులకు భేదాభిప్రాయాలున్నాయి.

**2. లక్షణాత్మక వర్గీకరణం :** వర్గీకరణంలో భాషల లక్షణాలను అనుసరించి అవి కొన్ని సముదాయాలుగా విభజించబడుతాయి. ఇలా ఒక సముదాయంలో చేర్చబడ్డ భాషలు జన్మ సంబంధం కలవికావచ్చు, లేనివి కావచ్చు. 1818లో ఆగస్ట్‌వాన్ ష్లెగెల్ (August Von Schlegal) ప్రపంచ భాషలన్నింటిని లక్షణాలను అనుసరించి మూడు ప్రధాన సముదాయాలుగా విభజించారు.

1. ప్రత్యయ రహిత భాషలు (Isolating, analytic or root languages).చైనీస్, వియత్నామీస్ లాంటి భాషలు.

2. సంశ్లేషణాత్మక భాషలు (Inflecting, synthetic, or fusional languages). లాటిన్, గ్రీక్, అరబిక్ లాంటి భాషలు.

3. విశ్లేషణాత్మక (వికరణాత్మక) భాషలు (Agglutinative of affixing languages) . టర్కిష్, స్వాహిలి, జపనీస్, ద్రావిడ భాషలవంటివి.

తరువాతి కాలంలో లాటిన్, గ్రీక్, సంస్కృతాల కన్నా క్లిష్టతరమైన భాషలు వెలుగులోకి వచ్చాయి. ఇటు

వంటి వాటిని కొందరు భాషా శాస్త్రవేత్తలు నాలుగవ సముదాయంగా విభజించారు.

4. సంక్లిష్టాత్మక భాషలు (Polysynthetic or incorporating languages). ఎస్కిమో, మొహవక్, ఆస్ట్రేలియన్ భాషలు.

ఇటీవలి కాలంలో పండితులు పైస్థూల విభాగం కన్నా ఒక్కొక్క వ్యాకరణాంగాన్ని విడివిడిగా తీసుకొని భాషలలో భేదసాదృశ్యాలని పరిశీలించడం సమంజసంగా ఉంటుందని భావించారు. ఉదాహరణకు, వర్ణ నిర్మాణంలో (1) మూడు అచ్చులున్న భాషలు, ఐదు అచ్చులున్న భాషలు అనే విధంగా విభజించవచ్చు. (2) ఉదాత్తత (Stress) వర్ణంగా ఉన్న భాషలు అనే విభజన మరొకటి. (3) హల్లులసంఖ్య సంయుక్త హల్లుల సంఖ్యపై ఆధారపడిన విభజన మరొకటి. పద నిర్మాణంలో రెండు వచనాలున్న భాషలు, మూడు వచనాలున్న భాషలు. విభక్తి ప్రత్యయా లున్న భాషలు, లేని భాషలు ఇత్యాదిగా విభజించవచ్చు. వాక్య నిర్మాణంలో విశేషణం విశేష్యానికి ముందుండే భాషలు, తరువాత ఉండే భాషలు (ఫ్రెంచ్), విశేష్యా లకి లింగవచన సాదృశ్యం ఉంటే భాషలు లేని భాషలు ఇత్యాదిగా విభజించవచ్చు.

**భాషా వర్గీకరణల ప్రయోజనాలు :** ఆనువంశిక వర్గీ కరణకు చరిత్రతో సంబంధం ఉంది. అందుచేత చరిత్ర రచనకు అది కొంతవరకు తోడ్పడవచ్చు. ఉదాహరణకు: రోమాన్స్ భాషలు ఒక కుటుంబంగా ఏర్పడడానికి కారణం చారిత్రకంగా కొంతకాలం పాటు రోమన్ సామ్రాజ్యం నిలిచి ఉండడమే! భాషలను ఒక దానితో ఒకటి పోల్చి చూడడం వల్ల ఒక్కొక్కప్పుడు నష్టమై పోయిన మూల భాషను వివరాలతో సహా పునర్నిర్మించడం సాధ్యం అవు తుంది. తులనాత్మక పద్ధతి సహాయంతో భాషల చారిత్రక పరిణామ వికాసాలను అధ్యయనం చేయవచ్చు. ఇండో-యూరోపియన్ భాషల చారిత్రక పరిణామ అధ్యయనం ఇందుకు చక్కని ఉదాహరణ. ఇలాగే ఆఫ్రికా లోని ప్రోటో బంటూ, ఓషియానియాలోని ప్రోటో ఆస్ట్రొనీ షియన్, ఉత్తరమెరికాలోని ప్రోటో సెంట్రల్ ఆల్గోం కియన్ భాషల పునర్నిర్మాణం ఆ యా దేశాలలోని భాషా పరిణామ చరిత్రను అధ్యయనం చేయడానికి ఎంత గానో తోడ్పడుతున్నది. ఈ రెండు రకాల వర్గీకరణలు కూడా భాషల మధ్య ఉన్న సాంస్కృతిక సంబం ధాల (cultural links) ప్రాధాన్యతను పూర్తిగా విస్మరి స్తున్నాయి.

**భౌగోళిక వర్గీకరణ :** ప్రపంచంలోని భాషలు ఏయే భాషాకుటుంబాలకు సంబంధించినవి ఎక్కడెక్కడ వ్యవ హారంలో ఉన్నాయో ఈ క్రింది భౌగోళిక వర్గీకరణాన్ని అనుసరించి కూడా పరిశీలించవచ్చు.

1. యూరప్‌లోని భాషలు, 2. దక్షిణాసియాలోని భాషలు, 3. ఉత్తరాసియాలోని భాషలు, 4. నైరృతి ఆసి యాలోని భాషలు, 5. తూర్పు ఆసియాలోని భాషలు, 6. ఆగ్నేయాసియాలోని భాషలు (ఆస్ట్రొనేషియన్ భాషతో సహా), 7. ఓషియానియాలోని 'ఆస్ట్రొనేషియన్-భిన్న' భాషలు, 8. ఆఫ్రికాలోని భాషలు, 9. ఉత్తర, దక్షిణ అమెరికాలలోని భాషలు.

**1. యూరప్‌లోని భాషలు :** యూరప్‌లో మాట్లాడే భాషలలో ఎక్కువ భాగం ఇండో యూరోపియన్ భాషా కుటుంబానికీ, యూరాలిక్ భాషా కుటుంబానికీ (ముఖ్యంగా ఫిన్నో-యూగ్రిక్ భాషాకుటుంబానికి) చెందినవి. సంఖ్యల దృష్ట్యా చూస్తే ఈ కుటుంబాల భాషలను మాట్లాడే వారి సంఖ్య స్వభాషా ప్రాంతమైన యూరప్‌లో కన్నా విదేశాల్లోనే ఎక్కువ. భాషాభాషుల సంఖ్యను బట్టే ఒక భాషాప్రాంతాన్ని నిర్ణయించవలసి వస్తే వీటిలో చాలా భాషలను నేడు యూరప్‌లోని భాషలు కావు అని అనవల సివస్తుంది. ఉదాహరణకు స్పానిష్ భాష మాట్లాడేవారు ఈ నాడు స్పెయిన్‌లో కంటె లాటిన్ అమెరికాలో ఎక్కువమంది ఉన్నారు.

నేటి భాషల ప్రాచీన రూపాలను భద్రపరిచే సాహిత్య సంప్రదాయాలు యూరప్‌లో ఏర్పడడంవల్ల ప్రతి లిఖిత యూరోపియన్ భాషకూ ఒక జాతీయ ప్రామాణిక భాష, వివిధ ప్రాంతీయ ప్రామాణిక భాషలు ఏక కాలంలో సహజీవనం చేయడం కనిపిస్తుంది. కొన్ని యూరోపియన్ భాషలు అంతర్జాతీయ వ్యవహారాన్ని సాధించినా ఆ భాషల మిశ్రిత రూపాల వాడుక (pidgin-creole usage) ఈ నాడు యూరప్‌లో కనిపించదు.

**ఇండోయూరోపియన్ భాషలు :** ఇండో-యూరపియన్ భాషా కుటుంబంలోని నేటి వరకూ నిలిచిఉన్న 9 శాఖలలోనూ 7 శాఖలకు చెందిన భాషలు ఈనాడు యూరప్‌లో వ్యవహారంలో ఉన్నాయి. ఇటాలిక్ శాఖలోని రోమాన్స్ ఉప విభాగంలో పోర్చుగీస్, స్పానిష్, కేటలాన్, ఫ్రెంచ్, రొమాన్ష్, లాడిన్, ఫ్రిలయూలియన్, ఇటాలి యన్, రుమేనియన్ అనే 9 భాషలు చేరి ఉన్నాయి. ప్రత్యేక సాహిత్య సంప్రదాయం ఉండడం ఒక ప్రమా ణంగా గ్రహిస్తే ప్రోవెన్కాల్, సార్డీనియన్ భాషలను కూడా ఈ జాబితాలో చేర్చవలసి ఉంటుంది. జాతీయ

భాష అయి ఉండడం ఒక ప్రమాణంగా గ్రహిస్తే ఈ జాబితాలోని భాషల సంఖ్య తగ్గుతుంది. లాడిన్, ఫ్రిలయూలియన్, ప్రోవెన్కాల్, సార్డీనియన్ భాషలు జాతీయ భాషలు కావు.

అనేక భాషలతో కూడి ఉన్న అన్ని శాఖల విషయంలోనూ భాషల పరిగణనంలో ఇలాంటి చిక్కులు ఎదురవుతున్నాయి. ఆధునిక జర్మానిక్ భాషలు అయిదు మాత్రమే కనిపిస్తున్నాయి: 1. ఇంగ్లీషు, 2. ఫ్రిజియన్, 3. నెదర్లాండిక్-జర్మన్ (ఆఫ్రికన్స్, యిడ్డిష్ భాషలతో సహా), 4. ద్వీపకల్పపు స్కాండినేవియన్, 5. ఖండాంతర్గత స్కాండినేవియన్. సాహిత్య సంప్రదాయం కలిగి ఉండడం, జాతీయ భాష అయి ఉండడం అనే ప్రమాణాలను పరిగణనలోనికి తీసుకుంటే నెదర్లాండిక్ జర్మన్ భాషను హైజర్మన్, లోజర్మన్, డచ్-ఫ్లెమిష్, ఆఫ్రికాన్స్, లుగ్జెన్ బర్గియమ్, యిడ్డిష్ అని విడదీయ వలసి ఉంటుంది. అలాగే ద్వీపకల్పపు స్కాండినేవియన్ భాషను ఐస్‌లాండిక్, ఫారోయీస్ అని విడదీయవచ్చును. అలాగే ఖండాంతర్గత స్కాండినేవియన్‌ను నార్వీజియన్ (న్యూ నార్వీజియన్, డేనో-నార్వీజియన్), డేనిష్, స్వీడిష్ అనే భాషలుగా విడదీయాలి!

శ్లావిక్ భాషలలో 13 ప్రామాణిక భాష లున్నాయి. ఈ భాషలను మూడు ప్రాంతీయవర్గాలుగా విడదీయవచ్చును: 1. తూర్పు శ్లావిక్ (రష్యన్, బేలోరష్యన్, యూక్రేనియన్), 2. పశ్చిమ శ్లావిక్ (పోలిష్, కషూబియన్, లోసార్బియన్, హైసార్బియన్, జెక్, స్లోవక్), 3. దక్షిణ శ్లావిక్ (స్లోవీన్, సెర్బో క్రోషియన్, మేసిడోనియన్, బల్గేరియన్)

ఇండో యూరోపియన్ భాషా కుటుంబానికి చెందిన తక్కిన యూరపియన్ శాఖలలో పేర్కొనదగినవి: కెల్టిక్ (వెల్ష్, బ్రెటాన్, ఐరిష్ గేలిక్, స్కాటిష్ గేలిక్), బాల్టిక్ (లితువేనియన్, లాట్వియన్), గ్రీక్ (ఆధునిక గ్రీక్, ట్సాకోనియన్), ఆల్బేనియన్ (రాజకీయ ఐక్యంవలన రెండు విభిన్న మాండాలికాలు నేడు ఒకే ఆల్బేనియన్ భాషగా వ్యవహరించ బడుతున్నాయి.)

ఇండోయురేనియన్ శాఖలోని రెండు భాషలలో ఒకటి 'వసెటిక్' (ఇరానియన్ భాష). ఇది వెనుక హంగరిలో వ్యవహరించబడేది. రెండవది రోమానీ భాష తాలూకు యూరపియన్ మాండలికం. దీనిని దేశద్రిమ్మరులు (gypsies) యూరప్ అంతటికి, అమెరికాకు కూడా వ్యాపింప చేశారు. అయినా రోమనీ భాష నేడు వేల్స్, ఫిన్‌లాండ్, బాల్కన్స్‌లలో మాత్రమే స్థానికభాషగా నిలచిఉంది.

**ఫిన్నో-యూగ్రిక్ భాషలు :** ఇండో-యూరపియన్ భాషలే గాక యూరప్‌లో ఫిన్నోయూగ్రిక్ శాఖకు చెందిన భాషలలో రెండు తప్ప తక్కిన వన్నీ వ్యవహారంలో ఉన్నాయి. ఇండో-యూరపియన్ భాషల విషయంలో లాగానే వీనిలోనూ విడి భాషలను లెక్కించడం దుష్కరం అవుతూంది. ఉదాహరణకు 'లాప్' (Lapp) భాషలో పలు రకాలు పరస్పరం అర్థం కానివి ఉన్నా వాటి నన్నిటినీ ఒకే 'లాప్' భాష యొక్క వివిధ మాండలికాలుగా పరిగణిస్తున్నారు. అంతే కాక ప్రాంతీయ భేదాల ననుసరించి నార్వీజియన్ లాప్, స్వీడిష్ లాప్, ఫిన్నిష్ లాప్, రష్యన్ లాప్ అని కూడా వ్యవహరిస్తున్నారు. బాల్టిక్-ఫినిక్‌లోని ఫిన్నో-యూగ్రిక్ ఉపసముదాయానికి లాప్, ఫిన్నిష్, కెరీలియన్, వెప్స్, ఇంగ్రియన్, ఎస్టోనియన్, లివోనియన్, వోటిక్ భాషలతో సన్నిహిత సంబంధాలు కనిపిస్తున్నాయి. తక్కిన రెండు ఫిన్నిక్ భాషలూ - మరీ, మోర్డింగ్‌లు, యూరపియన్ రష్యా మధ్య భాగంలో వాడుకలో ఉన్నాయి.

వీటికి ఉత్తరాన, ద్వినా నది ముఖద్వారం నుంచి తూర్పుగా ఉత్తరాసియాలో నెనెట్స్ (యూరక్) భాష మాట్లాడేవారున్నారు. ఇది యురాలిక్ శాఖకు సంబంధించిన భాష. యూరప్‌లోని ఫిన్నోయూగ్రిక్ భాషా కుటుంబానికి చెందిన మరొక భాష హంగేరియన్.

**ఇతర భాషలు :** మాల్టాలో వ్యవహారంలో ఉన్న మాల్టీస్ భాష అరబిక్ భాషా మాండలికం. అయితే ఇతర అరబిక్ మాండలికాలనుంచి మిక్కిలి దూరమై ఇటాలియన్ భాష చేత మిక్కిలి ప్రభావితమైనందువల్ల ఈ భాషను ప్రస్తుతం ప్రత్యేకమైన సెమిటిక్ భాషగా పరిగణిస్తున్నారు.

**బాస్క్ భాష :** స్పెయిన్‌లోని పైరనీస్‌లోను, ఫ్రాన్స్ లోను వ్యవహారంలో ఉన్న ఈ భాష ఒక్కటే పశ్చిమ యూరప్‌లోని నేటి భాషలలో ఇండో - యూరపియన్ భాషా కుటుంబానికి చెందని భాష.

**తుర్కిక్ భాషలు :** బల్గేరియాలోను, బాల్కన్స్‌లోని ఇతర ప్రాంతాలలోను చాలామంది ప్రజలు మాట్లాడే తుర్కిష్ భాష గాక అల్టాయిక్ భాషా వర్గానికి చెందిన అనేక తుర్కిష్ భాషలు తూర్పు యూరప్‌లో వాడుకలో ఉన్నాయి. చువాష్ భాషను చువాష్ అటానమస్ సోవియెట్ సోషలిస్ట్ రిపబ్లిక్‌లో మాట్లాడు తున్నారు. తాతార్‌భాష తాతార్ ఏ.ఎస్.ఎస్.ఆర్ లోనూ, రుమేనియా బల్గేరియాలలోని తత్పరిసరప్రాంతాలలోనూ వ్యవహారంలో ఉంది. ఇలాగే బష్కీర్ భాష బష్కీర్ ఏ.ఎస్.ఎస్.

ఆర్.లోనూ, గాగాజ్‌భాష యూక్రేనియన్ ఎస్.ఎస్.ఆర్, మోల్డేవియన్ ఎస్.ఎస్.ఆర్, బాల్కన్స్‌లలోనూ, కరాయిమ్ భాష దక్షిణ యూక్రేన్, లితువేనియాలలోను వ్యవహారంలో ఉన్నాయి.

**అంతరించి పోయిన భాషలు :** ఇండో-యూరపియన్ భాషా కుటుంబానికి చెందని అనేక భాషలు ఒకప్పుడు యూరప్‌లో వ్యవహారంలో ఉండి, ఇప్పుడు అంతరించి పోయినవి. గ్రీక్-రోమన్ రికార్డుల వలనను, ఆ యా భాషలలోని లిఖిత ఆధారాల వలనను అవి మనకు తెలి యవస్తున్నాయి. ఇలాంటి భాషలలో ఇట్రస్కన్ ఒకటి. ఇప్పటికీ దీనిని పూర్తిగా ఎవరూ చదువలేదు. క్రీ.పూ. 8 వ శతాబ్దం నుండి, క్రీ.శ. 4 వ శతాబ్దం వరకూ ఈ భాష ఇటలీలో వాడుకలో ఉన్నట్లు తెలుస్తూంది. ఐబీరి యన్ ద్వీపకల్పంలో వ్యవహారంలో ఉన్న అనేక భాషలలో ఒకటి అయిన ఐబీరియన్ భాష నేడు శాసనాలలోనూ, నాణేలమీదా మాత్రమే కనిపిస్తూంది. దీనిని ఒకప్పుడు ఎబ్రో నదీ ప్రాంతంలో మాట్లాడేవారు.

**2. దక్షిణాసియా భాషలు :** ఇండియా, బంగ్లాదేశ్, పాకిస్థాన్, నేపాల్, సిక్కిం, భూటాన్‌లలో మాట్లాడే భాషలు ఇండోయూరోపియన్ భాషా కుటుంబానికి చెందిన ఇండో ఆర్యన్, ఇరానియన్ శాఖలకు చెందినవి. కొన్ని భాషలు ద్రవిడియన్ భాషా కుటుంబానికి చెందినవి; బురుషస్కీ వంటి కొన్ని భాషలు ప్రత్యేక భాషలు. కొన్ని భాషలు సినో-టిబెటన్ వర్గానికి చెందినవి.

**ఇండో-ఇరానియన్ భాషలు :** ఆఫ్ఘనిస్థాన్‌లో మాట్లాడే కొన్ని దార్దిక్ భాషలూ, రోమనీ, మినహాయిస్తే ఇండో-ఆర్యన్ శాఖకు చెందిన భాష లన్నీ దక్షిణ ఆసియాలో వ్యవహారంలో ఉన్నాయి. ఇండో-ఆర్యన్ భాషలను వేరు చేసి చూడటం చాలా కష్టమైన పని. కొన్ని మాండలికాలు పరస్పర దురవగాహంగా పరిణమించాయి. మొత్తం 20 కంటె ఎక్కువ ఇండో-ఆర్యన్ భాషలు కనిపిస్తున్నాయి. లిఖిత రూపంలో మాత్రమే నిలచి ఉన్న సంస్కృతం ఇండో ఆర్యన్ భాష అయినా, దానిలోని పదజాలం ఆధునిక భాషలలో అత్యధికంగా ప్రవేశించింది. ఇండియా లోని హిందీ, పాకిస్థాన్‌లోని ఉర్దూ కేవలం పదజాలం విషయంలోనే భిన్నమైన భాషలు.

బెంగాలీ, అస్సామీ, పశ్చిమ హిందీ, తూర్పు హిందీ, బీహారి, మరాఠీ, మైథిలీ, గుజరాతీ, ఒరియా, సింహలీస్, సింధీ, నేపాలీస్ వంటి ఇండో-ఆర్యన్ భాషలను కోట్ల కొలదిమంది మాట్లాడుతున్నారు. ఇండో-ఆర్యన్ భాషలు (ముఖ్యంగా పశ్చిమ హిందీ) మాట్లాడేవారు దక్షిణాఫ్రికా లోనూ, దక్షిణ పసిఫిక్‌లోనూ, అమెరికన్ గయానాలలోనూ చాలామంది ఉన్నారు.

జమ్మూ-కాశ్మీర్ రాష్ట్రాలలో మాట్లాడే కాశ్మీరీ భాష ఒక్కటే సాహిత్య సంప్రదాయం ఉన్న దార్దిక్ భాష. షినా భాష కూడా జమ్మూ-కాశ్మీర్‌లలో వ్యవహరించబ డుతూంది. ముఖ్యంగా పాకిస్థాన్‌లోనే వ్యవహారంలో ఉన్న ఇతర దార్దిక్ భాషలు మాట్లడేవారి సంఖ్య చాలా తక్కువ.

కనీసం నాలుగు ఇరానియన్ భాషలు దక్షిణ ఆసి యాలో వ్యవహారంలో ఉన్నాయి. వాటిలో పాకిస్థాన్‌లోని పస్తోభాష, పాకిస్థాన్, ఇండియాలలోని బెలూచీభాష చెప్ప కోదగినవి.

**ద్రావిడ భాషలు :** ద్రావిడ భాషలు మాట్లాడేవారు చాలామంది దక్షిణ భారతదేశంలోనే ఉన్నా, మొత్తం 20 పైచిలుకు ద్రావిడ భాషలు ఇండియా అంతటా వ్యాపించి ఉన్నాయి. బ్రాహుయి అనే ద్రావిడ భాష పాకిస్థాన్‌లో వ్యవహారంలో ఉంది. నాలుగు ద్రావిడ భాషలు ప్రాచీన సాహిత్య సంప్రదాయం కలిగి, కోట్లకొలది ప్రజలచే మాట్లాడబడుతున్నాయి. అవి: తెలుగు, తమిళం, మలయాళం, కన్నడం. తమిళభాష మాట్లాడే వారు శ్రీలంక, మలేషియా, ఇండోనీషియా, బర్మా, వియత్నాం, దక్షిణాఫ్రికా మొదలైన ప్రాంతాలలో కూడా వ్యాపించి ఉన్నారు. ఎక్కువ ప్రచారంలో లేని ద్రవిడ భాషలలో గోండి, తుళు, కురుఖ్, కుయి భాషలు పేర్కొనదగినవి.

**ముండా భాషలు :** సుమారు 16 ముండా భాషలను మాట్లాడేవారు కూడా భారతదేశంలో ఉన్నారు. కొందరు భాషా శాస్త్రవేత్తలు ఇవి ప్రత్యేకమైన భాషా కుటుంబానికి చెందిన వని అంటున్నారు. మరికొందరు ఆగ్నేయాసియా భాషలతో వీనికి గల సాదృశ్యాన్ని గమనించి ఇవన్నీ ఒకే ఆస్ట్రో-ఏషియాటిక్ భాషావర్గానికి చెందినవని భావిస్తు న్నారు. ముండా భాషలలో ఎక్కువమంది మాట్లాడే భాష సంతాలీ. ముండారి, హో, సోరా, ఖరియా, కొర్కు భాషలు మాట్లాడేవారి సంఖ్య చాలా తక్కువ.

**ఇతర భాషలు :** మధ్యప్రదేశ్‌లోని నియార్ జిల్లాలో కొన్ని వందలమంది మహాలిక్ భాష మాట్లాడే వారున్నారు. పశ్చిమ అస్సాంలోని ఖాసీ, జెయిన్షియా కొండ జిల్లాలలో అయిదు లక్షలమంది ప్రజలు ఖాసీ భాషను మాట్లాడుతు న్నారు. ఈ రెండు భాషలూ ఏ కుటుంబానికీ చెందని విడి భాషలు అయి ఉండవచ్చును. రెండింటికీ ఆస్ట్రో-ఏషియాటిక్ భాషలతో దూర సంబంధం కనిపిస్తూంది. కొందరు విద్వాంసులు మహాలీ భాషను ముండా కుటుం

బంలో చేర్చారు. దక్షిణాసియాలోని మరొక విడిభాష బురుషస్కి. పాకిస్థాన్‌లో 30 వేలమంది ఈ భాషను మాట్లాడేవా రున్నారు. ఈ భాషకు దూరపు చుట్టరికం గల భాషలు కూడా కనిపించడం లేదు.

**సినో - టిబెటన్ భాషలు :** సినో-టిబెటన్ భాషా కుటుంబం తాలూకు బోడో-నాగ-కచిన్ భాషా వర్గానికి చెందిన భాషలు అస్సాం రాష్ట్రంలో వ్యవహారంలో ఉన్నాయి. నాగా భాషలు తూర్పు నేపాల్ నుంచి బర్మావరకూ అక్కడక్కడ వ్యవహారంలో ఉన్నాయి. కచిన్ భాషలు ఉత్తర బర్మాలో మాట్లాడ బడుతున్నాయి. వాటి మాండలికాలు కొన్ని అస్సాంలో కూడా వాడుకలో ఉన్నాయి. టిబెటన్ భాషా మాండలికా లనేకం (బల్టీ, షెర్పా, లోకే, స్పిటీ) కాశ్మీర్ నుంచి భూటాన్ వరకూ అక్కడక్కడ వ్యాపించి ఉన్నాయి.

**తాయ్ భాషలు :** ఖామ్‌తీ అనే తాయ్ భాష మాట్లాడేవారు కొందరు అస్సాంలో ఉన్నారు. అహోమ్ అనే మరొక తాయ్ భాషను వారు మత కర్మకాండల సందర్భంలో మాత్రమే వాడుతారు. అది నిత్య వ్యవహారంలో లేదు.

**ఇంగ్లీష్ భాష వాడుక :** వలస రాజ్యయుగానంతరం శ్రీలంకతో సహా దక్షిణాసియా అంతటా ఇంగ్లీష్ భాష తెలిసినవారు కొంద రున్నారు. వీరు ఇతర రాష్ట్రాలకు వెళ్లినపుడు ఇంగ్లీష్ భాషనే మాధ్యమంగా వాడుతున్నారు.

**3. ఉత్తర ఆసియా భాషలు :** ఉత్తరాన ఆర్కిటిక్ మహాసముద్రం మొదలుకొని దక్షిణాసియా చైనాలవరకూ, పడమట కాస్పియన్ సముద్రం, యూరల్ పర్వతాలు మొదలుకొని తూర్పున పసిఫిక్ మహాసముద్రం వరకూ ప్రజలు మాట్లాడే వివిధ భాషలను ఉత్తర ఆసియా భాషలు అంటున్నారు. అనువంశిక వర్గీకరణాన్ని అనుసరించి ఉత్తరాసియా భాషలు చాలా వరకు యూరాలిక్ భాషా కుటుంబానికి చెందినవి. కొన్ని ఆల్టాయిక్ భాషావర్గంలోని మూడు భాషా కుటుంబాలలో (తుర్కిక్, మంగోలియన్, మంచూ-తుంబుస్) ఒక దానికి చెందినవి. ఇండో-యూరపియన్ భాషా కుటుంబానికి చెందినవి కూడా కొన్ని ఉన్నాయి. యురాలిక్ భాషలలోను, ఆల్టాయిక్ భాషలలోను లాక్షణిక అంశాలలో అనేక సాదృశ్యాలు కనిపిస్తాయి. స్వర సామరస్యం, ప్రత్యేక పద లక్షణం (agglutination) వంటి లక్షణాలు రెండు భాషా కుటుంబాలలోనూ సమానంగా కనిపిస్తున్నాయి.

**యూరాలిక్ భాషలు :** యూరాలిక్ భాషాకుటుంబంలోని రెండు శాఖలకు సంబంధించిన భాషలు ఉత్తరాసియాలో వ్యవహారంలో ఉన్నాయి. అయితే ఆ భాషలు మాట్లాడేవారి సంఖ్య తక్కువ. యుగ్రిక్ భాషలలో (హంగేరియన్‌తో సహా ఫిన్నో-యూరిక్ శాఖకు సంబంధించిన ఉపవర్గం) మన్సీ (వోగుల్), ఖాంతీ (వోస్టాక్) అనే రెండు భాషలు వోబ్ నది, దాని ఉపనదుల తీరాలలో వ్యవహారంలో ఉన్నాయి. సమోయెదిక్ శాఖకు చెందిన భాష లన్నింటినీ ఉత్తరాసియాలో మాట్లాడుతున్నారు. ఇవి: యెనిసీ నదీ ముఖద్వారం నించి పశ్చిమంగా ఉత్తర ద్వినా నదీముఖద్వారం వరకూ అక్కడక్కడ మాట్లాడబడే నెనెట్స్ (యూరక్), యెనిసీ నదీ తీర ప్రాంతాలలోనే వ్యవహారంలో ఉన్న ఎనెట్స్, సైబీరియాలోని తాయ్‌మిర్ (Taymyr) ద్వీపకల్పంలో మాట్లాడే న్గానాసన్ (తావ్‌గీ), ఎనెట్స్‌కి దక్షిణాన తాజ్, టిమ్ నదులమధ్య భాగంలో మాట్లాడబడే సెల్‌కుప్ (వోస్ట్యాక్). మరొక దక్షిణ సమోయెదిక్ భాష అయిన కామాస్ (సయాన్) భాష మాట్లాడేవ్యక్తి 1963 జనాభా లెక్కల ప్రకారం ఒక్కడే ఉన్నాడు.

**ఆల్టాయిక్ భాషలు :** వీనిలో తుర్కిక్ భాషలు అన్ని యూరేషియన్ ప్రాంతాలలోనూ, దక్షిణాసియాలోనూ, ఆగ్నేయాసియాలోనూ వ్యవహారంలో ఉన్నా, వానిలో వైవిధ్యం లేకపోవడం చిత్రమైన అంశం. నిజానికి చాలా తుర్కిక్ భాషలను ఒకే భాషగా పరిగణించవలసి ఉన్నా, అవి ఆ యా ప్రాంతాలలోని పదజాలాన్ని స్వీకరించి పరస్పరం అర్థం కాకపోవడం వలన భిన్న భాషలుగా వ్యవహరించబడుతున్నాయి. తుర్కీ నుంచి వెళ్లిన తుర్కీ భాష మాట్లాడేవ్యక్తి ఉజ్‌బెక్ భాషను అర్థం చేసికోగలిగినంత తేలికగా ఉజ్‌బెక్ భాషీయుడు తుర్కిష్ భాషను అర్థం చేసికోలేడు. కారణం: తుర్కిష్ భాషలో ఎన్నో పర్షియన్, అరబిక్ పదాలు వచ్చి చేరడమే.

ఉత్తరాసియాలో దక్షిణం నుంచి మధ్యసైబీరియా ద్వారా ఈశాన్యంగా తుర్కిష్ భాషలు వ్యాపించి ఉన్నాయి. వీటిలో తుర్క్‌మెన్ ఎస్.ఎస్.ఆర్, ఇరాన్, ఆఫ్ఘనిస్థాన్ లలో మాట్లాడే తుర్క్‌మెన్‌భాష, ఉజ్‌బెక్ ఎస్.ఎస్.ఆర్ లోను, ఆఫ్ఘనిస్థాన్‌లోను మాట్లాడే ఉజ్‌బెక్‌భాష, కిర్గిస్ ఎస్.ఎస్.ఆర్‌లోను, ఆఫ్ఘనిస్థాన్ నుంచి చైనా వరకూగల ప్రాంతంలోనూ వ్యాపించి ఉన్న కిర్గిస్ భాష, కారాకల్పక్ ఎస్.ఎస్.ఆర్. లో మాట్లాడే కల్పక్ భాష, కజఖ్ ఎస్.ఎస్.ఆర్. లో మాట్లాడే కజఖ్ భాష ముఖ్యమైనవి.

**మంగోలియన్ భాషలు :** ఆఫ్ఘనిస్థాన్ మొదలు మంచూరియా వరకూ గల మధ్యాసియా ప్రాంతా లన్నింటిలోనూ చెదురు మదురుగా ఈ మంగోలియన్ భాషలు

వ్యవహారంలో ఉన్నాయి. తూర్పు ఆసియా, ఉత్తర ఆసియాలలోని ఎక్కువ భాగాలు ఈ ప్రాంతంలో చేరి ఉన్నాయి. ఈ మంగోలియన్ భాషలలో ఆఫ్ఘనిస్థాన్‌లో మాట్లాడే మొగోల్ (ఇరానియన్, తుర్కిక్ భాషల ప్రభావం దీని మీద ఎక్కువ), చైనాలోని కన్సూ రాష్ట్రంలోనూ, టిబెట్‌లోనూ మాట్లాడే మొంగ్వర్ (Monguor), ప్రధానంగా మంగోలియాలో మాట్లాడే దఘూర్ ప్రధానమైనవి. ఈ దఘూర్ భాషమీద తుంబుస్ భాషల ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది. మంగోలియన్ పీపుల్స్ రిపబ్లిక్‌లో అధికార భాష అయిన ఖాల్ఖా భాష ప్రభావం వలన ఈ భాషలలో అన్యోన్య అవగాహన ఎక్కువగా కనిపిస్తుంది.

మంచూ-తుంబుస్ భాషలు : సైబీరియా మధ్యభాగం నుంచి జపాన్, వోఖోట్స్క్ సముద్ర తీరాల దాకా కంచట్కా ద్వీపకల్పం, సఖాలి దీవులతో సహా, ఈ మంచూ తుంబుస్ భాషలు చెదురు మదురుగా వ్యవహారంలో ఉన్నాయి. ఈ భాషలు మాట్లాడేవారు సముద్రతీరం వెంట కొందరూ, యెనిసీ, తుంగుస్కా, ఖటాంగ, లీనా, ఆమూర్, సుంగారీ నదీ తీరాల వెంట కొందరూ వ్యాపించి ఉన్నారు. ఈ భాషలను గురించిన సమాచారం ఎక్కువగా లభ్యం కావడం లేదు. ఈ భాషలలో పశ్చిమాన, వాయవ్యాన సమోయేదిక్ (యురాలిక్) భాషలనుంచి, దక్షిణాన మంగోలియన్, చైనీస్ భాషలనుంచి, ఉత్తరాన, తూర్పున పేలియో-సైబీరియన్ భాషలనుంచి పదజాలం విరివిగా స్వీకరించ బడడం వలన ఈ భాషలను విడి విడిగా వర్ణించడం మరింత కష్టం అవుతూంది. చైనాలోని మంచూస్‌ల భాష తరువాత ఈ మంచూ-తుంబుస్ భాషలలో ఎక్కువ మంది మాట్లాడేది ఈవెన్స్క్ భాష.

**పేలియో-సైబీరియన్ భాషలు :** పేలియో-సైబీరియన్ ప్రజలు సైబీరియాలోని ఉత్తర ప్రాంతంలో తూర్పు సైబీరియన్ సముద్రానికీ, వోఖోట్స్క్ సముద్రానికీ మధ్యభాగంలో నివసిస్తున్నారు. కంచట్కా ద్వీపకల్పం కూడా ఈ ప్రాంతంలో చేరి ఉంది. పేలియో-సైబీరియన్ భాషలు నాలుగు వర్గాలుగా విడిపోయి ఉన్నాయి. వీటిలో ఒక దానితో ఒకదానికి సంబంధం లేకపోవడమే గాక ఇతర అనువంశిక కుటుంబాలతో సంబంధాలు కూడా రుజువు కాలేదు. ఈ భాషా వర్గాలలో మిక్కిలి ఉత్తరాన ఉన్న వర్గం లువోరా వెట్లాన్ . చుక్చీ, కంచడల్, కోర్యాక్ భాషలు ఈ వర్గానికి చెందినవి. కొందరు విద్వాంసులు కెరెక్, అల్యుటార్ భాషలను ఏ కుటుంబానికీ చెందని విడి భాషలుగా పేర్కొంటున్నారు. మరి కొందరు ఇవి గోర్యాక్ భాషా మాండలికాలే అంటున్నారు.

ఉత్తరాసియాలోని ఇండో-యూరపియన్ భాషలలో ఇటీవలనే అక్కడ ప్రవేశపెట్టబడిన రష్యన్ భాష కాక, ఆగ్నేయ ప్రాంతంలోని ఇరానియన్ భాషలూ, నామమాత్రావశిష్టంగా మిగిలిన టోచారియన్ భాష పేర్కొనదగినవి.

లేఖనం-అక్షరాస్యత : ఉత్తరాసియాకు ప్రాచీనకాలంలో లేఖన ప్రక్రియకు ప్రేరణ చైనానుంచి వచ్చింది. ఇటీవలి కాలంలో ప్రేరణ సోవియట్‌రష్యా నుంచి వచ్చింది. జార్ రాజుల కాలంలో నిరక్షరాస్యులుగా ఉన్న ఆల్టాయిక్ ప్రజలు రష్యన్ ప్రేరణతో అక్షరాస్యు లయారు. ఆల్టాయిక్ భాషలు లిఖిత భాషలు అయి ఉండగా, ఇందుకు విరుద్ధంగా పేలియో-సైబీరియన్ భాషలలో ఎక్కువ భాగం లేఖన విరహితాలు. సోవియెట్ విద్యా విధాన లక్ష్యం స్థానిక భాషలను విద్యాబోధనలో ఉపయోగించి నిరక్షరాస్యులను అక్షరాస్యులుగా చేయడం. ఉత్తరాసియాలో ఈ నాడు రష్యన్ భాష అధికార మాధ్యమం (lingua franca) గా ఉపయోగ పడుతూంది. 13 వ శతాబ్ది నాటి మంగోలియన్ సామ్రాజ్య కాలంలో తుర్కిక్ భాషలు ఉత్తరాసియాలో పరిపాలన భాషలుగా ఉండేవి.

4. నైరృతి ఆసియా భాషలు : ఈ నాడు ఇరాన్ మొదలుకొని పశ్చిమంగా మధ్యధరా సముద్రప్రాంతం వరకూ (ఇరాన్, ఇరాక్, సౌదీ అరేబియా, జోర్డాన్, సిరియా, లెబనాన్, ఇజ్రేల్‌లలో) సెమెటిక్, ఇండోయూరపియన్, తుర్కిక్ భాషా కుటుంబాలకు చెందిన భాషలు వ్యవహారంలో ఉన్నాయి. నైరృతి ఆసియాకు సమీపంలో ఉన్న ఆఫ్ఘన్‌స్థాన్, తుర్కీ, నల్లసముద్రానికీ, కాస్పియన్ సముద్రానికీ మధ్య ఉన్న కాకసస్ ప్రాంతాలూ భాషల అనువంశిక వైవిధ్యం విషయంలో యూరప్‌ను తల దన్నుతున్నాయి.

ఒకప్పుడు ప్రాచీన కాలపు సమీప ప్రాచ్యంలో ప్రథమ భాషగా వ్యవహారంలో ఉన్న సుమేరియన్ భాష ఇటు సెమెటిక్ కుటుంబానికి గాని, అటు ఇండో యూరపియన్ కుటుంబానికి గాని చెందింది కాదు. ఈ భాష నేడు కేవలం రచనలలో మాత్రమే మిగిలి ఉంది. అక్కాడియన్, హెర్షియన్ భాషలు రెండే మొట్ట మొదటి సారిగా ఇక్కడ విస్తృత ప్రచారంలోకి వచ్చిన భాషలు!

ఇండో-ఇరానియన్ భాషలు : ఇండో-యూరపియన్ భాషాకుటుంబంలోని ఇండో-ఇరానియన్‌శాఖకు సంబంధించిన ఇరానియన్ భాషా సముదాయానికి చెందిన మొత్తం 20 జీవద్ భాషలు నైరృతి ఆసియాలోనూ, చెదురు మదురుగా తత్పరిసర ప్రాంతాలలోనూ కూడా

వ్యవహారంలో ఉన్నాయి. పెర్షియన్ భాషలో మూడు వేర్వేరు సాహిత్య సంప్రదాయాలు ఉన్నాయి. ఇవి ఇరాన్, ఆఫ్ఘనిస్థాన్, టడ్జిక్ ఎస్.ఎస్.ఆర్. లకు మాత్రమే పరిమితం కావు. పస్తో భాష మాట్లాడేవారిలో సగం కంటె ఎక్కువమంది ఆఫ్ఘన్‌స్థాన్‌లోనూ, ఇతర దక్షిణాసియా ప్రాంతాలలోనూ ఉన్నారు. కుర్దిష్ భాషను మాట్లాడేవారు దక్షిణంగా దక్షిణ ఆర్మీనియన్ ఎస్.ఎస్.ఆర్., తుర్కీ, సిరియా, ఇరాన్, ఇరాక్‌లలో కనిపిస్తారు. బెలూచీ భాష మాట్లాడేవారిలో అయిదింట మూడు వంతుల మంది ఇరాన్‌లోనూ, దక్షిణ ఆఫ్ఘన్‌స్థాన్‌లోనూ ఉన్నారు. ఇతర ఇరానియన్ భాష లనేకం చాలా కొద్దిమంది ప్రజల వ్యవహారంలో ఉన్నాయి. అలాంటి భాషలలో లూరీ, బఖ్యారీ పేర్కొనదగినవి. ఈ భాషల వ్యవహర్తలు ఇరాన్‌లో మాత్రమే ఉన్నారు. ముంజి, షుఘ్ని భాషలు మాట్లాడేవారు ఎక్కువగా ఆఫ్ఘనిస్థాన్‌లోనూ, స్వల్పంగా పాకిస్థాన్, టడ్జిఖ్ ఎస్.ఎస్.ఆర్ లోనూ ఉన్నారు. యుఘ్నొబీ అనే ఇరానియన్ భాషను టడ్జిఖ్ ఎస్.ఎస్.ఆర్.లో మాట్లాడుతున్నారు. టట్, టాలిష్, ఓసె, టిక్ అనే ఇరానియన్ భాషలు పూర్తిగా కాకాసస్ ప్రాంతంలోనే వ్యవహారంలో ఉన్నాయి. వీటిలో టాలిష్ భాష మాట్లాడేవారు మాత్రం కొందరు ఇరాన్‌లో కూడా ఉన్నారు.

ఇదివరకు ఇండో-ఆర్యన్ కుటుంబంలోని దార్దిక్ శాఖకు చెందినట్లు భావించబడుతూ వచ్చిన, ఆఫ్ఘన్‌స్థాన్‌లో వ్యవహారంలో ఉన్న అర డజను న్యూరిస్తానీ (క్యాఫిరీ) భాషలను ఇటీవల కొందరు విద్వాంసులు ఇండో-ఇరానియన్ శాఖకు చెందిన ప్రత్యేక వర్గంగా భావిస్తున్నారు. రోమనీ అనే మరొక ఇండో ఆర్యన్ భాష తాలూకు రెండు మాండలికాలు నైరృతి ఆసియాలో వాడుకలో ఉన్నాయి. వీటిని ఆర్మీనియన్ రోమనీ, ఆసియాటిక్ రోమనీ అంటారు.

**ఇతర భాషలు :** మరొక ఇండో-యూరపియన్ శాఖకు చెందిన ఏకైక భాష అయిన ఆర్మీనియన్ భాష ఆర్మీనియన్ ఎస్.ఎస్.ఆర్., జార్జియన్ ఎస్.ఎస్.ఆర్., అజర్ బైజాన్ ఎస్.ఎస్.ఆర్. లలోనే ఎక్కువగా వ్యవహారంలో ఉన్నా, సిరియా, లెబనాన్, ఇరాన్, తుర్కీ, అమెరికాలలోని ఆర్మీనియన్ వర్గాలలోను, ఈజిప్ట్, ఫ్రాన్స్‌లలోను కూడా వ్యవహారంలో ఉంది.

చాలాకాలం క్రితమే అంతరించిపోయిన ఇండో-యూరపియన్ కుటుంబంలోని అనటోలియన్ శాఖకు చెందిన భాషలు (హిటైట్ కూడా వీటిలో ఒకటి) ఒకప్పుడు నైరృతి ఆసియాలో వ్యవహారంలో ఉండేవి.

అయిదు తుర్కిక్ భాషలు ప్రధానంగా నైరృతి ఆసియాలో వ్యవహారంలో ఉన్నాయి. అవి: 1. తుర్కిష్ (ఎక్కువగా తుర్కీలోను, పరిసర ఉత్తర ప్రాంతాలలోనూ మాట్లాడతారు), 2. అజర్ బైజానీ ( అజర్ బైజాన్, ఎస్.ఎస్.ఆర్., ఇరాన్‌లలో), 3. కుమిక్, 4 కరాచే, 5. నోగే. ఈ చివరి మూడు భాషలూ కాకాసస్ ప్రాంతంలో వాడుకలో ఉన్నాయి. ఉత్తరాసియాలో ప్రధానంగా వ్యవహారంలో ఉన్న ఉజ్‌బెక్, తుర్క్‌మెన్, ఖిడ్జిజ్ భాషలు కూడా నైరృతి ఆసియాలో స్వల్పంగా వ్యవహారంలో ఉన్నాయి.

మంగోలియన్ కుటుంబానికి చెందిన మంగోల్ భాష ఆఫ్ఘన్‌స్థాన్‌లోను, ద్రవిడియన్ భాషా కుటుంబానికి చెందిన బ్రాహుయి ఆఫ్ఘన్‌స్థాన్, ఇరాన్‌లలోను వ్యవహారంలో ఉన్నాయి.

**కకేషియన్ భాషలు :** కక్‌సస్ ప్రాంతంలో ఇండో-యూరపియన్, తుర్కిక్ భాషా కుటుంబాలకు చెందిన భాషలతో పాటు మూడు కకేషియన్ భాషా కుటుంబాలకు చెందిన 30 పైచిలుకు భాషలు కూడా వ్యవహారంలో ఉన్నాయి. దక్షిణ కాకాషియన్ భాష అయిన జార్జియన్ వాటిలో మిక్కిలి ప్రధానమైన భాష. దీనిని జార్జియన్ ఎస్.ఎస్.ఆర్, అజర్ బైజాన్ ఎస్.ఎస్.ఆర్, పరిసరాలలోని తుర్కీ, ఇరాన్ ప్రాంతాలలో మాట్లాడుతున్నారు. సుదీర్ఘ సాహిత్య సంప్రదాయం ఉన్న కాకాషియన్ భాష ఇది ఒక్కటే. తక్కిన దక్షిణ కాకాషియన్ భాషలు: లాజ్ (చాన్), స్వాన్. కాకాషియన్ భాషల వర్గీకరణంలో భాషావేత్తల మధ్య అభిప్రాయభేధాలు ఎక్కువగా కనిపిస్తున్నాయి.

**సెమిటిక్ భాషలు :** ఇప్పటికీ అయిదు సెమిటిక్ భాషలు నైరృతి ఆసియాలో వ్యవహారంలో ఉన్నాయి. 1. అరబిక్, 2. హీబ్రూ (ప్రధానంగా ఇజ్రేల్‌లో), 3. తూర్పు ఆరమాయిక్ మాండలికం (ఇప్పటికీ ఇజ్రేల్, సిరియా, ఇరాన్, ఇరాక్, ఆర్మీనియన్ ఎస్.ఎస్.ఆర్. లలో), 4. పశ్చిమ అరమాయిక్ మాండలికం (ఇప్పటికీ లెబనాన్, సిరియాలలో), 5. ఆగునిక దక్షిణ అరబిక్ (దక్షిణ సౌదీ అరేబియాలోను, పరిసరదీవులలోను). అంతరించిపోయిన సెమిటిక్ భాషలలో ప్రధానమైనవి: ఫొనీషియన్, అక్కాడియన్ (బాబిలోనియన్, అసీరియన్), మోవాబైట్, యూగారిటిక్.

**5. తూర్పు ఆసియా భాషలు :** ఉత్తర ఆసియాకూ, ఆగ్నేయాసియాకూ మధ్య ఉన్న చైనా, జపాన్, కొరియాలలోని భాషలను తూర్పు ఆసియా భాషలుగా వ్యవహరిస్తున్నారు. తూర్పు ఆసియా భాషలలో అనువంశిక వైవిధ్యం ఎక్కువగా కనిపిస్తుంది. ఐనూ, జపనీస్, కొరియన్ భాషలకు ఒకదానితో మరొకదానికి సంబంధం లేదు.

తూర్పు ఆసియాలోని ఇతర భాషా కుటుంబాలతోనూ వాటికి సంబంధం లేదు. చైనాలోని భాషలు ఒకే భాషా కుటుంబానికి చెందిన వివిధ మాండలికాలు.

**అల్టాయిక్ భాషలు :** ఉత్తరాసియాలోని మూడు ప్రధాన భాషా కుటుంబాలకు చెందిన భాషలు చైనాలో వాడుకలో ఉన్నాయి. తుర్కిక్ భాష అయిన ఉయిఘూర్ (Uighur) చైనాలోని సింకియాంగ్, కన్సూ మండలాల లోనూ, యు.ఎస్.ఎస్.ఆర్. లోనూ, పశ్చిమ మంగోలియాలోనూ వాడుకలో ఉంది. మరొక తుర్కిక్ భాష అయిన కిర్గిస్ మాట్లాడేవారు కూడా చైనాలో ఉన్నారు. మంచూ - తుంబుస్ భాషలలో మంచూ భాష సుప్రసిద్ధమైంది. దానికి 1599 నాటి నుండి సుదీర్ఘమైన సాహిత్య సంప్రదాయం ఉంది. 1643 లో మంచూ రాజుల ప్రోద్బలంతో మాండరిన్ భాష వాడుకలోకి వచ్చింది. అయినా, మంచూ భాష మాట్లాడేవారు మంచూరియా లోనూ, చైనీస్ తుర్కిస్థాన్‌లోనూ నేటికీ అక్కడక్కడ కనిపిస్తున్నారు.

కొరియన్, జపనీస్ భాషలతో అల్టాయిక్ భాషలకు వాక్య నిర్మాణంలో ప్రస్ఫుటమైన సామ్యం కనిపిస్తూ ఉండడంతో కొంతమంది భాషాశాస్త్రవేత్తలు వీటికి సుదూరమైన బాంధవ్యాన్ని అంటగడుతున్నారు.

**కొరియన్, జపనీస్, ఐనూ భాషలు :** కొరియన్ భాషను కొరియాలోనేగాక, చైనా, జపాన్‌లలో కూడా చెప్పుకోదగినంతమంది మాట్లాడుతున్నారు.

జపనీస్ భాషాకుటుంబంలో జపనీస్ భాష మాత్రమే గాక పరస్పరం బోధపడని ర్యుక్యూ (Ryukyu) దీవుల లోని ప్రజలు మాట్లాడే అనేక మాండలికాలు కూడా చేరి ఉన్నాయి. జపనీస్ భాష మాట్లాడేవారు జపాన్‌లోను, తైవాన్, బ్రెజిల్, యు.ఎస్. (ముఖ్యంగా హవాయ్) లోనూ కలసి మొత్తం 12,10,00,000 మంది దాకా ఉన్నారు.

తూర్పు ఆసియాలోని దీవులలో వాడుకలో ఉన్న ఐనూ భాషకు ఇతర భాషలతో సుదూరమైన సంబంధం ఉన్నట్టు కూడా కనిపించదు. ఈ భాష మాట్లాడేవారు హొక్కాయిడో దీవి, సఖాలిన్ దీవి, కురిల్ దీవులలో మొత్తం 16,000 మంది ఉన్నారు.

**చైనీస్ భాష - మాండలికాలు :** ఆ భాష మాట్లాడేవారి సంఖ్యల దృష్ట్యానూ, తూర్పు ఆగ్నేయ ఆసియాలో అవి నెరపుతున్న ప్రభావం దృష్ట్యానూ చైనీస్ భాషలు చాలా ప్రధానమైనవి. ఇరుగు పొరుగు భాషలు ఒకదాని కొకటి అర్థం అవుతూ ఉండడం మాండరిన్, వూ, కేంటొనీస్, హ్సియాంగ్, కన్‌హక్కా, మిన్ (ఉత్తర మిన్, దక్షిణ మిన్) వంటి చాలా చైనీస్ భాషలలో కనిపిస్తుంది. చైనా దేశీయులలో 70 శాతం మంది మాట్లాడే భాష మాండరిన్. ఇతర చైనీస్ భాషలను మాట్లాడేవారికి కూడా ఈ మాండరిన్ భాష తెలిసి ఉంటుంది. చాలా కాలంగా పరిపాలన భాషగా ఇది కొనసాగుతూ వచ్చింది. రెండు చైనీస్ భాషలను మాట్లాడేవారు ఒకరు మాట్లాడుతున్నది మరొకరు అర్థం చేసుకోలేక పోయినా, వాటి లిఖిత రూపాలను వారు అర్థం చేసుకోగలరు. ఒకే లిఖిత రూపాన్ని ఆ ఇరువురూ వేరువేరు విధాలుగా చదువుతారు. చైనీస్ లిపి సుమారు 4,000 సంవత్సరాలుగా వాడుకలో ఉంది. అయితే వేల కొద్దీ సంకేతాలను నేర్చుకోవలసి ఉండడంవల్ల ఈ భాషాధ్యేతలకు కొంత క్లేశం ఎదు రవుతూంది. అందుకే చైనా వారిలో చాలా మంది నిరక్షరాస్యులు (వ్రాయడం, చదవడం చేతకాని వారు). అయితే అక్షరాల సంఖ్య తగ్గించడంతోనూ, రోమన్‌లిపిని వాడుక చేయడంతోనూ నేడు పీపుల్స్ రిపబ్లిక్‌లో అక్షరాస్యుల సంఖ్య పెరుగుతూంది. భాషా భాషుల సంఖ్య విషయంలో మాండరిన్ ప్రపంచంలో అగ్రస్థానం వహిస్తూంది. 61 కోట్లమంది ఈ భాషను మాట్లాడుతున్నారు.

**తాయ్, మియావో - యావో భాషలు :** తాయ్ కుటుంబానికి చెందిన కమ్ - సుయి భాషావర్గంలోని భాషలన్నీ చైనాలో (క్వీచౌ, హ్యునాన్, క్వాంగ్‌సీ రాష్ట్రాలలో) వ్యవహారంలో ఉన్నాయి. వీటి మాండలికాలు కొన్ని ఆగ్నేయాసియాకు కూడా విస్తరించాయి. మియావో - యావో భాషలు మాట్లాడేవారు మధ్యచైనా, వియత్నాం, లావోస్, తాయ్‌లాండ్‌లలో చెదురు మదురుగా కనిపిస్తారు. మియావో భాషా మాండలికాలలో ముఖ్యమైనవి: రెడ్ మియావో, వైట్ మియావో, గ్రీన్ లేక బ్లూ మియావో, బ్లాక్ మియావో; యావో భాషలు: యావో (మన్ లేక మీన్), లాకా, ప్యునూ (Punu).

**టిబెటో - బర్మన్ భాషలు :** టిబెటన్ లేక టిబెటిక్ భాషా వర్గంలో కనీసం రెండు భాష లున్నాయి. వీటిని టిబెట్, నేపాల్, సిక్కిం, ఇండియాలలో మాట్లాడుతున్నారు. వీటిలో మొదటిది సెంట్రల్ టిబెటన్ భాష. టిబెట్‌లో ప్రామాణికభాష అయిన లాసా కూడా ఈ భాషా మాండలికమే! రెండవది పశ్చిమ టిబెటన్. ఇవి గాక సిక్కిం, నేపాల్, అస్సాం, ఇండియా, బంగ్లాదేశ్‌లలో వ్యవహారంలో ఉన్న అనేక ఇతర భాషలకు కూడా టిబెటన్ భాషతో సంబంధం కనిపిస్తూంది.

సైనో-టిబెటన్ భాషాకుటుంబంలోని టిబెటో - బర్మన్ శాఖకు చెందిన టిబెటన్ భాషతో సుదూర సంబంధం గల కొన్ని భాషలు తూర్పు ఆసియాలో బర్మా సరిహద్దుల ప్రాంతంలో వ్యవహారంలో ఉన్నాయి. వీటిని తరచు బర్మిక్ భాషలు అనడం కద్దు. వీటిలో బర్మీస్‌లో (బర్మీష్ ఉపవర్గం, కాచిన్ ఉపవర్గం) ముఖ్యమైనది.

**6. ఆగ్నేయాసియా భాషలు (ఆస్ట్రోనేషియన్ భాషతో సహా) :** ఆసియా ఖండ ప్రధాన భూభాగంలో చైనాకు దక్షిణాన, ఇండియాకు తూర్పున ఉన్న భూభాగాన్నీ, దాని పరిసరాలలోని దీవులనూ కలిపి 'ఆగ్నేయాసియా' అని వ్యవహరిస్తున్నారు. మలేషియాలోని ద్వీప సముదాయ భాగం, ఇండోనిషియా, ఫిలిపిన్స్ దీవులు దీనిలో చేరి ఉన్నాయి. ఇంచుమించు ఆగ్నేయాసియా దీవులలో మాట్లడే భాషలన్నీ ఆస్ట్రోనేషియన్ (మలయో-పోలినేషియ) అనబడే ఒకే భాషా కుటుంబానికి చెందినవి. ఆసియా ఖండంలోని ప్రధాన భూభాగంలో మాట్లాడే భాషలు మాత్రం ఆస్ట్రో - ఏషియాటిక్, తాయ్, సైనో టిబెటన్ భాషా వర్గాలకు చెందినవి. ఈ విధంగా ద్వీప సముదాయంలో కంటె ఆగ్నేయాసియాలోని ప్రధాన భూభాగంలో భాషా వైవిధ్యం ఎక్కువగా కనిపిస్తుంది. ఆస్ట్రోనేషియన్ భాషలు ఆగ్నేయాసియా నుండి సుదూరంగా ఉన్న ఓషియానియా (పోలినీషియా, మైక్రోనీషియా) వరకూ వ్యాపించాయి. ఒక ఆధునిక ఆస్ట్రోనేషియన్ భాష (మలగాసీ) హిందూ మహాసముద్రానికి ఆఫ్రికావైపున ఉన్న మడగాస్కర్ ప్రాంతంలో కూడా వ్యవహారంలో ఉంది.

ఆగ్నేయాసియాలో సాధారణంగా దేశంపేరు, భాషపేరు ఒకటిగానే ఉంటాయి. ఉదాహరణకు ఫిలిప్పీన్స్ రిపబ్లిక్‌లో మాట్లాడే జాతీయభాష 'ఫిలిప్పీనో'. నిజానికి ఫిలిప్పీన్స్‌లో ఈ భాష రెండవ భాషగా నేర్చుకోబడుతూంది. ఆగ్నేయాసియా ప్రజలలో తమను ప్రభావితం చేసిన ఇంగ్లీష్, ఫ్రెంచ్, డచ్, శ్పానిష్ - ఇటీవల జపనీస్, రష్యన్ - వంటి వలస విధానపు భాషలపట్ల భయం, అవిశ్వాసం వ్యక్తం అవుతున్నాయి. ఆస్ట్రోనేషియన్ భాషలనూ, ఇతరభాషలనూ మాట్లాడే వారికి పాపువా నుండి మెలనీషియా మీదుగా మైక్రోనీషియా వరకూ నియోమెలనీషియన్ లేక మెలనీషియన్ పిడ్జిన్ ఇంగ్లీష్ అనబడే ఒక కృతక భాష అనుబంధభాషగా ఉపయోగపడుతూంది.

ఆగ్నేయాసియా ప్రధాన భూభాగంలోని భాషలలో అనువంశిక వైవిధ్యం గోచరించినా, అనేక విషయాలలో వాటిలో లాక్షణికమైన సాదృశ్యం కనిపిస్తుంది.

ఆస్ట్రో - ఏషియాటిక్ భాషలు : ఆగ్నేయాసియాలో వ్యవహారంలో ఉన్న భాషా కుటుంబా లన్నిటిలోనూ మాన్ ఖ్మేర్ వర్గం పెద్దది. దీనికి సంబంధించిన భాషలు 50 పైచిలుకు వ్యవహారంలో ఉన్నాయి. బర్మా మొదలు వియత్నాం వరకు ఈ భాషలు మాట్లాడుతున్నారు. కంబోడియాలో ఖ్మేర్ (కంబోడియన్) అధికార భాష. ఈ భాష మాట్లాడేవారు తాయ్‌లాండ్‌లో కూడా ఉన్నారు. మాన్ భాష తాయ్‌లాండ్, బర్మాలలో వ్యవహారంలో ఉంది. ఆగ్నేయాసియా ప్రధాన భూభాగం లోని భాషలలో ఎక్కువ మంది ప్రజలు మాట్లాడే భాష వియెట్నామీజ్. ఇది వియెట్నాంలో బహుళంగానూ, కంబోడియా, తాయ్‌లాండ్, లావోస్‌లలో చెదురు మదురుగాను వ్యవహారంలో ఉంది. ఉత్తర వియెట్నాంలోని కేంద్రపీఠభూమి ప్రాంతంలో (High lands) మాట్లాడే మ్యువోంగ్ (Muong) దీనితో కొంతవరకు సంబంధం గల ఒక ప్రత్యేకమైన భాషగా పరిగణించబడుతూంది.

మలయాలో మాట్లాడబడే మూడు వర్గాల భాషలు (వీటిని 'మలక్కన్' అనడం కద్దు) ఆస్ట్రో ఏషియాటిక్ భాషా కుటుంబానికి చెందినవి. అవి: ఉత్తరమలయా, తాయ్‌లాండ్‌లలో మాట్లాడే జహాయిక్, లేక సెమాంగ్‌భాషలు, కౌలాలంపూర్‌కు దక్షిణాన తీరప్రాంతంలో మాట్లాడే సెనోయిక్ లేక సకాయ్ భాషలు, సెనోయిక్ భాషలకు దక్షిణాన మాట్లాడే సెమెలాయిక్ లేక జెకూన్ భాషలు.

తాయ్, సైనో-టిబెటన్ భాషలు : తాయ్ భాషా కుటుంబానికి చెందినవి కనీసం ఒక డజన్ భాషలు ఆగ్నేయాసియాలో వ్యవహారంలో ఉన్నాయి. అవి: తాయ్ లేక సయామీజ్ (తాయ్‌లాండ్‌లో), లావో (తాయ్‌లాండ్, లావోస్, కంబోడియాలలో), యువాన్ (తాయ్‌లాండ్‌లో), షాన్ (బర్మాలో), బ్లాక్‌తాయ్, లేక తాయ్‌నాయర్ (లావోస్, వియెట్నాంలలో), ఖూన్‌ఖామ్ (బర్మాలో), వైట్ తాయ్ లేక తాయ్ బ్లాక్, ఛే,నుంగ్‌తో, కెలావో లేక చిలావో (వియెట్నాంలో).

సుమారు 90 లక్షలమంది చైనీయులు ఆగ్నేయాసియాలో ఉన్నారు. వీరిలో 50 లక్షల కంటె ఎక్కువమంది తాయ్‌లాండ్‌లోనూ, 40 లక్షలమంది మలేషియాలోనూ ఉన్నారు. బర్మా, కంబోడియా, వియెట్నాం, లావోస్‌లలో 54 వేలమంది దాకా ఉన్నారు.

ఆగ్నేయాసియాలో వ్యవహారంలో ఉన్న సైనో-టిబెటన్ కుటుంబానికి చెందిన ఇతర భాషా వర్గాలలో బర్మీస్-లోలో (బర్మీస్) వర్గం భాషలు మాట్లాడేవారు ఎక్కువ ప్రాంతంలో వ్యాపించి ఉన్నారు. బర్మాలో సుమారు

90 శాతం మంది బర్మీస్ భాషను ద్వితీయభాషగా మాట్లాడుతున్నారు. లోలో భాషలు బర్మా, థాయ్‌లాండ్, లావోస్, వియెట్నాంలలో వ్యవహారంలో ఉన్నాయి. ఈ వర్గం భాషలలో చెప్పుకోదగినవి: లిసూ, లహూ, అఖా, ముంగ్, పునోయ్, ప్యేన్ మొదలయినవి. వాటిలో కొన్ని అస్సాంలోకి కూడా వ్యాపించాయి. బర్మా థాయ్‌లాండ్ లలో మాట్లాడబడే కరేన్ భాషలలో ముఖ్యమైనవి: స్గా (Sgah), పో, పావో (టుంగ్‌ఠు), పలాయిచి మొదలయినవి. కుకీచిన్ (కుకిష్) భాషావర్గానికి చెందిన భాషలలో చాలా భాగం బర్మాలో వ్యవహారంలో ఉన్నాయి. కచిన్ భాషలు మాట్లాడేవారు కూడా బర్మాలో ఉన్నారు.

ద్వీప సముదాయంలోని భాషా వర్గాలు : ఆగ్నేయాసియాలోని ద్వీప సముదాయంలో వాడుకలో ఉన్న ఒక చిన్న భాషావర్గం 'నికోబారీస్'. ఈ భాషలు నికోబార్ దీవులలో వాడుకలో ఉన్నాయి. ఇవి ఆస్ట్రో - ఏషియాటిక్ భాషాకుటుంబానికి చెందిన వని కొందరి భావన. ఈ ద్వీపసముదాయంలో వాడుకలో ఉన్న మరోభాషాకుటుంబం అండమానీస్. అండమాన్ దీవులలోని సుమారు 200 మంది ఈ భాషలను మాట్లాడుతున్నారు. ఈ భాషలు మెలనీషియా భాషా కుటుంబంలోని పాపువన్ భాషావర్గంతో సుదూరమైన సంబంధం కలిగినవని ఇటీవల కొందరు భాషావేత్తలు గుర్తించారు.

ఆస్ట్రోనేషియన్ భాషలు : ఆస్ట్రోనేషియన్ (మలయో - పోలినేషియన్) భాషా కుటుంబానికి చెందినవి సుమారు 500 భాషల వరకూ ఉన్నాయి. ఇవి మలేషియా, ఇండోనీషియన్ ద్వీపసముదాయం, ఫిలిప్పీన్స్, వియెట్నాం, కంబోడియా, తైవాన్, న్యూ గినియా సమీపంలోని దక్షిణ, మధ్య పసిఫిక్ దీవులు, మెడగాస్కర్‌లలో వ్యవహారంలో ఉన్నాయి. ఈ భాషలలో రెండు స్థూల వర్గాలను గుర్తించారు: పశ్చిమ ఆస్ట్రోనేషియన్ (ఇండోనీషియన్), తూర్పు ఆస్ట్రోనేషియన్ (ఓషియానిక్) వర్గాలు. పోలినీషియన్ భాషలూ, మెలనీషియన్, మైక్రోనీషియన్ వర్గాలకు చెందిన కొన్ని భాషలూ వీటికి సంబంధించినవే! ఆగ్నేయాసియాలోని ప్రధానభూభాగం అయిన మలేషియాలో మాట్లాడే మలయ్‌లో, వియట్నాంలో ప్రధానంగా మాట్లాడబడుతున్న చామ్, మరి ఎనిమిది భాషలూ పశ్చిమఇండోనిషియన్ వర్గానికి సంబంధించినవి. జావానీస్, సుడానీస్, మలయ్ (భాషా ఇండోనీషియాతో సహా) భాషలు కూడా వీటిలో చేరినవే!

న్యూజిలాండ్‌లో మాట్లాడే మావోరి తో సహా పోలినీషియాలో మాట్లాడే భాషలైన టాంగన్, తాహీతియన్, హవాయిన్ భాషలను తూర్పు ఓషియానిక్ వర్గానికి చెందిన పోలినీషియన్ భాషలు అనబడే ఉపవర్గానికి చెందినవని భావింపవచ్చును. తూర్పు ఓషియానిక్ వర్గంలో సుమారు 100 భాషలు ఉన్నాయి. వీటిలో పోలినీషియన్ భాషలే కాక ఫిజియన్ భాష. సాలమన్ దీవులలో మాట్లాడే అనేక భాషలూ కూడా చేరి ఉన్నాయి. మైక్రోనీషియా భాషా వర్గంలో గిల్బర్టీస్; ట్రూకీస్, పోనాటియన్ మొదలైన కనీసం 7 భాషలను మరొక ఉపవర్గంగా భావిస్తున్నారు. న్యూగినియాలో సుమారు 100 భాషలు వ్యవహారంలో ఉన్నాయి.

7. ఓషియానియాలోని ఆస్ట్రోనేషియన్ భిన్నభాషలు: ఆస్ట్రోనేషియన్ భిన్న భాషలు వ్యవహారంలో ఉన్న న్యూగినియా, ఆస్ట్రేలియాలు ఇంచుమించు ఒక చాపం ఆకారంలో ఉన్నాయి. వీటిచుట్టూ ఆస్ట్రోనేషియన్ భాషా ప్రాంతాలు తూర్పున పోలినీషియా, ఉత్తరాన మైక్రోనీషియా, పడమట ఇండోనీషియా ఉన్నాయి. న్యూగినియాకు మిక్కిలి సమీపంలో ఉన్న కొన్ని ఇండోనీషియన్ దీవులలో కూడా 'ఆస్ట్రోనేషియన్‌భిన్న భాషలు' కనిపిస్తున్నాయి.

ఉదారమైన ఆనువంశిక వర్గీకరణంలో మెలనీషియాలో వాడుకలో ఉన్న చాలా ఆస్ట్రోనేషియన్ భిన్న భాషలూ, ఇండోనీషియాలో కొన్ని భాషలూ ఒకే మూలం నుంచి వచ్చినట్టు భావించ బడుతూంది. పాపువన్ అనే ప్రాచీన నామాన్ని పరిహరించి అనేక నూతన భాషా కుటుంబాలను ఇప్పుడు గుర్తిస్తున్నారు. ఆస్ట్రేలియాలోని భాషలన్నీ పరస్పర సంబంధంగల భాషలనీ, వాటికి అటు ఆస్ట్రోనేషియన్ భాషలతోగాని, ఇటు ఆస్ట్రోనేషియన్ భిన్న భాషలతో గాని ఎలాంటి సంబంధం లేదనీ అందరూ అంగీకరిస్తున్నారు.

మలనీషియాలో చాలా సమాజాలవారు బహు భాషా భాషులు. ముఖ్యంగా న్యూగినియా విషయంలో ఈ మాట నిజం. తమ మాతృభాషలతో పాటు ప్రజలు తరచు ఇరుగు పొరుగు భాషలనూ, ఎక్కువగా నియో - మెలనీషియన్ భాష (ఇంగ్లీష్ మీద ఆధారపడిన ఒక ఫిడ్జిన్ క్రియోల్ భాష)నూ నేర్చుకుంటారు. పాపువాలో కొంత భాగంలోనూ, న్యూగినియా, పోలీస్‌మోటూలలోనూ ఒక ఆస్ట్రోనీషియన్ భాషను ఆధారంగా చేసికొన్న ఒక పిడ్జిన్ భాష అనుబంధ భాషగా వాడుకలో ఉంది. ఆస్ట్రేలియాలో కూడా అనేక భాషలను స్వాయత్తం చేసుకోవాలనే ఆసక్తి విస్తృతంగా కనిపిస్తుంది. అక్కడి ఆదిమవాసులు నియో మెలనీషియన్ కంటె భిన్నమైన ఇంగ్లీష్‌ను ఆధారంగా చేసికొని ఏర్పడిన మరో ఫిడ్జిన్ క్రియోల్ భాషను

మాట్లాడుతున్నారు. ఆస్ట్రేలియన్ భాషలకూ, టారీస్ జలసంధికి ఉత్తరాన ఉన్న ఆస్ట్రేలియన్ భిన్న భాషలకూ మధ్య కనిపించే మరొక సామ్యం ఏదో ఒక భాషను ఒక ప్రామాణిక భాషగా అభివృద్ధి చేయాలనే ఆసక్తి లేకపోవడం!

**పాపువన్ భాషలు :** 740 పాపువన్ లేక 'ఆస్ట్రో నేషియన్ భిన్న' భాషలు ఉత్తరానా, పడమటా ఉన్న శాంతాక్రుజ్ దీవులనుండి న్యూగినియా మీదుగా సాలమన్, బిస్మార్క్ ద్వీపసముదాయాలదాకా, హల్మహీరా, తియోర్, ఆలోర్‌లదాకా వ్యాపించి ఉన్నాయి. 1960 ప్రాంతం వరకూ న్యూగినియాలో వాడుకలో ఉన్న భాషలను గూర్చి సాగిన చర్చలవలన అంతకొద్ది ప్రాంతంలో వ్యాపించి ఉన్న వందలాది భాషలమధ్య ఎలాంటి పరస్పర సంబంధం లేదని తేలింది. అప్పటివరకూ న్యూగినియాలోని కొద్ది భాషలను గూర్చి తప్ప తక్కిన భాషలను గురించి ఏమీ తెలియదు. 1960 తరువాత హైలాండ్స్ రాష్ట్రాలలో జరిపిన సర్వే ప్రచురణల వలన చాలా భాషా వర్గాలమధ్య ఉన్న సంబంధాలను గుర్తించడం సాధ్యమైంది.

హైలాండ్స్‌లో పరస్పర సంబంధం ఉన్నట్లు గుర్తింపబడిన పెద్ద భాషావర్గానికి "తూర్పు న్యూగినియా హైలాండ్స్ కుదురు" (phylum) అని పేరు పెట్టారు. కాలక్రమేణ న్యూగినియాలోని ఎక్కువెక్కువ భాషలు ఈ కుదుటికి సంబంధించినవే అని గుర్తింప సాగారు. పాపువన్ భాషలలో భాషాకుటుంబాలనూ, భాషలనూ లెక్కగట్టడంలో ఒక చిక్కు ఉందని జ్ఞాపకం ఉంచుకోవాలి! వాటిలో చాలా భాషలను గురించి మనకు స్పష్టమైన భోగట్టా లేదు. ఇంకా ఎన్నో భాషా కుటుంబాలూ, ఇతర కుటుంబాలతో సంబంధంలేని విడిభాషలూ పాపువన్ భాషలలో గుర్తింపబడవలసి ఉన్నాయి. పాపువన్ భాషలలో చాలా భాషలు మాట్లాడేవారు కొన్ని వందల మంది మొదలు కొన్ని వేలమంది వరకూ మాత్రమే ఉన్నారు.

**ఆస్ట్రేలియన్ ఆదిమవాసుల భాషలు :** ఆస్ట్రేలియాలోని ఆదిమవాసులు మాట్లాడే భాష లన్నింటి మధ్యా సుదూరంగా అన్యోన్య సంబంధం ఉంది. సుమారు 260 ఆస్ట్రేలియన్ ఆదిమవాసుల భాషలలోనూ కొన్నిడజన్ల భాషలు మాత్రమే 90 శాతం ప్రజల వ్యవహారంలో ఉన్నాయి. వీటిలో అరండా భాషలు, తివీ, వాల్బిరీ, పడమటి ఎడారి భాష చెప్పుకోదగినవి. ఆరుగురి కంటె తక్కువమంది మాట్లాడే భాషలు డజన్లకొద్దీ ఉన్నాయి. ఆస్ట్రేలియాఖండంలోని ఉత్తరతీరంవెంట, వాయవ్య తీరం వెంట భాషావైవిధ్యం ఎక్కువగా కవిపిస్తుంది. 177 భాషలతో కూడిన ఒకే భాషాకుటుంబం (పామా - న్యున్గావ్) తక్కిన ఆస్ట్రేలియా అంతటా వ్యాపించి ఉంది.

వ్యాకరణ నిర్మాణం విషయంలో టారీస్ జలసంధికి ఉత్తరాన ఉన్న 'ఆస్ట్రోనేషియన్ భిన్న' భాషలలో 'వైరస్య' (heterogeneous) లక్షణం కనిపిస్తూ ఉండగా ఆస్ట్రేలియన్ భాషలలో 'సామరస్య' (homogeneous) లక్షణం కనిపిస్తుంది. ఇవి ధ్వని సంపుటులలో ఇంచుమించు ఏకరూపంగా ఉంటాయి. ఆస్ట్రేలియన్ భాషల మాండలికాలూ, ఆస్ట్రోనేషియన్ భాషల మాండలికాలూ ఒకదాని వెంట ఒకటి ఒక శృంఖలగా ఏర్పడి ఈ కొసలో మాట్లాడే వారి పదజాలం ఆ కొసలో వారికి అర్థం కానంత భిన్నంగా ఉంటుంది. అయితే ఈ శృంఖలలో మధ్యలో ఉన్న ఇరుగు పొరుగు మాండలికాలు పరస్పరం అర్థం అవుతాయి.

19 వ శతాబ్ది ఉత్తరార్ధం దాకా టాస్మేనియాలో వ్యవహారంలో ఉన్న రెండు, అంతకంటె ఎక్కువ భాషలకు ఆస్ట్రేలియన్ భాషలతో ఎలాంటి సంబంధం లేదు. అవి బహుశః ఇండో పసిఫిక్ కుదుటికి సంబంధించినవై ఉండవచ్చును.

**8. ఆఫ్రికాలోని భాషలు :** 19 వ శతాబ్దం నాటి వలసరాజ్యం విధానం ద్వారా ఆఫ్రికాలో ప్రవేశించిన ఇతర ఖండాల భాషలలో ప్రధానమైనవి యూరపియన్ భాషలు. 1960 ప్రాంతానికి ఆఫ్రికాదేశాలలో అధికభాగం స్వాతంత్ర్యం సంపాదించుకున్నా, అసంఖ్యాకమైన తమ ఆఫ్రికన్ దేశీయభాషలతో పాటు వలస యుగంలో తాము నేర్చుకున్న యూరపియన్ భాషలను కూడా ప్రజలు వ్యవహరిస్తున్నారు. యూరపియన్ వలస రాజ్య యుగానికి పూర్వం నైరృతి ఆసియా నుండి అనేక భాషలు ఉత్తర ఆఫ్రికాకి దిగుమతి అయాయి. ఇంచుమించు 3,000 ఏళ్ల క్రితమే అలా వలస వచ్చిన వారు ఇథియోపియన్ భాషను ఉత్తర ఆఫ్రికాకు కొని వచ్చారు. చాలాకాలం క్రితమే ఇండోనీషియన్ వలస దారులు ఆఫ్రికా తీరానికి 250 మైళ్ల దూరాన ఉన్న మెడగాస్కర్ దీవి చేరుకున్నారు. వలస రాజ్యయుగంలోనూ, అంతకు పూర్వమూ అరబ్ వర్తకులూ, భారతీయవర్తకులూ తూర్పు ఆఫ్రికా చేరుకున్నారు. అక్కడ నేటికీ ఆసియన్ వర్తకులలో కొన్ని ఇండో-ఆర్యన్ భాషలు వ్యవహారంలో ఉన్నాయి. వలసయుగానికి పూర్వం ఆఫ్రికాఖండ మధ్యభాగం ఆఫ్రికన్‌లు కాని వారి కందరికీ అచుంబితంగానే ఉండిపోయింది. అసంఖ్యాకమైన బంటూ భాషలకు మూలభాష కేమరూన్‌లో గాని, పశ్చిమాఫ్రికా లోని తత్పరిసర ప్రాంతాలలో గాని వ్యవహారంలో

ఉండేదనీ, చరిత్ర పూర్వయుగంలో జరిగిన ఒక వలసకు ఫలితంగా బంటూ భాషలు మాట్లాడేవారు మధ్య, తూర్పు ఆఫ్రికాలకు చేరుకున్నారనీ, ఈ కొత్త 'బంటూ' వలస దారులు అంతకుముందు విక్టోరియా సరస్సు చుట్టూ నివసిస్తున్న బుష్‌మన్, హోటెన్‌టాట్ భాషలు మాట్లాడేవారిని దక్షిణంగా కలగహరి ప్రాంతం వరకూ తరిమివేశారనీ చెప్పడానికి ఆధారాలు కనిపిస్తున్నాయి.

వలస రాజ్య యుగానంతర జాతులన్నింటిలోనూ నేడు ఇంగ్లీష్ భాషో, అరబిక్ భాషో, ఫ్రెంచ్ భాషో అంతర్జాతీయ భాషగానూ, జాతీయ అనుబంధ భాషగానూ వాడుకలో ఉంది. ఆఫ్రికన్ జాతులను నేడు ఎదుర్కొం టున్న ప్రధాన సమస్య: తమ దేశీయ భాషలలో వేటిని ఎక్కువగా అభివృద్ధి పరచి ప్రామాణిక భాషలుగా తీర్చిదిద్దాలి అని. క్రియో (Krio) వంటి అసంఖ్యాకమైన పిడ్జిన్ క్రియోల్ భాషలు ఇటీవలి కాలంలో తల ఎత్తాయి. మధ్య ఆఫ్రికన్ రిపబ్లిక్‌లోని 'శాంగో' భాష దేశీయమైందే అని గాని, పిడ్జిన్ క్రియోల్ భాష అని గాని కచ్చితంగా చెప్పలేము. తూర్పు ఆఫ్రికాలో స్వాహిలి, పశ్చిమాఫ్రికాలో హౌసా వంటి సుమారు డజను పై చిలుకు భాషలలో పిడ్జిన్- క్రియోల్ భాషలలో లాగ పదజాలం విపరీతంగా మార్పు చెందినా, వాటిని పిడ్జిన్ క్రియోల్ భాషలుగా వర్గీకరించడానికి వీలులేదు. కేవలం అవి అనుబంధ భాషలుగా అభివృద్ధి చెందినవి మాత్రమే! ఆఫ్రికాలోని ఆదిమ వాసులూ, రైతులూ నివసించే ప్రాంతాలలో జరిగే సంతలలో ఏదో విధమైన అనుబంధ భాషలు తప్పనిసరి అవుతున్నాయి.

దక్షిణాఫ్రికాలోనూ, అంతకంటె ఎక్కువగా పశ్చిమాఫ్రికాలోనూ ఆనువంశికంగా భాషా వైవిధ్యం ఎక్కువగా కనిపిస్తున్నా, లాక్షణిక దృష్ట్యా వాటిలో కొంత భాగాన్ని ఉప ప్రాంతాలుగా గుర్తించడానికి వీలవుతుంది. పశ్చిమాఫ్రికాలో చాలా భాషలలో స్వర భేదం వల్ల పదాలలోనూ, పదాంశాలలోనూ అర్థ భేదం కలుగుతూందని భాషా శాస్త్ర వేత్తలు గుర్తించారు.

హెమిటో-సెమిటిక్ భాషలు : హెమిటో సెమిటిక్ (ఆఫ్రో-ఏషియాటిక్) భాషా కుటుంబంలో చాదిక్, సెమిటిక్, కుషైటిక్, బెర్బర్, ఈజిప్షియన్ కోప్టిక్ (ఇది ప్రస్తుతం నామమాత్రావశిష్టం) అనే అయిదు శాఖలు ఉన్నాయి. అవి ఉత్తరాఫ్రికాలో మారిటేనియా నుంచి సోమాలియా వరకూ, ఆ పైన నైరృతి ఆసియా వరకూ వ్యవహారంలో ఉన్నాయి. చాదిక్ భాషా శాఖకు చెందిన 100 పై చిలుకు భాషలు నైజీరియా, నైజర్, కేమరూన్, ఘనా, చాద్, మధ్య ఆఫ్రికన్ రిపబ్లిక్‌లలో వ్యవహారంలో ఉన్నాయి. వీటిలో విపుల ప్రచారం కలది 'హౌసా భాష'. సుమారు 2 కోట్ల 20 లక్షల మంది ప్రజలు ఈ భాషను మాట్లాడుతున్నారు. వీరిలో ఎక్కువ మంది ద్వితీయ భాషగా ఈ భాషను మాట్లాడేవారు.

ఆఫ్రికాలో అయిదు సెమిటిక్ భాషలు వాడుకలో ఉన్నాయి: 1. ఆధునిక వ్యావహారిక అరబిక్‌భాష, 2. ఇతియోపియా లోని గురేజ్ (Gurage) భాష, 3. అంహరిక్ భాష, 4. ట్రిగ్రిమియా భాష, 5. టైగర్ (Tigre) భాష.

ఇతియోపియా, సోమాలియా, ది సూడాన్, టాంజేనియా, కెన్యాలలో కుషిటిక్ భాషలు వ్యవహారంలో ఉన్నాయి. వీటిలో ఎక్కువ మంది మాట్లాడే భాషలు: ఇతియోపియాలోని గాలిన్యా; సోమాలియా, ఇతియోపియాలలో మాట్లాడే సోమాలీ; సిడామో; హద్యా; అఫర్‌సాహో.

బెర్బర్ శాఖకు చెందిన భాషలు అట్లాంటిక్ మహా సముద్రానికి పశ్చిమంగా ఉన్న ఈజిప్టు పశ్చిమ ఎడారి ప్రాంతం నుంచి తీరప్రాంత మైన సెనెగల్ వరకూ, ఉత్తర నైజీరియా వరకూ వ్యవహారంలో ఉన్నాయి. బెర్బర్ భాషలలో పేర్కొనదగినవి: వెనుక కేనరీ దీవులలో వాడుకలో ఉన్న గువాంచీ, మొరాకోలో మాట్లాడే షూ; ఆల్జీరియా, లిబియా, నైజర్, మాలీ దేశాలలో వ్యవహారంలో ఉన్న తమాషక్; మొరాకో, ఆల్జీరీయాలలో మాట్లాడే తయాజైట్.

నైలో - సహారన్ భాషలు : మధ్య ఆఫ్రికాలో వ్యవహారంలో ఉన్న నైలో - సహారన్ భాషలలో 'చారీనైల్ భాషలూ', ఆ భాషలతో గాని, పరస్పరం గాని ఎలాంటి సంబంధమూ లేని మరి కొన్ని భాషలూ చేరి ఉన్నాయి. మిక్కిలి పెద్దదైన చారీనైల్ విభాగం ( తూర్పు సుడామిక్) లో 60 కంటె ఎక్కువ భాషలు చాద్ మొదలు కెన్యా, టాంజేనియాల వరకూ మాట్లాడ బడుతున్నాయి.

నైలో-సహారన్ భాషలలో చారీ-నైల్ వర్గానికి చెందని మరొక వర్గం సహారన్ వర్గం. ఆ వర్గంలో ఎక్కువ మంది మాట్లాడే కానూరీ భాష నైజీరియా, నైజర్, కేమరూన్, చాద్‌లలో సుమారు 40 లక్షలమంది ప్రజల వ్యవహారంలో ఉంది. 'మాబా' వర్గానికి చెందిన మసాలిట్ భాష మాట్లాడేవారు సుడాన్‌లో 60 వేల మంది ఉన్నారు. ప్రత్యేక భాషగా పేర్కొనబడుతున్న సాంఘై భాషను నైజర్, మాలీ, ఎగువ వోల్టా, నైజీరియా, బెనిన్ (దహోమి) లలో 10 లక్షల మంది ప్రజలు మాట్లాడుతున్నారు. మరొక ప్రత్యేక భాష 'ఫర్' ఎక్కువగా సూడాన్‌లోనే 4 లక్షల

మంది ప్రజల వ్యవహారంలో ఉంది.

**నైజర్-కాంగో భాషలు :** నైజర్-కాంగో భాషాకుటుంబానికి చెందిన భాషలు ఆఫ్రికా అంతటా మారిటేనియా మొదలు కెన్యా వరకూ, దక్షిణాన దక్షిణాఫ్రికావరకూ వ్యవహారంలో ఉన్నాయి. ఈ భాషా కుటుంబంలో ఆరు ఉప విభాగాలను గుర్తించారు. వీటిలో బంటూ భాషా విభాగం ఆఫ్రికాలోని ఇతర భాషా కుటుంబాల కంటె పెద్దది. ఆ విభాగంలో ఉన్న భాషల సంఖ్య, ఆ భాషలు మాట్లాడేవారి సంఖ్య (16 కోట్లు) కూడా ఎక్కువే! ఒక్కొక్క భాష 30 లక్షల మంది వ్యవహారంలో ఉన్న 15 బంటూ భాషలు ఉన్నాయి. ర్వాండ, షోనా, తాంగో, లూబా లూలువా, జోసా (Xhosa), జులు భాషలలో ప్రతిదానికీ 50 లక్షల మంది వ్యవహర్తలు ఉన్నారు. నైజర్-కాంగో భాషా కుటుంబంలోని ఇతర ఉప విభాగాలకు చెందినవి కొన్ని డజన్ల భాషల కంటె ఎక్కువ లేవు. మాలీ, నైజీరియాలోని ఐబర్ కోస్ట్‌లలో వ్యవహారంలో ఉన్న 'గుర్' (వోల్టాయిక్) భాషలలో 'మోసీ' భాష మాట్లాడేవారు 35 లక్షల మంది ఉన్నారు. సెనెగల్ నుంచి నైజీరియావరకూ మాట్లాడబడే పశ్చిమ అట్లాంటిక్ భాషలలో 'ఫులానీ' భాషను 1 కోటీ 15 లక్షల మంది, 'వోలోఫ్ భాషను 20 లక్షల మంది, 'ఔమ్మే' భాషను 10 లక్షల మంది మాట్లాడుతున్నారు.

**ఖోయిసన్ భాషలు :** ఖోయిసన్ భాషా కుటుంబాలలో సుమారు 4 డజన్‌ల భాషలు ఉన్నాయి. వీటిని దక్షిణ ఆఫ్రికాలో మాట్లాడుతున్నారు. ఖోయిసన్ భాషలు చాలా వరకూ అంతరించి పోతున్నట్లు భావిస్తున్నారు. ఖోయిసన్ భాషలలో ఎక్కువమంది (1,30,000) మాట్లాడుతున్న భాష 'నామా'!

**9. ఉత్తర, దక్షిణ అమెరికాలలోని భాషలు :** ఉత్తర, దక్షిణ అమెరికాలలోని ఆదిమ వాసులు మాట్లాడే భాషలను ఈ నాటి అమెరికన్ ఇండియన్‌ల (ఎస్కిమోలతో సహా) పూర్వీకులు ఆసియా ఖండం నుంచి తీసుకుని వచ్చారు. ఈ ఇండియన్‌ల సంస్కృతిని గురించి కొంత వరకు తెలుస్తున్నది గాని వారి భాషలను గూర్చి యూరపియన్‌భాషలతో వారికి అనుబంధం ఏర్పడేవరకూ మనకు ఏమీ తెలియదు.

ఈ నాడు ఉత్తర, దక్షిణ అమెరికాలలో 6 యూరపియన్ భాషలు విద్యా, పరిపాలన మాధ్యమాలుగా వ్యవహారంలో ఉన్నాయి. పెరగ్వేలో రువారాణి; గ్రీన్‌లాండ్‌లో గ్రీన్‌లాండిక్; పెరూలో క్వెచువా, ఐమరాన్ భాషలు వంటి కొన్ని ఇండియన్ భాషలు కూడా విద్యా, పరిపాలన మాధ్యమాలుగా వాడుకలో ఉన్నాయి. అమెరికాలలో అధికార భాషగా ఉన్న యూరపియన్‌భాషల వివరాలు:

| | | |
|---|---|---|
| స్పానిష్ | - | 18 |
| పోర్చుగీస్ | - | 1 |
| డచ్ | - | 2 (లాటిన్‌అమెరికాలో 1, కరిబియన్ దీవులలో1) |
| ఇంగ్లీష్ | - | 13 (ఉత్తర అమెరికాలో 2, కరీబియన్ దీవులలో 11) |
| ఫ్రెంచ్ | - | 4 (ఉత్తర అమెరికాలో1, కరీబియన్ దీవులలో 3) |
| డేనిష్ | - | 1 (గ్రీన్‌లాండ్‌లో) |

లాటిన్ అమెరికాలో వలసరాజ్య యుగానికి ముందూ, వలసరాజ్య యుగంలో తొలి ఒకటి రెండు శతాబ్దాలలోనూ ఈ క్రింది అమెరికన్ ఇండియన్ భాషలు కూడా అధికార భాషలుగా వ్యవహరింపబడ్డాయి.

1. నహువాతీ (నహువా) మెక్సికో, మధ్య అమెరికాలలోని అజ్‌టెక్‌ల భాష, 2. చిక్ చాముయిస్కా (కొలంబియాలో), 3. కెచువా (ఆండ్రియన్ ప్రాంతంలోని 'ఇన్కాల' భాష), 4. టుపి (బ్రెజిల్‌లో), 5. గువారానీ - పెరగ్వేలోను, పరిసర ప్రాంతాలలోను అమెరికన్ ఇండియన్ భాషలతో పాటు రెండు పిడ్జిన్ క్రియోల్ భాషలు కూడా రెండు రాజకీయ విభాగాలలో అధికార భాషలుగా ఉన్నాయి.

స్రావన్ (టకీ, టకీ - సురినామ్‌లో)
పాపియా మెంటో - (క్యురేకావోలో)

**ఉత్తర, మధ్య అమెరికాలలోని ఇండియన్ భాషలు :** ఉత్తర అమెరికాలో మెక్సికోకి ఉత్తరాన ఉన్న భూభాగాన్ని అమెరికన్ మానవ శాస్త్రవేత్త 'హెరాల్డ్ ఈ. డ్రైవర్' పది సాంస్కృతిక ప్రాంతాలుగా విభజించి పరిశీలించాడు. అవి: 1. ఆర్కటిక్ ప్రాంతం, 2. సబ్ ఆర్కటిక్ ప్రాంతం, 3. వాయవ్య తీర ప్రాంతం, 4. పీఠభూమి ప్రాంతం, 5. మైదానాలు, 6. ప్రెయరీలు, 7. తూర్పు ప్రాంతం, 8. కాలిఫోర్నియా, 9. గ్రేట్ బేసిన్, 10. నైరృతి ప్రాంతం. ఆర్కటిక్ ప్రాంతంలో అనువంశిక, లాక్షణిక, సాంస్కృతిక అంశా లన్నీ ఏకమై ఒకే భాషా కుటుంబానికి - 'ఎస్కిమో - అలియుట్' - కుటుంబానికి చెందిన భాషలు వ్యాప్తిలో ఉన్నాయి. సబ్ ఆర్కటిక్ ప్రాంతంలో 'అల్గోన్కియన్', 'అథబాస్కన్' అనే రెండు కుటుంబాలకు చెందిన భాషలు వ్యాపించి ఉన్నాయి. వాయవ్యతీర ప్రాంతంలోనూ, తత్పరిసర పీఠభూమి ప్రాంతంలోనూ వ్యాపించి ఉన్న భాషలలో అనువంశికంగా వైవిధ్యం

కనిపిస్తున్నా, ఆశ్చర్యకరంగా ధ్వని విషయంలో లాక్షణిక సామ్యాన్ని గుర్తించవచ్చును. చెట్టుచేమలు లేని మైదానాలలోనూ, ప్రెయరీలలోని పశ్చిమ భాగంలోనూ వ్యాపించి ఉన్న భాషలలో ఆనువంశికంగానూ, లాక్షణికంగానూ కూడా వైవిధ్యం కనిపిస్తుంది. ఇక్కడ వాడుకలో ఉన్న భాషలలో కడ్డోవన్ తప్ప తక్కిన వన్నీ ఈ మైదానాలకూ, ప్రెయరీ ప్రాంతాలకూ బయటి ప్రదేశాలనుంచి వచ్చినవే!

తూర్పు ప్రాంతంలోని భాషా కుటుంబాలలో కొంత వరకూ లాక్షణిక సామ్యం కనిపిస్తున్నా, ఆనువంశిక వైవిధ్యం విశేషంగా ఉంది. దీనికి ఎదుటి తీరమైన కాలిఫోర్నియాలో ఆశ్చర్యకరంగా సాంస్కృతికంగానూ, లాక్షణికంగానూ భాషలలో సామరస్యం కనిపిస్తుంది. గ్రేట్ బేసిన్‌లో రెండే భాషా కుటుంబాలు వ్యవహారంలో ఉన్నాయి. దాని పరిసరాన ఉన్న నైరృతి ప్రాంతంలో మళ్లీ ఆనువంశిక, లాక్షణిక, సాంస్కృతిక విషయాలలో భాషా పరంగా వైరస్యం కనిపిస్తుంది. 'హూబ్లో' సమాజాలలో నాలుగు భాషా కుటుంబాలు వ్యాప్తిలో ఉన్నాయి. నైరృతి ప్రాంతంలోని 'హూబ్లో-భిన్న' సమాజాలు సాంస్కృతికంగానూ, భాషాపరంగానూ కూడా నానాత్వాన్ని చాటుతున్నాయి.

**ఎస్కిమో-అల్యూట్ :** ఎస్కిమో-అల్యూట్ భాషా కుటుంబంలోని మూడు భాషలు నేటికీ వ్యవహారంలో ఉన్నాయి. గ్రీన్‌లాండ్ నుంచి సైబీరియా వరకూ, కొమాండోర్ దీవిలో అల్యూషియన్‌లకూ, కంచట్కాలకూ మధ్య గల ప్రాంతం వరకూ ఈ భాషలు వాడుకలో ఉన్నాయి.

**అథబాస్కన్ :** నాలుగు విభిన్న సాంస్కృతిక ప్రాంతాలలో అథబాస్కన్ భాషా కుటుంబానికి చెందిన 20 భాషలు వ్యవహారంలో ఉన్నాయి. వాయవ్యతీర ప్రాంతంలో మాట్లాడే 'ఈయక్', 'ట్లింజిట్', 'హైడా' అనే మూడు ప్రత్యేక భాషలకు (isolates) అథబాస్కన్ భాషతో సుదూర సంబంధం ఉన్నట్లు కనిపిస్తుంది.

**అల్గోన్కియన్ :** అల్గోన్కియన్ భాషా కుటుంబానికి చెందిన 13 భాషలు సబ్ ఆర్కిటిక్ ప్రాంతం, ప్రెయరీలు, మైదానాలు, తూర్పు ప్రాంతాలలో నేటికీ వ్యవహారంలో ఉన్నాయి. తూర్పు ప్రాంతంలో దిగువను వ్యవహారంలో ఉన్న 'ముస్కోజియన్' భాషా కుటుంబానికీ, మరి అనేక ప్రత్యేక భాషలకూ అల్గోన్కియన్ భాషలతో సుదూర సంబంధం ఉన్నట్టు కనిపిస్తుంది.

**మేక్రోసియోవన్ :** మేక్రోసియోవన్ 'కుదురు'లో సియోవన్ కుటుంబానికి చెందిన భాషలు ఎక్కువ. తూర్పు ప్రాంతంలోని ఓపో, బిలోక్సీ వంటి భాషలు నేడు వ్యవహారంలో లేవు. సియోవన్ కుటుంబంలోని భాషల కంటె ఐరోక్వోయియన్ కుటుంబంలోని భాషల సంఖ్య తక్కువ. కడ్డోవన్ భాషా కుటుంబం, తూర్పు ప్రాంతంలో వాడుకలో ఉన్న మరి రెండు 'ప్రత్యేక' భాషలూ (కటాబా, యూచీ) సియోవన్ కుటుంబంతో సన్నిహిత సంబంధం కలిగి ఉన్నాయి.

**హోకన్ :** హోకన్ కుదురులో అనేక చిన్న చిన్న భాషా కుటుంబాలూ, ప్రత్యేక భాషలూ చేరి ఉన్నాయి. ఇవి వాయవ్య తీర ప్రాంతంనుండి కాలిఫోర్నియా మీదుగా గ్రేట్ బేసిన్, నైరృతిప్రాంతం, దక్షిణాన మెసో అమెరికా వరకూ విస్తరించి ఉన్నాయి. హోకన్ భాషలలో ఎక్కువ మంది వ్యవహర్తలు ఉపయోగించే భాషలు 'ట్లాపానికన్', టెక్విస్టాటికన్ భాషా కుటుంబాలకు చెందినవి; కాలిఫోర్నియా, అరిజోనాలలో మాట్లాడే భాషలు యుమాన్ భాషా కుటుంబానికి చెందినవి.

**పెనూషియన్ కుదురు :** దక్షిణ అమెరికాలోని భాషలతో అనుబంధం ఉన్నట్లు స్పష్టంగా నిరూపితమైన ఉత్తర అమెరికాలోని భాషల కుదురు పెనూషియన్ కుదురు. వాయవ్య ప్రాంతం నుంచి పీఠభూమి ప్రాంతాలమీదుగా కాలిఫోర్నియా, మెసో అమెరికా, బొలీవియా, చిలీ, అర్జంటీనాల వరకూ ఈ పెనూషియన్ భాషలు విస్తరించి ఉన్నాయి. మెక్సికోకు ఉత్తరాన వ్యవహారంలో ఉన్న పెనూషియన్ భాషలలో చాలా భాగం అంతరించి పోవడమో, లేదా 50 మంది కంటె ఎక్కువ భాషా వ్యవహర్తలు లేని స్థితికి దిగజారి పోవడమో జరిగింది. అయితే మెసో అమెరికాలో మాత్రం చాలా దేశీయ భాషలు మాట్లాడేవారు ఎక్కువ సంఖ్యలో కనిపిస్తారు. ఉదా: 'జోక్' కుటుంబానికి చెందిన 'మిక్సీ' భాష మాట్లాడేవారు 77,000 మంది దాకా ఉన్నారు. 'మాయన్' భాషా కుటుంబంలో మాయాక్విచి, కెక్చి, కేక్చిక్వెల్, మామ్ వంటి భాషల వ్యవహర్తలు లక్షల సంఖ్యలో ఉన్నారు.

**ఆజ్‌టెక్-తనోవన్ కుదురు :** 'ఆజ్‌టెక్ - తనోవన్' కుదురులో తనోవన్, యూటో ఆజ్‌టెకన్ అనే రెండు భాషా కుటంబాలు చేరి ఉన్నాయి. మొదటి భాషా కుటుంబానికి చెందినవి 3 భాషలూ, రెండవ భాషా కుటుంబానికి చెందినవి సుమారు 20 భాషలూ ఉన్నాయి.

**ఓటో - మాంగ్వియన్ :** ఉత్తర అమెరికాలోని ఈ కుదురుకు సంబంధించిన భాష లన్నీ పూర్తిగా మెసో అమెరికాలోనే కేంద్రీకృతమై ఉన్నాయి. ఈ కుదుటికి చెందినవి అయిదు భాషా కుటుంబాలు ఉన్నాయి. ఈ

భాషలలో ఎక్కువమంది ప్రజల వ్యవహారంలో ఉన్నవి ఓటోమీ, మిక్స్‌టెక్, జెపోటెక్ భాషలు.

ఏ కుదుటికీ చెందని ప్రత్యేక భాషలు : ఉత్తర అమెరికాలో ఈశాన్య తీర ప్రాంతంలోనూ, పీఠభూమి ప్రాంతంలోనూ వాడుకలో ఉన్న సలీష్ భాషా కుటుంబానికి, అనేక చిన్న చిన్న భాషా కుటుంబాలకూ, ప్రత్యేక భాషలకూ ఏ కుదుటితోనూ అనుబంధం ఉన్నట్లు ఇంత వరకూ భాషాశాస్త్రవేత్తలు స్పష్టంగా నిర్దేశించలేక పోయారు.

దక్షిణ అమెరికన్ ఇండియన్ భాషలు : ఉత్తర అమెరికాలో కంటె దక్షిణ అమెరికాలో ఎక్కువ భాషల పేర్లు వినిపిస్తున్నాయి. అయితే చాలా భాషలను గురించి తగినంత భోగట్టా లభించడం లేదు. ఈ ఖండంలోని భాషల సంఖ్యను 350 కి తగ్గించినా, వీటిలో చాలా భాషల విషయంలో చిన్న చిన్న పద పట్టికలు మాత్రమే లభిస్తున్నాయి. కొన్ని భాషల విషయంలో 'ఎక్స్' (x) అనే తెగవారు మాట్లాడే భాష వై (y) అనే తెగవారు మాట్లాడేభాషకంటె భిన్నమైనది అని తప్ప మరే విధమైన భోగట్టా లభించడంలేదు. ఈ భాషలలో స్థూలంగా కొన్ని భాషా కుటుంబాలను గుర్తించే అవకాశం ఉన్నా, ఆ భాషలను గురించి లభిస్తున్న భోగట్టా అత్యల్పం కావడంవల్ల విర్వివాదంగా ఎలాంటి నిర్ణయాన్నీ చేసే అవకాశం లేకుండా ఉంది. ఉత్తర అమెరికాలోని 'ఇన్కా', 'ఐమారా' వంటి పరిసర భాషలను ఒకే ఆనువంశిక భాషా వర్గంగా గుర్తించా లన్నా వాటిలో ఇతర భాషలనుంచి ఎరువు తెచ్చుకొన్న పదాలను గుర్తించడం పెద్ద సమస్యగా తయారవుతూంది.

ఆండియన్-ఈక్వటోరియల్ కుదురు : నేటికీ వ్యవహారంలో ఉన్న అత్యధిక సంఖ్యాకమైన భాషలు (దాదాపు 200) ఈ కుదుటికి సంబంధించినవి. ఎక్కువ మంది జనం మాట్లాడే మూడు దక్షిణ అమెరికన్ ఇండియన్ భాషలు: క్వెచువా, గువారానీ, ఐమారా. ఇప్పటికీ వ్యవహారంలో ఉన్న ఆండియన్ ఈక్వటోరియల్ భాషలలో 14 భాషాకుటుంబాలూ, మరి ఎన్నో 'ప్రత్యేక' భాషలూ చేరి ఉన్నాయి. ఆరవాకన్ భాషా కుటుంబానికి చెందిన భాషల సంఖ్య చాలా ఎక్కువ (దాదాపు 100). దక్షిణ అమెరికాలో ఫ్రెంచ్ గయానా నుండి కొలంబియా వరకూ, దక్షిణ దిశగా పెరగ్వే వరకూ ఈ భాషలు వ్యవహారంలో ఉన్నాయి. వెనుక ఆరవాకన్ భాషలు మధ్య అమెరికాలోనూ, కరీబియన్ దీవులలోనూ కూడా మాట్లాడబడుతూ ఉండేవి. చాలా ఆరవాకన్ భాషలను మాట్లాడేవారు కొన్ని వందలకు మించి లేరు. టూపియన్ భాషా కుటుంబానికి చెందిన రెండు డజన్ల భాషలు దక్షిణ అమెరికాలో, ముఖ్యంగా అమేజాన్ నదికి దక్షిణ భాగంలో నేటికీ వ్యవహారంలో ఉన్నాయి. టూపియన్ భాషలలోనిదే అయిన గువారానీ (టూపి - గువారాని) భాషనూ, దాని వివిధ మాండలిక రూపాలనూ మాట్లాడే వారి నందరినీ లెక్కలోకి తీసికొంటే పెరగ్వే, బ్రెజిల్, అర్జెంటీనా, బొలీవియాలలో 34 లక్షలమంది దాకా ఉన్నారు. క్వెచుమారన్ వర్గానికి చెందిన క్వెచువా భాష మాట్లాడేవారు పెరూ, ఈక్వడార్, కొలంబియా, బొలీవియా, అర్జెంటీనా, చిలీలలో 70 లక్షల మంది వరకూ ఉన్నారు. మరొక క్వెచుమారన్ భాషా వర్గానికి చెందిన ఐమరాన్ భాషలను పెరూ, బొలీవియాలలో 10 లక్షల మంది మాట్లాడుతున్నారు. 'ఆండియన్-ఈక్వటోరియల్' కుదుటికి చెందిన తక్కిన భాషలు మాట్లాడేవారు కొన్ని వేలమందికి మించి లేరు.

జె-పనో-కరీబ్ కుదురు : ఈ కుదుటికి చెందిన భాషల సంఖ్య కూడా ఆండియన్-ఈక్వటోరియల్ కుదుటికి చెందిన భాషల సంఖ్యతో ఇంచుమించు సమానంగా ఉంది. అయితే ఈ భాషలను మాట్లాడేవారు చిన్న చిన్న తెగలవారు. అందుచేత ఈ భాషల వ్యవహర్తల సంఖ్య ఆండియన్ ఈక్వటోరియల్ భాషలను మాట్లాడేవారి సంఖ్యలో చాలా తక్కువ శాతం ఉంటుంది. జె-పనో-కరీబ్ కుదుటిలో కరిబాన్ (కరీబ్) భాషా కుటుంబం మిక్కిలి పెద్దది. ఈ కుటుంబానికి చెందిన సుమారు 60 భాషలు వెనిజులా, గయానాలు, బ్రెజిల్, కొలంబియాలలో నేటికీ వ్యవహారంలో ఉన్నాయి. ఈ కరిబాన్ భాషలను వెనుకటి రోజులలో కరీబియన్ దీవులలో కూడా మాట్లాడేవారు. చాలా కరిబాన్‌భాషలకు 1,000 మందికి మించి వ్యవహర్తలు లేరు. ఈ కుదుటికి చెందిన మరొక పెద్ద భాషా కుటుంబం మేక్రోగే కుటుంబం. దీనిలోని 25 భాషలు బ్రెజిల్‌లో వ్యవహారంలో ఉన్నాయి.

మాక్రో-చిబ్‌చాన్ కుదురు : ఈ కుదుటికి చెందిన 39 భాషలు గ్వాటిమేలా, హోండ్యురాస్‌ల నుంచి దక్షిణంగా పెరూ వరకూ విస్తరించి ఉన్నాయి. ఈ కుదుటిలో మిక్కిలి పెద్దది చిబ్‌చాన్ భాషా కుటుంబం. ఈ కుటుంబంలోని 16 భాషలు నికరాగ్వా నుంచి వాయవ్య కొలంబియా వరకూ నేటికీ వ్యవహారంలో ఉన్నాయి. వీటిలో కూనా భాష పనామాకు చెందిన ములాటాస్ (శాన్‌బ్లాస్) దీవులలోనూ, పనామా, కొలంబియాలలోనూ నేటికీ వ్యవహారంలో ఉంది. మరొక భాష గ్వాయిమి (Guaymi) ని పనామాలోనూ, ఇంకొక భాష పేఈజ్ (paez) ను కొలంబియాలోనూ మాట్లాడుతున్నారు.

బొ.శ్రీ.



160°
120°
80°
40°
0°
40°
80°
120°
160°
180°
60°
30°
0°
30°
60°
1
2
3
4
5
6
7
8
10
ఇండోయూరోపియన్
యురాలిక్
కకేషియన్ కుటుంబాలు
ఆల్‌టాయి
మకొత్కో-కమ్చత్కన్
ఆస్ట్రో-ఏషియాటిక్
కమ్-తాయ్
సైనో-టిబెటన్
ఆఫ్రో-ఏషియాటిక్
నీలో-సహారన్
నైజర్-కాంగో
ఖొయ్‌సాన్
పపూవన్ భాషలు
ఆస్ట్రేలియన్ భాషలు
ఎస్కిమో-అలెయుట్
న-దెనె భాషలు
ఇతర అమెరికన్ ఇండియన్ భాషలు
1. బాస్క్
2. కెత్
3. యుకఘిర్
4. నివ్‌ఖ్ (జిల్యాక్)
5. ఐనూ
6. బురుషాస్కి
7. నహాలీ
8. జపనీస్
9. కొరియన్
10. టాస్మానియన్
దీవులు
అండమానీస్
ఆస్ట్రోనేషియన్

# ప్రపంచ సాహిత్యాలు - పరిచయం

ప్రపంచ సాహిత్యాల నన్నిటిని కలిపి ఒకేచోట సమీక్షించే ప్రయత్నం ఇంతవరకు జరుగలేదు. *ఎన్ సైక్లోపీడియా బ్రిటానికా* (మేక్రోపీడియా) లో 'ది హిస్టరీ ఆఫ్ వెస్టర్న్ లిటరేచర్' (పాశ్చాత్య సాహిత్య చరిత్ర) అనే వ్యాసం తప్ప, 'ది హిస్టరీ ఆఫ్ లిటరేచర్ (ప్రపంచ సాహిత్య చరిత్ర) అనే వ్యాసం గాని 'ప్రాచ్య సాహిత్య చరిత్ర' అనే వ్యాసం గాని లేవు. దీనికి మూడు కారణాలను ఊహించవచ్చును. ఒకటి: పాశ్చాత్య సాహిత్యాల చరిత్ర కంటె ప్రాచ్య సాహిత్యాల చరిత్ర ప్రాచీనతర మైంది కావడం. రెండు: పాశ్చాత్య సాహిత్యాల విషయంలో చరిత్ర నిర్మాణానికి లభ్యమైనన్ని ప్రామాణికమైన ఆధారాలు ప్రాచ్య సాహిత్యాలకు లభించకపోవడం. మూడు: ప్రాచ్య సాహిత్యాలకు సంబంధించిన ప్రామాణికాధారాలు ఆ యా సాహిత్యాలలో లభ్యం అవుతున్నా, అవి ఇంగ్లీషు భాషలో లభ్యం కాకపోవడం; లేదా ఆంగ్లేయులకు అవి ప్రామాణికమైన ఆధారాలుగా కనిపించకపోవడం.

**ప్రాచ్య సాహిత్య చరిత్ర :** ప్రాచ్య సాహిత్యాలలో ప్రాచీనమైన సాహిత్యం సంస్కృత భాషలో కనిపిస్తుంది. సంస్కృత భాషలో తొలి రచన అనదగిన *ఋగ్వేదం* క్రీ.పూ. 1500 ప్రాంతంలో రచింపబడి ఉండవచ్చునని పాశ్చాత్య చరిత్ర రచయితలు స్వచ్ఛందంగా నిర్ణయించారు. అయితే భారతీయ జ్యోతిశ్శాస్త్ర విద్వాంసుల లెక్కల ప్రకారం అది కొన్ని లక్షల, కోట్ల సంవత్సరాల వెనుకటి రచనగా కనిపిస్తుంది.

*రామాయణం* కృతయుగంలో శ్రీరామ చంద్రునికి సమకాలీనుడైన వాల్మీకిచే విరచితమైంది. "వేద వేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే, వేదః ప్రాచేత సాదాసీత్ సాక్షాద్ రామాయణాత్మనా" అనే ప్రాచీన శ్లోకం 'వేదవేద్యు డైన రాముడు దశరథుని కుమారుడై అవతరించగా, వేదమే ప్రాచేతసుని ద్వారా, అనగా వాల్మీకి ద్వారా *రామాయణం* రూపంలో వెలసింది' అని తెలుపుతూంది. అనగా *రామాయణం* కంటె వేదం ప్రాచీనమైన దనడం స్పష్టం. రామాయణ కథ ప్రస్తుతం నడుస్తున్న మహాయుగంలోదే అనుకొన్నా, ఆ కథ జరిగి ఎన్నో లక్షల సంవత్సరాలు గడచి ఉండాలి. ఒక మహాయుగం పరిమాణాన్ని భారతీయ జ్యోతిశ్శాస్త్రవేత్తలు 43,20,000 సంవత్సరాలు అని నిర్ణయించారు. భారతీయ శాస్త్రవేత్తల లెక్క ప్రామాణికమైన దని అంగీకరిస్తే రామాయణం కనీసం 43 లక్షల ఏళ్లక్రితం రచించబడి ఉండాలి. అంతకంటె వేదాలు ఎంత వెనుకటివో తెలియదు. ఈ దృక్పథంతో చూస్తే ఋగ్వేదమే ప్రపంచ సాహిత్యంలో అత్యంత ప్రాచీనమైన రచన.

ప్రాచ్య సాహిత్యాలలో భారతదేశం తరువాత ప్రాచీనతమ సాహిత్యం చైనా భాషలో కనిపిస్తుంది. కాని, *ఎన్ సైక్లోపీడియా బ్రిటానికా* ప్రపంచ సాహిత్యాలలో అత్యంత ప్రాచీనమైన సాహిత్యం చైనా సాహిత్యమే అని నిర్ణయించింది. 3,000 కంటె ఎక్కువ సంవత్సరాలనుంచి అవ్యాహతమైన సాహిత్యచరిత్ర ఆ భాషలో కనిపిస్తూంది. చైనా భాషలో కనిపించే విశేషం: మాట్లాడే భాషలో వివిధ ప్రాంతాలలో వివిధ మాండలికాలు ఏర్పడినా, చిత్రాకార లిపిని ఉపయోగించే లిఖిత భాష మాత్రం చైనా అంతటా ఒక్కటే! కన్‌ఫ్యూషియస్ (క్రీ.పూ. 500) కాలంలో ప్రకటించబడిన *షీ చింగ్* (కవితా సంకలనం) చైనా భాషలోని పంచ మహాకావ్యాలలో మొదటిది.

ప్రాచ్య ఖండ భాషలలో జపానీస్, ఇండోనీషియన్ మొదలైన ఇతర భాషలలోని సాహిత్యా లన్నీ అర్వాచీన మైనవే!

ప్రాచ్య సాహిత్యాలలో సర్వసాధారణంగా కనిపించే సమాన ధర్మాలను గుర్తించాలంటే మరికొంత పరిశోధన అవసరం.

**పాశ్చాత్య సాహిత్యాలు :** యూరప్ ఖండ సాహిత్యాలలో పైకి ఎంత వైవిధ్యం కనిపిస్తున్నా వాటికన్నిటికీ ఒకే సమానమైన వారసత్వం ఉంది. గ్రీక్, లాటిన్, జర్మానిక్, బాల్టిక్, కెల్టిక్, రోమాన్స్ భాషలన్నీ ఇండోయూరపియన్ భాషా కుటుంబానికి చెందినవే!. ఫిన్నిష్, హంగేరియన్ భాషలూ, తూర్పు మధ్యధరా ప్రాంతంలోని హీబ్రూ మొదలైన సెమిటిక్ భాషలూ మాత్రం ఇండో-యూరపియన్ భాషా కుటుంబానికి చెందినవి కావు. అయితే ఈ భాష లన్నిటి సాహిత్యాలలోను సమానధర్మం

కనిపిస్తుంది. ఈ సాహిత్యాలలోని సమాన వారసత్వం ముఖ్యంగా ప్రాచీన గ్రీస్ నుంచి, రోమ్ నగరం నుంచి వచ్చింది. క్రైస్తవమతం ఈ సంప్రదాయాన్ని పోషించి, వ్యాపింపచేసి, పరిణతం చేసింది. యూరప్ ఖండంలోని వివిధ ప్రాంతీయ భాషలకే కాక యూరపియన్‌లు వలస పోయిన పశ్చిమార్ధ గోళంలోని వివిధ దేశాలకు కూడా అది ఈ సంప్రదాయాన్ని అందచేసింది. ఈ నాటికీ ఈ భాషలన్నిటి సాహిత్యాలలోనూ ప్రపంచంలోని ఇతర భాషలలోని సాహిత్యాలకంటె విలక్షణమైన ఒక సమాన ధర్మం గోచరిస్తుంది.

సాధారణంగా పాశ్చాత్య సాహిత్యాల సమీక్షను మూడు యుగాలుగా విభజిస్తారు. మొదటిది ప్రాచీనయుగం. రోమన్ సామ్రాజ్య పతనం (క్రీ.శ. 476) వరకూ గల కాలం. క్రీ.పూ. 800 మొదలు క్రీ.శ 476 వరకూ వెలువడిన యూరపియన్ సాహిత్యాలలో మహాకావ్యం, విషాదాంత రూపకం (ట్రాజెడి), సుఖాంతరూపకం (కామెడీ), భావగీతం, వ్యంగ్య పరిహాస రచన, చరిత్ర మొదలైన సాహిత్య ప్రక్రియలు ప్రాముఖ్యం వహించాయి. ఈ యుగంలో వెలసిన పురాణ వాఙ్మయం, తాత్త్విక సారస్వతం తదనంతర పాశ్చాత్య భావనా రీతులకు రూపకల్పన చేశాయి.

రెండవ యుగం మధ్యయుగం .క్రీ.శ. 476 మొదలు 15వ శతాబ్దం చివరివరకూ ఇది సాగింది. ఈ యుగంలో క్రైస్తవ మతపు విశ్వదర్శన రీతి ప్రాబల్యం వహించింది. లాటిన్ భాష ప్రభావం అన్ని భాషల మీద కనిపించింది. క్రమేణ ప్రాంతీయ భాషలు కూడా సాహిత్య మాధ్యమాలుగా అభివృద్ధి చెందాయి. ఈ యుగం చివరకు పలు ప్రధాన యూరపియన్ భాషలలో ప్రముఖ రచయితలు ఉద్భవించి ప్రశస్త రచనలు చేశారు.

మూడవ యుగం ఆధునిక యుగం. ఇది 15వ శతాబ్దం మధ్యభాగం మొదలుకొని నేటి వరకు కొనసాగుతూంది. దీనినే పునరుజ్జీవన యుగం అని కూడా వ్యవహరిస్తున్నారు. ఈ యుగంలో క్రమేణ కేథలిక్ భావనారీతి తాలూకు ప్రాబల్యం తగ్గి లౌకిక దృష్టి ప్రాధాన్యం వహించింది.

విహంగావలోకన పద్ధతిలో ప్రపంచ సాహిత్యాల పరిణామాలను సమీక్షించడంలో ప్రాచ్య, పాశ్చాత్య సాహిత్యాలు అనే విభాగాన్ని పాటించకుండా, భౌగోళికంగా వివిధ ఖండాలలోని సాహిత్యాలను ఈ క్రింది విధంగా వేరు వేరుగా సమీక్షించడం జరిగింది:

1. ఆసియా ఖండ సాహిత్యాలు
2. యూరప్ ఖండ సాహిత్యాలు
3. ఆఫ్రికా ఖండ సాహిత్యాలు
4. ఉత్తర అమెరికా సాహిత్యాలు
5. దక్షిణ అమెరికా సాహిత్యాలు
6. ఆస్ట్రేలియా సాహిత్యాలు

(ఆసియా ఖండ సాహిత్యాలలో భారతీయ సాహిత్యాలను సమీక్షించేందుకు ప్రత్యేకంగా *భారత భారతి* అనే ఒక పూర్తి సంపుటం నిర్దిష్టం కావడం వల్ల ఇందులో 'భారతీయ సాహిత్యాలు' అనే ఒక చిన్న స్థూలపరిచయ వ్యాసం మాత్రమే అక్షరక్రమంలో చేర్చడమైంది.)

బొ.శ్రీ.

# ఆసియాఖండ సాహిత్యాలు

## అరబ్బీ భాష - సాహిత్యం

భాష : ఇది సెమెటిక్ భాషా కుటుంబానికి చెందిన ఒక ప్రధాన భాష ఇది. అరేబియా ద్వీపకల్పంలో ఎక్కువ భాగంలోనూ, ఉత్తర ఆఫ్రికాలోనూ, మధ్య ప్రాచ్యంలోని కొన్ని ప్రాంతాలలోనూ ఈ భాష వాడుకలో ఉంది.

అరబిక్ భాష మహమ్మదీయుల మత గ్రంథాల భాష. వారి పవిత్ర గ్రంథం *ఖురాన్* ఈ భాషలోనే వ్రాయబడింది. ఈ భాషలో అనేక మాండలికాలు ఉన్నా, *ఖురాన్*‌లోని భాషనే ఆధునిక అవసరాలకు అనుగుణంగా స్వల్పంగా సవరించి, ఈ నాటికీ సాహిత్య భాషగానూ, గ్రాంథిక భాషగానూ వాడుక చేస్తున్నారు. అరబ్ ప్రపంచమంతటా ఈ ప్రామాణిక భాష ఒకే రూపంలో ఉంది. ఈ భాషలోని ప్రధాన మాండలికాలు అరేబియా, ఇరాక్, సిరియా, ఈజిప్టు, ఉత్తర ఆఫ్రికాలలో వాడుకలో ఉన్నవి. ఆల్జీరియాలోని మాండలికం తప్ప తక్కిన మాండలికాలన్నీ సాహిత్య భాషచేత విశేషంగా ప్రభావితం అయాయి. ఈ భాషలో లభిస్తున్న మొట్టమొదటి లిఖిత ఆధారం క్రీ. శ. 328 నాటి ఒక సమాధి సంబంధమైన శాసనం.

**సాహిత్యం :** ఇతర భాషలలో లాగానే అరబిక్ భాషలో కూడా ఆదిలో కవిత్వ రూపంలోనే సాహిత్యం ప్రారంభ మైంది. మంత్రాలుగా ఉచ్చరించే అంత్యానుప్రాసతో కూడిన గద్యలే క్రమేణ అధిక లయాన్వితాలై అనేక ఛందస్సులుగా పరిణమించాయి. యాత్రికుల వియోగ గాథలను వర్ణించే 'ఖసీదా' అనబడే గేయాలు ఎక్కువ ప్రచారంలో ఉండేవి. ఈ గేయాలలో ఒంటెలు, తుపాకులు, వేట మొదలైన ఎడారి జీవితానికి సంబంధించిన విషయాలు ప్రధానంగా వర్ణించబడేవి. ప్రాచీన అరబిక్ సాహిత్యంలో ఆనాటి సమూహ జీవనం, సాంఘిక పరిస్థితులూ, యుద్ధాలూ, చిత్త వృత్తులూ వర్ణింపబడేవి. ఈ గేయాలను పాడేవారిని 'రావీలు' అనేవారు.




అరేబియా ద్వీపకల్పం

ఇస్లాం మతం స్థాపించబడడానికి ముందు పెక్కు ఖసీదాలు వ్రాసి ఖ్యాతి గడించిన రచయిత ఉమ్ర-ఉల్-కైస్.

అరబ్బీ గద్య సాహిత్యంలో మొట్టమొదటి లిఖిత గ్రంథం *ఖురాన్*. రసూల్ మహమ్మద్‌కు దేవదూత ద్వారా సంక్రమించిన తత్త్వజ్ఞానాన్నీ, మతసాంఘిక ఆదర్శాలనూ, విధి నిషేధాలనూ వివరించే ఈ గ్రంథం అరబ్బీ సాహిత్యంలో అసమానమైనది. మహమ్మదీయులందరికీ ఏకైక ధర్మ గ్రంథంగా ఇది విలసిల్లుతూంది.

*ఖురాన్* రచనా కాలంనాటికి అరబ్బీ లిపి దోష భూయిష్ఠంగానూ, అసంపూర్ణంగానూ ఉండేది. అందుకే *ఖురాన్* వాక్యాలకు అర్థ నిర్ణయం చేయడానికి వ్యాకరణ, శబ్ద, భాషా శాస్త్రాల సమగ్ర పరిజ్ఞానం అవసరం. ఆ నాటి గద్య వాఙ్మయానికి *ఖురాన్* శైలే ఆధారం. నేటికీ అరబ్బీ భాషలో అదే ఆదర్శ గద్యశైలి.

ఉపదేశాత్మకాలైన ధార్మిక విషయాలకు గద్యమే సముచితమైన సాధనంగా భావింపబడేది. పైగంబర్, ఖలీఫాల కాలంలో కావ్య రచనకు ఆదరం లేకపోవడం వల్ల గద్య రచనలకే ప్రాధాన్యం ఏర్పడింది.

ఖలీఫాల పరిపాలనా కాలంలో అరబ్ దేశంలో ఇస్లాం మత సిద్ధాంతాలతో పాటు ఉన్నత, సామాన్య వర్గాలలో స్వేచ్ఛా విలాసాలు ప్రాబల్యం వహించాయి. ఆ నాటి రచనలలో మత సాంఘిక విషయాలు ఆధారంగా రాజకీయ వాతావరణం కూడా చిత్రింపబడేది. భోగలాలస ఎక్కువ కావడంతో కవిత్వ రచనలో శృంగార రస ప్రధానాలైన రచనలు కుప్పలు తెప్పలుగా వచ్చాయి. *బుధానియా-జమీల్- బ-మమార్, లుబనా-కైస్-బ-జరీహ్, లైలా-మజ్ను* మొదలైన కావ్యాలు పవిత్ర ప్రేమను చిత్రిస్తూ ఇరాన్, తుర్కిస్థాన్ మొదలైన మహమ్మదీయ దేశాలలో విశేష జనాదరణ పొందాయి. కావ్యాలుగా రూపొందిన ఈ ప్రేమ గాథలు అరేబియాదేశంలో అనంతరం జానపద గాథలుగా కూడా వ్యాప్తి చెందాయి.

ఇలాంటి లౌకిక కావ్య రచయితలలో ఉమర్-బ-అరబియాకు విలక్షణమైన స్థానం ఉంది. కురేష్ తెగకు చెందిన ఈ కవి రచనలు ఒక సంకలన గ్రంథంగా వెలువడ్డాయి. ఈ రచనలలో 'ఖసీదా'లు కాక, 'గజల్' అనబడే గేయాలు వాడబడ్డాయి.

కవిత్వానికి మళ్లీ ప్రాధాన్యం ఏర్పడడానికి ఇంకో కారణం కూడా ఉంది. *ఖురాన్*‌లోని ప్రవచనాలనూ, ఉపదేశాలనూ, వివిధ ఘట్టాలనూ అవగాహన చేసికొనడానికి కావ్య పరిజ్ఞానం అవసరం. *ఖురాన్* అధ్యయన, వ్యాఖ్యానాలకు కవిత్వం ఒక సాధనంగా ఉపయోగ పడుతూ వచ్చింది. ఇలా అరబ్బీ గద్య పద్య సాహిత్యాల వికాసానికి *ఖురాన్* మూలం అనడం నిర్వివాదం. *ఖురాన్* గురించిన చారిత్రక పరిశోధన మౌలిక నిరూపణ, వ్యాకరణం, కావ్యతత్త్వం, సిద్ధాంత నిరూపణం ఒక ప్రత్యేక వాఙ్మయ శాఖగా

రూపొందాయి. అంతేకాక *ఖురాన్* తాలూకు అనేక ప్రతులు (వివిధ పాఠాలతో) లభిస్తున్నాయి. వీటి నన్నిటినీ ఒకచోట చేర్చి సమగ్రమైన రూపాన్ని ఏర్పరచినవాడు ఇబ్న జరీర్-ఉల్-త హరి.

డమాస్కస్ నుంచి ఖలీఫాల రాజధాని బాగ్దాద్‌కు మారిన తరువాత అరబ్బీ రాజకీయ, లౌకిక, సాంస్కృతిక రంగాలమీద పారశీకుల ప్రభావం ఎక్కువైంది. వాఙ్మయ రంగంలో కొత్త కొత్త రచనా రీతులు వెలువడ్డాయి. గద్య పద్యాత్మకమైన ఈ యుగపు వాఙ్మయాన్ని ఆధ్యాత్మిక, ధార్మిక, వేదాంత, చారిత్రక, భౌగోళిక, భౌతిక శాస్త్రీయా లని వేరు వేరు శాఖలుగా విభజించవచ్చును.

13 వ శతాబ్దం నాటికి అరబ్బీ సాహిత్యంలో అనూచానంగా వస్తున్న సంప్రదాయాలకు వ్యతిరేకంగా గ్రీక్, క్రైస్తవ వాఙ్మయాల ప్రభావంతో దేశవ్యాప్తమైన ఒక ఉద్యమం ప్రారంభమైంది. దీనిని ప్రారంభించిన వారిలో ముఖ్యులు అబుల్ హసన్-అల్-అష్కి, మన్సూర్-అల్-మతుర్దీ అనేవారు. ఈ ఆందోళన మూలంగా ఏర్పడ్డ వేదాంతమార్గాన్ని 'కలామ్' అంటారు. సిద్ధాంత వాది అయిన అబూ బకర్ వలీల్లానీ అనే రచయిత ఈ కలా మ్‌కు ముఖ్య సాహిత్య ప్రతినిధి. ఈయన రచించిన *కితాబ్-అల్-మిలల్- వల్-నిహాల్* అనే గ్రంథం ఆ నాడు ప్రచారంలో ఉన్న సమస్త ధార్మిక వేదాంత సిద్ధాం తాలనూ క్రోడీకరించి ఇస్లాం సిద్ధాంతాలకు మెరుగులు దిద్దింది. ప్రాచీన సంప్రదాయానికి చెందిన ప్రముఖ కవి షేక్ అబ్దుల్-కాదిర్-జీలానీ. ఈయన *అల్కాదీరియా* అనే గ్రంథం వ్రాశాడు. ఈ కాలపు వాడే అయిన అల్-గజ్జెలి అనే సుప్రసిద్ధ సూఫీ విద్వాంసుడు ప్రతిపక్షు లను ఎదిరించి నిగూఢమైన ఆధ్యాత్మిక జీవన విధానాన్ని వర్ణించాడు. ఈతని రచనల వల్లనే ఇస్లాం సిద్ధాంతాలలో సూఫీ సిద్ధాంతాలకు ఒక స్థానం లభించింది.

పాశ్చాత్య దేశాలలో అరబ్బీ, *ఖురాన్* ల పఠన పాఠనాలు ఎక్కువ కావడంతో అక్కడ కూడా గ్రంథరచన సాగింది. స్పెయిన్ వాసులైన అల్‌దనీ, అల్‌షతీబీలు *ఖురాన్* ఉచ్చారణ విధానాన్ని గురించి ఒక గ్రంథం వ్రాశారు.

అబూ అసదుద్దౌలా మొట్టమొదటి అరబ్బీ భాషా వ్యాకర్త. అరబ్బీ వ్యాకరణ పరిశీలన ముఖ్యంగా కుఫా, బస్రా నగరాలల్లో ఎక్కువగా జరిగేది. ఈ రెండు నగరా లలోనూ వ్యాకరణం విషయంలో రెండు విభిన్న వాదాలు తల ఎత్తాయి. ఖలీల్-బిన్-అహమ్మద్, అబూ-శిర్-అ మర్-బిన్-ఉస్మాన్‌లు సుప్రసిద్ధ వైయాకరణులు.

వ్యాకర్తలు మొదట సామాన్యమైన అంశాలను గురించి వర్ణనాత్మకాలైన గ్రంథాలను వ్రాశారు. ఆ తరువాత వాటినుంచి శబ్దజాలాన్ని ఎంచుకొని వ్యాకరణాలూ, నిఘం టువులూ వ్రాశారు. బస్రాకు చెందిన అబూ బకర్-ఇబ్నా-రైద్, అల్-మొహ్రద్‌లు నిఘంటు కర్తలలో ముఖ్యులు. అల్-మొహ్రద్ సుప్రసిద్ధ విజ్ఞాన సర్వస్వం *కితాబ్-ఉల్-కామిల్*‌ను తయారుచేశాడు. కుఫాలోని వ్యాకరణశాస్త్ర పండితులలో హిసాయీ, పేరా-ఇబ్న-అల్ అనేవారు ప్రముఖులు. తాలబ్ వ్రాసిన *కితాబ్-ఉల్-ఫసీహ్* ఒక ప్రసిద్ధ విజ్ఞానకోశం. బాగ్దాద్‌లో ఇబ్న-ఖలాబియా, ఇబ్న-అహమ్మద్, ఇబ్న-ఫారీస్ అనే సుప్రసిద్ధ పండితులు ఉండేవారు. అజ్-జంఖసరీ వ్రాసిన నిఘంటువూ, వ్యాకరణం సుప్రసిద్ధాలూ, లోకసమ్మతాలూ.

ఇరానీయుల సంపర్కంతో అరబ్బీ కావ్యం లలిత భావాలకూ, మధురోక్తులకూ ఆలవాల మైంది. బశహర్-ఇబ్న-ఉర్ద్, సబీహ్-ఇబ్న-అబ్దుల్-కుద్దుస్, అబూ-నివాస్, అబుల్-అతాహి, అబు-తమ్మాన్ అనే వారు ప్రముఖ కవులు. అబూ నివాస్ వ్రాసిన *జూహదియాత్*, అబుల్-అతాహి వ్రాసిన *జుహద్* కావ్యాలు సుప్రసిద్ధాలు అయాయి.

*ఖసీదా* లను ప్రాచీన పద్ధతిలో వ్రాసిన కవులలో అబూ హమ్మామ్ (845), అల్‌బుహతురీ (897) ముఖ్యులు. సిరియా దేశీయులైన వీరు బాగ్దాదుకు వచ్చి రాజాశ్రయం పొంది అక్కడనే స్థిరపడి, *అల్-హమస్* అనే స్ఫుటగేయ సంకలనాలు సమకూర్చారు. అదే సమ యంలో స్పెయిన్‌లో నువాషాహ్, జజాల్ అనే కవులు నవీన కావ్యశైలిని ప్రారంభించారు.

అబ్బాసీ సైఫుద్దౌలా హందానీ కొలువుకూటం అరబ్బీ సాహిత్యానికి ఒక ప్రధాన కేంద్రం అయింది. అక్కడ హల్-ము-తనబ్బీ అనే ప్రసిద్ధకవి ఉండేవాడు. అంధు డైన మ-అరీ (1054) అనే కవి ప్రాచీన సంప్రదాయ పద్ధతిలో రచన సాగించాడు. ఇస్లాం, గ్రీక్, భారతీయ వేదాంతాలలో ఆయన దిట్ట. సాహిత్య విమర్శ రచ నలకే కాక *సకత్-ఉల్-జంద్, లుజుం-మయాలుజుం* అనే కావ్యాల వల్లకూడా ఆయన సుప్రసిద్ధు డయాడు. మ-అరీ కవి తన రచనలలో సమకాలీన పరిస్థితులనూ, ఆచార వ్యవహారాలనూ, ప్రభుత్వ విధానాలనూ తీవ్రంగా విమర్శించాడు.

అబ్బాసీ ఖలీఫా ద్వారా పార్సీ, గ్రీక్, సిరియా సాహిత్య రచనల అనువాదాలతో అరబ్బీ గద్యరచనకు మిక్కిలి ప్రోత్సాహం లభించింది. పార్సీనుంచి లలిత సాహిత్యాన్నీ, గ్రీక్ నుంచి తత్త్వ శాస్త్రాన్నీ, భౌతిక శాస్త్రాన్నీ,

భారతదేశం నుంచి గణిత శాస్త్రాన్నీ అనువదించుకొనే కార్యక్రమం ఆ నాడు విరివిగా కొనసాగింది. *పంచ తంత్రం, ఖుదాయీనామా, అరేబియన్‌నైట్స్* కథలు విశేష జనాదరణ పొందాయి.

*కితాబ్-ఉల్-హైవాన్, కితాబ్-ఉల్-బయాన్, బల్-తా-బయీన్, అలముఖాష్* అనే చక్కని కథలు వ్రాసినవాడు బస్రా నగరవాసి అయిన అల్ జాహీజ్. భాషా శాస్త్ర రచయితా, చారిత్రకుడూ అయిన ఇబ్నుకుతైబ (1883) అల్‌జాహీజ్‌కు సమకాలికుడు. *అదబ్-ఉల్-క బీర్* అనే గ్రంథంలో అనేక వ్యాకరణాంశాలనూ, భాషా విషయిక సమస్యలనూ ఆయన చర్చించాడు. *ఉల్మా-అ రిఫ్, మైన్-ఉల్-అక్బార్* అనేవి ఆయన ఇతర ప్రసిద్ధ రచనలు.

ఇతర విషయాలతో పాటు విజ్ఞాన సర్వస్వాల రచన కూడా అరబ్బీ గద్య సాహిత్యంలో ముందంజ వేసింది. స్పెయిన్ నివాసి ఇబ్న-అబ్దుల్-ఖని (939) రచించిన విజ్ఞాన సర్వస్వం ముఖ్యమైంది. రాగిబ్-ఉల్-ఇఫహామి (1109), అజ్-జ-సమరీ (1143) అనేవారు కూడా విజ్ఞాన సర్వస్వ రచయితలలో చెప్పుకోదగ్గవారు. రాజకీయ వ్యవహార పత్రాలలో కూడా ఆలంకారికమైన గద్యశైలి ప్రయోగింప బడేది.

మకమా అనబడే ఒక రకపు ఏకాంకికలు బహుళ ప్రచారంలోకి వచ్చాయి. ఈ ఏకాంకికలలో వచన గేయాల రూపంలో సంభాషణలు సాగుతాయి. మకమా రచనకు ఆద్యుడు అహమ్మద్-ఉల్-హందని (1007); దానికి ప్రతిష్ఠ కలిగించినవాడు అల్‌హరీరి (1121). ఆ కాలంలో ఇస్లాం మత యుద్ధాల కథలూ, అత్తారా గాథలూ, చారిత్రక కథలూ, అలిఫ్‌లైలా వంటి ప్రేమగాథలూ ప్రచారంలో ఉండేవి.

అరబ్‌దేశపు తొలి తత్త్వగ్రంథ రచయిత అబూ-యూసుఫ్-యాకుబ్-ఉల్ కిందీ (862). ఆయన తత్త్వశాస్త్రం, వైద్యం, జ్యోతిషం, గణితం, సంగీతం మొదలైన విషయాలమీద దాదాపు 200 గ్రంథాలు వ్రాశాడు. వేదాంత రచయితలలో అబు-సనర్- ఉల్‌ఫరాబీ (950), అబు-అలీ-ఇబ్నెసీనా, అల్‌గజ్జాలీ ముఖ్యులు.

తత్త్వచింతనలో క్రొంగ్రొత్త తెన్నులు చూపినవాడు ఇబ్నురన్ షర్ద్ (1198). ఇబ్న అవజ్జా (1138), ఇజ్నుతు ఫైర్ పాశ్చాత్య తత్త్వశాస్త్రంలో ప్రసిద్ధులు.

అల్‌ఖ్వారాజీ, తావీత్ ఇబ్నకుర్రా, అల్‌కరకీ అనేవారు గణితశాస్త్ర గ్రంథాలనూ, ఇబ్రహీమ్ అల్‌ఫజరీ జ్యోతిష శాస్త్ర గ్రంథాలనూ రచించారు. బాగ్దాద్, డమాస్కస్, కాహిరాలలో నక్షత్ర శాలలు ఏర్పడడంతో ఖగోళశాస్త్ర వాఙ్మయం వృద్ధి పొందింది.

వైద్య గ్రంథాలు రచించిన వారిలో అబు జకారియా అర్‌రాజీ (932), అజ్ జహరోయీ (1009), ఇబ్న సీనా (1037), ఇబ్నమసావహ్ (1015), ఇబ్న మెమూన్ (1209) మొదలైనవారు ముఖ్యులు. ఔషధాలయాలూ, వైద్యప్రయోగశాలలూ అనేకం ఈ కాలంలో వెలశాయి.

ఖలీఫాల పరిపాలనా వ్యవస్థ ద్వారా, రాకపోకల సౌకర్యాల ద్వారా భూగోళశాస్త్రజ్ఞానం పెంపొందింది. ఈ గ్రంథాలలో రాక పోకల మార్గాలూ, వ్యాపారం మొదలైన అంశాలే కాక ఇతర సాంఘిక, సాంస్కృతిక మత సంబంధమైన పరిస్థితుల వివరాలు కూడా ఉన్నాయి. ఇబ్నఖుర్ దాద్‌బీహ్, కూబీ, ఇబ్నరూస్తా, అల్‌మక్దసీ, అల్‌బేరూనీలు యాత్రా గ్రంథాలు వ్రాశారు. వకీరీ, యాకూత్‌లు భౌగోళిక నిఘంటువును రచించారు.

ప్రాచీన కావ్యాలూ, వంశ చరిత్రలూ ఆధారంగా ప్రాచీన చరిత్రను శోధించి కొందరు ప్రామాణికాలైన చరిత్ర గ్రంథాలను రచించారు. పైగంబర్ మహమ్మద్ సమగ్ర జీవిత చరిత్రను ఇబ్న ఇషాక్ రచించాడు.

స్పెయిన్ దేశస్థుడైన ఇసముద్దీన్-ఇబ్న-అల్-ఖబీల్ సుప్రసిద్ధ చారిత్రకుడు. అరబ్బుల సాంస్కృతిక సాహిత్య వికాసాలను గురించి అల్‌మక్కారి వ్రాసిన గ్రంథం సుప్రసిద్ధ మైంది.

మంగోలుల దాడులవల్ల బాగ్దాద్ పతనానంతరం సిరియా, ఈజిప్టు దేశాలు అరబ్బీ సంస్కృతికి కేంద్రాలు అయాయి. వాఙ్మయస్వరూప స్వభావాలలో కూడా ఈ మార్పు స్పష్టంగా కనిపిస్తుంది. ఈ యుగంలోని ప్రసిద్ధ రచయితలలో ఇబ్న అల్ అస్కలానీ, జలాలుద్దీన్ అల్ మహరీ, జలాలుద్దీన్ అసయూది, శబీబుద్దీన్ అల్ కస్త లినీ, ఇబ్నతైమియా, ఇబ్న ఉల్ జౌజియా, తకీఉద్దీన్ అస్‌సుబకి, అల్‌రౌరాని ముఖ్యులు.

చరిత్ర రచనలో నూతన పద్ధతులనూ, సాంఘిక శాస్త్ర రచనా సూత్రాలనూ ప్రతిపాదించి ఇబ్నఖల్‌దూన్ (1403) ఒక నూతనాధ్యాయాన్ని ప్రారంభించాడు.

అరబ్బీ సాహిత్యాన్ని అంతటినీ మథించి *కష్‌హుజ్ జునూన్* అనే పరిశోధనాత్మకమైన గ్రంథాన్ని రచించిన వాడు హాజిఖల్‌ఫా (1657) అనే తుర్కీ రచయిత.

ఇస్లాం మతప్రభావం వల్ల మన దేశంలో కూడా మహమ్మదీయ యుగంలో అరబ్బీ భాష ప్రచారం పొందింది. దక్షిణ భారతదేశపు పడమటి తీరంలో వ్యాపారం కోసం వచ్చిన అరబ్బుల నివాసాలు ఉండేవి. భారతదేశాన్ని వదలి

మధ్య ప్రాచ్యంలో స్థిరపడిన భారతీయ ముస్లిములలో అబూ అతాఉల్ సింధీ కవిగానూ, అసన్ అలీసగనీ భాషా శాస్త్రవేత్తగానూ, సఫీఉద్దీన్ అల్ హిందీ న్యాయశాస్త్ర పండితుడుగానూ ప్రఖ్యాతి పొందారు.

ముహీబు ఉల్లా బిహారీ (1707) వ్రాసిన *సల్లుం-అల్-ఉలూక్* తర్కశాస్త్రంలో గొప్ప గ్రంథంగా పరిగణింప బడుతూంది.

సద్‌బిన్ సామాన్, నిజాముద్దీన్ జౌలియా, నాసిరుద్దీన్ చిరాగ్ దేహలవీ, షహబుద్దీన్, అమీర్ ఖుస్రోలు అరబ్బీ సాహిత్యానికి అపారమైన సేవచేసిన భారతీయ ముస్లిములు. మలబారు నివాసి ముహమ్మద్-బా-అబ్దుల్ అజీజ్ అనే కవి కల్లికోట జామొరిన్ (ప్రభువు) కూ, పోర్చుగీసు వారికీ జరిగిన యుద్ధాన్ని వర్ణిస్తూ 500 పద్యాలు గల ఒక *మస్నవీ* కావ్యం వ్రాశాడు.

సయ్యద్ అలీఖాన్ ఇబ్నెమాసూమ్, సయ్యద్ అబ్దుల్ జలీల్ బిల్‌గ్రామీ, సయ్యద్ గులాం ఆజాద్, అలీముత్తకి, షాహ్‌వలీ ఉల్లాలు ప్రముఖ కవులు. జహీద్ అలి వ్రాసిన *తాజ్* అనే గ్రంథం భారతేతర దేశాలలో కూడా విశేషగౌరవం పొందింది.

1798 లో పాశ్చాత్య నాగరకతా సంపర్కం వల్ల అరబ్బీ సాహిత్యంలో ఆధునిక యుగం ప్రారంభమైంది. పాశ్చాత్య పద్ధతుల ననుసరించి పాఠశాలలూ, ముద్రణాలయాలూ, పత్రికలూ, యూరప్ ఖండ రచనల అనువాదాలూ మొదలైన వాటితో అరబ్బీ సాహిత్య చరిత్ర ఒక క్రొత్త మలుపు తిరిగింది.

ఆలంకారిక గద్యశైలి అంతమై సరసం, సరళం అయిన వ్యావహారిక భాషలో రచనలు వెలువడసాగాయి. ఆధునిక కథలు, నవలలు, విమర్శలు అన్నిటి మీదా పాశ్చాత్య ప్రభావం కనిపిస్తూంది.

షేక్ మహమ్మద్ అబ్దుల్ *ఖురాన్* మీద వ్రాసిన వ్యాఖ్యానం ఇస్లాం మత విధానంలో ఒక క్రొత్త రూపాన్ని ప్రవేశపెట్టింది. కావ్య వస్తువులోనూ, ఛందస్సులోనూ కూడా రచయితలు నూతన ప్రయోగాలను చేయసాగారు. నాటకాలు, సినిమాలు, రేడియోల ద్వారా సాహిత్యం జనసామాన్యానికి అందుబాటులోకి వస్తూంది.

అరబ్బీ కవిత్వరూపంలో గడచిన నూరేళ్లలోనూ ఎంతో మార్పు వచ్చినా ఇతివృత్తంలో మాత్రం నూతనాకర్షణ ఏర్పడ లేదు. ఈజిప్టులోని అరబ్బీకవి అహీజ్ ఇబ్రహీమ్ (1871-1932) ఇందుకు నిదర్శనం. శిల్పరచనలో ఎంత ఆరితేరిన వాడైనా ఆయన కవితలో చెప్పేందుకు క్రొత్త విషయం ఉండదు. కాని సిరియా, లెబనాన్‌లలో కవులు క్రొత్తపంథా త్రొక్కారు. ద్వితీయ ప్రపంచ సంగ్రామం తరువాత వీరి ప్రభావం అరబ్ సాహిత్య జగత్తుమీద ఎక్కువగా కనిపిస్తూంది. బాగ్దాద్ లోని మరూఫ్ రుసాఫీ (1875-1945) చివరివరకూ సాంప్రదాయిక కవితలనే ఆరాధిస్తూ వచ్చాడు.

1945 తరువాత అరబ్ కవిత్వంమీద నేటి యూరపియన్ రచనల ప్రభావం ఎక్కువైంది. రూపం విషయంలో వినూత్న ప్రయోగాలు జరుగుతున్నాయి. ఇట్టి కవులలో ముఖ్యంగా చెప్పుకోదగ్గవాడు సిరియా నివాసి అయిన ఎడోనిస్ (కలంపేరు; అసలుపేరు అలీఅహ్మద్ సాయిద్, 1930). ఆయన ఖండకావ్యాల సంపుటిని *ది బ్లడ్ ఆఫ్ ఎడోనిస్* అనే పేరుతో ఎస్‌హాదో ఇంగ్లీషులోకి అనువదించి 1971లో ప్రకటించాడు.

ఎడోనిస్ సమకాలికులైన అరబ్బీ కవులలో చెప్పుకోదగ్గవారు ఇరాక్ వాసులు హైదర్, నోయాదీ అల్-రవుదీలు, ఈజిప్టువాసి ప్రాంకాయిస్ బాసిలీ, సిరియావాసి మహూద్ అద్వాన్.

మ.మో.ఖా. *(బొ.శ్రీ.)*

## ఇండోనీషియన్ భాష - సాహిత్యం

భాష : దీనికే 'భాషా ఇండోనీషియ' అని మరొక పేరు. ఈ భాష మాట్లాడే వారు సుమారు 6 కోట్లమంది ఉన్నారు. ఒకప్పుడు ప్రధానమైన వాణిజ్య భాషగా ఉండి వివిధ ఇండోనీషియన్ భాషలు మాట్లాడే వారి కందరికీ సుపరిచితమైన మలయ్‌భాష ఆధారంగా ఈ 'భాషా ఇండోనీషియా' వెలసింది. 1945 లో ఇండోనీషియాకు ఇది అధికార భాషగా ప్రకటించబడింది. ఈ భాష మాట్లాడేవారిలో ఎక్కువమంది బహుభాషా వ్యవహర్తలు. వారు దీనిని రెండవ భాషగానూ, సాహిత్యభాషగానూ, వృత్తిభాషగానూ వ్యవహరిస్తారు. ఇండోనీషియన్ రిపబ్లిక్‌లో ఈ 'భాషా ఇండోనీషియా' యే కాక అనేక స్థానిక భాషలు వాడుకలో ఉన్నాయి. ఆ భాషలను మాట్లాడే ఇండోనీషియాలోని వివిధ జాతులవారికి వేరు వేరు మౌఖిక సాహిత్యాలు ఉన్నాయి. జావానీస్, మలయ్ భాషలలో మాత్రమే లిఖిత సాహిత్యాలు వెలశాయి. ఇతర భాషలలో కనిపించే మౌఖిక సాహిత్యాలు సుసంపన్నమైనవి. కథాకథనం వృత్తిగా గల కథకుల ద్వారా ఆ మౌఖిక సాహిత్యాలు నిలిచి ఉన్నాయి. వేరు వేరు కథల మధ్య స్వల్ప భేదాలు ఉన్నా ఆ కథ లన్నిటికీ పౌరాణిక వీరులే నాయకులుగా ఉంటారు. పౌరాణిక జంతువులు వాటిలో కనిపిస్తాయి. వచన సాహిత్యం

లోనూ, పద్య సాహిత్యంలోనూ కూడా ఈ పాత్రలు కలగలసి ఉంటాయి.

16వ శతాబ్ది నుంచీ ఆరంభమైన మహమ్మదీయ యుగంలో ఇండోనీషియన్ సాహిత్యం మహమ్మదీయ విశ్వాసాల చేత ఎక్కువగా ప్రభావితమైంది. తత్ఫలితంగా సగం చారిత్రకంగానూ, సగం పౌరాణికంగానూ ఉండే సంకలన గ్రంథాలు వెలువడ్డాయి. వాటిలో హిందూ, జావానీజ్ పుక్కిటి పురాణాలలోని జంతువులు, మహమ్మదీయ యోగులూ కలగలసిపోయి కనిపిస్తారు. నేటికీ ఈ కథలను అధిక మత నిష్ఠ గల గ్రామీణ ప్రజలు తమ కుటుంబ వర్గాలలో చెప్పుకుంటూ ఉంటారు.




ఇండోనేషియా

16వ శతాబ్దం నుంచీ మలయాలోనూ, సుమత్రా దీవి ఉత్తర ప్రాంతాలలోనూ గల రాజాస్థానాలలో వెలువడిన మలయ్ సాహిత్యం మీద ఇస్లాం ప్రభావమూ, పెర్షియా, అరేబియాలలోని ఆచారాల ప్రభావమూ ఎక్కువగా కనిపిస్తాయి. రాజాస్థానాలలో సాహిత్యం విశేషంగా పోషించబడింది. 16వ, 17వ శతాబ్దాలలో ఇస్లాం ఆధ్యాత్మిక కార్య కలాపాలకు ప్రధాన కేంద్రం అయిన అట్‌జె (Atjeh) లో ముఖ్యంగా రహస్య వాది కవులు రచించిన ఉద్గ్రంథాలు ఇస్లామిక్ జగత్తు అంతటా ప్రచారం పొందాయి (చూ. మలయ్ సాహిత్య చరిత్ర పుట. 50).

18వ, 19వ శతాబ్దాలలో జావానీజ్, మలయ్ సాహిత్యాలు రెండింటిలోనూ ఒక విధమైన స్తబ్ధత ఆవరించింది. 20వ శతాబ్దంలో రెండు ప్రపంచ యుద్ధాల మధ్యకాలంలో జాతీయోద్యమం విజృంభించిన తరువాత గాని మలయ్ సాహిత్య చరిత్రలో పునరుజ్జీవన దశ ఆరంభం కాలేదు.

ఇండోనీషియన్ సాహిత్యంలో 1920-30 మధ్య కాలంలో తొలి ఇండోనీషియన్ నవలలు వెలువడ్డాయి. కాని, ఆధునిక ఇండోనీషియన్ సాహిత్యం మీద ప్రధానమైన ప్రభావం చూపించింది 1933 లో ఆరంభమైన 'పుడ్‌జంగ బారు' (Pudjangga Baru- నూతన రచయిత) ఉద్యమమే. ఈ ఉద్యమంలో ఉత్సాహవంతులైన యువ రచయితలు - చాలావరకు సుమత్రాకు చెందిన వారు- ఇండోనీషియన్ భాషను ఆధునిక భాషగా తీర్చిదిద్ది 'అతీత సంస్కృతి' (Super culture) ని సృష్టించాలని దీక్షతో కృషిచేశారు. ఆటు తరువాత జపాన్ ఆక్రమణ, ఇండోనీషియా స్వాతంత్ర్యోద్యమం ఈ కృషికి మరింత పుష్టి చేకూర్చాయి. ఆ దశలో వెలువడిన రచయితలు '1945 రచయితల వర్గం'గా ప్రసిద్ధి పొందారు. ఈ వర్గంలోని వాడే సుప్రసిద్ధుడైన ఆధునిక ఇండోనీషియన్ కవి చైరిల్ అన్వార్ (Chairil Anwar). ఈయన 1822 లో మెడాన్ (Medan)లో జన్మించాడు; 27 వ ఏటనే టైఫస్ జ్వరంతో మరణించాడు.

నవల మీద కంటె చిన్నకథ మీద ఇండోనీషియన్ రచయితల దృష్టి ఎక్కువగా ప్రసరించినా, శాన్యూస్ పేన్ (Sanuse Pane), ఇద్రస్ (Idrus) వంటి నవలా రచయితలు కూడా ఎందరో ప్రసిద్ధి పొందినవారు ఉన్నారు. స్వతంత్ర వార్తాపత్రిక *ఇండోనీషియ రాయ* సంపాదకుడైన మొఖ్బర్‌లూబిస్‌కు సుకర్ణో ప్రభుత్వం తమ లంచగొండితనాన్నీ, సాంఘిక పతనాన్నీ నిర్దాక్షిణ్యంగా విమర్శించినందుకుగాను 1960 ప్రాంతంలో 4 ఏళ్లు జైలుశిక్ష విధించింది. ఆ ప్రభుత్వానికి మరీ ఆగ్రహం కలిగించిన రచన ఆయన వ్రాసిన రెండవ నవల *జకర్తాలో సంజవెన్నెల* (Twilight in Djakarta). 1963లో అది ప్రచురించబడింది. సుకర్ణో పాలనలో విప్లవ కాలంనాటి ఆదర్శదృష్టీ, నైతికదృష్టీ ఎంతగా దెబ్బతిన్నదీ ఆ నవల అత్యంత వాస్తవిక ధోరణిలో అభివర్ణించింది.

సుకర్ణో ప్రభుత్వ కాలంలో రచయితల స్వేచ్ఛను నిరోధించడానికి ఎన్ని అసహ్యమైన ప్రయత్నాలు జరిగినా, ఇండోనీషియన్ సాహిత్యం క్రమంగా ముందంజ వేయడం మానలేదు. 1960-70 మధ్య కాలంలో ఇండోనీషియన్ రచయితలకు తమ సాహిత్య మాధ్యమాన్ని తామే సృష్టించుకోవలసిన అగత్యం తీరిపోయింది. ఇండోనీషియన్ భాష అతి సంక్లిష్టమైన, అత్యంత సూక్ష్మమైన భావాలను కూడా ప్రకటించడానికి అవసరమైన పటిష్ఠతను సంతరించుకోగలిగింది. దానితో పాటు అక్షరాస్యుల సంఖ్య కూడా బాగా పెరిగింది. ఆ పరిస్థితులన్నీ అఖిల ఇండోనీషియన్ సాహిత్య ప్రాదుర్భావానికీ, ప్రాంతీయ సాహిత్యాల పట్ల అభినివేశాన్ని తగ్గించడానికీ దోహదం చేశాయి. బొ.శ్రీ.

# కొరియన్ భాష - సాహిత్యం

**భాష :** ఉత్తర, దక్షిణ కొరియాలలోని సుమారు 6 కోట్ల మంది ప్రజలూ, జపాన్‌లో స్థిరపడిన కొన్ని లక్షలమంది కొరియన్‌లూ మాట్లాడే ఈ భాష 'జపానీస్-కొరియన్' భాషా కుటుంబానికి చెందిందని కొందరు పండితుల అభిప్రాయం. దీనికి జపానీస్ భాషతో కొంత సంబంధం ఉన్నా, ఇది ఆల్టాయిక్ భాషా కుటుంబానికే మరింత సన్నిహితంగా కనిపిస్తుందని మరికొందరి అభిప్రాయం.



కొరియా

ప్రాచీన కొరియన్ భాష చైనీయ లిపిని వాడుతూ ఉండేది. ఆ లిపిలో వ్రాయబడిన 25 గేయ సంకలనాలు 'సిల్లా' రాజ్యకాలం (సుమారు క్రీ.పూ. 57- క్రీ.శ.935) నుంచి భద్రపరచబడ్డవి లభించాయి. 15వ శతాబ్దం మధ్యభాగంలో కొరియన్ లిపి వాడుకలోకి రావడానికి ముందు గల భాషా స్వరూపాన్ని గురించి ఎక్కువగా తెలియదు. కొరియన్ భాషా పరిణామాన్ని మూడు దశలుగా విభజించవచ్చును.

1. ప్రాచీన కొరియన్ భాష - (12 వ శతాబ్దికి పూర్వం), 2. మధ్యకాలీన కొరియన్ భాష - (12 వ శతాబ్దం నుంచి 16 వ శతాబ్దం వరకూ), 3. ఆధునిక కొరియన్ భాష - (17 వ శతాబ్దం నుంచి).

**సాహిత్యం :** క్రీ.పూ. 57 కు పూర్వమే కవిత్వంతో కొరియన్ సాహిత్యం ప్రారంభం అయింది. పొలం పనులలోనూ, మత కర్మకాండలలోనూ ప్రజలు సామూహికంగా గానం చేసే గేయాల రూపంలో మొదట ఆ సాహిత్యం ఉండేది. ఆ గీతాలు ప్రకృతికి చాలా చేరువగా ఉండేవి. అటు తరువాత కొరియా సంస్కృతి మీద చైనా సాహిత్య ప్రభావం వల్ల కొరియన్ కవిత్వం పరిణతి చెందింది. గేయరచన సామూహిక ప్రవృత్తిగా ఉండడం పోయి, వ్యక్తినిష్ఠం అయింది. వ్యక్తిగత సంతోషం, కోపం, విచారం ఆ గీతాలలో వ్యక్తం అవుతూ వచ్చాయి.

కొరియన్ సాహిత్యంలో అత్యంత ప్రాచీన రచనలు సూర్య చంద్రులకూ, చారిత్రకులైన రాజులకూ సంబంధించిన కట్టుకథలతోనూ, పుట్టుక, నీతి, వీరులు, జోస్యాలు, కలలు, జంతువులు మొదలైన వాటికి సంబంధించిన జానపద గాథలతోనూ నిండి ఉండేవి. మౌఖిక సాహిత్యంలో వీరగాథలు, తోలుబొమ్మలాటల కథలూ మొదలైనవి ప్రచారంలో ఉండేవి.

935లో సిల్లా రాజ్యయుగం అంతరించిన తరువాత కొరియన్ సాహిత్యంలో (935-1392) 'పయోల్‌గాక్' (pyolgak - విలక్షణ గీతం) అనే ఒక క్రొత్త కవితా ప్రక్రియ వాడుకలోకి వచ్చింది.

కొరియన్ కవిత్వంలో విశేష ప్రజాదరణ పొందిన కవితా ప్రక్రియ 'సిజో' (Sijo). మూడేసి పాదాలు గల పద్యాలతో కూడిన ఈ ప్రక్రియ 12 వ శతాబ్దంలో ప్రారంభమై, నేటికీ వాడుకలో ఉంది. కన్‌ఫ్యూషియస్ విలువలను పాటించే ఈ సిజో ప్రక్రియ ప్రకృతినీ, ప్రేమనూ కూడా అభివర్ణిస్తుంది. సిజోతో పాటుగా వాడుకలో ఉన్న మరొక కవితా ప్రక్రియ 'కాసా' (Kasa). ఇది దీర్ఘకావ్యం. స్త్రీ సౌందర్యం, యుద్ధం, విరహం ఆదిలో దీని ఇతివృత్తాలు. అనంతరం నీతి బోధన, యాత్రా వృత్తాంతాలు, వ్యక్తిగత విషాద గాథలు మొదలైన వాటికి కూడా ఇది ఉపయోగపడేది.

జపానీస్ ఆక్రమణ అనంతరం కొరియన్ సాహిత్యంలో వచన రచనకు ప్రాధాన్యం ఏర్పడింది. కన్‌ఫ్యూషియన్ సిద్ధాంతాల స్థానే ఆదర్శవాదం వాడుకలోకి వచ్చింది. ఈ యుగంలో వచ్చిన నవలలు విశేష జనాదరణ పొందాయి. 1910 లో ఆధునిక నవలలు ఆరంభం అయేవరకు 'సిన్‌సోసోల్' (Sinsonsol- క్రొత్త నవల) అనే ఈ రూపమే ప్రచారంలో ఉండేది. ఆ నవలలలో చెడును మంచి జయించడం, కాకతాళీయ సంఘటనలూ ఎక్కువగా కనిపించేవి. తొలి నవలలు కొన్ని పద్య రూపంగా కూడా ఉన్నాయి. ఆ నాటి నవలలలో చెప్పుకోదగ్గవి:

1. *ఒక రాక్షసుడి గొంతు* (A Demon's voice -1907), రచన: యీఇంజిక్, 2. *స్వేచ్ఛా ఘంట* (Liberty Bell), రచన: యీహేజో, 3. *శీతకాలపు చంద్రుడు* (Autumn Moon -1912), రచన: చోచాన్‌సిక్

ఈ నవలలలో ఆధునిక విజ్ఞాన శాస్త్రంలోని వింతలు, సంఘంలోని అంతఃకలహాలు, అంతర్జాతీయ వ్యవహారాలు, ఆధునిక సాంకేతిక శాస్త్రం మొదలైనవి ఇతివృత్తాలుగా గ్రహింపబడుతూ వచ్చాయి.

1920 తరువాత కొరియన్ సాహిత్యంలో సంపూర్ణ వికాసం కనిపించింది. 1919లో సాగిన స్వాతంత్ర్యోద్యమంలో యువ రచయితలు కొరియన్‌లపై జపాన్‌వారు సాగించిన దమనకాండనూ, హింసలనూ గర్హిస్తూ ఆగ్రహోదగ్రమైన రచనలు చేశారు. 1930 తరువాత పాశ్చాత్యుల చైతన్య స్రవంతి (stream of consciousness) శిల్పం వంటి వాటిని కొరియన్ రచయితలు అనుకరింప సాగారు. ఈ కాలంలో చోంగ్‌చియాన్ వ్రాసిన కావ్యాలలోనూ, యూహ్యోసో కథలలోని లలితమైన శైలిలోనూ కొరియా భాషకు గల శక్తి విస్పష్టం అవుతూంది.

రెండవ ప్రపంచ సంగ్రామ కాలంలో జపాన్ వారిచేత అణచి ఉంచబడిన కొరియన్ సాహిత్యం 1945 లో తిరిగి తల ఎత్తి పురోగమింపసాగినా, అంతలో కొరియన్ యుద్ధం (1950-53) ఆరంభం కావడంతో కొరియన్ సాహిత్య వికాసానికి తిరిగి విఘాతం కలిగింది. యుద్ధానంతర సాహిత్యం పాశ్చాత్య భావాలనుంచి పొందిన ఉత్తేజంతో తన ప్రాచీన సంప్రదాయాలకు తిరిగి జీవం పోయడానికి కృషి చేస్తూంది.

బొ.శ్రీ.

## చైనీస్ భాష - సాహిత్యం

**భాష :** దాదాపు 3,000 సంవత్సరాలకు పైగా చైనా భాష వ్యవహారంలో ఉన్నట్టు ఐతిహాసిక ఆధారాల వలన తెలుస్తూంది.




చైనా

ఆసియా ఖండంలో సినో-టిబెట్ (Sino-Tibetan) భాషా కుటుంబానికి చెందిన ప్రధాన భాష చైనా భాష. దీనిని చైనీయ 'హాన్' అని కూడా అంటారు; మరొక వర్ణనాత్మకమైన పేరు 'సినిటిక్' (Sinitic సిని - చైనా; టిక్ - టిబెట్; చైనా టిబెట్ భాషలు కలిసింది అని అర్థం). చైనాభాష అనేది అనేక మాండలికాల సమూహాన్ని సూచించే పేరు. ఈ మాండలికాలను ఉప భాషలు అనేవా రున్నారు. చైనాభాష అనే పేరిట వ్యవహారంలో ఉన్నన్ని ఉప భాషలు ప్రపంచంలో మరే భాషలోనూ లేవు. ప్రతి ఉపభాషకూ ఒక ప్రత్యేకత ఉంది. ఈ ఉపభాషలలో ఒకదానిని చైనావారు ప్రమాణీకరించారు. ప్రస్తుతం ఐక్యరాజ్య సమితిలో వాడకానికి స్వీకరించిన 5 ప్రపంచ భాషలలోనూ, ఈ ప్రమాణీకృత ఆధునిక చైనా భాష ఒకటి.

చైనాలోని ఉపభాషలు దేనికి అదేగా ఒక ప్రాంతం వారి భాష మరొక ప్రాంతం వారికి అర్థంకానంత భిన్నంగా ఉండేవి. మాండలిక శబ్దాల తేడా సరేసరి! ఉచ్చారణలలో ప్రాంతీయ వ్యత్యాసా లున్నాయి. వ్యాకరణంలో ఎక్కువ తేడాలు లేవు. ప్రాంతీయంగా ఎక్కువ వాడకంలో ఉన్న ఉపభాషలలో ప్రధాన మైనవి: ఉత్తర, మధ్య, పశ్చిమ ప్రాంతాలలో మాట్లాడే 'మాండరిన్' (Mandarin); ఉత్తర, దక్షిణ ప్రాంతాలలో మాట్లాడే 'వూ' (Wu); ఆగ్నేయ ప్రాంతంలో మాట్లాడే 'మిన్', 'కాన్' , 'హక్కా', 'హ్సియాంగ్', 'కాంటనీస్' లేక 'యూచ్' భాషలు.

చైనా ఉపభాష లన్నిటికీ సాహిత్యం మాత్రం ఒక్కటే! దాని పేరు 'వెన్‌యెన్'. ఈ ఉమ్మడి సాహిత్యాన్ని భావాత్మకమైన లిపిలో వ్యక్తం చేయడం పరిపాటి. ధ్వని విధేయమైన లిపి దాదాపు లేనట్లే. అయితే ఈ లిపిని చదవడంలో ఉచ్చారణ భేదా లున్నాయి. ఎవరి ప్రాంతీయ పద్ధతిని బట్టి వారు చదువుతారు. 1917 కు ముందు వెన్‌యెన్ పద్ధతి వ్రాతనే విస్తృతంగా అభిమానించేవారు. ఆ తర్వాత మాండలిక పద్ధతులలో, అంటే పాయ్‌హువా పద్ధతిలో సాహిత్యాలను వెలయించడం ఎక్కువయింది. పాత సాహిత్యశైలి, ఒరవడి క్రమంగా మరుగున పడసాగాయి.

1900వ సంవత్సరం ప్రాంతంలో జాతికి ఒకే భాష ఉండాలనే భావన ప్రచారమై, జాతీయ భాష కోసం మాండరిన్‌ను ఆధారంగా చేసుకొని, ఆధునికీకరణను చేపట్టారు. ఇదే ఆధునిక ప్రామాణిక చైనాభాష జాతీయభాష-క్వోయూ (Kuoyu), లేక ఉమ్మడిభాష ప్యూటుంగ్ హువా.

1956లో లిపిని సంస్కరించడానికి పూనుకొన్నారు. ఉచ్చారణను అనుసరించి, అంటే ధ్వని విధేయమైన అక్షరాలను రూపొందించి, ఏక లిపిని రూపొందించారు. దీనిని పిన్యిన్ (Pinyin) అన్నారు. పిన్యిన్ లిపిని విద్యాలయాలలో ప్రవేశ పెట్టారు. 1979 వరకూ దీనిని ఒక క్రమంలో వాడుతూ, ఇదే జాతీయ లిపి అని నిర్దేశించారు. ఇట్లా భాషను, లిపిని ఆధునిక జాతీయ అవసరాలకు అనువుగా తీర్చి దిద్దే ప్రయత్నం కొనసాగింది.

చైనా భాషా చరిత్రను పండితులు స్థూలంగా నాలుగు యుగాల క్రింద విభజించారు. ఆదిమయుగం (క్రీ.పూ. 500 వరకు), ప్రాచీనయుగం (క్రీ.పూ.500 - క్రీ.శ. ఆరంభం), మధ్యయుగం (క్రీ.శ.ఆరంభం - 1000), ఆధునికయుగం (1000 నుంచి).

క్రీ.పూ.500 సంవత్సరాల వరకూ వచ్చిన శిలాశాసనాలు, గేయాలు ఆ నాటి భాషా స్వరూపాన్ని విదితం చేస్తున్నాయి. ఆపైన క్రీస్తు శకారంభం వరకూ వాడుకలో ఉన్న భాష అతిప్రాచీన చైనాభాష. ఇతర భాషాశబ్దాలు ఈ కాలంలో చైనా భాషలో చేరినట్లు దాఖలాలు కానవస్తున్నాయి. ఈ యుగంలో కన్‌ఫ్యూషియస్ (Confucious), మెన్షియస్ (Mencius) ప్రభృతులు రచనలు చేశారు. అవి నేటికీ పఠనీయాలే! తర్వాత క్రీ.శ 1000 వరకు గల కాలం మధ్యయుగం. 1901 ప్రాంతంలోనే ప్రముఖ పండితుడు లూఫా యెన్ వ్రాసిన ఉచ్చారణకోశం ద్వారా, పూర్వీకులు చైనాభాషను ఎలా ఉచ్చరించేవారో తెలియవస్తుంది. క్రీ.శ. 1000 తరువాత నడిచినయుగం ఆధునిక యుగం. ఆధునికయుగంలో 11 వ శతాబ్దంలో స్సూ-మాక్వాన్గ్ అనే ఆధికారిక పండితుడు కూడా ఒక ఉచ్చారణ కోశం రచించాడు. ఈ రెండు కోశాలూ అంతకు ముందువారు రూపొందించిన శబ్దకోశాలలోని వివిధ శబ్దాలను పేర్కొని వాటి మూలాలనూ, రూపాంతరాలనూ, ఉచ్చారణలనూ విశదం చేస్తున్నాయి.

ఒకే తీరు అక్షరాలూ, శబ్దాలూ, సందర్భాన్ని బట్టి భిన్నమైన అర్థాలకు సంకేతాలు అవుతూ ఉంటాయి. ధ్వని ప్రణాళికను బట్టి అవే అచ్చులూ, హల్లులూ కలిసి వేర్వేరు అర్థాలను ద్యోతకం చేస్తాయి. చైనా భాషలో కలగలుపు అచ్చులు ఎక్కువ. మొత్తం ఈ భాషలో 21 అచ్చులు, 23 హల్లులు ఉన్నాయి. డ-త-జ-ద-గ లాంటి హల్లులు ప్రత్యేకంగా లేవు. సందర్భాన్ని బట్టి ఒకే అక్షరాన్ని వేర్వేరు రీతులుగా ఉచ్చరిస్తారు. పురాతన చైనా భాష ఉచ్చారణలో ఆరు 'స్వరాలు' స్పష్టంగా వినిపించేవి. ఆధునిక ప్రామాణిక చైనా భాషలో నాలుగు స్వరాలు మాత్రమే ఉపయోగిస్తున్నారు. చైనీయ లిపిలో ఒక అక్షరం ఒక భావానికి, లేదా ఒక పదానికి సంకేతం. అది చిత్ర లిపి. వివిధ భావాలకు సంకేతాలు చిత్రరూప అక్షరాలే. ఈ మధ్య విస్తృతార్థ సాధన కోసం సంశ్లిష్ట అక్షరాలు బాగా ఉపయోగిస్తున్నారు. ఈ లిపిని కుడినుంచి వ్రాయడం ఒక విశేషం; మరొకటి, పైనుంచి క్రిందికి వ్రాయడం!

తెలుగు భాషలో వలె విభక్తులు, నిర్దేశక సర్వనామాలు, భూత భవిష్యద్వర్తమానాలను సూచించే స్పష్టమైన శబ్ద రూపాలు చైనా భాషలో లేవు. ఆ యా అర్థాలను స్ఫురింపజేసే సంకేతా లున్నాయి. క్రియా పదాల సహాయంతోనే విశేషణాలు, అవ్యయాలు ఏర్పడుతూ ఉంటాయి. ఈ విధంగా భాషను సువ్యక్తం చేయడానికి దాదాపు ఐదు వేల లిపి సంకేతాలు నేర్చుకోడం అవసరం అవుతుంది. కాని, చైనా అంతటా ఈ సంకేతాలు అందరికీ అర్థం అవుతున్నాయి. అందరికీ అర్థమయ్యే ఈ చిత్రలిపి, ఒక విధంగా చైనా జాతిని సమైక్యంగా ఉంచడానికి ఆధారం అయింది. ఎన్ని కల్లోలాలు వాటిల్లినప్పటికీ, ఎన్ని రకాల ప్రభుత్వాలు నెలకొన్నప్పటికీ చైనా ప్రజలలో తాము ఏక జాతీయుల మనే భావం చెక్కు చెదరలేదు. భాష ఎన్ని ప్రాంతీయాలుగా విభక్త మైనప్పటికీ, లిపి మాత్రం దేశమంతటా ఒక్కటిగానే మిగిలి ఉంది. చైనా ఏకతకు ఈ చిత్రలిపి (ఉచ్చారణలు వేరైనా) పునాది. యాసల గంద్రగోళం ఏర్పడకుండా, అక్షరాల ఉచ్చారణను భిన్న భిన్నంగా తీర్చిదిద్దుకున్నారు. ఉచ్చారణ సౌలభ్యం వలన సంగీత సాహిత్యాలకు సాన్నిహిత్యం కుదిరింది. కవితలకూ నాటకాలకూ సాన్నిహిత్యం సాధ్యమైంది. చైనీయులు కవితలను పాడుకునేవారు. కాలక్రమాన ఆ గాన ఫణుతులు మరుగై, ఇప్పటివారు వాటిని ఏదో ఒక రాగం వరసను సాగలాగుతూ పాడుతున్నారు; కేవలం చదవడం కంటె, కొంచెం విభిన్నమైన విధానం ఇది. చైనా భాషలోని నాటకాలు సాధారణంగా గేయనాటకాలే!

చైనా చిత్రలిపిలో ఒక్కొక్క అక్షరం ఒక చిన్న సమాసం లాంటిది. ఈ అక్షర లాఘవం వలన వారి కవితకు అర్థపుష్టి చేకూరింది. వారి కవితలు టెలిగ్రాం భాషలో వ్రాసినట్లు ఉంటాయి. ఆనందాతిశయాన్నీ, అగాథ విషాదాన్నీ అలవోకగా అవి వ్యక్తం చేస్తాయి. సుదీర్ఘంగా వ్రాయవలసిన అగత్యం వారికి కలుగలేదు. సంక్షిప్త రచనలోనే భాష విశేషాలను వారు నిక్షిప్తం చేయగలిగారు.

లిపి వైచిత్రి వలన, అక్షరాలలో నిక్షిప్తం కాగల భావనా బాహుళ్యం వలన వాటిల్లిన నష్టాలలో ఒకటి,

రెండు ప్రముఖంగా పేర్కొన దగినవి. దాదాపు వేయి చిత్రాక్షరాలు నేర్చుకోవలసి ఉండడం వలన, ఎంత నేర్చినా, భాషాజ్ఞానం కొరవడడం తప్పనిసరి అయింది. వాడుక భాష ఎన్ని కోట్లమంది మాట్లాడుతున్నప్పటికీ, వారందరికీ భాషాజ్ఞానం అలవడే అవకాశాలు తక్కువ అయాయి. ఎక్కడో విద్యావ్యాప్తి సుగమమైన నగర ప్రాంతాలలో తప్ప, మిగతా చోట్ల అధిక సంఖ్యాకులు నిరక్షరాస్యులుగానే ఉండిపోవలసి వచ్చింది. భాషా ప్రాధాన్యం క్షీణించి, లిపి లేఖన పాండిత్యానికి ప్రాముఖ్యం హెచ్చింది. ఇది భాషాజ్ఞాన విస్తరణకూ, భావనా నైపుణి క్షీణతకూ దారి తీసింది. 1487 నుంచి 1901 వరకూ పరిపాలనలో ఉద్యోగాలు సంపాదించా లంటే లేఖన ప్రావీణ్యం తప్ప నిసరి యోగ్యత అయింది. అధికారులు ఆమోదించిన రీతిలోనే వ్రాయాలి. దాని వలన ఊహలూ, వేదనలూ అన్నీ వ్యక్తీకరించే అవకాశం సన్నగిల్లింది.

**సాహిత్యం :** చైనాలో లభించిన శాసనా లన్నిటిలోకీ పురాతనమైంది క్రీ.పూ. 1384 నాటిది. ఎముకలపైనా, గుల్లలపైనా చెక్కిన శాసనాలు అవి. అప్పటి లిపి కూడా ఇప్పటి లాగా చిత్రలిపే! అందుచేత ఇప్పటివారు ఆ లిపిని, భాషను అలవోకగా అర్థం చేసుకోగలరు. పురాతన శాసనాలలో అప్పటి కవితల ప్రసక్తి, అప్పటి సంగీత ప్రసక్తి కానవస్తున్నది. క్రీ.పూ. 500 సంవత్సరాల ప్రాంతం కన్ ఫ్యూషియస్ యుగం. ఆ కాలంలో వెలసిన గుడి గీతాలు, రాజదర్బారు గేయాలు, జానపదగేయాలు వగైరాలు *షీహ్ చిన్గ్* అనే పేరుతో ఒక సంకలనంగా లభిస్తున్నాయి. అది ఒక పురాణ గ్రంథం. దానిలో ఒక భాగం 'ఇ-చింగ్'. పశ్చిమ చైనా ప్రాంతంలో ఇది బాగా ప్రచారంలో ఉంది. ఇంచుమించు ఇది ఒక కాలజ్ఞాన తత్త్వాల సంకలనం వంటిది. ఆ తర్వాత క్రీ.పూ. 300 ప్రాంతంలో చూ యువాన్ అనే కవి ఉద్భవించి, చైనా కవితా జగత్తులో శాశ్వతకీర్తితో నిలిచి పోయాడు. అతడు రచించిన *విషాద నిరాసం* (On Encountering sorrow) అనే కావ్యం సుప్రసిద్ధమైంది. రాజకీయాలను, భగ్నప్రేమను మిళితం చేసి స్వర్గ భూములలోకి ప్రయాణం కట్టించిన కవి అతడు.

చైనా పురాణాలలో చెప్పే దాన్ని బట్టి మనుష్యులూ, దేవతలూ యథేచ్ఛగా స్వర్గంలో విహరించి రావచ్చు. షాన్ తీ అనే దేవ నాయకునిపైన తిరుగు బాటు చేయడానికి చిహ్ యూ అనే చిల్లర దేవుడు మానవ సహాయాన్ని అపేక్షిస్తాడు. తిరుగుబాటును అణచివేసిన తర్వాత, మను ష్యులు మానవలోకం దాటి పోవడానికి వీలు లేకుండా, స్వర్గానికీ మానవ లోకానికీ మధ్య పెద్ద అడ్డంకులను నెలకొల్పుతారు. కాని చిల్లర దేవుళ్లు, రెక్కల పాములు, మాయా సూకరాలు, వింత కోతులు వగైరా పురాణ జంతువులు ఈ అడ్డంకులను లక్ష్యం చేయకుండా యథే చ్ఛగా స్వర్గానికి వెళ్లి వస్తూ మానవులకు అక్కడి వారితో ఏమైనా పనులు ఉంటే వాటిని చేసుకువస్తూ ఉండేవి. పురాణ నాయకులకు వారి స్వర్గ యాత్రలలో ఈ జంతు వులు వెంట ఉండడం మామూలే! ప్రతి ఊరికీ, ప్రతి కుటుంబానికీ, ప్రతి వంతెనకూ ఇలా స్వర్గానికి వెళ్లి పనులు చేయించుకొని వచ్చే చిల్లర దేవుళ్లు రక్షకులుగా ఉండేవారు. చైనా సాహిత్యంలో ఇలాంటి దేవ దూతలు కోకొల్లలు!

మొట్టమొదటి వచన రచనలు తాత్త్వికుల ఆలోచ నల సంకలనాల రూపంలో వెలువడ్డాయి. *కన్‌ఫ్యూషియస్ విచార శకలావళి*, అలాగే *లా వోట్జూ* (Lao tzu) అనే *తావొ తేచింగ్* (Tao Teching) ('భావనా ఖండాలు'), *మెన్‌షియస్* (Mencius) ('ఆలోచనాం శాలు') ఇట్టి వచన రచనలకు ఉదాహరణలు. క్రీ.పూ. 240 ప్రాంతంలో మొదటి సారిగా సలక్షణమైన పుస్తకం రూపొందింది. లూ-పూ-వీయ్ రచించిన 60 వ్యాసాల సంపుటి *ల్యూ షీ చున్ చియూ* వివిధ తత్త్వాలసారం; వివిధ ప్రాంతాల జానపద గీతాల సంకలనం.

క్రీ.పూ. 225వ సంవత్సరంలో దేశంలోని పాటలనూ, ఆలయాలలోనూ, రాజదర్బారులలోనూ వాడుకలో ఉన్న సంగీత పద్ధతులనూ, వీరగాథలనూ, జానపద గేయాలనూ సేకరించి భద్రం చేయడానికి ఒక సంగీత పరిషత్తు 'యూయెఫ్యూ' నెలకొల్పారు. ఈ సంకలనం నుంచి తరు వాతి రచయితలు ఉత్తేజం పొంద సాగారు. అప్పటినుంచీ వివిధ శతాబ్దాలలో ఈ పరిషత్తు కార్యాచరణ కౌశలాన్ని మెరుగు పరిచే కృషి కొనసాగుతూ వస్తూంది.

220వ సంవత్సరం మొదలు భారతదేశంనుంచి వచ్చిన దండయాత్రల బృందాల ద్వారా సంక్రమించిన సాంస్కృతిక లక్షణాలను చైనా తన సంస్కృతిలో జీర్ణం చేసుకొ నసాగింది. అయినా తన సంప్రదాయాన్ని సురక్షితం చేసుకొంటూ ఉండేది. రాజకీయ ఐకమత్యం తరుచు భగ్నం అవుతూ ఉండడం వలన, సాహితీ పరులు ఎప్పటి కప్పుడు తమ సంప్రదాయాలనైనా పదిలం చేసుకోవాలని పట్టుదల వహించేవారు. ఈ కృషి ఫలితంగా సాహి త్యంలో పాతదనం పాతుకు పోయింది. అధికార భాషా శైలికీ, ప్రజా భాషా శైలికీ మధ్య ఒక అగాథం నెలకొన్నది.

ఉత్తమ రచయితలు ప్రజల భాషనే ఉపయోగించడానికి గట్టి కృషి చేశారు.

చైనా సాహిత్యేతిహాసంలో స్వర్ణయుగంగా పేర్కొనదగిన కాలం క్రీ.శ. 600 నుంచి 900 వరకూ. ఈ కాలంలో వివిధ శైలులను సరి సమానంగా వాడుకోడానికి ప్రయత్నం జరిగింది. వేర్వేరు శైలులను రంజకంగా అనుసరించడానికి రచయితలకు తగినంత స్వాతంత్ర్యం ఉండేది. క్రీ.శ. 775 ప్రాంతంలో తూఫూ (Tufu) అనే మహాకవి తన రచనలలో రాజకీయ నైశిత్యం, సాంఘిక పరిజ్ఞానం, నైతిక గాంభీర్యం, ప్రతిభావంతమైన కవితాకౌశలం ప్రదర్శించి లబ్ధ ప్రతిష్ఠుడయాడు.

ఆ తరువాతి శతాబ్దాలలో సాహితీ నియమాలపైన వివాదాలు ఎక్కువయాయి. రచనలు సర్వసాధారణంగా అంతకు మునుపటి వారి రచనలకు అనుకరణలే అయాయి. 1644 నుంచి 1912 వరకూ అంటే మన్‌చు (Manchu) దండయాత్రల కాలం నుంచి రచనలు ఎక్కువగా వెలువడ్డాయి. కాని, వాటిలో ప్రతిభా వ్యుత్పత్తులు కొరవడ్డాయి. ప్రతిభ అతి విరళంగా కానవచ్చేది. సృజనాత్మక రచనలు అరుదయాయి. ఇంత సుదీర్ఘ కాలంలో వెలువడిన ప్రథమ నవల *శోణ మందిరంలో స్వప్నం (డ్రీం ఆఫ్ ది రెడ్ చేంబర్)* అనే విషాదాంత కథ. దీనిని త్సావో చాన్ (Tso Chan) రచించాడు. ప్రపంచ నవలా సాహిత్యంలో పేర్కొనదగిన గొప్ప నవల ఇది. 1842 లో నల్లమందు యుద్ధాల తర్వాత, పాశ్చాత్య సాహిత్యాన్ని చైనా భాషలోకి అనువదించే కృషి ముమ్మరంగా ప్రారంభం అయింది.

19వ శతాబ్దం ద్వితీయార్ధంలో డాక్టర్ సన్‌యాత్ సెన్ (Sanyat Sen) ప్రభృతులు నూతన భావాల స్వీకరణను, రచనా స్వేచ్ఛను ప్రబోధించ సాగారు. ఒక నూతన రాజకీయ వ్యవస్థ స్థాపన సాధ్యమనే విశ్వాసం కల్పించగలిగారు. రచనా ప్రక్రియలు ఆధునికం కాజొచ్చాయి. జాతీయ భావాలు పరివ్యాప్తం కావడం ఈ యుగం ప్రధాన లక్షణం. 1919 మే 4న చైనాలోని షాన్ తున్‌గ్ (Shan Tung) రాష్ట్రాన్ని జపాన్ వారికి సంక్రమింపజేయాలని ఒక ఒడంబడిక జరిగే సరికి, చైనా ప్రజలు తమ దేశంలోని ఒక భాగాన్ని మరో దేశానికి దత్తం చేసే ఈ చర్యను తీవ్రంగా నిరసించారు. అప్పటికే జరిగిన జాతీయతా ప్రచారం ఈ నిరసన ఉద్యమానికి దోహదం చేసింది. జాతిని ఉత్తేజపరిచే రచనలు విరివిగా వెలువడనారంభించాయి. జాతీయ భావ ప్రధానమైన రచనలకు కమ్యూనిస్ట్ రచనలు తోడయాయి. ఈ రచనోద్యమం పట్ల యువ రచయితలు పలువురు ఆకర్షితులయారు. కమ్యూనిస్ట్ ఉద్యమం కూడా బలీయం కాజొచ్చింది. కార్మిక, కర్షక, సైనిక వర్గాలకు ఉపకరించే రచనలు చేయడమే సారస్వత ధ్యేయంగా ఉండాలని కమ్యూనిస్ట్ నాయకుడు మావో - త్సే - తుంగ్ (Mao Tse Tung) చేసిన నిర్దేశాన్ని అనుసరించే ఆధునిక సాహిత్యం రూపొందజొచ్చింది. కార్మికులు, కర్షకులు, సైనికులు సుక్షేమంగా ఉండడమే జాతీయ జీవనానికి ఆలంబనం అనే విశ్వాసం బలపడింది. ఈ దశలో సాహిత్యాభివృద్ధికి ఆధునిక ముద్రణ సౌకర్యాలు కూడా దోహదం చేశాయి. ప్రభుత్వం కూడా, వివిధ ఉపభాషా ప్రాబల్యాల వలన గందరగోళంగా తయారైన భాషా వ్యవస్థను మార్చడానికి గట్టి చర్యలు తీసుకుని, భాషాసమైక్యం చాలావరకు సాధించ గలిగింది. ఉత్తమ గ్రంథాలను చైనా భాషలోకి పరివర్తనం చేయడం, ఉత్తమ చైనా రచనలను ఇతర భాషలలోకి అనువదింపజేయడం, ప్రభుత్వ ప్రోద్బలంతో ఆరంభమైంది. చైనావారికే సరిగా అర్థంకాని ఉపభాషల వ్యవస్థతో ఇతర దేశాల వారికి గజిబిజి కలుగజేసిన చైనాసాహిత్యం వెనుకబట్టి, ఆధునిక చైనా సాహిత్యం విశ్వసాహితీ రంగంలో ప్రవేశించింది. వారి లిపిని వారే ఒక త్రోవకు తెచ్చుకొంటున్నారు.

## జపానీస్ భాష - సాహిత్యం

భాష : జపానీస్ భాషను (ర్యూక్యూస్‌లో ఉన్న వారితో సహా) జపాన్ దీవుల్లో 11 కోట్ల 50 లక్షలమంది జనం మాట్లాడు తున్నారు. వీరు గాక ప్రపంచంలోని పలు ప్రాంతాలకు వలస వెళ్లిన మరో 10 లక్షలమంది జపానీయులు కూడా ఈ భాష మాట్లాడే వారున్నారు.

జపానీస్ భాషలోనూ అనేక మాండలికాలు ఉన్నాయి. అందులో కొన్ని పరస్పరం బోధపడనివి కూడా ఉన్నాయి. జపాన్ నడిగడ్డ మీద ప్రధాన దీవిలోని మాండలికాలను 3,4 వర్గాలుగా విభజింపవచ్చును. అయితే ప్రధాన దీవిలోని మాండలికాలకూ, ర్యూక్యూస్ దీవుల్లోని మాండలికాలకూ మధ్య ఎక్కువ తేడా కనిపిస్తుంది. ఇటీవల భాషలో ఏకరూపతను సాధించే ప్రయత్నాలు జరుగుతున్నాయి. 1868 లోని 'మెయిజి రెస్టొరేషన్' ఉద్యమం వల్ల టోకియోలోని మాండలికం ఆధారంగా ప్రామాణిక లిఖిత భాష స్థిరపడడంతో అక్షరాస్యత, ప్రాథమిక విద్య తొందర తొందరగా వ్యాపించసాగాయి. ఇప్పుడు జపాన్‌లోని పలు ప్రాంతాలవారు తమ మాండలికంతో పాటు ఈ భాషను కూడా మాట్లాడుతున్నారు. ఆధునిక ప్రచార సాధనాలవల్ల ఈ భాష అన్ని ప్రాంతాలలోకీ చొచ్చుకొని

పోతూ, యువ తరాన్ని ఆకర్షిస్తూంది. దీనివల్ల వెను కటి కన్న తొందరగా మాండలికాలు క్రమంగా అంతరించి పోతున్నాయి.



జపాన్

జపానీస్ భాషకు ఇతర భాషలతో గల జన్య జనక సంబంధం విస్పష్టంగా తెలియదు. ఇది కొరియన్ భాషలకో, బహుశః ఆల్‌టాయిక్ (Altaic) భాషలకో సంబంధించి ఉండవచ్చు. జపానీస్ భాష పుట్టు పూర్వోత్తరాలను గురించి రెండు ఊహలు ప్రచారంలో ఉన్నాయి. ఉత్తర క్యూషూ (Kyushu) లోని ఆసియా ఖండ వాసులు 2 వేల ఏళ్ల క్రితం యాయోయి సంస్కృతికి చెందిన మూల జపానీస్ భాషకు రూపం ఇచ్చి ఉండవచ్చును. ఈ మూల భాష తర్వాతి కాలంలో ఇతర భాషలవల్ల మరుగునపడి ఉండవచ్చును. ఇంత కన్న బలమైన రెండవ ప్రతిపాదన- జపానీస్ మూల భాష మాండలికాలు 5 వేల ఏళ్ల క్రితమే కొరియన్ భాషనుంచి పుట్టి, క్రమ క్రమంగా దేశీయమైన ఆ నాటి మాండలికాల్ని పారదోలి ఉండవచ్చును అని.

సంయుక్త పదాలతో కూడిన ఈ భాష క్రీ.శ. మొదటి శతాబ్దినాటికే రూపొందింది. 5వ శతాబ్దం నాటికి ఈ భాషకు చైనా భాషతో సన్నిహితమైన సంబంధం ఏర్పడి, చైనీయ భాషా పదాలు విరివిగా ఈ భాషలో ప్రవేశించాయి. కాని, కాల క్రమాన ఆ చైనీయ పదాల ధ్వనులు వికృతి పొందడం వల్ల, నేటి చైనా భాషలోని పదాలకూ, వాటికీ ఏ మాత్రం పోలిక కనిపించదు.

జపానీస్ భాషలోని నామవాచకాలు వచనాన్ని అను సరించి మార్పు చెందవు. విభక్తిని సూచించడానికి చివర ప్రత్యయాలు చేర్చబడతాయి. తర తమ విభేదాలను సూచించే పదాలు ఈ భాషలో కనపడవు. వాక్య నిర్మా ణంలో కర్మణి ప్రయోగమూ కనబడదు. సంబంధ వాచక సర్వనామాలు లేవు. జపానీస్ భాషలో ప్రత్యేక సంఖ్యా వాచకాలు ఉన్నా, చైనీయ సంఖ్యావాచకాలకు కూడా వ్యాప్తి ఉంది. వాక్య రచనలో: 1. విశేషణం విశేష్యానికి ముందు ఉండడం; 2. క్రియాపదానికి ముందుగానే కర్మ ఉండడం, 3. వాక్యానికి చివరగా క్రియ రావడం కనపడుతుంది.

క్రీ.శ. 5 వ శతాబ్దం నుంచీ జపానీస్ భాషకు చైనీయ లిపిని వాడేవారు. కాని, చైనా భాష లాగ కాక జపానీస్ భాష ప్రత్యయాత్మకం కావడం చేతా, ఈ ప్రత్యయాలను సూచించడానికి చైనీయ లిపిలో వీలు లేకపోవడం చేతా, 48 ధ్వనులతో కూడిన ఒక క్రొత్త వర్ణమాలను జపానీస్ పండితులు రూపొందించారు. 'హిర గణ', 'కటకణ' అనే రెండు పద్ధతులలో ఈ ధ్వనులు విభజింప బడుతున్నాయి. ఇందులో 'హిరగణ' పద్ధతికి వ్యాప్తి ఎక్కువ. చైనీయ చిత్ర లిపులకు ప్రక్క ప్రత్యయా లను సూచించడానికీ, ప్రత్యేక ధ్వనులను సూచించడానికీ ఈ పద్ధతులు వాడబడు తున్నాయి.

**సాహిత్యం : ఆదిమయుగం (7 వ శతాబ్దానికి పూర్వం) :** 5 వ శతాబ్దంలో చైనా లిపి ప్రవేశపెట్ట బడేవరకూ జపాన్ భాషలో లిఖిత సాహిత్యంలేదు. అంత వరకూ కథలూ, గేయాలూ, ప్రార్థనలూ ఒక తరం నుంచి మరో తరానికి మౌఖికంగానే సంక్రమిస్తూ ఉండేవి. ఇవి గద్య ప్రాయంగా ఉండే పద్యాల రూపంలోనూ, వృత్త గంధులైన వచనాల రూపంలోనూ ఉండేవి. 5 వ, 6 వ శతాబ్దాలలో చైనా నాగరకత, బౌద్ధమతం జపాన్‌లో ప్రవేశించాయి. తత్‌ఫలితంగా జపానీస్ సాహిత్యంలో క్రొత్త వికాసం కనపడింది.

**'నారా' యుగం (710-794) :** 710 లో జపాన్ రాజధాని 'నారా' నగరం. తరువాత 794 లో అది 'హెయియాన్ క్యో' (క్యోటో) కు మార్చబడింది. ఈ మధ్యకాలంలో జపాన్‌లో బౌద్ధమతం స్థిరపడింది. చైనా లోని కళాకారుల ప్రోత్సాహంతో వాస్తుశిల్పాది కళల్లో తొందర తొందరగా మార్పులు వచ్చాయి. వ్రాతలో కూడా కొంత మార్పు వచ్చి, 'కణ' విధానం ప్రాచుర్యంలోకి వచ్చింది.

ఈ యుగంలోని సాహిత్యం చాలా వరకూ పద్య మయ మైనదే. మన్యోషూ అనేది ఈ యుగంలోని

అద్భుతమైన కవితల సంకలనం. జపాన్‌లోని సంకలిత గ్రంథా లన్నింటిలోనూ ఇది చాలా ప్రాచీన మైంది. ఇది 8 వ శతాబ్దంలో పూర్తిచేయబడి ఉండవచ్చును. ఇందులో సుమారు 450 మంది కవులు రచించిన 4,500పద్యా లుఉన్నాయి. (ఈకవుల్లో కకినొమొటా-నొ-హిటొమరో, యమబె-నొ-అకాహిటోకూడాఉన్నారు.) చైనాలోని ఇలాటి సంకలిత గ్రంథాలను చూచే జపానీయులు దీనిని కూర్చి ఉంటారు. ఇందులోని పద్యాల్లో అత్యధికమైనవి 'టంకా' (tanka) పద్యాలే. వాటిలో 31 అక్షరాలూ, 12 మొదలు 30 వరకూ పదాలూ ఉంటాయి. ఇవి ఆవేశపూరితమైన గీతాలు. కరుణ రసంతో కూడిన , తత్త్వదృష్టితో కూడి న , గీతాలూ కూడా ఇందులో ఉన్నాయి. ఇవి గాక ఈ గ్రంథాలలో 260 'చొకా' (choka) అనబడే దీర్ఘ కావ్యాలు కూడా ఉన్నాయి.

*కొజికి - కి*, (712) *నిహోన్-గి* లేక *నిహోన్ షొకి* (720) అనేవి జపాన్‌లోని పురాణ గాథల సేకరణలు. జపాన్ సాహిత్యంలో అన్ని కాలాల్లోనూ పురాణ గాథలు ఇతివృత్తంగా కనపడుతూనే ఉన్నా, ఈ రెండూ మాత్రం ఇప్పటికీ అధ్యయనం చేయబడుతూనే ఉన్నాయి; వీటిని గురించి చర్చలూ జరుగుతున్నాయి. మన దేశంలో పురాణ గాథల నుంచి ఎంతో సాహిత్యం పుట్టుకు వచ్చింది. కాని జపాన్‌లో ఈ పురాణ గాథల్ని రాజకీయ ప్రయోజ నాలకే ఉపయోగించినట్టు కనబడుతుంది. ఈ రెండూ కూడా పాలకులకు మరింత అధికారాలను సంక్రమింప చేయడానికీ, ఆ యా కాలపు పాలకుల వంశవృక్షపు మూలాలను అన్వేషించడానికీ వ్రాయబడి నట్టు కనప డుతుంది. అందుచేత వీటికి సాహిత్యంగా ప్రాధాన్యం తక్కువ. ప్రాచీన జపాన్ దేశపు భాషనూ, ప్రజాజీవి తాన్నీ, పురాణ గాథలనూ తెలిసికోడానికి ఇవి చాలా ఉపయోగపడుతాయి.

మియకెనొఓమి కనటారి, ఇజుమోనోఓమి హిరో షిమా అనేవారు 733 లో కూర్చిన *ఇజుయోఫూడోకి* అనేది జపాన్ దేశంలో సంతరించబడ్డ తొలి భూగోళ గ్రంథం.

హెయియాన్ యుగం (794-1192) : ఈ యుగంలో ఉదాత్తమైన జపాన్ సాహిత్యం అవతరించింది. 'నారా' యుగం నాటినుంచీ జపాన్‌లోని రాజకీయాధికారం చక్ర వర్తి నుంచి తొలగించబడి, 'ఫుజివారా' కుటుంబం వారి అధీనంలోకి వచ్చింది. ఆ కుటుంబంలోని పెద్దయే నిజా నికి దేశాన్ని పాలించేవాడు; ఆస్థానంలోని ఉన్నత పదవు లన్నీ ఆ కుటుంబంలోని ఇతర సభ్యులకు చెందిఉండేవి. ఈ యుగంలోని సాహిత్యం కూడా ఈ కుటుంబం లోని వారి సృష్టే! వారిలో చాలామంది స్త్రీలు అయి ఉండటం గమనింప దగింది. నాటి స్త్రీలు రాజకీయాల్లో కూడా జోక్యం కల్గించుకొనేవారు. ఈ కాలపు సాహిత్యం దానిని సృజించిన వారి లక్షణాలనే - అంటే, అతిమాత్ర మైన లాలిత్యం, భోగాల పట్ల ఆసక్తి, నీతి ధర్మాల పట్ల ఉపేక్షాభావం - ప్రతిఫలిస్తూంది.

మినమోటొ షిటాగొ రచించిన *ఉట్సుబొ మొనొగతరి* జపానీస్ సాహిత్యంలోని తొలి దీర్ఘ నవల. కాని,తర్వాత 1010నాటికి మురస కిషికిబు అనే ఆమె పూర్తిచేసిన *గెన్జి మొనొగతరి* తో పోల్చి చూస్తే, యీ తొలి నవల అపరిపక్వంగానూ, పేలవంగానూ కనపడుతుంది. జపానీస్ సాహిత్యం మొత్తంమీదే గెన్జికథ ఉత్తమోత్తమమైందని పలువురి అంచనా. బహుశః ప్రపంచంలో పుట్టిన మొట్టమొ దటి నవల ఇదే! ఇది గెన్జి రాజకుమారుని, అతని పుత్రుల, మనుమల ప్రణయ జీవితాన్ని వర్ణిస్తూంది. ఇందులో హెయి యాన్ రాజాస్థాన జీవితం కూడా చక్కగా చిత్రించబడింది. తర్వాతి జపానీస్ సాహిత్యం దీనివల్ల చాలా ప్రభావిత మైంది.

*టకెటొరి మొనొగతరి, ఇసె మొనొగతరి* అన్నవి ఈ కాలంలో రచించబడ్డ అసంఖ్యాకాలైన ఇతర గ్రంథా లలో ముఖ్యమైనవి. సీషోనగాన్ అనే ఆమె మురసకికి సమకాలికురాలు. ఆమె రచించిన గ్రంథం *మకురనోసోషి* (తలగడ తలపులు). ఇందులో రాచ దర్బారు జీవితానికి సంబంధించిన వ్యాసాలూ, రేఖా వృత్తాంతాలూ ఉన్నాయి. జపాన్ భాషలో 'జుహియిట్సు' అనబడే వ్యాస ప్రక్రియకు ఇది ప్రథమోదాహరణం.

ప్రాచీనాధునిక కావ్యాలతో కూడిన *కాకిన్షు* అనే సంకలన గ్రంథం ఈ యుగంలోని నలుగురు మహాకవులచేత (కిలోట్సురయుకి, కిలోటో మొనారి, బచికొచినోమిట్సునె, మిబునొతడమినె) సంపాదిత మైంది. దీనిలో వెయ్యి కావ్యాలున్నాయి. అందులో అయిదు దీర్ఘ కావ్యాలు, మిగిలిన వన్నీ 'టంకా' పద్యాలు గానే రచించ బడ్డాయి. దీనికి ప్రధాన సంపాదకుడు ట్సురయుకి. ఈతని పీఠిక సాహిత్య విమర్శాత్మకాలైన వ్యాసాలకు ఒరవడిగా పరిగ ణించబడుతూంది. ఈ ట్సురయుకి *టొసానిక్కి* (935) అనే దినచర్య గ్రంథాన్ని కూడా వ్రాశాడు. ఇందులోని శైలి సరళంగానూ, హాస్యభరితంగానూ ఉంటూ, ఆ నాటి ఒక యాత్రికుని జీవితాన్ని వర్ణిస్తూంది. *ఎంగిషికి* (905-27) అనే గ్రంథం రాచ కొల్వులలో అనుసరించబడే నియ మాలనూ, కార్య కలాపాలనూ వివరిస్తూంది. ఇది చైనీస్ భాషలో వ్రాయబడింది.

**కామకూరా యుగం (1192-1332) :** క్రీ.శ. 12 వ శతాబ్దిలో జపాన్‌లో జరిగిన అంతర్యుద్ధాలలో మిన యోటోస్ వర్గం వారు విజయం పొందారు. అప్పుడే రాజధాని కామకూరాకు మార్చబడింది. అందుచేత ఈ యుగానికి ఈ పేరు వచ్చింది. రాజకీయంగా ఇది సైనిక యుగం. ఈ యుగంలో మతాసక్తి హెచ్చుగా ఉండడంవల్ల పలువురు మత విషయాలను గురించి వ్రాయ నారంభించారు. అప్పుడే చైనానుండి వచ్చిన 'జెన్' అనబడే బౌద్ధమత శాఖ ప్రచారంలోకి వచ్చింది. వ్యక్తిగత ధ్యానం వలన మనో వికాసం కలుగుతుందని ఇది బోధిస్తుంది. ఇది క్రమంగా వ్యాప్తి చెంది కళ లన్నింటిమీదా తన ప్రభావం ప్రసరించింది.

కామకూరా యుగంలోని వాఙ్మయాన్ని కథా కావ్యాలు, 'టంకా' కావ్యాలు, 'జుయిహిట్సు' అనబడే వ్యాసాలు, బౌద్ధ వ్యాసాలు, గీతాలు, చైనా భాషలోని రచనలు అనే వర్గాలుగా విభజించవచ్చును. ఈ కాలంలోనే దేశీయ విదేశీయ పద్ధతుల కలయికతో ఒక జాతీయ లేఖన విధానం ఏర్పడింది. దీని ఫలితంగా ప్రాచీన రచనల పట్లా, జాతీయ గ్రంథాలపట్లా ఆసక్తి పెరిగింది. పూర్వయుగం నాటి కథలు, సంకలిత గ్రంథాలు మొదలయిన వాటికి ప్రతులు తయారు చేయడం, వ్యాఖ్యానాలు వ్రాయడం ప్రారంభమైంది. ప్రాచీన గ్రంథ ప్రీతి 'షిన్టోల' అధ్యయనాన్ని ప్రోత్సహించింది. మొత్తం మీద ఈ యుగంలోని వాఙ్మయంలో నీతికి స్థానం ఎక్కువ, ఉపజ్ఞ తక్కువ. ఆనాడు జరిగిన అనేక దురదృష్టకరమైన విషయాలను ప్రతి ఫలింపచేసే ఈ వాఙ్మయంలో కరుణరస భరితమైన వాతావరణం ఎక్కువగా కనపడుతుంది. అందుచేత బౌద్ధుల అభిప్రాయంలో ఇది 'మప్పో' (క్షీణ యుగం).

*హేకెమొనొ గటారి, జెనెపీ నీసు ఇకి* అన్నవి ప్రత్యేక గ్రంథాలే అయినా, వాటిని కలిపి చదవడమే మంచిది. వీటిలో రెండవది మొదటి దాని రూపాంతర మని కొందరు విమర్శకులు అంటారు. మొత్తంమీద రెండూ ఒకదాని కొకటి అనుసరణాలని కాని, ఒకే మూలాన్ని ఆధారంగా చేసుకొని వ్రాయబడ్డ రచన లని కాని చెప్పవచ్చు. *హేకెమొనొ గటారి* రచయిత ఎవరో తెలియదు. కాని, అది ఈ కాలానికి సంబంధించిన యుద్ధకథల శాఖకు చెందిన రచనల్లో ప్రముఖమైంది. ఇందులో శబ్దసౌష్ఠవం కోసం, నాద విన్యాసం కోసం - చైనీస్ భాష నుంచి దిగుమతి అయిన శబ్దజాలం ఉపయోగించబడింది. 'బివా' అనబడే జంత్రవాద్యం వాయిస్తూ పాడబడుతూండడం చేత, తర్వాతి నాటకాల మీద దాని ప్రభావం అధికంగా ప్రసరించింది. హమురోటోకి నాగా రచించిన *హొఇచిమొనొ గటారి, హొజెన్ మొనొ గటారి, మిజుకగామి* (జల ముకురము) అనేవి ఈ యుగంలో వచ్చిన చారిత్రక నవలలు.

'క్యోటో' రాజాస్థానంలో 'టంకా' పద్య రచన సాగుతూనే ఉండేది. 1235 నాటి *హ్యాకునిన్ ఇష్షు* (వందమంది కవుల గీతాలు) అనేది ఈ కాలానికి ప్రాతినిధ్యం వహించే సంకలిత కావ్య సంపుటి. దీని సంకలన కర్త ఫుజివారా సదాయ్ (Fujiwara Sadaie) అనే ఆస్థాన పండితుడు. కామో అనే బౌద్ధ సన్న్యాసి *హోజోకి* (1212), *ముమ్యోషో, షికిమొనొగటారి* (కాలచతుష్టయ కథ) అనే గ్రంథాలను వ్రాశాడు. వాటిలో *హోజోకి* అన్నది రచయిత స్వానుభవాలను వెల్లడించే వ్యాస సంపుటి. *టన్నిషో* అనే గ్రంథాన్ని షిన్‌రాన్ షానిన్ (1073-1262) శిష్యుడైన యూయెన్బో రచించినట్లు ప్రతీతి. దీనిలో ఒక భాగంలో షిన్‌రాన్ సిద్ధాంతాలూ, రెండోభాగంలో ఆ నాడు ప్రచారంలో ఉన్న వ్యతిరేక సిద్ధాంతాలమీద యూయెన్ విమర్శ ఉన్నాయి. నిచెర షానిన్ 1260 ప్రాంతాన *రిష్షో అన్ కొకురాన్* అనే జాతీయ కల్యాణాన్ని వివరించే వ్యాసం వ్రాశాడు. ఈ కాలంలోని చైనీస్ భాషలోని గ్రంథాలు అనేకం జెన్‌శాఖకు చెందిన బౌద్ధుల చేత రచింప బడ్డాయి. అవి అంత ఉత్తమ శ్రేణికి చెందినవి కావు. వీటిలో ఈశై, డోజెన్ అనే వారి గ్రంథాలు ప్రధానం అయినవి.

**నంబొకుచో, మురోమాచి యుగాలు (1332-1603) :** ఈ కాలంలో రాజ కుటుంబంలో రెండు పక్షాలు ఏర్పడ్డాయి. రెండు పక్షాలకూ సహాయులూ, అనుచరులూ ఉండేవారు. ఉత్తర, దక్షిణ ప్రభుత్వాలుగా 60 ఏళ్ల పాటు దేశంలో ద్వంద్వ ప్రభుత్వం కొన సాగింది. దీనికి 'నంబొకుచో' యుగ మని పేరు. మళ్లీ చక్రవర్తి ఒక్కడే ఏర్పడి, 'క్యోటో' నగరం రాజధాని అయింది. ఈ యుగాన్ని 'అషికగా' యుగం అనికాని, రాజధాని స్థాపింపబడిన వీధి పేరును బట్టి 'మురోమాచి' యుగమని కాని వ్యవహరిస్తారు. ఈ యుగంలో చాలా కాలం (1573 వరకు) అంతర్యుద్ధాలతో గడచిపోయింది.

ఈ యుగంలో పురుషులకు ప్రాధాన్యం హెచ్చి, స్త్రీలకు గౌరవం తగ్గింది. ఈ యుగం ఉత్తర భాగాన్ని అంధకార యుగ మని అంటారు. పూర్వ భాగాన కొన్ని కళలు, చిత్రలేఖనం ఉచ్చస్థితిని అందుకొన్నాయి. 1392-1465 మధ్య కాలంలో 'నో' అనబడే గేయనాటిక సమగ్రతను సంతరించుకుంది. ఇది వినా ఈ

కాలపు జపాను వాఙ్మయం అంతా క్షీణస్థితిలో ఉన్నదన వచ్చును. అయితే తర్వాతి కాలంలోని శాంతివైభవాలకు దారితీసే బీజా లన్నీ ఈ కాలంలోనే అంతర్గతంగా ఉన్నా యంటారు కొందరు. ఈ కాలపు ప్రముఖ రచన లన్నీ రెండుగా ఏర్పడ్డ రాజ పక్షాల పోరాటాలను ఆధారంగా చేసుకొని వ్రాసినవే! వాటి అవగాహనకు ప్రాచీ నమైన కైఫీయత్తులు మొదలైన వానిని పరిశీలించ వలసి ఉంటుంది.

*జిన్నోషోటోకి* అనే గ్రంథం కిటబటక చికాపుజా (1329-54) చే గొ-మురకమి రాజ్యపాలన కాలంలో వ్రాయబడింది. ఇది దక్షిణ రాజపక్షంవారి అధికారాన్ని సమర్థిస్తోంది. గ్రంథకర్త యొక్క స్వీయ రాజకీయ, నైతిక భావాలను కూడా వెల్లడిస్తోంది. దీనిలో సాహిత్య గుణం తక్కువే కాని తర్వాతి చార్రితకులపైన, రచయి తలపైన దీని ప్రభావం అధికంగా కనబడుతూంది.

*హైహీకీ* (శాంతి వృత్తాంతము) అనే గ్రంథాన్ని కొజిమా అనే సన్న్యాసి వ్రాశాడని అంటారు. ఇతడు జపాన్, చైనా భాషలను కలిపి ఒక సరళ సుందరమైన కొత్తశైలికి అంకురార్పణ చేశాడు. ఇది 17 వ, 18 వ శతాబ్దాలలో వృద్ధి చెంది ఆధునిక శైలికి దారి తీసింది. ఇలా సరళ సుందరమైన శైలిలో రచించబడి, ప్రజామో దాన్ని పొందిన మరో గ్రంథం కెన్కో సన్న్యాసి రచించిన *ట్సురెజురె గుసా.* దీనిలో జీవితానికి సంబంధించిన 240 విభాగాలను గురించి 'జు ఇహిట్సు' వ్యాసాలలో వివరించబడింది.

క్రీ.శ. 14వ శతాబ్దిలో 'నో' గేయ నాటిక సమగ్ర మైన రూప సౌష్ఠవాన్ని పొందింది. 'కగరు', 'బుగకు', 'డెంగకు', 'సరుగకు' అనే ప్రాచీన నృత్యాలతో కూడిన జపాన్ నాటకాలు ముఖ్యంగా మతానికి సంబంధించి నవి. వీటి సమన్వయ రూపమే 'నో' నాటిక. ఇందులో స్వగతాలూ, సంభాషణలూ ఉంటాయి. ఇది మొదట మత ప్రధానంగానే ఉన్నా, క్రమంగా లౌకిక రూపకంగా రూపొందింది. కనామా (1333-1384), అతని కుమా రుడు సియమి (1363-1443) అనే వారి చేతుల్లో ఇది ఉదాత్త స్థాయిని అందుకొంది. ఈ గేయ నాటికలలో ఉపజ్ఞ అల్ప మని కొందరు నిరసించగా, మరికొందరు అందుకు విరుద్ధంగా జపానీయుల వాఙ్మయంలో ఇది అత్యుత్తమ ప్రక్రియ అంటారు. 'నో' లోని గేయా లను, లేక పదాలను 'యోక్యోకు' లంటారు. ఇవి పద్య, గద్య మిశ్రితాలై ఉంటాయి. మధ్య మధ్య ప్రాచీనాలైన 'టంకా' పద్యాలు కూడా చొప్పించబడతాయి. ఇంక ఈ నాటికలను ప్రయోగించేటప్పుడు వివిధ ఆవేశాలను వ్యక్తీకరించడానికి సుమారు 15 రకాల ముఖాచ్ఛాదనాలు (masks) ఉపయోగిస్తారు. ప్రపంచ సాహిత్యంలో 'నో' ఒక క్రొత్త ప్రక్రియ. ఇందులో *టకాసగో, ఓయిమట్సు, నసైవా, దోజోజి, టొసెన్* అనేవి ముఖ్యమైన రచనలు. గంభీరోదాత్తాలైన 'నో' నాటకాలకు మధ్య 'క్యోజెన్' అనే హాస్య రచన ప్రయోగించబడుతూ ఉంటుంది. ఇది వాడు కలో ఉండే చిన్న ప్రహసనం వంటిది. 'నో', 'క్యోజెన్' - అనే ఈ రెండు ప్రక్రియల నుంచే తరువాతి నాటకా లన్నీ పుట్టాయని చెప్పవచ్చు.

ఈడో యుగం (1603-1868) : 16 వ శతాబ్ది అంతానికి జపాన్‌లోని అంతర్యుద్ధాలు ముగిసి పోయాయి. శక్తిమంతమైన ప్రభుత్వం ఏర్పడింది. రాజధాని ఈడో (ఇదే 'టోక్యో' అయింద) కు మార్చ బడింది. ఈడో రాజకీయ కేంద్రమే కాక, సాంస్కృతిక కేంద్రం కూడా అయినందువల్ల దీనిని 'ఈడో' యుగం అంటారు. క్రీ.శ. 16 వ శతాబ్దంలో తొలిసారిగా జపాన్‌కు పాశ్చాత్య దేశా లతో సంపర్కం ఏర్పడింది. క్రైస్తవ మతం అక్కడ వేగంగా వ్యాపించ నారంభించింది. కాని తర్వాత అణచి వేయబ డింది. ఈ కాలంలో ప్రభుత్వ శాసనం వల్ల జపాన్‌కు బయటి ప్రపంచంతో సంబంధం తెగిపోయింది. దీనివల్ల దేశీయమైన సాహిత్య రూపాలు వికాసాన్ని పొందిన మాట నిజమే కాని, వెలుపలి ప్రపంచ రచనల వల్ల ఇక్కడి సాహిత్యం ప్రభావితమయ్యే అవకాశం లేకపోయింది. అంటే ఈ యుగపు సాహిత్యం మీద పాశ్చాత్య ప్రభావం మృగ్య మనే చెప్పాలి.

అయితే ఈ యుగంలోనే జపాన్‌లో విద్యా వ్యాప్తి బాగా జరిగింది. పాఠశాలలు స్థాపించబడ్డాయి. చైనా, జపాన్ గ్రంథాలకు ప్రతులను తయారుచేయడానికి సన్న్యా సులు నియమించబడ్డారు. గ్రంథాలు ముద్రింప బడి ప్రజకు అందుబాటులోకి వచ్చాయి. అనేక చైనా పదాలు వచ్చి చేరి, జపాన్ భాష సుసంపన్నం అయింది. వ్యాకరణ విధానం సరళం చేయబడింది. గ్రాంథిక రచనా విధానానికి సమగ్ర రూపం ఏర్పడింది.

ఈ కాలంలో చైనా భాషా పాండిత్యం పట్ల అభిమానం జీవితం లోని అన్ని రంగాలనూ ప్రభావితం చేసింది. ఫుజివారాసీకా (1561-1619) చైనా ప్రాచీన గ్రంథాల పట్ల ఆదరాన్ని ప్రదర్శించి 'చూహ్సి' శాఖకు చెందిన నూత్న కన్ఫ్యూషియస్ తత్త్వాన్ని ప్రచారం చేశాడు. ఈ యుగంలో చరిత్ర, కల్పన, హాస్యరసం మిశ్రణంతో కూడిన పలు రకాల వాఙ్మయం వ్యాప్తిలోకి వచ్చింది. అందులో

విషాదాంత నాటకాలు, విషయలాలసను ప్రతిఫలించే నవలలు ముఖ్యమైనవి.

ఆ నాటి చైనా భాషా పండితులలో అరైహాకుసెకి (1657-1725) అగ్రేసరుడు. అతడు 1701 లో భూస్వాముల చరిత్రను వివరించే *హాన్‌కన్పు* అనే బృహద్గ్రంథాన్ని వ్రాశాడు. కైబరాఎక్కెన్ (1630-1714) అనే మరో పండితుడు నూరు గ్రంథాలను వ్రాశాడని ప్రతీతి. ఈ కాలపు ఇతర విద్వాంసులలో హయషిగజన్ (1583-1757), కినొషిటాజువాన్, కుమజావా బన్జన్, యమగాసోకో, ఇటిజిన్సై, ఒగ్యూసొరై అనే వారు ముఖ్యులు.

ఒక వంక ఇలా చైనా భాషా సాహిత్యాల ప్రభావం కొనసాగుతూ ఉండగా, దానికి ప్రతిగా మరొక వంక జపానీస్ దేశీయ సారస్వతం కూడా అభివృద్ధి చెందింది. టొకుగావా మిట్సుకుని చే ప్రారంభింపబడ్డ *డైనిహోన్‌షె* అనే జపానీసు దేశచరిత్ర ఈ శాఖకు చెందిన సాహిత్యంలో ముందుగా పేర్కొనదగింది. ఇది సరళం, ధారాళం అయిన చైనా భాషలో వ్రాయబడి, ఆ రకానికి చెందిన సాహిత్యంలో ప్రామాణికత్వాన్ని గడించుకుంది. కవి, చరిత్రకారుడు, భాషాతత్త్వవేత్త అయిన మెటురి నోరినాగా (1730-1801) *కొజీ-కి* అనే పురాణ గాథల సంకలనానికి 49 సంపుటాల్లో కొజికిడెన్ అనే వ్యాఖ్యానాన్ని వ్రాశాడు. రాయ్‌సన్యో (1780-1832) అనే రచయిత *నిహోన్‌గైషి* అనే జపాన్ దేశచరిత్రను వ్రాశాడు. కమొనొమబుచి, హిరటా అట్సు టాంవే అనే వారు ఈ శాఖకు చెందిన ఇతర ప్రముఖ రచయితలు. ఈ ఉద్యమం జాతీయతను పెంపొందించి, 'మెయిజి' యుగంలోని పునరుద్ధరణకు దారి చూపింది.

జపాన్ దేశంలో బాగా ప్రచారం పొందిన రూపక విశేషం 'కబుకి'. ఇది క్రీ.శ. 16 వ శతాబ్దంలో రూపొందింది. దీని చారిత్రక పరిణామాన్ని మూడు దశలుగా విభజించవచ్చును: 'ఒన్నా కబుకి' (మహిళా రూపకం), 'వకషూ కబుకి' (యువక రూపకం), 'మరో కబుకి' (పురుష రూపకం). సాహిత్య దృష్టితో పరిశీలిస్తే 'కబుకి' రూపకానికి విశేషమైన ప్రాముఖ్యం ఉన్నట్టు కనపడదు. ఈ యుగానికి చెందిన గొప్ప నాటక కర్త చికమట్సు మొన్జెయెమన్ (1653-1724). ఈతడు వ్రాసిన నాటకాలను చారిత్రకాలనీ, సంసార జీవితానికి సంబంధించినవనీ రెండు వర్గాలుగా విభజించ వచ్చును. సాధారణంగా ఈ నాటకాలలో అయిదేసి అంకాలు ఉంటాయి. నాటక ప్రయోజనం ఆనందం కలిగించడమని ఈతని అభిప్రాయం. *కొకుసైన్యకస్సెన్, సొనెజకిషిన్జూ, మెయిడొనే హిక్యకు, హాకటకొజొరొ నమినుకురు* అనేవి ఈతని రూపకాల్లో ముఖ్యమైనవి. టకెడ ఇజుమొ (1691-1756), నమికి షోజో (1630-93), కవటక మొకు ఆమి (1816-93) అనే వారు ఈ కాలంలో ప్రసిద్ధి పొందిన ఇతర నాటక కర్తలు.

ఈ యుగంలో (31 అక్షరా లున్న) 'టంకా' పద్యం కన్న చిన్నదైన 'హైకు' లేక 'హోక్కు' (Haiku) పద్యం ప్రచారంలోకి వచ్చింది. 'టంకా' లోని చివరి 14 అక్షరాలనూ విడిచి పెడితే 'హైకు' ఏర్పడుతుంది. ఈ 17 అక్షరాలు (syllables) 5,7,5 అక్షరాల పాదాలుగా అమర్చబడతాయి. ఋతువుల్నీ, పరాశ్రయభావాల్నీ వర్ణించడానికి ఇది బాగా ఉపయోగపడేది. జపాన్‌కవుల సారస్వత గుణసంపద అంతా ఈ 'టంకా', 'హైకు' పద్యాలలోనే గోచరిస్తుంది. మట్సుఓబషో (1644-94), అతని శిష్యులూ 'హైకూలను బాగా ప్రచారం చేశారు. ఎనొమొటొకొకకు, కగనోఛియో (1703-75) టనిగుచి బుసన్, కొబయషి ఇస్సా (1763-1828) అనే వారు ఈ శాఖకు చెందిన ఉత్తమ కవులు.

క్రీ.శ. 18వ శతాబ్దిలో కరైసెన్‌ర్యూ (1718-90) అనే 'హైకు' కవి కొత్త కవితామార్గాన్ని రూపొందించాడు. దీనిని అతని పేరుతోనే 'సెన్‌ర్యూ' అని వ్యవహరిస్తున్నారు. దీనిలో కూడా 17 అక్షరాలే ఉంటాయి. కాని ఇందులో ఋతువర్ణనకు ప్రాధాన్యం లేదు. మనిషినీ, మానవ జీవితాన్నీ నిశితంగా పరిశీలించడం దీని ప్రత్యేకత.

ఈ యుగంలో నవల కొత్త రూపాన్ని సంత రించుకుంది. ఇహారా సైకాకు (1642-93) సమకాలీన జీవితాన్ని చిత్రించే నవలను ప్రవేశపెట్టాడు. ఇతని నవలలు విషయ సుఖాల్ని విరివిగా వర్ణిస్తాయి. అందుచేత ఇవి నీతిబాహ్యంగా ఉంటా యని మొన్న మొన్నటి వరకూ వీటిని గర్హించేవారు. అయితే ఇటీవల వానిలోని వాస్తవికత పలువురి నాకర్షిస్తూంది. *ఫుడొ కొరొనొ సుజురి, కొషొకు ఇచ్చిడై ఒటొకొ, కొషొకు ఇచ్చిడై ఒన్న, కొషొకు గొనిన్ ఒన్న* అనేవి ఈ నవలాకారుని రచనలలో ప్రధానమైనవి.

జిపెన్షా ఇక్కు (1766-1831) అనే రచయిత *హిజకురిగె* అనే అత్యంత ఆసక్తిదాయకమైన గ్రంథాన్ని వ్రాశాడు. ఇందులో టోకైడో మార్గంలో యజిరోబె, కిటహచి అనే ఇద్దరు హాస్య పాత్రల యాత్రలు వర్ణించబడ్డాయి. షికిటెయి సన్బా (1766-1822) సామాన్య జనుల వాస్తవ జీవితాన్ని వర్ణిస్తూ *ఉకియోబురొ, ఉకియో*

*డొకొ, షుజూహచికుశే, కొకోన్ హ్యాకునిన్ బకా* అనే గ్రంథాలను వ్రాశాడు. క్యోకుపెయ్‌బకిన్ వ్రాసిన శృంగార రస పూరితా లయిన నవలలు చైనా ప్రాచీన నవలలను పోలి ఉంటాయి. వీటిలో *యుమిబరిజుకి* (1805), *సీయూకి* (1806), *నటోమి హక్కెన్డమ్* (1841), *సుఇ కోడెన్* ముఖ్యమైనవి. ఈతడు *షుహుచులన్* అనే చైనీస్ గ్రంథాన్ని కూడా అనువదించాడు.

**ఆధునిక యుగం (1868 నుంచి) :** దీనిని మెయిజి యుగం (1868-1912), టైషాషోవా యుగం అని రెండుగా విభజించవచ్చును.

**మెయిజి యుగం :** క్రీ.శ. 1868 లో రాజధాని 'క్యోటో' నుంచి ఈడోకు మార్చబడింది. అదే నేడు టోక్యో అని పిలవబడుతూంది. పరిశ్రమల్లోను, విద్యారాజకీయ రంగాల్లోనూ మార్పులు వచ్చాయి. యువతరంలోని నాయ కులు ఆధునిక శాస్త్రవిజ్ఞానం, స్వాతంత్ర్యం, సర్వమానవ సమానత్వం, ప్రేమ, మానవత మొదలయిన వాటివల్ల ఆక ర్షించబడ్డారు. సాహిత్యంలో పాశ్చాత్య ప్రభావం మొదట్లో ఏమంత కనపడలేదు. కొంత కాలం వరకూ వెను కటి యుగంలోని గ్రంథాలకు అనుసరణలే వెలువడుతూ వచ్చాయి. అలాంటి వాటిలో *జిప్పెన్షా - హిజకురిగె*కు అనుకరణం అని చెప్ప దగిన *సీయో హిచకురిగె* అనే 15 సంపుటాల గ్రంథం పేర్కొన దగింది. దానిని కనజవారోబన్(1829-94) రచించాడు.

19 వ శతాబ్దం చివరి పాదంలో ఇతర భాషా సాహిత్యాల పట్ల ఆసక్తి, ఆదరం పెరిగాయి. ఎన్నో అనువాదాలు రావడంతో రూసో, వోల్టేర్, మాన్‌టెస్క్యూ, మిల్ మొదలయిన వారి గ్రంథాలు ఎందరినో ఆకర్షించాయి. జపాన్ రచయితలు కూడా సామాన్య ప్రజలకోసం రాజకీయ నవలలను వ్రాయ నారంభించారు. యానోఫ్యూమియో (1850-1931) రచించిన *కైకోకుబిడన్* (1883) ఈ రకానికి చెందిన రచనల్లో ముఖ్యమైంది. ఫుకుజవాయుకిచి (1834-1901) పాశ్చాత్య నాగరకతా, సంస్కృతులను వివరిస్తూ చాలా గ్రంథాలను వ్రాశాడు.

అయితే 1885 నుండి జపానీయులు పాశ్చాత్య నాగరకతను గ్రుడ్డిగా అనుకరించడం మానివేశారు. తమ సంస్కృతిని గురించి తెలిసికోడానికి ప్రయత్నించారు. ఎర్నెస్టుఫెనొల్లోసా అనే పాశ్చాత్యుడు దేశీయమైన లలిత కళల పునః పరిశీలనకు దారి చూపాడు. సారస్వత రంగంలో కడచిన యుగంలోని జపాన్ రచయితల గ్రంథాలపట్ల ఆసక్తి ప్రబలింది. నిజానికి ఈ కాలం రాబోయే నవ యుగానికి నాంది అని చెప్పాలి.

మెయిజి యుగ సాహిత్య చరిత్రలో ట్సుబేచి షోయో రచించిన *షోసెట్సుషిన్జు ఇ* అనే విమర్శ గ్రంథం చాలా ముఖ్యమైంది. అందులో నవలా రచనా విధానం, వ్యక్తీ కరణ, శిల్పం మొదలయిన విశేషాలు చర్చించబడ్డాయి. సాహిత్యం శిల్ప ప్రధానమైందే కాని, నీతి ప్రధానమైంది కాదని ఈ గ్రంథం ప్రతిపాదిస్తూంది.

1890 నాటికి ట్సుబౌచి నవలలను వ్రాయడం మాని, నాటకాలను వ్రాయ నారంభించాడు. ఆతని నాటకాలలో *కిరిహిటోహ* (1896), *హిటోటోగిసుకొజోరకుగెట్సు* (1898), *మకినోకటా* అనేవి పేర్కొనదగ్గవి. అతడు నాటకరంగంలో ఎన్నో సంస్కరణలను తీసికొని రావ డమే కాకుండా 'కొబుకి' రూపకాలలోని లోపాలను ఎత్తి చూపి, వస్తువుకి, పాత్ర పోషణకు ప్రాధాన్యం కల్గిన క్రొత్త చారిత్రక రూపకాలను అవతరింపచేశాడు. ఈతని మీద షేక్స్పియర్ ప్రభావం పడినట్టు కనపడుతుంది. ట్సుబౌచితో పాటు సాహిత్యంలో వాస్తవికతకు ప్రాముఖ్య మిచ్చినవారిలో ఫూటాబతుయ్-షిమెయ్ (1864-1908), యమడబియ్యో' (1868-1910), ఒజోకికోయో అనేవా రిని కూడా పేర్కొనాలి. ఇందులో మొదటి ఇద్దరూ వ్యావహారిక భాషను వాడారు. ఒజోకి శృంగార ప్రధాన మైన *టజోటకన్, క్యాన్జికియష* అనే నవలలను వ్రాశాడు.

పిన్న వయస్సులోనే మరణించినా *టలెకురబె* అనే గొప్ప నవలను రచించిన హిగుచిఇచియో (1872-96) ఈ యుగంలోని ప్రముఖ రచయిత్రిగా ప్రసిద్ధి పొందింది. 'టొకుటొమిరొకా' (1868-1927) *షిజెన్‌టుజిన్ సెయ్* అనే స్వీయ చరిత్రనీ, *హొటొటొగిసు* (1896) అనే నవలను వ్రాసింది.

ఈ యుగంలో ఆదర్శవాదానికీ, కాల్పనికతకూ కూడా ప్రచారం లభించింది. ఆదర్శవాదుల్లో ముఖ్యుడు *గొజూనొటో* (1892) అనే గ్రంథాన్ని రచించిన కోడ రోహన్ మోరిఒగై (1862-1922), కిటమురటోకొకు (1868-94), ఇజుమిక్యోకా అనేవారు కాల్పనికోద్యమానికి పట్టుకొమ్మలు.

మెయిజి యుగంలోని చివరిదశలో వాస్తవికతా వాదం బాగా బలపడింది. టాల్‌స్టాయ్, ఇబ్సెన్, జోలా, మొపాసా మొదలైన వారి రచనల ప్రభావం ఇందుకు కొంత కారణం. అయితే జపాన్‌లోని ఈ వాస్తవికతా వాదం సంఘజీవితంతో కాక వ్యక్తిగత మానవ జీవితంతో ఎక్కువ ముడిపడి ఉంటుంది. వాస్తవికతా వాదులు కళ కోసమే కళ అనే కాల్పనికోద్యమ ఆదర్శాన్ని విడిచి, జీవితాన్ని యథాత థంగా వర్ణింప నారంభించారు. వారి రచనలలో లైంగిక

జీవితం నిస్సంకోచంగా వర్ణించబడింది. ఈ వాదానికి షిమముర హోగెట్సు (1871-1919), హసెగవటెనకి (1876) అనేవారి విమర్శలు చాలా బలాన్ని చేకూర్చాయి. కొసుగి టెన్గై (1865), కునికిట డొప్పొ (1871-1908), షియజకిటోసన్ (1872), టయమెకటై (1871-1930) అనేవారు వాస్తవికతా వాదులలో ముఖ్యులు. షిమజకి అసంఖ్యాకంగా వ్రాసిన రచనలు జపాన్ సాహిత్యానికి పుష్టిని కలిగించాయి. *హకై* (1906), *హరు* (1908), *ఇె* (1911) అనేవి అతని ముఖ్యమైన నవలలు. *యొకే మెయ్* (తెల్లవారు జామున) అనే రెండు సంపుటాల్లో వెలువడిన అతని నవలను జపాను నవలా వాఙ్మయంలోనే అగ్రగణ్యమైందిగా పరిగణిస్తున్నారు. ఇందులో అతని రచనా శిల్పం పరాకాష్ఠ నందుకుంది. దీనిని సమకాలిక జపాన్ సామాజిక చరిత్ర అనవచ్చు. 'షిమజకిషిన్ టైషి' అనే పాశ్చాత్యకవితా పద్ధతిని కూడా ఈయన జపాన్ సాహిత్యంలో ప్రవేశపెట్టాడు.

మెయిజి యుగంలోని ఆఖరి దినాల్లో వాస్తవికతా వాదం బలాన్ని కోల్పోగా, అనేక క్రొత్త ఉద్యమాలు బయలుదేరాయి. ఈ ఉద్యమా లన్నీ జీవితంలో వచ్చిన క్రొత్త మలుపుల్ని గురించి పరిశీలింప నారంభించాయి.

ఇలా వాస్తవికతా వాదాన్ని ప్రతిఘటించిన వారిలో ప్రముఖుడు 'నట్సుమె, సోసేకి' (1867-1916). ఇతడు మయూహా లేక జైకైహా విశ్రాంత సంప్రదాయం (leasure school) అనే క్రొత్త ఉద్యమాన్ని ప్రారంభించాడు. *వాగహైవనకోడె అరు* (నేను పిల్లిని-1905), *బొట్చన్* (1906), *కుసుమకుర* (1906), *గుబిజిన్సో* (1907), *సన్షిరో* (1908), *మన్* (1910) మొదలైనవి ఈతని ముఖ్యమైన రచనలు. ఆధునిక రచయితల మీద ఈతని ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది.

**టైషో షోవా యుగం :** మొదటి ప్రపంచ యుద్ధం కాలం నుంచీ జపాన్‌లో మత సంబంధమైన వాఙ్మయం మంచి ప్రచారంలోకి వచ్చింది. 'కగవాటా గొహికొ' అనే క్రైస్తవ బోధకుడు సాహిత్యం ద్వారా మానవ ప్రేమను బోధించడానికి ప్రయత్నించాడు. అతడు *షి సెన్ నోకొయెపె* (1920), *పైయొహోఇరుయోనొ* (1921) అనే ప్రశస్తమైన నవలలు వ్రాశాడు. ఈ శాఖలో కురటయొమోజో గొప్ప నాటకకర్త. *షుక్కెటు సొనోడేషి* (1917) అనేది అతని రచన లన్నిటిలోకీ శ్రేష్ఠమైంది.

టనిజక్ జునిఛిరో (1866), నగైకఫూ (1879) ల నాయకత్వాన వెల్వడిన నవ కాల్పనికోద్యమం వాస్తవికతా వాదాన్ని తీవ్రంగా ప్రతిఘటించింది. కళకూ, మానవ జీవితానికీ సామరస్యాన్ని సాధించడమే వారి ప్రధానాశయం. టనిజకి రచించిన *చిజిన్ నొఅయ్* అనే గ్రంథం అతని సాహిత్య తత్త్వాన్నీ, దృక్పథాన్నీ విశదీకరిస్తుంది. యోషీఇసము (1886), నగటా మికిహికొ (1870), టమురాటొషికొ (1884) అనేవారు ఈ శాఖకు చెందిన ఇతర ప్రసిద్ధ రచయితలు.

నవాదర్శవాదులు కూడా వాస్తవికతా వాదాన్ని ప్రతిఘటించినవారే! వారిలో ముషకోజి సనియట్సు (1885) రచించిన *కొప్పకుమానొ* (1918), *యూజో* (1920), *యొసొ* (1926) అనేవి ప్రసిద్ధ గ్రంథాలు. ఇవి గాక ఇతడు చాలా నాటకాలు కూడా వ్రాశాడు. ఇతని పాత్రలు ప్రపంచంలోని అన్ని ప్రాంతాలవారు గ్రహించారు. అరిషిమాటకెయో (1878-1923) ఈ శాఖకు చెందిన మరో రచయిత.

ఈ కాలంలో నవ వాస్తవికతా వాదం కూడా ప్రచారంలోకి వచ్చింది. కికుచికన్, అకుటగావా రైనోసుకె, కుమెయసావో, సటొమిటాన్, షిగా నవోయా అనే వారు ఈ కోవకు చెందిన వారిలో ముఖ్యులు. వీరిలో కికుచి ఎక్కువ ప్రజాదరాన్ని పొందిన రచయిత. మొదట ఇతడు ఏకాంకికలు వ్రాశాడు. వాటిలో *కి సెకి, చిచిక యెదుటో జూరోనో కొయ్* అనేవి ముఖ్యమైనవి. 1920 తర్వాత అతడు అందరికీ అర్థమయే శైలిలో పత్రికలలో నవలలు వ్రాయ నారంభించాడు. *షిన్జుఫుజిన్* (1920), *సాన్కటెయ్* (1934), *షొహై* (1933) అనేవి మిక్కిలి ప్రసిద్ధిలోకి వచ్చిన ఈతని నవలలు. 1923 తరువాత ఇతడు *బున్‌గేషిన్జూ* అనే సొంత మాస పత్రికను ఆరంభించి, దానికి అపారమైన ప్రసిద్ధిని చేకూర్చాడు.

అకుటగావా రైనోసుకె (1892-1927) ప్రశస్తాలైన కథానికలు రచించాడు. *రషోమన్* (1915), *హన* (ముక్కు-1916) అనేవి ముఖ్యమైనవి.

టైషో యుగం చివరి భాగంలో సామాన్య ప్రజా సాహిత్యం బయలుదేరింది. ప్రచారం దీని ప్రధాన లక్ష్యం. అందుచేత దీనిలోని శైలి అసమగ్రంగా ఉంటుంది. కథా వస్తువులు కూడా వికృతంగా ఉంటాయి. ఆధునిక జపాన్ ఆలోచనా విధానం దీనిలో ప్రతిఫలిస్తూంది. కొబయాషీ (1903-1933), హయాషిపుసో (1906), కిషిసన్జి (1899), టకెడారింటారో (1904), టొకునాగన వోషి (1899), హయామాయోషికి (1894), మెయిడకొ కొయిచిరో (1888) మొదలయిన వారు ఈ తెగకు చెందిన కవులలో ముఖ్యులు.

మైషో యుగంలోని ఈ కడపటి కాలంలో 'షిన్క్ న్కకుహా' అనే ఒక కొత్త ఉద్యమం బయలు దేరింది. యొకోమిట్సు రీచి మొదలైనవారు దీనికి నాయకులు. దీని ప్రధాన లక్షణం: హృదయ భావాలను స్పష్టంగా వ్యక్తీకరించడం. యొకోమిట్సు వ్రాసిన ఈ జాతి గ్రంథాలలో *కకై* (యంత్రం) అనేది ముఖ్యమైంది. టంకా, హైకు, షిన్టైషి, సెన్ర్యూ, డొయో (బాల కవిత) అనే కవితా మార్గాలను ఈ కాలంలో అనుసరించారు. మెయిజి చక్రవర్తి (1852-1912), యోసనో హిరోషి (1873-1935), కుజోటకేకో మొదలయినవారు 'టంకా' కవిత్వంలోనూ, మసవోకాషికి (1866-1902), నట్సుమె సోసేకి (1867-1916), తకహమాక్యోషి (1874) ఓనోబుషి మొదలయినవారు 'హైకు' కవిత్వంలోనూ, కునికిటడప్పో (1871-1908) షియజకిటోసన్ (1872), కిటహరా హకుషూ, నూగుచియొనెజిరొ మొదలయిన వారు షిన్టైషి కవిత్వంలోనూ, ఇవయాసజనమి (1870) బాల కవిత్వంలోనూ ప్రసిద్ధులు. కవటక మొకు ఆమి, పుకుచి ఓఛి (1841-1906), ఒకమోటోకిడో (1873) యమమోటోయూజో(1887) కురట మెమోజో (1891) మొదలయినవారు ఆధునిక జపాన్ నాటక వాఙ్మయాన్ని పోషించారు. నో తోపాటు, 'షిమ్పొ' (సాంఘిక జీవితాన్ని చిత్రించేది), 'షిన్గెకి', 'కబుకి' అనే రూపక భేదాలు కూడా ప్రచారం లోకి వచ్చాయి. 'ఈడో' యుగంలోని 'కబుకి' కాలక్రమేణ చాలా మార్పు చెందింది.

సామాన్య ప్రజలను ఆకర్షించే రక రకాల కథలు వచ్చాయి. మైషుబుంగకు, ట్సూజొకుబుంగకు అనేవి వాటి పేర్లు. అపరాధ పరిశోధనం, హాస్యం, సాంసారిక జీవనం మొదలయినవి వీనిలోని వస్తువులు. మొదట వీనిని ఉత్తమ సాహిత్యంగా పరిగణించకపోయినా, కికుబికాన్ మొదలయిన ఉత్తమ రచయితలు వీటికి ఉత్కర్షను కలిగించిన తర్వాత, ఇవి నేడు ఆదరించ బడుతున్నాయి. ఫ్రెంచ్, ఇంగ్లీషు, జర్మన్, అమెరికన్, భాషలలోని గ్రంథాలెన్నో జపాన్ భాషలోకి అనువదించ బడ్డాయి. పాఠకుల సంఖ్య కూడా బాగా పెరిగింది.

1937 లో చైనా యుద్ధం ఆరంభమైన తర్వాత యుద్ధ సాహిత్యం విరివిగా వచ్చింది. హినొ అషిహే రచించిన *ట్సుచిటు హీటై* (బురద-సైనికులు), *ముగిటుహీటై* (గోధుమలు-సైనికులు) మొదలయినవి అసాధారణమైన ప్రచారాన్ని పొందాయి.

1930 నుంచి జాతీయతా భావం పెంపొంది, 'షిన్క్యొషోసెట్సు' అనే కొత్త రకం నవల వృద్ధి చెందింది. ఆత్మీయ భావాలనూ, ఆలోచనలనూ, చిత్రించడం ఈ నవల ప్రధాన లక్షణం. మానవుని దైనందిన జీవితంలోని సామాన్య సన్నివేశాలే ఇందులోని వస్తువులు.

ఇలా 1868 నుంచీ అనేక పాశ్చాత్య సాహిత్య ప్రక్రియలు జపాన్ సాంప్రదాయిక సాహిత్యంలో కలిసి పోయాయి.

ద్వితీయ ప్రపంచ యుద్ధం అంతం అయాక దేశంలో ప్రజాస్వామ్యం బలపడడంతో నూత్నమైన ఆవేశంతో శక్తి మంతమైన కవిత, నాటకం, కథ, 'నేను-నవల' ఆవిర్భవించాయి. ఈ చివరిది స్వీయచరిత్రాత్మకమైన నవల. దీనికి షిగా నవోయ రచనలు చక్కని ఉదాహరణలు. టానిజాకిజున్ ఇషీరో, 1968 లో సాహిత్యానికి నోబెల్ పురస్కారాన్ని పొందిన కవాబాటా, యూసునారీ, అబికోబూ, ఓయె కెన్జాబురో జబురో శక్తిమంతమైన నవలలు వ్రాశారు. ఇవి ఇతర భాషలలోకి అనువదించ బడడమే కాక, వీటికి పాశ్చాత్య దేశాలలో మంచి ఆదరం లభించింది. అయితే అంతర్జాతీయంగా ఖ్యాతి నార్జించిన తొలి జపానీస్ రచయిత మిషిమా యుకీయో. ఈతడు జపానీస్ సాహిత్యానికి అంతర్జాతీయ పాఠకులను సంపాదించి పెట్టడంలో సమకాలీన రచయితలకు ఒరవడి పెట్టాడు.

చి.వెం., వ.మం.

## జావానీజ్ భాష - సాహిత్యం

**భాష** : ఇది నేటి ఇండోనీషియాలోని పెద్ద దీవులలో నాలుగోది అయిన జావాలో వ్యవహారంలో ఉన్న భాష. ఈ భాష మాట్లాడేవారు సుమారు 6 కోట్ల మంది దాకా ఉంటారు. జావానీజ్ 'ఆస్ట్రోనేషియన్' (మలయో పోలినేషియన్) భాషా కుటుంబానికి చెందిన భాష. ఆ కుటుంబ భాషలలో ఎక్కువ మంది జనం మాట్లాడే భాష ఇదే! ప్రాచీన కాలం నుంచీ భారత దేశంతో జావాకు గల సన్నిహిత సంబంధమే ఇందుకు కారణం.

ఈ భాషలో 4 మాండలిక భేదాలు ఉన్నాయి. అవి: 1. సుంద-గిరిజనం మాట్లాడే భాష, 2. జావానీజ్, 3. మధుర, సుమనప్ మాండలికం (దీనిలో మలయా, సుంద భాషల పదాలు హెచ్చు. పదాంతాలు వింతగా ఉంటాయి.) 4. 'బాలీ' మాండలికం (ఇది జావానీజ్ మాండలికానికి చాలా దగ్గరగా ఉంటుంది). మాండలిక భేదాలే కాక ఈ భాషలో గౌరవ స్థాయిని సూచించే కొన్ని విలక్షణమైన శైలీ భేదాలు కూడా ఉన్నాయి. వాటిలో 'న్గోకో' (దైనిక వ్యవహారక శైలి - informal) కీ, 'క్రమ' (శిష్టశైలి - differential) కీ మధ్య ఎక్కువ అంతరం

కనిపిస్తుంది. ఈ రెండు శైలులనూ వాడడానికి వీలులేని సందర్భాలలో 'మధ్య' శైలిని ఉపయోగిస్తారు. విరళంగా వాడుకలో ఉన్న ఇతర శైలులు; 'క్రమ ఇంగిల్' (మరీ విశిష్టమైన) శైలి, 'భాషా కెదటాన్' (రాజప్రాసాద) శైలి మొదలయినవి.

'కవి' అనబడే జావానీజ్ భాషా భేదం ప్రాచీనమైన పవిత్ర భాష. దీనిలో సంస్కృత పదాల పాలు హెచ్చు. జావానీజ్ భాషా లిపి దేవ నాగర లిపిని పోలి ఉంటుంది. ఈ భాషకు మొదట లిపిని ఏర్పరిచిన వాడు అజిస యబయ అని ప్రతీతి.

**సాహిత్యం :** 'కవి' భాషలో క్రీస్తుశకం ఆరంభం నుంచీ సాహిత్యం కనిపిస్తూంది. దీనిలో ప్రపంచోత్పత్తిని గురించిన కథలు ఎక్కువ. వస్తువు సాధారణంగా పౌరాణికం గాని, నైతికం గాని అయి ఉంటుంది. పౌరాణిక వాఙ్మయంలో *కాండ, పెపకమ్* లేదా *సెజడా* (చరిత్ర), బౌద్ధమత కథాప్రధానమైన *మనెక్‌మాయ, వివాహ కవి* (పరిణయకావ్యం), *రామ కవి* (జావానీజ్ రామాయణం), *పరికెస్సిత్* (పరీక్షిత్తు), ఇంద్రకీల పర్వతం మీద అర్జునుని తపస్సును గురించి వ్రాసిన *మింటురగ* అనే కావ్యం ముఖ్యంగా పేర్కొనదగ్గవి. 'అజిసవ యబయ' కాలం వరకూ ఇలాంటి కావ్యాలే వచ్చాయి.

క్రీ.శ. 750 నుంచీ జావానీజ్ సాహిత్యం లిఖిత రూపంలో లభ్య మవుతూంది.

నీతి బోధక కావ్యాలలో నీతిశాస్త్ర కవి (13 వ శతాబ్ది), శ్రుతి, భారత యుద్ధం అనేవి ప్రధానమైనవి. ఈ చివరి కావ్యంలో అర్జునుడి పరాక్రమం, భారతకథ 712 పద్యాలలో వర్ణించబడ్డాయి. *శాస్త్రమానవమ్* అనే గ్రంథం సంస్కృతంలోని *మనుధర్మ* శాస్త్రానికి అనుకరణం. జావానీజ్ సాహిత్యంలో ఇలాంటి అనుకరణ కృతులు అనేకం ఉన్నాయి. శృంగార రస ప్రధానమైన కావ్యాలలో 'పణ్జి' అనే సాహస కృత్యాలను వర్ణించే కావ్యం ముఖ్యమైంది. నాటకాలూ, తోలుతోనో, కొయ్యతోనో తయారైన బొమ్మలతో ప్రదర్శించే బొమ్మలాటలూ (వయంగ్) ఈ భాషలో ఎక్కువగా ప్రజాదరణ చూరగొన్నాయి.

జావానీజ్ సాహిత్యం మీద భారతీయ, మహమ్మదీయ సాహిత్యాల ప్రభావం అధికంగా కనిపిస్తుంది. అలాగే - మళ్లీ ఈ జావానీజ్ సాహిత్యం 'మలయ్', 'బాలినీజ్' మొదలైన పరిసర సాహిత్యాల మీద తన ప్రభావం ఎక్కువగా చూపించింది. అయితే - ఇండోనేషియా రిపబ్లిక్ రాజ్యానికి 'భాషా ఇండోనేషియా' (సంస్కరించబడిన మలయ్) అనే భాషను జాతీయ భాషగా నిర్ణయించడంతో జావానీజ్ భాషలో పుస్తక ప్రచురణ నిలిచిపోయింది.

వి.వెం.(బొ.శ్రీ.)

## టిబెటన్ భాష - సాహిత్యం

**భాష :** టిబెటిక్ (లేక బోడిక్) భాష సీనో - టిబెటన్ భాషా కుటుంబంలో 'టిబెటో - బర్మన్' వర్గానికి చెందిన భాష. టిబెట్‌లోను, భూటాన్‌లోను, నేపాల్‌లోను, సిక్కింతో సహా కొన్ని భారత దేశ ప్రాంతాలలోను ఈ భాషను మాట్లాడుతున్నారు. దీనిని సాధారణంగా నాలుగు మాండలిక వర్గాలుగా పండితులు విభజిస్తారు. దీనికి మధ్య దేశీయ, దక్షిణ, ఉత్తర, పశ్చిమ మాండలికాలని పేర్లు. ఇందులో ఉత్తర మాండలికం ఉత్తర టిబెట్‌లోనూ, పశ్చిమ మాండలికం పశ్చిమ టిబెట్‌లోనూ కనిపిస్తూంది. అత్యధికులు ఉపయోగించేది టిబెట్ రాజధానీ నగరం లాసా (Lhasa) లో మాట్లాడే మధ్య దేశీయ మాండలికం. దక్షిణాది మాండలికం ప్రధానంగా సిక్కిం, భూటాన్, నేపాల్ లలో వాడుకలో ఉంది. పశ్చిమ మాండలికాల ఉచ్చారణ విధానం పురాతనమైన పద్ధతినే ఆశ్రయించి ఉంటూ ఎక్కువ మార్పుకు లోను కాలేదు.

పురాతన భారతీయ లిపి ఆధారంగా వెలసిన ఇప్పటి టిబెటన్ లిపి 9 వ శతాబ్దం నుంచి వాడుకలో ఉంది. ఈ లేఖనం 7 వ శతాబ్దం నాటి టిబెటన్ ఉచ్చారణను అనుసరించి ఉండడంవల్ల, ఇది నేడు ప్రామాణికత్వాన్ని సంతరించుకొన్న టిబెటన్ ఉచ్చారణను ప్రతిబింబించదు.

**సాహిత్యం :** టిబెట్‌లో గ్రంథరచనకు ఉపయోగించబడుతున్న భాష 8 వ శతాబ్దంలోనే స్థిరపడింది. 13 వ శతాబ్దం వరకూ సంస్కృతంలోను, ఇతర భారతీయ భాషల్లోను ఉన్న బౌద్ధ సారస్వతాన్ని టిబెటన్‌లోకి అనువాదం చేయడానికి టిబెట్ పాలకులు ప్రయత్నించారు. దీని ఫలితంగా 'కంజూర్' (అనూదితములైన ఉక్తులు), 'టెన్జూర్' (అనూదితములైన గ్రంథములు) అనే రెండు రకాల రచనలు వెలువడ్డాయి. వీనికి మూల సంస్కృత గ్రంథాలు నష్టమై పోవడంవల్ల, బౌద్ధమత జిజ్ఞాసువులకు ఈ అనువాద గ్రంథాలు అమూల్యమైన నిధానాలుగా ఉన్నాయి.

టిబెటన్ సాహిత్యం బౌద్ధ సంప్రదాయంతోనే వృద్ధి పొందింది. అక్కడ మఠాలయాలే విద్యా కేంద్రాలు కావడం వల్ల టిబెటన్ భాష ప్రధానంగా మత సంబంధమైన భాష అనవచ్చును. ఇందులో మత సిద్ధాంతాలకు, మఠాలయ నియమాలకు, గ్రంథవిమర్శకు, తర్కజ్యోతిషా

లకు, వైద్యానికి, శిల్పానికి, చిత్రలేఖనానికి సంబంధించిన గ్రంథాల సంఖ్య ఎక్కువ. టిబెటన్ సాధువుల, ఆచార్యుల జీవితాలకు, వారు రచించిన నీతి పద్యాలకు, గేయాలకు, రూపకాలకు ప్రచారం ఎక్కువ. జానపద గేయాలు, ఇతిహాసాలు (కేసర్‌శాగా) కేవలం సామాన్య ప్రజకు సంబంధించినవి.

టిబెటన్ భాషలో మతంతో సంబంధంలేని లౌకిక సాహిత్యం చాలా తక్కువ. *అరిమర్దనుడైన గేసలర్‌రాజు అద్భుత చరిత్ర* అలాంటి ఒక మహాకావ్యం. ఇది కాక కొన్ని ప్రాచీన చరిత్రలు (*డిక్టాంగ్, హ్యూయంగ్* వంటివి) ఉన్నాయి. టిబెట్‌లో బౌద్ధమతం ప్రవేశించక ముందు ఉన్న 'బాన్' మతానికి సంబంధించిన గ్రంథాలు ఏవీ నేడు కనపడవు. ఇతర దేశాల పండితులు టిబెట్ సాహిత్యాన్ని ఇంకా సమగ్రంగా అధ్యయనం చేసినట్టు లేదు. ఇంత వరకూ జానపద గేయాలు, కథలు, జీవిత చరిత్రలు మాత్రమే ఇతర భాషలలోకి అనువదించబడ్డాయి.

తారానాథ్, భూటాన్, జానుపాల్ వ్రాసిన చరిత్ర గ్రంథాలకు ఆంగ్లానువాదాలు లభిస్తున్నాయి. శాక్య పండితుడు (1092), భూటాన్ (1290), ట్సాంగ్ ఖాప (1357), పద్మకర్పో (1526) మొదలైన వారి రచనలు విదేశీయుల దృష్టిని ఆకర్షించినట్టు లేదు.

చీ.శే.రా., వ.మం.

## తాయ్ భాష - సాహిత్యం

**భాష :** తాయ్‌లాండులో మాట్లాడే ఈ భాషను సయామీస్ అని కూడా అంటారు. ఇది సీనో - టిబెటన్ భాషాకుటుంబానికి చెందింది. ఈ కుటుంబంలోని మిగతా భాషల లాగే ఇది మౌలికంగా ఏకాక్షర పద రూపంగా ఉంటుంది. అయితే ఒకే పదం ఉచ్చారణలోని స్వరాన్ని (tone) బట్టి వేర్వేరు అర్థాల నిస్తుంది. ఇటువంటి స్వరాలు విస్పష్టమైనవి అయిదు ఉన్నాయి. అవి మధ్యమ, అనుదాత్త, పతత్, ఉదాత్త, ఉన్నమత్ (mid, low, tolling, high, rising) స్వరాలు. తాయ్ ఏకాక్షరాత్మకమైన దైనా, క్రొత్త అర్థాన్ని సూచించే పదాల నిర్మాణానికి వివిధ భావాలను వివరించే పదాలను కలిపి ఒక కొత్త సంయుక్త పదాన్ని - సమాసాన్ని - కూరుస్తారు. ఈ సంయుక్త పద నిర్మాణానికి సంస్కృతం కూడా కొంత వరకు ఉపయోగపడుతూంది.

చైనీయ పదాల లాగే ఇందులోని పదాలు వాక్యంలో తమ స్థానాన్ని బట్టి ఏ భాషా భాగమైనా కావచ్చు. కర్త, క్రియ, కర్మ అన్న వరుసలో వాక్య రచన జరుగుతుంది. నామవాచకాలకు లింగం, వచనం అన్న విభేదం సహజంగా లేదు. కాని, అలాటి అవసరం కల్గినప్పుడు కొన్ని పదాలను చేర్చి ఆ అర్థాన్ని సాధిస్తారు. అలాగే క్రియలకు కూడా కాలాలను బట్టి మార్పులు రావు. చైనీయ భాషలో లాగానే, భూత భవిష్యత్ కాలాలను సూచించడానికి నిన్న, రేపు వంటి పదాలను క్రియకు చేర్చి ఆ అర్థాలను స్ఫురింపజేస్తారు.

బౌద్ధ మత ప్రభావం వల్ల తాయ్‌భాషలోకి సంస్కృత, పాళీ పదాలు విరివిగా చేరాయి. ఇప్పటికీ వైజ్ఞానిక, తాత్త్విక, పారిభాషిక పదాలను సృష్టించు కోడానికి తాయ్‌భాష సంస్కృతాన్నే చాలావరకు ఆశ్రయిస్తూంది.



తాయ్‌లాండ్

భారత దేశపు బ్రాహ్మీలిపిని అనుసరించి తాయ్ లిపి 13 వ శతాబ్దంలో నిర్మించబడింది. దీనిలో హల్లులను సూచించే గుర్తులు 42, స్వరాన్ని సూచించే సంజ్ఞలు 4 ఉన్నాయి. ఇవి గాక అచ్చులను సూచించే సంజ్ఞలు అనేకం ఉన్నాయి.

**సాహిత్యం :** తాయ్ సాహిత్యం రాజాస్థానాలలో వృద్ధి పొందింది. రాజులు వ్యక్తిగతంగా రచయితలకు పోషకులుగా ఉండడమే గాక, స్వయంగా సాహిత్యానికి పుష్టిని కూడా చేకూర్చారు. తాయ్ సాహిత్యం తొలి స్వతంత్ర తాయ్ రాజ్యంలో (13 వ శతాబ్దంనుంచి 14 వ శతాబ్దం మధ్య భాగం వరకు) 13 వ శతాబ్దంలో ఆరంభమైంది. అయితే ఇది శాసనాల రూపంలోనే నిలిచి ఉంది. ఈ శాసనాలు నాటి సమకాలీన జీవితాన్ని గురించి ఎంతో సమాచారాన్ని తెలియ జేస్తున్నాయి.

17 వ, 18 వ శతాబ్దాలు తాయ్ సారస్వతానికి స్వర్ణ యుగం. ఈ కాలంలో కవిత్వం, నృత్య నాటకాలు, ఆఖ్యానాలు (prose narratives) బాగా అభివృద్ధి చెందాయి.

వీటిమీద కొంత హిందూ సారస్వత ప్రభావం కనపడు తూంది. అయుత్తయ 1767 లో పదభ్రష్టు డవడంతో కొంత కాలం లలిత కళల అభివృద్ధి కుంటుపడింది. కాని తిరిగి 19 వ శతాబ్దిలో పాలకుల ప్రోత్సాహంతో వచనంలో కథలు, నవలలు అభివృద్ధి చెంద నారంభించాయి.

ఇలా ప్రారంభక తాయ్ సాహిత్యం సంస్కృత, పాళీ సారస్వతాల మీద ఆధారపడి రూపొందింది. ఆ నాటి కావ్యాలు కొన్ని లభ్యం అవుతున్నా, ఆ యా గ్రంథాలను రచించిన వారిని గురించి, వారి కాలాన్ని గురించి వివరాలు స్పష్టంగా తెలియడం లేదు. పూర్వ సారస్వతంలోని అత్యుత్తమ గ్రంథా లేవో నిర్ణయించడానికి 1914 లో ప్రభుత్వం ఒక సంస్థను స్థాపించింది. ఆ సంస్థ కొనసాగించిన పరిశోధనల ఫలితంగా ఈ గ్రంథాలు ఉత్తమోత్తమమైనవని నిర్ణయించ బడింది: 1. *ఫలా*, 2. *ఫ సముత ఖేత్*, 3. *మహాచాత్ ఖంథట్*, 4. *ఖన్ ఛంగ్ ఖన్ ఫెన్* 5. *ఇనావ్*, 6. *హ్వాఛాయ్ నాక్‌రోప్*, 7. *సాంకోక్*, 8. *ఫ రాజపిథి శిప్ సంగ్ ద్వాన్*.

వీటిలో మొదటిదైన 'ఫలా' గద్యకావ్యం. తాయ్‌దే శంలోని ఒక రాజకుమారుని ప్రణయగాథనూ, చివరికి అతని మృతినీ లలితమైన శైలిలో ఈ కావ్యం వర్ణిస్తూంది. సముత్థ ఖేత్ (సముద్ర ఘోష) అనే ధర్మపీరుని గాథ పైవానిలోని రెండో గ్రంథం. ఇది సంస్కృత ఛందోరీతిని అనుసరించి వృత్తాలలో రచించబడింది. తాయ్ దేశంలో ప్రచారంలో ఉన్న బౌద్ధ జాతక కథల్లోని పన్నస జాతక గాథ ఆధారంగా ఈ కావ్యం రచించబడింది. నారయ్ అనే తాయ్ రాజు ఆస్థానం లోని కవి ఒకడు దీనిని రచించినట్టు తెలియ వస్తూంది. కాని ఇది అసంపూర్ణంగా నిలిచిపోయింది. తర్వాత 19 వ శతాబ్దిలో ఒక రచయిత దీనిని పూరించాడు. ఇందులో అర్థాలంకా రాల కన్న శబ్దాలంకారాలకు ఎక్కువ ప్రాముఖ్యం ఈయబడింది.

*మహాచాత్‌ఖంథట్* (మహాచాత్ - మాహాజాతి) అనేది తాయ్ సాహిత్యంలో ఒక విశిష్టమైన గ్రంథం. వెస్సంతర జాతకంలోని బుద్ధుని పూర్వజన్మ చరిత్ర ఇందు లోని కథావస్తువు. ఇందులో 13 కాండ లున్నాయి. పలువురు రచయితలు వివిధ కాలాలలో ఈ గ్రంథరచ నలో పాల్గొన్నారు. అందులో ప్రతి ఒక్కడూ రచించిన దానినుంచి అత్యుత్తమ భాగాలను సేకరించి ఈ గ్రంథం సంకలితం చేయబడింది. ఇది వృత్తగంధి అయిన గద్య కావ్యం. మనః ప్రవృత్తులలోను, వయస్సులోను గల భేదాల విచక్షణ లేకుండా తాయ్ ప్రజలను అందరినీ ఆకర్షించే అత్యుత్తమ గ్రంథం ఇది. ఇందులోని కథావిషయాలు ఎందరో చిత్రకారుల చిత్రాలకు వస్తువులు అయాయి.

ఖన్‌ఛంగ్, ఖన్‌ఫెన్ అనే ఇద్దరు యువకులు వాన్ థాంగ్ అనే యువతిని ప్రేమించడాన్ని, దాని పర్యవ సానాన్ని చిత్రించే మహాకావ్యం *ఖన్‌ఛంగ్ ఖన్ ఫెన్*. భావ సంఘర్షణలకు పాలయిన వాన్‌థాంగ్ విషాద జీవి తగాథ ఇందులో కరుణరస భరితంగా చిత్రింప బడింది. ఇది తాళగతికి చక్కగా కుదిరి, చెరి ఒక పదమూ అందుకుంటూ ఇద్దరు కలసి పాడడానికి అనువుగా రచించబడింది.

జావా దేశపు ప్రసిద్ధ పీరుడు పంజి. వానిని గురించి వ్యాప్తిలో ఉన్న గాథలలో ఒకటి కథావస్తువుగా తీసికొని *ఇనావ్* రచించబడింది. తాయ్ దేశంలోని అయోధ్య రాజ్యపు రాజకుమారికి ఆమె సఖు లిద్దరు ఇలాంటి రెండు కథలు చెప్పి, వాటిని గ్రంథస్థం చేశారని ప్రతీతి. కాని అందులో ఒకటి ఖిలమై పోయిందనీ, జీర్ణావస్థలో ఉన్న రెండవ దానిని తాయ్ దేశపు ప్రభువు రెండవ రామరాజు (1809-24) నాటక ప్రదర్శనకు అనుకూలంగా పరివర్తన చేశారనీ అంటారు. ఇలా మార్పులు పొందిందే ఇప్పటి *ఇనావ్*.

తాయ్ ప్రభువు వజ్రవ్యాధ (1910-25) చే *హ్వాఛాయ్ నాక్‌రోప్* అనే నాటకం రచించబడింది. 'పీరాత్మ' అని ఈ పేరుకు అర్థం. వజ్రవ్యాధ ప్రభువు బహుభాషా విశారదుడు. ఇంగ్లీష్, ఫ్రెంచ్ నాటకాలను అనుసరించి ఈతడు తాయ్ భాషలో చాలా ఉత్తమ నాటకాలను వ్రాశాడు. అతని నాటకా లన్నింటిలోకి *హ్వాఛాయ్ నాక్ రోప్* అత్యుత్తమ మైంది. దేశ స్వాతంత్ర్యానికి తన సర్వస్వాన్నీ ఒడ్డిన ఒక పీరుని ఊహా చిత్రాన్ని ఈ నాటకం మధురమైన శైలిలో ప్రతిపాదిస్తూంది.

*ఫరాజ పిథిశిప్ సంగ్ ద్వాన్* (రాజాస్థానవిధి) అనే గ్రంథం 'మూలాలంకర్ణ ప్రభువు' (1868-1910) చే రచించ బడింది. రాజాస్థానంలో సంవత్సరం పొడుగునా ఆ యా మాసాలలో జరిగే ఉత్సవ కార్య కలాపాలను ఇది విశదీకరిస్తుంది. గ్రంథకర్త అకాలమరణం వల్ల ఇది అసమగ్రంగా నిలచిపోయింది. సుబోధకమైన శైలిలో ఇది రచించబడింది. పై గ్రంథాలతో పాటు *ఫ అభయమణి, స్వస్తిరక్ష, రామకియెన్* అనేవి కూడా పేర్కొనదగినవి. *ఫ అభయమణిని* సుందరన్ భూ అనే కవి రచించాడు. ఇందులో ప్రణయం, సాహసం, కుటిలతంత్రం మొదల యినవి ఉండడంచేత ఇది జన రంజకమైన కథ అయింది. ఇది ఒక కల్పితకథ.

*స్వస్తిరక్షను* కూడా సుందరన్ భూ రచించాడు. ఇది ఒక లఘుకావ్యం. మానవ శ్రేయః సాధనకు అవలంబించదగిన నైతిక విధానాన్ని ఈ కావ్యం బోధిస్తుంది. ఇద్దరు రాజపుత్రులకు ధర్మోపదేశం చేసే ఉద్దేశంతో ఇది రచించ బడినట్లు తెలుస్తూంది.

*రామకీయిన్* తాయ్ భాషలోని రామాయణం. సంస్కృతంలోని వాల్మీకి రామాయణానికి, దీనికి గల పోలికలు తక్కువ. కాని తమిళ, కాశ్మీర, బెంగాలీ, మలయా, జాపనీసు భాషలలోని రామాయణాలతో దీనికి ఎక్కువ పోలిక లున్నా యని అభిజ్ఞుల అభిప్రాయం.

ఆధునిక యుగంలో తాయ్ సాహిత్యం పాలకుల ఆదరణ వల్ల విస్తృతంగా వృద్ధి పొందుతూంది. విజ్ఞాన శాస్త్ర గ్రంథాలు అనేకం నేడు రచించబడుతున్నాయి. ప్రపంచ సాహిత్యాలలోని ఉత్తమ గ్రంథాలెన్నో ఈ భాషలోకి అనువదించబడ్డాయి.

ఫి.అ.రా.(వ.మం.)

## తుర్కీ భాష - సాహిత్యం

**భాష :** తుర్కీ భాష ఆల్‌టాయిక్ భాషా వర్గంలోని తుర్కిక్ భాషా కుటుంబానికి చెందింది. ఈ భాషను తుర్కీ, సైప్రెస్, (పూర్వపు) యు.ఎస్.ఎస్.ఆర్ లలోనూ, దక్షిణ యూరప్ ప్రాంతంలో కొన్ని చోట్లా, మధ్య ప్రాచ్యంలోనూ మాట్లాడుతున్నారు.



తుర్కీ

ఆధునిక తుర్కీ భాష ఆటోమన్ తుర్కీభాష నుంచీ, ప్రాచీన అనటోలియన్ తుర్కీభాషనుంచీ ఏర్పడింది. 11 వ శతాబ్ది చివర 'సెల్‌జుక్' తుర్కులు అనటోలియాలో ప్రవేశపెట్టినందువల్ల ఆ భాషను 'ప్రాచీన అనటోలియన్ తుర్కీ భాష' అంటున్నారు. ఆ నాడు ఆ విధంగా ప్రవేశ పెట్టబడిన ఆ తుర్కీభాష క్రమంగా అనేక అరబిక్, ఫారసీ పదాలనూ, వ్యాకరణ రూపాలనూ కూడా తనలో కలుపుకొని పెంపొందింది. అరబిక్ లిపిని స్వీకరించింది. 1923 లో తుర్కిష్ రిపబ్లిక్ ఏర్పడిన తరువాత ఆ అరబిక్ లిపి స్థానంలో కొద్ది మార్పులతో లాటిన్ లిపిని (రోమన్) వాడడం ఆరంభం అయింది (1929). తుర్కిష్ ప్రభుత్వం భాషా సంస్కరణకు పూనుకొంది. ఆ ఉద్యమ ఫలితంగా పదజాలంలో స్వచ్ఛత ఏర్పడడం, ఒక నూతన సాహిత్య భాష ఆవిర్భవించడం జరిగింది.

వ్యాకరణ నిర్మాణంలోని భేదాలను బట్టి తుర్కీ భాషా వికాస చరిత్రను మూడు యుగాలుగా విభజించవచ్చును. 1. ప్రాచీన (ఆటోమన్) తుర్కిష్ (13 వ, 14 వ, 15 వ. శతా.), 2. మధ్య (ఆటోమన్) తుర్కిష్ (16 వ, 17 వ, 18 వ శతా.), 3. నూతన (ఆటోమన్) తుర్కిష్ (19 వ, 20 వ శతా.)

6 వ శతాబ్దిలోనే మధ్య ఆసియా ప్రాంతంలో తుర్కీ భాష మాట్లాడేవారు నివసిస్తున్నట్టు ఆ ప్రాంతంలో లభించిన కొన్ని శాసనాల వల్లా, చైనా దేశచరిత్రవల్లా స్పష్టం అవుతూంది. కాని, వారు ఆ తొలి నివాసాన్ని వదలి ఇతర దేశాలను జయించి అక్కడ స్థిరనివాసాలు ఏర్పరచుకోవడంతో ఆ ప్రాంతాలలో కూడా వారి భాష వ్యాప్తి చెందింది. భారతదేశం వంటి కొన్ని దేశాలలో మాత్రం కాల క్రమేణ ఆ భాష అంతరించి పోయింది. కాని నేటికీ (పూర్వపు) యు.ఎస్.ఎస్.ఆర్‌లో అజర్‌బైజాన్ మొదలుకొని ఆల్టాయ్ పర్వతాల వరకూ గల ప్రాంతాలలోనూ, చైనీస్ తుర్కీస్థాన్‌లోనూ తుర్కీ మాండలికాలు కొన్ని వ్యవహారంలో ఉన్నాయి. అయితే ఈ నాటి తుర్కీదేశంలో మాత్రమే సాహిత్య భాషగా ఈ భాష సంపూర్ణ వికాసం పొందింది.

ద్రావిడ భాషల లాగ ఇది సంయుక్త ధాతురూప పద భాష. దీనిలో సంయుక్తాక్షరాలు తక్కువ. కర్కశ ధ్వనులు లేకపోవడంవల్లా, అచ్చులలో సామరస్యం ఎక్కువగా ఉండడంవల్లా వీనులకు ఇంపైన భాషలలో ఒకటిగా ఇది పరిగణించబడుతూంది. వాక్య నిర్మాణంలో కూడా కొన్ని ద్రావిడ భాషలతో ఈ భాషకు పోలికలు కనిపిస్తున్నాయి. 'అమె మంచిది' అనే తెలుగు వాక్యం లాంటి క్రియా విరహితమైన వాక్యాలు తుర్కీ భాషలో కూడా కనిపిస్తాయి. ద్రావిడ భాషలో లాగానే ధాతురూపమే విధ్యర్థంలోకూడా వాడబడుతూంది.

**సాహిత్యం :** ఉత్తర మంగోలియాలోని 'ఓర్‌హన్' శాసనాలు, చైనా తుర్కిస్థాన్‌లో లభించిన 'ఉయ్‌గూర్' గ్రంథాలు మాత్రమే 'ఇస్లాం పూర్వయుగం' లో మనకు లభ్యం అవుతున్న ప్రాచీన తుర్కీ భాషా రచనలు! మహమ్మద్ కాష్‌గరి రచించిన నిఘంటువు (1073) కూడా తుర్కీ జానపద కవిత్వంలో నుంచి కొన్ని రచనలను ఉదాహరించింది. *కుతత్ కుబిలిక్* (1069) అనే పరిపాలనా కళకు సంబంధించిన గ్రంథమే ఇస్లామిక్ యుగంలో మనకు లభిస్తున్న మొట్ట మొదటి ఉదాత్త రచన. ఇది 'అరబో - ఫారసి' ఛందస్సులో వ్రాయబడింది.

అనంతర శతాబ్దాలలో తుర్కీ సాహిత్యం చగటే, అజేరి, అనటోలియన్ అనే మూడు మాండలికాలలో అభివృద్ధి చెందింది. తూర్పు తుర్కుల సాహిత్యభాష అయిన చగటే ముఖ్యంగా మధ్య ఆసియాలోనూ, 'గోల్డెన్ హార్ట్' (కివ్‌చెక్) ల చేతా వ్యవహరించబడేది. *షెజరీ తుర్క్* (15 వ శతా.), *బాబర్ నామా* (16వ శతా.) అనేవి ఈ మాండలికంలో వ్రాయబడిన రెండు ఉదాత్త రచనలు. ఆధునికమైన ఉజ్‌బెక్ భాష ఈ మాండలికం నుంచే పుట్టింది. తూర్పు ఓగజ్ (పడమటి పర్షియా ఇరాక్, తూర్పు అనటోలియా) తుర్కుల సాహిత్య భాష అయిన అజరీకి, అనటోలియన్ తుర్కీ భాషకూ ఎక్కువ భేదం లేదు. ఈ మాండలికంలో రచించిన ప్రధాన రచయితలలో మార్మిక కవి అయిన నెజిమి, సఫావిడ్ వంశస్థాపకుడు షా ఇస్మాయిల్ (ఇతనికే మరోపేరు హటై), 16 వ శతాబ్దిలోని గేయకవి ఫుజూలి అనే వారు ముఖ్యులు.

ఆటోమన్ లేక 'దక్షిణి' అని పిలువబడే అనటోలియన్ తుర్కీ భాష 13 వ శతాబ్దినుంచి ఆటోమన్ సామ్రాజ్యంలో విశేషంగా అభివృద్ధి చెందింది. 14 వ, 15 వ శతాబ్దాలలో హసిక్ పాషా, అహమెధిసేహి, అహమెద్‌పాష, నెకటి వంటి కవులు అరబో పర్షియన్ గణ విధానంలో తుర్కీ భాషను ఇముడ్చటానికి ప్రయత్నించి, ప్రాచీన ఫారసీ గ్రంథాలచేత ఉత్తేజితులై గేయాలు, ప్రేమ వృత్తాంతాలు వ్రాయసాగారు. ఈ ప్రారంభ యుగంలో చెప్పుకోదగ్గ మహనీయులు: యూనస్ ఎమ్రే, సులేమాన్ చలెబి. ఎమ్రే గొప్ప మార్మిక కవి. ఆయన సాంప్రదాయికమైన అక్షరచ్ఛందస్సు లో రచనలు సాగించాడు. చలెబి కవే మహమ్మద్ ప్రవక్తను గురించి మొట్ట మొదటిసారి స్తుతి పద్యాలు రచించినవాడు.

16 వ శతాబ్దం నుంచి తుర్కీ కవులు ప్రాచీన ఫారశీ కవులను అనుకరించడం మానివేసి, వారి కవితా కళను జీర్ణం చేసికొని తమ సహజ లక్షణాలను కూడా ప్రస్ఫుటం చేసే మౌలికమైన పద్య రచనా విధానాన్ని పెంపొందించుకొన్నారు. అలాంటి వారిలో బాకి, తస్లిక లీయాహ్యా, రూహీ, నెఫీ, సెయ్యిల్ ఇస్లామ్ యాహ్యా, నాబీ, నెవీ, నెడీయ్, షేహ్‌గాలిబ్ అనేవారు ముఖ్యులు. ఫారసీ ఛందో విధానాన్ని పూర్తిగా కైవసం చేసుకోవాలన్న తపన వల్ల తుర్కీభాష తన స్వాతంత్ర్యాన్ని కొంతవరకు కోల్పోవలసి వచ్చింది. పెక్కు అరబ్బీ, ఫారసీ పదాలనూ, వ్యాకరణ నియమాలనూ స్వీకరించవలసి వచ్చింది. దాని ఫలితంగా తుర్కీ సాహిత్యం అల్పసంఖ్యాకులైన విద్యావంతులకే పరిమితం కావడం సంభవించింది. ఈ ప్రాచీన యుగానికి చెందిన గద్య రచయితలలో హుకా సాదుద్దీన్, కాతిబ్ చలెబి (హాజీ ఖలీఫా), పెసెపి, నయీమా అనే చరిత్రకారులూ, అలీ చలిబి అనే యాత్రా గ్రంథ రచయితా ముఖ్యులు. సాదుద్దీన్ చెవికి ఇంపైన, లలితమైన శైలి ఉపయోగించాడు. తక్కినవారి శైలి అధికారిక పత్రాలలో కనిపించే వింత రూపాలు పరిహరించి సరళంగా సాగింది. విద్యావంతుల సాహిత్యంతో పాటుగా జానపద వాఙ్మయం కూడా ఆ కాలంలో పెంపొందింది. ఆ జానపద కవులలో ప్రజా జీవితాన్ని గురించి ప్రాచీన అక్షర ఛ్ఛందస్సులో సరళ సుందరమైన భాషలో గేయాలు వ్రాసిన కరకవో గ్లాన్ (17 వ శతా.) ముఖ్యుడు.

19 వ శతాబ్ది మధ్యకాలం నుంచి రాజకీయ, విద్యా, పరిపాలనా రంగా లన్నింటిలోనూ పాశ్చాత్య పద్ధతిలో ప్రవేశపెట్టబడిన సంస్కరణలతో పాటు సాహిత్యంలో కూడా ఒక నూతన విధానం ఆరంభం అయింది. దీనిని పెంపొందించినవాడు షినాసి. అతని శిష్యులు నమిక్ కెమాల్, జియా పాషాలు దానిని మరింత పెంపొందించారు. అబ్దుల్ హక్ హామిద్, అతని సమకాలికులూ దానికి ఒక సమగ్రరూపం కలిగించారు. ఫ్రెంచ్ సాహిత్యప్రభావంతో నవల, నాటకం, వ్యాసం వంటి కొన్ని పాశ్చాత్య సాహిత్య ప్రక్రియలు వెలశాయి.

19 వ శతాబ్దం చివర హవిడ్ జియా ఉసక్లిగిల్ అనే నవలా రచయిత, తెవ్‌ఫిక్ ఫిక్రెట్ అనే కవి, మరి కొందరు మిత్రులు, సెర్వెటిఫునెమ్ అనే పత్రిక ఆధారంగా ఒక క్రొత్త సాహిత్యోద్యమాన్ని ప్రారంభించారు. వారి రచనా విధానం, జీవిత దృక్పథం ఆధునిక కవిత్వానికీ, సర్వజన సమన్వయ విధానానికీ దారి తీశాయి. కాని భాషా సహజ పరిణామ క్రమాన్ని వారు గుర్తించలేక పోయారు. హుసేన్ రహ్మి, అహమద్ హసిమ్ అనే వారు ఈ వర్గంవారి వింతశైలిని విడిచిపెట్టి, శక్తి

మంతమూ, వాస్తవికమూ అయిన శైలిలో ఇస్టాంబుల్ జీవితాన్ని వర్ణించారు. కవితా రంగంలో కూడా మహమ్మద్ ఎమిన్, రిజాటిల్ ఫిక్ అనేవారు సరళమైన తుర్కీ భాషలో అక్షరచ్ఛందస్సులో రచనలు వెలువరించ సాగారు. 1908 నాటి విప్లవం తరువాత యువ రచయితలు 'ఫెక్రి - అటి' అనే క్రొత్త సారస్వత శాఖను వెలయించారు. వారిలో ప్రతీకాత్మక కవి అహమ్మద్ హసిమ్ ప్రముఖుడు. ఈ కాలంలో యాహ్యా కెమాల్ ప్రభావం ప్రబలమై అటు తరువాతి తరాల మీద కూడా ప్రసరించింది. మహమ్మద్ అకిప్ స్వతంత్రుడైన కవిగా ప్రసిద్ధి చెందాడు.

'టర్కిష్ హార్త్' స్థాపన అనంతరం జెన్క్ కలెమ్లర్ లో భాషను సరళం చేయడానికి ప్రయత్నాలు జరిగిన తరువాత రూపొంది పుష్టి సాధించిన జాతీయ వాఙ్మయానికి జియాగోక్ అల్ప్ నాయకత్వం వహించాడు. తుర్కీ జాతీయాశయాలకు జియా రూపకల్పన చేశాడు. తుర్కుల ప్రాచీన సంస్కృతి చరిత్రను గురించి పరిశోధనలు చేయడానికి తన దేశీయులను ఆయన ప్రోత్సహించాడు.

జాతికి పరీక్ష ఏర్పడిన కాలంలో రచయితలు, కవులు సర్వసాధారణమైన నూతనాదర్శంచేత ఉత్తేజితులయారు. ఫూఅద్‌కోప్రూ అనే పండితుడు తుర్కుల చరిత్ర, సంస్కృతులను గురించి తాను చేసిన పరిశోధన ఫలితాలను ప్రచురించాడు. కవులు, కథకులు, నవలా రచయితలు పాత వస్తువులను విడిచి దేశానికీ, ప్రజలకూ, సన్నిహితంగా ఉండే నూతన వస్తువులను గ్రహించసాగారు. ఓమర్‌సెయ్‌ఫుద్దీన్, యాకుబ్ కద్రి, ఖలిదె ఎడిబ్, రెఫిక్ హావిడ్, ఫలిహ్ రిఫ్కి, రిశద్ నూరి అనేవారు ఈ యుగానికి చెందిన గొప్ప గద్య రచయితలు. ఫరుక్‌నఫిజ్, నెసిఫ్ ఫజిల్ మొదలైనవారు అక్షర ఛ్ఛందస్సులో కవిత్వం వ్రాశారు. తరువాత నజిమ్ హిక్మెట్ ఛందోరహితమైన పద్యాన్ని ప్రవేశపెట్టాడు. అనేకులు ఆ పద్ధతిని అనుసరించారు.

1930 నుంచి వెలువడిన తుర్కీసాహిత్యంలో మనస్తత్వం, ఆత్మాశ్రయత్వాన్ని ప్రకటించే కవిత్వం, సాంఘిక సమస్యలను ప్రతిబింబించే నవలలు, కథానికలు ప్రధాన స్థానం వహించాయి. కవులలో అహమద్ హమ్దిటన్పినార్, బర్హన్‌వెలి, కహిడ్ సిడ్కి, ఫజిల్‌హూస్నూ, కహిడ్ కూలెబి, నెకటి కుమలి అనేవారూ, గద్యరచయితలలో సబహద్దిన్ ఆలి, సయిద్ ఫెయిక్, సమెద్ అగావోగ్లు, బర్హన్ కెమారు అనేవారూ ముఖ్యంగా చెప్పకోదగ్గవారు. వెనుకటి తరానికి చెందిన అబ్దుల్ హక్ సినపి హిసార్ 1940 ప్రాంతంలోనే తన అత్యుత్తమ రచనలు ప్రచురించాడు. 20 వ శతాబ్ది పూర్వార్ధంలోని తుర్కీ సాహిత్య శైలికీ, వికాసానికీ అవి చక్కని ప్రతినిధులు.

దివెం.(బా.శ్రీ.)

## ఫార్సీ భాష - సాహిత్యం

భాష : పర్షియన్, లేక 'ఫార్సీ' అనబడే భాష ఇండో - ఇరేనియన్ భాషాకుటుంబంలోని ఇరేనియన్ శాఖకు చెందింది. ప్రస్తుతం ఇరాన్‌లో ఇది అధికార భాష. ఆఫ్ఘనిస్తాన్‌లో కూడా ఈ భాష విరివిగా ప్రచారంలో ఉంది. అరబిక్ లిపిలో వ్రాయబడే నేటి ఫార్సీ భాష ఎన్నో అరబిక్ భాషా పదాలను కూడా తనలో లీనం చేసుకుంది.



ఇరాన్

దాదాపు క్రీ.పూ. 3 వ శతాబ్ది వరకూ వ్యవహారంలో ఉండిన ప్రాచీన ఫార్సీ భాషను గూర్చి క్యూనీయఫార్మ్ లిపిలో లభించిన అనేక శాసనాలు మనకు విశదం చేస్తున్నాయి. వాటిలోమిక్కిలి ప్రధానమైనవి: ఇరాన్‌లోని 'బైసిట్యూన్' (బెహిస్తూన్) వద్ద గల మొదటి డరైయస్ కాలం నాటి కట్టడాలలో లభించిన శాసనాలు. ఇవి చాలా భాగం త్రిభాషాత్మకాలు. ప్రాచీన ఫార్సీ, ఈలమైట్, అక్కేడియన్ భాషలు మూడూ ఆ శాసనాలలో వాడారు.

క్రీ.పూ. 3 వ శతాబ్ది మొదలు క్రీ.శ. 9 వ శతాబ్ది వరకూ వ్యవహారంలో ఉన్న మధ్య యుగీన ఫార్సీ భాష సాసానియన్ రాజుల కాలం నాటి అనేక సూత్రరూపమైన రచనలలో మనకు కనిపిస్తుంది. ఈ గ్రంథాలు అరమాయిక్ లిపిలో ఉన్నాయి. జోరాష్ట్రియన్, మేనకేయన్ మత సంప్రదాయాలను గూర్చి కూడా తెలిపే

వైవిధ్యంతో కూడిన సాహిత్యం ఈ మధ్యయుగ ఫార్సీ భాషలో కనిపిస్తుంది. సాసానియన్ రాజుల కాలంలోని ఈ మధ్యయుగ ఫార్సీ భాషకు అధికార నామం: 'పహ్లవీ'.

ప్రాచీన ఫార్సీ వ్యాకరణ రూపాలతో పోల్చి చూస్తే, ఆధునిక ఫార్సీ వ్యాకరణం అత్యంత సరళమైంది. వెనుకటి ఫార్సీ భాషలోని ప్రత్యయా లెన్నో ఆధునిక ఫార్సీ భాషలో లోపించాయి. ఆధునిక ఫార్సీలో విభక్తి ప్రత్యయాలను చేర్చే విధానం లేదు. నామవాచకం గాని, సర్వనామం గాని ముఖ్యకర్మ అనిగాని సూచించే ప్రత్యయాలు మాత్రమే కనిపిస్తాయి. సామ్యాన్ని సూచించేందుకు 'ఎజేపే' అనే అంత్యానుబంధం చేరుస్తారు. ఆ విధంగా నామవాచకానికి షష్ఠీ విభక్తి రూపం ఏర్పడుతుంది.

**మధ్య ఫారసీ (పహ్లవీ) :** అలెగ్జాండర్ సామ్రాజ్యం పతనమైన తరువాత పర్షియాను పార్థియన్‌లు పరిపాలించారు. ఇప్పుడు 'పహ్లవీ' అని వ్యవహరించబడుతున్న మాండలికానికి ఆ పేరు వారిని బట్టే ఏర్పడింది. కొన్ని గ్రంథాలలోను, శాసనాలలోను, నాణేలమీదా కనిపిస్తున్న భాష 'పహ్లవీ'యే అని విద్వాంసుల అభిప్రాయం. ఆదిలో 'ఫార్స్' రాష్ట్రంలో వాడుకలో ఉన్న ప్రాచీన ఫార్సీ యొక్క పరిణామ దశలలో ఇది ఒకటి!

**ఇస్లామిక్ ఫారసీ :** క్రీ.శ.7 వ శతాబ్దంలో పర్షియా ఖలీఫాలకు వశం కావడం, అక్కడ ఇస్లాం మతం వ్యాపించడంతో అరబ్బీ భాష కూడా దిగుమతి కావడం తప్పనిసరి అయింది. ఫార్సీ రచయితలు అరబ్బీ పదాలను యథేచ్ఛగా తమ రచనలలో వాడుక చేయసాగారు. అయినా దైనందిన వ్యవహారాలు 'ఫార్సీ' లోనే సాగుతూ వచ్చాయి. ప్రజాసామాన్యం పాడుకునే గేయాలు కూడా ఆ భాషలోనే ఉండేవి. గద్యంలో కంటె పద్యంలో అరబిక్ పదాల వాడుక తక్కువగా ఉండేది. పరదేశీయుల పాలనకు లోబడిన కొన్ని ఇతర దేశాలలోని భాషల లాగ ఫార్సీ భాష విజేతల భాషలో లీనమై పోలేదు. అరబ్బీ నుంచి కొంత పదజాలాన్ని ఎరువుతెచ్చుకున్నా తన వ్యాకరణ మర్యాదలను తాను చెక్కు చెదరకుండా నిలుపుకో గలిగింది. అందుచేత - ఒక్కొక్కప్పుడు వాక్యంలోని పదాలన్నీ అరబ్బీ పదా లయినా, క్రియ, వాక్య నిర్మాణం ఆ వాక్యాన్ని ఫార్సీ వాక్యంగానే నిలిపి ఉంచుతున్నాయి.

పత్రికలలోను, నవలలలోను, ఉత్తరాలలోను నేడు వాడుకలో ఉన్న వ్యావహారిక 'ఫార్సీ' భాషలో ప్రాచీన ఫార్సీ లక్షణాలు, నేటి వ్యావహారిక భాషా లక్షణాలు, ఫ్రెంచ్, జర్మన్ మొదలైన పాశ్చాత్యభాషల పదజాలం కలగలసి పోయి కనిపిస్తాయి. నేటి భాషకూ, 11 వ శతాబ్దం నాటి రచయితల భాషకూ వాక్య నిర్మాణంలో ఎక్కువ తేడా కనిపించదు. అయితే - అనేక నూతన పదాలు ఫార్సీ భాషలో చేరడం, వెనుకటి మాటల కెన్నిటికో అర్థ విపరిణామం ఏర్పడడం జరిగింది.

**ఆసియాలోని ఫార్సీ :** మహమూద్ గజనీ సామ్రాజ్యంలో బుఖారా, సామర్‌ఖండ్ అనే రెండు పెద్ద పట్టణా లుండేవి. అక్కడినుంచే ఇస్లాం మతం, పారసీక సంస్కృతి ఇటు భారతదేశానికి, అటు తుర్కీకి వ్యాపించాయి. క్రీ.శ. 1000 ప్రాంతంలో టర్కోయాన్ ప్రదేశా లన్నీ ముస్లిం ప్రభావానికి గురి అయాయి. స్థానిక భాషలలో ప్రవేశించిన అపరిచిత పదాలను వారు ఫార్సీ ద్వారా వివరించవలసి వచ్చేది. మతాంతరీకరణ సందర్భంలో కూడా ఫార్సీ భాషనే వారు వాడుతూ వచ్చారు. ఆసియామైనర్ లోని ఆటోమన్ నాయకులు తమ ఉత్తర ప్రత్యుత్తరాలలో ఫార్సీ భాషనే ఉపయోగించేవారు. తుర్కీభాష ఫార్సీ సాహిత్య గ్రంథాల అనువాదాలతోనే ఆరంభమైంది. తుర్కీ కవులు ఫార్సీనుంచి కొన్ని సుప్రసిద్ధ ఛందస్సులనూ, సాహిత్య ప్రక్రియలనూ మాత్రమే కాక, ఫార్సీ పదజాలాన్ని కూడా విశేషంగా గ్రహించారు. తత్ ఫలితంగానే నేటికీ గ్రాంథికమైన తుర్కీ భాషలో ఫార్సీ పాలు ఎక్కువగా కనిపిస్తుంది.

**సాహిత్యం :** మొదటి డరైయస్ కాలం నుంచే ఫార్సీ సాహిత్య చిహ్నాలు కనిపిస్తున్నాయి. అతడు బెహిస్తూన్ కొండమీద, నాణేలమీద కిర్మన్‌షాలోను తన శాసనాలను ప్రాచీన ఫార్సీ భాషలోనే చెక్కించాడు. జోరాష్ట్రియన్ మత గ్రంథాలలోని భాష కూడా ప్రాచీన ఫార్సీ భాషగానే పరిగణించబడుతూంది.

'అవెస్తా' అనే మాట పార్శీమత గ్రంథానికే కాక, అది వ్రాయబడిన మాండలిక భాషా భేదానికి కూడా పేరు. ఈ భాషకు సంస్కృతంతో సన్నిహితమైన సంబంధం ఉంది. ఇప్పుడు మనకు లభిస్తున్న అవెస్తా గ్రంథం వెనుక 21 సంపుటాలతో కూడి ఉండిన మూల గ్రంథంలో ఏకదేశం మాత్రమే! దీనిలో రెండు భాగాలు: 1. అవెస్తా మూలం, 2. 'ఖుర్ద్' అనబడే ప్రార్థనలు.

పహ్లవీ సాహిత్యం మత గ్రంథాలలో మాత్రమే నిలిచి ఉంది. వాటిలో *దీన్ కర్ద్, మైన్యో-ఇ-ఖిరద్* అనేవి ప్రసిద్ధాలు. అనంతర ఫార్సీ రచనల పరిణామాన్ని గూర్చి పరిశీలించేటప్పుడు వీటికి ప్రత్యేకమైన ప్రాముఖ్యం ఉంది. *యత్కారె జరిరాన్, ఇన్దార్స్-టి-ఖుస్రవీ, గవటాన్, కార్నీమక్-ఏ అర్దీషెర్* అనేవి కూడా ముఖ్యమైనవే!

ఫిరదౌసి రచించిన ఐతిహాసిక కావ్యానికి ఈ గ్రంథాలే ఆధారంగా ఉపయోగ పడ్డాయి.

**అరబ్బుల విజయం అనంతరం :** అరబ్ దండయాత్ర అనంతరం పహ్లావీ భాష స్థానాన్ని అరబ్బీ ఆక్రమించింది. ఇరాన్‌లోని ప్రసిద్ధ శాస్త్రజ్ఞులూ, తత్త్వజ్ఞులూ అందరూ అరబ్బీ భాషలోనే రచనలు చేయడం మొదలుపెట్టారు. వారిలో తబరి, అవిసెనా, బైజావి మొదలైనవారు ముఖ్యులు. పద్య కవిత్వంలో కూడా పాలకుల భాష అయిన అరబ్బీనుంచి 'ఖసీదా' గ్రహించబడింది. 'సమానిద్'లతో కళా, సారస్వతాలు పరిపుష్టా లయాయి. వారు కవులతోను, చరిత్ర రచయితలతోను 'గుండ్రని బల్ల' సమావేశాలు జరుపుతూ ఉండేవారు. అక్కడ ఆ రాజుల విజయావదానాలను గూర్చి కైవారాలు చేయబడుతూ ఉండేవి.

రూదకి అనే రచయిత ఈ 'సమానిద్' యుగానికి భూషణం వంటి వాడు. ఒక విధంగా ఫార్సీ భాషలో అతడు ఆదికవి. అతనితోనే ఇరాన్ రాజాస్థానకవిత్వం ఆరంభం అవుతూంది. ఈ కాలంలో వర్ధిల్లిన ఇంకో కవి దకికీ. *షానామా* అనే గ్రంథాన్ని ఈయనే మొదట ఆరంభించాడు.

గజ్నవీ వంశం వారు గజనీ నగరంలో కవుల, శాస్త్రజ్ఞుల సదస్సును పోషించేవారు. ఫార్సీ వాఙ్మయంలో దీని కెంతో ప్రసిద్ధి ఉంది. ఉన్‌సూరి అంజురి, మనూచెహ్రి, ఫర్రూఖి అనేవారు ఆ సదస్సుకు చెందిన ప్రముఖులే. వారిలో 'ఫిరదౌసి' అగ్రగణ్యుడు; అజరామరమైన తన షానామా ద్వారా ఇరాన్‌కు ఆయన శాశ్వతమైన కీర్తి ప్రతిష్ఠలు కలిగించాడు.

మహమూద్ ఆస్థానాన్ని అలంకరించిన శాస్త్రజ్ఞుల లోను, చారిత్రకులలోను అల్‌బెరూనీ, అవిసెన అత్యంత ముఖ్యులు. ఈ యుగంలో వ్యాప్తి పొందిన ఒక మత తత్త్వ సంప్రదాయానికి తాత్త్వికంగానూ, సాహిత్యపరంగానూ కూడా చాలా ప్రాముఖ్యం ఉంది.

**సెల్జూక్‌లు :** వీరి కాలంలోని సుప్రసిద్ధ సారస్వతోపాసకులలో అయిన అబుల్ హసన్ ముఖ్యుడు. అతడు సాధారణంగా నిజాముల్ ముల్క్ అనే బిరుద నామంతో వ్యవహరింపబడుతూ ఉంటాడు. పరిపాలనా కళను గూర్చి అతడు *సియాసత్ నామా* అనే గ్రంథం వ్రాశాడు.

సూఫీ మతానికి తాత్త్వికంగానే కాక, సాహిత్య దృష్ట్యా కూడా చాలా ప్రాధాన్యం ఉంది. ఏమంటే - ఫార్సీ సాహిత్యం అంతా ఈ సూఫీ తత్త్వంతో నిండి నిబిడీకృతమై ఉంది.

సూఫీ ఉద్యమంలో చెప్పుకోవలసిన మొదటి కవి అబూ సయీద్ అబుల్‌ఖైర్. ఇతడు క్వాట్రెయిన్ అనే పద్య రూపాన్ని పునరుద్ధరించి ప్రచారంలోకి తెచ్చాడు. ఖ్వాజా అబ్దుల్లా అన్సారీ ఈ క్వాట్రెయిన్‌ల రచనలోను, 'మొనాజాకట్' (ప్రార్థనలు) రచనలోనూ సిద్ధహస్తుడు. సూఫీ కవులలో మరో సుప్రసిద్ధుడు సనాయీ. 'మస్నవీ' రూపాన్ని మొట్ట మొదట వాడినవాడు ఇతడే! *హదీకత్ - ఉల్ హకీక* ఇతని ప్రసిద్ధమైన మస్నవీ.

ఈ కాలంలో వెలసిన సిద్ధాంతాలలో సూఫీ సిద్ధాంతంతో పాటు ఉమర్‌ఖయామ్ ప్రచారం చేసిన నాస్తిక సిద్ధాంతాన్ని గురించి కూడా చెప్పుకోవాలి. ఖయామ్ కవి మాత్రమే కాదు; జ్యోతిష్కుడు; గణకుడు; తత్త్వవేత్త కూడా. అతని రుబాయీలు ప్రపంచంలోని అన్ని భాషలలోకీ అనువాదం పొంది విశేష ప్రశస్తి పొందాయి.

ఫార్సీ వాఙ్మయంలో పద్య రచనతో పోల్చిచూస్తే గద్య రచన చాలా తక్కువ. ప్రాచీన కాలంలో గద్యంలో వ్రాయబడిన శాస్త్ర గ్రంథాలలో *జఖీర - ఏ - ఖ్వారజంషాహీ* ముఖ్యమైంది.

అల్‌గజాలి అనే నీతితత్త్వవేత్తతో ఇస్లామిక్ సూఫీ తత్త్వంలో ఒక గొప్ప పరిణామ దశ ఆరంభమైంది. చాలా వరకు అతడు అరబ్బీ భాషలోనే వ్రాసినా, తన సుప్రసిద్ధమైన *ఎహ్యా-ఉల్ ఉలూమ్ ఉద్దీన్‌*ను *కిమియాయె సాదత్* అనే పేరుతో ఫార్సీ భాషలో కూడా రచించాడు. అరూజి సమర్‌ఖండి రచించిన *చహార్ మకాలా* తాత్త్విక విషయాలతో కూడిన జీవిత చరిత్ర.

అన్వరి, ఖాకాని తమ జీవితాలలో అధికభాగాన్ని స్తోత్ర రచనలు చేయడంలో గడిపారు. వివిధ కథల నుంచి గ్రహించబడిన సుప్రసిద్ధ ప్రేయసీ ప్రియుల వృత్తాంతాలతో శృంగార కవిత్వం రచించబడింది. ఇలాంటి రచనలకు (గంజా) నిజామీ నాయకుడు. *ఖంస* అనబడే ఇతడు రచించిన అయిదు మస్నవీలను తరువాతి కవులు అనేకులు అనుకరించారు.

సనాయీ తరువాత సూఫీ సంప్రదాయాన్ని కొనసాగించినవాడు, ఫరీద్ ఉద్దీన్ అత్తార్. అతని సుప్రసిద్ధ రచన *మంతిఖ్-ఉల్-తైర్.* అతడు *తజ్ కిరత్ అల్ ఔలియా* అనే గద్య గ్రంథంలో ముస్లిం సన్న్యాసుల, వేదాంతుల జీవిత చరిత్రలనూ, ప్రవచనాలనూ సంకలితం చేసి ప్రకటించాడు.

'మౌలానా-ఎ-రూమీ' అనే నామాంతరం గల జలాలుద్దీన్ శాస్త్రాలలో మంచి జ్ఞానం గడించిన తరువాత, సాహిత్య జీవితం ప్రారంభించాడు. మంగోలీ దండయాత్రలు

అతని రచనోత్సాహానికి ఎలాంటి ఆటంకాన్నీ కలిగించినట్టు కనిపించదు. ఇతని రచనలలో ఒకటి అయిన ఒక మస్నవీకి సూఫీ ప్రపంచం అంతటా పహ్లవీ భాషలో వ్రాసిన *ఖురాన్* అనే ప్రసిద్ధి ఏర్పడింది.

సాదీ మహాకవి అన్ని రకాల పద్య కవితలూ చెప్పాడు. *బోస్తాన్, గులిస్తాన్* అనే ఇతని రచనలు ఆధునిక భాష లన్నిటిలోకీ అనువదింప బడడమే ఇతని ప్రతిభకు తార్కాణం.

మంగోల్‌లు కూడా శాస్త్రం, చరిత్రల విలువను బాగా గుర్తించారు. మంగోల్‌ల రాకకు ముందు పేరెన్నిక కన్నవాడు నసీరుద్దీన్ అనే తత్త్వవేత్త. ఇతడు జ్యోతి ష్కుడూ, గణకుడూ కూడా. *అక్‌లాకే-ఎ-నాసిరి* అనే ఇతని ప్రసిద్ధ గ్రంథం దేశీయ ఫార్సీభాషలో రచించబ డింది. ఇస్లామ్ వాఙ్మయంలో ఉన్న నీతి గ్రంథాలన్నిటిలో దీనికంటె ప్రశస్తమైన గ్రంథం మరొకటి లేదు. హలాగు కార్యదర్శి అయిన అతామలిక్ మంగోల్‌ల చరిత్రను వివ రంగా రచించాడు. ఈ గ్రంథానికే అటు తరువాత *తారిఖ్-ఎ-జహాన్‌గుషా* అని ప్రసిద్ధి ఏర్పడింది.

ఏల్ఖానీ యుగంలో పద్యరచన చాలా తక్కువ. నిజామీని మిక్కిలి జయప్రదంగా అనుకరిస్తూ ఖాజూ (కిర్మాన్ నివాసి) తనయుగంలోని కవులందరిలో అగ్రేసరు డయాడు. *రఫ్జత్-ఉల్-అన్వార్* అనే నీతి కావ్యం అతడు వ్రాశాడు. దీనికి నిజామీ రచించిన *మఖ్జన్ ఉల్-అన్వార్* మేలుబంతి. ఏల్ఖాన్ యుగం చివరి సంవత్సరాలలో- అనగా, తైమూర్ లంగ్ పర్షియా మీదికి దండెత్తి రావడానికి ముందరి 50 సంవత్సరాలలో - సూఫీ సాహిత్యం గొప్ప అభ్యుదయం సాధించింది. మహమూద్ షబిస్తరీ రచించిన *లమ్ ఆత్ ఆఫ్ ఇరాఖీ, గుల్షన్ ఎ-రాజ్* అనే తాత్త్విక కావ్యాలు రెండూ ఈ యుగం సాహిత్యంలో మిక్కిలి ప్రసిద్ధి పొందిన కావ్యాలు.

ఫార్సీ మహాకవులలో చివరివాడు హఫీజ్. భావ నైశిత్యంలోను, భావనా సౌందర్యంలోను ఫార్సీకవులలో ఇతడు అగ్రగణ్యుడు. 'ఖసీదా'లూ, 'రుబాఇయాత్'లూ మాత్రమే కాక 'గజల్' లు కూడా ఇతడు వ్రాశాడు. 'గజల్'ల రచనవలననే ఇతనికి అధిక ప్రశస్తి వచ్చింది. 'షిరాజ్ కోకిల' గా ఇతడు ప్రసిద్ధు డయాడు.

**తైమూరిడ్ యుగం :** ఏల్ఖాన్ యుగంలో లాగానే తైమూ రిడ్ యుగంలో కూడా విద్వాంసులు అనేకులు పలు చరిత్ర గ్రంథాలు వ్రాశారు. ఎందరో సంకలన కర్తలు సేకరించిన గ్రంథాలు ఎన్నో ఇప్పుడు లభిస్తున్నా, ఈ యుగంలో అగ్రశ్రేణికి చెందిన చారిత్రకుడు ఎవ్వడూ కనిపించడు. ఉన్నవారిలో హాఫీద్ అబ్రూ చెప్పకోదగ్గవాడు. విశ్వ చరిత్రను గురించి ఇతడు *జుబ్‌దతుల్ తవారీఖ్* అనే ఉద్‌గ్రంథం రచించాడు. తైమూరిడ్ యుగంలో కొందరు కవులూ, తత్త్వచింతకులూ కూడా ఉన్నారు. జామీ రచనలు అనేకం గద్యంలో ఉన్నాయి. సాదీ *గులిస్తాన్*ను మేలు బంతిగా గ్రహించి, *బహారిస్తాన్* అనే ఉత్తమ గద్య గ్రంథం ఇతడు రచించాడు. నిజామీని అనుకరిస్తూ ఆ ఛందస్సులోనే ఇతడు 5 మస్నవీలు రచించాడు. *సిల్సలత్-అల్-జహబ్, సుబహా-తుల్ -అబ్రాద్* అనే మస్నవీలలో అతని ప్రతిభ విస్పష్టంగా గోచరిస్తుంది. దౌలత్ షా రచించిన *తజ్‌కిరత్-తుస్-ఖోఒ* అనే ప్రసిద్ధ జీవిత చరిత్ర తైమూరిడ్ యుగం చివరి భాగంలో రచించబడింది.

**ఆధునిక ఫార్సీ సాహిత్యం :** పర్షియా సాహిత్య చరిత్రలో సఫవిద్ యుగం (పునరుద్ధరణ యుగం)లో భారతదేశం తోనూ, యూరప్ దేశాలతోనూ ఫార్సీ భాషకు సంపర్కం ఎక్కువ కావడం, మతవిశ్వాసం పెంపొందడం ప్రధాన లక్షణాలు. పర్షియా జాతీయజీవితంలో ఇది పునరుద్ధరణ యుగంగా పరిగణించబడుతూంది. 19 వ శతాబ్ది సాహి త్యంలోనే మత భావాలు ఎక్కువగా ప్రతిఫలిస్తున్నాయి. సఫీవి-షా- అబ్బాస్ ఆ కాలంలోని ప్రతిభావంతులైన రచ యితల నందరినీ ఆకర్షించి పోషించాడు. ఈ యుగంలోని సుప్రసిద్ధ కవులలో మొహ్‌సినెకాషిఫి, హాతీఫ్, వవాయీ, ఫౌఘానీ ముఖ్యులు. హాతీఫ్ కవి తైమూర్ విజయాలను వర్ణిస్తూ వ్రాసిన *తైమూర్ నామా* ఫార్సీ కవిత్వానికి క్రొత్తజీవం పోసింది.

హిలాలీ అస్తరాబాది ఈ యుగానికి చెందిన సూఫీ కవి. సుప్రసిద్ధమైన అతని మస్నవీ *షుల్-ఉ-ఖదా* అని ప్రసిద్ధి చెందింది. షా ఇస్మయిల్, షా అబ్బాస్‌ల మధ్యకా లంలో ప్రతిభావంతులైన కొందరు కవులు జన్మించారు. సాం మీర్జ అనే రచయిత *తుహ్ఫ-ఎ-సామి* అనబడే కొన్ని జీవిత చరిత్రలను రచించాడు. 'అస్కందర్ మున్షీ' అనే రచయిత *తారిఖె ఆలం-అరా-ఎ-అబ్బాసీ* అనే పేర బహు వివరాలతో కూడిన ఒక చరిత్ర రచించాడు.

**ఇండియాలో :** భారతదేశంలో మొగల్ ప్రభువుల కాలంలో - ముఖ్యంగా అక్బర్ చక్రవర్తి ఆస్థానంలో - ప్రతిభావంతు లైన ఫార్సీ విద్వాంసులు ఎందరో ఫార్సీ ఉద్ గ్రంథాలను వెలయించారు. అలాంటి వారిలో పారసీక దేశీయుడు ఖోద్‌మీర్ అనే చారిత్రకుడు ఒకడు. బాబర్ కోరికమీద అతడు *రవ్‌జతుస్సఫా* అనే చరిత్ర గ్రంథాన్ని భారతదేశం లోనే ఉండి రచించాడు. ఇతడు వ్రాసిన మరో ఉద్గ్రంథం *హబీబ్ ఉస్ సియర్.* షర్ఫుద్దీన్ *హుమయూన్ నామా* అనే గ్రంథం వ్రాశాడు.

అక్బర్ చక్రవర్తి కవులను ఎక్కువగా ఆదరించాడు. ముష్ఫిఖ (బుఖారా) అనే గేయ కవిని, 'హుసేన్ సవాయీ' (మషాద్) అనే మస్నవీ రచయితను అక్బర్ పోషించాడు. అక్బర్ కొలువులోని ప్రధానకవి ఉర్ఫి (షిరావాసి) బహు గ్రంథకర్త అయిన 'ఫైజీ' నిజామీ శైలిని అనుసరిస్తూ మన మహాభారతంలోని నల దమయంతుల కథను ఫార్సీ భాషలో రచించాడు.

జుహూరీ (టెహరాన్ వాసి) *సాకీనామా* అనే మస్నవీ వ్రాశాడు. ఇతణ్ణే అనుకరిస్తూ హఫీజ్ అలాంటిదే మరో మస్నవీ రచించాడు. జామీ తరువాత వచ్చిన కవులలో తబ్రిజీ కుటుంబానికి చెందిన 'సాయెబ్' (ఇస్ఫహాన్ వాసి) మిక్కిలి సమర్థుడైన కవిగా పరిగణించ బడుతున్నాడు. అతడు భారతదేశంలో షాజహాన్ కొలువులో కొంత కాలం గడిపాడు. అతని పద్యసంకలనం (*దివాన్*)లో - అనేక 'గజల్'లు, క్వాట్రెయిన్‌లు, పలువురు పోషకుల స్తుతులు, కొన్ని తుర్కిష్‌గజల్‌లు ఉన్నాయి.

సఫవిద్ యుగం తరువాత కూడా కొన్ని పాత కవితా ప్రక్రియలు ఇంకా కొనసాగుతూనే ఉన్నా, పాశ్చాత్య సంపర్కం, నూతన ప్రభావాలూ కొంత పరివర్తనం కలిగించాయి. ప్రాచీన సంప్రదాయానికి చెందిన ఈ కాలపు ప్రసిద్ధ ఫార్సీ కవులలో ముఖ్యుడు షేక్ ఆలీ హజిన్ (18 వ శతా.). ఇతడు తన కాలంలోని కవులను, పండితులను గురించి *తజ్ కిరతుల్మ్-ఉ ఆసరన్* అనే గ్రంథం రచించాడు.

19 వ శతాబ్దిలో ఇరాన్‌లో జన్మించిన కవులలో హబిబుల్లా ఖా ఆనీ మిక్కిలి ప్రతిభావంతుడు. ప్రాచీన యుగంలోని మహాకవుల రచనలలోని కొన్ని ఉదాత్త కవితా లక్షణాలు ఇతని కవిత్వంలో లోపించినప్పటికీ, ఇతని హేళనలలోను, స్తుతులలోను మహాకవిత్వ లక్షణాలు కనిపిస్తూనే ఉన్నాయి. గొప్పకవి, గేయకారుడు అయిన రజాఖాన్ లాలాబక్షీ *మజ్మ-ఉల్-ఫుసహా, రియాజుల్ అరిఫిన్* అనే రెండు ఉత్తమ గ్రంథాలు రచించి సాహిత్యానికి ఇంతింత అనరాని వన్నె చేకూర్చాడు.

దీర్ఘ విలాప కావ్యాల నుంచి పరిణమించిన 'తాజియా'లు ఆధునిక కాలంలోనే వృద్ధి పొందాయి. 19 వ శతాబ్దిలో బాబ్‌వాదం వచ్చింది. దీనికి చారిత్రక మైన విలువే ఎక్కువ అయినా, సాహిత్య ప్రాధాన్యం కూడా లేకపోలేదు. బాబ్ అనేక గ్రంథాలు రచించాడు. వాటిలో మిక్కిలి ముఖ్యమైంది *బయాన్*. హాజి-జైనుల్-ఏ-ఆబిదీన్ తన పర్యటనలను గురించి వర్ణిస్తూ *సియహత్-నామా-ఏ-ఇబ్రహీమ్* అనే గ్రంథం మనోహరమైన శైలిలో రచించాడు.

పాశ్చాత్య కళా విజ్ఞానాల ప్రభావం చేత ఆధునిక కవిత్వంలో గొప్ప పరివర్తనం ఏర్పడింది. నవ్య కవులు నూతన వస్తువులను గ్రహించి కవితా రంగాన్ని విస్తృతం చేశారు. ఈ నూతనోద్యమం ఫార్సీ కవిత్వానికి కృతక సంప్రదాయ శృంఖలాల నుంచి విముక్తి కలిగించింది. ఆధునిక ఫార్సీ కవిత్వం ప్రధాన లక్షణాలను ఈ క్రింది విధంగా సంగ్రహించవచ్చును:

1. కృతకం, ఆలంకారికం అయిన శైలికి స్వస్తి చెప్పబడింది. 2. మానవ జీవితానికి సంబంధించిన సర్వ రంగాలనుంచీ వినూతన వస్తువులు గ్రహించడం ఆరంభమైంది. 3. కాయిక శృంగార వర్ణనతో కూడిన కావ్యాల సంఖ్య తగ్గింది.

ఆధునిక కవిత్వంలో కొన్ని లోపాలు కూడా లేకపోలేదు. పెక్కు కావ్యాలలోని రచన కవితాశక్తి లోపించి ఛందోబద్ధమైన వచనం లాగ కనిపిస్తోంది. ఉదా: షొరిదా రచించిన *అవ్‌ద్జార్*. కొన్ని కావ్యాలు జనసమూహాలకు డెమోస్తనీస్ ఇచ్చిన ఆవేశపూరితమైన ఉపన్యాసాలలాగ ఉంటాయి. ఉదా. *అఖ్‌గరువతన్ ఫరోష్*.

ఆధునిక యుగంలోని రాజనీతి, దేశభక్తి ప్రధానాలైన కావ్యాలలో కూడా శృంగారం (ప్రేమ), వీరం, కరుణ మొదలైన రసాలు గోచరిస్తున్నాయి. ఈరజ్ మీర్జా రచించిన *మాదెర్, బిల్ఫ్-ఎ-మోదెర్* అనే రెండు కావ్యాలూ ఇందుకు నిదర్శనం.

కొన్ని కావ్యాలు వైదుషీ చమత్కారాలతో నిండి ఉంటాయి. ఇందుకు పూరల్ వ్రాసిన *మా హెబె మెహర్* చక్కని ఉదాహరణ. ఇరాన్‌లోని ఆధునిక ఫార్సీ కవయిత్రులలో పర్వీన్-ఎ-తెసామీ సుప్రసిద్ధురాలు.

ఆధునిక పర్షియా ఆస్థానకవి బహుమషాది. మహమ్మద్ బిన్ అబ్దుల్ వహబ్ ఖజ్వీనీ, రజాజాదానీ షఫక్ సయీద్ నఫీసీ నేటి ఉత్తమ ఫార్సీ వచన రచయితలు.

*రషీద్.(బా.శ్రీ.)*

## బర్మీస్ భాష - సాహిత్యం

**భాష :** బర్మీస్ భాష, దానికి సన్నిహిత సంబంధమున్న లోలో మాండలికాలూ, బర్మా, దాని పరిసర దేశాల్లో వినబడే కచినిష్, కుకిష్ భాషలూ సీనా-టిబెటన్ భాషాకుటుంబానికి చెందిన టిబెటన్-బర్మన్ వర్గానికి సంబంధించినవి. ఇందులో అరకానీజ్, దాను, ఇంథా అత్సి, లాషీ, మారు మొదలయిన మాండలికాలు ఉన్నాయి. ఆధునిక ప్రామాణిక బర్మీస్ భాష పురాతన బర్మీస్‌తో పోల్చి చూస్తే మిగతా మాండలికాల కన్న ఎక్కువ మార్పు చెందింది.



బర్మా

బర్మీస్ పదాలు చాలావరకు ఏకాక్షరాత్మకాలు. బర్మీస్ స్వరప్రధానమైన భాష- అంటే ఒకే పదానికి స్వరాన్ని బట్టి అర్థాలు మారుతా యన్నమాట.

11 వ శతాబ్దం మధ్యకాలం నుంచీ బర్మీస్ లిఖిత రూపంలో మనకు లభ్యం అవుతూంది. భారతీయ భాష అయిన పాళీ బర్మీయులకు పవిత్రమైన భాష అవడంచేత తమ భాషకు పాళీ లిపినే కొద్ది మార్పులతో వారు స్వీకరించారు.

**సాహిత్యం :** అతి ప్రాచీనమైన బర్మా సాహిత్యం శిలా శాసనాల్లోనే కనిపిస్తూంది. మిక్కిలి పురాతనమైన శాసనం 1113 నాటి 'మెయిజెయి' లేక మయిన్కబాకు, బయౌక్ - క్యీ. ఈ శాసనాలు సాధారణంగా వ్యక్తుల పేర అంకితం చేయబడ్డ సాంప్రదాయిక చిహ్నాలు.

15 వ శతాబ్ది మధ్య భాగం నుంచి సృజనాత్మకమైన బర్మీస్ సాహిత్యం కనపడుతూంది. ఇది ప్రధానంగా తాటాకుల మీద గంటంతో వ్రాయబడేది. ఈ సాహిత్యానికి 19 వ శతాబ్దం వరకూ బౌద్ధ చక్రవర్తులే పోషకులు. గ్రంథకర్తలు బౌద్ధ సన్న్యాసులు. బౌద్ధ మఠాలలో శిక్షితులయి ఆస్థానానికి చెందినవారూ, కవయిత్రులూ కూడా కొందరు ఉన్నారు. ఆ రచనలలో కొన్ని పద్య కావ్యాలుగా వ్రాసిన బౌద్ధ జాతక కథలు (ప్యో), కొన్ని బౌద్ధ మత గ్రంథాలు ఆధారంగా వ్రాసిన పద్య నీతి కథలు, కొన్ని స్తుతి పద్యాలు (*మాగస్*), కొన్ని చారిత్రక పదాలు (*ఎగియున్*), కొన్ని ప్రకృతి ప్రేమ గేయాలు (*యదు*), కొన్ని *టే-దల్, దాన్-చో, లే-చో, ద్వే-చో, బా-లే* అనబడే చిన్న చిన్న గేయాలు. ఇవి గాక కొన్ని లేఖలూ (*మియిట్టజ్జా*), కొన్ని ఆస్థానంలో ప్రదర్శనకు యోగ్యంగా ఉండే రూపకాలూ, కొన్ని ప్రాచీన రంగస్థల నాటకాలూ (ప్యా-జప్) కూడా ఉన్నాయి. అందులో 50 కి పైగా పద్య రచనలతో కూడినవి. బౌద్ధ ధర్మాసక్తి, ఆస్థానోచిత మైన భాషా మాధుర్యాలు వీటి ప్రత్యేక లక్షణాలు.

ఈ యుగంలో పద్య కావ్యాలు విరివిగా వ్రాయబడ్డా, వచనం ఉపేక్షించబడలేదు. అందులో చాలాభాగం పాళీ భాషలోని జాతక కథలకూ, బర్మీయ పూర్వ చరిత్రలకూ అనువాదాలు. చిన్న చిన్న వాక్యాలతో, శిథిల బంధం కల వాక్యభాగాలతో, నిరంకుశాలైన విరామ చిహ్నాలతో ఈ వచన రచన సాగింది.

1870 లో దిగువ బర్మాలో ముద్రణాలయాలు స్థాపించబడడంతో సాహిత్య చరిత్ర ఒక పెద్దమలుపు తిరిగింది. 1875 నుంచి వెనుకటి పద్య గ్రంథాల స్థానాన్ని నవలలు, కథానికలు ఆక్రమించాయి. 1920 లో రంగూన్ విశ్వవిద్యాలయం స్థాపించబడింది. అప్పటినుంచీ క్రొత్తతరం రచయితలు పద్యం, కథ, వ్యాసం మొదలయిన ప్రక్రియలతో ఆధునిక బర్మా వాఙ్మయాన్ని సుసంపన్నం చేశారు. అనువాదాలు, అనుసరణల ద్వారా ఇతర దేశాల సాహిత్యం బర్మీయులకు అందుబాటులోకి వచ్చింది. 1948 లో బర్మా యూనియన్ స్థాపించబడడంతో జాతీయసంస్కృతి పట్ల అభిమానం, ప్రత్యేక శ్రద్ధ వ్యక్తం అయాయి. అధికార భాషగానూ, బోధనా భాషగానూ ఇంగ్లీషుకు బదులుగా బర్మీస్ భాషనే వాడ నారంభించారు. ప్రభుత్వం కూడా భాషాభివృద్ధికి ప్రోత్సాహాన్నిస్తూ, ఉత్తమ శ్రేణికి చెందిన బర్మీస్ నవలలకు బహుమతుల నీయ నారం భించింది.

డి.వెం. (వ.సం.)

## భారత దేశపు భాషలు-సాహిత్యాలు

**భాషలు :** 1981 వ సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారం భారతదేశపు జనాభా 84,39,30,861. సుమారు 1,652 భాషలు భారతదేశంలో వ్యవహారంలో ఉన్నా, లిపీ, సాహిత్యం ఏర్పడిన భాషల సంఖ్య అతి స్వల్పమే!

**సాహిత్యాలు :** భారతదేశ సంవిధాన సభ మన రాజ్యాంగం లోని 8వ షెడ్యూల్‌లో 18 భాషలను మాత్రమే జాతీయ భాషలుగా గుర్తించి నమోదు చేసింది. అవి: 1. అస్సామీ, 2. ఉర్దూ, 3. ఒరియా, 4. కన్నడం, 5. కాశ్మీరీ, 6. కొంకణి, 7. గుజరాతీ, 8. తమిళం, 9. తెలుగు, 10. నేపాలీ, 11. పంజాబీ, 12. బెంగాలీ, 13. మణిపురీ, 14. మరాఠీ, 15. మలయాళం, 16. సంస్కృతం, 17. సింధీ, 18. హిందీ ఈ భాషా వ్యవహర్తల సంఖ్యను, ఈ క్రింద పట్టిక తెలుపుతుంది.

| | | |
|---|---|---|
| 1. | అస్సామీ | 89,58,977 |
| 2. | ఉర్దూ | 3,53,23,282 |
| 3. | ఒరియా | 2,28,81,053 |
| 4. | కన్నడం | 2,68,87,837 |
| 5. | కాశ్మీరీ | 31,74,684 |
| 6. | కొంకణి | 15,22,684 |
| 7. | గుజరాతీ | 3,31,89,039 |
| 8. | తమిళం | 4,47,30,389 |
| 9. | తెలుగు | 5,42,26,227 |
| 10. | నేపాలీ | 12,86,824 |
| 11. | పంజాబీ | 1,85,88,400 |
| 12. | బెంగాలీ | 5,15,03,085 |
| 13. | మణిపురి | - |
| 14. | మరాఠీ | 4,96,24,847 |
| 15. | మలయాళం | 2,59,52,966 |
| 16. | సంస్కృతం | 2,946 |
| 17. | సింధీ | 19,46,278 |
| 18. | హిందీ | 26,41,89,057 |

వీటిలో సంస్కృతం, ఉర్దూ, సింధీభాషలు ఏ ఒక్క ప్రాంతంలోనూ వ్యవహారభాషగా లేకపోయినా, సంస్కృతం సాంస్కృతిక భాషకావడంవల్లనూ, ఉర్దూ, సింధీ భాషల వ్యవహర్తలు మనదేశంలో ఉంటూ సాహిత్యసృష్టి చేస్తూ ఉండడంవల్లనూ వీటిని కూడా భారతీయ భాషల్లో చేర్చారు.

1954 లో ఏర్పాటు చేసిన సాహిత్య అకాడమీ మొత్తం 22 భారతీయ సాహిత్య భాషల్ని గుర్తించింది. రాజ్యాంగంలో లేని ఇంగ్లీషు, డోగ్రీ, మైథిలి, రాజస్థానీ భాషలు కూడా వీటిలో చేరాయి.

భారత దేశపు ప్రభుత్వ భాషలు రెండింటిలో ఒక టిగా గుర్తించబడిన ఇంగ్లీషు భాషా పఠన పాఠనాలు స్వాతంత్ర్యానంతరం కూడా కొనసాగుతూ ఉండడం వల్లా, ఇంగ్లీషులో సాహిత్య సృష్టి కూడా జరుగుతూ ఉండడంవల్లా అది కూడా భారతీయ సాహిత్య భాషగా గుర్తింపబడింది. జమ్ము, కాశ్మీర్ రాష్ట్రంలో కాశ్మీరీతో పాటు డోగ్రీ భాషలో కూడా సాహిత్య సృష్టి జరుగుతూ ఉండడం వల్ల డోగ్రీని కూడా ఒక సాహిత్య భాషగా గుర్తింపవలసి వచ్చింది. కొంకణి బొంబాయి రాష్ట్రంలో మరాఠీతో పాటుగా వృద్ధి పొందుతున్న మరొక సాహిత్య భాష. నేపాలీ భాష నేపాలీ దేశపు భాషే అయినా సింధీల లాగే నేపాలీలు కూడా మన దేశంలో స్థిరపడి తమ భాషలో సాహిత్యాన్ని పెంపొందించుకుంటూ ఉండడంవల్ల దానిని కూడా ప్రత్యేక భారతీయ సాహిత్య భాషలుగా సాహిత్య అకాడమీ గుర్తించింది. పై 22 భాషలలోనూ సృష్టి అవుతున్న సాహిత్యాలను కలిపి భారతీయ సాహిత్యంగా వ్యవహరిస్తున్నారు. (ఆ యా సాహిత్యాలను గూర్చిన వివరాలకు చూ. *భారత భారతి* సంపుటం).

చంద్ర

## మలయ్ భాష - సాహిత్యం

భాష : 'ఆస్ట్రోనేషియన్' (మలయో-పోలినేషియన్) భాషా కుటుంబంలో ఇండోనేషియన్ శాఖకు చెందిన ఒక భాష. ఈ భాష మాట్లాడే వారు 1 కోటి 30 లక్షల మంది పై చిలుకు ఉన్నారు. మలయా ద్వీపకల్పంలోనే కాకుండా సుమత్రా, బోర్నియోలలోనూ, మరికొన్ని ఆ ప్రాంతంలోని చిన్న చిన్న దీవులలోనూ కూడా ఈ భాష మాట్లాడేవారు ఉన్నారు. మలేషియా, ఇండోనేషియా లలో రెండవ భాషగా విస్తృతంగా ఈ భాష వాడుకలో ఉంది. సుమత్రాలో మాట్లాడే మినాంగ్ కబౌ, కెరిన్ట్జీ, రెజాంగ్ వంటి ఇతర భాషలతో మలయ్ భాషకు సన్నిహి తమైన సంబంధం ఉంది. బోర్నియో, జావాలలోని ఇతర ఆస్ట్రోనేషియన్ భాషలతోనూ, వియత్నాంలో మాట్లాడే చామ్ భాషతోనూ కూడా దీనికి ఎంతో కొంత సంబంధం స్పష్టంగా కనిపిస్తుంది.




మలేషియా

మలయ్ భాషలోని వివిధ మాండలికాలలో మిక్కిలి ప్రధానమైంది దక్షిణ మలయా ద్వీపకల్పంలో మాట్లాడే మాండలికం. ప్రామాణిక మలయ్ భాషకూ, ఇండోనే షియా రిపబ్లిక్‌లోని అధికార భాష అయిన 'భాషా

ఇండోనేషియా'కూ కూడా అదే ఆధారం! బజారు మలయ్ (మెలయు పసార్) అనే మాండలికాన్ని తూర్పు ఇండియా ద్వీపకల్పంలో అనుబంధ భాషగా విస్తృతంగా వాడుతున్నారు. ఇండోనేషియాలోని డచ్‌వారు మాట్లాడే మలయ్ భాషకు ఇదే ఆధారం. మలేషియాలోని చైనీయ వర్తక బృందాలు మాట్లాడే బజారు మలయ్ మాండలిక ప్రభేదాన్ని బాబా మలయ్ అంటారు. మలయ్ భాషతో సన్నిహిత సంబంధం గల భాషలలో లేక మాండలికాలలో ఇబన్ (సీదయాక్), బ్రూనైమలయ్, సాంబాస్ మలయ్, కుటై మలయ్, బంజారీస్ అనేవి బోర్నియోలో వాడుకలో ఉన్నాయి.

మలయ్ భాషా వ్యాకరణంలో ప్రత్యయాల వాడుక, మాటల ద్విరుక్తి ప్రముఖంగా కనిపిస్తాయి. ఉదాహరణకు 'డీబెలి' అంటే కొనబడింది అనీ, 'మెంబెలి' అంటె 'కొను' అనీ అర్థం వస్తుంది. అలాగే 'మౌ-కోరుట' అనే ధాతువు నుంచి ఏర్పడే 'కెమౌవన్' అనే మాటకు కోరిక అని అర్థం. ఈ భాషలో బహువచనాన్ని సూచించ డానికి ద్విరుక్తి వాడతారు. 'రుమహ్' అంటే ఇల్లు; 'రుమహ్ - రుమహ్' అంటే ఇళ్లు.

ఆధునిక కాలంలో మలయా భాషను లాటిన్ వర్ణ మాలతో స్వల్పమైన తేడాలు గల రెండు విభిన్న లిపులలో వ్రాస్తున్నారు. వాటిలో ఒకటి ఇండోనేషియా లోనూ, మరొకటి మలేషియాలోనూ వాడుకలో ఉన్నాయి. జావీ అనబడే ఒక రకపు అరబ్బీ లిపిని కూడా మలయాలోనూ, సుమత్రాలోని కొన్ని ప్రాంతాలలోనూ వాడుతున్నారు. మలయ్ భాషలో లభించిన తొలి లిఖిత ఆధారాలు 7 వ శతాబ్ది చివరి భాగానికి చెందిన కొన్ని సుమత్రన్ శాసనాలు. అవి దక్షిణ భారత దేశానికి చెందిన పల్లవ లిపిలో ఉన్నాయి.

మలయ్ భాషలో పద సంపద ఎక్కువ. క్రీస్తుశకం ఆరంభ కాలం నుంచీ సంస్కృత భాష ప్రభావం, 14 వ శతాబ్దంనుంచీ అరబ్బీ భాష ప్రభావం ఈ భాషమీద కనిపిస్తాయి. అనంతర కాలంలో ఇంగ్లీష్, డచ్ మొదలైన పాశ్చాత్య భాషలనుంచీ, తమిళం, హిందూస్థానీ మొదలైన భారతీయ భాషలనుంచీ, చైనీస్, జావానీజ్ భాషల నుంచీ కూడా పదజాలం ఎక్కువగా ఈ భాషలో ప్రవేశించింది.

**సాహిత్యం :** చరిత్రలు, పల్లె పాటలు (పాన్టౌమ్) మినహాయిస్తే ఇంచుమించు మలయా సాహిత్య మంతా అనువాద ప్రాయమే అని చెప్పాలి. హిందూ యుగంలో (400-1400) వెలువడిన సాహిత్యం ఏదీ నేడు లభించడం లేదు. *రామాయణ, మహాభారతాలు, జావానీజ్ కథాచక్రం* మలయాలోని గొప్ప విద్యాకేంద్రం అయిన మలక్కాలో 1450 ప్రాంతంలో పెర్షో-అరబిక్ లిపిలో రచించబడ్డాయి. మలయాదేశం ముస్లిం మతాన్నే అవ లంబించినా, భారతీయ శృంగార కథలనూ, హిందువుల పురాణ కథలనూ, పారశీకుల ఇతిహాసాలనూ, అరబ్బీ కథ లనూ ఎక్కువగా ఆదరించింది. 'శుభాంతమైంది అంతా శుభమే' అని ఒక కథ. ఇంకో కథ ఓల్టెర్ జడిగ్ నుంచి ఎరువు తెచ్చుకున్నది. పారశీ భాషనుంచి *అలె గ్జాండర్ కథ, శుక కథలు, అమీర్ హంజా కథలు* అనువదించబడ్డాయి. బిడ్ మీది కథలకూ, భక్తియార్ కథాచక్రానికి అనేక పాఠాంతరా లున్నాయి. *నూరు ప్రశ్నల గ్రంథం* మలయాకు పారశీ భాషనుంచి వచ్చిందే! యూరప్ ఖండంలోని ఇస్లాం మతానికి సంబంధించి తెలి సిన మొదటి ఉదంతం ఇదే అని భావిస్తున్నారు. 15వ శతాబ్దం నుంచి ఎలాంటి సాంకేతిక పదాల సహాయం లేకుంగానే మలయ్ రచయితలు ఇస్లాం మత విశ్వా సాలనూ, న్యాయాన్నీ, తత్త్వాన్నీ ప్రపంచించడం వారి రచనా కౌశలాన్నీ, బుద్ధి సంపదనూ స్పష్టం చేస్తుంది. *ప్రాచీన సింగపురం, మలక్కాలచరిత్ర* (మలయా కథా వళి), అటు తరువాత వచ్చిన పెడహ్ కథావళి, మిస మెలయు, రాజా అలిహజి వ్రాసిన *తుహాఫట్, అల్‌న పిస్* లాంటి చరిత్రల కన్నింటికీ ఒజ్జబంతి అని చెప్పాలి. అరబ్, భారతీయ వంశానికి చెందిన మున్షీ అబ్దుల్లా (1796-1854) మలయ్ భాషలో మొట్టమొదటి స్వీయ చరిత్ర రచించాడు. అదే కాక ఆయన *మలయా తూర్పు తీరపు యాత్రాస్థల వివరాలు, మక్కా తీర్థయాత్ర* అనే గ్రంథాలను కూడా వ్రాశాడు.

20 వ శతాబ్దంలో ప్రధానంగా పాఠ్య పుస్తకాలూ, ఈజిప్టు మూలాలను అనుసరించి రచించిన కథాపుస్తకాలే ఎక్కువగా వెలువడ్డాయి.

*డి.వెం.(బొ.శ్రీ.)*

## సింహళీ భాష-సాహిత్యం

**భాష :** సింహళీ భాష ఇండో-యూరోపియన్ భాషా కుటుంబంలోని పాళీభాష నుంచి పుట్టింది. సింహళీ భాషలో అక్కడక్కడ కొన్ని మాండలికాలు వ్యాప్తిలో ఉన్నాయి. అయినా - వీటిలో ఎక్కువ సాన్నిహిత్యం కనిపిస్తుంది. సింహళీ లిపి కూడా బ్రాహ్మీలిపి నుంచే పుట్టింది.

**సాహిత్యం :** క్రీ.పూ.3వ శతాబ్దంనాటికే సింహళంలో

వాఙ్మయం సృష్టింపబడింది అనడానికి ఆధారా లున్నాయి. అయితే - ఆ సాహిత్యంలో లభిస్తున్న ఆదిమ రచన సీగిరియా దుర్గంలోని దర్పణకుడ్యం మీద చెక్కబడ్డ *సీగిరియా గ్రప్తితి* అనే గీతి సముదాయం మాత్రమే! వీటిలో మొదటి గీతం 5వశతాబ్దంలో వ్రాయబడి ఉండవచ్చును. 10 వ శతాబ్దానికి చెందిన *సియబస్లకర, సిఖవళణ్ద* అనేవి ఇప్పటికి లభిస్తున్న సింహళీ గ్రంథాలలో అత్యంత ప్రాచీనమైనవి. వీటిలో మొదటిది అలంకార శాస్త్రగ్రంథం. రెండోది బౌద్ధ సన్న్యాసుల జీవిత నియమాలను తెలిపే మతగ్రంథం.




శ్రీలంక

క్రీ.శ. 12 వ శతాబ్దం చివర గురళుగోమి వ్రాసిన *అమవతుర, ధర్మప్రదీపికావ* అనే గద్య గ్రంథాలు వెలువడ్డాయి. తరువాత క్రీ.శ.13వశతాబ్దంలో వాటి ననుసరించి అనేక ఇతర గద్య గ్రంథాలు వ్రాశారు. వాటిలో *బుత్సరణ, సద్ధర్మ రత్నావలియ, పూజావలియ, తూపవంశ* అనేవి ముఖ్యంగా చెప్పుకోదగ్గవి.

సింహళీ వాఙ్మయంలో మొదటి కథా కావ్యాలు కూడా క్రీ.శ. 12 వ, 13 వ శతాబ్దాలలోనే వెలువడ్డాయి. *మువదేవ దావత, సస దావత, కవ్‌శిళుమిణ* అనేవి వాటిలో ముఖ్యమైనవి. తరువాత పలువురు కవులు బౌద్ధవస్తువులను గ్రహించి కావ్యాలు వ్రాశారు. క్రీ.శ. 14 వ శతాబ్దం చివరి పాదం నుంచి సందేశ కావ్యాలు వెలువడ్డాయి. క్రీ.శ. 15 వ శతాబ్దంలో కథాకావ్యాలతో పాటు అనేక సందేశ కావ్యాలు కూడా రచించబడ్డాయి. వాటిలో రాహులుని *కావ్యశేఖరం*, వాత్తావె వ్రాసిన *గుట్టిల* కావ్యం ప్రధానమైనవి.

తరువాతి 3 శతాబ్దాల కాలంలోనూ పాశ్చాత్యుల దండయాత్రల వల్లనూ, ఆంతరంగిక కల్లోలాల వల్లనూ సింహళీ సాహిత్యం చాలా వరకు వెనుక బడింది. ఈ అంధకార యుగంలో అక్కడక్కడ నక్షత్రాల్లాగ మెరసి కొంతైనా వెలుగు నందించిన వారు అలగివయన్న మొహత్తాల, వాళివిత సరణాంకర అనే బౌద్ధ రచయితలు.

19 వ శతాబ్దం తరువాత సింహళీ రచయితలపై పాశ్చాత్య వాఙ్మయ ప్రభావం కనిపిస్తుంది. 20 వ శతాబ్దంలో అవతరించిన నవలల మీద ఆ ప్రభావం మరింత ఎక్కువగా గోచరిస్తుంది. పద్య కావ్యాల రూప స్వభావాలలో కూడా మిక్కిలి మార్పు వచ్చింది. ఇతిహాసాలు మొదలైన పాత ప్రక్రియలు మాని, సింహళీ కవులు భావగేయాలు వ్రాయటం మొదలు పెట్టారు. అనేక శతాబ్దాలనుంచి జానపద రూపకమైన నాడగం జనుల సాంఘిక, సాంస్కృతిక జీవితం మీద ఎంతో కొంత ప్రభావాన్ని చూపిస్తున్నమాట యథార్థమే! అయినా, సింహళీ సాహిత్యంలో రూపక రచన ఇంకా బాల్యావస్థలోనే ఉందని చెప్పక తప్పదు. అయితే ఇటీవల వ్రాయబడ్డ రూపకాలమీద పాశ్చాత్య రూపక ప్రక్రియా ప్రభావం బాగా కనబడుతున్నది.

ది.వెం. (వేం.వెం.)

## సిరియాక్ భాష-సాహిత్యం

భాష : సిరియాక్ భాష ఉత్తర, మధ్య, లేక వాయవ్య శాఖకు చెందిన సెమిటిక్ భాష. 3 వ శతాబ్దం నుంచి 7 వ శతాబ్దం వరకు ఈ భాష క్రైస్తవ సాహిత్యానికీ, ప్రార్థనలకూ ముఖ్యమైంది. టుర్కీ ఆగ్నేయ భాగంలో ఉన్న ఎడెస్సా (ప్రస్తుతం దీని పేరు ఉర్ఫా)లోని తూర్పు అరమాయిక్ మాండలికం నుంచి ఈ భాష ఏర్పడింది. 2 వ శతాబ్దాంతంలో మధ్య ప్రాచ్యంలో క్రైస్తవ మతానికి ముఖ్యమైన కేంద్రాలలో ఒకటి ఎడెస్సా.




సిరియా

సిరియాక్ భాషలో 1 వ శతాబ్దం నుంచి శాసనాలు కనిపిస్తున్నాయి. శిలా శాసనాలు కాకుండా ఇతర లిఖిత పత్రాలు 243 వ సంవత్సరం నుంచి లభ్యం అవుతున్నాయి.

సిరియాక్ మాట్లాడే క్రైస్తవులు, కొన్ని మత పరమైన కారణాల వలన 5 వ శతాబ్దంలో తూర్పు సిరియన్‌లు, పశ్చిమ సిరియన్‌లు అని రెండు వర్గాలుగా చీలిపోయారు. అప్పుడు తూర్పు సిరియన్‌లు ఎడెస్సానుంచి బహిష్కరింపబడి పర్షియాలో స్థిరపడ్డారు. ఈ చీలిక తరువాత ఈ రెండు వర్గాలవారూ భిన్నమైన మాండలికాలను అభివృద్ధి చేసుకున్నారు. ఈ రెండింటికీ అచ్చుల ఉచ్చారణలోనూ, వ్రాతలోనూ, వ్రాతలో అచ్చులను సూచించే పద్ధతిలోనూ ప్రధాన భేదాలు ఉన్నాయి.

**సిరియాక్ లిపి :** సిరియన్ క్రైస్తవులు 1 వ శతాబ్దం నుంచి 14 వ శతాబ్దందాకా అరమాయిక్ లిపి నుంచి పరిణమించిన ఒక సెమిటిక్ వర్ణమాలను లేఖనంలో ఉపయోగించేవారు. ఆ వర్ణమాలలో 22 వర్ణాలు ఉంటాయి. అవన్నీ హల్లులే. ఈ లిపి కుడి నుంచి ఎడమకు, ఒక్కొక్కపుడు నిలువుగాను కూడా వ్రాయబడుతుంది. హల్లులకు పై భాగంలోను, దిగువ భాగంలోను గుర్తించే కొన్ని రేఖల వలన అచ్చులు సూచించబడతాయి. ఈ విధంగా అచ్చులను గుర్తించే పద్ధతి 600-1000 మధ్య రూపొందింది. ఇలా అచ్చులను సూచించడానికి వివిధ విధానాలు అనుసరించేవారు. కొన్ని అరబిక్ విధానాన్ని పాటించగా మరి కొన్నిటిలో గీతకు పైనో క్రిందో గ్రీక్ వర్ణాలతో అచ్చులను సూచించేవారు.

సిరియాక్ లిపిలో అనేక భేదా లున్నాయి. వాటిలో ముఖ్యమైంది: ఎస్ట్రాంగెలా లేక ఎస్ట్రాంగెలో. ఇదే 500 వ సంవత్సరం దాకా పూర్తిగా వాడుకలో ఉంది. ఈఫిసస్ కౌన్సిల్ (431) లో సిరియన్ చర్చి రెండుగా చీలి పోవడంతో సిరియాక్ భాషలోను, లిపిలోను కూడా రెండు రూపాలు ఏర్పడ్డాయి పశ్చిమ ప్రాంతరూపం, తూర్పు ప్రాంతరూపం అని. 7వశతాబ్ది అనంతరం ముస్లిమ్‌ల, అరబ్‌ల హయాంలో పశ్చిమ ప్రాంతరూపం ఇంచుమించు అంతరించింది. అయితే చెదురుమదురుగా కొన్ని సిరియన్ క్రైస్తవ సమాజాలు నిలిచి ఉండడం, వారు సిరియాక్ లిపినే వాడుతూ ఉండడం జరిగింది. పాలస్తీనా సిరియన్‌లనబడే మెలెకైట్ శాఖ తాలూకు పత్రాలు 14 వ శతాబ్దినాటి నుంచి లభిస్తున్నాయి. తూర్పు ప్రాంతపు, లేక నెస్టోరియన్ లిపి మధ్యాసియాలోను, సైబీరియాలోను 13వ, 14వ శతాబ్దుల వరకు నిలిచి ఉన్నట్లు దక్షిణ సైబీరియాలోని సమాధి ఫలకాలమీది వ్రాతలు స్పష్టం చేస్తున్నాయి. అతి ప్రాచీన సిరియాక్ శాసనం క్రీ.శ. 50 వ సంవత్సరం నాటిది.

**సాహిత్యం :** ఎడెస్సా చుట్టుప్రక్కల 1 వ శతాబ్దం నుంచి మధ్యయుగం వరకూ ప్రచారంలో ఉన్న తూర్పు అరమాయిక్-సెమిటిక్ భాష అయిన సిరియాక్ భాషలో వ్రాసిన సాహిత్యాన్ని సిరియాక్ సాహిత్యం అంటారు. 2 వ శతాబ్దంనుంచి క్రైస్తవ మతం ప్రబలంగా ఉన్న ప్రాచ్య దేశాలలో వైజ్ఞానిక కేంద్రంగా ఎడెస్సా గుర్తింపబడింది. 14 వ శతాబ్దంలో అరబ్బీ భాష సిరియాక్ భాషని తుడిచి పెట్టే వరకూ సిరియాక్ సాహిత్యం వెలువడుతూనే ఉంది. సెమెటిక్ పండితులకు ఈ సాహిత్యం ఆవశ్యకత ఎంతో ఉంది. సిరియన్ క్రైస్తవమతం అధ్యయనానికి ఇది అతిముఖ్యం. గ్రీక్ క్రైస్తవ గ్రంథాలు ఈ సాహిత్యంలో భద్రపరచబడ్డాయి. ప్రాచీన గ్రీక్ పాండిత్యానికీ, ఇస్లామిక్ ప్రపంచానికీ మధ్య ఈ సాహిత్యం కీలకమైన పాత్ర నిర్వహించింది. సిరియాక్ భాష పొందిన ప్రాముఖ్యానికి కారణం బైబిల్ నుంచి అనువాదాలు, పాటలు, పద్యాలు, గ్రీక్ నుంచి అనువాదాలు, బైబిల్ మీద వ్యాఖ్యానాలు, చారిత్రక గ్రంథాలు, సత్పురుషుల జీవిత సంగ్రహాలు, తత్త్వ శాస్త్రం, వ్యాకరణం, వైద్యం, విజ్ఞాన శాస్త్రం మొదలైనవి ఈ భాషలో లభ్యం కావడమే.

4 వ శతాబ్దంలో నివసించిన సెయింట్ ఎఫ్రెయ్ సైరస్ రచనలు ఈ సాహిత్యంలో మొట్టమొదటివి. తరువాత వచ్చిన రచయిత లెవరూ ఈ రచనలను అధిగమించలేక పోయారు. ఆయన పద్య రచనలో రెండు పద్ధతులు వాడారు. వాటిలో ఒకటి : వాడుక భాషను మహాకావ్యాలలో పద్యరచనకు ఉపయోగించడం. రెండు: బృందగానాలకు ఉపయోగించే రచనలు చేయడం. తూర్పు సిరియన్‌లలో ప్రసిద్ధి పొందిన నర్సై (503 ప్రాంతంలో చనిపోయాడు) తూర్పు క్రైస్తవ శాఖకు చెందిన వాడు. ఆయన పద్యాలలోని సొగసు, శైలిలోని సౌందర్యం వల్ల ఆయనను "హార్ప్ ఆఫ్ ది హోలీ స్పిరిట్" అనేవారు. మొదటి మైకేల్ రచించిన విస్తృతమైన సిరియాక్ చారిత్రక గ్రంథాలు మిక్కిలి ప్రధానమైనవి. ఈ 21 గ్రంథాలలోను చర్చికి, లౌకిక విషయాలకు సంబంధించిన చరిత్ర (1195 వరకు) ప్రస్తావించబడింది. ఇప్పుడు లభ్యం కాని అనేక పుస్తకాలు, పత్రాలు ఇందులో పొందుపరచబడడం వలన, చరిత్రకు సంబంధించిన ఎన్నో ఆధారాలు ఇందులో ఉండడం వలన దీని విలువ అమోఘం.

గ్రీక్ క్రైస్తవ రచనలను సిరియాక్ భాషలో వెలువరించడం ద్వారా సిరియన్‌లు తమ సాహిత్య కృషి మొదలు పెట్టారు. ఈ విధంగా అనువదించిన గ్రీక్-సిరియన్ సాహిత్యం మూలభాషలో లభ్యం కాని గ్రీక్ క్రైస్తవ సాహిత్యానికి ముఖ్యమైన ఆధారం అయింది. అరిస్టాటిల్ మొదలైన ప్రాచీన గ్రీక్ తత్త్వవేత్తల రచనలలో చాలావరకు సిరియాక్ భాషలోకి అనువదించారు. ఇదే విధంగా వైద్య, వైజ్ఞానిక రచనలను గ్రీక్ నుంచి సిరియాక్ భాషలోకి అనువదించారు. ఈ అనువాదాలు ఇస్లామిక్ నాగరకత పెరగడానికి విశేషంగా దోహదం చేశాయి. ఎందుకంటే సిరియాక్ నుంచి అరబ్బీ భాషలోకి అనువదించడం గ్రీక్ నుంచి అరబ్బీభాషలోకి నేరుగా అనువదించడం కంటె తేలిక. ఉదాహరణకు గాలెన్ గ్రంథాలలో 130 సిరియాక్ నుంచి అరబ్బీలోకి అనునదించబడగా, గ్రీక్ నుంచి అరబ్బీలోకి నేరుగా అనువదించబడినవి 9 మాత్రమే. ఇందువలన గ్రీక్ సంస్కృతికి సంబంధించిన అనేక గ్రంథాలు సిరియాక్ భాష ద్వారా మహమ్మదీయ ప్రపంచం మీద విశేష ప్రభావాన్ని ప్రసరించాయి.

ఇ.నా.(బొ.శ్రీ.)

## హీబ్రూ భాష-సాహిత్యం

**భాష :** *బైబిల్* రచనా కాలం నాటికి పాలస్తీనాలో జీవిస్తూ ఉండిన యూదుల మాతృ భాష ఇది. ప్రపంచంలో సజీవంగా ఉన్న ప్రాచీన తమ భాషలలో ఇది ఒకటి. క్రీ.పూ. 2,000 సంవత్సరాలనాటినుంచి ఈ భాష వాడుకలో ఉన్నట్లు క్రీ.పూ. 1350 నాటి 'ఎల్ అమర్‌నా' ఫలకాల వల్ల తెలుస్తూంది. సెమెటిక్ భాషా కుటుంబానికి చెందిన కెనానిటిష్ శాఖ తాలూకు ఒక మాండలికం హీబ్రూ భాష. ఇటీవల ఈ భాష పునరుద్ధరింపబడి ఇజ్రేల్ రాజ్యానికి అధికార భాషగా గ్రహించబడింది.

మన ఆర్య, ద్రావిడ భాషల కంటె సెమెటిక్ భాషలు విలక్షణ మైనవి. ఈ భాషలలో శబ్దాల ప్రాతిపదికలలో అచ్చులు కనిపించవు. ఉచ్చారణలో మాత్రమే అవి వినిపిస్తాయి. ఉచ్చారణలో హీబ్రూ భాష అరబిక్, అరమాయిక్ భాషలకు మధ్యస్థంగా ఉంటుంది. అరబిక్‌లో నేటికీ నిలచి ఉన్న కొన్ని సెమిటిక్ భాషా మూలధ్వనులు ఈ భాషలో లోపించాయి. కథా కథనానికీ, కవిత్వానికీ ఇది చాలా అనుకూలమైన భాష. కాని, ఈ భాషలో విశేషణాలూ, క్రియా విశేషణాలూ లేక పోవడంవల్ల భావ ప్రకటనలో కొంత క్లేశం ఉంది. ఆధునిక రచయితలు ఈ లోపాన్ని సవరించడానికి పూనుకొని కొత్త మాటలను కల్పించుకోడమో, ఇతర భాషల నుంచి ఎరువు తెచ్చుకోడమో చేస్తున్నారు.

**సాహిత్యం :** హీబ్రూ సాహిత్యంలో ప్రధానంగా చెప్పుకోదగిన ఉద్ గ్రంథం *బైబిల్*. ప్రపంచంలో *బైబిల్‌*కు వచ్చినంత ప్రచారం ఏ గ్రంథానికీ రాలేదు.

ప్రాచీన కాలంలో హీబ్రూ భాషీయులు తమ రచనలను లిఖిత రూపంలో భద్రపరిచేవారు కారు. తండ్రి నుంచి పుత్రునికీ, గురువునుంచి శిష్యునికీ ఆ నాటి సాహిత్యం పరంపరగా సంక్రమిస్తూ వచ్చింది. *బైబిల్‌*లోని 'ఓల్డ్ టెస్టమెంట్'లో ఆ నాటి సంగతులు కొన్ని పేర్కొనబడ్డాయి. కాలువలూ, బావులూ చాలా అపురూపం అయిన ఆ రోజులలో వారు నీటి ఎద్దడి అనుభవించారు. సృష్టి, జ్ఞానఫలం, తన సోదరుణ్ణి చంపిన కెయిన్, నోవా, బేబెల్ గోపురం మొదలైన వాటికి సంబంధించిన గాథలు ప్రాచీన కాలపు జానపద సాహిత్యానికి చెందినవై ఉండవచ్చును. హీబ్రూ సాహిత్యంలో *పెంటాట్యూక్* అనే ప్రాచీన తమ గ్రంథం మోజెస్ వ్రాశాడని ఒకవాదం. క్రీ.పూ. 440 కి చెందిన ఎజ్రా, నెహెమియా మొదలైన వారు దీనికి సంపాదకులు. తనకు పూర్వులైన ప్రవక్తల పాఠోపదేశాలను ఒకచోట చేర్చి దేశానికి ఐక్యాన్నీ, జాతీయతనీ సమకూర్చేందుకు మోజెస్ ప్రయత్నించాడు. ఆ ప్రయత్నానికి ఫలితంగా వెలసిన *పెంటాట్యూక్* యూదుల దర్శనగ్రంథం, న్యాయశాస్త్రం, శ్రుతి, స్మృతి కూడా! ఇది శాస్త్రీయగ్రంథం అయినా దీనిలో ఉపమానం మొదలైన అలంకారాలు విరివిగా వాడబడ్డాయి.

క్రీ.పూ. 1100 ప్రాంతం నుంచీ విదేశీయులతో యుద్ధాలు చెలరేగి యూదుల సంస్కృతిని కొంత కలవరపరిచాయి. తరువాతి కాలంలో డేవిడ్ గానంచేసిన భక్తిరస భరితమైన గీతాలలో కనిపించే సౌందర్యం, సౌకుమార్యం, ఉదాత్త భావాలూ నిరుపమానాలు. క్రీ.పూ. 7 వ, 8 వ శతాబ్దాలలో వచ్చిన అమోస్, హోసియా, ఇసాయా, జెఫానియా, నాహుం, హబక్కుక్, జెరెమియ, ఎజెకీల్‌ల రచనలలో సాహిత్య కల్పనా, వర్ణనా శక్తీ అధికంగా కనిపిస్తాయి.

యూదుల ప్రాచీన ధర్మగ్రంథం *తాల్ముద్*. అనేక కథలూ, గీతాలూ, ప్రవచనాలూ ఇందులో ఉన్నాయి. క్రీ.పూ. 2 వ శతాబ్దంలో దీనిని *అపోక్రిఫల్* అనే పేరుతో గ్రీక్ భాషలోకి అనువదించారు. ఈ కాలానికి చెందిన ఎనోక్ రచనలో స్వర్గ, నరకాలు విశదంగా చిత్రించబడ్డాయి.

ఎజ్రాతో వ్యాఖ్యాతల యుగం ఆరంభ మైంది. విధుల మీద వ్యాఖ్యానాలు వ్రాసిన వారిని హలాకోథ్ లనీ ఆచార సంబంధమైన సాహిత్యాన్ని రచించిన వారిని హగ్గడోథ్ లని అనేవారు. మొకిల్టా, సిఫా, సిఫేహ్ అని మూడు విధాల భాష్యాలు వెలువడిన కాలం అది. దీనితో మత ప్రచారకులైన రబ్బీలు వచ్చారు. 135 లో రాజకీయ కల్లోలాలవల్ల యూదు విద్వాంసులు చాలా మంది బాబిలోనియా మొదలైన దేశాలకు పారి పోయారు. అప్పటినుంచీ క్రమంగా యూదులు స్వదేశాన్ని పూర్తిగా వదలిపోవలసి రావడంచేత సాహిత్య సృష్టి సన్నగిల్లి, నశించింది. ఎడారి వాసులైన యూదుల సాహిత్య జగత్తు ఒక ఎడారిగా మారింది. ఎడారిలో జోజెబెన్ జోజె 7 వ శతాబ్దిలో చక్కని కవిత్వం చెప్పాడు. కాని, పాలస్తీనాలో 640 లో జన్మించిన జానాఈ అనే కవి ఆదికవిగా పరిగణించ బడుతున్నాడు. ఇతణ్ణే అనుసరించి చమత్కారయుతంగా కవిత్వం చెప్పిన వారిలో ఎలిజెర్‌బెబబీ కలీర్ అనే ప్రతిభాశాలి ముఖ్యుడు.

అరబ్బుల ప్రభావంతో హీబ్రూ సాహిత్యంలో సాడియా బెన్ జోసెఫ్ కవిత్వంతో స్వర్ణయుగం ఆరంభమైంది. బహుముఖమైన ప్రతిభతో తన 21 వ ఏట మొదటి కోశాన్ని ఇతడు రచించాడు. ప్రార్థనలతో కూడిన *సిద్దూర్* ఇతని ప్రధానగ్రంథం. హీబ్రూ వ్యాకర్తలలో ఇతడు ప్రప్రథముడు. ఇతడు వ్రాసిన *విశ్వాసాలూ - సిద్ధాంతాలూ* (*ఎమునోథ్ లేడేఓథ్*) అనే గ్రంథం ఇతనికి పేరు ప్రతిష్ఠలను చేకూర్చింది. దీనితో యూదుల దార్శనిక మీమాంస విదేశ ప్రాభవం నుంచి విముక్తి పొందింది.

అరబ్బుల అధీనంలోకి పోయిన యూదులు 10 వ శతాబ్దం నుంచీ కావ్యాలను మాతృభాషలోనూ, వైజ్ఞానిక రచనలను అరబ్ భాషలోనూ వ్రాయడం మొదలుపెట్టారు. యూరప్‌లోని వివిధ దేశాలకు వలస పోయిన యూదులు ఆ యా భాషలవారితో కలసి పోయినా, తమ మతగ్రంథాలమీద హీబ్రూభాషలో వ్యాఖ్యానాలను వ్రాయడం మాత్రం మానలేదు. వీరిలో 10 వ శతాబ్దిలో రజేనూజెర్షో, 11 వ శతాబ్దిలో రబ్బీషేలోమోయిషాకే ముఖ్యులు. ముఖ్యంగా, హీబ్రూ సాహిత్యంలో స్వర్ణ యుగం స్పెయిన్‌లో కనిపిస్తుంది.

. సాడియా శిష్యుడైన డునాష్ బెన్‌లబరాట్ (920-970) మొదటి సారిగా మాత్రాచ్ఛందస్సును వాడుక చేసినా, ఈ యుగంలో నిజమైన మొదటి కవి సాముయేల్ ఇబన్ నగిలాహ (1033-55). సుందరమూ, ధారావాహికమూ అయిన శైలిలో భక్తిగీతాలను *బెన్‌థిలిం* అనే పేర ఇతడు ప్రచురించాడు. *బెన్ మిష్లే, బెన్‌కోహెలెథ్* ఇతని ఇతర రచనలు.

సాలమన్ ఇబ్న్ గబిరోల్ (1020-52) గొప్ప నిరాశావాది అయినా, మధురమైన కవిత్వం చెప్పగలిగాడు. వేదనా, కరుణలతో నిండిన గంభీరమైన కవిత్వం ఇతనిది. మిబ్బహర్‌హాపేనీ నింతో ఇంకొక ప్రఖ్యాత కవి. మాధుర్య ప్రసాద గుణాలతో కూడిన కవిత్వం కూడా ఈ హాపేనీ చెప్పాడు. పాఠకులను మంత్రముగ్ధులను చేసి సమ్మోహపరిచే శైలిలో ప్రేమ, పెళ్లి, జనన మరణాలు, ప్రార్థన మొదలైన సన్నివేశాలన్నిటిలోనూ ఉపకరించే కవిత్వం చెప్పడమే కాకుండా, పవిత్రగిరి అయిన జియన్ మీద అనేక కరుణ రస భరితాలైన గాథలు అల్లినవాడు కావడంచేత ఇతడు 'జియన్‌గిరి గాయకుడు' గా ప్రసిద్ధి పొందాడు.

అబ్రహాం ఇబ్న్ ఎజ్రా (1092-1167) సర్వతోముఖమైన పాండిత్యం గలవాడు. గంభీరత గాని, మాధుర్యం గాని కవిత్వంలో అంతగా ప్రదర్శింపలేక పోయినా, భాష మీద పూర్తి అధికారం సాధించి హీబ్రూ భాషలో రచనలు చేసిన స్పెయిన్ దేశపు యూదులలో ఇతడు ప్రముఖుడయాడు.

మహా మేధావి, గొప్ప విద్వాంసుడు, తార్కిక శిరోమణి అయిన మోజెస్ బెల్ మైమోన్ మైమొనైడ్జ *తాల్ముద్‌*కు ఒక వ్యవస్థ కల్పించి, యూదుల దార్శనిక మీమాంసకూ, అరిస్టాటిల్ దర్శనానికీ మధ్య భేదం లేదని సిద్ధాంతీకరించాడు. ఇతడు రచించిన *పథ ప్రదర్శకం* అనే గ్రంథాన్ని ఈయన కాలంలోనే హీబ్రూ భాషలోకి అనువదించారు.

యుదాబెన్ సాలమన్ అల్‌హారీజీ (1155-1225) ఈ స్వర్ణయుగంలోని చివరి మహాకవి. వ్యంగ్య ప్రధానమైన *మక్బరల్ తహకీమోనీ* లో మాధుర్య గుణాన్ని ఇతడు విశిష్టంగా చూపించాడు. ఆనందాన్ని గురించి *సేఫెర్ శ ఆశు ఇం* అనే గద్య గ్రంథాన్ని రచించిన జోసెఫ్ ఇబన్ జబారా (1150) ఈ కాలానికి చెందినవాడే.

ఇటలీకి వలస వచ్చిన యూదులలో పేరెన్నిక కన్న గ్రంథకర్తలు చాలా కొద్దిమంది. ఇమానుయెల్ బెన్ సాలమన్ హారోమీ (1265-1330) రచించిన స్వర్గ నరకాలను గూర్చిన కావ్యం *హాథొఫెట్ బేహా ఎడెన్* ధాంటే కవికి మార్గదర్శకం అయింది. ఇతని కావ్యాలలో అశ్లీలం కొంత కనిపిస్తుంది. ఈ కాలంలోనే రహస్యవాద కవులు ఎక్కువ అయారు. వీరిలో మోజెస్ రెలియోన్,

పుట్టుగ్రుడ్డి అయిన ఐజెక్ ముఖ్యులు. చాలా మంది మధుపానం మీద కవిత్వం చెప్పారు.

14 వ శతాబ్దం తరువాత యూదుల మీద యూరప్ ఖండవాసులు కత్తిదూసి వెంటాడడంతో వీరికి ఆపత్కాలం వచ్చింది. మోజెస్ జాకూటో (1625-97) హీబ్రూ భాషలో మొదటి నాటకం వ్రాశాడు. ఆధునిక యుగం మోజెస్ హాయింటుజ్జాటో (1707-47)తో ఆరంభం అవుతూంది. ఇతడు కృతక శైలిని వదలి, తన 17 వ ఏట ఒక అలంకార గ్రంథాన్నే కాక మరి 30 గ్రంథాలు వ్రాశాడు. *మ ఆ సె శిశోన్, మిగ్డాల్ ఓజ్, లయె శరింధేహిల్లాహ్* అనే 3 నాటకాలలో విశిష్టమైన భావుకత కవిపిస్తూంది. ఈయన శిష్యుడైన డేవిడ్ ఫ్రాంకో మెండిజ్ కూడా *జేముల్ అథాలియాహ్* అనే నాటకం వ్రాశాడు. 18 వ శతాబ్దంలో మెండెల్సోన్ మొదలగువారు *మి అస్ఫీం* అనే పత్రిక నడుపసాగారు. యూదుల లౌకిక, సాంస్కృతిక దృక్పథాలను ప్రచారం చేసే ఈ పత్రికవల్ల ఇతర దేశాలలో ఉన్న యూదులలో నూతన చైతన్యం కలిగింది.

19 వ శతాబ్దంలో పేరెన్నిక గన్న ప్రతిభాశాలి అయిన కవి జూడాహ్ లోయెబ్ గార్డన్ (1830-92). ఈ కాలంలోనే అబ్రహాం మాపూ (1808-67) నవలా రచన ప్రారంభించాడు. ఈ శతాబ్ద మధ్య కాలంలో కథానికలు కూడా వెలువడసాగాయి. రాష్ట్రీయ భావన, ఆశయాలు యూదులను కలవర పరిచిన కాలంలో హీబ్రూ వాఙ్మయం అనేక విధాలుగా అభివృద్ధి చెందసాగింది. 1896 లో *హాయోం* అనే దినపత్రిక ఆరంభించబడింది.

'ఐజెక్'లో యెబ్ పెరెజ్, (1851-1915) కవి, కథకుడు కూడా! సమ్మోహకమైన శైలిలో పాఠకులను ముగ్ధుల్ని చేయగల ఇతని రచనలలో కనిపించే సౌందర్యం, ప్రేరణ, భావుకత, అనుభూతి విశిష్టాలైనవి. కథకులలో రూబెన్ బ్రెయ్నిన్ (1862-1939) ప్రముఖుడు. ఆధునిక కవులలో హాయిం నహ్మాన్ చియాలిక్ (1872-1934) జాతీయ గీతాలను పాడిన ముఖ్యుడు.

20 వ శతాబ్దంలో అనేక రచయితలు వచ్చారు. ప్రాచీన మార్గాన్ని నవ్యదృక్పథంతో సమన్వయం చేసిన వారు కొంద రున్నారు. జోసెఫ్ క్లాస్నెర్, జోషువా థాన్, బెర్డిచెర్స్కీ మొదలగువారు ఇలాంటి కృషి చేశారు. మాధుర్య, సౌకుమార్యాలతో భావుకుడైన సాల్ చెర్నిహోవ్స్కీ (1873-1944) ప్రకృతినీ, జాతీయతనూ తన కవితా శక్తితో మేళవించాడు. ఈయన ప్రభావం ఇప్పటికీ తగ్గలేదు. ఆబిగ్డోర్ హామైరే సమకాలిక జీవితాన్ని తన కవిత్వంలోనూ, కథలలోనూ చిత్రించాడు.

హీబ్రూ సాహిత్యం నేడు ఇజ్రేల్ దేశంలో సర్వతోముఖంగా అభివృద్ధి పొందుతూంది. జోల్ కింహీ, ఎబర్ హడనీ, జాడాయారీ మొదలగువారు నూతనోత్సాహంతో సాహిత్యసేవ చేస్తున్నారు. *పో.సు.శా.(బొ.శ్రీ.)*

# యూరప్‌ఖండ సాహిత్యాలు

## ౨

## ఆంగ్లో-నార్మన్ సాహిత్యం

ఈ సాహిత్యాన్నే నార్మన్-ఫ్రెంచ్ సాహిత్యం అనీ, ఆంగ్లో-ఫ్రెంచ్ సాహిత్యం అనీ కూడా అంటారు. మధ్య యుగంలో ఇంగ్లండులో వెలువడిన ఫ్రెంచ్ భాషా సాహిత్యానికే ఈ మూడు పేర్లూ. ఎడ్వర్డ్ ది కన్ఫెసర్ కాలంలోనే ఫ్రెంచ్‌భాషను ఇంగ్లండులో ప్రవేశపెట్టినప్పటికీ, నిజంగా దాని చరిత్ర 1066 లో నార్మన్ విజయం తో ప్రారంభమైంది. ఆ సంవత్సరంలో న్యాయశాస్త్రంలో, చర్చిలలో, పాఠశాలలలో, విశ్వవిద్యాలయాలలో, వర్తక వ్యాపారాలలో ఈ భాషే వాడుకభాష అయింది. ధనిక వర్గాలవారు ఈ ఆంగ్లో-నార్మన్‌ను నేర్చుకున్నారు. విస్తృతంగా వాడుకలోకి వచ్చినకొద్దీ అది అపభ్రంశం అయిపోయింది. దీనిని వేల్స్, ఐర్లండ్‌లలోనూ, స్కాట్లండ్‌లో కొంతభాగంలోనూ ప్రవేశపెట్టారు. ఇది ఆ యా దేశాలు స్వాతంత్ర్యం కోసం పోరాడే ముందే జరిగింది. ఇందులో సాహిత్య పరమైన మొదటి గ్రంథం మొదటి హెన్రీ రాజు కాలంలోనూ, ఆఖరిది నాల్గవ హెన్రీ కాలంలోనూ వెలువడ్డాయి. నూరు సంవత్సరాల యుద్ధం వలన ఇంగ్లండ్, ఫ్రాన్స్ దేశాల మధ్య ఏర్పడిన వివాదాల వలన ఆంగ్లభాష వాడకం ఇంగ్లండ్‌లో పెరిగింది. అయినప్పటికీ, ఫ్రెంచ్‌ని పార్లమెంటులోనూ, న్యాయశాస్త్రంలోనూ ఎక్కువగా వాడేవారు. ఈ రెండింటిలో ఫ్రెంచ్ ఇప్పటికీ కొంత వరకు నిలిచి ఉంది.

మొట్టమొదట వెలువడిన ఆంగ్లో-నార్మన్ పుస్తకాలు కొద్ది తేడాలతో ఫ్రెంచ్ భాషా గ్రంథాల మాదిరిగానే ఉండేవి. అయితే ఫ్రెంచ్ గేయ కావ్యం లాంటిది అంత

కుపూర్వం ఇంగ్లండ్‌లో లేదు. ఉదాహరణకు ప్రసిద్ధి గాంచిన రోలండ్ గీతం ఒకే ఒక వ్రాత ప్రతి దొరికింది. ఇది ఆంగ్లో-నార్మన్‌లో ఉంది. యూరప్ ఖండంలో వెలువడిన ఫ్రెంచ్ సాహిత్యానికీ, ఇంగ్లండ్‌లో వెలువడిన ఆంగ్లో-నార్మన్ సాహిత్యానికీ ముఖ్యమైన భేదం ఏమంటే 1215 లో జరిగిన 4 వ లాటరన్ కౌన్సిల్ సమావేశ ఫలితంగా సిద్ధాంతపరమైన, భక్తి సంబంధమైన సాహిత్యం ఫ్రాన్స్‌లో కంటె ఇంగ్లండ్‌లో ఎక్కువగా వచ్చింది. కొత్త సాహిత్య ప్రక్రియల అభి వృద్ధిలో మిగతా యూరపియన్ దేశాలకంటె ఇంగ్లండుదే ముందంజగా ఉండేదని దీనివలన తెలుస్తూంది. నార్మండీలోనూ, మిగతా యూరప్‌లోనూ చరిత్రరచన ప్రజాదరణ పొందింది. నార్మన్ విజయం తర్వాత ముఖ్యమైన వ్రాతలలోనూ, చరిత్రలలోనూ ఇంగ్లీషు బదులు లాటిన్ వాడినప్పటికీ, ఆంగ్లో నార్మన్‌లో రెండింటికీ ఉదాహరణలు లభిస్తాయి. మతసంస్థలవారు సత్పురుషుల జీవిత చరిత్రలను, ధనిక వర్గంవారు తమ పూర్వీకులను గురించిన ఊహాకల్పిత గాథలను వ్రాయించారు. ఈ విధంగా విభిన్న సాంఘిక, రాజకీయ కారణాలవలన ఆంగ్లో-నార్మన్ సాహిత్యం ఫ్రెంచ్ సాహిత్యానికి కేవలం అనుకరణ కాలేదు.

అతి ప్రాచీనమైన ఆంగ్లో-నార్మన్ గద్యరచన *రాజుల పుస్తకం (The Book of kings)* 12 వ శతాబ్దంలో ఇంగ్లండ్‌లో వ్రాయబడింది. సాలమన్ సామెతలను శామ్సన్ డినాన్ ట్విల్ అనువదించి, దానిమీద వ్యాఖ్యానం వ్రాశాడు. 13 వ శతాబ్దంలో రాబర్ట్ బెంథమ్ *సండే గాస్పెల్స్* వ్రాశాడు. ఈ శతాబ్దంలోనే ఆంగ్లోనార్మన్‌లో భవిష్య పురాణాలు (apocalypse) రచించబడ్డాయి. వీటిలో అందమైన చిత్రాలు కూడా ఉన్నాయి. 14 వ శతాబ్దంలో *ఆంగ్లో-నార్మన్ బైబిల్* ప్రారంభించారు. కాని అది పూర్తి కాలేదు. సత్పురుషుల గాథలు ఆంగ్లోనార్మన్‌లో ప్రసిద్ధి పొందాయి. బెనిడైట్ వ్రాసిన *సెయింట్ బ్రెండన్ యాత్ర* ఫ్రెంచ్‌లో అతి ప్రాచీనమైంది. ఇది 8 అక్షరాల పాదాలలో వ్రాసిన ఒక ద్విపద కావ్యం. సత్పురుషుల చరిత్రలు ప్రామాణికంగా వ్రాసిన వారిలో వేస్ మొదటి వాడు. 15 వ శతాబ్దంలో ఆంగ్లో- నార్మన్ రచయితలు చాలామంది ఆయనను అనుసరించారు.

ఫ్రెంచ్‌లో అత్యంత ప్రాచీనమైన నాటకం ఆంగ్లో-నార్మన్‌లోనే రచింపబడింది. 1215 న సమావేశమైన 4 వ లాటరన్ కౌన్సిల్ ప్రభావం వలన అనేక ప్రబోధాత్మక రచనలు వచ్చాయి. వాటిలో అత్యంత ప్రాచీనమైందీ, ఆకర్షణీయమైందీ *పవిత్ర క్రైస్తవ ప్రార్థనా మందిర దర్పణము*. దీనిని అబింగ్డన్‌కు చెందిన సెయింట్ ఎడ్మండ్ వ్రాశాడు. 13 వ, 14 వ శతాబ్దాలలో వ్యవసాయ శాస్త్రం, న్యాయ శాస్త్రం, వైద్య శాస్త్రం, వ్యాకరణం, విజ్ఞాన శాస్త్రాలవంటి సాంకేతిక విషయాలపై లెక్కలేనన్ని గ్రంథాలు ఈ భాషలో వెలువడ్డాయి. వేట, చదరంగం, డేగలవేట మొదలైన వాటిపై కూడా పుస్తకాలు వచ్చాయి. 13 వ, 14 వ, 15 వ శతాబ్దాలలో ప్రచురింప బడిన వర్ణక్రమాల పుస్తకాల ద్వారా యూరప్‌లోని ఫ్రెంచ్‌కీ, ఆంగ్లో-నార్మన్ భాషకీ గల తారతమ్యాలు తెలుస్తాయి.

**ప్రణయ గాథలు :** ఆంగ్లో-నార్మన్ సాహిత్యంలో అనేక ప్రణయ గాథలు (romances) వెలిశాయి. 12 వ శతాబ్దంలో థామస్ అనే వ్యక్తి ట్రిస్టన్‌గాథ వ్రాశాడు. ఇది అనేక ప్రాంతాలలో వ్యాపించి శకలాలుగా మిగిలి ఉంది. అనేక యూరపియన్ భాషలలో వెలువడిన *ట్రిస్టన్-ఇసోల్డ్*ల కథకు ఇది మూలం. *వాల్డెఫ్* అనే పుస్తకంలో ఈస్ట్ ఆంగ్లియాకు చెందిన ఒక కల్పితమైన రాజును, ఆయన కుమారులను గురించిన ప్రస్తావన ప్రతిభా వంతంగా చేయబడింది. 12 వ శతాబ్దంలో ఘన కార్యాలు చాటి చెప్పే పాట (chanson de geste) మాదిరిగా కొన్ని ప్రణయ గీతాలు రచింపబడ్డాయి. ఉదాహరణ-మాస్టర్ థామస్ రచించిన *హోర్న్* (Horn). అదే పేరు గల ఇంకో వ్యక్తి అలెగ్జాండర్ ప్రణయ గాథను స్వయంగా వ్రాశాడు. మధ్య యుగపు ఇంగ్లీష్ భాషలో వచ్చిన *అలెగ్జాండర్ రాజు*కి ఇది మూలం. 13 వ శతాబ్దంలో రాజాస్థానానికి సంబంధించిన వేరొక విధమైన ప్రణయగాథలు వెలువడ్డాయి.

**గేయ, హాస్య కావ్యాలు :** మొదటి ఫ్రెంచి కవయిత్రి మరీడి ఫ్రాన్స్ ఇంగ్లీష్ కథలు ఆధారంగా హాస్య కావ్యాలు వ్రాసింది. ఆమె 12 గేయకావ్యాలు కూడా వ్రాసింది. ఇవి 8 అక్షరాలతో కూడిన అంత్య ప్రాస గల ద్విపద పద్యాలు. వీటికి మూలం బ్రెటన్ గేయా లని ఆమె చెప్పింది. ఈ గేయ కావ్యాలలో వాస్తవికతకూ, కల్పిత కథకూ రెంటికీ సంబంధించిన అంశాలు ఉన్నాయి. సమకాలీన జీవితం, ప్రేమ సమస్యల విశ్లేషణను ఈమె నేర్పుతో చేసింది.

**రాజకీయ, చారిత్రక గ్రంథాలు :** ఆంగ్లో-నార్మన్ గేయాలు సంఖ్యలో తక్కువ. రూపకల్పనలో మౌలికత కనిపించదు. కాని రాజకీయ విషయాలపై అనేక వ్యంగ్య

రచనలు, పాటలు వచ్చాయి. పీటర్ లాంగ్‌టాఫ్ట్ వ్రాసిన *క్రానికల్* లో రాజకీయపరమైన పాట లున్నాయి. ఇది బ్రిటిష్ వారి సంపూర్ణ చరిత్ర. నికొలస్ ట్రెవెట్ యూరప్ చరిత్ర గద్యరూపంలో వ్రాశాడు. దీని నుంచే ఛాసర్ తన *మాన్ ఆఫ్ లాజ్ టేల్‌*ను తీసుకున్నాడు. వీటికి ముందే (సుమారు 1140) జెఫ్రీ గైమార్ వ్రాసిన ఆంగ్లో-నార్మన్ కవిత, *ఆంగ్లేయుల కథ* వెలువడింది. ఇది ఫ్రెంచ్‌లో మొట్టమొదటి చరిత్ర. మొదటి పెంబ్రోక్ ప్రభువు, వల్లని రాకుమారుడు అయిన మొదటి ఎడ్వర్డ్ జీవిత చరిత్రలు ఇంగ్లీషు ప్రభువులకోసం విదేశీయులు వ్రాశారు. అధికారపత్రాలు తరచుగా ఆంగ్లో-నార్మన్‌లోనే కనిపిస్తాయి. మొదటి ఎడ్వర్డు మొదలు ఎనిమిదవ హెన్రీ వరకు అనధికార నివేదికలు మొదలైన వన్నీ ఆంగ్లో-నార్మన్‌లోనే ఉన్నాయి. 14 వ శతాబ్దం చివర పార్లమెంటులో ఫ్రెంచ్‌తో పాటు పార్లమెంటులో ఇంగ్లీషు కూడా వాడుకలోకి వచ్చింది.

**ప్రాకృతిక చరిత్ర, విజ్ఞానశాస్త్రం :** ఆంగ్లో నార్మన్ భాషలోని తొలి రచయితలలో ఒకడైన ఫిలిఫ్ఫీ డి తావోన్ లేక థాన్ వ్రాసిన *ది కంప్యూటస్* మొట్టమొదటి ఫ్రెంచ్ జంతుశాస్త్రగ్రంథం (bestiary). అనర్ఘమణులను గురించి కూడా ఆయన వ్రాశాడు. సైమండ్ డి. ఫ్రీమ్ తన *రోమన్ డి ఫిలాసఫీ* అనే గ్రంథాన్ని తత్త్వశాస్త్రవేత్త అయిన బోతియస్ రచనలను ఆధారంగా చేసికొని రచించాడు.

ఇ.నా.

## ఆర్మీనియన్ భాష - సాహిత్యం

**భాష :** ఇండో-యూరోపియన్ భాషలలో పశ్చిమ భాషా వర్గానికి చెందిన ఒక ప్రత్యేక శాఖ, ఇటీవలి వరకూ సోవియెట్ సోషలిస్ట్ రిపబ్లిక్‌గా ఉన్న ఆర్మీనియన్ రిపబ్లిక్‌లోనే కాక, టర్కీలోని ఆర్మీనియన్‌లకు కూడా ఇది మాతృభాష. సోవియెట్ యూనియన్‌లోని కొన్ని ఇతర ప్రాంతాలలో కూడా ఈ భాష మాట్లాడబడుతూంది. ఆర్మీనియా నుంచి వలస పోయిన కాందిశీకులు తమతోపాటు ఆసియా మైనరుకూ, మధ్య ప్రాచ్యానికీ, అక్కడనుంచి రుమేనియా, పోలండ్, ఫ్రాన్స్ వంటి యూరపియన్ దేశాలకూ, అమెరికాకూ కూడా ఈ భాషను తీసికొని పోయారు.

క్రీ.పూ. 2 వ సహస్రాబ్దంలోనే ఉత్తర బాల్కన్ ప్రాంతాల నుంచి దండెత్తి వచ్చిన బాల్కన్‌లు కాకేషియస్ పర్వతాలకు ఆవలనున్న ప్రాంతాలలో ఈ భాషను మొదట ప్రవేశ పెట్టారు. ఆ విధంగా దండెత్తి వచ్చిన బాల్కన్‌లు 'వాన్' సరస్సు తీర ప్రాంతాలను ఆక్రమించుకొన్నారు. క్రీ.పూ.7 వ శతాబ్ది ప్రాంతానికి స్థానిక భాషలను త్రోసిరాజని ఈ ఆర్మీనియన్‌భాష అక్కడి ప్రజలందరికీ వాడుక భాష అయింది.

క్రీ.పూ. 4 వ శతాబ్ది ప్రారంభంలో 38 వర్ణాలతో కూడిన ఒక లిపి ఈ భాషకు ఏర్పాటైంది. సాంప్రదాయిక గాథల ననుసరించి బిషప్ సెంట్ మెస్రోబ్ (St. Mesrob) ఆ లిపిని కల్పించాడు. ఆ లిపినే నేటికీ ప్రపంచ మంతటా ఉన్న ఆర్మీనియన్‌లందరూ వాడుతున్నారు. ఆర్మీనియన్ సాంస్కృతిక చరిత్రలో స్వర్ణయుగమని చెప్పదగిన క్రీ.శ.5వ శతాబ్దంలో రూపొందిన లిఖిత ప్రామాణిక భాష "గ్రబర్"కు 'వాన్' సరోవర తీరంలో మాట్లాడే 'తారాన్' (Tarawn) మాండలికం ఆధారమని చెబుతున్నారు. 5వ, 8వ శతాబ్దాల మధ్య కాలంలో సాహిత్య భాష ఏకరూపంగా ఉండేది. కాని, 9వ శతాబ్దం నాటికి ప్రజల వాడుకలో ఉన్న మాండలికాల ప్రభావం లిఖితభాష అయిన 'గ్రబర్' మీద ఎక్కువగా కనిపింప సాగింది. 'గ్రబర్' అనబడే ఈ ప్రామాణిక భాషా పరిణామంలో మధ్యస్థ దశ 12 వ, 13 వ శతాబ్దాల నాటి 'సిలీషియా' లోని ఆర్మీనియన్ రాజ్య ఆస్థానభాషలో మనకు కనిపిస్తుంది. 19 వ శతాబ్ది మధ్యభాగం వరకూ ఎంతో కొంత సాంకర్యం చెందిన 'గ్రబర్' భాషే ఆర్మీనియన్ లిఖిత భాషగా ప్రయోగించబడుతూ వచ్చింది.

19 వ శతాబ్దంలో ఆర్మీనియన్ జాతీయ వాదులు ప్రజలలో జాతీయ చైతన్యాన్ని పురికొల్పడానికి పూనుకొన్నారు. జాతి పునరుజ్జీవనోద్యమం ఆరంభం అయి, నాటి ప్రజల వ్యావహారిక భాషకు సన్నిహితంగా ఉండే క్రొత్త సాహిత్యభాష వెలిసింది. దీనికి రెండు రూపాలు ఉన్నాయి తూర్పు ఆర్మీనియన్‌భాష, పశ్చిమ ఆర్మీనియన్‌భాష. అరారాత్ లోయ, యెరెవాన్ నగరం ప్రాంతాలలోని వాడుకభాష ఆధారంగా రూపొందిన తూర్పు ఆర్మీనియన్ సాహిత్య భాషే ప్రస్తుతం ఆర్మీనియన్ రిపబ్లిక్‌లో అధికార భాషగా ఉంది. ఇస్టాన్‌బుల్ (Instanbul) మాండలికం ఆధారంగా వెలసిన సాహిత్య భాష పశ్చిమ ఆర్మీనియన్ భాష. ఈ రెండు భాషలకూ మధ్య భేదం అత్యల్పం; పరస్పర అవగాహనకు అది ప్రతిబంధం కలిగించేది కాదు. ఈ సాహిత్య భాషలు గాక అనేక మాండలికాలు కూడా ఉన్నాయి. వాటిలో కొన్ని పరస్పర దురవగాహాలు.

19 వ శతాబ్దిలో కొందరు పరిశోధకులు ఆర్మీనియన్ భాషను ఇరానియన్‌భాషకు చెందిన ఒక మాండలికంగా భావించారు గాని, అనంతరం జరిగిన పరిశోధనల వలన ఇది ఇండోయూరపియన్ భాషా కుటుంబానికి చెందిన

ఒక స్వతంత్రమైన భాషే అని స్పష్టమైంది. ప్రాచీన ఆర్మీనియన్ భాష అనేక విషయాలలో గ్రీక్‌భాషకు సన్నిహితంగా కనిపించగా, ఆధునిక ఆర్మీనియన్‌భాష తుర్కిష్ భాషకు చేరువగా కనిపిస్తూంది. లిఖితభాషలోని పద జాలం పూర్తిగా ఆర్మీనియన్ దేశ్య వర్గానికి చెందినదే. అది ఇంచుమించు పూర్తిగా గ్రబర్ భాషమీదనే ఆధారపడింది. పరిసర భాషలనుంచి గ్రహించిన పదజాలం అత్యల్పం. సంస్కృతంలోని 'గౌ' శబ్దం ఆర్మీనియన్‌భాషలో 'కౌ' అనీ, దశ శబ్దం 'తశ్న్' అనీ మార్పు చెందాయి. సంఖ్యావాచకాలలో కొన్ని గుర్తించడానికి వీలులేనంతగా మారిపోయాయి. 'ద్వి', 'త్రి' శబ్దాలు ఈ భాషలో 'ఎరుకు', 'ఎరేఖ్' అని మార్పు పొందటానికి కారణాలు తెలియడం లేదు.

**సాహిత్యం :** క్రీస్తుశకం ఆరంభానికి ముందే ఆర్మీనియన్ భాషలో క్రైస్తవేతర మతాలకు చెందిన మౌఖిక సాహిత్యం ఉండే దని భావిస్తున్నారు. క్రీ.శ. 400 ప్రాంతంలో ఈ దేశంలో క్రైస్తవ మతం వ్యాపించినపుడు మతోన్మాదులైన క్రైస్తవాచార్యులు ఆ ప్రాచీన సాహిత్యాన్ని నాశనం చేశారు. 5 వ శతాబ్దానికి చెందిన ఒక రచయిత ఒక ప్రాచీన గ్రంథంలోని దని ఉదాహరించిన 20 పంక్తుల భాగం మాత్రమే ఆ ప్రాచీన సాహిత్యంలో నేడు మిగిలి ఉంది. 5 వ శతాబ్ది నుంచీ క్రైస్తవ ప్రచారకుల కృషి వల్ల గ్రీక్, సిరియాక్ భాషలనుంచి మతవాఙ్మయం విస్తృతంగా ఆర్మీనియన్ భాషలోకి అనువదించబడింది. ఆర్మీనియన్ క్రైస్తవశాఖలో ప్రార్థనాదికా లన్నీ ఆర్మీనియన్ భాషలోనే రచిస్తూ, అక్కడి మతాచార్యులు ఆ భాషను పవిత్రభాషగా గుర్తించారు. 5 వ శతాబ్దంలో వాడుకలోకి వచ్చిన గ్రబర్ భాషే ప్రామాణిక భాషగా ఆదరించబడింది.

10 వ, 11 వ శతాబ్దాలలో ఆర్మీనియన్ సాహిత్యం, ఇతర లలిత కళలు, వాస్తుశాస్త్రం స్వతంత్రంగా పెంపొందాయి. 10 వ శతాబ్దం నాటి సెంట్ గ్రెగరి నరేకట్జి మొట్టమొదటి ఆర్మీనియన్ మహాకవి. ఆయన రచించిన తాత్త్విక పద్యాలూ, కీర్తనలూ, *సాంగ్ ఆవ్ సాంగ్స్* మీద ఆయన వ్రాసిన వ్యాఖ్యానం ప్రసిద్ధి పొందాయి. 4 వ శతాబ్దం ఆరంభంలో బిషప్ ఉఖ్టనీస్ *ఆర్మీనియా దేశ చరిత్ర*నూ, జార్జియన్‌లకూ, ఆర్మీనియన్‌లకూ మధ్య సంభవించిన *మత వివాద చరిత్ర*నూ రచించాడు. 11 వ శతాబ్ది ఆరంభంలోనే బాగ్రాటిడ్ రాజ్యపతనానికి (1045) సంబంధించిన ఆర్మీనియన్ చరిత్రను అరిస్టాకీస్ లస్టివెర్ట్జి వ్రాశాడు.

1385 లో తైమూర్ దండయాత్ర అనంతరం చాలా కాలం ఆర్మీనియాలో సాంస్కృతిక, సాహిత్య రంగాలలో స్తబ్ధత ఆవహించింది. 17 వ శతాబ్దంలో ఆర్మీనియన్ సాహిత్యంలో తిరిగి నూతన చైతన్యం కనిపించింది. పాశ్చాత్య విద్వాంసులతోనూ, లాటిన్ రచనలతోనూ వారికి అనుబంధం ఏర్పడింది. ఆస్కాన్ ఆవ్ ఎరెవాన్ (జ.1614), డొమినికన్ పిరండెల్లిల సహకారంతో 1666 లో ఆమ్‌స్టెర్‌డామ్‌లో మొదటి ఆర్మీనియన్ బైబిల్ ముద్రితం అయింది. నహపెట్ కుచెక్ (16 వ శతా.) ఒక ప్రముఖ ఆర్మీనియన్ కవి. కాయిక శృంగారాన్ని గూర్చి ఆయన ప్రధానంగా గానం చేశాడు.

18 వ శతాబ్దంలో ఆర్మీనియాలో సాంస్కృతిక పునరుజ్జీవనం ఆరంభం అయింది. 19 వ శతాబ్ది మధ్య భాగానికి ఆధునిక ఆర్మీనియన్ సాహిత్యం వెలసేందుకు పూర్వరంగం సిద్ధం అయింది. సాహిత్యభాష విషయంలోనూ, సముచిత సాహిత్య ప్రక్రియల విషయంలోనూ సంప్రదాయవాదులకూ, సంస్కరణవాదులకూ మధ్య తీవ్రమైన వాదోపవాదాలు ప్రారంభం అయాయి. చివరికి సంస్కరణ వాదులే విజయం సాధించారు. ఆ నాటి ఆర్మీనియన్ సాహిత్యం యూరప్ ఖండ సాహిత్యాలనుంచి విశేషంగా ఉత్తేజం పొందింది. పశ్చిమ ఆర్మీనియన్ రచయితలలో హకోబ్ పరోనియన్, ఎర్వాండ్ ఓటియన్‌లు వ్యంగ్య పరిహాస నవలలు వ్రాసిన ప్రముఖ రచయితలు. గ్రిగోర్ జోరాబ్ వాస్తవికతా దృష్టి గల చిన్న కథలు వ్రాశాడు.

పశ్చిమ ఆర్మీనియన్ భాషలో ఎక్కువ పుష్టి పొంది ఉండని నవల రష్యన్ ఆర్మీనియన్ భాషలో నైతిక, సాంఘిక, రాజకీయ భావాల ప్రకటనకు ప్రబలమైన సాధనం అయింది. ఆధునిక ఆర్మీనియన్ సాహిత్య పితామహుడుగా పరిగణించబడుతున్న ఖచాటుర్ అబోవీన్ *ఆర్మీనియా గాయాలు* (1841) రచించాడు. ఆర్మీనియన్ నవలా రచయితలలో మిక్కిలి ప్రసిద్ధుడు అకోబ్ మెలిక్-అకోబియన్ (రఫీ). తూర్పు ఆర్మీనియన్ కవులలో హోవానీస్ కుమానియన్ భావగీతాలూ, కథాకావ్యాలు వ్రాశాడు. ఆర్మీనియన్ నాటకకర్తలలో ప్రసిద్ధుడు గేబ్రియల్ సుందు కియాన్. ఆయన వ్రాసిన హాస్యరూపకాలు (*హులాబలు, పెపో, ది బ్రోకెన్ హార్ట్*) ఆ నాడు ట్బిలిసిలోని ఆర్మీనియన్ సమాజాన్ని ప్రతిబింబిస్తున్నాయి.

20 వ శతాబ్ది ప్రథమ పాదంలో 'దారుణ హత్యా కాండ' కొనసాగిన అనంతరం ఇస్తాన్‌బుల్ నగరం ఆర్మీనియన్ సాహిత్య ప్రధాన కేంద్రం అనే ప్రతి

పత్తిని కోల్పోయింది. తిరిగి సాహిత్యంలో క్షీణదశ ఆరంభం అయింది. ఆర్మీనియన్ రచయితలు చెల్లాచెదరై పారిస్, బీరట్, బోస్టన్ నగరాలనుంచి రచనలు ప్రకటించ సాగారు. కొందరు తుర్కిష్ ఆర్మీనియన్‌లు తూర్పు ఆర్మీనియాకు పారిపోయి, 1936 లో ఆర్మీనియన్ సోవియెట్ సోషలిస్ట్ రిపబ్లిక్ ఏర్పడిన తరువాత కొంతవరకు రచనా స్వాతంత్ర్యాన్ని పొందారు.

బా.శ్రీ.

## ఆస్ట్రియన్ సాహిత్యం

ఇది జర్మన్ సాహిత్యంలో ఏక దేశంగా పరిగణించ బడుతూంది. కాని, నిజానికి ఒకే భాషలో వ్రాయబడి నప్పటికీ జర్మన్, ఆస్ట్రియన్ సాహిత్యాల మధ్య అనేక విషయాలలో భేదం కనిపిస్తుంది. జర్మన్ భాషలో వ్రాయ బడిన ఆస్ట్రియన్ సాహిత్యాన్ని గురించి మాత్రమే కాక జెకోస్లోవేకియా, హంగరీ, రుమేనియా, యుగోస్లావియాల లోని జర్మన్ భాష మాట్లాడే ప్రజలు సృష్టించిన ప్రత్యేక సాహిత్యాలను గురించి కూడా విడిగా తెలుసుకోవలసి ఉంది.



ఆస్ట్రియా

మధ్యయుగాంతం వరకూ జర్మన్, ఆస్ట్రియన్ సాహిత్యాలు ఏకరూపంగానే ఉన్నాయి. ఆస్ట్రియన్ సాహిత్యంలో వెలసిన తొలి రచనలు రాజాస్థానాలలో చెప్పిన పద్యాల రూపంలోను, 'మిన్నేసింగర్స్' (12 వ, 13 వ, 14 వ శతాబ్దాలలోని జర్మన్ గాయక కవులు) పాడిన గీతాల రూపంలోనూ, *నిబెలుంగెన్ లీడ్* (1200 ప్రాంతం) అనే అజ్ఞాత కర్తృకమైన గ్రంథం రూపంలోనూ మనకు లభ్యం అవుతూంది. వీటిలో ట్యూటానిక్ ప్రాచీన గాథలూ, ఆస్ట్రియన్ రాజాస్థానాలలోని వాస్తవిక సన్నివేశాలూ కలగలసిపోయి మనకు కనిపిస్తాయి. 1400 ప్రాంతంలో యోహానీస్ ఫాన్ టెప్ల్ (మరణం: 1414 - మరోపేరు ఫాన్ సాజ్) ఇటాలియన్ పునరుజ్జీవనోద్యమ భావాలనూ, మానవతా వాదాన్నీ ఆస్ట్రియన్ సాహిత్యంలో ప్రవేశపెట్టాడు. ఆయన రచన *డెర్ అకెర్మన్ ఆస్ బోహ్మెన్*. దీని తరువాత 16 వ శతాబ్దిలో వెలసిన కొన్ని మతసంబంధమైన నాటకాలూ, 18 వ శతాబ్దిలో జోసెఫ్ శ్ట్రానిట్స్కి వ్రాసిన కొన్ని జానపద రూపకాలూ తప్ప ఆస్ట్రియన్ సాహిత్యంలో చెప్పుకోదగినంత కృషి జరుగలేదు.

19 వ శతాబ్దం ఆరంభంలో నెపోలియన్ పతనం చెంది, వియెన్నా ఒక ప్రపంచ రాజధానిగా ప్రసిద్ధి చెందే వరకూ ఆస్ట్రియాలో ఉజ్జ్వల సాహిత్యం వెలువడడం జరగలేదు. 1804 లో హోలీ రోమన్ సామ్రాజ్యం నుంచి ఆస్ట్రియా విడివడినప్పటినుంచీ ఆస్ట్రియన్ సాహిత్యం తిరిగి సంపన్నం కాసాగింది. వియెన్నా, ప్రాగ్ నగరాలు దీనికి ప్రధాన కేంద్రా లయాయి. 19 వ శతాబ్దికి చెందిన 'బీడెర్ మైయర్' వర్గ రచయితల రచనలలో ఫ్రాంజ్ గ్రిల్ పార్జర్ (1791-1872) వ్రాసిన చారిత్రక నాటకాలూ, నికొలౌస్ లినౌ వ్రాసిన పద్యాలూ, అడాల్బర్ట్ స్టిఫ్టర్ (1805-88) వ్రాసిన బొహీమియన్ కథలూ ప్రధానంగా చెప్పుకోదగ్గవి. ఈ రచయితలు సుప్రసిద్ధ జర్మన్ కవి 'గొయ్‌థే' సంప్రదాయాన్ని అనుసరించారు. గ్రిల్ పార్జర్ వ్రాసిన *ఐన్ బ్రూడర్ డ్విస్ట్ ఇమ్ హవుస్ హాబ్స్‌బర్గ్, ఫామిలీ ఫ్ర్యాడ్ ఇమ్ హాబ్స్‌బర్గ్, లిబుస్సా* అనే నాటకాలూ, స్టిఫ్టర్ వ్రాసిన *డెర్‌నాజ్ సోమర్, లేట్ సమ్మర్, స్టూడియెన్, విటికో* వంటి నవలలూ, కథలూ చదివితే ఈ అంశం స్పష్టపడుతుంది. గ్రిల్ పార్జర్ తన రచనలలో యూరప్‌లోని రెండు శతాబ్దాల నాగరకతను సంగ్రహించాడని చెబుతారు. ఫెర్డినాండ్ రైమండ్ (1790-1836) వ్రాసిన జానపద రూపకాలూ, యోహాన్ నెస్ట్రోయ్ (1802-62) వ్రాసిన ప్రహసనాలూ, లికొలౌస్ లినౌ (1802-56) వ్రాసిన గేయాలూ విశేష ప్రశస్తి పొందాయి. యోహాన్ నెస్ట్రోయ్, వియెన్నాలోని 'అరిస్టోఫనీజ్' గా ప్రసిద్ధి పొందాడు.

ఆస్ట్రియా నాటక రంగం మిక్కిలి ప్రాచీన మైందని వారు చెప్పుకొంటారు. 'వియెన్నాబర్గ్ థియేటర్' (స్థా. 1741) 19 వ శతాబ్దిలో ప్రపంచ ప్రసిద్ధి పొందింది.

19 వ శతాబ్దం ఉత్తరార్థంలో ఆస్ట్రియన్ సాహిత్యంలో వాస్తవికతా వాద ప్రభావం ఎక్కువ కాసాగింది. ముఖ్యంగా మరీ ఫాన్ ఎబ్నెర్-ఎషన్‌బాగ్ (1830-1916),

ఫెర్డినాండ్ ఫాన్ సార్ (1833-1906), పీటర్ రోసెగ్గర్ (1843-1918), లుడ్విగ్ అంజెన్ గ్రుబర్ (1839-89), ఎర్నెస్ట్ ఫాన్ విల్డెన్ బ్రూఖ్ (1845-1909) ల రచనలలో ఈ ప్రభావం మరింత ఎక్కువగా కనిపిస్తుంది. వీరిలో చాలామంది గ్రామీణ కథలూ, స్థానిక నవలలూ (హైమెట్రోమన్) వ్రాశారు. ముఖ్యంగా అంజెన్ గ్రుబర్ ఆ నాటి సాంఘిక, రాజకీయ సమస్యలను తన రచనలలో చిత్రించాడు. విల్డెన్ బ్రూక్ దేశభక్తి ప్రబోధకాలైన నాటకాలు వ్రాశాడు. వియెన్నా లో 'ఇంప్రెషనిజ్మ్'కు మార్గదర్శకుడు 'సార్' కాగా, ఆ వాదాన్ని తారస్థాయికి తీసికొనిపోయిన వారు ఆర్థర్ ష్నిట్జ్‌లర్ (1862-1931), హ్యూగో ఫాన్ హాఫ్‌మన్ స్టాల్ (1874-1929) లు. ష్నిట్జ్‌లర్ మనస్తత్త్వ విశ్లేషణాత్మక నాటకాలకూ, కథలకూ అంకురార్పణ చేశాడు. హాఫ్‌మన్‌స్టాల్ 20 వ శతాబ్ది ప్రారంభ కాలంనాటి ఆస్ట్రియన్ జీవిత సంవేదనను తన కవిత్వంలోనూ, రూపకాలలోనూ స్ఫుటంగా ప్రదర్శించాడు. రిచర్డ్ బీర్ హాఫ్‌మన్ (1866-1945), లియోపాల్ట్ ఆండ్రియన్ (జ. 1875) లు కూడా ఆ నాటి ప్రముఖ రచయితలలో పేర్కొనదగ్గవారు. ష్నిట్జ్‌లర్ వ్రాసిన కథలూ, నాటకాలూ, ఫ్రెంచ్ సాహిత్య ధోరణులను పరిచయం చేస్తూ విశేష మానవతా దృష్టిని ప్రదర్శించాయి. బీర్ హాఫ్‌మన్ వ్రాసిన *జాకోబ్స్ డ్రీమ్స్, యంగ్ డేవిడ్* అనే పద్య రూపకాలు ఉదాత్తమైన రచనలు. హాఫ్‌మన్ స్టాల్ రచనలలో *జెడిట్టే* (కవిత), *డెత్ అండ్ ది ఫూల్, లిటిల్ థియేటర్ ఆఫ్ ది వరల్డ్, ఆండ్రియాస్, ది టవర్* ప్రధానమైనవి.

రాబర్ట్ మ్యూసిల్ నవలా రచనలో క్రొత్త ప్రయోగాలు చేశాడు. జార్జ్‌ట్రాక్ల్ 'ఇంప్రెషనిస్ట్' రచయితలలో మిక్కిలి ప్రసిద్ధుడు. జర్మన్ సాహిత్యానికి మార్గ నిర్దేశం చేసిన ప్రముఖ ఆస్ట్రియన్ రచయితలలో చెప్పుకోవలసినవారు: హెర్మన్ బ్రోహ్ అనే నవలా రచయిత, కార్ల్ క్రాస్ అనే వ్యంగ్య వ్యాస రచయిత, స్టీఫాన్ ట్స్వైగ్, వాల్టర్‌ఫాన్ మోలో.

ప్రాగ్ నగరం నుంచి వచ్చిన ఇద్దరు ప్రముఖ రచయితలలో ఒకరు: రెయ్‌నర్ మరియా రిల్కె (1875-1926), రెండవవాడు: ఫ్రాంజ్ కాఫ్కా (1883-1924). రిల్కె ప్రముఖ గేయకవి; వచన రచనలో కూడా సిద్ధహస్తుడు. కాఫ్కా వ్రాసిన కథలూ, నవలలూ అసంపూర్ణాలు అయినా భావౌన్నత్యానికీ, దృష్టి వైశాల్యానికీ ప్రసిద్ధికెక్కాయి. అతని రచనలలో *ది కాసిల్, ది ట్రయల్* ముఖ్యమైనవి.

ప్రథమ ప్రపంచ సంగ్రామం సందర్భంలో ప్రాగ్ నగరానికి వలస వచ్చి ప్రసిద్ధి పొందిన రచయితలలో ఫ్రాంజ్ కాఫ్కా కాక మాక్స్‌బ్రాడ్, ఫ్రాంజ్ వెర్ఫెల్ (1890-1945) లు కూడా సుప్రసిద్ధులు. ఫ్రాంజ్ వెర్ఫెల్ పెక్కు నవలలు, రూపకాలు, పద్య కావ్యాలు వ్రాశాడు. వీటిలో యుద్ధ పరాఙ్ముఖత ఎక్కువగా కనిపిస్తుంది. హైమిటో ఫాన్‌జోడెదెర్ అలెగ్జాండర్ లెర్నెట్-హోలెనియా, రాబర్ట్ మ్యూసిల్‌లు తమ నవలలలో ఆస్ట్రియా దేశపు పూర్వవైభవాన్ని వర్ణించారు. ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరం ఇంగెబోర్గ్ బాఖ్ మన్, రుమేనియా దేశంలో పుట్టిన పాల్ సెలాన్‌కవి, హెర్బర్ట్ ఐసెన్ రైఖ్ ఆస్ట్రియన్ సాహిత్యానికి ప్రముఖ ప్రతినిధులు. 1960-70 సంవత్సరాల మధ్య కాలంలో 'వీనర్ గ్రుప్పె' అనే రచయితల వర్గం ఏర్పడింది. దానిలో ఫ్రీడిఖ్ అచ్ లైట్నర్, హాన్స్‌కార్ల్ ఆర్ట్స్‌మన్, గెర్హార్ట్ రూయ్, ఆస్వాల్డ్ వీనర్, వోల్ఫ్‌గాంగ్ బౌవర్ థామస్ బెర్న్‌హార్ట్, పీటర్ హాండ్కేలు సుప్రసిద్ధులు. వీరందరూ నవలా నాటకరంగాలలో సువిఖ్యాతులయినవారు.

బొ.శ్రీ.

## ఇంగ్లీష్ భాష - సాహిత్యం

**భాష :** ఇంగ్లీష్ భాష ఇండో-యూరపియన్ భాషా కుటుంబానికి చెందిన ట్యూటానిక్ భాషా సముదాయంలో వెస్ట్ జర్మానిక్ శాఖకు సంబంధించింది. ఆంగిల్స్, శాక్సన్స్ అనే జర్మానిక్ జాతి ప్రజలు 5 వ శతాబ్దంలో ఉత్తర యూరప్ ప్రాంతం నుంచి వచ్చి బ్రిటిష్ దీవులను ఆక్రమించుకొని అక్కడ స్థిరపడ్డారు. వారి భాష 'ఆంగ్లో శాక్సన్'. ఇంగ్లీష్ భాష యొక్క ప్రాచీనతమ స్వరూపం కనుక దానిని 'ఓల్డ్ ఇంగ్లీష్' అని కూడా అంటారు. 11 వ శతాబ్దిలో నార్మన్ ఫ్రెంచ్ దేశస్థులు బ్రిటన్ దేశాన్ని ఆక్రమించుకున్న తరువాత నార్మన్-ఫ్రెంచ్ భాషతో సంపర్కంవల్ల ఆంగ్లో-శాక్సన్ భాష పెక్కు మార్పులకు లోనై క్రమంగా ఈ నాటి ఇంగ్లీష్ భాషగా రూపొందింది.

**సాహిత్యం :** ఇంగ్లీష్ సాహిత్యానికి ఉన్న ప్రాచుర్యం ఈ నాటి జీవద్భాషలలో మరే ఇతర భాషా సాహిత్యానికీ లేదు. ప్రక్రియా వైవిధ్యంలో కూడా ఇదే మొదట పేర్కొన దగినది. కొన్ని చారిత్రక, సాంస్కృతిక కారణాల వల్ల ఇంగ్లీష్ భాష ప్రపంచం అంతటా వ్యాపించింది. ఈ నాడు అంతర్జాతీయ రంగంలో పరస్పర భావ ప్రకటనకు ఈ భాష ఒక ప్రధాన సాధనం అయింది. ఈ భాషలో కావ్య నాటకాది కాల్పనిక రచనలు ఒక్క ఇంగ్లండ్

దేశంలోనే కాక దూరప్రాంతాలలో ఉన్న ఇతర దేశాలలో కూడా బహుళంగా ప్రచారంలో ఉన్నాయి.



ఇంగ్లండ్

ఆంగ్లో-శాక్సన్ భాషలో రచించబడ్డ కావ్యాలలో నశించిపోయినవి పోగా, ఇప్పటికి లభించిన వాటిలో *బేయోల్‌వుల్ఫ్* అనే వీరగాథాకావ్యం అతి ముఖ్యమైంది. లోక కంటకులైన గ్రెండెల్ వంటి రాక్షసులను ఎదిరించి హతమార్చిన బేయోవుల్ఫ్ అనే వీరపురుషుని విజయగాథలు ఈ కావ్యంలో అత్యుత్సాహంతో వర్ణించబడ్డాయి. 8 వ శతాబ్దంలో ఒక అజ్ఞాత కవి ఆ నాడు ప్రచారంలో ఉన్న కొన్ని వీర గీతాలను సేకరించి ఈ ఇతిహాస కావ్యంతో జోడించినట్లు భావిస్తున్నారు. ఆ నాటి ప్రజల వినోద విహారాలు, బలపరాక్రమాలు క్లేశభూయిష్ఠమైన వారి సాహసిక జీవితం వాటిలో చక్కగా చిత్రింపబడ్డాయి. ఇవి కాక *ది వాండరర్, ది సీ ఫేరర్* వంటి విషాద గీతికలు మరికొన్ని లభించాయి. తన కాశ్రయం ఇచ్చి పోషించిన యజమానుడు చనిపోగా బ్రతుకు తెరువుకోసం సముద్రం దాటి దూర తీరాలకు పోవలసి వచ్చిన ఒక నిర్భాగ్యుడు తన పూర్వపు సుఖ స్థితిని, ప్రకృత దీనావస్థను తలుచుకొని మానవ జీవితపు అనిశ్చిత స్థితిని గూర్చి చేసిన వ్యాఖ్యానం *ది వాండరర్* అనే గీతంలో చాలా సహజంగా వర్ణించబడింది. ప్రతికూలమైన ప్రకృతి శక్తులను, బలవంతులైన శత్రువులను నిరంతరం ప్రతిఘటిస్తూ జీవితయాత్ర కొనసాగించిన ఆ నాటి ప్రజల నిరాశామయ మానసిక దృక్పథం ఈ కావ్యాలన్నిటిలోనూ గోచరిస్తుంది.

ఆంగ్లో-శాక్సన్‌భాషలో కాడ్మన్, క్వీన్‌వుల్ఫ్ అనే క్రైస్తవ కవులు వ్రాసిన చక్కని కావ్యాలు కొన్ని లభించాయి. యార్క్‌షైర్‌లోని విట్బీ క్రైస్తవ మఠంలో గుఱ్ఱాల కాపరి అయిన కాడ్మన్ పండుగ రోజులలో మఠంలోని వారందరూ ఒకచోట చేరి ప్రార్థన గీతాలు రచించి పాడుతూ ఉంటే వాటిలో తనకు ఆసక్తి లేనందున తలవంచుకుని వెళ్లిపోతూ ఉండేవాడు. ఇలా ఉండగా ఒక రోజు రాత్రి అతడు గుఱ్ఱాల శాలలో నిద్రపోతూ ఉండగా ఒక దేవదూత ప్రత్యక్షమై 'పాడ' మని ఆదేశించాడు. 'ఏం పాడను?' అని కాడ్మన్ ప్రశ్నించాడు. 'సృష్టి ప్రారంభాన్ని గురించి పాడు' అని దేవదూత బదులు పలికాడు. అపుడు కాడ్మన్ నిద్ర మేల్కొని తనకు అప్రయత్నంగానే కవితా శక్తి అలవడిందని గ్రహించాడు. దేవదూత ఆజ్ఞను అనుసరించి సృష్టిని గురించి ఒక కావ్యం వ్రాశాడు. ఇదే విధంగా భోగలాలసుడై విలాసమయ జీవితం గడుపుతూ ఉన్న క్వీన్‌వుల్ఫ్ కూడా తనకు ఒక రోజున క్రీస్తు సిలువ సాక్షాత్కరించడం చేతనే తన దృష్టి, కవిత్వం ఆధ్యాత్మిక మార్గం వైపు మరలిన ఉదంతాన్ని తన *డ్రీమ్ ఆఫ్ ది రూడ్* అనే కావ్యంలో చెప్పుకొన్నాడు. ఇంగ్లీష్ కవిత్వానికి ప్రధాన లక్షణం అయిన అంత్యప్రాస నియమం అప్పటికింకా ఏర్పడలేదు. అయితే ఆంగ్లో-శాక్సన్ కావ్యాలలో అంత్యప్రాస లేని లోటును అనుప్రాస అలంకారం తీర్చి, ఆ నాటి కవిత్వానికి శ్రావ్యతను సమకూర్చింది.

కవిత్వం పుట్టిన కొంత కాలానికి ఈ భాషలో వచన వాఙ్మయం వెలసింది. 9 వ శతాబ్దంలో ఆల్ఫ్రెడ్ రాజు వచన రచనను ప్రోత్సహించాడు. పండితులకు మాత్రమే పరిచితమైన లాటిన్ భాషలోని మత గ్రంథాలను సామాన్య జనులకు కూడా అర్థమయే విధంగా స్వయంగా ఆంగ్లో-శాక్సన్ భాషలోకి అనువదించి, ఇతరులచే అనువదింపచేసి దేశానికీ, భాషకూ ఆయన మహోపకారం చేశాడు. అతని ఆదరణలో *ఆంగ్లో-శాక్సన్ క్రానికల్* ఆ నాటి జాతీయ చరిత్రగా రూపొందడమే కాకుండా వచన శైలికి కూడా ప్రామాణికం అయింది. ఆల్‌ఫ్రిక్, వుల్ఫ్ స్టాన్ అనే క్రైస్తవ మతాచార్యులు కొన్ని వచన గ్రంథాలు రచించారు. ఆల్‌ఫ్రిక్ వచనశైలి కవిత్వానికి మిక్కిలి సన్నిహితమై శైలీ రమణీయతకు పేరు పొందింది.

11 వ శతాబ్దంలో నార్మన్ దండయాత్ర జరిగిన నాటినుంచి ఇంగ్లండ్‌దేశంలో ఫ్రెంచ్ భాషకు అమితమైన ప్రాధాన్యం ఏర్పడడంతో ఇంగ్లీష్ భాష వెనుకబడింది. ఫలితంగా దాదాపు 150 ఏళ్ల పాటు ఇంగ్లీష్ భాషలో కావ్య రచన మందగించింది. సాహిత్య సృష్టి కొరవ

డిన ఈ కాలంలో ఇంగ్లీష్ భాష నార్మన్-ఫ్రెంచ్‌భాష ప్రభావంతో కొన్ని మార్పులకు లోనై నూతన వికాసం పొందింది. 15 వ శతాబ్ది చివరి వరకూ ఉన్న అది 'మిడిల్-ఇంగ్లీష్' (మాధ్యమిక ఇంగ్లీష్) అనే పేరుతో వ్యవహరించబడుతూంది.

ఈ కాలంలో వెలువడిన గ్రంథాలలో *బ్రుట్ బర్మ్యులమ్, కర్సర్‌మండీ* అనే పద్యకావ్యాలూ, *ఆంక్రిన్ రింబ్లే, అయన్ బైట్ ఆవ్ ఇన్‌విట్* అనే వచన రచనలు చెప్పుకోదగ్గవి. 13 వ శతాబ్దినాటి రచించబడ్డ *ది ఔల్ అండ్ ది నైటింగేల్* అనే సంవాద కావ్యంలో అప్పటి వరకూ బహుళప్రచారంలో ఉన్న అనుప్రాసకు మారుగా ఫ్రెంచ్ పద్ధతిని అనుసరించి అంత్యప్రాస నియమం పాటించబడడం ఒక విశేషం. 14 వ శతాబ్దినాటి *పెర్ల్ క్లేన్‌నెస్, పేషన్స్, సర్‌గావెయిన్ అండ్ ది గ్రీన్ నైట్* అనే నాలుగు పద్యకావ్యాలతో కూడిన వ్రాతప్రతి ఒకటే లభించింది. కవి పేరు తెలియలేదు. కాని కావ్యాలలో వాడిన మాండలిక ప్రయోగాలను బట్టి అతడు వెస్ట్ మిడ్ లాండ్ ప్రాంతీయుడని ఊహించ వచ్చును. *పెర్ల్* కరుణ రసప్రధానమైన ఒక కమనీయ కావ్యం. స్వప్నంలో కవికి పసితనంలోనే చనిపోయిన తన చిన్నారి బిడ్డ మార్గరేట్ నదికి ఆవలి ఒడ్డున కనిపిస్తుంది. పితృసహజమైన మమ కారంతో అతడు కొమార్తెను కలుసుకోడానికి వేగంగా నదిని ఈదుతూ ఉండగా స్వప్నం చెదరిపోతుంది. తన బిడ్డ ఆత్మ అమరత్వం పొందింది కదా అని సమాధానం చెప్పుకుని కవి ఊరట చెందుతాడు. *సర్ గావెయిన్* అనే కావ్యం వీరపురుషుల సాహసకృత్యాలను, విలాసి నుల జాణతనాన్ని, వారి ప్రణయజీవితాన్ని సరసంగానూ, మధురంగానూ కీర్తించే 'రోమాన్స్' అనే కావ్య శాఖకు చెందినది. దానిలో ప్రకృతి శోభ, సమకాలీన ప్రజాజీవితం చాలా సొగసుగా వర్ణించబడ్డాయి. విక్లిఫ్ తన అనుచరుల సహకారంతో *బైబిల్* అనబడే క్రైస్తవ మత గ్రంథాన్ని తొలిసారిగా సమగ్రంగా ఇంగ్లీష్‌భాషలోకి అనువదించాడు.

ఒక నిశ్చిత రూపం లేని భాషను సంస్కరించి మహాకావ్య రచనకు అనుకూలమైన సాధనంగా మలచి, సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమం ద్వారా యూరపియన్ భాషలలో నెలకొన్న సత్సంప్రదాయాలను స్వీకరించి, రస వంతమైన కావ్యాలతో ఇంగ్లీష్ భాషకు క్రొత్త అలంకారాలు కల్పించిన గౌరవం చాసర్ మహాకవికి దక్కింది. ఇంగ్లీష్ భాషలో రసాలంకార పరిపుష్టంగా కృతులు రచించిన కవు లలో అతడే మొదటివాడు. ఇటాలియన్, ఫ్రెంచ్ సాహిత్య రీతులను ఆకళించుకొని అతడు మొదట *ది బుక్ ఆఫ్ ది డచ్చెస్, ది హౌస్ ఆఫ్ ఫేమ్, ట్రాయిలస్ అండ్ క్రెసీడ్* అనే కావ్యాలు వ్రాశాడు. కాని చాసర్ ప్రతిభ చక్కగా విప్పారి పరిమళించింది *కాంటర్‌బరీ టేల్స్* అనే కథాకావ్యంలోనే. లండన్ నగరం నుంచి *కాంటర్ బరీ* పట్ట ణంలోని క్రైస్తవ దేవాలయానికి ప్రయాణిస్తున్న యాత్రికులు మార్గ మధ్యంలో కాలక్షేపానికి చెప్పుకొన్నట్లు కల్పించబడిన కథలు అవి. లోకజ్ఞుడైన చాసర్ కావ్యారంభంలో వివిధ యాత్రికుల రూపు రేఖలనూ, స్వభావ వైవిధ్యాన్నీ, హావ భావాలను మిక్కిలి మనోజ్ఞంగా చిత్రించాడు. సైనికుడుగా, రాజాస్థానోద్యోగిగా, రాజదూతగా ఆయన తరచు దేశా టనం చేసి గడించిన అనుభవమంతా సార్థకమయ్యేట్లు ఆ నాటి సమాజంలోని వివిధ వర్గాలకు చెందిన వ్యక్తుల ఆచార వ్యవహారాలను, లోటుపాట్లను *కాంటర్‌బరీ టేల్స్* కావ్యంలో అవకాశం లభించినప్పుడల్లా అతిసహజంగా వర్ణిం చాడు. మతం పేరిట ఆ నాడు అమాయకులైన ప్రజలను వంచించే దుర్నీతి పరులైన మతాచార్యుల పాత్రలను ఆయన వర్ణించే ధోరణిలోనే సన్నని మందలింపు కూడా అంతర్లీనమై ఉంటుంది. సరసమైన వ్యంగ్య హాస్యం ఈ కావ్యానికి జీవం.

చాసర్ సమకాలికులలో అతనితో సాటి రాగల కవు లెవరూ లేరు. జాన్ గవర్, విలియమ్ లాంగ్‌లాండ్ వంటి కవులు తమ కృతులలో ఆ నాటి సమాజంలోని దురాచారాలను తీవ్రంగా విమర్శించారు. కాని వారిలో కావ్యగుణం లోపించింది. *ది ట్రావెల్స్ ఆఫ్ మాండె విల్* అనే అనువాద గ్రంథం ఆ నాటి వచన రచనలలో చెప్పుకోదగ్గది.

'మహాజనో యేన గతః స పంథాః' అనే సూక్తిని అనుసరించి 'చాసర్' తరువాత 100 ఏళ్ల పాటు అతడు చూపిన త్రోవనే ఆశ్రయించి పలువురు కావ్య రచనకు ఉద్యమించారు. కాని వారి ప్రయత్నాలు పూర్తిగా ఫలించ లేదు. అతణ్ణి అనుసరించి కవిత్వం చెప్పిన వారిలో జాన్ లిడ్‌గేట్, విలియమ్ డన్బార్ ముఖ్యులు. మార్గకవిత మందగించిన ఆ శతాబ్దంలో దేశి కవితా శాఖకు చెందిన జానపద గీతాలకు అమితంగా ప్రజాదరణ లభించింది. ఆ గీతాలలో *చేవీ చేస్, సర్‌ప్యాట్రిక్ స్పెన్స్* చాలా ప్రసిద్ధి పొందాయి. 15 వ శతాబ్ది నాటి ఆర్థర్ రాజును గూర్చిన చిత్ర విచిత్రమైన కల్పనా కథలను సేకరించి సర్ జాన్ మెలొరీ అనే కవి, *మోర్ట్ డీ ఆర్థర్* అనే ప్రసిద్ధ వచన కథాకావ్యం రచించాడు. విలియమ్ కాక్ స్టన్ ప్రథమ ముద్రణ యంత్రం నెలకొల్పి దేశభాషలో పుస్తకాలు ముద్రించి సాంస్కృతిక పునరుజ్జీవనానికి ఆసా

ధారణమైన సేవ చేశాడు. విలియమ్ కిండేల్, మైల్స్ కవర్డేల్ అనేవారు *బైబిల్* మతగ్రంథాన్ని తిరిగి ఇంగ్లీష్ భాషలోకి రమణీయమైన శైలిలో అనువదించి మతంతో పాటు భాషకు కూడా సేవ చేశారు. అదే సమయంలో సర్‌టామస్ మోర్ *యుటోపియ* అనే వచనగ్రంథంలో ఆదర్శ సమాజ స్వరూపాన్ని చిత్రించాడు. తరువాత కొంత కాలానికి 16 వ శతాబ్ది ఆరంభంలో సర్ టామస్ వైట్, ఏర్ల్ ఆఫ్ సర్రే అనే కవులు ఇటాలియన్ ఛందో రీతులను అనుసరించి ఇటాలియన్ ప్రణయ కవిత్వాన్ని ఇంగ్లీష్‌భాషలోకి అనువదించి గేయ కవితా వికాసానికి అనుకూల వాతావరణం కల్పించారు. వారి గీతాలే ఇంగ్లీష్ సాహిత్యంలో ఉదయించిన కాల్పనికోద్యమానికి తొలి కిరణాలని చెప్పవచ్చు.

విద్యా గంధంలేని పామర జనులకు గూడా తమ పౌరాణిక గాథలను, మత సిద్ధాంతాలను సుబోధం చేయాలనే ఉదారాశయంతో క్రైస్తవ మతగురువులు ప్రధానమైన పర్వదినాలలో దేవాలయాలలో మతసంబంధమైన రూపక ప్రదర్శనాలను ఏర్పరచేవారు. వాటిలో ముఖ్యంగా *బైబిల్* లోని కథలు, సిద్ధపురుషుల లీలలు ప్రదర్శింపబడుతూ ఉండేవి. అలౌకికమైన అద్భుత సంఘటనలను చిత్రించే రూపకాలు కనుక, వాటిని 'మిస్టరీస్' అనీ, 'మిరకిల్ ప్లేస్' అనీ పిలిచేవారు. ప్రేక్షకుల మనోరంజనకై నడుమ నడుమ ప్రధాన కథతో ఎట్టి సంబంధమూ లేని హాస్య సన్నివేశాలు కూడా అప్పు డప్పుడు చేర్చబడుతూ ఉండేవి. క్రమంగా ఈ ప్రదర్శనలు దేవాలయాంతర్భాగం నుంచి దాని ప్రాంగణంలోకీ, తరువాత అక్కడ నుంచి నడివీథిలోకీ మారాయి. కొన్నాళ్లకు 'మొరాలిటీ ప్లేస్' అనే క్రొత్త రకం నాటకాలు వెలిశాయి. వాటిలో పుణ్యం, పాపం, శాస్త్రం, సంయమనం మొదలైన గుణాలే పాత్రల రూపంలో కల్పింపబడి, ధర్మప్రబోధం చేస్తాయి. ఇలాంటి నాటకాలలో *ఎవిరియూన్* మిక్కిలి ప్రశస్తమైంది. వాటితో పాటు వ్యంగ్య విమర్శతో కూడిన 'ఇంటర్లూడ్స్' అనే నాటికలు కూడా ప్రదర్శించబడేవి. ఇలాంటి రచనలలో జాన్ హేవుడ్ రచించిన *ఫోర్ పీస్* చెప్పుకోదగింది. రాను రాను ఈ ప్రదర్శనలకు మతంతో ప్రమేయం పోయి ప్రజలకు వినోదం చేకూర్చడమే లక్ష్యమైంది. ఇంగ్లీష్ భాషలో నాటక వాఙ్మయ వికాసం ఈ విధంగా మత ఆలయాల ధర్మ ప్రబోధ కార్యక్రమం నుంచి ఏర్పడింది. 16 వ శతాబ్దినాటికి ఈ స్థితి పూర్తిగా మారిపోయింది. అప్పుడు గ్రీక్, లాటిన్ నాటక సంప్రదాయ వేత్తలైన రచయితలు ఈ సాహిత్య ప్రక్రియను చేపట్టి, దీనిని సర్వాంగ సుందరంగా దిద్ది తీర్చారు. క్రమబద్ధమైన రూపకాలలో నికలస్ ఉడాల్ రచించిన *రాయిస్టర్ డాయిస్టర్* అనే సుఖాంత నాటకం, థామస్ శాక్విల్, థామస్ నార్టన్ అనే రచయిత లిరువురూ కలసి వ్రాసిన *గార్బోడక్* అనే విషాదాంత నాటకం మొట్టమొదటివి. ఆ కాలంలో ఈ నాటకాలు అమితంగా ప్రజాభిమానాన్ని చూరగొన్నవి. ఆ అభిమానమే 16 వ శతాబ్దిలో ఆంగ్లభాషలో జగత్ప్రసిద్ధమైన గొప్ప నాటకాల అవతరణకు హేతుభూతమైంది.

మొదటి ఎలిజబెత్‌రాణి పరిపాలనకాలం 16వ శతాబ్ది ఉత్తరార్ధం ఇంగ్లీష్ సాహిత్య చరిత్రలో స్వర్ణయుగ మని ప్రశస్తి కెక్కింది. ఇంగ్లండ్‌దేశంలో అప్పుడు నూతన చైతన్యం వెల్లివిరిసింది. ఇంగ్లీష్ ప్రజలు బహు రంగాలలో ఘనవిజయం సాధించి భావోత్తేజితు లయారు. దేశంలో జాతీయత క్రొత్త చిగుళ్లు తొడిగింది. ప్రజల ఆనందోత్సాహాలు ఆ నాటి సాహిత్య క్షేత్రంలో కూడా ప్రతిధ్వనించాయి. రసజ్ఞ జన మనో మోహనంగా బహుకావ్య నాటకాలను సృష్టించిన మహాకవు లనేకులు ఆ యుగంలో ఒక్కచోట సమకూడటం ఒక విశేషం. యూరప్ ఖండంలో పొడచూపిన సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమ ప్రభావం ఆ నాటి ఇంగ్లీష్ సాహిత్యానికి ఎనలేని గాంభీర్య మాధుర్యాలను సమకూర్చింది.

కాల్పనిక కవిత్వపు తీరు తెన్నులను చక్కగా గ్రహించి ఎడ్మండ్ స్పెన్సర్ సౌందర్య బంధురాలైన కావ్య ప్రసూనాలతో నాటి సాహిత్య ప్రపంచాన్ని సురభిళం కావించాడు. లలిత కోమల కాంత పదావళితో అపూర్వ సుందరశబ్ద చిత్రాలను సృష్టించి, పాఠకులను రసానంద పరవశులను కావించి, సుఖడోలికలలో ఊయెల లూగించడంలో అతనికి అతడే సాటి. స్పెన్సర్ కవి ప్రతిభ *ది షెపర్డ్స్ కాలండర్, యూమొరెట్టీ, ఎపిథలేమియమ్* వంటి లఘు కావ్యాలలో కూడా గోచరిస్తుంది. కాని ఆయన కీర్తి సౌధానికి మూలస్తంభమైంది *ది ఫెయిరీ క్వీన్* అనే కావ్యం. ఇంగ్లీష్ జాతి ఆ నాడనుభవించిన విజయోత్సవ సంరంభం ఈ కావ్యాన్ని కాంతిమంతం చేసింది. స్పెన్సర్ కవి పలుకులకు అబ్బిన అతులిత మాధురీ మహిమకు ముగ్ధులై తర తరాల కవులు ఆయన శబ్దచిత్ర కల్పనాన్నీ, శయ్యా సౌభాగ్యాన్నీ తమ కృతులలో అనుకరించడానికి ప్రయత్నించడం చేత ఆయనకు "కవీనాం కవిః" అనే బిరుదం సార్థక మైంది.

కాల్పనిక కవిత్వానికి మూలాధారమైన శృంగార రసం ఆ నాటి కృతులలో "ఎందెందు వెదకి చూచిన అందందే" సాక్షాత్కరిస్తుంది. ఆ నాటి కవులలో డేనియల్, డ్రేటన్,

కాంపియన్ ముఖ్యులు. ఇటాలియన్ భాషనుంచి గ్రహిం చబడిన 'సానెట్' అనే 14 పంక్తుల పద్యం ఈ ప్రణయ కవితా రచనకు ప్రధాన సాధనం అయింది. స్పెన్సర్ కవికి ఆప్తమిత్రుడైన సర్ ఫిలిప్ సిడ్నీ అలాంటి పద్యా లతో *ఆస్ట్రోఫెల్ అండ్ స్టెల్లా* అనే కావ్యం వ్రాశాడు. అతడే *ది ఆర్కేడియా* అనే సుదీర్ఘ వచన కథను, *ది అపాలజి ఫర్ పొయెట్రీ* అనే విమర్శ గ్రంథాన్ని కూడా రచించాడు. ఇంగ్లీష్ భాషలో కావ్యప్రయోజనాన్ని చర్చించే సాహిత్యశాస్త్ర గ్రంథాలలో సిడ్నీ పుస్తకానికి ప్రముఖ స్థానం ఉంది.

ఈ యుగంలో నాటక వాఙ్మయశాఖ చిగిర్చి విరియ పూసింది. మొదట కొంతకాలం పండితకవులు గ్రీక్ నాటక సంప్రదాయాలను అనుసరించి నాటక రచనకు ఉపక్రమించారు. కాని గ్రీక్ లక్షణశాస్త్రాల నియమాలు ప్రాచీన కాలంనాటి గ్రీక్ రంగస్థలానికి అనువైనవే అయినా, ఇంగ్లీష్ నాటకాలలో అవి ఎంతో అసహజంగా ఉండడం చేత ప్రజామోదాన్ని పొందలేక పోయాయి. అందుచేత అప్పటినుంచీ ఇంగ్లీష్ భాషలో కరుణ, హాస్యరసాల మేళనంతో స్థల, కాల, వస్తువుల పట్ల సంపూర్ణ స్వాతంత్ర్యంతో కూడిన దేశీయ నాటక సంప్రదాయం ఏర్పడింది.

ఆ నాటి ప్రజల ప్రధాన వినోదాలలో నాటక ప్రద ర్శనం ఒకటి కావడం వల్ల నాటక రచనకు విరివిగా ప్రోత్సాహం లభించింది. జాన్ లిలీ, థామస్ కిడ్, జార్జ్ టీల్, థామస్ లాడ్జ్, రాబర్ట్ గ్రీన్, థామస్ నాష్ ప్రభృతులు చక్కని నాటకాలు వ్రాశారు. క్రిస్టఫర్ మార్లో నాటకం అతని మహోజ్జ్వల భావనా పటిమ చేత భాసిం చింది. *టాంబర్లేన్, డా. ఫాస్టస్, ది జ్యూ ఆఫ్ మాల్టా, ఎడ్వర్డ్ ది సెకండ్* అనే నాటకాలు నాలుగు మార్లో ప్రతిభకు నిదర్శనాలు. అతడే *హీరో అండ్ లియాండర్* అనే చక్కని కావ్యం కూడా వ్రాశాడు.

ఆ నాటి నాటక కర్తలలో మహోన్నత శిఖర సదృశుడై నిలిచిన జగద్విఖ్యాత ప్రతిభాశాలి విలియమ్ షేక్స్‌పియర్. నాటక వాఙ్మయంలోని వివిధ శాఖలలో ఆయన స్పృశింపని దేదీ లేదు. అతడు 37 నాటకాలు రచించాడు. వాటిలో *ఏ మిడ్ సమ్మర్ నైట్స్ డ్రీమ్, ది మర్చెంట్ ఆఫ్ వెనీస్, మచ్ ఎడో ఎబౌట్ నథింగ్, యాజ్ యూ లైక్ ఇట్, ట్వెల్ఫ్త్‌నైట్* అనే సుఖాంత నాటకాలూ, *రిచర్డ్ ది సెకండ్, హెన్రీ ది ఫోర్త్, హెన్రీ ది ఫిఫ్త్* అనే బ్రిటిష్ చారిత్రక నాటకాలూ, *జూలియస్ సీజర్, ఆంటోనీ అండ్ క్లియోపాత్రా* అనే రోమన్ చారిత్రక నాటకాలూ, *రోమియో అండ్ జూలియట్, హామ్లెట్, ఒథెల్లో, మెక్బెత్, కింగ్ లియర్* అనే విషా దాంత నాటకాలూ, *సింబలీన్, ది వింటర్స్ టేల్, ది టెంపెస్ట్* అనే కాల్పనిక నాటకాలూ సుప్రసిద్ధ మైనవి. అతని నాటకాలకు మహోజ్జ్వలమైన భావనా, ప్రజ్ఞా విలసి తమైన పాత్ర నిర్మాణం, శ్రవణ పేయమైన శబ్ద సంధానం, విశ్వజనీన మైన ధార్మిక పరిజ్ఞానం నిరుపమాన రమణీ యతను ఆపాదించాయి.

వినోద మొక్కటే కాక ధర్మ ప్రతిపాదన కూడా నాటక రచన ధ్యేయం కావాలని విశ్వసించి, తదనుగుణంగా నాటకాలను రచించినవాడు బెన్ జాన్సన్. కాల్పనిక కథలను కాక నాటి వాస్తవిక ప్రజా జీవితాన్ని అతడు తన సుఖాంత నాటకాలకు కథావస్తువుగా గ్రహించాడు. అతని నాటకాలలో *ఎవిరి మాన్ ఇన్ హిజ్ హ్యూమర్, ది ఆల్కెమిస్ట్, వాల్పోన్* అనేవి ముఖ్యమైనవి. *వైట్ డెవిల్, ది డచెస్ ఆఫ్ మల్ఫీ* అనే విషాదాంత నాటకాలు వ్రాసిన జాన్ వెబ్‌స్టర్ నాటక రచనలో ఆరితేరిన వాడే కాని, భయానక బీభత్స సన్నివేశాలను మితిమీరి కల్పించాడు. *ది బ్రోకెన్ హార్ట్* అనే నాటకంలో జాన్ ఫోర్డ్ కరుణ రసాన్ని చక్కగా పోషించాడు. ఫ్రాన్సిస్ బోమంట్, జాన్ ప్లెచర్ అనే కవు లిరువురూ కలసి వ్రాసిన *ఫిల్లాస్టర్, ది మెయిడ్స్ ట్రాజెడీ* వంటి నాటకాలకు అమితమైన ప్రజాదరణం లభించింది. ఫిలిప్ మ్యాసింజర్ వ్రాసిన *ఏ న్యూ వే టు పే ఓల్డ్ డెట్స్* అనే నాటకం సరస హాస్యంతో ప్రేక్షకులకు చక్కిలిగింతలు పెట్టింది.

అప్పుడే ఫ్రాన్సిస్ బేకన్ అనే రచయిత ఇంగ్లీష్ లో 'ఎస్సే' (వ్యాసము) అనే నూతన సాహిత్య ప్రక్రియను ప్రవేశ పెట్టాడు. మాంటెన్ అనే ఫ్రెంచ్ రచయిత స్వీయకథాత్మకమైన తన సంగ్రహ వచన రచనకు ఆ పేరును మొదటిసారి ఉపయోగించాడు. ఫ్రాన్సిస్ బేకన్ సార్వకాలీన మైన గుణాదర్శాలను గూర్చి పెక్కు వ్యాసాలు రచించి, ఆ ప్రక్రియను తీర్చిదిద్దాడు. కాంటర్బరీ క్రైస్త వాలయాధిపతి అయిన టామస్ క్రాన్మర్ కూర్చిన *ది ఫస్ట్ ప్రేయర్ బుక్* అనే ప్రార్థన గ్రంథంలోని వచన శైలి గాంభీర్య సౌకుమార్యాలతో రాణించింది. ఆనాటి వచన గ్రంథాలకు మకుటాయమానమైంది - *ది ఆథరైజ్డ్ వెర్షన్* అనే బైబిల్ గ్రంథానువాదం. ఆ గ్రంథంలోని వచనం ప్రసాద మాధుర్యాది గుణాలతో కూడి, ఇంగ్లీష్ భాషకు అనేక శబ్ద చిత్రాలను, నుడికారాలను అందించి, నాటినుండీ భాషపై తన పలుకుబడిని నిరాఘాటంగా సాగించుకుంటూనే ఉంది.

17 వ శతాబ్ది మొదట కవిత్వ రచనలో ఒక విలక్షణ మార్గాన్ని అనుసరించి ఆధ్యాత్మికేతివృత్తాలపై కొందరు కవు లనేక పద్యాలను, గీతాలను రచించారు. వారి కవిత్వానికి 'తాత్త్విక మార్గం' (The Metaphysical school) అనే పేరేర్పడింది. నిజాని కది పూర్వయుగంలో విజృంభించిన కాల్పనికోద్యమంపై జరిగిన ఒక తిరుగుబాటని చెప్పవచ్చు. కేవలం సుందర మైన భావనా స్ఫూర్తికి మారుగా తార్కిక దృష్టి, ప్రఖ్యాతమైన, చమత్కార రమ్యమైన కవి సమయాలకు బదులుగా కల్పనావైచిత్రితో గూడిన సాదృశ్యాలు ప్రయుక్త మయాయి. కవితలో సహజ మార్దవం లోపించడంచేత కవిత్వం కవుల విస్తృత వైదుష్యానికి సూచన మాత్రంగా పరిణమించింది. ఈ నూతన రీతికి మార్గదర్శి జాన్ డన్ అనే ప్రసిద్ధ క్రైస్తవ మతబోధకుడు. డన్‌చూపిన త్రోవ ననుసరించి తాత్త్విక కవిత్వం రచించిన వారిలో జార్జ్ హెర్బర్ట్ హెన్రీవాన్, రిచర్డ్‌క్రాషా, ఏబ్రహమ్ కౌలే అనే కవులు ముఖ్యులు. ఆ కాలంలో తాత్త్విక మార్గపు వింత పోకడల జోలికి పోక సాంప్రదాయిక ధోరణిలో కవిత్వం చెప్పిన వారు కొంద రున్నారు. వారిలో రాబర్ట్ హెరిక్, ఆండ్రూ మార్వెల్, ఎడ్మండ్ వాలర్, రిచర్డ్ లవ్‌లేస్, శామ్యుయల్ బట్లర్ ప్రభృతులు కొన్ని సొగసైన కావ్యాలను వ్రాశారు.

అప్పటి కవులలో అగ్రగణ్యుడు జాన్ మిల్టన్. అద్వితీయమైన ప్రతిభా వ్యుత్పత్తులతో అతడు ఇంగ్లీష్ భాషలోని పద్య కావ్యాలలో కెల్లా శిరోరత్న మనదగిన *పారడైజ్‌లాస్ట్* అనే మహాకావ్యాన్ని రచించి, విశ్వవిఖ్యాతిని గడించాడు. మిల్టన్ రచించిన *లలెగ్రో, ఇల్ పెన్సెరోసో* అనే పద్య కావ్యాలూ, *కోమస్* అనే రూపకమూ, *లిసిడాస్* అనే విషాద గీతమూ అతని అమేయ ప్రతిభకు నిదర్శనాలు. అంత్య కాలంలో ఆయన *పారడైజ్ రీగెయిన్డ్* అనే కావ్యాన్నీ, *శామ్సన్ ఎగొనిస్టిస్* అనే రూపకాన్నీ రచించాడు. ఎన్నో వచన రచనలను కూడా చేశాడు. వాటిలో వాక్స్వాతంత్ర్యాన్ని బలపరచే *ఏరియో పెజిటికా* అనే గ్రంథం అతి ప్రసిద్ధ మైంది.

జాన్ డ్రైడెన్ అనే కవి అధిక్షేప కావ్య కర్తగా ప్రసిద్ధు డయాడు. *యబ్సలొమ్ అండ్ అకిటొఫెల్, ది మెడల్, మెక్ ఫ్లెక్నో* అనే కావ్యాలలో ఆ నాటి కలుషిత రాజకీయ వాతావరణాన్ని, వ్యక్తుల దుర్నీతిని వ్యంగ్యంగా ఆయన విమర్శించారు. ఆయన కవితా నైపుణ్యం *అలెగ్జాండర్స్ ఫీస్ట్, ది హైండ్ అండ్ ది పాంథర్* వంటి కావ్యాలలో కూడా కన్పిస్తుంది. డ్రైడెన్ కావ్య రచనకు 'హీరోయిక్ కప్లెట్' అనే ద్విపదను అత్యంత నైపుణ్యంతో ఉపయోగించి, ఇతర కవులకు మార్గదర్శకు డయాడు. పూర్వ కవుల కృతులనుండి 'ఫేబుల్స్' అనే నీతి కథల ననువదిస్తూ అనువృత్త కావ్యానికి వ్రాసిన పీఠికలో ఆయన సాహిత్యశాస్త్ర సిద్ధాంతాలను అతి దక్షతతో విమర్శించాడు. కావ్యనాటక లక్షణాలను చర్చిస్తూ, ప్రసన్న సరళ వచన శైలిని నూతనంగా నెలకొల్పుతూ అతడు ఉభయ తారకంగా కొన్ని సారస్వత వ్యాసాలను కూడా ప్రకటించాడు. ఆ నాటి నాటక కర్తలలో కూడా అతనికి ప్రముఖస్థానం ఉంది. ప్రేయసి క్లియోపాత్ర కోసం తన సర్వస్వాన్ని కోల్పోయిన మార్క్ ఆంటోనీ విషాద కథను ఆయన *ఆల్ ఫర్ లవ్* అనే నాటకంలో అతి రమ్యంగా చిత్రించాడు.

ఆ కాలపు నాటకాలలో ఎక్కువ భాగం సుఖాంత కథలతో కూడినవే. అవి కథా సంవిధాన కౌశలానికి పేరు పడ్డవి. కాని నైతిక స్పృహ లేకపోవడం వాటిలో లోపం. అప్పటి నాటక కర్తలలో ఓట్వే, ఎథెరిజ్ విచర్లీ, కాంగ్రీవ్, ఫార్కుహార్ అనే వారు ముఖ్యులు. కాంగ్రీవ్ వ్రాసిన *లవ్ ఫర్ లవ్, ది వే ఆఫ్ ది వరల్డ్* అనే నాటకాలు సుప్రసిద్ధ మైనవి.

అప్పటి వచన రచనలలో కనిపించే వైవిధ్యం గమనింప దగింది. విస్తృత వైదుష్య సూచకమైన గంభీరశైలిలో రాబర్ట్ బర్టన్ *ది ఎనాటమీ ఆఫ్ మెలాంకలి* అనే గ్రంథాన్ని, కవిత్వానికి ఎనవచ్చే రమణీయశైలిలో సర్ థామస్ బ్రౌన్ *రిలిజియో మెడిచీ, హైడ్రియో టేఫియా* అనే గ్రంథాలను, లలితమైన ఆలంకారిక శైలిలో జెరెమీ టెయిలర్ *హోలీ లివింగ్, హోలీ డయింగ్* అనే ధార్మిక గ్రంథాలను, సరళ సుందరమైన శైలిలో డ్రైడెన్ విమర్శక వ్యాసాలను, ప్రాసంగిక ధోరణిలో ఐజాక్ వాల్టన్ *ది కంప్లీట్ ఆంగ్లర్* అనే గ్రంథాన్నీ, నిత్య వ్యవహారంలో ఉన్న భాషలో శామ్యుయల్ పెప్స్ *డైరీ* వ్రాశారు. అప్పటి వచన రచయితలలో ప్రత్యేకంగా పేర్కొనతగినవాడు జాన్ బన్యన్. ఎక్కువగా చదువుకోకపోయినా, *బైబిల్* గ్రంథాన్ని నిత్యం పారాయణ చేయడంచేత సంక్రమించిన రచనా పాటవంతో అతడు *ది పిల్గ్రిమ్స్ ప్రోగ్రెస్* అనే నిగూఢార్థ రచనను అతి హృద్యంగా వెలయించాడు. పాపసంకులమైన పతిత స్థితి నుంచి పరమేశ్వర సన్నిధానానికి మానవుడు చేసే జీవితయాత్రలో అతనికి మార్గమధ్యంలో తటస్థించే వివిధానుభవాలను అతడీ గ్రంథంలో చాలా సొగసుగా వర్ణించటంవల్ల అది అమితంగా ప్రజాదరణ పొందింది.

క్రమంగా ప్రజలకు రాజకీయ, సాంఘిక రంగాలలో అప్పుడు ప్రబలిన నీతి హీనమైన విశృంఖల వర్తనపై

విరక్తి పుట్టింది. 18 వ శతాబ్దిలో నవ్యవాద సంప్రదాయం (The Neo classical school) నెలకొనడానికి అది పరోక్ష కారణం అయింది. నాటి కవులకు ప్రాచీన లాటిన్ కవిత్వ రీతులపై అనురక్తి ఏర్పడింది. కవిత్వంలో భావన కంటె బుద్ధికి ప్రాముఖ్యం హెచ్చయింది. ఫలితంగా వ్యంగ్య కావ్యాలూ, ప్రబోధాత్మక కావ్యాలూ ఎక్కువగా ఉద్భవించాయి. నాటి కవులు కమనీయ ప్రకృతి దృశ్యాలను విస్మరించి, నాగరక జీవితపు తళుకు బెళుకులను తమ కవితా వస్తువుగా చేసికొన్నారు. కవిత్వానికి సహజాలంకారమైన లాలిత్యం లోపించడంచేత కొంత కృత్రిమత్వం పొడచూపింది.

ఈ వర్గానికి చెందిన కవులలో ముఖ్యుడు అలెగ్జాండర్ పోప్. అతని కావ్యాలలో నవ్య సంప్రదాయవాద కవితలోని గుణ దోషా లన్నీ కన్పిస్తాయి. అతడు తన కవిత్వ సిద్ధాంతాలను *ఎస్సే ఆన్ క్రిటిసిజమ్* అనే కావ్యంలోనూ, సాంఘిక విశ్వాసాలను *ఎస్సే ఆన్ మాన్* అనే కావ్యంలోనూ విపులంగా వివరించాడు. గ్రీక్ భాషలో హోమర్ మహాకవి రచించిన *ఇలియడ్* అనే ప్రసిద్ధ కావ్యానికి ఆయన ఒక స్వతంత్రానువాదం వెలయించాడు. *ది రేప్ ఆఫ్ ది లాక్* అనే వ్యంగ్య కావ్యంలో నాటి నాగరిక సమాజంలో ఉన్నత వర్గానికి చెందిన వ్యక్తుల నిరర్థక విలాసమయ జీవితాన్ని అతి సుకుమారంగా పరిహసించాడు. పరిహాస రసికత్వానికి అతడు పెట్టింది పేరు. ఇక *డన్సియడ్* అనే అధిక్షేప కావ్యం ప్రత్యేకంగా అతని విరోధులను తూర్పార పట్టేందుకే పుట్టింది. అతని కవిత్వానికి ప్రాణం ఛలోక్తి. అతని పద్య పంక్తులు పెక్కు సామెతలై నిత్య వ్యవహారంలో చేరిపోయాయి.

ఎడ్వర్డ్ యంగ్, మాథ్యూ ప్రయర్, జాన్‌గే ప్రభృతులు పోప్ పెట్టిన ఒరవడి ననుసరించి తమ కృతులలో నవ్య సంప్రదాయ వాదాన్ని నిలువబెట్టారు. జేమ్స్ థామ్సన్ అనే కవి ఋతువర్ణనాత్మకమైన *సీజన్స్* అనే కావ్యంలో కొంత వరకు మధురభావనా ప్రధానమైన కాల్పనిక కవితా పద్ధతి ననుసరించాడు. మొత్తం మీద అప్పటి సాహితీపరుల భావ ప్రకటనకు కవితకంటె వచనమే అనుకూల సాధనం కావడంవల్ల ఆ యుగంలో ప్రశస్తమైన వచనగ్రంథాలు అనేకం వెలశాయి. డేనియల్ డీఫో వ్రాసిన *రాబిన్సన్ క్రూసో* కథ కల్పితమే అయినా, యథార్థగాథ అని నాటి పఠితలను భ్రమింపజేసి, అమితమైన ప్రజాదరణ పొంది, ఆ తరువాత బాల వాఙ్మయంలో సుస్థిర స్థానాన్ని ఆక్రమించుకొంది. జొనాథన్ స్విఫ్ట్ సరళమూ, సుబోధమూ అయిన సంవాదశైలిలో వచన రచన కావించి చాలా పేరు పొందాడు. వ్యంగ్య విమర్శలో ఆయన నిశ్చయంగా అద్వితీయు డని చెప్పవచ్చు. సాహిత్య ప్రపంచంలోని ప్రాచీ నాధునాతన మార్గాల మధ్య సంఘర్షణను *ది బ్యాటిల్ ఆఫ్ ది బుక్స్* అనే పుస్తకంలోను, క్రైస్తవ మతంలోని వివిధ శాఖలమధ్య చెలరేగుతున్న అంతః కలహాన్ని *ది టేల్ ఆఫ్ ఏ టబ్* అనే పుస్తకంలోను ఆయన విమర్శించాడు. అతనికి మానవ జాతిమీద కలిగిన విరక్తి అంతా కరడుగట్టి *గలివర్స్ ట్రావెల్స్* అనే అధిక్షేప వచన కథా కావ్యరూపం తాల్చింది. ఆ కథలో నాటి మానవ సమాజంలోని పెక్కు లోపాలను స్విఫ్ట్ నిశితంగా ఖండించాడు.

పత్రికల ద్వారా వ్యాస రచనకు ఆ కాలంలో చాలా ప్రోత్సాహం లభించింది. రిచర్డ్ స్టీల్, జోసెఫ్ అడిసన్ అనే రచయిత లిరువురు చేరి మొదట *ది టాట్లర్* అనే పత్రికలోను, తరువాత *ది స్పెక్టేటర్* అనే పత్రికలోను సమకాలిక సమస్యలను సౌమ్యంగానూ, మృదుహాస్య పూరితమైన రసవంతమైనశైలిలోనూ చర్చిస్తూ అనేక వ్యాసాలు ధారావాహికంగా ప్రకటించి, వచన వాఙ్మయాన్ని సంపన్నం చేశారు. ఆ వ్యాస పరంపరలో సృజింపబడ్డ ఐజాక్ బికర్‌స్టాఫ్, సర్ రోజర్ డీ కవర్లీ వంటి పాత్రలకు సాహిత్య ప్రపంచంలో అమరత్వం సిద్ధించింది.

అపార పాండితీ విభవం చేతా, మహత్తరమైన వ్యక్తిత్వం చేతా నాటి విద్వజ్జన మండలికి అధినేతగా నిలిచి ఇంగ్లీష్ భాషకు ప్రామాణిక నిఘంటువును కూర్చి, వాగనుశాసనుడు (Dictator of the English language) అని పేరు పడసిన మహనీయుడు డాక్టర్ జాన్సన్. అతడు భాషకు తొలి నిఘంటువును బహు ప్రయాసల కోర్చి సంకలనం చేయటమే గాక, *ది రాంబ్లర్, ది ఐడ్లర్* అనే ధార్మిక వ్యాసావళినీ *లండన్, ది వానిటీ ఆఫ్ హ్యూమన్ విషెస్* వంటి పద్య కావ్యాలను, *ఐరీన్* అనే నాటకాన్ని, *రాసెలాస్* అనే వచన కథను రచించాడు. షేక్స్‌పియర్ నాటక సంపుటికి ఆయన రచించిన విపుల పీఠికా, *లైవ్స్ ఆఫ్ ది పొయెట్స్* అనే బృహద్ గ్రంథమూ సాహిత్య విమర్శలో జాన్సన్ ప్రదర్శించిన అసామాన్య ప్రతిభకు చక్కని ఉదాహరణాలు. అంతే గాక సమకాలీన సాహితీ కులపతిగా రచయితలను చేరదీసి వారిని అనేక విధాలుగా ప్రోత్సహిస్తూ, తా నాడిన మాటలెల్ల సాహిత్యమూ, తన అభిప్రాయమే విద్వజ్జనులకు పరమ ప్రమాణమూ అనిపించుకొని పరోక్షంగా కూడా సాహిత్యానికి అద్వితీయమైన సేవ చేశాడు. జాన్సన్ వ్యక్తిత్వాన్ని కళ్లకు కట్టినట్లు చిత్రిస్తూ అతని మిత్రుడు జేమ్స్

బాస్వెల్ *లైఫ్ ఆఫ్ శామ్యుయల్ జాన్సన్* అనే జీవిత చరిత్రను ప్రకటించి జీవిత కథా వాఙ్మయంలో దానికి సాటి రాగల గ్రంథం మరోటి విశ్వ సాహిత్యంలోనే లేదనే ప్రఖ్యాతి గడించారు.

ఇంగ్లీష్ భాషలో "నావెల్" అనే సువిస్తృత కథా రూపకమైన నూతన సాహిత్య ప్రక్రియ 18 వ శతాబ్దిలో ఏర్పడింది. నవలా రచనకు ఆద్యుడైన రిచర్డ్‌సన్ *పమేలా, క్లారిస్సా* అనే నవలలలో మానినీ హృదయ నైర్మల్యాన్ని చిత్రించడానికి ప్రయత్నించాడు. ఫీల్డింగ్ నిత్యజీవితానికి సన్నిహితమైన కథలతో *జోసెఫ్ ఆండ్రూస్, టామ్ జోన్స్* అనే నవలలు వ్రాశాడు. స్మాలెట్ రచించిన *రోడరిక్ రాండమ్* మొదలైన నవలలు వాస్తవికతకు పేరు పొందాయి. లారెన్స్ స్టెర్న్ వ్రాసిన *ట్రిస్ట్రమ్ షాండీ, ఏ సెంటిమెంటల్ జర్నీ* అనే నవలలు ఆ నాడు విశేషంగా ప్రజాదరణ పొందాయి.

నాటి రచయితలలో సర్వతోముఖమైన ప్రజ్ఞ కలవాడు ఆలివర్ గోల్డ్‌స్మిత్. అతడు తన కావ్యాలతో జాన్సన్ వంటి విమర్శక సార్వభౌముణ్ణి కూడా మెప్పించ గలిగాడు. గోల్డ్‌స్మిత్ *ది ట్రావెలర్, ది డెజర్టెడ్ విలేజ్* అనే చక్కని పద్య కావ్యాలను, *షీ స్టూప్స్ టు కాంకర్* వంటి హాస్య నాటకాలను వ్రాశాడు. ఆయన రచించిన *ది వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్* అనే నవల అత్యుత్తమ శ్రేణికి చెందింది. *ది సిటిజన్ ఆఫ్ ది వరల్డ్* అనే వ్యాస మాలికలో సరస హాస్యంతో సమకాలీన సమాజపు మేలు కీళ్ళను విమర్శించాడు గోల్డ్‌స్మిత్.

ఎడ్మండ్ బర్క్ అనే రాజకీయవేత్త చేసిన గంభీరోపన్యాసాలు కావ్య గుణ సముపేతాలు కావడం చేత సాహిత్య గౌరవం పొందగలిగాయి. ఆ విధంగానే ఎడ్వర్డ్ గిబ్బన్ రసాలంకార శోభితమైన శైలిలో రచించిన *ది డిక్లైన్ అండ్ ఫాల్ ఆఫ్ ది రోమన్ ఎంపైర్* అనే చరిత్ర గ్రంథం కూడా సాహిత్యప్రతిష్ఠ నందుకుంది. అదే సమయంలో లేఖా సాహిత్యం కూడా వెలసింది. హొరేస్ వాల్పోల్, లార్డ్ చెస్టర్‌ఫీల్డ్ ప్రభృతులు వ్రాసిన లేఖలు గ్రంథరూపం తాల్చాయి. లేఖా రచనలో కూడా సిద్ధహస్తుడైన డాక్టర్ జాన్సన్ వాడి తూపులవంటి పలుకులతో ప్రయోజనం మాలిన చెస్టర్‌ఫీల్డ్ స్నేహ సహకారాలను నిరాకరిస్తూ వ్రాసిన ఉత్తరం లేఖా సాహిత్యమాలలో మణి పూస వంటిది. ఆ కాలంలోనే షెరిడన్ అనే నాటక కర్త చతురోక్తులతో అప్పుడప్పుడూ శ్రుతిమీరిన హాస్యంతో *ది రైవల్స్, ది స్కూల్ ఫర్ స్కాండల్* వంటి సుఖాంత నాటకాలను వ్రాసి ప్రసిద్ధి కెక్కాడు. లేని పాండిత్యాన్ని ప్రదర్శింపగోరి, అర్థం తెలియని మాటలను అసందర్భంగా వాడి నలుగురిలో నగుబాటు పాలయే వ్యక్తులను ఆయన 'మిసెస్ మేలప్రాప్' అనే పాత్ర రూపాన గేలిచేశాడు.

కాలం గడచినకొద్దీ కవులకు నవ్య సంప్రదాయ వాదం మీది వ్యామోహం అంతరింపగా, వారిదృష్టి తిరిగి ధ్యేయకవిత మీదికి మరలింది. కవులు పూర్వ కావ్యాలను అనుకరించడం మాని స్వయంగా ప్రకృతితో సాన్నిహిత్యం అనుభవించి, తమ వ్యక్తిగత ప్రతిభను స్వేచ్ఛగా వెల్లడించాలని యంగ్ అనే రచయిత హెచ్చరించాడు. క్రమంగా వారు నాగరక జన వినోద విలాసాలను వర్ణించడం మాని, ప్రకృతి శోభనూ, గ్రామీణుల నిరాడంబర జీవితాన్నీ కావ్య వస్తువులుగా గ్రహించారు. కవిత్వ రచనకు ప్రత్యేకంగా ఏర్పడిన కావ్యభాష అసహజమైం దని భావించి వారు స్వేచ్ఛగా సరళ మధురమైన సామాన్య పదజాలాన్ని గ్రహింప నారంభించారు. ఇలా కవితలో నవ్యతను ఆరాధించిన వారిని 19 వ శతాబ్ది ఆరంభంలో విజృంభించిన కాల్పనిక సాహిత్య పునరుజ్జీవనోద్యమానికి (The Romantic Revival) వైతాళికుల వంటి వారని చెప్పవచ్చు.

ఆ వైతాళికులలో థామస్ గ్రే, కాలిన్స్, కూపర్, బర్న్స్, బ్లేక్, అనే కవులు ముఖ్యులు. థామస్ గ్రే రచించిన *ఎలిజీ రిటెన్ ఇన్ ఏ కంట్రీ చర్చ్‌యార్డ్* మిక్కిలి ప్రసిద్ధమైంది. *ఓడ్ టు ఈవినింగ్* అనే గీతంలో కాలిన్స్ సంధ్యాకాల ప్రశాంత శోభను సుందరంగా చిత్రించాడు. శైశవంలోనే మాతృ వియోగం పాలైన కూపర్ అనే కవికి హఠాత్తుగా తల్లి చిత్రపటం లభింపగా, ఆనంద విషాద తరంగాలలో ఊగి పోతూ అతడు రచించిన గీతం అత్యుజ్జ్వల భావనతో దీపించింది. సుఖ దుఃఖాలను గూర్చి, ప్రణయాన్ని గూర్చి, దేశభక్తిని గూర్చి రాబర్ట్ బర్న్స్ అనే స్కాటిష్ కవి పెక్కు రసవంతమైన గీతాలను వ్రాశాడు. విలియమ్ బ్లేక్ తాత్త్విక దృష్టితో కూడిన కవిత్వ రచనలో తన విశిష్టతను చూపాడు. *సాంగ్స్ ఆఫ్ ఇన్నోసెన్స్, సాంగ్స్ ఆఫ్ ఎక్స్‌పీరియన్స్* వంటి గీతావళిలో అతని ఆధ్యాత్మిక విశ్వాసాలూ, రహస్యవాద ప్రియత్వమూ, శైలీ రామణీయకతా గోచరిస్తాయి. బ్లేక్ గీతాలు అతని భావజగత్తునుంచి అప్రయత్నంగా జారి పడిన ఆణిముత్యాలే గాని, అతడు కావాలని సంకల్పించి వ్రాసిన రచనలు కావు. ఈ కవు లందరూ ధ్యేయ కవితా శాఖా పునర్వికాసానికి దోహదం చేశారు.

అప్పుడే బిషప్ పెర్సీ నిసర్గ సుందరాలైన ప్రాచీన జానపద గీతాలను సేకరించి ప్రకటించాడు. ఆ కోవకు చెందిన గీతాలను మెక్ఫర్సన్ తానే రచించి 'ఓసియన్' అనే పూర్వకవి రచనలుగా మిథ్యా కథను కల్పించి వాటిని ప్రకటించాడు. అలాగే చాటర్‌టన్ *రౌలీ* గీతాలను వ్రాశాడు. నాటి పాఠకుల అభిరుచిని నవ్య సంప్రదాయవాదం నుంచి కాల్పనిక కవిత్వం మీదికి మరల్చడానికి ఈ గేయ సముదాయం కూడా అనుకూలించింది. 18 వ శతాబ్దంలో యూరప్ ఖండంలో ఉద్భవించిన మానవతా వాదం సంప్రదాయ శృంఖలా విముక్తమైన స్వేచ్ఛాపూర్ణ సాహిత్యావతరణానికి పరోక్షంగా ప్రేరక మైంది. 18 వ శతాబ్దం ముగిసే నాటికి తిరిగి కాల్పనిక కవిత్వం సర్వ రసజ్ఞ లోక మోహనంగా వికసించి పరిమళింప నారంభించింది.

వర్డ్స్‌వర్త్, కోల్‌రిడ్జ్ అనే కవు లిరువురూ కాల్పనిక సాహిత్య పునరుజ్జీవనోద్యమానికి నాయకత్వం వహిం చారు. వారు కథావస్తువులో, భాషలో, శిల్ప విన్యాసంలో నూతనత్వం ప్రదర్శించే గీతాలను 1798 లో *బ్యాలడ్స్* అనే పేరుతో పుస్తక రూపాన ప్రకటించారు. నాటి విమర్శకులు కొందరు ఈ నవ్య కవిత్వాన్ని ఈస డించినా, క్రమంగా పాఠకులు దానిలో ప్రకటించబడిన నిసర్గ మాధుర్యానికి వశంవదులైనారు.

వర్డ్స్ వర్త్ ప్రకృతి సౌందర్య దర్శనంతో కలిగిన ఆహ్లా దాన్ని వెల్లడిస్తూ ఆత్మాశ్రయ గీతాలను, *మైకేల్* వంటి కథా కావ్యాలను, తన ఆధ్యాత్మిక విశ్వాసాలకు వ్యాఖ్యా నప్రాయమైన *టింటర్న్ ఎబ్బీలైన్స్, ది ఇమ్మోర్టాలిటీ ఓడ్* వంటి ప్రశస్త కావ్యాలను పెక్కింటిని రచించాడు. అతని కవిత్వంలో అనితర సాధ్యమైన అర్థ గౌరవం కనిపిస్తుంది.

ఆయన మిత్రుడు కోల్‌రిడ్జ్ జన్మతః జిజ్ఞాసువు. జర్మన్ తత్త్వశాస్త్రాన్ని కూలంకషంగా తరచి చూసిన మేధావి. విషాదావృతమైన జీవిత భారాన్ని మోస్తూ ఆత్మవేదననే మధురకవితగా అతడు మార్చివేశాడు. *క్రిస్టబెల్, కుబ్లా ఖాన్* వంటి కాల్పనిక కావ్యాలూ, *ది నైటింగేల్, డిజెక్షన్ ఓడ్* వంటి తాత్త్విక స్వీయ కథాత్మక గీతాలూ కోల్‌రిడ్జ్ కవితా శక్తికి చక్కని ఉదాహరణలు. సాహిత్య విమర్శకు లలో కూడా అతనికి ప్రముఖ స్థానం ఉంది. షేక్స్పియర్ నాటకాలకు ఆయన చేసిన వ్యాఖ్యానం ప్రశస్తమైంది. కోల్‌రిడ్జ్ వ్రాసిన *బయోగ్రాఫియా లిటరేరియా* కాల్పనిక కవిత్వ శాఖకు లక్షణ గ్రంథం వంటిదని చెప్పవచ్చు.

వర్డ్స్‌వర్త్ సమకాలికులలో రాబర్ట్ సౌదే, వాల్టర్ శావేజ్ లాండర్, థామస్ కాంబెల్, థామస్ మోర్ ప్రభృతులు కొన్ని చక్కని ఖండ కావ్యాలు వ్రాశారు. సౌదే రచనలలో *ది ఇంచ్ కేప్‌రాక్, బ్యాటిల్ ఆఫ్ బ్లెనీమ్, ది స్కాలర్* అనే పద్యకృతులూ, నెల్సన్ జీవిత చరిత్రం అనే వచన గ్రంథం ప్రసిద్ధమైనవి. లాండర్ *ఇమాజినరీ కాన్వర్సేషన్* అనే వచనగ్రంథంలో సుప్రసిద్ధ చారిత్రక వ్యక్తుల నడుమ కల్పిత సంభాషణలను అతి చమత్కారంగా ఊహించి వ్రాశాడు. కాంబెల్ *లార్డ్ అలిన్స్ డాటర్, హోహైన్ లిండెన్, ది బాటిల్ ఆఫ్ ది బాల్టిక్* వంటి రమ్యమైన కృతులు రచించాడు. థామస్ మోర్ *లాల్లా రూఖ్* అనే కాల్పనిక కావ్యంలో అక్బర్, సలీమ్, నూర్‌మహల్, ఔరంగజేబ్ మొదలైన మొగల్ రాజ వంశీయులను గురించిన గాథలను వర్ణించాడు. *ఐరిష్ మెలొడీస్* అనే పేరుతో అతడు కొన్ని రసవంతమైన గీతాలు ప్రకటించాడు.

నాటి కవులలో దేశభక్తిని ఉద్దీపింపజేసే వీరగాథా కావ్య రచనకు సర్ వాల్టర్ స్కాట్ ప్రసిద్ధి కెక్కాడు. *ది లే ఆఫ్ ది లాస్ట్ మిన్‌స్ట్రెల్, మార్మియన్, ది లేడీ ఆఫ్ ది లేక్* వంటి కథాకావ్యాలలో ఇతడు పూర్వచారిత్రక గాథలను కావ్యోచితమైన మార్పులతో అభి వర్ణించాడు. కొంత కాలానికి ఆయన దృష్టి నవలా రచన మీదికి మర లింది. చారిత్రక నవలారచనకు మార్గదర్శకుడై, *వేవర్లీ, గైమానెరింగ్, రాబ్‌రాయ్, ది హార్ట్ ఆఫ్ మిడ్లోథి యన్, ది బ్రైడ్ ఆఫ్ లామర్ మూర్, ఐ వాన్ హో, కెనిల్‌వర్త్, క్వెంటిన్ డవార్డ్, ది టాలిస్మన్* వంటి సుప్రసిద్ధ నవలా పరంపరతో పాఠకుల అభిమానాలను ఆయన చూరగొన్నాడు. స్కాట్ జీవిత చరిత్రను ఆయన అల్లుడు జాన్ లాక్‌హార్ట్ వ్రాశాడు. జీవితచరిత్ర వాఙ్మ యంలో అది చాలా ప్రశస్తి కెక్కింది. అప్పుడే జేన్ ఆస్టిన్ అనే రచయిత్రి అమితమైన ప్రజాదరణం పొందిన *సెన్స్ అండ్ సెన్సిబిలిటీ, ప్రైడ్ అండ్ ప్రెజుడిస్, మ్యాన్స్ ఫీల్డ్ పార్క్* అనే చక్కని నవలలను వ్రాసింది. ఆమె విచిత్ర కల్పనల జోలికి పోక, తనకు సుపరిచితమైన వాతావరణంలో, తన వర్గానికి చెందిన స్త్రీ పురుషుల మన స్తత్త్వాన్ని వారి వినోద విహారాలను, కుటుంబ సమస్యలను హాస్యంతో అతి సహజంగా చిత్రించింది.

తరువాతి తరంలో బైరన్, షెల్లీ, కీట్స్ అనే యువ కవుల కృతులలో కాల్పనిక కవిత్వం క్రొత్త సొగసులు సంతరించుకుంది. ఫ్రెంచ్ విప్లవ జ్వాలలు చల్లారిన

తరువాత యూరప్ ఖండాన్ని ఆవరించిన నిరాశామయ వాతావరణం బైరన్ కావ్యాలలో స్పష్టంగా ప్రతిబింబించింది. అతని హృదయంలో రేకెత్తిన ఆధ్యాత్మిక సంఘర్షణ *చైల్డ్ హెరాల్డ్స్ పిల్గ్రిమేజ్, డాన్ జువాన్* వంటి కావ్యాలలోను, *మాన్ఫ్రెడ్, కెయిన్* అనే నాటకాలలోను ప్రతిఫలించింది. తన కావ్యాలలో తప్పులు చూపిన విమర్శకులను *ఇంగ్లీష్ బార్డ్స్ అండ్ స్కాచ్ రెవ్యూయర్స్* అనే అధిక్షేప కావ్యంలో నిర్దాక్షిణ్యంగా అతడు ఖండించాడు.

ఆ నిరాశామయ వాతావరణంలో విప్లవమే సుస్థిర వ్యవస్థకు ప్రాతిపదిక అవుతుందనీ, మానవులకు మహోజ్జ్వల భవితవ్యం ఉందనీ ఎలుగెత్తి చాటిన ఆదర్శవాది షెల్లీ. 'లిరిక్' అనే ఆత్మాశ్రయ భావ గీతికా రచనలో నిశ్చయంగా అతడు అద్వితీయుడు. *ది స్కైలార్క్, ది క్లౌడ్, ది సెన్సిటివ్ ప్లాంట్, ఓడ్ టు ద వెస్ట్ విండ్, ఏ లామెంట్* వంటి గీతాలు కలిగించే రసస్ఫూర్తి దీనికి నిదర్శనం. మానవుడి మంచితనంపై అతనికి గల ప్రగాఢ విశ్వాసం *ది రివోల్ట్ ఆఫ్ ఇస్లామ్* అనే పద్యకావ్యంలోను, *ప్రామీథియస్ అన్‌బౌండ్* అనే గేయ రూపకంలోను ప్రకటితం అయాయి. కీట్స్ మరణించినప్పు డతడు *ఆడోనిస్* అనే చిరస్మరణీయమైన విలాపగీతాన్ని వ్రాశాడు. *డిఫెన్స్ ఆఫ్ పొయ్యెటి* అనే విమర్శక వ్యాసంలో అతడు కావ్య ప్రయోజనాన్ని గూర్చిన తన సిద్ధాంతాలను సహేతుకంగా వివరించాడు.

'సత్యమే సౌందర్యం, సౌందర్యమే సత్యం' అని మనసారా నమ్మి, జీవితంలో వలెనే కవిత్వంలోనూ సౌందర్యాన్ని ఆరాధించిన మధుర హృదయుడు జాన్ కీట్స్. *ది ఈవ్ ఆఫ్ సెయింట్ ఆగ్నిస్, ఇసాబెల్లా* వంటి సుందర కథా కావ్యాలను, *టు ఆటమ్, టు ఏ నైటింగేల్, ఆన్ ఏ గ్రీసియన్ అర్న్, టు మెలాంకలీ* వంటి రమణీయ భావగీతాలను కీట్స్ రచించి చిరకీర్తిని ఆర్జించాడు.

19 వ శతాబ్దిలో రాజకీయ చర్చలతో పాటు సాహిత్య సమాలోచనం కూడా చేసే *ఎడింబరో రెవ్యూ, క్వార్టర్లీ రెవ్యూ, బ్లాక్‌వుడ్స్ మ్యాగజైన్, లండన్ మ్యాగజైన్* వంటి పత్రికలు వెలశాయి. వీటిలో స్కాట్లెండ్ నుంచి వెలువడిన మొదటి మూడు పత్రికలూ కాల్పనిక కవిత్వాన్నీ, వర్డ్స్‌వర్త్ ప్రభృతులనూ నిశితంగా విమర్శించి చివరకు వ్యక్తి దూషణలోకి కూడా దిగాయి. అప్పటి వచన రచయితలలో థామస్ డీ క్విన్సీ, చార్లెస్ లాంబ్, విలియమ్ హాజ్లిట్, లే హంట్ అనే వారు ముఖ్యులు. వారు కూడా పత్రికలలో వ్యాసరచన కావించారు. ఆలంకారికమైన శైలి డీ క్విన్సీ వ్యాసాల ప్రధాన గుణం. అతని రచనలలో *కన్ఫెషన్స్ ఆఫ్ యాన్ ఇంగ్లీష్ ఓపియమ్ ఈటర్* అనే స్వీయచరిత్ర అతి రమ్యమైంది. ఆత్మాశ్రయ వ్యాస (familiar essay) రచనకు చక్కని రాచబాట వేసిన వాడు చార్లెస్ లాంబ్. మృదు హాస్య పూరితమైన సరళశైలిలో అతడు 'ఈలియా' అనే మారుపేరుతో పెక్కు వ్యాసాలను రచించాడు. షేక్స్‌పియర్ నాటకాల ప్రదర్శనలో రంగస్థలాభినయంలోని ఔచిత్యాన్ని గూర్చి చర్చిస్తూ ఆయన వ్రాసిన సాహిత్య విమర్శవ్యాసం అతి ముఖ్యమైంది. కావ్య నాటకాలను గూర్చి విలియమ్ హాజ్లిట్ ప్రతిభా పూర్ణమైన విమర్శక వ్యాసాలను ప్రకటించి 'విమర్శకుల విమర్శకు'డని పేరు గడించాడు. నాటి విమర్శకులలో కాల్పనిక కవిత్వాన్ని సమర్థించి, వ్యాఖ్యానించినవాడు కీట్స్‌కవి మిత్రుడు లే హంట్. థామస్ లవ్ పీకాక్ అనే నవలా రచయిత *హెడ్‌లాంగ్ హాల్, నైట్‌మేర్ ఆబీ, క్రోచెట్ కాసిల్* వంటి నవలలలో నాటి సమాజాన్ని వ్యంగ్య ధోరణిలో విమర్శించాడు. ఆ నవలలలో ఆయన నడుమ నడుమ చక్కని భావగీతాలను సమకూర్చాడు.

**విక్టోరియన్ యుగం :** 1832 నుండి 19 వ శతాబ్దిలో శేషించిన కాలం విక్టోరియన్ యుగమని వ్యవహరించబడుతున్నది. విక్టోరియారాణి పరిపాలనా కాలంలో ఇంగ్లండ్ దేశంలో రాజకీయంగా శాంతి సౌభాగ్యాలు వర్ధిల్లాయి. కాని, అప్పుడు సాంఘిక, ధార్మిక, వైజ్ఞానిక రంగాలలో తీవ్రమైన సంచలనం కలిగింది. డార్విన్ అనే శాస్త్రజ్ఞుడు పరిణామ సిద్ధాంతాన్ని ప్రకటించాడు. *బైబిల్*లోని విశ్వసృష్టి వృత్తాంతాన్ని అది మూలచ్ఛేదం కావించడంవల్ల ప్రకృతి శాస్త్రాలకూ, మత సిద్ధాంతాలకూ మధ్య సంఘర్షణ ఏర్పడింది. హెర్బర్ట్ స్పెన్సర్, థామస్ హక్స్లీ వంటి మేధావులు విజ్ఞాన శాస్త్రాన్ని సమర్థించారు. కొందరు ఈ పరస్పర విరుద్ధ సూత్రాలను సమన్వయించడానికి ప్రయత్నించారు. యంత్రాల ఆవిష్కరణద్వారా పారిశ్రామికాభ్యుదయం కలిగింది. అందువల్ల సాంఘికంగా మరికొన్ని క్రొత్త సమస్యలు బయలుదేరాయి. వైజ్ఞానిక రంగంలో ప్రకృతిశాస్త్ర ప్రాధాన్యమూ, రాజకీయంగా ప్రజాస్వామ్య సిద్ధాంత వికాసమూ, మత విశ్వాసాలలో అనిశ్చిత స్థితీ అప్పటి యుగ లక్షణాలని చెప్పవచ్చు. ప్రజలు లౌకికమైన భోగలాభాలనే పరమార్థంగా ఎంచి, చిత్తవిస్తృతి కలిగించే కళలను విస్మరించి అనాగరకు లవుతున్నారని

కొందరు సంఘసంస్కర్తలు వారికి సాంస్కృతిక స్ఫూర్తి కలిగించే ప్రబోధాలు చేశారు. ఆ నాటి సాహిత్యంలో ఈ సంస్కరణాభిలాష, భావ సంచలనం స్పష్టంగా గోచరిస్తాయి.

నాటి కవులలో అగ్రగణ్యుడైన ఆల్ఫ్రెడ్ టెన్నిసన్ కావ్యాలలో అప్పటి జిజ్ఞాసువుల సందిగ్ధావస్థ సర్వత్ర తొంగి చూస్తుంది. పదలాలిత్యానికి ఆయన ప్రత్యేకంగా పేరు పొందాడు. ఆర్థర్ రాజును గూర్చిన ప్రాచీన గాథలను కథావస్తువుగా స్వీకరించి తన అసమాన శిల్ప ప్రౌఢి చేత ఆ నాటి మనోజ్ఞ వాతావరణాన్ని కళ్లకు కట్టేలా వర్ణిస్తూ *ది ఇడిల్స్ ఆఫ్ ది కింగ్* అనే కావ్యాన్ని రూపొందించాడు. ఒక మిత్రుడి స్మృతి చిహ్నంగా రచించిన *ఇన్ మెమోరియమ్* అనే కావ్యంలో టెన్నిసన్ ఆధ్యాత్మిక వేదన వర్ణింపబడింది. ఆయన లఘుకావ్యాలన్నీ చక్కగా మలచబడ్డ కళాఖండాలు. ఇక అల్పాక్షరాలతో అనల్పార్థరచన కావించిన ప్రతిభాశాలి రాబర్ట్ బ్రౌనింగ్. అతడాదర్శవాది. ప్రేమ దివ్యమైనదనీ, అదే మానవుడికి ఆత్మవికాసం కలిగించి స్వర్గద్వారం దగ్గరకు చేర్చగలదనీ ఆయన తన కావ్యాలలో చాటి చెప్పాడు. అతని రచనల్లో *పిప్పాపాసెస్* వంటి రూపకాలూ, *ఆండ్రియా డెల్ సార్టో, ఆబ్ట్‌వాగర్, రబ్బీబెన్ ఎజ్రా* మొదలైన ఖండ కావ్యాలూ, *హోమ్ థాట్స్ ఫ్రమ్ ఎబ్రాడ్* వంటి రసవంతమైన ఆత్మాశ్రయ గీతాలూ ఉన్నాయి. తన తోటి ప్రజలు 'కలదు కలండనెడివాడు కలడో లేడో' అని సందేహిస్తూ ఉండగా 'దేవుడు స్వర్గమునం దున్నాడు. ప్రపంచమునందంతయు సవ్యముగా ఉన్నది' అని ఘంటాపథంగా చెప్ప గలిగిన ద్రష్ట అతడు. అతని సతి ఎలిజబెత్ బ్యారెట్ బ్రౌనింగ్ కూడా కవిత్వరచనా శక్తి కలిగి *క్రై ఆఫ్ ది చిల్డ్రన్, ఆరోరా లే* వంటి కరుణరసాత్మక కావ్యాలను రచించింది.

మాథ్యూ ఆర్నాల్డ్ తన సమకాలికుల మానసిక వ్యథను *ది స్కాలర్ జిప్సీ, థిర్సిస్, రగ్బీచాపెల్* వంటి కావ్యాలలో చక్కగా చిత్రించాడు. అతని రచనలలో *సొహరాబ్ అండ్ రుస్తుం* అనే కథాకావ్యం *మెరపీ* అనే విషాదాంత నాటకం చెప్పుకోతగినవి. సాహిత్య విమర్శకులలో అతనికి ప్రధానస్థానం ఉంది. కవిత్వ ప్రయోజనం గురించీ, సాహిత్యవిమర్శ యొక్క ఆవశ్యకతను గురించీ వర్డ్స్‌వర్త్ ప్రభృతుల కవితాశిల్పం గురించీ ఆయన ప్రామాణికమైన విమర్శ వ్యాసాలను ప్రకటించి సాహిత్యానికి మహోపకారం చేశాడు. ఆర్నాల్డ్ కవికి సన్నిహిత మిత్రుడైన ఆర్థర్ హ్యూక్లఫ్ కృతులలో కూడా అప్పటి విద్యావంతుల మనస్తత్వం ప్రతిబింబిస్తుంది. అప్పుడే ఎడ్వర్డ్ ఫిట్స్ జెరాల్డ్ పార్శీభాషనుండి ఉమర్‌ఖయ్యామ్ *రుబాయాత్* గీతావళికి చేసిన స్వేచ్ఛానువాదానికి బహుళ జనాదరణ లభించింది. సనాతన మత విశ్వాసాలు చెదరి భౌతికవాదం ప్రబలడం వల్ల మానవ సమాజానికి కలిగే అనర్థాలను జేమ్స్ థామ్సన్ అనే కవి *డూమ్ ఆఫ్ ఏ సిటీ, ది సిటీ ఆఫ్ డ్రెడ్‌ఫుల్ నైట్* అనే కావ్యాలలో సూచించాడు.

నాటి వచన రచయితలలో కార్లైల్, రస్కిన్, న్యూమన్, మెకాలే వంటి ప్రతిభావంతు లున్నారు. నాటి సమాజంలోని లోపాలను తీవ్రంగా విమర్శించి, ప్రజలదృష్టిని సంస్కృతిమీదికి మరలించి, వారిని ఆదర్శ సమాజ నిర్మాణానికి ప్రోత్సహించడమే లక్ష్యంగా కార్లైల్, రస్కిన్ పెక్కు గ్రంథాలు రచించారు. కార్లైల్ రచనలలో *సార్టర్ రిసార్టర్, ఫ్రెంచ్ రివల్యూషన్, హీరోస్ అండ్ హీరోషిప్* అనే గ్రంథాలూ, రస్కిన్ రచనలలో *సెసేమ్ అండ్ లిలీస్, అన్ టూ ది లాస్ట్, క్రౌన్ ఆఫ్ వైల్డ్ ఆలివ్* అనే గ్రంథాలూ ప్రసిద్ధమైనవి. ఆదర్శ విశ్వవిద్యాలయ లక్షణాలను కార్డినల్ న్యూమన్ *ది ఐడియా ఆఫ్ ఏ యూనివర్సిటీ* అనే గ్రంథంలో సమర్థంగా వివరించాడు. తమోవృత పథంలో దారిచూపు మని తేజోమయుడైన ఈశ్వరుణ్ణి వేడుతూ అతడు రచించిన *లీడ్ కైండ్లీ లైట్* అనే ప్రార్థనగీతం విశ్వ విఖ్యాతమైంది. జాన్ స్టూవర్ట్ మిల్ స్వీయచరిత్రా, స్వాతంత్ర్యాన్ని గూర్చి వ్రాసిన వ్యాసం, మెకాలే రచించిన ఇంగ్లీష్ దేశచరిత్ర చారిత్రక రచనలైనప్పటికీ, శైలీ రామణీయకం వలన సాహిత్య గౌరవం గడించుకొన్నవి.

సమాజ స్వరూపాన్ని వాస్తవికంగా చిత్రించడానికీ, పరిసరాల ప్రభావంవల్ల వ్యక్తుల గుణ శీలాలలో ఏర్పడే పరిణామాలను విపులంగా ప్రదర్శించడానికీ, వేనవేల పాఠకులకు మనోరంజనం కలిగించడానికీ నవల అప్పుడు మిక్కిలి అనుకూల సాధన మైంది. సంఘసంస్కరణోద్యమ ప్రచారానికి కూడా అది చాలా తోడ్పడింది. కథన శిల్పంలో ఆరితేరిన నవలా రచయితలు ఆ నాడు అనేకులు వెలశారు. వారిలో ముఖ్యుడు చార్లెస్ డికెన్స్. జీవకళతో రాణించే పాత్రలను సృష్టించడంలోను, వర్ణన నైపుణ్యంలోను, కరుణ హాస్యాది రసపోషణంలోను అతని ప్రతిభ అపూర్వమైంది. అతని నవలలలో *పిక్విక్ పేపర్స్, నికలస్ నికిల్బీ, మార్టిన్ చూజిల్విట్, డేవిడ్ కాపర్ ఫీల్డ్, ఆలివర్ ట్విస్ట్, ఏ టేల్ ఆఫ్ టూ సిటీస్, గ్రేట్ ఎక్స్‌పెక్టేషన్స్* వంటి

ప్రసిద్ధ రచన లనేకం ఉన్నాయి. భావోద్వేగ ప్రదర్శనంలో అతడు మితిమీరి వర్తిస్తూంటాడు. తన నవలలలో ఆయన సమకాలీన సాంఘిక వ్యవస్థలో నిరాశ్రితులై పోయిన దీన దరిద్ర ప్రజలపై పాఠకులకు సానుభూతిని కలిగించి, వారి స్థితిగతులను చక్కపరిచేందుకు యత్నించాడు. ఇంగ్లీష్ నవలాకర్తలలో అతడే సర్వశ్రేష్ఠుడని స్టీఫెన్ లీకాక్, సోమర్సెట్ మామ్ వంటి సాహితీపరుల నిశ్చితాభిప్రాయం.

డికెన్స్ తన నవలలలో సామాన్య ప్రజల జీవితాన్నే ప్రధానంగా చిత్రిస్తే, అప్పటి ఉన్నత వర్గపు వ్యక్తుల విలాసమయ ప్రవర్తనను వర్ణించినవాడు థాకరే. కథను వాస్తవికంగా నిర్వహిస్తూ, పరోక్షంగా సాంఘిక దురాచారాలను విమర్శించడం అతని లక్ష్యం. థాకరే నవలలలో *వానిటీ ఫెయిర్, హ్యెనీ ఎస్మండ్, పెండెనిస్* ముఖ్యమైనవి. అప్పుడే జార్జ్ ఇలియెట్ అనే కలంపేరుతో మేరీ ఆన్ ఇవాన్స్ అనే రచయిత్రి *ఆడమ్ బీడ్, ది మిల్ ఆన్‌ది ఫ్లాస్, సైలాస్ మార్నర్, మిడిల్ మార్చ్* అనే నవలలలో నైతిక సంఘర్షణనూ, విషాద భావోద్వేగాన్నీ మిక్కిలి నేర్పుతో చిత్రించింది. జార్జ్ మెరెడిత్ సుకుమార హాస్య వ్యంగ్య ధోరణిలో *ది ఆర్డియల్ ఆఫ్ రిచర్డ్ ఫెవెరెల్, ది ఈగోయిస్ట్* వంటి చక్కని నవలలు వ్రాశాడు. అప్పుడు కోకొల్లలుగా వెలువడిన నవలలలో విలియమ్ విల్కీ కాలిన్స్ వ్రాసిన *ది వుమన్ ఇన్ వైట్*, షార్లెట్ బ్రాంటీ వ్రాసిన *జేన్ ఐర్*, ఎమిలీ బ్రాంటీ వ్రాసిన *వదరింగ్ హైట్స్*, చార్లెస్ కింగ్స్లీ వ్రాసిన *హెరెవర్డ్ ది వేక్*, ఆంటోనీ ట్రలోవ్ వ్రాసిన *బార్చెస్టర్ టవర్స్*, చార్లెస్ రీడ్ వ్రాసిన *ది క్లాయిస్టర్ అండ్ ది హార్త్*, టామస్ హ్యూస్ వ్రాసిన *టామ్ బ్రౌన్స్ స్కూల్ డేస్*, బ్లాక్‌మూర్ వ్రాసిన *లార్నాడూన్*, మిసెస్ గాస్కెల్ వ్రాసిన *క్రాన్‌ఫర్డ్* ప్రఖ్యాతమైనవి. ఇతరుల వలె రాబర్ట్ లూయీ స్టీవెన్సన్ తన నవలలలో నాటి వాస్తవిక జీవిత చిత్రణానికి యత్నింపక, విచిత్ర కల్పనా కథలతో *ట్రెజర్ ఐలెండ్, డాక్టర్ జెకిల్ అండ్ మిస్టర్ హైడ్* మొదలైన వినోద దాయకాలైన నవలలను వ్రాశాడు. ఆయన వ్యాసాలు ప్రసన్న మధురశైలికీ, భావగాంభీర్యానికీ పేరు పడ్డవి.

సాంఘిక జీవితంలో కళల కీయతగిన ప్రాధాన్యాన్ని గురించి జాన్ రస్కిన్ చేసిన ప్రబోధానికి ఫలితంగా ప్రీ రాఫెలైట్ (Pre-Raphallite) సాహిత్యోద్యమం వెలసింది. హోల్మన్ హంట్, మిల్లయస్, డి.జి. రోసెటీ అనే యువ చిత్రకారులు ఈ నూతనోద్యమానికి నాయకత్వం వహించారు. నవ జీవనానికి సౌందర్యమే సాధనమనీ, సౌందర్య లాంఛితాలైన కళలే సమాజ వికాసానికి తోడ్పడగలవనీ వారు భావించారు. ప్రీ రాఫెలైట్ కవులలో డి.జి. రోసెటీ, విలియమ్ మారిస్, స్విన్‌బర్న్ ముఖ్యులు. రహస్యవాద ప్రియత్వం, సంకేతాల మీద అభిమానం, రస స్ఫోరకమైన సుందరశబ్ద చిత్ర (imagery) కల్పనా వీరి కావ్యాలలోని విశిష్ట లక్షణాలు. రోసెటీ వ్రాసిన *ది బ్లెస్సెడ్ డామొజల్* అనే ఖండకావ్యం, మారిస్ రచించిన *ది ఎర్త్లీ పారడైజ్* అనే కాల్పనిక కథాకావ్యం, స్విన్‌బర్న్ వ్రాసిన *అటలాంటా ఇన్ కాలిడన్* అనే రూపకం మిక్కిలి రసవంతం అయినవి. డి.జి. రోసెటీ సోదరి క్రిస్టినా రోసెటీ *మై హార్ట్ ఈజ్ లైక్ ఏ సింగింగ్ బర్డ్* వంటి మనోహర భావగీతాలు రచించింది. కోవెంట్రీ పాట్మోర్ వ్రాసిన *ది ఏంజెల్ ఇన్ ది హౌస్* అనే కావ్యం రమణీయ భావనతో శోభించింది.

మొత్తం మీద విక్టోరియన్ యుగంలో రచయితలు వినోదం కలిగించడంతో పాటు సంఘసంస్కరణ కూడా సాహిత్యాశయం కావాలని నమ్మి, ఎక్కువగా ప్రయోజనాత్మక రచనలనే సృష్టించారు. అందుకు విరుద్ధంగా 19 వ శతాబ్ది చివర 'కళ కొరకే కళ' అనే సౌందర్య ప్రధానవాదం (aesthetic movement) తల ఎత్తింది. సాహిత్యానికీ, తదితర కళలకూ శిల్ప సౌందర్యమే పరమావధి అనీ, ధర్మ ప్రబోధంతో వాటికి నిమిత్తం లేదనీ వారి మతం. వాల్టర్ పేటర్ రచించిన *ది రినైసాన్స్* అనే వ్యాసంలో ఈ సిద్ధాంతం ప్రతిపాదింపబడింది. ఆయన వచనశైలి మిక్కిలి రమ్యమైంది. ఈ వాదాన్ని సమర్థించిన రచయితలలో ముఖ్యుడు ఆస్కార్ వైల్డ్. అతని వ్యాసావళి, *ది పిక్చర్ ఆఫ్ డోరియన్ గ్రే* అనే నవల, *ది ఇంపార్టెన్స్ ఆఫ్ బీయింగ్ ఎర్నెస్ట్, లేడీ విండర్మియర్స్ ఫాన్* అనే హాస్య నాటకాలు ప్రసిద్ధమైనవి. అతని రచనలలో మెరుపుతీగెల వంటి చతురోక్తులు అడుగడుగునా గోచరిస్తాయి.

మానవ సమాజంలో కథలు అనాదిగా ప్రచారంలో ఉన్నవి. కాని ఒక పాత్ర మనః ప్రవృత్తినో, రస స్ఫోరకమైన ఒక సన్నివేశాన్నో కేంద్రంగా చేసికొని, దాని కనుకూలమైన వాతావరణం సృష్టించి పాఠకులకు ఆహ్లాదం కలిగించే చిన్నకథ (short story) యొక్క శిల్ప స్వరూపం 19 వ శతాబ్దిలోనే ఏర్పడింది. డికెన్స్, స్టీవెన్సన్, ఆస్కార్‌వైల్డ్ ప్రభృతులు నవలలతో పాటు చిన్న

కథలు కూడా వ్రాశారు. కథానికా రచనలో అసమాన నైపుణ్యం ప్రదర్శించిన రచయిత రుడ్యార్డ్ కిప్లింగ్. అతడు భారతదేశంలో కొంతకాలం పత్రికా రచయితగా ఉండి అచ్చటి ప్రజాజీవితాన్ని పెక్కు కథలలో చిత్రించాడు. అతని నవలలలో *కిమ్* ప్రసిద్ధమైంది.

**ఆధునిక యుగం :** 19 వ శతాబ్ది చివర ఫ్రాన్సిస్ టామ్సన్ అనే కవి *ది హౌండ్ ఆఫ్ హెవెన్* అనే భక్తి రస ప్రధాన కావ్యాన్ని రచించాడు. మానవుడు విస్మరించినా విడువక అతనిని వెంటాడే పరమేశ్వరుడి కరుణా పరత్వం ఇందులో చక్కగా వర్ణింపబడింది. గెరార్డ్ మాన్లీ హాప్కిన్స్ కావ్యాలు ఆధ్యాత్మిక భావబంధురాలై శిల్పచమత్కృతికి కూడా పేరెన్నిక కన్నవి. రాబర్ట్ బ్రిడ్జెస్ కవితకు సుకుమార మధుర భావన వన్నె తెచ్చింది. అతని కృతులలో *ది టెస్టమెంట్ ఆఫ్ బ్యూటీ* సర్వాంగ సుందరమైంది.

*ఎరివాన్, ది వే ఆఫ్ ఆల్ ఫ్లెష్* అనే నవలలలో విప్లవాత్మక భావాలను జోడించి శామ్యూల్ బట్లర్ విక్టోరియన్ యుగపు విశ్వాసాలపై దాడిచేసి 20 వ శతాబ్ది రచయితలకు మార్గదర్శకు డయాడు. ఇంగ్లీష్ నవలా రచయితలలో టామస్ హార్డీకి విశిష్టస్థానం ఉంది. ప్రతికూల శక్తుల నడుమ నిరంతరం కెరటాల వలె చెలరేగే కష్టపరంపరను ఎదుర్కొంటూ బ్రతుకు బరువు మోసే మానవుల విషాదస్థితిని హార్డీ *ది రిటర్న్ ఆఫ్ ది నేటివ్, ది మేయర్ ఆఫ్ క్యాస్టర్ బ్రిడ్జ్, టెస్ ఆఫ్ ది డాబర్విల్స్, జూడ్ ది అబ్స్క్యూర్* వంటి నవలలలో అతి సమర్థతతో వర్ణించాడు. హార్డీ నవలల విశిష్టతకు కారణమైన తాత్త్విక దృష్టే అతని గీతాలలోను, *ది డైనాస్ట్స్* అనే నాటకంలోను ప్రతిబింబిస్తుంది.

20 వ శతాబ్దిలో ఇంగ్లీష్ సాహిత్యంలో తిరిగి పూర్వసంప్రదాయాలపై విముఖత్వం ప్రబలింది. రాజకీయ పరిణామాలూ, వైజ్ఞానిక రంగంలో పరిశోధన ఫలితంగా ఏర్పడిన క్రొత్త సిద్ధాంతాలూ రచయితలమీద తమ ప్రభావం చూపాయి. ముఖ్యంగా యూరపియన్ సాహిత్యంలో వెలసిన వాస్తవికతావాదం (Realism), ఫ్రాయిడ్ అనే మనస్తత్వ శాస్త్రజ్ఞుడు ప్రకటించిన మనోవిశ్లేషణ (Psycho-analysis) శాస్త్ర సిద్ధాంతాలూ, 'ఫేబియన్' సామ్యవాదం, నీషే, బెర్గ్‌సన్, జాన్-పాల్ సార్త్రె వంటి తత్త్వజ్ఞుల రచనలూ సాహిత్యంలో క్రొత్త పోకడలకు హేతువు లయాయి.

ఈ శతాబ్ది కవులలో ఏ.ఈ. హౌస్‌మన్ *ష్రాప్‌షైర్‌లాడ్, లాస్ట్ పోయెమ్స్* అనే సంపుటాలలో కొన్ని చక్కని గీతాలను ప్రకటించాడు. అనలంకృత సుందరాలైన అతని గీతాలు నిరాశామయ వాతావరణంలో చిత్తస్థైర్యాన్ని ప్రబోధించాయి. డబ్ల్యూ. బీ. యీట్స్, వాల్టర్ డీ లా మేర్ అనే కవులు కాల్పనిక సాహిత్యంలోని కమనీయ ఘట్టాలను క్రొత్త ధోరణిలో వర్ణించారు. మంచి చెడులకు, మానవుడి పాపకర్మకు, దేవకారుణ్యానికి, నడుమ ఏర్పడే సంఘర్షణను అతి దక్షతతో జాన్ మేస్‌ఫీల్డ్ *ది విడో ఆఫ్ బై స్ట్రీట్, ది ఎవర్ లాస్టింగ్ మెర్సీ* వంటి కావ్యాలలో వర్ణించాడు. 1914 లో ప్రారంభమైన ప్రథమ ప్రపంచ సంగ్రామం యువజనులలో కలిగించిన చిత్తసంక్షోభమంతా రూపర్ట్ బ్రూక్, సీజ్‌ఫ్రీడ్ సెసూన్, విల్ఫ్రెడ్ ఓవెన్, రాబర్ట్ గ్రేవ్స్ అనే కవుల కృతులలో హృదయ విదారకంగా వర్ణింపబడింది.

కాల్పనిక కవిత్వంలోని మధుర కోమల పదావళి నిర్జీవమై పోయి వర్తమాన ప్రజల మానసిక స్థితిని వర్ణించడానికి అనుకూలంగా లేదని దానిని తిరస్కరించి, నిత్య వ్యవహారంలో ఉన్న పదాలతో నవ భావ ప్రకటనకు అనువైన శబ్ద చిత్రాలను సృష్టించే లక్ష్యంతో సంకేత ప్రధానవాదం (Imagist movement) ఉద్భవించింది. 1912 నుండి ఇంగ్లీష్ కవిత్వంలో ఈ వాదానికి ప్రాధాన్య మేర్పడింది. నాటినుండి కవులు వర్ణ్య వస్తు వెలాటిదైనా వర్ణన శిల్పంలో నవ్యత కోసం కృషిచేశారు. ఈ వర్గానికి చెందిన కవులలో అగ్ర గణ్యుడు టి.ఎస్. ఇలియట్. అతడు జన్మతః అమెరికా దేశస్థుడైనా ఇంగ్లండ్‌లో స్థిరపడ్డాడు. అతడు వ్రాసిన *ది వేస్ట్‌లాండ్* అనే కావ్యం నవ్య కవిత్వావతరణకు నాందీ గీతమైంది. ఆయన *మర్డర్ ఇన్ ది కేథెడ్రల్, దిఫామిలీ రీ యూనియన్* వంటి రూపకాలను, *ది సేక్రెడ్ వుడ్* అనే సాహిత్య విమర్శక వ్యాసాలను కూడా వ్రాశాడు. మొదటి ప్రపంచ యుద్ధం ముగిసిన తరువాత మానవాళిలో వ్యాపించిన నైరాశ్య భావాన్ని ఇలియట్ తన రచనలో నిరుపమాన ప్రతిభతో చిత్రించాడు. రెండవ ప్రపంచ సంగ్రామానంతరం ప్రబలిన నైరాశ్య వాతావరణంతో పాటు క్రైస్తవ ధర్మ విశ్వాసం ప్రేరణగా ఇలియట్ *ఫోర్ క్వార్టెట్స్* అనే కావ్యాన్ని వ్రాసి సంచలనం కలిగించాడు. అనంతర కవులలో సిసిల్ డే, లూయీస్, డబ్ల్యూ.ఎచ్. ఆడెన్, లూయీ మెక్నీస్, స్టీఫెన్ స్పెండర్ రసవంతమైన కృతులను రచించి గౌరవస్థానం అందుకొన్నారు. ఇలి

యట్, ఆడెన్‌ల తరువాత విభిన్న ప్రక్రియలలో ఉద్యమ కవిత్వం బయల్దేరింది. దానికి డైలన్ టామస్, ఫిలిప్ లార్కిన్ టామ్‌గన్, టెడ్ హ్యూస్ ప్రభృతులు ఉత్తేజం అందించారు. నవ కాల్పనిక వాదిగా డైలన్ టామస్ *ఫెర్న్‌హిల్, పోయమ్ ఇన్ అక్టోబర్, ది ఫోర్ దట్స్ త్రూ ది గ్రీన్ ఫ్యూ్య డ్రైవ్స్ ది ఫ్లవర్* మొదలైన కవితలు వ్రాసి ప్రసిద్ధి చెందాడు. ఫిలిప్ లార్కిన్ *చర్చ్ గోయింగ్, విట్‌సన్ వెడ్డింగ్స్* వంటి కవితలతో ఖండకావ్య ప్రక్రియకు క్రొత్తప్రాణం పోశాడు. టెడ్ హ్యూస్ మానవ జీవితానికీ, బాహ్య ప్రకృతిలో ప్రస్ఫుటించే జంతుజాల ప్రవృత్తులకూ గల సంబంధ సామ్యాలను తన కవితలలో చిత్రీకరించాడు. మొత్తంమీద అధునాతన కవిత్వ సమాజ రీతుల వెనుక గోచరించే స్పందనలు మూడు : సమాజ వ్యవస్థలో తల ఎత్తిన యాంత్రికతా, నిష్పందతల పట్ల తిరుగుబాటు, కేవలం భావావేశపరమై వాస్తవికతకు దూరమైన రచనల పట్ల వైముఖ్యం, మానవానుభవ పరిధుల్ని కూలంకషంగా పరిశోధించాలన్న ఆకాంక్షా, శిల్పప్రాధాన్యం, వ్యంగ్య భాషణా, ధ్వని స్ఫూర్తి, శైలీ చమత్కృతీ, నిశితమూ సంక్షిప్తమూ అయిన రచనా వ్యాసంగమూ ఈ నాటి కవిత్వపు లక్షణాలు.

ఈ శతాబ్ది మొదట జోసెఫ్ కాన్రడ్ అనే రచయిత సముద్ర యానానికి సంబంధించిన సంఘటనలను అతి వాస్తవికంగా వర్ణిస్తూ *ది నిగ్గర్ ఆఫ్ ది నార్సిసస్, లార్డ్ జిమ్, టైఫూన్* వంటి నవలలను ప్రకటించాడు. *ది హిస్టరీ ఆఫ్ మిస్టర్ పాలీ, టోనో-బంగే* మొదలైన నవలలలో హెచ్.జీ.వెల్స్ సంఘసంస్కరణాభిలాష ప్రతి ఫలించింది. మధ్య తరగతి ప్రజల స్థితిగతులను వాస్తవికంగా వర్ణించిన ఆర్నాల్డ్ బెన్నెట్ నవలలలో *ది ఓల్డ్ వైవ్స్ టేల్* మిక్కిలి ప్రసిద్ధమైంది. ఉన్నత వర్గానికి చెందిన వ్యక్తులలో మూడు తరాల నడుమ కలిగిన పరిణామాలను అతి మనోజ్ఞంగా చిత్రిస్తూ జాన్ గాల్స్‌వర్దీ *ది ఫార్సైట్ శాగా* అనే పేరుతో నవలా పరంపరను ప్రకటించాడు. మనస్తత్త్వశాస్త్ర సూత్రాలను అనుసరించి చైతన్య స్రవంతి (stream of conciousness) శిల్పంతో జేమ్స్ జాయ్‌స్ *యులిసిస్, ఫినెగన్స్ వేక్* అనే నవలలను, వర్జీనియా వూల్ఫ్ అనే రచయిత్రి *మిసెస్ డాలోవే* వంటి కథను వ్రాశారు. డీ.హెచ్.లారెన్స్ *సన్స్ అండ్ లవర్స్, ది రెయిన్ బో, లేడీ చాటర్లీస్ లవర్* వంటి నవలలలో శృంగారాన్ని విశృంఖలంగా వర్ణించి, సాహిత్య ప్రపంచాన్ని కల్లోలితం కావించాడు. భావోద్వేగానికీ, వివేకానికీ నడుమ చెలరేగే సంఘర్షణను చిత్రించడంలో అద్వితీయుడు ఆల్డస్ హక్స్లీ. *ఆంటిక్ హే, పాయింట్ కౌంటర్ పాయింట్, ఏ బ్రేవ్ న్యూ వరల్డ్, ది ఏప్ అండ్ ది ఎసెన్స్* వంటి వ్యంగ్య నవలలలో అతడు సమాజంలో కన్పించే లోపాలను నిశితంగా విమర్శించాడు. సోమర్సెట్ మామ్ వ్రాసిన *ది మూన్ అండ్ సిక్స్ పెన్స్, ఆఫ్ హ్యూమన్ బాండేజ్, కేక్స్ అండ్ ఏల్, ది రేజర్స్ ఎడ్జ్* వంటి నవలలు అమితంగా ప్రజాదరణ పొందాయి. *షెప్పీ, ది లెటర్* మొదలైన నాటకాలను, *రెయిన్, హిజ్‌ఎక్స్‌లెన్సీ, మిస్టర్‌నో-ఆల్* వంటి రసవంతమైన చిన్న కథలను పెక్కింటిని ఆయన రచించాడు. నవలలలో నైతిక సంఘర్షణను సరసంగా ప్రదర్శించడంలో గ్రహామ్ గ్రీన్ అనే రచయిత ప్రతిభ గోచరిస్తుంది. కథానికా రచనలో కాథరీన్ మాన్స్‌ఫీల్డ్ అనే రచయిత్రి ప్రత్యేకత గడించింది. వెల్స్, గాల్స్‌వర్దీ, హక్స్లీ ప్రభృతులు నవలలతో పాటు చక్కని చిన్న కథలను కూడా ప్రకటించారు. ఇ. ఎమ్. ఫార్‌స్టర్ *హోవర్డ్స్ ఎండ్, ఏ పాసేజ్ టు ఇండియా*, ఎల్.పి. హార్ట్లీ *ది ష్రింప్ అండ్ ది ఆనిమోన్*, జోయిస్ కేరీ *ది హార్సెస్ మౌత్*, పాల్‌స్కాట్ *ది రాజ్ క్వార్టెట్* వంటి నవలలను వ్రాసి పేరెన్నికగన్నారు.

ఈ శతాబ్ది నాటకకర్తలలో అగ్రగణ్యుడు జార్జ్ బెర్నార్డ్ షా. అతడు తన సాంఘిక సిద్ధాంతాలను ప్రచారం చేయడానికి నాటకాన్ని ఒక సాధనంగా చేసికొని *మ్యాన్ అండ్ సూపర్ మ్యాన్, పిగ్మాలియన్, మిసెస్ వారెన్స్ ప్రొఫెషన్, సీజర్ అండ్ క్లియోపాత్రా, ఆండ్రోక్లీస్ అండ్ ది లయన్, హార్ట్‌బ్రేక్ హౌస్, సెయింట్ జోన్, బాక్ టు మెథూసెలా* వంటి మనోజ్ఞ నాటకాలను సృష్టించాడు. అతని కుశాగ్రబుద్ధీ, వాక్చమత్కృతీ, ధర్మప్రబోధ తత్పరతా వాటిలో సర్వత్రా కనిపిస్తుంది. సాంఘిక ప్రయోజనమే ప్రధాన లక్ష్యంగా గాల్స్‌వర్దీ కూడా *ది సిల్వర్‌బాక్స్, స్ట్రైఫ్, జస్టిస్* వంటి ప్రశస్త నాటకాలను రచించాడు. నాటకాలలో సాంఘిక సమస్యలను చిత్రించడంలో ఏ ఒక వైపూ మొగ్గు చూపక నిగ్రహంతో ఉభయ పక్షాల లోపాలనూ ప్రదర్శించి, నాటకీయ తాటస్థ్యానికి (dramatic objectivity) విమర్శకుల మన్ననల నందుకున్నాడు. జేమ్స్ బ్యారీ *పీటర్ ప్యాన్, ది ఎడ్మిరబుల్ క్రైటన్* వంటి రసవంతమైన నాటకాలను వ్రాశాడు. నోయెల్ కవార్డ్ హాస్యరస ప్రధానమైన నాటక రచనకు ప్రసిద్ధి పొందాడు. ఐరిష్ జాతీయ నాటకశాలా స్థాపనోద్యమ ఫలితంగా యీట్స్, జాన్ మిలింగ్టన్‌సింజ్, జార్జ్

మూర్, జార్జ్ రసెల్, లార్డ్ డన్సెనీ, సీన్ ఓ కేసీ ప్రభృతులు అనేక నాటకాలను వ్రాశారు. కాల గమనాన్ని గూర్చి ప్రయోగాత్మక నాటకాను రచించిన జే.బీ. ప్రీస్ట్లీ తన రచనలలో వర్తమాన సమాజస్థితిని చాలా సొగసుగా ప్రతిఫలింపచేశాడు. వాల్‌గియల్ గుడ్, లూయీ మెక్నీస్ శ్రవ్యనాటికా రచనలో నూతన ప్రయోగాలను చేసి ప్రతిష్ఠ గడించారు. కవితా నాటక ప్రక్రియను టి.ఎస్. ఇలియట్ తన *మర్డర్ ఇన్ ది కేథీడ్రల్, ఫామిలీ రీయూనియన్, ది కాక్‌టెయిల్ పార్టీ* మొదలైన నాటకాల్లో పునరుద్ధరించాడు. క్రిస్టఫర్ ఫ్రై *ది లేడీ ఇస్ నాట్ ఫర్ బర్నింగ్, వీనస్ అబ్సర్వ్‌డ్, ఫస్ట్ బార్న్, కర్ట్ మాంటిల్* మున్నగు కృతులలో దానికి దోహదం చేశారు. రెండవ ప్రపంచ సంగ్రామం తరువాత 'థియేటర్ ఆఫ్ ది అబ్సర్డ్' అనే నూతన నాటకోద్యమాన్ని, *జాన్ ఆఫ్ బోర్న్, లుక్ బాక్ ఇన్ ఆంగర్, లూథర్* మొదలైన రచనల్లోనూ, హరోల్ట్ పింటరే *ది రూమ్, ది బర్త్‌డే పార్టీ, ది కేర్ టేకర్* లాంటి ప్రయోగాల్లోనూ, వెస్కర్ *కిచెన్ ట్రైలజీ* లాంటి రూపకాల్లోనూ బలపరచారు. సామ్యూయల్ బెకెట్ *వెయిటింగ్ ఫర్ గోడో, ఎండ్‌గేమ్* వంటి సుప్రసిద్ధ రూపకాలతో ఆంగ్లనాటక రంగంలో సంచలనం తీసుకు వచ్చాడు.

మొదటినుండీ వ్యాసరచనకు వార్తాపత్రికలు ప్రోత్సాహం ఇచ్చాయి. ఈ శతాబ్దిలో కూడా పత్రికలలో ఉత్తమ స్థాయికి చెందిన వ్యాసాలు అసంఖ్యాకంగా ప్రకటితమైనాయి. ఆత్మాశ్రయ వ్యాసరచనలో చార్లెస్ లాంబ్ చూపిన త్రోవ ననుసరించి చెస్టర్టన్, హిలేర్ బెలాక్, ఏ.జీ.గార్డనర్, రాబర్ట్ లిండ్, ఈ.వీ. లూకాస్, మాక్స్ బియర్‌బమ్, జే.బీ.ప్రీస్ట్లీ ప్రభృతులు ఆహ్లాద కరమైన వ్యాసావళిని రచించారు. డబ్ల్యూ.ఎచ్. హడ్సన్ ప్రకృతి వర్ణనాత్మక రచనలు ప్రసిద్ధమైనవి. జీవిత చరిత్ర రచనలో లిట్టన్ స్ట్రేచీ *ఎమినెంట్ విక్టోరియన్స్* అనే పుస్తకంలో క్రొత్తదారి త్రొక్కాడు. టి.ఈ. లారెన్స్, విన్స్టన్ చర్చిల్ ప్రభృతుల చారిత్రక గ్రంథాలకు కూడా సాహిత్య గౌరవం సిద్ధించింది. ఇక సాహిత్య విమర్శకు పేరొందిన ప్రముఖులు సెయింట్‌బరీ, ఆలివర్ ఎల్టన్, వాల్టర్ ర్యాలే, ఏ.సీ.బ్రాడ్లీ, క్విల్లర్‌కూచ్, డబ్ల్యూ. పీ కార్, గిల్బర్ట్ మరీ, హెర్బర్ట్, గ్రియర్సన్, ఐ.ఏ.రిచర్డ్స్, టిల్యార్డ్ డేవిడ్ డైనిస్, హెలెస్ డాబీ షైర్ మున్నగువారు పలువురు ఉన్నారు. ఎఫ్. ఆర్. లీవిస్, విల్సన్‌నైట్, విలియమ్ ఎంప్సన్, రేమండ్ విలియమ్స్ మున్నగు ప్రఖ్యాత విమర్శకులు సాహిత్య సమీక్షకు క్రొంగ్రొత్త ఉత్తేజాన్ని కలిగించారు.

ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో అణ్వస్త్రాలు ఉపయోగింప బడినప్పటినుండీ ఏ క్షణమైనా విశ్వశాంతి విచ్ఛిన్నమై, మానవజాతి నామరూపాలు లేకుండా నశించిపోయే ప్రమాదం ఏర్పడింది. ఈ అనిశ్చిత స్థితి మూలాన పూర్వ విశ్వాసాలూ, సాంఘిక సూత్రాలూ కొంతకు కొంత చెదిరాయి. రెండవ ప్రపంచయుద్ధం ముగిసిన తరువాత, 1950 నుండి సమాజంలోని ఈ సందిగ్ధావస్థను తమ రచనలలో సూటిగా వెల్లడించేందుకు కుపిత యువజనులు (Angry Youngmen) అనే నూత్నవాద రచయితలు ఆవిర్భవించారు. వారికి వర్తమానమే ప్రధానం కాని, భూత భవిష్యత్తులతో ప్రమేయం లేదు. వ్యక్తులలో, సంస్థలలో వారు వంచనను ఏ మాత్రం సహింపరు. కపట నటనను నిర్దాక్షిణ్యంగా ఖండిస్తూ నేటి సమాజపు సత్య స్వరూపాన్ని వారు తమ గీతాలలోను, నవలలలోను చిత్రించడానికి ప్రయత్నించారు. ఈ వర్గపు రచయితలలో జాన్ వెయిన్ వ్రాసిన *హరీ ఆన్ డౌన్*, కింగ్స్లే, ఏమిస్ వ్రాసిన *లకీ జిమ్* అనే నవలలు విజయవంతమైనాయి. అలాగే ఆంగస్ విల్సన్ *ఆంగ్లో-సాక్సన్ ఆటిట్యూడ్స్, ది మిడిల్ ఏజ్ ఆఫ్ మిసెస్ ఇలియట్, ఓల్డ్ మెన్ ఎట్ ది జూ* వంటి నవలలను వ్రాసి పేరుగాంచాడు. విలియమ్ గోల్డింగ్ మానవ చేతనలో ప్రవృత్తిలో అంతర్హితం అయిన దౌష్ట్యాన్నీ, క్రూరప్రకృతినీ ప్రకటించే నవలలను వ్రాసి విఖ్యాతి గడించాడు. వాటిలో *లార్డ్ ఆఫ్ ది ఫ్లైస్, ది స్పైర్, ఫ్రీ ఫాల్, పించర్ మార్టిన్, పిరమిడ్* అనే కృతులు ప్రధానమైనవి. ఆధునాతన 'గోథిక్' సరళిలో ఐరిస్ మార్డాక్ *ది సాంగ్ కాసిల్, ది బెల్, ఏ సెవెర్డ్ హెడ్, ది ఇటాలియన్ గర్ల్* వంటి నవలలను అందించిన ప్రముఖ రచయిత్రి.

ఇంగ్లీష్ సాహిత్యం ఈ విధంగా సమాజంలోని భావ పరిణామాలను రమ్యంగా ప్రతిఫలింపచేస్తూ, జాతీయ జీవితానికి రసవద్ వ్యాఖ్యానమై పఠితలకు ఆత్మవికాసాన్ని కలిగిస్తూ నిత్యాభ్యుదయ మార్గంలో సాగిపోతున్నది. బ్రిటిష్ సామ్రాజ్య విస్తరణతో పాటు ఆంగ్లభాష ప్రపంచ వ్యాప్తి గాంచిన ఫలితంగా ఎన్నో కొత్త సాహిత్యాలు ప్రాదేశికంగా ఉద్భవించి గత అర్ధ శతాబ్దిలో వర్ధమానమైనాయి. ఆస్ట్రేలియాలో పాట్రిక్‌వైట్, రాండాల్ఫ్ స్టో, ఎ.డి. హోప్, జోడిల్ రైట్, కెనడాలో ఇ.జె. ప్రాట్, మార్గరేట్ ఆట్‌వుడ్; న్యూజిలాండ్‌లో ఆలెన్ కర్నో;

కరిబియన్ దీవులలో జార్జ్ లామింగ్, వి.ఎస్. నయిపాల్, విల్సన్ హారిస్, ఎడ్వర్డ్ బ్రాథ్‌వైట్, డెరెక్ వాల్కాట్; నైజీరియాలో చినువా అచిబి, వోలె సోయింకే, జె.పి. క్లార్క్; భారతదేశంలో ముల్క్‌రాజ్ ఆనంద్, ఆర్.కె. నారాయణ్, రాజారావ్, నిసిం ఇజికియల్, ఎ.కె. రామానుజం ప్రభృతులు తమ రచనలతో ఇంగ్లీష్ సాహిత్యాన్ని వికసింపజేసి, 'కామన్వెల్త్ సాహిత్యం' అనే నూత్న సాహిత్యాన్ని సృష్టించారు.

అ.రా.కృ. (డి.వి.కె.రా.)

## ఇటాలియన్ భాష - సాహిత్యం

**భాష :** ఇటలీదేశంలో అతి ప్రాచీనమైనకాలంలో వాడుకలో ఉన్న లాటిన్‌భాషనుండి ఏర్పడిన భాషలలో ఇటాలియన్ ఒకటి. ఈ భాషలో కాల, పురుష, విభక్తి ప్రత్యయాలలో రూపాంతరాన్ని చెందే శబ్దాలతో పాటు అవ్యయాలు కూడా ఉన్నాయి. ఇటాలియన్ భాష శ్రావ్యంగా ఉంటూ,



ఇటలీ

సంగీతకళకు అనుకూలంగా ఉండడంవల్ల ఇది ఎందరో విదేశీయుల్ని ఆకర్షించగలిగింది. 1200 ప్రాంతంనుంచి ఇటాలియన్ భాషలో రచింపబడ్డ గ్రంథాలు దొరుకుతున్నాయి. 13 వ శతాబ్దంలో వివిధ ప్రాంతాలలో వివిధ మాండలిక భాషలు వాడుకలో ఉండేవి. ఉత్తర భాగపు ప్రజలు మాట్లాడే ఇటాలియన్ దక్షిణ దేశం వాళ్లకు పరాయిగా వినిపించేది. దేశంలోని అన్ని ప్రాంతాల వారికీ సులభంగా అర్థమయే భాషను రూపొందించడానికి చేసిన వివిధ ప్రయత్నాలు డాంటే రచనల్లో ఫలించాయి.

**సాహిత్యం :** 12 వ శతాబ్దినుంచి 14 వ శతాబ్దం వరకూ ఇటలీలోని సాహిత్యానికి ప్రేరణ కలిగించినది ఫ్రెంచ్ సాహిత్యం. ఈ కాలంలో ఫ్రెంచ్ పద్య గద్య రూపమైన సాహస కథలు ఇటలీలో ప్రచారంలో ఉండేవి. 13 వ శతాబ్దానికి ఫ్రాంకో-ఇటాలియన్ సాహిత్యం అభివృద్ధి చెందింది. నాటి రచయితలకు ఉత్తేజకాలు ప్రధానంగా ఫ్రెంచి కథలే! వారి భాష కూడా ఫ్రెంచి భాషే! అయితే రచయితలు తమ రచనలలో తమకు తెలియకుండానే తమ మాండలికాన్ని ప్రవేశపెట్టేవారు. హోలీ రోమన్ చక్రవర్తి 2 వ ఫ్రెడరిక్ సిసీలియన్ రాజ్యాన్ని 1208 నుంచి 1250 వరకూ పరిపాలించాడు. ఆయన ఆస్థానంలోని సాంస్కృతిక వాతావరణపు ప్రేరణతో ప్రావెన్కాల్ (Provencal) రూపాలూ, ఇతివృత్తాలూ ఆధారంగా గేయకవిత రచించబడింది. ఈ కాలపు 'సిసీలియన్' కవులకు కవిత్వమన్నది జీవితంలోని బరువునూ, బాధనూ, మరచిపోవడాని కొక సాధనం. ఫ్రెంచ్ ప్రావెన్స్ (provence) లోని రాజకీయ కవితకు వారు ప్రాముఖ్యాన్నివ్వక, అక్కడి ప్రణయ కవిత్వాన్నే వీరు అనుకరించారు. ఈ కాలపు కవుల్లో గయాకొమోదా లెన్‌టీనియో (Giacomoda lentinio) 'సానెట్' అనే 14 పంక్తుల విలక్షణమైన ఛందస్సును సృష్టించిన వారిలో ఒకడుగా పేర్కొనబడుతున్నాడు. ఈతని రచనలూ, గయాకొమో పగ్లీస్ (Giocomo pugliese) రచనలూ ఆకర్షకంగానూ, శక్తిమంతంగానూ ఉంటాయి.

2 వ ఫ్రెడరిక్ మరణానంతరం టస్కనీ సాహిత్య కేంద్రం అయింది. టస్కన్ కవులు నిర్జీవమైన, గతానుగతికంగా వచ్చే సంప్రదాయానికి దాస్యం చేసే ప్రణయ కవిత్వం వ్రాశారు. కాని వారు రాజకీయ వస్తువును గ్రహించడంలో ఎక్కువ స్వాతంత్ర్యాన్ని ప్రదర్శించారు. బ్రునెట్టో లాటినీ వ్రాసిన *టిసోరెటో* వంటి నైతిక విలువలను అన్యాపదేశంగా బోధించే దీర్ఘమైన కావ్యాలు కూడా ఈ కాలంలోనే వెలువడ్డాయి. 13 వ శతాబ్దం మధ్యలో టస్కనీలో ప్రణయవాద, రహస్య వాదాల కలయికతో కూడిన కవిత్వానికి దారితీసిన వారిలో గుయిటొనే ద అరెజ్జ (Guittone d ' Arezzo 1225-1293) ముఖ్యుడు. ఈలోగా ప్రణయకవిత్వం ఒక కొత్త మలుపు తిరిగింది. చిత్తశుద్ధీ, ఉదాత్తమైన దృక్పథం ఈ కవితలో కనిపించింది. ఈ కవులది 'నొవోశైలి'; 'మధురమైన నవీన శైలి'. ఈ మధురశైలిని అనుసరించిన వారిలో గుయిదో గుయినిజెల్లి (1240-76) గ్విటో, కాల్వకాంటీ (1260-1300), డీనో ఫ్రెస్కో బాల్డీ, సీనోద పిస్తోయియా (1270-1336)

మొదలయిన వారు ఉన్నారు. గుయిదో గుయిని జెల్లీ రచించిన మిక్కిలి ప్రసిద్ధమైన కావ్యం 'ప్రేమకు సదా సుకుమార హృదయమే ఆశ్రయం' అనే పంక్తితో ప్రారంభం అవుతుంది. దీనిలో స్త్రీ ప్రేమకూ, దైవప్రేమకూ గల సంబంధం ఎలాంటి దనే ప్రశ్న చర్చించబడింది. కాల్వకాంటీ ఉదాత్తమైన శైలిని సాధించిన గేయకవి. ఇతని కావ్యాలలో ఎక్కువభాగం విషాదాంతాలే! ఇతడు గుయినిజెల్లీ కవిత్వాన్ని ఎంతో మెచ్చుకున్నా, 'ప్రేమ ఉదాత్త మానసికస్థితికి కారణమవుతుంది' అని అనడు. డాంటే కావలకాంతీని ఎంతో అభిమానించినా, ప్రేమ తత్త్వాన్ని గురించి అతని అభిప్రాయాలకు గుయిని జెల్లీ అభిప్రాయాలతో ఎక్కువ సామ్యం కనిపిస్తుంది. ఈ 'నావోశైలి'లో కవుల భాష వెనుకటి టస్కన్ కవుల భాషకన్న ఎక్కువ పదును తేరింది. స్థానిక లక్షణాలను పరిహరించి, ఇటలీకి ఒక ప్రామాణికమైన సాహిత్య భాషను వీరు సృష్టించారు.

ఉదాత్తమైన ప్రణయకవిత్వానికి భిన్నంగా కనిపించే హాస్య కవితలో కావాలని అసంస్కృతంగా ఉన్న వాడుక భాషను ప్రయోగిస్తారు. ఒక్కొక్కప్పుడు ఆ భాష అశ్లీలంగా కూడా ఉంటుంది. అయితే ఈ హాస్య కవులందరూ సంస్కారం ఉన్నవారే! వారు తరచుగా ఉపయోగించే పద్యం 'సానెట్'. వారిలో సెక్కొ అంగియోలీయారీ ప్రసిద్ధుడు, బహుముఖ ప్రజ్ఞావంతుడు. ఇతడు ప్రణయ కవిత్వంలో ఎంతో ఒడుపుగా 'నావోశైలి' కవులను అవహేళన చేస్తాడు. అయితే ఈ కవులలో పెత్రో దీ ఫయిటినెల్లీ రాజకీయాలలో తనకు గల తీవ్రమైన ఆసక్తి వల్ల శక్తిమంతమైన అధిక్షేప కవితను వ్రాశాడు.

సెయింట్ ఫ్రాన్సిస్ ఆఫ్ అసిసీ *కాంటీకొది ఫ్రాతే సోలె* (సూర్య గీతం) అనే రమణీయమైన కవిత వ్రాశాడు. అది లయాత్మకమైన వచనంలో వ్రాయ బడింది. ఈ వచన గీతం భగవంతుణ్ణి ఆయన సృష్టిలోని సమస్త వస్తుజాలం ద్వారా కీర్తిస్తుంది.

సాహిత్య పరంగా వచనం కూడా 13 వ శతాబ్దంలోనే ప్రారంభం అయింది. నాటి ఇటాలియన్ వచన గ్రంథాలలో ఎక్కువ భాగం ఫ్రెంచ్‌నుంచీ, లాటిన్‌నుంచీ చేసిన అనువాదాలే! ఈ వచనంలోని శైలి లాటిన్ వాక్య నిర్మాణ ప్రభావానికి లోనయింది. ఇటాలియన్ గద్యశైలికి ఆద్యుడు గుయిదో ఫాబా. ఫాబాను అనుకరించిన గుయిటొనే దారెజ్జొ శైలి ఆడంబరంగా ఉంటుంది. దీనికి భిన్నంగా రిస్తోరొదారెజ్జొ శైలి విస్పష్టంగాను, సూటిగాను ఉంటుంది. 13 వ శతాబ్దపు వచనం డాంటే *లావిటా నొవాలో* పరాకాష్ఠను పొందిందని చెప్పాలి. ఇతని వచనంలో సరళత, మాధుర్యం, కవితాశక్తి కనిపిస్తాయి.

దాంతే అలిగేరి (1265-1321) ఈ కాలానికి చెందిన మహాకవి. ఇతని కవిత నేటికీ యూరప్ ఖండం అంతటికీ శిరోధార్యంగా ఉంది. ఇతడు రచించిన *లదివినా కొమెడియా* (Ladivina commedia: The divine Comedy: 1310-21) ఒక అసాధారణమైన కావ్యం. మనసారా ప్రేమించిన స్త్రీ మరణానంతరం ఆధిభౌతిక, ఆధ్యాత్మిక సంస్కారాన్ని అనుభవించి, స్వర్గసీమల్లో ఆమెను కలసికొనగోరిన కవియొక్క ప్రణయగాథ ఇందులోని ఇతివృత్తం. ఈ కావ్యం నరకం అంతరిక్షం, స్వర్గం అని మూడు భాగాలుగా విభజింపబడింది. ఈ మూడు లోకాల గుండా కవి ప్రయాణం చేస్తాడు. అతడు నరకంలో ప్రవేశించి ఆ బాధలను చూశాడు; అనుభవించాడు. అంతరిక్షంలో ఆత్మసంస్కృతిని పొందాడు. తర్వాత స్వర్గానికి వెళ్లాడు. క్షణికంగా మెరిసిన దైవసాక్షాత్కారం ఈ కావ్యానికి పరాకాష్ఠ సన్నివేశం. ఈ ప్రయాణంలో అతనికి సాయపడ్డది 'వర్జిల్' అన్న రోమన్ కవి, 'బియాట్రిస్' అనే ఆమె. ఈ ఇద్దరూ మానవుని వివేచనాత్మకమైన ఆలోచనకూ, మతపరమైన విశ్వాసానికీ ప్రతీకలుగా గ్రహింపబడ్డారు. సకల సాహిత్య ప్రవృత్తులనూ ఒకే చోట సమావేశ పరచగల ఈ కావ్యం నానార్థ సమన్వితమూ, వివిధ రస విశిష్టమూ, గుణాలంకార సహితమూ, భావ చిత్ర పోషకమూ, ధ్వని ప్రధానమూ అయింది.

డాంటే ఈ మహాకావ్యాన్నే కాక 'వాడుకభాషలోని ఉదాత్తత' అనే గ్రంథం కూడా వ్రాశాడు. ఇది ఇటాలియన్ సాహిత్యభాషను గురించి చర్చించిన తొలి విమర్శక గ్రంథం. 1313 లో *మోనార్కియా* (Monarchia: On the Monarchy) అన్నదానిలో డాంటే రాజకీయాలకు సంబంధించిన తన అభిప్రాయాలను వివరిస్తూ, మతాధికారి 'పోప్' కూ, రాజ్యాధికారి చక్రవర్తికీ మధ్య పొత్తూ, అవగాహనా అవసరం అంటాడు.

14 వ శతాబ్దపు మరొక ప్రముఖ కవి ఫ్రాన్సెస్కొ పెట్రార్కా (1304-74). రాజకీయాలకు సంబంధించిన ఈతని అభిప్రాయాలన్నీ డాంటే అభిప్రాయాల కన్న వాస్తవిక పరిధిలో ఉంటాయి. అతడు 14 పంక్తులు గల 'సానెట్' అనే పద్యరూపాన్ని విస్తృతవ్యాప్తిలోకి తెచ్చాడు. దానిలో 'లౌరా' అన్న స్త్రీమీద తనకున్న ప్రేమను అతిలోక సుందరంగా గానం చేశాడు. అతని జీవితకాలంలోనే అతని ప్రభావం సమకాలిక రచయితల మీద విస్తారంగా పడింది. తర్వాత మూడు శతాబ్దా

లవరకూ ఇటలీ, స్పెయిన్, ఫ్రాన్స్, ఇంగ్లండ్ దేశాల సాహిత్యా లన్నీ ఇతని ప్రభావానికి లోనయాయి. ఇతని అనుయాయు లందరూ ఇతనిని అనుకరించడమే కాక, ఇతడు ప్రదర్శించిన సాహిత్యక్రమశిక్షణనూ, సానెట్‌తో సహా ఇతని సాహిత్య రూపాలనూ మనస్ఫూర్తిగా అంగీక రించారు. యూరపియన్ సాహిత్య పునరుజ్జీవనంలో ఈ లక్షణాలు అంతర్భాగం అయాయి.

14 వ శతాబ్దంలోని మూడో ప్రముఖ రచయిత బొకాచియో (1313-75). ఇతని రచన లన్నీ పూర్తిగా సాహిత్యపరమైనవే! ఇతని రచనలలో ముఖ్యమైనది *డె కామెరన్* (1348-53). ఇది నూరు కథల సంపుటం. ఇది సమకాలీన పౌరజీవితాన్ని చిత్రిస్తూ, దానిలోని లలిత లలితమైన హాస్యం నుంచి, ప్రగాఢమైన విషాదం వరకూ ప్రదర్శిస్తుంది. సాంప్రదాయిక ఇటాలియన్ వచన రచనా శైలికి ఇది ఉత్తమ ఉదాహరణగా గ్రహింపదగింది. యూర పియన్ పునరుజ్జీవన సాహిత్యం మీద దీని ప్రభావం అనల్పమైంది.

యథార్థానుభూతి ఆధారంగా మనోవైజ్ఞానిక విశ్లేష ణకు పూనుకొనిన పెట్రార్కా, బొకాచియో, డాంటేలు 14 వ శతాబ్దంలోని మహా సాహిత్య స్రష్టలు. వీరి అనుయాయులలో ఫాజియో డెగ్లీ, ఉబెర్తి (1300-67), ఫ్రాన్సెస్కో స్తాబిలీ మొదలైనవారు ప్రముఖులు.

1453 లో 'కాన్‌స్టాంట్‌నోపుల్' తుర్కుల చేతిలో పడగానే, అక్కడ ఉన్న గ్రీకులు తమ తమ వ్రాత ప్రతులనూ, పూర్వ గ్రంథాలనూ తీసికొని వలస పోయారు. వారిలో కొందరు ఇటలీ వచ్చారు. అక్కడ గ్రీక్ సాహిత్యం ప్రచారంలోకి రావడంతో సాహిత్యంలోనూ, లలిత కళలలోనూ నవోదయం, భావనాశక్తి, ధీ ప్రచోదనం కనిపించాయి. మానవుడన్నా, జీవితమన్నా దృక్పథం మారిపోయింది. రాజకీయ, నీతి శాస్త్రాలలో ఆధునిక సూత్రాలు ప్రతిపాదింపబడ్డాయి. ఈ నవ్య దృక్పథం ఏర్పడడానికి దారితీసినవారిలో లొరెంజో ది మెదిచి (1449-92) ఒకడు. ఫ్లారెన్స్‌లోని ఇతని ఆస్థానంలో లాగే నేపిల్స్, మిలాన్ ఆస్థానాలలోనూ, రోమ్‌లోని పోప్ ఆస్థానంలోనూ ఆనాటి విద్వాంసులను పోషించారు. 15 వ శతాబ్దంలోని నవీన సంస్కృతికి సంబంధించిన మాన వతావాదం మానవుణ్ణి గురించిన మధ్యయుగం నాటి అభిప్రాయాలను మార్చివేసింది. మానవుడే విశ్వానికి కేంద్రబిందు వనీ, అతని ఆత్మశక్తి భౌతిక, ఆధ్యాత్మిక లోకాలను అనుసంధాన పరుస్తుందనీ అతణ్ణి కీర్తించింది. ఈ కొత్త భావాలన్నీ ప్లేటో రచనలపట్ల ఆసక్తికి ఫలి తంగా వచ్చాయి. గయాన్నొజో మానెత్తి, పికోదెల్లా మిరాందోలా అనే వారు ప్లేటో రచనలను కూలంకషంగా పరిశీలించే తమ రచనలు చేశారు. 15 వ శతాబ్దం పూర్వార్ధంలో లాటిన్, గ్రీక్ భాషలపట్ల గల అభిమానంవల్ల దేశీయ భాష అయిన ఇటాలియన్ పట్ల ఈసడింపు భావం ఉండేది. కాని, ఈ శతాబ్దపు ఉత్తరార్ధంలో ఇటాలియన్‌భాష లాటిన్‌భాషను గద్దెనుంచి దింపివేసింది.

నికోలో మాకియవల్లీ రచనలు ఈ పునరుజ్జీవన యుగంలోని మౌలికమైన ఆలోచనాధోరణిని ప్రతిబింబి స్తాయి. అతణ్ణి నూత్న రాజకీయ శాస్త్రానికి పితామహుడు అంటారు. ఇందులో రాజకీయం నీతిశాస్త్రం నుంచి విడివడింది. అతని సుప్రసిద్ధ గ్రంథం *రాకుమారుడు* 1513 లో రచింపబడింది. ఇతని గ్రంథం యూరప్‌లోని రాజులను రెండు శతాబ్దాలపాటు నియంతలుగా చేయ డానికి ఉపయోగపడింది. మాకియవల్లీకి సాహిత్యచరిత్రలో కూడా స్థానం ఉంది. అతడు వ్రాసిన *లామంద్రగోలా* (1518) చాలా ప్రసిద్ధమైన రూపకం.

ఈ కాలంలో లుదొవికొ అరియోస్తొ (1474-1532) రచించిన *ఓర్లాందో ఫ్యూరియాసో* అనే కావ్యంలో అత్యంత రమణీయమైన సంప్రదాయ అభిరుచి కనపడు తుంది. ఇది 1516 లో మొదటి సారిగా ప్రచురించబడింది. తర్వాత రెండు శతాబ్దాల వరకూ దీని అనుకరణలు రావడమే కాకుండా, యూరప్ దేశాల పునరుజ్జీవన సాహిత్యంమీద దీని ప్రభావం ఎంతగానో కనిపించింది.

తార్కాతో తాసో (1544-95) ఇటాలియన్ పున రుజ్జీవన కాలానికి చెందిన మహాకవులలో చివరివాడు. ఇతడు వ్రాసిన *జెరూసెలామే లిబరాతా* అనే కావ్యంలో క్రొత్త ప్రాత సంప్రదాయాల సమన్వయం కనపడు తుంది. ఇతడు వ్రాసిన *లమింతా* ('L' Aminta: 1573) జానపద జీవితాన్ని ఆదర్శప్రాయంగా చూపే రూపకం.

నాటక రంగాన్ని పునరుద్ధరించిన వారిలో త్రిసినో, జిరాల్డీ మొదలైనవారు ఉన్నారు. గ్రీక్ నాటక శిల్పాన్ని అనుసరించి త్రిసినో రచించిన *సోఫొనిస్‌బా* (Sofonisba) ను తొలి ఇటాలియన్ విషాదాంత నాటకమని చెప్పవచ్చును. ఈ శతాబ్దపు మధ్యకాలంలో జిరాల్డీ గ్రీక్ నాటకాల అను కరణను ప్రతిఘటించి, రోమన్ విషాదనాటకకర్త సెనికా (Senica) ను ఒరవడిగా పెట్టుకొని 1541-49 మధ్య తొమ్మిది రూపకాలను వ్రాశాడు. యూరపియన్ నాట కాలు - ముఖ్యంగా ఎలిజబెత్ యుగంలోని నాటకాలు - ఇతని రూపకాల ప్రభావానికి లోనయాయి.

లాటిన్ ప్రహసనాలను (comedies) నమూనాగా చేసికొన్న ఇటాలియన్ సుఖాంత రూపకాలలో (comedies) విషాదాంత నాటకాలలో కన్న మంచి శిల్పం కనపడుతుంది. అవి సమకాలీన జీవితాన్ని కూడా ప్రతిఫలిస్తూ, ఆధునిక నాటకాల ఆరంభాన్ని సూచిస్తున్నాయి. అరియోస్తో, మాకియవెల్లి ల తో పాటు పిత్రో అరెతినో, గియోర్దనో బ్రూనో (1548-1600) లు కూడా మంచి రూపకాలను వ్రాశారు. బ్రూనో ఇటాలియన్ తాత్త్వికుడు కూడా! ఇతడు *కొవ్వొత్తులు చేసేవాడు* (1582) అనే రూపకం వ్రాశాడు.

కథానికా సాహిత్యం కూడా ఈ కాలంలో విరివిగానే వచ్చింది. నిత్య జీవితంలోని సమస్యలను ఆధారంగా చేసికొని *బాండెల్లో* (1485-1561) నవలలను రచించాడు. ఇటాలియన్ భాషలో ఈ కాలపు రచయితలు ఉపయోగించిన 'నవల్లా' శబ్దమే ఆంగ్లంలో 'నావెల్', తెలుగులో 'నవల' అయింది. ఈ శతాబ్దంలో రచించ బడ్డ ఇటాలియన్ నవలలలో నుంచే షేక్స్‌సియరు మొదలయిన వారు తమ నాటకాలకు ఇతివృత్తాలను ఎన్నుకున్నారు.

17 వ శతాబ్దంలో సాహిత్యస్రవంతి కాస్త కుంటుపడింది. రచనలలో రసప్రాశస్త్యం తక్కువై సారహీనమైన వస్తువూ, ఆడంబరమైన ఆకృతీ చోటు చేసుకున్నాయి. ఈ శతాబ్దంలో వైజ్ఞానిక ఆలోచనాధారకు కేథలిక్ చర్చ్ అడ్డు రావడం కూడా నీరస రచనలు రావడానికి కారణమైంది. జ్యామ్ బత్తీస్తా మారినో ఈ కాలపు రచనలకు ప్రాతినిధ్యం వహిస్తాడు. అతడు *లైర్* (1608-14), *లా సాంపొగ్నా* (1620) అనే గేయ కవితలు, *అడొనే* (1623) అనే దీర్ఘ పౌరాణిక నాటకం వ్రాశాడు. అతనికి ప్రేరణ అంతా 16 వ శతాబ్దమే. కాని ఆ కాలంలోని కవులలో లాగే క్రొత్తదనంతో ఆశ్చర్యాన్ని కలిగించడమే అతని లక్ష్యం. అతని రచన శిల్ప ప్రధానమైంది. ఈ శతాబ్దంలోని కవు లెందరో ఇతనివల్ల ప్రభావితులయారు; మరి ఎందరో ఇతనిని అనుకరించారు.

ఈ శతాబ్దంలోని వచన రచనలలో త్రైయానో బొకాలినీ వ్రాసిన అధిక్షేప రచనలూ, గిరోలా మో్రబూసోనీ నవలలూ ముఖ్యమైనవి. గెలీలియో కూడా ఈ కాలపువాడే. ఇతడు ప్రధానంగా శాస్త్రజ్ఞుడే అయినా, విస్పష్టమైన, శక్తిమంతమైన తన వచనశైలివల్ల ఇటాలియన్ సాహిత్య చరిత్రలో ఒక విశిష్ట స్థానాన్ని సంపాదించుకున్నాడు.

మారినో రచనల సంగతి ఎలా ఉన్నా అతని ప్రభావం మంచిది కాదన్న అభిప్రాయం బలపడి, ఆడంబరమైన శైలినుంచి సాహిత్యాన్ని విడిపించడానికి ప్రయత్నించిన వారిలో కార్లో మరియా మజ్జీ (1630-99), గ్రవినా (1664-1718), క్రెసింబెనీ (1663-1728) ముఖ్యులు. గయాంబత్తిస్తా వికో, లుడోవికో అంటోనియో మురటోరీ మొదలైన వారి రచనలలో ఇటలీలో చారిత్రక చైతన్యం మేల్కొనడం కనపడుతుంది. వికో తన 'నవీన విజ్ఞానం' (1728-44) అనే రచనలో మానవజాతి ప్రగతికి సూత్రాలను అన్వేషిస్తూ, మానవుని మనస్తత్వ పరిశీలన నుంచి నాగరకతలు పుట్టడానికి, పెరగడానికి, పతనం కావడానికి మౌలికంగా ఉన్న సూత్రాలను కనుగొన ప్రయత్నించాడు. గ్రవినా, వికో, మఫాయి, మురటోరీ మొదలయిన వారందరూ సంప్రదాయ రచనలను అనుకరించాలని చెబుతూనే, అంధాను కరణం పనికిరాదని హెచ్చరిస్తూ, తర్వాత వచ్చిన సాహిత్య విమర్శ ధోరణులకు నాందీ వాక్యాన్ని పలికారు.

ఇటాలియన్ నాటకంలో మార్పులు రావడం ఈ శతాబ్ది ఆరంభంలోనే ప్రారంభమయింది. 1726-47 మధ్య ఆంటోనియో కొంటీ నాలుగు విషాదాంత నాటకాలు వ్రాశాడు. ఇతనికి షేక్స్‌పియరు అభిమాన రూపక రచయిత. 1782 లో *సౌల్* నాటకకర్త విట్టొరియో ఆల్ఫియేరీ (1749-1803) రావడంతో నిజమైన విషాదాంత నాటకం ఆవిర్భవించింది. తర్వాతి రచనలను ఇతని రచన లెంతగానో ప్రభావితం చేశాయి. కార్లో గొల్డోనీ (1707-93) లాగే ఈతడు కూడా స్వీయచరిత్రను వ్రాసుకున్నాడు. యూరప్‌లోని ఇతర దేశాలతో పోల్చదగ్గ రూపకాల సృష్టికి ఇతడు చేసిన కృషి ఇందులో వివరించబడింది. గోల్డోనీ హాస్యరూపకాన్ని సంస్కరించాడు. వట్టి మోటు హాస్యంతో, అశ్లీలాలతో, వైవిధ్యంలేని పాత్రలతో ఉన్న తక్కువస్థాయి ప్రహసనాల స్వరూపాన్ని మార్చి వేశాడు. అతడు పాత్రలను విస్పష్టంగా తీర్చిదిద్దాడు. వెనీసు నగరపు వాతావరణాన్ని చురుకైన హాస్యంతో అద్భుతంగా చిత్రించాడు.

ఈ శతాబ్దంలోని సాహిత్య పునర్వికాసానికి ప్రతీకగా నిలిచేవాడు పరినీ. ఇంగ్లాండ్‌కు అలెగ్జాండర్ పోప్ ఎలాంటి వాడో ఇటలీకి పరినీ అలాంటివాడు. ఇతని *ఆ నాదు* అన్న అధిక్షేపకావ్యంలోనూ, *ఓడ్స్* (Odes) లోనూ ఉత్తమ నైతిక విలువలు, సమాజ సంస్కరణ పట్ల అభిలాష వ్యక్తమవుతాయి. గాస్పరో గోజీ (1713-86) కూడా ఇలాంటి ఆశయాలతోనే అధిక్షేప కావ్యాలను వ్రాశాడు. కాని ఈతని అధిక్షేపం అంత ఘాటుగా ఉండదు.

ఈ శతాబ్దాంతాన ఫ్రాన్స్‌తో యుద్ధాలు వచ్చి, సాహిత్యాన్ని కొంత కలవర పరచాయి. 19 వ శతాబ్దంలో దేశంలోని వివిధ రాష్ట్రాలను ఏకం చేయడానికి పలువురు

ప్రయత్నించారు. ఈ ఉద్యమ ప్రభావంతో మళ్లా కొత్త సాహిత్యం తల ఎత్తింది. ఈ పోరాటపు తొలి రోజుల లోని రచయితలలో ఉగో ఫోస్కాలోను ముందుగా పేర్కొనాలి. అతడు ఉద్రేకాన్నీ, శిల్పాన్నీ, సంప్రదాయ రచనలలో లాగ మేళవించడంలో ఎంతోనేర్పరి. ఇతని *దీ సెపొలరీ* (1807) అనే 300 పంక్తులకు మించని రచనలో మహాపురుషుల సమాధులను ఎంతో ఆవేశంతో వర్ణిస్తూ, అట్టివారి వారసత్వానికి అర్హులమని నిరూపించు కోవా లని సమకాలీనులను ప్రబోధించాడు. ఈ కావ్యం జాతీయ పునరుజ్జీవనానికి ఎంతో దోహదం చేసింది.

ఇటలీకి విముక్తిని సాధించి పెడతానన్న ఫ్రాన్స్‌దేశం ఇటాలియన్‌లను నిర్దాక్షిణ్యంగా అణగద్రొక్కింది. నెపో లియన్ ఆధిపత్యం కొనసాగిన కాలంలో సంప్రదాయ సాహిత్యానికి కొంత గౌరవం ఉండేది కాని, నెపోలియన్ పతనంతో సంప్రదాయ సాహిత్యంపట్ల అనాదరణ ఏర్పడింది. 1816-18 మధ్య కాల్పనిక సాహిత్యానికి అనుకూలంగా ఒక పెద్ద ఉద్యమం ఆరంభమయింది. మిలాన్‌నుంచి కాల్పనికోద్యమపత్రిక ఒకటి ప్రకటింప బడేది. దీనిలో జియోవానీ బెర్చెత్, సిల్వియో పెల్లికో మొదలైన ప్రముఖ ఇటాలియన్ రచయితలు కాల్పనికోద్యమాన్ని సమర్థిస్తూ రచనలు చేసేవారు. అయితే ఇటాలియన్ కాల్పనిక చైతన్యం అలెస్సాంద్రో మంజోనీ రచనలలో అద్భు తంగా ఆవిష్కరింప బడింది. *ఆయీప్రొమెస్సీ స్పోసీ* (1825-27) అనే నవల ఇతని ప్రధానమైన రచన. అది ఇరువురు జానపదుల ప్రణయగాథ. వారి వివాహానికి ఒక జమిందారు అడ్డుపడతాడు. యుద్ధం, విప్లవం, ప్లేగు మొదలైన విపత్తులనుంచి ఎలాగో బయటపడి ఈ ప్రేమి కులు కలుసుకుంటారు. ఇది ఇటాలియన్‌లోనే గాక ప్రపంచభాషలలోనే గొప్ప నవలగా పరిగణింపబడుతూంది. మంజోనీ కవిగానూ, విషాదాంత నాటక కర్తగానూ కూడా సుప్రసిద్ధుడు. ఈ కాలంలోని రచయిత లందరూ దేశభక్తి పూరితమైన రచనలనూ, అనేక నవలలనూ వ్రాశారు. ఉత్తమమైన గేయకవిత కూడా ఈ కాలంలో వెలువడింది. జియుసెప్పీ జియుస్తీ రచించిన అధిక్షేప కావ్యాలను కూడా ప్రజలు బాగా అభిమానించారు.

1870 నాటికి స్వాతంత్ర్యం లభించగా, అంతకు ముందు ఉన్న సాహిత్య లక్ష్యాలూ, భావాలూ, మార్గాలూ మారడం తప్పనిసరి అయింది. ఇటాలియన్ వాస్తవికతా వాదానికి జియోవన్నీ వెర్గా రచనలు మంచి ఉదాహరణలు. అయీ మాలవొగ్లియా (1881), మాస్త్రొడాన్ జెసూఆల్డో (1889) అనే వారి నవలలు ఈ శతాబ్దం తొలిభాగంలోని సిసిలీ దుస్థితిని హృదయ విదారకంగా వర్ణిస్తాయి. ఈత నిని అనుకరించిన వారిలో లుయిగీ కాపువానా, ఫెడెరికో ది రొబెర్టొ ముఖ్యులు. జీవిత వాస్తవికత తమ రచనలలో ప్రతిబింబించడానికి తమ చుట్టూ ఉన్న జీవితాన్నే వారు వస్తువుగా తీసుకున్నారు. దీనివల్ల 'ప్రాంతీయ నవల' అనే సంప్రదాయం కొత్తగా ఏర్పడింది. పావోలో ఫెరారి (1822-89), జియుసెప్పెజియా కోజె (1847-1909), రోబెర్తో బ్రాకో (1822-89) సామాజిక సమస్యలను చిత్రిస్తూ వ్యాఖ్యానించే నాటకాలను రచించి ఇటాలియన్ నాటక రచనకు తిరిగి జీవంపోశారు.

20 వ శతాబ్ది ప్రారంభంలో అంతర్జాతీయతా దృష్టి స్థానంలో తీవ్రమైన జాతీయత, సమాజ ప్రాధాన్యం స్థానంలో వ్యక్తిపూజ ప్రాముఖ్యం వహించాయి. ఈ క్రొత్త ధోరణికి గబ్రియలె డానంజియో ప్రాతినిధ్యం వహి స్తాడు. ఇతని ప్రభావం ఇటాలో స్వేవో (1861-1928), ఊగో ఓజత్తి (1871), బ్రూనోసీ కొగ్నానీ (1879), ఆంతోనియో బొర్జనే (1882) ల మీద బాగా కనప డుతుంది. వీరందరూ నియంతృత్వాన్ని బలపరిచిన రచయితలే!

డానంజియో కి అంతర్జాతీయ ఖ్యాతి లభించినా ఇటాలియన్ సంస్కృతిని వ్యవస్థీకరించడానికి, ఆలోచనా ధారను ఆధునికీకరించడానికి తోడ్పడింది బెనెజత్తో క్రోచె. ఇతడు ప్రధానంగా సాహిత్య విమర్శకుడు. సౌందర్య తత్త్వాన్ని అన్వేషించినవాడు. సామాజిక ఆర్థిక స్థితి గతుల నేపథ్యంతో నిమిత్తం లేని ఒక స్వతంత్ర సాహిత్య వివేచనా మార్గాన్ని అతడు సృష్టించాడు. అయితే ఇది 'స్వచ్ఛమైన కళ'ను విశ్వసించినవారి చేతులలో విపరీత వ్యాఖ్యకు గురి అయింది.

క్రోచె ఒక వంక సౌందర్య మీమాంసలో నిమగ్నమై ఉండగా రెండు ప్రధాన సాహిత్య ధోరణులు ఆవిర్భ వించాయి. 1. క్రెప్యుస్కో లారిస్మో: ఇది గతకాలం నాటి మధురానుభూతులను వ్యక్తీకరించడానికి వాడుక భాషా శైలిని ఉపయోగిస్తుంది. సెర్జియో కొరజ్జెని ఈ ధోరణికి చెందినవాడు. ఇతని రచనలలో కల్పన, భావన, ధ్వని ప్రధానమైనవి. 2. ఫ్యూచరిస్మో: దీనికి నాయకుడు పిలిప్పోతో మసోమారినెత్తి. ఈ ధోరణికి చెందిన కవులకు సాంప్రదాయిక కళ అంటే అసహ్యం. వారు భావ వ్యక్తీక రణలో పరిపూర్ణ స్వేచ్ఛను కోరుతారు. కార్యశూరత్వం, ధీరత్వం, వేగం, శబ్దాల వాడుకలో స్వేచ్ఛ అవసరం అంటూ వాటి ద్వారానే కళ ఆవిష్కృతం కాగలదని ఈ ఫ్యూచరిస్టులు వాదిస్తారు. ఈ కాలంలోనే క్యూబిస్ట్,

డాడాయిస్ట్, అధివాస్తవిక ఉద్యమాలు కూడా ఇటాలియన్ సాహిత్యంలో వచ్చాయి.

మొదటి ప్రపంచయుద్ధం పూర్తి అయిన తరువాత ఆ అరాజకం నుంచి కాస్త తేరుకోవాలనుకునే సరికి ఇటలీలో ఫాసిస్ట్ ప్రభుత్వం ఏర్పడింది. ఆ నియంతృత్వానికి అనుగుణంగానే సాహిత్యం క్రమబద్ధంగా ఉండాలనే సాంప్రదాయిక మార్గం తిరిగి తల ఎత్తింది. ఫాసిస్ట్ నియంతృత్వంలో స్వేచ్ఛతో కూడిన భావ వ్యక్తీకరణకు అవకాశం లేకపోవడం వల్ల ఆ రోజులలో ఏమి వ్రాయాలనే దానికన్న ఎలా వ్రాయా లనేది ఎక్కువ ప్రాముఖ్యం వహించింది. అయితే ఈ కాలంలోనే రికార్డో, బషెలి వంటి మంచి కథకులు, నోబెల్ పురస్కారాన్ని అందు కొన్న గ్రాజియా దెలెద్దా వంటి నవలా రచయితలు వచ్చారు.

నాటక కర్తలలో ల్విగీ పిరాండెలో అద్వితీయుడు. ఉన్మాదిని అయిన భార్యతో జీవయాత్ర గడిపిన ఇతని నాటకాలలో సాంఘిక సమస్యలు ఉత్తమ కళా దృష్టితో చిత్రించబడ్డాయి. 1934 లో ఇతనికి నోబెల్ బహుమతి లభించింది.

రెండవ ప్రపంచయుద్ధం పూర్తి అయేసరికి పరిస్థితులు మారాయి. ఇదివరకు ఎన్నడూ ఉపయోగించని వస్తువు లెన్నో రచయితలకు సమాజంలో కనపడ్డాయి. కార్లో లెవి వ్రాసిన *క్రీస్తు ఎబోలి దగ్గర ఆగాడు* అనే నవల (1945) లోనూ, రాక్కో స్కాటెల్లారో వ్రాసిన *ఫ్రాన్సిస్కో జోవిన్* అనే నవలలోనూ ఆ నాటి దక్షిణ ప్రాంతంలోని సమాజపు ఆర్థిక స్థితి గతులు, నైతిక సమస్యలు ప్రతిబింబించాయి.

క్రమ క్రమంగా ప్రపంచంలోని అన్ని దేశాల నుంచి కొత్త కొత్త ఆలోచనలూ, దృక్పథాలూ ముసురుకుంటూ రావడంతో మేధావులు వాటిని గురించి చర్చించడంలో నిమగ్నులై వాస్తవ జీవిత సమస్యల పట్ల అనాసక్తి ప్రదర్శించారు. డినో బుజాటీ 1958 లో రచించిన '60 కథలు' కాఫ్కా ప్రభావాన్నీ, కార్లో ఎమీలియో గడ్డా ఉపయోగించిన శబ్దవైచిత్రినీ, శ్లేషనూ, జేమ్స్‌జాయిస్ ప్రభావాన్నీ సూచిస్తాయి. 1966 నాటి మొరావియ రచన *అబద్ధం* ఒక నవలా రచయిత తన రచనను గురించి చేసిన రచన. అందుకే ఎదోఅర్డో సంగుయ్‌నేతి, ఇలియోపాగ్లియారాని వంటి కవులు ప్రజలకు అర్థం కాకుండా పోయారు.

అయితే ఆత్మావలోకనం గాని, తీవ్ర ఆదర్శవాద ధోరణి గాని ఎక్కువగా కనిపించని నవలా రచయితలు పారిశ్రామికమైన పెట్టుబడి వ్యవస్థలోని అస్తవ్యస్తతను విజయ వంతంగా చిత్రించ గలిగారు. ఒట్టోయిరో ఒట్టోయిరి, లూసియోమాస్త్రనార్డి మొదలైనవారు ఈ తరహా రచనలు చేశారు. మొరేవియా, కాల్వినో, ఉమ్‌బెర్టో ఎకోల రచనలు అనేక భాషలలోకి అనువదింపబడి విదేశీయులను ఎక్కువగా ఆకర్షించాయి. కాల్వినో వ్రాసిన *ఇటాలియన్ జానపద గాథలు* (1980), ఎకో వ్రాసిన *ఆ గులాబీ పేరు* (1983) అధిక ప్రజాదరణను చూరగొన్నాయి.

పో.సు.శా. (వ.మం.)

## ఈలమైట్ భాష

**భాష :** ఇరాన్‌కు నైరృతి దిశగా ఇంచుమించుగా నేటి ఖుజిస్తాన్ ప్రాంతంలో ఉండిన ఈలమ్ దేశానికి 'సూసియాన' అని మరో పేరు. దీని ముఖ్యపట్టణం సూసా అవడంచేత ఆ పేరు వచ్చి ఉంటుంది. ఈ దేశం మెసపటేమియన్ మైదానం నుంచి ఇరానియన్ పీఠభూమి వరకూ వ్యాపించి ఉండడంవల్ల ఈలమ్‌కు సంస్కృతి పరంగా *మెసపటేమియాతో* సంబంధం ఉన్నట్టు కనపడుతుంది. క్రీ.పూ. 3800 నుంచి క్రీ.పూ. 300 వరకు ఈ దేశం ప్రత్యేక సంస్కృతితో వర్ధిల్లింది. ఈలమ్ దేశచరిత్రలోని మూడు యుగాలకు చెందిన వ్రాతలు లభిస్తున్నాయి. మొదటి యుగం క్రీ.పూ.2,500 ప్రాంతాన ఆరంభం అవుతుంది. క్రీ.పూ 16 వ శతాబ్దం నుంచి 8 వ శతాబ్దం వరకు రెండో యుగం. ఈ యుగంలో బాణాగ్రలిపి (cuneiform) ఉపయోగించబడేది. ఈ యుగంలోని భాషను 'ప్రాచీన ఈలమైట్' అంటారు. క్రీ.పూ. 6 వ శతాబ్దం నుంచి 4 వ శతాబ్దం వరకూ పర్షియా దేశపు 'అఖామినిడ్' రాజులు పాలించిన కాలపు శాసనాలలో అక్కాడియన్, పురాతన పర్షియన్ భాషలతో పాటు ఈలమైట్ భాషను కూడా వాడేవారు. ఈ తుది యుగంలోని ఈలమైట్‌కు వాడిన లిపి కూడా బాణాగ్రలిపే. దీనిని 'నవీన ఈలమైట్' అంటారు. ఈ మూడు యుగాల్లోని శాసనాలనూ పూర్తిగా పరిశోధకులు చదువలేకపోతున్నా, ఈ భాషలోని కొన్ని వ్యాకరణాంశాలను గుర్తించగలిగారు. బహువచనం ఏర్పడడానికి చేర్చే ప్రత్యయాన్నీ, సర్వనామాల్నీ, క్రియాపదాలకు చివరవచ్చే ప్రత్యయాలనూ గురించీ కొంత తెలియవస్తూంది.

దీనికి జనక భాష కాని, దీనినుంచి జన్యమైన భాషలు కాని ఏమీ కనిపించడంలేదు. ఈ భాషలోని సాహిత్యాన్ని గురించి కూడా మనకు ఏమీ తెలియలేదు.

చీ.శే.రా.,(వ.మం.)

## ఎస్టోనియన్ భాష - సాహిత్యం

భాష : 800 దీవులూ, ప్రధాన భూభాగమూ కలిసిన ఎస్టోనియా పూర్వపు సోవియట్ రష్యాలోని ఒక రిపబ్లిక్ రాజ్యం. దీనికి ఉత్తరాన ఫిన్‌లాండ్ అఖాతమూ, తూర్పున రష్యన్ ఎస్.ఎఫ్.ఎస్.ఆర్ (S.F.S.R), దక్షిణాన లాట్‌వియా, పశ్చిమాన బాల్టిక్ (Baltic) సముద్రమూ ఉన్నాయి. ఈ రాజ్యంలోనూ, చుట్టుప్రక్కలా ఎస్టోనియన్ భాషను మాట్లాడుతారు. ఇది యూరలిక్ భాషా కుటుంబంలోని ఫిన్నో-యుగ్రిక్ శాఖకు చెందిన భాష. ఈ భాషలో ఉత్తరాది మాండలిక మొకటి, దక్షిణాది మాండలిక మొకటి ఉన్నాయి. అందులో ఉత్తరాది మాండలికమే సాహిత్య భాషగా రూపొందింది. కాస్త గణింపదగ్గ ఎస్టోనియన్ రచనలు 16 వ శతాబ్దంనుంచే కనపడుతున్నాయి. *కుల్లామా-ప్రార్థనలు* (Kullamaa prayers) 1520 ప్రాంతం నాటివి.

ఎస్టోనియన్ భాష ఫిన్నో-యుగ్రిక్ భాషల్లో బాల్టిక్-ఫిన్నిక్ వర్గానికి చెందిన భాష అవడం వల్ల, ఇది ఫిన్నిష్, వోటిక్, లివోనియన్, ఇన్‌గ్రియన్, కారెలియన్, వెప్స్ భాషలతో సన్నిహిత సంబంధాన్ని కలిగి ఉంది.

ఈ భాషమీద ఇండో-ఆర్యన్ భాషాకుటుంబానికి చెందిన లిథూనియన్, స్లావిక్ భాషల ప్రభావం కూడా కనపడుతూంది. ఆ రెండు భాషల్లోని నిత్య వ్యవహారానికి చెందిన పదాలు ఎన్నో ఎస్టోనియన్ భాషలో కనపడుతున్నాయి. ఈ భాష లేఖనానికి రోమన్ లిపికి దగ్గరగా ఉన్న 23 అక్షరాలు గల లిపిని వాడుతున్నారు.

**సాహిత్యం :** ఎస్టోనియన్ భాషలోని తొలి లిఖిత వాఙ్మయం మీద జర్మన్ ప్రభావం ఎక్కువగా కనపడుతుంది. ఈ భాషలోని తొలిగ్రంథం *లూథరన్ ప్రశ్నోత్తరాలు* (1535). *న్యూ టెస్టమెంట్* దక్షిణ ఎస్టోనియన్ మాండలికంలోకి 1686 లోనూ, ఉత్తర ఎస్టోనియన్ మాండలికంలోకి 1715 లోనూ అనువదింపబడింది. ఇలా 19 వ శతాబ్దం ప్రారంభం వరకూ మత సంబంధమైన గ్రంథాలే ఎస్టోనియన్ సాహిత్యంలో ప్రధానంగా కనిపిస్తాయి.

అయితే, ఎస్టోనియన్ సాహిత్యంలో 14 వ శతాబ్దం నుంచి 17 వ శతాబ్దంవరకూ జానపద సాహిత్యం విరివిగా వర్ధిల్లింది. ఫిన్నిష్ పురాణాలలోని వస్తువులే మార్పులతో ఇందులో కనిపించినా, ఫిన్నిష్ జానపద గేయాలకన్న ఎస్టోనియన్ గేయాలే మధుర తరంగా ఉంటాయి. లెక్కలేనన్ని పుటల జానపద గేయాలు 'టార్టు' లోని జాతీయ పురాతన వస్తుశాలలో భద్రపరచబడి ఉన్నాయట! ఈ జానపద సాహిత్య ప్రభావం వల్లనే ఎస్టోనియన్ సాహిత్యంలో గేయ కవిత ప్రధాన శాఖగా నిలిచిపోయింది.

ఈ భాషలో లౌకిక కావ్యరచనను ఆరంభించిన వాడు క్రిష్టియన్ జాక్ పీటర్‌సన్. ప్రాచీన గ్రీక్, లాటిన్ ఖండ కావ్యాలను అనుకరిస్తూ అతడు కొన్ని ఖండకావ్యాలను కూడా వ్రాశాడు. ఇతణ్ణి ఒరవడిగా పెట్టుకొని ఫ్రెడరిక్ రీనోల్డ్ క్రూజ్‌వాల్డ్ (1803-82) అనే ప్రముఖ రచయిత కొన్ని ఖండకావ్యాలను వ్రాయడమే గాక, జానపద గేయాల్లో అప్రసిద్ధంగా ఉన్న ఎస్టోనియన్ జాతీయగాథ నొకదానిని ఉద్ధరించి *కలెవి పోగ్* (1857-61) అనే గొప్ప ఇతిహాసంగా రచించాడు. ఇది కొద్దికాలం తర్వాత వచ్చిన ఎస్టోనియన్ కాల్పనిక జాతీయ ఉద్యమాన్ని బాగా ప్రభావితం చేసింది. ఇలా సాహిత్య భాషగా రూపొందుతూన్న ఎస్టోనియన్‌కు సమగ్రతను చేకూర్చ డానికి యోహాన్ వాల్డ్ మర్‌జాక్‌సన్ (1819-90) *పేర్నో పోస్ట్‌మీస్* అనే తొలి ఎస్టోనియన్ పత్రికను ఆరంభించాడు. ఈ సంపాదకుని కొమార్తె లిడియో కోయ్ దూలా (1843-86) మంచి గేయ రచయిత్రిగా ప్రసిద్ధి కెక్కింది. ఈమెతో పాటు అన్నా హావా కూడా ప్రజాదరణ పొందిన - దేశభక్తితో కూడిన - కాల్పనికోద్యమ రచనలను చేశాడు. ఈ భాషలోని తొలి నవలా కారుడు యూహాన్ సోమర్. ఈతడు వ్రాసిన *లూయిూ గీలాస్* 1843 లో వెలువడింది. ఎడ్వర్ట్ బోర్న్ హోహి వ్రాసిన *తసూజా* (1880) ఈ భాషలోని తొలి చరిత్రాత్మక నవల. యాకబ్ ఫార్న్ రచించిన *ఓమాటూబా, ఓమాలూబా* (సొంతఇల్లు, సొంత యజమాని) వాస్తవికతా శైలికి సన్నిహితంగా ఉంది. ఈ వాస్తవికత అటు తర్వాత యూహాన్ లీవ్ రచనల్లో మరింత అభివృద్ధి నొందింది.

లీవ్ రచనల్లో వ్యక్తమైన వాస్తవిత 1890 నుండి 1906 వరకూ ఎస్టోనియన్ సాహిత్యాన్ని ప్రభావితం చేసింది. తర్వాత గుస్తావ్ సూట్స్ నాయకత్వాన యువ ఎస్టోనియా రచయితలు ప్రారంభించిన అభినవ కాల్పనికోద్యమం దానిమీద తిరుగుబాటుగా వచ్చింది. వాళ్లు "కావాలి మరింత యూరపియన్ సంస్కృతి! ఎస్టోనియన్‌లుగానే ఉందాం. అయినా మనం యూరపియన్లం" అనే నినాదాన్ని ఇచ్చారు. సూట్స్, అతని అనుచరులూ ఈ నినాదం ద్వారా 'ఆకృతి' కి ఎక్కువ ప్రాముఖ్యాన్నివ్వాలని కోరారు. భాషా, భావనా ఉదాత్తరీతిలో ఉండాలన్న వీరి పట్టుదల వల్ల సామాన్యప్రజల్లో వీరికి ఖ్యాతి రాలేదు. 1917 విప్లవం తర్వాత 'సియారు బృందం' (Siaru group) ప్రాముఖ్యంలోకి వచ్చింది ('సియారు'

ఫిన్నొ - యుగ్రియన్ పురాణగాథలలో ఒక పక్షి). వీరూ అభినవ కాల్పనిక వాదులే కాని, సూట్సు ఆకృతి కిచ్చిన ప్రాముఖ్యాన్ని వీరు అంగీకరించలేదు. వీరు భావోద్రేక తీవ్రతకు ఉదాహరణలుగా హెన్రిక్ విస్‌నపూ, మేరీ అండర్‌ల రచనలను పేర్కొన వచ్చును. వీరి రచన లలో ఎస్టోనియన్ గేయకవిత్వం మంచి శక్తిమంతంగా రూపొందింది. తిరిగి 1930 నాటికి వాస్తవికత పునరు ద్ధరింప బడింది. కవిత్వం జీవితానికి దగ్గరగా వచ్చింది. అయితే ఈ పునరుద్ధరణవల్ల ఆవిర్భవించిన మంచి కవిత్వ మంతా యూహాన్ షూట్జ్ వర్ణించిన నగర జీవితానికి సంబంధించింది మాత్రమే! తర్వాత వెలుగులోకి వచ్చిన 'అర్బుజాడ్' బృందం సాహిత్యంలోని మేధాశక్తికీ, సౌంద ర్యానికీ ప్రముఖ స్థానాన్నిచ్చింది. బెట్టీ అల్వర్, హెయిటీ తల్‌విక్, ఉకు మాసింగ్, బెర్నార్డ్ కాంగ్రొ ఈ బృందానికి చెందిన అగ్రశ్రేణి కవులు. బెట్టీ అల్వర్ ప్రతీకా రూపమైన చిత్రాలను ఎంతో గడుసుగా ఉపయోగించాడు. *కోహ్‌టు పావ్, (డూమ్స్‌డే* 1937) అనే రచనలో హెయిటీ తల్‌విక్ రాబోయే ప్రపంచ ప్రళయాన్ని గూర్చి జోస్యం చెప్పాడు. ఉకుమాసింగ్ మతసంబంధమైన మార్మిక కవి త్వాన్ని వ్రాశాడు. బెర్నార్డ్ కాంగ్రొ తర్వాతి కాలంలో ప్రవాసంలో ఉన్న ప్రముఖ గేయకవి.

ద్వితీయ ప్రపంచ యుద్ధం తర్వాత సగానికి పైగా ఎస్టోనియన్ రచయితలు దేశాన్ని విడిచి ప్రవాసంలోకి వెళ్లిపోయారు. వారి కవిత్వం కాంగ్రొ కవితలో లాగ నిస్పృహా, నిరాశల్నీ, విస్‌నపూ కవితలో లాగ స్వదేశానికి ఎప్పుడు వస్తామా అనే తహతహనూ ప్రతిబింబించింది. క్రమంగా వ్యంగ్యధోరణిలో కవిత్వం వ్రాసే క్రొత్తతరం వచ్చింది. వీరిలో కల్‌జా లెపిక్, అర్నోవిహలమ్, ఇవార్ గ్రన్‌థల్ పేర్కొన దగ్గవారు. స్టాలిన్ తాలూకు సామ్యవాద వాస్తవికత ప్రబలంగా ఉన్న రోజుల్లో కవిత్వం ఎక్కు వగా వెలువడ లేదు. కాని 1960 ప్రాంతాన పాశ్చాత్య రీతులను ఉపయోగించే యాన్‌క్రాస్, ఎలెన్‌నిట్, ఏన్‌కాలెప్, మాట్స్ ట్రాట్ వంటి క్రొత్త కవులు బయలుదేరారు.

ఎస్టోనియన్ వచన రచన కూడా యూరప్‌లోని ఉద్య మాల ప్రభావానికి లోనయింది. ఈ శతాబ్దం ఆరంభం లోని వాస్తవికతా దృక్పథం లీవ్ వ్రాసిన *పది కథలు* (1893) లోని సామాజిక స్థితిగతుల చిత్రణలో కనిపి స్తుంది. అలాగే ఎర్నెస్ట్ పీటర్‌సన్ *బోయిల్స్* (కురుపులు: 1899-1901) లో సామాజిక న్యాయం కొరవడడాన్ని విమర్శిస్తాడు. ఎడ్వర్డ్ వైల్డ్ తన రచనల్లో భూస్వామ్య విధానాన్ని నిరసించాడు. సూట్స్ నాయకత్వంలోని అభి నవ కాల్పనికోద్యమానికి చెందిన ఫ్రెడిబెర్ట్ టుగ్లస్ 'ఇంప్రెషనిజమ్' నూ, 'ప్రతీకవాదాన్నీ' ఎస్టోనియన్ సాహి త్యంలో ప్రవేశపెట్టాడు. 1917 విప్లవం తర్వాత 'సియారు' వర్గానికి చెందిన వారిలో ఆగస్ట్ గైలిట్ ప్రసిద్ధి కెక్కాడు. వాస్తవిక వాదులుగా మారిన అభినవ కాల్పనిక వాదులలో అన్‌టన్‌టయ్ *సౌరె* (సత్యము-హక్కు 1926-33) అనే నైతిక మనస్తత్త్వాత్మక చరిత్రను వ్రాయగా, ఆల్బర్ట్ కివికాస్ వ్రాసిన *నిమెడ్ మార్ట్రిరహావ్‌లీ* (నాపరాతి ఫలకంమీది పేర్లు) కి విమోచనోద్యమ సంగ్రామం ఇతివృత్త మైంది.

ప్రవాసాన్ని అనుభవించిన నవలా కారులకు వారి ప్రవాసమే రచనా ప్రేరణ కలిగించింది. వారికి యుద్ధ కాలం నాటి అనుభవాలు, క్రొత్త పరిసరాలకు అల వాటుపడడం అనేవి ముఖ్యమైన వస్తువులు అయాయి. రిస్తికివి, పెడ్రొ క్రుస్టెన్, కార్ల్ రూమర్ మొదలయినవారు ఇలా ప్రవాసంలో ఉండి రచనలు చేసిన రచయితలు. నూతన రచయితలలో విమర్శకుడు, వ్యాసకర్త, నాటక రచయిత, అర్వొమాగీ, నవలా రచయితలు ఇల్‌మార్‌తాల్వే, ఇల్‌మార్‌యాక్స్, హెల్గా నౌ, ఎలిన్‌టూనా (Elintoona) ముఖ్యులు. ఈ కడపటి ముగ్గురిలోనూ అంతర్జాతీయ దృక్పథం బాగా కనిపిస్తుంది. ద్వితీయ యుద్ధానంతర సాహిత్యంలో కవితలో లాగే నవలలో కూడా ప్రమా ణాలు పడి పోయినట్టు కనపడుతుంది. అయితే క్రమంగా యువ నవలాకారులు - అర్వొవాల్‌టన్, ఎన్‌విటిమా, మాతీఉన్ట్ వంటివారు సామ్యవాద సమస్యలను పరిశీలిస్తూ నూతనశైలిలో ప్రయోగాలు సాగించారు.

నాటక రచయితలు తక్కువే కాని వారిలో ఇద్దరు ప్రముఖంగా కనపడతారు. ఆగస్ట్ కిట్స్‌బర్గ్ సుఖాంత నాటకాలను, ఉదాత్తమైన నాటకాలను కూడా వ్రాశాడు. హ్యూ గొరాడ్సెప్ నాటకాలు వాస్తవికంగానూ, ప్రతీకా త్మకంగానూ ఉంటూ సామాజిక స్థితిగతుల్ని వ్యంగ్యంగా విమర్శిస్తాయి.

ది.వెం. (వ.మం.)

## ఐరిష్ భాష - సాహిత్యం

భాష : దీనినే 'గైలిక్' భాష అని కూడా అంటారు. ఇది ఐర్లాండులో మాట్లాడుతున్న కెల్టిక్ భాషాకుటుంబానికి చెందిన ఒక భాష. లిఖిత రూపంలో ఈ భాష ఓఘమ్ శాసనాల్లో 5 వ శతాబ్దంలో కనపడుతుంది. తర్వాత కొద్ది కాలానికి లాటిన్ వర్ణమాలను వాడడం ప్రారంభ మయింది.

**సాహిత్యం :** ఐరిష్ సాహిత్యం రెండు విధాలుగా కనపడుతూంది. ఒకటి దేశీయ భాష అయిన ఐరిష్ లేక గైలిక్ భాషలోది; రెండోది పాలకులైన ఆంగ్లేయుల భాషలోని సాహిత్యం. ఈ రెండో దానిని ఆంగ్లో-ఐరిష్ సాహిత్యం అని తరచుగా వ్యవహరిస్తూంటారు.




ఐర్లండ్

లిఖితమైన ఐరిష్ లేక గైలిక్ సాహిత్యం క్రీ.శ. 6 వ శతాబ్దం నుంచీ కనిపిస్తూంది. ప్రాచీన సాహిత్యం స్తుతి, అధిక్షేపరూపాల్లో ఉంది. ఇందులో డల్లాన్‌ఫర్ గెయిల్ రచించాడని చెప్పబడుతున్న *యూలజీ ఆఫ్ సెంట్ కొలంబా* (597) మిక్కిలి ప్రసిద్ధమైంది. 8 వ శతాబ్దినుంచీ ఉత్తమ శ్రేణికి చెందిన ప్రకృతికవిత్వం రచింపబడింది. అయితే ఈ కావ్యాలను వ్రాసిన కవులు అజ్ఞాతంగానే ఉండిపోయారు. తర్వాత వచనంలో వీర గాథలు కూడా వచ్చాయి. 'చు-చూలైన్' లేక 'అల్స్టర్ చక్రం', 'ఫిన్' లేక 'ఫినియన్ చక్రం', 'పౌరాణిక చారిత్రక చక్రం' అని మూడు చక్రాలుగా వీటిని విభజించవచ్చు. వీటిలో రూప సౌందర్యం కనపడదు. కాని భావనా పటిమ, ఆశయ వైవిధ్యం గోచరిస్తాయి. ప్రేమా, సాహస వీర కృత్యాలూ ఇందులోని ప్రధాన వస్తువులు. యూయిస్లు, కుమారుల ప్రవాసం, బ్రిక్రూయ్, విందు, చూచూ లెయిన్, రోగశయ్య, బ్రాన్, సాహసం మొదలైనవి ఇందులో ముఖ్యమైనవి. *ది వోయేజ్ ఆఫ్ మాయెల్‌డూయిన్* (11 వ శతాబ్దం), *ది విజన్ ఆఫ్ యాడమ్నన్* అనేవి మధ్య యుగం సాహిత్యాన్ని బాగా ప్రభావితం చేశాయి. 950 నుంచి 1250 వరకు నడచిన మధ్య ఐరిష్ యుగంలో చరిత్ర, వంశ వృక్షాలు వంటివి కూడా పద్య రూపంలో వ్రాయ బడ్డాయి. నార్మన్ సంస్కృతి వ్యాపించి నప్పటి నుంచీ ఐర్లాండ్ సాహిత్యంలో శృంగారం కూడా చోటు చేసుకుంది.

13 వ శతాబ్దం నుంచీ 'ఫినియన్ చక్రం' ప్రాముఖ్యంలోకి వచ్చింది. మొదట *కొలొక్వీ ఆఫ్ ఏన్షెంట్స్* ఆధారంగా కొన్ని గ్రంథాలు బయలుదేరాయి. తర్వాత పదరూపంలో వీర కావ్యాలు వచ్చాయి. ఈ కాలానికి చెందిన 30 వేల పంక్తుల పదకవిత్వం నేటికీ నిల్చి ఉంది. తర్వాత పరిస్థితులు మారగా 'క్రొత్త కావ్య వైఖరులు' (Schools of Bardic Poetry) బయలుదేరి అభివృద్ధి చెందాయి.

17 వ శతాబ్దంలో జెఫ్రీ కీటింగ్, మైఖేల్ ఓక్లెరీ అనే చరిత్ర రచయితల రచనలు ప్రసిద్ధం అయాయి. ఈ కాలంలో ఆధ్యాత్మిక వస్తువుతో అనేక గ్రంథాలు రచింపబడ్డాయి. వాటిని వెయిన్, పారిస్ నగరాలలో ప్రచురించారు. ఈ కాలంలోనే కవిత్వం పద్యరూపం నుంచి గేయరూపం లోకి మార్పుచెందింది. 17 వ, 18 వ శతాబ్దాలలోని కవులలో ఓడగన్ రైథిల్లి, యోఘన్ రౌథ్ ఓసుయెల్లభమ్ అనే వారిని ముఖ్యంగా పేర్కొనాలి. రాఫ్టరీతో (1835) ఐరిష్ సాహిత్యంలో క్షీణదశ ఆరంభమయింది. 19 వ శతాబ్దంలో ఈ భాష క్రమక్రమంగా సన్నగిల్లింది.

కాని 19 వ శతాబ్దం చివరా, 20 వ శతాబ్దం ప్రారంభంలోనూ మళ్లీ ఐరిష్ సాహిత్యం వికాసాన్ని పొందింది. ఆ నాటి రాజకీయ జాతీయోద్యమం (political nationalism), దేశీయమైన గైలిక్ సాహిత్యం వారసత్వం పట్ల మొలకెత్తిన అభిమానం ఈ సాహిత్య వికాసానికి తోడ్పడ్డాయి. 1880 లో స్టాండిష్ ఓగ్రాడీ *ఐర్లాండ్ చరిత్రను*, 1889 తో డగ్లస్ హైడ్ *ఐర్లాండ్ సాహిత్య చరిత్రను* వ్రాశారు. ఐరిష్ భాషనూ, సంస్కృతినీ పునరుద్ధరించడానికి 1893 లో 'గైలిక్ లీగ్' స్థాపించబడింది. ఇవన్నీ ఐర్లాండ్ సాహిత్యంలో పునరుజ్జీవనానికి ప్రేరణ నిచ్చాయి. ఐర్లాండ్ సాంస్కృతిక వారసత్వాన్నీ, ఐర్లాండ్ జాతీయ సంగీతాన్నీ, గైలిక్ కవిత్వం లోని మార్మికత్వాన్నీ (mysticism) జ్ఞప్తికి తెస్తూ తొలి రోజులలోని రచయితలు సుసంపన్నమైన, ఉద్రేక పూరితమైన పద్యరచనలు చేశారు.

ఈ పునరుజ్జీవనం వల్ల గైలిక్‌లో కొంత ఆధునిక సాహిత్యం వచ్చింది. కానన్ పీటర్ ఓలియర్ బాల్యం నుంచీ ఐరిష్ మాట్లాడేవాడు. ఎన్నో అనుసరణల్నీ, అనువాదాల్నీ వ్రాశాడు. అందుచేత ఇతని రచనలలో ఉపజ్ఞ

అంతగా గోచరించకపోయినా, జాతీయపద ప్రయోగమూ, పరిణతమైన శైలీ కనపడతాయి. ఈ రచనలలో జానపద కథను ఆధారంగా చేసికొని రచించిన *సిడ్నా* (1904), *మైత్రిస్ ఆర్ క్రియోష్ట్* (1914) అనే అనువాదమూ, *మోన్లీల్ ఫీన్* (1915) అనే స్వీయ చరిత్రా ప్రత్యేకంగా పేర్కొనదగ్గవి. ఇతడు కొన్ని మంచి కథానికలూ, నాటకాలూ కూడా వ్రాశాడు. పాడ్రెయిక్ ఓ కొన్నైర్, పాడ్రెయిక్ ఓ సియోక్ ఫ్రడా, సీమన్ ఓ గ్రియన్నా అనే వారు ఈ కాలంలో పేర్కొనదగ్గ ఇతర రచయితలు. థామస్ ఓ క్రియోమ్ హతెయిన్ వ్రాసిన *య్యాన్డొయి లీనొక్* (1929) అనే గ్రంథం బాగా ప్రసిద్ధి కెక్కింది. అది రైతూ, జాలరీ అయిన ఒక వ్యక్తి స్వీయచరిత్ర. దీనినే రాబిన్ ఫ్లవర్ 1934 లో ఇంగ్లీష్‌లోకి అనువదించాడు. *ఫిషేల్బియైన్ అగ్‌ఫాస్* (1933) అనేది మరో స్వీయచరిత్ర. దీనిని యూయిరిస్ ఓసు యెల్లీబైన్ వ్రాశాడు. ఇది కూడా ఇంగ్లీష్‌లోకి అనువదింపబడి, జనాదరణ పొందింది.

1935 లో జానపద సాహిత్యాన్ని సంరక్షించడానికి ఒక ప్రత్యేక సంఘం నియమింపబడింది. ఈ సంఘంవారు అనేక జానపద రచనలను సేకరించారు. వాటి కోసమే ప్రత్యేకంగా ఒక పత్రిక కూడా ఏర్పాటైంది.

ఆంగ్లో-ఐరిష్ సాహిత్యం కూడా ఒక విధంగా ఐరిష్ సాహిత్యమే! ఈ సాహిత్య పునరుజ్జీవనానికి విలియం బట్లర్ యీట్స్ మూలపురుషుడు. మొట్ట మొదటి ఐరిష్ జాతీయ నాటకరంగస్థలం 'అబీ థియేటర్' స్థాపించడానికి అతడు చేయూత ఇచ్చినా, దానికోసం అతడు వ్రాసిన నాటకాలు పరిమితంగానే ఉన్నాయి. అవి కూడా చదువుకొని ఆనందించ దగినవే కాని, ప్రదర్శనకు అంత అనుకూలంగా లేవు. 'అబీ థియేటర్' కార్యకలాపాలలో అతనికి ఎక్కువగా తోడ్పడింది లేడీ గ్రిగరీ. దీని నిర్వహణలో ఆమె ఎంతో శ్రద్ధ తీసుకుంది. ప్రత్యేకంగా ఈ రంగస్థలంకోసం రైతు జీవితాలకు సంబంధించిన కొన్ని నాటకాలు కూడా వ్రాసింది. 1898 లో స్థాపించ బడిన ఐరిష్ సాహిత్యక రంగస్థలం (Irish Literary Theatre) కూడా రైతుల జీవితాన్ని చిత్రించే నాటకాలనే ప్రదర్శించేది. ఈ ఉద్యమానికి చెందిన రూపక రచయితలలో జాన్ మిల్లింగ్‌టన్ సింజ్ అద్వితీయుడు. అతడు రైతుల వ్యవహారభాషలో ఎంతో శక్తిమంతమైన శైలిని సాధించి, రమణీయమైన నాటకాలు వ్రాశాడు. తర్వాత ఈ రంగస్థలం వాస్తవికతవైపు - జానపదుల వాస్తవికతవైపు - మొగ్గింది. *ది లాస్ట్ లీడర్* (1918) అనే రాజకీయ నాటకాన్నీ, *ది వైట్ హెడెడ్ బోయ్* (1916) అనే ప్రహసనాన్నీ రచించిన లెనాక్స్ రాబిన్సన్; *ది బ్రయరీ గాప్* (1917) ను రచించిన టి.సి.ముర్రే ఆ తొలికాలంలోని వాస్తవికతా వాదుల వర్గంవారే! ఈ రైతు జీవితపు వాస్తవికతకు విరుద్ధంగా డబ్లిన్ (Dublin)లోని మురికివాడల్ని గురించి సీన్ఓకాసీ *దిషాడో ఆఫ్ ఎ గన్ మన్* (1923), *జూనో అండ్ ది పీకాక్* (1924), *ది ప్లౌ అండ్ ది స్టార్స్* (1926) అనే మూడు గొప్ప నాటకాలు వ్రాశాడు.

కవిత్వంలో యీట్స్‌తో పాటు జార్జ్ రస్సెల్‌ను కూడా పేర్కొనాలి. ఇతడు ఆధ్యాత్మికవాది (mystic), దేశభక్తుడు, వ్యావసాయిక సంస్కర్త. ఇతని రచనలన్నీ ఎంతో లోతైనవి; విలువైనవి. ఫాడ్రాయిక్ కొలం, ఆస్టిన్ క్లార్క్, జె.ఆర్.హిగ్గిన్స్ మొదలైనవారు యీట్స్ ప్రభృతులకు యువక సమకాలికులు. పాట్రిక్ హెన్రీ పియర్స్, టొమస్ మాక్‌డనాఫ్ జోసెఫ్ ప్లంకెట్ అనే వారు ఐరిష్ ప్రజాస్వామిక ఉద్యమానికి సంబంధించిన కవులు. ఈస్టర్ తిరుగుబాటుతో సంబంధ ముందని 1916 లో వీరు ఉరితీయబడ్డారు.

ఈ పునరుజ్జీవన కాలంలో కథాసాహిత్యం కూడా వచ్చింది. ఎమిలీ లాలెస్, స్టాండిష్ జేమ్ ఓ గ్రేడీ చారిత్రక కథలు వ్రాశారు. జేమ్స్ స్టీఫెన్సు కూడా కథలూ, కవితలూ వ్రాశాడు.

ది.వెం. (వ.పం.)

## ఐస్‌లాండిక్ భాష - సాహిత్యం

భాష : ఐస్‌లాండిక్ భాష 'ఇన్‌స్లెన్‌స్క్' పశ్చిమ స్కాండినేవియన్ భాషా వర్గానికి చెందింది. క్రీ.శ. 9 వ శతాబ్దంలో ఐస్‌లాండ్ నార్వీజియన్‌లచేత ఆక్రమించ బడింది. అప్పటికి స్కాండినేవియా, ఉత్తర జర్మనీ, ఇంగ్లండు తూర్పుభాగం మొదలైన చోట్ల ఒకే భాష మాట్లాడుతూ ఉండేవారు. అయితే 11 వ శతాబ్దం మధ్యకాలానికి స్కాండినేవియా స్వతంత్రంగా పరిణామం చెందటం ప్రారంభించింది. ఆ తరువాత ఐస్‌లాండిక్, డేనిష్, నార్వీజియన్ అనే మూడు ప్రత్యేక భాషలు ఏర్పడ్డాయి. రూనిక్ శాసనాలలోను, ప్రాత ఎడ్డాలోను, ప్రాత స్కాల్డిక్ కావ్యాలలోను మూల స్కాండినేవియన్ భాషే కనిపిస్తూంది. స్కాండినేవియన్‌భాష ఆంగ్లభాషతో సన్నిహిత సంబంధం కలిగి ఉండడమే కాక, దానిమీద అపారమైన ప్రభావాన్ని కూడా చూపించింది. నిత్యోపయోగంలో ఉండే అనేక ముఖ్య పదాలు ఇంగ్లీష్, ఐస్‌లాండిక్ భాషల్లో సమానంగా ఉన్నాయి. 12 వ శతాబ్దానికి

ఐస్‌లాండులో లేఖనం సర్వసాధారణమై పోయింది. ఆ నాటికి యూరపు ఖండంలోని ఇతర దేశా లన్నీ అన్ని విధాలైన రచనలకూ లాటిన్ భాషనే వాడుతూంటే ఐస్ లాండు వాసులు మాత్రం తమ దేశభాషనే వాడేవారు.




ఐస్‌లాండ్

రూనిక్ వర్ణ సమామ్నాయంలో 16 అక్షరాలు మాత్రమే ఉండడం వల్ల వాళ్లు క్రమేణ లాటిన్ వర్ణాలను ఎరువు తెచ్చుకున్నారు. ఐస్‌లాండిక్ పదా లన్నింట్లోనూ ఊనిక మొదటి అక్షరం మీదనే ఉంటుంది. ఐస్‌లాండిక్‌భాషలో పరభాషా పదాలు చాలా తక్కువ. పర భాషా సంపర్కం తక్కువ కావడం వల్ల యూరపియన్ భాషల్లో మిక్కిలి స్వచ్ఛమైన భాషగా దానిని పరిగణిస్తున్నారు. ఈ భాషలో పారిభాషిక పదాలూ, భావార్థక పదాలూ ఐస్‌లాండిక్ ధాతురూపాల నుంచే నిర్మించారు.

**సాహిత్యం :** నార్వేలో ఏర్పడ్డ అంతఃకలహాల మూలాన 11 వ శతాబ్దంలో అక్కడి విద్వాంసులూ, కవులూ అనే కమంది ఐస్‌లాండ్‌కు వలసవెళ్లారు. అందువల్ల ప్రాచీన నార్సు వాఙ్మయ మంతా అక్కడనే వ్రాశారు. ఈ సాహిత్యాన్ని ఎడ్డాస్, స్కాల్డిక్ కవిత, శాగాస్ అని మూడు ప్రధాన భాగాలుగా విభజించవచ్చు. 'ఎడ్డాస్' అనేవి పద్య గద్యాత్మకాలైన సంకలనాలు. అవి ప్రాచీన ట్యూటానిక్ మతానికి సంబంధించిన దేవతలను గూర్చి, వీరులను గూర్చి వివరిస్తాయి. 'శాగా' లనేవి ప్రాచీన స్కాండినేవియా, ఐస్‌లాండ్ వీరుల యొక్క చరిత్రలు. చరిత్ర రచనలో కూడా ఐస్‌లాండ్ వాసులు అపారమైన కృషి చేశారు. అరిపోర్గిల్‌సన్ 1120 వ సంవత్సరం వరకూ సాగిన ఐస్ లాండ్ చరిత్ర (*ఐస్‌లాండిన్గాబుక్*)ను సంగ్రహంగా వ్రాశాడు, *లాండ్‌నామ బుక్‌*లో ఐస్‌లాండ్ ద్వీపంలో తొలుత స్థిరపడిన వాళ్ల చరిత్ర ఉంది. కార్ల్ జాన్సన్ 'స్వెరి రాజు' పరిపాలన కాలపు చరిత్రను వ్రాశాడు. ఐస్‌లాండ్ చారిత్రకు లందరిలో స్నోరిస్టర్లూసన్ ముఖ్యుడు. అతని *హైమ్స్‌క్రింగ్లా* సుప్రసిద్ధమైంది. స్నోరికి సన్నిహిత బంధువు స్టర్లా థోరోర్సన్ అతని తరువాత చెప్పుకో దగ్గవాడు.

1260 వ సంవత్సర ప్రాంతంలో అజ్ఞాత నామధేయుడైన ఒక నార్వీజియన్ కవి వ్రాసిన *కోనన్‌స్ స్కగ్జా* అనే గ్రంథంలో తండ్రీ పుత్రుల సంవాద రూపంలో **అనేక** నీతి విషయాలు వివరించబడ్డాయి. 1030 ప్రాంతంలో ఒలావ్‌రాజు మరణించిన తరువాత మత ప్రాధాన్యం గల గ్రంథాలు వచ్చాయి. ఐనారీ స్కూలాసన్ వ్రాసిన *జైసీ* (సూర్యకిరణం) అనే గ్రంథం, *సోలార్‌ల్జో, డ్రామ్‌క్వోడీ* అనే గ్రంథాలూ, ఐస్టీన్ అస్‌గ్రిమ్‌సన్ వ్రాసిన *లీల్జా* అనే గ్రంథమూ వీటిలో ముఖ్యమైనవి.

14 వ, 15 వ శతాబ్దాలలో ఐస్‌లాండ్‌లో స్వతంత్ర కావ్యా లేవీ పుట్టలేదు. ఆ కాలంలో విద్వాంసులు చాలా మంది ప్రధానంగా పూర్వకవుల గ్రంథాలను చూచి వ్రాయటంలోను, అనువాద రచనలు చేయడంలోనూ నిమగ్నులయారు. వీరుల సాహస కథలు, పౌరాణిక వీరగాథలు ప్రజాదరణ పొందాయి. ఇదే కాలంలో 'రీమర్' అనే దీర్ఘ కథా కావ్యాలు వ్రాయడం ఆరంభమైంది. 1350 నుండి 1600 దాకా వ్రాసిన సుమారు 80 రీమర్ కావ్యాలు ఇప్పుడు లభిస్తున్నాయి. ఈ రచనా ప్రక్రియ 19 వ శతాబ్దం చివరి వరకూ ప్రజాదరాన్ని పొందుతూనే వచ్చింది. ప్రాచీన రాజాస్థాన కవిత్వం పట్ల ఇంకా ప్రజలకు ఆదరణ ఉన్న దనడానికి లోప్తరు గుట్టారమ్‌సన్ వ్రాసిన *హిట్టలీకిల్* అనే గ్రంథం నిదర్శనం (1432). 15 వ శతాబంలో స్కల్డుస్విన్ వ్రాసిన *హీమ్‌సాసోమి* అనే సాంఘిక హేళన కావ్యం కూడా పేర్కొనదగింది.

16 వ శతాబ్దంలో జరిగిన సంస్కరణోద్యమం వల్ల ఐస్‌లాండ్ సాహిత్యానికి కొంత ప్రోత్సాహం లభించింది. మఠాలయాలు ప్రధానంగా భక్తిమత ప్రధానాలైన గ్రంథాలను ముద్రించడం ప్రారంభించాయి. ఓడ్డర్‌గాట్ స్కాల్కస్సన్ 1540 లో *న్యూ టెస్టమెంట్*ను ఐస్‌లాండిక్ భాషలోకి అనువదించాడు. ఆ భాషలో ముద్రింపబడ్డ మొదటి గ్రంథం ఇదే. గ్యోబ్రాండర్ పొర్లాక్‌సన్ 1584 లో మొత్తం *బైబిల్*ను అనువదించడమే కాక 1612 లో *విస్నబుక్* అనే మతవస్తువుతో కూడిన కావ్యాల సంపుటిని కూడా ప్రచురించాడు.

17 వ శతాబ్దం మతాభినివేశానికీ, విద్వత్తుకూ ప్రసిద్ధి చెందింది. ఈ కాలంలో ఆర్నిమాగ్నూస్సన్ సేకరించిన నార్స్‌భాషా లిఖిత గ్రంథాలూ, హాల్‌గ్రిమత్ పీటర్‌సన్ వ్రాసిన గేయాలూ మిక్కిలి ప్రసిద్ధి పొందాయి. తరువాత చెప్పుకోతగినవాడు స్టీఫెన్ ఓలాఫ్సన్. జాన్‌మాగ్నూసన్ వ్రాసిన *పిస్లార్‌శాగా,* జాన్‌ఒలాస్సన్ (1593-1679) వ్రాసిన *ఐఫ్ శాగా* ఈ కాలంలో వెలసిన చెప్పుకోతగ్గ ప్రముఖ గ్రంథాలు.

18 వ శతాబ్దంలోని రచయితలలో ఎగర్ట్ ఓలాఫ్ సన్ మగ్నుస్, స్టీఫన్‌సన్ అనే వారు ప్రముఖులు. ఈ శతాబ్దంలోనే యూరప్ ఖండంలోని అనేక ఉదాత్త గ్రంథాలు ఐస్‌లాండ్ భాషలోకి అనువదించబడ్డాయి. జాన్ పొర్లాక్‌సన్, బెనెడిక్ట్ గ్రోండల్, స్విన్‌బ్జోరన్ ఎగిల్సన్ అనేవారు సుప్రసిద్ధ అనువాదకులు. జాన్ ఎస్పోలిన్ వ్రాసిన *ఐస్‌లాండ్స్ ఆర్బోయెకూర్* ఆ దేశపు ఉత్తమ చరిత్ర గ్రంథాలలో చివరిది.

19 వ శతాబ్దం ప్రారంభంలో 18 వ శతాబ్దంలోని భావాల మీద తిరుగుబాటు గోచరించింది. గేయ కవిత, ప్రకృతి కవిత ఆవిర్భవించాయి. ఈ నూతనోద్యమానికి *ఫ్జోల్నిర్* (1835) అనే పత్రిక ప్రోత్సాహ మిచ్చింది. దీనికి వెన్నెముకగా బిజార్ని, థోరారెన్సెస్, జానాస్ హాల్ గ్రిమ్‌స్సన్ అనే భావకవులు ప్రముఖంగా కృషిచేశారు. ప్రముఖులైన ఇతర కవులలో గ్రిమర్‌థార్, స్టైయిన్‌సన్, మాథియాస్ బ్రాఖుమ్సన్ అనే రచయితలు సుప్రసిద్ధు లయారు. సిగెరోబైయో ప్జోరో, హజాల్మర్ జాన్సన్ అనే వేరొక వర్గానికి చెందిన కవులు కర్షక కవులుగా ప్రసిద్ధు లయారు. వారు రైమర్ కావ్యరచనలో నేర్పు ప్రదర్శించారు. 1880 తరువాత సాహిత్యంలో కాల్పనికతను త్రోసిరాజని వాస్తవికత చోటు చేసుకుంది. ఈ విధానాన్ని పాటించి పేరు గడించినవాడు హన్నిస్ హాఫ్‌స్టేయిన్. *వెర్డోన్డి, హెయిమ్ డాలర్* అనే పత్రికలు ఈ నూతన సిద్ధాంతాన్ని ప్రచారం చేశాయి. కాని దీనిని అనేకమంది సరిగా అర్థం చేసుకోలేకపోయారు. తత్‌ఫలితంగా నూతన కాల్పనికోద్యమం బయలుదేరింది. యైనార్‌బెనెడి డిక్ట్సన్ దీనికి నాయకుడు. బెనెడిక్ట్ జాన్సన్ ఆధ్వర్యవంలో సాగిన ఫిన్గేజార్సీస్లా ఉద్యమం (1846-1939) యువ రచయిత లకు మంచి శిక్షణనూ, అనుభవాన్నీ అందజేసింది. ఈ కాలపు కవులలోని ఆత్మాశ్రయ కవితా విజృంభణానికి స్టీఫెన్ సిగురోస్సన్, డీలియో స్టీఫెన్‌సన్‌లు ప్రతినిధులు. స్టీఫెన్ స్టీఫెన్సన్ అనే ఐస్‌లాండిక్ కెనడియన్ కవిని కూడా ఇక్కడ ప్రముఖంగా పేర్కొనాలి.

1800 నుంచి ఐస్‌లాండిక్ భాషలో గద్యం కూడా పద్యం అడుగుజాడల్లో నడిచింది. కాల్పనిక వాదుల్లో జాన్‌థోరోడ్‌సన్, వాస్తవిక వాదుల్లో జెస్టర్ పాల్సన్, పొర్జిల్స్ గ్జల్లాండి అనే వారూ, యైనార్ క్వారన్, గ్యోముం దర్ ఫ్రియోజాన్సన్, జాన్‌ట్రాస్టి, గ్యోముందుర్ హంబన్, గున్నార్ గున్నార్సన్, క్రిష్టమన్ గ్యోముండ్సన్ అనేవారూ ఆదర్శ జాతీయవాదులుగా పేరెన్నిక గన్నారు. హాల్‌డోర్ లాక్స్‌నెస్ గొప్ప ప్రతిభావంతుడు. ఆయన అనేక నవ లలు, నాటకాలు వ్రాశాడు. 1955 లో ఆయన నోబెల్ బహుమానాన్ని అందుకున్నాడు. అథియాస్ జోఖుమ్‌సన్, ఇన్‌డ్రియోయ్ యైనార్సన్, జోహన్ సిగుర్ జాన్సన్, గ్యోముందుర్ కంబన్ అనేవారు నాటక కర్తలలో ప్రముఖులు.

ది.వెం.(చిం.వెం.)

## కామన్‌వెల్త్ సాహిత్యం

బ్రిటిష్ సామ్రాజ్య విస్తరణ ఫలితంగా ఇంగ్లీష్ భాష ప్రపంచ వ్యాప్తంగా అధికార భాషగా, వ్యావ హారిక భాషగా, అనుసంధాన భాషగా అనేక దేశాలలో వ్యవహ రింపబడ సాగింది. తత్ఫలితంగా విభిన్న సంస్కృతులు గల అమెరికా, ఆఫ్రికా, ఆసియా ఖండాలలో ఇంగ్లీష్‌లో సాహిత్య సృష్టి జరిగింది. ఈ వివిధ జాతీయ సాహిత్యాల ప్రాంతీయత, భావుకత, శిల్ప వైఖరి వేరైనప్పటికీ ఈ సాహిత్యాలన్నీ ఇంగ్లీష్‌భాషలోనే వ్రాయబడడంవల్ల వాటిని ఏకసూత్రంలో అన్వయించి తులనాత్మక దృష్టితో 'కామన్ వెల్త్ సాహిత్యం' అనే పేర పరిశీలించడం జరుగుతూంది.

కామన్‌వెల్త్ సాహిత్యాన్ని నాలుగు శాఖలుగా విభ జింపవచ్చును. బ్రిటిష్ ప్రజల సంతతితో కూడిన ఆస్ట్రేలియా, కెనడా, న్యూజిలాండ్, దక్షిణాఫ్రికాలలో జరిగిన రచనా వ్యాసంగం ఒకటి. రెండోది ఇండియా, పాకిస్తాన్, బంగ్లాదేశ్, శ్రీలంక, మలేషియా, సింగపూర్ దేశాలలో బ్రిటిష్ సామ్రాజ్యం నెలకొన్న కారణంగా ఉత్ప న్నమై వికాసం పొందిన సాహిత్యం. మూడోది ఇంగ్లీష్ భాష మాతృభాషగా వాడబడుతున్న వెస్టిండీస్-కరిబియన్ ద్వీప సముదాయాలలో కొనసాగిన వాఙ్మయం. నాలుగోది ఆఫ్రికా దేశాలలో రెండవ భాషగా, అనుసంధాన భాషగా, అధికార భాషగా ప్రచారం పొందిన ఇంగ్లీష్‌లో వెలువడిన సాహిత్యం.

మరొక విధంగా వర్గీకరిస్తే కామన్‌వెల్త్ సాహిత్యంలో రెండే శాఖలు. ఒకటి: ఇంగ్లీష్ మాతృభాషగా సంక్రమించిన తెల్లజాతి ప్రజల అధినివేశాలైన కెనడా, న్యూజిలాండ్, ఆస్ట్రే లియాదేశాలలో ఉద్భవించిన సాహిత్య సముదాయం. రెండు: వెనుక ఇంగ్లీష్ వారి పాలనలో ఉన్న అశ్వేతజాతుల,

మిశ్రమజాతుల దేశాలైన ఆఫ్రికా, ఆసియా, కరిబియన్ ప్రాంతాలలో వారు క్రొత్తగా నేర్చుకొన్న ఇంగ్లీష్‌భాషలో అభివ్యక్తి పొందిన సాహిత్య సంచయం.

మొత్తం మీద ఈ ప్రపంచ ఇంగ్లీష్ సాహిత్యం భావుకతలోను, వ్యుత్పన్నతలోను, జీవన చిత్రణలోను వైవిధ్యమూ, వ్యక్తిత్వమూ పుంజుకొని భాషాపరంగానూ, సాహిత్య పరిణామ ప్రక్రియ లోను భిన్నత్వంలో ఏకత్వాన్ని ప్రకటిస్తూంది. తులనాత్మక అధ్యయనానికి చక్కని రంగం కామన్‌వెల్త్ సాహిత్యం. అంతేకాక ఈనాడు ఇంగ్లీష్ భాషలో వెలువడుతున్న రచనలలో మేలైనవి బ్రిటన్ నుంచి గాక ఇతర దేశాలనుంచే ఎక్కువగా వస్తున్నాయి. పాట్రిక్ వైట్, ఏ.డీ. హోప్, జూడిత్ రైట్ (ఆస్ట్రేలియా), కేత రిన్ మాన్స్‌ఫీల్డ్, ఆలన్ కర్నో (న్యూజిలాండ్), ఈ. జె. ప్రాట్, మార్లే కాల్లాఘన్, హ్యూమా క్లెనాన్ (కెనడా), జార్జ్ లామింగ్, ఎడ్వర్డ్ బ్రాత్‌వైట్, విల్సన్‌హారిస్, వి. ఎస్. నైపాల్ (కరిబియన్ దీవులు), ఓలె, సోయింకా, చినువా అచిబి, క్రిస్టఫర్ బకిగ్‌జో, ఎన్‌గుగీ (ఆఫ్రికా), ఆర్.కే. నారాయణ్, రాజారావు, ముల్క్‌రాజ్ ఆనంద్, శ్రీ అరబిందో, నిసీమ్ ఇజికియల్ (ఇండియా) మొదలై నవారు ఈ నాటి ఇంగ్లీష్ సాహిత్యంలో ప్రముఖస్థానం వహించి ఉన్నారు. కామన్‌వెల్త్ సాహిత్యంలో వేరు వేరు దేశాలలో వర్ధిల్లిన సాహిత్యాలను గురించి ఆయా దేశ సాహిత్యాలను గూర్చిన వ్యాసాలలో వివరించబడింది.

డి.వి. కె.రా.

## కెల్టిక్ భాషలు - సాహిత్యం

**భాషలు** : ఇండో-యూరపియన్ భాషా కుటుంబం లోని ఒక వర్గం కెల్టిక్‌భాషలు. భాషా తత్త్వవేత్తలు ఇవి ఇటాలిక్ వర్గానికి, ట్యుటానిక్ వర్గానికి మధ్యస్థ మైనవని అభిప్రాయ పడుతున్నారు. రోమన్‌ల నాటికీ, అంతకు పూర్వం ఈ భాషలు పశ్చిమ యూరప్‌లో ఎక్కువ ప్రాంతంలో ప్రచారంలో ఉండేవి. వీటిని ప్రస్తుతం బ్రిటిష్ దీవుల్లోనే ప్రధానంగా మాట్లాడుతున్నారు. కెల్టిక్ భాషలను భౌగోళికంగాను, కాలక్రమానుసారంగాను ప్రధాన భూభాగంలోని కెల్టిక్ భాషలు, పరిసరద్వీపాలలోని కెల్టిక్ భాషలు అని రెండు వర్గాలుగా విభజించవచ్చును. ప్రధాన భూభాగం లోని కెల్టిక్ భాషనే 'గ్యాలిష్' అంటారు. ఈ భాష శాసనాలను బట్టి, సంప్రదాయాలను బట్టి స్వల్పంగా మాత్రమే తెలియ వస్తూంది. ఇక పరిసర ద్వీపాలలోని కెల్టిక్‌భాష ఆధునిక కెల్టిక్ భాషలకు మూలభాష. దీని మాండలికాలు గొయిడెలిక్, బ్రెతోనిక్‌లు. గొయిడెలిక్‌లో అంతర్భాగాలు ఐరిష్, మాంక్స్, స్కాటిష్, గేలిష్ భాషలు. బ్రెతోనిక్ సముదాయంలో చేరినవి వెల్ష్, బ్రెటాన్, కోర్నిష్ భాషలు. వీటిలో బ్రెటాన్, ఐరిష్, వెల్ష్, స్కాటిష్ భాషలకు మాత్రమే సాహిత్యాలు ఉన్నాయి.

ప్రధాన భూభాగంలోని కెల్టిక్ భాషలు దక్షిణాన గాల్ నుండి ఐబీరియా వరకూ గల ప్రాంతాలలోనూ, తూర్పున గలేషియా లోనూ సుమారు క్రీ.పూ. 5 వ శతాబ్దం నుంచి 5 వ శతాబ్దం వరకూ వాడుకలో ఉండేవి. వీటికి సంబంధించిన భోగట్టా గ్రీక్, రోమన్ రచయితలు తమ రచనలలో పేర్కొన్న కొన్ని నామాలకే పరిమితం కావడంచేత, ఈభాషలలోని సాహిత్యాన్ని గూర్చి మనకు ఎక్కువగా తెలియదు. పరిసర ద్వీపాలలోని కెల్టిక్ భాషలు ఐరిష్, బ్రిటిష్ భాషావర్గాలు కాలక్రమేణ విడిపోయాయి. సుమారు 5 వ శతాబ్దం వరకూ ఐర్లండ్‌లో ఐరిష్ భాష వాడుకలో ఉండేది. స్కాటిష్, గేలిక్ మాంక్స్ భాషలు ఈ ఐరిష్ భాషావర్గానికి చెందినవే. ఐర్లండ్ దేశీయులు స్కాట్‌లాండు, మాన్‌దీవులలో వలసరాజ్యాలు స్థాపించ డంతో అక్కడ ఇవి వృద్ధిచెందాయి. గ్రేట్ బ్రిటన్, మాన్ దీవులకు చెందిన బ్రిటిష్ భాషలకు మాతృకలు కెల్టిక్ భాషలే! స్కాట్‌లాండ్, మాన్‌దీవులలోని బ్రిటిష్ మాండలికాల స్థానే ఐరిష్ భాష వాడుకలోకి వచ్చింది. అయితే దక్షిణాన మాత్రం ఇటీవలి వరకూ వెల్ష్, కోర్నిష్ భాషలు నిలచే ఉన్నాయి. 5 వ, 6 వ శతాబ్దాల నాటికి వలసరాజ్య స్థాపన కారణంగా బ్రిటిష్ భాషలలో ఒకటి అయిన బ్రెటాన్ భాష ఫ్రాన్స్‌లోని బ్రిటనీకి కొనిపోబడింది.

కెల్టిక్ భాషలను గూర్చి జరిగిన పరిశోధన వల్ల మూల కెల్టిక్ భాషే పరిసర ద్వీపాలలోని కెల్టిక్ భాషలకూ, యూరప్ ప్రధాన భూభాగంలోని కెల్టిక్ భాషలకూ మాతృ భాష అని నిరూపిత మైంది. ప్రాచీన ఐరిష్ భాష అతి ప్రాచీనమైన కెల్టిక్‌భాష. దీనిలో అతి ప్రాచీన రచనలు లభిస్తున్నాయి. భాషా నిర్మాణంలో ఆ భాష మూల కెల్టిక్ భాషకు మిక్కిలి చేరువగా ఉంది.

అచ్, హల్ వ్యవస్థలోనూ, విశేషణ, విశేష్య నిర్మాణం లోనూ మూల కెల్టిక్ భాష తన మాతృక అయిన ఇండో-యూరపియన్ భాషా లక్షణాలను నిలుపు కొన్నట్లు స్పష్టం అవుతూంది. పరిసర ద్వీపాలలోని కెల్టిక్ భాషలలో క్రియ ఇండో-యూరపియన్ భాషలలో ఉన్నట్టు వాక్యాంతంలో కాక ఆధునిక కెల్టిక్ మాండలి కాలలో ఉన్నట్టు వాక్యం ఆదిలోకి మారడం ప్రారంభం అయింది. మూల కెల్టిక్ భాష మాట్లాడే ప్రజలు బహుశః మధ్య యూరప్ సమీపంలో నివసిస్తూ ఉండి ఉండవచ్చు.

ఆధునిక కెల్టిక్ భాషలన్నీ పరిసర ద్వీపాలలోని కెల్టిక్ భాషనుంచే పరిణమించాయి. వాటిని గూర్చి మాత్రమే మనకు పూర్తిగా తెలియవస్తూంది. ఇతర ఇండో-యూరపియన్ భాషలలో అరుదుగా కనిపించే లక్షణా లెన్నో ఆధునిక కెల్టిక్ భాషలలో కనిపిస్తూ ఉండడానికి కారణం బహుశః సుమారు క్రీ.పూ 500 ప్రాంతంలో జరిగిన కెల్టిక్ ఆక్రమణ అనంతరం కూడా బ్రిటన్‌లో కెల్టిక్ కంటె భిన్నమైన మరొక భాష వాడుకలో ఉండడం కావచ్చును.

ఆధునిక ఐరిష్ భాషలైన ఐరిష్, స్కాటిష్, గేలిక్, మాంక్స్‌లలో ఐరిష్ భాషకే సుదీర్ఘ సాహిత్య చరిత్ర ఉంది. ఓఘమ్ శాసనాల (300-500) నాటి నుంచి లాటిన్ వర్ణమాల ఐర్లండ్‌లో ప్రవేశ పెట్టబడింది. వెను వెంటనే అంతవరకూ మౌఖికంగా వస్తున్న సాహిత్యాన్ని లిపి బద్ధం చేశారు. 6 వ శతాబ్దం నుంచి 9 శతాబ్దం దాకా సాగిన ఈ కాలం ప్రాచీన ఐరిష్ యుగం. మధ్య ఐరిష్ యుగ ప్రారంభంలో భాషలో స్వచ్ఛత నశించి జానపద ధోరణులు ఆరంభం అయాయి. కాని ఆంగ్లోనార్మన్‌ల దాడి బహుశః ఐరిష్ పండితులను తిరిగి వాళ్ల భాషను ప్రమాణీకరించుకోడానికి ప్రేరేపించి ఉండ వచ్చును. 12 వ శతాబ్దంలో జరిగిన పునః ప్రమాణీకరణే ఆధునిక ఐరిష్ యుగానికి నాంది పలికింది. 17 వ శతాబ్దంలో ఆంగ్లాధిపత్యం ఐర్లాండ్‌లో స్థిరపడడంతో, ఇంగ్లీష్ ప్రధానమైన వాడుక భాషగా మారింది. దానితో ఐరిష్ ప్రాబల్యం తొలగింది. నేడు ఐరిష్ భాషను మాతృభాషగా మాట్లాడేవారు 50,000 మంది కంటె ఎక్కువ లేరు. అయితే సుమారు 3 లక్షలమంది దాకా ఐరిష్ భాషను అర్థం చేసుకునే స్థితిలో ఉన్నారు.

17 వ శతాబ్దం వరకూ స్కాట్లాండ్‌లో కూడా ఆధునిక ఐరిష్ భాషే సాహిత్య భాషగా ఉండేది. ఆ తరువాతనే స్కాటిష్ కవులు తమ మాండలికాలలో వ్రాయడం మొదలు పెట్టారు. స్కాటిష్ గేలిక్ భాషకు, ఇంగ్లీష్ భాష తాకిడి తగిలింది. అయినా స్కాటిష్ గేలిక్ మాతృభాషగా మాట్లాడేవారు సుమారు 80,000 లకు పైగా ఉన్నారు.

మాంక్స్ భాష మాన్‌దీవిలో 1610 లో మొదటి సారి లిఖితరూపం పొందింది. 18 వ శతాబ్దం నాటికి ఆ ద్వీప వాసులు కూడా కొద్దిమంది ఇంగ్లీష్‌ను అర్థం చేసుకునే స్థాయికి వచ్చారు. 19 వ శతాబ్దానికి మాంక్స్‌ను మాట్లాడే వారి సంఖ్య గణనీయంగా పడిపోయింది. ఈ శతాబ్దంలోని తొలి దశాబ్దాల నాటికే ఈ భాష వాడుక పూర్తిగా అంతరించింది.

ఐరిష్ సన్యాసులు ఇంగ్లీషు వారికి మాండలికాలను లిపిబద్ధం చేయడం నేర్పే నాటికి బ్రిటిష్ మాండలికాలు ఒకదాని కొకటి సన్నిహితంగా ఉండేవి. కాని, ఆ తరువాత వాటి అంతరం పెరుగసాగింది. 8 వ శతాబ్దం నుంచి 12 వ శతాబ్దం దాకా వెల్ష్‌భాషలో లిఖిత రచనలు అతి స్వల్పంగా మాత్రమే లభిస్తున్నాయి. కాని 12 వ శతాబ్దం నుంచి కవితా రూపంలో వెల్ష్ గ్రంథస్థం అవుతూ వచ్చింది. ఆధునిక వెల్ష్‌భాష 1588 లో వెలువడిన వెల్ష్ *బైబిల్* ద్వారా ప్రమాణీకరించబడింది. వేల్స్‌లో క్రమంగా ఇంగ్లీష్ వ్యాప్తి చెంద సాగింది. అయినప్పటికీ 18 వ శతాబ్దంలో సాగిన అల్ప సంఖ్యాకుల భాషల పరిరక్షణోద్యమ ఫలితంగా ప్రతి ఇంటా వెల్ష్ *బైబిల్*, ఇతర వెల్ష్ మతగ్రంథాలూ ఉండేట్టు చూసి వెల్ష్‌భాష క్షీణించకుండా అరికట్ట గలిగారు. పారిశ్రామిక విప్లవంతో వేల్స్ గనులలోను, పరిశ్రమలలోను ఇంగ్లీష్ భాష మాట్లాడే శ్రామికులు రావడంతో వెల్ష్‌భాష తిరిగి దెబ్బతింది. 1901 లో సగం మంది వెల్ష్‌భాష మాట్లాడే వారుండగా, 1961 నాటికి ఆ సంఖ్య నాలుగో వంతుకు పడిపోయింది. ఇటీవలి ప్రయత్నాల వల్ల పాఠశాలలలో దీని వాడుక ఎక్కువ అయింది.

బ్రెటాన్ భాషలో 15 వ శతాబ్దం దాకా ఎలాంటి సాహిత్య గ్రంథాలూ లభించడం లేదు. నాటినుంచి ఈ భాషా మాండలికాలు పరస్పరం దురవగాహం కాసాగాయి. 15 వ శతాబ్దంలోని తొలి దశాబ్దులలో బ్రెటాన్‌భాషలోని నాలుగు మాండలికాలను ప్రమాణీ కరించే ప్రయత్నం జరిగింది. అయితే ఫ్రెంచ్ ప్రభుత్వ విధానాల వలన బ్రెటాన్ భాషల బోధనను పాఠశాలల నుంచి తొలగించారు. అయినా ఇంకా కొద్దిమంది విద్యార్థులు మాత్రం బ్రెటాన్ భాషను నేర్చుకుంటున్నారు.

బ్రెటాన్ భాషలో లాగానే కోర్నిష్ సాహిత్య గ్రంథాలు కూడా 15 వ శతాబ్దం నుంచే కనిపిస్తున్నాయి. 18 వ శతాబ్దం ప్రారంభానికి కోర్నిష్ అక్కడక్కడ చెల్లాచెదురుగా మాట్లాడబడుతున్నప్పటికీ, ఆ శతాబ్దం అంతం నాటికి ఆ మాత్రం కూడా లేకుండా ఆ భాష పూర్తిగా అంతరించి పోయింది.

**సాహిత్యం :** గేలిక్ భాషలోనూ, దానినుంచి ఉత్పన్నాలైన స్కాటిష్ గేలిక్, మాంక్స్, వెల్ష్, బ్రెటాన్, కార్నిష్ భాషలలోనూ వెలువడిన సాహిత్యాన్ని కెల్టిక్ సాహిత్యం అంటారు. ఈ అన్ని సాహిత్యాలకూ కెల్ట్‌ల సాహిత్యమే మూలాధారం. క్రీస్తుకు ముందు కాలంలో

ఈ కెల్ట్‌లలో 'డ్రూయిడ్'లు అనే విద్వత్ పురోహిత వర్గం ఒకటి ఉండేది. ఆ డ్రూయిడ్‌లలో 'ద్రష్టలు' (vates), గాయకులు (bards) అనే రెండు తెగలవారుండేవారు. ప్రతి తెగకు కొన్ని నిర్దిష్టమైన ధర్మాలుండేవి. క్రొత్త రచయితలకు శిక్షణ ఇచ్చే పాఠశాలలను కూడా డ్రూయిడ్‌లు నడిపేవారు. అయితే అప్పటికింకా వారికి ఒక లిపి గాని, రచనలను గ్రంథస్థం చేసే ఆచారం గాని ఏర్పడలేదు. కేవలం మౌఖికంగానే తమ రచనలను వారు ప్రచారం చేసుకుంటూ ఉండేవారు. 'గాయకులు' స్తోత్ర గీతాలూ, తద్విరుద్ధాలైన దూషణగీతాలూ గానం చేసేవారు. ఈ గీతాల వల్ల ఆ యా వ్యక్తులకు కీర్తి, అపకీర్తులు కలగడం సంగతి అలా ఉండగా వీరోచిత కృత్యాలను సాధించే శక్తిని కూడా ఈ గీతాలు వారికి సమకూరుస్తాయని గాయకులు విశ్వసించేవారు. ధనిక వర్గం వారికి డ్రూయిడ్‌లూ, గాయకులూ ఎంత అవసరమో వీరికి వారూ అంత అవసరమే!

ఐర్లాండ్ ఎన్నడూ రోమన్ సామ్రాజ్యంలో భాగం కాలేదు. అందుచేత బ్రిటన్‌లోని స్కాట్లండ్, వేల్స్, కార్న్‌వాల్‌లలో కంటె ఐర్లండ్‌లో కెల్టిక్ సంస్కృతి ఎక్కువగా నిలిచి ఉంది. ఆంగ్లోశాక్సన్‌ల దాడికి కూడా ఐర్లాండ్ గురి కాలేదు. ఐర్లాండ్ కూడా క్రైస్తవ మతాన్ని స్వీకరించిన మాట, క్రైస్తవేతర దేవతల నారాధించే డ్రూయిడ్‌ల వర్గం అక్కడ అంతరించి పోయిన మాట నిజమే అయినా, 'ఫిలిడ్'లు (ద్రష్టలు) అనబడే డ్రూయిడ్‌ల సంతతివారు కెల్ట్‌ల సంస్కృతిని తరువాత కూడా అక్కడ పోషించారు. తమ పూర్వికుల భవిష్యత్ కథన శక్తులు కొన్ని 'ఫిలిడ్'లకు కూడా ఉండేవి. తమ మౌఖిక సంప్రదాయాలను తరతరాలకు అందచేసే ఒక విద్వద్ వర్గంగా వారు ఉండేవారు. జ్ఞాపకం ఉండేందుకు వీలుగా ఛందోబద్ధంగా వారు రచించిన వంశవృక్షాలు, శాసనాలు కొన్ని లభిస్తున్నాయి. క్రైస్తవ సంస్కృతి, క్రైస్తవ విద్వాంసులు భిన్నదృక్పథానికి చెందిన వారైనా వారు ఇతర దేశాలలో కంటె ఐర్లండ్‌లో స్థానిక సంస్కృతి పట్ల ఎక్కువ సహనం ప్రదర్శించారు. అంతే కాదు; ఐర్లండ్‌లో మొదటిసారిగా లేఖన ప్రక్రియను వారే ప్రవేశపెట్టారు. ఐరిష్ వారు స్వయంగానే అయితే మరి ఎన్నో తరాల తరువాత గాని ఆ కార్యాన్ని సాధించి ఉండ గలిగేవారు కాదు. లేఖన ప్రక్రియ వలన ఐర్లండ్‌లో లౌకికంగాను, మతపరంగాను కూడా సంస్కృతి చక్కగా వికసించే అవకాశం ఏర్పడింది. త్వరలోనే యూరప్ అంతటా ఐరిష్ జాతీయులు క్రైస్తవ మత మిషనరీలుగా ప్రసిద్ధి పొందారు.

అయితే 9 వ శతాబ్దంలో వైకింగ్ దండయాత్రల ఫలితంగా ప్రాచీన మతవ్యవస్థ అంతరించడం, ఎందరో ఐరిష్ విద్వాంసులు తమ లిఖిత గ్రంథసంచయాలతో సహా దేశం నుంచి పలాయితులు కావడం జరిగింది. దానితో యూరప్‌లో ఐరిష్ జాతీయులు 'విద్వాంసులు' అనే ప్రసిద్ధి ఏర్పడింది. వైకింగ్‌లను ఆ దేశం నుంచి తరిమి వేసిన తరువాత సాంస్కృతిక పునరుజ్జీవనం ఏర్పడింది. లాటిన్ పాండిత్యం స్థానే గేలిక్ పాండిత్యానికే గౌరవం ఏర్పడింది. అందుచేత ఆంగ్లోనార్మన్ దండయాత్ర సాంఘికంగా కొంత సంక్షోభం కలిగించినా, 12 వ శతాబ్ది నాటి పునరుజ్జీవనోద్యమం ఐర్లండ్‌కు ఎక్కువగా లాభం కలిగించింది.

మత విద్వాంసులు అంతవరకు ప్రధానంగా మౌఖికంగానే ఉంటూ వచ్చిన తమ సంప్రదాయాలను గ్రంథస్థం చేయడం మొదలుపెట్టారు. *ది బుక్ ఆఫ్ ది డన్ కౌ, దిబుక్ ఆఫ్ ది లైన్ స్టర్* (రెండూ 12 వ శతాబ్ది నాటివే)వారు సాధించిన విజయాలకు నిదర్శనాలు. ఈ రెండు గ్రంథాలతో పాటు 16 వ శతాబ్దినాటి *బుక్ ఆఫ్ ది డీన్ ఆఫ్ లిస్మోర్* వైవిధ్యంతో కూడిన, విస్తృతమైన ప్రాచీన సాహిత్యాన్ని మనకు పరిచయం చేస్తుంది. స్కాటిష్, గేలిక్ కవుల రచనలతో కూడిన ఈ గ్రంథం మధ్యయుగాలలో గేలిక్, స్కాట్‌లు కూడా ఐరిష్ సంస్కృతిని ఆదరించినట్లు నిరూపిస్తుంది. ఈ గ్రంథాలలోని కథలలో 'అల్‌స్టర్' (ఐర్లండ్‌లోని ఒక రాష్ట్రం) కథలు, పౌరాణిక కథలు, చారిత్రక కథలు, ఫిలియన్ (విప్లవాత్మక) కథలు అని పలు తెరగుల కథలు కనిపిస్తాయి. 'అల్‌స్టర్' కథలలో సుప్రసిద్ధమైన కథ *ది కేటిల్ రెయిడ్ ఆఫ్ కూలీ.* మెడ్బ్ రాణి ఆధిపత్యం క్రింద కన్నాట్ రాష్ట్రప్రజలు కోంకోబార్‌రాజు ఆధిపత్యం వహించిన అల్‌స్టర్ రాష్ట్రప్రజలతో చేసిన పోరాటం ఈ కథలో అభివర్ణించబడింది. కోంకోబార్ రాజుకు సాయం చేసిన క్యూచులాయిన్ ఐరిష్ వీరులలో అగ్రేసరుడు. 'మాబినోగియన్' అనబడే 11 వెల్ష్ కథలలో ప్రాచీన లక్షణాలు కనిపిస్తున్నా ఐరిష్ కథలకంటె అవి అర్వాచీనాలు. *ది వైట్ బుక్ ఆఫ్ రె డెర్క్, ది రెడ్ బుక్ ఆఫ్ హెర్ గెస్ట్* (రెండూ 14 వ శతాబ్ది నాటివే) వంటి అర్వాచీన లిఖిత గ్రంథాలలోవి ఆ కథలు. వాటిలో సుప్రసిద్ధమైనకథ. *మాబినోగి* నాలుగు శాఖలు (11 వ శతాబ్ది). దీనిలోని కథాకథనశైలి *కల్‌హ్వీచ్ అండ్ ఓల్‌వెన్* (1100) అనే కథలో కంటె కూడా పరిణతి చెందింది. దీనిలో జానపద కథల లక్షణాలు స్ఫుటంగా

కనిపిస్తున్నాయి. ఆ తరువాతి కథలలో 'ఆర్థర్ రాజు' దర్శనమిస్తాడు. చరిత్ర రచయిత జియోఫ్రే ఆఫ్ మన్ మౌత్ వ్రాసిన *హిస్టోరి యారీగన్ బ్రిటానియే* (1136) ద్వారా మొదటి సారిగా ఆర్థర్ రాజు కథలు, కెల్టిక్ నాను డులూ యూరప్ సాహిత్యానికి పరిచయం అయాయి. నార్మన్ లతో పాటు బ్రిటన్ ప్రవేశించిన ఒక 'బ్రెటాన్' కుటుంబానికి చెందినవాడు జియోఫ్రే. ఆ రోజులలో బ్రెటాన్‌లు మంచి కథకులుగా ప్రసిద్ధి పొందారు. అందు చేత కెల్టిక్ గాథలకు బ్రిటనీ రాష్ట్రం మరొక ఆలంబనం అయింది. దురదృష్ట వశాత్తు విస్పష్టమైన మధ్యయుగ కెల్టిక్ లక్షణాలు గల వచనం గాని, కవిత్వంగాని బ్రెటాన్, కోర్నిష్ భాషలలో ఎక్కువగా మనకు లభించలేదు. బ్రెటాన్‌లో రాజకీయ జోస్యానికి సంబంధించిన *ఆర్థర్, గుయంగ్‌లాఫ్‌ల సంవాదం* అనే ఒక రచన మాత్రమే 1450 నాటి నుంచి వ్రాత ప్రతులలో లభిస్తూంది.

చెదురు మదురుగా ఏవో కొన్ని పద్యాలు తప్ప ప్రాచీన బ్రెటాన్ సాహిత్యంలో వేరేదీ లభించడం లేదు. బ్రెటాన్ భాషలో లిఖితగ్రంథాలు చాలా వరకు 16 వ శతాబ్ది నుంచే కనిపిస్తున్నాయి. వాటిలో చాలా భాగం అనుసరణలు. మతసంబంధమైన పద్యాలు, మతసంబంధ మైన పద్యనాటకాలు అని రెండు వర్గాలుగా వాటిని విభజించవచ్చును. మొదటి వర్గంలోని సుదీర్ఘమైన కావ్యం *మృత్యు దర్పణం*. రెండో వర్గంలో పేర్కొన దగినవి: సెంట్ నాన్, సెంట్ గ్వెనోల్, సెంట్ బార్బరాల జీవి తాలను చిత్రించే మూడు పద్య రూపకాలు. *సెంట్ కేథరిన్ జీవితం* (ప్రచురణ 1576) అనువాదం అయినా అదే పటిష్ఠమైన తొలి వచన రచన.

మధ్యయుగ కార్నిష్ భాషలో లభించిన తొలి సాహిత్య రచన 1400 నాటి ఒక రూపకం. ఒక యువతి గుణ గణాలను కీర్తించి, ఆమెను భార్యగా స్వీకరించడం దీని ఇతివృత్తం. 15 వ శతాబ్దంలో ఒక సుదీర్ఘకావ్యం *మన ప్రభుని కామం*. మూడు భాగాల నాటకం *ది ఆర్‌డినేలియా, మెరియాసెక్ జీవితం* (1504) వెలు వడ్డాయి. కోర్నిష్ భాష క్షీణింప సాగిన సమయంలో వెలువడిన ఒకే ఒక ఆధునిక రచన *ప్రపంచ సృష్టి* (1611). ఐర్లండ్, స్కాట్‌లాండ్, వేల్స్‌లలోని కెల్ట్‌ల ప్రధాన లక్షణమైన 'గాయక సంప్రదాయం' (bardic order) కార్న్‌వాల్‌లోను, బ్రిటనీ లోను నిలద్రొక్కుకోలేక పోయిందనడం స్పష్టం.

గేలిక్, స్కాటిష్ గేలిక్, వెల్ష్ 'గాయకులు' తమ పూర్వికులనుంచి వారసత్వంగా తమకు సంక్రమించిన 'స్తోత్రపాఠ' రచనా సంప్రదాయాన్ని కొనసాగించారు. నిజా నికి అదే వారి ప్రధాన సాహిత్య ప్రక్రియ అయింది. పలు తెరగుల పాఠశాలలలో వారు శిక్షణ పొందుతూ వచ్చారు. వారి కావ్యాలలో వస్తువు ఎక్కువగా సంప్రదాయానుసారి అయి ఉండడంలోనూ, సంక్లిష్టమైనవారి 'కచ్చితపు' ఛంద స్సులలోనూ (ఐరిష్‌లో 'డాన్‌డిరీచ్' ఛందస్సు, వెల్ష్‌లో 'కానుకేత్'ఛందస్సు), వారి అలంకార విన్యాసంలోనూ ఆ శిక్షణ ప్రభావం కనిపించింది.

ఐర్లండ్‌లోని కవులలో 'ఓడేలిస్' వంటి గాయక కుటుంబాలనుంచి వచ్చిన వారే ఎక్కువగా కనిపిస్తారు. తమను పోషించే ప్రభువుల ప్రశంసలకే వారు తమ రచ నలను పరిమితం చేసుకున్నారు. ఛందస్సుల క్లిష్టతను, అలంకారాల బాహుళ్యాన్ని వారు ఆదరించారు. సాంప్రదా యిక సాహిత్యంలో చారిత్రక వంశవృక్షాత్మక రచనలలో వారు ప్రత్యేక నైపుణ్యాన్ని సాధించారు. అయితే దేశంలో ప్రభువుల వ్యవస్థ అంతరించి వారి అండదండలు లోపించ డంతో గాయక కవుల బృందాలు చెల్లాచెదరై పోయాయి. కఠినమైన 'డాన్ డిరీచ్' ఛందస్సు స్థానే అమ్‌హ్రాన్ వంటి సరళమైన గేయచ్ఛందస్సులు వాడుకలోకి వచ్చాయి.

వెల్ష్‌భాషలో కవిత్వం 6 వ శతాబ్ది తొలి పాదం నాటి గాయక కవులతో-ముఖ్యంగా 'తాలీసిన్', 'అనీరిన్' లతో ఆరంభమైంది. 12 వ, 13 వ శతాబ్దాలలో రాజాస్థాన కవుల ' ఔడ్లా' పద్యాలతోనూ, ధనిక భూస్వామి వర్గాల ఆశ్రితులైన కవుల 'సైడ్‌డా' పద్యాలతోనూ కవిత్వం పునరుజ్జీవిత మైంది. క్రమంగా ధనిక భూస్వామి వర్గాలమీద ఆంగ్ల ప్రభావం పడడంతో వారి ఆశ్రితులైన కవుల హోదా, కవితా స్థాయి పడిపోయాయి. 'ఔడ్లా' పద్యాల ప్రాధాన్యం పోయి 'సైడ్‌డా' పద్యాలది పైచేయి అయింది. దీనికి కారణం కొంతవరకు డాఫిడ్ ఆప్ గ్విలిమ్ అనే మహా ప్రతిభా వంతుడైన కవి. అయితే వెల్ష్ కవిత్వంలో 1535 మొదలు 1935 వరకు స్వర్ణయుగం అని చెప్పాలి. 'కానూకేత్' ఛందస్సులకు, 'సైడ్‌డా' ప్రక్రి యకు ప్రజాదరణ తగ్గి స్వేచ్ఛా ఛందస్సులు ప్రచారంలోకి వచ్చినా, అటు తరువాత కూడా ఆ పాత ఛందస్సుల వాడుక కొనసాగింది.

అచ్చు యంత్రం, సాంస్కృతిక పునరుజ్జీవనం, సంస్క రణోద్యమాల ప్రభావం ఒక్క వేల్స్‌లో తప్ప మరెక్కడా కెల్టిక్ సంస్కృతి మీద ఎలాంటి ప్రభావమూ చూపలేక పోయాయి. వేల్స్‌లో మానవతావాద ప్రభావం, బైబిల్ వెల్ష్ అనువాదపు ప్రభావం ప్రగాఢంగా కనిపించాయి. 18 వ శతాబ్దంలో మెథడిస్ట్ పునర్వికాసంతో వేల్స్ దేశస్థులు,

ప్రొటెస్టెంట్ మతం వైపు మొగ్గారు. మొదటి సారిగా అక్షరాస్యులైన ఆ దేశస్థులలో ప్రార్థనగీత (Hymns) రచనలో ఆరితేరిన విలియమ్ విలియమ్స్ (1717-91) ఉద్భవించాడు.

ఐర్లండ్, స్కాట్‌లాండ్, బ్రిటనీలలోని కొన్ని ప్రాంతాలలో మధ్యయుగ లక్షణాలు ఇంకా చెదురు మదురుగా నిలిచి ఉన్నాయి. ఇతర దేశాలలో అవి పూర్తిగా అంతరించి పోయాయి. అందుకే ఐర్లాండ్ మొదలయిన దేశాలలో 20 వ శతాబ్దం వరకు కూడా జానపద సాహిత్యం సుసంపన్నంగా ఉంటూ వచ్చింది.

స్థానిక జాతీయ పాలన లోపించడం వల్ల, మాతృ భాష కాకుండా ఇతర భాషలను బోధించే విద్యా విధానం కొనసాగడం వల్ల కెల్టిక్ భాషలలో ఆధునిక జీవితావసరాలను తీర్చగల వచనరచన, నవల వంటి ఆధునిక సాహిత్య ప్రక్రియలు ఆలస్యంగా ఆరంభం అయాయి. కెల్టిక్ భాషలు క్షీణించడంతో ఆ భాషలను మాట్లాడే ప్రజలు ద్విభాషా భాషులు కావలసి వచ్చింది. రచయితలు కూడా మాతృభాషను అనాదరించి ఆ రెండవ భాషనే సాహిత్య భాషగా చేపట్టడంవల్ల 'ఆంగ్లో-ఐరిష్', 'ఆంగ్లో - స్కాటిష్', 'ఆంగ్లోవెల్ష్', 'ఫ్రాంకో - బ్రెటాన్' సాహిత్యాలకు పుష్టి చేకూరింది. అయినా - వివిధ భాషా పునరుద్ధరణ ఉద్యమాలవల్ల ఐరిష్, గేలిక్, వెల్ష్, బ్రెటాన్ భాషలను శక్తిమంతంగా వాడుతూ, చెప్పుకోదగ్గ నవలలు, చిన్న కథలు, నాటకాలు, ఆధునిక కవిత రచించిన కొందరు కవులు వెలుగులోకి వచ్చారు.

బా.శ్రీ., చిం.వెం.

## గ్రీక్ భాష - సాహిత్యం

భాష : గ్రీక్ నేడు ప్రధానంగా గ్రీస్ దేశంలో భాషింపబడే ఇండో-యూరపియన్ భాషా కుటుంబానికి చెందిన ఒక భాష. ఆ కుటుంబానికి చెందిన అత్యంత ప్రాచీనమైన భాషలలో ఇది ఒకటి. ఈ భాషకు క్రీ.పూ. 14 వ శతాబ్దం మొదలు దాదాపు 3,400 సంవత్సరాల చరిత్ర ఉంది.

ఈ నాడు గ్రీస్ దేశంలో వాడుకలో ఉన్న లిఖిత, వ్యావహృత భాషా రూపాలు నాలుగు దశలలో క్రమ పరిణామం చెందుతూ వచ్చాయి. మొదటిదశ ప్రాచీన గ్రీక్ భాష. ఇది 'మైసీనియన్ గ్రీక్' (క్రీ.పూ 14 వ శతా. మొదలు క్రీ.పూ. 12 వ శతా. వరకు), 'క్లాసికల్ గ్రీక్' (క్రీ.పూ. 8 వ శతా. మొదలు క్రీ.పూ. 4 వ శతా. వరకు) అని రెండు భాగాలు. మొదటి విభాగం 'లీనియర్-బి' అనే అక్షర లిపిలో వ్రాయబడేది. రెండవభాగం లిపి ఏర్పడిన తరువాతి దశ.

ప్రాచీన గ్రీక్ దశ తరువాతి రెండవదశ హెలెనిస్టిక్ గ్రీక్, లేక 'కాయిన్' (క్రీ.పూ 4 వ శతా.



గ్రీస్

మొదలు క్రీ.శ. 4 వ శతా. వరకు). మూడవ దశ 'బైజాంటైన్ గ్రీక్' (5 వ శతా. మొదలు 15 వ శతా. వరకు). ఈ రెండు దశలకు సంబంధించిన సాహిత్య గ్రంథాలు కొంతవరకు లభించాయి. నాల్గవదశ: 'ఆధునిక గ్రీక్' (15 వ శతా. మొదలు నేటి వరకు). ఆధునిక దశలో కొద్ది తేడాలతో లిఖిత, వ్యావహృత శైలులు రెండూ ఏకరూపంగానే ఉంటాయి. చాలా ఇతర భాషలలో వలెనే ఆధునిక గ్రీక్‌లోను అనేక మాండలికాలు ఉన్నాయి. 'అయోనిక్-ఆటిక్' మాండలిక భాష హెలెనిస్టిక్ దశలో అధిక ప్రాబల్యం సంపాదించేవరకూ దేశంలో మాండలికాలు అసంఖ్యాకంగా ఉండేవి. వాటిని 'పశ్చిమ సముదాయం', 'ఈయోలిక్ సముదాయం', 'అయోనిక్-ఆటిక్ సముదాయం', 'ఆరెడో స్సైప్రియట్ సముదాయం' అని వర్గీకరింప వచ్చును. గ్రీస్ దేశ చరిత్రలో డొరియన్ దాడులు, వాటి ఫలితంగా క్రీ.పూ. 8 వ శతాబ్దంలో ఏర్పడిన వలస రాజ్య స్థాపన అనే రెండు ప్రధాన సంఘటనలు గ్రీక్ భాషా మాండలికాలు పలు విధాలుగా పరిణమించడానికి హేతువులు అయాయి. మాండలికాలుగా ఉన్న కాలంలోనే గ్రీక్ సాహిత్యం బాగా అభివృద్ధి పొందింది. ఉదాహరణకు హోమర్ వ్రాసిన సుప్రసిద్ధ గ్రీక్ కావ్యంలో ఈయొలిక్, అయోనిక్ మాండలిక భాషా లక్షణాలు కనిపిస్తాయి. 'కోరస్'లు అనే భావ గీతాలు డోరిక్ సంప్రదాయానికి చెందినవి. హెరాడోటస్, హిపోక్రటీస్‌లు వ్రాసిన సుప్ర

సిద్ధ గద్య రచనలు ఈయొలిక్ మాండలికంలో ఉన్నాయి. తూసిడిడీస్, ప్లేటోలు ఆటిక్ మాండలికంలో వ్రాశారు.

చాలావరకు ఏకరూపత సాధించిన గ్రీక్ వ్యాహృత భాష క్రీ.పూ. 4 వ శతాబ్దంలో అలెగ్జాండర్ సామ్రాజ్య స్థాపన కాలంలో ఏర్పడింది. దానిని 'కాయిన్' (సామాన్య భాష) అనీ, 'హెలెనిష్టిక్ గ్రీక్' అనీ అంటారు. ఈ భాష అంతకు ముందు వివిధ మాండలికాలుగా విడిపోయి ఉన్న భాషల నన్నింటినీ ఏకీకరించి, క్లిష్టమైన గ్రీక్ వ్యాకరణాన్ని సరళీకరించి కొంత మేలు చేసినమాట నిజమే అయినా, ఆటిసిస్ట్‌లు అనబడే ఛాందస వాదులకు అది రుచిం చలేదు. ప్లేటో, డెమోస్తనీస్‌లు వాడిన భాషతో అది విభేదిస్తుంది గనుక కాయిన్ 'అపరిశుద్ధమైన' భాష అని దానిని వారు నిరసించారు. రచనలలో 'కాయిన్'ను గాక ప్రాచీన భాషనే వాడుక చేయాలని వారు వాదించారు. వారిది పలుకుబడి గల వర్గం కావడంవల్ల వారి వాదం కొనసాగి, 'బైజాంటైల్ గ్రీక్' అనే పేరుతో ప్రాచీన భాషే గ్రాంథిక భాషగా ఆటిక్ సంప్రదాయంలో కొనసాగుతూ వచ్చింది. అయితే దానితో పాటు వ్యాహృతభాష అయన 'కాయిన్' కూడా అధిక అభివృద్ధి సాధించడంతో ఆయిక్, కాయిన్ భాషలమధ్య అఖాతం క్రమంగా పెరుగుతూ వచ్చింది.

నేటి గ్రీక్ వాడుక భాష మూడు రకాలుగా ఉంది. మొదటి దానిలో స్థానిక మాండలికాలు - పెలొపొనీషియన్, ఉత్తరయూరోబియాలో మాట్లాడే ఉత్తరమాండలికాలు మొదలైనవి చేరి ఉంటాయి. రెండవ రకం 'డెమాటిక్'. ఈ వాడుక భాషా రూపాన్ని అన్ని నగరాల లోనూ మాట్లాడతారు. ఇంచుమించు గ్రీక్ లందరికీ ఇది అర్థం అవుతుంది. మూడవ రకం 'కతరెవుస'. ఆటిసిస్ట్‌లు మాట్లాడే 'పరిశుద్ధ' గ్రాంథికభాష ఇది. ఇప్పటికీ సాహిత్య భాషగాను, పరిపాలన భాషగాను, సాంకేతిక ప్రచురణల, వార్తా పత్రికల, కరపత్రాల భాషగాను ఇది ప్రచారంలో ఉంది. విద్యావిధానంలో ప్రాథమిక విద్య తరువాత ఈ భాషనే బోధనా మాధ్యమంగా వాడుతున్నారు. అయితే కవిత్వానికీ, ప్రస్తుత శతాబ్దంలో కాల్పనిక సాహిత్యానికీ డెమోటిక్ భాష వాడబడుతూంది.

మధ్య మధ్య కొద్దికొద్ది సరళీకరణాలు ప్రవేశపెట్ట బడినా గ్రీక్ వ్యాకరణం తరతరాల నుంచి ఎక్కువ మార్పు లేకుండానే కొనసాగుతూ వచ్చింది. ప్రాచీన గ్రీక్‌లో ఏక, ద్వి, బహు వచనాలు ఉండగా కాల క్రమేణ ద్వివచనం అంతరించిపోయింది. నామవాచకాలకు శబ్దాలను బట్టి ఏర్పడే స్త్రీ, పుం, నపుంసక లింగాల విభాగం నేటికీ నిలిచి ఉంది. లింగ, వచన, విభక్తులలో విశేషణాలకు మన సంస్కృతంలో లాగ విశేష్యాలతో సామ్యం ఉండాలి.

గ్రీక్‌భాషలో సుసంపన్నమైన పదజాలం, సూక్ష్మమైన వాక్యరచనా విధానం ఉన్నాయి. గ్రీక్ ద్వీపకల్పంలోను, అనేక 'ఈజీయన్' దీవులలోను, అనటోలియా పశ్చిమ ప్రాంతంలోను ఈ నాడు గ్రీక్ భాష వ్యవహారంలో ఉంది.

**లిపి :** గ్రీక్ లిపి క్రీ.పూ. 1000 ప్రాంతంలోనే ఏర్పడింది. ఆధునిక యూరపియన్ వర్ణమాల లన్నీ ప్రత్యక్షం గానో, పరోక్షం గానో ఉత్తరసెమిటిక్ లిపినుంచే ఫొనీషియన్‌ల లిపి ద్వారా ఉత్పన్నం అయాయి. 'సెమిటిక్-భిన్న' భాష అయిన గ్రీక్‌భాషలోని అన్ని ధ్వనులనూ ప్రస్ఫుటంగా నిరూపించేందుకు వీలుగా గ్రీక్‌లిపిలో ఎన్నో కొత్తవర్ణాలు చేర్చడం, కొన్ని వర్ణాలను మార్చడమో, పరిహరించ డమో చేయడం జరిగింది. ముఖ్యంగా సెమెటిక్ వర్ణమాలలో హల్లులను సూచించే కొన్ని గుర్తులు గ్రీక్ వర్ణమాలలో అచ్చులను సూచిస్తాయి. సెమెటిక్ హల్లులను సూచించే అలీఫ్, హే, యొద్, అయిన్, వావ్, అనే గుర్తులు గ్రీక్ వర్ణమాలలో ఆల్ఫా, ఎప్సిలాన్, అయోటా, ఓమిక్రాన్, ఉప్సిలాన్‌లుగా మారి, ఏ (a), ఇ (e), ఐ (i), ఒ (o), యు (u) లను సూచింపసాగాయి.

**సాహిత్యం :** భారతీయ సాహిత్యాలకు సంస్కృతం లాగ యూరప్ ఖండంలోని వివిధ సాహిత్యాలలో ప్రాణ భూతమై అంతర్యామిగా గ్రీకు సంస్కృతి, సాహిత్యం వ్యాపించి ఉన్నాయి. ఆదర్శప్రాయమైన స్థితికి దేశాన్ని తీసికొని పోదలచినట్లైతే కోటీశ్వరులు గ్రీక్ సాహిత్యంలో పారంగతులు కావాలనీ, కోటీశ్వరులే గ్రీక్‌భాషను బోధించే ఆచార్యులు కావాలనీ బెర్నార్డ్ షా అన్నాడు.

క్రీ.పూ. 323 వరకు గ్రీక్ సాహిత్యంలో వీరగాథలు, ప్రజాస్వామ్యంతో కూడిన నగర రాజ్యాలు, అత్యుత్తమ రూపకాలు, వివిధ రంగాలలో విజ్ఞానం, దార్శనిక వివేచన వర్ధిల్లాయి. అది గ్రీక్ సాహిత్యచరిత్రలో స్వర్ణయుగం. నాటి సాహిత్య నిర్మాతలు ఆసియా నుంచి వచ్చి, మినోస్ నగరంలో కొంత కాలం ఉండి కాలక్రమేణ గ్రీక్‌దేశం చేరిన వారు. క్రీ.పూ. 8 వ శతాబ్దంలో పొరుగు వారైన ఫొయెనీషియన్‌ల నుంచి హీబ్రూలిపిని గ్రహించి 5 వ శతాబ్దంలో గ్రంథాలను లిఖిత రూపంలో నిబద్ధం చేశారు.

వీరకావ్యం ఐతిహాసిక, పౌరాణిక సంప్రదాయాల కలయిక. మొదటి కావ్యం క్రీ.పూ. 10 వ శతాబ్దంలో అంధ కవి హోమర్‌చేత సంకలితం చేయబడిందని కొందరూ, రచితమైందని కొందరూ అంటున్నారు. ట్రాయ్ నగరం ముఖ్యపట్టణంగా ఉన్న ఈలియం అనే ఒక ఆసియా దేశంతో పదేళ్లపాటు యుద్ధం చేసి గ్రీక్‌లు వారిని జయించిన గాథను వర్ణించే *ఇలియెడ్* అనే వీరకావ్యం హోమర్ వ్రాశాడు. వర్జిల్, మిల్టన్ మొదలైనవా రనేకులు ఈ కావ్యాన్ని అనుకరించారు. 10 వ సంవత్సరంలో జరిగిన యుద్ధాన్ని మాత్రమే హోమర్ ఇతివృత్తంగా స్వీకరించాడు. ఆదర్శవీరులైన ఎకిలీస్, హెక్టర్ మొదలైన పాత్రల చిత్రణ ఎంతో అద్భుతంగా, రసవంతంగా సాగింది. యుద్ధవర్ణన, సైనిక విన్యాసం కళ్లకు కట్టినట్లు చేయబడ్డాయి. భావన, కవితా ధార, భావ చిత్రాలు, శబ్దార్థ సంసర్గం అతిలోక సుందరంగా ఈ మహాకావ్యంలో భాసిస్తుంది. చైతన్యవంతము, ఉదాత్తమూ అయిన కావ్యం ఇది. యుద్ధానంతరం తుపానులకు గురి అయి దారి తప్పి స్వగృహాన్ని వెతుక్కుంటూ బయలుదేరిన యూలిసిస్ కథను, అతని అనుయాయుల కథలను, *ఒడిస్సీ* అనే మరో కావ్యంలో హోమర్ రచించాడు. హోమర్ వీధులవెంట పాడుకుంటూ తిరిగిన ఈ గాథలను తరువాతి తరాల వారు సేకరించి గ్రంథస్థం చేశారు. కొన్ని స్థలాలలో అర్వాచీనుల రచనలు మధ్యమధ్య చొప్పించబడ్డాయి. దార్శనికుడు, సమీక్షకుడు అయిన ప్లేటో వీటి నన్నిటినీ పరిశీలించి, శోధించి సరి అయిన హోమర్ కావ్యాలను పరిష్కరించి ప్రజలకు అందించాడు.

తరువాత హోమర్ కావ్యాలకు ఎన్నో అనుకరణలు బయలుదేరాయి. దేవతలను ఉద్దేశించిన సూక్తాలు 8 వ శతాబ్దంలో వెలువడ్డాయి. హెసియోడ్ సామాన్యులు ఉపయోగించే లౌకికభాషలో నీతిపరమైన ఖండకావ్యాలు వ్రాసి వాటిలో వారి భావాలను, ఆశయాలను చిత్రించాడు. *థియోగోనీ* అనే గ్రంథంలో అతడు గ్రీక్‌ల పౌరాణిక విశ్వాసాలను వివేచించాడు.

గ్రీక్ దేశంలోని ఇయోన్ ప్రాంతంలో వాడే భాషనే చాలావరకు హోమర్ ఉపయోగించాడు. ఈ ఇయోన్ ప్రాంతీయులతోనే భారతీయులకు సంబంధం ఏర్పడటం వలన వారు గ్రీకులందరిని యవనులు అని వ్యవహరించారు. ఈ యవన భాషను హెసియోడ్ వదలినా, యవనరాష్ట్ర వాసులే దార్శనిక వివేచనలను క్రీ.పూ. 6 వ శతాబ్దంలో ఛందోరూపంలో వ్రాయడం మొదలుపెట్టారు. ఇదే కాలంలో ఆర్ఫిక్ సంప్రదాయం తలఎత్తింది. క్రమ క్రమంగా క్రీ.పూ. 5 వ శతాబ్దం నాటికి ప్రజాస్వామ్యం, వ్యక్తిస్వాతంత్ర్యం అభివృద్ధి చెందాయి. గేయకవిత విజృంభించింది. లైర్ అనే వాద్యంతో ఈ గీతాలను పాడేవారు గనుక వీటిని 'లిరిక్' పద్యాలు అన్నారు. శోకం, విరహం వీటిలోని ప్రధాన విషయాలు. టిర్టేయుస్, సొలోన్, థియోగ్నిస్‌ల గేయాలు మనకు లభిస్తున్నాయి. ఈ గీతాలు రాజకీయ విషయాలను ఆధారంగా స్వీకరించినట్టివి. ఆర్కిలోకుస్ క్రీ.పూ. 7 వ శతాబ్దంలో ఇయాంబిక్ ఛందస్సులో తన భగ్నప్రేమను గురించి గానం చేశాడు.

గ్రీక్‌ల గేయ కవిత్వంలో గాన లక్షణం ప్రధానమైంది. సరళం, సుగమం అయిన భాషతో, సహజమైన శబ్దయోజనతో సామాన్య మానవుల హర్ష విషాదాలను, సంయోగ వియోగాలను, రాగ క్రోధాలను చిత్రించిన ఈ గేయాలు నేటికీ సజీవంగానే కనిపిస్తున్నాయి. వీటిని బహు జనామోదకరంగా మలచిన ఆల్కేయుస్, శాఫో (క్రీ.పూ. 650) ల గీతాలలో భావుకత, శబ్ద లాలిత్యం ఎక్కువగా ఉంటాయి. కవయిత్రి శాఫో చెప్పిన శృంగార గీతాలలో ఆధ్యాత్మిక ప్రేరణ, సుఖం, ఆవేశం కనిపిస్తాయి. సరళం, స్పష్టం, పరిష్కృతం అయిన శైలిలో సహజ భావ స్రవంతికి చక్కని రూప నిష్పాదన చేసిన శాఫో చిరస్మరణీయ.

బృంద గానరూపం అయిన 'కోరస్' డొరియన్ మాండలిక భాషలో మొదట వికసించింది. దేవపూజ, వివాహం, నృత్యం మొదలైన సన్నివేశాలలో బృందగానం చేసేవారు. ఈ కోరస్‌ను రచించిన మొదటి కవి అల్క్మన్. క్రీ.పూ. 6 వ శతాబ్దం నాటి విజయానికి సంబంధించిన సన్నివేశాలలో బృందగీతి (కోరస్) వినిపించసాగింది. ఈ గీతిని వికసింపచేసిన వారిలో ఇబికస్, పిండార్ (క్రీ.పూ. 518-422) లు ముఖ్యులు. ఒలింపిక్ నగరంలో జరిగిన పోటీల సందర్భంలో పిండార్ రచించిన గేయాలు పాడేవారు. ఇతని ఉపమాలంకారాలూ, కల్పనలూ అసాధారణమైనవి. ఇతని అనుయాయులలో సిమోనిడెస్, బాక్కిలిడస్‌లు ముఖ్యులు.

సహృదయుల నందరిని ప్రతి శతాబ్దంలోను ముగ్ధులను చేసినవి గ్రీక్ నాటకాలు. క్రీ.పూ. 5 వ, 4 వ శతాబ్దాలలో ఏథెన్స్ నగరం సాహిత్య, సాంస్కృతిక కేంద్రం అయింది. డయొనీసియస్ అనే దేవుడి ఉత్సవాలలో ప్రారంభం అయిన నాటకాలు క్రీ.పూ. 5 వ శతాబ్దంలో వార్షికోత్సవాలలో ప్రధానస్థానం ఆక్రమించాయి. బృందగీతం పాడే వేళ ఒక నటుణ్ణి ఉపయోగించి

సంవాదంతో తెస్పిస్ రూపక జగత్తుకు దారి చూపాడని సంప్రదాయం. మనకు నేడు లభించే మొదటి నాటకాలు విషాదాంతాలు. వీటిని రచించిన వారిలో ప్రథముడు ఈస్కిలస్ (క్రీ.పూ. 525-455). ఇతడు ప్రాచీన, పౌరాణిక ఇతివృత్తాలను ఆధారంగా స్వీకరించాడు. సమకాలిక సమస్యలను *పెర్షియన్* అనే నాటకంలో చిత్రించాడు. *ఆగమెమ్నాన్, ప్రొమేతియస్* అనే రూపకాలు ఇతని రచనలలో సుప్రసిద్ధమైనవి. ఈ నాటకాలలో ఇతడు రెండవ నటుణ్ణి చేర్చి నాటకీయ వాదానికి ప్రాధాన్యం ఇచ్చాడు. ఉదాత్త గేయాలు, అద్వితీయమైన భావన, గొప్ప కవిత్వం కల ఈ నాటకాలతో గ్రీకుల చరిత్ర ముందంజ వేసింది.

విషాదాంత నాటకాలకు పరినిష్పన్న రూపం కల్పించిన సోఫోక్లీస్ (క్రీ.పూ. 497-405) రచనలలో *ఈడిపస్, ఏంటిగొనీ, ఫిలోక్టెటిస్, ఎలెక్ట్రా* ముఖ్యమైనవి. ఇతడు బృందగీతిని అదుపులో ఉంచి నాటక వస్తువులను ప్రధానం చేసి అంతర్వ్యథను పాత్ర పోషణకు పునాదిగా చేశాడు. మానవ ప్రకృతిని సమగ్రంగా పరిశీలించి మూడవ నటుడికి కూడా స్థానం కల్పించాడు. కథా వస్తువులో ఏకత, అసాధారణ గ్రథనశక్తి, నాటక కళ సాధించాడు. గంభీరమైన ఆశయాలతో నైతిక దృష్టితో నాటకం రూపొందింది.

మూడవ నాటకకర్త యూరిపిడీస్ (క్రీ.పూ. 485-406) మొదట పూర్వనాటక కర్తలను అనుసరించినా క్రమంగా నూతన మార్గం అవలంబించాడు. వర్తమాన కాలంలోని సమస్యలను మనో వైజ్ఞానిక దృష్టితో పరిశీలించి తన నాటకాలలో చిత్రించాడు. వ్యక్తుల మధ్య కనిపించే పరస్పర సంఘర్షణ ప్రధాన ఇతివృత్తం కావడంచేత ఈ నాటకాలలో భావావేగం, వాస్తవికతా దృష్టి, కవితాశక్తి కనిపిస్తాయి. *మీడియా ఆల్సెస్టిస్, హిప్పోలీటా* మొదలైన విషాదాంత నాటకాలు ముఖ్యమైనవి. ఇతడు కొన్ని సుఖాంత నాటకాలు కూడా రచించాడు. బృంద గీతిని మన సంస్కృత నాటకాలలోని విష్కంభం స్థాయికి తీసికొచ్చి వ్యంగ్య ధోరణితో కూడిన నవ్య రూపకాన్ని రూపొందించిన యూరిపిడీస్ మహా ప్రతిభాశాలి. వినోదకరమైన సంవాదం, కరుణరసం, యథార్థ వస్తుతత్త్వం, భావ విశృంఖలత ఈయన రూపకాలలో కనిపిస్తాయి.

సుఖాంతమైన నాటకాలలో మిత్రులను, సమకాలికులను వ్యాజస్తుతి, నిందలతో చిత్రించి *మేఘం, కప్పలు, పక్షులు* మొదలైన పేర్లు గల రూపకాలు రచించినవాడు అరిస్టోఫనీజ్ (క్రీ.పూ. 450). పురాణరూపకాన్ని వదలి ఆధునిక సుఖాంత నాటకాన్ని రచించిన మేధావి మినాండర్ (క్రీ.పూ. 342-291). కరుణ, యథార్థత, రాగాత్మకత అనే భావాలతో నిండిన *మధ్యస్థుడు, సామోస్ రాష్ట్రపు పిల్ల* మొదలైన నాటకాలలో ఇతడు సమకాలిక సమాజంలో ఉన్న అశాంతిని, అస్థిరతను చిత్రించాడు. ఆధునిక గ్రీక్ నాటకం మినాండర్‌తోనే ప్రారంభం అయింది.

గద్యరచనలో ప్రప్రథముడు ప్లేటో. ఆధ్యాత్మిక, దార్శనిక మీమాంసలో నిమగ్నుడైనా ప్లేటో (క్రీ.పూ.427-347) ఈ విషయాలను సంవాద రూపంలో రచించాడు. ఈ సంవాదాలలో నాటకశైలీ, హాస్యరసం, సుశ్లిష్ట పదబంధం, శబార్థయోజనా, శబ్ద లాలిత్య మాధుర్యాలు, భావ గంభీరత, భావనా పటిమ, అసాధారణ కవితా శక్తి, సౌకుమార్యం ఉండడంచేత ఇవి సాహిత్య జగత్తులో ఉత్తమోత్తమ కృతులుగా పరిగణింపబడుతున్నాయి. వక్తృత్వాన్ని ఆదరించి శ్రోతల హృదయాలను స్పందింప చేసే గద్యరచనలను ఇచ్చిన వారిలో సోక్రటీస్ (క్రీ.పూ.436-338), డెమొస్తెనీస్ (క్రీ.పూ.384-322) లు ముఖ్యులు.

చరిత్రను కవితా దృష్టితో రచించిన వారిలో హెరొడోటస్ (క్రీ.పూ.485-425), థ్యూసిడైడిస్ (క్రీ.పూ. 460-400) లు ముఖ్యులు. ఉత్తమ వైజ్ఞానిక దృష్టితో కార్య కారణ సంబంధాన్ని గుర్తుంచుకుని చరిత్రకు సంబంధించిన దార్శనిక వాదాన్ని పోషిస్తూ పెలోపనీషియా యుద్ధాలను చిత్రించినవాడు తూసిడిడీస్. చరిత్రకారులలో జెనోఫోన్, ఎఫోరస్, తియొపొంపస్ లు కూడా గణనీయులు.

వైజ్ఞానిక విషయాలకు కూడా క్రీ.పూ. 6 వ శతాబ్దంలో వచనం ఉపయోగించ బడింది. హిపోక్రిటస్ *చికిత్సా శాస్త్రం* రచించాడు. దార్శనిక, వైజ్ఞానిక, సాహిత్య విషయాలను గురించి అనేక గ్రంథాలు రచించిన అరిస్టాటిల్ (క్రీ.పూ.384-322) సర్వతోముఖ పాండిత్యం కలవాడు. ఈయన ప్లేటో శిష్యుడు. ఏ శాస్త్రం తీసుకున్నా దాని మీద నేటిదాకా అరిస్టాటిల్ ప్రభావం కనిపిస్తుంది. ఈయన వద్ద విద్య అభ్యసించినవాడే ప్రపంచ విజేత అలెగ్జాండర్.

క్రీ.పూ. 322 నుంచి హెలెనిక్ యుగం ఆరంభం అయింది. ఈజిప్టులోని అలెగ్జాండ్రియా నగరం గ్రీక్ల సాహిత్యానికీ, విజ్ఞానానికీ కేంద్రం అయింది. ముక్తకాల వంటి ఖండకృతులు బయలుదేరాయి. కాలిమేకస్ (క్రీ.పూ.310-240) భావుకతతో కూడిన ఖండ కావ్యాలు, గేయాలు రచించాడు. అపోలోనియస్ (క్రీ.పూ.295-215) ప్రాచీనశైలిలో *ఆర్గోనాటిక* అనే మహాకావ్యం వ్రాశాడు.

తియోఫ్రాస్టస్ (క్రీ.పూ.300) మరి ఒక కవి. ఇదే కాలంలో వివిధ శాఖలలోని విషయాలను వచనరూపంగా వ్రాయడం ప్రారంభమైంది. కాని ప్రాచీన ఉన్నతి క్షీణించింది. రోమక సామ్రాజ్య కాలంలో గ్రీక్‌ల సంస్కృతి కొంత తగ్గుదల చూపించింది. కాని ఆనాటి రచయితలలో లూసియస్ (క్రీ.శ. 120-180), ప్లూటార్క్ (క్రీ.శ. 46-127)లు పరిగణనీయులు. రోమన్ రిపబ్లిక్ అంతరించే వరకూ ఇలా క్షీణదశలో ఉండి చివరికి ప్రాచ్య రోమక రాజ్యం అనబడే బైజాంటైన్ సామ్రాజ్య కాలంలో ఆ ప్రభువుల ఆదరణతో గ్రీక్ సాహిత్యం తిరిగి కొంత ఉచ్చస్థితిని పొందగలిగింది. కాని ఆ నాడు వెలువడిన గ్రీక్ సాహిత్యంలో రోమన్ సంస్కృతి ప్రభావం అడు గడుగునా కనిపించడమే కాక గ్రీక్ భాషకు కూడా కృతక రూపం సిద్ధించింది. ఆ నాటి రచయితలలో యూసీబియస్, బేసిల్, గ్రెగరీ, సెయింట్ క్రైసస్టన్, డమాస్కస్ నగర వాసియైన జాన్‌లు ప్రముఖులు. క్రైస్తవ మతచరిత్ర, దైవవిజ్ఞానం, భౌతికశాస్త్రం మొదలైన వాటిని గురించి అనేక గ్రంథాలు ఆ యుగంలో వెలశాయి. వ్యావహారిక గ్రీక్ భాషలో కూడా ఆ నాడు కొన్ని కావ్యాలు రచించబడ్డాయి. మైకేల్ గ్లైకస్, తియొడోరస్, ప్రోడ్రోమస్ మొదలైనవారు ఇలాంటి రచనా విధానంలో పేరు మోసినవారు.

1261 వ సంవత్సరంలో బైజాంటైన్ సామ్రాజ్యం అంతరించి భిన్న భిన్న రాజ్యాలుగా చీలిపోయినా, ఈ వివిధ రాజ్యాలలోను గ్రీక్ సాహిత్యం పోషించబడుతూనే వచ్చింది. కాని, 1453 లో కాన్‌స్టాంటినోపిల్ నగరాన్ని తురుష్కులు వశపరుచుకోడంతో ఈ రాజ్యాలన్నీ తుర్క్ సామ్రాజ్యంలో అంతర్భాగాలై గ్రీక్ పండితులకు నిలువనీడ దొరకక పోవడంవల్ల వారిలో చాలామంది యూరప్‌లోని వివిధ దేశాలకు వలస పోవలసి వచ్చింది. వారితో పాటు గ్రీక్ సంస్కృతి, సాహిత్యాలు యూరప్ అంతటా వ్యాపించాయి. కాని, అది వరకే లాటిన్ భాషా సాహిత్యాలు యూరప్ దేశా లన్నిటిలోను వ్యాపించి ఉండడంవల్లను, లాటిన్ భాషకు క్రైస్తవ మత సంబంధమైన పవిత్రత సంక్రమించడం వల్లను లాటిన్ భాషను త్రోసి రాజని గ్రీక్ భాష అంతగా ముందడుగు వేయలేక పోయింది. అయినా విజ్ఞాన శాస్త్రీయ విషయాలలో గ్రీక్‌భాషకే ఎక్కువ ఆదరణ చేకూరింది. అయితే క్రీట్, గ్రీస్ దేశాలలో తప్ప మిగిలిన యూరపియన్ దేశాలలో గ్రీక్ సాహిత్యం అని చెప్పుకోదగింది ఏదీ ఆ నాడు వెలువడలేదు.

దాస్యంలో చిక్కుకున్న గ్రీస్ దేశంలో కన్నా మిన్నగా క్రీట్ ద్వీపంలో గ్రీక్ సాహిత్యం పలు రీతులుగా వికాసం పొందగలిగింది. అక్కడి రచయితలలో స్టెఫానోస్ సాష్లికెస్, విజంచెస్ కోర్నరస్ అనే పద్య కవులూ, జార్జియస్ షోరాజిస్ అనే రూపక రచయితా ప్రముఖులు. కాని ఇంతలో 17 వ శతాబ్దంలో క్రీట్ ద్వీపం కూడా తుర్కుల హస్తగత మైంది. ఈ విధంగా గ్రీక్ మాతృభాషగా ఉన్న గ్రీస్, క్రీట్‌లు రెండూ దాస్యంలో మునిగిపోవడంతో మళ్లీ 1830 లో గ్రీస్ దేశం స్వతంత్రం అయేవరకూ గ్రీక్ సాహిత్యం పరతంత్రులైన ప్రజల ఆశ్రయంలో జీవించ వలసి వచ్చింది. అందువలన సామాన్య ప్రజానీకం మాట్లాడే వ్యావహారిక భాషనే కావ్యాలలో కూడా వాడాలి అనే వాదానికి బలం చేకూరింది. అయితే దానిని ప్రతిఘటించినవారు కూడా లేకపోలేదు. ఈ ఉభయుల వాదాలకూ సమన్వయం చేకూర్చి ఒక నూతన శైలిని ఆవిష్కరించినవాడు అడ్‌మాంటియస్ కోరెస్ (1748-1833). ఆధునిక గ్రీక్ సాహిత్యానికి ఇతడే మూలపురుషుడు అని చెప్పవచ్చును. ఇతనిని ఆదర్శంగా గ్రహించి రచయితలనేకులు కావ్యాలు వ్రాశారు. దేశదాస్యం తొలగించడమే వారి ఏకైక లక్ష్యం కావడం వల్ల వివిధ సాహిత్య ప్రక్రియలను విప్లవ భావ వ్యాప్తికే వారు వినియోగించారు. 19 వ శతాబ్దంలో గ్రీక్ రచయితలు ఆధునిక సాహిత్య ప్రక్రియలు అనేకం అవలంబించారు. మనస్తత్వ విశ్లేషణాత్మకాలైన నవలలు రచించడంలో సిద్ధ హస్తుడైన జార్జ్ ఎస్. విజేనస్ (1849-96), సహజవాదాన్ని అవలంబించిన మెక్సకేస్ (1868-1910) లు ఇట్టి రచయితలలో ప్రముఖులు. ఆధునిక గ్రీక్ రచయితలలో సుప్రసిద్ధుడు కోస్టెస్‌ఫలామస్ (1859-1942). ఇతని రచనలు భావ గంభీరతకూ, సరళమైన శైలికీ పేరు పొందాయి.

19 వ శతాబ్దం చివర గ్రీస్ దేశంలో సంభవించిన సాంఘిక, ఆర్థిక పరిణామాల ప్రభావం గ్రీక్ సాహిత్యంలో ప్రతిఫలింపసాగింది. 'నగర నవల' అనే నూతన సాహిత్య ప్రక్రియను గ్రీక్ సాహిత్యంలో ప్రవేశపెట్టిన వారు ఇయోనీస్ ప్సిచారిస్, గ్రెగోరియోస్ జనోపౌలోస్‌లు. వారి మార్గాన్ని అనుసరించినవారు కోన్‌స్టాంటినోస్ క్రిస్టోమనోస్(1867-1911), కోస్టాస్ చాట్జోపౌలోస్ (1871-1920). ఈ చివరి రచయిత గ్రీకులకు మొట్ట మొదటి సాంకేతిక నవల *అయిన ప్రైనోపోరో* (ఆకురాలుకాలం-1917) సమకూర్చాడు.

మొదటి ప్రపంచ సంగ్రామం ముగిసిన తరువాత యువ రచయితల బృందం ఒకటి 1930 నాటి రచయిత

లకు మార్గం సుగమం చేసింది. అప్పటికి గ్రీక్ వచనానికి పరిణతి చేకూరింది. గ్రీక్ భాషలో మొట్టమొదటి సారిగా ప్రయోజనంతో కూడిన మంచి నవలలు వెలశాయి. స్ట్రాటిస్ మైరివిలిస్ (1892-1969) *వార్‌ట్రియాలజీ* (యుద్ధానికి సంబంధించిన మూడు నాటకాలు) వ్రాశాడు. తరువాత ఆయన మౌలికమైన చిన్నకథలు కూడా రచించాడు. ఇలియాస్ వెనెజిస్ (1904-) తుర్కుల వద్ద ఖైదీగా గడిచిన తన జీవిత చరిత్ర *నౌమెరో-31328* (1922-23)తో పాఠకుల దృష్టి నాకర్షించాడు. 1930-40 మధ్య విశేష ప్రశస్తి పొందిన రచయితలలో ఒకడు కోస్మాస్ పోలిటిస్ (1888). అతడు రచించిన *ఇరోటికా* (1938) ఒక బాలుర బృందం యొక్క చర్యలను, ప్రతిచర్యలను వర్ణించే గ్రంథం. ఈ గ్రంథంలోను, అటు పిమ్మట వ్రాసిన నవలలలోను ఇతడు కథాకథనంలో అందె వేసిన చేయి అని నిరూపించు కున్నాడు. జార్జియోస్ థియోటోకాస్ (1905-66) వ్రాసిన పెద్ద నవల *ఆర్గో* (1936), చిన్నకథలు, వ్యాసాలూ, యాత్రాగ్రంథాలూ, రూపకాలూ అతని బహుముఖ రచనా దక్షతకు నిదర్శనాలు.

రెండవ ప్రపంచయుద్ధం ముగిసిన తరువాత యువ తరం రచయితలకు యుద్ధానికి ముందున్న తరం రచయితలే కవిత్వ రచనలోనూ, వచన రచనలోనూ కూడా మార్గ దర్శకులు అయారు. నికోస్ కజాన్ట్‌జాకిస్ వయోవృద్ధుడైన తరువాత కూడా అనేక రూపకాలూ, యాత్రా గ్రంథాలూ, తాత్త్విక విమర్శక వ్యాసాలూ మాత్రమే కాక అంతర్జాతీయ విఖ్యాతి పొందిన నవలలు కూడా రచించి యువ తరానికి మార్గదర్శకుడు అయాడు. కజాన్ట్‌జాకిస్ ఆధునిక గ్రీక్ వచన సాహిత్యానికి చేసిన సేవ నిరుపమానమైంది.

రెండవ ప్రపంచ యుద్ధం దురంతాలను 1940 ప్రాంతం నాటి అంతర్యుద్ధం నాటి దారుణానుభవాలను చూసిన యువతరం రచయితలు 1960 నాటికి ఒక విమాత్న కంఠం సంతరించుకున్నారు. వాసిలిస్, వాసిలికోస్, రోడిస్, ప్రావెలెంజియోస్, నికోస్ కజ్‌డగ్గిస్, కోస్టాస్ టాక్టిసిస్ వచనరచనలోను, భావుకతలోను చెప్పుకొనదగినవారు. చిన్నకథల రచయితలలో రెనోస్ అపోస్టొలైడిస్, స్పైరోస్ ప్లాస్కోవైటిస్‌లు సిద్ధహస్తులు!

*పో.సు.శా.(బొ.శ్రీ.)*

## జర్మన్ భాష - సాహిత్యం

**భాష** : జర్మన్, లేదా 'డాయిట్ష్' భాష ఇటీవలి వరకూ రెండుగా విడిపోయి ఉన్న తూర్పు, పశ్చిమ జర్మనీలలోనే కాక, ఆస్ట్రియాలో కూడా అధికార భాష. స్విట్జర్లండ్‌లోని 4 అధికార భాషలలో ఇది ఒకటి. ఇండో-యూరపియన్ భాషా కుటుంబంలోని పశ్చిమ జర్మానిక్ భాషా వర్గానికి చెందిన జర్మన్ భాషలో హైజర్మన్, లోజర్మన్ అని రెండు భేదాలు ఉన్నాయి. దక్షిణాది పీఠభూములలో మాట్లాడే హైజర్మన్ భాషే అధికారిక లిఖిత భాషగా గ్రహించబడింది.




జర్మనీ

ప్రాచీన హై జర్మన్ భాషా మాండలికాలు అనేకం (1100 దాకా) దక్షిణాది పీఠభూములలో వ్యవహారంలో ఉండేవి. అప్పటికి వాటికి ఒక ప్రామాణిక సాహిత్య భాష ఏర్పడలేదు. మధ్య యుగంలో (1100 తరువాత) ఎగువ హైజర్మన్ మాండలికాలు (అలిమానిక్, బవేరియన్) ఆధారంగా ఒక ప్రామాణిక భాష రూపొంద సాగింది. *నిబెలుంగెన్ లీడ్* అనే గ్రంథంతో సహా విస్తృత మైన సాహిత్యం మధ్య జర్మన్ భాషలో వెలువడింది.

ఆధునిక హై జర్మన్ ప్రామాణికభాష మధ్యయుగ హైజర్మన్ మాండలికాలనుంచీ, జర్మనీలోని మధ్య, దక్షిణ పీఠభూములలోను, ఆస్ట్రియా, స్విట్జర్లండ్‌లలో మాట్లాడే మాండలికాలనుంచీ రూపొందింది. లో జర్మన్ మాట్లాడే ప్రాంతంలో కూడా పరిపాలన భాషగాను, సాహిత్య భాషగాను ఇదే వాడుకలో ఉంది. మాట్లాడేవారి సంఖ్యనుబట్టి చూస్తే ప్రపంచ భాషలలో ప్రామాణిక హై జర్మన్ భాషది ఆరవ స్థానం. మొదటి అయిదు: చైనీయభాష, ఇంగ్లీష్, హిందీ-ఉర్దూ, స్పానిష్, రష్యన్. 16 వ శతాబ్దంలో మార్టిన్ లూథర్ *బైబిల్*‌కి చేసిన

జర్మన్ అనువాదంలో వాడిన భాష ఆధారంగా ఆధునిక ప్రామాణిక జర్మన్ భాష రూపొందింది. లో జర్మన్ (ప్లాట్‌డాయిట్ష్, లేక నైడర్ డాయిట్ష్) భాష ఉత్తర జర్మనీలోని పల్లపు భూములలో ప్రజలు మాట్లాడే భాష. ఇది ప్రాచీన శాక్సన్ భాషనుంచీ, హాన్సియాటిక్ లీగ్ పౌరులు మాట్లాడే లోజర్మన్ జర్మన్ భాషనుంచీ ఏర్పడింది. స్కాండినేవియన్ భాషలు ఈ భాషనుంచి ఎన్నో పదాలను గ్రహించాయి. కాని లీగ్ ప్రభ అంతరించడంతో లో జర్మన్ భాష ప్రాధాన్యం కూడా తగ్గిపోయింది. లో జర్మన్ మాండలికాలు ఎన్నో ఇప్పటికీ ఉత్తర జర్మనీ ప్రజల ఇళ్లలో వాడుకలో ఉన్నా, స్వల్పంగా సాహిత్యం కూడా ఆ భాషలో వెలువడినా, పరిపాలనలోను, సాహిత్యంలోను వాడదగిన ప్రామాణిక భాష ఏదీ అక్కడ రూపొందలేదు.

భాషా ధ్వనుల విషయంలో ముఖ్యంగా హల్లుల విషయంలో హై జర్మన్, లో జర్మన్ భాషల మధ్య భేదం కనిపిస్తుంది. జర్మన్ భాష సంస్కృతం లాగ పదాల చివర ప్రత్యయాలు చేరే భాష. దీనిలో ప్రథమా, ద్వితీయా, చతుర్థీ, షష్ఠీ అనే 4 విభక్తులు మాత్రమే ఉన్నాయి. క్రియలలో సంస్కృతంలో లాగ అనేక వికరణాలు ఉన్నాయి. సంస్కృతంలో లాగే వస్తు స్వరూపంతో సంబంధం లేకుండా కేవలం వ్యాకరణ నిర్దిష్టాలయిన స్త్రీ, పుం, నపుంసక లింగాలు ఈ భాషలో కనిపిస్తాయి. పదం ముందు ఉపసర్గల వంటివి చేర్చి కొత్త పదాలను సృష్టించేందుకూ, వేరు వేరు పదాలను కలిపి సమాసాలను రూపొందించేందుకూ ఈ భాషలో అవకాశం ఉంది. వెనుకటి రోజులలో ఈ భాష వ్రాయడానికి గోథిక్ లిపి వాడుకలో ఉన్నా, నేడు రోమన్ లిపినే వాడుతున్నారు.

**సాహిత్యం :** జర్మనీ, ఆస్ట్రియాలలోను, స్విట్జర్లండ్‌లో జర్మన్‌భాష మాట్లాడే ప్రాంతంలోనూ వెలసిన సాహిత్యం అంతా జర్మన్ సాహిత్యమే (ఆస్ట్రియన్-జర్మన్ సాహిత్య విశేషాలకు చూ. ఆస్ట్రియన్ సాహిత్యం).

జర్మన్ సాహిత్యం ఆది నుంచీ ఫ్రాన్స్ వంటి విదేశీ సాహిత్యాల ప్రభావాన్ని తనలో జీర్ణం చేసుకోడానికే ఎక్కువగా ప్రయత్నించినందువల్ల నిజమైన స్వతంత్ర జర్మన్ సాహిత్య సంప్రదాయం 18 వ శతాబ్ది చివరి దాకా ఏర్పడలేదు.

అనేక శతాబ్దాలపాటు జర్మనీ మత సంఘర్షణలకు నిలయం అయింది. చాలా ఆలస్యంగా గాని రాజకీయంగా జర్మనీ ఏకదేశం కావడం జరుగలేదు. చిన్న చిన్న జర్మన్ రాజ్యాల దుర్బల సమాఖ్యలో సాంస్కృతిక కేంద్రంగా ఉపయోగపడే ఒక ప్రధాన నగరం ఏదీ లేదు. అయితే - ఏక జాతిగా ఏర్పడే అవకాశం లోపించడం ఒక విధంగా జర్మనీకి మేలే చేసిందనవచ్చును. వివిధ స్థానిక కేంద్రాలలో జర్మన్ సాహిత్యం వృద్ధి పొందడం వల్ల జర్మన్ సంస్కృతిలో వైవిధ్యం ఏర్పడి, నిర్జీవమైన ఏకరూపత ఏర్పడకుండా అది నిరోధించింది.

యూరప్ ఖండంలోని ఆదిమ జర్మన్ తెగల లిఖిత గ్రంథాలు క్రీ.శ. 700 వ సంవత్సరం నుంచీ కనిపిస్తున్నాయి. అంతకు ముందు కూడా మౌఖిక సాహిత్య సంప్రదాయం కొనసాగి ఉంటుం దనడానికి ఆధారాలు ఉన్నాయి. ఆ సంప్రదాయానికి చెందినదే వీరులను ప్రశంసించే గీతాలతోనూ, క్రైస్తవేతర మత ప్రార్థనాగీతాలతోనూ, సమర గీతాలతోనూ కూడిన *హైల్డెన్ లీడర్.* క్రైస్తవ బోధనలను జర్మన్‌లకు అందజేయడం కోసం మతోద్యోగులు లాటిన్ నుంచి జర్మన్‌లోకి అనువదించిన గ్రంథాల వంటి చెప్పుకోదగిన సాహిత్యగ్రంథాలు కొన్ని 9 వ శతాబ్దంలో వెలశాయి.

**మధ్య హైజర్మన్ యుగం :** 1050 నుంచి స్థానిక సాహిత్య పునరుజ్జీవనం ప్రారంభమైంది. ఈ కాలం నాటి ఒక ప్రధాన సాహిత్య ప్రక్రియ 'మధ్యయుగ ఆస్థాన పురాణం' ( medieval court epic). ఈ రకం రచనలలో సాంప్రదాయిక గాథలు, రాజ కుటుంబ ప్రణయగాథలు, వీర సామంత ప్రభువుల మధ్య జరిగిన సమరాలు వర్ణించబడ్డాయి. జర్మన్ ఆస్థాన పురాణానికి గౌరవం తెచ్చిన కవులు ముగ్గురు: హార్ట్‌మన్ ఫాన్ ఆ, వోల్‌ఫామ్ ఫాన్ ఎషెన్‌బాహ్, గాట్‌ఫ్రీడ్ ఫాన్ శ్ట్రాస్‌బర్గ్. ఈ కాలంనాటి మరో ప్రధాన సాహిత్యప్రక్రియ 'మిన్నెసాంగ్' (ప్రణయ గీతం). దీనిలో కవి ఆస్థాన మర్యాదలను పాటిస్తూ తన ప్రేయసి పట్ల తన ఆరాధనా భావాన్ని ప్రకటిస్తాడు. 'మిన్నె గాయకుల' లో సుప్రసిద్ధుడు వాల్టెర్ ఫాన్ డెర్ వోగెల్‌వైడ్.

1450 ప్రాంతం నుంచీ ఒక నూతన దృష్టి ఏర్పడి సాహిత్యం మానవతావాదం వైపు మొగ్గు చూపింది. వ్యంగ్య పరిహాస ధోరణితోనూ, నీతిబోధక ధోరణితోనూ కూడిన ఈ నూతన సాహిత్యానికి మంచి ఉదాహరణగా గ్రహింపదగిన గ్రంథం: సెబాస్టియన్ బ్రాంట్ వ్రాసిన *డస్ నరెన్ షిఫ్* (1494-మూర్ఖుల ఓడ). ఆ యుగపు దుర్లక్షణా లన్నిటినీ అది పరిహసించింది.

జర్మన్ సాహిత్యంలో అతి ప్రాచీన కాలపు రచనలలో *డాస్ హిల్డె బ్రాండ్స్ లీడ్* ఒకటి. తండ్రీ కొడుకుల మధ్య యుద్ధం దీనిలో ఇతివృత్తం. వీర గాథలను వర్ణించే పద వాఙ్మయం (ballads) ప్రచారంలో ఉన్నకాలంలోనే జర్మన్ సాహిత్యంలో మధ్యయుగ ఛాయలు కనిపించాయి. 13 వ శతాబ్దం ఆరంభంలో ఐతిహాసిక కావ్యం *నిబులుంగెన్ లీడ్* వచ్చింది. తొలి అధ్యాయంలో హాగెన్, సీగ్ ఫ్రీడ్‌ల విరోధం, తరువాత హాగెన్, క్రీం హిల్ట్‌ల విరోధం గోచరించే ఈ వీరకావ్యంలో ప్రేమ, స్వామిభక్తి, వీర ధర్మం ఉదాత్తంగా పోషించబడ్డాయి. హోమెన్ స్టోఫెన్ కాలంలో ఉన్న హార్ట్‌మన్, వోల్ఫ్రిం ఫాన్ ఎషెన్‌బ్రాహ్, గోట్ ఫ్రీడ్ ఫాన్ శ్ట్రాస్‌బుర్గ్‌లు ఇలాంటి కావ్యాలను వ్రాయ సాగారు. నిరంతరం అన్వతంతో పోరాడి చివరకు విజయం సాధించిన పార్జివాల్ జీవిత కథను వోల్ఫ్రిం వ్రాశాడు. ట్రిస్టన్, ఇసాల్ట్‌ల ప్రణయగాథను గోట్ ఫ్రీడ్ వర్ణించాడు.

ఈ కాలంలోనే 'మిన్నె గాయకులు' అనబడే ప్రణయ కావ్య రచయితలు బయలుదేరారు. వీరిలో వాల్టర్ ఫాన్ డెర్ వోగెల్ వైడ్ ముఖ్యుడు. ఆస్ట్రియా వాసి అయిన రైన్‌మర్ ఫాన్ హాగెనే అనే కవికి తాను శిష్యుణ్ణి అని అతడు చెప్పుకున్నాడు. పోప్‌కు వ్యతిరేకంగా, రాజుకు అనుకూలంగా హృదయంగమమైన కవిత్వం వాల్టర్ రచించాడు. మధ్యయుగంలోని ఒక ప్రసిద్ధగాయకుడు టాన్ హోసెల్. ఇతణ్ణి గురించి ఎన్నో గాథలు ప్రచారంలో ఉన్నాయి.

15 వ శతాబ్దంలో జానపద వాఙ్మయం చాలా వచ్చింది. మధురమైన గేయాలలో హర్ష విషాదాలు, జీవన మరణాలు, మిత్రత్వ శత్రుత్వాలు దానిలో వర్ణించబడ్డాయి. సాహస కార్యాలు, సంయోగ వియోగానుభూతులు, ఋతు వ్యాపారాలు కళ్లకు కట్టినట్లు వర్ణించబడ్డాయి. ఇవి గోట్ ఫ్రీడ్ ఔగుస్ట్ బైర్గెర్ రచించిన *లెయొనారె* (1774) అనే కావ్యానికి ఆధారం అయాయి.

16 వ శతాబ్దంలో ఈ ధోరణిని అనుసరించిన 'మైస్టెర్ గాయకులు' అనే గాయక కవులు వచ్చారు. వీరిలో హన్స్ సాక్స్ (1494-1576) 40,000 గీతాలు వ్రాశాడు. *ఫాస్ట్ నాఖ్ట్‌స్పీలె* అనే హాస్యనాటకం కూడా ఇతడు వ్రాశాడు. ఇతని సమకాలికుడు మార్టిన్ లూథర్ కృషివలన జర్మనీ ప్రొటెస్టెంట్ చర్చ్ క్రిందికి వచ్చింది. రాష్ట్రీయత ఆవిర్భవించింది. 'పునర్వికాస' యుగం అవతరించి జర్మన్ సాహిత్యంలో సర్వతోముఖ వికాసం ఏర్పడడానికి దోహదం చేసింది.

ఈ నూతన చైతన్యం ఫలితంగా వచ్చిన మానవతా వాద ఉద్యమానికి యోహానిస్ రాయ్లిక్లిన్, డెసిడేరియుస్ ఎరాస్మస్, ఉల్రిఖ్ ఫాన్ హుట్టెన్‌లు నాయకులు. ఈ కాలంలో ప్రాచీన గ్రీక్, లాటిన్ సాహిత్య సంస్కృతులు పునరుద్ధరించబడ్డాయి. భావన విశృంఖలం అయింది. సమకాలిక వ్యావహారిక భాషలో కావ్యాలు వ్రాయడం ఆరంభించిన వారిలో మొదటి వాడు సెబాస్టియన్ బ్రాంట్.

అటు తరువాత కూడా జర్మనీలో రచయితలు లాటిన్, గ్రీక్ భాషలను వదలిపెట్టలేదు. చాలామంది రచయితలు లాటిన్‌లోనే వ్రాయసాగారు. 1617 లో మార్టిన్ ఓపిట్స్ మాతృభాషలోనే వ్రాయాలని ఆందోళన లేవదీసినప్పుడు జరిగిన వాదోపవాదాలన్నీ లాటిన్ భాషలోనే జరిగాయి. ఓపిట్స్ ఒక ఖండకావ్య సంపుటాన్నీ, జర్మన్ కవిత్వం మీద విమర్శక గ్రంథాన్నీ జర్మన్ భాషలో వ్రాసి ప్రచురించాడు. కాని, 1618 నుంచి సాగిన '30 సంవత్సరాల యుద్ధం' వలన మాతృభాషా కవిత్వోద్యమానికి అవరోధాలు ఏర్పడ్డాయి. 17 వ శతాబ్దంలో గ్రిమ్మెల్‌షౌజన్ వ్రాసిన *సింప్లిసిస్సియస్* అనే ఒకే ఒక ఉత్తమగ్రంథం ప్రచురించబడింది. ముక్కలు ముక్కలుగా విడిపోయి ఉన్న జర్మనీ దేశంలో ఫ్రెంచ్ భాషను పాలకులు ఆదరింపసాగారు. 18 వ శతాబ్దంలో లీప్సిగ్ నగరం సాహిత్యకేంద్రం అయింది.

**జర్మన్ సాహిత్య ప్రాదుర్భావం :** యోహాన్ క్రిస్టోఫ్ గోట్‌షెడ్ (1700-1766) తో 18 వ శతాబ్దంలో ఆధునిక జర్మన్ సాహిత్యానికి అంకురార్పణ జరిగింది. ఇతడు ఫ్రెంచ్ రచనలను అనుకరించడాన్ని ప్రోత్సహించాడు. సాహిత్యంలో శైలిని, రూపాన్ని ప్రధానంగా ఆదరించి, నియమబద్ధమైన రచనను ప్రచారంలోకి తెచ్చాడు. విషాదాంత నాటకాలలో హాస్య సన్నివేశాలు చేర్చాడు. తర్కపూర్ణం అయిన బౌద్ధికతకు ప్రాధాన్యం ఇచ్చిన ఇతని రచనల ప్రభావం తరువాతి జర్మన్ సాహిత్యం మీద ఎక్కువగా కనిపిస్తుంది. ఇతని సిద్ధాంతాన్ని ప్రతిఘటించి భావనా వ్యాపారానికీ, భావుకతకూ ప్రాముఖ్యం ఇచ్చినవాడు గొట్టిలీబ్ క్లోక్ స్టోక్ (1724-1803). ఇతని ఐతిహాసిక మహాకావ్యం: మెసియా. దీనిలో అవిరళమైన ఆవేగం, భావన కనిపిస్తాయి.

కవితా స్రవంతిని స్వేచ్ఛగా ఉంచ ప్రయత్నించిన 18 వ శతాబ్ది మధ్యకాలంలో వింకెల్మన్ మొదలైన వారి కృషివల్ల గ్రీక్ సాహిత్యానికీ, షేక్స్‌పియర్ రచనలకూ జర్మనీలో ప్రచారం ఏర్పడింది. కావ్యకళలో భావనా

వ్యాపారం తిరిగి ప్రధానం అయింది. ఈ మార్గంలో రచనలు చేసిన వారిలో రెస్సింగ్ ఒకడు. *హంబుర్గి షెడెమటుర్గీ* (1769) అనే గ్రంథంలో జర్మన్ నాటక రంగాన్ని ఇతడు సమీక్షించాడు. 1766 లో ఇతడు *లయోకూన్* అనే ఒక ఉత్తమ సౌందర్య మీమాంసా గ్రంథం రచించాడు. ఆ తరువాత గొయ్థే, షిల్లర్‌ల కావ్యసృష్టికి ఇది తోడ్పడింది. *మిస్ సారా సాంప్సన్* (1755), *మినాఫన్ బార్న్ హెల్మ్* (1767), *ఎమిలియా గలోటి* (1772), *నాథాన్ డెర్‌వైజ్* (1779) అనే నాటకాలు కూడా వ్రాశాడు. ఈ విధంగా జర్మన్ సాహిత్యంలో ఇతడు ఆధునిక యుగ ప్రవర్తకు డయాడు.

మానవ వ్యక్తిత్వం, కల్పన, భావుకత, సంచారిభావ జనితమైన అనుభూతులు గల కవిత్వం 18 వ శతాబ్దం చివర ఉద్భవించడంతో జర్మన్ సాహిత్య రంగంలో 'స్టుర్మ్ ఉండ్ డ్రాంగ్' అనే ఉద్యమాన్ని హెర్డర్ ప్రారంభించాడు. బుద్ధికి ప్రాధాన్యం ఇచ్చిన యాంత్రిక దృక్పథాన్ని త్రోసిరాజని ఇతడు జానపద గీతాల వైపుకి రచయితల దృష్టిని మరల్చాడు. ఇతని పర్యవేక్షణలో అనేక విదేశ సాహిత్య గ్రంథాలు జర్మన్‌భాషలోకి అనువదించబడ్డాయి.

**మహాకవి గొయ్థే :** జర్మన్ సాహిత్యాకాశంలో దేదీప్యమైన సూర్యుడిలాగ ప్రకాశించినవాడు యోహాన్ వుల్ఫ్ గాంగ్ గొయ్థే. సాత్విక భావాలకు ప్రాధాన్యం ఇచ్చి స్పైన్, షేక్స్‌పియర్ మొదలైన వారి రచనలనూ, గోథిక్ కళనూ అవగాహనం చేసుకుని, తార్కిక బుద్ధి కన్న ప్రతిభే మిన్న అని గ్రహించి, ఇతడు కవిత్వ రచనకు పూనుకున్నాడు. *గోయెట్స్ ఫాన్ బెర్లిషింగెన్* అనే నాటకాన్ని నవ్యభావనాశక్తి ప్రదర్శిస్తూ ఇతడు రచించాడు. ఆ తరువాత మధ్యయుగంనాటి ఫాస్ట్‌కథ ఇతణ్ణి ఆకర్షించింది. ప్రాపంచిక భోగాలు కోరి పెనుభూతంగా మారిన మెఫిస్టో ఫెలీస్‌కు తన ఆత్మను విక్రయించుకొన్న 'ఫౌస్ట్' చివరికి నరకానికి కొనిపోబడ్డా డని వెనుకటి కథ. కాని, గొయ్థే దృష్టిలో 'ఫౌస్ట్' ఆశయం ఆత్మతుష్టి. ఈ తుష్టిని సమకూర్చే పక్షంలో ఎలాంటి పెనుభూతానికైనా అతడు దాసుడు అవుతాడు. ఈ నాటకం పూర్వభాగంలో అద్భుతమైన కవిత్వం, కల్పన, భావన కనిపిస్తాయి. రెండవభాగం వ్రాయడానికి సుమారు 30 ఏళ్ల కాలం పట్టింది. ఈ లోగా ఒక భగ్న ప్రేమికుడి ఆత్మహత్యను గూర్చి తెలిపే *వెర్థెర్స్ లెయిడెన్* అనే నవల ఒకటి గొయ్థే రచించాడు. ఆ తరువాత *క్లావిగో, ఎగ్మంట్* అనే నాటకాలు, *విల్హెల్మ్ మైస్టర్* అనే నవల, అనేక గేయాలు వ్రాసి, జర్మన్ సాహిత్యాన్నే కాక యూరప్ సాహిత్యం అంతటినీ కూడా తన మార్గం వైపు మళ్లించుకోగలిగాడు. *డిష్‌టుంగ్ ఉండ్ వర్‌హీట్* (కవిత్వం - సత్యం) అనే పేరుతో ఒక ఆత్మ కథ కూడా గొయ్థే వ్రాశాడు.

గొయ్థేకు సమకాలికుడైన షిల్లర్ (1759-1805) *డీబర్* (దొంగలు) అనే నాటకంలో సాంప్రదాయికంగా వస్తున్న సాంఘిక మర్యాదలను విమర్శించాడు. ఇతడు రచించిన *ఫీస్కో* అనే నాటకం ప్రజాదరణ పొందలేదు. *కబలే ఉండ్ లీబే* (కుట్ర - ప్రేమ) అనే నాటకంలో ఇతని సొంత అనుభవాలూ, పాత్రపోషణలో వాస్తవికతా, ఆవేగం ఉన్నాయి. *డాన్ కార్లోస్* అనే పద్యనాటికలో కూడా ఇతని జీవితానుభవాలు కొన్ని కనిపిస్తాయి. 30 ఏళ్ల యుద్ధ చరిత్రను *వాలెన్ స్టైన్, డీజంగ్ ఫ్రన్ ఫన్ ఆర్లియన్స్, విల్హెల్మ్ టెల్* అనే ఉత్తమనాటకాలుగా షిల్లర్ వ్రాశాడు. అనేక గేయాలు కూడా ఇతడు రచించాడు. ఆ గేయాలలో ఉన్న కల్పన, భావన, శబ్ద సంయోజన, సౌందర్యం, లయ అద్వితీయాలు.

హాల్డెర్లిన్ (1770-1843) కవిత్వంలో నవ్య భావుకత కనిపిస్తుంది. ఉన్మాద స్థితికి చేరువగా ఉన్న కాలంలో ఇతడు వ్రాసిన గేయాలు హృదయాన్ని స్పందింపచేసేవి. మానవాతీతమైన పాత్రలతో కథలు అల్లినవాడు హాఫ్మన్ (1776-1822). యక్ష, కిన్నరుల గాథలు రచించిన టీక్ (1773-1853) కొన్ని నాటకాలు కూడా వ్రాశాడు. ఇదే సమయంలో ష్లెగెల్ సోదరులు నవ్య యుగ సాహిత్యాన్నీ, నాటక సాహిత్యాన్నీ సమీక్షిస్తూ ఉత్తమ వ్యాసాలు వ్రాశారు. బ్రెంటానో (1778-1842) కథలు అటు తరువాత రచయితలకు ఇతివృత్తాలను సమకూర్చాయి. రిక్టర్ (1763-1825) రచనలలో ఛాయావాదం, రహస్యవాదం గోచరిస్తాయి. నొవాలిస్ (1772-1901) పద్యాలలోని రహస్యవాదం, ప్రతీకావాదం శబ్దలాలిత్యంతో మిక్కిలి ఆస్వాద్యాలుగా సాగాయి. మధ్యేమార్గం అవలంబించి అతిలోక భావనను గాని, వాస్తవికతను కాని గ్రహించకుండా చక్కని పద్యాలు చెప్పినవాడు యూసెఫ్ ఫన్ ఐచెన్‌డోర్ఫ్ (1788-1857). ఈ యుగంలో వెలసిన ఉత్తమ నాటకకర్త హైనిఖ్ వాన్ క్లెస్ట్ (1777-1811). నిరాశాపూరితాలైన ఇతని నాటకాలలో *ప్రిన్జ్ ఫ్రీడిష్ ఫన్ హోంబుర్గ్* శ్రేష్ఠమైంది.

12 వ శతాబ్దంలో జర్మన్ సాహిత్యంలో మంచి నవలలు రాలేదు. 'రొమాంటిసిజమ్' (కాల్పనిక వాదం) యుగం అంతరించగానే 'రూపవాదులు' (formalists) తిరిగి విజృంభించారు. ఆత్మానుభూతి, వ్యక్తిగతమైన

ఊహలు, పదలాలిత్యం వెనుకబట్టాయి. ఈ కొత్తకవితా ప్రస్థానంలో అగ్రగణ్యుడు హైన్రిఖ్ హైన్ (1793 - 1856). ఆత్మవిమర్శ, సంఘ పరామర్శ, ఆత్మావహేళనం, వ్యాజోక్తి ఎక్కువగా ఇతని రచనలలో కనిపిస్తాయి. 'గీతావళి'లో కొంతవరకు ఇతడు వెనుకటి మార్గాన్నే అనుసరించినా, 'ఉత్తర సముద్రం' అనే ఖండకావ్య సంపుటిలో స్వచ్ఛమైన భావావేశం, ఉద్రేకం వ్యక్తం అయాయి. 1831 నుంచి ఇతడు పారిస్‌లో ప్రవాసిగా ఉండి *అట్టాట్రోల్, డాయిట్ష్‌లండ్* అనే ఖండకావ్యాలు ప్రచురించాడు. ఇతని చేతులలో వచన రచన లలితకళగా పరిణమించింది.

అన్నెట్టెఫన్ డ్రొస్టెహుయెల్షోఫ్ (1797-1848), మొయెరికె (1804-75) ల కావ్యాలలో భావన, ప్రకృతివర్ణన ప్రాధాన్యం వహించాయి. నికొలౌస్ లెనౌ (1802-1850), ఔగుస్ట్ ఫన్ ప్లాటెన్ (1796-1835) ల కావ్యాలలో రూపసృష్టి ఉత్తమ స్థాయికి చెందింది. వస్తు తంత్రాత్మకమైన గేయరచన చేసినవాడు రిచర్ట్ డేమెల్ (1863-1920). స్టెఫెన్ గెయెయోర్గె (1868-1933) రచనలలో కల్పన, ఆధ్యాత్మికత గోచరిస్తాయి. దైన్యం, ఆశ్చర్యం, ఉత్కంఠ ఇతని రచనలలో ప్రముఖంగా కనిపిస్తాయి. రైనర్-రిల్కె (1875-1926) అనే ప్రేగ్ నగరపు కవికి సంపూర్ణంగా భాష వశమై భావానుగుణంగా నడిచింది. *డుయి నెసె ఎలెగేన్* అనే కావ్య సందోహంలో ఇతని ప్రతిభ విదితం అవుతూంది. ఇతని మృత్యు గీతాలలో *డీసానెటె, అన్ ఓర్ఫియుస్* ప్రశస్తమైనవి. హ్యూగోఫన్ హోఫ్‌మన్‌స్టాల్ (1874-1929) నాటక రచయితగా పేరు గడించాడు. ప్రతీకావాదాన్ని ఆశ్రయించి, ఉత్కంఠనూ, అస్తిత్వవాద దృష్టినీ ప్రదర్శించే కావ్యాలు వ్రాసిన వారిలో ట్రాక్ల్ (1887-1914) ముఖ్యుడు. నేటి అభివ్యక్తి వాదులలో వెర్ఫెల్ (1890-1945), ఓస్కార్‌య లోయెర్కె (1884-1941), హైన్ హెబెర్ (1892-1945) ఎన్నదగినవారు. నవ్యమార్గాన్ని అవలంబిస్తున్న వారిలో హోల్థూసెన్ (జ. 1913) ఒకడు. నాటక రంగంలో హౌప్ట్‌మన్, వెడెకిండ్ మొదలైనవారి కృషి మీద ఇబ్సెన్ ప్రభావం కనిపిస్తుంది.

19 వ శతాబ్దంలో దార్శనిక జగత్తునీ, సాంఘిక సమస్యలనూ పూర్తిగా మథించి నూతన దృక్పథాన్ని ఆవిష్కరించిన కాంట్, ఫిష్టె షెల్లింగ్, హెగెల్, షోఫెన్ హౌవర్, నీట్షే వంటి జగత్ ప్రసిద్ధ దార్శనికులు జర్మన్ రచయితలే! వీరందరూ సౌందర్య మీమాంసా జగత్తును సుప్రతిష్ఠితం చేయదలచినవారు కూడా. మార్క్స్ కూడా ఆ శతాబ్దంలో జర్మనీలో ఆవిర్భవించిన రచయితే! వీరందరి ప్రభావం 20 వ శతాబ్దంలోని ఆర్థిక, రాజకీయ, నైతిక, సాంఘిక రంగాలమీద విస్పష్టంగా కనిపిస్తూంది.

నేటి విఖ్యాత రచయిత థామస్ మన్ (1875-1955) రచించిన అత్యుత్తమ నవల *డీ బుడ్డెన్ బ్రూక్స్*. మధ్య తరగతికి చెందిన ఒక వాణిజ్య కుటుంబాన్నీ, ఆ కుటుంబంలో పుట్టిన ఒక కళాకారుడి జీవితాన్నీ దీనిలో అతడు వర్ణించాడు. *డెర్ టోడ్ ఇన్ ఫెన్‌డిగ్‌*లో సంప్రదాయ విచ్ఛేదం వల్ల కలిగే ఫలితాలను వివరించాడు. క్షీణదశను చిత్రించే నవలలలో *బిల్డింగ్స్ రోమాన్, డెరెట్స్ బెరెబెర్గ్* ముఖ్యమైనవి.

ఓటమి, నిరాశ ప్రధాన ఇతివృత్తంగా గల ఫ్రాంజ్ కాఫ్కా (1883-1924) నవలలలో *డెర్‌ప్రోట్సెజ్, డాన్ష్లోస్* ప్రధానాలు. రెండు ప్రపంచ యుద్ధాల మధ్య కాలంలో స్టిఫాన్‌ట్స్వేగ్ (1881-1942) వ్రాసిన డెర్ స్ట్రైట్ ఉండెన్ సెర్గె యెష్టెన్ గ్రీషా ఉత్తమమైంది. ఎరిఖ్ మరియా రిమార్క్ (1898), హెర్మన్ హెస్ (1877-1962), ముసిల్ (1880-1942) మొదలైన ఎందరో ఇతర నవలా రచయితలు కూడా జగత్ ప్రసిద్ధు లయారు. చారిత్రక నవలలు వ్రాసిన వెర్నెర్ బెర్గెన్ గురెన్ (జ.1892) సునిశితమైన మేధతో యథార్థ పరిస్థితులను చిత్రించాడు. ఆధునిక కవులలో హన్స్ ఎగోన్ హూల్డ్ హుసెన్ నేటికీ జర్మన్ కవిత సజీవంగా ఉందని చాటుతున్నాడు.

**నాజీల పాలనలో జర్మన్ సాహిత్యం :** నాజీల హయాములో ఆధునిక జర్మన్ సాహిత్యం అనేక ఆంక్షలకు గురి అయింది. 1933 తరువాత ప్రముఖ జర్మన్ రచయిత లెందరో దేశం వదలిపోయి విదేశాలలో తలదాచుకోవలసి వచ్చింది. వారిలో చాలా మంది యుద్ధానంతరం కూడా జర్మనీ తిరిగి రాలేకపోయారు. 1945 లో యుద్ధం ముగిసే నాటికి జర్మనీలో సాంస్కృతిక శూన్యత వ్యాపించి ఉంది. ఫ్రాంజ్ కాఫ్కా, బ్రెటోల్డ్ బ్రెఖ్ట్ లు ప్రవాసంలోనే తమ ఉత్తమ రచనలు వెలువరించారు. బ్రెఖ్ట్ ప్రతిపాదించిన 'ఎపిక్ థియేటర్' (పౌరాణిక రంగస్థలం) వాదాన్ని స్విస్ నాటక రచయితలు ఫ్రీడ్రిఖ్ డుర్రెన్ మాట్, మాక్స్ ఫ్రిష్‌లు అనుసరించారు.

**యుద్ధానంతరం జర్మన్ సాహిత్యం :** యుద్ధానంతరం జర్మన్ సాహిత్యంలో శైలిలోనూ, భావనా ధోరణుల

లోనూ వైవిధ్యం కనిపించింది. పశ్చిమ జర్మనీలో '47గురు రచయితలవర్గం' వారు సాహిత్య రంగంలో నాయకత్వం వహించారు. ఆ వర్గానికి చెందిన వారే హైన్రిఖ్ బోల్, గ్యుంటెర్ గ్రాస్, పీటర్ హాండ్కె, ఊవే జాన్సన్ అనే నవలా రచయితలు. రహస్య వాది రచయిత ఆర్నోష్మిడ్ (1914 -) భాష విషయంలో నూతన ప్రయోగాలు చేస్తున్నాడు. పీటర్ వైస్ రాజకీయ దమన విధానాన్ని నిరసిస్తూ ప్రజలందరికీ అర్థం అయే సామాన్య భాషలో నాటకాలూ, నవలలూ వ్రాస్తున్నాడు.

పో.సు.శా.(బొ.శ్రీ.)

## జార్జియన్ భాష - సాహిత్యం

**భాష :** రష్యాలోని జార్జియా రాష్ట్ర ప్రజలచే వ్యవహరింపబడుతున్న జార్జియన్ భాష పూర్వపు సోవియెట్ సోషలిస్ట్ రిపబ్లిక్‌లో అధికార భాష. ఇది తూర్పు జార్జియన్, పశ్చిమ జార్జియన్ అనే రెండు ప్రముఖ శాఖలుగా విస్తరిల్లి, వివిధ మాండలిక రూపాలతో ప్రచారంలో ఉంది. అజెర్‌బైజాన్, ఉత్తర తుర్కీల లోనూ, ఇరాన్‌లోని ఇస్పహాన్ రాష్ట్రంలోని 14 గ్రామాలలోనూ కూడా ఈ భాష వ్యవహారంలో ఉంది. బైజాన్టియమ్, పర్షియా భాషలనుండి కొన్ని లక్షణాలను గ్రహించిన జార్జియన్ దక్షిణభాష కాకేషియన్ భాషా కుటుంబానికి చెందింది. ఈ భాషా సాహిత్యం 5 వ శతాబ్దంలో శాసన రూపంలో తొలుతగా లభిస్తోంది. ప్రాచీన జార్జియన్ యుగానికి చెందిన (5 వ, 11 వ శతాబ్దాల మధ్యకాలం) అనేక రచనలు లభిస్తున్నాయి. ఆర్మీనియన్ నుంచి అనువదించిన *బైబిల్* వాటిలో ఒకటి. 12 వ శతాబ్దంలో తూర్పు జార్జియన్ మాండలికం ఆధారంగా నవ్య జార్జియన్ సాహిత్య భాషను రూపొందించారు. 19 వ శతాబ్దం మధ్యభాగానికి అది పరిణత రూపాన్ని సంతరించుకొంది. అప్పటివరకూ ప్రాచీన జార్జియన్ భాషనే మతావసరాలకు ఉపయోగించేవారు. ప్రాచీన జార్జియన్‌లో 5 అచ్చులు, 30 హల్లులు ఉంటే , నవీన భాషలో 5 అచ్చులు 28 హల్లులు మాత్రమే ఉన్నాయి. దీనిలోని భాషా భాగాలు ఇండో-యూరపియన్ భాషలలో లాగే ఉన్నాయి.

జార్జియన్ భాషకు రెండు రకాల వర్ణమాలలను ఉపయోగించారు. ఖుట్సురి అందులో మొదటిది. అది ప్రస్తుతం వాడుకలో లేదు. రెండవది మ్ఖెద్రులి. అచ్చులోను, వ్రాతలోను కూడా దీనినే వాడుతున్నారు. రెండింటినీ ఎడమనుంచి కుడికే వ్రాస్తారు. ఈ వ్రాతను మెస్‌రోబ్ కనిపెట్టాడని ఒక వాదం ఉంది. మరొక వాదం ప్రకారం మొదటి జార్జియన్ రాజు పర్నివాజ్ 3 వ శతాబ్దంలో మ్ఖెద్రులికి వర్ణ సమామ్నాయం రూపొందించాడు. అయితే ఈ రెండు శాఖలకు గల సంబంధం స్పష్టంగా తెలియటం లేదు. బహుశః రెండు శాఖల వర్ణమాలలూ గ్రీక్ ప్రభావంతో అరమాయిక్ అక్షరాల నుంచి పుట్టి ఉండవచ్చును. మ్ఖెద్రులి రెండింటిలోను ప్రాచీన మయింది.

**సాహిత్యం :** 4 వ శతాబ్దం ప్రారంభంలో సెయింట్ నైనో (Nino) పాలనలో జార్జియన్‌లు క్రైస్తవ మతం స్వీకరించారు. ఆ నాటినుంచే వాళ్ల సాహిత్యచరిత్ర కూడా ప్రారంభమైంది. క్రైస్తవ మత గ్రంథాలను దేశభాషలో ప్రచారం చేయడానికి వారికి అక్షరమాలను కనిపెట్టవలసి వచ్చింది. 5 వ శతాబ్దంలో ఆర్మీనియన్ నుంచి *బైబిల్‌*ను అనువదించారు. ప్రాచీన గ్రీక్ సన్యాసుల రచనలతో పాటు వారి మత సిద్ధాంతాలూ, సంకీర్తనలూ, స్తోత్రాలూ కూడా అనువదించు కున్నారు.

జార్జియన్ భాషలో స్వతంత్ర సాహిత్యం సన్యాసుల జీవిత చిత్రణతో ఆరంభమైంది. సెంట్ షూనిక్ జీవితం ఇందుకు నిదర్శనం. దీనిలోని శైలి మిక్కిలి హృద్యంగా ఉంటుంది. ఈ కాలంలోనే జార్జియా క్రైస్తవ మతాన్ని స్వీకరించిన వృత్తాంతాన్నీ, వక్తాంగ్ గోర్గతాల్ ప్రభువు చేసిన సాహస కృత్యాలనూ వర్ణించే చరిత్ర గ్రంథాలు కూడా కొన్ని రచింపబడ్డాయి. మొట్టమొదట బౌద్ధగాథకు క్రైస్తవమత తత్త్వాన్ని ఆపాదించినవారు జార్జియన్‌లే.

తరువాతి యుగంలో ఇతిహాసాలూ, కావ్యాలూ వెలువడ్డాయి. వాటిలో ముఖ్యమైంది మోసెస్ వ్రాసిన *అమిరాన్-దరిజానియాని* (12 వ శతా.), షోటారుస్తవేలి వ్రాసిన *వేప్‌ఖిస్-త్కోసాని* (పులితోలు కప్పుకొన్న మానవుడు) అనే కావ్యంతో వీరకావ్య రచనలో స్వర్ణయుగం ఆరంభమైంది. ఇది టమార్ రాణికి అంకితం చేయబడింది. మంగోలుల దండయాత్రలు ముగిసిన తరవాత 17 వ, 18 వ శతాబ్దాలలో సాహిత్యం తిరిగి వికాసం పొందింది. మొదటి టేమరజ్, అర్చిల్, డేవిడ్ గురమిష్విలి అనేవారు ఈ కాలపు ప్రముఖ రచయితలు. అలెగ్జాండర్ చవచవడ్జె, నికొలస్ బరతష్విలి అనే కవులు కాల్పనికోద్యమానికి నాయకులు. 19 వ శతాబ్దంలో ఈలియా చవచవడ్జె, ఆకాకిట్సెరెటెలి అనేవారు చారిత్రక వస్తువును తీసికొని కావ్యాలూ, గేయాలూ వ్రాసి ప్రజలలో జాతీయ భావం రగిల్చారు. ఇంతే కాక జార్జియన్ సాహిత్యంలో జానపద గేయాలూ, పద్యాలూ విస్తారంగా ఉన్నాయి.

జార్జియన్ సారస్వతంలో నాటకాలు కూడా అభివృద్ధి చెందాయి అనడానికి రెండవ ఎరిక్లె (1762-98) కాలంలో టిఫ్లిస్‌లో ఒక ఆస్థాన నాటకశాల ఉండడమే తార్కాణం. రష్యన్ ఆక్రమణవల్ల కొంతకాలం ఆ సారస్వతం వెనుకపడింది. కాని 1850 లో జియోర్జీ ఎరిష్టవి జాతీయ నాటకశాల స్థాపించడంతో అది తిరిగి అభివృద్ధి చెందడం ఆరంభ మయింది. 1952 లో జార్జియాలో 27 నాటకశాలల్లో దేశీయ, విదేశీయ నాటకాలు ప్రదర్శించేవారట!

ఆధునిక కాలంలో వచనవాఙ్మయం, నవలలు వేగంగా అభివృద్ధి చెందుతున్నాయి. సుల్ఖాన్ సబా అర్బెలియాని (1658-1725) *ది బుక్ ఆఫ్ విజ్డమ్ అండ్ లైస్* అనే సుప్రసిద్ధ నీతికథా గ్రంథాన్ని వ్రాశాడు. 18 వ శతాబ్దంలో వఖుష్ట్ రాకుమారుడు జార్జియా చారిత్రక, భౌగోళిక పరిస్థితులను వర్ణించే గ్రంథాన్ని వ్రాశాడు. అయోన్, సాలమన్, డొడ్‌ష్విలి అనేవారు హేళన కావ్యాలకు, పత్రికారచనకు పునాదులు వేశారు. ఈలియా చవచవడ్జె చేతిలో సాంఘిక నవలకు సమగ్రత సిద్ధించింది. *డు యు కాల్ దిస్ ఏ మాన్* (Do you call this a man-1963) అనేది అతని ప్రసిద్ధ నవల. అలెగ్జాండర్ ఖజ్‌బెగి, డేనియల్ చొంకడ్జె, నైచెలి మొదలైన వారు ప్రముఖ నవలా రచయితలు. ఈ నవలాకారులు ఉత్తమసృజన సాహిత్యాన్ని సృష్టిస్తూ జార్జియన్ భాషకు కీర్తిని తెస్తున్నారు.

చిం.వెం.

## జెకోస్లోవక్ భాష - సాహిత్యం

**భాష :** 'జెకోస్లోవక్ సోషలిస్ట్ రిపబ్లిక్' అనబడే దేశం యూరప్ ఖండం నడిబొడ్డున ఉంది. దీనికి సముద్ర తీరం లేదు. దీని విస్తీర్ణం 49,375 చదరపుమైళ్లు (1,27,881 చదరపు కిలోమీటర్లు). రాజధాని ప్రేగ్ నగరం. దీనికి దక్షిణాన ఆస్ట్రియా హంగరీ దేశాలు, తూర్పున యూక్రేన్, ఈశాన్యదిశలో పోలెండ్, వాయవ్య దిశలో తూర్పు జర్మనీ, పశ్చిమదిశలో పశ్చిమ జర్మనీ దేశాలు ఉన్నాయి. 1984 జనాభా లెక్కల ప్రకారం ఈ దేశం జనాభా 1,54,66,000. 1918 లో ఈ దేశం స్వతంత్ర రాజ్యంగా అవతరించింది.

ఇండో-యూరపియన్ కుటుంబంలోని స్లోవానిక్ శాఖలోని పశ్చిమ వర్గానికి చెందింది జెక్ భాష. ఈ భాష నేటికీ ప్రత్యయాత్మకతను కోల్పోకుండా వ్యవహారంలో నిలచి ఉంది. ఈ భాషలో మూడు లింగాలూ, ఏడు విభక్తులూ ఉన్నాయి. భూత, భవిష్యద్, వర్తమాన కాలాలలో సమాపక, అసమాపక క్రియా రూపాలు రెండే ఉంటాయి. కొన్ని మాండలికాలలో ఉన్న ద్వివచనం కాలక్రమేణా లోపించింది. ఈ భాషను రోమన్ లిపిలోనే వ్రాస్తారు. వాక్య నిర్మాణం ప్రాచీనార్యభాషా పద్ధతికి చెందిందే!

**సాహిత్యం :** 9 వ శతాబ్దిలో ఆ నాటి ఫ్రాంకిష్ (జర్మన్) ప్రభావాన్ని త్రిప్పి కొట్టడానికి సెయింట్ సిరిల్, మెథోడియన్‌లు 'ప్రాచీన చర్చ్ స్లోవానిక్' అనే భాషను రూపొందించి ప్రచారం చేశారు. మత విషయికమైన గేయాలూ, ప్రార్థనా గీతాలూ, ప్రాచీన గాథలూ, యమకంతో కూడిన ఒక విధమైన గీతికలూ వంటివి 13 వ శతాబ్దిలో ప్రజలలో ప్రచారంలో ఉండే వని భావించడానికి అవకాశాలు ఉన్నాయి. కాని, ఆ తరువాత సాహిత్య భాషగా స్లోవానిక్ భాష స్థానాన్ని లాటిన్ భాష ఆక్రమించి, 18 వ శతాబ్ది వరకూ అదే కొనసాగడం సంభవించింది. కాని ఆ తాకిడిని తట్టుకుని జెక్‌భాష స్వతంత్రంగా నిలబడగలిగింది. ముఖ్యంగా కర్షక జీవితాన్ని జెక్ సాహిత్యం చిత్రించింది.

14 వ శతాబ్దం నుంచీ జెక్ భాషలో సాహిత్యం ఉందనడానికి నిదర్శనాలు కనపడుతున్నాయి. ఆ శతాబ్దంలో జెక్ ప్రజలకు పశ్చిమ యూరప్‌తో కలిగిన సాన్నిహిత్యం వలన ఆ భాషలో చెప్పుకోదగినంత అభివృద్ధి కలిగింది. మహాకావ్యాలూ, పురాణాలూ, రూపకాలూ, చారిత్రక కావ్యాలూ, మతపరమైన నీతిబోధకమైన గ్రంథాలూ వెలువడ్డాయి. 1350 నుంచే ఈ భాషలో లాటిన్ రచనా రీతులు చోటు చేసుకున్నాయి. గద్య సాహిత్యం బాగా వృద్ధి పొందింది. సాధువుల జీవిత కథలు, 'వృత్తాంతాలు' (chronicles) తో ప్రారంభం అయి మధ్యకాలంలో ప్రజా జీవనాన్ని ప్రతిబింబించే కథా సాహిత్యం కూడా ప్రజాదరణ పొందింది. ఆ శతాబ్ది చివర రాచరికానికి వ్యతిరేకంగా సాగిన బొహిమియన్ ఉద్యమాన్ని బలపరుస్తూ స్మిల్ ఫ్లాస్కా రచించిన *నోవారాడా* (Novarada - The new council) వంటి రాజకీయ రచనలు వెలువడ్డాయి.

ఆ శతాబ్ది అంతంలో జెక్ సాహిత్యం లౌకికం, ధార్మికం అని రెండు శాఖలుగా ఏర్పడింది. లౌకిక సాహిత్యంలో గద్య సాహిత్యం ఎక్కువగా ప్రజలకు సన్నిహితం అయింది. 15 వ శతాబ్దంలో జాన్ హస్ ప్రారంభించిన హసైట్ ఉద్యమం మత సంస్కరణకు దోహదం చేసి రెండు శతాబ్దాల పాటు పశ్చిమ యూరప్ ప్రభావం నుంచి జెక్ ప్రొటెస్టెంట్‌లను కాపాడింది.

జెక్ సాహిత్యానికి జాన్ హస్ నూతనరూపం కల్పించాడు. జాతీయభాషలో పటిష్ఠమైన ఉపన్యాసాలు రచించి జెక్ లేఖన విధానానికి ఒక ప్రామాణిక గ్రంథం సమకూర్చాడు. అతని అనుయాయులలో ఒకడైన పీటర్ చల్‌సికి రచించిన గ్రంథాలు విప్లవాత్మక, సామ్యవాద భావాలతో నిండి 'బొహీమియన్ సౌభ్రాత్ర సంఘం' వంటి సంస్థల ప్రాదుర్భావానికి దారి తీశాయి. ఫ్రెంచ్ భాషకు రూసో, రష్యన్‌భాషకు టాల్‌స్టాయ్ ఎలాంటివారో జెక్ సాహిత్యానికి చల్‌సికి అలాంటివాడని ప్రసిద్ధి. అతని రచనలు 'మొరేవియస్ చర్చ్'ని అనుసరించి ఏర్పడిన 'బొహీమియన్ బ్రదరెన్' ద్వారా జెక్ జాతీయ సాహిత్య వికాసానికి ఎంతగానో తోడ్పడ్డాయి.

16 వ శతాబ్దం నాటి జెక్ సాహిత్యం ముఖ్యంగా నీతి బోధనకు, వైదుష్య ప్రకటనకు పూనుకుంది. ఆ పునరుజ్జీవన యుగంలో పశ్చిమ యూరప్ నుంచి వచ్చిన మానవతా వాదం జెక్ సాహిత్యాన్ని ప్రభావితం చేసింది. ఆ కాలంలో 'యాత్రా దర్శినులు' బాగా ప్రజాదరణ పొందాయి. *క్రేలిస్ బైబిల్* అని పేరు గాంచిన *బైబిల్‌కి* జెక్ భాషానువాదం ఆ యుగపు సాహిత్యంలో పేర్కొనదగిన రచన. అది ఆ నాటి జెక్ సాహిత్య భాషకు ప్రామాణికం అయి ఒజ్జబంతి అయింది. ఈ *బైబిల్‌*ను అనువదించిన జాన్ బ్లహస్లాల్ ఆ నాటి రచయితలలో ప్రముఖులు.

1620 లో హబ్స్‌బర్గ్‌లు హుస్సైట్ బొహిమియాను జయించడంతో దేశంలో రాజకీయ కల్లోలం చెలరేగింది. ప్రొటెస్టెంట్‌ల పాలన అంతరించి కేతరిన్ హబ్స్‌బర్గ్‌ల పాలన రావడంతో అంతకు ముందు 2 శతాబ్దాల నుంచి ప్రగతి పథంలో ఉన్న జెక్ సాహిత్యానికి గ్రహణం పట్టింది. కొందరు పండితులు దేశం వదలి వలస వెళ్లిపోయారు. అలా ప్రవాసం పాలయిన పండితుల నోళ్లలో జెక్ సాహిత్యం తల దాచుకోవలసి వచ్చింది. ప్రవాసంలో ఉండి జెక్‌భాషా సేవ చేసిన వారిలో జాన్ అమోస్ కామెన్‌స్కీ ప్రముఖుడు. విద్యా విధానాన్నీ, దివ్య జీవనాన్నీ వివరిస్తూ అతడు చేసిన రచనలు యూరప్ ఖండం అంతటా పేరు పొందాయి. అతని రచన *లాబిరింత్ స్వేటా ఎరాజ్ క్రెడ్స్* (1631) గద్య సాహిత్యానికి శిరోభూషణంగా భావించబడుతూంది. కాని 18 వ శతాబ్ది అంతానికి ఆస్ట్రియన్ ప్రభుత్వం చేసిన శాసనాల ఫలితంగా జెక్‌భాష సాహిత్య భాషగా ఉపయోగపడడం నిలిచిపోయింది.

ఆస్ట్రియన్‌ల నిరంకుశ చర్యలే జెక్‌జాతీయులలో భాషాభిమానాన్ని రేకెత్తించి జెక్‌సాహిత్య పునరుద్ధరణకు కారణం అయాయి. ఆ ఉద్యమంలో ముఖ్యపాత్రధారి జోసెఫ్ డోబ్రోవ్‌స్కీ. అతడు జెక్ సాహిత్య భాషను పునరుద్ధరించి మార్గదర్శకుడయాడు. అతడు గొప్ప భాషా తత్త్వవేత్త; చారిత్రకుడు; ప్రముఖ రచయిత. ఆ నాటి సాంఘిక రాజకీయ పరిణామాలు ఒక క్రొత్త తరం పాఠకులను సమాయత్తం చేశాయి. డోబ్రోవ్‌స్కీ ప్రోత్సాహ ఫలితంగా రచనలు చేసిన ఆంటోవిన్ జారాశ్లావ్ క్రెచ్‌మేజర్ జెక్ సాహిత్యంలో ప్రథమ మహాకవి అయాడు.

అటు తరవాత 19 వ శతాబ్దంలో జెక్ సాహిత్యం కాల్పనికోద్యమం ప్రభావానికి లోనయింది. ప్రముఖ రచయితలు ఎందరో వివిధ రచనా ప్రక్రియలు చేపట్టారు. వారిలో జోసెఫ్ జెంగ్‌మన్ (1773-1847) జాన్ మిల్టన్ వ్రాసిన *పేరడైజ్ లాస్ట్‌*కు చేసిన అనువాదం (1811), 'జెక్-జర్మన్ మహా నిఘంటువు' (1835-39) ఆ ఉద్యమానికి దోహదం చేశాయి. అలాగే ఫ్రాంటిసెక్ పాలెస్కీ (1798-1876) తాత్త్విక గ్రంథరచయితగా ప్రసిద్ధి పొందాడు. వాక్లావ్ హాంకా అనే కవి మధ్య యుగాలలో రచించిన కవితల లిఖిత ప్రతులు కూడా పునరుద్ధరింపబడి పాఠకుల ఉత్సాహాన్ని ఇనుమడింప చేశాయి. అంత ప్రముఖులు కాకపోయినా మరికొందరు కవులు కూడా తమ రచనలతో జెక్ సాహిత్య సంప్రదాయాన్ని కొనసాగించగలిగారు. పద్యకావ్య రచయితగా ప్రసిద్ధి పొందిన జోసెఫ్ కరెషన్‌టైల్ జెక్ జాతీయ రచయిత. రూపక రచయితలలో వెన్సిస్‌లావ్ జ్రచెక్ (1828-1931) ప్రసిద్ధుడు. జూలియస్ జెయ్యర్ (1841-1901) పద్యకావ్య రచయితగానే కాక నవలా రచయితగా కూడా ప్రసిద్ధి పొందినవాడు.

మిగతా యూరప్ ఖండంలో లాగే జెక్ సాహిత్యంలో కూడా రొమాంటిక్ ఉద్యమం విజృంభించింది. జెక్ కవులలో సర్వ శ్రేష్ఠుడుగా భావింపబడే కారెల్ హైనెక్ మాచా వారికి నాయకుడు. 19 వ శతాబ్ది మధ్య కాలంలో ఈ రొమాంటిక్ ఉద్యమానికి ప్రతిఘటన ఏర్పడింది. రాజకీయ రచయిత కారెల్ హవ్లిసెక్ బొరోవ్‌స్కీ, నవలారచయిత బోజేన నెయ్‌కోవా - ఈ ఇద్దరూ దైనందిన సంఘటనలు ఇతివృత్తంగా స్వీకరించి ప్రాచీన సాహిత్య ధోరణి నుంచి జెక్ సాహిత్యాన్ని మరలించి క్రొత్త పుంతలు తొక్కించారు. మాచా రచించిన పురాణకావ్యం *మాజ్* (Maj) పేరు మీదుగా ఏర్పడిన మాజ్ వర్గీయులు యూరపియన్ సాహిత్యం చేత ప్రభావితమైన నూతన జెక్ సాహిత్యసృష్టికి అంకురార్పణ

చేశారు. కెరొలినా స్వెట్లా అనే నవలా రచయిత, వితెజ్జిశ్లావ్ అనే కవి వారిలో ప్రముఖులు. ఇంగ్లీష్, ఫ్రెంచ్, ఇటాలియన్ సాహిత్యాలనుంచి దిగుమతి అయిన అనేక అనువాద గ్రంథాలు 'జెక్ సాహిత్య చేతనను పశ్చిమయూరప్ ఖండ సాహిత్య చేతనకు సన్నిహితం చేయడానికి తోడ్పడ్డాయి. కాని కొన్ని చారిత్రక నవలలు దేశీ యేతివృత్తాల పట్ల కూడా పఠితల ఆసక్తిని పెంపొందించాయి. ఓటకార్ బ్రెజీనా, పీటర్‌బెజ్‌రుక్ వంటి కవులు నూతన మార్గంలో ముక్త ఛ్ఛందస్సులలో కవితలు వెలయించారు. జెక్ సాహిత్యంలో వాస్తవికతా వాదాన్ని ప్రవేశపెట్టిన వారిలో జాన్ స్వేతప్లక్ మచ్చెర్ (1864) ప్రముఖుడు. అయితే 20 వ శతాబ్ది ఆరంభం నుంచి వాస్తవికతా వాదానికి ఆదరణ సన్న గిల్లింది. దానికి బదులుగా ఇంద్రియాతీత విషయాలు ఇతివృత్తంగా తీసుకొని చేసే రచనలు ఎక్కువగా వెలువడ సాగాయి. ఇలాంటి రచయితలలో ఒటాకర్ ధీర్ (1881-1917), సిట్టర్‌డైక్ మొదలైనవారు ప్రముఖులు. ఆధునిక నవలా రచయితలలో అన్నా మేరియా టిల్లోవా, కేరల్ శ్లావక్ వంటి వారు అగ్రేసరులు.

1918 లో జెకోస్లోవేకియా స్వతంత్ర రాజ్యం అయింది. దానితో జెక్‌సాహిత్యం మూడు పువ్వులు, ఆరు కాయలుగా వర్ధిల్లసాగింది. గద్యసాహిత్యంలో ఉన్నత శిఖరాలు అందు కొన్న రచయితలు కార్ల్‌చాపెక్, బ్లాడిస్లావ్ వంకూరా ప్రభృతులు. చాపెక్, ఫ్రాంటిసెక్ తాంగర్‌లు జెక్ రూపకాలకు కూడా స్వతంత్ర ప్రతిపత్తి కల్పించారు. జెరోస్లోవ్ హసెక్ రచించిన *ది గుడ్ సోల్జర్ ష్వైక్* (1920-23) అనే నవలా, 1930 నాటి దాని ఇంగ్లీషు అనువాదం ఇప్పటికీ బహుళ ప్రచారంలో ఉండి పాఠకులను విశేషంగా అలరిస్తూనే ఉన్నాయి. 1918-45 మధ్యకాలంలో జెక్ గేయ కవిత బాగా శక్తి పుంజుకుని ఉదాత్త స్థాయిని అందుకొన్నది.

ద్వితీయ ప్రపంచ సంగ్రామం అనంతరం కమ్యూనిస్ట్ పాలన ఏర్పడి జెకోస్లోవేకియాలో స్వేచ్ఛా సాహిత్య ప్రవృత్తి అణగద్రొక్కబడింది. సంఘ సత్యతను చాటే కవితలు మాత్రం అనుమతింపబడ్డాయి. వాటిలో కవిత్వం క్షీణింపసాగింది. 1970 ప్రాంతంలో మాత్రం కొంత సజీవ సాహిత్యం తల ఎత్తింది. లాడిస్లావ్ మ్నాచ్‌కో రచించిన 'ది టేస్ట్ ఆఫ్ పవర్' చెప్పుకోదగిన రచన. దాని ఇంగ్లీష్ అనువాదం కూడా 1967 లో వెలువడింది. అనంతర కవులలో మిలాన్ కుందేరా, వ్లాడిమిర్ పారల్, జిరిమెడెక్‌లు ప్రసిద్ధులు. జె.మూ.ప్ర.

## డచ్ భాష - సాహిత్యం

భాష : ఇండో-యూరపియన్ భాషా కుటుంబంలో జర్మానిక్ వర్గంలోని పశ్చిమ శాఖకు చెందింది డచ్ భాష. నెదర్లాండ్‌కు వచ్చిన తొలిజాతులలో ఫ్రిజియన్‌లు మాత్రమే అక్కడ స్థిరపడ్డారు. 8 వ శతాబ్దం

నెదర్లాండ్స్

నుంచి వారు ప్రత్యేక భాషా సాహిత్యాలను రూపొందించుకున్నారు. శాక్సన్‌లు, ఫ్రాన్స్ దేశీయులు 3 వ, 9 వ శతాబ్దాల మధ్య కాలంలో నెదర్లాండ్‌లోని కొన్ని భాగాలలో వలస రాజ్యాలను స్థాపించుకున్నారు. అందుచేత దక్షిణాన ఫ్రాన్స్ సంస్కృతి, మిగిలిన ప్రదేశాల్లో శాక్సన్, ఫ్రాన్స్ మిశ్రమ భాషా సంస్కృతి నెలకొన్నాయి. నాగరకులైన ఫ్రాన్స్ దేశీయుల ఆధిపత్యంలో దక్షిణ నెదర్లాండ్ ఉత్తర నెదర్లాండ్ కంటె ముందుగానే సాహిత్యభాషను సృష్టించుకోగలిగింది. ప్రాచ్య, మధ్య, పశ్చిమ ప్రాంతాల మాండలికాలలో ఉన్న అంతరం వల్ల అక్కడ అభివృద్ధి అంత వేగంగా జరుగలేదు. మధ్యయుగ ప్రారంభంలో విద్వాంసులు మొదట 'లాటిన్' భాషను, తరువాత ఫ్రెంచ్ భాషను అభిమానించడంతో దేశీయ భాష గాథలుగా, జానపదుల పాటలుగా మాత్రమే మిగిలి అక్షరబద్ధం కాకుండా పోయింది. 10 వ శతాబ్దం నాటి *వాక్ డెన్నాంక్ ప్సామ్ (ఫ్రాగ్మెంట్స్)* అనే గ్రంథాన్నే ప్రాచీన డచ్ భాషకు తొలి ఉదాహరణగా గ్రహించవచ్చు. డచ్ భాష హాలెండ్‌లో అధికభాగంలోను,ఉత్తర ఫ్రాన్స్‌లోని కొన్ని జిల్లాలలోను— ప్రజలకు మాతృభాషగా ఉంది. ఆఫ్రికాలో బోయర్‌లు మాట్లాడే 'ఆఫ్రికాన్జ్' భాష కూడా

ఈ డచ్‌నుంచే పుట్టింది. ఇది చాలావరకు డచ్‌తో సాన్నిహిత్యం కలిగి ఉంది. మొదట డచ్‌భాషలో ఒక మాండలికమైన ఫ్లెమింగ్ 1200 ప్రాంతంలో స్వతంత్ర భాషగా రూపొంది స్వయంప్రతిపత్తిని ఆర్జించుకుంది.

ప్రాచీన కాలంలో రైన్‌నదీ పరిసర ప్రాంతాలలో వాడుకలో ఉన్న జర్మానిక్ భాషా మాండలికాలు కొన్ని క్రమంగా కలసిపోయి సామాన్య భాషగా రూపుదిద్దుకొన్నాయనీ, అదే ప్రాచీన డచ్ భాష అనీ భాషా తత్త్వవేత్తల అభిప్రాయం. ఈ ప్రాచీన భాషలో ఎలాంటి సారస్వతం లభించడం లేదు. ఈ ప్రాచీన డచ్‌భాష కాలక్రమేణ వికృతిచెంది, 1100 నాటికి మధ్యయుగపు డచ్‌భాషగా పరిణమించింది. 16 వ శతాబ్దం దాకా ఈ భాషే వ్యాప్తిలో ఉంది. కాని ఆ శతాబ్దంలో యూరప్‌లో జరిగిన రాజకీయ విపర్యయాల ప్రభావంతో ఫ్లాండర్స్ రాష్ట్రవాసులు అనేకమంది నెదర్లాండ్‌కు వలస వచ్చారు. ఈ రెండు సంస్కృతుల సమ్మేళనం వల్ల నేటి నవ్య డచ్‌భాష రూపొందింది. వ్యావహారిక రూపంలో డచ్‌భాషకు నెదర్లాండ్‌లో మాండలికాలు ఉన్నప్పటికీ వీటి కన్నిటికీ సాహిత్యభాష మాత్రం ఒక్కటే! అందు చేతనే గ్రాంథికభాషకూ, వ్యావహారిక భాషకూ భేదం ఎక్కువగా కనిపిస్తుంది. మిగతా పశ్చిమ యూరపియన్ భాషలలాగే డచ్‌భాషను కూడా రోమన్ లిపిలోనే వ్రాస్తున్నారు.

**సాహిత్యం :** డచ్ సాహిత్యానికి మొట్టమొదట రూపు దిద్దిన వారు డచ్ జమీందారులు. 12 వ శతాబ్దంలో అక్కడక్కడ కొందరు శ్రీమంతులు ఉబుసుపోక కోసం తమ మాతృభాషలో గ్రంథరచన చేయడానికి పూనుకోడంతో ఈ సాహిత్యంలో తొలిరచనలు వెలువడ్డాయి. ఆ కాలంలో విద్యావంతులు లాటిన్ భాషనే ఆదరించి, దేశీయ భాషలను నిరసిస్తూ ఉండడం వల్ల తొలి రచనలకు ఎక్కువ వ్యాప్తి చేకూరలేదు. అట్టి దేశీయ భాషా రచనలలో 12 వ శతాబ్దంలో హెయిన్‌రిక్ వాన్ వెల్డికె అనే సంపన్నుడు వ్రాసిన రచనలే మనకు లభించినంతలో తొలిరచనలు! ఈయన లాటిన్ భాషనుండి సెయింట్ సెర్వేషియస్ జీవిత గాథను అనువదించడమే కాక, కొన్ని ఫ్రెంచ్ గ్రంథాలను కూడా అనువదించాడు. ఇతని శృంగార గీతాలు కొన్ని భావ సౌకుమార్యానికి ప్రశంసలంది, యూరప్‌లోని వివిధ భాషలలోకి అనువదించబడ్డాయి. ఇతని రచనలన్నీ మతాశయాలకు అనుగుణంగానే సాగాయి. ఇతనిని అనుసరించి అనంతర కవులు కొందరు మధ్య యుగపు డచ్‌భాషలో కొన్ని కావ్యాలు వ్రాశారు. 13 వ, 14 వ శతాబ్దాలలో డచ్‌భాషలో వచ్చిన పుస్తకాల మీద ఫ్రెంచ్ భాషా ప్రభావం బాగా కనిపిస్తుంది. ఈ శతాబ్దాలలో సాంఘిక జీవనంలో వచ్చిన మార్పులను జాకోబ్ వాన్ మేర్లంట్ రచనలు విశదం చేస్తున్నాయి. తరువాత చాలాకాలం వరకూ డచ్ భాషలో నిలచి ఉన్న 'ఆత్మ ప్రబోధక' సాహిత్యానికి ప్రాతిపదికలు మేర్లంట్ రచనలలోనే కనిపిస్తాయి. మధ్యయుగాలలో మార్మిక కవిత్వం విస్తృతంగా ఆదరించ బడింది. ఇది పద్యరూపంగానూ, గద్యరూపంగానూ కూడా మంచి ప్రచారం సాధించింది. ఈ విధానంలో హడెవిచ్ (Hadewijch) అనే కవయిత్రి విఖ్యాతి గడించింది. ఈమె రచనలు అనంతర కవులపై గొప్ప ప్రభావాన్ని చూపాయి. అలాంటి వారిలో ప్రముఖుడు జాన్‌వాన్ రైస్ బ్రొయెక్. ఇతడు జర్మన్ మార్మిక కవితా నిపుణుడైన మీస్టర్ ఈకెహార్ట్ శిష్యుడు. ఇతడు అనేక రచనలు చేశాడు. సామాన్య మానవుణ్ణి ప్రబోధించేందుకు తేలికభాషలో బైబిల్ కథలు, గాథలు, ఉపకథలూ ఇతడు వ్రాశాడు. 14 వ శతాబ్దంలో వెలువడ్డ *అఫిషియమ్ స్టెల్లా* అనే లాటిన్ భాషా నాటకమే డచ్ నాటకాల్లో మొదటిది అని భావిస్తున్నారు. 15 వ శతాబ్దంలో నాటక రచనలో నాటి వ్యాపారవేత్తలైన జమీందారులు చెప్పుకోదగ్గవారు. వారు మధ్యయుగ చరిత్రను ప్రతిబింబిస్తూ అనేక నాటకాలు రచించారు.

16 వ శతాబ్దంలో యూరప్‌లో జరిగిన సాంస్కృతిక పునరుజ్జీవనం ఇటలీనుంచి ఫ్రాన్స్ ద్వారా నెదర్లాండ్ చేరుకుంది. ల్యూకాస్ డి హీరె మత కల్లోలం వల్ల దక్షిణాది కేథలిక్ ప్రాంతం నుంచి పారిపోయి, ఉత్తరాదికి చేరుకొన్నాడు. ఇలాంటి వారి రచనలలో మార్పు స్పష్టంగా కనిపిస్తుంది. ఈ రోజులలో వచ్చిన పద్యాలలోను, దేశీయభాషా రచనలలోను, డచ్‌వ్యాకరణాది వివిధ ప్రక్రియలలోను అవ్యవస్థ, అస్తిమితత స్పష్టంగా గోచరిస్తున్నాయి. కళా కారుడు, కవి అయిన కారెల్‌వాన్ మాండెర్ డచ్‌లో ఉత్తమ గద్యానికి ఒరవడి పెట్టాడు. ఒక శతాబ్దం దాకా ఈ గద్యం యూరప్‌లో మంచిపేరు పొందింది. తరువాత కూర్న్‌హెర్ట్, అతని అనుయాయులు *బైబిల్*ను డచ్‌భాషలోకి అనువదించి (1637) ప్రామాణిక డచ్ గద్యానికి పునాదులు వేశారు.

15 వ శతాబ్దంలో దేశాన్ని బర్గండీ రాజులు జయించడంతో డచ్ సారస్వతానికి ఆదరణ సన్నగిల్లింది. పునరుజ్జీవన యుగంలో యూరప్‌తో పాటు హాలండ్‌లో కూడా మార్పులు వచ్చాయి. అయినా డచ్ సారస్వతంలో మాత్రం సంపూర్ణాభివృద్ధి కనిపించలేదు.

అందుకు కారణం ఉత్తమశ్రేణి రచయితలు పేరు ప్రఖ్యాతుల కోసం లాటిన్ భాషను ఆశ్రయించడమే. 17 వ శతాబ్దం దాకా డచ్ సాహిత్యం ఒక మారుమూల అణగి ఉండిపోయింది.

నెదర్లాండ్‌లో 80 ఏళ్ళ పాటు యుద్ధం (1568-1648) సాగింది. ఆ యుద్ధకాలంలోనూ, ఆటు తరువాత స్పెయిన్ అధీనంలోని దక్షిణ నెదర్లాండ్ సైన్యం నుంచి ఎందరో కళాకారులూ, మేధావులూ, పెట్టుబడిదారులూ పారిపోయి హాలండ్ చేరుకున్నారు. ఇది హాలండ్‌లో స్వర్ణయుగానికి నాంది పలికింది. ఈ యుగ రచయితలలో ప్రథముడు, ప్రముఖుడు స్పీఘెల్. ప్రాత క్రొత్త సంప్రదాయాల మేలు కలయికతో పండిత పామర రంజకంగా ఇతడు రచనలు చేశాడు. ఇతని *న్యూ జార్లీడ్ కెన్స్* (నూతన వర్షగీతాలు), *లీడెన్ ఆఫై వాడెర్ ఆక్స్* (ప్రార్థన గీతాలు) మధ్య యుగ సంప్రదాయాలను, పునర్వికాస శైలిలో ప్రతిధ్వనింప జేశాయి. 1584 లో ఇతడు కూర్చిన 'డచ్‌సాహిత్యం పై సంవాదం' అనే గ్రంథం హెర్ట్ స్పీఘెల్ తాత్త్విక లక్షణాలను సంతరించుకొన్న మొట్టమొదటి ఉత్తమరచన. అనంతర కాలపు రచనలలో మానవతా వాదం డచ్ సాహిత్యంలో చోటు చేసుకుంది. డేనియల్ హియిన్‌సియుస్ ఈ రకం రచయితలలో ప్రముఖుడు. కవి, నాటక రచయిత, కళాకారుడు, గెర్‌బ్రాండ్ ఆడ్రియేన్‌ఘూన్ బ్రెడెరో అనే డచ్ రచయిత తన రచనా సామగ్రిని సామాన్య మానవుని జీవితం నుంచి ఎన్నుకునేవాడు. భావ వ్యక్తీకరణకు జానపదగేయ రూపం, ప్రహసనం, సుఖాంత నాటకాలు ఎన్నుకొని చక్కని రచనలు చేశాడు.

17 వ శతాబ్దం తొలి పాదంలో పీటర్ కార్నెలిఘూస్ హూఫ్ట్ (1581-1647), గెర్‌బ్రాండ్ ఆడ్రియేన్‌ఘూన్ బ్రెడెరో అనే ఇద్దరు రచయితలు దేశభాషోద్ధరణకు దీక్షపూని సుమధురమైన శైలిలో గేయాలనూ, నాటకాలనూ వెలువరించారు. శైలీ సౌభాగ్యంలో వారికి సాటి వచ్చే డచ్ రచయితలు మరెవ్వరూ లేరని తద్‌జ్ఞుల అభిప్రాయం. వీరిని అనుసరించి ఆ శతాబ్దం ప్రథమ పాదాంతంలో పేరు పొందిన రచయిత జూస్ట్ వన్‌డిన్ వాండెల్ (1587-1679). ఇతడు డచ్ కవి సార్వభౌముడుగా ప్రసిద్ధి పొందాడు. పద్యకావ్యాలూ, గేయాలూ, నాటకాలూ, అధిక్షేపకావ్యాలూ అనేకం ఇతడు రచించాడు. ఇతని కవితా ప్రాగల్భ్యం నాటకాలలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. అన్నిట్లోనూ *లూసిఫర్* ఉత్తమోత్తమం అయింది. భగవంతుణ్ణి ధిక్కరించి తిరుగుబాటు చేసి, విఫలమైన దేవగణాల గాథను చిత్రించిన విషాదాంత నాటకం ఇది. నేటికీ డచ్ నాటకరంగం మీద ఈ నాటకం ప్రముఖ స్థానం వహిస్తుంది. వాండెల్ కవితాశైలి అలంకారభరితం అయినప్పటికీ పదాడంబరం లేని లాలిత్యానికి పేరెన్నిక కన్నది. ఎందరో డచ్ రచయితలు అతనిని అనుకరించడానికి ప్రయత్నించారు. కాని వారిలో ఎవ్వరూ కృతకృత్యులు కాలేదు. ఈ రోజులలోనే ఎందరో రచయితలు భక్తిభావంతో మత సంబంధమైన పద్య కవిత్వాన్ని వెలువరించారు.

వాండెల్ తరువాత కొంత కాలందాకా డచ్ సాహిత్యంలో గొప్ప పేరు ప్రతిష్ఠలు పొందిన కవులు లేరు. 18 వ శతాబ్దంలో సృజనాత్మక రచయితల కన్నా అనువాదకులే ప్రబలంగా కనిపిస్తున్నారు. ఈ శతాబ్దంలో వచ్చిన రచనలలో పేరు ప్రఖ్యాతులు పొందిన ఇతర రచయితల గ్రంథాలకు నీరస అనుకరణే ఎక్కువ. కాని, ఈ యుగంలో విమర్శనాత్మక రచనకూ, అధిక్షేపకావ్య రచనకూ కొంత పుష్టి చేకూరింది. రచనా విధానంలో కూడా సుదీర్ఘ ప్రసంగాలు, అనవసర పదాడంబరం చోటు చేసుకున్నాయి. కవయిత్రి, వ్యాసరచయిత్రి అయిన బెట్టె వుల్ఫ్, ఆగ్జెడెకెన్ కలసి *డె హిస్టరీ వాన్ మెజుఫ్రౌసారా బర్గి హార్ట్* (సారాబర్గిహార్ట్ కన్యాచరిత్ర) అనే నవల వ్రాశారు. ఇది సునిశితమైన హాస్యానికీ, వాస్తవిక చిత్రణకీ పేరుపొందింది. ఈ శతాబ్దాంతానికి చాలా మంది కవులు నూతన సాంప్రదాయిక వాదానికి ఎదురు తిరిగారు. 1830 ప్రాంతంలో సారస్వతిక పునరుద్ధరణకు అంకురార్పణ జరిగింది.

19 వ శతాబ్దంలో వచ్చిన జేకబ్ గీల్ వ్యాసాలు భాషాతత్త్వశాస్త్రాల విమర్శ విధానంలో డచ్ సారస్వతానికి ఒక నూతన ప్రమాణాన్ని నెలకొల్పాయి. హాస్యరస మొలికించే అధిక్షేప రచనలకు పేరు పొందినవాడు 'ముల్తాతులీ' అనే కలం పేరుతో వ్రాసిన ఎడ్వర్ట్ డౌవెస్ డెక్కర్. డచ్ ఈస్ట్ ఇండీస్‌లో చేస్తున్న దారుణ కృత్యాలను సునిశిత హాస్యధోరణిలో ఇతడు విమర్శించాడు. ఇతని సమకాలికులైన పట్‌జీటర్ (1808 - 1875), బుస్కెన్‌హూట్ అనేవారు *డి గైడ్* (మార్గదర్శి) అనే సారస్వత మాసపత్రికను స్థాపించి, ఆ యుగంలో వచ్చిన గ్రంథాలను, రస వివేచన దృష్టితో విమర్శించి భాషా సేవ చేశారు. ఈ విమర్శకులు చూపిన మార్గాన్ని అనుసరించిన యువకులు తరువాత 1880 ప్రాంతంలో

ఆరంభమైన పునరుజ్జీవనోద్యమానికి నాయకు లయారు. వీరిలో విల్లెమ్‌క్లూస్ (1859-1938), ఆల్‌బర్ట్‌వెర్‌వే (1865-1937) మొదలైనవారు ప్రముఖులు. వీరు *నవీగెడ్స్* (నవ మార్గదర్శి) అనే మాస పత్రికను స్థాపించి దాని ద్వారా ఒక నూతన సంప్రదాయాన్ని ప్రచారంలోకి తెచ్చారు. కావ్య పరమోద్దేశం రసానుభూతి మాత్రమే అన్నది వీరి సిద్ధాంతం. తమ శైలికి వీరు 'వర్డ్ ఆర్ట్' (పదాత్మక కళ) అని పేరుపెట్టుకున్నారు. పదానికి భావాన్ని స్పష్టంగా చెప్పే సామర్థ్యం ఉండాలనీ, అలాంటి సరి అయిన పదం లేకుంటే మరో క్రొత్త పదాన్ని కల్పించుకోవాలనీ వీరు వాదించారు. వీరు అనేక క్రొత్తపదాలను సృష్టించి వాడుకలోకి తెచ్చారు. అందువల్ల భాషలో కొంత కృతకత్వం ఏర్పడినమాట నిజమే అయినా ఈ రచయితల కృషివల్ల డచ్ భాషా సారస్వతాలు పరిపుష్టం అయ్యాయి.

1880 తరువాత డచ్ సారస్వత రంగంలో వివిధ వాదాలు తలెత్తాయి. ఒక దశాబ్దంలో వ్యాప్తిపొందిన కవితా సంప్రదాయం మరు దశాబ్దానికే అంతరించి, దాని స్థానంలో మరో సంప్రదాయం చోటుచేసుకో సాగింది. అంతే కాక ఏక కాలంలో వివిధ వాదాలు వ్యాప్తి చెంది సాహిత్య క్షేత్రంలో అరాజకత ఏర్పడింది. అయితే కాలం గడచిన కొద్దీ ఈ విభిన్న వాదాల లోని వైరుధ్యం సమసిపోయి, అన్నీ. సారస్వత వికాసానికి సంపూర్ణ దోహదకారులే అన్న భావం ఏర్పడింది.

నవ్య కవులలో మిగిలిన దేశాలలో లాగే డచ్ దేశంలో కూడా ఒక ప్రత్యేక లక్షణం కనిపించింది. పరిసరాల మీద కలిగిన అసంతృప్తి వీరి రచనలలో అడు గడుగునా గోచరించింది.

1932 లో మెన్నోటేర్‌బ్రాక్, ఎడ్గార్‌డు పెరాన్ మొదలైన సాహిత్యోద్యమ కారులు *ఫోరమ్* అనే సాహితీ పత్రికను స్థాపించి దానిలో ఉత్తమ రచనలు ప్రచురించారు. నాజీల దురాక్రమణతో డచ్ సాహిత్య ప్రగతి కొంత కుంటుబడింది. యుద్ధానంతరం వచ్చిన నవలలు నాజీల అక్రమణ అనుభవాలను అనేక రీతులుగా వర్ణించాయి.

డచ్ సాహిత్యం ప్రాచీనకాలం నుంచి వివిధ సాంస్కృతిక సాహిత్యరంగాలలో పరిణతి సాధిస్తూ వచ్చింది. మధ్యయుగంలో ఫ్రెంచ్ సాహిత్యపు ప్రభావానికీ, వాండెల్ కాలంలో గ్రీక్, లాటిన్ సాహిత్యాల ప్రభావానికీ అది లోనయింది. 1860 నుంచి, డచ్ దేశానికి ప్రపంచంలోని వివిధ దూర దేశాలతో సాన్నిహిత్యం ఏర్పడింది. ఆ వివిధ సంస్కృతులలోని ఉత్తమ అంశాలను స్వీకరించి, జీర్ణించుకొని డచ్ సాహిత్యం పరిపుష్టం అవుతూ వచ్చింది. 20 వ శతాబ్దంలోని తొలి దశాబ్దాలలో నెస్సియో (జె.హెచ్.ఎఫ్. గ్రోమ్‌లోకు కలంపేరు), నవీన కాల్పనికతావాది ఆర్థర్ వాన్ షెండెల్, నిరాశావాది జె.జె. స్లామర్ హోప్‌లు డచ్ సాహిత్యాన్ని మరింత ముందుకు తీసికొని పోయారు. ఈ కాలంలో ప్రముఖ డచ్ కవులు జాన్ హెన్రిక్ లియోపోల్డ్, ఏ. రోలండ్ హోల్ట్స్, హెన్రిక్ మార్స్‌మన్, జె.సి. బ్లూమ్, మార్టినస్ నియోప్‌లు. రెండు ప్రపంచ యుద్ధాల మధ్యకాలంలో మెన్నోటెర్ బ్రాక్, ఎడ్గార్‌డు పెరాన్‌లు తమ విమర్శక వ్యాసాల ద్వారా ప్రసిద్ధి పొందారు. ఈ శతాబ్ది మధ్య భాగంలో డచ్ సాహిత్య రంగంలో అత్యంత ప్రముఖులుగా ఉన్నవారు. సైమన్ వెస్ట్ డిజ్క్ అనే ప్రముఖ నవలా రచయిత, గెరిట్ ఆక్టేబెర్క్ అనే మౌలిక కవి. రెండవ ప్రపంచ యుద్ధానంతర కాలంలో గంభీరమైన రచయిత విలెమ్ ఫ్రెడెరిక్ హెర్మన్స్, అరాజకతావాది హేరీయులిష్, అంతర్‌దృష్టి గల జెరార్డ్ రెవే చెప్పుకోదగిన వచన రచయితలు. కవులలో లూసె బెర్ట్ (ఎల్.ఏ. స్వాన్స్ విజ్క్‌కు కలంపేరు), గెరిట్ కవ్వెనార్, రుట్‌గెర్ కోప్లాండ్, జె. బెర్నెలెఫ్ మొదలైన వారు ప్రధానులు.

జె.ఇ.షాప్. (విం.వెం)

## డేనిష్ భాష - సాహిత్యం

భాష : డెన్మార్క్ దేశంలో ప్రస్తుతం అధికార భాషగా ఉన్న డేనిష్ (డాన్స్క్)భాష ఉత్తర జర్మానిక్ భాషా వర్గంలోని తూర్పు స్కాండినేవియన్ శాఖకు చెందింది. తనకు సన్నిహితమైన ఇతర




డెన్మార్క్

స్కాండినేవియన్ భాషల నుంచి సుమారు క్రీ.శ. 1000 ప్రాంతంలో డేనిష్ భాష వేరు కావడం ఆరంభమైంది. అతి ప్రాచీనమైన రూనిక్ లిపిలో చెక్కిన శాసనాలు సుమారు 250-800 మధ్య కాలానికి చెందినవి జట్లండ్ నుంచి దక్షిణ స్వీడెన్‌దాకా కనిపిస్తున్నాయి. లభించినంతలో అత్యంత ప్రాచీనమైన వ్రాతప్రతి 13 వ శతాబ్దం నాటిది.

మూల స్కాండినేవియన్ భాషతో పోల్చిచూస్తే డేనిష్ భాష చాలా ఎక్కువ మార్పు చెందినట్టు స్పష్టం అవుతుంది. మధ్య యుగాలలో అది విభక్తి వ్యవస్థను పూర్తిగా కోల్పోయింది. హాన్సియాటిక్ లీగ్ వర్తకులతోడి సంబంధం వల్ల ఎన్నో 'లో'జర్మన్ పదాలూ, ఉపసర్గలూ, ప్రత్యయాలూ డేనిష్ భాషలో ప్రవేశించాయి. ఆధునిక డేనిష్ భాషలో రెండే విభక్తులు: ప్రథమా, చతుర్థీ; రెండే లింగాలు: సామాన్యలింగం, నపుంసక లింగం. డేనిష్ భాషలో ఒకప్పుడు ఒక స్వర భేదంగా మాత్రమే ఉన్న ఒక ధ్వని ప్రస్తుతం 'కంఠ్యస్థిరం' (glottal stop)గా పరిణమించింది.

స్కాండినేవియామీదా, ఐస్‌లాండ్‌మీదా రాజకీయంగా డెన్మార్క్ దేశం అధికారం చలాయించడంవల్ల డేనిష్‌భాష ప్రభావం స్వీడిష్, ఐస్‌లాండిక్ భాషలమీద ఎక్కువగా కనిపిస్తుంది. సంస్కరణోద్యమం మొదలు 19 వ శతాబ్దం వరకూ డేనిష్ భాషే నార్వేలో అధికార భాషగా ఉండేది.

**సాహిత్యం :** డేనిష్ సాహిత్యానికి తొలి సాక్ష్యాలు 800-1100 మధ్య కాలం నాటి రూనిక్ లిపిలో కనిపించే శాసనాలలో లభిస్తున్నాయి. 12 వ శతాబ్దంలో దేశంలో క్రైస్తవమతం ప్రచారం కావడంతో లాటిన్ భాషా ప్రాచుర్యం పెరిగి, అదే ప్రధాన సాహిత్య భాషగా ఏర్పడి, 1536 నాటి ప్రొటెస్టెంట్ సంస్కరణోద్యమం వరకూ అలాగే కొనసాగింది. తరువాత మాతృభాషలోనే సాహిత్యం వెలువడాలనే ఉద్యమం 16 వ శతాబ్దంలో ఆరంభమైంది. యూరపియన్ సాహిత్య పునరుజ్జీవనోద్యమం 17 వ శతాబ్దం నాటికి గాని డెన్మార్క్‌కు వ్యాపించ లేదు. ఆ ఉద్యమ ఫలితంగా శిష్టసాహిత్య రూపాలనే ఆదరించడం, శాస్త్రపరిశోధన, పాండిత్యం పెంపొందడం జరిగింది. పుట్టుకచేత నార్వీజియన్ లైన లుడ్విగ్ హోల్‌బెర్గ్, యోహాన్ హెర్మన్ వెసెల్ అనే సుప్రసిద్ధ రచయితల ప్రభావంవల్ల 18 వ శతాబ్దంలో ఆధునిక డేనిష్ సాహిత్య సృష్టికి అంకురార్పణ జరిగింది. 19 వ శతాబ్ది నాటి కాల్పనికోద్యమానికి ఆడమ్ ఓహ్లెన్ ష్లేగర్ నాయకత్వం వహించాడు. 1870 ప్రాంతంలో జార్జ్ బ్రాండిస్ 'ప్రకృతి సిద్ధవాదం' (Naturalism) ప్రారంభించాడు. ఈ వాదం ప్రభావం ఆగస్ట్ స్ట్రిండ్‌బెర్గ్, హెన్రిక్ ఇబ్సెన్ మొదలైన స్కాండినేవియన్ రచయితలమీద కూడా కనిపించింది.

13 వ శతాబ్దానికి ముందు డేనిష్ భాషకు రూనిక్ లిపిని వాడేవారు. 1300 నుంచి లాటిన్ లిపి వాడుకలోకి వచ్చింది. ఆ లిపిలో మొట్టమొదట న్యాయశాస్త్రగ్రంథాలు మూడు వెలువడ్డాయి. ఈ మూడూ వేరువేరు మాండలిక భాషలలో ఉండడం వల్ల అప్పటికి ఇంకా ఒక జాతీయ సాహిత్యభాష రూపొందలేదని భావించవచ్చును. క్రైస్తవ మత స్వీకరణ (1200) తోనే డెన్మార్క్‌కి పశ్చిమ యూరపియన్ సాహిత్యంతో పరిచయం లభించింది. యూరప్‌లోని ప్రజానీకంలో సర్వ సామాన్యంగా వ్యాపించి ఉన్న కొన్ని పౌరాణిక గాథలు లాటిన్ నుంచి 14 వ శతాబ్దంలో డేనిష్ భాషలోకి అనువదించబడ్డాయి. ఈ యుగంలో వెలువడిన సాహిత్యంలో జానపద గేయ సంకలనాలదే ప్రథమస్థానం. ఆండర్స్ సోరెన్సన్ వేడెర్ 1881 లో 100 జానపద గేయాలతో ఒక సంకలనం కూర్చాడు.

16 వ శతాబ్దంలో డేనిష్ సాహిత్యంలో మానవతావాదం ప్రాబల్యం వహించింది. దీనిని అవలంబించిన రచయితలలో క్రిస్టియరల్ పీడార్‌సేన్ (1554) సుప్రసిద్ధుడు. ఇతడే మొదటిసారిగా *బైబిల్*ను పూర్తిగా డేనిష్ భాషలోకి అనువదించాడు. ఈ శతాబ్దంలో వచ్చిన లౌకిక సాహిత్యంలో హెమ్మర్ పీగర్ (1555) వ్రాసిన జర్మన్ కావ్యానువాదం ఒకటి పరిగణించదగింది. పునరుజ్జీవనోద్యమ కాలంలో తక్కిన ఇతర యూరపియన్ సాహిత్యాలతో పాటు డేనిష్ సాహిత్యంలోనూ నూతన చైతన్యం గోచరించింది. ఆనాటి కవులలో థామస్ కింగో (1634-1703) అనే ప్రార్థనాగీత రచయిత ప్రముఖుడు. గద్య గ్రంథాలలో కూడా అనేక ప్రముఖ రచనలు ఆ నాడు వెలువడ్డాయి. భాషాశాస్త్రంలోను, భాషాచరిత్రలోను కృషిచేసిన ఓల్‌వరన్, హెన్రి పొంటోప్పిడాన్, పీడర్ సైన్‌లు ప్రత్యేకంగా పేర్కొనదగినవారు. ఆ యుగంలో జన్మించిన రచయిత్రులలో లియోనారా క్రిస్టినాపుల్ ఫెల్ట్, బ్రిజిటీ తోట్‌లు ప్రసిద్ధి పొందారు. వీరిలో మొదటి ఆమె తన 20 ఏళ్ల జైలు జీవితాన్ని గురించి రాళ్లు కరిగే రీతిగా వర్ణించింది. రెండవ ఆమె 'సెనెకా' లాటిన్ రచనలను డేనిష్ భాషలోకి అనువదించింది.

18 వ శతాబ్ది పూర్వార్ధంలో జన్మించిన కవులలో లడ్విక్ హోల్‌బెర్గ్ (1684-1754) ప్రముఖుడు. ఇతడు డేనిష్ సాహిత్య పితామహుడుగా ప్రసిద్ధు డయాడు. అనేక ప్రహసనాలను, 34 సుఖాంత నాటకాలను, పెక్కు నవలలను రచించి ఇతడు డేనిష్ సాహిత్యాన్ని సుసంపన్నం చేశాడు. ఇతని తరువాత ఆ యుగంలో పేర్కొనదగినవాడు క్లోప్‌స్టాక్. జర్మన్ సాహిత్యంలోని మేలిగుణా లన్నిటినీ డేనిష్ సాహిత్యానికి అలవరచడానికి ఇతడు ఎంతో కృషి చేశాడు.

1801-1864 మధ్య కాలం డేనిష్ సాహిత్య చరిత్రలో స్వర్ణయుగం. క్రైస్తవమత నిష్ఠ, జాతీయతా భావం, మానవ ప్రేమ - ఈ మూడూ కాల్పనిక వాదంతో సమ్మిళితాలై డేనిష్ సాహిత్యాన్ని ఉచ్చ స్థితికి కొనిపోయిన కాలం అది. ఆడెమ్ ఓక్లెమ్, ష్లెగర్ నికొలాయ్ ఫ్రెడరిన్, సెవెరిన్ గ్రండ్‌విగ్ అనే మహాకవులు ఆ కాలంలో తక్కిన రచయితలకు మార్గదర్శకు లయారు. వివిధ రచనా ప్రక్రియలలో డేనిష్ సారస్వతంలో నూతన మార్గాలను ప్రదర్శించిన ధీశాలి ఓక్లెమ్ ష్లెగర్. జాతీయ భావనను పరిపుష్టం చేయడానికి తన రచనల ద్వారా నిరంతరం కృషి చేసి సఫలీకృతుడైనవాడు గ్రండ్‌విగ్. ఆ యుగంలోనే నవ్యవాస్తవికతా వాదానికి కూడా డెన్మార్క్‌లో ప్రాపకం లభించింది. దీనిని అవలంబించిన రచయితలలో పాల్ మార్టిన్ మెల్లర్, జాట్‌స్టీన్, స్టీన్‌వెన్ బ్లిచర్ అనే నవలా రచయితలు, థాన్‌సీన్ జిల్లెకుబర్గ్ ఎ హరెన్ స్వర్డ్ అనే కథానికా రచయిత ముఖ్యంగా పేర్కొన దగినవారు. ఆ నాడు ఆవిర్భవించిన నాటక రచయితలలో యోహాన్ లడ్విక్ హైబర్గ్ ప్రత్యేకంగా ప్రశంసనీయుడు. అతడు రచించిన *ఎల్వార్ హొజ్* (దేవ శిఖరి), *సివ్ సోవ్వర్లక్* అనే రూపకాలు అత్యుత్తమమైనవిగా ప్రశంసించ బడ్డాయి. పై రచయితల కన్న విలక్షణత కలిగి, డేనిష్ సాహిత్యంలో ప్రముఖస్థానం ఆక్రమించినవాడు హాన్స్ ఆండర్సన్ (1805-1875). కల్పనా సాహిత్యంలో ఇతనికి గల స్థానం నిరుపమానం. నవ్య సంప్రదాయాలను అనుసరించిన వారిలో జార్జ్ బ్రాండిస్ (1842-1927) ప్రముఖుడు. విమర్శకుడుగా కూడా ఇతడు సుప్రసిద్ధుడు. తరువాతి రచయితల కెందరికో ఇతడు మార్గదర్శకుడు అయాడు. ప్రథమప్రపంచ సంగ్రామానంతరం నవలా రచనకు డెన్మార్క్‌లో విశేష ఆదరణ లభించింది. నాటి నవలా రచయితలలో టామ్ క్రిస్టెన్సన్ సువిఖ్యాతుడు. గేయ కవులలో హోఫ్‌మన్స్, హోసెన్‌లు, రూపక రచయితలలో నాథన్ సెక్, కేరల్ గంద్రప్‌లు పరిగణనీయులు.

చీ.శే.రా.(బొ.శ్రీ.)

## నార్వీజియన్ భాష - సాహిత్యం

**భాష :** నార్వీజియన్ భాష పశ్చిమ స్కాండినేవియన్ శాఖకు చెందిన ఉత్తర జర్మానిక్ భాష. ఇది ఇండో-యూరపియన్ భాషా కుటుంబానికి చెందింది. నార్వే ప్రజలకు ఇది మాతృభాష. దీని మొదటి రూపం 'నార్స్'. తరువాత డేనోనార్వీజియన్, నూతన నార్వీజియన్ అనే రెండు భిన్నరూపాలలో ఇది ప్రచారంలోకి వచ్చింది. కాలక్రమేణ, ఇది అనేక వికృతులు పొంది సాహిత్య విలువలు కోల్పోయి మాండలికాలుగా చీలిపోయింది. 19 వ శతాబ్దం దాకా డేనో-నార్వీజియనే ఆధిపత్యాన్ని చలాయించింది. సాహిత్యం కూడా ఈ భాషలోనే అభివృద్ధి చెందింది. ఇది డేనిష్-నార్వీజియన్ భాషల కలయిక వల్ల ఏర్పడ్డ ఒక మిశ్రభాష కావడంతో అందరి మన్ననలూ పొందలేకపోయింది. 1887 లో నార్వేలో విద్యావిధాన మంతా డేనో-నార్వీజియన్‌లోనే జరగాలని ప్రభుత్వం ఒక శాసనం చేసింది. ఇది నార్వే ప్రజలకు సమ్మతం కాలేదు. నార్వీజియన్‌పై డేనిష్ భాషా ప్రభావాన్ని నిరసిస్తూ నార్వేకి ఒక జాతీయభాష కావాలనే ఆందోళన చెలరేగింది. దీనికి మూలపురుషుడు ఐవార్ ఆసిన్.

ఇతడు నార్వీజియన్ మాండలికాలలోని ఉత్తమ లక్షణాల నన్నిటినీ సంపుటీకరించి 'లాన్స్ మాల్' అనే ఒక జాతీయ భాషను రూపొందించాడు. పత్రికా రచయితలూ, వైజ్ఞానికులూ ఈ భాషను ఆదరించడంతో డేనో-నార్వీజియన్‌తో సమానమైన ప్రతిపత్తి దీనికి లభించింది. క్రమంగా నార్వే అంతటా డేనిష్ భాషా ప్రభావం పూర్తిగా తొలగిపోవడంతో లాన్స్ మాల్ భాషే ప్రభుత్వాదరణ పొంది, ప్రధానభాష అయింది.

**సాహిత్యం :** ప్రాచీన నార్స్ భాషలో 14 వ శతాబ్దం దాకా కొన్ని వీర గాథలు మాత్రమే గేయరూపంలో వెలువడ్డాయి. 14 వ శతాబ్దం తరువాత నార్వే పండితులు డేనిష్ సారస్వతాన్ని ఆదరించడంతో రచనలన్నీ డేనిష్ భాషలోనే వెలువడసాగాయి. అయితే డెన్మార్క్‌లోని డేనిష్ రచనల కంటె ఈ రచనలలో ఒక విశిష్టత ఉంది. 1814 లో ప్రబలిన నార్వే జాతీయోద్యమ ప్రభావం సాహిత్యంలో ప్రతిఫలించింది. ఆ నాటి రచయితలలో హెన్రిక్ యాన్కర్ జెర్రెగార్డ్ (1792-1842),

మోరీస్ క్రిష్టఫర్ హాసెన్ (1794-1842), కా్నాట్ నికొలాయ్ స్వాక్ (1794-1860) అనేవారు ప్రముఖులు. వీరిలో మొదటి రచయిత రచించిన *సోనేర్ ఆఫ్ నార్వే* (నార్వే బిడ్డలు) అనే గీతం 1870 దాకా నార్వే దేశంలో జాతీయ గీతంగా ఉండేది. పైవారికన్న ఎక్కువ కీర్తి ప్రతిష్ఠలు పొందినవాడు హెన్రిక్ వెర్గ్లాండ్ (1808-45). కొద్ది కాలమే జీవించినా ఇతడు తన బహుముఖప్రజ్ఞతో మహాకవిగా కీర్తి పొందాడు. ఈ కాలంలోనే నార్వీజియన్ జానపద గాథలను సంకలనం చేయడం జరిగింది. ఈ సంకలన కార్యక్రమంలో పీటర్‌క్రిస్టెన్ యస్ జోరాన్ సెన్ (1812-85), జోర్జెన్ ఓ (1813-82) అనేవారు ప్రముఖ పాత్ర వహించారు. జానపద గేయాలను సంక లనం చేసి మాగ్నస్ బ్రోస్టప్ లాండ్‌స్టడ్ (1802-80) నార్వీజియన్ సాహిత్యాన్ని సుసంపన్నం చేశాడు. క్రమేణ నార్వీజియన్‌లో జాతీయతా భావం పెంపొందసాగింది. పీటర్ యాండ్రెస్ మంచీ (1810-63) మొట్ట మొదటి సారి నార్వే జాతీయ చరిత్రను లాన్స్ మాల్ భాషలో వ్రాసి అటు జాతీయోద్యమానికి, ఇటు సాహిత్యానికి కూడా అసమానమైన సేవ చేశాడు. క్రమంగా నార్వేలో కాల్పనికోద్యమం విస్తరిల్లి రూపక రచనలో అది ప్రధాన పాత్ర వహించింది. బోర్సన్, ఇబ్సెన్‌లు ఈ ఉద్యమానికి మూల స్తంభాలు. వీరితో సరిసమానంగా చెప్పకోదగ్గ మరొక మహాకవి హామ్సన్ (జ.1859). ఇతడు రచించిన 'ఆకలి' అనే రచన నార్వీజియన్ సాహిత్యంలో ఒక నూతన రచనా ప్రక్రియకు దారి తీసింది.

20 వ శతాబ్దం తొలి దశకంలో సాహిత్యరంగ ప్రవేశం చేసి రెండవ ప్రపంచయుద్ధం ఆఖరుదాకా నార్వీజియన్ ప్రజ లను విశేషంగా ఆకర్షించిన ప్రధాన రచయితలలో సిగ్రెడ్ ఉండెసెట్, ఓలాఫ్ దూన్ ముఖ్యులు. దూన్ వ్రాసిన నవలలు యూరప్ అంతటా ప్రచారం పొందాయి. అతని నవలలను కొన్నింటిని రూపకాలుగా తిరిగి వ్రాయడం కూడా జరిగింది. ఇక విప్లవ భావాలను వెదజల్లడా నికి కవితను ఒక సాధనంగా తీసికొన్నవాడు అర్నల్ఫ్ ఓవర్‌లాండ్. మానవుని పురోగమనానికి ఆటంకా లని భావించిన మత సంప్రదాయాలను ఆయన నిశితంగా విమర్శించాడు. క్రైస్తవ మతం దశమగ్రహం అని ఆయన ఒక నవల వ్రాశాడు. ఆ నవల అశ్లీలంగా ఉందని అతని మీద నేరం ఆరోపించి ప్రభుత్వం అతనిని న్యాయస్థానం ముందు నిలిపింది. అయినా ఆతని రచనలు మాత్రం జనాకర్షణను కోల్పోలేదు. సమాజంలోని దోషాలను ఎత్తి చూపడంలో ఇతనికి తోడైన మరో నవ్య రచయిత హెల్గే క్రాగ్. పాశ్చాత్య సాహిత్యంలో నార్వీజియన్‌కు ఉన్నతస్థానం కల్పించిన హెన్రిక్ ఇబ్సెన్ అనుయాయి ఈ క్రాగ్. ఇబ్సెన్ సంప్రదాయాన్ని అనుసరించి రూపక రచ నలో అందెవేసిన చేయిగా ఇతడు పేరు తెచ్చుకున్నాడు. పై రచయితల ఉత్తమాభిరుచులను పుణికిపుచ్చుకొన్న మరోమంచి రచయిత సిగర్డ్ హోయర్. ఇతడు నవలా రచయిత. ఆధునిక సాంఘిక జీవితాన్నీ, దానిలోని వైరుధ్యాన్నీ చక్కగా ప్రదర్శించడంలో ఇతడు కృత కృత్యు డయాడు. నార్వే దేశాన్ని జర్మన్ నాజీలు ఆక్రమించిన రోజులలో ఆ దేశం పడిన అవస్థలను ఇతడు 'కారుచీకటి ముసురుకొన్న ఇల్లు' అనే నవలలో రమ్యంగా చిత్రించాడు. ఆ నవల యూరప్ ఖండ మంతటా గొప్ప ప్రచారం పొందింది. విస్తృతిలోను, జనసంఖ్యలోను నార్వే చాలా చిన్నది. అయినా ఇబ్సెన్, జోర్‌సన్ వంటి మహా రచ యితలకు జన్మ నిచ్చి విశ్వ సాహిత్య చరిత్రలో ఉన్నత స్థానాన్ని పొందింది నార్వే!

వి.శే.రా.(చిం.వెం.)

## పోర్చుగీసు భాష - సాహిత్యం

భాష : ఇండో-యూరపియన్ భాషాకుటుంబంలో లాటిన్ నుంచి జనించిన భాషలలో పోర్చుగీస్ ఒకటి. పోర్చుగల్ లోనూ, దక్షిణ అమెరికాలోని బ్రెజిల్ దేశంలోనూ ఇది దేశీయుల మాతృభాషగా ఉంది. ఆఫ్రికాలోని అంగోలా వంటి కొన్ని పోర్చుగీస్ వలస రాజ్యాలలో అక్కడి ఆఫ్రిక న్‌లకు కూడా ఇది మాతృభాషగా పరిణమించింది. ఈ భాష లాటిన్ నుంచి పుట్టినా, ఇందులోని అచ్చులలో ఒక ప్రత్యేకత కనిపిస్తూంది. లాటిన్‌లో శుద్ధ అచ్చులుగా ఉన్న ధ్వనులు కొన్ని పోర్చుగీస్‌లో సానునాసికాలుగా ఉచ్చరించ బడుతున్నాయి.




పోర్చుగల్

లిస్బన్ ప్రాంతంలోని మాండలికం ఆధారంగా ప్రామాణిక పోర్చుగీస్ భాష రూపొందించబడింది. పోర్చుగల్ దేశంలో మాండలికభేదాలు ఎక్కువగా లేకపోయినా, బ్రెజీలియన్ పోర్చుగీస్ యూరపియన్ పోర్చుగీస్ భాషతో చాలా విషయాల్లో భేదిస్తుంది. ఈ మార్పులు ఉచ్చారణలోనూ, క్రియారూపాలలోనూ, వాక్య నిర్మాణవైఖరిలోనూ కూడా కనపడతాయి. ఉదాహరణకు వాక్యంలో కర్మగా ఉండే సర్వనామాలు స్పానిష్ భాషలో లాగ బ్రెజీలియన్ పోర్చుగీస్‌లో క్రియకు పూర్వమే వస్తాయి, కాని ప్రామాణిక పోర్చుగీస్‌లో ఇవి క్రియ తర్వాత వస్తాయి. పోర్చుగీస్‌లో నాల్గు ప్రధాన మాండలికాలు ఉన్నా, అవి పరస్పరం అవగాహనకు ఆటంకంగా ఉండవు. పోర్చుగీస్ భాష రోమన్‌లిపిలోనే వ్రాయబడుతూంది. కాని, ఇందులో 'కె, డబ్ల్యు, వై' అనే అక్షరాలు మాత్రం లేవు. పదాలలోని వర్ణక్రమానికీ, ఉచ్చారణకూ పొడచూపిన వ్యత్యాసాలను తొలగించడానికి, 1943 లో పోర్చుగల్, బ్రెజిల్ ప్రభుత్వాలు చర్చలు జరిపి ఒక అంగీకారానికి వచ్చాయి. దానిని అనుసరించి వర్ణక్రమానికీ, ఉచ్చారణకూ ఇప్పుడు ఒక సుస్థిర సంబంధం ఏర్పడింది.

**సాహిత్యం :** పోర్చుగీస్ సాహిత్యం మొట్టమొదట 12 వ శతాబ్దంలో రూపొందింది. ఆ నాటి కవులు ఫ్రెంచ్ రచయితల శృంగార గీతాలను ఆధారంగా చేసికొని పద్యాలు వ్రాశారు. 14 వ శతాబ్దం మధ్యకాలానికి వీరికి స్పెయిన్ కవులు ఆదర్శప్రాయు లయారు. ఒక ఐతిహాసిక సంప్రదాయం కాని, సుప్రసిద్ధ ప్రాచీన కావ్యం కాని లేని పోర్చుగీస్ రచయితలు వీర గాథలను చిత్రించే జానపద (బేలడ్) గాథలను సృష్టించి, విస్తరింపజేశారు. గార్ఫియాదరె సెందె (1470-1536) చరిత్రను వచనముగా రచించుటేకాక, *కన్సియో నెరోగెరాల్* అనే గేయ సంకలనాన్ని కూడా ప్రకటించాడు. భావుకతతో కూడిన మధుర గేయాలూ, వ్యాజస్తుతి, వ్యాజనిందాత్మకాలైన పద్యాలూ కొన్ని ఇందులో ఉన్నాయి. 'డోనాఇనెస్ ద కాస్ట్రో' మరణం మీద 'గర్ఫియా' రచించిన గీతాలు కూడా ఇందులో ఉన్నాయి. వీటిలో ప్రధానంగా యథార్థత, కరుణరసం, భావన కనిపిస్తాయి. 'కాటలాన్' ప్రాంతపు భాషలో ఔజియస్ మార్చ్ (1397-1458) వ్రాసిన గీతాలు 'చారణ' వాఙ్మయంలో చివరివి. ఇటాలియన్ సాహిత్య సంప్రదాయాన్ని బాగా అవగాహన చేసికొని, ఫలప్రదమైన సమన్వయాన్ని సాధించిన వారిలో ఇతడే ప్రథముడు. భౌతిక, ఆధ్యాత్మిక శృంగారాల ఘర్షణ ఇతని ఇతివృత్తం.

నాటక రంగంలో గిల్‌విసెంతె (1465-1539) మొదట గ్రామజీవితాన్ని వస్తువుగా స్వీకరించినా, తన వ్యక్తిత్వాన్ని మరుగు పరచుకోలేదు. జీవితంలో తాను గమనించిన కర్షకులనూ, దైన్యస్థితిలో ఉన్న పెద్ద మనుష్యులనూ, కుటిల న్యాయాధిపతులనూ, ధనాశ గల మత గురువులనూ ఇతడు చిత్రించాడు. ఈ విభిన్న వర్గాల వారిని ఒకేచోట చేర్చిన నాటకంలో ఏకతను సాధించడానికి ఇతని కవితాశక్తి తోడ్పడింది. పాత్రల ప్రవృత్తి గేయ వాతావరణంలో సుప్రతిష్ఠిత మైంది. సంఘంలో వెనుకబడినవారి జీవితాన్ని చిత్రించడానికి మాతృభాషను, ఇతరత్రా స్పానిష్ భాషను ఇతడు ఉపయోగించాడు. ఇతని ప్రధాన రచన *మృత్యునృత్యము, శీత కాలము యొక్క విజయము, దొందువర్గోస్, అమాదిస్ దగాలా* అనేవి కూడ ఇతడు వ్రాసిన 44 నాటకాలలో చెప్పకోదగ్గవి.

15 వ శతాబ్దంనాటి 'ఫెర్నావొలోపిస్' గొప్ప చరిత్రకారుడు. ఆ నాటి సంక్లిష్ట సంఘటనలను వర్ణించడంలో అతడు అద్వితీయుడు. అతని తరువాత అతని అనుయాయుల రచనలకు 16 వ శతాబ్దంలో క్రొత్త దేశాలనూ, క్రొత్త సముద్ర మార్గాలనూ కనుగొన్న పోర్చుగీసుల సాహస సముద్ర యానాలూ, ఖండాంతరాలలో వారి విజృంభణా మంచి వస్తువు లయాయి. వారి రచనలు తరువాతి రచయితలకు గొప్ప ప్రేరణను కలిగించాయి. పునరుజ్జీవన యుగ వాతావరణం పోర్చుగీస్‌వారి సాహస గాథలకు మంచి నేపథ్యాన్ని చేకూర్చింది. క్రొత్త రూపాలతో, క్రొత్తఛందస్సులతో పోర్చుగీస్ సాహిత్యంలో స్వర్ణయుగం ఆరంభమయింది. ఈ యుగంలో దార్శనిక విషయాలను లలితంగా, మధురంగా గానం చేసిన వారిలో లుయిస్ కమోయెస్ (1524-80) ముఖ్యుడు. ఇతడు *ఒస్‌లుసియదస్* అనే ఐతిహాసిక మహాకావ్యాన్ని వ్రాశాడు. భగ్నప్రేమికుడై, గోవా మొదలైన స్థలాలలో విఫల సైనిక జీవితం గడపి, నిష్కామజీవనం గడపిన ఇతని గేయాలు ఎప్పుడో 16 వ శతాబ్దంలో రచింప బడ్డా, నేటికీ సజీవంగానే నిలిచి ఉన్నాయి. తన వ్యక్తిగత జీవితాన్ని కాక, మానవ సహజప్రవృత్తులనూ, ఆశయాలనూ, అతీంద్రియ సౌందర్యాన్నీ ఇతడు చిత్రించాడు. ఖండకావ్యాలలో ఇతని *బాబెల్ ఎసియాలో* శ్రేష్ఠమైంది. ఇతని *ఒస్ లుసియదస్* లోని ఇతివృత్తం వాస్కోడిగామా భారతదేశానికీ, తూర్పు ఇండియా దీవులకూ రావడం. వర్జిల్‌ను

ఆదర్శంగా తీసికొని, చరిత్రను మహాకావ్యంగా దిద్దిన వారిలో ఇతడు ఒకడు. సునిశిత పరిశీలన, జ్ఞాపకశక్తి ఇతని భావ చిత్రాలకు జీవం పోశాయి.

1500 లో బ్రెజిల్‌ను కనుగొన్న 50 సంవత్సరాల తరువాత పోర్చుగీస్‌వారు తీర ప్రాంతాన స్థిరపడి, క్రమంగా దక్షిణ అమెరికా వలస రాజ్యాన్ని విస్తరింపజేసుకున్నారు. 1578 లో పోర్చుగల్‌రాజు సిబాస్టియన్ యుద్ధంలో మరణించిన తరువాత 1640 వరకూ పోర్చుగల్ స్పెయిన్‌లో ఒక భాగం అయిపోయింది. ఇది పోర్చుగీస్ సాహిత్యానికి కాస్త గడ్డుకాలమే. అయినా శ్పానిష్ ప్రభావం వల్ల దేశీయ సాహిత్యం మరీ దెబ్బతినిపోలేదు. బ్రెజిల్‌లో పోర్చుగీస్‌వారు లోపలికి చొచ్చుకొనిపోయి తమ రాజ్యాన్ని విస్తరించుకున్నారు. అంటానియో వైయిరా గొప్ప వక్తా, రచయితా కూడా. అతడు పోర్చుగీస్ ప్రభావం నుంచి జారిపోకుండా బ్రెజిల్ ఏకత్వాన్ని కాపాడాడు. పోర్చుగల్ దేశంలో నిసర్గ గ్రామీణ జీవితాన్ని చిత్రించే కవిత్వం (Pastoral poetry) అద్భుతంగా పోషింపబడింది. మత నైతిక సంబంధమైన సంభాషణాత్మక రచనలలో ఉదాత్తమైన శైలి సాధింపబడింది.

18 వ శతాబ్దంలో పోర్చుగీస్ సాహిత్యం ఫ్రెంచ్ సాహిత్య తాత్త్విక భావాలకు లోనయింది. నవీన సంప్రదాయ నవ్యధోరణి (New Classicism) కేవలం నామమాత్రమే! నిజమైన సంప్రదాయవాదం లోని పటిమ మరుగున పడింది. రచనలలో నియమావళికి ప్రాముఖ్యం ఎక్కువ అయింది. 18 వ శతాబ్దం చివరి భాగంలో కవి వ్యక్తిగతమైన గొంతు తిరిగి వినబడసాగింది. దీనివల్ల గేయకవితలో క్రొత్తశైలీ, ధోరణీ కనిపించ నారంభించాయి. బ్రెజిల్‌లో పుట్టిన ఆంటోనియోజోస్ ద సిల్వా రచనలతో రంగస్థలం కూడా క్రొత్త ఊపిరి పోసుకుంది. విపరీతమైన ప్రజాదరణకు పాత్రమైన అతని సామాజిక, విమర్శనాత్మక రూపకాలు మతగురువుల అసహనానికీ, కోపానికీ గురి అయి అతణ్ణి (ఇంక్విజిషన్) విచారణ కు గురి చేశాయి.

కేవలం నియమ ప్రధానమైన కావ్య రచనను ఆశించిన కాలంలో కూడా భావుకత, కల్పనలో స్వేచ్ఛ, ఆవేగం, ఇంద్రియానుభూతి లేకపోలేదు. కవి, నాటకకర్త అయిన ఆల్మైడ దాగారేత్ (1799-1854) ప్రాచీన జానపద గేయాలను పునరుద్ధరించాడు. ఇతని సిద్ధాంతాలను ఎదుర్కొన్న నియమవాది అంతెరో దక్వెంతాల్ (1842-91) ఒక దార్శనిక కవి. తత్త్వాన్వేషణ కోసం ఇతడు చేసిన ప్రయత్నాలు 150 సానెట్లలో చిత్రింప బడ్డాయి. దార్శనిక దృక్పథం ఉన్నప్పటికీ వీటిలో కవిత, భావన, మాధుర్యం నిరుపమానంగా ఉంటాయి. ఇతడు ఆత్మానుభూతిని ఉదాత్త భాషలో ప్రకటించాడు.

19 వ శతాబ్దంలో వచ్చిన రాజకీయమైన మార్పులతో కాల్పనిక వాదానికి ఆశ్రయం ఏర్పడింది. స్వతంత్ర ఆలోచనా ధోరణీ, క్రొత్తమార్గాలకోసం అన్వేషణా, సాంస్కృతిక పునరుద్ధరణ (revival) ఈ యుగం లక్షణాలు. రూపకం, నవల అభివృద్ధి చెందాయి. కవిత్వం అంతర్ముఖమై సామాజిక సమస్యలను గురించి ఆలోచించ నారంభించింది. 1870 లో యువ తరపు రచయితలు పోర్చుగల్‌ను ఆధునికీకరించడానికి చేయూత ఇచ్చారు. కవితలోనూ, నవలలోనూ వాస్తవికతను పోషించాలనే విమర్శాత్మకమైన దృక్పథాన్ని వీరు సాహిత్యంలో ప్రవేశపెట్టారు. వారిలో ఎకాద క్వైరోస్ (1845-1900) ఒకడు. సంఘాన్నీ, మతాన్నీ విమర్శిస్తూ హేళన చేసిన ఇతని నవలలలో ప్రకృతి పట్ల ఎక్కువగా ఆసక్తి కనపడుతుంది.

20 వ శతాబ్దంలో ఆధునికత, ప్రయోగశీలం పోర్చుగీస్ సాహిత్యానికి ఒక క్రొత్త దృక్పథాన్ని చేకూర్చాయి. ప్రతీకవాదాన్ని ఆశ్రయించి యూజెనియో ద కాస్ట్రో (1869-1944) కవిత చెప్పాడు. ఈ ప్రతీకవాద కవులలో కేమిలో పెస్సాన్హా (1867-1926) అగ్రగణ్యుడు. ఈ వర్గానికి చెందినవాడే ఫెర్నాండో పెస్సోవా (1888-1935). గ్రామీణ దృష్టి, భావ వివశత, బౌద్ధిక దృక్పథం ప్రకటించే కవితను చెప్పిన పెస్సోవా ఈ మూడింటికీ సరిపోయే మూడు మారుపేర్లతో తన పద్యాలను ప్రచురించాడు. రూప యోజనలోనూ, శబ్ద గ్రథనంలోనూ ఈతని కావ్యాలు శ్రేష్ఠమైనవి.

ఆత్మపరిశీలన, ఆధ్యాత్మికానుభూతులపై మమత కల మిగువెల్ తోర్గా (1907) చక్కని ఖండ కావ్యాలూ, కథలూ వ్రాశాడు.

1822 లో పోర్చుగల్ నుండి బ్రెజిల్ స్వాతంత్ర్యాన్ని సంపాదించుకుంది. అప్పటి నుంచీ బ్రెజిల్ ఉత్తమ సాహిత్యాన్ని సృష్టిస్తూ, 20 వ శతాబ్దంలో ఉత్తేజాన్ని కలిగించే ఉత్తమ సాహిత్యాన్ని రూపొందించింది. 1974 లో స్వతంత్రమైన ఆఫ్రికన్ దేశాలలోని పోర్చుగీస్ భాషలో కూడా అద్భుతమైన ప్రత్యేక వ్యక్తిత్వంతో రచనలు వెలువడుతున్నాయి.

పో.సు.శా. (వ.మం.)

## పోలిష్ భాష - సాహిత్యం

**భాష :** పోలిష్‌భాష ఇండో-యూరపియన్ భాషా కుటుంబంలోని స్లొవోనిక్ వర్గానికి సంబంధించింది. యూరప్ ఖండంలోని పోలెండ్ దేశంలోనే కాక, పోలెండ్ వాసులు వలస పోయిన అమెరికా, ఫ్రాన్సులలో కూడా ఈ భాష మాట్లాడేవా రున్నారు. ఈ భాషలో ఏడు మాండలికా లున్నాయి. ఇవి అన్నీ గ్రాంథికభాషకు సన్నిహితంగానే ఉన్నాయి.



పోలండ్

ఈ భాషకు లాటిన్ లిపినే వాడుతున్నారు. కాని, పోలిష్ భాషలో మాత్రమే వినబడే కొన్ని ప్రత్యేక ధ్వనులను సూచించడానికి కొన్ని కొత్త అక్షరాలు దానిలో చేర్చబడ్డాయి.

**సాహిత్యం :** 10 వ శతాబ్దం నాటికే పోలిష్ భాష రూపొంది పోలండ్ దేశానికి ఒక ప్రత్యేక ప్రతిపత్తి ఏర్పడింది. అయినా ఆ దేశ భాషలో గ్రంథరచన మాత్రం మధ్యయుగం చివరి వరకూ జరుగలేదు. ఆ నాటి పోలండ్ వాసులకు లాటిన్ భాషపట్ల గల ఆదరమే దానికి కారణం. 10 వ శతాబ్దం నుంచి 15 వ శతాబ్దం చివరి వరకూ పోలండ్‌లో లాటిన్ సాహిత్యానికే ఆదరణ లభించింది. 14 వ శతాబ్దం వరకూ రచింపబడ్డ గ్రంథాలన్నీ క్రైస్తవమత సంబంధమైనవే. అవన్నీ లాటిన్‌లోనే రచింపబడ్డాయి. 15 వ శతాబ్దంలో పోలండ్ జాతీయ సంప్రదాయాన్ని గురించీ, అనేక ఇతర లౌకిక సమస్యలను గురించీ గ్రంథాలు వెలువడ్డా, అవీ లాటిన్‌లోనే రచింపబడ్డాయి.

అంత విరివిగా కాకపోయినా, పోలిష్ భాషలో కూడా కొన్ని రచనలు ఆనాడు సాగుతూ ఉండే వనీ, వానికి సామాన్య ప్రజలలో వ్యాప్తి ఉండేదనీ, కొన్ని పరిశోధనల వల్ల తెలుస్తుంది. అధిక వ్యాప్తి గల మేరీ మాతను స్తుతించే *బొగ్రొరికా* అనే పోలిష్ గీతాన్ని సెయింట్ అదల్‌బర్ట్ 10 వ శతాబ్దంలోనే రచించాడని కొందరి వాదం. ఇది యథార్థమే కావచ్చు. అయినా దీనికి సారస్వత ప్రశస్తి మాత్రం రాలేదు. ప్రాచీన పోలిష్ కవిత ఒకటి 13 వ శతాబ్దంలోనే రచింపబడినా 1407 నాటి దాని లిఖిత ప్రతి మాత్రమే లభించింది.

16 వ శతాబ్దం ఆరంభంలో పోలండ్‌లో వచ్చిన ఆర్థిక, సాంఘిక రాజకీయ విప్లవాల వల్ల సాహితీ సంస్కృతులలో గొప్పమార్పులు వచ్చాయి. దేశీయ ఐశ్వర్యాభివృద్ధి కోసం సంస్కరణలను తీసికొని వచ్చేందుకు ఆ నాడు ఆరంభింపబడ్డ రాజకీయ ఉద్యమం వలన పత్రికా రచన బాగా అభివృద్ధి చెందింది. ఈ శతాబ్దం మొదటి అర్ధభాగంలో కొందరు జమీందారులు, కొందరు ముద్రాపకులు పోలిష్ సాహిత్యపోషణకు నడుం కట్టారు. లాటిన్‌భాషను త్రోసిరాజని పోలిష్ భాషలోనే రచనను సాగించిన బెర్‌నాట్ ఇతర పోలిష్ రచయితలకు మార్గదర్శకుడయాడు.

16 వ శతాబ్దం నుంచి 17 వ శతాబ్దం మధ్య వరకూ పోలిష్ సాహిత్యానికి స్వర్ణయుగం. ఇటాలియన్ పునరుజ్జీవనోద్యమ ప్రభావం వల్లా, ఇతర దేశాలతో ఏర్పడ్డ సన్నిహిత సంపర్కాలవల్లా, దేశంలోని శాంతి స్థిరత్వాల వల్లా, ఈ కాలంలో వైవిధ్యంతోనూ, ఆత్మ విశ్వాసంతోనూ పోలిష్ సాహిత్యం వర్ధిల్లింది. మికోలజ్ రెజ్ స్వయం వ్యక్తిత్వ మున్న తొలి పోలిష్ రచయిత. 1543 లోని ఈతని పద్య వాగ్వాదం నూతన యుగారంభాన్ని సూచిస్తుంది. జాన్ కొచనోవిస్కీ ఆతని సమకాలికుడే. ఇతడు పునరుజ్జీవనోద్యమ సంప్రదాయంలో తొలినాళ్లలో వచ్చిన ప్రముఖ కవి. ఈ కాలంలో విషయవైవిధ్యంతో అనేక పద్య గద్య రచనలు వెలువడ్డాయి. ఈ కాలం లోని రచయితలలో నికోలస్, సెన్, షార్‌జిన్‌స్కీ, సెబాస్టియన్ క్లోనోవిజ్, సైమన్ సెమనోవిజ్ అనే పద్య కావ్య రచయితలూ, స్టెనిస్లాన్ జర్జచస్కీ, లూకాస్‌గార్‌నికీ, పీటర్ స్కర్గా అనే వచన కావ్య రచయితలూ ప్రముఖులు.

17 వ శతాబ్దం మధ్యనుంచి 18 వ శతాబ్దం ఆరంభం వరకూ గల కాలాన్ని పోలిష్ సాహిత్య చరిత్రలో 'బరోక్' యుగం అంటారు. స్వచ్ఛందం, విశృంఖలం అయిన కళా శైలికి 'బరోక్' అని పేరు. ఆ

సంప్రదాయాన్ని ఈ యుగంలోని రచయితలు విరివిగా ఆదరించడంవల్ల ఈ యుగానికి ఆ పేరు వచ్చింది. అతి శయోక్తి వంటి అలంకారాలతో కూడిన సాహితీ ప్రక్రియలు అనేకం ఈ యుగంలో వెలువడ్డాయి. ఈ యుగంలో ఉదాత్త గ్రంథాలను రచించినవారు కూడా కొందరు లేక పోలేదు. అట్టివారిలో వాస్లోపోటోకీ సుప్రసిద్ధుడు. 1681 లో తుర్కీపై పోలండ్ పోరాటాన్ని సాగించి, సాధించిన విజయాన్ని చిత్రిస్తూ ఇతడు ఒక ఐతిహాసిక గ్రంథాన్ని వ్రాశాడు. గేయకవి అయిన ఆంద్రూ మార్ష్టిన్ ఐతి హాసికుడైన వెస్పాసియన్ కొచవస్కీ, హాస్య కావ్యాలను రచించిన క్రిష్టఫర్ ఓపలన్‌స్కీ ఈ కాలపు ప్రముఖ రచయితలు.

18 వ శతాబ్దం నుంచి 19 వ శతాబ్దం వరకూ నీతి బోధక కావ్యాల రచన విరివిగా సాగింది. ఇట్టి రచనలు చేసిన వారిలో ఇగ్నేషియస్ క్రాసిస్కీ సుప్రసి ద్ధుడు. హాస్యరసాన్ని సాధనంగా చేసుకుని ఇతని రచనలు చక్కని నీతిని ప్రబోధిస్తాయి. కవితా ప్రతిభలో కొన్ని అంశాలతో ఇతనికి దీటైన త్రెంబెకే ఇతని సమకాలికుడు. కజేతన్ వజీరస్కీ, ఫ్రాన్‌సిస్ కర్పిన్ స్కీ, ఫ్రాంసిస్ నియాజ్జెలు కూడా ఆ కాలంలోని ఉత్తమ రచయితలు. ఆనాటి గద్య కావ్య రచయితలలో ఏడం నరుషెవిస్కీ, స్టవిష్లా ష్టేషిన్, హూగో కొల్లెంతాజ్‌లు సుప్రసిద్ధులు. మధ్య యుగంనాటి పోలండ్ దేశచరిత్రను మధురమైన శైలిలో ఇంపుగా చిత్రించిన వాడు నరుషెవిస్కీ. ష్టేషిన్ సామాజిక రాజకీయ సంస్కరణల్ని ప్రోత్సహించే ఉద్దే శంతో కొన్ని గ్రంథాలను వ్రాసి, ప్రజల అభిమానానికి పాత్రుడయాడు. తాత్త్విక గ్రంథ రచయితగా కొల్లెంతాజ్ పేరు పొందాడు.

ఈ యుగంలోనే రూపక రచన కూడా ఆరంభం అయింది. ఫ్రెంచ్ రూపక రచయితలను, ముఖ్యంగా మోలియర్‌ను అనుకరిస్తూ చాలామంది రచయితలు రూప కాలు వ్రాయ నారంభించారు. కొన్ని స్వతంత్ర రచనలూ వచ్చాయి. అలాంటి రచయితలలో వాస్లా రజవిస్కీ ప్రథముడని చెప్పాలి. పోలిష్ చరిత్రలోని కొన్ని ఘట్టా లను కథా వస్తువులుగా తీసికొని ఇతడు విషాదాంత నాటకాలు వ్రాశాడు. కాని పోలిష్ రూపక వికాసానికి దోహదం చేసినవారిలో వజేనక్ బొగుస్లవిస్కీ, ఫ్రాన్‌సిస్ జొబిలస్కీలను ముఖ్యంగా పేర్కొనాలి. బొగుస్లవిస్కీ కేవలం రూపక రచయిత మాత్రమే కాదు. నాట కాలు ప్రదర్శించడానికి యోగ్యమైన ఒక చక్కని నాటక శాలను వార్సా నగరంలో 1765 లో అతడు కట్టిం చాడు. తన నాటకాలనే కాకుండా, ఇతర రచయితల ఉత్తమ నాటకాలను కూడా దానిలో ప్రదర్శించడానికి అతడు ప్రోత్సహించేవాడు. అలాంటి ప్రోత్సాహం వల్లనే జొబిలస్కీ ఉత్తమ రూపకాలను రచించగలిగాడు. *ఫిర్‌సిక్ వజలోటక్* (సోగ్గాని పెండ్లి ప్రయత్నం) ఇతని ఉత్త మోత్తమ రచన. ఈ కాలంలోనే *పోప్‌రియట్‌పోసలా* (ప్రతినిధి పునరాగమనం) అన్న సుఖాంత నాటకాన్ని రచించిన జూలియన్ ఉరిసిన నియమశివిజ్ అనే రచ యిత కూడా ప్రసిద్ధుడే! ఇతడు *స్పీవీహిస్టరియానీ* (ఐతిహాసిక గేయాలు) అనే ఒక గేయ కావ్యాన్ని కూడా రచించాడు. దానిలోని గేయాలు నేటికీ అత్యుత్సాహంతో గానం చేయబడుతున్నాయి.

19 వ శతాబ్దంలో 1863 వరకూ కాల్పనిక కవి తాయుగం అనవచ్చు. 'విల్నా' విశ్వవిద్యాలయం ఆ నాడు పోలిష్ సాహిత్య ప్రధాన కేంద్రంగా ఉండేది. మహాకవి మిక్కీవిజ్ అక్కడే చదువుకున్నాడు. వార్సాలో కూడా వెనుకటి లాగే పోలిష్ సాహిత్యానికి ప్రోత్సాహం లభించేది. ఈ కాలంలో పోలండ్ రష్యన్ సామ్రాజ్యంలో ఒక భాగంగా ఉండేది. దేశ స్వాతంత్ర్యానికి కృషిచేయడం నాటి పోలిష్ రచయితల ప్రధాన లక్ష్యం. స్వాతంత్ర్యభా వాన్ని ప్రజలలో వ్యాపింప చేయడానికి సాహిత్యాన్ని ఒక సాధనంగా వారు భావించారు. దీనికి కాల్పనికవాదం బాగా ఉపయోగపడింది. అలాటి రచయితలకు కశిమీర్ బ్రోజిన్‌స్కీ మార్గదర్శి. పీడిత పోలిష్ ప్రజల ఆకాంక్షలను ఇతడు తన గ్రంథాలలో చిత్రించ గలిగాడు. మిక్కీవిజ్, స్లోవస్కీ, క్రాసిన్‌స్కీ వంటి మహాకవులు ఆతని మార్గం లోనే నడచి కాల్పనిక కవిత్వానికి ప్రాశస్త్యాన్ని చేకూర్చారు. వారిలో స్లోవస్కీ షేక్స్‌పియర్‌ను ఆదర్శంగా పెట్టుకొని గొప్ప రచనలు చేశాడు. పైముగ్గురి అంతటి ప్రతిభావం తులు కాకపోయినా, ఆన్‌టోనీమాల్‌జీవిస్కీ, సూయెన్ గోషినస్కీ, జోసెఫ్ బోదన్‌జలేస్కీల రచనలు కూడా ప్రసిద్ధమైనవే! ఆ కాలపు నవలా రచయితలలో హెన్రీ రజవిస్కీ ప్రముఖుడు. చారిత్రక నవలా రచయితలుగా క్రాస్‌విస్కీ, జిగ్మంట్ కాక్జోవిస్కీ, జగ్మంట్ మిల్కో విస్కీ అనేవారు ప్రసిద్ధులు. ఈ కాల్పనిక కవుల రచనల వల్ల క్రమంగా దేశంలో స్వాతంత్ర్య కాంక్ష తీవ్రరూపం దాల్చి, 1863 లో తిరుగుబాటుగా పర్యవసించింది. కాని 'జార్ ప్రభుత్వం' దీన్ని నిర్దాక్షిణ్యంగా అణచివేసింది.

1863 నాటి తిరుగుబాటు విఫలం కావడంతో, కాల్ప నిక స్వప్నాలు కూడా కరగిపోయాయి. రచయితలు వాస్తవిక పరిస్థితులను అవగాహన చేసికోనారంభించారు.

రచయితలు విశృంఖల భావావేశానికి ఆలంబనం అయిన కాల్పనికతా వాదాన్ని విడిచి పెట్టి, వాస్తవికతా వాదాన్ని ఆశ్రయించారు. ఈ వాదాన్ని ఆశ్రయించిన వారిలో ఏడమ్ అస్నిక్, మేరీ కోనోప్నికా మొదలయిన గేయ కవులు ఉన్నా, నవలలే ఎక్కువ ఆదరణను పొందాయి. ఆ కాలపు రచయిత హెన్రిక్ శీన్ కీవిజ్ రచించిన *కోవాడిస్* అనే గ్రంథం అనేక ప్రపంచ భాషలలోకి అనువదింపబడి, ప్రపంచఖ్యాతిని ఆర్జించింది. బొలెస్లా ప్రూస్, ఎ లిజా ఓర్జెస్ జకోవా రచించిన నవలలు కూడా ఈ కాలానికి చెందినవే.

19 వ శతాబ్దం చివరి భాగాన యువకవి వర్గం ఒకటి పోలండ్‌లో బయలుదేరి, 'కళ కోసమే కళ' అనే వాదాన్ని లేవదీసింది. అప్పటి నుంచీ మొదటి ప్రపంచ యుద్ధకాలం వరకూ పోలిష్ సాహిత్యంలో ఈ వాదమే ప్రాముఖ్యం వహించింది. ఈ వాదానికి బలాన్ని చేకూర్చిన రచయితలలో కాజిమీర్ జీ తత్మేజర్, జీవన్ ప్రజస్మిస్కీ, స్టాన్‌స్లావివిస్పియాన్‌స్కీ, జాన్‌కస్ ప్రోవిజ్, లియొపొల్డ్ స్టాఫ్ పేర్కొనదగిన వారు. వీరిలో విస్పియాన్‌స్కీ ఈ యుగంలోని రూపక రచయితలలో అగ్రగణ్యుడు.

మొదటి ప్రపంచయుద్ధం ముగిశాక పోలెండ్‌కు స్వాతంత్ర్యం సిద్ధించింది. రెండు ప్రపంచ యుద్ధాల మధ్య కాలంలో (1919-39) పోలిష్ సాహిత్యంలో వైవిధ్యంతో కూడిన అభివృద్ధి కనిపించింది. ఈ కాలపు రచయితలు ఆ నాటి యూరప్‌లోని భవిష్యద్వాదాన్నీ, అభివ్యక్తివాదాన్నీ అభిమానించారు. మనస్తత్వాన్ని నిరూపించే నవలలకు బాగా ఆదరణ లభించింది. ఆ తరహాకు చెందిన నవలా రచయితలలో వ్లాడిస్లావ్ స్టానిస్లావ్ రెయ్‌మాంట్ ప్రముఖుడు. ఇతని నవలలలో *జేమియా ఓబికనా, ఛ్లోపి* (రైతు) అత్యుత్తమాలు. 1924 లో ఇతనికి నోబెల్ బహుమానం లభించింది. ఈ కాలంలో గేయకవిత్వం కూడా ప్రాముఖ్యంలోకి వచ్చింది. బ్రోమివిస్కీ, అతని అనుయాయులు గేయ కవిత్వంలో క్రొత్త రీతుల్ని ప్రవేశపెట్టారు.

రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో దేశం స్వాతంత్ర్యాన్ని కోల్పోవడంతో, దేశభక్తి గేయాలు విరివిగా రచించబడ్డాయి. యుద్ధానంతరం సామ్యవాద ప్రభుత్వం ఏర్పడింది. ఆ నాటి నుంచీ వర్గరహిత సమాజ నిర్మాణాన్ని ధ్యేయంగా ఉంచుకొన్న రచనలే విరివిగా వెలువడుతున్నాయి.

మ.మూ.మూ. (వ.మం.)

## ప్రోవెన్‌కాల్ భాష - సాహిత్యం

భాష : దక్షిణ ఫ్రాన్స్‌లో ఓసిట్టాన్ మాట్లాడే ప్రాంతాలలోను, కొంతకాలం ఇటలీ, స్పెయిన్ ప్రాంతాలలోను గ్రంథరచనకు ఉపయోగించిన భాషను ప్రోవెన్‌కాల్ భాష అంటారు. ఈ భాషా సాహిత్యం ముఖ్యంగా మూడు యుగాలకు సంబంధించింది; మొదటిది 11-15 శతాబ్దాల మధ్య కాలంలో గ్రాంథిక ప్రోవెన్‌కాల్ భాష సర్వత్ర ఉపయోగించబడ్డ యుగం; రెండవది 16-18 శతాబ్దాల మధ్యకాలంలో గ్రాంథికభాష మాండలిక భాషలుగా వికేంద్రీకరింపబడ్డ యుగం; మూడవది 19-20 శతాబ్దాల కాలంలో పాక్షికంగా గ్రాంథికభాష పునరుద్ధరింపబడ్డ యుగం.

మొదటి యుగం : లభ్యమైన ప్రోవెన్‌కాల్ కవిత్వంలో 10 వ శతాబ్దానికి చెందిన వాటికన్ వ్రాతప్రతిలోని ఒక చరణం అతి ప్రాచీనమైంది. 11 వ శతాబ్దం చివరి భాగంలో ఏక్విటైన్ డ్యూక్ 9 వ విలియమ్ రచించిన పద్యాలు కనిపిస్తాయి. ఇవి పాడుకోడానికి నిర్దేశించబడినవి. ఈ గీతాలు చాలావరకు ప్రేమగీతాలు. గత కాలంలో తాను చిలిపిగా ప్రవర్తించడం పట్ల తన విచారం, తన దేశాన్ని, కుమారుణ్ని విడిచిపోవాలనే భయం ఈ గీతాలలో వ్యక్తీకరించ బడ్డాయి. ప్రోవెన్‌కాల్ ప్రేమ గీతాలు దక్షిణఫ్రాన్స్ లోని ఫ్యూడల్ వ్యవస్థకు సంబంధించిన సాంఘిక పరిస్థితులను చిత్రించాయి. ప్రాంతీయ ప్రభువులు తమ కొమార్తెల వివాహాలను రాజకీయ అవసరాలకోసం జరిపించేవారు. ఆస్థానంలోని కవులను వారు ఆకర్షించేవారు; వారి ప్రేమగీతాల రచనకు ప్రేరణ కలిగించేవారు. ఈ కవులు సాంఘికంగా తక్కువ స్థాయికి చెందినవారు కావడం వల్ల తమ ప్రేమ గీతాలను చాలా జాగ్రత్త అయిన శైలిలో రచించేవారు. ఇటువంటి 'ఆస్థాన ప్రేమ' ఈ సాహిత్యంలో ఒక సంప్రదాయంగా మారింది.

ఈ భాషలో కవిత్వం సర్కసులో మృగాలచేత ఆటలాడిస్తూ, మధ్య మధ్యలో పాటలు పాడి వినోదం కలిగించే 'జోగ్లారు' లతో ప్రారంభమైంది. వారిలో కవిత్వం తెలిసినవారు క్రమేణా ట్రూబడోర్స్‌గా కవిత్వ ఆవిర్భావానికి కృషిచేశారు. 9 వ విలియమ్ ఈ ట్రూబడోర్స్‌లో చెప్పుకోతగ్గ కవి. 12 వ శతాబ్దారంభంలో కెర్కమాన్ జానపద గీతాలు ఎన్నో రచించాడు. ఆయన శిష్యుడు మార్కాబ్రన్ తన కాలపు చరిత్రను కథావస్తువుగా స్వీకరించి 40 జానపద గీతాలను రచించాడు. విప్రలంభ శృంగారాన్ని ఉదాత్తంగా వర్ణించిన జొఫ్రె రుడెల్ కూడా లబ్ధ ప్రతిష్ఠుడైన కవి. బర్నార్డ్ డి వెన్టడోర్, బెర్ట్రాన్ డి బోర్న్, అర్నాట్ డేనియల్ ప్రఖ్యాతి వహించిన ట్రూబడోర్ కవులు.

13 వ, 14 వ శతాబ్దాలలో 'మిడి' లోని ధనవంతుల ఆర్థిక పరిస్థితి కుంటుపడడం వల్ల, పోషకులు లేక ట్రూబడోర్ కవిత్వం అంతరించింది. ఈ కాలంలో కవిత్వం తగ్గి బోధనకు, విజ్ఞానానికి అనువైన రచనలే సృష్టించ బడ్డాయి. ప్రోవెన్‌కాల్ సాహిత్యంలో చాన్‌సోదిగిస్టె (ఒకే రైమ్ పరిమితమైన నిడివి లేకుండా సాగే పద్యమాలిక) అనే రకపు గ్రంథాలు కనిపిస్తాయి.

చార్ల్స్ మార్టెల్ సాహస కృత్యాలను పదివేల పాదాలలో వర్ణించిన *గిర్టార్ డి రూసిలాన్* అనే గ్రంథం పేర్కొనతగింది. రచయిత గ్విలెమ్ డి టుడేలా సాహస గాథలు ఇతివృత్తంగా గల కావ్యాలలో మూడు మాత్రం లభిస్తున్నాయి: జౌఫ్రె, బ్లాన్డిన్ డి కార్నోల్వా, గిలెమ్ డి లా బారా. సాహసగాథలు, సమకాలీన గాథలు ఇట్టి నవలలకు ఇతివృత్తాలు. ఆర్నౌట్ డి కార్కాసిన్ రచించిన *నోహాస్‌డిల్ పాపగైలో* తన యజమాని శృంగార వ్యవహారాలలో సాయపడుతూ ఒక మాట్లాడే చిలుక ప్రధాన భూమిక వహిస్తుంది.

నీతిబోధక, మతసంబంధమైన రచనలలో *బీతియస్* అనే గ్రంథం ముఖ్యమైంది. ఇది డయొనీసియస్ కేటో రచించిన *డిస్టీ షోడి మోరిబస్‌*కి అనువాదం. 'మిడి' లోని నాటక రచన మతసంబంధమైన అద్భుత క్రియలకు సంబంధించింది. 'సైంట్ ఏగ్నెస్ అద్భుతరహస్యం' అనే నాటకం అతిప్రాచీనమైంది. మొదటి యుగంలో వచన రచనలు చాలా తక్కువ. 12 వ శతాబ్దంలో సెయింట్ జాన్ ప్రవచనం అనువదించబడింది. ట్రూబోడోర్ రేమన్, విడాల్ డి బెసాలు రచించిన లాస్ రేజోస్ డి ట్రోబార్ అనే వ్యాకరణ శాస్త్ర గ్రంథం ముఖ్యమైంది. రాజకీయ కారణాలవల్ల ప్రోవెన్‌కాల్ సాహిత్యం క్షీణించి వచనరచన అభివృద్ధికి విఘాతం కలిగించింది.

**రెండవ యుగం :** 15 వ శతాబ్దంలో ప్రోవెన్‌కాల్ సాహిత్యం దాదాపు అంతరించి పోయింది. ఫ్రెంచ్ భాషా సాహిత్యానికే ప్రోత్సాహం లభించింది. కాని నీతిబోధకమైన రచనలు ప్రోవెన్‌కాల్ సాహిత్యంలో ప్రచురించబడేవి. 16 వ శతాబ్దంలో ప్రోవెన్‌కాల్ సాహిత్యాన్ని పునరుద్ధరించడానికి గట్టి ప్రయత్నాలు మళ్లీ మొదలయాయి. *ఎపిలాగ్స్* (ఉపసంహారం) అనే గణనీయమైన రచన చేసిన గాస్కాన్ పేడి గేరోస్ తన మాండలికాన్ని సాహిత్య స్థాయికి తగినట్లు పోషించాడు. డేవిడ్ గీతాలకు (Psalms of David) అనువాదం, గాస్కాన్ కవితలూ ప్రోవెన్‌కాల్ భాషను దక్షిణఫ్రాన్స్‌లో కవిత్వ భాషగా పునరుద్ధరించాయి. గాస్కనీ (Gascony) లో ఒక ప్రముఖమైన 'పేడి గారోస్' (Peyde Garrous) అనే కవిత్వోద్యమం ప్రారంభ మైంది. ఈ కవులలో 4 వ హెన్రీపై *జెస్టిలోమె గాస్కాన్* (1610) అనే గ్రంథాన్ని రచించిన గుయిలోమె ముఖ్యుడు. పియర్‌గుడెలిన్ కూడా పేర్కొనతగ్గ కవి. ముఖ్యంగా ప్రహసనాలు రచించిన బ్రూయెస్, ఓపెరాడి ఫ్రాన్టిగ్నన్ (1677) రచించిన నికొలాస్ ఫిజెస్ నాటక కర్తలలో ప్రముఖులు.

టులాస్ కవులు చాలామంది గుడెలిన్‌ని అనుసరించిన వారు. ప్రాచీన సాహిత్య రీతుల పునరుద్ధరణకు కూడా గుడెలిన్ ప్రభావం ముఖ్య కారణం. ఈ కవులు లాటిన్ నుంచి అనువాదం చేయడమే కాక, రోమన్ కవులపై వ్యంగ్య కవిత్వం (మోస్టెక్) కూడా రచించారు. *మిరమాస్టో* (1684) అనే జానపద కావ్యాన్ని ఆకార్టేటే ఈనాటికీ పాఠకులకు రసానందాన్ని కలిగించే విధంగా ఆకర్షణీయమైన శైలితో, నిజాయితీతో కూడిన భావనా స్ఫూర్తితో రచించారు.

18 వ శతాబ్దంలో మతాచార్యులు సాహిత్య సృష్టికి ఎక్కువగా దోహదం చేశారు. జె.బి.ఫావ్రె *ది సెర్మన్ డి మూసు సిస్ట్రి* అనే ఉత్తమ బోధనా గ్రంథాన్ని రచించారు. లయాన్స్‌కి చెందిన టుసైంట్ గ్రోస్ మంచి ప్రతిభ గల కవి. కాని ఇతని ప్రతిభ తాత్కాలికమైన రచనలకు ఎక్కువగా వెచ్చించడం జరిగింది. సిప్రియన్ డెస్ పోరిన్స్ 'గాస్కనీ' కవు లందరిలోకి ప్రఖ్యాతి కెక్కిన కవి.

**మూడవ యుగం :** ఫ్రెంచ్ విప్లవం తరవాత ఎఫ్.జె.రెనోవర్ట్ వంటి రచయితలు మధ్య కాలపు ఉత్తమ సాహిత్య సంప్రదాయాలపై అభిరుచిని కనపరచారు. కవులు సంఘటితులై, తమ కవితలను సంకలనాలుగా ప్రచురించసాగారు. 'ప్రోవెన్‌కాల్ కవితా మాల', 'తొమ్మిది మంది ట్రుబొడోర్ కవులు' అనే కవితా సంకలనాలను ప్రచురించారు. ఈ కవితలు ముఖ్యంగా పండితులను ఆకర్షించగలిగాయి. బోర్డోకి చెందిన జీన్‌వెర్డీ బహుళ ప్రచారం పొందిన వ్యంగ్యాత్మక హాస్యరచనలు చేశారు. రుమనీల్, ఫ్రెడరిక్‌మిస్ట్రాల్ ప్రోవెన్‌కాల్ జాతీయ భావనకు ప్రోత్సాహం కల్పించారు. మంచి నిజాయతీతో, లౌకిక బుద్ధితో రుమనీల్ ఉత్సాహభరితమైన కవితారచన, వచనరచన చేశారు. *మిస్ట్రాల్ కలెన్డౌ* అనే సుదీర్ఘ కావ్యాన్ని రచించారు. ఆ కావ్యం ఆ నాటి రచనలలో తలమానికంగా నిలిచింది. ఎవిగ్నాన్ దగ్గర రుమనీల్, మిస్ట్రాల్, థియొడోర్ జౌబనేల్, ఆల్ఫాన్సో టవాన్ వంటి కవులు సమావేశమై ప్రోవెన్‌కాల్ సాహిత్యాన్ని

అభివృద్ధి పరచే ఉద్దేశ్యంతో ఫెల్బ్రిజ్ అనే ఒక సంఘాన్ని స్థాపించారు. వీరిలో మిస్ట్రాల్ 1904 లో నోబెల్ పురస్కారాన్ని పొందాడు. ఆయన ప్రోత్సాహంతో ఎందరో కవులు ఓసిట్టాన్ భాష మాట్లాడే ప్రాంతాలలో ప్రశంసనీయమైన రచనలు చేశారు.

20 వ శతాబ్దం పూర్వార్ధంలో మార్సెల్‌కి చెందిన వెలేరె బర్నార్ట్, ఎస్టియోకి చెందిన మారియస్ ఆంద్రె, *లోగోట్ ఓసిటాన్* (1903) రచించిన ఏన్టోనిన్ పెర్బోస్ మంచి సాహిత్యకృషి చేశారు. పెరెనీస్‌కి చెందిన కేమెలా జానపద కావ్యాలను రచించాడు. ఇదే కాలంలో రోన్‌కి చెందిన జోసెఫ్‌డార్బో *లా బెస్టెయోడి వెకారెస్* అనే ఇతిహాస ధోరణిలో నడచిన కథా సంకలనాన్నీ, కొన్ని కవితలను రచించాడు. ఫాల్కో డి బోర్నెసెల్లి, మారియస్ జోనో గ్రాంథికభాషను తమ రచనలలో పునరుద్ధరించారు. 19 వ శతాబ్దం చివరి భాగంలోని ప్రముఖ ప్రోవెన్‌కాల్ రచయితలలో ఆర్. రూకె, రచయిత్రి మార్సెల్ డ్రూటెల్ (Marcelle Drutel) పేర్కొనతగినవారు. నేడు సంప్రదాయ పద్ధతికి, అధునాతన పద్ధతికి చెందిన ఇరువర్గాల రచయితలూ ఉన్నారు. తమ శక్తి కొలది వారు సాహిత్య సృష్టి చేస్తూనే ఉన్నారు.

ఎస్.ఎస్.ప్ర.

## ఫిన్నిష్ భాష - సాహిత్యం

**భాష :** ఫిన్లాండులో మాట్లాడబడే ఫిన్నిష్ భాష యూరలిక్ భాషా కుటుంబానికి చెందిన ఫిన్నో-యుగ్రిక్ శాఖకు చెందింది. 19 వ శతాబ్దారంభంలో దేశీయమైన ఫిన్నిష్ భాషకు తగినంత గౌరవస్థానం ఉండేది కాదు. విద్యాబోధనకు, పరిపాలనా వ్యవహారాలకు, సాహిత్యానికి స్వీడిష్ భాష ఉపయోగించ బడేది. 1835 లో ఫిన్నిష్ జానపద గాథలపై ఆధారపడిన *కలెవల* అనే ఇతిహాస కావ్యం ప్రచురించబడింది. ఫిన్నిష్ జాతీయ భావనకు ఆ కావ్యం ఉద్దీపన కలిగించింది. తరువాతి శతాబ్దంలో ఫిన్నిష్ భాష విద్యారంగంలోను, పరిపాలనా రంగంలోను ప్రాముఖ్యం పొందసాగింది. 1863 లో అధికార భాషా స్థాయిని సంపాదించుకోగలిగింది. ఈ భాషలోని పదజాలం జర్మన్, రష్యన్ వంటి యూరపియన్ భాషలనుంచి గ్రహించబడింది. 16 వ శతాబ్దంలో ఫిన్నిష్ భాషలోకి *న్యూ టెస్టమెంట్‌*ను అనువాదంచేసి ప్రచురించడంతో ఫిన్నిష్ భాషలో లిఖిత సాహిత్యం ప్రారంభమైంది.

**సాహిత్యం :** ఫిన్నిష్, స్వీడిష్, లాటిన్ భాషలలో జరిగిన సాహిత్య కృషిని ఫిన్నిష్ సాహిత్యంగా పరిగణించవచ్చును. ప్రాచీన కాలంలో కవిత్వం మౌఖికంగా ప్రచారంలో ఉండేది. 19 వ శతాబ్దంలో లిఖిత రూపాన్ని దాల్చింది. 12 వ శతాబ్దం అర్ధభాగం నుంచి ఫిన్లాండ్ స్వీడన్ పరిపాలనలో ఉండేది. అందువల్ల పై వర్గాల ప్రజలు స్వీడిష్ భాషనే ఎక్కువగా ఉపయోగించేవారు. 19 వ శతాబ్దంలో ఫిన్నిష్ భాషను సాంస్కృతిక మాధ్యమంగా తీర్చిదిద్దడానికి గట్టి ప్రయత్నాలు ప్రారంభమయాయి.

**కవిత్వం :** ఫిన్నిష్ భాషలోని జానపద కవిత్వంలో ఎన్నో కవితా రూపాలు కనిపిస్తాయి. ఆ కవిత్వంలోని ఛందస్సు, సరళమైన భాష జానపదులు హాయిగా పాడుకోడానికి వీలుగా ఉంటుంది. ఈ కవిత్వంలో ప్రముఖరూపాలు: సుదీర్ఘ ఇతిహాస కావ్యాలు, చిన్న గీతికలు. జానపద కావ్యాలకు వీరుల సాహస కృత్యాలు ఇతివృత్తాలు. శాంపో సాహసగాథ, కులేర్వో విషాదగాథ, *కలెవల* ఇతిహాస కావ్యంలోని సాహసగాథలు ఈ జానపద సాహిత్యంలోని ప్రముఖ గాథలు. స్త్రీలు, దైనిక సమస్యలు, ప్రేమ చిన్నగీతికలకు కవితా వస్తువులు. ఆత్మ ఏకాకితనం, దట్టమైన అడవులు, అందమైన సరోవరాలు, జానపద జీవనం ఈ గీతికలలో చిత్రిత మయాయి. 18 వ శతాబ్దం ఉత్తరార్ధంలో జానపద కావ్యసంకలనం ముమ్మరంగా సాగింది. 1847 లో *కలెవల*కు తుదిరూపాన్ని ఎలియాస్ లోన్రాట్ అనే ప్రఖ్యాత సంకలన కర్త కల్పించాడు. లోన్రాట్ *కాంటిలెటార్* అనే కవితా సంకలనాన్ని కూడా ప్రచురించాడు. ఫిన్నిష్ సాహిత్యాన్ని *కలెవల, కాంటిలెటార్*లు అమితంగా ప్రభావితం చేశాయి.

**స్వీడిష్ భాషలోని ఫిన్నిష్ సాహిత్యం :** ఫిన్లాండులో స్వీడిష్ సాహిత్యం 19 వ శతాబ్దంలోనే అభివృద్ధి చెందింది. ఫిన్నిష్ ప్రజలు, వారి దేశ నైసర్గిక పరిస్థితులు జొహాన్ లుడ్విన్ రూనెబెర్గ్ రచనలలో మొదటగా ప్రతిబింబింపసాగాయి. ఆయన జాతీయ కవిగా పరిగణించబడ్డాడు. జకారియస్ టొపేలియస్ స్కాట్ పద్ధతిలో *ఫాల్ట్స్‌కార్స్ బెరాట్ టెల్సర్, రాజుగారి ఉంగరం, శస్త్రవైద్యుని* కథలు, కవితలు, పిల్లల కథలు రచించాడు. 19 వ శతాబ్దం చివరి భాగంలో ఫిన్నిష్ సాహిత్యం నుంచి ఫిన్నో-స్వీడిష్ దూరం కాసాగింది. 20 వ శతాబ్దంలో

'దగ్గ్రివర్డ' అనే కవుల ఉద్యమం ప్రారంభ మయింది. వీరు విశ్లేషణశక్తితో, హేతుబద్ధంగా కవిత్వ సృష్టి చేశారు. వీరిలో రూనర్ షిల్డ్ ప్రముఖుడు. ఈయన నాటకాలు నైతిక కళాత్మక సమస్యలను నిశితంగా పరిశీలించాయి. ఆర్విద్ మోర్నె, బెర్టెల్ గ్రెపెన్‌బెర్గ్ చెప్పుకో దగ్గ కవులు.

ఫిన్నో-స్వీడిష్ సాహిత్యం రెండవ దశలో ఆధునిక కవిత్వం ఆవిర్భవించింది. ఈ ఆవిర్భావానికి ఈడిత్ సోడర్‌గ్రాన్ కారకురాలు. ఈమె దార్శనిక, స్వాప్నిక సంబంధమైన కవితలను వెలువరించింది. ఈమె తరువాత ఎల్మర్ డిక్టోనియస్ రాజకీయ ప్రభావంతో చెవులకు కటువుగా ఉండే పదజాలంతో కవితలు రచించింది. సగంలో విరచబడడం వంటి నూతన శిల్పంతో గున్నార్ జోర్లింగు, ఆత్మగతమైన ప్రకృతి కవిత్వాన్ని రచించిన రబ్బె ఎన్కెల్ ఈ ఆధునిక కవులలో ముఖ్యులు. 1960 ప్రాంతాలలో వ్యక్తినిష్ఠమైన, సౌందర్యాత్మకమైన సాహిత్యసృష్టికి వ్యతిరేక ఉద్యమం ప్రారంభమైంది. సాంఘిక దృష్టి, విమర్శనాత్మక చర్చ అత్యావశ్యకమని వీరు భావించసాగారు. సామాజిక స్పృహ కలిగిన రచయితలలో లార్స్ హుల్డెన్, క్లాస్ ఏన్డర్సన్ ముఖ్యులు. 20 వ శతాబ్దపు వచన రచయితలలో టిటో కొలియండర్, నాటకకర్తలలో వాలెట్టిన్ కోరెల్ ముఖ్యులు.

**ఫిన్నిష్ సాహిత్యం :** ఫిన్లాండులో మొదటి లూథరన్ బిషప్, మత సంస్కర్త అయిన మైకేల్ అగ్రికోలా ఫిన్నిష్ సాహిత్యానికి ప్రారంభకులు. ఈయన 1548 లో *న్యూ టెస్ట్‌మెంటు* ఫిన్నిష్ అనువాదాన్ని ప్రచురించాడు. *బైబిల్* సంపూర్ణ అనువాదం 1642 లో ప్రచురించబడింది. నిజమైన ఫిన్నిష్ సాహిత్యం అలెక్సిస్ కివితో ప్రారంభమైంది. ఆయన రచించిన *నూయ సేమన్ వెల్‌జెస్టా* (1870), *ఏడుగురు సోదరులు* (1929) మొదటి ఫిన్నిష్ నవలలు. ఈ నవలలు హాస్యంతో కూడిన వాస్తవిక శైలితో, ఫిన్నిష్ ప్రజల జీవితాన్ని కథావస్తువుగా స్వీకరించి ఫిన్నిష్ సాహిత్యానికి ఒక ఒరవడిని ఏర్పరచాయి.

1872 లో కార్లో బెర్గ్‌బోమ్ ఫిన్నిష్ జాతీయ నాటక రంగాన్ని స్థాపించాడు. నార్వే, ఫ్రెంచ్ నాటకకర్తల ప్రభావం వల్ల ఫిన్నిష్ నాటకాలలో వాస్తవికతను, సాంఘిక విమర్శను కొత్త రచయితలు ప్రవేశపెట్టారు. మిన్నా కాంత్ అనే ప్రతిభావంతురాలైన నాటకకర్త్రి, కవితాత్మకమైన ప్రకృతి సంబంధమైన నవలలు రచించిన జుహాని ఆహో (Juhani Aho), *ఇస్తాన్‌మా* (పితృభూమి-1893) అనే నవలతో ప్రఖ్యాతి చెందిన ఆర్విద్ యార్నెఫెల్ట్ ఫిన్నిష్ సాహిత్యంతో కొత్త పుంతలు తొక్కారు.

19 వ శతాబ్దం చివరి భాగంలో ట్యూవో పక్కాలా రచించిన *పనివారి గాథలు* ఉత్తమ గ్రంథాల కోవలో చేర్చదగినవి. జొహానెస్ లిన్నాన్‌కోస్కి రచించిన *ఎఱ్ఱ పువ్వు పాట* (1920) లో ఫిన్లాండ్ డాన్ జువాన్ శృంగార కృత్యాలు వర్ణించబడ్డాయి. ఐనో కల్లాస్ అనే రచయిత్రి *రైగిన్ పప్పి* (1926), *తోడేలు-పెళ్లికూతురు* (1930) వంటి నవలా గీతాలలో అక్రమ లైంగిక సంబంధాలను విమర్శించింది. జానపద జీవనాన్ని వ్యంగ్యాత్మకంగా విమర్శించిన జోయెల్ లెహ్టోనెన్ రచనలు, *పుట్కినోట్కో*, *హెన్‌కియన్ బైస్టే* (ఆత్మ సంఘర్షణ 1933) లు ప్రశంసనీయ మైనవి. మార్సెల్ ప్రూస్ట్, జేమ్స్ జాయ్స్ వంటి వారిచే ప్రభావితుడైన వోల్టెర్‌కిల్పి *అలస్టాలోస్ సలిస్సా* (1933) అనే నవలలో స్వగతాలూ, ఆరుగంటలలో జరిగిన సంఘటనలను 900 పుటలకు విస్తరించడం వంటి ప్రయోగాత్మక రచనకు పూనుకున్నాడు. 1939 లో నోబెల్ పురస్కార గ్రహీత ఎఫ్.ఇ. సెల్లన్ పా జీవితాన్ని జీవశాస్త్ర దృష్టితో పరిశీలించాడు. మానవ జీవితానికీ పరిసరాలకూ ఉన్న సంబంధాన్ని ఆయన ప్రతిభావంతంగా *మీక్ హెరిటేజ్* (1938), *ది మైడ్ సిల్లా* (1933) వంటి నవలలలో ప్రదర్శించాడు. ఈ కాలంలోని కవులలో ఆలోచనా పరుడు, నిరాశావాది, పండితుడు అయిన పైక్కో ఏన్టెరో ప్రత్యేకంగా పేర్కొనతగినవాడు.

1920 ప్రాంతాలలో 'టులెన్ కంటజట్' (దివిటీల వారు) అనే కవుల సమూహం అవతరించింది. 'యూరప్‌కు కిటికీలు తెరవండి' అని వారి నినాదం. వీరు ఫిన్లాందు పాఠకులకు వచన కవితలనూ నాగరక కాల్పనిక కవిత్వాన్నీ పరిచయం చేశారు. వీరి కవిత్వాశయాలు కట్రీవలా అనే కవయిత్రి రచనలలో కనిపిస్తాయి. ఆమె మొదట శారీరక సుఖాలను కీర్తించింది. తరువాత సామాజిక విమర్శను, సోషలిజాన్ని అభిమానించింది. ఒలావి పావొలైనెన్ అనే మేధావంతుడైన వ్యాస రచయిత హిట్లర్ హయాంలోని జర్మనీని విమర్శిస్తూ *సిన్కా యుక్సేన్ వుహేలు* (విషాదకర స్వగతం: 1946) అనే వ్యాస సంపుటిని ప్రచురించాడు. రెండు ప్రపంచ యుద్ధాల మధ్య కాలంలో ఊనోకైలాస్, కార్లో సార్కియా అనే కవులు ముఖ్యులు. వీరు సంప్రదాయ ఛందోరీతులను, వెనుకటి కవిత్వ లక్షణాలను తిరిగి ప్రవేశపెట్టారు. ఊనో 'నిద్ర-మరణం' అనే కావ్యంలో స్థిరమైన నైతిక

నియమావళిని సమర్థించారు. పెన్టి హాన్‌పా, టాయివో పెక్కానెన్ ఈ కాలంలో ప్రసిద్ధి కెక్కిన వచన రచయితలు. తన కథలలో హాన్‌పా బీద ప్రజల జీవితాలను పరిశీలించి, మంచి శైలితో వ్యంగ్య ధోరణిలో వారిని చిత్రించారు. పెక్కానెన్ పారిశ్రామిక కార్మికులను ప్రతిభావంతంగా చిత్రించారు. *లప్‌సూవెని* (నా బాల్యం: 1953) అనే ఆయన ఆత్మకథ పారిశ్రామిక జీవనాన్ని చిత్రించిన బృహద్రచన.

ఆకర్షణీయమైన కాల్పనికత, మానసిక చిత్రణ, నిశితమైన సాంఘిక విమర్శ ద్వితీయ ప్రపంచ సంగ్రామం తరువాతి సాహిత్యంలో ప్రముఖమైన ధోరణులు. వామపక్ష ధోరణులు హాన్‌పా రచనలలోను, హెల్లా వ్యావోలిజోకి నాటకాలలోను మనకు కనిపిస్తాయి. ప్రపంచ యుద్ధం తరువాత యువకవులు స్వేచ్ఛాచ్ఛందస్సును, ప్రతీకాత్మకతను, ఆధునికతను కవిత్వంలో ప్రవేశపెట్టారు. వీరిలో పావో హావికో కవిత్వాన్ని, వచన రచనలను, విచిత్ర నాటికలను రచించాడు. ఈయన రాజకీయ, మత సంబంధమైన సమస్యలను పట్టించుకోకుండా, రసాత్మక కావ్యసృజన చేశాడు. 1950 ప్రాంతాలలో హెల్వి జువోనెన్, ఈవా - లీసా మేనర్, టువోమాస్ అన్హావా ఆధునిక రీతులలో కవిత్వరచన చేశారు. వచన రచనలలో కూడ ఇటువంటి ఉద్యమం ప్రారంభమైంది. నవలలలో వస్తుగతమైన, అతిశయోక్తులు లేని శైలి ఐలా పెన్నానెన్, ఈవా జోయెన్‌పెల్టో మొదలగువారి నవలలలో కనిపిస్తుంది. ఏన్టి హైరి (Antti Hyry) రచించిన *కెవాట్టా జా సిక్స్య* (Spring and Autumn), *అలకౌలు* (Alakoulu: 1965) వంటి నవలలలో చక్కని వచనశైలి కనిపిస్తుంది. చార్లీ చాప్లిన్ వ్యంగ్య ధోరణిలో వైజోమెరి 'మనీలా తాడు' (1951) వంటి యుద్ధ నవలలు రచించాడు. సంప్రదాయబద్ధమైన కథాకథన విధానాలను వైనోలిన్నా *టున్టెమెటామాన్ సోటిలాస్* (అజ్ఞాతసైనికుడు : 1954) అనే నవలలలో ప్రయోగించాడు.

1960 ప్రాంతాల నుంచి చాలా మంది కవులు అరమరిక లేని, సంభాషణాత్మకమైన శైలిని ప్రయోగిస్తూ సాంఘిక, రాజకీయ సమస్యలపై కచ్చితమైన అభిప్రాయాలను వెలువరించసాగారు. పెంటి సారికోస్కి మేట్టి రోస్సి ఈ వర్గం కవులలో ప్రముఖులు. ఈ కాలంలో రచించబడిన నాటకాలలో ఆర్వోసాలో, ఫిన్లాండులో ఫాసిస్ట్ ఉద్యమంపై రచించిన *లాపువలై సోసేరా* ప్రత్యేకంగా చెప్పుకోదగ్గవి.

ఎస్.ఎస్.ప్ర.

# ఫ్రెంచ్ భాష - సాహిత్యం

భాష : ఫ్రెంచ్, లేక ఫ్రాన్సాయిస్ భాష ఫ్రాన్స్, బెల్జియమ్, స్విట్జర్లండ్‌లలో వ్యవహారంలో ఉన్న ఒక 'రొమాన్స్' భాష (800 వ సంవత్సరం తరువాత లాటిన్ భాషనుంచి నిష్పన్నా లయిన భాషలను 'రొమాన్స్' భాష లంటారు). కెనడాలో-ముఖ్యంగా 'క్వెబెక్'లోనూ, న్యూ ఇంగ్లండ్ ఉత్తర ప్రాంతంలోనూ ఇంకా, గతంలో గాని ప్రస్తుతం గాని ఫ్రెంచ్ సామ్రాజ్యంలో చేరి ఉన్న పుదుచ్చేరి వంటి ప్రాంతాలలోనూ కూడా ఫ్రెంచ్‌భాష మాట్లాడేవా రున్నారు. 25 పైచిలుకు దేశాలలో ఇది అధికార భాషగా ఉంది. ఫ్రెంచ్ భాషలో లిఖిత ఆధారాలు 842 నాటి 'శ్ట్రాస్‌బర్గ్' ప్రతిజ్ఞల నుంచీ లభిస్తున్నాయి.



ఫ్రాన్స్

పారిస్ నగర పరిసరాలలోని భాష ఆధారంగా 'ఫ్రాన్సియెన్ ఫ్రెంచ్' అనబడే ప్రామాణిక భాష రూపొందింది. 16 వ శతాబ్దం మధ్యభాగం నుంచి ఇదే ఆధికారికమైన ప్రామాణిక భాషగా ఉంటూ వచ్చింది. ఈ ఫ్రాన్సియెన్‌భాష ఉత్తర, మధ్య ఫ్రాన్స్ దేశంలో మాట్లాడే మాండలికాలను చాలా వరకు త్రోసిరా జంది. దీనివలన దక్షిణఫ్రాన్స్‌లోని ఆక్సెటాన్ భాష వాడుక కూడా చాలా వరకు తగ్గింది. ఆక్సెటాన్ భాషలో ప్రధాన మాండలికమైన ప్రోవెన్‌కాల్ భాష (చూ.) మధ్యయుగంలో సాహిత్య భాషగా విస్తృతంగా వాడుకలో ఉంది. ఫ్రెంచ్ భాషలోని ఇతర మాండలికాలు కేవలం విద్యాగంధం లేని గ్రామీణుల వ్యవహారంలో మాత్రమే నిలచి ఉన్నాయి. అయితే- ఉత్తర ఫ్రాన్స్‌లోని పికార్డ్ వాలూన్ మాండలికం,

పశ్చిమఫ్రాన్స్‌లోని నార్మన్ మాండలికం మధ్యయుగంలో 'ఫ్రాన్సియెన్' భాషతో తీవ్రంగా పోటీపడ్డాయి. వాలూన్ భాష(చూ.) ఈ నాటికీ బెల్జియమ్‌లో వ్యవహారంలో ఉంది. ఫ్రెంచ్‌భాషలోని ఇతర మాండలికాలు: ఆర్లియనాయిస్, బోర్బనాయిస్, చాంపెనాయిస్, లొరేన్, బర్గిగ్నాన్, ఫ్రాంక్ కోమ్టాయిస్, గాలో, అంగెవిన్, మేన్, పోయిటెవిన్, సెయింటోనియాయిస్, అంగమోయిస్.

లాటిన్ భాషా పదాలు ఇతర రొమాన్స్ భాషలలో కంటె ఫ్రెంచ్‌లో విశేషంగా మార్పులు పొందాయి. ఉదాహరణకు-

| లాటిన్ | శ్పానిష్ | ఫ్రెంచ్ |
|---|---|---|
| సెకూరమ్ | సెగురో | సర్ |
| వోసెమ్ | వోజ్ | వా |

ఇతర రొమాన్స్ భాషలలో లాగే ఫ్రెంచ్ భాషలో కూడా వ్యాకరణం లాటిన్‌లో కంటె బాగా సరళం చేయ బడింది. నామ విభక్తులు పూర్తిగా అంతరించాయి. బహువచన ప్రత్యయం ('s', - 'es') వ్రాసేటప్పుడు వర్ణక్రమంలో నిలిచి ఉన్నా, ఉచ్చారణలో లుప్తం అయింది. స్త్రీ, పుం లింగ భేదాన్ని నామవాచకంలో వచ్చే మార్పువల్ల కాకుండా దాని ముందు ఉండే 'ఆర్టికిల్' ద్వారా గాని, విశేషణం ద్వారా గాని సూచిస్తారు. వ్యావహారిక ఫ్రెంచ్ భాషలో బహువచనంలో కూడా అదే విధంగా గుర్తించ బడుతుంది. క్రియలకు మూడు పురుషలలో ఏకవచన బహువచన రూపాలు వ్రాతలో వేర్వేరుగా కనిపిస్తున్నా, వాగ్ వ్యవహారంలో చాలా రూపాలు ఒకే విధంగా ఉచ్చరించబడుతున్నాయి. ఫ్రెంచ్ క్రియకు కాలాలనూ, కర్మణి ప్రయోగాన్నీ, ఆత్మనే పద అర్థాన్నీ సూచించే అనేక రూపాలు ఉన్నాయి.

రోమన్ సామ్రాజ్యంలో 'గాల్' అనే మరో పేరుగల ఫ్రెంచ్ సీమలో వ్యాపించిన 'టాటిన్' అనే అపభ్రంశ భాష కాలక్రమేణ వికృతి చెంది, 9 వ శతాబ్దం నాటికి ప్రాచీన ఫ్రెంచ్‌భాషగా రూపొందింది. ఈ ప్రాచీన భాష పలు మార్పులు చెంది మధ్య యుగపు ఫ్రెంచ్‌గా పరిణమించింది. 17 వ శతాబ్దం నాటికి దీనిలోని వివిధ మాండలికాలకు సన్నిహితత్వం ఏర్పడి, ఆధునిక ఫ్రెంచ్‌భాష అవతరించింది.

ఆఫ్రికాలోని ఫ్రెంచ్ వలస రాజ్యాలలో పరిణతి చెందిన మాతృభాషలు లేని ఆఫ్రికన్ తెగలకు ఫ్రెంచ్ భాషే వ్యవహార భాష అయింది. ఫ్రెంచ్‌భాషలోని పదజాలంలో ఎక్కువ భాగం 'లాటిన్' నుంచి వచ్చిందే అయినా గ్రీక్, అరబిక్, ఇంగ్లీష్, స్కాండినేవియన్, ఇటాలియన్ భాషా పదాలు కూడా అనేకం దీనిలో వచ్చి చేరాయి. ఈ భాష రోమన్‌లిపిలో వ్రాయబడుతుంది.

**సాహిత్యం :** ఫ్రాన్స్‌లోను, ఫ్రెంచ్‌భాష వ్యవహారంలో ఉన్న ఇతర ప్రాంతాలలోను వెలువడిన సాహిత్యం ఫ్రెంచ్ సాహిత్యం. పశ్చిమ యూరప్‌ను రోమన్‌లు ఆక్రమించడంతో అపభ్రంశ లాటిన్ భాషనుంచి పరిణమించిన 5 ప్రధాన రొమాన్స్ భాషలలో ఫ్రెంచ్ ఒకటి. నార్మన్‌లు 1066 లో బ్రిటన్‌ను జయించిన తరువాత అక్కడ ప్రభుత్వ భాష అయిన ఫ్రెంచ్ భాషలోని ఆంగ్లో-నార్మన్ మాండలికంలో వెలసిన సాహిత్యాన్ని గురించీ, కెనడా మొదలైన ఇతర దేశాలలో వర్ధిల్లిన ఫ్రెంచ్ సాహిత్యాలను గురించీ ప్రత్యేక వ్యాసాలలో వివరించ బడింది.

ఆధునిక యూరపియన్ సాహిత్యాలలో ఇంగ్లీషు సాహిత్యం తరువాత ప్రముఖస్థానం వహించింది ఫ్రెంచ్ సాహిత్యం. మధ్యయుగం మొదలుకొని నేటివరకూ అవిచ్ఛిన్నంగా పలు రీతులుగా వికాసం పొందుతూ వచ్చి, అనేక సాహిత్య ప్రక్రియలలో తక్కిన యూరపియన్ భాషా సాహిత్యాలకు మార్గదర్శకం అయి, ఫ్రెంచ్ సాహిత్యం మిక్కిలి ప్రసిద్ధి పొందింది. సౌందర్యారాధనలో ఫ్రెంచ్ ప్రజలు పరాకాష్ఠ పొందినవారు. ఈ సౌందర్య పిపాసే వారి సాహిత్యంలోనూ ప్రతిఫలిస్తూంది.

ప్రాచీన ఫ్రెంచ్ భాష అని గుర్తింపదగిన భాషలో కనిపిస్తున్న తొలి రచన 'స్ట్రాస్‌బర్గ్ ప్రతిజ్ఞ' (అనువాదం-842). 1100 కు పూర్వం మతసంబంధమైనవే మరికొన్ని గ్రంథాలు లభిస్తున్నాయి. అందుచేత ఫ్రెంచ్ సాహిత్య మూలాలు స్పష్టంగా గుర్తించడం కష్టం. 12 వ శతాబ్దం తరువాత వెలసిన కొన్ని గ్రంథాలు- ముఖ్యంగా కొన్ని చారిత్రక రచనలు లభిస్తున్నాయి. వీటిలో మొదటిది *షేన్సన్ డీ రోలండ్* ఈ గ్రంథానికి 1100 ప్రాంతంలో ఇంగ్లండ్‌లో కాపీచేయబడిన ఒక లిఖిత ప్రతి లభించింది. 13 వ శతాబ్దం దాకా ఫ్రెంచ్ సాహిత్య వ్యాసంగం నార్మన్‌లు జయించిన ఇంగ్లండ్‌లోనే ఎక్కువగా కనిపిస్తూంది. కాని 13 వ, 14 వ శతాబ్దాలలో ఫ్రాన్స్ దేశంలో ఫ్రెంచ్ సాహిత్యం అభివృద్ధి కాసాగింది.

*షేన్సన్ డీ రోలండ్* అనే ఐతిహాసిక రచన ప్రశస్తమైంది. ఈ నాటికీ ఫ్రెంచ్ సాహిత్యంలోని ఐతిహాసిక రచన లన్నిటిలోనూ శైలీ, కథాసంవిధానాలలో ఇదే సర్వోత్తమంగా భావించబడుతూంది. ఇది అజ్ఞాత కర్తృకం. ఫ్రెంచ్ జాతీయ వీరుడు షేర్లమేన్ కాలంలో క్రైస్తవమత సంరక్షణార్థమై ముస్లిములతో పోరాడి మరణించిన ఒక

వీరుని చరిత్ర ఈ ఇతిహాసానికి కథావస్తువు. తరువాతి కాలంలో ఈ గ్రంథంలోని ఛందోరీతినే అనుసరిస్తూ చారిత్రక కథలను వస్తువులుగా గ్రహించి అనేకులు గ్రంథాలు రచించారు. కాని, వాటిలో దేనికీ *రోలాండ్* గీతానికి వచ్చినంత ప్రసిద్ధి రాలేదు.

12 వ శతాబ్ది పూర్వార్ధం వరకూ ఇలాంటి రచనలు విరివిగా వచ్చాయి. ఆ తరువాత ఇంగ్లండ్ మొదలైన ఇతర దేశాలలోని ప్రాచీన వీరుల సాహసకృత్యాలను కథావస్తువులుగా గ్రహించడం ఫ్రెంచ్ కవులకు ఆచారం అయింది. దీనితో పాటు కావ్యం వలన సాధింప బూనే లక్ష్యంలో కూడా మార్పు కనిపించింది. వెనుకటి ఐతిహాసిక కావ్యాలకు క్రైస్తవ మత రక్షణ ప్రధాన లక్ష్యం కాగా, అనంతర కావ్యాలలో ప్రేమారాధనకు ప్రాముఖ్యం ఏర్పడింది. ఈ రకం కావ్యాలలో పూర్తిగా కృతకృత్యుడైన కవి క్రీటిన్ డిట్రాయీ. కథ అల్లడంలోనూ, పాత్రపోషణలోనూ ఇతని కౌశలం అద్వితీయం. ఇతడు చిత్రించిన నాయికా, నాయకుల ప్రవర్తనలను ఆదర్శంగా గ్రహించి తమ నిజ జీవితాలలో అనుకరించడానికి మధ్య యుగాలలోని ఫ్రెంచ్ దేశపు ఉన్నత వంశీయులు ప్రయత్నించేవారు.

దాదాపు 60 ఏళ్ల పాటు ఈ విధంగా ప్రేమారాధనకు ప్రాధాన్యం ఇచ్చే వీరగాథా రచన పద్యరూపంలో విరివిగా సాగింది. తరువాత ఇలాంటి కథావస్తువుతోనే గద్యరూపంలో కొన్ని కృతులు వెలువడ్డాయి. ఆదిలో ఈ గద్య రచనలకు కూడా పద్య రచనలతో సమానంగా ప్రశస్తి లభించినా, క్రమేణ ఇలాంటి రచనలకు ప్రజాదరణ సన్నగిల్లసాగింది.

ఆ కాలంలో ఇలాంటి ఐతిహాసిక కావ్యాలే కాక, కొన్ని స్వతంత్ర కావ్యాలు కూడా వచ్చాయి. వాటిలో సుప్రసిద్ధమైంది *రోమాన్ డీ రేనా*. ఇది వివిధ కవుల రచనలతో కూడిన ఒక ఖండకావ్య సంపుటి. ఈ ఖండ కావ్యాలలో జంతువులను పాత్రలుగా గ్రహించి వాటి ద్వారా మానవులలోని లోటు పాటులను విమర్శించడం జరిగింది.

13 వ శతాబ్దంలోనే గేయకవిత్వానికి కూడా కొంత పుష్టి చేకూరింది. అయినా 15 వ శతాబ్ది నాటికి విల్లోన్ కవి వలన గాని దీనికి బాగా ప్రశస్తి చేకూరలేదు. గేయాలలో సహజమైన క్లిష్ట ఛందో గతులను కూర్చడంలో మాత్రమే కాక, ఆ గేయాలలో తన జీవితానుభవాలను ధ్వనింప జేయడంలోను ఇతడు అందె వేసిన చేయి. ఆ మధ్యయుగ కాలంలోనే రూపక రచన కూడా కొంత వరకు కొనసాగింది. కాని, ఈ ప్రక్రియను చేబట్టిన కవులు రెండు విధాలుగా ఉండేవారు. కొందరు మతవిషయిక ధర్మబోధనకే మత రచనలను సాధనాలుగా గ్రహింపగా, మరి కొందరు ఐహిక మానసికానుభూతుల చిత్రణే తమ లక్ష్యంగా గ్రహించారు. మొదటి వర్గానికి చెందిన వారిలో ఆర్నూల్ గ్రీబాస్ (15 వ శతా.) ప్రముఖుడు. రెండవ వర్గంవారిలో ఆడమ్ డిలాహేలీ (13 వ శతా.) గణింపదగిన వాడు. రెండవ వర్గం వారి నాటకాలు సరళ శైలిలో ఉండి మనోరంజకాలై ప్రజాదరణ పొందగలిగాయి.

రూపకాలతో పాటుగా నీతిబోధక కావ్యాలూ, ప్రహసనాలూ కూడా కొన్ని మధ్యయుగంలో కొంతవరకు వ్యాప్తి పొందాయి. కాని, ఆ యుగంలో వెలువడిన ఇతర రచన లన్నిటికంటె విలక్షణమూ, ప్రాశస్త్యంలో దేనికీ తీసిపోనిదీ *రోమాన్ డీ రోజా* అనే గ్రంథం. ఇది రెండు ఖండాలు. మొదటి ఖండం రచయిత గిలోమీ డి లారీ (13 వ శతా.). రెండవ దానికి కర్త జీన్ డి మోన్ (13 వ శతా.). ఈ కావ్యం ప్రేమరస ప్రధానం. కాని, అందందు హాస్యం కూడా తొణికిసలాడుతూ ఉంటుంది.

ఈ విధంగా - మధ్యయుగంలోనే ఫ్రెంచ్ సాహిత్యంలో వివిధ సాహిత్య ప్రక్రియలకు అంకురార్పణ జరిగినప్పటికీ వాటి సంపూర్ణ వికాసానికి దోహదం చేసింది మాత్రం యూరప్‌లోని పునరుజ్జీవన యుగమే.

ఫ్రెంచ్ సాహిత్యంలో 16 వ శతాబ్దంలో పునరుజ్జీవన యుగం ప్రారంభమైంది. ఈ నూతన యుగానికి వైతాళికుడు క్లైమెంట్ మరో పండిత కుటుంబంలో జన్మించిన ఈ మహాకవి ఫ్రెంచ్ భాషకు ఒక క్రొత్త శైలిని ప్రసాదించాడు. ఇతని మార్గాన్ని అనుసరించి విక్టర్‌బ్రోడ్, మారిస్ సివ్ మొదలైన ప్రముఖ రచయితలు కావ్యరచన సాగించారు. కాని ఆ శతాబ్ది ప్రథమ పాదాంతాన పియరీ డి రోన్ సార్డ్ అనే ఒక మహాకవి ఉదయించి, రచనా రీతిలో ఇంకొక వినూత్న సంప్రదాయం స్థాపించాడు. మరి కొందరు ఉత్తమ రచయితల సాయంతో ఇతడు *ప్లీడీ* అనే ఒక ఉత్తమ సంకలిత గ్రంథం తయారుచేశాడు. యూరప్ సంస్కృతికి ఆలంబనా లయిన గ్రీక్, లాటిన్ సాహిత్యాల స్థాయికి ఫ్రెంచ్ సాహిత్యాన్ని తీసికొని రావడం కోసం ఆ ప్రాచీన భాషల నుంచి అనేక పదాలను గ్రహించి, ఫ్రెంచ్ రచనా సంవిధానంలో వాటికి స్థానం కల్పించి, ఫ్రెంచ్ భాషా సాహిత్యాలకు పుష్టి చేకూర్చడమే తన సంకలన గ్రంథ ప్రధాన లక్ష్యమని అతడు ప్రకటించాడు. ఇతడూ, ఇతని మిత్రులూ ఆ ప్రయత్నంలో కొంత వరకు సఫలత పొందినప్పటికీ

వారి ఉద్యమాన్ని విమర్శించి, ఖండించిన విద్వాంసులు కూడా ఆనాడు కొందరు లేకపోలేదు. అయినా ఈ గ్రంథం పలువురు రచయితల దృష్టిని ఆకర్షించి వారి ఆదరణకు, అనుసరణకు పాత్రం అయింది. ఈ మహా కృషిలో రోన్ సార్డ్‌కు సాయపడినవారిలో ప్రముఖుడు డూ బెల్లే. ఫ్రెంచ్ భాషా సంస్కరణను సమర్థిస్తూ ఇతడు *డిఫెన్స్ ఎట్ ఇలస్ట్రేషన్ డి లా ల్యాంగ్వే ఫ్రాన్స్వాయిస్* అనే గ్రంథం ప్రకటించడమే కాక, ఆ నూతన శైలిలో కొన్ని గ్రంథాలు కూడా రచించాడు. 'సానెట్', 'ఓడ్' ఇతని అభిమాన ఛందస్సులు. ఇతడు వ్రాసిన గ్రంథాలలో *అంటి క్విటీస్ డి రోమ్* (రోమ్ నగర ప్రాచీన విషయాలు) అనే గ్రంథం ఉత్తమమైంది. ఇతని గేయాలు అనేకం అత్యుత్తమ శ్రేణికి చెందినవిగా నేటికీ పరిగణించబడుతున్నాయి. 16 వ శతాబ్దంలోని తరువాతి రచయిత లందరూ ఈ మార్గాన్నే అనుసరించి, తమ తమ సామర్థ్యాల కనుగుణంగా దానికి విశేష పుష్టి చేకూర్చారు. ఆ శతాబ్దం చరమ భాగంలో జీవించిన మల్‌హెర్బి ఈ విషయంలో ప్రత్యేకంగా పేర్కొనదగ్గ వాడు. శైలిలో పద గాంభీర్యం కన్న అర్థ గాంభీర్యానికే ఇతడు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చాడు. ఇతని ప్రసిద్ధ రచనలు: *కామెంటైల్ సర్ డెస్ పోర్‌ట్రే, కన్‌సొలేషన్ డి మాన్ స్యూయర్ డూ పిరియర్*. వీటిలో మొదటిది: ఒక లక్షణ గ్రంథం. భాషా విషయంలోనూ, ఛందో విషయంలోనూ ఆదరించదగ్గ సంస్కరణలు దానిలో చర్చించబడి, సమర్థించబడ్డాయి. రెండో గ్రంథం ఆ లక్షణాలకు లక్ష్య గ్రంథంగా చెప్పదగింది.

ఈ శతాబ్దంలోనే జీవించిన కొందరు తాత్త్వికగ్రంథ రచయితలను గురించి ఇక్కడ ముచ్చటించాలి. వీరిలో కొందరి గ్రంథాలు సాహిత్యం దృష్ట్యా అంతగా ప్రశంస నీయాలు కాకపోయినా, రబేలే, కేల్విన్, మాంటెయిన్ అనేవారు తాత్త్వికులుగానే కాక కవులుగా కూడా పేరు పొందారు. రబేల్ రచించిన *గర్గాంటువా ఎట్ పంటా గ్రుయెల్* ఒక నవలగా పరిగణింప దగింది. శైలీ, కథా సంవిధానాలలోనూ, హాస్యరస పోషణలోనూ దీనికి సాటి రాగల ఫ్రెంచ్ రచనలు అత్యల్పం అని ఫ్రెంచ్ విమర్శకుల నిర్ణయం. ఆ శతాబ్దాన్ని ఉగ్రూత లూగించిన నూతనాదర్శా లకూ, వినూతన భావాలకూ అది ప్రతిబింబం. మైకేల్ డీ మాంటెయిన్ రచించిన వ్యాసాలు ఆత్మాశ్రయాలు. తన జీవితానుభవాలనే సవిమర్శన దృష్టితో పరిశీలించి, మానవ జీవితంలోని లోతు పాతులను అవగాహన చేసుకోడానికి రచయిత ఈ గ్రంథంలో ప్రయత్నించాడు. అంతే కాక, అందుకు తగిన ఉదాత్త శైలిని ప్రదర్శించి ఫ్రెంచ్ సాహిత్యంలో ఆ రచనకు చిరస్థాయి అయిన స్థానం కల్పించాడు.

క్రైస్తవ మతంలో ప్రొటెస్టెంట్ సిద్ధాంతాలకు తన వాద చాతురి చేత బలం చేకూర్చినవాడు కేల్విన్. 'క్రైస్త వమత సువ్యవస్థాపన' అనే అర్థం వచ్చే పేరుతో వెలువడిన ఇతని గ్రంథం తాత్త్వికులకే కాకుండా సాహిత్య ప్రియు లకు కూడా ఆదరణీయం అయింది. అల్పాక్షరాలలో అనల్పార్థాన్ని ప్రకటించడంలో ఇతడు ప్రవీణుడు. రబేలే, కాల్విన్‌లు ఇద్దరూ ఫ్రెంచ్ గద్య రచనా రీతికి మంచి పుష్టి చేకూర్చారు. వారి కృషిని ముందుకు కొనసాగించి గద్య రచనకు ప్రముఖ స్థానం కల్పించినవాడు అమి యోట్. ప్లూటార్క్ గ్రీక్ భాషలో రచించిన జీవితగాథలను ఇతడు ఫ్రెంచ్‌లోకి అనువదించి, ఆ అనువాదానికి కూడా మూలంతో సమానమైన ప్రతిపత్తి కల్పించాడు. రూపక రచనకు కూడా ఈ శతాబ్దంలో కొంత వ్యాప్తి చేకూరిన మాట నిజమే అయినా, ప్రశంసనీయమైన రూపకం ఏదీ ఆ నాడు వెలువడలేదు.

**ఫ్రెంచ్ అకాడమీ స్థాపన** : 17 వ శతాబ్దంలో వెనుకటి శతాబ్దిలోని కవితా రీతులనే అవలంబిస్తూ వాటికి అంతకు ముందు కన్న ఎక్కువ పరిపుష్టిని చేకూర్చడమే రచయితలు తమ లక్ష్యంగా గ్రహించారు. ఈ లక్ష్య సాధనకు రెండు సంఘటనలు ఎక్కువగా సహకరించాయి. వాటిలో మొదట చెప్పదగింది: ఫ్రెంచ్ అకాడమీ సంస్థా పన. రెండోది: రాజాదరణ. 1634 లో ఫ్రెంచ్ అకాడమీని స్థాపించడంతో పునరుజ్జీవనోద్యమానికి అధి కార బలం లభించింది. ఆ ఉద్యమ మూలపురుషులు నిర్ణయించిన కావ్య లక్షణాలు ఉల్లంఘించ రానివై రచ యితల కందరికీ ప్రమాణాలు అయాయి. కావ్యాలను పరిశీలించి ఉత్తమత్వాధమత్వాలను నిర్ణయించే అధికారం అకాడమీ సభ్యులైన 40 మంది పెద్దలకూ చేకూరింది. దీనికి తోడు ఆ నాడు ఫ్రాన్స్‌ను పాలిస్తున్న 14 వ లూయీ జాతీయ జీవితంలో ఏకత్వాన్ని సాధించడానికి సాహిత్యాన్ని ఒక సాధనంగా గుర్తించి దానిని పోషిం చాడు. ఆ నాడు రాజాదరణ వల్ల వెలుగులోకి వచ్చిన రచనలలో ముఖ్యంగా చెప్పుకోవలసినవి రూపకాలు. ఆ శతాబ్ది తొలి పాదంలోనే దాదాపు 100 రూపకాలు వెలువడినట్లు తెలుస్తూంది. ఆ రూపక రచయితలలో పియారీ కార్నియెల్, జీన్ రేసిన్, మోలియర్ అనేవారు ప్రధానులు. నవ్యరూపక రచనా విధానానికి దారి చూపిం

చినవాడు కార్నియెల్. అతని దుఃఖాంత నాటకాలలో *సిడ్* సుఖాంత నాటకాలలో *మెన్‌టోర్* అనంతర రూపక రచయితలకు ఒరవడి పెట్టాయి. దుఃఖాంత నాటక రచనా రీతిని విశిష్టస్థాయికి కొనిపోయి, గ్రీక్ దుఃఖాంత నాటకాలతో సమానమైన స్థానం దానికి కల్పించినవాడు రేసిన్. మోలియర్ తన హాస్యరస ప్రధానాలైన రూపకాల ద్వారా జగద్విఖ్యాతి నార్జించాడు. చమత్కార భరితమైన సంభాషణలకు ఇతని రచనలు నిధానాలు. గద్య రచనలో ఆ శతాబ్దిలో కొంత ప్రౌఢత చేకూరింది. ఆ నాటి గద్య రచయితలలో జీన్ డి లా ఫాంటెయిన్ ప్రధానంగా పేర్కొనదగినవాడు. ఇతడు 12 సంపుటాలుగా ప్రకటించిన కల్పనా కథలు శైలి విషయంలోనే కాక, రసపోషణకూ, కథాసంవిధాన నైపుణికీ కూడా ప్రసిద్ధి పొందాయి.

తాత్త్వికులుగా సుప్రసిద్ధులైన డేకార్ట్, పాస్కల్‌లు కూడా తాత్త్విక విషయాలను వివరిస్తూ గద్యరూపంగా తాము రచించిన గ్రంథాల వల్ల ఆ నాటి గద్యరచనకు ప్రాశస్త్యం చేకూర్చారు. ఈ శతాబ్దం వాడే అయిన బొయిలో లాక్షణికుడుగానూ, కవి గానూ కూడా ప్రసిద్ధి పొందడమే కాక, తరువాతి శతాబ్దాల రచయితల కందరికీ ప్రామాణికుడు అయాడు. ఇతడు వ్రాసిన *ఆర్ట్ పొయెటిక్* ('కావ్య కళ') అనే లక్షణ గ్రంథంలో అకాడమీ చేత ఉత్తమ కావ్య లక్షణాలుగా పరిగణింపబడిన లక్షణాలన్నీ సంక్షిప్తంగా వివరించబడ్డాయి. కళ లక్ష్యం, ప్రకటనా రీతి, రస వివేచన మొదలైన వాటిని గురించి ఇతడు ప్రకటించిన అభిప్రాయాలు 18 వ శతాబ్దం చివరి దాకా ఫ్రెంచ్ రచయితలకు మార్గనిర్దేశం చేశాయి. ఇతడు బాగా అభిమానించిన 'అలెగ్జాండ్రియన్' ఛందస్సు తరువాతి రచయితల కందరికీ అనుసరణీయం అయింది. ఇది పాదానికి 12 అక్షరాలతో కూడిన మనోహరమైన ఛందస్సు. 17 వ శతాబ్దం ఆఖరికి ఫ్రెంచ్ భాషలోని వాక్యరచనలో క్రొంగొత్త మార్పులు వచ్చాయి. వాక్యానికి నిర్దుష్టత, సంక్షిప్తత సిద్ధించాయి. ఈ మార్పుకి కారణం అయిన గద్య రచయితలలో ప్రధానులు: లా బ్రుయిరీ, లా రాకీ పోకాల్డ్, సెయింట్ సైమన్.

**18వ శతాబ్దం :** ఫ్రెంచ్ సాహిత్య చరిత్రలో 18 వ శతాబ్దాన్ని 'హేతువాద యుగం' అనవచ్చును. జీవితంలోని విలువల నన్నిటినీ హేతువాద దృష్టితో విమర్శించి, సరి కావని తోచిన వాటిని పరిహరించడమే తమ లక్ష్యంగా పెట్టుకొన్న విప్లవ వాదాలు చెలరేగిన కాలం ఇది. ఆస్తికత, మత విశ్వాసం, పరంపరాగత మైన ఆర్థిక వ్యవస్థ, ఆస్తి హక్కులు మొదలైన వన్నీ ఈ నూతన భావనల ధాటికి తట్టుకోలేక తీవ్రంగా పరివర్తన పొందాయి. ఇతర దేశాలనుంచి - ముఖ్యంగా ఇంగ్లండ్ నుంచి - వైజ్ఞానికంగాను, రాజకీయంగాను నూతన భావాలు ఫ్రాన్స్‌కు రావడం మొదలు పెట్టాయి. ఆ భావ విప్లవం ఆ నాటి రచనలలో ప్రతిఫలించింది. ఇలాంటి నూతన సాహిత్యానికి ప్రోత్సాహం కల్పించినవాడు పెయరీ బెయిలీ. ఆ నాటి ఫ్రెంచ్ ప్రజలు నైతికం గానూ, మతదృష్టి లోనూ పవిత్రంగా భావించిన అనేక అభిప్రాయాలను ఇతడు ఖండించాడు. అయితే ఇలాంటి తీవ్ర భావాల ప్రకటనకు సాహిత్యాన్ని ఒక సాధనంగా గ్రహించి ప్రజానీకపు దృష్టిని ఆకర్షించిన ప్రముఖ రచయిత వాల్టేర్. తమ రచనలతో ఇతని ఉద్యమానికి అండగా నిలిచిన వారిలో ముఖ్యులు: రూసో, మాంటెస్క్యూ, డెనిస్ డిడెరో, లె సాగీ, మేరీవాలు. 18 వ శతాబ్దంలో దాదాపు 80 సంవత్సరాలు జీవించిన వాల్టేర్ వివిధ సాహిత్య ప్రక్రియల ద్వారా మానవులలో సమానతా భావాన్ని రేకెత్తించడానికి కృషిచేశాడు. అతని ప్రజ్ఞ సర్వతోముఖ మైంది. వేల కొద్దీ లేఖలూ, వందల కొద్దీ కరపత్రాలూ, అనేక రచనలూ, పలు కథానికలూ, గద్య పద్యాత్మకా లయిన వ్యంగ్య రచనలూ, రూపకాలూ అతని లేఖిని నుంచి వెలువడ్డాయి. ఆ రచన లన్నింటిలోను ఒక ప్రత్యేకత కనిపించేది. అన్నిటిలోనూ మానవ శ్రేయోభిలాషయే అనుస్యూతంగా గోచరించేది. సునిశితమైన హాస్యం ఒలికిస్తూ, ధారాళమైన శైలిలో కన్నులకు కట్టినట్టు పాత్రలను సృష్టి చేయడంలోనూ, సన్నివేశాలను రూపొందించడంలోను ఇతడు సిద్ధహస్తుడు. మాంటెస్క్యూ రాజనీతి వేత్తగానేకాక, సరళ గద్య రచయితగా కూడా సుప్రసిద్ధుడు. లె సాగీ నవలా రచనలో కొత్త రీతులను చేబట్టాడు. మేరీవా కూడా నవలా రచయితే. ఇతని నవలలలో మానవ మానసిక సంఘర్షణకు ఎక్కువ ప్రాధాన్యం కనిపిస్తుంది. నవలా రచనకు ఉత్తమ స్థాయిని చేకూర్చిన వాడు యాబీ ప్రవోస్ట్. డెనిస్ డిడెరో ఒక వైజ్ఞానిక భావుకుడు. సృష్టి పరిణామ రహస్యాలను తన భావనాబలం చేత సాహితీ రూపంలో ప్రకటించడానికి ఇతడు పూనుకున్నాడు. జీన్ డీ రాండ్ ద లెంబర్డ్ అనే మరో పండితునితో కలిసి కృషి చేసి ఇతడు ఫ్రెంచ్ భాషలో తొలి విజ్ఞాన సర్వస్వాన్ని రూపొందించాడు. ఆ నాటి విప్లవ భావాలకు ఒక సిద్ధాంత రూపాన్ని చేకూర్చిన వాడు రూసో. ఈ మహా రచయితలూ, వారి అనుచరులూ ఫ్రెంచ్ సాహిత్య

రంగంలో చేసిన కృషివల్ల ప్రజలలో నూతన భావాలు వెల్లివిరిసి చివరికి ఆ శతాబ్ది చరమ భాగంలో ఫ్రెంచ్ విప్లవం రావడానికి దారితీశాయి.

**19 వ శతాబ్దం :** 19 వ శతాబ్దం నుంచి ఫ్రెంచ్ సాహిత్యంలో ఆధునిక యుగం ఆరంభమైంది. ఈ యుగానికి స్టేల్‌సతి, షెటోబ్రా వైతాళికులుగా పరిగణింపదగినవారు. స్టేల్‌సతి నవలా రచనలో నూతన మార్గాలను ప్రవేశపెట్టి, కళాభావనను అత్యుత్తమస్థాయికి తీసికొని పోవడానికి ప్రయత్నించింది. ఆమె అనంతరం జీవించిన షెటోబ్రా కాల్పనిక వాద వికాసానికి తోడ్పడ్డాడు. ఈ శతాబ్దంలో గేయకవిత్వం పునరుజ్జీవితమై, వెనుకటి కంటె ఎక్కువగా ప్రశస్తి పొందింది. ఈ 19 వ శతాబ్దంలో కవితా సామ్రాజ్యాన్ని పాలించిన రచయితలలో లా మార్టిన్, ఆల్‌ఫ్రెడ్ మసెట్, డీవీనీ, హ్యూగోలు ప్రముఖులు. భగ్నప్రేమను చిత్రిస్తూ ఉత్తమ కావ్యాలు వ్రాసిన వాడు లా మార్టిన్. మసెట్ వ్యంగ్య కవిత్వానికీ, చమత్కారంతో కూడిన ధారాళమైనశైలికీ, కథాకథననైపుణికీ పేరు పొందాడు. మానవ భావనల లోతులను అభివ్యక్తం చేయడానికి సాహిత్యాన్ని ఒక సాధనంగా గ్రహించిన వాడు ఆల్‌ఫ్రెడ్ డీవీనీ. ఇతడు వ్రాసిన ఒక్కొక్క రచనలో ఒక్కొక్క భావం ప్రాముఖ్యం వహించింది. వస్తువుకీ, సన్నివేశానికీ అనుగుణమైన శైలిని సమకూర్చుకోడంలో ఇతడు దిట్ట. అన్ని రంగాలలోనూ పై రచయిత లందరినీ అతిశయించి విశ్వ సాహిత్యక్షేత్రంలో చిరస్థాయి అయినవాడు విక్టర్ హ్యూగో. తన జీవిత కాలంలో దాదాపు 60 సంవత్సరాలు ఇతడు సాహిత్య సేవలో గడిపాడు. సాహిత్య శాఖలలో దాదాపు అన్నిటిలోను మనోరంజకా లయిన క్రొత్త పోకడలకు ఇతడు మార్గదర్శకుడయాడు. ఈ ప్రముఖ కవుల తరువాత లెక్కకు రాదగిన వారిలో పద్యకావ్య రచయితలైన థియోఫైల్ గౌతియర్, చార్లెస్ బోడలైర్ ప్రధానులు. 19 వ శతాబ్దం ఉత్తరార్థంలో 'ప్రతీక వాదం' (Symbolism) అనే ఒకనూతన కవితా వాదం బయలుదేరింది. కొన్ని సంకేతాల మరుగున మూలార్థాన్ని మరుగుపరచి చిత్రించడం ఈ వాదాన్ని అనుసరించేవారికి అభిమాన విషయం. ఇలాంటి కవులలో వెర్లైన్, మల్లార్మీ, రింబా ముఖ్యులు. ఈ కాలపు నవలా రచయితలలో విక్టర్ హ్యూగో తరువాత చెప్పుకోదగ్గవారు 'స్టైన్ డాల్' అనే నామాంతరం గల హెన్రీ బెయిల్, ఒనోర్ డి బాల్జాక్, ఫాబర్ట్, అలెగ్జాండర్ డ్యూమాస్, గై డి మాపాసాలు. ఈ శతాబ్దం చివరిభాగంలో జన్మించిన ఒక ప్రముఖ నవలా రచయిత ఎమిలీ జోలా. సమకాలిక జీవితాన్ని వివరంగా చిత్రించి, దానిలోని లోటు పాటులను ఎత్తిచూపడంలో ఇతడు నేర్పరి. రూపక రచన కూడా ఈ శతాబ్దంలో పరిపుష్టి పొందింది. హ్యూగో, డ్యూమాస్ లు రూపక రచయితలుగా కూడా ప్రసిద్ధిపొందారు.

**20 వ శతాబ్దం :** ఈ శతాబ్దంలో ఫ్రెంచ్ నవల క్రొంగ్రొత్త ఆభరణాలు సంతరించుకుంది. ఈ శతాబ్ది రచయితలు కథా కథన రీతిలో ఒక నూతన విధానాన్ని అవలంబించారు. వారిలో మొదటివాడు అనటోల్ ఫ్రాన్స్. 19 వ శతాబ్దం ఆఖరిపాదం నుంచీ ఇతని రచనలు ఆరంభం కావడం వలన ఇతణ్ణి 19 వ, 20 వ శతాబ్దాలు రెండింటికీ చెందిన రచయితగా పరిగణించాలి. ఆత్మ పరిశీలన ప్రధాన లక్ష్యంగా కావ్య రచన చేయడానికి ఈ శతాబ్దంలో కొందరు ప్రయత్నించారు. అలాంటి రచనల్లో పరిణతి సాధించిన వాడు మార్సెల్ ప్రౌస్ట్. ఇతనితో పాటుగా పేర్కొనదగిన మరొక ప్రముఖ రచయిత ఆంద్రీ జీద్. అక్రమ లైంగిక సంబంధాలను ఇతివృత్తంగా స్వీకరించడం కళాదృష్టిలో సమర్థనీయమా అనే ప్రశ్న తల ఎత్తడానికి ఇతని రచనలు కారణం అయాయి. ఆ ప్రశ్న విషయంలో భిన్నాభిప్రాయాలు ఉండే అవకాశం ఉన్నా, వస్తుచిత్రణలోను, పాత్రపోషణలోను, కథా సంవిధాన చాతుర్యంలోనూ ఇతడు ప్రదర్శించిన ప్రతిభ ఇతనికి ప్రముఖ రచయితగా ప్రశస్తి చేకూర్చింది. నవలా రచనలో ఈ కాలంలో అవలంబించబడిన నూతన మార్గానికి ఫలితంగా 'ఆవృత్తి నవల' (Cycle Novel) అనే ప్రక్రియ రూపొందింది. ఈ ప్రక్రియకు సృష్టికర్త రోమ్యా రోలా. ఇతడు రచించిన *జీన్ క్రిస్టఫర్* అలాంటి నవలలలో మొదటిది. ఒక వ్యక్తి జీవిత గాథను వస్తువుగా గ్రహించి, దానిలోని విలక్షణమైన సంఘటనల నన్నింటినీ మణులతో హారం గుచ్చినట్లు కూర్చి కథైక్యం చెడకుండా రచించడం ఈ పద్ధతి నవల ప్రత్యేకత. జూలిస్ రొమేన్ అనే రచయిత కూడా ఈ విధానాన్ని అవలంబించి దానికి ప్రాశస్త్యం చేకూర్చాడు. రోజర్ మార్టిన్ డూగార్డ్ వ్రాసిన *టిబాల్ట్స్* అనే 'ఆవృత్తి నవలకు' 1937 లో సాహిత్య రంగంలో నోబెల్ బహుమతి లభించింది.

పద్యకవిత్వంలో కూడా 20 వ శతాబ్దంలో క్రొత్త పుంతలు త్రొక్కడం జరిగింది. సాంకేతిక వాదం మొదలు అధివాస్తవికతా వాదం వరకూ వచ్చిన వివిధ కవితా వాదాలకు ఈ యుగం ఫ్రెంచ్ కవిత్వంలో వ్యాప్తి

లభించింది. కాల పురుషుడి పరీక్షకు వీటిలో ఎంత భాగం నిలువ గలదో ఈ నా డెవ్వరూ ఊహించి జోస్యం చెప్పలేరు. కాని, ఈ కాలంలో పద్యకావ్య రచయితలలో పాల్‌వెవిరీని స్మరించకుండా ఉండడం సాధ్యంకాదు. ఆలంకారికమూ, సరళమూ అయిన శైలిలో తాత్త్విక విషయాలను వివరించే శక్తి ఈయన రచనలలో ప్రధానంగా కనిపిస్తుంది.

రూపక రచనకు కూడా ఎక్కువ ఆదరణ ఈ యుగంలో లభించింది. సాంప్రదాయిక రూపక లక్షణాలకు స్వస్తిచెప్పి క్రొత్త పోకడలను ప్రదర్శించిన రూపకాలెన్నో వచ్చాయి. కాని, మేటర్‌లింక్ రచించిన నాటకాలకే కొన్నిటికి ప్రశస్తి వచ్చింది. అలౌకిక విషయాలను వస్తువుగా గ్రహించి రూపకాలు రచించిన పాల్‌క్లాడెల్ కూడా ఈ సందర్భంలో స్మరింపదగినవాడు.

నవ్య వైజ్ఞానికావిష్కరణలూ, నవ్య రాజకీయ భావాలూ, ఫ్రెంచ్ సాహిత్యం మీద తమ ప్రభావాన్ని కనుపరచాయి. దీనికి తోడు రెండవ ప్రపంచ మహాయుద్ధం ఫ్రాన్స్ దేశాన్ని సంక్షుభితం చేసింది. వీటన్నింటి ఫలితంగా మత, నైతిక రంగాలలో అవిశ్వాసం ప్రబలి, పలువురు రచయితల రచనలలో నాస్తిక భావాలు ప్రతిఫలించాయి. దీనిని ఎదుర్కొని పూర్వ సాంప్రదాయిక విశ్వాసాలను పునరుజ్జీవింప చేయడానికి పాల్ క్లాడెల్ వంటి సాంప్రదాయిక కవులు కొంత కృషి చేశారు. ఈ విరుద్ధ భావాలు రెండింటికీ సమన్వయం సాధిస్తూ ఒక నూతన తాత్త్విక సందేశం ఇచ్చిన వాడు హెన్రీ బెర్గ్‌సన్. ఇతని గ్రంథాలు తాత్త్విక రచనలే అయినా కావ్యాలుగా పరిగణించదగినవి. నవ్య రచయితల కెందరికో ఈ గ్రంథాలు మార్గదర్శకాలు అయాయి.

**అధివాస్తవికత-అస్తిత్వవాదం** : ఆంద్రీ బ్రెటన్ (1896-1966) నాయకత్వాన అధివాస్తవికతా వాదులు (Surrealists) కొంతకాలం ఫ్రెంచ్ సాహిత్య రంగంలో ప్రాధాన్యం వహించారు. 1932 నాటికి ఈ ఉద్యమం బాగా బలం పుంజుకుంది. ఆ ఏడాదే బ్రెటన్ తన *లేవా సెస్ కమ్యూనికెంట్స్* అనే రచన ప్రచురించాడు. సాహిత్యానికీ, కళాసృష్టికీ ఉత్తేజనం కలిగించేవి మన స్వప్నాలు అని దీనిలో ఆయన ప్రతిపాదించాడు. బ్రెటన్ వ్రాసిన కావ్యం *లేమర్‌ఫే* (1937) లో కామం (వాంఛ) నుంచీ, మన అంతశ్చేతనలో దాగి ఉన్న గుప్త శక్తుల నుంచీ మనకు విముక్తి చేకూర్చగలిగింది 'ప్రేమ' ఒక్కటే అని ఆయన చాటాడు. అధివాస్తవికతా వాదులలోని రాజకీయ విభేదాల వల్ల అనతికాలంలోనే ఆ ఉద్యమం అంతరించి పోయింది. అయినా భౌతికమైన, మానసికమైన స్వేచ్ఛకు సంబంధించిన భావాలు మాత్రం ఫ్రెంచ్ సాహిత్య రంగంలో స్థిరపడ్డాయి. 20 వ శతాబ్ది పూర్వార్ధంలో ఫ్రాన్స్‌లో వెలసిన ప్రముఖ అధివాస్తవిక కవులు పాల్ ఎలూవర్డ్ (1895-1952), లూయీ ఆరగాన్, బెంజమిన్ పెరెట్ (1899-1959), రాబర్ట్ డెస్నోస్ (1900-1945), రెనేచార్. ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరం ఫ్రెంచ్ సాహిత్య రంగంలో జీన్ అనోలిల్, యూజీనీ ఇయోనెస్కో, శామ్యుయెల్ బెకెట్, జీన్ గెనెట్‌లు ఎక్కువ ప్రభావం కనపరచారు.

అధివాస్తవికతా వాదం తరువాత ఫ్రెంచ్ సాహిత్య రంగాన్ని ప్రభావితం చేసింది 'అస్తిత్వ వాదం' (Existentialism). అధివాస్తవికతా వాద ప్రభావం ముఖ్యంగా కవిత్వం మీద, చిత్రకళ మీద మాత్రమే కనిపించగా, అస్తిత్వ వాదం తత్త్వశాస్త్రాన్నీ, నైతిక రంగాన్నీ, నాటక రంగాన్నీ, నవలనూ ఎక్కువగా ప్రభావితం చేసింది. జ్యాఁ పాల్ సార్త్రే ఈ ఉద్యమానికి వెన్నెముక వంటివాడు. *లా నాసియా* (1938) అనే ఇతని నవల సుప్రసిద్ధమైంది. ఈ వాదానికి చెందిన రచయితలలో మరో ప్రముఖుడు ఆల్బర్ట్ కమూ (1913-1960). ఇతడు వ్రాసిన నవలలలో 'బహిర్వర్తి' (The outsider) జగద్విఖ్యాతి పొందింది. ఇతడు సార్త్రి అనుయాయి. అయినా, తాత్త్వికంగా అనేక విషయాలలో ఆయనతో విభేదించాడు. సార్త్రి కంటె ముందే ఇతనికి సాహిత్య రంగంలో నోబెల్ బహుమతి లభించింది. అటు తరువాత సార్త్రి నోబెల్ బహుమతిని నిరాకరించాడు.

సార్త్రి, కమూ లు ఇద్దరూ ఋణపడిఉన్న రచయిత మాల్‌రో (Malraux). భావాలను ఆలోచన స్థాయికి పరిమితం చేయక జీవితంలో ప్రత్యక్షంగా జీవించాలనీ, 'నిబద్ధత' అవసర మనీ మొట్ట మొదట ప్రకటించిన వాడు మాల్‌రో. మాల్‌రో వ్రాసిన గొప్ప నవలలు *లా కండిషన్ హ్యూమేన్* (1933), *ఎస్ పొయిర్* (1937). కళ-మానవతావాదం అనే అంశానికి సంబంధించి ఆయన వ్రాసిన పలు సంపుటాలూ, *ఆంటీ మెమోయిర్స్* (1967) 20 వ శతాబ్ది సాధించిన ఉత్తమ సాహితీ విజయాలుగా భావించబడు తున్నాయి.

1960 తరువాత ఫ్రాన్స్‌లో ఒక కొత్తతరం నవలా రచయితలు వచ్చారు. రాజకీయాలు, మనస్తత్త్వ విశ్లేషణ, పాత్రచిత్రణ, కల్పిత విచిత్ర సన్నివేశాలు మొదలైన వాటిని గూర్చిన భ్రాంతి వీరికి తొలగిపోయింది. చిక్కు

ప్రశ్నలుగా, ప్రహేళికలుగా కనిపించే నవలలు వ్రాయడానికి వీరు పూనుకున్నారు. కాని, వారు ఎంత కళా కౌశలం గలవారైనా, ప్రగాఢత, మానవతా దృష్టి వారిలో మృగ్యాలని వారి రచనలు విశదం చేశాయి.

వీ.శే.రా.(బొ.శ్రీ.)

## బల్గేరియన్ భాష - సాహిత్యం

**భాష :** 'సిరిలిక్' లిపిలో వ్రాయబడే ఒక దక్షిణ శ్లావిక్ భాష. బల్గేరియాలోనూ, గ్రీస్, రుమేనియా, మోల్డవియన్ సోవియట్ సోషలిస్ట్ రిపబ్లిక్, యూక్రేనియన్ సోవియట్ సోషలిస్ట్ రిపబ్లిక్కులలోని కొన్ని ప్రాంతాలలోనూ ఈ భాష వాడుకలో ఉంది. బల్గేరియన్‌భాష మాసిడోనియన్ భాషలతో చాలా విషయాలలో విభేదిస్తూంది. నామ విభక్తులు ఇంచుమించు పూర్తిగా లోపించడం, ఇతర భాషా కుటుంబాలకు చెందిన బాల్కన్ భాషల వ్యాకరణ లక్షణాలను కొన్నిటిని అలవరచుకోడం ఈ భాషలో కనిపిస్తూంది. ఉదాహరణకు ఈ భాషలో నిర్దేశక విశేషణం (definite article) 'The' నామవాచకానికి ముందు గాక తరువాత వస్తుంది. (ఉదా. mase - table; masata - the table., ఆల్బేనియన్, రుమేనియన్ భాషలనుంచి ఈ లక్షణాన్ని బల్గేరియన్ భాష గ్రహించింది.




బల్గేరియా

బల్గేరియన్ భాషా చరిత్రను మూడు దశలుగా విభజిస్తారు: 1. ప్రాచీన బల్గేరియన్ (9 వ శతాబ్దం మొదలు 11 వ శతాబ్దం వరకు), 2. మధ్య బల్గేరియన్ (12 వ శతాబ్దం మొదలు 16 వ శతాబ్దం వరకు), 3. ఆధునిక బల్గేరియన్ (16 వ శతాబ్దం మొదలు నేటి వరకు).

10 వ, 11 వ శతాబ్దులనాటి మాసిడోనియన్ బానిసల భాషే ప్రాచీన బల్గేరియన్ భాష! ఇదే మొట్టమొదటి శ్లావిక్ సాహిత్య భాష. ఎస్.ఎస్. సిరిల్, మెథోడియస్ అనే శ్లావిక్ మిషనరీల శిష్యుడైన సెయింట్ క్లెమెంట్ అనే మతోద్యోగి మెరోవియా నుంచి తరిమివేయబడి, బల్గేరియాలోని మాసిడోనియా ప్రాంతంలో తలదాచుకొనిన నాటినుంచి ఈ భాష అభివృద్ధి చెందసాగింది. మధ్య బల్గేరియన్ భాషా దశలో నామ విభక్తులు అంతరించడం వంటి అనేక భాషా పరిణామాలు సంభవించాయి. బల్గేరియా బైజాంటైన్ సామ్రాజ్యంలో భాగమై దాస్యానికి గురి అయిన నాటినుంచే ఇట్టి మార్పులకు ఎక్కువ అవకాశం కలిగింది.

విపుల ప్రచారం పొందిన 16 వ శతాబ్దం నాటి పంచాంగాల (almanacs) లోని భాష నుంచి ఆధునిక బల్గేరియన్ లిఖిత భాష పరిణమించింది. 19 వ శతాబ్దం దాకా ఈ భాషకు ఒక స్థిరరూపం ఏర్పడలేదు. ఈ భాషలో పదజాలం చాలా వరకు రష్యన్ నుంచి, చర్చ్ శ్లావోనిక్ భాషల నుంచి ఎరువు తెచ్చుకున్నదే! అయితే ప్రథమ, ద్వితీయ ప్రపంచ సంగ్రామాల మధ్య కాలంలో ఈ భాషలో అన్య భాషలనుంచి ఎరువు తెచ్చుకున్న పదాలను వాడడం మానివేసి, వాటి స్థానే బల్గేరియన్ దేశీయ పదాలనే వాడుక చేయాలనే ఉద్యమం చెలరేగింది.

**సాహిత్యం :** బల్గేరియన్ భాషలో వెలువడిన సాహిత్యాన్ని బల్గేరియన్ సాహిత్యం అంటారు. 864 లో మొదటి ఖాన్ (జార్) బోరిస్ తూర్పు ఆర్థడాక్స్ క్రిస్టియన్ మతం స్వీకరించడంతోను, శ్లావ్‌లు క్రైస్తవమత స్వీకారం చేయడంతోను ప్రాచీన బల్గేరియన్ సాహిత్యం ఆరంభం అయింది. సిరిల్, మెథోడియస్‌ల శిష్యులు 'మొదటి శ్లావిక్ లిటరరీ స్కూలు' స్థాపించారు (893-971). సెయింట్ క్లెమెంట్ మొదటి శ్లావిక్ విశ్వవిద్యాలయం స్థాపించాడు. తొలి రచనలలో జాన్ ది ఎక్సార్క్ రచించిన *షెస్టోడ్ నెవ్* (సృష్టి జరిగిన 6 రోజులు), జార్ సిమియన్ వ్రాసిన *సియ్యోనోవ్ స్బోర్నిక్* (సిమియన్ రచనల సంకలనం) మున్నగు వానిని పేర్కొనవచ్చును. ఈ ప్రాచీన శ్లావిక్ రచనలలో చాలా వరకు గ్రీక్ రచనలకు అనువాదాలు. తమ భాషను సుసంపన్నం చేసికొని బైజాంటైన్ భావధారలోని సూక్ష్మాతి సూక్ష్మమైన అంశాలను కూడా ప్రకటించగల పటిమను తమ భాషకు కలిగించా లనే ఆ తొలి రచయితల ప్రగాఢ వాంఛ ఆ రచనలలో అభివ్యక్తం అవుతూంది.

13 వ, 14 వ శతాబ్దాలలోని మధ్య బల్గేరియన్ సాహిత్యయుగం (రజత యుగం) లో వెలువడిన *వాటికన్ మనాసెస్ క్రానికల్* (1345), *జార్ ఇవాన్ అలెగ్జాండర్ గాస్పెల్* (1356) లలో లేఖనం, బైండింగ్ మొదలైన గ్రంథ బాహ్య లక్షణాలను ఆకర్షకంగా తయారు చేసేందుకు మాత్రమే ఎక్కువగా కృషి జరిగింది. వస్తువు విషయంలో బైజాంటైన్ ప్రభావం ఎక్కువగా కనిపించింది. గ్రీక్ అనువాదాలు బల్గేరియన్ భాషను, సాహిత్యాన్ని సంపన్నం చేశాయి. లౌకిక, చారిత్రక వస్తువుల పట్ల ఉండే అభిరుచిని త్రోసిరాజని 14 వ శతాబ్ది చివరి భాగంలో ఆంతరమైన వెలుగును అన్వేషించే మార్మిక సిద్ధాంతాలు ప్రాచుర్యం వహించాయి. ఈ సిద్ధాంతాలే థియొడోసియస్ ఆఫ్ కర్నోవో, ఆయన సుప్రసిద్ధ శిష్యుడు పేట్రియార్క్ ఎవన్‌టిమి ల రచనలలో ప్రతిధ్వనించాయి. టర్నోవో సాహిత్య సంప్రదాయం ప్రాచీన చర్చ్ శ్లావోనిక్ సంప్రదాయాన్ని ప్రమాణీకరించడానికి ప్రయత్నించింది. దానిలో పై ఇరువురు ప్రముఖపాత్ర వహించారు. వ్రాత ప్రతులను ఈ యుగంలో శ్రద్ధగా భద్ర పరచారు. 10 వ శతాబ్ది ప్రారంభంలోనే బల్గేరియన్ భాషలో నీతిని ఉపదేశించే చిన్నకథలు వెలశాయి. *మైఖేల్‌ది వారియర్* కథలు', *టియోఫానా ది ఇన్ కీపర్* వంటి కథలు ఆ కోవకు చెందినవే. ప్రాచీన మధ్య యుగాలలో బల్గేరియన్ భాషలో మత సంబంధమైన రచనలే ఎక్కువ ప్రాధాన్యం వహించాయి.

ఆధునిక బల్గేరియన్ సాహిత్యం 19 వ శతాబ్దం నడిమి భాగం నుంచి ఆరంభమైంది. జాతీయ చైతన్యం ఏర్పడడం, నోవో బల్గార్‌స్కీ (ఆధునిక బల్గేరియన్ సాహిత్య భాష) రూపొందడం దీనికి తోడ్పడ్డాయి. ఈ ఉద్యమంలోని ప్రధాన నాయకులు: బిషప్ సోఫ్రోనీ, నియోఫిట్ రిల్‌స్కీ, వై. వైనెలిన్, వి. ఆప్రిలోవ్, ఐ. బోగోపోవ్. వీరిలో మొదటి వ్యక్తి సోఫ్రోనీ వ్రాసిన *నెడెల్నిక్* (ఆదివారం పుస్తకం 1806) బల్గేరియన్ భాషలో అచ్చయిన మొట్ట మొదటి పుస్తకం. నియోఫిట్ రిల్‌స్కీ వ్యాకరణ శాస్త్రవేత్త. 1835 లో మొట్ట మొదటి ఆధునిక బల్గేరియన్ స్కూలును స్థాపించినవాడు. ఎన్. జెరోవ్ బల్గేరియన్ భాషలో వచ్చిన మొట్టమొదటి పెద్ద నిఘంటువును సంకలనం చేశాడు. వుజ్‌రజ్‌దాన్ అనబడే బల్గేరియన్ జాతీయ పునరుజ్జీవ నోద్యమానికి మూల పురుషుడు 'ఫాదర్ పైసీ ఆఫ్ చిలాందారి'. ఆయన రచన *ఇస్టోరియా శ్లావ్యానో బుల్గార్‌స్కా* (1762 - శ్లావోబల్గేరియన్ చరిత్ర) బల్గేరియన్‌లలో ఆత్మగౌరవాన్ని పెంపొందించి, మొదటి తరం ఆధునిక బల్గేరియన్ రచయితలు ఆవిర్భవించ డానికి దారితీసింది.

1878 లో జరిగిన బల్గేరియన్ విముక్తి సాహిత్యం అభివృద్ధి చెందడానికి అనువైన వాతావారణాన్ని సమకూర్చింది. దాస్య, విముక్త దశల మధ్య అనుసంధానం కలిగించిన ఏకైక మహారచయిత ఇవాన్ వజోవ్. 1870, 1921 సం.ల మధ్యకాలంలో వివిధ సాహిత్య ప్రక్రియలలో ఆయన వెలువరించిన అసంఖ్యాకమైన రచనలు బల్గేరియా దేశపు భూత, వర్తమాన పరిస్థితులను ప్రతిబింబించాయి. జాతీయ కవిగా అతడు ప్రశంసలు పొందాడు. 'విస్మృత వీరుల పురాణం' (1881-84) బల్గేరియన్ స్వాతంత్ర్య వీరులకు అమరత్వం చేకూర్చింది. *చికోవిట్సీ* (1895 - uncles) అనే చిన్న నవల తుర్కుల పాలన కాలంలో బల్గేరియాదేశంలో ప్రముఖులైన కొందరి సజీవ పదచిత్రాలతో కూడింది. బల్గేరియా దేశపు జాతీయ నవల *పాడ్ ఇగోటో* (1893 - under the yoke) తుర్కులతో బల్గేరియన్‌లకు జరిగిన సంఘర్షణను కన్నులకు కట్టినట్లు చిత్రించింది. ఈ నవలలో వజోవ్ కథా కథన నైపుణి పరాకోటి నందుకుంది. వజోవ్ చిన్న కథలూ, యాత్రా గ్రంథాలూ కూడా మిక్కిలి ప్రసిద్ధి పొందాయి. ఆయన వ్రాసిన కొన్ని నాటకాలను 1907 లో స్థాపించబడిన సోఫియా నేషనల్ థియేటర్ వారు ప్రదర్శించారు.

వజోవ్‌తో సరిపోల్చదగిన భావనాశక్తి, సమన్వయ నైపుణి లోపించినా, కోన్‌స్టాంటిన్ వెల్చ్ కోవ్ కూడా వజోవ్ లక్ష్యాల సాధన కోసమే రచనలు చేసినవాడు. కాన్‌స్టాంట్ నోపుల్ ఇటలీల సందర్శనం వల్ల ఉత్తేజనం పొంది అతడు రచించిన 'సానెట్'లలో అతని కవితాశక్తి ప్రస్ఫుటం అవుతూంది.

స్వతంత్ర బల్గేరియా రాజ్యంలోని రచయితలు సమకాలీన సంఘంలోని లోపాలను ఎత్తి చూపారు. పిట్టకథల ద్వారా, వ్యంగ్య పరిహాస రచనల ద్వారా, సూక్తుల ద్వారా ఎస్. మిహాయ్‌లోవ్‌స్కీ ప్రజాజీవితంలోని దుష్ప్రవర్తనను తీవ్రంగా విమర్శించాడు.

1890 తరువాత యువతరం రచయితలు వెనుకటి తరం వారి ప్రాంతీయాభిమానాన్నీ, సాంఘిక రాజకీయ సమస్యల పట్ల వారు మొగ్గు చూపడాన్నీ నిరసించారు. సాహిత్యంలో 'సౌందర్య చేతన' ప్రాధాన్యాన్ని మొట్ట మొదటి సారి నొక్కి చెప్పిన బల్గేరియన్ విమర్శకుడు క్రుష్ఠ్యో కుస్టేవ్. పెంచోశ్లావైకో బల్గేరియన్ కవిత్వంలో కాల్పనిక సంప్రదాయ దృక్పథాన్ని విశాలతరం చేసి ఒక సంకీర్ణమైన కవిత్వభాషను రూపొందించడానికి తోడ్పడ్డాడు.

నీట్షే ప్రభావంతో ఆధ్యాత్మిక సాధన ప్రాధాన్యాన్ని చాటుతూ *ఎపిచెస్కీ పెస్నీ* (epic songs - 1896-98) అనే గ్రంథంలో ఆయన డాంటే, బీథోవెన్, షెల్లీ, లియోపార్డీల ప్రతిభను కీర్తించాడు. అసంపూర్ణంగా వదలిన ఆయన ఉద్గ్రంథం *కుర్వావా పెశన్* (Song of Blood, 1913). ఇది బల్గేరియా చరిత్రకు సంబంధించిన మహాకావ్యం.

20 వ శతాబ్దం ప్రారంభంలో పాశ్చాత్య కవిత్వంలో సింబాలిస్ట్ ఉద్యమం (ప్రతీక వాదోద్యమం) వచ్చింది. ఈ రకపు రచనలలో కిరిల్ క్రిష్టోవ్ వ్రాసిన *హిమ్ని నాజొరాట* చెప్పుకోదగినది. 'మిసూల్' వర్గానికి చెందిన పి. ఎవరోవ్ బల్గేరియన్ కవిత్వభాషను మృదుమధురంగానూ, భావోద్బోధకంగానూ చేయడానికి విశేషమైన కృషి చేశాడు. ఈ ఎవరోవ్ కవితా ప్రతిధ్వనులు డించో డిబెల్యనోవ్ వ్రాసిన మధురమైన శృంగార గీతాలలో మనకు వినిపిస్తాయి. డిబెల్యనోవ్ మొదటి ప్రపంచ సంగ్రామంలో మరణించాడు.

అంతలో వాస్తవికతా వాద సంప్రదాయం తల ఎత్తి ఆంటన్ స్ట్రాషిమిరోవ్, జి. స్ట్రామష్టోవ్‌ల రచనలలో స్ఫుటంగా అభివ్యక్తమైంది. స్ట్రాషిమిరోవ్ రచనలలో 'కొచెలోవో కలహం' (1895) అనే చిన్నకథా, *ఎసెన్ని డ్ని* (1902 - Autumn Days), *వామ్‌పిర్* (1902), *స్రేకూర్హ* (1906) వంటి నవలలు సుప్రసిద్ధాలు.

ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరం వచ్చిన వామపక్ష రచయితలలో జియోమిలేవ్, క్రిష్టోస్మిర్నెన్‌స్కీ, నికోలా వాప్ట్సరో మొదలైన వారు ప్రముఖులు. రెండు ప్రపంచ సంగ్రామాల మధ్యకాలంలో ఎలెన్ పెలెన్ గొప్ప బల్గేరియన్ వచన రచయితగా ప్రసిద్ధి పొందాడు.

1944లో కమ్యూనిస్ట్ ప్రభుత్వం ఏర్పడిన తరువాత 'సోషలిస్ట్ రియలిజమ్'ను ప్రతిపాదించే రచనలకే ప్రోత్సాహం లభించింది. ఏకప్రయోజన సిద్ధికోసం వ్రాసిన ఈ రచనలలో ప్రతిభను మదింపు వేయడం కష్టం. అయినా డి. డిమోవ్, డి టాలెవ్‌లు వ్రాసిన నవలలు బహుజనామోదం పొందాయి. ముఖ్యంగా టాలెవ్ 19 వ శతాబ్దినాటి మాసిడోనియాను గురించి వ్రాసిన గ్రంథం విశేష ప్రశస్తి పొందింది.

బొ.శ్రీ.

## బెల్జియన్ సాహిత్యం

బెల్జియంలోని ప్రజలలో ఫ్లెమిష్ భాషీయులైనవారిని ఫెమింగ్‌లు అనీ, ఫ్రెంచ్ భాషీయులైన వారిని వలూన్‌లు




బెల్జియం

అనీ వ్యవహరిస్తారు. వీరిద్దరూ తమ స్వతంత్ర ప్రతిపత్తిని అన్ని విషయాలలోనూ కాపాడుకుంటారు. అందుకే బెల్జియంలో ఫ్లెమిష్, ఫ్రెంచ్ సాహిత్యాలు వేర్వేరుగా వికసించాయి. బెల్జియం భౌగోళిక స్థితిని బట్టి, బెల్జియన్ రచయితలు ఇంగ్లీష్, జర్మన్ భాషా సాహిత్యాల ప్రభావానికీ, ప్రధానంగా ఫ్రెంచ్ భాషా సాహిత్యాల ప్రభావానికీ గురి కావడం సంభవించింది. అయినప్పటికీ బెల్జియన్ సాహిత్యంలో మౌలికత పుష్కలంగా ఉంది. బెల్జియన్ సాహిత్యాన్ని గూర్చి ప్రత్యేకంగా చెప్పవలసి వస్తే 1830 నుంచే ప్రారంభిస్తారు. 1830 విప్లవం తరువాతే బెల్జియం స్వతంత్ర రాజ్యంగా అవతరించింది.

**బెల్జియన్ ఫ్లెమిష్ సాహిత్యం :** ఫ్రెంచ్ అధికార భాషగా ఉన్నా, ఫ్లెమిష్ భాషలోనే ప్రప్రథమంగా బెల్జియం దేశ సాహిత్యం ఆవిర్భవించిందని చెప్పాలి. విదేశ నిరంకుశత్వాన్ని ఫ్లెమింగ్‌లు ఎదిర్చిన ఘట్టాలను ఇతివృత్తంగా తీసుకుని హెండ్రిక్ కన్షన్స్ (1812-1883) పెక్కు చరిత్రాత్మక నవలలను ఎంతో ప్రబోధాత్మకంగా రచించాడు. ఫ్లెమిష్ సాహిత్యం మొదటినుండీ కాల్పనికతను ఆదరించడం మూలాన ఆ లక్షణాలు ప్రధానంగా నిలచి పోయాయి. గ్రామీణ జీవితం పట్ల, సామాన్యుల పట్ల, రైతులపట్ల ఆసక్తి ఈ సాహిత్యంలో ఎక్కువగా కన్పిస్తుంది. సాంఘిక, మానసిక ప్రవృత్తులను వర్ణిస్తూ తద్వారా విశ్వజనీనతను సాధించడానికి ఈ సాహిత్యం ప్రయత్నించింది.

ఫ్లెమిష్ సాహిత్యంలో ప్రథమంగా చెప్పుకోదగిన ప్రముఖ కవి గ్విడో గెజెల్ (1830-1899). ఈయన ఫ్లెమిష్ కవిత్వాన్ని సమున్నత స్థితికి తీసుకుపోయాడు. భాషా సౌందర్యం, సౌకుమార్యం తన కవిత్వంలో ప్రదర్శించి ఫ్లెమిష్ భాషను సంపన్నం చేశాడు. పశ్చిమ ఫ్లెమిష్ మాండలికాన్ని కవిత్వంలో ప్రవేశపెట్టాడు. తరువాతి కాల్పనిక కవులు జర్మన్‌భాషా ప్రభావానికి బాగా లోనయారు.

19 వ శతాబ్దపు చివరలో ఫ్లెమిష్, డచ్ సాహిత్యాలకు దృఢమైన అనుబంధం ఏర్పడింది. దీనితో ఫ్లెమిష్ సాహిత్యం మీద డచ్ సాహిత్యం చెరగని ముద్ర వేసింది. దీనివలన ఫ్లెమిష్ రచయితలు యూరప్ సంస్కృతికి మరీ దగ్గర అయారు. వీరంతా *వాన్‌ను ఎన్‌స్ట్రాక్స్* (ఇవాళ-రేపు) అనే సాహిత్య పత్రిక ద్వారా సాన్నిహిత్యం ఏర్పరచుకున్నారు. తమ వ్యక్తిగత భావాలను వ్యక్తిగతమైన పద్ధతిలో వ్యక్తం చేయడం వీరి సాహిత్య ధ్యేయం. స్టిగన్ స్ట్రువెల్, ఫ్రాంక్‌లాట్యూర్ (1871-1969), కారెల్‌వాన్ వస్టిళెనె (1879-1929) ఈ ఉద్యమానికి ముఖ్య నాయకులు.

మొదటి ప్రపంచ యుద్ధం తరువాత ఫ్లెమిష్ రచయితలలో పెక్కుమంది సాంఘిక రాజకీయ సమస్యలమీద తమ దృష్టిని కేంద్రీకరించారు. భాషను ఆధునాతనం చేయడానికి చాలా కృషి చేశారు. పాల్‌వాన్ బస్టెజన్ (1896-1928) తన కవిత్వంలో "డాడావాదం", "వ్యక్తీకరణవాదం" (Expressionism) వంటి వాటితో ప్రయోగాలు చేశాడు. అయితే ఇలాంటి తిరుగుబాటు ధోరణులు ఫ్లెమిష్ సాహిత్యాన్ని పెద్దగా ప్రభావితం చేయలేదనే చెప్పాలి. ఈ కాలంలో నవల మాత్రం రైతులు, మధ్యతరగతి జనులు మొదలైనవారి జీవితాలను చిత్రిస్తూ ప్రజల ఆదరాన్ని చూరగొన్నది. ఫెలిక్స్ టిమ్మెర్‌మాన్స్ (1886-1947) ఈ కోవకు చెందిన నవలా రచయిత. రెండు ప్రపంచ యుద్ధాల మధ్య కాలంలోనూ, గత కొన్ని సంవత్సరాల్లోనూ జెరార్డ్ వాల్‌షాప్ ని మినహాయిస్తే ఫ్లెమిష్ సాహిత్య మంతా డచ్ సాహిత్యానికి మరీ సన్నిహితమైందని చెప్పవచ్చు.

**బెల్జియన్ ఫ్రెంచ్ సాహిత్యం** : బెల్జియన్ ఫ్రెంచ్ సాహిత్యం 1868 లో ప్రారంభమైనట్లు భావిస్తారు. ఛార్లెస్ డి కోస్టర్ (Charles de Coster) రచించిన *లా లెజెండ్ ది ఉలెన్ స్పీగల్* అనే వచనకావ్యాన్ని ఈ సాహిత్యానికి నాందిగా పరిగణిస్తారు. దీన్ని జాతీయ మహాకావ్యంగా గౌరవిస్తారు. దీని శైలి గంభీరమైంది. 1880 తరువాతే ఫ్రెంచ్ భాష బెల్జియన్ సాహిత్యంమీద అధికారాన్ని సంపాదించిందని చెప్పవచ్చు. ఆర్థికంగా వికాసం చెందడంతో సంఘంలో ఇంతకు ముందెన్నడూ లేనంతగా విద్యా సంస్కారాలు పెరిగాయి. దీనితో సాహిత్యం మొదలైన విషయాలపై ఆసక్తి పెరిగింది. విద్యాలయాలలో ఫ్రెంచ్ బోధనాభాషగా ఉండటం మూలాన అధికంగా ఆదరం లభించడంతో ఆ భాష ప్రభావం పెరిగింది. మధ్యతరగతి వారు సాహిత్య వ్యాసంగంలో ఎక్కువగా పాల్గొనడంతో ఫ్రెంచ్ ప్రాబల్యం ఎక్కువైంది. మాక్స్ వాలర్ (1860-1889) *లా యూనె బెల్జిక్* (La jeune Belgique) అనే సాహిత్య పత్రికను స్థాపించాడు. 1881 నుండి ఈ పత్రిక బెల్జియన్ సాహిత్యంలో ఫ్రెంచ్ ప్రగతికి దోహదం చేసింది. ఆక్టేవ్ పిర్మెజ్, ఇవాన్ గిల్కిన్, ఆల్బెర్ట్ గిరో, ఎమిలీ వెర్‌హీరెన్ మొదలైన రచయితలు ఈ ఫ్రెంచ్ సాహిత్యాభివృద్ధి ఉద్యమంలో ముఖ్యులు. కామిలే లెమనియర్ (1844-1913) నవలా రచయితగా గొప్ప శైలిని ప్రదర్శించి ప్రసిద్ధు డయాడు.

మోరిస్ మాటర్‌లింక్ ప్రతీకావాది అయిన కవి. లబ్ధప్రతిష్ఠుడైన నాటకకర్త కూడా! పశ్చిమదేశ నాటక రంగం మీద ఆయన ప్రభావం గాఢంగా కనిపిస్తుంది. *లా ప్రిన్సెస్ మలేని, లాసూబ్లూ* (The Blue Bird) మొదలైనవి ఆయన రచించిన ప్రసిద్ధ నాటకాలు. 1911 లో ఆయనకు నోబెల్ బహుమతి లభించింది. హబర్ట్ క్రేన్స్, ఎడ్మండ్ గ్లెసెనర్ మొదలైనవారు ప్రాంతీయ విషయాలను ఆధారంగా తీసికొని నవలలను రచించారు. నవలల కంటె, నాటకాలకంటె బెల్జియన్ ఫ్రెంచ్ సాహిత్యంలో కవిత్వానికే ఎక్కువ ఆదరం లభించింది.

బెల్జియన్ సాహిత్యంలో సంప్రదాయ పరమైన ధార్మిక వస్తువుతో పాటు సాంఘిక విషయాలను గూర్చిన వాదోపవాదాలు, తీవ్ర చింతన కూడా సాగుతూనే వచ్చాయి. దీని మీద ఫ్రెంచ్ సాహిత్య ప్రభావం ఎక్కువ. క్రమేపీ బెల్జియన్ ఫ్రెంచ్ రచయితలు ప్రధాన ఫ్రెంచ్ సాహిత్యంలో భాగంగా పరిణమించినా, ఫ్రాన్స్‌దేశ సాహిత్యంలోని మార్పులను పూర్తిగా అనుకరిస్తూ పోయినా, కొంతవరకు తమ ప్రత్యేకతను కూడా నిలబెట్టుకునే ప్రయత్నం చేశారు.

క్షీణయుగపు బెల్జియన్ ఫ్రెంచ్ కవిత్వం ఆవేదన, ఆకాంక్ష, నిరాశ మొదలైన వాటితో నిండిపోయింది. జార్జిస్ రోడెన్ బాక్ కవిత్వంలో ఈ విషయం స్పష్టంగా గోచరిస్తుంది. ఎమిల్ వెర్‌హారెన్ కవిత్వంలోనూ కొద్ది మార్పులతో ఈ లక్షణం కనిపిస్తుంది. ఛార్లెస్ ప్లిస్

నియర్ విమర్శకుడుగా, జార్జెస్ సెమనాన్ ప్రతిభావంతుడైన డిటెక్టివ్ నవలా రచయితగా ప్రసిద్ధి పొందారు.

మేరీ గెవెర్స్, మాడ్‌ఫ్రెరె, ఫ్రాన్సిస్ వాల్డర్ (Francis Walder) చెప్పుకోదగ్గ నవలా రచయితలు. ఫెర్నాండ్ క్రొమెలింక్, మికెల్ ది గిల్డ్‌రోడ్ నాటక రచనలో పేరు మోసినవారు.

శ్రీ.ల.

## బ్రెటాన్ భాష - సాహిత్యం

**భాష :** ఫ్రెంచ్ భూభాగమైన బ్రిటనీలో పశ్చిమ ప్రాంతంలోనూ, తీరప్రాంతంలోనూ సుమారు పదిలక్షల మంది బ్రెటాన్ భాషను మాట్లాడుతారు. ఇది కెల్టిక్ భాషా కుటుంబానికి చెందింది (చూ. కెల్టిక్ భాషలు). దీన్ని పాఠశాలలో ప్రవేశపెట్టడానికి ప్రభుత్వం అనుమతించలేదు. క్రీ.శ 5 వ, 6 వ శతాబ్దాలలో బ్రిటన్ నుంచి వలస వచ్చినవారు ఈ భాషను బ్రిటనీకి తమతో తీసుకొని వచ్చారు. అందుకే దీనికి వెల్ష్, కోర్నిష్ భాషలతో సామ్యం ఉంది. బ్రిటనీలోని కొన్ని స్థలాల పేర్లను పరిశీలిస్తే ఇది మరీ స్పష్టంగా తెలుస్తుంది. స్థలాల పేర్లను మినహాయిస్తే ప్రాచీన బ్రెటాన్ భాషను గూర్చి మనకు తెలిసింది చాలా తక్కువ.

**సాహిత్యం :** 14వ శతాబ్దానికి చెందిన ఒక వ్రాతప్రతిలో బ్రెటాన్ సాహిత్యానికి సంబంధించిందిగా భావింపబడే ప్రేమగీతం ఒకటి లభ్యమైంది. అయితే ఈ భాషలో పరిణతమైన పద్య రచన ఉండేదనీ, ఆర్థర్ గాథలను ప్రచారం చేయడంలో ఈ భాష ప్రముఖపాత్ర వహించిందనీ మనకు నిశ్చయంగా తెలిసినా, ఆ కాలంనాటి వ్రాతప్రతు లేవీ లభించలేదు. 10 వ శతాబ్దం నుంచీ బ్రిటనీ ఫ్రెంచ్, ఆంగ్లో-నార్మన్ ప్రభువుల ప్రభావానికి లోనైనందువల్ల బ్రెటాన్ భాష క్షీణించి మధ్యయుగాంతం నాటికి కేవలం పల్లెవారి భాషగా మిగిలి పోయింది. జీన్‌లాగడ్యూక్ రచించిన *కేథలికన్* అనే బ్రెటాన్-లాటిన్-ఫ్రెంచ్ నిఘంటువు 1499 లో ముద్రితమైంది. ఇదే బ్రెటాన్ భాషకు సంబంధించినంత వరకు అతి పురాతనమైన ముద్రిత గ్రంథం. ఫ్రెంచ్‌భాష అధికారంలో ఉండడం మూలాన ఆ భాషా ప్రభావం బ్రెటాన్ మీద ఎక్కువగా కన్పిస్తుంది. నిజానికి మొదటి దశలో బ్రెటాన్ సాహిత్య మంతా ఫ్రెంచ్ సాహిత్యాన్ని అనుకరించడమో, అనువదించడమో చేసేది. *ది అవర్స్* (గంటలు-1486), *ది మిర్రర్ ఆఫ్ డెత్* (మృత్యుదర్పణం-1519) అనే గ్రంథాలు ఇట్లాంటివే! ఇవి మతపర మైనవి కూడా!

క్రీస్తు జీవితాన్నీ, ఆ మతానికి చెందిన సాధు జనులనూ, మహాత్ములనూ ఆధారంగా తీసుకొని వ్రాసిన "మిస్టరీ" లేదా "మిరకిల్" నాటకాలే 19 వ శతాబ్దపు సాహిత్యంలో ఎక్కువ! బ్రెటాన్ నాటకాలకు ప్రజాదరణ హెచ్చు. మరే ఇతర కెల్టిక్ భాషలోని నాటకాలకూ ఇంత ఆదరం లభించలేదు.

బ్రెటాన్ కవిత్వాన్ని గ్వెర్జియూ, సోనియూ అని రెండు విధాలుగా విభజిస్తారు. మొదటి విభాగంలో విషాదాత్మక వీరగాథలను చేరుస్తారు. ఇవి చాలా నాటకీయంగా ఉంటాయి. రెండవ విభాగంలో ప్రేమగీతాలూ, అధిక్షేప రచనలూ, నావికుల పాటలూ, పద కవితలూ ఉంటాయి. బ్రెటాన్ జానపదుల కథలు, గాథలు అతి పురాతన లక్షణాలతో కూడి ఉండడం వల్ల పరిశోధక దృష్ట్యా చాలా విలువైనవి.

ప్రాస్పర్ ప్రోక్స్, ఆగస్ట్ బ్రిజోక్స్ 19 వ శతాబ్దానికి చెందిన ఇద్దరు ప్రముఖ కవులు. గత శతాబ్దంలో వెల్ష్ భాషీయులు తమ భాషకై చేస్తున్న కృషి బ్రెటాన్ భాషా సాహిత్యాల పునరుజ్జీవనానికి ఉత్సాహాన్నీ, ఉత్తేజాన్నీ కలిగించింది. జె.యం. యఫ్. లి గొనెదిక్ (1775-1895) ఈ భాషకు నిర్దిష్టమైన అక్షర విన్యాసాన్నీ, వ్యాకరణాన్నీ, సంస్కరించిన పదజాలాన్నీ నిర్ధారణ చేశారు. ప్రామాణికమైన బ్రెటాన్ భాషలో ప్రప్రథమంగా *బైబిల్*ను కూడా ఆయనే అనువదించినాడు.

1839 లో విల్మర్కీ పండితుడు (1835-1895) ప్రాచీన బ్రెటాన్ జానపదుల వీరగాథలు అంటూ కొన్ని గాథలను కూర్చి *బర్జజ్ బ్రెజ్* అనే సంకలన గ్రంథం ప్రకటించాడు. దీనికి జనాదరణం- విశేషంగా బ్రిటన్‌లో లభించింది. ఇవన్నీ పూర్వగాథలు కావనీ, వానిలో చాలా భాగం విల్మర్కీ స్వయంగా కల్పించినవనీ తరువాత తెలిసింది. అయినప్పటికీ, జానపద సాహిత్యం అధ్యయనానికి విల్మర్కీ పుస్తకం గొప్ప ప్రోత్సాహాన్ని కల్పించిందని చెప్పాలి. 1868-1890 మధ్యకాలంలో బ్రెటాన్ వీర గాథలనూ, పాటలనూ, కథలనూ సంపాదించి, ఏడు సంపుటాలుగా లూజెల్ ప్రకటించాడు.

20 వ శతాబ్దంలో బ్రెటాన్ భాషా సాహిత్యాలపై ఆసక్తి పెరిగింది. వెల్ష్‌వారు తమ భాష విషయంలో చేస్తున్న ప్రయత్నాలను దృష్టిలో పెట్టుకొని, 1901 లో బ్రిటనీలో 'గోర్సజ్' అనే సంస్థను స్థాపించటం దీనికి కారణం కావచ్చు. తత్‌ఫలితంగా కెల్టిక్ దేశభక్తి గీతాలు విరివిగా రచింపబడ్డాయి. కలోక్ (1888-1917) తన భక్తిగీతాలను *మోకర్లిల్లి* అనే గ్రంథంగా ప్రచురించి విశేష

ఖ్యాతిని ఆర్జించాడు. తంగి మలె మంచె (1875-1953) రచించిన *గూరువాన్ విచిత్ర యోధుడు* అనే గ్రంథాన్ని బ్రెటాన్ సాహిత్యంలో అత్యుత్తమ గ్రంథంగా పరిగణిస్తారు.

1925 లో 'నైర్మతి' (Gwalaru) అనే సాహిత్య పత్రిక ప్రారంభించబడింది. 1946 నుంచీ దీన్నే 'బంధం' (Alliamm) అనే పేరుతో ప్రచురిస్తున్నారు. బ్రిటనీ జానపదుల భాషకు గౌరవ ప్రతిపత్తులను కల్పించడం దీని ప్రధానాశయం. తత్ఫలితంగా బ్రెటాన్‌భాష ప్రాంతీయ, ప్రాదేశిక విషయాలకే పరిమితం కాకుండా విరివిగా ఉపయోగించటం జరిగింది. వచనం, పద్యరచన బాగా విస్తరించాయి. ఐరిష్, వెల్ష్ భాషలనుంచి పెద్ద ఎత్తున అనువాదాలను ప్రచురించడం జరిగింది. ఐర్లండ్‌కు చెందిన వీరగాథలను, కథలను అనువదించిన వారిలో ఐర్లండ్‌లో స్థిరపడ్డ రోపర్జ్ హెమన్ (1900-) ముఖ్యుడు. కథా రచనలోనూ, నవలా రచనలోనూ జాకెజ్ రియూ, యూనెన్ డ్రెజెన్ చెప్పుకోదగినవారు. మలెమంచె, రోపార్జ్ హెమెన్‌లు నాటకరంగంలో నూతన ప్రక్రియలను ప్రవేశపెట్టారు.

అధికారికమైన సహాయ సహకారా లేవీ లేకపోయినా బ్రెటాన్ సాహిత్యం ప్రవర్ధమానం కావడం విశేషం!

శ్రీ.ల.

## యిడ్డిష్ భాష - సాహిత్యం

**భాష :** 'యిడ్డిష్' పదం యూడిష్ (Judisch) అనే జర్మన్ భాషా పదం నుంచి ఏర్పడింది. యూడిష్, జూయిష్ పదాలు సమానార్థకాలు. 'యూదులకు చెందింది' అని అర్థం. తూర్పు యూరప్ దేశాలలో నివసించే యూదులు యిడ్డిష్ భాషను మాట్లాడుతారు. మధ్య యుగీన జర్మన్ భాష నుంచి పుట్టినా హీబ్రూ భాషా పదజాలం ఎక్కువగా ఉన్న భాష యిడ్డిష్. కాల క్రమేణ యూదులు ప్రపంచం అంతటా వ్యాపించడం వలన వివిధ దేశాల పదజాలాన్ని ఈ భాష సంతరించుకొంది. యిడ్డిష్ భాషకు హీబ్రూ లిపినే ఉపయోగిస్తారు. విద్యాధికులైన యూదులు హీబ్రూనే వాడేవారు. సాహిత్య వ్యాసంగాలకు యిడ్డిష్ భాషను వాడడానికి పెద్దగా ఇష్టపడేవారు కారు. అందుకే యిడ్డిష్ భాషా సాహిత్యం 19 వ శతాబ్ది మధ్యభాగం వరకూ అంతగా బలం పుంజుకోలేదు.

జర్మన్ భాషలో ఒక మాండలికంగా ప్రారంభమైన యిడ్డిష్ క్రమంగా స్వతంత్ర ప్రతిపత్తిని పొందింది. 14 వ శతాబ్ది నాటికే ఈ భాష రూపొందినట్లు ఆధారాలున్నాయి. ఆధునిక యిడ్డిష్ భాష మాత్రం 1750 నాటికి రూపం దాల్చినట్లు భావింపవచ్చు. రష్యా, పోలండ్, బొహీమియా మొదలైన తూర్పు యూరప్ దేశాలలో జర్మన్ యూదులు ఆవాసాలను ఏర్పరచుకోడం, జర్మనీలో ఉన్న యూదులతో సన్నిహిత సంబంధాలను కలిగి ఉండడం మూలాన యిడ్డిష్ భాషలో 18 శాతం పద జాలం స్లావిక్ భాషలనుంచి వచ్చి చేరింది. ఇది హీబ్రూ, అరమైక్ పదజాలం కంటె 6 శాతం ఎక్కువ. దాదాపు 66 శాతం పదజాలం జర్మన్ భాషనుంచి రూపొందినా, యిడ్డిష్‌కీ, జర్మన్‌భాషకీ వర్ణ విన్యాసంలోనూ, వాక్యరచనలోనూ, ఉచ్చారణలోనూ పోలికలు చాలా తక్కువ. అందుకే యిడ్డిష్‌ని జర్మన్‌భాషకు అపభ్రంశంగా భావించడాన్ని ఒప్పుకోరు. యిడ్డిష్ భాషకు 'లిథూనియన్', 'యూక్రేనియన్', 'పోలిష్' అనే మూడు మాండలికాలు ఉన్నా వాటిలో కనిపించే వ్యత్యాసాలు అమ్మలలో ఉన్న స్వల్పభేదాల నాశ్రయించినవే! ప్రామాణికమై, సాహిత్యపరమైన ఈ యిడ్డిష్‌భాష ఈ మూడు మాండలికాల ఉదాత్త లక్షణాలను సమీకరించుకుంది. ఈ భాషలో దాదాపు 90,000 పదా లున్నాయి. 60,000 లోకోక్తులూ, జాతీయాలూ ఉన్నాయి. ధర్మగ్రంథాలైన *బైబిల్*, *తాల్ముడ్‌*లు వీటికి ప్రధానమైన ఆకరాలు. యిడ్డిష్‌లో శబ్ద లాఘవం ఎక్కువ. అనేక భాషల నుంచి పదాలను గ్రహించి మిశ్ర పదబంధాలను విరివిగా వాడుకచేస్తారు.

**సాహిత్యం :** 1920 నుంచి యిడ్డిష్ భాషలో కవిత్వమూ, నవలా రచనే కాకుండా తత్త్వశాస్త్రం, విజ్ఞానశాస్త్రం, సాంకేతిక పరిజ్ఞానం మొదలైనవానికి సంబంధించిన గ్రంథాలు కూడా పెద్దసంఖ్యలో రచింపబడ్డాయి. రెండవ ప్రపంచ యుద్ధంలో నాజీల దురాగతాలకు బలి అయిన 60 లక్షలమంది యూదులలో 40 లక్షలమంది యిడ్డిష్ భాషీయులు. ఇలాంటి మహోపద్రవా లన్నింటినీ ఎదుర్కొని నిలిచి యూదు లందరినీ సంఘటితపరచే భాషగా యిడ్డిష్ భాషకు ప్రాధాన్యం ఉంది.

12 వ, 13 వ శతాబ్దాలలో యిడ్డిష్‌లో గ్రంథరచన మొదలైంది. ప్రారంభ దశలోని రచన లన్నీ మత విషయాలనో, ప్రార్థనా పద్ధతులనో వివరించడానికి ఉద్దేశించబడినవే! *బైబిల్* అనువాదాలు, ప్రార్థనాగ్రంథాలు, మతపరమైన గీతాలు మొదలైనవి ఈ కోవకు చెందినవి. తదితరమైన లౌకిక రచనలు జర్మన్, ఇటాలియన్ భాషలనుంచి కొద్ది మార్పులతో యిడ్డిష్‌లోకి చేర్చు కున్నవే. వీటిలో చాలా భాగం వీరోచిత శృంగార గాథలే. ఎలియా లెవిటా అనే పేరుతో ప్రసిద్ధుడైన ఎలియా బేకుర్ (1469-1549) *బొవొ-బుక్* అనే కావ్యాన్ని 1507 లో రచించాడు. 1541 నాటికి కాని ఇది ముద్రింపబడ

లేదు. దీన్నే యిడ్డిష్‌లో మొదటి కావ్యంగా పరిగణిస్తారు. *పారిస్ ఉన్ వియనె* అనే మరోకావ్యాన్ని కూడా లెవిటా వ్రాశాడు. అది 1595 లో ముద్రించబడింది. కాని అంతగా ప్రసిద్ధం కాలేదు. ఇంగ్లీష్ సాహిత్యంలో చాసర్ కవికి ఉన్న ప్రాధాన్యం యిడ్డిష్ సాహిత్యంలో లెవిటాకి ఉన్నట్లు భావిస్తారు. 1544 లో ఒక అజ్ఞాత రచయిత *సామ్యుల్ బుక్* అనే గ్రంథం *బైబిల్*లోని *బుక్ ఆఫ్ సామ్యుల్* ఆధారంగా వ్రాసి ప్రచురించాడు.

30 సంవత్సరాల యుద్ధ కాలం (1618-1648) లో యూదులు జర్మనీలో ఎన్నో అగచాట్లకు గురి అయి దేశాన్ని విడిచి భారీసంఖ్యలో పోలండ్‌కు వలసపోయారు. యిడ్డిష్‌లో మతేతరమైన లౌకిక రచనకు 18 వ శతాబ్దం మధ్యభాగం దాకా అవకాశం లేకుండా పోయింది. 1608 లో యూకోబ్ బెన్ ఇసాక్ ఆష్కెనాజీ వ్రాసిన *జెనో ఉరేనో* అనే పుస్తకం ప్రకటించ బడింది. ఇది *బైబిల్* లోని పెంటాట్యూక్ (మొదటి ఐదు పుస్తకాలు) కి వివరణాత్మకమైంది. యూదు మతపరమైన ప్రధాన వ్యాఖ్యానాలు ఇందులో చేర్చ బడ్డాయి. దీనిలో వాడబడిన భాష ఆధునిక యిడ్డిష్‌కి చేరువగా ఉంటుంది. 20 వ శతాబ్దం ప్రారంభం వరకూ ఈ పుస్తకాన్ని స్త్రీలు సబాత్ (ఆదివారం) నాడు పఠించడం ఆనవాయితీగా ఉండేది.

17 వ శతాబ్దంలో నీతి గ్రంథాలు, చరిత్రలు, భాషా బోధినులు, గీతాలు, స్మారక కావ్యాలు మొదలైనవి యిడ్డిష్ భాషలో అవతరించాయి. ఈ కాలంలోనే (1676-1679) *బైబిల్*కి రెండు అనువాదాలు కూడా ప్రచురింపబడ్డాయి. భారతదేశంలోని కొచ్చిన్ ప్రాంతంలో ఉన్న యూదులను గూర్చి 1675 లో యిడ్డిష్ భాషలో ఒక గ్రంథం వ్రాయబడింది. 'గ్లికెల్ స్మృతులు' కూడా ఈ కాలంలోనే రచించబడింది. గ్లికెల్ తన కుటుంబం లోని బాల బాలికల కోసమే ప్రధానంగా వ్రాసిన ఈ పుస్తకం ఇంగ్లీష్, జర్మన్ భాషలలోకి అనువదింపబడి గొప్ప గ్రంథంగా ప్రశంసించబడింది. 1686 లోనే ఆమ్‌స్టర్‌డామ్ నగరంలో *'కురంటీన్'* అనే యిడ్డిష్ భాషా పత్రికను ప్రారంభించారు. ప్రతి మంగళవారం, శుక్రవారం ఈ పత్రిక ప్రకటింపబడేది.

18 వ శతాబ్దంలో యిడ్డిష్ భాష పూర్తిగా వెనుకబడింది. మోజెస్ మండెల్‌సోన్ (1729-1786), ఆయన అనుయాయులు ప్రారంభించిన విముక్తి ఉద్యమం దీనికి కారణం అనవచ్చు. పురోగాములమనుకున్న యూదులు యిడ్డిష్‌కి బదులుగా జర్మన్‌భాషను వాడడం ప్రారంభించారు. కాని, యిడ్డిష్ భాషకు వ్యతిరేకంగా అలా ఉద్యమం సాగినా, ప్రజలు మాత్రం ఆ భాషనే ఆదరిస్తూ వచ్చారు. 18 వ శతాబ్దం నాటికి ప్రపంచంలో వివిధ దేశాలలో నివసించే యూదులందరూ యిడ్డిష్‌ను తమ భాషగా స్వీకరించారు. జర్మనీలోనే కాక ఇటలీ, స్విట్జర్లాండ్, హాలండ్, బొహీమియా, హంగరీ, రష్యా, రుమేనియా, లిథువేనియా, పోలండ్, ఆస్ట్రియా- హంగరీ దేశాలలో కూడా యిడ్డిష్‌లో గ్రంథరచన జరిగింది. ఇసాక్ అబ్రహం యూకెల్ ప్రప్రథమంగా యిడ్డిష్‌లో నాటకరచన చేశాడు.

19 వ శతాబ్దంలో యిడ్డిష్ భాష బాగా విస్తరించింది. ఇస్రాయెల్ ఆక్సెన్ 30 గ్రంథాలు రచించాడు. ఆధునిక యిడ్డిష్ భాషను ఉపయోగిస్తూ సోలమన్ ఎటింగర్ (1800-1865) *సెర్కిలి* అనే నాటకం వ్రాశాడు. ఈ కాలంలోనే ఇసాక్ మెయర్‌డిక్ (1814-1893) 400 కథలనూ, నవలికలనూ రచించాడు.

1864 లో అబ్రమోవిట్స్ (1836-1917) మెండెలి మోయ్‌కర్ స్ఫోరిమ్ అనే మారుపేరుతో డస్‌క్లైస్ మెనెలి అనే కథను ధారావాహికంగా ప్రచురించాడు. *డీ క్లియాచే, ఫిష్కె డెర్ క్రుమెర్* అనే పుస్తకాలను కూడా ఆయన రచించాడు. మెండెలి రచన చాలా సొగసైంది. యిడ్డిష్ భాషకు ఈయన రచనల వల్ల అత్యున్నత స్థానం ప్రాప్తించింది. ఇప్పటికీ యిడ్డిష్ భాషలో ఈయన శైలిని గొప్పగా భావిస్తారు. మెండెలి సమకాలికుడైన ఇసాక్ యోయెల్ లీనియెట్‌స్కీ *డస్ పోయ్‌లిషె యుంగెల్* అనే పుస్తకం వ్రాశాడు. అయితే - యూదుల జీవిత విధానాన్ని విమర్శించి నందున ఇది వివాదాస్పదమైంది.

షోలెమ్ అలైకెమ్ (1859-1916) ప్రసన్నమైన హాస్య రచయిత. ఆధునిక సాహిత్యంలో ఈయనకు ఎవరూ సరి లేరని అనిపించుకున్నారు. ఈయనను యూదు మార్క్ ట్వేన్‌గా అభివర్ణిస్తారు. సున్నితమైన హాస్యంతో వ్యంగ్యంగా ఈయన యూదు జీవనాన్ని చిత్రించాడు. మెండెలి కటువుగా విమర్శిస్తే, అలైకెమ్ సుకుమారంగా మందలిస్తాడు. ఈయన వ్రాసిన *టెవ్యాడెర్ మిల్కిగర్* సుప్రసిద్ధమైంది. దీనిలో ఆశాభావం విస్పష్టంగా కనిపిస్తుంది.

ఐలైజుష్ పెరెట్జ్ (1851-1915) యిడ్డిష్ సాహిత్యానికి విశాలమైన దృక్పథాన్ని కల్పించాడు. యూదు జీవితాన్ని సమగ్రంగా మననం చేసే లక్షణం ఈయన రచనలలో కన్పిస్తుంది. *కాసిడిష్, ఫోక్స్‌టిమ్‌లికె గెష్టిక్టెన్* ఈయన ఉత్తమ రచనలు. *బైనాక్ ఆఫ్న్ ఆల్టెన్*

మార్క్స్ అనే నాటకాన్ని కూడా వ్రాశాడు. అన్ని సాహిత్య ప్రక్రియలలోనూ అందె వేసినచేయి. ఆధునిక యిడ్డిష్ సాహిత్యంలో ఈయన స్థానం అత్యున్నతమైంది.

అమెరికాలో యిడ్డిష్ భాషకు మంచి ప్రాపకం లభించింది. 1876 లో రుమేనియాలో యాసీ నగరంలో అబ్రహం గోల్డ్ ఫాడెన్ స్థాపించిన యిడ్డిష్ నాటకరంగాన్ని యాకోబ్‌గోర్డిన్ సంస్కరించారు. జుయిష్ డెయిలీ ఫార్వర్డ్ పత్రికా సంపాదకుడైన అబ్రహామ్ కహన్, మారిస్ రోజెస్ ఫెల్డ్ వంటి కవులు, లియెన్‌క్రాబిక్ వంటి నవలా రచయితలు, నాటకకర్తలు, యాకోబ్ ఆడ్లర్ వంటి నటులు యిడ్డిష్ సంస్కృతిని విస్తారంగా ప్రచారం చేశారు.

యూరప్‌లో నిరాశ్రయులైన యూదులు న్యూయార్క్, ఫెలడెల్ఫియా, చికాగో నగరాలలో యిడ్డిష్ కేంద్రాలను స్థాపించారు. యూరప్‌లో ఒడెసా, వార్సా, కీవ్ నగరాలలో కూడా యిడ్డిష్ కేంద్రాలు ఉన్నాయి.

ఇస్రాయిల్ సింగర్, అబ్రహం రైసెన్, జాల్మన్ శ్నావర్ వివిధ సాహిత్య ప్రక్రియలలో పేరు పొందిన రచనలు చేశారు. షోలెమ్ ఆస్క్ *గాడ్ ఆఫ్ రివెంజ్* అనే నాటకంతోనూ, *ది నజరిని, ది అపోజల్, మేరి* అనే మూడు నవలలతోనూ పెద్ద వివాదాన్ని రేకెత్తించాడు.

యిడ్డిష్ భాషలో వివిధ సాహిత్య ప్రక్రియలు పరిపూర్ణంగా వికసించాయి. ప్రపంచంలో ఎన్నో దేశాలలో ఉన్న యూదులు ఈ భాషలో సాహిత్యాన్ని సృష్టిస్తున్నారు. సాంఘిక న్యాయం యిడ్డిష్ సాహిత్యంలో ప్రధాన విషయంగా కనిపిస్తుంది.

1938 నాటికే 400 యిడ్డిష్ వార్తాపత్రికలు ప్రపంచం నలుమూలలా ప్రచలితం అవుతూ ఉండేవి. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత కాస్త మందగించినా, యూదులు ఏ దేశంలో స్థిరపడ్డా తమ సంస్కృతిని, భాషను నిలబెట్టుకునే ప్రయత్నం చేశారు. యిడ్డిష్ భాషలోనే ఇసాక్ బషెవిస్ సింగర్ *సాటన్ ఇన్ గొరే* (Satan in Goray 1955), *ది ఫామిలీ మొస్కాట్ (1950)*, *ది స్లేవ్* (1962), *ది మేనర్* (1967) అనే గ్రంథాలు రచించాడు. ఆయనకు నోబెల్ బహుమతి లభించింది.

శ్రీ.ల.

## యుగోశ్లావ్ భాషలు - సాహిత్యాలు

**భాష :** యుగోశ్లావియాలో 3 అధికార భాష లున్నాయి: సెర్బో-క్రోవషన్, స్లోవీన్, మాసిడోనియన్. ఈ మూడూ శ్లావోనిక్ భాషావర్గంలో దక్షిణ శాఖకు చెందినవి.



యుగోశ్లావియ

**సెర్బో - క్రోవషన్ :** ఇది యుగోశ్లావియాలో ముఖ్యమైన భాష. దీనిని $1\frac{1}{2}$ కోట్లమంది మాట్లాడుతారు. ఇది సెర్బియా, మాంటినీగ్రో, బోస్నియా హెర్సెగోవినా, క్రోవషియా గణరాజ్యాలలో చాలామందికి మాతృభాష. మిగిలిన రెండు గణరాజ్యాలలో - అనగా స్లోవేనియా, మాసిడోనియాలలో ఇది ముఖ్యమైన రెండవభాష.

సెర్బ్‌లూ, క్రోవష్‌లూ తమ తమ మాండలిక భాషలలో గల స్వల్పమైన తేడాలను పెద్దవిగా చేసి తమవి రెండు స్వతంత్ర భాషలనే వాదాన్ని లేవ దీశారు. కాని ఇవి రెండూ భిన్న భాషలు కావు. కొన్ని మాటలలో మాత్రమే తేడా లున్న రెండు మాండలికాలు. క్రోవష్‌లు రోమన్ (లాటిన్) లిపిని, సెర్బ్‌లు సిరిలిక్ (Cyrilliic) లిపిని వాడుతారు.

ఈ భాషలో 3 ముఖ్యమైన మాండలికా లున్నాయి. ష్టోకవిస్కి, చకవిస్కి, కైకవిస్కి. వీటి పేర్లు ఆ యా ప్రాంతాలలో "ఏమిటి?" అనే పదానికి వాడేమాటలను బట్టి నిర్ణయించబడ్డాయి. చకవిస్కిలో 'చ' అంటే ఏమిటి అని అర్థం. దీన్ని ఇస్ట్రియా, దాల్మేషన్ ద్వీపాలలోను, తీర ప్రాంతాలలోను వాడుతారు. ఇందులో 'dj' అనే ధ్వనిని j (య) గా ఉచ్చరిస్తారు. ఒక మాటలో ఉన్న 'మ్' ధ్వనికి బదులు 'న్' ధ్వనిని వాడుతారు (Rukon, Rukom). j బదులు ľj (ల్య) - (ľjubav, jubav) వాడుతారు. కైకవిస్కిలో 'కా' అనగా 'ఏమిటి?' అని అర్థం. దీనిని ఉత్తర క్రోవష్ లో మాట్లాడుతారు. దీనిలో స,జ (c, dj) ధ్వనులను చ,జే (ఛ dž) ధ్వనులుగా పలుకుతారు. చివర 'ల' కార ధ్వనిని పాతపద్ధతిలో వాడుతారు. 'ఉ'తో మొదలయ్యే

మాటలకు ముందు 'వ' కారాన్ని చేరుస్తారు (Vulica, Ulica). మూడవ మాండలికమైన ష్టోకవిస్కీలో 'ష్టో' అంటే 'ఏమిటి' అని అర్థం. దీనిని సెర్బోక్రోవషియాలోని మిగతా ప్రాంతాలలో వాడుతారు. యుగోశ్లావియాలో నాలుగింట మూడు వంతులు ఈ మాండలికాన్నే మాట్లాడుతారు. సెర్బ్ లందరూ, క్రోవషియాలో చాలామందీ ఈ భాషనే వాడుతారు. దీనిలో విలువైన పదజాలం ఉంది. 5 అచ్చులు, 25 హల్లులు, 4 పద్ధతులలో ఊనికలూ (accentuations) ఉన్నాయి. జన బాహుళ్యం వాడే భాషకీ, సాహిత్యంలో వాడేభాషకీ ఎక్కువ భేదం లేదు. 9 వ శతాబ్దంలో శ్లావ్‌ల ధర్మదూతలైన సెయింట్ సిరిల్, సెయింట్ మెథోడియస్ లు పురాతన చర్చి శ్లావోనిక్ భాషను సాహిత్య భాషగా వాడారు. ఇది బాల్కన్ దేశాలలో స్థిరపడిన శ్లావ్ జాతివారికి సాహిత్య భాష అయింది. క్రోవష్‌లు 13 వ శతాబ్దంలో తమ భాషను గ్లగోలిటిక్ లిపిలో వ్రాసేవారు. 14 వ శతాబ్దంలోని రోమన్ అక్షరాలు వాడేవారు. అయితే సెర్బ్‌లూ, మాసిడోనియాన్‌లూ తమ మతపర మైన, లౌకికమైన సాహిత్యాలలో కూడా 'పురాతన చర్చ్ శ్లావోనిక్'నే వాడుతూ వచ్చారు. మధ్యయుగాలు అంత మయ్యే వరకు సెర్బ్‌లు 'సెర్బో - శ్లావోనిక్' అనే భాషను వాడేవారు. వ్రాత ప్రతులను తయారు చేయడంలో వాడుకభాషలోని చాలా అంశాలు చొరబడడం వలన ఆ విధంగా ఏర్పడిన సంకరభాషకు ఈ పేరు వచ్చింది. 18 వ శతాబ్దంలో హాబ్స్‌బర్గ్ రాజ్యాలలో నివసించే సెర్బ్‌లు తమ చర్చ్ పుస్తకాలను రష్యాలో వాడుతున్న 'పురాతన చర్చి శ్లావోనిక్' భాషలో అచ్చువేయించుకునేవారు. ఈ భాషతో తాము వాడుతున్న భాషలోని అంశాలు జతపరచి సెర్బ్‌లు తమ సాహిత్య భాషను రూపొందించుకున్నారు. ఇదే సెర్బో-శ్లావోనిక్ భాష.

ఈ భాషను 18 వ శతాబ్దాంతం నుంచి 19 వ శతాబ్దం మధ్య వరకు వాడుతూ వచ్చారు. తరువాత వుక్ స్టెఫనోవిక్ కరజిక్ అనే ఆయన సెర్బోక్రోవషన్ భాషను సంస్కరించాడు. ఈ సంస్కరణలలో ముఖ్యమైనవి: వాడుకభాషను సాహిత్యభాషగా వాడడం, ఉచ్చారణకు దగ్గరగా ఉండే వర్ణక్రమం, లిపిలో తగిన మార్పులు. అయితే ఈ సంస్కరణలకు ప్రాచీన మతావలంబకులు అభ్యంతరం తెలిపారు. 1850 లో వియన్నాలో జరిగిన సమావేశంలో ష్టోకవిస్కీ మాండలిక భాషను సాహిత్య భాషగా అంగీకరించారు. 'కరజిక్' 30 శబ్దాలకు 30 అక్షరాలను సూచించి వ్రాతలో ఇమిడిక సాధించాడు. ఇదే విధంగా 'గ్య' అనే ఆయన క్రోవష్‌లు వాడుతున్న రోమన్ లిపిని సంస్కరించి కొన్ని క్రొత్త అక్షరాలను చేర్చి ఆ లిపిని మెరుగుపరిచాడు. 1899 లో ధ్వని విధేయమైన వర్ణక్రమాన్ని క్రోవష్‌లు రూపొందించుకున్నారు.

**స్లోవీన్ :** ఇది కూడా దక్షిణ శ్లావిక్ భాషలలో ఒకటి. 15 లక్షలమంది ఈ భాషను మాట్లాడుతారు. యుగోశ్లావియా వాయవ్య ప్రాంతంలో ఉన్న స్లోవేనియా రిపబ్లిక్‌లోను, ఆస్ట్రియా, ఇటలీ పరిసర ప్రాంతాలలోను ఈ భాషను వ్యవహరిస్తారు. ఈ భాషలో నామవాచకాలలోను, క్రియలలోను ద్వివచనం వాడుకలో ఉంది. ఈ భాషలో మాండలిక భేదాలు చాలా ఎక్కువ. 46 మాండలిక భేదాలు ఉన్నట్లు అంచనా! 16 వ శతాబ్దంలో ప్రియోజ్ ట్రుబార్ తన రచనలలో మధ్యప్రాంతమైన గొలెన్‌స్కోలో వాడే భాషను ఉపయోగించి సాహిత్య భాషకు రూపకల్పన చేశాడు. ఆడంబొహరిస్ 1584 లో వ్రాసిన వ్యాకరణం వలన ఈ భాషకు మొదటిసారిగా వర్ణక్రమం స్థిరపడింది. 19 వ శతాబ్దం మధ్యవరకు ఈ వర్ణక్రమాన్నే ఉపయోగించేవారు. 1808 లో కోపితార్ అనే భాషాశాస్త్రవేత్త 'స్లోవీన్'ను దక్షిణ శ్లావోనిక్ భాషావర్గానికి చెందిన మరొక భాషగా గుర్తించాడు. ఇది తమకు తూర్పున ఉన్న సెర్బోక్రోవషన్ భాషనుంచి 7 వ, 9 వ శతాబ్దాల మధ్య కాలంలో విడిపోయి వేరే భాషగా రూపొందింది.

**మాసిడోనియన్ :** యుగోస్లోవియాలోని ఇతర భాషల వలె ఇది కూడా దక్షిణ శ్లావిక్ భాషా వర్గానికి చెందినభాష. బల్గేరియన్‌భాషకు ఇది దగ్గరగా ఉంటుంది. బల్గేరియా, గ్రీస్ వంటి పరిసర ప్రాంతాలలో కూడా ఈ భాష మాట్లాడుతారు. దీనిలో మూడు మాండలిక భాషా సముదాయాలు ఉన్నాయి. ఉత్తరాది మాండలికాలు (ఇవి సెర్బియన్‌కు దగ్గరగా ఉంటాయి); తూర్పు మాండలికాలు (ఇవి బల్గేరియన్‌కు దగ్గరగా ఉంటాయి); పశ్చిమ మాండలికాలు. ఈ మూడవ వర్గం మాండలికాన్నే ఎక్కువగా వాడుతారు. నేటి ప్రామాణిక భాషకు ఇదే మూలం. సాహిత్యభాష రెండవ ప్రపంచ యుద్ధం తరువాత గాని అభివృద్ధి చెందలేదు. 1950 లో ప్రచురించిన 'మాసిడోనియన్ లేఖన విధానం' దీనికి దోహదమైంది. దీనిలో సిరిలిక్ వర్ణమాలకు చెందిన 31 అక్షరాలు ఉన్నాయి.

**సాహిత్యాలు :** సెర్బ్‌లు, క్రోవష్‌లు, శ్లావియన్‌లు, మాసిడోనియన్‌లు కలిసి సృష్టించిన సాహిత్యాన్ని యుగో

శ్లావ్ సాహిత్యం అంటారు. మొదట యుగోశ్లావ్ లందరికీ ఒకే సాహిత్యం ఉండేది. అయితే 18 వ శతాబ్దం చివర అంకురించిన జాతీయ చైతన్యం వలన యుగోశ్లావియాలోని ప్రతి ఒక్క జాతి తన సాహిత్యాన్ని తనే స్వతంత్రంగా రూపొందించుకో సాగింది. ఈ భిన్న భిన్న సాహిత్యాలకు తమ తమ ప్రత్యేక లక్షణాలు ఉన్నప్పటికీ, అన్నిటిలోను ఎన్నో సామాన్య లక్షణాలు కూడా కనిపిస్తాయి.

సెర్బో-క్రోవషన్ సాహిత్యం : 9 వ శతాబ్దంలో దక్షిణ ప్రాంతంలో నివసించే శ్లావ్ జాతివారు క్రైస్తవ మతాన్ని స్వీకరించడంతో మతపరమైన సాహిత్య రచన ప్రారంభమైంది. సెయింట్ సిరిల్, సెయింట్ మెథోడియస్ అనే ప్రచారకులు చర్చికి సంబంధించిన పుస్తకాలను సలోనికా పట్టణ పరిసరాలలో వాడే భాష లోకి అనువదించారు. ఈ ప్రచారకుల శిష్యులు ఇలాంటి రచనలనే మాసిడోనియాలోని ఓక్రిడ్ భాషలో రచించారు. 1168 లో 'నెమన్యా' మధ్యయుగపు సెర్బియా రాజ్యాన్ని స్థాపించాడు. 15 వ శతాబ్దపు మధ్యభాగం వరకూ ఈ రాజ్యం నిలచి ఉంది. ఈ కాలంలో యుగోశ్లావియాలో విలువైన సాహిత్యం వెలువడింది. గ్రీక్ చర్చి పుస్తకాల అనువాదాలతో ప్రారంభమై క్రమంగా మౌలికమైన లౌకిక సాహిత్య సృష్టి జరిగింది. రాజులు, మతగురువుల జీవిత చరిత్రలు వెలశాయి. 'డానిలో' (14 వ శతాబ్ది) అనే మతగురువు ఇలాంటి రచనలు చేసిన వారిలో ముఖ్యుడు. యుగోశ్లావియాలో కవిత్వం వ్రాసిన మొట్ట మొదటి మహిళ ఎఫిమియా. ఆమె వ్రాసిన 'లాజర్ యువరాజ ప్రశంస' సెర్బియన్ కవిత్వంలో అత్యుత్తమ మైంది. 1459 లో తురుష్కులు ఈ ప్రాంతాన్ని ఆక్ర మించి, 350 సంవత్సరాల పాటు దానిని తమ వలస రాజ్యంగా పాలించడంతో సెర్బియన్ సాహిత్యపు అభివృద్ధి కుంటుపడింది.

అయితే తురుష్కుల ప్రభావం అంతగా లేని డాల్మే దీవులలోను, తీర ప్రాంతాలలోను ఇటలీ దేశపు పునరుజ్జీవనోద్యమ ప్రభావం కనిపించింది. అందువలన 15 వ శతాబ్దం చివర యుగోశ్లావ్ సాహిత్యంలో ప్రాంతీయ ధోరణులు పొడచూపాయి. 'రగూసా' గణరాజ్యం మీద కూడా పునరుజ్జీవన ప్రభావం విశేషంగా కనిపించింది. మహాకావ్యాలు, నాటకాలు, ప్రేమగీతాలు, నవలలు వంటి కొత్తప్రక్రియలు వెలశాయి. వాటిలో కూడా మతపరమైన విషయాలు కొనసాగినప్పటికి దేశభక్తికి, శృంగారానికి సంబంధించిన ఇతివృత్తాలు కూడా కనిపిస్తాయి. షిషికో మెంచటిక్, జోర్డ్రజిక్‌లు పెట్రార్క్ అనే ఇటలీ కవిని అనుకరించి కొన్ని అసహజ ధోరణులు ప్రదర్శించారు. వీరి తరువాత ప్రజ్ఞావంతులైన రంజీనా, జ్లాటరిక్ హెక్టోరొవిక్‌లుచిక్, మరులిక్ కవులు విశేషమైన కృషిచేశారు. కొత్త పోకడలు, బాణీలు ఆరంభించారు. ముఖ్యంగా మార్కోమరులిక్ *బైబిల్*లోని కథల ఆధారంగా రచించిన మహాకావ్యాలలో స్వదేశీయులను తురుష్కులమీద తిరుగుబాటు చేసేందుకు ప్రబోధించాడు. లాటిన్ భాషలో సుఖాంత నాటకాలు వ్రాసిన ప్లాటస్‌ను అనుకరిస్తూ మరీన్ డ్రజిక్ కొన్ని నాటకాలు వ్రాశాడు. రగూసా గణరాజ్యపు సాహిత్యంలో, స్వర్ణయుగం అనదగిన 17 వ శతాబ్దంలో వచ్చిన చెప్పుకోదగ్గ కావ్యాలలో ఒకటి ఐవన్ గుండులిచ్ వ్రాసిన *ఉస్మాన్*. దీనిలో తురుష్కులపై పోలిష్ జాతివారి విజయం వర్ణిస్తూ శ్లావిక్ జాతివారిలో సమైక్యం ఆవశ్యకతను గురించిన ప్రబోధం ఉంది. ఆ కాలంలో వెలసిన మరొక ముఖ్యమైన కవి ఇగ్నియత్ జుర్జెవిచ్. 18 వ శతాబ్దపు చివరి భాగంలో హేతువాదియైన డోసిథెజ్ ఓబ్రాడొవిచ్ సెర్బియన్ సాహిత్యాన్ని ఆధునికీకరించాడు. ఈయన సెర్బియన్ భాషలో జాతీయ సాహిత్య స్రష్ట. కొద్ది దశాబ్దాలలో సెర్బ్ జాతికి చెందిన 'కరజిక్', క్రోవష్ జాతికి చెందిన 'గయ్'లు పైన చెప్పిన ప్రకారం భాషా సంస్కరణలు చేసి సెర్బ్, క్రోవష్ భాషలను విలీనం చేసి, సమైక్య సాహిత్యం వచ్చేందుకు కారకు లయారు. 1830 వ సంవత్సరం ప్రాంతంలో వాడుక భాషను సాహిత్యరచనకు అంగీకరించడం, ష్టో మాండలికాన్ని ఉపయోగించడం, ధ్వని విధేయమైన వర్ణ క్రమం ప్రారంభించడం జరిగాయి. ఈ కాలంలో క్రోవష్ మజురంచి రచించిన 'స్మయిల్ ఆగా మరణం' గొప్ప పద్యకావ్యం. మాంటినీగ్రిన్ న్యెగోష్ 'పర్వత పుష్పమాల' అనే పద్యనాటకం వ్రాశాడు. ఇది మంచి చెడ్డల మధ్య జరిగే సంఘర్షణను చిత్రించిన రమ్యమైన రచన. ఈయన ఈ ప్రాంతపు షేక్స్పియర్‌గా ప్రసిద్ధి కెక్కాడు.

19 వ శతాబ్దంలో కాల్పనికోద్యమం వ్యాపించింది. అదే సమయంలో యుగోశ్లావియాలో జాతీయ సాహిత్యాలు వృద్ధి చెందాయి. గేయకవిత్వం బాగా ప్రచారంలోకి వచ్చింది. క్రోవషియాలో పీటర్ ప్రిరాడొవిచ్ దేశభక్తి గీతాలు వ్రాశాడు. సీమా మిలుటినోవిచ్ సరైలియా 'సెర్బియా మహిళ' అనే మహాకావ్యంలో తురుష్కులపై జరిగిన మొదటి తిరుగుబాటును గురించి ప్రస్తావించాడు. రాడిచెవిచ్, వోయిస్లావ్ ఇలిచ్ వంటి గేయ కవులు సెర్బియాలో

రచనలు చేశారు. మార్కో మిలయనోవ్ ఈ కాలంలో ప్రసిద్ధి గాంచిన గద్య రచయిత. మాసిడోనియన్ భాషలో కూడా మంచి రచనలు వచ్చాయి. జోవకిమ్ క్రచో వ్స్కీ జానపద గీతాలను సేకరించాడు. కాన్‌స్టంటీన్ మిలడినోవ్ ఈభాషలో కాల్పనిక పద్ధతి అవలంబించిన మొదటి కవి. పోపోవిచ్ మధ్యతరగతి జీవితానికి సంబంధించిన కథా వస్తువులతో వాస్తవికమైన వ్యంగ్య పరిహాస (satirical) నాటకాలు వ్రాశాడు. క్రోవష్ జాతివాడైన ఆగస్ట్ షెనోవ కాల్పనికోద్యమాల నుంచి వాస్తవికతా దృష్టివైపు మారుతున్న సంధి సమయాన్ని చిత్రించాడు.

సాహిత్యంలో వాస్తవికతకు ప్రధాన స్థానం కలిగిన కాలంలో గద్య రచనకు ప్రాముఖ్యం వచ్చింది. క్రోవష్‌లు నవలా రచనలో పేరు పొందారు. వారిలో కుమిచిచ్, కొవాచిచ్, కొజారక్‌లు ముఖ్యులు. సెర్బ్ జాతివారు చిన్నకథలు వ్రాయడంలో ఆసక్తి చూపారు. జకోవ్ ఇగ్జాటోవిచ్, లాజా లాజరెవిచ్, మిలోవాన్ గ్లిసిచ్, రాంకోవిచ్, సిమో మాటావుల్య కథా రచయితలలో సుప్రసిద్ధులు. నాటక రచయితలుగా లాజాకోటిచ్, ఇవో వోన్యోవిచ్ రాణించారు. వోన్యోవిచ్ ప్రతీక వాదాన్ని బలపరుస్తూ పద్యాలూ, నవలలూ కూడా వ్రాశాడు.

20 వ శతాబ్దపు తొలిదశలో నవలా రచన క్షీణించింది. బోరిసావ్ స్టాంకోవిచ్ మనస్తత్త్వ విశ్లేషణతో కూడిన నెచిస్ట్రాక్రవ్ అనే నవల వ్రాశాడు. ఇసిడోవా సెకులిచ్ వ్యాసరచన చేశాడు. ఆంటన్ గస్తవ్ మెటోస్ విమర్శలో ప్రసిద్ధి కెక్కాడు. దేశభక్తి ప్రేరణతో కూడా కవులు స్వచ్ఛమైన, మనోహరమైన రచనలు చేశారు. ఒక్కొక్కప్పుడు యుగోశ్లావియాలో రచయితలు పశ్చిమ యూరప్‌లోని, అమెరికాలోని కవిత్వధోరణుల వలన కూడా ప్రభావితులయారు.

క్రోవష్ జాతివారైన వ్రిడిష్ ఉయ్‌విచ్, వి. నాజర్‌లు అతిశయోక్తివాదం (Expressionism) వలన ప్రభావితులై అంతర్గత స్వగతాలను (inner monologues) తమ కవిత్వంలో వాడారు. సెర్బ్ జాతివారైన యోవన్ దుచిక్, పెట్రోవిచ్-డిస్, స్రన్యాన్స్కీలు కవిత్వాన్ని ఉన్నత శిఖరాలకు తీసుకువెళ్లారు. యుద్ధకాలపు బాధలను గోరన్ కోవచిక్ హృదయ విదారకంగా చూపించాడు. ప్రస్తుత కాలంలో చెప్పుకోదగిన కవులు కాస్టెలాన్, పోపా, ఐవన్ లాలిచ్, మిహలిచ్‌లు. నాటకరచనలో ఈ శతాబ్దంలో తగినంత ఉత్సాహం కనపడదు. యుగోశ్లావియా అంతటిలో ముఖ్యరచయితగా చెప్పుకోదగిన మిరోశ్లావ్ క్రలెజా 'క్రోవష్' జాతివాడు. సెర్బ్ జాతివాడైన నుషిక్ చమత్కారమైన సుఖాంత నాటకాలు వ్రాశాడు. బ్రానిమిర్ కోసిక్ రెండు ప్రపంచ యుద్ధాల మధ్యకాలంలో నవలను పునరుద్ధరించాడు. బోస్నియా ప్రాంతపు జీవితాన్ని ఇవో ఆంద్రోచి కథలలో చిత్రించాడు. ఈయనకు 1961 లో నోబెల్ బహుమతి లభించడంతో యుగోశ్లావియా సాహిత్యంలో నవల ఉచ్చస్థాయికి పెరిగి అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించింది. ఒక ప్రక్రియగా గత 40 సంవత్సరాలలో నవల పరిపక్వం చెందింది.

**స్లోవీన్ సాహిత్యం :** స్లోవీన్ సాహిత్య చరిత్రను 5 యుగాలుగా విభజించవచ్చును. 1. మౌఖిక కవిత్వ యుగం. అచ్చు యంత్రాలు వచ్చి సాహిత్యాన్ని అచ్చువేసే కాలం వరకూ ఈ యుగం కొనసాగింది. 2. 8 వ శతాబ్దంలో ఫ్రాంక్ జాతివారు స్లోవీన్ ప్రాంతాలను ఆక్రమించుకొన్న నాటి నుంచి 1550 లో ఈ భాషలో మొదటి అచ్చు పుస్తకం వెలువడేవరకూ సాగిన యుగం. ఈ యుగంలో మత న్యాయశాస్త్ర సంబంధమైన పుస్తకాలు అడపా దడపా వెలువడుతూ వచ్చాయి. 3. 1550 నుంచి 1768 వరకూ ఉన్న కాలంలో ప్రొటెస్టెంట్, కాథలిక్ మతాలకు సంబంధించిన పుస్తకాలు ప్రచురించారు. ఇదే కాలంలో మొదటి సారిగా దేశభక్తి కవిత్వ ధోరణులు కనబడ్డాయి. 4. 1768 నుంచి 1830 వరకు సాగిన యుగం లో స్లోవీవ్ భాషను సాహిత్యానికి అనువైనట్లుగా తీర్చిదిద్దారు. ఈ కాలంలోనే లౌకి[illegible]షయాలమీద కూడా కవిత్వం వెలువడింది. 5. 1830 నుంచి నేటివరకు. యూరప్‌లో వ్యాపించిన కాల్పనికోద్యమాన్ని స్లోవీన్‌లో తగిన మార్పులతో అనుసరించారు. ఫ్రాన్స్ ప్రెషెరెన్ తన కవిత్వంతో ప్రజలను ఉత్తేజపరిచాడు. రెండవ దశలో వాస్తవికత, సహజత్వం (naturalism) వాడుక లోకి వచ్చాయి. ఈ విధమైన రచనలు చేసిన వారిలో మార్కోవిచ్, ఫ్రాన్ లెవ్ స్టిక్‌లు అగ్రగణ్యులు. మూడవ దశలో ఆధునికత, ప్రతీకావాదం ప్రత్యేకమైన విషయాలు. నాల్గవ దశలో అతిశయోక్తివాదం (Expressionism) తల ఎత్తింది. అయిదవ దశలో సాంఘిక విమర్శకు, సామాజిక వాస్తవికతకు ప్రాధాన్యం కనిపిస్తుంది. ఆరవ దశలో ఆధునిక స్లోవీన్ సాహిత్యం మిగతా యుగోశ్లావ్, యూరపియన్ సాహిత్యాలతో సరిసమానమైన ప్రతిపత్తిని సంతరించుకుంది. ఈ సాహిత్యంలో గేయరచన, జానపద గేయాలు, మహా కావ్యాలు చెప్పుకోదగినవి. ఐవన్ ప్రియుటె, ఫ్రాంక్ క్రిడిచ్‌లు గొప్ప సాహిత్య విమర్శకులుగా పేరు పొందారు. ఐవన్ కంకర్

నవలలు, నాటకాలు వ్రాశాడు. స్లోవీన్ సాహిత్యానికి ప్రారంభ దశలో ఆ నాడు ఆ ప్రాంతాన్ని పాలిస్తున్న జర్మన్‌ల వలన ఎన్నో అడ్డంకులు ఏర్పడ్డాయి. 16 వ శతాబ్దం నుంచి క్రమంగా ఈ సాహిత్యం వృద్ధి చెందింది.

**మాసిడోనియన్ సాహిత్యం :** 9 వ శతాబ్దం నుంచి 19 వ శతాబ్దం వరకు స్లోవోనిక్ భాషలో మాసిడోనియన్ సాహిత్యం వెలువడింది. దీనిని మాసిడోనియన్‌లే కాక బల్గేరియన్‌లు కూడా తమ జాతీయ సంపదగా భావిస్తారు. ఈ భాషలో ప్రిలెప్-బ్రిటోలా మాండలికాన్ని సాహిత్య భాషగా గుర్తించారు. రెండవ ప్రపంచ యుద్ధానికి ముందు, దాని తరువాత ఈ భాషలో వచ్చిన ఇద్దరు ప్రముఖ కవులు: కోచోరాసిన్, కోలెనెడెల్ కొవాస్కి. వీరిలో మొదటి వాడు యుగోశ్లావియాకు, రెండవవాడు బల్గేరియాకు చెందినవారు. 1944 లో మాసిడోనియాలో దీనిని అధికార భాషగా గుర్తించారు. అప్పటినుంచి చైతన్య వంతమైన, ఆకర్షకమైన సాహిత్యం ఈ భాషలో రచింపబడుతూంది. కవిత్వంలో ముఖ్యంగా విశేషమైన కృషి జరిగింది. బ్లేజ్ కొనెస్కీ గొప్ప కవి. శ్లావ్కో యానెవ్‌స్కి, ఆకోషాపోవ్ లు గేయకవులు. నవలా రచయితలలో బ్లాడో మలెస్కీ, కోలె చెషూలే, ఐవోన్ బోస్కోవ్‌స్కీ, డిమిట్రీ సొలెవ్‌లు ముఖ్యులు.

యుగోశ్లావ్ సాహిత్యాన్ని సింహావలోకనం చేసినపుడు మనకు గోచరించేది దానిలోని విశిష్టమైన జానపద కవిత్వం. శతాబ్దాల తరబడి తురుష్కుల పాలనలోను, జర్మన్‌ల పాలనలోను ఉన్న ఈ దేశపు వివిధ ప్రాంతాలలో భాషా సాహిత్యాల అభివృద్ధి స్తంభించిపోయింది. అందుచేత ఆ రోజుల్లో మౌఖికంగా ప్రచారం అవుతూ వచ్చిన జానపద కవిత్వమే యుగోశ్లావ్ జాతు లన్నిటినీ ఉద్వేగపరిచింది. జానపద కవిత్వం వారి దైనందిన జీవితంలో చాలా కాలంనుంచి ముఖ్యభాగం అయింది. పర పాలనలో సాహిత్యాన్ని గ్రంథస్థం చేసే సదుపాయాలు లేనందువల్ల జానపద కవిత్వమే సజీవమైన సాహిత్యంగా రాణించింది. జానపద గేయాలు యుగోశ్లావియా లోని అన్ని జాతుల వారిలోను కనిపిస్తాయి. సెర్బ్‌ల, క్రోవష్‌ల సాహిత్యాలలో జానపద మహాకావ్యాలు ఉన్నాయి. సెర్బియాలో ఎక్కువ ప్రచారంలో ఉన్న ఒక జానపద మహా కావ్యంలో 14 వ శతాబ్దంలో జరిగిన కొసోవా యుద్ధం వర్ణించబడింది. ఉన్నత ఆదర్శాల కోసం ఆత్మత్యాగం చేయవలసిన అవశ్యకత, నైతిక వర్తన, పశుబలం మీద చివరికి ధర్మం విజయం సాధించడం ఈ కావ్యంలో ముచ్చటించబడ్డాయి. జానపద సాహిత్యం గానయోగ్యం కావడం వలన తర తరాలుగా సజీవంగా నిలచి ఉంది. వాటిని గానంచేసే పద్ధతి యుగోశ్లావియా జాతీయ శీలాన్ని మలిచింది. దానివలన శౌర్య సంప్రదాయం ఏర్పడింది. ఈ బాణీలో ఎన్నో కావ్యాలు వచ్చాయి. అంధుడైన ఫిలిప్ విష్ణహిక్ ఇలాంటి కావ్యాలు వ్రాసిన వారిలో ముఖ్యమైనవాడు.

యుగోశ్లావియాలో కాల్పనికోద్యమం ప్రబలినపుడు జానపద సాహిత్యం మరింత ప్రాముఖ్యం పొందింది. సెర్బో-క్రోవోషియన్ సాహిత్య భాషను తీర్చి దిద్దిన కారజిక్ (19 వ శతాబ్దం) సెర్బ్‌జాతికి సంబంధించిన జానపద గీతాలు, గాథలు, సామెతలు సేకరించి 4 సంపుటాలుగా ప్రకటించాడు. వీటి ప్రభావం విశిష్టమైంది. అనేక ఇతర యూరపియన్ భాషలలోకి వీటిని అనువదించారు. గెటే వంటి సుప్రసిద్ధ కవుల ప్రశంసలను కూడా ఇవి పొందాయి. పర పాలనలో పీడించబడుతున్న సమయంలో యుగోశ్లావ్ జాతిని ఉత్తేజ పరచడానికి, ఆ జాతి సాహిత్యాన్నీ, సంస్కృతినీ, చరిత్రనూ సజీవంగా నిలిపి ఉంచడానికి ఈ జానపద సాహిత్యమే తోడ్పడింది. అందువల్లనే ఇది యుగోశ్లావ్ సాహిత్యానికి గొప్ప గర్వకారణం.

ఇ.నా.

## యూక్రేనియన్ భాష - సాహిత్యం

**భాష :** ఇటీవలి వరకూ 'యూక్రేనియన్ సోవియట్ సోషలిస్ట్ రిపబ్లిక్' అనబడుతూ వచ్చిన యూక్రేన్‌దేశం పూర్వపు సోవియట్ రష్యాలో నైరృతి దిశలో ఉంది. దీనికి దక్షిణాన రుమేనియా, నైరృతిదిశను హంగరీ, పశ్చిమాన జెకోస్లోవేకియా, పోలండ్‌లూ, ఉత్తరాన, తూర్పున మిగిలిన పూర్వపు సోవియట్ యూనియన్ భాగాలూ ఉన్నాయి.

యూక్రేనియన్ భాషనే రుథేనియన్ భాష అని కూడా అంటారు. ఇది ఒక తూర్పు స్లోవిక్ భాషగా యూక్రేన్‌లోను, సోవియట్‌యూనియన్‌లోని కొన్ని కమ్యూనిటీలలోను, పోలండ్, జెకోస్లోవేకియాలలో కొన్ని భాగాలలోను వ్యవహరించబడుతూంది. రష్యన్, బైలో రష్యన్ భాషలతో ఈ భాషకు చాలా దగ్గర సంబంధం ఉంది. నిజానికి 12 వ, 13 వ శతాబ్దాల వరకు ఈ యూక్రేనియన్ భాష వాటినుండి వేరుపడి స్వతంత్ర భాషగా రూపొందలేదు. ఈ భాషను వ్రాయడానికి సిరిలిక్ వర్ణమాల ఉపయోగించ బడుతూంది.

13 వ శతాబ్దంలో కీవన్ రూస్ పతనానంతరం యూక్రేనియన్ ఒక విస్పష్టమైన మాండలిక భాషగా ఏర్పడింది. అయితే 18 వ శతాబ్ది అంతానికి కానీ ఆధునిక యూక్రేనియన్ సాహిత్య భాష ఆవిర్భవించ లేదు. ఈ భాషలో పోలిష్ భాషనుంచి ఎరువు తెచ్చుకున్న పదాలు ఎక్కువగా ఉన్నాయి. కాని చర్చ్ స్లోవానిక్‌భాష నుంచి రష్యన్ భాష గ్రహించిన పదజాలం కంటె చాలా తక్కువ పదజాలాన్నే యూక్రేనియన్ భాష గ్రహించింది.

**సాహిత్యం :** యూక్రేనియన్ భాషలో కనిపించే అత్యంత ప్రాచీన రచనలు కీవన్ రూస్ రచనలు. ఇవి 11 వ, 13 వ శతాబ్దాల మధ్య కాలానికి చెందినవి. వీటిని రష్యన్‌లు, బైలోరష్యన్‌లు కూడా తమ ప్రాచీన సాహిత్య సంపదగా భావిస్తారు. 13 వ శతాబ్దంలో జరిగిన మంగోలుల దండయాత్రకు ఫలితంగా క్షీణించిన యూక్రేనియన్ సాహిత్యం 16 వ శతాబ్దిలో కాని తిరిగి పునరుజ్జీవితం కాలేదు. 19 వ శతాబ్దం ప్రారంభం నుంచి సాహిత్య భాషగా ఈ భాష రూపొంది విస్తృతమైన గ్రంథరచన కొనసాగింది.

19 వ శతాబ్దంలోని యూక్రేనియన్ సాహిత్యం యూక్రేనియన్‌లలో జాతీయ చైతన్యం ఎంత శీఘ్రంగా అభివృద్ధి చెందిందో సూచిస్తూంది. ఆరంభంలో యూక్రేనియన్ రచయితల దృష్టి తమ ప్రజలలో జాతీయ చైతన్యాన్ని రేకెత్తించడానికి, వారిలో ఒక అవ్యాహత, చారిత్రక భావన కలిగించడానికి పూనుకుంది. 19 వ శతాబ్దంలోని యూక్రేనియన్ సాహిత్యం అంతా అధికారికంగానూ, అనాధికారికంగానూ కూడా రష్యన్‌ల వైముఖ్యానికి గురి అయింది. 1863 లోను, 1871 లోను యూక్రేనియన్ గ్రంథా లన్నీ నిషేధించబడ్డాయి. 1905 వరకు రష్యన్ సైన్స్ అకాడమీ యూక్రేనియన్ భాషను ఒక ప్రత్యేక భాషగానే గుర్తించలేదు.

వర్జిల్ రచించిన *ఈనిడ్* అనే కృతికి వికృతానుసరణ అయిన *ఈనిడా* (1798) అనే రచన చేసిన ఇవాన్ కోట్‌ల్యారెవ్‌స్కీ ఆధునిక యూక్రేనియన్ సాహిత్యానికి పితామహుని వంటివాడు. తరువాతి యూక్రేనియన్ రచయితలమీద ఆయన రచించిన కృతి ప్రభావం అమితంగా (ఒక్కొక్కప్పుడు అవాంఛనీయంగా కూడా) కనిపిస్తుంది. ప్రామాణికమైన గద్యసాహిత్యం మాత్రం హ్రిహ హోరీ క్విట్‌కా ఓస్నోవ్యానెన్కో వ్రాసిన *మరుస్యా* (1834) అనే నవలతోనే ప్రారంభం అయింది. అతని మరొక నవలిక *కోనోటోప్‌స్కా విద్మా* (1837) గోగోల్ నవలలను గుర్తుతెచ్చే ఉత్తమ నవలిక.

1830 ప్రాంతంలో యూక్రేనియన్ కాల్పని కోద్యమానికి ఖార్కోవ్ నగరం కేంద్రం అయింది. ఈ ఉద్యమంలో ఇజ్మాయిల్ స్రెస్ నెవ్‌స్కీ, లెవ్‌కో బోరో వికోవ్‌స్కీ, ఏ. మెట్లిన్‌స్కీ, మైకోలా కోస్టోమరోవ్‌లు ప్రముఖులు. పశ్చిమ యూక్రేన్‌లో కాల్పనికోద్యమానికి 'రుతేనియన్ త్రయం' అనబడే ముగ్గురు రచయితలను ప్రధాన ప్రతినిధులుగా పేర్కొనాలి. వారు: మార్కియన్ షాన్‌విచ్, యాకోవ్ హోలోవట్‌స్కీ, ఇవాన్‌వాహిల్ విచ్. కీవ్‌నగరంలోని రొమాంటిక్ కవుల రచనలలో కాల్పనికోద్యమం ఉచ్చస్థాయి నందుకొన్నది. కాస్టోమరోవ్ వ్రాసిన *బుక్స్ ఆవ్ జెనెసిస్ ఆవ్ ది యూక్రేనియన్ పీపుల్* అనే రచన వారి సిద్ధాంతాన్ని ప్రతిఫలిస్తూంది.

19 వ శతాబ్దికి చెందిన తారాస్‌షెవ్ చెంకో ఆ నాటి కాల్పనిక కవులలో విశిష్టుడు. అతడు తొలి దినాలలో వ్రాసిన కవిత్వం కాల్పనిక భావాలను వ్యక్తీకరించినా, అనంతరం అది యూక్రేనియన్ చరిత్రను గంభీరంగా ప్రకటించ సాగింది. ముఖ్యంగా అతని సుదీర్ఘ కావ్యం *హైడామాకీ* (1841) ఇందుకు చక్కని ఉదాహరణ. అనంతరం అతడు రష్యా యూక్రేన్‌ను అణచివేయడానికి సంబంధించిన ఇతివృత్తాలను తీసుకుని అనేక వ్యంగ్య రచనలు చేశాడు. ఉదా. *సోన్* (స్వప్నం), *కావ్కజ్* (కకాసస్), *పోస్లానీ* మొదలైనవి. ప్రవాసం నుంచి 1857 లో విముక్తిపొందిన తరువాత అతడు రచించిన కవిత విశాలతరమైన ఇతి వృత్తాలను గ్రహించింది. షెవ్ చెంకో తరువాత కాల్పనిక రచయితలలో ముఖ్యుడు కవి, గద్యరచయిత, అనువాదకుడు, చరిత్రకారుడు అయిన పంటెలిమాన్ కులిష్. *చోర్నాడా* అతని ప్రసిద్ధ గద్య కృతి.

యూక్రేనియన్ సాహిత్యంలో వాస్తవికతావాదం మార్కోవోవ్ చోక్ వ్రాసిన రోద్నివో పోవిడన్నియా (1857) తో ప్రారంభం అయింది. ఇతడు చాలా కాలం గ్రామీణ జీవన చిత్రణ చేసే చౌకబారు ప్రజాదరణ రచనలతో గడిపాడు. ఆనతోలి స్విడ్‌నిట్‌స్కీ వ్రాసిన *ల్యుబోరోట్‌స్కీ* అనే రచన శిల్పానికి గొప్ప ఉదాహరణ. కాని 1862 లోనే దానిని రచించినా, 1898 వరకు అది ప్రచురింపబడక పోవడం వలన యూక్రేనియన్ వాస్తవికతా వాదం మీద ఎలాంటి ప్రభావాన్నీ ఆ గ్రంథం చూపించలేకపోయింది. ఇవాన్ నెచూయ్ లెవ్‌స్కీ సాహిత్యరంగం విస్తృతమైంది, ఇతివృత్త వైవిధ్యంకలది.

*కైదాషే వాసిజ్జా* (1879) లో గ్రామీణ జీవనం చిత్రింప బడగా, *ఖ్మారి* (1908) లో యూక్రేనియన్ మేధావి వర్గం వర్ణించబడింది. ఏనాస్ మిర్నీ యూక్రేనియన్ వాస్తవికతా వాదానికి ప్రధాన ప్రతినిధి. తన సోదరుడైన ఇవాన్ రుడ్‌చెంకోతో కలిసి అతడు రచించిన *ఖిబా రెవట్‌ఓలి యాక్‌యస్లపోవ్ని* (1880) అనే కృతిలో అతడు చిత్రించిన సాంఘిక అన్యాయం, సంఘనిరసన భావాలూ, అలాగే *పొవియా* (The whore) లో అతడు చిత్రించిన భావాలూ, మనోవైజ్ఞానిక రచనలో క్రొత్తసొగసులు సాధించాయి. మహా ప్రతిభావంతుడైన ఇవాన్ ఫ్రాంకో అనే రచయిత గలీషియాలోని బోరి స్లోవ్ నూనె పరిశ్రమలను వర్ణిస్తూ వ్రాసిన నవలలు ఫ్రెంచ్ నవలా రచయిత ఎమిలీ జోలా పద్ధతిలో అత్యంత సహజంగా మనోహర మైన శైలిలో సాగాయి. ఫ్రాంకో రచించిన మై సే, పాన్‌స్కోర్యుర్తీ, ఇవాన్ విషెన్‌స్కీ అనే దీర్ఘకవితలలో అతని కవితాశక్తి పరాకోటి నందుకున్నది.

ఆ శతాబ్దం చివర లెస్యా యూక్రేనియిన్, మైఖే యలో కోట్సియూబిన్‌స్కీ, వాసిల్ స్టెఫానిస్కీల వంటి ప్రసిద్ధ కాల్పనిక కవు లెందరో ఆవిర్భవించారు.

20 వ శతాబ్దం మొదటి మూడు దశాబ్దాలు యూక్రే నియన్ సాహిత్య చరిత్రలో పునరుజ్జీవన యుగం. త్వర త్వరగా రంగులు మారుస్తూ తరచు ఒక దానితో ఒకటి పోటీ పడుతూ అనేక సాహిత్యోద్యమాలు ఒకదాని వెంట ఒకటి యూక్రేనియన్ సాహిత్యంలో వచ్చాయి. వోలోడి మిర్, విన్నిచెంకో రచనల ప్రధాన లక్షణం క్షీణదశ లోని వాస్తవికతా వాదం. పావ్‌లోటిచీనా ప్రతీకవాద కవులలో అగ్రేసరుడు. ఆ వాదానికి చెందిన మరి ముగ్గురు కవులు: డీ. జహూల్, పి. టెరెష్ చెంకో, ఓ. స్లిసరెంకోలు. నవ్య సంప్రదాయవాదం (Neo classicism) లో వచ్చిన ప్రముఖకవులు: మైకోలాజెరోవ్, మాక్సిమ్ రిల్‌స్కీ, మిఖాయిలో డ్రైఖ్మారా. భవిష్యద్వాదానికి (futurism) చెందిన కవులు: ఎమ్. సెమెన్‌కో, మైకోలా బజాం గ్‌లు. ఈ రెండవ కవి 20 వ శతాబ్దంలో వెలసిన యూక్రేనియన్ మహాకవిగా ప్రసిద్ధి పొందాడు.

రష్యా విప్లవం అనంతరం 1917-1932 వరకు సాగిన సాపేక్ష స్వాతంత్ర్య యుగంలో చాలామంది ప్రతిభా వంతులైన కవులు ఉద్భవించారు. మైకోలాఖ్విలోవీ చేసిన గద్యరచనలలో విప్లవాత్మక జాతీయ కాల్పనిక లక్షణాలు కనిపిస్తాయి. హ్రిహోరీ కోసింకా వచన రచనలు అతి శయోక్తి వాదానికి (Impressionism) చెందినవి. వై. యానోవ్‌స్కీ వ్రాసిన కథలు, నవలలు నిస్సంకోచంగా కాల్పనిక వాదానికి చెందినవి. వి. పిడ్‌మోహిల్నీ వాస్తవి కతావాద సిద్ధాంతాలకు కట్టుబడిన రచయిత. ఇతర ప్రముఖ రచయితలలో చెప్పుకోదగినవారు నవలారచయిత, చలనచిత్రనిర్మాత అలెక్సాండర్ డోవ్‌డెన్‌కో, నవలా రచ యితలు బోరిస్, ఆంటోనెన్‌కో డబిదోవిచ్, ఓలోడిమెర్ జైట్‌స్కీ, మిఖాయిలో ఇవ్‌చెన్‌కో, వోలెస్‌డాస్‌విట్నీలు, కవి అయిన మైక్‌యోహన్ సేన్, హాస్యరచయిత ఓస్టాప్ వైష్ణియాలు. మైకోలా కులిష్ ప్రఖ్యాత నాటకకర్త.

1932 లో సోషలిస్ట్ వాస్తవికతను ఆదరణీయ సాహి త్యశైలిగా కమ్యూనిస్ట్ పార్టీ విధించింది. ఈ ప్రభుత్వ విధేయ రచయితలకు చక్కని ఉదాహరణలు ఓలెక్జాండర్ హోర్నీచుప్ అనే నాటకకర్త, మిఖాయిలో స్టెల్‌మార్క్ అనే నవలా రచయిత.

స్టాలిన్ తరువాతి యుగంలో వచ్చిన క్రొత్త తరం రచయితలు సోషలిస్ట్ వాస్తవికతతో కూడిన నీరస రచనలు చేయడానికి నిరాకరించారు. '7వ దశాబ్ది రచ యితలలో' చెప్పుకోవలసినవారు లినాకోస్టెన్‌కో, వాసిల్ సిమోనెన్‌కో, వి. కోరోటిచ్ ఇవాన్‌డ్రాచ్, ఎమ్. విన్ హ్రానోవ్‌స్కీ, వి. హోలోబోరోరాడ్కో, ఎల్. కాలెనెట్స్. తరువాతి దశాబ్ది (1971-80) లో సాగిన ప్రభుత్వ దమన విధానం వల్ల చాలామంది రచయితల గొంతులు మూగపోవడమో, లేక సాంఘిక వాస్తవికతా వాదాన్ని గానం చేయడానికి సిద్ధపడడమో జరిగింది.

జె.సూ.ప్ర.

## రష్యన్ భాష - సాహిత్యం

భాష : ఇటీవలి వరకూ 'యు.ఎస్.ఎస్.ఆర్' (యూని యన్ ఆఫ్ సోవియెట్ సోషలిస్ట్ రిపబ్లిక్స్) అనే పేరుతో సుప్రసిద్ధమైన ఒక అగ్ర ప్రపంచ రాజ్యంలోని రష్యా అన బడే ప్రధానమైన రాష్ట్రంలో ప్రధానభాషగాను, మొత్తం 'యు.ఎస్.ఎస్.ఆర్' అంతటా సాంస్కృతిక భాషగానూ రష్యన్ భాష ప్రచారంలో ఉంది. ఈ భాష ఇండో యూరపియన్ భాషా కుటుంబానికి చెందిన ఒక తూర్పు శ్లావిక్ భాష. 'యు.ఎస్.ఎస్.ఆర్' లోని రష్యేతర రాష్ట్రాలలో కూడ అది రెండవ భాషగా వాడుకలో ఉంది. తూర్పు యూరప్‌లో సోవియెట్‌ల ప్రభావం క్రింద ఉన్న దేశాలలో ముఖ్యంగా స్థానిక భాషలు శ్లావిక్ భాషలై ఉన్న రాష్ట్రాలలో కూడా విరివిగా రష్యన్ భాష బోధింపబడుతూంది.

రష్యన్ భాషలోని మాండలికాలను ప్రధానంగా మూడు వర్గాలుగా గుర్తించారు: ఉత్తర మాండలికాలు, దక్షిణ మాండ లికాలు, మధ్యస్థ మాండలికాలు అని. ఉత్తర మాండలికాలు లెనిన్ గ్రాడ్ మొదలు సైబీరియా వరకూ వ్యాపించి

ఉన్నాయి. దక్షిణ మాండలికాలు మధ్య రష్యాలో ఎక్కువ భాగంలోనూ, దక్షిణ రష్యాలోనూ వ్యవహారంలో



రష్యా

ఉన్నాయి. మధ్యస్థ మాండలికాలు ఉత్తర, దక్షిణ మాండలికాలకు మధ్యభాగంలో వాడుకలో ఉన్నాయి. ఆధునిక రష్యన్ సాహిత్య భాష మాస్కో మాండలికాన్ని ఆధారంగా చేసికొని ఏర్పాటు చేయబడింది. మాస్కో నగరం ఆదిలో ఉత్తరమాండలిక భాషలను మాట్లాడే ప్రాంతంలో ఉండేది. కాని ఉత్తర, దక్షిణ మాండలికాల అన్యోన్య ప్రభావం వల్ల ఒక క్రొత్త మధ్యస్థ మాండలికం భాషా వర్గం ఏర్పడగా, మాస్కోనగరం ఆ మధ్యస్థమాండలిక ప్రాంతంలో అంతర్భాగం అయింది. ఈ మాదలికంలోని హల్లుల పద్ధతి ఉత్తర మాండలికాలను అచ్చుల పద్ధతి దక్షిణ మాండలికాలను పోలి ఉంటుంది.

రష్యన్ భాష గాని, యుక్రేనియన్, బెలో రష్యన్ వంటి ఇతర తూర్పు శ్లావిక్ భాషలు గాని 13 వ, 16 వ శతాబ్దాల మధ్యకాలంలో శతాబ్ది వేరు వేరుగా గుర్తించడానికి వీలైన విశిష్ట లక్షణాలతో కూడి ఉండేవి కావు. అంతకుముందు ఉమ్మడిగా వాడుకలో ఉన్న తూర్పు శ్లావిక్ భాషనే ప్రాచీన రష్యన్ భాష అని నేడు వ్యవహరిస్తున్నారు.

రష్యన్ భాష మీద క్రైస్తవ చర్చ్ ఉపయోగించే శ్లావానిక్ భాష ప్రభావం చాలా బలంగా కనిపిస్తుంది. 18 వ శతాబ్దినుంచీ, అనగా మొదటి పీటర్ ది గ్రేట్ జార్ పరిపాలిస్తున్న కాలం నుంచీ పాశ్చాత్యీకరణ ఆరంభమైన తరువాత పశ్చిమ యూరప్ భాషల ప్రభావం రష్యన్ భాష మీద ఎక్కువగా పడింది. ఆ భాషల నుంచి అనేక పదాలను రష్యన్ భాష స్వీకరించింది. 19 వ శతాబ్దం నాటి కవి అలెక్సాండర్ పుష్కిన్ రచనల ప్రభావం రష్యన్ భాష తాలూకు అనంతర పరిణామం మీద విస్తృతంగా కనిపిస్తుంది. వ్యావహారిక శైలినీ, చర్చ్ శ్లావోనిక్ శైలులనూ కలగలుపు చేసి రూపొందించుకొన్న విలక్షణమైన ఆయన శైలి సాహిత్య ప్రయోజనాలకు ఏ శైలి ప్రశస్తమైనది అనే వివాదానికి భరతవాక్యం పలికింది.

ఆధునిక రష్యన్ భాషలో ఆరు విభక్తులను (ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థీ, షష్ఠీ, సప్తమీ) వాడుతున్నారు. ఏకవచన, బహువచనాలలోనూ, విశేషణాలలోనూ కూడా ఈ విభక్తులు కనిపిస్తాయి. క్రియలలో సమాపక క్రియలు, అసమాపక క్రియలు ఉన్నాయి. రష్యన్ భాషా ధ్వనులలో ఊష్మ హల్లులూ, సంయుక్తాక్షరాలూ, తాలవ్యీకృతమైన హల్లులూ ఎక్కువ. నాలుక కొసను కఠిన తాలువు వైపు కదుపుతూ ఉచ్చరించే హల్లులను తాలవ్యీకృతమైన హల్లులు అంటారు. వాటి ఉచ్చారణలో చివర ఒక 'య్' వినిపిస్తుంది. తరచు వీటిని సరళ హల్లులు అని కూడా అంటారు. ప్రాచీన శ్లావిక్ భాష అవశేషాలు అయిన 'ఇ', 'ఉ' అనే స్వరాలు రష్యన్ భాషలో దుర్బల పరిసరాలలో లోపిస్తాయి.

**సాహిత్యం :** 10 వ శతాబ్ది చివరి భాగంలో 'కీవన్ రూస్' లో క్రైస్తవ మత ప్రవేశంతో రష్యన్ భాషలో తొలి లిఖిత గ్రంథాలు ఆరంభం అయాయి. ప్రాచీన రష్యన్, లేదా కీవన్ యుగంలో వెలువడిన మొదటి ప్రముఖ గ్రంథం బిషప్ ఇలారియన్ రచించిన 'డిస్కోర్స్ ఆన్ లా అండ్ గ్రేస్' ( 'నియమము-అనుగ్రహము-ఒక వ్యాసము' 11 వ శతాబ్ది మధ్య భాగం). కొంత వరకూ మతసంబంధమైన వాసన ఉన్నా మొట్ట మొదటి లౌకిక గ్రంథం అని పేర్కొనదగిన రచన వ్లాడిమిర్ మొనోమాఖ్ రాకుమారుడు రచించిన *ఇన్‌స్ట్రక్షన్* (ప్రబోధం 1117).

మధ్య యుగ రష్యన్ సాహిత్యంలో వెలసిన మొట్ట మొదటి ప్రముఖ రచన *ది లే ఆఫ్ ఇగోర్స్ హోస్ట్* (1185-87; 'ఇగోర్ ఉద్యమగీతం'). ఈ గ్రంథం 18 వ శతాబ్ది చివర వెలుగులోకి రావడం వలనో, 12 వ శతాబ్ది నుంచి దీనితో సరిపోల్చదగిన శక్తిమంతమైన రచన మరియొకటి లభించక పోవడం వలననో ఈ గ్రంథ ప్రామాణికతను గూర్చి విద్వాంసులలో అనేక వాదోపవాదాలు చెలరేగాయి. 13 వ శతాబ్ది మధ్య భాగంలో మంగోలుల దండయాత్రలో 'కీవన్ రూస్' పరాజితమైంది. 15 వ, 16 వ శతాబ్దాలలో మాస్కో తిరిగి తల ఎత్తే వరకూ రష్యన్ జాతీయ సాహిత్య

పునరుద్ధరణ సూచనలు కనిపించలేదు. ఈ కాలంలో వెలువడిన సాహిత్యంలో చాలా భాగం విద్వాంసులకూ, ముఖ్యంగా చరిత్ర రచయితలకూ మాత్రమే ఆసక్తి కలిగించేది. నిజమైన మానవత్వపు విలువలతో వెలువడిన మొదటి ప్రముఖ సాహిత్య గ్రంథం 17 వ శతాబ్దం చివర ఆర్చ్ ప్రీస్ట్ అవ్వాకుం పెట్రోవిచ్ రచించిన స్వీయ చరిత్ర. అనంతరం ఒక శతాబ్దం తరువాత గాని మైఖేల్ లోమ నోసోవ్, గ్రవిలడెర్జావిన్‌లు రచించిన ఓడ్ పద్యాలతోనూ, అలెక్సాండర్ రాడిష్ చేవ్, నికొలాయ్ కరంజిన్‌లు వచనంలో వ్రాసిన వృత్తాంత గ్రంథాల తోనూ గాని నిజమైన దేశీయ సాహిత్యం వెలువడడం జరుగలేదు. నికొలాయ్ కరంజిన్ రచించిన ఆవేశపూరితమైన కథ *పూర్‌లిసా* (1792) విశేష ప్రసిద్ధి పొందింది.

రష్యాలో సెన్సార్ షిప్, ప్రభుత్వ దమన నీతి ఎక్కువగా ఉన్నప్పటికీ 19 వ శతాబ్దంలో రష్యన్ భాషలో ప్రపంచం దృష్టిని ఆకర్షించగల ప్రశస్తమైన సాహిత్యం వెలువడింది. రష్యన్ సాహిత్య చరిత్రలోని ఈ స్వర్ణయుగం అలెక్సాండర్ పుష్కిన్ రచనలతో ఆరంభం అయింది. పుష్కిన్ రచించిన *యెవ్‌జెనీ ఓనేజిన్* (1833) అనే పద్యరూపంలో వ్రాసిన నవలలో ఆయన బహుముఖమైన ప్రజ్ఞ, మధురమైన శబ్దసంయోజన, సరళత, మౌలికత వ్యక్తం అవుతాయి. ఇక ఆయన రచించిన భావ గీతాలు సాటిలేనివి; శాశ్వతంగా నిలువజాలినవి. ఆయన రచనలు అటు తరువాతి రష్యన్ సాహిత్య పరిణామాలకు అద్భుతమైన ఉత్తేజం కలిగించాయి. అయితే ఆయన వచన రచనలు మాత్రం ఆయనకు కొద్దిగా అర్వాచీనుడైన మైఖేల్ లెర్మాంటోవ్ రచించిన *ఏ హీరో ఆఫ్ అవర్ టైమ్'* ('మన సమకాలీన వీరుడు; 1839-40') అనే గ్రంథం చూపించినంత ప్రభావం అనంతర రచయితల మీద ప్రసరించలేక పోయాయి. 1840 తరువాత వచన రచనే - అందులోనూ ముఖ్యంగా నవలే సర్వసాధారణమైన భావ ప్రకటన మాధ్యమం అయింది. మొట్టమొదటి ప్రముఖ వచన రచయిత నికొలాయ్ గొగోల్ అద్భుతమైన హాస్యంతో కవిత్వం వంటి వచనం వ్రాసే ఒడుపు ప్రదర్శిస్తూ *ది గవర్నమెంట్ ఇన్‌స్పెక్టర్* (1836) అనే హాస్య రంగస్థల రూపకం, *డెడ్ సోల్స్* (మరణించిన ఆత్మలు; 1842) అనే నవల వంటి ఉద్గ్రంథాలను ఆయన రచించాడు. మొట్టమొదటి ప్రముఖ నవలా రచయిత ఇవాన్ తుర్జినేవ్, *స్పోర్ట్స్ మెన్స్ స్కెచెస్* (1852) అనే నవలతో ఆయన ప్రసిద్ధిలోకి వచ్చాడు. ఆ నవలలో ఆయన 'సెర్ఫ్'ల (బానిసల) స్థితిగతులను చక్కగా చిత్రించాడు. అయితే ఈనాడు ఆయన కీర్తికి ప్రధానమైన ఆలంబనాలు 'బుద్ధిజీవుల' ఆవిర్భావాన్ని చిత్రించిన ఆయన చిన్న నవలలు. అవి: 1. *రూడిన్*, (1856); *ఆన్ ది ఈవ్* (1860); *ఫాదర్స్ అండ్ సన్స్* (1862). ఫియడోర్ డోస్టొయేవ్‌స్కీ, లియో టాల్‌స్టాయ్‌లు ఈనాడు ప్రథమ శ్రేణికి చెందిన రష్యన్ నవలా రచయితలుగా గుర్తింపు పొందారు. డాస్టొయేవ్‌స్కీ 1840-50 లలోనే రచన ప్రారంభించినా, సైబీరియాలో ఆయన ప్రవాస జీవితం వల్ల ఆయన రచనా జీవితం కొంత ఆలస్యంగా ప్రారంభమైంది. 1860-70 దశాబ్దం చివర గాని ఆయన మనస్తత్వ విచారణ పూర్వకమైన ప్రముఖ నవలలు *క్రైమ్ అండ్ పనిష్‌మెంట్* (నేరము-శిక్ష-1866), *ది ఇడియెట్* (మూర్ఖుడు, 1868-69), *ది డెవిల్స్* (దయ్యాలు, 1871-72), ఆయన అసంపూర్ణ రచన *ది బ్రదర్స్ కారమజోవ్* (1879-80) లు వెలువడటం జరుగలేదు. నవలా రచయితగా టాల్‌స్టాయ్ ప్రశస్తికి ప్రధాన ప్రాతిపదిక అయిన రచనలు: *వార్ అండ్ పీస్* (యుద్ధము-శాంతి, 1865-69), నెపోలియన్ రష్యా మీద చేసిన దండయాత్రను వర్ణించే ఒక చారిత్రక నవల, తీవ్రోద్వేగాన్నీ, ఆత్మహత్యనూ చిత్రించిన *అన్నా కారెనినా* (1875-77). రష్యన్ నవలా రచయితలలో గణనీయులైన ఇతరులు: ఇవాన్ గోంచెరోవ్, మైఖేల్ సాల్టికోవ్‌లు. 19 వ శతాబ్దం చివర ఆంటన్ చెకోవ్ హాస్య కరుణ రసాల సమ్మేళనంతో రచించిన చిన్న కథలు జీవిత నిరర్థకత్వాన్ని చాటాయి. మాక్జిమ్ గోర్కీ కార్మిక వర్గం పట్ల సానుభూతి గల రచయిత. విప్లవాత్మక పరిణామాలు కావాలని చాటి, ఆయన కమ్యూనిస్టులకు అభిమాన రచయిత అయాడు.

20 వ శతాబ్దం రష్యన్ కవిత్వం నూతన పునరుజ్జీవనంతో ఆరంభం అయింది. అలెక్సాండర్ బ్లాక్ గొప్ప కవిగా రాణించాడు. 1917 విప్లవం అనంతరం ఎక్కువ కాలం నిలువకపోయినా ఒక శక్తిమంతమైన సాహిత్య శకం ఆరంభం అయింది. వ్లాదిమీర్ మైకోవ్ స్కీ కావ్యాలూ, ఓసిప్ మాండెల్ స్టామ్, బోరిస్ పాస్టర్ నాక్‌ల రచనలు ఈ కాలంలో ముఖ్యంగా చెప్పుకోదగినవి. పాస్టర్ నాక్ *డ్యాక్టర్ జివాగో* (1957) అనే నవలను రచించి పాశ్చాత్య దేశాలలో విశేష ప్రశస్తి పొందాడు. ఈ కాలంలో వచన రచన కూడా పరిపుష్టమైంది. కాని ప్రభుత్వం 1932 లో రష్యన్ సాహిత్యంలో సోషలిస్ట్ రియలిజమ్ ప్రతిఫలించాలని శాసించడంతో రచనలలో

పటుత్వం దిగజార సాగింది. ఈ కాలంలో చెప్ప కోదగిన కొద్ది రచనలలో ఒకటి మైఖేల్ షోలోఖోవ్ రచించిన *అండ్ క్వయెట్ ఫ్లోస్ ది డాన్* (1934), దానికి ఉపాంగంగా వెలువడిన మరొక రచన. 1953 లో స్టాలిన్ మరణించిన తరువాత కొద్దికాలం రష్యన్ సాహిత్యంలో కొంత వికాసం కనిపించినా, తిరిగి ప్రభుత్వ దమన నీతి పెచ్చు పెరగడంతో అసమ్మతి సాహిత్యం తల ఎత్తింది. అలెగ్జాండర్ సోల్జెనిట్సిన్ (చూ.) కి 1970 లో సాహిత్యానికి నోబెల్ బహుమతి లభించింది. అసమ్మతి రచయితలలో ఆయన అగ్రసరుడు. ఆయన ప్రధానమైన నవల లన్నిటి పఠన పాఠనాలను సోవియెట్ యూనియన్‌లో నిషేధించారు. మొత్తం మీద 1917 తరువాత రష్యన్ సాహిత్యంలో వెలువడిన మిక్కిలి శక్తి మంతమైన, మిక్కిలి మౌలికమైన రచనలను సోవియెట్ ప్రభుత్వాన్ని వ్యతిరేకించిన, సోవియెట్ ప్రభుత్వంచే చిత్ర హింసకు గురి అయిన రచయితలే రచించారు. రష్యాలో అధిక సంఖ్యాక ప్రజల, తాత్కాలిక రాజకీయ, సామాజిక అవసరాలను తీర్చే సాహిత్యం పుష్కలంగానే వెలువడు తూంది. చెదురు మదురుగా విశిష్ట ప్రతిభను ప్రకటించే రచనలు కూడా వెలువడుతున్నాయి.

బా.శ్రీ.

## రుమేనియన్ భాష - సాహిత్యం

**భాష :** రుమేనియన్ భాషను సుమారు 2 కోట్ల మంది మాట్లాడుతున్నారు. ఇది రోమాన్స్ భాషలలో (అనగా లాటిన్ నుంచి పరిణమించిన భాషలలో) ఒకటి. 2 వ శతాబ్దంలో రోమన్ సైనికులు, వలసదారులు తమతో పాటు తమ లాటిన్ భాషను ప్రాచీన డాచియా (Dacia) ప్రాంతానికి తీసుకు పోయారు. అక్కడ సామాన్య ప్రజల నోళ్లలో పడి ఆ లాటిన్ భాష క్రమంగా తూర్పు రోమాన్స్ భాషగా పరిణమించింది. ఈ భాష మిగతా పశ్చిమ దేశాలలోని రోమాన్స్ భాషలనుంచి విడిపోయింది. ఇలా విడిపోవడానికి కారణం 6 వ శతాబ్దంలో ఈ ప్రదేశం మీద జరిగిన స్లావిక్ జాతివారి దండయాత్రలు.

రుమేనియన్ భాషలో నాలుగు మాండలికాలు ఉన్నాయి. వీటిలో ముఖ్యమైనది 'డాకో-రుమేనియన్'. ఇది వలేచియా ప్రాంతంలో మాట్లాడుతారు. రుమేనియాకు రాజధాని అయిన బుఖారెస్ట్ నగరం ఈ ప్రాంతంలోనే ఉంది. ఈ ప్రాంతీయభాషే ఈ దేశపు ప్రామాణిక భాష అయింది. రెండవ మాండలికం 'మేసిడో-రుమే నియన్'. దీనిని గ్రీస్, యుగోస్లావియా, ఆల్బేనియా, బల్గేరియా దేశాలలో మాట్లాడుతారు. మూడవ మాండ లికం 'మెగ్లెనో-రుమేనియన్'. ఇది గ్రీస్ దేశపు ఉత్తర ప్రాంతంలో వాడుతారు. నాలుగవ మాండలికం 'ఇస్ట్రో-రుమేనియన్'. దీనిని యుగోస్లావియాలోని ఇస్ట్రియన్ ద్వీపకల్పంలో మాట్లాడుతారు. అయితే, వీటిలో మూడవ, నాలుగవ మాండలికాలు చాలా వరకు అంతరించి పోయాయి.



రుమేనియా

రుమేనియన్ భాషలో లభ్యమైన మొట్టమొదటి లిఖిత పత్రం 1521 లో వ్రాసిన ఒక లేఖ. ఇది సిరిలిక్ లిపిలో ఉంది. రుమేనియన్ భాషకు 19 వ శతాబ్దం దాకా ఈ లిపినే వాడేవారు. మత సంబంధమైన పుస్తకాలు ఇప్పటికీ ఈ లిపిలోనే వ్రాస్తున్నారు. 19 వ శతాబ్దిలో సిరిలిక్ లిపి స్థానే రోమన్ లిపిని వాడడం మొదలుపెట్టారు. వర్ణక్రమంలో అధికారికంగా ఎన్నో సంస్కరణలు వచ్చాయి. చివరి సారిగా 1967 లో ఈ సంస్కరణలు జరిగాయి. వీటివలన వ్రాసే భాషకూ, మాట్లాడే భాషకూ సన్నిహితత్వం ఏర్పడింది.

రుమేనియన్ భాషలో పదజాలం చాలా వరకు లాటిన్ భాష నుంచి వచ్చింది. ఈ భాష మిగతా రోమాన్స్‌భాషల నుంచి విడిపోవడం వలన ఈ భాషలో తదితర భాషలనుంచి ఎక్కువగా పదాలు ప్రవేశించాయి. వీటిలో ముఖ్యంగా శ్లావిక్ పదాలు, కొన్ని టర్కిష్, హంగేరియన్, ఆల్బేనియన్ మాటలు ఉన్నాయి. ఇప్పుడు రుమేనియన్ భాషలో 40 శాతం శ్లావిక్ మాటలు ఉన్నా యని అంచనా! సాధారణంగా ఎక్కువ వాడుకలో ఉన్న పదాలలో 83 శాతం లాటిన్, 12 శాతం శ్లావిక్, 5 శాతం ఇతర భాషలకు చెందినవి.

దీని వ్యాకరణం మిగతా రోమాన్స్ భాషల కన్న క్లిష్టమైంది. ఇందులో నామవాచకానికి మూడు లింగాలు ఉంటాయి. అయితే నపుంసక లింగానికి చెందిన నామవాచకాలు ఏకవచనంలో పుంలింగతుల్యంగానూ, బహువచనంలో స్త్రీలింగతుల్యంగానూ ఉంటాయి. నామవాచకాలకు కర్తను, కర్మను సూచించే రెండు విభక్తులు మాత్రమే ఉన్నాయి. సర్వనామా లన్నింటికీ పరోక్ష కర్మను తెలిపే ప్రత్యేకమైన రూపాలు ఉన్నాయి. భవిష్యత్కాలాన్ని సూచించేందుకు సహాయక (auxiliary) క్రియలను వాడుతారు.

వ్యాకరణ రీత్యా రుమేనియన్భాష తనకు మూల భాష అయిన లాటిన్ భాషకు దగ్గరగా ఉంటుంది. శ్లావిక్ భాషల ప్రభావం పదజాలంలో మాత్రమే విశేషంగా కనబడుతుంది.

**సాహిత్యం :** రుమేనియన్ సాహిత్యం గత 4 శతాబ్దాలలో బాగా అభివృద్ధి చెందింది. 16 వ శతాబ్దంలో క్రైస్తవ మతానికి సంబంధించిన పుస్తకాల అనువాదాలు, ప్రార్థనలు, వ్యాఖ్యలు వెలువడ్డాయి. ముఖ్యంగా కోర్సెయ్ ఈ విధమైన గ్రంథాలు ప్రచురించాడు. లౌకిక సాహిత్యానికి కూడా అదే సమయంలో అవకాశం లభించింది. దీనికి కారణం అప్పుడు యూరప్లో ప్రబలిన పునరుజ్జీవన ఉద్యమం. గ్రీక్, శ్లావిక్, బైజాంటైన్, పుస్తకాల అనువాదాలు అనేకం వెలువడ్డాయి. 'వెయ్యి ఒక్క రాత్రులు', 'ఈసప్ నీతికథలు' అలాంటివి.

17 వ శతాబ్దంలో కూడా మతపరమైన పుస్తకాల ప్రచురణ కొనసాగింది. ఈ కార్యక్రమానికి ట్రాన్సిల్వేనియా, వలేచియా, మోల్డేవియా రాష్ట్రాలలో నెలకొని ఉన్న మఠాలు తోడ్పడ్డాయి. ఈ మఠాలు మత దైవ సంబంధిత విషయాలకు ముఖ్యమైన కేంద్రాలు. డోసోఫ్టెయి అనే గొప్ప పండితుడు మొదటి సారిగా 1673 లో రుమేనియన్ భాషలో పద్యాలు వ్రాశాడు. ఈయన మహనీయుల జీవిత గాథలు వ్రాశాడు. రుమేనియన్ జాతీయాలను వాడి, గద్యరచనలో సరళమైన శైలిని ఈయన ప్రోత్సహించాడు. 1688 లో *బైబిల్* అనువదించడంలో మతసాహిత్యం పరాకాష్ఠ చెందింది. ఈ అనువాదం తర్వాత వచ్చిన అనువాదాలకు మూల మైంది. మిరోన్ కోస్టిన్ తన దేశచరిత్ర ఆధారంగా ఒక పద్యకావ్యం రచించాడు.

18 వ శతాబ్దంలో మోల్డేవియాలోని రడాతీ నూతన సాంస్కృతిక కేంద్రంగా పేరు పొందింది. ప్రాచీన గ్రీక్ కవి అనాక్రియోన్ సంప్రదాయాన్ని అనుసరిస్తూ అలేచు వకరెసు గేయకవిత్వం, ప్రేమగీతాలు వ్రాశాడు. ఆయన తండ్రి అయినచిత మొదటి సారిగా రుమేనియన్ వ్యాకరణం వ్రాశాడు. ఆయన కుమారుడు ఇయన్చు పద్యకావ్యాలు వ్రాశాడు. గేయకవిత్వ సంప్రదాయాన్ని వలేచియాలో మములేను పోషించాడు.

19 వ శతాబ్దంలో ట్రాన్సిల్వేనియా రాష్ట్రంలో శామ్యూల్ మిచు నాయకత్వంలో లాటిన్ ఉద్యమం ప్రారంభమై ఇతర ప్రాంతాలకు ప్రాకింది. రుమేనియన్ భాష లాటిన్ భాషనుంచి పుట్టిన విషయాన్నీ, ఆ రెండు భాషలకూ గల దగ్గర సంబంధాన్నీ ప్రచారం చెయ్యడమే ఈ ఉద్యమం ముఖ్యోద్దేశం. 1821 లో వలేచియా రాష్ట్రంలో జరిగిన తిరుగుబాటు ఉద్యమం ప్రజలలో నూతన చైతన్యం కలిగించింది. ఈ శతాబ్దంలో యూరప్లోని ఇతర దేశాల వలె రుమేనియాలో కూడా కాల్పనికోద్యమం వ్యాపించింది. ఎలియడ్ రదులెస్కు అనే మహనీయుడు రుమేనియన్భాషలో మొదటి వార్తాపత్రికనూ, సంగీత సభనూ స్థాపించాడు. ఆయన రుమేనియన్, ఇటాలియన్ భాషలలో కవిత్వం వ్రాశాడు. చరిత్ర ఇతివృత్తంగా గల చిన్నకథలు మొట్ట మొదట ఆయనే వ్రాశాడు. కాల్పనిక ఉద్యమానికి వన్నె తెచ్చిన మరొక రచయిత గ్రీగోర్ అలెగ్జాండ్రెస్కు. ఫ్రెంచ్ రచయితల వలన ప్రభావితుడై, ఈయన అనేక నీతికథలను, ఎత్తిపొడుపు కావ్యాలను వ్రాశాడు. మిహాయిల్ కొగల్నిసేను *డాచియా లిటరార* అనే సాహిత్యపత్రికకు సంపాదకుడుగా ఉండి సాహిత్యంలో సాంప్రదాయిక ధోరణులను ప్రారంభించాడు. అలేసురుస్సో *బైబిల్*ను స్ఫురింపచేసే *కంటేరియా రోమనియై* అనే కావ్యం రచించాడు.

19 వ శతాబ్దపు రెండవ భాగంలో ప్రముఖులైన రచయితలు వాసిల్ అలెగ్జాండ్రి, మిహాయిల్ ఎమినెస్కు. వీరిలో మొదటివాడు పద్య, గద్య కావ్యాలను, నాటకాలను వ్రాయడమే కాకుండా జానపద గీతాలలో దాగిఉన్న సొగసులను వెలికి తీశాడు. ఈయన పద్య కావ్యాలలో *డోయిన్సిలా క్రిమియోర్*, గద్య రచనలలో *ఎబాఖ్ ఫ్రమ్ ఫ్లొరెస్కు*, నాటకాలలో *బలిడియు, డిస్పాట్ వోడ* చెప్పుకో దగ్గవి. ఎమినెస్కూను రుమేనియన్ సాహిత్యానికి తండ్రిగా భావించడం కద్దు. ఆయన ఆధునిక కవిత్వాన్ని సృష్టించారు. 60 పద్య కావ్యాలు వ్రాశాడు. హిందూ తాత్త్విక చింతనచేత, కాంట్, షోపెన్ హోవర్ల వంటి జర్మన్ తత్త్వ వేత్తలచేత ప్రభావితుడై గేయకవిత్వం సాగించారు. చిన్న కథలు, రాజకీయ తాత్త్విక విషయాలమీద ఎన్నో వ్యాసాలు రచించాడు.

టిటూ మెయొరెస్కు అనే రచయిత 'జునిమియా' అనే సాహిత్య సమితిని 1863 లో స్థాపించి, 'కళ కోసమే కళ' అనే వాదాన్ని బలపరచాడు. కథా రూపానికి వస్తువు కంటె ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వడాన్ని వ్యతిరేకించాడు. టాన్ లుకా కరగెయిల్ సాంఘిక ఇతివృత్తాలతో సుఖాంత నాటకాలకు నాంది పలికాడు. *కాళరాత్రి, పోయిన ఉత్తరం* ఈయన ప్రసిద్ధ నాటకాలు. బార్బు స్టెఫనెస్కు చరిత్రాత్మక, జాతీయ నాటకాలు వ్రాశాడు. మోజెస్ గేస్టర్ రుమేనియన్ జానపద సాహిత్యంలో పరిశోధన చేసినవారిలో మొదటివాడు. ఇయొన్‌మినులెస్కు, జార్జ్‌బకోవియాలు తమ కవిత్వంలో ప్రతీకవాదాన్ని విశేషంగా అనుసరించారు. లొవినెస్కు, దేవిడెస్కులు అతిశయోక్తి వాదాన్ని బలపరిచారు. ముఖ్యంగా దేవిడెస్కు రచించిన *కం టెకుల్ ఓముల్వి* (The song of Man - మానవుని గీతం) ప్రపంచ చరిత్రను సమీక్షించిన మహాకావ్యం.

మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత గేయ కవిత్వంతో నవల పోటీ పడింది. లివియురెబ్రెను రుమేనియన్ నవలను తీర్చిదిద్దాడు. రైతులకు భూమి ఆవశ్యకతను గురించి, వారికి స్వాతంత్ర్యావసరాన్ని గురించి బోధిస్తూ ఈయన నవలలు వ్రాశాడు. ట్రాన్సిల్వేనియా రాష్ట్రంలో 1907 లో జరిగిన రైతుల పోరాటాన్ని ఇతివృత్తంగా తీసుకుని *రస్కోలా* అనే నవలను 1937 లో రచించాడు. ఈ యుద్ధంలో తన స్వదేశం నిర్వహించిన విశిష్ట పాత్రను దృష్టిలో పెట్టుకుని *ఉరితీయబడిన వారి అడవి* అనే సుప్రసిద్ధ నవల వ్రాశాడు. సీజర్ పెట్రెస్కు *ముసురు కుంటున్న మబ్బులు* అనే నవల, పిల్లల సాహిత్యం వ్రాశాడు. *అయొనెల్ థియొడోరెను* మూల పురుషుల జీవితపంథా అదృశ్యం కావడాన్ని గురించి, విక్టర్ పాపా గ్రామీణవిషయాల మీద, జామ్ ఫిరెస్కు బుఖారెస్ట్ శివార్ల మీద నవలలు వ్రాశారు. మిహెయిల్ సదొవెను వాస్తవిక రచనలలోను, బ్రటెస్కు వయొనెస్టి రైతులకు సంఘంలో గల స్థానాన్ని చిత్రించడంలోను ప్రసిద్ధి చెందారు. వీరిద్దరు గద్య రచనలను పెంపొందించారు. నికొలెయ్ ఇయోర్గా నాటకాలు, కవిత్వం, విమర్శ వ్రాశాడు. ఈయన ఒక సాహితీ పత్రికను స్థాపించాడు. రుమేనియన్ సంస్కృతిలో పల్లెలకు గల విశిష్టస్థానం ఈయన కథావస్తువు. ఆధునిక రుమేనియన్ సాహిత్యంలో గేయ కవిత్వానికి గౌరవప్రదమైన స్థానం ఉంది. ఇందులో విభిన్న రీతులు చూడవచ్చు. నిచిఫోర్ క్రానిచ్ గేయాలలో సాంప్రదాయిక, మతవిషయిక ధోరణులు, ఇయోన్ పిలాట్ రచనలలో ఫ్రెంచ్, జర్మన్ గేయాల ప్రభావం గోచరిస్తాయి. గేయ కవిత్వంలో ట్యూడర్ ఆర్గేజీ ముఖ్యుడు. నవలారచయితగా, విమర్శకుడుగా, పత్రికా రచయితగా, కరపత్ర రచయితగా, తత్త్వశాస్త్రవేత్తగా కూడా ఈయన విఖ్యాతి పొందారు. ఈయన పద్య కావ్యాలలో *తగిన మాటలు* (Suitable Words), *మూస పూలు* (Mold Flowers), *సాయం కవితలు* (Evening Verses) అతి ముఖ్యమైనవి. సాహిత్య భాషను సంస్కరించి ఈయన మెరుగు పెట్టాడు.

రెండవ ప్రపంచయుద్ధం తర్వాత చెప్పుకోతగిన రచయితలలో జియోబోగ్జా సాంఘిక వాస్తవిక ఉద్యమం మీద, మిహెయిల్ బెన్యుబ్ యుద్ధానంతరం తనదేశం సాధించిన విజయాలను గురించి, యూజీన్ జెబెలెను సమకాలీన సంఘటనల, విషయాల ఆక్షేపణలతోను రచనలు చేశారు. కవులలో మరియా బనూస్ శాంతి కోసం జరిపే పోరాటాన్ని గురించి, మిరోన్ పరశ్చివెస్కు జానపద ఇతివృత్తాలమీద, మార్సెల్ బ్రస్‌లావ్ వివిధ కథావస్తువులమీద పద్యాలు వ్రాశారు. నాటక కర్తలలో అవురెల్‌బరంగా సమకాలీన జీవితాన్నీ, హొరియా లొవిన్స్కు వివేకవంతుల మారుతున్న వైఖరులనూ, 'దేవిడొగ్గు' గనులు కర్మాగారాలనూ కథావస్తువులుగా గ్రహించారు. అంతరించిన యుగంలో పల్లెజీవితం గురించి జహరియా స్టాంచూ, ఫాసిజాన్ని విమర్శిస్తూ ఎసిబియు కామిలార్ నవలలు వ్రాశారు. వ్యాసరచన, విమర్శలలో కలినెస్కు, మిహెయ్ రలియా, ట్యూడర్ వియాన్ ముఖ్యులు. సిల్వియన్ అయొనిఫెస్కు డుమిట్రు మిచు రుమేనియన్ భాషలో నవలలమీద విమర్శన గ్రంథాలు వ్రాశారు.

రెండు ప్రపంచ యుద్ధాల మధ్యకాలం రుమేనియన్ సాహిత్యచరిత్రలో ఒక మరపు రాని ఘట్టం. ఈ కాలంలో అన్ని సాహిత్య ప్రక్రియలలో విశేషమైన కృషి చేసి, తమ సాహిత్యానికి మెరుగులు దిద్దిన రచయితలు చాలా మంది ఉన్నారు. రుమేనియన్ సాహిత్యానికి విదేశాలలో ఎక్కువ ప్రచారం లేకపోయినప్పటికీ, రుమేనియన్‌భాష మాట్లాడేవారి సంఖ్య తక్కువైనప్పటికీ పాశ్చాత్య సాహిత్యాలలో దేనికీ ఈ సాహిత్యం తీసిపోదు.

ఇంకొక విషయం: రుమేనియాకు చెందిన మేధావులు పశ్చిమయూరప్‌లోని అన్ని ముఖ్య సాంస్కృతిక ఉద్యమాలలోనూ పాల్గొన్నారు. కొన్ని ఉద్యమాలకు వారు నాయకులు, స్థాపకులు కూడా! వీరిలో చెప్ప దగిన వారు: ట్రిస్టన్ జారా, మార్సెల్ జాంకో. వీరిద్దరూ 1916 లో జూరిఖ్‌లో 'డాడాయిజమ్' ప్రారంభించారు. రుమేనియాకు చెందిన రచయితలలో తమ మాతృభాషలోగాక ఫ్రెంచ్ భాషలో వ్రాసి ప్రపంచఖ్యాతి

గడించిన వారిలో ట్రిస్టన్ జారా, యూజీన్ అయొనెస్కో, ఇ.యమ్. కొరన్ ప్రముఖులు. ఇతరదేశాలకు వలస వెళ్ళి అక్కడ తమరచనలు చేస్తున్న రుమేనియన్ రచయితలలో మిర్సియా ఎలియడ్, వింటి లాహొరియా, పెట్రో దుమిట్రియు, వర్జిల్ ఇయెరుంకా, తోమా పావెల్ ప్రసిద్ధులు.

ఇ.నా.

## లట్వియన్ భాష - సాహిత్యం

**భాష :** ప్రధానంగా లట్వియా దేశంలో మాట్లాడబడే ఒక తూర్పు బాల్టిక్‌భాష. లట్వియాకు ఇటీవలి వరకూ అధికార నామం 'లట్వియన్ సోవియట్ సోషలిస్ట్ రిపబ్లిక్'. ఇది యూరప్‌లోని రష్యా భూభాగంలో వాయవ్య దిశగా బాల్టిక్ సముద్ర తీరంలో ఉన్న దేశం. 1918 నుంచి 1940 వరకు స్వతంత్రంగా ఉన్న ఈ దేశం జనాభా సుమారు 22 లక్షలు. వైశాల్యం 25,395 చ.మై. రాజధాని 'రీగా'. లట్వియా భాషనే 'లెట్టిష్' అని కూడా అంటారు.

ఆ భాషలో దొరుకుతున్న అత్యంత ప్రాచీన గ్రంథాలు ఒక కేథలిక్ 'ప్రాథమిక మత సూత్రగ్రంథం', ఒక లూథరన్ 'ప్రాథమిక మత సూత్ర గ్రంథం'. రెండూ గోతిక్ లిపిలోనే ఉన్నాయి. ఇవి సుమారు 16 వ శతాబ్ది నాటివి. ఈ భాషకు మొట్టమొదటి వ్యాకరణ గ్రంథం 18 వ శతాబ్దంలో వెలువడింది. 19 వ శతాబ్దం చివరకు సాహిత్య భాష పరిపూర్ణంగా అభివృద్ధి చెందింది. 1922 లో ఈ భాషను వ్రాయడానికి కొన్ని మార్పులతో లాటిన్ వర్ణమాలను ఆమోదించారు.

లట్వియన్ భాషలో మూడు మాండలిక భాషా వర్గాలు ఉన్నాయి: 1. తూర్పు లేదా ఎగువ లట్వియన్ మాండలికం, 2. పశ్చిమ లట్వియన్ మాండలికం, 3. కేంద్ర లట్వియన్ మాండలికం. ఈ మూడింటిలోను చివరిది మరింత సంప్రదాయానుగుణ మైంది. అదే ఆధునిక లట్వియన్ సాహిత్య భాషకు ఆధారం అయింది.

లితువేనియన్ భాషతో చాలా దగ్గర సంబంధం ఉన్నా, లట్వియన్ భాష అనేక విషయాలలో అంతకంటె భావప్రకటనకు ఎక్కువ అనుకూలమైంది. ఉదాహరణకు మాటల చివరి అక్షరాల మీది అచ్చులను లోపింప చేసే లక్షణం లట్వియన్ భాషలో మరింత ఎక్కువగా కనిపిస్తుంది. ఫిన్నిష్ భాష ప్రభావం వల్ల పదంలో మొదటి అక్షరం మీదే నియతంగా ఊనిక నిలిచి ఉంటుంది.

**సాహిత్యం :** లట్వియా దేశం 13 వ శతాబ్దంలో స్వాతంత్ర్యాన్ని కోల్పోయినందు వల్ల జానపద కవిత్వ దశ నుంచి లట్వియన్ సాహిత్యం సహజంగా పరిణామం చెందడానికి అంతరాయం ఏర్పడింది. లట్వియన్ సాహిత్య చరిత్రలో ఎక్కువభాగం ఈ అనుబంధాన్ని తిరిగి నెలకొల్పుకొనడం కోసం జరిగిన ప్రయత్నమే. జర్మన్ మతాధికారుల ప్రోత్సాహంతో లిఖితసాహిత్యం చాలా ఆలస్యంగా ఆరంభ మైంది. లట్వియన్‌భాషలో లౌకిక సాహిత్యం 18 వ శతాబ్దంలో జి.ఎఫ్.స్టెండర్ రచనలతో ఆరంభమైంది. 'వికాస యుగం' (Enlightenment) ఆవేశంతో ఆయన గ్రామీణ జీవన మనోహర దృశ్యాలతో కూడిన నీతి కథలు రచించాడు. ఆత్మాతిశయంతో ఆయన తన చిన్న చిన్న పాటలతో జానపదగీతాలను అణచివేయాలని చూశాడు. ఆయన చేసిన ఆ ప్రయత్నం వల్లనే 4 లక్షల ప్రచురితమైన జానపద గీతాలు, సుమారు 10 లక్షలు రికార్డు చేయబడి ఇంకా ప్రచురితం కాని జానపదగీతాలు లట్వియన్ సాహిత్యంలో ఎంత ప్రముఖ స్థానాన్ని ఆక్రమిస్తున్నాయో అర్థం అవుతుంది. 17 వ శతాబ్దం నాటికే ఫ్యూరెక్ సెరస్ జి. మాన్‌సెలియస్‌లు శత్రుత్వంతో కాకుండా ప్రేమభావంతో జానపద సాహిత్య ప్రభావాన్ని ఎదిరించారు. ఫ్యూరెక్‌సెరస్ ఆవేశపరుడైన కవి. నూతన ఛందోరీతులను, అనుప్రాసలను ప్రవేశ పెడుతూ లట్వియన్ జానపద గీతాలనుంచి శైలికి సంబంధించిన కొన్ని లక్షణాలను కూడా ఆయన గ్రహించాడు. ఇక మాన్ సెలియస్ లట్వియన్ వచన రచనకు పితామహు డనదగిన వాడు.

19 వ శతాబ్ది మధ్య భాగంలో ఏర్పడిన 'జాతీయ చైతన్యం' ఏర్పడిన కాలంలో లట్వియన్‌లు సాహిత్య రంగంలో తమ స్వాతంత్ర్యాన్ని స్థాపించుకున్నారు. జె. అలునాన్స్ వ్రాసిన *డ్జిస్ మియాస్* (1856) అనే పద్యకావ్యం ఆధునిక లట్వియన్ భావకవితకు నాంది పలికింది. జాసెక్లిస్ వ్రాసిన భావగీతాలలోను, ఏ. పంపర్స్ వ్రాసిన మహాకావ్యం *లాక్ ప్లీసిస్* (1888-భల్లూక హంతకుడు) లోను జానపదకవిత్వం నుంచి వారు ఉత్తేజన పొందడం కనిపిస్తుంది. మొదటి ప్రసిద్ధ నవల *మెర్నీకు లైకీ* (1879 - భూమి సర్వేయర్ల కాలం) కౌజైటీస్‌చే రచితమైంది. దానిలో లట్వియన్ రైతుల జీవితం స్వాభావికంగా చిత్రించబడింది. ఆధునిక లట్వియన్ నాటకాలు, కథానికలు ఆర్. బ్లామానిస్‌తో ప్రారంభం అయాయి.

1890-1900 మధ్య కాలంలో వచ్చిన 'నూతన ఉద్యమం' వాస్తవికతా వాదాన్ని బలపరచింది. కాని ఆ కాలంలో వచ్చిన ప్రముఖ కవి రైనిస్ సమకాలీన సమస్యలను చిత్రించడంలో జానపద కవిత్వంలోని చిత్తరువులతో ప్రతీక వాదాన్ని ఎక్కువగా ఉపయోగించాడు. అతని భార్య అస్పాజియా. ఆమె స్త్రీల హక్కులకోసం పోరాటం కొనసాగించింది. కాని ఆమె చివరి రచనలో కాల్పనిక ధోరణులు ఎక్కువగా కనిపిస్తాయి. జె. పోరుక్స్ నూతన కాల్పనిక వాదాన్ని ప్రవేశపెట్టగా తరువాతి దశాబ్దంలో 'క్షీణతా వాదులు' లేక 'ప్రతీక వాదులు' కళ కోసమే కళ అనే సిద్ధాంతాన్ని ప్రచారం చేశారు.

1905 లో లట్వియాలో రష్యన్ సామ్రాజ్యవాదం నుంచి స్థానిక జర్మన్ ఖామందుల నుంచి విముక్తి పొందేందుకు సాగిన విప్లవం ఆ ప్రజలకు గొప్ప ఆవేశభరిత మైన అనుభవం. ఆ రోజులలో భావకవితది పైచేయి కాసాగింది. కార్లిస్ స్కాల్‌బే అనే గొప్పకవి వ్రాసిన పద్యాలలోను, కల్పనా కథల లోను జానపద కవిత్వంలోని నైతిక జగత్తు క్రొత్త అవతారం ఎత్తింది. 1918 లో లట్వియా స్వతంత్రం అయిన తరువాత ఒక క్రొత్త తరం రచయితలు ఆవిర్భవించారు. జె. అఖురాటెర్స్ నీట్షెల ధోరణిలో సౌందర్య ధ్యేయాలు గల సాహసిక వీరులను చిత్రించాడు. ఆయన భావ గీతాలు శక్తిమంతమైనవే గాని కల్పితాలు. ఫ్రెంచ్, రష్యన్ ప్రాకృతిక వాదులనుంచి ఉత్తేజం పొందిన ఏ. యూపిటెస్ కార్మిక వర్గంలోని వారిని ఆదర్శ నాయకులుగా చిత్రించాడు. ఇ. విర్జా సాంప్రదాయిక రూపాలతో కూడిన భావ గీతాలు రచించాడు. స్ట్రామేని (1933) అనే అతడు తన వచన కవితలో ప్యాట్రియార్కల్ ఫారమ్‌స్టెడ్‌ను ప్రశంసించాడు. జె. జౌన్‌శుద్రబిన్స్ ప్రముఖ రచన అయిన *ఐజా, అట్‌బల్స్, జీమా* అనే భాగ్రత్రయంతో కూడిన నవలలో ఆవేశ ప్రవృత్తి అదుపులో ఉంటుంది. మొదటి ప్రపం

యాండెజ్స్ ఎంగ్లైటిస్, వెరోనికా స్ట్రిలట్టే ల కవితలలో విజయవంతంగా సాధించబడింది.

20 వ శతాబ్దంలో ఒక ఏకీకృతమైన ప్రపంచ దృష్టిని సాధించడం లట్వియన్ రచయితలకు దుష్కరం అయింది. అందుచేత వారు మనస్తాత్త్విక అంశాలవైపు తమ దృష్టిని మళ్లించారు. ఎం. బెంద్రూపే వ్రాసిన కథలు ఫ్రాయిడ్ ప్రభావాన్ని సూచిస్తాయి. అలాగే ఇ. ఆడమ్‌సన్స్ ఆధునిక మానవుని నరాల వ్యాధులను చిత్రించాడు. ఆంస్లేవ్స్ ఎగ్లైటిస్ ఒక్కొక్కసారి ఒక్కొక్క మానవ లక్షణాన్ని తీసుకుని దానిని అతిశయించి, వక్రీకరించి ప్రదర్శించడంలో ఉత్సాహం చూపించాడు. అత్యుత్తమ ఆధునిక లట్వియన్ నాటకకర్త ఎమ్. జివర్ట్స్ తన *వారా* (1944) అనే చరిత్రాత్మక విషాదాంత నాటకంలో లాగే సుదీర్ఘమైన స్వగతంతో ముగిసే ఒక ఏకాంక నాటిక రచించాడు.

అప్పటికి ఎందరో కవులు ఇంకా జానపద గీతాల వలన ప్రభావితులు కావడం, ఉత్తేజితులు కావడం జరుగుతూనే ఉంది. అయితే ఏ. కాక్స్ వచన కవితలో అతిశయోక్తులతో నగర పరిసరాల వాతావరణాన్ని వర్ణించే ఒక నూతన సంప్రదాయాన్ని సృష్టించాడు. అతని ప్రముఖ రచన *మూజిబాస్ స్కార్బీ* (1938) అనే జానపద గేయ కథాచక్రం ప్రథమప్రపంచ సంగ్రామం నాటి లట్వియన్ పదాతి సైన్యాన్ని గూర్చి వ్రాసింది. అతని ప్రభావం రెండవ ప్రపంచ యుద్ధం తరువాత పశ్చిమ దేశాలకు వలస పోయిన ఒక క్రొత్త తరం కవుల మీద స్పష్టంగా కనిపించింది.

వెల్డా స్కిక్నీర్ కవిత్వంలో అధివాస్తవిక లక్షణాలు కనిపిస్తూ ప్రాచీన లట్వియన్ మంత్రాలను ఆ పద్యాలు జ్ఞాపకం చేస్తాయి. ఎల్. టామ్స్ జిసాలిమ్స్‌ల కవిత్వం మీద ఏ. కాక్ భావనాత్మక కవిత (Imaginism) ప్రభావం, పెద్ద పెద్ద అమెరికన్ నగరాలలో పొందిన అనుభవాల ప్రభావం కలగలసి కనిపిస్తాయి. కాక్ కవిత

చిత్రించాడు. పశ్చిమ ప్రాంతంలో ఇక్లై స్కిప్స్ అస్తిత్వ వాదం నుంచి ప్రగాఢమైన ప్రతీక వాదం వైపు వివిధ స్థాయిలలో ఎలా మార్పు చెందిందీ ఆమె రచించిన *నీపోలిటాస్ జీమ్స్* (1971) అనే నవలలో స్పష్టంగా కనిపిస్తుంది.

బొ.శ్రీ.

## లాటిన్ భాష - సాహిత్యం

**భాష :** లాటిన్ భాష (లింగ్వా లాటినా) ఇండో-యూరపియన్ భాషా కుటుంబం లోని ఇటాలిక్ భాషా వర్గానికి చెందింది. ఆధునిక రొమాన్స్ భాషలకు ఇది మూలభాష. మొదట టైబర్ నది దిగువ తీర భూములలో చిన్న చిన్న ప్రజా సముదాయాల వ్యవహారంలో మాత్రమే ఉండిన లాటిన్ భాష రోమన్‌ల రాజకీయ బలం విస్తరించడంతో మొదట ఇటలీ అంతటా, తరువాత పశ్చిమ, దక్షిణ, యూరప్ ప్రాంతాలలోను, ఆఫ్రికాఖండంలో మధ్యధరాతీర ప్రాంతాలలోను వ్యాప్తి చెందింది. ఆధునిక రొమాన్స్ భాషలు రోమన్‌సామ్రాజ్యంలోని వివిధ భాగాలలో వాడుకలో ఉంటూ వచ్చిన వివిధ లాటిన్ మాండలికాల నుంచి పరిణమించాయి. మధ్య యుగాలలోను, అటు తరువాత ఇటీవలివరకూ పాశ్చాత్య దేశా లన్నిటిలోను వైదుష్య, సాహిత్య రంగాలలో లాటిన్ భాష వాడబడుతూ వచ్చింది. 20 వ శతాబ్దం ఉత్తరార్ధం వరకూ కూడా రోమన్ కేథలిక్ చర్చిలో మత కర్మ కాండలలో లాటిన్ భాషే వాడుకలో ఉండేది.

లాటిన్ భాషలో మనకు లభించిన అత్యంత ప్రాచీన రచన క్రీ.పూ. 6 వ శతాబ్దం నాటిది. అది నాలుగు మాటలతో కూడిన దుస్తులకు పెట్టుకునే పిన్‌మీద చెక్కిన ఒక శాసనం. ఈ మాటలలో ఊనిక (stress) లేని అక్షరాలలో పూర్తి అచ్చులను వ్రాసే సంప్రదాయం కనిపిస్తుంది. అనంతర లాటిన్ రచనలలో అచ్చుల వాడుక తగ్గింది.

లాటిన్ భాషా చరిత్రలో పౌరాణిక (classical) యుగంలో ప్రథమ, సంబోధన ప్రథమ, ద్వితీయ, చతుర్థీ, పంచమీ, షష్ఠీ అనే ఆరు విభక్తులు ఉండేవి. ఇకారాంత శబ్దాలు, హలంత శబ్దాలు తప్ప ఇండో యూరపియన్‌భాష లోని ఇతర శబ్ద వర్గాలన్నీ లాటిన్ భాషలో యథాతథంగా గ్రహించబడ్డాయి.

పౌరాణిక యుగంలో కనీసం మూడు రకాల లాటిన్ భాష వాడుకలో ఉండేది; పౌరాణిక లిఖిత భాష, పౌరాణిక వక్తృత్వ భాష, సామాన్యజనం మాట్లాడుకునే సాధారణ వ్యావహారికభాష. వ్యావహారిక లాటిన్ భాష కాలక్రమేణ పరిణామం చెందుతూ వచ్చింది. వ్యాకరణ నియమాల విషయంలోను, ఉచ్చారణలోను, పదజాలంలోను పౌరాణిక భాషకు ఇది ఎక్కువెక్కువగా దూరం అవుతూ వచ్చింది. పౌరాణిక యుగంలోను, దాని వెనువెంట వచ్చిన యుగంలోను అనేక శాసనాలలో వాడిన భాష లాటిన్ వ్యవహార భాషకు ప్రధానమైన ఆధారం అయింది. కాని, 3 వ శతాబ్దం తరువాత గ్రామ్య లాటిన్ అనబడే ప్రజాశైలిలో అనేక రచనలు వచ్చాయి. అయితే 4 వ శతాబ్ది చివరా, 5 వ శతాబ్ది మొదటా సెయింట్ జెరోన్, సెయింట్ అగస్టీన్‌లు వ్రాసిన రచనలు మాత్రం ఉదాత్తమైన సాహిత్య భాషలో రచింపబడ్డాయి.

గ్రీస్ దేశస్థులు ట్రాయ్ నగరాన్ని ధ్వంసం చేసిన తరువాత ఆ నగరంలోని రాజకుటుంబ సభ్యులు నూతన స్థావరాలను వెతుక్కుంటూ ఈనియస్ నాయకత్వం క్రింద ఇటలీకి వచ్చారని ఒక సాంప్రదాయిక గాథ. వారి వ్యవహారభాష లాటిన్. లాటిన్‌భాష మాట్లాడేవారు గ్రీక్‌ల నుంచి గ్రహించిన లిపినే పశ్చిమ యూరప్ వాసులు కొద్ది మార్పులతో స్వీకరించి, దానికి రోమక లిపి అని పేరు పెట్టారు. ఇంగ్లీష్ లిపిలో కనిపించే 'జే, యూ'. అనే అక్షరాలు రెండు మాత్రమే ఆ లిపిలో లేవు.

**సాహిత్యం :** ప్రాచీనతను లాటిన్ రచనలలో ప్రకృతినీ, దేవతలనూ ఉద్దేశించి వ్రాసిన గీతాలు, సూక్తాలు, ప్రార్థనలు ప్రధానమైనవి. న్యాయ విచారణకు సంబంధించిన 'ద్వాదశ పత్రాలు' మనకు లభించిన అతి ప్రాచీన రచనలు. క్రీ.పూ. ప్రథమ శతాబ్దానికి చెందిన సిసిరో రచనలు, ఉన్యాసాలు సాహిత్యస్థాయిని అందుకొన్నవి. వీటిలో ప్రాచీన సాహిత్య సంప్రదాయాలు కూడా ఉల్లేఖించ బడ్డాయి. సిసిరోకి ముందు లివియస్ అంద్రోనికస్ (క్రీ.పూ. 284 - 204) హోమర్ కావ్యాలను గ్రీక్‌భాషనుంచి లాటిన్‌లోకి అనువదించాడు. ఇతడూ, నెవియస్ (క్రీ.పూ 270 - 199) గ్రీక్ నాటకాలను కూడా అనువదించినట్లు తెలుస్తుంది. క్వింతుస్ ఎన్నియుస్ (క్రీ.పూ.239 - 169) లాటిన్ సాహిత్యానికి జనకుడుగా ప్రసిద్ధి పొందాడు. 19 సర్గలలో 600 పద్యాలతో ఇతడు ఒక వీరకావ్యం రచించాడు. ఇతని బంధువైన పకూలియస్ (క్రీ.పూ.220 - 130) కొన్ని నాటకాలు వ్రాశాడు. ఒక గణతంత్ర రాజ్యంగా ఉన్న ఇటలీ రాజ్యం ఆ రోజులలో ఆఫ్రికాలో చాలా చోట్ల స్థావరాలు ఏర్పరచుకుంది. ఆ స్థావరాలనుంచి ఖైదీగా

తీసుకొని రాబడిన టెరింటియస్ (క్రీ.పూ.195-156) లాటిన్ సాహిత్యంలో నాటకానికి విశిష్ట స్థానం కల్పించి యూరప్ ఖండంలోని నాటక వాఙ్మయానికి నాంది పలికాడు. ఇతడు రచించిన 6 సుఖాంత నాటకాలు నేడు ఉపలబ్ధం అవుతున్నాయి. ఈ రూపక స్రవంతికి రెండవ ఆశ్రయం ప్లాతస్ (క్రీ.పూ.220-184).

గ్రీక్‌ల ఖండకావ్య శైలిని అనుకరించిన లాటిన్ కవులలో కేతులుస్ (క్రీ.పూ.84-54), వలెరియస్, ఏదితోస్, లిసినుస్‌లు పేర్కొనదగ్గవారు. చక్షురింద్రియ గ్రాహ్యాలయిన చిత్రాలతో వాటిని నింపినవాడు లేవియస్. వ్యక్తిగతమైన గంభీరానుభూతులతో గేయ కవితను సృష్టించి యువతీ యువకుల హృదయాలను స్పందింపచేసినవాడు కేతులస్.

ఆధ్యాత్మికతను త్రోసిపుచ్చి నైరాత్మ్యవాదం అయిన భౌతిక వాదాన్ని ఇతివృత్తంగా గ్రహించి, లుక్రేషియస్ (క్రీ.పూ.94-54) అనే దార్శనిక కవి *దేరుం నాతుర* అనే మహాకావ్యం రచించాడు. దార్శనిక దృష్టిని కవితా స్రవంతితో మేళవించిన ఈ కావ్యంలో రస సౌందర్యాలు మూర్తీభవించాయి. గద్య రచనలో కాథో (క్రీ.పూ234-149), వారో (క్రీ.పూ.116-27), సిసిరో (క్రీ.పూ.106-43), జూలియస్ సీజర్ (క్రీ.పూ.100-44) ప్రభృతులు ఒక విశిష్టశైలిని రూపొందించి తరువాతి రచయితలకు మార్గదర్శకు లయారు.

క్రీ.పూ. మొదటి శతాబ్దంలో విచ్ఛిన్నశక్తులు తల ఎత్తి అంతర్యుద్ధానికి దారి తీశాయి. దానిలో విజయం సాధించిన అగస్టస్ సీజర్ కాలంలో మహాకవి వర్జిల్ (క్రీ.పూ.70 - 19) వర్ధిల్లాడు. గ్రీక్‌లకు ఇతిహాస రూపంలో ఒక మహా కావ్యాన్ని ఇచ్చిన హోమర్‌తో సరితూగ గల వర్జిల్ *ఈనియద్* అనే ఒక ఇతిహాస మహాకావ్యాన్ని లాటిన్‌భాషలో రచించాడు. ఈనియస్ ఇటలీ చేరుకున్న గాథ దీనిలో ఇతివృత్తం. రూప నిష్పాదన, భావచిత్రణ, గుణాలంకార వైచిత్రి, సుశ్లిష్టమైన శైలి, పాత్రపోషణ మొదలైన అంశాలలో ఈ కావ్యానికి సాటి రాగల కావ్యం ఇంతవరకు వెలువడలేదు.

అగస్టస్ కాలం లాటిన్ వాఙ్మయ చరిత్రలో స్వర్ణ యుగం. వర్జిల్, హోరేస్, ప్రొపెర్తియస్, ఓవిద్ మొదలైన మహాకవులు ఈ యుగానికి చెందినవారే. వ్యంగ్య ధోరణిలో ఆ నాటి పరిస్థితులను అవహేళన చేస్తూ పద్యాలు రచించినవాడు హోరేస్ (క్రీ.పూ65-8). ప్రసన్న గంభీర శైలితో 'ఓడ్' లు అనబడే ఖండ కావ్యాలను, గేయాలను, సమీక్షా సిద్ధాంతాలను, లేఖలను ఇతడు రచించాడు. మృత మిత్రులను ఉద్దేశించి 'ఎలిజీ' అనబడే స్మృతి గీతాలను రచించిన వారిలో ముఖ్యులు: ప్రొపెర్తియస్ (క్రీ.పూ.47-15), తివుల్లస్ (క్రీ.పూ.55-16), ఐవిద్ (క్రీ.పూ.43-18)లు. మధురంగా అవిచ్ఛిన్నమైన కావ్య ధారతో సాగే ప్రొపెర్తియస్ గేయాలు మనోహరాలు. ఇలాంటి గేయాలతో పాటు పౌరాణిక గాథలను, సంప్రదాయాలను ఒక్కచోట చేర్చి *మెటామర్ఫొసిస్* అనే కావ్యం కూర్చిన ఓవిద్ రచనలో మృదులమైనభావన, సుకుమారమైన పాత్రపోషణ, హృదయగ్రాహి అయిన ప్రణయ కళ కనిపిస్తాయి. ఈ కాలంలోనే ఇతిహాసాన్ని గద్యరూపంలో చిత్రించిన లివీ (క్రీ.పూ.59 -క్రీ.శ.17) కవితా దృష్టితో చరిత్రను అవగతం చేసికొన్నాడు.

క్రీ.శ 14 నుంచి 117 వరకు గల కాలం లాటిన్ వాఙ్మయ చరిత్రలో రజత యుగంగా పరిగణించ బడుతూంది. గద్యరచన ఉత్తమ స్థాయిని అందుకొన్నది. తాసితుస్ (55-118), సుయతోనియస్ (75-160) అనే ఐతిహాసిక ప్రముఖులు వివిధ సమస్యలను చక్కగా విశ్లేషించి చరిత్రను వైజ్ఞానిక దృష్టితో పరిశీలించారు. ప్లినీ ప్రాచీన సంప్రదాయ మర్యాదలను పాటిస్తూ చరిత్ర రచనలను చేసినవాడు.

వ్యాజస్తుతిరూపంలో నిందాత్మకమైన వ్యంగ్య సాహిత్యం ఈ రజత యుగంలో విజృంభించింది. సమకాలిక సమాజాన్ని విమర్శిస్తూ ఈ ధోరణిలో పెర్సియస్ ఫ్లాకుస్ (34 - 62) ఆరు పద్యాలు వ్రాశాడు. ఇతని కన్న తీవ్రమైన ధోరణిని అవలంబించి ఇలాంటి పద్యాలు రచించిన జువెనల్ (55-130) యూరప్ ఖండ భాషలలోని సాహిత్యాన్ని పూర్తిగా తీర్చిదిద్దగలిగాడు. సాంఘిక పరిస్థితులలో భాసించే అవినీతిని ఇతడు ఏ మాత్రం వదలిపెట్టలేదు.

సాహిత్యంలోని భావ, రూపాలలో రూప సంబంధమైన లక్షణాలను నిర్వచించి శైలినే ప్రధానంగా గ్రహించి సాహిత్య సమీక్షా శాస్త్రంలో క్రొత్త దృక్పథాన్ని ప్రవేశపెట్టిన విమర్శకుడు క్వింతిలియస్ (35-100). రీతి, గుణ, దోష, అలంకార సిద్ధాంతాలను, వక్తృత్వ సిద్ధాంతాలను వివేచించి ఇతడు సమీక్షకులకు ప్రామాణికుడు అయాడు.

వక్తృత్వం ఎక్కువగాను, కవిత్వం తక్కువగాను ఉందని క్వింతిలియస్ చేత విమర్శించబడిన అన్నెయుస్ లుకానుస్ (39 - 65) పాంపేయీ మీద ఒక ఇతిహాస కావ్యం వ్రాశాడు. అన్నెయుస్ సెనెకా (క్రీ.పూ. 4 - క్రీ.శ. 65) ఆచారంతో

సాహిత్యాన్ని సమన్వయపరచి విషాదాంత నాటకాలు రచించి తన తరువాతి వారికి మార్గదర్శకుడు అయాడు.

రోమ్ నగరంలోని ప్రమాదాలను, కాముకులను, జీవితాన్ని వ్యంగ్య చిత్రాలతో ప్రదర్శించినవాడు పెత్రోనియస్. అపులియస్ ఆ నాటి ధార్మిక సాంస్కృతిక హైన్యాన్ని *హిరణ్య గర్దభం* అనే గద్యరూపమైన ఒక కథలో చిత్రించాడు. ఈగ్రంథంలోని 'సైకి', 'క్యూపిడ్' ల (రతి, మన్మథుల) కథ తరువాతి శతాబ్దాలలో అనేక కవులను ఆకర్షించింది.

రెండవ శతాబ్దం నుంచీ లాటిన్ వాఙ్మయం క్రైస్తవుల హస్తగతం అయింది. ఆ విధంగా వెలసిన వాఙ్మయంలో కనిపించే మొదటి గద్య రచన తెర్తులియస్ (160-220) వ్రాసిన *అపోలో బేతికస్*. క్రైస్తవధర్మ ప్రతిపాదక మైన ఈ గ్రంథంలో ఓజోవంతమైన శైలీ, వ్యంగ్య వైభవం, అలంకార బాహుళ్యం కనిపిస్తున్నాయి. 3 వ శతాబ్దంలో మినుసియుస్ ఫెలిక్స్ సంవాద రూపంలో *ఆక్తేవియస్* అనే గ్రంథాన్ని అత్యాకర్షకమైన శైలిలో రచించాడు. దానిలో ఆయన క్రైస్తవ ధర్మాన్ని సమర్థించాడు. అర్నోబియస్ (303), లక్తాంతియస్ (250-310)లు ఇదే ధోరణిని అనుసరించారు. సంత్ జెరోమ్ (345-420), సంత్ అగస్టిన్ (354-420) లు ప్రఖ్యాత రచయితలు. 4 వ శతాబ్దం నుంచీ లాటిన్ వాఙ్మయంలో అగస్టిన్ యుగం ఆరంభ మైంది. జెరోమ్, అంబ్రోస్ (340-379), పౌలినుస్ (353-431) లు హృదయాన్ని ఆహరించుకోగల కవిత్వం చెప్పారు. దోనాతుస్, మర్తియానుస్ కపెల్లా ప్రభృతులు మార్మిక ప్రవచనాలు చేశారు. మధ్యయుగంలో జరిగిన ఆధ్యాత్మిక, దార్శనిక తత్త్వ వివేచనలకు ఆధార గ్రంథాలు అగస్టిన్ యుగంలోనే వెలువడ్డాయి. బైబిల్‌ను మొదట లాటిన్‌లోకి అనువదించిన వాడు జెరోమ్. 'దేవ నగరం' అనే పేరు గల అత్యుత్తమ దార్శనిక, ఆధ్యాత్మిక గ్రంథాన్ని అగస్టిన్ రచించాడు.

అంతకు ముందున్న ఆధ్యాత్మిక, దార్శనిక వివేచనలను క్రైస్తవ ధర్మంతో సమన్వయించ దలచిన వారి యత్నాల ద్వారా సాహిత్య రంగంలో కొన్ని కొత్త పోకడలు ఆరంభం అయాయి. వీరిలో బొయేతియస్ (480 - 525), కసియెదొరుస్ (480 - 570), సంత్ బెనడిక్త్ (480 - 547), గ్రెగరీ (540 - 604) ముఖ్యులు. వీరిలో మొదటి ఇరువురు ప్రాచీన గ్రీక్, రోమక సంప్రదాయ సంపదను కాపాడారు. రెండవ వాడు అరిస్టాటిల్ రచనలను ప్రచారంలోకి తెచ్చాడు. బెనడిక్త్ కృషివలన క్రైస్తవమఠాలు విద్యాపీఠాలుగా పరిణమించ సాగాయి. సంత్ ఇసిదోర్ (570 - 636) *ఎతిమలోగే* అనే పేరుగల విశ్వకోశం రచించాడు. సెదూలియస్ క్రైస్తవ ధర్మ సంబంధమైన కవిత్వం చెప్పాడు. కావ్యకళలో నిష్ణాతుడైన ఫోర్త్‌నాతాస్ (535 - 600) మధురమైన గేయ కవిత్వం చెప్పాడు. కొలుంబానుస్ (543 - 615), బీడ్ (673 - 735) మొదలైనవారు ఈ సరళిలో గొప్పగ్రంథాలు వ్రాశారు. మతం ఆధారంగా చేసుకొని కవిత్వం చెప్పిన వారిలో అల్క్యుయిన్ (755 - 804), థియొడుల్ఫ్, పాల్, అంగిల్‌బర్త్, ఐన్‌హర్డ్, లుపస్ శర్వతుస్, మౌరుస్ మొదలైనవారు ముఖ్యులు. ప్రకృతి సౌందర్యం చూసి ముగ్ధుడై గానం చేసిన కవి స్ట్రాబో. హ్రోత్స్విథా అనే కవయిత్రి సాహిత్యాను రాగిణి.

11 వ శతాబ్దంలో వ్యవహార భాషలుగా ఉన్న ప్రాకృతాలు క్రమంగా సాహిత్య భాషలుగా కూడా పరిణమించాయి. కాని 18వ శతాబ్దంలో కూడా యూరప్ ఖండవాసులు లాటిన్ భాషనే తమ సాంస్కృతిక భాషగా పరిగణిస్తూ ఉండేవారు. 11 వ శతాబ్దంలో విశ్వవిద్యాలయాలు వెలశాయి. వీటిలో గ్రీక్, లాటిన్ భాషలకు అధిక ప్రాధాన్యం ఈయబడింది. అన్సెలం, అబెలార్డ్ (1079 - 1142), శాలిస్‌బరీకి చెందిన జాన్ (1115 - 1180) మొదలైనవారు లాటిన్ భాషలోనే వ్రాసేవారు. 13 వ శతాబ్దంలో *సుమ్మా తియొలాజికా* అనే మహోత్కృష్టమైన గ్రంథం వ్రాసిన సంత్ థామస్ అక్వినస్ ఛాయావాదానికి సన్నిహితంగా దానిని రచించాడు. డాంటే (1265 - 1321) కొన్ని ఖండకావ్యాలను లాటిన్‌లో రచించాడు. థామస్ అకెంపిస్ (1380 - 1471) రచించిన *ఇమితాతియో క్రిస్తి* అనే గ్రంథం కవితా భావనలోను, దార్శనిక సిద్ధాంత వివేచనలోను, ఆత్మానుభూతి ప్రదర్శనలోను బైబిల్‌ను కూడా అతిశయించింది అనడం అతిశయోక్తి కాదు. 14 వ శతాబ్దంలో పెట్రార్కా (1304-1374) కొన్ని ఖండకావ్యాలు, గద్యరచనలు సిసిరో శైలిలో లాటిన్ భాషలో రచించాడు.

తరువాతి శతాబ్దంలో అనేకులు లాటిన్ భాషలోనే వ్రాయసాగారు. 17 వ శతాబ్దంలో న్యూటన్ తన భౌతిక శాస్త్రాన్ని లాటిన్ భాషలోనే వ్రాశాడు. 19 వ శతాబ్దం తరువాత లాటిన్ భాషలో చెప్పుకోదగిన రచనలు ఏవీ రాలేదు. కాని నేటికీ లాటిన్ భాషకు ఒక గౌరవమైన స్థానం ఉంది. యూరప్ ఖండ వాసులు గ్రీక్, లాటిన్ భాషలను వదలుకుంటే వారి సంస్కృతి నిర్జీవం కాగలదు.

పో.సు.శా.(బా.శ్రీ.)

## లిథువేనియన్ భాష - సాహిత్యం

**భాష :** లట్వియన్ భాషతో మిక్కిలి సన్నిహితమైన సంబంధం గల తూర్పు బాల్టిక్‌భాష. పూర్వపు సోవియట్ సోషలిస్ట్ రిపబ్లిక్‌లలో ఒకటి అయన లిథువేనియన్ రిపబ్లిక్‌లో ముఖ్యంగా ఈ భాష వ్యవహారంలో ఉంది. 1918 నుంచి అక్కడ ఇది అధికారభాషగా ఉంది. నేటికీ వ్యవహారంలో నిలచి ఉన్న మిక్కిలి ప్రాచీనమైన 'ఇండో - యూరపియన్' భాష ఇది.




లిథువేనియా

16 వ శతాబ్దం నుంచి ఈ భాష సాహిత్యభాషగా ఉన్నట్లు ఆధారాలు కనిపిస్తున్నాయి. లభించినంతలో అత్యంత ప్రాచీనమైన రచన 1525 నాటి 'ప్రభు ప్రార్థన' (Lord's Prayer) అనే గ్రంథానికి లిథువేనియన్ అనువాదం. ఆ గ్రంథంలోని భాష ప్రత్యేకంగా మత గ్రంథాల రచనకే ఉపయోగించే విలక్షణమైన భాష. దానికీ, ఆధునిక లిథువేనియన్ భాషకూ ఎన్నో విషయాలలో భేదాలు కనిపిస్తాయి. ఆధునిక లిథువేనియన్ సాహిత్య భాషలో కంటె ఆ నాటి భాషలో కొన్ని వ్యాకరణ రూపాలు మరింత దీర్ఘంగా ఉండేవి. ఆధునిక భాషలో కంటె దానిలో మరి రెండు విభక్తులు అదనంగా వాడుకలో ఉండేవి. పదజాలం లోను, వాక్య నిర్మాణం లోను శ్లావిక్‌భాషల ప్రభావం దానిమీద ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. పదాలమీది ఊనిక విషయంలో కూడా ఆధునిక భాషకంటె అది భిన్నమైంది. ఆ వెనుకటి భాషా లక్షణాలు 17 వ శతాబ్ది మధ్యభాగం వరకూ అలాగే కొనసాగాయి.

19 వ శతాబ్దంలో లిథువేనియన్ సాహిత్య భాషలో మూడు మాండలికాలు వాడుకలో ఉండేవి. బాల్టిక్ సముద్ర తీర ప్రాంతంలో దిగువ లిథువేనియన్ మాండలికం, తూర్పు భాగంలో ఎగువ లిథువేనియన్ కవితా భాష, పశ్చిమ భాగంలో ఎగువ లిథువేనియన్ మాండలికం (ఇది తూర్పు ప్రష్యాను ఆనుకుని ఉన్న ప్రాంతంలోనే ప్రధానంగా వాడబడేది) వాడుకలో ఉండేవి. 32 వర్ణాలతో కూడిన లాటిన్ వర్ణమాల ఉపయోగించి వ్రాసే ఆధునిక ప్రామాణిక సాహిత్య భాషకు ఆధారం పశ్చిమ ఎగువ లిథువేనియన్ మాండలికం. ఈ భాషలో రచనకు జోనాస్ జాబ్లోన్‌స్కిస్ (1861-1930) మూల పురుషుడు.

బాల్టిక్ భాష లన్నిటి లాగానే ఈ లిథువేనియన్ భాష కూడా అత్యంత ప్రాచీన మైన మూల ఇండో-యూరపియన్ భాషకు సంబంధించిన ప్రాచీన లక్షణాలను ఎన్నింటినో తనలో నిలుపుకుంది. అలాంటి లక్షణాలలో నామవాచకాలలోను, క్రియలలోను ద్వివచనాన్ని వాడుతూ ఉండడం ఒకటి. పాత లిథువేవియన్ భాషలో సప్తమీ బహువచన ప్రత్యయం మూల ఇండో-యూరపియన్ భాషలో లాగానే '- సు'.

**సాహిత్యం :** 14 వ, 15 వ శతాబ్దాలలో బాల్టిక్ సముద్రం నుంచి నల్లసముద్రం వరకూ వ్యాపించి ఉన్న 'ది గ్రాండ్ ప్రిన్సిపాలిటీ ఆఫ్ లిథువేనియా'లో మొదట బైలో రష్యన్, తరువాత లాటిన్ అధికారభాషలుగా ఉండేవి. 16 వ శతాబ్దంలో తాత్కాలికంగా ప్రొటెస్టెంట్ మతం వ్యాపించడంతో, అటు తరువాత వచ్చిన 'ప్రతి సంస్కరణ' ఉద్యమం మత గ్రంథాలను దేశీయ భాషలో వ్రాయడానికి దారి తీసింది.

తెలిసినంతలో మొట్టమొదట అచ్చయిన లిథువేనియన్ గ్రంథం ఎమ్.మాజ్విడాస్ రచించిన 'ప్రాథమిక మతసూత్రగ్రంథం' (Catechism-1547). అటు తరువాత జె.బ్రిట్‌కునాస్ లేక జె. బ్రెట్‌కే రచించిన మతసంబంధమైన గ్రంథాలు వెలువడ్డాయి. 1701 లో న్యూ టెస్టమెంట్ (నూతన నిబంధన) ప్రచురించబడింది. 1727 నాటికి మొత్తం మత గ్రంథా లన్నీ వెలువడ్డాయి. 18 వ శతాబ్దం వరకూ లిథువేనియన్ రచనలు చాలావరకూ మతసంబంధ మైనవిగానే ఉండేవి. ఇందుకు భిన్నంగా వెలువడిన మొట్ట మొదటి చెప్పుకోదగిన గ్రంథం: కె.

సిడ్విడాస్ సంకలనం చేసిన *డిక్షనేరియం ట్రియలింగువారం* (1629) అనే లితువేనియన్ నిఘంటువు.

18 వ శతాబ్దంలో వ్యాకరణాలు, నిఘంటువులు, జానపద గీతాల తొలి సంకలనాలు వంటి లౌకిక సాహిత్యం ఎక్కువగా వెలువడింది. ఆ కాలంలో వెలువడిన చెప్పుకోదగిన గ్రంథం మెటాయ్ (4 ఋతువులు-1818) అనే క్రిస్టిజోనాస్ డొనెలెయ్‌స్ వ్రాసిన పద్యకావ్యం. అది షట్పదులలో విరచితమైంది. జర్మన్ ప్రభావాన్ని ప్రకటిస్తూంది. ఏడాది పొడుగునా లితువేనియాలో కనిపించే గ్రామీణ జీవనాన్ని చిత్రించే మనోహరమైన కావ్యం అది.

19 వ శతాబ్దం పూర్వార్థంలో ఒక నూతన లితువేనియన్ సాహిత్యభాషను రూపొందించడానికీ, తమ దేశ ప్రాచీన చరిత్ర పట్ల ఎక్కువ ఆసక్తిని ప్రదర్శించే ఒక క్రొత్త కాల్పనిక దృష్టిని ప్రోత్సహించడానికీ ఒక ఉద్యమం ఆరంభ మైంది. ఆ నాటి సాహిత్యంలో, ముఖ్యంగా సిమనాస్ స్టానిషియస్, డయోనైజాస్ పోస్కాల కవిత్వంలో ఫ్రెంచ్ విప్లవ పరిణామ రూపంగా పాశ్చాత్య ప్రభావం ఎక్కువగా కనిపించింది. లితువేనియన్ రచనలను లాటిన్ వర్ణాలతో ముద్రించడాన్ని రష్యా ప్రభుత్వం నిషేధించినా, మత, విద్యాసంబంధ గ్రంథ రచయితగా సుప్రసిద్ధుడైన బిషప్ ఎమ్. వలెన్షియస్, యోనిక్‌సియూ సిలెలిస్ (1858-59), 'యానిక్‌సియా అడవి' అనే మహాకావ్యం రచించినకవి బిషప్. ఏ. బారనౌస్కాస్ లు పునరుజ్జీవనోద్యమాన్ని కొనసాగించారు. ఆ నాటి లితువేనియన్ సాహిత్యం రష్యా ప్రభుత్వపు రాజకీయ అధికారాన్నీ, పోలండ్ దేశపు సాంస్కృతిక ప్రభావాన్నీ ధిక్కరించేందుకు లితువేనియన్ ప్రజలను ప్రోత్సహించింది.

1883 లో జోనాస్ బసనవిషియస్ స్థాపించి 'లితువేనియన్ మైనర్'లో అచ్చువేయించిన *ఆస్ట్రా* (ఉషస్సు) అనే మొట్టమొదటి లితువేనియన్ పత్రిక పేరుతోనే ఆ తరువాతి తరం సాహిత్యం ప్రసిద్ధ మైంది. ప్రముఖ ప్రచారకకవి, కథానికా రచయిత విన్‌కాస్ కుద్రిక వ్రాసిన పద్యాలలో ఒకటి స్వతంత్ర లితువేనియా దేశానికి జాతీయ గీతం అయింది. లితువేనియన్ కవులలో సుప్రసిద్ధుడు జె. మాసియలిస్ (మారుపేరు మైరోనిస్) నాటక కవిగాను, భావకవిగాను కూడా సుప్రసిద్ధుడు. ఆయనను 'లితువేనియన్ పునరుజ్జీవనోద్యమ కవి-ప్రవక్త' అనేవారు. ఇతర ప్రముఖ రచయితలలో పేర్కొనదగ్గవారు: తత్త్వవేత్త, కవి, నాటకరచయిత అయిన వి. స్టోరాస్టా, ప్రశస్త కథానికా రచయిత అయిన జె. విలియనాస్, సాహిత్య విమర్శకు డైన జె. ట్యూమాస్ (వైజ్‌గాంటాస్).

1918 లో లితువేనియా తిరిగి తన స్వాతంత్ర్యం సంపాదించుకుంది. జాతీయ సంస్కృతిని పెంపొందించుకునేందుకూ, సాహిత్యంలో మరింత ఆలంకారికతను సాధించేందుకూ రచయితలు తిరిగి కృషి చేయసాగారు. వి.క్రేవ్ మికెవిషియస్ (నవలా రచయిత, నాటక కర్త) లితువేనియన్ రచయిత లందరిలోకీ ప్రముఖు డని కొందరి భావన. జె.బాల్‌ట్రు సాయిటిస్ భావకవిగా విఖ్యాతి చెందాడు. ఇతర ప్రముఖ రచయితలు ఆధునిక లితువేనియన్ కాల్పనికోద్యమ నాయకుడైన వి. మైకోలాయిటిస్ ప్యూటినాస్, కవులు, నాటకకర్తలు అయిన బి. స్రువోగా, కె. బింకిస్ లు, నవలారచయిత, కథానికా రచయిత అయిన ఐ. సీనియస్.

1940 లోను, 1944 లోను సోవియట్ యూనియన్ లితువేనియాను ఆక్రమించినప్పుడు లితువేనియన్ రచయితలు కమ్యూనిస్ట్ భావ ధోరణిలో రచనలు చేయాలని నిర్బంధింపబడ్డారు. పశ్చిమ భాగంలో రచనలు చేస్తున్న సుమారు 100 మంది రచయితలు జాతీయ సాహిత్యాన్ని పెంపొందించడానికి ప్రయత్నించారు. ఏ. నైకానిలియూనాస్ తాత్త్విక కవితద్వారాను, జె. యేకాస్ గ్రామీణ దృశ్య వర్ణనల ద్వారాను, ఎమ్. కాటిలిస్కిస్ తన నవలల ద్వారాను నూతన భావ ప్రకటన పద్ధతులను ప్రవేశ పెట్టడంలో కృతకృత్యు లయారు.

బొ.శ్రీ.

## వాలూన్ భాష-సాహిత్యం

భాష : ఆధునిక బెల్జియమ్ లోని రాష్ట్రాలైన హయనాత్ (Hainaut), లీజ్ (Liege), నామర్ (Namur), లగ్జెంబర్గ్, దక్షిణ బ్రాభంత్ ప్రాంతాలను పూర్వం 'వాలూనియా' అనేవారు. ఈ ప్రాంతాలలో పూర్వం వ్యవహారంలో ఉన్న భాష 'వాలూన్'. ప్రస్తుతం లీజ్(Liege) ప్రాంతంలో తప్ప మిగిలిన ప్రాంతాలలో ఈ భాష అంతగా కనిపించడంలేదు. హయనాత్ (Hainaut) లో రచింపబడినట్లు ఊహిస్తున్న 'అకాస్యిన్' (Aucassin), నికోలిట్టే (Nicolette) లలో ఈ వాలూన్‌భాషా చిహ్నాలు కనిపిస్తున్నప్పటికీ చాలా కాలం ఈ భాషను ప్రత్యేకంగా పవిత్ర మత గ్రంథాల రచనకే వాడుతూ వచ్చారు. క్రానిక్ డీ ఫ్లోరెఫ్ (Chronique de floreffe) వంటి 14 వ, 15 వ శతాబ్దాల కైఫీయత్‌లలో ఈ భాష వాడబడింది. ఈ భాషలో మొదటి నాటకమైన *మొరాలిటీ* (1623) 17 వ శతాబ్దంలో వెలువడింది. దీనితో ఈ భాష కొక పునరుజ్జీవనం సిద్ధించింది. 18 వ శతాబ్దంలో ఈ భాషను పాటలకూ, వ్యాఖ్యానాలకూ, వర్తమాన సంఘటన

లను చిత్రించే రచనలకూ, ప్రసిద్ధమైన హాస్య రచనలకూ కూడా వినియోగించడం జరిగింది. 19 వ శతాబ్దం లోని 'ఉద్వేగ వాదులు' ఈ భాషావ్యాప్తికి బాగా తోడ్పడ్డారు.

ఇటీవలి కాలంలో భాషా పరమైన పోరాటాలు చెలరేగి బెల్జియంలోని 'వాలూన్' ప్రజలు కొంతవరకు సంఘటిత మయారు. డచ్‌భాషను పోలిన ఫ్లెమిష్ భాష వ్యవ హారంలో ఉన్న ప్రాంతమనీ, ఫ్రెంచ్‌భాష వ్యవహారంలో ఉన్న ప్రాంతమనీ బెల్జియం దేశాన్ని రెండు సమాన భాగా లుగా విభజించారు. 1830 విప్లవం తరువాత బెల్జియం స్వతంత్ర దేశ మైనప్పుడు విప్లవ నాయకుల భాష ఫ్రెంచ్ కాబట్టి ఫ్రెంచ్‌ని అధికార భాషగా అంగీకరించడం జరి గింది. తరువాత ఫ్లెమిష్ కూడా ఫ్రెంచ్‌తో సమాన స్థాయిలో ఉండాలని ప్రజలు రాజకీయ పార్టీలమీద ఒత్తిడి తెచ్చారు. కాల క్రమేణ వారు తమ లక్ష్యాలను సాధిం చుకొన్నారు. పార్లమెంటరీ చర్చలనుంచి నాణేలమీది వ్రాతల వరకూ దేశ వ్యవహారా లన్నిటిలోనూ ఫ్లెమిష్‌కు ఫ్రెంచ్‌తో సమానమైన స్థానం లభించింది. ఘెంట్ (Ghent) విశ్వవిద్యాలయంలోని కోర్సులలో ఫ్లెమిష్ భాష వాడటం ప్రారంభమైంది. సైన్యంలో ఈ భాషావ్యవ హర్తలకు ప్రత్యేక దళాలు ఏర్పాటు చేయడం జరిగింది. న్యాయ వ్యవహారాలలో రెండు భాషలకూ స్థానం లభిం చింది. ప్రాథమిక, మాధ్యమిక పాఠశాలల బోధనలో పిల్లల మాతృభాషకు స్థానం లభించింది.

**సాహిత్యం :** వాలూన్ సాహిత్య చరిత్ర 9 వ శతాబ్దం నుంచే ప్రారంభమైంది. అయితే *కాంటీలెన్ డీ సెయింట్ యులాలీ* (Contilene de Sainte Eulalie) (C. 900) అనే గ్రంథాన్ని మినహాయిస్తే వాలూన్ సాహిత్యం 12 వ శతాబ్దం నుంచీ మాత్రమే కనిపిస్తుంది. ఈ శతాబ్దంలోనూ, దీని తరువాత మరి మూడు శతాబ్దాలలోనూ వచ్చిన వాలూన్ సాహి త్యంలో కైఫీయత్‌లు, మతపరమైన రచనలు, నాటకాలు ప్రముఖంగా కనిపిస్తాయి.

17 వ శతాబ్దం ప్రారంభంలో వాలూనియా ప్రజలలో ముఖ్యంగా లీజ్ జిల్లా ప్రజలలో సాహిత్య సృష్టికి తమ మాండలికం అనుకూలమైనదనే భావం పెరిగింది. అప్పటి నుంచీ రచనల సంఖ్య ఎక్కువయింది. ప్రజల జీవనాన్నీ, స్థానిక చరిత్రనూ వర్ణించే కావ్యాలకు ప్రజాదరణ లభిం చింది. *ఓడ్* (1620), *సోనెట్* (1622), *మొరాలిటీ* (1623) అనే మూడు రచనలూ 17 వ శతాబ్దంలో లీజ్' మాండలికంలో వచ్చిన ప్రధాన గ్రంథాలు. వీటిని జీన్ హూస్ట్ (Jean Heoust) 1921 లో ప్రచురించాడు. 17 వ, 18 వ శతాబ్దాలలో ఈ భాషలో సాహిత్యసృష్టి బాగా పెరిగింది. ఈ శతాబ్దాలలో మొత్తం మీద 50 గేయకావ్యాలు వెలువడ్డాయి. వీటిలో విదేశీ సైనికుల వలన జరిగిన దారుణాలను గురించిన రైతుల ఫిర్యా దులు, ఆ నాటి జీవితానికి సంబంధించిన సమస్యలమీద చర్చలు, స్త్రీలకు అవమానకరంగా ఉండే వ్యంగ్య రచ నలు, రాజకీయమైన విమర్శలు, మతపరమైన వివాదాలను గురించిన కరపత్రాలు ఉన్నాయి. 1789 లో వచ్చిన విప్లవమూ, దానివలన కలిగిన ఇబ్బందులూ ఎందరో లీజ్ దేశ భక్తులకు ప్రేరణ కల్పించాయి. ఆ విధంగా ప్రేరితు లయినవారు ప్రజాదరణ పాత్రమయిన వ్యంగ్య రచనలను కూర్చారు. వీటిలో 250 రచనలను ఆల్ఫిన్ బాతే సంకలనం చేశాడు. అయితే జె.జె. వెలెజ్ వ్రాసిన 'ది ప్రష్యన్స్' తప్ప మిగిలిన వన్నీ ప్రస్తుతం మరుగున పడిపోయాయి.

19 వ శతాబ్దంలో కవుల, మాండలిక రచయితల సంఖ్య బాగా పెరిగింది. అయితే ఈ శతాబ్ది మొదటి అర్ధభాగంలో గుర్తుంచుకోదగ్గ రచనలు కొన్నే ఉన్నాయి. వీటిలో ఛార్లెస్ నికొలస్ సిమొలన్ వ్రాసిన *లికోప రియె* (1822), హెచ్.జె.ఫోరిర్ వ్రాసిన *లిక్రాపి మానెడ్జె* (1830), సి.హెచ్.డ్యూ వివీర్ వ్రాసిన *లిపాంటలోన్ ట్రావె* (1839), జాస్ లామయె వ్రాసిన *లి బర్గ్‌మెయ్రె* అనే రచనలు చాలా ముఖ్యమైనవి. ఈ రచనలలో *లికోపరియె* అనేది సెయింట్ లాంబర్ట్ ప్రధాన చర్చికి చెందిన ప్రాచీన క్లాక్-టవర్‌నూ, లీజ్ చరిత్రలోని మహ త్తర సన్నివేశాలనూ చిత్రిస్తుంది. *లి బర్గ్‌మెయ్రె* అనే రచన వాలూన్ ప్రజలలో ఇప్పటికీ మంచి ఆదరణ పొందు తూంది. వాలూన్ సాహిత్య రంగంలో ఈ శతాబ్దంలో జరిగిన ప్రముఖ సంఘటన. 'సొసైటీ లిటరేచర్ వాలూన్' ఏర్పాటు కావడం ఈ సొసైటీ 1856 లో లీజ్‌లో ఏర్పా టయింది. ఇది నిజమైన ప్రాంతీయ విద్వత్‌పరిషత్తుగా రూపొందింది. వాలూన్ భాషా సాహిత్యాలమీద దాని ప్రభావం గణనీయమైంది. ఈ సంస్థ ఏర్పడినప్పటినుంచీ వాలూన్ సాహిత్యంలోని పద్యాల, నాటకాల సంఖ్య బాగా పెరిగింది. అంతే కాకుండా ప్రసిద్ధ విదేశీ రచయితల రచనలను వాలూన్ భాషలోకి అనువదించుకోడం కూడా చురుకుగా సాగుతూంది. మరొక విశేషం: ఈ సొసైటీ మేధావులనూ, పండితులనూ, రచయితలనూ, జానపద కళాకారులనూ అందరినీ ఒకే వేదిక మీదికి చేర్చింది. ఇది ఒక రకమైన రాష్ట్రీయ అకాడమీగా రూపొందింది. ఈ

సొసైటీ ప్రతి సంవత్సరం సాహిత్య పోటీలను ఏర్పాటు చేసింది. బులెటిన్‌లనూ, వార్షిక సంచికలనూ ప్రచురిస్తూ వచ్చింది.

ఈ సొసైటీ 1857 లో ఆంద్రి డెల్‌చెఫ్ వ్రాసిన *లిగా లంట్ డిల్ సర్వెంట్* అనే నాటకానికి బహుమతి ఇచ్చింది. 1884 లో ఎడ్వర్ట్ రియొచాంప్స్ వ్రాసిన *టీటాపిల్ పెర్కీ* అనే నాటకానికి కూడా ఈ సొసైటీ బహుమతి లభించింది. ఈ నాటకం ప్రదర్శించిన ప్రశంసనీయమైన పద్ధతి అద్భుతమైన వాలూన్ సాహిత్యాభివృద్ధిని సూచిస్తూంది.

20 వ శతాబ్దంలో వాలూన్ సాహిత్యం బాగా అభివృద్ధి చెంది కొత్త పుంతలు తొక్కింది. పండితులు సైతం తమ రచనలలో మాండలికాలను వాడుక చేయడం ప్రారంభమైంది. అనేకమంది మాండలిక భాషల అధ్యయనాన్ని చేపట్టడం ఈ శతాబ్దంలో చెప్పుకోదగ్గ విషయం.

అయితే ప్రతిచోటా వ్యావహారిక మాండలికాన్ని ఫ్రెంచ్ త్రోసి రాజంటూ ఉండడం కనిపిస్తూంది. మాండలికాన్ని ముఖ్యంగా ఫ్రెంచ్ సరిహద్దుల నానుకుని ఉన్న హయ్‌నాత్ (Hainaut) జిల్లాలో గ్రామ్యంగా పరిగణించడం జరిగింది. అయితే ప్రామాణిక మాండలికాన్ని మునుపెన్నడూ కనిపించనంత విరివిగా ఉపయోగించడం జరుగుతూంది. దాదాపు అన్ని గ్రామాలలోనూ నాటక సమాజాలు వాలూన్ నాటకాలను ప్రదర్శిస్తున్నాయి. బాగా ముఖ్యమైన కేంద్రాలలో రచయిత లందరూ సమాజాలను ఏర్పరుచుకొన్నారు. ఈ సమాజాలు మంచి రచయితలకు బహుమతు లందించడంతో పాటు కరపత్రాలనూ, పత్రికలనూ కూడా ప్రచురిస్తున్నాయి.

పద్మాకర్

# వెల్ష్ భాష - సాహిత్యం

**భాష :** వెల్ష్ భాష కెల్టిక్ భాషలలో బ్రిథోనిక్ భాషా వర్గానికి చెందిన భాష. వేల్స్‌లో ఈ భాష మాట్లాడుతారు. 1961 లో ఈ భాషా వ్యవహర్తల సంఖ్య దాదాపు 7,48,000. వీరిలో చాలామంది వెల్ష్, ఇంగ్లీష్ భాషలు రెండూ మాట్లాడుతారు. ఇంగ్లీష్ భాష మాదిరిగానే ఆధునిక వెల్ష్‌భాష అంత్యప్రత్యయాలను తక్కువగా వాడుతుంది. 6 వ శతాబ్దం నుంచి వెల్ష్ భాషకు సంపన్నమైన సాహిత్యం ఉంది. ఈ భాషలో అనేకమైన స్థానిక మాండలిక భేదాలు కనిపిస్తాయి. అయితే వేల్స్ రాజవంశంలో హెన్రీ ట్యూడర్ (హెన్రీ VII) 1485 లో బ్రిటిష్ సింహాసనాన్ని అధిష్ఠించడంతో ఈ మాండలికాలు క్రమంగా అంతరిస్తూ వచ్చాయి. ప్రస్తుతం కొద్దిమంది మాత్రమే వెల్ష్ భాషను మాట్లాడేవా రున్నారు.

**సాహిత్యం :** వెల్ష్ సాహిత్యానికి 6 వ శతాబ్దం నుంచి సుసంపన్నమైన, ఎడతెగని చరిత్ర ఉంది.

వెల్ష్ సాహిత్య చరిత్రను 3 యుగాలుగా విభజించవచ్చును. ఈ మూడింటిలో ప్రధానంగా గాయక కవుల యుగం (bards) మొదటిది. వీరి ప్రశస్తి కావ్యాలలో ఛందస్సు, అంత్యప్రాసలు కచ్చితంగా పాటించబడ్డాయి. తరువాత మధ్య యుగాల చివరి దశలో కావ్యభాషలో శైలీ ప్రాధాన్యం తగ్గిపోతూ వచ్చింది. అంతే కాకుండా వివిధ విషయాలను కావ్య వస్తువులుగా గ్రహించడం ఆరంభమైంది. మధ్యయుగం నాటి గద్యలో ప్రధానంగా కథలు, న్యాయశాస్త్ర గ్రంథాలు చెప్పుకోదగ్గవి. రెండో యుగంలో అంటే మధ్య యుగానికీ, ఆధునిక కాలానికీ మధ్యకాలంలో వెల్ష్ ధనిక వర్గంవారు ఇంగ్లాండ్‌కు తరలిపోవడం వల్ల మొదట వెల్ష్ సంస్కృతి కొంత బలహీనపడింది. అయితే అదే కాలంలో *బైబిల్‌*ను, *బుక్ ఆఫ్ కామన్ ప్రేయర్‌*ను వెల్ష్‌భాషలోకి అనువదించడం వల్ల వెల్ష్ గద్యానికి కొంత గౌరవం, ఉత్తేజం కలిగాయి. పునరుజ్జీవనోద్యమ ధోరణులుగా సాంప్రదాయిక పద్యరచన పునరుద్ధరణకు తోడ్పడ్డాయి. అంతే కాకుండా, 18 వ శతాబ్దంలో ఛందో రహిత (వచన) పద్యం అభివృద్ధి చెందింది. దీనిని సంకీర్తనలలోనూ, జానపద వీరగాథలలోనూ వాడేవారు. మూడో యుగమైన ఆధునిక, సమకాలీన వెల్ష్ సాహిత్య యుగం 19 వ శతాబ్దం ఉత్తరభాగంలో వెల్ష్ విశ్వవిద్యాలయ స్థాపనతో ఆరంభమైందని చెప్పవచ్చును. ఈ నాడు వెల్ష్ సాహిత్యం దాదాపు అన్ని ఆధునిక పాశ్చాత్య ప్రక్రియలతోను, శైలులతోను సుసంపన్నమై పురోగమిస్తూంది.

**వెల్ష్ సాహిత్య పునరుజ్జీవనం :** 18 వ శతాబ్దంలో వేల్స్‌లోను, ఇంగ్లండ్‌లోను వెల్ష్‌భాష పట్ల, వేల్స్‌కు చెందిన ప్రాచీన గాయక కవితా ప్రక్రియల పట్ల వ్యక్తమైన ఆసక్తినీ, ప్రేరణనూ 'వెల్ష్ సాహిత్య పునరుజ్జీవనం' అంటారు. ఇది ఒక ఉద్యమంగా రూపొందింది. లీవిస్ (Levis), రిచర్డ్, విలియమ్ మోరి వంటి వారు ఈ ఉద్యమాన్ని కొనసాగించారు. ప్రాచీన గ్రంథాలను సేకరించి, కాపాడుకొంటూ వచ్చిన వెల్ష్ పండితులు ప్రాచీన వెల్ష్ గాయక కవులు వాడిన సివిడ్ (cyviydd), ఆడ్ల్ వంటి కచ్చితమైన ఛందో రూపాలను వాడవల

సిందిగా సమకాలీన కవులను ప్రోత్సహించారు. ఇతర పండితులు కూడా ప్రాచీన కవుల వ్రాత ప్రతులను సేకరించి, వాటికి ప్రతులు తయారు చేశారు. ఈ ప్రతులు తరువాత ఏర్పడ్డ పండిత పరిశోధనకు ఆధార గ్రంథాలుగా రూపొందాయి. మధ్యయుగాలనాటి కవుల తరువాత ఛందోబద్ధమైన పద్యరీతిలో కావ్యరచన చేసిన గొరొన్వి ఓవెన్ నవ్య సంప్రదాయ కవిత్వానికి మార్గదర్శకుడయాడు. లండన్‌లో వెల్ష్ సాహితీ అధ్యయనాలకు వెల్ష్‌వారు స్థాపించుకున్న కేంద్రం 'క్రిమ్రోడోరియన్ సొసైటీ'. అలాంటి ఇతర సమాజాలు 'గ్వినెడిఖియన్' వంటి వాటితో కలిసి స్థానిక కవి పండిత సమ్మేళనాలను, పోటీలను ఆసొసైటీ ప్రోత్సహించసాగింది. ఫలితంగా 19 వ శతాబ్దం తొలిభాగంలో కవుల మధ్య వార్షికపోటీ పునరుద్ధరింప బడింది.

ఈ పునరుజ్జీవనం ఫలితంగా ప్రజాదరణ చూరగొన్న రచనలతో పాటు పాండిత్య ప్రకర్షతో కూడిన రచనలు కూడా అసంఖ్యాకంగా వచ్చాయి. ఈ పునరుజ్జీవన ఫలితంగానే ఛందోబద్ధం కాని మతపరమైన రచనలు, గేయరూపమైన సంకీర్తనలు, కింగానెడ్ (స్వరకల్పన, అనుప్రాస, అంతర్గత లయలతో కూడిన ప్రక్రియ) ను ఉపయోగించే జనరంజకమైన వీరగాథలు, చారిత్రక కథలు, బైబిల్, వెల్ష్ పురాణ గాథలు, కల్పిత గాథలు ఎన్నో వచ్చాయి.

19 వ శతాబ్దం నాటికి దాదాపు వేల్స్‌లోని కళలన్నిటిమీద ఇంగ్లాండు ప్రభావం బాగా ప్రబలమైంది. పునరుజ్జీవనం కనుమరుగయింది. 19 వ శతాబ్దం చివరలో మొదటి పునరుజ్జీవనం పునాది మీద కొత్తగా ఏర్పడ్డ వేల్ష్ విశ్వ విద్యాలయంలో రెండవ పునరుజ్జీవనం ఆరంభమైంది. ప్రాచీన గ్రంథాల అధ్యయనానికి సునిశితమైన పాండిత్యాన్ని అనువర్తింపచేయడం జరిగింది. ఈ పునరుజ్జీవనం వల్ల కొంతమంది కవులు ఉత్తేజితు లయారు. గతకాల వైభవాన్నీ, వెల్ష్‌భాష మనుగడకు సంబంధించిన ఆసక్తినీ ప్రతిబింబించే ప్రయోగాత్మక పద్య రచనలు వచ్చాయి.

పద్మాకర్

## శ్వానిష్ భాష - సాహిత్యం

**భాష :** ఒకప్పుడు ఇటలీలో వాడుకలో ఉండిన ఇండో-యూరపియన్ భాషా కుటుంబానికి చెందిన లాటిన్ భాషనుంచి ఉత్పన్నమైన 4 రోమాన్స్ భాషలలో శ్వానిష్ (ఎస్పనోల్) భాష ఒకటి. తక్కిన మూడు రోమాన్స్ భాషలు: ఫ్రెంచ్, ఇటాలియన్, పోర్చుగీస్.




స్పెయిన్

స్పెయిన్, ఉత్తర, దక్షిణ అమెరికాలు, ఆఫ్రికాలలో ఈ నాడు శ్వానిష్ భాష మాట్లాడేవారు సుమారు 25 కోట్లమంది ఉన్నారు. లాటిన్ గ్రంథాలకు టీకల రూపంలో వ్రాయబడిన అత్యంత ప్రాచీనమైన శ్వానిష్ రచనలు 10 వ శతాబ్దం నుంచీ కనిపిస్తున్నాయి. శ్వానిష్ సాహిత్యంలో తొలి రచన అని చెప్పదగిన గ్రంథం 1150 ప్రాంతంలో వెలువడింది.

శ్వానిష్ భాషనే - ముఖ్యంగా లాటిన్ అమెరికాలో - 'కాస్టీలియన్' అని కూడా అంటారు. 'కాస్టీలియన్' మాండలికం నుంచే నేటి ప్రామాణిక శ్వానిష్ భాష ఏర్పడింది. 9 వ శతాబ్దం ప్రాంతంలో బుర్గోస్ నగర ప్రాంతంలోనూ, ఉత్తర, మధ్య స్పెయిన్ (ప్రాచీన కాస్టిలీ) ప్రాంతంలోనూ ఈ 'కాస్టీలియన్' మాండలికం వాడుకలో ఉండేది. మూర్ల నుంచి స్పెయిన్ తిరిగి జయింపబడిన తరువాత 11 వ శతాబ్దంలో ఈ మాండలికం దక్షిణానికి కూడా వ్యాపించి, మధ్య స్పెయిన్ (నూతన కాస్టిలీ) లో మాడ్రిడ్, టోలిడో నగర ప్రాంతాలలో కూడా వాడుకలోకి వచ్చింది. 15 వ శతాబ్దం చివరి భాగంలో కాస్టిలీ, లియోన్ రాజ్యాలు ఆరగాన్ రాజ్యంతో విలీనం కావడంతో కాస్టీలియన్ మాండలికం స్పెయిన్ దేశం అంతటికీ అధికార భాష అయింది.

ఆరగాన్, నవర్రీ, లియోన్, ఆస్ట్రియాస్, సాం[illegible] డర్ మాండలికాల వాడుక క్రమంగా తగ్గుతూ వచ్చి, [illegible] ఏవో కొన్ని గ్రామీణ ప్రాంతాలలో మాత్రమే అవి నిలచి ఉన్నాయి. స్పెయిన్‌లో వాయువ్య భాగంలో మాట్లాడే గాలీషియన్ అనే పోర్చుగీస్ మాండలికం వాడుక కూడా క్రమంగా తగ్గిపోతూంది.

12 వ శతాబ్దికి ముందు అరబ్బులు ఆక్రమించిన స్పెయిన్ భూభాగంలో వాడుకలో ఉండిన స్పానిష్ మాండలికాన్ని మొజరాబిక్ అంటారు. ఇది నేటి స్పానిష్ భాషకు ప్రాచీన రూపం. దీనిలో అరబిక్ పదాల వాడుక ఎక్కువగా కనిపిస్తుంది. ఈ భాష ముఖ్యంగా నేడు అరబిక్, హీబ్రూ గీతాలలో కనిపించే 'ఖర్జా'లు అనబడే 'పల్లవి' పంక్తులలో నిలిచి ఉంది.

ఐబీరియన్ ద్వీపకల్పం (స్పెయిన్, పోర్చుగల్) బయట బ్రెజిల్ మినహా ఉత్తర, దక్షిణ అమెరికాలలోని అన్ని ప్రాంతాలలోను, ఫిలిప్పీన్స్‌లోను నేడు స్పానిష్ భాష వాడుకలో ఉంది. బ్రెజిల్‌లో మాత్రం స్పానిష్‌కు సోదరీ భాష అయిన పోర్చుగీస్ మాట్లాడుతారు. లాటిన్ అమెరికాలో మాట్లాడే స్పానిష్ భాషలో అనేక మాండలిక భేదాలు ఉన్నాయి. అన్నీ 'కాస్టీలియన్' నుంచి ఉత్పన్నమైనవే అయినా ఉచ్చారణలో యూరపియన్ స్పానిష్ భాష కంటె పలు విషయాలలో అవి భిన్నంగా ఉంటాయి.

లాటిన్ భాషలోని విభక్తి వ్యవస్థ స్పానిష్ భాషలో పూర్తిగా లోపించింది. సర్వనామాలలో కర్త, కర్మలకు మాత్రమే విభక్తి ప్రత్యయాలు చేరుతాయి. నామవాచకాలకు పుంలింగ స్త్రీలింగ ప్రత్యయాలు చేరుతాయి. ఏకవచన రూపానికి - 's' లేక - 'es' చేర్చడంవల్ల బహువచనరూపం ఏర్పడుతుంది. నామవాచకాలను అనుసరించి విశేషణాలకు ప్రత్యయాలు చేరుతాయి. క్రియారూపాలు ఏర్పడే వ్యవస్థ సంకీర్ణం అయినా, నియత మైంది.

**సాహిత్యం :** స్పెయిన్ దేశపు ప్రజలు అరబ్బులతో జరిపిన యుద్ధాలకు ఫలితంగా స్పానిష్ సాహిత్యం ప్రారంభమైంది. ఆయుద్ధాలలో స్పానిష్ యోధులు ప్రదర్శించిన ధైర్య సాహసాలను ప్రశంసించే గీతాలు మొదట బయలుదేరాయి. 1140 ప్రాంతంలో రచింప బడిన *పొయిమా (కాంతార్) దమియోసిద్* లభించినంతలో స్పానిష్ భాషలో వెలసిన మొట్టమొదటి ఇతిహాస కావ్యం. 40 ఏళ్లకు ముందు వాస్తవంగా జరిగిన ఒక సైనికుని వీరగాథ ఆ కావ్యంలో ఇతివృత్తం. 13 వ శతాబ్దంలో *లావిదాద సాంతా మారియా ఈగిప్సియాకా* అనే కావ్యం వచ్చింది. గొంజాలొద బర్సియో (1198-1265) అనేక పుణ్యపురుషుల జీవిత గాథలు రచించాడు. యూసాన్ రెంలోజో 1250 ప్రాంతంలో *వ్రిబోద అవిజాంద్రే* అనే కావ్యంలో నైసర్గిక సౌందర్యాన్నీ, పార్థివ సంపదనూ వర్ణించాడు.

6 వ ఆల్ఫోన్జో (1226-1357) కాలంలో ఫ్రెంచ్ సాహిత్యప్రభావం నుంచి విముక్తి పొందిన స్పెయిన్ కవులు గేయకవిత్వం వ్రాయడం మొదలు పెట్టారు. ఈ కవులను 'త్రోవాదోర్'లు అంటారు. పెడ్రోఅమిగో దనెవిల్లా, మొదదిసాంకో, ఐరాస్‌నూనెజ్ రసాంతియాగో అనే వారు ఈ విధమైన సంచార గాయక కవులలో ప్రధానమైనవారు. ఈ కాలంలో వెలువడిన గద్య రచనలలో కథలు, కథానికలు కూడా ఉన్నాయి. దాన్ యువాన్ మాన్యుయెల్ (1282-1339) కాస్టిల్ నగర కథా సంపుటిని *ఎల్‌కోందేల్ కానోర్* అనే పేరుతో ప్రకటించాడు. ఈ కథలకు మన పంచతంత్రమే మూలం. క్లిమెంత్‌పానెజ్ (1379-1426) నీతి బోధించే కథలు కూర్చాడు. వీర రసాత్మకమైన నవలలలో మొదటిది *ఎల్‌వ్రిబోదెల్‌కాబా లేరజిఫార్.* యువాన్ రోద్రిగెజ్ దలాకామార్ రచించిన *ఎల్‌సియోక్వోలి బ్రౌద అమోర్* (1440) ఈ తెగకు చెందిందే.

15 వ శతాబ్దంలో వచ్చిన ప్రభుత్వాన్ని విమర్శించే వ్యంగ్య రచనలలో *కోప్లాజ్‌దెల్ ప్రోలిస్మియాల్* (1670), *కోప్లాజ్ దయింగో రేవిల్లో* ముఖ్యమైనవి.

యువాన్ రుయిజ్ (1350) స్పెయిన్ దేశపు ప్రథమ మహాకవి. ఇతడు స్వీయకథ ద్వారా ఇంద్రియ సుఖాలకు లోను కాకూడదని హెచ్చరింపదలచి *ఎల్ వ్రిబోదబుయోన్ అమోర్* అనే కావ్యం వ్రాశాడు. వాస్తవికత, పశ్చాత్తాపం, పాత్రపోషణ గల ఈ కావ్యంలో అనేక మధురగేయా లున్నాయి. అల్ఫోన్జో అల్వారెజ్ దవిల్లా సందినో (1345-1425) రచనలలో స్తుతి, విమర్శ అధికంగా కనిపిస్తాయి. డోన్ ఇనిగోలో పెజ్ దమెందో జా కృతులలో ప్రాచీన కావ్యశైలితో ఇటాలియన్ సాహిత్య ప్రభావం సమన్వితం అయింది. స్త్రీల చపలత, ధూర్తత, పచ్చి శృంగారం వర్ణించిన కవి అల్ఫోన్జో మార్తినెజ్ ద తోలెదో (1398-1470). వీర గాథలను, సమకాలిక చరిత్రను చిత్రించినవాడు ఫర్నాన్ పెరెజ్ దగుజర్మన్ (1376-1460).

15 వ, 16 వ శతాబ్దాలలో మానవతా వాదం రచయితలను ఆకర్షించింది. ఈ యుగంలో స్పెయిన్‌దేశం ఉత్తమ నాటకాలను సృష్టించగలిగింది. ఫెర్నాండో దరోజస్ (1465-1541) 14 అంకాలు గల *లా సెలెస్తినా* అనే నాటకం వ్రాశాడు. పాత్రల స్వభావాలు ఆధారంగా చేసుకుని సన్నివేశాలు రూపొందినట్లు చిత్రించే నవ్య నాటకాలకు ఇది మార్గదర్శకం అయింది.

ఈ కాలంలో ఇటలీలో బహుళ ప్రచారంలో ఉన్న సిద్ధాంతాలను అనుసరించి యువాన్ దెన్ ఎన్సినా (1469-1529) కొన్ని నాటకాలు వ్రాశాడు. సుందరం,

యథార్థం అయిన దృశ్యాలతో హాస్యమయ రూపకాలను బార్తొలొ మెదతొరెస్ నా హారో రచించాడు. సంవాదం, భావం, శృంగారం, వినోదం ఎక్కువగా కనిపించే రూపకాలు వ్రాసినవాడు గిల్ విసెంతే (1465-1539). కొందరు నాటక కర్తలు ప్రాచీన గ్రీక్ నాటకాలలోని ఇతివృత్తాలను నవీన దృక్పథంతో చిత్రించారు. ఇలాంటి నాటకాలలో *ఫిలోమెనా* (1564), *నీజేలారి ఆ దా* (1577) ముఖ్య మైనవి. సెనెకా ప్రభావంతో హత్యా కాండలతో నిండిన నాటకాలు కూడా అప్పుడు రాసాగాయి. నీగ్రోపాత్ర లను రంగస్థలంమీద ప్రవేశపెట్టిన లోపెదర్ యెదో రచనలలో *ఆర్మెలిందా* ముఖ్యమైంది. ఈ యుగంలో వెలసిన ఉత్తమ నాటకకర్త లొపెద లేగా. స్థానికమైన ఇతివృత్తం తీసుకొని పలువిధాలైన పాత్రలతో, సజీవమైన శైలిలో దేశ ప్రేమను, వీరస్త్రీల మనోవైజ్ఞానిక విశేషాలను ఇతడు ప్రదర్శించాడు. 'ఆత్మయాత్ర', 'మిథ్యాసత్యం', 'సేవిల్ నక్షత్రం', 'ఎల్ అల్కాల్దేద జాలామీ' ఇతడు రచించిన నాటకాలలో శ్రేష్ఠమైనవి. వీటిలో కథావస్తువు, పాత్రలు సమప్రాధాన్యం కలవి. తిర్సోదమాలీనా రచనలలో 'గృహాన్ని శాసించే స్త్రీ', 'రాజప్రాసాదంలో లజ్జావతి' అనేవి ముఖ్యమైనవి. వీటిలో ఆచార సంప్రదాయాల ప్రాధాన్యం చిత్రించబడింది. మెక్సికోలో జన్మించిన యువాన్ రుయి జ్‌ద ఆలార్కోన్ ఈమెందోజా (1581-1639) 'సందిగ్ధ సత్యం', 'చిత్ర చయం', 'పతి పరీక్ష' మొదలైన 21 నాటకాలు వ్రాశాడు.

16 వ శతాబ్దంలో ఇటలీ దేశ సాహిత్య ప్రభావం స్పెయిన్ కవుల మీద ఎక్కువగా కనిపించినా, క్రిస్తోబల్ దకాస్తిల్లేజో (1490-1550) మొదలైనవారి కవిత్వంలో శబ్దాల కూర్పులోను, భావనలోను జాతీయతా ముద్ర పోలేదు. ఇటలీ వారి శైలిని అనుకరించిన జువాన్ జొస్కాన్ ద అల్మోగలేర్ (1495-1542) గేయ కవిత్వాన్ని ప్రచారంలోకి తెచ్చిన గర్సిలా సోదలాలేగా ప్రభృతులు సౌందర్యాన్నీ, భావుకతనూ కరుణరసంతో నింపి వేశారు. వీరరస ప్రధానమైన 'ఓడ్'అనే ఖండకావ్య ప్రక్రియను పరాకోటికి తీసికొని పోయినవాడు ఫెర్నాండో దవెరేరా. రోడ్రిగోకారో (1573-1645), లుపర్సియో (1559-1613), బర్తొలోయే (1561-1631)లు 'సానెట్' అనే ఖండకావ్య ప్రక్రియను ఉచ్చదశకు తీసికొనిపోయి శ్పానిష్ కవితా స్రవంతిని సజీవం చేశారు.

స్థానిక పరిస్థితులను దృష్టిలో ఉంచుకొన్న విమ ర్శలు, గద్యరచనలు ఈ కాలంలో వెలువడ్డాయి. శక్తి మంతమైన శైలిలో సంత్ ఇగ్నాతియస్ (1491-1556) వ్రాసిన గద్యకృతులను అనుకరించిన వారిలో బర్నార్డినో (1482-1545), జువాన్ ద ఆవిలా (1500-1569) ముఖ్యులు. లుఇస్ దగ్రానాదా అనేక లాటిన్ రచనలను శ్పానిష్‌భాషలోకి అనువదించాడు. వీరితో ఆరంభమైన రహస్యవాదం నాన్ సెత్రోద ఆల్కాంతారా (1499-1562) చేతిలో ప్రేమతో సమన్వయం పొందింది. సాంతా తెరేనా రచనలలో ఈ రహస్యవాదం పరాకాష్ఠ పొందింది. ఇతి హాసాలు కూడా ఈ యుగంలోనే చాలా వచ్చాయి. చరిత్రాత్మక సన్నివేశాలు ఆధారంగా చేసికొని కొందరు వీరకావ్యాలు వ్రాశారు. జువాన్ మార్తోరెజ్ (1490) కథా సాహిత్యానికి నాంది పలికినవాడు. 1554 లో వ్రాయబడిన *లాజారిలో దతోర్మేస్* అనే కథ తరువాతి కాలంలో బహుజనాదరణ పొందింది. అయితే ఈ కథా రచయిత ఎవరో తెలియదు. యూరప్ సాహిత్య జగత్తును తన వశం చేసుకొన్న మిగువెల్ ద సర్వాంతిస్ అద్వితీయ ప్రతిభాశాలి. ఇతడు రచించిన *డాన్‌క్విక్సోట్* నేటికీ పాఠకులను ఆకర్షిస్తూనే ఉంది. ఈ నవల తోనే యూరప్‌లోని భాషలలో ఆధునిక నవలల యుగం ఆరంభమైంది.

16 వ శతాబ్దంలో స్పెయిన్ సాహిత్యంలో 'బరోక్' అనే నూతనశైలి ఆరంభమైంది. జోజెదవాల్ది వియెల్సో (1560-1638), లుయిస్ దగాంగోరా ఇ ఆర్గోతే మొదలై నవారు ఈశైలిలో ఆరితేరినవారు. ఇదే శైలిలో నాటకాలు వ్రాసిన వారిలో లుయిస్ వాలెస్ దగేవారా ముఖ్యుడు. మహా మేధావి, గొప్ప నాటకకర్త అయిన కాల్దెరోస్ కూడా ఈ యుగం వాడే! అద్భుతమైన సంవాదాలు, శబ్దచిత్రం, సంగీతం కలిగి ధ్వని ప్రధానాలైన ఇతని నాటకాలు నేటికీ సజీవాలుగా నిలచి ఉన్నాయి.

18 వ శతాబ్దంలో ఫ్రెంచ్ సాహిత్య ప్రభావంతో 'బరోక్' శైలి వెనుక బట్టింది. సమీక్ష, తార్కిక బుద్ధి, వివేచనా పటిమ సాహిత్యంలో ప్రవేశించాయి. దాన్ ఫెలిక్స్ మరియా సమానియేగో (1745-1801) దేశీయ సామగ్రిని ఆధారంగా చేసికొని *ఫాబులాజ్ మోరాలెజ్* రచించాడు. కథలు, గద్య రచనలు, కావ్యాలు, నాట కాలు పూర్తిగా విజృంభించిన ఈ సాహిత్యంలో భావరూప సంయోజనం, శబ్దగౌరవం, లాక్షణిక సమ్మతి ఉన్నాయి. భావోద్రేకం, ఆవేశం మొదలైనవి సమీక్షకుల సిద్ధాంతా లలో ప్రధాన స్థానం పొందినా సాహిత్య ధారలో వీటికి ప్రాముఖ్యం కన్పించకుండా చేసిన రచయితలు 18 వ, 19 వ శతాబ్దాలలో ఉన్నారు. కాని, 1834 నుంచి 10 సంవత్సరాల కాలంలో నాటక రంగంలో భావనా

పటిమ, సంచారి భావ వైశిష్ట్యం కనిపించాయి. కొంత బీభత్స రస ప్రదర్శన కూడా లేకపోలేదు. బహుజ నామోదం పొందిన నాటక కర్తలలో ఫ్రాన్సిస్కోమార్తి నెజ్‌దలా రోజా (1787-1872), మరియానో బోజెదలారా మొదలైనవారు ఉన్నారు.

సౌందర్యోపేతం, స్వాభావికం అయిన గేయ కవిత *జోజెద ఎస్ప్రోన్సెదా* కావ్యాలలో ఆవిర్భవించింది. ఆదర్శ ప్రణయాన్ని చిత్రించిన కవి గుస్తావో అదుల్ఫోలేకర్. స్కాట్ రచించిన నవలల ప్రభావంతో ఆధునిక నవలలు వ్రాసిన వారిలో తెలెస్ఫోరో (1799-1835), పత్రీసియో (1807-1878), యుజెనియో (1815-1872) ముఖ్యులు. కాని, 19 వ శతాబ్దంలో వాస్తవికతా వాదం సాహిత్యంలో ప్రవేశించింది. జోజె మరియాద పెరేదా, బెనితో పెరెజ్‌గల్డోస్ లు ఈ మార్గంలో పేరెన్నిక కన్నవారు.

1898 లో రాజకీయ రంగాన్ని ఆవేశించిన కల్లోలాలతో సాహిత్యరంగం పూర్తిగా మారిపోసాగింది. రాజకీయ సామాజిక సమస్యలు ఇతివృత్తాలు అయాయి. పియో బరోజా, ఐన్సెంతె బ్లాస్కో ఇటానెజ్ (1867-1928), రామోస్ పెరోజ్ ద అయాలా (1880) మొదలైన ఆధునికుల చేతులలో జీవితానికి సన్నిహితంగా సాహిత్య ధార ప్రవహించ సాగింది. గేయకవిత్వంలో ఆంతోనియో మాకాంద్ (1875) మార్గదర్శకుడు అయాడు.

20 వ శతాబ్దంలో రెండు ప్రపంచ సంగ్రామాలే కాక, స్పెయిన్‌లో అంతర్యుద్ధం కూడా రావడంచేత శ్పానిష్ సాహిత్యం స్పెయిన్‌లోనే కాక, దక్షిణ అమెరికా, అర్జెంటీనా, క్యూబా, వెనిజుల, చిలీ, పెరూ, మెక్సికో దేశాలలో కూడా బాగా విజృంభించింది.

స్పెయిన్‌లో అంతర్యుద్ధం (1936-39) వల్ల ప్రతి భావంతులైన శ్పానిష్ రచయిత లెందరో ఇతర దేశాలకు వలసపోవలసి రావడంతో శ్పానిష్ సాహిత్య స్రవంతికి అంతరాయం ఏర్పడింది. దారుణమైన యుద్ధానుభవాలూ, యుద్ధంవల్ల సాంస్కృతికంగానూ, ఆర్థికంగానూ కలిగిన ఫలితాలూ శ్పానిష్ సాహిత్యంలో తీవ్రమైన వాస్తవికతా వాదానికి దారితీశాయి. తత్ఫలితంగానే కామిలోజుస్ సెలా ప్రారంభించిన ట్రెమెండిస్మో (ప్రాకృతికవాదం, అస్తిత్వవాద దృక్పథాలతో కూడింది) సంప్రదాయం కార్మెన్‌మార్టిన్ గైతే, ఎలీనా క్విరోగాల వంటి నవలా రచయితలలోని తీవ్ర సంఘసత్య దృక్పథంతో అభివ్యక్తమైంది. వాక్య నిర్మాణం, కథా కథనం, సాహిత్య భాషా స్వరూపం మొదలైనవాటిలో 1960 తరువాతి దశాబ్దంలో అనేక ప్రయోగాలు జరిగాయి. అంతకు ముందు సంఘసత్యదృక్పథాన్ని అనుసరించిన యువాన్‌గోయితిపోలో, జోస్‌మరియాగిరోనెలా మొదలైన వారి రచనలలో ఇవి కనిపించాయి. ఆంటోనియోబ్యురో వాలెజో వ్రాసిన నాటకంలోను, 'అసందర్భ' (Absurdism) సిద్ధాంత ప్రవక్త ఫెర్నాండో ఆరబాల్ రూపకాలలోను ఆకృతిలోనూ, శిల్పంలోనూ నూతన ప్రయోగాలకు చాలా ప్రాధాన్యం కనిపించింది. అయితే - ఆల్ఫోన్జో సాస్త్రే తన రచనలలో సాంఘిక సమస్యలపట్ల మరింత ప్రత్యక్ష సంబంధాన్నీ, నిబద్ధతనూ ప్రదర్శించాడు.

అంతర్యుద్ధం తరువాత భావకవిత (Lyric poetry) లో వెనుకటి 'మోడర్నిస్టులూ', 1927 తరం రచయితలూ పాటించిన సంక్లిష్టత తొలగిపోయి, ఆకృతి విషయంలోనూ, భావ స్పష్టత విషయంలోనూ ఎక్కువ సరళత, సాంఘిక భావన కనిపించింది. ఈ ధోరణి గేబ్రియా సెలయా, బ్లాసద ఓటెరో, క్లడియారోడిగ్వెజ్ వంటి కవులలో బాగా అభివ్యక్తం అయింది.

పో.సు.శా.(బొ.శ్రీ.)

## స్కాండినేవియన్ భాషలు - సాహిత్యాలు

**భాషలు :** డెన్మార్క్, ఫేరో దీవులు, ఐస్‌లాండ్, నార్వే, స్వీడన్ వాసులు ఉపయోగించే భాష లన్నింటినీ కలిపి 'స్కాండినేవియన్' భాషలు అంటారు. ఇవి జెర్మానిక్ భాషా శాఖకు సంబంధించిన ఉత్తర జెర్మానిక్ భాషా వర్గానికి చెందినది. డేనిష్, స్వీడిష్, నార్వేజియన్ (డేనోనార్వేజియన్, న్యూ నార్వేజియన్ రూపాలు), ఐస్‌లాండిక్, ఫేరోయీస్ భాషలు ప్రధానమైన ఆధునిక ప్రామాణిక స్కాండినేవియన్ భాషలు. వీటిలో డేనిష్, స్వీడిష్ భాషలను ప్రాచ్య స్కాండినేవియన్ భాషలని, నార్వేజియన్, ఐస్‌లాండిక్, ఫేరోయీస్ భాషలను పశ్చిమ స్కాండినేవియన్ భాషలని రెండు వర్గాలుగా వ్యవహరిస్తారు. 11 వ శతాబ్దం చివర సాధారణ స్కాండినేవియన్ భాష తాలూకు వివిధ మాండలికాల నుంచి ఈ భాషలు పుట్టాయి.

ఐస్‌లాండిక్, ఫేరోయీస్ భాషలు పాత 'నార్స్'లోని అనేక పదాలను, వ్యాకరణ ప్రక్రియలను నిలుపుకున్నాయి. ఈ రెండుభాషలలోను కనిపించే ప్రాచీన స్కాండినేవియన్ భాషా లక్షణాల వలన ఇతర స్కాండినేవియన్ భాషా వ్యవహర్తలకు ఇవి సులభంగా బోధపడవు. నార్వే, స్వీడెన్, డెన్మార్క్ నివాసులు ఎవరి భాషలో వారు మాట్లాడినా ఒకరి భాష మరొకరికి కొంతవరకు అర్థం అవుతుంది. ఈ భాషలలోని అనేక పదాలు, వ్యాకరణ ప్రక్రియలు చాలా వరకు ఏక రూపంగా ఉండడం, 600-1050 మధ్య

సాధారణ స్కాండినేవియన్ భాష ఎన్నెన్నో మార్పులకు గురి అయినా, ఆ మార్పులు ఈ భాషలలో కూడా దరిదాపు ఒకే రీతిలో జరగడం ఇందుకు ప్రధాన కారణాలు.

**సాహిత్యాలు :** స్కాండినేవియన్ సాహిత్యం మధ్య యుగాలలో ఉద్భవించింది. 200-800 మధ్య లభించిన రూనిక్ శాసనాలు ఈ భాషల తాలూకు ప్రాథమిక రచనలుగా పేర్కొనవచ్చును. నార్వేజియన్, ఐస్‌లాండిక్ భాషలలో మొదట వీర గాథలు, పురాణాలు, మహాపురుషుల ప్రశస్తులు, దైవ ప్రార్థనలు మొదలైన పద్య రచనలు వెలశాయి. 12 వ, 13 వ శతాబ్దాలలో వచ్చిన ప్రముఖ గ్రంథాలలో డెన్మార్క్ రచయిత శాన్సో గ్రామేటికస్ వ్రాసిన *గెస్టాడానోరమ్* (1185-1222 మధ్య; 'డెన్మార్క్ ప్రజలకృత్యాలు') స్కాండినేవియన్ సాహిత్యాలకు ఒక నిధానం వంటిది. ఈ రచన డెన్మార్క్‌కు మరింత ప్రాతినిధ్యం వహిస్తుంది. *యూఫేమియా విసోర్నా* (యూఫేమియా గీతాలు) 1303-1312 మధ్య స్వీడిష్ భాషలో వెలువడిన ఒక వీరగాథా కావ్యం. 1397 లో నార్వే, డెన్మార్క్‌లు రాజకీయంగా ఏకమయాయి. తరువాత కొద్ది శతాబ్దాల పాటు డేనిష్ భాషే రెండు దేశాలకూ సాహిత్య భాషగా కొనసాగింది.

స్కాండినేవియన్ సాహిత్యా లన్నిటిమీద లూథరన్ సంస్కరణోద్యమ ప్రభావం ప్రబలంగా కనిపిస్తుంది. 16 వ శతాబ్ది మధ్యకాలంలో స్వీడిష్, డేనిష్, ఐస్‌లాండిక్ భాషలలోకి *బైబిల్* అనువదించబడింది. అంతే కాక సంస్కరణోద్యమాన్ని దూషిస్తూనో, భూషిస్తూనో చక్కని రచనలు అనేకం వెలువడ్డాయి. తొలి లూథరన్ ప్రార్థన గీతాలు, ప్రబోధ గీతాలు కూడా వెలశాయి. 17 వ శతాబ్ది నాటి డేనిష్ జాతీయుడైన తామస్ కింగో వ్రాసిన భావ గీతాలూ, సంకీర్తనలూ, స్వీడిష్ జాతీయుడు జార్జ్ స్టీర్న్ హీల్మ్ వ్రాసిన కావ్యాలూ, ముఖ్యంగా *హెర్‌క్యులీస్* (1658) అనే ద్వ్యర్థికావ్యం యూరప్ ఖండంలో ఇతరదేశాలలో వెలసిన 'నవ్య సంప్రదాయ వాదాన్ని' (Neo-classicism) కొంత ఆలస్యంగా అయినా స్కాండినేవియాలో ప్రవేశ పెట్టాయి.

నార్వే జాతీయుడు లుడ్విగ్ హోల్‌బెర్గ్ సుఖాంత నాటకాలతో డెన్మార్క్‌లోను, ఓలోఫ్ వాన్ డాలిన్ నడపిన పత్రిక దెన్‌శ్వాన్ స్కా ఆర్గస్ (1732-34)తో స్వీడెన్‌లోను పునర్వికాసయుగం చివురుతొడిగింది. డాలిన్ నడిపిన పత్రిక ఫ్రెంచ్, ఇంగ్లీష్ భావాలను, సాహిత్య రూపాలను స్వీడెన్‌లో వ్యాపింపచేయడంలో ప్రముఖ పాత్ర నిర్వహించింది.

18 వ శతాబ్దం చివరనూ, 19 వ శతాబ్ది ఆరంభంలోనూ స్కాండినేవియాలో ప్రారంభమైన కాల్పనికోద్యమం కొంత వరకు 18 వ శతాబ్దినాటి బ్రిటిష్ రచనలనుంచి - ముఖ్యంగా *ఓసియన్* పేర జేమ్స్‌మేక్ పెర్సన్ వ్రాసిన పద్యాలనుంచి, తామస్ గ్రే, ఎడ్వర్డ్‌యంగ్‌ల పద్యాలనుంచీ, ఎక్కువగా జర్మన్ రచయితలైన గెతే, షిల్లర్, హెర్డర్‌బెర్గ్ జానపద సంప్రదాయం 'జేనా' తాత్త్విక సంప్రదాయం మొదలైన వాటి నుంచీ ఉత్తేజం పొందింది. 1807 లో కోపెన్ హాగెన్ మీద జరిగిన దాడి, ఫిన్‌లాండ్‌ను రష్యన్‌లు ఆక్రమించుకోడం మొదలైన అవమానకరమైన రాజకీయ సంఘటనల వలన డెన్మార్క్, స్వీడెన్‌లు తమ అస్పష్టమైన ప్రాచీన వైభవాన్ని స్మరిస్తూ జాతీయ భావంతో కూడిన కాల్పనికతను అలవరచుకొన్నాయి. డేనిష్ రచయితలు జోహనీస్, ఎవాల్డ్, ఆడమ్, వయహ్లెన్ స్లాగ్రెగెర్‌లు పురాణ కల్పిత గాథలను ఇతివృత్తాలుగా గ్రహించారు. స్వీడెన్‌లో ఇలాంటి ప్రవృత్తిని ప్రదర్శించిన వారు ఇసయ్యాస్ టెగ్నెర్, ఎరిక్ గుస్టాఫ్ గైజర్‌లు. తాత్త్విక, కాల్పనిక రచనలు చేసినవారిలో ప్రధానులు పెర్‌డేనియల్ ఆటెర్‌బామ్, ఎరిక్ జోహాన్ స్టాగ్నెలియస్‌లు. 1809 లో ఫిన్‌లాండ్ రష్యా దేశానికి దత్తం అయిన తరువాత స్వీడిష్ భాషే చాలా రోజులు అక్కడ సాహిత్య భాషగా కొనసాగింది. ఆ కాలంనాటి ఇద్దరు ప్రముఖ ఫిన్నో-స్వీడిష్ రచయితలు: జోహాన్ లుడ్విగ్ రూన్‌బెర్గ్ అనే కవి, విద్వద్ రచయిత జఖారియస్ టోపీలియస్.

19 వ శతాబ్ది తొలి భాగంలో ఐస్‌లాండ్‌లో సంభవించిన భాషా, సాహిత్య పునరుజ్జీవనంలో కాల్పనికోద్యమం కీలకమైన పాత్రను నిర్వహించింది. ఆ ఉద్యమ ప్రధాన ప్రతినిధి జార్నిరెన్‌సెన్. ఇతడు ఆ శతాబ్దంలో తరువాత వచ్చిన భావ కవిత్వానికి వరవడి అనతగిన దేశభక్తి కవిత్వం సృష్టించాడు.

1814 లో డెన్మార్క్ నార్వేను స్వీడెన్‌కు ధారాదత్తం చేసిన తరువాత హెన్రిక్ వెర్జిలాండ్ మొదలైన ప్రముఖ నార్వీజియన్ రచయితలు తమ సాహిత్యంలో కనిపించే డేనిష్ భాషా లక్షణాలను పూర్తిగా తొలగించి స్వతంత్ర సాహిత్య సంస్కృతుల అభివృద్ధికి పూనుకున్నారు. నార్వేలో జాతీయ కాల్పనిక వాదం ప్రముఖ పాత్ర నిర్వహిస్తున్నప్పుడు ఇవాన్ ఆసెన్ అనే రచయిత నూతన సాహిత్య భాషను సృష్టించడానికి ఒక ఉద్యమాన్ని ప్రారంభించాడు. ప్రాచీన నార్స్ భాషతో సన్నిహిత సంబంధాలు

గల గ్రామీణ మాండలికాలను ఆధారంగా చేసికొని ఒక నూతన సాహిత్యభాష రూపొందించబడింది. చాలా మంది నార్వేజియన్ రచయితలు వీరోచితమైన తమ గత చరిత్ర వలన, నూతన ఉద్యమం వలన ఉత్తేజితులయారు.

19 వ శతాబ్దం చివర డేనిష్ విమర్శకుడు జార్జ్‌బ్రాండిస్ కాల్పనిక భావాలకు స్వస్తి చెప్పి, సంఘ స్వచ్ఛతను ప్రతిబింబించే ఆధునిక సాహిత్యోద్యమానికి అంకురార్పణ చేశారు. అతని సమకాలికుడు, కవి, నవలారచయిత జన్స్ హీటర్ జాకుబ్‌సన్, నార్వేజియన్ రచయితలు బ్జోర్న్స్ జెర్న్ బ్జోర్న్‌సన్, హెన్రిక్, ఇబ్సెన్, స్వీడిష్ నాటకరచయిత ఆగస్ట్ స్ట్రిండ్‌బర్గ్‌లు అతని వాదాన్ని అనుసరించారు. తొలుత వారు చారిత్రక వస్తువులచేత ఆకర్షితులయినా తరువాత బ్రాండిస్ ప్రేరణతో ఆధునిక రచనలు చేయసాగారు. ఇబ్సెన్ వ్రాసిన ప్రసిద్ధ రూపకాలు సాంప్రదాయిక నీతి విధానాల కపట నాటకాన్ని బట్టబయలుచేశాయి. స్ట్రిండ్ బెర్గ్ రచన కూడా ఇదే ధోరణి నవలంబిస్తూ వాస్తవికత నుంచి సింబాలిజమ్, ఎక్స్‌ప్రెషనిజమ్‌ల వైపు పురోగమించింది. ఇబ్సెన్, స్ట్రిండ్‌బెర్గ్‌ల ఇద్దరి రచనలకు తమ దేశంలో ప్రతిఘటన ఎదురై, వారు విదేశాలలో రచనలు చేయవలసి వచ్చింది. చివరి రోజులలో స్వదేశంలో వారికి గుర్తింపు వచ్చింది. 1890 లో సంఘ స్వచ్ఛతా సిద్ధాంతానికి ప్రతిఘటన ఎదురయింది. డేనిష్ రచయిత జోహనిస్ జోర్గెన్‌సన్ కవిత్వంలో నూతన కాల్పనిక వాదాన్ని లేవదీసి మత విశ్వాసాలను ఆదరించడం తిరిగి ప్రారంభమైంది. నార్వేజియన్ రచయిత క్నట్ హంసున్ వ్యక్తి స్వీయానుభూతుల ప్రాధాన్యాన్ని పరిహసించాడు. ఆయన సమకాలికులైన స్వీడిష్ రచయితలు వెర్నర్‌ఫామ్, హైడెన్‌స్టమ్, శాల్మాలాగెర్‌లోఫ్‌లు పురాణ గాథలను, కల్పిత కథలను తిరిగి ఆదరించారు.

20 వ శతాబ్ద ప్రథమార్ధంలో డెన్మార్క్ జాతీయులైన హెన్రిక్ పోన్టోప్పిడన్, ఇసాక్‌డినేసన్, స్వీడెన్ జాతీయుడు హ్జల్మర్ బెర్గ్‌మన్, నార్వేదేశీయుడు సిగ్రిడ్ ఉండ్సెట్ మొదలైనవారు ప్రసిద్ధకవులు. ఈ యుగంలో శ్రామిక వర్గంలోనుంచి శక్తిమంతులైన రచయితలు అనేకులు వచ్చారు. డేనిష్ జాతీయులు మార్టిన్ ఆండర్సన్ నెక్సో, స్వీడెన్ జాతీయులు ఐవిండ్ జాన్సన్, హారీ మార్టిన్‌సన్ (1974 సాహిత్యానికి నోబెల్‌బహుమతి సంయుక్తగ్రహీతలు), విల్‌హెల్మ్ మెంబెర్గ్, నార్వే జాతీయులు అక్సెల్ సేండేమోస్, క్రిస్టోఫర్ ఉప్‌డా, ఆస్కార్ బ్రాటెన్ మొదలైన వారందరూ తమ జీవితాల ప్రారంభ దశలో ఎన్నో ఢక్కాముక్కీలు తిన్నవారే! ఫిన్నో-స్వీడిష్ రచయితలు ఎడిత్ సోడర్‌గ్రాన్, గున్నార్ బ్జోర్లింగ్, స్వీడెన్ రచయితలు గున్నార్ ఎకెలాఫ్, బిర్జెర్ సోబర్గ్, పార్‌లాగెర్క్విస్ట్ (నవలలు, నాటకాలు వ్రాశాడు), డెన్మార్క్ దేశీయుడు ఎమిల్‌బొన్నెలిక్కె, గుస్టాఫ్‌మంట్ - పీటర్‌సన్, నార్వే రచయిత కోల్ఫ్‌జాకొబ్‌సెన్‌లు పద్య రచనలో ఆధునికతను ప్రవేశపెట్టిన ప్రముఖ కవులు.

ప్రథమ, ద్వితీయ ప్రపంచ సంగ్రామాలు నాటక కర్తల దృష్టిని నైతిక వర్తన, అస్తిత్వ సమస్యలు మొదలైనవాటి మీద కేంద్రీకరింపజేశాయి. ఇలాంటి రచనలలో డెన్మార్క్‌కు చెందిన కాజ్‌ముంక్‌క్జెల్డ్ ఎబెల్, నార్వేకు చెందిన నార్డాల్‌గ్రీగ్‌లు సృష్టించిన నాటకాలు ప్రముఖమైనవి. స్వీడెన్‌కు చెందిన స్టిగ్ డాగెర్‌మన్, ఫేరోయీస్ రచయిత హెవోయిన్ బ్రూ, 1955 నోబెల్ సాహిత్యబహుమతి గ్రహీత అయిన ఐస్‌లాండ్ రచయిత హల్‌డోర్‌లాక్స్‌నెస్‌లు తమ నవలలలో కూడా ఈ సమస్యలను చర్చించారు.

సుమారు 1960 నుంచి 1978 దాకా వచ్చిన స్కాండినేవియన్ సాహిత్యం ప్రధానంగా సాంఘిక, రాజకీయ నిరసనను వ్యక్తీకరించడానికే అంకితమైంది. పెట్టుబడిదారీ వ్యవస్థ పట్ల అసంతృప్తి, తృతీయ ప్రపంచ దేశాలలో కానవస్తున్న దుర్భర దారిద్ర్యం పట్ల ఆందోళన, వియట్నాం యుద్ధంపట్ల వైముఖ్యం రచయితలలో డాక్యుమెంటరీల ద్వారాను, రాజకీయనిబద్ధతతో కూడిన రచనల ద్వారాను ప్రజలలో జాగృతి కలిగించడం అవసరమనే విశ్వాసాన్ని బలపరిచాయి. అయితే 1880 తరువాత భావనాత్మక సాహిత్యం తిరిగి తల ఎత్త సాగింది. ఈ నాటి స్కాండినేవియన్ సాహిత్యంలో ప్రముఖులైన శ్వన్‌లిండ్ క్విస్ట్, క్లాస్ రిఫ్‌బ్జెర్గ్, టోవ్ జాన్‌సన్, స్టైన్‌బ్జార్న్‌బి, జాకోబ్‌సెన్‌లు వర్తమాన సమాజం పట్ల మరింత తాత్త్విక దృష్టిని ప్రదర్శిస్తున్నారు. పుక్కిటి పురాణ గాథలలో తిరిగి ఆసక్తి, శైలిలోను, శిల్పంలోను నూతన ప్రయోగాల పట్ల అనురక్తి ఎక్కువగా కనిపిస్తున్నాయి. (చూ. స్వీడిష్ సాహిత్యం - పుట 162.)

చిం.వెం.

## స్కాటిష్ భాషలు - సాహిత్యం

స్కాటిష్, గేలిక్, లోలాండ్ స్కాటిష్ (లల్లాన్స్), ప్రామాణికమైన ఇంగ్లీష్, స్కాటిష్ ఇంగ్లీష్ సాంకర్యంవలన ఏర్పడిన వివిధభాషలు స్కాటిష్‌భాషలు. ఈ భాషలలో వెలువడే సాహిత్యాన్ని స్కాటిష్ సాహిత్యం అంటారు.

స్కాటిష్ సాహిత్యంలో అత్యంత ప్రాచీన రచనలు 14 వ శతాబ్దం ఉత్తరార్థం నుంచి లభిస్తున్నాయి. జాన్ బార్బర్ వ్రాసిన *ది బ్రూస్* (1376), ఇతర తొలి స్కాటిష్ పద్య కావ్యాలు రెండు ప్రధాన సంప్రదాయాలను సూచి స్తున్నాయి: 1. చరిత్ర గ్రంథాలను రచించడం, యోగుల సూక్తులను ఎనిమిదేసి అక్షరాలు కలిగి అంత్య ప్రాస పాటించే ద్విపదలలో కూర్చడం. 2. సాహస గాథలను, కల్పిత కథలను అనుప్రాసతోను, అంత్యప్రాసతోను కూడిన పద్యాలలో రచించడం.

ఆ తరువాత వచ్చిన కాలం (1425 - 1550) స్కాటిష్ సాహిత్య చరిత్రలో స్వర్ణయుగం. మేకరిస్ (సృష్టికర్తలు) గా ప్రసిద్ధులైన ఒక కవుల బృందం ఈ కాలంలో స్కాటిష్ సాహిత్యంలో ఘన విజ యాలు సాధించింది. వారిలో రాబర్ట్ హెన్రీసన్, విలియం డంబార్గ్, గావెన్ డగ్లస్, సర్ డేవిడ్ లిండ్సే మొదలైన వారు ఇంగ్లీష్ కవి చాసర్ వలన ఎక్కువగా ప్రభావితు లయారు. కాని వారి ఆస్థాన సాహస గాథలూ, స్వాప్నిక ద్వ్యర్థి కావ్యాలూ, విలక్షణమైన ఆలంకారిక ప్రయోగాలతో కూడి ఉంటాయి. వారి కావ్యాలలోని గంభీరశైలి అతిశ యోక్తులతో కూడినదని, కృతకమైనదని భావింపబడింది. అయినా దేశీయమైన స్కాటిష్ భాషను సాహిత్య భాషగా మలచడంలోను, వ్యంగ్య పరిహాస ధోరణులను, కల్పనలను కవితా మయంగా ప్రకటించడంలోను వారు కృతకృత్యు లయారు. ఆ విధంగా వారి రచనలు స్కాటిష్ జాతీయ సాహిత్యానికి ప్రధాన ప్రాతిపదికలు అయాయి.

ఈ యుగంలో స్కాటిష్ వచన రచన కూడా గణనీ యమైన ప్రగతిని సాధించింది. ముఖ్యంగా 1450-1630 వరకు ఈ ప్రగతి కనిపించింది. 1480 ప్రాంతంలో ప్రముఖ రచయిత జాన్ ఐర్లాండ్ మొట్ట మొదటి మౌలికమైన మతగ్రంథం వచనంలో రచించాడు. 15 వ శతాబ్దంలో స్వేచ్ఛగా మలచడానికి వీలులేకుండా పరిమిత శక్తి కలిగి ఉన్న స్కాటిష్ భాష జాన్ బెలెండెన్, జాన్ లెస్లీ మున్నగు వారి చారిత్రక రచనలలో సరళంగాను, లాటిన్‌పద విరహితంగాను రూపొందింది. ముఖ్యంగా జాన్ నాక్స్ వ్రాసిన *హిస్టరీ ఆఫ్ ది రిఫర్మేషన్ ఇన్ స్కాట్‌లాండ్* (1567) లో ఇట్టి మనోహరమైన భాష కనిపిస్తుంది. *కంప్లెయింట్ ఆఫ్ స్కాట్‌లాండ్* (1548-49) ఒక నిరుపమానమైన రచన. స్కాటిష్ దేశభక్తిని ప్రకటించడమే గాక ఆ గ్రంథం స్కాటిష్ వచన రచనలో అనేక నూతన ప్రయోగాలను చేసింది.

1603 లో స్కాట్‌లాండ్, ఇంగ్లండ్ దేశాలు ఏక ప్రభుత్వం క్రిందికి రావడంతో స్కాటిష్ రచనలమీద ఇంగ్లీష్ ప్రభావం ఎక్కువ అయింది. స్కాట్‌లాండ్ ప్రభుత్వ ఆస్థానం ఇంగ్లండ్‌కు తరలించ బడడంతో స్కాటిష్ రచయితలకు ప్రభుత్వ ఆదరణ దూరమైంది. విశ్రాంతి ఎక్కువ గల ధనిక వర్గం లోపించడంవల్ల రచ యితలకు లౌకిక సాహిత్యాన్ని పోషించాలంటే ప్రభుత్వ ఆదరణ తప్పనిసరి అయింది. అయితే స్కాటిష్ కవిత్వం మాత్రం సజీవంగానే కొనసాగింది. రాబర్ట్ సెంపిల్ వ్రాసిన *లైఫ్ అండ్ డెత్ ఆఫ్ హాబి సిమ్సన్* అనే కావ్యం ఇందుకు నిదర్శనం. అలాంటి కావ్యాలు గ్రామీణ ప్రశాంత జీవనాన్ని చిత్రిస్తూ లలితమైన హాస్యంతో ప్రజల మనస్సులను చూరగొన్నాయి.

18 వ శతాబ్ది తొలి భాగంలో ఇంగ్లండ్, స్కాట్ లాండ్‌ల విలీనానికి విరుద్ధంగా సాంస్కృతిక ప్రతిఘటన వ్యక్తం అయింది. ఈ ప్రతిఘటన అనేక కావ్య సంక లనాలలో అభివ్యక్త మైంది. అయితే జేమ్స్ వాట్సన్ వ్రాసిన *ఛాయిస్ కలెక్షన్ ఆఫ్ కామిక్ అండ్ సీరియస్ స్కాట్స్ పొయెమ్స్* (1706), ఎలాన్ రామ్‌సే వ్రాసిన *ఎవర్ గ్రీన్* (1724) వంటి కావ్యాలు స్కాటిష్ సాహిత్య భాషలో అంతవరకు సాధించిన అభివృద్ధిని ప్రకటిస్తూనే స్కాట్‌లాండ్ రాజకీయ వ్యక్తిత్వం మీద, స్కాటిష్ భాషమీద ఇంగ్లీష్ ప్రభావానికి ఉదాహరణలు అయాయి. ఈ ప్రక్రియకు తుది ఫలితంగా ప్రముఖ స్కాటిష్ కవులు రాబర్ట్ బర్న్స్, రాబర్ట్‌ఫెర్గుసన్ వంటివారు తమ కావ్యాలను ప్రధానంగా ఇంగ్లీష్‌లోనే వ్రాస్తూ ఉండడం, తద్వారా క్రమంగా క్షీణిస్తున్న స్కాటిష్ సాహిత్య సంప్రదాయానికి కాకుండా ఇంగ్లీష్ సాహిత్యానికే పోషణ చేకూరుస్తూ ఉండడం జరిగింది.

చిం.వెం.(బొ.శ్రీ.)

## స్విస్ సాహిత్యం

**సాహిత్యం :** నిజానికి స్విట్జర్లాండ్ దేశంలో మాట్లాడబడే రోమాష్ అనబడే రేటో రొమానిక్ భాషలో వెలువడిన సాహిత్యాన్నే 'స్విస్' సాహిత్యం అనవలసి ఉంటుంది. కాని స్విస్ జాతీయులు ఆ దేశంలో వ్యవహారంలో ఉన్న జర్మన్, ఫ్రెంచ్, ఇటాలియన్ భాషలలో దేనిలో వ్రాసిన సాహిత్యమైనా స్విస్ సాహిత్యం అనే వ్యవ హరించ బడుతూంది. మరొక సంగతి కూడా ఇక్కడ గుర్తుంచుకోవాలి. స్విస్ సాహిత్యంలో వెలసిన తొలి రచనలు లాటిన్ భాషలో వెలసినవి.

అయితే ఈ వ్యాసంలో ప్రధానంగా రోమాన్ష్ భాషలోను, ఇతర 'స్విస్' మాండలికాలలోను వచ్చిన సాహిత్యాలను

గురించి మాత్రమే వివరించబడుతూంది. స్విట్జర్లాండ్‌లోని లాటిన్, జర్మన్, ఫ్రెంచ్, ఇటాలియన్ సాహిత్యాలను గూర్చి తెలుసుకోవాలంటే ఆ యా సాహిత్యాల మీద వ్యాసాలు చూడాలి.



స్విట్జర్లాండ్

రోమాన్ష్ సాహిత్యం ఆదిలో మత సంబంధమైన రూపంలో మధ్య యుగాలలో ఆరంభం అయింది. సంస్కరణోద్యమం దానికి ప్రాణం పోసింది. 1560 లో న్యూ టెస్టమెంట్‌కి రోమాన్ష్‌భాషలో చక్కని అనువాదం ప్రకటితమైంది. 1679 లో జె.ఏ. వుల్పియస్, జె. డోర్టా *బైబిల్*ను పూర్తిగా అనువదించారు. ఇవి గాక మతాలకూ, రాజకీయాలకూ సంబంధించిన వివిధ గీతాలు ప్రజాదరణ పొందాయి. రోమాన్ష్ సాహిత్యం ప్రాంతీయ స్వభావం గలది. అయినా సంకలనకర్త కాస్పార్ డెకర్టిన్స్, కవులైన పీడర్‌లాన్సెల్ (Lonsel), జాన్‌గైడన్, ఆర్టర్, కాప్‌లిష్‌లు, గద్యరచయిత జియాచెన్ మైకేల్‌లే ఈ 20 వ శతాబ్దిలో విస్తృత విఖ్యాతి ఆర్జించుకున్నారు.

వివిధ స్విస్ మాండలికాలలో కూడా సాహిత్యం వెలసినా దానికి అంత ప్రఖ్యాతి రాలేదు. టిసినోలో మాండలిక సాహిత్యం ఎంతో శ్రద్ధగా రచింపబడినా దానికి ఎక్కువ పరిగణన రాలేదు. ఫ్రెంచ్ మాట్లాడే భాగంలోని ప్రాంతీయ మాండలికాలు క్రమంగా క్షీణిస్తున్నాయి. అక్కడి మాండలిక సాహిత్యంలో ప్రధానమైనవి గత కాలానికి చెందిన 1602 నాటి 'ఎస్కలేడ్' విజయాన్ని వర్ణిస్తూ వ్రాసిన *జెనీవన్ బాలెడ్* లు మొదలైనవి.

జర్మన్ మాట్లాడే భాగంలో మాండలిక భాషా సాహిత్యం బాగా వృద్ధి పొందుతూంది. దీనికి ప్రధాన కారణం అక్కడి ప్రజలు తమ విద్య, అంతస్తు మొదలైన పట్టింపులు లేకుండా నిత్యావసరాలకు తమ మాండలికాన్నే వాడుతూ ఉండడం. ఇక్కడి ప్రసిద్ధ కవులలో కొందరు హై జర్మన్ భాషలోనూ, తమ మాండలికంలోనూ కూడా రచనలు చేస్తారు. అడాల్ఫ్ ఫ్రే తన మాండలికం అయిన అర్‌గౌలో ఒక కవితా సంపుటం ప్రచురించాడు (1891). 'ష్విజ్' అనే మాండలికంలో మీన్‌రాడ్ లీనెర్ట్ అనేక కావ్యాలు వ్రాశాడు. 'బెర్నీస్' మాండలికంలో 20 వ శతాబ్ది రచయితలైన రూడోల్ఫ్ వాంట్‌టావెర్, సైమన్ గ్ఫెల్లర్‌లు శక్తిమంతమైన నవలలు వ్రాశారు. జోసెఫ్ రైన్‌హార్ట్'సోలోతుర్న్' మాండలికంలో రచనలు చేశాడు.

ఇక - సాధారణంగా ఫ్రెంచ్‌లోనో, జర్మన్‌లోనో వ్రాసే స్విస్ రచయితలు అనేకులు జగద్విఖ్యాతి పొందినవా రున్నారు. జోహాన్‌వైస్ వ్రాసిన *ఫామిలీరాబిన్‌సన్*, జొహనాస్పైరీ వ్రాసిన *హైడీ* అంతర్జాతీయ విఖ్యాతి పొందాయి. 19 వ శతాబ్ది నవలా రచయితలలో జెరిమియాస్ గాట్‌హెల్ఫ్, గాట్‌ఫ్రీడ్ కెల్లర్ లు ప్రముఖ నవలా రచయితలు. కాన్‌రాడ్ మేయర్ ఇతర దేశాల చరిత్రలను ఇతివృత్తంగా తీసుకుని పురాణ కావ్యాలు రచించాడు. జాకబ్ బర్క్‌హార్ట్ ఇటాలియన్ పునరుజ్జీవనోద్యమానికి చెప్పిన స్వతంత్రమైన వివరణ నేటికీ ప్రశంస లందుకుంటూంది. 20 వ శతాబ్ది స్విస్ రచయితలలో ఫ్రెడ్రిక్ డ్యురెన్‌మట్, మాక్స్ ఫ్రిష్‌లు జర్మన్ భాషలో గొప్ప నాటకాలు వ్రాశారు.

బొ.శ్రీ.

## స్వీడిష్ భాష-సాహిత్యం

భాష : యూరప్ ఖండంలోని 4 వ పెద్ద దేశం అయిన స్వీడెన్‌లో మాట్లాడే భాష ఇది. స్కాండినేవియా ద్వీపకల్పంలో ఉన్న 'స్వీడెన్' వైశాల్యం 4,49,964 చ.కి.మీ.లు. రాజధాని నగరం స్టాక్‌హోం. 1984 లెక్కల ప్రకారం జనాభా 83,32,000.

స్వీడిష్ భాష స్వీడెన్‌లో జాతీయ భాష కావడమే కాకుండా ఫిన్‌లాండ్‌లో కూడా ఫిన్నిష్‌తో పాటు రెండవ అధికార భాషగా ఉంది. ఉత్తర జర్మానిక్ భాషా కుటుంబంలోని తూర్పు స్కాండినేవియన్ భాషా వర్గానికి చెందింది స్వీడిష్ భాష. రెండవ ప్రపంచ సంగ్రామ కాలం వరకూ స్వీడిష్ భాషను ఎస్టోనియా, లట్‌వియాలలోని కొన్ని ప్రాంతాలలో కూడా మాట్లాడుతూ ఉండేవారు.




స్వీడెన్

స్కాండినేవియన్ భాషా వర్గంతో కలసి ఉన్న 600-1050 కాలంలోనూ, తరువాత 1225 వరకూ స్వీడిష్ భాషా చరిత్ర అసంఖ్యాకాలైన రూనిక్ శాసనాల వలననే ప్రధానంగా మనకు తెలియ వస్తూంది. 14 వ, 15 వ శతాబ్దాలలో ఈ భాషలో - ముఖ్యంగా ఉచ్చారణలో-మౌలికమైన మార్పులు వచ్చాయి. 1526 నుంచే ఆధునిక స్వీడిష్ భాషా చరిత్ర ఆరంభం అవుతూంది. ఆ ఏడాది న్యూ టెస్టమెంట్‌కి స్వీడిష్ భాషానువాదం ఒకటి మొదటి సారి ముద్రించబడింది. 17 వ శతాబ్దంలో హోహోం, లేక్ మాలార్ పరిసరాలలో మాట్లాడే 'స్వియా' మాండలికాలు ఆధారంగా ప్రామాణిక స్వీడిష్ భాష రూపొంద సాగింది. గోటా మాండలికాల నుంచి కూడా కొన్ని లక్షణాలను ఈ ప్రామాణిక భాష గ్రహించింది. 1786 లో స్థాపించబడిన స్వీడిష్ అకాడమీ 1836 లో ఒక స్వీడిష్ వ్యాకరణాన్ని ప్రచురించింది. తరువాత ఒక నిఘంటువును సంకలనం చేయడానికి కూడా పూనుకుంది.

ఇతర స్కాండినేవియన్ భాషలలో లాగే స్వీడిష్ భాషలో కూడా విర్దేశక సర్వనామం (definite article-'the') నామవాచకాలకు ముందు కాకుండా తరువాత వాడబడుతూంది. ప్రామాణిక స్వీడిష్ భాషలో విభక్తుల ననుసరించి నామవాచకాలలో ఎలాంటి మార్పూ కనిపించదు. ఒక్క షష్ఠీ విభక్తిలో మాత్రం నామవాచకానికి ఇంగ్లీష్‌లో లాగా 's' చేరుతుంది. ఈ భాషలో నపుంసక లింగం, సాధారణ లింగం అని రెండే లింగాలు ఉంటాయి. అయితే చాలా మాండలికాలలో ఇప్పటికీ స్త్రీ, పుం, నపుంసక లింగాల మధ్య భేదాలు కనిపిస్తున్నాయి. స్వీడిష్ భాష ఉచ్చారణలో స్వర భేదాలు పాటిస్తారు. ఇంగ్లీష్‌వారు అందుకే ఈ భాషను గాన సహితమైన లయాత్మక భాషగా అభివర్ణిస్తూ ఉంటారు. స్వీడిష్ పదజాలంలో ఇతర భాషలనుంచి ఎరువు తెచ్చుకున్న పదాలు చాలా ఉన్నాయి. ముఖ్యంగా దిగువ జర్మన్, ఎగువ జర్మన్ భాషలనుంచీ, ఇటీవల కాలంలో ఫ్రెంచ్, ఇంగ్లీష్ భాషల నుంచీ ఎన్నో పదాలను స్వీడిష్ భాష స్వీకరించింది.

**సాహిత్యం :** 13 వ శతాబ్దం నుంచే స్వతంత్ర స్వీడిష్ సాహిత్యం కనిపిస్తూంది. అంతకు ముందు స్కాండినేవియా అంతటా మాట్లాడబడే నార్స్ భాషకు చెందిన ఒక మాండలికంగానే ప్రాచీన స్వీడిష్ భాష పరిగణింపబడేది. 11 వ శతాబ్దంనుంచి ఈ దేశంలో కేథలిక్ క్రిస్టియన్ మతం క్రమంగా వృద్ధి పొందుతూ రావడంతో మధ్యయుగంలో స్వీడిష్ సాహిత్యాభివృద్ధి కుంటుపడింది. అంటే ఉ రోజులలో 'లాటిన్' సాహిత్య భాషగా అధికారం చలాయించే దన్నమాట.

16 వ శతాబ్దంలో స్వీడెన్ ప్రొటెస్టెంట్ సంస్కరణోద్యమాన్ని పూర్తిగా అనుసరించడంతో స్వతంత్ర స్వీడిష్ సాహిత్యం అభివృద్ధి చెందసాగింది. తరువాతి శతాబ్దులలో ఆ యా కాలాల యూరపియన్ సాహిత్యాలలో వచ్చిన ఫాషన్ లన్నీ స్వీడిష్ సాహిత్యంలోను వెలశాయి. అయితే మధ్య మధ్య స్వీడిష్ స్వతంత్ర సృజనాత్మక ప్రతిభ అభివ్యక్తం కాకపోలేదు. స్వీడెన్ చాలా కాలం కవిత్వానికీ, పురాణేతర సాహిత్యానికీ ప్రసిద్ధి పొందింది. 19 వ శతాబ్ది చివర నుంచి మాత్రమే ఈ దేశంలో ప్రముఖ నవలా రచయితలు, నాటక కర్తలు వెలశారు.

18 వ శతాబ్దంలో స్వీడిష్ సాహిత్యం మీద ఫ్రెంచ్ ప్రభావం, 3 వ గుస్టావ్ సంస్థానపు ప్రభావం ఎక్కువగా కనిపించాయి. ఓలాఫ్ వాన్ వలిన్ రచనలలో 18 వ శతాబ్దం నాటి హేతువాద ధోరణులు ప్రతిఫలిస్తాయి. తామస్ తోరిల్ట్ తన రచనలలో జే.జే.రూసో యొక్క ఆదర్శ వాదాన్ని ఆవేశంతో సమర్థించాడు. గుస్టావ్ ఆస్థానంలోని ప్రముఖ సాహితీవేత్త కారల్ మైకేల్ బెల్‌మన్. ఆయన కవి, గొప్ప నేర్పు గల వాగ్గేయకారుడు. ప్రముఖ ప్రాకృతిక వాది అయిన లినేయస్ గద్యరచయితలలో సిద్ధహస్తుడుగా ప్రసిద్ధి పొందాడు. 18 వ శతాబ్దం నాటి మరొక మహా రచయిత ఇమాన్యువల్ స్వీడెన్‌బోర్గ్. ఈయన రచనలలో భౌతిక, ప్రాకృతిక శాస్త్రాల ప్రభావమే కాకుండా మతం, తత్త్వశాస్త్రం కూడా కనిపిస్తాయి.

19 వ శతాబ్ది పూర్వార్ధంలో స్వీడిష్ సాహిత్యంలో కాల్పనికోద్యమ ధోరణులు కనిపించాయి. ఆ యుగం ప్రధాన లక్షణాలలో ఒకటి గత వైభవం పట్ల, సంప్రదాయాల పట్ల ఎక్కువ ఆసక్తి వ్యక్తం కావడం. ఇసయ్యాస్ టెగ్నర్ ప్రాచీన సంప్రదాయాన్నే కాక ప్లేటో ఆదర్శ వాదాన్ని కూడా సమర్థించాడు. ఆ శతాబ్ది చివరి భాగంలో విక్టర్ రిడ్‌బర్గ్ అనే రచయిత టెగ్నర్ సమర్థించిన ఆదర్శవాదానికి మరికొన్ని మెరుగులు దిద్ది పారిశ్రామిక సంస్కృతి వలన ఉత్పన్నమైన సమస్యలను ఎదుర్కోడానికి ప్రయత్నించాడు.

19 వ శతాబ్దం చివరి భాగంలో నాటక కర్త, నవలా రచయిత, కవి, చిత్రకారుడు అయిన ఆగస్ట్ స్ట్రిండ్ బెర్గ్ స్వీడిష్ సాహిత్యంలో విప్లవాత్మకమైన పరిణామాలు తెచ్చాడు. స్వీడిష్ రచయితలలో సర్వ శ్రేష్ఠుడుగా ఆయన ఇప్పుడు పరిగణింప బడుతున్నాడు. స్వీడిష్ కథలకు కాల్పనిక వ్యాఖ్యల రూపంలో సెల్మా లాగర్‌లోఫ్ రచించిన గ్రంథం *స్ట్రిండ్‌బెర్గ్* ప్రాకృతిక వాదానికి ఒక రకమైన ప్రతిధ్వనిగా గ్రహించబడుతూంది. 1909 లో సాహిత్యానికి నోబెల్ బహుమతి గ్రహించిన తొలి స్వీడిష్ రచయిత్రి ఆమె. గుస్టాఫ్ ఫ్రోడింగ్ మరొక గొప్ప భావ కవి. అతడు తరచు తాను జన్మించిన 'వార్మ్‌లండ్'ను గురించి వ్రాసేవాడు. వెర్నర్ ఫాన్ హైడెన్‌స్టామ్, ఎరిక్‌ఆక్సెల్ కార్ల్ ఫెల్ట్‌లు కూడా నవీన కాల్పనిక ఉద్యమానికి చెందినవారు. వీ రిరువురు కూడా సాహిత్యానికి నోబెల్ బహుమతి అందుకున్నవారు.

వెనకటి తరాలలో వలెనే 20 వ శతాబ్దంలో కూడా భావ కవితా రంగంలోనే ఉత్కృష్టమైన స్వీడిష్ సాహిత్యం వెలసింది. గున్నార్ ఎకెలోఫ్, ఎరిక్ లిండెర్ గ్రెన్ లు ఆ నాటి కవులలో చెప్పుకోదగినవారు. 1930-40 మధ్య కాలంలో 'యువకవి పంచకం' అనే కవి బృందం చక్కని శబ్దార్థాలంకారాలతోను, ప్రకృతి వర్ణనలతోను కూడిన కవిత్వం చెప్పారు. 20 వ శతాబ్దంలో స్వీడెన్ దేశానికి బయట కూడా విఖ్యాతిని ఆర్జించిన రచయితలలో ముఖ్యులు: 1951 లో సాహిత్యానికి నోబెల్ బహుమతి నందుకున్న పార్‌లాగర్‌క్విస్ట్, విల్ హెల్మ్ మోబెర్గ్, 1964 లో 'మార్కింగ్స్' ప్రచురించబడిన తరువాత డాగ్ హామర్స్‌జోల్డ్. స్వీడెన్‌లో విశేషప్రజాదరణ పొందుతున్నా స్వీడెన్ దేశానికి బయట పేరు ప్రఖ్యాతులు లేని ఈ నాటి ప్రముఖ స్వీడిష్ రచయితలు: ఐవిండ్ జాన్సన్, ఇవార్‌లో జొహాన్‌సన్, జాన్ ఫిడెగార్డ్, పెర్‌ఓలోఫ్ సుండ్‌మన్, హారీ మార్టిన్‌సన్ లు. ఈ మార్టిన్‌సన్ నవలా రచయిత, యువకవి పంచకంలో ఒకడు. (చూ. స్కాండినేవియన్ భాషలు-పుట 158)

బొ.శ్రీ.

## హంగేరియన్ భాష-సాహిత్యం

**భాష :** యూరలిక్ భాషా కుటుంబం లోని ఫిన్నో-యుగ్రిక్ శాఖకు చెందిన ఈ భాష హంగరీలోనే కాక జెకొస్లొవేకియా, రుమేనియా, యుగోస్లావియాలలో కూడా



హంగరీ

మాట్లాడబడుతూంది. ఈ భాషలో ధ్వన్యనుకరణ పదాలు కాక, తక్కిన పదాలలో సంయుక్తాక్షరాలు పదారంభంలో కనిపించవు. అచ్చులు కొన్ని ఉపసర్గల లాగ వ్యవహరించడం, విభక్తి ప్రత్యయాలు పదానికి చివర చేరడం, ఈ భాషలో కనిపిస్తుంది. ఇరానియన్, తుర్కీ, కాకాసియన్, స్లావిక్, లాటిన్, జర్మన్ భాషలనుంచి ఈ భాష పదాలను స్వీకరించింది. కాని, దీనిలోని ఉచ్చారణ విధానం, వ్యాకరణం యూరలిక్ పద్ధతినే అనుసరిస్తుంది. ఈ భాష తొలుత పాత కాలపు తుర్కీరూనీ లిపిలో వ్రాయబడుతూ ఉండేది. క్రీ.శ. 1000 నుంచీ రోమన్ లిపే వాడుకలోకి వచ్చింది.

**సాహిత్యం :** ఈ భాషలో 15 వ శతాబ్దం వరకూ లిఖిత రూపంలో సాహిత్యం లేదనే చెప్పాలి. అంత వరకూ హంగరీ దేశంలో లాటిన్ భాషలోనే గ్రంథరచన సాగుతూ వచ్చింది. అందులోనూ మతగ్రంథాలే ఎక్కువగా ఉండేవి. దేశభాషలో ఏ కొద్దిగానో రచన లున్నా, పండిత లోకంలో వాటికి వ్యాప్తి ఉండేది కాదు.

యూరపియన్ సాంస్కృతిక పునరుజ్జీవన యుగంలో మానవతా వాదం యూరప్ అంతటా వ్యాపించినా,

హంగరీ దేశానికి ఆలస్యంగా గాని అది వ్యాపించ లేదు. మానవతా వాదాన్ని ఆలంబనంగా చేసికొని వెలసిన కవితారీతిని జాన్ వైటీజ్ ప్రోత్సహించాడు. ఇతడు మొదట 'నజివారన్' మత పీఠంలో ఆచార్యుడుగా ఉండి, క్రమంగా దేశానికి అంతటికీ ముఖ్యమతాచార్యుడు అయాడు. ఈ కాలంలో హంగరీని పరిపాలిస్తున్న ముత్తయస్ రాజు (1458-1490) కి ఇతడు ఆంతరంగికుడుగా ఉండి, సాహితీపోషణ పట్ల అతనికి ఆసక్తిని కలిగించాడు.

సుప్రసిద్ధులైన తాత్త్వికులకు, పండితులకు, ఐతిహాసికులకు ఆ రాజు తన ఆస్థానంలో ఆశ్రయం ఇచ్చేవాడు. అతడు హంగేరియన్ కవులకే కాక, ఇతర యూరపియన్ దేశాల కవులకు కూడా తన ఆస్థానంలో స్థానం ఇచ్చి ప్రోత్సహించాడు. కాని ఈ రాజు కాలంలో హంగేరియన్ భాషలో ఉత్తమ రచనలు వెలువడలేదు. లాటిన్‌లో మాత్రం కొన్ని ఉదాత్త రచనలు వెలువడ్డాయి. అయినా ఈ కాలంలో ఒక సత్ఫలితం కలుగక పోలేదు. సమాజంలోని క్రింది వర్గాలలో బాగా విద్యావ్యాప్తి జరిగింది; దేశభాషపట్ల ఆసక్తి, దేశ భాషలోని రచనల పట్ల ఆదరమూ కలిగాయి. ఇలా ప్రజలలో కలిగిన భావ పరివర్తనమే చివరకు 16 వ శతాబ్దంలోని సంస్కరణ యుగానికి దారి తీసింది. సంస్కరణోద్యమంలో ముఖ్య పాత్ర వహించినవారు ప్రొటెస్టెంట్‌లు. వారు సామాన్య ప్రజలలో తమ వాదాన్ని వ్యాపింప చేయడానికి దేశభాషను సాధనంగా గ్రహించారు. అనేక ప్రార్థనా గీతాలను లాటిన్ నుంచి హంగేరియన్ భాషలోకి అనువదించారు. హంగేరియన్ భాషాభివృద్ధికి ఎంతగానో తోడ్పడిన ఏకైక గ్రంథం 1590 లో గస్పర్‌కరోల్కి అనువదించిన *బైబిల్*. ఈ కాలంలో జానపద కవిత్వం కూడా వికాసాన్ని పొందింది. ఈ కవితా శాఖలో 'విరాజీనేకక్' (పుష్ప గీతిక) అనబడే సాహిత్య ప్రక్రియ విరివిగా వ్యాప్తి చెందింది. ప్రేమికుడు తన ప్రణయమూర్తిని ఒక పుష్పంగా భావించి సంబోధించడం ఈ గీతాల్లో కనపడడంచేత ఈ కవితా ప్రక్రియకు ఈ పేరు వచ్చింది. ఈ గీతాలు అశ్లీలంగా ఉన్నా యని పండితులు ఎంత నిరసించినా, వాటి వ్యాప్తి మాత్రం తగ్గలేదు. ప్రాచీన చారిత్రక వ్యక్తులైన సాలమన్ మొదలైన వారికి సంబంధించిన ఐతిహాసిక కావ్యాలు కూడా ఈ యుగంలో హంగేరియన్ భాషలో రచింపబడ్డాయి. ఈ కాలపు రచయితలలో పీటర్ సెలిమన్ డి ఇలోస్వా, సెబాస్టియన్‌టినోదీ అనే ఇద్దరు ఐతిహాసిక కావ్య రచయితలూ, వేలంబియన్ బలస్సా అనే గేయకవీ ముఖ్యులు. బలస్సా హంగేరియన్ సాహిత్యంలోని ప్రథమ గేయకవి. 19 వ శతాబ్దం అంతం వరకూ ఇతని గేయాలకు ప్రజానీకంలో విశేషమైన ఆదరణ ఉండేది. ఈతని గేయాలను అనుకరిస్తూ ఎన్నో రచనలు వెలువడ్డాయి.

17 వ శతాబ్దంలో దేశంలో ఉన్న రాజకీయ పరిస్థితుల వల్ల సాహిత్యానికి విశేషపోషణ లభించలేదు. కాని ఆ కాలంలో స్వీయ చరిత్రలు అనేకం వెలువడ్డాయి. సుప్రసిద్ధ హంగేరియన్ తత్త్వవేత్త జాన్ శెరీడి అపాజా ఈ శతాబ్దివాడే! దేశ భవిష్యత్తును తీర్చి దిద్దగలవారు ఉపాధ్యాయులే కాని సైనికులు కారని ఇతడు బోధించాడు. ఈ యుగంలోని పద్యకవితకు పట్టుగొమ్మ స్టీఫెన్ గయోన్ గ్యోసి. సరళమైన ఇతని శైలి, కథా సంవిధాన నైపుణ్యం ప్రశంసాపాత్రాలు.

హంగరీలో 18 వ శతాబ్దంలో కాల్పనిక వాద కవిత్వానికి అంకురార్పణ జరిగింది. ఫ్రెంచ్ సాహిత్యాన్ని లక్ష్యంగా పెట్టుకొని బెస్సెనీ అనే కవీ, అతని మిత్రులూ కొన్ని కావ్యాలను వ్రాశారు. కాని ఇవేవీ ఉత్తమ స్థాయికి చెందినవి కావని అభిజ్ఞుల అభిప్రాయం. బెస్సెనీ వర్గానికి చెందని కొందరు రచయితలు మాత్రం ఈ విషయంలో విజయాన్ని సాధించారు. వారిలో డుజోనిక్స్, గ్వడానాయ్, షజేకా అనేవారు ముఖ్యులు. జర్మన్ కవితా సంప్రదాయాన్ని అనుకరించిన ఫ్రాన్సిస్ కాజింపీ స్వతంత్ర గ్రంథాలను కొన్నింటిని వ్రాయడమే కాక, షేక్స్‌పియర్, మోలియర్ మొదలైనవారి రచనలను హంగేరియన్ భాషలోకి అనువదించాడు. ఆ యుగం గేయ కవులలో ఫ్రాన్సిస్ కోల్సీ, జాన్‌బక్సాన్కీ పేర్కొనదగినవారు. వీరిలో కోల్సీ హంగేరియన్ జాతీయ గీతం వ్రాశాడు.

19 వ శతాబ్దంలోని ఉత్తమ రచయితలలో జోసెఫ్ కటోనా (1791-1830) ను మొదట పేర్కొనాలి. అతడు రచించిన *బేంక్‌బెన్* అనేది హంగేరియన్ రంగస్థలానికి చెందిన మొదటి ఉత్తమ రూపకం. షేక్స్‌పియర్‌ను అనుకరిస్తూ ఈ శతాబ్దంలో చాలామంది నాటకాలు వ్రాశారు. ఈ యుగంలోని కాల్పనిక కావ్య రచయితలలో చార్లెస్ కిస్ ఫలూది, మైకేల్ వరోస్మర్తి ముఖ్యులు.

1830 లో హంగేరియన్ సాహిత్య అకాడమీ స్థాపించబడింది. 1840-50 ప్రాంతాలకు కాల్పనిక వాదం వెనుకబట్టి, వాస్తవికతావాదం పొడసూప నారంభించింది. ఈ కాలంలోనే హంగేరియన్ భాషలో ఇద్దరు మహాకవులు

వెలుగు లోకి వచ్చారు. సాండర్ ఫెటోఫీ (1823-49) క్రొత్త మార్గాన్ని అన్వేషిస్తూ, శక్తిమంతమైన, ఉద్రేకపూరితమైన కవిత్వం వ్రాశాడు. ఇతని కవితలలో విప్లవాత్మకమైన తపన తేలిక భాషలో సూటిగా ప్రకటింపబడింది. జానస్ అరానీ (1817-1882) ఫెటోఫీకి మిత్రుడు. అతడూ ప్రజారంజకమైన కవితలను వ్రాశాడు. కాని, తన కవితలో తాదాత్మ్యం చెందకుండా, అతడు వస్తువుకు దూరంగా ఉండేవాడు. ఇమ్రీ మడక్ (1823-64) *ఆజ్‌ఎంబర్ ట్రాజిడియాజా* (మానవుని విషాద గాథ) అనే మత తాత్త్విక, రూపకాత్మక కవిత వ్రాశాడు.

19 వ శతాబ్దం ప్రారంభంలోనే నవల ఒక సాహిత్య ప్రక్రియగా స్థిరపడింది. అయినా వాస్తవికతా వాదం స్థిరపడిన తరువాతనే జోసెఫ్ యోట్‌వోజ్ (1813-71) రాజకీయ నవలతోనే ఉదాత్తమైన నవలలు రావడం ఆరంభమైంది. జిగ్‌మండ్ కెమీనీ (1814-75) నైరాశ్యంతో కూడిన మనస్తాత్త్విక విషాదాంత నవలలు వ్రాశాడు. మోర్‌జొకాయ్ (1825-1904) నవలలలో శిల్పం తక్కువ అయినా, కాల్పనిక వాతావరణంతో కూడిన ప్రజా రంజకమైన రచనలు అతనివి. కాల్‌మన్ మిక్స్‌జాత్ (1847-1910) వ్యంగ్యంతో కూడిన కథలలోనూ, నవలలలోనూ హంగేరియన్ సమాజంలోని వివిధ వర్గాల పరస్పర సంబంధాలనూ ఆ యా వర్గాలమధ్య గల వైరుద్ధ్యాన్నీ చిత్రించాడు.

20 వ శతాబ్దం ఆరంభంలో హంగేరియన్ సాహిత్యం ఒక్కసారిగా అపూర్వమైన వికాసం పొందింది. ప్రతీకాత్మక కవిత వ్రాసిన ఎన్‌డ్రే ఆడీ (1877-1919) మహాకవితో ఇది ప్రారంభమైంది. అతడు అద్భుతమైన గేయకవి. అతనిది అనితర సాధ్యమైన శైలి. అతడు విప్లవవాది. తన్నూ, తన చుట్టూ ఉన్న లోకాన్నీ నిశితంగా, నిర్మొహమాటంగా పరిశీలించడంలో కడు నేర్పరి. ఆడీ కవితలోని భాష అందరికీ అందు బాటులో ఉండి ఉంటే అతని ప్రభావం అంతర్జాతీయంగా ఇంకా ఎక్కువగా ఉండేది. *న్యూగత్* (పడమర) అనే వామపక్ష సాహిత్య పత్రిక ఆ రోజులలో ఎంతో శక్తిమంతమైంది. ఈ పత్రికతో సంబంధ మున్న రచయిత లందరికీ ఆడీ నాయకుడు.

ఆడీకి కొంచెం తరువాత నలుగురు మంచి కవులు వచ్చారు. మిహాలే బేబిట్స్ (1883-1949) గొప్ప మేధావి, మానవతావాది. డెజ్‌సోకోస్టాలన్యీ (1885-1936) హంగేరియన్ కవులలో సుప్రసిద్ధుడైన ఇంప్రెషనిస్ట్ కవి. ఆర్‌పద్‌టుత్ (1886-1928) విలక్షణమైన వ్యక్తిత్వం ఉన్న ఒక విషాద గేయ కవి. గయూల జూహస్ (1883-1937) హంగేరియన్ సంప్రదాయంతో అనుబంధం ఉన్న ఇంప్రెషనిస్ట్ కవి. 'న్యూగత్' వర్గానికి చెందిన వచన రచయితలలో జిగ్మండ్‌మోరి (1879-1942) ప్రముఖుడు. ఇతని వాస్తవిక కథలలోనూ, నవలలలోనూ హృదయానికి హత్తుకొనే పాత్రచిత్రణ, బహుముఖమైన సామాజిక వస్తు స్వీకరణ కనిపిస్తాయి. ఫ్రీగీస్ కరింతి (1887-1938) వ్యంగ్య ధోరణిలో శక్తిమంతమైన కథలు వ్రాశాడు.

రెండు ప్రపంచ యుద్ధాలకు మధ్య కాలంలో వచ్చిన రచయితలలో అధిక సంఖ్యాకులు సోషలిస్టులు, వారికి సన్నిహితులు. గయాలా ఇల్యాస్ (1902-) రాడికల్ కర్షక రచయితగా ప్రారంభించి, హంగేరియన్ కవితకు ఆచార్య పీఠాన్ని అధిష్ఠించాడు. అత్తిలా జోసెఫ్ (1905-37) శ్రామిక వర్గపు రచయిత. ఈతని కవితలో ఉద్రేకానికీ, హేతువాదాత్మక ఆలోచనా ధోరణికీ మధ్య సంఘర్షణ కనిపిస్తుంది. మిక్లోస్ రాడ్నోటీ (1909-44) తన జీవితం చివరి కాలంలో నాజీలచేతికి చిక్కి రాజకీయ ఖైదీగా ఉన్నప్పుడు కొన్ని కరుణ రసాత్మక కవితలు వ్రాశాడు. లాస్లో నెమెత్ (1901-76) మనస్తత్త్వ విశ్లేషణాత్మక నవలలు వ్రాశాడు. ఇతడు తత్త్వవేత్త కూడా. టిబార్ డెరీ (1894-1977) ఇతరులను బాగా ప్రభావితం చేసిన సోషలిస్ట్ రచయిత. ఇతని సంప్రదాయ విరుద్ధమైన అభిప్రాయాలవల్ల రెండో ప్రపంచయుద్ధం తర్వాత ఇతడు చిక్కులలో పడ్డాడు. అటు తర్వాత 1956 నాటి విప్లవంలో ఈతని ప్రముఖ పాత్రకు ఇదే కారణం అయింది. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం వచ్చిన కవులలో జానస్ పిలిన్‌స్కీ (1921-81), లాస్‌జ్లో నాగే (1925-78) పేర్కొదగినవారు.

*చీ.శే.రా.(వ.మం.)*

# ఆఫ్రికాఖండ భాషలు - సాహిత్యాలు

## ఆఫ్రికన్ భాషలు

ఆఫ్రికా ఖండంలో ప్రాచీన కాలంనుంచీ నివసిస్తున్న జాతులు మాట్లాడే భాషలను పండితులు 1. సెమెటిక్, 2. హెమెటిక్, 3. నీగ్రో, 4. పిగ్మీ-బుష్మన్ అనే నాలుగు కుటుంబాలుగా మొదట వర్గీకరించారు. కాని నీగ్రో కుటుంబానికి చెందిన వని భావింపబడే భాషలను సునిశితంగా పరిశీలించిన మరి కొందరు పండితులు అవి ఒకే కుటుంబానికి చెందనేర వని గుర్తించి సూడానిక్, బంటూ అనే రెండు కుటుంబాలకు చెందినవిగా వాటిని వేరుచేయవచ్చు నని ప్రకటించారు. అందుచేత ఇప్పుడు ఆఫ్రికన్ భాషలను 5 వర్గాలుగా (సెమెటిక్, హెమెటిక్, సూడానిక్, బంటూ, పిగ్మీ-బుష్మన్) విభజించవచ్చు నని పండితు లందరూ ఏకగ్రీవంగా అంగీకరిస్తున్నారు. వీటిలో సెమెటిక్, హెమెటిక్ భాషలను గురించి వేరొక చోట తెలుపబడింది (చూ.ప్రపంచభాషలు పుట 4)

**సూడానిక్ భాషలు :** అట్లాంటిక్ సముద్ర తీరం మొదలుకొని అబిసీనియా పశ్చిమ పర్వత సానువుల వరకు గల విశాల ప్రదేశంలో ఈ వర్గపు భాషలు మాట్లాడేవారు నివసిస్తున్నారు. తూర్పు, ఉత్తర ఆఫ్రికా ప్రాంతాలలో చెదురు మదురుగా కొన్ని మండలాలలో ఈ వర్గపు భాషలు మాట్లాడబడుతున్నాయి. ఈ వర్గానికి చెందిన వివిధ భాషల మధ్య పైకి అంతగా సామ్యం గోచరించక పోయినా శాస్త్రీయ దృష్టితో పరిశీలించి నపుడు వీటికి గల సన్నిహిత సంబంధం ద్యోతకం కాకమానదు. ఈ భాషలు విడివడిన తరువాత వాటిని మాట్లాడేవారు చెదరిపోయి సుదూరప్రాంతాలకు పోయినందున పదాల రూపంలోనే కాలక్రమేణ మార్పులు వచ్చాయి. ఇతర వర్గపు భాషలతో తరచు ఏర్పడిన సంపర్కం కూడా ఇలాంటి మార్పునకు కొంతవరకు కారణం అయింది.

ఈ భాషలు మాట్లాడే ప్రదేశాలను ఆ యా భాగాలలోని భాషల సన్నిహితత్వాన్ని బట్టి ప్రాచ్య, మధ్యమ, పశ్చిమ ప్రాంతాలుగా విభజింపవచ్చును. ప్రాచ్య భాషలలో ప్రముఖమైంది షీలుక్. దీనిలో అనేక ఉపభాషలున్నాయి. దింకా, నువర్, బురున్, నూబా అనేవి వాటిలో పరిగణింపదగినవి. మధ్యమ భాషలు వేరు వేరు పేర్లతో కాక ఉపవర్గాలుగా విభజింపబడి, 1. నైల్ కాంగో, 2. ఉబాంగీ, 3. షరీవడాయి, 4. షరీ, 5. నైగర్-షాద్, 6. నైగర్కామెరూన్ అనే పేర్లతో పిలువబడుతున్నాయి. ఇందులో ప్రతి ఉపవర్గంలోను కొన్ని వేరు వేరు భాషలు కలసి ఉంటాయి. ఈ విభజనను చేసినవాడు డెలాషాసీ అనే భాషాతత్త్వవేత్త. ఈ భాషలు తూర్పు రేఖాంశం 10 డిగ్రీలనుంచి 30 డిగ్రీల వరకు గల ప్రాంతంలో మాట్లాడబడుతున్నాయి. అయినా ఈ ఉపవర్గాల భాషలను గురించిన సమగ్ర పరిశోధన ఇంకా జరుగలేదనే చెప్పాలి. పశ్చిమ ప్రాంత భాషలను గురించి మాత్రం పూర్తి పరిశోధన జరిగి ఉండడంవల్ల వాటిని ఈక్రింది ఉపవర్గాలుగా విభజించడానికి వీలైంది.

1. **క్వా భాషలు :** ఇవి నైగర్నది దిగువ భాగపు పరిసరాలలోను, లైబీరియాలోని సెయింట్పాల్ నదీ తీర భూములలోను మాట్లాడబడుతున్నాయి. ఈ భాషలలో మూల ధాతువులలో ఒక వ్యంజనమూ, ఒక స్వరమూ మాత్రమే ఉంటాయి.
2. **బెన్వీక్రాస్ నదీ భాషలు :** ఈ భాషలమీద బంటూ కుటుంబ భాషల ప్రభావం కొంత కని పిస్తుంది. ఈ భాషలలో మూల ధాతువులు హలంతాలు.
3. **మధ్య టోగో భాషలు :** ఈ భాషలు మాట్లాడేవారు చాలా స్వల్పసంఖ్యలో మాత్రమే ఉన్నారు. ఉత్తర అక్షాంశ రేఖ 7 డిగ్రీలనుంచి 8 డిగ్రీల వరకు గల పరిమిత ప్రదేశంలో వీరు నివసిస్తున్నారు. కాని కాలక్రమేణ వీరి సంఖ్య క్షీణిస్తూంది. వీటి మూల ధాతువులలో ఒక హల్లు ఒక అచ్చు మాత్రమే కలిసి ఉంటాయి. ప్రత్యయాలు, ఉపసర్గలు ఈ భాషలలో ఉన్నాయి.
4. **గూర్భాషలు :** ఐవరీ కోస్ట్, గోల్డ్ కోస్ట్ ఉత్తర ప్రాంతాలలో ఈ భాషలు మాట్లాడుతున్నారు. వీటిలో కొన్నిటిలో ఉపసర్గలు, ప్రత్యయాలు వాడబడుతున్నాయి.
5. **పశ్చిమ అట్లాంటిక్ భాషలు :** సెనెగల్ నుంచి అట్లాంటిక్ వరకు గల ప్రాంతంలో ఈ భాషలు మాట్లాడుతున్నారు. వీటిలో ప్రాచ్యవర్గంలో తెమనే, బులామ్, లింబా, కిస్సీ, గోలా, అజుక్రు అనే భాషలూ, పశ్చిమ వర్గంలో ద్యోలా, బోలా, సరర్, పిపెల్, కన్యప్, బయ్ ఫదా, పజాడే, బన్యున్, నాలూ, బులండా, కోన్యాగీ,

బిజోగో, వులఫ్, సిరేర్ అనే భాషలూ ఉన్నాయి. వీటిలో ధాతువులు ఏకాక్షరాలు.

6. మాండింగో భాషలు : పశ్చిమ సూడాన్‌లో ఇవి మాట్లాడబడుతున్నాయి. 10 అనే సంఖ్యకు ఈ భాషలలో వాడే పదాన్ని అనుసరించి ఈ భాషలు మాడీటన్, మాండీఫూ అనే రెండువర్గాలుగా విభజించబడ్డాయి. మొదటి వర్గంలో బంబర, సోనింకే, మాలింకే, ద్యూలా అనే భాషలూ, రెండో వర్గంలో మెండీ, కపెల్లే, గబందే, గబుందీ, తోమా, మానో, జియోజలోంకా అనేవీ పరిగణించదగినవి. రెండోవర్గంలో చివరిదైన జలోంకా ఫ్రెంచ్ గినీలో విస్తృతంగా మాట్లాడ బడుతూంది. ఆ వర్గంలో తక్కినవి సియెర్రా, లియోనీ, లైబీరియా దేశాలలో మాట్లాడబడు తున్నాయి. ఈ భాషలలో రెండు అక్షరాల పదాలు ఎక్కువగా కనిపిస్తాయి. ఉపసర్గలు లేవనే చెప్పాలి.

7. బంటూ భాషలు : ఆఫ్రికా ఖండం దక్షిణ భాగంలో విస్తృతంగా ఈభాషలు వాడుకలో ఉన్నాయి. ఉపసర్గలు చేర్చి కొత్త పదాలు నిర్మించడం ఈ భాషలలో ఎక్కువగా కనిపిస్తుంది. ఉపసర్గల వలన బహువచనరూపాలు ఏర్పడే ప్రక్రియ ఈ భాషలలో ఉంది. హేంబర్గర్ అనే భాషాతత్త్వవేత్త ఈ వర్గపు భాషలను ఈ క్రింది ఉపవర్గాలుగా విభజించారు. ఆయా ఉపవర్గాల ప్రక్కనే వాటిలోని ప్రముఖ భాషల పేర్లు సూచింపబడ్డాయి:

1. గండా భాషలు: గండా, న్యోరో, కేరేవి. 2. రువండా భాషలు: రువండా, రుండి. 3. కిలిమాంజరో భాషలు: కికుయూ, కంబా, జగ్గా, మోషీ, సిహా. 4. ఉత్తర, ప్రాక్ తీర భాషలు: తవేతా-తయితా, చస్సూ, పొకోమో, నికా, శంబల, బూందీ, జిగులా, స్వాహిలీ, కొమోరే, జరామో, కామీ, మాతుంబి. 5. తూర్పు ఆఫ్రికా భాషలు: న్యాంవిజి, న్యాతురూ, గోగో, హేహే, పోగోరో, కగురూ, కొండే, యావ్, న్యాంజా, సేనే, తేతీ, కిలిమానే. 6. ఆగ్నేయ ఆఫ్రికా భాషలు: మకువా, రొంగా, గ్వంబా, చోపీ, వెందా, సోతో, కోలోలో, చ్వానా. 7. జూలూ భాషలు: గ్జోసా, లేకాఫిర్, జూలూ, తేబేలే, న్గోనీ. 8. (అ) మధ్యమ మండల భాషలు: తబనా, బెంబా, మంబ్వే, బిస్రాలాలా- లంబా, సెంగా, తోంగా, సుబియా. (ఆ) పశ్చిమ భాషలు: హెరేరో, నదోగా క్వనియామా, న్యానికా, మబుందా, లూయీ, ఉంబుందు, కింబుందు, లుండా, లూబా. 9. కాంగో భాషలు: కాంగో, కనియోకా, కుచ్బూ, కేలే, లోలో, సుకుందు. 10. వాయవ్య భాషలు: బంగీ, తేకే, కలయ్, గలోవా, దూమా, బెంగా, నోహో, బసా, ద్వాలా, బూబే, క్వేరీ, ఇసూబూ.

కాని ఈ విభజన సరి అయినదని నిర్ధారణ కాలేదు. శాస్త్రజ్ఞు లనేకులు ఇంకా ఈ భాషలమీద పరిశోధన సాగిస్తూనే ఉన్నారు.

పిగ్మి-బుష్‌మన్ భాషలు : వీటినే సంక్షిప్తంగా బుష్‌మన్ భాషలు అని కూడా వ్యవహరిస్తారు. ధ్వని సామ్యాలను బట్టి ఈ భాషలు దక్షిణ, మధ్యమ, ఉత్తర భాషలుగా మూడు వర్గాలుగా విభజింపబడ్డాయి. మకర రేఖకు దక్షిణాన గల దేశాలలో మధ్య భాగంలోను, పశ్చిమ ప్రాంతంలోను మాట్లాడే భాషలు దక్షిణ వర్గపు భాషలు. ఈ వర్గపు భాషలలో ముఖ్యమైంది 'ఖం' అనే భాష. కేప్ రాష్ట్రంలో వాయవ్య ప్రాంతంలో ఇది విస్తృతంగా వ్యాపించి ఉంది. కలహారీ ఎడారిలో మధ్య ఉత్తర భాగాలలో నివసించేవారు మాట్లాడే భాషలు మధ్యమ వర్గపు భాషలు. నైరృతి ఆఫ్రికాలోను, అంగోలాలోను మాట్లాడే భాషలు ఉత్తర వర్గపు భాషలు. మధ్యమ వర్గ భాషలలో హిచ్‌వారా, నారమ్ అనే భాషలు ముఖ్యమైనవి. వీటిలో మొదటిది దక్షిణ రొడీషియాలోని టాటి జిల్లాలోను, రెండోది బైకూనాలాండ్ నైరృతి సరిహద్దులోను మాట్లాడుతున్నారు. ఉత్తర వర్గపు భాషలలో అవెన్, కుంగ్, హైకమ్ అనేవి ప్రముఖమైనవి.

ఈ బుష్‌మన్ భాషలతో కొంతవరకు సన్నిహితమైనవి హాటెన్‌టాట్ భాషలు. ఈ భాషలపై హెమెటిక్ భాషల ప్రభావం కొంతవరకు ఉందనడం నిర్వివాదమే అయినా హాటెన్‌టాట్ భాషలకు బుష్‌మన్ భాషలతో ఒక విధమైన ప్రత్యేక సంబంధం ఉన్నట్లు కనిపిస్తున్నందు వల్ల వీటిని కూడా బుష్‌మన్ భాషలలోని ఒక వర్గంగానే శాస్త్రజ్ఞులు పరిగణిస్తున్నారు. నైరృతి ఆఫ్రికాలో కొందరు మాట్లాడే 'నామా' అనే భాష హాటెన్‌టాట్ వర్గంలో ప్రముఖమైంది.

బుష్‌మన్ భాషలలో కుంగ్, నామా అనే వాటిని గురించి మాత్రమే కొంత పరిశోధన జరిగింది. వీటిలో అంగిటితో పలికే హల్లులు ఎక్కువ. 'వ', 'ఫ' అనే అక్షరాలు కనిపించవు. మూలాచ్చులే కాక ద్విస్వర ధ్వనులు ఎక్కువగా ఉన్నాయి. చీనా భాషలో ఉన్నట్లు ధ్వనిస్థాయి (స్వరం-tone) భేదాన్ని బట్టి ఒకే పదానికి వేరు వేరు అర్థాలు ఉండడం కూడా కద్దు. మూడు వరకు మాత్రమే సంఖ్యావాచకాలు ఉన్నాయి. ఈ భాషలలో పదజాలం చాలా పరిమితం.

స్ట్రిక్ అనే భాషాతత్త్వవేత్త ఆఫ్రికన్ భాషల సంఖ్యను ఆయా కుటుంబాలను అనుసరించి ఇలా పరిగణించాడు: సెమిటిక్-10, హెమెటిక్-47, సూడానిక్-264, బంటూ-182. మొత్తం 503. చెప్పుకోడానికి ఇన్ని భాషలు ఉన్నా, పదిలక్షల జనాభామించి మాట్లాడే భాషలు 12 కంటె ఎక్కువ లేవు.

ఈ ఖండంలో భాషా వైవిధ్యం ఎక్కువగా ఉండడం వల్ల వివిధ భాషా వ్యవహర్తల పరస్పర వ్యవహారం కోసం కొన్ని సామాన్యభాషలు ('లింగ్వా ఫ్రాంకా' లు) కూడా ఉద్భవించాయి. ఉదాహరణకు తూర్పు ఆఫ్రికాలో స్వాహిలి, కాంగో నదీ పరీవాహ ప్రాంతంలో లింగాలా, మధ్య ఆఫ్రికా రిపబ్లిక్‌లో సాంగో, సూడాన్‌లో అరబిక్ భాషలు ఇలా సామాన్య భాషలుగా వాడబడుతున్నాయి. ఇవి కాక చారిత్రక కారణాల వల్ల ఇంగ్లీష్, ఫ్రెంచ్ భాషలు, వాటి ప్రాదేశిక రూపాంతరాలైన సంకర భాషలు ('పిడ్జిన్' భాషలు) అంతటా ప్రచారంలో ఉన్నాయి. ఆంగ్లోఫోన్, ఫ్రాంకోఫోన్ ప్రాంతాలలో ఇంగ్లీష్, ఫ్రెంచ్ భాషలలో గణనీయమైన ఆఫ్రికన్ సాహిత్య వ్యాసంగం కూడా జరుగుతూంది.

వీ.శే.రా.(డి.వి.కె.రా.)

## ఆఫ్రికా సాహిత్యాలు

దిగువ సహారా ప్రాంతంలో అనూచానంగా వస్తున్న ఎన్నో మౌఖిక జానపద రీతులు ప్రచారంలో ఉన్నాయి. పొడుపు కథలతో, సంక్షిప్త ప్రతీకలతో నిండిన సోమాలీ గీతాలూ, సుదీర్ఘమైన జూలూ ప్రశస్తి కీర్తనలూ, కాంబా కథకులు పిల్లలకు చెప్పే కెన్యా గాథలూ, ఈ పరంపరకు చెందినవి. వచనం కంటె కవిత్వానికే ఎక్కువ ప్రజాదరణ ఉండటం ఒక విశేషం. 'ప్రశస్తి కావ్యాలు' రాజుల పోషణలోనూ, సంచార గాయకుల నిర్వహణలోనూ సాహిత్య ప్రక్రియలుగా ఎంతో వికాసం చెందాయి. పశ్చిమ ఆఫ్రికా దేవతా మూర్తుల నుద్దేశించి వెలువడ్డ మతపరమైన గేయాలూ, ముక్త కవితలూ పురోహితుల పూజా విధానంలో చోటు చేసుకున్నాయి. అంత్యేష్టి కవిత్వంలో ప్రాచీనుల ప్రాభవాన్ని కీర్తించే పద్ధతి దక్షిణ ఘనాలోని ఆకన్‌స్త్రీల సంప్రదాయం. ప్రేమ గీతాలూ, పశుపక్ష్యాదులను అభివర్ణించే చిత్ర గీతికలూ, వివాహాలూ, క్రీడలూ, వినోదాలూ, ప్రాసంగిక విషయాలూ ఆధారంగా గానం చేసిన కవితలూ సామూహిక జీవితంలో ఒక భాగం అయిపోయాయి. ఎన్నికల తరుణంలో ప్రచార సాధనంగానో, రాజకీయ వ్యాఖ్యానం కోసమో బయల్దేరిన గేయాలు కూడా ఉన్నాయి. ఇవి గాక శిశు సాహిత్యం, కాంగోలో ప్రచారంలో ఉన్న వీరగాథా కావ్యాలూ కూడా ఈ మౌఖిక సంప్రదాయానికి చెందినవే! వచన సాహిత్యం ముఖ్యంగా కథాసంవిధానానికి చెందింది. కథలూ, గాథలూ, చారిత్రక, ఐతిహాసిక, పౌరాణిక అంశాలకు చెందిన కల్పనలూ వచనంలో కొనసాగాయి. సామెతలూ, జాతీయాలూ, నుడికారాలూ, పొడుపు కథలూ, బిరుదు నామాలూ ఇందులో విశేషంగా గోచరిస్తాయి. వక్తృత్వం కూడా విశేష కళగా రూపొందిన సాహిత్య ప్రక్రియ. పశ్చిమ ఆఫ్రికాలో భాషా నిరపేక్షమైన సాహిత్య సంప్రదాయం నృత్య గాన ప్రధానంగా బహుళ ప్రచారంలో ఉన్న నాటక విశేషం. ఈ 'మాస్క్వ్యరేడ్' కాక, వాద్యాలతో ముఖ్యంగా మృదంగ విన్యాస రూపంలో ఉన్న రూపక రచన కూడా మధ్య పశ్చిమ ఆఫ్రికా దేశాల్లో ప్రచారంలో ఉంది. ఈ విధంగా గ్రంథస్థం కాని మౌఖిక సాహిత్యం ఆఫ్రికా ఖండంలో బహుధా కానవస్తుంది.

**ఆఫ్రికన్-ఇంగ్లీషు రచనలు :** ఇంగ్లీష్‌లో రచనలు చేసిన మొదటి ఆఫ్రికన్‌లు ఫిలిస్ వీట్‌లీ (1773), ఎక్వియానో (1789). 19 వ శతాబ్దంలో ఇంగ్లీష్‌లో రచనా వ్యాసంగం ముఖ్యంగా నివేదికలకూ, ప్రాదేశిక వర్ణనలకూ పరిమితమైంది. 1911 లో ఘనాలో వెలువడ్డ *ఇథియోపియా అన్‌బోరిక్* అనే నవలలో ప్రస్ఫుటంగా ఆఫ్రికా వ్యక్తిత్వం, ఆ ఖండపు జనజీవనం, వలస విధానంతో పాటు బయల్దేరిన సామాజిక, సాంస్కృతిక సంఘర్షణ ప్రతిబింబించాయి. అయితే 1941 లో ఇ.ఇ. ఒబెంగ్ వ్రాసిన *ఎయ్‌టీన్ పెన్స్* అనే రచన ఆఫ్రికాలో వెలువడ్డ మొదటి నవలగా పేర్కొనవచ్చును. మరికొంత విస్తృతమైన దృక్పథంతో చూస్తే, 1883 లో ఆలివ్ ష్రెనర్ వ్రాసిన *ది స్టోరీ ఆఫ్ ఆన్ ఆఫ్రికన్ ఫామ్* ను ఆఫ్రికాలోని ప్రథమ సృజనాత్మక రచనగా పరిగణించవచ్చును.

బ్రిటిష్ సామ్రాజ్య విస్తరణలో ఆఫ్రికా ఖండంలో నెలకొని ఉన్న సంస్కృతి సంప్రదాయాలకు విఘాతం కలిగింది. స్థానిక ప్రాబల్యం గల సాంఘిక వ్యవస్థలూ, మర్యాదలూ క్రమేపీ అంతరించి పాశ్చాత్య భావనా ప్రక్రియలూ, జీవన విధానాలూ చోటు చేసుకున్నాయి. భౌతికవాదం, వైజ్ఞానిక చింత, వ్యక్తిత్వ ప్రాముఖ్యమూ, పట్టణ నాగరకతా, ఆర్థికోపాధి సంవిధానం మొదలైన విలువలు సమాజంలో మౌలికమైన మార్పులను ప్రేరేపించాయి. 1950-60 మధ్య కాలంలో స్వాతంత్ర్య

సముపార్జనతో పాటు ఆఫ్రికా జాతీయ పునర్నవోద్యమం ఆరంభమై, రాజకీయ సాంస్కృతిక స్పృహ వ్యాపించి "నెగ్రిట్యూడ్" సిద్ధాంతంగా పర్యవసించింది. పాశ్చాత్య ప్రేక్షక రచయితలు చిత్రీకరించిన చీకటి ఖండపు చూపు తిరస్కృతమైంది. వైభవోపేతమైన చరిత్ర, సంస్కృతి, సమాజ వ్యవస్థ కల ఉదాత్త నాగరకతకు ఆలవాల మైన ఆఫ్రికాను ప్రపంచ భవితవ్యానికి పునాదిగా ఆఫ్రికన్ నాయకులూ, మేధావులూ, రచయితలూ గుర్తించారు. ఇంగ్లీష్ పాలకులు అనుసరించిన జాతి విచక్షణా, ఫ్రెంచ్ పాలకులు అవలంబించిన జాతి విలీనతా - ఈ రెండు సిద్ధాంతాలనూ తిరస్కరించి విశాల ఆఫ్రికా తత్త్వాలను ప్రతిపాదించే రచనలు అనేకం వెలువడ్డాయి. ఈ భావ సంచలనంలో నిరసన, తిరస్కారం, ఆభిజాత్య దురహంకారం మొదలైన నిషేధాత్మక విలువలను అధి గమించి కళాదృష్టితో సామరస్య భావంతో, వాస్తవిక శైలిలో జాతి నవ చైతన్యాన్ని ప్రతిబింబించే సాహిత్యమే సార్థక మైనదిగా సెంగోర్, సోయింకా, అచిబీ మొద లైన రచయితలు రూపొందించారు. ఆఫ్రికా జానపద సంప్రదాయాన్ని ఆధునిక మార్గ సాహిత్య సంవిధానానికి సమన్వయించి నైజీరియాలోను, ఘనాలోను, కెన్యా లోను, ఉగాండాలోను సజీవమైన, సంచలనాత్మకమైన కావ్యాలను ఇంగ్లీష్‌లో రచించి విశ్వ ఆంగ్ల సాహిత్యానికి ప్రాణం పోస్తున్నారు - ఈ నాటి ఆఫ్రికా రచయితలు.

1952 లో నైజీరియా రచయిత ఆమోస్ టుటువోలా యోరుబా జానపద గాథాపద్ధతిలో *ది పామ్ వైన్‌డ్రింకర్* అనే ఒక వినూతనమైన నవలను ప్రచురించాడు. ఒనిష్టా తో ఆరంభమైన ప్రజారంజకశైలిలో సిప్రియన్ ఎక్వెన్సీ పట్టణాల్లో ప్రతిబింబించే కష్ట సుఖాలను ఎదుర్కొనే విభిన్న ప్రవృత్తులు గల వ్యక్తుల జీవన సమరాలను అభివ ర్ణిస్తూ 1953 లో *పీపుల్ ఆఫ్ ది సిటీ* తో ప్రారంభించి ఆ తర్వాత *జొగ్వానాసా, ఇస్కా* అనే నవలా పరంపరను ప్రకటించాడు. గాబ్రియల్ ఒకారా, ఎన్‌క్వాలో మొదలైన రచయితలు ఆఫ్రికా పట్ల న్యూనతా భావాన్ని తొలగదోస్తూ, ప్రాత క్రొత్తల కలయికను ప్రోత్సహించే రచనలను సృష్టించారు.

అయితే ఇంగ్లీష్‌లో కొనసాగిన ఆఫ్రికన్ రచనలకు మూలప్రేరణ విదేశాలలో, విశేషించి ఇంగ్లండ్‌లో విద్యా భ్యాసం చేసిన యువతరపు సాహిత్యకారుల ద్వారా లభించింది. ఇలియట్, యీట్స్, ఎజ్రా పౌండ్, ఆడెన్, విట్‌మన్ ప్రభృతుల కావ్యాదర్శాలను అవలం బించి, ఆఫ్రికా-నైజీరియా జన జీవనాన్ని సమీక్ష చేసే రచనలను వీరు రూపొందించారు. వీరిలో నైజీరియాకు చెందిన అచిబి, ఆలూకో, మునోన్యే, అమాదీ, సోయింకా, కెన్యాకు చెందిన ఎన్‌గుజా, ఘనాకు చెందిన ఆర్‌మా, ఫ్లోరాన్వాపాలు ప్రముఖ నవలాకారులు. అచిబి ఇబో తెగకు సంబంధించిన యుగసంధి స్వభావాన్ని ఇతివృ త్తంగా గ్రహించి వ్రాసిన *థింగ్స్ ఫాల్ అపార్ట్, నో లాంగర్ వాట్ ఈస్, ఆరో ఆఫ్ గాడ్, ఏ మ్యాన్ ఆఫ్ ది పీపుల్* అవగాహన, సానుభూతి, విమర్శన, కళాసమగ్రత మేళవించి వ్రాసిన ఉత్కృష్ట కృతులు. ఒకారో *ది వాయిస్*, సోయింకా *ది ఇంటర్‌ప్రెటర్స్, ఎన్‌గుగీ ఏ గ్రెయిన్ ఆఫ్ వీట్*, ఆర్మా *ది బ్యూటి ఫుల్ వన్స్ ఆర్‌నాట్ యెట్ బార్న్* అనే రచనలు ఆధునిక ఆఫ్రికన్ సమాజాల్లో తల ఎత్తిన సంఘర్షణలూ, వైరుధ్యాలూ, అపధోరణులూ కథావస్తువులుగా రచించిన ప్రసిద్ధ నవలలు. ఫ్లోరాన్వపా, బుచ్చీ ఎమిచెట్టీ మొదలైన రచయిత్రులు తమ నవలలలో ఆఫ్రికా నవ సమాజంలో మహిళాలోకం ఎదుర్కొనే సమస్యలను నిశితమైన మనో వైజ్ఞానిక దృష్టితో పరిశీలించి, సానుభూతితో చిత్రించారు.

'నెగ్రిట్యూర్' ఉద్యమం ఆఫ్రికాలో కవిత్వానికి, నాటక రచనకు పుష్టి నిచ్చింది. పురాణ గాథలూ, జానపద శైలులూ, జాతి చేతనా ప్రతిబింబిస్తూ ప్రతీకలనూ, సంకేతాలనూ, సంగీత నృత్య ప్రక్రియలనూ అనుసంధించి, స్పందనతో కూడిన కావ్యసృష్టి ఆఫ్రికా ఇంగ్లీష్ రచనలలో జరిగింది. బ్రూ, అవునూర్ (ఘనా); బార్ట్ విలియమ్స్ (సియేరా లియోన్) మొదలైన కవులు నిరసన, ధిక్కారం విప్లవం, ప్రతిక్రియ మొదలైన తీవ్ర భావ సంక్షోభాన్ని ప్రదర్శిస్తే, ఒకిగ్‌బో అనే నైజీరియా కవి, రుబిడారీ అనే టాండేనియా కవి తమ దేశ, జాతుల చారిత్రక అంతశ్చేతన ఆలంబనగా కాల్పనిక కావ్యాలను అందించారు. జీన్ పెపర్‌క్లార్క్, వోలే సోయింకా, అమా ఆటా అయిడూ ప్రభృతులు మహత్తరమైన నాటకాలను వ్రాశారు. వోలే సోయింకాకు 1986 లో నోబెల్ బహుమతి రావడంతో ఆఫ్రికా ఇంగ్లీష్ సాహిత్య కృషికి యోగ్యమైన పరిగణన విశ్వవ్యాప్తంగా లభించింది. *ది లయన్ అండ్ ది జ్యూయెల్, ది రోడ్, కోంగీస్ హార్వెస్ట్* మొదలైన అనేక రూపకాలను వ్రాసిన మహా మనీషి సోయింకా.

ఆఫ్రికా ఖండపు ఇంగ్లీష్ రచనలలో దక్షిణ ఆఫ్రికాకు విశిష్ట స్థానం ఉంది. శ్వేత జాతుల వలసగా రూపొందిన ఈ దేశం జాతి దురహంకారానికి, వర్ణ విచక్షణకు రాజకీయ దమన నీతికి, పరపీడన పరాయణత్వానికి మారుపేరుగా నిలచింది. అయితే అందులో ఉద్భవించిన సాహిత్యం

మానవతా భావస్ఫోరకమైంది. 19 వ శతాబ్దంలో బ్రిటిష్, డచ్ వలస వాసుల నిర్వాసిత చేతనను ప్రతిబింబించే కవితలు టామస్ ప్రింగిల్ మున్నగువారు వ్రాయగా, ఆలివ్ ష్రైనర్ తన ఆత్మకథా రూపమైన నవలలో రెండు భిన్న నైసర్గిక వాతావరణాల మధ్య చిక్కుకున్న వ్యక్తుల, కుటుంబాల, సమాజాల అనుభవాలను వాస్తవానికి చేరువగా చిత్రించింది. తరువాత రాయ్ కాంప్‌బెల్ *ది ఫ్లేమింగ్ టెర్రేస్*‌లోను, గయ్ బట్లర్, డేవిడ్ రైట్, ఎస్.టి. ప్రిన్స్, సిడ్నీ క్లౌట్స్, విలియం ప్లోమర్ మొదలైన ప్రతిభావంతులు తమ కవితలలోనూ మానవత్వపు విలువలనూ, ఉదారవాదాన్నీ ప్రతిపాదించారు. లారెన్స్ వాన్‌డెర్‌పోస్ట్ *ఇన్ ఏ ప్రావిన్స్* అనే నవలలో వర్ణించిన సామాజిక స్థితిని విస్తృతపరచి ఆలన్ పీటన్ *క్రై ది బిలవెడ్ కంట్రీ* అనే హృదయ విదారకమైన నవలలో శ్వేతాశ్వేత సౌహార్ద్రాన్ని నవజీవన ప్రణాళికగా, ధర్మం భూమికగా, మానవత్వం ప్రేరణగా ప్రతిపాదించాడు. అశ్వేత రచయితలలో ప్రముఖులు పీటర్ అబ్రహామ్స్ *(టెల్ ఫ్రీడమ్)*, ఇజికియెల్ *(డౌన్ సెకండ్ ఆవెన్యూ)*, ఆత్మకథా ప్రక్రియలో దక్షిణ ఆఫ్రికా సమాజ స్వభావాన్ని ప్రదర్శించి నల్లవారి మానవ హక్కులను పునరుద్ఘాటించారు. మొత్తంమీద అధికారిక రాజకీయ సిద్ధాంతాలకూ, లక్ష్యాలకూ సమన్వయం చేసి దక్షిణఆఫ్రికా సాహిత్యం వర్ణవిచక్షణా దూరమైన నవ మానవతాదర్శానికి ప్రోద్బలం చేకూరుస్తున్న దని గమనించవచ్చును. ఆఫ్రికా ఖండం యూరప్ ఖండరాజ్యాల వలసలుగా చీలిపోయి స్వాతంత్ర్య సిద్ధికి పూర్వం ఇంగ్లీష్, ఫ్రెంచ్, పోర్చుగీస్, స్పానిష్, బెల్జియన్ మొదలైన భాషలకు స్థావరమైది. ఇంగ్లీషు తరువాత సమాన ప్రాముఖ్యం గల ఫ్రెంచ్ ఆఫ్రికా సాహిత్యానికి మాధ్యమం అయిది. నిజానికి ప్రగతిశీలమైన, సంచలనాత్మకమైన సాహిత్య ప్రక్రియలు ఫ్రెంచ్ భాష మాట్లాడే ఆఫ్రికా దేశాలలోనే ప్రప్రథమంగా ఉద్భవించాయి. ఆఫ్రికా సాహిత్యానికి మూలస్తంభం లాంటి లియోపాల్డ్ సింగోర్ ఫ్రెంచ్ భాషలో మహాకవిగా పరిగణింప బడుతున్నాడు. జాక్వెస్ రబేమనాంజరా, బిరాగోడియోప్, జీన్ జోసెఫ్ రబేయారివేలో, ఊటామ్‌సీ మొదలైన ప్రతిభావంతులైన కవులు ఆఫ్రికా ఫ్రెంచ్ సాహిత్యాల్లో చిరస్థాయిగా నిలుస్తారు. నవలా రచయితలలో ప్రముఖులు ఒయోనో *(ది హౌస్‌బాయ్, ది ఓల్డ్‌మాన్ అండ్ ది మెడల్)*, కామెరాలేయ్ *(ది డార్క్ చైల్డ్, ది రేడియన్స్ ఆఫ్ ది కింగ్)* మోంగో బేటీ *(మిషన్ టు కాలా, కింగ్‌లాజరస్)*, సెంబేనె ఉస్మానె *(ది బ్లాక్ డాకర్, గాడ్స్ బిట్స్ ఆఫ్ వుడ్)*, ఆంబో ఊలోగ్వెమ్ *(బౌండ్ టు పవర్, ది లాస్ట్ ఆఫ్ ది జస్ట్)*. ఆధునిక విశ్వ సాహిత్యాకాశంలో వీరు ఉజ్జ్వల తారలు.

డి.వి. కె.రా.

## ఇతియోపియన్ సాహిత్యం

ఇతియోపియాలోని ప్రాచీన భాష గీజ్ (Geez) లో గాని, ఆధునిక అధికారభాష అయిన అంహరిక్‌లో గాని వెలువడిన సాహిత్యాన్ని ఇతియోపియన్ సాహిత్యం అంటారు.




ఇతియోపియా

అధికారికంగా సోషలిస్ట్ ఇతియోపియా అని వ్యవహరింప బడే ఈ దేశం ఆఫ్రికా ఖండంలోని తూర్పు భాగాన ఉన్న కొమ్ము భాగంలో ఎఱ్ఱసముద్రాన్ని ఆనుకొని ఉంది. ఈ దేశం విస్తీర్ణం 12,23,000 చ.కి.మీ.లు. రాజధాని నగరం అడిస్ అబాబా. ఎఱ్ఱసముద్రంలోని సుమారు 150 దీవులు కూడా ఈ ఇతియోపియాకు చెందినవే. 1984 జనాభా లెక్కల ప్రకారం ఈ దేశం జనాభా 3 కోట్ల 40 లక్షలు. జనాభా దృష్ట్యా ఆఫ్రికాలోని పెద్ద దేశాలలో ఇది మూడవది.

**గీజ్ సాహిత్యం :** గీజ్ భాషలో మనకు లభిస్తున్న అత్యంత ప్రాచీన రచనలు గ్రీక్‌భాషనుంచి అనువదింపబడిన మత గ్రంథాలు. ఆ అనువాదాలలోని శైలి మీదా, వాక్య నిర్మాణంమీదా ఆ గ్రీక్ గ్రంథాల ప్రభావం ఉండి ఉండవచ్చును. 7 వ శతాబ్దం మొదలు 13 వ శతాబ్దం వరకూ దేశంలో రాజకీయ అస్థిరత వ్యాపించి ఉండడంతో ఆ కాలంలో చెప్పుకోదగినంత సాహిత్య వ్యాసంగం జరుగలేదు. కాని, 1270 లో సోలోమోనిడ్ వంశం తిరిగి అధికారంలోకి రావడంతో గీజ్ సాహిత్యచరిత్రలో ఉత్తేజ

కరమైన క్రొత్త యుగం ప్రారంభ మైంది. ఈ యుగం లోను అనువాదాలదే పైచేయి. అయితే ఆ అనువాదాలు గ్రీక్ నుంచి గాక అరబిక్ నుంచి చేయబడ్డాయి. తరచు ఆ అరబిక్ గ్రంథాలకు మూలాలు కోప్టిక్, సిరియాక్, గ్రీక్ గ్రంథాలు అయి ఉండేవి. ఇతివృత్తం చాలావరకు భగవచ్ఛాస్త్రానికీ, మత సమస్యలకూ సంబంధించి ఉండేది. ఈ యుగం ఆరంభంలో వచ్చిన ఒక చెప్పకోదగిన రచన *క్బేబా నెగాస్ట్* (మహారాజుల వైభవం). ఇది కట్టు కథలతో కూడిన చరిత్ర, అన్యాపదేశం అపౌరుషేయ రచనలు ఈ మూడింటి మిశ్రమం. షేబారాణి సాల మన్ రాజును సందర్శించడం, ఆమెకు మెనెలిక్ అనే కుమారుడు జన్మించడం, అతడు ఇతియోపియన్ రాజ వంశాన్ని స్థాపించడం దీనిలోని ప్రధానకథ.

అబ్బా సాలమా అనే ఒక ఈజిప్షన్ రాజ పురుషుడు 1350 లో ఇతియోపియా నివాసి అయి, *బైబిల్* గ్రంథ సవరణకు కారణభూతుడు కావడమే కాక, ఇతి యోపియాలోని మతవిశ్వాసుల ఆదరం పొందిన ఎన్నో గ్రంథాలను గీజ్ భాషలోకి స్వయంగా అనువదించడమో, పరులచేత అనువదింప జేయడమో చేశాడు. ఆవేశ పూరితమైన *వెడేస్ మరియమ్* ప్రార్థనా గీతాల పుస్తకా లకు అనుబంధంగా చేర్చబడి, ఇంచుమించు పవిత్రగ్రంథ ప్రతిపత్తిని పొందింది. తరువాత కొద్ది కాలానికి 15 వ శతాబ్దం ప్రారంభంలో ఇతియోపియాకు 'సంరక్షక యోగి' అయిన సెయింట్ జార్జ్‌తో సహా వివిధ యోగుల, ఆత్మత్యాగుల జీవిత చరిత్రలు రచించబడ్డాయి. ఇదే కాలంలో యోగుల జీవిత చరిత్రలతో కూడిన అరబిక్ *సినాక్సేరియమ్* నుంచి రోజుకి ఒకటో రెండో చరిత్రల చొప్పన అనువాదాలు వెలువడ్డాయి.

15 వ శతాబ్ది ప్రారంభంలో అనేక మత గ్రంథాల అనువాదాలు వెలువడి వాటి ప్రభావం వల్ల రెండు స్వతంత్ర రచనలు వచ్చాయి. మొదటి తెవోడ్రోస్ (థియొడోర్) పాలనకాలం (1411-14) లో వెలువ డిన *ఫెక్కా రే ఇయాసుస్* (జీసస్ స్వరూప వివరణ) అనే గ్రంథం వాటిలో మొదటిది. రెండవది: *స్వర్గ మర్త్య లోకాల రహస్యం!* దీనిలో మైకేల్‌కీ, శనికీ మధ్య జరిగిన యుద్ధం రసవంతంగా వర్ణించబడింది. ఇదే కాలంలో వచ్చిన మరొక స్వతంత్ర గ్రంథం భగవ ద్దూష ణలను ఖండిస్తూ జియోర్గిస్ సాగ్లా రచించిన *రహస్య గ్రంథం. డెగ్గువా, మవాసీట్, మెరాఫ్* అనబడే బృహత్ ప్రార్థన గ్రంథాలు కూడా బహుశః ఈ కాలానికి చెంది నవే! మాల్కే (సాదృశ్యం) అనబడే మరొక రకం మత సంబంధమైన కవిత్వం కూడా 15 వ శతాబ్దంలోనే మొట్ట మొదటి సారి ఆరంభం అయింది. సాధార ణంగా దీనిలో అంత్యానుప్రాస, అయిదేసి పాదాలు గల 50 పద్యాలు ఉంటాయి. ప్రతిపద్యం సంబోధితుడైన యోగియొక్క భౌతిక, నైతిక గుణాలలో దేనినో ఒక దానిని ఉద్దేశిస్తుంది. ఈ స్వర్ణయుగంలో వచ్చిన మత సాహిత్యానికి తుది ఉదాహరణగా 1441-42 లో అరబిక్ నుంచి అనువదించబడిన *మేరీ మహిమలు* అనే గ్రంథాన్ని పేర్కొనవచ్చును. ఇది అమిత ప్రజాదరణ పొందింది; దీనికి అనేక పాఠాంతరాలు వెలశాయి.

1527-43 మధ్య జరిగిన ముస్లిం దండయాత్రలో ఇతియోపియన్ సాహిత్య వ్యాసంగం మళ్లీ స్తంభించిపో యింది. అనేక లిఖిత ప్రతులు నాశనం చేయబడ్డాయి. బలాత్కారంగా ఇస్లాం మతంలో చేర్చుకోడం విస్తృ తంగా కొనసాగింది. అటు తరువాత ముస్లిం దాడిని త్రిప్పికొట్టడం జరిగినా, దేశం మాత్రం తిరిగి యథాపూర్వ స్థితికి రాలేదు. క్రైస్తవ మతం లోకి మార్చబడిన ఒక ముస్లిం వర్తకుడు టెబర్ లిబనోస్ మతంలో ఒక మతో ద్యోగిగా ఉండి *యాంకా సా అమీన్* (విశ్వాస ద్వారం) అనే గ్రంథం వ్రాసి, మతం వదలినవారు పశ్చాత్తప్తులై తిరిగి వెనుకటి మతంలో చేరడాన్ని దానిలో సమర్థిం చాడు. ఇంకా ఇలాంటి అనేక గ్రంథాలు వెలువడి క్రైస్తవ మతంలో 'క్రీస్తు మానవ మాత్రుడే'అని వాదించే 'మోనో ఫైసైట్' శాఖను సమర్థించాయి. ఇంతలో రోమన్ కేథ లిక్ మతప్రచారకులు ఇతియోపియాలో ప్రవేశించడంతో ఇతియోపియన్ చర్చికి మరింత ప్రమాదం ఏర్పడింది.

ఇతియోపియాలో పురాతన భాష అయిన గీజ్ ప్రభావం అప్పటికే సన్నగిల్లుతూ కొద్దిమందికి మాత్రమే తెలిసిన మత సంబంధమైన భాషగా పరిణమింప సాగింది.

16 వ శతాబ్దంలో ఇతియోపియాలోని ప్రధాన వ్యావహారిక భాష అయిన అంహరిక్‌ను సాహిత్య ప్రయో జనాలకోసం వాడడం ప్రారంభం అయింది. రాజుల కైఫీయత్‌లలో కూడా అంహరిక్ పదాల వాడుక ఎక్కు వయింది. అయినా 1600 లో సాలిక్ ఆఫ్ డెబర్ లిబనోస్ అనువదించిన *హావీ* అనే మతసంబంధమైన ఒక బృహద్ విజ్ఞాన సర్వస్వం, ఈజిప్ట్‌పై అరబ్‌ల జైత్రయా త్రను వర్ణిస్తూ నికియూ బిషప్ వ్రాసిన *జోహానీస్ మడబ్బార్ చరిత్ర* (దీని అరబ్ మూలం వినష్టమై పోయింది. ఇది చాలా అమూల్యమైన గ్రంథం), పౌర న్యాయ శాసనాలను సంకలితం చేసి కూర్చిన *ఫెతానె గాస్ట్* (రాజుల న్యాయశాస్త్రం) వంటి గొప్ప గ్రంథాలు

గీజ్‌భాషలో వెలువడ్డాయి. ముఖ్యంగా గోండార్ నగరంలో గీజ్ కవిత 18 వ శతాబ్దంలో బాగా వర్ధిల్లింది. నాటినుంచి అనేక క్రైస్తవ మఠాలలో గీజ్ కవితా రచన కొనసాగుతూ వచ్చింది. అలాకా తాయే వ్రాసిన కొన్ని గీజ్ భాషా పద్యాలు అస్మెరా నగరంలో 1921 లో ప్రకటించ బడ్డాయి. హిరూయి వాల్డె సెలాసీ సంకలనం చేసిన ఒక కవితా సంకలనం 1926 లో అడిస్ అబాబాలో వెలువడింది.

ముఖ్యంగా తానా సరస్సుకి ఉత్తర ప్రాంతాలలో నివసించే ఫలాషాలు అనబడే యూదుజాతీయులు నేటికీ గీజ్‌భాషనే తమ పవిత్ర భాషగా ఉపయోగిస్తున్నారు. *బుక్ ఆఫ్ జూబిలీస్*‌తో సహా *ఓల్డ్ టెస్టమెంట్* మాత్రమే కాక ఫలాషాలకే ప్రత్యేకమైన *తేజాజా సాంబత్* (సబ్బత్ శాసనం) వంటి మరికొన్ని పుస్తకాలు కూడా గీజ్‌భాషలో వచ్చాయి. పై పుస్తకపు కాలం నిర్ధారణగా తెలియదు. బహుశః ఇది 14 వ శతాబ్దిలో అరబిక్ భాష నుంచి అనువదించుకున్న గ్రంథం కావచ్చును. ఓల్ఫ్ లెస్లా 1951 లో *ఫలాషా ఆంతాలజీ* అనే కవితా సంకలనం ప్రచురించాడు.

**అంహరిక్ సాహిత్యం :** మనకు తెలిసినంతలో అత్యంత ప్రాచీనమైన అంహరిక్ రచనలు అమ్‌డాట్స్ యాన్ (1314-44) విజయాన్ని కీర్తించే గేయాలు. 16 వ శతాబ్దం నుంచి ఈ భాషలో మతగ్రంథాలు వెలువడ్డాయి. 19 వ శతాబ్దం ప్రారంభంలో కెయిరోలో *బైబిల్* అనువాదం వెలువడింది. అయితే దానిలోని అంహరిక్ భాషా లక్షణాలను బట్టి చూస్తే అది ఇథియోపియన్ జాతీయులు చేసిన అనువాదంగా తోచదు. ఈ అనువాగం నుంచే మిషనరీ సంఘాలు అంహరిక్ భాష అంతగా తెలియకుండానే తమ తమ పాఠాలు, నవరణలు చేసుకున్నాయి. అంతకంటె *న్యూటెస్టమెంట్*‌కి మరింత విద్వదనువాదం అడిస్ అబాబాలో 1955 లో వచ్చింది. ఆ తరువాత 1961 లో *ఓల్డ్ టెస్టమెంట్* కు కూడా అంహరిక్ అనువాదం వెలువడింది. పూర్తిగా అంహరిక్ భాషలోనేఉన్న తొలి ఆధికారిక క్రైఫీయత్‌లు రెండవ తెవోడ్రోస్ (1855-68) కాలం నుంచి కనిపిస్తున్నాయి. జాన్ బన్యన్ వ్రాసిన *పిల్‌గ్రిమ్స్ ప్రోగెస్* అనే గ్రంథానికి అంహరిక్ అనువాదం 1892 లో వెలువడింది. దానితో అంహరిక్ భాషలో అన్యాపదేశాత్మకమైన నవల' (allegorical novel) అనే ఒక క్రొత్త సాహిత్య ప్రక్రియ అవతరించింది. దీనిలో కొంత భాగం మత దృష్టితో కూడిన కవిత కూడా ఉంటుంది. ఇలా వెలసిన తొలి రచన ఆఫెవోర్క్ గాబర్ ఐసస్ వ్రాసిన *లిబ్‌వాలడ్ తారిక్* (భావనాత్మక కథ 1908). రాస్ తఫారీ రాజప్రతినిధిగా ఉన్న కాలంలో (1916-20 తరువాత ఈయనే మొదటి హైలీసెలాసీ చక్రవర్తి అయాడు) హిరుయ్‌వాల్డె సెలాసీ (మృతి 1938) అంహరిక్ రచయితలలో సుప్రఖ్యాతు డయాడు. *వడజే లెబ్బే* (నా హృదయమే నా మిత్రుడు) అనే ఇతని అన్యాపదేశ రచన విశేష ప్రసిద్ధి పొందింది.

1936-41 మధ్య ఇటలీ ఇథియోపియాను ఆక్రమించుకోడం, తిరిగి ఇథియోపియా స్వాతంత్ర్యం పొందడం జరిగిన తరువాత అంహరిక్ సాహిత్యానికి అద్భుతమైన ప్రోత్సాహం లభించింది. చక్రవర్తి రచయితలను వివిధ సాహిత్య ప్రక్రియలలో ముఖ్యంగా నైతిక, దేశభక్తి రంగాలలో ఉత్తమ సాహిత్యం సృజించమని ప్రోత్సహించాడు. అనంతరం వచ్చిన రచయితలలో సుప్రసిద్ధులు; మాకోనెన్, ఎండాల్ కాచు (అన్యాపదేశాత్మక నవలలు, నాటకాలు), కెబెడే మైకేల్ (కవిత, నాటకాలు, చరిత్ర, జీవితచరిత్ర), టెక్లి ట్సోడెక్ మకూరియా (చారిత్రక రచనలు).

బొ.శ్రీ.

## ఈజిప్షన్ భాష - సాహిత్యం

**భాష :** ఈజిప్షన్ ప్రాచీనమైన ఒక విస్మృత భాష. దాదాపు క్రీ.పూ. 4000 నుండి క్రీ.పూ.3000 వరకు ఈజిప్టులో వర్ధిల్లిన ఒక నాగరకతకు ఈ భాష ఆలంబనంగా ఉండేది. క్రీ.పూ. 3000 ప్రాంతాన ఈ భాషకు చిత్ర లిపి ఒకటి రూపొందింది. అప్పటినుంచీ ఈ భాష వ్యవహారంలో ఉన్నంత కాలమూ కొన్ని శాసనాలూ, పత్రాలూ, గ్రంథాలూ ఆ లిపిలో వెలువడ్డాయి. పురాతత్త్వ శాస్త్రజ్ఞులు ఎంతో కృషి చేసి, వాటిలో లభ్యమైన వాటిని పఠించి వాటిలోని విషయాలను ప్రకటించడంవల్ల, ఈజిప్షన్ భాషా సాహిత్యాల పరిణామం రేఖా మాత్రంగా అయినా చిత్రించడానికి అవకాశం కలుగుతూంది.

భాషా తత్త్వశాస్త్రజ్ఞులకు పరిచితాలైన వివిధ భాషా కుటుంబాలలో దేనికీ ఈజిప్షన్ భాషతో సంబంధం ఉన్నట్టు కనపడదు. కొందరు పండితులు మాత్రం సెమెటిక్ భాషా కుటుంబంతో దీనికి ప్రత్యేక సంబంధం ఉండి ఉండవచ్చు నని ఊహిస్తున్నారు. కాని, అది ఇంకా ఊహగానే నిలిచి ఉంది.

క్రీ.పూ. 2400 కు పూర్వం ఈ భాషలో సాహిత్యం అనేది చెప్పదగింది ఏదీ వెలువడినట్టు లేదు. ఆ కాలానికి చెందిన వని భావించడానికి అవకాశ మున్న వ్రాతలలో కొన్ని మంత్ర తంత్రాలూ, ఆచార విధులూ మాత్రమే

కనపడుతున్నాయి. క్రీ.పూ. 2400 నుండి క్రీ.పూ.1500 వరకూ గల కాలం ఈ భాషా వికాస చరిత్రలో మధ్యమ యుగం. ఈ యుగంలో భాషకు కొంత ప్రౌఢత చేకూరింది. దేశ చరిత్రలు మొదలయినవి కొన్ని రచింప బడ్డాయి.

**సాహిత్యం :** క్రీ.పూ. 1500 మొదలుకొని క్రీ.పూ. 700 వరకూ గల కాలము ఈజిప్షన్ సాహిత్య చరిత్రలో స్వర్ణయుగం. వివిధ రచనా ప్రక్రియలలో ఆ యుగపు రచయితలు కృషి చేశారు. కాని ప్రపంచ చరిత్రలో ప్రథమ నాగరక జాతిగా పరిగణింపబడే ఈజిప్షన్‌ల సాహిత్యంలో ఐతిహాసిక కావ్యానికి కాని, రూపకానికి కాని స్థానం కనపడకపోవడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

రచనా రీతిని బట్టి ఇతిహాసంగా పరిగణించడానికి వీలు లేకపోయినా అలాంటి లక్షణాలు కొన్ని ఉన్న గ్రంథం ఒకటి ఆసాహిత్యంలో లభిస్తుంది. ఆ దేశాన్ని ఏలిన రెండవ రామిసీజ్ చక్రవర్తి హిటైట్ రాజ సముదాయాన్ని కదీశా నది దగ్గర యుద్ధరంగంలో జయించిన గాథ ఇందులో వర్ణించబడింది. రాజ ప్రశస్తిగా మాత్రమే భావించదగిన ఈ రచనకు ఆ దేశంలో ఎంతో ఆదరం ఉండేది.

రూపకాలు సువ్యవస్థిత రూపాన ఆ సాహిత్యంలో రూపొందక పోయినా, దేవలోక విశేషాలను సంభాషణ రూపాన ప్రజానీకానికి వెల్లడించే రచనలు కొన్ని ఉండేవి. ఉత్సవ సమయాలలో ఇవి ప్రదర్శింప బడేవి. గేయ కవిత్వానికి మాత్రం ఆ సాహిత్యంలో ప్రముఖ స్థానం లభించింది. ఈ గేయాలలో అధిక భాగం రాజులనూ, వారి వైభవాలనూ వర్ణించడానికి వినియోగింపబడ్డాయి. ప్రేమ, విరహం మొదలయిన శృంగార విషయిక గేయాలు కూడా కొన్ని కనపడుతున్నాయి. వీనిలో అన్నింటి కన్న హృదయంగమ మైంది మృత్యువును వర్ణించే ఒక గేయం.

ఈజిప్షన్ సాహిత్యంలో గేయం తర్వాత పేర్కొన దగ్గది కథానిక. *బృహత్కథ, అరేబియన్ నైట్స్* వంటి కథా మాలికలు ఆసాహిత్యంలో ఉన్నట్లు కొందరి అభిప్రాయం. ఇప్పుడు లభించే కథానికలలో కొన్ని ఏదో ఒక పెద్ద కథలోని అంతర్భాగంగా ఉన్నట్టు కనపడడమే ఈ ఊహకు కారణం.

ప్రజాభిమానానికి పాత్రమై నిలచి ఉన్న కథలలో **ఖూఫూ** (షియాప్స్ రాజు - మాంత్రికులు) అనేదానిలో సుప్రసిద్ధులైన పురాతన రాజులకు సంబంధించిన ఘటనా పరంపర వర్ణించబడింది. *భగ్ననౌక - నావికుడు* ఒక దీవికి కొట్టుకొని పోయిన నావికుణ్ణి ఒక రాకాసి సర్పం ఆదరించిన *అన్న దమ్ముల కథ.* ధర్మానికీ, అధర్మానికీ మధ్య ఘర్షణ దీని ఇతివృత్తం. పురాణ గాథల్లోని *ఒసిరిస్* అనే పాతాళ లోకపు దేవతతో దీనికి సంబంధం ఉన్నట్టు కనిపిస్తుంది. *హోరస్, సేథ్‌ల ఘర్షణ* లో దేవతలు అర్ధ విదూషక పాత్రలను నిర్వహిస్తారు. అయితే ఇతర కథలలో ఇలాంటి అలౌకికమైన అంశాలు గోచరించవు. *మాటకారి కర్షకుడు* కథలో వాక్చాతుర్యం వల్ల, తెలివి వల్ల ఒక గ్రామీణునికి న్యాయం లభిస్తుంది. *సినూహే* కథలో దేశభ్రష్టుడైన రాజు క్షమాభిక్ష పొంది, స్వగృహానికి తిరిగి వస్తాడు. *వీనామన్* కథ ఫోనీషియాకు కలప కొనడానికి పంపబడ్డ ఒక దూత సాహస యాత్రలను వర్ణిస్తుంది.

సామెతలూ, సందేశాలూ ప్రబోధక సాహిత్య శాఖకు చెందుతాయి. ప్టాహోటెప్ అమెనెమోప్ ల సుభాషితాలు ఈ శాఖకు చెందినవే! అవి సాధారణంగా తండ్రి కుమారునికీ, రాజు తన వారసునికి చేసే హితబోధలను పోలి ఉంటాయి.

ఈజిప్షన్ భాష క్రీ.పూ. 700 తరువాత అంహారిక్ మొదలైన భాషల ప్రభావానికి లోనయింది. లిపిలోనూ మార్పు వచ్చింది. ఇలా పరిణమించిన భాషకు 'డెమోటిక్' అనే పేరు ఏర్పడింది. ఈ భాషలో సాహిత్యం ఏమీ వెలువడలేదు. క్రీ.పూ. 300 తర్వాత ఈ డెమోటిక్ సైతం గ్రీక్ భాషా ప్రభావానికి లోనై, చాలా వికృతిని చెంది, కోప్టిక్ భాషగా పరిణమించింది. కాని, ఈ కోప్టిక్ భాషకు, వెనుకటి ఈజిప్షన్ భాషతో గల సంబంధం నామ మాత్రమే! ఈ కోప్టిక్ భాష కోప్టిక్ క్రైస్తవులకు ప్రార్థనా భాషగానే నేడు నిలచి ఉంది. ఈ నాడు ఈజిప్టు అంతటా అరబ్బీ భాషే వ్యవహారంలో ఉంది.

చీ. శే.రా. (వ.మం.)

## కోప్టిక్ భాష-సాహిత్యం

**భాష :** హెమెటో సెమిటిక్ భాషా కుటుంబానికి చెందిన కోప్టిక్ భాష పురాతన ఈజిప్షియన్ భాష నుంచి పరిణమించింది. కోప్టిక్ అనే మాట కుబ్ట్ (ఈజిప్టు దేశీయుడు) అనే అరబ్ భాషా పదం నుంచి పుట్టింది. 3 వ శతాబ్దం నుంచి 640 దాకా క్రైస్తవులైన ఈజిప్టు వాసులు కోప్టిక్ భాషనే వాడేవారు. 640 లో జరిగిన ముస్లిం దురాక్రమణతో పాటు అరబ్ భాష కూడా ఈజిప్టులో ప్రవేశించి, కోప్టిక్ భాషను తొలగించింది. 15 వ శతాబ్దం దాకా కోప్టిక్ భాష అక్కడక్కడ వాడబడుతూ వచ్చినా, 17 వ శతాబ్దం నాటికి అది పూర్తిగా అదృశ్యమై పోయింది (చూ. ఈజిప్షన్ భాష).

పురాతన ఈజిప్షన్ భాషనుంచి 8 వర్ణాలను గ్రీక్ వర్ణమాలకు చేర్చి ఆ విధంగా సిద్ధమైన వర్ణమాలనే కోప్టిక్ భాష వ్రాయడానికి ఉపయోగించేవారు. దీనిలో గ్రీక్ భాషలో లేని కొన్ని విశిష్ట ఈజిప్షన్ ధ్వనులను కూడా లిపి బద్ధం చేయడం సాధ్యమైంది. మత పరంగా కొన్ని గ్రీక్ పదాలు పురాతన ఈజిప్షన్ పదాలను వ్యవహారం నుంచి తొలగించాయి. కోప్టిక్ భాషలో 6 ప్రధానమైన మాండలికాలు ఉన్నాయి. ఎక్కువగా ఉచ్చారణ భేదం వల్లనే ఈ మాండలికాలు ఏర్పడ్డాయి. వీటిలో 4 ఈజిప్టు ఎగువ భాగానికీ, తక్కిన రెండూ ఈజిప్టు దిగువ భాగానికి చెందినవి. పయ్యూమిక్, అస్యూటిక్, ఆఖ్మిమిక్, సహిదిక్ అనే నాలుగు మాండలికాలు ఈజిప్టులోని ఎగువ భాగానికి చెందినవి. నైల్ నదీ పశ్చిమ తీరంలో బహుళంగా వ్యవహారంలో ఉన్న పయ్యూమిక్ 8 వ శతాబ్దం వరకూ వాడుకలో ఉంది. 4 వ శతాబ్దంలో అస్యూటిక్ విరివిగా ప్రచారంలో ఉంది. యోహాన్ సువార్త, అపోస్తలుల కార్యాలు, దైవప్రేరిత జ్ఞానానికి చెందిన ప్రతులు ఈ మాండలికంలోనే వ్రాయబడ్డాయి. అస్యూటిక్ మాండలికాన్ని సబ్-ఆఖ్మిమ్ అని కూడా అంటారు. ఆఖ్మిమిక్ మాండలికాన్ని ఆఖ్మిమిక్ నగరం ప్రాంతంలో మాట్లాడేవారు. సహెరిక్ అనే మాండలికం తీబీబ్ ప్రాంతంలో మాట్లాడబడేది. అదే ఈజిప్టు ఎగువ భాగాని కంతటికీ ప్రామాణికమైన కోప్టిక్‌గా స్థిరపడింది. తక్కిన మాండలికాలలో కంటె సహిదిక్ లోనే ప్రాచీన లిఖిత ప్రతులు ఎక్కువగా లభించాయి.

ఈజిప్టు దిగువ భాగానికి చెందిన మాండలికాలు బాష్మోరిక్, బొహైరిక్. ఏవో కొన్ని టీకలు, టిప్పణులు మినహాయిస్తే బాష్మోరిక్‌లో చెప్పుకోదగిన సాహిత్యం లేదు. అలెగ్జాండ్రియా, మెంఫిస్ నగరాలు ఉన్న ఈజిప్టులోని పశ్చిమ భాగం అంతటా బొహైరిక్ మాండలికం వ్యాపించి ఉండేది. కోప్టిక్ క్రైస్తవులు తమ మత ప్రయోజనాలకు బొహైరిక్‌నే వాడుకునేవారు. 14 వ శతాబ్దం వరకూ ఈమాండలికంలో గ్రంథరచన కొనసాగినట్లు నిదర్శనాలు ఉన్నాయి.

**సాహిత్యం :** కోప్టిక్ సాహిత్యం యావత్తు మతపరమైనదే అని చెప్పవచ్చును. 2 వ శతాబ్దం నుంచి 5,6 వందల ఏళ్లపాటు కోప్టిక్ భాష, సాహిత్యం పటిష్ఠంగా వర్థిల్లి, ఆ తరువాత క్రమంగా క్షీణించాయి. గ్రీక్‌భాష నుంచి చేసిన అనువాదాలే కాక, గ్రీక్ ఫాదిరీలు కోప్టిక్ భాషలో స్వతంత్రంగా రచించిన గ్రంథాలూ, క్రైస్తవ చర్చికి చెందిన గ్నోస్టిసిజం (Gnosticism), మానికీజమ్ (Manichaeism) వంటి తాత్త్విక మార్గాలకు సంబంధించిన గ్రంథాలు కోప్టిక్ భాషలో విస్తారంగా కనిపిస్తాయి. 'ఎడారి ఫాదిరీ'లలో మొదటివాడైన సెయింట్ ఆంతోనీ కోప్టిక్ భాషలో స్వతంత్ర గ్రంథరచన చేశాడు. ఆయన గ్రంథాలే ఈ భాషలో అతి ప్రాచీన మైనవి. 3 వ, 4 వ శతాబ్దాలలో కొందరు క్రైస్తవ తాత్త్వికులు, సన్యాసులు కోప్టిక్ భాషలో గ్రంథరచన చేశారు. వీరిలో సెయింట్ ఫాకోమియస్ ముఖ్యుడు. ఆయన వ్రాసిన *మత జీవన పద్ధతి* కోప్టిక్ భాషలోనే ఇప్పటికీ లభ్యం అవుతున్నది. అలెగ్జాండ్రియా ప్రధాన మతగురువైన సెయింట్ అథేనియస్ మత ప్రచార గ్రంథాలను కోప్టిక్ భాషలోను, గ్రీక్ భాషలోను కూడా వ్రాశాడు. మకేరియస్, సెయింట్ సెరాపియమ్ మొదలైనవారు కూడా కోప్టిక్ భాషలో గ్రంథరచన చేశారు. అయితే కోప్టిక్ రచయితలందరిలోకీ షెనూట్ మిక్కిలి ప్రసిద్ధుడు. ఈయన 4 వ, 5 వ శతాబ్దాల మధ్యకాలంలో ఈజిప్టు ఉత్తర భాగంలో అంబైప్‌కి సమీపంగా ఉన్న శ్వేత మఠానికి చెందిన సన్యాసి. లేఖలు, వ్యాఖ్యానాలు, ప్రబోధగ్రంథాలు విస్తారంగా వ్రాసి ఈయన కోప్టిక్ భాషకు సాహిత్య గౌరవాన్ని సమకూర్చాడు. ఈయన రచనలను సాహిత్య లోకంలో చిరస్థాయిగా నిలిచి ఉండ గల గ్రంథాలుగా పరిగణిస్తారు. షెనూట్ గ్రంథాల తరువాత పేర్కొనదగినవి 7 వ, 8 వ శతాబ్దాలలో వ్రాయబడిన క్రైస్తవ భక్తి గీతాలు. ముస్లింల కిరాతక కృత్యాలను తట్టుకోడానికి తోడ్పడే ఈ భక్తి గీతాలలో తీవ్రమైన శక్తి, ఉద్వేగమూ కనిపిస్తాయి.

శ్రీ.ల.

## దక్షిణ ఆఫ్రికా సాహిత్యం

ఆఫ్రికా ఖండంలో పూర్తిగా దక్షిణ దిక్కున ఉన్న ప్రాంతం దక్షణ ఆఫ్రికాగా వ్యవహరించ బడుతూంది. ఈ దేశానికి ఉత్తరాన బోట్స్వానా, రొడీసియాలు, తూర్పున మొజాంబిక్, స్వాజీలాండ్‌లు, దక్షిణానా, పడమరా హిందూ మహాసముద్రం ఎల్లలు. ఈ దేశం తెల్లవారి ఆధిపత్యంలోనే ఉంది. అధిక సంఖ్యాకులైన నల్ల జాతి ప్రజలు తమ దేశాన్ని తామే పరిపాలించుకోవాలని ఎంతో కాలంగా ఉద్యమాలు నిర్వహిస్తున్నారు. ఈ ప్రజల నాయకుడు నెల్సన్ మండేలా ఇటీవలనే నిర్బంధంలో నుంచి బయటికి వచ్చాడు.

దక్షిణ ఆఫ్రికాకు చెందిన సాహిత్యం ఆంగ్లంలోను, ఆఫ్రికాన్స్ (దక్షిణ ఆఫ్రికాలో అధికార భాషగా స్థానాన్ని

సంపాదించిన డచ్ భాషకి రూపాంతరం)లోను, ఆఫ్రికాకు చెందిన మూలభాషలలోను కనిపిస్తూంది. డచ్ భాషనుంచి విడివడ్డాక, మొదటి స్వతంత్ర రచన ఆఫ్రికాన్స్‌లో 1750 ప్రాంతంలో ప్రారంభమయింది. ఆఫ్రికాన్స్ సాహిత్యం మొదట్లో కవిత్వ రూపంలోనే ప్రముఖంగా కనిపించడం గమనించదగిన విషయం. స్థానిక సంప్రదాయాలపై ఆధార పడి కవిత్వ సృష్టి చేసిన వారిలో యూజినీ మారియాస్ (1871-1936) ప్రముఖుడు. ఈయన ప్రచురించిన ఒకే ఒక కవితా సంగ్రహంలో 'చలి రాత్రి' ముఖ్యమైన ఖండిక. ఈయన పశు, పక్షి, కీటకాలను నిశితంగా పరిశీలించిన వ్యక్తి. *చీమల ఆత్మ* (1934) అనే వచన రచన కూడా ఆయన చేశారు. లూయిస్ లియొపాల్డ్ (1880-1947) తన తరానికి చెందిన వారిలో అత్యంత ప్రతిభావంతుడు. రాజకీయవేత్తగా, పత్రికా రచయితగా, వైద్యుడుగా, నవలా రచయితగా, నాటక కర్తగా, వృక్షశాస్త్రజ్ఞునిగా ఆయన బహుముఖ ప్రజ్ఞను ప్రదర్శించాడు. ఆయన కవిగా కంటె నవలా రచయితగా ఎక్కువ ప్రసిద్ధుడు. *కట్టుబడిన నాగు* లో యుద్ధాలపై ఇతని విముఖత్వం, ప్రకృతిపట్ల అభిమానం ప్రస్ఫుటంగా కనిపిస్తాయి.




ద. ఆఫ్రికా

సి.ఎమ్. వాన్‌డెన్ హీవర్ (1909-57) బ్రిటిష్ వారి ఖైదీల క్యాంపులో జన్మించిన ఒకే ఒక ఆఫ్రికన్ రచయిత. ఈయన రచనలలో నవలలే ప్రముఖ స్థానాన్ని అలంకరిస్తున్నాయి. *ఆలస్యంగా అందినపండు* (1939), *పంటపొలం* (1935) ఈయన రచనలలో ముఖ్యమైనవి. మానసిక విశ్లేషణ ఇతని రచనలలో బలంగా లేకపోయినా, వ్యవసాయ రంగంలోని అపజయాల వల్ల పల్లెసీమలను వదలి పట్టణాలలోని దోపిడీ వ్యవస్థ విధానానికి తల ఒగ్గే కర్షకుల జీవితాలను ఈయన హృదయంగమంగా చిత్రించాడు.

ఎన్.పి. వాన్‌విక్‌లూవ్ (1906) ఈ నాటి రచయితలలో ప్రముఖుడు. ఈయన రచనలలో *జెర్మానికస్* (1946) అనే నాటకం, *ఓ చపల చిత్తా!* అనే పద్య రచన పేర్కొనదగినవి. ఉయిస్ క్రిగె (1910) ఫ్రెంచ్, స్పానిష్, పోర్చుగీస్ సాహిత్యాల నుంచి ఆఫ్రికాన్స్‌లోకి ఎన్నో అనువాదాలు చేశాడు. ఈయన స్వతంత్ర రచనలలో కూడా ఈ సాహిత్యాల ప్రభావం ప్రముఖంగా కనిపిస్తుంది. అయితే ఆ ప్రభావాన్ని తన దేశ వాతావరణానికి అనుకూలంగా ఆయన మార్చుకోగలిగారు. 'పొలం ద్వారం' అనే కవితలో శాంతిప్రియత్వం, మనిషిని మనిషి దోచుకునే వ్యవస్థపై ఆగ్రహం కనిపిస్తాయి. మంచికి తన మనసులో ద్వారాలను తెరుస్తా నని ఈ కవితలో ఈయన ప్రకటించాడు.

ఎలిజబెత్ ఐబర్స్ (1915) దక్షిణ ఆఫ్రికాలోని ప్రముఖ రచయిత్రి. ఈమె రచనలపై అమెరికన్ కవయిత్రి ఎమిలీ డికిన్సన్ ప్రభావం ఎక్కువ. మాతృత్వం, స్త్రీత్వం, ఏకాంతత్వం ఈమె కవితా వస్తువులు. *నిశ్శబ్ద సాహసం* (1948) ఆమె ఆంగ్లానువాదంతో ప్రచురించిన కవితా సంకలనం.

ఇన్‌గ్రిడ్ యోన్కర్ (1933-1965) తన ముప్ఫైరెండో సంవత్సరంలో ఆత్మహత్య చేసుకోడం సాహిత్యరంగంలో సంచలనాన్ని కలిగించింది. ఈమె కవిత్వాన్ని అమెరికన్ కవయిత్రి సిల్వియా ప్లాథ్ కవిత్వంతో పోల్చడం ఉచితం. ఈమె కవిత్వం మానసిక వ్యధకి సున్నితమైన సూచిక; మానవుని పుట్టుకకు, హింసా ప్రవృత్తికి ఉన్న అవిభాజ్య సంబంధానికి ప్రతీక. 1968 లో ప్రచురించబడ్డ కవితా సంకలనం ఆమెకు మంచిపేరు తెచ్చిపెట్టింది. దక్షిణ ఆఫ్రికాలోని పరిస్థితులకు దర్పణం పట్టింది.

దక్షిణ ఆఫ్రికా సాహిత్యంలో నల్లజాతివారి నీగ్రోతనం ప్రధానాంశం. ఆఫ్రికన్ సాహిత్యంలో ఉన్నత స్థానాన్ని వహించి, నోబెల్ బహుమతిని అందుకున్న *వోలె సోయింక* అన్నట్టు 'పులులు తమ పులి లక్షణాన్ని ప్రకటించవలసిన అవసరంలేదు'. నల్లజాతివారు తమ జాతి తత్త్వాన్ని సాహిత్యంలో ప్రకటించడం ఆఫ్రికా సాహిత్య ప్రస్థానంలో ఒక ముఖ్యమైన దశ. దక్షిణ ఆఫ్రికా సాహిత్యంలో ఈ అంశం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

ఐమి సెజైర్ (1913) తన కవిత్వంలో ఈ నీగ్రోజాతి తత్త్వాన్ని అధివాస్తవిక ధోరణిలో వ్యక్తం చేశాడు. ఈ

తత్త్వం ఆత్మకు సంబంధించిన ఒక అవస్థ అని ఆయన భావించాడు. 'నా జన్మభూమికి పునరాగమనం' అనే ప్రసిద్ధమైన కవితలో 'నన్ను అర్థం చేసుకోలేని వ్యక్తి పులి గాండ్రింపును కూడా అర్థం చేసుకోలేడు' అని తన జాతి ఆవేదనను ఆగ్రహంతో ప్రకటించాడు.

లెపొల్డ్ సెడార్ సెంఘూర్ (1906) కవిత్వంలో కూడా నీగ్రోజాతి ఆవేదన, ఆత్మాభిమానం ప్రధానమైన అంశాలు. ఈయన సెనెగల్‌కి అధ్యక్షుడుగా పనిచేసిన కవి. మార్క్సిస్టు సిద్ధాంతాలపై ఈయనకు గౌరవం ఉన్నా, అవి యథాతథంగా ఆర్థికంగా వెనుకబడ్డ ఆఫ్రికన్ దేశాలకు తగవు అని భావించి, ఐక్య ఆఫ్రికా సంఘటనకై కలలు కన్న స్వాప్నికుడు. నల్లజాతి ఒక మహత్తర శక్తిగా సంఘటితం కావాలని సెంఘూర్ విశ్వసించాడు. సెంఘూర్ సమైక్యతా వాది; విశ్వ సమైక్యతను ఆకాంక్షించిన ఆదర్శ కవి. రాజకీయవేత్తగా, కవిగా తన బాధ్యతలను సమన్వయ పరచుకోడానికి ఆయన ప్రయత్నించాడు. *నీడలలో గీతాలు* (1945), *గద్యం-పద్యం* ఈయన రచనలలో గణనీయ మైనవి.

ఆంగ్లంలో రచనలు చేసి, అంతర్జాతీయ ఖ్యాతిని సంపాదించిన దక్షిణ ఆఫ్రికా రచయితలు చాలామంది తమ దేశం నుంచి నిష్క్రమించినవారే! వీరిలో రాయ్ కాంప్‌బెల్, విలియమ్ ప్లోమర్ ముఖ్యులు.

రాయ్ కాంప్‌బెల్ (1901-57) దక్షిణ ఆఫ్రికాలో ఎక్కువ కాలం ఉండక పోయినా, తన ఉత్తమ కవిత్వాన్ని, రచనలను దక్షిణ ఆఫ్రికన్ ఇతివృత్తంతోనే రచించాడు. ప్లోమర్‌తో కలిసి 1926 లో *కొరడా దెబ్బ* అనే పత్రికను స్థాపించి సమాజంలోని ప్రతీప శక్తులను అధిక్షేపించాడు. ఆధునిక సాంకేతిక విజ్ఞానం మానవుడి వ్యక్తిత్వాన్ని మరుగు పరచడాన్ని ఆయన వ్యంగ్య ధోరణిలో విమర్శించాడు.

విలియమ్ ప్లోమర్ (1903) నవలా రచయితగా, కవిగా ప్రసిద్ధి చెందాడు. మానవతా దృక్పథం ఆయన రచనలలో ముఖ్యాంశం. దీనితో పాటు విశిష్టమైన సత్యాలను ప్రదర్శించడం ఆయనకు ఇష్టం. హాస్యధోరణి, వ్యక్తిగత భావచిత్రణ ఆయన కవిత్వాన్ని ఆకర్షణీయమైన రచనగా తీర్చిదిద్దాయి. *కవితా సంకలనం* (1960) ఆయన శబ్దప్రయోగ నైపుణ్యాన్ని, కవితా శిల్పాన్ని పుష్కలంగా ప్రదర్శిస్తుంది. నల్లజాతి వ్యక్తి యథార్థ స్వరూపాన్ని దర్శించిన కొద్దిమంది రచయితలలో ఈయన ముఖ్యుడు. టర్‌బోల్ట్ వుల్ఫ్ (1925) మ్యూజియమ్ పీసెస్ (1952) అనే నవలలో ఆధునిక కాలంలో ఇముడలేని వ్యక్తులను ఆయన చిత్రించాడు. ఆధునిక కాలంలో మరుగవుతున్న సాంప్రదాయిక వ్యక్తిగత విలువలను ఆయన వీటిలో చిత్రించాడు.

చార్ల్స్ మేజ్ (1912) దక్షిణ ఆఫ్రికా సాహిత్యంలో ఒకే ఒక సామాజిక నవలా రచయిత. మార్క్సిస్టు రచయితగా ప్రారంభించి మార్క్సిస్టు విధానంలో లోపాలను గ్రహించి, చివరకి మత సంబంధ భావాలకు లోనయి, వ్యక్తిగతమైన కాల్పనిక భావుకుడుగా మారిన కవి ఈయన. *దశల వారీ కవిత, మేధపై దాడి* అనే సంకలనాలు ప్రసిద్ధి చెందాయి.

డోరిస్ లెసింగ్ (1919) రొడిసియాలో జన్మించి, అక్కడి జీవితాన్ని సహృదయతతో అర్థం చేసుకున్న శ్వేతజాతి రచయిత్రి. *పచ్చగడ్డి పాడుతోంది* (1950) లో ఒక శ్వేతజాతి దంపతులు వారి నీగ్రో సేవకుని గురించి మానవతా దృష్టిలో ప్రవర్తించడాన్ని ఆమె చిత్రించింది. స్థానిక భాషలో శాశ్వత సత్యాలను వ్యక్తం చేయడానికి ఆమె ప్రయత్నించింది.

ఈ సాహిత్యంలో నవలా రచన నిజానికి 19 వ శతాబ్దం లోనే ప్రారంభమైంది. ఆలివ్ ష్రైనర్ (1858-1920) 1883 లో *దక్షిణ ఆఫ్రికా ఫార్మ్ కథ* అనే రచనతో మొదటి నవల ప్రారంభించారు. ఎమిలీ బ్రాంటి వ్రాసిన *వుదరింగ్ హైట్స్* ఈ రచనను ప్రభావితం చేసింది. సామాజిక బోధన నవలలోని కథకంటె ఈమెకు ఎక్కువ ముఖ్యం. ఆకర్షణీయమైన వర్ణనలు ఈమె రచనా శక్తిని వెల్లడిస్తాయి.

సారా గెర్ట్రూడ్ మిలెన్ (1889) వర్తమాన చరిత్రను సహృదయతతో నైపుణ్యంతో చిత్రించింది. నల్ల జాతి (colored) ప్రజల జీవితాల సమస్యలను *నల్లటి నది* (1919) వంటి నవలలలో హృదయంగమంగా చిత్రించింది.

ఎచ్.సి. బోస్‌మన్ (1905-51) ఈ శతాబ్ది పూర్వార్ధానికి చెందిన నవలా రచయితలలో అత్యంత ప్రసిద్ధుడు. *మా ఫెకింగ్ రోడ్* (1947) లోని ఆయన కథానికలు ఆఫ్రికన్ సమాజంలోని ఏకాకి జీవితానికి దర్పణం పట్టాయి. తన జైలు జీవితాన్ని *చల్లని రాతి పాత్ర* (1948) లో ఆయన విశదీకరించాడు.

ఆలెన్ పాటెన్ (1903) శ్వేతజాతి రచయిత అయినా తాను రచించిన *ప్రియమైన దేశమా, శోకించు!* (1948) లో దక్షిణ ఆఫ్రికాలోని జాతి సంబంధ సంఘర్షణను మానవతా దృక్పథంతో ప్రదర్శించాడు.

ఈ శతాబ్దంలో దక్షిణ ఆఫ్రికాలో కవిత్వం తగు స్థాయిలో సృష్టించబడుతూనే ఉంది.

గయ్ బట్లర్ (1918) తన దేశీయ విజ్ఞానాన్ని, యూరప్ ఖండ జ్ఞానాన్ని సమన్వయదృష్టితో తన కవిత్వంలో ప్రదర్శించారు. దక్షిణ ఆఫ్రికా అనుభవాలను యూరప్ పద్ధతిలోను, యూరప్ దేశాలను ముఖ్యంగా ఇటలీని దక్షిణ ఆఫ్రికా దృష్టితోను తన రచనలలో చిత్రించాడు. *యూరప్‌కు అపరిచితుడు* (1952) అనే ఈయన రచనలో ఈ చిత్రణ కనిపిస్తుంది. ఎంతో అందంగా, మర్మగర్భంగా ఆలోచనా భరితంగా ఈయన శైలి కొనసాగుతుంది.

ఎలెక్స్ లె గూమ్ (1925) తన రచనలో అధునాతన ఆఫ్రికాను గురించిన గాథలు చిత్రించాడు. *రాత్రి పూట షికారు* (1962) అనే రచనలో శ్వేతజాతీయుడికి ఎదురు చెప్పినందుకు ఉద్యోగం పోగొట్టుకున్న మైకేల్ ఎడొనిస్ కథను అతి వాస్తవికంగా ఈయన చిత్రించాడు. ఈయనపై డాస్టొయేవ్‌స్కీ ప్రభావం ఎక్కువ.

ఎజెకియల్ మ్ఫలాలె (Ezekiel Mphalile; 1919) బంటూ విద్యా చట్టాన్ని ఎదిరించడంవల్ల, తన దేశంలో ఉపాధ్యాయవృత్తి చేపట్టడానికి ఆయనకు వీలులేక పోయింది. దక్షిణ ఆఫ్రికాలోని రాజకీయ, సాంఘిక పరిస్థితుల వలన సృజనాత్మక రచనలకు అవకాశం తక్కువ. అందరూ ప్రభుత్వానికీ, ప్రజలకూ మధ్య కొనసాగుతున్న పోరాటపు రొంపిలోకి దిగజారడం తప్పని సరి అని ఆయన తన ఆవేదనను వ్యక్తం చేశాడు. *రెండవ రోడ్డుగుండా* (1959) లో నీగ్రోవారి నివాస స్థానాలలోని పరిస్థితులను హృదయ విదారకంగా ఆయన చిత్రించాడు.

దక్షిణ ఆఫ్రికాలోని సాహిత్యం అన్ని రంగాలలోను ఆ దేశపు సామాజిక చైతన్యాన్ని, నల్లజాతి వారి స్వాతంత్ర్య కాంక్షను, వారి దయనీయ జీవితాన్ని ప్రతిబింబిస్తుంది.

ఎస్.ఎస్.ప్ర.

## స్వాహిలీ భాష - సాహిత్యం

**భాష :** తూర్పు ఆఫ్రికా, ఆఫ్రికా ద్వీపాలలో ప్రముఖంగా బంటూ ప్రజలు ఉపయోగించే భాషను స్వాహిలీభాష అంటారు. ఈ భాష లామూ ద్వీపం నుంచి ఉత్తరాన కీన్యా వరకు, దక్షిణాన టాంజేనియా సరిహద్దు వరకు వ్యవహారంలో ఉంది. నైజర్-కాంగో భాషాకుటుంబంలోని బెన్యూ-కాంగో విభాగానికి ఈ భాష సంబంధించినది. టాంజేనియా, కీన్యా జైర్, ఉగాండా దేశాలలో ఈ భాష అధికార భాష. రమారమి 3, 4 కోట్లమంది ప్రజలు ఈ భాషను మాట్లాడు తున్నారు. స్వాహిలీ ప్రజలు ముఖ్యంగా యెమెన్, ఓమన్ నుంచి తరలి వచ్చిన అరబ్బీ ప్రజల సంతతివారు. అందువల్ల, వారి భాషపై అరబ్బీ భాష ఎక్కువ. 25 శాతం పదాలు అరబ్బీ నుంచి ఈ భాషలో మూడు ప్రధాన మాండలికాలు అవి టాంజేనియాలోను, జాంజిబార్‌లోను ఉన్న 'కియుంగుజా' మొంబాసా, కీన్యాలలో ఉన్న 'కిమ్‌విటా', లామూ ద్వీపంలో వాడుక 'కియాము'. కియుంగుజా మాండలికం స్వాహిలీ భాషగాను, కియాము మాండలికం కవిత్వ కిమ్‌విటా మాండలికం గద్య భాషగాను ప్రవహించాయి.

**సాహిత్యం :** ప్రాచీన స్వాహిలీ సాహిత్యంపై మత సంబంధ కావ్యాల ప్రభావం ప్రస్ఫుటంగా స్తుంది. మతబోధ, ఉపదేశం ఈ గ్రంథాల మహమ్మద్ ప్రవక్త జీవిత విశేషాలు ఈ కావ్యా వృత్తాలు. అయిదరూస్ అనే స్వాహిలీ కవి మూలం నుంచి 1652 లో అనువాదం చేసిన *మీజియా* అనే గ్రంథం స్వాహిలీ భాషలో మొదటి వ్రాతప్రతి. 17 వ శతాబ్దంలోనే ఫూమో స్వాహిలీ భాషలో మొదటి స్వతంత్ర చేశాడు. ప్రాచీన స్వాహిలీ సాహిత్యంలో *తంబూకా* (1728) అనే కావ్యం ప్రముఖమైం కావ్యం సుల్తాన్ లైతినభాని కోసం రచించబడిం పేరు గ్రంథస్థం కాలేదు. బకారిలో మొహమ్మ ఆల్ బుకర్ బిన్ ఉమన్ *ఉతేండివా లియోంగో* (1913) అనే ఇతిహాస కావ్యాన్ని రచించాడు. 18 బ్దంలో బ్వానామ్యేన్గో రచించిన *హెర్కాక్లియోస్* ప్రసిద్ధి చెందిన కావ్యం. 19 వ శతాబ్దంలో మొ తూర్పు ఆఫ్రికాకు సంస్కృతి కేంద్రంగా విల ఇక్కడ మయూకా అనే కవి అత్యంత భావు రాజకీయ అధిక్షేపణతో కవిత్వ సృష్టి చేశాడు. స్వాహిలీ సాహిత్యం మౌఖిక సంప్రదాయం ద్వా తరాలుగా పరిరక్షించబడింది.

20 వ శతాబ్దంలో టాంజేనియాలోను, కీన్యా ఉగాండాలోను స్వాహిలీ సాహిత్యం నవలా రంగ నాటక రంగంలోను బహుముఖంగా వృద్ధి చెందు

షాబాన్ రాబర్ట్ (1909-1962) స్వాహిలీ రంగంలో సుప్రసిద్ధుడు. ఆయన టాంగా (టాంగాన్యీ జన్మించి స్వాహిలీ శబ్దాలపై అద్వితీయమైన అధి సంపాదించాడు. నవలలు, వ్యాసాలు, కావ్యాలు, చరిత్ర అన్ని రంగాలలోను ఆయన ప్రశంసనీ

కృషి చేశారు. *రంగి జేటు* (మా రంగులు), *కిస్వాహిలీ* (స్వాహిలీ) ఆయన కవితలలో చిర స్మరణీయమైనవి. రంగు విశ్వజనీనమైనదనీ, తన భాష తన కత్యంత ప్రీతిపాత్రమైందనీ ఈ కవితలలో ఆయన వెల్లడించారు.

మటియాసి మ్యామ్బాలా (1909-69) టాంజేనియాకు చెందిన ప్రసిద్ధ కవి. ఆయన రచించిన *యు టెంజివా ఎంజెలి టకాటిటు* (Epic of the holy Gospel) మత సంబంధ గ్రంథాలలో ముఖ్యమైంది.

గ్రేస్ ఓ గోట్ కి కథానికా రచయిత్రిగా, నవలా రచయిత్రిగా ప్రముఖ స్థానం ఉంది. *ఉరుము లేని భూమి* (1968), *మరో ఆవిడ* (1976), *బాష్ప ద్వీపం* (1980) ఆమె రచించిన నవలలలో ముఖ్యమైనవి. వ్యంగ్య ధోరణి, అధిక్షేపణ ఆమె నవలలలో ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. కొన్ని కథలు స్థానిక గాథలపై ఆధారపడినవి.

న్గూగి వాథియోంగో (1938) నవలా రచయితగా సుప్రసిద్ధుడు. *ఏడవకు బిడ్డా!* (1964), *మధ్య నున్న నది* (1965), *గోధుమ గింజలు* (1967) ఆయన నవలలలో ముఖ్యమైనవి. వలస కాలం నుంచి క్రైస్తవ మిషనరీల రాకవరకు కీన్యాచరిత్రను తన నవలలలో ఆయన చిత్రించాడు. నది రెండు గట్లను ఆఫ్రికా నాగరకతకు, పాశ్చాత్య నాగరకతకు ప్రతీకలుగా *మధ్య నున్న నది*లో ప్రయోగించి, వాటి మధ్య సాగుతున్న సంఘర్షణను ఆయన ప్రతిభావంతంగా చిత్రించాడు. *రక్తపు రేకులు* (1977) లో కూడా ఈ సంఘర్షణే ఇతివృత్తం. ఈయన కథాకథన విధానం కూడా ప్రత్యేకంగా పేర్కొనదగింది. కాలాన్ని ఆయన యథేచ్ఛగా ముందు, వెనుకలకు మార్చి ఒక వినూత్న ప్రయోగాన్ని చేశాడు.

గ్రేస్ ఓ గోట్ రచించిన *వాగ్దత్త భూమి* (1986), ఒకెల్లో ఒకిలి రచించిన *వ్యభిచారిణి* (1968), గేబ్రియల్ రుహుంబిక రచించిన *స్వాతంత్ర్యంలో ఒక గ్రామం* (1969) ఈ సాహిత్యంలో పేర్కొన దగిన నవలలు. కాని ఇటీవల జనాకర్షకమైన నవలలు ఎక్కువగా వస్తున్నాయి. ఇవి నగరాలలోని యువతీ యువకుల అభిరుచులకు అనుగుణంగా రూపొందు తున్నాయి. వీటిలో సాహితీ విలువలు తగ్గిపోవడం ఆశ్చర్యకరం కాదు. చార్ల్స మంగూవా రచించిన *ఆమె కొడుకు* (1971), మేజా మ్వాంగీ రచించిన *బొద్దింక నాట్యం* (1979) ముఖ్యమైనవి.

కీన్యాకు చెందిన లియొనార్డ్ కిబేరా రచించిన *చీకట్లో గొంతులు* (1970) అనే నవల, ఉగాండాకు చెందిన బోనీ లుబేగా రచించిన *మండే పొద* (1970), *బహిష్కృతులు* (1971), అదే దేశానికి చెందిన ఎనెరికో సెరుమా రచించిన *అనుభవం* (1970) అనే నవలలు ఆ దేశాల సామాజిక పరిస్థితులకు అద్దం పట్టాయి.

ఇవే కాక యూఫ్రేజ్ కజిలహోబి రచించిన *రోజా మిస్టికా* (1971), *కిచ్వామాజి* (1974) అనే నవలలు, మార్తా మాంవాంగి రచించిన *హన్నా హొటియా* (1975) స్వాహిలీ భాషలోని చెప్పుకోదగ్గ నవలలు. ఇస్మేల్ ఆర్ మ్బిసె రచించిన *రక్తం మా భూమి* (1974) లో 1950 వ సంవత్సరం నాటి 'మేరు' ప్రజల విషాద మయ అనుభవాలు చిత్రిత మయాయి.

నాటక రంగంలో రాబర్ట్ సెరుమాగా, జాన్ రుగాండా ప్రసిద్ధి కెక్కారు. వీ రిద్దరూ ఉగాండా దేశస్థులు. సెరుమాగా కంపాలాలో నాటక సంఘాన్ని స్థాపించి *రెంగి మోయ్* అనే అతి ఉత్తేజ పూరితమైన నాటకాన్ని రచించి, ప్రదర్శింప చేశాడు. ఆఫ్రికా గాథలలో ప్రముఖమైన కవలల గాథ ఒకటి ఈ నాటకంలో ఇతివృత్తం. *ఒక నాటకం* (1968), *ఏనుగులు* (1972) అనేవి ఆయన వ్రాసిన ఇతర నాటకాలు.

జాన్‌రుగాండా *ది బెండర్స్* (1973) కంపాలాలో ఉన్నప్పుడే రచించాడు. నైరోబీకి వెళ్లాక *వరదలు* (1980) అనే నాటకాన్ని రచించాడు.

ఇబ్రహీమ్ హుసేన్ ఈ శతాబ్ది ఆరంభంలో 'మాజి వూజి' తిరుగుబాటు ఇతివృత్తంగా *కంజి కటిలె* (1969) అనే నాటకాన్ని రచించాడు. *వకాతి ఉకాల్* (1970), *మా షెటాని* (1971), *ఆలికోన* (1973) వంటి నాటకాలను కూడా ఆయన రచించాడు.

పనీనా మహోన్డో రచించిన నాటకాలలో *హైటా* (నేరము - 1972), *తంబుయేని హాకిజేవి* (మా హక్కులను గుర్తించండి - 1973) అనేవి ముఖ్యమైనవి. ఏ సంఘాని కైనా, రాజకీయ వ్యవస్థ కైనా వర్తించే విధంగా ప్రతిపక్షాలను అణగద్రొక్కే రాజకీయ విధానాన్ని ఆయన శక్తిమంతంగా ప్రదర్శించాడు; నిశితంగా విమర్శించాడు.

కీన్యాలో నేషనల్ నాటక సంఘం, రేడియో, టీవీ నాటక రంగానికి ప్రోత్సాహం ఇచ్చాయి. ఫ్రాన్సిస్ డి ఇమ్బూగా, న్గూగివా ధియోన్గో నాటక రంగానికి గణనీయమైన కృషి చేశారు. ఇమ్బూగా నాటకాలలో *అదృష్టపు ముద్దులు* (1972), *నగరంలో మోసం* (1976), *నిశ్శబ్దపు క్రీడ* (1979) ముఖ్యమైనవి. న్గూగి *నల్లటి ఋషి* అనే నాటకాన్ని ఆఫ్రికాలోని జాతులను ఉద్దేశించి రచించాడు.

ఎస్.ఎస్.ప్ర.

# ఉత్తర అమెరికా సాహిత్యాలు

## అమెరికన్ సాహిత్యం

యూరప్ ఖండంలోనూ, ఇంగ్లండ్‌లోనూ 16 వ శతాబ్దంలో సంభవించిన రాజకీయ, మత, సామాజిక, ఆర్థిక సంక్షోభాల వల్ల అక్కడి ప్రజలు ఎక్కువగా అమెరికాకు వలస వెళ్లి, అక్కడే స్థిర నివాసాలు ఏర్పరచు కోడం మొదలు పెట్టారు. క్రమంగా అట్లాంటిక్ పసిఫిక్ సాగరాల మధ్య ఉన్న ఉత్తర అమెరికా ఖండంలోని దక్షిణ భాగం అంతా ఒక గొప్ప రాజ్యంగా ఏర్పడి, నేడు ప్రపంచంలో ఒక అగ్రరాజ్యంగా పరిణామం చెందింది. ఈ సువిశాల రాజ్యంలో వెలసిన సాహిత్యాన్నే 'అమెరికన్ సాహిత్యం' అంటారు. రాజకీయ, మత స్వాతంత్ర్యాల కోసం, ఆర్థికాభ్యున్నతికోసం, ఈ రాజ్యం మరో వినూత్న ప్రపంచానికి మహా ప్రస్థానం సాగించి, ఈ నాడు చారి త్రక చేతనలో మానవాదర్శాలకు ఒక ప్రతీకగా, ఒక స్వప్నసీమగా రూపొందింది. మానవుల భవితవ్యానికి ఒక సంకేతంగా పరిగణించ బడుతూన్న ఈ నూతన సభ్యత వలన ఒక విశిష్ట వ్యక్తిత్వాన్ని సంపాదించు కొని, అమెరికన్ సాహిత్యం ఆశ్చర్యకరమైన వికాసాన్ని సాధించింది.

పాశ్చాత్యుల ఆక్రమణకు పూర్వం అమెరిండియన్‌ల పురాణగాథలూ, విశ్వోత్పత్తిగాథలూ, జానపద గీతాలూ, మతకర్మకాండకు సంబంధించిన మౌఖిక సాహిత్యం అమె రికాలో వ్యాపించి ఉండేది. యూరప్ వాసుల కాల్ప నిక రచనలతో అంతర్ధానమైన అట్లాంటిక్, ఎల్‌డోరాడో, హీబ్రాసిల్, పొమోనా మొదలైన స్వాప్నిక సీమలకు ప్రతీకగా అమెరికాను భావించడం వలన అనేక ఆదర్శ రాజ్య వర్ణనలు, సాహస యాత్రల గాథలు తొలిరోజులలో వెలశాయి. 16 వ, 17 వ శతాబ్దాలలోని నూతన ఖండాన్వేషకుల ఆవిష్కరణలను పొందుపరుస్తూ కొంత వాస్తవం, కొంత కల్పన మిళితం చేస్తూ కొన్ని రచ నలు వచ్చాయి. కొత్త వలసలను ప్రోత్సహించడానికి ఉద్దేశించిన ప్రాదేశిక, భౌగోళిక నివేదికలూ, అపురూప మైన ప్రకృతి సౌందర్యాన్నీ, చిత్ర విచిత్రానుభూతులనూ చిత్రించే రచనలూ కొన్ని వచ్చాయి. మత పరమైన వివాదాలకు సంబంధించిన రచనలూ కొన్ని వెలువడ్డాయి. ఇది అమెరికన్ సాహిత్య వికాసంలో ప్రారంభ దశ. సాహిత్య గౌరవం అంతగా పొందకపోయినా, చారిత్ర కంగా పరిగణనలోనికి తీసికోవలసిన దశ ఇది.

కొలంబస్ అమెరికాను కనుగొనడానికి ముందు అక్కడ ఉన్న సాహిత్యాన్నీ, రెడ్ ఇండియన్‌ల సాహి త్యాన్నీ వదలి పెట్టి, అనంతరం వెలువడిన అమెరికన్ సాహిత్యాన్ని ఈ క్రింది నాలుగు దశలలో అధ్యయనం చేయవచ్చును.

1. వలసయుగం, లేక ప్యూరిటన్‌యుగం, లేక జాతీయయుగం (16 వ శతాబ్ది మొదలు 19 వ శతాబ్ది ప్రథమపాదం వరకు), 2. కాల్పనికయుగం, లేక అంత ర్యుద్ధ దశ (1830-1860), 3. వాస్తవికతా యుగం - అంతర్యుద్ధం మొదలు మొదటి ప్రపంచ సంగ్రామ కాలం వరకు (1860-1918), 4. ఆధునిక యుగం (1918).

రాజకీయ దమన నీతికి, మత విచక్షణకు, నైతిక పతనానికి, రాక్షస ప్రవృత్తులకు, యుద్ధ మనస్తత్వానికి, అరాజక పరిస్థితికి ఆలవాలం అయిన యూరప్ సభ్య తకు ప్రత్యామ్నాయంగా ఆదర్శప్రాయమైన మానవ జీవన వ్యవస్థాపనకు అనుకూలమైన సారవంతమైన అపార భూభాగమూ, ప్రకృతిసంపదా, సహజ ధార్మికతా ఉన్న అద్భుతక్షేత్రంగా ప్రవాసులుగా వచ్చిన పాశ్చాత్యులకు అమెరికా కనిపించింది. అందుచేత సంకల్పబలంతో, మేధా శక్తితో, దృఢమైన అధ్యవసాయంతో వారు సాగించిన సామూహిక కృషి వలన ఏర్పడిన వినూత్న చైతన్యం నూతన సాహిత్యానికి గొప్ప ప్రోద్బలం అయింది. ఆ తొలి స్వప్నాల జయాపజయాల సంఘర్షణే నాటినుంచి నేటివరకూ అమెరికన్ సాహిత్యానికి మూలప్రేరణగా ఉంటూ వచ్చింది.

అమెరికన్ స్వాతంత్ర్య సంగ్రామానికి ముందు ఆ దేశంలో న్యూ ఇంగ్లాండ్, మధ్య అట్లాంటిక్, దక్షిణ ప్రాంతం మాత్రమే ఉండేవి. న్యూ ఇంగ్లాండ్ రాష్ట్రంలో ప్యూరిటన్ మత సంస్థ ప్రాబల్యం ఎక్కువ. ఆ మతం దృష్టిలో ధార్మిక చింతన, దైవానుగ్రహ నిరతి ముఖ్యమైనవి; మానవుడు తన ప్రథమ పాతకం కార ణంగా పతనావస్థ పొంది, భగవత్ ప్రపత్తి చేత మాత్రమే తిరిగి ఉద్ధరింప బడడానికి యోగ్యు డవు తాడు. ఎన్నిక అయిన పుణ్య పురుషుల ద్వారా మాత్రమే

భగవదనుగ్రహం లభ్యమవుతుంది. సామాన్యులు నైతిక ప్రవర్తనను అనుసరించి లోక వ్యవహారాలలో పాల్గొనడం ద్వారా ఫలసిద్ధి పొందుతారు. దివ్య రహస్యాలను గుర్తించి వాటిని అనుసరించడానికి ప్రయత్నిస్తూ బాహ్య ప్రకృతిలో కనిపించే సాంకేతిక ప్రక్రియలను, గూఢార్థం గల అద్భుతాలను, వింతలను బట్టి తమ నడవడికను సరిదిద్దుకోడం మానవుల కర్తవ్యం. పాప స్వభావంతో కూడిన మానవ ప్రకృతికి ధర్మ మార్గావలంబనమే విమోచన సాధనం. ఇట్టి ఆలోచనలతో కూడిన ప్యూరిటన్ సమాజంలో సచ్ఛీలం, ఋజు ప్రవర్తనా, క్రమశిక్షణ, అంతరాత్మ ప్రేరణ ముఖ్యమైన అంశాలు. ఇలాంటి సమాజంలో ఆవిర్భవించిన సాహిత్యంలోని విలువలు నైతిక, ధార్మిక లక్షణం గలవి. ఆటు తరువాత అమెరికన్ సాహిత్యంలో వెలువడిన ఉత్కృష్ట రచనల కన్నిటికి ప్యూరిటన్ సంస్కృతే ప్రాతిపదిక అయింది.

దివ్యత్వ ప్రాతిపదిక మీద వెలసిన మానవ వ్యవస్థ న్యూ ఇంగ్లండ్ రాష్ట్రాలకు ధ్యేయం కాగా, దక్షిణ రాష్ట్రాలలో ప్రజలకు ప్రకృతి ధర్మప్రధానమైన సమాజ ప్రణాళిక ఆదర్శప్రాయమైంది. అయితే ఈ రాష్ట్రాలలో 'ప్లాంటేషన్ ఆర్థికవిధానాన్ని' నిర్వహించడానికి బానిసత్వ పద్ధతి అవసరమై అనంతర కాలంలో క్లిష్టమైన పరిణామాలకు అది దారితీసింది. మధ్య అట్లాంటిక్ రాష్ట్రాలలో ఉత్తర, దక్షిణ సంస్కృతులు అనే రెండు భిన్న ధ్రువాలకు మధ్యస్థమైన మానవీయతా దృక్పథం ప్రాముఖ్యం వహించింది. ఈ మూడు విభిన్న సంప్రదాయాలమధ్యనూ సామరస్యం కుదిర్చి, వ్యక్తి స్వేచ్ఛను, సామాజిక స్పృహను, ఆర్థిక సౌష్ఠవాన్ని చేకూర్చే ప్రోత్సాహక శక్తిగా పనిచేసి ఈ విశాల భూభాగపు సరిహద్దుప్రాంతం (ఫ్రాంటియర్) అమెరికా చారిత్రక వికాసానికి ఎక్కువగా తోడ్పడింది. ఈ వైవిధ్యాల కలయికవల్ల ఏర్పడిన పరిణామాలనే ఆటు తరువాత వచ్చిన అమెరికన్ సాహిత్యం ప్రతిబింబించింది.

వలస యుగంలో వెలువడిన ధార్మిక, లౌకిక సారస్వతాలకు 'ది అమెరికన్ డ్రీమ్' అనబడే భావన మూలాధారమైంది. ఈ యుగంలో జీన్‌కాటన్, రోజర్ విలియమ్స్, నథేనియల్ వార్ట్, ఇంక్రీజ్ మాథర్, కాటన్ మాథర్‌లు ధార్మిక గ్రంథాలనూ; జాన్ స్మిత్, విలియమ్ బ్రాడ్ ఫర్డ్, జాన్ విన్‌ట్రప్ చారిత్రక గ్రంథాలను వెలువరించారు. ఇవి కాక సాహసయాత్రలు, నైసర్గిక స్థితి నివేదికలు, బందీల కథలు, ఆత్మకథలు, జానపద గాథలు, ఆదిమవాసుల అభివర్ణనలు, ప్రవాసగాథలు ఎన్నో ఈ యుగంలో వెలువడ్డాయి. అమెరికన్ సాహిత్యంలో తొలి కవయిత్రి ఆన్ బ్రాడ్‌స్ట్రీట్. *ది టెన్త్ మ్యూజ్, లేట్లీ స్ప్రింగ్ అప్ ఇన్ అమెరికా* అనే ఈమె కవితా సంకలనం 1650 లో వెలువడింది. 1662 లో వెలువడిన మైకెల్ విజిల్స్ వర్త్ రచించిన *డే ఆఫ్ డూమ్* అనే నీతిగ్రంథం ఉపదేశాత్మకమైన ప్యూరిటన్ ధర్మ నిరూపక రచన. ఎడ్వర్ట్ టెయిలర్ ఇంగ్లీష్ తాత్త్విక కవుల ధోరణిలో ఎన్నో దైవభక్తి పూరితమైన కవితలను భగవదంకితంగా వ్రాశాడు.

బెంజిమన్ ఫ్రాంక్లిన్, జోనథన్ ఎడ్వర్డ్స్‌లు వరుసగా లౌకిక ధార్మిక సాహిత్య సంప్రదాయాలను పెంపొందించి వచన రచనకు సాహిత్య గౌరవం చేకూర్చారు. వైజ్ఞానిక జాగృతి ఆధారంగా ఎన్నో ఆవిష్కరణలు చేసిన ఫ్రాంక్లిన్ ఆత్మకథ ఆ యుగ చైతన్యానికి అద్దం పట్టే రచన. దారిద్ర్యంలో జన్మించి స్వశక్తిచేత, స్వయంకృషిచేత శ్రీమంతుడైన మహామనీషిగా ఆదర్శవ్యక్తిగా అమెరికన్ సభ్యతకు ఒక ప్రతీకగా ఫ్రాంక్లిన్ ప్రసిద్ధి పొందాడు. పత్రికా సంపాదకుడుగా, ముద్రాపకుడుగా, విద్యావేత్తగా, శాస్త్రజ్ఞుడుగా, రాజకీయ కార్య ధురంధరుడుగా, బహుముఖ ప్రజ్ఞాశాలిగా రాణించిన ఫ్రాంక్లిన్ సామాన్య పాఠకులకు అందుబాటులో ఉండే సరళమైన శైలిలో ఎన్నో వ్యాసాలూ, సూక్తులూ, అధిక్షేప రచనలూ రచించి 'ప్రజాతాత్త్వికుడు' గా ప్రసిద్ధి పొందాడు. ఫ్రాంక్లిన్ లౌకిక దృష్టికి విరుద్ధంగా ధార్మికావేశంతో కూడిన రచయిత జోనాథన్ ఎడ్వర్డ్స్. ప్యూరిటన్ మతసంస్కర్తగా, నీతిబోధకుడుగా, పారమార్థిక చింతకుడుగా, ప్రకృతి పరిశీలకుడుగా, జిజ్ఞాసువుగా, అనేక కవితలు, ప్రసంగాలు, హితబోధలు వ్రాసి ఆయన సుప్రసిద్ధు డయాడు. *సిన్నర్ ఇన్ ది హాండ్స్ ఆఫ్ ఆన్ ఆంగ్రీ గాడ్* అనే రచనలో ఎడ్వర్డ్స్ వ్యక్తి స్వేచ్ఛకూ, భగవన్నిర్ణయానికీ మధ్య స్థూలంగా వైరుధ్యాన్ని పరిష్కారం చేసి, ప్యూరిటన్ ధర్మాన్ని బోధిస్తూ పాప పంకిలుడైన మానవునికి భగవంతుడే ఆపదుద్ధారకుడు అని నిర్దేశించాడు. అమెరికన్ విచార ధారలో లౌకిక దృష్టికి ఆశావాదానికి ఫ్రాంక్లిన్ ప్రతినిధి అయితే, ధార్మిక దృష్టికి, నైతిక వాస్తవిక వాదానికి ఎడ్వర్డ్స్ ప్రాతినిధ్యం వహించాడు.

1638-1776 మధ్యకాలంలో పత్రికా రచన ముమ్మరంగా కొనసాగింది. పోప్, ఆడిసన్ మొదలైన ఇంగ్లీష్ రచయితలను అనుకరిస్తూ అమెరికాలో అనేక రచనలు వచ్చాయి. రాజకీయ విషయాల మీద సిద్ధాంత పరమైన చర్చలూ, వాద ప్రతివాదాలూ, బహుళంగా వచ్చి వచన రచనా ప్రక్రియకు విశేషంగా దోహదం చేశాయి. ఈ

రచనలలో యూరప్‌కంటె విలక్షణమైన ఒక స్వతంత్ర అమెరికన్ కంఠస్వరం వినిపించింది. అమెరికన్ విప్లవం కాలంలో ప్రజలలో జాతీయ భావాన్ని, వ్యక్తి స్వాతంత్ర్యాన్ని, అభ్యుదయ నిరతినీ ప్రోత్సహించే అనేక రాజకీయ రచనలు వెలువడ్డాయి. ముఖ్యంగా టామస్ పెయిన్ మానవ హక్కులను సమర్థిస్తూ విప్లవ శంఖారావం పూరించాడు. టామస్ జఫర్‌సన్, జాన్ ఆడమ్స్, జేమ్స్ మాడిసన్ సైద్ధాంతిక వ్యాస పరంపరలో అమెరికన్ సంవిధానం పూర్వాపరాలను చర్చించి, లాక్, రూసో మొదలైన వారి వలన ఉత్తేజితులై ప్రజాస్వామ్య వాదాన్ని, తదనుగుణమైన రాజ్యాంగ సంవిధానాన్ని నిర్వచిస్తూ ఉదాత్తమైన రచనలు చేశారు. అమెరికన్ స్వాతంత్రోద్యమం తరువాత విశ్వ వ్యాప్తంగా బయలుదేరిన విప్లవ స్వాతంత్ర్యోద్యమాలకు ఈ రచనలు ప్రోత్సాహం చేకూర్చాయి.

1780 ప్రాంతంలో ఫిలిప్ ఫ్రెనో, టిమతి డ్వైట్, జోయెల్ బార్లోల కవితలు జాతీయచేతనకు ఉద్దీపకాలయాయి. దేశభక్తి కవిత్వంతోపాటు అమెరికాను భావి ప్రపంచపు ప్రతీకగా, ఆశాజ్యోతిగా వర్ణించే కావ్యాలు కూడా వెలువడ్డాయి. 'ప్రాత యూరపియన్ భావాల నుండి బయటపడి స్వానుభవైక నిరతి వృద్ధి చెంది ఒక నూతన సభ్యతను, సాహిత్యాన్ని సృష్టించాలి' అనే నినాదం బలపడింది. దీనితో పాటు జెఫర్‌సన్ ప్రతిపాదించిన కృషి వ్యవస్థాయోజనకు, హామిల్టన్ ధ్యేయాలకూ మధ్య మౌలికమైన విభేదాలు ఏర్పడి నిరంతర సంఘర్షణకు దారితీశాయి. అమెరికా దేశపు రెండవ అధ్యక్షుడు జాన్ ఆడమ్స్ జాతీయోద్యమంలో రాజకీయాలకు, యుద్ధ వ్యూహరచనకు ప్రాధాన్యం ఇచ్చి స్వాతంత్ర్యానంతరం వచ్చే తరాల వారికి కవిత్వం, చిత్రకళ, సంగీతం మొదలైన కళలకు అనుకూలమైన పరిస్థితులు కల్పించడం తన ధ్యేయంగా పేర్కొన్నాడు. ప్రారంభదశలో అమెరికాలో సృజన శక్తి లలిత కళల వైపు కాకుండా ఉపయోగకరమైన వస్తువులను సృజించడం వైపు మొగ్గు చూపింది. ఈ దశలో రచనా వ్యాసంగానికి కూడా ప్రయోజనం, ఉపయోగం లక్ష్యా లయాయి. జెఫర్సన్ అన్నట్లు ఆ నాటికి వాఙ్మయానికి ఇంకా వృత్తి గౌరవం లభించలేదు. సిడ్నీ స్మిత్ 1820 లో *ఎడింబరో రెవ్యూ* లో వ్యాసం వ్రాస్తూ "ఈ భూగోళంలో అమెరికన్ గ్రంథాన్ని చదివేది ఎవరు?" అని వెక్కిరించాడు.

స్వాతంత్ర్యానంతరం వాషింగ్టన్ ఇర్వింగ్ గతంలో అమెరికాలో నెలకొన్న బ్రిటిష్, యూరపియన్, అమెరికన్ అనుభూతులను, జానపద స్మృతులను మేళవించి యాత్రా కథలను, కల్పనా కథలను రచించి ప్రజలను రంజింప చేశాడు. ఆయన రచించిన *రిప్ వాన్ వింకిల్, స్లీపీ హాలో* అనే అద్భుత రసప్రధానమైన కథలు విశేష ప్రసిద్ధి పొందాయి. సీమా ప్రాంతపు స్వేచ్ఛా జీవనాన్ని, సాహసికతను, స్వాభావికతను చిత్రిస్తూ జేమ్స్ ఫెనిమోర్ కూపర్ *ది డియర్ స్లేయర్, ది ప్రెయిరీ* వంటి అనేక నవలలను సర్ వాల్టర్ స్కాట్ ఒరవడిలో రచించాడు. ఆయన సృష్టించిన పాత్ర 'నాటీ బంపో' సరళత, ధైర్యం, సౌశీల్యం, ఔదార్యం మూర్తీభవించిన నాయక పాత్రగా పాఠకుల మనోవీథులలో నిలిచి పోయింది. ఆరణ్యక జీవనంలోని సహజత్వాన్ని సమర్థిస్తూ కూపర్ పట్టణ నాగరకతలో కనిపించే కృతకత్వాన్ని, కపటత్వాన్ని కటువుగా విమర్శించాడు. జాన్ పెండిల్‌టన్ కెన్నెడీ, జేమ్స్ హాల్, విలియమ్ గిల్మర్ సిమ్స్, ఆగస్టస్ లాంగ్ స్ట్రీట్ ప్రభృతులు గత చరిత్రకు సంబంధించిన రొమాన్సులను, ప్రాదేశిక అనుభవాలను అభివర్ణిస్తూ రచనలు చేశారు. అమెరికాలో మొదటి నవల అయిన విలియం హిల్ బ్రౌన్ వ్రాసిన *ది పవర్ ఆఫ్ సింపతి* కొంత వరకు సామాజిక స్పృహను ప్రతిబింబిస్తూ మరొక నూతన రచనా ధోరణికి దారి తీసింది.

ఎక్కువ ప్రజాదరణ లభించిన కవి హెన్రీ వర్డ్స్‌వర్త్ లాంగ్ ఫెలో. రెడ్ ఇండియన్‌ల జానపద ఇతి వృత్తాలను తీసికొని *సాంగ్ ఆఫ్ హయావథా* మొదలైన కావ్యాలను ఆయన రచించాడు. ధీరోదాత్త లక్షణాలను ప్రతిపాదిస్తూ, ఆశాభావాన్ని బలపరుస్తూ ఉపదేశాత్మక సందేశాలను ఆయన అందించాడు. కుటుంబం, పాఠశాల, ప్రార్థనా మందిరం - ఈయన దృష్టిలో ఈ మూడే సంఘ జీవనానికి పునాదులు. ఈ మూడింటి చుట్టూ ఆయన కవిత్వం పరిభ్రమించింది. ఇంగ్లాండ్ దేశపు ప్రకృతి కవి అయిన వర్డ్స్‌వర్త్‌ను ఆదర్శంగా గ్రహించి అమెరికాలోని ప్రకృతి రామణీయకాన్ని, తన తాత్త్విక భావనలను పొందు పరుస్తూ *టు ఏ వాటర్ ఫౌల్, ది ఫ్రింజ్‌డ్ జెంటియెల్, డానటోప్సిస్* అనే కవితలను విలియం కల్లెన్ బ్రెయంట్ వ్రాయగా, రాబర్ట్ బర్న్స్ ప్రభావంతో జాన్ గ్రీన్‌లీఫ్ విటియర్ సందేశాత్మకంగా దేశీయ శైలిలో రచనలు చేశాడు. ఈ విధంగా అమెరికన్ సాహిత్య చరిత్రలో కాల్పనికోద్యమానికి అంకురార్పణ జరిగింది.

ఫిలడెల్ఫియా, న్యూయార్క్ నగరాలలో పాత్రికేయ వృత్తితో జీవితం గడుపుతున్న ఎడ్గార్ అలన్ పో మొట్టమొదటి నిజమైన అమెరికన్ సాహితీవేత్త అని చెప్పవచ్చును. గోథిక్, రొమాంటిక్ సంప్రదాయాలను

రెంటిని మేళవించి ఎన్నో కథలను, కవితలను 'పో' రచించాడు; విమర్శలను వ్రాశాడు. *యురేకా* అనే వైజ్ఞానిక, తాత్త్విక పరిశీలన గ్రంథం వెలుపరించాడు. ప్రతిభా, వ్యుత్పత్తి, కళా కౌశలం అత్యున్నత స్థాయిలో సమ్మేళనం చెందిన 'పో' అమెరికన్ సాహిత్యంలోని అన్ని ప్రక్రియలకూ ఆధునిక భావనలో మార్గదర్శకు డయాడు. బోదలేర్ మొదలైన ఫ్రెంచ్ కవుల ప్రశంసలు అందుకున్న తరువాత ఎంతో కాలానికి కాని ఆయన అమెరికాలో తగినంత గుర్తింపు పొందలేదు. *ఇస్రా ఫెల్, అనబెల్లీ, ది రేవెన్* అనే కవితలలోను, *ది ఫాల్ ఆఫ్ ది హౌస్ ఆఫ్ అషర్, మెయిల్ స్ట్రామ్, మర్డర్స్ ఇన్ ది రూమోర్గ్* మొదలైన అద్భుతమైన, అపరాధ పరిశోధక, మనోవైజ్ఞానిక కథానికలలోను *ది ఫిలాసఫీ ఆఫ్ కాంపోజిషన్* వంటి వ్యాసాల్లోను 'పో' తనదైన ఒక స్వతంత్ర మార్గాన్ని ఏర్పరచుకున్నాడు. కథా కథనానికి ప్రాణం 'ఉత్కంఠ' అనీ, కావ్యానికి సౌందర్య భావన స్థాయి భావం అనీ, ఖండ కావ్యమే ఎక్కువ ప్రభావశాలి అయిన కవితా ప్రక్రియ అనీ, సాహిత్యంలో ఉపదేశం కంటె రమ్యతే ప్రధానమనీ సిద్ధాంతీకరించి తన తరువాతి తరాల రచయితలను 'పో' ప్రభావితం చేశాడు. ఎన్నో సంఘర్షణలకు, నిరాశా నిస్పృహలకు, వ్యక్తిత్వంలోని వైరుధ్యాలకు కళాసృష్టిని సమన్వయ సాధనంగా ఎంచుకున్న విచిత్ర స్వభావం గల రచయిత 'పో'. "పొయట్రికి నిర్వచనం పో" అనేది ఒక నానుడి అయింది.

19 వ శతాబ్దపు పూర్వార్ధం అమెరికన్ సాహిత్యానికి స్వర్ణయుగం. ఈ కాలంలో న్యూ ఇంగ్లండ్‌లో హార్వర్డ్, బోస్టన్, కాంకార్డ్ ప్రాంతం కేంద్రాలుగా సాహిత్య పునర్వికాసోద్యమం సాగింది. ఈ ఉద్యమానికి ప్రధాన ప్రేరణలు వారసత్వంగా వచ్చిన ప్యూరిటన్ ధార్మిక భావం, జర్మన్ తాత్త్వికుల ఆదర్శవాదం, యూరపియన్ హేతువాదం, బ్రిటిష్ కాల్పనికోద్యమం, ఫ్రెంచ్ సామాజిక భావన, ప్రాచ్య దేశాల పారమార్థిక చింతన. ఈ భావ విప్లవం మూడు ప్రస్థానాలుగా సాగింది. మనిషి వ్యక్తిత్వానికి పుష్టి చేకూర్చి ఆధ్యాత్మిక శిఖరాలు అందుకునేట్లు చేయాలనే "ట్రాన్సెండెంటలిజమ్" ఒకటి. రెండవది మానవుడి పరిసరాలను, వ్యవస్థను మెరుగు పరచాలి అనే సంస్కరణోద్యమం. మూడవది: నాగరకతా, మర్యాదలను, సనాతన సంప్రదాయాలను బలపరచాలి అనే 'భద్రజన సంస్కృతి' ఉద్యమం.

1830 - 60 మధ్య కాలంలో ప్రముఖ రచయితలందరి దృష్టి సంఘ సంస్కరణ వైపు మళ్లింది. చరిత్ర గతిలో విపర్యస్తం అయిన అమెరికన్ ఆదర్శాలకు, ఆ నాటి వాస్తవాలకు మధ్య ఏర్పడిన అంతరాన్ని అంత మొందించి వ్యక్తి స్వేచ్ఛను, మానవాభ్యుదయాన్ని ప్రోత్సహించే మార్పులు అవసరమని వారు పునరుద్ఘాటించారు. మతాతీతమూ, లౌకికమూ, సార్వత్రికమూ అయిన విద్యా వ్యవస్థను రూపొందించడం, జైళ్లలో పరిస్థితులను మెరుగు పరచడం, బాల శ్రామికపద్ధతి నిర్మూలించడం, బానిసతనాన్ని రూపుమాపడం అనే లక్ష్యాలు సాధించడంకోసం ముమ్మరంగా ప్రచారం సాగింది. 'బ్రూక్ ఫామ్', 'ఫ్రూట్ లాండ్' మొదలైన ఆదర్శ సమాజ ప్రణాళికలు వివిధ ప్రాంతాలలో వెలశాయి. నీగ్రో విమోచనోద్యమ కాలంలో వచ్చిన ప్రసిద్ధ నవల హారియట్ బీచర్ స్టవ్ వ్రాసిన *అంకుల్ టామ్స్ కాబిన్.*

మార్గరెట్ ఫుల్లర్, విల్లెరీ చానింగ్, బ్రాన్‌సన్ ఆల్కాట్ మొదలైన మేధావులు 'ట్రాన్సెండెంటలిజం' అనబడే ఆధ్యాత్మికోద్యమానికి నాయకత్వం వహించారు. ఆ ఉద్యమమే క్రమేణ ఆ నాటి సాహిత్య పునరుజ్జీవనోద్యమానికి అంకురార్పణ చేసింది. దానికి ప్రముఖ ప్రతినిధి రాల్ఫ్ వాల్డో ఎమర్సన్. తన ఉపన్యాసాలతోను, సాహిత్య చర్చలతోను తోటి రచయితలను ఆయన ఉత్తేజితులను చేశాడు. *నేచర్* అనే వ్యాసంలో బాహ్య ప్రకృతి వెనుక అంతర్యామిగా ఒక దివ్యచేతన ఉంటుందని, భౌతిక ప్రక్రియల కన్నిటికి అదే చోదకశక్తి అని, పరిణామశీలమైన జగత్తునకు, కాలగతికి అదే ఆధారమని, దానిని అవగాహన చేసికొని తదనుగుణంగా తన స్వభావాన్ని చక్కదిద్దుకోడమే మానవ జీవితానికి ధ్యేయం కావా లని ఆయన ప్రతిపాదించాడు. దైవీభూతమైన సృష్టిలో ద్వంద్వాలు, వైరుధ్యాలు ఆభాసామాత్రాలే అని, భిన్న తత్త్వాలకు ఏకత్వాన్ని ఆపాదించే విశ్వ చైతన్యమే వాస్తవమైనదని, సృష్టి సర్వస్వం ఒక అవిభాజ్యమైన సత్యమని, మానవుడు దైవశక్తి సంపన్నుడని ఎమర్సన్ వక్కాణించాడు. మృత్కణం (మట్టి కణం) మొదలు తారాపథం వరకు ఒకే విశ్వాత్మ వ్యాపించి ఉన్న ఈ సృష్టి నైజాన్ని కేవలం హేతువాద దృష్టితో గాక అంతరంగంతో అవగాహన చేసుకోవాలని ఆయన వాదించాడు. జగత్తులో నిరంతరం ప్రకాశించే దివ్యరశ్మి కనుమరు గయినపుడే అంధకారం ప్రబలినట్లు తోచినా, అది మూలతత్త్వం కాదని, పాప పుణ్యాల సాపేక్షత కూడా అలాంటిదే అని నిరూపిస్తూ, మానవ ప్రకృతి సహజంగా సుగుణసంపన్నమే కాని పాపపంకిలం కాదని ఎమర్సన్ భావించాడు. 1837 లో వెలువరించిన *ది అమెరికన్*

*స్కాలర్* అనే తన ఉపన్యాసంలో ఎమర్సన్ అమెరికన్ సాహిత్య స్వాతంత్ర్యాన్ని ప్రకటించాడు. అమెరికన్ రచయితలు యూరపియన్ భావ దాస్యాన్ని విడనాడి తమ దేశంలోని బౌద్ధిక, సామాజిక పరిస్థితులను ప్రతిబింబించే స్వతంత్ర కావ్యాలను వ్రాయాలని, మానవుని ఆదర్శాలను, ఆకాంక్షలను పెంపొందించే సాహిత్యాన్ని సృజించాలని ఆయన ఉద్బోధించాడు. *సెల్ఫ్ రిలయన్స్, ఎక్స్‌పీరియన్స్, ది ఓవర్ సోల్* మొదలైన వ్యాసాలలో ఎమర్సన్ ఆధ్యాత్మికతను ప్రతిపాదించి, సమకాలీన సమాజానికి ఉద్దీపన కలిగించి, ఆశాభావాన్ని బలపరచాడు. అమెరికన్ సాహిత్యానికి ఎమర్సన్ కృతులు సింహద్వారం వంటివి. ఆయన ప్రభావంతో హెన్రీ డేవిడ్ తోరో *వాల్డెన్* అనే ఒక ఉద్గ్రంథం రచించాడు. అంతకు ముందు ఆయన వ్రాసిన *సివిల్ డిజొబీడియన్స్* అనే వ్యాసం గాంధీ మహాత్ముని సహాయ నిరాకరణోద్యమానికి ప్రేరణ కలిగించింది. వాల్ట్ విట్మన్ *లీవ్స్ ఆఫ్ గ్రాస్* అనే విప్లవాత్మక కావ్యాన్ని 1855 లో ప్రకటించి అమెరికన్ కవిత్వానికి క్రొత్త జీవం పోశాడు. మానవ జీవిత లక్ష్యాన్ని దర్శించి విశ్వదర్శనం చేసిన విట్మన్ కవిగాను, ద్రష్టగాను, మహా మానవుడుగాను జగత్ ప్రసిద్ధి పొందాడు.

ఎమర్సన్ ప్రతిపాదించిన ఆధ్యాత్మిక ఆదర్శ వాదాన్ని నిరాకరించి పాప ప్రవృత్తి మానవ స్వభావంలో జీర్ణించి ఉన్న ప్రేరణ అని, మంచి చెడుల పోరాటం ఊహా కల్పితం కాదని, అది ప్రకృతి సిద్ధమైనదేనని, ఆదర్శ మహా మానవ సిద్ధాంతం అహంకారాన్ని ప్రోత్సహించి దైవశక్తిని ధిక్కరించి అవగుణాలను రెచ్చగొట్టే ప్రమాదం ఉందని పూర్వపక్షం చేసిన వారిలో ముఖ్యులు హాథార్న్, మెల్విల్ లు. *ది స్కార్లెట్ లెటర్, ది హౌస్ ఆఫ్ ది సెవెన్ గేబిల్స్* అనే నవలలలోను ప్యూరిటన్ సంస్కృతికి, చరిత్రకు సంబంధించిన అనేక కథానికలలోను పాప ప్రవృత్తులను విశ్లేషించి హాథార్న్ నైతిక వాస్తవికతను ప్రతిపాదించాడు. హెర్మన్ మెల్విల్ *మొబీడిక్* లోనూ, గూఢార్థ సహితమైన వివిధ కథానికలలోనూ పాప పుణ్యాల సంఘర్షణలను, భ్రమచేత కల్పించబడిన మానవ విషాదాలను చిత్రించి విట్మన్‌తో పాటుగా అమెరికన్ సాహిత్యానికి మరొక మూల పురుషుడుగా ప్రసిద్ధి పొందాడు. ఈ యుగంలోనే జన్మించి, తాను జీవించి ఉన్న కాలంలో గుర్తింప బడక పోయినా భావుకత, ఆత్మపరిశీలన, శిల్పవైచిత్రి కారణంగా అనంతర కాలంలో ప్రసిద్ధి పొందిన గొప్ప కవయిత్రి ఎమిలీ డికిన్సన్. ఈ విధంగా అమెరికన్ సాహిత్యంలో ఎమర్సన్ సంప్రదాయం ఓజోగుణ భరితమై ఆశావాదాన్ని రేకెత్తింపగా, హాథార్న్ సంప్రదాయం రజస్తమో గుణాల వలన ఉత్పన్నమయ్యే అనర్థాలను ప్రకటిస్తూ వాస్తవికతా వాదాన్ని ప్రతిపాదించింది. ఈ రెండు విభిన్న ధ్రువాలూ ఆటు తరువాత వచ్చిన సృజనాత్మక రచనలకు గీటురాళ్లు అయాయి.

నిర్దిష్టమైన పరిణామ క్రమమూ, చారిత్రక దృష్టి కలిగి సమగ్రమైన యూరప్ సంస్కృతిని లక్ష్యంగా గ్రహించి వ్యక్తి వికాసాన్ని పెంపొందించే సభ్యతా సంస్కారాలు, పరంపరాగత సామాజిక మర్యాదలు శిష్టసమాజానికి ఆధారా లనీ, సాహిత్యకారులు వాటిని ప్రోత్సహించే రచనలను చేయాలనీ జె.ఆర్. లోవెల్, ఆలివర్ వెండెల్ హోమ్స్ వంటి వ్యాసకర్తలు, విమర్శకులు ప్రతిపాదించారు. ఎమర్సన్ ఆదర్శవాదానికి, హాథార్న్ నైతిక వాదానికి సమన్వయం చేకూర్చే మధ్యే మార్గం ఇది. ఈ మార్గమే మున్ముందు అమెరికన్ ఆలోచనా ధోరణిలో బలమైన సంప్రదాయంగా రూపొందింది.

అధినివేశ యుగం మొదలు 19 వ శతాబ్దం వరకూ సాగిన అమెరికన్ చరిత్రలో స్వాతంత్ర్య విప్లవం తరువాత ఏర్పడిన విషమ పరిస్థితులలో దాస్య విమోచనోద్యమం ఒక బాహ్యకారణంగా ఆరంభమైన అంతర్యుద్ధం మిక్కిలి విషాదకరమైన సంఘటన. అంతర్యుద్ధానికి నిజమైన కారణం సైద్ధాంతిక విభేదాలు. వాటికి తోడు ఉత్తర, దక్షిణ ప్రాంతాల మధ్య రాజకీయ స్పర్ధ, రాజ్య విస్తరణ కాంక్ష, ఆర్థికవ్యవస్థల తారతమ్యం, జీవన సరళులలో భిన్నత్వం కాలక్రమేణ తీవ్రస్థాయికి చేరాయి. ఈ సంఘర్షణకు బానిసత్వ నిర్మూలన ప్రకటన అవ్యవహిత హేతువు అయింది. ఉత్తర రాష్ట్రాలలో హోరెస్ గ్రీలీ, దక్షిణ రాష్ట్రాలలో జాన్ కాల్హూన్ భిన్న దృక్పథాలకు ప్రాతినిధ్యం వహించి వాద ప్రతివాదాలు కొనసాగించగా అబ్రహాం లింకన్ అధ్యక్షుడుగా ఉన్న కాలంలో ఈ సంక్షోభం పరాకాష్ఠ నందుకొని, అంతర్యుద్ధంగా పర్యవసించింది. విట్మన్, తోరో, మెల్విల్, సిడ్నీ లేనియర్ మొదలైన రచయిత లందరూ ఈ ఉత్పాతానికి ప్రతిస్పందించారు. ఈ పోరాటంలో వేరుపడి పోయిన దక్షిణ రాష్ట్ర సమాఖ్య ఓడిపోయి సంయుక్త వ్యవస్థే గెలు పొందినా, ఉత్తర దక్షిణ ప్రాంతాల మధ్య వైషమ్యాలు మాత్రం చారిత్రక అవశేషాలుగా మిగిలి పోయాయి. అమెరికా దేశం అట్లాంటిక్, పసిఫిక్ మహా సముద్రాలమధ్య ఉన్న భూఖండం అంతట విస్తరించి నగరాలు, పరిశ్రమలు, ప్రకృతి వనరులు, సంచార సాధనాలు పెరిగి, సంపన్న దేశంగా రూపొంద నారంభించింది.

అంతర్యుద్ధం తరువాతి కాలంలో ప్రజల రాజకీయ జీవనంలో కుసంస్కారం, అవినీతి, నైతిక పతనం, అధికార దుర్వినియోగం మొదలైన దుష్టధోరణులు పెచ్చరిల్లాయి. ఇంద్రియ సంతృప్తి, ధన సముపార్జనా నిరతి, భౌతిక సౌఖ్యాన్వేషణ ఎక్కువ అయి, సమాజంలో ఆదర్శవాదం వెనుకబట్టి, యథార్థ, ఉపయోగితా వాదాలు ప్రధాన ప్రేరణలు అయాయి. అందుకే అమెరికా చరిత్రలో ఈ యుగం "కాకిబంగారు యుగం" (Gilted age) గా అభివర్ణితమైంది. ఈ పరిస్థితులలో రచయితలు సంఘాన్ని విమర్శనాత్మకంగాను, వ్యంగ్యపూర్వకంగాను చిత్రీకరింపనారంభించారు. ఈ తరం సాహిత్యం గతాన్ని కాక వర్తమానాన్ని, ఆదర్శాలను గాక యథార్థాలను, కాల్పనికతను గాక ఐతిహ్యాన్ని ప్రాతిపదికలుగా గ్రహించింది. ఈ విధంగా వాస్తవికతోద్యమం ఆరంభమైంది.

వాస్తవికతా వాదం వస్తు స్వరూపాన్ని, మానవ స్వభావాన్ని, సమాజనైజాన్నీ యథాతథంగా చిత్రించే సాహిత్య ప్రక్రియ. అది రియలిజమ్, నేచురలిజమ్, ఎక్స్‌ప్రెషనిజమ్ అనే మూడు పాయలుగా ఆవిష్కృత మైంది. పశ్చిమ సరిహద్దు ప్రాంతంలో బ్రెట్‌హార్ట్, దక్షిణాన సిడ్నీ లెనియర్, ఎల్లెన్ గ్లాస్గోలు, ఉత్తరాన జోయెల్ హారిస్, కిత్ వాల్టన్‌లు మొదలైనవారు తమ తమ ప్రాంతీయ వాస్తవికతలను చిత్రిస్తూ కథా రచన చేశారు. విలియమ్ రోన్ హవెల్స్ ప్రెయరీ ప్రాంతపు మధ్య అమెరికాలోని చిన్న పట్టణాలలో కనిపించే మధ్య తరగతి వ్యాపారస్థుల సమాజాన్నీ, కుటుంబవ్యవస్థనూ ఆధారంగా చేసుకుని *ది రైజ్ ఆఫ్ సైలాస్ లాప్ హాం, దెయిర్ వెడ్డింగ్ జర్నీ* మొదలైన నవలలు రచించాడు. మార్క్ ట్వెయిన్ సరిహద్దు ప్రాంత నాగరకతను ఇతివృత్తంగా గ్రహించి మిసిసిప్పీ నదీ పరివాహ ప్రాంతపు జనజీవనాన్ని అభి వర్ణిస్తూ *హకిల్ బెరీ ఫిన్* వంటి నవలలను సృష్టించి, అమెరికన్ సాహిత్యంలో హాస్యరచనా పితామహు డయాడు. రాను రాను మార్క్ ట్వెయిన్‌కు హాస్యం మొగం మొత్తింది. సామాజిక నిర్వేదం, పరుషమైన విమర్శ స్ఫురించే *ది మిస్టీరియస్ స్ట్రేంజర్* వంటి కోపపూరిత రచనలు వెలువడ నారంభించాయి. రచనాశైలిలోను, పాత్రచిత్రణలోను, కథాసంవిధానంలోను దేశి పద్ధతిని ప్రతిబింబించిన *హకిల్ బెరీ ఫిన్* నాగరక సంస్కృతిలోని కపటత్వానికి భిన్నమైన సహజత్వాన్ని, సారళ్యాన్ని ప్రకటించి అమెరికన్ నవలా సాహిత్యంలో మౌలికమైన విలువ గల రచన అయింది. పసిఫిక్ తీరం వరకు అమెరికా విస్తృతి చెందిన ఈ యుగంలో ఇ.డబ్ల్యూ. హో, జోసెఫ్ కర్క్‌లాంగ్, ఎడ్వర్డ్ ఎగిల్‌స్టన్, హామ్‌లిన్ గార్లండ్ ప్రభృతులు మురికివాడలను, మారుమూల క్షేత్రాలను మోటు మనుష్యులతో నిండిన సరిహద్దు బస్తీలను అభివర్ణించి సమాజాన్ని నిశితంగా విమర్శించారు. నాగరకతా లక్షణాలు లోపించిన అమెరికాకు, ప్రాచీన నాగరికతతో విలసిల్లే యూరప్‌కు మధ్య ఉన్న వ్యత్యాసాలను గుర్తిస్తూ, చారిత్రక స్పృహ లోపించిన అమెరికాలో నిజమైన కళాసృష్టికి తగిన ప్రోత్సాహం లభించదని భావించి, హెన్రీ జేమ్స్ నూతనానుభవాలను అన్వేషిస్తూ ఇంగ్లండ్‌కూ, యూరప్‌కూ తరలి వెళ్లాడు. అనంతరం ఆయన అంతర్జాతీయ నవలా ప్రక్రియను ప్రారంభించి *ది పోర్ట్రెయిట్ ఆఫ్ ఏ లేడీ, ది అంబాసడర్స్* వంటి కళాత్మకమైన సుప్రసిద్ధ రచనలు చేశాడు. నవలా రచనను ఒక శిల్పంగా రూపొందించి 'దృష్టి కోణం', 'చైతన్య కేంద్రం', 'భావనోన్మీలన' వంటి కథాకథన సూత్రాలను స్థాపించి, ఆటు తరువాత వచ్చిన నవలా రచయితలను ప్రభావితం చేశాడు.

19 వ శతాబ్దపు ఉత్తరార్థంలో అమెరికాలోని విలువలను ప్రశ్నిస్తూ హెన్రీ జార్జ్, ఎడ్వర్డ్ బెల్లమీ, లెస్టర్ ఫ్రాంక్‌వార్డ్, ఫ్రెడరిక్ జాక్సన్ టర్నర్, థోర్మన్ వెబ్లెన్ మొదలైన మేధావులు సామాజిక, చారిత్రక గ్రంథాలను వ్రాసి అభ్యుదయ భావాలను ప్రకటించారు. విలియమ్ జేమ్స్ మనో విజ్ఞానాన్ని, జాన్ డ్యూయీ ప్రయోజనవాదాన్ని, హెన్రీ ఆడమ్స్ ఆధునిక చారిత్రక దృష్టిని తమ రచనలలో అభివ్యక్తం చేశారు. 19 వ, 20 వ శతాబ్దాల సంధి కాలంలో సంభవించిన ఈ విస్తృతమైన భావ విప్లవానికి అనుగుణంగా స్టీఫెన్ క్రేన్ (*ది రెడ్‌బ్యాడ్జ్ ఆఫ్ కరేజ్*), థియొడోర్ డ్రైజర్ (*సిస్టర్ కేరీ*), జాక్‌లండన్ (*ది ఐరన్ హీల్*), అప్టన్ సింక్లేర్ (*ది జంగిల్*) వంటివారు సామాజిక స్పృహ గల చక్కని నవలలను వెలువరించి డార్విన్, మార్క్స్ సిద్ధాంతాలు ఆధారంగా 'నేచురలిజమ్' ఉద్యమాన్ని బలపరిచారు.

20 వ శతాబ్దంలో మొదటి దశాబ్దం చివరకు అమెరికన్ దృక్పథంలోను భావనాధోరణిలోను, వ్యక్తిత్వంలోను వచ్చిన మార్పులను సూచించిన నవలలు: హెన్రీ ఆడమ్స్ స్వీయ గాథ *ది ఎడ్యుకేషన్ ఆఫ్ హెన్రీ ఆడమ్స్*, థియొడోర్ డ్రైజర్ వ్రాసిన *ఆన్ అమెరికన్ ట్రాజెడీ*.

డార్విన్ ప్రతిపాదించిన జీవ పరిణామవాదం ఛాయలలో అమెరికన్ ఆదర్శాలను ఒక వంక పునరుద్ఘాటిస్తూ మరొక వంక నైరాశ్యం ప్రకటిస్తూ విలియం వాన్ మూడీ, ఎడ్విన్ ఆర్లింటన్ రాబిన్సన్ అనే కవులు చక్కని కవితలు ప్రచురించారు. ఎజ్రా పౌండ్, హారియెట్ మన్రోల

నాయకత్వం క్రింద నవ్య కవిత్వోద్యమం బయలు దేరింది. *'పొయెట్రీ'* లాంటి చిన్న సైజు పత్రికలు అందుకు దోహదం చేశాయి. కార్ల్‌శాండ్‌బర్గ్, వాచెల్ లిండ్‌సే, ఎడ్గాల్ లీమాస్టర్స్, ఎమీ లోవెల్ మొదలైన కవుల రచనలు వివిధ కావ్య ప్రక్రియలలో సాగి కవిత్వానికి దేశంలో అనుకూల వాతావరణం కల్పించాయి. ఈ లోగా జీవ భౌతిక విజ్ఞాన శాస్త్రాల వలన ఆరంభమైన భావ విప్లవం ఫ్రాయిడ్ ప్రతిపాదించిన మనోవైజ్ఞానిక సిద్ధాంతాలతో పరాకాష్ఠ పొందింది.

జీవన పరిణామంలో డార్విన్, సమాజ వ్యవస్థలో మార్క్స్‌ల ప్రభావంతో అమెరికన్ సాంప్రదాయిక లౌకిక దృష్టి పెద్ద మలుపు తిరిగింది. పారిశ్రామిక ప్రగతి, పట్టణాల పెరుగుదల, సామాజిక స్తబ్ధత- వీటి వలన ఏర్పడిన వాతావరణంలో వ్యక్తి స్వేచ్ఛా, స్వాతంత్ర్యం మొదలైన వెనుకటి ఆదర్శాలు కనుమరుగై, మానవ ప్రవర్తనను నిర్దేశించే నైతిక ప్రమాణాలు మారిపో సాగాయి. ఫ్రాయిడ్ ప్రతిపాదించిన మనో వైజ్ఞానిక సూత్రాల వలన స్థూలచేతనకూ, సూక్ష్మచేతనకూ మధ్య సాగే సంఘర్షణలే మానవ స్వభావాన్నీ, ప్రవృత్తినీ ప్రభావితం చేస్తాయని స్పష్టం అయింది. బాహ్యాంతర చేతనల మధ్య వైమనస్యం సామాజిక దమనం వలన వృద్ధి చెంది వ్యక్తిని పెడమార్గాలకు మళ్లించడం జరుగుతుంది. అయితే అంతశ్చేతన బహిర్గతం కావడానికి సృజనాత్మకశక్తి తోడ్పడుతుంది. అంతర్గతం అయిన మానసిక చర్యలను అభివ్యక్తం చేయడానికి 'చైతన్య స్రవంతి', 'స్మృతి పరావర్తనం', 'అసౌష్ఠవ కథా కథనం' వంటి నూతన ప్రక్రియలు, ప్రయోగాత్మక శిల్పాలు వాడుకలోకి వచ్చి కవిత్వంలోను, నవలా రచనలోను, నాటక రచనలోను ఆధునిక సాహిత్యంలో ఒక క్రొత్త దనం కనిపించింది. అంతర్ముఖమైన వాస్తవికతా వాదం సమాజ పరిస్థితుల చిత్రణకు, పాత్రల మనో విశ్లేషణకు ఒక అనుసంధానం కలిపించింది. దృక్పథాలలోనూ, సిద్ధాంతాలలోనూ సంభవించిన ఈ మార్పులతో పాటు సంఘంలో సంచలనం కలిగించిన ప్రధాన సంఘటనలు: మొదట ప్రపంచయుద్ధం, దానిననుసరించి వచ్చిన ఆర్థిక మాంద్యం. వీటివలన కలిగిన తమ నిజమైన అనుభూతులను ప్రతిబింబిస్తూ ఆ నాటి యువతరం రచయితలు సాహిత్య సృష్టి చేశారు. యుద్ధానంతర కాలంలో ఆదర్శాల పేరిట జరిగే అత్యాచారాలను, హింసా ప్రవృత్తిని, కపట రాజకీయాలను, వ్యక్తి స్వాతంత్ర్యాన్ని భంగపరచే ప్రతీప శక్తులను ఆనాటి రచనలు తీవ్రంగా విమర్శించాయి. రష్యా విప్లవం పట్ల సానుభూతి ప్రదర్శించిన కొన్ని వామపక్షోద్యమాలు కూడా ప్రచారంలోకి వచ్చాయి. విలువల పతనం, భావాభివ్యక్తి లోపం ప్రతిబింబించే రచనలు నిరాశను, నిస్పృహను, ఉదాసీనతను, విశృంఖలత్వాన్ని ప్రదర్శించాయి. మొత్తం మీద అమెరికన్ సాహిత్యంలో 1920-30 మధ్య కాలంలో రెండవ 'పునరుజ్జీవనం' సంభవించిందని చెప్పవచ్చును.

కవిత్వరంగంలో ఎమీ లోవెల్ ప్రచారం చేసిన 'బింబ వాదం' (ఇమేజిజమ్), ఫ్రెంచ్ కవులనుంచి సంక్రమించిన 'ప్రతీక వాదం' (సింబాలిజం) మొదలైన ప్రయోగాల ప్రేరణతో యుద్ధానంతర కాల నిర్వేదాన్ని, పతితావస్థని, జడత్వాన్ని చిత్రిస్తూ టి.ఎస్. ఇలియట్ రచించిన *ది వేస్ట్ లాండ్* ఆధునిక కవిత్వానికి నాంది పలికింది. 'కవుల కవి' అయిన ఎజ్రా పౌండ్ నవీకరణోద్యమానికి సారథ్యం వహించాడు. రాబర్ట్ ఫ్రాస్ట్ సాంప్రదాయిక రీతులలోనే రచన సాగించినా, అతని కావ్యాలలో ఆధునిక భావాభివ్యక్తి కనిపిస్తుంది. విలియం కార్లోస్ విలియమ్స్, తన *పేటర్సన్* కావ్యంలోను, హార్ట్‌క్రేన్ *ది బ్రిడ్జ్* అనే కావ్యంలోనూ అమెరికన్ చారిత్రక వైయక్తిక భావ సంఘర్షణను చిత్రించారు. ఇ.ఇ. కమింగ్స్ కవిత్వ శైలిలో విచిత్ర ప్రయోగాలూ, చమత్కార ప్రక్రియలూ సాధించాడు. అలన్ టేట్, రాబర్ట్ పెన్ వారెన్ మొదలైన దక్షిణ ప్రాంతపు కవులు దాక్షిణాత్య సంస్కృతి పూర్వాపరాలను విశ్లేషిస్తూ రచనలు చేశారు. వాలెస్ స్టీవెన్స్ వాస్తవికతకూ, కాల్పనికతకూ మధ్య వారధి కట్టడానికి ప్రయత్నించి సంకేత ప్రధానమైన కవితలను రచించాడు. ఈ విభిన్న కవితారూపాల కలయికతో అమెరికన్ కవిత్వానికి ఒక విలక్షణమూ, విశిష్టమూ అయిన వ్యక్తిత్వం సిద్ధించింది.

నవలా సాహిత్యం, కథానికా సాహిత్యం కూడా ఈ కాలంలో సర్వతోముఖ వికాసం చెందాయి. షెర్వుడ్ ఆండర్సన్ వ్రాసిన *వైన్స్‌బర్గ్ ఒహాయో* లో చిన్న పట్టణాలలోని మధ్యతరగతి ప్రజల సుఖదుఃఖాలు సానుభూతితో చిత్రించబడ్డాయి . సింక్లెర్ లూయిస్ వ్రాసిన *బాబిట్* మొదలైన నవలలు ఈ కోవకు చెందినవే! వృత్తిపరమైన సమస్యలలో చిక్కుకొని, సమాజపు సానుభూతిని పోగొట్టుకొని భౌతిక విజయాలకోసం ప్రాకులాడే పాత్రలను ఆయన సృష్టించాడు. ఆయన రచనలలో సామాజిక విమర్శతోపాటు చురుక్కుమనిపించే వ్యంగ్యం, హాస్యమూ కూడా ద్యోతకమవుతాయి. పాత్రికేయుడుగా, వ్యాస కర్తగా ప్రసిద్ధి పొందిన హెచ్.ఎల్. మేంకెన్ అమెరికా జీవన విధానాన్ని అధిక్షేపిస్తూ, సృజనాత్మక లక్ష్యాలవైపు యువతరం దృష్టిని ఆకర్షించాడు.

యూరప్‌లో జరిగిన యుద్ధ కార్యకలాపాలలో పాల్గొని ప్రవాస జీవితం అనుభవించిన యువ రచయితలను పారిస్‌లో గెర్ట్రూడ్ స్టీల్ ప్రారంభించిన సాహిత్య శిల్పం ఆకర్షించింది. అలా ఆకర్షితులైనవారిలో ప్రసిద్ధులు: ఎఫ్. స్కాట్ ఫిడ్జ్ జెరాల్డ్, ఎర్నెస్ట్ హెమింగ్ వే, జాన్ డోస్ పాసోస్ మొదలైనవారు. వారిని 'తప్పిపోయిన తరం' (Lost Generation) అని ప్రజలు వ్యవహరింపసాగారు. 1920-30 మధ్య కాలంలో ఉద్భవించిన జాజ్ సంస్కృతికి ప్రతినిధి అయిన ఫిడ్జెరాల్డ్ *ది గ్రేట్ గాట్స్‌బి* అనే ప్రతిభావంతమైన నవలను వ్రాసి, అమెరికాలో వ్యాపించి ఉన్న స్వీయాదర్శపు వైఫల్యాన్ని చిత్రించాడు. ఆ నవలలోని నాయక పాత్ర ద్వారా ధనప్రాభవా కాంక్షల వల్ల కలిగే అనర్థాలను ఆయన చిత్రించాడు. జాన్ డోస్ పాసోస్ తన *అమెరికా ట్రైయాలజీ* లో పెట్టుబడిదారీ విధానం వల్ల కలిగే ఆర్థికశోషణను, పరపీడన దృష్టిని చిత్రించాడు. సంచార మాధ్యమాల సాంకేతిక ప్రక్రియలను అవలంబించి నవలా రచనలో సమాజ స్పృహకు స్థానం కల్పించాడు. హెమింగ్ వే *ది సన్ ఆల్సో రైజెస్, ఏ ఫేర్‌వెల్ టు ఆర్మ్స్* మొదలైన యుద్ధకాలపు నవలలను వ్రాసి ఆనాటి నైరాశ్య భావాన్నీ, విషాద సంఘటనలనూ నిర్దాక్షిణ్యంగా అభివర్ణించాడు. విలియం ఫాక్నర్ అమెరికా దక్షిణ ప్రాంతపు సభ్యతలో సంభవించిన పతనావస్థను, శ్వేత శ్వేతేతర జాతుల సంఘర్షణలో నిర్వీర్యమైన సాంఘిక వ్యవస్థను ఎంతో అవగాహనతో పరిశీలించి చైతన్య స్రవంతి ప్రక్రియలో *ది సౌండ్ అండ్ ది ఫ్యూరీ* మొదలైన ప్రాదేశిక *యోక్నాపటాఫా* నవలలో స్ఫుటంగా ప్రతిబింబింపజేశాడు. జాన్‌స్టెయిన్ బెక్ *ది గ్రేప్స్ ఆఫ్ రాత్* అనే తన సుప్రసిద్ధమైన నవలలో అమెరికాలో నిర్వాసితులు అయిన కర్షక కార్మిక వర్గాల దీనావస్థను వర్ణించాడు. థామస్ వుల్ఫ్ *లుక్ హోంవర్డ్ ఏంజెల్!* మొదలైన నవలలలో ఫ్రాయిడ్, ఆడ్లర్, యుంగ్ వంటి మనో వైజ్ఞానికుల సిద్ధాంతాన్ననుసరించి మానసిక సంఘర్షణలను చిత్రించి వానిలో అమెరికన్ దాక్షిణాత్య సంస్కృతిని వర్ణించాడు. సింక్లేర్ లూయీస్, హెమింగ్ వే, ఫాక్నర్, స్టెయిన్ బెక్‌లు సాహిత్యానికి నోబెల్ బహుమతి సంపాదించి అమెరికన్ నవలా సాహిత్యానికి ప్రఖ్యాతి చేకూర్చారు. గత చరిత్రను ఇతివృత్తంగా గ్రహించి ధైర్యసాహసాలు, శీల సంపద గల మహిళల నైజాన్ని చిత్రిస్తూ కొందరు రచయిత్రులు కూడా నవలలు వ్రాశారు. వీరిలో ఈడిత్ వార్టన్, విల్లాకాథర్ (*డెత్ కమ్సు టు ది ఆర్చిబిషప్*) ముఖ్యంగా పేర్కొనదగినవారు. 'ఉప యుక్తగతం', 'సజీవ వర్తమానం' అనే దృక్పథాలతో అమెరికన్ సాహితీ వికాసం కొనసాగింది.

ఈ కాలంలోనే మొట్ట మొదటిసారిగా గణనీయమైన నాటక సాహిత్యం కూడా ఆవిర్భవించింది. వాషింగ్టన్ స్క్వేర్ ప్లేయర్స్, గ్రీన్ విచ్ విలేజ్, బ్రాడ్ వే వంటి నాటక సంఘాల యాజమాన్యం క్రింద జార్జ్‌క్రాన్ కుక్, మేక్ గోవన్, సూసన్ గ్లాస్పెల్ మొదలైన కళాకారుల తోడ్పాటుతో వ్యాపారదృష్టిలేని ఔత్సాహిక, ప్రయోగాత్మక నాటకాలకు ప్రోత్సాహం లభించింది. ఇబ్సెన్, స్ట్రిండ్‌బెర్గ్, కైసర్, హౌప్ట్‌మన్ వంటి యూరపియన్ నాటక రచయితల ప్రభావంతో సామాజిక, మనోవైజ్ఞానిక రచనలను పూర్తిగా అవగాహన చేసుకుని నీషే, షోపెన్ హోవర్, ఫ్రాయిడ్, యూంగ్‌ల సిద్ధాంతాల వలన ప్రబోధితుడై యూజీన్ ఓ నీల్ 1918 నుండి నిర్విరామంగా కృషిచేసి సృష్టించిన నాటక పరంపర అమెరికాలో స్వతంత్ర నాటక సంప్రదాయానికి పుష్టి చేకూర్చింది. విధి వంచితులైన వ్యక్తుల విషాద పూరితమైన జీవితాలతో పెనవేసుకున్న సంఘర్షణలను, దుఃఖ పరిణామాలను చిత్రిస్తూ ఆధునిక మానవుడు ఎదుర్కొనే బాహ్యాంతర వైక్లబ్యాలాను ప్రదర్శిస్తూ ఓ నీల్ ప్రదర్శన యోగ్యమైన చక్కని నాటకాలను రచించాడు. 'ఎక్స్‌ప్రెషనిజం' లేక అభివ్యక్తీకరణ పద్ధతిలో *ఎంపరర్ జోన్స్, ది హెయరీ ఏప్, ది సైడ్ అండ్ ది ఎల్మ్స్, ది వార్నింగ్ బికమ్స్ ఎలెక్ట్రా, ది స్ట్రేంజ్ ఇంటర్లూడ్* అనే ప్రఖ్యాత విషాద నాటకాలను రంగస్థలానికి ఆయన అందించాడు. మాక్స్ వెల్ ఆండర్సన్ కావ్య నాటకాలను (*వింటర్‌సెట్*), ఫిలిప్ లూరీ వ్యంగ్యాత్మక నాటకాలను (*ది హోటల్ యూనివర్స్*) వ్రాసి అమెరికన్ నాటక సంప్రదాయానికి పుష్టిని చేకూర్చారు. ఆర్థిక మాంద్యం తెచ్చిపెట్టిన సంక్షోభాన్ని ఎదుర్కొనేందుకు ప్రెసిడెంట్ రూజ్‌వెల్ట్ ప్రతిపాదించిన 'న్యూ డీల్' యుగంలో సామాజిక స్పృహను, సామ్యవాద సూత్రాలను పాటిస్తూ క్లిఫర్డ్ ఓడెట్స్ డడెట్స్ (*వెయిటింగ్ ఫర్ లెఫ్టీ*), విలియన్ హెల్మన్ (*ది చిల్డ్రన్స్ అవర్*) విలియమ్ సారోయన్ (*ది బ్యూటీఫుల్ పీపుల్*) మొదలైనవారు చక్కని నాటకాలు ప్రకటించారు. నీగ్రో జానపద జీవితాన్ని ప్రతిబింబించే *మిస్టర్ రాబర్ట్స్, ఇన్ అబ్రహామ్స్ బోజమ్* మొదలైన కల్పనాత్మక రూపకాలు కూడా ఈ కాలంలో ప్రదర్శించ బడ్డాయి.

హెమింగ్ వే *ఫర్ హూం ది బెల్ టోల్స్*, ఫాక్నర్ *లైట్ ఇన్ ఆగస్ట్*, నీగ్రో రచయిత రిచర్డ్ రైట్ *నేటివ్ సన్* అనే నవలలలో కూడా సమకాలీన స్పందన

ద్యోతకమైంది. రెండవ ప్రపంచ సంగ్రామం నాటికి అమెరికా చారిత్రకంగానూ, రాజకీయంగానూ, సామాజికంగానూ కూడా ఒక నూతన యుగంలో అడుగు పెట్టేందుకు సిద్ధంగా ఉంది. అంతర్జాతీయ వ్యవహారాలలో జోక్యం కలిగించుకోడం, వ్యక్తివాదాన్ని వదలి శ్రేయో సంఘ దృక్పథాన్ని అవలంబించడం, వైజ్ఞానిక సాంకేతిక ప్రగతిలో నవ్య సమాజ ధోరణిని ప్రకటించడం ఈ యుగ ప్రధాన లక్షణాలు. తదనుగుణంగా సాహిత్యంలో కూడా మార్పు వచ్చింది. రెండో ప్రపంచయుద్ధం తరువాత అమెరికాలో తరాల అంతరాలు పెరగడం, ప్రజాబాహుళ్య సంచార సాధనాలకు ప్రాచుర్యం హెచ్చడం, సాంకేతిక విప్లవం, రోదసీ విజ్ఞాన వ్యాప్తి, అల్పజాతి వర్గాల జాగృతి, మానవ సంబంధాలలో నైతిక పరివర్తనం, వియెట్నాం సైనిక చర్యల వైఫల్యం వలన కలిగిన సామూహిక పాపభీతి, అణుయుద్ధ సంభావన వల్ల కలిగిన ఆందోళన, కళారీతులలో విశృంఖలత, మొదలైన వాని వలన భావ విప్లవం ఏర్పడింది. ప్రకృతి పరిసరాలకు అనువైన స్వాభావిక జీవన శైలి సాధించడానికి 'ప్రత్యామ్నాయ సమాజం' ఒక్కటే మార్గమని కొన్ని ఉద్యమాలు ప్రకటించాయి. అవి సాహిత్య రంగాన్ని కూడా ప్రభావితం చేశాయి. ప్రధాన సాహిత్య స్రవంతికి సమాంతరంగా రెడ్ ఇండియన్, ఆఫ్రో అమెరికన్,యూదుజాతుల మైనారిటీ సాహిత్యాలు కూడా బలం పుంజుకోసాగాయి. దక్షిణ రాష్ట్రాలలో నూతనోత్తేజంతో విశిష్టవాఙ్మయం వెలసింది.

హెమింగ్ వే *ది ఓల్డ్ మాన్ అండ్ ది సీ,* ఫాక్నర్ *ది బేర్,* *ఫ్రాస్ట్ కిటీహాక్,* ఓనల్ *ది ఐస్ మాన్ కమెత్, ఏ లాంగ్ డేస్ జర్నీ ఇన్ టు ది నైట్* వంటి సుప్రసిద్ధ రచనలు వెలువడ్డాయి. అయినా 1940-90 మధ్యకాలంలో నవ రచయితల ప్రాబల్యమే ఎక్కువగా కనిపిస్తుంది. దక్షిణ రాష్ట్రాలలో వెలసిన కృతులలో రాబర్ట్ పెన్ వారెన్ వ్రాసిన *ఆల్ ది కింగ్స్ మెన్,* డెల్టా రచయిత్రులుగా ప్రసిద్ధి చెందిన కాథరైన్ ఆన్ పోర్టర్, యూడోరా వెల్టీ, కార్సన్‌మా కలర్స్, ఫ్లానె రీ ఓ కానర్ వంటివారు రచించిన నవలికలు, కథానికలు, టెన్నెసీ విలియమ్స్ వ్రాసిన *ది గ్లాస్ మెనేజరీ, ఏ స్ట్రీట్ కార్ నేమ్డ్ డిజైర్* వంటి నాటకాలు ముఖ్యమైనవి. పశ్చిమ రాష్ట్రాలలో బీట్ కవులూ, హెన్రీ మిల్లర్ వంటి నవలాకారులూ ప్రసిద్ధి కెక్కారు. నార్మన్ మెయిలర్ *ది నేకెడ్ అండ్ ది డెడ్,* జోసెఫ్ హెల్లర్ *కాచ్-22* వంటి యుద్ధ గాథలను రచించారు. రాల్ఫ్ ఎలిసన్ *ఇన్విజిబుల్ మాన్,* జేమ్స్ బాల్డ్విన్ *నో టెల్ ఇట్ ఆన్ ది మౌంటెన్* (1953) వంటి నీగ్రో రచనలు కూడా వెలువడ్డాయి. జాన్ అప్‌డైక్, సాలింజర్, కుర్ట్ వానెగట్, కార్ల్ జోయిస్ ఓట్స్, జాన్‌బార్త్ మొదలైన వారు నవలా సాహిత్యంలో వైవిధ్యం సాధించారు. సాల్ బెల్లో *ఎడ్వెంచర్స్ ఆఫ్ ఆగ్‌మార్చ్, హెర్జోగ్, హుంబోల్డ్స్ గిఫ్ట్* వంటి నవలలలో యూదు జీవితాన్ని, నగర సభ్యతను సామ్యంగా గ్రహించి మానవ పరిస్థితులను, వ్యవస్థలను పరిశీలించారు. బెర్నార్డ్ మాలముడ్ *ది అసిస్టెంట్, న్యూ లైఫ్, గాడ్స్ గ్రేస్,* వంటి అస్తిత్వ వాదాన్ని ప్రకటించే రచనలు చేసి యూదు సాహిత్యాన్ని పెంపొందించాడు. సాల్ బెల్లోకు నోబెల్ బహుమతి లభించడంతో యూదు సాహిత్యపు గౌరవ ప్రతిష్ఠలు పెరిగాయి.

ఆధునిక కాలంలో టెన్నిసీ విలియమ్స్ మనో విశ్లేషణకు, ఆర్థర్ మిల్లర్ (*ది డెత్ ఆఫ్ ఏ సేల్స్‌మన్, ది క్రూసిబుల్, ఆఫ్టర్ ది ఫాల్*) సాంఘిక చింతనకు చెందిన నాటకాలు వ్రాశారు. 'అబ్సర్డ్ థియేటర్' ఉద్యమ ప్రభావంతో ఎడ్వర్డ్ ఆల్బీ (*హూయీజ్ ఎఫ్రయిడ్ ఆఫ్ వర్జీనియా వుల్ఫ్?*) *జాన్ గెల్బర్* (*ది కనెక్షన్*), లెరాయ్ జోన్స్ *ది స్లేవ్‌షిప్* అనేనాటకాలు రచించారు. సిల్వియా ప్లాట్, అలన్ గిన్స్‌బర్గ్, రెవర్టోవ్, బెర్రీమన్, రాబర్ట్ వెల్, జేమ్స్ డికీ మొదలైన కవులు ఆధునిక కవిత్వ వికాసానికి ఎక్కువగా తోడ్పడ్డారు.

ఆధునిక కాలంలో సాహిత్య విమర్శ మిక్కిలి ప్రభావశాలి అయిన ప్రక్రియగా రూపొందింది. జాన్ క్రోరాన్ సమ్, క్లియాన్త్ బ్రూక్స్, లెస్లీ అయివర్ వింటర్స్, హెరోల్డ్ బ్లూమ్, ఛార్ల్స్ జల్సన్, సూసన్ సోన్‌టాగ్ లెస్లీ ఫీడ్లర్, లియోనల్ ట్రిలింగ్ మొదలైన విమర్శకులు 'న్యూ క్రిటిసిజం', 'చికాగో స్కూల్', 'డికన్‌స్ట్రక్షనిజమ్', 'సిమియోటిక్స్' వంటి అనేక నూతన సమీక్షా పద్ధతులను ఆవిష్కరించారు.

ఈ విధంగా చారిత్రక విహంగ దృష్టితో అవలోకించి చూస్తే దాదాపు మూడు శతాబ్దాల కాలంలో ఇంగ్లీషు సాహిత్యానికి ఒక ఉపశాఖగా ఆవిర్భవించిన అమెరికన్ సాహిత్యం నైసర్గిక, చారిత్రక, మానవీయ ప్రేరణల వలన స్వతంత్రంగా పరిపుష్టమై, స్వకీయమైన ముద్ర సాధించి, విశ్వసాహిత్యంలో ఒక ప్రముఖ స్థానం సంపాదించుకుంది.

డి.వి. కె.రా.

## కెనడా సాహిత్యం

ఉత్తర అమెరికా ఖండంలోని కెనడా దేశంలో ఆ దేశపు రచయితలు సృష్టించిన ఇంగ్లీష్, ఫ్రెంచ్ సాహిత్యాలను రెంటినీ కలిపి కెనడా సాహిత్యం అంటారు. ద్వి భాషా రాజ్యం అయిన కెనడాలో ఈ రెండు సాహిత్యాలూ ప్రక్కప్రక్కనే అభివృద్ధి చెందాయి. ఈరెండింటి వికాస పరిణామాలలోనూ కొన్ని సామ్యాలు కనిపిస్తాయి. రెండు భాషలలోనూ తొలి రచనలు మొదట ఆ ఖండాన్ని అన్వేషిస్తూ వలస వచ్చిన వారు చేసినవే! అలాంటి వారిలో పేర్కొనదగ్గవారు: శామ్యుయెల్ డి చాంప్లేన్ (1577-1635), పియరె ఎస్ప్రిట్ రాడిసన్ (1636-1710), హెన్రీ కెల్సీ (1670-1730), శామ్యుయెల్ హీర్నె (1745-1792), ఇద్దరు అలెగ్జాండర్ హెన్రీలు (1739-1829?, --1814), అలెగ్జాండర్ మెకెంజి (1764-1820), సైమన్ ఫ్రేజర్ (1776-1862), డేవిడ్ థాంప్సన్ (1770-1857).



కెనడా

18 వ శతాబ్ది చివర భాగంలోను, 19 వ శతాబ్ది ఆరంభంలోను కెనడా దేశీయులు స్వతంత్ర రచనలు చేయడం ప్రారంభించారు. మాంట్రీల్ నగరంలో *గజెట్ లిటరేర్*, హాలిఫాక్స్ రేవుపట్టణంలో *నోవా స్కోషియన్* అనే పత్రికలు ప్రారంభం కావడం ఇందుకు దోహదం చేసింది. రెండు భాషలలోనూ తొలి కావ్యాలూ, నవలలూ 1820-30 మధ్య వెలువడ సాగాయి.

రెండు భాషలలోనూ ప్రయత్న పూర్వకంగా ప్రత్యేకమైన జాతీయ సాహిత్యం 19 వ శతాబ్ది ఉత్తరార్ధంలో ప్రారంభమైంది. ఆ నాటి కెనడా సాహిత్యంలో కాల్పనికత, పురా వైభవ స్మృతి (nostalgia) ప్రముఖంగా కనిపించేవి. మరింత విమర్శక దృష్టి, వాస్తవికత, శిల్ప పరిణతి కెనడా సాహిత్యంలో 20 వ శతాబ్ది తొలి 4 దశాబ్దాలలోను అభివ్యక్తం అయాయి. రెండు భాషలలోనూ ప్రపంచ దృష్టిని ఆకర్షించ గల ఉదాత్త రచనలు మాత్రం రెండవ ప్రపంచ సంగ్రామం అనంతరమే వెలువడ్డాయి.

కెనడాలోని ఇంగ్లీష్, ఫ్రెంచ్ సాహిత్యాల మధ్య ప్రస్ఫుటంగా కనిపించే మరి కొన్ని సామ్యాలు కూడా ఉన్నాయి. రెండింటిలోనూ కవిత్వమే ప్రముఖ స్థానం వహించింది. గద్య రూపంలో వ్రాసిన చరిత్ర మాత్రమే దానితో పోటీ పడ గలిగింది. 20 వ శతాబ్ది కొంత గడిచే వరకూ కూడా నవల బాగా వెనుక పడింది. 20 వ శతాబ్ది సగపడే వరకూ నాటక రచన ఇంచుమించు మృగ్యం అనే చెప్పాలి. ఇక స్వతంత్ర తాత్త్విక రచనలు అసలే వెలువడలేదు. విడి సాహిత్య రూపాల ఉద్దేశ్యంలోనూ, దిశలోనూ కూడా ఉభయ సాహిత్యాల మధ్యా సామ్యం కనిపిస్తుంది. ఇంగ్లీష్, ఫ్రెంచ్ భాషలు రెండింటిలోని కవిత్వం లోనూ ఇటీవలి వరకూ కెనడా దేశంలో అద్భుతమైన ప్రకృతి వర్ణనే ప్రాధాన్యం వహిస్తూ వచ్చింది. 19 వ శతాబ్దిలో రెండు భాషలలోనూ వెలువడిన నవలలు ఇంచుమించు అన్నీ చారిత్రక సాహస గాథలే (Romances). 20 వ శతాబ్ది ఆరంభంలో స్థానిక గ్రామీణ జీవన చిత్రణం ప్రాధాన్యం వహించింది. 1920 నుంచీ వాస్తవికత, వ్యంగ్య పరిహాసం, సమకాలీన జీవిత సాంకేతిక చిత్రణల వైపు నవల పురోగమించింది.

రెండు భాషలలో వెలువడిన కెనడా సాహిత్యంలోను జాతీయతా ముద్ర కోసం అన్వేషించడం ప్రధాన భాగం అయింది. ముఖ్యంగా ఫ్రెంచ్‌వారు ఇంగ్లీషు మాట్లాడే ఉత్తర అమెరికాలో అల్ప సంఖ్యాకులైనందు వల్ల తమ ప్రత్యేక వ్యక్తిత్వాన్ని నిరూపించుకోడం అవసరమైంది. ఫ్రాన్స్వా యిస్ జేవియర్ గార్నో (1809-1866), బెంజమిన్ సుల్టె (1841-1923), థామస్ చాపాయిస్ (1858-1946), లియోనెల్ అడాల్ఫ్ గ్రౌల్క్స్ (1878-1967) వంటి కెనడాలోని ఫ్రెంచ్ చరిత్ర రచయితలు తమ ప్రజలలో తమ వారసత్వం పట్ల గర్వ భావాన్నీ, దాన్ని సంరక్షించుకునేందుకు దృఢ సంకల్పాన్నీ కలిగించడానికే తమ రచనలను ప్రధానంగా ఉద్దేశించారు. వారి నవలా రచయితలు ఎలాంటి సంకోచం లేకుండా అమెరికన్ ప్రభావాలను నిరోధించాలనీ, తమ సంప్రదాయాన్ని పరిరక్షించుకోవాలనీ ప్రజలను ప్రబోధించారు.

కెనడాలోని ఇంగ్లీష్ సాహిత్యంలో వారి జాతీయాభిమానం మరింత విస్తృతంగానూ, మరింత నాజూకుగానూ అభివ్యక్తం అయింది. డజనుల కొద్దీ వారి నవల

లలో కెనడా ప్రకృతి సౌందర్యం, స్థానిక వ్యావసాయిక క్షేత్రాలలోనూ, బెస్తపల్లెలలోనూ కనిపించే వాస్తవిక జీవిత స్వరూపం అభివర్ణించబడ్డాయి. చార్లస్ జి.డి. రాబర్ట్ (1858-1918) వంటి జాతీయ కవుల దేశభక్తి గీతాలలో వారి జాతీయాభిమానం వెల్లివిరుస్తూంది.

**కెనడాలో ఇంగ్లీష్ సాహిత్యం :** అమెరికా ఖండం లోని కెనడా దేశంలో స్థిర నివాస మేర్పరచుకొన్న ఇంగ్లీష్ వారు అక్కడ సృష్టించిన ఇంగ్లీష్ సాహిత్యాన్ని కెనడా ఇంగ్లీష్ సాహిత్యం అని వ్యవహరిస్తున్నారు. ఆదిలో అది ఇంగ్లీష్ సాహిత్యంలోని బహు శాఖలలో ఒకటిగానే ఆరంభమై క్రమేపీ స్వయం వ్యక్తిత్వం సముపార్జించిందని చెప్పవచ్చును. కెనడాలో వివిధ రాష్ట్రాల వ్యవస్థాపనకు ముందు వెలువడిన పుస్తకాలలో రచయితలు కెనడా దేశ విశిష్టతను గురించి వ్రాయక, తాము వీడివచ్చిన మాతృదేశం ఇంగ్లండు మీదనే ఎక్కువ మమకారాన్ని ప్రకటించారు. ఇలాంటి రచనలకు సుసానా మూడి స్వీయచరిత్ర చక్కని ఉదాహరణ. నాటి రచనలలో - ముఖ్యంగా థామస్ హాలిబర్టన్ వ్రాసిన *ది క్లాక్ మేకర్* అనే హాస్య కథలలో కథానాయకుడైన శామ్‌స్లిక్ మాటలూ, చేతలూ పాఠకులకు వినోదం కలిగించాయి. చార్లెస్ హెవీ సేజ్ పద్య నాటకాలకు కొంత కాలం చాలా ప్రజాదరణ లభించింది. కెనడా దేశంలో వెలువడ్డ ప్రథమ సాహిత్య పత్రిక *ది లిటరరీ గార్లెండ్* 1838 మొదలు 1951 వరకు మాంట్రియల్ నుంచి ప్రకటించబడింది.

1867 లో రాష్ట్ర వ్యవస్థాపన జరిగిన తరువాత క్రొత్త నగరాలు, విశ్వ విద్యాలయాలు స్థాపించబడ డంతో సాహిత్య రంగంలో కూడా నూతన చైతన్యం వెల్లివిరిసింది. కవులు అనేకులు 19 వ శతాబ్ది చివర తమ మధుర గీతాలాపాలతో కెనడా ఇంగ్లీష్ సాహిత్యాన్ని రస సంపన్నం చేశారు. వారందరూ కెనడా ప్రకృతి సౌందర్యాన్ని అభివర్ణించి ఆరాధించారు. ఇంగ్లీష్ సాహిత్య క్షేత్రంలో ఉదయించిన కాల్పనికోద్యమ ప్రభావం కెనడా ఇంగ్లీష్ కవితలో కూడా స్పష్టంగా కనిపించింది. నాటి కవులలో ఇజాబెలా, వాలెన్సీ, క్రాఫర్డ్, చార్లెస్ రాబర్ట్స్, ఆర్చిబాల్డ్ లాంప్‌మన్, డంకన్ కాంబెల్ స్కాట్, బ్లిస్ కార్మన్ వైవిధ్యంతో కూడిన మనోహరమైన కవితలు రచించారు. ఇక 20 వ శతాబ్దిలో కూడా పాలీన్ జాన్సన్, విల్‌ఫ్రెడ్ కాంబెల్, జాన్‌మెక్ క్రే వంటి కవులు ధ్యేయ కవితా మార్గాన్ని అనుసరించారు. రాబర్ట్ సర్వీస్ కావ్యాలలో ద్రుతగతి స్ఫోరకమైన నూతన గేయ ఫణితి గోచరిస్తుంది.

*వకొష్టా, ది కెనేడియన్ బ్రదర్స్* అనే చారిత్రక నవలలతో జాన్ రిచర్డ్‌సన్ 1840 ప్రాంతంలోనే నవలా రచనకు మార్గదర్శకు డయాడు. కాని వాస్తవానికి కెనడా ఇంగ్లీష్ సాహిత్యంలో నవలా రచన 20 వ శతాబ్ది లోనే ఫలప్రద మైంది. అక్కడ అటవీప్రాంతాల సీమా సమాజం లోని ప్రజల స్థితి గతులను చిత్రిస్తూ రాల్ఫ్ కానర్ దాదాపు 40 నవలలు వ్రాశాడు. స్టీఫెన్ లీకాక్ అనే ప్రసిద్ధ హాస్యరచయిత *లిటరరీ లాప్సెస్, నాన్ సెన్స్ నావెల్స్, సన్ షైన్ స్కెచెస్* వంటి వ్యంగ్య హాస్య రచన లతో అంతర్జాతీయ ప్రఖ్యాతి పొందాడు. విలియం కర్బీ, సర్ గిల్బర్ట్ పార్కర్, ఎల్.ఎమ్.మాం ట్‌గామరీ, మార్షల్ సాండర్స్, ఎర్నెస్టీ థామ్సన్,సీటన్ ప్రభృతులు చక్కని కథలను, నవలలను సృష్టించారు.

మొదటి ప్రపంచ సంగ్రామం ముగిసిన తరువాత కెనడా-ఇంగ్లీష్ సాహిత్యం అతి వేగంగా విస్తరించింది. కవిత్వ రచనను ప్రోత్సహించే లఘు పత్రికలు వెలశాయి. నవలలు విరివిగా బయలుదేరాయి. ఈ.జె.ప్రాట్ కొన్ని వీరగాథా కావ్యాలను, రసవంతమైన భావగీతాలను రచిం చాడు. ఏ.ఎమ్. క్లెయిన్, ఎఫ్. ఆర్. స్కాట్, ఏ.జె.ఎమ్. స్మిత్, లియో కెనెడి, ఎల్.ఏ.న్యాకే, పీ.కె. పేచ్ వంటి యువ కవులు సాంఘిక సమస్యలను చిత్రిస్తూ రచనా విధానంలో నవ్యతను ప్రకటించే కావ్యాలు వ్రాశారు. డొరేతి, లైపేస్ ఆన్ మార్రిట్, ఆడ్రే బ్రౌన్ అనే కవయిత్రులు సుకుమార భావ చిత్రణ లోను, ఎర్ల్ బిర్నే కథన శిల్పం లోను నైపుణ్యం ప్రదర్శించారు.

మేజో డీలా రోషే అనే రచయిత్రి అంటార్యో రాష్ట్రంలో స్థిరపడిన ఒక కుటుంబపు చరిత్రను వరుసగా కొన్ని నవలలలో చిత్రించింది. ఈ నవలలు చాలా ప్రసిద్ధి పొందాయి. కెనడాలోని పంట పొలాలలో కర్షకుల జీవితం ఫ్రెడరిక్ గ్రోవ్ నవలలలోను, నోవా స్కోషియా రాష్ట్రంలోని ప్రజాజీవితం టామస్ రడ్డాల్ నవలలలోనూ చక్కగా చిత్రించబడ్డాయి. అలాగే డబ్ల్యు.ఓ. మిచల్ కథలలో సాస్కచివాన్ ప్రాంత దృశ్యాలు కనిపిస్తాయి. శ్వేతజాతివారికీ నీగ్రోలకు మధ్య గల అంతరాన్నీ, ఆ రెండు జాతుల మధ్యా సంఘర్షణనూ నీగ్వో థాలెన్ గ్రాహమ్ వ్రాసిన *ఎర్త్ అండ్ హైహెవెన్* అనే నవల మిక్కిలి అవగాహనతో చిత్రించింది. కెనడా నాగరక జీవితం మోర్లే కాలఘన్ రచించిన *ది లౌడ్ అండ్ ది లాస్ట్* అనే నవలలో అభి వర్ణితమైంది. నేటి నవలా రచయితలలో క్యూమెక్లెనన్ అగ్రగణ్యుడు. *బరోమీటర్*

*రైజింగ్, టు సాలిట్యూడ్స్* అనే నవలలలో అత డక్కడి సాంఘిక పరిస్థితులను అతి వాస్తవికంగా చిత్రించాడు. మార్గరేట్ లారెన్స్ వ్రాసిన *జెస్ట్ ఆఫ్ గాడ్* లో ప్రయరీ పట్టణ ప్రజల జీవితాన్నీ, మార్గరేట్ ఆటివుడ్ *సర్ ఫేసింగ్, సర్వైవల్* మొదలైన నవలలలో మహిళా జాగృతికి సంబంధించిన సమస్యలను, మార్దెకాయ్ రిక్లర్ *ది అప్రంటిస్‌షిప్ ఆఫ్ డడ్డీ క్రోవిట్, ది ఇన్‌కంపే రబుల్ అటాక్* అనే వ్యంగ్య గర్భిత హాస్య నవలలలో యూదు సమాజపు వైరుధ్యాలను, బ్రియాన్ మోన్ *ది ఓన్లీ పేషన్ ఆఫ్ జూడిత్ హోర్నే, ది లక్ ఆఫ్ జింజర్ కాఫీ* అనే రచనలలో నిర్వాసితుల సందిగ్ధ పరిస్థితులను విపులంగా చర్చించారు.

నాటకోత్సవాలు, కెనడా బ్రాడ్‌కాస్టింగ్ కార్పొరేషన్ కార్యక్రమాలు, నాటక రచనకు మంచి ప్రోత్సాహ మిచ్చాయి. రాబర్ట్‌సన్ డేవిస్ రంగస్థల ప్రదర్శనకు తగిన చక్కని వ్యంగ్య హాస్య నాటకాలు వ్రాశారు. మిస్టర్ సింక్లేయర్, జోసెఫ్ స్కల్ రేడియో నాటక రచనలో సిద్ధహస్తులు. ఈ.కె.బ్రౌన్, సి.ఎఫ్ క్లింక్, లార్న్ పియర్స్, డబ్ల్యూ.ఇ. కాలిన్స్, డబ్ల్యువుడ్ కాక్ ప్రభృతులు అత్యుత్తమ స్థాయికి చెందిన సాహిత్య విమర్శకులు. కెనడా ఇంగ్లీష్ సాహిత్యంలో కావ్య సమీక్షా శాస్త్రం బాగా అభివృద్ధి చెందింది. ఈ రంగంలో బాగా పేరు సంపాదించిన విమర్శకులు నార్త్రప్ ఫ్రై (అనాటమీ ఆఫ్ క్రిటిసిజమ్), మార్షల్ మాన్‌లుహార్న్ *ది మెకానికల్ బ్రెయిన్, గూటెకబో గెలాక్సీ* అనే గ్రంథాలను వెలువరించారు.

వ్యాస ప్రక్రియ స్టీఫెన్ లీకాక్ వంటి వారి కృషితో క్రొత్త మలుపులు తిరిగింది. ఈ విధంగా కెనడా ఇంగ్లీష్ రచయితలు తమ సాహిత్యంలో కెనడా ప్రత్యేకతను ప్రతిఫలింప చేయాలని పట్టుదలతో కృషిచేస్తున్నారు.

**కెనడాలో ఫ్రెంచ్ సాహిత్యం :** కెనడా దేశానికి వలస పోయిన ఫ్రెంచ్ ప్రజలలో వర్ధిల్లిన ఫ్రెంచ్ సాహిత్యాన్నే కెనడా ఫ్రెంచ్ సాహిత్యం అని వ్యవహరిస్తున్నారు. గార్నో (1809-66) ఈ సంప్రదాయంలో తొలి రచయిత. *హిస్టొరీ డి కెనడా* అనే పేరుతో అత డొక దేశచరిత్రను వ్రాశాడు. ఫిలిఫ్ డి గాస్కి (1786-1871) అనే రచయిత *లే ఏనిషియన్ కెనడియన్స్* (కెనడా నిర్మాతలు-1863) అనే ఒక నవల వ్రాసి ఆ సాహిత్యంలో నవలా రచనకు అంకురార్పణ చేశాడు. ఇది మొట్టమొదటి నవల కావడమే కాక ఉత్తమ నవలగా కూడా పేరు పొందింది. లూయీ ఫ్రెంచ్చట్ (1839-1902) అనే రచయిత తన కావ్యాల ద్వారా ఫ్రాన్స్ దేశంలో కూడా ఉత్తమ కవిగా పేరుపొందాడు. విక్టర్ హ్యూగో ప్రభావం ఇతనిమీద ఎక్కువగా కనిపిస్తుంది. కెనడా ఫ్రెంచ్ సాహిత్యంలోని గేయరచనలో అతనికి సమానులు అరుదు. కెనడా ఫ్రెంచ్ సాహిత్యంలోని ఆధునిక యుగం చార్లెస్ గిల్ (1871-1918) అనే రచయితతో ఆరంభమైనట్లు భావింపవచ్చును. *క్రాస్ట్రినిటీ* అనే పేరుతో ఇతడు రచించిన పద్యకావ్యం పద్యరచనలోనే కాక భావప్రకటనలో కూడా ఒక నూతన మార్గాన్ని అనుసరించింది. 19 వ శతాబ్ది చివర లాజో నెల్లిగాన్, మోరిన్, చోపిన్, బ్లాంకీలా మెంటీల్ అనే ప్రముఖ రచయితలు వెలశారు. 20 వ శతాబ్దంలో నవలా రచనకు విస్తృతంగా ఆదరణ లభించింది. హీమాన్ అనే రచయిత వ్రాసిన *మేరియా చాప్ డీలీన్* అనే గ్రంథం ఒక నూతన భావ విప్లవానికి దోహదకారి అయింది. గేబ్రియల్ రాయ్ *ది టిన్ ఫ్లూట్, ది కాషియర్* మొదలైన నవలలలో సమాజంలో సామాన్య మానవుని మనఃప్రవృత్తులకు అద్దం పట్టిన ప్రతిభావంతురాలైన రచయిత్రి.

డి.వి.కె.రా.(బొ.శ్రీ.,అ.రా.కృ.)

# దక్షిణ అమెరికా సాహిత్యాలు

## అర్జంటీనా సాహిత్యం

అర్జంటీనాలో ప్రజలు మాట్లాడే భాష స్పానిష్ భాష. ఈ దేశం స్పానిష్ వలస రాజ్యంగా ఉన్నప్పుడే ఇక్కడ మొదటి విశ్వవిద్యాలయం స్థాపించబడింది; తొలి ముద్రణ యంత్రాలు దిగుమతి అయాయి. నిజానికి ఆ నాడే అర్జంటినా స్వతంత్ర సాంస్కృతిక జీవితానికి అంకురార్పణ జరిగింది. అయినా 1810 నాటి విప్లవోద్యమం వల్ల దేశం స్వతంత్ర ప్రతిపత్తి పొంది, ఒక ప్రత్యేక జాతిగా ఏర్పడిన తరువాత గాని ఆ సంస్కృతికి ఒక విస్పష్ట రూపం ఏర్పడలేదు. ఆ నాటి నుంచి అర్జంటీనాలో వెలసిన స్పానిష్ సాహిత్యం అర్జంటీనా ప్రత్యేక జాతీయ లక్షణాలతో కూడి ఉండడం చేత స్పానిష్ సాహిత్యంలో

ఒక భాగంగా కాక, ప్రత్యేకమైన అర్జంటీనా సాహిత్యంగా వ్యవహరించ బడుతూంది.




అర్జంటీనా

ఫ్రెంచ్ విప్లవ భావాలతో ఉత్తేజితులైన అర్జంటీనా మేధావి వర్గానికి అర్జంటీనా విప్లవం ఎంతో ఋణపడి ఉంది. మొదటి విప్లవకూటానికి కార్యదర్శి అయిన మారియానో మోరెనో (1779-1811) మహా మేధావి. విప్లవసేనల సేనాని మాన్యువల్ బెల్‌గ్రానో (1770-1839) ఒక గణిత శాస్త్ర పాఠశాలను స్థాపించాడు. ఆయన మొరెనోతోను, ఇతరులతోను కలసి, ఆ వలస రాజ్యంలో ప్రబలంగా ఉన్న మతవిద్యా శిక్షణను ఎదిరించి ఆధునిక విజ్ఞాన శాస్త్రాల బోధన ద్వారాను, ఆర్థిక రంగంలో మరింత ఉదార విధానాలు అవలంబించడం ద్వారాను అర్జంటీనా దేశాన్ని ఆధునికీ కరించాలని ప్రయత్నించారు. స్వాతంత్ర్య సంగ్రామానంతరం (1826-27) అధ్యక్షుడుగా ఉండిన బెర్నార్డినో రివడేవియా యూనివర్సిటీ స్థాయి దాకా ఉచిత విద్యా బోధనను ప్రవేశపెట్టి అర్జంటీనా సాంస్కృతి కోద్యమానికి గొప్ప దోహదం చేశాడు. కాని ఆయన ప్రయత్నాలు ఫలోన్ముఖం కాకమునుపే దేశంలో మళ్లీ కల్లోల పరిస్థితులు ఏర్పడ్డాయి. అయినా ప్రతిభా శాలులైన కొందరు యువకులు తమ విశిష్ట శక్తులను ప్రదర్శింప సాగారు. 1832 నుంచి 1852 వరకు సుదీర్ఘకాలం కొనసాగిన యువాన్ మాన్యువల్ ద రోసాస్ నియంతృత్వ పాలనలో ఒక క్రొత్త తరం మేధావులు వెలశారు. అయితే రోసాస్ నియంతృత్వ పాలనలో ఇంచుమించు ఈ మేధావు లందరూ విదేశాలకు వలస పోవలసి వచ్చింది. అలాంటి వారిలో ప్రధానుడు ఎస్టిబాన్ ఎకెవెరియా (1805-1851). తన 20 వ ఏట అతడు సార్‌బాన్‌లో విద్యాభ్యాసం చేయడానికి పారిస్ వెళ్లాడు. అక్కడనుంచి బ్యూనస్ ఐర్స్‌కి తిరిగి వచ్చిన తరువాత అతడు 1837 లో 'మే సొసైటీ' స్థాపించాడు. *లాకాటివా* అనే ఒక సుదీర్ఘమైన ప్రణయ గీతం అతడు వ్రాశాడు. రోసాస్ నియంత తాలూకు సైనికుల చేతులలో దారుణ హింసకు గురిఅయి, చివరకు హత్య కావించబడిన ఒక యువకుని యథార్థ గాథను చిత్రిస్తూ అతడు వ్రాసిన *ఎల్ మాటెడెరో* శక్తిమంతమైన నవల.

'మే సొసైటీ'లో మరొక ప్రముఖ సభ్యుడు న్యాయ సిద్ధాంత వేత్త అయిన బౌటిస్టా అల్బెర్డీ (1810- 1884) తన జీవిత కాలంలో ఎక్కువ భాగం ఆయన పరిసరాల లోని దక్షిణ అమెరికన్ దేశాలలో గడిపాడు. రోసాస్ నియంత పతనం చెందిన తరువాత అల్బెర్డీ *బేసెస్ యి పుంటోస్ డి పార్టి డ పర లా కాన్‌స్టిట్యూషన్ డి లా నేషన్ అర్జెంటీనా* అనే రాజ్యాంగ ప్రాథమిక సూత్రాలకు సంబంధించిన ఒక గ్రంథం వ్రాశాడు. దానిలో అమెరికా సంయుక్త రాష్ట్రాల రాజ్యాంగాన్ని అర్జెంటీనా ప్రజల ఖాదర్శాలకు అనుగుణంగా సవరించి తమ దేశపు రాజ్యాంగ శాసనానికి ఒక ప్రాతిపదికను తయారు చేశాడు. అనంతరం 1853 లో అర్జెంటీనా రాజ్యాంగ శాసనం రూపొందించేటప్పుడు కొద్ది మార్పులతో దానినే స్వీకరించడం జరిగింది. రెండు అమెరికా ఖండాలలోను న్యాయశాస్త్ర ప్రాతిపదికల నిర్మాతలలో ఒకడుగా అల్బెర్డీ ప్రసిద్ధి పొందాడు. *ఎల్‌క్రిమెన్ డిలాగెర్రా* (The Crime of the war- యుద్ధాపరాధం) అనేపేరుతో ఆయన వ్రాసిన గ్రంథం ఈ నాటికీ ప్రామాణికమైన రచనగా భావించబడుతూంది.

డొమింగో ఫాస్టినో సార్మియెంటో (1811-1888) అర్జెంటీనా సాంస్కృతిక జీవిత రంగంలో అత్యంత ప్రముఖ వ్యక్తి. రోసాస్ నియంతను ఎదిరించినవారిలో ఆయన కూడా ఒకడు. అతి సామాన్యమైన స్థితినుంచి ఆ కాలం నాటి మహా విద్వాంసులలో ఒకడుగా ఆయన ఎదిగాడు. రోసాస్ నియంత పతనానంతరం ఆయనను వాషింగ్టన్‌లో అర్జెంటీనా రాయబారిగా నియమించారు. అమెరికన్ సంయుక్త రాష్ట్రాలలోని జీవిత విధానం పట్ల అత్యంత గౌరవాభిమానాలు ఆయనకు ఏర్పడ్డాయి. అప్పటికే (1845) ఆయన *ఫాకండో* (నియంతలపాలనలో అర్జెంటీన్ రిపబ్లిక్‌లో జీవన సరళి) అనే ఉద్

గ్రంథం వ్రాశాడు. దానిలో పరమ కిరాతకుడైన స్థానిక సేనాని 'యునాన్ ఫాకండో క్విరోగా' పాత్రను ఆయన చిత్రించాడు. ఆ పుస్తకానికి మరో పేరు *నాగరకతా? కిరాతకత్వమా?.* 1868 లో సార్మియెంటోను వాషింగ్టన్ నుంచి రప్పించి ఆర్జెంటీనాకు అధ్యక్షుణ్ణి చేశారు. తన హయాంలో ఆయన దేశం అంతటా పాఠశాలలు నెలకొల్పి 19 వ శతాబ్దం ఆఖరుకి ఆర్జెంటీనాలో నిరక్షరాస్యతను పూర్తిగా రూపు మాప గలిగాడు.

ఆర్జెంటీనా సాంస్కృతిక రంగంలో మరో మహనీయుడు: జోస్ హెర్నాండెజ్ (1834-1886). ఆయన *మార్టిన్ ఫీరో* (Martin fierro) అనే ఒక మహా కావ్యం వ్రాశాడు. గ్రీక్‌జాతిని అర్థం చేసుకోవాలంటే హోమర్‌గ్రంథాలు చదవడం ఎంత అవసరమో ఆర్జంటీనా సాంస్కృతిక వ్యక్తిత్వాన్ని అర్థం చేసుకోడానికి ఈ మహాకావ్యం చదవడం అంత ముఖ్యం. 'గాచో' (పంపా) లు అనబడే పశుపాలకుల మధ్య హెర్నాండెజ్ పెరిగాడు. వారి అభ్యుదయానికే ఆయన జీవితం ధారపోశాడు.

మార్టిన్ ఫీరో అనే నిజాయితీపరుడైన, వెలివేయబడిన ఒక గౌచో (పశువుల కాపరి-రైతు) ఎదుర్కోవలసి వచ్చిన దురదృష్టాలను వర్ణిస్తూ హెర్నాండెజ్ ఆర్జంటీనాలో ఆ నాడు ఒక గ్రామీణ కార్మికుడు తాను సాగుచేసే భూమి మీద తనకు ఎలాంటి హక్కూ లేక, నగరం నుంచి వచ్చిన దురాక్రమణదారుల చేతిలో ఎలా బాధలు పడేవాడో కళ్లకు కట్టినట్లు వర్ణించాడు. ఆ సంర్భంలో కవి సంఘ న్యాయ పరిధులను అధిగమించి విశ్వజనీనంగా వివేకం, న్యాయం అనాదిగా ఎదుర్కొనవలసి వస్తున్న సంఘర్షణలను గూర్చి అతి ఆవేశంతో గానం చేశాడు. మార్టిన్ ఫీరో ఆర్జెంటీనా దేశస్థులకు జాతీయ బైబిల్ అయింది. దానిలో ఓదార్పు, మనోదార్ఢ్యం, ప్రబోధం వారికి లభించాయి.

లియోపాల్డో లూగోనీస్ (1874-1938) తో అర్జెంటీనా సాహిత్య చరిత్రలో ఒక నూతన శకం ఆరంభమైంది. మోడర్నిస్మో అనే పేరుతో ఆరంభమైన సాహిత్యోద్యమ నాయకులలో ఆయన ఒకడు. ఈ ఉద్యమాన్ని ప్రారంభించిన వాడు నికరాగ్వా దేశపు కవి రూబెన్ డేరియో. గ్రీక్ సాహిత్యం కూడా బాగా అధ్యయనం చేసిన లూగోనీస్ ప్రభావం ఆధునిక ఆర్జెంటీనా సాహిత్యం మీద అత్యధికంగా కనిపిస్తుంది. ఆయనకు బలమైన విరోధులూ ఉన్నారు; ఆరాధించే అనుయాయులూ ఉన్నారు.

మోడర్నిస్మో ఉద్యమం నుంచి విడిపోయిన రచయితలలో కూడా కొందరు ప్రముఖులు ఉన్నారు. వారిలో రికార్డో గైరాల్డీస్ (1880-1927) ఒకడు. ఆయన రచించిన నవల *డాన్ సెగుండో సోంబ్రాలో* 'గౌచో' జీవితం గడుపుతూ ఒకబాలుడు పరిణతి సాధించడం వర్ణించబడుతుంది. జార్జ్ లూయిస్ బోర్జెస్ మరి ఒకడు. ఆయన అనేక పద్య కావ్యాలూ, గద్య కావ్యాలూ వ్రాసి, 20 వ శతాబ్దిలో అత్యంత ప్రముఖుడైన ఆర్జెంటీనా రచయితగా విఖ్యాతి పొందాడు. ఆయన రచనలలో *ఫిక్కియోనీస్* వంటి ఉద్గ్రంథాలు పేర్కొనదగినవి. లియో పాల్డో మారెచల్ కవిగానే ఎక్కువ ప్రసిద్ధుడైనా ఆయన జాయిస్ (James Joyce) పద్ధతిలో నగరజీవితాన్ని వర్ణిస్తూ వ్రాసిన నవల *ఎడాన్ బ్యూనస్‌ఆయర్స్* చాలా గొప్ప నవల. జూలియో కార్టజార్ వంటి క్రొత్తతరం రచయితల మీద ఆయన ప్రభావం చాలా ఎక్కువగా పడింది. కార్టజార్ వ్రాసిన తాత్త్విక రచన *హాప్ స్కాచ్* వల్ల 1960-70 దశాబ్దిలోని ప్రముఖ రచయితలలో ఆయన ఒకడు అయ్యాడు.

**నాటక రచన :** ఆర్జెంటీనాలో ప్రసిద్ధి పొందిన తొలి నాటక రచయితలు గ్రెగోరియో డీ లా పెరీర్ (1867-1913), రాబెర్టో పెయిరో (1867-1928) లు. అయితే, అందరిలోను ప్రముఖ నాటక రచయిత ఫ్లోరెన్సియో సాంచెజ్ (1873-1909). ఈయన ఉరుగ్వే దేశం వాడైన బ్యూనస్ ఆయర్స్ నగరంలో స్థిరపడి రచనలు చేశాడు. ఆయన వ్రాసిన నాటకాలు ఆర్జెంటీనాలో కార్మికవర్గం, పెటీ బూర్జువా వర్గాల జీవితాలను చిత్రిస్తూ ప్రపంచ ప్రసిద్ధమైన గొప్ప నాటకాల స్థాయిని అందుకున్నాయి.

అగస్టిన్ కుజ్జానీ, ఓస్వాల్డ్ డ్రాగున్, ఓమర్ డెల్ కార్లో వంటి నాటక రచయితల నాటకాలు కూడా ప్రదర్శించ బడుతున్నా, వారెవరూ 'సాంచెజ్' స్థాయిని అందుకున్నవారు కారు.

ఆర్జెంటీనా సాహిత్యం శ్పానిష్ భాషలోనే వెలువడుతున్నా విశిష్ట జాతీయ లక్షణాలను ప్రదర్శిస్తూ అది శ్పానిష్ సాహిత్యం కన్న విలక్షణమైన ప్రత్యేక సాహిత్యంగా గుర్తింపు పొందింది.

బొ.శ్రీ.

## కరీబియన్ సాహిత్యం

కరీబియన్ సముద్ర ద్వీప సముదాయంలో వెలువడిన రచనలు ముఖ్యంగా ఇంగ్లీష్ వారి వలసపాలనలో సంక్రమించిన అనుభూతుల ప్రేరణతో రచింపబడ్డాయి. భూస్వామ్య విధానం, చెరకు పంట, చక్కర ఉత్పత్తి ఆధారంగా గల వాణిజ్య వ్యవస్థ అనే సాధనంతో సాగిన

శ్వేతజాతుల సంస్కృతి ఆదిమ జాతుల నిర్మూలనానికి, ఆఫ్రికా జాతుల బానిసత్వానికి, ఆసియా వాసుల శ్రామిక ప్రవాసానికి, తత్ఫలితంగా సంకీర్ణ సమాజపు అంతర్గత వైరుధ్యాలకు, సంఘర్షణలకు దారితీసింది. ఈ చారిత్రక వైవిధ్యంలోను, భిన్నత్వంలోను ఏకత్వాన్ని ప్రతిపాదించే అంతస్సూత్రాన్ని అన్వేషించే మనస్తత్త్వం, భావుకత, విచికిత్స కరీబియన్ సాహిత్యానికి ఆలంబనాలు అయాయి. 18వ శతాబ్దంలో అనుకరణతో ఆరంభమై, 19వ శతాబ్దంలో కాల్పనికోద్యమ ఛాయలో పెరిగిన కరీబియన్ దీవులలోని ఇంగ్లీష్ రచనా ప్రక్రియలో స్థానిక విశిష్ట సంస్కృతిలక్షణాలు ప్రస్ఫుటంగా అభివ్యక్తి పొందలేక పోయాయి.

19 వ శతాబ్దం మధ్యకాలంలో బానిసత్వ వ్యవస్థ రద్దయిన తరువాత స్వతంత్రమైన ఆలోచనా ధోరణి ఏర్పడి ప్రాదేశిక, స్థానిక లక్షణాలతో కూడిన కవితలు, కథలు, గాథలు వెలువడసాగాయి. దేశీయ జానపద కల్పనలతో పాటు మాండలిక భాషల లోని నుడికారాలు, ప్రయోగాలు ఇంగ్లీష్ భాషలో ప్రవేశించి దానికి నూతన ధ్యేయాన్ని, భావనా పటుత్వాన్ని చేకూర్చాయి. 1930 నాటికి రాజకీయ చైతన్యం, బౌద్ధిక జాగృతి, సామాజిక స్పృహ, సాంస్కృతిక స్పందన మిళితమై ఒక సాహిత్యోద్యమం ఆరంభమైంది. ట్రినిడాడ్, జమైకా, బార్బడోస్, గయానా ప్రాంతాలలో నెలకొన్న లఘు పత్రికలు ఈ ఉద్యమానికి దోహదం చేశాయి. అశ్వేత జాతుల నవ వైతాళికులుగా బడుగు వర్గాల ప్రతినిధులుగా విప్లవ శంఖారావం పూరిస్తూ రచయితలు రచనలు చేయసాగారు. *బిమ్, ఫోకస్, కైరోవెరాల్* మొదలైన సాహిత్య పత్రికలు ఈ క్రొత్త తరపు కవులకు, కథకులకు, వ్యాస కర్తలకు వేదికలు అయాయి.

సి.ఎల్.ఆర్. జేమ్స్, ఎడ్గార్ మిట్టెల్ హోల్ జర్, మార్కస్ గార్వే మొదలైన రచయితలు విశిష్టమైన కరీబియన్ సాహిత్య సృష్టికి పునాదులు వేశారు. రెండవ ప్రపంచ సంగ్రామం తరువాత రాజకీయ, ఆర్థిక, సామాజిక విద్యా రంగాలలో కలిగిన మార్పుల వలన సాహిత్య వ్యాసంగానికి క్రొత్త స్ఫూర్తి ఏర్పడింది. జార్జ్ లామింగ్ వ్రాసిన *ఇన్ ది కాసిల్ ఆఫ్ మెస్కిన్, ది ఎమిగ్రెంట్స్, సీసన్ ఆఫ్ ఎడ్వెంచర్, ప్లెజర్స్ ఆఫ్ ఎక్సైల్* వంటి రచనలలో నల్లజాతి వారి చారిత్రక ప్రవాసం, దాస్య వ్యవస్థలో వా రనుభవించిన న్యూనత, శోషణ, దారిద్ర్యం, దైన్యం ఒకవైపున, మరోవైపున ఆ సమాజంలో తొంగి చూసే జీవకళ, భావుకత, స్వాప్నికత, జానపదకళావైభవం ప్రతిఫలించాయి. సామ్ సెల్వన్ రచించిన *ఏ బ్రైటర్ సన్, ది లోన్లీ లండనర్స్, టర్న్ ఎగైన్ టైగర్* మొదలైన నవలలలో కరీబియన్ సమాజంలో ఇండియా, ఆఫ్రికా, యూరపియన్ జాతుల మిశ్రమ సభ్యతా వ్యవస్థలతోను, వ్యక్తులతోను గల సంబంధ బాంధవ్యాలు, సంఘర్షణలు చిత్రించబడ్డాయి. వి.ఎస్. నయిపాల్ ప్రవాస భారతీయ సమాజంలో తనకు గలిగిన అనుభవాలను హాస్యం, వ్యంగ్యం, వేదనా, విషాదం కలబోసి *ది మిస్టిక్ మాస్యూర్, ఏ హౌస్ ఫర్ మిస్టర్ బిశ్వాస్, ది మిమిక్ మెన్* మొదలయిన నవలలలో అత్యంత ప్రతిభావంతంగా చిత్రించాడు. నీగ్రో జీవనాన్ని ఇదే విధమైన సామాజిక స్పృహతో *బ్రదర్ మాన్, ది హిల్స్ వర్ జాయ్‌ఫుల్ టుగెదర్* అనే నవలలో రోజర్ మాయిస్ వ్యక్తం చేశాడు. విల్సన్ హారిస్ *పాలెస్ ఆఫ్ ది పీకాక్, ది సీక్రెట్ లాడర్* మొదలైన నవలలలో ప్రకృతికి, సభ్యతకు గల నిగూఢ సామరస్యం ప్రాతిపదికగా భూత భవిష్యద్ వర్తమాన కాలాలు సంగమించే ఆధ్యాత్మిక నేపథ్యాన్ని భావనచేసి మానవుని వైశిష్ట్యాన్ని నిరూపించాడు. ఎడ్వర్డ్ బ్రాత్‌లైట్ *రైట్స్ ఆఫ్ పాసేజ్, ఐలెండ్స్* అనే కావ్యాలలో కరీబియన్ సంస్కృతికి చిహ్నమైన కాలిప్సో సంగీతపు ఛాయలను, మిశ్రమ ఇంగ్లీష్ భాషలోని నుడికారాలను ప్రయోగిస్తూ ఆ శ్వేత జాతుల ఆక్రందనలను, అభిలాషలను అభివర్ణించాడు. డెరెక్ వాల్కాట్ *రూయిన్స్ ఆఫ్ ఏ గ్రేట్ హౌస్, ఏ కేర్‌ఫ్రీ ఫాషన్, ఏ లెటర్ ఫ్రమ్ బ్రూక్లిన్* మొదలైన కవితలలో కరీబియన్ మానవుని అంతరంగంలో చెలరేగే సంక్షోభాన్నీ, భావోన్మీలనాన్ని సానుభూతితో పరిశీలించి చారిత్రక స్మృతులకు, వర్తమాన స్థితిగతులకు మధ్య వారధిగా నిలువ గల ఆధునిక కావ్య భాషను రూపొందించాడు. ఎరోల్ జాన్ *ఏ మూన్ ఆన్ ది రెయిన్‌బో షాల్* అనే నాటకంలో కరీబియన్ మిశ్రమ సమాజంలోని జీవన ధోరణులకు వాస్తవమైన ప్రతిబింబాన్ని అందజేశారు. ఈ విధంగా కరీబియన్ రచనలు అసమానమైన జీవశక్తితో, భావనా సంపదతో, శిల్ప వైశిష్ట్యంతో అలరారుతూ ఇంగ్లీష్ కామన్‌వెల్త్ సాహిత్యంలో ప్రముఖ స్థానం వహిస్తున్నాయి.

డి.వి.కె.రా.

## లాటిన్ అమెరికన్ సాహిత్యం

పశ్చిమార్ధ గోళంలోని దక్షిణమెరికాలో స్పానిష్ భాష మాట్లాడే వివిధ దేశాలలోనూ, పోర్చుగీస్ భాష మాట్లాడే బ్రెజిల్ దేశంలోనూ ఉత్పన్నమైన సాహిత్యాన్ని అంతటినీ కలిపి 'లాటిన్ అమెరికన్ సాహిత్యం' అంటున్నారు.

శ్పానిష్ విజేతలకు దక్షిణ అమెరికాలో ఎదురైన ఎఱ్ఱ ఇండియన్ జాతీయుల రచనలు కూడా లాటిన్ అమెరికన్ సాహిత్యంలో భాగంగానే పరిగణించ బడుతున్నాయి.

లాటిన్ అమెరికన్ సాహిత్యంలోని తొలి రచనలలో సైనికుల రిపోర్టులూ, నూతన ఖండం ఆవిష్కరణలోను, విజయంలోను, వలస రాజ్య స్థాపనలోను పాల్గొన్న చారిత్రకుల రచనలూ ముఖ్యమైనవి. అలాంటి ప్రత్యక్ష కథనాలలో ప్రముఖ మైనవి: హెర్నాన్ కార్టీస్, బెర్నల్ డియాజ్, డెల్ కాస్టిలోల మెక్సికో విజయాన్ని గురించిన విస్పష్టమైన, మనోహరమైన వర్ణనలు. పునరుజ్జీవనోద్యమానికి ప్రతిధ్వనిగా శ్పానిష్ సైనికు లెందరో తమ వీర కృత్యాలనూ, సాహస యాత్రలనూ వర్ణిస్తూ మహా కావ్యాలు వ్రాశారు. ఈ రకం కావ్యాలలో తలమానికమైంది: ఆలోన్సో డి ఎర్సిలా-ఇ-జూనిగా వ్రాసిన *లా అరౌకానా* (1569-89). శ్పానిష్ వారికీ, చిలీ దేశంలోని అరౌకానియన్ ఇండియన్‌లకూ మధ్య జరిగిన యుద్ధాన్ని కన్నులకు కట్టినట్లు వర్ణించే ఒక మనోహరమైన చారిత్రక కావ్యం ఇది.

బ్రెజిల్ దేశంలో పోర్చుగీస్ వారు వలస రాజ్యం స్థాపించుకునే సందర్భంలో వెలువడిన సాహిత్యం ఇందుకు భిన్న మైంది. పోర్చుగీస్ ఖండాన్వేషకులూ, మిషనరీలూ, తాము క్రొత్తగా కనుగొన్న భూభాగపు సౌందర్యాన్నీ, విశిష్ట గుణాలనూ ప్రశంసిస్తూ గ్రంథాలు వ్రాశారు.

16 వ 17 వ, శతాబ్దాలలో లాటిన్ అమెరికా లోని వలస రాజ్యాలకు కొంచెం నిలకడ ఏర్పడిన తరువాత యూరప్‌లోని తమ స్వదేశాలలో తల ఎత్తిన సాహిత్య ధోరణుల కన్నిటికీ ప్రతిరూపాలు లాటిన్ అమెరికాలో కూడా కనుపించసాగాయి. మహాకావ్యాన్ని అణగ ద్రొక్కి హేళన కావ్యం (satire), భావ కవిత ప్రాధాన్యంలోకి వచ్చాయి. లాటిన్ అమెరికాలో వచ్చిన భావకవిత్వంలో స్వతంత్రమైన ఆవేశం లోపించి శ్పానిష్ ఆర్భాటపు కవి లూయీ డి గంగోరా ఇ. ఆర్గోటేకు అనుకరణలే ఎక్కువగా వెలువడ సాగాయి. అయితే మెక్సికన్ క్రైస్తవ సన్న్యాసిని సోర్‌జువానా ఐనిష్‌డీ లా క్రజ్ వంటివారు రచించిన కొన్ని కావ్యాలు సరళంగా, మతసంబంధి, లౌకిక ప్రేమలను ప్రతిపాదిస్తూ నిజమైన సాహితీ ప్రతిభను ప్రదర్శించినవి లేకపోలేదు. 18 వ శతాబ్దంలో ఫ్రెంచ్ విప్లవ కాలం నాటి ఆచారాలు, సాహిత్యం, భావ ధోరణులు లాటిన్ అమెరికన్ సాహిత్యం మీద ఎక్కువ ప్రభావాన్ని కనపరచాయి. లాటిన్ అమెరికన్ విప్లవాత్మక యుద్ధాల (1808-24) లో వెల్లివిరిసిన ఆవేశం జూస్ జోక్విన్ ఓల్మెడో, జోస్ మరియా హెరెడియా వంటి వారి దేశభక్త్యాత్మకమైన 'ఓడ్' పద్యాలలోను, వీరకావ్యాలలోను వ్యక్తమైంది.

19 వ శతాబ్ది మధ్యభాగం నాటికి కాల్పనికోద్యమం లాటిన్ అమెరికన్ రిపబ్లిక్ లన్నింటికీ వ్యాపించింది. ఇక్కడి కాల్పనిక కవులు తమ ఇతివృత్తాల కోసం స్థానిక ప్రకృతి దృశ్యాలవైపు, నమూనాలవైపు తమ దృష్టిని మళ్లించారు. ఉదాహరణకు ఆ దేశంలోని ఎఱ్ఱఇండియన్‌లు, వారి పూర్వీకులు, 'పంపా'లు అనబడే గడ్డి బీడులలోని పశువుల కాపరులు (దక్షిణాది మైదానాలలో గుఱ్ఱం ఎక్కి పశువులను కాసేవారు), బ్రెజిల్ ఈశాన్య భాగంలోని 'సెర్టానిజో' అనబడే వారు లాటిన్ అమెరికన్ కాల్పనిక కవులకు చక్కని ఇతివృత్తం సమకూర్చారు. అనంతరపు లాటిన్ అమెరికన్ సాహిత్యంలో కూడా ఈ ఇతివృత్తాలు కొనసాగి, ప్లేట్ నదీ ప్రాంతపు గౌచో సాహిత్యం, బ్రెజిల్ లోని *ఇండియానిస్టా* నవల వంటి విలక్షణమైన లాటిన్ అమెరికన్ సాహిత్యప్రక్రియలకు దోహదం చేశాయి. ఆవిధంగా రూపొందిన మరొక స్థానిక సాహిత్య ప్రక్రియ 'కాస్టమ్ బ్రిస్మో'. సమకాలీన ప్రజా జీవనంలో కనిపించే ఆచారాలను, అలవాట్లను వాస్తవిక పద్ధతిలో చిత్రించే సాహిత్య ప్రక్రియ ఇది. 'కాస్టమ్ బ్రిస్మో' అనే ఈ సాహిత్య ప్రక్రియే అనంతర కాలంలో ప్రకృతి చిత్రణకు బదులు సాంఘిక సమస్యలకు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చే వాస్తవిక నవలగా రూపొందింది.

1880 ప్రాంతంలో లాటిన్ అమెరికాలోని చాలా ప్రాంతాలలో జీవితం విషయంలోను, సాహిత్యం విషయంలోను ఒక నూతన చైతన్యం అభివ్యక్తమై 'ఆధునికతోద్యమం' అనే ఒక క్రొత్త సాహిత్యోద్యమానికి దారి తీసింది. నికరాగ్వా కవి రూవెన్‌డరియో నాయకత్వం క్రింద ఈ ఉద్యమం తారాస్థాయిని అందుకొని 'కళ కళ కోసమే' అనే సిద్ధాంతాన్నీ, సౌందర్యాన్నీ, వైచిత్ర్యాన్నీ, సంస్కారాన్నీ ఆరాధించే సిద్ధాంతాన్నీ ప్రచారం చేసింది.

1910-20 నాటి మెక్సికన్ విప్లవపు దారుణమైన అనుభవాలు లాటిన్ అమెరికన్ రచయితలలో ప్రగాఢమైన సాంఘిక చైతన్యాన్ని మేలుకొలిపాయి. 'ఆధునికతావాదు'ల పలాయన సాహిత్యాన్ని నిరసించి ఎఱ్ఱ ఇండియన్‌లు, నీగ్రోలు, మెస్టిజో (Mestizo) రైతులు, నగరాలలోని కార్మికులు వంటి సామాన్య ప్రజల దుస్థితిని, అవమానాలను వర్ణిస్తూ వారు కాల్పనిక సాహిత్యం సృష్టింప సాగారు. ఈ రకం రచనలలో మరియానో అజువెల రచించిన *లాస్ డి అబాజో* (1915),

జార్జ్ ఇకాజా వ్రాసిన *హువాసి పుంగో* (1934) లు పేర్కొనదగినవి. కవిత్వంలో సీజర్ వాలెజో, పాబ్లో నెరుదా అటు తరువాతి ప్రగతి వాది కవులు సాంఘిక, రాజకీయ ఇతివృత్తాలు స్వీకరించి, సాహసోపేతమైన నూతన అలంకారాలతోను, ఛందోరూపాలతోనూ పద్యాలు వ్రాశారు. నాటక రంగంలో ముఖ్యంగా మెక్సికో, బ్రెజిల్‌లలో 1920-40 మధ్యకాలంలో అతిశయోక్తివాదం (Expressionism) మొదలు 'అసంగత నాటకం' (Theatre of the Absurd) వరకు వచ్చిన వివిధ ఉద్యమాల ప్రభావంతో నూతన ప్రయోగాలు జరిగాయి.

20 వ శతాబ్దం ఉత్తరార్ధంలో లాటిన్ అమెరికన్ సాహిత్యం ఇతివృత్తాలలోను, సంకేతాలలోను మరింత విశ్వజనీన దృష్టిని అలవరచుకొని, పాశ్చాత్య సాహిత్య ప్రధాన స్రవంతిలో విలీనం అయింది. ఆధునిక మానవుడు ఒంటరితనం, తననుండి తనను వేరుచేసే శక్తులు, అస్తిత్వ సంబంధమైన నిరాశ, దౌష్ట్యం మొదలైన వాటికి బలి అవుతున్న సమస్యకు సంబంధించిన తాత్త్వికాన్వేషణకు ఈ సాహిత్యం ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చింది. దీనిలో ప్రస్ఫుటంగా కనిపించిన మరొక లక్షణం మానసిక విశ్లేషణ, వాస్తవ, కల్పనా, స్వాప్నిక సత్యాల మధ్య సంఘర్షణ. జోర్గే లూయి బోర్గే, ఎడువార్డో మలేయా, జూలియో కార్టాజా, గేబ్రియల్ గార్షియా మార్క్వెజ్ వంటి నేటి ప్రముఖ నవలా రచయితలలో ఈ లక్షణాలు మరీ ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి.

బొ.శ్రీ.

# ఆస్ట్రేలియా సాహిత్యాలు

## ఆస్ట్రేలియన్ సాహిత్యం

1788 లో ఇంగ్లీషు వారు ఆస్ట్రేలియాలో స్థిర నివాసం ఏర్పరచుకోక ముందు అక్కడి ఆదిమ వాసుల సంస్కృతిలో విస్తృతమైన మౌఖిక సాహిత్యం నెలకొని



ఆస్ట్రేలియా

ఉండేది. గీత, గానాలతో సనాతన స్వప్నయుగం నాటి వీరులను స్తుతించే గాథలు కొరబొరీ నృత్యాలకు, సాంప్రదాయిక క్రతుసంస్కారాలకు అనుబంధంగా ఉంటూ ఉండేవి. జానపదకవితలు, ఇతిహాసాలు, పౌరాణిక గాథలు పరిసరాల ప్రకృతిని, జంతు పక్షి జాలాన్ని, సృష్టి గాథలను ఇతివృత్తాలుగా చేసికొని శ్రవ్య సాహిత్య సంప్రదాయంలో అనేకం వెలశాయి. సామూహిక చైతన్యంలో నిలిచిపోయిన ఈ సాహిత్య వారసత్వం ఈ నాటికీ ఆస్ట్రేలియన్ రచయితలకు ఉద్దీపనంగా ఉంది. ఆస్ట్రేలియా సాహిత్యానికీ, భౌగోళిక పరిస్థితులకూ అప్పుడు విశిష్టమైన సంబంధం ఉంది. ఒక బృహద్ద్వీపం అని వర్ణించదగిన ఈ ఖండంలో తీర ప్రాంతాలను మినహాయిస్తే తక్కిన భూ భాగం అంతా శూన్య మరుభూమి గాను, పొదలు, తుప్పలు, చిట్టడవులు నిండిన రాకాసి నేల గాను దర్శనమిస్తుంది. ఈ ఖండానికి వలస వచ్చిన మొదటి తరాల వారు జీవిత శిక్ష విధింపబడి ద్వీపాంతర వాసానికి పంపబడిన నేరస్తులు. ఆ తరువాత వచ్చిన వారు భూమ్యాక్రమణ దారులు, ప్రభుత్వాధికారులు, మధ్య తరగతి వృత్తిపరులు. ఇంగ్లండ్‌నుంచి, యూరప్ దేశాల నుంచి వ్యాపారం కోసం, ధనార్జన కోసం అదృష్టాన్ని వెదుక్కుంటూ వచ్చినవారు కొందరు. అనంతర కాలంలో బంగారపు రంది పెల్లుబికిన తరువాత వచ్చిన నవ ధనికవర్గం, పారిశ్రామిక విప్లవ ఫలితంగా వెలసిన పెట్టుబడిదారులు దేశ సహజ సంపదలను, ఉపలబ్ధులను కొల్లగొట్టడానికి పూనుకున్నారు. కాల క్రమేణ ఈ విభిన్న వర్గాల మధ్య సంఘర్షణలు బయలుదేరి భావ సంచలనం చెలరేగడంతో ఆ యుగసంధిలో సాహిత్య సృష్టికి నిజమైన స్పందన ఏర్పడింది.

ఆస్ట్రేలియా లోని ఇంగ్లీషు సాహిత్య వికాస చరిత్రను 3 యుగాలుగా అధ్యయనం చేయవచ్చును. 1788-1880 మధ్య కాలంలో ప్రకృతి వర్ణనలు, నివేదికలు, వ్యవహార పత్రాలు బహుళంగా వెలువడ్డాయి. వీటికి చారిత్రక ప్రాముఖ్యమే గాని సాహిత్య గౌరవం అంతగా లేదు. 1880-1940 మధ్య కాలంలో వెలువడిన రచనలలో కొన్ని ఆ నాటి విక్టోరియన్ రొమాంటిక్ సంప్రదాయాలను అనుసరించి రచింపబడినవి; మరి కొన్ని ఆస్ట్రేలియా లోనే చిగురించిన విశిష్ట భావుకతను ప్రతిబింబించేవి. 1940 మొదలు నేటివరకు - వలసలు, నగరాలు, పరిశ్రమలు విస్తరించిన ఆధునిక యుగ ధర్మాన్ని విశ్లేషించి చిత్రించే విభిన్న సాహిత్య రీతులు ఉత్పన్నమైన మూడవ యుగం. 1973 లో ఆస్ట్రేలియన్ రచయిత పాట్రిక్ వైట్ కు నోబెల్ బహుమతి లభించడంతో ఆస్ట్రేలియన్ సాహిత్యం విశ్వ పరిగణన సంపాదించుకుంది.

మొదటి నూరు సంవత్సరాల కాలంలో అధినివేశ స్థిరీకరణ ప్రక్రియకు సహజమైన జీవితానుభవాలు, సమస్యలు ఆస్ట్రేలియన్ సాహిత్యంలో ప్రాధాన్యం వహించాయి. సీమాంత విస్తరణ, నగర నిర్మాణం, ప్రకృతి వనరుల సాధన, నవ సమాజ పరికల్పన - ఇవి వలస నాగరకత ప్రధాన లక్షణాలు. ఆస్ట్రేలియాకు వలస వచ్చిన తొలి తరాల వారు చిన్న చిన్న నేరాలకు కూడా ప్రవాస శిక్ష విధించబడ్డ నేరస్తులు. వారి అనుభవంలో ఆస్ట్రేలియా ఒక విశాలమైన కారాగారం. ఇదే ప్రతీక జాతి అంతశ్చేతనలో గాఢంగా ముద్రితమై, ఆ తరువాతి కాలంలో వెలువడిన రచనలలో కూడా స్ఫుటంగా కనిపిస్తుంది. నేరస్తులతో పాటుగా వచ్చిన అధికారులు, ఆ తరువాత దిగిన వలస జనులు జీవిత యాత్రలో ప్రాథమిక కార్యకలాపాలలోనే నిమగ్నులై ఉండేవారు. రచనా వ్యాసంగానికి వారికి సమయమే లభించేదికాదు.

రెండవ అర్ధ శతాబ్దిలో జ్ఞాపికలు, డైరీలు, స్వీయ కథలు, ప్రకృతి వర్ణనలు, చెరసాలలలోను, బంగారం గనులలోను పొందిన అనుభవాలు, ఋతుచక్ర పరిభ్రమణంలో ఎదురయ్యే ఎద్దడులు, వెల్లువలు, దావాగ్ని ప్రకోపాలు, చిత్ర విచిత్ర జంతుజాలాల, వృక్ష సంతతుల దృశ్యాలు అపార భూఖండపు శూన్యత, ఒంటరితనం, మరీచికా ప్రహేళికలు-ఇవి ఆ నాడు రచనా సామగ్రిగా రూపొందాయి. హెన్రీ కింగ్స్లీ వ్రాసిన *ది రిక్లైకన్స్ ఆఫ్ జ్యోఫి హామ్లిన్* (1859) లోను, *ది హిల్యార్స్ అండ్ ది బర్టన్స్* (1865) అనే నవలలోను వలస వచ్చిన ఆంగ్లేయ కుటుంబాలు ఈ క్రొత్త ప్రపంచంలో ఏ విధంగా మనుగడ సాగించిందీ వర్ణించబడింది. అపరాధి జన జీవనం చిత్రించిన మార్కస్ క్లార్క్ వ్రాసిన నవల *ఫర్ ది టెర్మ్ ఆఫ్ హిస్ నేచురల్ లైఫ్* (1876) శిక్షాస్మృతిలోని అమానుషత్వాన్ని, జైలు అధికారుల దురాగతాలను, వలస పాలనలోని దుష్టధోరణులను నిశితంగా ఖండించిన ప్రశస్త రచన. రోల్ఫ్ బోల్డర్ వుడ్ వ్రాసిన *రాబర్ట్ అండర్ ఆమ్స్* (1888), *ది మైనర్స్ రైట్* (1890) అనే నవలలలో బంగారం కోసం ఆ రోజులలో జరిగిన అన్వేషణను గురించి, లోభాగపు అడవులలో కొనసాగిన సాహస జీవితాలను గురించి వర్ణించబడింది. కథాకథన చాతుర్యం, సన్నివేశ కల్పనలో నైపుణి, వాతావరణ చిత్రీకరణ ఆ కాలపు నవలలలో ముఖ్యాంశాలు.

వచన రచనలలో జరిగినంత కృషి, వ్యక్తమైనంత ఆత్మవిశ్వాసం కవిత్వ రంగంలో కనిపించలేదు. ఇంగ్లీష్ రొమాంటిక్ కవుల అడుగు జాడలలో ప్రకృతివర్ణన, ధ్యానాత్మక భావుకతతో కూడిన కవితలు ఆస్ట్రేలియాకు అనువర్తింపజేసి రచింపబడ్డాయి. ఆడమ్ లిండ్సే గోర్డన్ ఆస్ట్రేలియాలోనే ఉద్భవించిన జానపద ధోరణిలో *బుష్ బాలెడ్స్ అండ్ గేలపింగ్ రైమ్స్* (1870) లో అశ్విక సమాజపు సాహస కార్యాలకు దీటుగా లయబద్ధమైన గేయాలు రచించాడు.

19 వ శతాబ్దపు చివరి 20 సంవత్సరాల కాలంలో జాతీయతాభావం పెంపొంది, అప్పటికి వేరు వేరు రాష్ట్రాలుగా ఉన్న వలసలు ఒకే సమాఖ్యగా రూపొందే ఉద్యమం బలపడింది. హెన్రీ లాసన్, స్టీల్ రడ్ వ్రాసిన కథానికలలో జాత్యభిమానం, గ్రామీణ జీవనపు విలువలూ, చిన్నభూమి కమతదార్ల పాట్లూ ఇతివృత్తాలుగా కానవస్తాయి. ప్రైస్ వారుంగ్ వ్రాసిన నాలుగు సంపుటాల కథలలో నేరస్తులుగా శిక్ష విధించ బడి ఇంగ్లండ్ నుంచి వెలివేయబడిన ప్రవాసితుల ఇక్కట్లు, సంక్షోభాలు కథావస్తువులుగా రూపొందాయి. 1880 నాటి గ్రామీణ జీవనానికి జోసెఫ్ ఫర్ ఫీ రచించిన నవల *సచ్ ఈస్ లైఫ్* అద్దం పట్టింది. వలస స్టేషన్లలో జీవిత వైఖరులు, గొడ్ల సవారీల సల్లాపాలు, దేశభక్తి భావాలూ, ఆధ్యాత్మిక విషయాలు, మానవ అస్తిత్వ భవితవ్యాలను గూర్చిన చర్చలూ ఈ ప్రసిద్ధ నవలలో నిక్షిప్తమయాయి. (బాలెడ్లు) లాసన్, బాంజో పాటర్సన్ అనే కవులు జానపద గీతాలను ఎన్నింటినో రూపొందించారు.

1901 లో ఏర్పడిన రాష్ట్ర సమాఖ్య ఆస్ట్రేలియా చరిత్రలో ఒక మైలురాయి. సాహిత్యంలో జాతీయ

భావన వచనంలోను, కవితలోను మరింత బలీయంగా గోచరించింది. అయితే దానితో పాటు ఆస్ట్రేలియన్ పరిస్థితులలో జీవన సంశ్లిష్టతను గుర్తించి, సామాన్య జనుల కష్టాలవైపూ, సంఘ సంస్కరణ ఆవశ్యకత వైపూ దృష్టి మళ్ళింది. కాథరిన్ సుసానా ప్రిచర్డ్ 40 ఏళ్ల కాలంలో వ్రాసిన నవలా సముదాయంలో పట్టణాలలోని కార్మికుల స్థితిగతులు ప్రతిబింబించాయి. లూయీ స్టోన్, ఎడ్వర్డ్ డైసన్, కైలీ టినెంట్ అనే వారు కూడా ఈ వర్గపు రచయితలలో ప్రముఖులు. ఆదిమ వాసులకూ, తెల్లజాతి వారికీ మధ్య గల సంబంధాలను ఈనియాస్ గన్, క్సేవియర్ హెర్బర్ట్, కాథరిన్ ప్రిచర్డ్‌లు పరిశీలించారు. చారిత్రక స్పృహ, వలస కాలపు స్థితిగతులూ ఇతివృత్తాలుగా స్వీకరించిన రచయితలు మైల్స్ ఫ్రాంక్లిన్, ఎలియనోర్ జార్క్. నవలలూ, కథానికలూ, సమీక్షలూ వ్రాసి వాన్స్ పామర్ పేరు పొందాడు. హెన్రీ హాండెల్ రిచర్డ్‌సన్ అనే పేరుతో రచనలు చేసిన రచయిత్రి ఎథెల్ ఫ్లారెన్స్. లిండ్‌సే రాబర్ట్‌సన్ స్వీయానుభవ ప్రేరణతో 1917-29 మధ్య తన తండ్రి జీవితం కేంద్రంగా *ది ఫార్ట్యూన్ ఆఫ్ రిచర్డ్ మహోనీ* అనే నవలా త్రయాన్ని వ్రాసి, ప్రవాస జీవనాన్ని, బంగారు గనులలో పనిచేసే వారి స్థితిగతులనూ, పాత్రల మనో వైఖరులనూ అద్భుతంగా వాస్తవికతకు చేరువగా చిత్రించింది. కవిత్వ రచన కూడా వైవిధ్యమూ, నిశిత పరిశీలనా, అభివ్యక్తిరమ్యతా సంతరించుకుంది. జాన్ షా నీల్‌సన్ లలిత మధురమైన గీతాలను, విక్టర్ డాలీ కాల్పనికతతో పాటు వ్యంగ్య హాస్యాలను పొందుపరచిన కవితలను, సి.జె. డెనిస్ జానపద గేయాలను, క్రిష్టఫర్ బ్రెన్నన్ యూరపియన్ సంప్రదాయంలో ప్రతీకాత్మక కావ్యాలను, కెన్నెత్ స్లెసోర్ విశిష్టమైన నాటకీయ ముక్తకాలను వ్రాసి ఆస్ట్రేలియన్ కవితా రంగానికి ప్రత్యేక వ్యక్తిత్వాన్ని కల్పించారు.

ఆధునిక యుగం రెండవ ప్రపంచయుద్ధకాలంలో మొదటి, రెండవ తరాలలో బహుముఖంగా వికాసం చెందింది. సాహిత్య పత్రికలు విస్తృతంగా బయల్దేరి, పాఠకుల సంఖ్య వృద్ధి చెందింది. వాస్తవిక దైనందిన స్వభావాలను వర్ణించడం కొనసాగినా, ఆస్ట్రేలియన్ రచయితల దృక్పథం 1950 తరువాత రాను రాను అంతర్ముఖత్వం, గవేషణాశీలం అలవరుచుకుంది. ఈ భావ విప్లవానికి 1973 లో నోబెల్ బహుమతిని గెలుచుకున్న పాట్రిక్ వైట్ రచనలు పరాకాష్ఠ పొందాయి. *ది ట్రీ ఆఫ్‌మాన్* (1955), *వోస్* (1957), *రైడర్స్ ఇన్‌ది చారియట్* (1961), *ది సాలిక్ మండలా* (1966), *ది వివిసెక్టర్* (1970), *ఐ ఆఫ్ ది స్టార్మ్* (1973), *ఏ ఫ్రింజ్ ఆఫ్ లీవ్స్* (1976), *ది ట్వైబర్న్ ఎ ఫెయిర్* (1979) అనే నవలలలో పాట్రిక్ వైట్ మానవ జీవితంలోని వివిధ సంఘర్షణలను, మానవ సంబంధాలను, పాపపుణ్యాల ఆంతర్యాలనూ, అస్తిత్వవాద జిజ్ఞాసను అత్యంత అవగాహనతోను, శక్తిమంతమైన కథా శైలిలోను, పాత్ర చిత్రణద్వారానూ, కళాసంవిధాన నైపుణ్యంతోను అభివ్యక్తం చేశాడు. ఆస్ట్రేలియాకు వలసవచ్చిన ఈ తరపు కుటుంబాల సమస్యలను మార్టిన్ బోయెడ్ విశ్వాస సందేహాల ద్వైధీభావంతో లూసిండా బ్రేపోర్ట్ (1946), *ఏ డిఫికల్ట్ యంగ్‌మాన్, వెన్ బ్లాక్ బర్డ్స్ సింగ్* (1962) మొదలైన నవలలలో పరిశీలించాడు. రేండల్ఫ్ *టు ది ఐలాండ్స్* (1958), *ది మెర్రీ గోరౌండ్ ఇన్ ది సీ* (1965) అనే నవలలలోను, టామస్ కీనెలీ, హాల్‌పోర్టర్ కష్టినాస్టెడ్ ప్రభృతులు తమ రచనలలోను నవ్యనవలా సాహిత్యాలను పెంపొందించారు.

ప్రకృతి వర్ణన కవిత్వ వస్తువుగా కొనసాగడమే కాక మనోవిశ్లేషణ, ఆంతరిక చింతన, బింబ ప్రతీకా సంవిధానం మొదలైన ప్రక్రియలతో అనేక కవితా రీతులు బయలు దేరాయి. ఏ.డి. హోప్, జీడిత్ రైట్, జేమ్స్ మెకాలే, డగ్లస్ స్టువర్ట్, రాబర్ట్ డి. ఫిట్జ్‌జెరాల్డ్ మొదలైన కవులు ఆధునిక యుగంలో ప్రసిద్ధి చెందారు. రెండవ ప్రపంచయుద్ధం తరువాత డగ్లస్ స్టువర్ట్ *నెడ్ కెల్లి* (1943), రేలోలర్ *సమ్మర్ ఆఫ్ ది సెవెన్‌టీన్త్ డాల్* (1953), ఆలన్ సేమూర్ *ఒన్‌డే ఆఫ్ ది యియర్* (1961), పాట్రిక్‌వైట్ *హామ్ ఫ్యూనరల్* (1965) అనే నాటకాలను రచించి, ప్రదర్శించి నాటక సంప్రదాయాన్ని పటిష్ఠం చేశారు.

ఆత్మవిమర్శన, భావుకత, కాల్పనికత, శిల్పనైపుణి అలవరచుకొని ఆస్ట్రేలియా సాహిత్యం కామన్‌వెల్త్ సాహిత్యంలో ప్రముఖస్థానం వహించి ముందంజ వేస్తున్నది.

డి.వి. కె.రా.

## న్యూజిలాండ్ సాహిత్యం

భౌగోళికమైన ఉనికి వల్లను, చారిత్రక కారణాల వల్లను న్యూజిలాండ్ ఒకవైపున ఆస్ట్రేలియా వంకకును, మరొకవైపున ఇంగ్లండు వంకకును తన దృష్టిని ప్రసరింపవలసి వచ్చింది. ఆస్ట్రేలియాతో పోల్చిచూస్తే న్యూజిలాండ్ ప్రాకృతికంగా మరింత సుందరమైన, నివాస యోగ్యమైన దేశం. తమ దేశం చక్కని శాద్వలాలతో, సాగరోన్మీలితమైన తీరాలతో రమ్యమైన స్వప్నసీమ అనే భావన న్యూజిలాండ్ జాతీయుల అంతశ్చేతనలో ప్రగాఢంగా ముద్రితమై

పోయింది. అక్కడకు వలస పోయిన ప్రజలు మధ్య తరగతికి చెందిన వారు. గ్రామీణ జీవితానికీ, వ్యవసాయానికీ, పశుపాలనకూ, పాడి పరిశ్రమకూ అలవాటు పడినవారు. అయితే వర్గ విభేదాలు, సాంప్రదాయిక ధోరణులు, ఆచార మర్యాదలు, మతనిష్ఠ కల సమాజ వ్యవస్థ వలన కలిగే సంఘర్షణలూ న్యూజిలాండ్‌లోని ఆదిమవాసులైన మవోరీల సంస్కృతిని నిర్దాక్షిణ్యంగా అణచివేసి శ్వేతజాతి నాగరకతను స్థాపించడం వల్ల కలిగిన పాపభీతి, నిర్వేదము న్యూజిలాండ్ జాతీయుల సామూహిక చేతనలో గాఢంగా ముద్రితం అయాయి. ఈ ప్రభావాలకు లోను కావడం వల్ల, లేదా వాటిని అధిగమించాలనే ప్రయత్నం వల్ల సాహిత్యం దృష్ట్యా న్యూజిలాండ్ రచయితల భావుకత్వం ఒక విశిష్టతను సంతరించుకుంది.




న్యూజిలాండ్

న్యూజిలాండ్‌లో స్థిర నివాస వ్యవస్థ ఆస్ట్రేలియాలో కంటె 50 ఏళ్లు ఆలస్యంగా ఏర్పడడం వల్ల 1840-1940 మధ్య కాలంలో న్యూజిలాండ్ సాహిత్యం ప్రాథమిక రచనలకే పరిమితం అయినా, 1930 నుంచి నవ చైతన్య ప్రేరణతో జాగృతం అయింది. మొదటి దశలో ప్రకృతి వర్ణన, స్థానిక కథా వస్తు స్వీకరణ, స్వీయ కథా కథనం రచనలకు ఆలంబనాలు అయాయి. ఎఫ్.ఇ. మానింగ్ వ్రాసిన *ఓల్డ్ న్యూజిలాండ్* (1963), శ్యాముయెల్ బట్లర్ వ్రాసిన *ఫస్టియర్ ఇన్ కాంటర్ బరీ సెటిల్‌మెంట్* (1863), లేడీ మేరీ ఆన్‌బేకర్ వ్రాసిన *స్టేషన్ లైఫ్ ఇన్ న్యూజిలాండ్* (1870) ఈ కోవకు చెందిన రచనలు. వలస కవులలో ముఖ్యులు ఆల్ఫ్రెడ్ డోమెట్, జీన్ బార్.

కేథరిన్ మాన్స్‌ఫీల్డ్ ప్రతిభాశాలిని అయిన రచయిత్రి. *బ్లిస్ అండ్ అదర్ స్టోరీస్, ఎట్ ది బే, ది గార్డెన్ పార్టీ* (1922) వంటి కథానికలలో న్యూజిలాండ్ సమాజంలో ఆచార మర్యాదలను పాటించడం విషయంలో వ్యక్తుల ప్రతిస్పందనలను, విశేషించి కౌమార దశలోను, వయస్సంధిలోను ఉన్న కన్యల మనో వికారాలను అత్యద్భుతంగా చిత్రించి కథానికా ప్రక్రియను ఆమె అత్యున్నత శిఖరాలకు తీసుకొని వెళ్లింది. జేన్ మాండర్ *ది స్టోరీ ఆఫ్ ఏ న్యూజిలాండ్ రివర్* (1920) లోను, విలియమ్ సాచెల్ *ది లాండ్ ఆఫ్ ది లాస్ట్* (1902) లోను గణనీయమైన విజయం సాధించారు. 1920-30 మధ్య కాలంలో ఫ్రాంక్ సార్జిసన్ కథా రచయితగాను, ఏ.ఆర్.డి ఫెయిర్‌బర్న్, ఆర్.ఏ.కె. మాసన్, ఆలెన్ కర్నో, కెనిస్ నోవర్ లు కవులుగాను వన్నెకెక్కారు. సార్జిసన్ ముఖ్యంగా ఆర్థిక మాంద్యానికి గురి అయిన సమయంలో సామాన్య ప్రజలు - ముఖ్యంగా కార్మికులు - ఎదుర్కోవలసి వచ్చిన దీనావస్థను హృదయానికి హత్తుకు పోయే విధంగా చిత్రించాడు. *మాన్ ఎలోన్* (1939) రచయిత జాన్ మల్గన్, *చిల్డ్రన్ ఆఫ్ ది పూర్* (1934) రచయిత జాన్ ఏ.వీ. దారిద్ర్య రేఖకు దిగువను జీవనం సాగించే ప్రజల బ్రతుకులను ఇతివృత్తంగా స్వీకరించారు.

రెండవ ప్రపంచ యుద్ధ సమయంలోను, తదనంతరము బహుముఖమైన వికాసం అన్ని రంగాలలోను కనిపించింది. విశేషించి కథానికా ప్రక్రియలో రోడెరిక్ ఫిన్‌లేసన్, మారిస్ దుగ్గన్, ఓయీ, మిడిల్టన్, ఫిలిఫ్ విల్సన్ కథకులుగా ప్రసిద్ధి పొందారు. కవి, నాటక రచయిత అయిన జేమ్స్ కే. బాక్సర్ చరిత్ర రచయిత, కవి అయిన కీత్ సింక్లేర్ ఈ కాలపు సాహిత్యానికి సారథులయారు. నవలా రచయితలలో డాన్ డేవిన్ (*నో రెమిడెన్స్*-1959), డేవిడ్ బాలెండ్ టైన్ (*ది కనింగ్‌హామ్స్*-1949), సిల్వియా ఆస్టన్ వార్నర్ (*స్పిన్‌స్టర్* - 1958; *గ్రీన్‌స్టోన్*-1966), ఇయన్ క్రాస్ (*ది గాడ్ బాయ్*-1957; *ఆఫ్టర్ అన్జాక్ డే* - 1961), జీనెట్ ఫ్రేం (*ఫేసెస్ ఇన్ ది వాటర్*-1961, *ఏ స్టేట్ ఆఫ్ సీ*-1966, *ది రెయిన్‌బర్డ్స్*-1968, *ది ఔల్స్ డూ క్రై*-1957), మారిష్ షాడ్‌బోల్ట్ (*అమాంగ్ ది సిండర్స్*-1965, *స్ట్రేంజర్స్ అండ్ జర్నీస్*-1972), మారీస్ గీ (*ఏ స్పెషల్ ఫ్లవర్*-1965, *ఇన్ మై ఫాదర్స్ డెన్*-1972) సుప్రసిద్ధులయారు. ఆలన్ కర్నో వ్రాసిన *ది ఆక్స్* అనే చరిత్రాత్మక నాటకం ప్రతిభావంతమైన రచన. మొత్తం మీద న్యూజిలాండ్ సాహిత్యం ప్రవర్ధమానం అవుతూ కామన్‌వెల్త్ సాహిత్యంలో యథోచితమైన స్థానాన్ని సంపాదించుకుంటూంది. డి.వి.కె.రా.

# సింహావలోకనం

'విహంగావలోకన' పద్ధతిలో వివిధ ప్రపంచ సారస్వతాల చరిత్రలను స్థూలంగా పరిశీలన చేసిన తరువాత వీటిలో కొన్ని సమాన ధర్మాలను కొంత వరకు గుర్తించవచ్చును.

ప్రపంచంలో ఇంచుమించు అన్ని సాహిత్యాలూ వచన రూపంలో కాకుండా గేయ రూపంగానే ఆరంభం అయినట్టు కనిపిస్తుంది. అత్యంత ప్రాచీనమైన మన *వేదాలు* ఉదాత్తానుదాత్త స్వరిత స్వర భేదాలతో గేయరూపంగానే ఆవిర్భూతం అయాయి.

కథలు, గాథలతో ఆరంభమైన పాశ్చాత్య సాహిత్యాలలో కూడా ఆరంభంలో ఆ కథ లన్నీ గేయరూపంలోనే ఉండేవి. తేలికగా గుర్తించుకోడానికి వీలుగా తిరిగి తిరిగి వచ్చే పదాలూ, పదబంధాలూ, లయాత్మకమైన నడక, అనుప్రాసలూ వాటిలో ఉండేవి. *ఎపిక్ ఆఫ్ గిల్గమేష్* (సుమారు క్రీ.పూ. 2,000) అనే బాబిలోనియన్ ప్రాచీనగాథ పద్యరూపంలోనే వెలువడింది. ప్రాచీన కాలంలో మధ్య ప్రాచ్య భాషలలోని *ది వార్ ఆఫ్ ది గాడ్స్*, *ది స్టోరీ ఆఫ్ అదాపా* (ఈ రెండూ బాబిలోనియన్ గాథలు), *ది హెవెన్లీ బౌ, ది కింగ్_హూ ఫర్‌గాట్* (ఈ రెండూ కానవైట్ గాథలు) మొదలైన గాథ లన్నీ పద్యరూపంలోనే వెలశాయి. ఇవి క్రీ.పూ. రెండవ సహస్రాబ్దంలో క్యూనియఫారమ్ లిపిలో మట్టి ఇటుకల మీద చెక్కబడ్డాయి.

ప్రాచీన సారస్వతాలన్నీ ఆదిలో కొంతకాలం మౌఖికంగానే ఒక తరం నుంచి మరొక తరానికి సంక్రమిస్తూ వచ్చి అనంతర కాలంలో లిపి బద్ధం చేయబడ్డాయి.

శృంగారం, గ్రామీణ జీవన మధుర సన్నివేశాలూ, వేరు వేరు తండాల వారి మధ్య సాగిన యుద్ధాలూ, ప్రకృతి వర్ణనలూ మొదలైనవి ఆ నాటి సాహిత్యాలకు ప్రధానమైన ఇతివృత్తాలుగా ఉండేవి. నీతిబోధనలూ, నీతి కథలూ, ప్రకృతి రహస్యాలను ఆవిష్కరించే రచనలూ కూడా ఇంచు మించు అన్ని సాహిత్యాలలోనూ కనిపిస్తాయి.

ఒక సంస్కృతిలో విస్పష్టరూపంలో సారస్వతం ఏర్పడే నాటికే ఆ సమాజంలోని సభ్యులందరిలోనూ సాధారణమైన 'అనుభూతి రూపాలు' (archetypes) ఏర్పడి ఉంటాయి. మతం వల్ల, పుక్కిటి పురాణాలవల్ల కొన్ని ప్రతీకలు ఏర్పడుతాయి. ప్రపంచంలోని సర్వ ఉద్గ్రంథాలూ సార్వజనీనమైన ఈ మానవ అనుభూతులకే రూపకల్పన చేశాయి. అయితే సాహిత్యం అంతా కొన్ని మౌలిక అనుభూతుల, ప్రేరణల పునశ్చరణ రూపమే అని భావింపరాదు. తొలి మానవుని అనుభూతులను ప్రకటించిన *వేదాలూ*, కన్ఫ్యూషియస్ రచనలూ, *ఎపిక్ ఆఫ్ గిల్గమేష్* లేదా సోఫోక్లీస్ రచించిన *ఈడిపస్ ది కింగ్* వంటి ఆ తొలి రచనలే అనంతరకాలంలో తిరిగి తిరిగి పునశ్చరితం కావడం లేదు. సాహిత్యానికి ఇతివృత్తం అయిన మానవుని అనుభూతి మిక్కిలి విస్తృతమైంది. సారస్వత ప్రారంభ కాలంలోని కట్టుకథలూ, పుక్కిటి పురాణాలూ, జానపద గాథలూ, వాటిలోని సంవిధానాలూ, సన్నివేశాలూ, ఆలంకారిక విన్యాసం తరువాతి రచనలకు ఉత్తేజాన్ని కలిగిస్తూ వచ్చాయి. మానవ పరంపర ఒక అవిచ్ఛిన్నమైన వాహిని వంటిది. ఒకే జీవశాస్త్రీయ తత్త్వంలో మానవు లందరూ సమాన భాగస్వాములుగా ఉన్నారు. నగరాలు వృద్ధి చెందిన తరువాత వెలసిన వివిధ నాగరకతలలో కూడా సమాన ధర్మం కనిపిస్తుంది. ప్రముఖ మనశ్శాస్త్ర వేత్త యూంగ్ కల్పించిన పదబంధం 'కలెక్టివ్ అన్‌కాన్షస్' (సామూహిక అజ్ఞాత చేతన) కు నిజమైన అర్థం 'మానవజాతి ఏ ప్రాంతంలో ఉన్నా ఒకే సాధారణ అనుభూతిలో పాలుపంచుకుంటుంది' అని! 'ప్రేమ', 'మృత్యువు' లాంటివి సర్వమానవులకూ ఏక రూపమే! దక్షిణాఫ్రికాలోని బుష్‌మన్ కాని, ఫ్రెంచ్ సర్రియలిస్ట్ గాని వాటికి ఒకే విధంగా ప్రతిస్పందిస్తాడు. అందుచేత వివిధ సారస్వతాలలోని ఇతివృత్తాలలో పైకి అంతులేని వైవిధ్యం కనిపించినా, వాటి అన్నిటి వెనుకా అంతర్నిహితంగా ఒకే సాధారణ మానవ జీవనానుభూతి ధ్వనిస్తూ ఉంటుంది.

కొన్ని సాహిత్యాలలో ముఖ్యంగా చైనీస్, ప్రాచీన నార్స్, ప్రాచీన ఐరిష్ వంటి భాషా సాహిత్యాలలో రోజూ మాట్లాడుకునే వ్యావహారిక భాషకీ, సాహిత్యంలో వినియోగించే భాషకీ మధ్య చాలా భేదం కనిపిస్తుంది. దీని వలన సాహిత్య పఠనం ఒక విశిష్టమైన అనుభూతి అవుతుంది. పాశ్చాత్య సాహిత్య సంప్రదాయంలో కూడా ఇటీవలి కాలంలోనే సాహిత్య సృష్టికి శిష్ట వ్యావహారిక భాషను వాడుక చేయడం ఆరంభం అయింది. ఎలిజబెత్ కాలంలోని పౌరులు షేక్స్పియర్ వాడిన సాహిత్య

భాషను మాట్లాడేవారు కారు. అలాగే 18 వ శతాబ్దంలో శామ్యుయెల్ జాన్సన్, ఎడ్వర్ట్ గిబ్బన్‌ల వచన శైలి ఆ నాటి సాధారణ ప్రజలు మాట్లాడుతూ వచ్చిన వ్యవహార భాషకు అద్దం పట్టదు. ఇంగ్లీష్‌లో విద్యావంతుడైన సాధారణ పౌరుడు మాట్లాడే వ్యావహారిక భాషలో సాహిత్య రచన చేసిన మొట్టమొదటి రచయిత డేనియల్ డీఫో (1660-1731). చిత్రంగా ఆ నాడు ఆయన రచించిన వ్యావహారిక శైలి నేటికీ ఏమంత మార్పు చెందలేదు. 19 వ శతాబ్దంలో థామస్ డీక్వెన్సీ లేదా వాల్టర్ పేటర్ వంటి రచయితలు రచించిన గంభీర వచన రచనల కంటె డీఫో రచించిన *రాబిన్సన్ క్రూసో* ఈనాడు మరింత సమకాలీనమైన రచనగా మనకు కనిపిస్తుంది. అందుచేత ప్రపంచ సాహిత్యాలన్నిటిలోనూ ఇంచుమించు స్థిరంగా ఉండే సాహిత్య భాషకూ, దినదినం మారుతూ ఉండే వ్యవహార భాషకూ మధ్య ఎంతో కొంత అంతరం కనిపిస్తూనే వచ్చింది.

మధ్య యుగాలలో శిష్ట సాహిత్యం చాలా భాషలలో రాజాశ్రయంలో వృద్ధి పొందినట్లు కనిపిస్తుంది. ఆ కాలంలో సామాన్య జానపద సాహిత్యానికీ, శిష్ట సాహిత్యానికీ మధ్య అంతరం ఎక్కువ అయింది. సాహిత్యం లిపి బద్ధం అయిన తరువాత రాజాశ్రయంలో వర్ధిల్లిన శిష్ట సాహిత్యాలకు ప్రాబల్యం ఎక్కువ అయింది. జానపద సాహిత్యంలోని ఇతివృత్తాలను శిష్ట సాహిత్యం స్వీకరించడం జరిగినా శిష్టసాహిత్య ఇతివృత్తాలు జానపద సాహిత్యంలో చోటుచేసికోవడం ఎక్కువగా కనిపించదు.

ఆధునిక కాలంలో సామాన్య ప్రజల ఆదరణ పొందే సాహిత్యానికి ప్రాధాన్యం ఎక్కువ అవుతూంది. అయితే ప్రాచీన కాలంలో ప్రజల మన్ననలు పొందిన జానపద సాహిత్యానికీ, ఆధునిక కాలంలోని 'ప్రజాదరణ' సాహిత్యానికీ ఎలాంటి పోలికలూ లేవు. నేటి ప్రజాదరణ సాహిత్యం సంఘంలో విద్యావంతులైన వారికోసమో, సినీమా, టెలివిజన్ వంటి వినోద సాధనాలకోసమో వ్రాయబడడం జరుగుతూంది. నేటి 'ప్రజాదరణ' సాహిత్యం నిజంగా ప్రజలనుంచీ, జానపదులనుంచీ రావడం లేదు. వారు కేవలం ఈ సాహిత్యానికి శ్రోతలూ, ప్రేక్షకులూ, పఠితలూ మాత్రమే!

ప్రాచ్య సాహిత్యాల మీద పాశ్చాత్య సాహిత్య ప్రక్రియల ప్రభావం ఆధునిక కాలంలో ఎక్కువగా కనిపిస్తూంది. పాశ్చాత్యుల నవల, కథానిక, నాటిక, ఖండకావ్యం మొదలైన సాహిత్య ప్రక్రియలన్నీ ప్రాచ్య సాహిత్యాలలో కూడా నేడు విశేష ప్రజాదరణ పొందుతున్నాయి. బహుశః యాంత్రిక నాగరకత పాశ్చాత్యుల నుంచి ప్రాచ్య దేశాలకు సంక్రమించడం కొంత వరకు ఇందుకు కారణం కావచ్చును.

ఏమైనా వివిధ ప్రపంచ దేశ సాహిత్యాల మధ్య సమగ్ర మైన తులనాత్మక పరిశీలన జరిగితే తప్ప ఇతివృత్తాలూ, శైలులూ, అలంకార విన్యాసాలూ, కావ్య ప్రక్రియలూ మొదలైన వాటిలో ప్రపంచ సారస్వతాలలో కనిపించే సామ్య వైషమ్యాలను విస్పష్టంగా అవగాహన చేసుకోడం సాధ్యం కాజాలదు. బా.శ్రీ.

**అకుటగావా, రైనోసుకే (1892-1927)** : సుప్రసిద్ధ జపనీస్ కథకుడు, నాటక రచయిత, కవి, స్వతంత్రమైన రచనాశైలి కలవాడు.



1892 మార్చి 1 వ తేదీన టోక్యో నగరంలో జన్మించిన అకుటగావా బాల్యంలో ఎప్పుడూ రోగిష్టిగా ఉండేవాడు. అయినా పాఠశాలలో అగ్రశ్రేణిలో ఉండేవాడు. విస్తృతంగా గ్రంథ పఠనం చేసేవాడు. టోక్యో ఇంపీరియల్ విశ్వవిద్యాలయంలో ఆంగ్ల సాహిత్యాన్ని అభ్యసిస్తున్న రోజులలోనే (1913-1916) అకుటగావా రచనా వ్యాసంగం ప్రారంభమైంది.

1915 లో అతని కథానిక *రషోమా* ప్రచురింపబడడం ఆనాటి సుప్రసిద్ధ నవలా రచయిత నట్సుమే సోసేకీతో అతని పరిచయానికి దారితీసింది. సోసేకీ ప్రోత్సాహంతోనే 12 వ, 13 వ శతాబ్దాలనాటి జపనీస్ కథలను ఆధునిక మనస్తత్వశాస్త్ర దృష్టితో మౌలికమైన శైలిలో అతడు తిరిగి చెప్పడం ప్రారంభించాడు. చైనా సాహిత్యం నుంచీ, జపాన్ లోని 16 వ శతాబ్దంనాటి నాగసాకీ లోని క్రైస్తవ సమాజం నుంచీ, 19 వ శతాబ్దంలో జపాన్‌కు యూరప్ దేశీయులతో ఏర్పడిన సంపర్కం నుంచీ విస్తృతంగా అతడు తన ఇతివృత్తాలను ఎంచుకున్నాడు. అతని కథానికలు అనేకం ఆవేశభరితమై, బీభత్సరస పూరితమైన ఇతివృత్తాలతో ఆకర్షకంగా నడుస్తాయి.

1922 లో అకుటగావా ఆత్మకథారూపమైన రచనలకు పూనుకున్నాడు. ఆధునిక జీవితాన్ని గూర్చి అకుటగావా వ్రాసిన రచనలలో వెనుకటి కథలు తిరిగి చెప్పినపుడు కనిపించినంతటి ప్రతిభ కనిపించదు. అందుకే అవి అంతగా ప్రజాదరణ పొందలేదు. అకుటగావా రచించిన చిట్టచివరి ప్రముఖ రచన *కప్ప* (1927). ఇది అతని జీవితావసాన దశలోని నిరాశా నిస్పృహలను ప్రతిబింబిస్తుంది. అతని ఆత్మహత్య సాహిత్య జగత్తును ఆశ్చర్య చకితులను చేసింది. బహుశః ఏ జపనీస్ రచయిత రచనలూ అకుటగావా రచనలంత ఎక్కువగా ఇతర భాషలలోకి అనువదింపబడలేదు. అతని కథలలో కొన్ని చలన చిత్రాలుగా కూడా వచ్చాయి. సుప్రసిద్ధ చలన చిత్రం *రషోమా* (1951)కు 'కురోసవా అకిర' దర్శకత్వం వహించాడు. *రషోమా* అనే కథే కాక *యాబు నో నాకా* (1921; *తోటలో*, 1952) అనే కథ కూడా ఈ చలన చిత్రానికి ఆధారం అయింది.

వ.మం.

**అజుయెలా, మరియానో (1873-1972)** : మెక్సికో నవలారచయిత. మెక్సికో విప్లవం ఇతి వృత్తంగా నవలా పరంపరను రచించాడు. వైద్యవిద్యార్థిగా, స్థానిక రాజకీయనేతగా, సైనికోద్యోగిగా 1911-15 మధ్య బయల్దేరిన ఉద్యమ సంచలనాన్నీ, హింసా కాండనూ ప్రత్యక్షంగా చూచి, యూరపియన్ వాస్తవికతా వాద ప్రభావంతోనూ, వ్యష్టివాద దృక్పథంతోనూ సామూహిక ప్రజా చైతన్యాన్ని ఆయన చిత్రీకరించాడు. నిర్వీర్యమైన ఆదర్శవాదాన్ని తిరస్కరించి, అనుభవైక సాధ్యమైన జీవన సత్యాలను ఆయన ఆవిష్కరించాడు. సమష్టి జీవితంలో సంభవించే మార్పులకూ, ప్రభావాలకూ లోనై వ్యక్తి పొందే చిత్తవృత్తినీ, శీలపరివర్తననూ ఆయన అభివర్ణించాడు.

*ఆంద్రేస్ పెరేస్ మదరిస్తా* (1911) అనే నవలలో ప్రాతికేయుడుగా విఫల మనోరథుడైన అధీర నాయకుడు విచిత్ర పరిస్థితులలో మదరిస్తాలలో కలసిపోయి ప్రజానాయకుడుగా ఆదరాభిమానాలు చూరగొన్న తీరు వర్ణితమైంది. మధ్య తరగతి ప్రజలు గాక, రైతు విప్లవకారులు ప్రధాన ఆలంబనంగా వెలువడ్డ ఇతని ప్రసిద్ధమైన నవల *హూస్ డి అబాజో* (1915-16). *లోస్ కసీక్స్*, *లాస్ మోస్కాస్* (1918), *మాలా హెర్బా* (1909), *మార్సెలా* (1932) మెక్సికో సాహిత్యంలో పేరెన్నికగన్న నవలలు. *లా మాల్ హోరా* (1923) అనే దీర్ఘ కథానికలో సమాజపు క్రీనీడలలో జీవనయాత్ర సాగించే ఒకానొక వనిత సజ్జనుల సహాయం లభించి కూడా విధి లీలలకు ఎరగాక తప్పని విషాదోదంతం వర్ణింపబడింది. 1938 లో విప్లవానంతర తరంలో మెక్సికో నగరాన్ని ఆవరించిన కలుషిత వాతావరణాన్ని, అవినీతిని, భ్రష్టాచారాన్ని అజుయెలా నిర్మొహమాటంగా విమర్శించాడు. ఆ తరువాత నిర్వేదగ్రస్తుడై సృజనశక్తి కుంటువడి, కేవలం కోపావేశ భూయిష్ఠమైన రచనలు అనేకం చేశాడు.

డి.వి.కె.రా.

**అజోరిన్ (1874-1967)** : శ్వానిష్ విద్వాంసుడు, సాహిత్య విమర్శకుడు. 20 వ శతాబ్ది ఆరంభంలో శ్వానిష్ జీవితానికీ, సాహిత్యానికీ నూతన చైతన్యం కలిగిం

చడానికి అవిశ్రాంతంగా కృషి చేసిన మహారచయితలలో ఒకడు. ఆ రచయితల తరం 'జనరేషన్ ఆఫ్ 1898' నాటి తరంగా ప్రసిద్ధి పొందింది.

అజోరిన్ ఈ కవి కలంపేరు. అసలు పేరు జోస్ మార్టినెజ్ రూయిజ్. విస్పష్టమైన శైలితోను, సాహిత్య విమర్శలో స్వయంగా సాధించిన నూతన నియమాలతోను అజోరిన్ రచనలు చేసి, 19 వ శతాబ్దంలో రచయిత స్వేచ్ఛకు ప్రతిబంధకంగా ఉన్న లక్షణశాస్త్ర ఆదేశాలను త్రోసిపుచ్చాడు.



అజోరిన్ గ్రనెడా, వలెన్షియా, సాలమాంకాలలో న్యాయశాస్త్రాన్ని అభ్యసించాడు. తరువాత తన మాట తీరుకు, ఆలోచనా ధోరణికి దగ్గరగా ఉండే పాత్రికేయుడు కావాలనే ఉద్దేశ్యంతో మాడ్రిడ్ వెళ్లాడు. అక్కడ ఒక నవలాత్రయాన్ని ఆయన రచించాడు. అవి: *లా వల్యూన్టెడ్* (1902), *ఆంటోనియో అజోరిన్* (1902), *లాస్ కన్ఫెషన్స్ డి అన్ పెక్వెనో ఫిలోసోఫో* (1904). వీటిని సాంప్రదాయిక నవలా పద్ధతికి భిన్నంగా, సంభాషణల రూపంలో ఆయన వ్రాశాడు. ఈ నవలాత్రయం 'జనరేషన్ ఆఫ్ 1898' ని ముందుకు నడిపించాయి. అపూర్వమైన దేశభక్తి గల అజోరిన్ విలువలు తారుమారయిన స్పానిష్ సంప్రదాయాన్ని తిరిగి ఉచ్ఛస్థితికి తీసుకురావాలని నిరంతరం కృషి చేశాడు. *ఎల్ ఆల్మా కేసెలానా* (1900), *లా రూటా డి డాన్ క్విజోట్* (1905), *ఉనాహోరా డి ఎస్పానా* (1560-1590) అనే గ్రంథాలలో స్పానిష్ జీవన పరమార్థాన్ని తిరిగి సాధించయత్నించాడు. పాఠకుణ్ణి ఇతని రచనలో అంతర్లీనంగా ఉన్న వ్యంగ్య శక్తి మిక్కిలి ప్రభావితుణ్ణి చేస్తుంది. అజోరిన్ సాహిత్య విమర్శలు *ఆల్ మర్జిన్ డి లాస్ క్లాసికోస్* (1915) వంటివి స్పానిష్ సాహిత్య గ్రంథాలను చదివించటానికీ, ఆ సాహిత్యం సామాన్యజనానికి అందుబాటులోనికి రావటానికీ నవ్య మార్గాలను సృజించి సాహిత్యాభిరుచిని పెంపొందించాయి.

ప్రపంచ సాహిత్యంలో చోటుచేసుకుంటున్న నూతన ఆలోచనా రీతులను స్పానిష్ పాఠకులకు తెలియ పరచటానికీ, వారిని జాగృతులను చేయటానికీ అజోరిన్ *రెవిస్తా డి అక్సిడెంటె* (Magazine of the West) అనే పత్రికను 1923 నుండి 1936 వరకు నడిపాడు. స్పెయిన్ అంతర్యుద్ధ సమయంలో అతడు *లా నేషియోన్* అనే అర్జెంటీనా పత్రికకు వ్యాసాలు వ్రాస్తూ పారిస్ నగరంలో గడిపాడు. తిరిగి 1949 లో మాడ్రిడ్‌లో కాలు మోపాడు. అజోరిన్ అస్తమయం తరువాత మనోవార్‌లో ఆయన గ్రంథాలయాన్ని ఒక మ్యూజియమ్‌లో ప్రదర్శించే ఏర్పాటు చేశారు.

చిం.వెం.

**అనువిల్, జాన్ (1910-1987) :** అంతర్జాతీయ విఖ్యాతి గడించిన ఫ్రెంచ్ నాటక కర్త. రెండవ ప్రపంచ యుద్ధం తరువాత ఫ్రెంచ్ నాటకరంగం మీద బలమైన ప్రభావం చూపించిన రచయిత. ఈయన నాటకాలు సందేశాత్మకాలు. రంగస్థలం అంటే ఈయనకున్న ప్రీతినీ, నటులన్నా, గృహిణులన్నా, ఉంపుడుగత్తెలన్నా, విశ్వ విద్యాలయ పండిత భిషక్కులన్నా, ప్రభుత్వోద్యోగులన్నా ఆయన కుండే ఏవగింపునీ ఈయన నాటకాలు ప్రకటిస్తాయి. అనువిల్ నాటకాలలో తరచు కనిపించే విశిష్ట లక్షణాలు అంతర్నాటకం, పూర్వకథా కథనాలు, భావి కథా సూచనలు, పాత్రల మార్పిడి మొదలైనవి.



తన నాటకాలను బట్టి తన జీవిత విశేషాలను గుర్తించడానికి వీలులేకుండా అనువిల్ జాగ్రత్తపడ్డాడు. న్యాయశాస్త్రం అభ్యసించి కొద్దికాలం పాటు ఎడ్వర్టైజ్‌మెంట్ రంగంలో ఈయన పనిచేశాడు. తన 18 వ ఏట జీన్ జిరాదో (Jean Giraudoux) రచించిన *సీగ్‌ఫ్రీడ్* అనే నాటకం చూసి, రంగస్థలోచితమైన, కవితామయమైన భాష ఎలా ఉండాలో ఆయన గుర్తించాడు. అదే ఆటు తరువాత ఆయన జీవిత మార్గాన్ని నిర్దేశించింది. కొద్దికాలం పాటు నటుడూ, దర్శకుడూ అయిన

లూయీ జౌవెట్ వద్ద ఆయన కార్యదర్శిగా పని చేశాడు.

అనువిల్ రచించిన మొదటి నాటకం *లా హెర్మిన్* (1932 లో ప్రదర్శితం). తరువాత 1937లో *లా వాయేజర్ శాన్స్ బాగేజ్* ('లగేజీ లేని ప్రయాణికుడు'), 1938 లో *లా సేవేజ్* అనే నాటకాలు రచించడంతో అనువిల్ సుప్రసిద్ధు డయాడు.

'స్వాభావిక వాదాన్నీ' (Naturalism), 'యథార్థ వాదాన్నీ' (Realism) త్రోసిరాజని అనువిల్ 'నటనా వాదాన్ని' (Theatricalism) ఆదరించాడు. భావనకూ, కవితకూ రంగస్థలం మీద తిరిగి పట్టం గట్టాడు.

*లా ఇన్విటేషన్ ఔ చాటో* ('చంద్రుని చుట్టూ వలయం' 1947) అనే నాటకంతో అనువిల్ రచనలు మరింత గాంభీర్యాన్ని సంతరించుకున్నాయి. 1950-60 మధ్య అనువిల్ రచించిన నాటకాలలో రాజకీయ చైతన్యం ఎక్కువగా కనిపిస్తుంది. *పవర్‌బిటోస్, ఔ లె డినెర్ డి టెటెస్* (1956) ఇందుకు చక్కని ఉదాహరణ. 1968-70 మధ్య 'అసంగతవాది' (Absurdist) నాటక రచయితలైన యూజీన్ ఇయొనెస్కో, శామ్యూయెల్ బెకెట్‌లతో పోల్చిచూస్తే అనువిల్ నాటకాలు పాతబడిపోయినట్లు కనిపిస్తాయి. 1968 లో ఆయన రచించిన *లె బౌలంగెర్, ల బౌలంగెరె ఎట్ లె పెటిట్ మిత్రోన్* (ది బేకర్, ది బేకర్స్ వైఫ్ అండ్ ది బేకర్స్ బోయ్) అనే నాటకానికి ప్రజలు ఏమంత ఉత్సాహంగా ప్రతిస్పందించలేదు. అయితే ఆ తరువాతి దశాబ్దిలో ఆయన రచించిన *చెర్ ఆండోయ్‌నె; ఔ లామూర్ రతే* (1969; *ది లవ్ దట్ ఫెయిల్‌డ్* - 1971), *లెస్ పాయిసన్స్ రోజెస్; ఔ, మొన్‌పెరె, చె హెరోస్* (గోల్డ్ ఫిష్ - 1970), *నె రెవిలిజ్ పస్ మదామ్* (డూ నాట్ అవేకెన్ ది లేడీ - 1970) *లె డైరెక్టర్ డి లొపేరా* (1972), *లారెస్టేషన్* (ది అరెస్ట్ - 1975), *లె సెనేరియో* (1976), *వైవ్ హెన్రీ* -IV (1977), *ల చులోటె* (ది ట్రౌసర్స్ - 1978) మొదలైన నాటకాలు అద్భుతమైన జనరంజక శక్తి గల నాటక రచయితగా అనువిల్ స్థానాన్ని సుస్థిరం చేశాయి.

ఇ.నా.

**అపోలెనియు, జిలోమె (1880-1918) :** ప్రముఖ ఫ్రెంచ్ కవి. 20 వ శతాబ్ది ప్రారంభంలో ఫ్రెంచ్ సాహిత్య కళారంగాలలోని అన్ని అభ్యుదయోద్యమాలలోను పాల్గొన్నవాడు. ఈయన తల్లి పోలండ్‌కి, తండ్రి ఇటలీకి చెందినవారు. తన పుట్టుపూర్వోత్తరాలను ఈయన రహస్యంగా ఉంచేవాడు. తండ్రి ఈయనను గురించి పట్టించుకోలేదు. 20 వ ఏట పారిస్ వెళ్ళి విచ్చలవిడిగా తిరిగాడు. 1901 లో జర్మనీలో కొద్ది నెలలు గడపినప్పుడు ఈయనమీద ఆ వాతావరణం ప్రగాఢ మైన ప్రభావం కలిగించి, కవిగా రాణించేట్టు చేసింది. రైన్‌లాండ్ అందానికి ముగ్ధుడై, తర్వాత అక్కడి అడవులను, గాథలను తన కవిత్వంలో అభివర్ణించాడు. అంతకన్న ముఖ్యమైన విషయం ఆనీ ప్లేడెన్ అనే బ్రిటిష్ వనితను ప్రేమించి, లండన్‌వరకు ఆమెను వెంటాడాడు. ఆ ప్రేమ ఫలించలేదు. ఈ ఉదంతాన్ని *షాన్‌సోన్ దు మాల్-ఎయిమ్* అనే సుప్రసిద్ధ కావ్యంగా రూపొందించాడు.

పారిస్ తిరిగి వచ్చిన తరువాత, సాహితీవేత్తలు తరచు వెళ్లే కాఫీ హోటళ్లలో ఆయన రచయితగా పేరు సంపాదించాడు. తన తరం ముఖ్య రచయితలను కలిసి, వారితో స్నేహం చేశాడు. 1903 లో ఒక సాహిత్య పత్రికను నడపడానికి సాహసించాడు. ఆయనకు యువ చిత్రకారులతో కూడా మైత్రి ఏర్పడింది.



వారందరూ తర్వాత సుప్రసిద్ధ చిత్రకారు లయారు. ఉదాహరణకు ఆండ్రీ డిరై, రావుల్ డఫీ, పాబ్లో పికాసో ఆయన స్నేహితులు. తన సమకాలీనులకు హెన్రీ రూసో చిత్రాలను, నీగ్రో శిల్పాలను పరిచయం చేశాడు. పికాసోతో చేతులు కలిపి, క్యూబిస్ట్ కళాసృష్టికి సంబంధించిన సూత్రాలను సాహిత్యంలో పాటించడానికి ప్రయత్నం చేశాడు. 1913 లో క్యూబిస్టు చిత్రకారులపై ఒక పుస్తకం వ్రాశాడు.

ఆయన తొలి సంపుటం, *లాయెషాంటిర్ పూరిసాన్* (1909) మెర్లిన్ అనే మాంత్రికుడు, వివియన్ అనే అప్సరసల మధ్య కవిత్వ ధోరణిలో నడచిన వింతైన సంభాషణ. మరుసటి సంవత్సరంలో ఒక కథల సంపుటి వెలువడింది. తర్వాత నాలుగు పంక్తుల పద్యాల గ్రంథం *లాబెస్టియేర్* వ్రాశాడు. కాని, 1913 లో వ్రాసిన *ఆల్‌కూల్స్* అతని కావ్యాలలో చాలా ముఖ్యమైనది. ఈ

పద్యాలలో ఆయన గడచిన జీవితానుభూతులన్నీ తిరిగి మననం చేసుకుంటాడు.

1914 లో ఆయన సైన్యంలో చేరాడు. 1916 లో తలమీద గాయం తగలడం వలన పారిస్ తిరిగి వచ్చాడు. తన అనుభవాన్ని పురస్కరించుకుని *లా పొయెట్ అసాసిన్* అనే ప్రతీకాత్మకమైన కథను వ్రాశాడు. 1918 లో వెలువడిన *కాలిగ్రామ్స్* అనే పద్యాల సంపుటి యుద్ధానికి సంబంధించిన దృశ్యాలతోను, నూతన ప్రేమగాథలతోను నిండి ఉంది. యుద్ధంలో తగిలిన గాయాల వలన నీరసించి, చివరకు శ్వానిష్ ఇన్ఫ్లుయెంజా వలన ఆయన మరణించాడు.

1917 లో ఆయన నాటకం *లెస్‌మెల్స్ డి టైరిసియస్* ను ప్రదర్శించారు. దానిని ఆయన అధివాస్తవికత అని వర్ణించాడు. ఈ పదం వాడడం అదే మొదటిసారి.

తన కవిత్వంలో ఈయన అనేక సాహసమైన సాంకేతిక ప్రయోగాలు చేశాడు. *కాలిగ్రామ్స్* అనే ఈయన పద్యాలు రంగవల్లులు (designs) గా కూడా కనిపించేవి.! పద్యాలలో అక్షరాలను పంక్తులను నైపుణ్యంతో రంగవల్లుల ఆకారంలో ఏర్పాటు చేయడం వలన రెండు రకాలైన భావం ఏర్పడుతుంది. ప్రచారంలో లేని విధంగా మాటలను పొందుపరచడం వలన ఆయన ఆశ్చర్యాన్ని కలిగించాడు. దీనివలన ఆయనను అధివాస్తవికత (Surrealism) కు వైతాళికుడు అనవచ్చును. అయితే, అప్పుడప్పుడు ఆయన తన అధునాతన సూత్రాలను మరచిపోయి, తన బాధలను, తన మధురానుభూతులను మిక్కిలి సొగసైన గేయాలలో మధురంగా గానం చేశాడు.

ఇ.నా.

**అమాదో, జోర్జ్ (1912--):** బ్రెజిల్ దేశపు నవలా రచయిత. దక్షిణ బాహియా రాష్ట్రంలో జన్మించి కోకో తోటల వాతావరణంలో పెరిగి అక్కడి గ్రామీణ, కార్మిక జన జీవనాన్ని యథాతథంగా చిత్రణ చేశాడు. వామపక్ష సభ్యుడుగా కమ్యూనిస్టు సిద్ధాంతాల ప్రాతిపదికపై అనేక రచనలు చేశాడు. ఫలితంగా ఎన్నో సార్లు కారాగార శిక్ష అనుభవించి దేశాంతర ప్రవాసంలో కొన్నాళ్లు గడిపాడు. *కోకో* (1933), *సుహోర్* (1934), *సెరాస్ దో సెమ్ ఫీన్* (1942) అనే నవలలలో మార్క్సిస్ట్ దృక్పథంలో సామాజిక జాగృతిని చిత్రించాడు. సిద్ధాంత పరమైన రాజకీయాలతో విరక్తి చెంది, 1857 తరువాత బ్రెజిల్‌లోని సామాన్య జన జీవనాన్ని వినోదాత్మకంగా ప్రదర్శించే రచనలకు ఉపక్రమించాడు.

*గాబియేలా, క్రావో ఎ కెనేలా* (1958), *ఓస్ వెల్హోస్ మరీన్ హేయ్ రోస్* (1962) మొదలైన నవలలు వ్రాసి క్రొత్త శైలిని అవలంబించాడు. ఈయన రచనలు ఇంగ్లండ్, అమెరికా, రష్యాలలో బహుళ జనాదరణ పొందాయి.

డి.వి.కె.రా.

**అమిచిస్, ఎడ్మాందో డి (1846-1908) :** సుప్రసిద్ధ ఇటాలియన్ నవలా రచయిత, కథానికా రచయిత, కవి. కొన్ని యాత్రా గ్రంథాలను, బాలురకు పనికి వచ్చే కొన్ని కథానికలను కూడా ఆయన రచించారు.

మొడెనాలోని సైనిక శిక్షణ సంస్థలో విద్యాభ్యాసం పూర్తిచేసుకుని సైన్యంలో ఆయన చేరారు. సైనిక పత్రిక కోసం సైనిక జీవితానికి సంబంధించిన రేఖాచిత్రాలవంటి రచనలు ఆయన చేశారు. *లిటాలియా మిలిటారె* అనే ఆ సైనిక పత్రికకు 1867 లో ఆయన సంపాదకులుగా కూడా ఉన్నారు. 1868 లో *లావీటా మిలిటారే* (ఇటలీలో సైనిక జీవితం - 1982) అనే ఆయన కథల సంపుటం వెలువడింది. 1872 లో *నొవెల్లె* (చిన్న కథలు) అనే మరొక కథా సంకలనం ప్రచురితమయింది. ఈ రెండవ సంకలనం ఆయన ఉత్తమ రచన అని ఆయన విమర్శకులు భావిస్తున్నారు. *పొయిజీ* అనే కావ్య సంకలనం 1880 లో ప్రచురించబడి, ఆయనను కవిగా లోకానికి పరిచయం చేసింది. దీనితో పాటు నవలలు, యాత్రా సాహిత్యం, వ్యాసాలు కూడా అమిసిస్ ప్రచురించారు. 1886 లో ప్రచురితమైన *కుహోరె* అనే పిల్లలకు సంబంధించిన నవల ఉద్వేగపూరితమైంది. ఆర్ద్ర భావనా భరితమైంది. ఈ గాథకు 1876 లో మొదటి ఆంగ్లానువాదం ప్రచురించబడింది. కాని, 1860 లో *పసిపిల్లవాడి మనస్సు* అనే పేరుతో పిల్లవాడి డైరీ రూపంలో సాగిన గాథ ఉత్తమ రచన. ఈ గాథ 25 పైగా భాషలలోకి అనువదించబడింది. ఎందరో చదువరుల హృదయాలను ఆకట్టుకోగలిగింది.

ఎస్.ఎస్.ప్ర.

**అరానీ, జానోస్ (1817-82) :** ప్రముఖ హంగేరియన్ గేయకవి. నిరుపేద రైతు కుటుంబంలో జన్మించి, డెబ్రసెన్‌లో విద్యాభ్యాసం చేశాడు. మధ్యలో చదువు మానివేసి కొద్ది కాలం ఒక సంచార గాయక వర్గంతో కలిసి తిరిగాడు. 1847 లో బహుళ ప్రజాదరణ పొందిన *తోల్డీ* అనే అతని గేయకావ్యం వెలువడడంతో సాహిత్య రంగంలో సుస్థిరమైన స్థానం ఈయన సాధించాడు. ఆ గేయకావ్యంలోని ఇతివృత్తం తోల్డీ అనే ఒక జానపద

వీరుని జీవిత చరిత్ర. ఆ కథలోని ఘట్టాలను తీసుకునే మరి రెండు కావ్యాలను కూడా అరానీ వ్రాశాడు. శాండోర్ పెటోఫీ అనే ఆయన *తోల్డీ* కావ్యాన్ని ప్రశంసిస్తూ ఒక పద్యం వ్రాశాడు. అరానీకి జీవితాంతం ఆయన మిత్రుడుగా ఉన్నాడు.

1848 లో అరానీ హంగేరియన్ విప్లవంలో పాల్గొని కొదికాలం పాటు రైతుల కోసం ప్రభుత్వం నడిపిన ఒక పత్రికకు సంపాదకుడుగా పనిచేశాడు. విప్లవం విఫలం కావడంతో ఉపాధ్యాయ వృత్తిని చే పట్టాడు. 1858 లో హంగేరియన్ అకాడమీకి సభ్యుడుగా ఎన్నుకోబడ్డాడు. తరువాత మకాం నాగేకోరోస్ నుంచి పెస్ట్‌కి మార్చాడు. అక్కడ ఒక సాహిత్య పత్రికకు సంపాదకుడుగా ఉంటూ, అకాడమీకి సెక్రటరీగాను, తరువాత 1870 లో సెక్రటరీ జనరల్‌గాను ఎన్నికయాడు.



*తోల్డీ* అనే మహాకావ్యం మూడు భాగాలుగా వెలువడింది. 1. *తోల్డీ* (1847), 2. *తోల్డీ స్జెరెల్మీ*, (1848-49, తోల్డీ ప్రేమ), 3. *తోల్డీ ఎస్టెపి* (1854, తోల్డీ జీవిత సాయంతనం) . తోల్డీ గొప్ప శరీర దార్ఢ్యం గల యువకుడు. 16 వ శతాబ్దంలో పీటర్ ఇలోస్వాయ్ సెలిమ్స్ రచించిన పద్యరూపమైన చరిత్ర గ్రంథంనుంచి ఆ పాత్రను ఆయన గ్రహించాడు.

*బొలాండ్ ఇస్టోక్* (1850 - Stephen the Fool) అనే మరో మహాకావ్యం హాస్య, కరుణ రస సంభరితం. హంగేరియన్ చరిత్ర పూర్వయుగానికి సంబంధించిన హూణులను గూర్చిన మూడు భాగాలు గల ఒక మహా కావ్యాన్ని వ్రాయడానికి అరానీ పూనుకున్నాడు. కాని, దానిలో *గుడా హలాలా* (గుడా రాజు మరణం) అనే మొదటి భాగాన్ని మాత్రమే 1864 లో ఆయన ప్రకటించాడు. మరణానికి ముందు అరానీ వ్రాసిన *వోస్జికే* అనే మధురమైన గీతాలు జీవితంలో ఆయన వైఫల్యాన్నీ, ఒంటరితనాన్నీ చాటుతున్నాయి.

1882 అక్టోబరు 22 న బుడాపెస్ట్‌లో అరానీ మరణించాడు.

బొ.శ్రీ.

**అరియోస్తో, లుదోవికో (1474-1533) :** ప్రముఖ ఇటాలియన్ కవి. ఇటాలియన్ పునరుజ్జీవనోద్యమం నాటి కళా రీతులకు, తాత్త్విక ధోరణులకు దర్పణం పట్టిన *ఆర్లాండో ఫూరియోసో* అనే మహా కావ్య రచయిత. నాటక రచయితగా కూడా సుప్రసిద్ధుడు.

టిబుల్లస్, హొరేస్ వంటి రోమన్ కవులచేత ఉత్తేజితుడై అరియోస్తో లాటిన్ లో కూడా కొన్ని కావ్యాలు రచించాడు. అయితే అవి అరియోస్తోకు సమకాలికుడైన విద్వత్కవి పీట్రో బెంబో రచనలంత శిల్ప సౌందర్యం కలవి కావు. 1505 నుంచే అరియోస్తో *ఆర్లాండో ఫ్యూరియోస్తో* అనే కావ్య రచన ప్రారంభించాడు. తన జీవిత కాల మంతా దానిని తిరిగి తిరిగి సవరిస్తూ, మెరుగులు పెడుతూ వచ్చాడు. మొదటి సారి అది వెనిస్‌లో 1516 లో ముద్రిత మైంది. 'బట్టావారిమా' అనే ఎనిమిది పాదాలు గల ఛందస్సులో 40 అధ్యాయాలలో ఈ కావ్యం రచించబడింది. రెండవ ముద్రణలోను, మూడవ ముద్రణలోను బెంబో ప్రభావం అరియోస్తో మీద ఎక్కువగా కనిపిస్తుంది. *ఆర్లాండో ఫ్యూరియోసో* అనే కావ్యానికి ఆర్లాండో (రోలాండ్‌కి ఇటాలియన్ వికృతి ఆర్లాండో) నాయకుడు. ఈ కావ్యంలో ప్రధానంగా ఆంజలిక పట్ల ఆర్లాండ్‌కు గల ప్రగాఢమైన ప్రేమ, క్రైస్తవులకు 'పాగన్'లకు మధ్య పారిస్ సమీపంలో జరిగిన యుద్ధం, ఉపనాయికా నాయకులైన రుగ్గీరో, బ్రాడమెంటేల ప్రణయగాథ వర్ణించబడ్డాయి.

1517-25 మధ్య కాలంలో అరియోస్తో 7 వ్యంగ్య పరిహాస కావ్యాలు రచించాడు. వీటిలో మతసంస్థలలోని అవినీతిని వ్యంగ్యంగా ఆయన విమర్శించాడు.

1525 నాటికి అరియోస్తో తగినంత డబ్బు కూడబెట్టుకుని ఫెరారాకు తిరిగి వచ్చి, చుట్టూ తోట ఉన్న ఒక చిన్న ఇల్లు కొనుక్కుని అక్కడ స్థిరపడ్డాడు. బహుశః 1528-30 మధ్య ఎలెస్సాండ్రా బెలూచీని ఆయన వివాహమాడి ఉండవచ్చును. *ఆర్లాండో ఫ్యూరియోసో* మూడవ ముద్రణ 1532 లో వెలువడింది. దానిలో అధ్యాయాల సంఖ్య 46 కు పెరిగింది. ఆ ముద్రణ వెలువడిన కొద్ది మాసాలకే 1533 జూలై 6 న ఫెరారీలోనే అరియోస్తో తుది శ్వాస విడిచాడు.

బొ.శ్రీ.

**అరెటినో, పియట్రో (1492-1556) :** యూరప్ అంతటా ప్రఖ్యాతి పొందిన ఇటాలియన్ కవి, వచన రచయిత, నాటకకర్త. 1492 ఏప్రిల్ 20 న ఇటలీలోని ఎరెజోలో అరెటినో జన్మించాడు. అతని

తండ్రి వృత్తి పాదరక్షల తయారీ. పుట్టుకతో బీదవాడైనా శ్రమపడి పెరూగియాలో సాహిత్యం శ్రద్ధగా చదివి,



1512 ప్రాంతం వరకు చిత్రకళ కూడా అభ్యసించాడు. అవినీతికరమైన ఒక *సానెట్* రచించినందుకు బలాత్కారంగా దేశబహిష్కారం అనుభవించవలసి వచ్చిందని ఒక కథ. అలా కాకుండా ఒక పవిత్ర చిత్రానికి రహస్యంగా ఒక ఐహిక భోగసంబంధమైన అంశాన్ని జోడించినందుకు దేశ బహిష్కారం అనుభవించవలసి వచ్చిందని మరి కొందరు. తర్వాతి జీవితంలో అతనికి పేరు రావడంతో ఇలాంటి కట్టు కథలే మరికొన్ని వెలశాయి. 1516 ప్రాంతంలో ఇతడు రోమ్ వెళ్లి అగస్టినో ఛిగా అనే బ్యాంకరు వద్ద కొలువులో చేరాడు. కొద్ది సంవత్సరాలు కాగానే అప్పటి 'పోప్' అయిన లియోగ్రై సేవలో కుదురు కొన్నాడు. అప్పటికే అతనికి కవిగా పేరు వచ్చింది. 1512 లో పోప్ మరణానంతరం అతని జీవితం కొంతవరకు చిక్కుల పాలయింది. తనకు ఆశ్రయదాత అయిన కార్డినల్-డి-మెడిసి పోప్ పదవికి పోటీ చేయగా అతని పక్షాన ప్రచారం కోసం వ్యంగ్య పదచిత్రాలు తయారు చేసి అందించాడు. పలుచని చెక్కముక్కల మీద వ్యంగ్య కవితలు వ్రాసి పాస్కినో అనబడే వికృతమైన విగ్రహానికి అతికించేవారు. కాని, 'కార్డినల్స్ బృందం' ఆడ్రియన్ VI ను పోపుగా ఎన్నుకొంది. అయినా తన హేళన కవితల వల్ల అరిటెనోకు పేరు వచ్చింది. అతడు తెలివిగా రోము నుంచి పారిపోయి, క్లెమెంట్ VII ఎన్నిక అయ్యే వరకూ తిరిగి రాలేదు. తరువాత అతని రచనలలో సర్వశ్రేష్ఠమైన కామెడీ అనదగిన *లా కార్తీజియానా* వ్రాయడం ప్రారంభించాడు. బహుశః దాని రచనా ప్రణాళిక 1525 లో సిద్ధం అయి ఉండవచ్చు. అదే సంవత్సరంలో మార్క్ ఎంటోనియో గిబెర్టీ కి విరోధి ఒకడు తనను ఎదిరించి అయిదారు చోట్ల గాయాలు చేయడంతో కుడి చేయి పూర్తిగా పనికి రాకుండా పోయింది. దానితో అతని జీవితం దాదాపు ముగిసిందనే చెప్పాలి.

1527 లో తిరిగి రోమ్ వదలిపెట్టి గియోవన్ని డెల్లీ బందేనీరె ను కలసి వెనీస్ నగరం చేరు కొన్నాడు. అక్కడ సాన్సావినో, టిటియాన్ లతో కలిసి మారుమూల ప్రాంతాల్లో నివసించేవాడు. అయినా అప్పుడు అతని జీవితం భోగాలకూ విజయాలకూ నిలయం అయింది. అక్కడ గ్రాండ్ కెనాల్ అనే ఒక భవంతిలో ఉంటూ తన తర్వాతి రచనలలో చాలా భాగం కూర్చాడు. తనకు అనుకూలంగా ఉన్న ఎరిటైన్స్‌తో- అనగా పెక్కురు భార్యలతో- విలాస జీవనం గడిపాడు. వారిలో కెటరినా, సాండెల్లా, ఏరినా, రిక్సియాలు అంటే అతనికి మరీ ఇష్టంగా ఉండేది. 1538 లో నేరారోపణపై అతడు దేశబహిష్కారానికి గురి కాబోయి, కొద్దిలో తప్పించుకొన్నాడు. తర్వాత చివరి సారిగా రోమ్‌కు వెళ్లగా, పోప్ జూలియస్ III అతనిని సాదరంగా ఆహ్వానించి కొంత పింఛను కూడా మంజూరు చేశాడు. 1556 అక్టోబరు 21 న ఎరెటినో చనిపోగా, అతని కళేబరాన్ని వెనీస్‌లోని 'సాన్‌లుండా' చర్చిలో ఖననం చేశారు.

అరెటినో రచనలు అతని సమయస్ఫూర్తిని, దృఢనిశ్చయాన్ని తెలియజేస్తాయి. 16 వ శతాబ్ది ఇటాలియన్‌లలో అతనిని "మూర్తీభవించిన ఉత్సాహం" గా పరిగణించేవారు. ప్రక్రియా వైవిధ్యం ప్రదర్శించిన రచయితగా అరిటెనో ప్రసిద్ధి పొందాడు.

జె.సూ.ప్ర.

**అలెక్సిస్, విలిబాల్డ్ (1798-1871) :** ప్రముఖ జర్మన్ చారిత్రక నవలా రచయిత, సాహిత్య విమర్శకుడు, బహుగ్రంథ కర్త, బహుముఖ ప్రజ్ఞాశాలి. 'అలెక్సిస్ విలిబాల్డ్' ఇతని కలంపేరు. (అసలు పేరు: జార్జ్ విల్‌హెల్మ్ హైనిఖ్ హేరింగ్.)



1798 జూన్ 29 న బ్రెస్‌లోవ్ లో ఈయన జన్మించాడు. తండ్రి హేరింగ్; ఫ్రెంచ్ శరణార్థి కుటుంబానికి చెందినవాడు.

అలెక్సిస్ 1815 నాటి ఉద్యమంలో బెర్లిన్‌లో స్వచ్ఛంద సేవకుడుగా పనిచేశాడు. తరువాత బెర్లిన్,

బ్రెసోల్ విశ్వ విద్యాలయాలలో న్యాయశాస్త్రం అధ్యయనం చేశాడు. కాని తన తొలి రచన *వాలడ్‌మోర్* (1824) విజయవంతం కావడంతో న్యాయవాదవృత్తికి స్వస్తి చెప్పి రచయితగా బెర్లిన్‌లో స్థిరపడ్డాడు. *వాలడ్ మోర్* ఇంగ్లీష్‌లో సర్ వాల్టర్ స్కాట్ వ్రాసిన నవలలకు సేరడీ. "సర్ వాల్టర్ స్కాట్ ఇంగ్లీష్ నవలకు ఇది స్వేచ్ఛానువాదం" అని ప్రచురించి, పాఠకులను ఆయన తమాషా చేశాడు. రచయితగా అలెక్సిస్ కీర్తికి ఆ జోక్ కొంతవరకు భంగం కలిగించినా, తిరిగి 1827 లో స్వతంత్రంగా రచించిన *స్లాస్ అవలాన్* విషయంలో కూడా అదే పొరపాటును తిరిగి ఆయన చేశాడు. ప్రధానంగా బెర్లిన్‌లోనే ఉంటూ *బెర్లినర్ కాన్‌వర్‌సేషన్స్ బ్లాట్* అనే పత్రికకు సంపాదకత్వం నిర్వహిస్తూ, వివిధ సాహిత్య పత్రికలకు వ్యాసాలు, సమీక్షలు రచిస్తూ జీవించాడు. తరువాత అలెక్సిస్ యూరప్ ఖండం అంతటా విరివిగా పర్యటించి వచ్చాడు. ఆ పర్యటనానుభవాలనే *హెర్బ్‌స్టెరై సేడర్క్ స్కాండినేవియన్* (1828 శిశిర ఋతువులో స్కాండినేవియా యాత్ర) వంటి అనేక యాత్రా గ్రంథాలుగా రచించాడు.

అలెక్సిస్ నవలలే కాక, కొన్ని కావ్యాలు, కథానికలు కూడా రచించాడు. ఈయన కథానికల మీద టీక్ (Tieck) ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది.

ఫ్రెడరిఖ్ ది గ్రేట్ కాలానికి చెందిన చారిత్రక నవల *కబానిస్* (1832) తో ఈయన దేశభక్తిపూరితమైన చారిత్రక నవలా రంగంలో అడుగుపెట్టాడు. ఈ నవల ఈయనకు సర్ వాల్టర్ స్కాట్ అంతటి పేరు తెచ్చిపెట్టింది. ఉత్తమ పురుషలో వ్రాయబడిన ఈ నవల నిర్మాణంలో బిగువు లోపించడం, కాల్పనిక దృష్టి వలన కొన్ని తప్పులు దొర్లడం జరిగింది. 1840 నుంచి ఈయన అనేక నవలలు ప్రచురిస్తూ వచ్చాడు. బ్రాండెన్ బర్గ్ లోని ప్రకృతి రామణీయకాన్ని లోకానికి చాటి చెప్పిన తొలి జర్మన్ రచయిత అలెక్సిస్. ఈయన నవలలలో పేర్కొనదగినవి: *డెర్ రోలండ్ ఫాన్ బెర్లిన్* (1840), *డెర్ ఫాల్ వోల్డెమార్* (1842), *డీ హోసెన్ డెస్ హెర్న్ ఫాన్ బ్రెడో* (1846-48). అలెక్సిస్ 1842 లో జూలియస్ ఎడ్వర్డ్ టాట్‌జిగ్ (1780-1849) తో కలసి *డెర్ నెవే పిటవల్* అనే సుప్రసిద్ధ కోర్టు దావాల కథల సంకలనానికి సంపాదకత్వం వహించాడు. వివిధ దేశాలకూ, కాలాలకూ సంబంధించిన నేరాల వెనుక గాథలను వివరించే ఈ రచనా ప్రక్రియ విశేష ప్రజాదరణ పొందింది.

1856 లో పక్షవాతం వచ్చి తురింజియా లోని ఆరమ్‌స్టాట్ కు తరలి వెళ్లి చాలా కాలం అనారోగ్యంతో బాధపడి చివరకు 1871 డిసెంబరు 16 వ తేదీన అక్కడే ఆయన మరణించాడు.

పద్మాకర్

**అలెహంద్రే, విసెంటీ (1898-1984) :** ప్రముఖ శ్పానిష్ కవి. 1977 లో ఇతనికి సాహిత్యంలో నోబెల్ బహుమతి వచ్చింది.

ఒక రైల్వే ఇంజనీరు కుమారుడైన అలెహంద్రే న్యాయ శాస్త్రం చదివి కొంతకాలం న్యాయశాస్త్రాధ్యాపకుడుగా పని చేశాడు. 1925 లో తీవ్రంగా జబ్బుపడి, కోలుకొనే రోజుల్లో కవిత్వం వ్రాయటం ప్రారంభించాడు. '1927 తరం' అనే సాహిత్యోద్యమంలో ప్రముఖ సభ్యుడయాడు. ఇతడి మొట్టమొదటి బృహత్కావ్యం *ప్రణయనాశం* (*La Destruction el amor: 1935*) జాతీయ సాహిత్య పురస్కారానికి పాత్రమైంది. దీనిలోని వస్తువు భౌతిక విశ్వంతో మానవుని తాదాత్మ్యం. *స్వర్గచ్ఛాయ* (*Sombra del paraiso: 1944*) లో కూడా ఇదే వస్తువు. *హృదయ చరిత్ర* (1954) లోను *విశాల క్షేత్రంలో* (*Vasto domini: 1962*) లోను మానవజీవితం మరింత ప్రాధాన్యం వహిస్తుంది. కాలం, మృత్యువు, మానవుని ఏకాకితనం - ఇవే వీటిలోని వస్తువు. *ముగింపు గీతాలు* (*Poemas de La consumacion: 1963*), *లోచూపు సంభాషణలు* (*Dialogos de conocimiento:1974*) మొదలైన ఇతని తుది రచనలలో మృత్యువు, జ్ఞానము, అనుభవము మొదలైన వాటిని గూర్చిన తాత్త్విక జిజ్ఞాస కనిపిస్తుంది. *కలయికలు* (*Los encuentros: 1958*) అనే వచన రచనలో సమకాలీన రచయితలను గూర్చిన శబ్ద చిత్రాలున్నాయి.

ముక్త ఛందస్సులో అందె వేసిన చేయి అయిన అలెహంద్రేపై అధివాస్తవికతా ధోరణుల ప్రభావం గాఢంగా పడింది. స్పెయిన్ అంతర్యుద్ధ సమయంలో (1936-1944) ఇతని రచనలు నిషేధానికి గురి అయినా, 1949 లో ఇతడు శ్పానిష్ రాయల్ అకాడమీకి ఎన్నికయాడు.

చ.తి.

**ఆంజ్యోలియేరి, చెక్కో (1260-1312) :** ఇటాలియన్ భాషలో హాస్య కవితా రచనకు ఆది కవిగా ప్రసిద్ధుడు. మిలిటరీలో కొన్నాళ్లు పనిచేశాడు. దేశం నుంచి బహిష్కృతుడై, న్యాయవ్యవస్థతో కొన్ని ఇబ్బందులు ఎదుర్కొన్నాడు. కొందరు స్త్రీలతో ప్రేమ కలాపాలు సాగించాడు. జూద మన్నా, మద్య మన్నా ఎక్కువ

ఇష్టం. ఆంజ్యోలియెరి చెక్కో జీవితాన్ని గురించి మనకు తెలిసిన విశేషాలు ఇంత మాత్రమే!

నిస్సందేహంగా ఆంజ్యోలియెరి కి కొంచెం కోపం ఎక్కువ! తల్లి దండ్రులపైన, భార్యపైన, ప్రియురాలిపైన, సమకాలీన కవులైన దాంతె, గ్వీడో కాల్వకాంటీ (Guido Cavalcanti) వంటి వారిపైన తన ఆగ్రహాన్ని ఆయన ప్రదర్శించాడు. ఆయన స్వీకరించిన ఇతివృత్తాలపైన, అనుసరించిన పంథాపైన మధ్యయుగానికి చెందిన గొలియర్డ్ సంప్రదాయపు ప్రభావం ఎక్కువ అని కొందరు విమర్శకులు భావించారు. ఈ సంప్రదాయంలో కవులు అధిక్షేపణ ధోరణిలో మోతాదుకు మించిన నిందతో పద్యరచన చేస్తారు. ఆంజ్యోలియెరి కవిత్వంలోని ఈ ధోరణికి ఆయన వ్యక్తిత్వంలోని లోపాలు కారణం కాదు; ఆయన అనుసరించిన సంప్రదాయం దీనికి ముఖ్యకారణం. అయినప్పటికీ, కవితాచాతుర్యం, భాషా పటిమ, జీవితంలోని అసంగతమైన విపరీతాలను గురించిన అవగాహన ఆయన కవిత్వానికి ఒక వినూత్న సౌందర్యాన్ని ఆపాదించాయి.

ఆంజ్యోలియెరి కవితా సంకలనాలు *సొనెటి బర్లెషి ఎరియెలెస్టిసి డై ప్రిమిద్యుసికొలి* (మొదటి రెండు దశాబ్దాల హాస్య, వాస్తవిక కవితలు-1920), *ఇల్ సాన్జోనీ* (కవితా సంకలనం - 1946) అనేవి వెలువడ్డాయి. వీటిలో రెండవ సంకలనంలో 150 సానెట్‌లు ఉన్నాయి. 1970 లో టోమస్ చబ్ అనువదించిన *ది సానెట్స్ ఆఫ్ ఎ హేండ్సమ్ అండ్ వెల్ మేనర్డ్ రోగ్* (అందమైన, మర్యాదస్థుడైన ఒక దగుల్బాజీ గీతాలు) అనే సంకలనం ఇంగ్లీషులో ప్రచురించబడింది.

ఎస్.ఎస్.ప్ర.

**ఆండర్సన్, షెర్‌వుడ్ (1876-1941) :** అమెరికన్ కథానికా రచయిత. అమెరికా మధ్య రాష్ట్రాలలోని చిన్న పట్టణాలలో జీవన యాత్ర సాగించే మధ్య తరగతి సామాన్య పౌరుల అనుభవాలనూ, మనః ప్రవృత్తులనూ విశ్లేషిస్తూ *వైన్స్‌బర్గ్ ఒహియో* (1919) అనే కథా సంపుటిని ఆయన వెలువరించాడు.

ఒక రంగుల కార్ఖానాలోనూ, ఒక ప్రకటనల కంపెనీలోనూ, ఒక చిల్లర వ్యాపార సంస్థలోనూ ఉద్యోగాలు చేసి, నాగరక పారిశ్రామిక వాణిజ్య వ్యవస్థలో వ్యక్తిత్వాన్ని కోల్పోయి విసిగి వేసారిన సగటు జీవుల పలాయన ప్రవృత్తినీ, నైరాశ్యాన్నీ ప్రతిబింబించే సన్నివేశాలు ఆండర్సన్ కథలకు ముఖ్య ప్రేరణలు. సందేహాలూ, ఆందోళనలూ, క్లిష్ట సమస్యలూ సృష్టించిన విష వలయాలలో చిక్కుకొని స్వేచ్ఛాభిముఖంగా మహా ప్రస్థానం చేసే విండీ మాక్ఫర్సన్ లాంటి విచిత్ర పాత్రలను ఆయన సృష్టించాడు. సమాజం విధించే నిషేధాలకు, దమన ప్రక్రియలకు లోనై భావవ్యక్తీకరణ సామర్థ్యం కోల్పోయిన మూగ మనసులలోని అణగారిన కోరికలనూ, అంతశ్చేతనలో చెలరేగే కలవరాలనూ ఫ్రాయిడ్ ఆవిష్కరించిన మనోవైజ్ఞానిక సిద్ధాంతాలకు అనుగుణంగా చిత్రీకరించడంలో ఆండర్సన్ సిద్ధహస్తుడు.

మానవుడి అంతర్యంలో అణగి ఉన్న చీకటి కోణాలను అకస్మాత్తుగా, అసంకల్ప ప్రతీకార చర్యగా దీప్తిమంతం చేసే కాంతి పుంజాలను ప్రసరిస్తూ అజ్ఞాత దిగంతాలను అన్వేషించే భావుకుడు ఆండర్సన్. సహజ సారళ్యాన్నీ, ధారాళ మనోభావ ప్రకటననూ కోల్పోయి, హింసకూ, పరపీడన పరాయణత్వానికీ, దుష్కృత్యాలకూ పాల్పడి 'విరోధి మానవులు' గా పర్యవసించే ప్రమాదాన్ని ఆండర్సన్ తన కథలలో మన దృష్టికి తెస్తాడు. యాంత్రికతకూ, సామాజిక శోషణకూ ప్రత్యామ్నాయంగా స్వాభావికతనూ, స్వచ్ఛందతనూ, సహృదయతనూ మానవ సంబంధాలకు ప్రాతిపదికగా ఆయన నిర్దేశిస్తాడు.

పాత్ర చిత్రణలో, సన్నివేశ కల్పనలో, సంభాషణా శైలిలో, కథా సంవిధానంలో, రచనా శిల్పంలో ప్రజావాణికీ, జీవన వాస్తవికతకూ చేరువైన ప్రక్రియలను ప్రయోగించి *పూర్‌వైట్* (1920), *డార్క్ ల్యాఫర్* (1925) మొదలైన నవలలను గూడా ఆండర్సన్ వ్రాశాడు. హెమింగ్‌వే, డాస్ పాసోస్, ఫాక్నర్ మొదలైన ప్రఖ్యాత నవలా రచయితలు ఆయన అడుగు జాడలలో నడచి అత్యున్నత స్థాయిని అందుకున్నారు.

డి.వి.కె.రా.

**ఆండెర్సెన్, హాన్స్ క్రిస్టియన్ (1805-75) :** ప్రముఖ డేనిష్ రచయిత; దివ్య లోకాల కథలు వ్రాయడంలో అసదృశ ప్రతిభ ప్రదర్శించిన రచయిత. విశ్వవ్యాప్తంగా ఈయన కథలు ప్రసిద్ధి పొందాయి. రూపక రచనతో పాటు నవలలు, కవిత్వం, యాత్రా వృత్తాంతాలూ రచించాడు. స్వీయ చరిత్రాత్మకమైన రచనలు ఎన్నో చేశాడు. డెన్మార్క్ దాటి ఈ రచనలు పరిచితం కాకపోయినా ఈయన రచించిన దేవలోక వ్యక్తుల కథలు మాత్రం ఎన్నో సార్లు ఇతర భాషలలోకి అనువాదం పొందాయి. వివిధ భాషలలోకి పదే పదే తర్జుమా పొందిన కథలివి.

ఆండెర్సెన్ జన్మించింది ఒక మురికివాడలో. ఘనీభవించిన ఆ నాటి వర్గవ్యవస్థలో తన ఉనికిని నిలబెట్టుకోడం

కోసం ఆయన సంకులమైన పోరాటం సాగింపవలసి వచ్చింది. ఆయనను మొట్టమొదట ఆదుకొని విశేష సహాయం చేసినవ్యక్తి జొనాస్ కాలిన్. కోపన్‌హాగన్ లోని రాయల్ థియేటర్ డైరెక్టర్లలో ఆయన ఒకరు. నటుడుగా రాణిద్దా మన్న ఉత్సాహంతో, కొండంత ఆశతో ఆండెర్సెన్ ఆయనను ఆశ్రయించాడు. కాని ఆ ఆశ అడియాస అయింది. విరాళాలు సేకరించి, కాలిన్ ఇతడిని స్కూలుకు పంపించాడు. కాని ఆ పాఠశాల ప్రధానోపాధ్యాయుడు మంచివాడు కానందువల్ల ఆండె ర్సెన్ పాఠశాల చదువులో ఆశాభంగం చెందినా, 1828 లో కోపెన్‌హాగన్ విశ్వవిద్యాలయంలో చేరడానికి తద్వారా అవకాశం లభించింది.

ఆ మరుసటి సంవత్సరం సాహిత్యంలో ఆయనకు పేరు తెచ్చిన మొదటి పుస్తకం ప్రకటించబడింది. *1828, 29 లలో హాల్‌మన్ కాలువ నుంచి అమేగర్ ద్వీపం తూర్పు తీరానికి నడక* అనేది ఆ రచన. జర్మన్ రచయిత ఇ.టి.ఎ. హాఫ్‌మన్ ధోరణిలో సాగిన ఆ రచన అద్భుత సన్నివేశాత్మకం. ఆ రచన ద్వారా ఆయనకు గొప్ప గుర్తింపు వచ్చింది. ఆ రచన చెప్పుకోదగి నంత విజయం సాధించింది. ఆ తరువాత ఆండెర్సెన్ నాటక రచనకు పూనుకొన్నాడు. రెండు సార్లు ఆయ నకు అపజయం ఎదురైనా *ది ములేతన్* (1840) అనే రచనతో మంచి పేరు వచ్చింది. బానిసత్వపు దుర్మార్గాన్ని గురించిన రచన ఇది. అయితే రంగస్థలం ఆయనకు అనుకూలక్షేత్రం కాలేకపోయింది. చాలా కాలం వరకూ ప్రధానంగా ఆయన నవలా రచయితగానే గుర్తింపు పొందాడు. ఆయన రచించిన చాలా నవలలు స్వీయగాథాత్మకాలే! 1837 నుంచి 45 వరకూ ఆయన రచించిన మూడు నవలలు ప్రసిద్ధి పొందాయి. ఇవి కొన్ని ఇంగ్లీషులోకి కూడా అనువాదం పొందాయి. విదేశ యాత్రా పర్యటనానుభవాలు కూడా ఆయన చాలా ప్రకటించాడు. ఆ తర్వాత ఆయన దేవదూతల అద్భు తేతివృత్తాంతాల కథలు వ్రాశాడు. 1835 నాటికే ఈ అద్భుత గాథలు ప్రకటించినా, తర్వాత 8 సంవత్సరాలకు గాని వాటికి విశేషమైన పేరు ప్రఖ్యాతులు రాలేదు.

ఈ కథలు జానపద గాథా సన్నివేశాత్మకంగా పైకి కనిపించినప్పటికీ, నైతిక వాస్తవికతను చిత్రించేవే కాని, కేవలం ఊహాగానాత్మకమైనవి కావు. ఈయన ఈ ప్రక్రియకు బాగా వ్యాప్తి కలిగించాడు (1858-72). 1843, 1847, 1852 లలో వీటి పునర్ముద్రణలు వెలువడ్డాయి. కొన్ని కథలు సౌందర్యం, మంచితనం అంతిమ విజయం పొందడం గురించి (ఉదా. *మంచు రాణి*) వ్రాయబడినా, చాలావరకు నిరాశోపహతంగానూ, విచారకరమైన ముగింపులతోనూ ఈ కథ లుంటాయి. ఇలా కనిపించే కథ లన్నిటిలోనూ స్వీయజీవిత ఛాయలు కనిపిస్తాయి. జీవితంలో ఆశ, ఉత్సాహం లేకపోవడమే కాక, వ్యక్తిగత జీవితంలో ఆయన చాలా బాధ లనుభ వించాడు. ఆండెర్సెన్ వివాహ మాడలేదు. కాని ప్రేమ వ్యవహారాలలో మాత్రం చిక్కుకున్నాడు. స్వీడిష్ వనిత జెన్నలిండ్ ఇటువంటి వారిలో ఒకరు.

ఆయన వ్రాసిన ఏ రచననూ చించి పారేయలేదు కాబట్టి ఆయన డైరీలు, వేల కొలది ఉత్తరాలతో పాటు సాహిత్య రచన లన్నీ ముందు తరాల వారికి లభిస్తు న్నాయి. వీటివలన ఆయన చాలా ఆశాపరుడు, గర్విష్ఠి, నరాల ఉద్రిక్తత కలవాడు, అహంభావి, సుకుమార మన స్కుడు, కుశాగ్రబుద్ధి అని తెలుస్తూంది. ఈయన పరిసరాల పరిశీలనాశక్తి అమోఘం.

మంజుశ్రీ

**ఆంద్రోచి, ఇవో (1892-1975)** : శ్లావిక్ నవలా రచయిత, కథానికా రచయిత. 1961 లో సాహిత్యానికి నోబెల్ బహుమతి గ్రహీత.



జాగ్రెబ్, వియె న్నాలలో విద్యా భ్యాసం చేసే రోజు లలోనే ఇతడు పద్య, గద్య రచ యితగా గుర్తింపు పొందాడు. మొదటి ప్రపంచయుద్ధ కాలంలో అప్పటి ఆస్ట్రో-హం గేరియన్ ప్రభుత్వం రాజకీయ కార్యకలాపాలకై ఈయనను నిర్బంధించింది. కారాగారవాస సమయంలో (1918) ఇతడు రచించిన *ఎక్స్‌పోంటో* (Exponto) అనే జైలు అనుభవాలతో కూడిన వచన గేయకావ్యం ఈయనకు మంచిపేరు తెచ్చింది. 1920 నుండి కథానికా, నవలా రచయితగా ప్రసిద్ధు డయాడు. యుద్ధా నంతరం స్వతంత్ర ప్రభుత్వోద్యోగిగా రోం, బుఖారెస్ట్, బెర్లిన్, మాడ్రిడ్, జెనీవా నగరాలు దర్శించాడు. ఈ పర్యటనల అనుభవాలన్నీ ఇతని రచనలలో చోటుచేసు కున్నా, ప్రధానంగా ఇతని జన్మస్థలమైన బొసోనియా

రాష్ట్రమే ఈయన కథలకు రంగస్థలం. ద్వితీయ ప్రపంచ యుద్ధసమయంలో కూడా ఇతడు గృహ నిర్బంధానికి లోనయాడు. ఆ సమయాన్నంతా ఇతడు సాహిత్య రచనకు వినియోగించాడు. బొసోనియా యాత్రలు గా ప్రసిద్ధమైన *బోస్నియా కథ, డ్రీనా నది వంతెన, దళిత వనిత* అనే మూడు నవలలలో బోసోనియా ప్రజల ఆశలు, ఆకాంక్షలు, నష్టాలు, కార్పణ్యాలు అన్నీ అత్యంత హృదయస్పర్శిగా చిత్రించ బడ్డాయి. అందుకే నోబెల్ ప్రశస్తిలో 'తన దేశ చరిత్రను, దేశీయ జీవన గతులను మహా కావ్య ధాటిలో నిబద్ధం చేశా' డని ఈయనను ప్రశంసించారు. భవిష్యత్తును గూర్చిన భయం, ఉదాత్త రచనల ద్వారా సంకటాల నధిగమించగల మనే ఆశాభావం ఈయన రచనలలో కనిపిస్తాయి. రెండవ ప్రపంచ యుద్ధానంతరం ఈయన పార్లమెంటు సభ్యు డయాడు. రచయితల సంఘం, ప్రచురణ కర్తల సమాఖ్యల నుండి పారితోషికాలు కూడా పొందాడు.

చ.తి.

**ఆకెన్సైడ్, మార్క్ (1721-70) :** ఆంగ్లకవి, ప్రముఖ వైద్యుడు. టైన్ నదీ తీరాన ఉన్న న్యూకేజిల్‌లో 1721, నవంబర్ 9 న మార్క్ ఆకెన్సైడ్ జన్మించాడు. అతని తండ్రిది కసాయివృత్తి. 7 సంవత్సరాల వయస్సులో అతని కాలు ఒకటి శాశ్వతంగా దెబ్బ తింది. ఆకెన్సైడ్ చిన్నప్పటి నుంచి బాలమేధావిగా గుర్తింపు పొందాడు. మొదట మత బోధకుడు కావాలని న్యూకేజిల్ స్కూలులో చేరాడు. 16 ఏళ్ళ వయస్సులోనే (1737) పత్రికలలో అతని కవితలు అచ్చు అవుతూ ఉండేవి. వాటిలో ముఖ్యమైనది *వర్చ్యుఓసో* (1737). ఈ పద్యాలు పఠితలకు స్పెన్సర్ పద్యాలను గుర్తుకు తెచ్చేవి. 1739 లో కొందరు స్నేహితుల ధన సహాయంతో ధార్మిక విద్యను అభ్యసించడానికి ఎడింబరో వెళ్ళాడు. కాని, అక్కడ మనస్సు మార్చుకొని వైద్య విద్యను అభ్యసించాడు. తన స్నేహితుల సొమ్మును తిరిగి వారికి ఇచ్చి వేశాడు. విద్యను చురుకుగా అధ్యయనం చేసి అతి త్వరలో తన 20 వ యేట న్యూకేజిల్‌లో వైద్యవృత్తి చేపట్టాడు. 1743 లో లండన్ చేరి ఫిజీషియన్‌గా స్థిరపడి బాగా ధనం సంపాదించాడు.


Fisher, 1772.

1744 లోనే తన ప్రధాన కవిత *ది ప్లెజర్స్ ఆఫ్ ఇమాజినేషన్* ప్రచురించాడు. అది ముక్తచ్ఛందస్సులో మూడు అధ్యాయాలు గల రెండు వేల పంక్తుల పద్య కావ్యం. తన 17 వ యేట ప్రారంభించి, 23 వ ఏట దానిని ముగించాడు. అప్పటి కతడు పరిణత మనస్కుడు కాకపోవడంచేత ఎడిసన్, షాఫ్ట్స్‌బరీల అభిప్రాయాలను ఇతడు ఎరువు తెచ్చుకొన్నట్టు ఈ కవితలో కన్పిస్తుంది. డాడ్స్లీ (Dodsly) అనే ప్రచురణకర్త ఈ కవితకై ఆకెన్సైడ్‌కు 120 పౌనుల మొత్తాన్ని ముట్టచెప్పాడుట. పైగా 23 ఏళ్ళకే కవిగా మంచి ప్రసిద్ధి కూడా వచ్చింది. 1744 లో లెయ్‌డిన్ నగరం (Leyden) వెళ్లి కొద్ది మాసాలలోనే డాక్టరు పట్టా పొందాడు. నార్తాంప్టన్‌లో వైద్యుడుగా స్థిరపడాలని వ్యర్థ ప్రయత్నం చేసి, మళ్లీ లండన్ తిరిగి వచ్చాడు. 1744 లో అతని *ఎపిసిల్ టు క్యూరియో* వెలువడింది. తర్వాత కొన్ని *ఓడ్* ల సంకలనం ప్రచురింపబడింది. కాని నడి వయస్సులోనే అతని కవితా జీవనం ముగిసిపోయింది. తన తీవ్రధోరణి కారణంగా, వృత్తిలో రాణించినా కవిగా అతడు అంతగా రాణించ లేకపోయాడు. అతని కవిత్వం విద్వాంసులను తప్ప సామాన్య పాఠకులను ఆకట్టుకోలేకపోయింది. వైద్యవృత్తికి సంబంధించిన కొన్ని గ్రంథాలు కూడా అతడు రచించాడు.

1753 లో కేంబ్రిడ్జ్ యూనివర్శిటీ నుంచి ఎం.డి (M.D.) పట్టా పొంది రాయల్ సొసైటీ ఫెలో గా ఎన్నుకోబడ్డాడు. 1754 లో కాలేజ్ ఆఫ్ ఫిజిషియన్స్ (College of Physicians) కు ఫెలో గా ఎన్నిక అయాడు. తర్వాత గుల్ స్టోనియన్ క్రునియన్ లెక్చరర్‌గా కూడా పని చేశాడు. 1757 లో తన *ప్లెజర్స్ ఆఫ్ ఇమాజినేషన్* గ్రంథాన్ని సంస్కరించి రెండవ ముద్రణ వెలువరించాడు. అందులో కొన్ని పంక్తులు తర్వాతి కాలంలో వర్డ్స్‌వర్త్‌కు ప్రేరకాలు అయాయి. దానికి కవిత్వ పరంగా కంటె రాజకీయ, నైతిక, సాంఘిక పరంగా ఎక్కువ విలువను ఇస్తారు. 1759 లో అతడు సెయింట్ థామస్, క్రైస్ట్ హాస్పిటళ్లకు చీఫ్ ఫిజీషియన్ అయి, 1761 లో మహారాణికి వైద్య సలహాదారుగా నియమింపబడ్డాడు. 50 ఏళ్లలోపునే 1770 లో అతడు విష జ్వరంతో మరణించాడు. అతనిని లోకం కవితా గంధ శూన్యుడైన

కవి (Impoetic poet) గా గుర్తించింది. అతని *హిమ్ టు ది నైయాడ్స్* మంచి రచన. *పెరిగ్రిన్ పికిల్* అనే కృతిలో 44 వ అధ్యాయంలోని స్మాలెట్ అనే డాక్టరు పాత్రలో ఆయన ఆత్మకథ కొంత కనిపిస్తుంది.

చిం.వెం.

**ఆక్సకోవ్, సెర్గెయీ టిమొఫ్యెవిచ్ (1791-1859) :** ప్రముఖ రష్యన్ నవలా రచయిత. జమీందారీ కుటుంబంలో పుట్టిన ఆక్సకోవ్ సాంప్రదాయిక విద్య నభ్యసించి కొంత కాలం న్యాయశాఖలో అనువాదకుడుగా పనిచేశాడు. 1812 లో యుద్ధంలో పాల్గొన్నాడు. 1839 లో వారసత్వంగా పెద్ద ఆస్తి లభించడంతో ఉద్యోగం మానివేసి, కవులను, కళాకారులను చేరదీసి వారితో కాలక్షేపం చేస్తూండే వాడు. మొదట్లో బాయ్‌లో (Boileau), మోలియర్ (Moliere)ల అనువాదాలూ, పాతకాలపు అభిరుచులు ప్రకటించే కవిత్వాలూ, నాటకరంగ సంబంధమైన వ్యాసాలూ వ్రాసేవాడు. వీటివల్ల ఇతడి కేమీ గుర్తింపు రాలేదు. ఇంతలో ఇతని కుమారులు కాన్‌స్టాన్‌టిన్ (Konstantin), ఇవాన్ (Ivan)లు స్లావోఫిల్ ఉద్యమంలో ప్రముఖ కవులుగా, నాటక కర్తలుగా ప్రసిద్ధు లయారు. కొడుకుల నుండి లభించిన స్ఫూర్తితో ఇతడు శ్లావ్ నవచైతన్య స్రవంతిలో చేరి నవలా రచయితగా ప్రసిద్ధి పొందాడు. నికొలాయ్ గోగోల్ (Nikolay Gogol) కు సన్నిహితుడైన ఆక్సకోవ్ మీద గోగోల్ ప్రభావం గాఢంగా ఉంది. *మంచు తుఫాను* (Binan - 1834), *ఒక రష్యన్ కుటుంబ గాథ,* (Semexnaya khronice - 1856) *గత స్మృతులు* (Vospominani: 1856) మొదలైన ఇతడి రచన లన్నిటిలోను తన చిన్ననాటి, తన తండ్రి తాతలనాటి రష్యన్ గ్రామీణ జీవితాన్ని, వాస్తవిక గాథలను, అనుభవాలను కల్పనతో జోడించి నవలలుగా రూపొందించాడు. సరళమైన భాష, వాస్తవికతా స్ఫూర్తి, సన్నివేశ సూక్ష్మాంశ స్మరణ, నిశితమైన ఆత్మ విమర్శ, కథా కథనంతో తాటస్థ్యం అనే గుణాల వల్ల ఇతడి నవలలు జనాదరణ పొందాయి. రష్యన్ నవలా రంగంలో ఈ ధోరణికి ఇతడే ఆద్యుడు. *గోగోల్ స్మృతులు* లో గోగోల్ సంక్లిష్ట వ్యక్తిత్వాన్ని చక్కగా చిత్రించాడు. వేట, చేపలు పట్టటం, సీతాకోకచిలుకలను పెంచటం మొదలైన వినోద వ్యాపకాలను గురించి కూడా ఆక్సకోవ్ ఆసక్తికరమైన రచనలు చేశాడు.

చ.తి.

**అఖ్మతోవా, ఆనా (1889-1966) :** రష్యన్ కవయిత్రి. ఇది ఈమె కలంపేరు. అసలు పేరు అన్నా ఆంద్రియెన్నా గోరెన్కో. ఈమె మరణానంతరం రష్యన్ కవయిత్రులలో తలమానికంగా గుర్తింపబడింది.

ఈమె 11 వ ఏటనే కవిత్వం వ్రాయడం ప్రారంభించింది. 20 వ ఏట 'పరాకాష్ఠా వాది' కవుల సంఘంలో సభ్యురాలైంది. ఆ సమాజపు ప్రముఖుడైన నికొలాయ్ గుమిల్యోవ్‌ను వివాహమాడింది. కాని త్వరలోనే అతనికి విడాకులిచ్చింది. పరాకాష్ఠా వాదులు సాహిత్యంలో గూఢవాదం, అస్పష్టత, సాంకేతికత, కృత్రిమత్వాలను నిరసించి సౌందర్యం, స్పష్టత, సమగ్రత, సారళ్యం అనే గుణాలను అభిమానించేవారు. ఆనా కవిత్వంలో ఈ గుణాలు పుష్కలంగా ఉండేవి. ఈమె కవితలలో ప్రధాన వస్తువు ప్రణయం. అందులోనూ భగ్నప్రేమ ఈమెకు ఇష్టం. రచనలోని ఆత్మీయత, స్పష్టత, కళాత్మకతల వల్ల సాధారణీకరణాన్ని ఈమె సాధించగలిగేది. తొలి కవితా సంకలనాలైన *సంజవేళ* (1912), *జపమాలతోనే* (1914) ఈమె ప్రఖ్యాతురాలైంది. తరువాత ప్రణయానికి తోడు సామాజిక చైతన్యం, దేశభక్తి, మత విషయాలు కూడా ఆమె కవిత్వంలో చోటుచేసుకున్నాయి. అధికారిక సోవియెట్ విమర్శకులు మాత్రం ఈమెను బూర్జువా కవయిత్రిగానే పరిగణించేవారు. దేవుడు, ప్రణయం కవితా వస్తువులుగా ఉన్నందున ఈమెను 'అర్ధ సన్యాసిని, అర్ధ వేశ్య' అని ఆక్షేపించేవారు. కొంత కాలం ఈమె సోవియెట్ రచయితల సంఘం నుంచి వెలివేయబడింది. దానికి తోడు 1921 లో ఈమె మాజీ భర్త నికోలాయ్ సోవియెట్ వ్యతిరేక కుట్రలో పాల్గొన్నాడన్న అభియోగంపై మరణ శిక్షకు గురికావటంతో ఈమె పరిస్థితి మరింత క్లిష్టమైంది. ద్వితీయ ప్రపంచ యుద్ధం ప్రారంభ మయ్యేవరకు ఈమె కలం మౌనం వహించవలసివచ్చింది. యుద్ధ సమయంలో దేశభక్తి, యుద్ధప్రచారంతో కూడిన రచనలతో మళ్ళీ ఈమె వెలుగులోకి వచ్చింది. యుద్ధానంతరం స్టాలిన్ నిరంకుశత్వంలో ప్రజ లనుభవించిన యాతనలను గురించి



శోక గీతం రచించినందున తిరిగి అజ్ఞాతవాసంలోకి పోవలసివచ్చింది. 1950 ప్రాంతాలలో రాజకీయ నేరాలకై సైబీరియాలో ప్రవాసశిక్ష విధించబడిన తన కుమారుని కాపాడుకొనేందుకై ఈమె తిరిగి స్టాలిన్‌ను స్తోత్రగానం చెయ్యటం ప్రారంభించింది. 'స్టాలిన్ ఎక్కడనో అక్కడనే స్వాతంత్ర్యం, శాంతి, విశ్వవైభవం' అని కూడా ఆమె వ్రాసింది. కాని ఆమెకు గల 'అర్ధ సన్యాసిని, అర్ధ వేశ్య' అన్న బిరుదుమాత్రం ఆమెను వదలలేదు. స్టాలిన్ మరణానంతరమే ఆమె మళ్ళీ వెలుగులోకి రాగలిగింది. *నాయక రహిత కావ్యం* అనే అత్యుత్తమకావ్యం ఈమె 1940-1962 ల మధ్య వ్రాసినా, 1976 వరకూ ప్రకటితం కాలేదు. ఇది 20 వ శతాబ్దపు ఉత్తమ కావ్యాలలో ఒకటిగా పరిగణింప బడుతూంది. దీనిలో ఒక యువకవి ఆత్మహత్య ఇతివృత్తం. ఆత్మకథ, కల్పన సమపాళ్లుగా మిశ్రితమైన ఈ కావ్యంలో ఆనా సాహిత్య సిద్ధాంతాలూ, ఆశయాలూ, లక్ష్యాలూ ప్రకటితమైనవి. జీవిత చరమదశలో ఇటలీనుండి ఒక అంతర్జాతీయ పురస్కారం, ఆక్స్‌ఫర్డ్ గౌరవ డాక్టరేట్ ఈమెకు లభించాయి. చనిపోయేనాటికి ఈమెకు సమకాలీన సర్వోత్తమ రష్యన్ కవయిత్రిగా గుర్తింపు కలిగింది. మరణానంతరమే ఈమె రచనలు ఇతర భాషలలోకి అనువదింపబడి ఈమెకు ప్రపంచ ప్రఖ్యాతి లభించింది. రవీంద్రనాథ టాగూర్ రచనలను కొన్నింటిని రష్యన్ భాషలోకి అనువదించటంతో ఈమె భారతీయులకు సన్నిహితురాలైంది.

చ.తి.

**అగస్టినీ, డెల్‌మిరా (1886-1914)** : దక్షిణ అమెరికాలోని 'ఉరుగ్వాయ్' దేశపు ప్రఖ్యాత కవయిత్రి. 'మోడర్నిస్టా' అనబడే ఆధునికీకరణోద్యమానికి మార్గ నిర్దేశం చేసి, కామోద్దీపకమైన శృంగారాన్ని ప్రేరణగా స్వీకరించి సమకాలీన సాహిత్యంలో సంచలనం సృష్టించిన రచయిత్రి. వియోగ సంయోగావస్థలలో ప్రేమికుల లైంగిక మనో వ్యాపారాలను బాహాటంగాను, నిర్మొహమాటంగాను ఈమె చిత్రించింది. *ఎల్ లిబ్రో బ్లాంకో* (1917), *కాంటోస్ డి లా మన్యానా* (1910), *లోస్ కాలికెస్ వాసియోస్* (1913) ఈమె కవితా సంపుటాలు. భర్తతో విడిపోయి చివరకు అతని చేతనే హత్య గావింపబడింది అగస్టినీ.

డి.వి.కె.రా.

**ఆగ్నోన్, ష్మూయెల్ యూసెఫ్ (1888-1970):** ప్రముఖ ఆధునిక హీబ్రూ కథానికా రచయిత. ఆగ్నోన్ ష్మూయెల్ యూసెఫ్ ఇతని కలం పేరు. ఇతని అసలు పేరు శామ్యూల్ జోసెఫ్ జాక్జెక్స్. 1966 లో నెల్లీ సాక్స్ తో కలసి ఈతడు సాహిత్యానికి నోబెల్ బహుమతిని అందుకున్నాడు.

వ్యాపారులు, మత గురువులు, పండితులు జన్మించిన ఒక పోలిష్ యూదు కుటుంబంలో ఆగ్నోన్ జన్మించాడు. 1903-06 మధ్య అతడు సొంత పేరుతోనూ, అనేక కలం పేర్లతోనూ యిడ్డిష్ (Yiddish) లోనూ, హీబ్రూభాషలోనూ రచనలు చేయనారంభించాడు. 1907 లో ఆతడు పాలస్తీనాలో స్థిర పడిన తరువాత ఆగ్నోన్ అన్న పేరుతో రచనలు చేయనారంభించాడు. నాటకీయమైన, దర్శనాత్మకమైన, శిల్ప మనోహరములైన తన రచనలలో బైబిలు భాషను ఆయన ఉపయోగించాడు.



పాలస్తీనా వాతావరణంతో కూడిన అతని తొలికథ *అగునాట్* (1908 - త్యజింపబడ్డ భార్యలు) ఆతనిని మొదటి సారి సాహిత్యలోకానికి పరిచయం చేసింది. అతని తొలి పెద్ద నవల *హఖ్‌నాసత్ కాల* (రెండు భాగాలు: 1919). ఆ నవలలోని నాయకుడు రెబ్ యుడెల్ హసిద్. ఆస్ట్రో హంగేరియన్ సామ్రాజ్యాలలో యూదులు నివసించే బస్తీలలో దేశ ద్రిమ్మరిగా తిరిగే ఒక యూదునికి ఇతడు ప్రతీక. అతని రెండవ నవల *ఓరియా నటా లలూన్* (1938 ఆ రాత్రికి ఒక అతిథి) లో ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం యూరపియన్ యూదుల లౌకిక, నైతిక పతనం వర్ణింపబడింది. 1950 లో దీనికి బియాలిక్ బహుమతి లభించింది. ఆతని మూడవ, బహుశః అత్యుత్తమమైన - నవల *త్మోల్ షిల్‌షమ్* (1945; మొన్నటి దినం). నూతన మానసిక, నైతిక వాతావరణాన్ని వంట పట్టించుకోడంలో పాశ్చాత్య ప్రభావానికి లోనవుతూన్న ఒక యూదుని సమస్యలనూ, విముక్తిని సాధించిన ఇజ్రాయిల్ సమస్యనూ ఈ నవల చర్చిస్తుంది. ఇది అతని తొలి రచనలలో లాగ వాస్తవికమైన కథ కాదు; ప్రతీకాత్మకమైన ఆత్మకథా కాదు. అయినా ఇందులో ఆగ్నోన్ వాస్తవిక, ఆధ్యాత్మిక జీవితానుభవాల రూపం బోధపడుతుంది.

ఆగ్నోన్ వ్రాతప్రతులను, అచ్చు ప్రతులను చూస్తే ఆతని ప్రతి రచన తిరిగి తిరిగి దిద్దినట్లు, మార్చి వ్రాసినట్లు తెలుస్తుంది. అందుకే ఆతని సంపూర్ణ రచనలు - ఒకటి 11 భాగాలుగానూ, మరొకటి 8 భాగాలుగానూ ప్రకటింపబడి, వేర్వేరు పాఠాలతో ఉన్నాయి. మొదటిది బెర్లిన్, జెరూసలం, టెల్ అవీవ్ లలో ప్రకటింపబడగా, రెండవది (8 భాగాలు) టెల్ అవీవ్‌లో ప్రకటింపబడింది. ప్రాత బడిన పదాలతో కూడిన అతని శైలి అనువాదానికి తేలికగా కొరుకుడు పడదు. కాని, అనువాదంలో కూడా ఆతని రచన ఎంత శక్తి మంతమయిందో మనకు ప్రస్ఫుటంగా బోధపడుతుంది.

ఒక జానపద కథల సంకలనానికీ, యూదుల మత గ్రంథాలనుంచి సేకరించిన కొన్ని రచనలకూ ఆగ్నోన్ సంపాదకత్వం వహించాడు. 1958 లో అతని ఆత్మ కథాత్మకమైన ఒక పదచిత్రం కూడా వెలువడింది.

వ.మం.

**ఆచెబె, చినువా (1930) :** నైజీరియా దేశపు విశ్వవిఖ్యాత నవలా రచయిత. బ్రిటిష్ సామ్రాజ్య వ్యవస్థలో వలస పాలనలో ఇబో జాతి ప్రజల సంప్రదాయాలు ఛిన్నభిన్నమై పాశ్చాత్య నాగరకతా ప్రభావం వలన ఉత్పన్నమైన అనిశ్చిత పరిస్థితులను ప్రదర్శించే నాలుగు నవలలను ఈయన వ్రాశాడు. అవి: *థింగ్స్ ఫాల్ అపార్ట్* (1958), *నో లాంగర్ ఎట్ యీజ్* (1960), *ఆరో ఆఫ్ గాడ్* (1964); *ఏ మాన్ ఆఫ్ ది పీపుల్* (1966).

పాశ్చాత్య సాహిత్యపరులు ఆపాదించిన "అంధకార ఆఫ్రికా" అనే అపవాదును తిరస్కరించి, ఆఫ్రికా ప్రజల యథార్థ సామూహిక సభ్యతను అనుభవైక పురస్సరంగా, సజీవంగా చిత్రిస్తూ, వారి ఆచార వ్యవహారాలూ, రీతి రివాజులూ సాంసారిక, ధార్మిక విధానాలూ, భావనా ప్రవృత్తులూ, ఆశయాదర్శాలూ, విశ్వదర్శన దృక్పథాలూ నాటకీయంగా చిత్రించి నైజీరియా సాహిత్య పునరుజ్జీవనానికి ప్రోద్బలం కలిగించాడు ఆచెబె.

రచయితలు సంఘ శ్రేయస్సును ధ్యేయంగా పాటిస్తూనే, సృజనాత్మక విలువలను, కల్పనా శిల్పాన్ని రూపొందించా లని ఆచెబె ఉద్బోధించాడు. నైజీరియాలో చెలరేగిన అంతర్యుద్ధపు విషమ సమయంలో బయాఫ్రా విప్లవ కారుల న్యాయమైన హక్కులనూ, కోరికలనూ బలపరుస్తూ సామాజిక చైతన్యాన్ని ఆయన రేకెత్తించాడు.

*థింగ్స్ ఫాల్ అపార్ట్* లో ఉమువోఫియా గ్రామ నాయకుడైన 'బకోంక్వో' విషాదోదాత్త గాథను ఎంతో అవగాహనతో చారిత్రక పరిజ్ఞానంతో ఆయన అభివర్ణించాడు. *నో లాంగర్ ఎట్ యీజ్* లో ఒక వైపు సాంప్రదాయిక మూఢ విశ్వాసాల, దురాచారాల ఒత్తిడికి లోనై, మరో వైపు ఆధునిక సమాజంలో ప్రబలిన ధన కాంక్ష, ప్రాభవోత్కర్ష, అవినీతి, భ్రష్టాచార ధోరణులకు లొంగిపోయి నైతిక పతనం చెందిన ఉద్యోగస్థుడు ఓబీ వృత్తాంతాన్ని చిత్రించాడు. *ఆరో ఆఫ్ గాడ్* లో ఎజువేలో అనే మతాధికారి వ్యక్తిత్వంలో కాల గతిలో సంభవించిన మార్పుల కోలాహలంలో ప్రకోపించిన మానసిక సంఘర్షణనూ, భావనా వైక్లబ్యాన్ని పౌరాణిక శైలిలో ఆయన చిత్రించాడు. *ఏ మాన్ ఆఫ్ ది పీపుల్* లో స్వాతంత్ర్యానంతరం నైజీరియాలో తల యెత్తిన రాజకీయ దురాచారాలు, కపట నీతి, హింసా ప్రవృత్తి, ప్రతీప వాదం సృష్టించిన కలుషిత ప్రజా జీవితం, సంక్షోభ వాతావరణం, సున్నితమైన హాస్యం, నిశితమైన వ్యంగ్యాత్మక విమర్శ, మానవీయ దృక్పథం మేళవించి, వాస్తవిక దృక్పథంతో చిత్రించాడు. కామన్ వెల్త్ సాహిత్యంలో అగ్రశ్రేణి రచయితగా ఆచెబె పరిగణింప బడుతున్నాడు.

డి.వి.కె.రా.

**ఆట్వే, టామస్ (1652-85) :** ప్రతిభాశాలి, అల్పాయుష్కుడు అయిన ఒక ఆంగ్ల కవి, నాటక రచయిత. ఒక మతాచార్యుని కుమారుడైన ఆట్వే నటుడు కావాలని ప్రయత్నించి, విఫలుడై తరువాత నాటక రచయితగా రాణించాడు. మొదట్లో అంత్యానుప్రాసతో కూడిన వినోద నాటకాలు వ్రాసినా, ఆ తరువాత ఇతడు వ్రాసిన అనుప్రాస రహితమైన గంభీర విషాద నాటకాలే ఇతనికి విశేషఖ్యాతిని సమ కూర్చాయి. ధీరోదాత్త కృత్రిమ కథా నాటకాల యుగంలో ఇతడు రసవంతమైన రచనలు చేసి నూతన మార్గదర్శకుడైనాడు. ఆంగ్లంలో ఇతడు అత్యంత కరుణ రస భరితమైన నాటకాల రచయిత. కన్నీళ్ళు తెప్పించటంలో అత్యంత సమర్థుడు అని పేరు పొందాడు. మోలియర్, షేక్స్‌పియర్, ప్లుటార్క్‌ల నుండి కథావస్తువులు గ్రహించినా, సరళమైనభాష, సహజమైన సన్నివేశకల్పన, సజీవమైన పాత్రచిత్రణ, మానవ భావోద్రేకాల హార్దిక నిరూపణ ఇతని విశిష్ట గుణాలు. *వెనిస్ ప్రిజర్వ్డ్, ఆల్సిబియేడ్స్* (Alcibiades), *చీట్స్ ఆఫ్ స్కేపిన్, ది ఆర్ఫన్, ది సోల్జర్స్ ఫార్చ్యూన్* మొదలైన ఇతని నాటకాలు 19 వ శతాబ్దిలో కూడా ప్రదర్శింపబడేవి. పద్యనాటక రచయితలలో షేక్స్‌పియర్ తరువాత ఇతనికే ఈ ఘనత దక్కింది. డ్రైడెన్

ఇతనిని చాలా మెచ్చుకొన్నాడు. ఇతని వ్యక్తిగత జీవితం కూడా విషాదభరితమే. ఇతనికి కీర్తి లభించినంతగా ధనం లభించలేదు. భగ్నప్రేమికుడై, దుర్భర దారిద్ర్య పీడితుడై, ఆకలి బాధతో ఒక సత్రంలో దిక్కులేకుండా ఇతడు చనిపోయాడని కొంద రంటారు.

చ.తి.

**ఆడమ్స్, హెన్రీ (బ్రూక్స్) (1838-1918) :** అమెరికన్ చరిత్రకారుడు, సాహిత్యవేత్త. పాశ్చాత్య సాహిత్యంలోని స్వీయచరిత్రలలో ఎన్నదగిన *ది ఎడ్యుకేషన్ ఆఫ్ హెన్రీ ఆడమ్స్* అనే ఆత్మకథను రచించినవాడు.



ఆడమ్స్ బోస్టన్‌లోని ఒక పూరోహితుని కుటుంబానికి చెందినవాడు. అతని పూర్వికులు న్యూజిలాండ్‌లోని ప్యూరిటన్ వంశానికి చెందినవారు. అమెరికన్ అధ్యక్షుడు 'జాన్ ఆడమ్స్' కి ఇతను మునిమనుమడు. జాన్ క్విన్సీ ఆడమ్స్‌కి మనుమడు. ఇతని తండ్రి ఛార్లెస్ ఫ్రాన్సిస్ ఆడమ్స్ (1807-86) రాజప్రతినిధి, చరిత్రకారుడు, కాంగ్రెస్ సభ్యుడు. అతని తల్లి అభిగైల్ బ్రౌన్ బ్రూక్స్. ఆడమ్స్ హార్వర్డు విశ్వవిద్యాలయంలో 1858 లో పట్ట భద్రుడయాడు. అటార్నీ కావాలనే ఆశయంతో బెర్లిన్ విశ్వవిద్యాలయంలో న్యాయశాస్త్రానికి సంబంధించిన ఉపన్యాసాలు విన్నాడు.

1861 లో అమెరికాలో అంతర్యుద్ధం చెలరేగినప్పుడు అబ్రహాం లింకన్ ఆడమ్స్ తండ్రిని ఇంగ్లండు వ్యవహారాల మంత్రిగా నియమించాడు. అప్పటికి 23 యేండ్ల వయస్సు కల ఆడమ్స్ తండ్రితో లండన్ వెళ్లి 1868 వరకు ఆయనకు ప్రైవేటు సెక్రటరీగా ఉన్నాడు.

అమెరికాకు తిరిగి వచ్చి వాషింగ్టన్‌లో *ది నేషన్* అనే దినపత్రికకు విలేఖకుడుగా పనిచేశాడు. రైళ్లు మొదలైన వాటి మీద గుత్త ఆధిపత్యం, రాజకీయ నాయకులలో లంచగొండితనం మొదలైన వాటిని ఖండిస్తూ ఆడమ్స్ అనేక వ్యాసాలు వ్రాశాడు. *చ్యాప్టర్స్ ఆఫ్ ఇరీ అండ్ అదర్ ఎస్సేస్* అనే వ్యాస సంపుటిలో 1871 లో ఈ వ్యాసాలు ప్రచురింపబడ్డాయి.

1870 వరకు *నార్త్ అమెరికన్ రివ్యూ* అనే పత్రికకు విలేఖకుడుగా ఆడమ్స్ కొనసాగాడు. మారుపేరుతో ఆడమ్స్ రచించిన *డెమ్యాక్రసీ ఆన్ అమెరికన్ నావెల్* అనే నవలలో అతడు విశ్వాసాన్ని కోల్పోవడం వ్యక్తమౌతుంది. ఆడమ్స్ వలెనే ఆ నవలలోని నాయిక మెడిలీన్ లీ కూడా వాషింగ్టన్ రాజకీయాలతో సన్నిహిత సంబంధాలు ఏర్పరచుకుంది. ఆమె తరచుగా అధ్యక్షుణ్ణి, అతని అనుయాయులను కలుసుకుంటూ వారిలోని పదవీ కాంక్ష మొదలైన అవలక్షణాలను చూచి "ప్రజాస్వామ్యం నన్ను కలచివేసింది" అని వాపోతుంది.

1870 లో హార్వర్డ్ కళాశాల ప్రిన్సిపాల్ మధ్య యుగ చరిత్రను బోధించే ఉపన్యాసకుడుగా ఆడమ్స్‌ను నియమించాడు. 1877 లో థామస్ జఫర్‌సన్ మంత్రివర్గంలో ఆర్థిక కార్యదర్శి ఆల్బర్ట్ గెలటిన్ పత్రాలను ఎడిట్ చేయడం కోసం అతడు ఆ పదవికి రాజీనామా చేశాడు. అమెరికన్ వ్యవహారాలలో ఉత్సుకతను ప్రకటించి 1879 లో *లైఫ్ ఆఫ్ ఆల్బర్ట్ గెలటిన్* అనే జీవిత చరిత్రనూ, 1882 లో *జాన్ రాన్‌డాల్ఫ్* జీవిత చరిత్రనూ పూర్తి చేశాడు. ఆ అధ్యయనానికి పర్యవసానంగా *హిస్టరీ ఆఫ్ యునైటెడ్ స్టేట్స్* అనే 9 సంపుటాల బృహద్గ్రంథాన్ని రచించాడు. 1884 లో *ఎస్తేర్* అనే మరొక నవలను ఆడమ్స్ మారుపేరుతో ప్రచురించాడు. ఆ నవలలో ఆధునిక విజ్ఞానశాస్త్రానికీ, మతానికీ మధ్య గల సంబంధాన్ని వివరించడానికి ఆయన పూనుకున్నాడు.

1885 లో 13 సంవత్సరాలు తనతో వైవాహిక జీవితం గడపిన మారియన్ హూపర్ ఆత్మహత్య చేసికోవడం అతనికి దిగ్భ్రాంతి కలిగించింది. భార్య చనిపోయిన తరువాత వికలమైన మనస్సుతో అతడు దేశాటన చేయడం మొదలు పెట్టాడు.

1870 నుండి చనిపోయేవరకూ మేధావులు, విజ్ఞానులు రాజకీయాలను గురించీ, కళలను గురించీ, విజ్ఞాన శాస్త్రాన్ని గురించీ ఆడమ్స్‌తో చర్చించడానికి వస్తూ ఉండేవారు. వారిలో బ్రిటిష్ రాజకీయవేత్త సర్ సిసిల్ ఆర్థర్ స్ప్రింగ్‌రైస్, హెన్రీ హచ్‌సన్ రిచర్డ్‌సన్, సన్‌బెన్రీ కాబట్ లాడ్జ్ పేర్కొనదగినవారు. భూగర్భ శాస్త్రవేత్త క్లారెన్స్ కింగ్, రాజనీతివేత్త జాన్ హే ఆడమ్స్‌కు ప్రియ మిత్రులు. వీరితో ఆయన జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలు నేటికీ మిక్కిలి విజ్ఞాన దాయకాలుగా ఉన్నాయి.

1912 లో తన 74 వ ఏట ఆడమ్స్ హృద్రోగానికి

గురి అయాడు. అతని మనస్సు అస్తవ్యస్తమై కొంత కాలం స్పృహతోనూ, మరి కొంతకాలం మైకంతోనూ గడచిపోయింది. వాషింగ్టన్ ఇంట్లో ఆడమ్స్ నిద్రలో చనిపోయినప్పుడు అతని కోరిక ప్రకారం, ఏ రకమైన సూచనలు గుర్తులు లేకుండా అతని భార్య సమాధి ప్రక్కనే అతనిని కూడా సమాధి చేశారు. ఆడమ్స్ చనిపోయిన తరువాత అతని *ది ఎద్యుకేషన్ ఆఫ్ హెన్రీ ఆడమ్స్* అనే పుస్తకానికి 1919 లో పులిట్జర్ బహుమతి ఇవ్వబడింది.

రాజ్యలక్ష్మి

**ఆడిసన్, జోసెఫ్ (1612-1719) :** ఆంగ్ల కవి, వ్యాసరచయిత, నాటకకర్త. విల్ట్‌షైర్ లోని మిల్ స్టన్‌లో ఆడిసన్ జన్మించాడు. అతని తండ్రి రెవరెండ్ లారి న్స్‌లాట్ ఎడిసన్. ఎడిసన్ మొదట అమీస్‌బరా, సాలీస్‌బరా, ఛార్టర్ హౌస్ స్కూళ్ళలోనూ, తరువాత మాగలెన్ కాలేజ్ లోనూ చదువు కొనసాగించాడు.



ఛార్టర్‌హౌస్ స్కూలులోనే అతనికి రిచర్డ్ స్టీల్‌తో పరిచయం ఏర్పడింది. 15 ఏళ్ల వయస్సుకే ఆక్స్‌ఫర్డ్ క్వీన్స్ కాలేజ్‌లోను, తర్వాత రెండేళ్ళలో మాగ్డలెన్ కాలేజ్‌లోను చేరి, 1693 లో ఎం.ఏ. డిగ్రీ పొందాడు. తర్వాత 5 ఏండ్లకు ఫెలో షిప్ పొందాడు. ప్రాచీన సాహిత్యంలో ఇతడు దిట్ట. ఇతడు వ్రాసిన లాటిన్ కవితలు డ్రైడెన్ పండితుని ప్రశంసల నందుకొన్నాయి. డ్రైడెన్ చేసిన వర్జిల్ అనువాదానికి ఇతడు చక్కని వ్యాఖ్య వ్రాసి వర్జిల్ నాల్గవ గ్రంథంలోని కొన్ని భాగాలకు చక్కని అనువాదం కూడా చేశాడు. తర్వాత స్నేహితుల ఔదార్యంతో యూరప్ ఖండం అంతటా పర్యటించాడు. అది అతని తర్వాతి రాజకీయ జీవితానికి నాంది అయింది. 1703 లో కింగ్ విలియమ్ III మరణించినపుడు తిరిగి స్వదేశానికి వచ్చి 1705 లో ఎక్సైజు కమీషనరుగా నియుక్తు డయాడు. బ్లెన్‌హేమ్ విజయాన్ని పురస్కరించుకొని 1740 లో *ది కేంపెయిన్* అనే కవిత వ్రాశాడు. 1708 లో పార్లమెంటులో ప్రవేశించి ఛీఫ్ సెక్రటరీగా ఐర్లాండు వెళ్లాడు. విగ్ ప్రభుత్వ పతనంతో 1710 లో ఇంగ్లండు తిరిగి వచ్చాడు.

ఆడిసన్ కిట్-కాట్ క్లబ్ మెంబరు అయినప్పుడు మళ్లీ స్టీల్‌తోను, స్మిత్‌తోను ఇతనికి స్నేహం ఏర్పడింది. టాట్లర్ కు వ్యాసాలు వ్రాసి పంపేవాడు. స్టీల్‌తో కలసి 1711 లో *స్పెక్టేటర్* అనే క్రొత్త వ్యంగ్య పత్రికను ప్రారంభించాడు. 1713 లో కాట్స్ అనే ముక్తచ్ఛందస్సులో కవిత వ్రాశాడు. *గార్డియన్* పత్రికకు వ్యాసాలు వ్రాసి పంపేవాడు. 1715 లో అతడు వ్రాసిన ప్రోజ్ కామెడీ *ది డ్రమ్మర్* విజయవంతం కాలేదు. 1715 లో విగ్ ప్రభుత్వం మరల అధికారంలోకి రాగానే ఆడిసన్ మరల ఐర్లాండు ఛీఫ్‌సెక్రటరీ అయి, 1716 లో లార్డ్ కమీషనర్ ఆఫ్ ట్రేడ్ అయాడు. అప్పుడే అతడు వార్విక్ రాకుమారిని వివాహమాడాడు. 1715-16 లో అతడు *ఫ్రీ హోల్డర్* పత్రికకు విరివిగా వ్యాసాలు వ్రాసేవాడు. తర్వాత *ఓల్డ్‌విగ్* కు వ్రాసేవాడు. దానివల్లనే అతని స్నేహితుడైన స్టీల్‌తో అతనికి వైమనస్యం ఏర్పడింది. 1719 లో తన 47 వ ఏట ఆడిసన్ పరమపదించాడు. అతనిని వెస్ట్ మినిస్టర్ ఆబేలో సమాధి చేశారు.

జోసఫ్ ఆడిసన్ పేరుతో ముడిపడిన *ది టాట్లర్, స్పెక్టేటర్* అనే పత్రికలలో *టాట్లర్* కి సంపాదకుడు స్టీల్. వినోదం, రాజకీయాలు, విదేశీ వార్తలు, కవితలు వంటివి వ్యంగ్యధోరణిలో దానిలో చోటుచేసుకొనేవి. ఆడిసన్ *టాట్లర్* కు స్వంతంగా 42, స్టీల్‌తో కలసి 36 వ్యాసాలు వ్రాశాడు. తర్వాత స్టీల్‌తో కలసి *స్పెక్టేటర్* అనే పత్రికను స్థాపించి, 1711 మార్చి 1 నుంచి 1712 డిసెంబరు 6 వరకు మొత్తం 555 సంచికలు ప్రకటించాడు. ఆడిసన్ దానిని 1714 లో పునరుద్ధరించి 80 సంచికల వరకు నడిపాడు. *టాట్లర్* వారానికి 3 సార్లు మాత్రమే ప్రచురింపబడేది. కాని, *స్పెక్టేటర్* దినపత్రికకు ఆడిసన్, స్టీల్‌లతోపాటు అలెగ్జాండర్ పోప్, థామస్ టికిల్ వంటి వారు కూడా వ్యాసాలు వ్రాసేవారు. సమకాలిక సమస్యలను సౌమ్యంగానూ, నిష్పాక్షికంగానూ మృదు హాస్యంతో కూడిన రసవంతమైన శైలిలో చర్చిస్తూ అనేక వ్యాసాలు ధారావాహికంగా ప్రకటించి వచన వాఙ్మయాన్ని వారు సుసంపన్నం చేశారు.

ఒక క్లబ్‌లోని కార్యక్రమాల రూపంలో ఆ పత్రిక వెలువడేది. దానిలోని కల్పిత పాత్రలలో ముఖ్యమైనది, ప్రసిద్ధి పొందింది *సర్ రోజర్ డి కవర్లి* అనే పల్లెటూరి పెద్దమనిషి, జమీందారు. ఇతర పాత్రలు ఐజాక్ బికర్‌స్టాఫ్, సర్ ఆండ్రూ ఫ్రీమార్ట్, కెప్టెన్ సెంట్రీ, విల్‌హ

నీకూయ్ మొదలైనవి. ఈ పత్రిక ఆ నాటి మధ్యతరగతి ప్రజలు ఒక వర్గంగా ఏర్పడి, అభ్యున్నతి సాధించడానికి తోడ్పడిందని ప్రశంసలందుకుంది.

జె.మూ.ప్ర.

**ఆడీ, ఎన్‌డ్రే (1877-1919) :** 20 వ శతాబ్దిలో మిక్కిలి ప్రముఖుడైన హంగేరియన్ భావకవి. కొందరు విమర్శకుల దృష్టిలో మొత్తం హంగేరియన్ సాహిత్య చరిత్రలోనే మిక్కిలి ప్రముఖ కవి.



నిరుపేదలైనా, గౌరవ ప్రతిపత్తులు గల కుటుంబంలో ఆడీ జన్మించాడు. కొంతకాలం న్యాయశాస్త్రం అధ్యయనం చేశాడు. 1900 నుంచి చనిపోయేవరకూ ఆయన ఒక పత్రికా విలేఖకుడుగా పనిచేశాడు. 1899 లో ఆయన ప్రచురించిన *వెర్సెక్* అనే తొలి కావ్యసంపుటికి ఎలాంటి ఆదరమూ రాలేదు. 1903 లో ఆయన ప్రచురించిన *మెగ్ ఎజిస్‌జర్* అనే ఖండకావ్య సంపుటంలో అసాధారణమైన ఆయన ప్రతిభ తొలిసారిగా అభివ్యక్తమైంది. ఆయన తరువాతి రచన *ఉజ్ వెర్సెక్* (1906 - కొత్త పద్యాలు) అనే పుస్తకం హంగేరియన్ సాహిత్య వర్గాలలో గొప్ప సంచలనం కలిగించింది.

హంగేరీ సాహిత్యంలో 19 వ శతాబ్దం చివరా, 20 వ శతాబ్దం మొదటా కవిత్వం నిద్రాణస్థితిలో ఉండేది. సాందోర్ పెటోఫీ, జానోస్ అరానీ అనే కవుల రచనలకు ప్రతిధ్వనులే ఆ నాడు వెలువడుతూ ఉండేవి. మౌలికంగా వ్రాయ ప్రయత్నించిన కవులలో ప్రజల దృష్టిని ఆకట్టుకోగలిగినంత ప్రతిభావంతులు ఎవరూ రాలేదు. అందుచేత ఆడీ అన్నట్లు 'కొత్తశకంలోని తనకొత్తపద్యాలను' ఆనందించేందుకు దేశం ఆ నాడు తయారుగా లేదు. ఆడీ పద్యాలు రూపం లోను, భాషలోను, వస్తువులోను కూడా విప్లవాత్మక మైనవి. సంప్రదాయాన్ని అనుసరించకపోయినా, అత్యద్భుతమైన అతని భాష, అపరిచిత పూర్వాలైన విశేషణాలూ పాఠకులను నిర్ఘాంతపరిచాయి. అతని పద్యాలలోని ఉదాత్త గంభీర మైన స్వరం వారిని మరింత చకితులను చేసింది. పత్రికా విలేఖకుడుగా పారిస్‌లో ఆడీ ఉనికి హంగేరీని అతనికి సంకుచితమైన ఒక ఐహిక దృష్టి గల దేశంగా కనిపించేట్టు చేసింది. తన పద్యాలలో ఆడీ తన దేశాన్ని తీవ్రంగా దుయ్యబట్టాడు. ఆ పద్యాలలోని కళా కౌశలాన్ని ఎవరూ కాదనలేక పోయినా, అతడు ప్రకటించిన భావాలపట్ల రాజకీయంగా పెద్ద గాలి దుమారం చెలరేగింది. వామపక్ష తీవ్రవాదులు ఆడీని ఒక ప్రవక్తగా కొనియాడగా, సవ్యపక్ష (Right wing) జాతీయవాదులు అతనిని తీవ్రంగా దూషింప సాగారు.

తరువాతి రచనలలో ఆడీ తన దేశాన్ని మరీ విచ్చల విడిగా దూషించడం మాని, ఉదాత్త స్థాయిలో సాంఘికంగాను, రాజకీయంగాను తన దేశాన్ని సున్నితంగా మందలించే ధోరణిని అలవరుచుకున్నాడు. తన దేశాన్ని, అక్కడి సాంఘిక, రాజకీయ లోపాలను ప్రథమ ప్రపంచసంగ్రామం వల్ల ప్రజలకు కలిగిన యాతనలనూ గాఢంగా అవగాహన చేసుకొని తన బాధను, ఆగ్రహాన్ని ప్రకటించేందుకు ఆడీ ఒక నూతన మార్గం కనుగొన్నాడు. అప్పటికి అతని ఆరోగ్యం క్షీణించింది. చురుకుగా పనిచేయలేకపోతున్నాడు. 12 ఏళ్లలో అతడు 10 కావ్య సంపుటాలు ప్రకటించాడు. కొన్ని చిన్న కథలు, అసంఖ్యాకమైన వ్యాసాలు కూడా వ్రాశాడు.

హంగేరియన్ ప్రజలపట్ల ఆడీకి గల ప్రేమ అతని కావ్య వస్తువులలో ఒక అంశం మాత్రమే! ఆయన ప్రణయ గీతాలలో మౌలికమైన ప్రతిభ, కాయిక శృంగారాన్ని ఆధ్యాత్మిక స్థాయికి లేవనెత్త గల ఉదాత్తత కనిపిస్తుంది. మతపరమైన ఆయన పద్యాలు కొందరికి భగవద్ద్రోహంగా కనిపించినా, చాలామంది దృష్టిలో ఆయన భగవదన్వేషణనే అవి ప్రకటించాయి. ఆయన ఇలా అంటారు.

"అన్ని వస్తువుల అట్టడుగునా ఆయనే ఉన్నాడు
ఆయన కోసమే అన్ని గంటలూ మోగుతాయి
ఆయన ఎడమ ప్రక్కన నేను ఉన్నాను!"

త్రాగుడు వ్యసనానికి గురి అయి, 1919 జనవరి 27 న బుడాపెస్ట్‌లో ఆడీ కన్ను మూశాడు.

బొ.శ్రీ.

**ఆడెన్, డబ్ల్యు. హెచ్. (1907-73) :** ప్రముఖ ఆంగ్ల కవి, నాటక రచయిత, విమర్శకుడు. వామపక్షాభిమానిగా, సమకాలీన కవులలో అగ్రశ్రేణి కవిగా ప్రసిద్ధుడు.

ఇతని తండ్రి వైద్యుడు, తల్లి నర్స్ కావడంతో ఇంట్లో సాహిత్య వాతావరణం కంటె వైజ్ఞానిక వాతావరణమే

ఎక్కువగా ఉండేది. ఇతని చిన్నతనం బర్మింగ్‌హోమ్‌లో గడచింది. ఇతని పూర్వులకు ఐస్‌లాండుతో ఉన్న సంబంధం వల్ల ఇతనికి ఐస్‌లాండ్ గాథ లంటే ప్రత్యేకమైన అభిమానం ఉండేది. మొదట్లో ఇంజనీరు కావాలనుకొన్నాడు. కాని జీవశాస్త్రం చదివాడు. ఆక్స్‌ఫర్డ్‌లో విద్యార్థిగా ఉండగానే కవిగా గుర్తింపు పొందాడు. లూయీ మెక్నీస్ డే లెవిస్, స్టీవెన్ స్పెండర్ మొదలైన వర్ధమాన కవులపై ఇతని ప్రభావం గాఢంగా ఉండేది. అందుచేత వీళ్ళ జట్టును 'ఆడెన్ తరం' అని అనేవాళ్లు. విద్యాభ్యాసానంతరం జర్మనీ వెళ్లి ఆ భాషా సాహిత్యాల మీద అభిమానం పెంచుకొన్నాడు. కొన్నాళ్లు ఇంగ్లాండ్, స్కాట్లండ్‌లలో ఉపాధ్యాయుడుగా పనిచేశాడు. 1930 ప్రాంతాలలో ఇతనిని సమకాలీన సర్వశ్రేష్ఠ ఆంగ్లకవిగా కొందరు గుర్తించారు. 1965 నాటికి యీట్స్, ఇలియెట్‌లు మరణించడంతో ఇతని అగ్రగణ్యాత్వం నిర్వివాదమైంది.



ఆడెన్ కవితా జీవితాన్ని అతడే నాలుగు దశలుగా విభజించుకొన్నాడు. మొదటి దశ (1927-1933) రచనలలో, శైలిలో సమత, స్పష్టత లోపించి లక్ష్యశుద్ధి కొరవడినట్లు స్పష్టంగా కనిపిస్తుంది. అయినా, సమాజపు జబ్బులకు కవిత్వమే ఔషధ మనే ఇతని నమ్మకం లీలగా వాటిలోనూ గోచరిస్తూ ఉంటుంది. *వక్తలు* (*Orators*), *సర్వతోభద్రము* (*Charade*), *ఉభయ పక్ష గ్రహీత* (*Paid on Both Sides*) మొదలైన ఈ కాలపు ఇతని రచనలలో ఐస్‌లాండ్ గాథలు, బడిపిల్లల కథలు, ప్రాచీనాంగ్ల కవితలు, కార్ల్‌మార్క్స్, సిగ్మండ్ ఫ్రాయిడ్‌ల ప్రభావం - అన్నీ కలగా పులగంగా ఉండేవి. రెండో దశ (1933-1938) లో ఇతడు స్పష్టంగా వామపక్ష వాదిగా కనిపిస్తాడు. ఒకవంక పెట్టుబడిదారీ వ్యవస్థలోని చెడుగును ఉద్ఘాటిస్తూనే, మరోవంక ఏక పక్ష నియంతృత్వ ప్రమాదాన్ని గూర్చి హెచ్చరిస్తాడు. *ఈ దీవిమీద, అపరిచితుడా చూడు,* మొదలైన కవితా సంకలనాలలో శైలి కొంత సాఫీగానే సాగుతుంది. *మృత్యునృత్యం, చర్మం క్రింది కుక్క, సరిహద్దుమీద* మొదలైన నాటకాలు, *ఐస్‌లాండు లేఖలు* (*Letters from Iceland*), *యుద్ధానికి యాత్ర* (*Journey to war*) మొదలైన వచన రచనలు కూడా చేశాడు. ఈ దశ చివరలో ఆడెన్‌కు వామ పక్షాలతో మొగం మొత్తి క్రైస్తవ మతం వంకకు మరలటం కనిపిస్తుంది. మూడో దశ (1939-1948) లో ఆడెన్ అమెరికా పౌరుడుగా స్థిరపడ్డాడు. మత, బౌద్ధిక, దృక్పథాలలో మార్పు స్పష్టంగా కనిపిస్తుంది. *మరో సమయం* (*Another Time*), *ద్వివిధ మానవుడు* (*Double Man*) మొదలైన కవితా సంకలనాలు, *సముద్రమూ, దర్పణమూ* (*Sea and Mirror*) అనేపేర షేక్స్‌పియర్ *టెంపెస్ట్* నాటకానికి అర్ధనాటకీయ వ్యాఖ్య, *ఆతురతా పూర్ణయుగం* (*Age of Anxiety*) అనే మనశ్శాస్త్ర సంబంధమైన చిత్ర సంభాషణా ఈ కాలపు రచనలు. ఈ చివరి రచనకే ఆడెన్‌కు పులిట్జర్ బహుమతి లభించింది. నాలుగో దశ (1948-1973) లోని రచనలైన *ఆకిలిస్ డాలు, క్లియోకు జోహారు, గోడలు లేని నగరం* మొదలైన కవితా సంకలనాలలో మత విషయాలు, ప్రకృతి వర్ణనలు, గృహ జీవితం చోటుచేసుకున్నవి. *దురాచారి పురోగతి, యువ ప్రేమికుల స్మృతి గీతం* మొదలైన సంగీత నాటకాలు, *వర్ణకారుని హస్తం, నిశ్రిత ప్రపంచం* మొదలైన విమర్శ గ్రంథాలు ఈ కాలపు రచనలు. బోలింగెన్ బహుమతి, జాతీయ పుస్తక పురస్కారం, ఆక్స్‌ఫర్డ్ ఆచార్య పదవి మొదలగు గౌరవాలు ఆడెన్‌ను వరించాయి.

సామాజిక, నైతిక, బౌద్ధిక సమస్యలను గుర్తించేందుకూ, వాటికి పరిహారం కనుక్కోనేందుకూ కవిత్వాన్ని ఒక సాధనంగా ఆడెన్ గ్రహించాడు. కాని అంతశ్చేతన, స్వాప్నిక కల్పనలు బాహ్య వాస్తవ జగత్సమస్యలతో కలగాపులగం కావటంతో, ఇతని కవితలను విడివిడిగా తీసుకొన్నప్పుడు అస్పష్టత, అసంగతత్వం కనిపిస్తున్నా, సమష్టిమీద చూస్తే సాంకేతిక, పౌరాణిక, ఐతిహాసిక సన్నివేశాల విలక్షణమైన ఒక సమగ్రమైన విశ్వరూపం ఆడెన్ రచనలలో కనిపిస్తుంది.

వ.తి.

**ఆదమోవ్, ఆర్థర్ (1908-70)** : 'అసంగత' (absurd) నాటక రచనలు చేసిన ప్రముఖ ఫ్రెంచ్ రచయిత. 1908 ఆగస్టు 23 న రష్యాలో కిస్లోవొడాస్క్‌లో

జన్మించాడు. 1970 మార్చి 16 న పారిస్‌లో మరణించాడు. 1912 లో ఆర్మీనియాకు చెందిన ఈయన కుటుంబంవారు పశ్చిమ జర్మనీలో స్థిరపడ్డారు. జినీవా, మెయింజ్, పారిస్‌లలో ఈయన విద్యాభ్యాసం చేశాడు. 1924 లో పారిస్‌లో ఉన్న అధివాస్తవిక (Surrealist) వర్గాలతో సంబంధాలు పెట్టుకొని, ఈయన అక్కడే ఉండిపోయాడు. *డిస్‌కంటిన్యుయిటీ* అనే పత్రికకు సంపాదకత్వం వహించాడు; కవిత్వం వ్రాశాడు. 1938 లో నరాల బలహీనత వల్ల బాధపడ్డాడు. 1938-43 సంవత్సరాలలో తన స్వీయచరిత్ర వ్రాశాడు. దానిపేరు *లా ఆవ్యూ:* దీనిలో తనని తనే కించపరుచు కుంటూ తన సంక్షుబ్ధ అంతరంగాన్ని విశదపరచాడు. ముందు వ్రాయబోయే అసంగత నాటకాలకు పనికి వచ్చే భావాన్ని, వ్యక్తిని విపరీతంగా భయపెట్టే 'నేను అన్యుణ్ణి' అనే భావాన్ని ఈ గ్రంథంలో ఆయన వ్యక్తీకరించాడు. రెండవ ప్రపంచ యుద్ధంలో ఖైదీల శిబిరంలో సుమారు ఒక ఏడాది పాటు ఉన్నాడు. దీనివలన మానసికంగా ఆయన చాలా దెబ్బ తిన్నాడు.

అసంగత నవలలు రచించిన స్వీడిష్ రచయిత ఆగస్ట్ స్ట్రిండ్‌బెర్గ్, ఫ్రాంజ్ కాఫ్కాల వలన ప్రభావితుడై, 1947 లో అదమోవ్ నాటకాలు వ్రాయడం మొదలుపెట్టాడు. భగవంతుడు మరణించాడనీ, జీవిత పరమార్థం అందు కోరానిదనీ నమ్ముతూ, ఈయన కమ్యూనిస్టు ఆదర్శాలకు తన సొంత తాత్త్విక వ్యాఖ్యలు చెప్పాడు. నాటకం ద్వారా మానవుని ఒంటరితనాన్ని ప్రకటించవచ్చునని ఈయన భావించాడు.

ఆదమోవ్ వ్రాసిన మొదటి నాటకం *లా పేరడీ* లో ముళ్ళులేని ఒక గడియారం ఉంటుంది. అందులోని పాత్రలు ఎప్పుడూ కాలం గురించి ఒకరిని ఒకరు ప్రశ్నించుకుంటూ ఉంటారు. ఈ నాటకంలోని ప్రపంచం మానవునికి ఒక పేరడీ. ఈయన దృష్టిలో మానవుడు జీవితానికి ఒక అర్థంకోసం నిస్సహాయంగా వెదుకుతున్నాడు. జీవితానికి అర్థం ఉన్నప్పటికీ, అది మానవునికి అందడం లేదు. *లా ఇన్వేషన్* అనే నాటకంలో మానవుని పరిస్థితి ఇంకా వాస్తవికంగా చిత్రించడానికి ప్రయత్నం చేశాడు. ఈ నాటకం ఆంద్రీ జీద్, జా విలార్ లకు బాగా నచ్చింది. 1950 లో విలార్ దర్శకత్వంలో దీనిని పారిస్‌లో ప్రదర్శించారు. ఆదమోవ్ రచించిన మూడవ నాటకం *లె గ్రాండ్ ఎట్ లా పెటిట్ మెనూవర్* మీద ఆయన స్నేహితుడు, క్రూరతా నాటకరంగం (Theatre of cruelty) ప్రవక్త ఆంటొనిన్ ఆర్టోద్ ప్రభావం కనబడుతుంది.

1953 లో ప్రదర్శించిన *లె ప్రొఫెస్యూర్ తరాన్* లో ఒక విశ్వవిద్యాలయంలోని ఆచార్యుడు తన బాహ్య జీవితపాత్రలో విఫలు డవడం చూస్తాం. ఈ నాటకం స్వప్నానికి సంబంధించిన అసంగత తర్కం మీద ఆధారపడి ఉంది. కాని దీని నిర్మాణం, పాత్రీకరణ స్పష్టంగా, గాఢంగా ఉన్నాయి. ఆధునిక ప్రపంచంలో దాగి ఉన్న నిరాశాపూరిత మైన దారుణమైన కలవరాన్ని (cruel confusion) నిరసిస్తూ ఆదమోవ్ తాను గుర్తించిన ఆపదలకు పరిష్కారాలు సూచించాడు. 1955 లో ప్రదర్శించిన *లాపింగ్ పాంగ్* అనే ఆయన నాటకం బాగా ప్రజాదరణ పొందింది. ఈ నాటకంలో పాత్రలన్నీ యంత్రానికి లొంగి పోతాయి. ఇది అంతులేని, లక్ష్యంలేని జూదం లాంటిది. మానవుడు తప్పుడు ధ్యేయాలను అంటిపెట్టుకుని, వాటిని గురించి ఎంతో కష్టపడి నిష్ఫలుడవడానికి ఇది మంచి నిదర్శనం. ఈయన తర్వాతి రచనలు *పావులో పావ్‌లీ,* (1957); *లె ప్రింటెమ్ప్స్* 71, (1961); *లా పొలిటిక్ డెస్ రెస్టస్* (1963) లలో విప్లవాత్మకమైన రాజకీయ ప్రకటనలు ఉన్నాయి. అయినా, ఆయనకు నాటకీయమైన ప్రయోగాలు చేయడంలో ఆసక్తి తగ్గలేదు. చివరికి, జీవితం అసంగతం (absurd) కాదనీ, అది క్లిష్టమైంది మాత్రమే అనీ ఒప్పుకుని, ఆత్మహత్య చేసుకున్నాడు. 1955 లో ప్రచురించిన ఆయన నాటకాల రెండవ సంపుటానికి వ్రాసిన ముందుమాటలో ఆదమోవ్ తన పనిలో తన వైఖరిని గురించీ, తన జీవితాన్ని గురించీ వ్యాఖ్యానించాడు.

ఇ.నా.

**ఆరిస్టోఫనీస్ (క్రీ.పూ. 450-క్రీ.పూ. 388) :** ఆరిస్టోఫనీస్ సుప్రసిద్ధుడైన గ్రీక్ నాటకకర్త. ఈయన నాటకా లన్నీ సుఖాంతాలే. 40 పైగా నాటకాలను వ్రాసినా, వానిలో పదకొండు మాత్రమే తరువాతి తరాలకు లభ్యమయాయి. ఈయన సుఖాంత నాటకాలలో బృందగానము, అనుకరణ, అవహేళన ప్రధానంగా కన్పిస్తాయి.

ఆరిస్టోఫనీస్ నాటకాలలో రచన బిగువుగా ఉండదు. కథాకథనంలో ప్రతిభ పెద్దగా కన్పడదు. పాత్రపోషణ ప్రసన్నంగా ఉండదు. అయినా ఈయన నాటకాలు కాల విపర్యయానికి లోను కాకుండా 20 వ శతాబ్దం వరకూ

నిలచి ఉన్నాయి. ఇప్పటికీ ఆరిస్టోఫనీస్ నాటకాను వాదాలు ప్రజాదరణను పొందుతున్నాయి. ఈయన నాటక రచనలో ప్రదర్శించిన హాస్యం, చమత్కార సంభాషణ, తెలివైన వెక్కిరింత మొదలైన లక్షణాలు దీనికి కారణం కావచ్చు.

ఆరిస్టోఫనీస్ క్రీ.పూ. 450 కి చెందినట్లు భావిస్తున్నారు. ఏతెన్స్ నగర పౌరుడైనా, ఆయన జన్మస్థలమేదో నిశ్చయంగా తెలియదు. క్రీ.పూ. 427 లో ఆయన నాటక రచన ప్రారంభించినట్లు తెలుస్తున్నది. నాటకకర్తగా 40 ఏండ్లు పరిశ్రమించిన ఆరిస్టోఫనీస్ 40 నాటకాలను వ్రాసినట్లు విశ్వసిస్తున్నారు. ఏతెన్స్ నగరానికి సంబంధించిన సామాజిక, తాత్త్విక విషయాలు ఈయన నాటకాల్లో ప్రముఖంగా కనిపిస్తాయి. పిలొపొనీసియన్ యుద్ధం (క్రీ.పూ. 431-404) ఈయనను బాగా ప్రభావితం చేసింది. ఏతెన్స్-స్పార్టాలకు మధ్య జరిగిన యుద్ధాన్ని ఆరిస్టోఫనీస్ గట్టిగా విమర్శించాడు. అప్పటి ప్రముఖ రాజకీయ నాయకులను ఆట పట్టించిన సన్నివేశాలు ఈయన నాటకాలలో అక్కడక్కడ తటస్థపడతాయి.

లభ్యమైన ఆరిస్టోఫనీస్ నాటకాలలో *ద బర్డ్స్* (పక్షులు), *ద ఫ్రాగ్స్* (కప్పలు), *ద క్లౌడ్స్* (మబ్బులు) బాగా ప్రచారంలో ఉన్నాయి.

*ద ఫ్రాగ్స్* అనే నాటకంలో యూరిపిడీజ్ అనే నాటక కర్తను, *ద క్లౌడ్స్* అనే నాటకంలో సోక్రటీజ్‌ను అరిస్టోపనీస్ వెక్కిరించాడు. ఆ వెక్కిరింత కటువైందనీ, అంత సబబుగా లేదనీ విమర్శకుల అభిప్రాయం.

శ్రీ.ల.

**ఆరేలియస్, మార్కస్ (121-180) :** (చూ.) మార్కస్ ఆరేలియస్

**ఆర్టోద్, ఆంటొనిన్ (1896-1948) :** ఫ్రెంచ్ నాటక రచయిత, కవి, నటుడు, అధివాస్తవిక (Surrealist) ఉద్యమానికి ప్రవక్త. ప్రాచీనమైన బూర్జువా రంగస్థలానికి బదులు క్రూరత్వంతో కూడిన ఒక నూతన రంగస్థలాన్ని సృష్టించాలని ప్రయత్నించాడు. ఈ సృష్టి వలన మానవునిలో దాగిఉన్న అంతశ్చైతన్యాన్ని (subconsious) వెలికి తీసి, మానవుణ్ణి తానెవరో తెలుసుకో గలిగేటట్లు చేయాలనుకున్నాడు.

ఈయన పసివాడుగా ఉండగా మెదడువాపు వ్యాధితో బాధపడ్డాడు. యౌవన దశ మధ్యప్రాచ్యంలో గడపి రహస్యవాదంలో ఆసక్తి చూపాడు. జీవితాంతం బాధపెట్టిన మెదడుకు సంబంధించిన వ్యాధులవలన తరచు ఆయన పిచ్చాసుపత్రులలో చేరవలసి వచ్చేది.

తన అధివాస్తవిక కవిత్వాన్ని ఆయన జాక్వెస్ రివియర్ అనే ప్రసిద్ధి కెక్కిన విమర్శకునికి పంపాడు.



దీనితో వారిద్దరి మధ్య దీర్ఘకాలం ఉత్తర ప్రత్యుత్తరాలు నడిచాయి. పారిస్‌లో నటన నేర్చుకుని ఇతడు 'డాడాయిస్ట్-సర్రియలిస్ట్' రంగస్థలంపై మొదటిసారిగా ప్రవేశించాడు. అధివాస్తవికులకు నాయకుడైన ఆంద్రీ బ్రెటన్ కమ్యూనిజంకు మద్దతు ఇచ్చినందు వలన ఈయన వారినుండి విడిపోయాడు. తమ ఉద్యమం రాజకీయాలకు అతీతంగా ఉండాలని నమ్మి, ఆర్టోద్ వేరొక అధివాస్తవిక వర్గంలో చేరాడు. ఈ వర్గానికి నాయకుడు రాజర్ విట్రాక్ అనే నాటకకర్త. కార్ల్ డ్రేయర్ తీసిన ఫిల్మ్ 'లా పేషన్ జీన్ డి ఆర్క్' లో ఆర్టోద్ ఒక పూజారి వేషాన్ని ధరించాడు.

ఆర్టోద్ రచించిన రెండు గ్రంథాలలో రంగస్థలాన్ని గురించిన ఆయన అభిప్రాయాలు విశద మవుతాయి. ఆ గ్రంథాలు *మానిఫెస్ట్ దు థియేటర్ డిలా క్రువటే* (1932), *లా థియేటర్ ఎట్ సోన్ డబుల్* (1938). ఈ రెండింటిలో ఆయన నటునికి, ప్రేక్షకులకు మధ్య అన్యోన్య సంబంధం ఏర్పడాలని కోరాడు. ఇది మాంత్రిక విద్య వలన సాధ్యమని చెప్పాడు. సంకేతాలు, శబ్దాలు, విచిత్రమైన దృశ్యాలు, దీపాల కాంతుల మేళవింపు వలన ఏర్పడిన భాష మామూలు పదాలు చెప్పలేని భావాలను చెప్పగలవని, ఆ భాషద్వారా మానవుని ఆలోచనలను, తర్కాన్ని కూలగొట్టి, తను ఉన్న ప్రపంచంలోని నీచత్వాన్ని చూసేట్టు చెయ్యగల వని ఆయన అన్నాడు. రంగస్థలం ఒక జాడ్యం వంటి దని, దాని క్రూరత్వాన్ని భరించగలిగిన ప్రేక్షకులు దాన్ని అధిగమించే శక్తిని పుంజుకుంటా రని చెప్పాడు.

ఆర్టోద్ రచనలకు ఆయన సిద్ధాంతాల కన్న తక్కువ ప్రాముఖ్యం ఉంది. ఆ రచనలు రాణించలేదు. 1935 లో ప్రదర్శించిన *లె చెంచి* ఆ కాలానికి మించిన సాహస ప్రయోగాలు చేసింది. ఆయన అంతర్దృష్టి జెనె, ఈజీన్, ఇయొనెస్కొ, శామ్యూల్ బెకెట్ వంటి అసంగత నాటక రచయితలను ఎక్కువగా ప్రభావితం చేసింది. భాష, హేతువాదాలకు రంగ స్థలంలో ఉన్న ప్రముఖ స్థానాన్ని కూలదోసి, సమకాలీన రంగస్థలాన్ని వీటి నుండి దూరంగా మళ్లించిన వారిలో ఆయన ఎన్నదగినవాడు.

ఇ.నా.

**ఆర్డెన్, జాన్ (1930--) :** ఆంగ్ల నాటక రచయిత. ఆర్డెన్ విద్యార్థిగా ఉండగానే ఇతని నాటకాలు ప్రదర్శిత మవుతూ వచ్చాయి. వాడుక భాష, పాటలు, పద్యాలు మిశ్రితమైన ఇతని రచనా శైలి విలక్షణ మైనది. మానవజీవితంలోని కొన్ని క్లిష్ట సమస్యలను ఎత్తి చూపి, పరిష్కారం సూచించకుండా ముగింపు చేయటం ఇతని ప్రత్యేకత. *ది లైఫ్ ఆఫ్ మేన్* (1956: మానవ జీవితం) అనే రేడియో నాటికలో, ఒక పిచ్చివాడు నడిపే ఓడలో చిక్కుకొన్న ప్రయాణికుల విషాదాంత ప్రయాణం ఇతివృత్తం. *వాటర్స్ ఆఫ్ బాబిలన్* (1957) లోని ధూర్తపాత్ర సమాజంలోని నైతిక అస్పష్టతను ఎత్తిచూపి ప్రేక్షకులను, విమర్శకులను చాలా ఇబ్బంది పెట్టింది. *లివ్ లైక్ పిగ్స్* (1958 'పందుల్లాగ బ్రతకండి'), *సార్జెంట్ ముస్‌గ్రేవ్ నృత్యం* (1959) కూడా ఇలాగే వివాదాత్మకమైనవి. ఆర్డెన్ 1957 లో మార్గరెటా డార్సీ (Margaretta D Arcy) అనే నటిని వివాహమాడి, ఆమెతో కలసి కొన్ని రచనలు చేశాడు. *హేపీ హెవెన్* (1960 - సుఖ స్వర్గం) ఒక వృద్ధాశ్రమాన్ని గురించిన ప్రహసనం. *ది వర్క్ హౌస్ డాన్కీ* (1963 - కర్మాగారపు గాడిద) లో మ్యునిసిపల్ కుళ్లురాజకీయాలు వస్తువు. *బూటకపు స్వాతంత్ర్యం* (1965)లో ప్రజాస్వామ్యసాధనలో మార్క్సకార్టా నిరర్థకత నిరూపిత మయింది. *జొనాథన్ దురదృష్ట నిధి* (1968) ఆ కాలంలో ప్రబలిన రంగస్థల నగ్నత్వాన్ని గురించిన శృంగార సంభాషణ. ఇలా ఇతని నాటకా లన్నీ దుస్సహమైన మానసిక సంక్షోభాన్ని సృష్టించి, తీవ్రమైన ఆలోచనను పురికొల్పేవిగా ఉంటాయి.

చ.తి.

**ఆర్న్‌డెట్, ఎర్న్‌స్ట్ మోరిట్స్ (1769-1860) :** ప్రముఖ జర్మన్ కవి, వచన రచయిత. దేశ భక్తుడు. నెపోలియన్ యుగంలో జర్మనీలో జాతీయ చైతన్యం ప్రబోధించిన మహనీయుడు.

రైజెన్ ద్వీపంలోని షారిట్జ్‌లో 1769 డిసెంబర్ 26 వ తేదీన ఆర్న్‌డెట్ జన్మించాడు. స్ట్రాల్సుండ్, గ్రీఫ్‌స్వాల్డ్, జీనా ప్రాంతాలలో విద్యాభ్యాసం చేసి లూథరిన్ మతోద్యోగి పదవి (Ministry) కి ఆయన అర్హత సంపాదించాడు. తన 28 వ ఏట ఆ మతోద్యోగం విడిచిపెట్టి 18 నెలల పాటు ఆస్ట్రియా, హంగరీ, ఇటలీ, ఫ్రాన్స్, బెల్జియం దేశాలను ఆయన సందర్శించి వచ్చాడు. తిరుగు ప్రయాణంలో రైన్‌నది ప్రక్కనుంచి వస్తూ ఆ నదీ తీరాలలో ఫ్రెంచ్ వారిచేత ధ్వంసం చేయబడిన దుర్గాలను చూసి ఆయన చలించి పోయాడు. ఫ్రాన్స్‌కు వ్యతిరేకంగా తీవ్రమైన విద్వేష భావాన్ని పెంచుకున్నాడు. ఆ ప్రయాణంలో కలిగిన భావాలనే అటు తరువాత ఆయన *రైసెన్ డర్చ్ ఐనెన్ టెయిల్ డాయిట్షలాండ్స్, ఉంగార్న్స్, ఇటాలియన్స్, ఉండ్ ఫ్రాంక్రెయిక్స్ ఇన్ డెన్ యార్హెన్* (1798-99, 1802-04) లలో వర్ణించాడు.

1800 లలో గ్రీఫ్‌స్వాల్డ్‌లో చరిత్రశాఖలో సహోపన్యాసకుడుగా ఆర్న్‌డెట్ స్థిరపడ్డాడు. 1803 లో *జర్మానీన్ ఉండ్ యూరోపా* అనే గ్రంథం ప్రచురించాడు. దానిలో ఫ్రెంచ్ దురాక్రమణను గూర్చిన తన భావాలను చాటాడు. ఆయన చేసిన తరువాతి రచన (1803) *వెర్‌సూక్ ఎయినర్ గెష్కిక్టే దెర్ లీ బిగ్జాన్ క్కాఫ్ ఇన్ పొమెర్న్ ఉండ్* రూజెన్‌ల లోని దాస్యచరిత్రకు సంబంధించింది. ఆ రచన ఫలితంగా మూడేళ్ల తరువాత 1806 లో స్వీడిష్ రాజు నాల్గవ గుస్టాఫ్ ఆ ప్రాంతాలలో బానిసత్వాన్ని రద్దుచేశాడు. ఆర్న్‌డెట్ 1806 లో గ్రీఫ్‌స్వాల్డ్ విశ్వవిద్యాలయంలో చరిత్రశాఖకు అధిపతి అయాడు. *గైస్ట్ డెర్ ట్సైట్* (కాల స్వభావం) అనే గ్రంథం మొదటిభాగం 1808 లో వెలువడింది. దానిలో ఫ్రెంచ్ దాస్యం నుంచి విముక్తి సాధించాలని తన దేశీయులను ఆయన ప్రబోధించాడు. నెపోలియన్ క్రోధం నుంచి తప్పించుకోడానికి ఆర్న్‌డెట్ స్వీడెన్ దేశానికి పలాయితుడు కావలసి వచ్చింది. అక్కడనుంచే ఆయన కరపత్రాలు, పద్యాలు, పాటల ద్వారా తన దేశీయులను ప్రబోధింప సాగాడు. 1809 లో ఆయన జర్మనీకి తిరిగి వచ్చి, 1812 లో ఫ్రాన్స్‌కు వ్యతిరేకంగా చివరి పోరాటాన్ని నడపటానికి సెంట్ పీటర్స్ బర్గ్‌కు వెళ్లాడు.

శాంతి నెలకొనిన తరువాత 1818 లో ఆర్న్‌డెట్‌ని బాన్ విశ్వవిద్యాలయంలో ఆధునిక చరిత్ర శాఖకు అధ్యక్షుడుగా నియమించారు. ఆ ఏడాదే ఆయన వ్రాస్తూన్న *గైస్ట్ డెర్ ట్సైట్* నాల్గవ భాగం ప్రచురితమైంది. దానిలో ఆయన జర్మన్ అధికారుల అభివృద్ధి నిరోధక చర్యలను విమర్శించాడు.

ఆర్న్‌డెట్ వ్రాసిన పద్యాలన్నీ దేశభక్తి పూరితమైనవే; ఆయన *గెడిఖ్టె* (పద్యాలు - 1804-18) లో ఎన్నో మనోహరమైన మతసంబంధమైన పద్యాలు కూడా ఉన్నాయి. ఆయన ఇతర రచనలలో ముఖ్యమైనవి స్వీయచరిత్ర (1840), *హైన్రిడిక్ కార్ల్‌ఫాన్ స్టైన్ తో నా యాత్రలు.*

1860 జనవరి 29 వ తేదీన బాన్ నగరంలో ఆర్న్‌డెట్ మరణించాడు.

పద్మాకర్

**ఆర్నాల్డ్, మాథ్యూ (1822-88) :** విక్టోరియన్ యుగంనాటి ప్రముఖ ఆంగ్లకవి, సాహిత్య, సాంఘిక విమర్శకుడు. తన దృష్టిలో అనాగరకము లనిపించిన (barbarian) అభిరుచులమీదా, ఆచారాలమీదా తీవ్రంగా ధ్వజ మెత్తిన గొప్ప సంస్కర్త, *కల్చర్ అండ్ అనార్కీ* (1869 'సంస్కృతి - అరాజకం') అనే గ్రంథం వ్రాసి 'సంస్కృతి ప్రవక్త'గా ప్రశంస లందినవాడు.



మాథ్యూ ఆర్నాల్డ్ రగ్బీస్కూలు హెడ్మాస్టరైన థామస్ ఆర్నాల్డ్ కుమారుడు. 1828 లో మాథ్యూ స్కూలులో చేరి, ఆక్స్‌ఫర్డ్ బాలియోల్ కాలేజీలో కూడా చదివి 1843 లో *క్రాంవెల్* అనే తనపద్యానికి *న్యూడిగేట్* బహుమతి పొందాడు. 1847 లో ఆర్నాల్డ్ లాన్స్‌డౌన్ (కాబినేట్ మంత్రి) ప్రభువుకి ప్రైవేట్ సెక్రటరీ అయాడు. 1851 లో ఫ్రాన్సెస్ లూసీ వైట్మన్‌ను వివాహం ఆడాడు. ఆ వివాహానికి అవసరం అయిన ధనం ఆర్జించడంకోసం లాన్స్‌డౌన్ అనుగ్రహంతో ఇన్స్‌పెక్టర్ ఆఫ్ స్కూల్స్‌గా చేరి చనిపోవడానికి రెండేళ్లముందు వరకూ ఆపదవిలో కొనసాగాడు. ఇంగ్లండ్‌లో అన్ని రాష్ట్రాలు పలుమార్లు పర్యటించి వచ్చాడు. ఫ్రాన్స్, జర్మనీ, హాలెండ్, స్విట్జర్లాండ్ దేశాలలో విద్యావిధానాన్ని పరిశీలించడం కోసం ప్రభుత్వం తరఫున ఆ దేశాలు చూసి వచ్చాడు. విదేశాలలో విద్యా విధానం మీద ఆయన సమర్పించిన రెండు నివేదికలు తరువాత గ్రంథరూపంలో వచ్చాయి.

ఆయన మొదటి ఖండకావ్య సంపుటి *ది స్ట్రేడ్ రివెలర్ అండ్ అదర్ పొయెమ్స్* (1849). 1852లో *ఎంపెడోక్లీస్ ఆన్ ఎట్నా, అండ్ అదర్ పొయెమ్స్* అనే సంపుటం వెలువడింది. ఈ రెండు సంపుటాలను ఆయన 'ఏ' అనే గుప్తనామంతో ప్రచురించాడు. వెనుకటి రెండు సంపుటాలనుంచి కొన్ని పద్యాలను ఎంచి, 1853 లో ప్రకటించిన సంపుటం తన సొంత పేరుతోనే ప్రకటించాడు. దాని ఉపోద్ఘాతంలో *ఎంపెడో క్లీస్* అనే పద్యాన్ని ఆ సంపుటంలో ఎందుకు చేర్చలేదో వివరించాడు. నాటకీయమైన ఆ పద్యంలో 'వేదనతప్ప ఆచరణ లేదనీ, అన్నీ సహించి ఊరుకోడం తప్ప ఏమీ చేసేది లేదనీ' ఆయన అన్నాడు. ఆర్నాల్డ్ రచించిన గొప్ప *ట్రాజెడి మెరోప్* 1858 లోను, *క్రొత్త పద్యాలు* అనే పద్య సంపుటం 1867 లోను వెలువడ్డాయి. ఆ తరువాత ఆయన మరి కొత్త పద్యాలు ఏవీ వ్రాసినట్లు కనిపించదు. ఆర్నాల్డ్ కవితలో ఎక్కువభాగం విమర్శకుడుగా ఆయన స్థాపించిన ప్రమాణాలకు నిలువజాలదు. పైకి ఆయన ఎంత ఉత్సాహంగానూ, గంభీరంగానూ, ఉదాత్తుడుగానూ కనిపించినా అంతరాంతరాలలో అణచి వేయబడిన జీవితం తాలూకు ప్రతిధ్వనులు ఆయన కవిత్వంలో తరచు వినిపిస్తూ ఉంటాయి.

*ఆత్మ ఆంతర సీమల యందు నుండి*
*ఎదో సుదూర తీరమునుండి ఎగసినట్లు*
*తేలి గాలుల మీద ప్రతిధ్వని లెవా*
*తనరుచు విషాదమున ముంచు దినము లెల్ల!*

1853 లో తన మిత్రునికి వ్రాసిన ఒక లేఖలో "నా కిప్పుడు 30 ఏళ్లు దాటాయి. మూడువంతులు నేను చల్లబడి పోయాను" అని వ్రాశాడు. ఆయనకు కవితావేశం ఒక విచిత్ర సన్నివేశంలో ఎలా వచ్చిందో ఆయన ఇలా వివరించాడు.

*"ఒక్క వజ్రఘాతమ్ము నా యురము తాకె*
*నిలిచి పోయిన నాడి స్పందింపసాగె"*

ఆర్నాల్డ్ కవితలో ఎక్కువభాగం ఇలా స్వగతంగానూ, ఆత్మదోష నివేదనగానూ మాత్రమే సాగినా, *సొహ్రాబ్ అండ్ రుస్తుం* వంటి పద్యాలలో ఉదాత్తత, స్వవిషయ రాహిత్యం గోచరిస్తాయి. 'డోవర్ బీచ్'

వంటి పద్యాలలో గొప్ప ధ్యానముద్రనూ, *ది స్కాలర్ జిప్సీ, థైర్‌సిస్* వంటి పద్యాలలో గాంభీర్యాన్నీ ఆయన సాధించాడు.

1857లో ఆర్నాల్డ్ ఆక్స్‌ఫర్డ్ కవితాశాఖాధ్యక్షుడుగా ఎన్నికై, పదేళ్లపాటు ఆపదవిలో ఉన్నాడు. ఆ ఆచార్య పదవికి ఆయన విప్లవాత్మకమైన ఒక నూతన లక్షణం చేకూర్చాడు. తన ప్రారంభోపన్యాసంలోనే ఆయన ఇలా అన్నాడు: "సాహిత్యంలో 'ఆధునికాంశ' (modern element) అనే శీర్షికలోని 'ఆధునిక' (modern) అనే పదానికి కేవలం 'సమకాలీన' అనే అర్థం కాదు. నైతిక, బౌద్ధిక విముక్తికోసం పడే ఆరాటం 'ఆధునికత' ప్రధానమైన లక్షణం. ఆయన ఉపన్యాసాలలో అనేకం అటుతరువాత *విమర్శక వ్యాసాలు* అనే శీర్షికతో గ్రంథ రూపంలో వెలువడ్డాయి. ఆయన ఆచార్య పదవివలన కలిగిన మూడు సత్ఫలితాలు: హోమర్ అనువాదాలను గూర్చి ఆయన చేసిన మూడు ఉపన్యాసాలు (1861). వాటిలో హోమర్ నిజాయితీనీ, ఉదాత్తతనూ ఆధునిక ప్రపంచానికి ఔషధంగా ఆయన నిర్దేశించాడు. అనవసరపు తొందర, విభిన్న లక్ష్యాలు ఆధునిక ప్రపంచాన్ని వేధిస్తున్న వ్యాధి ప్రధాన లక్షణాలుగా ఆయన పేర్కొన్నారు.

ఆర్నాల్డ్‌లో కవి అస్తమయం, విమర్శకుని ఆవిర్భావం ఏకకాలంలోనే జరిగినట్లు తోస్తుంది. అటు తరువాత ఆయన పూర్తిగా వచన రచనకే పూనుకున్నారు. *ఎస్సేస్ ఇన్ క్రిటిసిజమ్* 'ప్రథమ పరంపర-1865', 'ద్వితీయ పరంపర-1888', *కల్చర్ అండ్ అనార్కీ* అనే తొలి గ్రంథాలలోనే ఆర్నాల్డ్ ప్రముఖ భావాలూ, పదబంధాలూ ప్రచారంలోకి వచ్చాయి. 'ప్రస్తుతకాలంలో విమర్శకుని కర్తవ్యం' అనేది 1865 లో వెలువడిన సంపుటంలోని తొలివ్యాసం. తరువాత ఆర్నాల్డ్ విపులీకరించిన అనేక భావాలు బీజప్రాయంగా ఈ వ్యాసంలోనే మొదట ప్రతిపాదించ బడ్డాయి. అంతకుముందు ఎన్నడూ లేని ప్రాధాన్యాన్ని విమర్శకు ఆయన సాధించాడు. ఆయన ఉద్దేశ్యంలో విమర్శ కర్తవ్యం ప్రపంచంలో సాధించిన అత్యుత్తమ జ్ఞానాన్నీ, భావాలనూ రాగద్వేష విరహితమైన దృష్టితో గుర్తించి ప్రచారం చేయడం. ఆవిధంగా సత్యం, నిత్య నూతనం అయిన ఒక భావధారను పరిపోషించడం. ఒక్క సాహిత్యంలోనే గాక భగవచ్ఛాస్త్రం, చరిత్ర, లలిత కళలు, విజ్ఞానశాస్త్రం, సాంఘికశాస్త్రం, రాజకీయాలు మొదలైన అన్ని రంగాలలోను "రాగద్వేష విరహితమైన వస్తుగతదృష్టి"ని సమర్థించడమే నిజానికి ఆయన ప్రధాన లక్ష్యంగా కనిపిస్తుంది.

మాథ్యూ ఆర్నాల్డ్ అభిప్రాయం ప్రకారం విమర్శ రంగంలో ఇంగ్లండ్‌దేశం ఫ్రాన్స్, జర్మనీలకంటె ఎంతో వెనుకబడి ఉంది. గొప్ప సృజనాత్మక శక్తిగల ఆంగ్ల కాల్పనిక కవులు కూడా ఇంగ్లీష్‌లో విమర్శ అభివృద్ధి చెందకపోవడంవల్ల బాధ పడ్డారు. ఆంగ్లసాహిత్య విమర్శకులు యూరప్‌లోని ఇతర సాహిత్యాలను గూర్చి, అచ్చటి ప్రధాన విమర్శ ప్రమాణాలను గూర్చి తెలిసికొని ఉండడం అవసరం. ఈ భావాన్ని ఆర్నాల్డ్ *ది లిటరరీ ఇన్‌ఫ్లుయెన్స్ ఆఫ్ ఎకాడమీస్* అనే తన రెండవ వ్యాసంలో విపులీకరించాడు. తన విమర్శ రంగ పరిధులను ఆర్నాల్డ్ ఎంతగా విస్తృతపరచుకొన్నాడో గుర్తించడానికి ఆయన వ్రాసిన కొన్ని వ్యాసాల శీర్షికలు చూస్తే చాలు. మారిస్ డి గెరిన్, యూజినీడి గెరిన్, హైంద్రిక్ హైన్, జౌబర్ట్, స్పినోజా, మార్కస్ అరీలియస్ వంటి వ్యాస శీర్షికలన్నీ జీవితానికి ఆధునిక భావాలను వర్తింపజేసేందుకు ఆయన ఏ విధంగా కృషిచేశాడో తెలియపరుస్తున్నాయి.

1888 లో ప్రకటించబడిన విమర్శ వ్యాసాల సంపుటంలో తొలివ్యాసం *ది స్టడీ ఆఫ్ పొయెట్రీ* మొదట ఇది టి.హెచ్. వార్డ్ సంకలితం చేసిన *ది ఇంగ్లీష్ పొయెట్స్* (1880) అనే గ్రంథానికి ఉపోద్ఘాతంగా వెలువడింది. ఆర్నాల్డ్‌ను చిరస్మరణీయుణ్ణి చేసిన ఆయన భావా లనేకం ఈ వ్యాసంలో మనకు కనిపిస్తాయి: "మత విశ్వాసాలు కూలిపోతున్న యుగంలో మతాన్ని త్రోసిరాజని కవిత్వం ఆ స్థానాన్ని ఆక్రమించాలి." "జీవిత పరమార్థాన్ని మనకు వివరించడానికీ, మనలను ఓదార్చడానికీ, మనకు పుష్టి చేకూర్చడానికీ ఎక్కు వెక్కువగా మనం కవిత్వ సహాయాన్ని అర్థించడం జరుగుతుంది. అందుకే కుకవిత్వంనుంచి సుకవిత్వాన్ని వేరు చేయడం మనం నేర్చుకోవాలి. ఈ పని చేయగలగాలంటే మహాకవుల రచనలను గీటురాళ్లుగా స్వీకరించి దీక్షను, పదజాలాన్నీ, పద్యగమనాన్నీ ప్రమాణంగా మనం గ్రహించాలి."

తక్కిన వ్యాసాలలో టాల్‌స్టాయ్, అమీల్ (Amiel)ల మీద వ్రాసిన రెండు వ్యాసాలు మినహాయిస్తే మిగిలినవన్నీ మిల్టన్, గ్రే, కీట్స్, వర్డ్స్‌వర్త్, బైరన్, షెల్లీ వంటి ఆంగ్ల కవులను గూర్చి వ్రాసినవే. అన్ని వ్యాసాలలోనూ, జ్ఞాపకం ఉంచుకోదగ్గ విషయాలు ఎన్నో ఉన్నాయి. అన్నీ ఆ యా కవుల జీవిత విమర్శన రీతులను కచ్చితంగా అంచనా కట్టి, ఆధునిక మానవ జిజ్ఞాసను ఆ యా కవులు ఎంత వరకు తీర్చగలిగారో

వివరించాయి. ఆర్నాల్డ్ పేర్కొన్న అనేక అభిప్రాయాలకూ, నిర్ణయాలకూ ఇతర విమర్శకుల నుంచి ప్రతిఘటన వచ్చింది. "డ్రైడెన్, పోప్‌లు ఆత్మతో గాక బౌద్ధికంగా కవిత వ్రాశారు గనుక వారు కృతక కవులు" అనడం "గ్రే రచన ఆధ్యాత్మిక భావదూరమైన వచనయుగంలో వచ్చిన రెండవ తరగతి కావ్యం" (minor classic) అనడం, "గ్రే, కీట్స్, షెల్లీల కవిత్వం వెనుక ఉన్న మనిషిని గూర్చి" మరీ ఎక్కువగా పట్టించుకోడం, డన్ (Donne) కవినిగూర్చి ప్రస్తావించకపోవడం, కవిత్వం అంతరాంతరాలలో మానవ జీవిత విమర్శ అనడం మొదలైనవి అలాంటి తీవ్ర ప్రతిఘటనకు గురి అయాయి.

*సంస్కృతి, అరాజకం* అనే శీర్షికతో వెలువడిన గ్రంథం ఒక విధంగా ఆర్నాల్డ్ రచనలకు కేంద్రం వంటిది. *విమర్శ కర్తవ్యం, ఫ్రెనిఖ్ ఫైన్* అని అంతకుముందు ఆయన వ్రాసిన గ్రంథాలలో విక్టోరియన్ యుగ లక్షణాలమీద ఆయన వెలువరించిన అభిప్రాయాల విపులీకరణే ఈ గ్రంథం.

ఆర్నాల్డ్ తన జీవిత మంతటిలోనూ ప్రముఖస్థానం ఆక్రమించిన మతం వైపు తన దృష్టిని మళ్లించి *సెంట్ పాల్ అండ్ ప్రొటెస్టాంటిజమ్* (1870), *లిటరేచర్ అండ్‌డాగ్మా* (1873), *గాడ్ అండ్ ది బైబిల్* (1875), *లాస్ట్ ఎస్సేస్ ఆన్ చర్చ్ అండ్ రెలిజియన్* (1877) అనే గ్రంథాలు రచించాడు. ఈ గ్రంథాలలో ఆర్నాల్డ్ ఆంగ్లికన్ ఆధునికతా వాదాన్ని ప్రతిపాదించాడు. అటు పూర్వాచార పరాయణుల మత విశ్వాసాల నుంచి, ఇటు మత విశ్వాసం లేని హేతువాదుల నుంచి కూడా ఈ గ్రంథాలు తీవ్ర విమర్శలకు గురిఅయాయి. కాని, తన మత సంబంధమైన రచనలు నిర్మాణాత్మకమైనవనీ, సాంప్రదాయికమైనవనీ ఆర్నాల్డ్ భావించాడు.

1888 వసంత ఋతువులో హృద్రోగం వలన లివర్‌పూల్‌లో హఠాత్తుగా ఆర్నాల్డ్ మరణించాడు. లాలెహామ్‌లో ఆయనను ఖననం చేశారు.

బొ.శ్రీ.

**ఆర్నిమ్, బెట్టినా వాన్ (1785-1859) :** ఆధునిక ప్రముఖ జర్మన్ రచయిత్రి గానే కాక విశిష్టమైన వ్యక్తిత్వం గల మహిళగా కూడా ఆర్నిమ్ ప్రసిద్ధి పొందింది. ఆమె రచనలలో ఇతివృత్తాలు పైకి వేరు వేరుగా కనిపించినా నిజానికి అవి అన్నీ ఆమె స్వీయ జీవిత చిత్రాలే! ఫ్రాంక్‌ఫుర్ట్ అమ్ మెయిన్‌లో 1785 ఏప్రిల్ 4 న ఆర్నిమ్ జన్మించింది.

జర్మన్ కాల్పనికోద్యమంలో ఆర్నిమ్ ప్రముఖ పాత్ర నిర్వహించింది. ఈమె మిక్కిలి స్వాతంత్ర్యాభిలాషిణి. అయినా 1811 లో అఖిమ్ ఫాన్ ఆర్నిమ్‌ను వివాహమాడి అతనితో అనుకూల దాంపత్యం నెరపి, ఏడుగురు పిల్లల తల్లి అయింది. తన స్వభావంలో ఉన్న వైరుధ్యాలనే తన రచనలలో ఆమె ప్రకటించింది. ఆమెకు మిక్కిలి కీర్తి తెచ్చిన మూడు గ్రంథాలు గోథే మహాకవితోనూ, కెరోలిన్ ఫాన్ గుండెరోన్‌తోనూ, తన అన్న క్లెమెన్స్ బ్రెంటానో తోను ఆమె సాగించిన ఉత్తర ప్రత్యుత్తరాల రూపంలో ఉన్నాయి. అవి *గొథేస్ బ్రీఫ్ వెచ్‌సెల్ మిట్ ఐనెమ్ కిండె* (1835); *డీ గాండెరోడ్* (1840), *క్లెమెన్స్ బ్రెంటానోస్ ఫ్రూలింగ్స్ క్రాన్జ్* (1844). మొదట తాను వ్రాసిన లేఖలను సవరించి మార్పులు చేసి కొంతవరకు నవలల రూపంగా వాటిని ఆమె తీర్చిదిద్దింది. ఎలాంటి సంకోచాలూ లేని స్ఫుటమైన శైలి ఆమెది. ఆమె తల్లి మాక్సిమిలియానేకు వివాహం కావడానికి ముందు నుంచీ గొథేతో స్నేహం ఉండేది. వివాహం అయిన తరువాత భర్త అనుమానపడడంవల్ల హఠాత్తుగా ఆ స్నేహానికి విఘాతం కలిగింది. 35 ఏళ్ల అనంతరం తిరిగి కూతురు తల్లి స్థానాన్ని ఆక్రమించి, గొథేను ఆరాధించ సాగింది. మొదటి సారి ఆమె గొథేను కలుసుకునే నాటికి ఆయన వయస్సు 57 ఏళ్లు. తరచు ఆర్నిమ్ ఫ్రాంక్‌ఫుర్ట్ వెళ్లి, గొయిథే తల్లిని కలుసుకుని ఆ మహాకవి బాల్యానికి సంబంధించిన సంఘటనలను ఆమె వలన తెలిసికొని వ్రాసిపెట్టుకుంటూ ఉండేది. అనంతరం గొథే తన స్వీయచరిత్ర (*డిఖ్‌టుంగ్ ఉండ్ వార్‌హైట్*) లో ఆమె వ్రాసిపెట్టుకున్న ఆ నోట్సును ఉపయోగించుకున్నాడు. గొథేతో ఆర్నిమ్ అనుబంధం 1811 వరకూ కొనసాగింది. అటు తరువాత గొథే భార్య క్రిస్టియానే బహిరంగ కలహానికి దిగడంతో అది అంతమైంది.

ఆమె రాజకీయ అభిప్రాయాలు సంఘంలోని బడుగు వర్గాలపట్ల సానుభూతిని ప్రకటించేవి. ప్రష్యారాజు ఫ్రెడరిక్ విలియమ్ VI కోసం ఆమె రెండు పుస్తకాలు వ్రాసింది: *ఈ పుస్తకం రాజుగారికి చెందుతుంది* (1843), *రాక్షసులతో సంభాషణలు* (1852). బెట్టినా ఫాన్ ఆర్నిమ్ రచయిత్రి మాత్రమే కాదు; శిల్పి, గాయని కూడా! ఆమెలోని బహుముఖ ప్రజ్ఞలు, అభిరుచులు జర్మన్ కాల్పనిక తత్త్వానికి ప్రధాన లక్షణాలుగా పరిగణించబడ్డాయి.

1859 జనవరి 20 న బెర్లిన్‌లో ఆర్నిమ్ మరణించింది.

పద్మాకర్

**ఆర్వెల్, జార్జ్ (1903-1950)** : ఆంగ్ల నవలా రచయిత, విమర్శకుడు. ఆర్వెల్ జార్జ్ ఇతని కలం పేరు. అసలు పేరు ఎరిక్ ఆర్థర్ బ్లెయిర్ (Eric Arthur Blair). ఇతని తండ్రి బెంగాల్‌లో ప్రభుత్వోద్యోగిగా ఉండగా ఇతడు జన్మించాడు. తల్లి ఫ్రెంచి జాతీయురాలు. బర్మాలోని ఒక కలప వ్యాపారి కూతురు. మితి మీరిన భేషజాలవలన కుటుంబం పేదదైపోయినందున ఇతడు ఇంగ్లండ్‌లో చాలా పేదరికంతో బాధపడుతూ విద్యాభ్యాసం చేశాడు. కొంతకాలం బర్మాలో పోలీసు ఉద్యోగిగా పని చేశాడు. కాని చిన్నతనం నుండి సామ్రాజ్యవాద వ్యతిరేక భావాలు, సామ్యవాద భావాలు పెంచుకున్న ఆర్వెల్ ఆ ఉద్యోగంలో ఇముడలేక రాజీనామా చేశాడు. కొంతకాలం ప్రజా కంటకపు ఉద్యోగం చేసిన పాప పరిహారార్థం కొన్నాళ్లు లండన్‌లో పేదలు, కూలీలు, నిరుద్యోగులు, భిక్షుకుల మధ్య చిరిగిన గుడ్డలు ధరిస్తూ నివసించాడు. వ్యవసాయ కూలీగా, గనుల్లో పనివాడుగా, ప్యారిస్‌లో హోటలులో పాత్రలు కడిగేవాడుగా పనిచేశాడు. కొన్నాళ్లు ఉపాధ్యాయుడుగా, పుస్తకాల అంగడిలో పనివాడుగా పనిచేశాడు. ఇలా వైవిధ్యంతో కూడిన జీవితంలో సంపాదించిన అనుభవాలు ఆధారంగానే *డౌన్ అండ్ ఔట్ ఇన్ ప్యారిస్ అండ్ లండన్* (లండన్ ప్యారిస్‌ల నిమ్న శ్రేణులు), *రోడ్ టు విగాన్ పియెర్* (క్రవంతెనకు దారి) (*Road to Wigan Pier*), *ది క్లెర్జిమన్స్ డాటర్* (మతాచార్యుడి కూతురు) మొదలైన నవలలు వ్రాశాడు. ఈ రచన లన్నింటిలోను సామ్యవాద భావాలతో పాటు అపమార్గాలలో పోతున్న సామ్యవాదోద్యమం పట్ల అధిక్షేపణ కూడా కనిపిస్తుంది. స్పెయిన్ అంతర్యుద్ధ సమయంలో అక్కడికి వెళ్లి ప్రజాతంత్ర సైన్యంలో చేరాడు. తీవ్రంగా గాయపడడంతో జీవితాంతం వరకు అతని కంఠస్వరం దెబ్బ తిన్నది. తరువాత ఏక పక్ష నియంతృత్వానికి పాల్పడ్డ స్పెయిన్ కమ్యూనిస్టులను వ్యతిరేకించి, ప్రాణాపాయ పరిస్థితిలో పారిపోయి ఇంగ్లండ్ చేరాడు. *హోమేజి కటలోనియా* (1938 కటలోనియాకు జోహారు) అనే గ్రంథంలో ఈ అనుభవాలను పొందుపరచాడు. ఇదే అతని సర్వోత్తమ గ్రంథమని కొందరి భావన. తిరిగి ఇంగ్లండ్ చేరిన తరువాత ఇతడు మితవాదిగా మారిపోయాడు. *కమింగ్ అప్ ఫర్ ఎయిర్* (1939 గాలికోసం పైకివస్తూ) అనే గ్రంథంలో ప్రాతకాలపు ప్రజాస్వామ్య వైభవాన్ని స్మరిస్తూ, రాబోయే ఫాసిస్టు యుద్ధాన్ని గూర్చి భయపడుతూ కనిపిస్తాడు. రష్యా విప్లవం, అది కలిగించిన ఆశాభంగం వస్తువులుగా *యానిమల్ ఫార్మ్* (1945 పశువుల కొట్టం) అనే నవల వ్రాశాడు. చాలా కాలం వరకు దీన్ని ప్రకటించే సాహసం ఎవరూ చెయ్యలేకపోయారు. 1950 లో ఇతడు దాదాపు మృత్యుశయ్య మీద ఉండి రచించిన '1984' అనే నవలలో ప్రభుత్వాల నిరంకుశత్వాన్ని ఇలాగే కొనసాగ నిస్తే ముందు ముందు సత్యానికీ, చరిత్రకూ ఎటువంటి దుర్గతి పట్టబోతున్నదో ఊహించి చెప్పాడు.



నవలా రచయితగా ఆర్వెల్ విశేష ప్రతిభ ప్రదర్శించలేకపోయాడు. అతనిలో సృజనాత్మకత తక్కువ. అతని కథ లన్నీ కట్టుకథల్లాగానే కనిపిస్తాయి. కాని పత్రికా రచయితగాను, ఆత్మకథా రచయితగాను అతడు అనన్య సామాన్యమైన ప్రతిభ ప్రదర్శించాడు. నిజ జీవితంలోని చేదు అనుభవాలే అతనిలో ధార్మికమైన క్రోధాన్ని ప్రజ్వలింపజేసి అత్యుజ్జ్వలమైన రచనలు చేయించాయి.

చ.తి.

**ఆలర్కోన్ యి అరిజా, పెడ్రో ఆన్టోనియో డి (1833-91)** : ప్రముఖ స్పానిష్ నవలా రచయిత. *ఎల్ సాంబ్రె రో డీ ట్రెస్‌పికోస్* (1874) అనే ప్రసిద్ధమైన నవల వ్రాసినవాడు.

అతడు రచించిన నాటకం *ఎల్ హిజో ప్రోడిగో* (The Prodigal Son) 1857 లో రంగస్థలం నుంచి నిష్క్రమించిన నాటికే ఆలర్కోన్ పత్రికా రచయితగా, కవిగా గణనీయమైన ఖ్యాతిని సంపాదించాడు. ఆ నాటక వైఫల్యం అతనిని మిక్కిలి క్రుంగదీసింది. ఫలితంగా అతడు 1859-60 మధ్య సైన్యంలో చేరాడు. తన ప్రత్యక్షానుభవంతో సైనిక జీవితాన్ని వస్తువుగా చేసుకొని *డియోరియో డీ అన్ టెస్టిగో డీ లా గెరా డీ ఆఫ్రికా* (1859, Diary of a witness of the African war) అనే గ్రంథం రచించాడు. సైనిక జీవిత చిత్రణకు సంబంధించిన ఈ జాతి గ్రంథాలలో ఇది ఉత్తమోత్తమమైంది. సైన్యం నుండి తిరిగి వచ్చిన తరువాత ఆలర్కోన్ *ఎల్ లాటిగో* అనే క్రైస్తవమత వ్యవస్థా వ్యతిరేకమైన ఒక పత్రికకు సంపాదకత్వం వహించాడు.

కాని 1868-74 మధ్య నిలకడలేకుండా పదవులు మార్చటంవల్ల రాజకీయ రంగంలో గౌరవం కోల్పోయాడు. ఏదేమైనా అతని సాహిత్య ఖ్యాతి మాత్రం నానాటికీ అపారంగా విస్తరించింది. ఒకానొక జానపద కథాగేయాన్ని ఆధారంగా చేసుకొని వ్రాసిన *ఎల్ సాంబ్రెరొ డీ ట్రెస్ పికోస్* అనే చిన్న నవల అతని నిర్మాణ దక్షతకూ, సూక్ష్మ పర్యాలోచనకూ నిదర్శనం. *మాన్యుయల్ డి ఫాల్లా* అనే తన నృత్య నాటికను అదేపేరుతో కథారూపంగా రచించాడు. ఆలర్సోన్ రచించిన ఇతర ప్రసిద్ధ నవలలు: *ఎల్ ఫినాల్ డినార్మా* (1855, The Last Act of Norma), *ఎల్ ఎస్కాన్డాలో* (1875, The Scandal), *ఎల్ నినోడిలాబోలా* (1880, The Lucky Kid).

చిం.వెం.

**ఆలిగ్రియా, సైరో (1909-1967)** : పెరూ దేశపు నవలా రచయిత. మరానోన్ నదీ ప్రాంత నివాసుడైన బాల్సెరో జాతి ఇండియన్‌ల జీవితాన్ని చిత్రిస్తూ *లా సెర్పియెన్టే డె ఓరో* (1935), *లోస్ పెర్రోస్ హంబ్రియెన్టోస్ (1936), ఎల్‌ముండో ఎస్ ఆంచోయి అజెనో* (1941) అనే నవలలను వ్రాశాడు. ఆదిమవాసులైన ఇండియన్‌లను స్థలభ్రష్టులుగా, క్షేత్రభ్రష్టులుగా చేసి వారిపై అనేక అత్యాచారాలను, అన్యాయాలను జరిపిన సామ్రాజ్య వాద ప్రతీప శక్తులను ఈయన నిశితంగా విమర్శించాడు. అదే సమయంలో వారి సమాజ వ్యవస్థలో జాతి పతనానికీ, నిర్వీర్యతకూ కారణాలైన అజ్ఞానమూ, మూఢవిశ్వాసమూ, నిష్క్రియతా మొదలైన బలహీనతలను గూడా సూక్ష్మ దృష్టితో విశ్లేషించి చూపించాడు.

డి.వి.కె.రా.

**ఆలెన్కార్, హోసే డి (1829-77)** : బ్రెజిల్ దేశపు నవలా రచయిత. ఆదిమానవుని సహజ సరళతనూ, నైతిక ప్రవర్తననూ, శీల స్వచ్ఛతనూ ప్రశంసించే కాల్పనిక గాథలను వ్రాశాడు. వాణిజ్య సభ్యతలలో పెచ్చుపెరిగిన ధనకాంక్షా, భౌతిక సౌఖ్య నిరతీ, కాథలిక్ పురోహితుల మతమౌఢ్యం వల్ల ప్రకృతి ధర్మాలకు దూరమైన కృత్రిమ నాగరకతా వంటి ధోరణులను గర్హిస్తూ, శీలలైన కన్యలూ, శాలీనులైన అమెరిండియన్లూ, ప్రాకృతిక నైజానికి అనుగుణంగా సామరస్య భావం సాధించే ఆదర్శజీవన వ్యవస్థను అభివర్ణిస్తూ *ఓ గ్వారానీ* (1857), *ఇరాసిమా* (1865) అనే నవలలను రచించాడు. కథాకథనంలోనూ, శిల్పసంవిధానంలోనూ ఎన్నో లోపాలున్నా, రసవంతమైన శైలిద్వారానూ, జాతీయ మైన ఐతిహ్యాన్ని వర్ణించడం ద్వారానూ, బ్రెజీలియన్ సాహిత్యంలో విశిష్ట స్థానం గడించాడు. *ఆస్ మినాస్ డి ప్రాటా* (1865); *ఓ గాచో* (1870), *ఉబిరాహారా* (1874), *ఓ సెర్టానెహో* (1876) అనేవి ఆయన ప్రముఖ రచనలు.

డి.వి.కె.రా.

**ఆల్జర్, హొరేషియో (1834-99)** : అమెరికన్ నవలా రచయిత; కథానికా రచయిత. అమెరికా అంతర్యుద్ధానంతరం పారిశ్రామిక పురోగతిలో ఆ సమాజంలో ప్రబలిన భౌతిక లాలసను, ఆశావాదాన్ని ప్రోత్సహిస్తూ శతాధికంగా లోకప్రియమైన నవలలు వ్రాశాడు. వ్యక్తి తన ప్రతిభతో నిరవధికమైన స్వయంకృషి ద్వారా, నైతిక ప్రవర్తనను విడనాడకుండా ఐశ్వర్యాన్ని సముపార్జించి, సుఖమయ జీవనాన్ని సాధించాలన్న లౌకికాదర్శాన్ని ఆయన ప్రతిపాదించాడు. అమెరికా స్వప్నానికి మూలాధారమైన 'సాఫల్య' సిద్ధాంతాన్ని బలపరుస్తూ, వ్యక్తి సంకల్పశక్తి, అవకాశప్రాప్తి గీటు రాళ్లుగా తన పాత్రలను మలచి ఎంతో ప్రజాదరణ పొందాడు. పొదుపూ, నిజాయితీ, నిరంతర కృషీ, కార్య దక్షతా, ఆత్మ విశ్వాసం ప్రాథమిక విలువలుగా భావిస్తూ, తమ భాగ్యరేఖను మలుచు కుంటూ, పేదరికం నుండి పెద్దరికందాకా పెరిగి, ప్రాభవం, అభ్యున్నతి సాధించిన ధీరనాయకుల వృత్తాంతాలను *రాగెడ్ డిక్* (1868), *రిజెన్ ఫ్రమ్ ది రాంక్స్* (1874), *ఫేసింగ్ ది వరల్డ్* (1893) మొదలైన నవలలలో వర్ణించి, కర్మ మార్గాన్ని అవలంబించమని సమకాలీన యువతరాన్ని ఆల్జర్ ఉద్బోధించాడు.

డి.వి.కె.రా.

**ఆల్ఫియెరీ, విట్టోరియో కోంటె (1749-1803):** ప్రముఖ ఇటాలియన్ రచయిత; నిరంకుశత్వాన్ని నిర్భయంగా ఖండిస్తూ రచనలు చేసిన ట్రాజెడీ రచయిత.

1749 జనవరి 16 లో పీడ్మంట్ మండలంలోని అస్తిలో జన్మించాడు. ఇతర యూరపియన్ జాతులలోని ట్రాజెడీలకు దీటైన ఇటాలియన్ ట్రాజెడీలను ఇతడు సృష్టించాడు. తన భావగీతాల ద్వారానూ, నాటకాల ద్వారానూ ఇటలీ జాతీయ చైతన్యాన్ని పునరుజ్జీవింపచేసిన మహాకవి ఈయన. ట్యూరిన్ మిలిటరీ అకాడమీలో విద్యాభ్యాసం చేసి మొదట ఒక చిన్న సైనికోద్యోగం చేబట్టాడు. కాని త్వరలోనే ఆ ఉద్యోగానికి రాజీనామా చేసి, యూరప్ అంతటా పర్యటించాడు. తాను ఆదర్శం అని నమ్మిన రాజకీయ స్వాతంత్ర్యం ఆయనకు ఇంగ్లండులో కనిపించింది. ఫ్రాన్స్‌లోని సాహిత్య వైభవం ఒక

ప్రగాఢమైన ప్రభావ ముద్రను అతనిపై వేసింది. వోల్టేర్, రూసో, మాంటెస్క్యూల రచనలను ఆయన గాఢంగా చదివాడు.

1772 లో ఆల్ఫియెరీ ట్యూరిన్‌లో స్థిరపడి ముందుగా *క్లియోపాట్రా* అనే విజయవంతమైన ట్రాజెడీని 1775 లో రచించాడు. తరువాత జీవితాన్ని సాహిత్యానికే అంకితం చేసి, 1782 నాటికి 14 ట్రాజెడీలను, అనేక భావ గీతాలను రచించాడు. 1777 లో నిరంకుశత్వాన్ని ఖండిస్తూ వచనంలో *డెల్లా టిరాన్నైడ్* (1777) అనే రాజకీయ ఉద్గ్రంథం రచించాడు. 1777లోనే ఫ్లారెన్స్‌లో స్టువార్ట్ భార్య కౌంటెస్ అఫ్ అల్బనీని కలుసుకుని, జీవితాంతం ఆమెతో ప్రగాఢమైన అనుబంధం పెంచుకున్నాడు. ఆల్ఫియెరీ నాటకాలలో సాధారణంగా ఒక నిరంకుశ ప్రభువుకూ, ఒక స్వాతంత్ర్య యోధునికీ మధ్య జరిగే సంఘర్షణ చిత్రించబడింది.



ఈయన వ్రాసిన మొత్తం 19 ట్రాజెడీలలోను ముఖ్యమైనవి: *ఫిలిప్పో, పాలెనిస్, ఆంటిగొనె, వర్జీనియా, అగమెమ్నాన్* మొదలైనవి. ఆయన ట్రాజెడీలలో మకుటాయమానమైనది *సాల్* (Saul). *మిటాడీ విక్టోరియె ఆల్‌ఫెరీ స్క్రిట్టాడా ఎస్సొ* అనే పేరుతో ఆయన వ్రాసుకున్న ఆత్మకథ ఆయన మరణానంతరం ప్రచురించబడి, 1951 లో ఇంగ్లీషులోకి అనువదించబడింది. 1803 అక్టోబరు 8 న ఫ్లారెన్స్‌లో ఆల్ఫియెరీ తుది శ్వాస విడిచాడు.

బా.శ్రీ.

**ఆల్మ్‌క్విస్ట్, కార్ల్ యొనాస్‌లోవ్ (1793-1866):** ప్రముఖ స్వీడిష్ రచయిత. ఆతని రచనలు ఎగుడు దిగుడుగా కనిపించినా, స్వీడిష్ గద్యరచనలో సిద్ధహస్తుడుగా ప్రసిద్ధి పొందాడు.

ఉప్సల లో విద్యాభ్యాసం పూర్తిచేసి ఆల్మ్‌క్విస్ట్ స్టాక్‌హోమ్‌లో క్రైస్తవ మతోద్యోగిగా ప్రవేశించాడు. 1823 లో తన పదవిని వదలుకొని స్నేహితులతో కలసి రూసో భావాలకు అనుగుణమైన, ఆదర్శప్రాయమైన కర్షక జీవితాన్ని గడపడానికి పశ్చిమ స్వీడన్ వెళ్లాడు. రెండేళ్ల తరువాత ఆతడు స్టాక్‌హోమ్ తిరిగివచ్చి, 1829 నుండి 1841 వరకు ఒక ప్రయోగాత్మక ఉన్నత పాఠశాలలో ప్రధానోపాధ్యాయుడుగా ఉన్నాడు. మోసం చేశాడనీ, ఒకవడ్డీ వ్యాపారిని హత్యచేయబూనాడనీ, అతని మీద అభియోగాలు రాగా, 1851 లో ఆతడు అమెరికా సంయుక్త రాష్ట్రాలకు పారిపోయాడు. 1865 లో యూరపుకు తిరిగివచ్చాడు.

1830-40 మధ్య కాలంవరకూ ఆల్మ్‌క్విస్ట్‌కు పెద్ద పేరు రాలేదు. ఈ మధ్య కాలంలోనే ఈతడు పుంఖానుపుంఖంగా గద్య, పద్య రచనలను ప్రచురింపనారంభించాడు. ఇలా వచ్చిన నవలలు, చిన్నకథలు, పద్య కావ్యాలూ, పద్య నాటకాలూ *టార్న్ రోజెన్స్‌బుక్* అన్న పేరుతో 14 భాగాలుగా ప్రకటించబడ్డాయి. ఆల్మ్‌క్విస్ట్ రచనలలో ముఖ్యమైనవి: *అమోరిన* (దీనిని 1821లో వ్రాశాడు. కొద్ది మార్పులతో 1839 లో ముద్రించాడు), *డ్రోట్నిన్‌జెన్స్ జువెల్స్‌మైక్* (1834: 'రాణీగారి వజ్రాల ఆభరణం'). ఈ రెండవది చరిత్రాత్మక నవల. దీనిలోని కథా నాయిక టిన్టోమరా స్త్రీ పురుష లక్షణాలు రెండూ ఉన్న ఒక విచిత్ర పాత్ర. ఆమె అత్యంత ఆకర్షణీయమైన పాత్ర అవడమేకాక, ఆల్మ్‌క్విస్ట్ సృజనాత్మక రచనలన్నింటికీ ఆమె ప్రతీకగా కనపడుతుంది. *డెట్ గార్ ఆన్* (1838) ప్రేమ, వివాహాల విముక్తి కోసం వాదించే అద్భుతమైన వాస్తవిక కథ. ప్రజలలో చర్చలను లేవదీసే స్ట్రిండ్‌బర్గ్ పద్ధతికి ఇది నాంది పలికింది.

ఆల్మ్‌క్విస్ట్ బహుముఖ ప్రజ్ఞాశాలి. ఆతడు సాంప్రదాయికమైన వివాహ వ్యవస్థను ఎదుర్కొన్నాడు; 1837లో ఆతడు క్రైస్తవ మతగురువుగా దీక్షపొంది, లూథరిన్ చర్చి విశ్వాసాలను ధైర్యంగా అవహేళన చేశాడు. పాత్రికేయుడుగాను, సృజనాత్మక రచయితగాను నైతిక సామాజిక సంస్కరణలకోసం పోరాడాడు. కాని, ఆతనిలో ప్రధానంగా స్వార్థచింతనతో కూడిన ఏకాకితనం కనిపించేది. క్రైస్తవ మార్మికవాదం, స్వీడెన్‌బర్గ్ పారలౌకిక దృష్టి ఇతని వ్యక్తిత్వానికి రూప కల్పన చేశాయి.

వ.మం.

**ఆష్, షోలెమ్ (1880-1957) :** యిడ్డిష్ భాషా రచయిత. వార్సాలో హీబ్రూ, యిడ్డిష్ భాషలలో రచనా వ్యాసంగం ప్రారంభించి, తదుపరి 1909 లో అమెరికాలో స్థిర నివాసం పొంది, కొన్నాళ్లు లండన్‌లోకూడా గడిపాడు. సమకాలీన చారిత్రక, ధార్మిక విషయాలను కథావస్తువులుగా నాటకాలూ, నవలలూ వ్రాశాడు.

యూదుజాతిలో బడుగువర్గాల జీవితాన్ని చాకచక్యంగా, అవగాహన పూర్వకంగా చిత్రీకరించాడు. *ది వెంజెన్స్ ఆఫ్ గాడ్* (1907) అనే నాటకం, *ది నాజరీన్* (1939), *ది అపాసిల్* (1943), బైబిల్ గాథలను ఆధారంగా చేసుకొన్న *మేరీ* (1949) అనే నవల ఆయన సుప్రసిద్ధ కృతులు.

డి.వి.కె.రా.

**ఆస్టూరియాస్, మిగుయెల్ ఆంజిల్ (1899-1974) :** గ్వాటిమేలా నగరానికి చెందిన కవి, నవలా రచయిత, దౌత్య నిపుణుడు, నోబెల్ పురస్కార గ్రహీత. 1899 అక్టోబరు 19 వ తేదీన ఆస్టూరియస్ గ్వాటిమేలా నగరంలో జన్మించాడు. 1923 లో యూనివర్సిడాడ్ డి గ్వాటిమేలాలో న్యాయశాస్త్రంలో పట్టభద్రుడైన తరువాత పారిస్ నగరంలో స్థిరపడి, సార్బాన్ విద్యాలయంలో ఆస్టూరియస్ సంస్కృతి శాస్త్రం (ethnology) అధ్యయనం చేశాడు. ఫ్రెంచ్ నవలా రచయిత, అధివాస్తవికవాది అయిన ఆండ్రీ బ్రెటాన్ ప్రభావానికి లోనై తీవ్రమైన అధివాస్తవిక వాదిగా ఆయన రూపొందాడు. ఆయన రచించిన తొలి ఉద్గ్రంథం *లెయెన్డాస్ డి గ్వాటిమేలా* (1930-గ్వాటిమేలా గాథలు). దీనిలో స్పెయిన్‌వారి ఆక్రమణకు పూర్వం మాయన్ జాతివారి సంస్కృతి, జీవన విధానం వర్ణించ బడ్డాయి. ఈ గ్రంథానికి ఫ్రాన్స్‌లోను, స్వదేశంలోను కూడా విశేషమైన ప్రశంస లభించింది.



ఫ్రాన్స్ నుంచి గ్వాటిమేలాకు తిరిగి వచ్చిన తరువాత ఆస్టూరియస్ *ఎల్ డియారియె డెల్ ఐర్* అనే రేడియో మేగజైను నడిపాడు. ఆ కాలంలోనే ఆయన కవితా సంకలనాలు అనేకం- *సొనేటోస్ (1936 Sonnets)* మొదలైనవి వెలువడ్డాయి. 1946 లో ఆయన రాజదౌత్య జీవితం ప్రారంభమైంది. అయినా మధ్య, దక్షిణ అమెరికాలలోని వివిధ దేశాలలో రాజదౌత్య విధులు నిర్వర్తిస్తూనే ఆస్టూరియస్ రచనా వ్యాసంగం కూడా కొనసాగిస్తూ వచ్చాడు. ఆరోజులలోనే నవలా రచయితగా కూడా ఆస్టూరియస్ ప్రతిభ అభివ్యక్తమైంది. ఆయన తొలి నవల *ఎల్ సీనార్ ప్రెసిడెంట్* (1946) లో గ్వాటిమేలా నియంత అయిన మాన్యువెల్ ఎస్ట్రాడా కాబ్రెరాను సహేతుకంగా విమర్శించాడు. *హామ్‌బ్రెస్ డి మెయిస్* (1949) అనే నవల ఆయన నవలలలో తలమానికంగా పరిగణించబడుతూంది. దానిలో ఆయన రెడ్ ఇండియన్ రైతుల దుర్భర పరిస్థితులను చిత్రించాడు. *వినెటో ఫ్యూర్‌టే* (1950), *ఎల్‌పాపావెర్‌డే* (1954), *లాస్ వోజోస్ డి లాస్ ఎన్‌టెరాడోస్* (1960) అనే నవలాత్రయంలో అరటి తోటలలో పనిచేసే రెడ్ ఇండియన్ కార్మికుల దారుణ పరిస్థితులు వర్ణించబడ్డాయి. 1966 నుంచి 1970 వరకు ఆస్టూరియస్ పారిస్‌లో గ్వాటిమాలన్ రాయబారిగా పనిచేస్తూ, అక్కడే స్థిరపడిపోయాడు.

1967 లో ఆస్టూరియస్‌కు సాహిత్యంలో నోబెల్ బహుమతి లభించింది. 1966 లో ఆయనకు సోవియెట్ యూనియన్ లెనిన్ శాంతి బహుమతి లభించింది. 1974 జూన్ 9 న మాడ్రిడ్‌లో ఆస్టూరియస్ తుది శ్వాస విడిచాడు.

బొ.శ్రీ.

**ఆస్టెన్, జేన్ (1775-1817) :** ప్రముఖ ఆంగ్ల నవలా రచయిత్రి. నిత్యజీవితంలో ఎదురయే సాధారణ వ్యక్తులను గురించి వ్రాస్తూ ఇంగ్లీష్ నవలలకు ఆధునికతా లక్షణాన్ని ప్రస్ఫుటంగా కలిగించిన మొట్టమొదటి రచయిత్రి. సమకాలీన మధ్యవర్గం వారి అలవాట్లను హేళన చేస్తూ *సెన్స్ అండ్ సెన్సిబిలిటీ* (1811), *ప్రైడ్ అండ్ ప్రెజుడిస్* (1813), *మాన్స్ ఫీల్డ్ పార్క్* (1814), *ఎమ్మా* (1815), *నార్తేంగర్ ఆబీ, పెర్సుయేషన్* (1817 లో ఆమె చనిపోయిన తరువాత ప్రకటితమయింది) అనే నవలలను ఆమె రచించింది.

స్టీవెన్‌టన్‌లోని హాంప్‌షైర్ గ్రామంలో రెక్టార్‌గా పనిచేస్తున్న రెవెరెండ్ జార్జ్ ఆస్టెన్ కుమార్తెగా 1775 డిసెంబరు 16 వ తేదీన జేన్ ఆస్టెన్ జన్మించింది. ఆమె తండ్రికి ఆరుగురు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. ఈమె రెండవ కుమార్తె. కుటుంబంలో ఈమెతో మిక్కిలి సన్నిహితంగా ఉన్నది ఈమె అక్క 'కెసెండ్రా'. ఆమె కూడా అవివాహితగానే ఉండిపోయింది. ఆ అక్కచెల్లెండ్రిద్దరూ 1782 మొదలు 1787 వరకు 5 ఏళ్ళు మాత్రమే స్కూళ్లకు వెళ్లి చదువుకున్నారు. తరువాత వారి విద్యాభ్యాసం ఇంటివద్దనే కొనసాగింది. తండ్రి గొప్ప విద్వాంసుడు. చర్చ్‌లో చేరడానికి ముందు ఆయన ఆక్స్‌ఫర్డ్‌లోని సెంట్‌జాన్స్ కాలేజ్‌లో ఫెలోగా ఉంటూ,

విద్యార్థులలో విజ్ఞాన తృష్ణను రేకెత్తించేవాడు. ఆయన భార్య కెసెంద్రా చమత్కారంగా మాట్లాడేది. ఆశువుగా పద్యాలు, కథలు అల్లి పిల్లలకు చెప్పేది. నాటకాలలో నటించడం అంటే ఆ కుటుంబ సభ్యులకు ఎంతో ఇష్టం. ఆస్టెన్ కుటుంబ సభ్యులతోను, ఇరుగు పొరుగులతోను ఒక స్టీవెంటన్ నాటక సమాజం ఏర్పడింది. వేసవి సెలవులలోను, క్రిస్మస్‌పండుగ దినాలలోను వారు తమ ఇంట్లోనే నాటకాలు ప్రదర్శించేవారు.

జేన్ ఆస్టెన్ బాల్య జీవితంలో ఎలాంటి చెప్పుకోదగిన సంఘటనలూ లేకపోయినా, ఆ నాటి సాంఘిక, రాజకీయ పరిణామాలకు దూరంగా ఆమె జీవితం గడపినా, అనురాగ పూరితమైన తన కుటుంబ వాతావరణమే ఆమె రచనకు ప్రేరణ కలిగించింది. స్టీవెంటన్ వాతావరణంతోనే గాక, బంధుత్వ రీత్యాను, మైత్రిని పురస్కరించుకొని బాత్, లండన్ మొదలైన నగరాలను ఆమె సందర్శిస్తూ ఉండడంవల్ల అక్కడి వాతావరణంతో కూడా ఆమెకు ప్రగాఢమైన పరిచయం ఏర్పడింది. ఆ వాతావరణాలనూ, ఆమె సన్నిహితంగా ఎరిగి ఉన్న వ్యక్తులనూ ఆమె తన నవలలలో చిత్రించింది.

ఆమె మొట్టమొదటి రచన 1787 లో చేసింది. ఆ తరువాత 1795 లోపుగానే తన రచనలలో ఎక్కువ భాగం ఆమె రచించింది. ఆ రచనల కన్నిటికి శుద్ధ ప్రతులు వ్రాయించి మూడు చక్కని సంపుటాలుగా ఆమె తయారు చేయించింది. మూడింటిలోనూ కలసి మొత్తం 21 రచనలు - నాటకాలు, కావ్యాలు, చిన్న నవలలు, ఇతర వచన రచనలు ఉన్నాయి. సునిశితమైన వివేచనతో ఆ నాడు ఉన్న వివిధ సాహిత్య రూపాలకు పేరడీలుగా చేసిన రచనలు అవి. ఆమె సీరియస్‌గా వ్రాసిన తొలి రచన: *లేడీ సుసాన్* (1793-94 లో ఉత్తరాల రూపంలో వ్రాసిన చిన్న నవల)

జేన్ ఆస్టెన్ 1796 లో టామ్ లెఫ్రాయ్‌ని, 1798 లో శామ్యూల్ బ్లాకాల్‌ని, 1802 నవంబరులో హారిస్ బిగ్ విదర్‌ని వివాహం చేసుకోవాలను కుంది. కాని అంతలోనే ఆమె మనస్సు మార్చుకుంది. ఆ తరువాత ఒక నౌకా శాఖాధికారి, ఒక సైనికాధికారి, ఒక మతాధికారి వంటి వారి నెందరినో ఆమె వివాహం చేసుకోబోతూందని పుకార్లు వచ్చాయి. కాని, వెంట వెంటనే వారు మరణిస్తూ ఉండడంతో ఆమె ఎవరినీ వివాహం చేసుకోలేదు.

జేన్ ఆస్టెన్ నవలలలో ప్రేమ, వివాహం ప్రధాన విషయాలు కావడం వల్ల ఈ పుకారులలో కొన్నింటి నిజాలను ఆమె నవలల ద్వారా ఊహించవచ్చును. ఆమె నవలలలో భగ్నప్రేమ యొక్క అనుభూతి ఎక్కువగా కనిపిస్తూంది. ఆమె చివరి నవల *పెర్స్వేషన్* లో ఈ అంశం మరీ స్ఫుటంగా కనిపిస్తుంది.

1811 తరువాత ఆస్టెన్ జేన్ జీవితం మిక్కిలి ఫలప్రదం అయినట్లు కనిపిస్తూంది. అప్పటికి ఆమె రచన లన్నీ అచ్చయినాయి. మంచి సమీక్షలు వచ్చాయి. వాటి అమ్మకాలు పెరిగాయి. ప్రిన్స్ రీజెంట్ (తరువాత ఆయనే నాలుగవ జార్జ్ అయాడు) ఆమెకు అభిమాన పాఠకుడై తన అన్ని నివాస గృహాలలోను ఆమె పుస్తకాల సెట్టు ఒక్కొక్కటి ఉంచుకునేవాడు. *ఎమ్మా* అనే నవల ఆయనకు అంకితం చేయబడింది. సమీక్షకులు ఆమె రచనలలోని నైతిక ప్రబోధాన్నీ, సజీవపాత్ర చిత్రణనూ, సాంసారిక వాస్తవికతనూ ఎక్కువగా ప్రశంసించారు.

తన జీవితంలో చివరి 18 మాసాలూ ఆమె గ్రంథ రచనలో తీరిక లేకుండా గడపింది. 1816 ఆగస్టు వరకూ ఆమె *పెర్స్వేషన్* అనే నవలా రచనలో నిమగ్నం అయింది. *సుసాన్ (నార్తేంగర్ ఆబీ)* వ్రాతప్రతిని సరిచూసింది. ఆ రోజులలో ఆ పుస్తకాన్ని ఆమె *మిస్ కేథరిన్* అని కూడా వ్యవహరిస్తూ ఉండేది. 1817 జనవరిలో తన చివరి నవల *శాండిటన్* వ్రాయడం మొదలు పెట్టింది. ఎనిమిది వారాలలోనే 24,000 పదాలు గల ఆ నవలను ఆమె వ్రాయడం, సరిచూడడం పూర్తి చేసింది. 1816 ఆరంభం నుంచే ఆమె ఆరోగ్యం క్షీణించడం మొదలుపెట్టింది. 1817 ఏప్రిల్‌లో ఆమె వీలునామా వ్రాసింది. మే నెలలో ఒక శస్త్రవైద్య నిపుణునిచేత పరీక్ష చేయించడానికి ఆమెను వించెస్టర్ తీసుకు వెళ్లారు. అక్కడే జూలై 18 ఉదయం 4.30 గంటలకు ఆమె శాశ్వతంగా కన్ను మూసింది.

బొ.శ్రీ.

**ఆస్బ్ బ్యోర్న్ సేన్, పీటర్ క్రిష్టియన్ (1812-85) :** నార్వేజియన్ జానపద గాథా సంగ్రాహకుడు. మో జోర్గెన్ ఇంగ్‌బ్రెట్‌సెన్ (1813-1882) తో కలసి నార్వేజియన్ జానపద సాహిత్యాన్ని సేకరించాడు.

నార్వేజియన్ సాహిత్య చరిత్రలో వీరి 'నార్వేజియా జానపద గాథావళి' ఒక మైలురాయి వంటిది. ఈ గ్రంథం ద్వారా నార్వేజియన్ భాషను వీరెంతో ప్రభావితం చేశారు.

జీవితంలోనూ, రచనా కృషిలోనూ వీరిరువురికీ దృఢానుబంధం ఉండేది. వీరిని గూర్చి జంటగా తప్ప ఎక్కడా ప్రస్తావన జరిగేది కాదు. 1827 లో యౌవనంలో వీరు కలుసుకొని, ఏకోదరు లంతగా మమేకం అయిపోయారు.

ఆస్బ్‌బ్యోర్న్‌సేన్ తన 20 వ ఏట తూర్పు నార్వేలో ప్రైవేట్ ట్యూటర్‌గా జీవితం ప్రారంభించాడు. అప్పు డాయన జానపద గాథలు సేకరించడం ప్రారంభించాడు. ఇతని సహచరుడైన 'మో' బాగా విద్యావంతుడు, సంపన్నుడు అయిన రైతు కుమారుడు. క్రిస్టియానియా లోని కింగ్ ఫ్రెడరిక్ విశ్వవిద్యాలయం నుంచి 1839 లో అతడు మత విజ్ఞానంలో పట్టభద్రు డయాడు. స్వతంత్ర మత భావాల వలన ఆయన మతోద్యోగి కాలేక పోయాడు. అందువలన ఆయన కూడా ఉపాధ్యాయుడై సెలవురోజులలో దక్షిణ నార్వే జానపద గాథలను సేకరించే పనికి పూనుకున్నాడు. ఇంతలో ఆస్బ్ బ్యోర్న్‌సేన్ ప్రకృతి శాస్త్రజ్ఞు డయాడు. జోర్డ్స్‌లో తన అన్వేషణలు కొనసాగిస్తూండగా ఆయన కథలు కూడా సేకరిస్తూ వచ్చాడు. అప్పుడు వీరిద్దరూ తమ కృషిని సంయుక్తంగా పరిశీలించి ప్రచురించడానికి నిశ్చయించుకున్నారు.

ఆ కాలానికి నార్వేజియా సాహిత్య శైలి కూడా డెన్మార్క్ సాహిత్య శైలి లాగా జాతీయ జానపద గాథా ప్రకటనకు అనువుగా ఉంది. ఈ దేశాల మౌఖిక కథలు వివిధ మాండలిక భాషలలో ఉండేవి. ఆస్బ్‌బ్యోర్న్‌సేన్, 'మో' లు ఈ శైలి సమస్యను సులభంగా పరిష్కరించారు. వివిధ మాండలికాల స్థానంలో సులభశైలిని ఉపయోగించడమే ఈ సూత్రం. అయితే జానపద గాథ స్వరూపాన్ని మాత్రం నిలిపి ఉంచారు. మొట్టమొదటి గాథలు 1837 నాటికే నార్వేలో ప్రకటితమయాయి. తర్వాత 1841 లో *నార్వే జానపద గాథావళి* పేరుతో ఈ కథలు ప్రచురితమయాయి. 1842, 1843, 1844 లలో విస్తృతమూ, సచిత్రమూ అయిన ముద్రణలు వెలువడ్డాయి. 1852 లో విపులమైన ఏక సంపుటంగా సమగ్ర పరిష్కృత రూపంలో ఈ గాథలు వెలువడ్డాయి.

ఈ గాథా సంపుటి యూరప్‌లో పురాణగాథా తులనాత్మకాధ్యయనానికి ప్రధానాధారంగా భావించబడింది. అనేక భాషలలో అనువాదం పొందింది. 1859 లో మొదటిసారి ఇంగ్లీషు అనువాదం వచ్చింది. 20 వ శతాబ్దపు ఉత్తరార్ధం వరకూ మరెన్నో అనువాదాలు వెలువడ్డాయి. నార్వేలో ప్రామాణిక శైలికి నమూనాగా ఈ గాథలు ఉపయోగపడి ఆధునిక నార్వే సాహిత్య భాషాశైలి అయిన 'బొక్‌మాల్' ఆవిర్భావానికి కారణం అయాయి.

1856 లో ఆస్బ్‌బ్యోర్న్‌సేన్ అటవీ శాస్త్రజ్ఞుడై కలప నిలువ ఉంచే విజ్ఞానాన్ని గూర్చి అధ్యయనం చేశాడు. నార్వే దేవదూతల గాథలు, పురాణ గాథలు (1845-48) ఆయన ప్రకటించాడు. జీవరాశి ప్రాదుర్భావం డార్విన్ గ్రంథాన్ని ఆయన అనువదించాడు (18

మో *పద్యావళి* (1850) మో జోర్గెన్‌కు ప్రతిభావంతుడైన కాల్పనిక కవిగా ప్రసిద్ధి చేకూ ఆయన రచించిన *బావి-నీటిగుంట* నార్వేదేశ సాహిత్యంలో ఉద్గ్రంథంగా రూపొందింది. 185 'మో' ఒక మతోద్యోగాన్ని స్వీకరించాడు. 187 క్రిస్టియన్‌శాండ్ కి బిషప్ అయాడు.

మ.

**ఇంజ్, విలియమ్ (మోటర్) (1913-7**

ప్రముఖ అమెరికన్ నాటక రచయిత. *కమ్ బాక్* *షీబా* (1952 లో చలన చిత్రంగా వచ్చింది), (1956 లో చలనచిత్రం తీశారు), *బస్ స్టాప్* ( లో చలనచిత్రం తీశారు) అనే నాటకాలు ఈ రచనలలో ప్రసిద్ధమైనవి. *పిక్నిక్* నాటక ర ఈయనకు పులిట్జర్ బహుమతి వచ్చింది.

లారెన్స్‌లోని కాన్సాస్ విశ్వవిద్యాలయంలోను, విల్‌లోని జార్జ్‌పీబడీ ఉపాధ్యాయ కళాశాలలోను చదువుకొన్నాడు. ఆ తరువాత 1937 నుంచి వరకు ఉపాధ్యాయుడుగా పనిచేశాడు. 1943 1946 వరకు సెయింట్ లూయిలోని *స్టార్* పత్రికలో నాటక విభాగ సంపాదకు పనిచేశాడు.

ఈయన మొదటి నాటకం *ఫార్దర్ ఆఫ్ హెవెన్* (1947). పదేళ్ళ తరువాత దీనినే రించి *ది డార్క్ ఎట్ ది టాప్ ఆఫ్ ది స్టె* అనే నాటకంగా రూపొందించాడు. 1960 లో చలనచిత్రంగా వచ్చింది.

మిడ్‌వెస్ట్‌ని, చిన్న చిన్న పట్టణాలలో కనిపించే సరణిని రూపు గట్టించిన మొదటి అమెరికన్ కర్తలలో ఇంజ్ ఒకడు. 1950-60 దశాబ్దిలో ఈ మంచి పేరు ప్రతిష్ఠలు వచ్చాయి. అనంతర కా ఈయన రచనలలో ప్రసిద్ధమైనవి: *ఏ లాస్ ఆఫ్* (1960; ఇది 1963లో *ది స్ట్రిపర్* అనేపేరుతో చిత్రంగా రూపొందింది), *నాచురల్ అఫెక్షన్* (19 *వేరిజ్ డాడీ* (1966), *ది ల్యాస్ట్ పాడ్* (19 1961 లో ఈయన వ్రాసిన *స్ప్లెండర్ ఇన్ ది* అనే మౌలికమైన చలన చిత్ర రూపకానికి అ పురస్కారం లభించింది. ఈయన లఘు రచన చెప్పకోదగ్గవి: *గ్లోరీ ఇన్ ది ఫ్లవర్* (1958), *బొబోలింక్, ఫర్ హెర్ స్పిరిట్* (1962), ది

*ఇన్ ది బేస్‌మెంట్* (1962), *బస్ డ్రైవర్స్ బాక్ ఇన్ టౌన్* (1962).

పో.ద.

**ఇకాజా (కర్నల్), హోర్గే (1906-1978 ):** ఈక్వ డార్ దేశపు నాటక కర్త, నవలా రచయిత. తన దేశంలో (ఎ(ర) ఇండియన్‌లను దోచుకొంటున్న తీరు తెన్ను లను, వారికి జరుగుతున్న ఘోర అన్యాయాలను అత్యంత వాస్తవికంగా కళ్ళకు కట్టేట్టు రచించాడు. ఈ కార ణంగా ఈయనకు దళితుల ప్రతినిధిగా అంతర్జాతీయంగా గుర్తింపు వచ్చింది.

ఇకాజా రచనా వ్యాసంగం నాటక రచనతో మొద లయింది. కాని 1933 లో *ఎల్ డిక్టేటర్* అనే నాటక రచనకు ఈయనను అభిశంసించారు. అప్పు డీయన దృష్టి నవలా ప్రక్రియ మీదికి మళ్ళింది. మరుసటి సంవత్సరంలోనే ఈయన మొదటి నవల *హువాసిపంగో* వెలువడి మంచిపేరు తెచ్చింది. పెద్ద వివాదాన్ని కూడా రేకెత్తించింది. 1951 లో దీని పరిష్కృత ప్రతి వెలు వడింది. 1964 లోను, 1973 లోను దీనికి ఇంగ్లీషు అనువాదాలు వెలువడ్డాయి. *హువాసిపంగో* అంటే చిన్న మడిచెక్క (పొలం). ఈ నవలలో ఒక ఎ(ర ఇండియన్ పనివాడు చేసిన శ్రమకు ప్రతిఫలంగా భూమి యజమాని ఆ పొలం అతనికి ఇస్తాడు. ఇలాంటి పొలాలను, తెల్లవాళ్ళ అత్యాశ వల్లా, క్రూరత్వం వల్లా ఎ(ర ఇండియ న్‌లు అనుభవించడానికి వీలుపడని పరిస్థితులను ఇకాజా వర్ణించాడు. పరమ ఘోరంగా పొలాలకు నిప్పంటిం చడం, ఎదురు తిరిగిన ఎ(ర ఇండియన్‌లను ఊచకోత కొయ్యడం వంటి దుశ్చర్యలకు తెల్లవాళ్లు పాల్పడతారు. ఈ నవలను ఈక్వడార్‌లోని ఉన్నత వర్గాల మీద జరిపిన అత్యాచారంగా కొందరు భావించారు. మతాధికారులు కూడా ఈ నవలను నిరసించారు. కాని ఇది త్వరలోనే అతివాదులకు ప్రచార సాధనంగా ఉపకరించింది. రష్యన్, చైనీస్ భాషలతో సహా అనేకభాషల లోకి అనువదించ బడింది. కొందరు దీనిని కేవలం ప్రచార సాహిత్యంగా పరిగణిస్తే, మరి కొందరు దీని కథా నిర్మాణంలో తప్పులు పట్టారు. అయితే శక్తిమంతమైన శైలి వలన దీనిని అనేక మంది విమర్శకులు వాస్తవిక దృష్టితో కూడిన ఉత్తమ రచనల కోవలో చేర్చారు.

ఆ తరువాత కూడా ఇకాజా తన నవలలలో పేద ఎ(ర ఇండియన్‌ల దుస్థితులను, తెల్లవాళ్ళ ఘోర కృత్యాలనూ వర్ణిస్తూనే వచ్చాడు. రూపక రచనను కూడా మానలేదు. ఈయన తరవాతి రచనలలో చెప్పుకో దగ్గవి: *ఇన్ ది స్ట్రీట్స్* (1939), *హాఫ్ ఏ లైఫ్ ఎమేజ్డ్* (1942), *డెత్ సిక్స్ టైమ్స్* (1954) మొదలైనవి. ఎంపిక చేసి ఈయన రచనలను కొన్నింటిని 1961 లో మెక్సికోలో ప్రచురించారు.

1973 తరువాత ఇకాజా పెరూలోనూ సోవియట్ యూనియన్‌లోనూ తమ దేశపు రాయబారిగా పని చేశాడు. వాస్తవికమైన తన కథావస్తువుల ద్వారాను, సునిశితమైన శైలి ద్వారాను ఈయన ఈక్వడార్‌లోను, స్పానిష్ అమెరికా అంతటిలోను ఒక తరం రచయితలను గొప్పగా ప్రభావితులను చేశాడు.

పో.ద.

**ఇజాక్స్, హోర్గె (1837-95) :** కొలంబియా దేశపు కవి, నవలా రచయిత. ఈయన అత్యుత్తమ రచన *మరియా* (1867) 19 వ శతాబ్దిలో వెలువడిన అత్యంత ప్రసిద్ధమైన లాటిన్-అమెరికన్ నవలలలో ఒకటి.

ఈయన ఒక సంపన్నుడైన ఆంగ్లేయ యూదు జాతీయుని కుమారుడు. చక్కగా చదువు కొన్నాడు. 1860-63 లో జరిగిన కాకా (Cauca) యుద్ధంలో ఈయన ఆస్తులన్నీ పోయి నిరుపేద అయాడు. 1864 లో బొగోటాలో స్థిరనివాసం ఏర్పరచుకొని *పొయజి యాస్* అనే చిన్న పుస్తకం ఒకటి ప్రచురించాడు. 1867 లో ప్రచురించిన శృంగార పరమైన నవల *మరియా*తో ఈయనకు మంచి గుర్తింపు వచ్చింది. ఈయన రచనలలో ఉత్తమగ్రంథంగా దీనికి ప్రాచుర్యం వచ్చింది. ఇందులో ఈయన నివాసస్థానమైన కాకా లోయలోని జీవితాన్ని రమణీయంగా చిత్రించడం జరిగింది. అందువల్ల దీనిని స్వీయచరిత్రాత్మక మైన రచనగా భావిస్తున్నారు. *మరియా* చాలా భాషల్లోకి అనువాదం పొందింది. ఆ తరువాత ఈయన సాహిత్య వ్యాసంగంతో పాటు ప్రజాహిత జీవనంలో కూడా పాల్గొన్నాడు.

చనిపోయే నాటి వరకూ ఇజాక్స్ రచనలు చేస్తూనే వచ్చాడు. కాని మొదటి రచన స్థాయిని తక్కిన రచనలు అందుకోలేదు.

పో.ద.

**ఇబాబూరూ, యువాన్ డీ (1895-1979) :** ఉరుగ్వే దేశపు కవయిత్రి. దక్షిణ అమెరికా కవయిత్రు లలో ఎక్కువ ప్రసిద్ధి గలవారిలో ఒకతె. అసలుపేరు జువానియా ఫెర్నాండెజ్ మొర్వాస్.

ఈమె తన కవిత్వంలో సరళమైన భాషలో చక్కని ఇంద్రియానుభూతి పరమైన చిత్రాలను రచించింది. ప్రేమ, ప్రకృతి ఈమె కావ్యవస్తువులు. *టంగ్స్ ఆఫ్*

*డైమండ్* (1919) వంటి ఈమె తొలి రచనలలో ఆత్మ ప్రత్యయం, కాముకత కనిపిస్తాయి. అనంతర కాలంలో *ది రోజ్ ఆఫ్ ది విండ్స్* (1930) వంటి కవితలలో శిథిలమవుతున్న సౌందర్య జీవశక్తుల స్పృహ, చివరికి *లాస్ట్* (1950) లో ముసలి తనపు నిస్పృహ వ్యక్తమవుతున్నాయి. ఈమె తొలి రచనలలో ఉన్న గాఢ వాంఛ, అనుభూతి తరువాతి రచనలలో లేకపోయినప్పటికీ దక్షిణ అమెరికా లోని అత్యంత ప్రాచుర్యం పొందిన కవయిత్రులలో ఒకతెగా ఈమె నిలిచి పోయింది. 1950 లో ఈమె ఉరుగ్వే రచయితల సంఘానికి అధ్యక్షురాలుగా ఎన్నికయింది.

పో.ద.

**ఇబ్న్ ఎజ్రా, మోసెస్ (1060-1139) :** హీబ్రూ కవి, విమర్శకుడు. స్పెయిన్‌లోని యూదుల స్వర్ణయుగం (900-1200) లో వెలసిన మహాకవి. లౌకిక కవిత వ్రాసిన తొలి యూదుకవులలో ఈయన ఒకడు. ఈయన ఇంటిపేరు 'హసల్లాహ్'. ఈ హీబ్రూ పదానికి 'పశ్చాత్తాప కవిత వ్రాసినవాడు' అని అర్థం. 'సెలిహాట్' అనే పశ్చాత్తాపంతో కూడిన ప్రార్థనలు వ్రాసినందువలననే ఈయనకు ఈ పేరు వచ్చింది.

అరబిక్‌లో ఇబ్న్ ఎజ్రాను 'అబూహారూన్ మూసా' అని వ్యవహరిస్తారు. ఇతడు ఒక సుప్రసిద్ధమైన హిస్పనో హీబ్రూ కుటుంబానికి చెందినవాడు. ఇతని సోదరులు ముగ్గురూ గొప్ప విద్వాంసులు. కవి, బైబిల్ వ్యాఖ్యాత అయిన అబ్రహాం ఇబ్న్ ఎజ్రా ఈయనకు దగ్గరి చుట్టం. తన అన్నగారి కుమార్తెను ఇతడు గాఢంగా ప్రేమించాడు. ఆమె కూడా ఇతనిని ప్రేమించింది. అయితే అన్న గారు ఆమెను ఇతని కిచ్చి వివాహం చేయకుండా ఇతని తమ్ముడికి ఇచ్చాడు. ఈ సంఘటన ఎజ్రా హృదయానికి తీవ్రమైన ఆఘాతం కలిగించింది. ఇందువల్ల అతనికి సోదరులతో సంబంధాలు చెడిపోవడమే గాకుండా తత్పర్యవసానంగా అతడు గ్రెనడాను వదలి వెళ్లిపోయాడు.

ఇబ్న్ ఎజ్రా వ్రాసిన పవిత్ర రచనలు, లౌకిక కవితలు కూడా హీబ్రూ భాషమీద అతనికి గల అధికారం, పద్య నిర్మాణంలోను, శైలిలోను అతనికి గల ప్రతిభ సాటిలేనివని నిరూపిస్తున్నాయి. ఇతడు వ్రాసిన లౌకిక కవిత *తర్షిష్* అనే సంపుటాలలో ఎక్కువగా కనిపిస్తుంది. ప్రేమ, ద్రాక్షారస మాధుర్యం, పక్షుల కలరవాల శ్రావ్యత, కృతఘ్నత, వార్ధక్యం మీదపడడం వంటి వస్తువులు ఈ కవితలలో ఎక్కువగా కనిపిస్తాయి. తుది రచనలలో ఎక్కువ భాగం పశ్చాత్తాప పూర్వక మైన ప్రార్థనలే! వీటిలో ఆత్మావలోకనం, విషాదం ఎక్కువగా గోచరిస్తాయి. ఈ ప్రార్థనలలో చాలా భాగం యూదుల మతగ్రంథంలోకి ఎక్కాయి. తన వెనుకటి ప్రియురాలు ప్రసూతి సందర్భంలో మరణించినప్పుడు ఇతడు రచించిన విలాపగీతం హృదయ విదారకమైంది.

ఇబ్న్ ఎజ్రా అరబిక్ భాషలో కవితా కళను గూర్చి ఒక ఉద్గ్రంథం రచించాడు. దీనిని *షీరాత్ ఇజ్రేల్* (ఇజ్రేల్ గీతం) అనే పేరుతో 1924 లో 'బి. హాల్పర్' హీబ్రూ భాషలోకి అనువాదం చేశాడు. స్పెయిన్‌లోని అరబిక్, కాస్టీలియన్, హీబ్రూ కవితలను గూర్చి వివరించే ఈ గ్రంథం స్పానిష్ సాహిత్య చరిత్రలలో ప్రధానమైంది.

అరబిక్ భాషలోనే ఇబ్న్ ఎజ్రా ఒక తాత్త్విక రచన కూడా చేయగా దానిలోని కొన్ని భాగాలు *అరుదత్ హా-బోసెమ్* (సుగంధ ద్రవ్య కల్పిత శయ్యా) అనే పేరుతో హీబ్రూలోకి అనువదించబడ్డాయి. దీనిలో భగవంతుని కల్యాణ గుణాలు, సూక్ష్మవిశ్వ ప్రదర్శకమైన మానవుని స్వభావం మొదలైనవి వివరించబడ్డాయి.

బొ.శ్రీ.

**ఇబ్న్, గబీరోల్ (1022-70) :** యూదు జాతీయుడు, దక్షిణ స్పెయిన్ నివాసి, హీబ్రూ భాషా కవి. జన్మ స్థలం మలాగా (Malaga). సారగోసా (Saragossa) లో హీబ్రూ, అరబిక్ సాహిత్యాలు అధ్యయనం చేసి, అక్కడనే తన 16 వ ఏటనే కవిగా గుర్తింపు పొందాడు. అప్పటికే అతనికి తాను మహాకవిననే ఆత్మవిశ్వాసం ఏర్పడింది. 'నా పాట రాజులకు కిరీటం, సరదార్ల తలలపై కలికి తురాయి. నా మేను నేలమీద నడుస్తున్నా, నా ఆత్మ ఆకాశ మార్గాన విహరిస్తోంది; చూడండి పదహారేళ్ళ ప్రాయంలోనే, ఎనభై ఏళ్ళ విజ్ఞానాన్ని నా ఎదలో నింపుకొన్నాను' అన్నాడు ఇబ్న్. అతడు యెకుటీల్ ఇబ్న్ హసన్ అనే సరదారు ఆశ్రయం సంపాదించాడు. నవ్య ప్లేటో తత్త్వ ప్రభావం వలన సంతాన నిరోధం మొదలైన మత విరుద్ధ భావాలను వెల్లడించేవాడు. దానికి తోడు ప్రపంచాన్ని లెక్కచేయక పోవటం, అతిశయమైన ఆత్మశ్లాఘ, అసభ్య స్థాయిలో అన్యదూషణల మూలాన సాటి యూదులే అతనిని ద్వేషించ సాగారు. 'గ్రీకు' అని అతనిని అపహాస్యం చేసేవారు. చివరికి అతడు సారగోసా వదలి పారిపోవలసి వచ్చింది. *సాంగ్ ఆఫ్ స్ట్రైఫ్* అనే రచనలో ఈ అనుభవాన్నే అతడు చెప్పకొన్నాడు. "మూర్ఖ వక్ర సమాజ మధ్యంలో, తా నొక్కడే వివేకవంతుడు;

ఒకడు నీ మీద పాము విషం క్రుమ్మరిస్తాడు, మరొకడు పొగడ్తలతో బుర్ర చెడగొడుతాడు. మరొకడు 'అయ్యా, అనుగ్రహించు' అంటూనే నీ వెనుక గోతులు తవ్వుతాడు. ఛీ! వీరి తండ్రులు నా గొర్రెలను కాసే కుక్కలుగా కూడా పనికిరారు" అంటాడు.

తన పోషకుడైన యెకుటీల్ మందలింపుతో ఇతడు కొంచెం దారికి వచ్చి, తరువాత *ముత్యాల ఎన్నిక* అనే అరబ్బీ లోకోక్తి ముక్తావళి, *నైతికతాభివృద్ధి* వంటి వివాదాస్పద రచనలు చేశాడు. సారగోసా, గ్రెనడాలలోని హీబ్రూ వైయాకరణుల మధ్య చెలరేగిన వివాదంలో పాల్గొని గ్రెనడా పండితులతో పాటు ఆ రాజ్య పాలకుడైన వజీర్ శామ్యూల్ హానాగిడ్‌ను కూడా పరుషంగా దూషించాడు. కాని తన పోషకుడైన యెకుటీల్ మరణానంతరం ఆ వజీరునే ఆశ్రయించి అతని స్తోత్ర పాఠకుడుగా మారిపోవలసి వచ్చింది. ఇతని హీబ్రూ కవితా శైలి అరబిక్ ఛందస్సులతోను, సాహిత్య సంప్రదాయాలతోను, బైబిల్ భాషలతోను మిశ్రితమై విలక్షణంగా ఉంటుంది. ఇతని దైవ ప్రార్థనా గేయాలు 200 వరకు లభ్య మవుతున్నాయి. వాటిలో కొన్ని ప్రపంచ వ్యాప్తంగా యూదుప్రార్థనా గ్రంథాలలో చేరిపోయాయి. వాటిలో విశ్వచైతన్యాన్నీ, మానవుని అల్పత్వాన్నీ, భగవదనుగ్రహంతో అతడు పొందగల మహత్త్వాన్నీ కీర్తిస్తాడు. 'నా సకలోహ వైభవ సనాథమైన కవిత్వం కూడా, నీ మహత్త్వం ముందు అగణ్యమైనదే. ఐనా నీ పాదవేదిక ముందు నేను పాడే పాటకు, నీ వెంతో ముచ్చట పడుతావు. నీవు నాలో ఊపిరి గా, నేను నీ ఔన్నత్యాన్ని గానం చేస్తాను' అంటాడు. 'రాజ్యకిరీటం' లాంటి గేయాలలో చేతనాచేతనమైన సమస్త సృష్టి భగవంతునినుండి, సూర్యుని నుండి సూర్యకాంతిలాగ ఉద్భవించిందనీ, తిరిగి భగవంతునితో తాదాత్మ్యంకోసం భగవదభిముఖంగానే పురోగమిస్తున్న దనీ, భగవత్ స్తుతి ఆకాంక్షా తీవ్రతను అభివ్యక్తం చేస్తుందనీ ఇతడు చెబుతాడు. భగవత్‌స్తుతితో పాటు తన ఆశ్రయ దాతల స్తుతి, ఆత్మస్తుతి, పర దూషణ, స్వేచ్ఛా ప్రణయం, ప్రకృతి సౌందర్యం మొదలైనవి ఇతని కవితా వస్తువులు. ఇతని గేయాలు వందల కొలదిగా దొరుకుతూన్నా, ఒక గ్రంథ రూపంగా సంకలితం కాలేదు.

చ.తి

**ఇబ్న్ బటూటా (1304-68/ 69) :** మధ్య యుగాలలోని గొప్ప అరబ్బీ యాత్రాగ్రంథ రచయిత. ఆయన రచించిన యాత్రాగ్రంథం *రిహ్లాహ్* (యాత్రలు). ఇబ్న్ తన జీవిత కాలంలో ప్రయాణించిన 75 వేల మైళ్ళ సుదీర్ఘయాత్రలూ, వాటి వివరాలూ దీనిలో ఉన్నాయి. ప్రపంచంలోని అన్ని ముస్లిం దేశాలకు, చివరకు చైనా, సుమత్రా వంటి దూర తీరాలకు కూడా ఇబ్న్ యాత్రలు చేశాడు. ఇతని జన్మస్థలం మొరాకో లోని టాన్జీర్.

ఇబ్న్ న్యాయాధిపతుల కుటుంబంలో జన్మించాడు. తన స్వస్థలమైన టాన్జీర్ లోనే సంప్రదాయంగా వచ్చిన న్యాయశాస్త్రం అధ్యయనం చేశాడు. 1325 లో తన 21 వ ఏట మక్కా ప్రయాణంతో ప్రారంభించి పలు యాత్రలు చేశాడు. మొదట్లోఏదో మొక్కుకోసం జరిగిన ఈప్రయాణం రాను రాను అతని విద్యాభ్యాసం పూర్తయి న్యాయాధిపతికి కావలసిన అర్హతలు సంపాదించేసరికి ఇతనిని ఒక ఎడతెగని యాత్రా పిపాసిగా చేసింది. ఒకే మార్గంలో రెండో సారి ఎప్పుడూ తిరిగి రాకూడదు అనే నియమం పెట్టుకొని క్రొత్త క్రొత్త దేశాలూ, ప్రదేశాలూ తిరిగి అతడు జ్ఞానోపార్జన చేశాడు. కైరో నుంచి ఉత్తర ఈజిప్టు, అక్కడినుంచి ఎర్ర సముద్రం, తిరిగి సిరియా, అక్కడనుంచి కొందరు యాత్రికులతో కలసి మక్కా ఇలా - ప్రయాణించి 1326 నాటికి తన మొదటియాత్ర ముగించాడు. అరేబియా ఎడారి దాటి ఇరాక్, దక్షిణ ఇరాన్, బాగ్దాద్ వెళ్లి ఇరాన్ లోని ఆఖరి మంగోల్ రాజు అబుసైద్ (1316-36) ను కలశాడు. 1327 నుంచి 30 వరకు ఇబ్న్ మక్కా, మదీనాల మధ్య తిరగడంలోనే జీవితం గడిపాడు. 1332 లో రెండో సారి మక్కాకు వెళ్లినప్పుడు అక్కడి యాత్రికుల ద్వారా ఢిల్లీ సుల్తాన్ మహమ్మద్ బీన్ తుగ్లక్ (1325-51) గురించీ, ముస్లిం విద్వాంసుల పట్ల ఆయన చూపే ఔదార్యం గురించీ విని ఇబ్న్ ఆయన ఆస్థానంలో స్థానం సంపాదించాలనుకున్నాడు. మార్గ మధ్యంలో ఎందరో ముస్లిం పాలకుల చేత గౌరవాలు అందుకుని ఎన్నో దేశాలు తిరిగి హిందూ కుష్ పర్వతాల ద్వారా 1333 సెప్టెంబరు 12 న భారత దేశ సరిహద్దుల లోకి అడుగుపెట్టాడు. అప్పటికే ఇబ్న్ చాలా పేరు ప్రఖ్యాతులు గడించాడు. అతని వెంట ఎందరో అనుచరులూ, సేవకులూ ఒక రాణివాసం ఉండేవారు. తుగ్లక్ ఎంతో ఆదరంగా ఇబ్న్‌ను గౌరవించి తన ఆస్థానంలో న్యాయాధిపతి (ఆదీ) గా నియమించాడు. కొన్ని సంవత్సరాల పాటు ఇబ్న్

ఈ ఉద్యోగాన్ని నిర్వహించాడు. కాని, తుగ్లక్ ఎంత ఔదార్య వంతుడో అంత క్రూరుడు. ఇబ్న్ రోజూ ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకుని బ్రతికేవాడు. చివరికి అనుకున్నంతా అయింది. ఇబ్న్ పదవి కోల్పోయాడు. ఎలాగో ప్రాణాలు దక్కాయి. మళ్లీ సుల్తాను గారి కరుణకు పాత్రుడై చైనాకు రాయబారిగా నియమింప బడ్డాడు. మార్గంలో సుల్తాను చైనాకు తన ద్వారా పంపిన బహుమతులు దోపిడి దార్లు దొంగలించగా సుల్తానుకు భయబడి ఇబ్న్ మాల్దీవులకు పారిపోయి అక్కడి రాజకీయాలలో ప్రవేశించి సుల్తాను అవాలని కూడా ప్రయత్నించాడు. అలా శ్రీలంక, చైనా, సుమత్రా వంటి ఎన్నో దేశాలు తిరిగి తిరిగి 1353 వ సంవత్సరం చివర ఇబ్న్ తిరిగి స్వదేశం చేరుకున్నాడు. అతని జ్ఞాపకాల పుస్తకాన్ని సుల్తాను కోరిక మీద తాను బుజాయ్ (1355) కి అంకితం ఇచ్చాడు. ఆయన ఒక మంచి కవి. ఆయన వ్రాసిన గద్యరచనలను ఆయనే పద్యాలుగా మలచాడు. తర్వాత ఇబ్న్ గురించిన వివరాలు ఎక్కువగా తెలియవు. 1368 లోనో, 1369 లోనో ఆయన మరణించాడు.

తన జీవితకాలంలో సుమారు ఒక 20 మంది సామ్రాజ్యాధినేతలను ఇబ్న్ కలుసుకున్నాడు. తన గ్రంథంలో తనకు వ్యక్తిగతంగా పరిచయం ఉన్న 2 వేలమంది పేర్లు ఆయన ఉటంకించాడు.

అతని గ్రంథం *రిహ్లాహ్* వలన ఆ నాటి ముస్లిం దేశాల లోని చరిత్ర, సాంఘిక, రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక విషయాలు ఎన్నో వివరంగా తెలుసుకోడానికి వీలవుతుంది. అంతే కాకుండా ఇబ్న్ వ్యక్తిత్వం కూడా ఈ గ్రంథం వలన అవగత మవుతుంది.

పప్పు

**ఇబ్న్ హజ్మ్ (994-1064) :** ప్రముఖ అరబ్బీ చరిత్ర రచయిత, న్యాయశాస్త్రవేత్త, ఆధ్యాత్మిక తత్త్వవేత్త, సాహితీవేత్త. అరబ్బీలో నాలుగు వందలకు పైబడి రచనలు చేశాడు. ఆ రచనలు వివిధ రంగాలకు చెందినవి. అరబ్బీ భాషలో గొప్ప పండితుడుగా ఆయనను లోకం స్మరిస్తోంది.

సిరియా పాలకుల వంశంతో బంధుత్వం గల ఒక కుటుంబంలో హజ్మ్ జన్మించాడు. సెవెల్లీకి పశ్చిమాన ఉన్న మంటాలిషామ్‌కు చెందిన హజ్మ్ క్రైస్తవ మత ప్రాచుర్యం గల కుటుంబానికి చెందినవాడని కొంద రంటారు. బహుశః ఇతని తాతగారు క్రైస్తవం నుంచి ఇస్లాముకు మారి ఉండవచ్చునని అభిజ్ఞుల అభిప్రాయం. హజ్మ్ తండ్రి అహ్మద్ బాగా చదువుకున్నవాడు. రెండవ హిషామ్ కాలిఫా వద్ద ఈయన పెద్ద ఉద్యోగస్థుడుగా ఉండేవాడు. అందుచేతనే హజ్మ్‌కు మంచి విద్యాభ్యాసం చేసే అవకాశం లభించింది. 1008 నుంచి 1031 వరకు రాజ్యం అల్లకల్లోలంగా ఉండేది. రాజ్యం చివరకు చిన్న చిన్న ముక్కలై స్వతంత్ర రాష్ట్రాలు అవతరించాయి. తండ్రి 1012 లో మరణించినా, హజ్మ్ రాజవంశాన్ని అంటిపెట్టుకునే ఉండి వారితో సహకరిస్తూ ఉండేవాడు. అయితే విప్లవకారుల దృష్టిలో ద్రోహిగా పరిగణించబడి ఇబ్న్ హజ్మ్ అనేక సార్లు జైలుశిక్ష అనుభవించాడు.

వివిధ రంగాలలో నిష్ణాతుడైన హజ్మ్ కృషి న్యాయ శాస్త్రం, చరిత్ర, మతం, విభిన్నమతాల సమన్వయ పరిశీలనం, తత్త్వం మొదలైన రంగాలలో విశేషంగా కనిపిస్తుంది. *టాక్ ఆల్ హమామహ్* అనే ఆయన గ్రంథం *ది రింగ్ ఆఫ్ ది డవ్* అనే పేరుతో ఖ్యాతి పొందింది. జాహిరి తెగకు చెందిన న్యాయశాస్త్రాధ్యయనంలో హజ్మ్ మిక్కిలి నిర్మాణాత్మకమైన కృషి చేశాడు. ముస్లిం మతగ్రంథం అయిన *ఖురాన్* నుంచి ఉత్తేజాన్ని పొందిన ఈ న్యాయశాస్త్ర రచనల వలన హజ్మ్‌కి పెద్ద పేరు రాకపోయినా ఆయన ఈ సిద్ధాంతాలను వివిధ మతాల సమన్వయానికి, పరిశీలనకు ఉపయోగించడం వల్ల ఆ నాటి పరిశోధకులలోను, చారిత్రకులలోను అగ్రగణ్యు డనిపించుకొన్నాడు.

ఒక వంక ఆధ్యాత్మిక చింతన గల న్యాయశాస్త్రాధికారి అయినా హజ్మ్ రాజకీయ రంగానికి దూరంగా ఎన్నడూ ఉండలేదు. ఆ రోజులలోని విద్వాంసులతో బహిరంగ చర్చలలో పాల్గొని తాను నమ్మిన సిద్ధాంతాలను సమర్థించాడు. నిష్కర్షగా, నిర్మొహమాటంగా సూక్ష్మమైన పరిశీలన, అవగాహనలతో ఆయన తాను చెప్పదలచుకున్నవి స్పష్టంగా చెప్పేవాడు. అన్యాయాన్ని, అవినీతిని, మోసాన్ని నిర్దాక్షిణ్యంగా తన రచనలలో హజ్మ్ తూర్పారబట్టేవాడు. అతని రాజకీయ జీవితం ప్రజల ఆదరణకు నోచుకోకపోయినా, అతని రచనలు కొన్ని బహిరంగంగా తగులబెట్టబడినా, అతడు తాను నమ్మిన మార్గాన్ని మాత్రం వదలిపెట్టలేదు. అతని జీవితకాలం తరువాత కూడా అతనిని విమర్శించడం సాగినా, అతని పక్షాన వాదించేవారు కూడా కొందరు బయలు దేరారు. ముస్లిం విద్వాంసులు ఈ నాటికీ ఇబ్న్ హజ్మ్‌ను తమ రచనలలో ఉదహరిస్తూనే ఉంటారు.

పప్పు

**ఇబ్సెన్, హెన్రిక్ (1828-1906) :** ప్రముఖ నార్వీజియన్ నాటకకర్త, కవి. 1828 మార్చి 20 న నార్వేదేశం లోని స్కియెన్ లో ఈయన జన్మిం చాడు. ఈయన బాలుడుగా ఉన్న ప్పుడే ఈయన తండ్రి తన ఐశ్వర్యం అంతా కోల్పో యాడు. మొదట్లో ఈయన వైద్య శాస్త్రం అభ్యసించా లనుకున్నాడు. కాని తరువాత ఆ ప్రయత్నం మాని సాహిత్య రంగంలో ప్రవేశించాడు. ఈయన తొలి రచన *కాటిలినా* అనే ఒక విషాదాంత రూపకం. 1850 లో అది ప్రదర్శించబడింది. అయితే ఎక్కువ విజయవంతం కాలేదు.



ఆ తరువాత ఇబ్సెన్ క్రిస్టియానియాకు పోయి మరి ఇద్దరు యువకులతో కలసి అక్కడ *ఆంధ్రిమ్నర్* అనే వారపత్రిక నడుపుతూ దానిలో భావ గేయాలూ, అధిక్షేప కావ్యాలూ ప్రచురిస్తూ వచ్చాడు. 1851 లో బెర్గెన్ నగరంలో ఈయన ఓల్ బుల్ నేషనల్ థియేటర్‌కు దర్శకుడై, 1857 వరకూ ఆ హోదాలో పనిచేశాడు. నార్వీజియన్ రాజకీయాలు తనకు సమ్మతాలు కానందు వల్ల 1864 లో ఇబ్సెన్ నార్వే విడిచి జర్మనీ, ఇటలీ దేశాలలో కొన్నాళ్లు గడిపాడు. 1891 లో ఆయన నార్వేకు తిరిగి వచ్చాడు.

ఇబ్సెన్‌కు 'ఆధునిక రూపక వాఙ్మయ పిత' అనే ప్రసిద్ధి ఏర్పడడానికి కారణం ఆ నాటి నాటక రంగం మీద ఆయన ప్రభావం అపారంగా ఉండడం. నాటక రచనలో వస్తువు, పాత్రపోషణ, సంభాషణలు మొద లైన వాటిలో ఇబ్సెన్ వాస్తవికతకు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చాడు. ఆయన నాటకాలలోని పాత్రలు వాస్తవిక మానవులే! వారి సమస్యలు కూడా వాస్తవిక మైనవే!.

ఇబ్సెన్ నాటక రచనా జీవితాన్ని రెండు భాగా లుగా విభజించ వచ్చును. మొదటి 25 సంవత్సరాలలో చాలా వరకూ ఆయన చారిత్రక రూపకాలు రచించాడు. వీటిలో అనేకం నార్వేలోని జానపద వాఙ్మయం మీద ఆధారపడినవి. *ది వైకింగ్స్ ఆఫ్ హెల్గేలాండ్* (1858) లో పాత్రలను తీర్చిదిద్దడంలో ఇబ్సెన్ వాస్తవిక దృష్టి ఆరంభం అవుతుంది. 1877 లో *పిల్లర్స్ ఆఫ్ ది సొసైటీ* అనే నాటకంతో ఆయన సాంఘిక నాటక రచనలకు శ్రీకారం చుట్టారు. సాంఘిక వస్తువు తీసు కుని నాటకాలు వ్రాసిన వారిలో ఈయనే మొదటివాడు. *డాల్స్ హౌస్* (బొమ్మరిల్లు-1879) అనే నాటకంలో వివాహ సమస్య చిత్రించబడింది. *ఘోస్ట్స్* (1891) అనే నాటకం సుఖవ్యాధులకు సంబంధించిన చర్చతో కూడి ఉంది. ఇది నార్వేలో నిందకు గురి అయింది; ఆంగ్లదేశంలో నిషేధించబడింది.

ఇబ్సెన్ రచించిన నాటకాలలో ముఖ్యమైనవి *బ్రాండ్, పియర్‌జిన్ట్* (ఇవి పద్యరూపంలో వ్రాసిన దృశ్య కావ్యాలు), *లీగ్ ఆఫ్ యూత్* (రాజకీయ హేళన కావ్యం), *వాన్ క్వైట్ ఎట్ సోషల్ హోగ్, ది ప్రిటెం డర్స్* (చారిత్రక రూపకాలు), *వైల్డ్ డక్, హెడ్డా గాబ్లర్* (సాంఘిక రూపకాలు). ఇవి కాక ఇబ్సెన్ *టెర్జివిజెన్* అనే ఇతిహాస కావ్యాన్నీ, *పావిడెర్నే* (1860) అనే దీర్ఘ పద్యకావ్యాన్నీ కూడా రచించాడు. అయితే ఆయన యశస్సు ప్రధానంగా రూపక రచనలమీదే ఆధార పడి ఉంది. ఆంటన్ ఛెఖోవ్, ఎడ్మండ్ గాస్సి, జార్జ్ బెర్నార్డ్ షా మొదలైన అనంతర ప్రముఖ రచయితల మీద ఇబ్సెన్ ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది.

ఇబ్సెన్ వ్యక్తి స్వాతంత్ర్యం మీద విశ్వాసం గలవాడు. కార్య గౌరవం మీద ఆయన ఆసక్తి ఇంతింం తన రానిది. స్త్రీల ప్రభావం ద్వారా సంఘాన్ని పునరు ద్ధరించాలని ఆయన ఆలోచించినట్టు చెబుతున్నారు. రూపక రచయితగానే గాక ఆలోచనా పరుడైన మేధావిగా కూడా ఇబ్సెన్‌కు ఎక్కువ ప్రాధాన్యం ఉంది. తన రూపకాలలో సాహసంతో ఈయన చేసిన అనేక చర్చలు వాటికి సంబంధించిన సాంఘిక సమస్యల పరిష్కారానికి దారితీశాయి. అన్ని సాంఘిక సంబంధాలకూ సత్యమే పునాది అని ప్రతిష్ఠించడానికి ప్రయత్నించి, దానిలో ఆయన కృతకృత్యు డయాడు. ఈయన రూపకాలు అనేక భాషల లోకి అనువదింపబడడమే గాకుండా వాటిమీద అనేక విమర్శలు కూడా వెలశాయి.

ది.వెం.

**ఇమెర్మన్, కార్ల్ లెబెరెఖ్ట్ (1796-1840) :** ప్రసిద్ధ జర్మన్ నాటకకర్త, నవలారచయిత. *డీ ఎపిగోనెన్* అనే నవల, *డెర్ ఓబెర్ హోఫ్* అనే గ్రామీణ జీవనాన్ని చిత్రించే వాస్తవిక కథ ఈయన రచనలలో ప్రసిద్ధాలు.

మాగ్డెన్‌బర్గ్‌లో 1796 ఏప్రిల్ 24 న ఈయన జన్మించాడు. ఈయన తండ్రి ఒక సివిల్ ఉద్యోగి. 1813-17

మధ్య హాలే లో న్యాయశాస్త్రం అధ్యయనం చేస్తూ మధ్యలో చదువు మాని నెపోలియన్ యుద్ధాలలో అంతిమ పోరాటాలలో పాల్గొన్నాడు. మూన్‌స్టర్ లోని సైనిక న్యాయస్థానంలో పనిచేస్తూ (1819-24) ప్రష్యన్ సేనాని అడాల్ఫ్, ఫ్రైహర్ ఫాన్‌లూట్జో భార్య అయిన లూఎలిసా ఫాన్ లూట్జో ను ప్రేమించాడు. లూట్జో 1825 లో విడాకులు ఇచ్చే దాకా 14 ఏళ్ల పాటు వారి ఆ ప్రేమకలాపం కొనసాగింది. కాని ఎలిసా రెండవ వివాహానికి ఇష్టపడలేదు. 1824 ప్రారంభంలో ఇమెర్మన్ మాగ్డెబర్గ్‌లోని క్రిమినల్ కోర్టులో జడ్జిగా నియమితుడై మూడేళ్ల తరువాత డూసెల్ డోర్ఫ్ రాష్ట్రీయ న్యాయ స్థానానికి బదిలీ చేయబడ్డాడు. డూసెల్‌డోర్ఫ్‌లో ఒక నమోనా నాటకశాలను ఆయన నిర్మింపచేశాడు. 1839 లో ఇమెర్మన్ 20 ఏళ్ల వయస్సు గల మారియానే నీమియర్‌ను వివాహ మాడాడు. ఆ నూతన వివాహ జీవిత సౌఖ్యమే ఆయన అసంపూర్ణ మహాకావ్యం *ట్రిస్టాన్ ఉండ్ ఇసోల్డె* లో ప్రతిఫలించింది.

సమకాలీన సంధియుగ లక్షణాలు ఇమెర్మన్ రచనలలో ప్రగాఢంగా కనిపిస్తాయి. గొయిథే యుగం నీడలో తమ కాలపు రచయితలు జీవించ వలసి వచ్చిందనే విషాద కరమైన సత్యం ఆయనకు తెలుసు. ఆయన వ్రాసిన ప్రముఖ నాటకాలు *డాస్ ట్రావెర్ స్పీల్ ఇన్ టైరోల్* (1828-దీనినే కొద్దిగా మార్చి 1835 లో *ఆండ్రియాస్ హోఫెర్* అనే పేరుతో ప్రకటించాడు), *మెర్లిన్* (1832), *అలెక్సిస్* (1832-మూడుభాగాల నాటకం), హాస్యరూపకం *టులిఫాంట్ చెన్* (1830).



ఇమెర్మన్ నాటకాల కంటె నవలలే ప్రధానమైనవి. ఆ నాటి పరిస్థితులను అవి కచ్చితంగా ప్రకటింప గలిగాయి. *డీ ఎపిగోనెన్* (1836) అనే నవలలో ఆయన సమకాలీన సమాజ చిత్రాన్ని ప్రదర్శించాడు. గొయిథే వ్రాసిన *విల్ హెల్మ్ మైస్టర్* కు ఆ నవల కొంత ఋణపడి ఉన్నా, అదే మొట్టమొదటి జర్మన్ సమకాలీన నవల అనదగింది. *మున్ష్ హౌసెన్* (1338-39) వ్యంగ్య ప్రధానమైన నవల. రైతుల గ్రామీణ జీవితం దీనిలో చిత్రించబడింది. ఇమెర్మన్ 1840 ఆగస్ట్ 25 న ప్రష్యాలోని డుసెల్ డోర్ఫ్ లో మరణించాడు.

పద్మాకర్

**ఇయనెస్కో, యూజీన్ (1911-)** : రుమేనియాలో జన్మించిన ఫ్రెంచ్ నాటక రచయిత. ఈయన రుమేనియాలోని స్లటేనాలో 1912 నవంబరు 26 న జన్మించాడు. 1956 లో ఈయన వ్రాసిన *లా కన్టాట్రైస్ షావ్* అనే ఫ్రెంచి ఏకాంకిక నాటక శిల్పంలో పెద్దవిప్లవాన్ని సృష్టించింది. 'థియేటర్ ఆఫ్ ది అబ్‌సర్డ్' అనబడే నూతన నాటకాలకు నాంది పలికింది.

ఈయనను పసిపిల్లవాడుగా ఉన్నప్పుడు ఫ్రాన్స్‌కు తీసుకు వెళ్ళారు. కాని 1925 లో రుమేనియాకు తిరిగి వచ్చాడు. బుఖారెస్ట్ విశ్వవిద్యాలయంలో ఫ్రెంచ్‌లో పట్టభద్రుడై 1939 పారిస్‌లో డాక్టరేట్ డిగ్రీ పొందాడు. 1945 తర్వాత పారిస్‌లో స్థిరనివాస మేర్పరచుకున్నాడు. ప్రూఫ్ రీడరుగా ఉంటూ ఇంగ్లీషు భాషను నేర్చుకొన్నాడు. ఇతని మొదటి నాటకంలో ప్రసిద్ధమైన సన్నివేశంలో ఇద్దరు అపరిచిత వ్యక్తులు కలుసుకొని, వాతావరణాన్ని గురించి, వారి నివాసాలనుగురించి, వారికి ఎంత మంది పిల్లలున్నారో మొదలైన అతిసామాన్యమైన విషయాలు ముచ్చటిస్తూ వారిద్దరూ వాస్తవానికి భార్యా భర్తలని గుర్తిస్తారు. ఇయనెస్కో రచనలలో తరచు కనబడే ఇతివృత్తాల కిది మంచి ఉదాహరణ. ఒక వ్యక్తి తననుండి తానే వేరుపడడంపై వేరొకరికి తన భావాలు ప్రకటించడంలో ఏర్పడే క్లిష్ట పరిస్థితి ఆయన నాటకాలలో కనబడుతుంది.

ఇయనెస్కో చాలా నాటకాలు వ్రాశాడు. వీటిలో తర్కవిరుద్ధమైన భావాలను ప్రకటించాడు. వీటిలో నిర్హేతుకమైన, హింసతో కూడిన చిన్న స్కెచ్‌లు (ఉదా. *ది లీడర్,* 1960) చెప్పుకోదగ్గవి. *ది లెసన్, ది చైర్స్* వంటి విపులమైన ఏకాంకికలలో ఆయన తర్వాత వాడిన ఇతివృత్తాలు ముందుగానే సూచితం అయాయి. అలాంటి ఇతివృత్తం మరణాన్ని గురించిన భయం. ఈయన ఏకాంకికలలో సాధించినంత నైపుణ్యం నాటకాలలో సాధించడానికి శ్రమపడ్డాడు. *అమెదీ* (1954), *టుయర్ సాన్స్ గేగ్స్* (ది కిల్లర్, 1959), *రైనా సెరస్* (1959) మొదలైన నాటకాలలో *ఎగ్జిట్ ది కింగ్* (1963) వంటి నాటకాలలో సాధించిన నాటకీయ సమగ్రత లోపించింది. 1965 లో *ఏ స్ట్రోల్ ఇన్ ది ఎయిర్* అనే తాత్త్విక చింతనతో కూడిన విశిష్టమైన రచన చేశాడు. 1966

లో వ్రాసిన *థర్స్ట్ అండ్ హంగర్* అనే నాటకంతో మళ్లీ అసంగత రచనలు ప్రారంభించాడు.

ఇయనెస్కో సాధించిన ఒక విజయం అధివాస్తవిక ధోరణులను, పద్ధతులను నాటకాలలో ప్రవేశపెట్టి అంత వరకు సహజ రంగస్థల విధానాలకు అలవాటు పడిన ప్రేక్షకుల దృష్టిని తాను సృష్టించిన నవీన పద్ధతుల వైపు మళ్లించడం. ఆయన నిశితమైన విమర్శకుడుగా అంతకు పూర్వమే పేరు పొందడం వలన ఈ పని ఆయనకు సులభమైంది. ఆయన ఆఖరి రచనలలో బుద్ధి వైపరీత్యం కంటె స్వప్నాలను, చైతన్య స్రవంతి లోతులను అన్వేషించడం ఉన్నాయి. ఆయన నిరాశావాదం నిర్హేతుక మైన మరణం మీద ఆధారపడి ఉంది. చివరలో ఈ నిరాశావాదం సన్నగిల్లింది. మొదట్లో ఆయన తనను దక్షిణపక్ష అరాచకవాది (Right-wing anarchist) అని వర్ణించుకున్నాడు; కాని 1968 లో ప్రచురించిన ఆయన *ఫ్రాగ్‌మెంట్స్ ఆఫ్ ఏ జర్నల్* లో వామపక్షాల దృక్పథాలన్నిటికీ ఆయన తీవ్రమైన వ్యతిరేకి అని తేలింది.

ఇ.నా.

**ఇయోట్వ్యాస్, జోసెఫ్ బారో (1813-71) :** ప్రముఖ హంగేరియన్ రచయిత, గొప్ప రాజనీతి విశారదుడు. ఈయన 1813 సెప్టెంబర్ 13 న బుడా (Buda) లో జన్మించాడు. ఈయన చాలా సంవత్సరాలు పశ్చిమ యూరప్‌లో కాలం గడిపాడు. అక్కడే ఈయనకు పాశ్చాత్య ఉదారవాద భావాలతోను, కాల్పనికోద్యమ నాయకులతోను బాగా పరిచయం ఏర్పడింది. 1839-40 సంవత్సరంలో జరిగిన రాజకీయ ప్రతినిధి సభలో ఈయన యూదుల దాస్యవిమోచనాన్ని గురించి వాదించాడు. ఇదే సందర్భంలో బాధ్యతాయుతమైన ప్రభుత్వం కావాలని ఈయన ప్రతిపాదించాడు. ఇలాంటి ప్రభుత్వం లేకుండా హంగరీలో అవసరమైన సంస్కరణలు ప్రవేశపెట్టడం సాధ్యం కాదని ఆయన వాదన. *ది విలేజ్ నోటరీ* (1844-46) అనే ఈయన నవల హంగరీలో ఉత్తమరచన. ఇది ఉదారవాద ప్రగతి శీల స్వభావంతో కూడిన రచన. 1848 వ సంవత్సరం 'ఫిబ్రవరి విప్లవం' తరువాత ఏర్పడ్డ మొట్టమొదటి బాధ్యతాయుత హంగరీ ప్రభుత్వంలో ఈయన విద్యాశాఖా మాత్యుడుగా ఉన్నాడు. ప్రధానమంత్రి లాజుస్ కొసుత్‌తో అభిప్రాయ భేదం ఏర్పడడం వల్ల ఆ పదవికి రాజీనామా ఇచ్చి, ఇయోట్వ్యాస్ మ్యూనిచ్‌కు వెళ్లిపోయాడు. అందువల్ల స్వాతంత్ర్య సమరంలో చురుగ్గా పాల్గొనలేకపోయాడు. అయితే రాజ్యానికి సంబంధించిన 19 వ శతాబ్దం నాటి ప్రముఖ భావనల ప్రభావంతో స్వాతంత్ర్యం కోసం కృషి చేశాడు. ఈయన 1851 లో హంగరీకి తిరిగి వచ్చిన తరువాత రాజకీయాల నుంచి దూరంగా ఉన్నాడు. 1859 లో తన *గారంటీస్ ఆఫ్ ది పవర్ అండ్ యూనిటీ ఆఫ్ ఆస్ట్రియా* అనే రచనను ఈయన ప్రచురించాడు. ఇందులో ఈయన బాధ్యతాయుత ప్రభుత్వాన్ని అనుమతించే ప్రభుసత్తాక రాజ్యంలోని రాజీ మార్గాన్ని ఆశ్రయించాడు. ఆ తరువాత 1861, 1865, 1867 సంవత్సరాలలో జరిగిన మహాసభలలో డీక్‌కు విధేయతనూ, మద్దతునూ ప్రకటించాడు. 1867 నాటి ఆండ్రసీ మంత్రి మండలిలో ఈయన విద్యాశాఖామాత్యుడుగా ఉన్నాడు. 1848 మంత్రిమండలిలోని మంత్రులలో తిరిగి పదవిలోకి వచ్చింది ఈయన ఒక్కడే. ఈయన హంగరీలో జాతీయ విద్యావిధానాన్ని ఏర్పాటు చేశాడు. మతానికి సంబంధించిన విషయాలలో ఈయన మాంటిల్ ఎంబర్ట్ కు స్నేహితుడు, శిష్యుడు కూడా. ఇయోట్వ్యాస్ ఉత్తమ కేథలిక్ అయినప్పటికీ పోప్ ఎప్పుడూ తప్పు చేయడనే వాదాన్ని వ్యతిరేకించాడు. అంతేకాకుండా ఫెహెరార్ అనే బిషప్ దీనిని ప్రకటించినప్పుడు ఇయోట్వ్యాస్ ఆయనను కాపిటల్ కు హాజరు కమ్మని ఆజ్ఞాపించాడు. ఆస్ట్రియా, హంగరీ దేశాల మధ్య కుదిరిన రాజకీయ ఒడంబడికను ఈయన నిరంతరం సమర్థించేవాడు. ఆండ్రసీ పరోక్షంలో ఈయన మంత్రిమండలికి అధ్యక్షత వహించేవాడు. 1871 ఫిబ్రవరి 2 వ తేదీన ఇయోట్వ్యాస్ చనిపోయాడు.

ఇయోట్వ్యాస్ హంగేరియన్ రాజకీయాలలోనే కాకుండా హంగేరియన్ సాహిత్యంలో కూడా ప్రముఖ స్థానం ఆక్రమించాడు. ఈయన వ్రాసిన కవితలలో ఉత్తమ కవితలు ఈయన వీరగాథలలో కనిపిస్తాయి. అయితే, ఈయన కాల్పనిక కవితలతో పోల్చినప్పుడు ఈయన వ్రాసిన ఈ పద్యాలు అంత ప్రాచుర్యం పొందలేదని చెప్పవచ్చును. 1838 లో పెస్ట్ లో వచ్చిన వరదల సందర్భంలో వ్రాసిన *ది కార్తూసియన్స్* అనే రచన ప్రజలను విపరీతంగా ఆకర్షించింది. అప్పటికి *మాగ్యార్* అనే నవల ఆరంభదశలో ఉంది. ఇది ప్రధానంగా జుసిని చారిత్రక గాథలకు ప్రాతినిధ్యం వహిస్తుంది. సమ కాలిక సామాజిక సమస్యలకూ, రాజకీయ అభిలాషకూ తగినంత ప్రాముఖ్యమివ్వడం ద్వారా ఇయోట్వ్యాస్ ఈ నవలకు ఆధునికతను చేకూర్చాడు. ఈయనే వ్రాసిన ప్రసిద్ధమైన *విలేజ్ నోటరీ* వాస్తవ జీవితానికి మరింత సన్నిహితంగా వచ్చింది. ఇది 1514 లో హంగరీలోని ప్రజల జీవితాన్ని వాస్తవికంగాను, విపులంగాను చిత్రించింది.

పద్మాకర్

**ఇర్వింగ్, వాషింగ్‌టన్ (1783-1859) :** అమెరికన్ రచయిత. ఇతనిని 'ప్రథమ అమెరికన్ విద్వాంసుడు' అనడం కద్దు. ఇతని గొప్ప రచన *ది స్కెచ్ బుక్.*

ఒక ప్రెస్బిటేరియన్ తండ్రికీ, సాధుస్వభావురాలైన ఒక ఆంగ్లికన్ తల్లికీ పుట్టిన 11 గురు సంతానంలో చివరివాడు కావడం వల్ల ఇర్వింగ్ గారాబంగా పెరిగాడు. తండ్రి పెద్ద పిల్లల విషయంలో ఉన్నత విద్యను అభ్యసించాలని పట్టుబట్టినా, ఇతడు కాలేజి చదువును తప్పించుకొని 'జోసయ్యా ఆగ్డెన్ హాఫ్ట్‌మన్' ఆఫీసులో చేరి అప్పుడప్పుడు న్యాయశాస్త్రం అభ్యసించాడు. ఆ హాఫ్ట్‌మన్ అందమైన కుమార్తె మెటిల్డాతో ప్రణయకలాపం సాగించాడు. మారుపేరుతో కొన్ని వ్యంగ్య వ్యాసాలను 1802-1803 మధ్య పీటర్ ఇర్వింగ్ నడుపుతున్న *మార్నింగ్ క్రానికల్* అనే పత్రికలో ఇర్వింగ్ ప్రచురించాడు. తన ఆరోగ్యం కోసం 1804-1806 మధ్య హడ్సన్‌కూ, కెనడాకూ, అటుతరువాత యూరప్ ఖండానికీ యాత్రలు చేసి వచ్చాడు.

తిరిగి వచ్చిన తరువాత 1806 లో న్యాయశాస్త్ర పరీక్షలో ఉత్తీర్ణుడై ప్రాక్టీసు పెట్టాడు.

ఇర్వింగ్ వ్రాసిన *హిస్టరీ ఆఫ్ న్యూయార్క్* (1809) డచ్చివారి న్యూయార్క్ పాలనకు సంబంధించిన హాస్య రస భరితమైన చరిత్ర. 1809 లో మెటిల్డా హోఫ్‌మన్ ఆకస్మిక మరణంతో ఆ రచనకు అంతరాయం ఏర్పడింది. అతని దుఃఖం కొంతకాలంపాటు అతనిని నిష్క్రియుణ్ణి చేసింది. 1811 లో అతడు వాషింగ్‌టన్‌కి మారాడు. అయినా కొన్నేళ్లపాటు అతని జీవితం లక్ష్య రహితంగా సాగింది. థామస్ కాంప్‌బెల్ పద్యాలకు అమెరికన్ ఎడిషన్ ఒకటి అతడు తయారు చేశాడు. *అనలెక్టిక్ మేగజైన్* కు సంపాదకత్వం వహించాడు. 1815 లో తన సోదరుల కంపెనీ దివాళా తీయకుండా చూడడం కోసం అతడు లివర్పూల్ వెళ్లాడు. లండన్‌లో సర్ వాల్టర్ స్కాట్‌తో అతని కేర్పడిన పరిచయం లాభదాయకంగా పరిణమించింది. స్కాట్ ప్రోత్సాహంతో అతడు *ది స్కెచ్ బుక్ ఆఫ్ జియోఫ్రీ క్రేయాన్ జెంట్* (1819-20) రచించాడు. దానిలోని 30 పై చిలుకు రచనలలో తొలి ఆధునిక కథానికలు అని చెప్పదగిన *ది లీజెండ్ ఆఫ్ స్లీపీ హాలో, రిప్ వాన్ వింకిల్, ది స్పెక్టర్ బ్రైడ్‌గ్రూమ్* మొదలైనవి ఉన్నాయి. ఆ పుస్తకానికి వచ్చిన ఘన విజయంతో అతడు తన రచనల మీదనే జీవించగల స్థితికి వచ్చాడు. 1822 లో అతడు *బ్రేస్‌బ్రిడ్జ్ హాల్* రచించాడు. ఇది *స్కెచ్‌బుక్* కు ఉత్తర భాగం వంటిది.

1826 లో హెచ్. ఎవరెట్ ఆహ్వానం మీద అతడు స్పెయిన్‌లోని అమెరికన్ దౌత్యకార్యాలయంలో చేరాడు. అక్కడ ఉండగానే అతడు *కొలంబస్* (1828), *ది కంపానియన్స్ ఆఫ్ కొలంబస్* (1831) రచించాడు. తరువాత ఇర్వింగ్ మూర్ జాతివారి గతకాలపు గాథలను అధ్యయనం చేసి *కాంక్వెస్ట్ ఆఫ్ గ్రెనెడా* (1829), *ది అల్‌హాంబ్రా* (1832) రచించాడు.

17 ఏళ్ల అనంతరం 1832 లో ఇర్వింగ్ న్యూయార్క్‌కు తిరిగి వచ్చాడు. తరువాత అతడు *ఏ టూర్ ఆఫ్ ది ప్రెయిరీస్* (1835), *ఎస్టోరియా* (1836), *ది ఎడ్వెంచర్స్ ఆఫ్ కెప్టెన్ బానెవిల్లి* (1838) రచించాడు.

వాషింగ్టన్ ఇర్వింగ్ న్యూయార్క్‌లోని టారీటౌన్‌లో 1859 నవంబరు 28 న తుదిశ్వాస విడిచాడు.

బా.శ్రీ.

**ఇల్ఫ్, ఇల్యా (1897-1937); పెట్రోవ్, యెవ్‌జెనీ (1903-42) :** ఇవి సోవియట్ దేశపు జంట రచయితల మారుపేర్లు; అసలు పేర్లు ఇల్యా ఆర్నాల్డోవిచ్ ఫైన్జిల్‌బెర్గ్, యెవ్‌జెనీ పెట్రోవిచ్ కటాయెవ్. వీరిద్దరూ సోవియట్ హాస్య రచయితలు. 1920-1939 మధ్యకాలంలో వీరి వ్యంగ్య రచనలు విశేష ప్రసిద్ధి పొందాయి.

ఇల్ఫ్ ఒక పేద యూదు కుటుంబంలో జన్మించాడు. యౌవన ప్రాయంలో వివిధ వృత్తులలోను వాణిజ్యాలలోను పనిచేశాడు. 18 వ ఏటనే ఒడెస్సాలో పాత్రికేయుడయాడు. రచయితగా జీవితం సాగించేందుకు అతడు 1923 లో మాస్కో వెళ్ళాడు.

పెట్రోవ్ ఒక బడిపంతులు కొడుకు. వార్తా విలేఖకుడుగా జీవితం ప్రారంభించాడు. 'నేర పరిశోధకుడు' గా కూడా కొద్దికాలం పనిచేశాడు. 1923 లో మాస్కో వెళ్ళి, అక్కడ పాత్రికేయవృత్తి నవలంబించాడు.

ఇల్ఫ్ కేంద్ర రైల్వే కార్మికుల పత్రిక *గుడోక్* (The Whistle) సిబ్బందిలో చేరాడు. పెట్రోవ్ *క్రాస్నీ పెరెట్స్* (Red Pepper) అనే అధిక్షేపాత్మక హాస్య పత్రికలో పనిచేశాడు. 1926 లో ఇతడు కూడా *గుడోక్* పత్రికలో ప్రవేశించాడు. ఇక్కడే ఇతడు, ఇల్ఫ్ కలసి సాహితీ భాగస్వాములయారు. ఆ భాగస్వామ్య ఫలితంగా 1928 లో *ద్వెనట్సత్ స్టుల్యేవ్* (The twelve chairs) అనే వ్యంగ్య నవల ప్రచురించారు. సోవియెట్ జీవితంలోని నూతన ఆర్థిక విధానాన్ని అధిక్షేపించే అద్భుత హాస్య నవల ఇది. ఈ రచన విడుదలైన కొద్దికాలానికే సుప్రసిద్ధినందింది. దానిలోని బాధ్యత తెలియని ధూర్త నాయకుడు - ఓస్టాప్ బెండర్ - రష్యా కాల్పనిక

సాహిత్యంలో ప్రసిద్ధు డయాడు. కథాంతంలో అతడు కూడా అంతరించి పోయాడు. ఆ నవలకు ఉత్తర కథ అనదగ్గ *జోలొటాయ్ టెలినాక్* (1931, *The little Golden calf)* అనే నవలలో తిరిగి అతడు సజీవుడై దర్శన మిస్తాడు. ఈ నవల కూడా వెనుకటి నవలలాగే హాస్య సన్నివేశాలతో కూడిందే అయినా చనిపోయిన 2 వ సోవియెట్ నాయకుని పుత్రునిలా అభినయించే పాత్రలు దీనిలో మరింత హాస్యాన్ని సమకూరుస్తాయి. ఈ జంట రచయితలు 1936 లో అమెరికా సంయుక్త రాష్ట్రాలలో పర్యటించి *ఒడ్నోటడ్నయ అమెరికా* (One-storied America) అనే నవల వ్రాశారు. స్వయంచోదిత (automobile) వాహనంపై వాళ్లిద్దరూ దేశమంతా తిరిగిన హాస్యకథ ఇందులోని ఇతివృత్తం. ఇది అమెరికా జీవితంలోని సంస్కార హీనమైన భౌతిక దృక్పథాన్ని విమర్శిస్తుంది. అయితే పెట్టుబడిదారీ వ్యవస్థలో అనేక లక్షణాలు తమకు నచ్చినట్లు కూడా దీనిలో వారు అంగీకరిస్తారు. ఈ కథకు కొనసాగింపు వలె కనిపించే *టోన్యా* (1937) అనే పెద్దకథ బలవంతంగా పెట్టుబడిదారీ సమాజంలో జీవింపవలసి వచ్చిన కొందరు సోవియెట్ ప్రజల అగచాట్లను కూడా సముచితమైన వ్యంగ్య ధోరణిలో చిత్రిస్తుంది. ఈ సుదీర్ఘ రచనలే కాక ఈ జంట రచయితలు *ప్రావ్దా* వార్తా పత్రికలో ఎన్నో అధిక్షేప హాస్యరచనలు కూడా ప్రచురించారు.

1937 లో ఇల్ఫ్ క్షయవ్యాధితో మరణించాడు. పెట్రోవ్ మాత్రం *లిటరేచర్ నయా గజెటా* (Literary Gazette), ఓ గొన్యోక్ (Little light) అనే పత్రికలలో రచనలు చేస్తూ ఉండేవాడు. అతడు 1942 లో ముట్టడికి గురి అయిన సేవస్టపోల్ నుండి మాస్కోకు వెళుతూ మార్గమధ్యంలో హతు డయాడు.

వి.వి.యల్.

**ఇవానోవ్, వ్సెవోలోడ్ వ్యాచస్ లావోవిచ్ (1895-1963) :** రష్యన్ రచయిత. ఈయన గద్య రచనలు చైతన్య వంతమైన వాస్తవికతకు ప్రసిద్ధి కెక్కాయి. ఈయన ఫిబ్రవరి 24, 1895 లో రష్యాలోని లెబ్యా ఝెలో జన్మించాడు.

సైబీరియా, టర్కీస్థాన్ సరిహద్దు ప్రాంతంలో ఒక నిరుపేద కుటుంబంలో పుట్టి, ఇవానోవ్ ఇంటినుండి పారిపోయి, ఒక సర్కస్ కంపెనీలో హాస్యగాడుగా చేరాడు. తర్వాత దేశద్రిమ్మరిగా, శ్రామికుడుగా తిరుగుతూ వినోద కాలక్షేపా లిస్తూ కొన్నాళ్లు గడిపాడు. 1917 వ సంవత్సరం విప్లవం తర్వాత వచ్చిన ప్రజాయుద్ధంలో కమ్యూనిస్ట్ సైన్యంలో పనిచేశాడు.

1920 లో ఇప్పుడు లెనిన్ గ్రాడ్ అనబడే పెట్రో గ్రాడ్‌కు వెళ్ళాడు. అక్కడ ఇవానోవ్‌కు సెరాపియన్ సోదరులతో సంబంధం ఏర్పడింది. ఆ సోదరులు ఒక ప్రత్యేక సాహితీ బృందానికి చెందినవారు. ఈ బృందం వారు 19 వ శతాబ్దపు జర్మన్ రచయిత ఇ.టి.ఏ. హాఫ్‌మన్ కాల్పనిక రచనలను మెచ్చుకుంటారు. ఇవానోవ్ ప్రజాయుద్ధాన్ని గూర్చి వ్రాసిన నవలలు రచయితగా ఆయనకు పేరు తెచ్చాయి. అవి మానవ ప్రవర్తనను చక్కగా చిత్రించాయి. ఇందులో వాడిన శైలి ఉదాత్తమైంది. మానవజీవితానికి సంబంధించిన ఇంద్రియానుభూతులను చిత్రించడంలో ఆయన శక్తి అసాధారణమైంది. ఆసియాలో చేరి ఉన్న రష్యాలోని జీవితం నుంచి తన కథలకు ఇతివృత్తాలను ఆయన ఎన్నుకొన్నాడు. మాండలికాలను, వాడుక పదాలను విశేషంగా వాడాడు.

1920 ప్రాంతంలో సాహిత్య విధానాలలో వచ్చిన ఆధికారికమైన మార్పుల వలన ఇవానోవ్ తన రచనలను నూతన సూత్రాలకు అనుగుణంగా సవరించ వలసి వచ్చింది. ఈ మార్పులు చేసే సమయంలో ఆయన వైఖరిలో కూడా మార్పు వచ్చింది. మానవుడు సహజ జ్ఞానం కలవాడు అని, భౌతిక జీవితం ముఖ్యమని నమ్మిన ఇవానోవ్ మానసిక విశ్లేషణకు పూనుకున్నాడు. 1930 ప్రాంతంలోనూ ఆ తర్వాతను వచ్చిన ఆయన రచనలు, అంతకు పూర్వం వెలువడ్డ రచనల కంటె తీసికట్టు అని భావించబడుతున్నాయి. *ఆర్మర్డ్ ట్రైన్* అనే 1922 లో వ్రాసిన నవలకు 1930 తర్వాత వ్రాసిన నవలలు సాటి రావు. ఈ నవలను నాటకంగా కూడా ఆయన మలచాడు.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం, 1953 వరకు ఇవానోవ్ రచనలు చేయలేదు. ఆ సంవత్సరంలో మాక్సిమ్ గోర్కీ గురించి తన జ్ఞాపకాలు, అనుభవాలు ప్రచురించాడు. తర్వాత ఎన్నో వ్యాసాలూ, ప్రయాణ వర్ణనలు రచించాడు. సోవియట్ సాహిత్య చరిత్రలో ఆయనకున్న స్థానానికి ఆయన తొలి రచనలే కారణం.

ఇ.నా.

**ఇషర్‌వుడ్, క్రిస్టొఫర్ (1904-1986) :** ఆంగ్లో అమెరికన్ నవలా రచయిత, నాటకకర్త. ఈయన పూర్తి పేరు క్రిస్టొఫర్ విలియమ్ బ్రాడ్‌షా ఇషర్‌వుడ్. 1904 ఆగస్టు 26 వ తేదీన చెషైర్‌లో ఈయన జన్మించాడు. 1930 ప్రాంతంలోని బెర్లిన్ మీద వ్రాసిన నవలల వలన

ఈయన ప్రసిద్ధి కెక్కాడు. వీటిలో ముఖ్యమైనది *మిస్టర్ నారిస్ చేంజెస్ (ట్రెయిన్స్)* (1935). ఆయన రచనలు స్వల్పసంఖ్యలో ఉండడం వలన, సాధారణమైన శైలివలన, ఇతివృత్తాల పరిధి పరిమితం కావడం వలన ఆయన అగ్రశ్రేణి రచయితగా గుర్తింపు పొందలేకపోయాడు. కాని అతడు నిర్ణయించుకున్న పరిధులలో అవీ పరిపూర్ణ రచనలే అని పలువురు భావిస్తున్నారు.

ఆయన కొంతకాలం ఉపాధ్యాయుడుగాను, పత్రికా రచయితగాను పనిచేశాడు. *ఆల్ ది కాన్స్పిరేటర్స్* (1938), *ది మెమోరియల్* (1932) అనే ఆయన మొదటి రెండు నవలల ద్వారా ఆయనకు తన స్నేహ బృందంలో గుర్తింపు లభించింది. 1930 లో బెర్లిన్ వెళ్ళిన తర్వాత ఆయన ఎన్నుకున్న ఇతివృత్తం ద్వారా ఆయనకు ఎక్కువ పేరు వచ్చింది. 1930లో డబ్ల్యు.ఎచ్. ఆడెన్‌తో సహకరించి మూడు పద్యనాటకాలు ఆయన వ్రాశాడు. ఇవి *ది డాగ్ బినీత్ ది స్కిన్* (1935), *ది ఎసెంట్ ఆఫ్ ఎఫ్-సిక్స్* (1936), *ఆన్ ది ఫ్రాంటియర్* (1938). 1938 లో వీరిద్దరూ కలసి చైనా వెళ్లి *జర్నీ టు ఏ వార్* (1939) వ్రాశారు. రెండవ ప్రపంచ యుద్ధం రావడంతో ఇషర్‌వుడ్ రచనా దృక్పథంలో మార్పు రావడమే కాకుండా ఆయన నివాసంలో కూడా శాశ్వతమైన మార్పు వచ్చింది. 1939 లో ఆయన అమెరికాకు వెళ్లి, 1946 లో ఆ దేశపు పౌరుడయాడు. యుద్ధకాలంలో ఆయన శాంతి వాదాన్ని బలపరిచాడు. అప్పుడే హిందూ వేదాంతంలోని ఆత్మ పరిత్యాగంపై ఆయనకు ఆసక్తి కలిగింది.



ఇషర్‌వుడ్ నవల *ది వరల్డ్ ఇన్ ది ఈవెనింగ్* (1954) కొత్త పుంతలు తొక్కింది. దీనిలో ఇదివరకటి వలె రచయితను కూడా నవలలో ఒకపాత్రగా ఉంచినప్పటికీ, 'ఫ్లాష్‌బాక్' పద్ధతులు అనుసరించాడు. విశ్వాసం, నీతి వంటి సమస్యలతో నవలా సామగ్రిని సృష్టించాడు. *డౌన్ దేర్ ఆన్ ఏ విజిట్* (1962) లో రచయిత తన జీవితాన్ని అనేక దశలలో పరీక్షిస్తాడు. ఈ దశలలో ప్రతి ఒకటి ఒక పాత్ర ద్వారా నిరూపించబడుతుంది. ప్రతిపాత్రను సూత్రధారుడి నుంచి విడిపోయిన ఒక అంశంగా పరిగణించ వచ్చును. 1964 లో వ్రాసిన *ది సింగిల్ మాన్* ఎక్కువ ఆదరణ పొందిన చిన్న నవల. ఇందులో 'ఏకలైంగిక' ప్రవృత్తి గల ఒక మేధావి యొక్క ఒంటరితనాన్ని, అతని జీవితంలో ఒకే ఒక రోజులో జరిగిన సంఘటనలను సూక్ష్మంగా పరీక్షిస్తాడు. 1967 లో వచ్చిన *ఏ మీటింగ్ బై ది రివర్* అనే నవల లౌకిక విజయాల కన్న, ఆస్తి పాస్తులకన్న వేదాంతంలో ఉదాహరించిన ధ్యానమార్గం ఘనమైనదని చాటుతుంది. ఆయన ఇతర రచనలలో *లయన్స్ అండ్ షాడోస్* (1938) వంటి స్వీయచరిత్ర, *కాథలీన్ అండ్ ఫ్రాంక్* (1971) వంటి తన తల్లి దండ్రుల చరిత్ర పేర్కొనదగినవి.

ఇ.నా.

**ఇహారా, సైకాకూ (1642-93)** : జపనీస్ కవి, నవలా రచయిత. జపాన్ సాహిత్య పునరుజ్జీవన యుగ ప్రముఖులలో ఒకడు. అసలు పేరు: హిరయామా టోగో (Hirayama Togo). 'హైకై' అనే చిన్న ఛందస్సులో వినోద హాస్య గేయశ్రుంఖలల ఆశుకవిగా ఇతడు ప్రసిద్ధుడయాడు. ఇతని



ఆశు కవితా వేగం నమ్మటానికి వీలులేనంతగా ఉండేది. 1671 లో ఒక రోజులో 1600 పద్యాలు రచించడంతో ప్రారంభించి, సాధనతో 1680 నాటికి రోజుకి 23,500 పద్యాలు చెప్పగలిగాడట! దానితో ఇతనికి 'ఇరవై వేల కవి' అనే పేరు స్థిరపడిపోయింది. ఆ తరువాత ఇతడు రచనా వేగాన్ని తగ్గించుకొన్నా ఆశు కవిత్వపు రోజులలో అలవడిన కృతకశైలి మాత్రం ఇతనిని వదలింది కాదు. అందుచేతనే సాటికవులు ఇతనిది 'డచ్' భాష అని అవహేళన చేసేవారు. 'హైకై' అభ్యాస బలంతో ఇతడు వ్రాసిన నవలలు మాత్రం బాగా జనప్రియాలయాయి. ధారావేగం, ధ్వని, అధ్యాహారం, అవహేళన ఇతని నవలా శైలిలోని ప్రధాన లక్షణాలు. ఇతని కథా వస్తువు ప్రధా

నంగా ఆ నాడు సమాజంలో ప్రాధాన్యం వహిస్తున్న వర్తక వర్గపు అభిరుచులను, స్వేచ్ఛా విలాస జీవితాన్ని గూర్చినవే. దీనినే ఇతడు వివిధ దృక్కోణాలనుంచి పరిశీలిస్తాడు. ఇతని తొలి నవల *రసికుని జీవితం* లో ఒక వర్తక ప్రముఖుడు 6 ఏండ్ల నుండి 60 ఏండ్ల వయస్సులో ఒక 'ఆడ మలయాళానికి' వలస పోయేవ రకు పొందిన అనుభవాలు చిత్రించబడ్డాయి. *ప్రేమను ప్రేమించిన మహిళాపంచకం* లోకూడా ఇదే వస్తువు. *ఒక జపాను కుటుంబపు గిడ్డంగి* అనే కథా సంపుటిలో ధనం సంపాదించుకొనే, లేక పోగొట్టుకొనే అనేకమంది వర్తకుల అనుభవాలు కథలుగా చెప్పబడ్డాయి. *క్షత్రియ* వర్గాన్ని (సామురాయ్) గురించిన కథలు కూడా ఇతడు వ్రాశాడు. కాని అవి రక్తి కట్టలేదు. ఇతని రచన లన్నిటిలోను జపాను జన జీవితం, ముఖ్యంగా ఒసాకా నగర వాతావరణం అచ్చుగుద్దినట్లు కనిపిస్తాయి. జపాన్ కాల్పనిక సాహిత్యంపై ఇతని ప్రభావం చాలాకాలం వరకు కొనసాగుతూ వచ్చింది.

చ.తి.

**ఈస్కిలస్ (క్రీ.పూ. 525-456) :** సుప్రసిద్ధ గ్రీక్ కవి, నాటకకర్త. ప్రాచీన కాలంలో పాశ్చాత్య దేశాలలో గ్రీకు దేశం విజ్ఞాన కళారంగాలలో అగ్రగణ్యంగా ఉండేది. క్రీ.పూ. 8 వ శతాబ్దం నాటికే హోమర్ అనే మహా కవి *ఇలియడ్, ఒడెస్సీ* అనే ప్రసిద్ధ కావ్యాలు రచించి ఉన్నాడు. తర్వాత క్రీ.పూ 5 వ శతాబ్దిలో 'ట్రాజెడీ' అనే ఒక సాహితీ ప్రక్రియ గ్రీసుదేశంలో బహుళవ్యాప్తి పొందింది. ఆ గ్రీకు సారస్వత ప్రక్రియకు చెందిన ప్రసిద్ధ కవులు అనేకులు ఉన్నా, వారిలో ముఖ్యమైనవారు ముగ్గురు. వారిలో ఈస్కిలస్ ప్రథమగణ్యుడు. మిగిలిన వారు ఇద్దరూ: సోఫోక్లిస్, యూరిపిడిస్‌లు. ఈస్కిలస్ క్రీ.పూ. 525 లో ఏథెన్స్ నగరంలో జన్మించాడు.

విషాదాంత రూపక కర్తలలో ఇతడే ప్రథముడు అని అరిస్టాటిల్ గ్రీకు నాటక వికాసాన్ని గూర్చి వ్రాసిన తన గ్రంథం *పొయెటిక్స్* లో పేర్కొన్నాడు. ఈస్కిలస్ తండ్రి యూఫోరియన్. గ్రీకు నాటక పితామహు డని పిలువతగిన ఈస్కిలస్ మొత్తం 90 విషాద రూపకాలు రచించాడని అంటారు. కాని వానిలో నేడు సంపూర్ణ కృతులుగా లభ్యమవుతున్నవి 7 మాత్రమే. అవి: 1. *సప్లీ సెస్* (క్రీ.పూ 490), 2. *పెర్సియా* (క్రీ.పూ. 472), 3. *సెవెన్ ఎగెనెస్ట్ థెబాస్*... 

80 వరకు అసంపూర్ణాలు. ఈతని నాటకాలలో చివరిది అయినా బహుళప్రచారం పొందినది: *ఓరెస్టియా ట్రయా లజీ* (క్రీ.పూ.458) అనే మూడు విషాద రూపకాల సంపుటి. ఇది ఆగమెమ్నాన్, సోఫోరియో, యూమినైడ్స్‌ల సమష్టిరూపం. క్రీ.పూ 534 వ సంవత్సరంలో పిజిస్ట్రా టస్ (Pizistratus) అనే ఏథెన్స్ నియంత నాటకాల పోటీలను ప్రారంభించాడు. ఇవి డయోనిసస్ అనే దేవత ఉత్సవాలలో జరుపబడేవి. ఇందులో పాల్గొనే కవులు మూడు విషాద రూపకాలను ఒక శాటిర్ రూపకాన్ని కలిపి సమష్టిగా రచించాలి. మొట్టమొదట థెస్పిస్ అనే కవికి ప్రథమ బహుమతి లభించినా, తర్వాత ఈస్కిలస్ మొత్తం మీద పదమూడు సార్లు బహుమతులు గెల్చుకొన్నట్లు తెలుస్తూంది. ఇతడు కవితారంగంలోనే కాకుండా కదనరంగంలో కూడా నిపుణుడు.

ఈస్కిలస్ రూపకాలు భావనిర్భరతకు, శయ్యా సౌభాగ్యానికి ప్రసిద్ధి పొందాయి. ఇతనికి మత విషయాలపైన, తత్త్వవిషయాలపైన ఆసక్తి ఎక్కువ. పాప పుణ్యాల విషయంలో ఆ నాటి గ్రీకు దేశీయులకు ఉన్న అభిప్రాయాలు ఈతని గ్రంథాలలో పూర్తిగా స్పష్టంగా ప్రతిబింబిస్తున్నాయి.

ఉదాత్తము, స్వయం సంపూర్ణము, సముచిత పరిమాణము కలిగి ఉండే లోకవృత్తం యొక్క అనుకరణయే ట్రాజెడీ. ట్రాజెడీ అనే పదానికి 'మేక పాట' అని అర్థం. ఆ పేరు ఎందుకు వచ్చిందో సరిగా చెప్పలేకపోయినా మేక తోలు కప్పుకొని లేదా కట్టుకొని డయోనిసస్ దేవుని సేవకులు నాట్యం చేసేవారని, అందుచేత ట్రాజెడీ అనే పేరు వచ్చిందనీ చాలామంది విశ్వసిస్తారు. అది ఆఖ్యాన రూపంలో కాకుండా నాటకీయంగా ప్రదర్శించ బడుతుంది. అరిస్టాటిల్ దృష్టిలో ట్రాజెడీ విషాదాంతం కానక్కరలేదు; విషాదాత్మకం అయితే చాలు.

*ది సప్లయాంట్స్* (క్రీ.పూ. 490) లభ్యమౌతున్న ఇతని రచనలలో మొదటిది. నాటక చతుష్టయ గుచ్ఛంలో మిగిలిన మూడూ నశించి పోయాయి. దీని కథలో ఈజిప్టు రాజైన డానాస్ యొక్క 50 మంది కొమార్తెలు ఆర్గాస్ పారిపోతారు. ఆర్గాస్ రాజైన పిలాస్గస్ ఈజిప్టుతో యుద్ధం వస్తుందని తెలిసినా వారికి ఆశ్రయం ఇస్తాడు. ఈ నాటకంలో సూత్రధారుడు కాకుండా మరో ఇద్దరు నటులు ఉంటారు. దీనిలో నటన, పాత్రచిత్రణ అంతగా లేకున్నా మంచి గేయాలు, చక్కని భాష, నాటకీయ వైరుధ్యం దీనికి ప్రసిద్ధి చేకూర్చాయి.

సమకాలీన చారిత్రక ఇతివృత్తం గల రూపకం *ది పర్షియన్స్* (క్రీ.పూ. 472). సలామిస్ యుద్ధంలో ఓడిపోయిన పర్షియన్లను వేధించడం ఈ రూపకంలో ఇతివృత్తం. మంచి సంభాషణలు ఉన్నా కథా సంవిధానం పేలవంగా ఉంటుంది. 'భూతం' కనిపించడం దీనిలోని విశిష్టత.

థేబన్ చక్రంలోని నాటకత్రయంలో చివరిది *ది సెవెన్ ఎగెయిన్స్ట్ థీబ్జ్* (క్రీ.పూ. 1167). లాయీ నుంచి వంశానుక్రమంగా వారసులకు శాపం తగలడం దీనిలోని ఇతివృత్తం. ఈడిపస్ మరణానంతరం అతని కుమారులు ఎటొక్లెస్, పొలినిసెస్‌లు రాజ్యం కోసం పరస్పరం కలహించుకొంటారు. చివరకు ఒకరి నొకరు చంపుకొంటారు.

అన్యాయం, పాశవికశక్తులు ఒక పక్షాన ఉండగా విజ్ఞాన, న్యాయ, ఋజువర్తనలు మరొక పక్షాన ఉండగా, రెండింటికి జరిగిన సంఘర్షణ చిత్రించే రూపకం *ది ప్రామెథ్యూస్ బౌండ్* (క్రీ.పూ. 466). మానవులకు 'నిప్పు' అందించినందుకు జ్యేయస్, ప్రామెథ్యూస్‌లను కొండ శిలకు బంధించి బాధించినా, అతడు జ్యూస్ పతన రహస్యం చెప్పడు. దీనిలో నటన కొరవడినా, ఈస్కిలస్ నాటకాలలో ఇది శ్రేష్ఠమైన దంటారు. షెల్లీ, బ్రిడ్జెస్, మిల్టన్, గొథె, బైరన్, బ్రౌనింగ్, స్విన్‌బర్న్, హార్డీ మొదలైన ప్రాచీన, ఆధునిక రచయితలపై దీని ప్రభావం మిక్కుటంగా కనిపిస్తుంది.

*ది మెక్టెస్టియా* (ఆగమెమ్నాన్, ది షోపోరియన్, ది ఎమోన్ డైవ్) నాటకాలలో పూర్తిగా లభ్యమవుతున్న ట్రియాలజీ. దీని ఇతివృత్తం కూడా ఆనువంశికంగా శాపం తగలడమే. టంటలస్ చేసిన నేరానికి అతనికి తగిలిన శాపం వరుసగా పిలోప్స్, అట్రెస్, ఆగమెమ్నాన్, ఒరెస్టస్‌లకు సంక్రమిస్తుంది. దుఃఖానుభవం వలన జ్ఞానం కలిగిన ఒరిస్టస్ తనను వెంటాడుతున్న ఫ్యూరీస్ (ఎమ్ నైడ్స్) ను క్షమాభిక్ష కోరుతాడు. ఈ నాటక ప్రభావం సాఫోక్లిస్, యూరిపిడిస్, సినేకా, వోల్టేర్, ఆల్ఫైరీ, వాగ్నెర్, ఓనీల్ మొదలైన వారిపై గాఢంగా పడింది. ఆగమెమ్నాన్‌లో క్లిటెమ్నెస్ట్రా పాత్రచిత్రణ ఉదాత్తమైనది. *షొఫొరామె* లో వ్యంగ్యం, ఉత్కంఠ అధికం. దృశ్యపరివర్తనం కలిగిన మొదటి నాటకం *ఎమెనైడ్స్*.

జె.మూ.ప్ర.

**ఉంగారెట్టీ, జోసెపి (1888-1970)** : ప్రసిద్ధ ఇటాలియన్ కవి. 1888 ఫిబ్రవరి 10 న ఆలెగ్జాండ్రియాలో జన్మించాడు. పారిస్‌లో విద్య నభ్యసించాడు. ఆ సమయంలోనే ఫ్రెంచ్ ప్రతీక వాదుల ప్రభావానికి లోన యాడు. మొదటి ప్రపంచ సంగ్రామంలో తనకు కలిగిన మిలిటరీ అనుభవాలు సాహిత్య రంగంలో ప్రవేశించడానికి అతనికి ప్రేరణ కలిగించాయి. 1937 నుంచి రెండవ ప్రపంచ సంగ్రామం ప్రారంభ మయే వరకూ బ్రెజిల్‌లో ఇటాలియన్ సాహిత్యం బోధిస్తూ ఉండేవాడు.

ఆధునిక ఇటాలియన్ సాహిత్యంలో ఋషివాటికా విద్యా విధానాన్ని ప్రారంభించిన యశస్సు ఉంగారెట్టీకి దక్కుతుంది. ఫ్యూచరిస్టులు పాటించే కవితలోని విప్లవాత్మక భావాలచే ఆకర్షితుడైనా, ఉంగారెట్టీ వారు ఉపయోగించే ఆలంకారిక శైలిని వ్యతిరేకించాడు. శబ్దాల, ధ్వనుల, పదాల జిగి బిగిని, కూర్పువల్ల ఏర్పడే సౌందర్యాన్ని ప్రధానంగా పాటించాడు. అతడు ఇటాలియన్ భాషకు, కవిత్వానికి సమకూర్చిన స్వచ్ఛత, గాంభీర్యం కారణంగా మిక్కిలి ప్రసిద్ధి పొందాడు. ఈ శతాబ్దపు పూర్వార్థంలో ఉన్న కవులలో మంచి ప్రతిభాశాలిగా, ఇతరులపై ప్రభావం చూపినవాడుగా భావించ బడుతున్నాడు.

ఉంగారెట్టీ కవితా సంపుటాలలో ముఖ్యమైనవి: 1. *ఇల్ పోర్టో సెపోల్టో*, 2. *లే గ్యరే* (Le Guerre, 1919), 3. *ఆల్లెగ్రియా డి న్యౌఫగీ* (1919), దీనిలో 1914-1919 సంవత్సరాల మధ్య అతడు రచించిన కవితలు సంగ్రహింపబడ్డాయి, 4. *సెంటిమెంటో డెల్ టెంపో* (1933 - దీనిలో 1919 నుంచి 1932 వరకు గల అతని రచనలు ఉన్నాయి), 5. *ఇల్ డొలోరే* (1947; 1937 నుంచి 1946 వరకు రచించిన పద్యాలు సంగ్రహింపబడ్డాయి). ఇతడు కొన్ని అనువాద గ్రంథాలు కూడా రచించాడు. 1. *ట్రాడుజి ఓనీ డి పోయిసీ స్ట్రానీర్* (1936), 2. *సోనెట్టాడి షేక్స్పియర్* (1946లో ఇంగ్లీషు నుంచి అనువదింపబడ్డాయి). అలాగే ఫ్రెంచ్ నుంచి 1. *ఫ్లోరాలా పొయిస్సియా ఎర్మటికా* (1936), 2. *ఒట్టోస్టెండీ* (1946) లనుకూడా అనువదించాడు.

జె.మూ.ప్ర.

**ఉండ్‌సెట్, సిగ్రిడ్ (1882-1949)** : స్కాండినేవియాకు చెందిన ప్రసిద్ధ నార్వేజియన్ కవయిత్రి, నవలా రచయిత్రి. డెన్మార్కులోని కెలుండ్‌బర్గ్‌లో 1882 మే 20 న జన్మించింది. 1912 లో ఆండర్స్ స్వార్‌స్టాడ్‌తో ఈమె వివాహం జరిగింది. కాని ఆ దంపతులు 1925 లో విడాకులు తీసుకున్నారు. ఈమె ఓస్లో (Oslo) నగరంలో 1949 లో మరణించింది.

ఉండ్‌సెట్ తండ్రి ఒక ప్రసిద్ధ పురాతత్త్వ శాస్త్రవేత్త. ఈమెకు 11 సంవత్సరాల వయస్సులోనే పితృ వియోగం కల్గింది. దానితో కుటుంబం చిక్కుల పాలై ఆమె విద్యాభ్యాసం కుంటుపడింది. బీద తనం కారణంగా 16 సంవత్సరాలైనా నిండని వయస్సులోనే ఆమెకు ఒక ఆఫీసులో ఉద్యోగం చేయవలసిన పరిస్థితి ఏర్పడింది. కాని ఆ పరిస్థితి నేర్పిన అనుభవం ఆమె తొలిరోజులలో వ్రాసిన నవలలకు కావలసిన ఇతివృత్తాన్ని సమకూర్చి పెట్టింది. *జెన్ని* 1911 లో వెలువడింది. 1930 లో ఇది ఆంగ్లంలోకి అనువదింపబడింది. ఇది చాలా ప్రసిద్ధి పొందింది. దీనిలో ఆ నాటి మధ్యతరగతి స్త్రీల సమస్యలు అతి సహజంగా చిత్రించబడ్డాయి. ప్రథమ ప్రపంచ సంగ్రామం కారణంగా కొంతకాలం మౌనంగా ఉన్నా, 1920-22 సంవత్సరాల మధ్య తన సర్వప్రశస్తమైన కావ్యం *క్రిస్టిన్ ల్యూవ్రాన్స్ డాటర్* ను రచించింది. దాని తరువాత పరంపరగా ఒలావ్ ఆడన్‌సన్ రచన జరిగింది. ఇది పైదానంత ప్రసిద్ధి పొందలేదు. 1924 లో రోమన్ కాథలిక్ మతాన్ని ఆమె స్వీకరించింది. ఆ కారణంగా తలెత్తిన అనేక సమస్యలను ఇతివృత్తంగా గ్రహించి ఆమె చాలా నవలలు వ్రాసింది. ఉండ్‌సెట్ సిగ్రిడ్ శైలి ఉదాత్తంగానూ, నిత్యజీవితానికి దగ్గరగాను ఉంటుంది. నార్వీజియన్ మధ్యకాలీన సాహిత్యం విషయంలో ఆమెకు అపారమైన పాండిత్యం ఉంది. ఈ కారణం చేతనే ఆమె చారిత్రక నవలలకు గాంభీర్యం, ఉదాత్తత, ప్రామాణికత సిద్ధించాయి. నవలలలో చిత్రించబడిన ఈమె పాత్రలు మిక్కిలి సజీవంగా కనిపిస్తాయి. నట్ హమ్సున్ తో పాటు ఆమెను కూడా ఈ శతాబ్దిలో గొప్ప నార్వీజియన్ రచయిత్రిగా గౌరవిస్తారు. 1928 లో ఈమెకు నోబెల్ బహుమతి లభించింది. ఆమె కవిత *ఉండ్‌గమ్* (1910) చెప్పుకోదగిన రచన .



ఉండ్‌సెట్ ఇతర రచనలు: 1. *ఫ్రూమార్తాఔలీ* (1907), 2. *డిన్ లికెలిగ్ ఆడ్లర్* (1908), 3. *విగాలి జోట్ బగ్ విగ్‌డిస్* (1910), 4. *గున్నార్స్ డాటర్* (1936), 5. *ఫాటిగే స్కి జోబోనార్* (1912), 6. *వారెన్* (1914), 7. *స్పాంబెన్ ఆవ్‌ట్రోల్డ్ స్పీలెట్* (1917), 8. *ఇమేజెస్ ఇన్ ది మిర్రర్* (ఆంగ్లానువాదం 1938) 9.*డిక్లాగ్ జమ్ ఫ్లూయర్* (Dekloge Jum fluer-1918), 10. *క్రిస్టిన్ లవ్‌రాన్స్ డాట్టర్* - 3 భాగాలు (1920-22) .

ఇవి కాక ఇంకా అనేక నవలలు, విమర్శలు వెలువడ్డాయి. జీవితం చివరి దశ వరకు ఆమె రచనలు సాగిస్తూనే ఉంది.

జె.సూ.ప్ర.

**ఉడాల్, నికోలాస్ (1505-56)** : ఆంగ్లనాటక రచయిత, కవి. ఇతడు సౌదాంప్టన్ నగరంలో జన్మించాడు. వించెష్టర్ స్కూలులోను, ఆక్స్‌ఫర్డ్ లోని కార్పస్ క్రిస్టీ కాలేజి లోను విద్య అభ్యసించాడు. 1554 లో ఆ కాలేజీకి ఫెలో అయాడు. 1553 లో ఆనిబొలిన్ పట్టాభిషేకోత్సవానికి తన స్నేహితుడైన జాన్‌తో కలిసి గేయాలు, పద్యాలు రచించాడు. 1534 లో ఉడాల్ *ఫ్లవర్స్ ఫర్ లాటిన్ స్పెకింజ్* అనే సంకలన గ్రంథాన్ని టెరెన్స్ లాటిన్ కవితల నుండి గ్రహించి వాటి ఇంగ్లీషు అనువాదాలతో సహా ప్రచురించాడు. అదే సంవత్సరంలో అతడు ఈటన్ స్కూలుకు హెడ్‌మాష్టరు అయాడు. కాని త్వరలోనే అనుచిత కార్యాలకు దిగి అపకీర్తి పాలయాడు. తత్ఫలితంగా 1537 లో ఈటన్ స్కూలు విద్యార్థులు థామస్ క్రాంవెల్ సమక్షంలో ప్రదర్శనలు జరిపారు.

1541 లో దొంగతనం, స్వ లింగ సంపర్కం వంటి అవినీతి ఆరోపణలవల్ల ఈటన్ స్కూలు నుంచి డిస్మిస్ అయాడు. కొంత కాలం మార్షల్ సీ (Marshal sea) లో కారాగార శిక్ష అనుభవించి, విడుదలై 1542 లో లండన్‌లో స్థిరపడ్డాడు. అదే సంవత్సరంలో ఎరాస్మస్ రచన *ఎపోఫ్ తెగ్మెస్* కు ఇంగ్లీషు అనువాదం ప్రచురించాడు. ఆ సమయానికి సంస్కరణోద్యమానికి బాహాటంగా తన మద్దతును ప్రకటించాడు. *ఎజికియాస్* అనే తన నాటకంలో పోప్‌పై ఇంగ్లాండురాజు సాధించిన విజయాన్ని ఘనంగా శ్లాఘించాడు. ఎరాస్మస్ రచన అయిన *పేర్ాఫేస్ అపాస్ ల్యూక్* యొక్క అనువాదాన్ని కాథరీన్ రాణి సహాయ సంపత్తులతో 1545 లో ప్రచురించాడు. 1549 లో ఆ పేర్ాఫేస్ ల ప్రచురణను పర్యవేక్షించాడు. 1551 లో విండ్సర్ కు మతాధికారిగా నియమింప బడ్డాడు. మేరీ రాణి అయిన తరువాత

రిఫార్మిస్ట్ అయి ఉండి కూడా ఆమె అభిమానాన్ని, ఆదరణను చూరగొన్నాడు. 1555 లో వెస్ట్ మినిస్టర్ స్కూలుకు హెడ్‌మాష్టరుగా నియమింపబడ్డాడు.

ఉడాల్ రచనలుగా నాలుగు నాటకాలను పేర్కొంటున్నారు. మేరీ రాణి గేయరూపకాలను, నాటకాలను ప్రదర్శించే అధికారిగా అతనిని నియమించింది. *నికారాల్ఫ్ రోయిస్టర్ డోయిస్టర్* అనే నాటకం నిశ్చయంగా అతనిదే అని చెప్పవచ్చు. అదే మొట్టమొదటి ఇంగ్లీషు కామెడీ అని భావింప బడుతూంది.

*రాల్ఫ్ రోయిస్టర్ డోయిస్టర్* అనే కామెడీ 1554 ప్రాంతంలో రచింపబడి మొదట 1506 లో అచ్చు అయింది. ఇది అంత్యానుప్రాసలతో రచింపబడినది. ఇతివృత్తం చాలా సరళం. క్రిష్టియన్ కస్టాన్స్ అనే ఆమె ఇంటి ఎదుట జరిగిన సన్నివేశం అది. కస్టాన్స్ అనే వితంతువుకూ గాయిన్‌గుడ్‌లక్ అనే వర్తకుడికీ వివాహం నిశ్చయం అవుతుంది. అతడు వ్యాపారరీత్యా పొరుగూరు వెళ్ళగా, రాల్ఫ్ రాయిస్టర్ డాయిస్టర్ ఆశ్రితుడైన మాత్యూ మర్రీ గ్రీక్ రాకపోవడంతో రాల్ఫ్ కస్టాన్స్‌తో ప్రేమకలాపం జరిపి, ఆమెను వివాహం చేసుకొన గోరాడు. కాని మూర్ఖుడైన రాల్ఫ్ ఆమె నుంచి ఏలాంటి ప్రతిస్పందన రాకపోవడంతో బలాత్కారంగా ఆమెను లేవతీసుకొని పోవాలనుకుంటాడు. కాని, ఆమె కుటుంబం వారు రాల్ఫ్‌ని, అతని అనుచరుణ్ణీ తరిమి కొడతారు. ఇంతలో గాయిన్ తిరిగి వచ్చి కస్టాన్స్‌ను వివాహం చేసుకోడంతో కథ సుఖాంతం అవుతుంది. మెగ్ మార్బుల్ క్రస్ట్, టిబ్ టాక్ ఎపేస్ అనే పనికత్తెల ద్వారా ఆ నాటి స్కూళ్ళ ప్రిన్సిపాల్స్‌పై వ్యంగ్యోక్తులు చెణుకులు పలికించడం ఈ నాటకంలో గమనించదగ్గ ప్రత్యేకత.

జె.సూ.ప్ర.

**ఊనమూనో, మిగ్యుల్ డి (1864-1936) :** శ్పానిష్ విద్యావేత్త, తత్త్వశాస్త్రవేత్త, కవి, నాటకకర్త. స్పెయిన్‌ను 20 వ శతాబ్ద ప్రథమ భాగంలో తన వ్యాసాల చేత అధికంగా ప్రభావితం చేసిన ప్రముఖ రచయిత.

బిల్బావో లోని ఇన్‌స్టిట్యూట్ విజ్‌కైనా లో కొంతకాలం చదివి, 1880 లో మాడ్రిడ్ విశ్వ విద్యాలయంలో చేరాడు. అక్కడ ఆయన నాలుగు సంవత్సరాలలో సాహిత్య తత్త్వ శాస్త్రాలలో డాక్టరేట్ పట్టా పొందాడు. ఆరు సంవత్సరాల తరువాత సాలమాంకా విశ్వవిద్యాలయంలో గ్రీకు భాషా సాహిత్యాల బోధనకు ఆచార్యుడుగా నియుక్తుడయాడు.

ఊనమూనో 1901 వ సంవత్సరంలో యూనివర్సిటీ రెక్టార్ అయాడు. కాని 1914 లో మొదటి ప్రపంచయుద్ధాన్ని సమర్థించడంతో అతనిని పదవీ బాధ్యతలనుండి తొలగించారు. ఆయన ప్రత్యర్థులు 1924 లో స్పెయిన్‌సైనిక ప్రభుత్వాన్ని స్థాపించి, ఆయనకు దేశబహిష్కార శిక్ష విధించారు. అక్కడి నుంచి ఆయన ఫ్రాన్సుకు పారిపోయాడు. సైనిక ప్రభుత్వ పతనం తరువాత ఊనమూనో తిరిగి సాలయాంకా విశ్వవిద్యాలయం చేరుకొన్నాడు. 1936 లో ఫ్రాంకోస్ ఫలాంగిస్టును వ్యతిరేకించడంతో రెక్టార్ పదవినుండి మరోసారి తొలగించారు. అంతే కాక గృహ నిర్బంధంలో కూడా ఉంచారు. రెండు నెలల తరువాత ఆయన హృద్రోగంతో మరణించాడు.

ఊనమూనో యథార్థవాదులలో మొట్టమొదట పేర్కొన దగినవాడు. మేధ, ఉద్వేగాలమధ్య సంఘర్షణకు గురి అయిన తొలి అస్తిత్వ వాదులలో ఆయన ఒకడు. మనిషికి "అవినీతిపై గల ఆకలిని" గూర్చి సహేతుకంగా నిరూపిస్తూ, నమ్మక మొక్కటే మనిషిని సంతృప్తి పరచ గలదని ఆయన వివరించాడు. ఈ అసాధారణమైన ఉద్వేగం అతనికి అపారమైన మానసిక వ్యధను కలిగించింది.

ఊనమూనో పరిపూర్ణ కవిగాను, నాటక కర్తగానే కాక, వ్యాసకర్తగా, నవలా రచయితగా అపార ప్రజ్ఞ చూపాడు. ఆయన పరిపూర్ణ తత్త్వ విచార జ్ఞానాన్ని *డెల్ సెంటి మెంటొ ట్రాజికో డి లా విదా ఎన్ లాస్ హోంబ్రెస్ యి యెన్ లాస్ ప్యూబ్లోస్* లో పరిపూర్ణంగా చూడవచ్చును. ఇందులో ఊనమూనో మానవుడు సంపూర్ణ జీవితం అనుభవించటానికి దైవ సంకల్పం ఎలా సహకరిస్తుందో వివరిస్తాడు. ఇదే కాక అతడు స్వీకరించిన *లా ఎగోనియా డెల్ క్రిష్టియానిస్మొ* (1925) కూడా ఇలాంటి అన్వేషణనే వ్యక్తం చేస్తుంది. ఊనమూనో వ్రాసిన ప్రసిద్ధ నవల *అబెల్ సాంకెజ్ ఉనా హిస్టోరియా డి ఫేషన్* (1917) *బైబిలు* కథకు ఆధునిక ప్రతిధ్వని.

ఊనమూనో సృజించిన *ఎల్ క్రిస్తో ది వెలాజ్ క్వెజ్* (1920) ఆధునిక శ్పానిష్ పద్యానికి ఒక చక్కని ఉదాహరణ.

చిం.వెం.

**ఎంప్సన్, సర్ విలియం (1906-84) :** ఆంగ్ల కవి, విమర్శకుడు, అధ్యాపకుడు. ఈయన 1906 లో ఇంగ్లండ్‌లో జన్మించాడు. సాంకేతిక శాస్త్రవిజ్ఞానాన్ని సాహిత్యాధ్యయనంలోనూ, విమర్శలోనూ ధారాళంగా

ఉపయోగించిన రచయిత. *సెవెన్ టైప్స్ ఆఫ్ ఆంబిగ్విటీ* అనే ఈయన విమర్శ గ్రంథం ఇరవయ్యో శతాబ్దపు ప్రథమ భాగంలో రచించబడిన ఉత్కృష్ట గ్రంథాలలో ఒకటిగా పరిగణింపబడుతూంది. నిశితమైన మేధాశక్తితో పాటు తాను చెప్పదలచిన విషయంపై గాఢమైన ప్రత్యయం, తపన, ఉద్వేగం ఈయన కవితలో కనిపిస్తాయి. కాలం చెల్లిపోయిందనుకున్న ఛందస్సులలో సమకాలీన సమస్యలను అతి నిపుణంగా ప్రస్తావిస్తూ కవిత్వంలో విశిష్టమైన ప్రయోగాలను చేశాడు. ఈ పద్ధతి జాన్ వేన్, కింగ్స్లీ అమిస్ వంటి తరువాతి యువ కవులను ప్రభావితం చేసింది.

ఎంప్సన్‌కి కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయంలో ఏవర్ ఆర్మ్ స్ట్రాంగ్ (ఐ.ఏ.) రిచర్డ్స్ అనే సుప్రసిద్ధ విద్వాంసుని పర్యవేక్షణలో సాహిత్యాధ్యయనం చేసే అవకాశం లభించింది. తన అభిమాన విషయమైన గణితశాస్త్రాన్ని వదలి రిచర్డ్స్ వద్ద సాహిత్యాన్ని కూలంకషంగా అధ్యయనం చేసి *సెవెన్ టైప్స్ ఆఫ్ ఆంబిగ్విటీ* అనే గ్రంథాన్ని ప్రకటించాడు. అప్పటి కాయనకు 24 ఏళ్లు మాత్రమే! ఈ గ్రంథంలో ఎంప్సన్ కావ్యవిమర్శలో క్రొత్తపద్ధతిని ప్రవేశపెట్టాడు. కావ్యార్థంలో అస్పష్టత, అనియతత్వం దోషాలు కావనీ, కావ్య గుణాన్ని ఇనుమడింపచేసే ఉపాదేయమైన లక్షణాలనీ ఆయన అనేక ఉదాహరణలతో సహా తర్కసహంగా నిరూపించినాడు.

జాన్ డన్ మొదలైన మెటాఫిజికల్ కవుల ప్రభావం ఈయన కవిత్వం మీద కనిపిస్తుంది. సాంకేతిక పరిజ్ఞానం వలన లభ్యమైన ఉపమానాలను బహుళంగా ఉపయోగిస్తూ, మానవ జీవిత నైరాశ్యాన్ని తన కవిత్వంలో ఈయన ప్రస్ఫుటం చేశాడు. ఈయన కవిత్వం వైయక్తిక మైంది. 1935 ప్రాంతాలలో రాజకీయ వాతావరణం సర్వే సర్వత్రా వ్యాపించి ఉన్నప్పటికీ, ఈయన కవిత్వంలో రాజకీయ ప్రమేయం లేకపోవడం గమనించ దగింది.

1931 నుండి 1934 వరకు జపాన్‌లోని టోక్యో విశ్వవిద్యాలయంలో ఎంప్సన్ అధ్యాపకుడుగా పనిచేశాడు. తరువాత మూడు సంవత్సరాలు ఇంగ్లండ్‌లో విస్తృత రచనా వ్యాసంగం చేసి, చైనాలోని పీకింగ్ జాతీయ విశ్వవిద్యాలయంలో ఆచార్యుడుగా చేరాడు. చైనా జపాన్ యుద్ధకాలంలో కష్ట నష్టాలను భరిస్తూ, తన అధ్యాపక వృత్తిని చైనాలో కొనసాగించాడు. 1940 లో ప్రచురించిన *ది గాదరింగ్ స్టార్మ్* అనే పద్య సంపుటంలో ఆ నాటి తీవ్ర రాజకీయ సంక్షోభ ప్రభావం గోచరిస్తుంది. 1949 లో గాని *కలెక్టెడ్ పొయెమ్స్* ను ప్రచురించడం జరగకపోయినా, 1940 నాటికే ఎంప్సన్‌కు గొప్ప కవిగా కీర్తి లభించింది. కొంత కాలం బ్రిటిష్ బ్రాడ్‌కాస్టింగ్ కార్పొరేషన్‌కి చైనీస్ సంపాదక పదవిని నిర్వహించి తిరిగి చైనా జాతీయ విశ్వవిద్యాలయంలో 1947 లో ప్రవేశించి, ఐదు సంవత్సరాలపాటు అధ్యాపకుడుగా పనిచేశాడు. అమెరికాలో కెన్యన్ కాలేజీలో కొంత కాలం ఆచార్యుడుగా పనిచేశాడు. రిచర్డ్స్ సిద్ధాంతాలు ప్రాతిపదికగా అవతరించిన 'నవీన విమర్శ' కు (New criticism) కెన్యన్ కాలేజ్ ఒక కేంద్రంగా ఖ్యాతి చెందింది. 1953 లో షెఫీల్డ్ విశ్వవిద్యాలయంలో ఎంప్సన్ ఆచార్యుడుగా స్థిరపడ్డాడు.

*సమ్ వెర్షన్స్ ఆఫ్ పాస్టరల్* (1935), *ద స్ట్రక్చర్ ఆఫ్ కాంప్లెక్స్ వర్డ్స్* (1951), *మిల్టన్స్ గాడ్* (1961) అనే గ్రంథాలను ఎంప్సన్ రచించాడు. వీనిలో చివరి గ్రంథం వివాదాస్పదమైంది.

కవిత్వ విమర్శలో తొందరపాటు, పారుష్యం తరచుగా కనిపించినా, విమర్శకుడుగా ఎంప్సన్ సమున్నత స్థానాన్ని పొంది, ఆధునిక సాహిత్య విమర్శలో విశిష్ట మార్గదర్శిగా ప్రఖ్యాతు డయాడు.

శ్రీ.ల.

**ఎకా డీ కీరోస్, హోసే మరియా డీ (1845-1900)** : సాంఘిక సంస్కరణకు అంకితమైన పోర్చుగీస్ నవలా రచయిత. పోర్చుగల్‌లో భౌతికవాదాన్ని, యథార్థవాదాన్ని ప్రవేశపెట్టినవాడు. పోర్చుగీసు నవలా రచయిత లందరిలో ప్రముఖుడుగా ప్రసిద్ధి పొందాడు. 19 వ శతాబ్ది నవలా రచయితలలో ప్రముఖుడై ప్రపంచ విఖ్యాతి ఆర్జించాడు.

ఎకా డీ కీరోస్ ఒక ప్రముఖ మేజిస్ట్రేట్‌కు కలిగిన అక్రమ సంతానం. అందువలన అతడు బాల్యాన్ని బంధువులవద్ద గడపవలసి వచ్చింది. ఐదేళ్ళ వయస్సులో వారు అతనిని బోర్డింగ్‌స్కూల్‌లో చేర్చారు. 1866 లో కోయింబ్రా విశ్వవిద్యాలయం నుంచి పట్టభద్రు డయాడు. అక్కడే అతడు ఫ్రెంచ్ భాషను కూడా అధ్యయనం చేశాడు. తరువాత లిస్బన్‌లో స్థిరపడ్డాడు. అతని తండ్రి ఎకా డీ కీరోస్ తల్లిని చట్ట సమ్మతంగా వివాహం చేసుకొనిన తరువాత, అతనికి న్యాయవాదవృత్తిని ప్రారంభించటానికి సహకరించాడు. కాని, ఎకా డీ కీరోస్ కు నిజమైన ఆసక్తి సాహిత్యం మీదే ఉంది. అతని చిన్న కథలు, వివిధ విషయాలను గూర్చిన వ్యాసాలు వ్యంగ్య ధోరణితో పాఠకులను ఆశ్చర్యంలో ముంచెత్తుతూ పోర్చుగల్‌లో వెలువడసాగాయి.

1871 లో 'జనరేషన్ ఆఫ్ 70' అనే పేరుతో పని చేసే ఒక తిరుగుబాటు మేధావి వర్గంతో సంబంధాలను పెంచుకొని సాంఘిక, కళా విలువలను పెంపొందించ టానికి, సంస్కరించటానికి పూనుకొన్నాడు. ఎకా డీ కీరోస్ ఈ వర్గం సహకారంతో సమకాలీన పోర్చుగీసు సాహిత్యంలో కనిపించే కృతకత్వాన్ని, ఆడంబరతను బహిరంగ పరుస్తూ అనేక ఉపన్యాసాలు ఇచ్చాడు.

అతడు ప్రధాన న్యాయమూర్తిగా మొదట హవానా లోను (1872-74), ఇంగ్లండులోని న్యూకేజిల్‌లోను (1874-79), అనంతరం బ్రిస్టల్‌లోను (1879-88) దక్ష తతో పనిచేశాడు. ఈ సమయంలోనే ఆయన తన పేరు కలకాలం నిలిచిపోయే నవలలు వ్రాశాడు. వాటిలో పోర్చుగల్ సంప్రదాయ కుటుంబాలలో కనిపించే మూఢ త్వాన్ని, దుష్టత్వాన్ని తొలగించటానికి ప్రయత్నించాడు. మొదటి నవల *ఓ క్రైమ్ డొ ప్యాడె అమారొ* (1875) లో ఆయన పోర్చుగల్‌లోని ఒక పట్టణంలో శీలం లేని బ్రహ్మచారి అయిన ఒక మతగురువు వల్ల కలిగిన అనర్థాన్ని, మూఢవిశ్వాసంవల్ల కలిగే అపాయాలను వర్ణించాడు. తరువాతి నవల *ఓ ప్రిమో బేసిలియో* (1878) లో తీక్ష్ణమైన వ్యంగ్యంతో విపరీత మోహం వల్ల కలిగే విపత్తులను చిత్రించాడు.

ఎకా డీ కీరోస్ నవలలలో కళా ఖండంగా పరిగణిం చబడుతున్న *ఓస్ మైయాస్* (1888) లో పోర్చుగీసు సంఘంలోని మధ్య తరగతి, ధనిక వర్గాల వారి జీవితా లను చిత్రించాడు.

ఆయన చివరి నవలలు పూర్వపు నవలల వలె కాక భావ ప్రధానమైనవి. *ఎ సిడా డి ఎ ఏజ్ స్సెరాస్* (1901) పోర్చుగీసు పల్లెపట్టుల సౌందర్యాన్ని, గ్రామీణ జీవితాన్ని, సంతోషాన్ని అద్భుతంగా చిత్రించిన నవల.

ఎకా డీ కీరోస్ 1888 లో పారిస్‌లో ప్రధాన న్యాయమూర్తిగా నియమింపబడ్డాడు. చనిపోయే వరకు అక్కడే పనిచేశాడు. అతని మరణానంతరం ప్రకటించిన *కాంటోస్* (1902) అనేది ఒక చిన్న కథల సంకలనం. *ఉల్టిమాస్ పేజియన్స్* (1912) అనే రచన సన్యాసుల వీరగాథలతో నిండినది. 20 వ శతాబ్ది ద్వితీయా ర్థంలో కూడా కీరోస్ రచనల అనువాదాలు ఆసక్తితో పఠించబడుతున్నాయి.

చిం.వెం.

**ఎక్వెన్సీ, సిప్రియన్ (1921) :** ప్రముఖ నైజీరియన్ నవలా, కథానికా , బాల సాహిత్య రచయిత. ఆఫ్రికాలోని నగరవాసుల జీవితాన్ని ఆయన అతి వాస్తవికంగానూ, ప్రతిభావంతంగాను చిత్రించాడు.

ఇబో తెగకు చెందిన ఎక్వెన్సీ నైజీరియాలోని ఇబ దాన్ విశ్వవిద్యాలయ కళాశాల లోను, లండన్‌లోని చెల్సీ ఫార్మసీ స్కూలు లోను విద్యాభ్యాసం చేశాడు. 'ప్రేమ గుసగుసలు' (1947), 'చిరుతపులి పంజా' (1950) ఆయన తొలి రచనలు. నాగరక జీవితంపై మోజు, ఆ జీవితం లోని లోపాల విషయంలో జాగ్రత్త వహించా లనే ఉద్బోధన ఈ నవలలో ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. 1954 లో 'నగరంలోని ప్రజలు' అనే నవల ప్రచు రించబడింది. లాగోస్ లోని నేర వార్తా రచయిత, నృత్యకార్యక్రమాలలో సంగీత నిర్దేశకుడు అయిన ఒకవ్యక్తి దృక్పథం నుంచి నైజీరియాలోని అవినీతి, లంచగొం డితనం, నిరంకుశత్వం వంటి సమస్యలను పరిశీలించి వాటిని నిశితంగా విమర్శించడం ఈ నవలలో ప్రధాన ఇతివృత్తం.

*జాగువా నానా* (1961) అత్యంత విజయవంత మైన నవల. గొప్ప ఆకర్షణ, జాణతనం ఉన్న జాగువా అనే వ్యభిచారిణి ఈ నవలలో నాయిక. నైజీరియాలోని నాగరకులు తమ గ్రామీణ లక్షణాన్ని మరచి పోయి, నగరాలలోని నీతిబాహ్యమైన, బాహ్యాడంబర పూరితమైన జీవితంపై మోజు పెంచుకుని జాగువా చుట్టూ పరి భ్రమించడం ఈ నవలలోని ఇతివృత్తం. 'లోకోటౌన్, తదితర కథానికలు' అనే సంకలనం కూడా లాగోస్ లోని ఉత్తేజకరమైన జీవితాన్నీ, విలువలనూ, పూర్తిగా అంతరిస్తున్న నాగరక జీవితాన్నీ వ్యంగ్యదృష్టితో, అతి వాస్తవికంగా చిత్రించింది. 'మండుతున్న గడ్డి' (1962) ఫులాని పశువుల కాపరుల జీవితాన్ని ఆర్ద్రంగా చిత్రిం చింది. ఎక్వెన్సీ ఎన్నో పిల్లల పుస్తకాలను, ఇబో తెగకు సంబంధించిన జానపద గాథల సంకలనాలను కూడా ప్రచురించాడు.

వృత్తి రీత్యా ఎక్వెన్సీకి రేడియో ప్రసారం అభిమాన విషయం. నైజీరియా రేడియో ప్రసార విభాగానికి ఆయన ఎన్నో రచనలు చేశాడు. ఫెడరల్ సమాచారశాఖ సంచా లకుడుగా ఆయన కొంత కాలం పనిచేశాడు. నవలలలో పాత్రచిత్రణ, వ్యక్తుల అంతరాంతరాల విశ్లేషణ ఎక్కువగా జరుగక పోయినా, ఆఫ్రికాలోని నాగరక జీవన శైలిని అవి చిత్రిస్తున్నాయి. ఎందరో పాఠకులను ఆయన రచనలు ఆకట్టుకోగలిగాయి. బయాఫ్రా యుద్ధాన్ని చిత్రించిన 'శాంతి అనంతరం' (1976) ఆయన చేసిన ఇటీవలి రచనలలో చెప్పుకోదగ్గది. ఎస్.ఎస్.ప్ర.

**ఎచెగరాయ్ యి ఐజాగ్వైర్రె, హోసే (1832-1916) :** స్పానిష్ గణితశాస్త్రవేత్త, రాజనీతి వేత్త, 19 వ శతాబ్దం చివరిపాదంలో విఖ్యాతుడైన నాటకకర్త. ప్రోవెన్ కాల్ భాషాకవి. ఫ్రెడరిక్ మిస్ట్రాల్‌తో పాటు 1904 లో సాహిత్యానికి నోబెల్ బహుమతిని గ్రహించాడు.

తొలిదశలో ఎచెగరాయ్ గణితశాస్త్రాచార్యుడుగా పని చేశాడు. అనంతరం 1868 లో ప్రభుత్వసేవలో ప్రవేశించి పెక్కు పదవులు నిర్వహించాడు. 1874 లో ఆర్థికమంత్రి బేంకో డి ఎస్పానా అభివృద్ధిలో ప్రముఖపాత్ర వహించాడు.

చెకెగరాయ్ రచించిన మొదటి నాటకం *ఎల్ లైబ్రో టలోనారియో* 1874 లో ప్రచురితమైంది. అప్పటికి ఎచెగెరాయ్‌కి 42 ఏళ్లు. అయితే ఆ తరువాత విస్తారంగా, సగటున సంవత్సరానికి రెండు నాటకాల చొప్పున రచించాడు. అతని తొలి రచన పూర్తిగా కాల్పనికతతో నిండి ఉంది. కాని అనంతరం హెన్రిక్ ఇబ్సెన్ మొదలైన వారిచే ప్రభావితుడై అతడు వాస్తవిక రచనల వైపు మళ్లాడు. తన భావాలను వ్యంగ్యంగా అతడు ప్రతిపాదిస్తాడు. *ఓ లోకురా ఓ శాంటిడాడ్* (1877) లో సంఘంలో నిజాయితీ ఎలా ఉన్మాదంగా భావించబడుతుందో చూపాడు. అతడు తన రూపకాలన్నింటిలోను కొంత అతిశయోక్తిని ప్రవేశపెట్టేవాడు. ఈ పద్ధతి అతనికి అలవాటు. నేటి సమాజం మరచినా, ఆ రోజులలో ఆయన ప్రవేశపెట్టిన మహోన్నత భావాలవలన ఆయన అపారమైన ఖ్యాతిని పొందాడు. నాటక నిర్మాణ రీతిలో తన కున్న లోపాన్ని కప్పిపుచ్చుకోటానికి ఎచెగరాయ్ ఈ ఉన్నత భావాలను ప్రవేశపెట్టేవాడు. రంగస్థల నిర్వహణలో అతడు యుక్తితో పలు ప్రయోగాలు నిర్వహించినా, అవి తరువాతి కాలంలోనే స్పానిష్ నాటక రంగంలో విప్లవాత్మకమైన మార్పులు కలిగించాయి.

చిం.వెం.

**ఎజ్‌వర్త్, మరియా (1767-1849) :** ఆంగ్లో-ఐరిష్ రచయిత్రి. మేరియా తండ్రి రిచర్డ్ ఎజ్‌వర్త్ లాంగ్ ఫోర్డ్ లోని ఎజ్‌వర్త్ టౌనుకు పార్లమెంటు సభ్యుడు. ఇతడు బహుపత్నీకుడు. అందరి భార్యల వల్లా సంతానం పొంది బహు కుటుంబికు డయాడు. మరియా వారి బాధ్యత తనమీద వేసుకుని వారికి అందరికి సంరక్షకురాలుగా ఉండేది. గృహ నిర్వహణతో పాటు ఇంటా బయటా పనులు చక్కబెడుతూ తండ్రి రచనా వ్యాసంగానికి సహాయపడుతూ ఉండేది. రిచర్డ్ ఎజ్‌వర్త్ తత్త్వవేత్త. నూతన విద్యా విధానానికి సంబంధించి అతడు ఒక గ్రంథం వ్రాయగా మరియా దానికి లక్ష్య గ్రంథంగా తన తొలి కృతి *ది పేరెంట్స్ అసిస్టెంటు* ను కథల సంపుటిగా సంతరించింది. అది 1796 లో 6 సంపుటాలుగా ప్రచురింపబడింది. ఆమె తర్వాతి కృతులు *ఎర్లీ లెసన్స్* (1801-1814), *మోరల్ టేల్స్ ఫర్ యంగ్ పీపుల్* (1801). ఈ అన్ని రచనలలోను ఆమె తండ్రి ప్రభావం ఆమె మీద బాగా గోచరిస్తోంది. రచనలు సప్రయోజనంగానూ, నీతిదాయకంగానూ ఉండాలని ఆయన సిద్ధాంతం. ఐర్లాండు జీవితాన్ని ప్రతిబింబించే ఆమె నవలలలో ఈ ప్రభావం మిక్కుటంగానే కనపడుతుంది. దానితో పాటు ఆంగ్లో-ఐరిష్ ఎజ్‌వర్త్‌ల ఠీవి కూడా అభివ్యక్తం అవుతుంది. తండ్రి ఎస్టేట్లు అన్నీ తానే చూసుకొంటూ ఉన్నా, ఆమె ఇంటిలో పని చేసేవారికి దూరంగానే ఉండేది. నవలా రచయిత్రిగా ఆమె మంచి పేరు పొందింది. ఐరిష్ జీవిత చిత్రణమే కాకుండా ధనిక వర్గాల విలాస జీవితానికి సంబంధించిన నవలలు కొద్దిపాటి హాస్యం ప్రదర్శిస్తూ వ్రాసింది. సాంఘిక నవలా చిత్రణలో ఆమె దిట్ట. తండ్రి విద్యా విధాన సిద్ధాంత గ్రంథాలకు ఉదాహరణగా తాను వ్రాసిన కథలలో మరిచిపోలేని పిల్లల పాత్రలను సృష్టించి ఆ కోవలో తొలి రచయిత్రిగా ప్రసిద్ధి పొందింది.

ఐర్లాండులోని జీవిత చిత్రణ ఇతివృత్తంగా వచ్చిన *కాసిల్ రేక్ రెన్ట్* (1801) తో ఆమె ప్రసిద్ధ నవలలు ప్రారంభం అయాయి. ఈ నవలలో రేక్ రెన్ట్ కుటుంబం ఎలా పతనం అయిందో వర్ణించబడింది. థాడె క్విర్క్ అనే ఆ కుటుంబపు ఆస్తి పరిరక్షకుడు ఈ నవలలో కథకుడు. తనకు తెలిసిన



మొదటి రేక్ రెన్ట్ అయిన సర్ పాట్రిక్ తాగుబోతు అయి ఎలా పాడయాడో అనే విషయంతో మొదలు పెట్టి ఆ కుటుంబం చివరి వ్యక్తి సర్ కోండి తన ఆస్తి అవశేషాలతో కాలం గడిపేవరకూ అతడు కథ చెబుతాడు. థాడె క్విర్క్ కొడుకే చివరికి ఆ ఆస్తిని చేజిక్కించుకొంటాడు. 18 వ శతాబ్దిలోని వివేక హీనులైన ఐరిష్ భూస్వాముల జీవితాన్ని ఈ నవల చక్కగా

విశ్లేషించింది. *ది అబ్సెంటీ* (1812) అనే నవల కూడా ఐర్లాండ్ భూస్వాముల కుటుంబ గాథే. ఆ నాటి భూస్వాములకు తమ ఎస్టేటులనుండి ధనం వసూలు చేయడమే పరమార్థం. ఆ ధనంతో వారు లండన్‌లోను, రోమ్ నగరంలోను విలాస జీవితం గడిపేవారు. తమ జమీలోని ప్రజల స్థితిగతులు వారు పట్టించు కొనేవారు కారు. అలాంటి భూస్వాములలో లార్డ్ క్లాన్ బ్రోనీ తన ఎస్టేటులో ఉండకుండా లండనులో ఉండేవాడు. అతని భార్య ధనికవర్గం గుర్తింపుకోసం చేసే ఆడం బరపు ఖర్చుల కోసం అతడు అప్పులపా లవుతాడు. వారి కుమారుడు ఐర్లాండులోని తమ ఎస్టేటుకి వచ్చి అచ్చటి పరిస్థితి చూసి నిర్ఘాంతపోతాడు. తల్లి అభ్యంతరం చెప్పినా అతడు తండ్రిని ఒప్పించి తన ఎస్టేటుకు వచ్చి బాధ్యత స్వీకరించేట్టు చేయడమే ఈ నవల లోని సారాంశం.

జె.సూ.ప్ర.

**ఎన్నియుస్, క్వింటస్ (క్రీ.పూ. 239- క్రీ.పూ. 169) :** ప్రాచీన రోమన్ పౌరాణిక కవి; నాటక రచయిత; వ్యంగ్య పరిహాస రచయిత; ఒక విధంగా రోమన్ సాహిత్య పితామహుడు. ఆయన రచించిన పురాణ కావ్యం *అనాలీస్* అతి ప్రాచీన కాలంలో ఈనియా తెగల వారు దేశద్రిమ్మరులుగా తిరుగుతూ ఉన్నకాలం నుంచీ తన కాలం వరకూ నడిచిన రోమ్ దేశపు కథను రసవంతంగా చెప్పే కథాకావ్యం. వర్జిల్ *ఈలియడ్* రచించే వరకూ అదే రోమన్ జాతీయ కావ్యంగా పరిగణింపబడేది.

ఎన్నియుస్ దక్షిణ ఇటలీలోని రూడియేలో క్రీ.పూ 239 లో జన్మించాడు. తాను పుట్టిన ప్రాంతపు ప్రభావం వల్ల ఆయన మూడు భాషలలో నిష్ణాతుడయాడు. ఆ మూడు భాషలూ తనకు మూడు హృదయాల వంటివి అనేవాడాయన. ఆ మూడు భాషలలో ఒకటి తన మాతృభాష అయిన ఓస్కాన్. రెండవది తన విద్యాభ్యాస మాధ్యమం అయిన గ్రీక్ భాష. మూడవది రెండవ ప్యూనిక్ యుద్ధ కాలంలో తాను సైన్యంలో చేరి పని చేసేపుడు ఆ సైన్యంలో మాట్లాడే లాటిన్ భాష. క్రీ.పూ. 204 లో పెద్ద కేటో (The elder cato) ఆయనను రోమ్ నగరం తీసికొనిరాగా, అక్కడ విద్యార్థులకు పాఠాలు చెపుతూ, గ్రీక్ నాటకాలకు లాటిన్ భాషలో అనుసరణలను రచిస్తూ కాలం గడిపాడు. రోమ్‌లోని ప్రముఖులతో ఆయనకు పరిచయాలు ఏర్పడ్డాయి. వారిలో పెద్ద సిపియో ఒకడు. ఆయనకు ఆశ్రయం ఇచ్చినవాడు మార్కస్ ఫుల్‌వియస్ నొబిలియర్. ఆ ఆశ్రయదాత కుమారుడు క్వింటస్ ఎన్నియుస్‌కు రోమన్ పౌరసత్వపు హక్కును సంపాదించి పెట్టాడు. ఈ కొద్ది విషయాలు మాత్రమే ఎన్నియుస్ జీవితాన్ని గురించి మనకు తెలియ వస్తున్నాయి.

ఎన్నియుస్ రచించిన పురాణ కావ్యం *అనాలీస్* లో 600 పంక్తులు మాత్రమే ఇప్పుడు లభిస్తున్నాయి. వాటిలో ప్రత్యక్ష సాక్షుల కథనాలతో పాటు కల్పిత వర్ణనలు కూడా చేరి, వస్త్వైక్యం దెబ్బ తిన్నది. విషాదాంత రూపక రచనలో ఎన్నియుస్ సిద్ధహస్తుడు. గ్రీక్ భాష నుంచి, ముఖ్యంగా యూరిపిడీస్ రచనలనుంచి 19 నాటకాలకు ఆయన లాటిన్‌లో స్వేచ్ఛానువాదం చేసినట్లు తెలుస్తోంది. గ్రీక్ ఇతివృత్తాన్ని లాటిన్ ఛందస్సులలో మలచడంలో ఆయన గొప్ప ప్రతిభ ప్రదర్శించాడు. అనుప్రాస, అక్షర రమ్యత, సాధించడంలో ఆయన గొప్ప నిపుణుడు. రోమన్ ఇతి వృత్తాలను తీసికొని ఆయన రచించిన నాటకాలలో *సబీనే*, ఫుల్‌వియస్ నగరంముట్టడిని అభివర్ణించే *అన్‌బ్రాంచియా*, *సిపియో* చెప్పుకోదగ్గవి. *సతురే* అనే రచనలో ఎన్నియుస్ స్వతంత్ర రోమన్ సాహిత్య ప్రక్రియ అని చెప్పుకోదగిన నూతన ప్రక్రియకు రూపకల్పన చేశాడు. దీర్ఘాచ్చులను సూచించడానికి రెండు వర్ణాలు వ్రాయడం, లాటిన్ హ్రస్వ లిపిని రూపొందించడం వంటి ఘన కార్యాలు సాధించిన ఎన్నియుస్ బహుముఖ ప్రజ్ఞావంతుడు. ఆ నాటి బౌద్ధిక, సాహిత్య ఉద్యమా లన్నిటితోనూ ఆయనకు సంబంధం ఉండేది. రిపబ్లికన్ యుగంలో సిసిరో మొదలైనవారు ఎన్నియుస్ సాహిత్య ప్రతిభను విశేషంగా ప్రశంసించారు.

బొ.శ్రీ.

**ఎన్సినా, జువాన్ డెల్ (1468-1529) :** శ్పానిష్ నాటకకర్త, కవి, మత గురువు ప్రదర్శించడం కోసం నాటకాలు వ్రాసిన కవి. ఉత్సవ గీతాలకు సంగీతం కూర్చినవాడు.

ఎన్సినా చర్చిలో పాటలుపాడే గాయకబృంద సభ్యుడు. సాలమాంకా చర్చిలోను (1484), సాలమాంకా విశ్వవిద్యాలయంలోను (1490 కి ముందు) గాయకుడుగా శిక్షణ పొందాడు. తరువాత అల్బా ప్రభువు సేవలో ప్రవేశించాడు. ఆ రాజసభ కోసం అనేక జానపద ఖండ కావ్యాలను, గొల్ల సుద్దుల వంటి మత సంబంధమైన నాటకాలను వ్రాసి వాటికి సంగీతాన్ని కూర్చాడు. ఎన్సినా నాటకాలలో ఎనిమిది 1496 లో ప్రచురణ పొందాయి. అనంతరం అతడు తన నివాసాన్ని ఇటలీకి మార్చాడు.

పోప్ అలెగ్జాండరు VI కు ప్రీతి పాత్రుడు కావాలని, చర్చిలో మతసంబంధ గురుపదవి పొందాలని కనీసం మూడు సార్లు రోమును సందర్శించాడు. స్పెయిన్ నివాసి అయిన ఎన్సినా స్పెయిన్‌లో తనకంటూ ఒక స్థానం సంపాదించుకోటానికి ప్రయత్నించాడు. 1591 లో జెరూసలెమ్‌లో పర్యటించి, అక్కడ సామూహిక ప్రార్థనలలో పాల్గొన్నాడు. ఈ యాత్రా విశేషాల నన్నింటిని పుస్తకరూపంగా ప్రచురించాడు. 1523 నుండి ఆమర ణాంతం లెయోన్‌లో మఠాధిపతిగా పనిచేశాడు.

ఆయన రచించిన నాటకాలలాగే, కూర్చిన సంగీతం కూడా ప్రపంచానికి ఆనందాన్ని అందిస్తుంది.

చిం.వెం.

**ఎమర్సన్, రాల్ఫ్ వాల్డో (1803-1882) :** అమెరికన్ మహాకవి, వక్త, వ్యాస రచయిత, న్యూ ఇంగ్లండ్ ఆధ్యాత్మికవాద (Transcendentalism) ప్రవక్త.

ఎమర్సన్ తండ్రి రెవరెండ్ విలియమ్ ఎమర్సన్. అతడు యూనిటేరియన్ మతోద్యోగి. తండ్రి నుంచి ఆ మతాధికార వృత్తిని ఎమర్సన్ వారసత్వంగా పొందాడు. అతని తల్లి రూత్ హస్కిన్స్ తీవ్రమైన ఆంగ్లికన్ సంప్రదాయానికి చెందింది. ఆ ఆంగ్లికన్ సంప్రదాయ ప్రభావంతో పాటు రాల్ఫ్ కడ్‌వర్త్, రాబర్ట్ లైటన్, జెరిమీ టెయిలర్, శామ్యుయెల్ టెయిలర్, కాలెరిడ్జ్ వంటి ప్రముఖ ఆంగ్లికన్ రచయితల, మేధావుల ప్రభావం కూడా ఎమర్సన్ మీద కనబడుతుంది.

1811 మే 12 న ఎమర్సన్ తండ్రి మరణించగా, బౌద్ధికంగా అతనిని తీర్చిదిద్దే బాధ్యత అతని అత్త (Aunt) మేరీ మూడీ ఎమర్సన్ మీద పడింది. 1812 లో ఎమర్సన్ బోస్టన్ పబ్లిక్ లాటిన్ స్కూలులో చేరాడు. అక్కడ అతని చిన్న చిన్న పద్యాలకూ, సాహిత్య ప్రతిభకూ ప్రోత్సాహం, గుర్తింపు లభించాయి. 1817 లో ఎమర్సన్ హార్వర్డ్ కాలేజీలో చేరి, 1821 లో పట్టభద్రుడయాడు. యూనిటేరియన్ సమాజంలో బోధించడానికి 1826 లోనే అతడు లైసెన్స్ పొందినా, 1829 నుంచే వారం వారం 'సెర్మన్' లు (మతబోధలు) ఇవ్వసాగాడు. అనంతరం అతని వ్యాసాలకూ, అతని పద్యాలకూ బీజప్రాయాలు అనదగిన భావాలు ఆ సెర్మన్‌లలోనే మనకు కనిపిస్తాయి.

1829 సెప్టెంబరు 29 న *ఎలెన్ లూయిజా టక్కర్‌*ను ఎమర్సన్ వివాహ మాడాడు. 1831 లో క్షయ వ్యాధితో ఆమె మరణించగా ఆ దుఃఖంతో అతడు తన విశ్వాసాలను ప్రశ్నింపసాగాడు. పరమార్థాన్ని తెలుసుకోడం కోసం మెథడిస్ట్‌లూ, క్వేకర్‌లూ, బోస్టన్ ప్రాంతంలోని స్వీడెన్ బోర్జియన్‌లూ మొదలైన వారి వైపు తన దృష్టిని మళ్లించాడు. వైట్ మౌంటెన్స్‌లో ఆర్తితో కూడిన ధ్యానానికి ఫలితంగా 'గ్నోతీ సియాటన్' అనే వచన కావ్యం 1831 జూలై నెలలో రచించాడు. అప్పటి నుంచి యూనిటేరియనిజమ్ పట్ల అతని ఆసక్తి సన్నగిల్లింది.

1834 లో ఎమర్సన్ అన్న ఎడ్వర్డ్ బ్లిస్ చనిపోవడం అతని ఆస్తికతకు మరొక అగ్ని పరీక్ష అయింది. ఆ ఏడాది నవంబరులో అతడు 'కంకార్డ్' లో స్థిరపడి కవిగా పరిణతి సాధించాడు. *రొడోరా, జనోఫనీస్, ఈచ్ అండ్ ఆల్, ది స్నో స్టారమ్* మొదలైన పద్యాలలో ఈ పరిణతి కనిపిస్తుంది. ఈ లోగా 1835 లో అతడు తన కంటె స్వల్పంగా వయస్సులో పెద్దదైన లిడియా జాక్సన్‌ను వివాహమాడడం, మరొక సోదరుడు చార్లెస్ ఛాన్సీ మరణించడం జరిగాయి.

ఎమర్సన్ రచనలలో చెప్పుకొనదగినవి *నేచర్*(1836), *ది అమెరికన్ స్కాలర్*(1837), *ది అడ్రెస్ ఎట్ డివినిటీ కాలేజ్.* 1840 లో *ది డయల్* అనే పత్రికను స్థాపించడంలో అతడు తోడ్పడ్డాడు. మొదట కొన్నాళ్లు మార్గరెట్ ఫ్యుల్లర్, తరువాత ఎమర్సన్ దానికి సంపాదకులుగా పనిచేశారు. ఆ పత్రిక ద్వారా ఆధ్యాత్మిక భావాలను అతడు ప్రచారం చేయసాగాడు. ఎమర్సన్ వ్యాసాలు 1841, 1844 లలో రెండు సంపుటాలుగా వెలువడ్డాయి. ఆయన ఖండ కావ్య సంకలనాలు 'పొయెమ్స్' (1846) లోను *మేడే* (1867) లోనూ వెలువడ్డాయి. ఆ రెండు సంపుటాల వలన ప్రముఖ అమెరికన్ కవిగా ఎమర్సన్ గుర్తింపు పొందాడు.

*రిప్రజెంటేటివ్ మెన్* (1849) లో ప్లేటో, స్వీడెన్ బోర్గ్, మాంటేన్, షేక్స్‌పియర్, నెపోలియన్ బోనపార్టీ, గొయిథేలను మానవజాతికి గొప్ప సేవకులుగా ఆయన అభివర్ణించాడు. మిక్కిలి పరిణతి చెందిన ఎమర్సన్ రచన *ది కాండక్ట్ ఆఫ్ లైఫ్* (1860) మెరుగులు తీరిన మానవతా వాదాన్ని ప్రతిపాదిస్తుంది. తన *వుడ్ నోట్స్* (1840) లో థోరో భావాలకూ, *ది పొయెట్* (1844) లో విట్మన్ భావాలకూ పూర్వచ్ఛాయలను ఎమర్సన్ అందజేశాడు.

1872 లో కంకార్డ్‌లో ఎమర్సన్ నివసిస్తున్న ఇంటి పై అంతస్తు కూలిపోగా, ఇరుగు పొరుగులు ఆయన వ్రాత ప్రతులనూ, గ్రంథాలయాన్నీ కొంత వరకు కాపాడారు. మరికొందరు మిత్రులు మూడవసారి ఎమర్సన్

ఇంగ్లండ్, ఫ్రాన్స్, ఇటలీ, ఈజిప్ట్‌లను సందర్శించి రావ డానికి నిధులను సమకూర్చారు.

19 వ, 20 వ శతాబ్దాల సాహిత్య జగత్తును అత్యధికంగా ప్రభావితం చేసిన రాల్ఫ్ వాల్డో ఎమర్సన్ 1882 ఏప్రిల్ 27 న అమెరికాలోని 'కాంకార్డ్' నగరంలో తుది శ్వాస విడిచాడు.

బా.శ్రీ.

**ఎర్సిలా - యి - యూనిగా, ఆలోన్స్ డి (1533-94) :** కత్తిని, కలాన్ని సమానమైన నైపుణ్యంతో ప్రయోగించగలిగిన శ్పానిష్ కవి. 1569 - 87 మధ్య కాలంలో ఆయన రచించిన *లా అరౌకేనా* స్పెయిన్ పునరుజ్జీవన కాలంలో వెలసిన ప్రసిద్ధ కావ్యం. అమెరికాకు సంబంధించిన మొదటి పద్య కావ్యం అది.



1555 లో అమెరికా వెళ్లే ముందు ఎర్సిలా సాహిత్య సంబంధమైన కృషి ఎక్కువగా చేశాడు. చిలీలో అరౌకేనా ఇండియన్‌లతో జరిగిన యుద్ధాలలో మంచి గుర్తింపు పొందాడు. ఈ యుద్ధాలలో తన అనుభవాలు ఆధారంగా ఈ కావ్యరచనకు ఉపక్రమించాడు. 1563 లో స్పెయిన్ తిరిగి వచ్చిన తరువాత ఈ కావ్యాన్ని పూర్తిచేశాడు. 1569, 1578, 1589 సంవత్సరాలలో మూడు విడతలుగా ఈ కావ్యం ప్రచురించబడింది. ఇందులో 37 ఆశ్వాసాలు ఉన్నాయి. నిర్మాణంలోను, వస్త్వైక్యంలోను, కవిత్వ రచనలోను కొన్ని లోపాలు ఉన్నప్పటికీ, కన్నులకు కట్టినట్లు యుద్ధాలను వర్ణించడం ఈ కావ్యంలో ప్రశంసించ దగ్గ విషయం. ఈ యుద్ధాలలో అరౌకేనియన్‌లు ప్రదర్శించిన ధైర్య సాహసాలను 'ఎర్సిలా' ఎంతో గౌరవంతో, సానుభూతితో చిత్రించాడు.

ఎస్.ఎస్.ప్ర.

**ఎలిటిస్ ఒడిస్సియస్ :** చూ. అనుబంధం-I.

**ఎలియెట్, జార్జ్ (1819-1880) :** విక్టోరియా యుగానికి చెందిన ఆంగ్ల నవలా రచయిత్రి. ఆధునిక యుగంలో కల్పనా సాహిత్యానికి ప్రధాన లక్షణమైన మనస్తత్వ విశ్లేషణ పద్ధతిని తొలిసారిగా ఈమె రూపొందించింది.

జార్జ్ ఎలియెట్ అనే పురుష నామంతో రచనలు చేసిన ఈమె అసలు పేరు మేరీఆన్ లేక మరియన్, క్రాస్, నీ ఇవాన్స్. ఇంగ్లండులోని వార్విక్‌షైర్ మండలంలోని షిల్వర్స్ కోటన్ అనే గ్రామంలో 1819 నవంబరు 22 న ఈమె జన్మించింది. ఈమె తండ్రి రాబర్ట్ ఇవాన్స్. ఇంగ్లండులోని మిడ్లాండ్ మాండలికాలు ఈమెకు బాగా తెలుసు. ఈమె న్యూనీటన్ లోని మిసెస్ వాలింగ్‌టన్స్ స్కూలులో విద్యాభ్యాసం చేసింది (1828-32). విద్యాభ్యాస కాలంలో బలమైన క్రైస్తవ మత నిష్ఠ అలవడడమే గాక, ఫ్రెంచ్, ఇటాలియన్ భాషలతో కూడా ఈమెకు పరిచయం ఏర్పడింది. తల్లి మరణానంతరం ఇంటికి తిరిగి వచ్చి, లాటిన్, జర్మన్ భాషలు నేర్చుకుంది. 1841 లో తండ్రితో పాటు ఈమె కొవెన్ట్రీ చేరుకుంది. అక్కడ చార్లెస్ బ్రే (1811-82) అనే ఒక హేతువాదితో ఈమెకు పరిచయం ఏర్పడి, క్రైస్తవ మతంపై విశ్వాసం క్రమంగా సన్నగిల్ల సాగింది. అయినా తండ్రి సంతృప్తికోసం 1849 లో ఆయన మరణించేవరకు చర్చికి వెళుతూ తన మత వ్యతిరేకతను బాహాటంగా చాటలేకపోయింది.

1843 లో డి.ఎఫ్. స్ట్రాస్ రచించిన *డాస్ లెబెన్ జేసూ క్రిటిష్ బీర్బైటెట్* అనే జర్మన్ గ్రంథాన్ని *ది లైఫ్ ఆఫ్ జీసెస్ క్రిటిక్లీ ఎగ్జామిన్‌డ్* అనే పేరుతో ఆంగ్లీకరించి మూడు సంపుటాలుగా ప్రచురించింది (1846). కర్త పేరు లేకుండా ప్రకటించబడిన ఆ గ్రంథం ఇంగ్లండ్‌లో హేతువాద ప్రచారానికి విశేష దోహదం చేసింది.



ఆర్.హెచ్. బ్రాబన్ట్ మానవుల అతిమానవ శక్తులను ఖండిస్తూ వ్రాయ తలపెట్టి , ఎప్పటికీ పూర్తి చేయని ఒక ఉద్గ్రంథ రచనలో సహాయం చేయడానికి ఇవాన్స్‌ను ఆహ్వానించాడు. జర్మన్, గ్రీక్ గ్రంథాలను ఇద్దరూ కలసి చదువుతూ ఉండేవారు. సుదీర్ఘ వాహ్యాళులలో భగవచ్ఛాస్త్రాన్ని గూర్చి చర్చిస్తూ ఉండేవారు. వీరి ద్దరి సాన్నిహిత్యం బ్రాబన్ట్ సతీమణికి నచ్చకపోవడంతో మధ్యలోనే ఇవాన్స్ ఆ ఉద్యోగం నుండి విరమించుకోవలసి

వచ్చింది. అక్కడి తన అనుభవాన్నే *మిడిల్ మార్చ్* నవల లోని మిస్టర్ కాసాబాన్ పాత్రలో ఆమె విస్పష్టంగా చిత్రించింది.

ఇవాన్స్ 1849-50 శీతాకాలం జెనీవాలో ఫ్రాన్సాయిస్ డాల్ బర్ట్ డ్యూరెడ్ కుటుంబంతో గడిపి, 1850 లో కోవెంట్రీకి తిరిగి వచ్చింది. తన తండ్రి ద్వారా సంక్రమించిన సంవత్సరానికి 100 పౌన్‌ల ఆదాయంతో ఎలా బ్రతకడమా అని ఆమె మథనపడసాగింది. అప్పుడు ఆమె అనువదించిన స్ట్రాస్ గ్రంథాన్ని ప్రచురించిన జాన్ చాప్‌మన్ ఆమెకు గ్రంథ సమీక్ష చేసే ఒక పని అప్పగించాడు. చాప్‌మన్ కుటుంబంతో కలసి ఆమె జీవిస్తూ ఉండగా చాప్‌మన్ సతీమణికీ, చాప్‌మన్‌కి ప్రియురాలైన వారి పిల్లల ఆయాకూ ఆమె మీద అసూయ కలగడంతో 10 వారాలలోనే కంట తడి పెట్టుకుంటూ ఆమె కోవెంట్రీకి తిరిగి రావలసి వచ్చింది. ఆమె చాప్‌మన్ పట్ల ఆకర్షింపబడిన మాట కొంతవరకు నిజమే అయినా ఆమె అతనికి ప్రియురాలుగా ఉన్నట్లు మాత్రం ఎక్కడా దాఖలాలు లేవు. కొన్ని నెలల తరువాత చాప్‌మన్ ఆరంభించిన *ది వెస్ట్‌మినిస్టర్ రివ్యూ* పత్రికలో సబ్ ఎడిటరుగా చేరి, 1854 వరకు మూడేండ్లపాటు ఇవాన్స్ అక్కడ పనిచేసింది. చాప్‌మన్ ఇస్తూ వచ్చిన సాయంకాలపు పార్టీలలో ప్రముఖ రచయితలనూ, రాజకీయ మత రంగాలలో తీవ్రభావాలు కలవారినీ ఎందరినో ఆమె కలుసుకునేది. ఆ కాలంలోనే *ది ఇకానమిస్ట్* పత్రిక సబ్ ఎడిటర్ అయిన హెర్బర్ట్ స్పెన్సర్‌ను ఆమె కలుసుకోడం, వారిద్దరి అభిరుచులూ చాలా వరకు ఏకం కావడంతో వారు వివాహం చేసుకుంటారనే పుకారు బయలు దేరడం జరిగింది. ఆ వివాహమైతే జరగలేదు గాని, తరువాత ఆమె వివాహమాడిన ఇద్దరు వ్యక్తులను ఆ స్పెన్సరే ఆమెకు పరిచయం చేశాడు.

విక్టోరియన్ యుగంలో ప్రముఖ ప్రాతికేయుడైన జార్జ్ హెన్రీ లీవిస్ తన భార్య ఆగ్నిస్ జెర్విస్‌తో విడిపోయినట్లు రూఢికాగానే అతనికి పరిచయం అయిన మరియన్ ఇవాన్స్ అతనికి చేరువై, బాహాటంగా అతనికి భార్యగా జీవింప సాగింది. 1854 జూలైలో ఆమె అనువదించిన ఫ్యూవర్ బాఖ్ జర్మన్ రచన *ఎసెన్స్ ఆఫ్ క్రిష్టియానిటీ* ప్రచురించబడిన వెంటనే వారిద్దరూ కలసి జర్మనీ వెళ్లారు. 1878 లో లీవిస్ చనిపోయేవరకూ వారిద్దరూ సుఖంగా భార్యా భర్తలుగానే కలసి జీవించారు.

వైమర్, బెర్లిన్ నగరాలలో *ది వెస్ట్ మినిస్టర్* పత్రికలో కొన్ని అత్యుత్తమమైన వ్యాసాలు ఆమె వ్రాసింది. స్పినోజా వ్రాసిన *ఎథిక్స్* అనే గ్రంథం (ఇప్పటికీ ఇది అముద్రితం) ఆమె ఆంగ్లీకరించింది. లీవిస్ ప్రోత్సాహంతో ఇవాన్స్ షిల్వర్స్ కోటాన్ గ్రామంలో తన బాల్య జీవిత స్మృతులతో కూడిన కథ వ్రాసింది. *ది శాడ్ ఫార్ట్యూన్స్ ఆఫ్ ది రెవరెండ్ అమోస్ బ్కార్టన్* అనే పేరుతో ఆ కథ బ్లాక్‌వుడ్స్ మాగజైన్‌లో ప్రచురించబడింది (1957). దానికి మంచి ప్రచారం రావడంతో ఆ సంవత్సరమే ఆమె *మిస్టర్ గిల్ఫిల్స్ లవ్ స్టోరీ, జానెట్స్ రిపెంటెన్స్* అనే మరో రెండు కథలు పత్రికలలో సీరియల్‌గా ప్రచురించింది. ఈ మూడు కథలను కలిపి రెండు సంపుటాలుగా 1858 లో బ్లాక్‌వుడ్ ప్రచురించడం జరిగింది. జార్జ్ ఎలియెట్ అనే కలం పేరుతోనే అవి ప్రచురించబడ్డాయి.

జార్జ్ ఎలియెట్ వ్రాసిన తొలి సుదీర్ఘమైన నవల *ఏడమ్ బీడ్* (3-సంపుటాలు-1859). 'ఆవుల నిశ్వాసాలతోనూ, ఎండుగడ్డి వాసనలతోనూ నిండిన ఒక గ్రామీణ కథ ఇది' అని ఈ నవలను రచయిత్రి వర్ణించింది. వాస్తవికతతో కూడిన ఈ నవలలో చక్కని హాస్యం కూడా మేళవింపబడింది. ఒక ఏడాదిలోనే *ఏడమ్ బీడ్* ఎనిమిది ముద్రణలు పొందింది. బ్లాక్‌వుడ్ వారు ఒప్పుకున్న 800 పౌన్లకు రెట్టింపు రాయల్టీ ఇచ్చి, కాపీరైట్ తిరిగి ఆమెకు ఇచ్చివేశారు.

1860 లో వెలువడిన *ది మిల్ ఆన్ ది ఫ్లాస్* (3 సంపుటాలు) వాస్తవిక జీవన దృశ్యాలతోనూ, ఆమె చిన్ననాటి స్మృతులతోనూ, సునిశితమైన మనస్తత్త్వ విశ్లేషణతోనూ పాఠకులను విశేషంగా ఆకర్షించింది.

ఆ రోజులలో చరిత్రాత్మక నవలల పట్ల మోజు ఉండేది. 1860 లో లీవిస్ తో కలసి ఇవాన్స్ ఫ్లారెన్స్ నగరం సందర్శించిన సందర్భంలో *సవనరోలా* (ఒక ఇటాలియన్ సన్యాసి) జీవితం చారిత్రక నవలకు మంచి ఇతివృత్తం అని లీవిస్ ఆమెకు సూచించాడు. ఇవాన్స్ వెంటనే ఉత్సాహంగా అందుకు పూనుకుని *రమోలా* (1862-63) వ్రాసి ప్రచురించింది. అంతకు ముందే 1861 లో ఆమె *సైలాస్ మార్నర్* అనే నవల ప్రచురించింది. ఒక సాలెవానికి తాను పోగొట్టుకున్న బంగారం స్థానంలో ఒక తప్పిపోయిన పిల్లవాడు దొరకడానికి సంబంధించిన ఈ చిన్న నవల సంక్షిప్తతకూ, రూప సౌష్ఠవానికీ పేరుపొంది, జార్జ్ ఎలియెట్ నవలలన్నిటిలోకీ సర్వోత్కృష్టమైందిగా పేరు పొందింది.

జార్జ్ ఎలియెట్ వ్రాసిన ఆ తరువాతి రెండు నవలలూ సంస్కరణల బిల్లు ఆమోదానికి సంబంధించి

జరిగిన ఆందోళన కాలం నాటి ఇంగ్లండ్ జీవితాన్ని చిత్రించేవి. *ఫెలిక్స్ హోల్ట్, ది రాడికల్* (మూడు సంపుటాలు -1866) అనే నవలలో 1832 లో 'న్యూ నీటన్' లో తాను ప్రత్యక్షంగా చూసిన ఒక ఎన్నికల దొమ్మీని ఆమె చక్కగా చిత్రించింది. *మిడిల్ మార్చ్* (8 భాగాలు 1871-72) జార్జి ఎలియెట్ రచనలలో మేలి గ్రంథం అని అందరూ అంగీకరించారు. కేవలం వినోదాత్మకంగా ఉండే నవల ఈ రచయిత్రి చేతిలో ఉదాత్త బుద్ధి చాతుర్యంతో కూడిన కళారూపంగా పరిణమించింది.

*డేనియల్ డెరోండా* (8 భాగాలు-1876) యూదు పాఠకులకు ఎక్కువ ఉత్సుకతను కలిగించిన నవల. ఈ నవలలోని గ్వెండోలెన్ పాత్ర జార్జి ఎలియెట్ సాధించిన సర్వోత్తమమైన సిద్ధి అని విమర్శకులు ప్రశంసించారు.

1878 నవంబరు 30 న లీవిస్ మరణించాడు. 25 ఏళ్లపాటు ఆయన తన భార్య ఇవాన్స్ ప్రతిభ వికసించడానికి సంపూర్ణదోహదం కలిగించాడు. భర్త మరణానంతరం జాన్ వాల్టన్ క్రాస్ (1840- 1924) అనే బ్యాంకర్‌కు చేరువై జార్జ్ ఎలియెట్ 1880 మే 6 న అతనిని వివాహ మాడింది. అప్పటికి క్రాస్ వయస్సు 40. ఆమె వయస్సు 61. ఆ ఏడాదే డిసెంబరు 22 వ తేదీన జార్జ్ ఎలియెట్‌గా ప్రసిద్ధి పొందిన రచయిత్రి మరియన్ ఇవాన్స్ లండన్ నగరంలో శాశ్వతంగా కన్ను మూసింది.

బొ.శ్రీ.

**ఎలియట్, థామస్ స్టైరన్స్ (1888-1965):** సుప్రసిద్ధ అమెరికన్ ఇంగ్లీష్ కవి, నాటక రచయిత, సాహిత్య విమర్శకుడు. ఇంగ్లీషు కవిత్వంలో ఆధునికీ కరణోద్యమ నాయకుడు. రెండు ప్రపంచ యుద్ధాల మధ్యకాలంలో టి.ఎస్. ఎలియట్ 20 వ శతాబ్దపు సంస్కృతిపై దృఢమైన ప్రభావాన్ని ప్రదర్శించాడు. పదాల వాడుక, శైలి, పద్య రీతులలో ఆయన చేసిన ప్రయోగాలు ఇంగ్లీషు కవిత్వాన్ని పునరుజ్జీవింప చేశాయి. ఆయన విమర్శనాత్మక వ్యాసాల పరంపర ద్వారా అనేక ప్రాత పద్ధతులను తుడిచిపెట్టి, క్రొత్తవాటిని ప్రవేశపెట్టాడు. సాంఘిక, సాంస్కృతిక విషయాల మీద నూతన అభిప్రాయాలను వెల్లడించాడు. ఫేబర్ అండ్ ఫేబర్ అనే ప్రచురణ సంస్థకు డైరక్టర్‌గా ఉంటూ చాలా మంది యువకవులకు ఉదారంగా, విచక్షణతో ప్రోత్సాహాన్ని అందించాడు. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో *ఫోర్ క్వార్టెట్స్* ప్రచురించడం వలన ఆయన అప్పటి ఆంగ్ల కవులలో అగ్రగణ్యుడుగా ప్రసిద్ధి పొందాడు. 1948 లో 'ఆర్డర్ ఆఫ్ మెరిట్' అనే బిరుదు, నోబెల్ బహుమానం లభించడంతో ఆయన కీర్తి మరింత వ్యాపించింది.



థామస్ స్టైరన్స్ ఎలియెట్ అమెరికాలోని మిస్సోరి రాష్ట్రంలో సెయింట్ లూయీస్ నగరంలో సెప్టెంబరు 26, 1888 న పుట్టాడు. ఆయన తండ్రి హెన్రీ వేర్ ఎలియట్, కుటుంబ సంప్రదాయానికి భిన్నంగా వ్యాపారంలో ప్రవేశించాడు. తల్లి ఛార్లట్ ఛాంప్ స్టైరన్స్ కవిత్వం వ్రాసేది. ఆమె 15 వ శతాబ్దం ఇటలీలో మత సంస్కర్తగా ఉన్న సవనరోలా జీవితం ఆధారంగా ఒక పద్యనాటకాన్ని కూడా వ్రాసింది. ఈ కుటుంబం సెయింట్ లూయీస్‌లో స్థిరపడి 54 సంవత్సరాలు గడిచినా, వారు న్యూ ఇంగ్లండుకు సంబంధించిన రాజకీయ, మత సంస్కృతులను విడనాడ లేదు. ఎలియట్ చివరి వరకూ న్యూ ఇంగ్లండు పౌరుడుగానే ఉన్నాడు.

ఎలియట్‌కు తన తండ్రిలా వ్యాపారంలో ప్రవేశించవలసిన అవసరం లేదు. తనకు కావలసిన, అప్పుడు లభ్యమైన విద్యను అభ్యసించడానికి ఏ విధమైన అడ్డంకులూ లేవు. సెయింట్ లూయిస్‌లోని స్మిత్ అకాడమీ నుంచి, మ్యాసచూసెట్స్‌లోని మిల్టన్ వెళ్ళాడు. 1906 లో హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో చేరాడు. 1909 లో బి.ఏ. పట్టాను పొందాడు. ఆ విశ్వవిద్యాలయంలో ఆయనను విశేషంగా ప్రభావితుణ్ణి చేసిన వారిలో జార్జ్ సొంటయానా అనే తత్త్వవేత్త, కవీ, ఇర్వింగ్ బ్యాబిట్ అనే విమర్శకుడూ ప్రధానులు. బ్యాబిట్ నుంచి ఎలియట్ కాల్పనిక వ్యతిరేక వైఖరిని అలవరుచుకున్నాడు. తర్వాత ఎఫ్.ఎచ్. బ్రాడ్లే, టి.ఇ. హ్యూమ్ వంటి బ్రిటిష్ తత్త్వవేత్తల రచనలు చదివి ఈ వైఖరిని మరింత బలపరచుకున్నాడు. ఒక ఏడాది పాటు అదే విశ్వవిద్యాలయంలో తత్త్వశాస్త్రశాఖలో సహాయకుడుగా పనిచేశాడు.

20 వ శతాబ్దపు మొదటి సగ భాగంలో పేరెన్నికగన్న ఇద్దరు, ముగ్గురు కవులలో ఒకడుగా గుర్తింపు

పొందిన ఈయన జీవితంలో 1910-11 సంవత్సరం చాలా ముఖ్యమైనది. ఆ ఏడాది ప్యారిస్‌లో సోర్‌బోన్ విశ్వ విద్యాలయంలో హెన్రీ బెర్గ్‌సన్ తత్త్వశాస్త్రంపై ఇచ్చిన ఉపన్యాసాలు ఆయన విన్నాడు. అలెయిన్ ఫోర్నియెతో కలసి కవిత్వం అధ్యయనం చేశాడు. అలెయిన్-ఫోర్నియె చెప్పిన పాఠాల వలన ఎలియట్‌కు ఫ్రెంచి భాషలో ప్రావీణ్యం ఏర్పడడమే కాకుండా, షార్లెస్ బోదెలేర్ జూల్స్ లా ఫోర్గ్ , స్టెఫనీ మల్లర్మె వంటి ప్రతీకవాదుల కవిత్వం కూడా అలవాటు పడింది. 1914 లో ఎజ్రా పౌండ్‌ని ఆయన కలశాడు. 1946 లో "కవిత" అనే పత్రికలో ఎజ్రా పౌండ్ సాహిత్య జీవితాన్ని సమర్థిస్తూ ఈ శతాబ్దపు ప్రారంభ దశలో యువ అమెరికన్ కవుల నిస్సారమైన సాహిత్య వ్యాసంగాన్ని విమర్శించాడు. ఎలియట్, పౌండ్ లిద్దరూ ఇతర భాషలలోని కవులపై దృష్టి మరల్చారు. పౌండ్ ట్రూబెడూర్స్ రచించిన ఇటలీ లోని తొలి పునరుజ్జీవన యుగపు ( Renaissance) కవిత్వాన్ని, ఎలియట్ లాఫోర్గ్ డాంటె కవిత్వాన్ని అధ్య యనం చేశారు. ఎలియట్ శైలిమీద వీరి ప్రభావం ఉంది. 1911-14 లో హార్వర్డ్‌లో మళ్ళీ ప్రవేశించాడు. ఈ సారి భారతీయ తత్త్వ శాస్త్రాన్ని, సంస్కృతాన్ని ఛార్లెస్ లాన్ మన్ అనే గొప్ప పండితునివద్ద నేర్చుకున్నాడు. 1913 లో బ్రాడ్లే వ్రాసిన *అప్పియరెన్స్ అండ్ రియాలిటీ* చదివాడు. 1916 లో 'బ్రాడ్లే తత్త్వశాస్త్రంలో జ్ఞానమూ, అనుభవమూ' అనే సిద్ధాంత వ్యాసాన్ని యూరప్‌లో పూర్తి చేశాడు. ఈలోగా మొదటి ప్రపంచయుద్ధం వలన ఆయన యూరప్ నుండి హార్వర్డ్‌కు వచ్చి మౌఖిక పరీక్షకు హాజరు కాలేకపోవడం వలన పి.హెచ్.డి డిగ్రీ పొందలేక పోయాడు.

ఎలియట్ నాలుగు విధాలుగా ప్రసిద్ధి పొందాడు: సంపాదకుడు, నాటక కర్త, సాహిత్య విమర్శకుడు, తాత్త్విక చింతన గల కవి. తన కాలంలో ఉన్న ఆంగ్ల కవులలో ఆయనే బహుశః ఎక్కువ పాండిత్యం గల కవి. ఆయన కళాశాలలో వ్రాసిన పద్యాలు సాంప్ర దాయి కంగాను, సాహితీపరమైనవిగాను ఉన్నాయి. ఆయన ముఖ్యమైన మొదటి ప్రచురణ ఆధునికత్వానికి మచ్చు తునుక అని చెప్పదగింది: *ది లవ్ సాంగ్ ఆఫ్ జొ ఆల్ఫ్రెడ్ ప్రూఫ్రాక్.* ఇటువంటి కవిత్వం - ముఖ్యంగా అందులో మొదటి 3 పంక్తులు - అంతకు పూర్వం ఆంగ్ల కవిత్వంలో కనపడవు. ఈ పద్యం నకలును తన స్నేహితుడైన కాన్‌రాడ్ అయికెన్‌కు ఇచ్చాడు. ఆయన దానిని పౌండ్‌కు పంపాడు. పౌండ్ దానిని హారియట్ మన్రోకు పంపించాడు. ఆమె 'కవిత' అనే పత్రికకు సంపాదకురాలు. అయితే ఎలియట్ వ్రాసినది కవిత్వమో, కాదో ఆమె నిర్ణయించ లేకపోయింది. ఏడాది గడిచి పోయింది. ఈ పద్యం అప్పటి సంప్రదాయాలకు భిన్నంగా ఉంది. 1798 లో కోల్‌రిడ్జ్, వర్డ్స్‌వర్త్‌లు ప్రచురించిన "లిరికల్‌బాలెడ్స్" సాధించిన కవితా విప్లవానికి ఎలియట్ సాహసం తీసిపోదు. 1917 లో *ప్రూఫ్రాక్ అండ్ అదర్ అబ్జర్వేషన్స్* అనే మొదటి సంపుటితో 20 వ శతాబ్దపు కవితా విప్లవం పరిపక్వం చెందిం దని చెప్పవచ్చును. ఈ విప్లవాని కున్న ప్రాముఖ్యం వివాదాంశం కావచ్చు. కాని, కోల్‌రిడ్జ్, వర్డ్స్‌వర్త్‌లు సాధించిన కాల్పనిక విప్లవాన్ని ఇది స్ఫురింపజేస్తుంది. ఎలియట్, పౌండ్ - వీరిద్దరూ కవిత్వభాషను సంస్కరించడానికి పూనుకొ న్నారు. మానవులు నిజంగా వాడే భాష కవిత్వ భాష కావాలని వర్డ్స్‌వర్త్ చాటితే, చదువుకున్న మనిషి మాట్లాడే పాండిత్య ఆర్భాటం, మోటుతనం లేని భాష కవిత్వానికి సరి అయినదని ఎలియట్ భావించాడు.

ఒక ఏడాది హైగేట్ స్కూల్‌లో ఫ్రెంచ్, లాటిన్ భాషలు ఎలియట్ బోధించాడు. 1917 లో లాయడ్స్ బ్యాంక్‌లో గుమాస్తాగా చేరి కొద్ది కాలం పనిచేశాడు. ఈ కాలంలో సమీక్షకుడుగా, సాహిత్య విమర్శకుడుగా, తాత్త్విక వ్యాసకర్తగా ప్రసిద్ధి పొందాడు. 1919 లో *జెరోన్‌టియన్* అనే పద్యాన్ని వ్రాశాడు. ఇటువంటి పద్యం అంతకు పూర్వం ఇంగ్లీషు భాషలో రాలేదు. 1922 లో ప్రచురించిన *ది వేస్ట్ లాండ్* తో ఆయనకు అంతర్జాతీయ ఖ్యాతి లభించింది.

ఈ పద్యం 5 భాగాలుగా ఉంది. 20 వ శతా బ్దంలో పాశ్చాత్య నగరాలలో చిన్నాభిన్నమైన వివేకాన్నీ, అనుభూతులనూ ప్రతిబింబింపచేస్తూ రచించిన పద్యం ఇది. ఎలియట్ లౌకికదృష్టి ప్రబలిన నగరానికి చెందిన కవి. శాశ్వత నగరాలు శిథిలమై, క్షీణదశ ప్రాపించినదే ఆధునిక నగరం. ఇదే *వేస్ట్ లాండ్* యొక్కకట్ట కడపటి ఇతివృత్తం. అలంకార ధోరణులను తరచు మారుస్తూ భిన్నమైన శైలులను ప్రదర్శిస్తూ ఈ పద్యం నడిచింది. కాని ఇది ఆయన తొలి విమర్శకులు తలచినట్లు ప్రాచీన కాలపు ఘనతతో, నేటి దీనావస్థను పోల్చే పద్యం కాదు. అది కాలాతీతమైన నైతిక వైభవాన్ని, నైతిక పతనాన్ని ఒకేసారి స్ఫురింప చేస్తుంది. ఎజ్రా పౌండ్ సలహా మేరకు మొదట వ్రాసిన 800 పంక్తులను 433 పంక్తులకు ఆయన కుదించాడు. ఎలియట్ పద్యాలలో *ది వేస్ట్ లాండ్* అత్యంత ప్రాముఖ్యం గలది కాదు. కాని, అది

ఆయన కావ్యాలలో ఎక్కువ ప్రసిద్ధి పొందింది. 'కవి-విమర్శకుడు' గా ఈయనకు 20 వ శతాబ్దంలో ప్రముఖ స్థాన ముంది. కవియైన విమర్శకుడు తన విమర్శలలో తనకు కవిగా నచ్చిన విషయాలగురించి వ్రాయాలనీ, కవిని అతని సంప్రదాయంలో చూపించాలనీ, కేవలం చారిత్రక పాండిత్యం వలన ప్రయోజనం లేదనీ చెప్పాడు. ఇటువంటి విమర్శల వలన ఆయన కవిత్వం అర్థం చేసుకోడం సులభ మౌతుంది. ఆయన 1920 లో ప్రచురించిన ది సేక్రెడ్ వుడ్ అనే పుస్తకంలో *ట్రెడిషన్ అండ్ ది ఇండివిడ్యువల్ టాలెంట్* అనే వ్యాసం ఉంది. దీనికీ, వర్డ్స్వర్త్ 1800 లో వ్రాసిన ముందుమాటకూ పోలికలు ఉండడమే కాకుండా, ఈ రెండూ చారిత్రకంగా సమానమైన ప్రాముఖ్యం గలవి. ఈయన దృష్టిలో సంప్రదాయాన్ని కవి తనకు తాను సంపాదించుకోవాలి. కవికి ముందున్న రచన పునశ్చరణ సంప్రదాయం కాదు. సంప్రదాయం అంటే హోమర్ మొదలుకొని నేటి వరకూ వచ్చిన యూరపియన్ సాహిత్య మంతా! ఆంగ్లంలో వ్రాసే కవి, గతకాలంలోని ఏ వస్తువులనైనా తీసుకొని ఏ భాషలోనైనా వాడి తన సంప్రదాయాన్ని తాను సృష్టించుకోవచ్చును. ఎలియట్ కవిత్వంలో అనేక భాషలనుంచి గ్రహించిన పంక్తులూ, ఇతర కవులనూ గురించిన హాస్యవిమర్శ విప్లవాత్మకంగా వాడుకోబడ్డాయి. ఎలియట్ వ్రాసిన ఇంకో వ్యాసం, *హామ్లెట్ అండ్ హిజ్ ప్రోబ్లమ్స్* లో ఉద్వేగ వినిమయం (objective correlative) అనే సిద్ధాంతాన్ని విపులీకరించాడు. కళలో ఏదైనా రసాన్ని పోషించేందుకు ఒకే ఒక పద్ధతి ఉంది. ప్రతి రసానికి సంబంధించిన కొన్ని మాటలూ, వస్తు సముదాయం, పరిస్థితి, సంఘటనలూ ఉంటాయి. ఈ బాహ్య వాస్తవాలను చెప్పగానే వాటికి సంబంధించిన రసం ఉత్పన్న మవుతుంది అని ఎలియట్ చెప్పాడు. ఈ పదానికి సాహిత్య విమర్శలో ఎక్కువ ప్రభావం ఏర్పడింది. దీనివలన మాటకీ, వస్తువుకీ ఆనుకూల్యం అత్యవసరమనీ, విక్టోరియన్ యుగంలో వలె సందిగ్ధత ఉండకూడదనీ తేలింది. *ది మెటఫిజికల్ పొయెట్స్, ఆండ్రూ మార్వెల్* అనే రెండు వ్యాసాలలో ఆంగ్ల కవిత్వ పరంపరమీద నూతన చారిత్రక దృష్టిని సారించి, క్రొత్త వరుసక్రమాన్ని నెలకొల్పాడు. ఈ కొలబద్దతో చూస్తే 17 వ శతాబ్దపు తాత్త్విక కవులు అగ్రశ్రేణికి చెందినవారు అవుతారు. 18 వ, 19 వ శతాబ్దపు కవులు వారి కంటె తీసికట్టు. ఎలియట్ వాడిన రెండవ ప్రసిద్ధమైన పద బంధం 'ఉద్వేగ భిన్నత' (Dissociation of Sensibility) ఈ వ్యాసాలలో ఉంది. ఆంగ్ల కవిత్వం లో డన్ (Donne), మార్వెల్ (Marvel)ల తర్వాత వచ్చిన మార్పులను విశదీకరించడానికి ఈ పదాన్ని ఎలియట్ సృష్టించాడు. ఈ పదాన్ని కొందరు వ్యతిరేకించారు. కాని ఈ పదాన్ని వాడడానికి కారణమైన చారిత్రక సత్యాన్ని ఎవరూ కాదనలేరు. ఎలియట్, పౌండ్ల కవిత్వం వలన 17 వ శతాబ్దపు కవులు కొందరిపై ఆసక్తి తిరిగి హెచ్చింది. 1933 లో ఎలియట్ హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో *ది యూజ్ ఆఫ్ పొయిట్రీ అండ్ ది యూజ్ ఆఫ్ క్రిటిసిజమ్* అనే ఉపన్యాసం ఇచ్చాడు. దీనితో విమర్శకుడుగా ఆయన మొదటిదశ పూర్తి అయింది. అంతకు పూర్వమే మతశాస్త్రం (Theology), సామాజిక శాస్త్రాలవైపు ఆయన దృష్టి మళ్లింది. *థాట్స్ ఆఫ్టర్ లాంబెత్* (1931), *ది ఐడియా ఆఫ్ ఏ క్రిస్టియన్ కల్చర్* (1939), *నోట్స్ టువర్డ్స్ ది డెఫినిషన్ ఆఫ్ ఏ కల్చర్* (1948), *డాంటె* (1929) వంటి సుదీర్ఘ వ్యాసాలలో సాహిత్యపు పునాదులను మతశాస్త్రం (Theology)లోకీ, తత్త్వ శాస్త్రంలోకీ విస్తరింపజేశాడు. ఏదైనా కావ్యం కవిత్వ మవునా కాదా అనే విషయం సాహిత్య ప్రమాణాల ద్వారా నిర్ణయించాలి. ఆ కావ్యం గొప్ప కవిత్వమా కాదా అనేది సాహిత్యానికి అతీతమైన ప్రమాణాల ద్వారా నిర్ణయించాలి!

విమర్శ, కవిత్వం - ఇవి రెండూ పెనవేసుకుని కలసి పోయి ఉంటాయి. ఈ రెండూ ఏకత్వం సాధించిన మనస్సులోని వివేకంనుంచి పుట్టాయి. వీటిని విడిగా చర్చించడం కష్టం. 1927 లో ఎలియట్ కేథలిక్గా మారాడు. బ్రిటిష్ పౌరు డయాడు. ఆ తర్వాత 1930 లో వ్రాసిన సుదీర్ఘ కావ్యం *ఆష్ వెన్స్‌డే* (Ash Wednesday) లో శైలి, అదివరకు వ్రాసిన పద్యాలశైలి కంటె భిన్నమైంది. దీనిలో మతపరమైన ధ్యానం ఉంది. వాస్తవానికి ఒక సారి వ్రాసినట్లు మళ్లీ వ్రాయడం ఎలియట్ చేయలేదు. అయినా ప్రతి పద్యం నిస్సందేహంగా ఆయనదే! *ఆష్ వెన్స్‌డే* కు సరియైన ఆదరణ లభించలేదు. ఆ సమయంలో కవిత్వంలో లౌకిక దృష్టి ఖచ్చితంగా ఉండాలనే వాదన ఉండేది. ఎడ్మండ్, విల్సన్ వంటి విమర్శకులు ఈ పద్యానికి వక్ర భాష్యాలు చెప్పి, అది ఎలియట్‌కి వ్యక్తిగతమైన భ్రమల తొలగింపుకు ఉదాహరణగా వర్ణించారు.

ఎలియట్ పద్య కావ్యాలలో *ఫోర్ క్వార్టెట్స్* అతి ముఖ్యమైంది. ఇందులో నాలుగు భాగా లున్నాయి. ప్రతి భాగం స్వయం సంపూర్ణత కలిగి ఉంది. ఆ

నాలుగు భాగాలు 1935-1941 మధ్య కాలంలో అప్పు డప్పుడు ప్రచురించ బడ్డాయి. 1943 లో పుస్తక రూపంలో వచ్చాయి. 20 వ శతాబ్దపు ఆంగ్ల కవిత్వపు పరాకాష్ఠకు ఉదాహరణ బహుశః *లిటిల్ గిడ్డింగ్* లో వ్రాసిన ఉదంతం. ఇందులో యీట్స్ (Yeats), మల్లార్మె (Mallarme) లు కలిసి భూతంగా వచ్చి ఎలియట్‌ను కలుస్తారు (వీరిద్దరూ ఎలియట్‌కు గురుతుల్యులు). ఈ సన్నివేశం లండన్‌లో యుద్ధకాలంలో విమానదాడులను ఎదుర్కొనడంలో తమ రాత్రి విధులను నిర్వర్తించుకుని ప్రాతఃకాలంలో తిరిగి వస్తున్నప్పుడు జరుగుతుంది. దీనిని 72 పంక్తులలో టెర్జ-రీమాలో పొందుపరిచాడు. డాంటే కవిత్వానికి ఇంగ్లీషులో సాధ్యమైనంత సన్నిహితత్వాన్ని ఈ పద్యంలో ఎలియట్ సాధించాడు. తన నమూనాలకు చాలా దగ్గరగా ఉన్నా, కవి పూర్తిగా స్వస్వరూపంగా ఉండగల డని ఎలియట్ విశ్వాసం. దానికి ఈ *లిటిల్ గిడ్డింగ్* లోని పంక్తులు చక్కని ఉదాహరణలు.

1926 లో *స్వేనీ ఎగొనిస్టెస్* తో ప్రారంభించిన ఎలియెట్ నాటక రచన 1958 లో ప్రదర్శించిన *ది ఎల్డర్ స్టేట్స్‌మన్* తో పూర్తి అయింది. ఇవి *మర్డర్ ఇన్ ది కెథీడ్రల్* మినహా - ఆయన గేయ, ధ్యాన కవిత్వానికంటె తక్కువ స్థాయిలో ఉన్నాయి. లౌకిక మైన నాటకాలు కూడా ప్రజలను ఆకర్షిస్తాయి. ఎందు కంటే, ఆ ప్రజలు తమకు తెలియకుండానే ఒక మతం గురించి వెతుకుతూ ఉంటారు. నిజానికి నాటకాలన్నీ ఆత్మజ్ఞానం, సామరస్యం, పవిత్రత్వం వైపు పురోగమిస్తూ మత సంబంధమైన స్వరూపం కలిగి ఉంటాయని ఎలి యట్ విశ్వసించాడు. అందువలన నాటకాన్ని మిగతా అన్ని రకాల కవిత్వం కంటె పై స్థాయిలో ఉంచాడు. పద్య నాటకాలను, పునరుద్ధరించి రంగస్థలానికి ఆయన క్రొత్త వెలుగు తెచ్చాడు. *ది ఫామిలీ రియూనియన్* (1939), *మర్డర్ ఇన్ ది కెథీడ్రల్* (1935) క్రైస్తవ విషాదాంత నాటకాలు. ఇందులో మొదటిది పగ ఇతి వృత్తంగా గలది; రెండవది అహంభావం అనే పాపం ఎలా పతనం అవుతుందో చూపిస్తుంది. ఎలియట్ వ్రాసిన మిగతా నాటకాలు సుఖాంతాలు. వీటి ఇతివృత్తాలు గ్రీకు నాటకాల నుండి తీసుకున్నాడు. వీటిలో అత్యంత విజ యవంతమైంది *ది కాక్‌టెయిల్ పార్టీ*. దీనికి మూలం యురిపిడీస్ రచించిన *ఆల్ సెస్టిస్*.

సంపాదకుడుగా ఎలియట్ వ్యాపకం ఆయన ఇతర ముఖ్య వ్యాపకాలకు అనుబంధం మాత్రమే. 1922-39 ల మధ్య వెలువడిన *ది క్రైటీరియన్* అంతర్జాతీయంగా విమర్శక పత్రికగా పేరు పొందింది. ఎలియట్ మరణానంతరం ప్రచురింపబడిన విమర్శ సంపుటం *టు క్రిటిసైజ్ క్రిటిక్, అండ్ అదర్ రైటింగ్స్* (1965) లో రెండు మిక్కిలి విలువైన వ్యాసాలు ఉన్నాయి. వీనిలో మొదటిది తన విమర్శలను సమీక్షిస్తూ, నిశితంగా దాని విలువను అంచనా వేసేది. రెండవ దానిలో అమెరికన్ భాష, అమెరికన్ సాహిత్యం వేరనే వాద ఖండనం ఉంది. బ్రిటిష్ అమెరికన్ సాహిత్యాలు వేరు కాదు, అవి రెండూ ఒకే సాహిత్యానికి శాఖలు అని ఆయన నొక్కి చెప్పాడు. 18 వ శతాబ్దపు మధ్య కాలాన్ని జాన్సన్ యుగంగా వర్ణించినట్లు 20 వ శతాబ్దపు మొదటిసగ భాగాన్ని బహుశః ఎలియట్ యుగం అని చరిత్రకారులు వర్ణించవచ్చును. కాని శామ్యూల్ జాన్సన్ క్రొత్త సంప్రదాయ యుగం ఆఖరయే సమయంలో వచ్చి, దాన్ని సంక్షిప్త పరచాడు. ఎలియట్ విమర్శకుడుగా, కవిగా, తన యుగాన్ని తానే సృష్టించుకున్నాడు. తన సొంత విషయాలను ఎల్లప్పుడూ నేపథ్యంలోనే ఉంచాడు. 1915 లో వివియన్ హెయ్‌వుడ్‌ను ఆయన వివాహమాడాడు. 1933 తర్వాత ఆమెకు పిచ్చి ఎక్కడంవల్ల వారు వేరు వేరుగా ఉండేవారు. 1947 లో ఆమె చనిపోయింది. జనవరి 1957 లో వేలరిఫ్లెచెర్‌ని ఆయన తిరిగి వివాహం చేసుకున్నాడు. జనవరి 4, 1965 లో తాను లండన్‌లో మరణించేవరకూ ఆమెతో ఆయన సుఖంగా దాంపత్య జీవనం గడిపాడు.

ఇ.నా.

**ఎవాల్డ్, యోహానెస్ (1743-1781) :** డెన్మార్క్ దేశపు మహాకవి, కోపెన్ హాగెన్ నగరంలో 1743 లో జన్మించాడు. ముప్పైఎనిమిది సంవత్సరాల అల్ప వయస్సులోనే గతించాడు. మృదు మధురమైన గీతికా రచనలో సిద్ధహస్తుడు. స్కాండినేవియన్ కథలు, గాథలు ఆధారంగా ఎన్నో గీతాలను రచించాడు. 1758 లో మత తత్త్వ శాస్త్రాన్ని అధ్యయనం చేస్తున్న సమయం లోనే కీర్తికాంక్షతో ఏడు సంవత్సరాల యుద్ధంలో పాల్గొనడానికి చదువుకు స్వస్తి చెప్పాడు. తిరిగి వచ్చిన తరువాత తాను ప్రేమించి తన కవిత్వంతో ఆరాధించిన ఆరెండ్సె అను యువతి మరొకరిని వివాహమాడిం దని తెలిసికొని నిరాశతో క్రుంగిపోయాడు. 19 సంవత్సరాల ప్రాయంలో విద్యాభ్యాసం పూర్తి చేసి మంచి వచన రచయితగా, కవిగా పేరు సంపాదించు కొన్నాడు. 1769 లో *ఆడమ్ ఓగ్ ఎవా* (Adam og Eva) అనే విషా దాంత నాటకాన్ని వ్రాసినాడు. దీని మీద ఫ్రెంచ్ ప్రభావం ఎక్కువ. జర్మన్ కవి ఫ్రీడ్రిఖ్ క్లోప్‌స్టాక్,

షేక్స్పియర్‌లు ఈయనను బాగా ప్రభావితుణ్ణి చేశారు. 1770 లో వ్రాసిన *రోల్ఫ్ క్రాగె* (Roelf Krage) లో వీరి ప్రభావం స్పష్టంగా కనిపిస్తుంది. మద్యపాన వ్యసనానికి గురి అయిన ఎవాల్డ్‌ని తల్లి మెలకువతో సంస్కరించి 'రంగ్‌స్టెడ్' పట్టణంలో ఏకాంత నివాసాన్ని ఏర్పాటు చేయడంతో ఎవాల్డ్ *రంగ్‌స్టెడ్స్ లిక్‌సాలిగ్ హెడెర్, బాల్డర్స్ డోడ్* అనే ఉత్తమ గ్రంథాలను రచింప గలిగాడు. తన జీవితాన్ని జ్ఞాపకాల రూపంలో *లెన్‌సెట్ బన్‌మేనింగెర్* అనే గ్రంథంగా రచించాడు. 1775 వ సంవత్సరంలో ఎల్సినోర్ నగరంలో ప్రశాంతంగా జీవించాలని వెళ్ళి అక్కడ రెండు సంవత్సరాలు గడిపాడు. ఆ కాలంలోనే ఆయనలో తాత్త్విక మైన ఆంతరంగిక సంఘర్షణ మొదలైంది. తీవ్రమైన అనారోగ్యానికి గురి అయి మరణశయ్యమీద ఉన్న ఎవాల్డ్ *ఉడ్‌రుస్ట్‌డిగ్, హెల్ట్‌ఫ్రాగొల్గాతా* అనే గొప్ప భక్తిగీతాన్ని రచించాడు. ఈ గీతం ఈయనకు డేనిష్ సాహిత్యంలో శాశ్వతస్థానాన్ని సంపాదించి పెట్టింది. ఆయన వ్రాసిన నాటకాలలో *ఫిస్‌కెర్నె* (1779) ఇప్పటికీ ప్రదర్శింప బడుతూంది. ఆయన మరణానంతరం ప్రచురింపబడిన ఆయన జీవిత జ్ఞాపకాలు గొప్ప వచన గ్రంథంగా పేరుపొందింది. *కొంగ్‌క్రిష్టియన్ స్టాడ్ వెడ్ హయెన్ మాస్ట్* అనే గీతం విస్తృత ప్రచారాన్ని పొందింది. దీన్ని జాతీయ గీతంగా ఆలపిస్తారు. ఆయన గీతాలు మరెన్నో ప్రజాదరణను పొందాయి. సంప్రదాయ ముద్ర స్పష్టంగా కనిపిస్తున్నా, తన సమకాలీన జీవితాన్ని ప్రతిబింబింప చేస్తూ సుకుమారమైన గీతాలను రచించి, డేనిష్ సాహిత్యానికి ఒక ప్రత్యేకతను సంతరించిన వాడు యోహనెస్ ఎవాల్డ్.

శ్రీ.ల.

**ఎవ్లిన్, జాన్ (1620-1706) :** ప్రముఖ బ్రిటిష్ రచయిత. ఇతడు సర్రే నివాసి అయిన రిచర్డ్ ఎవ్లిన్ రెండవ కుమారుడు. ఆక్స్‌ఫర్డ్‌లోని బల్లివోల్ కాలేజీలో విద్య నభ్యసించాడు. తరువాత యూరప్ ఖండమంతా విరివిగా సంచరించాడు. 1642 లో తిరిగి ఇంగ్లాండు చేరుకొని రాయలిస్ట్ వాలంటీరుగా పని చేశాడు. రాయలిస్ట్ ఉద్యమానికి అతడు సానుభూతి చూపిస్తున్నా అంత ర్యుద్ధంలో ఉత్సాహం చూపించక 1649 లో ఇంగ్లాండు వదలి వెళ్లిపోయాడు. అదే సంవత్సరంలో రాజైన మొదటి ఛార్లెసును ఉరితీయటం జరిగింది. ఆ యేడే అతడు *ఆఫ్ లిబర్టీ అండ్ సర్విట్యూడ్* అనే తన తొలి కృతిని ప్రచురించాడు. అది ఎఫ్ డిలా మోత్లెవాయే అనే ఫ్రెంచ్‌కవి వ్యాసాలకు ఆంగ్లానువాదం. విదేశంలో ఉన్నా ఎవెలిన్ ఇంగ్లాండుకు రాజైన రెండవ ఛార్లెస్‌తో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూ ఉండేవాడు. చివరకు 1652 లో ఇంగ్లాండు తిరిగి వచ్చాడు.

ఇంగ్లాండులో రాజరికం పునరుద్ధరింప బడ్డాక స్థాపించ బడిన రాయల్ సొసైటీ మొదటి తరం వారిలో ఎవ్లిన్ జాన్ కూడా ఒక ఫెలో 4 సంవత్సరాల తర్వాత పెపిస్ ఫెలోగా ఎన్నుకోబడ్డాడు. ఈ ఇద్దరూ స్నేహితులై ఇంగ్లీషు భాషలోని ప్రసిద్ధ 'దినచర్య' రచయితలుగా పేరు పొందారు. 1661 లో ఎవ్లిన్ లండన్ నగరంలో పెరిగి పోతున్న వాతావరణ కాలుష్యానికి పరిష్కారాలు సూచిస్తూ *ఫ్యూమిఫూజియం* అనే గ్రంథాన్ని రచించాడు. ప్రభుత్వం ఆ పరిష్కారమార్గాలు కొన్నిటిని చేపట్టి తర్వాత విరమించుకొంది. వేషధారణలో విదేశీమోజును నిరసిస్తూ, 1661 లోనే *టరానస్* లేక *ది మోడ్* అనే గ్రంథం ప్రచురించాడు. దారుశిల్పానికి సంబంధించిన *స్కల్‌ప్చురా* 1662 లో వెలువడింది. ఆ సమయంలో నౌకా దళానికి ఓడల కొరత ఏర్పడింది. నౌకా దళపు ఆఫీసు హెచ్చరికతో రాయల్‌సొసైటీ ఈ పనిని తనకు అప్పచెప్పగా ఎవ్లిన్ *సిల్వా* అనే గ్రంథం 1664 లో రచించాడు. ఇది వృక్షాలు నాటడానికి, వన సంరక్షణకు చెందిన ఉత్తమ గ్రంథం. మంచి ఫలితాలు ఇచ్చింది.



లండనులో సంభవించిన ప్లేగు, అగ్ని ప్రమాదాల సందర్భంలో పెపిస్‌తో కలిసి ఎవెలిన్ సత్వర సహాయక చర్యలలో చురుకుగా పాల్గొన్నాడు. అగ్నిప్రమాదం తర్వాత లండన్ పునర్నిర్మాణ విషయంలో అతని సూచనలు ఇతరుల సూచనలకంటె శ్రేష్ఠమైనవిగా భావించి అనుసరించడం జరిగింది. 1674 లో అతడు *నావిగేషన్ అండ్ కామర్సు* అనే రచనను ప్రచురించాడు. తన స్నేహితురాలైన మిసెస్ గోడాల్ఫిన్ ను గూర్చి అతడు వ్రాసిన స్మృతికావ్యం ప్రచురణ కాలేదు. ఫ్రెంచిభాష నుంచి అనేక గ్రంథాలను ఆయన అనువదించాడు. అవి

కాకుండా ద్రాక్షతోటలు, పతకాలు, పండ్ల షర్బత్తులు మొదలైన వాటిపై ఎన్నో వ్యాసాలు వ్రాశాడు. డెట్‌ఫోర్డ్‌లోని సెయస్‌కోర్ట్ లో ఉన్న అతని ఉద్యానవనం యాత్రాస్థలంగా మిక్కిలి ప్రసిద్ధి కెక్కింది. రాజ కుటుంబం కూడా దానిని సందర్శించారు.

ఆ తోట అతని జీవితంలో ఒక భాగమై పోయింది. కాలెండరు కాగితాలమీద ఎన్నో విషయాలమీద నోట్స్ వ్రాస్తూ 1660 నాటికి వాటిని అన్నిటినీ ఒక క్రమపద్ధతిలో కూర్చి *డైరీ* కావ్యంగా తయారు చేశాడు. పెపిస్ కూడా ఇలాగే కూర్చిన తన కావ్యానికి *కెలండరియమ్* అని పేరు పెట్టాడు.

ఎవ్లిన్ డైరీ 19 వ శతాబ్ది వరకు అజ్ఞాతంగా ఉండిపోయింది. తర్వాత లేడీ ఎవ్లిన్ దానిని ఒక బట్టల పెట్టెలో ఉండగా చూసి, *విలియమ్ బ్రే* సంపాదకత్వంలో దానిని రెండు సంపుటాలుగా ప్రచురించింది. అదే *ది మెమోయిర్స్ ఆఫ్ జాన్ ఎవ్లిన్* (1818). తర్వాత అది 1906 లో మూడు సంపుటాలుగాను, 1955 లో ఆరు సంపుటాలుగాను, 1959 లో ఒకే పెద్ద సంపుటంగాను పునర్ముద్రణ పొందింది. ఇంత తెలివైన రచయిత అయినా, అతని పాఠకలోకం చాలా పరిమితం కావడం చిత్రం!

జె.సూ.ప్ర.

**ఎస్ప్రోన్‌సేడా-ఇ-డెయ్‌గాడో, హోసే డి (1808-42) :** స్పానిష్ కాల్పనిక కవి, విప్లవ యోధుడు. 'స్పానిష్ లార్డ్ బైరన్' అని ప్రసిద్ధి పొందినవాడు.

తన విప్లవాత్మక కార్యక్రమాల వల్ల 1826 లో ఎస్ప్రోన్ సేడా స్పెయిన్‌దేశం వదలి పారిపోయాడు. లండన్‌లో తెరిసా మంచా అనే ఆమెతో గాలిదుమారం వంటి తీవ్రమైన ప్రేమకలాపంలో చిక్కుకున్నాడు. తరువాత పదేళ్ల పాటు అతని జీవితం మీద దాని ప్రభావం కనిపించింది (*కాంటో ఎ తెరిస్సా* లో ఇతివృత్తం అదే). ఫ్రాన్స్‌లోని జూలై విప్లవం (1830) లో అతడు పాల్గొన్నాడు. అనంతరం స్పెయిన్‌కి తిరిగి రావడానికి అతనికి అనుమతి లభించింది. విప్లవాత్మక కార్యకలాపాల కారణంగా అనేక పర్యాయాలు స్పెయిన్‌లో అతడు కారాగార వాసానికి గురి అయాడు. చరిత్రాత్మక నవల *శాంఛో సల్దానా* (1834) 'బడజోస్' జైలులో ఉన్న కాలంలోనే అతడు వ్రాశాడు. 'సాలమంకా విద్యార్థి' (1839) అనే రచన ఐబీరియన్ కాల్పనికోద్యమంలో ఒక మైలు రాయి వంటిది. *డాన్ జువాన్* గాథ వంటి ఆ కథలో నాయకుని సంఘ విద్రోహ, మతవిద్రోహ చర్యలు పరాకాష్ఠ నందుకొంటాయి. *పాయెసియాస్* (1840) అనే రచన మీద లార్డ్ బైరన్ ప్రభావం, సర్ వాల్టర్ స్కాట్ ప్రభావం ఎక్కువగా కనిపిస్తాయి. అతని అసంపూర్ణకావ్యం 'దౌర్భాగ్యపు జగత్తు' (The Devilish world) లో తాత్త్విక వివేచన ఎక్కువగా కనిపిస్తుంది. అతని ఉత్తమ రచనలలో ఒకటిగా అది పరిగణించబడుతూంది. హేగ్ లోని రాయబారి కార్యాలయంలో కార్యదర్శిగాను, స్పానిష్ పార్లమెంటు (The cortes) లో ఆల్మీరియా నుంచి ఎన్నికైన ప్రతినిధి గాను (1842) ఎస్ప్రోన్ సేడా పనిచేశాడు. సెయింట్ సైమన్ ప్రభావం ఎక్కువగా కనిపించే ఆయన రాజనీతి రచనలలో *ఎల్ మిస్టీరియోసో మెండిజాబాల్* (1836) ఒకటి. 'మామా కాదు, అల్లుడూ కాదు' (1834 - Neither The Uncle Nor The Nephew), 'ప్రేమ తనమీద దాడులకు పగతీర్చుకుంటుంది?' (1838) వంటి పలు నాటకాలు కూడా ఎస్ప్రోన్ సేడా రచించాడు.

1842 మే 23 న మాడ్రిడ్ నగరంలో ఎస్ప్రోన్ సేడా అకాల మరణం పొందాడు.

*బొ. శ్రీ.*

**ఎహ్రెన్‌బర్గ్, ఇల్యా గ్రిగోరీవిచ్ (1891-1967) :** ప్రముఖ రష్యన్ రచయిత. 1891 వ సంవత్సరంలో కీవ్ నగరంలో ఒక మధ్య తరగతి యూదు కుటుంబంలో ఈయన జన్మించాడు. 1909 లో పారిస్ నగరానికి వలస వెళ్లి ఇరవై సంవత్సరాలు అక్కడ గడిపాడు. ఆ కాలంలోనే మాస్కో నగరానికి తరచు వెళ్లేవాడు. రష్యన్ వార్తా పత్రికలకు విలేఖకుడుగా కూడా ఉండేవాడు. ఇరవయ్యో శతాబ్దపు రెండవ దశకంలో వస్తున్న మార్పులూ, మారుతున్న ప్రపంచం ఈయనకు అంతగా రుచించలేదు. తన భావాలను 'ది ఎక్స్‌ట్రా-ఆర్డినరీ ఎడ్వంచర్స్ ఆఫ్ జులియో జురెనిటో' (1922) అనే నవలలో విస్పష్టం చేశాడు. సోవియెట్ రష్యా, తదితర యూరప్ దేశాలు పాటిస్తున్న విలువలను వ్యంగ్యంగా విమర్శించడం ఈ నవలలో ప్రధానంగా కనిపిస్తుంది. 1930 వ సంవత్సరంలో ఈయన సోవియెట్ రష్యాలో స్థిరపడ్డాడు. స్టాలినిజానికి బాసటగా ఉండి కళల విషయంలో ప్రభుత్వ నీతికి చేయూత నిచ్చాడు. స్టాలిన్ మరణానంతరం భావ ప్రకటనా స్వాతంత్ర్యం (ప్రభుత్వం విధించిన పరిధులలో) కావాలని ఎహ్రెన్‌బర్గ్ ఆందోళన చేశాడు. ప్రభుత్వ దమననీతి వలన దురవస్థల పాలైన రచయితలకు తగినంత సహాయం కూడా చేశాడు.

పాత్రికేయుడుగా, నవలా రచయితగా ఎ్రెహెన్‌బర్గ్ సుప్రసిద్ధుడు. రెండు ప్రపంచ యుద్ధాలను, శ్వానిష్ అంత ర్యుద్ధాన్ని యూరప్-అమెరికా దేశాల ప్రజా జీవనాన్నీ తన నవలలలో ఈయన ప్రతిబింబింప జేశాడు. 1930-1950 మధ్య కాలంలో వ్రాసిన నవలలలో పాశ్చాత్య జీవనాన్ని బాగా అర్థం చేసికొని (తన బోల్షవిక్ దృక్పథాన్ని అడ్డు రానీయక తగినంత ఔదార్యంతో) చిత్రీకరించాడు. సోవి యట్ రచయితలలో అందరికంటె ఎక్కువగా పాశ్చాత్య జీవనాన్ని అర్థం చేసికొన్న రచయితగా ఎ్రెహెన్‌బర్గ్ గుర్తింపు పొందాడు.

శ్రీ.ల.

**ఒపిట్జ్, మార్టిన్ (1597-1639) :** జర్మన్ కవి, సాహితీ సిద్ధాంత ప్రవక్త. 1597 వ సంవత్సరంలో సైలీషియా ప్రాంతానికి చెందిన బున్జ్ లావ్ పట్టణంలో ఈయన జన్మించాడు. హైడెల్‌బర్గ్ విశ్వ విద్యాలయంలో అధ్యయనం చేశాడు. ఆ నాటి జర్మన్ యువకవుల సముదాయానికి కేంద్రస్థానీయుడుగా ఉండేవాడు. 30 సంవత్సరాల యుద్ధాన్ని తప్పించుకోడానికి 1620 లో హాలండ్ దేశానికి పారిపోయి, డచ్చి కవి, భాషా తత్త్వ వేత్త అయిన డేనియల్ హైన్సియస్ ప్రభావానికి లోనయాడు. తరువాత సైలీషియాకు వెళ్ళి కొంత కాలం అధ్యాపక పదవిని నిర్వహించాడు. 1625 లో పొయెట్ లారియేట్ గౌరవాన్ని పొందాడు. 1627 లో రెండవ ఫెర్డినాండ్ చక్రవర్తిచే 'ప్రభు' బిరుదాన్ని పొందాడు. 1626 నుండి ఆరు సంవత్సరాల పాటు 'దోహ్నా' ప్రభువుకు కార్యదర్శిగా పనిచేశాడు. ఆ కాలంలోనే పారిస్ వెళ్ళవలసి రాగా, ఆయనకు హుగో గ్రోటియస్‌తో పరిచయం ఏర్పడింది. పోలండ్‌కు చెందిన నాల్గవ లాడిస్ లాస్ రాజుకు కార్యదర్శిగాను చారిత్రకుడుగాను పనిచేశాడు.

20 ఏళ్ల వయస్సులోనే ఓపిట్జ్ జర్మన్ భాషా సంస్కారాన్ని కోరుతూ *అరిస్టార్కస్* అనే గ్రంథాన్ని వ్రాశాడు. జర్మన్ భాషాశైలినీ, లయనూ గూర్చి కొన్ని నియమాలను నిర్దేశిస్తూ 1624 లో *బుక్ ఫోన్‌దెర్ డొయిచ్‌శ్రెన్ పొయిటెరై* అనే గ్రంథాన్ని వ్రాశాడు. దీనికి మంచి ప్రచారం వచ్చింది. మాత్రాగణాలను కాకుండా ఊనికను ఆశ్రయించిన ఛందః ప్రణాళికను రూపొం దించి, 17 వ శతాబ్దం జర్మన్ కవిత్వ పునర్వికాసానికి తోడ్పడ్డాడు. తరువాత ఒట్టావియో రినక్సినీ వ్రాసిన *డాఫ్నే* అనే నాటకాన్ని జర్మన్‌లోకి భాషాంతరీకరణం చేశాడు. ఇది జర్మన్ భాషలో మొదటి *ఓపెరా* (యక్షగానం లాంటిది). *జ్లట్నా* అనే ఇతిహాస కావ్యాన్ని 1623 లో వ్రాశాడు. *ట్రాస్ట్ గెడిష్టే ఇన్ విదర్ వర్టిగ్ కైట్ డెస్ క్రెగెస్* (1633), *టొయిట్షె పొయెమాటా* (1624), *షె ఫెరఫోన్‌డెర్ నిమ్ ఫెన్ హెర్సినియా* (1630) మొదలైన గ్రంథాలను రచించాడు. తన కాలంనాటి సాహిత్య వైవిధ్యాన్నంతా సంపూర్ణంగా ఆకళించుకున్న విద్వాంసుడుగా పేరు పొందాడు. ఒపిట్జ్ గొప్ప కవి కాకపోయినా, గొప్ప వైదుష్యం కలవాడు.

శ్రీ.ల.

**ఓకారా, గాబ్రియల్ (1921) :** నైజీరియన్ (ఆఫ్రి కన్) రచయిత. నైజీరియాలోని ఇజా ప్రాంతంలో 1921 వ సంవత్సరంలో ఈయన జన్మించాడు. కవిగా, నవలా రచయితగా సుప్రసిద్ధుడు. ఆఫ్రికాకు చెందిన ప్రాథమిక సమస్యల నన్నింటినీ కూలంకషంగా తెలిసికొన్న రచ యిత. 1960 నాటికే ఈయన కవిత్వం దేశ మంతటా బాగా ప్రచార మైంది. అప్పటికే ప్రపంచంలోని వివిధ భాషలలోనికి ఈయన కవిత్వం అనువదింపబడింది. 1944 లో *ది వాయిస్* (కంఠస్వరం) అనే నవలను ప్రచురిం చాడు. ఇంగ్లీష్ భాషను తన సృజనాత్మక ప్రయోగాలకు సరిపోయేట్టుగా స్వతంత్రంగా ప్రయోగించిన తీరు ఈ నవలలో స్పష్టంగా గోచరిస్తుంది. తన మాతృభాష అయిన ఇజా వాక్య విన్యాసానికి సరిపడే విధంగా ఇంగ్లీష్ భాషను మలచి ఒక విశిష్టమైన సాహిత్య ప్రక్రియకు ఈయన నాంది పలికాడు. ఈ పద్ధతి అందంగానూ, ఆకర్షకంగానూ ఉంటుంది.

స్వయంకృషితో విద్యనార్జించిన ఓకారా ప్రాథమిక పాఠశాలలో తన చదువు పూర్తి కాగానే పుస్తకాల బైండర్‌గా వృత్తిని ప్రారంభించాడు. తరువాత కొద్ది కాలం లోనే రేడియో ప్రసారాలకై నాటికలను, గల్పికలను వ్రాయడం మొదలుపెట్టాడు. *నన్ నది పిలుపు* అనే కవితను 1953 లో ప్రచురించాడు. దానికి నైజీరియన్ కళా ఉత్సవం పురస్కారం లభించింది. 1960 నాటికి ఓకారా సుప్రసిద్ధ కావ్య శిల్పిగా గుర్తింపబడ్డాడు.

భిన్నమైన, పరస్పర విరుద్ధమైన ప్రతీకలకు సామ రస్యం కల్పిస్తూ తన కవిత్వంలో ఒక క్రొత్త శక్తిని ఆయన ప్రవేశ పెట్టాడు. సామూహిక గేయ మార్దవం ఆయన కవిత్వంలో పుష్కలంగా ఉంటుంది. జీవితంలోని ఒడు దొడుకులనూ, వాస్తవాన్నీ, ఆనందాన్నీ తన కవిత్వంలో ఆవిష్కరిస్తూ వాస్తవ జగత్తును అతిక్రమిం చకుండా ఉండటం ఆయన ప్రత్యేక లక్షణం. చావు బ్రతుకుల సమస్య ఆయన కవిత్వంలో తరచుగా చోటు చేసుకుంటుంది. పద్యమైనా, గద్యమైనా *ఓకారా* రచనలో

ఆఫ్రికా భావాలు, మతం, జానపద కథలు, గాథలు, కల్పనలు సమృద్ధిగా ఉంటాయి. తన భాషలోని నుడికారం, లయ, పదవిన్యాసం సంపూర్ణంగా ఇంగ్లీష్ భాషలో ప్రతిధ్వనించే విధంగా ఆయన రచన చేస్తాడు.

*ది వాయిస్* (కంఠ స్వరం) అపూర్వమైన రచన. దీనిలో పద్యం, గద్యం కలిసిపోతూ ఉంటాయి. వర్తమాన మానవ జీవిత సమస్యలను ఈ కావ్యం లోతుగా పరిశీలిస్తుంది. చీకటి, వెలుగు, భౌతికవాదం, ఆదర్శవాదం మొదలైన పరస్పర వైరుధ్యాలు పోటీపడే సన్నివేశాలను సృష్టించి ఒక విచిత్రమైన భూమికను ప్రతీకగా పరిచయం చేస్తాడు. ఈ నవలలో ఒకోలో నాయకుడు. వ్యక్తిగా విశ్వ జనీన మానవ ప్రతీకగా ఒక ఆదర్శాన్ని అన్వేషిస్తాడు. మానవ జీవితంలోని నైతిక విలువలకు, ఆదర్శవాదానికి ప్రత్యేక వ్యాఖ్యానంగా ఈ అన్వేషణ స్ఫురిస్తుంది. ఈ నవల విషాదాంతమైనా, జీవితాన్ని పరిశీలించిన తీరు మెచ్చుకోదగింది. ఇతర నైజీరియన్ నవలా కారులు నీరస పాత్రలను ప్రవేశ పెట్టి తృప్తి చెందితే, ఓకారా తన నవలలో జీవితంలోని అంతరంగ సంఘర్షణను గొప్పగా చిత్రించాడు.

ఓకారా తూర్పు నైజీరియా ప్రభుత్వానికి సమాచార శాఖాధికారిగా పనిచేశాడు. చినువా అచెబె, సైప్రియాన్ ఎక్వెన్సీలతో కలిసి 1969 లో అమెరికాను సందర్శించి అక్కడి విశ్వవిద్యాలయాలలో ఓకారా ఉపన్యసించాడు.

శ్రీ.ల.

**ఓకేసీ, షాన్ (1880-1964) :** ప్రముఖ ఆంగ్ల నాటక రచయిత. ఓకేసీ షాన్‌కి మరోపేరు 'షాన్ ఒ-కథాసీ'. ఇతడు డబ్లిన్ లోని ఒకపెద్ద ప్రొటెస్టెంటు కుటుంబంలో కడగొట్టు సుతుడుగా జన్మించాడు. చిన్నప్పటినుంచి కంటిచూపు సరిగా లేకపోవడంతో ప్రాథమిక విద్యకంటె ఎక్కువ చదవడానికి నోచుకోలేదు. 13 ఏళ్లు వచ్చినప్పటి నుండి తన చేతికి దొరకిన ప్రతి రచనా క్షుణ్ణంగా చదివేసేవాడు. జీవితం పూర్వార్ధంలో రోడ్డుమీది శ్రామికుడుగా జీవన పోరాటం సాగించాడు. తర్వాత గేలిక్ భాష నేర్చు కున్నాడు. త్వరలోనే ట్రేడ్‌యూనియనిస్ట్ అయి, 1914 లో ఐరిష్ సిటిజన్ ఆర్మీ కార్యకలాపాలకు సహాయపడ్డాడు. 1916 లో ఈస్టర్ రైజింగ్ లో పాల్గొని మూడు నాటకాలు వ్రాశాడు. కాని, వాటిని ఆబే థియేటర్ స్వీకరించలేదు. *ది షాడో ఆఫ్ ఏ గన్‌మాన్* మాత్రం 1923 ఏప్రిల్‌లో ప్రదర్శింపబడింది. ఆ నాటకం నగర జీవనం గడిపే పేదల జీవితాలలో కనపడే తాత్కాలిక సన్నివేశాలు చక్కని నాటకీయతతో చిత్రించింది అవడంవలన ఓకేసీకి పేరు ప్రఖ్యాతులు వచ్చాయి. వెంటనే 1923 అక్టోబరులో *కెథలీన్ లిజన్స్ ఇన్* అనే ఏకాంకిక, 1924 మార్చిలో *జూనో అండ్ ది పీకాక్* ప్రదర్శించ బడ్డాయి. ఈ *జూనో* 1925 లండన్‌లో కూడ ప్రదర్శింపబడి, అఖండవిజయం పొందడమే కాక, 20 వ శతాబ్ది ఇంగ్లీషు నాటక రంగంలో ముఖ్య రచనలలో ఒకటిగా ప్రసిద్ధి పొందింది.

1926 ఫిబ్రవరిలో మరో ప్రసిద్ధ నాటకం *ది ప్లౌ అండ్ ది స్టార్స్* ఆబే థియేటరులో ప్రదర్శింపబడి సంచలనం రేకెత్తించింది. 20 ఏళ్ల క్రితం సింగె (Synge) కామిక్ వ్యంగ్యనాటకాల కంటె ఓకేసీ ట్రాజిక్ వ్యంగ్య నాటకాలే ప్రజలను ఎక్కువగా ఆకట్టు కొన్నాయి. దానితో ఉత్తేజం పొందిన ఓకేసీ లండన్ వెళ్లి శేషజీవితం అక్కడే గడిపాడు.

ఓకేసీ నాటకాలు ఐర్లాండు థియేటరు చరిత్రలో ఒక కొత్త మలుపు తెచ్చాయి. తమ నికృష్ట జీవితాలను ప్రతిబింబింప చేసే ఓకేసీ ట్రాజిక్ నాటకాలు కృత్రిమ జీవనాన్ని చిత్రించే ఇతరుల కామెడీల కంటె ఐరిష్ ప్రజలకు ప్రీతిపాత్రా లయాయి. ఓకేసీ పాత్రల సంభాషణలలో కృతకమైన కవితా ధోరణి కాక వాస్తవ జీవితాలను చిత్రించే మాండలిక భాష తొణికిసలాడటం ఒక విశేషం. అతని పాత్ర చిత్రణ కూడా నిర్దుష్టంగాను, ఉదాత్తంగాను ఉంటుంది. అతని మూడు నాటకాలలోను ఐరిష్ ప్రజల కడగండ్లు మూడు భంగిమలలో మనకు కళ్లకు కట్టినట్లు కనిపిస్తాయి. *ది ప్లౌ అండ్ ది స్టార్స్* లో ఇతివృత్తం ఈస్టర్ రైజింగ్‌కి సంబంధించింది. *ది షాడో ఆఫ్ ఏ గన్ మాన్* లో బ్రిటిష్ సేనల చేతిలో ఐరిష్ గెరిల్లాల అణచివేత ఇతివృత్తం కాగా, *జూనో అండ్ ది పీకాక్* లో అంతర్యుద్ధం ఇతివృత్తంగా కనిపిస్తుంది. దానిలో పీకాక్ అయిన జాక్ బోయిల్ పాత్రను నిర్వహించడం నటులకు చాలా కష్టసాధ్యం అవటంతో ఆ నాటకం మళ్లీ మళ్లీ ప్రదర్శించబడలేదు. మూడింటిలోనూ *ది ప్లౌ అండ్ ది స్టార్స్* శ్రేష్ఠమైంది. ఈ మూడు నాటకాలూ అతని కీర్తి పతాకాన్ని ఎగురవేశాయి.

1928 లో ఓకేసీ కొత్త నాటకం *ది సిల్వర్ టాసి* ని అబే థియేటర్ ప్రదర్శించకుండా యీట్స్ (Yeats) అడ్డు పడటంతో ఇద్దరి మధ్య చోటు చేసుకున్న స్పర్థ కొన్ని దశాబ్దాలపాటు కొనసాగింది. యుద్ధ వ్యతిరేకతను చిత్రించే ఈ ట్రాజి-కామెడీ 1929 లో లండన్‌లో ప్రదర్శించబడి, ప్రజాదరణ పొందింది. ఆ తర్వాత ఓకేసీ 1934 లో *విత్ ఇన్ ది గేట్స్*, 1940 లో

ద స్టార్ టరెన్స్ రెడ్ (The Star Turns Red) వ్రాసి లండన్‌లో ప్రదర్శింపజేశాడు. 1943 లో వ్రాసిన రెడ్ రోజెస్ ఫర్ మి డబ్లిన్‌లోని ఒలింపిలా థియేటర్‌లో ప్రదర్శించబడింది. ఓకేసీ తర్వాతి రచనలలో ఐరిష్ మాండలికంలో జీవిత చిత్రణం బదులు లండన్ ప్రామాణిక భాష కనిపిస్తుంది. 1943 లో పర్‌పుల్ డస్ట్, 1947 లో ఓక్ లీవ్స్ అండ్ లవండర్, 1949 లో కాక్-ఎ- డూడిల్ డాండీ 1955 లో బిషప్స్ బోన్‌ఫైర్ (Bishops Bonfire), 1958 లో ది డమ్స్ ఆఫ్ ఫాదర్ నెడ్ లు వెలువడ్డాయి. చివరిది మతాధికారుల ఆగ్రహానికి అతనిని గురిచేసింది.

ఓకేసీ తర్వాతి రచనలు అంత ప్రముఖమైనవి కాక పోయినా అతని స్వీయచరిత్రలోని సంపుటాలు, ఐ నో ఆన్ ది డోర్ (1939), పిక్చర్స్ ఇన్ ది హాల్‌వే (1942), డమ్స్ అండర్ ది విండోస్ (1945), ఇన్నిష్ ఫాలెన్ ఫేర్ ది వెల్ (1949) రోజ్ అండ్ క్రౌన్ (1952); సన్ సెట్ అండ్ ఈవెనింగ్ స్టార్ (1954) వంటి రచనలలో కూడా అతని ప్రతిభ వెల్లడి అవుతూంది.

జె.మూ.ప్ర.

**ఓనీల్, యూజీన్ (1888-1953) :** ప్రముఖ అమెరికన్ నాటక రచయిత. సాహిత్యానికి 1936 వ సంవత్సరపు నోబెల్ బహుమతి గ్రహీత. నిజ జీవితమే ఒక విషాద కావ్యంగా పర్యవసించి, ఓనీల్ అనేక విషాదాంత నాటకాలను సృష్టించి యుగపురుషుడుగా ప్రసిద్ధి కెక్కాడు. అ వ్యక్తుల, బాధాసర్ప దష్టుల, అభిశప్తుల, విధివంచితుల నిరాశామయ జీవితాలను సృష్టి రహస్యానికి ప్రతీకలుగా రూపొందించి మానవ వ్యక్తిత్వపు అంతర్యపు లోతుల్లో చెలరేగే మానసిక సంఘర్షణలను, నిర్వేద వైక్లబ్యాలను ప్రధానభూమికగా స్వీకరించి నాటక ప్రక్రియను ప్రభావశాలియైన మనో విశ్లేషణాత్మక సాధనంగా ఓనీల్ నెలకొల్పాడు. వేద్ కింద్, హాప్ట్‌మన్, కైసర్, ఇబ్సెన్, స్ట్రిండ్‌బర్గ్ మొదలైన ప్రఖ్యాత యూరపియన్ నాటక రచయితల అడుగు జాడలలో వినూత్నమైన శిల్ప సంవిధానాలను ప్రయోగించి అమెరికన్ నాటకరంగంలో నూతన చైతన్యం కల్పించాడు.



వాస్తవికతోద్యమాన్ని కేంద్రబిందువుగా స్వీకరించి చిత్తవృత్తి చిత్రీకరణ, సాంకేతిక రూపాంతరీకరణ వైవిధ్య సాధనాలుగా అనుసంధించి ఓనీల్ నాటక పరిధులను విస్తృతపరచాడు. పరిధానాలు, ప్రహేళికలు, స్వగతాలు, నవలా కథా కథనం, స్వాప్నిక మూర్ఛనలు, రంగస్థల విన్యాసాలు మొదలైన అనేకానేక నూత్న ప్రయోగాలు చేసి సృజనశీలమైన దృశ్యకావ్య నిర్మాణం చేశాడు. 1920-30 దశాబ్దంలో బియాండ్ ది హారైజన్, ది ఎంపరర్ జోన్స్ (1920), ది హెయిరీ ఏప్ (1922), ది గ్రేట్ గాడ్ బ్రౌన్ (1926), డిసైర్ అండర్ ది ఎల్మ్స్ (1924) మొదలైన శక్తిమంతమైన నాటకాలను ప్రదర్శింపజేశాడు. ఆ తరువాత గ్రీకు విషాదాంత నాటకాలకు మూలమైన నియతి సిద్ధాంతాన్ని, ఫ్రాయిడ్ మనోవిజ్ఞాన సూత్రాలను అమెరికా చారిత్రక పరిణామానికి అనుసంధించి మోర్నింగ్ బికమ్స్ ఎలెక్ట్రా (1930), స్ట్రేంజ్ ఇంటర్లూడ్ (1928) మొదలైన బృహద్రూపకాలను సృష్టించాడు.

ఆపై దాదాపు దశాబ్దం పాటు మౌనం వహించి, రెండవ ప్రపంచ యుద్ధానంతర కాలంలో ది ఐస్‌మాన్ కమెత్ (1946), లాంగ్‌డేస్ జర్నీ ఇంటూ ది నైట్ (1955) మొదలైన పశ్చాత్తాప పరితప్తమైన సంచలనాత్మకమైన నాటకాలను ప్రచురించాడు. అమెరికా భౌతిక సభ్యతా పరిణామ క్రమంలో ప్రకోపించిన ప్రతీప శక్తుల ద్వారా సంభవించిన మానవాదర్శాల పతనావస్థను చిత్రించే ఏ టేల్ ఆఫ్ ది పొసెసర్స్ సెల్ఫ్ డిస్పొసెస్డ్ అనే 11 చారిత్రక నాటక పరంపరలను రచించి, వాటి ప్రతులను అనారోగ్య కారణంగా కాల్చి నాశనం చేశాడు. మొత్తం మీద అమెరికాలో నాటకోద్యమ వికాసానికి ముఖ్య సూత్రధారుడు ఓనీల్. అతని ప్రభావంతో చొరవ, వ్యుత్పన్నత, పరిణతి సంపాదించుకొన్న అమెరికన్ నాటక సాహిత్యం టెన్నెసీ విలియమ్స్, ఆర్థర్ మిల్లర్, ఎడ్వర్డ్ ఆల్బీ మొదలైన రచయితల కృతుల ద్వారా మరింత సంపన్నమై విశ్వవిఖ్యాతి గడించింది.

డి.వి.కె.రా.

**ఓనెట్టీ, యువాన్ కార్లోస్ (1909) :** 1963 లో ఉరాగ్వే జాతీయ, సాహిత్య బహుమతిని గెలుచుకొన్న నవలాకారుడు, కథానికా రచయిత. ఓనెట్టి లా విడా బ్రెవె (1950), ఏ బ్రీఫ్ లైఫ్ వంటి గ్రంథాలను

ప్రచురించాడు. బోనస్ ఏర్స్ లోని విశ్వవిద్యాలయంలో ఉన్నత విద్య నభ్యసించాడు. ఓనెట్టి రచనా వ్యాసంగం చేపట్టకముందు ఎన్నో ఉద్యోగాలు చేశాడు. 1930 లో ఉరాగ్వే జాతీయ రంగంలో ఉండే ఉద్యోగస్వామ్య విధానాన్ని 1939 లో రచించిన తన మొదటి నవల *ఎల్ పోజో* లో చిత్రించాడు. నగరంలో ప్రవేశించిన ఒక వ్యక్తి అగమ్య గోచరంగా ఎవ్వరితోనూ భావ వినిమయం చేయలేకపోవడం ఇందులోని ఇతివృత్తం.

1943 లో 'బోనెస్ ఏర్స్' ను చేరిన ఓనెట్టి రాయిటర్ న్యూస్ ఏజన్సీ రిపోర్టర్‌గాను, ఎన్నో ప్రచురణలకు జర్నలిస్టుగాను శ్రమించి, 1955 వరకు అక్కడే ఉన్నాడు. 1942 లో వెలువరించిన *టెర్రా దీ నాడియే* (ఎవరికీ చెందని భూమి) నవలలో పారిమార్థికత లేని నగరజీవనాన్ని నిహిలిస్టు దృక్పథంతో చిత్రించాడు.

సాంటామేరియా అనే కాల్పనిక నగరాన్ని *లావిడా బ్రెవె* లో సృష్టించాడు. ఇదే నగరం తరువాత వ్రాసిన రచనలలో కూడా కనిపిస్తూ ఉంటుంది. ప్రాచీన సంప్రదాయాన్ని, ప్రశాంతతను అనుభవించేందుకు వీలుగా ఒక వ్యక్తి మరో వ్యక్తిగా జీవించే యత్నం చేస్తాడు. 1940 లో రచించిన కథాగుచ్ఛం *అన్‌సూయినో రియలైజడో యూ అత్రోస్ కుయెంటోస్* (ఫలించిన కల, ఇతర కథలు) 1951 లో ప్రచురిత మయింది.

1955 లో మాంటె విడియోకు తిరిగివచ్చిన అనంతరం రెండేళ్లకు మునిసిపల్ గ్రంథాలయాలకు డైరెక్టరు అయ్యాడు. ఉరాగ్వేలోని రాజకీయార్థిక పరిస్థితులను, ఉద్యోగ స్వామ్యాన్ని *ఎల్ అస్టిల్లెరో* (1961), *ది షిప్ యార్డ్* (1968) లలో ప్రతిబింబింప జేశాడు. *జుంటా కడావెరెస్* (1964, శవ సంయోగం) లో వ్యభిచారాన్ని, అమాయికత్వాన్ని ఇతివృత్తంగా మలచాడు. 1970 లో *ఓబ్రాస్ కంప్లీటస్* (సంపూర్ణ రచనలు), 1973 లో *లాము రెటి ఉలానినా* (మృత్యువు, లఘుకన్యక) అనే నవల, కు *యెటో కంప్లీటస్* (సంపూర్ణ కథలు) 1974 లోను, *టీంపోడె అబ్రాజర్* (1974, భవిష్యత్ సమయం) అన్న రచనలు వెలువడ్డాయి. 1939 నుంచి 1968 దాకా రచించిన వ్యాసాలూ, సాహిత్య, రాజకీయ గల్పికలు, *రీక్వైయ్‌ఫర్ ఫాక్‌నర్* (1975) లో సంపుటిగా వెలువడ్డాయి.

*గు.శం.*

**ఓమర్ ఖయ్యామ్ (1048-1122) :** *రుబాయత్* లనబడే తన ముక్తక పద్యాల ద్వారా ప్రపంచ విఖ్యాతి పొందిన అరబిక్ మహాకవి; గణిత, ఖగోళ శాస్త్రవేత్త.

అరబిక్ భాషలో ఓమర్ ఖయ్యామ్ పూర్తి పేరు "అల్ఫత్ ఉమర్ ఇబ్న్ ఇబ్రహీమ్ అల్ ఖయ్యామీ అన్ నైషాబురీ". 1048 మే 18 వ తేదీన ఓమర్‌ఖయ్యామ్ నేటి ఇరాన్‌లోని నైషాపూర్ పట్టణంలో జన్మించాడు. 'ఖయ్యామ్' అనే అరబిక్ మాటకు అర్థం 'డేరాలు తయారు చేసే వాడు' అని. బహుశః తన తండ్రి వృత్తి వల్ల ఓమర్ ఖయ్యామ్‌కు ఆ ఉపనామం ఏర్పడి ఉండవచ్చును. చిన్నతనంలో నైషాపూర్ లోనే వివిధ శాస్త్రాలలోను, తత్త్వశాస్త్రం లోను ఖయ్యామ్ చక్కని శిక్షణ పొందాడు. కొంత కాలం బాల్ఖ్‌లో కూడా అతడు విద్యాభ్యాసం చేశాడు. అనంతరం సామర్‌ఖండ్ వెళ్లాడు. అక్కడ ఉండగానే బీజ గణితానికి సంబంధించిన ఒక ఉద్గ్రంథ రచనను ఆయన పూర్తిచేశాడు. శాస్త్ర వేత్తగా సంపాదించిన పేరు ప్రతిష్ఠల వలన సెల్జుక్ సుల్తాన్ మాలిక్ షా పంచాంగం పరిష్కరణకు అవసరమైన ఖగోళ శాస్త్రీయ పరిశీలనలను కొనసాగించడం కోసం ఆయనను తన ఆస్థానానికి ఆహ్వానించాడు. ఇస్ఫహాన్ నగరంలో ఒక వేధశాల (Observatory) ను ఇతర ఖగోళశాస్త్రవేత్తల సహకారంతో నిర్మింపచేసే బాధ్యతను కూడా ఆయనకు ఒప్పచెప్పాడు. 1092 లో ఆయనకు ఆశ్రయ మిచ్చిన ప్రభువు మరణించడంతో ఓమర్ ఖయ్యామ్ మక్కా యాత్రకు బయలుదేరాడు. అక్కడ నుంచి నైషాపూర్ తిరిగివచ్చి, విద్యార్థులకు పాఠాలు చెపుతూ, అప్ప డప్పుడు ఆస్థానంలో జ్యోతిష్యం చెబుతూ కాలక్షేపం చేశాడు. తత్త్వశాస్త్రం, ధర్మశాస్త్రం, చరిత్ర, గణితశాస్త్రం, వైద్యం, ఖగోళశాస్త్రం మొదలైన అనేక శాస్త్రాలలో ప్రామాణికమైన పాండిత్యం ఆయన సంపాదించాడు. దురదృష్టవశాత్తు ఆయన వచనరచనలలో కొద్ది భాగమే మిగిలాయి. వాటిలో తత్త్వశాస్త్రానికి సంబంధించిన ఒక సంక్షిప్తరచన, *యూక్లిడ్* మీది వ్యాఖ్యానం చెప్పుకోదగినవి.

ఆంగ్ల కవి ఎడ్వర్డ్ ఫిడ్జ్ గెరాల్డ్ ఓమర్ ఖయ్యామ్ వ్రాసిన చతుష్పాది పద్యాలను ఆంగ్లంలోకి స్వేచ్ఛగా అనువదించి, వాటిని ఒక క్రమంలో అమర్చి చక్కని విలాప కావ్య రూపంలో ప్రచురించడంతో ఓమర్ ఖయ్యామ్ కు ప్రపంచ విఖ్యాతి వచ్చింది. ఇంగ్లీష్‌లో నుంచి అతని *రుబాయత్* లు ప్రపంచంలోని వివిధ భాషలలోకి అనూదితాలు అయాయి. తెలుగులో శ్రీ దువ్వూరి రామిరెడ్డి ఆంగ్లమూలాన్నే కాక అరబిక్ మూలాన్ని కూడా సంప్రదించి, పానశాల అనే పేరుతో

ఓమర్ ఖయ్యామ్ *రుబాయత్* లను అనువదించి ప్రకటించాడు.

ఫిడ్జ్ గెరాల్డ్ అనువాదం వెలువడేవరకూ అరబిక్ విద్వాంసులకు ఓమర్ ఖయ్యామ్ రుబాయత్‌లను వ్రాసిన సంగతే తెలియదు. ఆయన సమకాలికులు ఆయన కవితా రచనలను పట్టించుకోలేదు. సుమారు రెండు శతాబ్దాల తరువాత ఆయన అరబిక్ రుబాయత్‌లు గ్రంథరూపంలో వచ్చాయి. ఏ. జె. ఆర్‌బెరీ 13 వ శతాబ్దం నాటి వ్రాత ప్రతులను ఆధారంగా గ్రహించి కనీసం 250 రుబాయత్‌ల ప్రామాణిక పాఠాలను ప్రకటించాడు. ఆ పద్యాలను సునిశితంగా అధ్యయనం చేసిన వారికి ఆయన ఎంత గాఢమైన భావుకుడో, విశ్వాన్ని గురించిన, కాలస్వభావాన్ని గురించిన, దేవుడికీ మనిషికీ మధ్య గల అనుబంధాన్ని గురించిన సనాతన సమస్యలు ఆయనను ఎంతగా కుదిపి వేశాయో అర్థం అవుతుంది.

1122 డిసెంబరు 4 వ తేదీన ఓమర్ ఖయ్యామ్ నైషాపూర్‌లోనే శాశ్వతంగా కన్ను మూశాడు.

బొ.శ్రీ.

**ఓయె కెన్జాబురో (1935) :** జపనీస్ నవలా రచయిత. ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరం జపాన్ భాషలో చెలరేగిన విప్లవానికి ప్రాతినిధ్యం వహిస్తూ, జపాన్ భాషకు సహజమైన లయను భంగపరుస్తూ, ఎగుడు దిగుడుగా ఉండే ఒక క్రొత్త రకం వచనశైలికి అంకురార్పణ చేసినవాడు.

ఓయె కెన్జాబురో ఒక సంపన్న భూస్వాముల కుటుంబంలో 1935 జనవరి 31 న షికోకులోని ఎహీమ్ ప్రిఫెక్చర్ (మతోద్యోగి అధికారమండలం) లో జన్మించాడు. యుద్ధానంతరం అమలు జరిగిన భూసంస్కరణలలో వారి ఆస్తి చాలా భాగం హరించి పోయింది. 1984 లో ఓయె టోక్యో విశ్వవిద్యాలయంలో చేరి, 1959 లో పట్టభద్రుడయాడు. ఫ్రెంచ్ సాహిత్య విభాగంలో అతడు విద్యార్థిగా ఉన్న రోజులలోనే మిషీమా యుకీయో తరువాత అంత ప్రతిభావంతుడైన యువ రచయిత రాలేదనే పేరు తెచ్చుకున్నాడు. 1960 లో పీకింగ్‌లో జరిగిన యువ జపనీస్ రచయితల సమావేశంలో పాల్గొన్నాడు.

తన తొలి రచన అయిన *షిషా నో ఓగోరి* (1957, *లా విష్ ఆఫ్ ది డెడ్*, 1965) తోనే అతడు సాహిత్య పరుల దృష్టిని ఆకర్షించాడు. అది మొదట 'బుంగకుకై' అనే పత్రికలో ప్రచురించబడింది. అతని తొలి నవల *మెమోషిరీ కౌచి* (1958, *ప్లక్‌ది బడ్ అండ్ డిస్ట్రాయ్ ది ఆఫ్‌స్ప్రింగ్*) విశేష ప్రశంసలు అందుకొంది. షికూ (1958, *ది కాచ్*, 1959) అనే రచనకు అతనికి *అకుటగావా అవార్డు* లభించింది.

కాని అతని రెండవ నవల *వరెరా నో జిడాయ్* (1959- *అవర్ జనరేషన్*) కి విశేష జనాదరణ లభించలేదు. అతని సమకాలికులు సాంఘిక, రాజకీయ విమర్శలలో అతను ఎక్కువగా తల దూరుస్తున్నాడని భావించారు.

ఓయె 1960 లో వివాహితుడై, 1963 లో పెద్ద కపాలం గల కుమారుడు కలిగిన తరువాత అతని రచనా వ్యాసంగం మరో మలుపు తిరిగింది. ఆ సంఘటన వలన ఉత్తేజితుడై అతడు *కోజిన్‌డెకి నా తైకెన్*(1964 *ఏ పర్సనల్ మేటర్*, 1969) అనే గ్రంథం రచించాడు. దానికి 1964 లో షించో బహుమతి లభించింది. రెండవ ప్రపంచ యుద్ధం తరువాత అతడు హిరోషిమా సందర్శించాడు. తత్ఫలితంగా *హిరోషిమా నోటో* (1965, హిరోషిమా నోట్స్) అనే గ్రంథం వ్రాశాడు. 1970 తరువాత అతని రచనలలో, ముఖ్యంగా వ్యాసాలలో పరమాణుయుగంలో అధికార రాజకీయాలకూ, మూడవ ప్రపంచ యుద్ధానికి సంబంధించిన ప్రశ్నలకూ ఎక్కువ ప్రాధాన్యం కనిపించింది.

1967 లో ఓయె రచించిన *మానెన్‌గానెన్‌నో ఫుట్టో గోరు* ('ది సైలెంట్ క్రై' 1974) అనే రచనకు ఓయెకు 'తానిజాకి' బహుమతి లభించింది. ఓయె రచనలలో అతని వ్యక్తిగత అనుభవాలు విశేషంగా ప్రతిఫలిస్తున్నాయి.

బొ.శ్రీ.

**ఓయోనో, ఫెర్డినాండ్ లియోపాల్డ్ (1929-) :** ప్రముఖ ఆఫ్రికన్ రాజనీతివేత్త, నటుడు, హాస్య రచయిత. ఫెర్డినాండ్ ఒయోనో రచనలలో సున్నితమైన హాస్యమూ, వ్యంగ్య చిత్రణమూ ప్రధానంగా ఉంటాయి. ఆఫ్రికాకు చెందిన జీవిత యథార్థాన్ని సునిశితమైన ప్రజ్ఞతో వివేచన చేసి తన రచనలతో కనువిప్పు కలిగించే ప్రయత్నం ఈయన చేశాడు. ఈయన ఫ్రెంచ్ భాషలో వ్రాసిన *యూనే వీజీబోయ్* (ఇంగ్లీష్ అనువాదం: *హౌజ్ బోయ్* - 1966) ఆధునిక ఆఫ్రికన్ సాహిత్యంలో అత్యుత్తమ గ్రంథంగా ప్రశంసల నందుకున్నది. *లేవియన్స్ నీగ్రే ఎటిలోమెదైలే* (ఇంగ్లీష్ అనువాదం *ద ఓల్డ్ మాన్ అండ్ ద మోడల్* 1967) కూడా సుప్రసిద్ధమైందే! ఈ రెండు రచనలలోను ఓయోనో ఫ్రెంచివారి పాలనలో తన జీవితానుభవం ఆధారంగా వలస విధానాన్ని తూర్పార పడతాడు. హౌజ్‌బాయ్ ఫ్రెంచి కమీషనర్ సేవలో కాలం గడుపుతున్న ఒక బాలుని విషాద

జీవితాన్ని, దుస్థితిని వర్ణిస్తుంది. *ఓల్డ్‌మాన్ అండ్ ద మోడల్* లో ఒక వృద్ధుడు ఫ్రెంచ్ వలస తత్త్వాన్ని వ్యంగ్యంగా విమర్శించడం ఇతివృత్తం. ఫ్రెంచి ప్రభుత్వం ఆ వృద్ధుని సేవలకు మెచ్చి ఒక పతకంతో సన్మానించా లనుకున్న రోజే, తెల్లవారిని గూర్చి తన మనస్సు మార్చు కొని పతకాన్ని వదులుకోవడం కథావస్తువు. ఓయోనో ఫ్రెంచివారి మనస్తత్వాన్ని, వలసవిధానాన్ని, పరిపాలనను, మతప్రచారాన్ని నిర్దాక్షిణ్యంగా విమర్శిస్తాడు. *చెమిన్ దీ యూరప్* (ఇంగ్లీష్ అనువాదం: *రోడ్ ఆఫ్ యూరప్*, 1960) ఒక యువకుని జీవిత వివేచనను చిత్రీకరిస్తుంది.

ఓయోనో రంగస్థల నటుడుగా కూడా ప్రసిద్ధుడు. ఫ్రెంచి విమర్శకుల మన్ననలు పొందినవాడు. 1960 నుంచి పారిస్, రోమ్ నగరాలలోనూ, అంతర్జాతీయ సమితిలోనూ, బెల్జియం, లైబిరియా దేశాలలోనూ రాయ బారిగా పదవీ బాధ్యతలను ఓయోనో నిర్వహించాడు.

శ్రీ.ల.

**ఓర్తెగా యి గాసిట్, హోసె (1883-1955)** : 20 వ శతాబ్దపు శ్పానిష్ సాహిత్య పునరు జ్జీవనాన్ని గొప్పగా ప్రభావితం చేసిన మనీషి. తాత్త్వికు డుగా, మానవతా వాదిగా ఈయన సుప్రసిద్ధుడు. మాడ్రిక్ విశ్వ విద్యాలయంలో తత్త్వశాస్త్రాచార్యుడుగా ఉన్నప్పుడే నియో కాంటియన్ తత్త్వంతో విభేదిస్తూ *స్వర్గంలో ఆదాము* అనే గ్రంథాన్ని 1910 లో ప్రచురించాడు. తన ఆలోచనలను వివరిస్తూ *క్విక్సోట్ తలపులు* 1914 లోను, *అధునాతన విషయం* 1923 లోను ప్రకటించాడు.



దేశ కాల పరిమితమైన వ్యక్తి జీవితాన్నే ప్రాథమిక సత్యంగా ఆయన పరిగణించాడు. హేతువునే జీవిత ప్రవర్తకంగా ఆయన విశ్వసించాడు. దేశకాలాతీతమైన హేతువును కాని, సత్యాన్ని కాని ఆయన అంగీకరించ లేదు. తన తరం వారితో పాటు స్పెయిన్ సమస్యలను కూలం కషంగా అధ్యయనం చేసి ఆ పరిస్థితుల ప్రభావాన్ని స్పష్టంగా ప్రతిబింబిస్తున్న వ్యాస పరంపరను పత్రికల్లో పుంఖానుపుంఖంగా ఆయన ప్రచురించాడు. *ఎస్పానా* (1915), *ఎల్‌సోల్* (1917), *రివిస్టాది ఓక్సిడెంటె* అనే పత్రికలను ఆయన స్థాపించాడు. 1936 లో స్పెయిన్ ను విడిచి తొమ్మిదేండ్లు యూరప్‌లో ఆయన కాందిశీకుడుగా ఉన్నాడు. రెండవ ప్రపంచ యుద్ధం ముగిసిన తరువాత స్పెయిన్‌కి తిరిగి వచ్చాడు. 1948 లో హ్యూమానిటీజ్ సంస్థను నెలకొల్పాడు. *వెన్నె ముక లేని స్పెయిన్* (1922), *ప్రజాపోరాటం* (1929) అనే ఈయన గ్రంథాలు బహుళ జనాదరాన్ని పొందాయి.

శ్రీ.ల.

**ఓల్మెడో, హోసె జోయాక్విన్ (1780-1847)** : లాటిన్ అమెరికన్ కవి, రాజకీయవేత్త. దక్షిణ అమెరికా స్వాతంత్ర్య సముపార్జనను ఉగ్గడిస్తూ ఈయన వ్రాసిన కవితా ఖండికలు సుప్రసిద్ధ మైనవి. స్ఫూర్తినీ, ఉత్తేజాన్నీ కలిగించే ఈయన గీతాలు తరువాతి తరం కవులను, దేశభక్తులను ఎంతగానో ప్రభావితం చేయడమే కాక, దక్షిణ అమెరికా స్వాతంత్ర్యం కోసం ప్రాణా లొడ్డిన మహా వీరులకు మాసిపోని స్మృతి చిహ్నాలుగా నిలిచిపోయాయి.

సాన్‌మార్కోస్ జాతీయ విశ్వవిద్యాలయంలో 1805 లో న్యాయశాస్త్రం పట్టా పుచ్చుకొని, 1811 లో కోర్టిజ్ ది కాడిజ్ అనే స్పెయిన్ రివల్యూషనరీ పార్లమెంట్‌కి గుయాక్విల్ నుంచి ప్రతినిధిగా ఎన్నుకోబడ్డాడు. ఫ్రెంచ్ విప్లవం ప్రసాదించిన ఉత్తమ భావాల కనుగుణంగా ఈ పార్లమెంట్ 1812 లో విశాల దృక్పథాన్ని సూచించే రాజ్యాంగాన్ని సిద్ధం చేసింది. శ్పానిష్ అమెరికాలో తరు వాతి కాలాన వచ్చిన తిరుగుబాటు ఉద్యమా లన్నింటిపై దీని ప్రభావం స్పష్టంగా గోచరిస్తుంది.

ఓల్మెడో 1816 లో గుయాక్విల్ కి తిరిగి వచ్చాడు. రాజకీయాల్లో చురుకుగా పాల్గొంటూ సాహిత్య వ్యాసం గాన్ని కొనసాగిస్తూ ఉండేవాడు. హోమర్, హరేస్, వర్జిల్ కవుల ప్రభావంతో స్ఫూర్తిపొంది స్వాతంత్ర్యాన్ని గూర్చి వీరోచిత విషయాలను గూర్చి విస్తారంగా వ్రాసి ఖ్యాతి నార్జించినాడు. ఈయన రచించిన *కాంటో అబొలివర్* (1825) అనే వీరగీతాన్ని శ్పానిష్ అమెరికన్ సాహిత్యంలో మణిపూసగా పరిగణిస్తారు. శ్పానిష్ సైన్యా లను సైమన్ బొలేవర్ అనే స్వాతంత్ర్య యోధుడు ఎదుర్కొని ఓడించడం ఈ గీతంలో వర్ణింపబడింది. 1830 లో 'ఈక్వేడర్' రిపబ్లిక్‌గా అవతరించడంతో ఓల్మెడోను ప్రప్రథమ ఉపాధ్యక్షుడిగా ఎన్నుకొన్నారు. క్రియాశీల రాజకీయాల్లో కృషిచేయడమే తన కిష్టమని ప్రకటించి ఆయన ఆ పదవిని స్వీకరింపలేదు. స్పెయిన్ నుండి

విముక్తి పొందిన దక్షిణ అమెరికాలో వెనువెంటనే అంతర్యుద్ధాలు రావడం, సైనిక ప్రాబల్యం పెరగడం మున్నగు విపరీత పరిణామాలను ఆయన తీవ్రంగా గర్హించాడు.

శ్రీ.ల.

**ఓవిడ్ (క్రీ.పూ. 43 - క్రీ.శ. 17) :** రోమన్ కవి. *ఆర్స్ అమెటోరియా* (Art of Love), *మెటమోర్ఫోసిస్* అనే రచనలచే ముఖ్యంగా సుప్రసిద్ధుడైనవాడు. అనిర్దిష్టమైన అవినీతి ఆరోపణలతో ఆగస్టస్ చక్రవర్తి క్రీ. శ. 8 లో తన సామ్రాజ్యంలో మారుమూల నల్ల సముద్రం ఒడ్డున ఉన్న టామిస్ అనే ప్రాంతానికి ఓవిడ్‌ను బహిష్కరించాడు. అక్కడ కూడా అతడు తన రచనలను ముఖ్యంగా *ట్రిస్టియా* ( Sorrows) ను కొనసాగించాడు.

ఓవిడ్ (పబ్లియస్ ఓవిడియస్ నాసో) రోమ్ నగరానికి 140 కి.మీ. ల దూరాన ఉన్న ఒక చిన్న పట్టణంలో క్రీ.పూ. 43 మార్చి 20 న జన్మించాడు. తన కవితలో పలు స్థలాలలో అందమైన పచ్చని చేలతో కూడిన తన జన్మస్థలాన్ని ఓవిడ్ స్మరిస్తాడు. తండ్రి తగినంత సంపన్నుడు కావడం చేత అతనినీ, అతని అన్ననూ విద్యాభ్యాసం కోసం రోమ్‌కు పంపాడు. అప్పుడు ఓవిడ్‌కు 12 ఏళ్ల వయస్సు ఉండవచ్చును. అక్కడ అలంకార శాస్త్ర (Rhetoric) పాఠశాలలలో నాటి అత్యుత్తమ గురువుల వద్ద అతడు విద్యాభ్యాసం చేశాడు.

విద్యాభ్యాసానంతరం కొంతకాలం ఏథెన్స్‌లో ఉండి, తరువాత తన మిత్రుడూ, తన వలెనే కవీ అయిన పాంపియస్ మేసర్‌తో కలసి గ్రీక్ ప్రాంతాలలో పర్యటించి వచ్చాడు. ఆ అనుభవం ఓవిడ్ కవితలలో ప్రతిఫలిస్తూంది. ఆదిలో కొన్ని చిన్న చిన్న న్యాయాధికారి పదవులను నిర్వహించినా, చివరికి ఓవిడ్ తనపూర్తి సమయాన్ని కవిత్వ రచనకే వినియోగింపసాగాడు. సెక్స్టస్ ప్రోపర్టియస్, అతని కంటె వయస్సులో కొంచెం పెద్దవాడైన హొరేస్‌లు అతని సమకాలికులు. వర్జిల్ కవిని ఓవిడ్ కలుసుకున్నాడు. కాని ఓవిడ్‌కి యుక్తవయస్సు వచ్చే సరికే టిబుల్లస్ పరమపదించాడు. అతని మీద ఓవిడ్ అద్భుతమైన *స్మృతిగీతం* (Elegy) రచించాడు.

ఓవిడ్ తొలి కవితలు *ఎమోర్స్* (Loves) సుమారు క్రీ.పూ. 20 తో ఆరంభించి 5 సంపుటాలుగా వెలువడ్డాయి. ప్రేమ యొక్క వివిధ దశలను ఎలిజియాక్ చందస్సులో వర్ణించిన ఖండకావ్యాలు అవి.

*ఎమోర్స్, ఆర్స్ ఎమెటోరస్, రెమెడియో ఎమోరిస్* అనే రచనలలో ఓవిడ్ లోని పరిణతిని మనము గుర్తించవచ్చును. అతడు రచించిన *మీడియా* అనే ట్రాజెడీ వినష్టమైపోయింది. క్వింటీలియన్ అనే విమర్శకుడూ, టాసిటస్ అనే చరిత్ర రచయితా ఆ ట్రాజెడీని ప్రశంసించారు.

ఓవిడ్ రచించిన *ఫస్టీ* (Calendar) రోమన్ సంవత్సరాన్నీ, దానిలోని మత సంబంధమైన పండుగలనూ వర్ణిస్తుంది. 12 భాగాలతో కూడిన ఆ గ్రంథంలో మొదటి ఆరు భాగాలు మాత్రమే మనకు లభించాయి.

*మెటమోర్ఫసిస్* 15 భాగాలతో కూడిన సుదీర్ఘ కావ్యం. ఇతర కావ్యాలవలె కాక ఇది షట్పదీ ఛందస్సు (Hexameter) లో రచింపబడింది. ఎలిజాయిక్ ద్విపద ఛ్ఛందస్సులోనూ, షట్పదీ ఛ్ఛందస్సులోను ఓవిడ్ సిద్ధహస్తుడై, తన తరువాతి తరాలవారికి ఒరవడి పెట్టాడు. స్పష్టంగా వర్జిల్ మహాకవికి ఋణపడి ఉన్న రచయితలలో కూడా ప్రతి పంక్తిలోనూ ఓవిడ్ ప్రభావం కూడా మనకు కొంత కనిపిస్తుంది. మధ్య యుగాలలో ఓవిడ్ పరమ ప్రామాణికుడైన పండితుడుగా పరిగణింపబడ్డాడు. ప్రణయ కవితా ప్రియులైన ఛాసర్, షేక్స్‌పియర్, గొయిథే, ఎజ్రాపౌండ్‌లు ఓవిడ్‌కు ఋణపడి ఉన్నారు.

బొ.శ్రీ.

**ఔ యాంగ్ శ్యూ (1007-72) :** చైనా దేశపు కవి, చరిత్ర రచయిత. సుంగ్ వంశానికి చెందిన రాజ్యకార్య దురంధరుడు. చైనా సాహిత్యంలో సరళమైన ప్రాచీన శైలిని పునరుద్ధరించడానికీ, చైనా రాజకీయ జీవితాన్ని కన్ఫ్యూషియస్ సిద్ధాంతాల కనుగుణంగా సంస్కరించడానికీ కృషిచేసిన మహనీయుడు.

ఔయాంగ్ శ్యూ గౌరవనామం యూంగ్ శ్యూ, కలం పేరు ట్సుయివెంగ్ ఔయాంగ్ శ్యూ. ఈయన సెచ్వాన్ రాష్ట్రంలో మీన్‌యాంగ్ లోని ఒక న్యాయాధిపతి కుమారుడు. ఇతని మూడవ ఏట తండ్రి మరణించాడు. తల్లినీ, తననూ మేనమామ హ్యూపేకు తీసికొని వెళ్లాడు. 1030 లో పశ్చిమ రాజధాని అయిన లోయాంగ్‌లో జడ్జిగా ఔయాంగ్ నియమింపబడ్డాడు. అప్పటికే ప్రతిభావంతుడైన యువ రచయితగా అతనికి గుర్తింపు వచ్చింది. లోయాంగ్‌లో ప్రముఖవ్యాస రచయిత ఎన్‌షూ్యతోనూ, కవి అయిన మైయోచన్‌తోనూ మైత్రి ఏర్పడింది. ఆ మైత్రి ఔయాంగ్ హోదాను పెంచడమే కాక, ప్రాచీన శైలి లోని సరళత పట్ల, స్పష్టత పట్ల అతని అభిమానాన్ని దృఢతరం చేసింది. అప్పటికి కొన్ని సంవత్సరాలకు ముందే టాంగ్

వంశ సాహిత్య మహా రచయిత హాన్‌యూ రచనలు అతడు క్షుణ్ణంగా చదివాడు. హాన్‌యూ శైలి విశుద్ధమైన, సరళమైన ప్రాచీన శైలి. అది ఔయాంగ్‌ను మిక్కిలి ఆకర్షించింది. ఆ శైలీ పునరుద్ధరణను సమర్థిస్తూ ఒక నూతన సాహిత్యోద్యమాన్ని ఆయన లేవదీశాడు.

1034 లో రాజధాని నగరమైన కైఫెంగ్‌లో ఆస్థాన గ్రంథాలయంలో పాఠ నిర్ణాయకుడుగా ఔయాంగ్ నియమించబడ్డాడు. రెండేళ్ళ తరువాత ఫాన్‌చుంగ్ యన్ అనే ప్రభుత్వోద్యోగికి ప్రభుత్వాచారాలను విమర్శించి నందుకు దేశబహిష్కార శిక్ష విధించినపుడు నిస్సంకోచంగా ఔయాంగ్ ఆ చర్యను లిఖితపూర్వకంగా నిరసించాడు. తత్ఫలితంగా అతనికి కూడా బహిష్కార శిక్షను విధించి హ్యూపే, హ్యూనాం రాష్ట్రాలకు ఒక చిన్న న్యాయ శాఖోద్యోగిగా బదిలీ చేశారు. అక్కడ ఉన్నపుడే అతడు అయిదు *రాజవంశాల నూతన చరిత్ర* అనే గ్రంథం రచించాడు. ఇంచుమించు 10 వ శతాబ్దం అంతటా సాగిన చైనాలోని రాజకీయ సంక్షోభాన్ని ఆ గ్రంథం వివరిస్తుంది. న్యాయదృష్టితో ఔయాంగ్ ఆ గ్రంథంలో ఆత్మబలిదానం చేసిన విప్లవయోధులకూ, రాజద్రోహులుగా పరిగణింపబడినవారికీ, దేశబహిష్కృతులైన వారికీ ప్రత్యేక విభాగాలు కేటాయించాడు. అంతకు ముందున్న రాజ వంశాల చరిత్రలలో కనిపించని విలక్షణమైన అంశం ఇది.

1043 లో ఫాన్‌చుంగ్‌యంగ్ సిఫార్సుతో ఔయాంగ్ తిరిగి రాజధాని నగరానికి రప్పించబడి ప్రభుత్వ సలహాసంఘ సభ్యుడుగా నియమించబడ్డాడు. ఫాన్, మరికొందరూ కలసి ఒక రాజకీయ సంస్కర్తల బృందాన్ని స్థాపించినందుకు వారిమీద ప్రభుత్వం చర్య తీసుకోగా, ఔయాంగ్ పక్షపాతవైఖరిని గూర్చి ఒక గొప్ప వ్యాసం వ్రాశాడు. ఆ వ్యాసంలో రాజకీయంగా అలాంటి బృందాలు నిర్మాణాత్మకంగా ప్రభుత్వానికి సహాయపడ గలవని ఆయన సమర్థించాడు. చక్రవర్తి జెన్‌ట్సుంగ్ అతని ధైర్యాన్నీ, నిర్మొహమాటమైన అభిప్రాయాలనూ మెచ్చుకొని జెన్‌ట్సుంగ్ దినచర్యను, రాజశాసనాలను రచించే పని ఆయనకు పురమాయించాడు. నిర్మొహమాటమైన ఔయాంగ్ అభిప్రాయాలూ, ఇతరుల పట్ల అతని తీవ్ర విమర్శక ధోరణీ అతనికి చాలామందిని శత్రువులను చేశాయి. 1045 లో చాలా సంవత్సరాల క్రితం అతడు లో-యాంగ్‌లో ఉన్నపుడు తన మేనకోడలితో అక్రమసంబంధాలు కలిగి ఉన్నాడని అభియోగం తెచ్చి అతనిని విచారించారు. చివరకు నిర్దోషి అని అతనిని విడుదల చేసినా, ఆ విచారణ వలన అతని కీర్తి బాగా దెబ్బ తింది.

అతనిని ఉన్నత పదవులనుంచి తొలగించి అన్‌హ్వాయ్ రాష్ట్రంలో వివిధ స్థలాలలో చిన్న మేజిస్ట్రేటుగా నియమించారు. మనోహరమైన గ్రామీణ సౌందర్యం అతనిలో ద్రాక్షాసవ ప్రీతిని తీవ్రం చేసింది. తనను తను 'ముసలి త్రాగుబోతు' అని వర్ణించుకుంటూ ఆ పేరుతో ఒక కుటీరం కూడా ఆయన నిర్మించుకున్నాడు. అదే శీర్షికతో ఆయన వ్రాసిన వ్యాసం చైనా సాహిత్యంలో మణిపూసలలో ఒకటిగా ఎన్నబడుతూంది. చివరికి 1054 లో ఆయనను తిరిగి రాజధానికి రప్పించి హన్‌లిన్ అకాడమీలో సభ్యుణ్ణి చేశారు.

మొదట ఆయనను టాంగ్ వంశం నూతనచరిత్ర వ్రాయమని పురమాయించినా, దాని రచన ఇంకా ప్రారంభం కాకమునుపే ఒక ఏడాది తరువాత ఉత్తర చైనాలో ఎక్కువ భాగాన్ని ఏలుతున్న మంచూరియన్ ఖైతాన్స్ సంస్థానానికి ఆయనను రాయబారిగా పంపారు. 1060 లో ఆ నూతన చరిత్ర పూర్తి అయిన తరువాత ఆయనను ఎన్నో ఉన్నత పదవులు వరించాయి. రాజకీయాలలో ఔయాంగ్‌కు ఎలాంటి మౌలిక భావాలూ లేకపోయినా, అభ్యుదయకరమైన భావాలను ఆయన సమర్థిస్తూ వచ్చారు.

60 ఏళ్ల వయస్సులో ఆయనమీద కక్ష వహించిన ఒక వ్యక్తి తన కోడలితో అక్రమ సంపర్కం ఉన్నట్లు ఔయాంగ్ మీద అభియోగం తెచ్చాడు. ఆ అమ్మాయి తండ్రి ఔయాంగ్ కు అనుకూలంగా సాక్ష్యం చెప్పినా, ఆ అభియోగం ఔయాంగ్ ప్రతిష్ఠకు తీవ్రమైన భంగం కలిగించింది. పదవీ విరమణకు సిద్ధపడినా చక్రవర్తి అన్‌హ్వాయ్, షాంటుంగ్, హునాన్‌లలో వరుసగా ఆయనను మేజిస్ట్రేట్‌గా నియమించాడు. 1071 లో చివరకు ఆయనకు 'యువరాజు గారి ఆచార్యోత్తముడు' అనే బిరుదు ఇచ్చి పదవీ విరమణ చేయించారు. ఔయాంగ్ 'ముసలి త్రాగుబోతు' అనే తన కుటీరం ఉన్న అందమైన అన్‌హ్వాయ్‌లో స్థిరపడాలని ఆశపడ్డాడు గాని అటు తరువాత కొద్ది నెలలకే తన 66 వ ఏట 1072 లో హోనాన్ నగరంలోనే ఆయన శాశ్వతంగా కన్ను మూశాడు.

ఆయన సొంత గ్రంథాలయంలో పదివేల గ్రంథాలూ, అనేక ప్రాచీన లిఖిత ప్రతులూ ఉండేవి. మరణానంతరం ఆయనకు 'వెన్‌చుంగ్' (సాహితీధనుడు, విశ్వాసపాత్రుడు) అనే బిరుదం ఇచ్చి సత్కరించారు. బొ.శ్రీ.

**ఔస్మన్, సెంబీన్ (1923-)** : పశ్చిమాఫ్రికా లోని సెనెగల్ ప్రాంతపు రచయిత. అతడు రచించిన చారిత్రక, రాజకీయ నవలలు, 1965 నుండి అతడు దర్శకత్వం వహించిన చలన చిత్రాలు అతనికి అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిపెట్టాయి.

ఔస్మన్ సెనెగల్ నదీ తీరంలోని కాసమాన్స్ ప్రాంతంలో చేపలు పట్టే వృత్తితో తన జీవితాన్ని ప్రారంభించాడు. మార్సెస్సామ్‌లోని ఇకోల్ డి సెరమిక్ ప్రాంతంలో చదువు సాగిస్తూ క్రమంగా డాకార్ ప్రాంతానికి చేరుకొని అక్కడ ఇటుకలు మోస్తూ నీటి కుళాయిల పనిచేస్తూ, యంత్రపు పనులలో తర్ఫీదు పొందుతూ ఉండేవాడు.

ద్వితీయ ప్రపంచ యుద్ధకాలంలో 1942 లో 'స్వచ్ఛంద ఫ్రెంచ్ సైన్యం' లో చేరి 1944 లో ఫ్రాన్సులోనే స్థిరపడ్డాడు. మార్సెయిల్‌లో రేవు కార్మికుడుగా పనిచేస్తూ, తీవ్రవాద కార్మిక నాయకుడు అయాడు.

ఔస్మన్ ఫ్రెంచ్ భాష చదవడం, వ్రాయడం స్వయంగా నేర్చుకున్నాడు. 10, 12 సంవత్సరాలలో ఆ భాషలో గ్రంథ రచన చేసే సామర్థ్యం సంపాదించాడు. మార్సెయిల్ రేవు కార్మికుడుగా స్వీయానుభవాలు ఆధారంగా 1956 లో తన తొలి నవల *లే డాకర్ నాయిర్* (ది బ్లాక్ డాకర్ - 'నీగ్రో రేవు పనివాడు') రచించాడు. రేవు కార్మికుడుగా పెద్ద పెద్ద బరువులు మోయడం వల్లనో యేమో వెన్నెముక పాటుదప్పి, బరువైన పనులకు అతడు స్వస్తి చెప్పవలసి వచ్చింది. బ్రతుకు తెరువుకు సాహిత్యమే అతనికి శరణ్యా మైంది. అటు తరువాత అతని కలం నుండి వెలువడిన రచనలు విశిష్టమైనవి *ఓ పేస్ మాన్ బ్యూ వీపుల్* (1957, ఓ మై కంట్రీ, మై బ్యూటిఫుల్ పీపుల్), *లెస్ బౌట్స్ డి బాయిస్ డి డ్యూ* (1960, God's Bits of Wood). ఈ రచనలలో ఔస్మన్ రైలు దారులు నిర్మించే ఆఫ్రికా కార్మికులు సమ్మెల ద్వారా తమ జీత భత్యాలు పెంపొందించుకోడానికి 1947-48 సంవత్సరాలలో సాగించిన ఉద్యమాన్ని చిత్రించాడు. దారుణమైన వలస విధానాన్ని ధైర్య సాహసాలతో ఎదుర్కొనే తొలి ప్రయత్నం ఈ నవలలలో కనిపిస్తుంది. అందువల్లనే ఇవి ఇతర భాషలలోకి కూడా అనువదించబడ్డాయి.

ఔస్మన్ మంచి కథానికా రచయితగా కూడా ప్రసిద్ధుడు. అతడు రచించిన *వోల్టేయిక్* (1962) *లా హర్మటన్* (1964), *జలా* (1974-ఆంగ్లానువాదం 1976) అనే కథానికా సంపుటులలో కొన్ని కథలు అతడు తరువాత దర్శకత్వం వహించిన చిత్రాలకు ఇతివృత్తాన్ని కూడా సమకూర్చాయి.

1960 లోనే అతనికి చలన చిత్రాల మీద ఆసక్తి ప్రారంభమైంది. అతని లక్ష్యం 'ఆఫ్రికా దేశీయులలో ఫ్రెంచ్ బాషా జ్ఞానం కాని, గ్రంథ పరిచయంగాని లేని అధిక సంఖ్యాకులైన సామాన్య జనులకు కూడా తన చిత్రాలు సుబోధకంగా ఉండాలి' అని, మాస్కోలోని ఫిల్మ్ శిక్షణాలయంలో అధ్యయనం సాగించి, ఆఫ్రికా చేరుకొని, వస్తు ప్రధానమైన మూడు చిత్రాలు తీశాడు. ఈ మూడూ సాంఘిక నిబద్ధతతో కూడినవే. 1966 లో అతడు *లా నాయిర్ డి* (బ్లాక్ గాళ్- 'నీగ్రో బాలిక') అనే చిత్రం తీశాడు. ఆఫ్రికా దేశీయుడు ప్రప్రథమంగా తీసిన చలన చిత్రం ఇదే! డాకార్ నుండి వచ్చిన చదువుకోని ఒక నీగ్రో బాలిక ఒక ఫ్రెంచ్ కుటుంబంలో పనికత్తెగా చేరి, పడరాని పాట్లు పడుతూ గడపే బానిస బ్రతుకును ఈ చిత్రం కళ్లకు గట్టినట్లు చూపిస్తుంది. 1967 లో కేన్నెస్‌లో జరిగిన ఫిల్మ్ ఫెస్టివల్‌లో ఈ చిత్రం బహుమానం పొందింది.

1968 లో ఔస్మన్ విప్లవాత్మకమైన ఒక నిర్ణయం తీసుకున్నాడు. 'ఇక నుంచీ ఈ పరాయి ఫ్రెంచిభాషలో చిత్రం నిర్మించను, దేశీయమైన వులఫ్ భాషలోనే నిర్మిస్తాను' అని అదే ప్రకారం *మండబి* (మనీ ఆర్డరు) అనే చిత్రాన్ని వులఫ్ భాషలో తీశాడు. దానిలో డాకార్ ప్రాంతపు దైనందిన జీవితంలోని హాస్య సన్నివేశాలను, లంచగొండితనాన్ని అద్దంలో చూపినట్లు చూపాడు. అతని చిత్రాలలో మేలుబంతి అనదగిన సెడ్డో (1977, ఔట్ సైడర్స్), ఆఫ్రికా దేశపు మతాల స్వరూపాన్ని ప్రదర్శిస్తుంది. ఆ చిత్రం ఆశ్చర్యకరంగా తన మాతృభూమి సెనెగల్ లోనే నిషేధానికి గురి అయింది.

వి.వి.యల్.

**కంపనెలా, టోమాసో (1568-1639)** : ప్రముఖ ఇటాలియన్ కవి. ప్లేటో అడుగు జాడలలో నడచిన తత్త్వవేత్త. 'పునరుజ్జీవన' కాలంలోని మానవతా దృక్పథాన్నీ, రోమన్ కేథలిక్ మత సిద్ధాంతాన్నీ సమన్వయ పరచడానికి కంపనెలా ప్రయత్నించాడు. స్పెయిన్‌లో 'మతవిచారణ' (ఇన్క్విజిషన్) కాలంలో కారాగారవాసం చేస్తున్న సమయంలో ఆయన రచించిన సమ సమాజ దృక్పథాన్ని ఆవిష్కరించే *లాసిట్టా డెల్‌సోలె* (Lacitta del sole సూర్యనగరం, 1602) కంపనెలాను చిరస్మరణీయుణ్ణి చేసింది.

1583 లో డొమినికన్ మత సంస్థలో ప్రవేశించిన తరువాత టొమాసో అనే పేరును ఆయన స్వీకరించాడు. అరిస్టాటిల్ పండితుని అభిప్రాయాలను వ్యతిరేకించిన 'బెర్నార్డినో టెలీసియో' (1509-88) అనే ఇటలీ తత్త్వ వేత్త సిద్ధాంతాలు కంపనెలాను అధికంగా ప్రభావితుణ్ణి చేశాయి. తన మతసంస్థ అనుమతి పొందకుండానే నేపిల్స్ వెళ్లి *ఫిలసాఫియా సెన్సిబస్ డెమన్స్ట్రేటా* (ఇంద్రియాలు ప్రదర్శించే తత్త్వం, 1591) అనే గ్రంథాన్ని ఆయన రచించాడు. ఇందులో టెలీసియో ప్రతిపాదించిన అనుభవ ప్రాతిపదిక కలిగిన తత్త్వ ధోరణి ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఈ అభిప్రాయాలు మతాధికారుల ఆగ్రహానికి దారి తీశాయి. అందువల్ల మత ధిక్కరణ నేరానికి ఆయన కారాగారవాసం చేయవలసి వచ్చింది. కారాగారం నుండి విముక్తు డయిన తరువాత 'పాడువా' వెళ్లి, గెలీలియోను ఆయన కలుసుకున్నాడు. 1616 లో తాను రచించిన *అపాలజియా ప్రొ గెలీలియో* లో ఆయన గెలీలియో సిద్ధాంతాలను గట్టిగా బలపరచాడు.

మొదటి నుంచీ కంపనెలాకు ప్రత్యక్షానుభవాలు జ్ఞానానికి ప్రాతిపదికలు అనే విశ్వాసం ఎక్కువ. ప్రతి సిద్ధాంతం ఆచరణ యోగ్యమయినప్పుడే శిరోధార్యం అని ఆయన భావించేవాడు. ఈ అభిప్రాయాలు ఆయన ప్రారంభ దశలో రచించిన *డి మొనార్కియా క్రిస్టియనోరమ్* (1593), *డయలాగో పొలిటికో కాంట్రాలు టెరాని, కాల్వెనిస్టీ ఎడ్ ఆల్ట్రి ఎరెటిసి* (1595) లలో కనిపిస్తాయి. పాపపంకిల మైన మానవ సమాజాన్ని పునరుజ్జీవితం చేయడానికి సంస్కరణ ప్రాతిపదిక మీద విశ్వవ్యాప్త మత సామ్రాజ్యస్థాపన అవసర మని ఆయన విశ్వసించాడు. ఈ మత సంబంధమైన ఆలోచనలు సాంఘిక సంస్కరణల ఆవశ్యకతను కూడా గుర్తించాయి. కెలాబ్రియాలోని స్పెయిన్ పరిపాలనను అంత మొందించాలనే ఉద్యమానికి ఆధ్యాత్మిక నాయకత్వాన్ని 1599 లో ఆయన చేపట్టాడు. ఈ సందర్భంలో మళ్లీ ఆయనకు యావజ్జీవ కారాగారవాస శిక్ష విధించబడింది.

కారాగారంలో ఉన్న సమయంలో ఆయన కేథలిక్ మత సిద్ధాంతాల వైపు మొగ్గడం జరిగింది. ఈ సమయంలోనే ఆయన ఊహించిన 'ఆదర్శ సామ్రాజ్యా'న్ని చిత్రించే *లాసిట్టా డెల్ సోలే* వ్రాశాడు. హేతువాదం చేత సంస్కరింపబడిన విజ్ఞాన వంతులు పరిపాలకులుగా ఉండే రాజ్యంగా తన ఆదర్శసామ్రాజ్యాన్ని ఆయన ఊహించుకున్నాడు. సమాజ శ్రేయస్సు కోసం ప్రతి ఒక్కరూ తమ శక్తి సామర్థ్యాలను అంకితం చేయడం ఈ వ్యవస్థకు మూలాధారం. వ్యక్తిగతమైన ఆస్తి, అవసరాలకు మించిన సంపద లేకపోవడం వల్ల, దారిద్ర్యానికి ఆస్కారం ఉండదు. ఇదీ కంపనెలా కలలు గన్న 'స్వర్గసీమ' స్వరూపం.

తన 27 సంవత్సరాల కారాగార వాస కాలంలో కంపనెలా ఎన్నో కవితలను కూడా రచించాడు. వీటిలో *స్కెల్టా*, (1622), *మెటాఫిసికా* (1638) అనే కవితా సంకలనాలు లభ్యం అవుతున్నాయి. *స్కెల్టా* లో అతి మౌలికమైన ఇటాలియన్ కవితా ప్రక్రియలు కనిపిస్తాయి. *మెటాఫిజికా* లో అధికారం, జ్ఞానం, ప్రేమ అనే శక్తిత్రయంపై నిర్మితమైన తత్త్వ సిద్ధాంతం ప్రతిపాదించబడింది. *థియలాజియా* (1613-14) అనే 30 భాగాల గ్రంథంలో కంపనెలా కేథలిక్ సిద్ధాంతాలను తన తత్త్వ సిద్ధాంత దృష్టితో వివేచన చేశాడు.

1626 లో కారాగారం నుంచి విముక్తు లయిన తరువాత తన సిద్ధాంతాలకు రోమ్ లోని మతాధికారుల ఆమోదాన్ని సాధించడానికి ఆయన ప్రయత్నం చేశాడు. 1634 లో స్పెయిన్ ప్రభుత్వ వ్యతిరేక మైన కుట్ర నేపిల్స్‌లో బయలుపడడంతో ఆయన ఫ్రాన్స్‌కు పరారీ కావలసి వచ్చింది. 13 వ లూయీ రాజు కార్డినల్ డి రిచ్‌లూ ఆయనకు పారిస్‌లో ఘనమైన స్వాగతం పలికాడు.

ఎస్.ఎస్.ప్ర

**కజంటాకిస్, నికోస్ (1885-1957) :** వైవిధ్యంతో కూడిన పలు గ్రంథాలు రచించి గ్రీక్ సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన ప్రముఖ ఆధునిక గ్రీక్ రచయిత.

ఆటోమాన్ తురుష్క ప్రభువులపై క్రీట్ ప్రజలు తిరుగు బాటు చేసినకాలంలో కజంటాకిస్ జన్మించాడు. కొన్ని రోజులు ఆయన కుటుంబం నెక్సోస్ అనే గ్రీక్ ద్వీపానికి వలస వెళ్లవలసి వచ్చింది. ఏథెన్సు విశ్వవిద్యాలయం (1902-06) లో న్యాయశాస్త్రాన్నీ, పారిస్‌లో (1907-09) ప్రసిద్ధ తత్త్వవేత్త హెన్రీ బెర్గ్‌సన్ వద్ద తత్త్వశాస్త్రాన్నీ ఆయన అధ్యయనం చేశాడు. తరువాత స్పెయిన్, ఇంగ్లాండ్, రష్యా, ఈజిప్టు, పాలస్తీనా, జపాన్ వంటి దేశాలలో విస్తృతంగా పర్యటించి, ద్వితీయ ప్రపంచ సంగ్రామానికి ముందు ఎజీనా ద్వీపంలో నివాసం ఏర్పరచు కున్నాడు. 1945 లో గ్రీక్ ప్రభుత్వంలో మంత్రిగా పని చేసి, యునెస్కోలో మరో పదవి చేబట్టడానికి 1947-48 ప్రాంతంలో ఫ్రాన్స్ వెళ్లాడు. ఫ్రాన్స్‌లోని ఏన్టిబెస్‌కి నివాసం మార్చాడు.

కజంటాకిస్ రచనా వ్యాసంగం విస్తృతమైంది. తత్త్వసంబంధమైన వ్యాసాలూ, యాత్రా గ్రంథాలూ, విషాదాంత నాటకాలూ, దాంతె *డివైన్ కామెడీ* కీ, గెథె *ఫౌస్ట్* కీ ఆధునిక గ్రీక్‌భాషలోకి అనువాదాలూ రచించాడు. ఇలా ఎన్నో సాహిత్య ప్రక్రియలలో ఆయన తన ప్రతిభను ప్రదర్శించాడు. అనేక కవితలు ఆయన ప్రచురించాడు. హోమర్ రచించిన *ఒడిస్సె* కావ్య గాథను కొనసాగిస్తూ 33,333 పాదాల బృహత్కావ్యాన్ని ఆయన రచించాడు. ఇందులో ఈయన తాత్త్విక చింతన ప్రగాఢత, విస్తృతి మనకు సాక్షాత్కరిస్తాయి.

విస్తృతంగా అనేక భాషలలోకి అనువదింపబడిన *జోర్బా* (1952) అనే నవలలో గాఢమైన ప్రేమ, సంఘం లోని బీదప్రజలపట్ల సానుభూతి ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. ఈ రెండింటికి ప్రతినిధిగా జోర్బా చిత్రింప బడ్డాడు. *స్వాతంత్ర్యమా? మరణమా?* (1950) అనే రచనలో 19 వ శతాబ్దంలో క్రీట్‌లోని గ్రీక్‌లు తురుష్క ప్రభువులపై కొనసాగించిన తిరుగుబాటు ప్రతిభావంతంగా చిత్రించ బడింది. *గ్రీకుల ఆవేశం* (1954), క్రీస్తు జీవితాన్ని మానసిక విశ్లేషణ చేసిన *క్రీస్తు ఆఖరి ప్రలోభం* ఆయన అవసానదశలో చేసిన రచనలు. మరణానంతరం *గ్రేకో నివేదిక* (1965) అనే ఆత్మకథ వంటి రచన ప్రచురితమైంది. *జోర్బా, గ్రీకు ఆవేశం* వంటి నవలలు చలనచిత్రాలుగా కూడా రూపుదిద్దుకున్నాయి. ఆయన రెండవ భార్య హెలెన్ *నికోస్ కజంటాకిస్* అనే ఆయన జీవితచరిత్రను 1968 లో ప్రచురించింది.

ఎస్.ఎస్.ప్ర

**కజీనోక్సీ, ఫెరెన్స్ (1759-1831) :** హంగేరియన్ విద్వాంసుడు. ధనిక కుటుంబంలో జన్మించిన కజీనోక్సీ న్యాయశాస్త్రం చదివి ప్రభుత్వోద్యోగి అయాడు. కాని అతని అభ్యుదయ భావాలు సంప్రదాయవాది అయిన రెండవ ఫ్రాన్సిస్ ప్రభువుకు నచ్చక పోవడం వల్ల అతడు అనేక బాధలకు గురికావలసి వచ్చింది. కజీనోక్సీని బంధించి మృత్యు దండన విధించారు. కాని, జూన్ 1801 న అతనిని విడుదల చేశారు.



కజీనోక్సీ సారస్వతం వైపు తన దృష్టిని మరల్చాడు. రచనలలో తనకు అశ్లీలంగా, అయోగ్యమైనవిగా అనిపించే వాటిని పారద్రోలడానికి అతడు చాలా ప్రయత్నాలు చేశాడు. ముఖ్యంగా భాషా పరంగా అతడు చాలా సంస్కరణలు సూచించాడు. వ్యాకరణం, ఉచ్చారణ, శైలి మొదలైన వాని విషయంలో అతడు ప్రారంభించిన సంస్కరణలు హంగేరియన్ భాషను మరింత సరళం చేశాయి.

వి.వి.సు.

**కటల్లీస్, గైయస్ వెలీరియస్ (క్రీ.పూ. 84 - క్రీ.పూ. 54) :** ప్రాచీన రోమన్ కవి. ప్రేమనూ, ద్వేషాన్నీ ప్రకటించే ఆయన కవితలు ప్రాచీన రోమన్ కవితలో అత్యుత్తమమైన భావగీతాలుగా పరిగణింప బడుతున్నాయి. 25 కవితలలో ఆయన 'లెస్బియా' అనే స్త్రీతో తన ప్రణయాన్ని గూర్చి ప్రస్తావించాడు. అయితే ఆ 'లెస్బియా' ఎవరో స్పష్టంగా తెలియదు. కటల్లీస్ రచించిన ఇతర కవితలు జూలియస్ సీజర్‌ను, ఇతర సమకాలీన రాజకీయనాయకులను వ్యంగ్యంగా విమర్శించేవి.

ప్రాచీన కాలంలో వెలువడిన కటల్లీస్ జీవిత చరిత్ర ఏదీ లభించలేదు. అతని సమకాలికులూ, తరువాతి రచయితలూ పేర్కొనిన విషయాలూ, అతని పద్యాలలో లభించే సాక్ష్యాలూ మాత్రమే అతని జీవిత చరిత్రను ఊహించడానికి ఆధారాలుగా ఉన్నాయి. అతని పద్యాలను బట్టి క్రీ.పూ. 55-54 లో అతడు జీవించి ఉన్నట్లు తెలుస్తోంది. ఓవిడ్ కవి రచనల వలన అతడు చిన్న వయస్సులోనే తన 30 వ ఏట మరణించినట్లు తెలుస్తోంది. కటల్లీస్ కవి సిసిరో, పాంపే, సీజర్‌ల సమకాలికు డనడం స్పష్టం. తన పద్యాలలో ఈ ముగ్గురిని గురించీ అతడు ప్రస్తావించాడు.

కటల్లీస్ కవితలలో లెస్బియాను గురించి వ్రాసిన 25 రచనలూ చిరకాలం నిలువగలవి. ప్రేమలోని ఆశా, నిరాశలూ, మధ్యలో ప్రకటితం అయ్యే వివిధ ఉద్వేగాలూ ఆ కవితలలో మనోహరంగా చిత్రింపబడ్డాయి. ఈ కవితలలో రెండు - అసాధారణమైన ఛందస్సులలో రచింపబడినవి - ఈజియన్ దీవి లేస్బోలోని శాఫో కవయిత్రి రచనలను గుర్తు తెస్తాయి. తన సోదరుని సమాధి వద్ద కేటలస్ రచించిన విలాపగీతం, కవికి ఇష్టమైన ఆవాసం 'సెర్మియో' తో ఆయన కడపటి వీడ్కోలును వర్ణించే కవిత, అక్మె, సెప్టిమియస్‌ల శపథాలను గూర్చిన కవిత,

కేల్వస్ భార్య మీద ఈ కవి రచించిన స్మృతి గీతం మొదలైన ఈ కవి కవితలు చిర స్మరణీయాలు.

బా.శ్రీ.

**కటాయేవ్, వాలంటీన్ పెట్రోవిచ్ (1897-1986):** 1919 విప్లవం తరువాత రష్యాలో ఏర్పడిన సాంఘిక పరిస్థితులను హాస్యధోరణిలో వ్యంగ్యాత్మకంగా చిత్రించిన సోవియట్ రచయిత. నవలలు, నాటకాలు రచించి, సోవియట్ నవలలలో సాధారణంగా కనిపించే నీతి బోధనకు స్వస్తి చెప్పాడు.

1916 లో కటాయేవ్ కథానికా రచన ప్రారంభించాడు. 1920 వరకు ఆయన ఎర్రసేనలో పని చేసి, ఒడెస్సాలో పత్రికా రచయిత వృత్తిని చేపట్టాడు. 1922 లో మాస్కో చేరుకుని *గుడోక్* (ఈల) అనే పత్రిక సంపాదకవర్గంలో చేరాడు.

గోగోల్ రచనా విధానాన్ని అనుసరిస్తూ ఇద్దరు సాహస వంతుల గాథను *రాస్ట్రాట్చికి* (1926) అనే నవలలో ఆయన చిత్రించారు. *క్వాడటుర్కాకుగా* (1928) అనే హాస్యప్రధానమైన నాటికలలో నగరాలలో ఇళ్లు లభించకపోవడంవల్ల ఒకే గదిలో రెండు జంటలు కాపురం చేయవలసి వచ్చిన పరిస్థితిని కటాయేవ్ ప్రతిభావంతంగా చిత్రించాడు. 1905 విప్లవాన్ని ఒడెస్సా పాఠశాల విద్యార్థుల దృక్కోణం నుంచి పరిశీలించి, *బెలెవెట్ పారుస్ ఒడినోకి* (1936) అనే నవలలో చిత్రించాడు. ఈ నవల ఆధారంగా ఒక మంచి చలనచిత్రం నిర్మించబడింది. *వ్రెమ్యావ్ పెరేడ్* (1932) లో ఇతివృత్తం ఒక సిమెంటు కర్మాగారంలోని కార్మికులకు సంబంధించినది. రష్యా పంచవర్ష ప్రణాళికలను చిత్రించిన మంచి నవల ఇది. *సింపోల్కా* (1948) అనే నవలికకు 1946 లో స్టాలిన్ బహుమతి లభించింది.

1950-60 మధ్య కాలంలో *యునోస్ట్* అనే పత్రిక సంపాదకత్వం నిర్వహించి కటాయేవ్ ఎందరో రచయితలను ప్రోత్సహించాడు. ఆవేశం అందజేశాడు. వీరిలో యెవ్టుషెంకో, అఖ్మదులీనా చెప్పుకోదగ్గవారు. తన రచనా వ్యాసంగాన్ని నిర్విరామంగా కొనసాగిస్తూ, *నోవీ మీర్* అనే సాహిత్య పత్రికలో *స్వీన్ కోలోడెట్స్* అనే నవలను 1966 లో ప్రచురించాడు. మత్తుమందు ప్రభావంలో ఉన్నప్పుడు తాను కన్న కలలను తాత్త్విక ధోరణిలో కవితాత్మకంగా ఈ నవలలో ఆయన ఆవిష్కరించాడు. ప్రూస్ట్, జాయిస్, కాఫ్కా వంటివారి రచనల ప్రభావం ఈ నవల మీద ఎక్కువగా కనిపిస్తుంది. తన కుటుంబ గాథలు, స్నేహితులు, ప్రియురాళ్లు, రష్యా చరిత్ర లోని ఘట్టాలు, అమెరికాలో తన పర్యటనానుభవాలు 'చైతన్యస్రవంతి' శిల్పం ద్వారా ఈనవలలో ఆత్మకథారూపంలో సాక్షాత్కరిస్తాయి. కటాయేవ్ రచనలన్నిటిలోను ఈ నవల తలమానికంగా భాసిస్తూంది. అత్యున్నతమైన భావుక శక్తి, సున్నితమైన హృదయం, మౌలిక రచనా శక్తితో ప్రభుత్వం వారి ఆదరానికి నోచుకున్న కొద్దిమంది రష్యన్ రచయితలలో కటాయేవ్‌కు ఒక విలక్షణమైన స్థానం ఉంది.

ఎస్.ఎస్.ప్ర.

**కనెట్టి, ఎలియస్ :** చూ. అనుబంధం-I

**కపోటే, ట్రూమన్ (1924-84) :** అమెరికన్ నవలా రచయిత, కథానికా రచయిత, నాటక రచయిత. అసలు పేరు ట్రూమన్ స్ట్రెక్‌ఫుస్ పెర్సన్స్. ప్రాథమికదశలో దక్షిణ ప్రాంతంలోని 'గోథిక్' సంప్రదాయాన్ని తమ రచనలలో కపోటె అనుసరించాడు. తరువాత 1966 ప్రాంతానికి *ఇన్ కోల్డ్ బ్లడ్* అనే నవల రచనలో పత్రికారచనా శిల్పాన్ని ఆయన ప్రవేశపెట్టాడు. కాన్సాస్‌లో మానసిక వికార ప్రవృత్తి కలిగిన ఇద్దరు వ్యక్తులు చేసిన రెండు హత్యలు ఈ నవలకు ఇతివృత్తం. ఈ విధానాన్ని ఆయన 'కల్పితం కాని నవల' అని అభివర్ణించారు. ఆయన చిన్నతనంలోనే తల్లి దండ్రులు విడాకులు తీసుకోడం వల్ల లూయిసియానాలోను, అలబామాలోను ఉన్న బంధువుల ఇంట్లో పెరిగాడు. ఆ పసితనపు అనుభవాలను ఆధారంగా చేసుకొని ఆత్మకథా సదృశమైన *ఏ క్రిస్మస్ మెమొరీ* (1966), *థాంక్స్‌గివింగ్ విజిటర్* (1969) అనే రచనలు చేశాడు. 1948 లో ఆయన మొదటి నవల *అదర్ వాయిసెస్, అదర్ రూమ్స్* ప్రచురించబడింది. మంచి భవిష్యత్తు ఉన్న యువ రచయితగా కపోటె గుర్తించబడ్డాడు. కన్న తండ్రి కోసం, తన వ్యక్తిత్వం కోసం విలువలు అంతరిస్తున్న దక్షిణ అమెరికాలోని సాంఘిక వ్యవస్థలో ఒక పసివాని అన్వేషణ ఈ నవలలో హృదయాకర్షకంగా చిత్రితమైంది. *ది గ్రాస్ హార్ప్* (1951) లో నాగరక జీవితం నుంచి వన సీమలలోకి నిష్క్రమించిన అమాయక జీవులను కపోటె చిత్రించారు. ఈ అమాయకులు నూతన శక్తిని పుంజుకొని సాంఘిక జీవితంలో తిరిగి ప్రవేశించడం వల్ల ఈయన పలాయనవాది కాదని నిరూపితమైంది. నాటకంగా కూడా ఈ నవల రంగస్థలంపై విజయాన్ని సాధించింది. హెరాల్డ్ ఆర్లెన్‌తో కలసి *ది హౌస్ ఆఫ్ ఫ్లవర్స్* (1954) అనే సంగీత రూపకాన్ని కపోటే తయారు చేశాడు. *బీట్ ది డెవిల్* (1954), అనే చలన చిత్రం కోసం హెన్రీ జేమ్స్

రచించిన *టర్న్ ఆఫ్ ది స్క్రూ* అనే నవలను కపోటే రూపాంతరీకరించాడు. *లోకల్ కలర్-1950* ఆయన పర్యటనానుభవాలను చిత్రించే వ్యాసాల సంకలనం. రష్యాలో తన పర్యటనానుభవాలను పురస్కరించుకుని 1956 లో *మ్యూజెస్ ఆఫ్ హెర్డ్* అనే రచన చేశాడు. మాన్ హట్టన్ లోని ఒక వ్యభిచారిణి జీవితాన్ని *బ్రేక్ ఫాస్ట్ ఎట్ టిఫానీస్* (1958) అనే నవలికలో అత్యంత సానుభూతితోను, వాస్తవికంగాను చిత్రించాడు. పత్రికా ప్రపంచంతోను, ప్రసిద్ధ వ్యక్తులతోను తనకుగల అనుభవాన్ని ఆధారంగా చేసుకొని *అబ్జర్వేషన్స్* (1959), *ది డాగ్స్ బార్క్* (1973) వంటి రచనలు చేశాడు. ముప్పై సంవత్సరాలుగా రచించిన వ్యాసాలను *మ్యూజిక్ ఫర్ కేమెలియాన్స్* (1980) అనే పేరుతో ప్రచురించాడు. *ఎస్క్వైర్* (*Esquire*) పత్రికలో *ఆన్సర్డ్ ప్రేయర్స్* అనే శీర్షికతో 1975 లో ఒక వ్యాస పరంపరను కపోటే ప్రారంభించాడు. కాని మధ్యలో ఆయన మరణించడంతో ఆ వ్యాస పరంపర అసంపూర్తిగానే మిగిలిపోయింది.

ఎస్.ఎస్.ప్ర.

**కమిస్సో, అడెల్‌బెర్ట్ వాన్ (1781-1838) :** బెర్లిన్ కాల్పనికోద్యమ కవులలో మిక్కిలి ప్రతిభావంతులలో ఒకడు. గొయిథే వ్రాసిన *ఫౌస్ట్* వంటి కల్పితకథగా *పీటర్ ష్లెమిల్స్ రిమార్కబుల్ స్టోరీ* ని రచించి సువిఖ్యాతుడైనవాడు.

కమిస్సో పూర్తిపేరు 'లూయీ చార్లెస్ అడిలైడ్ కమిస్సో బాన్‌కోర్ట్'. ఇతడు 1781 జనవరి 30 న ఫ్రాన్స్‌లోని షాంపేన్ నగరంలో జన్మించాడు. ఫ్రాన్స్ విప్లవజ్వాలలలో మునిగి ఉన్న రోజులలో ఇతని కుటుంబం ప్రష్యాలోని వుర్జ్‌బర్గ్ నగరంలో తలదాచుకుంది. అక్కడ నుంచి బెర్లిన్ చేరుకుంది. తన 17 వ ఏట ఇతడు ప్రష్యా దేశపు పదాతిసైన్యంలో చేరాడు. విప్లవానంతరం ఇతని కుటుంబం ఫ్రాన్స్‌కి తిరిగి వెళ్లిపోయినా ఇతడు మాత్రం బెర్లిన్‌లోనే ఉండి భాషాశాస్త్రం, తత్త్వశాస్త్రం అధ్యయనం చేశాడు. 'సెరెస్‌దువర్నే' తో ఇతని పరిచయం ఇతనిలో నిగూఢంగా ఉన్న కవితాశక్తిని మేల్కొలిపింది. 1804-1806 మధ్యకాలంలో ఇతడు మరికొందరితో కలసి *ది బ్లెనర్ ముసెనాల్‌మనాక్* అనే పత్రికను వెలువరించాడు. తన తొలి కవితా ఖండాలను ఆ పత్రికలోనే ప్రచురించాడు. 1804 లో ఉత్తర జర్మనీ లోని యువ కవులను సంఘటిత పరచి *నార్డ్ స్టెర్న్‌బుండ్* అనే పేరుతో ఒక కాల్పనిక కవితా సమితిని స్థాపించాడు. 1807-08 సంవత్సరాలలో కమిస్సో ఫ్రాన్స్, స్విట్జర్లాండులలో పర్యటించాడు. ఫ్రాన్స్‌లోని ప్రసిద్ధ రచయిత్రి మదాం స్టేల్ తోను, ఆమె స్నేహితురాలు హెల్మినా ఫాన్ చేజీ అనే మరొక రచయిత్రితోను ఇతనికి సన్నిహిత పరిచయం ఏర్పడింది. బెర్లిన్ తిరిగి వచ్చిన తరువాత వృక్షాది శాస్త్రాధ్యయనం చేశాడు. 1813 లో తన రచనలలో మిక్కిలి విశిష్టం, విఖ్యాతం అయిన కావ్యం *పీటర్ ష్లెమిహిల్* రచించాడు. ఈ కావ్యంలో కమిస్సో ఫ్రాన్స్ నుంచి విముక్తికోసం జర్మనీ చేస్తున్న యుద్ధం వల్ల తనలో చెలరేగిన మానసిక సంక్షోభాన్ని ప్రదర్శించాడు. 1815 లో 'ఓటోఫాన్ కుజబూ' నాయకత్వంలో వైజ్ఞానిక రంగంలో సరికొత్త ప్రయోగాలు నిర్వహించేందుకు రష్యన్ నౌక 'రూరిక్' భూ ప్రదక్షిణం చేయడానికి బయలుదేరింది. ఆ నౌకలో వృక్షశాస్త్రజ్ఞునిగా కమిస్సో 3 ఏళ్లపాటు ప్రయాణించి ఆ విజ్ఞానశాస్త్ర విశేషాలను తన డైరీలో వ్రాశాడు. ఆ డైరీ 1821 లో ప్రచురితమై వైజ్ఞానిక సాహిత్యంలో విశిష్టమైన స్థానాన్ని సంపాదించుకుంది. కమిస్సో బెర్లిన్‌లోని బొటానికల్ గార్డెన్స్ పర్యవేక్షకుడుగా నియమితుడై శేషజీవితం అక్కడే గడిపాడు. 1819 లో అతడు ఆంటోనీ పియాస్టే అనే ఆమెను వివాహ మాడాడు.

1828-32 మధ్య కమిస్సో ఎన్నో గేయాలు, జానపద కథాగేయాలు, కథాకావ్యాలు రచించాడు. 'టెర్జారీమా' అనే త్రిపదీ ఛందస్సులో ఇతడు విశేషంగా కృషి చేశాడు. కమిస్సో గేయాలలో *ఫాయెకలీబె ఉండ్ ఫ్రాయెన్ లెబెన్* అనేది విశ్వవిఖ్యాతమైంది. దీనికి రాబర్ట్ షూమన్ సంగీతం కూర్చాడు. ఇతని కవిత్వం మీద గొయిథే, లుడ్విగ్‌ల ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది. ఫ్రెంచ్ కవి పీరేజీన్ డి బెరాన్జర్ వ్రాసిన రాజకీయ భావగీతాల ధోరణిని కమిస్సో జర్మన్ భాషలో ప్రవేశపెట్టాడు. 1838 ఆగస్ట్ 21 న కమిస్సో బెర్లిన్ నగరంలో కన్నుమూశాడు.

*గం.శ్రీ.*

**కమూ, ఆల్బెర్ట్ (1913-60) :** ప్రముఖ ఫ్రెంచ్ నవలా రచయిత, వ్యాస రచయిత, నాటకకర్త. మొదట ఫ్రాన్స్‌లో, తర్వాత యూరప్‌లో, ఆటు తర్వాత ప్రపంచ మంతటా సమకాలీన తరానికి ప్రతినిధి గాను, తర్వాతి తరానికి సలహాదారు గాను గుర్తింపు పొందాడు. రెండవ ప్రపంచయుద్ధానంతరం ఆల్బెర్ట్ కమూ నవలా రచయితగాను, నాటకకర్తగాను నైతిక సిద్ధాంత ప్రవక్తగాను రాజకీయ సిద్ధాంత ప్రవక్తగాను పేరు పొందాడు. యుద్ధానంతరం మేధావుల భ్రమలను తొలగించిన పరిస్థితిని ఆయన రచనలు చక్కగా ప్రతిబింబించాయి. పరాయి

జగత్తులో మానవుని ఏకాకితనం, 'చెడు' ను గురించిన సమస్య, తోసుకు వచ్చే మరణం - వంటి విషయాలను గురించిన ప్రస్తావన వాటిలో ఉంది. తన సమకాలీనులలో చాలమంది బోధించే శూన్యవాదాన్ని ఆయన అర్థంచేసుకున్నప్పటికీ, సత్యం, ధర్మం వంటి విలువలను పరిరక్షించవలసిన ఆవశ్యకతను గురించి ఆయన వాదించాడు. ఆయన 46 వ సంవత్సరంలో చనిపోయే ముందు తన చివరి రచనలలో క్రైస్తవ మతం లోనూ, మార్క్సిజమ్ లోనూ ఇమిడి ఉన్న విశ్వాసాలను త్రోసిపుచ్చి, వాటి స్థానంలో ఉదారమైన మానవత్వాన్ని ప్రతిపాదించాడు.

ఆయన అల్జీరియాలో మండోవీ లో 1913 నవంబరు 7 న జన్మించాడు. ఒక ఏడాది తిరుగకుండానే ఆయన తండ్రి మొదటి ప్రపంచ యుద్ధంలో చనిపోయాడు. ఆయన తల్లి దాసీగా పని చేసి కుటుంబాన్ని పోషించింది. కమూ, ఆయన అన్న లూసియన్, తల్లి, అమ్మమ్మ, మేనమామలతో అల్జీర్స్‌లో శ్రామిక వాడలోని ఒక చిన్న ఇంట్లోకి మారారు. కమూ మొట్టమొదట ప్రచురించిన వ్యాస సంపుటిలో (1937) ఆ నాటి భౌతిక వాతావరణం, తనతల్లి, అమ్మమ్మ, మేనమామల వర్ణనలు ఉన్నాయి. 1938 లో వచ్చిన నోసెస్ అనే రెండవ వ్యాస సంపుటిలో ఆల్జీరియాలోని పల్లె ప్రాంతం గురించి గేయ రూపమైన వర్ణనలు ఉన్నాయి. ఇందులో ప్రకృతి సౌందర్యాన్ని ఒక సంపదగా గుర్తించి దాన్ని నిరుపేదలు కూడా అనుభవించ గలరని చెప్పాడు. ఈ రెండు సంపుటాలలో మానవుని అశాశ్వత జీవితాన్ని భౌతిక ప్రపంచపు శాశ్వత లక్షణంతో పోల్చి చూస్తాడు.



CAMUS, ALBERT
France

1918 లో కమూ ప్రాథమిక పాఠశాలలో చేరాడు. అదృష్ట వశాత్తు లూయీ జెర్మెయిన్ అనే గొప్ప ఉపాధ్యాయుని వద్ద చదువుకున్నాడు. ఆయన ద్వారా అల్జీర్స్ ఉన్నత పాఠశాలలో చదువుకోవడానికి ఉపకార వేతనం సంపాదించాడు. (34 సంవత్సరాల తర్వాత నోబెల్ బహుమానం అందుకునే సమయంలో చేసిన తన ప్రసంగాన్ని తన గురువైన జెర్మెయిన్‌కు అంకితం చేశాడు. గురువు పట్ల ఆయన విశ్వాసానికి ఇది చక్కని ఉదాహరణ). తర్వాత 'వివేక' (Intellectual), 'ప్రబోధ' (awakening) దశ వచ్చింది. అప్పుడు ఫుట్‌బాల్, ఈత, కుస్తీ (Boxing) వంటి క్రీడలలో ఆయన ఎక్కువ ఆసక్తి చూపాడు. 1930 లో క్షయ రోగం ఆయనను పీడించింది. అందువలన ఆయన ఆటలకు స్వస్తి చెప్పాడు. ఆయన చదువుకు కూడా కొంత అంతరాయం ఏర్పడింది. 15 ఏళ్ల పాటు నివసించిన చిన్న ఇల్లు కుటుంబం వదలి స్వశక్తితో జీవించా లనే ఉద్దేశ్యంతో ఆయన అనేక రకాల ఉద్యోగాలు చేస్తూ అల్జీర్స్‌లోని విశ్వవిద్యాలయంలో తత్త్వశాస్త్రంలో విద్యార్థిగా కూడా ఉండేవాడు.

ఆ విశ్వవిద్యాలయంలో తన అధ్యాపకులలో ఒకరైన జా గ్రెనియె వలన ఆయన ఎక్కువగా ప్రభావితుడయ్యాడు. కమూ సాహిత్య తత్త్వ సంబంధమైన భావాలు వికసించడానికి ఆ గురువు ఎంతో సాయం చేశాడు. గురుశిష్యు లిద్దరికీ ఫుట్‌బాల్ అంటే ఎక్కువ మోజు. ప్లోటైనస్, సెయింట్ ఆగస్టీన్‌ల తాత్త్విక రచనలలో గ్రీక్ క్రైస్తవ ప్రభావాలకు సంబంధించిన ఒక సిద్ధాంత వ్యాసం వ్రాసి, 1936 లో ఆయన డాక్టరు పట్టం పొందాడు. మళ్లీ క్షయరోగం తీవ్రం కావడంతో విశ్వవిద్యాలయంలో ఉపన్యాసకుడుగా చేరే అర్హతను కోల్పోయాడు. ఆరోగ్యం కోలుకోడానికి ఫ్రాన్స్‌లోని ఆల్ప్స్ పర్వతాలకు వెళ్లి ఫ్లారెన్స్ పైసా, జినోవాల మీదుగా అల్జీర్స్‌కి తిరిగి వచ్చాడు.

1930-40 మధ్య కమూ తన వ్యాపకాలను విస్తృత పరుచుకున్నాడు. ఫ్రెంచ్‌లో ఉత్తమ రచయితల రచనలను చదివాడు. సమకాలీనులైన జీద్ (Gide), మెతర్‌లా మాలాల రచనలు కూడా చదివాడు. అల్జీర్స్ లోని యువ వామపక్ష మేధావులలో ప్రముఖుడయాడు. 1934-35 లో కమ్యూనిస్ట్ పార్టీ సభ్యుడుగా ఉండేవాడు. శ్రామికుల నాటక రంగం కోసం నాటకాలు వ్రాసి, స్వయంగా వాటిలో నటించి, వాటికి దర్శకత్వం కూడా వహించేవాడు. సుప్రసిద్ధ నాటకాలను శ్రామికులకు అందచేయడమే ఈ నాటకరంగం ప్రధాన ధ్యేయం. జీవితాంతం నాటకరంగం పట్ల విశేషమైన అభిమానం చూపాడు. కాని ఆయన నాటకాలకు ఎక్కువ ఆదరణ లభించలేదు. అయితే 1944-45 సంవత్సరాలలో మొదటిసారిగా ప్రదర్శించిన *లా మాలెన్ తెండు, కలిగుల* వంటి నాటకాలు 'అసంగత' (absurd) నాటకరంగంలో మరపురానివిగా పరిగణించవచ్చు. ఫాక్నర్ (Faulkner)—

వ్రాసిన *రిక్వాయమ్ ఫర్ ఏ నన్*, డాస్టోయ్‌విస్కీ వ్రాసిన *పొజెస్డ్* అనే నవలలను కమూ నాటకీకరించాడు. నాటక రంగానికి ఆయన చేసిన సేవలో ఈ రెండు అనుకరణలు ప్రధానంగా పేర్కొనదగినవి.

రెండవ ప్రపంచ యుద్ధానికి కొద్ది కాలం క్రితం కమూ ఒక పత్రికలో పని చేశాడు. దానిలో సార్త్ (Sartre) గ్రంథాలను సమీక్షించాడు. అల్జీరియాలోని కబిలై ప్రాంతం లోని ముస్లింల సాంఘిక పరిస్థితులను గురించి కొన్ని వ్యాసాలు వ్రాశాడు. ఈ వ్యాసాలు 1958 లో పుస్తక రూపంలో అచ్చు అయాయి.. 1954 లో జరిగిన అల్జీరియా యుద్ధానికి 15 సంవత్సరాల క్రితమే ఆ యుద్ధానికి కారణమైన అక్రమాలవైపు, అన్యాయాల వైపు కమూ దృష్టి మరల్చాడు. రాజకీయ సైద్ధాంతిక కారణాలమీద కాక, మానవత్వం విలువలపై ఆయన తన వాదాన్ని ప్రతిపాదించాడు. వలస రాజ్యపు అన్యాయాలను మరచి పోకుండా, ఫ్రాన్స్‌కి అల్జీరియాలో నిర్వహించవలసిన ఒక ముఖ్యపాత్ర ఉంటుందని ఆయన వ్రాశాడు.

పత్రికా రచయితగా ఆయన ఫ్రాన్స్ ఆక్రమణ చివరి సంవత్సరాలలోనూ, ఫ్రాన్స్ విముక్తి పొందిన వెంటనే ప్రముఖ పాత్ర వహించాడు. *కాంబాట్* (Combat) అనే పత్రికా సంపాదకుడుగా ఆయన స్వతంత్ర మైన వామపక్ష దృక్పథాన్ని ప్రచారం చేశాడు. ఈ దృక్పథానికి ఆధారం న్యాయం, సత్యం అనే ఆదర్శాలు. రాజకీయ చర్యలన్నీ గట్టి నైతిక పునాదులమీద ఆధారపడి ఉండాలని ఆయన విశ్వాసం. తర్వాతి పరిస్థితుల వలన ఆయనకు కొన్ని భ్రమలు తొలగాయి. 1947 లో ఆపత్రికతో ఆయన తెగతెంపులు చేసుకున్నాడు.

అప్పటికే కమూ ప్రముఖ సాహితీ వేత్తలలో ఒకడుగా గుర్తింపు పొందాడు. 1942 లో ప్రచురించిన *లా ఎ్ట్రేంజర్* ఆయన మొదటి నవల. 20 వ శతాబ్దంలో ఒక 'నిర్లిప్తుని' (Out sider) లక్షణాలను ఆయన ప్రతిభతో చిత్రించాడు. ఆ 'నిర్లప్తుడు' ఒక అరబ్బు జాతీయుని చంపిన నేరస్థుడు. కాని సంఘం చేసిన తీర్పులను ఆయన ఒప్పుకోకపోవడం తను నిజంగా అనుభవించిన దాన్ని మించి ఏమీ మాట్లాడకపోవడం అంతకంటె ఘోరమైన నేరాలుగా కోర్టు పరిగణిస్తుంది. ఆదే సంవత్సరంలో *లా మిత్ డి సిసిఫె* అనే తాత్త్విక వ్యాసం వ్రాశాడు. దీని ప్రభావం అపారం. దీనిలో ఆయన సమకాలీన శూన్యవాదాన్ని (Nihilism), అసంగత (absurd) పరిస్థితిని సానుభూతితో వివరించాడు. ఆయన రెండవ నవల *లా ప్లేగ్* (1947) లో కమూ శూన్యవాదాన్ని అధిగమించడానికి ప్రయత్నించాడు. ఇది ప్రతీకాత్మక (Symbolic) రచన. దీనిలో ఓరన్ అనే పట్టణంలో తీవ్రమైన అంటువ్యాధి వ్యాపించినపుడు అక్కడి ప్రజల ప్రవర్తన చిత్రించబడింది. ఆ మహావ్యాధిని ఎదుర్కొని, అణచి వేయడానికి వారు అశక్తులైనా వారి స్నేహ భావం, మానవ సహజమైన హుందాతనం ఈ నవలలో ప్రకటించబడ్డాయి. దీనిలో ఆయన 'అసంగతత్వ' వాదం నుంచి ఎదిగి, నైతిక తాత్త్విక తిరుగుబాటుకు సిద్ధపడ్డాడు. ఈ రెండూ ఆయనలో కనిపించే ప్రధానమైన భావాలు. *లా హూమ్ రివోల్తే* (1951) అనే సుదీర్ఘమైన రెండవ వ్యాసంలో రాజకీయ-చారిత్రక విప్లవాన్ని నైతిక తాత్త్విక తిరుగుబాటుతో ఆయన పోల్చాడు. దీనివలన మార్క్సిస్టు విమర్శకులు జ్యాఁ పాల్ సార్త్ వంటి వారి ఆగ్రహానికి గురి అయాడు. తర్వాత కథానికల సంపుటం *లా ఎక్సైల్ ఎట్ లా రోయమ్* (1957)లో వచ్చింది. *షూట్* (1956) అనేనవల క్రైస్తవమత సంబంధమైన ప్రతీకావాదం (Symbolism)తో కూడిఉంది.

1957 లో తన 44 వ ఏట కమూ నోబెల్ బహుమానం అందుకున్నాడు. తన సహజ వినయంతో ఆ బహుమతిని ఆండ్రీ మాల్రాకు తాను ఇచ్చి ఉండేవాడిని అని చెప్పాడు. 1960 లో కారు ప్రమాదంలో కమూ మరణించాడు.

ఇ.నా.

**కమేయేస్, లూయీ డి (1525-1580) :** పోర్చుగల్ దేశపు జాతీయ మహాకవి. *ఓస్ లూసియాడస్* (1572 - Oslusiadas) అనే మహాకావ్య రచయిత. పోర్చుగీస్ చరిత్రలోని ప్రధాన సంఘటనలను వర్ణించే కావ్యం ఇది.

కమేయేస్ జీవిత విశేషాలను గురించి విశేష పరిశోధన జరిగింది. 1524 లోనో, 1525 లోనో 'లిస్బన్' నగరంలో ఈయన జన్మించినట్లు భావించబడుతూంది. ప్రాచ్య దేశాలలో పోర్చుగీస్ రాజ్యవిస్తరణ ఉద్యమం పరాకాష్ఠ అందుకొన్న రోజు లవి. ఈయన ప్రపితామహుడు 'వాస్కో పెరెస్ డి కామోన్స్' గాల్ (ఫ్రాన్స్) దేశం నుంచి రాజకీయ కారణాల వల్ల 14 వ శతాబ్దం తుది పాదంలో పోర్చుగల్‌కు వలస వచ్చిన వాడని ఆయన జీవిత చరిత్ర కారులు అంటున్నారు. ఆయన 'కోయింబ్రా' విశ్వవిద్యాలయంలో చదివాడని కొందరూ, అసలు ఏ విశ్వ విద్యాలయంలోనూ చదవలేదని కొందరూ అంటున్నారు. అయినా, సనాతన,

అధునాతన సంస్కృతులలోను, తత్త్వశాస్త్ర పాండిత్యం లోను ఆ నాటి యూరపియన్ కవులలో కమేయేస్‌కు సాటి రాగల వారెవరూ లేరు. తన యౌవన కాలంలో కమేయేస్ పోర్చుగీస్ వలస అయిన మొరాకోలో కొంత కాలం గడపినట్లు పరిశోధకులు భావిస్తున్నారు. అయితే అక్కడికి ఆయనను ప్రవాస శిక్ష విధించి పంపిచారో, లేక సైనిక శిక్షణ పొంది ప్రభుత్వ అనుగ్రహం పొందడానికి తానే స్వయంగా వెళ్లాడో నిశ్చితంగా తెలియదు. 1553 లో ఒక బజారు కలహంలో చిక్కుకొని ఒక ప్రభుత్వాధికారిని కొట్టిన నేరాన్ని 3 వ జాన్ రాజు మన్నించా డనీ, ప్రభుత్వోద్యోగిగా కమేయేస్ భారతదేశం వెళ్లాలని ఆ క్షమాపత్రంలో సూచించబడిందనీ తెలుస్తోంది. సుమారు 17 ఏళ్ల పాటు కమేయేస్ భారత దేశంలో ఉన్నాడు. అయినా ఆ కాలంలో అతని జీవిత విశేషాలను తెలుసుకునేందుకు ఎలాంటి ఆధారాలూ లభించడం లేదు. కాని, ఆయన రచనలలోని కొన్ని అంశాలు ఆ నాటి భారత దేశపు సాంఘిక పరిస్థితులతో ఆయనకు ప్రత్యక్ష పరిచయం ఉన్నట్లు సూచిస్తున్నాయి.

కమేయేస్ జీవిత కాలంలో ఆయన రచించిన మహా కావ్యం కాక మరి మూడు ప్రశంసాత్మక రచనలు మాత్రమే ప్రకటించబడ్డాయి. వాటిలో ఒకటి: *భారత దేశం లోని ఓషధులు* (1563). రెండవది: *ఒక సానెట్*; మూడవది: బ్రెజిల్ అని సాధారణంగా పిలువబడే *శాంతా క్రుజ్ రాష్ట్ర చరిత్ర* (1576). 'టెర్జారిమా' అనే ఛందస్సులో ఈ రచన సాగింది. ఆయన రచించినట్లు భావించబడుతున్న రెండు నాటకాలు 1587 లో లిస్బన్‌లో ప్రకటించబడ్డాయి. అప్రకటితంగా ఉండిపోయిన ఆయన పద్యాలు మొదటి సారి 1595 లో ప్రకటించబడ్డాయి. అయితే వాటిలో కొన్నిటికి అప్పటికే స్పానిష్ అనువాదాలు వెలువడ్డాయి. ఆయన మరణించిన సంవత్సరమే *ది లూసియాడ్స్* కి రెండు విభిన్న అనువాదాలు స్పానిష్ భాషలో ప్రకటించ బడ్డాయి. తరువాత వచ్చిన కమేయేస్ రచనల ప్రచురణలలో 19 వ శతాబ్దం చివరివరకూ క్రమంగా ఎన్నెన్నో ప్రక్షిప్తాలు చేరుతూ వచ్చాయి.

'ప్రేమ' ను భగవత్ స్వరూపంగా భావించే 'నియో ప్లాటోనిస్ట్' భావధారకు చెందిన వాడు కమేయేస్. ఆయన మిక్కిలి కాముకుడు, అయినా నిజాయితీ కోసం, ఆత్మ గౌరవం కోసం ఆరాట పడిన వాడు. మానవ జీవితం కర్మాధీనం అనీ, ఉత్తర లోకంలో దేవుని సమక్షంలో ఒక స్వర్గంలో ఉంటూ మనిషి తన పాపాలను క్షాళితం చేసుకుంటా డనీ ఆయన విశ్వసించేవాడు. 'సెబాస్టియన్' రాజుకు తప్ప తన కావ్యాలను ఎవ్వరికీ ఆయన అంకితం చేయలేదు. ఎవ్వరినీ తన రచనలలో స్తుతించలేదు. తన కుటుంబ అనుబంధాలనూ, మిత్రులతోడి అనుబంధాలనూ అనేకం ఆయన తన కావ్యంలో చొప్పించాడు.

1580 జూన్ 10 వ తేదీన లిస్బన్ నగరంలో కమేయేస్ తుది శ్వాస విడిచాడు.

బొ.శ్రీ.

**కర్దూచీ, జియోస్యూ (1835-1907) :** ఇటాలియన్ కవి. 1906 లో నోబెల్ బహుమతి గ్రహీత. పీజా విశ్వవిద్యాలయంలో విద్యనభ్యసించిన తరువాత బలోన్యాలో ఇటాలిన్ సాహిత్య విభాగం ప్రధానాచార్యుడుగా పని చేశాడు. 1890 లో జీవితాంతం కొనసాగే సెనేటర్‌గా నియమింపబడ్డాడు. జాతీయ కవిగా ఇతడు ఇటాలియన్‌ల మన్నన లందుకున్నాడు.

ఆ రోజుల్లో కవిత్వంలో నెలకొన్న కాల్పనిక ధోరణులను తొలగించి, సాంప్రదాయిక రీతులను తిరిగి ప్రవేశపెట్టాలని కార్దూచీ నిశ్చయించుకున్నాడు. జూసెపి పారిని (Gieuseppe parini), విన్సెన్జో మోన్టీ (Vincezo Monti), యుజో ఫాస్కొలో ఇతనికి గురు తుల్యులు. ఇతడు వెలువరించిన మొదటి కవితా సంకలనాల్లో వారి ప్రభావం కనబడుతుంది. *ఇనో ఎ సటానా* (Inno a satana-1863, "శాటన్ ప్రార్థన గీతం") వైయక్తిక, రాజకీయ, సామాజిక, మత రంగాలలో ఇతని గాఢమైన స్వేచ్ఛా కాంక్షను వ్యక్తపరుస్తుంది. ఆ నాటి రాజకీయ పరిస్థితే ఈ కవితకు ప్రధాన ప్రేరణ. కవిగా అతని వ్యక్తిత్వాన్ని ఈ గ్రంథం ప్రకటిస్తోంది. 1880 లో వెలువడిన *రైమ్ నొవి* (*Rime nuove*), *ఒడి బార్బరి* (*Odi barbare*) అతని కవితాశక్తికి ప్రతీకలుగా నిలచాయి.

వి.వి.సు.

**కల్వీనో, ఇటాలో (1923-1985) :** ఇటలీ దేశపు పత్రికా రచయిత, కథానికా రచయిత, నవలా రచయిత. ఈయన తన వక్రోక్తులవల్లా, వికటతర్కం వల్లా 20 వ శతాబ్దపు ఇటాలియన్ రచయిత లందరిలో ఎక్కువ జనరంజకు డయాడు. ఇటలీ దేశంలో అనేక సాహిత్య పురస్కారాలను అందుకొన్న కల్వీనో *అవర్ ఏన్సెస్టర్స్* అనే సంపుటంలో చేరిన మూడు భావనాత్మక కథలవల్ల అంతర్జాతీయంగా పేరు పొందాడు.

కల్వీనో నడివయస్సులో క్యూబాను విడచి ఇటలీ వెళ్లాడు. రెండో ప్రపంచ యుద్ధంలో ఈయన ఇటాలియన్ రెసిస్టెన్స్ ఉద్యమంలో చేరాడు. ఆ తరువాత

టొరినో (ట్యూరిన్)లో స్థిరపడి *ఎల్ యూనిట* అనే కమ్యూనిస్ట్ పత్రికలోను, 'ఐ నాంది' అనే ప్రచురణాలయంలోనూ పనిచేస్తూ సాహిత్యంలో ఆరితేరాడు. 1959 మొదలుకొని ఎలియో విట్టోరిని తో కలిసి *ఇల్ మెనొబె డి లిటరేచర్* అనే పత్రికకు సంపాదకత్వం వహించాడు.

కల్వినో మొదట్లో వ్రాసిన రెండు కథాత్మక రచనలకు ఇటాలియన్ రెసిస్టెన్స్ ఉద్యమం స్ఫూర్తి నిచ్చింది. *ది పాత్ టు ది నెస్ట్ ఆఫ్ స్పైడర్స్*, (1947) అనే వాస్తవిక నవల రెసిస్టెన్స్ ఉద్యమాన్ని నిస్సహాయస్థితిలో ఉన్న ఒక తరుణ వయస్కుని అనుభవాలను తెలుపుతుంది. రెండోది *ఆడమ్, వన్ ఆఫ్టర్‌నూన్* మరియు తదితర కథలు (1949).

తరువాత వాస్తవిక రచనలను వదలి మళ్ళీ కల్వినో కల్పనాత్మక రచనలను, ఆలంకారిక రచనలను చేస్తూ వచ్చాడు. 1950-60 దశకంలో ఈయన వ్రాసిన మూడు నీతి కథలకు ప్రఖ్యాతి వచ్చింది. వీటిలో మొదటిది *ది క్లోవెన్ వైకౌంట్* (1952). ఇందులో ఒక వ్యక్తి ఫిరంగి దెబ్బ వల్ల రెండుగా-సగం మంచి, సగం చెడుగా చీలి పోతాడు. ఒక పల్లెటూరి పిల్ల మీద కలిగిన ప్రేమ ద్వారా అతడు తిరిగి పూర్తి మనిషి అవుతాడు. రెండోది *ది బేరన్ ఇన్ ది ట్రీస్* (1959). చెట్ల కొమ్మల మధ్యలో తాను హాయిగా ఏర్పరచుకొన్న సంపూర్ణ జీవనం నుంచి దిగి రావడానికి నిరాకరించిన 19 వ శతాబ్ది జమీందారు ఇతివృత్తంతో ఆహ్లాదకరంగా నడచిన కథ ఇది. మూడోది *ది నాన్‌ఎగ్జిస్టెంట్ నైట్* నవ వాస్తవిక వాద ధోరణిలో వ్యంగ్యంగా రచించిన ఒక పౌరాణిక కథ ఇది. తరువాతి కాలపు రచనలలో రెండు కథా సంపుటులూ, ఐదు నవలలూ ఉన్నాయి.

పో.ద.

**కవాబాటా, యాసునారీ (1899-1972) :** 1968 లో నోబెల్ సాహిత్య బహుమతి పొందిన జపనీస్ నవలా రచయిత. సంప్రదాయ జపనీస్ సాహిత్యంలో అధునాతన భావాలను ప్రవేశపెట్టి, తనకుండే ఒంటరితనాన్ని, మృత్యుభీతిని తన వ్రాతలలో ధ్వనింపజేశాడు. బాల్యంనుంచి యౌవనంలో అడుగు పెట్టేవరకూ సమీప బంధువులను పోగొట్టుకొని ఒంటరితనంతో పెరగడం వల్ల ఆ భావాలే ఈతని రచనలలో ప్రతిబింబించినట్లు తోస్తుంది.

టోక్యో ఇంపీరియల్ విశ్వవిద్యాలయం నుంచి పట్టభద్రుడై *ఇజు నో ఒడొరికో* (1926) అనే జీవిత చరిత్ర సదృశ రచనతో కవాబాటా సాహిత్య రంగ ప్రవేశం చేశాడు. 'యొకోమిత్సురీచి' తో కలసి ఆయన నడిపిన *బుంగెయ్ జిదాయ్* (కళా యుగం) అనే పత్రికలో దానిని ఆయన ప్రచురించాడు. కవాబాటాకు సంబంధం ఉన్న నియో సెన్సువలిస్ట్ వర్గానికి ఇది వేదికగా ఉపయోగపడింది. మొదటి ప్రపంచ యుద్ధ కాలం నాటి ఫ్రెంచ్ సాహిత్య రీతు లయిన డాడాయిజం, ఇంప్రెషనిజం, క్యూబిజం నుంచి నియోసెన్సువలిస్ట్‌వాదం ఉత్తేజం పొందింది. సుందర, వికార రూపాలను కలిపి చిత్రించడం, ప్రతీకలను కలగాపులగం చేయడం వంటి లక్షణాల ప్రభావం కవాబాటా మీద ఎక్కువగా కనిపిస్తుంది. 17 వ శతాబ్దంలోని జపనీస్ గద్యంలోనూ, 15 వ శతాబ్దంలోని *రెంగ* (గొలుసు పద్యం) లోనూ ఇవే లక్షణాలు కనిపిస్తాయి.

*'రెంగా'* ను మృదు రచనగా మలచడం కవాబాటా ప్రత్యేకత. 1935 లో మొదలు పెట్టిన కవాబాటా ప్రముఖ నవల *యుకిగుని* (1948) పన్నెండేళ్ల తరువాత తుదిరూపం సంతరించుకొంది. 1949 లో ప్రారంభమయిన *సెంబుజూరు* (వెయ్యి కొంగలు) అసంపూర్తిగానే మిగిలి పోయింది. *యమానోబతా* (1949-54), 'మంచు పర్వతం' (1970) ఆయన నవలలలో ప్రఖ్యాతి పొందినవి.

జీవితంలో మృత్యువులో సౌందర్యాన్ని దర్శించడానికి ప్రయత్నించానని నోబెల్ బహుమతి స్వీకరిస్తూ కవాబాటా ప్రకటించాడు. మిషిమా యుకియో అనే తన స్నేహితుని మరణానంతరం కవాబాటా ఆత్మహత్య చేసుకొన్నాడు.

*గు.శం.*

**కష్నిట్జ్, మరీ లూయిా (1901-74) :** జర్మన్ కవయిత్రి, నవలా రచయిత్రి. ఈమె రచనలలో ఆశా భావం, కారుణ్యభావం ప్రస్ఫుటంగా కనిపిస్తాయి.

1901 జనవరి 31 వ తేదీన 'కార్ల్ లూహే' లో జన్మించిన మరీ లూయిా కష్నిట్జ్ 'పోట్స్‌డామ్' లోనూ, బెర్లిన్ లోనూ పెరిగి పెద్దదయింది. విద్యాభ్యాసం ముగిసిన తరువాత రోమ్‌లో ఆమె పుస్తకాల వ్యాపారం చేపట్టింది. పురాతత్త్వ శాస్త్రజ్ఞుడైన తన భర్తతో కలసి విరివిగా ఆమె దేశాటనం చేసింది. మధ్యధరా ప్రాంతంలో ఆమె చేసిన పర్యటనల వలన ఆమెకు కలిగిన సాంప్రదాయిక విజ్ఞానపు ప్రభావం ఆమె రచనల మీద ఎక్కువగా కనిపిస్తుంది. రెండవ ప్రపంచ యుద్ధానికి ముందు ఆమె రెండే రెండు నవలలు ప్రకటించింది: *లవ్ బిగిన్స్* (1933), *ఎలిస్సా* (1937):

యుద్ధానంతరం ఆమె చక్కని భావగీతాలు రచించింది. వాటిలో సాంప్రదాయిక, ఆధునిక పద్య ప్రక్రియలను, మౌలిక మైన పదజాలాన్నీ ఆమె వాడుక చేసింది. అట్టి ఆమె రచనలలో పేర్కొనదగినవి: *డాన్స్ ఆఫ్ డెల్ అండ్ పాయెమ్స్ ఆఫ్ ది టైమ్స్* (1947), 2. *మ్యూజిక్ ఆఫ్ ది ఫ్యూచర్* (1950). ఆమె ప్రకటించిన తరువాతి కవితా సంపుటాలలో ముఖ్యమైంది: *యువర్ సైలెన్స్, మై వాయిస్* (1962). భర్త వియోగం తరువాత ఆమె అనుభవించిన ఒంటరితనం, జీవితానికి ఒక క్రొత్త అర్థం కోసం ఆమె సాగించిన అన్వేషణ ఈ కావ్యంలో కనిపిస్తాయి.

కష్నిట్జ్ కొన్ని స్వీయ కథాత్మక నవలలు కూడా వ్రాసింది. *విదర్ దెన్ ఐ* (1963) అలాంటి రచన. *లాంగ్ షాడోస్* (1960) అనే ఆమె కథానికా సంపుటం కూడా ప్రశంసల నందుకుంది. కొన్ని సాహిత్యా వ్యాసాలను, శ్రవ్య, రంగస్థల నాటకాలను కూడా కష్నిట్జ్ రచించింది.

1974 అక్టోబరు 10 న రోమ్‌లో మరీ లూయీ కష్నిట్జ్ మరణించింది.

పో.ద.

**కాంగ్రీవ్, విలియమ్ (1670-1729) :** 17 వ, 18 వ శతాబ్దాలలో ఇంగ్లండులో లబ్ధప్రతిష్ఠుడైన ప్రముఖ నాటక రచయిత. స్టాఫర్డ్‌షైర్ లోని ఒక ఉన్నత కుటుంబానికి చెందిన కాంగ్రీవ్ డబ్లిన్‌లోని ట్రినిటీ కళాశాలలో విద్యాభ్యాసం చేసి, తన ఆనందం కోసం *ది ఓల్డ్ బాచిలర్* (*The Old Bachelor*) అనే నాటకాన్ని రచించాడు. అదృష్టవశాత్తు ఆ నాటకం డ్రైడెన్ వంటి కవుల మన్ననలను పొందగలిగింది. 1693 లో అది ప్రదర్శించబడింది. 1695 లో *లవ్ ఫర్ లవ్*, 1697 లో *ది మోర్నింగ్ బ్రైడ్*, 1700 లో *ది వే ఆఫ్ ది వరల్డ్* కాంగ్రీవ్ రచించాడు. ఈ నాడు అత్యధికంగా ప్రశంసింపబడుతున్న *ది వే ఆఫ్ ది వరల్డ్* ఆ రోజుల్లో విజయవంతం కాలేదు. ఆ నిరుత్సాహంతో కాంగ్రీవ్ నాటక రచన హఠాత్తుగా విరమించుకున్నాడు. ఆ నాటి పరిధులలో *లవ్ ఫర్ లవ్, వే ఆఫ్ ది వరల్డ్* సుఖాంత నాటకాలుగా మంచిపేరు తెచ్చుకున్నాయి. సంఘంలోను, సంసారంలోను ఉండే చిక్కులను చక్కని పాత్ర చిత్రణతోను, ఆకర్షకమైన సంభాషణా చాతుర్యంతోను కాంగ్రీవ్ తన నాటకాలలో ప్రదర్శించారు. హాస్య రచనలో కాంగ్రీవ్ అందె వేసిన చేయి. రెస్టోరేషన్ కాలంలోని హాస్యనాటక రచనకు కాంగ్రీవ్ ఊపిరి పోశాడు. *వే ఆఫ్ ది వరల్డ్* లో చతురత సంభాషణలు, స్త్రీల మనస్తత్త్వచిత్రణ, ఆ నాటి సంఘంలోని ఉన్నత వర్గాల ప్రజల కార్యకలాపాలు చిత్రించబడిన తీరు ప్రత్యేకంగా చెప్పుకోదగింది.

ఎస్.ఎస్.ప్ర.

**కాకినోమోటో హిటోమారో (--708) :** జపనీస్ సాహిత్యవేత్త, సంప్రదాయ సాహిత్యంలో పేరెన్నికగన్నవాడు. 'టంకా', 'చొకా' పద్య రూపాలను ఆ కాలం సాహిత్యంలో ప్రవేశ పెట్టినవాడు. 5, 7, 7 అక్షరాలతో మూడు పాదాల పల్లవి పునరుక్తమయే 'సెడొకను' మొదట ప్రవేశపెట్టినవాడు. అయితే ఈ ప్రయోగం ఈయన తరువాత విజయవంతం కాలేదు. *మన్‌యోషూ జపానీస్* సంకలనంలో కనిపించే 61 టంకాలు, 16 చొకాలు కాకినోమోటో రచనలే! ఈయనను గురించిన సమాచారం ఈయన రచనల ద్వారానే తెలుస్తుంది.



'నరా' వద్ద జన్మించి కోర్టులో చిన్న అధికారిగా ప్రవేశించి, ఇద్దరు రాజకుమారులను సేవించి, తన పద్యాలలో వారి రాజరికపు చర్యలనే వర్ణించాడు. తరువాత ప్రాంతీయాధికారం చేపట్టి ఇవామీ ప్రాంతంలో (ఇప్పుడు షిమాన్‌లో ఉంది) తనువు చాలించాడు. ఈయన కిద్దరు భార్యలు.

ప్రాచీన కాలంనాటి గేయం నుంచి, కొత్త తరం సాహిత్య ప్రక్రియలన్నింటిలోను ఆయన విజయం సాధించాడు. అన్ని రకాల కల్పనా రీతులను, విషయ వైవిధ్యాన్ని, సామ్రాజ్యవాద పద్య లక్షణాలను వారసత్వంగా పొంది ఆయన కొత్తరీతులను, భావనా విధానాలను, సాహిత్యా నిర్మాణ విధానాలను రూపొందించి (కొన్నింటిని చైనీస్ పద్యరూపాల నుంచి గ్రహించారు) నూతన గాంభీర్యంతో రచనలు చేశాడు.

హిటోమారో కవితలో సుకుమారమైన భావుకతతో పాటు మానవతాదృష్టి, పరులపట్ల జాలి కనిపిస్తాయి. 'ఓమి' అనే దాని పతనం గురించి ఆయన వ్రాసిన పద్యం హృద్యమైంది. 'అకీ' ప్రాంతంలో కారూ యువ

రాజు యాత్రల వర్ణన, తన ఇద్దరు భార్యల వియోగ సందర్భంలో ఆయన వ్రాసిన గేయాలు, 'తకేచి' యువ రాజుమృతి సందర్భంలో వ్రాసిన స్మృతిగేయం, 'సమిన్' ద్వీపంలో మానవ దేహంపై వ్రాసిన గీతాలు ఆయన రచనలలో మణిపూసల వంటివి.

*గు.శం.*

**కాథర్, విలా (సిబెర్ట్) (1873-1947) :** అమెరికన్ నవలా రచయిత్రి. *అలెగ్జాండర్స్ బ్రిడ్జ్* (1912) కాథర్ రచించిన మొదటి నవల. నగర జీవనాన్ని ప్రతిబింబించే ఒక వాస్తవిక కథ ఇది. *ఓ పయొనీర్స్* (1913), *మై ఏన్టోనియా* (1918) అనే నవలలలోని రంగస్థలం తాను చిన్ననాడు పెరిగిన నెబ్రాస్కా సరిహద్దు ప్రాంతం. యూరప్ నుంచి స్వీడిష్ వారు, రష్యన్‌లు, జర్మన్‌లు వలస వచ్చి ఈ ప్రాంతంలో స్థిరపడ్డారు. వాళ్ల మధ్య కాథర్ పెరిగింది. వారి ధైర్య సాహసాలు, పట్టుదల, ఈ నవలలలో కాథర్ కథావస్తువుగా తీసుకుంది. ఈ రెండు నవలలు ఆమె గొప్ప రచనలుగా పరిగణింపబడుతున్నాయి. ఈ ధైర్యోత్సాహాలు క్రమేణా క్షీణించడాన్ని *వన్ ఆఫ్ అవర్స్* (1922), *ఎ లాస్ట్ లేడీ* (1923) లలో ఆమె చిత్రించింది. 'వన్ ఆఫ్ అవర్స్' కు పులిట్జర్ బహుమతి లభించింది.

రాను రాను ఆమెలో గట్టి నిస్పృహ జనించింది. ఈ నిస్పృహ *ప్రొఫెసర్స్ హౌస్* (1925) లోనూ, ఆమె వ్యాస సంపుటి *నాట్ అండర్ ఫార్టీ* (1936) లోనూ కనబడుతుంది. కాని ఆమె కళ్ళ ఎదుట ఉడిగిపోయిన ధైర్యోత్సాహాలు ఫ్రెంచ్ కాథలిక్ మిషనరీలలోనూ (*డెత్ కమ్స్ ఫర్ ది ఆర్చ్‌బిషప్* - 1927), క్విబెక్‌లోని ఫ్రెంచి కెనెడియన్లలోనూ (*షేడోస్ ఆఫ్ ది రాక్*-1931) ఆమె చూసింది. మరి కొన్ని నవలలను, కథలను వ్రాయడమే కాక, ఒక కవితా సంపుటిని (ఏప్రిల్ ట్విలైట్స్ 1903) కూడా ఆమె వెలువరించింది. *పిట్స్‌బర్గ్ లీడర్* పత్రికకు నాటికా, సంగీత విభాగాల సంపాదకురాలుగా ఆమె కొన్నాళ్లు పనిచేసింది.

*వి.వి.సు.*

**కాన్రాడ్, జోసెఫ్ (1857-1924) :** పోలండ్‌లో జన్మించిన ఇంగ్లీష్ నవలా రచయిత. అసలు పేరు 'జోసెఫ్ తియోడోర్ కాన్రాడ్ కోర్జినోవిస్కీ. కాన్రాడ్ బాలుడుగా ఉన్నప్పుడు రచయిత అయిన తండ్రి ద్వారా తనకు ఆంగ్లభాషతో పరిచయం ఏర్పడింది. కాన్రాడ్‌ను సముద్రం బాగా ఆకర్షించింది. ఫ్రెంచ్, బ్రిటిష్ వాణిజ్య నౌకా దళాలలో 16 సంవత్సరాలు ఆఫీసరుగానూ, ఇతరహోదాలలోనూ పనిచేశాడు. ఈ నౌకాయానాలలో అతని అనుభవాలు తను వ్రాసిన చాలా నవలలకు ఆధారం అయాయి. ఉదాహరణ: *యూత్* అనే నవలిక, *ది నిగ్గర్ ఆఫ్ ది నార్సిసస్* అనే నవల. అతనికి పరిచయమైన వ్యక్తులు అతని నవలలలో పాత్ర లయారు. *నోస్ట్రొమో, ఆల్‌మేయర్స్ ఫాలీ, లార్డ్ జిమ్* మొదలైన నవలలూ ఇంకా అనేక కథానికలూ కాన్రాడ్ అనుభవాల నుంచి ఆవిర్భవించినవే.

అతడు రచించిన నవలిక *హార్ట్ ఆఫ్ డార్క్‌నెస్* ముఖ్యంగా పేర్కొనవలసినది. ఆఫ్రికాలోని కాంగో దేశం ఆ రోజులలో యూరపియన్ల రాజ్య దాహానికి గురి అయింది. కాన్రాడ్ అక్కడ తాను చూసిందీ, అనుభవించిందీ ఈ నవలికా రూపంలో వెల్లడించాడు. అది ఒక మరపురాని, అతనిని కదల్చి వేసిన అనుభవం. అంధకార అంతరాళం అంటే ఒక్క ఆఫ్రికా మాత్రమే కాదు (ఆరోజులలో ఆఫ్రికాను చీకటిఖండం అనేవారు). ఆ అంధకారం సృష్టిలోను, మనలోను ఉన్న దుష్ట శక్తుల్ని సూచిస్తుంది. మనలో అజ్ఞాతంగా ఉన్న దుష్ట శక్తులు ఎప్పుడో ఒకప్పుడు మనకు తెలియకుండానే మనం చాలా నాగరకులం అని అనుకుంటున్నప్పుడు మనలోని చెడును బయటపెట్టి మనలను దెబ్బ తీస్తాయి. ఆ క్షణంలో మానవుడు "హారర్! హారర్" ("ఎంత ఘోరం!") అని తనను గురించి తాను వాపోతాడు. అదే తనకు కనువిప్పు అవుతుంది. ఈ రచన కాన్రాడ్‌ను ఒక ద్రష్టగా చూపిస్తుంది. అతని జీవిత సిద్ధాంతాన్ని వెలువరిస్తుంది.

మానవుడు తన లక్ష్యసాధనకు చేసే యత్నాలు విఫల మవడమే కాకుండా, ఈ సృష్టి అతనిని నిర్లక్ష్యంగా చూస్తూ, అతని నిస్సహాయతను నిరూపిస్తోంది. ఆధునిక ఆంగ్ల నవలా సాహిత్యం మీద కాన్రాడ్ ప్రభావం చాలా ఉంది. నవలా రచనలో ఆయన చూపిన ధోరణులు తరువాతి రచయితలను ప్రభావితం చేశాయి. మానవుని హృదయాంతరాళంలో ఉన్న దుష్ట శక్తులు అతని పతనానికి ఎలా దారి తీస్తాయో, వాటిని ఎదుర్కోవాలంటే నిజాయితీ వంటి ఏ విలువలను మనం పెంచుకోవాలో, ఆ విలువలు మనలో లేనప్పుడు మనలోని చెడుకి మనమే గురిఅయి, ఎలా భ్రష్టులం అవుతామో అన్నదే కాన్రాడ్ రచనల సారాంశం అని చెప్పవచ్చు.

*వి.వి.సు.*

**కాన్సియెన్స్, హెండ్రిక్ (1812-83) :** బెల్జియన్ కాల్పనిక నవలా రచయిత. ఫ్లెమిష్ భాషలో నవలా రచనకు అంకురార్పణ చేసి, అభివృద్ధి చేసినవాడు కావ

డంవల్ల "ఫ్లెమిష్ ప్రజలకు పుస్తకాలు చదవడం ఆయన నేర్పాడు" అని ప్రశంసింపబడు తున్నాడు. కాన్సియెన్స్ తండ్రి ఫ్రెంచ్‌వాడు; తల్లి ఫ్లెమిష్ వనిత. 1812 డిసెంబరు 3 వ తేదీన ఆన్ట్‌వెర్ప్ నగరంలో ఆయన జన్మించాడు. 1820 లో తల్లి చనిపోయిన తరువాత తండ్రితో సహా కాన్సియెన్స్ నగర ప్రాకారాల బయట నివసింపసాగాడు. అప్పుడే ప్రకృతి హృదయం అతనికి అవగతమై, జీవితాంతం అతనికి ఓదార్పు కలిగిస్తూ వచ్చింది. *ప్రకృతి గ్రంథం లోని కొన్ని పుటలు* (*1846 - A few pages from the book of nature*) అనే ఆయన ప్రసిద్ధ నవలకు ఆ నాటి జీవితమే అవసరమైన ఉత్తేజాన్ని కలిగించింది. కొన్నేళ్లు ఉపాధ్యాయుడుగా పని చేసి, 1831 లో ఆయన సైన్యంలో చేరాడు. క్రమంగా ఫ్రెంచ్ కాల్పనికోద్యమంతో పరిచయం ఏర్పడి, ఫ్రెంచ్ భాషలో కొన్ని పద్యాలు వ్రాశాడు. (ఆ రోజులలో కవిత్వానికి అనర్హమైన అనాగరక భాషగా 'ఫ్లెమిష్' పరిగణించబడుతూ ఉండేది). 1836 లో సైన్యం నుంచి విడుదలై ఆన్ట్‌వెర్ప్ నగరం లోని సాహిత్య జీవనంలో పాల్గొన సాగాడు. తన దేశ గత వైభవాన్ని తలుచుకొని పొంగిపోతూ, *అద్భుతాలు జరిగిన ఆ ఏడాది* (1837) రచించాడు. 16 వ శతాబ్దం నాటి చారిత్రక దృశ్యాల పరంపర అది. *ఫ్లాండర్స్ సింహం* (1838 - The Lion of Flanders) ఫ్లెమిష్ మనిసిపాలిటీలు ఫ్రాన్స్‌మీద తిరుగబడి 'గోల్డెన్ స్పర్స్' యుద్ధంలో (1302) విజయం సాధించిన సంఘటనను వర్ణించే మహాకావ్యం. ఫ్లెమిష్ నవలకు రూపకల్పన చేయడమే కాకుండా, యూరపియన్ కాల్పనికోద్యమంలో వచ్చిన సుప్రసిద్ధమైన చారిత్రక నవలలు కూడా కొన్ని ఆయన వ్రాశాడు.

'కాన్సియెన్స్' కథలలో సెంటిమెంట్ ఎక్కువగా ఉంటుం దని కొందరు విమర్శించినా, తరచు అవి ఏదో ఒక నీతిని బోధిస్తూ ఉంటాయి. *మాతృమూర్తి సహనం* (1844), *కొయ్యా క్లెరా* (1850), *పాపం ఆ పెద్దమనిషి* (1851) మొదలైనవి ఆయన రచనలలో పేర్కొనదగినవి. ఆయన రచనలు అనేక భాషలలోకి అనువదించబడ్డాయి. 1856 లో 'కోర్ట్రిజ్క్' జిల్లాకు కమీషనర్ గాను, 1868 లో బ్రసెల్స్‌లోని మ్యూజియమ్‌కు క్యూరేటర్ గాను ఆయన నియమించబడ్డాడు.

19 వ శతాబ్దం నాటి ఫ్లెమిష్ జాతీయ పునరుజ్జీవనోద్యమానికి చెందిన ప్రముఖ వ్యక్తులలో 'కాన్సియెన్స్' ఒకరు. ఆయన కథా కథన చాతురి, భావనా శక్తి, వాస్తవిక చిత్రణ నైపుణి, ప్రగాఢమైన అనుభూతి శీలం ఆయన రచనలలో కనిపించే భాషా దోషాలనూ, అర్థవ్యక్తి లోపాలనూ కప్పివేస్తాయి.

బొ.శ్రీ.

**కాన్‌స్తాంత్, బెంజామిన్ (1767-1830) :** ఫ్రెంచ్-స్విస్ నవలా రచయిత, రాజకీయ రచయిత. 1816 లో *అడోల్ఫ్* అనే నవల వ్రాసి, ఆధునిక మనస్తత్త్వ సంబంధమైన నవలకు ఒరవడి పెట్టాడు. ఈయన స్టెండాల్ తో సాటిరాగలవాడు అని వర్ణించారు. కాన్‌స్తాంత్ నిశిత మైన పరిశీలన శక్తి గల కథకుడు. నెపోలియన్ తరానికి చెందిన యూరప్‌లో కానవచ్చే జాతీయతకు అతీతుడైన వ్యక్తి ఈయన. స్వవిషయాలను నిష్పాక్షికంగా చూడగల శక్తి గలవాడు. ఆధునిక లక్షణానికి ఆయన రచనలు నాంది పలికాయి.

కాన్‌స్తాంత్ తండ్రి స్విట్జర్‌లాండ్‌లో ఉన్న ఫ్రెంచి జాతీయుడు. ఎర్ లాంగెన్ (జర్మనీ), ఆక్స్‌ఫర్డ్, ఎడింబరోలలో కాన్‌స్తాంత్ విద్య నభ్యసించాడు. 1787 లో ఈయన మదామ్ డి షెరియె తో స్నేహం చేశాడు. ఆమె ఈయన కన్న 27 సంవత్సరాలు పెద్దది. 1789 లో రాజవంశానికి చెందిన గ్రామ్ అనే ఆవిడను వివాహమాడాడు. 1794 లో ఫ్రెంచ్ విప్లవానికి మద్దతు ఇచ్చాడు. దాని వలన తన ఉద్యోగాన్నీ, భార్యనీ వదలి వేశాడు. అదే సంవత్సరంలో మదామ్ డి స్టాల్‌ను లాసేన్‌లో కలుసుకున్నాడు. మరుసటి సంవత్సరం ఆమెతో పారిస్ తిరిగివచ్చాడు. వారి కల్లోల భరితమైన ప్రణయ సంబంధం 1806 వరకూ కొనసాగింది. 1799 లో జరిగిన రాజకీయ పరిణామాల వలన ఆయన త్రిసభ్య సంఘంలో ఒక సభ్యుడుగా నియమితు డయాడు. కాని త్వరలో ఆయన బోనపార్టీ పాలనా విధానాలను వ్యతిరేకించాడు. 1802 లో ఆయనను త్రిసభ్య సంఘం నుంచి బహిష్కరించారు. 1803 లో మదామ్ డి స్టాల్‌తో కలసి ఆయన దేశాంతరం వెళ్ళాడు. జెనీవా దగ్గర ఉన్న కోపెట్‌లోని ఆమె నివాసంలోను, జర్మనీ లోని వైమార్‌లోను ఆయన ఎక్కువ కాలం గడపేవాడు. జర్మన్ సాహిత్య ప్రభావాన్ని ఫ్రాన్స్‌కు అంద చేసిన వారిలో ఇతడు ముఖ్యుడు. అప్పుడే ఫ్రెడరిక్ ష్లెగెల్, ఆగస్ట్ ష్లెగెల్ సోదరులతో ఈయనకు సన్నిహిత సంబంధం ఏర్పడింది. ఈ సోదరులు కాల్పనికోద్యమానికి పునాది వేసిన వారు. వారి ద్వారా ఆయన మదామ్ డి స్టాల్‌ను ఉత్తేజపరచి, ఆమె ప్రముఖరచన, *డి ల ఆల మెయిన్* కు ప్రేరకు డయాడు.

ప్రవాసంలో ఉండగా, ఆయన 5 సంపుటాలు గల ఒక గ్రంథం రచించాడు. ఇందులో మత సంబంధమైన భావాలూ, మరణం వల్ల ఏర్పడే బెదిరింపును గురించిన చారిత్రక విశ్లేషణలూ ఉన్నాయి. దీనిలో తన ఆంతరంగిక విషయాలు కూడా కొన్ని ఉన్నాయి. ఆయన దినచర్య పుస్తకాలవలన, ఆయన ఉత్తరాలవలన ఆయనను గూర్చిన విషయా లెన్నో మనకు తెలుస్తున్నాయి. *అడోల్ఫ్* అనే నవల వలన ఆయన మదామ్ డి స్టాల్ నుండి ఎందుకు విడిపోయాడో తెలుస్తుంది.

1808 లో ఆయన చార్లెట్ వాన్ హార్డెన్ బెర్గ్‌ను రహస్యంగా వివాహం చేసుకున్నాడు. కాని, మేధావిగా ఆయనకు మదామ్ డి స్టాల్‌తోను, కోపెట్ మిత్ర వర్గంతోను సంబంధాలు తెగిపోలేదు.

1813 లో ఆయన ఒక గ్రంథంలో నెపోలియన్ క్షీణ దశను సింహావలోకనం చేశాడు. బూర్బన్ రాజవంశం తిరిగి రాజ్యానికి రావడం ఆయనకు గాని, మదామ్ డి స్టాల్‌కి గాని నచ్చలేదు. నూరు రోజుల నెపోలియన్ సామ్రాజ్యంతో ఆయన విధి లేక రాజీపడ్డాడు. దీనికి కారణం ఆయన ప్రేమించిన ఇంకొక వ్యక్తి మదామ్ రికెమియర్. పారిస్ తిరిగి వచ్చిన తర్వాత ఉదారమైన పత్రికా రచయితగా ఆయన పనిచేశాడు. 1819 లో ప్రజాప్రతినిధిగా ఎన్నికయాడు. పత్రికా స్వాతంత్ర్యం కోసం పాటుపడ్డాడు. తన రచన లన్నీ పుస్తక రూపంలో పొందుపరచి ప్రచురించాడు. 1830 జూలై నెలలో కౌన్సిల్ ఆఫ్ స్టేట్ అధ్యక్షుడుగా నియమితుడయాడు కాని కొద్ది నెలలకే కాన్‌స్టాంత్ కాలధర్మం చెందాడు.

ఇ.వా.

**కాఫ్కా, ఫ్రాంజ్ (1883-1924)** : జెకోస్లోవేకియాలో జన్మించిన ప్రముఖ జర్మన్ రచయిత. మరణానంతరం ప్రచురింపబడిన *ది ట్రయల్* (1925), *ది కేజిల్* (1926) వంటి ఈయన దార్శనిక నవలలు ఈ 20 వ శతాబ్ది మానవునిలోని ఆతురతలను, విభక్తతను (alieniation) అద్భుతంగా చిత్రించాయి. తన రచనలు 'విమోచన సాధనాలని', ఒకవిధమైన 'ప్రార్థనల' వంటివని ఆయన పేర్కొన్నాడు.

1883 జూలై 3 న ఒక యూదు మధ్య తరగతి కుటుంబంలో కాఫ్కా జన్మించాడు. ఇతని తండ్రి హెర్మన్ కాఫ్కా ఒక వర్తకుడు. తల్లి జూలీ లూవీ. చిన్నతనంలోనే ఇతని అన్నలు ఇద్దరు మరణించడంతో ఇతడే కుటుంబానికి పెద్ద బిడ్డ అయాడు. ఆ భావం ఇతని మనస్సులో నిరంతరం మెదులుతూ ఉండేది. ఇతని చెల్లెళ్లు ముగ్గురిలోనూ ఆఖరి చెల్లెలు ఇతనితో ఎక్కువ సన్నిహితంగా ఉండేది. తన తండ్రివైపు పూర్వికులను గాక తల్లివైపు పూర్వికులను ఇత డెక్కువ గౌరవించేవాడు. సాంఘికంగా వారు ఉన్నత స్థాయికి చెందిన వారని కాదు; వారిలోని ఆధ్యాత్మిక దృష్టి, బుద్ధి సూక్ష్మత, పవిత్రత, మత గ్రంథపఠనం, వింత ప్రవృత్తి, విషాద పూరిత దృష్టి, శారీరకంగానూ, మానసికంగానూ సుకుమారంగా ఉండడం ఇతనిని ఆకర్షించాయి. పిల్లల పట్ల అమిత మమకారం గల సాధారణ స్త్రీ అయిన తన తల్లికి ఇతడు ఎక్కువ చేరువ కాలేదు. చండశాసనుడైన భర్తకు తాళం వేస్తూ తన కుమారుడు 'స్వప్నప్రాయమైన తన ఆంతర జీవితాన్ని తన రచనలలో నిరూపిస్తూ' కాలం గడపే అవాంఛనీయమైన ధోరణిని ఆమె అర్థం చేసుకోలేక పోయింది.

కాఫ్కా తండ్రి ప్రభావం కాఫ్కా జీవితం మీదా, రచనల మీదా ఎక్కువ కనిపిస్తుంది. నిజానికి కాఫ్కా చిత్రించిన పాత్రలలో అతని తండ్రి పాత్రే మిక్కిలి ప్రస్ఫుటంగానూ, సజీవంగానూ పఠితలను ఆకర్షిస్తుంది. ప్రతి విషయంలోనూ పట్టుదల చూపే ఆ దుకాణదారుడికి జీవితంలో ప్రాపంచిక విజయం, సాంఘిక పురోగతి-రెండే ప్రధాన లక్ష్యాలు! కాఫ్కా ఆత్మకథా రూపంగా వ్రాసిన *లెటర్ టు హిజ్ ఫాదర్* (రచన 1919) అనే లేఖ ఆ తండ్రిని చేరనేలేదు. కాఫ్కాకు జీవితం పట్ల విరక్తి కలుగడానికీ, తల్లిదండ్రుల ఇనుప పిడికిలి నుండి విడివడి, స్వతంత్రంగా వివాహం చేసికొని, సాహిత్యంలోకి పలాయనం సాగించాలనే వాంఛ అతనికి కలగడానికీ నిరంకుశుడైన అతని తండ్రే కారణం. తను ఒట్టి చేతకానివాడు అనే భావాన్ని ఆ తండ్రి కొడుకులో ప్రవేశపెట్టాడు. తన తండ్రి వల్ల తన సంకల్పబలం దెబ్బ తిన్నదని అతని నమ్మకం. తండ్రితో తన ఈ సంఘర్షణ కాఫ్కా రచించిన కథ *ది జడ్జిమెంట్* (1913) లో కనిపిస్తుంది. మరింత విస్తృత ప్రమాణంలో కాఫ్కా నవలలలో కూడా కనిపిస్తుంది. అయితే కాఫ్కా ఆతు



రతకూ, నిరాశకూ మూలాలు ఇంతకంటె ప్రగాఢమైనవి. కాఫ్కా నిరాశకు మూలకారణం: తన స్నేహితులతోనూ, ప్రేమించిన స్త్రీలతోనూ, ఏవగించుకునే తన ఉద్యోగం తోనూ, తాను జీవిస్తున్న సమాజంతోనూ, 'అవినాశ్య తత్త్వం' అని అతను పేర్కొన్న దేవునితోనూ అతడు సరిపుచ్చుకోలేకపోవడం.

ప్రేగ్‌లో ఉన్న కాలంలో కాఫ్కా తాను సోషలిస్టననీ, నాస్తికవాదిననీ ప్రకటించాడు. జీవితమంతా కొంతవరకు సోషలిస్టుల పట్ల సానుభూతి చూపాడు. జెక్ అరాచక వాదుల సమావేశాలకు (మొదటి ప్రపంచ యుద్ధానికి ముందు) అతడు హాజరవుతూ ఉండేవాడు. చివరి రోజు లలో 'సోషలైజ్డ్ జియోనిజమ్' పట్ల స్పష్టంగా అతడు ఆసక్తి చూపించాడు.

కొంత కాలంపాటు 'మాక్స్ బ్రాడ్' వంటి వారు కాఫ్కాకు సన్నిహిత మిత్రులుగా ఉండేవారు. కాఫ్కా మరణానంతరం 'మాక్స్ బ్రాడ్' అతని జీవిత చరిత్ర వ్రాశాడు. 1902 లో కాఫ్కాకూ, మాక్స్ బ్రాడ్‌కూ పరి చయం అయింది. అప్పుడు కాఫ్కా ప్రేగ్ యూనివర్శిటీ లో న్యాయ శాస్త్రం అధ్యయనం చేస్తూ ఉండేవాడు. 1906 లో అతడు డాక్టరేట్ పట్టం పొందాడు. తరువాత కొద్ది కాలం పాటు ఒక న్యాయవాది వద్ద అప్రెంటిస్‌గా పనిచేసి, అనంతరం ఒక ఇన్స్యూరెన్స్ కంపెనీలో ఉద్యోగిగా చేరాడు. ఆ ఉద్యోగం కాఫ్కా రచనలు చేయ డానికి ఎక్కువగా అనుకూలించనందున 1908 లో ఉదయం 8 గంటలనుంచి మధ్యాహ్నం 2 గంటలవరకు మాత్రమే పనిచేయవలసి ఉన్న మరియొక ఇన్స్యూరెన్స్ ఇన్‌స్టిట్యూట్‌లో చేరాడు. 1917 వరకూ కాఫ్కా ఆ ఉద్యోగంలో ఉన్నాడు. క్షయవ్యాధి కారణంగా తరచు మెడికల్ లీవు పెట్టవలసి వచ్చేది. చివరకు 1922 లో పెన్షన్ మీద రిటైరై, తరువాత రెండు సంవత్సరాలకే 1924 జూన్ 3 న వియెన్నా సమీపంలోని కీర్లింగ్‌లో కాఫ్కా మరణించాడు.

బొ.శ్రీ.

**కారల్, లూయీ (1832-98)** : ఇంగ్లీష్ నవలా రచయిత. ఇతని అసలుపేరు 'ఛార్లెస్ లుట్‌విడాడ్జసన్! తర్క, గణితశాస్త్రాలలో దిట్ట. ఛాయాచిత్ర గ్రహణం ఈయన వ్యాపకాలలో ఒకటి. బాలసాహిత్యంలో శాశ్వ తంగా నిలచిపోయే *ఏలిస్ ఇన్ వండర్‌లాండ్* (1865) దానికి అనుబంధంగా వెలువడిన *త్రూ ది లుకింగ్ గ్లాస్* (1871) అనే నవలలు రచించి సాహిత్యంలో శాశ్వ తమైనస్థానం సంపాదించుకొన్నాడు. పెద్దలను కూడా రంజింపచేసే ఈ నవలలు తన చుట్టూ ఉన్న పిల్లలను చూస్తూ, వాళ్ల అభిరుచులు తెలుసుకొని, వాళ్లకోసమే వ్రాసినట్లుగా ఉంటాయి. అదే ఈ నవలల ప్రత్యేకత. ఈయన వ్రాసిన *ది హంటింగ్ ఆఫ్ ది షార్క్* అనే కవిత 'అసందర్భ సాహిత్యం' (Nonsensical literature) లో ఉన్నత ప్రమాణాలను నెలకొలిపింది.

మతాచార్యుడైన రెవరెండ్ ఛార్లెస్ డాడ్జసన్‌కు కలి గిన పదకొండుమంది సంతానంలో పెద్దవాడైన కారల్ బాల్యమంతా చిన్న పిల్లల ఆట పాటలతో ఉత్సాహవంతంగా గడపినా, ఆరోగ్యం అంతంత మాత్రంగానే ఉండేది. అయినా *రెక్టరీ పత్రిక*కు క్రమం తప్పకుండా కవితలు, వ్యాసాలు వ్రాస్తూ ఉండేవాడు. మొదట యార్క్ షైర్ లోను, తరువాత రగ్బీ స్కూలు (1846-50) లోను, ఆ తరువాత ఆక్స్‌ఫర్డ్‌లోని 'క్రైస్ట్‌చర్చ్' లోను విద్యాభ్యాసం కొనసాగించాడు. విద్యార్థిగా ప్రతిభావంతుడైన కారల్ గణిత శాస్త్రంలో ప్రథముడుగా కృతార్థుడై ఉపకారవే తనాన్ని పొంది, తరువాత ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో ఉపన్యాసకుడుగా 1881 వరకూ పనిచేశాడు. జీతాంతం ఆక్స్‌ఫర్డ్ ఫెలోషిప్‌ను అతడు వదలుకోలేదు. ఆ నాటి ఆచారం ప్రకారం ఆ 'ఫెలోషిప్'ను ఉంచుకోవాలంటే బ్రహ్మ చారిగానే ఉండిపోవాలి. అలాగే వివాహం చేసుకోకుండా మతాచార్యుడుగా అతడు స్థిరపడ్డాడు. 1861 డిసెంబరు 22 న ఇంగ్లండ్ మతవ్యవస్థలో 'డీకన్' అనే పదవి అతనికి లభ్యమైంది. కొద్దిగా నత్తి, చెముడు ఉన్నా, అందరిని ఆకట్టుకునే విధంగా మతబోధలను చేయగలిగేవాడు.

చిన్నపిల్లలతో సాన్నిహిత్యం, వాళ్ల ఆటపాటలలో ఆసక్తి ఇతనికి చిన్ననాటి నుండి ఎక్కువగా ఉండటంతో వాళ్లకోరికలు, ఇష్టానిష్టాలు బాగా అర్థం చేసుకోగలిగాడు. చిన్నపిల్లలతో స్నేహం చేయటానికి అలవాటు పడ్డ కారల్‌కు హెన్రీ జార్జ్ లిడెల్ బిడ్డలైన 'ఏలిస్ లిడెల్ లోరినా', ఎడిత్‌లు సన్నిహితు లయారు. రచయిత జార్జ్ మాక్డొనాల్డ్, కవి లార్డ్ టెనిసన్‌ల పిల్లలుకూడా ఈయనకు చేరువయారు. ఆ బాలప్రపంచం నుంచి ఆవిర్భవించినవే ఈయన మేటి రచనలయిన *ఏలిస్ ఇన్ వండర్ లాండ్, త్రూ ది లుకింగ్ గ్లాస్* అనే ప్రఖ్యాత బాల నవలలు. ఒకసారి ఏలిస్‌తో సహా ఆ పిల్లలతో థేమ్స్‌నదిపై విహారానికి వెళ్లినపుడు వాళ్లకు చెప్పిన కథలనుంచే ఉద్భవించింది ఇందులో మొదటి నవల. అతడు అప్పుడప్పుడు ఆ పిల్లలకు చెబుతూ వచ్చిన సాహసగాథలకే కొన్నిమార్పులు, చేర్పులుచేసి

ఈ నవలను వ్రాశాడు. ఈ నవల నిదానంగానే అయినా అద్భుతవిజయం సాధించింది. ఆయన మరణం నాటికే ఈ నవల బాలసాహిత్యంలో జగద్విఖ్యాతి పొందింది.

'ఏలిస్' విజయానికి కారణం ఎవరికీ అంతుబట్ట లేదు. దాని ప్రత్యేకత ఏమిటో అవగాహన కాలేదు. రచయిత ఊహించని, అనుకోని ఎన్నో లక్షణాలను పండితులు, పామరులు, విమర్శకులు దానికి ఆపాదించారు. కొందరు అది ద్వంద్వార్థ నైతిక కావ్యం (Allgory) అన్నారు. నైతిక మైన అంతరార్థం, నిగూఢమైన సందేశం అందులో ఉన్నా యన్నారు. కాని, ఇది నిజంకాదు. ఇందులో ఎటువంటి నిక్షిప్త సందేశాలూ, ద్వంద్వార్థాలూ లేవు, కొందరు అతితెలివికి పోయి కారల్ చిన్నారి బాలికలతో, ముఖ్యంగా 'ఏలిస్ లిడెల్' తో చేసిన స్నేహాలు అతనిలో గుప్తంగా ఉన్న వివాహేచ్ఛ నుంచి ఉద్భవించినవే అని, అందులో కొందరిని ముఖ్యంగా 'ఏలిస్' ను తాను వివాహం చేసుకోదలిచాడని, ఆ బాలికలు ఎవరినో తాము వివాహం చేసుకోబోతున్నామని చెప్పినప్పుడు కారల్ అసూయ పడేవాడని అన్నారు. కాని ఇవన్నీ కేవలం అభాండాలు మాత్రమే. అతడు ఏలిస్‌తో స్నేహం ఆపివేసిన నాటికి ఆమె వయస్సు 12సంవత్సరాలు మాత్రమే! సాధారణంగా 12 సంవత్సరాల పైబడిన బాలికతో ఇతడు స్నేహంచేసిన దాఖలాలేమీ లేవు.

కారల్ పిల్లల కథలే కాక విద్యావిషయిక రచనలు కూడా కొన్ని చేశాడు. విశ్వవిద్యాలయ వ్యవహారాలపై కొన్ని కర పత్రాలను ప్రకటించాడు. అవన్నీ కలిపి *నోట్స్ బై ఏన్ ఆక్స్ ఫర్డ్ షీల్* (1874) అనే పేరుతో ప్రకటించాడు. *యూక్లిడ్ అండ్ ది మోడర్న్ రైవల్స్* అనే గణితశాస్త్ర గ్రంథాన్ని కూడా వ్రాశాడు. సాహిత్యం పరం గాని ఇలాంటి గ్రంథాలకు తన అసలు పేరు (డాడ్జ్‌సన్) నే వాడుకొన్నాడు.

కారల్ వ్రాసిన కవిత లన్నీ కలిపి *ఫాంటస్మగోరియా అండ్ అదర్ పొయెమ్స్* అనే సంకలనంగా ప్రకటించారు. జీవితం చివరి భాగంలో ఏలిస్ మూసలో తిరిగి కథలు వ్రాయటానిక ప్రయత్నించి *సిల్వీ అండ్ బ్రూనో* (1889), దాని రెండవ భాగం *సిల్వీ అండ్ బ్రూనో కన్‌క్లూడెడ్* (1893) అనే రెండు నవలలు వ్రాశాడు, కాని అవి ఘోరంగా విఫలం అయ్యాయి. కారల్ వ్రాసిన నవలలలో చిరస్థాయిగా నిలిచేది 'ఏలిస్' మాత్రమే!

కె.బి.మూర్తి.

**కారీ (ఆర్థర్), జోయ్స్ (లూనెల్) (1888-1957)** : విశిష్టమైన వ్యక్తిత్వం గల ఆంగ్లనవలా రచయిత. ఈతని నవలలలోని పాత్రలు గొప్ప సృజనాత్మక శక్తిని ప్రతిబింబిస్తాయి. ప్రతి నవల మూడు భాగాలుగా ఉంటూ, ఒక్కొక్క భాగాన్ని ఒక్కొక్క కథానాయకుడు కథనం చేసే పద్ధతిని ఈయన ప్రవేశ పెట్టాడు.

కారీ ఒక 'ఇంగ్లీషు-ఐర్లండ్' కుటుంబంలో పుట్టాడు. అతనికి 8 వ సంవత్సరం లోనే తల్లి చనిపోయింది. అప్పటినుంచి ఇంగ్లండులో చదువుతూ, కొంతకాలం బంధువర్గంతో గడుపుతూ వచ్చాడు. తన 16 వ ఏట పారిస్‌లోను, ఎడింబర్గ్‌లోను చిత్రలేఖనం నేర్చుకున్నాడు. 1909 నుంచి 1912 వరకు, ఆక్స్‌ఫర్డ్‌లోని ట్రినిటీ కాలేజ్‌లో న్యాయశాస్త్రం అభ్యసించాడు. 1912-13 లో జరిగిన బాల్కన్ యుద్ధంలో బ్రిటిష్ రెడ్‌క్రాస్‌లో చేరి సేవచేశాడు. 1914 లో సేవా దళంలో చేరి, మొదటి ప్రపంచ యుద్ధం జరుగుతున్న కాలంలో నైజీరియా రెజిమెంట్‌లోని సైనికులకు సేవచేశాడు. 'కామరూన్స్' తో యుద్ధం చేస్తూ గాయపడి, 1917 లో నైజీరియాకు తిరిగి వచ్చి అక్కడ జిల్లా అధికారిగా స్థిరపడ్డాడు. కారీ వ్రాసిన నవలలకు పశ్చిమ ఆఫ్రికా కథావస్తువును సమకూర్చింది. గొప్ప నవలా రచయిత కావాలనే సంకల్పంతో 1920లో ఆక్స్‌ఫర్డ్‌లో ఆయన స్థిరపడ్డాడు. ఆ సంవత్సరంలోనే *శాటర్ డే ఈవెనింగ్* అనే అమెరికన్ పత్రికలో 10 చిన్నకథలను "థామస్ జోయిస్" అనే మారు పేరుతో ప్రచురించాడు. పురాణాలు, చరిత్ర, వేదాంత విషయాలను గురించి తనకు తెలిసినంతవరకు తన నవలలలో వ్రాయాలని ఆయన సంకల్పించాడు. 1932 లో *ఐసా సేవ్‌డ్* అనే నవల వ్రాసేవరకు, ఎన్నో సంవత్సరాలు ఆయన గ్రంథపఠనంలోనే గడిపాడు. ఆ తరువాత కారీ క్రైస్తవమతంలోకి మారినా, మూఢవిశ్వాసాలను వదలుకోలేని ఒక ఆఫ్రికన్ యువతి కథతోపాటు, ఆఫ్రికాకు సంబంధించిన మూడు నవలలు కూడా ఆయన ప్రచురించాడు. ఆ మూడు నవలలు: 1. *ఏన్ అమెరికన్ విజిటర్* (1933), 2. *ది ఆఫ్రికన్ విచ్* (1936), 3. *మిస్టర్ జాన్‌సన్* (1939). ఈ మూడు నవలలేకాక *కాజిల్ కార్నర్* (1938) అనే బ్రిటిషు సామ్రాజ్యపతనాన్ని అభివర్ణించే నవలను కూడా ఆయన ప్రచురించాడు.

తన చిన్నతనాన్ని వర్ణిస్తూ, 1941 లో *ఏ హౌస్ ఆఫ్ చిల్డ్రన్* అనే నవలను వ్రాశాడు. 1940 లో

*చార్లీ ఈజ్ మై డార్లింగ్* అనే నవలలో యుద్ధంలో ప్రవాసితుడైన ఒక లండన్ నగరనివాసి జీవితాన్ని కారీ వర్ణించాడు.

కారీ సాహిత్య ప్రక్రియలలో పాత్ర తనకథను తానే చెప్పుకునే విధానం ముఖ్యమైంది. సారా మండే అనే యువతి చెప్పే *హెర్ సెల్ఫ్ సర్‌ప్రైజ్* అనే కథ 1941 లో వెలువడింది. అలాగే సారా మండే జీవితంలో తారసపడిన ఇద్దరు వ్యక్తులను గురించి 1942 లో *టు బి ఏ పిల్‌గ్రిమ్* లోను, *ది హార్సెస్ మౌత్* (1944) లోను వ్రాశాడు. ఈ రెండవ నవలకు విశేషప్రశస్తి వచ్చింది. ఇలాగే ఒక రాజకీయవేత్త భార్య జీవితాన్ని ఒక నవలలోను, ఆ రాజకీయవేత్త జీవితాన్ని మరో నవలలోను, ఆ రాజకీయవేత్త భార్య రెండో భర్తజీవితం ఇంకో నవలలోనూ వ్రాసి మూడు భాగాల నవల అనే ఒక క్రొత్తపంథాను కారీ సృష్టించాడు. ఒక్కరి జీవితాన్నే నవలా వస్తువుగా తీసికొని, మూడు నవలలుగా వ్రాసిన ప్రత్యేకమైన నవలా రచయితగా కారీ పేరు పొందాడు.

మత సంబంధమైన మరో నవలా త్రయాన్ని కూడా ఆయన వ్రాయా లనుకున్నాడు. కాని, మానసిక శాంతి లేక సరిఅయిన శరీరపోషణ లేక, నరాల బలహీనతతో కృశించిన శరీరంతో ఆ నవలా త్రయాన్ని ఆయన పూర్తిచేయలేనని గ్రహించాడు. 1959 లో *ది కాపిటల్ అండ్ ది ఫ్రీ* అనే నవలలో తాను చెప్పదలచుకున్న విషయాన్నంతా ఒకే నవలగా రూపొందించాడు. 1960 లో *స్ప్రింగ్ సాంగ్* అనే సంపుటంలో కారీ కథలన్నీ సంకలితం చేయబడ్డాయి.

రాజ్యలక్ష్మి

**కార్డెనాల్, ఎర్నెస్తో (1925-) :** నికరాగ్వా దేశపు విప్లవ కవి. ఇతని కవితలు ఇంగ్లీష్, ఇటాలియన్, జర్మన్, రొమానియన్ భాషలలోకి తర్జుమా చేయబడ్డాయి. నికరాగ్వాలోని జెసూట్ పాఠశాలలో విద్య నారంభించి మెక్సికోలోనూ, తరువాత కొలంబియా విశ్వవిద్యాలయం లోనూ కార్డెనాల్ వేదాంతం, సాహిత్యం అభ్యసించాడు. 1965 లో ఫాదర్‌గా నియమింపబడ్డాడు.

1952-57 మధ్య వ్రాసిన కవితలు *ఎపిగ్రమాస్* (Epigramas) అనే పేరుతో 1961 లో కార్డెనాల్ ప్రకటించాడు. మార్షల్, కాటులస్ (Catullus) చూపిన సంప్రదాయ పద్ధతిలో కార్డెనాల్ తన రచనలు చేశాడు. కాని భాషలో మాత్రం ఆధునికత కనబడు తుంది. ఆ నాటి సాంఘిక, రాజకీయభాషనే అతడు వాడాడు. దీనిలోని కవితలు 'సమోజా' పరిపాలన లోని హింసా కాండలను ఖండిస్తాయి. మరి కొన్ని ప్రేమ గీతికలు. ఇవి సునిశితమైన వ్యంగ్య ధోరణిలో రచింప బడ్డాయి. *లాహారో* (La haro 1960, *జీరో అవర్ అండ్ అదర్‌డాక్యుమెంటరీ పోయమ్స్* (1980) వాస్తవిక ధోరణిలో రచింపబడ్డాయి. ఇది విశిష్ట మైన నిరసన కవిత. *గెత్సెమనికై* (1960) లోని పద్యాలు కార్డెనాల్ అనుభవంలోనుంచి పుట్టుకొచ్చినవే! *సాల్మోస్* (1964) లోని పద్యాలు ఆ నాటి దుష్ట చర్యలను ఖండిస్తూ రచనా రీతిలో *బైబిల్‌*ని జ్ఞాపకం చేస్తాయి. చివరకు ఈ యుగాంతంలో ప్రపంచం ఎలా వినాశం చెందుతుందో కవి వ్యక్త పరుస్తాడు. *ఎపోకలిప్స్* (1977) అనే కవితలో సర్వ నాశనం అయే ప్రపంచంలో నుంచి నూతనసృష్టి జరుగు తుందనీ, అది మానవుల ఐకమత్యం, క్రైస్తవాదర్శాలమీద నిర్మింపబడు తుందనే విశ్వాసాన్ని వ్యక్తపరుస్తాడు. 1969 లో వ్రాసిన *హోమేజ్ టు అమెరికన్ ఇండియన్స్* లో గతించిన శతాబ్దాలలో మానవుడు ఏ విధంగా ప్రకృతి ఒడిలో జీవించాడో, సైనికుల కన్నా కవులకే ఏ విధంగా ఆ రోజులలో ఎక్కువ ప్రాముఖ్యం ఉండేదో తెలియ పరుస్తాడు. కార్డెనాల్ కొన్ని వచన గ్రంథాలను కూడా వ్రాశాడు.

జూలై 1979 లో సమోజాను తొలగించిన విప్ల వంలో కార్డెనాల్ పాల్గొన్నాడు. నూతన ప్రభుత్వంలో సాంస్కృతిక శాఖామంత్రిగా ఆయన నియమింపబడ్డాడు. 'నికరాగ్వా'లోని కేథలిక్ చర్చిని విప్లవాత్మక పంథాలో 'ప్రజల చర్చి'గా మార్చడానికి ప్రయత్నాలు చేయడం చూసి కార్డెనాల్‌ని 1983 లో రెండవ పోప్ జాన్ మందలించాడు.

వి.వి.సు.

**కార్పెంతియర్, ఆలేజో (1904-80) :** క్యూబా దేశంలోని పత్రికా రచయిత, సంగీతవేత్త, నవలా రచ యిత. పారిస్‌లో విద్య నభ్యసించాడు. 1927 లో మచాడో నిరంకుశత్వాన్ని విరసించినపుడు ఇతనికి జైలుశిక్ష వేశారు. కాని జైలునుంచి తప్పించుకుని కార్పెంతియర్ పారిస్ చేరాడు. 1928 లో అధివాస్తవికతోద్యమంలో పాల్గొన్నాడు. కాని ఆ ఉద్యమాన్ని తర్వాత అతడు తిరస్కరించాడు.

జైలులో అతడు మొదలుపెట్టిన *ఎకు-యంబా-ఓ* అనే నవల 1933 లో మాడ్రిడ్‌లో వెలువడింది. ఇది సంఘటనలను యథాతథంగా చెప్పే నవల. క్యూబాలో

నీగ్రో జీవనాన్నీ, సంస్కృతినీ చక్కని అవగాహనతో ఇతడు వర్ణిస్తాడు.

1943 లో కార్పెంతియేర్ 'హైతీ' సందర్శించాడు. తత్ఫలితంగా *ఎల్ రెనొ డె ఎస్టు మన్డో* (1949) అనే నవల వ్రాయబడింది. ఇది 19 వ శతాబ్దం మొదటి భాగంలో హైతీని నిరంకుశంగా పాలించిన హెన్రీ క్రిస్టోఫ్ ను గురించిన కథ. చిత్ర విచిత్ర అంశా లున్న ఈ నవల ముఖ్యంగా సాంఘిక వాస్తవిక ధోరణిలో వ్రాయ బడింది. 1941 లో వెనిజులా వెళ్లినపుడు *లాస్ పేసోస్ ప్రెడిడోస్* (1953) అనే నవల వ్రాశాడు. ఈ నవల చాలా ప్రశంసల నందుకుంది. స్పానిష్- అమెరికన్ జీవన వాస్తవికత లోని ఆంతర్యం ప్రాచీన గాథలలో చెప్పబడిన సంస్కృతి, స్పానిష్ దేశీయులు ప్రవేశపెట్టిన నాగరకతల సమ్మేళనంగా చూపడానికి రచయిత ఈ నవలలో ప్రయత్నం చేశాడు.

1958 లో *గెరాడెల్ టింపో* వెలువడింది. ఇది కథల సంపుటి. ఇందులో ఒక నవలిక కూడా ఉంది. 1950 ప్రాంతాన క్యూబాలో రేగిన హింసా కాండను, అణచివేతను గురించి ఇది వ్రాయబడింది.

1940, 1950 లలో కార్పెంతియర్ యూరప్‌లోనూ, దక్షిణ, ఉత్తర అమెరికాలలోనూ ఎక్కువ కాలం గడి పాడు. జూన్ 1959 లో కాస్ట్రో తిరుగుబాటు చివరి రోజులలో క్యూబాకు తిరిగివచ్చాడు. 1962 లో అతడు వ్రాసిన *ఎల్ సిగ్లో డి లాస్‌లు సెస్* అనే నవల ఫ్రెంచి తిరుగుబాటులోని విరుద్ధమైన అంశాలను వ్యాఖ్యానిస్తుంది. ఫ్రెంచి తిరుగుబాటుదారులు వర్ణించిన ఆశయాలు ఏ విధంగా విఫల మయాయో, హింస ఏ విధంగా చెలరే గిందో రచయిత చర్చిస్తాడు. 1974 లో *కన్సెర్టొబురాకో* అనే నవల వ్రాశాడు. ఇది ప్రత్యేక శైలిలో వ్రాయబడిన సంక్లిష్ట మైన నవల. ఇది స్పానిష్ అమెరికా లోని నాగ రకతల సమ్మేళనాలమీద కార్పెంతియర్ అభిప్రాయాలను వ్యక్త పరుస్తుంది.

రచయితగానే గాక, సాంస్కృతిక రాయబారిగా, ఆకాశవాణి కేంద్ర డైరెక్టరుగా, పత్రికా సంపాదకుడుగా, సంగీత శాస్త్ర ఆచార్యుడుగా కూడా కార్పెంతియర్ పేరు తెచ్చుకున్నాడు.

వి.వి.మ.

**కార్ల్‌ఫెల్ట్, ఎరిక్ ఆక్సెల్ (1864-1931):** స్వీడిష్ కవి, నోబెల్ బహుమతి గ్రహీత. స్వీడెన్‌లోని ఫోకెర్నా (Folkaerna) లో 1864 జులై 20 వ తేదీన జన్మించాడు.

కార్లెపెల్ట్ ప్రధానమైన రచన లన్నింటిని ఆరు కవితా సంపుటాలుగా వెలువరించారు. అవి : *విల్డమార్క్ ఓక్ కేర్లెక్స్ స్విసార్* (1895- 'అరణ్య ప్రేమ గీతాలు'), *ఫ్రిదోలిన్స్ విసర్* (ఫ్రిదోలిన్ పాటలు, 1898), *ఫ్రిదోలిన్స్ లస్ట్ గార్డ్* (1901, 'ఫ్రిదోలిన్ ఆనంద ఉద్యానవనం'), *ఫ్లోరా ఓక్ పోమోన* (1906), *ఫ్లోరా ఓక్ బెలోనా* (1918), *హోస్టోర్న్* (1927, 'శరదృతు శృంగం'). చివరి సంపుటం ఆయన మరణానికి నాలుగు సంవత్సరాల ముందు ప్రచురింప బడింది. ఈయన కవితలలో కొన్ని ఇంగ్లీషులోకి అనువదింపబడి *ఆర్కాడియా బోరియలిస్* అనే పేరుతో ఒక సంపుటంగా 1938 లో వెలువడింది.

స్టాక్ హోమ్‌లో ఒక వ్యవసాయ సంస్థలో గ్రంథా లయాధికారిగా ఈయన పనిచేశాడు. 1904 లో స్వీడిష్ అకాడమీ కి ఎన్నికయ్యాడు. తర్వాత 1912 లో ఈ అకాడమీకి శాశ్వత కార్యదర్శి అయాడు.

1918 లో ఆక్సెల్ నోబెల్ బహుమతిని తిరస్క రించాడు. 1931 లో ఆయన మరణానంతరం ఆయనకు నోబెల్ బహుమతి ఇవ్వబడింది. మరణానంతరం నోబెల్ బహుమతి ప్రదానం చేయబడడం అదే మొదటి సారి. స్టాక్‌హోమ్‌లో 1931 ఏప్రిల్ 8 న కార్ల్‌ఫెల్ట్ మరణించారు.

నాగరాజ్

**కార్‌లైల్, టామస్ (1795-1881) :** ప్రపంచ విఖ్యాతి పొందిన బ్రిటిష్ చరిత్ర రచయిత; వ్యాస రచయిత; *ది ఫ్రెంచ్ రివల్యూషన్* (1837- 3 సంపుటాలు), *ఆన్ హీరోస్, హీరోవర్షిప్, అండ్ ది హీరోయిక్ ఇన్ హిస్టరీ* (1841), *ది హిస్టరీ ఆఫ్ ఫ్రెడరిక్ II ఆఫ్ ప్రష్యా కాల్డ్ ఫ్రెడరిక్ ది గ్రేట్* (6 సంపుటాలు, 1858-65) అనే సుప్రసిద్ధ గ్రంథాల రచయిత.

1795 డిసెంబరు 4 వ తేదీన స్కాట్‌లాండ్‌లోని 'ఎక్లిపెచాన్' లో టామస్ కార్లైల్ జన్మించాడు. ఆయన తండ్రి 'జేమ్స్ కార్లైల్', 'జేమ్స్ కార్లైల్' కొన్నాళ్లు తాపీ మేస్త్రీగా ఉండి తరువాత చిన్న రైతుగా స్థిరపడ్డాడు. కాల్విన్ సిద్ధాంతాలలో దృఢ విశ్వాసమూ, చక్కని నైతిక ప్రవర్తనా గల 'జేమ్స్ కార్లైల్' ప్రభావం ఆయన కుమా రుడైన టామస్ కార్లైల్ మీద ఎక్కువగా కనిపిస్తుంది. తండ్రి పట్లనే కాక తల్లి పట్ల, తన ఎనమండుగురు సోదరీ సోదరుల పట్ల కూడా 'కార్లైల్' గాఢమైన మమ తానురాగాలు ప్రదర్శించాడు. చిన్న తనంలో 'టామస్' కొన్నాళ్లు తమ 'ఎక్లెపిచాన్' గ్రామ పాఠశాలలోనే చదు వుకొని, 1805 లో 'అన్నన్' ఎకాడమీ లోనూ, 1809 లో 'ఎడింబరో' విశ్వవిద్యాలయంలోనూ చేరి విద్యాభ్యాసం

చేశాడు. అక్కడ ఆయన బహుగ్రంథావలోకనం చేశాడు. ఆయన మతబోధక వృత్తిని అవలంబించడం తండ్రి అభిమతం. కాని 'టామస్' కు ఆ వృత్తి పట్ల ఆసక్తి లేదు. ఆదినుంచీ ఆయనకు గణితశాస్త్రంలో అభినివేశం ఎక్కువ. 1814 లో 'అన్నన్' లో గణితశాస్త్ర బోధకుడుగా ఆయన చేరాడు. 1816 లో 'కిర్‌కాల్డీ' లోని మరొక స్కూలుకు ఆయన మారాడు. అక్కడ స్కాటిష్ బోధకుడు, యోగి అయిన 'ఎడ్వర్డ్ ఇర్వింగ్' తో పరిచయం ఏర్పడి ఆయనపట్ల కార్లైల్‌కు గాఢమైన ప్రశంసా భావం ఏర్పడింది. "ఇర్వింగ్‌తో పరిచయం కాకపోతే ఇద్దరు మానవుల మధ్య భావైక్యం అంటే ఏమిటో నా కెప్పటికీ తెలిసి ఉండేది కాదు" అంటాడు కార్లైల్. 1822 లో ఇర్వింగ్ లండన్ చేరి, అక్కడ సుప్రసిద్ధ మతబోధకుడు అయిన తరువాత కూడా ఆ ఇరువురి మైత్రీ కొనసాగింది.

1819 లో ఆయన ఉపాధ్యాయ వృత్తిని వదలి న్యాయశాస్త్రం అధ్యయనం చేయడానికి తిరిగి 'ఎడింబరో' యూనివర్సిటీలో చేరాడు. కాని, అక్కడ ఆయనకు మనశ్శాంతి లభించక, జీవిత సమస్యలను గురించిన కలవరంతో కొన్నాళ్లు గడిపాడు. ఆ రోజులలోనే ఆయన జర్మన్ భాషా సాహిత్యాలను అధ్యయనం చేయసాగాడు. జర్మన్ సాహిత్యం పట్ల, ముఖ్యంగా గొయిథే రచనల పట్ల ఆయనకు గొప్ప ప్రశంసా భావం ఏర్పడింది. *విల్‌హెల్మ్ మైస్టర్స్ అప్రెంటిస్ షిప్* అనే గొయిథే రచనను ఆంగ్లంలోకి అనువదించి ప్రకటించాడు (1824). 1826 లో 'జేన్ వెల్ష్' అనే ఆమెను కార్లైల్ వివాహ మాడాడు. వివాహమైన తొలి రోజులలో కార్లైల్ దంపతులు 'క్రైగెన్ పుట్టక్', 'దంఫ్రీ షైర్'లలో ఎక్కువ కాలం గడిపారు. *ఎడింబరో రివ్యూ* లో తరచు కార్లైల్ రచనలు వెలువడేవి. ఆ రోజులలోనే ఆయన *సార్టర్ రిసార్టస్* అనే రచన ప్రకటించగా, అది బాగా ప్రజాదరణ పొందింది. ప్రపంచం పట్ల కోపం, హాస్యం, స్వీయ జీవిత విశేషాలు, జర్మన్ తత్త్వశాస్త్రం అన్నీ కలగాపులగంగా కలిపి ఉన్న చిత్రమైన రచన అది!

1834 లో టామస్ భార్యతో సహా లండన్ తిరిగి వచ్చి చైన్‌రో లో నివసింపసాగాడు. అప్పుడే *ది ఫ్రెంచ్ రివల్యూషన్* రచన ప్రారంభించాడు. ఆ రచన వ్రాతప్రతిని 'జే.ఎస్. మిల్' కు పంపగా ప్రమాదవశాత్తు అది కాలిపోవడం, అయినా నిరుత్సాహపడక 'టామస్' దానిని తిరిగి వ్రాయడం మిక్కిలి ప్రచారం పొందిన అద్భుతమైన సంఘటన. టామస్ రచనలలో తలమానికం అని చెప్ప దగింది *ది ఫ్రెంచ్ రివల్యూషన్*. 1837 లో అది ప్రకటితం కాగానే విద్వాంసులనుంచీ, సామాన్య జనం నుంచీ కూడా ఆయనకు ప్రశంసలు లభించాయి.

'టామస్ కార్లైల్' గొప్ప వక్త. తరచు ఉపన్యాసాలకు ఆయనకు ఆహ్వానాలు వస్తూ ఉండేవి. వాటివలన ఆయన ఆర్థికమైన చిక్కులు తొలగిపోయాయి. *చార్టిజమ్* (1840) అనే రచనలో టామస్ సాంప్రదాయిక ఆర్థిక సిద్ధాంతాన్ని తీవ్రంగా వ్యతిరేకించాడు. *ఆన్ హీరోస్, హీరోవర్షిప్, అండ్ ది హీరోయిక్ ఇన్ హిస్టరీ* (1841) గ్రంథ ప్రచురణతో ఆయనకు తన జీవిత ధ్యేయం అర్థమై దృఢ సంకల్పంతో ముందుకు సాగాడు.

తన దృష్టిలో ఆదర్శప్రాయుడైన వ్యక్తి 'క్రాంవెల్' అని టామస్ కార్లైల్ భావించాడు. 1845 లో *ఆలివర్ క్రాంవెల్స్ లెటర్స్ అండ్ స్పీచెస్ విత్ ఎలూసీడేషన్స్* అనే గ్రంథం ప్రకటించాడు. ఆటు తరువాత వెలువడిన ప్రధాన గ్రంథం *లేటర్ డే పాంఫ్లెట్స్* (1850). ఈ రచనలో ఆయనలోని అనాగరక ప్రవృత్తి స్ఫుటంగా అభివ్యక్తం అవుతుంది.

1857 లో కార్లైల్ 'ఫ్రెడరిక్ ది గ్రేట్' జీవిత చరిత్ర వ్రాయడానికి పూనుకున్నాడు. 1858-65 సంవత్సరాల మధ్య అది ప్రకటితం అయింది. జీవితంలో చివరి రోజులలో 1865 లో 'ఎడింబరో' విశ్వవిద్యాలయం వారు 'కార్లైల్'కు 'రెక్టార్' పదవి ఇచ్చారు. ఆ పదవి చేబడుతూ 1866 లో ఆయన చేసిన ఉపన్యాసం *ఆన్ ది ఛాయిస్ ఆఫ్ బుక్స్* అనే పేరిట ప్రచురించబడింది. అంతలో లండన్‌లో 'టామస్' భార్య 'జేన్ కార్లైల్' హఠాత్తుగా మరణించింది. ఆటు తరువాత 15 సంవత్సరాలు 'టామస్' జీవించాడు. 1875 లో ఆయన వ్రాసిన చారిత్రక గ్రంథం *ది ఎర్లీ కింగ్స్ ఆఫ్ నార్వే*, 1881 లో *రెమినిసెన్సెస్* (నా స్మృతులు) వెలువడ్డాయి. తన భార్య వ్రాసిన లేఖలను ఆయన ఎడిట్ చేయగా 1883 లో అవి ప్రచురించబడ్డాయి. 1881 ఫిబ్రవరి 5 వ తేదీన లండన్‌లో టామస్ కార్లైల్ శాశ్వతంగా కన్ను మూశాడు. వెస్ట్ మినిస్టర్ ఆబీలో ఆయన ఖననానికి అనుమతి లభించినా, టామస్ కోరిక మేరకు 'ఎక్లెఫెచాన్'లోని ఆయన తల్లిదండ్రుల సమాధుల పక్కనే ఆయనను కూడా ఖననం చేశారు. బొ.శ్రీ.

**కాలహాన్, మోర్లే (ఎడ్వర్డ్) (1903-1990):** కెనడా దేశపు నవలా రచయిత, కథానికా రచయిత. పారిస్‌కి ప్రవాసం పంపబడిన రచయితల అనుభవాలలో కొద్దికాలం పాటు ఈయన కూడా పాలు పంచుకున్నాడు.

టొరాంటోలో 1903 సెప్టెంబరు 22 న జన్మించిన కాలహాన్ మొదటి కథానికా సంపుటం *ఏ నేటివ్ ఆర్గానీ* 1929 లో ప్రకటితమై ఆయనకు మంచి గుర్తింపు తెచ్చింది. అటు తరువాత ఆయన వ్రాసిన ఉత్తమ కథానిక లన్నీ *మోర్లే కాలహాన్స్ స్టోరీస్* (1959), *నో మ్యాన్స్ మీట్ అండ్ ది ఎన్‌ఛాంటెడ్ పింప్* (1978) అనే రెండు సంపుటాలుగా ప్రకటించబడ్డాయి. ఈ రెండవ సంపుటంలో ఉన్న రెండు కథలూ సుమారు 50 ఏళ్ల వ్యవధానంలో రచించ బడ్డాయి. 1931 లో ప్రచురించ బడిన మొదటి కథలో ఒక స్త్రీ సంపన్నులైన తన మిత్రులను సందర్శించడం, దాని పర్యవసానాలూ వర్ణించబడ్డాయి. రెండవ కథలో ఒక తార్పుడుకానికి ఒక వేశ్య మీద గలిగిన వ్యామోహం ఇతివృత్తం.

కాలహాన్ రచించిన 10 నవలలలోను మొదటిది *స్ట్రేంజ్ ఫ్యూజిటివ్* (1928). సంఘంలో ఇముడలేని ఒక వ్యక్తి సర్వనాశనం కావడం దీనిలో వర్ణించబడింది. ఇలాంటి వ్యక్తి కాలహాన్ నవలలలో తరచు కనిపిస్తాడు. ఈ రచయిత వ్రాసిన ఇతర నవలలు : *సచ్ ఈజ్ మై బిలవెడ్* (1934), *దె షెల్ ఇన్‌హెరిట్ ది ఎర్త్* (1935), *ది లవ్డ్ అండ్ ది లాస్ట్* (1951), *ఏ పాషన్ ఇన్ రోమ్* (1961), *ఏ ఫైన్ అండ్ ప్రైవేట్ ప్లేస్* (1975), *దట్ సమ్మర్ ఇన్ పారిస్* (1963). ఈ చివరి రచన పారిస్‌లో తాను గడపిన రోజులకూ, ఎఫ్. స్కాట్, ఫిడ్జ్‌గెరాల్డ్, ఎర్నెస్ట్ హెమింగ్‌వే లతో తన మైత్రికీ సంబంధించిన సంస్మరణ గ్రంథం. ఇంగ్లీష్ విమర్శకుడు ఎడ్మండ్ విల్సన్ 'ఇంగ్లీష్ సాహిత్యంలో అన్యాయంగా విస్మృతి పాలైన రచయిత' అని కాలహాన్‌ను వర్ణించాడు.

రాజ్యలక్ష్మి

**కాలిన్స్, (విలియమ్) విల్కీ (1824-89) :** ఆంగ్ల నవలా రచయిత. మిస్టరీ కథను ఆంగ్ల సారస్వతంలో ప్రవేశపెట్టాడు. 1852 లో *బేసిల్* అనే నవల వ్రాశాడు. మధ్య తరగతి ప్రజల జీవిత సరళిని భూమికగా చేసికొని, ప్రతీకారాన్ని, దుర్వృత్తిని ముదురు రంగులలో ప్రదర్శించే కథ ఇది. ఇందులో పూర్తి వాస్తవికత కనిపిస్తుంది. ఇతనికి 1851 లో చార్లెస్ డికెన్స్‌తో పరిచయం ఏర్పడింది. వీరిరువురిలో ఒకరి మీద ఇంకొకరి ప్రభావం కనపడుతుంది. పాత్ర చిత్రణలోనూ, హాస్య పోషణ లోనూ డికెన్స్ ప్రభావం ఇతనిపై బాగా కనపడుతుంది. ఇంక డికెన్స్ మీద కాలిన్స్ ప్రభావం కూడా ఉంది. *ఏ టేల్ ఆఫ్ టూ సిటీస్* (1859), *గ్రేట్ ఎక్స్పెక్టేషన్స్* (1860-61) అనే నవలలలో ముందేమి జరుగుతుందో తెలియనీయకుండా ఉత్కంఠను కల్గించే అనూహ్య పద్ధతిలో డికెన్స్ ఇతివృత్తాలను నిర్వహించడం ఇందుకు ఉదాహరణగా పేర్కొనవచ్చు. డికెన్స్ నడుపుతున్న *హౌస్‌హోల్డ్ వర్డ్స్* అనే పత్రికలో కాలిన్స్ ధారావాహిక రచనలు ప్రకటించాడు. అతడు వ్రాసిన నవలలలో *నో నేమ్* (1862), *ఆర్మడేల్* (1866), *ది మూన్ స్టోన్* బాగా ఆదరణ పొందాయి. మిస్టరీ కథా కథన శిల్పంలో ఇతడు అనితర సాధ్యమైన ప్రతిభను చూపాడు. తరువాతి రచయితలు ఎంతో మంది ఇతనిని అనుకరించారు.

వి.వి.సు.

**కాల్డెరోన్ డె లా బార్కా, పెడ్రో (1600-81):** శ్వానిష్ స్వర్ణయుగంలో 'లోప్ డీ వేగా' తరువాత పేర్కొనదగిన మహా నాటకరచయిత, కవి. కాల్డెరోన్ రచించిన లౌకిక నాటకాలలో మిక్కిలి ప్రసిద్ధి పొందినవి: *ది సర్జన్ ఆఫ్ హిజ్ ఆనర్* (1635), *జీవితం ఒక కల* (1635), *జలామియా మేయర్* (1640), *వాయువు కుమార్తె* (1653- The daughter of the air). చివరిది ఆయన రచనలలో మణిపూసగా భావించబడుతూంది. ఈ లౌకిక నాటకాలే కాక కొన్ని వీథి నాటకాలూ (operas), మత సంబంధమైన ఇతివృత్తంతోకూడిన నాటకాలూ కూడా 'కాల్డెరోన్' రచించాడు.

'కాల్డెరోన్' 1600 వ సంవత్సరం జనవరి 17 వ తేదీన మాడ్రిడ్ నగరంలో జన్మించాడు. ఆయన తండ్రి ఒక ప్రభుత్వోద్యోగి. ఆయన చండశాసనుడు కావడం వల్ల ఆయన ప్రభావం 'కాల్డెరోన్' యౌవనం మీదా, ఆయన తొలిరచన మీదా ఎక్కువగా కనిపించింది.

'ఆల్‌కలా' (Alcala) విశ్వవిద్యాలయంలో 'కాల్డెరోన్' 1614 లో మెట్రిక్యులేషన్ పాస్ అయి తరువాత 'సాలమాంకా' కు మారి, 1619 లేక 20 వరకు న్యాయ శాస్త్రం, భగవచ్ఛాస్త్రం అధ్యయనం చేశాడు. మొదట మతోద్యోగిగా చేరా లనుకున్నాడు. కాని ఆ ప్రయత్నం విరమించుకొని 'కాస్టిలీదుర్గ' రక్షక దళంలో చేరాడు. 1623 లో రాజాస్థానం కోసం నాటకాలు వ్రాయడం మొదలుపెట్టి, నాలుగవ ఫిలిప్ ఆస్థానం లోని ప్రముఖ నాటక కవులలో ఒక డయాడు. 1636 లో రాజు ఆయనకు 'నైట్' బిరుదు ఇచ్చి గౌరవించాడు. 'కాల్డెరోన్' తొలి నాటకాలు రాజాస్థానంలోనే గాక ప్రజల నాటక

శాలలలో కూడా ప్రదర్శింపబడి, ప్రశంస లందుకున్నాయి. 1635 లో 'లోప్ డీ వేగా' మరణించిన తరువాత 'కాల్డెరోన్' శ్పానిష్ నాటక రంగానికి అధినేత అయాడు. 'కేటలాన్' తిరుగుబాటు సందర్భంలో 1640 లో ఒక అశ్విక దళంలో చేరి 1642 వరకూ సైన్యానికి గొప్ప సేవ చేశాడు. సైన్యంలో నుంచి పదవీ విరమణ చేసిన తరువాత 1645 లో 'ఆల్బా ప్రభువు' (Duke of Alba) ఆస్థానంలో కార్యదర్శిగా చేరాడు. కొన్నేళ్ల తరువాత ఆయనకు ఒక అక్రమ సంతానం (కుమారుడు) కలిగాడు. ఆ బిడ్డ తల్లి ఎవరో ఎవరికీ తెలియదు. ఆమె మరణం పట్ల విచారంతో, విరక్తితో 'కాల్డెరోన్' మతబోధక వృత్తి చేపట్టి, 1651 లో ఇక మీద రంగస్థల నాటకాలు ఏవీ వ్రాయ నని ప్రకటించాడు. అయితే ప్రజల రంగస్థలానికి నాటకాలు వ్రాయడం మానుకున్నాడే గాని, ఆటు తరువాత కూడా రాజుగారి ఆదేశం మేరకు ఆస్థాన రంగస్థాలానికి నాటకాలు రచిస్తూనే వచ్చాడు. *స్త్రాలె ఎట్ సిలే* అనే చక్కని మత సంబంధమైన ధ్యాన గీతం 'కాల్డెరోన్' మత సంస్థలో చేరిన తరువాత వ్రాసిందే! 1657 లో మాడ్రిడ్‌కు తిరిగివచ్చి, 1663 లో రాజుగారి 'చాపెల్' లో గౌరవ మతోద్యోగిగా నియమింపబడ్డాడు.

ఆస్థాన నాటక కవిగా కాల్డెరోన్ స్పెయిన్‌లో వీధి నాటకాల అభ్యుదయానికి కూడా అంకురార్పణ చేశాడు. 1648 లో *పాలెరినా ఉద్యానవనం* రచించాడు. రెండు అంకాలు కలిగి కొంత వచనం, కొంత గేయం ఉన్న రూపకం ఇది. తరువాత ఇలాంటి రూపకాలు చాలా రచించాడు. 1660 లో తన మొదటి వీధినాటకం - ఏకాంకిక *గులాబీ ఎఱ్ఱదనం* రచించాడు. ఇది పూర్తిగా సంగీత రూపకమే! ఆ ఏడాదే *గాలి ఈసు కూడా చంప గలదు* (Jealousy even of the air can kill) అనే మూడంకాల వీధినాటకం వ్రాశాడు. ఇటాలియన్ సంప్రదాయంలో లాగానే సంగీతం సాహిత్య విధేయంగా ఉంటూ, 'కాల్డెరోన్' సంగీత నాటకా లన్నీ పూర్తిగా కవితా మయాలుగా ఉంటాయి.

'కాల్డెరోన్' రచించిన మత సంబంధమైన నాటకాలలో *మనిషికీ దేవుడికీ మధ్య అఖాతం* (1652-57), *ప్రపంచ మహా నాటకం* (1635), *దేవుణ్ణి మించిన అదృష్టం లేదు* వంటి నాటకాలు చెప్పుకోదగ్గవి. క్రైస్తవ మత విశ్వాసాలను ప్రచారం చేసే అద్భుతమైన నూతన నాటక రూపాన్ని ఆవిష్కరించి 'కాల్డెరోన్' ప్రపంచ సాహిత్య చరిత్రలో శాశ్వతమైన స్థానం సంపాదించుకున్నాడు. ఆయన భావ గాంభీర్యం, పాత్రచిత్రణ కౌశలం, నిజాయితీ, ఆంతర దృష్టి, హేతుబద్ధత, నైతిక దృక్పథం ప్రపంచ మహా నాటక రచయితలలో ఒకడుగా 'కాల్డెరోన్'కు గణన చేకూర్చాయి.

తన 81 వ ఏట 1681 మే 25 వ తేదీన మాడ్రిడ్ నగరంలోనే 'కాల్డెరోన్' శాశ్వతంగా కన్ను మూశాడు.

బా.శ్రీ.

**కాల్డ్వెల్, ఎర్స్కిన్ (1903-1987):** అమెరికా దక్షిణ ప్రాంతం లోని పేద గ్రామీణులను గురించి సరళమైన శైలిలో నవలలూ, కథలూ వ్రాసిన అమెరికన్ రచయిత. వీటిలో హింస, కాముక వ్యాపారం, వికృత వినోదం కలగలుపుగా ఉండి అంతర్గర్భితంగా సామాజిక అన్యాయం పట్ల నిరసన గోచరిస్తుంది. ఈయన రచనలకు ప్రపంచ మంతటా ప్రాచుర్యం ఏర్పడింది. ముఖ్యంగా ఫ్రాన్స్‌లోను, రష్యాలోను వీటికి గౌర వాదరాలు లభించాయి.

ఈయన తండ్రి ఒక మతప్రచారకుడు. ఈయనను గురించి కాల్డ్వెల్ 1968 లో ప్రచురించిన *డీప్ సౌత్: మెమరీ అండ్ అబ్జర్వేషన్* అన్న పుస్తకంలో సుదీర్ఘంగా వ్రాశాడు. తొలి కాలంలో బడి చదువు సక్రమంగా సాగలేదు. ఎలాగో అయిందనిపించి, ఎర్స్కిన్ కాలేజీ లోను, వర్జీనియా యూనివర్శిటీలోను చదివాడు. కాని పట్టభద్రుడు కాలేదు. *కాల్ ఇట్ ఎక్స్‌పీరియన్స్* (1951) అనే స్వీయ సాహిత్య జీవిత చరిత్రలో ఈయన తాను చేసిన అనేక రకాల ఉద్యోగాలను ఏకరువు పెట్టాడు. అమెరికన్ జీవితంలో అసాధారణమైన విస్తృతానుభవాన్ని గడించడమే కాక, సామాజిక వివేకాన్ని కూడా పెంపొందించుకొన్నాడు.

కథానికా రచయితగా తీవ్ర కృషి చెయ్యాలన్న ఆశయంతో ఈయన 1926 లో 'మెయిన్' లో స్థిరపడ్డాడు. "టొబాకో రోడ్" (1932) అనే నవలతో ఈయనకు మంచి పేరు వచ్చింది. గ్రామీణ దారిద్ర్యానికీ, పతనావస్థకూ ఈ నవల అద్దం పట్టింది. దీన్ని జాక్ కర్క్‌లండ్ నాటకీకరించి 1934 లో న్యూయార్క్ రంగస్థలం మీద ప్రదర్శించినపుడు వరుసగా అది ఏడున్నర సంవత్సరాలు ఆడింది. వినోద విషాద మిశ్రమ మయిన జీటర్ లెస్టర్, అతని కుటుంబం, ఇరుగు పొరుగులను గూర్చిన ఇతివృత్తంతో కూడిన ఈ నాటకం అమెరికన్ నాటక రంగానికి ప్రధానాధార మైంది. కాల్డ్వెల్‌కు నవలా రచయితగా పేరు తెచ్చినవి: *టొబాకో రోడ్, గాడ్స్ లిటిల్ ఏకర్* (1933), *ట్రబుల్ ఇన్ జులై*

(1940) మొదలగు నవలలతో పాటు ఒక పిల్లవాడి బాల్య జీవితాన్ని చక్కగా చిత్రించిన *జార్జియా బోయ్* (1943) అనే కథను కూడా పేర్కొనవచ్చు.

1930-40 దశకంలో కాల్డ్వెల్ సామాజిక సమస్యల పరిష్కారానికి శ్రద్ధగా పనిచేశాడు. ముఖ్యంగా ఆయన పేదరికానికి గురి అయిన కౌలుదార్ల పక్షం వహించాడు. *యూ హావ్ సీన్ దెయిర్ ఫేసెస్* (1937) అన్న గ్రంథంలో వాళ్ల జీవితాలను చిత్రించాడు. కాల్డ్వెల్ చేసిన రచనకు, అప్పటి ఆయన భార్య మార్గరెట్ బర్క్-వైట్ ఫొటో గ్రాఫులు సమకూర్చింది. మరో రెండు పుస్తకాల ప్రకటనలో కూడా వీరిద్దరూ కలసి పనిచేశారు. 1941 లో జర్మనీ దాడి చేసేనాటికి వీరు రష్యాలో ఉన్నారు. పత్రికా రచనా సంబంధమైన పనులు నిర్వహిస్తూ వీరు కొన్ని నెలల పాటు అక్కడే ఉండిపోయారు. ఈ అనుభవం ద్వారా *ఆల్ ఔట్ ఆన్ ది రోడ్ టు స్మోలెన్స్క్* (1942) అన్న పుస్తకంలో యుద్ధం జరుగుతున్న తీరు తెన్నులను గురించి కాల్డ్వెల్ రచించాడు.

1945 లో కాల్డ్వెల్ *అమెరికన్ ఫోక్ వేస్* అనే పేరుతో అమెరికాలోని వివిధ ప్రాంతాలను గురించి వివరించే గ్రంథ సంపుటాల ప్రచురణకు పూనుకొని వాటికి ప్రధాన సంపాదకత్వం వహించాడు. 1955 నాటికి 25 సంపుటాలు రూపొందాయి. తదుపరి కాలంలో ఈయన రచించిన నవలలు విమర్శకులను అంతగా ఆకర్షించలేదు.

అమెరికాలోని సమకాలీన ఉత్తమ రచయితలు 5 గురిలో కాల్డ్వెల్ ఒక డని తోటి నవలా రచయిత విలియం ఫాక్నర్ (1897-1962) పరిగణించి నప్పటికీ అమెరికన్ విమర్శకులు సాధారణంగా ఈయన పట్ల ఎక్కువగా అసూయనే చూపిస్తూ వచ్చారు. ఈయన రచనలలో ఈయన కథానికలే అత్యుత్తమమైనవిగా పరిగణించవచ్చును.

పో.ద.

**కావల్‌కాంటీ, గ్వీడో (1255-1300) :** ఇటలీ దేశపు కవి. డాంటే తరవాత "నూతన మధుర శైలి"లో రచించిన ఫ్లారెన్స్ కవులలో చెప్పుకో దగిన ప్రముఖుడు.

ఫ్లారెన్స్‌లో మంచి పలుకుబడి గల కుటుంబంలో పుట్టిన కావల్‌కాంటి బ్రనెటో లాటిని అనే తాత్త్విక పండితుని వద్ద విద్య నభ్యసించాడు. ఈ లాటిని అంతకు పూర్వం డాంటేకు గురువు. కావల్‌కాంటీ ఒకప్పటి వ్యతిరేక రాజకీయ పక్షనాయకుడయిన ఫరినాటా డెగ్లి ఉబర్టి కుమార్తెను పెళ్లిచేసుకొన్నాడు. అదే సంవత్సరంలో డాంటే తన కవితలలో కొన్నిటిని కావల్‌కాంటీకి అంకితం చేశాడు. డాంటే అతనిని "మొదటి మిత్రుడు"గా పరిగణించాడు. అయితే కావల్‌కాంటీని ఫ్లారెన్స్ నుంచి బహిష్కరించడంలో ఇతని పాత్ర ఉన్నట్లు కనిపిస్తుంది. సర్జానాలో ఆశ్రయం పొందినప్పుడు ఇతనికి మలేరియా జ్వరం వచ్చింది. ఫ్లారెన్స్‌కు తిరిగి రావడానికి అనుమతి లభించింది. ఫ్లారెన్స్‌లోనే కావల్‌కాంటి చని పోయాడు.

బలమైన, సహజ స్వభావ ప్రదర్శకమైన, ఉజ్జ్వలమైన కావల్‌కాంటీ మూర్తిమత్వాన్నీ, దాన్ని ప్రతిబింబించే ఆయన పద్యాలనూ సమకాలికుల్లోనూ, అనంతర కాలంలో ప్రముఖులైన డాంటే, గేబ్రియల్, రోజెటి, ఎజ్రా పౌండ్ వంటి వాళ్ళు అభిమానించారు. ఆయనవి సుమారు 50 పద్యా లున్నాయి. వీటిలో ఎక్కువ ఇద్దరు మహిళలను సంబోధించేవి; ఒకామె, 1292 లో ఆయన కలుసుకొన్న మాండెటా, రెండవామె జియొవన్ని. కావల్‌కాంటీ పద్యాలు ప్రతిభావంతంగా, సుందరంగా, సూటిగా సాగే చక్కని శైలిలో నడుస్తాయి. ఈయన ప్రధాన కవితా వస్తువు ప్రేమ; సాధారణంగా, అంతర్గతంగా వేదన కలిగించే ప్రేమ ఇది!

కావల్‌కాంటీ కవితలలో ఒక దానిలో ప్రేమకు చక్కని, సంక్లిష్ట తాత్త్విక విశ్లేషణ కనిపిస్తుంది. అనంతర కాలంలో దీనిమీద చాలా వ్యాఖ్యానాలు వచ్చాయి.

కావల్‌కాంటీ కవిత్వం మొదట 1527 లో ఒక సంపుటిగా రూపొందింది. చాలా పద్యాలకు రోజెటి అనువాదాలు వెలువడ్డాయి.

పో.ద.

**కాసా, జ్యోవానీ డెలా (1503-1556) :** ఇటలీ దేశపు మతాధికారి, కవి, అనువాదకుడు. ఈయనకు సాహిత్య చరిత్రలో స్థానం కల్పించిన రచన, మర్యాదలను గురించి ఈయన వ్రాసిన *గెలాతియో* గ్రంథం. ఇది అనేక భాషలలోకి అనువాదం పొంది జనరంజకమయింది.

ఈయన ముగెల్లోను, డెల్లాకాసాలోను పెరిగి, బొలోనా, ఫ్లారెన్స్, పాదువా, రోమ్ నగరాలలో చదువుకొన్నాడు. 1544 లో ఈయనను బెనవెంటో ఆర్చ్ బిషప్‌గా నియమించారు. 1555 లో పోప్ పాల్ IV ఈయనను సెక్రటరీ ఆఫ్ స్టేట్‌గా నియమించాడు. ఫ్రాన్సెస్కో బెర్ని మాదిరిగా ఈయన కూడా యౌవనోత్సాహంతో నిండిన అధిక్షేప రచనలతో పాటు గంభీరమైన శైలిలో కొన్ని గేయరచనలు కూడా చేశాడు. *ఓరజియోని పొలిటికె* (1707, *పొలిటికల్ డిస్కోర్సెస్*) వంటి రాజకీయ రచనలు కూడా కొన్ని ఈయన

చేశాడు. ఈ గ్రంథంలో ఇటలీ దేశానికి వచ్చిన విపత్తుల పట్ల ఈయన దుఃఖం ప్రకటించాడు.

డెలా కాసాకు ఎక్కువ పేరు తెచ్చిన గ్రంథం *ఇల్ గెలాటియో*. ఇది ఆలోచనాత్మకమైంది, హాస్య భరితమైంది. 1550-1555 మధ్య కాలంలో రచించిన ఈ గ్రంథం. ఈయన వ్రాసిన *రైమ్*తో పాటు 1558 లో వెలువడింది. దీనిని 1576 లో. రాబర్ట్ పీటర్‌సన్ ఇంగ్లీషులోకి అనువదించాడు. మర్యాదస్తుల సమాజంలో ఎలా నడుచుకోవాలో వివరంగా వర్ణిస్తుంది ఈ గ్రంథం. ఇది యూరప్ అంతటా విశేష ప్రాచుర్యం పొందింది.

పో. ద.

**కాస్తిల్యోని, బాల్దాసారె (1478-1529) :** ఇటలీ దేశపు దౌత్యాధికారి, రాజాస్థాన సభ్యుడు. ఈయన *ఇల్ కార్టిజియానో* అన్న గ్రంథం వ్రాయడంతో పునరుజ్జీవనోద్యమ (రినైజాన్స్) కాలంలో మన్నన లందుకొన్నాడు.

ఈయన మిలాన్ లో విద్యాభ్యాసం చేశాడు. లుడోవికో స్ఫోర్జా ఆస్థానంలో శూరవిద్య నేర్చుకొన్నాడు. 1499 లో ఫ్రాన్సెస్కో గోన్‌జగా (మార్క్విస్ ఆఫ్ మాంటువా) ఆస్థానంలో ప్రవేశించాడు.

ఉర్బినో లో ఈయన పీట్రో బెంబో వంటి వారితో పరిచయ మేర్పరచుకొన్నాడు. అక్కడ ఉన్నకాలంలోనే లాటిన్, ఇటాలియన్ భాషలలో వ్రాసిన పద్యాలతో సహా మరికొన్ని రచనలు చేశాడు. *తిర్సి* (1506) అనే లఘు కావ్యం, బిబీనా రచించిన *కాలండ్రియా* నాటకానికి ఈయన వ్రాసిన ప్రస్తావన వాటిలో చెప్పుకోదగ్గవి.

1509 లో జరిగిన యుద్ధంలో పాల్గొనడానికి డెలా రోవరె అనే సేనాపతి వెంట ఈయన కూడా వెళ్లాడు. 1511 లో 'మిరండోలా' ముట్టడిలో రెండో జూలియస్‌తో పాటు ఈయన కూడా పాల్గొన్నాడు. ఈయన సేవలకు గుర్తింపుగా 'పెసారొ' సమీపంలో ఉన్న 'నోవిలార' కు ఈయనను ప్రభువును చేశారు.

*కార్టిజియానో* (రచన 1513-18; ప్రచురణ 1528) సంవాదపద్ధతిలో నడిచింది. ఆదర్శవంతుడైన రాజసభా సభ్యుణ్ణి గురించి, సంపన్న మహిళ గురించి, రాజాస్థాన సభ్యునికీ, యువరాజుకూ ఉండవలసిన సంబంధాలను గురించి దీనిలో వివరించడం జరిగింది.

ఆ శతాబ్దిలో వెలువడ్డ గొప్ప గ్రంథాలలో ఒకటిగా దీనికి పేరు వచ్చింది. దీనికి ఇటలీలో త్వరగా గుర్తింపు రావడమే కాక ఇది అనేక భాషలలోకి అనువదింపబడింది. దీనిని సర్ థామస్ హోబి *ది కోర్టియర్* (1561) అనే పేరుతో ఇంగ్లీషులోకి అనువదించాడు. ఆ కాలంలో వెలువడ్డ ప్రతిభావంతమైన వచన రచనలలో అత్యుత్తమ మైనదిగా దీనికి ప్రసిద్ధి వచ్చింది.

పో.ద.

**కాస్టెలో బ్రాంకో, కమీలో (1825-90) :** పోర్చుగీసు నవలా రచయిత. ఇతడు వ్రాసిన 58 నవలలలో కాల్పనిక వాదంనుండి యథార్థవాదం వరకు విభిన్న రీతులలో సాగిన రచన లున్నాయి. కొన్ని సందర్భాలలో ఇతనిని పోర్చుగీసు 'బాల్‌జాక్' (ప్రముఖ ఫ్రెంచ్ కథానికా రచయిత) గా అభివర్ణించారు.

కాస్టెలో ఒక ఉన్నత కుటుంబంలో అక్రమ సంతానంగా జన్మించాడు. బాల్యంలో అనాథగా, కఠోర నియమాల మధ్య పోర్చుగల్ లోని 'ట్రాస్-ఓస్ మాంటెస్' లో బంధువుల ఇళ్లలో అతడు పెరిగాడు. సుశిక్షణ లేక పోవడంతో గర్విష్ఠిగా తయారయాడు. పోర్టోలో చదువు కూడా సక్రమంగా సాగలేదు. తొలుత వైద్యుడుగా, తరువాత మతగురువుగా కావటానికి యత్నించాడు. తుదకు వీటన్నింటిని వదలి సాహితీ ప్రక్రియను చేబట్టాడు. కొంత కాలం గాత్‌జాతి కథలు *మిస్టరీస్ డి లిస్బోవా* (1854, Mysteries of Lisbon), *ల్విా నీగ్రాడొప్రాపె డినిజ్* (1855) వంటివి వ్రాశాడు. *ఆన్ఐ ఎస్టై ఆ ఫెలిసిదాడె?* (1856), *విన్గాంకా* (1858) ల రచనతో, శైలిలో పరిపూర్ణత సాధించాడు. అనేక పర్యాయాలు అతడు ప్రేమకలాపాలలో మునిగాడు. పోర్టోలో ఒక వ్యాపారవేత్త అర్ధాంగి అనాప్లాసిడోను లేవదీసుకొని వెళ్ళడంతో అతని ప్రేమ పరాకాష్ఠ అందుకొంది. ఈ దుష్ట చర్యకు ఫలంగా ప్రేమికు లిద్దరినీ (1861) బంధించారు. కాస్టెలో ఈ నిర్బంధ సమయంలోనే తన ప్రసిద్ధ రచన *అమోర్ డి పెర్డికావొ* (1862, Fatal love) ను కేవలం రెండు వారాలలోనే వ్రాశాడు. దీనిలోని కథానాయకుడు కుటుంబం వ్యతిరేకించడంతో ప్రేమ విఫలమై, నేరాలకు పాల్పడి దేశబహిష్కార శిక్షకు గురి అవుతాడు. ఈ పుస్తకం జీవితానికి సరికొత్త నిర్వచనం ఇచ్చింది. దీనిలో రచయిత కాస్టెలో బ్రాంకోను చక్కగా గుర్తించవచ్చు. మోహం నిరంతర ప్రవాహం లాంటిది. సాంఘిక విలువలు దానికి అడ్డంకులు. ఈ రెండింటి ఘర్షణ ఫలమే దుఃఖం, పాపం, బాధలు. వాటి విమోచనకు పరిష్కార రూపమే ఈ రచన.

1864 లో కాస్టెలో కారాగారం నుంచి విముక్తుడయాడు. అప్పటికే అనాప్లాసిడో భర్త మరణించడంతో కాస్టెలో బ్రాంకో అనాతో కలసి మిన్హోమండలంలోని సీడో అనే గ్రామంలో స్థిరపడ్డాడు. జీవనం కోసం నిరం

తరాయంగా రచనా వ్యాసంగాన్ని కొనసాగించాడు. ఈ సాహితీ వ్యాసంగంలో పలు రకాల పద్య కృతులు, నాటకాలు, ప్రౌఢమైన కవితలు, మతసంబంధమైన తీవ్ర చర్చలు చోటు చేసుకున్నాయి. విభిన్న రీతులలో నవలా సాహిత్యాన్ని ఈయన సృష్టించాడు. వీటిలో చాలావరకు ప్రచురణకర్తల అభ్యర్థన మేరకు రచించినవే. 1885 క్రియా బోటెల్హో ప్రభువు అవార్డును అతని రచనకు బహూకరించారు. నిరాశ కలిగించిన కుమారుని ప్రవర్తన, అనారోగ్యం, అప్పుడప్పుడే సంభవిస్తున్న అంధత్వం కారణాలుగా అతడు ఆత్మహత్య చేసుకున్నాడు.

కాస్తెలో బ్రాంకో రచనలలో అనేకం ధారావాహికాలు. వీటిలో సంక్షిప్తత, శక్తిమంతమైన కథాకథనం కనిపిస్తాయి. *అమోర్ డి ప్టెర్దికావొ, ఓ రొమాన్స్ డమ్ హోమెమ్ రికొ* (1861, The love story of a rich man), *ఓ రెట్రెటొ డి రికార్డినా* (1868; Portrait of Ricardina) వంటి రచనలను అందుకు దృష్టాంతంగా పేర్కొనవచ్చును.

కాస్తెలో బ్రాంకో పేరు కాల్పనిక యుగానంతరం కూడా చిరస్థాయిగా నిలిచింది. గ్రామీణ జీవితాలకు ప్రతీకలైన అతని *నో విల్లాస్ డొ మిన్హో* (1875-77) వంటి నవలలలో వాస్తవికతను ప్రతిబింబించింది. అయితే వాస్తవికతా వాదులతో ఇతనికి సాహిత్య వివాదం తలఎత్తింది. దానితో కాస్తెలో వాస్తవికతా వస్తువును, శైలిని పరిహాసం చేస్తూ *యూసెబియో మకారియో* (1879), *ఎకోర్జా* (1880, "The Rabble") వంటి పుస్తకాలు రచించాడు. వాస్తవికత కు వ్యతిరేకంగా వ్రాస్తూ ఉన్నా క్రమంగా అతని శైలి ఆ విధానానికి దగ్గరైందని కొందరు విమర్శకుల భావన.

చిం. వెం.

## కిడ్, టామస్ (1558-94) :

ఇంగ్లీషు నాటక రచయిత. శ్పానిష్ ట్రాజడీతో పాటుగా ఇంగ్లీషులో *రివెంజ్ ట్రాజడి* (ప్రతీకారంతో కూడిన విషాదాంత నాటకం) రూపొందించిన రచయిత.

ఒక కాపీయిస్టు కుమారుడైన కిడ్ లండన్‌లోని మర్చంట్ టైయిలర్స్ స్కూలులో విద్యాభ్యాసం చేశాడు. సాహిత్య రచన చేపట్టడానికి ముందు యూనివర్శిటీలో చదివిన సూచన లేమీ లేవు. కొన్నేళ్లపాటు ఆయన ఒక నాటక సంఘాన్ని నడుపుతున్న ఫెర్డినాండో ప్రభువు (స్ట్రేంజి ప్రభువు) వద్ద పనిచేసినట్లు కనిబడుతూంది. *ది శ్పానిష్ ట్రాజడి* 1592 అక్టోబరు నెలలో రిజిస్టరైంది. దానిని ఏ కంపెనీ వారు ఎపుడు ప్రదర్శించిందీ తెలియదు. కాని స్ట్రేంజి ప్రభువు కంపెనీవారు 1592 లో దానిని 16 సార్లు ప్రదర్శించారు. అది మిక్కిలి ప్రజాదరణ సాధించి అనేక పునర్ముద్రణలు పొందింది.

కిడ్ రచించిన మరొక నాటకం *కార్నీలియా* (1594). 1591 ప్రాంతం లో క్రిస్టఫర్ మార్లోతో కలసి కిడ్ ఒకేబసలో నివసిస్తూ ఉండేవాడు. 1593 మే 13 న రాజద్రోహనేరం క్రింద అతడు బంధింపబడి చిత్రహింసకు గురిఅయాడు. అతని గదిలో వెతుకగా ఏసుక్రీస్తును ధిక్కరించే నాస్తిక రచనలు కనపడ్డాయి. తరువాత కొంత కాలానికి అతడు ఒక లేఖలో ఆ రచనలు మార్లోవి అని ప్రకటించాడు. కిడ్ జీవితాన్ని గురించి మనకు తెలియజేసే ఒకే ఒక్క ఆధారం ఆ ఉత్తరమే. 1594 డిసెంబరు 30 వ తేదీన కిడ్ లండన్‌లో మరణించాడు.

గు.శం.

## కిప్లింగ్, (జోసెఫ్) రుడ్‌యార్డ్ (1865-1936):

ఇంగ్లీష్ నవలా రచయిత, కథకుడు, కవి. ప్రధానంగా బ్రిటిష్ సామ్రాజ్యవాదం ప్రశంసకుడుగాను, ఇండియా లోని బ్రిటిష్ సైనికులను గురించిన కథలు, పద్యాలు వ్రాసిన కవిగాను, చిన్న పిల్లల కథలు వ్రాసిన రచయితగాను ప్రసిద్ధి పొందినవాడు. 1907 లో సాహిత్యానికి కిప్లింగ్‌కు నోబెల్ బహుమతి లభించింది.



1865 డిసెంబర్ 30 న రుడ్‌యార్డ్ కిప్లింగ్ ఇండియాలోని బొంబాయి నగరంలో జన్మించాడు. ఇతని తండ్రి జాన్ లాక్‌వుడ్ కిప్లింగ్ కళాకారుడూ, విద్వాంసుడూ. అతడు లాహోర్‌లోని మ్యూజియంకి క్యూరేటర్‌గా పనిచేసేవాడు. తండ్రి ప్రభావం కిప్లింగ్ రచనల మీద విశేషంగా కనిపిస్తుంది. రుడ్‌యార్డ్ కిప్లింగ్ వ్రాసిన సుప్రసిద్ధ నవల 'కిమ్' మొదటి అధ్యాయంలోని 'అద్భుత భవనం' పర్యవేక్షకుడుగా వర్ణింపబడినవాడు కిప్లింగ్ తండ్రే. కిప్లింగ్ తల్లి 'ఆలిస్ మాక్డొనాల్డ్'. ఆమె ఇద్దరు అక్కలు 19 వ శతాబ్దంలో సుప్రసిద్ధులైన పెయింటర్‌లు. సర్ ఎడ్వర్డ్ బర్న్ జోన్స్, సర్ ఎడ్వర్డ్ పాయింటర్‌లను

వివాహమాడారు. మూడవ సోదరి ఆల్ఫ్రెడ్ బాల్విన్‌ను వివాహమాడి, తరువాత బ్రిటిష్ ప్రధాని అయిన శ్టాన్లీ బాల్డ్విన్‌కు తల్లి అయింది. ఈ బంధుత్వాలు కిప్లింగ్‌కు జీవితాంతం సహాయపడ్డాయి.

కిప్లింగ్ బాల్యం ఏమంత ఆనందంగా గడువలేదు. అతని ఆరవ ఏట తల్లిదండ్రులు అతనిని ఇంగ్లండ్ తీసుకొని పోయి, 'సౌత్‌సీ' లో ఒక పెంపుడు ఇంటిలో అయిదేళ్ల పాటు ఒంటరిగా వదిలారు. అక్కడ అతడు అనుభవించిన అగచాట్లే *బాబా, బ్లాక్‌షీప్* (1888) అనే కథలో కిప్లింగ్ వర్ణించాడు. తరువాత అతడు వెస్ట్ వరల్డ్ హోమ్‌లోని యునైటెడ్ సర్వీసెస్ కాలేజ్ అనే బోర్డింగ్ స్కూల్‌లో చేరాడు. దాని స్మృతులు జీవితాంతం కిప్లింగ్‌ను వెన్నంటుతూనే వచ్చాయి.

1882 లో కిప్లింగ్ ఇండియా తిరిగి వచ్చి, ఏడేళ్లపాటు పత్రికా రచయితగా పనిచేశాడు. అతని తల్లిదండ్రులు ఆక్రమించిన పదవులు ప్రధానమైనవి కాకపోయినా ఆంగ్లో ఇండియన్ సమాజంలో వారు పై వర్గానికి చెందిన వారు. అందుచేత ఆ వర్గం వారి జీవితాన్ని పరిశీలించే అవకాశం కిప్లింగ్‌కు కలిగింది. చిన్నతనం నుంచీ కిప్లింగ్‌ను ఇండియా దేశీయ జీవనచిత్రం విశేషంగా ఆకర్షించింది. తాను పనిచేసిన పత్రికలలో ఆ దృశ్యాలను వచన రూపంలోనూ, చిత్రాలరూపంలోనూ అభివర్ణిస్తూ వచ్చాడు. 1886 లో *డిపార్ట్‌మెంటల్ డిట్టీస్* నూ, 1888 లో *ప్లెయిన్ టేల్స్ ఫ్రమ్ ది హిల్స్* నూ ప్రకటించాడు. 1877-89 మధ్య ఆ కథానికా సంపుటాలు ప్రచురించాడు. 1889 లో అతడు ఇంగ్లండ్ వెళ్లేనాటికే అక్కడ అతని కీర్తి వ్యాపించింది. తరువాత ఒక ఏడాది లోపుగానే సమకాలీన వచన రచయితలలో మిక్కిలి ప్రతిభావంతులలో ఒకడుగా కిప్లింగ్ ప్రసిద్ధి పొందాడు. 1892 లో *బేరక్-రూమ్ బాలెడ్స్* ప్రకటించడంతో అతని కీర్తి మరింత పెరిగింది. ఇంగ్లీష్ కవి లార్డ్ బైరన్ తరువాత అంత తక్కువకాలంలో అంత ఎక్కువ కీర్తిని పొందినవాడు కిప్లింగే. 1892 లో ఆస్థానకవి లార్డ్ టెన్నిసన్ చనిపోయిన తరువాత ప్రజాదరణలో ఆయన స్థానాన్ని కిప్లింగ్ ఆక్రమించుకొన్నాడు.

1892 లో కిప్లింగ్ అమెరికా దేశానికి చెందిన 'కెరోలిన్ బాలెస్టీర్' ను వివాహమాడాడు. ఆ యువ దంపతులు అమెరికా వెళ్లి వెర్మాంట్‌లోని మిసెస్ కిప్లింగ్ ఎస్టేట్‌లో స్థిరపడ్డారు. ఈ దంపతుల అలవాట్లూ, పద్ధతులూ ఇరుగు పొరుగులకు నచ్చకపోవడంతో వారు తిరిగి ఇంగ్లండ్ వచ్చారు. అప్పటినుంచి కిప్లింగ్ అమెరికన్లను 'విదేశీయులు' గానే చూస్తూ వచ్చాడు.

అమెరికాలో ఉన్న కాలంలో కిప్లింగ్ ఈ క్రింది రచనలు ప్రచురించాడు. 1. *ది లైట్ దట్ ఫెయిల్డ్* (1890), 2. *కెప్టెన్స్ కరేజియస్* (1897), 3. *కిమ్* (1901), 4. *ది జంగిల్ బుక్స్* (1894, 1895).

1902 లో ససెక్స్ రాష్ట్రంలోని 'బుర్వాష్' లో ఒక ఇల్లుకొని జీవితాంతం కిప్లింగ్ అక్కడే గడిపాడు. అతని తరువాతి రచనలలో చాలావాటికి, ముఖ్యంగా *పుక్ ఆఫ్ పుక్స్ హిల్* (1906), *రివార్డ్స్ అండ్ ఫెయిరీస్* (1910) లకు ససెక్స్ రాష్ట్రమే పూర్వరంగాన్ని సమకూర్చింది. 1907 లో కిప్లింగ్‌కి సాహిత్యంలో నోబెల్ బహుమతి లభించింది.

ఒక బ్రిటిష్ పౌరుడికి లభించే అత్యుత్తమ గౌరవం 'ఆర్డర్ ఆఫ్ మెరిట్' ను కిప్లింగ్ రెండు పర్యాయాలు నిరాకరించాడు. 1895 లో తనను ఆస్థానకవిగా నియమించడానికి నిర్ణయించే పక్షంలో దానిని తాను నిరాకరిస్తానని ప్రభుత్వానికి ముందుగానే కిప్లింగ్ వ్రాశాడు.

ఆంగ్ల విమర్శకుడు టి.ఎస్. ఎలియెట్ కిప్లింగ్‌ను కవిగా ఎంతపైకి ఎత్తాలని ప్రయత్నించినా, నిజానికి కిప్లింగ్ అంత ఉదాత్త కవికాడు. వచన రచయితగానూ, కథకుడుగానూ కిప్లింగ్ ప్రతిభ కొంతవరకు ప్రశంసించదగినది.

1936 జనవరి 18 వ తేదీన లండన్ నగరంలో రుడ్‌యార్డ్ కిప్లింగ్ దేహయాత్ర చాలించాడు.

*నాగరాజ్(బొ.శ్రీ.)*

**కీట్స్, జాన్ (1795-1821) :** ఇంగ్లీషు కాల్పనిక కవులలో అగ్రశ్రేణికి చెందినవాడు. అల్పాయుష్కుడైనా అజరామరాలైన భావగీతాలు రచించి శాశ్వతమైన కీర్తిని ఆర్జించిన మహాకవి. *ఎండిమియాన్, లా బెల్లీ డేమ్ శాన్స్ మెర్సీ, ఓడ్ ఆన్ మెలాంకలీ, ఓడ్ టు ఏ నైటింగేల్, ఓడ్ ఆన్ ఏ గ్రీషియస్ అర్న్, ఓడ్ టు సైకే, ది ఈవ్ ఆఫ్ సెంట్ ఆగ్నిస్,* 'హైపీరియన్' మొదలైన కీట్స్ కావ్యాలు సుప్రసిద్ధమైనవి.



లండన్‌లో 1795 అక్టోబరు 31 వ తేదీన 'జాన్ కీట్స్' జన్మించాడు. ఆయన మాతామహుడు 'జాన్ జెన్నింగ్స్' డబ్బు గలవాడు. అశ్వాలను అద్దె కిచ్చే ఒక అశ్వశాల (Livery stable) ని, ఒక సత్రాన్ని (Inn) ఆయన నడిపేవాడు. జాన్ కీట్స్ తండ్రి టామస్ కీట్స్ ఆయన దగ్గర ఉద్యోగం చేసేవాడు. టామస్ కీట్స్ పుట్టు పూర్వోత్తరాలు స్పష్టంగా తెలియవు. తన యజమాని "జెన్నింగ్స్" కుమార్తె "ఫ్రాన్సెస్"ను టామస్ కీట్స్ వివాహమాడి ఆయనకు అల్లు డయాడు. 1804 లో ఒక గుఱ్ఱపు స్వారీ ప్రమాదంలో టామస్ కీట్స్ చనిపోగా, అతని భార్య వెంటనే మరొక వివాహం చేసుకుంది. అంతకు ముందే ఆమెకు టామస్ కీట్స్ వల్ల ముగ్గురు కుమారులు కలిగారు: 'జాన్ కీట్స్', అతని సోదరులైన 'టామ్', 'జార్జ్'.

తమ మాతామహుని మరణానంతరం కీట్స్, అతని ఇద్దరు సోదరులూ మిడిల్‌సెక్స్ లోని 'ఎడ్మాంటన్' లో తమ మాతామహి (అమ్మమ్మ) వద్ద గడిపారు. తల్లి ఫ్రాన్సెస్ తన రెండవ వివాహం భగ్నం కావడంతో కొన్నేళ్ల తరువాత పిల్లల దగ్గరకు తిరిగి వచ్చింది. 'కీట్స్' ప్రాథమిక విద్యాభ్యాసం 'ఎన్‌ఫీల్డ్'లో జరిగింది. ఆ స్కూలులోని చక్కని వాతావరణం కీట్స్ మనస్సుకు ఊరట కలిగించింది. ఆ స్కూలు హెడ్మాస్టరు గారి కుమారుడు 'ఛార్లెస్ కౌడెన్ క్లార్క్' తో కీట్స్‌కి ప్రగాఢమైన మైత్రి ఏర్పడింది. స్కూలులో చదివే రోజులలో తీవ్రమైన రాగ ద్వేషాలతో చీటికీ మాటికీ కయ్యాలకు కాలు దువ్వే ధూర్తుడుగా తప్ప సాహిత్య ప్రియుడుగా కీట్స్‌కి గుర్తింపు రాలేదు. 1809 లో తల్లి తమ వద్దకు తిరిగి వచ్చిన దగ్గరనుంచీ కీట్స్ విస్తృతంగా గ్రంథ పఠనం ప్రారంభించాడు. స్కూలులో ఎన్నో బహుమతులు అందుకున్నాడు. 1810 లో కీట్స్ తల్లి క్షయ వ్యాధితో మరణించింది. తన సెలవు లన్నీ కీట్స్ ఆమెకు ఉపచారం చేయడంలోనే గడిపాడు.

తరువాత కొద్ది రోజులకే కీట్స్ స్కూలు చదువుకి స్వస్తి చెప్పి ఒక డాక్టరుగారి దగ్గర అప్రెంటిస్‌గా చేరాడు. అయినా తరచూ తన మిత్రుడు 'ఛార్లెస్ కౌడెన్ క్లార్క్'ను కలుసుకుంటూనే ఉండేవాడు. అతని మైత్రీ ప్రభావం వల్లనే కీట్స్ తన తొలి పద్యం *స్పెన్సర్ అనుకరణ* రచించాడు. తరువాత అలాగే ప్రసిద్ధ కవుల పద్యాల ననుకరిస్తూ మరి కొన్ని పద్యాలు రచించాడు. ఆయన చుట్టూ ఒక చిన్న యువ కవి మండలి చేరింది.

1815 అక్టోబరు 1 న లండన్‌లోని సౌత్‌వార్క్ బరోలో ఉన్న గైస్ హాస్పిటల్‌లో కీట్స్ విద్యార్థిగా చేరి, నాలుగు నెలలలోనే 'డ్రెస్సర్'గా, అంటే జూనియర్ హౌస్ సర్జన్‌గా ప్రమోషన్ పొందాడు. అయితే అప్పటికే కవిత్వం ఆయనకు ఒక వ్యసనం అయింది. దానిలో విజయం సాధించ లేకపోతే ఆత్మహత్య చేసుకుంటా నని ప్రకటించడం వరకూ వచ్చింది. సమకాలికుడైన 'లెయ్ హంట్', 'విలియమ్ వర్డ్స్‌వర్త్' ల రచనలను తీవ్రంగా అధ్యయనం చేయడం వలన వెనుకటి కవి మిత్రులకు దూరమై తన కొక మౌలిక శైలిని అతడు రూపొందించు కొనసాగాడు. 1816 మే నెలలో *ఓ సాలిట్యూడ్* అనే ఆయన సానెట్ హంట్ సంపాదకుడుగా ఉన్న *ది ఎగ్జామినర్* అనే పత్రికలో ప్రచురించబడింది. 1816 జూలైలో కీట్స్ పరీక్షలలో గెలుపొంది, 'ఔషధ విక్రేతల సంఘ' సభ్యుడుగా లైసెన్స్ పొందాడు. 'రాయల్ కాలేజ్ ఆఫ్ సర్జన్స్' లో సభ్యత్వం పొందే ఉద్దేశ్యంతో కొన్ని లెక్చర్లకు హాజరైనా, కీట్స్ ఆ కోర్సును పూర్తి చేయలేదు.

కీట్స్ ఆ రోజులలో లండన్ బ్రిడ్జ్‌కి దక్షిణపు కొసను ఉన్న 'డాన్' స్ట్రీట్‌లో ఉండేవాడు. ఒక సాయంత్రం 'క్లార్క్'తో కలిసి 'జార్జ్ ఛాప్‌మన్' చేసిన హోమర్ కావ్యానువాదం చదివి ఇంటికి తిరిగి వచ్చిన తరువాత కీట్స్ *ఛాప్‌మన్ హోమర్ చదివాక* (On first looking into Chapman's Homer) అనే సానెట్‌ను వ్రాశాడు. అదే అతని మొట్టమొదటి పరిణత కవిత. 1816 అక్టోబర్‌లో 'క్లార్క్'కీట్స్‌ని 'లెయ్‌హంట్'కి పరిచయం చేశాడు. వెంటనే అతడు 'హంట్' బృందంలో సభ్యుడై చారిత్రక చిత్రకారుడు 'బెంజమన్ రాబర్ట్ హైడన్'నీ, యువకవి 'జాన్ హామిల్టన్ రేనాల్డ్స్'నీ కొద్ది రోజుల తరువాత షెల్లీనీ కలుసుకున్నాడు. అప్పటికి కీట్స్ వయస్సు 21. వైద్యవృత్తికి పూర్తిగా స్వస్తిచెప్పి, కవితా రంగానికే కీట్స్ అంకితం అయాడు.

1816 డిసెంబరు 1 న లెయ్ హంట్ *యువ కవులు* అనే ఒక వ్యాసాన్ని తన *ది ఎగ్జామినర్* పత్రికలో ప్రచురించాడు. దానిలో కీట్స్‌ని, రేనాల్డ్స్‌ని, షెల్లీని ఆయన ప్రశంసించాడు. కీట్స్ రచించిన *ఛాప్‌మన్స్ హోమర్* అనే సానెట్‌ని పూర్తిగా ఉదాహరించాడు. దానితో కవిగా కీట్స్ స్థిరపడ్డాడు. ఒక ఖండకావ్య సంపుటిని ప్రచురణకు సిద్ధం చేశాడు. చేతిలో కానీ లేకపోయినా ఆయన ఆకర్షకమైన వ్యక్తిత్వం ఆయనను అందరికీ ప్రీతిపాత్రుణ్ని చేసింది. కీట్స్ సమగ్రమైన

వ్యక్తిత్వం ఆయన లేఖలలో బాగా వ్యక్తం అయింది. లెయ్ హంట్ కి అంకిత మిచ్చిన ఆయన కావ్య సంపుటి 1817 మార్చిలో వెలువడింది. వెంటనే ఒక ప్రచురణకర్త సుదీర్ఘ కావ్యం అయిన *ఎండిమియాన్* రచనకు కీట్స్‌ని ప్రోత్సహించాడు. షెల్లీ మీద మైత్రీ పురస్సర మైన పోటీతో కీట్స్ ఆ కావ్య రచనకు పూనుకున్నాడు. చంద్రాధిదేవత అయిన 'సింత్యా'కూ, 'ఎండిమియాన్' అనే పేరు గల ఒక మానవ మాత్రునికీ మధ్య సాగిన ఒక పవిత్ర ప్రణయాన్ని ప్రతిపాదించే ఒక గ్రీక్ గాథ ఆ కావ్యానికి ఆధారం.

1817-18 శీత కాలంలో లండన్ సందర్శించిన 'విలియమ్ వర్డ్స్‌వర్త్'ని 'కీట్స్' కలుసుకున్నాడు. కాని వర్డ్స్‌వర్త్ అహంభావం కీట్స్‌కి నిరుత్సాహం కలిగించింది. అదే సమయంలో హంట్ మీది వ్యామోహం కూడా ఆయనలో సన్నగిల్లసాగింది. 'హైపీరియన్' అనే రాక్షసుణ్ణి సూర్యాధిదేవత అపోలో నిర్జించిన గ్రీక్‌గాథ ఆధారంగా *హైపీరియన్* అనే దీర్ఘకావ్యాన్ని కీట్స్ వ్రాయడం మొదలుపెట్టాడు.

**మహాకావ్య రచన:** *ఎండిమియాన్* అనే తన మహాకావ్యాన్ని వెయ్యేసి పంక్తులు గల నాలుగు భాగాలుగా 'కీట్స్' రచించాడు. మొదటి భాగం రచనకు 1817 ఏప్రిల్ నెలలో లండన్ నగరం వదలి ప్రశాంత వాతావరణాన్ని ఆయన ఎంచుకున్నాడు. రెండవ భాగం 'హాంప్‌స్టెడ్'లో వ్రాశాడు. అక్కడ 'చార్లెస్ వెంట్‌వర్త్ డిల్‌కే', 'ఛార్లెస్ బ్రౌన్'లు ఆయనకు పొరుగున ఉండేవారు. మూడవ భాగాన్ని 'కీట్స్' ఆక్స్‌ఫర్డ్‌లో మరొక నూతన మిత్రుడు 'బెంజిమన్ బైలీ' కి అతిథిగా ఉంటూ సెప్టెంబరు నెలలో పూర్తిచేశాడు. ఆ బెయిలీతో కీట్స్‌కి తరుచు మత, తాత్త్విక చర్చలు జరుగుతూ ఉండేవి. నాల్గవ భాగాన్ని లండన్‌లో కొంత, డార్కింగ్ సమీపంలో ఉన్న బాక్స్‌హిల్‌లో కొంత పూర్తిచేశాడు. నవంబరు నెల ఆఖరుకు కావ్యం పూర్తి అయింది. ఆ కావ్య రచనా కాలంలో కళకూ, తత్త్వశాస్త్రానికీ సంబంధించిన ఎన్నో వినూత్న భావాలు కీట్స్ మెదడులో రూపు దాల్చాయి. ఆ భావాలను ఆయన 'బెయిలీ'కి వ్రాసిన లేఖలలో ప్రకటించాడు. ఆ లేఖలలో ప్రస్తావించబడిన వ్యాధి బహుశః ఏదో సుఖవ్యాధి అయి ఉండవచ్చు నని విమర్శకులు ఊహిస్తున్నారు.

1818 ఆరంభంలో కీట్స్ *ఎండిమియాన్* కావ్యానికి శుద్ధప్రతి తయారు చేయడంలోను, చిన్న చిన్న ఖండ కావ్యాలు వ్రాయడంలోను నిమగ్ను డయాడు. ఇంగ్లీషు కవులను గురించి 'విలియమ్ హాజ్‌లిట్' చేసిన విమర్శకోపన్యాసాలకు కీట్స్ హాజరయాడు.

**విధి వైపరీత్యం:** అంతలో 'కీట్స్' అనేక ఈతి బాధలకు గురి అయాడు. చేతిలో ఉన్న డబ్బు ఖర్చు అయిపోయింది. ఒక సోదరుడు 'టామ్ కీట్స్' క్షయ వ్యాధితో బాధసాగాడు. మరొక సోదరుడు జార్జ్ కీట్స్ పెళ్లి చేసుకుని, అమెరికా వలస పోవాలని ఆలోచిస్తున్నాడు. 1818 మార్చిలో 'జార్జ్' కి విశ్రాంతి ఇచ్చి, 'టామ్'కి స్వయంగా ఉపచారాలు చేయడానికి *కీట్స్* పూనుకున్నాడు. ఆ కాలంలోనే *ఇసబెల్లా* లేక *ది పాట్ ఆఫ్ బాసిల్* అనే కథాకావ్యం కీట్స్ వ్రాశాడు. మే నెల ఆరంభంలో టామ్‌ని కీట్స్ లండన్ తీసుకుని వచ్చాడు. ఒక పక్క టామ్‌కి ఉపచారాలు చేస్తూనే కీట్స్ *హైపీరియన్* లోని మొదటి రెండు భాగాలూ రచించాడు. ఆ రోజుల్లోనే ముగ్గురు యువతులు కీట్స్ దృష్టిని ఆకర్షించారు. ఒకామె 'జేన్ కాక్స్' - జె.హెచ్ రేనాల్డ్స్ సోదరి. మరొకామె 'ఇజబెల్లా జోన్స్'. 1817 లో హేస్టింగ్స్‌లో కీట్స్ ఆమెను కలుసుకున్నాడు. ఆమె చాలా విచిత్రమైన మనిషి. మూడవ ఆమె కీట్స్ నిజమైన ప్రేయసి ఫ్రాన్సెస్ బ్రాన్. హాంప్‌స్టెడ్ లో తన తల్లి దగ్గర ఆమె ఉండేది. 'టామ్' మరణానంతరం 'కీట్స్' హాంప్‌స్టెడ్‌కి వెళ్లినపుడు ఆమె అతనికి చేరువ అయినట్లు కనిపిస్తుంది. *ది ఈవ్ ఆఫ్ సెంట్ ఆగ్నెస్* అనే పద్య రచనకు కీట్స్‌ని ప్రోత్సహించింది ఇజబెల్లా జోన్స్. 1819 నవంబరు నెల చివర ఆ పద్యం రచించబడింది. *హైపీరియన్* కావ్యాన్ని పూర్తి చేయకుండానే కీట్స్ మధ్యలో నిలిపివేశాడు.

"ఫ్రాన్సెస్ బ్రాన్" ని వివాహ మాడడానికి కీట్స్ నిశ్చితార్థం చేసుకున్నాడు. కాని 'టామ్ కీట్స్'కి పరిచర్యలు చేస్తున్న రోజులలోనే 'కీట్స్'లో క్షయ వ్యాధి అంకురించింది.

**అవసాన దశ:** 1820 ఫిబ్రవరి 3 వ 'కీట్స్' ఊపిరితిత్తుల నుంచి రక్తం పడింది. మరి కొన్ని సార్లు అలా రక్తం పడడం జరిగిన తరువాత డాక్టరు చివరి ఆశగా కీట్స్‌కు ఇటలీ వెళ్ల మని సలహా చెప్పాడు. ప్రచురణ కర్తలు చేసిన ఆర్థికసహాయంతో 'జోసెఫ్ సెవెర్న్' అనే యువ చిత్రకారుణ్ణి వెంట పెట్టుకుని సెప్టెంబరు 17 వ తేదీన కీట్స్ ఓడ ఎక్కి ఇటలీ బయలుదేరాడు. తన 25 వ పుట్టిన రోజున నేపిల్స్‌లో దిగి, రోమ్‌కి బయలుదేరాడు. కొన్ని వారాల తరువాత ఎక్కు వెక్కువగా రక్తం పడుతూ ఇంక ఎలాంటి ఆశా లేదని స్పష్టమైంది.

కీట్స్ ఆత్మహత్య చేసుకోవా లనుకున్నాడు. కాని 'సెవెర్న్' నిరోధించాడు. 1821 ఫిబ్రవరి 23 న సెవెర్న్ చేతులలోనే కీట్స్ ప్రాణాలు వదిలాడు.

కీట్స్ అకాల మృతికి విలపిస్తూ షెల్లీ *ఎడనాయిస్* అనే అద్భుతమైన ఖండకావ్యం వ్రాశాడు. లెయ్ హంట్, బైరన్ మొదలైన వారు కీట్స్ కవితా ప్రతిభను వేనోళ్ల కొనియాడారు.

*బొ.శ్రీ.*

**కుందేరా, మిలాన్ (1929--) :** జెక్ నవలా రచయిత, కథానికా రచయిత, నాటక కర్త, కవి. 1975 లో ఫ్రాన్స్‌లో ప్రవాసం అనుభవించాడు.

ప్రముఖ పియానిస్టు, వాద్యకారుడు అయిన లుడ్విక్ కుందేరా ఇతని తండ్రి. మిలాన్ మొదట్లో సంగీతం, ఆ తరువాత రచనా వ్యాసంగం అభ్యసించి, 1953 లో *స్లోవెక్ జ్వాదా షీరా* (మానవుడు ఒక విశాల వనం) అనే కవితా సంకలనాన్ని వెలువరించాడు. *పోస్లెద్నీ మజ్* (1955 - నిరుటి మే నెల), *మోనోలజీ* (1975- 'స్వగతాలు') అనే సంకలనాలను వానిలోని రాజకీయ వేర్పాటు వాదం వల్లనూ, అసభ్యశృగారం వల్లనూ జెక్ రాజకీయాధికారులు నిషేధించారు. కమ్యూనిస్టు పార్టీలో కొన్నాళ్లు (1948-50, 1956-70) సభ్యుడుగా ఉండి, తిరిగి బయటికి వచ్చాడు. సంగీత, నాటక కళలకు చెందిన ప్రాగ్ అకాడమీలో సినీమా విభాగంలో అధ్యయనంతో పాటు ఆయన అధ్యాపకత్వం కూడా నిర్వహించాడు.

అనేక కథా సంకలనాలనూ, *మెజౌబెలె క్లీషు* (1962 - తాళం చెవుల యజమానులు) వంటి ఏకాంకికను ప్రకటించాడు. తరువాత తన తొలి నవల అయిన *జెర్ట్* (1967-జోక్) అనే హాస్య రచనను వెలువరించాడు. స్టాలినిజం కాలంలో జెక్‌ల విపరీత వర్తనను చిత్రించే ఈ నవల ఎన్నో భాషలలోకి అనువాదం పొంది అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించింది. అతని రెండవ నవల *జి హాట్ జెబిందె* (1969- జీవితం మరెక్కడో ఉంది) 1948 లో కమ్యూనిస్ట్ పాలన ఏర్పడిన కాలంలో కమ్యూనిజాన్ని పూర్తిగా ఆలింగనం చేసి కొన్న ఒక వ్యక్తిని పరిహసించే రచన. జెక్ భాషలో దీని ప్రచురణను నిషేధించారు. అధికారులు ఇతని రచన లన్నిటినీ నిషేధించి, ఇతనిని ఉపాధ్యాయ ఉద్యోగంలో నుంచి తొలగించి, కమ్యూనిస్ట్ పార్టీ నుంచి కూడా బహిష్కరించారు.

1975 లో కుందేరా తన భార్య (వెరా హ్రబంకోవా) తో కలసి ఫ్రాన్స్‌కు వలసపోయి అక్కడి రెన్నెస్ విశ్వవిద్యాలయంలో ఉపాధ్యాయ వృత్తిని చేపట్టడానికి అనుమతించారు. 1979 లో జెక్ ప్రభుత్వం కుందేరా పౌరసత్వాన్ని రద్దు చేసింది. *వల్చిక్ నా రోజ్ లే ఘ్నూ* (1976 వీడ్కోలువిందు), *ది బుక్ ఆఫ్ ల్యాఫ్టర్ అండ్ ఫర్‌గెటింగ్, ది అన్‌బేరబుల్ లైట్‌నెస్ ఆఫ్ బీయింగ్* (1984) మొదలైన కుందేరా రచనలు ఫ్రాన్స్‌నుంచే వెలువడ్డాయి.

*గు.శం.*

**కున్హా, యూక్లిడెస్ డి (రోడ్రిగ్స్ పిమెంటా) (1866-1909) :** ప్రముఖ బ్రెజిలియన్ రచయిత. *ఓస్ సెర్టోస్* (1902, బాక్ లాండ్స్ ప్రతిఘటన) వంటి చరిత్రాత్మకమైన రచన చేసిన మహనీయుడు. బ్రెజిల్ సరిహద్దులలోని అజ్ఞాత ఆదిమజాతి పేర్లను ఈయన సమర్థించాడు.

సైన్యంలో ఇంజనీరుగా పనిచేసి తరువాత పత్రికా రచయితగా మారాడు. 1896-97 లో రిపోర్టర్‌గా బాహియా రాష్ట్రంలోని 'బాక్ లాండ్స్' కు సైన్యం వెంబడి వెళ్లాడు. 'అంతోనియో కవున్సిల్హారో' (ది కవున్సిలర్) తన అనుచరులతో కలసి అక్కడ స్వతంత్ర రాజ్యం నిర్మించుకోగా, వరుసగా వచ్చిన 'బ్రెజిల్' ప్రభుత్వాలు దానిని నాశనం చేసే ప్రయత్నం చేశాయి. ఆ వృత్తాంతాన్ని కున్హా గ్రంథస్థం చేశాడు. ఆ గ్రంథం ఆసక్తిదాయకంగా ఉంటుంది. వెనుకబడిన జాతులవారిని జాతీయ జీవనంలో భాగస్వాములుగా చేయాలని కున్హా వాదించాడు.

ఒక వ్యక్తిగతమైన వివాదంలో తుపాకి గుండుకు గురి అయి కున్హా జీవితం విషాదాంతంగా ముగిసింది. ప్రతి ఏడు ఆగస్టు నెలలో బ్రెజిలియన్‌లు ఒక వారం రోజులపాటు ఈయన గౌరవార్థం 'సెమినా యూక్లిడీనా' అనే ఉత్సవం జరుపుతున్నారు.

*గు.శం*

**కువో మో-జో (1892-1978) :** 20 వ శతాబ్దపు ప్రముఖ చైనా దేశపు రచయిత, విద్వాంసుడు, ప్రముఖ ప్రభుత్వాధికారి.

సంపన్నుడైన ఒక వ్యాపారి కుమారుడు. ఆదిలో సంప్రదాయ విద్య 1914 లో అభ్యసించగా తన చైనీయ భార్యను పరిత్యజించి వైద్యం అభ్యసించడానికి జపాన్ వెళ్లాడు. అక్కడ ఒక జపనీస్ యువతి ప్రేమలో పడి ఆమెను వివాహ మాడాడు. విదేశ భాషలను, సాహిత్యాలను బాగా చదివాడు. స్పినోజా, గోథే, టాగూర్, వాల్ట్ విట్మన్‌లను క్షుణ్ణంగా అధ్యయనం చేశాడు. ఈతని

కవిత్వం మీద విట్మన్, షెల్లీల ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది. 1922 లో ప్రకటించిన *సారోస్ ఆఫ్ యంగ్ వెర్తర్* (గోథే రచనకు అనువాదం) ఎక్కువ ప్రసిద్ధి పొందింది. *సోషల్ ఆర్గనైజేషన్, సోషల్ రెవల్యూషన్* అన్న అనువాదం ఈయన దృష్టిని మార్క్సిజం వైపు మళ్లించింది. ప్రోలెటేరియట్ పట్ల సానుభూతిని ప్రదర్శించే రచనలే చేయాలని ఆయన వాదించాడు.

చైనా ఏకీకరణకు ఉత్తరాన భూస్వామ్య పద్ధతికి వ్యతిరేకంగా చాంగ్ కైషేక్ నడపిన ఉద్యమంతో 1926 లో ఒక రాజకీయ 'కమిసార్' గా పని చేశాడు. కాని 1927 లో కమ్యూనిస్ట్ నాన్ చాంగ్ తిరుగుబాటులో పాల్గొన్నాడు. ఆ తిరుగుబాటు విఫలం కావడంతో కువో జపాన్ పారిపోయి, 10 ఏళ్లు చైనీస్ సంస్కృతిని గురించి పరిశోధనలు చేశాడు. 1937 లో తిరిగి చైనా వచ్చి జపాన్‌కు వ్యతిరేకంగా పోరాడాడు. అనేక ప్రభుత్వ పదవులు ఆయనను వరించాయి. అనేక కవితలు, నవలలతో పాటు 9 సంపుటాల స్వీయ చరిత్ర, గోథే, షిల్లర్, తుర్గెనేవ్, టాల్‌స్టాయ్, అప్టాన్ సింక్లేర్ మొదలైన ప్రముఖ విదేశీ రచయితల రచనలకు అనువాదాలూ కూడా కువో ప్రకటించాడు. కాంస్య పాత్రల మీద, అస్థికల మీద ఉన్న లేఖనాలను అధ్యయనం చేశాడు. కొన్ని చారిత్రక తాత్త్విక రచనలు కూడా కువో ప్రకటించాడు.



1949 తరువాత పీపుల్స్ రిపబ్లిక్ ఆఫ్ చైనాలో ఎన్నో పదవులు నిర్వహించాడు. చైనీస్ విజ్ఞాన శాస్త్ర అకాడమీకి అధ్యక్షుడయాడు. 1966 లో జరిగిన సాంస్కృతిక విప్లవంలో విమర్శలకు గురి అయిన వారిలో కువో ఒకడు. అయితే తాను మావో రచనలను సరిగా అర్థం చేసుకోలేదని తన వెనుకటి రచన లన్నింటిని దగ్ధం చేయమని ఆయన కోరాడు. అందుచేత సహచరులకు లాగ ఈయన పదవులకు ఎలాంటి భంగం కలుగక పోగా, 1970 తరువాత మరిన్ని అధికారాలను ఈయన చేబట్టాడు. *గు.శం.*

**కూపర్, జేమ్స్ ఫెనిమోర్ (1789-1851) :** అమెరికాలోని మొట్టమొదటి ప్రముఖ నవలా రచయిత. సరిహద్దులలోని సాహస కృత్యాలను అభివర్ణించే నవలలు వ్రాసినవాడు. 'నాటీ బంపో', 'హాకీ' వంటి పాత్రలను సృష్టించినవాడు. *ది పయొనీర్స్* (1823), *ది లాస్ట్ ఆఫ్ ది మోహికాన్స్* (1826), *ది ప్రైమరీ* (1827), *ది పాత్ ఫైండర్* (1840), *ది డీర్ స్లేయర్* వంటి సుప్రసిద్ధ నవలల రచయిత.

కూపర్ 1789 సెప్టెంబర్ 15 వ తేదీన న్యూజెర్సీలోని బర్లింగ్‌టన్‌లో జన్మించాడు. అతని తల్లి 'ఎలిజబెత్ ఫెనిమోర్'. ఆమె న్యూ జెర్సీలోని ఒక గౌరవనీయమైన క్వేకర్ కుటుంబానికి చెందింది. తండ్రి విలియమ్, 'సెస్క్వేహానా' నది జన్మస్థానం వద్ద ఒక సరిహద్దు వలస ఏర్పాటు చేసినవాడు. ప్రస్తుతం దీనిని 'కూపర్స్ టౌన్' అంటున్నారు. జార్జ్ వాషింగ్టన్, జాన్ ఆడమ్స్ అమెరికా అధ్యక్షులుగా ఉన్న కాలంలో విలియమ్ ఫెడరలిస్ట్ కాంగ్రెస్ సభ్యుడుగా పనిచేశాడు. చనిపోయేనాటికి అమెరికా జాతీయ రచయితగా ప్రసిద్ధి పొందిన జేమ్స్ కూపర్‌కు బాల్యంలో అది చక్కని నేపథ్యం సమకూరింది.

ఆల్బనీలో జేమ్స్ కూపర్ ప్రాథమిక విద్య ముగించి 1803-1815 మధ్య 'యేల్' లో చదివాడు. అతని కాలేజీ చదువును గురించి మనకు ఎక్కువగా తెలియదు. విద్యార్థిగా లాటిన్ భాషలో అత్యుత్తమ విద్యార్థి అనిపించుకున్నాడు. తరువాత కూపర్ నౌకాదళంలో చేరి 'మిడ్ షిప్‌మన్' గా పనిచేశాడు. 1809 లో ఆయన తండ్రి మరణించడంతో ఆర్థికంగా అతడు స్వతంత్రుడయాడు. 1811 లో 'సుసాన్ డీలాన్సీ' ని వివాహమాడి నౌకాదళం ఉద్యోగానికి రాజీనామా ఇచ్చాడు.

వివాహమైన తరువాత 10 ఏళ్ల పాటు ఎక్కడా నిలుకడ లేకుండా వేరు వేరు రంగాలలో పనిచేశాడు. స్తిమితం లేక ఉన్న ఆ కాలంలోనే తన భార్య చేసిన సవాలుకు జవాబుగా తన మొదటి నవలను *ప్రికాషన్* రచించాడు (1820). ఆ నవల 'జేన్ ఆస్టిన్' నవలలకు కొంత వరకు అనుకరణ అని చెప్పవచ్చును. జేమ్స్ కూపర్ వ్రాసిన రెండవ నవల *ది స్పై* (1821). ఇదీ ఒక విధంగా 'సర్ వాల్టర్ స్కాట్' రచించిన *వేవర్లీ* నవలలకు అనుకరణే! అయినా దానిలో కూపర్ విశిష్టమైన అమెరికన్ పాత్రలను ప్రవేశపెట్టడం వలన, అమెరికన్ స్వాతంత్ర్య సంగ్రామాన్ని నేపథ్యంగా స్వీకరించడం వలన దానికి అంతర్జాతీయ విఖ్యాతి లభించింది. కూపర్ ఆర్థిక స్థితి కూడా మెరుగు పడింది.

*ది స్ప్రై* తరువాత కూపర్ వ్రాసిన నవల *ది పయొనీర్స్* (1923). ఈ నవలలో కూపర్స్ టౌన్ లోని ఆచార వ్యవహారాలు చిత్రించబడ్డాయి. 1827 లో జేమ్స్ కూపర్ *ది ప్రైమరీ* అనే నవలను రచించాడు. ఈ నవలలో కూపర్ నవల లన్నింటిలోనూ కనిపించే 'లెదర్ స్టాకింగ్' అనే పాత్ర మరణిస్తాడు. కూపర్ అంతటితో లెదర్ స్టాకింగ్ పాత్రకు స్వస్తి చెప్పా లనుకున్నాడు గాని 1840 లో రచించిన *ది పాత్ ఫైండర్* లోనూ, 1841 లో ప్రచురించిన *ది డీర్ స్లేయర్* లోనూ తిరిగి ఆ పాత్ర ప్రత్యక్షం అయింది. 'లెదర్ స్టాకింగ్' పాత్రతో కూడిన నవలలే ఎక్కువ జనాదరణ పొందాయి. 1823 లో ఆయన వ్రాసిన నాల్గవ నవల *ది పైలట్* సముద్రాన్ని గురించి ఆయన వ్రాసిన నవలలలో మొదటిది. సముద్రాన్ని గురించి వ్రాసిన ఈ నవలా పరంపర కూడా విశేష ప్రజాదరణను చూరగొంది.

1822-26 మధ్య కూపర్ న్యూయార్క్ సిటీలో స్థిరపడి అక్కడ 'ది బ్రెడ్ అండ్ చీజ్' క్లబ్‌ను స్థాపించాడు. దానిలో 'ఫిడ్జ్‌గ్రీన్ హేలక్' వంటి కవులూ, రచయితలూ సభ్యులుగా ఉండేవారు. 1826-33 మధ్య కూపర్ యూరప్ లో గడిపాడు. *ది బ్రేవో* (1831) వంటి నవలలలో ఆయన యూరప్‌లోని అవినీతినీ, అక్కడి ప్రభుత్వాల నిరంకుశ విధానాలనూ ఖండించాడు.

అమెరికా తిరిగి వచ్చిన తరువాత కొంతకాలం న్యూయార్క్ సిటీలో గడిపి తరువాత చనిపోయే వరకూ కూపర్స్ టౌన్‌లో జేమ్స్ కూపర్ గడిపాడు. చివరి రోజులలో జేమ్స్ కూపర్ *ది అమెరికన్ డెమోక్రాట్* (1838). *ది మానికన్స్* (1835), *హోమ్ ఏజ్ ఫౌండ్* (1838) వంటి రాజకీయ రచనలు చేశాడు. అయినా, ఆటవిక జీవితానికీ, సముద్ర జీవితానికీ సంబంధించి కూపర్ రచించిన నవలలను ఆదరించినంతగా ఈ రాజకీయ రచనలను పాఠకులు ఆదరించ లేదు. చివరి రోజులలో తన రచనలవలన వచ్చే ఆదాయం కూడా తగ్గిపోయింది. చివరి దశాబ్దంలో *లెదర్ స్టాకింగ్* కథలను తిరిగి ఆయన వ్రాయడానికి పూనుకొన్నా వెనుకటి ప్రజాదరణ వాటికి లభించలేదు.

1851 సెప్టెంబరు 14 న జేమ్స్ ఫెనిమోర్ కూపర్ కూపర్స్ టౌన్‌లో తుది శ్వాస విడిచాడు.

*గు.శం.*

**కెజిలాహాబీ, యూఫ్రాసే (1944-) :** ఆఫ్రికన్ నవలా రచయిత, కవి; స్వాహిలీ భాషలో గొప్ప రచయిత, పండితుడు.

1970 లో 'దార్ ఎస్ సలాం' విశ్వవిద్యాలయంలో బి.ఏ. పట్టభద్రుడై, దేశంలోని ఎన్నో విద్యాలయాలలో అధ్యాపకత్వం నెరపి, అనంతరం విశ్వవిద్యాలయంలోని స్వాహిలీ సాహిత్య విభాగంలో చేరాడు. తరువాత 'విస్కాన్సిన్' విశ్వవిద్యాలయం (అమెరికా) నుంచి కూడా పట్టభద్రు డయాడు.

కెజిలాహాబీ రచించిన *రోసా మిస్టికా* (1971) అనే నవల గొప్ప సంచలనాన్ని సృష్టించింది. పాఠశాల విద్యార్థినులతో వారి ఉపాధ్యాయులు అక్రమ సంబంధం పెట్టుకొనడాన్ని వర్ణించిన ఈ నవలను టాంజానియా, కీన్యాలలో మొదట నిషేధించారు. అయితే తరువాత దీనిని ప్రామాణిక పాఠ్య గ్రంథంగా నిర్ణయించారు. 1960 నుంచి టాంజానియాలో ఆరంభమైన పారిశ్రామికాభివృద్ధి వల్లా, నగరాలు పెరగడం వల్లా మాత్రమే కాక ఆఫ్రికన్ సమాజవాద ప్రయోగం వల్ల కూడా వ్యక్తి సమాజంతో సామరస్యం సాగించలేకపోవడమే కెజిలాహాబీ నవలలలో ప్రధానమైన ఇతివృత్తం. *కిష్ వామాజీ* (1974, జలాధారం), *దునియా ఉవాంజా వా ఫ్యూజో* (1975, అరాజక ప్రపంచం), *గుంబా లా న్యోకా* (1979 పాము చర్మం), అనే ఆయన రచనలు ప్రసిద్ధి పొందాయి.

కెజిలాహాబీ నవలలలోని నాయకులలో చాలా మంది ఆ సంఘర్షణలను అధిగమించలేకపోయారు. అయినా రచయిత చివరికి ఒక ఆశాభావాన్ని కాకపోయినా, ఓర్పుతో సమాజ వ్యవస్థను అనుసరిస్తే తగిన ప్రతిఫలం లభించగలదని సూచిస్తాడు.

ఆసక్తికరమైన సంఘటనలను కల్పించడంలోనూ, సరళమైన భాషను వాడడంలోనూ కెజిలాహాబీ సిద్ధహస్తుడు. ఈ లక్షణం ఆయన కవితలలోనూ, సాహిత్య సిద్ధాంత రచనలలోనూ కూడా వ్యక్త మవుతుంది. *కిచోమీ* (1974, పొడిచినట్లుండే బాధ) అనే సంకలనంలోని పద్యాలూ, కొన్ని విమర్శక రచనలూ స్వాహిలీ సాహిత్య రంగంలో వివాదాలను లేవదీశాయి.

కెజిలాహాబీ 'స్వాహిలీ' విద్వాంసుడుగా మన్ననలు పొందాడు. ఆయన రచించిన *ఉషాయిరి వా షాబాన్ రాబర్ట్* (షాబాన్ రాబర్ట్ కవిత్వం) వెనుకటి తరానికి చెందిన ఒక ప్రముఖ స్వాహిలీ కవి కవితా పరామర్శ 1976 లో ప్రచురితమైంది. స్వాహిలీ భాషా పరిశోధక సంస్థలో కెజిలాహాబీ సలహాదారుడుగా పనిచేశాడు.

*గు.శం.*

**కెద్వెట్ పాషా, అహ్మద్ (1822-1895) :** 19 వ శతాబ్దం తుర్కిష్ సాహిత్యంలో పేరు మోసిన చరిత్రకారుడు, రాజకీయవేత్త.

ఒట్టోమన్ కుటుంబంలో పుట్టి, మతపరమైన కళాశాలలో 17 ఏళ్లకే సంప్రదాయ ఇస్లాం విద్యను, గణితాన్ని, పర్షియన్ భాషనూ అధ్యయనం చేశాడు. 1844-45 లలో ఖాజీగా నియమితుడై, ఆ తరువాత 1846 నుంచి 58 దాకా ఒట్టోమన్ ప్రధానమంత్రి (ముస్తాఫా రషీద్ పాషా) దగ్గర ఆయన మరణించేవరకు సలహాదారుగా పనిచేశాడు. ఒట్టోమన్ ప్రభుత్వంలో దారుల్ మౌలిమిన్ (ఉపాధ్యాయ శిక్షణ కళాశాల డైరక్టర్) గాను, మెష్లిజ్-ఇ-మారిఫ్ (విద్యామండలి) లో ప్రధాన కార్యదర్శిగాను, వకానూవిస్ (న్యాయస్థాన ప్రభుత్వ పట్టాదారు) గాను, ఒట్టోమన్ కేంద్ర ప్రాంతాల గవర్నర్‌గాను, ఒట్టోమన్ చట్టాన్ని క్రమబద్ధం చేసి, ప్రజలకు సాన్నిహిత్యం చేకూర్చేందుకు కృషి చేసే న్యాయశాఖమంత్రి గాను ఎన్నో పదవులను నిర్వహించి 'మెసిల్లే' గా పేరు తెచ్చుకొన్నాడు. ఫ్రెంచ్ సివిల్ చట్టం ఆధారంగా ఇస్లాం చట్టం రూపొందించినా, ప్రాతిపదిక సూత్రాలను ఆయన గ్రహించాడు. అధికంగా ఇస్లాం కెద్వెట్ సమకాలికులతో పోల్చిచూస్తే సంప్రదాయవాదిగానే భావించవలసి ఉంటుంది.

తొలి రోజుల్లో కవిత్వాన్ని రచించినా, *తారిహి-ఇ-కావెదెల్* అనే గ్రంథాన్ని 12 సంపుటాల్లో రచించి చారిత్రక రచయితగా ప్రసిద్ధి పొందాడు. ఈ గ్రంథంలో 1774 నుంచి 1826 వరకు జరిగిన సంఘటనల సారాంశం పొందు పరిచాడు. *తేజ్‌కర్ ఇ-కావెదెల్* (స్మృతులు) అనే గ్రంథంలో తాను ప్రభుత్వ చారిత్రకుడుగా ఉన్ననాటి స్మృతులను పదిలపరిచాడు. *మరుజల్* (పరిశీలనలు) అన్న గ్రంథంలో 1839 నుంచి 1876 వరకు జరిగిన ఘటనలను పొందుపరిచాడు. ఇంతే కాక *కవాయిదీ ఉస్మానియే* (ఒట్టోమన్ మౌలికాంశాలు) అనే రెండు తుర్కిష్ వ్యాకరణ గ్రంథాలను రచించాడు.

కాలెండర్‌లో వచ్చిన మార్పులను సూచించే *తక్వీమ్ ఇ ఎద్వార్* (సంవత్సరాల గణనం), 14 వ శతాబ్దం నాటి ఇబ్న్ ఖల్దూన్ అనే అరబ్ చారిత్రక వేత్త ప్రభావంతో వ్రాసిన *ముఖద్దిమా* (ఉపోద్ఘాతం) పేర్కొనదగిన ప్రముఖ రచనలు.

*గు.శం.*

**కెమాల్, నమిక్ (1840-88) :** ఆ నాటి తుర్కిష్ జాతీయ ఉద్యమాన్ని గాఢంగా ప్రభావితం చేసిన ప్రముఖ తుర్కిష్ కవి, గద్యరచయిత. 'యువ తుర్క్' ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించిన తుర్కిష్ సాహిత్యాన్ని పాశ్చాత్య పద్ధతుల వైపుకు మళ్లించిన ప్రముఖులలో ఒకడు.

ఉన్నత వంశీకుడైన కెమాల్ ఆనాటి సంప్రదాయాల ప్రకారం ఇంటివద్దనే విద్యాభ్యాసం చేశాడు. పర్షియన్, అరబిక్, ఫ్రెంచ్ భాషలను కూడా అభ్యసించి 1857 లో ఆటోమాన్ ప్రభుత్వపు తర్జుమా సంస్థలో ఉద్యోగిగా చేరాడు. ఉద్యోగరీత్యా ఆనాటి ప్రముఖ పండితులతో, కవులతో పరిచయం కలగటంతో తాను కూడా ప్రాచీన ఆటోమాన్ రీతిలో కవిత్వం వ్రాయటం ప్రారంభించాడు. *తస్వీర్- ఇ-ఎజ్‌కార్* (Tasvir-i-Ejkar) పత్రిక సంపాదకుడైన 'ఇబ్రహిం సినాసి' భావాలు కెమాల్‌ను ఎంతగానో ఆకట్టుకొన్నాయి. ఆయనకు పాశ్చాత్యభావాలన్నా, పాశ్చాత్య రీతులన్నా మక్కువ ఎక్కువ. రాజకీయ ఒత్తిడుల కారణంగా ఇబ్రహిం పారిస్‌కు పారిపోయినప్పుడు కెమాల్ ఆ పత్రికకు సంపాదకత్వ బాధ్యత వహించాడు. అయితే ఆ తరువాత కెమాల్ కూడా దేశాన్ని వదలి లండన్‌కు, అక్కడనుంచి పారిస్‌కు వెళ్లిపోయి చివరకు వియెన్నాలో తలదాచుకోవలసి వచ్చింది. ఈ కాలంలో ఆయన హ్యూగో, రూసో వంటి మహారచయితల రచనలను పఠించి వాళ్ల రచనలలో కొన్నింటిని తుర్కిష్ భాషలోకి అనువదించాడు. కొంతకాలం *హరియత్* (లిబర్టీ) అనే పత్రికను నడిపాడు. 1871 లో 'యువ ఆటోమాన్' విప్లవకారులు తుర్కీకి తిరిగి వచ్చారు. వారితో పాటు తుర్కీ చేరిన కెమాల్ *ఇబ్రెత్* అనే పత్రికా సంపాదకుడుగా తన విప్లవ రచనలను సాగించాడు. 1854 లో జరిగిన 'సిలిస్ట్రియా' ముట్టడి ఆధారంగా *వతన్ యాహ్సూట్ సిలిస్ట్రియా* అనే నాటకాన్ని రచించాడు. ఇది దేశ భక్తినీ, రాజకీయాలలో ఉదార భావాలనూ ప్రచారం చేసేది కావడం వలన ప్రభుత్వం కెమాల్‌ను బంధించి కారాగార వాస శిక్ష విధించింది. చివరకు 1888 లో సాకిజ్ రాష్ట్రానికి కెమాల్ గవర్నర్ అయాడు.

స్వేచ్ఛావాది, సంఘసంస్కర్త అయిన కెమాల్ తుర్కిష్ సాహిత్యంలోకి *వతన్* (పితృదేశము), *హరియత్* (స్వేచ్ఛ) అనే యూరపియన్ భావాలను ప్రవేశపెట్టినవాడుగా సాహితీ చరిత్రలో కీర్తింపబడుతున్నాడు. ఎంత స్వేచ్ఛావాది, ఉదార వాది అయినా ఈ రచయిత తన సంస్కరణ ఉత్సాహంలో ఇస్లామ్‌ను తిరస్కరించలేదు. ఇస్లామ్ మతము ఆధునిక భావాలకు

అడ్డుగాదని ప్రకటించి, తుర్కీలో బ్రిటిష్ పద్ధతిలో ఏర్పడిన చట్టబద్ధమైన రాజ్య స్వరూపం, ప్రభుత్వ ఇస్లామ్ మత బోధలకు అనుగుణ మైనవేనని అందరిని ఒప్పించటానికి ప్రయత్నించాడు. ఆయన నవలలలో ప్రధాన మైనవి: *ఇంతిబా యాహుత్ ఆలీ బెయిన్ సెర్గుజెసిటీ* (1874- జాగృతి), సెజ్మీ (1877/88) అనేవి. *రూయా* (స్వప్నం) అనే సామాజిక రచనలో దాస్యంనుండి విముక్తి పొందిన తుర్కీ ఎలా ఉండాలి అని ఆయన కోరుకొంటున్నాడో స్పష్టం చేస్తాడు. ఈ నవల బహుజనాదరణ పొంది, ఆయన కీర్తి ప్రతిష్ఠలను ఇనుమడింపజేసింది.

కె.బి.మూర్తి

**కెల్లర్, గాట్‌ఫ్రీడ్ (1819-90) :** ప్రముఖ జర్మన్, స్విస్ వచన రచయిత. 19 వ శతాబ్ది తుది భాగంలోని వాస్తవికతా సంప్రదాయానికి చెందినవాడు. తండ్రి ఇతని బాల్యంలోనే మరణించగా, దృఢసంకల్పం గల తల్లి కష్టపడి ఇతనిని చదివించింది. చిలిపి పనుల వల్ల సెకండరీ స్కూలు నుండి బహిష్కృతుడై ప్రకృతి దృశ్య చిత్ర రచనకు పూనుకున్నాడు. మ్యూనిఖ్‌లో రెండేళ్ల చదువు నిష్ఫలం కావడం వలన జ్యూరిక్‌కు తిరిగి వచ్చి, 1846 లో తన తొలి ఖండకావ్య సంపుటిని ప్రకటించాడు. 1848-50 మధ్య జ్యూరిక్ ప్రభుత్వం హైడెల్‌బెర్గ్‌లో 'కెల్లర్'ను చదివించింది. అక్కడ తత్త్వవేత్త 'లుడ్విగ్ ఫ్యూయర్‌బాక్' ప్రభావం ఇతని మీద గాఢంగా పడింది. 1850-55 మధ్య కెల్లర్ బెర్లిన్‌లో గడిపాడు.

1854-55 లో *డెర్ గ్రూనే హైన్రీఖ్* అనే స్వీయ చరిత్రాత్మకమైన నవలను కెల్లర్ వ్రాశాడు. 'కెల్లర్' కు విశేష విఖ్యాతి ఆర్జించి పెట్టిన ఈ నవలను 25 ఏళ్ల తరువాత (1879-80) అతడు పూర్తిగా పరిష్కరించి తిరిగి ప్రకటించాడు. ఈ నవలలో నాయకుడు 'గ్రీన్ హెన్రీ' చిత్రకారుడు కావా లనుకుంటాడు. స్వల్పంగా విజయం, పలు ఆశాభంగాలూ ఎదురైన తరువాత తన సొంత నగరానికి తిరిగి వెళ్లి ఒక చిన్న ప్రభుత్వోద్యోగంలో చేరి గౌరవంతోను, తృప్తితోను జీవితం గడుపుతాడు. 15 ఏళ్లపాటు రచనా వ్యాసంగానికి స్వస్తి చెప్పి జీవితం చివరి రోజులలో 'కెల్లర్' మళ్లీ సాహిత్య రచనకు పూనుకున్నాడు. చిన్న కథలు వ్రాయడంలో 'కెల్లర్' సిద్ధహస్తుడు. *సెల్డ్విలా లో జనులు* (1856-74) *ఏడు గాథలు* (1872) అనే రెండు సంపుటాలుగా ఆయన చిన్నకథలు ప్రకటించబడ్డాయి. కెల్లర్ వ్రాసిన చిట్టచివరి నవల *మార్టిన్ సలాందర్* (1856) ఆ నాటి స్విట్జర్లాండ్‌లోని రాజకీయ జీవితాన్ని చిత్రిస్తుంది.బొ.శ్రీ.

**కైసర్, జార్జ్ (1878-1945) :** జర్మన్ నాటక రచయిత, స్వేచ్ఛావాది. గుమాస్తా ఉద్యోగం చేయటానికి



అర్జంటీనా వెళ్లిన కైసర్ అనారోగ్య కారణాలవల్ల తిరిగి జర్మనీ చేరాడు. ఆరోగ్యం పొందటానికై, వైద్యశాలలో దీర్ఘకాలం ఉన్న సమయంలో వ్యంగ్యంతో కూడిన హాస్యనాటికలు వ్రాసినా అవి ప్రజల దృష్టిని ఆకర్షించలేదు. 1914 లో వ్రాసిన *డీ బుర్గర్ ఫాన్ కెలేస్* అనే నాటకం అతనికి మొట్ట మొదటిసారి గుర్తింపు తెచ్చింది. ఈ నాటకంలో తను చెప్పదలచుకున్న విషయాన్ని నాటకీయతతో నిశితమైన పదజాలంతో చదువరులను ఉత్తేజపరచే విధంగా సంభాషణలను నడిపించాడు. ఈ ఆధునిక యుగంలో డబ్బుకు, యంత్రాలకు మధ్య మనిషి ఎలా నలిగి పోతున్నాడో ఎలా కొట్టుకొని పోతున్నాడో కొన్ని నాటకాలలో కైసర్ వర్ణించాడు.

కైసర్ వ్రాసిన ప్రధాన నాటకాలు: 1. *ఫ్రమ్ మోర్న్ టు మిడ్ నైట్ (1916), 2. ది కోరల్ (1929), 3. గాస్* I *(1918), గాస్* II *(1920), హోలే, వెగ్, పార్దె (1919), నెబెనైనాందెర్ (1923) ట్వైమల్ ఆలివర్ (1926), దెర్ సిల్బర్సే* (1933). ఈ చివరి నాటకానికి కుర్ట్ వైల్ సంగీతాన్ని సమకూర్చాడు. ఈ నాటకాలు ఫ్రెంచ్ ఎక్స్‌ప్రెషనిస్ట్ ఉద్యమానికి ఇతనిని నాయకుణ్ణి చేశాయి.

బాహ్య వాస్తవికతను గాక, అంతరంగిక అనుభూతిని నిరూపించాలనే వాదం, నిస్సంకోచంగా స్వేచ్ఛగా రచన చేయాలనే వాదం, కైసర్ రచనలలో ఒక దశ మాత్రమే! అతని భావ గంభీరత, కళాత్మకమైన పాత్రల సృష్టి, హృదయానికి హత్తుకుపోయే విధంగా సంభాషణలను నడిపే చాతుర్యం అతని తరువాతి నాటకాలలో వ్యక్తం అవుతాయి. అట్టి నాటకాలు : *అక్టోబర్ టాగ్ (1928), డెర్ గార్ట్‌నర్ ఫాన్ తాలెజ్ (1938), ఆలెయిన్ ఉండ్ ఎలెన్* (1940) మొదలైనవి.

1938 తరువాత చనిపోయే వరకూ నాజీలు కైసర్ నాటకాలను నిషేధించినప్పుడు అతడు

స్విట్జర్లండ్‌కు పారిపోయి, చనిపోయే వరకూ అక్కడే, తన రచనా వ్యాసంగాన్ని కొనసాగించాడు. కైసర్ చివరి రచన పౌరాణిక కథతో కూడిన ఒక నాటక త్రయం.

రాజ్యలక్ష్మి

**కాక్టో, జాన్ (1889-1963) :** ఫ్రెంచ్ కవి, నవలా రచయిత, నటుడు, చిత్ర కారుడు. 1916, 1917 లలో పారిస్ నగరం ఆధునిక కళలకు నాట్యరంగంగా ఉండేది. చిత్రకారులు పికాసో, మోడిగ్లానిల తోను, రచయితలు మేక్స్ జాకబ్, గిలామ్ ఎపొలినైర్‌ల తోను కాక్టో పరిచయం చేసుకున్నాడు.

మేక్స్ జాకబ్ ద్వారా రేమెండ్ రేడిగే అనే పదహా రేళ్ల బాలునితో కాక్టోకి పరిచయం ఏర్పడింది. రేడిగే మహా మేధావి. అతడు కవితకు ముఖ్య లక్షణాలు అని భావించిన సరళత, స్పష్టత కాక్టో రచనలలో కనిపిస్తాయి. తన ఇరవై ఒకటో ఏట అల్పాయుష్కుడుగా రేడిగే చనిపోయినప్పుడు కాక్టోకు తీరని వెలితి అని పించింది. ఆ బాధ మరచిపోయేందుకు నల్లమందుకు అలవాటుపడడం వల్ల అతని ఆరోగ్యం దెబ్బ తింది. అతడు ఆరోగ్యకేంద్రంలో కోలుకుంటున్నప్పుడు, జాక్వి మారిటైన్ అనే తాత్త్వికవేత్తతో కలిగిన పరిచయం వల్ల కాక్టో దృష్టి ఆధ్యాత్మిక చింతన వైపు మరలింది. 1925 లో అతడు రచించిన *లంగ్ ప్యూరిబిస్* అనే సుదీర్ఘ కవితలో కవి ఒక దేవతతో వాదానికి దిగుతాడు. ఇదే దేవత మళ్లీ మళ్లీ కాక్టో రచనలలో కనపడుతుంది.

1926 లో అతడు రచించిన *ఆర్ఫీ* అనే నాటకం ప్రదర్శింపబడింది. దీనిలో కవి స్వభావాన్ని కాక్టో తన దృక్కోణంలో నుంచి ఆవిష్కరిస్తాడు. ఆ నాడు విషాదాంత రూపకాలు పునరుద్ధరింపబడడానికి *ఆర్ఫీ* బాగా తోడ్పడింది. 1934 లో *ల మషీన్ ఇన్‌ఫర్నల్* అనే నాటకం వ్రాశాడు. ఇది అతడు రచించిన నాట కాలన్నింటిలోను గొప్పది. తన సొంత ధోరణిలో ఈడిపస్‌కథావస్తువును కాక్టో రూపొందిస్తాడు. దీనిలోను, అంతకుముందు తాను తీసిన *లె సంగ్ దన్ పొయెట్* అనే సినిమాలోను ఆయన మానవ జీవిత సత్యాలకు చేరు వయాడు. 1940 తరువాత *ల బెల్లె ఎలాబెట్*, *ఆర్ఫీ* అనే సినిమాలకు దర్శకుడుగా పనిచేశాడు. దారు శిల్పంలో కూడా ఆయన తన ప్రతిభను ప్రదర్శించాడు.

కాక్టోపై విమర్శకులు విభిన్న అభిప్రాయాలను వ్యక్త పరచారు. గ్రీక్ విషాదాంత రూపకాన్ని పునరుద్ధరించిన వాడుగా, అధివాస్తవికతా వాదిగా, బూర్జువా నాటక రచయితగా అతనిని పేర్కొంటారు. 20 వ శతాబ్దికి చెందిన ఉత్తమ కళాకారుడుగా ఆయన ప్రసిద్ధి పొందాడు. సుదీర్ఘమైన కాక్టో రచనా వ్యాసంగాన్ని విశ్లేషించి చూస్తే మానవాతీత శక్తుల ప్రేరణకు కళాకారుడు లోనవుతా డనే ఆయన ప్రగాఢ విశ్వాసం మనకు విదితమవుతుంది.

వి.వి.సు.

**కొరాయిస్, ఆడమాంటియోస్ (1748-1833):** గ్రీక్ విద్వాంసుడు. ఆధునిక గ్రీక్ సాహిత్యానికి పితామహుని వంటివాడు. గ్రీక్ స్వాతంత్ర్య సమరానికి ఇతడు నడిపిన సంప్రదాయవాద (క్లాసిసిజమ్) పునరుద్ధరణ ఉద్యమం బౌద్ధికమైన పునాదులు సిద్ధం చేసింది.

ఆధునిక గ్రీక్ భాషా, సంస్కృతులపై ఇతని ప్రభావం, అలనాటి ఇటలీ దేశస్థుడైన డాంటే ప్రభావంతోను, జర్మన్ దేశస్థుడైన లూథర్ ప్రభావంతోను సరిపోల్చదగింది. ఒక వర్తకుని కుమారుడైన కొరాయిస్, ఫ్రాన్స్‌లోని మాంట్ పెల్లీర్ యూనివర్సిటీ కళాశాలలో వైద్యశాస్త్రం చదివి, 1788లో పారిస్ వెళ్లి అక్కడ సాహిత్య వ్యాసంగం ప్రారం భించాడు. ప్రాచీన వైద్యశాస్త్రవేత్తల రచనలనే ముందుగా ఇతడు ప్రచురించాడు. ముఖ్యంగా 'హిపోక్రటీస్' రచన లను, *థియోఫ్రేస్టస్ కేరక్టర్స్* ను ప్రచురించాడు. కాని ఇతని ప్రధాన ప్రచురణలు 1805 నుంచి 1826 వరకూ ఇక్కడ సేకరించిన *లైబరీ ఆఫ్ గ్రీక్ లిటరేటర్* అనే 17 సంపుటాలు గల గ్రంథం 1809 నుంచి 1827 వరకు సేకరించిన, *పరేగా* అనే తొమ్మిది సంపుటా గ్రంథం. వీటిలో చారిత్రక, రాజనీతిక, తాత్త్విక, వైజ్ఞానిక రచనలు చేరి ఉన్నాయి. వాటికి ఆధునిక గ్రీక్ భాషలో కొరాయిస్ ఉపోద్ఘాతాలు వ్రాశాడు. హోమర్ రచించిన 'ఇలియడ్' మొదటి నాలుగు భాగాలను కూడా ఈయన పరిష్కరించి ప్రకటించాడు.

ఆధునిక గ్రీక్‌లు తమ ప్రాచీన సంస్కృతిని, సాహి త్యాన్ని పునరుద్ధరించుకోడం ద్వారానే శక్తిని, ఐకమత్యాన్ని సాధించగలరని కొరాయిస్ ఒక నిర్ణయానికి వచ్చాడు. ఆ లక్ష్యంతోనే ఆయన తన రచనలు కొనసాగించాడు. అందుకోసం ఒక క్రొత్త గ్రీక్ సాహిత్య భాషను ఆయన సృష్టించాడు. 'డెమోటిక్' అనే మాండలిక భాష నుంచి అన్య దేశ్యాలను తొలగించి దానిని క్లాసికల్ గ్రీక్‌తో సమన్వయించి, ఒక నూతన సాహిత్య భాషను ఆయన సృష్టించాడు. 1828-1835 మధ్య కాలంలో *అటక్టా* అనే మొట్టమొదటి ఆధునిక గ్రీక్ డిక్షనరీని ఆయన సంకలనం చేశాడు. అందుకు ఆయన తర్వాతి గ్రీక్ రచయిత లందరూ ఆయనకు ఎంతో ఋణపడి ఉంటారు.

ఫ్రెంచ్ విప్లవం కళ్లారా చూసిన కొరాయిస్ తత్త్వవేత్తలయిన థామస్ హాబ్స్, జాన్ లాక్, జీన్ జేక్విస్ రూసోల రచనల వలన విశేషంగా ఉత్తేజితు డయాడు. అంతేగాక అంధకారయుగం అనంతరం తిరిగి ప్రాచీన కావ్యశైలి అనుసరణ అవసరం అని ప్రకటించిన చరిత్ర కారుడైన 'ఎడ్వర్డ్ గిబ్బన్' వాదం ఇతనిని విశేషంగా ఆకర్షించింది. చర్చ్ అధికారం నుంచి, విముక్తికోరే సంఘాన్ని బలపరుస్తూ, అతడు బైజాంటైన్ కాలంలోని ప్రాచీన క్రైస్తవ సంప్రదాయాన్ని అనుసరించే భాషను, అతడు నిరసించాడు. అదే అతని నూతన గ్రీక్ సాహిత్య భాషకు పునాది అయింది.

గ్రీక్ దేశం మీద అతని రచనల ప్రభావం అధికంగా ఉన్నా, మత సంబంధమైన విషయాలలో అతని అభిప్రాయాలను వ్యతిరేకించి గ్రీక్ నాయకులు అతనిని బహిష్కరించారు. ఆనాటి గ్రీక్ నాయకులు, 'కాన్స్టాంట్ నోపిల్' ను తిరిగి పట్టుకోవాలని చర్చ్ అధికారం తిరిగి స్థాపించాలని, అదే స్వాతంత్ర్య సమర లక్ష్యం అని భావించారు.

తన జీవితన కాలంలో ఎక్కువ భాగం ఫ్రాన్స్‌లోనే కొరాయిస్ గడిపాడు. 1830 లో జరిగిన గ్రీక్ సమర కాలంలో 'పారిస్ ఫిల్‌హెలెనిక్' సంఘాన్ని స్థాపించి, ఎన్నో కర పత్రాలను వ్రాసి గ్రీక్‌దేశం లోనికి పంపించాడు. ఆ స్వాతంత్ర్య సమరానికి నిధులు కూడా సమకూర్చాడు.

అమెరికా స్వాతంత్ర్య సమరంలో పోరాడిన గొప్ప నాయకుడైన మార్క్విస్ డి. లాఫాయెట్‌ను, గ్రీక్ దేశానికి అధ్యక్షుడుగా కొరాయిస్ ప్రతిపాదించాడు.

రాజ్యలక్ష్మి

**కోర్డియెరో డ మాటా, జోయాకిమ్ డియాస్ (1857-94) :** ఆఫ్రికన్ కవి, నవలా రచయిత. ఈయన బహుముఖ ప్రజ్ఞాశాలి. వడ్రంగి వృత్తిలో ఉన్న కోర్డియెరో కవిగా, నవలా రచయితగా, విలేఖకుడుగా, ఉపాధ్యాయుడుగా, చరిత్రకారుడుగా, లాక్షణికుడుగా, జానపద సాహిత్యకర్తగా ప్రఖ్యాతి గడించాడు; స్వయంకృషితో ఈయన పైకి వచ్చాడు. కాని వ్రాత ప్రతులుగానే ఉండి పోయిన ఈయన రచనలు చాలా వరకూ కాలగర్భంలో కలసిపోయాయి. ముద్రింపబడిన కొన్ని పద్యాలు మాత్రం ఇప్పటికీ నిలచి ఉన్నాయి. ముఖ్యంగా నిఘంటు రచయితగా, హితోపదేశ గ్రంథకర్తగా ఈయన చిరస్మరణీయుడు. ఈయన *కింబుందు-పోర్చుగీసు* నిఘంటువు 1893 లో వెలువడింది. అంగోలా సాహితీ బౌద్ధిక జీవిత సమున్నతికి కృషి చేసిన వారిలో ఈయన ఒకడు. అంగోలాలో సంప్రదాయానికి, సంస్కృతికి ఒక గౌరవస్థానాన్ని సంపాదించిపెట్టిన ఘనత ఈయనకు దక్కుతుంది.

వి.వి.షు.

**కోర్నిల్, పియేర్ (1606-84) :** ఫ్రెంచ్ కవి, నాటక రచయిత. ఇతడు ఫ్రెంచ్ క్లాసికల్ విషాదాంత రూపక కర్తగా ప్రసిద్ధి పొందాడు. 1635 లో ఇతడు రచించిన *మైడీ* (Miedee) విషాదాంత రూపక శిల్పంలో ఒక విశిష్ట ప్రయోగం. తరువాత *లెసిడ్*(Lecid) అనే నాటకం రచించాడు. ఇది ఫ్రెంచ్ క్లాసికల్ విషాదాంత రూపకాలకు నాంది పలికింది. ఆ నాటి సంప్రదాయవాద రచనలలో సాంప్రదాయిక సూత్రాలకు ప్రాముఖ్యం ఇవ్వబడలేదు. ముఖ్యమైంది ప్రగాఢమైన నైతికపరమైన అనుభూతి వలన పాత్రలలో గోచరించే మానసిక సంఘర్షణ, సత్యాన్ని దర్శించిన క్షణంలో ఆ పాత్రలకు వివేకోదయం కలగడం - ఈ దృష్టితో ఆ నాటి సాంప్రదాయిక (క్లాసికల్) రచనలు చేయబడ్డాయి. *లెసిడ్* ఆ కోవకు చెందినదే. గాఢప్రేమకు, వంశ గౌరవానికి మధ్య జనించే సంఘర్షణకు ఈ నాటకంలో ప్రాముఖ్యం ఇవ్వబడింది. కోర్నిల్ చూపిన ఈ సాంప్రదాయిక దృక్పథం జ్ఞానోదయం అయిన ఘడియలలో మానవుడు తీవ్ర ఆవేదన పొందడం, ఆ తరువాత వచ్చిన *రేసిన్* విషాదాంత రూపకాలలో పరిపక్వత చెందింది.



1640-43 లలో కోర్నిల్ వ్రాసిన *లెసిడ్, హొరెస్, సిన్నా పోలియెట్* నాటకాలను 'సాంప్రదాయిక నాటక చతుష్టయం' అంటారు. ఇవి రోమన్ నాటకాలు. విశిష్టమైన శైలిలో వ్రాయబడ్డాయి. భాషను పాత్ర చిత్రణకోసం కాకుండా, భావాలను చక్కగా ప్రతిపాదించడానికి, వాటి మధ్య సంఘర్షణను చూపించడానికి వినియోగించుకుంటాడు. దీని ముఖ్యోద్దేశ్యం రెండు వైపుల వాదననూ వివరిస్తూ ఒక సౌష్ఠవాన్ని సాధించడం.

కోర్నిల్ చెప్పుకో దగ్గ హాస్య నాటకాలు కొన్ని వ్రాశాడు. అతను రచించిన *లె మన్ట్యూర్* తనను ప్రభావితం

చేసిం దని సుప్రసిద్ధ రచయిత, కోర్నీల్ సమకాలికుడు అయిన మోలియర్ అంటాడు. *లె మన్ట్యూర్* ని సాంప్రదాయిక హాస్య నాటకం అనవచ్చు. తరువాత మరి కొన్ని నాటకాలు అతడు వ్రాశాడు. అంతే కాక సెంట్ థామస్ ఎ కెంపిస్ వ్రాసిన *ఇమిటేషియో క్రీస్టి*ని పద్య రూపంగా అనువాదం చేశాడు. మోలియర్, ఫిలిప్ క్వినాల్ట్‌లతో కలసి సైకి (1671) అనే నాటకం వ్రాశాడు. నృత్యం ద్వారా చూపించిన సన్నివేశాలు, రమ్యమైన కవిత - దీనిలో చెప్పుకోదగ్గవి.

ఫ్రెంచ్ సాంప్రదాయిక నాటక రంగ పురోభివృద్ధికి కోర్నీల్ చేసిన కృషి చిర స్మరణీయం. ఇతనిని ఫ్రెంచ్ సంప్రాదాయిక విషాదాంత రూపకాలకు పితృతుల్యుడు అంటారు. వ్యక్తిపరమైన, నైతికమైన సంఘర్షణలను నాటకీయమైన సన్నివేశంలో చూపడంలో కోర్నీల్ సిద్ధ హస్తుడు.

వి.వి.సు.

## కోలెట్, సిదోనీ గాబ్రియెల్ (1873-1954) :

20 వ శతాబ్దం పూర్వార్ధంలోని ప్రముఖ ఫ్రెంచ్ రచయిత్రి. ఆమె నవలలలో, ప్రేమ, ప్రేమకు సంబంధించిన సుఖ దుఃఖాలు ప్రధానంగా కనిపిస్తాయి. ధ్వనులు, వాసనలు, రుచులు కచ్చితంగా పాఠకుని భావనలో స్ఫురింపజేయగల గొప్ప రచయిత్రి కోలెట్.

బర్గండీలో తల్లి అదుపాజ్ఞలలో పెరిగిన కోలెట్ తన చుట్టూ ఉన్న ప్రపంచంలో 'పుట్టి పెరిగి, ఎగిరిపోయే' ప్రతి అంశాన్ని చక్కగా అవగాహన చేసుకోగల నేర్పును తన తల్లివద్ద నుంచి అలవరచుకుంది. ప్రపంచాన్ని యథాతథంగా ఆమె అంగీకరించింది. ప్రేమను గూర్చి, ప్రకృతిని గూర్చి అమాయికతను, గడుసుతనాన్ని సమ్మిశ్రితం చేసి ఆమె రచనలు చేసింది. ఆమె పరిశీలన శక్తి సునిశితమైంది. 50 ఏళ్ల పాటు తన రచనలతో ఆమె తన పాఠకులను ఉర్రూత లూగించింది. ఆమె జీవితాన్ని గూర్చి ఎన్నో అపవాదులు వచ్చినా చివరకు ఆమెకు 1935 లో 'బెల్జియన్ రాయల్ అకాడమీ' సభ్యత్వం లభించింది. 1945 లో 'ది ఫ్రెంచి అకడమిక్, గాన్‌కోర్టు' సభ్యత్వం కూడా లభించింది. స్త్రీలకు అరుదుగా లభించే 'లీజియన్ డి ఆనర్' లో 'గ్రాండ్' ఆఫీసర్ పదవి కూడా ఆమెను వరించింది.

ఆమె తన 20 వ ఏట 'హెన్రీ గాథియర్ విల్లార్స్' అనే సాహిత్య విమర్శకుణ్ణి వివాహమాడింది. 'హెన్రీ గాథియర్ విల్లార్స్' నవలా రచనలలో కోలెట్‌కు గల శక్తిని గుర్తించి ఆమె రచించిన నాలుగు *క్లాడిన్* నవలలను (1900-1903) 'విల్లీ' అనే కలం పేరుతో ప్రచురించాడు. విచ్చలవిడిగా తిరిగే స్వచ్ఛంద చారిణి అయిన ఒక యువతి స్మృతులు ఆ నవలలకు కథా వస్తువు. తరువాత ప్రపంచంలో తారసపడిన మనుష్యులతో నైరాశ్యం చెంది, జంతు ప్రపంచంతో తనకు గల అనుబంధాలను గురించి వ్రాసింది. అదే సమయంలో ఆమె వృక్ష ప్రపంచంతో కూడా మమకారం, అనుబంధాలు పంచుకుంది.

1906 లో 'హెన్రీ గాథియర్ విల్లార్స్' కు విడాకు లిచ్చి, ఒక సంగీత మందిరంలో గాయనిగా స్థిరపడింది. దేశ ద్రిమ్మరిగా తిరుగుతూ ఉన్న ఆ కాలంలో ఆమె *లా వేగ బాండీ* (1910), *లా ఎన్ వెర్స్ డ్యు మ్యూజిక్ హాల్* అనే నవలలు వ్రాసింది.

*లామాటిన్* అనే పత్రిక ప్రధాన సంపాదకుడైన 'హెన్రీ డి జోవెనల్' ను 1912 లో తిరిగి ఆమె వివాహం చేసుకుంది. అతని పత్రికకు ఆమె చిన్న కథలను, నాటక రంగానికి చెందిన వ్యాసాలను వ్రాస్తూ ఉండేది. 1913 లో వారిద్దరికీ ఒక కుమార్తె కలిగింది. *లా పెయిక్స్ ఛెస్ లెస్ బిటిష్* అనే జంతువులను గూర్చిన నవలలలో 'చెల్ గాజు' ఆ పాపే!

ఈ రచన లన్నిటిని 'మెస్ అప్రెంటిజ్ సీజెస్' శిక్షణ కాలంలో చేసిన రచనలు (1936) అనే సంకలనంగా ఆమె ప్రకటించింది. 1920-30 దశాబ్ది ఆమె రచనలకు స్వర్ణయుగం అని పేర్కొనవచ్చును. ఈమె రచనలలో మొదటి వర్గం మొదటి ప్రపంచయుద్ధం తరువాత స్వల్పంగా పతనం చెందిన యువతీ యువకులను గూర్చి వ్రాసిన నవలలు. చెరీ (1920) లోని కళంకిత నాయకుడు అలాంటి వాడే! *లాఫిన్ డిచెరి* (1928) అనే నవలలో ఒక యువకునికీ, ఒక వయస్సు ముదిరిన వనితకూ మధ్య అక్రమ సంబంధం వర్ణించబడింది. *లాబ్లే ఎన్ హెర్ బే* (1923) అనే నవల నూత్న వయస్కులైన పసివారి ప్రేమ కలాపాల వర్ణనతో కూడింది.

రెండవ వర్గానికి చెందిన రచనలలో ఒక్కసారి బాల్యాన్ని స్మరించడం, అర్థంలేని ప్రేమ కలాపాలకూ, భ్రమలకూ దూరం కావడం జరిగింది. 1930 తరువాత సుమారు 25 సంవత్సరాలపాటు ఎంతో సృజనాత్మకంగానూ, పరిణతి తోనూ ఆమె రచనలు చేసింది. 1934 లో హెన్రీ డి జోవెనల్ కు విడాకు లిచ్చి, గొప్ప రచయిత అయిన 'మారిస్ గడ్ కెట్' ను ఆమె తిరిగి వివాహం చేసుకుంది. ఈ వివాహం వలన రెండవ

ప్రపంచ యుద్ధకాలంలో తన భర్త గెస్టాపో వల్ల జైలు శిక్ష అనుభవించిన కొద్ది కాలం తప్ప, మిగిలిన కాల మంతా ఆమె ఎంతో ఆనందంగా గడిచింది.

1955 లో *ప్రెస్ డి కోలెట్* అనే పేరుతో గడ్‌కెట్ తమ వైవాహిక జీవిత అనుభవాలను వివరిస్తూ ఒక గ్రంథం ప్రచురించాడు. కోలెట్ వ్రాసిన తరువాతి రచనలలో ఇతివృత్త వైవిధ్యం కనిపిస్తుంది. *లాచటీ* (1933), *డ్యూవో* అనే నవలలు 'అసూయ' ను గురించి వ్రాసినవి.

ఒక బాలికను ఇద్దరు అక్కచెల్లెళ్లు పెంచి పెద్దచేసి, వేశ్యగా తయారు చేసిన కథ *గిగీ* (1944) నాటకంగాను, సినిమాగాను కూడా వచ్చింది. ఇది ఒక అత్యద్భుతమైన సంగీత కళారూపంగా పేరుపొందింది.

1949 నుంచి కీళ్లవాపు వ్యాధితో ఆమె బాధ పడింది. చివరికి తనకు ఇష్టమైన పిల్లులతో ఆనందంగా జీవిస్తూ పారిస్‌లోని తన అందమైన 'పాలియస్-రాయల్' భవనంలో 1954 ఆగష్టు 3 న కోలెట్ మరణించింది.

రాజ్యలక్ష్మి

**కోలెరిడ్జ్ సామ్యుయెల్ (1875-1912) :** 20 వ శతాబ్ది ఆరంభంలో విశేష విఖ్యాతి ఆర్జించిన ఇంగ్లీష్ వాగ్గేయకారుడు. కోలెరిడ్జ్ తండ్రి జాతి విద్వేషణ కారణంగా వైద్యుడుగా బ్రిటన్‌లో రాణించలేక, తన బ్రిటిష్ భార్యనీ, కుమారుణ్నీ వదలి స్వదేశం అయిన పశ్చిమ ఆఫ్రికాకు వెళ్లి పోయాడు. తన 5 వ ఏట కోలెరిడ్జ్ వయొలిన్ వాయించడం మొదలు పెట్టి, క్రాయ్‌డన్‌లోని ఒక ప్రెబ్బిటేరియన్ చర్చ్ గాయక బృందంలో చేరాడు. అక్కడ హెచ్.ఏ వాల్టర్స్ శిక్షణలో కొంత ఆరితేరాడు. ఆ వాల్టర్సే 1890 లో కోలెరిడ్జ్‌ని రాయల్ కాలేజ్ ఆఫ్ మ్యూజిక్‌లో చేర్పించాడు.

విద్యార్థిగా ఉన్న రోజులలోనే కోలెరిడ్జ్ కొన్ని కృతులు ప్రచురించాడు. 1896 లో అతడు క్రాయ్‌డన్‌లోని ఒక ఔత్సాహిక గాయక బృందానికి దర్శకుడై, వారికి శిక్షణ ఇస్తూ కచేరీలు చేస్తూ, సంగీతోత్సవాలలో న్యాయ నిర్ణేతగా పనిచేస్తూ తన భార్యనూ, ఇద్దరు బిడ్డలనూ పోషించుకో సాగాడు. తరువాత అనేక కృతులు రచించి, 1898 లో గ్లాస్టర్ సంగీతోత్సవాలలో తొలి ఘన విజయం సాధించాడు. *హియావథాస్ వెడ్డింగ్ ఫీస్ట్* (1898), *ది డెత్ ఆఫ్ మిన్నాహాహా* (1899), *హియావథాస్ డిపార్చర్* (1900) మొదలైనవి ఆయన కృతులలో ప్రధానమైనవి. నీగ్రో జానపద సంగీతంలో కోలెరిడ్జ్ అందె వేసిన చేయి. 1904, 1906, 1910 వ సంవత్సరాలలో ఆయన అమెరికా సందర్శించినప్పుడు అక్కడి సంగీత రసజ్ఞులు ఆయనను ఘనంగా సత్కరించారు.

బొ.శ్రీ.

**కౌపర్, విలియమ్ (1731-1800) :** ప్రముఖ ఆంగ్ల 'ప్రకృతి' కవి. తన కాలపు కవులందరిలోనూ ఎక్కువ ప్రజాదరణ చూరగొన్నవాడు. *ది టాస్క్*, మధుర మైన భావగీతం *ది పాప్లర్ ట్రీస్* వంటి పద్యాల ద్వారా 18 వ శతాబ్ది 'ప్రకృతి' కవితకు ఒక క్రొత్త సొగసును చేకూర్చి నవాడు. దైనిక సుఖ దుఃఖాలను గూర్చి వర్ణిస్తూ డొంకలూ, చెరువులూ, నదులూ, గడ్డివాములూ, జింకలూ మొదలైన కవితా వస్తువులతో కౌపర్ సంతృప్తి చెందాడు. అట్టి కవితా సామగ్రి మీద కవికి గల ప్రీతిలో పేదలన్నా, అధోవర్గాల వారన్నా అతనికి గల ఆసక్తి కూడా అభివ్యక్తం అయింది. సరళమైన భాషతో 18 వ శతాబ్ది పద్యరీతుల మీద కౌపర్ తిరుగుబాటు చేసి, ముందు రాబోయే బర్న్స్, వర్డ్స్‌వర్త్, కోలెరిడ్జ్ వంటి కవుల మార్గాన్ని సుగమం చేశాడు. తరచు ఈ కవిలో లలితమైన హాస్యమే తొంగిచూస్తూ వచ్చినా, ఈతని *ది క్యాస్టవే* అనే కావ్యంలో ఇతని మనస్సు లోపలి పొరలలోని కరుణరసం పైకి ఉబికి వచ్చింది.



తల్లి మరణానంతరం తన 6 వ ఏట కౌపర్‌ని స్థానిక బోర్డింగ్ స్కూలుకు పంపారు. తరువాత అతడు లండన్‌లోని వెస్ట్ మినిస్టర్ స్కూలుకు మారి, 1750 లో అక్కడ న్యాయశాస్త్రం చదవడం ప్రారంభించాడు. 1754 లో లాయరుగా నమోదయాడు. విద్యార్థిగా ఉండగానే తన బంధువు (cousin) థియొడోరా కౌపర్‌ను అతడు ప్రేమించాడు. కాని, త్వరలోనే జీవితాంతం అతనిని బాధించిన మానసిక అస్థిరత్వ లక్షణాలు అతనిలో కనిపింపసాగాయి. 1756 లో ఆస్తి ఏమీ మిగుల్చకుండా అతని తండ్రి మరణించాడు. అతని కుటుంబంలోని పెద్దల పలుకుబడి వలన 'హౌస్ ఆఫ్ లార్డ్స్' లో అతనికి ఉద్యోగం లభించింది. కాని అది కౌపర్‌కు

సంతోషాన్ని కలిగించక పోగా, ఆత్మహత్యాప్రయత్నానికి ప్రేరేపించింది. తరువాత 18 నెలలపాటు మానసిక చికిత్సాలయంలో అతడు ఉన్నాడు.

1773 లో మేరీ అన్విన్‌ని వివాహం ఆడాలని అనుకుంటూ ఉండగానే కౌపర్‌కి తిరిగి మానసిక అస్వస్థత ఏర్పడింది. దానినుండి కోలుకొనిన తరువాత 1780 నుంచి కౌపర్ తిరిగి కవితా వ్యాసంగానికి పూనుకొన్నాడు. *ది ప్రోగెస్ ఆఫ్ ఎరర్* అనే వ్యాసానికి మిసెస్ అన్విన్ ఇతివృత్తాన్ని సూచించింది. తరువాత అతడు రచించిన *కన్వర్సేషన్, రిటైర్‌మెంట్* అనే రచనలలో ఆ రోజులలోని అతని ఉల్లాసం ప్రతిఫలించింది.

ఇరుగు పొరుగున నివసిస్తున్న లేడీ ఆస్టెన్‌తో కౌపర్‌కు మైత్రి ఏర్పడింది. ఆమె అతనికి చెప్పిన కథనే *ది జెర్నీ ఆఫ్ జాన్ గిల్పిన్* అనే కథా గేయంగా అతడు రచించాడు. 1783 లో అది అచ్చు కాగానే లండన్ నగరం అంతటా దానిని గానం చేయసాగారు. సరదాకి ఆమె సోఫామీద పద్యం వ్రాయమని కోరగానే కౌపర్ *ది టాస్క్* అనే కావ్యం వ్రాశాడు. సుదీర్ఘమైన ఈ కావ్యంలో గ్రామీణుల విశ్రాంతి, ఉల్లాసం చక్కగా వర్ణింపబడ్డాయి. 1585 లో అది ప్రచురింపబడగానే దానికి విశేష ప్రశస్తి వచ్చింది. తరువాత కౌపర్ హోమర్‌కవి రచనలను ఆంగ్లంలోకి అనువదింపసాగాడు. కాని, అంతలోనే తిరిగి అతని ఆరోగ్యం క్షీణించి, 1795 లో మేరీ అన్విన్‌తో సహా ఈస్ట్ డెర్‌హాం చేరి, అక్కడ స్థిరపడ్డాడు. 1792 నుంచి అనారోగ్యంగా ఉంటూ వచ్చిన మిసెస్ అన్విన్ 1796 లో మరణించింది. ఆ సంఘటన కౌపర్‌ను మిక్కిలి క్రుంగదీసి, చివరికి 1800 లో కౌపర్ ఆ ఈస్ట్ పెర్‌హాంలోనే శాశ్వతంగా కన్ను మూశాడు.

1835-37 మధ్య కౌపర్ రచన లన్నిటిని పరిష్కరించి 15 సంపుటాలుగా రాబర్ట్ సౌదే ప్రచురించాడు. లేఖా రచయితగా కూడా కౌపర్‌కి ఇంగ్లీష్ సాహిత్యంలో గొప్ప ప్రశస్తి ఉంది. *గాడ్ మువ్స్ ఇన్ ఏ మిస్టీరియస్ వే, ఓ ఫర్ ఏ క్లోజర్ వాక్ విత్ గాడ్* వంటి ఆయన భగవత్ స్తుతి గీతాలు ప్రొటెస్టెంట్ ఇంగ్లండ్ జానపద వాఙ్మయంలో భాగాలుగా చేరిపోయాయి.

రాజ్యలక్ష్మి (బొ.శ్రీ.)

**క్రాబ్, జార్జ్ (1754-1832) :** ప్రముఖాంగ్లకవి దైనందిన జీవితపు వాస్తవ విషయాలను విపులంగా, రమ్యంగా పద్యకావ్యాలుగా రచించిన కవి. శస్త్ర చికిత్సకుడు కావలసిన వాడు ఆ వృత్తిని వదలి లండన్ చేరి రచనా వ్యాసంగంలో ప్రవేశించాడు. 'సర్ ఎడ్మండ్ బర్క్' సాయంతో ఇతని రచన *ది లైబ్రరీ* అనే కవిత ప్రచురణ పొందింది. ఇది నైతిక బోధలతో మిళితమైన వర్ణనాత్మక రచన. బర్క్ సాయంతోనే 1782 లో 'డ్యూక్ ఆఫ్ రట్‌లాండ్' కు సహాయకుడు గా ఇతడు నియమితుడయ్యాడు.

1783 లో *ది విలేజ్* అనే గీతంతో ఈ రచయిత కవిగా గుర్తింపు పొందాడు. గోల్డ్ స్మిత్ వ్రాసిన *డిజర్టెడ్ విలేజ్* పూర్తిగా రసవత్తరమైన వర్ణనలతోను, స్వీయ వాంఛా ప్రేరిత భావాలను చిత్రించేదిగాను ఉండి, వాస్తవికతను పూర్తిగా కప్పివేసిందనే భావంతో ఈ రచయిత దానికి పోటీగా ఈ పద్యాన్ని వ్రాశా డని చెప్పవచ్చు. ఇందులో ఈ రచయిత పల్లె ప్రాంతపు వాస్తవిక జీవితాన్ని చక్కగా చిత్రించాడు. పల్లె ప్రాంతంనుంచి వచ్చిన ఇతని సూక్ష్మపరిశీలనా దృష్టి ఎంత పటిమ గలదో ఇందులో కనిపిస్తుంది.

పట్టణ వాసానికి అలవాటు పడిన తరువాత క్రాబ్ దాదాపు 20 సంవత్సరాల పాటు చెప్పుకోదగిం దేమీ వ్రాయలేదు. ఆర్థిక అవసరాలు పెరగటంతో తిరిగి 1807 లో రచనలు ప్రారంభించాడు. 1807 లో *పారిష్ రిజిస్టర్,* 1810 లో *ది బరో,* 1812 లో *టేల్స్ ఇన్ వెర్స్,* 1819 లో *టేల్స్ ఆఫ్ ది హాల్* అనే పద్య కథలను వ్రాసి ప్రచురించాడు.

*ఆగస్టన్స్* లో దాదాపు చివరి వాడైన 'క్రాబ్' డ్రైడెన్, పోప్‌ల ఒరవడిలో 'హిరాయిక్ కప్‌లెట్' ను ఎంతో నైపుణ్యంతో వాడి దానికి కొత్త అందాలను సంతరించాడు. ఇతని తొలి రచనలు ఆగస్టన్ల చివరి రోజులలో వెలువడ్డాయి. అనంతర రచనలు *రొమాంటిక్ తిరుగుబాటు* మంచి ఉచ్చ దశలో ఉండగా వచ్చాయి. కాని క్రాబ్ సహజ స్థానిక వాతావరణం పట్ల చూపిన మక్కువ, ఉన్నత వర్గాల భావాలపట్ల వారి కృత్రిమ జీవిత పద్ధతుల పట్ల చూపిన నిరసనభావం రొమాంటిక్ రచయితల అభిమానాన్ని కూడా చూర గొన్నాయి.

కె.వి. మూర్తి.

**క్రీజా, మిరోస్లావ్ (1893-1981) :** ఆధునిక క్రోయేషన్ సాహిత్యంలో ప్రముఖ స్థానాన్ని సంపాదించుకున్న నవలా రచయిత, నాటక రచయిత.

మొదట్లో సైన్యంలో ఉపయుక్తం అయే శిక్షణ పొందినప్పటికీ మొదటి ప్రపంచ యుద్ధం తరువాత రచనా వ్యాసంగానికే పూర్తి సమయం వెచ్చింప దలచి 1919 లో వామపక్ష పత్రికను నడిపాడు. రెండవ ప్రపంచ యుద్ధం తరువాత 'యుగోస్లావ్ అకాడమీ ఆఫ్

సైన్స్ అండ్ ఆర్ట్' కు ఉపాధ్యక్షుడై, ఆ తరువాత యుగోస్లావ్ రచయితల సంఘానికి అధ్యక్షు డయాడు. రాజకీయ, సామాజిక అన్యాయాలను నిర్భయంగా, తీవ్రంగా విమర్శించేవాడు. ఇతడు వ్రాసిన *గ్లెంబా జెవి* (1932) అనే మూడు భాగాల నాటకం ఆస్ట్రియన్ సామ్రాజ్యంలోని క్రోయేషన్ బూర్జువా వర్గపు నైతిక పతనాన్ని, విశృంఖలత్వాన్ని ఎత్తి చూపుతుంది.

*పావాతక్ ఫిలిపా లాటినోవికా* (1932) అనే నవల, *హోవత్స్కిబాగ్ మార్స్* (1922) అనే కథా సంపుటి *బాలడ్ పెటిస్ కెరంపుహ్* (1936) అనే ద్విపద కావ్యం ఈయన ఇతర రచనలు.

కె.జి. మూర్తి.

**క్రూజ్, సార్ జువానా ఇనెస్ డి లా (1651-95)** : వలస పాలనలోని మెక్సికోకు చెందిన మహా కవయిత్రి. ఈమె అసలు పేరు 'జువానా ఐన్స్ డి అస్బాజె' .

బాల్యంలోనే ఈమె అఖండ పాండిత్య పటిమను చూపింది. 8 సంవత్సరాల వయస్సులోనే *లో* (Loa) అనే నాటకీయమైన చిన్న కవితను భగవంతుణ్ణి కీర్తిస్తూ వ్రాసింది. 9 సంవత్సరాల వయస్సులో లాటిన్ భాషను 20 పాఠాలలో నేర్చుకొంది. ఆమె తెలివి తేటలను గూర్చి తెలుసుకున్న ఆ నాటి రాజప్రతినిధీ, అతని ఆస్థానంలోని వారూ ఆమెను పిలిచి పరీక్షించి ఆమె ప్రతిభను కొనియాడారు. 17 సంవత్సరాల వయస్సులో 40 మంది ఆచార్యులు పెట్టిన కఠిన మౌఖిక పరీక్షలో వారినే అయోమయంలో పడవేసిన దిట్ట ఈమె.

విజ్ఞాన సంపాదనకే జీవితాన్ని అంకితం చేయదలచి వివాహపు ఆలోచనలను ఆమె వదులుకొంది. 1669 లో 'శాన్ జెరోనియా' కాన్వెంటులో సన్యాసినిగా చేరింది. అక్కడ 4,000 గ్రంథాలు గల గ్రంథాలయాన్ని సమకూర్చింది. పలు కవితలు వ్రాసింది. మతపరమైన, లౌకికమైన నాటకాలు వ్రాసింది.

*రెస్పుయ్స్టా ఎసార్ ఫిలోటా* అనే సుదీర్ఘ లేఖలో తనపై వచ్చిన విమర్శనలను తిప్పికొట్టటంతో పాటు, స్త్రీలకు మేధా పరమైన వాంఛ లుండగూడ దనే వాదాన్ని త్రోసిపుచ్చుతూ తన అపార విజ్ఞాన సముపార్జనా కాంక్షను నిర్భయంగా వ్యక్తం చేసింది. *హోంబర్స్ నెసియోస్ క్యూ అక్యూజెస్* అనే కవితతో ఈమెకు కవయిత్రిగా గుర్తింపు లభించింది.

ఈమె రచనలు మూడు సంపుటాలుగా ప్రకటితమయాయి. మొదటిది: *ఇనన్‌దేషియా కేస్టాలిడా* (1689) మాడ్రిడ్‌లోను, రెండవది *సెగండో వాల్యూమెన్ డి లా అబ్రాస్ డి సరార్ జువానా ఐన్స్ డి లా క్రజ్* (1692) సెవెల్లిలోను, మూడవది *ఫేమా వై అబ్రాస్ పోస్థుమస్ డి ఫెనిక్స్ డి మెక్సికో వైడెజిమా మూసా* (1700) మాడ్రిడ్‌లోనూ వెలువడ్డాయి.

ఈ రచనలు ఒక గట్టి విశ్వాసంనుంచి వచ్చినవి కావడంతో రచయిత్రి హృదయం నుంచి పాఠకుని హృదయంలోకి సూటిగా చొచ్చుకొని పోతాయి.

కె.జి. మూర్తి.

**క్రేన్, స్టీఫెన్ (1871-1900)** : అమెరికా సంయుక్త రాష్ట్రాలకు చెందిన కవి, నవలా రచయిత, కథానికా రచయిత. మాగి: *ఏ గర్ల్ ఆఫ్ ది స్ట్రీట్స్* (1893), *ది రెడ్ బ్యాడ్జ్ ఆఫ్ కరేజ్* (1895) అనే నవలలు, *ది ఓపెన్ బోట్, ది బ్రైడ్ కమ్స్ టు యెల్లోస్కై, ది బ్లూ హోటెల్* అనే కథానికలు ఈయన రచనలలో ముఖ్యమైనవి.



తల్లివైపు చాలామంది మెథడిస్ట్ చర్చిలో మతాచార్యులు. తల్లి కూడా క్రైస్తవ మితపాన సంఘాలలో పనిచేసేది. ఇతని పూర్వికులలో సైనికులు, సైన్యాధిపతులు కూడా ఉన్నారు. ఈయన రచనలకు ఈ పూర్వికులలో ఒకరి వృత్తి నుండి ఇతని శైలికి ఆధారం లభిస్తే, మరొకరి వృత్తి నుంచి కథావస్తువులు లభ్యమైనట్లున్నాయి అని అతని మిత్రులు అనేవారు.

మతాచార్యుడైన తండ్రిపట్ల, తన పూర్వికులు బోధించిన బోధనల పట్ల ఇతనికి తెలియకుండానే ఇతనిలో ఒక విధమైన తిరుగుబాటు ధోరణి అంకురించింది. వారు ఏమేమి చేయగూడదన్నారో అవన్నీ అతనికి అలవాటయాయి. నవలా పఠనం, నాటకాలు చూడటం, పొగత్రాగటం, సారాయి నిషాలకు అలవాటు పడటం వంటి దుర్గుణా లన్నీ ఇతనికి అలవడ్డాయి. అయితే తండ్రి మందలింపులతోను, బైబుల్ కూడా ఆసక్తిగా పఠించటం తోను, ఈయన రచనలన్నింటిలో మతం వాసనలు కొంతవరకు కనిపిస్తూనే ఉంటాయి.

విద్య పట్ల ఎక్కువ ఆసక్తి చూపించని ఇతడు జీవితంలో విఫలు డవుతాడని ఇతని ఉపాధ్యాయులు

అనుకొన్నారు. క్రమశిక్షణ మూసలో ఇముడలేక పోయాడే గాని, అన్ని దురలవాట్ల మధ్య, మంచి పుస్తకాలు చదవటం అనే వ్యసనం కూడా ఇతనికి ఉండేది. షేక్స్‌పియర్, ఫ్లుటార్క్‌ల రచనలే కాక, గ్రీక్, రోమన్ ప్రాచీన గ్రంథాలను కూడా ఇతడు క్షుణ్ణంగా చదివాడు.

*ది రెడ్ బ్యాడ్జ్ ఆఫ్ కరేజ్* అనే నవలలో ఒక మంచి క్రైస్తవుణ్ణి, సాహసవంతుడైన సైనికుణ్ణి చక్కగా మేళవించటం జరిగింది. మాగీలో ఫ్రెంచి ఇంప్రెషనిస్టుల ప్రభావం కనపడుతుంది. *ది ట్రిబ్యూన్* (The Tribune, 1892) అనే పత్రిక ఇతని సలివాన్ కౌంటీ కథలను, కథా చిత్రాలను సుమారు ఒక డజను వరకు ప్రచురించింది. ఆ నాటి ప్రముఖ సాహిత్య విమర్శకుడు విలియమ్ డీన్ హోవెల్స్ ఇతని ప్రతిభను గుర్తించి తగిన హంగులతో సాహితీ రంగ ప్రవేశం చేసినవాడని ఇతనిని అభివర్ణించాడు.

1895 లో క్రేన్ పశ్చిమ అమెరికాకు, మెక్సికోకు వెళ్లాడు. *బా షెలర్ అండ్ సిండికెట్* కు ఆ ప్రయాణానికి సంబంధించిన అనుభవాలతో కథా చిత్రాలను వ్రాసి పంపాడు. *ది రెడ్ బ్యాడ్జ్ ఆఫ్ కరేజ్* వ్రాసిన తరువాత క్యూబాలో తిరుగుబాటును గురించి వ్యాసాలు వ్రాయమని 700 డాలర్లు ఇచ్చి ఒక వార్తా పత్రిక ఇతనిని పంపింది. కాని 1897 ఉగాది నాడు అతడు ప్రయాణిస్తున్న 'కమోడోర్' అనే నావకు ప్రమాదం జరగటం, తన డబ్బంతా పోగొట్టుకొని ప్రాణాలు దక్కించుకొని, తీరం చేరుకోటం జరిగింది. ఈ ప్రమాద ఫలితమే *ది ఓపెన్ బోట్*. ఇది ప్రపంచ కథానికలలోనే గొప్ప కథలలో ఒకటి అనవచ్చును.

క్యూబా వెళ్లలేక పోయిన క్రేన్ గ్రీకో-టర్కిష్ యుద్ధాన్ని గురించి వ్రాయటానికి గ్రీస్ వెళ్లాడు. జాక్సన్ విల్లి లోని ఒక హోటల్ యజమానురాలు కోరా టేలర్ అతని ప్రేమలో పడి తన ఇల్లు, వాకిలి అమ్మేసి అతని వెంట గ్రీస్ వెళ్లి ప్రపంచంలో యుద్ధాన్ని గురించి వ్రాసిన ప్రథమ మహిళా రచయిత అయింది. ఆ యుద్ధం అయిపోయాక వారు ఇంగ్లండ్‌లో స్థిరపడ్డారు. ఆ రోజులలోనే హెన్రీ జేమ్స్, హెచ్.జి. వెల్స్ వంటి ప్రముఖ రచయితల సాంగత్యం లభించింది. ఆదాయానికి మించి ఖర్చుచేసి 500 పౌన్ల వరకు అప్పులలో కూరుకునిపోయి, చాలా కష్టాలు పడి, చివరకు 1900 వ సంవత్సరంలో క్రేన్ మరణించాడు.

అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని 19 వ శతాబ్దపు ప్రముఖ నవలా రచయితలలో ఇతనిని ఒకనిగా పేర్కొనవచ్చును. మాగీ నవలతో ఒక కొత్త పుంతను తొక్కాడనీ, తరువాతి తరం వారికి ఇది మార్గదర్శక మయిందనీ విమర్శకుల భావన. *ది రెడ్ బ్యాడ్జ్ ఆఫ్ ఆనర్* లో మనో వైజ్ఞానిక పరమైన వాస్తవికతను (Psychological Realism) విమర్శకులు గుర్తించారు . వీటి కంటె కూడా యుద్ధ విలేఖకుడుగా, కథారచయితగా, పత్రికా రచయితగా ఎక్కువ విజయాన్ని క్రేన్ సాధించాడు. అపహాస్యానికీ, జాలికీ, భ్రమకూ, ఆశకూ నిరాశకూ మధ్య ఉత్సుకతతో కూడిన స్పర్థను సృష్టిస్తూ విలక్షణమైన శైలిలో ఈయన రచనలు సాగుతాయి. అనిర్దిష్టమైన, స్వతంత్రమైన శైలే అతని విజయానికి కారణమైందని చెప్పవచ్చు.

కె.జి. మూర్తి.

**క్రేన్, (హెరాల్డ్) హార్ట్ (1899-1932) :** ప్రముఖ అమెరికన్ కవి. మానవ జీవన మాధుర్యాన్ని గురించి పారిశ్రామిక యుగంలోని జీవనంతో సహా దార్శనిక ధోరణిలో భావ గీతాలు రచించిన కవి. ఆయన ప్రసిద్ధ కావ్యం *ది బ్రిడ్జ్* (1930). దానిలో అమెరికన్‌ల అనుభూతిని పురాణీకరించడానికి ఆయన పూనుకున్నాడు. పురాణ కావ్యంగా అది విఫలమైనా, దానిలోని ఎన్నో భావ గీతాలు 20 వ శతాబ్దిలోని అమెరికన్ పద్యాలలో మిక్కిలి ప్రశస్త మైనవిగా కీర్తించ బడుతున్నాయి.

హార్ట్ క్రేన్ 1899 జూలై 21 వ తేదీన ఓహియో రాష్ట్రంలోని గేరెట్స్‌విల్లీ గ్రామంలో జన్మించాడు. ఆయన బాల్యం క్లీవ్‌లాండ్‌లో గడిచింది. తల్లిదండ్రుల వివాహం భగ్నం కావడంతో బాల్యం అతడు చాలా చిరాకుతో గడిపాడు. అతని 17 వ ఏట తల్లిదండ్రులు విడాకులు తీసుకున్నారు. శేష జీవిత మంతా అతడు చాలా ఉద్వేగపరుడుగా ఏకలింగ సంపర్కానికీ, మద్యపానానికీ అలవాటు పడి దుర్భరంగా గడిపాడు. న్యూయార్క్ సిటీ లోనూ, క్లీవ్‌లాండ్ లోనూ రక రకాల ఉద్యోగాలు అతడు నిర్వహించాడు. అతని కవిత్వం చిన్న చిన్న పత్రికలలో ప్రచురించబడడం ప్రారంభించిన తరువాత 1923 లో అతడు న్యూయార్క్‌లో స్థిరపడ్డాడు. వేగంతోనూ, కలవరంతోనూ కూడిన నగర జీవితం అతనిని ఆకర్షించింది. తన కవిత్వంలో అతడు దానిని వర్ణించడానికి పూనుకున్నాడు. సమకాలీన జీవితానికీ, ప్రాచీన పౌరాణిక జీవన విధానానికీ అవ్యాహతమైన అనుబంధం కల్పించడానికి తన కవిత్వం ద్వారా అతడు ప్రయత్నించాడు.

హార్ట్ క్రేన్ తొలి ప్రచురణ *వైట్ బిల్డింగ్* (1926). దానిలో అతని దీర్ఘకావ్యం *ఫర్ ది మారేజ్ ఆఫ్*

*ఫాస్టెస్ అండ్ హెలెన్* కూడా చేర్చబడింది. టి.ఎస్. ఎలియెట్ రచించిన *ది వేస్ట్ లాండ్* కి సమాధానంగా క్రేన్ దానిని రచించాడు.

తండ్రి, సుప్రసిద్ధ దాత 'ఓటో హెచ్. కాన్' అందచేసిన ఆర్థిక సహాయంతో క్రేన్ *ది బ్రిడ్జ్* అనే తన కావ్యాన్ని పూర్తి చేశాడు. వర్తమాన భూతకాలాలను కలుపుతూ మానవుని సృజనశక్తిని ఉగ్గడించే ఆ కావ్యంలో 15 భాగా లున్నాయి.

క్రేన్ 'గుగ్గెన్‌హైమ్' ఫెలోషిప్ సంపాదించి మెక్సికో సిటీకి వెళ్లి ఒక మెక్సికన్ ఇతివృత్తాన్ని తీసికొని మరొక మహాకావ్యం వ్రాయాలని సంకల్పించుకున్నా, కొన్ని ప్రతిబంధకాల వలన అతడా కావ్యం వ్రాయలేకపోయాడు. అయితే, మెక్సికోలో ఉన్న కాలంలో క్రేన్ *ది బ్రోకెన్ టవర్* (1932) అనే ఒక చక్కని కావ్యం వ్రాశాడు. మెక్సికో నుంచి అమెరికాకు తిరిగి వస్తూ ఓడమీద నుంచి కరీబియన్ సముద్రంలోకి దూకి, 1932 ఏప్రిల్ 27 న క్రేన్ ఆత్మహత్య చేసుకున్నాడు.

అతని *కలెక్టెడ్ పొయెమ్స్* అనే గ్రంథం 1933 లో వెలువడింది. కాని, అటు తరువాత 1966 లో *ది కంప్లీట్ పొయెమ్స్ అండ్ సెలెక్టెడ్ లెటర్స్ అండ్ ప్రోజ్* అనే పేరుతో ఒక సమగ్ర సంపుటం వెలువడింది.

బొ.శ్రీ.

**క్రైటన్, జేమ్స్ (1560-1582)** : స్కాట్లండ్ దేశపు మహావక్త; బహుభాషా వేత్త; 'ఏడ్మైరబ్ల్ క్రైటన్' (ప్రశంసనీయ క్రైటన్) అని ప్రసిద్ధి పొందినవాడు. చాలామంది అతనిని 'స్కాట్' సంస్కృతికి ఆదర్శప్రాయమైన ప్రతినిధి అని ప్రశంసించినా, కొంతమంది అలాంటివ్యక్తి ఒకడు నిజంగా ఉన్నాడా అనే సంశయాన్ని వెలిబుచ్చుతున్నారు.

ఒక ప్రభుత్వోద్యోగి అయిన రాబర్ట్ క్రైటన్ అతని తండ్రి. 'బీత్' వంశానికి చెందిన ఎలిజబెత్ స్టూవర్ట్ అతని తల్లి. తల్లిదండ్రులను బట్టి తాను రాజవంశానికి చెందిన వాడనని క్రైటన్ వాదిస్తూ ఉండేవాడు. 1575 లో 'సెంట్ ఆండ్రూస్' యూనివర్శిటీ లో 2 సంవత్సరాలకు బదులు ఒకే సంవత్సరం చదివి జేమ్స్ క్రైటన్ ఎమ్.ఏ. పూర్తి చేశాడు. ఆ తరువాత పారిస్ వెళ్లి అక్కడ కాలేజ్ 'నవరే' లో గుర్తింపు పొందాడు.

సాము గరిడీలలోను, గుర్రపుస్వారీలోను, అస్త్ర విద్యలోను, 10 భాషలలోను అతనికి గల ప్రజ్ఞా పాటవాలను గురించి, క్రైస్తవమత వేదాంతంలో విజ్ఞాన సర్వస్వం అని చెప్పదగిన అతని పాండిత్యాన్ని గురించి, ఏ విషయం మీద అయినా అనర్గళంగా మాట్లాడగల అతని వక్తృత్వ ప్రతిభను గురించి వివరిస్తూ 1580 లో వెనిస్ నగరంలో ఒక కరపత్రం వెలువడింది.

యూరప్‌లో మనకు తెలియవచ్చిన ఆయన కార్యక్రమం 1579 జూలై లో 'జెనోవా' లోని రాజభవనంలో ఆయన చేసిన మహోపన్యాసం. ఆ తరువాతి సంవత్సరం వెనిస్ నగర ముద్రాపకుడు ఆల్డస్ మాన్‌టియస్ ని కలుసుకున్నాడు. బహుశః ఆ కరపత్రాన్ని ప్రచురించినవాడు ఇతడే అయి ఉండవచ్చును. ఆల్డస్ మాంటియస్ స్థానికంగా ప్రసిద్ధి పొందిన మానవతా వాదులకు క్రైటన్ ను పరిచయం చేశాడు. క్రైటన్ బహుముఖ ప్రజ్ఞలకు వారు అతనిని ఎంతో ప్రశంసించారు. 1581 లో మాన్‌టియస్ రోమన్ కవి 'సిసిరో' వ్రాసిన *పెరాడాక్సా* ను తిరిగి ప్రచురించి, దానిని క్రైటన్‌కు అంకితం చేస్తూ అతని ప్రతిభను కొనియాడాడు. అంతకు ముందు 1581 లో 'పాదువా' లో క్రైటన్ రెండు చర్చలలో పాల్గొని అఖండ ఖ్యాతిని ఆర్జించినట్లు కనిపిస్తుంది.

ఆ తరువాతి సంవత్సరం జేమ్స్ క్రైటన్ మాంటువా ప్రభువు కొలువులో ఉద్యోగిగా చేరాడు. కాని, అక్కడి రాజ కుమారుని అసూయా ద్వేషాలకు గురి అయి, క్రైటన్ హత్య చేయబడ్డాడు.

తన హ్రస్వజీవితంలో అతడు సాధించిన ఆశ్చర్యకరమైన ఘనకార్యాల సంగతి అలా ఉండగా, సర్ థామస్ ఉర్ క్వార్ట్ 1652 లో క్రైటన్ చిత్రాన్ని *ది డిసకవరీ ఆఫ్ మోస్ట్ ఎక్స్‌క్విజిట్ జ్యూయెల్* అనే పేరుతో చిత్రీకరించాడు. అది కొంతవరకు అతిశయోక్తిగా కనిపిస్తుంది.

ప్రచురించబడిన అతని లేఖల ద్వారా, క్రైటన్ ఎన్నో రకాల అప్పులు చేశాడని తెలుస్తోంది. క్రైటన్‌కు గల లోపాలలో ఇది ఒకటి. అయినా అతడు 'ఆశ్చర్యకరమైన ప్రతిభావంతుడు' అని చెప్పక తప్పదు. అతని కున్న వేదాంత పరిజ్ఞానం, అతని జ్ఞాపకశక్తి, వివిధ భాషలలో అతని పాండిత్యం మొదలైనవి అతనికి పేరు ప్రఖ్యాతులు తెచ్చాయి. క్రైటన్‌కు 'ప్రశంసింపదగిన' అనే విశేషణం 1603 లో 'జాన్ జాన్‌స్టన్' వ్రాసిన *హీరోస్ స్కాటిసి* అనే పుస్తకంలో మొదటిసారి కనిపిస్తుంది.

1909 లో పి.ఎఫ్. టైలర్, డొగ్లాస్ క్రాటన్ జేమ్స్‌లు క్రైటన్ జీవిత చరిత్రలు వ్రాశారు.

రాజ్యలక్ష్మి

**క్లాడెల్, పాల్ (లూయిస్-ఛార్లస్-మేరీ) (1868-1955)** : 20 వ శతాబ్దపు తొలి అర్ధభాగంలో ఫ్రెంచ్ సాహితీ లోకానికి మకుటాయమానంగా వెలిగిన

ప్రసిద్ధ కవి, నాటక స్రష్ట, వ్యాస రచయిత. భగవంతుని యందు ఇతనికి గల అచంచల విశ్వాసమే ఇతని రచనలకు ఊపిరిని, సౌష్ఠవాన్ని, పటిమను, విశిష్టతను చేకూర్చాయి.

ఆర్థిక వ్యవహారాలలో పాండిత్యాన్ని, గుర్తింపును ఆర్జించి క్లాడెల్ ఫ్రెంచ్ విదేశ వ్యహారాల శాఖలో 1890 లో చేరి రాజనీతిజ్ఞుడుగా పేరు పొంది అనేక ఉన్నత పదవులు చేబట్టి, ప్రపంచంలోని ప్రధాన నగరాలన్నీ సందర్శించాడు. టోక్యో, వాషింగ్‌టన్, బ్రసెల్స్‌లో ఫ్రెంచ్ రాయబారిగా ఉంటూనే తన రచనా వ్యాసంగాన్ని కొనసాగించాడు. పారిస్‌లోని ఆ నాటి సాహితీపరులకు దూరంగా ఉండడంతో తనదైన ఒక దృక్పథాన్ని, ఆదర్శాన్ని, శైలిని ఆయన ఏర్పరచుకోగలిగాడు. సృష్టిని మతపరంగా అవగాహన చేసుకొని తన కవితల ద్వారా, నాటకాల ద్వారా ఆ సృష్టి రహస్యాన్ని ఛేదించి చూపించడమే ధ్యేయంగా ఇతని సాహితీ కృషి సాగింది. తన ధ్యేయాన్ని సాధించడానికి ప్రతీకాత్మకమైన నాటకాలను ఇతడు ఎన్నుకొన్నాడు. ఏకరూపమైన ఇతివృత్తం, వాతావరణం, సంఘటనల ద్వారా, తిరిగి తిరిగి కనిపించే ప్రతీకాత్మక పాత్రల ద్వారా ఈ నాటకాలకు ఇతడు బలం చేకూర్చాడు.

ఇతని నాటకాలలో సైన్యాధ్యక్షులు, విజేతలు వంటి కార్యశూరులే నాయకులుగా కనిపిస్తారు. *లా విల్లి* (1890), *ఎల్.ఇ. ఛేంజ్* (1893), *లె రిపోజ్‌డి సెప్టీమ్ జో* (1896) అనే ఈయన వ్రాసిన మూడు నాటకాలలోని నాయకులూ అహంభావం, దురాశ, అంతులేని కోరికలు, హింస వంటి మానవ బలహీనత లన్నింటితో కూడి కని పిస్తారు. క్లాడెల్ ఈ మానవ బలహీనత లన్నింటినీ అధిగమింప జేసి ముక్తి మార్గం వైపు వారిని నడిపిస్తాడు.

1906 లో క్లాడెల్ వివాహం చేసుకొన్నాడు. కాని అంతకు ముందు 4 సంవత్సరాల పాటు వివాహిత అయిన ఒక పోలిష్ స్త్రీతో ప్రేమ వ్యవహారాలు నడిపాడు. ఈ గొడవ లన్నీ ఏదో ఒక రూపంలో ఆ తరువాత అతడు చేసిన రచనలలో కనిపిస్తాయి. స్వీయచరిత్ర వంటి దని చెప్పదగిన *ప్యార్టేజ్ డి మిడి* (1906) లో మానవ ప్రేమకు, లోకాతీత మైన దివ్య ప్రేమకు తేడాలను చూపించడానికి క్లాడెల్ ప్రయత్నిస్తాడు. *ఎల్ అనాన్స్ ఫేట్ ఎ మేరీ* (1912) లో ఈ సమస్యను ఇతడు పరిష్కరించాడు. భగవంతుని ప్రణాళికలో స్త్రీ పాత్ర ఏమిటో ఈ రచనలో క్లాడెల్ స్పష్టంగా గుర్తిస్తాడు. పురుషుని రెచ్చగొట్టేదీ, పాపానికి మూలం అయిన ఈవ్ కుమార్తెగా మాత్రమే గాక, పురుషుని ముక్తిమార్గం వైపు మళ్లించ గలిగిన మేరీ మాత బిడ్డగా కూడా స్త్రీని ఇతడు చూడగలిగాడు. *లి సాలియర్ డి శాటిన్* (1924) క్లాడెల్ రచనలలో మణిపూస వంటిది. దీనిలోని నాయిక డోనా ప్రోహిజ్ ద్వారా క్లాడెల్ భగవంతుని దృష్టిలో స్త్రీకున్న పాత్ర ఏమిటో స్పష్టంగా చూపించాడు. వివాహిత అయిన 'డోనా' కూ, అన్ని బలహీనతలూ ఉన్న మగధీరుడు 'రోడ్రిగ్' కూ మధ్య సాగిన ప్రేమగాథే దీని ఇతివృత్తం. అయితే ఆ జంట లైంగిక తృప్తిని నిరాకరించి అంతిమ త్యాగాన్ని ఆహ్వానించటం దీనిలోని గొప్ప విశేషం. డోనా మరణించటం, రోడ్రిగ్ బానిసగా కొనిపోబడడంతో కథ ముగుస్తుంది. దానితో వారిమధ్య ఆధ్యాత్మికమైన కలయిక ఏర్పడుతుంది.

ఈయన ఇతర రచనలలో *ఎల్ ఓ టేజ్* (1911), *లె పెరిహ్యుమిలి* (1920), *లె పెయిన్ దర్* (1918) అనే మూడు భాగాల చారిత్రక నవల ప్రసిద్ధ మైంది. *సింక్ పాండెస్ ఓడ్స్* (1910) ఈయన వ్రాసిన భావ కవితా సంకలనం. క్లాడెల్ అనంతర రచనలలో పటిమా పాటవాలు కొంచెం దెబ్బ తిన్నట్లు కనిపిస్తుంది.

కె.వి. మూర్తి.

**క్లార్క్, జాన్ పెపర్ (1935-)** : ఆఫ్రికన్ భౌగోళిక రమ్యతను కవిత్వంలో రస మయంగా చిత్రించిన నైజీరియన్ కవి. కవిగానే గాక పత్రికా రచయితగా, నాటక స్రష్టగా, విమర్శకుడుగా కూడా ప్రఖ్యాతి పొందినవాడు. సాంప్రదాయిక 'ఐజా' మూఢనమ్మకాలను, గాథలను క్షుణ్ణంగా పరిశీలనా దృష్టితో అధ్యయనం చేసి, అనేక వ్యాసాలను ప్రచురించిన పండితుడు.

ఇబదాన్ విశ్వవిద్యాలయం నుంచి పట్టా పుచ్చుకొన్న క్లార్క్ 1960 లో రచయితగాను, పత్రికా రచయితగాను జీవితం ప్రారంభించాడు. తరువాత లాగోస్ లోని *డైలీ ఎక్స్‌ప్రెస్* పత్రికకు సంపాదక వ్యాసాలు వ్రాశాడు. ఉపకార వేతనంపై 'ప్రిన్స్‌టన్' విశ్వవిద్యాలయంలో అధ్యయనం చేశాడు. ఆ అనుభవాలే *అమెరికా, దెయిర్ అమెరికా* (1964) అనే రచనకు ఉపయోగ పడ్డాయి. అమెరికన్ మధ్య తరగతి విలువలను, నల్లజాతి వారి జీవన పద్ధతులను, పెట్టుబడిదారీ వ్యవస్థను ఘాటుగా విమర్శిస్తూ సాగుతుంది ఈ రచన.

ఇతడు భావకవి. ఇతని కొన్ని కవితలలో భావావేశం కనిపిస్తుంది. 1962 లో వెలువడ్డ *పొయెమ్స్* 1965 లో రచించిన *ఎ రీడ్ ఇన్ ది టైడ్* అనే కవితా సంపుటాలు ఇందుకు నిదర్శనాలు. ఇతని ఉత్తమ

రచనలలో కేవలం శిల్పం మాత్రమే గాక సాంప్రదాయిక ఆఫ్రికన్ జీవితాన్ని స్వతంత్రమైన కల్పనాశక్తితో చక్కగా చిత్రీకరించడం కనిపిస్తుంది.

ఇతని నాటకాలలో మొదటి మూడూ విషాదాంతాలే! 1961 లో వ్రాసిన *సాంగ్ ఆఫ్ ఏ గోట్* ఒక కుటుంబ విషాద గాథ. దానిలోని కవితా పాటవాన్నీ, నాటకీయ నిపుణతనూ విమర్శకులు విశ్వవ్యాప్తంగా కొనియాడారు.

1964 లో వ్రాసిన *ది మాస్క్వరేడ్* అనే నాటకం కూడా కుటుంబ విషాద గాథే! కాని తరువాత వ్రాసిన *ది ర్యాఫ్* ఇతని నాటకాలలో ఉత్తమ మైనది. దీనిలోని ఇతివృత్తం సంకేతాత్మకం. నలుగురు మనుష్యులు తెప్ప లాంటి దానిసాయంతో 'నైగర్' నదిపై గమ్యం లేకుండా వాలువెంట తేలుతూ పోవడమే దీనిలోని ఇతివృత్తం. ఇది మానవుని అగమ్య గోచర స్థితిని, ముఖ్యంగా నాటి నైజీరియా పరిస్థితిని తెలుపడానికే ఈ రచయిత వ్రాశాడు. పాత్ర చిత్రణ, సంకేతాత్మకమైన సంఘటనలు ఈ రచనకు జీవం పోశాయి.

*ది ఒజిది ఆఫ్ అటాజి* (1966) అనేది ప్రత్యేకంగా చెప్పుకోదగిన మరొక ప్రయోగాత్మక నాటకం. దీనిలో ఐజా తెగకు సంబంధించిన కర్మకాండలను నాటకీయం చేశాడు. దీనిని పూర్తిగా ప్రదర్శించడానికి ఏడు రోజులు పట్టేదట. శ్రావ్యమైన సంగీతంతో, కన్నులకు విందు చేసే నృత్యాలతో, ఆహ్లాదకరమైన మూకాభినయంతో, మనోహర దృశ్యాలతో ఇది ప్రజలను ఎంతగానో రంజింపచేసిన నాటకము. ఈ రచయిత ఐజా ఐతిహాసిక కావ్యమైన *ది ఒజిది శాగా: బ్రైడ్స్ ఆఫ్ ది డెల్టా* ను ఆంగ్లంలోకి అనువదించి నైజీరియా సాహితీ సంపదను బయటి ప్రపంచానికి అందించాడు.

కె.జి. మూర్తి.

**క్లార్క్, మార్కస్ (1846-81) :** ఇంగ్లండులో పుట్టి ఆస్ట్రేలియాలో స్థిరపడ్డ ఆంగ్ల రచయిత. 17 సంవత్సరాల వయస్సప్పుడు ఆస్ట్రేలియా చేరి రకరకాల చిన్న ఉద్యోగాలు చేసి, వ్యవసాయం చేయటానికి కూడా ప్రయత్నించి చివరకు రచయితగా స్థిరపడ్డాడు. 1867 నాటికి *ఆస్ట్రేలియన్ మాగజైన్* పత్రికకు కథానికలు వ్రాయడం ప్రారంభించాడు. *మెల్‌బోర్న్ ఆర్గస్* అనే పత్రికకు నాటక సమీక్షలు కూడా వ్రాశాడు. *ఆస్ట్రేలియన్ జర్నల్* అనే పత్రిక సీరియల్‌గా వేసుకోటానికి ఒక రచనను కోరగా *ఫర్ ది టర్మ్ ఆఫ్ హిజ్ నేచురల్ లైఫ్* అనే ప్రసిద్ధ నవలను వ్రాశాడు. రూఫస్ డాన్ అనే వ్యక్తి తాను చేయని నేరానికి బలి అయిపోయి, నేరస్థుల ప్రపంలోకి తోయబడటంతో ఏ విధంగా పతనమై పోయిందీ క్లార్క్ ఈ నవలలో ఎంతో రసవంతంగా చిత్రిస్తాడు. ప్రజల ఆవేశ కావేషాలకు అద్దం పట్టే నాటకీయ ఫక్కీలో నడిచిన ఈ నవల వాస్తవికతను కూడా మితిమీరిన మోతాదులో చూపిస్తుంది. ఇదే ఈయనకు ఎక్కువగా పేరు ప్రఖ్యాతులను తెచ్చి పెట్టిన రచన. ఆస్ట్రేలియా ఇంగ్లండుకు వలసదేశంగా ఉన్న కాలం నాటి సాహిత్యంలో ఈ నవల మణిపూస వంటిది. ఈయన రచనలలో ఉత్తమమైన వాటిని *ది ఆస్ట్రల్ ఎడిషన్ ఆఫ్ ది సెలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ మార్కస్ క్లార్క్* అనే పేరుతో 1890 లో ప్రచురించడం జరిగింది.

కె.జి. మూర్తి.

**క్లైస్ట్, (బెర్న్డ్) హైన్రిఖ్ (విల్‌హెల్మ్) వాన్ (1777-1811) :** 19 వ శతాబ్దిలోని ప్రముఖ జర్మన్ నాటక కర్తలలో మొట్టమొదటివాడు. ఫ్రాన్స్, జర్మనీలలో వచ్చిన రియలిస్ట్, ఎక్స్‌ప్రెషనిస్ట్, నేషనలిస్ట్, ఎగ్జిస్టెన్షియలిస్ట్ ఉద్యమాలలో వచ్చిన కవులందరికీ పితామహుని వంటివాడు. ఆధునిక జీవన, సాహిత్య సమస్యలను మును ముందుగా దర్శించిన ప్రతిభాశాలి.

సైనిక వృత్తిలో కొన్నాళ్లూ, న్యాయ, గణిత శాస్త్రాల అధ్యయనంలో కొన్నాళ్లూ జీవితంలో ఏడు సంవత్సరాల అమూల్యమైన కాలం వృథాగా గడచిపోయిన తరువాత ఇమాన్యువల్ కాంట్ దర్శన శాస్త్రం చదివి క్లైస్ట్ తార్కిక జ్ఞానంలో విశ్వాసం కోల్పోయాడు. ఉద్వేగాలకూ, తార్కిక జ్ఞానానికీ మధ్య సాగిన సంఘర్షణే క్లైస్ట్ రచనలలో ప్రధానంగా కనిపిస్తుంది.

చదువుకు స్వస్తి చెప్పి మొదట పారిస్‌కీ, తరువాత స్విట్జర్లాండ్‌కీ వెళ్లి అక్కడ ఒక రైతుగా స్థిరపడాలని చూశాడు. అక్కడ ఉండగానే *శ్రాఫెన్‌స్టైన్ కుటుంబం* (1803) అనే తన తొలి విషాదాంత నాటకం వ్రాశాడు. కవి మానసిక అస్వస్థత అత్యంత ప్రస్ఫుటంగా ఈ రచనలో గోచరిస్తుంది. ఆ రోజులలోనే (1808) *రాబర్ట్ గైస్కార్డ్* అనే అసంపూర్ణ విషాదాంత నాటక రచనను అతడు ప్రారంభించాడు. తిరిగి అక్కడ నుంచి బయలుదేరి పారిస్ వచ్చి, నిరాశతో తన వ్రాతప్రతులన్నిటినీ తగులబెట్టి స్వచ్ఛందంగా ఫ్రెంచ్ సైన్యంలో చేరాలని చూశాడు. కాని ఫ్రాన్స్ నుంచి బహిష్కృతుడై తూర్పు పర్షియా చేరుకుని 'కోనిగ్స్‌బెర్గ్' లో ఒక చిన్న ప్రభుత్వోద్యోగంలో చేరి శిక్షణ కాలంలోనే దానికి రాజీనామా ఇచ్చాడు. తరువాత డ్రెస్‌డెన్ వెళ్లి అక్కడ

రచనా వ్యాసంగాన్ని కొనసాగించాలని అనుకున్నాడు. కాని అక్కడి ఫ్రెంచ్ ప్రభుత్వం అతనిని గూఢచారి అనే నేరం మీద అరెస్ట్ చేసి, 6 నెలలు జైలు శిక్ష విధించింది.

డ్రెస్‌డెన్‌లో (1807-1809) క్లైస్ట్‌కి ప్రముఖ రచయితలతోనూ, చిత్రకారులతోనూ, కళాపోషకులతోనూ పరిచయం ఏర్పడింది. రాజకీయ తత్త్వవేత్త 'ఏడమ్ మ్యుల్లర్' తో కలసి *ఫోబస్* అనే ప్రముఖ పత్రికను ఆయన ప్రచురించాడు. ఆయన జైలులో ఉండగా మోలియర్ వ్రాసిన *యాంఫిట్రియాన్* కి ఆయన చేసిన నాటకీకరణకు విశేష ప్రశస్తి లభించింది. 1808 లో *పెంతే సీలియా* అనే నాటకం ప్రచురించాడు. ఆ నాటకంలోని అతని కవిత గంభీరమైందనీ, శక్తిమంతమైందనీ ప్రశంసలు పొందింది. 1808 మార్చ్‌లో క్లైస్ట్ వ్రాసిన ఏకాంకిక 'పగిలిన కుండ' ను గెయిథే వైమార్‌లో ప్రదర్శింప చేశాడు. కాని ఆ ప్రదర్శన ఫలవంతం కాలేదు. 1808 చివర నెపోలియన్ మీద తిరుగుబాటు చెలరేగే సూచనలు కనిపించినపుడు క్లైస్ట్ తీవ్రమైన యుద్ధ కవితలు వ్రాశాడు.

క్లైస్ట్ 8 అద్భుతమైన చిన్న నవలలు కూడా వ్రాశాడు. *ఎజారాహ్ లుంగెన్* అనే పేరుతో ఒక సంకలన గ్రంథంగా ఇవి వెలువడ్డాయి (1810-11). వీటిలో ఇమిడిక, శక్తి, భావ విస్పష్టత గోచరిస్తాయి. ఇతర వ్యక్తులు, లేదా ప్రకృతి పెట్టే హింసల వలన మానవుడు ఓర్పును ఎలా కోల్పోతాడో ఈ నవలలు చిత్రిస్తాయి. క్లైస్ట్ రచించిన చిట్టచివరి నాటకం *ప్రిన్జ్ ఫ్రీడ్రిఖ్ ఫాన్ హోంబుర్గ్* అద్భుతమైన మనస్తత్త్వ విశ్లేషణాత్మకమైన నాటకం.

6 నెలల పాటు *బెర్లినర్, ఎజెండె బ్లాటర్* అనే దిన పత్రికకు క్లైస్ట్ సంపాదకత్వం వహించాడు. కాని ఆ పత్రిక ఆగిపోవటంతో జీవనోపాధికి ఆస్కారం లేక గొయిథే వంటి సమకాలిక రచయితల గుర్తింపు పొందలేకపోయాననే అనే నిరాశాభావంతో క్లైస్ట్ క్రుంగిపోయాడు. నయంకాని తీవ్రమైన వ్యాధితో బాధపడుతున్న 'హెన్రీటే ఫోగెల్' అనే ఒక స్త్రీ తనను వధించమని క్లైస్ట్‌ను అర్థించింది. దానితో అతడు 1811 నవంబరు 21 న వాన్ సీ తీరంలో ఆమెను తుపాకితో కాల్చి, తనను తాను కాల్చుకొని ఆత్మహత్య చేసుకున్నాడు.

బ్రా.శ్రీ.

**క్వాసిమోడో, సాల్వటోరి (1901-1968) :** ఇటాలియన్ కవి, విమర్శకుడు, అనువాదకుడు. హెర్మటిక్ కవులలో నాయకుడుగా ఉండేవాడు. రెండవ ప్రపంచ యుద్ధం తరువాత ఆధునిక సాంఘిక సమస్యలపై ప్రగాఢమయిన కవిత్వం వ్రాశాడు. 1959 లో సాహిత్యానికి నోబెల్ బహుమతి పొందాడు. తండ్రి ఒక రైలు నిర్మాణం కంపెనీలో ఉద్యోగి. క్వాసిమోడో ముందుగా సెరక్యూస్, మెస్సినాలలో విద్యాభ్యాసం చేశాడు. తరువాత పాలెర్మోలో ఇంజనీరింగ్, గణితశాస్త్రం నేర్చుకున్నాడు. చిన్నవయస్సు నుంచి కవిత్వ రచనాసక్తి ఉండేది. పది సంవత్సరాలపాటు గవర్నమెంట్ ఇంజనీర్‌గా పనిచేసినా, తీరిక సమయంలో కవిత్వం వ్రాస్తూ ఉండేవాడు.



అతని కవిత్వ రచనలు *సోలరియా* అనే ఫ్లారెన్స్ నగర పత్రికలో ప్రచురణ అయేవి. హెర్మెస్ తాత్త్విక ధోరణులకు చెందిన గుసెపె ఉంగరెట్టి, ఇడినో మాంటికే ఇతనికి గురు తుల్యులు. *నేల, నీరు* అన్న మొదటి కవితా సంకలనం 1930 లో ఇతడు ప్రచురించాడు. 1935 తరువాత ఉద్యోగానికి స్వస్తి చెప్పి, మిలన్‌లో ఒక సంస్థలో సాహిత్య ఆచార్యుడుగా చేరాడు.

1932-36 సంవత్సరాలలో కొన్ని కవితా సంకలనాలు ప్రచురించాడు. వీటినిండా హెర్మెస్ తాత్త్విక ధోరణులే! 1938 లోను, 1942 లోను మరి రెండు సంకలనాలు ప్రచురించి ఈ ధోరణికి స్వస్తి చెప్పాడు.

1947 వో యుద్ధానంతరం ప్రచురించిన 'అనుదినం' అన్న సంకలనంతో ఇతని కవిత్వ ధోరణి దైనందిన సాంఘిక సమస్యలవైపు ప్రసరించింది. నాజీ పాలనలో జరిగిన దురన్యాయాలూ, ఇటలీ దురాగతాలూ వీటిలో బాగా వర్ణించడం జరిగింది. తరువాత సాంకేతిక వాదానికి ప్రతిరూపా లయిన కవిత్వ రచనలు చేశాడు. *లా టెర్రా ఇంపరెజ్జియబాల్* (The Incomparable Earth) అన్న పుస్తకం 1958 లో ప్రచురించాడు. 1978 వరకూ ఇలా అనేక సంకలనాలు ప్రచురిస్తూనే ఉన్నాడు.

స్వీయ రచనలతో పాటు 1930 నుంచి గ్రీక్ కవితలూ, నాటికలూ అనువదించాడు. ఈస్కిలస్, 'సోఫోక్లీజ్' (Sophocles), 'యూరిపిడీస్' (Euripides) ల

గ్రీక్ రచనల అనువాదాల సంకలనం 1963 లో ప్రచురితం అయింది. లాటిన్ రచయిత లయిన 'కటులస్' ( Catullus), 'ఓవిడ్' (Ovid), 'వర్జిల్' (Virgil) ల రచనలూ, ఆరు షేక్స్‌పియర్ (Shakespeare) నాటకాలూ, మోలియర్ (Moliere) రచనలూ, 20 వ శతాబ్దం అమెరికన్ రచయితల కవితలూ, 'పాబ్లొ నెరుడా', టీలీల రచనలూ క్వాసిమోడో అనువదించాడు. ఇటాలియన్ కవితా సంకలనాలు రెండు కూర్చాడు. అసంఖ్యాకమయిన సాహిత్య, విమర్శ వ్యాసాలు వ్రాశాడు. వీటిలో ప్రధాన మయినది 'కవి, రాజకీయ వేత్త, ఇతర వ్యాసాలు' 1960 లో ఇతని రచనల సమగ్ర సంకలనం వెలువడింది.

శ్రీ విరించి.

**క్విరోగా, హొరేషియో (1878-1937) :** ఉరుగ్వేలో పుట్టి పెరిగిన రచయిత. అరణ్య ప్రాంతపు దేశాలలో మనిషి, జంతువు తమ మనుగడ కోసం ఎలా తాపత్రయ పడుతున్నాయో అభివర్ణిస్తూ కథానికలు వ్రాసి, ఉరుగ్వే కథా రచయితగా పేరు పొందాడు.

యౌవనంలో యూరప్ దేశాలు పర్యటించాడు. జీవితంలో ఎక్కువకాలం అర్జెంటీనాలో గడిపి అరణ్య ప్రాంతాలలో పర్యటిస్తూ తన కథా వస్తువులను సేకరించుకునేవాడు. పత్రికా రచయితగా కొంత కాలం గడిపాడు. ఉపాధ్యాయ వృత్తి కూడా కొన్నాళ్లు చేపట్టాడు. *ది కోరల్ రీఫ్* అనే గద్య, పద్య సంకలనంలో ఇతని సాహిత్య ప్రతిభ అభివ్యక్తమయింది. అమెరికన్ రచయిత ఎడ్గార్ ఆలెన్ పో' కథారచనలో ఇతనికి ఆదర్శం. అరణ్య ప్రాంతాల వర్ణనకూ 'రుద్యార్డ్ కిప్లింగ్' ఇతని ఆదర్శం.

జీవితం అంటే మనుగడకోసం ఎడతెరిపి లేని పోరాటం అని వర్ణిస్తూ 1918 నుండి 1925 వరకూ వివిధ సంకలనాలు ప్రచురించాడు. వీటి ఆంగ్లానువాదం *ది డీ కేపిటేటెడ్ చిల్డ్రెన్ అండ్ అదర్ స్టోరీస్* 1973 లో ప్రచురితం అయింది. 1921 లో ప్రచురించబడిన *అనాలోండా* అనే పుస్తకం ఇతని వాస్తవిక, తాత్త్విక, సాంకేతిక ధోరణికి మచ్చు తునక. విష జంతువులు, పాములు ఇతర జీవులు ఆ ప్రాంతాలలో ఎలా గిజగిజలాడుతూ జీవిస్తున్నాయో ఇతడు చూపించాడు.

జీవిత చరమకాలంలో ఇతడు అనారోగ్యంతో క్రుంగిపోయాడు. తుదివరకూ ఒక ఉచిత వైద్యాలయంలో ఉంటూ అక్కడే ఆత్మహత్య చేసుకున్నాడు.

శ్రీ విరించి.

**క్వెంటాల్, ఆంటెరో టార్క్వెనియో డి (1842-1891) :** ప్రముఖ పోర్చుగీస్ కవి. 1860-70 ప్రాంతంలో కాల్పనిక వాదం మీద తిరుగుబాటు చేస్తూ సాహిత్యంలోనూ, సమాజంలోనూ ఒక నూతన దృక్పథాన్ని ఆవిష్కరించాలనే లక్ష్యంతో 'కోయింబ్రా తరం' అనే పేరుతో 'కోయింబ్రా' విశ్వవిద్యాలయంలో రూపొందిన ఒక యువకవి బృందానికి నాయకుడు.

'అజోర్స్' లోని పోంటాడెల్గడాలో 1842 ఏప్రిల్ 18 వ తేదీన రచయితలూ, యోగులూ పుట్టిన ఒక సంపన్న కుటుంబంలో క్వెంటాల్ జన్మించాడు. క్వెంటాల్ లోనూ, అతని కవితలోనూ కూడా యోగి లక్షణాలు కొంతవరకూ కనిపిస్తాయి. కోయింబ్రా విశ్వవిద్యాలయంలో న్యాయశాస్త్రం అధ్యయనం చేస్తున్న కాలంలో (1858-1864 మధ్యకాలంలో) తన తొలి కాల్పనిక కవిత *అదృశ్య మాన కాంతి కిరణాలు* (Raios de Extincta Luz) గ్రంథాన్నీ, 1872 లో ప్రచురితమైన *శృంగార వసంత ఋతువు*, (Primaveras Romanticas) అనే గ్రంథాన్నీ క్వెంటాల్ రచించాడు. 1865 లో ఆయన *ఓడ్స్ మోడెర్నాస్* అనే రచన చేశాడు. తన తోటి విద్యార్థులలో ఆ గ్రంథం బౌద్ధికంగానూ, నైతికంగానూ ఇతనికి గౌరవాన్ని సమకూర్చింది. *సద్బుద్ధి, సదభిరుచి* (1865) అని ఈయన రచించిన కరపత్రం వెనుకటి పోర్చుగీసు సాహిత్యంలోని 'ఫార్మలిజ్మ్' ను విమర్శించింది. అటు తరువాత 1871 వరకూ వెనుకటి తరం సాహిత్యాభిరుచులమీద ఆయన సాగించిన దండయాత్రకు అది అంకురార్పణ. 1871 లో క్వెంటాల్ 'లిస్బన్ కేసినో' లో నిర్వహించిన 'ప్రజాస్వామికోపన్యాస' పరంపర కాల్పనిక వాదానికి చిట్ట చివరి అఘాతం అయింది.

కోయింబ్రా విశ్వవిద్యాలయం విడిచిపెట్టిన తరువాత క్వెంటాల్ మొదట లిస్బన్ లోనూ, తరువాత పారిస్ లోనూ 'టైపోగ్రాఫర్' (కంపోజిటర్) గా పనిచేశాడు. ఆరు మాసాలపాటు అలా కార్మికుడుగా జీవించడంతో క్వెంటాల్ భ్రమ లన్నీ తొలగిపోయాయి. అనారోగ్య కారణంగా అతడు తిరిగి పోర్చుగల్ చేరుకున్నాడు. 1869 లో అమెరికా, కెనడా సందర్శించి తిరిగి లిస్బన్ చేరుకున్నాడు. అక్కడ కార్మికుల తరఫున జరుగుతున్న ప్రచార కార్యక్రమాలలో పాల్గొని, పోర్చుగల్‌లో జరిగిన మొదటి అంతర్జాతీయ కార్మిక సమావేశం (First International) ఏర్పాటు చేయడంలో ఎంతో సహాయం చేశాడు. పియరే-జోసెఫ్ ప్రౌధాన్ సోషలిస్ట్

సిద్ధాంతాల వలన ప్రభావితుడై, క్వెంటాల్ ఒక సోషలిస్టు పత్రికకు సంపాదకత్వం కూడా నిర్వహించాడు.

ఈ కాలంలో క్వెంటాల్‌లో విపరీతమైన అసంతృప్తి చెలరేగింది. తనకు ఇష్టమైన అనేక ప్రణాళికలకు స్వస్తి చెప్పి, తన తొలి పద్యా లన్నీ ఆయన చింపి వేశాడు. వెన్నుముక వ్యాధి ఆయనను బాధింపసాగింది. చికిత్స వలన తాత్కాలికంగా మాత్రమే గుణం కనిపించింది. కొంచెం మనశ్శాంతి ఏర్పడిన తర్వాత ప్రశస్తమైన తన తుది *సానెట్* లను క్వెంటాల్ రచించాడు.

1881 లో తాను పెంచుకున్న ఇద్దరు అనాథ బాలికల పోషణను పర్యవేక్షించేందుకు క్వెంటాల్ 'పోర్టో' సమీపంలోని 'విలా డో కాండె' చేరుకొన్నాడు. అతని సన్నిహిత మిత్రుడూ, చరిత్ర రచయితా అయిన 'ఓలివీర మార్టిన్స్' ద్వారా రాజకీయ పరిణామాలు ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ ఉండేవాడు. పోంటా డెల్గాడాలోని తన కుటుంబాన్ని చూడడానికి వెళ్లి, 'శారీరక బాధతోనూ, నిద్రలేమితోనూ, నిరాశతోనూ క్రుంగిపోయి', క్వెంటాల్ ఆత్మహత్య చేసుకున్నాడు.

కవిగా క్వెంటాల్ చేసిన నూతన ప్రయోగాలు ఎక్కువగా లేవు. సానెట్ రచన మీద ఆయన అధికారం సంపాదించాడు. *ఓస్ సోనెటోస్ కాంప్లిటోస్* (1886) అనే 109 సానెట్లలో ఆయన ఆధ్యాత్మిక ప్రగతి చరిత్ర మనకు గోచరిస్తుంది. 1922 లో ఇంగ్లీష్‌లోకి అనువదింపబడిన *సానెట్స్ అండ్ పోయెమ్స్* 1977 లో పునర్ముద్రణ పొందింది.

బొ.శ్రీ.

**క్వెవేదో ఇ విలేగాస్, (ఫ్రాన్సిస్కో గోమిజ్ డి) (1580-1645) :** స్పానిష్ కవి, స్పెయిన్ సాహిత్య స్వర్ణయుగానికి చెందిన ప్రసిద్ధ వ్యంగ్య రచయిత.

క్వెవేదోయి సంపన్నమైన సంప్రదాయ కుటుంబంలో పుట్టాడు. 1596 నుండి 1606 వరకు అల్కాలా, వల్లడోలిడ్ విశ్వవిద్యాలయాల్లో విద్య నభ్యసించాడు. పలుభాషలలో పాండిత్యం అలవడింది. 23 సంవత్సరాల పిన్నవయస్సులోనే కవిగా, చమత్కార సంభాషణ చతురుడుగా ఖ్యాతి సంపాదించాడు. సమకాలికులూ, వయస్సులో పెద్దవారూ అయిన సెర్వాంటెస్, లోప్ డివెగాలు క్వెవేదోయి కవిత్వాన్ని అభినందించారు. అయితే ఈ కవి దృష్టి రాజకీయ భవితవ్యం వైపు మళ్లింది. 1613 లో ఓసునా ప్రభువు వద్ద సలహాదారుగా ప్రవేశించాడు. తరువాత సిసిలీ, నేపుల్స్‌లకు వరుసగా ఏడు సంవత్సరాలు వైస్రాయి పదవిని నిర్వహించి అపార గౌరవాదరాలు చూరగొన్నాడు. స్పెయిన్‌లో ఫిలిప్ IV సింహాసనారూఢుడు కావటంతో ఓసునా ప్రభువు ఆయన అభిమానం చూరగొనలేక క్రుంగిపోయాడు. దీనితో క్వెవేదోయిని కూడా గృహనిర్బంధంలో ఉంచారు. తరువాత అతడు రాజకీయ జీవితాన్ని ఏవగించుకొని సమకాలీనుల అవివేకాన్ని నిరూపిస్తూ అనేక వ్యంగ్య పూరిత గద్య పద్య కృతులను వ్రాస్తూ రచనా వ్యాసంగానికి పూనుకున్నాడు. ఒక పరిహాస కవిత కారణంగా 1639 లో తిరిగి ఒక మఠంలో నిర్బంధింప బడ్డాడు. 1643 లో విడుదలైనా, ఆరోగ్యం క్షీణించటంతో తరువాత కొద్ది కాలానికే మరణించాడు.

క్వెవేదోయి రచనలు అతని వ్యక్తిత్వాన్ని స్ఫుటంగా చాటుతాయి. అతని రచనలలో అసహ్యకరమైన కథాంశాలు మొదలు ఉదాత్తమైన ప్రవృత్తులవరకు వివిధ రీతులు కనిపిస్తాయి. అయన విద్య, సంస్కృతి మహత్తరమైన విలువలతో కూడిన రచనలు చేయటానికి దోహదం చేశాయి.

నాటి సంఘంలోని లోపాలను విమర్శిస్తూ వ్రాసిన ఆయన వ్యంగ్య రచనలు నేడు అంత రసస్ఫోరకంగా ఉండక పోవచ్చు. కాని దుష్టుల సాహస కృత్యాలతో నిండిన నవల *లా వైడాడెల్ బస్‌కాన్* (1926) వలన అతడు కలకాలం జీవిస్తాడు. ఇందులో పాల్ అనే మోసగాణ్ణి దొంగలు, వంచకులు అపార్థం చేసుకుంటే వాడు కొనసాగించిన సాహసాలను రచయిత చిత్రించాడు. క్వెవేదోయి *స్యూనోస్* (1627) ను 1606 నుండి 1622 వరకూ వ్రాశాడు. ఇందులో నరకం, మరణం మొదలైన వాటిని గూర్చిన చక్కని కల్పన లున్నాయి. 'బొరొక్వె' శైలీ విధానం ఆ నాటికి క్రొత్తదైనా, ఆ శైలిలో సంక్లిష్టమైన శ్లేషలతో ఇతడు రచనా వ్యాసంగం కొనసాగించాడు. 1969 లో క్వెవేదోయి కవితలతో ఒక సంకలన గ్రంథానికి ఆంగ్లానువాదం ప్రచురించారు.

చిం.వెం.

**ఖాతీబీ ఎబ్దెల్‌కెబీర్ (1938-) :** మొరాకోలోని సాహిత్య విమర్శకుడు, నవలాకారుడు. 1960-70 దశాబ్దిలోని ఆగ్రహావేశ పరులైన యువజనుల ప్రతినిధి. క్రొత్తగా స్వాతంత్ర్యం సంపాదించి 'మ్యాగ్రిడ్' దేశాలలోని సాంఘిక, రాజకీయ విధానాలలో చాలా వాటిని వారు నిరసించారు.

ఖాతీబీ మొరాకోలోనే ఉన్నత పాఠశాల విద్య ముగించి, పారిస్‌లోని సార్బోన్ విశ్వవిద్యాలయం నుంచి సాంఘిక శాస్త్రంలో పట్టభద్రు డయాడు. డాక్టరేట్ చేయడానికి అతడు తీసికొనిన విషయం *లె రోమన్*

*మ్యాగెబిన్* (మ్యాగ్రిబియన్ నవల). 1968 లో ఆ థీసిస్ ముద్రించ బడింది. ఆదినుంచి ఖాతీబీ సాహిత్యంలో రచయితకు 'నిబద్ధత' అవసరం అని వాదించాడు. అయితే నవలను గురించి చేసిన పరిశోధనలో నిబద్ధతతో రచనలు చేసే రచయిత ముఖ్యంగా విప్లవానంతర శకంలో ప్రచారకుడు కాకుండా ఎలా ఉండగలడు అనే ప్రశ్న తల ఎత్తింది. జన సామాన్యపు నినాదాలను పట్టించు కోకుండా, రచయిత విద్యావంతులైన జనంలో ఒక సాంస్కృతిక స్థాయిని నెలకొల్పాలని ఖాతీబీ వాదించాడు.

ఖాతీబీ వ్రాసిన తొలి నవల *లా మె మోయిరే టాటావీ* (1971). ఈ రచన కొంతవరకు ఆత్మకథా త్మకంగా సాగింది. ఖాతీబీ మొరాకన్ సాంఘిక జీవన విధానం మీద అనేక గ్రంథాలను రచించాడు. ఆరంభంలో 'మ్యాగ్రిబియన్' రచయితలు ఫ్రెంచ్ భాషను వాడకూడదు అని ఖాతీబీ ప్రకటించిన అభిప్రాయం 1960-70 నాటి విప్లవ ధోరణిని ప్రతిఫలిస్తూంది.

*లామ్మోర్ డెస్ ఆర్టిస్టీస్* (1964), *లే ప్రాఫీట్ డి వాయిలె* (1979) అనే రెండు నాటకాలూ, *లే లివ్రే టు శాంగ్* (1979) అనే నవల ఖాతీబీ అభిప్రాయాలను స్పష్టంగా ప్రకటిస్తున్నాయి.

శ్రీ విరించి

**ఖోమ్యాకోవ్, అలెక్సీ స్టెపనోవిచ్ (1804-60):** 19 వ శతాబ్దంలో రష్యన్ జీవన విధానాన్ని ప్రశం సిస్తూ ఆరంభమైన 'స్లావోఫైల్' ఉద్యమానికి నాయకుడు. తరతరాలుగా రష్యన్ జార్‌లను సేవించిన కుటుం బంలో అతడు జన్మించాడు. తండ్రి స్టీఫాన్ హయాంలో కుటుంబం ఆర్థికస్తోమత క్షీణించిపోగా తల్లి మేరియా కిరియెవ్‌స్కాయా ఆ కుటుంబాన్ని నిలబెట్టింది. ఆమె తన ఇద్దరు కుమారులను, కుమార్తెలను రష్యన్ చర్చి సంప్రదాయంలో పవిత్రంగా పెంచింది. బాగా చదివిం చింది. అలెక్సీ ఖోమ్యాకోవ్ ఒక ఫ్రెంచి మతగురువు, ఒక గ్రీకు విద్వాంసుడు, అనేక మంది రష్యన్ పండితుల వద్ద విద్యాభ్యాసం చేశాడు. ఫ్రెంచ్, జర్మన్, ఆంగ్లభాష లలో ప్రావీణ్యం సంపాదించాడు. గ్రీక్, లాటిన్ భాషలు అధ్యయనం చేశాడు. సంస్కృతం చదువుకొని రష్యన్ సంస్కృత నిఘంటువును రూపొందించాడు. మాస్కో యూనివర్సిటీ నుంచి గణిత శాస్త్రంలో పట్టభద్రుడై 18 నెలలపాటు ఫ్రాన్స్ దేశంలో పర్యటించాడు. 1828-29 ల మధ్య జరిగిన రూసో-టర్కీ యుద్ధంలో గణనీయమైన పాత్ర నిర్వహించి శేష జీవితాన్ని సాహిత్య వ్యాసంగంలో గడిపాడు. సాంసారికమైన జీవితంలో అనుకూల మైన భార్య, అణకువ గలిగిన అనేకమంది పిల్లలతో జీవితం హాయిగా గడిపాడు.

వివిధ రంగాలలో, ప్రక్రియలలో రచనలు చేసిన ఖోమ్యాకోవ్ పద్యరచన చేశాడు. తత్త్వశాస్త్రంలోను, రాజ కీయ విషయాలపైన వ్యాసాలు రచించాడు. ఆర్థికశాస్త్రం, సాంఘిక శాస్త్రం, ఆధ్యాత్మిక శాస్త్రాలపై ఆయన వ్యాసాలు ఎంతో ఆసక్తి కలిగించేవి. ఒక భూస్వామిగా వ్యవసా యరంగంలో ఆయన నిర్మించిన యంత్రాలకు ఇంగ్లండు నుంచి బహుమతు లందుకున్నాడు. తుపాకుల తయా రీలో కూడా సిద్ధహస్తుడని పేరు గాంచాడు. అంతే కాకుండా తన పరిధిలో అనేకమంది గ్రామీణులకు వైద్యం కూడా చేసేవాడు. ఆయన జీవిత కాలంలో రాజరికం వారి నిషేధాలవల్ల ఆయన రచనలు కొన్నే ముద్ర ణకు నోచుకున్నాయి. ఆయన వ్రాసిన అనేక రచనలు ఆయన తర్వాత స్నేహితులచే ప్రచురింపబడ్డాయి. ఇప్ప టికీ రష్యాలో ఆయన రచనలు పాఠ్యగ్రంథాలుగా నిర్దేశింపబడుతూనే ఉన్నాయి.

రష్యన్ సాహిత్య చరిత్రలో స్వర్ణయుగంగా ప్రసిద్ధి కెక్కిన కాలంలో జీవించినవాడు ఖోమ్యాకోవ్. నికొ లస్-1 పరిపాలనలో మేధావులకు సంఘంలో సరియైన స్థానం లేని రోజులలో రెండు వర్గాల వారు మాత్రమే వారి వారి రచనలను ప్రజల కందించ గలిగారు. ఒక వర్గం వారు పశ్చిమ జీవిత ధోరణులకు ప్రోత్సాహ కులు కాగా, రెండవ వర్గం వారు రష్యన్ సంప్రదాయ పద్ధతులను 'స్లావోఫైల్స్' పేరిట ప్రచారం చేస్తూ వచ్చారు. ఈ రెండవ వర్గానికి నాయకుడు ఖోమ్యా కోవ్. పాశ్చాత్య విధానాల పట్ల ఖోమ్యాకోవ్ నిజానికి సుముఖుడే అయినా, రష్యా గతాన్ని ఆయన అధికంగా ప్రేమించాడు. నాస్తికులు సాంఘికమైన రాజకీయమైన పరిణామాన్ని తీసుకొనిరాగలరని ఆయనకు నమ్మకం లేదు. అందుకే ఆయన ఆశించినది, రూపొందించినది సోబోర్నోస్ట్ నినాదం. 'సోబోర్నోస్ట్' పదానికి అనేక అర్థా లున్నా ఐక్యమత్యం, సుసంగత జీవన విధానం అనే అర్థాలు ఖోమ్యాకోవ్ ఆలోచనా విధానాన్ని ప్రతిబింబి స్తాయి. ఆయన రచనలలో ఈ నినాదం ప్రాతిపదికగా వ్రాసిన రచనలే మిక్కిలి ప్రసిద్ధ మైనవి. నికొలస్-1 పరిపాలనలో లేకుండా ఉండి ఉంటే ఖోమ్యాకోవ్‌కి అతని మేధకు, పాండిత్యానికి, ప్రతిభకి తగిన గుర్తింపు లభించి ఉండేది. తాను చికిత్స చేస్తున్న గ్రామీణుల నుంచి కలరా సోకి, ఖోమ్యాకోవ్ 1860 అక్టోబరు 5 వ తేదీన మరణించాడు.

ఒక నిజాయితీ పరుదుగా, నిస్వార్థ సేవాపరాయ ణుడుగా మాత్రమే కాక ఒక అద్వితీయ మేధావిగాను, అనన్య ప్రతిభా శాలిగాను, సంభాషణ చతురునిగాను కూడా రష్యా దేశం ఆయనను సర్వదా స్మరిస్తుంది.

పప్పు

**గడ్డా, కార్లో ఎమీలియో (1893-1973) :** ప్రసిద్ధ ఇటలీ దేశ వ్యాస రచయిత. చిన్నకథలూ, నవలలూ కూడా ఈయన వ్రాశాడు. వినూత్నమైన సొంత బాణీకి, మౌలికతకు ప్రసిద్ధి పొందాడు. ఈ విషయంలో ఈయ నను జేమ్స్ జాయ్స్‌తో పోలుస్తారు.

'గడ్డా' 1893 నవంబర్ 14 న మిలన్ (Milan)లో జన్మించాడు. వృత్తిరీత్యా ఇతడు ఎలెక్ట్రికల్ ఇంజనీరు. మొదటి ప్రపంచ యుద్ధంలో ఈయన పాల్గొన్నాడు. 1930 ప్రాంతం నుంచి రచనలు చేయడం ప్రారంభిం చాడు. ప్రారంభం నుంచీ కూడా ఈయనకు శైలి పట్ల ప్రత్యేకమైన మక్కువ ఉండేది. ఈయన రచనలలో మానసిక, సాంఘిక విశ్లేషణ ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఈయన తొలి రచనలు *ది డ్రీమ్స్ అండ్ ది లైటింగ్* (1955) అనే సంపుటంగా వెలువడ్డాయి. గడ్డా వ్రాసిన *క్వైర్ పాస్టిసి యాస్ప్యయొబుషాటో ది వయా మెగులానా* (1957) అనే సుప్రసిద్ధమైన నవల ఎక్కువ ప్రజాదరణ పొందింది. ఫాసిస్ట్ రోమ్‌లో జరిగిన హత్యలు, దొంగతనాలతో పాటు తదుపరి జరిగిన దర్యాప్తులను కూడా ఈయన తన నవలలో చిత్రించాడు. ఈ నవ లలో వాడిన ప్రత్యేకభాష 'ఇల్ ఫాస్టిసియొస్పియొ' గా ఇటలీలో సుప్రసిద్ధమైంది. ఈ భాషలో మూడు రోమన్ మాండలికాల సమ్మేళనం కనిపిస్తుంది. ఈయన వాడిన భాషలో శ్లేషలూ, విదేశ పదాలూ, హేళనలూ, కల్పిత పదాలూ, సంప్రదాయ సూచనలూ ఎన్నో కనిపిస్తాయి. గడ్డా దృక్పథం పాదరసం లాంటిది. ఈయన శైలిలో వక్రోక్తి, తీవ్రత, హాస్యం, తత్త్వం, అశ్లీలం సమపాళ్ళలో కనిపిస్తాయి. 1973 మే 21 న రోమ్‌లో గడ్డా మరణించాడు.

పద్మాకర్

**గలెగోస్, రోమ్యులో (1884-1969) :** దక్షిణ అమెరికాలోని వెనిజులాకు చెందిన రాజకీయ వేత్త, నవలా రచయిత. వెనిజులా ముఖ్యపట్టణం కరాకస్‌లో పుట్టి పెరిగి, యూనివర్సిడాడ్ సెంట్రల్ నుండి పట్టభద్రు డయాడు. రాజకీయ జీవితంలో చాలా ఒడి దుడుకులు అనుభవించాడు. కొద్దికాలం విద్యామంత్రిగాను, 1948 లో కొన్ని నెలలు దేశాధ్యక్షుడు గాను ఉన్నాడు. 1948 లో సైనిక తిరుగుబాటు వలన పదవి కోల్పోయి, పదేళ్ల పాటు మెక్సికోలో తలదాచుకొని, 1958 లో స్వదేశానికి తిరిగి వచ్చాడు. శేషజీవితం స్వదేశంలోనే గడిపాడు.

రాజకీయ వేత్తగా కంటె నవలా రచయి తగా గలెగోస్ అంతర్జాతీయ ఖ్యాతి గడించాడు.



ఈయన రచించిన ముఖ్యమైన నవలలో మొదటిదైన *డోనా బార్బరా* (1929) అప్పటి నియంత గోమెజ్‌ని విమర్శిం చినట్లుగా భావింప బడి ఇతని దేశ బహిష్కరణకు దారి తీసింది. దీని తరు వాత *కాంటక్లారా* (1934), *కనైమా* (*Canaima-1935*) అనే రెండు నవలలను ఈయన వ్రాశాడు. ఇవి ముఖ్యంగా వెనిజులా ప్రజల జీవితసర ళిని, వారి సమస్యలను చిత్రించినప్పటికీ, ఈ నవలలు అమెరికాలోని దేశ పరిస్థితులకు కూడా అన్వయిస్తాయి. పైన చెప్పిన నవలలో ఈయన దక్షిణ అమెరికాలోని మైదానాలలోని రెడ్ ఇండియన్ల జీవితాన్నీ, వారి సమస్యలనూ, యూరప్ నుండి వలస వెళ్లినవారు వీరిని కొల్లగొట్టడాన్నీ వర్ణించాడు. ఇవే పరిస్థితులు దక్షిణ అమెరికాలోని చాలా దేశాలలో ఉన్నాయి. అందువల్ల ఈయన దక్షిణ అమెరికా ప్రాంతీయ నవలా రచ యితగా విఖ్యాతి పొందాడు. ఇవి కాకుండా ఈయన *ప్రోబె నీగ్రో* (1937) అనే రచనలో 19 వ శతా బ్దపు వెనిజులాలోని నీగ్రోల జీవితాన్ని వర్ణించాడు. ఈయన రచనలు దేశ, భాషల హద్దులు అధిగమించి మానవ ప్రకృతిని ప్రతిబింబించడం చేత ప్రపంచమంతటా సాహిత్యాభిమాను లందరి మన్ననలను ఈయన అందు కొన్నాడు. చనిపోయేనాటికి గలెగోస్ దేశంలో ప్రముఖ రాజకీయ వేత్తగాను, సాహితీ వేత్తగాను దేశ ప్రజల గౌరవాభిమానాలను అందుకోగలిగాడు.

డి.ఎ.రా.

**గామా, హోసె బసిల్యో డ (1740-95) :** ప్రముఖ బ్రెజీలియన్ కవి. బ్రెజీల్ లోని శాన్ హోజె డరియో డస్ మోర్టెస్ అనే పట్టణంలో 1740 లో జన్మించాడు.

క్రైస్తవమత సంబంధమైన విద్యలో జెస్యూట్ మిషనరీల వద్ద శిక్షణ పొంది, 1759 లో ఆ శిక్షణ పూర్తి చేశాడు. కాని ఆ సంవత్సరంలోనే జెస్యూట్స్ అందరూ బ్రెజిల్ నుండి బహిష్కరింపబడడం జరిగింది. ఆ సమయంలో ఈయన పోర్చుగల్ పారిపోయి అక్కడ తలదాచు కొన్నాడు. కాని ఈయనను అక్కడ నుండి కూడా ఆఫ్రికాలోని అంగోలాకు బహిష్కరించే ప్రమాదం ఏర్పడింది. ఆ పరిస్థితిలో ఈయన అధికారవర్గం లోని మార్క్విస్ డపోంబల్‌ను ఆశ్రయించి దేశ బహిష్కరణ శిక్ష తప్పించుకొన్నాడు. ఈ అధికారి యొక్క ప్రాపకం పొందడానికి 1769 లో ఆయన కుమార్తె వివాహ సందర్భంగా ఒక ఖండకావ్యం వ్రాశాడు. 1769 లో 'ఓ ఉరుగ్వే' అన్న దీర్ఘ కవితను వ్రాశాడు. తను ఆశ్రయించిన వారి మన్నన పొందడానికి ఈ కావ్యంలో ఈయన జెస్యూట్స్‌ని విమర్శించాడు. ఇందులో శ్పానిష్ వారు ఉరుగ్వే ఇండియన్‌లపై యుద్ధానికి వెళ్లి, వారిని తరిమివేసి, వారి దేశాన్ని ఆక్రమించుకోడం వర్ణించాడు. విశేషమేమి టంటే, తాత్కాలికమైన ప్రయోజనం కోసం వ్రాసిన ఈ కావ్యం బ్రెజీలియన్ సాహిత్యంలో చాలా అగ్రస్థానాన్ని అందుకొంది. పోర్చుగల్ జాతీయ కవి రేమోయన్స్ బాణీకి భిన్నంగా 'బ్లాంక్ వెర్స్' ఛందస్సులో ఈ కావ్యం వ్రాశాడు. 'ఓ ఉరుగ్వే' లోని పొంగుతున్న నదుల వర్ణనలు, శ్పానిష్ వారు ఇండియన్లతో చేసిన యుద్ధ వర్ణనలు, బ్రెజీలియన్ సాహిత్యానికి విశిష్టతను, స్వతంత్ర ప్రతిపత్తిని చేకూర్చాయి.

డి.ల.

## గార్సియా మార్క్వెజ్, గబ్రియేల్ (1928-) :

ప్రముఖ లాటిన్ అమెరికన్ నవలా రచయిత, కథానికా రచయిత.

మార్క్వెజ్ లాటిన్ అమెరికాలోని కొలంబియా రాష్ట్రంలో 'అరకటక' అనే చిన్న పట్నంలో 1928 మార్చి 6 న జన్మించాడు. బొగోటో విశ్వవిద్యాలయంలో విద్యనభ్యసించి పట్టభద్రు డయాడు. పత్రికా రచయితగా స్థిరపడ్డాడు. మాతృభాష అయిన శ్పానిష్ భాషలో రచనలు చేసి ప్రసిద్ధుడయాడు. ఇటీవలి కాలంలో భార్యా పుత్రులతో స్పెయిన్‌లోని బార్సిలోనా లో నివాస మేర్పరచుకున్నాడు. ఇతని రచనలలో *నూరేళ్ల ఏకాంతం* (1970), *ది ఆటం ఆఫ్ ది పేట్రియార్క్* అనేవి సుప్రసిద్ధమైన నవలలు. *లీఫ్ స్టార్మ్* (lift storm), *నోవన్ రైట్స్ టు ది కర్నల్* (1968), *ఇన్నొసెంట్ ఎరెండిరా అండ్ అదర్ స్టోరీస్* (1978), *ఇన్ ఈవిల్ అవర్* ఈయన కథాసంపుటాలు. ఈయన నవలలలో పురాణ గాథలు, స్థల పురాణాలు, వాస్తవిక వృత్తాంతాలూ అల్లిబిల్లిగా అల్లుకొని ఒక విచిత్ర వాతావరణాన్ని సృష్టిస్తాయి. *నూరేళ్ల ఏకాంతం* నవలలో నాగరకతా ప్రపంచానికి అతి దూరంగా ఉన్న 'మకందో' అనే ఒక చిన్న గ్రామంలో 'బుయెండ్' అనే కుటుంబం తాలూకు నూరేళ్ల కథను గార్సియా మనోహరంగా వర్ణిస్తాడు. క్రమంగా ఆధునిక వైజ్ఞానిక నాగరకత ఆ గ్రామంపై చూపిన ప్రభావం కూడా వర్ణిస్తాడు. ఇతివృత్తంలో గాల్స్‌వర్దీ వ్రాసిన *ఫోర్‌సైట్ శాగా*ను, సి.పి.స్నో వ్రాసిన *బ్రదర్స్ అండ్ స్ట్రేంజర్స్* మొదలగు క్రానికల్ నవలలను పోలి ఉన్నా, దీనిలోని వాతావరణం, శైలీ దీనికి విశిష్టతను ఆపాదిస్తున్నాయి. గ్రామీణుల నమ్మకాలు, వైజ్ఞానిక ప్రగతి, జిప్సీ జీవితం అనుభవాలూ, ప్రేమ, కామం ఇలాంటి ఎన్నో, ఎన్నో అంశాలతో అద్భుతంగా సాగిన అందాల హరివిల్లు ఈ నవల.

*గం.శ్రీ.*

## గార్సియా లోర్కా, ఫెడెరికో (1898-1936) :

శ్పానిష్ కవి, నాటక రచయిత. *బోడాస్ డీ సాంగే* అనే ప్రసిద్ధ 'నాటక త్రయం' రచించిన గార్సియా శ్పానిష్ అంతర్యుద్ధం ప్రారంభంలో హత్య చేయబడ్డాడు.

గార్సియా తండ్రి వ్యవసాయదారుడు. తల్లి ఉపాధ్యాయిని. చిన్నతనంలోనే లోర్కా గార్సియా సంగీతం పట్ల ఆసక్తి చూపేవాడు. గ్రేనడాలో ఒక పాఠశాలలో లోర్కా విద్యాభ్యాసం మొదలయింది. తండ్రి కోరిక మీద న్యాయ శాస్త్రం అభ్యసించాలని గ్రేనడా యూనివర్సిటీలో చేరాడు. కాని కొద్ది రోజులలోనే అది వదిలి సాహిత్యంలో చేరాడు. స్నేహితులలో అతనికి గొప్ప సంగీతజ్ఞుడుగానే గుర్తింపు వచ్చింది. 1918 లో తాను ప్రయాణించిన కేస్టైల్ యాత్ర గురించి గద్యంలో ఒక చక్కని పుస్తకం ప్రచురించి స్నేహితులను ఆశ్చర్య పరిచాడు. 1919 లో మాడ్రిడ్ యూనిర్శిటీలో 'విద్వాంసుల కూటమి' లో చేరాడు. తన కాలం నాటి రచయితలు, కళాకారులతో సన్నిహిత సంబంధాలు ఏర్పరచుకొన్నాడు. అతడు అక్కడ ఉన్న మొదటి రెండు సంవత్సరాలలోనే అతని పద్యాలు స్పెయిన్ దేశం అంతటా ప్రాచుర్యాన్ని పొందాయి. అలా ఆయన కవితలు ఆనోటా ఆనోటా వినబడేవే తప్ప ముద్రణకు నోచుకోలేదు. అయితే అదే సమయంలో అతని పద్యాలు, పాటలు 1912 లోను 1927 లోను, 1936 లోను వివిధ సంకలనాలుగా వెలువడ్డాయి. అతని మొదటినాటకం *ఎల్ మాలెఫికోడిలా మరిపోసా*

(Butterfly's Evil Spell) 1920 లో కేవలం ఒక్క రోజు ప్రదర్శనతో ముగిసింది.

1922 లో లోర్కా మాన్యువల్ డి ఫెల్లాతో కలసి జానపద గేయాలకు సంగీతం కూర్చినప్పుడు గ్రేనడాలో లోర్కాకు మంచి గుర్తింపు లభించింది. సాంప్రదాయిక స్పెయిన్ పాటలకు ఆధునికతను జోడించి లోర్కా రచించిన 18 పాటలకు (జిప్సీ బాలెడ్స్) అద్భుతంగా ఆదరణ లభించింది. పద్యరచన ఒక వంక కొనసాగిస్తూనే మరో వంక లోర్కా నాటకాలు కూడా వ్రాశాడు. 1927 లో ఆయన నాటకానికి మొట్ట మొదటిసారిగా గుర్తింపు వచ్చింది. అదే సంవత్సరంలో లోర్కా చిత్రాల ప్రదర్శన కూడా జరిగింది. లోర్కా వ్రాసిన *జిప్సీ బాలెడ్స్* ఆయనకు అంతర్జాతీయ ఖ్యాతిని సంపాదించి పెట్టింది. అయితే మానసికంగా లోర్కా ఒక మథనకు లోనై 1929-30 ల మధ్య అమెరికా, క్యూబాలలో పర్యటించాడు. అప్పుడు వ్రాసిన *పోయెటా ఎన్ నుయోవా యార్క్* పద్య సంకలనం 1940 లో లోర్కా మరణించిన తర్వాత ముద్రింపబడింది. యాంత్రిక నాగరకతలో జీవితం పొందుతున్న మరణవేదనను గార్సియా దీనిలో వర్ణించాడు.

1931 నాటికి లోర్కా తిరిగి స్వదేశం వచ్చాడు. పద్యాలు, నాటకాలు వ్రాయడం ప్రారంభించాడు. తోలు బొమ్మలాటలు కూడా రెండు రచించాడు. స్పెయిన్ రిపబ్లిక్ అయిన తరువాత లోర్కా నాటకరంగం మీద విజృంభించాడు. 'లా బేరక్కా' అనే నాటకమండలి వ్యవస్థాపకునిగా, దర్శకునిగా, నిర్దేశకునిగా లోర్కా ఎన్నో అమూల్యమైన నాటకాలు వ్రాసి ప్రదర్శించాడు.

1933 లో ప్రదర్శించిన *బోడాస్ డి సాంగ్రే* ఆ నాటకాలలో మొట్ట మొదటిది. దీనిలో తను ప్రేమించిన వానితో పెండ్లికుమార్తె లేచిపోవడం, ఇరు పక్షాలవారు ఒకరి నొకరు చంపుకోడం ఇతివృత్తం.

1934 లో లోర్కా స్నేహితు డొకడు ఎద్దుతో పోరాడుతూ చనిపోయాడు. 1935 లో లోర్కా ఆయన మీద వ్రాసిన స్మృతికావ్యం *లాంటో పోర్ ఇగ్నాసియో శాంజెజ్ మోజియాస్* స్పెయిన్ సాహిత్యంలోనే కాక ప్రపంచ సాహిత్యంలోనే అద్వితీయమైన స్మృతి కావ్యంగా ప్రశస్తి పొందింది.

1934 లోనే లోర్కా రెండవ జానపద నాటిక *యెర్మా* ప్రదర్శింపబడింది. పిల్లలు లేని ఒక స్త్రీ పిల్లలను కనే యోగ్యతలేని తన భర్తను చంపడం దీనిలోని ఇతివృత్తం.

1936 లో ఒక నాటి సాయంత్రం జూన్ నెలలో లోర్కా *లా కాసాడి బెర్నా అల్బా* అనే తన మూడవ నాటికను స్నేహితులకు చదివి వినిపించాడు. తల్లిచేత నిర్బంధించబడిన నలుగురు అక్కచెల్లెళ్ల ప్రవర్తన ఈ నాటికకు ఇతివృత్తం.

1936 జూలై నెలలో స్పెయిన్‌లో జరిగిన అంత ర్యుద్ధం సందర్భంలో లోర్కా గ్రేనడాకు వెళ్లిపోయాడు. ఆగష్టు నెలలో ఒకనాటి రాత్రి విప్లవవాదులు లోర్కాను కాల్చి చంపారు.

పప్పు

**గాల్స్‌వర్దీ, జాన్ (1867-1933) :** సుప్రసిద్ధ ఇంగ్లీష్ నవలా రచయిత, నాటకకర్త. ఆగష్టు 1867 లో ఇంగ్లండులో 'కింగ్స్‌టన్ హిల్' అనే గ్రామంలో ఒక సంపన్న కుటుంబంలో జన్మించి, హారో స్కూల్ లోను, ఆక్స్‌ఫర్డ్ విశ్వ విద్యాలయం లోను విద్య నభ్యసించి, 1890 లో బారిష్టర్ అయాడు. తరువాత ఈయనకు ప్రఖ్యాత నవలా రచయిత జోసెఫ్ కాన్‌రాడ్‌తో పరిచయ మయింది. ఇది తరువాత స్నేహంగా మారి జీవితాంతం కొనసాగింది. కొంత కాలానికి న్యాయవాది వృత్తి తన తత్త్వానికి సరిపడదని గ్రహించి, గాల్స్‌వర్దీ రచనా వ్యాసంగం ప్రారంభించాడు. ఈయన మొదటి రచనలను *ఫ్రమ్ ది ఫోర్ విండ్స్* (1897) అనే కథల సంపుటిని, *జోసెలిన్* అనే నవలను, తన స్వంత ఖర్చుతో 'జాన్‌సిన్ జాన్' అనే కలం పేరుతో ప్రచురించాడు. ఈయన రచనలలో ముఖ్యమైనవి, ఈయనకు పేరు తెచ్చినవి: *ది ఫోర్సైట్ శాగా* అనే ఐదు నవలల సంకలనం. వీనిలో మొదటిది *ది మాన్ ఆఫ్ ప్రాపర్టీ*. దీనిలో ఫోర్సైట్ కుటుంబ చరిత్రను, అప్పుడు వస్తున్న సాంఘిక పరిణామాలను ఈయన చిత్రించాడు. మొదటి ప్రపంచయుద్ధం తరువాత ఫోర్సైట్‌ల చరిత్రను ఈయన *ఏ మోడర్న్ కామెడీ* (1929) అన్న మూడు నవలల సంకలనంలో వర్ణించాడు. ఇవే కాకుండా ఈయన మరికొన్ని నవలలు కూడా వ్రాశాడు.



1905 లో ఈయన 'ఏడా పియర్సన్' అనే ఆవిడను వివాహ మాడాడు. *ది మాన్ ఆఫ్ ప్రోపర్టీ* లోని సోమ్స్

ఫోర్సైట్ భార్య ఐరీన్‌కూ, ఏడా పియర్సన్‌కూ చాలా పోలిక లుండడం గమనించదగింది. గాల్స్‌వర్దీ నవలా రచయిత గానే కాకుండా నాటక రచయితగా కూడా పేరు తెచ్చుకున్నాడు. ఈయన తన నాటకాలను నాచురలిస్టిక్ ధోరణిలో వ్రాసి, వానిలో నైతిక, సాంఘిక, న్యాయ పరమైన సమస్యలను ఆలోచనా పరుల దృష్టికి తెచ్చాడు. ఈయన నాటికలలో ముఖ్యమైనవి: *ది సిల్వర్ బాక్స్* (వెండి బరిణె, 1906), *స్ట్రియిఫ్* (సంఘర్షణ, 1909), *జస్టిస్* (న్యాయం, 1910) మొదలైనవి. వీనిలో ఈయన ధనిక పేద వర్గాల మధ్య చట్టం చూపే విచక్షణను, పరిశ్రమలలో యజమాని శ్రామిక సంబంధాలనూ, ఆ నాటి జైళ్లలోని శోచనీయ పరిస్థితులనూ చిత్రించాడు. ఈ నాటిక లన్నిటిమీద ఇబ్సెన్ ప్రభావం కనిపిస్తుంది. ఈ నాటకాలు కొన్ని ప్రజలలో సంచలనం కలిగించి, న్యాయ వ్యవస్థలో సంస్కరణలకు దారి తీశాయి. ఈయన తన నాటికలలో సాంఘిక న్యాయ వ్యవస్థలలోని లోపాలను ఎత్తి చూపి, తన నవలలలో మానవ ప్రకృతిని శోధించి, సాహిత్య అభిమానుల మన్ననను పొందాడు. ఈయన చేసిన సాహితీ సేవను గుర్తిస్తూ 1932 లో ఈయనకు నోబెల్ (సాహిత్య) బహుమతి ప్రదానం చేశారు. 1933 లో ఈయన మరణం తరువాత ఈయన ఖ్యాతి తగ్గింది గాని, 1965 ప్రాంతాలనుండి తిరిగి ఈయన రచనలు ప్రజాదరణను పొందుతున్నాయి.

డి.ల.రా.

**గాషియేర్, థియోఫిల్ (1811-72) :** గొప్ప ఫ్రెంచి కవి, నవలా రచయిత, విమర్శకుడు, పాత్రికేయుడు.



తన జీవితకాలంలో అధికభాగం పారిస్ పట్టణంలోనే గడిపిన గాషియేర్ ప్రభావం ఆనాటి సాహిత్యంలో అన్ని ఉద్యమాల మీదా ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. మొదట్లో కుంచె చేత్తో పట్టుకున్నా కొద్ది కాలానికే తను కవిగా రాణించగలనని గాషియేర్ గుర్తించాడు. కాల్పనిక ఉద్యమం వైపు మొగ్గు చూపి ఆ నాటి రచయితలు సాగించిన సాంస్కృతిక విప్లవానికి దోహదం చేస్తూ గాషియేర్ ఒక వినూత్నమైన మార్గాన్ని అవలంబించాడు. విమర్శ విషయంలో నిక్కచ్చిగా ఉండే గాషియేర్ తనతోటి వారి రచనలనే కాకుండా తన రచనలను కూడా విమర్శిస్తూ *లెస్ జ్యూనెస్ ఫ్రాన్స్* (1833) అనే రచన చేశాడు.

గాషియేర్ మొదటి పద్య సంకలనం 1830 లో వెలువడింది. 1832 లో *ఆల్బెర్టెస్* అనే సుదీర్ఘ వర్ణనాత్మక రచన ప్రచురింపబడింది. ఈ కాలంలోనే గాషియేర్ కాల్పనికోద్యమాన్ని విడిచి 'కళ కళకోసం' అనే నినాదాన్ని ప్రతిపాదించాడు. *ఆల్బెర్టెస్* కు అతడు వ్రాసిన ఉపోద్ఘాతంలోను, 1835 లో ప్రచురించిన నవల *మెడ మోయిసిల్ డి మాపుపిన్* ఉపోద్ఘాతంలోను అతడు తన నూతన ప్రతిపాదనను వివరించాడు. అవి సాహిత్య రంగంలో కల్లోలాన్ని లేవదీశాయి.

1840 లో గాషియేర్ అయిదు నెలలపాటు స్పెయిన్ దేశంలో పర్యటించాడు. అక్కడి ప్రజలు, వాతావరణం గాషియేర్‌కు ఉత్తేజాన్నిచ్చాయి. అప్పుడు వెలువడిన పద్యాలు *ఎస్పానా* (1845) అనే గద్య రచనలోను, *వోయేజ్ ఎన్ ఎస్పాగె* (1845) లోను గాషియేర్ రచనా పాటవం తారస్థాయిని అందుకుంది. ఈ అనుభవం తర్వాత గాషియేర్ నీరసమైన స్థావర జీవితాన్ని తప్పించుకోడానికి ఇలా ప్రయాణాలు చేయడం ఒక మంచి మార్గం అని భావించాడు. 1836 నుంచి 55 వరకు *ల్యా ప్రెస్సె, లమోనిటూర్ యూనివర్సల్* పత్రికలకు వారం వారం అతడు వ్రాస్తూ ఉండేవాడు. ఇవి కాక అనేక పత్రికలకు, పుస్తకాలకు రచనలు పంపుతూ ఉండేవాడు. కవిత్వానికి కావలసిన శక్తికి, స్పందనకు తన పాత్రికేయ జీవితం విఘాతం కలిగిస్తోందని ఎప్పుడూ అతడు బాధపడేవాడు. గ్రీస్ దేశంలో ప్రయాణం చేయడంవల్ల గాషియేర్‌కు సంప్రదాయపు విలువల పట్ల గౌరవం పెరిగింది. కళ నీతిని బోధించవలసిన అవసరం లేదు, కళ వ్యక్తిగత విషయాలకు అతీతమైనది అనే భావన ఆయన మనస్సులో దృఢపడింది. పద్యరచనలో గాషియేర్ ఒక ప్రత్యేక మార్గం సృష్టించుకున్నాడు. దాని పేరు 'లాన్స్ పొజిషన్ డి ఆర్ట్'. ఈ ప్రాతిపదికపై నిర్మించిన ఆయన పద్య సంకలనం *ఎ మాపుల్స్ ఎల్ కెమీస్* (1852) ఆయన రచనలలో తలమానికమైందని నిస్సందేహంగా చెప్పవచ్చును.

ఆయన పద్యరచనా నైపుణి ఆయన నవలా నిర్మాణంలో కూడా ఒక చక్కని మార్పు తెచ్చింది. సమకాలికులెందరో గాషియేర్‌ను ఆరాధించేవారు. తన చివరి

రోజులలో యువరాణి మేథిల్డీకి స్నేహితుడై ఆమెచేత గ్రంథాలయాధికారిగా నియమింపబడి గాషియేర్ కొంతలో కొంత తన ఆర్థిక స్థితిని మెరుగు పరుచుకున్నాడు.

పప్పు

**గాస్కెల్, ఎలిజబెత్ క్లెగార్న్ (1810-65) :** ప్రఖ్యాత ఆంగ్ల నవలా రచయిత్రి, కథానికా రచయిత్రి.



లండన్ మహానగరంలోని చెల్సియాలో 1810 లో జన్మించిన కుమారి స్టీవెన్‌సన్ 1832 లో మాంచెస్టర్‌కు చెందిన రెవరెండ్ డబ్ల్యూ గాస్కెల్‌ను పెళ్లి చేసుకొని మాంచెస్టర్ నగరంలో గాస్కెల్ సతి అయింది. పారిశ్రామిక కేంద్రమైన మాంచెస్టర్‌లోని శ్రామిక వర్గంతో సన్నిహిత సంబంధ మేర్పరచుకొని వారిలో ఒకతెగా మెసలింది. వారి ఆశలు, ఆశయాలు, కలలు, కడగండ్లు క్షుణ్ణంగా పరిశీలించి, సానుభూతితో అర్థం చేసుకున్న గాస్కెల్ సతి పారి శ్రామిక వర్గ నవలా రచయిత్రులలో ఎన్నదగింది. తాను పుట్టిన లండన్ నగర దక్షిణప్రాంతంలోని వ్యవసాయ కూలీల జీవితాలను కూడా వాస్తవంగా ఈమె చిత్రించింది. పారిశ్రామిక నాగరకత అభివృద్ధి చెంది, దేశంలో సంపద పెరిగి, ప్రభుత్వం అదివరకున్న రక్షిత వ్యాపార పద్ధతికి స్వస్తి చెప్పి, స్వేచ్ఛా వాణిజ్య విధానం వంటి నూతన ఆర్థిక విధానాలను అమలుపరుస్తున్న సమయంలో, శాస్త్రజ్ఞానం, ఆర్థికాభివృద్ధి మాత్రమే శాంతి, సౌభాగ్యాలను ప్రసాదించగలవని విపుల ప్రచారం జరుగుతున్న రోజులలో ఈమె తన రచనల ద్వారా విమర్శనాత్మకంగా యథార్థ జీవితాన్ని చిత్రించి, ఉత్తమమైన విలువలను నిర్ధరించి, నైతికంగా, సాంఘికంగా ప్రజలను చైతన్యవంతులను చేసింది. జేన్ ఆస్టెన్ అంత కళాత్మకంగా భావావిష్కరణ చేయలేకపోయినా, జార్జ్ ఎలియట్‌కు ఈమె మార్గదర్శకురాలైంది. ఈమె ప్రసిద్ధ రచయిత చార్లెస్ డికెన్స్ (Charles Dickens) తో కలసి నడిపిన *హౌస్‌హోల్డ్ వర్డ్స్* వంటి పత్రికలలో ఈమె ప్రచురించిన కథలు ఎందరినో ఆకర్షించాయి. ఈమె నవలలలో గ్రామీణ జీవిత మాధుర్యాన్ని చవిచూపించిన *క్రేన్ ఫోర్డ్* అనే నవల ప్రశస్తమైనదని పలువురు పాఠకుల అభిప్రాయం. శ్రామిక లోకపు కళ్యాణానికి అంకితం చేస్తూ వ్రాసిన *ఉత్తర దక్షిణాలు* (North and South) మరి కొందరి దృష్టిలో గణనీయమైన రచన. ఈమె కళకు వాస్తవికత పునాది. తన అనుభవంలోకి రాని అనుభూతిని గాని, విషయాన్ని గాని ఆమె చెంతకు చేరనీయలేదు. వ్యంగ్య భంగిమలో సున్నితమైన హాస్యంతో సాంఘిక జీవిత కఠోర సత్యాలను, ఆర్థిక దోపిడీని, నిశితంగా విమర్శించడంలో ఈమె అందె వేసిన చేయి. పాత్రల విశ్లేషణలో, పదునైన సంభాషణలు తీర్చిదిద్దడంలో ఈమె ప్రదర్శించిన పనితనం నాటకీయ సన్నివేశాలను సృష్టించడంలో కనిపించదు. సాంఘిక, ఆర్థిక సమస్యలను చర్చిస్తూ వ్రాసిన ఈమె నవలలను ప్రోబ్లమ్ నవల లని ఆంగ్ల విమర్శకులు వ్యవహరిస్తున్నారు. ఈమె నవలలలో మానవ మనస్తత్వ విశ్లేషణ కూడా పుష్కలంగా కనిపించడంతో ఈమెను 'సైకలాజికల్ రియలిస్ట్' అని కూడా అంటున్నారు. ఈమెకు కార్మికుల పట్ల, కర్షకుల పట్ల ఎంత సానుభూతి ఉన్నా, ఈమెలో సోషలిస్టు లేదా విప్లవాత్మక ధోరణి కనిపించలేదు. దయ, త్యాగం, ప్రేమ మొదలైన మానవతా విలువలనే ఈమె ప్రబోధించింది. ఈమె నవలలలో ప్రధానమైనవి: 1. *మేరీ బార్టన్* (1848), ఇది ఆమె తొలినవల, ఇందులో ఈమె మాంచెస్టర్ పారిశ్రామిక వాడలను శ్రామికుల దీనాతిదీనమైన దైనందిన జీవితాన్ని మరపురాని రీతిలో వర్ణించింది. 2. *రూత్* (1853), ఈ నవలలో గాస్కెల్ సతి అమాయకంగా కాలుజారిన అతివ దయనీయ గాథను వర్ణిస్తూ ఇలాంటి పతితల పట్ల సంఘం సానుభూతిని ప్రదర్శించి, ఆదుకొని, ఆశ్వాసించాలనీ, అసహ్యించుకొని వెలివేయరాదనీ ప్రబోధించింది. 3. *నార్త్ అండ్ సౌత్* (1855), 4. *సెల్వియాస్ లవర్స్* (1863), 5. *వైవ్స్ అండ్ డాటర్స్*. ఈమె చరమదశలో వ్రాసిన *ది లైఫ్ ఆఫ్ షార్లెట్ బ్రాంటే* (1857) ఈమె రచించిన ప్రశస్తమైన జీవిత చరిత్ర.

గం.శ్రీ.

**గాస్కోయిన్, జార్జ్ (1525-77) :** ఆంగ్ల కవి. వివిధ విదేశీ సాహిత్య ప్రక్రియలను ఇంగ్లీష్ భాషలో మొదటి సారిగా ప్రవేశ పెట్టిన లాక్షణికుడు.

సర్ జాన్ గాస్కోయిన్ పెద్ద కుమారుడైన జార్జ్ గాస్కోయిన్ 1520-30 మధ్య కాలంలో జన్మించి ఉండవచ్చును. కేంబ్రిడ్జ్‌లోని ట్రినిటీ కళాశాలలో ఈయన న్యాయశాస్త్రం అభ్యసించాడు. 1555 లో 'గ్రేస్ ఇన్'

సభ్యు డయాడు. అటు తరువాత రాజకీయవేత్తగా, రాజాస్థాన సదస్యుడుగా, సైనికుడుగా అనేక అవతారాలు దాల్చాడు. అన్ని అవతారాలలోను కొంతవరకు విజయం సాధించాడు.

లెడ్‌ఫర్డ్ నుంచి ఎన్నికై పార్లమెంట్ సభ్యుడుగా పనిచేశాడు (1557-59). దుబారా ఖర్చుతో అప్పులు చేసి నిర్లక్ష్యంగా జీవించే వ్యక్తి అని పేరు తెచ్చుకున్నాడు. కొన్నాళ్లు ఆంగ్ల సైన్యంలో చేరి, యుద్ధ ఖైదీగా చిక్కి తిరిగి శత్రువులచేత విడుదలచేయబడి స్వదేశం చేరు కున్నాడు. ఒక ధనిక వితంతువును వివాహం చేసుకున్నాడు. ఆ విధంగా ఆంగ్లకవి 'నికొలస్ బ్రెటన్' కు సవతి తండ్రి అయాడు. ఈయన తన సాహసగాథ అయిన *ది ఫ్రూట్స్ ఆఫ్ వార్స్* (1575) ను లార్డ్ గ్రే కు అంకితం చేశాడు. 1575 లో కెనిల్‌వర్త్ వుడ్‌స్టాక్‌లలో ఎలిజబెత్ రాణికోసం వినోద కార్యక్రమం ఏర్పాటు చేయడంలో ఈయన సహాయపడ్డాడు. ఈయన రచనలలో చాలా భాగం ఈయన చివరి రోజులలోనే ప్రచురితం అయాయి.

చాసర్ మహాకవిని తనకు గురువుగా గాస్కోయిన్ పేర్కొన్నాడు. ఈయన పద్యాలు *ఏ హండ్రెడ్ సండ్రీ ఫ్లవర్స్* అనే పేరుతో 1572 లో ప్రచురించబడ్డాయి. 1576 లో ఈయన ప్రచురించిన *ది స్టీల్ గ్లాస్* ప్రప్రథమ ఇంగ్లీష్ వ్యంగ్య రచనగా చెప్పబడుతూంది. *సెర్టెన్ నోట్స్ ఆఫ్ ఇన్‌స్ట్రక్షన్స్* అనే ఈయన రచన ఇంగ్లీష్‌లో వెలువడిన మొట్టమొదటి ఛందశ్శాస్త్రగ్రంథం. ఈయన మరొక రచన *డాన్ బార్తోలోమ్యు ఆఫ్ బేత్* స్వీయ చరిత్రాత్మక రచన. *ది అడ్వెంచర్ ఆఫ్ మాస్టర్ ఎఫ్ జె.* పునరుజ్జీవన యుగంలో వెలువడిన మొట్టమొదటి మౌలికమైన గద్యకథ.

'గ్రేస్ ఇన్' లో ఉంటున్న రోజులలోనే గాస్కోయిన్ నాటక రంగంలో కృషి చేస్తూ వచ్చాడు. ఈయన నాటకం *జోకాస్టా* (1566 లో ప్రదర్శితమైంది) ఇంగ్లీష్ నాటకరంగం మీద ప్రదర్శించబడిన తొలి గ్రీక్ విషాదాంత నాటకం. ఈయన వ్రాసిన *సపోజెస్* (1566) అనే మరొక నాటకం, ఆరియొస్టో వ్రాసిన *ఐ సపొజిటీ* అనే ఇటాలియన్ రచనకు ఇంగ్లీష్ అనువాదం. ఇదే షేక్స్‌పియర్ వ్రాసిన *టేమింగ్ ఆఫ్ ది ష్రూ* అనే నాటకానికి వస్తువును సమకూర్చింది. మూడవ నాటకం *ది గ్లాస్ ఆఫ్ గవర్నమెంట్* (1575) ప్రబోధాత్మకమైంది.

గాస్కోయిన్ తన ఆఖరు రోజులలో జార్జ్ వెట్‌స్టోన్ అతిథిగా ఉంటూ 1577 అక్టోబరు 7 వ తేదీన స్టామ్‌ఫర్డ్ సమీపంలో ఉన్న బెర్నాడ్‌లో కాలం చేశాడు.

పద్మాకర్

**గే, జాన్ (1685-1732)** : ఆంగ్ల కవి, నాటక రచయిత. బార్న్‌స్టాపిల్ నగరంలో ఒక బీదకుటుంబంలో 'గే' జన్మించాడు. అతనికి 10 సంవత్సరాల వయస్సు రాకముందే తల్లి దండ్రు లిద్దరూ మరణించారు. అయినా స్వగ్రామంలోనే ఫ్రీ గ్రామర్ స్కూల్లో విద్యాభ్యాసం ముగించుకొని లండన్‌లో ఒక పట్టు వ్యాపారస్థుని వద్ద ఉద్యోగానికి చేరాడు. కాని అది ఎంతో కాలం కొనసాగలేదు. 1708 లో తన 23 వ ఏట "వైన్" అనే ఛందోరహిత మైన పద్యాన్ని ప్రచురించాడు. మాన్‌మౌత్ డచెస్ దగ్గర 1712 లో ఆంతరంగిక కార్యదర్శిగా చేరాడు. 1713 లో *రూరల్ స్పోర్ట్* అనే కవిత వెలువడింది. ఇది పోప్‌కి అంకితం చేసిన కవిత. దీనిలో 'గే' తాను దుకాణంలో పనిచేసే రోజులను చమత్కారంగా వర్ణించాడు. 1713 లోనే వెలువడిన మరో హాస్యకవిత *ది వైఫ్ ఆఫ్ బాత్* అంత ప్రజాదరణ పొందలేదు. తరువాత ఒక సుదీర్ఘమైన కవిత మూడు సంపుటాలుగా 1714 లో వెలువడింది. దీనిలో వ్యంగ్యం కన్న హాస్యం ప్రజలను ఎక్కువగా ఆకట్టుకొంది. గ్రామీణ జీవితాన్ని రమ్యంగా చిత్రించిన కవితగా ఇది ప్రజాదరణ పొందింది. అనంతరం అలాన్ రామ్‌సే వంటి కవులు దీనిలోని గ్రామీణ జీవన చిత్రీకరణ విధానాన్ని అనుసరించారు. 1715 ఫిబ్రవరి నెలలో గే నాటిక *వాట్ డు యు కాలిట్* ప్రదర్శింప బడింది. కాని 'గే' అనుకున్నంత ఆదరణ ఆ నాటికకు లభించలేదు. స్విఫ్ట్ సలహా మీద గే 1716 లో *ట్రివియా, ఆర్ ది ఆర్ట్ ఆఫ్ వాకింగ్ ది స్ట్రీట్స్ ఆఫ్ లండన్* అనే నాటిక వ్రాశాడు. దీనిలో రోడ్డుమీద నడిచేవాళ్లు ఎంత కష్టపడాలో, ఎన్ని ప్రమాదాలు ఎదుర్కోవాలో సున్నితంగా విమర్శిస్తూ సందేశాత్మకంగా దీనిని నడిపించారు. 'గే' జీవితాంతం ప్రభుత్వోద్యోగం కోసం తపించాడు. కాని ఆయనకు ఆ అర్హతలు లేవు. 1714 లో పోప్ ద్వారా తనకు పరిచయం అయిన లార్డ్ క్లేరె డెన్ దగ్గర కార్యదర్శిగా పదవీ బాధ్యతలు స్వీకరించాడు. కాని, రెండు నెలలకు మించి ఆ పదవిలో కొనసాగలేకపోయాడు. పోప్ కోరిక మీద ఆయన ఆస్థానంలో పదవికోసం *ఏన్ ఎపిసిల్ టు ఏ లేడీ* అనే కవిత వ్రాశాడు. ఫలితంగా *వాట్ డు యు కాలిట్* చూడడానికి ఆ యువ దంపతులు వచ్చారు. 1717 లో 'గే' మరో నాటకం *త్రీ అవర్స్*

*ఆఫ్టర్ మేరేజ్* ప్రదర్శించాడు. కాని అందులో కొన్ని సంభాషణలు, అసభ్యకరమైన సన్నివేశాలు ఆ నాటకానికి భవితవ్యం లేకుండా చేశాయి. ఈ నాటకానికి కారకులైన మిత్రత్రయం గే, పోప్, అర్బత్‌నాట్. ఈ ముగ్గురిని పత్రికలు తీవ్రంగా విమర్శించాయి. కొన్నాళ్ల పాటు గే అజ్ఞాతంగా ఉండిపోయాడు. కాని 1720 లో చందాలు వసూలు చేసే పద్ధతిలో తన పద్య సంకలనాన్ని ప్రచురించి 1000 పౌండ్లు ఆర్జించాడు. సౌత్ సీ స్టాక్‌వారి బహుమతి 20 వేల షేర్లు కూడా గే అందుకున్నాడు. 1724 లో *ది క్యాప్టివ్స్* అనే మరో నాటకం అంతంత మాత్రంగానే విజయం సాధించింది. 1927 లో కథల సంపుటి నొక దాన్ని 'గే' రచించాడు. 1926 లో *ది బెగ్గర్స్ ఒపెరా* అనే ఒక నాటకం అనుకోనంత విజయం సాధించింది. అందులోని పాటలు, సంగీతం ఆ నాటకానికి మరింత ప్రజాదరణ చేకూర్చాయి. 62 రోజులు ఏకధాటిగా ఆ నాటకం ప్రదర్శించబడింది. దీనివల్ల 'గే' 693 పౌండ్లు సంపాదించాడని తెలుస్తూంది. అదే మూసలో వ్రాసిన మరో నాటకం *పోలీ* రచయితకు 1100 పౌండ్లు ఆర్జించి పెట్టింది. తన శేషజీవితాన్ని 'గే' క్వీన్స్ బెరీ డ్యూక్ దంపతుల ప్రాపకంలో గడిపాడు. తరువాత 'గే' మరేదీ వ్రాయలేదు. 1732 లో మూడు రోజులు తీవ్రమైన జ్వరం వచ్చి 'గే' దివంగతు డయాడు. వెస్ట్ మినిస్టర్ అబేలో ఆయన భౌతిక శరీరాన్ని ఖననం చేశారు.

పప్పు

**గొంగోరా ఇ ఆర్గోటె, లూయీ డి (1561-1627) :** తన తరంలో అసాధారణమైన ప్రఖ్యాతి ఆర్జించిన స్పానిష్ మహాకవి. అతడు నెలకొల్పిన బోరో కళా రీతిని, క్లిష్టమైన శైలిని గొంగోరిసమ్ (గొంగోరిస్మో) అని వ్యవహరిస్తారు. ఆయన అనుయాయులు గొంగోరా వాదాన్ని అతిశయంగా ఆకాశాని కెత్తి కీర్తించడంవల్ల, ఆ వాదాన్ని నిల్పగల సమర్థులు లేకపోవటంవల్ల గొంగోరా మరణం తరువాత అది అప్రతిష్ఠ పాలయింది. 20 వ శతాబ్దంలో మళ్లా అది గొప్ప విప్లవాన్ని తెచ్చి, వెనుకటి ప్రతిష్ఠను అందుకొంది.

గొంగోరా ఒక న్యాయమూర్తి కుమారుడు. తండ్రికి చెందిన అపురూపమైన గ్రంథాలయం వల్ల, ఉన్నత పదవులలో ఉన్న బంధువుల వల్ల అతని విద్య నిరాటంకంగా కొనసాగింది. ఈయన సాలమాంకా విశ్వవిద్యాలయంలో చేరి అతి త్వరలోనే గొప్ప ఖ్యాతిని సముపార్జించాడు. క్రైస్తవ మత మాన్యాన్ని పొందాలనే ఉద్దేశ్యంతో మత సంబంధ విధులను నిర్వహించాడు. కాని 55 సంవత్సరాలు వచ్చేవరకూ మాడ్రిడ్‌లోని రాజసభలో మత గురువు కాలేకపోయాడు. అతడు సృష్టించిన కొన్ని వ్యంగ్య పద్యాలు, మరికొన్ని ఇతర రచనలు గొంగోరా జీవితంలో చోటుచేసుకొన్న కలతలు, దుఃఖం, కోపం మొదలైన వాటికి ప్రతిధ్వనులు. గొంగోరాకు లోప్ డి వేగా వంటి కొందరు అంధానుయాయులూ, అంతటి ప్రబలురైన మరికొందరు శత్రువులూ ఉన్నారు. అలాంటి శత్రు వర్గంలో ఫ్రాన్సిస్కో డి క్వెవెడా ఒకడు. సాటి లేని వ్యంగ్య రచనలోను, స్వర సమ్మేళన రచనా విన్యాసంలోను గొంగోరాకు అతడూ ఏమాత్రం తీసిపోడు.

*రొమాన్స్* లు, *సానెట్* లు వంటి చిన్న పద్యాల కూర్పులో గొంగోరా సిద్ధహస్తుడు. కాని సుదీర్ఘకృతు లైన



*ఫేబులా డి పోలిఫెమో యి గలాటెయా, సోలెడేడ్స్* (రెండూ వ్రాత ప్రతుల రూపంలోనే పాఠకులను చేరాయి, 1613) ఉద్దేశ్య పూర్వకంగా అతి ప్రౌఢంగానూ, సంక్లిష్ట శైలితోనూ నిర్మించ బడడంతో అనేకమంది ఉపేక్షకు, విమర్శకు కారణం అయాయి. ఆయన రచనలను గూర్చిన 20 వ శతాబ్దపు విమర్శ ప్రకారం గొంగోరా రచనలలో ఉన్న ఏకత్వం ప్రౌఢమైన అతని శైలివలన ఆచ్ఛాదితమై పోయింది; అతడు విభిన్నరీతుల కవిత్వం వ్రాయలేదు.

19 వ శతాబ్దిలో ప్రజానీకం గూఢం, క్లిష్టమైన గొంగోరా కవితను అంతగా అర్థం చేసుకోలేక పోయింది. కాని 1927 లో ఆయన త్రిశత జయంతి ఉత్సవాలలో గొంగోరా ఔన్నత్యం తిరిగి ప్రతిష్ఠాపించబడింది. ఆయన కవితలో దాగి ఉన్న అంతఃసౌందర్యాన్ని ఆస్వాదించగల శ్రోతలు ఇన్నాళ్లకు లభించారు. ఆ కవిత్వంలో అంత ర్లీనంగా దాగి ఉన్న సౌందర్యానికి వారు పారవశ్యం పొందుతున్నారు. ఆర్. ఓ. జోన్స్ గొంగోరా ప్రసిద్ధ రచనలు కొన్నింటిని ఆంగ్లంలోకి తర్జుమా చేసి, 1966 లో ప్రచురించాడు.

చిం.వెం.

**గొంజాగా, తోమాస్ ఆంటానియో (1744-1810) :** ప్రముఖ పోర్చుగీస్ కవి. 20 వ శతాబ్ది దాకా కేమోస్ తరువాత ఎక్కువ ప్రజాదరణ పొందిన రెండవ కవి.

1744 ఆగస్టు 11 న పోర్టో లో జన్మించిన గొంజాగా 'కోయింబ్రా' లో తన న్యాయశాస్త్రాధ్యయనం 1768 లో ముగించాడు. 1782 లో 'బ్రెజిల్' లోని విలా రికాలో న్యాయమూర్తిగా నియమితు డయాడు. అక్కడ మరీలియా తో ప్రేమలో పడ్డాడు. ఆమె పేరు అతని భావ గీతాలలో తరచు వినిపిస్తుంది. తీరా 1789 లో వారిరువురూ వివాహ మాడుదా మనుకుంటూ ఉండగా ఒక అసత్యపు కుట్ర నేరారోపణమీద గొంజాగా అరెస్టు చేయబడ్డాడు. మూడు సంవత్సరాలు జైలులో గడిపిన తరువాత మొజాంబిక్‌కు 'ప్రవాసి' గా అతడు పంపబడ్డాడు. అతని కీర్తికి ఆధారం ఒకే ఒక గ్రామీణ ప్రేమ గీతికా సంపుటి. దానిపేరు *మరీలియా డి డిర్సియు.* అది రెండు భాగాలుగా ప్రకటించబడింది. మొదటిభాగం అతడు అరెస్ట్ కావడానికి పూర్వం (1792 లో) రచించబడింది. మరీలియాను వివాహం చేసుకోబోతున్నాను గదా అనే ఆనందోత్సాహాలు ఈ భాగంలో కనిపిస్తాయి. రెండవ భాగం (1799) జైలులో వ్రాయబడింది. దీనిలో తన ప్రేయసితో విరహం వర్ణిత మయింది. మొజాంబిక్ చేరిన తరువాత గొంజాగా ఒక ధనిక యువతిని వివాహమాడి, ప్రధానమైన పదవులు నిర్వహిస్తూ జీవితాంతం అక్కడే గడిపి, 1810 లో అక్కడే మరణించాడు.

బొ.శ్రీ.

**గొన్‌సాల్వెస్ డియాస్, ఆంటోనియో (1823-64) :** బ్రెజిల్ దేశపు జాతీయ కవి. గొన్‌సాల్వెస్ డియాస్ బ్రెజిల్ దేశపు 22 రాష్ట్రాలలో ఒకటైన మరన్‌హావో రాష్ట్రంలో కాక్సియాస్ సమీపంలో బోవిసాలో 1864 నవంబరు 3 వ, తేదీన జన్మించాడు. మరన్‌హావో రాష్ట్రం సాంస్కృతికంగా విలక్షణ మైంది. బ్రెజిల్ దేశంలోని ప్రజలు మిశ్ర జాతీయులు. దక్షిణ అమెరికాలోని ఆదిమవాసులైన ఒక తెగ ఇండియన్ జాతికి, పోర్చుగీసు దేశీయులకు మధ్య ఏర్పడిన సాంకర్యం వల్ల కలిగిన మిశ్రజాతి ఇది. అనాదిగా వస్తున్న ప్రాచీన ఇండియన్ జానపద సాహిత్యం, సంస్కృతి సజీవంగా నిల్చి, కొలది మార్పులకు లోనయాయి. కేథలిక్ క్రైస్తవాచారాలు, ఆదిమ జాతుల పాలకుల ఆచారాలు కలగలసి రూపొందిన సంస్కృతి వీరిది. ఈ రాష్ట్రంలో ఈ జాతిలో జన్మించిన గొన్‌సాల్వెస్ డియాస్ తన కాల్పనిక గేయాలలోను, జానపద గీతాలలోను బ్రెజిల్ సంస్కృతికి శాశ్వతత్వం సమకూర్చాడు. కనుకనే జాతీయ కవిగా ఆయన గుర్తింపు పొందాడు. ఈయన రచించిన ప్రవాస గీతం (1847) బ్రెజిల్ దేశంలో ఏ నోట విన్నా వినిపిస్తుంది. ఈయన పోర్చుగల్ దేశంలో కొంబ్రా విశ్వవిద్యాలయంలో విద్య నభ్యసించాడు. భాషా శాస్త్రంలోను, మానవ జాతుల పరస్పర సంబంధాలకు సంబంధించిన శాస్త్రంలోను ప్రవేశం సంపాదించాడు. *డిక్షనరీ ఆఫ్ టు పీ-ఇండియన్* అనే నిఘంటువును 1857 లో రచించాడు. ప్రసిద్ధి కెక్కిన అమెజాన్ నదీ పరీవాహక ప్రాంతపు ఉత్తర లోయలో ఈయన అనేక పరిశోధనలు చేశాడు. యూరప్‌లోని వివిధ జాతుల సంస్కృతి సంబంధాలపై పరిశోధనలు జరిపి, 1864 లో స్వదేశానికి తిరిగి వస్తూ మార్గమధ్యంలోనే నౌకాభంగం కారణంగా దుర్మరణం పాలయాడు. ఈయన తలబెట్టిన ఐతిహాసిక కావ్యం 'ఓస్ తాంబిరోస్' అసంపూర్ణంగా మిగిలిపోయింది. కాల్పనిక సంప్రదాయానికి చెందిన ఈయన కవితలో దేశప్రేమ వెల్లివిరుస్తూంది. నూతన ప్రపంచమైన అమెరికా దేశం, భూమధ్యరేఖా ప్రాంతమైన బ్రెజిల్ దేశం భూతల స్వర్గంగా ఇతని కవితలో కీర్తించబడ్డాయి. ఈ క్రింది కవితా సంపుటాలను గొన్ సాల్వెస్ ప్రకటించాడు: 1. *ప్రెమిరోస్ కేంటోస్* (ప్రథమ కవితలు 1846), 2. *సెగుంటోస్ కాంటోస్* (తదుపరి కవితలు 1848) 3. *ఆల్టిమోస్* (ఆఖరి కవితలు 1851).

*గం.శ్రీ.*

**గొయ్‌థే, యోహాన్ వుల్ఫ్‌గాంగ్ వాన్ (1749-1832) :** జగత్ప్రసిద్ధి పొందిన ప్రముఖ జర్మన్ మహాకవి. బహుముఖమైన ప్రజ్ఞను, ఆధికారికమైన వాక్కును ప్రదర్శించిన యూరప్‌లోని పునరుజ్జీవన యుగ మహా రచయితల తరంలో చిట్టచివరివాడు. కవిగా, నాటకకర్తగా మాత్రమే గాక, విమర్శకుడుగా, పత్రికా రచయితగా, చిత్రకారుడుగా, రంగస్థల నిర్వాహకుడుగా, నీతి ధురంధరుడుగా, విద్యావేత్తగా, ప్రాకృతిక దార్శనికుడుగా కూడా సుప్రసిద్ధుడైనవాడు. శతాధిక గ్రంథకర్త. విజ్ఞానశాస్త్రాన్ని గురించి చేసిన రచనలే 14 సంపుటాలుగా వెలువడ్డాయి. భావకవితా ధోరణిలో అసాధారణమైన వస్తువైవిధ్యాన్నీ, శైలినీ ప్రకటించినవాడు. 82 ఏళ్ల నిండు జీవితం జీవించి మానవాతీతమైన విజ్ఞానాన్నీ, వివేకాన్నీ గడించి, సుమారు ఆరు దశాబ్దాలపాటు జర్మన్ సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన మహామనీషి.

'ఫ్రాంక్ ఫర్ట్ అమ్ మెయిన్' లో ఒక మధ్యతరగతి కుటుంబంలో 1749 ఆగస్టు 28 వ తేదీన యోహాన్ వోల్ఫ్‌గాంగ్ ఫాన్ గొయిథే జన్మించాడు. లైప్‌ట్సిగ్, శ్ట్రాస్ బర్గ్‌లలో ఆయన న్యాయశాస్త్రం అభ్యసించాడు. ఆయన జీవితంలోని తొలిసంవత్సరాలు 'స్టుర్మ్ ఉండ్ డ్రాంగ్' ఉద్యమ సంరంభంలో గడిచాయి. *గోట్జ్ ఫాన్ బెర్లికింగెన్* (1773) అనే నాటకం, *డీ లైడెన్ డెస్ యుంగెన్ వెర్దర్స్* (1774-'యువకుడైన వెర్దర్ సంతాపాలు') అనే నవల ఆ ఉద్యమానికి ఆయన అర్పించిన కానుకలు. 1775 నుంచి గొయిథే 'వైమార్' లో గడిపాడు. అక్కడ ఆయన 'చార్లొటే ఫాన్ స్టైన్' అనే ఆమెను ప్రేమించాడు. ఆమె గొయిథే చేత అద్భుతమైన భావగీతాలు వ్రాయించింది. ఆమెకు గొయిథే 1500 లేఖల వరకూ వ్రాశాడు. గొయిథేను ఉత్తేజపరచిన స్త్రీలలో ఆమె ఒకతె మాత్రమే అయినా, ఆయనలో క్లాసిసిజమ్ వృద్ధి పొందే ప్రధానమైన దశలో ఆయన మీద ఆమె తన ప్రభావం ప్రసరింపజేసింది. 1786 లో ఆయన ఇటలీలో గడపిన కాలంలో క్లాసికల్ సంస్కృతితో ఆయనకు ఏర్పడిన ప్రత్యక్ష పరిచయానికి ఫలితంగా *ఇఫిగెనీ ఔఫ్ టౌరిస్* (1787), *టార్క్వాటో టాసో* (1790), అనే నాటకాలూ, *రోమన్ ఎలిజీలు* (1795) అనే పద్యకావ్యం వెలశాయి.

షిల్లర్ మహాకవితో గొయిథేకు గల మైత్రీ, ఆయనతో సాగించిన ఉత్తర ప్రత్యుత్తరాలు, సౌందర్య మీమాంసను గూర్చిన గొయిథే సిద్ధాంతాలకు నైశిత్యాన్ని సమకూర్చాయి. కాల్పనిక ఉద్యమం పట్ల పూర్తి సానుభూతిని ప్రకటించకపోయినా విదేశీ సాహిత్యాలను ఆదరంతో స్వీకరించే కాల్పనిక కవుల ధోరణిని ఆయన మెచ్చుకున్నాడు. ప్రాచ్య సంస్కృతితో సమన్వయం సాధించడం కోసం *వెస్ట్- ఓస్ట్‌లిచార్ దివాన్* (1819) లో ఆయన ప్రయత్నించాడు. జీవితాంతం గొయిథేకు వైజ్ఞానిక, తాత్త్విక చర్చల పట్ల తీవ్రమైన ఆసక్తి ఉండేది. 'రంగుల సిద్ధాంతం' (The theory of colours) మీదా, వృక్షశాస్త్రం మీదా, జీవశాస్త్రం మీదా కూడా ఆయన రచనలు చేశాడు. చివరి వరకూ తన సృజనశక్తి పోకుండా కాపాడుకుంటూ వచ్చిన గొయిథే తుది సంవత్సరాలలో *మైస్టర్ యాత్రలు* (1821-29) రచించాడు. తన సర్వోత్కృష్టమైన నాటకం *ఫౌస్ట్* ను (మొదటిభాగం-1808, రెండవభాగం-1832) పూర్తిచేశాడు.

గొయిథే వ్యక్తిత్వంలో అంతర్నిహితంగా దాగి ఉన్న 'ప్రవక్తల నిర్వేదాన్ని' (prophetic sorrow) గుర్తించే రోజు తప్పక వస్తుందని కార్లైల్ పండితుడు రాల్ఫ్‌వాల్డో ఎమర్సన్‌కు వ్రాసిన ఒక లేఖలో జోస్యం చెప్పాడు. ఆ జోస్యం నిజమై, రెండవ ప్రపంచ యుద్ధానంతరం అంతవరకూ గొప్ప ఆశావాదిగా భావింపబడుతూ వచ్చిన గొయిథేను తీవ్రమైన ఆత్మక్షోభకు గురి అయిన నిరాశావాదిగా గుర్తించే ప్రయత్నాలు ఆరంభ మయాయి. ఆంగ్లమహాకవి టి.ఎస్. ఎలియెట్ "గొయిథే కవి కాడు, ఋషి" అని పేర్కొన్నాడు. అయితే ఈ రెండు విభిన్న అభిప్రాయాలలోనూ పాక్షికంగానే సత్యం ఉన్నదని విమర్శకులు భావిస్తున్నారు. తన మాధ్యమం మీద సంపూర్ణమైన అధికారం కలిగి వచన రచనలు కూడా అనువాదానికి లొంగనంత ప్రగాఢంగా ఉండే గొయిథే వంటి మహాకవుల విషయంలో ఇలాంటి విరుద్ధమైన అభిప్రాయాలు వ్యక్తం కావడం తప్పనిసరి! *మాక్సీమెన్* (సూక్తులు), *గెస్‌ప్రాకే* (సంభాషణలు) అనే గ్రంథాలలో గొయిథే ప్రగాఢ విజ్ఞానం వెల్లడి అవుతూంది.

గొయిథే రచించిన 150 గ్రంథాలలో 15 మాత్రమే ఇంగ్లీష్‌లోకి అనువదించబడ్డాయి. నవలా రచయితగా, నాటకకర్తగా గొయిథే అద్భుతమైన ప్రతిభ ప్రకటించాడు. ఆయన భావగీతాలు కూడా నిరుపమానాలు! వాటిలో చాలా గీతాలను జర్మన్ గాయకులు స్వరపరచి గానం చేశారు. *పెండోరా* వంటి ఆయన ఉత్తమ కావ్యాలు కొన్ని ఆయన మరణానంతరం గాని తగినంత గుర్తింపు పొందలేదు. గొయిథే గేయ కావ్యాలలో *ది ఎర్ల్‌కింగ్, ది వాండరర్స్ నైట్ సాంగ్* అనేవి సుప్రసిద్ధాలు. ఒక మతోద్యోగి కుమార్తె మీద అతడు రచించిన ప్రణయ గేయాలు సాటిలేనివి.

కాళిదాసు రచించిన 'అభిజ్ఞాన శాకుంతలానికి' అనువాదం చదివి గొయిథే ఆనంత పారవశ్యంతో నాట్యం చేశాడనీ, 'స్వర్గ మర్త్యలోకాలను ఒకేముడిలో ఇమిడ్చిన వింతసృష్టి' అని ఆ నాటకాన్ని ప్రశంసిస్తూ ఒక పద్యం చెప్పాడనీ ప్రసిద్ధి.!

1832 మార్చి 22 వ తేదీన వైమార్‌లో గొయిథే తన ఇహలోక యాత్ర చాలించాడు.

*బొ.శ్రీ.*

**గోకాల్ప్, జియా (1875/76-1924)** : తుర్కిష్ సమాజ శాస్త్రవేత, కవి. ఈయన అసలు పేరు మహమ్మద్ జియా. తుర్కీ దేశపు జాతీయోద్యమాన్ని బాగా ప్రచారం చేసిన మేధావులలో ఈయన ఒకడు.

తుర్కీ జాతీయోద్యమ కాలంలో ఈయన *గెంఖ్ కాలెమ్లర్* వంటి పత్రికలకు వ్యాసాలు వ్రాసేవాడు. 1912

లో ఈయన ఇస్తాన్‌బుల్ విశ్వవిద్యాలయంలో సమాజ శాస్త్ర ఆచార్యుడుగా నియమింప బడ్డాయి.

గోకాల్ప్ మొదట ప్రపంచ తుర్కు లందరినీ ఏకం చేయా లనే పాన్-తుర్కిజ్మ్ సిద్ధాంతాన్ని సమర్థించాడు. అయితే తరవాత ఒట్టోమాన్ సామ్రాజ్యంలోని తుర్క్‌లకు సంబంధించి నంత వరకే తన భావాలను పరిమితం చేసుకొని తుర్కిష్ దేశ ఆధునికీకరణకూ, పాశ్చాత్యీ కరణకూ కృషి చేశాడు. తుర్కీదేశం ఇస్లాం దేశం కాకముందు తుర్కీ దేశచరిత్ర, ఆచారాలు, విశ్వాసాలు తెలియజేయడంలో ఈయనకు మంచి ఆసక్తి ఉన్నప్పటికీ, తుర్కిష్ వారసత్వాన్ని వదులుకోకుండా పాశ్చాత్య నాగ రకతకు చెందిన ఎన్నో రీతులను అనుసరించ వచ్చునని ఈయన భావించాడు.

1918 లో తాత్కాలికంగా యుద్ధ విరమణ ఒప్పందం కుదిరిన తరవాత ప్రముఖ తుర్కీ రాజకీయ నాయకులు అనేకులతోపాటు దేశం వదలి పెట్టి గొకాల్ప్ కూడా మాల్టాకు ప్రవాసం వెళ్ళాడు. జాతీయ వాద విజయం (1922) అనంతరం దియార్బాకిర్‌కు తిరిగి వచ్చి, మళ్లీ అంకారాకు వెళ్లాడు. అంకారాలో విద్యామంత్రిగా పని చేశాడు. ఈయన 1923 లో కొత్త తుర్కిష్ రిపబ్లిక్ పార్లమెంటు సభ్యుడుగా ఎన్నికయాడు. అయితే తరవాత కొంత కాలానికే గోకాల్ప్ మరణించాడు.

తుర్కిష్ జాతీయవాద ప్రచారకుడుగా గోకాల్ప్ ఎందరో రాజకీయ నాయకులనూ, రచయితలనూ ప్రభా వితం చేశాడు. ఈయన రచనల్లో *కిజిల్ ఎల్మా* (1914) అనేది చాలా ప్రసిద్ధమైన రచన. *కిజిల్ ఎల్మా* అంటే 'ఎర్రని ఆపిల్' అని అర్థం. 'ఆపిల్' ప్రతీకగా విశ్వ సార్వభౌమత్వాన్ని బోధించే ప్రాచీన తుర్కీ దేశపు పురాణ గాథను ఇది వివరిస్తుంది. ఈయన చేసిన ఇతర రచనలు: 1. *ఎని హయత్* (1923-కొత్తజీవితం), 2. *టర్లెస్మెక్, ఇస్లామ్‌లాస్మెక్, మొసిర్లాస్మెక్* (1918) (తుర్కీ కరణం ఇస్లామీ కరణం, ఆధునికీకరణం), 3. *ఆల్తినిసిక్* (బంగారు కాంతి) మొదలైనవి. ఈయన వ్రాయాలనుకొన్న తుర్కీ 'నాగరకత-చరిత్ర' అనే గ్రంథం అసంపూర్ణంగానే మిగిలిపోయింది. ఈయన వ్రాసిన ఎన్నో వ్యాసాలను నియాజి బెర్కెస్ ఇంగ్లీషులోకి అనువదించాడు.

పద్మాకర్

**గోగోల్, నికొలాయ్ వాసిలోవిచ్ (1809-1852) :** ప్రముఖ రష్యన్ హాస్య రచయిత, నాటకకర్త, నవలా రచయిత. ఆయన వ్రాసిన *మయ్యోర్ట్వ్‌యేదుషీ* (చచ్చిపోయిన ఆత్మలు) అనే నవల, *షినెల్* (The over coat) అనే కథానిక 19 వ శతాబ్ది నాటి రష్యన్ వాస్తవికతా వాద సంప్రదాయానికి ప్రాతిపదికలుగా భావించ బడుతున్నాయి.

బాల్యంలో గోగోల్‌ను యూక్రేన్‌లో పల్లెలలోని రస సంభరితమైన రైతు జీవితం, కోసక్ సంప్రదాయాలు, సుసం పన్నమైన జానపద వాఙ్మయం ఎక్కు వగా ప్రభావితం చేశాయి. 12 ఏళ్ల వయస్సప్పుడు గోగోల్‌ని 'నెజిన్'లోని హైస్కూలుకు పంపారు. చురు కైన వాక్కుతోనూ స్కూలు మాగజై న్‌కు వ్రాసిన గద్య పద్య రచనలతోనూ స్కూలు నాట్యరంగం మీద హాస్యభరితమైన వృద్ధ స్త్రీ పురుష పాత్రల ప్రదర్శనలతోనూ గోగోల్ అక్కడ నలు గురి దృష్టినీ ఆకర్షించాడు. 1828 లో ప్రభుత్వోద్యోగంలో చేరాలనే ఆశతో ఆయన పీటర్స్‌బర్గ్ వెళ్లాడు. కాని 'ఉత్తర', 'దక్షిణా'ల, సహాయం లేకుండా జీవనోపాధి సాధించడం దుష్కర మని త్వరలోనే ఆయన గ్రహిం చాడు. నటుడు కావా లని చూశాడు. కాని వాచిక పరీక్షలో ఆయన కృతార్థుడు కాలేక పోయాడు. యునై టెడ్ స్టేట్స్‌కు వలస పోవా లని ఆలోచించాడు. తల్లి పొలం మీది తనఖా విడిపించడానికి పంపిన డబ్బుతో ఓడ ఎక్కి జర్మన్ రేవు పట్టణం 'ల్యూబెగ్' చేరుకున్నాడు. కొద్ది కాలం జర్మనీలో పర్యటించి, చేతిలో డబ్బు అయిపోగానే పీటర్స్‌బర్గ్ తిరిగి వచ్చి, ఏదైనా పనికోసం ప్రయత్నించాడు. కొన్ని చిల్లర పనులు చేశాడు.



తన చిన్ననాటి యూక్రేన్ జీవితాన్ని స్మరిస్తూ కొన్ని రచనలు చేసి పత్రికలలో ప్రచురించాడు. యూక్రేన్ లోని అందమైన ప్రకృతి దృశ్యాలు, రైతులు, ఉత్సాహంతో పొంగులు వారే పిల్లలు అందరినీ తన రచనలలో గోగోల్ చిత్రించాడు. దయ్యాలు, రాక్షసులు మంత్రకత్తెలు మొదలైన వారికి సంబంధించిన యూక్రేనియన్ జానపద వాఙ్మయంలోని కథలు తిరిగి చెప్పాడు. ఆ విధంగా ఈయన రచనలలో కల్పన, యథార్థం మధురంగా సమ్మి శ్రణం పొందాయి. *వెచేరానా ఫుటోర్లేబ్లిచ్ దికంకీ* ('ది కంకా' వద్ద చేలలో సాయంతనాలు) అనే పేరుతో

1831-32 లో రెండు సంపుటాలుగా వెలువడిన గోగోల్ ఎనిమిది నవలికలూ ఆ విధంగానే వెలశాయి. సజీవమైన, సంభాషణాత్మకమైన శైలిలో వ్రాయబడిన ఆ రచనలు రష్యన్ సాహిత్యానికి ఒక నూతనోత్తేజాన్ని కలిగించాయి. ఆ రచనలలో వాడిన యూక్రేనియన్ పదాలూ, పద బంధాలూ, వాటిలో గుబాళించే సజీవమైన జానపద వాఙ్మయ సౌరభాలూ రష్యన్ సాహిత్య జగత్తును విశేషంగా ఆకర్షించాయి.

కేవలం పాఠకులను వినోద పరచడానికే కాక రష్యన్ ప్రజలకు సన్మార్గాన్ని ఉపదేశించడానికే భగవంతుడు తనకు సాహితీ ప్రతిభను ప్రసాదించాడని గోగోల్ విశ్వసింపసాగాడు. అందుకే *మయోర్ ట్రేదుషీ* అనే వచన గ్రంథం వ్రాయడానికి ఆయన పూనుకున్నాడు. ప్రచురించబడిన మొదటి భాగంలో రష్యాలోని నరక ప్రాయమైన ఆనాటి జీవితం చిత్రించబడింది. రెండవ, మూడవ భాగాలలో క్రమంగా కశ్మల క్షాళనం, స్వర్గజీవన సాధనం చిత్రించాలనుకున్నాడు. కాని క్రమంగా తనలో సాహితీ ప్రతిభ సన్నగిల్లుతూందని ఆయన గుర్తించాడు. రెండవ భాగం వ్రాయడంలో 10 సంవత్సరాలు ఆయన గడిపాడు. కాని సత్ఫలితాలు కనిపించలేదు. చివరి రోజులు గోగోల్ భగవత్ప్రార్థనలలో గడిపాడు. 1848 లో పాలస్తీనాకు తీర్థయాత్ర కూడా చేసి వచ్చాడు. భగ్నజీవి అయి వివిధ ప్రాంతాలలో తిరుగుతూ చివరికి మాస్కో చేరుకున్నాడు. అక్కడ ఒక మతబోధకుడు ఫాదర్ మాట్‌వే కాన్‌స్టాంటినోవ్‌స్కీ ప్రభావానికి గురి అయాడు. అతని ఆదేశంతో 'చచ్చిపోయిన ఆత్మలు' అనే నవల ద్వితీయ భాగం వ్రాత ప్రతిని 1852 ఫిబ్రవరి 24 వ తేదీన తగులబెట్టాడు. అటు తరువాత పది రోజులకే మార్చి 4న ఆ మాస్కో నగరంలోనే ఆయన శాశ్వతంగా కన్ను మూశాడు.

రష్యన్ సాహిత్య చరిత్రలో గోగోల్ నిర్వహించిన పాత్ర విలక్షణ మైంది. తరువాత వచ్చిన రష్యన్ కల్పనా సాహిత్యాని కంతటికీ ఒక విధంగా ఆయన ఒరవడి పెట్టాడు. రష్యా తనను తాను దర్శించడానికి తోడ్పడిన తొలి రచయితలలో గోగోల్ ఒకరు. లియో టాల్‌స్టాయ్, ఇవాన్ గాంచెరోవ్, ఇవాన్ తుర్గెనీవ్‌లు పుష్కిన్ వచన రచనను ఒరవడిగా గ్రహించగా, డాస్టోయెవిస్కీ, ప్రతీకాత్మక కవి, నవలా రచయిత అయిన ఆంద్రీ బెలీలు గోగోల్ ఆలంకారిక రచనను అనుసరించారు. సామాన్య మానవుణ్ణి సాహిత్య రచనలలో నాయకుణ్ణిగా చేయడం కూడా గోగోల్‌తోనే ప్రారంభం అయింది. *బొ.శ్రీ.*

**గోజీ కార్లో , కాంటే (1720-1806) :** ఇటాలియన్ కవి, గద్య రచయిత, నాటక కర్త. గోజీ కార్లో సంప్రదాయ పరిరక్షణ కోసం కలాన్ని పదునుగా వాడాడు. ఇతర నాటక కర్తల ఆధునిక ప్రయోగాలను నిరసిస్తూ, సంప్రదాయ రూపాల పునరుద్ధరణకోసం పాటు పడ్డాడు. ఇటలీలోను, ఇతర యూరప్ దేశాలలోను ప్రాచుర్యం పొందాడు. తరువాతి తరాల వారి ప్రయోగాలకూ, రంగస్థల సంగీత నాటక ప్రాదుర్భావానికీ ఇతని కృషి ఉపకరించింది.

బీద కుటుంబంలో పుట్టినా, సాంస్కృతికంగా ఉన్నతి సాధించిన కుటుంబం ఇతనిది. గోజీ కార్లో యుద్ధంలో చేరాడు. 1744 లో వెనిస్‌కు తిరిగి వచ్చి ప్రహేళికలు, ఇతర గద్య రచనలు చేయడం ఆరంభించి, ఇటలీ సాహిత్య క్షేత్రంలో ఇతర భాషల సాంకర్యాన్ని వ్యతిరేకించే వర్గానికి మూల పురుషుడయాడు. సాంప్రదాయిక సుఖాంత నాటకాల ప్రచారానికి దీక్ష పూనాడు.

1747 లోను, 1761 లోను ఈ అభిప్రాయాలను ప్రేరేపించే కవితలను, నాటకాలను ప్రచురించాడు. నాటక రంగాన్ని కలుషితం చేస్తున్నారనుకున్న గోల్డోని, బెయిరీలపై ప్రహేళికలు వ్రాశాడు. ఇవి విజయవంతం కావడంతో, వరుసగా తొమ్మిది తోలుబొమ్మల నాటకాలు వ్రాశాడు. జానపద కథలను, ప్రచారంలో ఉన్న పాత కథలను, దేవతల కథలను వస్తువులుగా తీసుకుని రూపకాలుగా మలిచాడు.

ఇతని ప్రయోగాలు ఇటలీలోనే గాక ఇతర యూరోపు దేశాలలోను ప్రాచుర్యం పొందాయి. ముఖ్యంగా జర్మనీలో 1777-78 లలో ఇతని రూపకాలు ఎక్కువగా ప్రదర్శించ బడ్డాయి. ముందు తరాలలో 'ఒపెరా' కు రానున్న ఇవి పూర్వ రూపాలు అయాయి.

1797 లో ఇతడు తన స్వీయ చరిత్రను కూడా ప్రచురించాడు. ఎంతో విస్తృతం అయిన రచన ఇది. ఇది 1890 లో ఇంగ్లీషు లోకి భాషాంతరీకరణం పొందింది.

*శ్రీ విరించి*

**గోట్‌ఫ్రీడ్ వాన్ స్ట్రాస్‌బర్గ్ (1210 ప్రాంతం) :** మధ్యయుగం నాటి ప్రముఖ జర్మన్ కవులలో ఒకడు. ఈయన రచించిన *ట్రిస్టన్ ఉండ్ ఇజోల్డె* అనే ఇతిహాసగాథ సుప్రసిద్ధమైన ఒక ప్రేమికుల కథ ఆధారంగా వ్రాయబడింది. ఈయన జనన, మరణ సంవత్సరాల వివరాలు స్పష్టంగా తెలియవు. 13 వ శతాబ్దం నాటి వాడని మాత్రం తెలుస్తూంది. ఈయన రచించిన *ట్రిస్టన్ ఉండ్*

*ఇజోల్డె* ఇంచు మించు 1210 నాటిది. ఈయన ఉన్నత కుటుంబంలో జన్మించినప్పటికీ, ఆ కాలంలో లభించినంత ఉన్నత విద్యను అభ్యసించి, సంపన్నులమధ్య, విద్యావంతుల మధ్య జీవితాన్ని గడిపినట్లు తెలుస్తూంది. *ట్రిస్టన్* లోని ఇతివృత్తం అప్పటికే యూరప్‌లో సుపరిచితమైనదైనా, ఈయన ఆ కథను ఆదర్శప్రేమను చదువరులకు నిరూపించటానికి ఉపయోగించాడు. దీనిలో ముఖ్యాంశాలు: ప్రేమ, బాధల అవినాభావ సంబంధం, వ్యథ ద్వారా ప్రేమ మానవునిలోని ఔన్నత్యాన్ని బహిర్గతం చేస్తుందనే నమ్మకం. ఈ కావ్యంలోని స్త్రీ పురుష పాత్రల ప్రవర్తన, ప్రేమ సాధారణ నైతిక విలువలకు కాక ఆ నాడు రాచ కొల్వుల లోని సంప్రదాయాల కనుగుణంగా ఉన్నాయి. దీనిలో నాయికా నాయకుల ప్రేమ సాధారణ నైతిక విలువలకు వ్యతిరేకమైనప్పటికీ అది సహజమూ, న్యాయబద్ధమూ అని కవి సమర్థించాడు. గోట్‌ఫ్రీడ్ యొక్క *ట్రిస్టన్* అసంపూర్తిగా మిగిలిపోయింది. రమణీయ కథా సంవిధానం వల్లనూ, కవితా నైపుణ్యం వల్లనూ, విషయ ఉదాత్తత వల్లనూ ఆ నాటి సాహిత్యంలో ఇది విశిష్ట స్థానం పొందింది. ఈ ఒక్క రచనే ఈయన పేరును యూరపియన్ సాహిత్యంలో చిరస్మరణీయం చేసింది. అంతే కాకుండా 1859 లో రిచర్డ్ వాగ్నర్ వ్రాసిన *ట్రిస్టన్ ఉండ్ ఇజోల్డె* అనే సంగీత నాటికకు ఇది ప్రేరణ అయింది.

డి.ల.రా.

**గోట్‌షెడ్, యోహాన్ క్రిస్టోఫ్ (1700-66) :** జర్మన్ రచయిత, విమర్శకుడు. 18 వ శతాబ్ది నాటి ఫ్రెంచ్ 'క్లాసికల్' ప్రమాణాలను, అభిరుచిని జర్మన్ సాహిత్యంలో, ముఖ్యంగా జర్మన్ నాటక రంగంలో ప్రవేశ పెట్టిన మహనీయుడు.

కోనిగ్స్‌బెర్గ్ సమీపంలో ఉన్న జూడిటెన్ కిర్చ్‌లో 1700 వ సంవత్సరం ఫిబ్రవరి 2 న గోట్‌షెడ్ జన్మించాడు. ఈయన తండ్రి ఒక లూథరన్ ఫాదిరీ. కోనిగ్స్‌బెర్గ్‌లోనే విద్యాభ్యాసం చేసి డిగ్రీ తీసుకుని ప్రష్యన్ సైన్యంలో చేరకుండా తప్పించుకోడానికి లైప్‌ట్సిగ్‌కు పారిపోయాడు. 1730 లో లైప్‌ట్సిగ్ విశ్వవిద్యాలయంలో జర్మన్ కవిత్వ శాఖకు ఆచార్యుడుగా నియమించబడ్డాడు. 1734 లో తర్కశాస్త్రానికీ, తత్త్వశాస్త్రానికీ ఆచార్యు డయాడు.

1725-26 ల లోనే గోట్‌షెడ్ *డీ వెర్నున్‌ఫ్టీయెన్ టాడ్లెరినెన్* (హేతుబద్ధమైన విమర్శకురాండ్రు) అనే ఒక స్త్రీల పత్రికను ప్రచురింపసాగాడు. తరువాత *డెర్ బీడెర్ మన్* (1727-29 నిజాయితీ పరుడు) అనే మరొక పత్రిక కూడా నడిపాడు. 1730 లో జర్మన్ పద్య నాటక రంగస్థలాన్ని గురించి ఒక ప్రముఖ విమర్శక గ్రంథాన్ని ప్రచురించాడు. ఫ్రాన్స్‌లో 'క్లాసికల్' వాద ప్రధాన ప్రవక్త 'నికొలస్ బాయ్‌లూ' బోధించిన హేతువాదాన్నీ, ఉదాత్తాభిరుచినీ జర్మన్ కవితా కళకు అన్వయింప జేస్తూ వెలువడిన మొదటి జర్మన్ విమర్శక గ్రంథం ఇది.

గోట్‌షెడ్ చేసిన బృహద్రచన *డాయిట్‌షే షౌబూనే* (6 సంపుటాలు, 1741-45) ఫ్రెంచ్ నాటకాలకు అనువాదాలతో కూడింది. గోట్‌షెడ్ స్వతంత్రంగా వ్రాసిన నాటకాలు అంత ఉదాత్తమైనవి కావు. *డెర్ స్టెర్ బెండెకాటో* (మరణిస్తూన్న కాటో) ఇంగ్లీష్‌లో జోసెఫ్ ఎడిసన్ వ్రాసిన విషాదాంత నాటకానికి జర్మన్ అనువాదం. గోట్‌షెడ్ రచన లన్నిటిలోనూ ఇది చెప్పుకోదగింది. *గ్రుండ్లె గుంగ్ అయినర్ డ్రాయిట్షెక్ స్ప్రాక్ కున్‌స్ట్* (1748, 'జర్మన్ సాహిత్య భాషకు ప్రాతిపదిక') అనే గ్రంథం జర్మన్ సాహిత్య భాషను క్రమబద్ధం చేయడానికి విశేషంగా తోడ్పడింది.

గోట్‌షెడ్ భార్య 'లూయిజె అడల్ గుండే విక్టోరియేనీ కుల్మున్' (1713-62) కూడా ప్రజాదరణ పొందిన అనేక ప్రహసనాలను, సుఖాంత నాటకాలను రచించింది. వీటిలో *డాస్ టెస్టమెంట్* ఉత్తమమైంది. *స్పెక్టేటర్* మొదలైన ఇంగ్లీష్, ఫ్రెంచ్ రచనల నెన్నిటినో ఈమె జర్మన్ భాషలోకి అనువదించింది.

1766 డిసెంబరు 12 న లైప్‌ట్సిగ్ లో గోట్‌షెడ్ అంతిమ శ్వాస విడిచాడు.

పద్మాకర్

**గోడిమర్, నదీన్ (1923--) :** దక్షిణాఫ్రికా శ్వేత జాతి రచయిత్రి. పుస్తక నిషేధం అమలులో ఉన్న పోలీసు రాజ్యంలో స్వేచ్ఛగా మాట్లాడడంవల్లను నిరంతరం వర్ణ విచక్షణను, జాతి దురహంకారాన్ని ఎలుగెత్తి నిరసిస్తున్నందువలనను ఈమెకు 1991 లో నోబెల్ సాహిత్య బహుమతి వచ్చింది. దక్షిణాఫ్రికాలో నోబెల్ బహుమతి పొందిన వారిలో ఈమె రెండవది. ఈమెకు ముందు 1986 లో డెస్మండ్ టుటు (Desmond Tutu) కు నోబెల్ శాంతి బహుమతి వచ్చింది. నోబెల్ బహుమతి పొందిన స్త్రీలలో ఈమె ఏడవది.

1923 లో నవంబరు 20 న గోడిమర్ జన్మించింది. తండ్రి ఇస్టిడోర్, తల్లి నన్. గోడిమర్ ప్రైవేటు పాఠశాలలో విద్యనభ్యసించి, తరువాత ఒక ఏడాది విట్‌వాటర్ శాండ్ విద్యాలయంలో చదివింది. ఈమె 1961

లో *ఫోర్డ్ ఫౌండేషన్ విజిటింగ్ ప్రొఫెసర్ ఫెలోషిప్* తో అమెరికా వెళ్ళింది. 1961 లో *ఫ్రైడేస్ ఫుట్ ప్రింట్* అనే కథానికా సంపుటికి డబ్ల్యు.హెచ్. స్మిత్ సాహిత్య అవార్డు వచ్చింది. నల్లజాతి పరిపాలన కోసం పోరాడుతున్న, ఒకప్పుడు నిషేధించబడ్డ ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెసులో ఈమె సభ్యురాలు. ఈమె శ్వేత జాతి ప్రభుత్వాన్ని చాలా తీవ్రంగా నిరసించింది. 19 వ శతాబ్దపు రష్యన్ నాయకుల వల్ల ప్రభావితమైన ఈమె మనిషిని గూర్చి ఇలా అంటుంది: "మానవ జీవితంలో ప్రతిదీ సందిగ్ధమైనదే. ప్రజలకు తమకు ఏమికావాలో తెలుసునేమోకాని, వారెవరో వారు తెలుసుకోరు". ఈమె శాస్త్రీయ మార్క్సిజం (Classical Marxism) వల్ల ప్రభావితురాలైనప్పటికీ, దాని ఆధిపత్యానికి ఈమె తావు ఇవ్వలేదు.

వర్ణవిచక్షణ, జాతి అహంకారంతో కూడిన దక్షిణాఫ్రికా శ్వేతజాతి మైనారిటీ ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శించి నిరసించినందున ఈమె వ్రాసిన 10 నవలలలో 4 నవలలు, 7 కథానికా సంపుటాలు నిషేధించబడ్డాయి. ఈమె రచనలలో సమకాలీన దక్షిణాఫ్రికా నల్లజాతీయుల సాంఘిక జీవన విధానమేకాక, తెల్లజాతీయులలోని రెండు వర్గాల జీవన విధానం (Conservative & Liberal) కూడా కన్పిస్తుంది. మొదట ఈమె కథానికలు ప్రచురించబడినప్పుడు ఒక విమర్శకుడు ఇలా అన్నాడు: "ఈమె రచనలు స్వతంత్ర భావాలతో కూడిన న్యూయార్క్ రచయితల రచనలను పోలి ఉన్నాయి". ఆమె మొదటి నవల *ఏ వరల్డ్ ఆఫ్ స్ట్రేంజర్స్* (1958). ఇప్పటికి కూడా ఆవిడ రచనలు తెల్లజాతీయుల దురహంకారం, క్రూరత్వం, అన్యాయం, వర్ణవిచక్షణ, దానవత్వం మొదలగు కథాంశాలను వర్ణిస్తున్నాయి. పెట్టుబడిదారీ విధానానికీ, వర్ణవిచక్షణకు సంధి కుదర్చడానికి ఆమె చేస్తున్న అవిరళకృషికి ఆవిడ రచనలు ప్రత్యక్ష సాక్ష్యమిస్తాయి. గోడిమర్ ఎక్కువగా చారిత్రక నవలలు రచించింది. తన చుట్టూ ఉన్న వాతావరణంలోని అత్యంత జటిలమైన సాంఘిక సంబంధాలను ఉద్వేగభరితంగా చిత్రించింది.

ఈమె రచనలలో *ఏ వరల్డ్ ఆఫ్ స్ట్రేంజర్, ఎ గెస్ట్ ఆఫ్ ఆనర్, ది కాన్సర్వేషనలిస్ట్, జూలీస్ పీపుల్, మై సన్స్ స్టోరీ* మొదలగు నవలలు, *ది సాఫ్ట్ వాయిస్ ఆఫ్ సర్పెంట్, ఫ్రైడేస్ ఫుట్ ప్రింట్, ఏ సోల్జర్స్ ఎంబ్రేస్, సమ్‌థింగ్ అవుట్ దేర్* మొదలగు కథా సంపుటాలు ముఖ్యమైనవి.

భారతి

**గోరెస్, యోసెఫ్ వాన్ (1776-1848) :** ప్రముఖ జర్మన్ రచయిత. కేథలిక్ రాజకీయ పాత్రికేయ వ్యవస్థలోను, కాల్పనిక ఉద్యమంలోను అగ్రేసరులలో ఒకరు. ఫ్రెంచ్ విప్లవానికి స్పందించిన గోరెస్ 1817 లో *డాస్ రోటే బ్లాట్* (ఎరుపు రంగు పుట) పత్రికను నడిపాడు. 1795 లో రాజకీయ దౌత్యానికి ఫ్రాన్స్ వెళ్లి తిరిగి వచ్చిన గోరెస్ రాజకీయ వ్యవస్థ పట్ల నమ్మకం పోగొట్టుకుని క్రియాశీల రాజకీయాలనుండి వైదొలగేడు. 1806-07 సంవత్సరాల మధ్య హీడెల్‌బెర్గ్‌లో ఉపన్యాసకుడుగా ఉన్నప్పుడు ఆ నాటి జర్మన్ కాల్పనికోద్యమ ప్రభావానికి లోనై కొందరు మిత్రులతో కలసి *ట్సైటుంగ్ ఫుర్ ఐన్‌సీడ్లర్* అనే పత్రిక నడిపాడు. తరువాత ఆ పత్రికకే *ట్రొస్ట్ ఐన్ సమ్‌కేట్* అని నామకరణం చేశాడు. అదే కాలంలో గోరెస్‌కు జర్మన్ జానపద సాహిత్యం పట్ల ఆసక్తి కలిగింది. తాను కనుగొన్న పురాతన జానపద సాహిత్యాన్ని 1807 లో ఒక సంపుటిగా వెలువరించి జర్మన్ ప్రజలకు అందించాడు. 1810 లో *మిథికల్ స్టోరీస్ ఆఫ్ ది ఏషియన్ వర్ల్డ్* ప్రచురించాడు.

1814 లో నెపోలియన్‌పై జాతీయోద్యమం సందర్భంగా గోరెస్ రైనిష్ మెర్‌కుర్ అనే వార్తా పత్రికను ప్రారంభించాడు. ఆ రోజుల్లో చాలా పేరెన్నిక గన్న పత్రికగా నెపోలియన్‌కు వ్యతిరేక నినాదాలతో ఆ పత్రిక నడిచింది. నెపోలియన్ తర్వాత అరాచక రాజకీయవాదులను దుయ్యబట్టడం వలన గోరెస్ దేశం వదలి పోవలసి వచ్చింది. 1819 నుంచి 24 వరకు గోరెస్ స్విట్జర్లాండ్‌లో దారిద్ర్యం అనుభవించి తిరిగి 1824 కు జర్మనీ వచ్చి కేథలిక్ పండితుడుగా ఉద్యోగంలో చేరాడు. ఆ రోజులలోనే అతడు నాలుగు సంపుటాలుగా రచించిన క్రైస్తవ మార్మికతా వాదం (1836-42) ప్రామాణిక గ్రంథంగా ఈ నాటికీ పరిగణించబడుతూంది.

1848 లో గోరెస్ మరణించినా అతని పేర 1876 లో 'గోరెస్ సొసైటీ' స్థాపించబడి కేథలిక్ విద్యాపీఠంగా నిలచి ఉంది.

పప్పు

**గోర్కీ, మాక్సిమ్ (1868-1936) :** సుప్రసిద్ధ రష్యన్ ప్రకృతివాది కథకుడు, నవలా రచయిత. అనాథలను, సంఘబాహ్యులను గురించిన కథలు, నవలలు నాటకాలు వ్రాసి మొట్ట మొదట ప్రజాదరణ పొందాడు. గోర్కీ రచించిన *అమ్మ* (Russian: *Mat* 1906; Eng:*Mother 1911*), *దిగువ అంతస్తులు* (Eng:*The lower depths 1903*) ఆ వర్గంలోనివే! 'మాక్సిమ్

గోర్కీ' అనేది ఈయన కలం పేరు. అసలు పేరు ఎలెక్సీ మాగ్జియోవిచ్ పెష్కోవ్.

రష్యాలోని నిజ్నీనోవ్ గోరాడ్‌లో 1868 మార్చి 16 వ తేదీన గోర్కీ జన్మించాడు. ఆయన 5 వ ఏటనే రైతుగాను, షిప్పింగ్ ఏజెంట్‌గాను పనిచేస్తున్న ఆయన తండ్రి మరణించాడు. అతని తల్లి పునర్వివాహం చేసు కోడం వల్ల నిజ్నినోవ్‌గొరాడ్ లోని అతని మాతామహుడే అతనిని పెంచి పెద్ద చేశాడు. మాతామహుడు అతనిని కఠినంగా చూసినా మాతామహి ప్రేమను అతడు కొంత వరకు చూరగొనగలిగాడు. చిన్నతనంలో తాత అతనిని చదివించకుండా 8వ ఏట నుంచే అతనిని పనులలోకి పంపాడు. చెప్పుల దుకాణంలో పనివాడుగాను, ప్రెస్సులో వార్తాహరుడుగాను, వోల్గా ఓడలో ప్లేట్లు కడిగే వాడు గాను గోర్కీ పనిచేశాడు. వోల్గా ఓడలో పనిచేస్తున్న రోజులలోనే అక్కడి వంటవాడు పుస్తకాలు చదవడంలో గోర్కీకి ఆసక్తి కలిగించాడు. ఆ ఆసక్తి జీవితాంతం ఆయనలో నిలిచి ఉంది. యజమానులచేత తరచు దెబ్బలు తింటూ, ఆకలితో నకనకలాడుతూ సరి అయిన దుస్తులు కూడా లేకుండా గోర్కీ ఎన్నెన్నో బాధలు అనుభవించాడు. ఆ కష్టాల వల్లనే 'గోర్కీ' (చేదు) అనే తన కలంపేరు కల్పించుకున్నాడు. యౌవనారంభ కాలంలో గోర్కీ 'కజాన్'లో రొట్టెలు కాల్చే పనివాడు గాను, డాక్ పనివాడుగాను, నైట్ వాచ్‌మన్‌గాను ఇలా ఎన్నో పనులు చేశాడు. 21 వ ఏట కజాన్‌ను వదిలి ఏవేవో చిల్లర పనులు చేస్తూ దేశ దిమ్మరిగా రష్యా అంతటా తిరిగాడు.

1899-1906 మధ్య సెంట్ పీటర్స్‌బర్గ్ (లెనిన్ గ్రాడ్) లో మార్క్సిస్ట్ అయి, సోషల్ డెమోక్రాటిక్ పార్టీని బలపరచ సాగాడు. 1903 లో పార్టీలో చీలిక లేర్పడినపుడు గోర్కీ బోల్షివిక్ పక్షంలో చేరాడు. అయితే బోల్షివిక్ నాయకుడు లెనిన్‌తో తరచు ఆయనకు అభిప్రా యభేదాలు వస్తూ ఉండేవి. 1901 లో గోర్కీ రచించిన విప్లవాత్మకగీతం *సాంగ్ ఆఫ్ ది స్టార్మీ పెట్రెల్* ప్రచు రించినందుకు గాను *జిజ్న్* (Life) అనే మార్క్సిస్ట్ పత్రికపై ప్రభుత్వం చర్య తీసుకుంది. గోర్కీ అరెస్ట్ అయి వెంటనే విడుదల చేయబడి, క్రిమియా వెళ్లాడు. అప్పటికే ఆయనలో క్షయవ్యాధి లక్షణాలు అంకు రించాయి. 1902 లో ఆయన 'రష్యన్ అకాడమీ ఆఫ్ సైన్సెస్' సభ్యుడుగా ఎన్నుకోబడ్డాడు. అయితే కొన్ని రాజకీయ కారణాలవల్ల వెంటనే ఆ ఎన్నికను రద్దు చేశారు. తత్ఫలితంగా చెకోవ్, కోరోలెంకోలు అకాడమీ నుంచి రాజీనామా చేశారు. గోర్కీ 'జ్నానియే' (విజ్ఞానం) అనే ప్రచురణ సంస్థ ఆరంభించాడు. 1905 నాటి విప్లవంలో గోర్కీ ప్రముఖపాత్ర వహించాడు. ఆ మరుసటి ఏడాది అరెస్ట్ అయి విదేశాల నుంచి వెలువడిన నిరసనల ఫలితంగా వెంటనే విడుదల చేయబడ్డాడు. తరువాత గోర్కీ తన సతీమణితో సహా అమెరికాలో పర్యటించి న్యూయార్క్‌లోని జీవిత విధానాన్ని నిరసిస్తూ *ది సిటీ ఆఫ్ ది యెల్లో డెవిల్* (1906) అనే కథల సంపుటి ప్రచురించాడు.

1906 లో రష్యా వదలి 7 ఏళ్ల పాటు రాజ కీయ నిర్వాసితుడుగా జీవితం గడిపాడు. 1913 లో రష్యా తిరిగి వచ్చి, ప్రథమ ప్రపంచ సంగ్రామంలో రష్యా పాల్గొనడాన్ని వ్యతిరేకించిన బోల్షివిక్‌లను సమర్థించాడు. 1917 లో బోల్షివిక్‌లు అధికారం కైవశం చేసుకోడాన్ని ప్రతిఘటించి, లెనిన్ నియంతృత్వ ధోరణులను తన *నోవ యజీజ్న్* (న్యూ లైఫ్) అనే పత్రికలో విమర్శించసాగాడు.

1921-28 మధ్య గోర్కీ ఇటలీలోని సోరెంటోలో గడిపాడు. మధ్య మధ్య జర్మనీ మొదలైన దేశాలు సంద ర్శించి వచ్చేవాడు గాని రష్యాకు మాత్రం తిరిగిరాలేదు. చివరికి 1928 లో తన అభిమానుల ఒత్తిడి వల్ల రష్యాకు తిరిగి వచ్చాడు. అతని షష్టి పూర్తి వేడుకలు అతడు ఎన్నడూ ఊహించనంత వైభవంగా జరిగాయి. ఆ మరుసటి ఏడాదే మకాం పూర్తిగా రష్యాకు తర లించి చనిపోయే పర్యంతం అక్కడే ఉన్నాడు. స్టాలిన్ అధికారంలోకి వచ్చిన తరువాత గోర్కీ అతనికి అండగా నిలిచాడు. 1934 లో సోవియెట్ రచయితల యూని యన్ ఏర్పడినప్పుడు దానికి ఆయనే మొదటి అధ్యక్షుడు అయాడు.

గోర్కీ మరణాన్ని గూర్చి కొన్ని అపోహలు ఉన్నాయి. 1936 జూన్ 14 న ఆకస్మికంగా ఆయన మరణించినపుడు అది సహజ మరణమా, బలవన్మరణమా అన్న ప్రశ్న తల ఎత్తింది. 1938 లో జరిగిన బుఖారిన్ ప్రభృతుల విచారణ సందర్భంలో ఆ అంశం చర్చకు వచ్చింది. 'బ్లాక్ ఆఫ్ రైటిస్ట్స్ అండ్ ట్రాట్‌స్కీయిట్స్' అనే సోవియెట్ వ్యతిరేక సంస్థ వారి కుట్రకు గోర్కీ బలి అయినట్లు ఆ విచారణలో తేలింది.

రచనా వ్యాసంగం: గోర్కీ రచించిన మొట్టమొదటి కథ *మకార్ చూద్రా* (1892). తరువాత అలాంటి కాల్పనిక కథలు, అన్యాపదేశ కథలు అనేకం అతడు రచించాడు. 1895 లో 'చల్కాష్' ప్రకటనతో రచయితగా అతని విజయం ప్రారంభమైంది. 'చల్కాష్' ఒక హార్బర్ దొంగ

జీవితాన్ని కాల్పనిక, వాస్తవిక దృష్టుల సమ్మేళనంతో చిత్రించిన ఆయన తొలి ప్రముఖ రచన. 1899 లో *ట్వెంటీ సిక్స్ మెన్ అండ్ ఏ గర్ల్* అనే సుప్రసిద్ధ కథను గోర్కీ రచించాడు. అప్పటికే ఆయన టాల్‌స్టాయ్‌తోనూ, చెకోవ్‌తోనూ సమానమైన మహారచయితగా గుర్తింపు పొందాడు.

**నాటకాలు - నవలలు:** గోర్కీ మొదటి నవల *ఫోమా గోర్డెయేవ్* (1899). ఆ నాటినుంచి రష్యాలో ధనస్వామ్యాభివృద్ధి గోర్కీ రచనలకు ప్రధానమైన ఇతివృత్తం అయింది. గోర్కీ రచించిన *అమ్మ* అనే నవల అనేక ప్రపంచ భాషలలోకి అనువాదం పొందడమే కాకుండా 1926 లో ఒక మూకీ చిత్రంగా కూడా తయారుచేయబడింది. తరువాత 1930-31 లో బెర్టోల్ట్ బ్రెఖ్ట్ దానిని నాటకీకరించాడు. గోర్కీ రచించిన నాటకాలలో *నాడ్నే* (1902), *ది లోవర్ డెప్త్స్* (1906) ప్రముఖమైనవి.

గోర్కీ రచనలలో సర్వోత్కృష్టమైన ఆయన ఆత్మకథ మూడు సంపుటాలుగా ఆయన తుది రోజులలో వెలువడింది. మొదటి సంపుటం 'నా బాల్యం' (1913), రెండవసంపుటం: 'ఈ ప్రపంచంలో' (1915-16), మూడవది: 'నా విశ్వ విద్యాలయాలు' (1923). నిజానికి గోర్కీ అధ్యయనం చేసిన ఒకే ఒక విశ్వవిద్యాలయం జీవితమే. 'కజన్' విశ్వవిద్యాలయంలో చేరి చదువుకోవాలనే ఆయన ప్రయత్నం విఫలం అయింది. రష్యన్ భాషలో వెలువడిన ఆత్మకథ లన్నింటిలోకీ తలమానికమని చెప్పదగింది గోర్కీ ఆత్మకథ. దానిలో ఆయన స్వంత జీవిత విశేషాలు స్వల్పభాగం మాత్రమే! ఎక్కువ భాగం ఆ నాటి రష్యాలోని పరిస్థితుల చిత్రణే! చివరి వరకూ గోర్కీ రచనలు చేస్తూనే ఉన్నాడు. కాని ఆయన తుది రచనలలో విప్లవాత్పూర్వకాలం నాటి సంఘమే చిత్రించబడింది. 'ది ఆర్టమనోవ్ బిజినెస్' (1925) అనే ఆయన ప్రసిద్ధమైన నవలలో విప్లవానికి ముందు రష్యాలో ధనస్వామ్యం యొక్క అభ్యుదయ పతనాలు చిత్రించబడ్డాయి. చివరి రోజులలో వ్రాసిన నాటకాలలో *యెగోర్ బులిఖోవ్ ఈ బ్రుగియే* (1932), *డాస్టిగ్లేవ్, ఇతరులు* (1933), *తుది నాటకాలు* (1937) చెప్పుకోదగినవి. అయితే ఆ రోజులలో ఆయన రచనలలో మిక్కిలి ప్రజాదరణ పొందిన గ్రంథం టాల్‌స్టాయ్‌ని గూర్చిన ఆయన జ్ఞాపకాలు (1919). చెకోవ్ ను గూర్చి గోర్కీ వ్రాసిన గ్రంథం కూడా ప్రజాదరణ పొందింది. స్టాలిన్ హయాము లోని దారుణ సంఘటనలను సమర్థిస్తూ అప్పుడప్పుడు గోర్కీ కొన్ని కరపత్రాలు కూడా ఆ రోజులలో ప్రచురిస్తూ వచ్చాడు. అజరామరులైన ప్రపంచ రచయితలలో గోర్కీ ఒకరు.

బా.శ్రీ.

**గోల్డింగ్, విలియమ్ :** చూ. అనుబంధం-I.

**గోల్డోనీ, కార్లో (1707-1793) :** ఇటాలియన్ నాటకకర్త. వాస్తవికతా దృష్టితో కూడిన ఆధునిక కామెడీకి పితామహుడుగా పరిగణింపబడుతున్నవాడు. అంతకు పూర్వం ఉన్న ముఖం తొడుగులు ధరించి ప్రదర్శించే నాటక విధానానికి స్వస్తి చెప్పి, సాహజికత ఉట్టిపడే పాత్రలతో, గాఢ బంధం గల సంవిధానాలతో, సజీవమైన సంభాషణలతో కూడిన నూతన ఇటాలియన్ కామెడీకి నాంది పలికినవాడు.

ఒక వైద్యుని కుమారుడుగా గోల్డోనీ 1707 ఫిబ్రవరి 25 న వెనిస్ నగరంలో జన్మించాడు. చిన్నతనంలోనే తండ్రి తాలూకు లైబ్రరీలోని కామెడీ లన్నీ చదివాడు. 1721 లో రిమినీ స్కూలు నుంచి పారిపోయి, కొన్నాళ్లు ఒక దేశద్రిమ్మరి నటబృందం వెంట తిరిగాడు. తిరిగి 'పావియా' లో పాపల్ కళాశాలలో చేరి ప్లాటస్, టెరెన్స్, అరిస్టోఫనీస్‌ల కామెడీలు చదివాడు. అనంతరం మోలియర్ నాటకాలు చదవడం కోసం ఫ్రెంచ్ భాషను నేర్చుకున్నాడు.

పావియా నగరంలోని మహిళలను గురించి ఒక వ్యంగ్య నాటిక రచించినందుకు గోల్డోనీని ఘిస్లేరీ కాలేజి నుంచి బహిష్కరించారు. తరువాత అనిష్టంగానే పావియా యూనివర్శిటీలో న్యాయశాస్త్రం చదువసాగాడు. కొన్నాళ్లు వెనిస్‌లోను (1731-33), కొన్నాళ్లు 'పెసా' లోనూ (1744-48) న్యాయవాదగాను, దౌత్యోద్యోగిగాను పని చేసినప్పటికీ గోల్డోనీ నిజమైన ఆసక్తి మాత్రం వెనిస్ నగరంలోని 'టీట్రో శాన్ శామ్యుయేలే' థియేటర్‌కి నాటకాలు వ్రాయడంలోనే ఎక్కువగా కనిపించేది. 1748 లో టీట్రోసంత్ ఆంజలో, కంపెనీవారికి నాటకాలు వ్రాసి పెట్టడానికి గోల్డోనీ అంగీకరించాడు. గోల్డోనీ తొలి నాటకాలు ప్రాచీన, ఆధునిక విధానాల మధ్య ఊగిసలాడుతున్నట్లు కనిపించినా, *లా పమేలా* (ప్రదర్శన: 1750) అనే నాటకంలోనే ముఖం తొడుగుల పాత్రలకు పూర్తిగా ఆయన స్వస్తి చెప్పాడు. 'లా పమేలా' శామ్యుయెల్ రిచర్డ్‌సన్ నవలకు నాటకీకరణ.

1750-51 లో గోల్డోనీ 16 క్రొత్త కామెడీలను వ్రాసి ఇవ్వడానికి అంగీకరించాడు. వాటిలో అత్యుత్తమమైనవి: *ఐ పెట్టిగో లెజ్జీ డెలే డానే* ( స్త్రీల పిచ్చాపాటీ), *ఇల్ బుగియార్డో* (అబద్ధాలకోరు), *ఇల్ వెరో అమికో* (నిజమైన నేస్తం).

1753 నుంచి 1762 వరకు గోల్డోనీ 'టీట్రోశాన్ లూకా' (ప్రస్తుతం దీని పేరు టీట్రో గోల్డోనీ) కంపెనీవారికి నాటకాలు వ్రాసి ఇచ్చాడు. ఈ కాలంలో వచ్చిన ప్రధానమైన నాటకాలు: *లా లోకండీరా* (ప్రదర్శన: 1753), వెనీషియన్ మాండలికంలో వ్రాసిన *ఐ రుస్తే ఘీ* (ప్రదర్శన: 1760, 'నిరంకుశులు') *లే బరు ఫే చియో జోటే* (ప్రదర్శన: 1762, 'చియోగియా కలహాలు').

అప్పటికే పీట్రో చియారీ అనే నాటకకర్తతో గోల్డోనీకి పోటీ ఏర్పడింది. తన *ఇల్ మాల్ కం టెంటి* అనే నాటకంలో అతనిని వ్యంగ్యంగా పరిహసించాడు. కార్లో గోడ్జీ అనే ప్రాచీన నాటక విధాన సమర్థకుడు ఒక వ్యంగ్య కావ్యంలో (1757) గోల్డోనీని విమర్శించాడు. మరొక నాటకం *లా మోరే డెల్లే టే మిలారెట్* (ప్రదర్శన: 1761) లోగోల్డోనీ, చియారీని ఇద్దరినీ ఆయన పరిహసించాడు.

1762 లో గోల్డోనీ *కామెడీ ఇటాలియన్నీ* ని డైరెక్టు చేయడం కోసం వెనిస్ నుంచి తన మకామును పారిస్‌కు మార్చాడు. తరువాత తన ఫ్రెంచ్ నాటకాలన్నింటినీ వెనీషియన్ ప్రేక్షకుల కనుగుణంగా త్రిప్పి వ్రాశాడు.

1764 లో గోల్డోనీ పదవీ విరమణ చేసి, వెర్సైయిల్స్ లోని రాకుమార్తెలకు ఇటాలియన్ బోధింపసాగాడు. 1783 లో ఫ్రెంచ్ భాషలో సుప్రసిద్ధమైన తన మెమాయిర్స్ (స్మృతులు) రచించడం మొదలు పెట్టాడు. ఫ్రెంచ్ విప్లవం తరువాత అతని ఉపకారవేతనం రద్దయి, గోల్డోనీ దారిద్ర్యంతో మిక్కిలి బాధపడ్డాడు.

*బా.శ్రీ.*

**గ్రాస్, గ్యుంటెర్ (1927-) :** జర్మన్ భాషలో నాజీయుగంలో పేర్కొనదగిన నవలా రచయిత, కవి, నాటకకర్త, ముద్రాపకుడు. 1959 లో ప్రచురితమైన అద్భుతమైన అతని మొదటి నవల డై బ్లెక్ట్రోమెల్ సాహిత్య ప్రపంచంలో ఒక నూతన శకానికి అంకురార్పణ చేసింది.

తన స్వగ్రామం అయిన డేన్జిగ్‌లో గ్యుంటెర్ హిట్లర్ యువ వ్యవస్థలో శిక్షితుడై 16 వ ఏటనే సైన్యంలో చేరి యుద్ధంలో క్షతగాత్రుడై యుద్ధ ఖైదీగా నిర్బంధింపబడ్డాడు. తరువాత జీవితంలో నల్లబజారు వ్యాపారిగా, సమాధిరాళ్లు చెక్కుడు పనివాడుగా, 'జాజ్‌బాండు' లో డ్రమ్ వాయించే వాడుగా వివిధ రకాల వృత్తులు చేపట్టాడు. రచయితల సమాఖ్య ఒకటి 'గ్రూప్ 47' అని ఉండేది. దానివల్ల ఉత్తేజితుడై వ్యాసాలు, పద్యాలు ఎన్నో రచించాడు. మొదట్లో అవి అంతగా ప్రజలను ఆకర్షించకపోయినా, 1956 లో పారిస్ నగరం వెళ్లి అతడు వ్రాసిన సుప్రసిద్ధ నవల *డై బ్లెక్ట్రోమెల్* ఒక రకంగా గ్యుంటెర్ జీవితాన్నీ, ఆ నాటి సాంఘిక వ్యవస్థనూ సజీవంగా చిత్రించడం వల్ల 1972 లో ఆ నవల సినిమాగా కూడా తీయబడింది.

దాని తర్వాత 1961 లో అతడు వ్రాసిన నవలిక *కాట్ అండ్ మౌస్* 1963 లో ఆంగ్లీకరించబడింది. 1963 లో అతడు వ్రాసిన ఐతిహాసిక నవల *హుండె జారె* 1965 నాటికి *డాగ్ యియర్స్* గా ఆంగ్లీకరించబడింది. ఈ మూడు నవలలూ గ్రాస్ రచనల విశ్లేషణకు పనికి వచ్చే నవలాత్రయం.

రాజకీయ చైతన్యం గల రచనలే అతని నవలలన్నీ. గ్రాస్ సోషల్ డెమొక్రటిక్ పార్టీ తరఫున రాజకీయ రంగంలో ప్రవేశించి సాంఘిక, సాహిత్య విలువల పరిరక్షణ కోసం పాటు పడ్డాడు.

పప్పు

**గ్రాసా అరానా, హోసె పెరీరా డా (1868-1931) :** ప్రసిద్ధ బ్రెజిలియన్ నవలా రచయిత. సావో లూయిజ్ లో 1868 జూన్ 21 న జన్మించాడు. ఈయన నవలా రచయితే కాదు, రాజనీతిజ్ఞుడు కూడా! ఈయన వ్రాసిన *కానా* ('Canaa') అనే నవల బాగా ప్రసిద్ధి పొందింది. ఈ నవల ద్వారా ఈయనకు మంచి పేరు ప్రఖ్యాతులు లభించాయి. ఈ నవలలో ఇద్దరు జర్మన్ వలసదారుల ఆలోచనా రీతులనూ, సమస్యలనూ వివరించడం ద్వారా బ్రెజిలియన్ జాతి వైరుధ్యాలకు కారణాలను అన్వేషించాడు. ఈ నవల లోని తాత్త్విక వివరణలూ, లలితమైన వర్ణనలూ ప్రపంచ పాఠకులకు బ్రెజిల్‌లోని ప్రకృతి దృశ్యాల సొగసునూ, ఆ సమాజంలోని సమస్యలనూ పరిచయం చేస్తున్నాయి.

బ్రెజిలియన్ అకాడమీ ఆఫ్ లెటర్స్ సంస్థాపక సభ్యుడుగా ఈయనకు బ్రెజిల్‌లో ఒక విశిష్ట గౌరవం ఏర్పడింది. ఈయన తన సాహిత్య జీవితాన్ని సామాజిక, రాజకీయ కళా రంగాలలో కృషి చేయడానికి అంకితం చేశాడు. ఈయన నూత్న కల్పనోత్సాహం వయస్సు పెరిగినా ఏ మాత్రం తగ్గి పోలేదు. 1920 లో ఈయనకు బ్రెజిల్‌లోని మోడర్నిస్ట్ ఉద్యమంతో సన్నిహిత సంబంధం ఏర్పడింది. అకాడమీ ప్రమాణాలు లాంఛన ప్రాయమై మరుగుపడి పోయాయని భావించడం వల్ల అందుకు నిరసనగా ఈయన 1924 లో అకాడమీకి

రాజీనామా చేశాడు. ఈయన తన రచనలో నిరంతరం పురోగామి సాహిత్య రీతుల మీద ప్రయోగాలు చేస్తూ వచ్చాడు. ఈయన మరణానికి కొంత ముందు ప్రచురితమైన 'అద్భుత యాత్ర' (1929) అనే నవలలో ఈయన ఎన్నో క్రొత్త క్రొత్త పదాలను, జాతీయాలను చొప్పించాడు. ఈయన వ్రాసిన *ఏ ఈస్థెటికా దా విదా* (1925), *ఒ ఎస్పిరిటో మోడెర్నో* (1925) అనే వ్యాసాలలో ఈయన వెలిబుచ్చిన అభిప్రాయాలు ఎంతో యుక్తియుక్తంగా ఉన్నాయి.

పద్మాకర్

**గ్రిమ్ సోదరులు- గ్రిమ్, జాకబ్ లుడ్విగ్ కార్ల్ (1785-1862), గ్రిమ్, విల్‌హెల్మ్ కార్ల్ (1786-1859) :** ప్రప్రథమ జర్మన్ జానపద వాఙ్మయ సంగ్రాహకులు, పరిశోధకులు, భాషా శాస్త్రవేత్తలు, నిఘంటు కర్తలు. వీరి సంకలనం *కిండర్ ఉండ్ హౌస్ మార్చిన్* (1812-22). ప్రపంచంలోనే జానపద వాఙ్మయ పరిశోధన శాఖకు ప్రాతిపదిక అయింది. ముఖ్యంగా జాకబ్ గ్రిమ్ చారిత్రక భాషా శాస్త్ర రంగంలోనూ, జర్మానిక్ ఫైలాలజీ రంగంలోనూ అమూల్యమైన కృషి చేశాడు.

గ్రిమ్ సోదరుల తండ్రి 'ఫిలిప్ విల్ హెల్మ్' హనౌ అనే చిన్న పట్టణంలో ఒక లాయరు. ఆయనకు 5 గురు కుమారులు, ఒక కుమార్తె. గ్రిమ్ సోదరులే పెద్దవారు. 1796 లో తండ్రీ, 1808 లో తల్లీ చనిపోవడంతో అప్పటికి 23 ఏళ్లవాడైన జాకబ్ గ్రిమ్ మీద తన నలుగురు తమ్ముళ్లనూ, చెల్లెలినీ పైకి తీసుకురావలసిన బాధ్యత పడింది. 'కాసెల్' లో హైస్కూలు చదువు ముగించి గ్రిమ్ సోదరులు మార్‌బుర్గ్ యూనివర్శిటీలో తమ తండ్రిలాగే న్యాయ శాస్త్రం అధ్యయనం చేశారు (1802-6). మార్‌బుర్గ్‌లో ఉండగానే 'క్లిమెన్స్ బ్రెంటేమర్' వారిలో జానపద కవితా ప్రియత్వాన్ని ఉద్బుద్ధం చేశాడు. అలాగే 'హిస్టారికల్ స్కూల్ ఆఫ్ జ్యూరిస్‌ప్రుడెన్స్' వ్యవస్థాపకులలో ఒకడైన 'ఫ్రీడ్రిఖ్ కార్ల్ ఫాన్ సావిగ్నీ' ప్రాచీన పత్రాల పరిశోధనకు శాస్త్రీయమైన విధానాన్ని వారికి బోధించాడు. అదే అటు తరువాతి కాలంలోని వారి పరిశోధనలకు బలమైన పునాది అయింది. గ్రిమ్ సోదరులమీద ప్రభావం చూపినవారిలో తత్త్వవేత్త 'యోహాన్ గోట్‌ఫ్రీడ్ హెర్డర్' (1744-1803) కూడా ఒకరు. జానపద కవిత్వ స్వరూపాన్ని ఆయన వారికి బోధించాడు. అయితే వారు పరమ స్వతంత్రులుగా తమ పరిశోధన సూత్రాలను తామే రూపొందించుకున్నారు.

1806 లో ఫ్రెంచ్‌వారి ఆగమనంతో జాకబ్ 'కింగ్ జెరోమ్ ఆఫ్ వెస్ట్‌ఫేలియా' ప్రైవేట్ లైబ్రరీకి లైబ్రేరియన్ అయాడు. 1813 లో నెపోలియన్ ఓటమితో ఆ ఉద్యోగం వదులుకోవలసి వచ్చింది. జాకబ్ వియెనా కాంగ్రెస్ (1814 సెప్టెంబరు-1815 జూన్) లో పాల్గొన్నాడు. ఈ లోగా 1814 లో విల్‌హెల్మ్ కాసెల్‌లోని ఎలెక్టర్స్ లైబ్రరీకి సెక్రటరీ అయాడు. 1816 లో జాకబ్ కూడా ఆ లైబ్రరీలోనే చేరాడు. 18 వ, 19 వ శతాబ్దాలనాటి గోథిక్ రొమాంటిసిజమ్‌తో ఏకీభవించలేక గ్రిమ్ సోదరులు వాస్తవికతా వాదులుగా ఉండిపోయారు. సుదూర భూతకాలంలోకి పరిశోధనలు జరిపి, తమ కాలంనాటి సాంఘిక సంస్థల కన్నిటికీ పునాదులు ఆ భూత కాలంలో ఉన్నట్లు వారు గుర్తించారు. అయితే ఆ పునాదులను పరిరక్షించాలనే వారి వాదానికి అర్థం తిరిగి గతంలోకి పయనించాలని కాదు. ఆది నుంచీ గ్రిమ్ సోదరులు తమ పరిశోధనలను తమ దేశ సరిహద్దులకే పరిమితం చేయకుండా స్కాండినేవియా, స్పెయిన్, నెదర్లాండ్స్, ఐర్లాండ్, స్కాట్లాండ్, ఇంగ్లండ్, సెర్బియా, ఫిన్‌లాండ్ దేశాల సాహిత్య సంప్రదాయాలకు కూడా విస్తరింప జేశారు.

1805 లో గ్రిమ్ సోదరులు కొన్ని సునిశిత వ్యాఖ్యలలో జానపద సాహిత్యానికీ, ఇతర సాహిత్యానికీ గల ప్రధాన భేదాన్ని వివరించారు. వారి దృష్టిలో జానపద కవిత్వమే నిజమైన కవిత్వం. మానవ జాతి చిరంతనమైన సుఖ దుఃఖాలను, ఆశలను, భయాలను అది వ్యక్తీకరిస్తుంది.

రెండు దశాబ్దాల పాటు (1806-26) జానపద సాహిత్య సేవ చేసిన తరువాత జాకబ్ తన దృష్టిని వ్యాకరణం వైపు, ఫైలాలజీ వైపు మళ్లించి *డాయిట్షే గ్రమేటిక్* (1819-37) అనే గ్రంథం వ్రాశాడు. ఈ శీర్షికలోని 'డాయిట్షే' శబ్దానికి కేవలం 'జర్మన్' అని అర్థం కాదు. దాని వ్యుత్పత్త్యర్థమైన 'సాధారణ' అనే అర్థంలో ఆ మాటను ఆయన ప్రయోగించాడు. 1824 లో జాకబ్ గ్రిమ్ ఒక సెర్బియన్ వ్యాకరణాన్ని జర్మనీకరించి, దానిలో స్లావిక్ భాషలను గూర్చి, సాహిత్యాన్ని గూర్చి అద్భుతమైన ఉపోద్ఘాతం వ్రాశాడు.

1829 లో గ్రిమ్ సోదరులు 'కాసెల్' వదలి గాటింజన్ విశ్వవిద్యాలయంలో లైబ్రేరియన్‌లుగానూ, ప్రొఫెసర్‌లుగానూ చేరారు. 1840 తరువాత ప్రష్యారాజు ఫ్రెడరిక్ నాల్గవ విలియం ఆహ్వానం మీద బెర్లిన్ వచ్చారు. అక్కడ 'రాయల్ అకాడమీ ఆఫ్ సైన్సెస్' లో సభ్యులుగా యూనివర్శిటీలో ఉపన్యాసా లిచ్చారు. అక్కడే వారు

తమ ఉద్గ్రంథమైన *డాయిచ్లెస్ వోర్టర్ బుఖ్* అనే జర్మన్ మహా నిఘంటు సంకలనం ప్రారంభించారు. ఆ నిఘంటువులో 'డి' (D') అక్షరం పూర్తి అయేవరకు విల్‌హెల్మ్, 'ఎఫ్' (F) అక్షరం పూర్తి అయేవరకు జాకబ్ జీవించి ఉన్నారు. బ్రిటన్, ఫ్రాన్స్, నెదర్లాండ్ స్వీడన్, స్విట్జర్లాండ్ వంటి ఇతర దేశాలలో అలాంటి నిఘంటువులు రూపొందడానికి అది ప్రాతిపదిక అయింది.

గ్రిమ్ సోదరులలో జాకబ్ అవివాహితుడుగానే ఉండి పోయాడు. విల్‌హెల్మ్ మాత్రం కాసెల్ లోని 'డరోతియా వైల్డ్' అనే స్త్రీని వివాహమాడి హెర్మన్ (సాహిత్య, కళా చరిత్రకారుడు, 1828-1901), రూడోల్ఫ్ (న్యాయాధిపతి 1830-89), ఆగస్టే (1832-1919) అనే ముగ్గురు సంతానాన్ని కన్నాడు. గ్రిమ్ సోదరుల సమాధులు వెస్ట్ బెర్లిన్‌లోని 'మత్తాకిర్ఫోఫ్' లో ఉన్నాయి.

బొ.శ్రీ.

**గ్రిమ్మేల్ షౌజెన్, హాన్స్ జాకొబ్ క్రిస్టోఫ్ వాన్ (1622-1676) :** 17 వ శతాబ్దపు జర్మన్ నవలా రచయితలలో వ్యంగ్య పరిహాస నవలా రచయితగా గ్రిమ్మేల్ షౌజెన్ పేరు గడించాడు. తాను వ్రాసిన *సింప్లి సిస్సిమస్* అనే నవలా మాల లో కొంత వరకూ ఈయన స్వీయ చరిత్ర కూడా ఇమిడి ఉంది. యూరప్‌లో జరిగిన 30 ఏళ్ల యుద్ధం (1618-1648) లో క్రౌర్యాన్నీ, అమానుషత్వాన్నీ ఈయన మొదటి నవలలో హృదయంలో నాటుకొనేటట్లుగా వర్ణించాడు. 1622 లో పశ్చిమ జర్మనీలోని గెల్న్‌హాసెన్‌లో పుట్టిన ఈయన బాల్యావస్థలోనే ఇతరుల ఒత్తిడి వలన 30 ఏళ్ల యుద్ధంలో పాల్గొనవలసి వచ్చింది. తరువాత ఈయన సైనికుడుగా అభివృద్ధి సాధించి, 1639 నాటికి ఫాన్ షాయెన్‌బర్గ్ అనే నాయకుని ప్రాపకం పొందాడు. ఇరవై ఏళ్ల పాటు ఆ కుటుంబానికి సేవ చేశాడు కాని, 1660 లో వారి ధనాన్ని తన స్వప్రయోజనానికి వాడుకొన్నాడని తెలియడంతో అచ్చటి నుండి వెడలగొట్ట బడ్డాడు. సైన్యంలో ఉండగానే ఈయన రచనా వ్యాసంగం ప్రారంభించాడు గాని, తన మొట్టమొదటి ప్రముఖ *ఎడ్వెంచరస్ సింప్లి సిస్సిమస్* లో మొదటి భాగాన్ని 1669 లో మాత్రమే ప్రచురింప గలిగాడు. ఈ నవలా మాల *సింప్లిసిస్సిమస్* 16 వ శతాబ్దపు జర్మనీలో నెలకొని ఉన్న మూఢ విశ్వాసాలు, భయాలతోనిండివున్న వాతావరణంలో మానవుని ఆత్మయొక్క యాత్రను వర్ణిస్తుంది. ఈ నవలలో గ్రామీణ హాస్య ధోరణి, అతి క్రూరమైన అప్పటి మానవుల ప్రవర్తన చాలా వాస్తవికంగా వర్ణింపబడ్డాయి. ఈ నవలలోని పాత్రలను, కథను తరువాతి నవల లైన *కరేజ్ ది ఎడ్వెంచరెస్* (1669), *ది మేజికల్ బర్డ్స్ నెస్ట్*, (1672) లో కూడా చిత్రీకరించాడు. వీనిలో ఆయన ముఖ్యంగా మానవుని పేరాశను, వైరితనాన్ని వ్యంగ్యంగా విమర్శించి, ఆ కాలపు యూరప్‌లోని ప్రజలను ఆకర్షించాడు. 1676 లో స్ట్రాస్‌బర్గ్‌లోని రెంచెన్ నగరంలో గ్రిమ్మేల్‌షౌజెన్ మరణించాడు.

డి.ఐ.రా.

**గ్రిల్‌పార్జర్, ఫ్రాంజ్ (1791-1872) :** ఆస్ట్రియన్ నాటక రచయిత. విషాదాంత నాటకాల రచయితగా ఆస్ట్రియాలో ప్రసిద్ధి పొందిన ఫ్రాంజ్ వియెన్నాలో జన్మించాడు. తండ్రి ఋణ బాధలతో 1809 లో మరణించాడు. తల్లి సంగీత విద్వాంసుల కుటుంబానికి చెందినది. భర్త మరణించిన పదేళ్లకు ఆమె ఆత్మహత్య చేసుకుంది. వియెన్నా విశ్వవిద్యాలయంలో న్యాయశాస్త్ర పట్టభద్రుడైన ఫ్రాంజ్ జీవితంలో ఎక్కువ కాలం ప్రభుత్వోద్యోగిగా గడిపాడు.



1817 లో ఫ్రాంజ్ సాహిత్య జీవితం అతని తొలి విషాదాంత నాటకం *డీ ఆన్ ఫ్రావ్* ప్రదర్శనతో ప్రారంభం అయింది. తరువాతి సంవత్సరంలోనే ఇతడు ప్రఖ్యాత రంగస్థల వేదిక హోఫ్‌బర్గ్ థియేటర్‌కు రచయితగా నియమింపబడ్డాడు. సున్నితమైన మనస్సు గల ఫ్రాంజ్ తన జీవితంలో ప్రణయ కలాపాలవల్ల, తన నాటకాలమీది విమర్శలవల్ల, ప్రజల అభిరుచి లోపం వల్ల ఎంతో బాధ పడ్డాడు. 1820-21 మధ్య కాథరీనా అనే ఆమెను ప్రేమించినా, పెళ్లి చేసుకోలేక పోయాడు. భగ్న ప్రేమికుడుగా మరో రెండు ప్రణయాలలో కూడా తీవ్రమైన బాధకు గురి అయాడు. అతని డైరీలవల్ల, అతని పద్య సంకలనం *ట్రిస్టియా ఎక్స్ పేటో* (1835) వల్ల ఈ విషయాలు మనకు అవగతమౌతున్నాయి.

విమర్శకు గురి అయి బాధ పడడం వల్ల 1830 నుంచి రచనలు కొంచెం తాపీగా చేయడం మొదలు పెట్టాడు. తరువాతి సంవత్సరాలలో అతడు సంపాదించిన కీర్తి తన సాహిత్య జీవితారంభంలో పొందిన

బాధకు కొంత ఉపశమనాన్ని కలిగించింది. 1861 నాటికి చట్టసభకు ఎన్నికైనా, తన 80 వ జన్మదినోత్సవం దేశం అంతా జరుపుకున్నా, గ్రాంజ్ మరణించే నాటికి అతని నాటకాలు మూడు ఇంకా అముద్రితాలుగానే మిగిలి పోయాయి.

గ్రాంజ్ రచనలలో అతని 12 దుఃఖాంత నాటకాలు, ఒక సుఖాంత నాటకం నాటక ప్రక్రియా వైవిధ్యాన్ని, ఇతివృత్త విభిన్నతను సూచిస్తాయి. గ్రీక్ ఇతిహాసాల నుండి స్వప్న వృత్తాంతాల వరకు, భగ్నప్రణయం నుండి బాధాతప్త జీవన రీతి వరకు వీనిలో అన్నీ చిత్రింపబడ్డాయి.

నాటకంలో సంఘటనలకు సరిపోయిన సంభాషణలు రచించడం గ్రాంజ్ రచనలలోని విశిష్టత. పాత్రలు తమ తమ పరిధులలోనే ఉంటూ చివరికి ఎలా విచ్ఛిన్నం అవుతాయో ఇతని దుఃఖాంత నాటకాలలో ప్రస్ఫుటంగా గోచరిస్తుంది. 1818 లో ప్రదర్శింపబడిన *సాఫ్హో* అనే నాటకంలో జీవితానికీ, కళకూ గల విభిన్న పరిధులను ప్రతిబింబింప చేశాడు. తల్లి ఆత్మహత్య చేసుకున్న తరువాత అతడు వ్రాసిన నాటకం *ది గోల్డెన్ ఫ్లీస్* (1821) లో బ్రతుకులో నిరాశ, నిస్పృహ ఎలా అవరిస్తాయో చూపిస్తాడు రచయిత. *ది వేవ్స్ ఆఫ్ సీ అండ్ లవ్* అనే అతని దుఃఖాంత నాటకం గ్రాంజ్ రచనలన్నిటిలోను తలమానిక మైంది. *హీరో అండ్ లియాండర్* ఇతివృత్తంగా గల ఈ నాటకంలో వస్తువుకి, శైలికి మధ్య ఒక చక్కని సమన్వయం కనిపిస్తుంది.

గ్రాంజ్ మరణం తర్వాత అతని అముద్రిత నాటకాలు మూడూ ప్రచురిత మయాయి. ఆ మూడింటిలో *ది జ్యూయెస్ ఆఫ్ టోలెడో* లో ఒక రాజు ఒక లేబ్రాయపు స్త్రీపై పెంచుకున్న వ్యామోహం ఇతివృత్తం.

గ్రాంజ్ రచనలలో ఆదర్శవంత మైన ఇతివృత్తాల కన్న సామాజిక స్పృహ, జీవితాన్ని ప్రతిబింబించే ఇతివృత్తం ఎక్కువగా కనిపిస్తాయి.

పప్పు

**గ్లిన్, ఎలినోర్ (1864-1943) :** ఆంగ్ల నవలా రచయిత్రి. ఏ పాఠశాలకూ వెళ్లి చదువుకోక పోయినా, ఇంటి గ్రంథాలయంలో పుస్తకాలు ఎన్నో చదివి లార్డ్ కర్జన్, మిల్నెర్, బ్రాడ్లే వంటి వారి సాహచర్యంలో, గ్లిన్ కావలసిన పరిజ్ఞానాన్ని సంపాదించింది.

*వరల్డ్* పత్రికలో ధారావాహికంగా ప్రచురితమైన ఆమె మొదటి నవల *ది విజిట్స్ ఆఫ్ ఎలిజబెత్*. దీనిలో ఒక అమ్మాయి తన తల్లికి వ్రాసిన ఉత్తరాల ద్వారా ధనికులైన ప్రయాణికుల విచ్చలవిడితనం చిత్రీకరించబడింది. 1900 లో ఇది పుస్తకంగా ప్రచురితమైంది. ఇందులో గ్లిన్ నిశిత దృష్టి, విషయపరిజ్ఞానం మనకు గోచరిస్తాయి. ఇలాంటివే మరికొన్ని రచనలు చేసి గ్లిన్ ఒక్కసారిగా గాఢమైన కాల్పనిక జగత్తు ఇతివృత్తంగా గల నవలలు వ్రాయటం ప్రారంభించింది. ఆ రోజుల్లో ఆమె రచనలను సంఘం వేనోళ్ల కొనియాడింది. ఇతివృత్తం కన్న ఆమె కథా కథన విధానం అందరినీ ఎక్కువగా ఆకర్షించింది.

1907 లో ఆమె వ్రాసిన *త్రీ వీక్స్* అనే నవల గొప్ప సంచలనాన్ని కలిగించింది. దీనికి ఒక రాణి సామాన్య పౌరునితో పెట్టుకున్న అక్రమ సంబంధం ఇతివృత్తం. కొన్ని లక్షలమంది ఆ నవల చదివారు. తరువాత నాటకంగా కూడా దానిని ప్రదర్శించారు. ఈ నవలలో నాయకుడు మరణిస్తాడు; నాయిక మళ్లీ పుడుతుంది. 1910 లో ఆమె వ్రాసిన *హిజ్ అవర్* కూడా మంచి పేరు సంపాదించింది. 1916 లో ఆమె వ్రాసిన *ది కెరియర్ ఆఫ్ కేథరీన్ బుష్* లో ఒక సామాన్య స్త్రీ నాయిక.

1916 నుంచి గ్లిన్ రచనలు చేయడం తప్పని సరిఅయిన పరిస్థితి ఏర్పడింది. ఆ మరుసటి సంవత్సరం ఆమె భర్త మరణించాడు. ఆమె ఋణగ్రస్తురాలైంది. ఈ కాలంలో ఆవిడ వ్రాసిన నవల లన్నీ ఇంగ్లాండు, అమెరికాలలో పాఠకులను దృష్టిలో పెట్టుకుని వ్రాసినవే. 1920 లో ఆమె హాలీవుడ్ లో సినీ రచయిత్రిగా ప్రవేశించింది. చాలావరకు ఆమె నవలలు సినిమాలుగా తీయబడ్డాయి. *ఇట్* అనే ఆమె రచన ఆధారంగా తీయబడిన చిత్రాన్ని చాలాకాలం వరకూ లైంగిక ఆకర్షణకు మారుపేరుగా చెప్పుకునేవారు. 1929 లో తిరిగి గ్లిన్ ఇంగ్లండు వచ్చింది. 1936 లో ఆమె స్వీయచరిత్ర *రొమాంటిక్ అడ్వంచర్* వెలువడింది.

గ్లిన్ నవలా ప్రపంచంలో కొంతకాలం ఒక ప్రభంజనాన్ని సృష్టించిందని చెప్పవచ్చు. 1943 సెప్టెంబరు 23 న లండన్‌లో ఆమె మరణించింది.

పప్పు

**గ్విమార్‌యేస్ రోసా, యోవా (1908-67) :** బ్రెజిలియన్ నవలా రచయిత. 1908 లో బ్రెజిల్ లోని మినాస్ గెరైస్ రాష్ట్రంలో పుట్టిన గ్విమార్‌యేస్ రోసా ఈ శతాబ్ది మధ్యంలో బ్రెజిలియన్ నవలను పునరుజ్జీవింప చేశాడు. తన నవలలలోను, కథలలోను ఈయన బ్రెజిలియన్ ఇండియన్‌ల వాడుక భాష నాధారం చేసికొని ఒక విశిష్టమైన, అనువాదానికి వీలు

కాని వచన శైలిని కల్పించాడు. ఇది ఈయన ప్రత్యేకత. ఈయన రచనలు విప్లవాత్మకమైన వైనా, ప్రాచీన విలు వలను కూడా గౌరవిస్తాయి. ఈయనకు మతంలో ప్రగాఢమైన విశ్వాసం ఉన్నా, తన మూల మతమైన కాథలిసిజమ్‌తో ఇతర మతాల (ముఖ్యంగా టావోయిజం) లోని అంశాలను సమన్వయపరచాడు. తన కథలలోను, నవలలలోను ఈయన బ్రెజిలియన్ ఇండియన్‌లు గ్రామీణ వ్యవస్థ నుండి పట్టణ వ్యవస్థకు మారడంలో ఎదుర్కొన్న సమస్యలను చిత్రీకరించాడు. ఈయన 1932 వరకు వైద్యుడుగా పనిచేసి, తరువాత బ్రెజిలియన్ నియంత 'వర్గాస్' చేత తన దౌత్య వ్యవహర్తగా నియమింపబ డ్డాడు. ఉద్యోగ రీత్యా చాలా దేశాలు దర్శించాడు.

తన మొదటి కథల సంపుటి *సగరానా* (1946) తోనే గ్విమార్‌యేస్ సాహిత్యవేత్తల గుర్తింపు పొందాడు. ఈ కథలు మన పంచతంత్ర కథల వలె మానవుని తెలి విని ప్రదర్శిస్తాయి. వీనిలోనే ఈయన తన విశిష్టమైన వచనశైలిని రూపొందించుకొన్నాడు. 1956 లో *కార్పొ డి బెయిలీ* అనే ఏడు చిన్న నవలల సంపుటి ప్రకటించాడు. ఈయన రచన లన్నిటిలోకీ చిర స్మరణీయ మైన నవల *గ్రాండె సెర్టావ్: వెరెడాస్* (1956). దీని ఇంగ్లీష్ అనువాదం (The Devil to Pay in the Backlands) 1963 లో వెలువడింది. ఈ నవల భాషలోనూ, పాత్రల మనస్తత్వ వర్ణనలోనూ కూడా చాలా క్లిష్టంగా ఉండి, చదవడానికి కష్టంగా ఉంటుంది. ఈ నవల ఈయనకు అంతర్జాతీయ ఖ్యాతిని గడించి పెట్టింది. దీని తరు వాత 1962, 1967 లలో ఈయన మరి కొన్ని కథా సంపుటాలను ప్రకటించి బ్రెజిలియన్ సాహిత్యంలో తన స్థానాన్ని పదిల పరచుకొన్నాడు. ఈయన సాహితీసేవకు గుర్తింపుగా 1967 లో ఈయనను బ్రెజిలియన్ సాహిత్య అకాడెమీ (Academia Brasilera de letras) విశిష్ట సభ్యత్వం ఇచ్చి సత్కరించింది.

తరువాత మూడు రోజులకే, 1967 నవంబరు 19 న ఈయన కన్ను మూశాడు. ఈయన కథలు 'పెరూ' దేశ ప్రముఖ రచయిత ఆర్గెడాస్‌ను చాలా ప్రభావితం చేశాయి.

*డి.ల.రా.*

**గ్విరెల్డెస్, రికార్డో (1886-1927) :** ఆర్జెంటీనా నవలా రచయిత. లాటిన్ అమెరికాకు చెందిన శ్పానిష్ కవిగా, నవలాకారుడుగా, ప్రసిద్ధి పొందాడు. ఆర్జెంటీనా రాజధాని బ్యూనోస్ ఐరిస్ మహానగరంలో 1886 ఫిబ్ర వరి 13 న, ఒక శ్రీమంతుల కుటుంబంలో గ్విరెల్డెస్ జన్మించాడు. ఇతని బాల్యంలో చాలా భాగం తండ్రి పొలా లున్న లాపోర్టినా వ్యవసాయక్షేత్రంలో గడచింది. ఆర్జెంటీనా దేశంలోను, మరికొన్ని దక్షిణ అమెరికా దేశాలలోను మనకు సువిశాలమైన పచ్చిక బయళ్లు కనిపిస్తాయి. వీటిని పంపాస్ (Pampas) అంటారు. ఈ బయళ్లలో గాషో అనే ఒక తెగ ఆదిమ వాసులు జీవిస్తారు. వీరు ప్రాక్తన ఇండియన్ జాతుల సాంకర్యం వల్ల ఉత్పన్న మైనవారు. వీరి ఆచార వ్యవహారాలు వింతగా కనిపిస్తాయి. వీరు పశువుల మందలను గుర్రాలపై స్వారీ చేస్తూ కాపలా కాస్తూ ఉంటారు. గ్విరెల్డెస్ కు చిన్నతనంలోనే ఈ జాతివారితో సన్ని హిత సంబంధం ఏర్పడింది. వారి జీవిత సరణి బాగా అర్థమైంది. ఇతని ప్రసిద్ధ నవల *డాన్ సెగుండో సోంబ్రా* లో ఈ జీవితం మనోహరంగా వ్యాఖ్యానించబ డింది. గ్విరెల్డెస్ 1910 వ సంవత్సరంలో ప్రప్రథమంగా ఫ్రాన్స్ దేశంలో పర్యటించాడు. తరువాత అతడీ దేశాన్ని పలుమార్లు సందర్శించాడు. చివరకు ఆ దేశంలోనే పారిస్ నగరంలో 1927 అక్టోబరు 8 న గ్విరెల్డెస్ కన్ను మూశాడు.

ఇతని తొలి రచన *ఎల్ సెన్ స్కెరోడీ క్రిస్టల్* అనే గద్య పద్యాత్మక సంపుటి. ఇది ప్రజాదరణ పొందలేక పోయింది. కాని మొదటి ప్రపంచ యుద్ధానంతరం ఇతడు చేసిన వచన రచనలు, ముఖ్యంగా నవలలు జనరంజకా లయాయి. బహుశః శైలీ పరంగా ఇతడు చేసిన ప్రయోగాలు ఇందుకు కొంత కారణం కావచ్చు. ఇతని కథలలోను, నవలలలోను ప్రక్రియా నిర్వహణ నైపుణ్యం, దేశభక్తి ప్రధానమైన భావాలూ, సంప్రదాయ సిద్ధాలైన ఇతివృత్తాలూ ప్రాధాన్యం వహిస్తాయి. ఇతని రచనలలో *క్వెంటోస్ డి మ్యురెటే ఇ డి సంగ్రె* (1905) *జమైకా* (1923) గణనీయ మైనవి.

*గం.శ్రీ.*

**గ్విలెన్ (బటిస్టా), నికోలాస్ (1902-1989) :** క్యూబా దేశపు కవి. ఈయన క్యూబాలోని కెమాగ్వేలో 1902 లో యూరపియన్, ఆఫ్రికన్ తల్లి దండ్రులకు జన్మించాడు. పెద్దగా చదువుకోకపోయినా, శ్పానిష్ అమె రికన్ సాహిత్యాన్ని బాగా అధ్యయనం చేశాడు. 1930 లో ప్రచురింపబడిన *మోటిఫ్స్ ఆఫ్ సన్* అనే పద్య సంపుటి సాంప్రదాయిక సాహిత్య రీతులను, *ఆఫ్రో క్యూబన్* ల జీవిత విధానాన్నీ చక్కగా మేళవించి, అనతికాలంలోనే అందరి మన్ననలూ పొందింది. తరువాత ఈయన పేద, పీడిత ప్రజల దైనందిన జీవితాన్ని వర్ణించడంతో తృప్తి

చెందక రాజకీయంగా వారి తరఫున పోరాటం ప్రారంభిం చాడు. 1937 నాటి *సాంగ్స్ ఫర్ సోల్జర్స్ అండ్ సోనీస్ ఫర్ టూరిస్ట్స్* అనే కవితా సంపుటి ఈ దృక్పథాన్ని ప్రతిబింబిస్తుంది. 1937 లోనే ఈయన స్పెయిన్ వెళ్లి, అక్కడ జరుగుతున్న అంతర్యుద్ధంలో రిపబ్లికన్‌ల పక్షాన పోరాడాడు. ఈ యుద్ధానుభవాలనుంచి స్పెయిన్ అనే కవితా సంపుటి ఆవిర్భవించింది. స్పెయిన్ నుండి క్యూబా తిరిగి వచ్చిన తరువాత కమ్యూనిస్టు పార్టీలో చేరి, రాజకీయ, ఆర్థిక సంస్కరణలకోసం కృషి చేశాడు. ఈ సమయంలో సాహితీ వేత్తలు ఈయనను శ్పానిష్ అమెరికాలోని నీగ్రో కవులలో ప్రముఖునిగా గుర్తించారు. ఇక్కడనుంచి అనగా 1959 నుంచి ఈయన రచించిన *ది డవ్ ఆఫ్ పాప్యులర్ ఫ్లైట్* వంటి కవితా సంకలనా లలో కవి కంఠం కంటె రాజకీయవాది కంఠం పెద్దగా వినిపిస్తుంది. 1947 నుండి 1972 వరకు వెలువడిన ఈయన కవితల ఇంగ్లీష్ అనువాదాలు విస్తృతమైన పాఠకలోకానికి విశిష్టమైన ఆఫ్రో క్యూబన్ సంస్కృతిని పరిచయం చేశాయి. ఇదే ఆశయంతో ఈయన ఆఫ్రో క్యూబన్ అధ్యయన సంఘాన్ని కూడా స్థాపించాడు. తన కవిత్వ వ్యాసంగం వల్లను, సాంఘిక న్యాయం కోసం, మానవ హక్కుల కోసం జరిపిన పోరాటం వల్లను గ్విలెన్ ఆధునిక క్యూబాలో ప్రత్యేకమైన స్థానం సంపాదించుకొన్నాడు.

డి.ల.రా.

**గ్రీన్, గ్రాహమ్ (1904-1991) :** ప్రముఖ ఆంగ్లేయ నవలా రచయిత. నవలా రచయితగా అంతర్జా తీయ కీర్తి నార్జిం చిన గ్రీన్ 1904 అక్టోబర్ 2 న బెర్క్ మ్‌హెడ్ గ్రామంలో జన్మించాడు. తండ్రి ఆ గ్రామ పాఠశా లలో ప్రధానోపా ధ్యాయుడు. గ్రీన్ బాల్యం ఆనందంగా గడవలేదు. పాఠ శాల వాతావరణం, బోధన కూడా ఇత నికి సరిపడలేదు. దానికి తోడు బాల్యంలోనే ఇతని కెదురైన అనుభవాలు ఇతనిపై చెరగని ముద్ర వేశాయి. ఒక నిరుద్యోగి భగవంతుని నిందిస్తూ ఒక సత్రంలోకి పరుగెత్తి కుత్తుక నుత్తరించుకొని మరణించడం కళ్లారా చూశాడు. తనకు తెలిసిన ఒక పదిహేనేళ్ల అమ్మాయి గర్భవతి అయి, ఆమె, ఆమె ప్రియుడు రైలు పట్టాలపై తల మొండెం వేరై పడి ఉన్న దృశ్యం ఇతనిని బాగా కలతపెట్టింది. ఇవన్నీ జీవితంలో ఎందుకు జరు గుతున్నాయి? ఇవి అనివార్యాలా? జీవితంలో దౌష్ట్యం (evil) ఒక అనివార్య భాగమైతే, దీనికి బాధ్యత భగ వంతునిది కాదా? ఎన్నో ప్రశ్నలు, ఎన్నో సమాధానాలు. తాను 14 వ ఏట చదివిన నవల *ది వైపర్ ఆఫ్ మిలాన్* (మార్జొరీ బొవెన్ వ్రాసింది) కూడా ఇతనిపై అమిత ప్రభావాన్ని కనపరచింది. అశాంత చిత్తుడైన ఇతడు చివరకు ఇంట్లో నుంచి పరారీ అయాడు. అయితే తండ్రి ఇతనిని వెతికి తీసుకు వచ్చి ఒక మానసిక వైద్య నిపుణునికి అప్పగించాడు. అతని చికిత్స ఫలించి గ్రీన్ మళ్లీ మామూలు మనిషి అయాడు. ఆక్స్‌ఫర్డ్‌లో మూడేళ్లు చరిత్ర అభ్యసించి, పట్ట భద్రుడయాడు. తరు వాత రెండేళ్లు నాటింగ్‌హామ్‌లో పత్రికా లేఖకుడుగా పనిచేశాడు. ఇతనిలో జరుగుతున్న అంతర్మథనం వల్ల ఇత నికి జీవితంలో దౌష్ట్యం అనివార్య మని, జీవఫలం చేదు విష మని, తరణోపాయం కేథలిక్ క్రైస్తవమత మని దృఢాభిప్రాయాలు ఏర్పడ్డాయి. తాను పుట్టి పెరిగిన ఆంగ్లికన్ క్రైస్తవాన్ని విడిచి పెట్టి కేథలిక్ క్రైస్తవంలోకి మారాడు. 1927 వ సంవత్సరంలో వివియన్ అనే యువతిని వివాహ మాడి, లేఖకోద్యోగానికి స్వస్తిచెప్పి, స్వచ్ఛంద రచయితగా స్థిరపడ్డాడు. ఇతడు కేథలిక్ క్రైస్తవం పుచ్చుకొన్నా మతాధిపతుల నిర్వచనాలను, ఆచారాలను అంగీకరించలేదు. ఇతని మతం కేవలం వైయక్తికానుభవ సారం. ఆక్స్‌ఫర్డ్‌లో ఉన్నప్పుడే *బబ్లింగ్ ఏప్రిల్* (1925) అనే కవితా సంపుటిని ప్రకటించాడు. తరువాత నవలలు, నాటకాలు, యాత్రాచరిత్రలు మొదలైన ఇతర ప్రక్రియలు కూడా నిర్వహించాడు. ఇతని రచనలలో కేథలిక్ క్రైస్తవ దృక్పథం సర్వే సర్వత్ర కనిపిస్తుంది. పాత్రచిత్రణలో మనశ్శాస్త్ర దృష్టి కూడా కనిపిస్తుంది. మతం, మనో విశ్లేషణ పడుగు పేకల్లా కలసిపోయి ఇతని నవలలకు ఒక ప్రత్యేకతను ఆపాదిస్తున్నాయి. అన్ని నవలలలోను బాల్యంలోనే అమాయికత్వ లోపం, అవినీతి వర్తనకు బీజాలు పడడం గమనిస్తాం. ఇతని రచనలపై సినిమా ప్రభావం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. ఇతని నవల లనేకం వెండి తెరమీద ఘన విజయాలు సాధించాయి. ఇతని మొదటి నవలలో సమకాలీన వాస్తవికత ఎక్కువగా చోటు చేసుకుంది. వామపక్ష దృక్పథం కూడా కనిపిస్తుంది.



ఈ దృక్పథం క్రమంగా తగ్గిపోయి మతం కేంద్రస్థానాన్ని ఆక్రమించింది. పాపం, ప్రాయశ్చిత్తం, దైవకృప, ముక్తి మొదలైన అంశాలు ప్రధానేతివృత్తాలు. పాపాత్ములే పరమాత్మకు సన్నిహితు లని చూపిస్తాడు. పాపాత్ములే మహాత్ములుగా పరిణమిస్తారు. ఇతని మొదటి నవల *ఇస్తాంబుల్ ట్రైన్* (1932) చలన చిత్రంగా కూడా రాణించింది. *ఇట్జ్ ఏ బాటిల్ ఫీల్డ్* (1934), *ఇంగ్లండ్ మేడ్ మీ* (1935), *ఏ గన్ ఫర్ సేల్* (1936) మార్క్సిస్ట్ సిద్ధాంత ప్రభావితాలు. తరువాతి నవలలలో *బ్రైటన్ రాక్* (1938), *ది పవర్ అండ్ ది గ్లోరీ* (1940), *ది ఎండ్ ఆఫ్ ది ఎంపైర్* (1951), *బర్న్టట్ ఔట్ కేస్* (1961) ముఖ్యమైనవి. ఇతడు చేపట్టిన ఇతర ప్రక్రియలు: నాటకాలు 1. *ది లివింగ్‌రూమ్* (1957), 2. *ది పాటింగ్ షెడ్* (1958), 3. *కార్వింగ్ ఏ స్టాట్యూ* (1964), 4. *త్రీ ప్లేజ్* (1962). యాత్రాగంథాలు: *జర్నీ వితౌట్ మేప్స్* (1962), *ఇన్ సెర్చ్ ఆఫ్ ఏ కేరక్టర్* (1691). వ్యాసాలు: *ది లాస్ట్ చైల్డ్‌హుడ్ అండ్ అదర్ ఎస్సేస్*, కథలు: *ట్వంటీవన్ స్టోరీజ్* (1965).

గం.శ్రీ.

**గ్రీన్, జూలియెన్ (హార్ట్‌రిడ్జ్) (1900--) :** 'ఫ్రెంచ్-అమెరికన్' నవలా రచయిత. 1900 లో ఫ్రాన్స్ లోని పారిస్‌లో జన్మించాడు. ఈయన తల్లిదండ్రులు అమెరికన్‌లు. తండ్రి వ్యాపారస్థుడు. తల్లి దైవభక్తి, మత విశ్వాసం ఈయనను ప్రభావితం చేశాయి. ఈ ప్రభావం ఈయన నవలలలో కనిపిస్తుంది. ఈయన బాల్యం, యౌవనం ఫ్రాన్స్‌లో గడిచాయి. 19 వ ఏట అమెరికా వెళ్లి వర్జీనియా విశ్వవిద్యాలయంలో విద్య నభ్యసించి, ఒక ఏడాది అక్కడే విద్య బోధించాడు. రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో కూడా అమెరికాలో అధ్యాపకుడుగా ఉండి, తరువాత అమెరికన్ సైన్యంలో చేరి పోరాడాడు.

ఈయన సాహిత్య కృషి చాలా వరకు ఫ్రాన్స్ లోను, ఫ్రెంచ్ భాషలోను జరిగింది. ఫ్రాన్స్‌లో ఉన్నా ఈయన ఇంగ్లీషు బాగా అభ్యసించాడు. కాని ఈయన నవల లన్నిటిని మొదట ఫ్రెంచ్‌లో వ్రాసి, తరువాత ఇంగ్లీషులోకి తర్జుమా చేశాడు. ఈ నవలలలో అమెరికా లోని దాక్షిణాత్య గోతిక్ ధోరణులు బాగా కనిపిస్తాయి. ఈయన నవలలలోని పాత్రలు స్వల్ప విషయాలకు అమిత ప్రాధాన్యత నిచ్చే మనస్తత్వం గలవారై మనదృష్టి నాకర్షిస్తారు. 1925 నుండి 1971 వరకు ఈయన కొన్ని నవలలు, *సౌల్* అనే నాటిక కాక, ఇంగ్లీషులో *మెమరీస్ ఆఫ్ హాపీ డేజ్* అనే పుస్తకం కూడా వ్రాశాడు. ఈయన నవలా రచయితగా ఫ్రెంచ్ ఎకాడమీ గ్రాండ్ ప్రైజ్ వంటి గౌరవాలు చాలా పొందాడు.

1926 మొదలుకొని భగవత్స్వరూపం, మరణం భగవత్పరంగానూ, స్వపరంగానూ కళాకారుడి ద్వంద్వ కర్తవ్యం మొదలైన విషయాలపై తన ఆలోచనలను ఈయన 'జర్నల్స్' అనే సంపుటాలలో పొందుపరచాడు. జూలియెన్ గ్రీన్ అమెరికాలోనూ, ఫ్రాన్స్‌లోనూ కూడా సాహిత్యవేత్తగా మన్ననలు పొందాడు.

డి.ల.రా.

**గ్రీన్, రాబర్ట్ (1558-1592) :** 16 వ శతాబ్ది తుదిభాగంలోని విశేష ప్రజాదరణ పొందిన ఆంగ్ల వచన రచయిత. వచన పద్య రచనలోనూ, శృంగార పూరితమైన కామెడీ రచనలోనూ షేక్స్పియర్ కంటె ముందు విజయం సాధించినవాడు. ఈయనే రచనను ఒక వృత్తిగా అవలంబించిన తొలి ఆంగ్ల రచయిత. ఇంగ్లీషులో ఆత్మకథా రచనలో ఇంచుమించుగా మొట్టమొదటివాడు.

కేంబ్రిడ్జ్, ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయాలు రెండింటి నుండి గ్రీన్ పట్టభద్రు డయాడు. అనంతరం లండన్ వెళ్లి అక్కడి 'అధోజగత్తు' (Under world) తో సన్నిహిత పరిచయం సంపాదించాడు. 1580-92 మధ్య దాదాపుగా 35 రచనలు చేశాడు. ప్రజలకు ఆకర్షకంగా ఉండే రచనలు చేయడంకోసం గ్రీన్ సాహిత్య సంబంధమైన ఫాషన్‌లను ఎక్కువగా అనుసరించాడు. ఆయన అనుసరించిన మొదటి నమూనా జాన్ లిలీ వ్రాసిన *యూఫ్యూస్*

1580-90 మధ్య సర్ ఫిలిప్స్ సిడ్నీ రచించిన *ఆర్కేడియా* పద్ధతిలో గ్రీన్ మధ్య మధ్య భావగీతికలు చేర్చిన గ్రామీణ వచన నాటకాలు రచించాడు. అట్టి భావ గీతికలతోనే గ్రీన్‌కి కవిగా మొదట ప్రశస్తి వచ్చింది. ఆ విధంగా వ్రాసిన గ్రామీణ వచన నాటకాలలో మణిపూస వంటిది *పండోస్టో* (1588). షేక్స్పియర్ రచించిన *ది వింటర్స్ టేల్* నాటకానికి ఇదే ప్రత్యక్షమైన ఆధారం.

1590 ప్రాంతంలో గ్రీన్ నీతి ప్రబోధకమైన నాటకాలను వ్రాయడానికి పూనుకొన్నాడు. *గ్రీన్స్ నెవర్ టూ లేట్* (1590) తో ఆరంభించి దుబారా వ్యయం చేసే కుమారునికి సంబంధించిన కథ లనేకం గ్రీన్ వ్రాశాడు. *గ్రీన్స్ గ్రోట్స్‌వర్త్ ఆఫ్ విట్టే, బాట్ విత్ ఏ మిలియన్ ఆఫ్ రిపెంటెన్స్* అనే రచన వలన తన స్వీయ

అనుభవాలనే గ్రీన్ తన రచనలలో ఎలా ప్రకటించేవాడో తెలుస్తుంది. గ్రీన్ మరణానంతరం 1592 లో అది ముద్రితమైంది. దానిలోని రాబర్టో అనుభవా లన్నీ స్థూలంగా తన అనుభవాలే అని గ్రీన్ అంగీకరించాడు.

రంగస్థలం కోసం గ్రీన్ రచించిన నాటకాలను గురించి సమస్య లనేకం అపరిష్కృతంగానే ఉండిపోయాయి. ఆ నాటకాలు రచించిన తేదీ లన్నీ ఊహాకల్పితాలే. *ది ఆన రబుల్ హిస్టరీ ఆఫ్ ఫ్రైయర్ బేకన్, అండ్ ఫ్రైయర్ బోంగే* (రచన 1591, ప్రచురణ 1594) ఇంగ్లీషు భాషలోని విజయవంతమైన తొలి కామెడీ కావడంతో గ్రీన్ తనలోని నాటక రచనా ప్రతిభను గుర్తించాడు. *ది స్కాటిష్ హిస్టరీ ఆఫ్ జేమ్స్ ది ఫోర్త్, స్లెయిన్ ఎట్ ఫ్లాడెన్* (రచన 1590, ప్రచురణ 1598) లో గ్రీన్ ఒక ఇటాలియన్ కథను అనుసరించాడు; అయితే ఓ బెరాన్, బోహాన్ పాత్రల ప్రేమను దేవతల కథల నుంచి గ్రహించాడు. షేక్స్పియర్ రచించిన *ఏజ్ యూ లైక్ ఇట్, ఏ మిడ్ సమ్మర్ నైట్స్ డ్రీమ్* నాటకాలకు అదే భూమిక అనవచ్చును.

గ్రీన్ తన జీవితంలోని చివరి సంవత్సరంలో *ఏ నోట బుల్ డిస్కవరీ ఆఫ్ కూసేన్జ్, ఏ డిస్పూ టేషన్ బిట్వీన్ ఏ హీకోనీ కాచర్ అండ్ ఏ షీకోనీ కాచర్* అనే నాటకాలను రచించాడు.

*బి.శ్రీ.*

**గ్రేజియా, దెలెద్దా (1871-1936) :** ఇటాలియన్ నవలా రచయిత్రి, నోబెల్ బహుమతి గ్రహీత్రి. గ్రేజియా 1871 సెప్టెంబర్ 27 న సార్డీనియాలోని న్యూరో (Nuoro) లో జన్మించింది. ఈమె నవలా రచయిత్రి మాత్రమే గాక ఇటాలియన్ సాహిత్యంలో ప్రకృతి వాద సంప్రదాయానికి (Naturalistic shcool) చెందిన రచయిత్రి. ఈమె సార్డీనియన్ మధ్యతరగతి కుటుం బంలో పుట్టింది. చిన్న వయసులోనే ఈమె వివాహం చేసుకొంది - వివాహం తర్వాత రోమ్ నగరంలో స్థిర నివాసం ఏర్పరచుకొన్న తర్వాత కూడా ఈమె తరచు సార్డీనియాను సందర్శించేది.

అందరిలాగా స్కూలులో చదువకపోయినా ఈమె ప్రకృతి చిత్రణా విధానాన్ని సహజంగా పెంపొందిం చుకొని, రచయిత్రిగా సిద్ధి పొందింది. సార్డీనియా జానపద కథలు, పిల్లల అపహరణలు (Kidnapping), విఫలమైన ప్రేమ వ్యవహారాలు మున్నగు మానవ సమస్యలను గాఢంగా పరిశీలించి వాటిని కథా వస్తువుగా తీసుకొని రసవంతమైన రచనలు చేసింది. ఈమెకు 1926 వ సంవత్సరంలో నోబెల్ బహుమతి లభించింది. ఈమె మొట్టమొదటి రచనలు కథలు. 13 వ ఏటనే *స్టార్ ఆఫ్ సార్డీనియా* (*Star of Sardinia*) లో వాటిని ప్రకటించింది. 18 సంవత్సరాల వయసప్పుడు ఆమె కథలు ఫ్యాషన్ పత్రిక *ఉల్టిమా మోదా* (Ultima Moda) లో ప్రచురింపబడ్డాయి. ఇతర కథలు నెల్ అజ్జురో *(Nell, Azzurro)* అనే శీర్షికతో *మిలాన్ (Milan)* లో ప్రచురిత మయాయి.

ఈమె రచనలలో ముఖ్యమైనవి: *ఫియోర్ ది సార్డెగ్నా* *(Fior di sardegna:*, 1892, 'సార్డీనియా పుష్పం'), *అనిమె ఒనెస్తే రొమాన్జో ఫెమిగ్లియర్(Anime oneste, romanzo famigliare:*, 1895, 'నిష్కపటమైన ఆత్మలు'), *ల వియా దెల్ మేల్ (La Via del male:*, 1896, 'పాపిష్టి మార్గం'), *ఇల్ వెచ్చియో దెల్లా మాన్టెగ్నా (Il Vecchio della montagna:*, 1900, 'The old man of the Mountain'), *ఎలియాస్ పోర్తొలు* Elis portalu, 1903)- ఇది తన సోదరుని భార్యతో ప్రేమ వ్యవహారం నడిపిన దోషి కథ. *సెనెరె (Cenere: 1904, Ashes: 1900) లె దెర* (L'edera, 1908, 'ఒక లత'), *సీనో అల్ కన్ ఫైన్ (Sino al confine: 1910, 'Up to the limit')*, *ఇల్ నొస్త్రొ పద్రోనె* (*Il nostro padrone: 1910* 'మా మాష్టారు'), *నెల్ దె సెర్టో (Nel deserto:* 1911 'ఎడారిలో'), *కొలంబిక్ స్పార్వైరి* (*Colombic sparvieri* ('Doves and Falcons': 1912), *ల మద్రె* (La madre: 1920, 'పూజారిణీ') ఈ నవలలే కాక ఇంకా *సెగ్రెతో దెల్ ఉమొసొలితరియో (Segreto dell uomo solitario* 1921, 'ఒంటరిగా నున్న వాని రహస్యం'), *ఇల్ దియోదెయి వివెన్తి (Il Dio dei viventi*, 1922, 'బతికున్న దేవుడు'), *ల ఫుగెన్ ఎజిత్తో (La Fuga in Egitto:* 1925, 'ఈజిప్టుకు పారిపోవడం' ), *అనలెన బిల్సిని (Annalena Bilsini: 1927*, *ఇల్ పెసెదెల్ వెన్తొ* (*Il paese del vento:* 1931, 'వాయు దేవుని భూమి'), మొదలగు రచనలు కూడా గ్రేజియా వ్రాసింది. ఈమె *కొసిమా* అనే నవలలో తన స్వీయ చరిత్ర కొంత వ్రాసింది. 1937 లో అది ఆమె మరణానంతరం ప్రచురించబడింది.

*నాగరాజ్*

**గ్రేవ్స్, రాబర్ట్ (రాంక్) (1895-1985) :** కవి, పండితుడు, పరిశోధకుడు, నవలా రచయిత, అనువా దకుడు, ప్రాచీన గాథా సమాహర్త (మిథోగ్రాఫర్). శతాధిక గ్రంథకర్త అయిన రాబర్ట్ గ్రేవ్స్ లండన్ నగ

రంలో 1895 జులై 2 న కవులకు పుట్టినిల్లైన ఒక కుటుంబంలో జన్మించాడు. కెల్టిక్ జాతులకు సహజమైన కాల్పనిక ప్రవృత్తి, ట్యూటానిక్ జాతులకు సహజమైన క్రమశిక్షణ, నిదానం, నైపుణ్యం మేళవించిన లాక్షణిక ప్రవృత్తి ఇతనికి వారసత్వంగా సంక్రమించాయి. తండ్రి ఆల్ఫ్రెడ్ పెర్సివాల్ గ్రేవ్స్ ఐరిష్ జాతీయ పునరుజ్జీవనోద్యమంలో ప్రశంసనీయమైన పాత్ర నిర్వహించాడు. గ్రేవ్స్ జీవితాన్ని తీర్చి దిద్ది, జీవితం పట్ల ఒక నిర్దిష్టమైన దృక్పథం ఏర్పడడానికి కారణభూతమైన సంఘటనలు ముఖ్యంగా మూడు: 1. బంధువర్గ సభ్యులతో చిన్ననాడేర్పడిన సన్నిహిత సంబంధం, 2. ఛార్టర్ హౌస్ స్కూల్లో విద్యాభ్యాసం, 3. మొదటి ప్రపంచ యుద్ధంలో సైనికుడుగా ఫ్రెంచ్ యుద్ధానుభవాలు. 1933 వ సంవత్సరంలో ప్రచురించిన తన స్వీయచరిత్ర *గుడ్‌బై టు ఆల్ దట్* లో తన అనుభవాలను విశదంగా వర్ణించడమే కాక, మొదటి ప్రపంచ సంగ్రామాన్ని అత్యద్భుతంగా వర్ణించాడు. యుద్ధంలో చూర్ణీకృత సర్వాంగుడైన గ్రేవ్స్ మరణించినట్లు అధికారులు మొదట ధ్రువీకరించి, పత్రికలలో ప్రకటించారు. ఇతడు అదృష్టవశాత్తు ఆస్పత్రిలో ప్రఖ్యాత మనస్తత్వ శాస్త్రవేత్త, మానవజాతుల సంబంధ శాస్త్రవేత్త, సాహితీ పరుడు అయిన డా. డబ్ల్యూ. హెచ్. ఆర్. రివర్స్ చేతిలో పడి, సమర్థమైన చికిత్స ద్వారా 'న్యూరోసిస్' నుంచి కోల్కొనడమే కాక, అతడి పరిశోధనా ఫలితాలను కూడా ఆకళించుకొని నూత్న దృక్పథంతో బయట పడ్డాడు. రివర్స్ ప్రాక్తన జాతుల నాగరకతను క్షుణ్ణంగా అధ్యయనం చేసి, నవీన మానవుని మూర్తిమత్త్వాన్ని విశ్లేషించి, ప్రమాణీకరించాడు. ఫ్రాయిడ్ స్వప్న సిద్ధాంతాలను అంగీకరించినా, లైంగిక వాంఛకు ఫ్రాయిడ్ ఇచ్చిన సర్వప్రాధాన్యాన్ని ఆయన తిరస్కరించాడు. సహజ ప్రవృత్తికీ, బాహిర జీవితానికీ మధ్య స్వతః ఏర్పడ్డ అగాథాన్ని గురించి రివర్స్ స్థాపించిన సిద్ధాంతాలు గ్రేవ్స్‌కు కవితా తత్త్వాన్వేషణలో, ప్రాచీన గాథా విశ్లేషణలో కరదీపికలై పథ నిర్దేశం చేశాయి. తన కవితా సిద్ధాంత ప్రతిపాదకాలైన *పొయెటిక్ అన్ రీజన్* (1925), *ఆన్ ఇంగ్లీష్ పొయ్‌ట్రీ* (1921) అనే గ్రంథాలలో తాను రివర్స్ సిద్ధాంతాల చేత ఎంతగా ప్రభావితుడయాడో వివరించాడు. ఈ గ్రంథాలతో పాటు *ది క్రౌనింగ్ ప్రివిలేజ్* (1955), *ఆక్స్‌ఫర్డ్ అడ్రెసెస్ ఆన్ పొయ్‌ట్రీ* (1962) మొదలైన గ్రంథాలలో కవితా తత్త్వాన్ని, కావ్యానందాన్ని విలక్షణమైన రీతిలో ఆవిష్కరించాడు. ప్రపంచంలోని సర్వసాహిత్యాన్నీ, జానపద గాథలనూ, పురాణ కథలనూ మథించి ఒక వినూత్నమైన సిద్ధాంతాన్ని 'శ్వేత దేవత' (1940) అనే ఉత్కృష్ట గ్రంథంలో ప్రతిపాదించాడు. "ప్రపంచంలో ఏ నాడైనా, ఏ కవికైనా స్ఫూర్తి నిచ్చేదీ, ప్రేరేపించేదీ ఈ 'శ్వేత దేవతే'. కవిత్వ మంతా ఈమెకే అంకితం. సమస్త పురాణ గాథలూ ఈమె విలాసాలే. ఈమెను ఉపాసించడమే ఒక మతం. ఇది చరిత్ర కందని కాలంనుంచీ ఈ నాటి వరకూ సాగుతూనే ఉంది" అని అంటాడు గ్రేవ్స్. ఈ గ్రంథంలో కవికి త్రికాలనేతృత్వం, శాపాను గ్రహ సామర్థ్యం, మంత్రశక్తి ఉండవచ్చని కూడా అంగీకరించాడు. మన దేశంలో సరస్వతిని విద్యాధిదేవతగానే కాక, 'నిశ్శేష జాడ్యాపహా' అని కూడా స్తుతిస్తాం. గ్రేవ్స్ దృష్టిలో కవితకు సమస్త రోగ నివారక శక్తి ఉంది. ఇంకా ఎన్నో ఆసక్తికరమైన, వివాదాస్పదమైన అభిప్రాయాలను గ్రేవ్స్ వ్యక్తం చేశాడు.

ఇతడు 36 కవితా సంపుటాలను వెలయించడమే కాక, కవిత్వ విశ్లేషణ ప్రధానమైన *ఎ కీ టు మోడర్నిస్ట్ పొయ్‌ట్రీ* అనే అతి ముఖ్యమైన గ్రంథాన్ని లౌరా రైడింగ్ అనే అమెరికన్ కవయిత్రితో కలసి వ్రాశాడు. ఇతడు బ్రిటిష్ పద సాహిత్యానికి చేసిన సేవ నిరుపమానం. ప్రాచీన పద సాహిత్యాన్ని పునరుద్ధరించిన ఘనత ఇతనికి చెందుతుంది.



నవలా ప్రపంచంలో ఇతడు రచించిన *ఐ క్లాడియస్* అనే చారిత్రక నవల ప్రసిద్ధమైంది. ఇతని అనువాద రచనలలో గ్రీకు భాషలో 'అపుల్యూస్' వ్రాసిన గ్రంథానువాదం *గోల్డెన్ ఆస్* ప్రఖ్యాతి చెందింది. గ్రేవ్స్ కొంతకాలం ఆక్స్‌ఫర్డ్‌లో సాహిత్యాచార్యుడుగా ఉన్నా, తన జీవితంలో అధిక భాగాన్ని స్పెయిన్‌లో 'మజార్కా' అనే చోట ప్రవాసంలోనే గడిపాడు.

*గం.శ్రీ.*

**గ్రోవ్, ఫ్రెడరిక్ ఫిలిప్ (1871-1948) :** కెనడా దేశంలోని ప్రఖ్యాత ఆంగ్ల నవలా రచయిత. కెనడా దేశంలో సుమారు రెండు వందల ఏళ్లుగా ఆంగ్ల, ఫ్రెంచ్, రచనా స్రవంతులు సాగుతున్నా, 20 వ శతాబ్దం వరకూ చెప్పుకోతగ్గ ప్రతిభావంతుడైన రచయిత పుట్టనే లేదని

చెప్పాలి. కెనడా దేశంలోని మొట్టమొదటి నవలను గత శతాబ్ది ప్రారంభంలో జాన్ రిచర్డ్‌సన్ రచించాడు. అయితే ప్రక్రియకు పరిణతి, ప్రతిష్ఠ ఈ శతాబ్దంలోనే ఫ్రెడరిక్ గ్రోవ్ ప్రభృతుల వల్లనే కలిగాయి. గ్రోవ్ జన్మతః రష్యన్ దేశస్థుడు. స్వీడెన్ దేశంలో పెరిగాడు. యూరప్‌లోని వివిధ విశ్వవిద్యాలయాల్లో విద్య నభ్యసిస్తూ, విస్తృతంగా ప్రయాణం చేశాడు. 1892 వ సంవత్సరంలో తన తండ్రితో పాటు కెనడా వెళ్లడం సంభవించింది. ఆ దేశంలో తండ్రి హఠాన్మరణానికి గురి కావడంతో అనాథుడై అక్కడే ఉండిపోయాడు. మళ్లీ యూరప్ వెళ్లే అవకాశం అతనికి కలుగలేదు. కెనడాలోనే వ్యవసాయ కూలీగా 20 ఏళ్లు శ్రమించాడు. 1912 వ సంవత్సరంలో మోనిటోబా నగరంలో ఉపాధ్యాయవృత్తిలో చేరి, 12 ఏళ్లు పనిచేశాడు. పత్రికా సంపాదకత్వం కూడా నిర్వహించాడు. 'నన్ను నేను వెతుక్కుంటూ' (1946) అనే శీర్షికతో ఆసక్తికరమైన స్వీయ చరిత్రను వ్రాసుకున్నాడు. 1948 ఆగస్టు 19 న ఒంటారియో రాష్ట్రంలోని 'సిమ్ క్లో' నగరంలో చనిపోయాడు.

ఇతడు వ్రాసిన నవలలను ప్రెయిరీ నవలలని వ్యవహరిస్తారు. కెనడా దేశంలో మైళ్ల కొలది విస్తరించిన చెట్టు, చేమ, కొండ, గుట్ట, ఎత్తు పల్లాలు లేని సువిశాల సమతల మైదానాలు పరచుకొని ఉన్నాయి. ఈ మైదానాలను *ప్రెయిరీ* లు అంటారు. ఈ మైదాన జీవిత సరణిని చిత్రించే నవలలు కనుక వీటికి ప్రెయిరీ నవలలని పేరు వచ్చింది. *మా నిత్యాహారం* (*Our Daily Bread:1919*), *జీవితపు పూజ* (*The Yoke of Life:1930*), *భౌమిక ఫలాలు* (*Fuits of the Earth:1933*) అనేవి ఇతని రచనలు. ప్రకృతితో మానవుడు చేసే నిరంతర యుద్ధాలు, తరాల అంతరాలు ఇతని నవలలలోని ప్రధానేతివృత్తాలు. శైలి గణనీయం కాక పోయినా, ఒక విధమైన ఆకర్షణ ఇతని రచనలలో కనిపిస్తుంది.

*గం.శ్రీ.*

**చర్చిల్, సర్‌విన్‌స్టన్ లియొనార్డ్ స్పెన్సర్ (1874-1965)** : 1953 వ సంవత్సర నోబెల్ బహుమతి గ్రహీత. ఆక్స్‌ఫర్డ్ షైర్ ( Oxford shire) లోని బ్లెన్‌హైమ్ పేలస్ Blenheim Palace) లో 1874 నవంబర్ 30 న జన్మించాడు. ఈయన రచయిత, ప్రాసంగికుడు, రాజనీతికోవిదుడు, మాజీ బ్రిటిష్ ప్రధాని (1940-45). రెండవ ప్రపంచ యుద్ధంలో పరాజయం తథ్యం అనుకొన్న బ్రిటన్‌కు విజయాన్ని సాధించి పెట్టిన విజయ సారథి. సంధుర్‌స్ట్ లోని రాయల్ మిలిటరీ కాలేజీ నుండి పట్టభద్రు డయాడు. దక్షిణ ఆఫ్రికా బోయర్ యుద్ధం (Boer War) లో రెండవ స్థాయి అధికారిగా, యుద్ధ విలేఖకుడుగా పనిచేశాడు.

ఈయన తన మొదటి పుస్తకం *మలకండ్ సైనిక దళ వృత్తాంతం (1898 Story of the Malakand Field Force)* దాని తరువాత *నదీ యుద్ధం (1899 The River War)* 1900 లో తన ఏకైక నవల *సవ్‌రోల* (Savrola) ప్రచురించాడు.

1900 లో ఈయన రాజకీయ రంగ ప్రవేశం చేసి బ్రిటిష్ పార్లమెంట్‌లో కన్సర్‌వేటివ్ మెంబర్ అయాడు. కాని ఈయన 1904 లో ఆ పార్టీ వదలి లిబరల్ పార్టీలో చేరాడు. 1908 లో ఈయన కేబినట్ సభ్యు డయాడు. మొదట 'బోర్డ్ ఆఫ్ ట్రేడ్' అధ్యక్షపదవిలోను తరువాత హోమ్ సెక్రటరీగాను పనిచేశాడు. 1911 లో నావికా శాఖ (Admirality) లో చేరాడు. మొదటి ప్రపంచ యుద్ధం ఆరంభమవుతున్న సమయంలో ఈ పదవికి రాజీనామా చేసి 'కెంబేటెన్ట్ ఆఫీసర్' (1915-16) గానూ తర్వాత మందుగుండు సామగ్రి (Munitions) మంత్రి (1917-18) గాను పనిచేశాడు. యుద్ధానంతరం వలస ప్రాంతాల కార్యదర్శిగాను, ఖజానా ఛాన్సలర్‌గాను పనిచేశాడు. ఈయన తిరిగి కన్సర్వేటివ్ భావాలవైపు దృష్టి సారించాడు.

1930 ప్రాంతాలలో ఈయన *నా జీవితంలో తొలి దశ (My Early Life: 1930) ఆలోచనలు, సాహసాలు (Thoughts and adventures: 1932), మర్ల్‌బరో (Marlborough: 1933-38, సమకాలీన మహనీయులు (Great Contemporaries: 1937)* మొదలైన రచనలు చేశాడు. 1939 లో మరల అడ్మిరాలిటీ ( Admirality) లో నియమితుడయాడు. నెదర్లాండ్స్‌ని జర్మని ఆక్రమించి నపుడు మరల ఈయనను బ్రిటిష్ ప్రధానిగా అయాడు. ఫ్రాన్స్ దేశం కదుదయనీయంగా పతనమైనా, లక్ష్య పెట్టక శత్రు దేశాలను అడ్డగించడానికి అమెరికా, సోవియెట్ యూనియన్‌లతో కలసి పోరాడి అంతిమ విజయాన్ని సాధించాడు. యుద్ధానంతగం ఈయన పార్టీ అధికారాన్ని కోల్పోయినా, మరల 1951 లో బ్రిటిష్ ప్రధానమంత్రి అయాడు.

చారిత్రక వర్ణనలో, జీవిత చరిత్ర వర్ణనలో ఈయనకు గల ప్రావీణ్యానికి, మానవత్వపు విలువలను కాపాడటంలో గల నిష్ఠకు అమోఘమైన వాక్చాతుర్యానికి 1953 లో ఈయనకు నోబెల్ బహుమతి లభించింది.

1955 లో ఈయన పదవీ విరమణ చేసిన తర్వాత తన ఉత్కృష్టకృతి *రెండవ ప్రపంచ యుద్ధం* (The Second World War) వ్రాశాడు. అంతేగాక *ఇంగ్లీష్ మాట్లాడే ప్రజల చరిత్ర* (History of the English Speeking Peoples, 1956-58) నాలుగు సంపుటాలలో వ్రాశాడు. చర్చిల్ సుప్రసిద్ధ చిత్రకారుడు కూడా.

గొప్ప వాగ్ధాటికల ఈ మహామనిషి 1965 జనవరి 24 న లండన్‌లో మరణించాడు.

*నాగరాజ్*

**చాటర్‌టన్, టామస్ (1752-70)** : ఆంగ్ల కవి. చాటర్‌టన్ ఇంగ్లండ్‌లోని బ్రిస్టల్ లో 1752 లో జన్మించాడు. ఈయన జీవిత మంతా లేమిలోనే గడచింది. తండ్రి ఉపాధ్యాయుడు. ఈయన మొదటి నుండి కవిత్వంలో అసాధారణ ప్రజ్ఞ కలవాడే కాని, ఆ ప్రజ్ఞ పెడత్రోవ పట్టడంతో అది ఆయన జీవితకాలంలో గుర్తింపబడలేదు. ఈయన తన తొలి కవిత 10 వ ఏట రచించాడు. 12 వ ఏట *ఏన్ ఎపోస్టేట్స్ విల్* అనే ప్రతిభావంతమైన ఆక్షేపణ కావ్యాన్ని రచించాడు. న్యాయవాద వృత్తిలో శిక్షణకోసం ఈయనను లాంబర్ట్స్ అనే న్యాయవాది దగ్గర చేర్చారు. కాని, ఈయనకు ఆ వృత్తి ఏ మాత్రమూ నచ్చక మానుకొన్నాడు. 1768 మొదలుకొని ఈయన కొన్ని కవితలు రచించి, 15 వ శతాబ్ది నాటి బ్రిస్టల్ కవి టామస్ రౌలీ రచనగా వాటిని చలామణీ చేశాడు. ఈ రౌలీ అనే కవి చాటర్‌టన్ సృష్టించిన వాడే. అయితే ఆ పేరు మాత్రం 15 వ శతాబ్దం లో బ్రిస్టల్‌లో నివసించిన ఒక మత ప్రవర్తకుడిది. చాటర్‌టన్ యొక్క ఈ బాల్య చేష్ట అతనికి సహాయం చేసే కొంతమంది వ్యక్తుల నుండి అతనిని దూరం చేసింది. వీరిలో హోరేస్ వాల్‌పోల్ ఒకడు. రౌలీ పేరుతో చాటర్‌టన్ వ్రాసిన కవితలలో *ఎలినోర్ అండ్ యూగా* అన్నది ఒక్కటే అతని జీవితకాలంలో ప్రచురింప బడింది. 1770 లో ఈయన మరణం తరువాత 1778 లోను, 1782 లోను ఈ 'రౌలీ' కవిత్వ సంపుటాలు ప్రచురింపబడ్డాయి. ఈ 'రౌలీ కవితలలో కొన్ని లోపా లున్నా, వాని రచయిత అసాధారణ ప్రజ్ఞావంతు డని పాఠకులకు విదితమవుతుంది. ఈయన జీవితకాలం అంతా దారిద్ర్యం, మనోవేదన, ప్రజాదరణ కొరకు ఆరాటాలతోనే గడచింది. 1770 లో ఈయన లండన్ వచ్చి తాను వ్రాసిన *ది రివెంజ్* అనే సంగీత నాటికను ప్రదర్శించాడు. దీనివల్ల స్వల్పంగా లాభించినా, వాతావరణం నిరాశా జనకంగా ఉండడంతో ఈ ప్రతిభావంతుడు 1770 ఆగస్టు 24 న విషం మ్రింగి ఆత్మహత్య చేసుకొన్నాడు. ఈయన మరణానంతరం రొమాంటిక్ కవులైన కోల్ రిడ్జ్, వర్డ్స్‌వర్త్ ప్రభృతులు ఈయన ప్రతిభను కొనియాడుతూ అనేక పద్యాలు వ్రాశారు.

*డి.ల.రా.*

**చాపెక్, కార్ల్ (1890-1938)** : అంతర్జాతీయ ఖ్యాతి పొందిన జెక్ నవలా రచయిత. కథానికా, నాటక, వ్యాస రచయిత.

ఒక దేశవాళీ డాక్టర్ కుమారుడుగా జన్మించిన చాపెక్ ను జీవితాంతం వెన్నెముక వ్యాధి వెన్నాడింది. రచనా వ్యాసంగం ద్వారా ఆయన దానిని మరచిపోయాడు. 14 వ ఏట రచనలు ప్రారంభించాడు. ప్రాగ్, బెర్లిన్, పారిస్‌లలో తత్త్వ శాస్త్రాన్ని అధ్యయనం చేసి, 1917 లో ప్రాగ్‌లో రచయితగా, పాత్రికేయుడుగా స్థిరపడ్డాడు. 1907 నుంచీ 1920 వరకూ వ్రాసిన రచనలను చాపెక్ చిత్రకారుడైన తన తమ్ముడు 'జోసెఫ్' తో కలసి ప్రచురించాడు. ఆ తమ్ముడు ఇతని రచనలకు చిత్రాలు వేశాడు.

జోసెఫ్‌తో కలిసి *జరీవె ప్లామిని* (హృద్యమయిన అగాథాలు, 1916) అనే కథానికలను, *క్రాకనో షోవా జ్రహదా* (1921, ధనం, ఇతర కథలు) అనే రచనను వెలువరించాడు. మానవునిలో పాశవిక శక్తుల విజృంభణ శాస్త్రీయ ప్రగతితో మేల్కొంటా యని ఆయన హెచ్చరించాడు. *ఆర్. యు. ఆర్.* (1923) అనే నాటకంలో 'మానవ యంత్రం' నిర్మించి 'రోబోట్'ను ప్రదర్శించాడు. రోబోట్ తనను సృష్టించిన మానవుని మనుగడకే భంగం కలిగిస్తుంది.

ఇదే రీతిలో *తోవార్నా న అబ్సొల్యూట్నా* (1922), *క్రాకాతిత్* (1924), *వాల్కాస్ మ్లోకీ* (1936), అనే రచనలు వెలువరించాడు. మానవ స్వార్థాన్ని, విలువలను జీవన విధానాలను వివరించే హాస్య రచన *జెజివో తా హమ్ము* జోసెఫ్‌తో కలిసి 1921 లో రచించాడు. ప్రజాస్వామికంలో చాపెక్‌కు గల విశ్వాసం వల్ల అతడు తన మిత్రుడు జాన్ మసారిక్‌ను సమర్థించాడు. అతని జీవిత చరిత్ర అనేక కథలకు ఉత్తేజం కలిగించింది.

సాధారణ జీవనాన్ని *హర్దుబాల్* (1933) లోను, ప్రపంచం పట్ల జాగరూకతను *ప్రావెతోస్* (1934) లోను, గుణాత్మక నిర్ణయాల వ్యక్తిగత కారణాలను *అబ్ యెష్నాజివోత్* (1934) లోను, వాస్తవిక చిత్రణను *ప్రెనిపర్తా* (1937) లోను ప్రదర్శించాడు. *బెలానె మోక్*

(1937), *మాతా* (అమ్మ-1940) ఈయన రచనలలో ప్రశస్తమైనవి.

*గు.శం*

**చాసర్, జెఫ్రీ (1342/43 1400) :** ఇంగ్లీషు భాషలో ఆదికవి అని చెప్పదగ్గవాడు. షేక్స్పియర్‌కు ముందు చాసర్ అంత ప్రముఖ ఆంగ్లకవి మరొకడు లేడు. ఆయన రచించిన *కాంటర్‌బరీ టేల్స్* ఇంగ్లీషు భాషలో వెలసిన మహాకావ్యాలలో ఒకటిగా పరిగణించబడుతూంది.

చాసర్ తండ్రి 'జాన్ చాసర్' ద్రాక్షాసవ విక్రేత. మధ్య తరగతి కుటుంబానికి చెందిన ఆయన ఆదాయంలో ఎక్కువ భాగం ద్రాక్షాసవం వల్లా, తోళ్ల పరిశ్రమ వల్లా వచ్చేది. 1357 లో చాసర్ బుల్‌స్టర్ రాకుమారి కొలువులో చేరాడు. 1359 లో ఫ్రాన్స్‌లో 3 వ ఎడ్వర్డ్ సైన్యంలో పనిచేయ వలసి వచ్చింది. 'ఫిలిప్పా ఫాన్' ను 1366 లో చాసర్ వివాహమాడాడు. ఆ మరుసటి ఏడాదే కోర్టు ఉద్యోగిగా నియమింపబడ్డాడు.

చాసర్ రచించిన మొట్టమొదటి మంచి పద్యం *బుక్ ఆఫ్ ది డచ్చెస్* (1369-1370). లంకాస్టర్ ప్రభువు పుత్రిక మీద వ్రాసిన ఒక విలాప గీతం అది. తరువాతి దశాబ్దిలో దౌత్యశాఖలో ఉద్యోగాలు కారణంగా చాసర్ ఫ్లాండర్స్, ఫ్రాన్స్, ఇటలీ మొదలైన దేశాలలో పర్యటించాడు. తరువాత కస్టమ్స్ శాఖలో కంట్రోలర్‌గా నియమితు డయాడు. *హౌస్ ఆఫ్ ఫేమ్* అనే ప్రేమ గీతం రచించాడు. 1380-90 మధ్య వ్యక్తిగతంగానూ, రాజకీయంగానూ అనేక ఈతిబాధలు అనుభవించ వలసి వచ్చినా, ఆ కాలంలోనే *పార్లమెంట్ ఆఫ్ ఫౌల్స్* అనే ప్రేమగీతం, బోతియస్ వ్రాసిన *కన్సొలేషన్ ఆఫ్ ఫిలాసఫీ* ఆంగ్లీకరణ, *ట్రాయిలస్ అండ్ క్రిసీడ్* అనే నవలా రచించాడు. బహుశః 1387 లో చాసర్‌కు భార్యావియోగం సంభవించి ఉండవచ్చు. 1390 తరువాత కూడా ఆయనకు రాజాస్థానంతో మంచి సంబంధాలు ఉన్నాయి. ఆ కాలంలోనే ఆయన సుప్రసిద్ధమైన అసంపూర్ణ కావ్యం *కాంటర్‌బరీ టేల్స్* వెలువడింది. 1399 డిసెంబరులో చాసర్ వెస్ట్ మినిస్టర్ అబ్బే తోటలో ఒక ఇల్లు అద్దెకు తీసుకున్నాడు. ఆ మరుసటి ఏడాదే ఆయన చనిపోవడం, ఆ 'అబ్బే' లోనే ఆయనను సమాధి చేయడం జరిగింది.

*బొ. శ్రీ.*

**చికమట్సు మోన్జామెమోన్ (1653-1725) :** సుప్రసిద్ధుడైన జపనీస్ నాటక కర్త. అసలు పేరు సుగిమోరీ నోబ్యుమోరీ. దాదాపు 160 నాటకాలను ఆయన రచించాడని పరిశోధక విద్వాంసులు లెక్క తేల్చారు. వాటిలో ఎక్కువ భాగం 'బున్‌రాకు' (Bunraku) అనబడే తోలు బొమ్మల నాటకాలకోసం వ్రాసినవి. చికమట్సుకు ముందు తోలు బొమ్మల నాటకాల కోసం చిల్లర రచయితలు తోలు బొమ్మలను ఆడించే వారి ఇష్టానిష్టాలకూ, శక్తి యుక్తులకూ అనుగుణంగా చౌకబారు రచనలు చేస్తూ ఉండేవారు. చికమట్సు మొట్టమొదటి సారిగా కళాత్మకమైన విలువలు గల నాటకాలు వ్రాశాడు.

ఆయన నాటకాలను చారిత్రకాలు, సాంసారిక విషాదాంతాలు అని రెండు వర్గాలుగా విభజించుకోవచ్చు. ఆధునిక విమర్శకులు రెండవవర్గం నాటకాలనే ఎక్కువగా మెచ్చుకుంటున్నారు. అందుకు కారణం: వాటిలో వాస్తవికత ఎక్కువగా ఉండడం, పాశ్చాత్య నాటక సిద్ధాంతాలకు అవి మరింత చేరువగా ఉండడం. 1738 లో చికమట్సు మిత్రుడొకడు రచించిన *నానివా మియాగె* అనే గ్రంథంలో తోలు బొమ్మల నాటకాలను గురించిన చికమట్సు అభిప్రాయాలు ఉదాహరించబడ్డాయి. ఒక చోట చికమట్సు "వాస్తవికానికీ, అవాస్తవికానికీ మధ్య ఉన్న అతి సూక్ష్మమైన సరిహద్దు రేఖలో నిజమైన కళ ఇమిడి ఉంది" అంటాడు. తన నాటక రచనలో కూడా 'చికమట్సు' నాడు ప్రచారంలో ఉన్న అసందర్భపు అతిశయోక్తులకూ క్రొత్తగా వాడుకలోకి వస్తున్న వాస్తవిక చిత్రణలకూ మధ్యస్థంగా అతి నేర్పుగా రచన సాగించాడు.

తన కాలం నాటి 'బసాకా' నగరంలో జీవిస్తున్న వర్తకులు, గృహిణులు, దొంగలు, వేశ్యలు మొదలైనవారంతా చికమట్సు సాంసారిక విషాదాంత నాటకాలలో మనకు దర్శన మిస్తారు.

చికమట్సు రచనలలో అధిక ప్రజాదరణ పొందింది- *కోకు సేన్యా కస్సేన్* (కోక్సింగా యుద్ధాలు- 1715). చైనాలో మింగ్ రాజవంశ పాలనను పునఃప్రతిష్ఠించాలని చూసిన ఒక సాహసికుణ్ణి గూర్చిన చరిత్రాత్మక నాటకం అది. మరొక ప్రముఖ రచన *షింజూ తెన్ నో అమిజిమా* (1720, *అమిజిమా ఆత్మ హత్య*). ఈ నాటకం నేటికీ తరచు ప్రదర్శించబడుతూంది.

1725 జనవరి 6 న 'బసాకా' నగరంలో చికమట్సు మోంజామెమోన్ చనిపోయాడు. *బొ.శ్రీ.*

**చెంగ్ చెన్-తో (1898-1958) :** 20 వ శతాబ్దపు చైనా భాషా సాహిత్యాలకు ఆయువు పట్టు అనదగిన ప్రముఖ రచయిత, చరిత్రకారుడు, విద్యావేత్త. చైనా సాహిత్యానికి సంబంధించిన అనేక గ్రంథాలను, పత్రాలను

దేశం నలుమూలలా తిరిగి సేకరించాడు. యౌవన దశనుండే వ్యాసాలు, కవిత్వం, చిన్నకథలు వ్రాయడం ప్రారంభించాడు. ఒక వంక రచనలు చేస్తూనే మరో వంక శాంఘై, పీకింగ్ నగరాలలో చదువు కొనసాగించాడు. భాషా సంస్కరణోద్యమంలో చురుకుగా పాల్గొని చైనా సాహిత్యానికి ఎనలేని సేవ చేశాడు. సంస్కరణాభిలాషి కావడం వలన చైనాలో అప్పటికే ప్రచురణలో ఉన్న *షియా-షో-యిచ్-పావ్* అనే పత్రికకు సంపాదక బాధ్యత చేబట్టి, భాషలో మార్పులు తెచ్చాడు. అభ్యుదయ భావాలకు దర్పణ మనదగిన రచనలను ఆహ్వానించి, రచయితలలో నూతనోత్తేజం కలిగించాడు. నూతన సాహితీ ప్రక్రియలతో వాస్తవికతకు, సామాజిక స్పృహకు అద్దం పట్టే రీతులలో వెలువడిన ఈ నూతన పత్రికకు యువతరం జేజేలు పలికింది. సాహితీ ప్రియులకు, పరిశోధకులకు ఈ పత్రిక కరదీపికగా సహాయపడింది.

చెంగ్ సృజనాత్మకమైన కృషితో పాటు విదేశీ భాషా సాహిత్యాలను ఈ పత్రిక ద్వారా చైనా ప్రజలకు పరిచయం చేశాడు. ఇందుకు గాను అనేక దేశాలలో ఆయన పర్యటించాడు. చైనాలో క్రొత్త వాఙ్మయ శకానికి నాంది పలికాడు.

1920 లో పత్రికా సంపాదక మండలిని పునర్వ్యవస్థీకరించి ప్రధాన సంపాదక బాధ్యతను స్వీకరించి, జీవితాంతం వరకు మాండలిక భాషా వికాసానికి కృషి చేశాడు. సాంప్రదాయిక రీతులలో అనూచానంగా వస్తున్న ప్రక్రియలను మార్చి, ఆద్యతన భావాలకు స్ఫూర్తిని కలిగించే కథలు, కవితలతో పత్రికకు క్రొత్త రూపు రేఖలు కలిగించాడు.

1927 లో భాషా సంస్కరణోద్యమంలో భాగంగా పారిస్, లండన్ నగరాలు సందర్శించి పండితులతో, ప్రముఖులతో చర్చించాడు. విదేశ పర్యటనానంతరం, మాండలిక భాషా స్వరూపాలు, సాహిత్యం, సాంస్కృతిక వికాసాల మీద ప్రత్యేక వ్యాసాలు ప్రచురించాడు. పెక్కు సంపుటాలను తన సంపాదకత్వంలో పరిష్కరించి ప్రచురించాడు. చైనా ప్రభుత్వ, సాంస్కృతిక మంత్రిత్వ శాఖలో ఉన్నతాధికారిగా చేరి, దేశ సాంస్కృతిక వికాసానికి అవిరళ కృషి చేశాడు.

1958 లో సాంస్కృతిక పర్యటన బృందాన్ని తీసుకొని ఆఫ్ఘన్‌స్థాన్ వెళ్తున్న సందర్భంలో విమానం కూలిపోయిన దుర్ఘటనలో చెంగ్ మరణించాడు.

ఆధునిక చైనా సాహిత్యానికి చెంగ్ మణిదీపం లాంటివాడు.

శే.రా.

**చెల్దేరోడె, మిషెల్ డి (1898-1962) :** బెల్జియన్ నాటక రచయిత. ఈయన 1898 లో బెల్జియంలోని ఇక్సెల్స్‌లో జన్మించాడు . ఈయన తన నాటకాలను ఫ్రెంచ్‌లో వ్రాసి, ప్రదర్శన కోసం ఫ్లెమిష్ భాషలోకి తర్జుమా చేసేవాడు. ఈయన ఆశయసిద్ధికే పూర్తిగా అంకితం అయినాడు. కీర్తికాంక్ష లేనివాడు కావడంచేత, ఈయన ప్రజ్ఞ రెండవ ప్రపంచయుద్ధం తరువాత గాని బాహ్య ప్రపంచానికి వెల్లడి కాలేదు. ఈయన నాటకాల వాతావరణం చీకట్లను చిమ్ముతూ, సామాన్య ప్రపంచం కంటె భిన్నంగా ఉంటుంది. ఈ నాటకాలలో మంచి, చెడుల ఘర్షణ, సైతాను అస్తిత్వం ముఖ్య వస్తువులు. ఈయన లాగే ఫ్లాండర్స్‌కు చెందిన హియరోనిమస్ బోష్, బ్రూగెల్ అనే చిత్రకారుల ప్రభావం ఈ నాటకాలపై కనిపిస్తుంది. మరొక ప్రక్క ఇరినైజాన్స్, ఇంగ్లిష్ నాటక కర్తలు మార్లో, మిడిల్‌టన్‌లను ఈ నాటకాలు జ్ఞప్తికి తెస్తాయి.

చెల్దే రోడె తన నాటకాలలో చాలా వాటిని ఫ్లెమిష్ పాప్యులర్ థియేటర్ కోసం వ్రాశాడు. తదనుగుణంగా ఈయన నాటకాలలో కొన్ని ప్రత్యేకం తోలు బొమ్మల ఆట కోసం వ్రాయబడినవి. ఈయన 1927 లో సెంట్ ఫ్రాన్సిస్ ఆఫ్ అసిసీ జీవితాన్ని గురించి వ్రాసిన నాటకం విశేష ఆదరణ పొందింది. 1928 లో పై సంస్థ కోసం *బరబ్బాస్* (Barabbas) అనే నాటకం వ్రాశాడు. ఇది జీసస్ జీవితంలోని అంతిమ ఘడియలను, ఆయనను సిలువ వేయడాన్ని ఆర్ద్రతతోను, సానుభూతితోను చిత్రిస్తుంది. పై రెండు నాటికలలో మానవతా దృష్టి, సానుభూతి, కనిపిస్తాయి గాని, భక్తిభావం గోచరించదు. *బరబ్బాస్* అప్పుడు ప్రజాదరణ పొందడమే కాక ఈ నాటిక ఈస్టర్ సమయంలో ప్రదర్శింపబడుతూంది.

ఇవి కాక ఈయన *పెంటగెట్స్*, *హాప్ సిగ్నోర్* (1935), *ది స్కూల్ ఫర్ జెస్టర్స్* (1942), *క్రానికల్స్ ఆఫ్ హెల్* (1949) అనే నాటకాలూ, కొన్ని నవలలూ వ్రాశాడు. వీనిలో ముఖ్యపాత్ర సామాన్యంగా వికల మనస్కుడైన ఒక కళాకారుడు. ఈ నాటకాలు విజయవంతం కావడానికి నిర్వహణలో ప్రత్యేకమైన మెలకువలు, నిర్వాహకుని సానుభూతి అవసరం. కథారచనలో పటుత్వం, నిర్వహణలో క్రొత్త పంథా, జానపద భాషలో సంభాషణలు ఈ నాటకాలకు అన్ని తరహాల ప్రేక్షకుల ఆదరాన్నీ సంపాదించాయి. 'టోటల్ థియేటర్' ఉద్యమానికి ఈయన బాగా దోహదం చేశాడు. ఈ పద్ధతిలో నాటకకర్త ప్రేక్షకులను అన్ని విధాలా (శబ్ద, దృశ్య ప్రేరణల

ద్వారా) నాటకంలో సంలీనం చేసి, నాటకంలో ప్రతిపాదించబడిన సమస్యను గురించి ఆలోచించేట్టు చేస్తాడు. ఈయన ఆధునిక యూరపియన్ నాటక రంగంలో సంచలనం సృష్టించి, అమెరికన్ నాటక రంగాన్ని కూడా ప్రభావితం చేసి, 1962 లో బెల్జియంలో మరణించాడు.

డి.ల.రా.

**చెస్టర్‌టన్, జి.కె. (1874-1936) :** ఇంగ్లీషు సాహిత్య విమర్శకుడు, కవి, వ్యాసకర్త, నవలల, కథానికల రచయిత. హాస్య ప్రవృత్తి, స్థూలకాయం ఈయనలోని విశిష్టతలు.

లండన్ లోని సెయింట్ పాల్స్ స్కూలులో చెస్టర్‌టన్ విద్యాభ్యాసం చేశాడు. తర్వాత స్లేడ్ స్కూలులో చిత్ర కళాధ్యయనం చేశాడు. యూనివర్శిటీ కాలేజీలో సాహిత్యం చదువుకొన్నాడు. 1910 వ సంవత్సరం వరకూ ఆయన వ్రాసిన రచనలను మూడు విధాలుగా విభజించవచ్చును. మొదటి విభాగం: ఆయన సామాజిక విమర్శ (పత్రికా రచనలో). ఇది *ది డెఫెండెంట్* (1901), *ట్వెల్వ్ టైప్స్* (1902), *హెరెటిక్స్* (1905) అనే సంపుటాలుగా సంకలితం చేయబడింది.

ఈ రచనలలో ఆయన దక్షిణాఫ్రికాలో బోయర్ల యుద్ధాన్ని సమర్థించాడు. రాజకీయంగా ఆయన ఉదారవాద (లిబరల్) పక్షానికి చెందినవాడు. ఆ తర్వాత కొంతకాలం తీవ్రవాద అభిప్రాయాలు ఈయనను ప్రభావితం చేశాయి. అప్పట్లో ఈయన తన మిత్రుడు హిలరీ బెల్లక్‌తో కలసి 'పంపిణీ' వాది అయినాడు. భూమిని పంపిణీ చేయాలన్నది ఈ వాదం. ఈయన రచించిన 'ప్రపంచంలో దోషం ఏమిటి'? (1910) అనే రచనలో వీరి వాదం బాగా వ్యక్తం అవుతుంది.

ఆయన రచనలలో రెండవ విభాగం: సాహిత్య విమర్శ. 'రాబర్ట్ బ్రౌనింగ్' (1903), 'చార్లెస్ డికిన్స్' (1906), *ఎప్రిసియేషన్స్ అండ్ క్రిటిసిజమ్స్ ఆఫ్ ది వర్క్స్ ఆఫ్ చార్లెస్ డికెన్స్* (1911), కొందరి నవలలకాయన రచించిన ఉపోద్ఘాతాలు, సాహిత్య విమర్శకుడుగా ఆయన స్థానాన్ని నిరూపిస్తున్నాయి. సాహిత్య విమర్శకుడుగా అవి ఆయన గొప్ప రచనలు. ఆయన రచించిన *జార్జ్ బెర్నార్డ్ షా* (1909), *ది విక్టోరియన్ ఏజ్ ఇన్ లిటరేచర్* (1913) లతో పాటు *విలియం బ్లేక్* (1910), ఆ తర్వాత రచించిన పరిచయ గ్రంథాలైన *విలియం కాబెట్* (1925), *రాబర్ట్ లూయీ స్టీవెన్‌సన్* (1927) ఆయన విమర్శనాత్మక రచనలలో ప్రతిభావంతమైనవని చెప్పదగినవి.

ఆయన రచనలలో మూడవ విభాగం: రంగస్థలం, మతవిజ్ఞానం. 1922 లో ఆంగ్లికన్ శాఖ నుంచి రోమన్ కేథలిక్ విశ్వాసిగా ఆయన పరివర్తన పొందాడు. క్రైస్తవమతం గురించి ఆయన *ఆర్థొడక్సీ* (1909) అనే గ్రంథంలో అంతకు పూర్వమే వ్రాసి ఉన్నా, ఆయన శాఖాంతర పరివర్తనం ఆయన రచనకు మరింత పదును పెట్టింది. ఇది *కాథలిక్ చర్చ్ అండ్ కన్‌వర్షన్* (1926) *ఏ హోవల్స్ అండ్ డినైయల్స్* (1936) లాంటి రచనలలో మరింత ప్రస్ఫుటంగా కనబడుతుంది. ఈయన విశ్వాస పరివర్తనం ద్వారా వచ్చిన ఇతర రచనలు: *సెయింట్ ఫ్రాన్సిస్ ఆఫ్ అస్సెసి* (1923), *ది ఎస్సే ఇన్ హిస్టారికల్ థియొలజీ, ది ఎవర్ లాస్టింగ్ మాన్* (1925), *సెయింట్ థామస్ ఎక్వినాస్* (1933) మొదలైనవి.

కవిగా చెస్టర్‌టన్ వీరగాథాత్మక రచనలలో సిద్ధహస్తుడు. *లెపాంటో* (1911) అనే ఆయన రచన ఇందుకు ఉదాహరణగా పేర్కొనదగింది.

ఆయన వ్యాసరచన నిశితంగా, వ్యంగ్యంగా, గంభీరంగా సాగింది. ఆయన బాహ్యప్రవృత్తి *ఆన్ రన్నింగ్ ఆఫ్టర్ వన్స్ హాట్* (1908), *ఎ డిఫెన్స్ ఆఫ్ నాన్సెన్స్* (1901) వంటి వ్యాసాలలో ఎక్కువగా కనిపిస్తుంది.

చెస్టర్‌టన్ సృజనాత్మక సాహిత్యాన్ని చాలా మంది పాఠకులు అభిమానిస్తారు. *ది నెపోలియన్ ఆఫ్ నాటింగ్ హిల్* (1904) అనే నవల లండన్ సివారులో అంతర్యుద్ధ కాలంనాటి ఒక ప్రేమ గాథ. దీని తరువాత ఒక కథాసంపుటం ఆయన వెలువరించాడు. ఈ కథల సంపుటి పేరు *ది క్లబ్ ఆఫ్ క్వీర్ ట్రేడ్స్* (1905). ఆ తర్వాత చెస్టర్‌టన్ ఒక ప్రతీకాత్మకమైన నవల ప్రకటించారు. ఈ నవల పేరు *ది మాన్ హూవజ్ థర్స్‌డే* (1908). వీటన్నిటికన్నా ఆయన ఒక మతాచార్యుణ్ణి గురించి వ్రాసిన నవలలు మరింత ప్రసిద్ధి పొందాయి. *ది ఇన్నొసెన్స్ ఆఫ్ ఫాదర్ బ్రౌన్* (1911), *విస్‌డమ్* (1914), *ది ఇన్‌క్రెడ్యులిటీ* (1926), *ది సీక్రెట్* (1927), *ది స్కాండల్ ఆఫ్ ఫాదర్ బ్రౌన్* (1935) మొదలైనవి చెస్టర్‌టన్ నవలలలో పేర్కొనదగినవి.

పూర్తిగా విభిన్న దృక్పథాలు కల హెచ్. జి. వెల్స్, షా, బెల్లక్, మాక్స్‌బీర్ బహమ్‌లు చెస్టర్‌టన్‌కు మిత్రులు. ఆయన స్వీయచరిత్ర 1936 లో వెలువడింది.

*మంజుశ్రీ*

**చెహోవ్, ఆంటోన్ (పావ్‌లోవిచ్) (1860-1904) :** జగత్ప్రసిద్ధి చెందిన రష్యన్ నాటక

రచయిత, కథానికా రచయిత. 19 వ శతాబ్ది తుది భాగాన వెలసిన రష్యన్ వాస్తవికతా సంప్రదాయ ప్రధాన ప్రతినిధి. *ది సీగల్, అంకుల్ వన్యా, త్రీ సిస్టర్స్, ది చెరీ ఆర్చర్డ్* వంటి సుప్రసిద్ధ రచనల నిర్మాత.

రష్యాలోని 'టాగన్ రాగ్' అనే గ్రామంలో 1860 జనవరి 29 న ఒక బానిస కుమారుడుగా చెహోవ్ జన్మించాడు. ఆయన తండ్రి ఒక చిల్లర దుకాణం నడిపేవాడు. తన దుకాణంలో పనిచేయమనీ, తానే నడుపుతున్న ఒక చర్చి గాయక బృందంలో చేరమనీ కుమారుణ్ణి ఆయన నిర్బంధించేవాడు. తల్లి చెహోవ్‌ను ఎంత ప్రేమగా చూసినా, బాల్యానికి సంబంధించిన బాధా కరమైన స్మృతులే అతనికి మిగిలాయి. అతని అనంతర రచనలలో చాలా వాటిలో ఆ అనుభవాల ప్రతిధ్వనులు వినిపిస్తాయి.

కొద్దికాలం పాటు గ్రీక్ బాలురకోసం నడిపే ఒక స్థానిక పాఠశాలలో చదివి, అనంతరం చెహోవ్ 'టాన్ జీమ్నాజియా' (హైస్కూలు) లో చేరి, 10 ఏళ్లు అక్కడ చదివాడు. ముఖ్యంగా గ్రీక్, లాటిన్ పురాణాలు బోధించే ఆ పాఠశాలలో ఉన్నత విద్యా ప్రమాణాలు పాటించబ డేవి. తండ్రి దివాళా తీయడంతో చివరి 3 ఏళ్లూ ఒంటరిగా ఉంటూ చిన్న పిల్లలకు చదువు చెబుతూ చెహోవ్ తన కాళ్లమీద తాను నిలబడవలసి వచ్చింది. తండ్రి తక్కిన కుటుంబ సభ్యులతో సహా జీవనోపాధిని వెతుక్కొంటూ మాస్కో నగరం చేరు కొన్నాడు. 1879 శీతాకాలంలో చెహోవ్ మాస్కోలోని తన కుటుంబ సభ్యులను చేరుకొని 1892 వరకూ వారితో కలసి ఉన్నాడు. మాస్కో యూనివర్సిటీలోని వైద్య కళాశాలలో చేరి, 1884 లో వైద్య పట్టభద్రు డయాడు. తండ్రి జీతం చాలీ చాలకుండా ఉండటం చేత కుటుంబ నిర్వహణ బాధ్యత అతనే చూడవలసి వచ్చింది. అతని ఇద్దరు అన్నలలో అలెక్సాండర్ జర్నలిస్ట్. నికొలాయ్ ఆర్టిస్ట్. వారు విలాస జీవితాలు గడుపుతూ కుటుంబ బాధ్యతను పట్టించుకునేవారు కాదు. జర్నలిస్ట్‌గా రచనలు చేస్తూ, హాస్య రచనలు ప్రకటిస్తూ, డబ్బు సంపాదించి చెహోవ్ తానే సంతోషంగా కుటుంబ పోషణ చేసేవాడు.

హాస్య పత్రికలకు మారుపేరుతో ఛలోక్తులు వ్రాయ డంతో చెహోవ్ రచనా జీవితం ప్రారంభమైంది. 1888 నాటికే ఆయనకు కొంతవరకు ప్రజాదరణ లభించింది. అనంతర రచనలకంటె ఆ కాలంలో చెహోవ్ చేసిన రచనలే ఎక్కువ. హాస్య రచనలతో పాటు మానవ దైన్యాన్నీ, నైరాశ్యాన్నీ చిత్రించే కరుణ రస భరితమైన రచనలు కూడా చెహోవ్ చేయ నారంభించాడు.

1891-92 నాటి దారుణ కాటక పరిస్థితులలో డాక్టరుగాను, వైద్యశాఖా నిర్వాహకుడుగాను చెహోవ్ దేశానికి ఎనలేని సేవచేశాడు. మాస్కోకు 50 మైళ్ల దక్షిణాన గల మెలిఖోవో గ్రామంలో ఒక ఎస్టేట్ కొన్నాడు. ముసలి తల్లిదండ్రులతోనూ, చెహోవ్‌కు సేవ చేయటానికి అవివాహితగానే ఉండిపోయిన సోదరి 'మరియా' తోనూ ఆరేళ్ల పాటు చెహోవ్ అక్కడ జీవించాడు. ఆ కాలంలో ఆయన చేసిన రచనలు *ది బటర్ ఫ్లై, నైబర్స్* (1892), *ఆన్ అనానిమస్ స్టోరీ* (1893), *ది బ్లాక్ మాంక్* (1894), *మర్డర్ అరియాడ్నే* (1895).

చెహోవ్ రచించిన చివరి రెండు నాటకాలు: *త్రీ సిస్టర్స్* (1900-1901), *ది చెర్రి ఆర్చర్డ్* (1903-1904). చెహోవ్ నాటకాలు రంగస్థలం మీద ప్రదర్శింప బడుతూ విశేష ప్రజాదరణ పొందాయి. 1904 జనవరి 17 న చెహోవ్ రచనల రజతోత్సవ సందర్భంలో ప్రదర్శించిన నాటకానికి మృత్యుముఖంలో ఉన్న చెహోవ్‌ను రప్పించి, నిరాడంబరుడైన ఆయన చేత బలవంతంగా ఆయనను ప్రశంసిస్తూ చేసిన ఉపన్యాసాలు వినిపించారు. ఆ ఏడాదే జూలై 14/15 న జర్మనీలోని బాడెన్‌వైడర్‌లో చెహోవ్ తన దేహయాత్ర చాలించాడు. ఆయన చనిపోయిన 40 ఏళ్లకు ఆయన సంపూర్ణ రచనలు, లేఖలు 8 సంపుటాలుగా ప్రకటించబడిన తరువాత గాని ఆయన రచనల విశిష్టతను లోకం పూర్తిగా గుర్తించలేదు. ప్రధానంగా చెహోవ్ నాటక కర్తగానే సుప్రసిద్ధుడైనా, విమర్శకుల దృష్టిలో 1888 తరువాత ఆయన రచించిన కథానికలు అంత కంటె విలువైనవి!

బ్రా.శ్రీ.

**చౌ చో జెన్ (1885-1966) :** ప్రముఖ చైనీయ వ్యాసకర్త, పరిశోధకుడు, అనువాదకుడు. ఇతడు రష్యన్, గ్రీకు, రోమ్, జపాన్ సాహిత్యాలను అధ్యయనం చేసి, పరిశోధనాత్మక రచనలు చేసి ప్రచురించాడు. చైనా భాషలో వస్తున్న మార్పులను ఎప్పటికప్పుడు గమనిస్తూ, మాండలిక పదకోశాలను తయారు చేశాడు. చిన్నప్పటి నుంచే సాహిత్యాభిలాష ఎక్కువగా గల చౌచో జెన్ తన జ్యేష్ఠ సోదరుడు చౌ, షూ-జెన్ (కలం పేరు లూ-సెన్) తో కలిసి చదువు కొనసాగించాడు. అయితే ఆర్థిక పరిస్థితులు అంతగా అనుకూలించ లేదు. పట్టుద లతో పరిశోధన కొనసాగించి ఆంగ్లం, ఇతర పాశ్చాత్య

భాషలను వాటిలోని సాహితీ ప్రక్రియలను గురించి విశేషంగా వ్యాసాలు వ్రాశాడు. క్రమంగా అనువాద రచనలు మొదలు పెట్టాడు. ఎడ్గార్-అలెన్-పో వ్రాసిన ప్రసిద్ధమైన *ది గోల్డ్ బగ్* కు చైనీయ అనువాదం 1905 లో వచ్చింది. మరుసటి సంవత్సరం తన సోదరునితో జపాన్ వెళ్లి, ప్రాచీన జపాన్, గ్రీకు సాహిత్యాలను అధ్యయనం చేశాడు. తరచు విదేశీ భాషలలోని కథలను, నవలలను, కవితలను అనువాదం చేస్తూ ఉండేవాడు. ముఖ్యంగా వాస్తవికతా దృష్టితో కూడిన యూరపియన్ కథలను తన ప్రజలకు తెలిసే విధంగా సులువైన భాషలో అనువాదం చేసి, ప్రజా రచయితగా పేరు పొందాడు. నిరంకుశ పరిపాలనలో మ్రగ్గుతున్న చైనా ప్రజలను ఉత్తేజితులను చేశాడు. ప్రజలలో చైతన్యం కలిగించాడు. విదేశీ భాషలపై కొద్ది కాలంలోనే అధికారం సంపాదించాడు.

ఒక జపాన్ యువతిని వివాహం చేసికొని చైనా తిరిగి వచ్చి, కొంతకాలం చౌచో జెన్ పీకింగ్‌లో అధ్యాపక వృత్తి నిర్వహించాడు. మానవత్వపు విలువలపై విశ్వాసం గల చౌ అచిరకాలంలోనే మంచిపేరు సంపాదించాడు. మానవతావాది అయి, సాహిత్య కారుడుగా ప్రసిద్ధుడయాడు. కాని స్థానిక జాతీయ ప్రభుత్వం ఆగ్రహానికి గురికావలసి వచ్చింది. అనేక పర్యాయాలు వామపక్ష వాదుల దాడులకు గురి అయాడు. నిషిద్ధ రచయితగా ప్రభుత్వం అతనిని ప్రకటించి, అతని మీద పలు నేరారోపణలు చేసి మరణశిక్ష విధించింది. ఆ శిక్ష అమలు కాకముందే, 1949 లో పూర్తి క్షమాభిక్ష లభించడంతో బ్రతికి బయట పడ్డాడు.

1949 లో చైనాలో కమ్యూనిస్ట్ పాలన ఏర్పడిన తరువాత చౌ పీకింగ్ తిరిగి వచ్చి తన పరిశోధనలూ, అనువాదాలూ కొనసాగించాడు. 1966 నవంబరులో పీకింగ్ నగరంలోనే చౌ తుదిశ్వాస విడిచాడు.

శే.రా.

**చ్యాబ్రేరా, గ్రాజియా (1552-1638) :** ఇటలీ దేశపు కవి. ఈయన ప్రవేశపెట్టిన కొత్త ఛందస్సులు, హెలెనిక్ శైలి అర్వాచీన ఇటలీ కవులకు గేయ కవితా రచనకు స్ఫూర్తి నిచ్చాయి.

చ్యాబ్రేరా రోమ్‌లో తత్త్వజ్ఞానాన్ని అధ్యయనం చేశాడు. ఒక మతాధికారి ఇంట కొన్నాళ్లు నివసించాడు. తర్వాత మళ్లీ సవోనాకు తిరిగి వచ్చాడు. అక్కడ పౌర, దౌత్య శాఖల ఉద్యోగాలు, కొందరు రాజకుటుంబాల పిల్లల సంరక్షణ బాధ్యత ఆయనకు కావలసినంత తీరుబాటు కలుగజేశాయి. ఈ తీరుబాటు కాలంలో ఆయన విస్తృతంగా పద్యరచన చేశాడు. ఈ కావ్య రచన అనేక రీతులలో సాగింది. గేయరచనలు, వర్ణనాత్మక రచనలు, సంవాదాత్మక శృంగార జానపద గీతాలు, మహాకావ్యాలు, విషాదాంత కావ్యాలు, అధిక్షేప రచనలు ఎన్నో చేశా డాయన. ఆయన రూపొందించిన 'కంజొని' (ప్రాంతీయ కవితా రీతులనుంచి ఉత్పాదించిన గేయ ఫణితులు) శైలీ రీతులలో నవ్యతను ప్రవేశ పెట్టింది. *కండొట్టి* అనే ఆయన గేయ రచన ప్రాచుర్యం పొందింది. ఇది చాలా అందమైన రచన, సంగీత యుక్తం, హాస్య రస భరితం. ఈ రచన 16 వ శతాబ్దపు ఫ్రాన్స్ దేశపు ప్లీయడి కవుల రచనల చేత ఎక్కువగా ప్రభావిత మైనట్లు కనపడుతుంది. ఈ రచనా రీతిలో ఆయన 4, 5, 6, 8, 9, మాత్రా పంక్తులను ప్రవేశ పెట్టడం నవ్యత (పూర్వరీతి 11, 9, మాత్రా పంక్తులతో సాగేది). ఇంతే కాక రక రకాల స్వర వికాసం కూడా ఆయన గేయ రచనకు అందం చేకూర్చింది. చ్యాబ్రేరా చేసిన ప్రయోగాలు విజయవంతం కావడంతో ఆ తర్వాత వచ్చిన కవులకు వివిధ గేయ రచనా విన్యాసాలు లభ్య మయాయి. ఈయన రచనా రీతిని (ముఖ్యంగా 18 వ శతాబ్దపు) ఇటాలియన్ ఆర్కిడియా కవులు అనుసరించారు. ఈయన రచనలు కొన్ని 19 వ శతాబ్దపు కాల్పనిక కవి వర్డ్స్‌వర్త్ మెప్పుకు పాత్రమైనాయి. ఈయన రచించిన సమాధి గీతాలను కొన్నిటిని వర్డ్స్‌వర్త్ ఆంగ్లీకరించాడు.

మంజుశ్రీ

**ఛాప్‌మన్, జాన్ జే (1862-1933) :** అమెరికన్ సంస్కారప్రియుడు, నైతికవాది, కవి, విమర్శకుడు, నాటకకర్త. న్యూయార్కు రాష్ట్రంలో ప్లాకిప్సి అనే గ్రామంలో 1862 మార్చి 2 న జన్మించాడు. ఇతడు సహజమైన ధార్మిక ప్రవృత్తి, సేవాతత్పరత కలవాడు. ఇతని తల్లి వంశంలోనూ, తండ్రి వంశంలోనూ కూడా ప్రగతిశీలురు, కార్యశూరులు పలువురు ఉదయించారు. తాత తండ్రులు ఆనాటి దురాచారమైన బానిస వ్యాపారాన్ని తీవ్రంగా ప్రతిఘటించారు. నీగ్రోల ఎడ సానుభూతి ప్రదర్శించారు. ఛాప్‌మన్ తన 13 వ ఏట కంకార్డు రాష్ట్రంలోని సెంట్ పాల్స్ స్కూలులో చేరాడు. కాని ఆరోగ్య లోపంవల్ల ఇంటికి తిరిగి వచ్చి, ఇంటివద్దనే విద్య నభ్యసించి, 1885 వ సంవత్సరంలో హార్వర్డ్ విశ్వ విద్యాలయం పట్టా పుచ్చుకున్నాడు. అనంతరం కొంతకాలం యూరప్ ఖండంలో పర్యటించి వచ్చి, తిరిగి హార్వర్డు విశ్వ విద్యాలయంలో న్యాయ కళాశాలలో

చేరాడు. 1887 లో న్యాయ శాస్త్ర పట్టభద్రుడై, న్యూయార్క్‌లో న్యాయవాదిగా స్థిరపడి పదేళ్లు ప్రాక్టీసు చేశాడు. వృత్తి చేతనేగాక, ప్రవృత్తిచేత కూడా న్యాయ వాది కనుక సామాజిక న్యాయం కూర్చడం కోసం ఎన్నో సాంఘిక కార్యక్రమాలు ఆయన చేపట్టాడు. "గుడ్ గవర్నమెంట్ క్లబ్" అధ్యక్షుడుగా, *ది పొలిటికల్ నర్సరీ* (1807-1901) అనే పత్రిక స్థాపక సంపాదకుడుగా ప్రజలలో రాజకీయ, సామాజిక చైతన్యాన్ని రేకెత్తించాడు. యాంత్రిక నాగరకతను, తత్ సంబంధమైన విలువలను వ్యతిరేకిస్తూ వ్యాసాలు వ్రాశాడు. ఈ సామాజిక చింతన పర్యవసానంగా ఇతని కలంనుంచి *కాజెస్ అండ్ కాన్సీక్వెన్సెస్* (1898), *ప్రాక్టికల్ ఏజిటేషన్* (1900) అనే రెండు పుస్తకాలు రూపొందాయి. 1901 లో మళ్లీ ఆరోగ్యం బాగా దెబ్బ తినడంతో 10 ఏళ్లపాటు ఏ కార్యక్రమం లేకుండా విశ్రాంత జీవితం గడిపాడు. ఈ సమయంలో కొంత బాల సాహిత్యాన్ని సృష్టించాడు. 1910 లో *ది ట్రెజన్ అండ్ డెత్ ఆఫ్ బెనెడిక్ట్ ఆర్నాల్డ్* అనే ప్రసిద్ధ నాటకంతో సాహిత్యరంగ ప్రవేశం చేశాడు. మళ్లీ సాంఘిక కార్యక్రమాలు కూడా చేపట్టాడు. 1911 లో ఒక నీగ్రోపై చట్టవిరుద్ధమైన న్యాయవిచారణ జరిపి హింసించి, దారుణంగా హత్యచేసిన శ్వేత జాతీయులను అభిశంసించడానికి కోట్స్‌విల్‌లో 1912 లో ఒక సంస్మరణ సభను ఏర్పాటు చేశాడు. సభకు ఇద్దరే సభ్యులు హాజరయారు. అయినా ఛాప్‌మన్ నిరాశ చెందలేదు. మహోద్రేకంతో జాతి విచక్షణా విధానాన్ని తెగనాడుతూ ఉపన్యసించాడు. ఆ ఉపన్యాసం తరువాత పత్రికలో ప్రచురించబడి సంచలనం సృష్టించడమే కాక, జనహృదయంలో అబ్రహం లింకన్ గెట్టిస్ బర్గ్ ఉపన్యాసం మాదిరిగా శాశ్వతమైన ముద్ర వేసింది. ఈ ఉపన్యాసం ప్రఖ్యాత గ్రంథం *మెమొరీస్ అండ్ మైల్ స్టోన్స్* (1915) లో చేర్చబడింది. ఇతని ధర్మదీక్షకు హార్వర్డ్ రోజులలో జరిగిన ఒక సంఘటనను ఉదాహరించవచ్చును. ఇతడు ఒకనాడు హార్వర్డు ప్రాంగణంలో ఇద్దరు యువతీ యువకులను కొంచెం దూరం నుంచి చూడడం తటస్థించింది. వారెవరో ఏదో విషయమై ఘర్షణ పడుతున్నట్లనిపించింది. మరికొంత సేపట్లో ఆమె నతడు మానభంగం చేయడానికి సంకల్పించాడేమో అనిపించింది. ఆ అత్యాచారాన్ని ఆపాలని మహోద్రేకంతో ఆ యువకునిపై లంఘించి, ముష్టి ఘాతాలతో నొప్పించి, గాయపరచి, ఆమెను రక్షించాడు. అది జరిగిన కొంత కాలానికి యాదృచ్ఛికంగా ఏ యువతిని తాను రక్షించాడో ఆమెనే అతడు వివాహమాడడం తటస్థించింది. వివాహానంతరం ఆ నాటి సంఘటనలో ఆ యువకుడు ఆమెపై అత్యాచారం తలపెట్టలేదనీ, నిర్దోషి అనీ తెలిసి పశ్చాత్తప్త హృదయుడై క్రుంగిపోయాడు. తనకు తానే ప్రాయశ్చిత్తం విధించుకొని, తన ఎడమ చేతిని కాల్చుకొన్నాడు. తత్ఫలితంగా ఆస్పత్రిలో అతడి చేతిని తీసివేయవలసి వచ్చింది.

ఇతడు మొత్తం 25 పుస్తకాలు రచించాడు. వీటిలో ప్రధానమైనవి: *విలియం లోయిడ్ గేరిసన్* (1913), *కలెక్టెడ్ సాంగ్స్ అండ్ పొయెమ్స్* (1919), *ఎమర్సన్ అండ్ అదర్ ఎస్సేస్ గ్రీక్ జీనియస్ అండ్ అదర్ ఎస్సేస్,* (1915), *ఏ గ్లాన్స్ టువార్డ్స్ షేక్స్‌పియర్* (1922). 1932 లో ప్రచురించిన *న్యూ హొరైజాన్ ఇన్ అమెరికన్ లైఫ్* అన్న గ్రంథంలో వ్యాపారపు విలువలు అమెరికా దేశపు విద్యారంగాన్ని కలుషితం చేసి హతమారుస్తున్నాయని ఆయన ఆవేదన వ్యక్తం చేశాడు. ఇతడు తన రచనలలో వ్యాపార నాగరకత పై ధ్వజమెత్తాడు. మితిమీరిన ధనదాహాన్నీ, క్షణంలో కోటికి పడగెత్తాలన్న దురాశనీ తీవ్రంగా విమర్శించాడు. 1933 నవంబర్ 4 న ఛాప్‌మన్ చనిపోయాడు.

గం.శ్రీ.

**జహీజ్, అల్ (776-868/869)** : పూర్తిపేరు 'ఉథ్‌మాన్ అమ్ర్ ఇబ్‌న్ బహర్ ఇబ్‌న్ మహబూబ్ అల్-జహీజ్'

ఇరాక్‌లోని ఇస్లామ్ మతాచార్యుడు, మేధావి, సాహిత్యపరుడు. విశిష్టమైన వచనశైలికి, ప్రతిభా పూర్ణమైన అరబిక్ వచన రచనకు ప్రసిద్ధుడు. ఈయన కుటుంబం బహుశః ఇథియోపియాకు చెందినదై ఉండవచ్చు. బస్రాలో సామాన్య జీవితాన్నే వీరు గడిపారు. అయితే ఆయన ప్రజ్ఞా, వాక్చాతుర్యం పండిత మండలిలో ఆయనకు స్థానం కల్పించాయి. సంఘంలో గౌరవం కలిగించాయి. అబ్బా సిద్ కాలిఫ్ అల్-మమూన్ పరిపాలనకాలంలో అల్-జహీజ్ ఆయన రాజధానియైన బాగ్దాద్‌కు నివాసం మార్చాడు. ఆస్థానంలో చేరకుండా, పెద్ద పెద్ద రాజోద్యోగుల ఆదరణతో కొంతవరకు ఆయన జీవితం గడిపాడు. ఆయన వారికి తన గ్రంథాలను అంకితం చేశాడు. రాజాస్థానం సామర్రాకు మారినప్పుడు అల్ జహీజ్ కూడా అక్కడకు మారాడు. కాని మరణించడానికి కొద్ది కాలం ముందు ఆయన బస్రాకు తిరిగి వచ్చాడు.

మత విద్యను గురించి, రాజనీతిని గురించి ఆయన రచించిన గ్రంథాలు ఏవీ నేడు లభ్యం కావడం లేదు.

ఇతర గ్రంథకర్తల ఉదాహరణల ద్వారా మాత్రమే కొన్ని తెలుస్తున్నాయి. ఆయన వ్రాసిన గొప్ప వచన రచనలు మాత్రం దొరుకుతున్నాయి. వ్యాసరూపంలో ఉన్న సంకలన గ్రంథాలు ఇవి. *కితాబ్-అల్-హయవాన్* అనే 7 సంపుటాల అసంపూర్ణ గ్రంథంలో జంతువులను గూర్చి ఆయన వ్రాశాడు. దీనిలో జంతువులనే పాత్రలనుగా చేసి మత విషయిక, సాంఘిక భాషా విషయిక చర్చలు నిర్వహించాడు. *కితాబ్ అల్-బయాన్ వల్ అల్ తబీన్* అనేది ఒక బృహద్గ్రంథం. సాహిత్య శైలిని గూర్చి, భాషా సామర్థ్యం గురించి చర్చించే గ్రంథం ఇది. *కితాబ్ అల్-బుఖలా* (పిసినారుల కథలు) అనేది ఒక కథల సంపుటం. అల్-జహిజ్ ఆ నాడు మానవీయ శాస్త్రాలన్నిటిని గూర్చి ఉపదేశాత్మక రచనలు చేశాడు.

మేధా స్వాతంత్ర్యానికి అల్-జహిజ్ పేరు పొందినా, తన రచనలలో తరచు ప్రభుత్వాన్ని బలపరచేవాడు. హేతువాద అభినివేశపరులైన ముటాజిలైట్ సంప్రదాయంతో అతడు చేయికలిపాడు. ఈ మత సంప్రదాయాన్ని అల్-మమూన్ కాలిఫా, ఆయన తరువాత వచ్చిన కాలిఫా సమర్థించాడు. ముతాజివేట్ సంప్రదాయాన్ని అల్ ముతావక్కిల్ అనే కాలిఫా పరిత్యజించిన తరువాత కూడా అల్-జహిజ్ ఆ సంప్రదాయాన్ని సమర్థించే రచనలు చేశాడు. అందులో *మనక్వీబ్ అల్-తుర్క్* అనే వ్యాసం లాంటి రచన పేర్కొనదగింది.

మంజుశ్రీ

**జాన్సన్, ఊవే (1934-84)** : జర్మన్ రచయిత, నవలాకారుడు. ఈయన నవలలు ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం విభక్త జర్మనీలోని జీవిత వైరుధ్యాలను చిత్రించాయి. పూర్వకాలపు స్వీడిష్ వంశాలకు చెందిన మెక్లెన్‌బర్గ్ కుటుంబంలో జాన్సన్ జన్మించాడు. రాస్టక్, లైప్‌జిగ్ విశ్వవిద్యాలయాలలో జర్మన్ భాషను అధ్యయనం చేసి 1956 లో డిప్లొమా పొందాడు. స్వయంగా రచనలు చేయడానికి ముందు అమెరికన్ రచయితలవి, బ్రిటిషు రచయితలవి కొన్ని గ్రంథాలు ఆయన అనువాదం చేశాడు. ఆయన మొదటి నవలను *ఇంగ్రిడ్ బబెన్ డెర్ డీ* ని తూర్పు జర్మనీ ప్రచురణకర్తలెవ్వరూ ప్రచురించటానికి అంగీకరించలేదు. దీనికి కారణం వారు సూచించిన మార్పులకు వేటికీ ఆయన ఎంత మాత్రమూ సమ్మతించక పోవడమే. ఆ నవల అచ్చుకాకుండానే ఉండి పోయింది. ఇటువంటి ఇబ్బందులు తరచు ఎదురవుతాయని భావించి ఆయన 1959 లో పశ్చిమ బెర్లిన్‌కు తన ఆవాసాన్ని మార్చాడు. ఆ తరువాత ఆయన దృష్టి అంతా ఉభయ జర్మనీల మధ్య ఉండే విద్వేష పూర్వకమైన స్పర్థ పట్ల ప్రసరించి తన రచనలలో దాన్ని వస్తువుగా చేసుకొన్నాడు. ఇక అప్పటి నుంచి ఆయన *ముట్ మస్సుంగెన్ ఊబెర్ జేకో* (1963), *స్పెక్యులేషన్స్ ఎబౌట్ జేకబ్* (1963), *దాస్ డ్రిట్టె బుచ్ ఉబెర్ అచిమ్* (1963, అచిమ్ గురించిన మూడో గ్రంథం), చిన్న చిన్న నవలలు, *కర్ష్, ఉండ్ ఆండేర్‌ప్రోసా* (1964), *ఐనె రెయిసె వెగ్‌వొహిన్* (1969), *జ్వాయి అస్టిఛిన్* (1965) లాంటి రచనలు చేశాడు. ఆ రచన లన్నీ ప్రయోగాత్మక మైనవే.

జాన్సన్ కథా కథనం ఒక రంగం నుంచి ఇంకొక రంగానికి, ఒక చైతన్య స్థాయి నుంచి ఇంకొక స్థాయికి హఠాత్తుగా మారిపోతుంది. ఒకే మాటలు వివిధ పాత్రలు పలికినప్పుడు వివిధార్థాలు స్ఫురిస్తాయి. నాలుగు సంపుటాల నవలా మాలిక *యహ్రెస్టగే* (1970-83) లో ఒక నూతన రచనా శిల్పాన్ని ఉపయోగించాడు. పత్రికల కటింగ్‌లతోను; వ్యాఖ్యాలతోను కథ నడిపే శిల్పం ఇది. 1960-70 మధ్య న్యూయార్క్‌లో జరిగిన సంఘటనలూ, కథానాయిక గుర్తుకు తెచ్చుకొనే 1920-60 మధ్య జర్మనీలో జరిగిన సంఘటనలూ దీనిలో వర్ణించబడ్డాయి. 1966-68 మధ్య జాన్సన్ న్యూయార్కులో ఉన్నాడు. అక్కడి నుంచి పశ్చిమ బెర్లిన్‌కు తిరిగి వచ్చి 1974 లో ఇంగ్లండు చేరుకొన్నాడు. యుద్ధానంతరం జర్మనీలో ఏర్పడ్డ 47 గురు గ్రంథకర్తల సంఘంలో ఆయన సభ్యుడు. ఆ సంఘంలో చాలామంది కన్నా వయసులో ఆయన చిన్నవాడు. తర్వాత ఆయన వ్రాసిన వ్యాసం ఏ జర్నీ టు క్లాగెన్‌ఫుర్ట్ పేర్కొనదగినది. ఇంగ్లీషులో కూడా కొన్ని వ్యాసాలు ఎన్నదగినవి. మార్క్ బులబీ రచించిన 'ఊవే జాన్సన్' అనే గ్రంథం ఆయన రచనలను, జీవితాన్నీ గూర్చి అధ్యయనం చేసిన గ్రంథం.

మంజుశ్రీ

**జాన్సన్, ఐవింద్** : చూ. అనుబంధం-I.

**జాన్సన్, (ఎమిలీ) పోలీన్ (1862-1913)** : కెనడా దేశంలో స్థిరపడిన ఎర్ర ఇండియన్ మహిళ. విదేశాలలో ఉంటున్నా దేశాభిమానం వీడని రచయిత్రి. తన జీవిత కాలానుభవాలను మధురంగా కవితారూపంలో వ్యక్తీకరించిన భావుకురాలు. తన జాతి వారసత్వాన్ని ప్రతిఫలించే కావ్యాలను ఆమె ప్రచురించింది. మొహాక్ నగర ముఖ్యుని కూతురు రీమె. తల్లి ఆంగ్ల వనిత.

పసితనం నుంచే కవిత పట్ల మక్కువ గల పోలీన్ తాను ప్రచురించిన అన్ని కావ్యాల మీద *తెకాహిన్ వేక్* అనే తన ఇండియన్ నామాన్నే ముద్రించింది.

అమెరికా సంయుక్త రాష్ట్రాలు, కెనడా, ఇంగ్లండ్ దేశాలు పర్యటించి తన కవితా గానంతో రసజ్ఞులను అలరించింది. ఆమెకు ఇష్టమైన 'నల్లరంగు' వస్త్రాలలో ఆమె విశేషంగా కనిపించేది. చివరకు కెనడా దేశం లోని 'వేంకోవర్' పట్టణంలో ఆమె స్థిరపడింది. అక్కడే ఎర్ర ఇండియన్‌ల జీవన వికాసానికి చెందిన కథలు, కవితలు వ్రాసింది. ఇంతవరకు ప్రకటింప బడిన ఆమె పుస్తకాలు ఇవి: 1. *ది లిజెండ్స్ ఆఫ్ వేంకోవర్* (1911), 2. *ది షాగ్‌నప్పి* (1913), 3. *ది మొకాసిన్ మేకర్* (1913), 4. *ఫ్లింట్ అండ్ ఫెదర్* (1912), ఆమె వ్రాసిన *ది సాంగ్ మై పాడిల్ సింగ్స్* అన్న పాట కెనడాలో పాఠశాలల విద్యార్థులందరికీ కంఠస్థం.

శే.రా.

**జాన్సన్, బెన్ (1572-1637) :** ఆంగ్ల నాటక రచయిత. భావకవి, సాహిత్య విమర్శకుడు. 'బెంజమిన్ జాన్‌సన్' గా కూడా ఈయన ప్రసిద్ధుడు. ఇంగ్లీష్‌లో షేక్స్‌పియర్ తరువాత మళ్లీ అంతటి ప్రముఖ నాటకకర్తగా ఈయనను పరిగణిస్తున్నారు. ఈయన రచించిన ప్రముఖ నాటకాలలో *ఎవ్విరి మాన్ ఇన్ హిజ్ హ్యూమర్* (1798), *వాల్పోనే* (1606), *ది ఆల్‌కెమిస్ట్* (1610), *ఎవ్విరి మాన్ ఆవుట్ ఆఫ్ హిజ్ హ్యూమర్* (1599), *సెజానస్* (1603, ఆయన రచించిన రెండు ట్రాజడీలలో ఇది ఒకటి), *ఈస్ట్‌వర్డ్ హో* (1605), *ఎపికోనే* (1609), *బార్తొలోమ్యు ఫెయిర్* (1614) చెప్పుకోదగ్గవి.

తొలిదశలో బెన్‌జాన్‌సన్ నటుడుగాను, నాటక రచయితగాను జీవితం ప్రారంభించాడు. ఫిలిప్స్ హెన్‌స్లోవేకు ఈయన నాటకాలు వ్రాసి పెట్టేవాడు. *ది కేస్ ఈజ్ ఆల్‌టర్డ్* అనే ఒక్క నాటకం తప్ప ఆ దశలో ఈయన రచించిననాటకాలలో ఏవీ లభించలేదు. ఈయన ట్రాజెడీలూ, కామెడీలూ కూడా రచించినా, లభించిన రచనలలో రెండే ట్రాజెడీలు కనిపిస్తునాయి: *సెజానస్* (1603), *కేటిలైన్* (1611).

జాన్‌సన్ నాటకాలు నేటికీ ప్రదర్శన యోగ్యాలుగా ఉన్నాయి. సంభాషణల రచనలో ఆయన అందె వేసిన చేయి. సంవిధాన కల్పనలోను, పాత్ర చిత్రణలోను ఆయన గొప్ప నేర్పరి! అనంతర నాటక రచయితల మీద బెన్ జాన్‌సన్ ఎక్కువ ప్రభావాన్ని ప్రదర్శించాడు.

బొ.శ్రీ.

**జాన్సన్, శామ్యుయెల్ (1709-84) :** సుప్రసిద్ధ ఆంగ్లకవి, వ్యాస రచయిత, విమర్శకుడు, పత్రికారచయిత, నిఘంటు కర్త, సంభాషణ చతురుడు. 18 వ శతాబ్దం నాటి ఆంగ్ల సాహిత్య రంగంలోని ప్రముఖ వ్యక్తులలో ఒకరు. డాక్టర్ జాన్‌సన్‌గా ఆయన ప్రసిద్ధుడు. ఆయన కూర్చిన *డిక్షనరీ ఆఫ్ ది ఇంగ్లీష్ లేంగ్వేజ్* (1755) ఇంగ్లీషు భాషలో ప్రాచీన సాహిత్యం నుంచి ఉదాహరణ వాక్యాలను కూడా ఇస్తూ వెలువడిన మొట్టమొదటి ప్రధానమైన నిఘంటువు!

ఒక పుస్తక విక్రేత కుమారుడు జాన్‌సన్. ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసం ముగించి, తన జన్మ స్థానమైన 'లిక్‌ఫీల్డ్' లో ఒక స్కూలు ప్రారంభించాడు. కాని అది ఫలప్రదం కాలేదు. 1737 లో తన వెనుకటి విద్యార్థి 'డేవిడ్ గారిక్' తో కలసి జాన్‌సన్ లండన్ వెళ్లాడు. అక్కడ రిచర్డ్ శావేజ్ ఆయనకు మిత్రుడయాడు. *జెంటిల్‌మన్స్ మేగజైన్* కు ఆయన వ్రాసిన జర్నలిస్టిక్ వ్యాసాలే ఆయన తొలి రచనలు. వాల్పోల్ మంత్రి వర్గాన్ని విమర్శిస్తూ వ్రాసిన రచనల వల్ల మొదటిసారి జాన్సన్ నలుగురి దృష్టిలోనూ పడ్డాడు. 1745 లో తన దృష్టిని షేక్స్‌పియర్ రచనల వైపు మళ్లించి *మిసిలేనియస్ అబ్జర్వేషన్స్ ఆన్ ది ట్రాజెడీ ఆఫ్ మాక్‌బెత్* అనే గ్రంథం జాన్‌సన్ రచించాడు. ఆయన వ్రాసిన నీతిబోధకమైన కావ్యం *ది వానిటీ ఆఫ్ హ్యూమన్ విషెస్* 1749 లో ప్రచురించబడింది. 1746 లోనే జాన్‌సన్ *డిక్షనరీ ఆఫ్ ది ఇంగ్లీష్ లాంగ్వేజ్* సంకలనానికి కాంట్రాక్ట్ మీద సంతకం చేశాడు. ఆ డిక్షనరీ జాన్సన్‌కు గొప్ప ప్రతిష్ఠను చేకూర్చింది. అయినా, తన జీవనోపాధి కోసం పత్రికా రచనల వంటివి చేయడం ఆయనకు తప్పలేదు. 1750 లో ఆయన పత్రిక *ది రాంబ్లర్* ఆరంభం అయింది. తరువాత *ది ఐడ్లర్* అనే మరొక పత్రిక కూడా ఆయన నడిపాడు. డబ్బు అవసరమై 1759 లో ఆయన *రాసెలాస్* అనే ఒక తాత్త్విక కథను వ్రాశాడు. *ది లైవ్స్ ఆఫ్ ది మోస్ట్ ఎమినెంట్ ఇంగ్లీష్ పొయెట్స్* (1777) అనే గ్రంథంలో జాన్‌సన్ తేలిక పాత్రికేయ రచనలలో కూడా ఎంతటి ఉదాత్తమైన సాహిత్య విమర్శ స్థాయిని ప్రదర్శించ వచ్చునో నిరూపించాడు.

జాన్‌సన్ తన జీవిత చరిత్రను వ్రాసిన జేమ్స్ బాస్వెల్‌ను 1763 లో కలుసుకొన్నాడు. వారిరువురి మైత్రి ఆంగ్ల సాహిత్య చరిత్రలో అత్యంత విలక్షణమైంది. 1773 లో వారిరువురూ కలసి స్కాట్లండ్ హైలాండ్స్ లోనూ, పశ్చిమ దీవులలోనూ పర్యటించి వచ్చారు. ఆ పర్యటనను గురించి వర్ణిస్తూ ఇద్దరూ వేరు వేరుగా చేసిన

రచనలు ఉన్నాయి. షేక్స్‌పియర్ రచనలకు జాన్సన్ వెలువరించిన ఎడిషన్ 1765 లో పూర్తి అయింది. దాని ప్రచురణ జరిగిన సంవత్సరమే డబ్లిన్‌లోని ట్రినిటీ కాలేజ్ ఆయనకు ఎల్.ఎల్.డి పట్టం ఇచ్చి సత్కరించింది. రచయితగా జానసన్ ప్రతిభావంతుడు; ప్రాసంగికుడుగా అంతకంటె ప్రతిభావంతుడు.

బొ.శ్రీ.

**జాఁ, పాల్ (1763-1825)** : ప్రముఖ జర్మన్ నవలా రచయిత. అసలుపేరు ఫ్రీడ్రిఖ్ రిఖ్టర్. 1763 మార్చి 21 న వ్సీడేల్ నగరంలో జన్మించాడు. ఇతని కలం పేరు "జాఁ పాల్" (Jean Paul). ఇతని నవలలు 19 వ శతాబ్ది తొలి ఇరవై సంవత్సరాలలో మిక్కిలి ప్రజాదరణ పొందాయి. సుప్రసిద్ధ ఫ్రెంచ్ రచయిత జాఁ జాక్వ్యుస్ రూసో (Jean Jaegues Rousscan) మీది అభిమానంతో 'జాఁ పాల్' అనే కలం పేరు పెట్టుకున్నాడు.

జాఁ పాల్ ప్రభావం 19 వ శతాబ్దిలో తర్వాతి జర్మన్ రచయిత ఫ్రీడ్రిఖ్ హేబల్, సుప్రసిద్ధ ఇంగ్లీషు రచయిత థామస్ కార్లైల్ ల పైన ప్రస్ఫుటంగా కనబడుతుంది.

జాఁ పాల్ మామూలు ఉపాధ్యాయుని కుమారుడు. లైప్‌జిగ్ అనే చోట 'థియాలజీ' (భగవచ్ఛాస్త్రం) అభ్యసించాడు. ఆర్థిక ఇబ్బందులు కారణంగా పై చదువులు చదువలేక ప్రైవేట్ ట్యూటర్ గాను (1787-90), ఉపాధ్యాయుడుగాను (1789-94) పనిచేశాడు. ఇతని మొట్టమొదటి నవల *సెల్క్షన్స్ ఫ్రమ్ ది డెవిల్స్ పేపర్ టుగెదర్ విత్ ఏ రిక్వైరడ్ నోటీస్ ఫ్రమ్ ది జా మోడెల్* అన్న నవల 1789 లో వెలువడింది. 1793 వ సంవత్సరంలో *ది ఇన్‌విజిబుల్ లాడ్జ్* అన్న రెండు భాగాలు గల నవల వ్రాశాడు. 1795 లో *ఫ్లార్టీ ఫైవ్ డాగ్ పోస్ట్ డేస్* అనే నవల ప్రకటింపబడింది. 1801 వ సంవత్సరంలో కరోలిన్ మేయర్ అనే ఆమెను పెళ్లి చేసుకొన్నాడు. 1804 నుండి జీవితాంతం వరకూ బెరూత్‌లో నివాస మేర్పరచుకొని అక్కడే స్థిరపడ్డాడు.

జాఁ పాల్ రచనా జీవితంలో రెండవ ఘట్టం తనలోని 'కామిక్ రియలిస్ట్' 'సెంటిమెంటల్ ఎంతూజియాస్ట్' ల మధ్య సామరస్యం సాధించే ప్రయత్నం. ఈ దశలో జాఁపాల్ వ్రాసిన నవల *ఫ్లవర్ ఫ్రూట్ అండ్ థారన్ పీ.* ఈ నవలను థామస్ కార్లైల్ 1827 లో ఇంగ్లీషులోకి అనువదించాడు.

*టైటాన్* అనే 4 సంపుటాలు గల ఒక నవలను జాఁపాల్ వ్రాశాడు. దీని ఇంగ్లీషు అనువాదం 1862 లో వెలువడింది. ఇదే అతని రచనలలో అత్యుత్తమమైన రచనగా అతడు చెప్పుకొన్నాడు. పూర్తిగాని నవల *ఫ్లీగెలి యారె* (4 సంపుటాలు).

మూడవ ఘట్టంలో క్లాసిసిజమ్ మీదను, కాల్పనిక వాదం మీదను అంతకు ముందున్న భావాలను వదలుకొని, అతడు హాస్య నవలలను వ్రాయడం ప్రారంభించాడు.

ఈ దశలో వ్రాసిన *డాక్టర్ కాటీజెన్ బెగ్రర్స్ జెర్నీ టు ది స్పా* అన్న నవలను, (1889 - 2 భాగాలు), *ఆర్మీ చాప్లెన్ ష్మెల్జల్స్ లెపి జర్నీ* (1827) జాఁ పాల్ వ్రాసిన ప్రజాదరణ పొందిన చివరి రెండు నవలలు.

1808 లో జాఁ పాల్ కు అప్పటి రాజకుమారుడు కార్ల్ థియోడర్ వన్ డాల్‌బర్గ్ పెన్షన్ ఇచ్చాడు. తర్వాత 'బవేరియన్ ప్రభుత్వం' ఆ పెన్షన్ ఇచ్చేది.

జాఁ పాల్ 1825 నవంబరు 14 న చివేరియాలోని బేమూత్ లో స్వర్గస్థు డయాడు.

శే.వెం.న.

**జామ్యాటిన్, యుజెనీ ఇవనోవిచ్ (1884-1937):** రష్యన్ నవలా రచయిత, నాటకకర్త, ప్రహేళికల రచయిత. జామ్యాటిన్ విప్లవానంతరం పేరులోకి వచ్చిన ప్రఖ్యాత సాహిత్యకారుడు. ఆదర్శాలను పట్టుకు వేలాడే నవలను ప్రయోజనాత్మకమైన ధోరణులవైపు మళ్లించిన వాడు. శైలిలో, సంవిధానంలో కొత్త మార్గం తొక్కినవాడు. యూరపియన్ బుద్ధి జీవుల పద్ధతిలో నాగరకతా మానవతా విలువలవైపు దృష్టి సారించి సోవియట్ సాహిత్య రంగంలో సృజనాత్మకతను ప్రతిష్ఠించాడు.

రష్యాలోని సెయింట్ పీటర్స్ బర్గ్‌లో - నావిక ఇంజనీర్‌గా చదువు ముగించి ఉద్యోగం చేపట్టాడు. ఇంజనీరింగ్ వృత్తితో పాటు, రచనా వ్యాసంగాన్ని కూడా కొనసాగించాడు. 1953 లో *ఏ ప్రావెన్షియల్ టేల్* (ఒక రాష్ట్రం కథ) అనే పుస్తకాన్ని ప్రచురించాడు. అది నగర జీవితం పైన అపహాస్యాన్ని ప్రదర్శించే రచన. 1914 లో ప్రచురించిన *ఎట్ ది వరల్డ్ ఎండ్* (ప్రపంచం అంతంలో) అన్న పుస్తకం మిలిటరీ జీవితాన్ని తెగనాడుతూ చేసిన రచన. ఈ పుస్తకాన్ని జారిస్ట్ సెన్సార్ వర్గం ఖండించింది. జామ్యాటిన్ పై అభియోగం తీసుకువచ్చింది. ఈ అభియోగం వీగిపోయినా, అతడు కొన్నాళ్లపాటు రచనను ఆపి వేశాడు. మొదటి ప్రపంచ యుద్ధకాలంలో లండన్‌లో ఉండి రష్యన్ కట్టడాల పర్యవేక్షణ చేశాడు. 1918 లో *ది ఐలాండర్స్* (ద్వీప

వాసులు) అన్న పుస్తకంలో ఇంగ్లీషు దేశ జీవితాన్ని అపహాస్యం చేస్తూ అక్కడి నైచ్యాన్ని, రాగ ద్వేషాల అణచి వేతను ప్రకటించాడు. 1917 లో రష్యాకు తిరిగి వచ్చాడు.

విప్లవానికి ముందు 'బోల్షవిక్' అయినా, ఆ తరువాత ఆ పార్టీ నుంచి వైదొలగాడు. సాహిత్య క్షేత్రంలోని రాజకీయాలు అతని విమర్శకు గురి అయాయి. యువ తరాన్ని నడిపించే రచనలకు ఆయన నాంది పలికాడు. *ఐ ఆమ్ ఎ ఫెయిడ్* (నాకు భయం వేస్తోంది) అన్న వ్యాసం 1921 లో ప్రచురించాడు. ఈ వ్యాసంలో తుది వాక్యం "రష్యన్ సాహిత్య భవిష్యత్తు అంతా గతంలోనే ఉండి పోయింది". ఈ సంవత్సరంలోనే అతడు మంచి కథానికలు వ్రాశాడు. 1924 లో *వీ* (మనము) అనే నవల ప్రచురించాడు. ఇది రష్యన్ భాషలో ప్రచురణ కాలేదు కాని అమెరికాలో (1924) దాని ఇంగ్లీషు అనువాదం వచ్చింది. అనంతరం 1927 లో ప్రేగ్‌లో దీని రష్యన్ మూలం ప్రచురణ అయింది. నియంతృత్వ దేశంలో మనుష్యులు పేర్లు లేకుండా సంఖ్యలలోనే వ్యవహరింప బడడం, అందరూ ఒకే రకమైన ఆహారం, దుస్తులు కలిగి ఉండడం, లైంగిక వ్యవహారాలలో గూడ నియమాలు ఇందులో ప్రస్తావితం అయాయి. 1932 లో వచ్చిన ఆల్డాస్ హాక్స్‌లీ రచన *బ్రేవ్ న్యూ వరల్డ్* (Brave New World) కు, 1942 లో వచ్చిన జార్జ్ ఆర్వెల్ రచన *నైన్‌టీన్ ఎయిటీ ఫోర్* (Nineteen Eighty four) కు ఇది మూలం అనవచ్చును.

1923 లో జామ్యాటిన్ తన దృష్టిని నాటక రంగం వైపు మళ్ళించాడు. కొన్ని నాటకాలు చక్కగా ప్రచారం అయినా, 'మనము' పైన వచ్చిన విమర్శల మూలంగా అతని రచనలు మరుగున పడిపోవలసి వచ్చింది. 1931 లో మాక్సిం గోర్కీ జోక్యంతో కామ్రేడ్ స్టాలిన్ అతనిని రష్యా వదలి వెళ్ళి పోవడానికి అనుమతించాడు. తన జీవిత శేషాన్ని పారిస్‌లో గడపిన జామ్యాటిన్ రచనలు సోవియట్ రష్యా లో ఇప్పటికీ అజ్ఞాతంగానే ఉన్నాయి.

శ్రీ విరించి

**జారీ, ఆల్ఫ్రెడ్ (1873-1907)** : ఫ్రెంచ్ నాటక రచయిత. 'అసంగత' (absurd) రూపక కర్తగా ప్రసిద్ధుడు. 23 సంవత్సరాల వయస్సులోనే *ఉబూ రాయి* (1896 - ఉబు రాజు) అనే 'అసంగత' రూపక రచన చేసి ఆ ధోరణి సంప్రదాయానికి ఆద్యు డయాడు. తరువాత ఈ సంప్రదాయం *థియేటర్ ఆఫ్ ది అబ్‌సర్డ్* గా ప్రసిద్ధి పొందింది. *ఉబూ రాయి* తొలి ప్రదర్శన అపహాసానికి పాత్రమై గందరగోళం సృష్టించింది. రెండు రాత్రులు మాత్రమే అది ఆడింది. కాని 20 వ శతాబ్దంలో కూడా నేటికీ దాని ప్రతిస్పందనలు కనిపిస్తూనే ఉన్నాయి. ప్రపంచంలోని సాధారణ విషయాలలో అసంగతత్వాన్ని, అసందర్భాన్నీ, అర్థరాహిత్యాన్నీ జారీ చిత్రించాడు.

18 సంవత్సరాల వయస్సులో యౌవనోత్సాహంతో, సామాన్యమైన కుటుంబ వారసత్వపు ఆస్తితో జారీ పారిస్ వచ్చాడు. గ్రంథాలయాలను తరచు సందర్శిస్తూ ఆయన రచనలకు ఉపక్రమించాడు. ఆయన వేషం విపరీతం గానూ, కొట్టవచ్చిన ట్టుగానూ ఉండేది. ప్రవర్తన విడ్డూరంగా ఉండేది. బైసికిల్ ఎక్కి రివాల్వరు తరచు వెంట



ఉంచుకొని తిరుగుతూ ఉండేవాడు. తొందరలోనే ఆయన సంపద, అదృష్టం తరిగిపోయింది. అతని జీవితంలో అరాచక పరిస్థితులు దాపురించాయి. దిక్కులేని స్థితిలో తాగుడుకు బానిస అయి అర్థాయుష్కుంగా 24 ఏళ్లకే ఆయన జీవితం ముగిసింది.

1896 డిసెంబరు 10 న ఆయన *ఉబూ రాయి* ప్రదర్శితమైంది. 15 సంవత్సరాల వయస్సులోనే జారీ తన సహపాఠులు కొందరితో కలసి ప్రదర్శించడం కోసం ఆ రూపకం రచించాడు. పాఠశాలలో ఉపాధ్యాయుల్లో ఒకరిని దృష్టిలో పెట్టుకుని ఆయనను వెటకారం చేయడానికి ఈ నాటకం ఆయన వ్రాశాడు. 'ఉబు' పాత్రది రాక్షస ప్రవృత్తి. చాలా అట్టహాసం, ఆడంబరం అతని లక్షణం. తోలు బొమ్మలాంటి వ్యక్తిత్వం. ఇతడు పోలండుకు రాజవుతాడు. అమిత మూర్ఖత్వం, అంతులేని అధికార వ్యామోహంతో ఎన్నో క్రూర కృత్యాలకు తల పడతాడు. ఈ నాటకం తర్వాత *ఉబు ఎంచెయినే* (1900), *ఉబు సర్ లబు టే* (1901) అనే రూపకాలు కూడా ఆయన వ్రాశాడు. ఈ మూడు నాటకాలనూ *జేన్ విలార్* 1958 లో ప్రదర్శింప చేశారు. జారీ కథలు, కవిత్వం కూడా ప్రచురించాడు. *లముర్ ఎన్ విజిటిస్* (1898), *లె సురమలె* (1902) అనేవి ఆయన నవలలు.

ఇవి శృంగారాత్మకంగా ఉన్నాయి. అయితే అశ్లీలాలు కావు. తాను నిరూపించిన ఈ అసందర్భ ధోరణి రచనా ప్రక్రియకు *పాటాఫిజిక్* అని ఆయన పేరు పెట్టాడు. దీనిని గురించిన ఒక లక్షణ గ్రంథం కూడా ఆయన వ్రాశాడు (1911 లో ప్రచురితం). అధిభౌతిక విషయాలను అధిగమించి 'ఊహాత్మకమైన శాస్త్రీయ పరిష్కార విజ్ఞానం' గా దానిని ఆయన పేర్కొన్నాడు. డాడా సంప్రదాయోద్యమం, అధివాస్తవికతా ఉద్యమాల ఆదిమ ప్రవర్తకులు రూపొందించిన పరిభాషా రూపకల్పనలను ఉపయోగించుకోడమే కాక, వాటిని ఆయన మరింత పటిష్ఠం చేశారు.

*మంజుశ్రీ*

**జార్జ్, స్టీఫాన్ (1868-1933) :** ప్రముఖ జర్మన్ భావకవి. 19 వ శతాబ్ది చివరలో జర్మనీ కవితా పునరుజ్జీవనానికి ప్రధానంగా కృషి చేసినవాడు. పారిస్, మ్యూనిచ్, బెర్లిన్‌లలో తత్త్వశాస్త్రాన్ని, కళా వికాస చరిత్రను అధ్యయనం చేశాడు. విస్తారంగా దేశ పర్యటనం చేశాడు. పారిస్‌లోని సింబాలిస్టులతోనూ, మల్లార్మే తోనూ, లండన్‌లో రాఫలైట్‌ల ముందు తరంవారితోనూ సన్నిహితమైన సంబంధాలు పెంపొందించుకొన్నాడు. తర్వాత ఆయన జర్మనీ తిరిగి వచ్చాడు. అక్కడ బెర్లిన్, మ్యూనిచ్, హైడెర్‌బర్గ్‌ల మధ్య ఆయన తన సమయాన్ని గడిపాడు. తన పేరిట 'జార్జ్ క్లైస్' అనే ఒక సాహిత్య సంప్రదాయాన్ని ప్రవర్తింప జేశాడు. తన బలమైన, అధికారికమైన వ్యక్తిత్వం వల్ల దానికి పుష్టి చేకూర్చాడు. ఆ నాటి సుప్రసిద్ధ రచయితలు ఎందరో ఈ సంప్రదాయానికి చెందినవారు. వీరు నడిపిన పత్రికలో తమ రచనల ద్వారా ఈ సంప్రదాయాన్ని వెలికి తీసుకు వచ్చారు. ఈ పత్రిక ముఖ్యాశయం జర్మనీ సాహిత్య భాష దిగజారి పోకుండా పునః పటిష్ఠం చేయడం. 1892 నుంచి 1919 వరకు ఈ పత్రిక ప్రచురితమైంది.

క్రొత్తదైన ఒక ప్రామాణికతను జర్మన్ కవితలో వెలయించడమే జార్జ్ ఆశయం. అనుప్రాసల ఎగుడు దిగుళ్ళను, ఛందస్సంబంధి క్రమ రాహిత్యాన్ని పరిహరించడం ఆయన అభిమతం. స్వరాలను, వ్యంజనాలను అతి జాగ్రత్తగా కూర్చి తద్వారా ఒక రమ్యత సాధించడం ఈ శైలి ధ్యేయం. ఈ విధంగా రూపొందింప జేసిన కవితకు ఒక మాదకతా మాధుర్యం సంక్రమింప జేయడం ఈ శైలి ఆశయం. ఈ కవితాశయాలు భాషా దుర్దశను అరికట్టాడానికే కాక భౌతిక వాదాన్ని, ప్రకృతి సిద్ధాంతాన్ని నిరోధించడానికి కూడా ఉద్దేశింప బడ్డాయి. ఈ రెండింటికీ జార్జ్ పరమ వ్యతిరేకి. గ్రీసుదేశం ప్రోత్సహించిన మానవతా వాదం వైపు జార్జ్ ఆకర్షితుడయాడు. ఆధునిక సమాజంలో క్రమంగా మానవతా వాదం ఆవిష్కృతమవుతూందని ఆయన భావన. ఆయన భావాలు, ఆ భావాలవల్ల ప్రభావితులై ఆయన అనుయాయులు కొందరు వాటిని ప్రచారం చేసిన తీరు, ఆయన ప్రదర్శిస్తున్నాడని భ్రమించిన ఆధిక్యతా భావన, అధికారం చెలాయించే ధోరణి, ఆ అధికారం కోసం ఆరాటం ఆయనను సరిగ్గా అర్థం చేసుకోని కొందరి దృష్టిలో అపహాస్యం పాలయాయి. జార్జ్ ఆనాటి రాజకీయ పరిణామాలకు బద్ధ విరోధి. అన్నిటికన్నా ముఖ్యంగా నాజీ తత్త్వాన్ని ఆయన తీవ్రంగా వ్యతిరేకించాడు. ఆయన నాజీల భావాలకు అనుకూలుడని కొందరు భ్రమించారు కాని అది సరికాదు. నాజీల ప్రభుత్వం ఆయనకు ధనాన్ని, బిరుదులను ఇవ్వటానికి సిద్ధమైనప్పుడు ఆయన వాటిని నిరాకరించి, అజ్ఞాతవాసంలోకి వెళ్లిపోయాడు.

జార్జ్ రచనలు 18 సంపుటాలుగా వచ్చాయి. ఇవి 1927-34 మధ్య వెలువడ్డాయి. వీటిలో ఐదు అనువాదాలు, ఒక పద చిత్రాల సంకలనమూ కూడా ఉన్నాయి. ఆయన కవితా సంకలనాలలో *హైమ్నెన్* (1890), *పిల్‌గర్‌ఫ్హార్టెన్* (1891), *అల్గబాల్* (1892), *దాస్ జార్ దర్ సీలె* (1897), *దాస్ నియు రెయిచ్* (1928) ముఖ్యమైనవి. ఆయన కవితా శిల్పాన్ని, ఆధ్యాత్మిక సంపత్తిని ఇవి ప్రతిబింబిస్తున్నాయి. తొలినాళ్ళ సందేహాలనుంచి విడివడి ఆత్మపరిశీలనాత్మకంగా ఎదిగి తను నిర్వహించవలసిన పాత్రలో విశ్వాసం పొంది, ద్రష్టగా మారి, ఆధునిక మానవ సమాజానికి నాయకత్వ నిరూపకంగా ఆయన వ్యక్తిత్వం ఈ కవితా సంకలనాలలో మనకు కనిపిస్తుంది.

వ్యక్తిగతంగానూ, ఆధ్యాత్మికంగానూ ఆయన ఆశయ ఫలసిద్ధి *మాక్సిమిన్* (మాక్సిమిలియన్ క్రోన్ బెర్జెర్, 1888-1904) అనే యువకుని ద్వారా ఆయన దర్శించ గలిగారు. మాక్సిమిన్ అందమైన, అత్యంత ప్రతిభావంతుడైన యువకుడు. 1902 మార్చిలో మ్యూనిచ్‌లో జార్జ్ ఈయనను కలుసుకొన్నాడు. ఈ కుర్రవాడు మరణించగా అతనికి దైవత్వారోపణం చేసి అతని పట్ల తన ప్రశంసను ఒక కవితా సంపుటి (1906) ద్వారా ఆయన ప్రకటించాడు.

*మంజుశ్రీ*

**జియామీ మోటోకియా (1363-64-1443):** జపాన్‌లోని 'నో' థియేటరుకు చెందిన ప్రముఖ నటుడు,

నాటక రచయిత, ప్రయోక్త. ప్రస్తుతరూపంలో 'నో' నాటకాన్ని సృష్టించిన ఘనత ఈయనకూ, ఈయన తండ్రి 'కనామీ' (1333-84) కీ చెందుతుంది. 'అషికగ యోషిమిట్సు' అనే జపాన్ పాలకుని (షోగన్) ఆదరణ జియామీకి లభించింది. 1374 లో ఆయన సమక్షంలో జియామీ తన నాటకం ప్రదర్శించాడు. అంత వరకూ 'నో' నాటకంలో ఉన్న మొరటు లక్షణాలు పోయి జియామీ కాలంలో ఆ రూపకం సంకీర్ణమైన ధనిక స్వాముల రూపకంగా రూపొందింది. తండ్రి మరణానంతరం జియామీయే 'నో' రంగస్థలానికి ప్రధాన వ్యక్తి అయాడు. తన తండ్రి స్థాపించిన 'కాన్జె' సంప్రదాయానికి ఆయన పరిపుష్టి చేకూర్చాడు. నాటకాలను అద్భుతంగా ప్రదర్శించడమే గాక జియామీ శతాధికంగా నాటకాలు రచించాడు. ప్రస్తుతం ఆ రంగస్థలానికి చెంది లభ్యం అవుతున్న 230 రూపకాలలోనూ ఇంచుమించు సగభాగం ఆయన వ్రాసినవే! వాటిలోని గొప్ప నాటకాల కన్నిటికీ కర్తృత్వం ఆయనదే. 1422 లో జియామీ జెన్ బౌద్ధ మత సన్న్యాసి అయాడు. ఆయన కుమారుడు 'మోటో మాసో' కు ఆయన వారసత్వం సంక్రమించింది. అయితే 1429 లో పాలకుడు (షోగన్) అయిన 'అషికగయోషి నోరి' జియామీ కుమారుణ్ణి కాకుండా అతని మేనల్లుడు 'ఒనామీ' కి తన సమక్షంలో ప్రదర్శించే గౌరవం కలిగించి, ఆదరించాడు. 'మోటోమాసా' 1432 లో చనిపోగా, 'యోషినోరి' 1434 లో జియామీని దేశబహిష్కృతుణ్ణి చేశాడు. 1441 లో షోగన్ (పాలకుడు) మరణించిన తరువాత జియామీ క్యోటోకు తిరిగి వచ్చాడు.

జియామీ రచనలలో ముఖ్యమైనది *ఫూషికాడెన్* అనే సంకలనం. తన విద్యార్థులకు ఉపయోగించే 'మాన్యువల్' లుగా జియామీ దీనిని రచించాడు. ఆయన దృష్టిలో నటుడు ప్రధానంగా యోధుని పాత్రను, స్త్రీ పాత్రను, వృద్ధుని పాత్రను నటింపగలిగి ఉండాలి. ఆ యా పాత్రలకు తగిన నృత్యం, సంగీతం కూడా అతనికి చేతనయి ఉండాలి. 'నో' నాటకాల అభినయంలో ప్రధానమైన అంశం అనుకరణ. అయితే 'నో' నాటకాలలోని ఆధ్యాత్మికాంశం (యూజెన్) మరింత ముఖ్యమైంది. అదే 'నో' నాటకాల నాణ్యతకు గీటురాయి. జియామీ "యూజెన్‌లో సారభూతమైన అంశం నిజమైన సోయగం మృదుత్వం!" అంటాడు. నాటకరచనకూ, నటుల హావభావాలకూ వెనుక ఉండే అనిర్వచనీయమైన, పారమార్థికమైన ఒక జగత్తును నాటకం స్ఫురింపజేయాలి. *కనామీ* రచించగా జియామీ ప్రదర్శించిన *మట్సుకజె* (పైన్ చెట్లలోని గాలి) వంటి నాటకాలలో దృశ్య, శ్రవ్య భాగాలను ఆవరించుకొని ఒక అద్భుతమైన ప్రశాంతి గోచరిస్తుంది. జియామీ రచించిన ఇతర నాటకాలలో *యూజెన్* భాగం తక్కువగానూ, క్రియాత్మక భాగం (వాస్తవికతా భాగం) ఎక్కువగానూ కనిపిస్తుంది. బహుశః 'క్యోటో' లోనే 1443 సెప్టెంబరు 1 వ తేదీన జియామీ మోటోకియో దేహం చాలించాడు.

శే.రా.

**జియోర్గొస్, సెఫెరిస్ (1900-1971) :** న్యాయవాది, నోబెల్ బహుమతి గ్రహీత. సెఫెరిస్ జియోర్గొస్ 1900 మార్చ్ 13 న తుర్కీలోని స్మిర్న (Smyrna) లో జన్మించారు. సెఫెరిస్ తన విద్యాభ్యాసాన్ని ఏథెన్స్‌లోనూ, తరువాత పారిస్‌లోను ముగించారు. ఈయన తండ్రి పారిస్‌లో న్యాయవాది. పారిస్ విశ్వవిద్యాలయం నుంచి న్యాయశాస్త్రంలో పట్టా పుచ్చుకొన్నాడు.

1924, 25 వేసవికాలాలను జియోర్గొస్ లండన్‌లో గడిపాడు. ఈయన ఏథెన్సుకు తిరిగి వచ్చిన తర్వాత గ్రీకు విదేశీ వ్యవహారాల మంత్రిత్వశాఖలో నియమితుడయాడు. ఈయన 1962 లో రాయబారిగా పదవీ విరమణ చేసి ఏథెన్స్‌లో స్థిరపడ్డాడు.

గొప్ప అనువాద కర్తగా కూడా జియోర్గొస్ ప్రసిద్ధి పొందాడు.

ఈయన రచనలు *స్ట్రోఫే* (1931, 'Turning Point'), *స్టెర్న* (1931, 'The Cistern') *మిథిస్టోరెమా* (1935, 'Mythical Story'), *ఎమెరొలొజియో కతస్ట్రొమతొస్* (1940, 'Log book 1'), *టెట్రాడియో జిమ్నాస్మటొన్* (1940, 'Exercise Book'), *పోయీమత* (1940, 'Poems'), *ఎమిరొలొజియొ కతస్ట్రొమతొస్ 2* (1944, 'Log Book 2'), *కిచెలె* (1942, 'Thrush'), *పొయీమత* (1924-46 'Poems'), *ఎమిరొలొజియొ కతస్ట్రొమతొస్-3* (1945, 'Log Book-3') ఈయన కవితలు, ఇంగ్లీషు, ఫ్రెంచ్, జర్మన్ ఇటాలియన్, శ్పానిష్, స్వీడిష్ భాషలలోకి అనువదించబడ్డాయి. ఈయన చాలా మంచి వ్యాసాలను కూడా వ్రాశాడు. అందులో ప్రసిద్ధి గాంచినవి: డొకిమొస్ (1944, 'Essays'), ఎరొతొక్రితొస్ (1946, Erotokritos). 20 వ శతాబ్దపు గ్రీకు కవులలో మిక్కిలి ప్రసిద్ధుడు.

ఈయన భావగీతాలకు హెలినిక్ సంస్కృతి (ప్రాచీన గ్రీకు సంస్కృతి) పట్ల ఈయనకు గల అభిమానానికి,

1963 లో సాహిత్యరంగంలో జియోర్‌గొస్‌కు నోబెల్ బహుమతి లభించింది. 1971 సెప్టెంబర్ 20 న ఏథెన్స్‌లో ఈయన మరణించాడు.

*నాగరాజ్*

**జిరాదో, జీన్ (1882-1944) :** ఫ్రెంచ్ నవలా రచయిత, వ్యాసరచయిత, నాటక రచయిత. వాస్తవిక తకు కాకుండా సంభాషణలకూ, శైలికీ ప్రాధాన్యం ఇచ్చే ఇంప్రెషనిస్టిక్ పద్ధతి నాటక రచయిత.

1882 అక్టోబరు 29 న ఫ్రాన్స్‌లోని బెలాక్ లో జన్మించిన జిరాదో ఎకోల్ నార్మేల్ స్యూపరీర్ లో విద్యాభ్యాసం చేసి డిప్లొమేటిక్ సర్వీసులో చేరాడు. *సుజానే ఎట్ లే పసిఫిక్* (1921) వంటి కవితాత్మకమైన నవలలు వ్రాసి 'వైతాళిక' (avant garde) రచయితలలో ఒకడుగా ప్రసిద్ధి పొందాడు. *సీగ్‌ఫ్రీడ్ ఎట్ లే లిమోసిన్* (1922) లో జిరాదో ఫ్రాన్స్, జర్మనీ అనే శత్రురాజ్యాల మధ్య వైరాన్ని సిల్హటీ చిత్రంగా చిత్రించాడు. స్మృతి భ్రంశంతో బాధపడే ఒక వ్యక్తి కథకు దానిని పూర్వరంగంగా ఆయన వాడుకున్నాడు. *బెల్లా* (1926) ఒక ప్రేమ కథ. ఈ కథ వెనుక ఒక జాతీయవాదికీ, ఒక అంతర్జాతీయ వాదికీ మధ్య వైరాన్ని మనం చూడవచ్చు. జిరాదో నాటకాలలో రెండు వ్యతిరేక శక్తులమధ్య సంఘర్షణ తరచు గోచరిస్తుంది. *ఆంఫిట్ర్యాన్ 38* (1929) లో మనిషికీ, దేవుడికీ మధ్య సంఘర్షణ, *సోడోమ్ ఎట్ గోమోరే* (1943) లో పురుషునికీ, స్త్రీకీ మధ్య సంఘర్షణ, *జుడిత్* (1931) లో ఓల్డ్ టెస్టమెంట్ క్రైస్తవ మతానికీ, పాగన్ సిద్ధాంతాలకూ మధ్య సంఘర్షణ గోచరిస్తాయి.

1928 లో తన నవలను *సీగ్‌ఫ్రీడ్* అనే పేర నాటకీకరించడంతో జిరాదో నాటక రంగ జీవితం ఆరంభ మయింది. ఆ నాటకంతోనే నటుడు, దర్శకుడు అయిన లూయీ జొవెట్ ప్రేక్షకులకు పరిచితు డయాడు. జొవెట్‌తో జిరాదో అనుబంధం రెండవ ప్రపంచ యుద్ధం వరకూ కొనసాగింది. జిరాదో మౌలిక రచయిత కాదు. బైబిల్ సంప్రదాయం నుంచి ఆయన ఉత్తేజితుడు కావడం *ఎలెక్ట్రా* (1937), *కాంటిక్ డెస్ కాంటిక్స్* (1938, 'సాంగ్ ఆఫ్ సాంగ్స్') అనే గ్రంథాలలో కనిపిస్తుంది.

జిరాదో కొన్ని సినిమాలకు కూడా రచయితగా ఉన్నాడు. వాటిలో చెప్పుకోదగినవి: *లా డచెస్ డీ లాంజియాస్* (1942), *లే ఆంజెస్ డ్యూ పీచె* (1944).

జిరాదో మొదటి ప్రపంచ సంగ్రామంలో పనిచేసి 'లీజియన్ ఆఫ్ ఆనర్' బిరుదం పొందాడు. 1939-40 లలో ఇన్‌ఫర్మేషన్ కమీషనర్‌గా పనిచేశాడు. 1944 జన వరి 31 న పారిస్‌లో జిరాదో కన్ను మూశాడు.

*బొ.శ్రీ.*

**జిరాల్డీ జ్యాంబతీస్తా (1504-73) :** ప్రముఖ ఇటాలియన్‌కవి, నాటక రచయిత, నవలా కారుడు. ఫెరారా నగరంలో 1504 వ సంవత్సరంలో జన్మించాడు.

ప్రాచీన పద్ధతులలో రచింపబడిన 'విషాదాంత' నాటకాల స్వరూప స్వభావాలు మార్చడంలో జిరాల్డీ కృతకృత్యు డయాడు. విషాద నాటకాలను చిన్న మార్పు లతో సుఖాంతం చేసిన రచనలలో *ఆర్బిచె* ప్రసిద్ధమైంది. ఈ నాటకాన్ని ఇటలీ దేశంలోని ప్రధాన నగరంలో పలుమార్లు ప్రదర్శించారు. విషాదంతో హాస్య సమ్మేళనం చేయడం ఈ రచనలోని ఒక ప్రత్యేకత. 'సిలియో కల్‌కాగ్నిని' అనే మహనీయుని వద్ద శుశ్రూషచేసి నాటక కళా రహస్యాలను ఆయన తెలిసి కొన్నాడు. ఇంచుమిం చుగా జిరాల్డీ వ్రాసిన నాటకా లన్నీ విషాద హాస్యాంత నాటకాలు. 1541 లో వచ్చిన *ఆర్బిచె, డిస్కోర్స్ ఆన్ కామెడీ అండ్ ట్రాజెడి* (1543), *డిడోస్* (1542), *ఆల్ టైల్* (1543), *క్లియోపాత్ర* (1543) *ఆంటివలో మెని* (1549) మొదలైన నాటకాల వల్ల ఇతడు నాటక రచనలో ఎంత ప్రతిభావంతుడో విదితం అవుతుంది. ఇతని పైన ప్రసిద్ధనాటక రచయిత షేక్స్‌పియర్ ప్రభావం అమితంగా ఉంది. *ఒథెల్లో* నాటక భాగాన్ని జిరాల్డీ *మూర్ ఆఫ్ వెనిస్* అనే కథగా వ్రాసి బహుళ ప్రచారం పొందాడు.

ఒక ప్రత్యేక ప్రదర్శన కోసం వ్రాసిన నాటకంలో ఉన్న భయానక, హింసాత్మక పరిస్థితులను సమయ స్ఫూర్తితో సుఖాంత నాటకంగా మలచి ప్రదర్శించి జిరాల్డీ మెప్పు పొందాడు. 1545 లో వ్రాసిన *ఈగిల్*, 1565 లో రచించిన *ఎకటామిటీ* అనే నాటకాలూ, ఆధునిక నటనా రీతుల లక్షణాలను సంతరించుకొన్నవి.

ఇతనికి కవిత్వం మీద మక్కువ కలగడానికి కారణం అరిస్టాటిల్ రచనలు. ఆ ప్రభావంతో కవితలు వ్రాస్తూ సమాజం పట్ల గల అవగాహనను ఇతడు ప్రదర్శించాడు. బొకాకియో రచించిన డెకామెరన్ పద్ధతిలో ఉన్న 112 కథలను జిరాల్డీ సేకరించాడు. నైతిక విలువలకు ప్రాధాన్యం ఇచ్చిన అతని కథలను ఫ్రాన్స్, స్పెయిన్ భాషలలోకి అనువాదం చేశారు. కథలు, నాటకాలు,

కవితలు వ్రాయడంతో పాటు, అనువాదాలు కూడా చేసి జిరాల్డీ ఇటలీ సాహిత్యానికి ఎనలేని సేవ చేశాడు.

శే.రా.

**జిరాసెక్, అల్వాస్ (1851-1930) :** మొదటి ప్రపంచ యుద్ధానికి ముందు వచ్చిన జెకొస్లోవేకియన్ నవలా రచయితలలో మిక్కిలి ప్రధానుడు. గొప్ప జాతీయ వాది. జిరాసెక్ ఒక సెకండరీ స్కూలులో ఉపాధ్యాయుడు. అసంఖ్యాకమయిన చారిత్రక నవలలు వ్రాసి స్వేచ్ఛ, సాంఘిక న్యాయాలవైపు ప్రజల దృష్టిని మళ్లించాడు. ఆయన ప్రధాన రచనలు: *తరంగాల మధ్య* (1891) *ప్రపంచాని కంతకు వ్యతిరేకంగా* (1894), *సౌభ్రాతం* (1899-1908), *చీకటి* (1915); ఈయన ప్రముఖమయిన రచన. స్వాతంత్ర్య కాంక్షను ప్రకటిస్తూ మొదటి ప్రపంచ యుద్ధకాలంలో బహిరంగంగా కొన్ని చర్యలు ఈయన చేపట్టాడు. 1918 ఏప్రిల్ 13 న గొప్ప ప్రజా సమూహాన్ని సమాయత్తం చేసి అందరి చేత 'జాతీయతా' ప్రమాణాలు చేయించాడు.



శ్రీ విరించి

**జీడ్, ఆంద్రీ ప్రాల్-జిలౌమె (1869-1951) :** సుప్రసిద్ధ ఫ్రెంచ్ నవలా రచయిత, మానవతా వాది, నీతి ప్రవక్త. 1947 లో సాహిత్యానికి ఆంద్రీ జీడ్‌కి నోబెల్ బహుమతి లభించింది. ఈయన రచనలు చాలావరకు ఆత్మకథాత్మకాలు. ఈయన ఉద్వేగ జీవితానికీ, ఏక లింగ సంపర్క ప్రవృత్తికీ మధ్య ఏర్పడిన సంఘర్షణ వలన ఈయన నైతిక రచనలు వెలువడ్డాయి.

1869 నవంబరు 22 న పారిస్‌లో జీడ్ జన్మించాడు. తండ్రి 'పాల్ జీడ్', తల్లి 'జూలియెట్ రోండియో'. చిన్నతనంలో అనారోగ్యం వలన జీడ్ విద్యాభ్యాసం సరిగ్గా సాగలేదు. 1880 లో తండ్రి మరణానంతరం ఈయనను పెంచి పెద్ద చేసే బాధ్యతంతా తల్లిమీదే పడింది. జీడ్‌కి 13 ఏళ్ల వయస్సుండగా ఆయన 15 ఏళ్ల వయస్సు గల తన కజిన్ 'మాడిలీన్' ని ప్రేమించాడు. ఉద్వేగ భరితమైన ఆ అనుభవం జీడ్ జీవితంలో గొప్ప మార్పును తెచ్చింది. మాడిలీన్ తన తల్లి అవినీతి ప్రవర్తనను ప్రత్యక్షంగా చూసి వెక్కి వెక్కి ఏడుస్తూ భగవత్ప్రార్థన చేస్తూ ఉండగా జీడ్ ఆమెను కలుసుకొన్నాడు.

ఎవ్వరితోనూ చెప్పకూడని తాను కనుగొన్న తన తల్లి అవినీతి ప్రవర్తనను గూర్చి ఆమె అతనికి చెప్పింది. ఆ దృశ్యమే *స్ట్రెయిట్ ఈజ్ ది గేట్* అన్న ఆయన రచనకు ఆధారమైంది.

1889 లో జీడ్ 'బలారియట్' (Baccalaureat) పరీక్షలో ఉత్తీర్ణుడైన తరువాత తన జీవితాన్ని రచన, సంగీతం, దేశ పర్యటనలలో గడపాలని నిర్ణయించుకొన్నాడు. రహస్యంగా మాడిలీన్ పట్ల తన ఆరాధనా భావాన్ని తన రచనలలో గూఢంగా వ్యక్తం చేసి, ఆమె ప్రేమను సాధించాలని నిశ్చయించుకొన్నాడు. ఆయన తొలి రచన *ది నోట్ బుక్స్ ఆఫ్ ఆంద్రీ వాల్టర్* (1891) ఆత్మకథాత్మకం. తన పేరు పెట్టకుండా సొంత ఖర్చుతో ఆ పుస్తకాన్ని ఆయన ప్రచురించాడు. కాని అది అటు మాడిలీన్ ప్రశంసను గాని, ఇటు ప్రజల మెప్పును గాని పొందలేక పోయింది. ఆ సంవత్సరమే ఆయన సహాధ్యాయి, రచయిత 'పీరే లోయిస్' ఆయనకు ప్రముఖకవి 'స్టీఫెన్ లార్మే' నడుపుతున్న 'ట్యూస్‌డే ఈవెనింగ్స్' అనే ఫ్రెంచ్ సింబాలిస్ట్ ఉద్యమ కేంద్రస్థానంతో పరిచయం కలిగించాడు. కొంతకాలం పాటు జీడ్ మీద ఆ ఉద్యమం తాలూకు సౌందర్య సిద్ధాంతాల ప్రభావం పడింది. ఆ ఉద్యమం ప్రభావంతో ఆయన వ్రాసిన రచనలు: *నార్సిసస్* (1891), *యూరియెన్స్ వాయేజ్* (1893), *ది లవర్స్ ఆటెంప్ట్* (1893).

1893 లో మొదటి సారి జీడ్ ఉత్తరాఫ్రికాలో పర్యటించాడు. అక్కడ ఉండగానే జబ్బుపడి కోలుకొన్న తరువాత *ఫ్రూట్స్ ఆఫ్ ది ఎర్త్* రచించాడు. ఫ్రాన్స్ తిరిగి వచ్చిన తరువాత అతడు పారిస్ సెలూన్‌ల లోని 'ఉక్కిరి బిక్కిరి చేసే వాతావరణం' ప్రభావానికి లోనై *మార్షలాండ్* (1894) అనే సెటైర్ వ్రాసి ఆ ప్రభావం నుంచి విడుదల పొందాడు. సదా గుహలలో నివసిస్తూ తమ చూపు ఉపయోగాన్ని కోల్పోయిన కొన్ని జంతువులతో కూడిన అద్భుతమైన అన్యాపదేశ కథ ఇది.

1895 లో జీడ్ తన కజిన్ 'మాడిలీన్' ని వివాహమాడాడు. 1896 లో 'లా రోక్' అనే కమ్యూన్‌కి మేయర్ గా ఆయన ఎన్నికయ్యాడు.

1916లో జీడ్ తన రెండవ జర్నల్ రచించడం మొదలుపెట్టి దానిలో తన భగవదన్వేషణ ప్రయత్నాలను

రికార్డు చేయసాగాడు. 1926 లో ఆ జర్నల్ *నుం క్విడ్ ఎట్ టు* అనే పేర ప్రకటితమైంది. అందులో ఆయన తన ఆధ్యాత్మిక సమస్యను ఇలా వివరించాడు: 'కేథలిక్' సిద్ధాంతాలు ఒప్పుకోడానికి వీలులేనివి. ప్రొటెస్టెంటు మతం దుర్భరమైంది. అయినా నేను ప్రగాఢమైన క్రైస్తవుని అనుభూతిని పొందుతున్నాను.

మొదటి ప్రపంచయుద్ధం అయిపోయిన తరువాత జీద్‌లో ప్రగాఢమైన మార్పు వచ్చింది. 1923 లో ఆయన ఏకైక సంతానం 'కేతరీన్' జననం ఆయనకు నూతన ఆశాభావం కలిగించింది.

1947 జూన్ లో ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీ జీద్‌కు 'డాక్టర్ ఆఫ్ లెటర్స్' పట్టం ఇచ్చి గౌరవించింది. అదే సంవత్సరం నవంబరులో ఆయనకు సాహిత్యంలో నోబెల్ బహుమతి వచ్చింది. 1950 లో ఆయన జర్నల్‌లో చివరి సంపుటం వెలువడింది. దానిలో ఆయన 80 వ జన్మదినం వరకు నడిచిన జీవితం ఉంది. జీద్ రచనలన్నీ ఆయన సంక్లిష్ట వ్యక్తిత్వంలోని ఏదో ఒక అంశం మీద వెలుగు ప్రసరించేవే. ఆయన చివరి రోజులలో వ్రాసి పెట్టుకున్న నోట్స్ ఆయన మరణానంతరం *సో బీ ఇట్* లేక *ది చిప్స్ ఆర్ డౌన్* అనే పేర ప్రకటితమైంది. అంతకంటె కూడా చెప్పుకోదగిన రచన తన మరణానికి ఒక నెల క్రితం జీద్ నాగసాకీ ఆటం బాంబ్ బాధితులలో ఒకనికి వ్రాసిన లేఖ. దానిలో "అసత్యాన్ని ద్వేషించే వ్యక్తి ఒక్కడే మానవజాతిని కాపాడగల ఆశాకిరణం!" అని ఆయన ప్రకటించాడు.

అసంఖ్యాకమైన రచనలు చేసి ఆంద్రీ జీద్ 1951 ఫిబ్రవరి 19 న పారిస్‌లో తుది శ్వాస విడిచాడు.

బొ.శ్రీ.

**జుంజ్, లియోపాల్డ్ (1794-1886) :** ప్రముఖ హీబ్రూ కవి. 19 వ శతాబ్దంలో హీబ్రూ సాహిత్యం లోను, చారిత్రక విషయాలలోను పండితుడైన జర్మన్ దేశీయుడు. యూరప్ ప్రజల సాహితీ సాంస్కృతిక వికాసానికి ఉద్యమాలు నిర్వహించాడు. ఆధునిక సాహితీ దృక్పథంతో ప్రాచీన సాహితీ స్వరూపాలను సంస్కరించిన విప్లవకారుడుగా జర్మన్‌లో ఇతనిని కీర్తించారు.

బెర్లిన్ విశ్వవిద్యాలయంలో జుంజ్ అధ్యయనం చేశాడు. 1821 లో హాలే విశ్వవిద్యాలయంలో డాక్టరేట్ పొందాడు. తరువాత ఆర్థిక పరిస్థితులు హీనమై భుక్తికి గూడ జరుగక, మత గురువుగా కొన్నాళ్లు, పత్రికా సంపాదకుడుగా కొన్నాళ్లు పనిచేశాడు. కొంతకాలం ఉపాధ్యాయుడుగా కూడా గడిపాడు. పరిస్థితుల నుండి గట్టెక్కి 1840-50 ల మధ్య బెర్లిన్‌లో యూదు ఉపాధ్యాయుల శిక్షణ సంస్థలో ప్రిన్సిపాల్‌గా కొన్నాళ్లు ఉన్నాడు. 1818 లో రాబినిక్ లిటరేచర్ గురించి పలు వ్యాసాలు వ్రాసి ప్రచురించాడు. మొదటి సారిగా యూదు సాహితీ పరిమళాల గుబాళింపును అందజేసి ప్రముఖుల ప్రశంసలను పొందాడు. ప్రముఖ న్యాయవాది ఎడ్వర్డ్ గన్స్, గణిత శాస్త్రవేత్త 'మోసెస్‌మోసర్' ల సాహచర్యంతో యూదు ప్రజల సాహిత్య విజ్ఞానశాస్త్రాల అభివృద్ధికి ఒక సంస్థను ఏర్పాటు చేసి, ఒక పత్రికను కూడా ప్రచురించాడు. ఆ పత్రిక ద్వారా ఎన్నో వ్యాసాలు వ్రాసి ప్రజలను జాగృతం చేశాడు. *జైట్స్ క్రిఫ్ట్* అనే ఆ పత్రికకు తానే సంపాదకుడు. మధ్య యుగాల (1100-1500) నాటి రాబిష్ గ్రంథాలకు వ్యాఖ్యాతగా, సంపాదకుడుగా, మంచి పేరు సంపాదించాడు. సంస్థ నుండి కొంత మంది సభ్యులు వదలి వెళ్లిన పరిస్థితిలో తానొక్కడే ఆ ఉద్యమాన్ని కొనసాగించాడు.

1832 లో యూదు సాహిత్యాన్ని చారిత్రక దృక్పథంతో విశ్లేషించి పరిణామాలను, అభివృద్ధిని సమీక్షించాడు. తన జీవిత మంతా యూదు సంస్కృతి పునరుద్ధరణకే అంకితం చేశాడు. పరిశోధనాత్మక సంపుటాలను ప్రచురించాడు. 1838 లో *బైబిల్ యూదు* అనువాద గ్రంథానికి ప్రధాన సంపాదకుడుగా ఉన్నాడు. చివరిదశలో కూడ అనేక వ్యాసాలు *బైబిల్‌ని* గురించి వ్రాసి ప్రచురించాడు. అవి మూడు సంపుటాలుగా వెలువడ్డాయి (1875-76).

శే.రా.

**జుదే హా లెవీ (1075-1141) :** ప్రముఖ యూదుకవి, దార్శనికుడు. పూర్తిపేరు 'యెహుదా బెన్ షెమ్యుయెల్ హాలెవీ'. అరబిక్ సాంస్కృతిక పరిధిలో హీబ్రూ కవిత చెందిన అత్యుత్తమస్థాయి ఈ కవి రచనలలో కనిపిస్తుంది. ఈయన ప్రముఖ రచనలు: *దీవాన్ జూయెనైడ్* అనే పద్య సంకలనాలూ, *శపర్ హోహుజారి* అనే సంభాషణాత్మకంగా యూదు సిద్ధాంతాలను వివరించిన రచన.

జుదే హా లెవీ ఉత్తర స్పెయిన్‌లోని 'తుదేలా' అనే నగరంలో జన్మించాడు. అతడు జన్మించేనాటికి నగరంతో సహా స్పెయిన్‌లో చాలా భాగం ముస్లిముల పాలనలో ఉండేది. 1085 లో 6 వ అల్ఫాన్సో రాజు టోలెడోను జయించి దానిని తన రాజధానిగా చేసుకున్నాడు. జుదే హా లెవీ తన బాల్యాన్ని స్పెయిన్‌లోని క్రైస్తవ ప్రాంతం లోనే గడిపినా, 'ముస్లిం స్పెయిన్' పట్ల అతనికి అధిక ఆసక్తి ఉండేది.

జుదే హా- లెవీ 1090 కి పూర్వమే దక్షిణ స్పెయిన్‌లోని ఆందలూషియా చేరి తన యౌవనాన్ని అచ్చటి 'లూసెనా' వంటి ప్రముఖ యూదు కేంద్రాలలో గడిపాడు.

జుదేహా-లెవీ తాను రచించిన 'కుజారి' అనే కావ్యం తుది పలుకులో స్పెయిన్‌కు వీడ్కోలు చెప్పడం, జియాన్ పట్ల ఆకర్షించబడడం కనిపిస్తుంది. జుదే రచనలలో మిక్కిలి ప్రసిద్ధ మైంది. 'జియోనైడ్' మధ్య యుగంలో పలుభాషలలోకి ఇది అనువదించబడింది. జియోనిస్ట్ భావాలను వ్యతిరేకించే వారిని పద్యాలలో తీవ్రంగా ఇతడు ఎదుర్కొన్నాడు. 1141 జూలైలో ఈజిప్ట్‌లో జుదే హా లెవీ మరణించాడు. ఈజిప్టు ప్రజలు అతని మరణానికి ప్రగాఢ సంతాపాన్ని ప్రకటించారు. అతని మరణాన్ని గురించిన ఒక కల్పితకావ్యం అటు తరువాతి కాలంలో ప్రచారంలోకి వచ్చింది. దానిలో తన జియోనైడ్ కావ్యం లోని కొన్ని భాగాలను వినిపించడానికి అతడు జియాన్ (జెరుసలెమ్ లోని ఒక కొండ) చేరుకోగానే ఒక ముస్లిం విరోధి అతనిని హత్యా చేసినట్లు వర్ణించబడింది.

జుదే హా-లెవీ మీద అరేబియన్ సాహిత్య ప్రభావం ప్రగాఢంగా కనిపిస్తుంది. అతని ప్రసిద్ధ పద్య సంకలనం *దీవాన్* లో లౌకిక పద్యాలూ, మత సంబంధమైన పద్యాలూ కూడా ఉన్నాయి. రెండింటిలోనూ 'జియాన్' పట్ల అతనికి గల తీవ్రమైన అభిమానం అభివ్యక్త మవుతూంది.

బొ.శ్రీ.

**జువెనాల్ (డెసిమస్ జూనియస్ జువెనాలిస్) (క్రీ.శ 55/60-127)** : రోమన్ వ్యంగ్య కవులలో మిక్కిలి శక్తిమంతుడు. ఈయన వాడిన పదబంధాలూ, సూక్తులూ ఎన్నో ప్రజల నోళ్లలో తరతరాలుగా వానుతూ వచ్చాయి. *(బ్రెడ్ అండ్ సర్క్యూజెస్, హూ విల్ గార్డ్ ది గార్డ్స్) దెమ్ సెల్వ్స్)* వంటి నానుడులు జువెనాల్ కల్పితాలే!

జువెనాల్ సమకాలికులలో ఆయనను గూర్చి పేర్కొనిన వాడు 'మార్షల్'. తాను జువెనాల్ మిత్రుడనని తెలుపుతూ జువెనాల్ మంచి వాక్చతురుడని అతడు పేర్కొన్నాడు. ఆయన మరణానంతరం చాలాకాలానికి వ్రాయబడిన ఆయన జీవిత చరిత్రలు కొన్ని ఉన్నాయి. అవి సంగ్రహాలూ, కొంతవరకూ అవిశ్వసనీయాలూ!

జువెనాల్ ను గూర్చిన కొన్ని యథార్థాంశాలను ఇలా పేర్కొనవచ్చును: ఆయన ఒక సంపన్న కుటుంబానికి చెందినవాడు. డొమిషియెన్ (క్రీ.శ 81-96) చక్రవర్తి ఆస్థానంలో ఉన్నతోద్యోగానికి తొలిమెట్టుగా మొదట ఆయన సైన్యంలో ఒక ఆఫీసరుగా చేరాడు. కాని ఆస్థాన పదవి లభించక హతాశు డయాడు. ఆఫీసర్ల ప్రమోషన్‌ల మీద ఆస్థానం వారి అనుగ్రహ ప్రభావం ఎక్కువగా ఉందని ప్రకటిస్తూ జువెనాల్ ఒక వ్యంగ్య రచన చేశాడు. తత్ఫలితంగా ప్రస్తుతం ఈజిప్ట్‌లోని ఆస్వాన్‌లో ఉన్న 'సయినీ' (Syene) అనే చిన్న సరిహద్దు పట్టణానికి అతనిని బహిష్కరించారు. అతని ఆస్తిని స్వాధీనం చేసుకున్నారు. క్రీ.శ. 96 లో డొమిషియెన్ హత్య అనంతరం అతడు రోమ్‌కు తిరిగి వచ్చి లేమితోను, నిరుద్యోగంతోను ధనికుల దయాధర్మం మీద ఆధారపడి జీవిస్తూ వచ్చాడు. కొన్నేళ్ల తరువాత అతని స్థితి కొంత మెరుగు పడినట్లు తెలుస్తూంది. జువెనాల్ మరణాన్ని గురించి ఎట్టి వివరాలు స్పష్టంగా తెలియకపోయినా, క్రీ.శ. 127 ప్రాంతంలో అతడు మరణించి ఉండవచ్చు నని ఊహిస్తున్నారు.

జువెనాల్ రచించిన 16 వ్యంగ్య కావ్యాలలోనూ చండశాసనుడైన డొమిషియెన్ చక్రవర్తి పాలనలోనూ, అతని అనంతరం పాలించిన దయార్ద్ర దృష్టి గల నెర్వా (96-98), ట్రాజాన్ (98-117), హాడ్రియెన్ (117-138) చక్రవర్తుల హయాములలోనూ, రోమ్‌లోని జీవిత దృశ్యాలు వర్ణించ బడ్డాయి. కొలది వ్యవధానాలతో 5 వేరు వేరు సంపుటాలుగా ఆ వ్యంగ్య కావ్యాలు ప్రకటించబడ్డాయి.

వాటి వివరాలు: మొదటి సంపుటం - 1-5 వ్యంగ్య కావ్యాలు (క్రీ.శ. 100-110). డొమీషియన్ చక్రవర్తి క్రూర పరిపాలనను వర్ణించేవి.

రెండవ సంపుటం - 6 వ వ్యంగ్య కావ్యం. క్రీ.శ 115 నాటి సంఘటనలను చిత్రించేది.

మూడవ సంపుటం - 7 వ, 8 వ, 9 వ వ్యంగ్య కావ్యాలు. అర్హులైన రచయితలకు సాయం చేయడం కోసం ఒక సాహిత్య సంస్థను స్థాపించిన ఒక చక్రవర్తిని (హాడ్రియన్‌ని) ప్రశంసించేవి.

నాల్గవ సంపుటం - 10 వ, 11 వ, 12 వ వ్యంగ్య కావ్యాలు. ఇవి ఏ కాలాన్ని చిత్రిస్తున్నదీ స్పష్టమైన సూచనలు లేవు.

ఐదవ సంపుటం - 13 వ, 14 వ, 15 వ, 16 వ వ్యంగ్య కావ్యాలు. ఇవి క్రీ.శ 127 నాటి సంఘటనలకు సంబంధించినవైనట్లు కనీసం రెండు స్పష్ట మైన సూచనలు ఉన్నాయి. ఈ వ్యంగ్య కావ్యాలలో రోమ్ సమాజంలోని అవినీతీ, బలహీనతలూ, పశుప్రవృత్తీ నిరసించబడ్డాయి. మొదటి వ్యంగ్యకావ్యంలో దుష్టత్వం,

నేరం, ధన దుర్వినియోగం తాను వ్యంగ్య కావ్యం రచించకుండా ఉండలేనంత తార స్థాయికి చేరుకున్నాయి - అన్నాడు జువెనాల్. జీవించి ఉన్న అధికారులను దుయ్యబట్టడం ప్రమాదకరం కనుక మరణించినవారినే ఉదాహరణాలుగా ఎంచుకొన్నా నన్నాడు. అయితే ఆ సూత్రాన్ని ఆయన పూర్తిగా పాటించినట్లు కనిపించదు. ఒక్కొక్కప్పుడు సజీవులై ఉన్న సమకాలికుల మీద కూడా విసురులు విసిరాడు.

జువెనాల్ చనిపోయిన తరువాత కొంత కాలం పాటు ఆయన రచనలు మరుగున పడ్డాయి. తరువాత క్రీ.శ 200 ప్రాంతంలో టెట్యూలియన్ అనే క్రైస్తవ ప్రచారకుడూ, మరికొందరు క్రైస్తవ రచయితలూ అతని రచనలను చదివి వాటిలో నుండి ఉదాహరించడం మొదలు పెట్టారు. నేటి వరకూ నిలిచి ఉన్న జువెనాల్ రచనలమీద వ్యాఖ్యానం క్రీ.శ. 350-420 సంవత్సరాల మధ్య రచింప బడింది. అనంతరం జువెనాల్ రచనలను ప్రశంసించడం అవ్యాహతంగా కొనసాగుతూ వచ్చింది. అతని వ్యంగ్య పరిహాస రచనలను అనుకరించిన వారిలో 'జియోవన్ని బొకాషియో', 'నికొలాస్ బాయిల్యూ', లార్డ్ బైరన్ మొదలైన మహాకవు లున్నారు.

బొ. శ్రీ.

**జూక్‌మేయర్, కార్ల్ (1896-1977) :** ప్రముఖ జర్మన్ నాటకకర్త. 1896 డిసెంబర్ 27 న జర్మనీలోని నకెన్ హైమ్ (Nacken heim) పట్టణంలో జన్మించాడు. జూక్‌మేయర్ నాటకాలు రెండు ప్రపంచ యుద్ధాల వలన మిక్కిలి క్లిష్టమైన సమకాలిక జీవిత సమస్యలను చిత్రిస్తూ రచించినవి.

మొదటి ప్రపంచ సంగ్రామ కాలంలో నాలుగు సంవత్సరాలపాటు జూక్‌మేయర్ జర్మన్ సైన్యంలో పని చేశాడు. అటు తర్వాత తన జీవితాన్ని పూర్తిగా రచనలకే అంకితం చేశాడు. 1924 లో ప్రసిద్ధి చెందిన నాటక రచయిత బెర్టోల్ట్ బ్రెఖ్ట్ కీ, ప్రసిద్ధ దర్శకుడు 'మాక్స్ రైన్‌హార్ట్' కీ సన్నిహితుడుగా ఉన్నా, తన స్వాభావికవాద (Naturalism) ప్రక్రియల పట్ల విశ్వాసాన్ని ఏ మాత్రం కోల్పోలేదు.

జూక్‌మేయర్ వ్రాసిన మొట్టమొదటి విజయ వంతమైన నాటకం 1925 వ సంవత్సరంలో ఆయన వ్రాసిన *ది హాపీ వైన్ యార్డ్.* ఆ నాటకానికి క్లైస్ట్ (Kleist) బహుమతి వచ్చింది. 1931 వ సంవత్సరంలో *ది కెప్టెన్ ఆఫ్ కోపెనిక్* అనే నాటకం వ్రాశాడు. ఇది ప్రష్యన్ సైనిక వాదాన్ని హేళన చేసే ఒక వ్యంగ్య పరిహాస రచన. నాటక రచయితగా దీని వల్ల ఆయనకు ఎనలేని ఖ్యాతి వచ్చింది. 1933 లో రాజకీయ ఒత్తిడులు కారణంగా ఆస్ట్రియా దేశానికి ఆయన వలస పోవలసి వచ్చింది. అక్కడ *ది విలన్ ఆఫ్ బ్రైజెన్* అనే నాటకం వ్రాశాడు.

1939 వ సంవత్సరంలో జూక్‌మేయర్ అమెరికాకు వెళ్లి ఆ దేశం పౌరుడుగా అక్కడ స్థిరపడి పోయాడు. అక్కడనే అతని నాటకా లన్నిటిలోకీ ఉత్తమమని చెప్పదగ్గ *ది డెవిల్స్ జనరల్* అనే నాటకం వ్రాశాడు. ఈ నాటకంలో దేశభక్తికీ, అంతరాత్మ ప్రబోధానికీ మధ్య సంఘర్షణను ఆయన చక్కగా చిత్రించాడు.

ఈ నాటక రచనవల్ల జూక్‌మేయర్ జీవితం ఒక క్రొత్త మలుపు తిరిగింది. తొలి రచనలలో కంటె ఈ రచనలో ఎంతో పరిణతి కనిపిస్తుంది. అంతకు ముందు ఉత్సాహంతో ఉరకలు వేస్తూ ఉండే ఆయన రచనలలో నైతిక విలువల మథింపుకు ప్రాధాన్యం ఏర్పడింది. ఈ పద్ధతిలోనే 1949 లో *బార్బరా బ్లమ్‌బెర్గ్* అనే నాటకం, 1950 లో *ది సాంగ్ ఇన్ ది ఫియరీ ఫర్‌నేస్,* 1955 లో *ది కోల్డ్ లైట్* ఆయన వ్రాశాడు. ఈ చివరి రచనను అణుశాస్త్రవేత్త అయిన 'క్లాస్ ఫక్స్' (Klaus fuchs) మీద వచ్చిన దేశద్రోహం కేసును ఆధారంగా చేసుకొని ఆయన రచించాడు.

జూక్‌మేయర్‌ది ఒకచోట స్థిరంగా ఉండే ప్రవృత్తి కాదు. 1946 లో తన నివాసాన్ని స్విట్జర్‌లాండ్ కు ఆయన మార్చాడు. 1952 లో తన రచనలకు 'గోథే' బహుమతిని పొందాడు. భగవంతుడిలో విశ్వాసం, మనిషి ప్రవర్తన పట్ల నమ్మకం జూక్‌మేయర్ లో ఎన్నడూ సడలలేదు. ఆయన నాటకా లన్నీ విమర్శనాత్మకాలే!

జూక్‌మేయర్ చేసిన ఇతర రచనలలో వ్యాసాలూ, *వాట్ ప్రైస్ గ్లోరీ* వంటి రచనలకు చలన చిత్రానువాదాలూ, *ది బ్లూ ఏంజెల్* వంటి చలన చిత్రాలకు వ్రాసిన సెనేరియోలూ, *సల్వేర్ ఆర్డర్, ది మూన్స్ రైడ్ ఓవర్* వంటి నవలలూ చెప్పుకోదగ్గవి. రెండు ఆత్మ చరిత్రాత్మక రచనలు ఆయన వెలువరించాడు. 1940 లో *సెకండ్ విండ్* అనే పేరుతో ఒకటీ, 1970 లో *ఏ పార్ట్ ఆఫ్ మై లైఫ్* అనే పేరుతో రెండవదీ వెలువడ్డాయి. 1961 లో ఇతని రచన లన్నీ మొత్తం నాలుగు సంపుటాలుగా ప్రకటించబడ్డాయి. 1977 జనవరి 18 న స్విట్జర్లాండ్‌లోని విస్ప్ నగరంలో జూక్ మేయర్ పరమపదించాడు.

శే.వెం.వ.

**జెనెత్, జీన్ (1910-1986) :** ఫ్రెంచ్ నవలా రచయిత. సాంఘికంగా వెలివేయబడ్డా, గొప్ప నవలా రచయితగా విఖ్యాతుడైనవాడు. కామ శృంగారాన్నీ, అశ్లీల విషయాలనూ అద్భుత కవితామయ దృశ్యాలుగా మలచినవాడు. నాటక రంగంలో వైతాళిక (అవాంట్ గార్డ్) వర్గానికి నాయకత్వం వహించినవాడు.

పారిస్‌లో 1910 డిసెంబరు 19 న జన్మించిన 'జెనెత్' కామిలీ గేబ్రియల్ జెనెత్‌కు కలిగిన అక్రమ సంతానం. శైశవంలోనే తల్లి ఇతనిని పరిత్యజించగా, ఒక రైతు కుటుంబం పెంచి పెద్దచేసింది. పదవ ఏట దొంగతనం చేస్తూ పట్టుబడి అనేక సంవత్సరాలు 'మెట్రే' లోని సంస్కరణ పాఠశాలలో గడిపాడు. అక్కడ ఇతడు పొందిన నికృష్టమైన అనుభవాలనే *మిరకిల్ డీ లా రోస్* (1945-46) అనే నవలలో అభివర్ణించాడు. తన ఆత్మకథా రూపమైన *జర్నల్ డ్యూ వోలియర్* (1949; 'ఒక దొంగ ఆత్మకథ') లో ఎలాంటి సంకోచం లేకుండా ఒక తిరుగుబోతుగా, జేబుదొంగగా, మగవేశ్యగా బార్సిలోనా, ఆంట్వెర్ప్ మొదలైన నగరాలలో తాను పొందిన అనుభవాలను జెనెత్ వర్ణించాడు. ఆ గ్రంథంలో సౌందర్య పిపాసువుగా, అస్తిత్వవాదిగా, 'అసందర్భవాద' వైతాళికుడుగా కూడా జెనెత్ మనకు దర్శనమిస్తాడు.

ఒక దోపిడీ సందర్భంలో 'ఫ్రెస్‌నీస్' లో జైలు శిక్ష అనుభవిస్తున్న కాలంలో 1942 లో జెనెత్ తన రచనా వ్యాసంగం ప్రారంభించాడు. ఆ జైలులో ఉండగా ఆయన రచించిన నవల *నోటర్-డేమ్ డెస్ ఫ్లూర్స్* (1944; 'అవర్ లేడీ ఆఫ్ ది ఫ్లవర్స్' 1949) యుద్ధానికి ముందు మాంట్‌మార్ట్రెలోని నేరస్తుల వాడను విస్పష్టంగా చిత్రించింది. అతని రచనా ప్రతిభ జ్యా కాక్ట్యూ, జ్యా-పాల్ సార్త్రె, సైమన్ డీ బ్యూవాయిర్‌ల దృష్టిని ఆకర్షించింది. 1947 లో మరొక దోపిడీ సందర్భంలో శాశ్వత డెటెన్యూగా బంధింపబడినపుడు అతని తరఫున ప్రముఖ ఫ్రెంచ్ రచయితలు ఫ్రెంచ్ రిపబ్లిక్ అధ్యక్షుని వద్దకు రాయబారంగా వెళ్లి అతని శిక్షను రద్దు చేయించారు. *పోంప్స్ ఫ్యునెబెస్* (1947; 'అంత్య క్రియలు'), *క్వెరెల్లే ది బ్రెస్* (1947) అనే మరో రెండు నవలలు రచించిన తరువాత జెనెత్ నాటక రచనలో ప్రయోగాలు ప్రారంభించాడు. అతని తొలి రచనలైన ఏకాంకికల మీద సార్త్రె ప్రభావం బలంగా కనిపిస్తుంది. *హాట్ సర్వేలెన్స్* ('1949, శవజాగరణ') లో కూడా కారాగారంలోని అనుభవాలే వర్ణించబడ్డాయి. అయితే *లే బానిస్* (1947, 'కన్నెపిల్లలు') లో స్వస్వరూపాన్వేషణ సమస్యలు కనిపిస్తాయి. ఈ నాటకంతో జెనెత్ అసందర్భవాద నాటక రంగంలో ప్రముఖ రచయితగా స్థిరపడ్డాడు.

అతని తరువాతి నాటకాలు *లే బాల్కన్* (1956; 'ది బాల్కని' 1958), *లే నీగ్రోస్* (1958, నీగ్రోలు), *లే పేరవెంట్స్* (1961, 'తెరలు'), ఎక్స్‌ప్రెషనిస్ట్ పద్ధతిలో ప్రేక్షకుల రాజకీయ, జాతిగత, మత సంబంధ విద్వేషాలకు గొప్ప ఆఘాతాన్ని కలిగించిన రచనలు.

తిరుగుబాటు దారు, అరాజక వాది అయిన జెనెత్ అన్ని విధాలైన సాంఘిక, రాజకీయ క్రమశిక్షణలనూ నిరాకరించాడు. జ్యాఁపాల్ సార్త్రె తన *సైంట్ జెనెత్, కమెడియన్ ఎట్ మార్టిర్* (1952; *సెయింట్ జెనెత్, ఏక్టర్ అండ్ మార్టిర్ 1963)* లో జెనెత్‌ని యోగిగా అభివర్ణించాడు.

బొ.శ్రీ.

**జెనోఫన్ (క్రీ.పూ. 431-350) :** గ్రీస్ దేశపు కవి, చరిత్ర కారుడు. *అనాబసిస్* అనే ప్రసిద్ధ గ్రంథ రచయిత. వచన రచనలో సిద్ధహస్తుడు. లాటిన్ సాహిత్యం మీద ఇతని ప్రభావం అమితంగా ఉన్నట్టు తెలుస్తుంది. సంపన్నమైన 'అథేనియా' కుటుంబంలో జన్మించాడు. క్రీ.పూ. 431-404 లో ఏథెన్స్ కు స్పార్టాతో గొప్ప యుద్ధం జరిగింది. ఆ కాలంలో అక్కడి పరిస్థితులు అల్లకల్లోలంగా ఉండడం వల్ల ఇతని కుటుంబీకులు వేరే ప్రాంతాలకు వలస వెళ్లారు. ఆ దేశంలో ఆ రోజుల్లో ప్రబలి ఉన్న తీవ్రవాద ప్రజాస్వామ్యాన్ని జెనోఫన్ ఎదిరించాడు. సోక్రటీస్ హత్యోదంతం ఇతనిని బాగా కలచివేసింది. చివరకు ఇతనిని దేశద్రోహిగా నిర్ణయించి దేశం నుంచి బహిష్కరించారు. తర్వాత పర్షియా రాజు సైరస్ అనుగ్రహం వలన సైనిక కమాండర్‌గా యుద్ధంలో పనిచేశాడు. వేల మైళ్లు సైన్యంతో ప్రయాణించాడు. తన అనుభవాలను *అనాబసిస్* అనే గ్రంథంలో విపులీకరించాడు. స్పార్టా రాజు అగీసలెస్ వద్ద కొంత కాలం పనిచేశాడు. కోరోనియా యుద్ధంలో పాల్గొన్నాడు. వీరసైనికుడుగా తాను పొందిన అనుభవాల సారమే గొప్ప చారిత్రక గ్రంథం *అనాబసిస్.* ప్రజలు ఇతనిని అభినందించి ఒక విశాలమైన ప్రాసాదాన్ని బహూకరించి తమ గ్రామంలోనే ఉంచుకొన్నారు. కాని, తిరిగి రాజకీయపోరాటం పొరుగు రాజ్యాల మధ్య ప్రబలడంతో 'స్పార్టా' లో ఎక్కువ రోజులు ఉండలేక అథేనియాకు వచ్చాడు. స్పార్టాలో ఉన్నప్పుడే ఇతనికి పెండ్లి అయింది, ఇద్దరు కొడుకులు. తాను ఏథెన్స్‌లో ఉన్నపుడే వేస్

*అండ్ మీన్స్* వ్రాశాడు. కొడుకులను కూడా సైన్యంలో చేర్చాడు. గుఱ్ఱాలవేట అంటే ఇష్టపడే జెనోఫన్ *ఆన్ హార్స్‌మన్‌షిప్* అనే గ్రంథం వ్రాశాడు. *ఎపాలాజీ, సింపోజియమ్ అండ్ మెమోరబిలియా* సోక్రటీస్‌ను సమర్థిస్తూ ఇతడు రచించిన గ్రంథాలు.

*సైరోపీడియా* లో జెనోఫన్ రాజకార్య దురంధరుని శిక్షణను గురించీ, అతని కుటుంబ స్థితి గతుల ప్రాధాన్యాన్ని గురించీ తన భావాలను ప్రకటించాడు. దాని కనుబంధంగా అతడు రచించిన *హీరోన్* రాజరికాన్ని గురించి ఒక రాజుకూ, ఒక కవికీ మధ్య జరిగిన ఒక ఊహాకల్పిత సంభాషణ.

తూసిడైడీస్ మీద తనకు గల ప్రశంసాభావం వలన జెనోఫన్ అతని అసంపూర్ణ రచనను పూర్తి చేశాడు. క్రీ.పూ. 411-403 నాటి గ్రీకు చరిత్ర అతడు స్వానుభవంతో వ్రాసినా, విమర్శనాత్మక విశ్లేషణ కొరవడినందువలన తూసిడైడీస్ రచనతో సరితూగడం లేదు. తరువాత దానిని గ్రీక్ చరిత్ర *హెలెనికా* లో ప్రథమ, ద్వితీయ భాగాలుగా చేర్చారు.

వచన రచయితగా జెనోఫన్ తనతోటి చరిత్ర రచయితలైన హెరోడోటస్, తూసిడైడీస్‌లతో సరిసమానంగా చెప్పుకోదగ్గవాడు. వారిద్దరికంటె లాటిన్ సాహిత్యం మీద జెనోఫన్ ప్రభావం మరింత ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. జెనోఫన్ రచనలు 16 వ శతాబ్దంలో పలు యూరపియన్ భాషలలోకి అనువదింపబడ్డాయి.

శే.రా.

**జెల్లెరప్, కార్ల్ అడోల్ఫ్ :** చూ. అనుబంధం-I.

**జేమ్స్, హెన్రీ (1843-1916) :** ప్రముఖ అమెరికన్ నవలా రచయిత. 1915 లో ఇంగ్లండ్ పౌరసత్వం పొంది అక్కడ స్థిరపడ్డాడు. ఆయన నవలలలోని ప్రధాన వస్తువు అటు అమెరికాలోని అమాయికత్వానికీ, ఉత్సాహానికీ, ఇటు యూరప్‌లోని అవినీతికీ, విజ్ఞానానికీ మధ్య జరిగిన సంఘర్షణ. ఆయన వ్రాసిన *డెయిసీ మిల్లర్* (1979), *ది పోర్‌ట్రెయిట్ ఆఫ్ ఏ లేడీ* (1881), *ది బోస్టోనియన్స్* (1886), *ది అంబాసిడర్స్* (1903) అనే నవలలు ఇందుకు చక్కని ఉదాహరణలు.

చిన్నతనంలో హెన్రీ జేమ్స్ ఎప్పుడూ పుస్తకాలు చదువుకుంటూ, సంఘం ఎదుట బిడియపడుతూ ఉండేవాడు. హెన్రీ జేమ్స్, అతని సోదరుడు విలియమ్ జేమ్స్ చిన్నతనంలో తల్లితండ్రుల వెంట దేశ సంచారంచేస్తూ ట్యూటర్‌ల వద్ద, గవర్నెస్‌ల వద్ద చదువుకున్నారు. యుక్త వయస్సులో జెనీవా, పారిస్ లండన్‌లలో గడిపారు. ఆ నాటి అమెరికన్ బాలురకు ఎవరికీ లభించని యూరప్‌తో పరిచయం వారికి చిన్నతనంలోనే ఏర్పడింది. 1875-76 లో జేమ్స్ పారిస్‌లో ఉంటూ న్యూయార్క్ ట్రిబ్యూన్‌కి సాహిత్య పరమైన లేఖలు వ్రాసేవాడు. ఆ రోజులలోనే *ది అమెరికన్* అనే నవల వ్రాశాడు. రష్యన్ నవలా రచయిత 'ఇవాన్ తుర్గెనేవ్' అంటే జేమ్స్‌కి చాలా ఇష్టం. అమెరికన్ స్త్రీని గూర్చి జేమ్స్ చేసిన పరిశోధన అతని కీర్తికి అంకురార్పణ చేసింది.

1880-90 మధ్య జేమ్స్ సంఘ సంస్కర్తలను గూర్చి, విప్లవకారులను గూర్చి *ది బోస్టోనియన్స్, ది ప్రిన్సెస్ కాసమాసిమా* అనే రెండు నవలలు వ్రాశాడు.

చివరి దశలో జేమ్స్ మూడు ఉత్కృష్టమైన నవలలు వ్రాశాడు. వాటిలో మొదటిది *ది అంబాసిడర్స్* (1903). రెండవది *ది వింగ్స్ ఆఫ్ ది డవ్* (1902), మూడవది *ది గోల్డెన్ బౌల్* (1904). ఈ నవలలలో కేవలం సంవిధానం, పాత్రల చిత్రణ మాత్రమేకాక అంతకంటె ఉదాత్తమైన తాత్త్విక బోధ కనిపిస్తుంది.

జేమ్స్‌కి గౌరవాలు కొంత ఆలస్యంగానే లభించాయి. ఆక్స్‌ఫర్డ్, హార్వర్డ్ విశ్వవిద్యాలయాలు గౌరవ పట్టాలతో అతనిని సత్కరించాయి. నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఆర్ట్స్ అండ్ లెటర్స్‌కీ, 1905 లో అమెరికన్ అకాడమీ ఆఫ్ ఆర్ట్స్ అండ్ లెటర్స్‌కీ గౌరవ సభ్యుడుగా ఆయన ఎన్నుకోబడ్డాడు. అయిదవ జార్జ్ చక్రవర్తి నుండి 'ఆర్డర్ ఆఫ్ మెరిట్' అందుకున్నాడు. 1916 లో ససెక్స్‌లోని 'రై' లో జేమ్స్ చనిపోయినపుడు అతని చితాభస్మం అమెరికాలోని కేంబ్రిడ్జ్ సిమెటరీలోని అతని కుటుంబ సభ్యుల సమాధుల ప్రక్కన ఖననం చేయబడింది. సమాధి ఫలకం మీద 'అట్లాంటిక్ మహా సముద్రానికి ఇరు ప్రక్కలా ఉన్న తన తరం వారి అంతశ్చేతనను వ్యాఖ్యానించినవాడు' అని వ్రాశారు.

జేమ్స్ రచనలకు పాఠకులు ఎప్పుడూ తక్కువే. అయినా, 1943 లో ఆయన శతవార్షిక జయంతి జరిగిన తరువాత ఆయన రచనలు వివిధ భాషలలోకి అనువదించబడ్డాయి. ప్రస్తుతం (1993) లో ఆయన 150 వ జయంతి ఉత్సవాలు ప్రపంచ వ్యాప్తంగా జరుగుతున్నాయి.

బా.శ్రీ.

**జోయిస్, జేమ్స్ (ఆగస్టీన్ అలయోసియస్) (1882-1941) :** జగత్ ప్రసిద్ధుడైన ఐరిష్ నవలా రచయిత. భాషా శైలి విషయమై నూతన ప్రయోగాలు చేసి ప్రసిద్ధి పొందినవాడు. *యులిసిస్* (1922), *ఫిన్నిగన్స్ వేక్* (1939) మొదలైన రచనలలో ఈ పద్ధతులను

ఆయన ప్రవేశ పెట్టాడు. 1904 లో జోయిస్ ఐర్లండ్ విడిచి తన శేష జీవితాన్ని ట్రీస్టె, పారిస్, జూరిఖ్ లలో గడిపాడు.

కుటుంబంలో పదిమంది పిల్లలలో పెద్దవాడైన జోయిస్‌ను ఆరేళ్ళ వయస్సులోనే క్లాంగోల్ప్స్ వుడ్ కాలేజిలో విద్యాభ్యాసం నిమిత్తం చేర్పించారు. ఇది జెసూయిట్‌లు నిర్వహించే భోజన వసతి సౌకర్యం గల పాఠశాల. ఈటన్ ఆఫ్ ఐర్లండ్ గా ఇది ఆ రోజులలో ప్రసిద్ధి పొందింది. లభిస్తున్న ఆధారాలను బట్టి ఈ పాఠశాలలో ఆయన సంతోషంగా కాలం గడిపినట్లు తెలుస్తున్నది. అయితే ఆయన తండ్రి సంపద త్వరలోనే హరించి పోయింది. మద్యపాన వ్యసనానికి లోనై, తన వ్యవహారాలను నిర్లక్ష్యం చేసి, ఆఫీసునుంచి అప్పులు తీసుకొని, ఆయన తండ్రి పూర్తిగా చితికి పోయాడు. కుటుంబం దరిద్రావస్థకు గురి అయింది. పిల్లలు తరచు విషాదకరమైన దృశ్యాలను చూడటానికి అలవాటు పడవలసి వచ్చింది. ఋణదాతలు వచ్చి ఇబ్బంది పెట్టడం, ఇంట్లో వస్తువులు ఒక్కొక్కటే కుదువ పెట్టబడుతూ ఉండడం, ఒక ఇంటి నుంచి అద్దె చెల్లించకుండా, పనివాళ్లకు చెల్లించకుండా ఇంకో ఇంటికి మారుతూ ఉండడం వీటన్నిటిని పిల్లలు చూశారు. 1891 వేసవికాలపు సెలవుల తర్వాత జోయిస్ మళ్లీ క్లాంగోల్ప్స్ పాఠశాలకు వెళ్లలేదు. కొద్ది నెలలు ఒక క్రైస్తవ పాఠశాలలో ఆయన చదివాడు. కాని ఈ విషయాన్ని ఆయన ఎప్పుడూ అటు తర్వాత ప్రస్తావించలేదు. అనంతరం రెండు సంవత్సరాలు పూర్తిగా ఆయన ఇంటి దగ్గరే ఉండి పోయాడు. స్వయంగా చదువు కోడానికి ప్రయత్నించాడు. 1893 ఏప్రిల్‌లో ఆయన తన సోదరుడు స్టానిస్లవస్‌తో డబ్లిన్‌లోని బెలివిడర్ కాలేజి అనే జెసూట్ గ్రామర్ స్కూల్‌లో జీతం లేకుండా చేరడం జరిగింది. చదువులో ఇక్కడ జోయిస్ చాలా చురుకుతనం చూపించాడు . విద్యార్థి సమితికి రెండు సార్లు ఆయన అధ్యక్షుడయాడు. ఈ సంఘాన్ని 'మారియన్ సొసైటీ' అనేవారు. ఇంచుమించుగా బడిపెద్ద వంటిది ఈ హోదా. అయితే అనుమానాస్పద పరిస్థితులలో ఆయన ఈ పదవిని త్యజించాడు. రోమన్ కేథలిక్ విశ్వాసాన్ని ఆయన వదులుకోడమే అందుకు కారణం అనవచ్చు.

డబ్లిన్‌లోని యూనివర్శిటీ కాలేజ్‌లో తర్వాత ఆయన చేరాడు. ఇది జెసూయిట్ మతోద్యోగుల అధీనంలో ఉండేది. 1879 లో అమలు పరచిన రాయల్ యూనివర్శిటీ ఆక్టు ద్వారా వారి అధికారాలు చాలా పరిమితం అయాయి. ఈ కాలేజీలో ఆయన మత విద్యగాని, తత్త్వశాస్త్రంగాని నేర్చుకోలేదు. భాషలను అధ్యయనం చేశాడు. విపరీతంగా పుస్తకాలు చదివాడు. ముఖ్యంగా జెసూయిట్ మతాచార్యులు చదవ వద్దన్న పుస్తకాలే ఎక్కువగా చదివేవాడు. కళాశాలలోని సాహిత్య, చారిత్రక సమితి కార్యకలాపాలలో ముఖ్యపాత్ర వహిస్తూ ఉండేవాడు. హెన్రిక్ ఇబ్సన్ పట్ల ఆయనకు ఎంతో ఇష్టం కలిగింది. అందువల్ల ఇబ్సన్ రచనలు మూలంలో చదవాలన్న కుతూహలంతో ఆయన డేనో-నార్వేజియన్ భాష నేర్చుకున్నాడు. *ఇబ్సన్ క్రొత్త నాటకం* అనే ఒక వ్యాసాన్ని, *వెన్ వీ డెడ్ ఎవేకెన్* (మరణించి మనం మేల్కొందాం) అనే నాటకాన్ని సమీక్షిస్తూ వ్రాసిన వ్యాసాన్ని ఆయన చదివాడు.

ఈ వ్యాసం 1899 వ సంవత్సరంలో లండన్ ఫోర్ట్‌నైట్ రివ్యూలో ప్రచురితమైంది. అప్పటి కాయన వయస్సు 18 ఏళ్లే. ఈ విధంగా చిన్నప్పుడే రచయిత కావడానికి ఆయన కృత నిశ్చయుడయాడు. తన కుటుంబం వారినీ, స్నేహితులనూ, ఉపాధ్యాయులనూ తన నిర్ణయాన్ని బలపరచ వలసిందిగా ఆయన అర్థించాడు. 1901 అక్టోబరులో *ది డే ఆఫ్ ది రాబిల్‌మెంట్* అనే వ్యాసం ఆయన ప్రకటించాడు. దీనిలో *ఐరిష్ లిటరరీ థియేటర్* (ఇదే తర్వాత డబ్లిన్ అబే థియేటర్ గా పేరు మార్చుకొంది) ను చౌకబారు అభిరుచులు ప్రచారంచేస్తున్నదని తీవ్రంగా విమర్శించాడు. అంతకు పూర్వం ఆయన ఈనాటకసమాజాన్ని సమర్థించినవాడే!

ఆ రోజులలో ఆయన చాలా నిరాశోపహతుడై జీవిస్తూ వచ్చాడు. అయితే పరీక్షల విషయంలో మాత్రం శ్రద్ధ వహించాడు. 1902 అక్టోబరు 31 న ఆయన బి.ఏ పట్టా పుచ్చుకొన్నాడు. ప్రయోగాత్మకంగా ఎన్నో చిన్న చిన్న రచనలు చేశాడు. వాటి నాయన 'ఎపిఫనీస్' అన్నాడు. ఈ మాటకు దేవతలు తమ దివ్య చర్యలను మానవ నేత్రాలకు కనపరచడం అని అర్థం. అయితే జోయిస్ ఇటువంటి వచన ఖండికలను ఒక వ్యక్తి లేదా సంఘటన నిజతత్త్వం తనకు తెలిసినపుడు తన అనుభవాలను అక్షరబద్ధం చేయడానికి ఉపయోగించుకొన్నాడు. ఈ విధమైన అతని ప్రయోగాలు వాస్తవికమైన ఒక సన్నివేశాన్ని అతడు చిత్రించేటప్పుడు అతని రచనకొకనూతన శైలిని సమకూర్చాయి.

రచనా వ్యాసంగంలో కొనసాగటానికి వీలుగా వైద్య వృత్తి ద్వారా ధనం సంపాదించాలని ఆయన తలపోశాడు.

కాని, డబ్లిన్‌లో కొన్ని తరగతులకు హాజరైన తర్వాత ఎంత అప్పు చేయగలడో అంత అప్పు చేసి పారిస్ వెళ్లాడు. అక్కడ 15 రోజులు గడిపిన తర్వాత చదువుకోడానికి జీతం ముందుగానే కట్టాలనీ, డబ్లిన్‌లో తాను సంపాదించుకొన్న విద్యార్హతలు అక్కడ సరిపోవనీ ఆయన తెలుసుకున్నాడు. నెలరోజులు విశ్రాంతిగా గడపవచ్చని ఆయన ఇంటికి వచ్చాడు. మళ్లీ పారిస్ తిరిగి వెళ్ళిన తర్వాత వైద్యం చదవటం విరమించుకొన్నాడు. కొన్ని పుస్తక సమీక్షలు ప్రకటించి వాటివల్ల వచ్చిన డబ్బుతోనూ, ఇంగ్లీషు పాఠాలు చెప్పి సంపాదించిన పైకంతోనూ, తల్లి పంపించిన డబ్బుతోనూ కాలం గడుపుతూ సెయింట్-జనివె గ్రంథాలయంలో అధ్యయనం సాగించి, తాను తలపెట్టిన గ్రంథరచనకు విషయ సేకరణలో నిమగ్నుడయ్యాడు. అరిస్టాటిల్, సెయింట్ థామస్ అక్వినస్, గుస్టేవ్ ఫ్లాబర్ట్‌ల తాత్త్విక దృక్పథాలను గూర్చి విస్తారంగా ఆయన నోట్సు వ్రాసుకున్నాడు.

ఇంతలో వాళ్ల అమ్మ మృత్యుశయ్యమీద ఉన్నందువల్ల ఆయన 1903 ఏప్రిల్‌లో ఇంటికి తిరిగి వచ్చాడు. బ్రతుకు తెరువుకోసం ఎన్నో వృత్తులు చేపట్టాడు. ఒక సుదీర్ఘమైన వాస్తవికతా నవల రచించటానికి ఆయన పూనుకొన్నాడు. తన జీవిత సంఘటనలనే ఆధారంగా చేసుకొని *స్టీఫెన్ హీరో* అనే ఈ నవలను వ్రాయడానికాయన ఉపక్రమించాడు. 1904 లో జార్జ్ రసెల్ ఐరిష్ నేపథ్యంతో చిన్న చిన్న కథలు వ్రాస్తే వ్యవసాయదారుల కోసం తాను నడుపుతున్న *ది ఐరిష్ హోమ్‌స్టెడ్* అనే పత్రికలో వాటిని ప్రచురించడానికీ, ఒక్కొక్క కథకు ఒక పౌండు చొప్పున ఇవ్వడానికీ అంగీకరించగా, ఆయన కొన్ని కథలు వ్రాసి ఇచ్చాడు. అవే ఆ తర్వాత *డబ్లినర్స్* పేరుతో (1904) సంపుటిగా వచ్చాయి. *ది సిస్టర్స్, ఈవ్‌లైన్, ఆఫ్టర్ ది రేస్* అనే మూడు కథలు *స్టీఫెన్ డెయాడులస్* అనే మారుపేరుతో ప్రకటితమైనాయి. అయితే జోయిస్ కథలు తన పాఠకులకు పనికిరావని సంపాదకుడు తేల్చుకోవడానికి ముందు ఈ మూడు కథలూ ఆ మారుపేరుతో వెలువడ్డాయి. ఇంతలో ఆయన జీవితం ఇంకో మలుపు తిరిగింది. *నోరా బర్నియకలా* అనే అమ్మాయి ఆయనకు పరిచయం కావడం, ఆ పిల్ల నాతడు ప్రేమించడం జరిగింది. ఈ సంఘటన జూన్ 16 న జరిగింది. ఆ రోజును ఆయన 'వికసన దినం' గా వర్ణించాడు. తనతో పాటు ఐర్లండు విడిచి వచ్చేందుకు ఆమెను అతడు అంగీకరింపచేశాడు.

1904 అక్టోబరులో జోయిస్, నోరాలు డబ్లిన్‌ను విడిచి పెట్టారు. హంగరీలో ఆస్ట్రియాపోలాలోని బెర్లిజ్ స్కూలులో ఆయనకు ఉద్యోగం లభించింది. తీరిక సమయాలలో ఆయన నవలా రచనలోను, కథానికల రచనలలోను నిమగ్నుడయ్యేవాడు.

1905 లో వారు ట్రెయిస్టెకు కాపురం మార్చారు. జోయిస్ సోదరుడు స్టానిసస్ కూడా వారితో చేరాడు. ఇక్కడ ఉండగానే వారి పిల్లలు జార్జ్, లుసియాలు పుట్టారు. 1906-07 ల మధ్య ఆయన 8 నెలలు రోమ్‌లో ఒక బాంక్ లో పనిచేశాడు. అక్కడ ఆయనకు ప్రతి విషయంలోనూ అసంతృప్తే ఎదురైంది. చూసిన ప్రతిదాని పట్లా ఆయన కెంతో అనిష్టం కలిగింది. ఐర్లండ్ దేశమే ఎంతో మెరుగనిపించింది. ఇదివరకు తాను తన కథలలో ఐరిష్‌వారి అతిథి మర్యాదకు ఎక్కువ ప్రాధాన్యమివ్వలేదని గుర్తించి *ది డెడ్* అనే పేరుతో ఒక కొత్త కథ వ్రాయటానికి జోయిస్ సంకల్పించాడు. *స్టీఫెన్ హీరో* అనే తన నవలలో కళాత్మక శిల్పం కొరవడిందని ఆయన భావించి దానిని ఐదు అధ్యాయాలలో *ఎ పోర్ట్రెయిట్ ఆఫ్ ది ఆర్టిస్ట్ ఏజ్ ఏ యంగ్‌మాన్* అనే పేరుతో తిరిగి రాయటానికి పూనుకొన్నాడు.

1909 లో *డబ్లినర్స్* కథల సంకలనాన్ని ప్రచురించడానికి రెండు సార్లు ఆయన ఐర్లండ్ దర్శించాడు. కాని ఆయన ప్రయత్నం కలసి రాలేదు. పూర్వ స్నేహితు డొకడు తారసిల్లి 1904 లో నోరా అనురాగాన్ని తాను కూడా పంచుకొన్నానని ఆయనకు చెప్పడంతో తీవ్ర మనోవేదనకు గురి అయాడు. ఇంకొక పాతకాలపు స్నేహితుడు అది అబద్ధమని నిరూపించాడు.

జోయిస్ ప్రకటించిన చివరి పుస్తకం *ఫిన్నెగాన్స్ వేక్* (1939). 1940 లో రెండవ ప్రపంచ సంగ్రామంలో ఫ్రాన్స్ పతనం సంభవించిన తరువాత జోయిస్ తన కుటుంబంతో సహా జూరిఖ్ తిరిగి వచ్చాడు. తన చివరి పుస్తకానికి తగినంత ఆదరణ లభించలేదనే మనోవేదనతో అలాగే ఆయన 1941 జనవరి 13_న పరమపదించాడు.

మంజుశ్రీ

**జోరిల్లా-డి-శాన్‌మార్టిన్ జువాన్ (1855-1931):** గొప్ప లాటిన్- అమెరికన్ చారిత్రక కావ్య రచయిత. 1886 లో ప్రచురితమైన *తబారే* అనే సంకలనం ద్వారా ఇతని కీర్తి నలు దిశలా ప్రాకింది. అనేక పర్యాయాలు పరిష్కరించబడి చివరికి 1926 లో పరిష్కృత ప్రతిగా ప్రచురింపబడింది ఈ గ్రంథం. ఈ

కావ్యంలో ఇతివృత్తం ఒక శ్పానిష్ యువతి ఎర్ర ఇండియన్ యువకుని ప్రేమించడం. జోరిల్లా దక్షిణ అమెరికాలోని ప్రధాన నగరాలలో విద్యాభ్యాసం చేసి, 1876 లో *నోట్స్ ఫర్ ఏ హిమ్* అనే గ్రంథం వ్రాశాడు. ప్రముఖ శ్పానిష్ కాల్పనిక కవి గుస్తావో అడల్ఫో బెక్వెర్ ప్రభావం ఇతనిమీద అమితంగా కనిపిస్తుంది. లలిత లలిత పదాలతో మధురంగా కవిత్వం చెప్పగల జోరిల్లా కొంతకాలం పత్రికా సంపాదక బాధ్యతను కూడా నిర్వహించాడు. దేశభక్తి పూరితమైన కవితలూ, వ్యాసాలూ వ్రాశాడు. *ది ఫాదర్ లాండ్ లెజండ్* అనేది ఈ కవి రచించిన సుప్రసిద్ధమైన 'ఓడ్' కావ్యం.

సాహిత్యంతో పాటు రాజకీయాలలో కూడా అనుభవం గల జోరిల్లా ఫ్రాన్స్, పోర్చుగల్, స్పెయిన్, వాటికన్ లలో రాయబారిగా కూడా పనిచేసి గొప్ప కీర్తి నార్జించాడు.

శే.రా.

**జోరిల్లా యి మోరల్ హోసె (1817-93) :** శ్పానిష్ కవి, నాటక రచయిత, కాల్పనికోద్యమ ప్రధాన నాయకుడు. ఇతని రచనలు శ్పానిష్ విలక్షణ శైలికి ఉదాహరణగా ప్రసిద్ధి పొందాయి.

జోరిల్లా న్యాయశాస్త్రాన్ని టోలడో, వల్లాడో-లిడ్‌లలో అభ్యసించి, సాహిత్య వ్యాసంగం చేబట్టడానికి మాడ్రిడ్ వెళ్లాడు. 1837 లో కవియైన 'మారియనో జోస్ డీ లారా' అంత్య క్రియల సందర్భంలో చక్కని స్మృతి కవిత వ్రాసి చదివి ప్రసిద్ధి పొందాడు. తర్వాత జోరిల్లా తన భార్య నుంచి, ఆర్థిక ఇబ్బందులనుంచి దూరంగా పారిపోయి, 1855 నుండి 1866 వరకు విదేశ సంచారం చేశాడు. తర్వాత వివిధ రచనలు చేసినా బికారిగానే మిగిలిపోయాడు.

1899 లో జోరిల్లా 'జాతీయ కవి' గా గుర్తింపు పొంది, ప్రభుత్వం నుంచి పెన్షన్ అందుకొన్నాడు.

జోరిల్లా *లెయెండాస్*(కథలు-గాథలు) అన్న గ్రంథంతో ప్రసిద్ధిలోకి వచ్చాడు. ఇతని మొదటి కవితా సంకలనం *కాన్‌టోస్ డెల్ ట్రోహాడర్* 1841 లో వెలువడింది. దీనిలో కవి అజాగరూకత, శబ్దాడంబరం కనిపిస్తాయి.

డాన్ జువాన్ కథను ఆధారంగా చేసుకుని *డాన్ జువాన్ టెనోరియో* (1841) అనే నాటకాన్ని 20 వ ఏట జోరిల్లా వ్రాశాడు. ఈ రచన వల్ల జోరిల్లాకు గొప్ప పేరు వచ్చింది. ఈ నాటకం 19 వ శతాబ్దిలో స్పెయిన్ దేశంలో మిక్కిలి ప్రసిద్ధి పొందింది. ఇప్పటికీ తరచు ప్రదర్శింప బడుతూంది. దీనిలో శ్పానిష్ ప్రజల విశిష్ట గుణ గణాలు చిత్రించబడడం వల్ల జోరిల్లా జాతీయ రచయితగా గుర్తింపు పొందాడు. దీనిలోని పాత్రలు సజీవంగా చిత్రించ బడ్డాయి.

శే.వెం.న.

**జోలా, ఎమిలి (1840-1902) :** ప్రముఖ ఫ్రెంచ్ నవలా రచయిత, సాహిత్య విమర్శకుడు. సాహిత్యంలో ప్రకృతి వాదోద్యమ ప్రారంభకుడు. 20 నవలలతో కూడిన నవలా చక్రం *రౌగన్ మాక్వార్ట్* రచయిత. దానిని ఆయన 'రెండవ సామ్రాజ్యకాలంలో ఒక కుటుంబం యొక్క స్వాభావిక, సాంఘిక చరిత్ర' అని వర్ణించాడు. ఆ నవలా చక్రంలోనివే ఒక వేశ్య జీవితాన్ని చిత్రించే *నానా* (1880), గనుల త్రవ్వకం పరిస్థితులను వర్ణించే *జర్మినాల్* (1885). ఆల్ఫ్రెడ్ డ్రేఫస్‌ను సమర్థిస్తూ జోలా వ్రాసిన *జాక్యూస్* అనే వ్యాసం కూడా సుప్రసిద్ధమైంది.



పారిస్ నగరంలో 1840 ఏప్రిల్ 2 వ తేదీన ఎమిలీ జోలా జన్మించాడు. ఆయన తండ్రి ఒక ఇటాలియన్ సివిల్ ఇంజనీర్ ఫ్రాన్సిస్కో జోలా; తల్లి ఫ్రెంచ్ జాతికి చెందిన ఎమిలీ ఔబర్ట్. 1862 లో ఎమిలీ జోలా ఫ్రెంచ్ పౌరసత్వం పొందాడు. 1847 లో ఫ్రాన్సిస్కో జోలా మరణించాడు. తండ్రి మరణానంతరం 1857 లో ఆ కుటుంబం తిరిగి పారిస్ నగరానికి వచ్చింది. అక్కడ ఎమిలీ జోలా 'లైసీ సెయింట్ లూయీ' లో చదివి మరికొందరు ప్రముఖ ఫ్రెంచ్ రచయితలలాగానే 1859 లో 'బేకాలౌరీట్' పరీక్షలో ఫెయిల్ అయ్యాడు. తరువాత రెండేళ్లపాటు ఉద్యోగం లేక జోలా చాలా అవస్థలు పడ్డాడు. ఆ సమయంలోనే పేదల కష్టాలు ఆయనకు ప్రత్యక్షంగా తెలిసి వచ్చాయి. ఆ అనుభవం ఆయన నవలలలో ఎంతో ఉపయోగపడింది. చివరికి ఒక షిప్పింగ్ కంపెనీలో ఆయనకు చిన్న గుమాస్తా ఉద్యోగం దొరికింది. కాని అది ఆయనకు రుచించలేదు. 1862 మార్చ్‌లో 'లూయీ క్రిస్టఫే ఫ్రాన్స్వాయిస్ హాచెట్'

అనే ప్రచురణ సంస్థలో సేల్స్ డిపార్ట్‌మెంట్‌లో చేర డంతో ఆయన పరిస్థితులు మెరుగు పడ్డాయి.

ఇతర ఫ్రెంచ్ నవలా రచయితల వలె జోలా కూడా మొదట కవిత్వం వ్రాశాడు. మానవుడి మీద ఒకటి, ప్రేమ మీద ఒకటి ఆయన రెండు కావ్యాలు వ్రాశాడు. రెండవ కావ్యాన్ని హాచెట్‌కు చూపగా అతడు దానిని ప్రచురింప నిరాకరించాడు. కవిత్వం కంటె కథలు బాగా ఖర్చు అవుతాయని అతడు అన్నాడు. జోలా 1864 లో *కాంటెస్ ఆ నినాన్* అనే కథల సంపుటిని ప్రకటించాడు. 1865 లో ఆత్మకథాత్మకమైన *లా కన్ఫెషన్ ది క్లాడి* అనే నవల ప్రచురించాడు. కాని అది పోలీసుల దృష్టి నాకర్షిం చడంతో ప్రచురణ సంస్థ అధికారి "రచన మానివేయనైనా మానివేయి; లేదా మా సంస్థనుంచి రాజీనామా అయినా చెయ్యి" అని బెదిరించాడు. అప్పటికే జోలా ఫ్రీలాన్స్ (స్వచ్ఛంద) రచయితగా డబ్బు సంపాదిస్తూ ఉండడం వల్ల ఆ ప్రచురణ సంస్థలో ఉద్యోగానికి రాజీనామా చేశాడు.

జోలా రచించిన నవలలలో *థెరిసా రాక్విన్* (1867) *మాడిలైన్ ఫెరాట్* (సిగ్గు-1868) చెప్పుకోదగ్గవి. 'గేబ్రిలీ' ఇలియనోర్ అలేగ్జాండ్రెన్ మెలీ' అనే ఆమెను 1870 మే 31 న జోలా వివాహ మాడాడు.

*రౌగన్ మాక్వార్ట్* నవలా చక్రం 10 నవలలతో వ్రాయాలని మొదట ఆయన అనుకొన్నాడు. కాని క్రమంగా అది 20 నవలలకు పెరిగింది. ఆ నవలా చక్రంలో మొదటి నవల *లా ఫార్చ్యునే డెస్ రౌగన్* (1871), *లా అ సోమూయిర్* (తాగుబోతు -1877) రచనతో అతని రచనలు ఎక్కువగా ఖర్చు అయే వర్గంలో చేర్చబడ్డాయి. మొదటి 20 నవలల నవలా చక్రం తరు వాత *లెస్‌ట్రాయిస్ విల్లీస్* (మూడు మహానగరాలు), *లెస్‌క్వాట్రె ఎవాంజలీస్* (నాలుగు సువార్తలు) అనే మరి రెండు చిన్న నవలలు ఆయన రచించాడు.

జోలా విజ్ఞాన శాస్త్రంలో ఎక్కువ నమ్మకం కలవాడు. 19 వ శతాబ్ది ఉత్తరార్థంలో ఫ్రాన్స్‌లో ప్రచారంలో ఉన్న 'విజ్ఞాన శాస్త్రమే మానవ జీవిత గమనాన్ని నిర్ణయిస్తుం' దనే వాదాన్ని జోలా పూర్తిగా ఆమోదించాడు.

1902 సెప్టెంబరు 22 న సీన్ నదీ తీరాన ఉన్న మెడాన్ గ్రామంలోని తమ వేసవి నివాసం నుంచి జోలా కుటుంబం పారిస్ నగరానికి తిరిగి వచ్చింది. ఆ రోజు రాత్రే వారి పడక గదిలో అగ్నిప్రమాదం సంభవించి మోనాక్సైడ్ పీల్చడం వల్ల వారు మరణించారు. అది జోలా రాజకీయ శత్రువులు చేసిన హత్యా ప్రయత్నమని కొందరు భావించారు. కాని అది రుజువు కాలేదు. యూరపియన్ నవలా రచయితలలో జోలాను మహా రచయితగా చేసిన అంశం: ఆయన కవితా మయమైన దృష్టి!

బొ.శ్రీ.

## టాకెరే, విలియం, మేక్‌పీస్ (1811-1863) :

ఇంగ్లీషు నవలా రచయిత, పత్రికా రచయిత, విమర్శకుడు, చిత్రకారుడు. ఈయన వ్రాసిన రెండు నవలలు, *వేనిటీ ఫేర్* (1847-48), *ది హిస్టరీ ఆఫ్ హెన్రీ ఎస్మండ్* (1852) వలన ఈయనకు ఖ్యాతి వచ్చింది.

ఈయన తండ్రి రిచ్మండ్, తల్లి అన్. ఇంగ్లాండ్ బడులలో విద్యాభ్యాసం చేసి కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయంలో ఒక సంవత్సరం గడిపాడు. ఫ్రాన్స్, జర్మనీలలో పర్యటిం చాడు. గెథే (Goethe)ని కలుసుకొన్నాడు. ఇసబెల్లా షాను పెళ్లి చేసుకొన్నాడు. ముగ్గురు కుమార్తెలు కలిగారు.

టాకెరే తనకు సంక్రమించిన ఆస్తి హరించుకు పోవడం వలన కుటుంబ పోషణకు కష్టపడవలసి వచ్చింది. పత్రికా రచనలు నిర్విరామంగా చేశాడు. హాస్య పత్రికగా ప్రఖ్యాతి గాంచిన *పంచ్* (Punch) కి రచనలు, చిత్రాలు పంపాడు. 1840 లో భార్యకి పిచ్చి ఎత్తడం, తరువాత జేన్‌బ్రాక్ ఫీల్డు అనే వివాహిత స్త్రీతో ప్రణయం, ఆ ప్రణయం ఆకస్మాత్తుగా ఆగిపోవడం వంటి సంఘటనల వలన ఆయన జీవితంలో సుఖం, శాంతి కొరవడ్డాయి. పైగా, తన ప్రతిభకు తగిన గుర్తింపు లేదనే బాధతో కుమిలిపోయాడు.

1847-48 మధ్యకాలంలో సీరియల్‌గా వెలువడిన *వేనిటీ ఫేర్* అనే నవల వలన, దానికి ఆయనే గీసిన బొమ్మల వలన ఆయనకు కీర్తి, సంపద లభించాయి. ఈ నవలలో కథానాయకుడు లేడు. 19 వ శతాబ్దపు రెండవ దశాబ్దంలో జరిగిన కథ. ఎమీలియా సెడ్లీ, బెకీషార్ప్ అనే ఇద్దరు వైవిధ్యం గల వనితల పరస్పరం పెనవేసుకున్న అదృష్టాలను వర్ణించే కథ ఈ నవల. బెకీ షార్ప్ ఈయన సృష్టించిన పాత్రలలో మరపురానిది. *పెన్ డెన్నిస్* అనే నవల కొంత వరకు స్వీయ చరిత్ర. 1851 లో 18 వ శతాబ్దపు ఇంగ్లీషు హాస్య రచయితలను గురించి ఉపన్యాసాలు ఇచ్చి, తన ఖ్యాతిని స్థిరపరచు కొన్నాడు. తరువాత *హెన్రీ ఎస్మండ్* అనే చారిత్రక నవల వ్రాశాడు. కొందరి విమర్శకుల దృష్టిలో ఇదే టాకరే నవలలలో అత్యంత ప్రశస్తమైనది.

తన రచన లన్నింటిలోను లేనిపోని ఆడంబరాలకు పోవడాన్ని టాకెరే నిరసించాడు. మానవ ప్రవృత్తిపై,

సంఘంలోని లోపాలపై ఆయన తన అభిప్రాయాలు తెలియ పరిచాడు. కపటత్వం, మానవుల రహస్య ఉద్వేగాలు, ప్రేమతో కూడిన విషాదాలు, జరిగిన సంఘ టనలను మరచిపోలేక పోవడం, జీవితంలో ఎక్కువగా ప్రదర్శితమైన గర్వం గురించి ఆయన వ్యాఖ్యలు చేశాడు. సమకాలీనులైన నవలా రచయితలు అవలంభించే అతిశ యోక్తితో కూడిన పాత్రల చిత్రీకరణ మొదలైన పద్ధతు లను ఈయన విడనాడాడు. సాధ్యమైనంత వాస్తవికంగా జీవితాన్ని ప్రతిబింబించే రచనలను, పాత్రలను, కళలను నేర్పుతో ఆయన విశదపరచాడు. కథాగమనం, వర్ణన, సంభాషణ, విమర్శ అనే నవలలోని నాలుగు అంశాలను ఆయన సమ్మిళితం చేశాడు.

1852 లో హాస్య రచయితలను గురించి ఉపన్యా సాలను ఇవ్వడానికి టాకెరే అమెరికా వెళ్లాడు. తరువాత యూరప్‌లో తన కుమార్తెలతో కలసి పర్యటించాడు. *ది న్యూకమ్స్* అనే మధ్య తరగతి సంఘ జీవనాన్ని చూపించే నవలను అప్పుడే వ్రాశాడు. డికెన్స్‌లా *ది రోజ్ అండ్ ది రింగ్* అనే క్రిస్మస్ పుస్తకం కూడా వ్రాశాడు. *ది వర్జీనియన్స్* అనే నవలలో కొంత అమెరికాలో, కొంత ఇంగ్లండులో (18 వ శతాబ్దపు ఉత్తర భాగంలో) జరిగిన కథ వివరింప బడింది.

1860-69 లో కారన్ హిల్ పత్రికకు సంపాదకుడు గా పనిచేశాడు. 1863 లో *డెనిస్ డువాల్* అనే ఇంకో చారిత్రక నవల ప్రారంభించి అది పూర్తి కాక ముందే హఠాత్తుగా మరణించాడు.

ఆయన నవలలలో అగ్ర, మధ్య తరగతుల జనం ఎక్కువ. వాస్తవంగా జరిగినట్లుండే సన్నివేశాలు కూర్చ డంలో ఈయన తన సమకాలీనుడైన ఛార్లెస్ డికెన్స్‌తో సమానుడుగా, లేదా ఆయన కంటె అధికుడుగా కనిపిస్తాడు.

ఇ.నా.

**టాగూర్, రవీంద్రనాథ్ (1861-1941)** : ప్రప థమ ఆసియాఖండ నోబెల్ బహుమతి గ్రహీత, బెంగాలీకవి, నాటక రచయిత. భారత జాతీయ గీతికా కర్త, తత్త్వవేత్త. విశ్వకవి రవీంద్రనాథ్ టాగూర్ 1861 వ సంవత్సరం మే ఏడవ తేదీన కలకత్తా పట్టణంలో జన్మించాడు. ఈయన కవియే కాక కారుణ్యమూర్తి, ధార్మికుడు, చిత్రకారుడు, గాయకుడు, స్వరకర్త, విద్యావేత్త, కళలన్నిటిని కలగలిపి పోత పోసిన సమగ్రమూర్తి. ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం వారిచే 'డాక్టర్ ఆఫ్ లెటర్స్' అందుకొన్న మహామనీషి. బెంగాలీ 'గురుదేవ్'. భారతీయ సంస్కృతిని పాశ్చాత్యు లకు, పాశ్చాత్య సంస్కృతిని భారతీయులకు పరిచయం చేసిన యుగ పురుషుడీ బెంగాలీ కవి సార్వభౌముడు. బాల్యంలో ఈయన విద్యాభ్యాసం అంతా ఇంటి వద్దనే కలకత్తాలోని ప్రముఖ పండితుల పర్యవేక్షణలో జరిగింది.

ఈయన బాల్యంలోనే కవిత్వాన్ని వ్రాయడం మొదలు పెట్టాడు. ఈయన కవితా సంకలనం మానసి 1890 వ సంవ త్సరంలో ప్రచురిం పబడింది. రవీం ద్రుని మేధాపరిణ తిని, పాండిత్యాన్ని సూచించే సంకలనం ఇది. ఇందులో ప్రసిద్ధి చెందిన పద్య రచనలే కాక, అంత వరకు బెంగాలీ సాహిత్యానికి పరి చయం లేని వచన రచనలు కూడా ఎన్నో ఉన్నాయి. ఇందులో కొన్ని కవి తలు రవీంద్రునికి గల సామాజిక, రాజకీయ స్పృహలకు ప్రతీకలు.



ఈయన 1891 లో తన తండ్రిగారి ఎస్టేట్లను పర్యవేక్షించడానికై షియాల్దా, సహజాద్‌పూర్‌లకు వెళ్ళారు. (ఈ రెండూ ప్రస్తుతం బాంగ్లాదేశ్‌లో ఉన్నాయి.) అక్కడ పేద సామాన్య గ్రామీణ ప్రజలతో సన్ని హితంగా మెలగి వారి పేదరికం, వెనుకబాటుతనంపై సానుభూతిని పెంపొందించుకొన్నాడు. ఇవే ఆయన తర్వాతి రచనల్లో ప్రతిబింబించాయి. అణగదొక్కబడిన వీరి బ్రతుకులు, దుఃఖా లాధారంగా రచించబడ్డ కథలన్నీ *గల్పగుచ్ఛ* (1912, 'కథా గుచ్ఛం') లో సంకలనం చేయబడ్డాయి.

తన సమకాలీనుడు, సులభశైలితో మార్మికతను బోధించిన లలన్ ఫకీర్‌తో సన్నిహిత సంబంధా న్నేర్పరచుకొని, అతని కవితలనేకం అధ్యయనం చేశాడు. ఈయన ఉత్తర బెంగాల్ గ్రామీణ ప్రాంతాల మనోహర దృశ్యాలకు ముగ్ధు డయాడు. పద్మా నది సోయగాలు రవీంద్రుని ఊహాలోకా న్నాక్రమించుకొన్నది. ఈ కాలంలో ఆయన *సోనార్ తరి* (1893: 'బంగరు ఓడ'), *చిత్ర* (1896), *చైతాలి* (1900), *నైవేద్య* (1901) మున్నగు కవితలే గాక *చిత్రాంగద* (1892, ఆంగ్లాను

వాదం-*చిత్ర* : 1913), మాలిని (1895) మొదలగు గేయ నాటకాలను కూడా రచించాడు.

భార్య మరణం, చిన్నకుమారుడు సమీంద్రనాథ్ మరణం ఈయనచే కొన్ని ఉత్తమ కవితలు వ్రాయ బడడానికి ప్రేరకా లయాయి. *గీతాంజలి* (1910) కవితా సంకలనం ఆంగ్లానువాదం ఎందరో పాశ్చాత్య పండితులను ఆకర్షించి, 1913 లో నోబెల్ బహుమతిని సంపాదించి పెట్టింది.

1915 లో బ్రిటిష్ ప్రభుత్వం ఈయనకు *సర్* బిరుదాన్నిచ్చి సత్కరించింది. కానీ దాన్ని ఆయన జలియన్‌వాలా బాగ్ (పంజాబ్) లో బ్రిటిష్ ప్రభుత్వం పిల్లలు, స్త్రీలు అనే విచక్షణ లేకుండా నిర్వహించిన పాశవిక మారణ హోమానికి నిరసనగా 1919 లో త్యజించాడు. ఈయన విరామ మెరుగని రచయిత. తన చివరి 25 సంవత్సరాల కాలంలో 21 కవితా సంపుటాలను వెలువరించాడు. చాలా రచనలను ఆయనే ఆంగ్లంలోకి అనువదించాడు.

టాగూర్ నవలా రచయిత కూడా. కాని ఇవి ఆయన కవితల్లాగా పేరు ప్రఖ్యాతులను ఆర్జించి పెట్ట లేకపోయాయి. ఈయన నవలల్లో ప్రసిద్ధి పొందిన *గోరా* (1910, ఆంగ్లానువాదం : 1924) ప్రదర్శించబడి, చలన చిత్రంగా రూపు దిద్దుకుంది. రవీంద్రునిచే వ్రాయబడ్డ కథలలో ఆయన కళానైపుణి విశదమవుతుంది.

ఈయన సంప్రదాయ భారతీయ, పాశ్చాత్య సంగీతాలు తెలిసిన స్వతస్సిద్ధ స్వరకర్త. తన రచనలలో కొన్ని వందల కవితలకు తనే స్వయంగా రాగాలను కూర్చి ఆలపించాడు. ప్రాక్ పశ్చిమాల సంగమంగా ఉత్తమ ఆదర్శ విద్యను బాలబాలికలకు నేర్పాలనే ఉద్దేశంతో 1901 లో కలకత్తా సమీపాన గల శాంతినికేతన్‌లో ఒక పాఠశాలను నెలకొల్పాడు. అదే నేడు ప్రపంచ ప్రసిద్ధి పొందిన శాంతినికేతన్ విశ్వవిద్యాలయంగా రూపు దిద్దుకొంది. అంతే గాక 1924 లో విశ్వభారతి విద్యాలయాన్ని కూడా స్థాపించాడు. ఇది ప్రఖ్యాతి పొందిన పండితుల నెందరినో ఆకర్షించింది.

భారత్, బాంగ్లాదేశ్ జాతీయ గీతాలు *జనగణమన*, *ఆమర్ సోనార్ బంగ్లా* ఈయన రచనలే. శ్రీలంక జాతీయ గీతం కూడా రవీంద్రుని ప్రసిద్ధ కవిత అయిన *చిత్తజేథ వయ సున్య* మీద ఆధారపడిందే.

తండ్రి తపోనిష్ఠ, తాతగారి జీవిత పథం మేళవించిన ఈయన భారత జాత్యుద్ధరణకే కాక సమున్నత భారత సంస్కృతి వికాసానికి, విశ్వమానవ సౌభ్రాత్రానికి జీవితాంతం కృషిచేసి 1941 వ సంవత్సరం ఆగస్టు 7 వ తేదీన కీర్తిశేషు డయాడు. ఈ యుగపురుషునికి విశ్వకవి బిరుదం సార్థకమైంది.

వాగరాజ్

**టామస్, డిలన్ (1914-1953)** : సుప్రసిద్ధ వెల్ష్ కవి, వచన రచయిత. ఆయన రచనలు లలిత హాస్యానికీ, గంభీరమైన శైలికీ, కరుణ రసానికీ ప్రసిద్ధి పొందాయి. మద్యపాన వ్యసనానికి దాసుడై నిర్లక్ష్యంగా జీవితం గడపి మితిమీరిన మద్యపానం వల్లనే చివరికి ఆయన అసువులు కోల్పోయాడు. టామస్ వేల్స్‌లోని నైరృతి భాగంలో తన బాల్యం గడిపాడు. అతని తండ్రి 'స్వాన్ సీ' గ్రామర్ స్కూలులో ఇంగ్లీషు బోధించేవాడు. ఆ స్కూలులోనే టామస్ చదివాడు. డిలన్ తల్లి ఒక సన్నకారురైతు కుమార్తె. అతడు వ్రాసిన *ఫెర్న్ హిల్* (1946) అనే కావ్యం రైతు జీవిత మాధుర్యాన్ని వర్ణిస్తుంది. అతడు మతదృష్టి గల కవి కాకపోయినా బాల్యంలో తల్లి అతనిని ఒక 'చాపెల్' (క్రైస్తవ ప్రార్థన మందిరం) కు తీసికొని వెళ్లడం వలన అతని కవిత్వంలోని అలంకారాలు కొన్నిటికి అది ప్రేరణ కలిగించింది. డిలన్‌కు వెల్ష్ భాష రాకపోయినా తాను ఎప్పుడూ వెల్ష్ కవిననే చెప్పుకునేవాడు. తాను కార్మిక వర్గానికి చెందిన వాడనని కూడా ఆయన అంటూ ఉండేవాడు. కాని అది నిజం కాదు. అతని కుటుంబం బాగా చదువుకొన్న మధ్య తరగతికి చెందింది. చిన్నతనం నుంచి తండ్రి పిల్లల కథలు కాకుండా పడుకోబోయే ముందు డిలన్‌కి షేక్స్పియర్ నాటకాలను చదివి వినిపిస్తూ ఉండేవాడు. డిలన్ ఆంగ్ల భాష ఉచ్చారణ నిర్దుష్టంగా ఉండేది. చిన్నతనంలో ఔత్సాహిక నటుడుగా నటించే రోజులలో అతడు రంగస్థలాన్ని వృత్తిగా స్వీకరించాలనుకునేవాడు. జీవితాంతం కవిత్వం ప్రధాన వృత్తి కాగా, రెండవ వృత్తిగా అతడు నటననే అభిమానించినట్లు కనిపిస్తుంది.

డిలన్ మొదటి పుస్తకం '18 పద్యాలు' 1934 లో వెలువడింది. తరువాత రెండేళ్లకు '25 పద్యాలు' అనే పుస్తకం ప్రచురించాడు. 1936 నుంచి సుమారు 10 ఏళ్లపాటు లండన్‌లో అతడు గడిపాడు. సాహితీ వర్గాలలో

ప్రసిద్ధుడైనా, దారిద్ర్యంతో బాధపడుతూ ఉండేవాడు. బి.బి.సి (రేడియో) కీ, చలన చిత్రాలకూ వ్రాసి డబ్బు సంపాదించాలని అతడు చేసిన ప్రయత్నాలు తగినంతగా ఫలించలేదు. అనారోగ్యం వలన సైన్యంలో చేరకుండా అతడు తప్పించుకున్నాడు. సహజంగా అతనికి ధనికుల పట్ల విముఖత, బడుగువర్గాల పట్ల సానుభూతి ఉండేవి. 1946 నుంచే అతడు అమెరికాకు వలస పోవాలని కలలు గనేవాడు. కాని చేతిలో డబ్బు లేకపోవడం వల్ల అది సాధ్యపడలేదు. ఆ మరుసటి ఏడాది అతనికి నరాల జబ్బు వచ్చినా, ఏ మానసిక వ్యాధి వైద్యుణ్ణీ సంప్రదించడానికి అతడు నిరాకరించాడు. ఆక్స్‌ఫర్డ్‌లో ప్రముఖ చరిత్ర రచయిత ఏ.జె.పి. టెయ్‌లర్ అతనికి ఒక కాటేజ్ ఇచ్చాడు.

1950 లో మొదటిసారి అతని అమెరికన్ పర్యటన ఏర్పాటైంది. ఆ రోజులలోనే అతడు *అండర్ మిల్క్ వుడ్* అనే నాటకం రచించాడు. 1953 లో న్యూయార్క్‌లోని పొయెట్రీ సెంటర్‌లో దానిని ప్రదర్శించారు. 1954 లో బి.బి.సి నుంచి అది ప్రసారం చేయబడింది. 1952 లో వెలువడిన అతని *కలెక్టెడ్ పొయెమ్స్* కి ఇంగ్లండ్‌లోనూ, అమెరికాలోనూ కూడా మంచి ఆదరణ లభించింది.

డిలన్ టామస్ గురించి ఎన్నో కట్టుకథలు ప్రచారమై, లార్డ్‌బైరన్ తరువాత ఏ ఆంగ్ల భాషా కవీ గురికానన్ని దూషణలకు అతడు గురి అయాడు. డిలన్ టామస్ 1953 నవంబర్ 9 న న్యూయార్క్ సిటీలో 37 ఏళ్లకే అకాల మృత్యువు పాలయాడు.

ఇ.నా.(బొ.శ్రీ.)

**టాల్‌స్టాయ్, లియో (1828-1910) :** జగత్ప్రసిద్ధి చెందిన రష్యన్ నవలా రచయిత. ఒక ధనిక భూస్వామి కుటుంబంలో 'టులా' రాష్ట్రంలోని యస్నయ పోలియానాలో 1828 సెప్టెంబరు 9 న టాల్‌స్టాయ్ జన్మించాడు. కొంతకాలం 'కజాన్' యూనివర్సిటీలో చదివి, అక్కడి విద్యాబోధనతో అసంతృప్తి చెంది, 1847 లో యస్నయ పోలియానాలోని తమ ఎస్టేటుకు తిరిగి వచ్చాడు. అనంతరం 1851 లో కాకాసస్ లో ఉన్న తన సోదరుడు నికొలాయ్ వద్దకు పోయి, ఆ మరుసటి సంవత్సరం సైన్యంలో చేరాడు. స్థానిక ఆదిమజాతుల వారితో జరిగిన చిన్న చిన్న యుద్ధాలలోను, సెవాస్టపోల్ ముట్టడిలోనూ టాల్‌స్టాయ్ పాల్గొన్నాడు. 1857 లో ఫ్రాన్స్, స్విట్జర్లాండ్, జర్మనీలను సందర్శించాడు. విదేశాల నుంచి తిరిగి వచ్చిన తరువాత యస్నయాలో రైతు బాల బాలికల కోసం ఒక స్కూలు స్థాపించాడు. 1862 లో ఒక మధ్యతరగతి యువతి 'సోన్యా (సోఫ్యా) యాండ్రెయెవ్నా బెర్స్' ను వివాహమాడాడు.

అప్పటికే తన *సెవాస్టపోల్ కియేరాస్ కాజీ* (1855-56 Sevastopol Sketches) అనే రచనతో కథానికా రచయితగానూ, *కజక* (1863 - The Cossacks) అనే నవలతో నవలా రచయితగానూ టాల్‌స్టాయ్ కీర్తి గడించాడు. అయితే 'వోమ్ నా ఇమిర్' (1865-69 War and Peace) అనే నవలతో గాని ఆయన సువిఖ్యాతుడు కాలేదు. నెపోలియన్ యుద్ధాల నేపథ్యంతో వ్రాసిన ఈ నవలలో పలు రష్యన్ పాత్రల జీవితాలూ, అనుభవాలూ చిత్రించబడ్డాయి. వారందరి జీవితాలూ 1812 లో జరిగిన ఫ్రెంచ్ దాడి వలన ఎలా ప్రభావితమైందీ రచయిత వర్ణించాడు. బృహత్ పరిమాణం గల ఈ నవలలో సూక్ష్మమైన మానసిక విశ్లేషణను వస్తుగత దృష్టితో టాల్‌స్టాయ్ నిర్వహించాడు. సంకీర్ణమైన పాత్రలను నిర్దుష్టమైన తీరులో తీర్చిదిద్దిన *వార్ అండ్ పీస్* నవలలోని కథా సంవిధానం పాశ్చాత్య నవలా చరిత్రలో సాధింపబడిన ఒక ఘనమైన సాంకేతిక విజయంగా పరిగణింపబడుతూంది.



టాల్‌స్టాయ్ రచించిన రెండవ పెద్ద నవల 'అనా కారెనినా' (1875-77) లో ఒక వివాహిత స్త్రీ ఒక యువకుని మాయలో పడి శీలం కోల్పోయి, భర్తను పరిత్యజించి, విషాదకర పరిస్థితులలో అకాల మృత్యువు వాతబడడం అనే ఇతివృత్తం వర్ణించబడింది. 'అనా కారెనినా' లో టాల్‌స్టాయ్ నైతిక దృష్టి మరింత బలంగా అభివ్యక్తమైంది. *వార్ అండ్ పీస్* లో మొదట ఆయన ఆరంభించిన జీవిత పరమార్థ అన్వేషణ ఈ నవలలో కూడా కొనసాగింది.

*ఏ కన్‌ఫెషన్* (1878-79, ప్రచురణ: 1882) అనే నవలలో జీవితానికి అర్థాన్ని అన్వేషించడంలో తాను ఎదుర్కొన్న ఆధ్యాత్మిక క్లిష్ట పరిస్థితిని టాల్‌స్టాయ్ వర్ణించాడు. క్రమంగా సంఘ సంస్కరణవైపు ఆయన మొగ్గు

చూపాడు. *కళ అంటే ఏమిటి?* (1897) అనే రచనలో టాల్‌స్టాయ్ కళ మత, నైతిక ప్రయోజనాలను సాధించాలనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. *రిసరెక్షన్* (1899) అనే మరొక పెద్ద నవలనూ, *ది పవర్ ఆఫ్ డార్క్‌నెస్* (1888) వంటి సాంఘిక సమస్యలను చర్చించే రూపకాలనూ కూడా టాల్‌స్టాయ్ రచించాడు. దేశద్రిమ్మరి అయిన యోగిగా జీవించాలనే వాంఛకూ, భూస్వామిగానూ, ప్రముఖ రచయితగానూ తన బాధ్యతలను నిర్వహించాలనే వాంఛకూ మధ్య పడి నలిగిపోయి, టాల్‌స్టాయ్ ఒక రాత్రి రహస్యంగా ఇల్లు వదలిపోయి, అటు తరువాత కొన్ని రోజులకు ఒక రైల్వే జంక్షన్‌లో 1910 నవంబరు 20 న దేహత్యాగం చేశాడు.

బా.శ్రీ.

**టాసిటస్ (సుమారు క్రీ.శ. 56-120) :** టాసిటస్ సుప్రసిద్ధ గ్రీక్ చరిత్ర రచయిత. గ్రీక్ భాషా వచన రచనలో విలక్షణ శైలీ నిర్మాతగా ప్రసిద్ధి పొందాడు.

టాసిటస్ ఉత్తర ఇటలీ దేశంలో జన్మించాడు. ఇతని తల్లిదండ్రులను గూర్చిన వివరాలు అంతగా తెలియవు. ఈయన జన్మించిన కుటుంబం 'కర్‌నేలియస్'. ఈ పేరు రోమన్ లోని గౌరవ కుటుంబానికి చెందింది.

టాసిటస్ 'రెటోరిక్' ను అభ్యసించాడు. 'రెటోరిక్' అంటే సాధారణ విద్యతోపాటు గద్య రచనా ప్రక్రియలో ప్రత్యేక శిక్షణ కూడా ఇవ్వడం. టాసిటస్ మార్కస్ ఆపర్, జూలియస్ సెకన్‌డస్ అనే ఇద్దరు ప్రసిద్ధ న్యాయశాస్త్ర కోవిదుల వద్ద న్యాయశాస్త్రాన్ని అభ్యసించాడు.

టాసిటస్ 77 లో గ్నేయస్ జూలియస్ అగ్రికోలా కుమార్తె ను వివాహమాడాడు. అగ్రికోలా ఇంపీరియల్ సర్వీసులో పనిచేస్తూ, తరువాత బ్రిటన్‌లో గవర్నర్‌గా కూడా పనిచేశాడు.

టాసిటస్ స్వయంకృషి వల్లా, ప్రతిభవల్లా సాంఘికంగా ఎంతో అభివృద్ధిని పొందుతూ వచ్చాడు. ఎన్నో ఉన్నతమైన పదవులను చేపట్టాడు. మొదట 'క్వేస్టర్' గాను (81), ఆ తర్వాతి కాలంలో (88) న్యాయ సంబంధమైన అధికారి (ప్రేటర్) గాను నియమితుడయ్యాడు. ప్రీస్ట్లీ కాలేజ్ మెంబరుగా కూడా ఉన్నాడు.

రోమ్‌కు తిరిగి వచ్చిన తర్వాత రోమ్ చక్రవర్తి డామిటియన్ సంపన్నులను పీడించడం ప్రత్యక్షంగా చూశాడు. 93 లో టాసిటస్ మామగారైన అగ్రికోలా గతించాడు. ఈ సమయంలోనే టాసిటస్ తన స్వయంకృషి వల్ల ఎంతో పేరును సంపాదించాడు. 97 వ సంవత్సరంలో నెర్వా చక్రవర్తి కాలంలో 'కాన్సల్' పదవిని పొంది వర్జీనియస్ రూఫస్ మరణ సందర్భంలో ఫ్యూనరల్ ఉపన్యాసం చేశాడు. దీని వలన టాసిటస్‌కు ఎంతో ప్రఖ్యాతి ఏర్పడింది.

మొదట టాసిటస్ రెండు రచనలు చేశాడు: 1. *డీ విటా జూలీ అగ్రికోలే*, 2. *డీ ఆరిజీన్ ఎట్ సీటు జర్మనోరమ్.* ఈ రెండింటిలో మొదటిది తన మామగారైన అగ్రికోలా జీవిత చరిత్ర. ఇందులో అగ్రికోలా బ్రిటన్ గవర్నరుగా పనిచేసిన కాలాన్ని ప్రధానంగా వర్ణించాడు. రెండో రచన జర్మన్ గిరిజనులను గూర్చి చేసిన రచన. భౌగోళిక సమస్యలతో పాటు మానవ జాతులను గూర్చిన శాస్త్రీయమైన ఆలోచనా రీతిని ఈ రచనలో ఆయన అందించాడు. జర్మన్‌లను గూర్చి తెలిసికొన గోరేవారికి ఇది చక్కగా ఉపయోగపడుతుంది.

టాసిటస్ గ్రీక్ వచన రచనా శైలిలో ప్రత్యేకమైన కృషి చేశాడు. అంతకు ముందున్న వచన రచనా రీతిని మార్చి ఒక క్రొత్త ఒరవడిని ఆయన ప్రవేశ పెట్టాడు. టాసిటస్ వక్తగా కూడా ప్రసిద్ధుడు. వక్తృత్వాన్ని, కవిత్వాన్ని జోడించి ఆయన తన సాహిత్య జీవితాన్ని గడిపాడు. రోమన్ ప్రజాస్వామ్యాన్ని గూర్చిన ఎన్నో చక్కని ఉపన్యాసాలను ఆయన చేశాడు. తరువాత ఆయన దృష్టి చరిత్ర రచన వైపు మళ్లింది.

డొమిషియన్ చక్రవర్తి పరిపాలనను గూర్చి అతని మరణం గూర్చి, ఒక గ్రంథాన్ని టాసిటస్ వ్రాశాడు. దాదాపు 30 వరకు చారిత్రక రచనలు ఆయన చేశాడు. కాని వానిలో ఎక్కువ భాగం అసంపూర్ణంగానే ఉండిపోయాయి. రోమన్ చరిత్రలోని క్లిష్ట పరిస్థితులు, డొమిషియన్ తర్వాత రోమ్ విచ్ఛిన్నం కావడం, నెర్వా చక్రవర్తి పరిపాలన, తర్వాత ట్రాజన్ రాజు పరిపాలన విధానాలను టాసిటస్ రచనలు వర్ణించాయి.

టాసిటస్ చరిత్ర రచనా విధానంలో చాలా నిబద్ధతను పాటించాడు. ఆయన చరిత్ర రచనలు మామూలు కథల ధోరణిలో ఉండవు. అవి యథార్థమైన సంఘటనలతో నిండి ఉంటాయి. పురాతన రోమ్ చరిత్రను, సాంస్కృతిక విప్లవాన్ని గూర్చి ఆయన చేసిన రచనలు చాలా విలువైనది. గ్రీక్ రచయిత లెందరో టాసిటస్ చరిత్ర రచనా విధానాన్ని ప్రస్తుతించారు.

టాసిటస్ సాహిత్య శైలి విశిష్టమైంది. అతని ఆలోచనా విధానం, భావ వ్యక్తీకరణ పద్ధతి అత్యుత్తమమైనవి. అతడు చరిత్ర రచనకు మూడు విధానాలను ఏర్పరుచుకొన్నాడు: 1. సంఘటనలను అవగాహన

చేసుకోడం, 2. వ్యక్తిత్వ ముద్రను చిత్రించడం, 3. మానవ ప్రవర్తన. టాసిటస్ భాష సజీవంగా ఉంటుంది. ఆయన వ్రాసే లాటిన్ భాష చదువరిని విశేషంగా ఆకర్షిస్తుంది.

శే.వెం.న.

**టాసో, టోర్క్వాటో (1544-1595) :** పునరుజ్జీవన యుగం ఉత్తర భాగానికి చెందిన ఇటాలియన్ మహాకవి.



మొదటి పవిత్ర మత యుద్ధంలో జెరూసలేమ్‌ను ఆక్రమించుకొన్న సంఘటనను గూర్చి *జెరూసలెమే లిబరేటా* (1581) అనే వీరరస ప్రధానమైన మహాకావ్యం వ్రాసి ప్రసిద్ధి పొందిన మహనీయుడు. నేపుల్స్ రాజ్యంలోని సోరెంటోలో 1544 మార్చి 11 న టాసో జన్మించాడు. తండ్రి కవి, రాజాస్థానాధికారి అయిన 'బెర్నార్డో టాసో', తల్లి పోర్జియా డిరోసి. ఉర్బినో సంస్థానంలో ఆ డ్యూక్ కుమారునితో కలిసి టాసో చదువుకొన్నాడు. ఆ రోజులలోనే పవిత్ర మత యుద్ధవీరుల కథలు ఆయనను ఉత్తేజ పరిచేవి.

తరువాత వెనిస్‌లో ఉండగా 'ఒట్టావా రిమా' అనే ఛందస్సులో (పాదానికి 11 గణాలు గల 8 పాదాలతో కూడిన ఇటాలియన్ వృత్తం) ఒక మహాకావ్యం వ్రాయడానికి టాసో పూనుకొన్నాడు. కాని త్వరలోనే ఆ రచన ఆపు చేశాడు. ఒక చరిత్రాత్మక కావ్యం వ్రాయడానికి అవసరమైనంత అనుభవం తన కింకా రాలేదని ఆయన గుర్తించాడు. వీరరస ప్రధానాలైన ఇతివృత్తాలను తీసికొని వివిధ కావ్యాలను వ్రాయసాగాడు. తత్పర్యవసానమే *రినాల్డో*. దానిలో టాసో కవిత్వ రచనా నైపుణి ప్రస్ఫుటంగా అభివ్యక్తమైనా, ఆయన కవితా ప్రతిభ పూర్తిగా వికసించలేదు.

1560 లో న్యాయ శాస్త్రం అభ్యసించడానికి టాసోను 'పాడువా' పంపారు. అక్కడ మానవతావాది, విమర్శకుడు అయిన 'స్పెరోనే స్పెరోనీ' ని ఆయన కలుసుకొన్నాడు. ఆయన పర్యవేక్షణలో టాసో అరిస్టాటిల్ రచించిన *పొయెటిక్స్* అధ్యయనం చేశాడు. 1562 లో టాసో 'లూక్రిజియా బెండిడియో' పై ప్రణయ గీతాలు వ్రాశాడు.

1569 లో టాసో తండ్రి మరణించాడు. తరువాత ఆయన పారిస్ వెళ్లి ఫ్రెంచికవి 'పీరే రోన్‌సార్డ్' ను కలుసు కొన్నాడు. 1571 లో ఫెర్రారాకు తిరిగి వచ్చి డ్యూక్ ఆస్థానంలో చేరి కవిత్వం విరివిగా వ్రాయసాగాడు. 1573 లో *అమింటా* అనే గ్రామీణ నాటకం ఆయన రచించాడు. ఆ సంవత్సరమే *గెలిల్టో రే డీ నార్విజియా* అనే విషాదాంత నాటకం వ్రాయడం మొదలు పెట్టాడు.

తన మహాకావ్యం *జెరూసలెమే లిబరేటా* రచనను టాసో 1775 లో పూర్తి చేశాడు. ఈ మహాకావ్యంలో మొదటి పవిత్ర మతయుద్ధం చివరి మాసాలలో 'గాడ్ ఫ్రే' అనే వీరుడు నడిపిన ఒక క్రైస్తవ సైన్యం ప్రదర్శించిన సాహస కృత్యాలను టాసో వర్ణించాడు.

తన మహా కావ్యంలోని విలక్షణతను ఎరిగి ఉన్న టాసో రోమ్ నగరానికి వెళ్లి ఒక విమర్శక బృందం చేత దానిని పరిష్కరింపజేసే ఏర్పాటు చేశాడు. 1576 లో ఫెరారాకు తిరిగి వచ్చి రోమన్ విమర్శకుల విమర్శల దృష్ట్యా తన కావ్యాన్ని సవరించడానికి ఆయన పూనుకొన్నాడు.

టాసో చివరి రోజులలో వ్రాసిన తాత్త్విక, నైతిక సంభాషణలు, అసంఖ్యాకమైన ఆయన లేఖలు 16 వ శతాబ్ది నాటి ఉత్తమ ఇటాలియన్ వచనానికి నిదర్శనాలు. 1581 లో *జెరూసలెమె లిబరేటా* తొలి ముద్రణ వెలువడింది. ఇటాలియన్ విమర్శకుల మధ్య సుదీర్ఘ కాలం ఆ కావ్యం మీద వాదోపవాదాలు చెలరేగాయి. *అపలోజియా* అనే రచనతో టాసో కూడా ఆ చర్చలలో పాల్గొన్నాడు.

అనతికాలంలోనే *జెరూసలెమే లిబరేటా* అనేక యూరపియన్ భాషలలోకి అనువదింపబడింది. పలువురు కవులు ఆయనను అనుకరింప సాగారు.

1595 ఏప్రిల్ 25 న రోమ్ నగరంలో టాసో మహాకవి తుదిశ్వాస విడిచాడు.

బొ.శ్రీ.

**టాసోనీ, అలెసాండ్రో (1565-1635) :** ఇటాలియన్ భాషలో రాజకీయ రచయిత, సాహిత్య విమర్శకుడు, కవి. టాసోనీ అలెసాండ్రో 1565 సెప్టెంబరు 28 న ఇటలీ దేశంలోని మోడేనా అనే చోట జన్మించాడు.

టాసోనీ సుప్రసిద్ధమైన అధిక్షేప కవిత *ది రేప్ ఆఫ్ ది బకెట్*. ఇది ఇటలీ అధిక్షేప సాహిత్యంలో

పేరెన్నిక గన్న రచన. ఎందరో ఈ రచనను గూర్చి విమర్శ వ్యాసాలు వ్రాశారు.

టాసోనీ విద్యాభ్యాసం బోలోగ్నా, పిసా, ఫెరారా విశ్వవిద్యాలయాలలో జరిగింది. అక్కడ అతడు న్యాయ శాస్త్రాన్ని అభ్యసించాడు. ఆ తర్వాత ఇతడు *అకాడ మీయా డెల్లా క్రస్కా* అనే సంస్థలో పనిచేశాడు. టాసోనీ జీవితంలో ఎక్కువ భాగం దీనిలోనే గడిచింది. ఇతని గద్య రచనలు కూడా ఆకర్షణీయంగా ఉంటాయి. వానిలో *అబ్జర్వేషన్స్ ఆన్ పెటార్క్స్ పోయెమ్స్* అనే గ్రంథాన్ని 1609 లో ఆయన ప్రచురించాడు. వేదాంత, రాజకీయ, శాస్త్రీయ ఆలోచనలతో కూడు కొన్న మరొక రచన 1620 లో ప్రకటింపబడింది. ఆ గ్రంథం పేరు: *టెన్ బుక్స్ ఆఫ్ డైవర్స్ థాట్స్ ఆఫ్ అలెసాంద్రో టాసోనీ.*

టాసోనీ రచనలలో ఉత్తమ మైన రచన *ది రేప్ ఆఫ్ ది బకెట్.* దీనిలోని ఇతివృత్తం ప్రధానంగా 14 వ శతాబ్దిలో బోలోగ్నా, మోడెనా పట్టణాల మధ్య జరిగిన యుద్ధం. మోడెనా సైనికులు బోలోగ్నా పట్టణంలో ఒక బకెట్‌ను పట్టుకొంటారు. అది వాళ్లకు దొరికిన 'ట్రోఫీ' లాంటిది. ఈ కావ్యంలోని బకెట్ చర్చిలో ఉన్న బిషప్ సింహాసనానికి ప్రతీక.

టాసోనీ 1635 ఏప్రిల్ 25 న మోడెనా పట్టణంలో మరణించాడు.

శే.వెం.న.

**టింగ్ లింగ్ (1904--) :** 20 వ శతాబ్దంలో మిక్కిలి ప్రసిద్ధి పొందిన చైనా రచయిత్రి. తిరుగు బాటుతనంతో కూడిన తన యౌవనంలో ఆమె అనేక ఆత్మీయమైన కథలూ, నవలలూ రచించింది. 1931 లో చైనా కమ్యూనిస్టు పార్టీలో చేరిన తరువాత శ్రామిక వర్గ రచనలు చేసింది. 1951 లో సాహిత్యంలో స్టాలిన్ బహుమతిని గెలుచుకుంది. కాని, 1957 లో రైటిస్ట్ అనే నెపంతో కమ్యూనిస్టు పార్టీ నుంచి బహిష్కృత అయింది. 'టింగ్ లింగ్' ఆమె కలం పేరు. అసలు పేరు 'చియాంగ్ వెయ్ ఛి'.

గౌరవం క్షీణిస్తున్న ఒక మర్యాదస్థుల కుటుంబంలో హ్యునాన్ రాష్ట్రంలోని చాంగ్ దే లో 1904 లో టింగ్‌లింగ్ జన్మించింది. 1911 లో తండ్రి పోయిన తరువాత బ్రతుకు తెరువు తెలిసిన తల్లే ఆమెను పెంచిపెద్ద చేసింది. చాంగ్‌టే లో తల్లి స్థాపించిన బాలికా పాఠశాలలోను, టావో యువాన్ అనే మరొక పట్టణంలోను ఆమె విద్యాభ్యాసం చేసింది. 1919 లో టింగ్ లింగ్ తల్లి మీద తిరుగబడి చాంగ్ షా లోని బాలబాలికలు కలసి చదువుకునే పాఠశాలలో చేరింది. రెండేళ్ల తరువాత ఆమె షాంఘై, పిమ్మట నాన్‌కింగ్ చేరి, ముఖ్యంగా అక్కడి సాంస్కృతిక జీవితాన్ని పరి శీలించింది. ఆ రోజులలోనే అరాజకవాదం ఆమెను ఆకర్షించింది. కొద్ది రోజులు చాంఘై విశ్వవిద్యాల యంలో పనిచేసిన తరువాత పీకింగ్ పోయి, అక్కడ ముందు ముందు కవిగా రూపొందనున్న 'హ్యూయేపిన్' (1925లో) ను కలుసుకుంది. అతనితో కలసి ఆమె పీకింగ్ వెలుపల ఉన్న 'వెస్టర్న్ హిల్స్' కు మకాం మార్చింది.

ఫ్రెంచ్, రష్యన్ నవలా రచయితల ప్రభావంతో టింగ్ లింగ్ ఆత్మీయమైన, పాక్షికంగా ఆత్మ కథా త్మకమైన చిన్న కథలు వ్రాయడం మొదలు పెట్టింది. ఎలాంటి సంకోచం లేకుండా 'సెక్స్' ను గురించి స్వేచ్ఛగా వ్రాస్తూ మరింత స్వాతంత్ర్యం కలిగిన ఒక నూతన చైనీయ కథా నాయికను ఆమె సృష్టి చేసింది. ఆమె కథలకు విశేష ప్రజాదరణ లభించింది. కాని హ్యూయేపిన్ రచయితగా ఎట్టి అభివృద్ధిని సాధించలేక పోయినందువల్ల ఆ దంపతులు 1928 లో షాంఘైకి మారి, అక్కడ ఒక సాహిత్య పత్రిక ఆరంభించారు. కాని, అది విజయవంతం కాలేదు. హ్యూయేపిన్ తన దృష్టిని రాజకీయాలవైపు మళ్లించాడు.

1930 నాటికి టింగ్ లింగ్ మూడు కథా సంపుటా లను, ఒక చిన్న నవలను ప్రచురించింది. ఆ ఏడాదే ఆమె కొక కుమారుడు కలిగాడు. హ్యూయేపిన్ కమ్యూ నిస్టు పార్టీలో చేరి రాజకీయాలలో పూర్తిగా తలదూర్చి 1931 లో ఉరితీయబడ్డాడు. 1933 లో టింగ్ లింగ్ కమ్యూనిస్టు పార్టీలో చేరి లెఫ్ట్ వింగ్ రచయితల లీగ్ నడిపే పత్రికలకు సంపాదకురాలైంది.

టింగ్ లింగ్ మార్క్సిజంలోకి మారిన తరువాత దాని ప్రభావం ఆమె రచనల మీద బాగా కనిపించింది. శ్రామిక వర్గ పక్షపాతంతో కూడిన *షుయి* (వరద-1931) అనే ఆమె రచన చైనాలోని సంఘవాస్తవికతకు దర్పణ ప్రాయం అయింది. క్యుమింగ్ టాంగ్ ప్రతినిధులు 1933 లో ఆమెను ఎత్తుకుపోయి 1936 వరకు బంధిం చారు. ఒక సైనికుని వేషంలో ఆమె తప్పించుకొని యెనాన్‌లోని క్యూనిస్టులను చేరుకుంది. అక్కడ ఆమెకు మావ్‌సేటుంగ్ తో పరిచయం ఏర్పడింది. కర్నల్ 'పెంగ్ తేహువాయ్' తో ప్రణయ కలాపం సాగించింది. ఆమె కథలలో కమ్యూనిస్టు పార్టీపట్ల కొన్ని విషయాలలో

అసంతృప్తిని ఆమె నిర్భయంగా ప్రకటించింది. అందుకు మావో ఆమెను మందలించాడు.

టింగ్ లింగ్ రచించిన *సూర్యుడు సాంగ్ కాన్ నది మీద ప్రకాశిస్తున్నాడు* (1948) అనే శ్రామిక వర్గ నవల గొప్ప విజయం సాధించింది. స్టాలిన్ బహుమతి అందుకున్న మొట్టమొదటి చైనీస్ నవల అదే. 1957 లో ఆమె కమ్యూనిస్టు పార్టీ నుంచి బహిష్కరించబడి కల్చరల్ రివల్యూషన్ కొనసాగుతున్న అయిదేళ్లకాలం నిర్బంధంలో గడిపింది. 1975 లో విడుదలై, 1979 లో తిరిగి పార్టీలో చేర్చుకోబడింది. ఇటీవలి ఆమె రచనలలో కొన్ని విమర్శక వ్యాసాలూ, చిన్నకథలూ పేర్కొనదగినవి.

శే.వెం.న.

**టిఖోనోవ్, నికొలాయ్ సెమ్యునోవిచ్ (1896-1979) :** ప్రసిద్ధ సోవియెట్ కవి, గద్య రచయిత. వీరోచితమైన బుర్రకథలకు, జాతీయ కళారూపాలకు, సృజనాత్మకతకు పేరు పొందాడు; అనేక నూతన ప్రయోగాలు చేశాడు.

యూక్రేన్‌లోని ఒక మధ్య తరగతి కుటుంబంలో పుట్టి, పెద్ద చదువులు చదువలేదు. మొదటి ప్రపంచ యుద్ధంలో హుస్సార్ రెజిమెంట్‌లో పనిచేశాడు. తరువాత 'రెడ్ ఆర్మీ' లో చేరాడు. 1917 నాటి రష్యన్ విప్లవంలో పాల్గొన్నాడు.

1920 ప్రాంతంలో లెనిన్‌గ్రాడ్‌లో స్థిరపడ్డాడు. 18 వ, 19 వ శతాబ్దుల నాటి జర్మన్ రచయిత హాఫ్‌మన్‌ను ప్రస్తుతించే 'స్కిపియన్ బ్రదర్స్' సాహితీ వర్గంలో సభ్యుడుగా చేరాడు.

1922 లో ప్రచురించిన రెండు కవితా సంకలనాలలో యుద్ధం రోజులలో వీరోచితమైన తన భావ పరంపరను ప్రకటించడానికి యత్నించాడు. విప్లవం నుంచి ఆయన స్ఫూర్తిని పొందాడు. సాహితీ క్షేత్రంలో స్పష్టతకు, వాస్తవికతకు, నవీనతకు ఆయన ప్రాధాన్యం ఇచ్చాడు.

1920-30 మధ్య కాలంలో వెలిమీర్ క్లెబ్నికోవ్, బోరిస్ పాస్టర్‌నాక్‌ల ప్రభావంతో టిఖోనోవ్ తన కవిత్వంలో నూతన ప్రయోగాలు చేశాడు. తూర్పు, మధ్య ఆసియాలలో పర్యటించి, కొత్తరకం కవితా సామగ్రి సమకూర్చుకొన్నాడు.

టిఖోనోవ్ ఎక్కువగా సాంఘిక అంశాలను కవిత్వంలో చొప్పించడం ఆరంభించింది 1930 తరువాతనే! గద్య రచనలలో కాల్పనికతనే కొనసాగించాడు. సోవియట్ పాలక వర్గాన్ని సమర్థిస్తూ, దేశభక్తితో రెండవ ప్రపంచయుద్ధ కాలంలో తన వెనుకటి ధైర్యాన్ని, కర్తవ్య దీక్షను ప్రకటించే రచనలు చేశాడు.

రష్యా దేశానికి సాంస్కృతిక రాయబారిగా పలు దేశాలలో ఆయన పనిచేశాడు. లెనిన్ పేరిట మూడు బహుమతులు, స్టాలిన్ పేరుతో మూడు బహుమతులు ఆయన పొందాడు. 1944-46 లో సోవియెట్ రచయితల సమాఖ్యకు అధ్యక్షుడుగా ఉన్నాడు. 1950 లో పాస్టర్నాక్‌కు వ్యతిరేకంగా పనిచేసినందున ఎందరో మిత్రులను ఆయన కోల్పోయాడు. *లెనిన్‌గ్రాడ్ కథలు* (1977), పద్యాలు, *పురాణ గీతికలు* (1981), *అనుదిన గీతికలు* (1982) టిఖోనోవ్ ప్రధాన రచనలు.

శ్రీ విరించి

**టిబులస్, ఆల్బియస్ (క్రీ.పూ. 55-19) :** రోమన్ కవి, ప్రాచీన ప్రామాణిక స్మృతి కవిత్వ (ఎలిజీ) రచయితలుగా ప్రసిద్ధులైన కార్నీలియస్ గాలస్, ప్రొపర్షియస్, ఓవిడ్‌లతో సమానుడు. వీరందరిలో టిబులస్ ప్రముఖు డని 'క్వింటిలియన్' పేర్కొన్నాడు. 'హోరేస్' తన కవితలలోను, కవితా లేఖలలోను పేర్కొనిన ఆల్బియస్ ఈ టిబులసే అని విజ్ఞుల అభిప్రాయం. *కార్పస్ టిబులియానమ్* అనే ఆ నాటి కవితా సంకలనంలోని టిబులస్ కవితలే మనకు ఈ నాడు లభ్యమవుతున్నాయి. ఈ సంకలనం ఆగస్టస్ చక్రవర్తినాటి రోమన్ సాహిత్య ఉన్నత స్థాయికి చక్కటి ఉదాహరణ.

ఈయన జీవితాన్ని గురించి మనం తెలుసుకోడానికి ఆధారాలు: ఈయన కవితలు, అధికారిక మని చెప్పలేని ఒక సంగ్రహ జీవిత చరిత్ర, ఇతర రచయితలు ఈయనను గురించి తమ రచనలలో ఉటంకించిన విషయాలు. సమాజంలో ఉన్నత వర్గానికి చెందిన ఈయన ఒక పెద్ద జాగీరుకు వారసుడు. కాని క్రీ.పూ. 41 లో మార్క్ ఆంటోనీ, ఆక్టేవియస్‌లు తమ సైనికులకోసం ఈయన ఆస్తిలో చాలా భాగం వశపరచుకొన్నట్లు తెలుస్తూంది. ప్రముఖ పాలనాదక్షుడు, మేటి వీరుడు, ప్రఖ్యాత సాహితీవేత్త అయిన 'మార్కస్ వెలిరియస్ మెస్సాలా కార్వినస్' స్నేహాన్ని, ప్రాపును ఈ కవి చిన్న వయస్సులోనే సంపాదించుకొని, మెస్సాలా సాహితీ బృందంలో ఒక ముఖ్య సభ్యుడు కాగలిగాడు. ఈ బృందం ఆగస్టస్ చక్రవర్తి ఆస్థానానికి దూరంగానే ఉండేది. టిబులస్ రచనలలో కూడా ఎక్కడా ఆ చక్రవర్తి ప్రస్తావన లేక పోవడం గమనించ దగింది.

టిబులస్ మొదటి కవితాసంపుటి *డెలియా* (అసలు పేరు కాదు) అనే స్త్రీతో ఆయన సాగించిన

ప్రేమ కలాపాన్ని వర్ణిస్తుంది. ఆమె భర్త సైనికోద్యోగిగా విదేశాలకు వెళ్లినపుడు ఆమెతో ఈయన ప్రేమ కలాపాలు జరపడం, ఆ ఉద్యోగి తిరిగి వచ్చిన తరువాత కూడా వీరి ప్రేమ వ్యవహారాలు రహస్యంగా కొనసాగడం, చివరకు తానే కాక ఆమెకు ఇంకా ఇతర ప్రియు లున్నారనే విషయాన్ని తెలుసుకుని ఆమెతో సంబంధం తెగ తెంపులు చేసుకోడం ఈ కావ్యంలో కనిపిస్తుంది. రెండవ సంపుటిలో డెలియా స్థానాన్ని 'నెమిసిస్' (ఇది కూడా ఆమె అసలు పేరు కాదు) అనే స్త్రీ ఆక్రమిస్తుంది. ఈమె ఉన్నత శ్రేణి వ్యభిచారిణి. ఆమె పద్ధతులకు వ్యథ చెందినా చివరివరకు టిబులస్ ఆమెను వదలినట్లు కనిపించదు.

టిబులస్ రచనలలో మనకు అతడు సహృదయుడుగా, స్నేహశీలిగా, నిస్స్వార్థపరుడుగా కనిపిస్తాడు. స్త్రీల పట్ల ఆయన చూపిన సహృదయత, సున్నితత్వం ఆనాటి పరిస్థితుల దృష్ట్యా అరుదైనవి.

రోమన్ కవిత్వం (ఎలిజీ) భావ సౌందర్యానికీ, భావ ప్రకటనలోని ఆర్ద్రతకూ, హుందాతనానికీ టిబులస్ అందె వేసిన చేయి. స్వచ్ఛమైన శైలి, కావ్య నిర్మాణంలో సౌష్ఠవం, సూత్ర నిర్దేశితం గాని రచనా శిల్పం ఆయన రచనలు బహుళ ప్రాచుర్యం పొందడానికి కారణాలు. టిబులస్ రచనలలో కనిపించే మృదుత్వం, స్వచ్ఛత, సహజ సౌందర్యం ఎన్నదగినవి.

కె.జి.మూర్తి.

**టిర్సో డి మొలీనా (1584-1648) :** స్పానిష్ నాటక రచయిత, లోప్ డి వేగాకు ముఖ్య అనుచరుడు. 'గేబ్రియల్ టెల్లెజ్' పెట్టుకొన్న కలం పేరు ఇది. ఆల్కలా విశ్వ విద్యాలయంలో అధ్యయనం చేశాడు. 1601 లో 'మెర్సి డేరియన్ ఆర్డర్' లో సభ్యత్వం పొందాడు. ఆ వ్యవస్థ చరిత్ర ను *హిస్టారియా జనరల్ డి లా ఆర్డెన్ డి లా మెర్సిడ్* గా 1637 లో రూపొందించాడు. మతాన్ని అధ్యయనం చేసి అందలి ధర్మ సూక్ష్మాలను బాగా అవగాహన చేసుకున్న మేధావి. సహజంగా ఆయనలో రంగస్థలం పట్ల ఉన్న ఆసక్తి, స్పానిష్ *కమెడియా* స్రష్ట అయిన 'లోప్ డి వేగా' సాధించిన విజయాలూ, కలిగించిన ఉత్సాహం ఆయనను నాటక రచనవైపుకు మళ్లించాయి. ఈయన నాటకాలలో తాత్త్విక చింతన అక్కడక్కడ కనిపిస్తుంది. స్పెయిన్, పోర్చుగల్, వెస్టిండీస్‌లలో తన మతోద్యోగరీత్యా విస్తృతంగా పర్యటించిన ఈ రచయిత తన నాటకాలలో ఆ యా దేశాల విశేషాలను విరివిగా వాడుకొన్నాడు.

ఆయన నాటకాలలో మనకు లభ్య మయేవి 80 మాత్రమే. 1627-1636 మధ్య 5 భాగాలుగా ఇవి ప్రకటితం అయాయి. సుఖాంత, విషాదాంత నాటకాలు వ్రాయటంలో ఈయన దిట్ట. 'కామెడి' లు వ్రాయటంలో తన సమకాలీనులతో సరితూగిన వాడే అయినా 'ట్రాజెడి' లు వ్రాయటంలో వాళ్లందరి పై ఉన్నత స్థాయి వాడని నిస్సందేహంగా చెప్పవచ్చు.

ఈతని విషాదాంత నాటకాలలో ప్రముఖంగా పేర్కొనదగినవి; *ఎల్ బుర్లడార్ డి సెవిల్లా, ఎల్ కాండినెండో పార్ డిస్ కాన్ఫియాడో* (1635). వీటిలో మొదటి దాని ద్వారా 'నాయకుడు', ప్రతినాయకుడు ఈ రచయిత. (Hero, villain) ఒకడే అయిన డాన్ జువాన్ పాత్రను ఈయన సాహిత్యానికి అందించాడు. ఆ పాత్ర జన బాహుళ్యంలో ప్రచారంలో ఉన్న కథలలోదే అయినా, దానిని తన నాటకంలో తీర్చి దిద్దడంలో ఆయన తన విశిష్ట ముద్రను స్పష్టంగా వేయగలిగేవాడు. రెండవ నాటకం ధర్మశాస్త్ర పరంగా సమర్థనీయమే అయినా చూడటానికి అసంబద్ధంగా కనిపించే ఒక విరోధాభాసను ప్రదర్శిస్తుంది. దీనిలో ఒక వ్యక్తి మహాపాపి. పాపకృత్యాలను నిరాఘాటంగా సాగిస్తున్నప్పటికి భగవంతుని పట్ల కొద్దో గొప్పో విశ్వాసం గలవాడు. ఆ విశ్వాసాన్ని ఆరిపోనీయకుండా పెంచుకొంటూ వచ్చాడు. తుదకు దైవానుగ్రహం వలన మోక్షం పొందాడు. ఇక రెండవ వ్యక్తి సన్మార్గాన్ని అనుసరించి దైవభక్తితో జీవితం గడిపి ఒకానొక దశలో ఆ విశ్వాసాన్ని మంట కలుపుకొన్నవాడు. ఇతడు శాశ్వతంగా నరకానికి పంపబడుతాడు.

పాత్రలలోని మానసిక సంఘర్షణలను, పరస్పర విరుద్ధమైన లక్షణాలను చిత్రీకరించడంలో ఈ రచయిత అందె వేసిన చేయి. *ఆంటోనా గార్సియా* (1635) లో 'మంది భావావేశాన్ని' హేతువాద బద్ధంగా చక్కగా విశ్లేషించి చూపాడు. *లా ప్రుడెన్షియా ముజర్* (1634) లో ప్రాచీన కాలంలోని ప్రాంతీయ సంఘర్షణలను ప్రదర్శించాడు. *లావెన్ గాన్జా డి తమర్* (1634) లో వాస్తవికత కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది.

నాటకాలు మాత్రమే కాక, మిత్రుల కాలక్షేపానికి పనికి వచ్చే అనేక కవితలు, కథలు కూడ రచించారు.

కె.జి.మూర్తి.

**టీక్, (యోహేన్) లుడ్విగ్ (1773-1853) :** బహుముఖ ప్రజ్ఞావంతుడైన, జర్మన్ రచయిత, విమర్శకుడు. జర్మనీలోని తొలి రొమాంటిక్ ఉద్యమాన్ని విమర్శించినవాడు. కథలు చెప్పటం ఈయనకు పుట్టుకతోనే

అబ్బిన విద్య. ఈయన గొప్ప రచనలు కూడా ఫెయిరీ టేల్స్ వలె హృదయాన్ని స్పందింపచేసేవే గాని మేధను స్పృశించేవి గావు. బెర్లిన్ జిమ్నాసియం (1782-92) లోను, హాల్, గాటింజన్, ఎర్లాంజన్ (1792-94) విశ్వ విద్యాలయాలలోను టీక్ అధ్యయనం చేశాడు. తరువాత 'వేకెన్ రోడర్' తో కలసి షేక్స్పియర్‌ను, ఎలిజబెతన్ నాటకాన్ని, మిడిల్ హై జర్మన్ ను, మధ్య యుగం నాటి పట్టణ వాస్తుశాస్త్రాన్నీ అధ్యయనం చేశాడు.

ఈయన రచనలలో పేర్కొనదగినవి: *డైజెషీ ష్టే డెస్ హెర్న్ విలియమ్ లొవెల్* (1795-96) (దీనిలో ఒక సుకుమార మనస్కుడైన యువ మేధావి నైతికంగా భ్రష్టుడైన విధానాన్ని 3 సంపుటాల్లో ఈయన వర్ణిస్తాడు), *కార్ల్‌వాన్ బెర్నెక్* (1797) అనే విషాదాంత నాటకం, మధ్య యుగాలనాటి కళాత్మక జీవితం ఇతివృత్తంగా గల *ఫ్రాన్జ్ స్టెర్న్ బాల్డ్స్ వాండరం జెన్* (1798) అనే నవల, 18 వ శతాబ్ది హేతువాదాన్ని అనుకరించినట్లు నటిస్తూ హేళన చేసే *ది జస్టిఫెల్ట్ కేటర్* అనే నాటకం.



1799 లో షేక్స్పియర్ నాటకమైన *ది టెంపెస్ట్* ను, *డాన్ క్విక్సోట్* ను జర్మన్ భాషలోనికి టీక్ అనువదించాడు. 1802 తరువాత ఆయనలోని సృజనాత్మక శక్తి కొంతవరకు మరుగున పడినట్లు కనిపిస్తుంది. 1825 వరకు ఆయన తిరిగి చెప్పుకోదగిన స్వతంత్ర రచనలు చేయలేదు. ఈ మధ్య కాలంలో ఆయన మిడిల్ హై జర్మన్ లో పాండిత్యం సంపాదించటం, ఎలిజబెతన్ నాటకాలను అనువదించడం, 16 వ, 17 వ శతాబ్దాల జర్మన్ నాటకాలను సంగ్రహించి ప్రకటించడం, నొవాలిస్, హైనిచ్ వాన్ క్లీష్ వంటి ఇతర జర్మన్ రచయితల రచనలను ప్రకటించడం వంటి సాహిత్య పరమైన కార్యకలాపాలను చేబట్టాడు.

1825 నుండి 1842 వరకు డెస్డెన్‌లోని నాటక ప్రదర్శన సంస్థకు సలహాదారుడుగా, విమర్శకుడుగా పని చేసి 'గొయ్‌థే' తరువాత చెప్పుకో దగిన విమర్శకుడుగా పేరు తెచ్చు కొన్నాడు. 1842 ప్రాంతంలో ఆయనలోని సృజనాత్మక శక్తి తిరిగి విజృంభించడంతో సమకాలీన మధ్య తరగతి జీవితం నుంచి, చరిత్రనుంచి విషయాలను సేకరించి సుమారు 40 నవలికలను ఆయన వ్రాశాడు. వీటిలో టీక్ రెండవ తరపు రొమాంటిక్ రచయితలను, 'యంగ్ జర్మనీ' ఉద్యమాన్ని తీవ్రంగా విమర్శించడం జరిగింది. 1842 లో ప్రష్యా చక్రవర్తి ఆహ్వానం పై బెర్లిన్‌లో స్థిరపడి, అక్కడి సాహితీ వర్గాలకు నాయకుడయాడు.

కె.వి.మూర్తి

**టుటువోలా, ఆమోస్ (1920--) :** ప్రముఖ నైజీరియన్ రచయిత. 'యోరుబా' తెగకు చెందిన పుక్కిటి పురాణాలను, మత విషయాలను, జానపద గాథలను తనదైన విశిష్ట సాహితీరూపంలో బయటి ప్రపంచానికి అందించినవాడు. సాంప్రదాయిక విద్యను ఆరు సంవత్సరాల పాటు ఈయన అభ్యసించినా, అభూత కల్పనలతో కూడిన జానపద కథలు, భూలోకానికి ఆవల ఉంటాయనుకునే దయ్యాలు, భూతాలు, స్వర్గ, నరక వాసులు, చిన్నప్పుడు పాఠశాలలో చదువుకున్న *తౌజండ్ అండ్ వన్ నైట్స్* కథలు, *పిల్గ్రిమ్స్ ప్రోగెస్* వంటి రచనలూ ఈయన రచనలకు ప్రాతిపదిక లయాయి. ఈతని రచనలలో 'విలియం బ్లేక్', 'జాన్ బన్‌యన్', 'దాంతే అలిగెరి' ల ఫక్కీ కనిపిస్తుంది. ఈయన రచనలలో బహుళ ప్రాచుర్యం పొందినది *ది పామ్ వైన్ డ్రింకార్డ్ అండ్ హిజ్ డెడ్ పామ్‌వైన్ ట్యాప్స్టర్ ఇన్ ది డెడ్స్ టౌన్* (1952).

*మై లైఫ్ ఇన్ ది బుష్ ఆఫ్ ఘోస్ట్స్* (1954) లో బానిస వర్తకుల బారి నుండి తప్పించుకునే ప్రయత్నంలో ఒక బాలుడు దయ్యాల పొదలో ఎలా చిక్కుపడతాడో తెలుపుతాడు. *సింబి అండ్ ది శాటిర్ ఆఫ్ ది డార్క్ జంగిల్* (1955) లో అందమైన ఒక ధనవంతుల అమ్మాయి గృహాన్ని వదలి బీదరికాన్ని, ఆకలి మంటలను అనుభవించడం చూపిస్తాడు. వీటిలో జీవిత సత్యాన్ని శోధించాలనే ఈ రచయిత తృష్ణ స్ఫురిస్తుంది. *ది బ్రేవ్ ఆఫ్రికన్ హంట్రెస్* (1958), *ది ఫెదర్ వుమన్ ఆఫ్ ది జంగిల్* (1962), *అజై అండ్ హిజ్ ఇన్‌హెరిటెడ్ పావర్టీ* (1967), *ది విచ్ హెర్బాలిస్ట్ ఆఫ్ ది రిమోట్ టౌన్* (1981) అనేవి ఈయన మరి కొన్ని రచనలు. వీటిలో సామ్యం కనిపించని కొన్ని చెదురు మదురు సంఘటనలను తీసుకుని వాటిని తన కవితా దృష్టి అనే దారంలో గుది గుచ్చి ఒక అందమైన మాలగా మనకు అందించిన ఈ రచయిత నైపుణ్యం మెచ్చుకో

దగింది. యోరుబా తెగను గురించిన వివరాలు, వారి ఆచార వ్యవహారాలు ఈయన రచనలకు కథా వస్తువు అవడం వల్లను, ఈయన రచనా రీతి హృదయానికి హత్తుకునే విధంగా ఉండడం వల్లను ఈయన రచనలు ఇంగ్లండ్, అమెరికా, ఆఫ్రికాలలో బహుళ ప్రాచుర్యం పొందాయి.

కె.జి.మూర్తి

**టెనిసన్, ఆల్‌ఫ్రెడ్ టెనిసన్ (1809-92) :** ఇంగ్లీష్ కవిత్వ చరిత్రలో విక్టోరియన్ యుగానికి ప్రముఖ ప్రతినిధిగా పరిగణింపబడుతున్న ప్రసిద్ధ ఆంగ్లకవి. 1884 లో 'ప్రభు' బిరుదం పొందాడు. ఒక ప్రాచీన లింకన్ షైర్ కుటుంబంలో 'రెక్టార్' (మతోద్యోగి) గా పనిచేస్తున్న తండ్రి కడుపున పుట్టిన 12 గురు పిల్లలలో టెనిసన్ నాల్గవవాడు. లింకన్‌షైర్‌లోని 'సోమెర్స్ బీ' లో 1809 ఆగష్టు 6 న ఆయన జన్మించాడు. చిన్నతనం నుంచీ ఆల్‌ఫ్రెడ్ వయస్సుకు మించిన తెలివి తేటలు ప్రదర్శించాడు. 20 ఏళ్లు నిండక మునుపే పోప్, స్కాట్, మిల్టన్‌ల శైలులను అనుకరిస్తూ కవిత్వం వ్రాశాడు. *ది డెవిల్ అండ్ లేడీ* అనే కావ్యం ఈయన ఆ వయస్సులో వ్రాసినదే (ప్రథమముద్రణ: 1930). టెనిసన్ మీద బైరన్ ప్రభావం చాలా ఎక్కువ. 1824 లో బైరన్ చనిపోయాడని వినగానే దుఃఖంతో నేల మీద పడి పొర్లి, ఒక శిలమీద 'బైరన్ ఈజ్ డెడ్' (బైరన్ చనిపోయాడు) అని ఆయన చెక్కాడు.

1827 లో తన సోదరులు ఛార్లెస్, ఫ్రెడరిక్‌లతో సహా కేంబ్రిడ్జ్‌లోని ట్రినిటీ కళాశాలలో టెనిసన్ చేరాడు. అక్కడ ఆయనకు ఆర్థర్ హలంతో ప్రగాఢమైన స్నేహం ఏర్పడింది. 1829 లో కేంబ్రిడ్జ్‌లో ఉండగా *టింబక్టూ* అనే పద్యం వ్రాసి ఛాన్సలర్ స్వర్ణపతాకాన్ని గెలుచుకోడంతో టెనిసన్‌కు బాగా పేరు ప్రఖ్యాతులు వచ్చాయి. 1831 లో టెనిసన్ తండ్రి చనిపోయాడు. డిగ్రీ తీసికోకుండానే కేంబ్రిడ్జ్‌నుంచి టెనిసన్ బయటికి వచ్చాడు.

1842 లో టెనిసన్ తన పద్యాలు రెండు సంపుటాలుగా ప్రకటించాడు. 1847 లో తన మొదటి సుదీర్ఘ కావ్యం *ది ప్రిన్సెస్* ప్రకటించాడు. 1850 లో టెనిసన్ 'ఎమిలీ సెల్‌వుడ్' ను వివాహం ఆడాడు. 1850 లోనే తన మిత్రుడు హలం మీద వ్రాసిన స్మృతి గీతాలు *ఇన్ మెమోరియమ్* అనే పేర ప్రకటించబడ్డాయి. అవి టెనిసన్‌కు విక్టోరియా మహారాణితో మైత్రిని సమకూర్చాయి. ఆ ఏడాదే టెనిసన్ పొయెట్ లారియెట్ (ఆస్థానకవి) అయాడు. టెనిసన్‌కు హలం (1852-1928), లియొనెల్ (1854-86) అని ఇద్దరు కుమారులు.

*ఓడ్ ఆన్ ది డెత్ ఆఫ్ విల్లింగ్‌టన్* (1852) ప్రచురింపబడడంతో జాతీయ కవిగా టెనిసన్ స్థానం సుస్థిర మైంది. 1859 లో టెనిసన్ *ఐడిల్స్ ఆఫ్ ది కింగ్* అనే కావ్యం ప్రచురించాడు. స్వాభావికంగా కీర్తి విముఖుడైన టెనిసన్‌కి అప్పటికే విపరీతమైన ఖ్యాతి వచ్చింది. *ఈనక్ ఆర్డెన్* (1864), *ఐడిల్స్, ది హోలీ గ్రెయిల్ అండ్ అదర్ పొయెమ్స్* (1869) అనే గ్రంథాలకు కూడా మంచి ప్రజాదరణ లభించింది.

1874 లో టెనిసన్ 'గేయ నాటక' రచనకు పూనుకొని *క్వీన్ మేరీ* (1875) ప్రచురించాడు. ఆయన ఇతర గేయ నాటకాలు: *హరోల్డ్* (1876), *బెకెట్* (1884), *ది ప్రామిస్ ఆఫ్ మే* (1882).

1889 లో టెనిసన్ సుప్రసిద్ధమైన *క్రాసింగ్ ది బార్* అనే పద్యం వ్రాశాడు. ఆ ఏడాదే *డిమెటర్ అండ్ అదర్ పొయెమ్స్* వెలువడింది. 1892 లో టెనిసన్ రూపకం *ది ఫారెస్టర్స్* న్యూయార్క్ సిటీలో ప్రదర్శించబడి ఘనవిజయం సాధించింది. టెనిసన్ తుది సంపుటం: *ది డెత్ ఆఫ్ ఓనోన్, అక్బర్స్ డ్రీమ్* (అక్బర్ కన్న కల) *అండ్ అదర్ పోయమ్స్*.

టెనిసన్ కీర్తికి బ్రౌనింగ్, స్విన్‌బర్న్లు తీవ్ర ప్రతిస్పర్థులు. 20 వ శతాబ్దం విమర్శకులు టెనిసన్ రచనల విలువలను కొంతవరకు తగ్గించారు. తన సమకాలికులను రంజింప చేయగలిగి నంతగా ఆయన పద్యాలు నేటి పాఠకులను అలరించలేక పోతున్నాయి. అయినా, కొందరు విమర్శకులు టెనిసన్ రచనలలో కొన్ని అయినా అజరామరాలుగా నిలుస్తాయి అని భావిస్తున్నారు. తన 83 వ ఏట 'సరే' లోని ఆల్డ్‌వర్త్‌లో టెనిసన్ తుది శ్వాస విడిచాడు.



**టెరెన్స్ (క్రీ.పూ. 185-159)** : రోమ్‌కు చెందిన సుఖాంత నాటక కర్తలలో ప్లాటస్ తరువాత చెప్పుకోదగిన వాడు. ఈయన పద్య రూపంలో వ్రాసిన ఆరు సుఖాంత నాటకాలు పరిశుద్ధ లాటిన్ భాషకు దృష్టాంతాలుగా నిలచాయి. ఆధునిక *కామెడి ఆఫ్ మేనర్స్* కి టెరెన్స్ వ్రాసిన నాటకాలే ప్రాతిపదిక అనవచ్చును.

'టెరెన్షియస్ లుకానస్' అనే రోమన్ సెనేటర్ ఇతనిని చిన్నప్పుడే బానిసగా రోమ్‌కు తీసుకువచ్చాడు. కాని ఇతని ప్రతిభను గుర్తించిన టెరెన్షియస్ ఇతనికి విద్యాభ్యాసాలు గరపి స్వేచ్ఛను ప్రసాదించాడు.

ఇతని జీవిత విశేషాలు మనకు ఎక్కువగా తెలియవు. అవి తెలుసుకోడానికి మనకున్న ఆధారాలు నాలుగు. దాదాపు 3 శతాబ్దాల తరువాత 'సుటోనియస్' వ్రాసిన ఇతని సంగ్రహ జీవిత చరిత్ర వానిలో మొదటిది. 4 వ శతాబ్దపు భాషా శాస్త్రకోవిదుడు 'ఏలియస్ డొనేటస్' ఈయన నాటకాలపై వ్రాసిన విమర్శనాత్మక వ్యాసాలు రెండవ ఆధారం. ఈయన నాటకాల మొదటి ప్రదర్శనలకు సంబంధించిన ప్రకటనలు, ఆ నాటకాలకు తానే వ్రాసి నాటకాలలోనే పొందు పరచిన పీఠికలు మూడవ ఆధారం. మిగతా ఆధారాలు: *ఆన్డ్రియా ది ఆంగ్డియన్ గర్ల్* (క్రీ.పూ. 166), *హెసైరా* (క్రీ.పూ. 165), *హ్యూటన్ టిమోరమెంటస్* (క్రీ.పూ. 161), *అడెల్ఫి అడెల్ఫో* (క్రీ.పూ. 160) అనే ఈయన వ్రాసిన సుప్రసిద్ధ నాటకాలు.

ఈ నాటకాల ప్రదర్శనలు అంతగా విజయవంతమైనట్లు కనిపించదు. అంతకు పూర్వం 'కాసిలియస్' అనే నాటక కర్తకు పేరు ప్రఖ్యాతులు ఆర్జించి పెట్టిన 'లూసియస్ ఆంబీవియస్ టర్పియో' అనే ప్రఖ్యాత నటుడు టెరెన్స్ నాటకాలలో కూడ నటించడం టెరెన్స్ అదృష్టమే అయినా, బహుశః అతడు అప్పటికి వయస్సు మీరి పోవడం వలన ఈ నాటకాలు రక్తి కట్టలేదేమో!

ఇతని పేరు ప్రఖ్యాతులకు అసూయ చెందిన తోటి రచయితలు ఇతనిపై అనేక నిందలు వేశారు. ఆ నాటి రోమన్ నాటక కర్తలు పూర్వ గ్రీక్ నాటకాలు ఆధారంగా, గొప్పింటి యువకులను, ప్రేమ వ్యవహారాలలో వారి ఒడుదొడుకులను ఇతివృత్తంగా తీసుకొనేవారు. మూలానికి విధేయంగానే ఉంటూ తమదైన వ్యక్తిత్వ ప్రభావాన్ని కొందరు చూపగలిగితే, మరికొందరు వాటిని మక్కికి మక్కి అనువదించారు. కాని టెరెన్స్ మూలనాటకాన్ని పాడుచేశాడనీ, రెండు మూడు నాటకాలలోని సంఘటనలను, పాత్రలను యథేచ్ఛగా కలగాపులగం చేసి ఒకే నాటకంగా వ్రాశాడనీ అతనిపై అభియోగం వచ్చింది. ఆ రచనలు పూర్తిగా అతని స్వంతమే కావనీ, ఉన్నత వంశీకులు కొందరు అతనికి రచనలో సాయంచేశారనీ మరికొందరు నిందించారు. వీటిలో నిజం పాలు ఎక్కువ లేదని విజ్ఞుల అభిప్రాయం.

ఇతడు కేవలం అనువాదకుడే కాదు. మూల నాటకాలలోని ఇతివృత్తాన్నీ, పాత్రలనూ, సంఘటనలనూ యథాతథంగా గాక, తన మేధతో, కాల్పనిక శక్తితో వాటికి చేర్పులు, మార్పులు చేసి తన స్వంత బాణీని ప్రస్ఫుటం చేసిన మహా రచయిత. తరువాతి తరాల రోమన్ విద్యా పద్ధతులపైనా, యూరోపియన్ రంగస్థలం మీదా ఈయన ప్రభావం విశేషంగా కనిపిస్తుంది.

25 సంవత్సరాల వయస్సులోనే ఈయన మరణించడం దురదృష్టకరం. 25 వ సంవత్సరంలో గ్రీస్ వెళ్లిన టెరెన్స్ మరి తిరిగి రాలేదు. గ్రీస్‌లోనో, సముద్ర ప్రయాణంలోనో ఆయన మరణించి ఉంటాడు.

కె.జి.మూర్తి

**టోరెస్ నహారో, బార్టోలోమె డి (1484-1525)** : శ్పానిష్ నాటక రచయిత, వ్యాస రచయిత. టోరెస్ నహారో 1484 వ సంవత్సరంలో స్పెయిన్ దేశంలో 'లాటారె డీ మిగ్వెల్ సెస్మిరో' అనే చోట జన్మించాడు. నాటక రచయితగా, సృజనాత్మక సిద్ధాంత కర్తగా పేరు పొందాడు. ఇతడు సజీవ పాత్రలను సృజించాడు.

ఈతని జీవితానికి సంబంధించిన వివరాలు చాలా స్వల్పంగా మనకు తెలుస్తున్నాయి. ఇతడు సైనికుడుగా కొంతకాలం పనిచేశాడు. కొంత కాలం ఆల్జీర్స్ (Algiers) లో నిర్బంధితుడు గా ఉన్నాడు. తర్వాత రోమ్‌కు పారిపోయాడు. అక్కడ పోప్ లియో X కు విశ్వాస పాత్రుడయాడు. అక్కడ ఉన్న ముఖ్యులైన చర్చి అధికారులతోను, వ్యాపారస్థులతోను అనుబంధాన్ని పెంచుకొన్నాడు.

టోరెస్ నహారో తన రచనలను మొదట 1517 వ సంవత్సరంలో ఒక సంపుటిగా ప్రచురించాడు. దానిపేరు *ది ఫస్ట్ థింగ్స్ ఆఫ్ పల్లాస్.* ఈ రచనలో నాటక కళను గూర్చి, విషాదాంత, సుఖాంత నాటకాలను గూర్చి చర్చించాడు. తన రచనలను తానే రెండు విధాలుగా వర్గీకరించుకొన్నాడు: 1. *కామీడియా అనోటీసియా* వాస్తవికాలు, స్వయంగా గమనించిన యథార్థ ఘటనలతో కూడినవి, 2. *ఫాంటాసియా* - కల్పితాలు- యథార్థాలు కాకపోయినా, యథార్థాలు అనిపించేవి.

టోరెస్ నహారో ఒక గొప్ప వ్యంగ్య నాటకాన్ని వ్రాశాడు. దాని పేరు *కామెడీ ఆఫ్ కిచెన్* (వంటశాల

ప్రహసనం). దీనిలో రోమన్ రాజభవనంలో జరుగుతున్న అవినీతిని వ్యంగ్యంగా ప్రకటించాడు. *లా సెల్సిస్టీనా* అనే నవలను ఆధారంగా చేసుకొని ఈ నాటకాన్ని ఆయన వ్రాశాడు. ఈ నాటకం స్పెయిన్ హాస్య నాటక స్వర్ణయుగానికి దారి తీసింది. అయితే తరువాతి నాటక రచయితల రచనల కన్న ఇది పూర్తిగా భిన్నమైంది.

టోరెస్ నహారో విశ్రామ మెరుగని రచయిత. శ్పానిష్ నాటకరంగ వికాసానికి తన జీవితాన్ని ధారపోసి, 1525 లో ఇతడు ఫెనిల్లె లో చనిపోయాడు.

శే.వెం.న.

**టోరెస్, బొదెత్ జైమి (1902-74) :** ప్రముఖ మెక్సికో కవి, నవలా రచయిత, విద్యావేత్త, రాజనీతిజ్ఞుడు. అమెరికా దేశంలోని మెక్సికో నగరంలో 1902 ఏప్రిల్ 17 న టోరెస్ జన్మించాడు.

మెక్సికో నేషనల్ యూనివర్సిటీలో టోరెస్ న్యాయ శాస్త్రం, సాహిత్యం అభ్యసించాడు. తర్వాత కొంతకాలం పాటు నేషనల్ ప్రిపరేటరీ స్కూల్‌కు సెక్రటరీ గాను, విద్యా మంత్రిత్వ శాఖలో ప్రజా గ్రంథాలయాల అధిపతిగాను పనిచేశాడు. ఆ పిమ్మట కొంతకాలం విశ్వవిద్యాలయంలో ఫ్రెంచ్ సాహిత్యాచార్యుడుగా (1924-29) పనిచేశాడు.

టోరెస్ ప్రచురించిన మొదటి కవితా సంకలనం *ఫెర్వర్* (1918). దీనిలో ఆధునిక భావాలను ఫ్రెంచ్ సాహిత్యంలో మొదటి సారిగా జైమి ప్రవేశపెట్టాడు. ఒంటరితనం, తన ఉనికిని గూర్చి తెలుసుకోవాలనే ఆరాటం, చావును కోరుకోడం మొదలగు అంశాలు ఈ సంపుటిలో కనిపిస్తాయి. ఆ తర్వాతి రచనలైన *ది డెలిరియస్ హార్ట్, సాంగ్స్* అనే సంపుటాలలో ప్రణయానికి సంబంధించిన ఖండికలు ఉన్నాయి. సుప్రసిద్ధ శ్పానిష్ కవి అయిన జ్వాన్ రామోన్ యిమెనెజ్ ప్రభావం చేత *లాకాసా* (గృహం) అనే కావ్యాన్ని వ్రాశాడు. దీనిలో కృత్రిమ వాతావరణం నుంచి పారిపోయి ప్రశాంతమైన గ్రామీణ జీవితం గడపాలనే వాంఛ అభివ్యక్త మవుతుంది.

*బియాంబో ది ఫోల్డింగ్ స్క్రీన్* అనే జపనీస్ పద్యరూపాలను టోరెస్ అనుకరించాడు.

టోరెస్ సంపాదకుడుగా ఒక పత్రిక వెలువడింది. ఆ పత్రికపేరు *కాం టెంపోరేనియోస్.* దీనిలో సంస్కృతికి, సాహిత్యానికి సంబంధించిన రచన లుండేవి. ఈ పత్రిక ఎందరో మెక్సికన్ కవులను ప్రభావితం చేసింది.

టోరెస్ ఎన్నో ఉన్నతమైన రాజకీయ పదవులను యూరోప్‌లోను, అమెరికాలోను నిర్వహించాడు. టోరెస్ విద్యామంత్రిగాను, విదేశాంగ మంత్రిగాను పని చేశాడు. మెక్సికో డెలిగేషన్ టు ది యునైటడ్ నేషన్స్ ప్రిపరేటరీ కమీషన్‌కి నాయకుడుగా పనిచేశాడు. "మెక్సికో డెలిగేషన్ టు ది ఇంటర్ నేషనల్ కాన్ఫరెన్స్ ఆఫ్ అమెరికన్ స్టేట్స్ ఇన్ బోగోటా" కు నాయకత్వం వహించాడు. తర్వాత యూనెస్కో డైరక్టర్ జనరల్‌గా (1948-52) పనిచేశాడు. పాఠశాలలకూ, గ్రంథాలయాలకూ చేసిన సేవలవల్ల టోరెస్ మెక్సికోలో విద్యారంగానికి పితామహుడుగా ప్రసిద్ధి కెక్కాడు.

1954 లో వెలువడిన *ఫ్రాంటియర్స్*, 1957 లో వెలువడిన *వితవుట్ ట్రూస్* అనే కవితా సంకలనాలలో టోరెస్ పరిణతి చెందిన కవిగా కన్పిస్తాడు. టోరెస్ గద్య రచయితగా కూడా ప్రసిద్ధుడు. ప్రౌస్ట్ (Proust), టాల్‌స్టాయి (Tolstoy) లను గూర్చి అతడు వ్రాసిన వ్యాసాలు అందుకు నిదర్శనాలు. 1966 వ సంవత్సరంలో ఇతడు జాతీయ సాహిత్య బహుమతి పొందాడు. టోరెస్ వ్రాసిన నవలలు ఆరు ప్రచురింపబడ్డాయి. *పొయెటికల్ వర్క్* అన్న పేరున ఇతని కవితలు రెండు సంపుటాలుగా వచ్చాయి. *సెలెక్టెడ్ పోయెమ్స్ ఆఫ్ జైమి* అన్న పేరుతో ఫ్రెంచ్, ఇంగ్లీషు భాషల్లో ఒక ఎడిషన్ వెలువడింది.

టోరెస్ చివరకు కేన్సర్ వ్యాధి పీడితుడై 1974 మే 13 న లో మెక్సికో నగరంలో మరణించాడు.

శే.వెం.న.

**ట్రాక్ల్, జార్జ్ (1887-1914) :** ఆస్ట్రియన్ కవి. వాస్తవికతను చాలా వరకు పక్కకు నెట్టి, ఆత్మాంతర్గతమైన తన అనుభవాన్ని కొన్ని ప్రతీకల ద్వారాను, తనదైన ఒకే ప్రత్యేక రీతిలోను వ్యక్తీకరించినవాడు (Expressionist). జీవితంలో స్వయంగా తాను అనుభవించిన అనేక వ్యథలూ, యుద్ధకాలంలో ఉద్యోగరీత్యా తన చుట్టూ ప్రత్యక్షంగా చూసిన అనేక దృశ్యాలు ఈ రచయితను కలచివేశాయి. ఫలితంగా స్మృతి కావ్యాన్ని (eligy) తన భావ ప్రకటనా మాధ్యమంగా ఎన్నుకొని, ప్రసిద్ధ కావ్యాలను వ్రాశాడు. జవ సత్వా లుడిగిపోవడం, మరణం ఈతని కావ్యాలలో ఇతివృత్తాలు.

సహజంగా తనలోకి తాను ముడుచుకు పోయే స్వభావం గల ఈ కవి ఒక కమ్మరి కుమారుడు. వియెనా విశ్వ విద్యాలయంలో (1908-10) 'ఫార్మసిస్ట్' గా శిక్షణ పొంది తరువాత సైన్యంలో వైద్య విభాగంలో 'లెఫ్టినెంట్' గా చేరి, 'గలీసియా' లో యుద్ధం కలిగించిన బీభత్సాన్ని ప్రత్యక్షంగా చూసినవాడు. యుద్ధంలో క్షతగాత్రులకు మందులు పంచుతూ వారి తీవ్రబాధలను, అందులో కొందరి ఆత్మ హత్యలను, సైన్యం నుంచి

పారిపోయిన కొందరు సైనికులను పట్టుకుని ఉరి తీయడాన్ని స్వయంగా చూసి విచలితుడై, తానే ఆత్మహత్యా ప్రయత్నం చేసినట్లు తెలుస్తోంది. క్రాకో మిలిటరీ వైద్యశాలలో 'కొక్కై' అధిక మోతాదులో (బహుశః పొరపాటున) తీసుకోవడం వలన ట్రాక్ల్ చనిపోయినాడు.

ట్రాక్ల్ 1913 నాటికే మాదక ద్రవ్యాలకు బానిస అయ్యాడు. అతని చెల్లెలు 'గ్రెటె' పై అతనికి గల అసాధారణమైన ప్రేమ, బలీయమైన సంచార తృష్ణ ఇతని జీవితాన్ని ప్రభావితం చేసిన ఇతర విషయాలు.

ట్రాక్ల్ తన మొదటి కవితా సంపుటిని 1913 లో ప్రచురించాడు. ఈతని రచన లన్నింటిలోను వర్తమానపు బీభత్సానికి క్షోభపడటం, స్వర్గధామం అయిన భూత కాలపు అనుభూతుల కోసం, పునర్జన్మకోసం ఆరాట పడడం కనిపిస్తుంది. ఈయన కవితలలో కొన్నింటిని 'లూసియా జెట్స్' అనే రచయిత ఆంగ్లంలోకి అనువదించి, 1973 లో ప్రచురించాడు.

కె.జి.మూర్తి

**ట్స్వెటాయెవా, మరీనా ఇవనోవా (1892-1941) :** రష్యా బయట ఎక్కువ ప్రచారం పొందక పోయినా 20 వ శతాబ్దపు ఉత్తమ రష్యన్ కవయిత్రులలో ఒకరుగా ఈమె గుర్తింపు పొందింది. ఈమె రచనలలో విలక్షణమైన ఒక స్వంత లయ, బాణీ కనిపిస్తాయి. చెప్ప దలచుకున్నది సూటిగా చెప్పటం ఈమె ప్రత్యేకత. ఈమె తన బాల్యం మాస్కోలోనే గడిపింది. తండ్రి విశ్వవిద్యాలయంలో ఆచార్యుడు, ఒక పురావస్తుశాల సంచాలకుడు. తల్లి పియానో వాయిద్యంలో నిపుణురాలు. తల్లి దండ్రులతో ఇటలీ, స్విట్జర్లాండ్, జర్మనీ, ఫ్రాన్స్‌లను దర్శించింది. 16 సంవత్సరాల వయస్సప్పుడు సోర్‌బాన్ విశ్వవిద్యాలయంలో చేరింది. 1910 లో *వెచెర్నీ ఆల్బం* అనే ఆమె తొలి కవితా సంకలనం వెలువడింది. దీనిలోని కవితలు అంత చెప్పుకోదగ్గవి కాకపోయినా వాటిలో అక్కడక్కడ కనిపించే మెరుపులు తరువాతి కాలంలో ఆమె సాధించిన విజయాలకు ప్రాతిపదికగా కనిపిస్తాయి. 1922 లో వెలువడిన *జార్-డెవిట్సా* అనే ఒక అభూతకల్పనా గాథను చెప్పే సుదీర్ఘ కావ్యం ఆమె కవితా చమత్కారాలకు అద్దం పట్టి చూపిస్తుంది.

ఆమె, ఆమె భర్త రష్యన్ విప్లవాన్ని తీవ్రంగా ఎదుర్కొన్నారు. ఈ కాలంలో ఆమె వ్రాసిన కావ్యాలు బోల్షవిక్ విప్లవాన్ని తీవ్రంగా ప్రతిఘటించేవే. వీటిలో చెప్పదగినది *లెబిడినీ స్టాన్* (1917-21). 1922 లో ఆమె రష్యాను వదలి, బెర్లిన్, ప్రేగ్ లలో కొంతకాలం ఉండి చివరకు 1925 లో పారిస్‌లో స్థిరపడింది. అక్కడ *స్టిఖిన్ బ్లోకు* (1922), *పొస్సెరోసీ* (1928) అనే కవితా సంపుటాలను ప్రచురించింది. *అరియేడ్నీ* (1924), *ఫేడ్రా* (1927) అనే రెండు సాంప్రదాయిక పద్య రూప విషాదాంత నాటకాలను, *మై పుష్కిన్* (1937) అనే విమర్శనాత్మక గ్రంథాన్ని వ్రాసింది.

1930 నుండి ఆమె కవిత్వంలో ఒంటరితనం, స్వదేశానికి తిరిగి వెళ్లాలనే తపన కనిపిస్తాయి. *టోస్కా పో రోడిన్* (1935) లో ఇవి బాగా ప్రస్ఫుట మయినాయి. 1937, 38 ప్రాంతంలో భర్త, కుమార్తె రష్యాకి తిరిగి వెళ్లి కమ్యూనిస్టులతో కొంత కాలం పనిచేసి, స్టాలిన్ క్రూరత్వానికి బలి అయి పోయారు. 1939 లో ఆమె కూడా మాస్కో చేరి కొన్ని అనువాద రచనలను చేబట్టింది. రెండవ ప్రపంచయుద్ధ కారణంగా మాస్కో వదలి ఒక మారుమూల ప్రాంతానికి వెళ్లి, వంటరితనం భరించలేక 1941 లో ఆమె ఆత్మహత్య చేసుకుంది.

కె.జి.మూర్తి

**ట్వెయిన్, మార్క్ (1835-1910) :** అమెరికా సంయుక్త రాష్ట్రాలకు చెందిన రచయిత, హాస్యస్రష్ట, ఉపన్యాసకుడు, పత్రికా రచయిత. *ది ఎడ్వెంచర్స్ ఆఫ్ టామ్ సాయర్* (1876), *లైఫ్ ఆన్ ది మిస్సిసిపి* (1883), *ది ఎడ్వెంచర్స్ ఆఫ్ హాకల్ బెర్రి ఫిన్* (1885) అనే యువ సాహస గాథలు ఈయనకు ప్రపంచ వ్యాప్తంగా ప్రఖ్యాతి తెచ్చి పెట్టిన రచనలు. అమెరికన్ జీవితం నుంచి వస్తువును గ్రహించి సాహితీ రూపంలో ప్రకటించి అమెరికన్ రచనలకు ఒక విశిష్టత చేకూర్చినవాడు. చాలా విస్తృతంగా పర్యటించి అమెరికన్ జీవితంలోని మొరటుతనాన్ని, హాస్య ప్రియత్వాన్నీ, ధనాకాంక్షను, నిస్పృహను, వంటరితనాన్ని స్వయంగా తాను కూడా అనుభవించి ఉండడం చేత హృదయానికి హత్తుకునే రీతిలో ప్రకటించిన నిజాయితీ గల రచయిత. వాస్తవాలను ఊహలుగా, ఊహలను వాస్తవాలుగా చిత్రీకరించిన శిల్పి. చిన్న



పిల్లలనుండి వృద్ధులు, పండితుల వరకు అందరు చదివి ఆనందించే రీతిలో ఉంటాయి మార్క్ ట్వెయిన్ రచనలు.

క్లెమెన్స్ జాన్ మార్షల్, జేన్ లాంప్టన్ క్లెమెన్స్ల ఆరవ సంతానం 'మార్క్ ట్వెయిన్'. ఇతనికి 4 సంవత్సరాలప్పుడు ఆ కుటుంబం మిస్సిసిపి నది పడమర ఒడ్డున ఉన్న 'హానిబాల్' కు మారారు. తండ్రి ఒక కిరాణా కొట్టు నడుపుతూ న్యాయవాదిగా కూడా పనిచేసేవాడు. తరువాత స్థానిక రాజకీయాలలో ప్రవేశించాడు. హానిబాల్ లోకి నౌకల మీద పని చేసే వాళ్లు ఎక్కువగా వస్తూ పోతూ ఉండేవాళ్లు. వాళ్లలో ఎక్కువ మంది కర్కశులు, జూదరులు, మోసగాళ్లు, కత్తులు, తుపాకులు పుచ్చుకొని భయం కొలిపే రీతిని తిట్టుకుంటూ, కొట్టుకుంటూ ఉండేవారు. నదీ జీవనాన్ని చిన్నతనంలో మార్క్ ట్వెయిన్ అతి దగ్గరనుండి చూశాడు. ఆ ఊరు ప్రక్కనే ఒక కొండ, దానిలో ఒక గుహ ఉండేవి. మార్క్ ట్వెయిన్ ఆ గ్రామం లోని ఒక త్రాగుబోతు కొడుకయిన 'టామ్ బ్లాంకెన్ షిప్' తో తరచు గడుపుతూ ఉండేవాడు ఆ నదీ తీరంలోనో, ఆ గుహదగ్గరో! ఈ టామ్నే మార్క్ ట్వెన్ తన నవలలో *హకల్ బెర్రి ఫిన్* గా చిత్రించి చిరస్మరణీయుణ్ణి చేశాడు. ఈ రచయిత 4 సంవత్సరాలప్పుడు సోదరిని, 7 సంవత్సరాలప్పుడు సోదరుని, 11 సంవత్సరాలవయస్సులో తండ్రిని (1847) పొగొట్టుకొన్నాడు. కుటుంబానికి సాయం చేయటానికి ఇష్టం లేకపోయినా ఇంటింటికి పత్రిక లందించే బాలుడుగా పని ప్రారంభించాడు. తన కన్న 10 సంవత్సరాలు పెద్దవాడైన సోదరుడు 'ఆరియన్' ప్రారంభించిన *హానిబల్ జర్నల్* అనే పత్రికలో పని చేశాడు. 'రాంబ్లర్' అనే కలం పేరుతో ఆ పత్రికకు వ్రాయటం కూడా ప్రారభించాడు. 17 సంవత్సరాల వయస్సప్పుడు తన పేరుతోనే వ్రాసిన *ది డాండీ ఫ్రైటెనింగ్ ది స్క్వాటర్* అనే హాస్యరచన 'బోస్టన్' నుంచి వెలువడే 'ది కార్పెట్ బాగ్' అనే పత్రికలో ప్రచురిత మయింది.

'హానిబాల్' నుండి 'సెయింట్ లూయీ' పట్టణానికి, అక్కడి నుండి 'న్యూయార్క్' నగరానికి మార్క్ ట్వెయిన్ వెళ్లాడు. అక్కడ నుండి ఫిలడెల్ఫియా, వాషింగ్టన్లకు వెళ్లి తిరిగి పశ్చిమ ప్రాంతంలోని 'మస్కటిన్' చేరి, తనలాగానే ఊళ్లు పట్టుకుని తిరుగుతున్న తన సోదరుని ముద్రణాలయంలో పనిచేశాడు. ఈ సంచార ప్రియుడు నిలకడగా ఎక్కువకాలం ఏ పట్టణంలోను ఉండలేక దక్షిణ అమెరికాలోని అమెజాన్ నదీ ప్రాంతంలో తన అదృష్టాన్ని పరీక్షించుకోవాలనుకొని అక్కడికి కూడా వెళ్లి వచ్చాడు. తన యాత్రలను గూర్చి లేఖల రూపంలో వ్రాయగా, వాటిని క్యోకక్ లోని 'డెయిలీ పోస్ట్' అనే పత్రిక ప్రచురించింది. 4 సంవత్సరాల పాటు మిస్సిసిపి నదిమీద నావలు నడిపే పైలట్గా పనిచేశాడు. ఈ కాలంలో ఆయన అన్ని రకాల మనుష్యులను కలవడం వలన మానవ స్వభావాన్ని బాగా ఆకళింపు చేసుకొన్నాడు. అమెరికన్ సివిల్వార్ ఉత్తర దక్షిణ రాష్ట్రాలమధ్య రాక పోకలను ఆటంక పరచగా, కొంత కాలం పాటు 'న్యూ ఆర్లియన్స్' రాష్ట్రంలో ఉండి పోయాడు. అప్పట్లో *క్రైసెంట్* అనే పత్రికలో 'క్వింటియస్ కర్టియస్ స్నాడ్గ్రాస్' అనే మారు పేరుతో ఈ రచయిత వ్రాసిన కొన్ని లేఖలు ఈ రచయితకు స్థానిక సైనికులతో పరిచయ మేర్పడినట్లు తెలుపుతున్నా, ఆ అంతర్యుద్ధం పట్ల ఆయనకు గల భావాలు మనకు ఖచ్చితంగా తెలియవు. తరువాత సోదరుడు 'ఆరియన్' అబ్రహం లింకన్ అనుచరుడుగా ప్రాంతీయ కార్యదర్శి పదవి పొందగా అతనితో పాటు 'నెవాడా' చేరాడు. అక్కడ జూదం లాంటి స్టాక్ వ్యాపారంలో చేతులు కాల్చుకొని, తీర ప్రాంతాలలో వెండి బంగారాలను పోగు చేసుకోడానికి వెళ్లి అందులోనూ విఫలుడై వర్జీనియా నగరంలోని *టెరిటోరియల్ ఎంటర్ప్రైజ్* అనే పత్రికకు తిరిగి వ్రాయటం పారంభించాడు. 1863 ఫిబ్రవరి 3న వర్జీనియా నగరంలో 'మార్క్ ట్వెయిన్' అనే ఈయన కలంపేరు ప్రారంభమైంది. అప్పటికి ఆయన వయస్సు 27. సహజంగా కోపిష్ఠి అయిన ఈ రచయిత ఒక సంపాదకునితో పోట్లాడి నెవాడాను వదలి కాలిఫోర్నియా చేరాడు. శాన్ఫ్రాన్సిస్కో నగరంలో ప్రఖ్యాత రచయితలు 'బ్రెట్ హార్ట్', 'ఛార్లస్ ఫారార్ బ్రౌన్' లతో పరిచయం కలిగింది. అక్కడి పోలీసు వ్యవస్థలోని అవినీతిని బహిర్గతం చేస్తూ వ్రాసినందుకు ఆ నగరం కూడా వదల వలసి వచ్చింది.

1866 లో 'హానలూలూ' వెళ్లాడు. అక్కడ చేసిన ఉపన్యాసాలు, అక్కడినుండి వ్రాసిన లేఖలు బహుళ ప్రాచుర్యం పొందాయి. *ఆల్టా కాలిఫోర్నియా* అనే ప్రముఖ పత్రికకు సంచార విలేఖకుడుగా యూరప్, జెరూసలెమ్ లకు వెళ్లాడు. ఈ పత్రికకు, *న్యూయార్క్ ట్రిబ్యూన్* కు ఈయన వ్రాసిన లేఖలు, వ్యాసాలు బహుళ ప్రాచుర్యాన్ని పొందాయి. వీటిని 1869 లో *ది ఇన్నొసెంట్స్ అబ్రాడ్* అనే గ్రంథరూపంలో ప్రచురించగా దానికి విశేష ప్రశస్తి లభించింది. అమెరికాకే చెందిన

ఆధికారికమైన ఒక క్రొత్త గొంతు వెలువడిందని ఆ నాటి జనాభిప్రాయం.

1870 ఫిబ్రవరి 2 న బలీవియా లాంగ్డన్ ను క్ల్యెమ్న్ వివాహం చేసుకుని, మామగారి సాయంతో *బఫెలో ఎక్స్‌ప్రెస్* అనే పత్రికలో వాటాను సంపాదించాడు. 1871 లో 'హార్ట్ ఫర్డ్'లో గృహాన్ని నిర్మించుకొని దాదాపు 20 సంవత్సరాలు అక్కడే భార్య పిల్లలతో సుఖంగా గడిపాడు. అతని ఉత్తమ రచనలు ఈ కాలంలోనే వెలువడ్డాయి. 1872 లో *రఫింగ్ ఇట్*, 1873 లో ఛార్లస్ డడ్లీ వార్నర్‌తో కలసి వ్రాసిన *ది గిల్డెడ్ ఏజ్* వెలువడ్డాయి. *ఓల్డ్ టైమ్స్ ఆన్ ది మిస్సిసిపి* అనే పేరుతో తన గత అనుభవాలను *అట్లాంటిక్ మంత్లీ* (1875) లో ధారావాహికగా ప్రచురించి, తరువాత దానినే విస్తరించి *లైఫ్ ఆన్ ది మిస్సిసిపి* అనే గ్రంథంగా ప్రచురించాడు. వాస్తవమైనవి, ఊహాజనితమైనవి అయిన అనేక చిన్న తనపు అల్లరి పనులను కలపోసి 1876 లో *అడ్వెంచర్స్ ఆఫ్ టామ్ సాయర్* గాను, బ్లాక్ ఫారెస్ట్‌లో తన యాత్రానుభవాలను క్రోడీకరించి *ఎ ట్రాంప్ అబ్రాడ్* (1880) గాను, రాజరికాన్ని, సామాజిక దురభిప్రాయాలను విమర్శించే విధంగా యువకుల అల్లరిచిల్లర పనులను వివరిస్తూ *ది ప్రిన్స్ అండ్ ది పాపర్* (1881) గాను ప్రచురించడం జరిగింది.

సామాన్య ప్రజానీకపు భాషను తన సహజ నైపుణ్యంతో సాహిత్య భాషగా మలచిన ప్రజ్ఞాశాలి ఈయన. మానవ జీవితానికి ఏదో పెద్ద ప్రయోజనముం దని ఈయన నమ్మినట్లు లేదు. జీవ పరిణామం మానవుని అవతరణతో విఫలమైందని, సృష్టిలో మానవుడే అతి నీచుడని ఆయన నమ్మినట్లు కనపడుతుంది.

చివరి రోజులలో పెద్ద మొత్తంలో ధనార్జన చేయాలని ఆశించి పెట్టిన పెట్టుబడులు నష్ట పోవటంతో ఆర్థికంగా చాలా ఇబ్బందులకు గురి అయాడు. ఆ స్థితిలో వ్రాసిన *ది అమెరికన్ క్లైమెంట్, టామ్ సాయర్ అబ్రాడ్* (1894) లు విజయవంతం కాలేదు. కాని 'హెన్రీ హటిల్‌స్టన్ రోజర్స్' తో పరిచయం ఏర్పడిన తరువాత తిరిగి ఆర్థికంగా పుంజుకొని తన ఉపన్యాసాలను, రచనలను కొనసాగించాడు. 1906 లో స్వీయచరిత్రను ఒక వ్రాయసగానికి చెప్పటం ప్రారంభించాడు. ఇది పూర్తికాకుండానే 1910 ఏప్రిల్ 21 న ఆయన అస్తమించాడు.

కె.జి.మూర్తి.

**ట్స్వీగ్, స్టీఫాన్ (1881-1942) :** ప్రముఖ జర్మన్ కవి, వ్యాసరచయిత, కథానికా రచయిత, నవలా రచయిత, నాటక రచయిత. ఊహా కల్పితమైన, లేదా చారిత్రక పాత్రల చిత్రణలో ట్స్వీగ్ అందెవేసిన చేయి.

ఆస్ట్రియా, ఫ్రాన్స్, జర్మనీలలో విద్యాభ్యాసం చేసి 1913 లో సాల్ట్‌బుర్గ్‌లో ఆయన స్థిరపడ్డాడు. 1934 లో నాజీలు ఆయనను తరిమివేయగా, ప్రవాసితుడుగా ఆయన మొదట ఇంగ్లండు, తరువాత 1940 లో బ్రెజిల్ దేశం వెళ్లాడు. తమ నూతన పరిసరాలలో ఒంటరితనాన్నీ, భ్రాంతులు తొలగి పోవడాన్నీ భరించలేక ట్స్వీగ్, ఆయన రెండవ భార్య ఆత్మహత్య చేసుకున్నారు.

మనస్తత్వ శాస్త్రంలోనూ, ఫ్రాయిడ్ బోధనలలోనూ విశేషమైన ఆసక్తి గల ట్స్వీగ్ సూక్ష్మాతి సూక్ష్మమైన పాత్ర చిత్రణలో సిద్ధహస్తు డయాడు. 1920 లో *డ్రై మైస్టర్* (Three Masters-1930) అనే వ్యాస సంపుటి ప్రచురించాడు. దానిలో బాల్జాక్, డికెన్స్, డాస్టోయెవిస్కీల ప్రతిభను ఆయన వివరించాడు. అలాగే 1925 లో ప్రచురించిన *డెర్ కాంఫ్ మిట్ డెమె డామన్* (Master Builders -1939) అనే వ్యాస సంపుటిలో ఫ్రీడ్రిఖ్ హోల్డెర్లిన్, హైన్రిఖ్ వాన్ క్లైస్ట్, ఫ్రీడ్రిఖ్ నీట్షేల మీది వ్యాసాలు ఉన్నాయి. స్టెర్న్‌స్టుండెన్ డెర్ మెన్ష్‌హైట్ (1928, The Tide of Fortune, 1940) అనే అయిదు చారిత్రక వ్యక్తుల పద చిత్రాలతో కూడిన గ్రంథంతో ట్స్వీగ్‌కు విశేష ప్రశస్తి లభించింది. ట్స్వీగ్ రచించిన *జోసెఫ్ ఫౌషే* (1929), మేరీ స్టువార్ట్ మొదలైన వారి జీవిత చరిత్రలు కూడా ప్రజాదరణ పొందాయి. ఆయన వ్రాసిన కథానికా సంపుటాలలో *ఫెర్విరుంగ్ డెర్ గెఫూలె* (1925, Conflicts-1927) చెప్పుకోదగింది. ఒక మనస్తత్వ ప్రధానమైన *ఉంగెడుల్డ్ డెస్ హెర్జెన్స్* (1938, Beware of Pity-1939) అనే నవలను కూడా ట్స్వీగ్ రచించాడు. ఛార్లెస్ బోద్‌లేర్, పాల్ వెర్లైన్, ఎమిలీ వెర్‌హెయిర్న్‌ల రచనలను ట్స్వీగ్ జర్మన్ భాషలోకి అనువదించాడు. *ది రాయల్ గేమ్ అండ్ అదర్ స్టోరీస్* (1981) అనే పేరుతో జిల్‌సట్‌క్లిఫ్ ఆయన కథలను కొన్నిటిని ఆంగ్లంలోకి అనువదించి ప్రకటించాడు. రయోడి జెనిరో సమీపంలో ఉన్న పెట్రోపొలిస్‌లో 1942 ఫిబ్రవరి 22 న ట్స్వీగ్ మరణించాడు.

బ్యా.శ్రీ.

**ట్రోలాప్, ఆంటొనీ (1815-82) :** విక్టోరియా యుగపు ప్రసిద్ధ ఆంగ్ల నవలా రచయిత. రాజకీయ,

సాంఘిక నవలలను పుంఖానుపుంఖాలుగా వ్రాసి విశేష ప్రజాదరణను పొందినవాడు. ఈ విజయం వలన ఆయన రచనల సాహితీ విలువలను విమర్శకులు చాలా కాలం తరువాత గాని అంచనా వేయ లేకపోయారు. ఆ నాటి సామాజిక వ్యవస్థను, రాజకీయ వ్యవస్థను తన నవలలలో రచయిత చక్కగా ప్రదర్శించాడు.

'బార్సెట్ షైర్' అనే ఒక ఊహాజనిత కౌంటీని ఆధారంగా చేసుకుని ఆయన వ్రాసిన 5 నవలలు అమితమైన ప్రజాదరణ పొందాయి. *ది వార్డెన్* (1855) లో ఒక ధర్మ సంస్థ నిర్వహిస్తున్న వృద్ధుల వసతి గృహపు అధికారి అక్రమంగా ధనార్జన చేసినందుకు తీవ్రమైన విమర్శల నెదుర్కొనవలసి రావడం ఇతివృత్తం. ఆ 'వార్డెన్' మానసిక పరిస్థితిని విశ్లేషించిన రీతి ఈ నవల విజయానికి కారణం. *బార్‌ఛెస్టర్ టవర్స్* (1857), *డాక్టర్ థార్న్* (1858), *ఫ్రేమ్‌లీ పార్సనేజ్* (1861), *ది స్మాల్ హౌస్ ఎట్ ఆలింగ్‌టన్* (1864), *ది లాస్ట్ క్రానికల్ ఆఫ్ బార్‌సెట్* (1867) అనేవి ఈ వరుసలో ఈయన రచించిన ఇతర నవలలు. *డాక్టర్ థార్న్* పుట్టుక మీద, భూస్వామ్య పద్ధతి మీద ఆధారపడిన ఆ నాటి సాంఘిక వ్యవస్థను చక్కగా విశ్లేషించి చూపుతుంది. ఈ *బార్సెట్ షైర్* నవలలు ఆనాటి పల్లె వాతావరణాన్ని, భూస్వాముల జీవిత పద్ధతులను కళ్లకు కట్టినట్లు చూపుతాయి.


Trollope oil painting by S. Laurence

అతి సామాన్య కుటుంబం నుంచి వచ్చిన ఈ రచయిత 1834 నుండి 41 వకు జనరల్ పోస్టాఫీస్‌లో ఒక గుమాస్తాగా దుర్భరమైన జీవితాన్ని గడిపాడు. 1841 లో పోస్టల్ సర్వేయర్‌గా ఐర్లాండుకు బదిలీ అయిన తరవాత కొంత ఉత్సాహాన్ని పుంజుకొన్నాడు. 1844 లో రోజ్ హెజెల్టిన్ ను వివాహం చేసుకుని క్లోన్‌మెల్‌లో గృహాన్ని ఏర్పరచుకుని స్థిరపడ్డాడు. ఆ తరువాత సాహితీ రంగంలో ప్రవేశించి తన సామాజిక, రాజకీయ అవగాహననూ, మానవ స్వభావాల పట్ల తనకు గల గాఢమైన విశ్లేషణా పాటవాన్నీ ప్రదర్శించి ప్రజాదరణనూ, సాహితీ వేత్తల మన్ననలనూ పొంద గలిగాడు.

1869 తరువాత ఇతని రచనలలో కొంత మార్పు కనిపించింది. *హి న్యూ హి వజ్ రైట్* (1869), *సర్ హారీ హాట్స్‌పూర్ ఆఫ్ హంబ్లెత్‌వైట్* (1871), *కెప్ట్ ఇన్ ది డార్క్* (1882), *ది యుస్టేస్ డైమండ్స్* (1873) మొదలైనవి ఈ కోవకు చెందినవి. ఈ నవలలలో మనో విశ్లేషణ చెప్పుకోదగినది. వీటిలో చివరిది అతని మరణానంతరం ప్రచురితమైన *స్కార్‌బరోస్ ఫామిలీ* (1883). దానిలో ఆనాడు అమలులో ఉన్న సామాజిక వ్యవస్థ సమూలం గా నాశనం కావాలని నమ్మే ఒక భూస్వామి తన ఆస్తి హక్కులను, చట్టపరంగా లభించిన హక్కులను పరిరక్షించు కోడానికి ప్రయత్నిస్తే ఏమి జరుగుతుందో ఈ నవల విశ్లేషించి చూపుతుంది.

చివరి దశలో ఆరోగ్యం క్షీణిస్తున్నా, ప్రజాదరణ తగ్గుతున్నా లక్ష్యపెట్టక ససెక్స్ కౌంటీ లోని ఒక ప్రశాంతమైన కుగ్రామంలో తన రచనలను సాగించాడు. 1882 లో లండన్‌లో పక్షవాతంతో మరణించాడు. సి.పి. స్నో వ్రాసిన ఈయన జీవిత చరిత్ర *ట్రోలోప్-హిజ్ లైఫ్ అండ్ ఆర్ట్* (1975) ఈ రచయిత జీవిత విశేషాలను, సాహితీ సేవలనూ తెలియజేస్తుంది.

కె.జి.మూర్తి

**డగ్లస్, గేవిన్ (1475-1522) :** స్కాటిష్ కవి. *ఈనిడ్* గ్రంథం మొత్తాన్ని ఆంగ్లీకరించిన మొట్టమొదటి బ్రిటిష్ రచయిత. బిషప్‌గాను, ఉన్నత వంశీకుడుగాను ఆ నాటి స్కాటిష్ రాజకీయాలలో ప్రముఖ పాత్ర వహించాడు.

ఆయన రచన లని చెప్పబడుతున్న *కాన్షెన్స్* (conscience), రెండు నీతి ప్రధానమైన శ్లేష కావ్యాలు - *ది పేలస్ ఆఫ్ ఆనర్, కింగ్ హార్ట్* ఆంగ్లంలో ఈనిడ్ అనే నాలుగు గ్రంథాలు ఆయన నైతిక శ్రద్ధను, క్లిష్ట చ్ఛందోరూపాలపై ఆయన కున్న అధికారాన్ని చాటి చెబుతున్నాయి. 1501 లో ప్రకటితమైన *ది పేలస్ ఆఫ్ ఆనర్* 'నిజమైన గౌరవం ఎక్కడ ఉంది' అనే విషయాన్ని చర్చించే స్వాప్నిక శ్లేష కావ్యం. రెండవ కావ్యం *కింగ్‌హార్ట్* ఈయన రచించినది కాదేమో అని కొందరు సందేహించారు. ఏమైనా అది చెప్పుకోదగిన శ్లేష కావ్యం. పుట్టుకనుండి మరణం వరకూ జీవాత్మ పయనాన్ని అది చక్కగా వర్ణిస్తుంది. ఈ కావ్యంలో యౌవనంలో విషయ వాంఛలకు బానిసగా ఉండి, అంతరాత్మ సంఘర్షణలకు గురి అవుతూ, వృద్ధాప్యాన్ని

చేరి మరణించే వరకూ ఈ జీవాత్మ పయనాన్ని కళ్లకు కట్టినట్లు కవి వర్ణించాడు.

అప్పటి రాజు నాలుగవ జేమ్స్ హత్య తరువాత ఆయన భార్య మార్గరెట్ ట్యూడర్ (అప్పటి ఇంగ్లండు రాజు ఎనిమిదవ హెన్రీ సోదరి) డగ్లస్ దగ్గరి బంధువును రెండవ వివాహం చేసుకోవడంతో ఈ కవి రాజ బంధువుగా రాజకీయాలలో చురుకుగా పాల్గొని ఇంగ్లండుకు అనుకూలమైన వర్గంతో చేతులు కలిపాడు. ఫలితంగా సాహిత్య సేవ కుంటుపడింది. 1521 లో ఈ వర్గం ప్రాబల్యం తగ్గటంతో డగ్లస్ ఇంగ్లండుకు పారిపోయి తలదాచుకో వలసి వచ్చింది. ప్లేగు వ్యాధితో అక్కడే ఇతడు మరణించాడు.

ఈయన రచనలలో మధ్య యుగం నాటి పోకడలు బాగా కనిపిస్తాయి. ఈనిడ్ అనువాదంలో తన పాండిత్య ప్రకర్షను, భాషా భేదాలలో ఉండే సున్నితత్వాన్ని ప్రదర్శించినా మూలగ్రంథాన్ని సమకాలీనం అనిపించేటట్లు చేయటానికి ఎన్నుకోవలసిన పదజాలంలో గాని, ధ్వని ప్రకటనలో గాని, ఎక్కువ శ్రద్ధ తీసుకొన్నట్లు కనపడదు. ఆయన వ్రాసిన ప్రతి గ్రంథానికీ ఆయనే వ్రాసిన పీఠికలు (prologues) ఆయన రచనా పాటవానికి కలికి తురాయి వంటివి.

కె.బి.మూర్తి

**డన్, జాన్ (1572-1631)** : 'మెటా ఫిజికల్' పద్ధతికి చెందిన ప్రసిద్ధ ఆంగ్లకవి. అనేక లౌకిక కవనాలతో పాటు, మతపరమైన కవిత్వాన్ని, సిద్ధాంత భాష్యాలను కూడ రచించి ఆంగ్ల సాహిత్యంలో ఒక విశిష్ట స్థానాన్ని పొందినవాడు. ఈ కవి తల్లి తండ్రులు కేథలిక్కులు. ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయాలలో అధ్యయనం చేసినా, మతపరమైన ప్రమాణాన్ని అంగీకరించలేక ఏ డిగ్రీని తీసుకోలేదు. తరువాత ప్రభుత్వోద్యోగాన్ని పొందాలనే తపనతో న్యాయశాస్త్రాన్ని అభ్యసించి తద్వారా సమాజంలోని కొందరు పెద్దల ప్రాపకాన్ని సంపాదించాడు. ఆ విధంగా ఆ నాటి రాజముద్రను కాపాడే ఆర్థికమంత్రి 'సర్ థామస్ ఎగర్టన్' దృష్టిలో పడి, ఆయన కార్యదర్శి పదవిని చేబట్టి, ఆయన ద్వారానే పార్లమెంటు సభ్యుడు కూడా కాగలిగాడు. 1601 ప్రాంతంలో ఈయనకు కేథలిక్ మతంపై విశ్వాసం సన్నగిల్లడం ప్రారంభమైంది.



1592 ప్రాంతంలో ప్రాచీన లాటిన్ కవుల సరళిలో కొన్ని పద్య లేఖలను, 1593-98 మధ్యకాలంలో ఐదు వ్యంగ్య కావ్యాలను, 1601 లో *మెటెమ్ సైకొసిస్* అనే వ్యంగ్య మహాకావ్యం లో ఒక అధ్యాయాన్ని ఈయన రచించాడు. ఇవి కాక *ఓవిడ్* ఆధారంగా కొన్ని 'ప్రేమ-స్మృతి' కావ్యాలను (love-elegies), మార్షల్‌ను కొంతవరకు అనుకరించినట్లు చెప్పదగిన కొసమెరుపుతో ఉండే చిన్న పద్యాలనూ (epigrams) ఈయన వ్రాశాడు. అనుకరణలో కూడా విలక్షణమైన పాండిత్యాన్ని, శైలిని, భావాన్ని జోడించి ఆ యా రచనలపై తన ప్రత్యేక ముద్రను వేసిన మహారచయిత ఈయన.

మత పరంగా రోమన్ చర్చికి ఇంగ్లీష్ చర్చికి విభేదాలు పొడచూపి నప్పుడు ఆ సమస్యను విశ్లేషించి అనేక వ్యాసాలు వ్రాసి గద్యంపై తన అధికారాన్ని ప్రదర్శించాడు. ఉన్నత వర్గానికి చెందిన సర్ జార్జ్‌మోర్ పుత్రికను ఆయన ఇష్టానికి వ్యతిరేకంగా వివాహమాడి ఆర్థికంగా, రాజకీయంగా కష్టాల పాలయాడు.

1610 లో *సూడోమార్టిర్* అనే గ్రంథాన్ని మత పరంగా అప్పటి రాజైన మొదటి జేమ్స్ భావాలను బలపరుస్తూ వ్రాసి, ఆక్స్‌ఫర్డ్ విశ్వ విద్యాలయం నుండి 'మాస్టర్ ఆఫ్ ఆర్ట్స్' పట్టాను పొందాడు. 'జెసూట్స్' ను విమర్శిస్తూ 1611 లో *ఇగ్నాషియస్ హిజ్ కాంక్లేవ్* అనే గ్రంథాన్ని లాటిన్‌లోను, ఆంగ్లంలోను ప్రచురించాడు. మత విషయంలో రోమ్ అధికారాన్ని అన్ని దేశాలు అంగీకరించవలసిన అవసరం, లేదని ప్రతి దేశం తన కనుకూలమైన వ్యవస్థను తాను ఏర్పరచుకోవాలని ఈయన ప్రచారం చేశాడు. ఫలితంగా మొదటి జేమ్స్ మతపరమైన ఉద్యోగాలనే ఇతనికి ఇచ్చి చివరకు 1621 లో 'సెయింట్ పాల్స్ కెథెడ్రల్' కు ప్రధానాధికారిగా నియమించాడు. మతాధికారిగా ఆయన చేసిన బోధనాత్మక ప్రసంగాలు ఆ శతాబ్దం అంతటికీ గొప్పవిగా ఇప్పటికీ చెప్పుకొంటారు. వాటిలో కొన్ని *డివోషన్స్ అపాన్ ఎమర్జెంట్ అకేషన్స్, డెత్స్ డ్యూయెల్* గాను ప్రకటిత మయాయి. ఆయన రచనలు 19 వ శతాబ్ది లోను, ఇంకా ఎక్కువగా 20 వ శతాబ్దిలోను బహుళ ప్రాచుర్యాన్ని పొంది ఆయనకు మంచి గుర్తింపును

తెచ్చాయి. మేధాసంపన్న మైన వాదానికి భావావేశాన్ని జోడించటంలోను, సంక్లిష్ట మానసిక స్థితులనూ, వాటి వైవిధ్యాన్నీ నాటకీయంగా చిత్రీకరించటంలోను, ఆంగ్ల నుడికారాన్ని గజిబిజి చేయకుండా సామాన్య పదజాలాన్ని అనంతమైన భావాలను ప్రకటించే విధంగా వాడుకో వడంలోను ఆయనకు ఆయనే సాటి! ఆధ్యాత్మికంగా ఆత్మగతిని, దాని శృంఖలాబద్ధ స్థితిని, స్వేచ్ఛా ప్రియ త్వాన్ని, పరమాత్మతో దానికున్న సంబంధాన్ని సూచనా ప్రాయంగా తన కవితలలో చెప్పే 'మెటాఫిజికల్' కవులలో అగ్రగణ్యుడైన ఈయన విభిన్నం, విప్లవాత్మకం అయిన 'ఇమేజస్' ను ధైర్యంగా వాడి భావ ప్రకటనను సుగమం చేశాడు.

కె.జి.మూర్తి

**డన్ బార్, విలియమ్ (1465-1530) :** స్కాటిష్ కవిత్వ చరిత్రలో స్వర్ణయుగ మని చెప్పదగిన 4 వ జేమ్స్ పరిపాలనా కాలంలోని ప్రముఖ కవి. ఆంగ్ల కవి 'ఛాసర్' పెట్టిన వరవడిలో కవిత్వాన్ని వ్రాసి మన్ననలను పొందిన వాడు. 1479 లో ఎం.ఏ. పట్టాను తీసుకు న్నట్లు కనపడుతుంది. ఫ్రాన్సిస్కన్ దీక్షను స్వీకరించి ప్రభు సేవలో విస్తృతంగా పర్యటించాడు. నాలుగవ జేమ్స్ వివాహం తరువాత 1511 లో రాణి మార్గరెట్ తో ఆబర్డీన్ వెళ్ళి అక్కడి విందు వినోదాలను వర్ణిస్తూ *బ్లెత్ ఆబర్డీన్* అనే కావ్యాన్ని వ్రాశాడు.

వందకి పైగా ఉన్న ఈయన కవితలు క్లుప్తంగా ఉండి ఆ యా సమయాలలోని ఒక వ్యక్తిగత మాన సిక స్థితినో, రాజాస్థానంలోని ఒక సంఘటననో తెలియ జేస్తాయి. క్షుద్ర వ్యంగ్యం నుంచి, ఉన్నత భక్తి భావం వెల్లివిరిసే శ్లోకాల వరకూ అన్ని రకాల రచనలూ వీటిలో కనిపిస్తాయి. సుదీర్ఘ కావ్యాలలో ఛాసర్ మూసలో నడిచిన *ది గోల్డెన్ టార్జ్* కలలు ఆధారంగా ఉన్న ఒక విశ్లేషణ కావ్యము. దీనిలో శ్లేష అతి లలితంగా ఉండి దృశ్యచిత్రణ అద్భుతంగా కనిపిస్తుంది. 4 వ జేమ్స్ వివాహపు వేడుకలను చిత్రీకరిస్తూ వ్రాసిన *ది థిసిల్ అండ్ ది రాయిస్* అనే కావ్యం కూడా పండిత పామరుల మన్ననల నందుకొంది.

శబ్దాలంకార ప్రధానంగా సాగే *ఫ్లయ్‌టింగ్ ఆఫ్ డన్ బార్ అండ్ కెన్నెడి* అనే కావ్యంలో వృత్తిపరంగా తన ప్రత్యర్థి అయిన వాల్టర్ కెన్నెడీపై వ్యక్తిపరమైన దూషణ బాణాలను మిక్కిలి లాఘవంతో కురిపించాడు. అయితే కీర్తి శేషులైన కొందరు కవులను గూర్చి వ్రాస్తూ *ది లామెంట్ ఫర్ ది మకారిస్* అనే రచనలో అదే కెన్నెడీ పట్ల అనురాగాన్నీ, అభిమానాన్నీ ప్రకటించాడు. *ట్రేయ మైజ్ ఆఫ్ టూ మారీడ్ విమెన్ అండ్ ది విడో* అనేది శబ్దాలంకార భూయిష్ఠమైన మరొక వ్యంగ్యకావ్యం. దానిలోని వ్యంగ్యం జుగుప్స కలిగించేదే అయినా బహుళ ప్రాచుర్యం పొంది, అందరి మన్ననలనూ అందుకుంది.

డన్ బార్ ప్రతిభా పాండిత్యాలు అనన్య సామాన్యమై నవి. భగవంతుడి లీలలను పొగిడే శ్లోకాల నుండి నీచ వ్యంగ్యం వరకూ ఏది వ్రాసినా అనర్గళమైన వాగ్ధారను ప్రదర్శించిన మహాకవి డన్ బార్. ఈయన రచనలలో శ్లాఘించినా, దూషించినా, అది స్మృతి కావ్యమైనా, తిట్టు కవిత్వమైనా పదజాలాన్ని వాడుకోవడంలో ఎన్న దగిన నైపుణి కనిపిస్తుంది. ప్రాత కవితా వస్తువులను, రూపాలను తన లక్ష్యానికి అనుగుణంగా అవి తనవే అని స్ఫురించే రీతిలో మలచుకుని తన ప్రతిభా పాటవాలను ప్రదర్శించిన రచయిత డన్ బార్. కవితా వస్తు వైవిధ్యంలోను, కవితా శిల్పంలోను ఆయన ప్రదర్శించిన ప్రతిభ స్కాటిష్ కవులలో అపూర్వమని చెప్పదగినది. సాంప్రదాయికమైన ఒరవడికే జీవకళ ఉట్టి పడే నూతనత్వాన్ని అపాదించ గలిగిన మహామేధావి డన్ బార్.

కె.జి. మూర్తి

**డరెల్, లారెన్స్ (జార్జ్) (1912-1990) :** రెండవ ప్రపంచ యుద్ధానంతరం వచ్చిన ఆంగ్ల నవలా రచయితలలో ప్రసిద్ధుడు. నవలా రచనలో సొంతమయిన స్వతంత్రపోకడలను విస్తృతంగా అనుసరించినవాడు. నవ లలే కాక, ప్రాంతీయ ప్రత్యేకతలను తెలిపే గ్రంథాలూ, పద్య నాటకాలూ, అనేక చిన్నకథలూ కూడా ఈయన వ్రాశాడు.

ఆంగ్లేయుడే అయినా ఎక్కువ కాలం ఇంగ్లండు బయటే గడపటం వల్లనేమో ఆంగ్ల సంప్రదాయాలపట్ల, స్వభావాల పట్ల ఈయనకు ఎక్కువ గౌరవ మున్నట్లు కనపడదు. అందుకే ఈయన నవలలు ప్రపంచ మంతటా మన్నన లందుకున్నా, ఇంగ్లండులో మాత్రం అంతగా ఆదరణకు నోచుకోలేదు.

నాలుగు భాగాలుగా వ్రాసిన *ది అలెగ్జాండ్రా క్వార్టెట్ - జస్టిన్* (1957), *బాల్తజార్* (1958), *మౌంట్ ఆలివ్* (1958), *క్లియా* (1960) - ఈయనకు సువిఖ్యాతిని తెచ్చిపెట్టిన నవల. మొదటి మూడూ రెండవ ప్రపంచ యుద్ధానికి పూర్వం అలెగ్జాండ్రియాలో జరిగిన సంఘటన లను తెలియజేసేవి. నాలుగవది యుద్ధకాలంలోకి కూడా సాగుతుంది. పూర్తిగా ఆత్మానుగతమైన (subjective)

కథాకథన శిల్పం ద్వారా ఈ నవల 'సత్యపు సాపేక్షత' ను చర్చిస్తుంది. అయితే ఈ నవల అంతర్లీనంగా జీవిత గమనంలో తుది లక్ష్యమైన పరమార్థాన్ని చేరుకోడానికి లైంగికానుభవం, కళ, ప్రేమ వివిధ సోపానాలనే ప్రధాన విషయాన్ని తెలియచెబుతుంది.

అనంతర రచన లయిన *ట్యూన్* (1968), *నన్ క్వామ్* (1970) లు తొలి రచన లంత ప్రాచుర్యాన్ని పొందలేదు. ఇంకా *మాన్స్యూర్* (Monsieur) లేక *ది ప్రిన్స్ ఆఫ్ డార్క్‌నెస్* (1975), *లివియా* లేక *బరీడ్ అలైవ్* (1978), *కాన్‌స్టెన్స్* లేక *సాలిటరీ ప్రాక్టీసెస్* (1982) అనేవి ఈయన ఇతర నవలలు. ఇవి కొంత వరకు *అలెగ్జాండ్రియా క్వార్టెట్* నే పోలి ఉంటాయి.

*ఎ ప్రైవేట్ కంట్రీ* (1943), *సిటీస్, ప్లెయిన్స్ అండ్ పీపుల్* (1946), *ది ట్రీ ఆఫ్ ఐడిల్‌నెస్* (1953), *ది ఐకాన్స్* (1966) అనే కావ్యాల ద్వారా ఈయన కవిగా కూడా గుర్తింపు పొందాడు. *ప్రాస్పెరోస్ సెల్* (1945), *రిఫ్లెక్షన్స్ ఆన్ ఎమెరీన్ వీనస్* (1953), *బిట్టర్ లెమన్* (1957) అనే యాత్రా గ్రంథాలలో కార్ఫూ రోడ్స్, సైప్రస్ ద్వీపాలను డరెల్ రమణీయంగా చిత్రించాడు.

ఇంగ్లండులో నవలా రచయితగా కంటె, కవిగానే ఈయన ఎక్కువ ఖ్యాతిని సంపాదించుకున్నాడు.

కె.జి.మూర్తి

**డానంజియో గ్రబియేల్ (1863-1938) :** ఇటాలియన్ కవి, నవలా రచయిత, నాటకకర్త, కథకుడు, పత్రికా రచయిత, సైనిక వీరుడు, రాజకీయనాయకుడు. 20 వ శతాబ్ది తొలి దశకాలలోను, నిరంకుశ నియంతృత్వ (Fascost) కాలంలోను పుంఖానుపుంఖాలుగా రచనలు చేసిన అతి వివాదాస్పద రచయిత.

ప్రముఖ భూస్వామ్య కుటుంబంలో నుంచి వచ్చిన వాడు. రోమ్ విశ్వ విద్యాలయంలో అధ్యయనం చేశాడు. 16 సంవత్సరాల వయస్సప్పుడే *ప్రైమోవర్* (1879) అనే పేరుతో తన కవితలను ప్రచురించాడు. 1882 లో వ్రాసిన *కాంటో నోవో* అమితమైన ఉత్సాహాన్నీ, ఉద్వేగాన్నీ కలిగిస్తూ, ఇంద్రియ ప్రీతిని కలిగించేదిగా ఉంటుంది. స్వీయ చరిత్ర ఆధారంగా అల్లిన *ఇల్ పియాసిరె* (1898) అనే నవలలోని నాయకుడు ఆయన సృష్టించిన అనేక *నీట్షేయన్ సూపర్‌మాన్* (Nietzchean-superman) నాయకులలో మొదటివాడు. *ఎల్ ఇన్నొసెంట్* (1892) లో కూడా ఇటువంటి నాయకుడే కనిపిస్తాడు. *ఇల్ ట్రియాన్ఫో డెల్లా మోర్ట్* (1894 మృత్యువిజయము) అనేది ఆయన ప్రసిద్ధ నవల. *లెవర్జిని డెల్ రోసి* (1896) లో నైతికంగా దిగజారిపోయి స్వీయ శ్రేయస్సును నిస్సంకోచంగా ప్రకటించి స్వార్థ ప్రయోజనాలను సాధించుకునే నీట్షేన్ నాయకుడు దర్శన మిస్తాడు.

*లాడి డెల్ సీలో డెల్ మేరె డెల్లా టెర్రా ఇడెజ్లి ఇరోయ్* (1899) అనే కావ్యం ఈయనకు కవిగా స్థిర యశస్సు చేకూర్చింది. 1904 లో ప్రకటితమైన *ఆల్క్యోన్* టస్కన్ వేసవి ఇచ్చే శబ్దాలను, రుచులను, సువాసనలను, అనుభవాలను బహురమణీయంగా వెదజల్లుతుంది. ఇది ఆయన ఉత్తమ కావ్యమని విమర్శకుల అభిప్రాయం.

1894 లో డానంజియో ఆ నాటి ప్రముఖ రంగస్థల తార 'ఎలియనారా డూస్' తో సంబంధ మేర్పరచుకొని, ఆమెకోసం నాటకాలు వ్రాయటం ప్రారంభించాడు. *లాగైకొండా* (1899) *ఫ్రాన్సెస్కా డా రైమిని* (1901) అనేవి ఈయన ఇతర నాటకాలు. ఎలియనారా డూస్‌తో తన అనుభవాలను పొందుపరుస్తూ *ఇల్ ఫ్యోకో* (1900-జీవన కీల) అనే శృంగార ప్రధానమైన నవలను వ్రాశాడు.

మొదటి ప్రపంచ యుద్ధంలోకి తన దేశాన్ని దింపటానికి తీవ్రంగా కృషిచేసి, అది జరిగిన తర్వాత సైన్యంలో చేరి తన దేశం తరఫున ఆ యుద్ధంలో వీరోచితంగా పాల్గొని ఒక కంటిని కోల్పోయిన మహావీరుడు డానంజియో. 1919 లో కొంతమందితో కలిసి 'ఫ్యూమ్' రేవు పట్టణం వర్సెయిల్స్ సంధి ప్రకారం ఇటలీకే చెందవలసి ఉన్నదని వాదించి, దానిని ఆక్రమించుకొని, 1921 వరకూ దానిని నియంతగా ఈయన పాలించాడు. ఫాసిస్ట్‌గా అప్పటి ఇటలీ నియంత ముస్సోలినీ ప్రశంస లందుకొన్నాడు.

కె.జి.మూర్తి

**డారియో, రూబేన్ (1867-1916) :** నికరాగ్వాకి చెందిన ప్రసిద్ధకవి, పత్రికా రచయిత, రాజనీతిజ్ఞుడు. ఇది ఈతని కలం పేరు. అసలు పేరు: 'ఫెలిక్స్ రూబెన్ గార్సియా శార్మియంటో'. 19 వ శతాబ్ది చివరలో శ్పానిష్-అమెరికన్ సాహిత్యంలో ఉద్భవించిన 'ఆధునికతా' ఉద్యమానికి తలమానికం వంటివాడు. లయ, ఛందస్సు, దృశ్య చిత్రణలలో వినూత్న ప్రయోగాలు చేసి శ్పానిష్ కవిత్వానికి నూతన జీవం పోసి, ఆధునిక రూపాన్ని సంతరించాడు. ఫలితంగా యూరప్, అమెరికా ఖండాలలో శ్పానిష్ కవిత్వానికి బహుళ ప్రాచుర్యం లభించింది. 14 సంవత్సరాల వయస్సులోనే అద్భుత మేధను ప్రదర్శించి ప్రేమ, వీరత్వం, సాహసం ఊపిరిగా గీతాలనూ, గేయాలనూ రచించి జనాన్ని మెప్పించాడు.

1886 లో నికరాగ్వే వదలి దేశాలు తిరగటానికి బయలు దేరాడు. చిలీ దేశంలో కొంత కాలం ఉండి *అజుల్* అనే గద్య, పద్య సంకలనాన్ని 1888 లో ప్రచురించాడు. శ్పానిష్- అమెరికన్ సాహిత్యంలో ఒక నూతన అధ్యాయానికి ఇది నాంది పలుకుతున్నదని యూరప్, అమెరికాలలోని పండితులూ, విమర్శకులూ భావించారు. 'కళ కళ కోసమే' అని ఈ కవి గాఢంగా విశ్వసించిన రోజులలో ఈ రచనను చేశాడు. ఫ్రెంచ్ 'పర్నాసియన్' కవిత్వ రీతుల ప్రభావం ఈ సంకలనం మీద కనిపిస్తుంది. అందరినీ ఆకర్షించే వినూత్నత్వం, పూర్తిగా 'వస్తుగతం కాని' పదప్రయోగం ఈయన రచనలోని ప్రత్యేకత. 1893 లో బ్యూనోస్ ఎయిర్స్‌లో కొలంబియన్ రాయ బారిగా ఉంటూ అచటి యువ రచయితలకు నాయకు డయాడు. 1896 లో ప్రకటించిన *ప్రొజాస్ ప్రొఫేనాస్ యి ఆట్రోస్ పొయమాస్* (profane hyns and other poems) అనే కవితా సంకలనంలో *అజుల్* లో కనిపించే శైలికి సంబంధించిన వినూత్న ప్రయోగాలు కొనసాగాయి. అయితే ఈ రచనల మీద సమకాలీన ఫ్రెంచ్ సింబాలిస్టుల ప్రభావం కనిపిస్తుంది. ఆయన ప్రచారం చేసిన ఆధునికతా ఉద్యమంలోని పలాయన వాద సిద్ధాంతానికి పరాకాష్ఠ ఈ సంకలనం.

1898 లో *లా నేషన్* అనే పత్రికకు విలేఖకుడుగా డారియో యూరప్ వెళ్ళాడు. 1898 లో స్పెయిన్ ఓటమి తరువాత దక్షిణ అమెరికాలో ఏర్పడిన అస్థిరత, భయం, శ్పానిష్ భాష భవిష్యత్తు ఆయనను కలవర పరిచాయి. మానవ అస్తిత్వానికి ఆయన అర్థం వెదకటం ప్రారంభించాడు. ఆ తపనలో నుంచి ఉద్భవించిందే ఆయన ఉత్తమ గ్రంథం *డి విడాయ్ ఎస్పరంజా* (Songs of Life and Hope). ఇది 1905 లో ప్రచురిత మయింది. మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభం కావటంతో ఆయన యూరప్ వదలి అమెరికా వెళ్ళి, న్యూమోనియాతో బాధ పడుతూ స్వదేశం చేరి, 1916 లో అక్కడే మరణించాడు. ఈయన రచనలను *ఆబ్రాస్ కంప్లీటాస్* అనే రెండు సంపుటాల గ్రంథంగా ఈయన మరణానంతరం (1971) ప్రచురించటం జరిగింది. మెక్సికో, స్పెయిన్, చిలీలలోని ప్రముఖ కవులు ఈ గ్రంథానికి పీఠికలు వ్రాశారు.



కె.జి.మూర్తి

**డికిన్సన్, ఎమిలీ (1830-86) :** అమెరికన్ భావ కవయిత్రి. ఈమెను 'న్యూ ఇంగ్లండ్ మిస్టిక్' గా పేర్కొంటారు. ఈమె తన కవితలలో లయ, ప్రాసలతో వినూత్న ప్రయోగాలు చేసింది. తల్లి దండ్రుల ప్రేమాభిమానాలకు ఎక్కువగా నోచుకోని ఈమె అమ్‌హర్స్ట్ అకాడమీలోను, 'మౌంట్ హోల్యోక్ ఫీమెల్ సెమినరీ' లోను విద్య నభ్యసించింది. మత విషయంలో ఈమె 'స్కెప్టిక్' (భగవంతుడున్నాడని నమ్మటం విషయంలో అనేక శంకలను వెలిబుచ్చే వానిని స్కెప్టిక్ అంటారు) అయినప్పటికీ ఈమె రచనలలో చాలా వాటిలో భగవంతుని గురించిన విషయాలే దర్శన మిస్తాయి. అనేక శంక లున్నప్పటికీ తీవ్రమైన మతపరమైన స్పందనలు ఆమెలో ఉండటం చేతనే ఒక విధమైన అంతస్సంఘర్షణ ఏర్పడి, ఆమె రచనలకు ఒక విశిష్టమైన నిశితత్వాన్ని చేకూర్చాయని చెప్పవచ్చు.

ఈమె 1850 ప్రాంతంలో రచన ప్రారంభించింది. రాల్ఫ్ వాల్డో ఎమర్సన్, ఎమిలీ బ్రాంటీల ప్రభావం ఈమె తొలి రచనలపై బాగా కనపడుతుంది. 1850-60 దశకంలో ఈమె వ్రాసిన లేఖలు ఈమెలోని హాస్య ప్రియత్వాన్నీ, చురుకు దనాన్నీ, మొహమాటాన్నీ తెలియజేస్తాయి. 1855 లో అమెరికన్ కాంగ్రెస్ సభ్యుడుగా ఉన్న తండ్రిని చూడటానికి వాషింగ్టన్ వెళ్తూ దోవలో ఫిలడెల్ఫియాలో ఆగినప్పుడు ప్రఖ్యాత మత బోధకుడు రెవరెండ్ ఛార్లస్ వాడ్స్‌వర్త్ బోధనలను ఆమె వినటం జరిగింది. ఎమిలీ ఆయనతో స్నేహాన్ని ఏర్పరుచుకొని, ఆధ్యాత్మిక విషయాలపై లేఖలద్వారా కొంత కాలంపాటు ఆయనతో చర్చలు సాగించింది. ఎమర్సన్, మరికొందరు భావాతీత వాదులు (Transcendalists) విశ్వసించిన 'ఈ విశ్వం దయామయమైనది' అనే వాదానికీ, వాడ్స్‌వర్త్ నమ్మే కాల్వినిస్ట్ ఛాందస భావాలకూ మధ్యలో ఎక్కడో అసలు వాస్తవం దాగి ఉన్నదని ఆమె భావించేది.

పత్రికా సంపాదకులైన జోసయ జి. హాలండ్ దంపతులతోను, శామ్యూల్ బౌల్స్ తోను 1850-60 దశకంలోనే ఉత్తర ప్రత్యుత్తరాలు సాగించటం ఆమె ప్రారంభించింది.

ఒక కవితలో ఆత్మను శరీరం నుంచి వేరు చేసి చూడగలిగితే ఆ ఆత్మ ఎంత సంతోషాన్నీ, ఉద్వేగాన్నీ కలిగించగలదో వర్ణిస్తుంది. అనేక ఇతర కవితలలో కూడా ప్రేమ తీవ్రస్థాయిలో విశ్వప్రేమగా రూపం దాల్చి చివరకు భగవంతుని పట్ల ప్రేమలో విలీనం కావడం అనే విషయాన్ని రమణీయంగా చిత్రిస్తుంది ఈ కవయిత్రి. తన భావాలకూ, అనుమానాలకూ, ప్రశ్నలకూ అనుగుణంగా లయ, ప్రాస, ఛందోరీతిని మారుస్తూ వీటిలో నూతన ప్రయోగాలను చేస్తుంది. దాదాపు 800 కవితలు వ్రాసినా వాటిలో బహుకొద్ది మాత్రమే ఈమె జీవితకాలంలో ప్రచురిత మయాయి. *స్ప్రింగ్ ఫీల్డ్ రిపబ్లికన్* అనే పత్రికలో ఐదు కవితలు ప్రచురిత మయాయి. కవి, ప్రజాదరణ సంపాదించుకొన్న నవలా రచయిత అయిన 'జాక్సన్' ఆమె కవిత్వంలోని గొప్పతనాన్ని గుర్తించి, ప్రచురించమని ఒత్తిడి తెచ్చినా, ఆమె అందుకు అంగీకరించలేదు.

ఆమె మరణానంతరం ఆమె సోదరి 'లవినియా' పట్టుదలతో ఆమె రచన లన్నిటిని సంపాదించి ప్రచురించింది. 1890 లో టి.డబ్ల్యూ హిగ్గిన్‌సన్, మేబెల్, లూమిస్ టాడ్‌ల సంపాదకత్వంలో *పోయమ్స్ బై ఎమిలీ డికిన్సన్* అనే సంకలనం ప్రచురితం అయింది. 1957 వరకూ ఆమె ఇతర కవితలు వేరు వేరు గ్రంథాలుగా వెలువడుతూనే వచ్చాయి. ఆ విధంగా మొత్తం 1775 కవితలూ, లేఖలూ ప్రచురితం అయాయి. ఇవి చదివిన వారికి ఆమె కవితలూ, లేఖలూ మాత్రమే కాక ఆమె జీవితం కూడా కళాత్మకమే అనిపించక మానదు.

కె.జి.మూర్తి

**డికెన్స్, చార్లెస్ (1812-70) :** ప్రముఖ ఆంగ్ల నవలా రచయిత; విక్టోరియన్ యుగ నవలా రచయితలలో అగ్రేసరుడుగా భావించ బడుతున్నవాడు. *ది ఓల్డ్ క్యూరియాసిటీ షాప్* (1841), *ఏ క్రిస్మస్ కెరోల్* (1843), *మార్టిన్ చజ్ లెవిట్* (1844), *ఏ టేల్ ఆఫ్ టూ సిటీస్* (1859), *గ్రేట్ ఎక్స్‌పెక్టేషన్స్* (1861) మొదలైన జగత్ప్రసిద్ధమైన నవలల రచయిత.

డికెన్స్ బాల్యంలో అభద్రతా భావంతో జీవితం గడిపాడు. ఒక దారుణమైన ఫ్యాక్టరీలో కార్మికుడుగా అతడు పనిచేశాడు. ఆ రోజులు ఆయన జీవిత దృక్పథం మీదా, ఆయన రచనల మీదా ఒక శాశ్వతమైన ముద్ర వేశాయి. కొన్నాళ్లు ప్లీడరు గుమాస్తాగా పనిచేసి, తరువాత వరుసగా న్యాయస్థానాలలోను, పార్లమెంట్‌లోను, లండన్ వార్తా పత్రికలోను డికెన్స్ రిపోర్టర్‌గా పనిచేశాడు. 1833 లో కొన్ని చిన్నకథలు, వ్యాసాలు పత్రికలలో ప్రచురించడంతో రచయితగా డికెన్స్ జీవితం ప్రారంభమైంది. 1837 లో వెలువడిన ఆయన హాస్యరస ప్రధానమైన నవల *ది పిక్విక్ పేపర్స్* ఆ కాలంలో డికెన్స్ ను ఇంగ్లండ్‌లోని అత్యధిక ప్రజాదరణ గల రచయితగా చేసింది. మొదట అది ఒక పత్రికలో 20 భాగాలుగా ప్రకటించ బడింది. *ఆలివర్ ట్విస్ట్* (1837-39 మధ్య సీరియల్‌గా వెలువడింది), *నికొలాస్ నికెల్ బీ* (1838-39 లో సీరియల్‌గా వెలువడింది), 1840 -50 మధ్య వెలువడిన నవలలు, *డేవిడ్ కాపర్ ఫీల్డ్* (1850) ఆశాభావంతో కూడిన డికెన్స్ దృక్పథాన్ని ఎక్కువగా ప్రకటించాయి. *డేవిడ్ కాపర్ ఫీల్డ్* కొంత వరకు ఆత్మకథాత్మకమైన నవల. తరువాత *బ్లీక్ హౌస్* (1852-53) దగ్గర నుంచి *మ్యూచువల్ ఫ్రెండ్* (1864-65) వరకూ వచ్చిన నవల లన్నింటిలోనూ విక్టోరియన్ యుగం నాటి పారిశ్రామిక సమాజపు అమానుష దృష్టి ప్రబలంగా కనిపిస్తుంది. ఆ కాలంలోనే ఆయన భార్యను విడిచిపెట్టి, వయస్సులో ఉన్న ఒక నటితో శృంగార కలాపం కొనసాగించాడు. 1858 లో సభలలో ఆయన రచనా పఠనం విశేష ప్రజాదరణ పొందింది.

ఇంగ్లండ్‌లోని కెంట్ రాష్ట్రంలో బెతామ్ సమీపంలో ఉన్న 'గాడ్స్‌హిల్' లో 1870 జూన్ 9 న చార్లెస్ డికెన్స్ దేహయాత్ర చాలించాడు.

బొ. శ్రీ.

**డి క్విన్సీ, టామస్ (1785-1859) :** సుప్రసిద్ధ ఆంగ్ల వ్యాసరచయిత, సాహిత్య విమర్శకుడు. *కన్ఫెషన్స్ ఆఫ్ ఆన్ ఇంగ్లీష్ ఓపియమ్ ఈటర్* గ్రంథ రచయిత.

లాంక్‌షైర్‌లోని మాంచెష్టర్‌లో 1785 ఆగస్ట్ 15 న టామస్ డి క్విన్సీ జన్మించాడు. బాల్యంలో కుటుంబానికి దూరమై దుస్సహవాసాలు చేశాడు. 15 వ ఏట వేల్స్‌కు పారిపోయాడు. 1802-03 లో లండన్‌లో కొంతకాలం అజ్ఞాత వాసం చేశాడు. 1803 లో తిరిగి కుటుంబాన్ని కలుసుకొని ఆక్స్‌ఫర్డ్‌లోని ఓర్‌సెస్టర్ కాలేజ్‌లో చేరాడు. అక్కడే 'మానవ జాతికి జ్ఞాన ప్రదాత' ను కావాలన్న నిశ్చయానికి వచ్చాడు.

డి క్విన్సీ అనేక విషయాలమీద అనేక గ్రంథాలు విస్తృతంగా చదివినవాడు. చరిత్ర, జీవితచరిత్ర, అర్థశాస్త్రం, మనశ్శాస్త్రం, జర్మన్ తత్త్వశాస్త్రం వంటి వివిధ విషయాల మీద ఆయన వ్యాసాలు వ్రాశాడు. 1804 లో కాలేజ్‌లో ఉండగానే ముఖంలో నరాల నొప్పి (Facial neuralgia) ని భరించలేక ఆయన నల్లమందు అలవాటు

చేసుకొన్నాడు. జీవితాంతం ఆ అలవాటు ఆయనను వదలలేదు. స్వానుభవంతో ఆయన వ్రాసిన *కన్ఫెషన్స్ ఆఫ్ ఆన్ ఇంగ్లీష్ ఓపీయమ్ ఈటర్* అనే గ్రంథం విశేష ప్రజాదరణ పొందింది.

సాహిత్య విమర్శకుడుగా వర్డ్స్‌వర్త్, కాలరిడ్జ్‌లు రచించిన *వీరగాథా గేయాల* (Lyrical ballads) ప్రాధాన్యాన్ని మొట్టమొదట గుర్తించినవాడు టామస్ డి క్విన్సీ. 1807 లో ఆ ఇరువురు కవులకూ డి క్విన్సీ సన్నిహిత మిత్రుడు అయాడు.

1817 లో డి క్విన్సీ అంతకుముందే ఒక కుమారుడు కలిగిన అందమైన 'మార్గరెట్ సింప్సన్' ను వివాహం ఆడాడు. డి క్విన్సీ విస్తృతంగా రచనలు చేసినా చాలా కొద్ది భాగం మాత్రమే ప్రకటించబడ్డాయి.

ఆయన ఆత్మ కథాత్మక రచనలలో ఒకటి *లేక్ రెమినిసెన్సెస్.* లేక్ కవులలో ఒకడైన వర్డ్స్‌వర్త్‌కి ఆ రచన చాలా కష్టం కలిగించింది. సాహిత్య విమర్శకుడుగా డి క్విన్సీ చేసిన రచనలలో ముఖ్యంగా చెప్పుకోవలసింది: *ఆన్ ది నాకింగ్ ఎట్ ది గేట్ ఇన్ మాక్‌బెత్* (మొదట 1823 అక్టోబర్ లో *లండన్ మేగజైన్* లో ప్రకటిచబడింది). షేక్స్‌పియర్ మీద వచ్చిన విమర్శక రచనలలో మిక్కిలి ప్రముఖమైన వ్యాసాలలో ఇది ఒకటి!

1837 లో భార్య మరణానంతరం ఏకాకిగా, వింత వ్యక్తిగా జీవిస్తూ తరచు డి క్విన్సీ తన నల్లమందు కలలలోకి జారిపోతూ ఉండేవాడు. ఆయన రచనలు 14 సంపుటాలకు పైబడి వెలువడినా, డి క్విన్సీ తన పాండిత్యాన్ని ఒక క్రమపద్ధతిలో ప్రతిపాదించడంగాని, ఒక సుసమన్వితమైన జీవిత దృక్పథాన్ని స్థాపించడం గాని చేయలేక పోయాడు.

1859 డిసెంబరు 8వ తేదీన ఎడింబరో లో టామస్ డి క్విన్సీ శాశ్వతంగా కన్నుమూశాడు.

*బొ.శ్రీ.*

**డినెసెన్, ఇసాక్ (1885-1962) :** డెన్మార్క్ దేశీయురాలైన డినెసెన్ సుప్రసిద్ధ కథా రచయిత్రి. ఈమెకు సాహిత్య పిపాస మాత్రమే కాక, మృగయా వినోదం పట్ల ఆసక్తి కూడా ఉండడం విశేషం. సంపన్న కుటుంబంలో పుట్టిన ఈమె 'బ్లిక్సెన్-ఫినికె' జమీందారిణి (Baroness) గా ప్రసిద్ధురాలు. ఈమె స్వగృహంలోనే కొంత కాలం విద్యాభ్యాసం చేసి తరువాత రాజధానీ నగరమైన కోపెన్‌హేగన్‌లో లలిత కళా అకాడమీలో శిక్షణ పొందింది. 1914 వ సంవత్సరంలో తన దగ్గరి బంధువైన బ్రార్ బ్లిక్సెన్ ఫినికె ప్రభువును పెండ్లిచేసుకొని ఆతనితో కలసి ఆఫ్రికా ఖండంలోని కీన్యా దేశానికి వలస వెళ్ళింది. ఈమెకు వేట అంటే మహాప్రీతి. పులులు, సింహాలు లాంటి పెద్ద పెద్ద క్రూరమృగాలను వేటాడడంలో నిపుణురాలు. కీన్యాలో కాఫీతోటల పెంపకంలో భర్తతో సహకరిస్తూ ఏడేళ్లు గడిపింది. ఆఫ్రికా మహారణ్యాలూ, నశిస్తున్న ఆఫ్రికా జాతీయ సంస్కృతీ ఈమెను అమితంగా ఆకర్షించాయి. ఈమెకు డెనిస్ ఫ్లించ్ హేటన్ అనే ఆంగ్లేయ మృగయా వినోదితో పరిచయం ఏర్పడి గాఢ స్నేహంగా మారింది. 1917 లో ఈమె భర్తకు విడాకులిచ్చి, కాఫీ తోటలపై స్వయంగా యాజమాన్యం వహిస్తూ మరి పదేళ్లు గడిపింది. ఇంతలో కాఫీ ధర ఘోరంగా పడిపోవడంతో విపరీతమైన నష్టాలను ఎదుర్కోవలసి వచ్చింది. దానికి తోడు తన ఆప్త మిత్రుడు డెనిస్ ఫ్లించ్ హేటన్ గతించడంతో ఒంటరిదై పోయింది. ఒంటరితనం, నష్టాలు భరించలేక స్వదేశానికి తిరిగి వచ్చింది. డెన్మార్క్‌లో తన కాలాన్ని అధికభాగం రచనలకే వినియోగించింది. ఈమె ఇటు ఇంగ్లీషులోనూ, అటు డేనిష్ భాషలోనూ రమ్యంగా రచించ గలిగిన ప్రౌఢ. అనేక కథా సంపుటాలనే కాక, ఒక నవలను, ఒక వచన గ్రంథాన్ని కూడా రచించి స్కాండినేవియన్ సాహిత్యాన్ని సుసంపన్నం చేసింది.

*సెవెన్ గోథిక్ టేల్స్* (Seven Gothic Tales), *వింటర్స్ టేల్స్* (Winters Tales 1942), *లాస్ట్ టేల్స్* (Last Tales, 1957). డినెసెన్ కథలు చారిత్రక నేపథ్యంతో, అలౌకిక వాతావరణంతో, శిల్పచాతుర్యంతో పఠితలను ఉర్రూత లూగిస్తాయి. ఈమె ఏకైక నవల *ఏంజెలిక్ ఎవెంజర్* (Angelic Avenger) 1944 లో ప్రకటించబడింది. ప్రజలు డెన్మార్క్‌ను ఆక్రమించిన నాజీ జర్మన్ పరిపాలనపై అధిక్షేప కావ్యంగా దీన్ని ఆస్వాదించి, ఆదరించారు. ఈమె వచన రచన *ఔట్ ఆఫ్ ఆఫ్రికా* (1937) ప్రసిద్ధమైంది. ఈ గ్రంథంలో ఆమె తన ఆఫ్రికా అనుభవాలనే కాక, ఆఫ్రికా వాసులైన అనాది మానవుల జీవిత సరణిని, క్రమక్రమంగా క్షీణిస్తున్న ఆఫ్రికా జాతీయ నాగరకతను కవితా శైలిలో రమ్యంగా ఆవిష్కరించింది.

*గం.శ్రీ.*

**డిఫో, డేనియల్ (1660-1731) :** ప్రథమాంగ్ల నవలా రచయిత. పత్రికా రచనలో నవయుగ వైతాళికుడు. ఇతని రచనలు *రాబిన్‌సన్ క్రూసో* (1719), *మోల్ ఫ్లెండర్స్* (1722) శాశ్వతత్వాన్ని, జనప్రియత్వాన్ని సంపాదించుకున్నాయి. ఇతని తల్లి దండ్రులు అధ

కారిక, సాంప్రదాయిక మతానికి వ్యతిరేకులైనందున ఇతని విద్యాభ్యాసం ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జ్ యూనివర్శిటీలలో కాకుండా రెవరెండ్ గ్రీన్ నిర్వహిస్తున్న నెవింగ్‌టన్ గ్రీన్ విద్యాపీఠంలో జరిగింది. చిన్నప్పటినుంచీ ఇతనికి వ్యాపారమంటే అభిమానమెక్కువ. నైతిక విలువలంటే అపారమైన విశ్వాసం. ఆర్థికశాస్త్రంలో ఇతనికి కొన్ని స్పష్టమైన స్వకీయమైన అభిప్రాయా లున్నాయి. అతని బృహద్వ్యాపార ప్రణాళికలన్నీ విజయవంత మవుతాయని కలలు గంటూ, భారీ ఎత్తున ఋణాలు చెయ్యడం, ఆ కలలు కల్లలై దివాలా తియ్యడం, ఋణదాతల ఒత్తిడికి తట్టుకోలేక జైలు పాలవడం పరిపాటి అయిపోయింది. అతడు తనను గూర్చి చెప్పుకొన్న ఈ పద్యం పంక్తులు గమనించండి. *నో మేన్ హేజ్ టేస్టెడ్ డిఫరెంట్ ఫార్ట్యూన్స్ మోర్ అండ్ థర్టీన్ టైమ్స్ ఐ హేవ్ బీన్ రిచ్ అండ్ పూర్* (నాకన్న జీవితంలో ఆటు పోటులను చవిచూసినవాడు మరొకడు లేడు. పదమూడు సార్లు లక్షాధికారిని, భిక్షాధికారిని అయాను).

డిఫోకు వ్యాపారమంటే ఎంతమక్కువో, రాజకీయా లన్నా అంతే ఇష్టం. అప్పటి ఇంగ్లండు దేశపు రాజు రెండవ జేమ్స్ కేథలిక్ క్రైస్తవుడు. అతని పరిపాలనను దుయ్యబడుతూ ఎన్నో కరపత్రాలను డిఫో ప్రచురించాడు. అతని రాజకీయ ప్రత్యర్థి డ్యూక్ ఆఫ్ మాన్‌మూత్‌తో కలసి అతనిని సింహాసన భ్రష్టుణ్ణి చేయాలని ప్రయత్నించాడు. సెజ్‌మూర్ యుద్ధంలో మాన్‌మూత్ పూర్తిగా పరాజితుడు కాగా, డిఫో అతికష్టం మీద బ్రతికి బయట పడ్డాడు. మరి మూడేళ్ల తరువాత జేమ్స్ రాజు దేశభ్రష్టుడై ఫ్రాన్స్‌లో తలదాచుకోగా, డచ్చి జాతీయుడైన విలియం ఆఫ్ ఆరెంజి (William of Orange) అతని భార్య రాణీ ఏన్(Anne) రాజ్యానికి వచ్చిన సందర్భంలో డిఫో వారికి చేతులెత్తి స్వాగతం పలుకడమే కాక, వారి పాలనను సమర్థిస్తూ అనేక కర పత్రాలను, వ్యాసాలను రచించాడు. అంతేకాదు, వారి తరఫున గూఢచారిగా కూడా పనిచేశాడు. జాత్యహంకారాన్ని తృణీకరిస్తూ ఇతడు వ్రాసిన పద్యం *ది ట్రూ బోర్న్ ఇంగ్లీష్‌మన్* (*The True born Englishman*-1701) ప్రజల్లో విశేష వ్యాప్తిని గడించింది. ఇతడు అంతర్జాతీయ రాజకీయాల్లో కూడా తలదూర్చాడు. స్పెయిన్‌లోని రాజకీయ పరిస్థితి ప్రపంచశాంతికి భంగం కలిగించవచ్చునని భావించి, అయిదుగురు *కెంటు* ప్రాంతీయ గౌరవనీయ రాజకీయ వేత్తలకు, టోరీమెజారిటీ గల పార్లమెంటుకు, దేశరక్షణను పటిష్ఠం చేయవలసిన ఆవశ్యకతను విశదీకరిస్తూ ఒక మహజరును సమర్పించగా, ప్రభుత్వం వారిని అక్రమంగా అరెస్టు చేసి జైల్లో పెట్టింది. ఆ మర్నాడే డిఫో పదహారు మంది గౌరవనీయ రాజకీయ ప్రముఖులను వెంటబెట్టుకుని, స్పీకరును కలుసుకుని, *లీజియన్స్ ఆఫ్ మెమోరియల్స్* గా చరిత్ర ప్రసిద్ధి కెక్కిన వినతి పత్రాన్ని అందజేశాడు. అందులో అతడు ప్రజలు ప్రభువుకు ఎలా బానిసలు కారో, అలాగే పార్లమెంటుకు కూడా బానిసలు కారని వివరించాడు. ఫలితంగా ప్రభుత్వం నిర్బందితుల్ని విడుదల చేసింది. ఈ ఘనవిజయాన్ని పురస్కరించుకొని, లండన్ నగరం ఇతనిని ఘనంగా సత్కరించిది. అనంతరం ఇతని రచనలు ఇటు టోరీలకు, అటు విగ్గులకు కూడా ఆగ్రహం కలిగించాయి. ఇతని నైతిక వర్తనను అసహ్యించుకున్న అతని ప్రత్యర్థులంతా ఇతనిని జైలుకు పంపారు. డిఫో చాలా అగచాట్లకు గురిఅయాడు. కోర్టు ఇతనికి జరీమానా విధించింది. జైలుకు పంపించింది. బండవేసి హీనంగా హింసించింది. సహ రచయితలు అపహాస్యం చేశారు. అయినా డిఫో ధైర్యం కోల్పోలేదు. తన రచనా వ్యాసంగం విరమించుకోలేదు. ఇతని ప్రఖ్యాత నవల *మోల్‌ఫ్లాండెర్స్* జైల్లోనే పుట్టింది. జైల్లోనూ, బయటా కూడా తను నిజమని నమ్మినదాన్ని నిర్భయంగా వ్రాస్తూనే వచ్చాడు. ఎంత ధైర్యశాలి అయినా ఋణదాతల బారినుండి తప్పించుకోవడం కోసం భార్య పుత్రులను విడిచి పెట్టి పారిపోక తప్పలేదు. ఎప్పుడో ఎలాగో అజ్ఞాతవాసంలోనే మరణించాడు.

డిఫో రచనలు అసంఖ్యాకంగా ఉన్నాయి. కరపత్రాలు, పత్రికా రచనలు మినహాయిస్తే ఇతని ముఖ్యరచనలు : 1. కవితలు: *హిమ్ టు ది పిల్లొరీ* (Hymn to the pillory), *టూర్ త్రూ ది హోల్ ఐలండ్ ఆఫ్ బ్రిటన్* (Tour Through the Whole Island of Britain)2. నవలలు: *రాబిన్ సన్ క్రూసో* (Robinson Crusoe), *మోల్ ఫ్లాండర్స్* (Moll flanders), *రోక్సానా* (Roxana). చిన్న చిన్న వివరాలను సైతం విడచి పెట్టని వాస్తవిక వర్ణనా ఫణితి, సరళమైన శైలీ ఇతని నవలలకు అసమానమైన రంజకత్వాన్ని ఘటించాయి. ఇతని రచనలన్నిటిలోనూ నైతిక పారమ్యం ప్రతిపాదించబడింది. ఇది అప్పుడప్పుడు 'అతి' అని కూడా అనిపిస్తుంది.

*గం.శ్రీ.*

**డి లా రోష్, మాజో (1878-1961) :** ఆంగ్ల సాహిత్యంలో గాల్స్‌వర్దీ వ్రాసిన ఫోర్‌సైట్ శాగా (Forrsyte saga) చాలా ప్రసిద్ధమైంది. అలాగే కెనడా

దేశ సాహిత్యంలో డి లా రోష్ వ్రాసిన *వైటోక్* కుటుంబ నవల కూడా ప్రసిద్ధమైంది. జాల్నా ఎస్టేట్ అధికారులు వైటోక్ కుటుంబస్థులు. 1925 నుండి 1950 వరకూ గల పాతిక సంవత్సరాలలో సాగిన వైటోక్ కుటుంబ గాథ ఈ నవలలో ఉంది. *జాల్నా* (Jalna) అన్న మొదటి నవల 1927 లో ప్రారంభ మయింది. ఆ తర్వాత 15 నవలలు వచ్చాయి. మొదటి నవల అడిలైన్ వైటోక్ అనే చురుకైన అవ్వ నూరవ పుట్టిన రోజుతో ప్రారంభ మౌతుంది. ఈమెను పురస్కరించుకొనే డి లా రోష్ 1936 లో వైటోక్స్ (Whiteocks) నాటకం కూడా రాశాడు. ఈ నాటకం చాలా కాలం అవిచ్ఛిన్నంగా ప్రదర్శించ బడింది. 1935 లో వచ్చిన చలనచిత్రం *జాల్నా* కూడా విజయవంతమైంది. అమెరికా సంయుక్త రాష్ట్రాలలోనూ, యూరప్ ఖండం లోనూ ఇవి విరివిగా ప్రచారం పొందాయి. వైటోక్స్ నవలలోని కథాంశం కెనడా దేశంలోని అంటారియో రాష్ట్రానికి చెందినా, వీటికి కెనడా దేశంలో ప్రజాదరణ లేదు. కెనడాదేశ వాసులు ఈ నవలలో తమ దేశ వాతావరణాన్ని, జీవిత విధానాన్ని చూడాలని ఆకాంక్షించారు. కాని ఈ నవలలో అవి లోపించడం వల్ల కలిగిన నైరాశ్యమే దీనికి కారణం కావచ్చు. ఈ నవల కెనడా దేశపు కుటుంబ గాథ అయినా రచయిత ఇందలి విషయాన్ని ఎంతో సమర్థతతో సాధారణీకరించి, విశ్వజనీనతను చేకూర్చాడు. 15 నవలలు, ఒక నాటకమే కాక డి లా రోష్ ఎన్నో బాలల కథలు కూడా వ్రాశాడు. 1957 లో *రింగింగ్ ది ఛేంజెస్* (Ringing the changes) అన్న పేరుతో తన స్వీయ చరిత్రను వ్రాశాడు.

*గం. శ్రీ.*

## డురావో, హోసే డీ సాంతా రీతా (1772-):

డురావో బ్రెజిల్ దేశపు ఇతిహాసకవి. ఇతని ఇతిహాస కావ్యం *కరమూరు* (Caramuru) ప్రసిద్ధమైంది. ఇతడు స్వదేశంలోనే రాజధానీ నగరం రియోడి జనీరోలో విద్యా భ్యాసం చేసి అనంతరం పోర్చుగల్ దేశంలో కొయింబ్రా విశ్వవిద్యాలయంలో 'థియోలజీ' (భగవద్విషయ శాస్త్రం) లో పిహెచ్.డి పట్టా పుచ్చుకొన్నాడు. రెండేళ్ల తరువాత సెంట్ అగస్టిన్ ఆర్డరుకు చెందిన గ్రాంటియన్ కాన్వెం టులో మతాధికారిగా చేరాడు. కాని అతడు జెసూట్ క్రైస్తవశాఖ పట్ల చూపిన సానుభూతి కారణంగా ఉన్న తాధికారులతో తగాదా పడ్డాడు. ఆ రోజుల్లో జెసూట్ క్రైస్తవులకు పోర్చుగల్‌లోనూ, బ్రెజిల్‌లోనూ, ఇతరత్రా కూడా ఆదరం కరువైంది. జెసూట్లను ఈ రెండు దేశాల్లోనూ బహిష్కరించారు. ఆ తరుణంలో వారిపట్ల సానుభూతి ప్రకటించడం క్షమార్హంకాని నేరం. అందు వల్ల డురావో తన ఉద్యోగాన్ని కోల్పోవలసి వచ్చింది. పొరుగు దేశమైన స్పెయిన్‌లో తలదాచుకొన్నాడు. అయితే స్పెయిన్ దేశం ఇతనిని గూఢచారిగా భావించి నిర్బంధించింది (1762). నిర్బంధానంతరం ఇతడు ఇటలీ దేశంలోని రోము నగరం చేరుకొన్నాడు. పోప్ మహాశ యుని గ్రంథాలయాధికారిగా, భాండారిగా పదవీ స్వీకారం చేశాడు. రోము నగరంలోని మేధావి వర్గంతో సన్నిహిత సంబంధాలు పెట్టుకొన్నాడు. 1778 లో పోర్చుగల్ తిరిగి వచ్చి కోయింబ్రా విశ్వవిద్యాలయంలో భగవద్విషయాచార్య పదవి నలంకరించాడు. తరువాత మళ్లీ గ్రాంటియన్ కాన్వెంటులో చేరి 'ప్రైయర్' (Prior) హోదాలో స్థిర పడ్డాడు. ఇతడు 1781 లో తన ప్రసిద్ధ కవిత *కరమూరా పోయెమా ఎపికా డిస్‌క్యొబి మెంటోడా బాహియా* (ది ఎపిక్ పోయం ఆఫ్ ది డిస్కవరీ ఆఫ్ బాహియా) ను లిస్బన్ నగరంలో ప్రచురించాడు. ఇది 10 ఆశ్వా సాల మహాకావ్యం. బ్రెజిల్ ఉత్తరభాగానికి బాహియా అని పేరు. ఈ భాగాన్ని కనిపెట్టడం ఇతి వృత్తంగా నిర్మించబడిన కల్పిత కావ్యం ఇది. డీగో అల్వారిజ్ అన్వేషకుడు, నాయకుడు. ఇతనిని బాహియాకు చెందిన ఆటవిక తెగలలో ఒకరైన నరమాంస భక్షకులు కర మూరు (జలధిసర్పం) అని పిలవడం వల్ల డీగో అల్వారిజ్‌కు 'కరమూరు' అని పేరు వచ్చింది. అదే కావ్యనామం అయింది. ఇతనికి రావలసినంత ఖ్యాతి రాలేదనే నిస్పృహతో ఇతడు తన ఇతర రచనలను దగ్ధం చేశాడు.

*గం.శ్రీ.*

## డురాస్, మార్గరీత్ (1914--) :

కొచిన్ చినాలో జన్మించిన డురాస్ ఫ్రెంచి వనిత. ఈమె అసలు పేరు మార్గరిట్ డినాడియో. నవలలు, నాటకాలు చలనచిత్ర సంభాషణలు అనేకం వ్రాయడమే కాక, స్వయంగా చల నచిత్ర దర్శకత్వం కూడా చేపట్టింది. ఈమె వ్రాసిన ఫిల్మ్‌నాటకాలు (film plays) *హిరోషిమా మోనా మోర్* (1959, Hiroshima Monamour), *ఇండియా సాంగ్* (India Song, 1975) ఈమెకు అంతర్జాతీయ ఖ్యాతి గడించి పెట్టాయి. ఈమె బాల్యం అంతా ఇండో చైనాలోనే గడిపింది. తన 17 వ ఏట మాతృదేశమైన ఫ్రాన్సు వెళ్లి అక్కడి పారిస్ విశ్వ విద్యాలయంలో రాజనీతి శాస్త్రాన్ని అభ్యసించింది. ఆమెలో ఆ రోజుల్లో వామపక్ష భావాలు చోటు చేసుకున్నాయి. కమ్యూనిస్టు

పార్టీలో చేరి, పదేళ్ల పాటు ఆ పార్టీ సభ్యురాలుగా కొన సాగింది. ఈమె రచించిన తొలి నవలలు ప్రజాదరణను పొందలేకపోయినా, మూడవ నవల *ది సీ వాల్* (The Sea wall, 1950) గుర్తింపు పొందింది. ఈ నవలలో ఇండోచైనాలోని ఒక పేద ఫ్రెంచి కుటుంబ గాథ వర్ణితమైంది. కథ చాలా వరకూ ఈమె స్వీయ జీవిత వృత్తాంత సంబంధి కావడం వల్ల కథ, వర్ణన సహజంగా భాసించాయి. ఈ నవలలో ప్రసిద్ధ అమెరికన్ నవలా రచయితలు స్టైన్ బెక్, కాడ్వెల్‌ల ప్రభావం కనిపిస్తుందని అభిజ్ఞుల అభిప్రాయం. ఈమె తరువాతి నవలలు ది సెయిలర్ *ఫ్రమ్ జిబ్రాల్టర్*, 1966, మోడరేట్ కాన్టబయిల్-1960) శైలిలో లయాత్మక మాధుర్యాన్ని, సంభాషణా, చాతుర్యాన్ని సంతరించుకొన్నాయి. ఒక పదేళ్ల పాటు ఆమె తన కథలను 'సినిమా స్క్రిప్టు'లుగా వ్రాసుకొంది. ఈమె సంభాషణా నైపుణ్యం *ది హిరోషిమా మోన్ ఆమోర్*కు అనంత ఖ్యాతిని కూర్చింది. యుద్ధానంతరం హిరోషిమాలోని జపాన్ దేశపు వణిక్ప్రముఖునికీ, ఒక ఫ్రెంచి నర్తకికి మధ్య నడచిన ప్రేమాయణాన్ని ఆ రచన రసవంతంగా చిత్రించింది. కాలం గడచిన కొద్దీ డురాస్ సామాన్యేతివృత్తాలకూ, సాధారణ నవలా రచనా విధానానికీ దూరమౌతూ వచ్చింది. పాత్రల సంఖ్య బాగా తగ్గడం, కథా కథనంలో పొదుపరితనం, సంవిధాన రాహిత్యం చోటుచేసుకో నారంభించాయి. ఈ లక్షణాల వల్ల ఈ నవలలు అప్పుడు అమెరికా, యూరప్ ఖండాల్లో ప్రచారంలో ఉన్న నవ్య నవలోద్యమానికి (Nouveau Roman) చెందినట్లుగా కొందరు భ్రమించారు. కాని తన నవలా స్వరూపం స్వయం ప్రయోగ ఫలితమే ననీ, ఉద్యమ ప్రభావం కాదనీ ఆమె స్పష్టపరచింది. ఈమె కొత్త తరహా నవలలలో కొన్ని: *ది ఆఫ్టర్‌నూన్ ఆఫ్ మొన్స్యూర్ ఆండెస్మాస్* (1965), *ది డెస్ట్రోయ్, షీ సెడ్* (1970), *లవ్* (1970). ఈమె నాటకాలు *థియేటర్*-I, *థియేటర్*-II అన్న పేర్లతో సంకలితం చేయబడ్డాయి. ఈమె కథ వ్రాయడమే కాక, ఎడిటింగ్, దర్శకత్వం కూడా వహించిన చిత్రం *ఇండియాసాంగ్*. ఇది చలన చిత్రరంగంలో ఒక మైలురాయి.

*గం.శ్రీ.*

డెరెక్ వాల్ కాట్ (1930--) : చూ: వాల్ కాట్, డెరెక్.

దేవిస్, విలియమ్ రాబర్ట్‌సన్ (1913--) : కెనడా దేశీయుడు. నవలలు, నాటకాలు వ్రాశాడు. *వరల్డ్ ఆఫ్ వండర్స్* (అద్భుత మయ ప్రపంచం,) లాంటి ఇతని నాటకాలలో ప్రఖ్యాత మనస్తత్వ శాస్త్రవేత్త కార్ల్‌యుంగ్ (Karl Jung) ప్రభావం కనిపిస్తుంది. ఇతడు పుట్టడం కెనడా దేశంలోనైనా, ఇంగ్లండులోని ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసం చేశాడు. అంతేకాక నాటక రచనలోనూ, ప్రదర్శనలోనూ, రంగస్థల పర్యవేక్షణలోనూ తర్ఫీదు పొందాడు. ఇంగ్లండులో ప్రసిద్ధ నాటక కంపెనీ ఓల్డ్‌విక్ రిపర్టరీ అనే కంపెనీలో సభ్యత్వం పొందాడు. ఇతని నాటకాలలో *ఈరోజ్ ఎట్ బ్రేక్‌ఫాస్ట్* (చద్దికాడ వలరాజు, 1949 *ఎట్ మై హార్ట్స్ కోర్* (హృదయాంత రాళంలో) ప్రసిద్ధమయాయి. ఇతని అధిక్షేప నాటకాలు కూడా జనరంజకా లయాయి. వాటిలో *లీవెన్ ఆఫ్ మాలిస్* (Leaven of Malice, 1954 దౌష్ట్య విజృంభణ) ఎన్నికైన రచన. దీనిలో సంస్కృతి రంగంలో పెద్దల పెత్తనాన్ని పరిహసించాడు. ఇతని ఇతర నాటకాలు: *ది రెబెల్ ఏంజెల్స్* (తిరుగబడ్డ దేవతలు: 1981) *ఫిఫ్త్ బిజినెస్* (అయిదవ వ్యాపారం, 1970), *ది మాంటికోర్* (The Monticore, 1973).

*గం.శ్రీ.*

డాస్ పాసోస్, జాన్ (1896-1970) : అమెరికా సంయుక్త రాష్ట్రాలకు చెందిన ప్రసిద్ధ నవలా రచయిత. మొదటి ప్రపంచ యుద్ధానంతరపు 'లాస్ట్ జనరేషన్'(యుద్ధ మరణాల కారణంగా ఒక తరం ప్రతిభా పాటవాలను మానవాళి కోల్పోవటంతో, ఆ తరానికి ఈ పేరు పెట్టారు) కి చెందిన సుప్రసిద్ధ నవలా రచయితలలో ఎన్నదగినవాడు. సమాజ చరిత్ర రచయితగా, సాహితీవేత్తగా ఈయన ఖ్యాతికి ముఖ్య కారణం *యు.ఎస్.ఏ* అనే మూడు భాగాల నవల. వామపక్ష భావాలు గల ఈ రచయిత అమెరికన్ జీవన విధానాలతో రాజీపడలేక ఈ నవలలో వాటిని తీవ్రంగా విమర్శించాడు. పోర్చుగీస్ వంశానికి చెందిన ఈయన తండ్రి సంపన్నుడైన న్యాయవాది. డాస్ పాసోస్ హార్వర్డ్ విశ్వవిద్యాలయం నుంచి పట్టభద్రుడై, మొదటి ప్రపంచ యుద్ధంలో అంబులెన్స్ డ్రైవరుగా చేరి పనిచేశాడు.



ఈయన తొలి రచనలలో ఈ పాశవిక ప్రపంచంతో తలపడి అన్ని విధాలా తీవ్రంగా గాయపడిన సున్నిత మనస్కులైన కళాకారులు ప్రధాన పాత్రలుగా కనిపిస్తారు. వీటిలో ముఖ్యమైనది *త్రీ సోల్జర్స్* (1921) అనే యుద్ధ వ్యతిరేక నవల. 1925 లో వ్రాసిన *మన్‌హట్టన్ ట్రాన్స్‌ఫర్* ఇంప్రెషనిస్ట్ ఫలోక్తులతో సాగిపోయే ఒక ప్రయాణికుని కథ. 1927 లో 'నికొలాశాకో', 'బార్తొలో మ్యోవాన్ జెట్టి' అనే ఇద్దరు అరాజక వాదులకు ప్రభుత్వం విధించిన ఉరిశిక్షను రద్దు చేయటానికి సాగిన తీవ్ర పోరాటంలో ఈ రచయిత ప్రముఖ పాత్ర వహించి, ఆ పోరాటం విఫలమై వారిని ఉరి తీసినప్పుడు తీవ్రంగా వ్యాకులితుడై అమెరికన్ జీవన విధానాల పట్ల తీవ్ర నిరసన భావాన్ని పెంచుకొన్నాడు. ఫలితంగా యునైటెడ్ స్టేట్స్‌ను రెండు విభిన్న జాతుల సమాఖ్యగా చూడటం ప్రారంభించాడు. సంపన్నులు, పలుకుబడి గల వారిది ఒక జాతి అయితే, పేదవారు, అధికారం, పరపతి లేనివారు వేరొక జాతి అని ఆయన విశ్వసించాడు. ఈ భావాన్ని ఆధారంగా చేసుకొని ఆయన వ్రాసిన మూడు నవలలను కలిపి *యు.ఎస్.ఏ* అనే గ్రంథమాలగా ప్రకటించాడు. వాటిలో మొదటిది *ది ఫార్టీ సెకండ్ పేరలల్* 1930 లో వెలువడింది. దీనిలో కథ 1900 వ సంవత్సరం నుంచి మొదటి ప్రపంచ యుద్ధం వరకూ సాగుతుంది. రెండవది *1919* అనే నవల. 1932 లో వెలువడింది. ఇది యుద్ధ ప్రారంభం నుండి వెర్సైల్స్ సంధివరకు జరిగిన విషయాలను వివరిస్తుంది. మూడవది *ది బిగ్ మనీ* (1936) 1920-30 దశకంలోని ఆర్థిక ద్రవ్యోల్బణాన్నీ, 1930-40 దశకంలోని విషాద ఆర్థిక మాంద్యాన్నీ చిత్రిస్తుంది. కార్ల పరిశ్రమకు రాజైన హెన్రీ ఫోర్డ్, అనేక నూతన పరికరాలను సృష్టించిన థామస్ ఎడిసన్, అధ్యక్షుడు వుడ్రో విల్సన్, పెట్టుబడిదారు జె.పి. మోర్గన్‌ల జీవిత విశేషాలను వీటిలో ఎంతో నైపుణ్యంగా చొప్పించాడు. రెండవ జాతి ప్రతి నిధులుగా సోషలిస్టు అయిన 'యూజెని వి. డెబ్స్', ఆర్థిక శాస్త్రవేత్త 'థోర్ స్టీన్ వెబ్లెన్', కార్మిక నాయకుడు 'జోహిల్', మొదటి ప్రపంచ యుద్ధపు ఒక అజ్ఞాత సైనికుడు ఈ నవలలో కనిపిస్తారు.

కార్మిక ఉద్యమం పట్ల, వామపక్ష రాజకీయాల పట్ల తనకు ఏర్పడిన అసంతృప్తిని ప్రకటిస్తూ *డిస్ట్రిక్ట్ ఆఫ్ కొలంబియా* అనే మూడు నవలల మరొక మాలికను డాస్‌పాసోస్ వెలువరించాడు. *అడ్వెంచర్స్ ఆఫ్ ఏ యంగ్ మాన్* (1939), *నంబర్ వన్* (1943), *ది గ్రాండ్ డిజైన్* (1949) అనేవి ఆ మూడు నవలలు. వీటిలో వుడ్రో విల్సన్ ప్రతిపాదించిన 'న్యూ డీల్ లిబరలిజమ్' పట్ల రచయిత తీవ్ర అసంతృప్తిని ప్రకటిస్తాడు.

వయస్సుతో పాటు సృజనాత్మక శక్తి కూడ క్షీణించటంతో డాస్‌పాసోస్ మరణించే నాటికే ఆయన రచనలను విమర్శకులు నిర్లక్ష్యం చేయటం ప్రారంభించారు.

కె.జి.మూర్తి.

**డోస్టొయెవ్‌స్కీ, ఫ్యోడోర్ (1821-81) :** రష్యన్ భాషలో ప్రముఖ నవలా స్రష్టగాను, పత్రికా రచయితగాను, కథకుడుగాను ప్రసిద్ధి చెందినవాడు. తన అపారమైన మనోవైజ్ఞానిక అవగాహనతో మానవ హృదయంలోని చీకటి గదులలోకి చొచ్చుకొనిపోయి అక్కడ నిద్రాణమై ఉన్న మానవ స్వభావాన్ని ప్రభావితం చేసే భావాలను వెలికి లాగి చూపగలిగిన మహామేధావి. అందుకే ఆయన చిత్రించిన పాత్రలు, సృష్టించిన సంఘటనలు హృదయానికి హత్తుకునేటట్లు ఉంటాయి. 20 వ శతాబ్ది నవలా రచయితలపై ఆయన ప్రభావం విస్తృతంగా కనిపిస్తుందని చెప్పటం అతిశయోక్తి కాదు.

మిలిటరీ ఇంజనీరుగా శిక్షణ పొందినా ఆ వృత్తిని వదలి రచనా వ్యాసంగాన్నే చేపట్టి సాహిత్య సేవకే అంకితమై డోస్టొయెవ్‌స్కీ తన రచనల ద్వారా పండిత, పామరులను ఆకట్టుకొన్నాడు. సెయింట్ పీటర్స్‌బర్గ్ లోని ప్రజా జీవితాన్ని ప్రతిబింబించే నవలలు, కథానికలు 1846-49 ల మధ్య వ్రాశాడు. 1846 లో *పూర్ ఫోక్* అనే నవలతో ఆయన తన రచనలకు శ్రీకారం చుట్టారు. వామపక్ష మేధావుల సభలో పాల్గొన్నందుకు 1849 లో ప్రభుత్వం ఆయనను బంధించి మొదట ఉరి శిక్ష విధించి, తరువాత దానిని సైబీరియాలో యావజ్జీవ కారాగార శిక్షగా మార్చింది. ఈ అనుభవాలన్నింటిని కూర్చి *ది హౌస్ ఆఫ్ ది డెడ్* (The House of The Dead) అనే నవలను 1961-62 లో ఆయన ప్రచురించాడు. 1854 లో ప్రభుత్వం ఆయనను విడుదల చేసింది. ఆయన *ఇపోఖా* (Epokha) అనే పత్రికను స్థాపించి అందులో 1864 లో *నోట్స్ ఫ్రం ది అండర్ గ్రౌండ్* అనే వ్యాసాలు ప్రచురించాడు. ఆయన గొప్ప నవలలలో మొదటి దైన *క్రైమ్ అండ్ పనిష్‌మెంట్* 1866 లో ప్రచురితమైంది. ఆయన ఇతర నవలలలో *ది ఇడియెట్* (1866-69), *ది పొజెస్డ్* (1869-72) ఎన్నదగినవి. ఆయన ప్రముఖ రచన అని చెప్పదగిన *బ్రదర్స్ కరమజోవ్* (Brothers Karamazov) 1880

లో వెలువడింది. మేటి రష్యన్ రచయితలలో ఒకరుగా చిరస్మరణీయుడైనవాడు డోస్టెయెవ్‌స్కీ.

కె.జి.మూర్తి

డౌసన్, ఎర్నెస్ట్ (1867-1900) : ఆంగ్ల సాహిత్యంలో 19 వ శతాబ్ది చివరి దశకానికి క్షీణయుగం అని పేరు. ఆ క్షీణయుగపు కవులలో డౌసన్ ప్రసిద్ధుడు. కళ కళకోసమే అన్న వాల్టర్ పేటర్ సిద్ధాంతం ఇతనికి శిరోధార్యం. ప్రతీకాత్మక కవిత్వం వ్రాయడంలో డబ్ల్యు. బి. యీట్స్‌తో సమస్కంధుడు, మార్గదర్శి, ప్రతిభాశాలి అయినా ఇతడు ప్రస్తుతం ఒకే ఒక పద్యంలో జీవిస్తున్నవాడు. ఆ పద్యం పల్లవి *ఐ హేవ్ బీన్ ఫెయితుఫుల్ టు యూ సినారే, ఇన్ మై ఓన్ ఫేషన్* ప్రసిద్ధమైంది.

ఇతని జీవితం ఒక విషాద కావ్యం అనవచ్చు. ఇతని తలిదండ్రు లిద్దరూ క్షయవ్యాధి గ్రస్తులై నిలుకడలేని జీవితం గడపారు. చిన్నప్పుడు వారితో పాటు డౌసన్ కూడా ఫ్రాన్స్, ఇటలీ దేశాల్లో పర్యటించడం వల్ల విద్యాభ్యాసానికి అంతరాయం కలిగింది. చివరకు 1886 లో ఆక్స్‌ఫర్డ్ - విశ్వవిద్యాలయంలో చేరినా, రెండేళ్ల లోనే కుటుంబాదాయం క్షీణించడం వల్ల విశ్వవిద్యాలయం విడిచిపెట్టి బ్రతుకు తెరువు చూసుకో వలసి వచ్చింది. తన తండ్రి పనిచేసే లండన్ డాక్‌లో ఉద్యోగిగా చేరాడు. సాహిత్య పిపాస కారణంగా విలియం బట్లర్ యీట్స్, లయోనెల్ జాన్సన్, ఆర్థర్ సిమన్స్, ఆబ్రే బియర్డ్‌స్లీ మొదలగువారు సభ్యులుగా గల రైమర్స్ క్లబులో సభ్యుడుగా చేరాడు. సోహోలోని పోలండ్ రెస్టారెంటులో పరిచారిక ఆడిలైట్ ఫోలినోవిజ్ అనే పన్నెండేళ్ల బాలిక ఇతనిని విపరీతంగా ఆకర్షించింది. ఆమెను గాఢంగా ప్రేమించాడు. పెళ్లి చేసుకోవాలని ఆకాంక్షించాడు. కాని అతని ప్రేమ విఫలమైంది. నాల్గు ఏళ్ల తరువాత ఆమె ఇంకొకరిని పెళ్లి చేసుకొంది. ఈ లోగా తండ్రి మరణించడం, తల్లి ఆత్మహత్య చేసుకోడం అతని జీవితాన్ని మరింత దుర్భరం చేశాయి. క్షయ లక్షణాలు కూడా కనిపించాయి. అతడు మరి పెళ్లి మాట తలపెట్టలేదు. నైరాశ్యంతో, ఆడిలైడ్ నామస్మరణ చేస్తూ మగువ, మధువు జీవితం కాగా, పేదరికపు కబంధ హస్తాల్లో చిక్కుకొని నరకం అనుభవించాడు. ఫ్రాన్సు దేశంలో అతి నికృష్ట స్థితిలో ఉన్న అతనిని అతని స్నేహితుడు ఆర్.హెచ్. షెరార్డు కనిపెట్టి ఆదుకొని ఇంగ్లాండు తీసుకువచ్చాడు. ఆ స్నేహితుని ఇంట్లోనే డౌసన్ కన్ను మూశాడు.

ఇతని కవితకు స్ఫూర్తి నిచ్చింది ఆడిలైడ్. ఆమెను ప్రేమించిన తొలి రోజులలో వ్రాసిన పద్యం *నాన్ సుమ్ క్వాలిస్ ఈరామ్‌బో నై సబ్ రెగ్నొ సినారై* సాహిత్యంలో చిరస్థాయిగా నిలిచిపోయింది. ఇతని కవితలో ఒకానొక అనిర్వచనీయ శైలీ మాధుర్యం కనిపిస్తుంది. ఇతని రచనలు: కవితా సంపుటాలు 1. *వెర్సెస్* (1896), 2. *డెకొరేషన్స్* (1899). ఆర్థర్ మూర్‌తో కలసి వ్రాసిన నవలలు: *ఏ కామెడీ ఆఫ్ మాస్* (1893), *ఏడియన్ రోమ్* (1899); *డిలెమాస్* (1895) అనే కథా సంపుటి కూడా ఇతనిదే. అయితే ఇతనికి కవిగా మాత్రమే గుర్తింపు వచ్చింది.

*గం.శ్రీ.*

డ్యురెన్‌మట్, ఫ్రీడ్రిఖ్ (1921--) : జర్మన్ నాటక రచయిత. ఈయన రచించిన 'ట్రాజీ-కామిక్' నాటకాలు ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరం జర్మన్ నాటక రంగ పునరుద్ధరణలో ప్రముఖ పాత్ర నిర్వహించాయి.

జ్యూరిఖ్, బెర్న్ నగరాలలో విద్యాభ్యాసం చేసిన డ్యురెన్‌మట్ 1933-45 మధ్యకాలంలో జాతీయ సోషలిజం తుఫానులాగ విజృంభింపని ఒక జర్మన్ భాష మాట్లాడే దేశంలో పుట్టి పెరగడం ఒక విధంగా ఆయన అదృష్టం అని చెప్పాలి. ఆ సంవత్సరాలలో జర్మన్ నాటకం ఒక్క స్విట్జర్లాండ్ దేశంలో మాత్రమే ప్రవర్ధమానంగా ఉండడం వలన డ్యురెన్‌మట్‌కీ, ఆయన మిత్రుడు మాక్స్ ఫ్రిష్‌కీ జర్మన్ నాటకరంగం అభివృద్ధి కోసం నూతన ప్రయోగాలు చేసే అవకాశం లభించింది. జర్మన్ భాష మాట్లాడే ఇతర రచయితలకు అలాంటి అవకాశం లేకుండా పోయింది. డ్యురెన్‌మట్ నాటకీయ శిల్పం మీద జర్మన్ ప్రవాస నాటక రచయిత బెర్టోల్ట్ బ్రెఖ్ట్ ప్రభావం స్పష్టంగా కనిపిస్తుంది. మధ్యలో పిట్టకథలు చెప్పించడం, నటులు తమ పాత్రలనుండి వెలువడి మధ్య మధ్య కథకులుగా వ్యవహరిస్తూ ఉండడం వంటి విధానాలను బ్రెఖ్ట్ నుంచే డ్యురెన్‌మట్ గ్రహించాడు. డ్యురెన్‌మట్‌కి లోకం అసంబద్ధంగా కనిపించింది. ఆ అసంబద్ధ సన్నివేశాలను యథాతథంగా వాటికి ఎలాంటి ప్రాముఖ్యాన్నీ కల్పించాలని ప్రయత్నించకుండా తన నాటకాలలో ఆయన ప్రదర్శించాడు.

డ్యురెన్‌మట్ నాటకాల సెట్టింగులు విచిత్రంగా ఉండేవి. ఆయన తొలి నాటకం *ఎస్ స్టేట్ గెష్రీబెన్* (It is Written, ప్రదర్శన, ప్రచురణ: 1947) 1534-36 మధ్య మ్యున్‌స్టర్‌లో అనబాప్టిస్టుల అణచివేతకు సంబంధించింది. *డెర్ బ్లింద్* (The Blind

Man, ప్రదర్శన 1948, ప్రచురణ 1960), *రోమ్యులస్ డెర్‌గ్రోసే* (Romulus the Great, ప్రదర్శన : 1949, ప్రచురణ : 1962) అనే నాటకాలలో వలె పై నాటకంలో కూడా డ్యురెన్‌మట్ చారిత్రక సత్యాలలో హాస్యం కలిగించడానికి వీలుగా స్వాతంత్ర్యం వహించి కొద్ది మార్పులు చేశాడు. *డీ ఎహే డెస్ హెర్ర్ మిసిసిపి* (The Marriage of Mr. Mississippi, ప్రదర్శన, ప్రచురణ: 1952) డ్యురెన్‌మట్‌కు అంతర్జాతీయ ఖ్యాతి చేకూర్చింది. 1958 లో అమెరికాలో *ఫూల్స్ ఆర్ పాసింగ్ త్రూ* అనే పేరుతో ఆ నాటకం ప్రదర్శించారు. అనంతరం 1974 వరకూ ఆయన పలు నాటకాలు వ్రాసి ప్రదర్శింపచేశాడు.

నాటకాలు మాత్రమే కాక డ్యురెన్‌మట్ అపరాధ పరిశోధక నవలలూ, రేడియో నాటకాలూ, విమర్శక వ్యాసాలూ కూడా రచించాడు.

బొ.శ్రీ.

**డ్యూమాస్, అలెగ్జాండర్ (1824-95) :** ఫ్రెంచ్ నాటక రచయిత; నవలా రచయిత. 'సమస్యాగర్భిత నాటక' (problem play) ఉద్యమ స్థాపకులలో ఒకడు. 'సమస్యా గర్భిత' నాటకం మధ్యతరగతి ప్రజల జీవితాన్ని వాస్తవికంగా చిత్రిస్తూ, సంఘంలోని ఒక సమకాలిక సమస్యకు పరిష్కార మార్గాన్ని సూచిస్తుంది.

డ్యూమాస్ ఫిల్స్ అనే మారు పేరు గల ఇతడు 1824 జూలై 27 న పారిస్‌లో జన్మించాడు. తన తండ్రి సాహిత్యప్రతిభ వారసత్వంగా ఇతనికి సంక్రమించింది. అయితే తండ్రి, కొడుకుల రచనల మధ్య ఎలాంటి పోలికా కనిపించదు. విజయవంతమైన ఇతని తొలి నవల *లా డామ్ జేక్స్ కామిలియాస్* (1848). తరువాత ఆ నవలలోని కథనే నాటకంగా (కామిలి - Camille) రచించినప్పుడు దానికి విశేష ప్రశస్తి లభించింది. ఈ నాటకం 1852 లో తొలిసారి రంగస్థలం మీద ప్రదర్శింపబడింది. ఈ నాటకాన్ని ఆధారంగా చేసుకునే గైజెపే వెర్డీ తన వీథి నాటకం (Opera) *లాట్రావియాటా* రచించి, 1853 లో ప్రదర్శింపచేశాడు.

ఇతని తండ్రి కల్పనలతో నిండిన చారిత్రక నాటకాలు, నవలలు రచింపగా ఈ అలెగ్జాండర్ డ్యూమాస్ వర్తమాన సాంఘిక నాటకాలకే ప్రాధాన్యం ఇచ్చాడు. నీతివిరుద్ధమైన ప్రేమకలాపాల వల్ల తన తండ్రి ఎలా సర్వనాశనం అయాడో ప్రత్యక్షంగా చూసిన డ్యూమాస్ తన నాటకాలలో కుటుంబ జీవనం, వివాహ వ్యవస్థల పవిత్రతను గూర్చి ప్రబోధించాడు. ఉదాహరణకు *లేడెమీ మాండే* (1855 లో ప్రదర్శితం) వేశ్యలవలన వివాహ వ్యవస్థకు ఏర్పడిన చేటును గురించి చర్చించింది. ఆధునిక ప్రేక్షకులకు డ్యూమాస్ నాటకాలు నీరసంగానూ, మాటల పోగులుగానూ కనిపించినా, 19 వ శతాబ్దం చివరి విమర్శకులు ఆ నాటకాలలోని నిజాయితీతో కూడిన నైతిక ప్రబోధాన్ని విశేషంగా ప్రస్తుతించారు. 1875 లో డ్యూమాస్ 'అకాడమీ ఫ్రాన్సాయిజ్' లో చేర్చుకోబడ్డాడు.

డ్యూమాస్ వ్రాసిన మిక్కిలి రసవంతమైన నాటకాలలో పేర్కొనదగినవి *లేఫిల్స్ నేచురల్* (1858 'ఔరస పుత్రుడు'), *అన్ పీరేప్రాడిగ్యు* (1859). ఈ రెండవ నాటకంలో డ్యూమాస్ తన తండ్రి స్వభావాన్ని చిత్రించాడు.

అలెగ్జాండర్ డ్యూమాస్ 1895 నవంబరు 27 న ఫ్రాన్స్‌లోని మార్లీలీరాయ్‌లో తుది శ్వాస విడిచాడు.

బొ. శ్రీ.

**డ్యూస్, యోవా డి (1830-96) :** పోర్చుగీసు మహాకవి. యోవా డి డ్యూస్ కాల్పనిక గేయ సంప్రదాయానికి భరత వాక్యం చెప్పడమే కాక, నవీన కవిత్వానికి నాంది కూడా పలికినవాడు. కోయింబ్రా విశ్వ విద్యాలయంలో డ్యూస్ న్యాయ శాస్త్రం అభ్యసించి పట్టభద్రుడయాడు. ఇతడు చీకూ చింతా



లేకుండా, ఆనందమే జీవిత ధ్యేయమని భావించి విశృంఖల జీవితం గడపడం వల్ల చదువు సరిగా సాగలేదు. అందుకే పట్టా పుచ్చుకోడానికి పదేళ్లు పట్టింది. విద్యార్థి దశలోనే గేయాలు వ్రాసి మిత్ర బృందానికి వినిపించేవాడు. వాటిని గ్రంథస్థం చేయాలన్న యోచన లేనేలేదు. అయినా ఇతని స్నేహితుల్లో కొందరు కొన్ని గేయాలను భద్రపరచి అప్పుడప్పుడు అక్కడక్కడ ప్రచురించేవారు. కోయింబ్రాలో ఇతడు యువ కవితా సారథిగా ఆనాడు ప్రాచుర్యంలో ఉన్న 'ఫార్మలిస్టు' కవిత్వంపై ధ్వజమెత్తాడు. అతని అభిమానులంతా కలసి అతనిని 1869 లో జరిగిన పార్లమెంటు ఎన్నికలలో అభ్యర్థిగా నిలిపి గెలిపించారు. అయితే అతడు ఆ పదవిలో పట్టుమని ఏడాది కూడా ఉండలేదు. ఒక సమస్యను పురస్కరించుకొని,

నైతిక బాధ్యతను స్వీకరిస్తూ తన పదవికి రాజీనామా చేశాడు. ఇందువల్ల అతని ప్రతిష్ఠ బాగా పెరిగింది. కాని ఆర్థికంగా ఇబ్బందుల్లో ఇరుక్కుపోయాడు. ఈ పరిస్థితు ల్లోనే పెళ్లి కూడా చేసుకొని మరింత క్లిష్టపరిస్థితులను ఎదుర్కోవలసి వచ్చింది. ధనార్జన కోసం కాయకష్టం చేయవలసి వచ్చింది. అతి చిన్న ఉద్యోగాలు చేయవలసి వచ్చింది. వాణిజ్య దృష్టికిలోనై కవితను అమ్ముకొనవలసి వచ్చింది. అయితే ఈ క్లిష్ట సమయంలోనే ఇతడు విద్యా బోధనలో సరికొత్త ప్రయోగం చేసి సఫలు డయాడు. ఇతడు కనుగొన్న నూత్న విద్యా విధానం 1888 వ సంవత్సరంలో అధికారికంగా పాఠశాలల్లో ప్రవేశ పెట్ట బడడమే గాక, ఆ బాధ్యత కూడా ఇతనికే అప్ప జెప్ప బడింది. అప్పటికే ఇతడు ప్రచురించిన రెండు కవితా సంపుటాలు ఇతనికి కీర్తి నార్జించి పెట్టాయి. ఆదాయం కూడా పెరిగింది. 1893 వ సంవత్సరంలో ఇతని సంపూర్ణ గ్రంథావళి ప్రచురితమై, సాహిత్యరంగంలో ఇతనికి స్థిరమైన స్థానం కల్పించింది. పోర్చుగీసు సాహిత్యలోకం ఇతనిని యుగపురుషునిగా కీర్తించి సంభా వించింది. 1896 లో విద్యార్థిలోకం ఇతనిని ఘనంగా సన్మానించింది. గేయ కవిత్వంలో విప్లవాత్మకమైన మార్పులు తెచ్చి, కాల్పనికోద్యమంలో విపరీత ధోరణు లకు ఆనకట్టకట్టాడు. సరళసుందరమైన ప్రేమ కవిత్వాన్ని రచించి, ప్రత్యక్షతా గుణస్ఫూర్తి చేత తన కాలంనాటి కవిత్వాన్ని ప్రభావితం చేశాడు. ఇతడు 20 వ శతాబ్ది ప్రారంభ దశలో పోర్చుగీసు నూత్న కవిత్వంపై చెరగని ముద్ర వేశాడు.

*గం.శ్రీ.*

**డ్రైజర్, థియొడోర్ (1871-1945)** : అమెరికన్ నవలా రచయిత; ప్రకృతివాద సిద్ధాంతానికి అమెరి కాలో ప్రధాన సమ ర్థకుడు. ఈయన రచనలలో ముఖ్య మైనవి: *సిస్టర్ కేరీ* (1900) *ది ఫైనా న్షియర్*(1912), *ది టైటాన్* (1914), *ఆన్ అమెరికన్ ట్రాజెడీ* (1925). 1871 ఆగస్టు 27 న ఒక పెద్ద కుటుం బంలో జన్మించిన



డ్రైజర్ బాల్యంలో దారుణమైన దారిద్ర్యం అనుభ వించాడు. జర్మన్ దేశీయుడైన తన తండ్రి యొక్క సంకుచితమైన కేథలిక్ నమ్మకాలు ఇతనికి రుచిం చక చర్చికి దూరమయాడు. నిరక్షరాస్య, సాధుస్వభావ అయిన ఔహాయో రాష్ట్రానికి చెందిన తల్లిని మాత్రం ఇతడు ప్రేమతో తరచు తలుచుకొంటూ ఉండేవాడు. ఇండియానా లోని వేరు వేరు పట్టణాలలో చదువు కొంటూ క్రమంగా ఇతడు యూనివర్సిటీ ఆఫ్ ఇండి యానాలో ఒక సంవత్సరం చదువు పూర్తి చేశాడు. తరువాత చికాగో, సెంట్‌లూయీ, మో, పిట్స్‌బర్గ్‌లలో కొన్నాళ్లు జర్నలిస్ట్‌గా పనిచేసి, చివరికి 1894 లో న్యూయార్క్ చేరుకొన్నాడు. అక్కడ అప్పటికే వాగ్గేయ కారుడు (Music composer) గా సుప్రసిద్ధుడైన తన అన్న 'పాల్ డ్రెస్సర్' సాయంతో ప్రతికలలో వ్యాసాలు వ్రాయడం మొదలు పెట్టాడు. టి.హెచ్. హక్స్‌లీ, హెర్బర్ట్ స్పెన్సర్, డార్విన్‌లచే ప్రభావితుడై నిరంతరా యంగా సాగుతున్న పరిణామం యొక్క ఫలితం ఈనాటి మనిషి అనీ, మారడానికి అతడు అశక్తుడనీ అతడు విశ్వసించేవాడు. 1898 లో సెంట్‌లూయీలో కలుసుకొన్న 'సారావైట్' తో అతనికి వివాహం జరిగింది. అయితే చంచల స్వభావం గల ఆతని ప్రవృత్తి వలన వారి వివాహం చిక్కులలో పడింది.

డ్రైజర్ 1900 వ సంవత్సరంలో ప్రకటించిన *సిస్టర్ కేరీ* 456 ప్రతులు మాత్రమే ఖర్చు అయాయి. యువన వలా రచయిత 'ఫ్రాంక్ నోరిస్,' ఇంగ్లండులోని ఆర్నాల్డ్ బెనెట్, హెచ్.జి. వెల్స్‌లు దానిని ప్రశంసించినా, త్వరలోనే అది మరుగున పడిపోవడం వల్ల డ్రైజర్ చాలా క్రుంగిపోయాడు. అతడు ఉన్మాదం సరిహద్దుల లోకి వచ్చాడు. బ్రూక్లిన్ నగరపు మురికివాడలలో పస్తులు ఉండసాగాడు. ఆ పరిస్థితిలో దయాళువు అయిన అన్న పాల్ అతనిని వెతుక్కొంటూ వచ్చి కాపాడాడు. సిస్టర్ కేరీ ఆ నవలలోని అనౌచిత్యం నాయిక అవినీతి ప్రవర్త నలో కంటె ఆమె పుట్టుకలోను, తన అవినీతికి ఆమె ఎట్టి దండననూ అనుభవించకపోవడంలోను ఎక్కువగా కనిపిస్తుంది.

సంపాదక వృత్తిలో తల దాచుకొంటూ 1907 లో *బుట్టెరిక్* పత్రికలకు డ్రైజర్ ప్రధాన సంపాదకుడు అయాడు. ఒక సహాయ సంపాదకుని కుమార్తె మీది వలపు కారణంగా 1910 లో ఆ ఉద్యోగాన్ని అతడు కోల్పోయాడు. తన రెండవ నవల *జెన్నీ జెర్‌హార్ట్* 1911 లో వెలువడింది. హెచ్. ఎల్ మెన్‌కెన్ మొదలైన

విమర్శకులు దానిని ప్రశంసించారు. *ది ఫైనాన్షియర్* (1912), *ది టైటాన్* (1914) అనే రెండు నవలలు అవినీతి పరులైన కూడా లోకంలో విజయం సాధించిన వారిపట్ల అతనికి గల వ్యామోహాన్ని చాటుతున్నాయి. 1915 లో *ది జీనియస్* అనే నవల వెలువడింది. డ్రెయిజర్ తిరిగి జీవనోపాధి కోసం పత్రికా రచన చేపట్ట వలసి వచ్చింది. తిరుగుబాటుదారులైన ఎడ్గార్‌లీ మాస్టర్స్ అనేకవీ, ఫ్లాయిడ్ డెల్, షెర్వుడ్ ఆండర్‌సన్, జార్జ్ జీన్ నాథన్, పావీస్ (powys) సోదరులు, లివిలిన్ మొదలైన రచయితలు అతనికి మిత్రులయారు. 1913 లో యూరప్ సందర్శించి వచ్చిన తరువాత డ్రైజర్ ఆత్మ కథా రూపమైన *ఏ ట్రావెలర్ ఎట్ ఫార్టీ* ప్రచురించాడు. అలాగే 1916 లో మోటారు మీద తన స్వరాష్ట్రానికి వెళ్లివచ్చిన తరువాత *ఏ హూజియర్ హాలీడే* ప్రచురించాడు. తరువాత *ప్లేస్ ఆఫ్ ది నాచురల్ అండ్ సూపర్ నాచురల్* (1916) ప్రచురించాడు. 1918 లో *ది హాండ్ ఆఫ్ ది పాటర్ ఫ్రీ*, అనే కథానికా సంపుటం, *ట్వెల్వ్‌మెన్* (1919) అనే వాస్తవ వ్యక్తుల పదచిత్రాలూ, *హేరబ్-ఎ-డబ్-డబ్* (1920), ఆత్మకథ అయిన *ఏ బుక్ ఎబౌట్ మైసెల్ఫ్* (1922), *కలర్ ఆఫ్ ఏ గ్రేట్ సిటీ* (1923) వెలువడ్డాయి. న్యూయార్క్‌లోని ఒక ప్రసిద్ధమైన హత్యా కేసు ఆధారంగా *ఏన్ అమెరికన్ ట్రాజెడీ* అనే నవల రచించాడు.

అతడు చనిపోయిన తరువాత కొద్ది కాలంలోనే ప్రజాదరణను కోలుపోయినా, నిజాయితీ, శక్తి, కారుణ్యం అనే గుణాలవల్ల సాహిత్యంలో డ్రైజర్ విశిష్టమైన స్థానాన్ని సంపాదించాడు. *సిస్టర్ కేరీ, ఏన్ అమెరికన్ ట్రాజిడీ* శాశ్వతమైన సాహిత్యపు విలువలు గల జానపద నవలలు. అతని రచనలు రష్యన్ భాషలోకి అనువదించబడి లక్షలాది కాపీలు ఖర్చు అయాయి.

1945 డిసెంబరు 28 న హాలీవుడ్‌లో డ్రైజర్ తన దేహ యాత్ర చాలించాడు.

బా.శ్రీ.

**డ్రైడెన్, జాన్ (1631-1700) :** ప్రముఖ ఆంగ్లకవి, నాటక రచయిత, సాహిత్య విమర్శకుడు, యుగకర్త. ఆనాటి సాహిత్య జగత్తు మీద అధిక ప్రాబల్యం చూపించినవాడు కావడం వల్ల ఆయుగం 'డ్రైడెన్ యుగం' గా ప్రసిద్ధి పొందింది. నార్తాంప్టన్ షైర్‌లోని ఆల్డ్‌వింకిల్ అనే పల్లెటూరులో ఒక సామాన్య కుటుంబీకునికి 1631 ఆగస్టు 19 వ తేదీన డ్రైడన్ జన్మించాడు. అతని 11 వ ఏట ఇంగ్లాండ్‌లో అంతర్యుద్ధం ప్రారంభం అయింది. అతని తండ్రి వైపు కుటుంబం, తల్లి వైపు కుటుంబం కూడా రాజుగారికి విరుద్ధంగా పార్లమెంటు పక్షం వహించారు. 1644 ప్రాంతంలో డ్రైడెన్ వెస్ట్ మినిస్టర్ స్కూలులో చేరి 'రిచర్డ్ బుస్‌బీ' శిష్యరికంలో సాంప్రదాయిక విద్య (classical education) అభ్యసించాడు. జీవితాంతం సాంప్రదాయిక సాహిత్యంతో అతనికి గల అనుబంధానికి వెస్ట్ మినిస్టర్‌లోనే అంకురార్పణ జరిగింది. 1650 లో డ్రైడెన్ కేంబ్రిడ్జ్‌లో ట్రినిటీ కళాశాలలో చేరి, 1654 లో బి.ఏ. పట్టభద్రుడయాడు. అక్కడ కొంతవరకు ఆయన విజ్ఞాన శాస్త్ర ప్రగతిలో ఆసక్తి ప్రదర్శించాడు. 1663 లో డ్రెయిడెన్ అప్పుడే స్థాపించబడిన రాయల్ సొసైటీకి ఫెలోగా ఎన్నుకోబడ్డాడు.

డ్రైడెన్ తొలి రచనలలో 1649 లో వెలువడిన *ఆలివర్ క్రాంవెల్* స్మారక సంచికలో ప్రచురించిన రచన



విజ్ఞుల దృష్టిని ఆకర్షించింది. ఆయన వ్రాసిన *హీరోయిక్ స్టాంజాస్* లో పరిణతి, శబ్ద సంయోజనలో మాధుర్యం వ్యక్తం అయాయి. ఈ విధమైన కవిత్వంలో డ్రైడెన్ సిద్ధహస్తుడు. 1660 లో రెండవ ఛార్లెస్ తిరిగి సింహాసనం ఎక్కినపుడు ఆయనను అభినందించిన కవులతో డ్రైడెన్ కూడా గొంతు కలిపాడు. ఆ ఏడాది జూన్‌లో *ఆస్ట్రేయియా రిడక్స్* (అంత్యానుప్రాసతో కూడిన 300 పంక్తులు గల రచన) ప్రచురించాడు. 1661 లో జరిగిన పట్టాభిషేకం సందర్భంలో *టు హిజ్ సేక్రెడ్ మెజెస్టీ* రచించాడు. ఈ రెండు కావ్యాల లక్ష్యం రాజరిక వ్యవస్థను బలపరచడం, రాజపదవికి ఠీవిని, నిత్యత్వాన్నీ, దివ్యత్వాన్నీ ఆపాదించడం. డ్రైడెన్‌ను తరచు అవకాశవాది అని విమర్శించడం జరిగినా, రాజుగారికీ, నూతన రాజరిక వ్యవస్థకూ ఆయన పలికిన స్వాగతం నిజాయితీతో కూడినది.

1663 డిసెంబరు 1 న బెర్క్‌షైర్ ప్రభువైన థామస్ హోవర్డ్ కడగొట్టు కుమార్తె ఎలిజబెత్ హోవర్డ్‌తో డ్రైడెన్‌కు వివాహం జరిగింది. బెర్క్‌షైర్ ప్రభువు

కుమారుడు సర్ రాబర్ట్ హోవర్డ్ అంతకుముందు నుంచే డ్రైడెన్‌కు మిత్రుడు. డ్రెయిడెన్ దంపతులకు ముగ్గురు కుమారులు కలిగారు.

డ్రైడెన్ రచించిన సుదీర్ఘకావ్యం *ఏనస్ మిరాబిలిస్* (1667) ఇంగ్లీషు నౌకాదళం డచ్చివారి మీద సాధించిన విజయాన్నీ, 1666 నాటి మహాగ్ని ప్రమాదం (Great fire) నుంచి బయట పడడాన్నీ అభినందించే కావ్యం.

1668 లో ఆస్థానకవి (poet laureate) సర్ విలియం డవెనెంట్ మరణించగానే డ్రైడెన్‌ను ఆస్థాన కవిగా నియమించారు. అటు తరువాత రెండేళ్లకు రాజవంశ చరిత్ర రచయితగా ఆయన నియమించ బడ్డాడు. ఆయన వార్షిక వేతనం 200 పౌండ్లు (1677 లో దానిని 300 పౌండ్లు చేశారు.) ఎప్పుడూ బకాయి పడుతూ ఉండేది. రాజుగారు చనిపోయే నాటికి డ్రైడెన్‌కు దాదాపు 1000 పౌండ్లు రావలసి ఉంది.

డ్రైడెన్ మొదటి నాటకం *ది వైల్డ్ గాలెంట్* (హాస్యరస ప్రధానమైన రూపకం) 1663 లో ప్రదర్శిం చబడింది. కాని అది ప్రజలను ఎక్కువగా ఆకర్షించలేదు. అయితే 1664 లో సర్ రాబర్ట్ హోవర్డ్‌తో కలసి తయారు చేసిన రూపకం *ది ఇండియన్ క్వీన్* విజయవంతమైంది. దానికి అనుబంధంగా డ్రైడెన్ ఒక్కడే రచించిన *ది ఇండియన్ ఎంపరర్* 1665 లో ప్రదర్శించబడి ఘనవి జయం సాధించింది. ప్లేగు మూలంగా మూతబడి, తిరిగి 1666 జూన్‌లో థియేటర్‌లు తెరువబడిన తరువాత ప్రదర్శించ బడిన డ్రెయిడెన్ రూపకం *సీక్రెట్ లవ్* లేక *ది మెయిడెన్ క్వీన్* విశేష ప్రజాదరణ పొందింది. ముఖ్యంగా అది రాజుగారిని ఎంతో అలరించింది. దానిలో రాజుగారి 'ప్రియురాలు 'మెల్‌గ్విన్' హాస్యపాత్ర అయిన 'ఫ్లోరిమెల్' పాత్రను పోషించింది.

1668 లో డ్రైడెన్ *ఆఫ్ డ్రమెటిక్ పొయెజీ, ఏన్ ఎస్సే* ప్రచురించాడు. తనతో సహా నలుగురు సమకాలీన రచయితల మధ్య జరిగిన చర్చ అది. దానిలో నాటక ప్రదర్శన సూత్రాలూ, ప్రక్రియలూ, ప్రాచీన అధునాతన నాటకాల తీరూ, ఫ్రెంచ్, ఇంగ్లీష్ నాటకాల మధ్య భేదం చర్చించబడ్డాయి. దానిలో వాడిన సరళమైన వ్యావహారికశైలి అటు తరువాతి రచయితల కెందరికో ఒరవడి పెట్టింది.

1668 లో డ్రైడెన్ 'కిల్లీ గ్రూ' కంపెనీవారికి ఏడాదికి మూడు నాటకాల చొప్పున వ్రాసి ఇచ్చేట్టూ, అందుకు ప్రతిఫలంగా పదవ వంతు వాటాదారుగా తనను ఆ కంపెనీలో చేర్చుకొనేట్టూ ఒప్పందం కుదుర్చుకొ న్నాడు. తద్వారా ఏడాదికి 300 పౌండ్లు మొదలు 400 పౌండ్లు దాకా డ్రైడెన్‌కు ఆదాయం వచ్చేది. అలా ఆయన వ్రాసిన నాటకాలలో చెప్పుకోదగినవి: *టిరా నిక్ లవ్* (1669), *ది కాంక్వెస్ట్ ఆఫ్ గ్రెనెడా* (1670-71), *ఔరంగ్ జేబ్* (1675) *హిస్ మేరేజ్ ఆ-లా-మోడీ, ఆల్ ఫర్ లవ్* (షేక్స్‌పియర్ ఆంటోని అండ్ క్లియోపాత్ర ఆధారంగా వ్రాసింది-1677).

1678 లో డ్రైడెన్‌కు కిల్లీ గ్రూ కంపెనీ వారితో పేచీ వచ్చి విడిపోయి *ఈడిపస్* అనే నాటకాన్ని దాని ప్రత్యర్థి నాటక సమాజానికి వ్రాసి ఇచ్చాడు.

పద్యాలలో వ్యంగ్య పరిహాస రచనలు కూడా డ్రైడెన్ ప్రవేశపెట్టాడు.

1688 లో రెండవ జేమ్సు రాజ్యపరిత్యాగం చేయ డంతో డ్రైడెన్‌కు గల రాజకీయావకాశాలన్నీ అంతరించి పోయాయి. అతని ఆస్థానకవి పదవి 'షాడ్‌వెల్' కు లభించింది. మళ్లీ అతడు నాటకరంగం వైపు దృష్టి మళ్లించి *డాన్ సెబాస్టియన్* (1689), *ఆంఫిట్రియాన్* (1690), *కింగ్ ఆర్థర్* (1691) రచించాడు. 1694 లో *లవ్ ట్రియా ఫెంట్* అనే విషాద హాస్య రూపకం (tragi comedy) విఫలం కావడంతో డ్రెయిడెన్ రంగ స్థల నాటక రచననుంచి విరమించుకొన్నాడు.

1684 నుంచే డ్రెయిడెన్ జాకబ్ టామ్‌సన్ అనే ప్రచురణ కర్తకు కవితా సంకలనాలు పర్యవేక్షణ చేస్తూ ఉండేవాడు. తన పద్యాలు కూడా కొన్ని - ముఖ్యంగా అనువాదాలు - వాటిలో ప్రచురించబడ్డాయి. 1692 లో డ్రైడెన్ *ఇలియనోరా* అనే సుదీర్ఘ స్మృతికావ్యం ప్రచురించాడు. చివరి రోజులలో డ్రైడెన్ చేసిన గొప్ప రచన *వర్జిల్* అనువాదం. ఆ అనువాదానికి గాను డ్రెయిడెన్‌కు సుమారు 1400 పౌండ్లు లభించాయి. టామ్‌సన్‌కు డ్రైడెన్ వ్రాసి ఇచ్చిన అఖరి రచన *ఫేబుల్స్ ఏన్షియెంట్ అండ్ మోడర్న్* (1700).

నూతన యుగం ఆవిర్భవించక మునుపే 1700 మే నెల 1 వ తేదీన లండన్ నగరంలో డ్రైడెన్ మహాకవి అస్తమించాడు. 'వెస్ట్ మినిస్టర్ ఆబీ'లో కవులకోసం నిర్దే శించిన ప్రదేశంలో జియోఫ్రీ ఛాసర్, అబ్రహం కౌలీల సమాధుల మధ్య డ్రైడెన్ భౌతిక కాయాన్ని సమాధి చేశారు.

బా.శ్రీ.

**తమాయా యి బవూస్, మానుయేల్ (1829-98)** : స్పానిష్ నాటక రచయిత; అడిలార్డో అయాలా యి-హెరేరా తో కలసి ఆయన 19 వ శతాబ్ది మధ్య

భాగంలో శ్వానిష్ నాటక రంగాన్ని తీర్చి దిద్దాడు. కాల్పనికత నుంచి వాస్తవికత వైపునకు శ్వానిష్ సాహిత్యా రథాన్ని మరలించిన వారిలో తమాయా ముఖ్యుడు.

తమాయా ఒక సుప్రసిద్ధ శ్వానిష్ నటుని కుమారుడు. చిన్నతనంలోనే నాటకాలను వ్రాయడం ప్రారంభించాడు. తన 11 వ ఏట మొదటి నాటకం రంగస్థలం మీద ప్రదర్శించ బడింది. నాటక సాహిత్యంలో వివిధ ప్రక్రియలలో ప్రయోగాలు చేశాడు. విరివిగా నాటకాలు వ్రాసి నాటక రంగంలో ఘనవిజయం సాధించాడు.

తమాయా 1870 వ సంవత్సరంలో నాటక రచనకు స్వస్తి చెప్పి అటు తర్వాత "బిబిలియోటికా నేషనల్" అనే సంస్థకు డైరెక్టరుగానూ, శ్వానిష్ అకాడమీకి కార్యదర్శిగానూ పనిచేశాడు.

ఇతని జీవితాన్ని రెండు ఘట్టాలుగా విభజింప వచ్చును. ఇందులో మొదటి ఘట్టంలో ఇతని మీద జర్మన్ నాటక రచయిత ఫ్రీడ్రిఖ్ షిల్లర్ ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది. ఆ ప్రభావంతో వ్రాసినవే *స్త్రీ*, *ప్రేమ పిచ్చి* మొదలైన నాటకాలు.

రెండో ఘట్టంలో వాస్తవికతా వాద దృష్టితో నాటకాలు వ్రాసి సమకాలీన శ్వానిష్ సమాజంలో ఉన్న కుళ్లును తమాయా ప్రదర్శించాడు. *లో పోజిటివో* (1862), *లాన్సెస్ డి ఆనర్* (1863), *లోస్ హాంబ్రెస్ డి బీన్* (1870) వంటి నాటకాలు ఈ దశకు చెందినవి. రంగస్థల నటుడుగా అనుభవం ఉన్న తమాయా రంగస్థలోచితమైన చక్కని రచనలు చేశాడు. ఇతని ప్రహసనాలు జీవం ఉట్టి పడుతూ ఉంటాయి.

తమాయా రచనలలో తలమానికమైంది: *క్రొత్త నాటకం* (1867). ఈ నాటకం వల్ల ఇతనికి అంతర్జాతీయ ఖ్యాతి లభించింది. ఇందులో విషాదాన్ని అతి నేర్పుతో ఆయన చిత్రించాడు.

శే.వెం.న.

**తాహా, హుసెయెన్ (1889-1973) :** ఈజిప్టు సాహిత్యంలో ఆధునిక ఉద్యమంలో ప్రముఖ వ్యక్తి. అరబ్బీభాషలోని ఆయన రచనలలో నవలలూ, కథలూ, విమర్శలూ, రాజకీయ వ్యాసాలూ ఉన్నాయి. స్వదేశానికి బయట ఆయన స్వీయచరిత్ర *అల్ అయ్యామ్* (1929-32) ప్రసిద్ధి పొందింది.

సాధారణ పరిస్థితులలో పుట్టి, తన రెండవ ఏట గుడ్డివా డయాడు. 1902 లో అల్ అఝూర్ మఠానికి వెళ్ళాడు. ఇది ఇస్లాం మతంలో ప్రముఖ విద్యాపీఠంగా పేరు పొందింది. కొద్ది కాలంలోనే హుసెయెన్‌కు, అక్కడున్న సంప్రదాయ దృష్టిగల అధికారులతో సరి పడలేదు. అప్పుడు క్రొత్తగా స్థాపించిన లౌకికమైన కైరో విశ్వవిద్యాలయంలో చేరాడు. అక్కడ పిహెచ్.డి. (1914 లో)పొందిన వారిలో మొదటివాడు. తరువాత పారిస లోని సోర్‌బోన్‌లో విద్య నభ్యసించి పాశ్చాత్య సంస్కృతిని గురించి తెలుసుకొన్నాడు.

కైరో విశ్వవిద్యాలయంలో అరబ్బీ భాషాచార్యుడుగా స్వదేశానికి తిరిగి వచ్చాడు. ఆయన సాహసోపేతమైన అభిప్రాయాల వలన అక్కడున్న సంప్రదాయ వాదులతో ఆయనకు వివాదాలు చెలరేగాయి. ఆధునిక విమర్శనా పద్ధతులను ప్రవేశపెట్టడం వలన ఆయనకు శత్రువులు ఎక్కువ యారు. *ఇస్లామ్‌కు పూర్వపు కవిత* అనే గ్రంథంలో ఇస్లాంకు పూర్వం ఉన్న కవిత అని చెప్పబడేది నిజంగా ఇస్లాం తరువాత వ్రాయబడింది అనీ, ఖురాన్ లోని పురాణ గాథల్ని నమ్మదగినవిగా చేయడానికి వాటిని అంతకు పూర్వపు కవిత్వమని చెప్పారనీ అభిప్రాయ పడ్డాడు. అందు వలన ఆయనను స్వధర్మాన్ని వీడిన మనిషిగా చూశారు. 1938 లో వ్రాసిన ఇంకో పుస్తకం *ది ఫ్యూచర్ ఆఫ్ కల్చర్ ఇన్ ఈజిప్ట్* లో ఈజిప్ట్ సంస్కృతి, నాగరికత, విస్తృతమైన మధ్యధరా నాగరికత సన్నిహితమైనవనీ, గ్రీక్, ఫ్రెంచ్ నాగరకతలు దానిలో అంతర్భాగాలనీ తన విశ్వాసాన్ని ప్రకటించాడు. యూరపియన్ నాగరకతను ఈజిప్ట్ జీర్ణించు కోవాలని కోరాడు.

1950 నుండి 1952 లో రాజరికం అంతమయ్యే వరకు విద్యామంత్రిగా పనిచేసి, విద్యావ్యాప్తికి బాగా కృషి చేశాడు. విద్యా రుసుమును రద్దు చేశాడు. తరువాతి కాలంలో చేసిన రచనలలో పేదవారి యెడల సానుభూతి, ప్రభుత్వ సంస్కరణలలో ఎక్కువ ఆసక్తి కనబరిచాడు. స్వీయరచన లన్నీ పొందుపరుస్తూ, 1967 లో ఆయన తన 78 వ ఏట *ముథాక్కిరత్* అనే పుస్తకం ప్రచురించాడు.

ఇ.నా.

**తుర్గెనేవ్, ఇవాన్ (సెర్జియేవిచ్) (1818-1883):** ప్రముఖ రష్యన్ నవలా రచయిత, కవి, నాటక రచయిత. *స్పోర్ట్స్ మన్స్ స్కెచెస్* (1852), *రూడిన్* (1856), *హోమ్ ఆఫ్ ది జెంట్రీ* (1859), *ఆన్ ది ఈవ్* (1860), *ఫాదర్స్ అండ్ సన్స్* (1862) మొదలైన సుప్రసిద్ధ గ్రంథాల రచయిత. 1856 తరువాత తుర్గెనేవ్ ఎక్కువగా జర్మనీ, ఫ్రాన్స్‌లలోనే తన జీవితం గడిపాడు.

సెర్జీ తుర్గెనేవ్ అనే పదవీ విరమణ చేసిన ఒక అశ్విక దళోద్యోగికీ, 'వర్వారా పెట్రో వ్నా నీ లుటోవినోవా' అనే ధనవంతురాలైన తల్లికీ రెండవకుమారుడుగా ఇవాన్ తుర్గెనేవ్ రష్యాలోని ఓర్యోల్‌లో 1818 నవంబరు 9 వ తేదీన జన్మించాడు. 1834 లో చనిపోయిన తండ్రి ప్రభావం కంటె తుర్గెనేవ్ మీద తల్లి ప్రభావమే ఎక్కువ. *ఫస్ట్ లవ్* (1860) అనే సుప్రసిద్ధమైన తుర్గెనేవ్ కథలో తన తండ్రి పాత్ర శక్తిమంతంగా చిత్రించబడింది. తుర్గెనేవ్ రచించిన ప్రధానమైన నవలలలోని నాయికల చిత్రణలో ప్రభావవంతమైన తన తల్లి పాత్రకు తుర్గెనేవ్ శాశ్వతత్వం కలిగించాడు.



1840-50 మధ్య తుర్గెనేవ్ *ఏ కాన్వర్సేషన్, ఆంద్రీ ది లాండ్ ఓనర్* వంటి సుదీర్ఘ కావ్యాలను రచించాడు. కొన్ని సాహిత్య విమర్శక వ్యాసాలు కూడా వ్రాశాడు. సెంట్ పీటర్స్ బర్గ్ విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్ పదవిని సంపాదించడంలో విఫలుడై ప్రభుత్వోద్యోగం కూడా విరమించుకున్న తరువాత తుర్గెనేవ్ *ఇంటెలెక్చువల్ వితవుట్ ఏ విల్, ది డయిరీ ఆఫ్ ఏ సూపర్ పయస్ మాన్* (1850) వంటి వచన రచనలు చేశాడు.

అదే కాలంలో *ఏ పూర్ జంటిల్‌మన్* (1848 - నికొలాయ్ గొగోల్ రచనకు ఇది అనుకరణ) వంటి నాటకాలను కూడా రచించాడు. తుర్గెనేవ్ నాటకాలలో *ది బాచులర్* (1849) ఒక్కటే ప్రదర్శించబడింది. ఆయన నాటకాలలో *ఏ మంత్ ఇన్ ది కంట్రీ* (1855) మణి పూసవంటిదని భావిస్తున్నారు.

1847 లో విదేశాలకు వెళ్ళడానికి ముందు సాహిత్య పత్రిక *సోవ్రెమెన్నిక్* (The contemporary) కార్యాలయంలో తుర్గెనేవ్ 'ఖోర్ అండ్ కాలినిచ్' అనే ఇద్దరు రైతుల సంగ్రహ సంభాషణను వదలి వెళ్లాడు. అది విశేష ప్రజాదరణ పొందింది.

తుర్గెనేవ్ నవలలలో *మూమూ* సెంట్ పీటర్స్ బర్గ్‌లో అతడు నిర్బంధంలో ఉన్న కాలంలో రచించబడింది. దానిలో బానిస వ్యవస్థలో ఉన్న క్రూరత్వాన్ని తుర్గెనేవ్ ప్రస్ఫుటంగా చిత్రించాడు. అతడు వ్రాసిన నవలలలో *యెకోవ్ పసెంకోవ్* (1855), *రూడిన్* (1856), *హోమ్ ఆఫ్ ది జెంట్రీ* (1859) ఎన్నగదినవి. తుర్గెనేవ్ రచించిన సర్వోత్కృష్టమైన నవల *ఫాదర్స్ అండ్ సన్స్* (1862).

ప్రముఖులైన తన సమకాలిక రచయితలలో కంటె తుర్గెనేవ్‌లో కనిపించే విశిష్ట లక్షణాలు : ఏ మాత్రం అతిశయోక్తి లేకపోవడం, సమతౌల్యాన్ని పాటించడం, కళాత్మకమైన విలువలను పాటించడం. లేఖల రచయితగా కూడా తుర్గెనేవ్ పాఠకులను విశేషంగా ఆకర్షించాడు. డాస్టాయెవిస్కీ, టాల్‌స్టాయ్‌లు తుర్గెనేవ్ కంటె ఎక్కువ ప్రసిద్ధి ఆర్జించినా, తుర్గెనేవ్‌లోని స్పష్టత, హుందాతనం ఆయన కీర్తిని చిరస్థాయిగా చేయగలిగాయి.

బొ.శ్రీ.

**తూ ఫూ (712-770) :** చైనీస్ కవి. ఆ భాషలో అందరి కంటె గొప్ప కవి అని విమర్శకుల అభిప్రాయం. పండిత కుటుంబంలో జన్మించి, సాంప్రదాయికమైన కన్‌ఫ్యూషియన్ విద్యా విధానంలో చదివాడు. కాని ఇంపీరియల్ పరీక్షలో ఉత్తీర్ణుడు కాలేకపోయాడు. అందువలన తన యౌవన దశలో ఎక్కువ కాలం పర్యటనలు సాగించి, కవిగా మన్నలు పొంది, ఇతర కవులను కలసికొన్నాడు. వారిలో లీ పో కూడా ఉన్నాడు. టావో మతంతో కొన్నాళ్లు



సంబంధం పెట్టుకొని, రాజధానికి వచ్చి సాంప్రదాయిక కన్‌ఫ్యూషియన్ మతాన్నే స్వీకరించాడు. తరువాత లీ పోని ఎప్పుడూ కలసికోలేదు.

740 వ దశాబ్దంలో తూఫూకి ధనమూ, అధికారమూ లేకపోయినా, ఇంపీరియల్ పరీక్షలో రెండవ సారి తప్పినా, ఆయనను ఎక్కువగా గౌరవించేవారు. 751-755 మధ్యకాలంలో తన రచనా పరంపరను ప్రభువుదృష్టికి తేవడానికి ప్రయత్నించాడు. ఈ రచనలలో రాజకీయాలపై సలహా లున్నాయి. వాటిలో వాడిన భాష పొగడ్తలతో కూడి ఉండడం వలన ఆయనకు రాజాస్థానంలో గౌరవపదవి దొరికింది. 752 ప్రాంతంలో పెళ్లి చేసుకొని వ్యవసాయ భూమిని సంపాదించాడు. అప్పటికే ఊపిరి తిత్తుల వ్యాధి సోకింది. 755 లో జరిగిన ఆన్‌లూషాన్ తిరుగుబాటులో చాలా కష్టాల పాలయాడు. 757 లో ఏదో విధంగా తప్పించుకొని, వలస ప్రాంతంలో ఉన్న రాజాస్థానంలో ప్రవేశించి సెన్సార్ గా నియమితు డయాడు. ఆయన పంపిన పత్రాలు చక్రవర్తికి రుచించ నందున ఆయన పదవి పోయింది. మళ్లీ పేదరికం, ఆకలి బాధలకు గురి అయి తన సంతానంలో పలువురు తిండి లేక చనిపోవడం చూశాడు. 764 వరకు తిరుగుతూ స్థానికంగా పలుకుబడి ఉన్న ఒక ప్రభువు దగ్గర పనిచేసి కొంతభూమిని సంపాదించి క్యూయి-చౌలో వ్యవసాయదారుడుగా స్థిరపడ్డాడు. 768 లో మళ్లీ తిరుగుతూ దక్షిణ దిశగా వెళ్లాడు. 770 లో చనిపోయాడు. ప్రచారంలో ఉన్న గాథను బట్టి ఆయన పదిరోజుల ఉపవాసం తరువాత అమితంగా తిని, త్రాగడం వలన చనిపోయాడని ప్రతీతి.

తొలి దశలో తూఫూ వ్రాసిన కవిత్వంలో ప్రకృతి సౌందర్యాన్ని గురించి, కాలం మారిపోవడాన్ని గురించి ఉన్నాయి. తరువాత యుద్ధాన్ని గురించి నిశితంగా వ్రాశాడు. రాజాస్థానంలో ఉండే వైభవం గురించి వ్యంగ్యంగా చిత్రించాడు. వ్యక్తిగతమైన బాధలతోను, జాతీయ సంక్షోభం తోను రాటుదేరిన తరువాత 755-759 మధ్య కాలంలో ఆయన వ్రాసిన కవిత్వంలో అర్థంలేని యుద్ధంలో ఇరుక్కున్న మానవుల పట్ల జాలి కనబడుతుంది.

తూఫూకు చైనీస్ సాహిత్యంలో గల అత్యున్నతస్థానం ఆయనకు ఛందస్సు వాడడంలో గల సౌలభ్యం మీద, సంప్రదాయ దృష్టితోకూడిన (Classicism) సాహిత్యాన్ని వెలువరించడం మీద ఆధారపడి ఉంది. ఆయన కాలంలో వాడుకలో ఉన్న అన్ని సాహిత్య ప్రక్రియలలోను ఆయన నిపుణుడు.

ఇ.నా.

**థర్బర్, జేమ్స్ (1894-1961)** : అమెరికన్ రచయితగా, వ్యంగ్య చిత్రకారుడుగా (కార్టూనిస్ట్) గా పేరు పొందాడు. ఈయన రచనలలో, చిత్రాలలో పట్టణ వాసి అయిన మానవుడు తనను ఆవరించిన ప్రపంచాన్ని అవగాహన చేసుకోలేక వేరే ఊహా ప్రపంచంలోకి పారిపోతాడు. తాను ఉంటున్న ప్రపంచం తను సృష్టించింది కాదు; అది తనకు అర్థంకాదు. *వాల్టర్ మిట్టీ రహస్య జీవితం* అనే కథలో భార్యావిధేయుడైన పగటికలలు కనే వాల్టర్ మిట్టీ అటువంటి ఒక పట్టణవాసి. ఇటువంటి పాత్రలు ఆయన రచనలలో మనకు తరచుగా కనిపిస్తాయి.

థర్బర్ 1931 నుండి 1918 వరకు ఒహాయో స్టేట్ యూనివర్శిటీలో విద్య నభ్యసించాడు. అయితే అక్కడ ఆయన డిగ్రీ పొందలేదు. తరువాత విదేశ వ్యవహారాల శాఖలో వాషింగ్టన్‌లోనూ, పారిస్‌లోను గుమాస్తాగా పనిచేశాడు. స్వస్థలమైన కొలంబస్‌కు వచ్చి పత్రికా విలేఖకుడుగా కొన్నాళ్లు పనిచేశాడు. 1924 లో పారిస్ వెళ్ళి నవలా రచనకు ప్రయత్నించాడు. కాని అది ఫలించలేదు. ఇంకో రెండు సంవత్సరాలు పత్రికా విలేఖకుడుగా వివిధ పత్రికలకు పారిస్‌లోను, న్యూయార్క్‌లోను పనిచేశాడు. 1927 లో హెరాల్డ్ రాస్ కొత్తగా స్థాపించిన *ది న్యూయార్కర్* అనే పత్రికలో చేరి, దాని నాగరకమైన రీతికి ముఖ్య కారకు డయాడు. ఈ పత్రికలో తన సహచరులను గురించి *ది యియర్స్ విత్ రాస్* 1959 అనే పుస్తకంలో వ్రాశాడు.

ఆయన మొదటి చిత్రం 1931 లో వెలువడింది. తాను ముఖ్యంగా రచయితనని, చిత్రాలు వేయడం తేలికైన పని అని ఆయన తలచేవాడు. కాని ఆయన స్నేహితుడు, వ్యాసకర్త అయిన ఇ.బి.వైట్ ఆ చిత్రాల విలువ కనిపెట్టి వాటిని వారిద్దరు కలసి రచించిన *ఈజ్ సెక్స్ నెసెసరీ* (1929) అనే పుస్తకంలో ప్రచురించాడు. థర్బర్ రచనలలో పదే పదే కనపడే పాత్రలలో గయ్యాళి భార్య, పిరికిభర్త, శాంతంగా, నిశ్శబ్దంగా ఉంటూ గమనించే జంతువులూ ఉంటాయి. ఇవి ఆయన కల్పించిన పట్టణ గాథలలో ప్రసిద్ధి కెక్కాయి.

1933 లో *ది న్యూయార్కర్* పత్రిక వదలి వెళ్ళిన తరువాత కూడా ఆయన రచనలు దానికి పంపేవాడు. చిన్నప్పుడు జరిగిన ప్రమాద కారణంగా 1940 నాటికి

ఆయనకు కంటిచూపు తగ్గింది. అందువలన బొమ్మలు గీయడం తగ్గించాడు. 1952 నాటికి అంధత్వం బాగా ఎక్కువ కావడం వలన అది పూర్తిగా మానివేశాడు.

1933 లో రచించిన *మై లైఫ్ అండ్ హార్డ్ టైమ్స్* లో తన జీవితానికి సంబంధించిన భ్రమలు ఉన్నాయి. 1952 లో వెలువడిన *ది థర్బర్ ఆల్బమ్* లో కుటుంబానికి సంబంధించిన బొమ్మలు ఉన్నాయి. 1940 లో ప్రచురించిన *ఫేబుల్స్ ఫర్ అవర్ టైమ్* లో మానవుల తెలివి మాలిన పనులను గురించి స్పష్టమైన, నిశితమైన అభిప్రాయాలు ఉన్నాయి. 1941 లో ఎలియట్ నూగెంట్‌తో కలసి వ్రాసిన *ది మేల్ ఆనిమల్* అనే నాటకంలో విద్యావిషయిక స్వేచ్ఛ గురించి వ్రాశాడు. ఆధునిక కాలంలో వ్రాసిన ఊహాకల్పనలలో (fantasies) *ది 13 క్లాక్స్* (1950), *ది వండర్‌ఫుల్ ఓ* (1957) చాలా జయప్రదమైనవి. 1960 లో ఆయన రచనలూ, బొమ్మలూ కలసి ఉన్న *ది థర్బర్ కార్నివాల్* ను నాటకంగా ప్రదర్శించారు. అందులో ఆయన కూడా పాత్ర ధరించాడు. 1962 లో *క్రెడోస్ అండ్ క్యూరియోస్* అనే పుస్తకం ఆయన మరణానంతరం వెలువడింది.

ఇ.నా.

**థియోక్రిటస్ (క్రీ.పూ. 310-250) :** గ్రీక్ కవి గ్రామీణుల, గొల్లకాపరుల జీవితానికి సంబంధించిన (Pastoral) కవిత్వానికి సృష్టికర్త. ఆయన కవితలను *ఐడిల్స్* చిన్న పద్యాలు అనేవారు.

ఈ చిన్న పద్యాల ద్వారా తెలిసే విషయాల కంటె ఆయన జీవితాన్ని గురించి వేరేమీ తెలియదు. ఆయన సిసిలీలో జీవించాడు. అప్పుడప్పుడు కోస్, అలెగ్జాండ్రియా, రోడ్ నగరాలలో కూడా గడిపాడు. ఆయన పద్యాలు ఒక విధమైనవి గ్రామీణ దృశ్యాల్ని చిత్రిస్తాయి. రెండవ రకం కావ్యాలు, గేయాలు పట్టణ ప్రాంతాలను వర్ణిస్తాయి.

ఈయన రచనలలో అతిముఖ్యమైనవి గ్రామీణ జీవితాన్ని, గొల్లకాపరుల జీవితాన్ని చిత్రిస్తాయి. గొల్లకాపరులు వనదేవతలను ప్రేమించడం, వారి పాటల పోటీలు ఈ కవితలలో వర్ణించబడ్డాయి. లాటిన్ భాషలో వర్జిల్ వ్రాసిన *ఎకోలాగ్స్* కు ఇవి మూలం. పునరుజ్జీవన (Renaissance) యుగంలో మిల్టన్ వ్రాసిన *లిసిడేస్*, షెల్లీ వ్రాసిన *ఆడొనాయిస్*, మాథ్యూ ఆర్నాల్డ్ వ్రాసిన *థిర్సిస్* ల మీద ఈ కవిత్వ ప్రభావం ఎక్కువగా గోచరిస్తుంది. ఈయన కవితలలో ఎక్కువ ప్రసిద్ధి పొందిన వాటిలో *థిర్సిస్* ఒకటి. ఇది తొలిగ్రామీణ కవి అయిన డాఫ్నిస్ భగ్నప్రేమ వలన మరణించగా ఆయనమీద వ్రాసిన స్మృతిగీతం. రెండవది *థాలీసియా* కోస్ అనే దీవిలో జరిగే ఉత్సవాన్ని వర్ణించేది.

ఈయన పద్యాలలో అనంతరకాలంలో వచ్చిన పాస్టరల్ కవిత్వంలో కనబడే అసహజ సౌందర్యం ఎంత మాత్రం లేదు. రైతులకు వారి స్థితికి మించిన భాషను, ఊహలను ఆపాదించా యని ఆ పద్యాలపై విమర్శ ఉంది. ఇది కొంత వరకు నిజమైనా, ఆధునిక గ్రీక్ జానపద గేయాలతో పోల్చి చూస్తే *థియోక్రిటస్* పద్యాలతో, వాటికి ఎంతో దగ్గర సంబంధం ఉందని తోస్తుంది.

ఇ.నా.

**థోరో, హెన్రీ డేవిడ్ (1817-62) :** అమెరికాకు చెందిన వ్యాసకర్త, కవి, కర్మయోగి. 1854 లో తాను రచించిన *వాల్డెన్* అనే గ్రంథంలో విశదీకరించిన సిద్ధాంతాలను తన జీవితంలో స్వయంగా అమలు పరచిన వ్యక్తిగా ప్రసిద్ధికెక్కాడు. 1849 లో రాసిన పౌర అవిధేయత (civil disobdience) అనే వ్యాసంలో ఉదాహరించిన పౌరహక్కులను గురించి గట్టిగా వాదించినవాడు.



కాంకర్డ్ గ్రామంలో పుట్టి పెరిగి, అక్కడి పరిసరాలతో (అడవులు, సెలయేళ్లు, పచ్చికబయళ్లు) ఎక్కువ సన్నిహితత్వం ఏర్పరచుకొని, వాటినే తన ప్రపంచంగా భావించినవాడు. ఆయన సాధారణ కుటుంబానికి చెందినవాడు. బడిలో ఉపాధ్యాయుల మన్ననలను పొంది, హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో చేరాడు. 1837 లో పట్టభద్రుడయాడు.

1839 లో తన సోదరుడైన జాన్‌తో కలసి కాంకర్డ్ మెర్రిమ్యాక్ నదులలో నావ ప్రయాణం సాగించాడు. ఈ యాత్రలో ప్రకృతి సౌందర్యం అతణ్ణి ముగ్ధుణ్ణి చేసింది. ప్రకృతి కవిగా పేరు పొందడం తన జీవితాశయంగా నిర్ణయించుకున్నాడు.

అదృష్టవశాత్తు తన గ్రామంలో రాల్ఫ్ వాల్డో ఎమర్సన్ తో స్నేహం కుదిరింది. ఎమర్సన్‌కు అనువైన శిష్యుడు లభించాడు. థోరోకు పితృతుల్యుడు, మిత్రుడు,

మార్గదర్శి లభించాడు. ఎమర్సన్ తన ఆకర్షణ శక్తి వలన అనేక మందిని ప్రభావితులను చేశాడు. వీరందరి చింతనల ఫలితంగా న్యూ ఇంగ్లండులో ట్రాన్సెండెంటలిజమ్ అవతరించింది. ఇది 19 వ శతాబ్దంలో అమెరికాలోని ముఖ్యమైన సాహిత్య ఉద్యమం. దీనికి నాయకులు ఎమర్సన్, థోరోలు. ఇద్దరికీ అంతర్జాతీయ ఖ్యాతి లభించింది. ఈ ఉద్యమం కాల్పనికోద్యమాన్ని, సంస్కారాన్ని మిళితం చేసింది. సంఘం కన్న వ్యక్తికీ, హేతువు కన్న ఉద్వేగానికి, మానవుని కన్న ప్రకృతికి దీనిలో ప్రాధాన్యం ఇచ్చారు. జ్ఞాన సముపార్జనకు రెండు మార్గాలున్నాయని ఈ ఉద్యమం ఒప్పుకొంది. అవి: జ్ఞానేంద్రియాలు (Senses), సహజజ్ఞానం (Intuition). అయితే సహజ జ్ఞానం, బోధనను మించినదని ఈ ఉద్యమం నొక్కి చెప్పింది.

1837 లో థోరో ఒక దినచర్య (Journal) పుస్తకాన్ని ప్రారంభించి, ఇంచుమించు తన జీవితాంతం దాన్ని కొనసాగించాడు. ఎమర్సన్ సారథ్యంలో *ది డయల్* అనే పత్రిక వెలువడింది. దాని మొదటి సంపుటిలో థోరో రచించిన *సింపతీ* అనే పద్యం ప్రచురించారు. ఈ పత్రికలోనే ఆయన వ్యాసాలు, పద్యాలు, అనువాదాలు చాలా వచ్చాయి.

1840 లో ఎలెన్ సెవాల్ అనే ఆమెను ప్రేమించి పెళ్ళి చేసుకోవాలనుకొన్నాడు. ఆమె తండ్రి అభ్యంతరం వలన ఆ పెళ్ళి ఆగిపోయింది.

కవిగా జీవించడానికి ఎమర్సన్‌కు ఎక్కువ ప్రోత్సాహమున్నా, అప్పుడప్పుడు కష్టపడి పనిచేయవలసి వచ్చింది. ఎమర్సన్ థోరోను తన దగ్గర ఉండమని ఆహ్వానించాడు. కాని థోరోకు మనశ్శాంతి లభించలేదు. 1842 లో తన సోదరుడైన జాన్ చనిపోవడంతో ఆయనకు మనశ్శాంతి మరింత నశించింది. తరువాత న్యూయార్క్‌లో సాహితీ ప్రపంచంలో స్థానం సంపాదించే ఉద్దేశ్యంతో అక్కడికి వెళ్లాడు. కాని నిరాశతో స్వగ్రామానికి తిరిగి వచ్చాడు.

1845 లో కాంకర్డ్‌కు రెండు మైళ్ళలో ఉన్న వాల్డెన్ కొలను దగ్గర చిన్న కర్ర ఇల్లు కట్టుకొని జూలై 4 వ తేదీన దానిలో ప్రవేశించాడు. అది ఆయన వ్యక్తిగత స్వాతంత్ర్య దినం.

ఈ అనుభవం వలన ఆయనకు ఎక్కువ సంతృప్తి కలిగింది. ఆయనకు తగినంత తీరిక సమయం దొరికింది. అప్పుడు ప్రపంచం నిజంగా ఎలా ఉందో ఆలోచించసాగాడు. తనకు కావలసిన చిన్న కోరికలు తీర్చుకోడానికి సమయం చిక్కింది. తనకు అవసరమైన చిక్కుడు తానే పండించుకో గలిగాడు. ఈ ప్రయోగం వలన ఆయనకు ముఖ్యంగా వ్రాయడానికి ఎక్కువ సమయం దొరికింది.

అక్కడే రెండు సంవత్సరాలు ఉన్నాడు. మొదటి సంవత్సరంలో *కాంకర్డ్ మెరిమేక్ నదులపై ఒక వారం* అనే పుస్తకం పూర్తి చేశాడు. రెండవ ఏడు *వాల్డెన్ లేక అడవిలో జీవితం* అనే పుస్తకం వ్రాశాడు. దీనిని 1854 లో ప్రచురించాడు. దీనిలో ప్రపంచం మంచిదని ఆయన పేర్కొన్నాడు. ఆయన జీవితంలో వాల్డెన్ కొలను దగ్గర గడపిన రెండు సంవత్సరాలు చాలా ఫలప్రదమైనవి.

ఆయనను సాహితీ సన్న్యాసిగా చెప్పుకోడం ఒక సంప్రదాయమైంది. కాని ఇది నిజం కాదు. ఆయన అనేక అతిథులను అక్కడికి ఆహ్వానించాడు. చాలా సార్లు తన స్వగ్రామానికి నడచి వెళ్లేవాడు. తరువాత ఎమర్సన్ ఆహ్వానం మేరకు ఆయన ఇంటికి మకాం మార్చాడు.

వాల్డెన్‌లో ఉంటున్నప్పుడు ఒకరాత్రి కారాగార వాసం చేశాడు. పన్ను కట్టడం నిరాకరించడం వలన ఆయనను ఖైదులో పెట్టారు. మరుసటి రోజున ఒక అజ్ఞాత స్త్రీ పన్ను చెల్లించింది. థోరో అనిష్టతతో జైలునుండి బయట పడ్డాడు. కాని ఒక రాత్రి జైలులో ఉండడం వలన తన అభిప్రాయాన్ని వ్యక్తం చేయగలిగానని ఆయన చెప్పాడు. బానిసత్వాన్ని బలపరచే, మెక్సికోపై సామ్రాజ్యవాదంతో కూడిన యుద్ధం చేసే ప్రభుత్వాన్ని తాను సమర్థించలేనని ఆయన ప్రకటించాడు. తన అనుభవాలను పురస్కరించుకొని *పౌర అవిధేయత (Civil disobdience)* అనే వ్యాసం ప్రచురించాడు. అప్పట్లో దానిని ఎవరూ ఎక్కువగా పట్టించుకోలేదు. కాని 19 వ శతాబ్దపు మధ్యకాలంలో దానిపై అనేకులు ఆసక్తి చూపించారు. దానిలోని సందేశం ఈనాటికీ ముఖ్యమైందే. అదేమంటే పౌరసంబంధిత న్యాయానికి మించిన గొప్ప న్యాయం మరొకటి ఉంది అని ఆ ఘనమైన న్యాయాన్ని అనుసరించడం మన విధి. ఈ అనుసరణ వలన వేరే కష్టనిష్ఠూరాలు వచ్చినా దీనిని పాటించడం మన కర్తవ్యం. "అన్యాయంగా వ్యక్తిని బంధించే ప్రభుత్వంలో న్యాయంగా జీవించే వ్యక్తికి యోగ్యమైన నివాసం కారాగారమే" అని ఆయన చెప్పాడు.

ఆయన వాల్డెన్‌ను విడిచి వెళ్ళినప్పుడు ఆయన జీవితంలో ఒక ముఖ్యఘట్టం పూర్తయింది. తరువాత ఆయన సర్వేయర్‌గా, వృక్షాలకు సంబంధించిన నకళ్ళు (specimens) సమీకరించడంలో నిమగ్నుడయాడు.

ఆధ్యాత్మిక ధోరణి (Transcendentalism) క్రమేపి తగ్గి కార్యవాది అయాడు. బానిసత్వం నిర్మూలించాలని పట్టు బట్టాడు. బానిసలు పారిపోవడానికి సహాయం చేశాడు. బానిసత్వ నిర్మూలనోద్యమ నాయకుడు జాన్ బ్రౌన్ ఆయనకు పితృతుల్యు డయాడు; ఆదర్శప్రాయుడు అయాడు. బ్రౌన్ ముందు ఎమర్సన్ తీసికట్టుగా కనబడ్డాడు. బ్రౌన్‌ను ఉరితీసిన వార్త విని థోరో మానసికంగా చాలా బాధ పడ్డాడు. 1862 లో క్షయరోగంతో థోరో మరణించాడు.

థోరో ఘనత ఆయన కొద్ది జీవనలక్ష్యాల మీద ఆధారపడి ఉంది. ఎటువంటి పరిస్థితులలోనైనా, మానవుడు తన అంతస్సాక్షినే అనుసరించాలి; జీవితం చాలా విలువైనది, దాన్ని ఉపాధికోసం వృథా చెయ్యకూడదు. అడవులూ, సెలయేళ్లూ గల ప్రాంతం మంచిది; వీథులూ, జన సమూహాలూ ఉన్న ప్రాంతం చెడ్డది అని ఆయన ఆచరణలో పెట్టి చూపించి, శక్తిమంతమైన శైలిలో తన అనుభవాలను గురించి వ్రాశాడు. ఆ రచనల ప్రభావం ఈ నాడు కూడా ప్రజల మీద ఎక్కువగా ఉంది. తన గ్రంథమైన *వాల్డెన్* ప్రపంచాన్ని మేల్కొలిపే కోడికూత అని ఆయన చెప్పుకొన్నాడు.

ఇ.నా.

**థ్యూసిడైడిస్ (క్రీ. పూ. 5 వ శతాబ్ది ఉత్తరార్థం):** గ్రీక్ చరిత్ర రచయితలలో మేటి. *హిస్టరీ ఆఫ్ ది పెలొపొనేషియన్ వార్* అనే సుప్రసిద్ధ చరిత్ర గ్రంథ రచయిత. ఆ గ్రంథంలో క్రీ.పూ. 5 వ శతాబ్దిలో ఏథెన్స్‌కూ, స్పార్టాకూ మధ్య జరిగిన యుద్ధ విశేషాలు వివరించబడ్డాయి. ఒక జాతి యుద్ధ విధానాలకు సంబంధించిన రాజకీయ, నైతిక విశ్లేషణను మొట్ట మొదటి సారిగా గ్రంథస్థం చేసిన రచన అది.

థ్యూసిడైడిస్‌ను గూర్చి నిశ్చితంగా మనకు తెలిసిన విషయాలు తన రచనలో తనను గూర్చి ఆయన తెలిపిన అంశాలే!. ఆయన ఏథెన్స్ నివాసి. స్పార్టాతో ఏథెన్స్ యుద్ధం ఆరంభం అయే నాటికి ఆ యుద్ధ ప్రాధాన్యాన్ని గుర్తించి అది సుదీర్ఘకాలం సాగబోతూందనీ, ఆది నుంచీ నోట్స్ వ్రాసి పెట్టుకుని ఆ యుద్ధాన్ని గురించి వివరించడం అవసరమనీ ఆలోచించగలిగినంత పరిణత వయస్కుడు తుర్గెనేవ్. అందుచేత బహుశః ఆయన క్రీ.పూ. 460 తరువాత జన్మించి ఉండడం జరుగక పోవచ్చును. ఆయన వ్రాసిన చరిత్రలో క్రీ.పూ. 431 నుంచి జరిగిన సంఘటనలు వివరించబడ్డాయి. ఆయన క్రీ.పూ. 424 లో 'స్ట్రాటిగోస్' (మిలిటరీ మేజస్ట్రేట్) గా ఎన్నుకోబడే నాటికి ఆయన వయస్సు నిశ్చయంగా 30 ఏళ్ల పైబడి ఉండాలి. అందుచేత గ్రీక్ చరిత్ర రచయిత 'హెరడోటస్' కంటె తుర్గనేవ్ వెనుకటి తరానికి చెందినవాడై ఉంటాడు.

థ్యూసిడైడిస్ తండ్రి పేరు ఓలోరస్ (ఇది ఏథెన్స్ నగర సహజమైన పేరు కాదు). సుప్రసిద్ధ ఏథేనియన్ రాజనీతి వేత్త, సేనాని అయిన మిల్టియడిస్‌తో థ్యూసిడైడిస్‌కి ఏదో విధమైన బాంధవ్యం ఉండి ఉండవచ్చును.

ఏథెన్స్‌లో క్రీ.పూ. 430-429 లో ఒక మహా జాడ్యం వ్యాపించిన కాలంలో థ్యూసిడైడిస్ ఏథెన్స్‌లోనే ఉన్నాడు. అతనికి కూడా ఆ వ్యాధి సోకింది. ఇతరుల యాతనలు అతడు కళ్లారా చూశాడు. తరువాత క్రీ.పూ. 424 లో ఆ సంవత్సరానికి సంబంధించిన 10 మంది 'స్ట్రాటిగాయ్' లో ఒకడుగా ఎన్నిక అయాడు. థేసోస్‌లోని నౌకాదళానికి నాయకుడు కూడా అయాడు. కాని ఆపదవిలో విఫలుడు గావడం వల్ల థ్యూసిడైడిస్‌ను విచారణ చేసి ప్రవాస శిక్ష విధించారు. ఆ ప్రవాసం తనకు ఏకాగ్రతతో చరిత్రను అధ్యయనం చేయడానికీ, వివిధ ప్రాంతాలలో పర్యటించి పలువురి పరిచయం సంపాదించుకోడానికీ తోడ్పడిందని అనంతర కాలంలో థ్యూసిడైడిస్ అన్నాడు.

థ్యూసిడైడిస్ వ్రాసిన చరిత్ర 8 భాగాలుగా విభక్తం అయింది. అది క్రీ.పూ. 411 ఆకురాలు కాలంలో జరిగిన సంఘటనలతో ఆరంభమై యుద్ధం ముగియడానికి $6\frac{1}{2}$ ఏళ్లకు ముందే ఆగిపోయింది. థ్యూసిడైడిస్ వదలిపెట్టిన దగ్గర నుంచి తరువాతి చరిత్రను క్రాటిపస్, జెనోఫన్, థియోపోంపస్‌లు పూర్తి చేశారు.

క్రీ.శ. 4 వ శతాబ్దం చివర గాని చరిత్ర రచన ప్రారంభకులలో థ్యూసిడైడిస్ పేరుతో పాటు హెరొడొటస్ పేరును కూడా థియోఫ్రాస్టస్ చేర్చడం జరుగలేదు. క్రీ.పూ. 1 వ శతాబ్దిలో సిసిరో, డయొనీసియస్ రచనల వలన థ్యూసిడైడిస్ గొప్ప చరిత్ర రచయితగా స్థిరపడి, ఆయన కీర్తి చిరస్థాయి అయింది.

బొ.శ్రీ.

**దాంతే, అలిగేరి (1265-1321) :** ఇటాలియన్ మహాకవి; గొప్ప వచన రచయిత; సాహిత్య సైద్ధాంతికుడు; నైతిక తత్త్వవేత్త; రాజకీయ భావుకుడు. ఆయన వ్రాసిన *క్రైస్తవ పురాణం, ది డివైన్ కామెడీ* ప్రపంచ సాహిత్యంలోనే ప్రముఖంగా పేర్కొన దగినవి.

ఫ్లారెన్స్‌లోని ఒక ఉన్నత వంశానికి చెందిన ఒక బూర్జువా కుటుంబంలో 1265 మే 15, జూన్ 15

మధ్య దాంతే జన్మించాడు. ఫ్లారెన్స్ నగరంలోనే దాంతే పెరిగి పెద్దవా డయాడు. ఆ నగరాన్ని రెండుగా చీల్చిన ఆ నాటి రాజకీయ ఘర్షణలలో ఆయన ప్రముఖ పాత్ర వహించాడు. పోప్ చేత సమర్థించబడిన 'బ్లాక్ గుయెల్ఫ్స్' వర్గానికి వ్యతిరేకంగా ప్రజాస్వామిక కమ్యూనిష్టు విధానాన్ని సమర్థించే 'వైట్ గుయల్ఫ్స్' పార్టీలో దాంతే సభ్యుడయాడు. 'వైట్ గుయల్ఫ్' ల హయాములో (1295-1302) కొన్నాళ్లు దాంతే నగర పరిపాలనా నిర్వహణలో కూడా పాల్గొన్నాడు. 'బ్లాక్ గుయెల్ఫ్' లు అధికారం లోకి వచ్చినప్పుడు దాంతే, ఆయన అనుచరులు దేశబహిష్కృతు లయారు. 1302 తరువాత ఆయన ఫ్లారెన్స్‌లో తిరిగి అడుగు పెట్టలేదు. దేశద్రిమ్మరి అయి అనేక ఇటాలియన్ నగరాల, రాజకుమారుల ఆశ్రయంలో గడిపి, చివరికి రావెన్నా నగరంలో స్థిరపడ్డాడు.

1285 ప్రాంతంలో దాంతే వివాహం చేసుకొన్నాడు. కాని అతని జీవితానికి ధ్రువతార అని చెప్పదగింది 'బియాట్రిస్ పోర్టినారీ' (మరణం 1290) పట్ల ఆయనకు గల ఆధ్యాత్మిక ప్రేమ. తన తొమ్మిదవ ఏట చిన్న పిల్లగా ఉన్న బియాట్రిస్‌ను మొదట దాంతే చూశాడు. అనంతరం ఆమె ఆదర్శ మహిళగా అతని మనస్సులో నిలచిపోయి, అతని కవిత్వానికీ, క్రైస్తవ భక్తికీ ప్రధాన ప్రేరణ అయింది. దాంతే ప్రధాన రచనలు: *లా విటా న్యూవోవా* (1293 ప్రాంతం), *డి వల్గారీ ఎలా క్వెన్షియా* (1304-05), *ఏ బాంక్వెట్ ఆఫ్ నాలెడ్జ్* (1304-07), *మొనార్కియా, ది డివైన్ కామెడీ*. వీనిలో మొదటిది బియాట్రిస్ ప్రేమను గూర్చి గద్య పద్యాలలో వర్ణించేది. రెండవది సాహిత్య భాషగా లాటిన్‌ను త్రోసి పుచ్చి ఇటాలియన్ దేశభాషకు సుస్థిర స్థానం కల్పించింది. మూడవది మానవుని ఐహిక ఆధ్యాత్మిక గమ్యాలను గూర్చి వివరించే లాటిన్ గ్రంథం!

1321 సెప్టెంబరు 13/14 న రావెన్నా నగరంలోనే దాంతే తుది శ్వాస విడిచాడు.

*బా.శ్రీ.*

**దిబ్ మొహెమెద్ (1920--)** : దిబ్ ఆఫ్రికా ఖండంలోని అల్జీరియా దేశపు కవి. బహుముఖ ప్రజ్ఞా ధురీణుడు. నవల, నాటకం మొదలైన ప్రక్రియల్లో సిద్ధహస్తుడు. సినీమా రచయిత కూడా! ఇతడు కొంతకాలం ఉపాధ్యాయుడుగా, కొంతకాలం అకౌంటెంటుగా, కొంత కాలం పత్రికా రచయితగా, కొంతకాలం వ్యాపారిగా వివిధ వృత్తుల నాశ్రయించి అనుభవం గడించాడు. అల్జీరియాలో జాతీయోద్యమ పవనాలు వీస్తున్న రోజులలో తన నవలల చేత జాతిని జాగృతం చేసి, నూత్న చైతన్యం వెదజల్లాడు. ఇతని రచనలు ప్రజల శ్రామిక జీవితాలకు నిలువుటద్దాలు. 1954 లో దేశబహిష్కృతుడై ఫ్రాన్సులో మనుగడ సాగించాడు. ఇతని నవలలను రెండు తెగలుగా విభజించవచ్చును. మొదటి తెగ జాతీయ విప్లవానికి ముందు వ్రాసినవి. వీటిలో ఇతడు ప్రజలకు స్వాతంత్ర్య స్ఫూర్తి నిచ్చి, సమరోన్ముఖులనుగా సమాయత్త పరచడమే కాక, వారిలో రగుల్కొన్న నూత్న చైతన్యాన్ని వాస్తవిక శైలిలో చిత్రించాడు. ఈ సమయంలో ఇతడు రచించిన గ్రంథ త్రయానికి అనన్య ప్రచారం లభించింది. అవి: 1. *ల గ్రాండ్ మైసన్* (*La grand Maison 1952*), 2. *లిన్ సింద్రే* (*Lin cendre, 1954*), 3. *లె మ్రిటి ఆ టిస్సెర్* (*Le meter a tisser, 1957*) మొదలైనవి. రెండవ తెగ నవలల్లో ఇతని శైలి పరిణతిని, ప్రౌఢిమను సంతరించు కొంది. స్వాతంత్ర్యానంతర కాలంలో వ్రాసిన ఈ నవలల్లో శైలి ప్రతీకాత్మకంగా సాగింది. పురాణ వాతావరణం వీటిలో సర్వసాధారణం. ఒక్క *ఉన్ ఎటె ఆఫ్రికా* (Un Ete Africain 1959) మాత్రం స్వాతంత్ర్య పూర్వ బాణీలో సాగింది. ఈ నవలలో దిబ్ ఫ్రెంచి ప్రభుత్వపు దమననీతిని 'అల్జీరియా' కాలపు సాంకేతిక నిపుణుల చేతిలో అధికారం కేంద్రీకృతం కావడాన్ని, ఫ్రాన్సు దేశానికి వలసపోయిన శ్రామిక లోకపు కడగండ్లను అత్యంత వైదగ్ధ్యంతో వర్ణించాడు. అన్ని రచనలలోనూ ప్రగతి పట్ల ప్రగాఢ విశ్వాసం, సర్వమానవ సౌభ్రాత్ర కాంక్ష ప్రధానంగా కనిపిస్తాయి. ఇతడు ఎన్ని నవలలు, నవలికలు, నాటకాలు వ్రాసినా తాను కవిననే గర్వంగా చెప్పుకొంటాడు. ఇతని కథా సంకలనాలు రెండు: *ఒంబ్రె గార్డీనే* (*Ombre Gardienne, 1961*), *ఫార్ము లేరే* (*Formulaires, 1970*) పేర్కొనదగినవి.

*గం.శ్రీ.*

**దీదెరో, డెనిస్ (1713-84)** : ప్రముఖ ఫ్రెంచ్ రచయిత, పండితుడు, తత్త్వవేత్త. 'ది ఏజ్ ఆఫ్ ది ఎన్‌లైటెన్‌మెంట్' లో ప్రధానంగా చెప్పదగిన *ఎన్‌సైక్లోపీడియా* కు 1745 నుండి 1772 వరకూ ప్రధాన సంపాదకుడు.

సామాన్య కుటుంబం నుండి వచ్చిన ఈయన 'జెసూట్స్' వద్ద విద్య నభ్యసించి, పారిస్ విశ్వవిద్యాలయం నుంచి 'మాస్టర్ ఆఫ్ ఆర్ట్స్' పట్టాను 1732 లో తీసుకొన్నాడు. న్యాయవాదిగా శిక్షణ పొందినప్పటికీ ఆవృత్తి పై కంటె భాష, తత్త్వశాస్త్రం, సాహిత్యం, గణితముల పై ఎక్కువ మక్కువ చూపాడు. జీవన భృతికోసం

కొంతకాలం పాటు ఉపాధ్యాయుడుగా పనిచేస్తూ, మిష నరీలకు కొద్ది మొత్తాలకు ఉపన్యాసాలు వ్రాసి పెట్టాడు. మత పరంగా తీవ్రమైన అంతస్సంఘర్షణకు ఈ రచ యిత లోనైనట్లు ఈయన రచనలద్వారా తెలుస్తుంది. క్రైస్తవ మతంలో విశ్వాసం నుంచి భగవంతుని అస్తి త్వాన్ని మాత్రమే నమ్ముతూ మతపరమైన విశ్వాసాలను, కర్మ కాండలను త్రోసి పుచ్చే స్థితికీ, అక్కడ నుంచి నాస్తికత్వానికీ ఆయన పయనించాడు.

మూడవ షాఫ్ట్స్‌బరీ ప్రభువు వ్రాసిన *ఎన్క్వైరీ కన్సర్నింగ్ వర్ట్యూ* ని 1745 లో ఫ్రెంచిలోకి స్వేచ్ఛా నువాదం చేశాడు. 1746 లో తన మొదటి స్వంత రచన అయిన *పెన్సీస్ ఫిలసిఫిక్స్* ప్రచురించాడు. ఇందులో ఈయన ప్రకటించిన క్రైస్తవ వ్యతిరేకభావాలు పెద్ద గాలి దుమారాన్నే లేవదీశాయి. తరువాత వ్రాసిన *లెస్ బిజో ఇన్‌డిస్క్రీట్స్* అనే నవల అసభ్యమైన దనే ముద్ర వేసుకుంది. 1755 లో సోఫీ వోలాండ్ అనే ఆమెతో అక్రమ సంబంధం పెట్టుకుని దానిని దాదాపు 20 సంవత్సరాల పాటు సాగించాడు. అయితే ఈ సంబంధం అభిరుచుల సారూప్యం, సానుభూతి, గాఢమైన స్నేహా లతో గట్టిపడింది. ఆమెతో నడిపిన ఉత్తర ప్రత్యుత్తరాలు ఈ రచయిత వ్యక్తిత్వాన్నీ, ఉత్సాహాన్నీ, భావాలనూ చక్కగా ప్రతిబింబిస్తాయి. ఈ నైతిక విలువలను చిత్రిస్తూ *ది టూ ఫ్రెండ్స్ ఆఫ్ బోర్‌బోన్* అనే కథానికను వ్రాశాడు. జర్మన్ రచయితలైన గొయిథె, షిల్లర్‌లు దీని ప్రాముఖ్యాన్ని గుర్తించటం జరిగింది.

*ది ఎన్‌సైక్లోపీడియా* ప్రధాన సంపాదకుడుగా దాని పరిధిని విస్తృతం చేసి, విప్లవాత్మక భావాలకు ప్రకటన మాధ్యమంగా దానిని మార్చగలిగాడు. విజ్ఞాన సంపదను విస్తృతం చేసి చర్చిలోను, రాజ్యంలోను పాతుకుపోయిన అభివృద్ధి నిరోధక శక్తులను ఎదుర్కొని వాటిని బలహీన పరచటానికి అనువైన సాధనంగా దానిని మలచటానికి ప్రయత్నించి అందుకు ఉపయోగించే యువ మేధావు లను, రచయితలను ఆయన ప్రోత్సహించాడు. ఆయన ప్రచారంలోకి తేవటానికి ప్రయత్నించిన 'భౌతిక పరమైన నాస్తికవాదం' గిట్టక ప్రభుత్వం ఆయనను కారాగారానికి పంపింది. *ది ఎన్‌సైక్లోపీడియా* సంపుటాలలో మొదటిది 1751 లో వెలువడగా, చిట్టచివరిది 1772 లో వెలువడింది.

*ఎన్‌సైక్లోపీడియా* పని పూర్తికావటంతో ఆయనకు జీవనాధారం పోయింది. రష్యాకి చెందిన కేథరిన్ ది గ్రేట్ ఆయనను ఆర్థికంగా ఆదుకొంది. ఆమెకు కృతజ్ఞతలు తెలుపటానికి రష్యా వెళ్లి ఘన సమ్మానాన్ని పొందాడు. ఆమె కోసం *ప్లాన్ ఆఫ్ ఏ యూనివ ర్సిటీ ఫర్ ది గవర్న్‌మెంట్ ఆఫ్ రష్యా* అనే గ్రంథాన్ని వ్రాశాడు. అక్కడ ఉన్న 5 మాసాలలోనే ఆమె పరిపా లనా పద్ధతులపట్ల అసంతృప్తి చెంది, ఆ అసంతృప్తిని ప్రకటిస్తూ ఒక వ్యాసంలో విజ్ఞతతో కూడిన నిరంకుశత్వం సామాజిక వ్యధలకు పరిష్కారం కాజాలదని తెలిపాడు. తరువాతి కాలంలో రష్యాలో ప్రచారంలోకి వచ్చిన విప్లవ భావాలకు ఈ వ్యాసం నాందీ వాక్యం పలికిందని చెప్పవచ్చు.

1751 లో *దీదెరో లెటర్ ఆన్ ది డెఫ్ అండ్ డంబ్* ని ప్రచురించాడు. ఇందులో భాష ప్రయోజనాలను గురించి, దాని అంద చందాలను గురించి చర్చించాడు. 1749 లో ప్రచురితమైన మరొక వ్యాసం లో గ్రుడ్డివారు స్పర్శజ్ఞానంతో చదవటానికి వీలయ్యే పద్ధతి కావా లని సూచించాడు. దాదాపు ఒక శతాబ్దం తరువాత లూయీ బ్రైలీ ద్వారా అటువంటి లిపి తయారైం దని మనకు తెలుసు.

ఈ రచయిత తాత్త్విక పరంగా *కాన్వర్సేషన్స్ బిట్వీన్ డలెంబర్ట్ అండ్ దీదెరో* వంటి అనేక రచనలు ప్రచురించాడు. వీటిలో ఆయన తన భౌతిక దర్శనాన్ని ప్రతిపాదించి విశదీకరిస్తాడు. విజ్ఞాన శాస్త్రపరంగా ఆయన పదార్థం కణజాల నిర్మాణమనే సిద్ధాంతాన్ని ప్రతిపా దించాడు. డార్విన్ కంటె ముందే జీవ పరిణామ సిద్ధాంతాన్ని ఊహాపరంగా సూచించిన మహా మేధావి దీదెరో. మనో వైజ్ఞానిక శాస్త్రపరంగా స్వప్నాలకు సంబంధించిన సిద్ధాంతా న్నొక దానిని దీదెరో ప్రతిపాదిం చాడు. అనంతర కాలంలో ఈ సిద్ధాంతం ఫ్రాయిడ్‌ని ఆకట్టుకొన్నది.

తాత్త్వికంగా 'శాస్త్రీయమైన విధి నిర్ణాయకత' ను ఆయన విశ్వసించినట్లు కనిపించినా, ఆయనలో ఈ విషయమై కొంత ఊగిసలాట కూడా కనిపిస్తుంది. *లా నెవ్యూ డీ రామ్యూ* లో పరాన్న భుక్కూ, నైతిక వ్యవస్థపై విశ్వాసం లేనివాడూ అయిన ఒక పాత్ర ద్వారా ఆ నాటి సామాజిక పద్ధతులపై వ్యంగ్య బాణాలను దీదెరో కురిపించాడు.

మహామేధావి, విజ్ఞాన ఖని అయిన దీదెరో 1784 జూలై 30 న పారిస్‌లో అస్తమించాడు.

కె.జి. మూర్తి.

**దు గార్డ్, రోజర్ మార్టిన్ (1881-1958) :** 1937లో సాహిత్యానికి నోబెల్ బహుమతి గ్రహించిన ఫ్రెంచ్ నవలా రచయిత, నాటక రచయిత. సమ

కాలీన ఫ్రెంచ్ సమాజాన్ని సమగ్రంగా పరిశీలించిన మహామనీషి. ఈయన ఒక మధ్య తరగతి కుటుంబంలో జన్మించాడు. పారిస్‌లోని ఎకోల్ దెస్ చార్టెస్ లో విద్యనభ్యసించాడు. 1905 లో ఫోటోగ్రాఫర్‌గాను, పురాపత్ర సంరక్షకుడుగాను ఉత్తీర్ణు డయాడు.

మొదటి ప్రపంచ యుద్ధకాలంలో ఈయన మోటార్ ట్రాన్స్‌పోర్ట్ విభాగంలో పనిచేశాడు. యుద్ధానికి ముందు, తరువాత కొద్ది కాలంపాటు ఈయన దు వియెక్స్-కొలంబియర్ థియేటర్‌లో జాక్వెస్ కొపేతో కలసి పనిచేశాడు. చివర రోజులలో ఈయన ఏకాంతంగా ఎక్కువకాలం రచనా వ్యాసంగంలోనే గడిపాడు. ఈయన మొదటి నవల *దేవెనీర్* (1908). తరువాతది *లు నె ది నౌస్.* ('మాలో ఒకడు' 1909) ఇది పూర్తిచేయని నవల *మరియొస్ జీన్ బోరిస్* (1913) లోని ఒక అధ్యాయం మాత్రమే. ఇందులో ఆయన తన చిన్నతనపు క్యాథలిక్ విశ్వాసానికీ, తర్వాత తాను సాధించిన పాండిత్యానికి మధ్య జరిగిన సంఘర్షణను గూర్చి చర్చించాడు. అంతేగాక ఫ్రెంచ్ సమాజంపై డ్రైఫస్ ప్రభావాన్ని కూడా ఆయన వివరించి చెప్పాడు. 1922-40 మధ్యకాలంలో *లెస్ థిబాల్ట్స్* (English- The world of Thibaults 1939-41) రచించాడు. ఇది మధ్యతరగతికి చెందిన ఇద్దరు అన్నదమ్ములకు సంబంధించిన ఇతివృత్తం ఆధారంగా వ్రాయబడిన ఎనిమిది భాగాల పెద్ద నవల. మానవ సంబంధాలను ఓర్పుతో పరిశోధించటమే ఈ నవల గొప్ప తనం. ఈ నవలే ఈయనకు 1937 లో నోబెల్ బహుమతి సంపాదించి పెట్టింది. మొదటి ప్రపంచ యుద్ధంలో యూరప్ ఎలా చిక్కుకుందో *లెటె* (1914) అనే నాటకంలో లో వర్ణించాడు. దీనికి, టాల్‌స్టాయ్ వ్రాసిన *వార్ అండ్ పీస్* కి కొంత పోలిక ఉంది.

ఈయన ఫ్రెంచ్ రైతులకు సంబంధించి రెండు హాస్య నాటికలను వ్రాశాడు. అవి: *లె టెస్టమెంట్ దు పెరె లెలు* (1913), *ల గోన్* (1928). ఈయన తన నాటకం *ఉన్ టా చిటర్నే* (1931) లో స్వలింగ సంపర్కం మీద వ్రాశాడు. ఇతర రచనలు: *కాన్ఫిడెన్స్ ఆఫ్రికెన్* (1931) *వియెల్లె ఫ్రాన్స్* (1933, Englsih- 'The postman', 1954), *నోట్స్ సర్ అంద్రె జీడ్* (1951, English-1953) ఈయన తన అత్యుత్తమ కృతి *లెస్ సావనీర్స్* 1941 లో వ్రాయడం ప్రారంభించినా అది 1958 లో ఆయన మరణించేనాటికి అసంపూర్తిగానే మిగిలి పోయింది. ఈయన సమగ్ర రచనలు *బయ్స్‌వెస్ కంప్లీట్స్ ద రోజర్ మార్టిన్ దుగార్డ్* అనే పేరుతో 1955 లో ప్రచురింపబడ్డాయి. ఆల్బెర్ట్‌కమూ దీనికి పీఠిక వ్రాశాడు.

*నాగరాజ్*

**దోనెలీ, ఇగ్నేషియస్ (1831-1901) :** దోనెలీ అమెరికా దేశపు ప్రముఖ నవలా రచయిత, సంఘ సంస్కర్త, వక్త. ఇతడు తన జన్మస్థలమైన ఫిలడెల్ఫియాలోనే విద్య నభ్యసించి, న్యాయశాస్త్రంలో పట్టభద్రుడయాడు. కాని త్వరలోనే స్వరాష్ట్రం విడిచి పెట్టి, మిన్నిసోటా రాష్ట్రంలోని మిన్నియా పోలిస్ నగరంలో స్థిర పడ్డాడు. అక్కడ ప్రముఖ వ్యక్తి జాన్ నినింజర్‌తో పరిచయం ఏర్పడి, భావ సాదృశ్యం వల్ల గాఢమైత్రీ బంధ మేర్పడింది. వారిద్దరూ కలసి ఒక బృహత్ప్రణాళికను రూపొందించారు. 'నినింజర్' అన్న పేరుతో సంస్కృతికీ, పారిశ్రామికాభివృద్ధికీ కేంద్రంగా ఒక నగరాన్ని నిర్మించారు. ఇది ముఖ్యంగా అమెరికాకు వలస వచ్చి స్థిరపడ దలచిన వారికే ఉద్దేశించబడింది. వారికోసం దోనెలీ ఆ నగరంలోనే *ఎమ్మిగ్రెంట్స్ ఎయిడ్ జర్నల్* అన్న పేరుతో ఒక ద్విభాషా పత్రికను ఇంగ్లీషు, జర్మన్ భాషలు రెండింటిలోనూ నడిపించాడు. వారి ప్రణాళిక ప్రారంభంలో మంచి ఫలితాల నిచ్చింది. ఎంతోమంది ఆకర్షితులై నగరంలో నివాస మేర్పరచుకొన్నారు. కాని కాలం గడిచిన కొద్దీ, ఆర్థికంగా ఇక్కట్లు ప్రారంభమై, చివరికి 1857 లో అందరూ ఆ గ్రామం విడిచి వెళ్లిపోవలసిన స్థితి ఏర్పడింది. ఒక్క దోనెలీ మాత్రమే మిగిలి పోయాడు. అప్పు డతడు రాజకీయ రంగంలో ప్రవేశించి, రిపబ్లికన్ సభ్యుడయాడు. మిన్నిసోటా రాష్ట్ర గవర్నర్ పదవికూడా నిర్వహించాడు. 1870 ప్రాంతంలో రిపబ్లికన్ పార్టీ సభ్యత్వానికి రాజీనామా చేసి, కార్మికులకోసం, కర్షకులకోసం పోరాడే చిన్న రాజకీయ పక్షాల తరఫున పాటుపడడం ప్రారంభించాడు. నినింజర్ నగరానికి తిరిగి వచ్చి, *ఏంటీ మోనోపోలీ* (గుత్తాధికార వ్యతిరేకి) అనే పత్రికను ప్రారంభించాడు. పెట్టుబడిదారులు, వడ్డీ వ్యాపారులు ప్రజాశత్రువులని వారిని తీవ్రంగా విమర్శించాడు. ఇతని సుప్రసిద్ధ గ్రంథం *అట్లాంటిస్* 1882 లో వెలువడింది. ఇందులో ఇతడు పాశ్చాత్య పురాణ ప్రసిద్ధమైన అట్లాంటిస్ ద్వీపం సమస్త నాగరకతకూ పుట్టినిల్లని ప్రతిపాదించాడు. ఆ తరువాత ప్రచురించిన *రగ్నరోక్, ది ఏజ్ ఆఫ్ ఫైర్ అండ్ గ్రావెల్* అనే నవలలో ఇతడు భూమి మీద కనిపించే 'టిల్' నిక్షేపాలు, గ్రావెల్ (కంకర రాళ్లు) నిజానికి అతి ప్రాచీన కాలంలో ఒక తోకచుక్క

భూమిని డీకొన్నప్పుడేర్పడ్డాయని ప్రతిపాదించాడు. *ది గ్రేట్ క్రిప్టోగ్రామ్* (1888), *ది సైఫర్ ఇన్ ది ప్లీజ్ అండ్ టూమ్ స్టోన్* (1889) అనే సంచలనాత్మక రచనలలో షేక్స్‌పియర్ పేరుతో ఉన్న నాటకాలు నిజంగా షేక్స్‌పియర్ వ్రాయలేదనీ అతని సమకాలీన మేధావి ఫ్రాన్సిస్ బేకన్ వ్రాశాడనీ తీర్మానించాడు. ఈ పరిశోధన ఫలితంగా షేక్స్పియర్ సమకాలికుడైన క్రిస్టఫర్ మార్లో కూడా అతనివిగా చెప్ప బడుతున్న నాటకాలను వ్రాయలేదనీ, వాటిని కూడా బేకన్ మహాశయుడే వ్రాశాడని నిర్ణయించాడు. అలాగే సుప్రసిద్ధ ఫ్రెంచ్ రచయిత మాంటేన్ (Montaigne) వ్రాసిన వ్యాసాలు కూడా బేకన్ రచనలే అని స్థిరీకరించడానికి ప్రయత్నించాడు. ఇతడు 1891 లో ప్రచురించిన నవల *సీజర్స్ కోలమ్* ఒక భవిష్యద్దర్శనం (యుటోపియా). ఇందులో ముందు ముందు రాబోయే రేడియో, టెలివిజన్, విషవాయు ప్రయోగం మొదలైన వాటిని ఊహించి వర్ణించాడు.

గం.శ్రీ.

**నగూగి, జేమ్స్ (తియోంగ్ ఓ) (1938--):** తూర్పు ఆఫ్రికాకు చెందిన ప్రముఖ నవలా రచయిత. ఆయన రచించిన *ఏడవకు పాపాయి!* (1964) అనే రచనే ఇంగ్లీషులో తూర్పు ఆఫ్రికాను గూర్చి వెలువడిన మొదటి నవల.

నగూగి 1963 లో 'మకెరెరె' విశ్వవిద్యాలయం (కంపాలా, ఉగాండా) నుంచి ఒక బి.ఏ. డిగ్రీ, 1964 లో లీడ్స్ విశ్వవిద్యాలయం (యార్క్‌షైర్, ఇంగ్లండ్) నుంచి మరొక బి.ఏ. డిగ్రీ పొందాడు. లీడ్స్ డిగ్రీ పొందిన తరువాత నగూగి కెన్యాలోని నైరోబీ విశ్వవిద్యాలయం కళాశాలలో ఆంగ్లోపన్యాసకుడుగాను, నార్త్ వెస్టర్న్ యూనివర్సిటీ (ఇవాన్‌స్టన్, ఇల్లినోయిస్, అమెరికా) లో విజిటింగ్ ఇంగ్లీషు ప్రొఫెసరుగాను పనిచేశాడు. 1972 నుంచి 1977 వరకు నైరోబీ విశ్వవిద్యాలయంలో సీనియర్ ఉపన్యాసకుడుగానూ, సాహిత్య శాఖాధ్యక్షుడుగానూ పనిచేశాడు. 1965 లో సెనెగల్‌లోని 'డాకర్' లో నీగ్రో కళల ఉత్సవాలలో *వీప్ నాట్ చైల్డ్* అనే రచన తూర్పు ఆఫ్రికా సాహిత్య సంస్థ నుంచి బహుమతు లందుకొంది. అది దోపిడీకి గురి అవుతున్న ప్రజల పోరాటాలకు ధర్మమైన దారిని చూపటం కళాకారుని విధ్యుక్త ధర్మమన్న నగూగి అభిప్రాయాన్ని ప్రతిపాదిస్తుంది. ఎమెర్జెన్సీ సమయంలోనూ, మాల్ మాల్ విప్లవకాలంలోనూ, కెన్యా స్వాతంత్ర సమరంలోనూ కూరుకుపోయిన ఒక 'కికుయు' కుటుంబ గాథ ఇది. *గోధుమ గింజ* (A Grain of Wheat: 1967) లో ఆ కాలపు మరొక లక్షణం వివరించబడింది. ఇది ఎక్కువ రచనా శిల్పాన్ని ప్రకటిస్తోందనీ, స్వాతంత్ర్య సమరకాలంలోనూ, తరువాతనూ తల ఎత్తిన సాంఘిక, ధార్మిక సమస్యలనూ, జాతులకు సంబంధించిన సమస్యలనూ ఎత్తి చూపిందనీ విమర్శకుల అభిప్రాయం. *మధ్య నున్న నది* (A river Between-1965) నగూగి రచించిన మూడో నవల. వాస్తవానికి ఇది తక్కిన వాటికన్న ముందు వ్రాసినది. క్రైస్తవ మతానికి, సాంప్రదాయిక విధానాలకు, నమ్మకాలకు మధ్య ఏర్పడిన సంఘర్షణ వల్ల విడిపోయిన ప్రేమికుల కథ ఇది. పాశ్చాత్య విద్య వల్ల సాంస్కృతికంగా చీలిపోయిన సమాజాన్ని సంఘటితం చేసే ప్రయత్నం ప్రాత విలువలకు, క్రొత్త విలువలకు పొత్తు కుదరక పోవడంవల్ల విఫలం కాక తప్పదని ఈ నవల సూచిస్తుంది. *నెత్తుటి రేకులు* (petals of blood-1977) తూర్పు ఆఫ్రికాలో స్వాతంత్ర్యానంతర సాంఘిక ఆర్థిక సమస్యలను, ముఖ్యంగా రైతులను, కూలీలను విదేశ వ్యాపార సంస్థలు, దురాశాపరులైన దేశవాళీ పెట్టుబడి దారులు దోచుకోడాన్ని ఈ నవల చిత్రించింది. 'కికుయూ' భాషలో వ్రాసిన నవల *సయితానీ ముతరబా-ఇని* ((1980) (The Devil on the cross-1982) లో ఈ అభిప్రాయాలనే అన్యాపదేశ పద్ధతిలో నగూగి ప్రతిపాదించాడు.

నగూగి రచించిన పలు నాటకాలలో *నీల యతి* (The Black Hermit-1962) మొదటిది. 'మిసిర్ గి మ్యూగో' తో కలసి ఆయన రచించిన నాటకం: *డెడాన్ కిమతి న్యాయ విచారణ* (The Trial of Dedan kimathi-1977) ఆయన నాటకాలలో ఉత్తమమైన దని కొందరి అభిప్రాయం. 'నగూగి వామిరై' తో కలసి ఆయన కికీయూ భాషలో *నగాహీకా నదీనా* (I will Marry when I want-1980) అనే నాటకం రచించాడు. దీని ప్రదర్శన ఆయనకు కెన్యా ప్రభుత్వంతో చిక్కులు తెచ్చిపెట్టి, ఆయనను 1978 లో విచారణ లేకుండా నిర్బంధంలో పెట్టటానికి దారితీసింది (1981 లో ప్రచురింపబడిన ఆయన పుస్తకం *డిటెయిన్డ్* ఆయన బాధలను అభివర్ణించింది). ఆ నాటకం మధ్యకెన్యాలో పెట్టుబడిదారీ వ్యవస్థ మీద, కొత్త వలస విధానం మీద, మత సంబంధమైన వంచన మీద నిర్భయంగా చేసిన దాడి.

సాహిత్యం మీద, సంస్కృతి మీద, రాజకీయాల

మీద తన అభిప్రాయాలను నగూగి ఎన్నో వ్యాసాలలోను, ఉపన్యాసాలలోను ప్రకటించాడు. వాటిలో ముఖ్యమైన వాటిని *గృహాగమనం* (Homecoming-1972), *రచయితలూ-రాజకీయాలూ* (Writers in Politics-1981) అనే సంకలనాలుగా కూర్చారు. ఇటువంటి రచనలు ఆయనకు ఆఫ్రికాలో ప్రముఖ సాంఘిక విమర్శకులలో ఒకడుగా ప్రసిద్ధి సంపాదించి పెట్టాయి. *రహస్య జీవితాలు* (Secret Lives) అనే శీర్షికతో ఒక కథానికా సంకలనం 1975 లో నగూగి ప్రచురించారు.

*శ్రీ.న.చ.రా.*

**నట్సుమే సోసెకీ (1867-1916) :** ప్రముఖ జపాన్ నవలాకారుడు. ఆధునిక జపాన్ దేశపు మేధావుల దుస్థితిని ఎక్కువ నైపుణ్యంతో చిత్రించిన వారిలో మొదటివాడు. ఈయన అసలు పేరు నట్సామేకిన్నొ సూకె. జపాన్ లోని ఈడోలో ఫిబ్రవరి 9, 1867లో పుట్టి, టోక్యోలో డిసెంబర్ 9, 1916 న మరణించాడు.



1893 లో టోక్యో విశ్వవిద్యాలయం నుండి డిగ్రీని పొందాడు. 1900 వరకు వివిధ రాష్ట్రాలలో విద్యాబోధన చేశాడు. ఆ సంవత్సరం స్కాలర్‌షిప్ మీద ఇంగ్లండు వెళ్లాడు. 1903 లో టోక్యో విశ్వవిద్యాలయంలో ఆంగ్లోపన్యాసకుడుగా చేరాడు. హాస్యభరితమైన రెండు నవలలు వ్రాసి ఆయన పేరు సంపాదించాడు. ఇవి: *ఐ యామ్ ఎ క్యాట్* (1906), *బొచెన్* (1918). ఈ రెండింటిలో సంస్కృతి రహితమైన వారిని, వైజ్ఞానికంగా 'గారడీలు చేసే వారిని వ్యంగ్యంగా చిత్రించాడు. ఆయన నవల *ది త్రీ కార్నర్డ్ వరల్డ్* (1965) హైకు రీతిలో వ్రాసిన నవల దూరంగా ఉన్న పల్లెలో ఒక చిత్రకారుని జీవితాన్ని తెలిపే ఈ నవల గేయ కవిత్వంలాగ నడిచి క్రొత్త పోకడలు సృష్టించింది.

1907 లో ఉపాధ్యాయవృత్తి వదలి, సాహిత్య సృష్టికే తన సమయాన్ని వెచ్చించాలని నిర్ణయించుకొని నట్సుమే తన విజ్ఞాన · వైవిధ్యాన్ని తెలిపే పలు పుస్తకాలు వ్రాశాడు. మానవుడు ఒంటరితనం నుండి తప్పించుకోడానికి చేసే ప్రయత్నాలు ఇందులో పొందుపరిచాడు. ఆయన కథానాయకులు విద్యాధికులైన మధ్య తరగతి మనుష్యులు. వారు మోసపోవడం వలన, లేక ఇతరులను మోసగించడం వలన పాపభీతి, విరక్తి కలిగి ఇతరు లందరికీ దూరమైనవారు. *ది వే ఫేరర్* (బాటసారి) అనే నవలలో కథానాయకుడు తన ఒంటరితనం వలన పిచ్చివాడుగా మారుతాడు. *కొకొరొ* అనే నవలలో నాయకుడు ఆత్మహత్య చేసుకొంటాడు. *ది గేట్* అనే నవలలో నాయకుడు జెన్ దేవాలయంలో ప్రవేశించ లేక పోతాడు. మనశ్శాంతి కోసం అక్కడకు వెళ్ళినా, తన ఒంటరితనాన్ని, వైఫల్యాన్ని, నిస్సహాయతను ఎత్తి చూపే విధంగా ఉన్న ఆ ద్వారంలో ప్రవేశించలేదు. ఆయన చివరి నవల *గ్రాస్ ఆన్ ది వే సైడ్* (1915). ఇది స్వీయ చరిత్రలాగ నడుస్తుంది.

నట్సుమే తను సంప్రదాయం నుండి ఏమీ నేర్చుకోలేదని, తనవి స్వతంత్ర రచనలనీ అన్నాడు. వాటిలో ఎంత నవీనత ఉన్నా, జపాన్‌కు ప్రత్యేకమైన, సున్నితమైన గేయధోరణి ఉంది. వాస్తవిక నవల పాశ్చాత్య సాహిత్య ప్రక్రియ అయినప్పటికీ, నట్సుమే రచనలలో అది సహజమైన వైఖరితో జపాన్ సంస్కృతిలో వేళ్ళు తన్నుకొని ఉంది.

*ఇ.నా.*

**నబొకోవ్, వ్లదిమిర్ (1899-1977) :** రష్యాలో జన్మించి అమెరికాలో స్థిరపడిన నవలా రచయిత, సాహిత్య విమర్శకుడు. 1917 తరువాత ప్రవాసులుగా అమెరికా వచ్చిన రచయితలలో ఈయన ప్రధానుడు. రష్యన్, ఇంగ్లీష్ భాషలు రెండింటిలోనూ ఈయన రచనలు చేశాడు. *లోలిటా* (1955) వంటి ప్రపంచ ప్రసిద్ధమైన గొప్ప నవలలు రచించాడు.

వెనుకటి ఒక సంపన్న కుటుంబంలో నబొకోవ్ జన్మించాడు. ఆయన తండ్రి వి.డి. నబొకోవ్ రష్యన్ విప్లవానికి ముందున్న లిబరల్ కాన్‌స్టిట్యూషనల్ డెమోక్రాటిక్ పార్టీ (కాడెట్స్) నాయకులలో ఒకడు. ఆయన క్రిమినల్ చట్టాన్ని గురించీ, రాజకీయాలను గురించీ అనేక గ్రంథాలూ, వ్యాసాలూ రచించాడు. వాటిలో *ది ప్రొవిషనల్ గవర్నమెంట్స్* (1922) కెరెన్స్కీ పతనాన్ని గురించి తెలిసికొనేందుకు ప్రధానమైన ఆధార గ్రంథాలలో ఒకటి. 1922 లో వారి కుటుంబం బెర్లిన్‌లో స్థిరపడిన తరువాత ఒక బహిరంగ సభలో మరొక వ్యక్తిని కాపాడబోయిన వి.డి. నబొకోవ్‌ను ఒక రైటిస్ట్ పొరపాటున హత్య చేశాడు. ఆయన కుమారుడైన నబొ

కోవ్ తన మీద ఆ సంఘటన యొక్క ప్రభావం ఏమీ లేదని ప్రకటించినప్పటికీ ఆయన నవలలలో తరచు పొరపాటున ఇలా హత్యా చేయబడిన సంఘటనలు కనిపిస్తున్నాయి. *స్పీక్, మెమొరీ* అనే తన ఆత్మకథలో నబొకోవ్ తన తండ్రి పట్ల తనకు గల ప్రగాఢమైన ప్రేమను వర్ణించాడు.

1919 లో రష్యానుంచి బయట పడడానికి ముందు *పొయెమ్స్* (1916), *టూ పాత్స్* (1918) అనే రెండు కవితా సంపుటాలను నబొకోవ్ ప్రకటించాడు. మొదట అతడు తన కుటుంబంతో ఇంగ్లండ్ చేరాడు. అక్కడ కేంబ్రిడ్జ్‌లోని ట్రినిటీ కళాశాలలో ప్రముఖ రష్యన్ ప్రవాసులకు ఇచ్చే స్కాలర్‌షిప్ మీద చదువుకొన్నాడు. మొదట అతడు జువాలజీ చదివి, తరువాత ఫ్రెంచ్, రష్యన్ సాహిత్యాల అధ్యయనానికి మారాడు. 1922 లో ప్రథమ శ్రేణిలో పట్టభద్రు డయాడు. ఇంగ్లండులో ఉన్న కాలంలో రష్యన్‌లోనూ, ఇంగ్లీష్ భాషలోనూ కూడా కవితలు వ్రాశాడు. *ది క్లస్టర్, ది ఎంపీరియన్ పాత్* అనే రెండు రష్యన్ కవితా సంపుటాలు 1923 లో వెలువడ్డాయి.

1922-40 మధ్య నబొకోవ్ జర్మనీ, ఫ్రాన్స్‌లలో నివసించాడు. కవితలు వ్రాయడం కొనసాగిస్తూనే, నాటక రచనలో కూడా ఆయన ప్రయోగాలు చేశాడు. పూర్తిగా తయారై విడుదల కాని చాలా చలన చిత్రాలకు సినేరియోలు వ్రాయడంలో కూడా సహకరించాడు. 1925 నాటికి తన రచనా మాధ్యమం వచనమే అని నబొకోవ్ గుర్తించాడు. ఆయన మొదటి చిన్నకథ 1924 లో బెర్లిన్‌లో ప్రచురితమైంది. మొదటి నవల *మాషెంకా* 1926 లో వెలువడింది. ఆ రెండింటిలోనూ నబొకోవ్ స్వీయ జీవిత సంఘటనలు ప్రతిఫలించాయి. మళ్లీ అంతగా ఆయన స్వీయ జీవితానుభవాలు ప్రతిఫలించిన నవల 1957 లో అమెరికాలో వెలువడిన *నిన్* (Pnin). 'ఇతాకా' లోని కార్నెల్ యూనివర్సిటీలో రష్యన్, యూరపియన్ సాహిత్యాలను బోధించిన నాటి (1948-58) నబొకోవ్ అనుభవాలు ఆ నవలలో మనకు కనిపిస్తాయి.

నబొకోవ్ నవలలలో చెప్పుకోదగినవి: *కింగ్, క్వీన్, నేవ్* (1928), *ది డిఫెన్స్, డిస్పెయిర్, ఇన్విటేషన్ టు ఏ బిహెడింగ్, లోలిటా.* నబొకోవ్ నవలలలో ఎక్కువ ప్రతులు చెల్లిన నవల *లోలిటా.* తక్కిన వాటి వల్ల ఆయనకు కొన్ని వందల డాలర్ల కంటె ఎక్కువ ఆదాయం రాలేదు. అమెరికా చేరి ఇంగ్లీష్‌లో రచనలు చేయడం మొదలు పెట్టిన దగ్గరనుంచి నబొకోవ్ కీర్తి క్రమంగా వృద్ధి చెందుతూ వచ్చింది. కొన్ని రోజులు ఆయన 'వి. సిరిన్' అనే కలంపేరుతో రచనలు చేశాడు. సమకాలీన యూరపియన్ రచయిత లందరికీ తలమానికం వంటివాడు అని నబొకోవ్‌ను విమర్శకులు శ్లాఘించారు. 1977 జూలై 2 న స్విట్జర్లండ్‌లోని మాంట్రియక్స్‌లో నబొకోవ్ తుది శ్వాస విడిచాడు.

బ్రా.శ్రీ.

**నియో రియలిజమ్ :** రెండవ ప్రపంచ యుద్ధం తరువాత ఇటలీలో సాహిత్యరంగంలోనూ, చలన చిత్రరంగంలోనూ కూడా కొనసాగిన ఉద్యమం ఇది. యుద్ధానికి దారి తీసిన సంఘటనలను, యుద్ధకాలంలోను, అటు తరువాత తల ఎత్తిన సాంఘిక సమస్యలను వాస్తవ దృష్టితో చిత్రించడం ఈ ఉద్యమం లక్ష్యం. సాహిత్య రంగంలో 1920-30 ప్రాంతాలలోనే ఈ ఉద్యమ బీజాలు కనిపించినా, ఫాసిస్ట్ దమననీతి వలన రెండవ యుద్ధం పూర్తి అయిన తరువాత గాని ఈ ఉద్యమం స్పష్టంగా ఆరంభం కాలేదు. అంతకు ముందు ఇటలీలో సాగిన రియలిస్ట్ ఉద్యమం లక్ష్యాలతోనే ఇంచుమించు ఈ ఉద్యమం కూడా ప్రారంభమైంది. కాకపోతే ఫాసిస్టు దమననీతి వల్ల ప్రతిభావంతులైన రచయితలకు కలిగిన తీవ్ర ప్రతిస్పందనలు ఈ ఉద్యమంలో విలక్షణంగా కనిపిస్తాయి.

ప్రముఖ నియోరియలిస్ట్ రచయితలలో నోబెల్ బహుమతి పొందిన సాల్వటోరి క్వాసిమోడో అనే కవీ, ఆల్బర్టో మోరావియా, ఇగ్నేజియో, సిలోనే, కార్లో లెవీ, వాస్కో ప్రాటోలినీ, కార్లో వెర్నారీ, సెజారే పావ్సే, ఎలియో విట్టోరినీ, కార్లో సోలా, ఇటాలో కల్వినో, కర్జియో మాలపార్టి, కార్లో ఎమీలియో గడ్డా మొదలైన వారు పేర్కొనదగినవారు.

ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరం ఈ ఉద్యమం ప్రబలంగా విజృంభించింది. వాస్కో ప్రాటోలినీ రచించిన ఆత్మకథాత్మక రచన, *ఇల్ క్వార్టెరె* (1946), *ది నేకెడ్ స్ట్రీట్స్* (1952), *క్రోనేఖ్ డి పోవెరి అమంటి* (1947), *ఏ టేల్ ఆఫ్ పూర్ లవర్స్* (1949), అనే గొప్ప నవల, కర్జియో మలపార్టే యుద్ధాన్ని గురించి వ్రాసిన *కాపుట్* (1944), *లా పెల్లె* (1949) *ది స్కిన్* (1952) వంటి నవలలు విశేష ప్రజాదరణ పొందాయి.

చలన చిత్రరంగంలో కూడా సమానాంతరంగా ఈ నియో రియలిస్ట్ ఉద్యమం సాగింది. వార్తా చిత్రాల లాగ అత్యంత సహజంగా చిత్రాలను తీయడం మొదలు

పెట్టారు. ఈ చిత్రాలలో కళాత్మకమైన విలువలు లోపిం చినా వీటిలో కొన్ని అంతర్జాతీయ విఖ్యాతి పొందాయి. అలాంటి చిత్రాలలో *ఓ పెన్ సిటీ* (1945), *పైసాన్* (1946) వంటివి చెప్పుకోదగినవి.

బొ.శ్రీ.

**నెజమి (1141-1209)** : పర్షియన్ సాహిత్యంలో అత్యుత్తమ కాల్పనిక పురాణ కవి. పర్షియన్ పురాణ రచనలో వ్యావహారికమైన, సహజమైన శైలిని ప్రవేశపె ట్టినవాడు.

నెజమి జీవితాన్ని గురించి మనకు తెలిసింది అత్యల్పం. చిన్నతనంలోనే తల్లి తండ్రులను కోల్పోయి ఇంచుమించు జీవితం అంతా సెల్జుక్ సామ్రాజ్యంలోని గంజాలోనే ఆయన గడిపాడు. ఒక్కసారి మాత్రం రాజకుమా రుణ్ణి కలుసుకోడానికి ఆయన గంజా వదలి వెళ్లాడు. అనేక రాజుల, రాజకుమారుల ఆదరణ అనుభవించినా, తన నిరాడంబర జీవితం వలన, త్రికరణ శుద్ధితో కూడిన స్వభావం వలన మాత్రమే నెజమి ప్రసిద్ధి పొందాడు.

నెజమి రచించిన *కసీల్దా* లూ (ఓడ్ పద్యాలు) గజల్‌లూ (భావగీతాలు) కొన్ని మాత్రమే నేడు మనకు లభిస్తున్నాయి. ఆయన కీర్తికి ప్రధాన ఆలంబనం *ఖమ్‌సే* అనే అయిదు భాగాలు గల మహాకావ్యం. అది 30,000 అంత్యాను ప్రాస పాటించిన ద్విపదలతో కూడింది. ఫిర్దౌసీ, సనాయీ అనే పర్షియన్ మహా పౌరాణిక కవుల వలన ఉత్తేజితుడై నాటకీయతతో కూడిన మొట్టమొదటి ఈ పర్షియన్ మహా కావ్యాన్ని నెజమి రచించాడు. *ఖమ్‌సే* లోని మొదటి భాగం *మఖ్ జాన్ అల్ అస్రాల్* (The Treasury of Mysteries - 1945), రెండవభాగం 'ఖో స్రో-జో-షిరీన్', మూడవ భాగం ఇస్లామిక్ జానపద గాథలలో ప్రసిద్ధమైన ఒక కథను తీసికొని నెజమి రచించిన *లైలీ-ఓ-మెజ్నూన్* (లైలా మజ్నూల కథ), నాలుగవభాగం *హాఫ్ట్ పైకర్* (ఏడు సోయగాలు-ఇది ఆయన అత్యుత్తమ రచన అని పరిగణిస్తున్నారు). *ఖమ్‌సే* లోని అయిదవ భాగం *సికందర్* (సికందర్ నామా). ఇది అలెగ్జాండర్‌ను గూర్చిన ఒక తాత్త్విక పద చిత్రం.

పర్షియన్ భాష మాట్లాడే ప్రాంతాలలో నెజమి కవితలోని మౌలికతనూ, అతని శైలిలోని స్పష్టతనూ ఎక్కువగా ఆస్వాదిస్తున్నారు. అయితే సామాన్య జనానికి మాత్రం నెజమి కవిత అర్థం కావడం కొంచెం కష్టం.

బొ.శ్రీ.

**నెరుదా, పాబ్లో (1904-73)** : ప్రముఖ చిలి యన్ కవి; నెరుదా అసలుపేరు నెఫ్తాలి రికార్డో రెయిస్ బసోవాల్టో.



ఇతడు రాజ నీతిజ్ఞుడు, మార్క్సిస్టు. 1971లో సాహిత్యానికి నోబెల్ బహుమతి పొందినవాడు. నెరుదా ఒక రైల్వే కార్మికుని కుమారుడు. నెరుదాకు నెల రోజులు నిండక ముందే తల్లి మరణించడంతో తన తండ్రి రెండో పెళ్ళి చేసుకొన్నాడు.

1910 లో టెముకో బోయిస్ స్కూల్లో చేరి, 1920 లో సెకండరీ విద్య ముగించాడు. ఆయన పదేళ్ళ వయస్సులో కవిత్వం వ్రాయటం మొదలు పెట్టాడు. అందులో కొంత తరువాతి కాలంలో వెలువడింది. మారుపేరుతో (తన తండ్రికి కోపం తెప్పించకుండా ఉండటానికి) విద్యార్థి ప్రచురణల్లో 1920 లో 'పాబ్లో నెరుదా' అనే పేరు వాడుకోడం మొదలు పెట్టాడు. దాన్ని 1946 లో చట్టరీత్యా స్వాయత్తం చేసుకొన్నాడు.

నెరుదా పన్నెండేళ్ళ వయస్సులో 'గేబ్రియలా మిస్ట్రాల్' అనే ప్రసిద్ధ చిలియన్ కవిని కలుసుకొన్నాడు. ఆయన ద్వారా తాను మహాకవుల కావ్యాలతో పరి చయం సంపాదించాడు. నెరుదా తీవ్రమైన అరాజక వాది. "పీటర్ క్రాపోట్కిన్" అరాజక కమ్యూనిజం సిద్ధాంత వ్యాఖ్యాతలలో ప్రముఖుడైన 'జీన్ గ్రేవ్' రచనను అనువదించాడు.

1921 లో నెరుదా టెముకో వదలి రాజధానియైన 'సాన్షియాగో' నగరానికి వెళ్లాడు. ఆయన ముఖ్య లక్ష్యం టీచర్స్ కాలేజిలో ఫ్రెంచి డిగ్రీ పొందటమే అయినా చదువు కన్న కవిత్వానికే ఎక్కువ కాలం వెచ్చింపసాగాడు. ఆ ఏడు అక్టోబరులో తన రచన *లాక్షాన్షియన్ డిలాఫియెస్టా* తో చిలియన్ విద్యార్థి సమాఖ్య కవిత్వపు పోటీలో మొదటి బహుమతి గెలు చుకొన్నాడు. తన సాహితీ రచనలు సమాఖ్య పత్రిక క్లేరిడాడ్ లో ప్రచురించటం మొదలు పెట్టాడు. 1923 లో తన మొదటి పుస్తకం *క్రెపుస్కులారియో* (Crepuscalarrio) ప్రచురించాడు. తనకున్న ఫర్నిచరు,

రాష్ట్రంలో మాంటి ఫాంటేన్‌లో తన చిన్నతాత గారి దగ్గర పెరిగి పెద్దవాడయాడు. అక్కడ ఆయన బాల్యదశ స్మృతి రమణీయమైన స్వప్నంగా ఆయన శేషజీవితంలో మెదిలేది. 1820 లో ఆయన తన తండ్రితో పారిస్ లో నివసించటానికి వెళ్ళాడు. అక్కడ చార్లమన్ కాలేజిలో చదువుకొంటూ ఉండగా, ఆయన థియోఫైల్ గాషియర్ (Theophile Gautier) అనే కవిని కలుసు కొన్నాడు. ఆయనతో శాశ్వతమైన స్నేహం ఏర్పడింది. నెర్వాల్ చిత్రకారులతో, కళాకారులతో, కాల్ప నికులతో, సంప్రదాయవాదులతో కలసి కాలం గడపటం మొదలుపెట్టాడు. అతనికి వాళ్ళ తాతల ఆస్తి కొంత సంక్రమించింది. దానితో ఇటలీలో పర్యటించగలిగాడు. తక్కిన ఆస్తి అంతా ఒక నిర్భాగ్యపు నాటక సమీక్షకోసం ధార పోశాడు. అప్పట్లో నెర్వాల్‌కి జర్మన్ సాహిత్యం మీద ఎక్కువ ఆసక్తి ఉండేది. గొయిథే రచించిన *ఫౌస్ట్* ఫ్రెంచి భాషలోకి అనువదించాడు. *లా మెయిర్ డి గ్లోయిర్* (La Main De Gloire -1832 'The Land of Glory') అనే కథా సంపుటిని *ఇ.టి.ఏ. హాఫ్‌మన్* (E.T.A. Hoffmann) ధోరణిలో రచించాడు.

1836 లో నెర్వాల్ 'జెన్నీ కొలోన్' అనే నటితో గాఢమైన ప్రేమలో పడ్డాడు. అయినా ఆమె రెండు సంవత్సరాల తరువాత మరొకణ్ణి పెళ్ళి చేసుకొని, 1842 లో మరణించింది. ఆమె నెర్వాల్‌కి ఒక స్వాప్నిక మూర్తి అయింది.

1842 లోనే నెర్వాల్ లెవాంట్ యాత్రకి వెళ్ళాడు. దాని ఫలితమే ఆయన ఉత్తమ రచనలలో ఒకటి *వాయేజ్ ఎన్ఓరియంట్* (*Voyage en orient-1843-51, voyage to the East)* అనే యాత్రా గ్రంథం.

ఆయన ఉధృతంగా రచనలు చేస్తున్న కాలంలో తీవ్రమైన మానసిక సంక్షోభానికి గురిఅయి, కనీసం ఎని మిది సార్లైనా మానసిక చికిత్సాలయాలలో చేరాడు. *లె చిమెరిస్* (*Les Chimeres-1854* "The chimeras") అనే ఆయన రచించిన 'సానెట్లు' గాన యోగ్యమైనవి. దారిద్ర్యంతోను, వేదనతోను కలతచెంది 1855 లో పారి స్‌లోని 'రూడలాలి యెల్లీ లేంటర్నీ' దీప స్తంభానికి ఉరివేసుకొని చనిపోయాడు.

శ్రీ.న.చ.రా.

**నెర్వో, అమాదో (1870-1919) :** ప్రముఖ మెక్సి కన్ కవి, రాజకీయవేత్త. నెర్వో పూర్తి పేరు 'జువాన్ క్రైసోస్ టోమో రూయిజ్ నెర్వో'. 19 వ శతా బ్దాంతంలోనూ, 20 వ శతాబ్దారంభంలోనూ సాగిన ఆధునికోద్యమంలో అత్యంత ప్రసిద్ధి చెందిన కవి. నెర్వో కవిత్వం, గాఢ మతాభినివేశంతో సరళరూపంలో, అంతశ్శాంతి కోసం ఆయన పడిన సంఘర్షణను వ్యక్తం చేస్తుంది.

నెర్వో మతాచార్య విద్యాభ్యాసాన్ని విడిచి, 1888 లో మజాట్లాన్‌లో పత్రికా రచయిత వృత్తిని స్వీకరిం చాడు. 1894 లో మెక్సికో నగరానికి చేరి, అక్కడ తన మొదటి నవల *ఎల్ బాచిలర్* 1895-"The Baccalaureate") రచించాడు. ఆధునాతన భావాలతో తన మొదటికవితా సంపుటి *పెర్లాస్ నీగ్రాస్* (Perlas negras: 1898) రచించాడు. 1898 లో మరికొందరితో కలిసి *రివిస్టా మోడర్నా* (Revista Moderna) అనే పత్రిక స్థాపించాడు. అది అనతికాలంలోనే ఆధునికోద్యమ పత్రికలలో అత్యంత ప్రభావవంత మైంది.

నెర్వో మెక్సికన్ రాయబారి కార్యాలయంలో కార్య దర్శిగా పనిచేస్తూ మాడ్రిడ్‌లో ఉండేవాడు. (1905-18). ఆ కాలంలో పారిస్ సాహిత్యవర్గాలతో ఎక్కువకాలం గడు పుతూ ఉండేవాడు. ఆ కాలంలోనే ఆయన కవితలూ, వ్యాసాలూ, కథానికలూ చాలా రచించాడు. అవి 29 సంపుటాలుగా సంకలితమయాయి. ఆయన తరువాతి రచనలు, *సెరినిడాడ్* (*Serenidad-1914* "Serenity"), *ప్లెనిట్యుడ్* (*Plenitud- 1918:* Plenitude) లలో అంత శ్శాంతి కోసం ఆయన పడిన తపన ప్రతిఫలిస్తుంది. అది కొంతవరకూ బౌద్ధ తాత్త్విక దర్శనాల అధ్యయనం ద్వారా సాధ్యమైంది.

ఆయన 1918 లో మెక్సికోకు తిరిగి వచ్చిన తరు వాత అర్జంటీనాకి, ఉరుగ్వేకి రాయబారిగా నియమితుడై మాండివిడియోలో ఆయన మరణించే వరకూ పనిచేస్తూ వచ్చాడు.

శ్రీ.న.చ.రా.

**నెవిన్స్, అలన్ (1890-1971) :** అమెరికన్ చరిత్ర రచయిత, విద్యావేత్త. ముఖ్యంగా ఆయన రచించిన ఎనిమిది సంపుటాల అమెరికా అంతర్యుద్ధ చరిత్రవల్లను, అమెరికన్ రాజకీయ పారిశ్రామిక ప్రముఖుల జీవిత చరిత్రల వల్లను విఖ్యాతి చెందాడు.

నెవిన్స్ పశ్చిమ ఇల్లినాయ్ రాష్ట్రంలో ఒక వ్యవసాయ క్షేత్రంలో పెరిగాడు. ఇల్లినాయ్ విశ్వవిద్యాలయంలో చదువు కొన్నాడు. అక్కడ స్నాతకోత్తర విద్య పూర్తి చేస్తుండగా, తన మొదటి పుస్తకం, *రాబర్ట్ రోజర్స్ జీవిత చరిత్ర* (*The Life of Robert Rogers-1914)* అమెరికన్ కాలనీల సరిహద్దులో లాయలిస్ట్ పక్షంలో

రాష్ట్రంలో మాంటి ఫాంటేన్‌లో తన చిన్నతాత గారి దగ్గర పెరిగి పెద్దవాడయాడు. అక్కడ ఆయన బాల్యదశ స్మృతి రమణీయమైన స్వప్నంగా ఆయన శేషజీవితంలో మెదిలేది. 1820 లో ఆయన తన తండ్రితో పారిస్ లో నివసించటానికి వెళ్ళాడు. అక్కడ చార్లిమన్ కాలేజిలో చదువుకొంటూ ఉండగా, ఆయన థియోఫైల్ గాషియర్ (Theophile Gautier) అనే కవిని కలుసు కొన్నాడు. ఆయనతో శాశ్వతమైన స్నేహం ఏర్పడింది. నెర్వాల్ చిత్రకారులతో, కళాకారులతో, కాల్ప నికులతో, సంప్రదాయవాదులతో కలసి కాలం గడపటం మొదలుపెట్టాడు. అతనికి వాళ్ళ తాతల ఆస్తి కొంత సంక్రమించింది. దానితో ఇటలీలో పర్యటించగలిగాడు. తక్కిన ఆస్తి అంతా ఒక నిర్భాగ్యపు నాటక సమీక్షకోసం ధార పోశాడు. అప్పట్లో నెర్వాల్‌కి జర్మన్ సాహిత్యం మీద ఎక్కువ ఆసక్తి ఉండేది. గొయిథే రచించిన *ఫౌస్ట్* ఫ్రెంచి భాషలోకి అనువదించాడు. *లా మెయిన్ డి గ్లోయిరి* (La Main De Gloire -1832 'The Land of Glory') అనే కథా సంపుటిని *ఇ.టి.ఏ. హాఫ్‌మన్* (E.T.A. Hoffmann) ధోరణిలో రచించాడు.

1836 లో నెర్వాల్ 'జెన్నీ కొలోన్' అనే నటితో గాఢమైన ప్రేమలో పడ్డాడు. అయినా ఆమె రెండు సంవత్సరాల తరువాత మరొకణ్ణి పెళ్లి చేసుకొని, 1842 లో మరణించింది. ఆమె నెర్వాల్‌కి ఒక స్వాప్నిక మూర్తి అయింది.

1842 లోనే నెర్వాల్ లెవాంట్ యాత్రకి వెళ్లాడు. దాని ఫలితమే ఆయన ఉత్తమ రచనలలో ఒకటి *వాయేజ్ ఎన్‌ఓరియంట్* (*Voyage en orient-1843-51, voyage to the East)* అనే యాత్రా గ్రంథం.

ఆయన ఉధృతంగా రచనలు చేస్తున్న కాలంలో తీవ్రమైన మానసిక సంక్షోభానికి గురిఅయి, కనీసం ఎని మిది సార్లైనా మానసిక చికిత్సాలయాలలో చేరాడు. *లె చిమెరిస్* (*Les Chimeres-1854* "The chimeras") అనే ఆయన రచించిన 'సానెట్లు' గాన యోగ్యమైనవి. దారిద్ర్యంతోను, వేదనతోను కలతచెంది 1855 లో పారి స్‌లోని 'రూడలాలి యెల్లీ లేంటర్నీ' దీప స్తంభానికి ఉరివేసుకొని చనిపోయాడు.

శ్రీ.న.చ.రా.

**నెర్వో, అమాదో (1870-1919) :** ప్రముఖ మెక్సి కన్ కవి, రాజకీయవేత్త. నెర్వో పూర్తి పేరు 'జువాన్ క్రైసోస్ టోమో రూయిజ్ నెర్వో'. 19 వ శతా బ్దాంతంలోనూ, 20 వ శతాబ్దారంభంలోనూ సాగిన ఆధునికోద్యమంలో అత్యంత ప్రసిద్ధి చెందిన కవి. నెర్వో కవిత్వం, గాఢ మతాభినివేశంతో సరళరూపంలో, అంతశ్శాంతి కోసం ఆయన పడిన సంఘర్షణను వ్యక్తం చేస్తుంది.

నెర్వో మతాచార్య విద్యాభ్యాసాన్ని విడిచి, 1888 లో మజాట్లాన్‌లో పత్రికా రచయిత వృత్తిని స్వీకరిం చాడు. 1894 లో మెక్సికో నగరానికి చేరి, అక్కడ తన మొదటి నవల *ఎల్ బాచిలర్* 1895-"The Baccalaureate") రచించాడు. ఆధునాతన భావాలతో తన మొదటికవితా సంపుటి *పెర్లాస్ నీగ్రాస్* (Perlas negras: 1898) రచించాడు. 1898 లో మరికొందరితో కలిసి *రివిస్టా మోడర్నా* (Revista Moderna) అనే పత్రిక స్థాపించాడు. అది అనతికాలంలోనే ఆధునికోద్యమ పత్రికలలో అత్యంత ప్రభావవంత మైంది.

నెర్వో మెక్సికన్ రాయబారి కార్యాలయంలో కార్య దర్శిగా పనిచేస్తూ మాడ్రిడ్‌లో ఉండేవాడు. (1905-18). ఆ కాలంలో పారిస్ సాహిత్యవర్గాలతో ఎక్కువకాలం గడు పుతూ ఉండేవాడు. ఆ కాలంలోనే ఆయన కవితలూ, వ్యాసాలూ, కథానికలూ చాలా రచించాడు. అవి 29 సంపుటాలుగా సంకలితమయాయి. ఆయన తరువాతి రచనలు, *సెరినిడాడ్* (*Serenidad-1914* "Serenity"), *ప్లెనిట్యుడ్* (*Plenitud- 1918:* Plenitude) లలో అంత శ్శాంతి కోసం ఆయన పడిన తపన ప్రతిఫలిస్తుంది. అది కొంతవరకూ బౌద్ధ తాత్త్విక దర్శనాల అధ్యయనం ద్వారా సాధ్యమైంది.

ఆయన 1918 లో మెక్సికోకు తిరిగి వచ్చిన తరు వాత అర్జంటీనాకి, ఉరుగ్వేకి రాయబారిగా నియమితుడై మాండివిడియోలో ఆయన మరణించే వరకూ పనిచేస్తూ వచ్చాడు.

శ్రీ.న.చ.రా.

**నెవిన్స్, అలన్ (1890-1971) :** అమెరికన్ చరిత్ర రచయిత, విద్యావేత్త. ముఖ్యంగా ఆయన రచించిన ఎనిమిది సంపుటాల అమెరికా అంతర్యుద్ధ చరిత్రవల్లను, అమెరికన్ రాజకీయ పారిశ్రామిక ప్రముఖుల జీవిత చరిత్రల వల్లను విఖ్యాతి చెందాడు.

నెవిన్స్ పశ్చిమ ఇల్లినాయ్ రాష్ట్రంలో ఒక వ్యవసాయ క్షేత్రంలో పెరిగాడు. ఇల్లినాయ్ విశ్వవిద్యాలయంలో చదువు కొన్నాడు. అక్కడ స్నాతకోత్తర విద్య పూర్తి చేస్తుండగా, తన మొదటి పుస్తకం, *రాబర్ట్ రోజర్స్ జీవిత చరిత్ర* (*The Life of Robert Rogers-1914)* అమెరికన్ కాలనీల సరిహద్దులో లాయలిస్ట్ పక్షంలో

వెర్నర్ దగ్గర భూగర్భశాస్త్రం చదువుకోటానికి ఫ్రీబెర్గ్ అకాడమీకి నొవాలిస్ వెళ్లాడు.

జీనాలో (1799) నొవాలిస్ యువ కాల్పనిక కవి సమాజ సమక్షంలో తన *జీయిస్టిక్ లియిడర్* (Geistliche lieder-1799-Sacred Songs-1956) పఠించాడు. నోవాలిస్ ప్రభావాన్ని విస్తరింపచేసిన ప్రధాన రచన అదే. 1799 లో లీసెస్ ఫెల్స్ ఉప్పు కొటార్లలో పరిపాలనా శాఖలో పదవిని చేపట్టాడు.

ఆయన రచనల రెండు సంకలనాలు *బ్లూమెన్-స్టాబ్* (Blulen-staub, 1798) *గ్లాబెన్ ఉండ్ లీబి* (Glauben und liebe-1798, Faith and love) చాలా భాగం అసంపూర్ణంగా ఉన్నాయి. అవి ప్రపంచాన్ని ప్రతీకాత్మకంగా వ్యాఖ్యానిస్తూ కవిత్వం, తత్త్వశాస్త్రం, పదార్థ శాస్త్రం మిళితం చేయటానికి పూనుకొన్నాయి. ఆయన ప్రసిద్ధమైన పౌరాణిక కాల్పనిక గాథ *హ్యెన్రిఖ్ వాన్ ఓఫ్టర్ డిన్జెన్* (Heinrich von ofler dingen - 1802) ప్రాచీన కాల్పనిక కవుల అభిప్రాయాలను, అభిరుచులను ప్రతిఫలిస్తుంది.

*శ్రీ.న.చ.రా.*

**నోబెల్ బహుమతి :** ఏటేటా అయిదు రంగాలలో సుప్రసిద్ధులకు ఇవ్వబడే అంతర్జాతీయ బహుమతులలో ఒకటి. 1969 లో ఆరవ రంగంలో కూడా నోబెల్ బహుమతి ఏర్పాటు చేయబడింది. మూడు స్వీడిష్ సంస్థలు, ఒక నార్వీజియన్ సంస్థ కలసి ఈ బహుమతుల వితరణ కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నాయి. ఆల్ఫ్రెడ్ బెర్న్‌హార్డ్ నోబెల్ (1833-1896) తన వీలునామా ద్వారా ఏర్పాటు చేసిన ఒక నిధి నుంచి ఈ బహుమతుల ప్రదానం జరుగు తూంది. 1901 డిసెంబరు 10 వ తేదీ నుంచి నోబెల్ బహుమతుల వితరణ జరుగుతూ వస్తూంది. గత ప్రతిసంవత్సరం మానవజాతికి అత్యుత్తమమైన సేవలను అందచేసిన మహనీయులకు ఆ బహుమతుల వితరణ జరగాలని నిర్దేశించిన నోబెల్ యొక్క అయిదవ వర్ధంతినాటి నుండి ఫిజిక్స్, కెమిస్ట్రీ, ఫిజియాలజీ-మెడిసిన్, సాహిత్యం, శాంతి అనే ఐదు రంగాలలోను నోబెల్ బహుమతులను ఏటేటా ఇస్తున్నారు. ఆర్థికశాస్త్రంలో కూడా మరొక బహుమతిని 1968 లో బాంక్ ఆఫ్ స్వీడెన్ ఏర్పాటు చేయగా, ఆ రంగంలో తొలిబహుమతి 1969లో ఇవ్వడం జరిగింది.

ఆల్ఫ్రెడ్ నోబెల్ ఈ బహుమతుల వితరణ కార్యక్రమాన్ని నిర్వహించాలని తన వీలునామాలో సూచించిన నాలుగు సంస్థలు: 1. ది రాయల్ స్వీడిష్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ (ఫిజిక్స్, కెమిస్ట్రీలలో), 2. ది రాయల్ కేరోలిన్ మెడికో-సర్జికల్ ఇన్‌స్టిట్యూట్ (ఫిజియాలజీ, మెడిసిన్‌లలో), 3. స్వీడిష్ అకాడమీ (సాహిత్యంలో-ఈ మూడు సంస్థలూ స్వీడెన్‌లోని స్టాక్‌హోమ్‌లో ఉన్నాయి), 4. నార్వీజియన్ స్టోర్టింగ్ (పార్లమెంట్) ఓస్లోలో ఏర్పాటు చేసిన నార్వీజియన్ నోబెల్ కమిటీ (శాంతి రంగంలో). ది రాయల్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ ఆర్థిక శాస్త్రంలోని బహుమతిని కూడా పర్యవేక్షిస్తూంది. వీలునామా లోని షరతుల కనుగుణంగా స్థాపించబడిన 'ది నోబెల్ ఫౌండేషన్' నోబెల్ నిధులను నిర్వహించే చట్టబద్ధమైన సంస్థ. నోబెల్ బహుమతులను నిర్ణయించే నాలుగు సంస్థల కార్యక్రమాలనూ ఇది సమన్వయ పరుస్తుంది. ప్రతి నోబెల్ బహుమతిలోను ఒక బంగారపు మెడల్, ఒక ప్రశంసా పత్రం, ఫౌండేషన్ వారి ఆదాయాన్ని అనుసరించి నిర్ణయించబడే నగదు చేరి ఉంటాయి. ఆర్థిక రంగంలోని బహుమతి కూడా ఇతర రంగాలలోని బహుమతులవలెనే నిర్వహించబడుతూంది. (చూ. అనుబంధం-II)

*బొ.శ్రీ.*

**పపీనీ, జ్యవానీ (1881-1956) :** ఇటాలియన్ జర్నలిస్టు, విమర్శకుడు, కవి, నవలా రచయిత. పపీనీ 1881 జనవరి 9 న ఫ్లారెన్సులో జన్మించాడు. 20 వ శతాబ్ది పూర్వార్ధంలో ఉన్న ప్రసిద్ధ ఇటాలియన్ విద్యావేత్తలలో పపీనీ ఒకడు. కొంతవరకు వివాదగ్రస్తమైన వ్యక్తి అయాడు. మొదట తీవ్రవాది అయినా, సంపాదకుడుగా, రచయితగా అనుభవం గడించి, ఇటాలియన్ ఫ్యూచరిస్ట్ సంఘ నాయకుడుగాను, పిమ్మట రోమన్ కాథలిక్కుమతం స్వీకరించి గట్టి మత విశ్వాసం గల బోధకుడుగాను ప్రసిద్ధి పొందాడు.

ఫ్లారెన్సు యూనివర్సిటీలో విద్యనభ్యసించిన పపీనీ త్వరలోనే ఫ్లారెన్సు నగరంలో సాహిత్య ప్రవర్తకుడయాడు. లియొనార్డో (1903) అనే ఫ్లారెంటైన్ సాహిత్య పత్రిక స్థాపకులలో అత డొకడు. ఈ కాలంలోనే అతడు తీవ్ర సంప్రదాయ విరోధిగా "ఇల్ క్రెపుస్కోలో డి ఫిలోసఫి" (1906) వంటి చాలా కృతులు వ్రాశాడు. వానిలో సంప్రదాయ తత్త్వాన్ని తీవ్రంగా ఖండించాడు. "లియొనార్డో" పత్రిక 1907 లో ఆగిపోయింది. దానితో 'పపీనీ' లా నిమా, లావోస్ పత్రిక సిబ్బంది వర్గంలో చేరాడు. ఆ కాలంలోనే అతడు తన ప్రసిద్ధ స్వీయ చరిత్రాత్మక నవల *ఎన్ ఓమో ఫినిటో* (1912) ను వ్రాశాడు. దానిలో ఫ్లారెన్స్‌లో తన

వెర్నర్ దగ్గర భూగర్భశాస్త్రం చదువుకోటానికి ఫ్రీబెర్గ్ అకాడమీకి నొవాలిస్ వెళ్లాడు.

జీనాలో (1799) నొవాలిస్ యువ కాల్పనిక కవి సమాజ సమక్షంలో తన *జీయిస్టిక్ లియిడర్* (Geistliche lieder-1799-Sacred Songs-1956) పఠించాడు. నోవాలిస్ ప్రభావాన్ని విస్తరింపచేసిన ప్రధాన రచన అదే. 1799 లో లీసెస్ ఫెల్స్ ఉప్పు కొటార్లలో పరిపాలనా శాఖలో పదవిని చేపట్టాడు.

ఆయన రచనల రెండు సంకలనాలు *బ్లూమెన్-స్టాబ్* (Blulen-staub, 1798) *గ్లాబెన్ ఉండ్ లీబి* (Glauben und liebe-1798, Faith and love) చాలా భాగం అసంపూర్ణంగా ఉన్నాయి. అవి ప్రపంచాన్ని ప్రతీకాత్మకంగా వ్యాఖ్యానిస్తూ కవిత్వం, తత్త్వశాస్త్రం, పదార్థ శాస్త్రం మిళితం చేయటానికి పూనుకొన్నాయి. ఆయన ప్రసిద్ధమైన పౌరాణిక కాల్పనిక గాథ *హైన్రిఖ్ వాన్ ఓఫ్టర్ డిన్జెన్* (Heinrich von ofler dingen - 1802) ప్రాచీన కాల్పనిక కవుల అభిప్రాయాలను, అభిరుచులను ప్రతిఫలిస్తూంది.

*శ్రీ.న.చ.రా.*

**నోబెల్ బహుమతి :** ఏటేటా అయిదు రంగాలలో సుప్రసిద్ధులకు ఇవ్వబడే అంతర్జాతీయ బహుమతులలో ఒకటి. 1969 లో ఆరవ రంగంలో కూడా నోబెల్ బహుమతి ఏర్పాటు చేయబడింది. మూడు స్వీడిష్ సంస్థలు, ఒక నార్వీజియన్ సంస్థ కలసి ఈ బహుమతుల వితరణ కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నాయి. ఆల్ఫ్రెడ్ బెర్న్‌హార్డ్ నోబెల్ (1833-1896) తన వీలునామా ద్వారా ఏర్పాటు చేసిన ఒక నిధి నుంచి ఈ బహుమతుల ప్రదానం జరుగు తూంది. 1901 డిసెంబరు 10 వ తేదీ నుంచి నోబెల్ బహుమతుల వితరణ జరుగుతూ వస్తూంది. గత ప్రతిసంవత్సరం మానవజాతికి అత్యుత్తమమైన సేవలను అందచేసిన మహనీయులకు ఆ బహుమతుల వితరణ జరగాలని నిర్దేశించిన నోబెల్ యొక్క అయిదవ వర్ధంతినాటి నుండి ఫిజిక్స్, కెమిస్ట్రీ, ఫిజియాలజీ-మెడిసిన్, సాహిత్యం, శాంతి అనే ఐదు రంగాలలోను నోబెల్ బహుమతులను ఏటేటా ఇస్తున్నారు. ఆర్థికశాస్త్రంలో కూడా మరొక బహుమతిని 1968 లో బాంక్ ఆఫ్ స్వీడెన్ ఏర్పాటు చేయగా, ఆ రంగంలో తొలిబహుమతి 1969లో ఇవ్వడం జరిగింది.

ఆల్ఫ్రెడ్ నోబెల్ ఈ బహుమతుల వితరణ కార్యక్రమాన్ని నిర్వహించాలని తన వీలునామాలో సూచించిన నాలుగు సంస్థలు: 1. ది రాయల్ స్వీడిష్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ (ఫిజిక్స్, కెమిస్ట్రీలలో), 2. ది రాయల్ కేరోలిన్ మెడికో-సర్జికల్ ఇన్‌స్టిట్యూట్ (ఫిజియాలజీ, మెడిసిన్‌లలో), 3. స్వీడిష్ అకాడమీ (సాహిత్యంలో-ఈ మూడు సంస్థలూ స్వీడెన్‌లోని స్టాక్‌హోమ్‌లో ఉన్నాయి), 4. నార్వీజియన్ స్టోర్టింగ్ (పార్లమెంట్) ఓస్లోలో ఏర్పాటు చేసిన నార్వీజియన్ నోబెల్ కమిటీ (శాంతి రంగంలో). ది రాయల్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ ఆర్థిక శాస్త్రంలోని బహుమతిని కూడా పర్యవేక్షిస్తూంది. వీలునామా లోని షరతుల కనుగుణంగా స్థాపించబడిన 'ది నోబెల్ ఫౌండేషన్' నోబెల్ నిధులను నిర్వహించే చట్టబద్ధమైన సంస్థ. నోబెల్ బహుమతులను నిర్ణయించే నాలుగు సంస్థల కార్యక్రమాలనూ ఇది సమన్వయ పరుస్తుంది. ప్రతి నోబెల్ బహుమతిలోను ఒక బంగారపు మెడల్, ఒక ప్రశంసా పత్రం, ఫౌండేషన్ వారి ఆదాయాన్ని అనుసరించి నిర్ణయించబడే నగదు చేరి ఉంటాయి. ఆర్థిక రంగంలోని బహుమతి కూడా ఇతర రంగాలలోని బహుమతులవలెనే నిర్వహించబడుతూంది. (చూ. అనుబంధం-II)

*బొ.శ్రీ.*

**పపీనీ, జ్యావానీ (1881-1956) :** ఇటాలియన్ జర్నలిస్టు, విమర్శకుడు, కవి, నవలా రచయిత. పపీనీ 1881 జనవరి 9 న ఫ్లారెన్సులో జన్మించాడు. 20 వ శతాబ్ది పూర్వార్ధంలో ఉన్న ప్రసిద్ధ ఇటాలియన్ విద్యావేత్తలలో పపీనీ ఒకడు. కొంతవరకు వివాదగ్రస్తమైన వ్యక్తి అయాడు. మొదట తీవ్రవాది అయినా, సంపాదకుడుగా, రచయితగా అనుభవం గడించి, ఇటాలియన్ ఫ్యూచరిస్ట్ సంఘ నాయకుడుగాను, పిమ్మట రోమన్ కాథలిక్కుమతం స్వీకరించి గట్టి మత విశ్వాసం గల బోధకుడుగాను ప్రసిద్ధి పొందాడు.

ఫ్లారెన్సు యూనివర్సిటీలో విద్యనభ్యసించిన పపీనీ త్వరలోనే ఫ్లారెన్సు నగరంలో సాహిత్య ప్రవర్తకుడయాడు. లియొనార్డో (1903) అనే ఫ్లారెంటైన్ సాహిత్య పత్రిక స్థాపకులలో అత డొకడు. ఈ కాలంలోనే అతడు తీవ్ర సంప్రదాయ విరోధిగా "ఇల్ క్రెపుస్కోలో డి ఫిలోసఫి" (1906) వంటి చాలా కృతులు వ్రాశాడు. వానిలో సంప్రదాయ తత్త్వాన్ని తీవ్రంగా ఖండించాడు. "లియొనార్డో" పత్రిక 1907 లో ఆగిపోయింది. దానితో 'పపీనీ' లా నిమా, లావోస్ పత్రిక సిబ్బంది వర్గంలో చేరాడు. ఆ కాలంలోనే అతడు తన ప్రసిద్ధ స్వీయ చరిత్రాత్మక నవల *ఎన్ ఓమో ఫినిటో* (1912) ను వ్రాశాడు. దానిలో ఫ్లారెన్స్‌లో తన

బాల్యజీవితం, ఆదర్శసిద్ధికై అతని ఆరాటం, వైయక్తిక లక్ష్యప్రాప్తి మొదలైన విషయాలు వ్రాశాడు.

అప్పటికే పపీనీ ఫ్యూచరిజమ్ ఔత్సాహికుడు, అనుయాయి అయి *లా సెర్బా* (1913) అనే మరో పత్రికను స్థాపించాడు. రెండు సంవత్సరాల పాటు దానిని నడిపిన తరువాత పపీనోకు ఫ్యూచరిస్ట్ ఉద్యమంలో ఉత్సాహం సన్నగిల్లింది.

1920 లో పపీనీ తాను పెరిగి పెద్ద అయిన రోమన్ కేథలిజమ్ లోనికి మతాంతరీకరణ చెంది, అనేక ధార్మిక గ్రంథాలు రచించాడు. *స్టోరియా డి క్రిస్టో* (1921) అనేది జీసస్ జీవిత చరిత్రను యథాతథంగా చిత్రించేది. *పాన్ ఎ వినో* (1926) అనేది ధార్మిక కవితల సంపుటి. మరొకటి *సెంట్ ఆగస్తీనో* (1929). అయితే, అతని తరువాతి రచనలు కూడా చర్చిని విమర్శించకుండా ఉండలేదు. *లెటర్ అగ్లివుమని డీ, పాపా సెల్లిస్తినో* (1946), *ఇల్ డి యావ లో* (1953) అనే రెండు రచనలూ సంప్రదాయ వ్యతిరేక భావాలు కల్గినవే.

'పపీనీ' మొత్తం 60 కృతులవరకు రచించాడు. అతని సాహిత్య వ్యాసాలు మూడు సంచికలుగా వెలువడ్డాయి. వానిలో *వెంటిక్వాట్రొ, సెర్వెల్లి* (1912) అనేవి ప్రముఖమైనవి. వానిలో ఆనాటి యూరపియన్ సాహిత్య ప్రముఖులను గురించిన విమర్శలతో పాటు తనను గురించి కూడా ఒక విమర్శనాత్మక వ్యాసం జోడించబడడం విశేషం. ప్రాచీన ధోరణి, కవిత్వం, చిన్న కథలు కూడా అతడు ప్రచురించాడు. అతని ఇతర ప్రముఖ రచనలు: *డాంటే జీవిత చరిత్ర, డాం టేవివో* (1933). తాత్త్విక గవేషణ గల ఆ గ్రంథానికి ముస్సోలినీ బహుమతి లభించింది. (అప్పటికి పపీనీ తీవ్ర ఫాసిస్టుగా మారాడు. *స్టోరియా డెల్లా లిటరేచరా ఇటాలియానా* (1937), *మైఖేల్ ఎంజిలో జీవిత చరిత్ర* (1949) కూడా ప్రముఖమైనవే. 1956 జూలై 1 న ఇతడు ఫ్లారెన్స్ నగరంలోనే జీవనయాత్ర చాలించాడు.

జె.సూ.ప్ర.

**పరీనీ, జెసుప్పె (1729-1799) :** ఇటాలియన్ కవి, గద్య రచయిత. పరీనీ 'హొరేషియన్ ఓడ్స్' అనే పద్యాల వల్ల విశేష ప్రశస్తి గడించాడు. *అల్కూన్ పొయిసీ డి రిపానో యూ పిలినో* (1752) అనే ఆర్కాడియన్ కవిత ఇతనికి విద్వల్లోకంలో సాహిత్య వేత్తగా స్థానం కలిగించింది. ఆ మరుసటి సంవత్సరమే అతడు ప్రతిష్ఠాకరమైన *మిలానీస్ అకాడమీయా డీ ట్రాన్స్‌ఫార్మటీ* లో సభ్యు డయాడు.

1954 లో మతబోధకుడుగా మారిన 'పరీనీ' *డ్యూక్ గ్యాబియో సెర్ బెల్లోనీ* కుటుంబంలో వారి జ్యేష్ఠ కుమారునకు ట్యూటరుగా నియుక్తు డయాడు. అక్కడ అతనికి ఆదరణ, గుర్తింపు కరువైనా 1762 వరకూ అక్కడే కాలం గడిపాడు. దానికి పర్యవసానంగా *డయొలాగో స్సోపా లా నోబల్టా* అనే రచన చేశాడు. దీనిలో ఒక పెద్దమనిషి శవానికీ, ఒక కవి శవానికీ మధ్య గొప్పతనాన్ని గురించి చర్చ సాగుతుంది. రెండవది అతని కీర్తి కిరీటానికి తురాయి అనదగిన *ఇల్ జియార్నో* (Il giorno) అనే వ్యంగ్య రచన. ఇది 1763-1801 మధ్య 4 సంపుటాలుగా మధ్య వెలువడింది.

*ఇల్ జియార్నో* లోని మొదటి రెండు భాగాలూ సంపాదించి పెట్టిన కీర్తితో పరీనీ మొదట *గెజెటా డి మిలానొ* కు సంపాదకుడై తరువాత 'పాలటైన్, బ్రేరా' స్కూళ్లల్లో (Palatine and Brera schools) ఆచార్యు డయాడు. మిలాన్‌లో 'పరీనీ' యువకుడైన 'మొజార్టో' ను కలసి కొన్నాడు. అతడు ఇతని *అస్కానియో ఇన్ అల్బా* (Ascanio in Alba) అనే నాటకానికి *ఓపెరా గీతాలు* వ్రాశాడు. ఆ ఓపెరా 1771 లో ప్రదర్శింపబడింది. ఫ్రెంచివారు మిలాన్‌ను ఆక్రమించినపుడు మూడేళ్లపాటు 'పరీనీ' ఇబ్బంది పడుతూనే ప్రభుత్వోద్యోగం చేయవలసి వచ్చింది.

'పరీనీ' ఇతర కృతులలో 20 ఏళ్ల సుదీర్ఘకాలం రచింపబడి, 1795 లో ప్రచురింపబడిన *ఓడ్స్* ప్రముఖమైనది. 'పరీనీ' మరి కొన్ని సాహిత్య కృతులు, *డి ప్రిన్సిపి జెనరలి-ఎ-పర్టికాలరి డెయ్ బెయ్ లెటరే* (1801) అనే ఒక 'సౌందర్య మీమాంస' ను గూర్చిన ఉద్గ్రంథం రచించాడు.

జె.సూ.ప్ర.

**పలాసియో వాల్డెస్, అర్మాండో (1853-1938):** 19 వ శతాబ్దంలో అత్యంత ప్రజాదరణ పొందిన స్పానిష్ నవలా రచయితలలో ఒకడు. ఆయన ఆశావాదం వల్ల, మనోహరులైన కథానాయికలవల్ల, వాస్తవిక దృష్టివల్ల, నియతి నిరాడంబరతల వల్ల ఆయన మిక్కిలి ప్రసిద్ధి పొందాడు.

మాడ్రిడ్ విశ్వవిద్యాలయంలో న్యాయశాస్త్రం చదువుకొని, విమర్శకుడుగా తన సాహిత్య వ్యవసాయం ప్రారంభించాడు. కాని త్వరలోనే నవల మీదికి దృష్టి మళ్ళించాడు. ఆయన నవలలు చాలా వరకూ ఆత్మ

కథాత్మకాలు. ముఖ్యంగా, *రివరిటా* (Rivarita-1886), *మెక్సిమినా* (Maximina-1887) *లానా వెలాడ డన్ నావెలిస్టా* (1921: The novel of a novelist) లు అలాంటివి. ఆయనకు ఆదిలో ప్రకృతి శాస్త్రాభిమానం ఉండటంవల్ల, ఆయన రచనలో తాత్కాలిక దశగా ప్రకృతి దృష్టి ప్రస్ఫుట మౌతుంది. ముఖ్యంగా *లా ఎస్పుమా* (1890- The Froth, 1891), 'లాఫె' (1892: Faith) అలాంటివి. బైబిలు లోని 'మార్తా మేరీ' ని కథావస్తువుగా గ్రహించి రచించిన *మార్తా లా మరియా* (1883) ఆయన అత్యంత పటిష్ఠమైన రచన. ఆయన జన్మభూమి ప్రాదేశికచ్ఛాయ ఆస్టూరియస్ నవలలన్నిటిలో లాగానే *మార్తా లా మరియా* లో కూడా ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. *జోస్* (Jose-1885), వాస్తవిక నావిక జీవన చిత్రణ. *లా ఆల్డియా పెర్డిడా* (*La Aldea poerdida-1903;* The lost village) పల్లె బ్రదుకును నాగరకత ధ్వంసం చెయ్యడాన్ని గురించి రచించిన నవల. జోస్ మరియా డ పెరిడాలాగ కాకుండా, ఆయన తన నవలలను స్పెయిన్‌లోని విభిన్న ప్రదేశాలలో నడిపించాడు. *రివెరిటా* 2 సంపుటాలు (Riverita-1886-The little Brook). మాడ్రిడ్‌లోనూ, *లా అలెగ్రియా డెల్ కేపిటాన్ రైబాట్* (*La Alegria del Capita Ribot 1898*- The joy of Captain Ribot-1900) లో కథ వెలెన్షియాలోనూ, *లా హెర్మానా సాన్‌సల్పిషియో* (La Hermana Sansulpicio-1889 : Sister Saint Sulpice) లోని కథ అండలూషియాలోనూ నడుస్తుంది. ఆయన నవలలలోని నిజాయితీ, హాస్యమూ మితిమీరిన భావోద్రేకాన్ని అదుపులో ఉంచాయి.

శ్రీ.న.చ.రా.

**పల్ఛీ, ల్వీగీ (1432-84) :** ప్రముఖ ఇటాలియన్ రచయిత రినైజాన్స్ కాలం నాటి ఉద్గ్రంథం *మార్గెంటో* రచయితగా పల్చీ సుప్రసిద్ధుడు. ఈ గ్రంథంలో ఫ్రెంచి జీవన ధోరణులపై హాస్యరస భరితమైన కవిత్వం కనిపిస్తుంది.

ఇటాలియన్ భాషలో అనేక రచనలు చేసిన పల్చీ ఈ నాటికీ *మార్గెంటో* రచయితగానే ప్రపంచంలో ప్రసిద్ధి పొందాడు. మొదట 23 అధ్యాయాలుగా ప్రచురింపబడిన ఈ పుస్తకం తరువాత 28 అధ్యాయాలుగా విస్తరించబడి 1483 లో తిరిగి ప్రచురించబడింది. హాస్యం, కరుణ సమ్మిశ్రితంగా కనిపించే ఈ రచనలో హాస్యం పాలు కొంత ఎక్కువే అనిపించినా అక్కడక్కడ కవి తన అనుభవాల అగాథాలలో నుంచి వెలికి తీసిన జీవిత సత్యాలను నిర్భయంగా ప్రకటించాడు. పల్చీ ప్రముఖ రచన అయిన 'మార్గెంటో' లేదా 'మార్గెంటోమాగియోరి' లో కవి నైతిక దృక్పథం అభివ్యక్తం అవుతుంది. ఏదో విధంగా ధనార్జనే జీవితంలో ప్రధాన ధ్యేయం అని భావింపబడుతున్న యుగంలో తన ప్రగాఢ మత విశ్వాసాలతో పల్చీ చాలా ఘర్షణ పడ్డాడు.

పల్చీ చాలా కాలం వరకు 'మెడిసీ' కుటుంబ సంరక్షణలో పెరిగి ఆ వాతావారణంలో ఎందరో కవులతో, కళాకారులతో పరిచయా లేర్పరచుకొని, కొంతకాలం విదేశాలలో రాయబారిగా ఉంటూ వచ్చినా, ఆర్థిక పరమైన బాధలకు లోనై, 'రాబర్టో సన్సెవెరినో' అనే వ్యక్తి వద్ద చేరి, ఆమరణాంతం అక్కడే ఉండిపోయాడు.

1823 లో ఈయన రచన *మార్గెంటో* లోని మొదటి అధ్యాయాన్ని బైరన్ ఆంగ్లంలోకి అనువదించాడు. 1962 లో అది పునర్ముద్రితమైంది.

పప్పు

**పాజ్, ఆక్టావియో (1914--) :** మెక్సికన్ కవి, నవలా రచయిత, సాహిత్య విమర్శకుడు. ఇతని అప్రతిహతమైన రచనలకు 1990 లో నోబెల్ బహుమతి వచ్చింది. మెక్సికన్ రచయితలలో ఇతడే మొదటి నోబెల్ సాహిత్య బహుమతి గ్రహీత. 1977 లో ఇతనికి జెరూసలేమ్ బహుమతి వచ్చింది.

1914 వ సంవత్సరం మార్చి 31 వ తేదీన మెక్సికో నగరంలో పాజ్ జన్మించాడు. ఇతని తండ్రి ఆక్టేవియో. తల్లి జోస్‌ఫినాపజ్. ఇతడు తన 17 వ ఏటనే రచనలు చేయసాగాడు. మెక్సికో విశ్వవిద్యాలయంలో విద్య నభ్యసించాడు. 1937 లో స్పెయిన్ లో జరిగిన 'ఆంటీ ఫాసిస్టు కాంగ్రెసు' కు హాజరయాడు. 1938-39 లో మెక్సికోలో శ్పానిష్ రిపబ్లిక్ శరణార్థులకు తన శక్తి వంచన లేకుండా సహాయ మందించాడు. 1945 లో పారిస్‌లోని మెక్సికన్ రాయబార కార్యాలయంలో కార్యదర్శిగా పనిచేశాడు. 1962-68 సంవత్సరాలలో భారత దేశంలో మెక్సికన్ రాయబారిగా పనిచేశాడు. కాని 1968 లో మెక్సికోలో ప్రభుత్వ చర్యలకు నిరసనగా ఆందోళన చేస్తున్న విద్యార్థులపై కాల్పులు జరపడంతో తన పదవికి రాజీనామా చేశాడు.

1970-71 లో కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయం లాటిన్-అమెరికన్ స్టడీస్ లో ప్రొఫెసరుగా పనిచేశాడు. *తాలర్* (Taller), *బరాంద* (Baranda) అనే సాహితీ పత్రికలను స్థాపించాడు. *ఎల్ పాపులార్* (El Popular), *ప్లూరల్* (Plural) అనేపత్రికలకు సంపాదకుడుగా పని చేశాడు. పురావస్తుశాస్త్రం, చరిత్ర, తత్త్వశాస్త్రం, మరియు

ప్రజాదరణ పొందిన గేయాలను రచించడం మూలాన ఈయనను బేంజో పేటర్సన్ అని వ్యవహరించేవారు.

మొదట ఈయన న్యాయవాదిగా సిడ్నీలో 1900 వరకూ పనిచేసి, తరువాత పత్రికా విలేఖకుడుగా దక్షిణ ఆఫ్రికా వెళ్లి అక్కడ బోయర్ యుద్ధాన్ని వర్ణిస్తూ ఆస్ట్రేలియన్ పత్రికలకు వ్రాశాడు. తరువాత *సిడ్నీ ఈవెనింగ్ న్యూస్* కు, *సిడ్నీ టౌన్ అండ్ కంట్రీ జర్నల్* కు సంపాదకుడుగా వ్యవహరించాడు. మొదటి ప్రపంచ యుద్ధంలో ఈయన *సిడ్నీ మార్నింగ్ హెరాల్డ్* పత్రిక విలేఖకుడుగా యూరప్‌లో పనిచేసి, తరువాత తన దేశం తరఫున ఈజిప్ట్ ఫ్రాన్స్‌లలో పోరాడాడు. శేష జీవితాన్ని పాత్రికేయుడుగా గడిపాడు.

విశేష ప్రజాదరణ పొందిన ఈయన పాటలే ఈయనకు ఎక్కువ కీర్తిని సమకూర్చాయి. 1905 లో ఈయన *ది ఓల్డ్ బుష్ సాంగ్స్* అనే పాటల సంకలనాన్ని, 1917 లో *సాల్ట్ బుష్ బిల్, జె.పి. అండ్ అదర్ వెర్సెస్* అనే సంకలనాన్ని ప్రచురించాడు. *వాల్జింగ్ యెటిల్డా* ఈ 1917 నాటి సంకలనం లోనిదే. ఇవే కాకుండా ఈయన చిన్న పిల్లల కోసం *ది ఎనిమల్స్ నోహా ఫర్గాట్* (1933) అనే కవితా సంకలనాన్ని, కొన్ని కథలను కూడా రచించాడు. న్యాయవాదిగాను, పత్రికా రచనలోను ఈయన కృషి చేసినప్పటికీ, ఈయన జానపద గేయ కర్తగా ఆస్ట్రేలియా ప్రజలకు చిరస్మరణీయుడు. ఆస్ట్రేలియాలోని సిడ్నీలో 1941 ఫిబ్రవరి 5 న కన్ను మూశాడు. డి.ల.రా.

**పార్కర్, డోరతీ (1893-1967) :** అమెరికన్ కథానికా రచయిత్రి, కవయిత్రి. అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని న్యూజెర్సీకి చెందిన వెస్ట్ ఎండ్ లో 1893 ఆగస్టు 22 న జన్మించిన 'పార్కర్' న్యూయార్క్ నగరంలో 1967 జూన్ 7 న అస్తమించింది. 1920 నుంచి ఆ శతాబ్దం మధ్యవరకు నగర వాసులలో కనిపించే మూర్ఖత్వంపై సమయస్ఫూర్తి, మార్మికత గల కవితలు రచించి ఈమె ప్రసిద్ధి పొందింది.



పార్కర్ న్యూయార్క్ నగరంలోనే పెరిగి పెద్దదయింది. మారిస్ టవున్‌లో గల మిస్‌డానా స్కూలులో పట్టభద్రురాలైన పిదప *వానిటీ ఫెయిర్* పత్రికలో పని చేసింది. అదే పత్రికలోని రచయితలలో మరో ఇద్దరు హాస్య రచయితలు *రాబర్ట్ బెంచెలీ, రాబర్ట్ షెర్వుడ్* లతో కలసి న్యూయార్క్‌లోని అల్గాన్ క్విన్ హోటలులో భోజన విరామ సమయంలో నడిచే *అల్గాన్ క్విన్ రౌండ్ టేబుల్* స్థాపనకు ఆమె బీజారోపణ చేసింది.

తన నాటక విమర్శలు తీవ్రంగా ఉండడంతో 1920 లో వానిటీ ఫెయిర్ నుండి విడిపోయిన పార్కర్ స్వచ్ఛంద రచయిత్రిగా మారింది. అప్పటి *న్యూయార్కర్* పత్రికలో 'నిత్య పాఠకుడు' అనే శీర్షికతో క్రొత్త పంథాలో గ్రంథ విమర్శకు 'పార్కర్' శ్రీకారం చుట్టింది. 1927 నుంచి 1933 వరకు ఈ శీర్షిక నిరంతరాయంగా కొనసాగింది. ఈ విమర్శలలోనివే కొన్ని *ఏ మంత్ ఆఫ్ శాటర్‌డేస్* అనే పేరుతో 1971 లో సంకలనంగా వెలువడ్డాయి. 1926 లో ప్రచురింపబడిన ఆమె కవితల మొదటి సంకలనం *ఎనఫ్ రోప్* అనే పేరుతో బాగా అమ్ముడు పోయింది. మరో రెండు పద్య కృతులు. *సన్-సెట్ గన్* (1928) *డెత్ అండ్ టాక్సెస్* (1931). ఇవి అన్నీ 1937 లో వెలువడిన కవితా సంపుటి *నాట్ సో డీప్ ఏజ్ ఏ వెల్* లో చేర్చబడ్డాయి.

1929 లో *బిగ్ బ్లాండ్* అనే కథ ఆ యేడాది చిన్న కథలలో ఉత్తమమైనదిగా ఎన్నికై ఓ. హెన్రీ అవార్డును గెల్చుకొన్నది. వయసు మళ్లుతున్న నాట్యకత్తెను గూర్చిన కరుణామయ గాథ దానిలోని ఇతివృత్తం. *లామెంట్స్ ఫర్ ది లివింగ్* (1930), *ఆఫ్టర్ సచ్ ప్లెజర్స్* (1933) అనే కథా సంకలనాలు మరి కొన్నింటితో కలిపి 1939 లో *హియర్ లైస్* అనే బృహత్ సంకలనంగా వెలువడింది. మానవ జీవితంలోని మోద ఖేదాలను హాస్య మిశ్రితంగా ప్రదర్శించడమే ఆ కథల, కవితల ప్రధాన లక్షణం.

1933 లో ఆమె తన రెండవ భర్త *అలాన్ క్యాంప్ బెల్* తో కలసి 'హాలివుడ్' వెళ్లింది. అచ్చట వారు 15 సినిమాలకు సహాయ రచయితలుగా పనిచేసి ప్రసిద్ధి పొందారు. వానిలో *ఏ స్టార్ ఈజ్ బోరన్* అనేది 'ఎకాడమీ' అవార్డుకు ఎన్నిక అయింది. తరువాత ఆమె వామపక్ష రాజకీయాలలో నిమగ్నం కావడంతో అంతకు పూర్వం "నగర జీవనాన్ని ప్రతిబింబించే చురుకైన వనిత" అనిపించుకొన్న ఆమె పాత్ర మరుగున పడింది. శ్పానిష్ అంతర్యుద్ధం వలన రెండవ ప్రపంచ యుద్ధం తరువాత

ప్రజాదరణ పొందిన గేయాలను రచించడం మూలాన ఈయనను బేంజో పేటర్సన్ అని వ్యవహరించేవారు.

మొదట ఈయన న్యాయవాదిగా సిడ్నీలో 1900 వరకూ పనిచేసి, తరువాత పత్రికా విలేఖకుడుగా దక్షిణ ఆఫ్రికా వెళ్లి అక్కడ బోయర్ యుద్ధాన్ని వర్ణిస్తూ ఆస్ట్రేలియన్ పత్రికలకు వ్రాశాడు. తరువాత *సిడ్నీ ఈవెనింగ్ న్యూస్* కు, *సిడ్నీ టౌన్ అండ్ కంట్రీ జర్నల్* కు సంపాదకుడుగా వ్యవహరించాడు. మొదటి ప్రపంచ యుద్ధంలో ఈయన *సిడ్నీ మార్నింగ్ హెరాల్డ్* పత్రిక విలేఖకుడుగా యూరప్‌లో పనిచేసి, తరువాత తన దేశం తరఫున ఈజిప్ట్ ఫ్రాన్స్‌లలో పోరాడాడు. శేష జీవితాన్ని పాత్రికేయుడుగా గడిపాడు.

విశేష ప్రజాదరణ పొందిన ఈయన పాటలే ఈయనకు ఎక్కువ కీర్తిని సమకూర్చాయి. 1905 లో ఈయన *ది ఓల్డ్ బుష్ సాంగ్స్* అనే పాటల సంకలనాన్ని, 1917 లో *సాల్ట్ బుష్ బిల్, జె.పి. అండ్ అదర్ వెర్సెస్* అనే సంకలనాన్ని ప్రచురించాడు. *వాల్జింగ్ మెటిల్డా* ఈ 1917 నాటి సంకలనం లోనిదే. ఇవే కాకుండా ఈయన చిన్న పిల్లల కోసం *ది ఎనిమల్స్ నోహా ఫర్గాట్* (1933) అనే కవితా సంకలనాన్ని, కొన్ని కథలను కూడా రచించాడు. న్యాయవాదిగాను, పత్రికా రచనలోను ఈయన కృషి చేసినప్పటికీ, ఈయన జానపద గేయ కర్తగా ఆస్ట్రేలియా ప్రజలకు చిరస్మరణీయుడు. ఆస్ట్రేలియాలోని సిడ్నీలో 1941 ఫిబ్రవరి 5 న కన్ను మూశాడు. డి.ల.రా.

**పార్కర్, డోరతీ (1893-1967) :** అమెరికన్ కథానికా రచయిత్రి, కవయిత్రి. అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని న్యూజెర్సీకి చెందిన వెస్ట్ ఎండ్ లో 1893 ఆగస్టు 22 న జన్మించిన 'పార్కర్' న్యూయార్క్ నగరంలో 1967 జూన్ 7 న అస్తమించింది. 1920 నుంచి ఆ శతాబ్దం మధ్యవరకు నగర వాసులలో కనిపించే మూర్ఖత్వంపై సమయస్ఫూర్తి, మార్మికత గల కవితలు రచించి ఈమె ప్రసిద్ధి పొందింది.



పార్కర్ న్యూయార్క్ నగరంలోనే పెరిగి పెద్దదయింది. మారిస్ టవున్‌లో గల మిస్‌డానా స్కూలులో పట్టభద్రురాలైన పిదప *వానిటీ ఫెయిర్* పత్రికలో పని చేసింది. అదే పత్రికలోని రచయితలలో మరో ఇద్దరు హాస్య రచయితలు *రాబర్ట్ బెంచెలీ, రాబర్ట్ షెర్వుడ్* లతో కలసి న్యూయార్క్‌లోని అల్గాన్ క్విన్ హోటలులో భోజన విరామ సమయంలో నడిచే *అల్గాన్ క్విన్ రౌండ్ టేబుల్* స్థాపనకు ఆమె బీజారోపణ చేసింది.

తన నాటక విమర్శలు తీవ్రంగా ఉండడంతో 1920 లో వానిటీ ఫెయిర్ నుండి విడిపోయిన పార్కర్ స్వచ్ఛంద రచయిత్రిగా మారింది. అప్పటి *న్యూయార్కర్* పత్రికలో 'నిత్య పాఠకుడు' అనే శీర్షికతో క్రొత్త పంథాలో గ్రంథ విమర్శకు 'పార్కర్' శ్రీకారం చుట్టింది. 1927 నుంచి 1933 వరకు ఈ శీర్షిక నిరంతరాయంగా కొనసాగింది. ఈ విమర్శలలోనివే కొన్ని *ఏ మంత్ ఆఫ్ శాటర్‌డేస్* అనే పేరుతో 1971 లో సంకలనంగా వెలువడ్డాయి. 1926 లో ప్రచురింపబడిన ఆమె కవితల మొదటి సంకలనం *ఎనఫ్ రోప్* అనే పేరుతో బాగా అమ్ముడు పోయింది. మరో రెండు పద్య కృతులు. *సన్-సెట్‌గన్* (1928) *డెత్ అండ్ టాక్సెస్* (1931). ఇవి అన్నీ 1937 లో వెలువడిన కవితా సంపుటి *నాట్ సో డీప్ ఏజ్ ఏ వెల్* లో చేర్చబడ్డాయి.

1929 లో *బిగ్ బ్లాండ్* అనే కథ ఆ యేడాది చిన్న కథలలో ఉత్తమమైనదిగా ఎన్నికై ఓ. హెన్రీ అవార్డును గెల్చుకొన్నది. వయసు మళ్లుతున్న నాట్యకత్తెను గూర్చిన కరుణామయ గాథ దానిలోని ఇతివృత్తం. *లామెంట్స్ ఫర్ ది లివింగ్* (1930), *ఆఫ్టర్ సచ్ ప్లెజర్స్* (1933) అనే కథా సంకలనాలు మరి కొన్నింటితో కలిపి 1939 లో *హియర్ లైస్* అనే బృహత్ సంకలనంగా వెలువడింది. మానవ జీవితంలోని మోద ఖేదాలను హాస్య మిశ్రితంగా ప్రదర్శించడమే ఆ కథల, కవితల ప్రధాన లక్షణం.

1933 లో ఆమె తన రెండవ భర్త *అలాన్ క్యాంప్‌బెల్* తో కలసి 'హాలివుడ్' వెళ్లింది. అచ్చట వారు 15 సినిమాలకు సహాయ రచయితలుగా పనిచేసి ప్రసిద్ధి పొందారు. వానిలో *ఏ స్టార్ ఈజ్ బోరన్* అనేది 'ఎకాడమీ' అవార్డుకు ఎన్నిక అయింది. తరువాత ఆమె వామపక్ష రాజకీయాలలో నిమగ్నం కావడంతో అంతకు పూర్వం "నగర జీవనాన్ని ప్రతిబింబించే చురుకైన వనిత" అనిపించుకొన్న ఆమె పాత్ర మరుగున పడింది. శ్పానిష్ అంతర్యుద్ధం వలన రెండవ ప్రపంచ యుద్ధం తరువాత

హాలివుడ్‌ను ఆక్రమించుకొనిన కమ్యూనిస్ట్ వ్యతిరేక ఉద్యమానికీ, ఆమె స్వీయ విశ్వాసాలకూ, ఉద్యోగ నిర్వహణకూ పొత్తు కుదురలేదు. *ఎస్క్వైర్* పత్రికలో ఆమె గ్రంథ విమర్శలు వ్రాసి రెండు నాటకాలకు సహ రచయిత్రిగా పనిచేసింది. అందులో మొదటిది *ది కోస్ట్ ఆఫ్ ఇల్లిరియా* (ప్రథమ ప్రదర్శన: 1949). ఇది ఆంగ్ల వ్యాసకర్త ఛార్లెస్ లాంబ్‌ను గురించినది. 'టెక్సాస్', 'లండన్' నగరాలలో ప్రదర్శించబడింది. రెండవది *ది లేడీస్ ఆఫ్ ది కారిడార్* (1953). దీనిలో ఇతివృత్తం న్యూయార్క్ నగరం చిన్న వీథులలోని హోటళ్లలో ఉండే ఏకాకి వితంతువుల చరిత్రకు సంబంధించింది. ఇది 'బ్రాడ్వే' లో కొద్ది కాలం ప్రదర్శింప బడింది. అంతకు ముందు 'ఎల్మెర్ రైస్' తో కలసి రచించిన *క్లోజ్ హార్మొనీ* అనే నాటకం కూడా 1924 లో న్యూయార్క్ నగరంలో కొద్దికాలం పాటు ప్రదర్శింపబడింది.

జె.సూ.ప్ర.

**పార్డో బజాన్, ఎమీలియా (1852-1921) :** శ్పానిష్ రచయిత్రి. నవలలు, చిన్నకథలు, సాహిత్య విమర్శ వ్రాసి ప్రసిద్ధి కెక్కింది.

1883 లో ప్రచురితమైన ఒక బహుముఖమైన వ్యాసం *లాకుష్టిఓన్ పాల్పిట్టాన్తే* తో ఆమెకు సాహిత్య లోకంలో మొట్టమొదట గౌరవస్థానం లభించింది. దానిలో స్వాభావికత (ప్రాకృతికత) గురించి చర్చించ బడ్డది. దాని మూలంగా ఫ్రెంచి, రష్యన్ సాహిత్యోద్యమాలు స్పెయిన్‌లో ప్రాచుర్యం పొందాయి. ప్రకృత్యారాధనకు సంబంధించిన ఒక సాహిత్య వివాదానికి ఆమె కారణభూతురాలైంది. వ్యక్తిగత భావ స్వాతంత్ర్యాన్ని ఆమె బలపరచి దాని స్థిరీకరణకు పాటు పడింది.

ఆమె నవలలలో *లోస్ పజోస్ డి ఉల్లో* (1886), దాని అనుబంధ రచన *లా మ్యాడె నా టు రలేజా* మిక్కిలి ప్రసిద్ధి పొందాయి. వీనిలో భౌతికంగాను, నైతికంగాను పతనం చెందిన 'బాలిసియాన్' జమీందారీని గురించి సహజ సుందరమైన నైతిక నేపథ్యంలో అవినీతి మార్గంలో పడిన అధికారం తీరు తెన్నులు విమర్శింపబడ్డాయి. *ఇన్సొలేసియన్, మారినా* అనే రెండూ 1989 లో ఆమె రచించిన మనో విశ్లేషణాత్మకమైన మంచి రచనలు. ఆమె సాహిత్య జీవనం వలన తనకు 'చిన్నతనం' కలిగింది అనే భావంతో భర్త ఆమె నుండి విడిపోయాడు. మాడ్రిడ్ యూనివర్సిటీలో 'రొమాన్స్ సాహిత్యానికి' ఆచార్యత్వం నెరపిన పార్డో బజాన్‌కు 1916 లో (కవయిత్రులకు అలభ్యమైన) సాహిత్య పీఠపు విశిష్టగౌరవం లభించింది.

జె.సూ.ప్ర.

**పాల్మా, రికార్డో (1833-1919) :** పెరూ వలస రాజ్య రచయిత. శ్పానిష్ అమెరికన్ సాహిత్యంలో ప్రజా బాహుళ్యం ఆదరం పొందిన కృతులు రచించాడు.

తన 20 వ ఏట పెరూవియన్ నౌకాదళంలో చేరిన పాల్మా రాజకీయ కారణాలచే 1860 లో చిలీ దేశానికి పారిపోయి అచ్చట పత్రికా రచయితగా స్థిరపడ్డాడు. ఆరేళ్ల తరువాత స్పెయిన్‌కు వ్యతిరేకంగా జరుగుతున్న విప్లవోద్యమంలో పాల్గొనడానికి లీమా తిరిగి వచ్చాడు. 1881 లో జరిగిన పసిఫిక్ యుద్ధంలో కూడా అతడు పాల్గొన్నాడు. చిలీ వారు దేశాన్ని ఆక్రమించినపుడు చిలీ సైన్యాలు ప్రసిద్ధి గాంచిన నేషనల్ లైబ్రరీని ధ్వంసం చేసినందుకు తీవ్ర నిరసనను ఇతడు తెలియచేశాడు. యుద్ధం తరువాత ఆ నేషనల్ లైబ్రరీని పునర్నిర్మించే పనికి ఈయనను నియోగించారు. తరువాత తన జీవితాంతం పాల్మా ఆ లైబ్రరీకి "క్యూరేటర్" గా పనిచేశాడు. 1887 లో అతడు 'విమన్' అకాడమీని స్థాపించాడు.

పాల్మా సాహిత్య జీవనం అతడు యువకుడుగా ఉన్నప్పుడే ప్రారంభం అయింది. అతని తొలి రచనలు లఘుగీతాలు, శృంగార, సాహస నాటకాలు, విక్టర్ హ్యూగో రచనల నుండి చేసిన కొన్ని అనువాదాలు. అతడు *అనాన్స్ డి లా ఇంక్విజీనియస్ డి లీమా* (1963) అనే కృతితో ప్రారంభించి అనేక పద్య కృతులు రచించి పేరు పొందాడు. ముఖ్యంగా అతనికి కీర్తి తెచ్చిపెట్టింది బహు సుందర రచన అయిన *ట్రాడిసి ఓన్స్* పెరు *అనాస్* (1872) అనే గద్య పద్య రచనల సంపుటం. పెరూ వలస రాజ్యంలోని రైతాంగం వంటి సామాన్య ప్రజలను గూర్చిన ప్రసిద్ధ, కల్పిత ఇతివృత్తాలతో కూడిన గద్య కృతి అది. 'నేషనల్ లైబ్రరీ' నుండి సేకరించిన స్వల్ప చారిత్రకాంశాలకు తన తాత ముత్తాతల నుంచి సంభాషణ రూపంలో తెలియవచ్చిన ఉదంతాలు, జానపద గాథలు, పుక్కిటి పురాణగాథలు మొదలైన వాటిని జోడించి జాతీయత ఉట్టిపడేట్టు చేసిన రచనలు అవి. ఆ శృంఖలలోని మొదటి ఆరు సంపుటాలు 1872-1883 మధ్యకాలంలోనే వెలువడ్డాయి. వాటి తరువాత వచ్చినవి: *రోపా వీజా* (1889), *మిస్ అల్టిమస్ ట్రడిసి ఓన్స్* (1906), *అపెండిస్ అ మీస్ అల్టిమస్ ట్రాడిసివోన్స్* (1910). వీనికి అనుబంధంగా *ట్రాడిసివోన్స్ ఎల్ సాల్సా వెర్డె*

*లాస్ మెజోర్స్ (టడిని ఓన్స్ పెరూ అనాస్* (1918) వంటి చిత్ర కథలు కూడా చేర్చబడ్డాయి.

జె.మూ.ప్ర.

**పావ్సే, సెజారే (1908-50)** : ఇటాలియన్ విమర్శకుడు, నవలా కారుడు, అనువాదకుడు, కవి. అమెరికా సంయుక్త రాష్ట్రాలకు, ఇంగ్లండుకు చెందిన ఎందరో ఆధునిక రచయితలను ఇటలీ పాఠకులకు పరిచయం చేసిన వాడు.

తండ్రి ఒక ప్రభుత్వోద్యోగి. ఉద్యోగ రీత్యా ఆ కుటుంబం టురిన్‌కు రావలసి వచ్చింది. అక్కడనే పావ్సే పాఠశాల చదువు, యూనివర్శిటీ విద్య కొనసాగాయి. అతని సృజనాత్మక శక్తులు బహిర్గతం కావడానికి ఆ దేశపు ఫాసిస్టు ప్రభుత్వం అవరోధం కల్పించడంతో 1930-1940 సంవత్సరాల మధ్య అమెరికా సంయుక్త రాష్ట్రాలకు చెందిన 20 వ శతాబ్దపు రచయితల కృతులనెన్నింటినో అతడు అనువదించసాగాడు. వారిలో ప్రముఖులు 'ఆండర్సన్ షెర్‌వుడ్', 'గెర్‌ట్రూడ్ స్టైన్, 'జాన్ స్టెయిన్ బెక్', 'జాన్ డోస పాసోస', 'ఎర్నెస్ట్ హెమింగ్వే' మొదలైనవారు. 19 వ శతాబ్దానికి చెందిన రచయిత 'విలియం ఫాక్‌నర్' ప్రభావం అతనిపై అమితంగా ప్రసరించింది. 'హెర్మన్ మెల్ విల్లీ' రచించిన *మోబీ డిక్* ను తొలుతనే అతడు అనువదించాడు. ఐరిష్ రచయిత 'జేమ్స్ జాయిస్' నవల లెన్నింటినో అతడు అనువదించాడు. అతని విమర్శనాత్మక వ్యాసాలు అతని మరణానంతరం *లా లెటరాటురా అమెరికానా ఎ అల్ట్రి సగ్గే* (1951) అనే పేరుతో ప్రచురితం అయాయి.

పావ్సే 'ఈనౌదీ' అనే ప్రచురణ సంస్థను స్థాపించి జీవితాంతం దానికి సంపాదకుడుగా ఉన్నాడు. ఫాసిస్టు వ్యతిరేక తెగల సమీక్ష *లా కల్చురా* అనే కృతి వలన ఆగ్రహం చెందిన ప్రభుత్వం అతనిని 1935 లో అరెస్టు చేసి చెరసాలలో ఉంచింది. ఈ అనుభవాలే అతడు తరువాత రచించిన *ఇల్ కార్సరే* (*ప్రిమా షెఇల్ గాల్లో సాంతిలో* 1949లో ప్రచురితమయింది) *ఇల్ కంపానో* (1947) లోను ప్రతిబింబించాయి. జైలు నుంచి విడుదల అయాక అతని మొదటి గేయ సంపుటి *లావొరేర్ స్టాన్‌సా* (1936) వెలువడింది. అతని తొలి నవల *పాసే టాయ్* (1941) లో అతని ఇతర రచనలలో వలెనే బాల్యంలోని మధుర స్మృతులకు చెందిన ఎన్నో పవిత్ర స్థలాలు చోటు చేసుకొన్నాయి. 1943-45 సంవత్సరాల మధ్య ఫాసిస్టు వ్యతిరేక ఉద్యమకారుల సాంగత్యంలో 'పీడ్‌మాంట్' కొండలలో పావ్సే గడిపాడు.

పావ్సే రచనలలో హెచ్చు భాగం - ముఖ్యంగా చిన్న కథలు, నవలలు - యుద్ధం తరువాత అతని మరణానికి ముందే వెలువడ్డాయి. మెల్విలీ ప్రభావం కొంత సోకడంతో అతని రచనలలో పౌరాణికత, ప్రతీకాత్మకత, శిల్ప సంపన్నత ఎక్కువగా చోటు చేసుకొన్నాయి. అతని ప్రముఖ కృతులలో ఒకటైన *డయోలోగి కన్‌ల్యూకో* (1947) కవితా రూపంలో ఉన్న సంభాషణలతో మానవ స్థితిగతులను చక్కగా ప్రతిబింబించింది. అతని గొప్ప నవలగా ఎంచబడే *లా లూనా -ఎ-ఇ-ఫాలో* (1950) లో తాను పెరిగిన ప్రదేశాలను సందర్శించి తన్ను తాను గుర్తింపగోరిన ఒక కథానాయకుని కరుణమయగాథ చిత్రితమైంది. అతని ఇతర కృతులలో ప్రముఖమైనది: *లాబెల్లా ఎస్టేట్* (1949). ఈ కృతికి ఇవ్వబడిన 'స్ట్రేగా ప్రైజ్' స్వీకరించిన అనతి కాలంలోనే ఒక హోటల్ గదిలో పావ్సే ఆత్మహత్య చేసికొన్నాడు.

1957 లో పావ్సే పేరిట సాహిత్యానికి ఒక బహుమతి స్థాపించబడింది. ఆ తరువాతనే అతని ఉత్తమ రచనలలో కొన్ని ప్రచురితం అయాయి. ఆ సంపుటిలో అతని ఉత్తమ కవితగా భావించి ప్రణయగేయ ఖండికలు సంగ్రహింపబడ్డాయి. అవి: *వెరా లా మోర్టే-ఎ-అవ్-ఇ టోయ్ ఒచీ* (1951), *నోటీ డి పెస్టా* అనే కథల సంపుటి (1964). అతని అంతర్జీవితాన్ని ప్రతిబింబించే చరిత్ర *ఇల్ మెస్టేరె డి వివెర్ డయారియో* (1935-1950). ఇది 1952 లో లండన్‌లోను, 1971 న్యూయార్క్ ప్రచురింపబడింది.

పావ్సే రచనలలో చాలా భాగం ముద్రితం అయాయి. అవి *రాకొంతి* (1960), *టోల్డ్ ఇన్ కాన్ఫిడెన్స్ అండ్ అదర్ స్టోరీస్* (1971). అతని ఉత్తమ కవిత్వ సంకలనంగా ఎంచబడిన *పోయిసీ ఎడిట్-ఎ-ఇన్‌డైట్* (1962) ఇటాలో కాల్వినో సంపాదకత్వంలో వెలువడింది. *లెటర్* (1924 నుండి 1950 వరకు గల ఖండికల సంపుటి) 1962 లో వెలువడింది. అతని కవితల సంకలనం ఇంగ్లీషులో *ఏ మానియా ఫర్ సాలిట్యూడ్, సెలెక్టెడ్ పొయెమ్స్* (1930-50) 1969 లో వెలువడింది.

జె.మూ.ప్ర.

**పాస్కోలీ, జ్యావానీ (1855-1912)** : గంభీరం, కరుణామయం అయిన ఇటాలియన్ గేయకవితలు రచించిన ప్రాచీన సార్డీనియన్ విద్వాంసుడు. అతని గేయాలు పరిపూర్ణమైన ఆకృతి సౌందర్యంతోను, లయాత్మకమైన శైలితోను, పద లాలిత్యంతోను కూడి ఉండి తరువాతి కవుల మీద అమిత ప్రభావాన్ని ప్రసాదించాయి.

పాస్కోలీ బాల్యం చాలా కష్టాలతో గడిచింది. అతని 12 వ ఏట అతని తండ్రిని ఎవరో హత్య చేశారు. 13 వ ఏట తల్లి మరణించింది. అతనికి యుక్త వయస్సు వచ్చేసరికి ఆ కుటుంబంలో మరో 5 గురు పిల్లలు కూడా మరణించారు. బొలోనా యూనివర్సిటీలో మహాకవి "జియోస్యూ కర్డూసీ" వద్ద శిష్యుడుగా స్కాలర్‌షిప్‌తో చదువుకొనే రోజులలో పాస్కోలీ మానసిక రుగ్మతతో చాలా కాలం బాధపడ్డాడు. అరాజకతను ప్రచారం చేసినందుకు 1879 లో అరెస్టు అయి, కొన్ని నెలలు జైలు శిక్ష అనుభవించాడు. ఆ తరువాత 1882 నుంచి ఉపాధ్యాయవృత్తి స్వీకరించాడు. మొదట ఉన్నత పాఠశాలలోను, తరువాత పెక్కు ఇటాలియన్ యూనివర్శిటీలలోను పని చేశాడు. గ్రీక్, లాటిన్ ఇటాలియన్ సాహిత్యాల ఆచార్యుడుగా ఉన్నాడు. అతని ప్రతిభను గుర్తించి 1905 లో బొలోనా యూనివర్శిటీలో ఇటాలియన్ సాహిత్య ఆచార్యుడుగా అతనిని నియమించారు.

పాస్కోలీ మొదటి సాహిత్య కృతి *మీరికే* (1891) ఘన విజయం సాధించింది. దానిలో తన విద్యార్థి జీవితం తాలూకు మానసిక ఆందోళనను ప్రతిబింబించే మృదు మధుర గేయాలు లలితమైన శైలిలో రచించాడు. ఆ తరువాత వెలువడిన కృతి *కాంటీ డి క్యాస్టర్ వెచ్చియో* (1903) లో మానసిక కల్లోలానికి శాంతి మార్గం అన్వేషించడం గోచరిస్తుంది. ఆ తరువాతి రచనలలో *పొయెమీ కాన్విివియేలి* (1909), వర్జిల్, కర్డూసీ కవుల వలనను ఫ్రెంచ్ ప్రతీకావాదుల వలనను ప్రభావితమైన మరో రెండు రచనలూ ముఖ్యమైనవి.

పాస్కోలీ రచించిన లాటిన్ పద్యకృతులు అతని ధారాశుద్ధిని ప్రతిబింబిస్తూ అనేక బహుమతులు గెల్చుకొన్నాయి. గాబ్రియల్ డానంజియో పాస్కోలీని 'ఆగస్టన్' (Augustan) యుగంలో సర్వోత్తమ లాటిన్ కవిగా పేర్కొన్నాడు. తన చరమ జీవితంలో పాస్కోలీ పెక్కు జాతీయ, చారిత్రక కావ్యాలు, ఆంగ్లానువాదాలు (1923 లోను, 1927 లోను) వెలువరించాడు. అతడు వర్డ్స్‌వర్త్, షెల్లీ, టెన్నిసన్‌ల కృతులు కూడా అనువదించాడు. అతని 50 వ వర్ధంతి స్మారకంగా 1962 లో "పాస్కోలీ ప్రైజ్" అని అతని పేరు మీదుగా ఒక ఇటాలియన్ సాహిత్య పురస్కారం ఏర్పాటు చేయబడింది. అతని జన్మస్థలానికి "సాన్ మారో పాస్కోలీ" అని నామకరణం చేసి ఇటలీ ప్రజలు అతనిపట్ల తమకు గల గౌరవం చాటుకున్నారు. జె.మ్యూ.ప్ర.

**పాస్టర్‌నాక్, బోరిస్ (1890-1960) :** *డాక్టర్ జివాగో* అనే తన నవలకు 1958 లో నోబెల్ పురస్కారం అందుకున్న రష్యన్ కవి. కాని సోవియట్ యూనియన్ లో తీవ్రసంచలనం, వ్యతిరేక భావం కారణంగా అతడు ఆ బహుమతిని తిరస్కరించాడు.

రష్యన్ విప్లవం తరువాత చెలరేగిన కల్లోలంలో దేశ సంచారం, ఆధ్యాత్మిక ఏకాకిత్వం, ప్రేమభావం మొదలైన వాటిని ప్రకటించే ఈ నవల అంతర్జాతీయ రంగంలో బాగా అమ్ముడు పోయింది. అయినా స్వదేశంలో మాత్రం రహస్యంగా చదువుకోవలసిన దుస్థితి ఏర్పడింది.

పాస్టర్‌నాక్ సంస్కారవంతమైన యూదు కుటుంబంలో పెరిగాడు. అతని తండ్రి లియొనిడ్ (Leonid) ఆర్ట్ ప్రొఫెసర్, నవలా రచయిత. *లియో టాల్‌స్టాయ్*, కవి రెయ్‌నర్ మరియా రిల్క్, సెర్గి రక్ మనినాఫ్ వంటి ప్రముఖుల చిత్రాలను ఆయన చిత్రించాడు. వారంతా తరచుగా అతనికి, 'లెనిన్' కు అతిథులుగా వచ్చేవారు. అతని తల్లి *రోసా కఫ్‌మాన్* (Rosa kaufman) పియానో వాదనలో ప్రసిద్ధి పొందింది.

బాల్యంలో పాస్టర్‌నాక్ సంగీత విద్వాంసుడు కావాలని భావించేవాడు కాని, ప్రసిద్ధకవి అయాడు. సంగీత శాస్త్రాన్నీ, గేయ రచనలను ఆరేళ్ల పాటు ఆయన అధ్యయనం చేశాడు. అనుకోకుండా మాస్కో యూనివర్శిటీలో తత్త్వశాస్త్రం అభ్యసించాడు. ప్రథమ ప్రపంచయుద్ధం కాలంలో శారీరకంగా మిలిటరీ సర్వీసుకు అనర్హుడు కావడంతో యూరల్స్ ప్రాంతంలో ఒక రాసాయనిక కర్మాగారంలో పనిచేశాడు. విప్లవానంతరం "సోవియెట్ ఎడ్యుకేషన్ కమిస్సేరియట్" లైబ్రరీలో పనిచేశాడు.

1913 లో పాస్టర్‌నాక్ మొదటి పద్యకావ్యం వెలువడింది. 1917 లో అతని మలి కృతి *పోవెర్క్ బార్‌యెరోవ్* విశిష్ట గౌరవం పొందింది. మూడవ కృతి *సిస్ట్రా మయా జిన్* (1922) తో అతడు ప్రసిద్ధ కాల్పనిక కవిగా గుర్తింపు పొందాడు. అప్పటి అతని కృతులు అతనిపై పడిన ప్రతీకాత్మక ప్రభావాన్ని ప్రతిబింబిస్తాయి. రష్యన్ స్థాయిని బట్టి వానికి న్యూనత ఆపాదింపబడినా అవి విజయ వంతం అయాయి. 1933 నుండి 1943 వరకు అతని సాహిత్య జీవనంలో విరామం ఏర్పడింది. కారణం అతని జీవితానికి భద్రత లోపించినట్లు అతడు భావించడమే. స్టాలిన్ జన్మస్థానం అయిన జార్జియా కవితలు అనువదించడం వలన స్టాలిన్ అతనిని వదలిపెట్టాడని కొందరంటారు. అతని ప్రధాన

అనువాదాలు: షేక్స్పియర్, గొయిథే, పాల్ వెర్లెయ్న్, రిల్కె ఇతర ఆంగ్లేయ రొమాంటిక్ కవుల రచనలు.

1956 లో తన *డాక్టర్ జివాగో* ను మాస్కో లోని ఒక ప్రసిద్ధ పత్రికకు ప్రచురణార్థం ఇచ్చి పాస్టర్నాక్ దాని మీద ఎన్నో ఆశలు పెట్టుకున్నాడు. కాని దానిలో 'అక్టోబర్ విప్లవం', ఆ విప్లవకారులు, సోవియట్ సాంఘిక వ్యవస్థ మొదలైనవి వక్రంగా చిత్రించబడ్డాయి అనే నెపంతో దాని ప్రకటనకు ఆ పత్రిక నిరాకరించింది. 1957 లో సర్వహక్కులు పొందిన ఒక ఇటాలియన్ ప్రచురణ సంస్థ ద్వారా అది పశ్చిమ దేశాలకు చేరింది. కాని దానిని పునః సంస్కరించడానికి ఆ సంస్థ ఒప్పుకోలేదు. 1958 లో దాని ఇంగ్లీషు ప్రతి వెలువడగా వెంటనే అది 18 ప్రపంచ భాషల లోకి అనువదింపబడింది.

నోబెల్ ప్రైజు ప్రకటనతో సోవియెట్ యూనియన్ లో అతని పట్ల నిరసన ఉద్యమం ప్రబలి అతనికి అనుహాదకుల సంస్థ నుంచి ఉద్వాసన చెప్పారు. దానితో అతనికి జీవనం కూడా కటకట అయింది. అతనిని దేశం నుంచి వెళ్లగొట్టాలని కూడా బహిరంగ సభలు జరిగాయి. "మాతృభూమిని వదలి వెళ్లడం నాకు మరణ తుల్యం" అని అతడు ప్రాధేయ పూర్వకంగా అప్పటి ప్రధాని 'నికిటా-ఎస్-కృశ్చెవ్' కు విన్నవించుకొన్నాడు. చివరకు కేన్సర్‌తోను, గుండెజబ్బుతోను బాధపడి, తాను పుట్టిన చోటనే చరమ జీవితం గడిపాడు.

పాస్టర్నాక్ కృతుల ఆంగ్లానువాదాలలో కొన్ని చిన్న కథ లున్నాయి. అతని స్వీయచరిత్ర *ఓకానయా గ్రామేటా* (1931) కూడా ఉంది. 1960 మే నెల 30 వ తేదీన పాస్టర్నాక్ మాస్కోలో మరణించాడు.

జె.సూ.ప్ర.

**పింటర్, హెరాల్డ్ (1930--) :** ఆంగ్ల నాటక రచయిత; రెండవ ప్రపంచ యుద్ధం తరువాత సంక్లిష్ట లక్షణం గల నాటక రచయితగా ప్రసిద్ధి పొందాడు. వచనంలో సంక్షిప్తత, లఘు సంభాషణలు, మౌన వ్యాఖ్యలతో పాత్రల అంతరాంతరాలలోని భావాలను వెలిబుచ్చుతూ ఇతని నాటకాలు ప్రఖ్యాతి పొందాయి.

యూదు దర్జీ కొడుకైన పింటర్ 'లండన్ ఈస్ట్ ఎండ్' ప్రాంతంలోని శ్రామిక వాడలో పుట్టి పెరిగాడు. అతని నాటకాలలో, ఆ ప్రాంతంలో తరచు కానవచ్చే హింసా ప్రవృత్తి ప్రతిబింబిస్తూ ఉంటుంది. తన బాల్యంలో రెండవ ప్రపంచయుద్ధం కారణంగా తరచుగా కాందిశీకుడు కావలసి వచ్చినా, తీవ్రంగా బాంబు దాడులు జరిగిన సమయంలో అతడు లండన్‌లోనే ఉన్నాడు. యుద్ధం తరువాత ఫాసిస్టు దౌర్జన్యాలను ధైర్యంగా ఎదుర్కొంటూ అతడు అక్కడే నిలదొక్కుకోగలిగాడు.

'రాయల్ ఎకాడమీ ఆఫ్ డ్రమెటిక్ ఆర్టు' లో నటనా కళను అభ్యసించాడు. కాని రెండు 'టరమ్‌లు' పూర్తికాకుండానే తన 18 వ ఏట మిలిటరీ సర్వీసుకు రిక్రూట్ కావడానికి తన అభ్యంతరం వెల్లడించడంతో రెండు సార్లు కోర్టు విచారణకు హాజరై, పర్యవసానంగా జుల్మానా చెల్లించవలసి వచ్చింది. 1950 లో *పొయిట్రీ లండన్* (Poetry London) పత్రికలో అతని కవితలు ప్రచురించబడటం ప్రారంభమయింది. ఆ తరువాతి సంవత్సరమే లండన్‌లోని 'సెంట్రల్ స్కూల్ ఆఫ్ స్పీచ్ ట్రైనింగ్ అండ్ డ్రమెటిక్ ఆర్ట్' లో మరల నటన తరగతులకు హాజరు కావడం ప్రారంభించాడు.

పింటర్ 1951-1955 లలో ఒక డ్రామా కంపెనీతో కలసి ఐర్లాండులో సంచరించాడు. ఈ విషయం *మాక్* (1968) అనే గ్రంథంలో వ్రాసుకొన్నాడు. 1954 నుండి 1957 వరకు 'డేవిడ్ బారన్' అనే మారుపేరుతో స్థానిక నాటక కళాశాలలో నటించాడు. 1956 లో అతడు వివెన్ మర్చెంట్ (Viven Merchant) అనే ఒక నర్తకిని వివాహ మాడాడు. ఆమె అతని నాటకాలకు చక్కని భాష్యకారిణిగా పనిచేసింది. 1957 లో అతని మొదటి నాటకం *ది రూమ్* (The Room) ప్రదర్శింపబడింది. అది ఒక ఏకాంకిక. అతని తొలి నాటకాలలో ప్రముఖంగా కనిపించే హాస్యధోరణికి బీజం అందులోనే కనిపిస్తుంది. అతని పూర్తి నిడివి నాటకం *ది బర్త్‌డే పార్టీ* (1958). ఇది 1968 లో చలన చిత్రంగా తీయబడింది. లండన్ నగరవాసులను తికమక పెట్టి ఒక్క వారం మాత్రమే ప్రదర్శింపబడింది. కాని తరువాత ఇది టెలివిజన్‌లోను, రంగస్థలం మీద ప్రేక్షకుల్ని బాగా ఆకట్టుకొన్నది.

పింటర్‌కి కీర్తి నార్జించినది అతని రెండవ పూర్తి నిడివి నాటకం *ది కేర్ టేకర్* (1960). ఇది 1963 లో చలనచిత్రంగా రూపొందింది. దానిలో మాజీ మానసిక రోగి ఒకడు తన అన్నగారితో కలసి తాను నివసిస్తున్న ఇంటికి ఒక తిరుగుబోతును తీసుకు వస్తాడు. 'థియేటర్ ఆఫ్ ది అబ్సర్డ్' అనే ప్రజారంజకమైన థియేటర్ రచయితలలో ఒకడుగా పింటర్‌ను ఈ నాటకం స్థిరీకరించింది. *ది హోమ్ కమింగ్* లో సంయుక్త రాష్ట్రాలలో ప్రొఫెసరుగా ఉన్న ఒక వ్యక్తి తన భార్యను తీసుకొని 'లండన్ ఈస్ట్ ఎండ్' లోని తన కుటుంబాన్ని

చూడడానికి వెళ్ళిన గాథ దీనిలో చిత్రింపబడింది. ఆ తరువాత వచ్చిన *లాండ్ స్కేప్* (1969), *సైలెన్స్*, (1969), *నైట్* (1969), *ఓల్డ్ టైమ్స్* (1971) మొదలైనవి రంగస్థలం మీద అంగ విన్యాసాల ప్రాధాన్యం ఎక్కువగా గలవి. ఆ పిమ్మట విజయవంతమైన అతని నాటకాలు *నో మేన్స్ ల్యాండ్* (1975), *బిట్రేయల్* (1978) మొదలైనవి. 1970 ప్రాంతాల నుండి పింటర్ ఎక్కువగా తన నాటకాలకు, ఇతరుల నాటకాలకు దర్శకుడుగా పనిచేశాడు. అతని *పొయెమ్స్ అండ్ ప్రోజ్* అనే రచన 1978 లో ప్రచురింపబడింది.

పింటర్ అనేక రేడియో నాటకాలు, దూరదర్శన్ రూపకాలు, కొన్ని చిత్రాలకు వెండితెర కథలు కూడా రచించాడు. అవి *ది సర్వెంట్* (1962), *ది గో-బిట్వీన్* (1971), *ది ల్యాస్ట్ టై-కూన్* (1974), *ది ఫ్రెంచి లెఫ్టినెంట్స్ వుమెన్* (1988) మొదలైనవి.

జె.మూ.ప్ర.

**పిండార్ (క్రీ.పూ. 518-446) :** గ్రీక్ కవులలో అత్యుత్తమ గేయ కవిగా పేరు పొందినవాడు. బహుశః ఇతడు స్పార్టన్ వంశానికి చెందిన ఒక కుటుంబంలో జన్మించి ఉంటాడు. ఏథెన్సు నగరంలో విద్యాభ్యాసం చేసినందువల్ల రాజకీయ, సాంస్కృతిక రంగాలలో పిండార్ పరిణతను సంపాదించాడు.

హోమర్, హెసియోడ్ మొదలైన గ్రీకు మహాకవుల రచనలను చదివి ఉత్తేజితుడై పిండార్ గేయ రచనా వ్యాసంగం లోని లోతుపాతులను తెలుసుకొని ఆ నాటికే ప్రాచుర్యంలో ఉన్న నాటక, నాట్య రంగాలకు గేయ రచన ప్రారంభించాడు. ఏథెన్సు పట్టణంలో మేధావి వర్గాలకు తలమానికమైన స్థానాన్ని పొందిన అగథోక్లిస్ పిండార్‌కి గురువు.

పిండార్ వ్రాసిన 17 సంపుటాల గేయాలలో కేవలం నాలుగు మాత్రమే మిగిలినా, అవి అతని రచనా పాటవానికి నిదర్శనాలు. మత పరమైన, సామూహిక గానానికి పనికి వచ్చే గేయాలు పిండార్ రచనల్లో ముఖ్యమైనవి. మన కింతవరకు దొరికిన అన్ని రచనల్లోను *ఎపినికిసియాలు* అతని రచనల్లో ఉత్కృష్టమైనవిగా కనిపిస్తున్నాయి. ఇవి మొత్తం 44 కవితలు. ఇందులో ఒలింపియన్, పిథియన్, ఇస్త్మియన్ అనే ఆటలను బట్టి విభాగం కనిపిస్తుంది. వీటిలో చాలావరకు ఆయనకు ఆటలలో ఎంత అనుభవం ఉండేదో నిరూపిస్తున్నాయి. అంతే కాకుండా పిండార్‌లో అచంచలమైన దేశభక్తి, ప్రాంతీయ అభిమానం కూడా గోచరిస్తాయి.

పిండార్ తన తొలి రోజుల్లో వ్రాసిన కవిత లన్నీ కాలగర్భంలో కలసిపోయాయి. అయినా అతడు భగవంతునిపై వ్రాసిన కవితలు ప్రాంతీయ సరిహద్దులను అధిగమించి అతనికి కీర్తిని సంపాదించి పెట్టాయి. *డెల్ఫిలో* పిండార్, అతని తరువాతి తరంవారు అనేకులు ప్రత్యేక మర్యాదలు పొందగలిగారు. ఒక ఇనుప కుర్చీ-బ్రతికున్న రోజుల్లో పిండార్ ఉపయోగించినట్టుగా చెప్పబడేది - ఈ నాటికీ అక్కడ ప్రదర్శన శాలలో మనకు కనిపిస్తుంది.

ఆ నాటి రాజకీయ జీవితం పిండార్ మీద ఒక చెరగని ముద్ర వేసిందని చెప్పాలి. అతని ధనస్వామిక గుణాలు, నిర్మొహమాటం ఆయన భవిష్యత్తుకు నిరోధకాలయాయి. ఇవన్నీ ఆయన కవితలలో గోచరిస్తాయి. అయినా సుమారు 40 ఏళ్ల వయస్సు వచ్చేసరికి పిండార్ కవిత్వం ప్రజాదరణ పొందడంతో పాటు ప్రజలు ఆయన కవితా పాటవాన్ని మెచ్చుకునే స్థితి ఏర్పడింది. ఏథెన్సును గురించి ఆయన వ్రాసిన కవిత ఆయనకు ఒక ప్రత్యేక గౌరవాన్ని సంతరించి పెట్టింది. బహుశః ఈ కాలంలోనే పిండార్ పెండ్లి చేసుకొని ఉంటాడు.

తరువాత ఒక దశాబ్దం పాటు డెల్ఫి మీద ఫోసెస్ వారి ఆధిపత్యం ఏర్పడడంతో ఆ పదేళ్లూ పిండార్ గొంతు మూగ వోయింది. పిండార్ 80 ఏళ్ల వయసు వరకూ జీవించాడని కొంద రంటారు. కాని క్రీ.పూ.446 తర్వాత ఆయన వ్రాసిన కవిత్వం కనిపించలేదు.

పిండార్ కవితలు ఆధునికుల ప్రశంసలను కూడా పొందాయి. కాలాతీతమైన ఒక ప్రత్యేక లక్షణం వాటిలో ఉండడం అందుకు కారణం. అయితే ఆధునికులు ఆ నాటి సామాజిక వ్యవస్థను దృష్టిలో పెట్టుకొని ఒక అవగాహనతో చదివితే గాని పిండార్ కవితలలోని అసలు రుచి బోధపడదు.

పప్ప

**పిరాండెలో, ల్విగీ (1867-1936) :** ప్రముఖ ఇటాలియన్ నాటకకర్త, నవలారచయిత, కథానికా రచయిత, 1934 లో సాహిత్యంలో నోబెల్ బహుమతి గ్రహీత. ఆధునిక నాటకరంగంలో ఆయన కనుగొన్న నూతన ప్రక్రియ 'థియేటర్ వితిన్ ది థియేటర్' ఆయనకు గొప్ప కీర్తి నార్జించి పెట్టింది.

పిరాండెలో ఒక గంధకం వ్యాపారి కుమారుడు. తండ్రి ఇతనిని వ్యాపారంలో పెట్టాలని ప్రయత్నించాడు. కాని ఈయన దృష్టి విద్యా వ్యాసంగం మీద ఉండేది. 1887 లో రోమ్ విశ్వ విద్యాలయంలో కొంత కాలం విద్యాభ్యాసం చేసి అక్కడి ప్రొఫెసర్‌తో సరిపడక తరువాతి సంవత్సరం జర్మనీలోని *బాన్* యూనివర్శిటీకి వెళ్లి 1891 నాటికి అక్కడే ఆగ్రిజెంటో మాండలికాల మీద డాక్టరేట్ సంపాదించాడు. 1894 లో ఒక ధనికుడైన గంధకం వ్యాపారి కూతురు ఆంటోనియెట్టిని పెండ్లాడడం వల్ల పిరాండెలోకు ఆర్థిక స్వస్థత లభించింది. రోమ్‌లోనే ఉంటూ రచనా వ్యాసంగం చేస్తూ 1889 నాటికే ఒక కవితా సంకలనం *మాల్ గియోకొండో* ప్రచురించాడు. పిరాండెలో మరెన్నో కవితా సంకలనాలను వెలువరించాడు.



1903 లో ఒక దుర్ఘటన వల్ల తండ్రికి, మామగారికి చెందిన గంధకపు గనులు మూత పడ్డాయి. ఒక్కసారిగా పేదరికాన్ని ఎదుర్కోవలసి వచ్చినపుడు పిరాండెలో రచనల వల్ల సంపాదనే కాకుండా, రోమ్‌లో ఒక కళాశాలలో ఇటలీ భాషాధ్యాపకునిగా కూడా ఉద్యోగం చేయవలసి వచ్చింది. ఈ లోగా భార్య మానసిక అనారోగ్యానికి గురి అయి, 1919 లో చికిత్సా కేంద్రంలో చేర్చబడింది. ఆమె కున్న పెద్ద మానసిక రోగం పిరాండెలో పట్ల అసూయ, ద్వేషం. ఈ నేపథ్యంలోనే పిరాండెలో రచనలు సాగటం వల్ల మారుతున్న మానవ ప్రవృత్తి ఆయన రచనలలో ప్రస్ఫుటంగా గోచరిస్తుంది.

పిరాండెలో తొలి రోజులలో ప్రచురించిన కథానికా సంకలనాలు *అమోరి సెంజా ఎమోర్* (1894, ప్రేమలేని ప్రేమ), *బెఫెడ్లా మోర్టె ఎడెల్లా విట* (1902-03 జీవన్మరణాల ప్రవృత్తి) లలో ఆయన సత్యాన్వేషణ కనిపిస్తుంది. పిరాండెలో రచనలపై ఇటాలియన్ నవలా ప్రపంచంలో ఇద్దరు ప్రముఖులు 'లూయిజి చాపువానా', 'జియోవన్ని వెర్గా'ల ప్రభావం కనిపిస్తుంది.

పిరాండెలో ఒక చరిత్రాత్మక నవలను 1913 లో వెలువరించాడు. 1925-26 లో వెలువడిన *యూనో నెస్సునో ఎ సెంటొమిలా* అనే నవల ఒక ప్రత్యేక శైలికి చెందిన అద్వితీయమైన రచన. దీనిలో కథానాయకుడు ఒక్కసారిగా తన చుట్టూ ఉన్న వారు తన వంటి దృక్పథం కలవారు కాదని తెలుసుకొంటాడు.

1898 లో పిరాండెలో మొదటిసారిగా నాటకరంగం వైపు తిరిగాడు. *లీ ఎపిల్లో* అనే నాటిక రచించాడు. కాని 1910 వరకు దానిని ప్రదర్శించడం కుదురలేదు. పిరాండెలో నాటక రచయితగా మొదట విమర్శలకు గురి అయినా రాను రాను ఆయన రచనలలో అంత ర్భూతంగా ఉన్న సునిశితమైన మానవతా దృక్పథాన్ని ప్రజలు అర్థం చేసుకోగలిగారు. *సీ పెర్సొనగ్గీ, ఎన్రికో* పిరాండెలోకి అంతర్జాతీయ కీర్తిని ఆర్జించి పెట్టాయి.

1928 తరువాత పిరాండెలో ఎక్కువగా పర్యటనలు చేస్తూ గడపేవాడు. తన వీలునామాలో తాను మరణించిన తరువాత తన శవం వెంట కేవలం ఒక 10 మంది బీదవాళ్లూ, శవ శకటపు చోదకుడూ తప్ప ఇంకెవరూ రానవసరం లేదని, ఏ రకమయిన ఆర్భాటాలూ కూడదనీ వ్రాసుకొన్న నిరాడంబరుడు పిరాండెలో.

పప్పు

**పిల్న్యాక్, బోరిస్ (1894-1937)** : ప్రముఖ రష్యన్ నవలా రచయిత. అసలుపేరు బోరిస్ డ్రెయవిష్ వొగావ్. 1920 ప్రాంతంలో ప్రతీకాత్మక నవలా రచనకు, కథారచనకు ప్రసిద్ధి పొందాడు.

వోల్గానది ఒడ్డున గల ఒక గ్రామంలోను, మాస్కో దగ్గర గల సరటోవ్ నగరంలోను బాల్యం గడపిన పిల్న్యాక్ తన 9 వ ఏటనే రచనలు చేయడం ప్రారంభించాడు. 1922 లో ప్రచురితమైన *గోలీగాజ్,* 1928 లో ప్రచురితమైన *ది నేకెడ్ ఇయర్* అనే నవలలు పిల్న్యాక్ కు ప్రతిష్ఠ సమకూర్చాయి. ఈ రెండో నవల ఆ నాటి సామాజిక విప్లవాలను ప్రతిబింబిస్తూ విశేష విఖ్యాతి పొందింది.

1926 లో ఆయన వ్రాసిన *ది టేల్ ఆఫ్ ది అన్‌ఎక్స్‌టింగ్విష్డ్ మూన్* అనే నవల సమాజంలో ఒక కల్లోలాన్ని లేవదీసింది. ఈ నవల ఫ్రూంజ్ అనే సుప్రసిద్ధ సైనికాధికారి మరణాన్ని గురించి ధ్వని ప్రధానంగా వ్రాయబడిన రచన. ఈ నవల ప్రచురించబడిన పత్రికలన్నిటిలోను ఆ పుటను తొలగించి ఆ పత్రికలను అమ్మారు. 1929 లో ఇదే నవలను ప్రచురించడానికి ప్రయత్నించి మరోసారి పిల్న్యాక్ కష్టాలకు గురి అయాడు. *మహోగనీ* అని ఈయన వ్రాసిన మరో నవల రష్యాలో నిషేధింపబడింది.

కమ్యూనిస్టు సిద్ధాంతాలపై పిల్న్యాక్ కున్న అనిష్టత, విముఖత ఆయన రచనలలో ప్రస్ఫుటంగా గోచరిస్తాయి. అవి కనిపిచకుండా ఉండడానికి *ది వోల్గా ఫాల్స్ టు ది కాస్పియన్ సీ* వంటి రచనలు చేసినా అధికారుల ఆగ్రహానికి గురి కాక తప్పలేదు. 1937 లో శ్టాలిన్ ప్రభంజనం రష్యాను కుదిపి వేస్తున్న రోజుల్లో రష్యన్ సాహిత్యం నుంచి పిల్న్యాక్ పేరు, రచనలు పూర్తిగా తొలగింప బడ్డాయి. శ్టాలిన్ మరణానంతరం పిల్న్యాక్ 1937 లో ఖైదు చేయబడి అదే సంవత్సరం మరణించినట్లు అధికార ప్రకటనలు వెలువడ్డాయి. 1976 వరకు ఆయన రచనలు ఒక సంపుటిగా వెలువడలేదు.

పప్పు

**పుష్కిన్, అలెక్సాండర్ (1799-1837) :** రష్యన్ భాషలో నవలలు, నాటికలు, కథానికలు రచించిన పుష్కిన్ ఆధునిక రష్యన్ సాహిత్యానికి మూలపురుషుడుగా, ఆదేశపు మహాకవిగా సుప్రసిద్ధు డయాడు.

ధనిక కుటుంబంలో జన్మించిన పుష్కిన్ తొలి రోజులలో ఫ్రెంచ్ భాష అభ్యసించాడు. చిన్నతనంలో రష్యన్ జానపద కథలు ఆనోటా ఆనోటా విని క్రమంగా ఒక ఊహాపథంలో విహరించే కళాకారుడుగా మారాడు పుష్కిన్. 1814 లో *వెస్ట్నిక్ ఎవ్రోపీ* అనే కవితా సంకలనంతో పుష్కిన్ సాహిత్య వ్యాసంగం ప్రారంభమైందని చెప్పవచ్చు. అయితే అతని తొలి ఉద్గ్రంథం *రస్లాన్ అండ్ ల్యూడ్ మిలా* 1820 లో ప్రచురింపబడింది. అంత వరకు అంగీకరింపబడ్డ ఛందో లక్షణాలన్నీ పరిహరించిన ఈ కావ్యం రష్యన్ సాహితీ ప్రపంచంలో ఒక తుఫాను రేపింది. కాని పుష్కిన్‌కి 'పేరు ప్రఖ్యాతులు' ఆర్జించి పెట్టింది.

1817-18 ప్రాంతాల్లో పుష్కిన్ రాజకీయ రచనలు చేసి రష్యన్ విప్లవానికి అంకురాలు నాటిన వైతాళికులలో ఒకడుగా పేరు పొందాడు. అయితే 1820 నాటికి దేశం నుంచి బహిష్కృతుడై, అనారోగ్య పీడితుడైనా, ఆరోజుల్లో తాను తిరిగిన ప్రదేశాలు, పరిస్థితులు ఆధారంగా 1822 నుంచి 27 వరకూ *సదరన్ సైకిల్* అనే కవితా సంపుటాలు వెలువరించాడు. వాని వల్ల కీర్తి లభించినా, పుష్కిన్‌కి తృప్తి కలుగలేదు. 1823 లో కవితారూపమైన నవల *యెవజనీ ఓన్జిన్* రచన కుపక్రమించాడు. ఇది 1831 లో పూర్తయింది. ఈ నవల ఆ నాటి రష్యన్ జీవితానికి చక్కని ప్రతిబింబం.

బహిష్కృతుడైన కాలంలో రెండేళ్ల పాటు మిఖయ్‌లోవ్‌స్కోయ్ లో ఉండగా అక్కడి జానపద గాథలు, పాటలు పుష్కిన్‌ని ఆకర్షించాయి. ఆ సమయంలోనే రష్యన్ చరిత్ర క్షుణ్ణంగా చదివి అవగాహన ఏర్పరచుకొన్న పుష్కిన్ ఆ రోజుల్లో చేసిన రచనలు ఇతివృత్తంలోను, విషయ విశదీకరణలోను క్రొత్త పుంతలు తొక్కాయి. *బోరిస్ గోడునోవ్* అనే ఉద్గ్రంథానికి ఈ కాలంలోనే ఆయన అంకురార్పణ చేశాడు. దీనిని 1824-25 ల మధ్య రచించినా 1831 వరకూ ఇది ప్రచురణ కాలేదు. ఈ రచనలోనే అంతవరకు అతనిలో అంతర్లీనంగా ఉన్న ఫ్రెంచ్ ప్రభావం మాయమై, జానపద బీజాలు అంకురించాయి. డిసెంబరు ఉద్యమానికి ముందు వ్రాయబడిన ఈ రచన పాలకులకు, పాలితులకు మధ్య ఉండవలసిన సంబంధాలను వివరిస్తూ చక్కని కథా కథనంతో సాగింది. ఆ నాటి సాంఘిక కల్లోలాన్నీ , రాజకీయ నిస్పృహనూ ప్రతిబింబించింది. దీనిలో తనపై షేక్స్పియర్ ప్రభావం ఉందని పుష్కిన్ స్వయంగా చెప్పకొన్నాడు. సెన్సార్ వల్ల ప్రచురణ ఆలస్యం అయినా ప్రచురణ అయిన తర్వాత ఈ రచనకు అనుకోని ఆదరణ లభించింది.

1826 లో బహిష్కరణ ఆదేశం రద్దయి, పుష్కిన్ మాస్కో తిరిగి వచ్చాడు. అయినా అతని రచనల మీద ఆంక్షలు, అతని స్వాతంత్ర్యానికి ప్రతిబంధకాలు ఎక్కువయాయి. ఒక వంక అతని మీద పోలీసుల నిఘా, మరోవంక స్నేహితులే పుష్కిన్ నిజాయితీని నమ్మలేని స్థితి ఏర్పడింది. 1827-30 ల మధ్య ఆయన వ్రాసిన కవితలలో ఈ పరిస్థితి కనిపిస్తుంది.

1829-36 మధ్య పుష్కిన్ వ్రాసిన ప్రతి రచన సాహిత్యంలో ఒక నూతన శకాన్ని సృష్టించింది. ఆయన వ్రాసిన దుఃఖాంత రచనలలో *స్క్యుపోయ్ రిస్టార్* (1836), *మొజార్ట్ ఇ సయిలెరి* (1831), *కమెన్ని గోస్ట్* (1839), *పిర్‌వో వ్రెమ్యాచుమీ* (1832) రష్యన్ సాహిత్యంలో నూతన అధ్యాయాలుగా నిలచిపోయాయి.

1831 లో పుష్కిన్ తల్లిని ఎదిరించి 'నటాల్యా' అనే ఆమెను పెండ్లాడాడు. ప్రభుత్వోద్యోగాన్ని స్వీకరించి రష్యాచరిత్ర రచించడానికి ఉపక్రమించింది ఈ సమయంలోనే. పద్య రచనను వదలిపెట్టకుండా మరో వంక గద్య రచనలు కూడా చేయడం మొదలు పెట్టి, ఎన్నో నవలలు కూడా పుష్కిన్ రచించాడు.

కవిగా, రచయితగా ప్రపంచంలో ఒక విశిష్టమైన స్థానాన్ని పుష్కిన్ సంపాదించాడు. అతని రచనలు చాలా వరకు వివిధ ప్రపంచ భాషల్లోకి అనువదింపబడ్డాయి.

పప్పు

**పెటోఫి, సాందోర్ (1823-49) :** ప్రముఖ హంగేరియన్ కవి. హంగేరియన్‌ల స్వాతంత్ర్యేచ్ఛకు ప్రతినిధిగా నిలచిన విప్లవ కవి.

బాల్యంలో అనేక పాఠశాలలలో చదివి, యౌవనంలో సైన్యంలో చేరి, అనారోగ్య కారణంగా సైన్యం నుంచి పంపివేయబడిన పెటోఫి తరువాత హంగరీలో మూల మూల అనేక ప్రదేశాలలో పర్యటించి, చాలావరకు కాలినడకను ప్రయాణించి ప్రజల జీవితాన్ని ప్రత్యక్షంగా దర్శించాడు. 1842 లో తన 19 వ ఏట మొట్టమొదటి కవిత రచించి ప్రచురించాడు. 1844 లో ఆ నాటి హంగరీ కవులలో ఆద్యుడయిన మిహోలీ సలహా ననుసరించి, *పెస్టీడివల్ లాప్* అనే సాహిత్య పత్రికలో సహ సంపాదకుడుగా చేరాడు. అదే సంవత్సరం అతని తొలి కవితా సంపుటి *వెర్సిక్* ప్రచురించబడింది. వెంటనే పెటోఫి గొప్పకవిగా గుర్తింపబడ్డాడు. కొంత వరకు ఈ కవితా సంపుటి సంచలనాన్ని సృష్టించినా, అనుకోకుండా గొప్ప పేరు ప్రఖ్యాతులు లభించాయి. 1847 లో జూలియా అనే ఆమెను పెండ్లాడాడు.

1848 లో హంగరీలో చెలరేగిన విప్లవానికి ముందు సాహిత్య రంగంలో పెటోఫి ఒక కీలకమైన పాత్ర వహించాడు. మోర్ జొకాయ్ అనే మరొక సాహితీవేత్తతో కలసి 1847 లో *ఎలెట్ కెపెక్* అనే పత్రికకు సంపాదకుడుగా పనిచేశాడు. ఫ్రెంచ్ విప్లవం వల్ల ప్రభావితుడైన పెటోఫి తన చుట్టూ ఉన్న సమాజంలోని ఆర్థిక అసమానతల పట్ల తీవ్రంగా స్పందించాడు. ఆ రోజులలోనే అతడు వ్రాసిన *ఉల్సాని మగ్యార్* (రైజ్ హంగేరియన్) అనే గేయం జాతీయ గీతం అయింది. ట్రాన్సిల్వేనియా సైన్యాధిపతి జనరల్ జోజెఫ్ బెమ్ అనే ఆయనకు పెటోఫి అంగరక్షకుడుగా పనిచేశాడు. 1849 జూలై 31 న జరిగిన సెజస్వార్ యుద్ధ సమయంలో పెటోఫి హఠాత్తుగా అదృశ్యం అయిపోయాడు. దశాబ్దాల తరబడి హంగేరియన్ ప్రజలు పెటోఫి మరణించి ఉంటాడు అన్న విషయాన్ని నమ్మలేకపోయారు.

సాహితీ రంగంలోకి ఒక ప్రభంజనంలా దూసుకొని వచ్చిన పెటోఫి కేవలం 26 సంవత్సరాల వయస్సులోనే మరణించడం హంగేరియన్‌ల దురదృష్టం. జీవించి ఉన్న ఆ కొద్ది సంవత్సరాలలోనే కవితా మార్గంలో ఒక క్రొత్త మలుపు తీసుకొనివచ్చి, కవిత అందరికీ అందుబాటులో ఉండే విధంగా, చెప్పదలచుకొన్నది ముక్కుకు సూటిగా చెప్పే రీతిలో మలచిన శిల్పి పెటోఫి.

పప్పు

**పెట్రార్క్ (1304-1374) :** ఇటాలియన్ పండితుడు, కవి, మానవతావాది. పూర్తి పేరు ఫ్రాంసెస్కో పెట్రార్క్. సంస్కరణోద్యమంలో ఈయన రచించిన ప్రేమ కవితలు ఆ రకం కవిత్వానికి పునాది వేశాయి. తండ్రి 1302 లో ఫ్లారెన్స్ వదలి అరెజ్జోకు వచ్చిన తరువాత పెట్రార్క్ 1304 లో జన్మించాడు. కొంతకాలం ఫ్రాన్స్‌లో విద్యాభ్యాసం చేసి ఇటలీ తిరిగి వచ్చిన పెట్రార్క్‌లో సాహిత్య జిజ్ఞాస అధికం అయింది. పెట్రార్క్ తొలి కవితలు తన తల్లి మరణం తరువాత వ్రాసిన స్మృతి గీతాలు. 1326 లో తండ్రి మరణించిన తరువాత అప్పటి వరకు చదువుతున్న న్యాయశాస్త్రం వదలి పెట్రార్క్ తనకు అభిరుచి ఉన్న సాహిత్యాధ్యయనం ప్రారంభించాడు.

కేవలం సాహిత్యం మీద మమకారం మాత్రమే కాక దృఢమైన ఆధ్యాత్మిక భావన, ఆదర్శప్రాయమైన జీవితం గడపాలనే తపన, మానవతా దృక్పథం పెట్రార్క్‌లో ఆది నించి కనిపించిన సుగుణాలు. ఇదే కాలంలో పెట్రార్క్ లారా అనే ఆమెను ప్రేమించి ఆలపించిన ప్రేమ గీతికలు అతని మానసిక సౌకుమార్యాన్ని తెలియజేస్తాయి. జీవితాంతం ఆమె ఎవరో ఇతరులకు తెలియకపోయినా 1327 నించి పెట్రార్క్ లో రగిలిన ఈ ప్రేమ జ్వాలలు అతని సాహిత్య రచనలలో తలమానిక మైన పద్య సంకలనానికి మూలకారణ మయాయి. అతని జీవితంలో 1327 ఒక ముఖ్యమైన మలుపు. అక్కడి నుంచి అతని విదేశ యాత్రలు మరికొంత పరిణతిని, అవగాహనను అతనికి చేకూర్చాయి. ఈ నేపథ్యంలో సంప్రదాయ సంస్కృతికి, క్రైస్తవ మత సందేశానికి గల ఒక అపూర్వమైన సమన్వయాన్ని పెట్రార్క్ తన కవిత్వం ద్వారా ప్రతిపాదించి ఇటాలియన్ భాషలో ఒక నూతన శకానికి నాంది పలికాడు.

పెట్రార్క్ రచనలను క్రమంగా క్రోడీకరించడం కొంచెం కష్టంతో కూడిన పని. వ్రాసిన రచన లన్నిటినీ అతడు మళ్ళీ మళ్ళీ సవరించేవాడు. అయినా అతడు లాటిన్ ఛందస్సులో వ్రాసిన 66 కవితలు ఎంతో ప్రాచుర్యాన్ని పొందాయి. *ఆఫ్రికా* అనే ఒక ఇతిహాసం, *డి వైరస్ ఇలస్ట్రిబస్* అనే రోమ్ వీరుల గాథలు పెట్రార్క్ రచనలలో చెప్పుకోదగిన మరికొన్ని.

1340 లో రోమ్ నుంచి, పారిస్ నుంచి అతనిని కవిగా గౌరవించడానికి ఆహ్వానాలు వచ్చాయి. రోమ్‌లో ఒక వెయ్యి సంవత్సరాల తరువాత ఛందోబద్ధమైన కవితకు ప్రాణం పోసిన కవిగా పెట్రార్క్ ను సన్మానించారు.

1348 లో ప్లేగ్ వ్యాధి సోకి ఎందరో మిత్రులు మరణించారు. వారిలో పెట్రార్క్ కవితలలో చోటుచేసుకున్న *లారా* కూడా ఉంది. 1350 లో పెట్రార్క్ ఈ స్థితిలో రోమ్ వెళ్లి అక్కడ తాను ప్రాపంచిక సుఖాలను త్యజిస్తున్నట్లు ప్రకటించాడు. 1362 లో వెనీస్‌లో స్థిరపడిన పెట్రార్క్ 1367 లో తిరిగి పాడువా చేరుకొన్నాడు. శేష జీవితంలో స్వీయ చరిత్ర ఉత్తరాల రూపంలో వ్రాసి తరువాతి తరాలకు అందించాడు. ఇటాలియన్ భాషలో పెట్రార్క్ తీసుకొని వచ్చిన సాంస్కృతిక విప్లవం ఒక ముఖ్యమైన సాహిత్య శకానికి నాంది పలికింది. ఆఖరి నిముషం వరకూ సాహిత్యసేవకే అంకితం అయిన పెట్రార్క్ 1374 లో *వర్జిల్* వ్రాతప్రతి మీద తలవాల్చి కన్నుమూశాడు.

పప్పు

**పెట్రోనియస్, ఆర్బిటేర్ గైయస్ (మృతి - క్రీ.శ. 66)** : ప్రముఖ లాటిన్ రచయిత. క్రీస్తుశకం తొలి రోజుల్లో జన్మించి 66 వరకూ జీవించిన పెట్రోనియస్ అసలుపేరు 'టైటస్ పెట్రోనియస్ నిగర్'. ఆనాటి రోమన్ సంఘాన్ని ప్రతిబింబించే రచనను క్రీ.శ. మొదటి శతాబ్దంలోనే చేసిన సాహితీ వేత్త పెట్రోనియస్.

నీరో చక్రవర్తి ఆంతరంగిక బృందంలో పెట్రోనియస్ ఒకరు. కాని, ఈ అనుబంధం ఎక్కువకాలం సాగలేదు. అంతేకాక నీరోను చంపడానికి కుట్ర చేశాడన్న ఆరోపణతో పెట్రోనియస్‌ను క్రీ.శ 66 లో ఖైదు చేశారు. శిక్ష కోసం వేచి ఉండక తన మరణానికి తానే ఏర్పాట్లు చేసుకొని ఆ సంవత్సరంలో ఆయన చనిపోయాడు.

పెట్రోనియస్ రచనలలో ముఖ్యమైనది *ది సాటీరికాన్*. ఇది ఒక హాస్యభరితమైన నవల వంటి రచన. ఈ గ్రంథంలో ఒక వంక ఉత్కృష్టమైన సాహిత్యపు విలువలు, మరోవంక సామాజిక స్పృహ గోచరిస్తాయి. వ్యంగ్య రచనా ధోరణిలో సాగే దీనిలోని గేయాలు ఆ నాటి సామాజిక పరిస్థితులను ప్రతిబింబిస్తూ సునిమెత్తని విమర్శ, చమత్కారం కలపిన ఒక అద్వితీయమైన శైలిలో సాగాయి. ఆత్మయొక్క శాశ్వతత్వం గురించిన విశ్వాసాలనూ, నిత్య జీవితంలో ఆనందానికి ప్రాముఖ్యం ఇవ్వవలసిన అవసరాన్నీ తెలియజేస్తూ అనవసరమైన మెట్ట వేదాంత ధోరణులను ఈ గ్రంథం నిరసించింది. అయితే ఇందులో ఎక్కడా ఒక నిర్దిష్టమైన వేదాంతం గాని, నీతి బోధ గాని కనిపించదు.

ఆ నాటి ప్రజల కోసమే వ్రాయబడినా, ఈ గ్రంథం ఈ నాటికీ ఆ నాటి స్థితిగతులను తెలిపే ప్రశస్త రచనగా చరిత్రలో మిగిలి పోయింది. ఒకవేళ ఈ పుస్తకం నుంచి చదువరు లేమైనా ఆశిస్తే అది కేవలం సౌందర్యారాధనకు, సాహితి విలువలకు పరిమితం కావాలి గాని దీనిలో నీతి ఏమైనా ఉందా అని వెదుకకూడదు. ఈ గ్రంథంలో అనేక చిన్న చిన్న ఇతివృత్తా లున్నాయి. భాష, శైలి చాలా తేలికగా అందరికీ అర్థమయ్యే విధంగా ఉన్నాయి. కాని, కొందరు విమర్శకులు పెట్రోనియస్ ఈ గ్రంథాన్ని చాలా తక్కువ కాలంలో నిర్లక్ష్యంగా వ్రాశాడని అంటారు.

1913 లోను, 1965 లోను ఈ గ్రంథానికి ఆంగ్లనువాదాలు వెలువడ్డాయి. వీటిలో *ట్రిమాల్షియోనిస్ డిన్నర్ పార్టీ, విడో ఆఫ్ ఎఫిసస్* చాలా ప్రజాదరణ పొందాయి. అయితే ఈ ఒక్క గ్రంథంతోటే అమరుడైన పెట్రోనియస్ ఇతర రచన లేమైనా చేశాడా అనేది వివాదాంశం.

పప్పు

**పెరెజ్ గాల్డోస్, బెనీటో (1843-1920)** : సుప్రసిద్ధ శ్పానిష్ నవలారచయిత. టాల్‌స్టాయ్, డికెన్స్, బాల్జాక్ లతో పోల్చదగిన నవలా రచయిత. సంకుచితమైన రాజకీయ మత తత్త్వాలకు అతీతమైన విశాల దృక్పథం గలవాడు. నగరాన్ని గురించిన రచనలే ఇతని గొప్ప రచనలు అయినా, జాతీయ దృక్పథంతో ప్రాంతీయ తత్త్వాలను నిరసించిన రచయిత 'పెరెజ్'.



న్యాయ శాస్త్రం చదువుతూ పాత్రికేయుడు కావాలనే కాంక్షతో పెరెజ్ ఆ చదువుకు స్వస్తి చెప్పి తన రచనల మీదనే ఆధారపడి జీవించాడు. 1870 లో ప్రచురితమైన అతని మొదటి నవల *ది ఫౌంటైన్ ఆఫ్ గోల్డ్*. చరిత్రాత్మక మైన నవలా రచనలో 'పెరెజ్' చేసిన ప్రయోగాలు అద్వితీయ మైనవి. ఆ కోవలో తొలి రచనలు నెపోలియన్ యుద్ధ కాలంలో శ్పానిష్ చరిత్రను గురించి తెలియ జేసేవి. ఈ కాలపు చరిత్రను చాలా మంది విస్మరించడం వల్ల 'పెరెజ్' తరువాతి కాలంలో రచించిన ఇరవై నవలలలో చారిత్రకమైన

నిజాలతోను, కల్పనలతోను కూడిన ఒక అనన్యమైన కథా కథన విధానం కనిపిస్తుంది.

తన కాలంలో యూరప్‌లోని రచయితల నవలల లోని తీరుతెన్నులు 'పెరెజ్' నవలా రచనపై ప్రభావం చూపాయి. ముఖ్యంగా *ది ప్రోహిబిషన్* లోను, *ఫార్ట్యూనాటా విజసింతీ* లోను ఈ ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది.

1895 లో వెలువడిన నవల *నజరిన్* లో 'పెరెజ్' యొక్క మానవతా వాదం ప్రస్ఫుటమవుతుంది. పెరెజ్ రంగస్థలానికి వ్రాసిన రచన లన్నీ ప్రజాదరణ పొందాయి. ఆ కాలంలో అవి వేలాది మంది ప్రేక్షకుల హృదయాలను కదిలించాయి. అయితే వాటిలో కళ కన్న అతని రాజకీయ దృష్టికే ఎక్కువ ప్రాచుర్యం ఉందని చెప్పవచ్చు.

ఒక వంక ఇంత విజయవంతంగా సాహితీ జీవితం సాగినా మరొక వంక 'పెరెజ్' ఎన్నో వైఫల్యాలనూ, ఓటములనూ కూడా ఎదుర్కోవలసి వచ్చింది. 'పెరెజ్' వృద్ధాప్యంలో మానసికంగా ఎంతో క్రుంగిపోయాడు. మేధాశక్తి రాను రాను క్షీణించసాగింది. 1912 లో పూర్తిగా అంధుడై, 1920 నాటికి పెరెజ్ అనామకుడుగా మరణించాడు.

పప్పు

**పెర్ల్ ఎస్. బక్ (1892-1973) :** ప్రముఖ అమెరికన్ రచయిత్రి. యౌవనం అంతా సుమారుగా చైనా దేశంలో గడిపిన 'పెర్ల్' నవలలలో చైనీయుల జీవితాలే కనిపిస్తాయి. చైనాలో కొన్నాళ్లు విద్యాభ్యాసం చేసి రించ్‌బర్గ్‌లో పట్టభద్రురాలై, 1914 లో తిరిగి చైనాకు వచ్చి నాన్కింగ్ యూనివర్శిటీలో ఆమె అధ్యాపకురాలైంది.

1923 లో మొదటిసారిగా ఆమె వ్యాసాలు అమెరికాలోని పత్రికలలో ప్రచురణ అయాయి. అవన్నీ చైనా ప్రజల జీవితాన్ని ప్రతిబింబించేవే! కాని ఆవిడ నవల *ది గుడ్ ఎర్త్* ప్రచురణ అయే దాకా, అంటే 1931 వరకూ *పెర్ల్ బక్* కి ఎక్కువ పేరు ప్రఖ్యాతులు రాలేదు. ఈ నవల ప్రపంచంలోని అనేక ఇతర భాషల్లోకి అనువదింపబడింది. 1932 లో ఆమె వ్రాసిన *సన్స్*, 1935 లో వెలువడిన *ఎ హౌస్ డివైడెడ్* కూడా ఎంతో ప్రజాదరణ పొందాయి. ఈ మూడింటినీ కలిపి *ది హౌస్ ఆఫ్ ఎర్త్* అనే పేర 1935 లో ప్రచురించారు.

1917 లో తాను వివాహమాడిన క్రైస్తవ మతాధికారి 'జాన్ బక్' కు ఆమె 1934 లో విడాకు లిచ్చింది. 1935 లో న్యూయార్క్‌లోని ఒక పుస్తక ప్రచురణ కర్త 'రిచర్డ్ వాల్ష్' ను పెండ్లాడి, ఆ తరువాత 'పెర్ల్ బక్' అమెరికాలో స్థిరపడిపోయింది. 'పెర్ల్ బక్' గొప్ప మానవతావాదిని, రెండవ ప్రపంచయుద్ధం తరువాత నిరాశ్రయులై, అనాథలైన వేలాది మంది పిల్లలకోసం ఆమె 'పెర్ల్ బక్ నిధి' అని ఒక సహాయనిధిని ఏర్పాటు చేసి, 1967 నాటికి తన వంతుగా తాను జీవితాంతం సంపాదించిన ఆస్తిలో ఎక్కువ భాగం సుమారు డెబ్బై లక్షల డాలర్లు ఆ సంస్థకు దానం చేసింది.

1936 తరువాత 'పెర్ల్ బక్' జీవిత చరిత్రలను వ్రాయడానికి పూనుకొని మొదట ఆమె తండ్రి చరిత్ర *ఫైటింగ్ ఏంజెల్* అనే పేర వ్రాసింది. తల్లి చరిత్ర *ది ఎక్సైల్* అని వ్రాసింది. ఇంకా తరువాత *డ్రేగన్ సీడ్, ది ఇంపీరియల్ వుమన్, ది ఫస్ట్ వైఫ్ అండ్ అదర్ స్టోరీస్* అనే గ్రంథాలు కూడా వ్రాసింది. తన కుమార్తెలో మానసిక వికాసం లేకపోవడం వల్ల ఆమె వ్రాసిన కథానిక - *ది చైల్డ్ హూ నెవర్ గ్రూ.* ఆమె రచనలలో మరొక ముఖ్యమైన రచన ఆమె స్వీయచరిత్ర-మై *సెవరల్ వర్ల్డ్స్.* ఇవి కాక *జాన్ సెడ్జెస్* అనే మారు పేరుతో ఆమె ఐదు నవలలు వ్రాసింది.

'పెర్ల్ బక్' కు పులిట్జర్ పురస్కారం, 1938 లో నోబెల్ సాహిత్య పురస్కారం లభించాయి.

పప్పు

**పెర్స్, సాం-జాం(సెంట్ జాన్) (1887--) :** ప్రముఖ ఫ్రెంచ్ రచయిత. ఇతని అసలు పేరు మారీ లెసీ ఆగస్ట్ సెంట్ లెజర్. ఈయన 1887 లో గ్వాడలూప్‌లో జన్మించాడు. బోర్డో, పారిస్ విశ్వవిద్యాలయాలలో విద్య నభ్యసించి 1914 లో ప్రభుత్వోద్యోగా నియమితుడయాడు. చైనాలో మొదట షాంగ్‌హై లో కాన్సల్‌గాను, పికింగ్‌లో సెక్రటరిగాను వ్యవహరించాడు. 1921 లో జరిగిన నిరాయుధీకరణ సమావేశంలో ఈయన తూర్పు ఆసియా వ్యవహారాలపై నిపుణుడుగా పాల్గొన్నాడు. తరువాత కొన్నాళ్లు (1921-23) ఫ్రెంచ్ రాజకీయ వేత్త ఎరిస్టీడ్ బ్రియాలాకు కార్యదర్శిగా



ఉన్నాడు. 1940 లో విషీ ప్రభుత్వం అధికారంలోకి వచ్చినప్పుడు ఈయన పదవి నుండి తొలగింపబడి, అమెరికా వెళ్లి అక్కడ వాషింగ్టన్‌లో లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్‌కు ఫ్రెంచ్ సాహిత్యంలో సలహాదారుగా వ్యవహరించి, 1957 లో స్వదేశానికి తిరిగి వచ్చాడు.

ఈయన ప్రభుత్వ సేవ ప్రారంభించడానికి ముందు 1911 మొదలు కవిత్వ సంపుటాలను కొన్నిటిని ప్రచురించాడు. ఇవి మొదట ఫ్రెంచ్‌లోను, తరువాత ఇంగ్లీష్ అనువాదంలోను ప్రచురింపబడ్డాయి. వీనిలో మొదటిది *ఏలోజెస్, ఇతర కవితలు*. ఈ సంపుటం లోని కవితలపై 'సింబాలిజం' ప్రభావం కనిపిస్తుంది. దీని తరువాతి రచనలలో ఈయన ఒక వ్యక్తిగతమైన శైలిని రూపొందించుకొన్నాడు. ఈయన కవితాశైలి సునిశితంగాను, స్వచ్ఛంగాను ఉండి, కవులను విశేషంగా ఆకర్షించింది. సామాన్య పాఠకులను మాత్రం అంతగా ఆకర్షించలేదు. సాధారణ పదప్రయోగం ద్వారాను, మత సంబంధమైన ఛందస్సుల ద్వారాను ఈయన తన అనుభూతులను ప్రపంచానికి వ్యక్తపరచాడు. పండితులు ఈయన కవిత్వాన్ని *రింబో* కవిత్వంతో పోలుస్తారు. ఈయన తొలి రచనలలో ముఖ్యమైన *అనాబేస్* (1924) ను *అనాబేసిస్* అనే పేరుతో టి. ఎస్. ఇలియట్ ఇంగ్లీషులోకి అనువదించాడు. ఈయన తాను అమెరికాలో ఉన్న కాలంలో చేసిన రచనలు *ప్రవాసము* (1942), *వెంట్స్* (1946), *ఎక్సల్, ఇతర కవితలు* (1949), *అమెర్త్* (1957), *క్రానిక్* (1960), *అయిస్ కాజ్* (1962). వీనిలో ఈయన వ్యక్తిత్వం స్ఫుటంగా కనిపిస్తుంది. కొందరు అమెరికన్ పాఠకులు ఈయనను ఫ్రెంచ్ జాతీయతా భావానికి ప్రతిబింబంగా పరిగణించారు. ఈ కవితలన్నింటిలోను ఈయన మేధాశక్తి గోచరిస్తుంది. *అనబేస్* లోనివి కొన్ని, *సీమార్క్స్* లోనివి కొన్ని కవితలు ఇంగ్లీష్‌లోకి అనువదింపబడి విశేష ప్రజాదరణ పొందాయి.

ఈయన చేసిన సాహిత్య సేవకు గుర్తింపుగా 1960 లో ఈయనకు సాహిత్యంలో నోబెల్ బహుమతి ఇచ్చారు.

డి.ల.రా.

**పొలిటీయన్ (ఏంజలో పోలీజీయానో) (1454-94)** : రినయ్‌జాన్స్ నాటి ఇటలీలోని ప్రముఖ విద్వాంసుడు, కవి, మానవతావాది. 1454 జూలై 14 న ఇటలీలో జన్మించాడు. 1464 లో ఇతని తండ్రి మరణంతో కుటుంబం కష్టాలపాలై, 1469 నాటికి ఈయన ఫ్లారెన్స్ లోని బంధువుల వద్దకు చేరాడు. లాటిన్ భాషలో కవితా నైపుణ్యంతో ఆనాటి ఇటలీలో మహా సంపన్నుడైన "లోరెంజో డి మెడిచీ" దృష్టిని ఆకర్షించాడు. గ్రీకు ఇతిహాసం ఇలియడ్ మొదటి రెండు భాగాలను లాటిన్ లోకి అనువదించి "లోరెంజో" కు అంకితం చేశాడు. ఈ విధంగా ఈయన మెడిచీ కుటుంబం ప్రాపకం సంపాదించి, "లోరెంజో" కుమారుడు "పియరో" కు గురువుగా నియమితు డయాడు. 1470-75 మధ్యలో ఇలియడ్‌లోని భాగాలకు ఈయన చేసిన లాటిన్ అనువాదం ప్రప్రథమంగా కీర్తి సంపాదించింది. ఈయన వ్రాసిన వివిధ లాటిన్ కవితలు అత్యున్నత స్థాయికి చెందినవి. వీనిలో ఈయన ఎలిజీ, ఓడ్ మొదలైన విభిన్న కవితా ప్రక్రియలను ప్రయోగించాడు. కాని ఈ దశలోని ఈయన రచనలలో అతిముఖ్యమైనది: ఇటాలియన్ భాషలో 1475-1478 మధ్యలో ఈయన రచించిన *స్టాంజె కమ్యూనికేట్ పెర్ లా జియోస్త్రా డెల్ మ్యాగ్నిఫికో గిలియానో డీ మెడిచీ* అనే పద్యకావ్యం. ఈ కావ్యంలో లోరెంజా కుమారుడు "గియూలియానో" "సిమోనెటా" (Simonetta) ల ప్రణయాన్ని చిత్రించాడు. ఈ కావ్యంపై ఆనాటి మానవతావాదం యొక్క, లాటిన్ ఇతిహాసాల యొక్క ప్రభావం కనిపిస్తుంది. కాని 1478 లో "గియూలియానో" మృతివల్ల రెండవ భాగం అసంపూర్తిగా మిగిలిపోయింది.

లోరెంజో డి మెడిచీ, పొలీటియన్‌లు ఇటాలియన్ సాహిత్య గౌరవ ప్రపత్తులు పెంపొందడానికి కారకులని సాహితీవేత్తల అభిప్రాయం. లోరెంజో చేత నేపుల్స్ రాజ కుమారునికి పంపబడిన టస్కన్ కవితా సంకలనానికి పొందుపరచబడిన అంకితపత్రం (1478) లో పొలీటియన్ ఇటాలియన్ కవిత్వ సంప్రదాయాన్ని వివరించి,



దాని ప్రాశస్త్యాన్ని ఉద్ఘాటించాడు. కాని 1479 లో లోరెంజో భార్యతో ఏర్పడిన తగవు కారణంగా ఈయన మెడిచీ కొలువు వదలి ఉత్తర ఇటలీ అంతా పర్యటించాడు. ఈ పర్యటనలో ఆయన ఆ కాలపు పండితులను కలసికొని, వెరోనా విశ్వవిద్యాలయంలో ఉపన్యసించాడు. తరువాత కళాపోషకుడైన మాంట్యువా

సంస్థానాధీశుడు ఫ్రాన్సెస్కో గోంజాగా కొలువులో చేరి, అక్కడ ఉండగా ఇటాలియన్‌లో *ఫెవోలా డార్ఫియో* (1478) అనే పద్యకావ్యం వ్రాశాడు. ఈ కావ్యం *స్టాంజె* అంతగా కాకపోయినా, పండితుల మన్ననలు పొందింది. మాంట్యువాలో గౌరవంగా బ్రతుకుతున్నప్పటికీ ఈయన మనస్సంతా మెడిచీ సంస్థానం మీదనే ఉండేది. ఇతని ప్రార్థనలకు సమాధానంగా లోరెంజో ఇతనిని 1480 లో తిరిగి ఫ్లారెన్సుకు పిలిపించి, తన కుమారుడు పియారోకు గురువుగా నియమించాడు. లోరెంజో ప్రాపకం వల్లనే ఈయన ఫ్లారెన్సు విశ్వవిద్యాలయంలో ప్రాచీన సాహిత్యాచార్యుడుగా నియమితు డయాడు. ఫ్లారెన్సు విశ్వ విద్యాలయంలో ఉండగా 1482-1486 మధ్య నాలుగు ఉపన్యాసాలు ఇచ్చాడు. వీనిలో గ్రీక్, లాటిన్ సాహిత్యాలను గూర్చి, వాటిలో ప్రముఖులైన హోమర్, హెసియడ్, వర్జిల్‌ల కవిత్వాన్ని గూర్చి తన అభిప్రాయాలను ప్రకటించాడు. ప్రాచీన సంప్రదాయాన్ని గ్రుడ్డిగా అనుకరించడం కాక, ఆధునికులు దానిని సందర్భానికి తగినట్లుగా మలచుకోవాలన్నది ఈయన సిద్ధాంతం.

ఈయన జీవితంలో చివరి దశ చాలా వరకు ఫ్లారెన్సులో గడిపాడు. ఈ దశలో ఈయన మెడిచీ గ్రంథాలయానికి వ్రాత ప్రతులను సేకరించడంలోనూ, ప్రాచీన గ్రంథాలను అనువదించడంలోనూ, దేశభాష అయిన ఇటాలియన్‌లో కవిత్వం వ్రాయడంలోనూ కాలం గడిపాడు. ఇవిగాక ఈయన 1489 లో ప్రాచీన భాషా విశ్లేషణ గ్రంథం అయిన *మిసెలేనియా* ను కూడా వ్రాశాడు. ఇటువంటిదే మరొక గ్రంథం వ్రాయడం పూర్తి కాకుండా ఈయన ఫ్లారెన్సులో 1494 సెప్టెంబరు 29 న మృతి చెందాడు. ఈయన కవిగాను, విమర్శకుడుగాను మాత్రమేకాక, దేశభాష అయిన గ్రీక్, ఇటాలియన్‌లో కవిత్వం వ్రాసి దానికి ప్రతిష్ఠ చేకూర్చాడు.

డి.ల.రా.

**పోంటోప్పిడాన్, హెన్రిక్ (1857-1943) :** డేనిష్ వాస్తవికతా వాది, రచయిత. కార్ల్ జెల్లెరుప్‌తో కలసి 1917 లో సాహిత్యానికి నోబెల్ బహుమతి అందుకొన్నాడు. ఆ నాటి డెన్మార్కులోని జీవన పరిస్థితులను యథాతథంగా వర్ణించినందుకు ఆయన కా బహుమతి లభించింది.

పోంటోప్పిడాన్ నవలలూ, కథానికలూ ఆదిలో సాంఘికాభ్యుదయ కాంక్షతో రచించినా, తరువాతి కాలంలో తన జీవితంలో, అది నిజం కాలేదన్న నిర్వేదంతో తన దేశంలో తన కాలంలో ఉన్న వాస్తవ స్థితిగతులను అసాధారణమైన సమగ్రతతో చిత్రించాడు.

ఒక మత గురువు పుత్రుడైన పోంటోప్పిడాన్ 1873 లో కోపెన్‌హేగన్‌లో ఇంజనీరింగ్ చదివించాడు. 1879 లో ఆ చదువు నిలిపి వేసి, కొన్ని సంవత్సరాలు ఉపాధ్యాయ వృత్తి స్వీకరించాడు. ఆయన మొదటి కథానికల సంపుటి *స్టాక్కీడ్ వింజర్* (1881). ఆ తరువాత 1900 వ సంవత్సరం వరకూ తన రచనలవలన,



కోపెన్ హేగన్‌లోని వివిధ పత్రికలకు చేసిన రచనల వలన జీవనం కొనసాగించాడు. పోంటోప్పిడాన్ రచనలలో ముఖ్యంగా నిర్లిప్తత, నిస్పృహాయత కనిపిస్తాయి. ఒక అర్ధశతాబ్ది కాలంలో రచించిన ఆయన నవలలూ, కథానికలూ, డేనిష్ జీవితాన్ని బహుముఖంగా ప్రతిబింబిస్తున్నాయి.

ఆయన తొలి రచనలు జానపద జీవితాన్ని గురించి వ్రాసినవి. *లాంప్స్ బై బిల్లెడర్* (1883), *ఫ్రా హై టర్నీ* (1887), *స్కైయర్* (1890) ఇవన్నీ సంఘం మీద ఆగ్రహం ప్రకటించినా, పల్లెప్రజల నిర్లిప్తతనూ, కార్య విముఖతనూ పరిహాసంతో హేళన చేశాయి. మూడు సంపుటాలలో ప్రకటింపబడిన *డెట్ ఫోర్జెట్టిడ్* (1891-1895), *ది ప్రామిస్డ్ లాండ్* (1896) పల్లె ప్రాంతాలలోని మత వివాదాలను అభివర్ణించేవి. 1890-1900 దశకంలో పోంటోప్పిడాన్ ధార్మిక సమస్యలను గురించి నవలికలు రచించాడు. *నట్టెవాగ్ట్* (1894), *గామ్లె ఆడమ్* (1895), *హోజ్ సాంగ్* (1896) అలాంటివి. వీటి తరువాత ఒక పెద్ద నవల *లిక్కెపర్* (1898-1904) రచించాడు. ఇందులో ప్రధాన పాత్రకు కొంత వరకు పోంటోప్పిడాన్‌తో పోలిక ఉంది. ఆయన ఒక మతగురువు కుమారుడు. తన ఇంట్లో ఉన్న సదాచార వాతావరణానికి అతడు ఎదురు తిరుగుతాడు. రాజధానిలో ఇంజనీరుగా జీవించడానికి నిర్ణయించుకొంటాడు. ఈ నవలలో వాతావరణపు బలం ప్రధానమైంది. పగటి కలలు కంటూ, వాస్తవాలంటే భయపడే జాతీయ జీవన దృక్పథాన్ని దీనిలో పోంటోప్పిడాన్ గర్హించాడు.

పోంటోప్పిడాన్ మూడో నవలా చక్రం *ద డోడ్స్ రిగే* (De Dodes Rige) 5 సంపుటాలు (1912-16). *మృత్యు సామ్రాజ్యం* (1901) లో లిబరల్స్ విజయం తరువాత వచ్చిన రాజకీయ పరివర్తనను అసంతృప్తిని, నవయుగ నిస్సారతను గురించిన ఆందోళనను ప్రదర్శిస్తుంది. ఆయన కటువైన నవల *మాండ్స్ హిమ్మరిగ్* (Mands Himmerig-1927) మొదటి ప్రపంచ యుద్ధంలో డెన్మార్క్ తటస్థ వైఖరిని వర్ణిస్తూ, నిర్లక్ష్యమైన భౌతిక వాదాన్ని తిరస్కరిస్తుంది. ఆయన కడపటి ప్రముఖమైన రచన 1933-1940 మధ్య కాలంలో ప్రచురించబడిన, నాలుగు సంపుటాల స్మృతులు. అది సంక్షిప్త రూపంలో *అన్‌వర్‌వెజ్స్ టిల్ మిగ్ సెల్ఫ్* (1943) అనే పేరుతో వెలువడింది.

శ్రీ.న.చ.రా.

**పో, ఎడ్గార్ అలన్ (1809-49) :** అమెరికన్ కవి, కథా రచయిత, విమర్శకుడు. 1809 లో బోస్టన్‌లో జన్మించాడు. బాల్యంలోనే తల్లిదండ్రులు మరణించడం వలన రిచ్‌మండ్ (వర్జీనియా) నగరానికి చెందిన జాన్ అలన్ అనే పొగాకు వర్తకుని కుటుంబంలో పెరిగాడు. అందు చేతనే తన పేరులో "అలన్" కలుపుకొన్నాడు. ఈయన విద్యాభ్యాసం మొదట ఇంగ్లండ్‌లోని స్టోక్ న్యూవింగ్టన్‌లోనూ, తరువాత వర్జీనియా (అమెరికా) లోని రిచ్‌మండ్ ఎకాడమీ, వర్జీనియా విశ్వవిద్యాలయాలలోనూ కొనసాగింది. కాని ఈయన బాధ్యతా రహితమైన ప్రవర్తన వలన, అలన్ ఈయన చదువును ఆపివేసి తన వ్యాపార సంస్థలో చేర్చుకొన్నాడు, కాని, పో తత్త్వానికి ఈ జీవన విధానం నచ్చక, బోస్టన్‌కు వెళ్ళిపోయి అచ్చట కవిగా జీవితం ప్రారంభించాడు. 1827 లో కలం పేరుతో *టామర్లేన్ అండ్ అదర్ పొయెమ్స్* అనే సంకలనం ప్రచురించాడు గాని, దాని వలన ఏమీ ఆదాయం రాలేదు. ఈయన జీవితంలో కవిగాను, కథకుడుగాను రాణించినా జీవితం అంతా దరిద్రంతోనే గడిపాడు. కొద్దికాలం సైనిక సేవలో ఉన్నాడు కాని ఆ జీవితంలో కూడ ఇమడలేక, తిరస్కారానికి గురి అయాడు. తరువాత అమెరికన్ పత్రికలలో రచనల మూలంగా చాలా స్వల్పమైన సంపాదనతో కాలక్షేపం చేయసాగాడు. *టేల్స్ ఆఫ్ ది గ్రోటెస్క్ అండ్ ది అరాబెస్క్* (1840) అనే కథాసంపుటి వల్లను, *ద రేవెన్* (1844) అనే పద్య రచన వల్లను విశేషమైన కీర్తినార్జించి, బాల్టిమోర్‌లోని *సదర్న్ లిటరరీ మెసెంజర్* పత్రికకు సంపాదకు డయాడు. ఈ పత్రికలో వ్రాసిన వ్యాసాలలో ఈయన అమెరికన్‌లకు అపరిచితమైన క్రొత్త శైలిని ఆవిష్కరించాడు.

1836 లో ఈయన "వర్జీనియా క్లెమ్" అనే 14 ఏళ్ల బాలికను వివాహమాడాడు. వీరి వైవాహిక జీవితమంతా లేమితోనే గడిచింది. చివరకు ఈమె 1847 న్యూయార్క్ నగరం దగ్గరి ఫోర్డమ్ గ్రామంలో మరణించింది. ఈమె సంస్మరణార్థమే పో *ఎనా బెల్ లీ* (1849) అనే పద్యాన్ని రచించాడు. ఈ రచన తరువాత ఈయన *ఉలాలూమె* (1847), *ద బెల్స్* (The bells, 1849) అనే గ్రంథాలు రచించి, 1849 లో అనారోగ్య కారణంగా బాల్టిమోర్‌లో మరణించాడు.

పైన ఉదహరించిన రచనలే కాక ఈయన చేసిన ఇతర రచనలు: *ద మిస్టరీ ఆఫ్ రూమోర్గ్* (1841), *ద ఫాల్ ఆఫ్ ద హౌస్ ఆఫ్ అషర్* (1839), *ద గోల్డ్ బగ్* (1842), *టేల్స్* (1845), *యురేకా* వచన కవిత (1848), *ద నెరేటివ్ ఆఫ్ ఆర్థర్ గోర్డన్ పిమ్ ఆఫ్ న్యాన్టకెట్* (1838). పో వ్రాసిన కవిత్వం పరిమాణంలో ఎక్కువ కాకపోయినా విశిష్టమైన కళా నైపుణ్యాన్ని, శబ్దాల ఉపయోగంలో పాదుపరి తనాన్ని ప్రదర్శిస్తుంది. ఇంతేకాకుండా ఈయన కవితలలోను, కథలలోను ఆశ్చర్య, భయోత్పాదక వాతావరణాన్ని అతి నిపుణతతో మిళితం చేశాడు. 'కథానిక' అనే సాహిత్య ప్రక్రియను నిర్వచించిన వారిలో ఈయన ప్రథముడు. ఈనాటి "డిటెక్టివ్" కథకు ఈయనే పితామహుడు. ఈయన కవిగాను, కథానికా రచయితగానే కాక విమర్శకుడుగా కూడా గణనీయుడు. అమెరికన్ సాహిత్యానికి యూరప్ లో గుర్తింపు తెచ్చిన ప్రముఖులలో ఎడ్గార్ అలన్ పో ఒకడు.

డి.ల.రా.

**పోటోట్స్కి, వాస్లా (1621-96) :** ప్రముఖ పోలిష్‌కవి. పోటోట్స్కి 1621 లో పోలండ్ లోని జెన్స్వాలో జన్మించాడు. ఈయన కొద్దిపాటి విద్య నభ్యసించి, గ్రామ ప్రాంతాలలో భూస్వామిగా జీవితం గడుపుతూ తన సరదాకోసం మాత్రమే కవిత్వ రచన చేయసాగాడు. క్రిస్టియన్ మతంలో ఈయన యూనిటేరియన్ శాఖకు చెందినవాడు. పోలిష్ ప్రభుత్వ విధానానికి అనుగుణంగా ఈయన ఆ శాఖను వదలి అనిష్టం గానే రోమన్ కాథలిక్ శాఖకు మారాడు. కాని ఈయన భార్య యూనిటేరియన్ గానే ఉండిపోయి, ఆవిడ క్షేమాన్ని గూర్చి ఈయనకు ఆందోళన కలుగ చేస్తూ ఉండేది.

పోటోచ్కి కవిత్వం ఇంచుమించు 30,000 పంక్తుల వరకూ ఉంది. దీనిలో ముఖ్యమైనవి: *వోజ్న చొసిమ్‌స్కా* అనే దీర్ఘకావ్యం, *ఒగ్‌రోడ్ ఫ్రాసెక్* అనే ముక్తక పద్యాల సంకలనం. *వోజ్న చొసిమ్‌స్కా* అనే కావ్యం చోసిమ్ నగరాన్ని 1621 లో తుర్కిష్ సైన్యం ముట్టడించడాన్ని, ఆ ముట్టడిని 65,000 మంది ఎదుర్కొనడాన్ని వర్ణించింది. ఈ కావ్యంలో వర్ణింప బడిన సంఘటనలు వాస్తవ మైనవే గాని, అందు వర్ణింపబడిన పోలిష్ వీరుల శౌర్య పరాక్రమాలు కల్పితాలు. పోటోచ్కి కవిత్వంలో పొదుపరితనం *ఒగ్‌రోడ్ ఫ్రాసెక్* అనే కావ్యంలో ప్రస్ఫుటమౌతుంది. ఈ ముక్తకాల సంకలనం పోలండ్‌లో ఆనాటి ప్రజల భావాలను, సాంఘికాచారాలను ఉత్సాహం గొలిపేటట్లు వర్ణిస్తుంది. ఈ రచయిత ముఖ్య రచనలు రెండూ కూడా రచింప బడిన తరువాత చాలా కాలానికి కాని ప్రచురణ కాలేదు. *వోజ్న చొసిమ్‌స్కా* అన్న మహాకావ్యం 1850 లోనూ, *ఒగ్‌రోడ్ ఫ్రాసెక్* అన్న సంకలనం 1907 లోనూ వెలుగుచూశాయి.

డి.ల.రా.

**పోప్, అలెగ్జాండర్ (1688-1744) :** ఆంగ్ల సాహిత్యంలో అగస్టన్ యుగంలో ప్రముఖ కవి, అధిక్షేప కావ్య కర్త (Satirist). ఈయన పేరు ముఖ్యంగా *ఎస్సే ఆన్ క్రిటిసిజమ్* (1711) అనే కవితా విమర్శ మూలం గాను, *రేప్ ఆఫ్ ది లాక్*(1712-1714), *ది డన్సియడ్*(1728) అనే అధిక్షేప కావ్యాల మూలం గాను ఆంగ్ల సాహిత్యంలో సుస్థిర మైంది.



పోప్ 1688 మే లో లండన్ లో ఒక రోమన్ కాథలిక్ కుటుంబంలో జన్మించాడు. 1700 లో వీరి కుటుంబం లండన్ వదలి బిన్‌ఫీల్డ్ అనే గ్రామానికి తరలి వెళ్లడంతో వీరికి చాలా రోమన్ కాథలిక్ కుటుంబాలతో పరిచయం ఏర్పడింది. జాన్ కారిల్ అనే స్థితిమంతునితో ఈయనకు ఏర్పడ్డ పరిచయం *ది రేప్ ఆఫ్ ది లాక్* అనే అధిక్షేప కావ్య రచనకు దారి తీసింది. వీరు రోమన్ కాథలిక్ లవడం వలన ఈయన విద్యాభ్యాసం మామూలు పాఠశాలల్లో కాక ఇంటివద్ద కాథలిక్ ఆచార్యుల వద్ద జరిగింది. కాని చాలా వరకు ఈయన స్వయం కృషి వల్లనే పాండిత్యం సంపాదించాడు. చాలా చిన్న వయస్సులోనే గ్రీక్, లాటిన్, ఫ్రెంచ్, ఇటాలియన్ భాషలు నేర్చుకొని, ఆ సాహిత్యాలు అధ్యయనం చేశాడు. తనకు నచ్చిన లాటిన్ కవుల ననుకరిస్తూ కొన్ని పద్య రచనలు కూడా చేశాడు. 1717 వరకూ పోప్ జీవితం విండ్సర్ ఫారెస్ట్‌లోని బిన్‌ఫీల్డ్ గ్రామంలోనే గడచింది. మధ్య మధ్యలో లండన్ వెళ్లి విలియమ్ విచర్లీ వంటి సాహిత్య పరులను కలుసుకొని వచ్చేవాడు. 1705 నుండి పోప్ గణనీయమైన కవితా కృషి ప్రారంభించి 1709 లో ఒక పద్య సంపుటి ప్రకటించాడు.

పోప్ జీవితమంతా అనారోగ్యంతోనే గడిపాడు. అందువలన ఈయన చాలా వరకు ఇంటివద్దనే ఉండేవాడు. అయినా ఈయన చాలామంది చిత్రకారులను ఆకర్షించేవాడు. 1711 లో ప్రకటితమైన *ఎస్సే ఆన్ క్రిటిసిజమ్* అనే విమర్శక రచన పోప్‌కు బాగా పేరు సంపాదించి, 'ఎడిసన్' (Addison), "స్టీల్" (steele) వంటి ప్రముఖ సాహిత్యవేత్తల స్నేహాన్ని ఈయనకు సమకూర్చింది. వారు ప్రకటిస్తూన్న *ది స్పెక్టేటర్* పత్రికలో పోప్ కొన్ని వ్యాసాలు ప్రకటించాడు. చతుర విమర్శ ద్వారా సంఘంలో అవినీతిని అరికట్టవచ్చుననే సిద్ధాంతం ఈయనను ప్రభావితుణ్ణి చేసింది. ఈ ప్రభావం తోనే పోప్ *ది రేప్ ఆఫ్ ది లాక్* (The rape of the lock, 1712-14) అనే సుప్రసిద్ధ కావ్యాన్ని రచించాడు. తనకు సమీపంలో ఉన్న రెండు కేథలిక్ కుటుంబాల మధ్య ఏర్పడిన కలహాన్ని ఒక భయంకర యుద్ధంతో పోలుస్తూ, ఐదు భాగాలలో ఈ కవితను వ్రాశాడు. ఈ కథను ఆధారంగా చేసుకొని అప్పటి సంఘంలో నెలకొని ఉన్న ఆడంబరాన్నీ, వాస్తవ విరుద్ధమైన విలువలను అపహాస్యం చేస్తూ పోప్ ఈ రచన చేశాడు. తేలికపాటి కథావస్తువుతో ఇలియడ్‌వంటి గ్రీకు ఇతిహాసరీతిలో వ్రాసిన ఈ కావ్యం ఈ నాటికీ ఆసక్తికరంగా ఉండి ఈ తరహా సాహిత్యం (mock-epics) లో ప్రముఖమైనదిగా గుర్తింపబడుతూంది.

లాటిన్, గ్రీక్ కవితా రీతులను అనుకరిస్తూ పోప్ అనేక కవితలను రచించాడు. హోమర్ యొక్క *ఇలియడ్* ను గ్రీక్ నుండి ఇంగ్లీష్‌లోకి అనువదించడం ఈయన జీవితాశయంగా ఉండేది. *ఇలియడ్* లో నాలుగు భాగాల అనువాదాన్ని ఈయన 1715 లో ప్రకటించాడు. అలాగే హోమర్ మరోగ్రంథమైన *ఒడిసీ* లో అయిదు

భాగాలను 'విలియమ్ బ్రూమ్', 'ఎలిజా ఫెంటన్' ల సహాయంతో అనువదించి, 1725, 1726 లలో ప్రకటించాడు.

పోప్ యొక్క రాజకీయ, మతపరమైన సంబంధాల వలన శతాబ్దం ముగియవచ్చేసరికి 'ఎడిసన్', 'స్టీల్' వంటి వారి స్నేహాలు పోయి, క్రొత్తగా 'జొనాథన్ స్విఫ్ట్', 'జాన్ ఆర్బుత్‌నాట్' వంటి వారు మిత్రు లయారు. పూర్వ మిత్రులు కొంతమంది (ఏడిసన్, స్టీల్) పోప్ ఖ్యాతిని కళంకితం చేయాలని యత్నించారు గాని, ఆ యత్నం ఫలించలేదు. తనను విమర్శించి, అవహేళన చేసే శత్రువుల నందరినీ దుయ్యబడుతూ *ది డన్సియడ్* (1728) అనే అధిక్షేప కావ్యం పోప్ రచించాడు. *ది రేప్ ఆఫ్ ది లాక్* వలె ఈ కావ్యం కూడా పోప్‌కు కీర్తి చేకూర్చింది.

1717 లో పోప్ బిన్‌ఫీల్డ్ నుండి 'ట్వికెనమ్' అనే మరో గ్రామానికి మారాడు. ఇక్కడ ఉండగా ఈయన ఉద్యానవనం పెంచి అందులో తన మిత్రులతో కాల క్షేపం చేసేవాడు. ఈయన సాహిత్య కృషి జీవితాంతం విమర్శకు గురి అవుతూ ఉండేది. ఈ పరిస్థితుల్లో ఈయన విమర్శలను ఎదుర్కొనడానికి తన చుట్టూ ఉన్న సంఘం లోని లోపాలను ఎత్తి చూపే ఉద్దేశ్యంతో లాటిన్ కవి హొరెస్ యొక్క అధిక్షేప కవితలను ఆంగ్లంలో అనువాద వ్యాఖ్యలను జతపరచి ప్రచురించాడు. ఈ అనుకరణలలో పోప్ ప్రతిభ కూడా వ్యక్తమవుతుంది. ఈయన 'బ్రూటస్' అనే ఇతిహాసకావ్యం వ్రాయడానికి పూనుకొన్నాడు గాని, అది పూర్తికాకముందే 1744 లో చనిపోయాడు.

తన రచనల లోను, తన లేఖలలోను పోప్ తనను ఒక ఆదర్శ వ్యక్తిగా చిత్రించుకొన్నాడు. అయితే ఈ చిత్రీకరణను ఈయన విమర్శకులు అంగీకరించరు. చివరకు ఈయన మిత్రులు కూడా ఈ చిత్తరువుతో పూర్తిగా ఏకీభవించరు. వ్యక్తిగతంగా ఈయనలో దోషాలు లేకపోలేదు గాని, కవిగా ఈయనకు ఉన్నతస్థానం స్వదేశంలోనే కాక పొరుగు దేశాలైన ఫ్రాన్సు, ఇటలీలలో కూడ ఇవ్వబడింది. తన కవితా వస్తువుకు, కవితా ప్రక్రియకు ఉచితమైన పదజాలాన్ని మలచుకోవడంలోను, తగిన కవితా చిత్రాలద్వారా తన భావాలను వ్యక్తీకరించడం లోను ఈయన విశేష ప్రజ్ఞ కనపరచాడు. అందుచేతనే ఈయన ఇంగ్లీష్ సాహిత్యపు అగస్టన్ యుగంలో ప్రముఖ కవిగాను, విద్వాంసునిగాను గుర్తింపబడ్డాడు.

డి.ల.రా.

**పోలీయో, గైయస్ అసీనియస్ (క్రీ.పూ. 76-క్రీ.శ. 4)** : ప్రముఖ రోమన్ వక్త, కవి, చరిత్ర వేత్త. పోలీయో పుట్టుక, బాల్యాలను గూర్చి వివరాలు తెలియవు. అప్పటి పరిస్థితులను చిత్రించే చరిత్ర గ్రంథం ఒకటి ఈయన వ్రాసినట్లు ప్రసిద్ధి. తరువాత చరిత్రకారులైన 'ఎప్పియన్' (Appian), 'ప్లూటార్క్' (Plutarch) లకు ఇది ఆధారగ్రంథమైంది.

పోలీయో ప్రముఖ లాటిన్‌కవి 'కాటులుస్' (catullus) సన్నిహితులతో ఒకడు. ఈయన క్రీ.పూ. 56 లో ప్రజా జీవితం ప్రారంభించి, ఇటలీలో జరిగిన అంతర్యుద్ధంలో రూబికాన్ వద్ద సీజర్‌ను కలశాడు. తరువాత క్యూరిమోతో ఆఫ్రికాలోను (క్రీ.పూ.49-45) గ్రీస్, ఆఫ్రికా, స్పెయిన్‌లలో సీజర్ నాయకత్వంలో జరిగిన యుద్ధం లోను పాల్గొన్నాడు. సీజర్ మరణం తరువాత మార్క్ ఏంటనీ పక్షంలో చేరి, ఒక ప్రాంతానికి పాలకుడుగా ఉండి, మహాకవి 'వర్జిల్' (vergil) తో స్నేహం చేసి, అతని ఆస్తి ప్రభుత్వం వశం కాకుండా కాపాడాడు. తరువాత ఈయన రాజకీయాలలో తటస్థంగా ఉన్నాడు. తిరిగి క్రీ.పూ. 39 లో ఈయన పార్థియా సైన్యాలను ఓడించి, తద్వారా వచ్చిన సంపదతో రోమ్‌లో మొట్ట మొదటి ప్రజా గ్రంథాలయం నిర్మించాడు. తరువాత సామాన్య వ్యక్తిగా, రాజకీయాలకు దూరంగా ఉండి, సాహిత్య వేత్తలకు చేయూత నిస్తూ, సాహిత్యసేవ చేశాడు.

పోలీయో ఆనాటి ఇటలీలో ప్రముఖ వక్తలలో ఒకడు. తన ఉపన్యాసాలలో విషయ స్పష్టత, వాగ్ధాటి మిళితం చేసేవాడు. కాని ఈయన ఉపన్యాసాలు ఇప్పుడు లభ్యం కావటం లేదు. వీనిశైలి సిసిరో అనుయాయులకు నచ్చలేదు. కాటులుస్, వర్జిల్, హొరెస్ మొదలగు వారు ఈయన కవిత్వాన్ని మెచ్చుకొన్నారు. ఈయన చరిత్ర రచన ప్రారంభించిన తరువాత కవిత్వ రచన విరమించుకొన్నాడు. *హిస్టరీ ఆఫ్ ది సివిల్ వార్స్* (లాటిన్ శీర్షికకు ఆంగ్లానువాదం "అంతర్యుద్ధాల చరిత్ర") అన్న గ్రంథంలో ఈయన క్రీ.పూ. 60 నుండి క్రీ.పూ. 42 అనగా రోమన్ రిపబ్లిక్ పతనం వరకు జరిగిన అంతర్యుద్ధాలను వర్ణించాడు. పోలీయో మనుష్యులను వారి శైలిని నిర్మొహమాటంగా విమర్శించేవాడు. పోలీయో విమర్శలకు గురి అయిన వారిలో సిసిరో, సాలుస్ట్ మొదలగు ప్రముఖవక్తలు, కవులు ఉన్నారు. అన్నిటికంటె ముఖ్యంగా ఈయన అగస్టన్ నేతృత్వంలో రూపుదిద్దుకొన్న రోమన్ స్వాతంత్ర్యాన్ని సమర్థించాడు. డి.ల.రా.

**పౌండ్, ఎజ్రా (లూమిస్) (1885-1972) :** అమెరికా దేశపు కవి, విమర్శకుడు. 20 వ శతాబ్దపు ఆంగ్ల సాహిత్యం మీద ఎజ్రా పౌండ్ ప్రభావం చాలా ప్రగాఢంగా ఉన్నందు వల్ల సాహిత్య విమర్శకులు ఇతన్ని 'కవీనాం కవిః' అని ప్రస్తుతిస్తారు. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ఈయన ఫాసిజానికి అనుకూలమైన రచనలు చేయగా అవి ఇటలీలో బాగా ప్రాచుర్యం పొందాయి. కాని యుద్ధం ముగిశాక ఈయనను 1958 వరకూ జైల్లో నిర్బంధించారు.

ఇదాహో అనే చిన్న పట్టణంలో పౌండ్ జన్మించాడు. ఇది ముఖ్యంగా గని పట్నం. పౌండ్ తండ్రికి ఈయనొక్కడే సంతానం. ఆయన ఫెడరల్ లాండ్ ఆఫీసులో ఉద్యోగి. పౌండ్ తండ్రి 'హోమర్ లూమిస్ పౌండ్' విస్కాన్సిన్ రాష్ట్రం వాడు. తల్లి 'ఇసాబెల్ వెస్టన్' న్యూయార్క్ రాష్ట్రానికి చెందినది. 1887 ప్రాంతంలో పౌండ్ కుటుంబం తూర్పు రాష్ట్రాలకు తరలి వెళ్లింది. 1889 జూన్‌లో హోమర్ పౌండ్‌కు ఫిలడెల్ఫియాలోని మింట్ (టంకసాల) లో ఉద్యోగం రావడం వల్ల, పౌండ్ కుటుంబం వింకోట్ కు దగ్గర్లో స్థిరపడింది. పౌండ్ బాల్యం సాధారణ మధ్య తరగతి స్థాయిలో గడిచింది.

రెండు సంవత్సరాల తరువాత చెల్ టెన్ హోమ్ మిలటరీ ఆకాడమీ లో చదివి డిగ్రీ చదువు పూర్తి చేయకుండానే పౌండ్ ఆసంస్థను వదిలి పెట్టాడు. అయితే స్థానికంగా ఉన్న పాఠశాలలలో విద్యాభ్యాసం కొనసాగించాడు. తరువాత రెండేళ్లపాటు (1901-03) పెన్సిల్వేనియా విశ్వవిద్యాలయంలో చదువుకొన్నాడు. అక్కడే ఆయనకు 'విలియం కార్లోస్ విలియమ్స్' అనే కవితో పరిచయ మేర్పడింది. ఆ పరిచయం యావజ్జీవ మైత్రిగా పరిణతి నందింది. పౌండ్ అక్కడ హామిల్టన్ కళాశాలలో చేరి పిహెచ్.బి. (బాచిలర్ ఆఫ్ ఫిలాసఫీ) డిగ్రీ తీసుకొన్నాడు. 1905 లో పెన్సిల్వేనియాకు తిరిగి వచ్చాడు. 1906 జూన్‌లో ఎమ్.ఏ. డిగ్రీ తీసుకొన్నాడు. మరో ఏడాది పాటు డాక్టరేట్ పట్టాకు కృషిచేసిన తరువాత ఆ విశ్వవిద్యాలయాన్ని వదలిపెట్టాడు. అప్పటికే ఆయన గ్రీక్, ఫ్రెంచ్, ఇటాలియన్, జర్మన్ శ్పానిష్ ప్రోవెన్‌కాల్, ఆంగ్లోశాక్జన్ భాషల్లోనే కాక ఇంగ్లీష్ సాహిత్య, వ్యాకరణాల్లో కూడా గణనీయమైన విద్వత్తును గడించాడు.

1907 లో వాబాష్ నగరంలోని ప్రెస్బిటేరియన్ కళాశాలలో రొమాన్స్ భాషల ఆచార్యు డయాడు. అప్పటికే ఆయన కవిత్వం వ్రాయడం ఆరంభించాడు. ఆయన ప్రవర్తన ప్రెస్బిటేరియన్ ఉన్నతికి ఎంతో దోహదం చేసింది. కాని ఆయ నక్కడ ఎక్కువకాలం ఉండలేదు. 1908 ఫిబ్రవరిలో కొంత సామానుతోను, అమెరికన్ ప్రచురణ కర్త నిరాకరించిన కవితల వ్రాతప్రతితోను ఆయన యూరప్‌కు వెళ్లాడు. అంతకుపూర్వం ఆయన పెద్దతల్లితోను, రెండోసారి 1902 లో తల్లిదండ్రులతోనూ కలసి యూరప్ వెళ్లాడు. మూడోసారి 1906 వేసవిలో ఒంటరిగానే యూరప్‌కు బయలుదేరాడు. యూరప్‌కు వెళ్లిన మూడు సందర్భాల్లోను రినైజాన్స్ ఉద్యమానికి చెందిన లాటిన్ కవులకు సంబంధించి వ్రాసిన *రాఫైలెట్ లాటిన్* అనే వ్యాసానికి, 11 వ శతాబ్దానికి చెందిన ఒక వర్గపు కవులను గురించి వ్రాసిన వ్యాసానికి, *ఇంటరెస్టింగ్ (ఫ్రెంచ్ పబ్లికేషన్స్, బుర్గోస్, ఎ డ్రీమ్ సిటీ ఆఫ్ ఓల్డ్ కాజిల్* అనే వ్యాసానికి అవసరమైన సమాచారాన్ని ఆయన సేకరించాడు.

కొంత డబ్బు సంపాదించుకొని ఆయన జిబ్రాల్టర్‌కు వెళ్ళాడు. అటునుంచి దక్షిణ స్పెయిన్‌కు, ఆ తరువాత వెనిస్‌కు వెళ్ళాడు. అక్కడ 1908 జూన్‌లో, మొదటి కవితా సంపుటి *ఎ ల్యూమ్ స్పెంటో* (A Lume Spento) ను స్వంత ఖర్చులతో ప్రచురించాడు. 1908 సెప్టెంబరు ప్రాంతంలో ఆయన లండన్ వెళ్ళాడు. అక్కడ రచయిత, సంపాదకుడు అయిన ఫోర్డ్ మెడాక్స్ ఫోర్డ్‌కు స్నేహితు డయాడు. ఫోర్డ్ తన పత్రిక *ఇంగ్లీషు రివ్యూ* (English Review) లో పౌండ్ రచనలను ప్రచురించాడు. పౌండ్ లండన్‌లో ఉండగానే టి.ఇ.హల్మ్ అనే తత్త్వవేత్త అధ్యక్షుడుగా ఉన్న "స్కూల్ ఆఫ్ ఇమేజెస్" లో చేరాడు. ఇంగ్లండులో ఉండగా పౌండ్ *పర్సోనే* (Personae) అనే కవితల సంపుటిని 1909 ఏప్రిల్‌లో, అక్టోబరులో *ఎక్సల్టేషన్స్* (Exultations) అనే పుస్తకాన్ని, 1910 లో *ది స్పిరిట్ ఆఫ్ రొమాన్స్* అనే మూడో పుస్తకాన్ని (1909-10 సంవత్సరాలలో లండన్‌లో ఇచ్చిన ఉపన్యాసాలు ఆధారంగా కూర్చిన వ్యాస సంపుటి) ప్రచురించాడు.

ఫిలడెల్ఫియాలోను, న్యూయార్క్‌లోను ఉన్నప్పుడు ఆయన సాహితీవేత్తగా నిలదొక్కుకోలేక పోయాడు. 1911లో తిరిగి యూరప్ వచ్చాడు. ఇటలీ, జర్మనీ, ఫ్రాన్స్ దేశాలు పర్యటించాడు. 1911 లోనే ఆయన ఆల్ఫ్రెడ్ ఆర్. ఆరేజ్ (Alfred R.Orage) అనే జర్నలిస్టును కలుసుకొన్నాడు. ఆల్ఫ్రెడ్ *న్యూ ఏజ్* (New Age) అనే సోషలిస్టు వారపత్రికకు సంపాదకుడు. ఆయన తన పత్రికలో పౌండ్‌కు కొన్ని పేజీలు కేటాయించి, కొంత ఆదాయం క్రమం తప్పకుండా వచ్చేటట్లు చేశాడు.

పౌండ్ ఆ పత్రికలో తొమ్మిదేళ్ల పాటు పని చేశాడు.

1912 లో షికాగో నుంచి వెలువడుతున్న *పొయెట్రీ* అనే పత్రికకు లండన్ కరెస్పాండెంట్ అయాడు. పౌండ్ ఆ పత్రిక అభివృద్ధికి ఎంతో కారకు డయాడు. తద్వారా ఆయన ఆంగ్లో-అమెరికన్ కవితా రంగంలో గణనీయమైన పేరు సంపాదించుకొన్నాడు. రాబర్ట్ ఫ్రాస్ట్ (Robert Frost) డి.హెచ్. లారెన్స్ (D.H. Lawrence) ల ప్రతిభను మొదటిసారిగా గుర్తించి, ఆ పత్రికలో పౌండ్ వారి కవిత్వాన్ని సమీక్షించి వారికి ప్రశస్తి తెచ్చాడు. అంతేకాక జాకోబ్ ఎపిస్టేన్, హెన్రీ గాడియర్-బ్రెస్కా అనే ఆధునిక శిల్పుల ప్రతిభను కూడా వెల్లడించాడు. 1912-14 లలో ప్రతీకోద్యమానికి (Imagist Movement) నాయకత్వం వహించాడు. ప్రతీకోద్యమపు మానిఫెస్టోను, కవితల సంపుటి *ద ఇమేజిస్టెస్* (Des Imagistes, 1914) ను ప్రచురించాడు.

మేట్స్ (Meats) అప్పటికే ప్రసిద్ధ కవి. మేట్స్‌తో పౌండ్‌కు స్నేహం ఏర్పడింది. పౌండ్ మేట్స్ చేత సరళమైన, క్రొత్తరకమైన శైలిని అనుసరింపజేయడంలో కృతకృత్యు డయాడు. 1914 లో మేట్స్ స్నేహితుడైన ఒలీవియా షేక్స్పియర్ (Olivia Shakespear) కూతురు డొరోథీ షేక్స్పియర్ (Dorothy Shakespear) ను అతడు వివాహం చేసుకొన్నాడు. ఆ సంవత్సరంలోనే జేమ్స్ జాయ్స్ (James Joyce) తో కలసి రచనలు చేయడం ప్రారంభించాడు. అయితే జేమ్స్ జాయిస్ అప్పట్లో అనామకుడే. లండన్ నుంచి ప్రచురిత మయే *ది ఇగోయిస్ట్* అనే పత్రికకు అనధికార సంపాదకుడు గాను, న్యూయార్క్ నగరం నుంచి ప్రచురితమయే *ది లిటిల్ రివ్యూ* అనే పత్రికకు లండన్ సంపాదకుడుగాను పనిచేశాడు. పౌండ్ ఆ పత్రికలో జేమ్స్ జాయిస్ రచనలైన *పోర్ట్రెయిట్ ఆఫ్ ది ఆర్టిస్ట్ ఆజ్ ఏ యంగ్ మాన్* (Portrait of the Artist as a Young Man), *యులిసిస్* (Ulysses) లు ప్రచురితం కావడానికి తోడ్పడ్డాడు. జేమ్స్ జాయిస్ కీర్తి ప్రతిష్ఠలకే కాక, ఆర్థికంగా నిలదొక్కుకోడానికి కూడా పౌండ్ ఎంతో అండగా నిలిచాడు. ఆ సంవత్సరంలోనే కవిగాను, విమర్శకుడుగాను ప్రసిద్ధి చెందిన టి. యస్. ఇలియట్‌ను కూడా గుర్తింపుకు తీసుకొని రావడానికి ఆయన ఎంతో దోహదం చేశాడు. పౌండ్ 1912 లో *రిపోస్టెస్* (Ripostes) అనే కవితా సంపుటిని, *పావేన్స్* (Pavennes), *డివిజన్స్* Dvisions) అనే విమర్శ గ్రంథాలను ప్రచురించాడు.

ప్రాచ్య కవులలో ప్రసిద్ధుడైన ఎర్నెస్ట్ ఫెనోలోనా తో పౌండ్ కు పరిచయమేర్పడింది. ఆయన రచనలను కొన్నింటిని 1913 లో పౌండ్ అనువదించాడు. అతి ప్రాచీన చైనా కవితా రచనలను కొన్నింటిని ఇంగ్లీషులోకి అనువదించి *కేథీ* (Cathy) అనే సంపుటంగా 1915 లో పౌండ్ ప్రచురించాడు. వాటి కెంతో పేరు వచ్చింది. అంతేకాక జపాన్ భాషా నాటకాలను అనువదించి రెండు సంపుటాలుగా ప్రచురించాడు.

మొదటి ప్రపంచ యుద్ధం ఘోర దురంతాల వల్ల పౌండ్ ఎక్కడా స్థిరంగా నిలువలేకపోయాడు. నిరాశా నిస్పృహలతో ఇంగ్లండ్ అంతటా సంచరించాడు. యుద్ధం తరువాత పారిస్ వెళ్ళాడు. పారిస్‌కు వెళ్ళేముందే రెండు ముఖ్యమైన కవితా సంపుటాలను ప్రచురించాడు. అవి: *క్వియా పాపర్ అమావి* (Quia pauper Amavi, 1919) *హ్యూగ్ సెల్విన్ మాబర్లీ* (Hugh Selwyn Mauberley, 1920). మొదటి పుస్తకం 1917 లో బ్రిటీష్ రాచరికపు వ్యవస్థ మీద ఒక వ్యాఖ్యానం వంటిది. రెండో పుస్తకం మా బర్లీ 1919 నాటి బ్రిటీష్ సాహితీ సంస్కృతికి సంబంధించిన ఒక కోణాన్ని ఎంతో సునిశితంగా, సూక్ష్మంగా చిత్రించింది. 20 వ శతాబ్దిలో మాబర్లీ కవితా సంపుటికి ఎంతో ప్రశస్తి వచ్చింది. పారిస్‌లో (1921-24) ఉన్నప్పుడు పౌండ్ యువ అమెరికన్ నవలా రచయిత అయిన ఎర్నెస్ట్ హెమింగ్వేను కలుసుకొన్నాడు. *లే టెస్టమెంట్* (Le Testament) అనే ఒపెరా వ్రాయడంలో హెమింగ్వేకు సహాయపడ్డాడు. ఈ ఒపెరా *ఫ్రాంన్స్వాయిస్ విలాన్* కవితలు ఆధారంగా రచించినది. ఇది 1926 లో పారిస్‌లో ప్రదర్శిత మైంది.

1931 లోను, 1962 లోను లండన్ బి.బి.సి ద్వారా కూడా ప్రసారిత మైంది. టి.ఎస్. ఇలియట్ రచించిన *ది వేస్ట్ లాండ్* (The waste land) అనే సుదీర్ఘ కవితను పరిష్కరించడంలో పౌండ్ తోడ్పడ్డాడు. న్యూయార్క్ నుంచి ప్రచురితమయే *ది డయల్* ( The Dial) అనే సాహిత్య మాసపత్రికకు కరెస్పాండెంట్‌గా కూడా పనిచేశాడు.

పారిస్ విసుగెత్తిన తరువాత 1924 లో రాపెలో (Rapallo) కు వెళ్ళాడు. ఆ తరువాత ఇటలీకి వెళ్లాడు. ఇటలీలో 20 సంవత్సరాలపాటు స్థిరంగా ఉన్నాడు. 1927-28 లో పౌండ్ తన స్వంత పత్రిక అయిన *ఎక్సైల్* కు సంపాదకత్వం వహించాడు. 1915 లో మొదలు పెట్టిన *ది కాంటోస్* అనే సుదీర్ఘ కవితా

సంపుటిలోని వివిధ ఖండికలన్నీ కలిపి *ఏ డ్రాఫ్ట్ ఆఫ్ XXX కాంటోస్* (1937); *కాంటోస్* (1940) అనేవి వెలువడ్డాయి. అదే దశకంలో ఆయన వచన రచనల్లో మంచివాటిని కొన్నింటిని ఏరి, *మేక్ ఇట్ న్యూ* (Make it New, 1934) అనే పేరుతో వెలువరించాడు. చరిత్ర, సంస్కృతి రంగాలలో పౌండ్ కొనసాగించిన కృషి ఆయన వ్రాసిన *గైడ్ టు కల్చర్* (1938) అనే పుస్తకం వల్ల కొంతవరకూ వెల్లడవుతుంది. 1930-40 దశకంలో ఆర్థికమాంద్య ప్రభావం ప్రపంచ వ్యాప్తంగా కనిపించింది. అందువల్ల పౌండ్ చరిత్ర పట్ల ముఖ్యంగా ఆర్థిక చరిత్రపట్ల అధికాసక్తిని పెంచుకొన్నాడు.

యూరప్‌లో యుద్ధకార్యకలాపాలు ముమ్మర మవుతున్నపుడు 1939 లో పౌండ్ ఇటలీ, అమెరికాల మధ్య శాంతి సంబంధాలు నెలకొంటా యనే ఆశతో స్వదేశానికి తిరిగి వెళ్లాడు. 1941-43 సంవత్సరాల మధ్య ఇటలీ, అమెరికాలు తిరిగి యుద్ధంలో తలపడినప్పుడు పౌండ్ రోమ్ రేడియో కేంద్రం నుంచి కొన్ని వందల ప్రసంగాలు చేశాడు. వాటిలో కొన్ని *జేమ్స్ జాయిస్, ద్రవ్య నియంత్రణ, యూదు బాంకర్ల ఆధిపత్యంలో అమెరికా ప్రభుత్వం* వంటి విషయాల మీద కూడా ఉండేవి. పౌండ్ అమెరికా యుద్ధ ప్రయత్నాలను బహిరంగంగానే దుయ్యబట్టాడు. 1945 లో అమెరికా సైన్యాలు అతనిని అరెస్టు చేశాయి. పీసా పట్టణంలో సైన్య నేరస్తుల కాంప్‌లో ఆరు నెలలపాటు ఖైదీగా పౌండ్ గడిపాడు. అక్కడ తీవ్రమైన అనుకూల పరిస్థితులున్నా కన్‌ఫ్యూషియన్ రచనను *ది గ్రేట్ డైజెస్ట్ అన్‌వోబ్లింగ్ పివట్* (1951) అనే పేరుతో ఇంగ్లీషులోకి అనువాదం చేశాడు. *ది పీసన్ కాంటోస్* (1948) అనే సుదీర్ఘ కవితా సంపుటిని కూడా రచించి ప్రచురించాడు.

రాజ ద్రోహనేరం విచారణ సందర్భంగా పౌండ్ అమెరికాకు తిరిగి వచ్చాడు. అయితే వైద్య బృందం అతనిని ఉన్మాదిగాను, నేరవిచారణకు తగిన మానసిక స్థితి లేని వాణ్ణిగాను నిర్ధారించింది. వాషింగ్‌టన్‌లో ఉన్మాద నేరస్తుల ఆసుపత్రి అయిన సెయింట్ ఎలిజబెత్ ఆసుపత్రిలో 12 సంవత్సరాలు (1946-58) పౌండ్ ఉన్నాడు. ఈ కాలంలో *ది కాంటోస్* రచన కొనసాగించాడు. *సెక్షన్: రాక్‌డ్రిల్* (Section, Rak-Drill-1955 ), *థ్రోన్స్* (Thrones-1959) అనే కవితా సంపుటాలు ఆ కాలంలో వ్రాసినవే. ఇదే కాలంలో ప్రాచీన చైనీస్ కవిత్వాన్ని అనువదించి *ది క్లాసిక్ ఆంథాలజీ* (The Classic Anthology 1954) అనే పుస్తకంగా ప్రకటించాడు. సోఫోక్లీస్ (Sophocles) రచించిన *ట్రాచినియాయి విమెన్ ఆఫ్ ట్రాచిస్* ను కూడా అనువదించాడు.

పౌండ్ ఎందరో వ్యక్తులను కలుసుకొన్నాడు. ఎందరితోనో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాడు. ఆ కాలంలో ఆయన మీద ఎంతో వివాదం చెలరేగింది. 1949 లో అతడు రచించిన *పీసన్ కాంటోస్* కు చాలా ముఖ్యమైన బొలింజెన్ బహుమానం (Bollingen prize) వచ్చింది. 1958 ఏప్రిల్ 18 వ తేదీన ఆయనను నేర విచారణకు అయోగ్యుడని ప్రకటించడం, ఆయన మీద ఉన్న ఆరోపణ లన్నిటినీ తొలగించడం జరిగింది. సెయింట్ ఎలిజబెత్ ఆసుపత్రి నుంచి పౌండ్‌ను విడుదల చేశారు. ఆయన ఇటలీకి తిరిగి వచ్చాడు.

పౌండ్ 60 సంవత్సరాలపాటు నిర్విరామంగా రచనా వ్యాసంగం కొనసాగించి, 70 స్వంత పుస్తకాలను, సుమారు 70 ఇతర పుస్తకాల అనువాదాలను ప్రచురించాడు. 1500 వ్యాసాలకు పైబడి రచించాడు.

పో.ద.

**ప్రతీకావాదోద్యమం** : 19 వ శతాబ్ది ఫ్రెంచి కవులు సాహిత్య, కళా రంగాలలో ప్రారంభించిన ఉద్యమ మిది. తరువాత ఇది చిత్రకళా, నాటక రంగాలకు కూడా విస్తరించింది. 20 వ శతాబ్ది యూరోపియన్, అమెరికన్ సాహిత్యాలను విశేషంగా ప్రభావితం చేసింది. ప్రతీకవాద కళాకారులు వైయక్తిక అనుభూతులను ఉదాత్తమైన ప్రతీకాత్మక భాషను ఉపయోగించి, సూక్ష్మం గాను, సూచన ప్రాయంగాను వ్యక్తీకరించడానికి ప్రయత్నించారు.

**ప్రతీకవాద సాహిత్యం** : ప్రతీకవాద కవులలో స్టీఫెన్ మలార్మే, పాల్ వెర్లెయ్న్, ఆర్థర్ రాంబో, జూల్స్ లాఫోర్జ్, హెన్రీ రేనియర్, రెన్‌ఘిల్, గుస్తావ్ కాహ్న్ మొదలైన ఫ్రెంచివారు ప్రముఖులు. ఎమిలివర్హారెన్, జార్జెస రోడెన్‌బాఖ్, బెల్జియం దేశీయులు. జీన్ మోరియాస్, ఫ్రాన్సిస్ వీలె గ్రిఫిన్, స్టూవర్ట్ మెరిల్, గ్రీసు దేశీయులు.

రెనీదె గోర్మాంట్ ప్రముఖ ప్రతీకవాద విమర్శకుడు. బెల్జియం దేశీయుడైన మారిస్ మాటర్లింక్ (Maurice Maeterlinck) ఈ వాదాన్ని నాటక రంగానికి వర్తింపజేశాడు. ఫ్రెంచ్ కవులయిన పాల్‌వలేరీ, పాల్ క్లాడెల్‌లను ప్రతీకవాదానికి 20 వ శతాబ్ది లోని వారసులుగా పరిగణిస్తారు.

కొందరు ఫ్రెంచ్ కవులు, సాంప్రదాయిక ఫ్రెంచ్ కవిత్వంలోని శిల్పానికీ, వస్తువుకూ సంబంధించిన కఠినమైన

సంప్రదాయాలకు వ్యతిరేకంగా చేసిన తిరుగుబాటులో ప్రతీకవాదం ఆవిర్భవించింది.

వెర్లెయ్న్, రాంబో వంటి అగ్రగాములయిన ప్రతీకవాదులు ఛార్లెస్ బోద్లేర్ (Charles Baudelaire) ఆలోచనల వల్ల, కవిత్వం వల్ల, ముఖ్యంగా ఆయన రచించిన *లెస్ ఫ్లొర్స్ ద్యు మాల్* (1857) లోని పద్యాల వల్ల చాలా ప్రభావితు లయారు.

ప్రతీకవాదులకు నాయకుడు మలార్మే. ఆయన రచించిన *డివగేషన్స్* (1897) ఈ ఉద్యమ సాహిత్య శాస్త్రానికి సంబంధించిన చాలా విలువయిన గ్రంథం. కఠినమైన ఛందో రీతులను తప్పించుకొని, అంతకన్న స్వేచ్ఛనిచ్చే కవితా రూపాలను సాధించడానికి ప్రతీకవాద కవులు వచన పద్యాలు వ్రాయడానికి పూనుకొన్నారు.

ప్రతీకవాదోద్యమం 1890 ప్రాంతాల్లో పరాకాష్ఠ నందుకొని, 1900 ప్రాంతం నుంచి జనరంజకతను కోల్పోతూ వచ్చింది. ప్రతీకవాద రచనలు 20 వ శతాబ్దపు బ్రిటీష్, అమెరికన్ సాహిత్యాలను ఎంతగానో ప్రభావితం చేశాయి. ప్రతీకవాదుల ప్రయోగాత్మక పద్ధతులు, ఆధునిక కవితా శిల్పాన్ని సుసంపన్నం చేశాయి. యీట్స్ (W.B. Yeats), ఎలియట్ (Eliot) ల కవిత్వాల్లోనూ, జేమ్స్ జోయిస్ (James Joyce), వర్జీనియా వుల్ఫ్ (Virginia wolf) వంటి వారి నవలల్లోనూ ప్రతీకవాద సిద్ధాంతాలు ఫలరూపం పొందాయి. వీరి రచనల్లో కథనం కంటె పదచిత్రాల మేళనాలూ, నమూనాలూ ప్రాధాన్యం వహించాయి.

నిర్దుష్టంగా రూపొందిన కొద్దిపాటి ప్రతీకవాద నవలల్లో జె.కె. హైస్‌మన్ రచించిన *ఎ రిబౌన్స్ ఎగెయిన్స్ట్ నేచర్* ఒకటి. 20 వ శతాబ్దానికి చెందిన అమెరికన్ విమర్శకుడు ఎడ్మండ్ విల్సన్ ప్రతీక వాదోద్యమాన్ని అనుశీలిస్తూ రచించిన *ఆక్సెల్స్ కాసిల్* (1931) ఆధునిక సాహిత్య విశ్లేషణలో ఉత్తమ గ్రంథం గాను, ఆ ఉద్యమ అధ్యయనంలో సాధికారమయిన గ్రంథంగాను పరిగణన పొందింది.

పో.ద.

**ప్రాట్, ఎడ్విన్ జాన్ (1883-1964) :** కెనడా దేశపు ఆంగ్లకవి. యువకుడుగా ఉన్నప్పుడు మంత్రి పదవికోసం శిక్షణ పొందాడు. టొరంటో విశ్వవిద్యాలయానికి చెందిన విక్టోరియా కళాశాలలో నమోదు చేసుకోడానికి (1907) పూర్వం ప్రాట్ కొంత మతబోధ కూడా పొందాడు. 1911 లో తత్త్వశాస్త్రంలో డిగ్రీ పొందాడు. 1916 లో దైవశాస్త్రాన్ని అధ్యయనాంశంగా తీసుకొని డిగ్రీ తీసు కొన్నాడు. మనో విజ్ఞాన శాస్త్రం కూడా అతని అభిమాన విషయం. 1919 వరకూ విక్టోరియా కళాశాలలో మనో విజ్ఞాన శాస్త్రాధ్యాపకుడుగా ఉన్నాడు. ఆ తరువాత ఇంగ్లీషు డిపార్ట్‌మెంట్‌లో చేరి, 1953 లో పదవీ విరమణ చేసేవరకూ ఆ శాఖలోనే ఉన్నాడు.

ప్రాట్ తొలి కవితా సంపుటాలు : *రాఖేల్* (1917), *న్యూ ఫౌండ్ లాండ్ వెర్స్* (1923). ఈ రెండు సంపుటాల్లో ప్రాట్ సముద్రం విసిరిన సవాళ్ళనూ, న్యూ ఫౌండ్ లాండ్ తీర ప్రాంతపు శ్రమజీవుల మనోభావాలను చిత్రించాడు. *ది విచెస్ బ్రూ* (1925), *టైటాన్స్* (1926) అనే గ్రంథాల్లో ప్రాట్ కథనాత్మక శైలిని అవలంబించాడు. *ది రూజ్వెల్ట్ అండ్ ది అంటినో* (1930) లోను, *ది టిటానిక్* (1935) లోను ప్రాట్ నౌకాభంగ ఇతివృత్తాన్ని ప్రతిపాదించాడు.

*బ్రేబూఫ్ అండ్ హిజ్ బ్రదర్స్* (1940) అనే కవితా సంపుటిలో ప్రాట్ కవితా శక్తి ఉన్నత శిఖరాల నందుకొన్నది. పన్నెండు వచన కవితా సంపుటాల్లో *ఇరోకోయ్* వల్ల జెసూట్ మిషనరీలు పొందిన నరక యాతనలను, వీర మరణాలను చిత్రీకరించాడు. రెండో ప్రపంచ యుద్ధానికి సంబంధించి ప్రాట్ రచించిన గ్రంథాల్లో వివిధ ఇతివృత్తాలు ఉన్నాయి. వాటిలో కొన్ని రెండో ప్రపంచ యుద్ధ కాలంలో ఫ్రాన్స్ స్థావరాలను ఖాళీచేయించిన ఇతివృత్తానికి సంబంధించి *డంకర్క్* (1941), *స్టిల్ లైఫ్ అండ్ అదర్ వెర్స్* (1943), *కలెక్టెడ్ పొయెమ్స్* (1944), *దే ఆర్ రిటర్నింగ్* (1945), *బి హైండ్ ది లాగ్* అనేవి. *దే ఆర్ రిటర్నింగ్* అనే గ్రంథం యుద్ధం చివరి దశను చిత్రించేది.

రెండో ప్రపంచ యుద్ధంలో ముర్మోన్స్క్‌కు సరుకులను చేరవేసే నౌకల సంరక్షణార్థం పంపే కెనడా దేశపు సైనిక నౌకాదళం వీరోచిత కృత్యాలను *బిహైండ్ ది లాగ్* అనే గ్రంథం సంస్మరిస్తుంది.

ప్రాట్ రచించిన మరో గ్రంథం *టువర్డ్స్ ది లాస్ట్ స్పైక్* (1952). ఇందులో కెనేడియన్ పసిఫిక్ రైల్వే (1970-85) భవన నిర్మాణోదంతాన్ని సవివరంగా చిత్రించాడు. ఈయన కెన్నో బహుమానాలు వచ్చాయి. కెనడాలో ఘనంగా పౌర సన్మానం జరిగింది. 'ది కంపానియన్ ఆఫ్ ది ఆర్డర్ ఆఫ్ సెయింట్ జార్జ్' (1946) అనే బిరుదును ఈయనకు ప్రదానం చేశారు.

పో.ద.

**ప్రాటోలినీ, వాస్కో (1913--) :** ఇటలీ దేశపు కథానికా రచయిత, నవలా రచయిత. ఫాసిజమ్ తలెత్తిన

రోజుల్లో ఫ్లొరెంటైన్‌లోని పేదవాళ్ళ కడగండ్లను చాలా ప్రతిభావంతంగా చిత్రించిన రచయిత. ఇటాలియన్ నవ్య వాస్తవతా వాదానికి చెందిన రచయితల్లో ప్రముఖుడు.

ప్రాటోలినీ ఫ్లొరెన్స్‌లో పెరిగాడు. పేదవాడుగానే జీవించాడు. ఈయన తన ఆరోగ్యం క్షీణించేవరకూ చిన్న చిన్న ఉద్యోగా లెన్నో చేశాడు. ఆరోగ్యం సరిగా లేనందు వల్ల 1935 నుంచి 1937 వరకు ఒక శానిటోరియంలో గడిపాడు. చిన్నతనంలో పాఠశాలలోను, గురువుల దగ్గర చదువుకోలేదు. అయితే స్వయంగా నిర్విరామంగా చదువుకొన్నాడు. శానిటోరియమ్‌లో ఉన్నప్పుడు వ్రాయడం మొదలు పెట్టాడు.

ప్రాటోలినీ రోమ్‌కు వెళ్ళి, అక్కడ ఇలియో విట్టోరిని అనే నవలా రచయితను కలుసు కొన్నాడు. ఆయన ప్రాటోలినీ సాహితీవేత్తలకు పరిచయం చేశాడు. ఇద్దరూ బాగా సన్నిహితు లయారు. ఇద్దరూ ఫాసిజాన్ని తీవ్రంగా వ్యతిరేకించిన వారే. ఫాసిస్టు ప్రభుత్వం ప్రాటోలినీ నడుపుతున్న సాహితీ పత్రిక *కాంపోడి మార్టే* (Compodi Morte) ని ఆపు చేసింది. ఆ పత్రిక 1939 లో తొమ్మిది మాసాలు మాత్రం వెలువడింది.

ఆయన నవలలలో మొదట పేర్కొనవలసింది *ఇల్ క్వార్టియర్* (Il Quartiere-1944). దీని ఆంగ్లానువాదం *ది నేకెడ్ స్ట్రీట్* (1952). ఈ నవలలో ఫ్లొరెంటైన్‌లో కౌమార ప్రాయంలో ఉన్న ఒక ముఠాను గురించి ఎంతో ఉద్వేగ భరితంగా కళ్ళకు కట్టినట్లు చిత్రించాడు. *క్రోనికా ఫినీలియర్* (Cronica Feniliare- 1947; ఆంగ్లంలో *టూ బ్రదర్స్*, 1962) అనే నవలలలో చనిపోయిన తన సోదరుని జీవితాన్ని ఎంతో మృదువుగా చిత్రించాడు.

ప్రాటోలినీ రచించిన *క్రానేచె డి పోవరి ఆమంటి* (Cronache di Poveri Amanti-1949) అనే నవల ఇటాలియన్ నవ్య వాస్తవతా వాద కాలానికి చెందిన ఉత్తమ రచనగా పరిగణన కెక్కింది. అది విస్తృతంగా అమ్ముడు పోవడమే కాక *ది టేల్ ఆఫ్ పూర్ లవర్స్ వర్క్స్*) అనే నవలకు రెండు అంతర్జాతీయ సాహిత్య పురస్కారాలు కూడా లభించాయి. 1925-26 లలో ఫాసిజమ్ ఉచ్ఛదశలో ఉన్నప్పుడు ఫ్లొరెంటైన్ నగరంలోని పేదవాళ్ల జీవితాన్ని అన్ని కోణాలనుంచి చిత్రించడం జరిగింది. *యునెరోడిల్ నోస్ట్రొటెంపో* (1949), *ఏ హీరో ఆఫ్ టుడే, ఏ హీరో ఆఫ్ అవర్ టైమ్* అనే నవలలను ఫాసిజానికి వ్యతిరేకంగా రచించాడు.

1955-1966 మధ్య కాలంలో ప్రాటోలినీ మూడు నవలలు ప్రచురించాడు. ఈ మూడు నవలలనూ *ఉనా స్టోరియా ఇటాలియానా* (An Italian story) అని ఒకే శీరికతో ప్రచురించడం జరిగింది. మొదటిదైన *మెటెల్లో* (1955, ఇంగ్లీషు అనువాదం 1968 లో వచ్చింది) మూడు నవలలలోకీ ఉత్తమమైనది. ఇందులో 1875 తరువాత తలెత్తిన కార్మిక వివాదాలను గురించి, 1902 లో విజయవంతమైన భవన నిర్మాణపు పనివాళ్ల సమ్మెను గురించి ఎంతో హృదయంగమంగా చిత్రించబడింది. రెండో నవల *లోసియాలో* (Loscialo 1960, *ది వేస్ట్* లో 1902 నుంచి 1920 ప్రాంతం వరకూ ఫాసిజమ్ నిలద్రొక్కుకొంటున్న సమయంలో నిమ్న తరగతుల ఆలసత్వాన్ని, దయనీయతను ప్రాటోలినీ, చిత్రించాడు. మూడో నవల *అలిగోరియా డెరిసియోన్* (1966, Allegory and Derision) లో ఫాసిజమ్ ఉచ్ఛదశనూ, పతనదశనూ చిత్రీకరించడం జరిగింది. ఈ నవలలో ముఖ్యంగా ఫ్లొరెంటైన్ లోని మేధావి వర్గపు నైతిక, బౌద్ధిక సంఘర్షణలను రచయిత చిత్రీకరించాడు.

పో.ద.

**ప్రూథోమ్, సల్లీ (1839-1907) :** ప్రముఖ ఫ్రెంచ్ కవి. పూర్తిపేరు రేనే ఫ్రాన్స్వాయస్-అర్మండ్ ప్రూథోమ్. ఈయన పర్నేసియన్ ఉద్యమంలో ప్రధాన పాత్ర వహించాడు. కాల్పనికోద్యమపు విపరీత లక్షణాలకు వ్యతిరేకంగా బయలుదేరిన ఉద్యమ మిది. ఇది కళాత్మక ప్రమాణాలకు, ఔచిత్యానికి, ఉత్తమాభిరుచులకు ప్రాధాన్య మిస్తుంది. ప్రూథోమ్ పాఠశాలలో విజ్ఞాన శాస్త్రాలను చదివాడు. కాని కంటిజబ్బు వల్ల విజ్ఞాన శాస్త్ర అధ్యయనానికి స్వస్తి చెప్పవలసి వచ్చింది. ఆయన మొదట ఒక కర్మాగారంలో గుమాస్తాగా పనిచేశాడు. 1860 లో న్యాయశాస్త్రం చదువడానికి ఆ ఉద్యోగం వదలిపెట్టాడు. 1865 లో ప్రేమలో విఫలమై విషాద గీతాలను విస్తృతంగా వ్రాసి ప్రచురించడం మొదలు పెట్టాడు. అవి *స్టాన్సె సెట్ పొయమ్స్* (Stanceset Poems, 1865). *లేవాజ్ బ్రైజ్, లే ఎప్రాయువ్స్* (Les Epreives: 1866; The Trails), *లే సొలిట్యూడ్స్* (les solitudes,



1869, sotilude) అనేవి కూడా ఆయన తొలినాటి రచనలే. వీటిలో ప్రేమ, విరహం, విషాదం, మోహావేశం మొదలైన అనుభూతులు ప్రకటితం అయాయి.

తరువాత ప్రూథోమ్ ఆత్మీయ ధోరణిలో గీతాలు వ్రాయడం మానివేసి విషయనిష్ఠమైన దృక్పథంతో పర్నేసియన్ ఉద్యమానికి దోహదం చేసే తాత్త్విక భావలతో పద్యాలు వ్రాయడం మొదలు పెట్టాడు. ఆ ధోరణికి చెందిన రెండు ప్రసిద్ధ రచనలు: *లా జస్టిస్* (La Justic, 1878; Justice), *లే బోన్‌హార్* (Le bonheur, 1888 (happiness). వీటిలో రెండోది ప్రేమకోసం, జ్ఞానం కోసం ఫౌస్ట్ ధోరణిలో చేసిన అన్వేషణ.

ప్రూథోమ్ చేసిన తరువాతి రచనల్లో నిగూఢతతో పాటు, తాత్త్విక విషయ వివరణ కూడా గోచరిస్తుంది. 1881 లో ఫ్రెంచ్ అకాడమీకి ఈయన సభ్యుడుగా ఎన్నికయాడు. 1901 లో ఈయనకు సాహిత్యంలో మొట్టమొదటి నోబెల్ బహుమతి వచ్చింది.

పో.ద.

**ప్రూస్ట్, మార్సెల్ (1871-1922) :** ఫ్రెంచి నవలా రచయిత. *ఏ లా రెచిర్చె దు టెంప్స్ పర్దు* (A la recherche du temps perdu) (Remembrance of things past) అనే నవల ఈయన వ్రాసిన నవలల లో ప్రసిద్ధమైంది. ఇది ఈయన జీవితానికి సంబంధించిన నవల. కొన్ని చోట్ల 'చైతన్య స్రవంతి' శిల్పాన్ని అనుసరించి ప్రతీకాత్మకంగా వ్రాసిన మనో వైజ్ఞానిక నవల.



మార్సెల్ ప్రఖ్యాత వైద్యుడైన 'అడ్రియన్ ప్రూస్ట్' కుమారుడు. తల్లి 'జీన్ నెక్‌వీల్' సంపన్న యూదు కుటుంబానికి చెందినది. 1880 లో 'మార్సెల్' కు ఉబ్బసం వ్యాధి వచ్చింది. అప్పటినుంచి ఈయన జీవితాంతం దానితో బాధ పడ్డాడు. ఈయన 1882-89 లలో 'లైసే కాండర్ సెట్' లో గడిపాడు. అప్పుడే రచనలు వ్రాయడం ప్రారంభించాడు. 'అల్ఫాన్స్ డార్లు' అనే తత్త్వవేత్త మార్సెల్ గురువు. ఆయన వల్ల మార్సెల్ ఎంతో ప్రభావితుడయాడు. విద్యార్థిగా ఉన్నప్పుడు ఈయనకు వరుసకు సోదరుడైన హెన్రీ బెర్గ్‌సన్ (Henri Bergson) అనే తత్త్వవేత్త ప్రభావానికి ప్రూస్ట్ లోనయాడు. చరిత్రకారుడైన 'ఆల్బర్ట్ సోరెల్', 'పాల్ డెస్జార్డిన్స్' ల ప్రభావం కూడా మార్సెల్‌మీద పడింది. 1896 లో *లే ప్లెసిర్స్ ఎట్ జూర్స్* అనే కథాసంపుటిని ప్రచురించాడు. దీనిలోని కథలు ఎక్కువగా 1892-93 ప్రాంతంలో *లె బాంకెట్* (Le Banquit) అనే పత్రిక లోను, *లా రివ్యూ బ్లాంచె* అనే పత్రికలోను ప్రచురితం అయాయి. 1895 నుంచి 1899 వరకూ ఈయన *జీన్ సాంతియోల్* (Jean Santeuil) అనే ఆత్మకథాత్మక నవలను రచించాడు. ఇది అసంపూర్తి నవల. 'ఫ్రాస్ట్ రస్కిన్' వ్రాసిన *బైబిల్ ఆఫ్ అమియన్స్*, *సెసామె అండ్ అమియ్యా* లను ఇతడు అనువదించాడు. వీటిలో ఆయన పరిపక్వ వచన రచన కనపడుతుంది.

ఈయన చాలా విస్తృతంగా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాడు. ఈయన వ్రాసిన మూడు వేల లేఖలు ముద్రితమయాయి. ఇంకా ఎన్నో లేఖలు ముద్రితం కావలసి ఉన్నాయి. ఆ ఉత్తరాలు ఈయన వ్యక్తిత్వాన్ని తెలుపుతాయి.

'ప్రూస్ట్' మీద ఉన్న ఆరోపణలలో ప్రధానమైనవి: ఆయన నిరాశావాది, మతవ్యతిరేకి, స్వలింగ కాముకుడు, సోమరి, దృఢ సంకల్పం లేనివాడు, తత్త్వశాస్త్రంలో తగినంత పరిజ్ఞానం లేనివాడు. ప్రతి చిన్న విషయాన్ని విశదంగా వ్యక్తీకరిస్తాడు అని. కాని నిజానికి ఈయన మీద జరిగిన పరిశోధనలు ఈయన విరామం లేకుండా పనిచేస్తాడని నిరూపించాయి. ప్రూస్ట్ అతిభౌతికవాది. ఏది చెప్పినా మనస్సుకు హత్తుకునేలా చెబుతాడు. మొత్తం మీద 'ప్రూస్ట్' మీద వ్యతిరేక విమర్శలే ఎక్కువగా వచ్చాయి. 'ప్రూస్ట్' వచన రచన ఎంతో పరిణతి చెందినది, పరిపక్వమైనది. ఆయన వచనం మీద 17 వ శతాబ్ది నైతికవాది అయిన లా బ్రుయేరే సాంఘిక చరిత్రకారుడు సెయింట్ సైమన్, కాల్పనిక వాదుల్లో ముఖ్యుడైన 'షాతో్బ్రియాండ్', 'బాల్జాక్', 'రేనాన్' (Renan), 'రస్కిన్' ల ప్రభావం ఉంది. ప్రూస్ట్ విమర్శకులు కొన్ని అపోహలతో, ఆయన సాహిత్యాన్ని సరిగా అంచనా వేయలేక పోయినప్పటికీ ఆయన ప్రశస్తి ఏమీ తగ్గలేదు. సామాన్య పాఠకుడు ఆయన రచనలను నేటికీ అభిమానిస్తూనే ఉన్నాడు.

పో.ద.

**ప్రాపర్షియస్, సెక్స్‌టస్ (క్రీ.పూ. 55-16 ప్రాంతం) :** ప్రాచీన రోమ్‌కు చెందిన కవి. ఎక్కువగా

స్మృతి గీత (elegies) కవులలో ప్రసిద్ధుడు. ఈయన వ్రాసిన స్మృతి గీత గ్రంథాల్లో *సింథియా* (cynthia) అనేది క్రీ.పూ. 29 లో వెలువడింది.

సెక్స్‌టస్ ప్రోపర్షియస్ జీవిత వివరాలు అంతగా తెలియటం లేదు. ఈయన తండ్రి చిన్నప్పుడే పోయాడు; కాని తల్లి ఈయనను బాగా చదివించింది. ఆక్టేవియన్ తన సైనికులకు పునరావాసం కల్పించే నిమిత్తం ప్రోపరియస్ కుటుంబం వారి పొలాలను కొన్నిటిని స్వాధీనం చేసుకొన్నాడు. ప్రొపర్షియస్ పేదవాడుకాక పోయినా, దీనివల్ల అతని ఆదాయం బాగా తగ్గిపోయింది. అందువల్ల ప్రొపర్షియస్ తల్లితో పాటు అంబ్రియాను వదలి పెట్టి, రోమ్‌కు వెళ్లాడు. ఈయన స్నేహితులలో కొందరు కవులు కూడా ఉన్నారు. వారిలో చెప్పుకోదగినవారు ఓవిడ్ (Ovid), బాసస్ (Bassas). ఈయనకు రాజకీయాల్లోను, న్యాయశాస్త్రంలోను, సైనిక జీవితంలోను ఆసక్తి లేదు. ఈయన మొదట తనకంటె వయస్సులో పెద్దదైన తైసినా (Tycinna) ను ప్రేమించాడు. అయితే ఈ ప్రేమ ఎంతో కాలం నిలువలేదు. తరువాత *సింథియా* అనే కవితా సంపుటిలో నాయిక అయిన 'హోస్టియా' ను ఎంతో గాఢంగా ప్రేమించాడు.

సాహిత్య పోషకుడయిన మేసినాస్ ప్రొపర్షియస్‌ను తన ఇంటికి ఆహ్వానించి ఇతర సాహితీ వేత్తలతో పరిచయం చేశాడు. ఆ కాలంలోని కొందరు సాహితీ వేత్తలు కలిసి 'మేసినాస్' బృందంగా ఏర్పడ్డారు. ఈ బృందంలో ప్రొపర్షియస్‌తో పాటు వర్జిల్ (Virgil), హోరేస్ (Horace) అనే కవులు కూడా ఉండేవారు. ప్రొపర్షియస్ వర్జిల్ కవిత్వాన్ని ఎంతగానో అభిమానించేవాడు. హోరేస్‌ను ప్రొవర్షియస్ ఎక్కడా పేర్కొనక పోయినా ఈ ఇద్దరి కవుల ప్రభావమూ ప్రొపర్షియస్ మీద ఉంది. ముఖ్యంగా మూడో కవితా సంపుటిలో హోరేస్ ముద్ర స్పష్టంగా కనిపిస్తుంది.

తొలి నాళ్ళలో ఈయన రచించిన స్మృతి గీతాల్లో ప్రేమ ఒక్కటే ప్రధాన విషయం కాదు. ఈయన మత విశ్వాసాలు, తాత్త్విక విశ్వాసాలు కూడా వాటిలో చోటు చేసుకొన్నాయి. మరణం పట్ల ఒక తాత్త్విక భావన ఏర్పడిన తరువాత ఈయన మహాకావ్య నిర్మాణం తలపెట్టాడు. అదే ఈయన రెండో పుస్తకం. ఆ పుస్తకంలో తన కాలంనాటి భౌతిక వాదాన్ని అధిక్షేపించాడు. ఒక విధంగా ఈయన సంప్రదాయవాది. ధనిక వర్గం పట్ల అనుకూలంగా మెలిగాడు. రోమన్ సామ్రాజ్యవాదం పట్లా, అగస్టస్ పరిపాలన పట్లా మొగ్గుదల ఉండేది. అయితే ప్రకృతి సౌందర్యమన్నా, కళ లన్నా అపారమైన ఆరాధన ఉండేది. తన కాలంనాటి ఫ్యాషన్ లంటే మోజుండేది. కాని బాహిరమైన విలాసాలంటే ఈయనకు గిట్టేదికాదు.

ప్రొపర్షియస్ కవితా గుణాలలో ముఖ్యంగా రెండు గుణాలను ప్రాచీనులు ప్రశంసించారు. ఒకటి: బ్లాండిటియా (Blanditia), రెండోది ఫెకండియా (facundia) ఆయన కవిత్వంలోని మొదటి గుణం మార్దవం, సౌందర్యారాధన, సౌకుమార్యం- ఈ గుణా లన్నిటినీ కవి 'బ్లాండిటియా' అని అన్నారు. ఇక రెండో గుణమైన ఫాకండియా అంటే భావాన్ని ఉచితమైన భాషలో శక్తిమంతంగా వ్యక్తీకరించడం. ఈయనకు భాషమీద ఉన్న అధికారం అపారం.

ప్రొపర్షియస్ తన పూర్వ కవులను అనుసరించినట్లుగానే, ఈయనను అనంతర కవులూ అనుసరించారు. ముఖ్యంగా ఓవిడ్ ఈయన వల్ల ఎంతగానో ప్రభావితుడయాడు. పాంపే గోడల మీద ఉన్న చిత్రలిపి క్రీ.శ. మొదటి శతాబ్దంలో ఈయనకున్న ప్రాచుర్యాన్ని వెల్లడిస్తుంది. మధ్యయుగాలలో ఈయన కవిత్వాని కంత ఆదరణ ఉండేదికాదు. అయితే పునరుజ్జీవనకాలం నుంచి ఈయన కవిత్వాన్ని సాధారణ పాఠకుల కంటె వృత్తిరీత్యా పండితులైన వారే ఎక్కువగా అధ్యయనం చేశారు.

ప్రొపర్షియస్ కవిత్వాన్ని త్వరగా అవగాహన చేసుకోలేము. అందుకు కారణం అప్పటి వ్రాతప్రతులను సులభంగా చదువలేక, వ్రాసిన విషయాన్ని నిర్ధారణ చేసుకోలేక పోవడం; అంతేకాక ఆయన రచనలలో ఎక్కువగా అస్పష్టమైన పౌరాణికోదంతాల సూచనలు నిండి ఉండడం కూడా మరొక కారణం కావచ్చు. ఉదాత్తమైన భాషలో సమున్నతమైన భావాలను మధురంగా వెల్లడించడం, నిజాయితీ ప్రొపర్షియస్ ప్రత్యేక లక్షణాలు.

పో.ద.

**ప్లాటస్ (సుమారు క్రీ.పూ. 254-184) :** రోమన్ హాస్యనాటక రచయిత. ఈయన నాటకాలకు ఇతివృత్తం గ్రీకు నాటకాల నుంచి గ్రహించిందే. లాటిన్ భాషలో ఇవి నిజమైన రోమన్ నాటకాలుగా నిలిచి పోయాయి.

ప్లాటస్ జీవితం గురించి, వ్యక్తిత్వం గురించి చాలా తక్కువగా తెలుస్తున్నది. ప్లాటస్‌నూ, టెరెన్స్ (Terence) నూ గొప్ప రోమన్ హాస్య నాటక రచయితలుగా పరిగణిస్తారు. ప్లాటస్ నాటకాల వ్రాత ప్రతులు బాగా శిథిలం కావటంవల్ల, మార్పులకూ, చేర్పులకూ

గురి అయాయి. కొన్ని అసంపూర్తిగా లభించాయి. లభించినవి మొత్తం 21 మాత్రమే. అయినప్పటికీ ఆ నాటకాలు ప్లాటస్ సాహిత్య, నాటక రచనా కౌశలాన్ని వెల్లడిస్తాయి. పాశ్చాత్య సాహిత్య, నాటక చరిత్రలో ప్లాటస్‌కు సుస్థిరమైన స్థానం ఉంది.

క్రీ.శ. 2 వ లేదా 3 వ శతబ్దానికి చెందిన ఫెస్టస్ అనే వైయాకరణుని అభిప్రాయం ప్రకారం, ప్లాటస్ ఇటలీ దేశంలో మధ్య ఈశాన్య భాగంలో జన్మించినట్లు తెలుస్తున్నది. అనంతరం ఇటాలియన్ రచయితలు, ముఖ్యంగా క్రీ.పూ. ఒకటో శతాబ్దానికి చెందిన సిసిరో పేర్కొన్న ఆధారాలను బట్టి ఇతని కాలాన్ని నిర్ణయించడం జరిగింది. ప్లాటస్‌కు చిన్నతనం నుంచీ నాటకాలతో, రంగస్థలంతో సంబంధమున్నట్లు తెలుస్తున్నది. చిన్నప్పుడు నాటక రచయితగా సంపాదించిన డబ్బును వ్యాపారంలో పెట్టి నష్టపోయాడు. జీవిక కోసం కొంతకాలం పాటు ధాన్యం మిల్లులో పనిచేశాడు. ప్లాటస్‌కు పూర్వమున్న రోమన్ నాటక రచయితలు సుఖాంత దుఃఖాంత నాటకాలకు ఇతివృత్తాలనూ, నాటక శిల్పాన్నీ చాలా వరకు గ్రీకు నాటకాలనుంచి స్వీకరించారు. రోమన్ జీవితం నుంచి, రోమన్ పౌరాణిక గాథల నుంచి తీసుకొన్న ఇతివృత్తాలకు కూడా గ్రీక్ రూపక నిర్మాణ పద్ధతులను, రంగస్థల నిర్మాణాన్ని, దుస్తులను అనుసరించడం జరిగింది. ప్లాటస్ తన పూర్వీకులలాగే తన నాటకాలకు అన్నిటికీ కాకపోయినా చాలా వాటికి ఇతివృత్తాలను క్రీ.పూ. మూడో శతాబ్ది పూర్వార్ధభాగానికి, నాలుగో శతాబ్ది ఉత్తరార్ధ భాగానికి చెందిన గ్రీకు నాటక రచయితల నాటకాల నుంచి గ్రహించాడు. గ్రీకు నాటక చరిత్రలో ఈ కాలాన్ని 'న్యూ కామెడీ' యుగంగా పిలుస్తారు. ప్లాటస్ ఎక్కువగా మినాండర్ (Menander), ఫిల్‌మన్ (Philmon) ల నాటకాల నుంచి ఇతివృత్తాలను గ్రహించాడు. అయితే ప్లాటస్ ఆ ఇతివృత్తాలను యథాతథంగా అనుసరించలేదు. ఎంతో స్వతంత్రతను కనబరిచాడు. ప్లాటస్ తన నాటకాల్లో రోమన్ భావనలను, పలుకుబడులను చక్కగా మేళవించాడు. ఇటలీ దేశపు పట్టణాల పేర్లను, మార్కెట్‌ల పేర్లను తన నాటకాలలో పేర్కొన్నాడు. అంతేకాదు; రోమన్ చట్టాలను, రోమన్ న్యాయస్థానాల వ్యవహార సరణిని, రోమన్ న్యాయాధిపతులను, వారి బాధ్యతలను, సెనేట్ వంటి రోమన్ సంస్థలను గురించి కూడా పేర్కొన్నాడు.

ప్లాటస్ నాటకాల మూల ప్రతులు లభించడం లేదు. నాటక ప్రదర్శనకోసం (దర్శకులు, నిర్మాతలు, నటులు) చేసిన మార్పులతోను, చేర్పులతోనుకూడిన లిఖిత ప్రతులు మాత్రమే లభించాయి. ప్లాటస్ నాటకాలను సిసిరో కాలం వరకూ చాలా విరివిగా ప్రదర్శించి ఉంటారు. కనుక అవి ఎన్నో మార్పులకూ చేర్పులకూ గురి అయి ఉంటాయి. సిసిరో ఈ నాటకాలలోని భాషను మెచ్చుకొన్నాడు. హోరేస్ (Horace) కవి ఈ నాటకాలలోని భాష మరింత మెరుగు దిద్దుకోవలసిన అవసరం ఉన్నదని విమర్శించాడు. క్రీ.శ. రెండో శతాబ్ది నుంచి ప్లాటస్ నాటకాల పట్ల కొత్తగా అభిరుచి, ఆసక్తి పెరిగింది.

పో.ద.

**ప్లినీ ద ఎల్డర్ (క్రీ.శ. 23-79) :** ప్లినీ రోమ్ దేశపు ప్రసిద్ధ విద్వాంసుడు. *ది నేచురల్ హిస్టరీ* అనే గ్రంథం వ్రాసిన వాడు. ఇది విజ్ఞాన కోశ పద్ధతిలో చేసిన గొప్ప రచన. మధ్య యుగాలనాటి వరకు ఈ గ్రంథాన్ని చాలా ప్రామాణిక మైనదిగా భావించేవారు.

ప్లినీ సంపన్న కుటుంబానికి చెందినవాడు. ఈయన రోమ్‌లో విద్యాభ్యాసం పూర్తి చేశాడు. 23 వ ఏట మిలిటరీలో చేరాడు. జర్మనీలో పనిచేశాడు. ఆశ్విక దళంలో కమాండర్ స్థాయికి ఎదిగాడు. ఈయన రోమ్‌కు తిరిగి వచ్చి న్యాయశాస్త్రం చదువుకొన్నాడు. దాదాపు నీరో (Neero) పాలన అంతమయ్యే వరకూ స్పెయిన్ నగరం న్యాయాధికారి (procurator) అయ్యేవరకూ ప్లినీ దాదాపు విశ్రాంత జీవితం గడిపాడు. చదువడంతోను, వ్రాయడంతోను కాలం గడుపుతుండేవాడు.

ప్లినీ మొత్తం ఏడు గ్రంథాలు వ్రాసినట్లు తెలుస్తున్నది. అయితే వాటిలో *ది నేచురల్ హిస్టరీ* అనే ఒక్క గ్రంథం మాత్రమే లభించింది. అయినా అతని తొలి రచనలైన వ్యాకరణానికి సంబంధించిన కొన్ని శకలాలు, *పంపోనియస్ సెకండస్* జీవిత చరిత్ర, రోమన్ చరిత్ర, జర్మన్‌లో రోమన్ ప్రచారం-దాని అధ్యయనం అనే గ్రంథాలలో కొన్ని భాగాలు లభించాయి. ప్లినీ కీర్తి అంతా *ది నేచురల్ హిస్టరీ* అనే ఒక్క గ్రంథం మీదే నిలిచి ఉంది.

*ది నేచురల్ హిస్టరీ* 37 సంపుటాలుగా వెలువడిన బృహత్ గ్రంథం. క్రీ.శ 77 నాటికి దీని రచన పూర్తి అయింది. ఉపోద్ఘాతంలో దీన్ని టైటస్ చక్రవర్తికి అంకితమిచ్చినట్లుగా ఉంది (టైటస్ ప్లినీ చనిపోయిన కొద్దికాలానికే చక్రవర్తి అయాడు). వెల్లావెదురుగా ఉన్న పాత విజ్ఞానాన్నంతా ఒక్క చోటికి చేర్చి *ఎన్కిక్లోస్ పేడియో* (Enkyklios paideia) (ఎన్‌సైక్లోపీడియాకు

పూర్వరూపం) సంతరిస్తున్నానని చెప్పుకొన్నాడు. *ది నేచురల్ హిస్టరీ* లో ప్లినీ ఎంతో జాగ్రత్తగా నూటికి పైగా ఆకరాలను పేర్కొన్నాడు. నిజానికి మొదటి సంపుటం మిగతా 36 సంపుటాలకూ సారాంశ రూపమైన గ్రంథం. ఆయన ఆ సంపుటాలలో తన గ్రంథ రచనకు సమాచారాన్ని ఏ గ్రంథాలనుంచి సేకరించాడో ఆ గ్రంథాల పట్టికను కూడా ఇచ్చాడు. ఆయన ఇచ్చిన పట్టికలోని గ్రంథాలు చాలా వరకూ ఇప్పుడు లభించడం లేదు.

పో.ద.

**ప్లినీ, ది యంగర్ (క్రీ.శ. 61/62-113) :** రోమన్ రచయిత, పరిపాలన దక్షుడు. సాహిత్య గౌరవం గల ఆయన రచించిన లేఖ లెన్నో లభించాయి. రోమన్ సామ్రాజ్యం అత్యుచ్ఛదశలో ఉన్న ఆనాటి సాంఘిక, వైయక్తిక జీవితాలకు సంబంధించిన అంశాలెన్నో ఆ లేఖల వలన మనకు తెలుస్తున్నాయి.

ఒక సంపన్న కుటుంబంలో ప్లినీ ఇటలీలోని 'కోమమ్' లో జన్మించాడు. తన పినతండ్రి ప్లినీ ది ఎల్డర్ అతనిని పెంచుకొన్నాడు. తన 18 వ ఏట అతడు న్యాయవాది వృత్తి చేపట్టాడు. సివిల్ కోర్టులో అతడు సంపాదించిన కీర్తి వలన లంచగొండులైన రాష్ట్రీయ ఉద్యోగులను విచారించే రాజకీయ కోర్టులలో కూడా అతనికి ప్రాక్టీసు పెరిగింది. క్రమంగా అతడు 'ప్రేటర్', 'కాన్సల్' అనే పరిపాలక పదవులకు ఎన్నిక అయాడు.

తన సమకాలికుడైన చరిత్ర రచయిత టాసిటస్ వలెనే ప్లినీ ది యంగర్ కూడా సంప్రదాయవాది. రోమన్ సామ్రాజ్య అధికారానికి తల ఒగ్గి 'మంచి', 'చెడు' చక్రవర్తులందరినీ సేవించడానికి సిద్ధపడ్డాడు. 'చెడు' చక్రవర్తులను తన రచనలలో విమర్శించాడు. క్రీ.శ. 100-109 మధ్య తన వ్యక్తిగత లేఖలతో కూడిన 9 సంపుటాలను ఆయన ప్రకటించాడు. వాటిలో 97 అక్టోబర్‌లో డొమీటియన్ చక్రవర్తి మరణం మొదలు 100 వ సంవత్సరం వరకూ జరిగిన సంఘటనల ప్రస్తావన ఉంది. 10 వ సంపుటంలో ట్రాజన్ చక్రవర్తికి ఆయన వ్రాసిన లేఖలూ, వాటికి ఆ చక్రవర్తి ఇచ్చిన సమాధానాలూ ఉన్నాయి.

ప్లినీ రచించిన సుదీర్ఘ లేఖలు రాజకీయ కోర్టులలో అతడు సాధించిన విజయాలను వర్ణిస్తున్నాయి. డొమీటియన్ మరణించిన తరువాత 12 సంవత్సరాలలో గల ప్రముఖ రాజకీయ వేత్తలను గూర్చి ప్లినీ చేసిన వర్ణనలు ఆ నాటి సాంఘిక చరిత్రను పునర్నిర్మించడానికి తోడ్పడుతున్నాయి. లేఖా రచనను ఒక కళారూపంగా ప్లినీ తీర్చిదిద్దాడు.

ఆధునిక కాలంలో వెలువడిన అత్యుత్తమమైన ప్లినీ లేఖల సంపుటం 'ఎమ్. షుస్టర్' సంపాదకత్వంలో వెలువడింది. (దాని ద్వితీయ ముద్రణ: 1952). 1746 లో వెలువడిన ప్లినీ లేఖల ఆంగ్లానువాదాన్ని 1915 లో డబ్ల్యూ.ఎమ్. హికిన్సన్ పరిష్కరించి రెండు సంపుటాలుగా ప్రచురించాడు.

బొ.శ్రీ.

**ప్లేటో (క్రీ.పూ. 428/427-348/347) :** ప్రాచీన గ్రీక్ మహా విద్వాంసులు ముగ్గురిలో రెండవ వాడు. ఆ ముగ్గురూ: సోక్రటీస్, ప్లేటో, అరిస్టాటిల్. ఏథెన్స్‌లోనో, ఈజినాలోనో ప్లేటో జన్మించి ఉండవచ్చును. ఒక విస్తృతమైన దార్శనిక సిద్ధాంతాన్ని ఆయన ప్రవచించాడు. నీతి, సనాతన భావాలు, లేక రూపాలు ఆయన సిద్ధాంతానికి ప్రధాన ప్రాతిపదికలు.



ఒక ధనిక కుటుంబంలో జన్మించిన ప్లేటోకు తొలి దినాలలో రాజకీయ రంగంలో అభ్యుదయం సాధించాలనే ఆశలు ఉండేవి. కాని నీతిమంతులకు రాజకీయాలు సరి అయిన రంగం కాదని ఆయన గుర్తించాడు. క్రీ.పూ. 399 లో సోక్రటీస్‌కు మరణ దండన విధించిన తరువాత మరికొందరు దార్శనికులతో పాటు ప్లేటో కూడా 'మెగారా' లో తలదాచుకొన్నాడు. తరువాత కొన్ని సంవత్సరాలపాటు గ్రీస్, ఈజిప్ట్, ఇటలీ, సిసిలీ మొదలైన ప్రాంతాలలో పర్యటించాడు. సిసిలీలో మొదటి డయొనీషియస్ చక్రవర్తి భావమరిది 'డియాన్' లో తనతో సమానధర్ముణ్ణి అతడు గుర్తించాడు. సుమారు క్రీ.శ. 387 ప్రాంతంలో ఏథెన్స్‌లో అతడు 'ది అకాడమీ' ని స్థాపించాడు. దార్శనిక వైజ్ఞానిక పరిశోధనలు చేయడం ఆ సంస్థ లక్ష్యం. జీవితాంతం ఆ అకాడమీకి ఆయన అధ్యక్షుడుగా ఉండి గణిత, ధర్మ శాస్త్రాలకు ఒక ప్రామాణికమైన సంస్థగా దానిని తీర్చి దిద్దాడు. క్రీ.శ. 367 లో మొదటి డయొనీషియస్ మరణానంతరం డియాన్

అభ్యర్థన మీద రెండవ డయొనీషియస్‌కు ట్యూటరుగా ప్లేటో సిరాక్యూస్ వెళ్లాడు. కాని చట్టబద్ధమైన రాజును విద్యావంతుణ్ణి చేయాలనే ఆ ప్రయోగం విఫలమైంది.

ప్లేటో 'అకాడమీ' ని స్థాపించి దానిని నడపడమే తన జీవిత ప్రధాన ధ్యేయంగా భావించినప్పటికీ, తరువాతి తరాలవారికి ఆయన ప్రాధాన్యం ఆయన దార్శనిక రచనలలోనే ఎక్కువగా కనిపించింది. ప్లేటో సంభాషణలు రెండు వర్గాలుగా విభజింపబడ్డాయి. మొదటి వర్గంలో సోక్రటీస్ భావనలూ, రెండవ వర్గంలో ప్లేటోనిక్ భావాలూ విస్పష్టంగా కనిపిస్తాయి. క్రీ.పూ. 348/347 లో ప్లేటో ఏథెన్స్ నగరంలో దేహయాత్ర చాలించాడు.

బొ.శ్రీ.

**ఫాక్నర్, విలియమ్ (1897-1962) :** ప్రముఖ అమెరికన్ నవలా రచయిత. *యోక్నపటోఫ* అనే రచనా పరంపర ద్వారా జగత్ప్రసిద్ధుడైనవాడు. ఆ రచనలు అమెరికాలోని దక్షిణ భాగపు సాంప్రదాయిక గాథలను, మానవ విశ్వజనీన అనుభూతులను చిత్రించాయి. సాహిత్యానికి 1949 లో ఫాక్నర్‌కు నోబెల్ బహుమతి లభించింది.



ఉత్తర మిసిసిపిలోని ఒక పల్లె ప్రాంతంలో జన్మించిన నలుగురు సోదరులలో ఫాక్నర్ పెద్దవాడు. ఫాక్నర్ కుటుంబంవారు మొదట పొరుగు మండలంలోని 'రిప్లే' కు, తరువాత ఆక్స్‌ఫర్డ్‌కు నైరృతి భాగాన 50 మైళ్ల దూరంలో ఉన్న ఒక ప్రాంతానికి తమ నివాసం మార్చారు. విలియమ్ ఫాక్నర్ తన జీవితంలో ఎక్కువ భాగం అక్కడే గడిపాడు. ఫాక్నర్ ముత్తాత కర్నల్ విలియమ్ సి. ఫాక్నర్ అంతర్యుద్ధం రోజులలో ఒక ఉన్నత పదవి నిర్వహించాడు. తరువాత రిప్లే నుంచి టెన్నిసీ వరకూ ఒక రైల్ రోడ్ నిర్మించడమే గాక *ది వైట్ రోజ్ ఆఫ్ మెర్ఫిస్* (1881) అనే శృంగార రసాత్మకమైన నవల కూడా రచించాడు. ఆ రచన 36 సార్లు పునర్ముద్రణ పొందడమే దాని ప్రజాదరణకు నిదర్శనం.

విలియమ్ ఫాక్నర్‌ను చిన్నతనంలో 'బిల్లీ' అనీ, 'మెమీ' అనీ పిలిచేవారు. ఆయన దాది ' కేరోలిన్ బార్' అతనికి వెనుకటి దాస్యపు రోజుల నాటి కథలను చెబుతూ ఉండేది. ఆక్స్‌ఫర్డ్‌లో పబ్లిక్ లైబ్రరీ లేదు. ఇంట్లో డికెన్స్ మొదలైన ప్రముఖ ఆంగ్ల రచయితల పుస్తకాలు కొన్ని ఉండేవి.

మామూలు స్కూలు చదువు అతనికి గిట్టేది కాదు. స్కూలులో చేరిన రెండవ సంవత్సరమే స్కూలు చదువు మానివేశాడు. తరువాత ఫిలిప్‌స్టోన్‌తో పరిచయం వలన సింబలిస్ట్, మోడర్నిస్ట్ పుస్తకాలెన్నో చదివాడు. ఛార్లెస్ బోద్లేర్, పాల్ వెర్లెయ్న్, స్టిఫాన్ మలార్మే (ఫాక్నర్ ఫ్రెంచ్ భాషను స్వయంగా నేర్చుకొన్నాడు), ఆస్కార్ వైల్డ్, జేమ్స్ జోయిస్, టి.ఎస్. ఎలియెట్, కాన్రాడ్ ఐకెన్‌ల రచనలు కూడా ఎక్కువగా చదివాడు.

ఫాక్నర్ కెనడా దేశపు రాయల్ వైమానిక దళంలో చేరి అతని శిక్షణ కాలం పూర్తికాకముందే యుద్ధం ఆగిపోవడంతో తిరిగి ఆక్స్‌ఫర్డ్ చేరుకొన్నాడు. తరువాత మిసిసిపి విశ్వవిద్యాలయంలో చేరి అక్కడ కాలేజ్ పత్రికకు పద్యాలు వ్రాశాడు. తరువాత 'కాగితం, పొగాకు, కిళ్లీ, కొద్దిగా విస్కీ' కొనుక్కోడానికి చాలినంత డబ్బు సంపాదించడంకోసం అనేక చిన్న చిన్న వృత్తులను చేపట్టాడు. ఫాక్నర్ తొలి రచన ఒక గ్రామీణ పద్యాల సంకలనం: *ది మార్బుల్ ఫాన్* (1924).

1925 పూర్వార్థం ఫాక్నర్ న్యూ ఆర్లియన్స్‌లో సాహితీ మిత్రుల మధ్య గడిపాడు. అక్కడ ఉండగానే అతని తొలి నవల *సోల్జర్స్ పే* వ్రాశాడు. గాయపడిన ఒక వైమానిక దళోద్యోగి జార్జియాకు తిరిగి రావడం దానిలోని కథ.

1930-42 మధ్య ఫాక్నర్ రెండు కథానికా సంకలనాలూ, *ఏ గ్రీన్ బౌ* (1933) అనే ఖండకావ్య సంపుటం, 9 నవలలూ ప్రచురించాడు. ఈ రచనలు చేస్తూనే అదే కాలంలో ఫాక్నర్ హాలీవుడ్‌లో చలనచిత్రాలకు కూడా వ్రాసేవాడు. ఫాక్నర్ నవలలలో పేర్కొనదగినవి: *ఏజ్ ఐ లే డయింగ్* (1830), *శాంక్చువరీ* (1931), *లైట్ ఇన్ ఆగస్ట్* (1932), *పైలాన్* (1935), *సార్టొరిస్, అబ్‌సలామ్ అబ్‌సలామ్* (1936), *ది అన్‌వాన్‌క్విష్డ్* (1938), *ది వైల్డ్‌పామ్స్* (1939), *ది హామ్లెట్* (1940), *గో డౌన్, మోసెస్* (1942).

1940-45 మధ్య ప్రజలలో ఫాక్నర్ ఆకర్షణ కొంత తగ్గింది. అతని నవలలలో *ది హామ్లెట్, గో డౌన్ మోసెస్* మాత్రమే పాఠకులచేత ఎక్కువగా ప్రశంసించ

బద్దాయి. కాని, తరువాత 1946 లో *ది పోర్టబుల్ ఫాక్నర్* ప్రచురణతో ఫాక్నర్ కీర్తి పెరుగసాగింది. 1948 లో ఫాక్నర్ *ఇన్‌ట్రూడర్ ఇన్ ది డస్ట్* అనే క్రొత్త నవలను వ్రాశాడు. శ్వేత జాతీయుడైన ఒక బాలుడు అభిమానం గల ఒక నీగ్రోను ప్రజల బారి నుంచి కాపాడడం దానిలోని ప్రధాన కథ.

ఫాక్నర్ పెరూ, బ్రెజిల్ (1954), జపాన్, ఫిలిప్పీన్స్, పశ్చిమ యూరప్ (1955), గ్రీస్ (1957), వెనిజులా (1961) మొదలైన దేశాలలో విస్తృతంగా పర్యటించాడు.

చివరిరోజులలో ఫాక్నర్ చేసిన రచనలు: *ది టౌన్* (1957), *ది మాన్షన్* (1959), *ది రైవర్స్* (1962). *ది రైవర్స్* (Reivers) ఫాక్నర్ చేసిన చిట్టచివరి రచన. అది తన చిన్ననాటి స్మృతులను గుర్తుచేసుకొనే ఒక కామెడీ. మిసిసిపీలోని ఆక్స్‌ఫర్డ్‌లో 1962 జూలై 6 న ఫాక్నర్ మరణించడానికి ఒక నెల రోజుల ముందు అది వెలువడింది. హెమింగ్వే తరువాత ఒక సంవత్సరానికి ఫాక్నర్ మరణించడంతో అమెరికన్ నవలా రచనను సుసంపన్నం చేసిన ఒక గొప్ప తరం అంతరించి పోయింది.

*నాగరాజ్(బా.శ్రీ.)*

**ఫాక్స్, జాన్ (1516-1587)** : ఇంగ్లీష్ ప్యూరిటన్ మత బోధుకుడు. ప్రొటెస్టెంటిజమ్ కోసం అనేక యాతనలను అనుభవించిన వారిని గూర్చి *ది బుక్ ఆఫ్ మార్టిర్స్* అనే గ్రంథం రచించినవాడు. ఆ గ్రంథం బహుళ జనాదరణ పొంది, ఇంగ్లీష్ ప్యూరిటన్‌ల గృహాలలో బైబిల్ తరువాత అంత పవిత్రమైన గ్రంథంగా ఆరాధించబడుతూంది. కనీసం ఒక శతాబ్దం పాటు రోమన్ కేతలిసిజమ్‌ను గూర్చిన ప్రజాభిప్రాయానికి అది రూపకల్పన చేసింది. 14 వ శతాబ్దం మొదలు తన కాలంలో మొదటి మేరీ రాణి పాలన వరకూ ఇంగ్లీష్ ప్రొటెస్టెంట్‌లు అనుభవించిన కడగండ్లను ప్రధానంగా ఆ గ్రంథం చిత్రించింది.

ఆక్స్‌ఫర్డ్‌లో విద్యాభ్యాసం చేసి 7 సంవత్సరాల పాటు అక్కడ ఫెలోగా ఉన్న తరువాత తీవ్రమైన ప్రొటెస్టెంట్ భావాలు కలవాడనే అనుమానం ఆ కాలేజ్ అధికారులకు కలిగింది. 1547 లో అతడు ఆ ఫెలోషిప్‌కు రాజీనామా చేసి, లండన్ చేరి డ్యూక్ ఆఫ్ నార్ఫక్ మనుమలకు ట్యూటర్‌గా కుదిరాడు. ఫాక్స్ 'రిఫర్మేషన్' ఉద్యమాన్ని సమర్థిస్తూ అనేక రచనలు చేశాడు. 1553 లో మొదటి మేరీరాణి సింహాసనం ఎక్కిన తరువాత అతడు విదేశాలకు పారిపోవలసి వచ్చింది. స్ట్రాస్‌బోర్గ్‌లో మృతవీరులను గూర్చి అతడు చేసిన పాక్షిక రచనను లాటిన్ భాషలో *కామెంటెరై రేరమ్ ఇన్ ఎక్లిసియా జెస్టారమ్* (1554) అనే శీర్షికతో ప్రచురించారు. తరువాత ఫాక్స్ ఫ్రాంక్‌ఫర్ట్ వెళ్లి జాన్‌నాక్స్ నడుపుతున్న కాల్వినిస్టిక్ పార్టీకి సంహాయం చేశాడు. అనంతరం స్విట్జర్లాండ్‌లోని బేసల్ చేరి ప్రూఫులు దిద్దుతూ చాలీచాలని ఆదాయంతో కొన్నాళ్లు గడిపాడు. బేసల్‌లో ఉన్న రోజులలోనే ప్రొటెస్టెంట్‌లను పీడించకుండా రాణిని నిరోధించవలసిందిగా ఒక ఆవేశపూరితమైన విజ్ఞప్తిని ఫాక్స్ రచించాడు. 1557 లో అది ప్రచురితమైంది.

1559 లో ప్రొటెస్టెంట్ రాణీ మొదటి ఎలిజబెత్ అధికారంలోకి వచ్చిన తరువాత ఫాక్స్ లండన్ తిరిగి వచ్చి, తన *ది బుక్ ఆఫ్ మార్టిర్స్* రచన పూర్తి చేశాడు. దాని ఆంగ్లానువాదం మార్చి 1563 లో ప్రకటించబడింది. ఆ గ్రంథానికి 1570 లో ద్వితీయ ముద్రణ, 1576 లో తృతీయ ముద్రణ, 1583 లో చతుర్థ ముద్రణ వెలువడ్డాయి. ఈ ముద్రణలలో ఫాక్స్ ఎన్నో చేర్పులూ, మార్పులూ చేశాడు.

1560 లో ఫాక్స్ ఆంగ్లికన్ మతబోధకుని దీక్ష స్వీకరించాడు. పాల్స్‌క్రాస్ వద్ద అతడు చేసిన బోధనా ప్రసంగం *ఏ సెర్మన్ ఆఫ్ క్రైస్ట్ క్రూసిఫైడ్* (1570) విరివిగా అమ్ముడు పోయింది. 1563 లో ప్లేగ్ జాడ్యం సంభవించనప్పుడు వ్యాధి పీడితులను ఓదారుస్తూ అతడు ఒక ఉదాత్తమైన రచన చేశాడు. ఎలిజబెత్ రాణికీ, ఆమె సలహాదారులకూ ఫాక్స్ నష్టపరిహారం అర్థిస్తూ ఆవేశ పూరితమైన లేఖలు వ్రాశాడు.

లండన్‌లోని క్రిపుల్ గేట్‌లో 1587 ఏప్రిల్ 18 న జాన్ ఫాక్స్ మరణించాడు.

*బా.శ్రీ.*

**ఫార్క్‌హార్, జార్జ్ (1678-1707)** : ఐరిష్ నాటక రచయిత. 18 వ శతాబ్ది ప్రారంభంలో ఇంగ్లీష్ నాటకరంగంకోసం శక్తిమంతమైన హాస్య రూపకాలు రచించినవాడు. సంభాషణలలోని మౌలికత, స్వయంగా నటుడు కావడం వల్ల సాధించిన రంగస్థల యోగ్యత ఆయన సమకాలికులలో విలక్షణ నాటక రచయితగా ఆయనను నిరూపించాయి.

ఒక మతోద్యోగి కుమారుడైన ఫార్క్‌హార్ డబ్లిన్‌లోని ట్రినిటీ కళాశాలలో చేరాడు. కాని తన శక్తి యుక్తులన్నీ డబ్లిన్‌లోని స్మాక్ ఆలీ థియేటర్‌లో నటుడుగా రాణించడానికే వినియోగించి, చివరికి దానిలో విఫలుడయాడు. అనంతరం నటన వృత్తిని పరిహరించి తనతో

నటించిన ప్రముఖ నటుడు రాబర్ట్ విల్క్స్ సలహా మీద ఫార్క్వహార్ కామెడీ రూపకాలను రచించడంకోసం లండన్ వెళ్లాడు. ఆయన తొలి నాటకాలు విజయవంతం అయాయి. తన నాటకాలలోని విదూషక పాత్రలను ద్వేషించకుండా ఫార్క్వహార్ వాటిని చూసి ఆనందించే వాడు.

ఫార్క్వహార్ తొలి రూపకం *లవ్ అండ్ ఏ బాటిల్* 1699 లో లండన్‌లోని డ్రూరీ లేన్ థియేటర్‌లో ప్రదర్శింపబడి విజయవంతం కావడంతో ఆ ఏడాదే *ది కాన్‌స్టెంట్ కపుల్* అనే మరొక రూపకం కూడా అతడు వ్రాశాడు. 1701 లో *సర్ హారీ విల్ డెయిర్* వెలువడింది. 1702-1704 మధ్య *ది ఇన్‌కాన్‌స్టెంట్* (జాన్ ఫ్లెచర్ వ్రాసిన *వైల్డ్ గూస్ ఛేజ్* కి అనుసరణ), *ది ట్విన్ రైవల్స్*, ఫ్రెంచ్ నుంచి యథేచ్ఛానువాదం చేసిన *ది స్టేజ్ కోచ్* అనే రూపకాలను రచించాడు. తరువాత 1706 వరకూ ఫార్క్వహార్ ఏ నాటకాలూ రచించలేదు. బహుశః ఆ సమయంలో అతడు సైనికుడుగా పనిచేసి ఉండవచ్చును. 1703 లో పెద్ద ఆస్తి ఉన్నదనే భ్రమతో ఒక యార్క్‌షైర్ స్త్రీని ఫార్క్వహార్ వివాహమాడాడు.

ఇంగ్లీష్ నాటక రంగానికి ఫార్క్వహార్ అందచేసిన గొప్ప కానుక 1706 లో వెలువడిన *ది రిక్రూటింగ్ ఆఫీసర్.* ఆ మరుసటి సంవత్సరం *ది బ్యూక్ స్ట్రెటజెమ్* వెలువడింది. ఈ నాటకాలలో ఎలిజబెతన్ నాటక రచయితలకు సహజమైన శబ్దశక్తీ, పాత్రలపై రచయిత ప్రీతీ వ్యక్తం అయాయి. *ది బ్యూక్ స్ట్రెటజెమ్* నాటకాన్ని అవసానదశలో మంచం మీద ఉండి ఫార్క్వహార్ పూర్తి చేశాడు. హే మార్కెట్ థియేటర్‌లో అది ప్రదర్శింపబడిన కొద్ది రోజులకే 1707 ఏప్రిల్ 29 న లండన్‌లో ఫార్క్వహార్ మరణించాడు.

బొ.శ్రీ.

**ఫిట్జెరాల్డ్, ఎడ్వర్డ్ (1809-1883) :** ప్రముఖ ఆంగ్లకవి. ఓమర్ ఖయ్యాం వ్రాసిన *రుబాయత్* లకు ఈయన చేసిన ఆంగ్ల స్వేచ్ఛానువాదం ఇంగ్లీష్‌లోని స్వతంత్ర కావ్యాలతో సమానమైన ప్రతిపత్తిని పొందింది. 12 వ శతాబ్దికి చెందిన పర్షియన్ కవి ఓమర్ ఖయాం రచించిన పద్యాలలో కొన్నింటిని ఎంచుకొని వాటిని స్వేచ్ఛగా ఈయన ఆంగ్లీకరించాడు. ఈయన రచనలో నుంచి ఎన్నెన్నో పంక్తులు తరచు నిత్య వ్యవహారంలో కూడా ఉదాహరించబడుతూ ఉంటాయి. 'ఏ జగ్ ఆఫ్ వైన్, ఏ లోఫ్ ఆఫ్ బ్రెడ్, అండ్ దౌ' (ఒక సారా పాత్ర, ఒక రొట్టె, ఎదురుగా నీవు), 'ది మువింగ్ ఫింగర్ రైట్స్' (కదలే వ్రేళ్లు లిఖిస్తున్నాయి) వంటి వాక్యాలు అలాంటివి.

సఫక్‌లోని వుడ్‌బ్రిడ్జ్ సమీపంలో గల బ్రెడ్‌ఫీల్డ్‌లో 1809 మార్చి 31 న ఫిట్జెరాల్డ్ జన్మించాడు. కేంబ్రిడ్జ్ లోని ట్రినిటీ కళాశాలలో విద్యాభ్యాసం చేశాడు. అక్కడే 'థాకరే' తో జీవితాంతం నిలచి ఉన్న గాఢ మైత్రి ఆయనకు ఏర్పడింది. 1830 లో పట్టభద్రుడైన తరువాత వుడ్‌బ్రిడ్జ్‌లో ఆయన ప్రశాంతంగా జీవితం గడిపాడు. ప్రధానంగా ఏకాంత వాసం చేస్తున్నా టెన్నిసన్, కార్లైల్ వంటి రచయితలతో ఆయనకు గాఢమైన మైత్రి ఏర్పడింది. వారితో తరచు ఆయన ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూ ఉండేవాడు.

సంకోచంతో, అతి మందగతితో రచనలు చేసిన ఫిట్జెరాల్డ్ కొన్ని రచనలను పేరు లేకుండా ప్రకటించాడు. తరువాత 1853 లో *సిక్స్ డ్రామాస్ ఆఫ్ కాల్డెరాన్* అని ఒక యథేచ్ఛానువాదం చేశాడు. అటు పిమ్మట ఆయన దృష్టి ప్రాచ్య దేశాల వైపు మళ్లింది. పర్షియన్ భాష నేర్చుకున్నాడు. *ఓమర్ ఖయాం* అనువాదంలో ప్రధానంగా ఆ కవి చిత్తవృత్తినీ, భావననూ మాత్రమే అనువదించడానికి ఫిట్జెరాల్డ్ పూనుకున్నాడు. ఆంగ్ల పాఠకులకు అర్థమయ్యే తీరులో తన స్వంత ప్రతీకలను ఆయన వాడాడు.

1859 మార్చి నెలలో చాలా సాధారణమైన చిన్న ప్రచురణగా *రుబాయత్* వెలువడింది. 1860 వరకూ అది పాఠకుల దృష్టిని విశేషంగా ఆకర్షించలేదు. మొదట డి.జి. రోజెట్టి, తరువాత స్విన్‌బర్న్ కవులు ఆ రచనలోని విశిష్టతను గుర్తించారు.

1883 జూన్ 14 న నార్ఫక్ రాష్ట్రంలోని మెర్టన్‌లో ఫిట్జెరాల్డ్ తన దేహయాత్ర చాలించాడు. (చూ. ఓమర్ ఖయాం.)

బొ.శ్రీ.

**ఫిట్జెరాల్డ్, ఎఫ్. స్కాట్ (1896-1940):** అమెరికన్ కథానికా రచయిత, నవలా రచయిత. 1920-30 నాటి 'జాజ్' యుగ చిత్రణకు ప్రసిద్ధి పొందినవాడు. మిక్కిలి ప్రతిభావంతమైన అతని నవల *ది గ్రేట్ గాట్స్‌బీ* (1925). అమెరికా, ఫ్రాన్స్‌లలో తన భార్య జెల్డాతో ఫిట్జెరాల్డ్ గడిపిన వ్యక్తిగత జీవితం కూడా అతని నవలలంత ప్రసిద్ధి పొందింది.

ఫిట్జెరాల్డ్ తీవ్రమైన భావనాశక్తి గల కాల్పనిక రచయిత. సెంట్‌పాల్ అకాడమీ (1908-10) లోనూ,

న్యూమన్ స్కూల్ (1911-13) లోనూ అతడు ఎంత తీవ్రంగా ప్రయత్నించినా జనరంజకత్వం సాధించలేక పోయాడు. కాని, ప్రిన్స్టన్‌లో మాత్రం ప్రతిభావంతమైన విజయాన్ని గూర్చి అతడు కన్న కలకు కొంత చేరువగా వచ్చాడు. ఆ యూనివర్శిటీలో ప్రముఖ వ్యక్తులలో ఒకడై, ఎడ్మండ్ విల్సన్, జాన్ పీల్ బిషప్‌లతో జీవితాంతం నిలచి ఉండే ప్రగాఢమైన మైత్రిని సంపాదించాడు.

1917 లో ఫిట్జెరాల్డ్ సైన్యంలో చేరాడు. 'మాంట్ గొమరీ' సమీపం లో 'ఆలా' వద్ద అలబామా సుప్రీం కోర్ట్ న్యాయమూర్తి కుమార్తె [illegible]సెయిర్‌ను అతడు కలుసుకున్నాడు. వారు పరస్పరం [illegible]గా ప్రేమిం చుకొన్నారు. ఫిట్జెరాల్డ్ న్యూయార్క్[illegible]క్కడ స్వల్పకాలంలో విజయం సాధించి [illegible]ల్డాను వివా[illegible]మా డాలని సంకల్పించాడు. కాని, అది సాధ్యం కాలేదు. తరువాత సెంట్‌పాల్‌లో వెనుక తాను ప్రిన్‌స్టన్‌లో ఉండగా ఆరంభించిన నవలను పూర్తిచేసి, 1920 లో దానిని ప్రకటించిన తరువాత గాని జెల్డాను వివాహం ఆడడం పడలేదు.

ఫిట్జెరాల్డ్ రచనలలో చెప్పుకోదగినవి : *దిస్ సైడ్ ఆఫ్ పేరడైజ్* (1920), *ది బ్యూటిఫుల్ అండ్ డామ్డ్* (1922), *ది గ్రేట్ గాట్స్‌బీ* (1925), *టెండర్ ఈజ్ ది నైట్* (1934), *ది లాస్ట్ టైకూన్* (1939).

*దిస్ సైడ్ ఆఫ్ పేరడైజ్* నవలతోనే ఫిట్జెరాల్డ్‌కు మొదట మంచి కీర్తి వచ్చింది. సాహిత్య గౌరవం గల *స్క్రిబ్నర్స్, ది శాటర్ డే ఈవెనింగ్ పోస్ట్* వంటి పత్రికలకు వ్రాసే అవకాశం లభించింది. ఫిట్జెరాల్డ్, జెల్డాలు సంతోషంగా జీవితాన్ని గడుపసాగారు.

1924 లో ఫిట్జెరాల్డ్ దంపతులు 'రివీరా' చేరి అక్కడ సరి అయిన ఆదరణ లభించకపోవడంతో అక్కడ నుంచి ఫ్రాన్స్ వెళ్లారు. తరువాతి దశాబ్దం ఫిట్జెరాల్డ్ దంపతులకు అంత సుఖంగా గడవలేదు. ఫిట్జెరాల్డ్ త్రాగుడు వ్యసనానికి లోనయాడు. జెల్డా రాత్రీ పగలూ కూడా 'బాలే' నాట్యం చేయసాగింది. 1930 లో ఒకసారి, 1932 లో మరొకసారి ఆమె మానసిక వ్యాధికి గురి అయింది. 'జెల్డాను చేర్చిన శానిటోరియం చుట్టూ తిరుగుతూ నేను ఆశతో బ్రతికే శక్తిని కోల్పోయాను' అంటాడు ఫిట్జెరాల్డ్.

అమెరికన్ సాహిత్యంలో 1920-30 దశాబ్దానికి ముఖ్యంగా ప్రాతినిధ్యం వహించే నవలా రచయిత ఫిట్జె రాల్డ్. ఆ దశాబ్దిలోనే ఫాక్నర్, హెమింగ్వే, సింక్లెర్ లూయిస్, జాన్ డాస్ పాసోస్, ఎజ్రా పౌండ్, టి.ఎస్. ఎలియెట్‌లు ప్రసిద్ధిలోకి వచ్చారు. అది ఒక రకంగా అమెరికన్ సాహిత్య పునరుజ్జీవనదశ అనవచ్చును.

1940 డిసెంబర్ 21 న హాలీవుడ్‌లో ఫ్రాన్సిస్ స్కాట్ ఫిట్జెరాల్డ్ దేహయాత్ర చాలించాడు.

బొ.శ్రీ.

**ఫిట్జెరాల్డ్, రాబర్ట్ డేవిడ్ (1902-1987) :** ఆస్ట్రేలియన్ కవి. పద్యశిల్పానికీ, భావ గాంభీర్యానికీ ప్రసిద్ధి చెందినవాడు.

1902 ఫిబ్రవరి 22 న న్యూ సౌత్ వేల్స్‌లోని హంటర్స్ హిల్‌లో జన్మించిన రాబర్ట్ ఫిట్జెరాల్డ్ సిడ్నీ విశ్వవిద్యాలయంలో సైన్స్ అధ్యయనం కోసం చేరాడు. కాని తరువాత రెండేళ్లకే చదువు మాని, ఫిజీ దీవులలో సర్వేయర్‌గా వెళ్లాడు. ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలో న్యూ సౌత్ వేల్స్‌లో ఇంజనీరింగ్ సర్వేయర్‌గా పనిచేశాడు.

ఫిట్జెరాల్డ్ కవితా రచనలు 1922 లో *టు మీట్ ది సన్* తో ఆరంభమై, 1938 లో వెలువడిన *మూన్ లైట్ ఏకర్* వరకూ క్రమ పరిణతి పొందాయి. *ఎస్సే ఆన్ మెమరీ* అనే రచనకు ఫిట్జెరాల్డ్‌కు జాతీయ బహుమతి లభించింది. *బిట్వీన్ టు టైడ్స్* (1952) అనే ఒక సుదీర్ఘమైన తాత్త్విక కావ్యంలోను, *ఫార్టీ యియర్స్ పొయెమ్స్* లోను కవి భావనాశక్తి పరా కాష్ఠ నందుకొంది. *ది ఎలిమెంట్స్ ఆఫ్ పొయెట్రీ* (1963) అనే ఒక విమర్శక రచనను, *ఆఫ్ ప్లేసెస్ అండ్ పొయెట్రీ* (1976) అనే వ్యాస సంపుటిని కూడా ఫిట్జెరాల్డ్ ప్రకటించాడు.

బొ.శ్రీ.

**ఫిర్దౌసీ (935-1020/26) :** పర్షియా దేశపు ప్రముఖకవి. 'షానామా' (రాజుల కథ) అనే మహాకావ్యం రచించినవాడు. అంతకు పూర్వం ఉన్న ఒక వచన గ్రంథాన్ని ఆధారంగా చేసి కొన్నా, దానికి ఆయన అజరామరమైన కవితా రూపం ఇచ్చాడు. ప్రాచీన నగరమైన ట్యూస్ పరిసరాలలో ఒక గ్రామంలో ఫిర్దౌసీ జన్మించాడు. అనం



తర శతాబ్దాలలో అతని జీవితాన్ని గురించి అనేక కథలూ గాథలూ వెలసినా, అతని వాస్తవ జీవిత గాథను గూర్చిన వివరాలు ఏమీ మనకు స్పష్టంగా తెలియవు. తన కావ్యంలో అక్కడక్కడ తనను గూర్చి చేసికొన్న ప్రస్తావనల వలనను, అతడు చనిపోయిన తరువాత వందేళ్ల లోపున 1116 లోనో, 1117 లోనో ఫిర్దౌసీ సమాధిని సందర్శించిన 12 వ శతాబ్ది నాటి కవి నెజామి-యే అరూజి అతని జన్మస్థలంలో తాను విన్న వృత్తాంతాలు ఆధారంగా చేసిన రచన వలనను మాత్రమే ఫిర్దౌసీ జీవితాన్ని గురించిన కొన్ని అంశాలు మనకు తెలియ వస్తున్నాయి. నెజామి రచనను అనుసరించి ఫిర్దౌసీ ఒక భూస్వామి. ఆయనకు ఒక్కతే కుమార్తె. ఆమెకు తగిన కట్నం ఇచ్చి వివాహం చేయడం కోసమే తన జీవితంలో 35 సంవత్సరాల పాటు కృషిచేసి *షానామా* అనే మహాకావ్యాన్ని అతడు రచించాడు. దానిలో 60,000 ద్విపదలు ఉన్నాయి. తన చిన్ననాడు ట్యూస్ నగరం లోనే అదే పేరుతో రచింపబడిన ఒక వచన గ్రంథం అతనికి ఆధారం. ఆ వచన గ్రంథం *ఖ్వాటాయ్‌నామక్* అనే పహ్లవీ (మధ్య పర్షియన్) లోని ఒక చారిత్రక గ్రంథానికి అనువాదం.

*షానామా* రచన 1010 లో పూర్తి అయింది. సుల్తాన్ గజనీ మహమ్మద్‌కు వెంటనే ఫిర్దౌసి దానిని సమర్పించాడు. కవికీ, అతని రాజపోషకునికీ మధ్యగల సంబంధాలను గురించి అనేక పుక్కిటి పురాణాలు వెలశాయి. నెజామి రచనను అనుసరించి ఫిర్దౌసీ స్వయంగా ఘజ్నా వచ్చి 'అహ్మద్ ఎబ్న్ హసన్ మెయ్ మండి' అనే మంత్రి సహాయంతో దానిని ప్రతి తీసికొనడానికి సుల్తాన్ అంగీకారం సంపాదించాడు. కాని, దురదృష్ట వశాత్తు కవికి ఈయవలసిన పారితోషికాన్ని గురించి ఆ మంత్రి విరోధులను సుల్తాన్ సంప్రదించాడు. వారు ఫిర్దౌసీకి 50,000 దీనారాలను ఈయవలసినదని సూచించారు. అది కూడా ఎక్కువే అని వారన్నారు. చివరికి ఫిర్దౌసీకి 20,000 దీనారాలు ముట్టాయి. ఫిర్దౌసీ నిరాశోపహతుడై శహాబాద్ షారేయార్ కొలువులో తల దాచుకొన్నాడు. అక్కడ ఫిర్దౌసీ సుల్తాన్ మహమ్మద్ మీద 100 వ్యంగ్య పరిహాస పద్యాలు రచించి దానిని షారేయార్‌కు వినిపించాడు. షారేయార్ ఆ కావ్యాన్ని మహమ్మద్‌కే అంకితం చేయవలసిందని సలహా యిస్తూ ఆ నూరు వ్యంగ్య పరిహాస పద్యాలకూ పద్యానికి 1000 దీనారాలను చెల్లించి ఆ పద్యాలను తన కావ్యం నుంచి తొలగించవలసిందని కోరాడు. ఫిర్దౌసీ ఆ 100 పద్యాలనూ నాశనం చేసినా, నెజామి కాలం నాటికి వాటిలో 6 పద్యాలు ప్రచారంలో ఉన్నట్లు అతడు వ్రాశాడు.

వార్థక్యంలో ఫిర్దౌసీ కవి పశ్చిమ పర్షియాలో గాని, బాగ్దాద్‌లో గాని గడపినట్లు ఇటీవలి వరకూ భావింపబడుతూ వచ్చింది. కాని నెజామి కథనం ప్రకారం ఆయన చివరిరోజులు ట్యూస్‌లోనే గడచాయి. గజనీ మొహమ్మద్ ఇండియాపై దాడిచేసి తిరిగి వస్తూ ఫిర్దౌసీ పట్ల తన ప్రవర్తనకు పశ్చాత్తప్తుడై 60,000 దీనారాల విలువచేసే నీలిమందు దివాణపు ఒంటెల మీద ఫిర్దౌసీకి పంపవలసిందని ఆదేశించాడట. కాని ఆ ఒంటెలు ఒక ట్యూనిస్ నగరద్వారం గుండా నగరంలో ప్రవేశించే సమయానికి మరొక ద్వారం గుండా ఫిర్దౌసీ శవం బయటికి పోయినట్లు తెలుస్తూంది. ఫిర్దౌసీ కుమార్తె సుల్తాన్ పంపిన కానుకను నిరాకరించింది. చివరికి ఆ ధనాన్ని ట్యూస్ నగరపు సరిహద్దులోని ఒక విశ్రాంతి మందిరానికి మరమ్మత్తులు చేయడానికి వినియోగించారు. ఫిర్దౌసీ ఏ సంవత్సరంలో మరణించిందీ నెజామి స్పష్టంగా తెలుపలేదు. 1020 నుంచి 1026 మధ్య ఆ మహా కవి మరణించి ఉండవచ్చునని తరువాతి రచయితలు పేర్కొన్నారు. ఏది ఏమైనా ఫిర్దౌసీ 80 సంవత్సరాలు జీవించాడని మాత్రం నిస్సందేహంగా చెప్పవచ్చును.

బొ.శ్రీ.

**ఫీల్డింగ్, హెన్రీ (1707-1754) :** ప్రముఖ ఇంగ్లీష్ నవలా రచయిత, నాటక రచయిత. శామ్యుయెల్ రిచర్డ్‌సన్‌తో పాటు ఇంగ్లీష్ నవలకు శ్రీకారం చుట్టిన వాడని ప్రసిద్ధి. ఈయన నవలలలో సుప్రసిద్ధమైనవి: *జోసెఫ్ ఆండ్రూస్* (1742), *టామ్‌జోన్స్* (1749).

మార్ల్‌బరోడ్యూక్, 18 వ శతాబ్ది ఆరంభంలో జనరల్ అయిన జాన్ చర్చిల్ వద్ద పని చేసిన కర్నల్ ఎడ్మండ్ ఫీల్డింగ్ ఈ హెన్రీ ఫీల్డింగ్‌కు తండ్రి. ఇతని తల్లి క్వీన్స్ బెంచ్ న్యాయమూర్తి సర్ హెన్రీ గౌడ్ కుమార్తె. ఆయన నుండి డోర్‌సెట్‌లోని ఈస్ట్‌స్టార్‌లో ఈమెకు ఆస్తి సంక్రమించింది. హెన్రీ ఫీల్డింగ్ మూడేండ్లవాడుగా ఉండగా అతని కుటుంబంవారు ఈస్ట్ స్టార్‌కు మారారు. అతని 11 వ పుట్టిన రోజునకు కొద్ది దినాల ముందు అతని తల్లి మరణించగా అతని తండ్రి పునర్వివాహం చేసికొన్నాడు. హెన్రీ ఫీల్డింగ్ ఈటన్ కాలేజ్‌లో చేరి అక్కడే సాహిత్య ప్రీతి, ప్రాచీన ఉద్గ్రంథాలతో తగినంత పరిచయం సంపాదించుకొన్నాడు.

తన 17 వ ఏట స్కూల్ చదువుకు స్వస్తి చెప్పి విలాస పురుషుడుగా తిరుగుతూ నాలుగేళ్లు గడిపి, అనంతరం హాలండ్‌లోని లైడన్ విశ్వవిద్యాలయంలో చేరి, 18 నెలలు సాహిత్యాధ్యయనం చేశాడు. తండ్రి అతని చదువుకు డబ్బు పంపే స్థితిలో లేకపోవడం వలన నాటక రచయితగా స్థిరపడ్డాడు. మొత్తం అతడు 25 నాటకాలు వ్రాశాడు. రంగస్థలం మీద అవి విజయవంతం కాక పోయినా వాటిలోని ప్రతిభ మాత్రం ఎవ్వరూ కాదనరానిది. ప్రధానంగా అతడు వ్యంగ్య పరిహాస రచయిత. తన కాలంనాటి రాజకీయ అవినీతిని అతడు నిశితంగా విమర్శించాడు. 1737 లో లండన్‌లోని లిటిల్ థియేటర్‌లో తన *హిస్టారికల్ రిజిస్టర్ ఫర్ ది ఇయర్ 1736* అనే నాటకం ప్రదర్శింప చేశాడు. దానిలో అప్పటి ప్రధాని సర్ రాబర్ట్ వాల్పోల్‌ని నిర్దాక్షిణ్యంగా అతడు పరిహసించాడు. ప్రధానికి కోపం వచ్చి పార్లమెంట్ చేత లైసెన్స్ లేనిదే నాటకాలు ప్రదర్శింపరాదనే లైసెన్సింగ్ ఆక్ట్ పాస్ చేయించాడు. దానితో నాటక రచనకు ఫీల్డింగ్ స్వస్తి చెప్పవలసి వచ్చింది. 1734 లో ఇతడు చార్లట్ క్రాడక్‌ను వివాహం ఆడాడు. తరువాత న్యాయశాస్త్రం చదివి పట్టా పొందాడు. అయితే న్యాయవాదిగా అతడు విజయం సాధించలేకపోయాడు.

1740 లో శామ్యుయెల్ రిచర్డ్‌సన్ *పమేలా లేక వర్చ్యూ రివార్డెడ్* అనే నవలను ప్రచురించాడు. అది అసాధారణమైన విజయం సాధించింది. 1741 లో ఆ నవలను వ్యంగ్యంగా పరిహాసం చేస్తూ *ఏన్ అపాలజీ ఫర్ ది లైఫ్ ఆఫ్ మిసెస్ పమేలా ఆండ్రూస్* అనే రచన ఆకాశరామన్న పేరుతో అతడు ప్రచురించాడు. ఆ రచన చేసినవాడు హెన్రీ ఫీల్డింగేనని అతని జీవితకాలంలోనే నిర్ధారణ అయింది. ఫీల్డింగ్ రచించిన *జోసెఫ్ ఆండ్రూస్* రచనతో దానికి పోలికలున్నాయి.

హెన్రీ ఫీల్డింగ్ రచనలలో ప్రధానమైనవి: *మిసిలినీస్* (1743-3సంపుటాలు), *ఏ సీరియస్ అడ్రెస్ టు ది పీపుల్ ఆఫ్ గ్రేట్ బ్రిటన్* (1745), *అమీలియా, ది జర్నల్ ఆఫ్ ఏ వాయేజ్ టు లిస్బన్.*

19 వ శతాబ్ది ఆంగ్ల నవలా రచయిత సర్ వాల్టర్ స్కాట్ ఫీల్డింగ్‌ని 'ఇంగ్లీష్ నవలకు పితామహుడు' అని అభివర్ణించాడు. నిజానికి అతడే తొలి ఇంగ్లీష్ నవలా రచయిత కాకపోయినా, నవలా రచనలో ఒక క్రమ పద్ధతినీ, శిల్పాన్నీ అతడే ప్రవేశ పెట్టాడు. నవలా రచనలో ఆయన ప్రవేశపెట్టిన వాస్తవికత 19 వ శతాబ్ది చివరి వరకూ కొనసాగింది. తన కాలపు చరిత్ర రచయితగానూ, విమర్శకుడుగానూ కూడా ఫీల్డింగ్ కీర్తింప బడ్డాడు. 1754 అక్టోబర్ 8 న హెన్రీ ఫీల్డింగ్ లిస్బన్ నగరంలో తుది శ్వాస విడిచాడు.

బొ.శ్రీ.

**ఫుజివారా, సదాయ్ (1162-1241) :** ప్రముఖ జపనీస్ కవి, సాహిత్య విమర్శకుడు. ఇతనిని 'టేయికా' అనీ, 'ఫుజివారా టేయికా' అనీ కూడా అనేవారు. తన యుగంలో మహామహులైన కవులలో ఈయన ఒకడు. అధునాతన యుగం దాకా జపనీస్ సాహిత్యంపై అమిత ప్రభావం ప్రసరించిన గొప్ప సాహిత్య విమర్శకుడు.

జపాన్ చరిత్రలోని రాచరిక యుగపు కవితా సప్తమ సంకలనం సెన్జాయిషు (Sen zaishu- 1188;) వేయేళ్ల కవితా సంకలనం) సంకలనకర్త అయిన 'షన్జయి' (టోషి నారి, 1114-1204) కి పుత్రుడూ, కవితా వారసుడూ అయిన ఫుజివారా తండ్రి సంపాదించిన కవితా ప్రతిష్ఠను పరిపుష్టం చేసుకోడమే గాకుండా రాజకీయ రంగంలో కూడా తన కుటుంబానికి ఔన్నత్యం సంపాదించాలని ప్రయత్నించాడు. కాని 50 ఏళ్లు పైబడే వరకూ రాజకీయ రంగంలో ఆయన ఎక్కువ అభ్యుదయం సాధించలేకపోయాడు.

టేయికా చక్కని వ్యుత్పత్తి గల మౌలిక కవి. ఆయన ఆదర్శమైన 'యోయెన్' (అలౌకిక సౌందర్యం) జపనీస్ కవితా సంప్రదాయానికి అసాధారణమైన సోయగాన్ని కూర్చింది. అలౌకిక సౌందర్యంతో కూడిన తన కావ్యాలలో 'టేయికా' సాంప్రదాయికమైన భాషనే ఆత్యాశ్చర్య జనకమైన నూతన రీతులలో ప్రయోగించాడు.

టేయికా కావ్యాలు యువకుడూ, చక్కని కవిత్వాభిరుచి కలవాడూ అయిన మాజీచక్రవర్తి 'గోటోబా' (1180-1239) ప్రశంసల నందుకున్నాయి. ఆ మాజీ చక్రవర్తి అష్టమ ఇంపీరియల్ కవితా సంకలనం *షిన్ కొకిన్*-షు కు సంగ్రాహకులలో ఒకడుగా ఫుజివారాను నియమించాడు. తరువాత 1232 లో ఆ సంకలనానికి ఫుజివారా ప్రధాన సంగ్రాహకుడు అయాడు. వరుసగా రెండు కవితా సంపుటాలకు సంగ్రాహకుడుగా పనిచేసిన మొదటి వ్యక్తి అనే ఘనత ఆయనకు దక్కింది.

తన 40 వ, 50 వ సంవత్సరాల మధ్య టేయికాలో ఒక ఆంతరంగిక సంఘర్షణ చెలరేగి అది ఆయన కవితా లక్ష్యాలలో మార్పు తెచ్చింది. చివరి రోజులలో ఆయన ప్రధాన కవితా లక్ష్యం 'యూషిన్' (అనుభూతి ప్రత్యగ్రత). ఈ భావనలో కవిత్వం సరళంగానూ, సూటిగా పాఠకుల హృదయాలను తాకేది గానూ ఉండాలి. ఈ

దశలో టెయికా రచించిన కావ్యాలు ప్రజలను ఎక్కువగా కదలించాయి. అయితే, ఈ దశలో ముఖ్యంగా టెయికా విమర్శకుడుగానూ, సంపాదకుడుగానూ, విద్వాంసుడుగానే ఎక్కువ కాలం గడిపాడు.

టెయికా రచించిన విమర్శక వ్యాసాలలో ప్రధానమైనవి: *ఐగాబైగె* (కవితా రచన ప్రధాన సూత్రాలు), *షుకానో దైతై* (మహా కావ్య ప్రధాన లక్షణాలు), *హ్యాకూనెన్ ఇషు* (వంద మంది కవుల చాటువులు), *కిందైషూకా* (1909; సమకాలీన పద్య రత్నాలు), *మైగెట్ సుషో* (1219; నెలసరి నోట్సు).

శ్రీ.వ.చ.రా.(బొ.శ్రీ.)

**ఫుయెంటస్, కార్లోస్ (1928) :** మెక్సికన్ నవలా రచయిత, కథానికా రచయిత, విమర్శకుడు, రాజదూత, సాహిత్యవేత్తగా అంతర్జాతీయ ఖ్యాతి నార్జించినవాడు.

ఒక రాజదూత కుమారుడుగా 1928 నవంబరు 11 న మెక్సికో నగరంలో జన్మించిన కార్లోస్ ఫుయెంటస్ తన కుటుంబ సభ్యులతో కలసి ఉత్తర, దక్షిణ అమెరికాలలోను, యూరప్‌లోను విరివిగా పర్యటించాడు. తన 4 వ ఏటనే వాషింగ్టన్, డి.సి.లో ఆతడు ఇంగ్లీష్ భాష నేర్చుకొన్నాడు. మెక్సికో విశ్వవిద్యాలయంలో న్యాయశాస్త్రం అధ్యయనం చేశాడు. అనంతరం జెనీవాలోని 'ఇన్‌స్టిట్యూట్ డెస్ హౌటెస్ ఎట్యూడెస్ ఇంటర్నేషనలిస్' లో చేరాడు.

ఫుయెంటస్ జెనీవాలోని అంతర్జాతీయ కార్మిక సంస్థకు పంపబడిన మెక్సికన్ ప్రతినిధి వర్గంలో (1950-52) ఒక సభ్యుడు. విదేశాంగ మంత్రిత్వ శాఖలో కార్యదర్శి (1954). ఇంకా ఎన్నో ఇట్టి పదవులను ఆయన అలంకరించాడు.

1950 ప్రాంతంలో తన కుటుంబంలోని మధ్య తరగతి విలువలపై తిరుగుబాటు చేసి కమ్యూనిస్ట్ పార్టీలో చేరాడు. కాని 1962 లో ఆ పార్టీ నుంచి బయటకు వచ్చాడు. అయినా మార్క్సిస్ట్‌గానే ఉన్నాడు. 1968 నాటి ఒలింపిక్ క్రీడలకు వ్యతిరేకంగా జరిగిన విద్యార్థి ప్రదర్శనలను ప్రభుత్వం నిర్దాక్షిణ్యంగా అణచివేసినందుకు నిరసన తెలిపి అతడు ప్రభుత్వ విరోధి అయాడు. 1969 తరువాత క్యూబాలోని కాస్ట్రో ప్రభుత్వం పట్ల సానుభూతి తెలిపినందుకు అమెరికన్ ప్రభుత్వానికి కూడా ఆయన కానివాడు అయాడు.

ఫుయెంటస్ తొలి కథానికా సంపుటం *లాస్ డియాస్ ఎన్మాస్ కెరడోస్* (1954- The Masked Days) గత కాలాన్ని వాస్తవిక దృష్టితో ఆశ్చర్యకరంగా చిత్రించింది. ఆయన తొలి నవల *లా రీజియన్ మాస్ ట్రాన్స్‌పరెంటె* (1958; Whare the Air Is Clear, 1960) . దానిలో రచయిత తాత్త్వికంగాను, మనస్తత్త్వ దృష్టితోను జాతీయ తత్త్వాన్ని చిత్రించి, మెక్సికన్ సమాజాన్ని నిశితంగా విమర్శించాడు. దాని వలన ఫుయెంటస్ జాతీయ గౌరవం పెరిగింది. ఆ నవలలో రచయిత ఫ్లాష్‌బాక్ మొదలైన చలన చిత్రప్రక్రియలను సంఘంలోని వేరు వేరు స్థాయిలలోని ప్రజల వాడుక భాషను ప్రయోగించాడు. అటు తరువాత ఫుయెంటస్ ఎక్కువకాలం రచనా వ్యాసంగంలోనే గడిపాడు. అయినా యౌవనంలో వలె దేశాటనం కొనసాగిస్తూనే వచ్చాడు.

*లాస్ ద్యుయనాస్ కాన్సనియాస్* (1959; The good Conscience, 1961) లో కూడా తొలి నవలలోని చలనచిత్ర ప్రక్రియలనే వాడుక చేస్తూ, గ్రామీణ ఆర్థిక వ్యవస్థ క్రమంగా మధ్య తరగతి నగర వ్యవస్థగా ఎలా క్రమ పరిణామం చెందిందీ చిత్రించాడు.

*ఆరా* (1962) అనే నవలికలో వాస్తవికతను, ఊహాగానాన్నీ విజయవంతంగా సమ్మిశ్రితం చేశాడు. *లా మ్యుయెర్తే డి ఆర్టిమియో క్రజ్* (1962; The Death of Artemio Cruz; 1964) అనే నవల మెక్సికన్ విప్లవం విశిష్ట ఫలితం అని చెప్పదగిన ఒక వ్యక్తి అవసాన ఘడియలను వర్ణించింది. ఆ నవల పలు యూరపియన్ భాషలలోకి అనువదింపబడి అంతర్జాతీయ నవలా రచయితగా ఫుయెంటస్ కీర్తిని సుస్థిరం చేసింది.

*కాన్బియో డీ పీల్* (1967; A change of skin; 1968) అనే నవల మెక్సికన్ సామూహిక చేతనను నిర్వచించి, ఆ దేశంలోని పుక్కిటి పురాణాలకు నూతన వ్యాఖ్యలు చెప్పింది.

ఫుయెంటస్ 1978 లో ఒక డిటెక్టివ్ నవల కూడా వ్రాశాడు.

బొ.శ్రీ.

**ఫుల్లర్, మార్గరేట్ (1810-50) :** సమకాలీన ప్రజా జీవితాన్ని మెరుగు పరచాలని, వారి అభిరుచుల స్థాయిని పెంచాలని ఆరాటపడిన అమెరికన్ రచయిత్రి, విమర్శకురాలు, అపార పాండిత్యాన్ని సంపాదించుకొన్న మహిళ. అమెరికన్ సంస్కృతికి ఒక వ్యక్తిత్వాన్ని ఆపాదించిన మేటి మేధావిని.

తండ్రి ప్రోద్బలంతో విపరీతంగా గ్రంథ పఠనం చేసింది. కాని నిజ జీవితానుభవాలు గ్రంథపఠనం కంటె ఎక్కువ విజ్ఞానాన్ని ఇవ్వగలవని నమ్మింది. 1836-37 లో బోస్టన్‌లోను, 1837-39 లో ప్రావిడెన్స్‌లోను ఉపా

*బాలెడెన్* (1861, Ballads) వంటి జనాదరణ పొందిన ప్రష్యన్ చరిత్రకు సంబంధించిన జానపద వీరగాథలను కూడా ఆయన రచించాడు.

లిబరల్ వార్తా పత్రిక *వాసిషెట్సైటుంగ్* లో నాటక విమర్శకుడుగా చేరి వెనుకటి కన్సర్వేటివ్ ప్రతి బంధకాలు తొలగిపోయిన తరువాతనే ఫోన్‌టేన్ తన సర్వోత్కృష్టమైన రచన చేశాడు. తన 56 వ ఏట *వోర్ డెమ్ స్టుర్మ్* (1878, Before the storm) అనే ఆ చారిత్రాత్మక నవలను రచించాడు. దానిలో ప్రష్యన్ రాజవంశీకులను సానుభూతితోనూ, విమర్శక దృష్టితోనూ కూడా చిత్రించాడు. ఆయన మాటలలోనే అది 'మనం గడపే జీవితానికి అతిశయోక్తులు లేని అచ్చమైన ప్రతిబింబం'. ఫోన్‌టేన్ తాను రచించిన పలు నవలలలో సంఘంలో స్త్రీ స్థానాన్ని గురించి కూడా చర్చించాడు. *ఫ్రౌ యెన్నీ ట్రైబెల్* (1893), *ఎఫీ బ్రీస్ట్* (1898) అట్టి నవలలో ప్రశస్తమైనవి. ముఖ్యంగా *ఎఫీ బ్రీస్ట్* లోని అద్భుతమైన పాత్ర చిత్రణ, ఫోన్‌టేన్ స్వస్థలమైన బ్రాండెన్ బర్గ్‌లోని సంకీర్ణ జీవన చిత్రణ మెచ్చుకోదగినవి. ఆయన రచించిన ఇతర ప్రధాన గ్రంథాలు: *డెర్ ెష్లీన్* (1899), *షాక్ వాన్ వుడెన్* (1883).

థియొడోర్ ఫోన్‌టేన్ 1898 సెప్టెంబరు 20 న బెర్లిన్‌లో జీవితం చాలించాడు.

బా.శ్రీ.

**ఫోర్‌స్టర్, ఇ.ఎమ్ (1879-1970)** : ప్రముఖ బ్రిటిష్ నవలా రచయిత, వ్యాస రచయిత, సాంఘిక సాహిత్యిక విమర్శకుడు. ముఖ్యంగా *హోవర్డ్స్ ఎండ్* (1910), *ఏ పాసేజ్ టు ఇండియా* (1924) అనే నవలల వలనా, విస్తారంగా వ్రాసిన విమర్శక వ్యాసాల వలనా ఆయన ప్రసిద్ధిలోకి వచ్చాడు. ఎడ్మండ్ మోర్గన్ ఫోర్‌స్టర్ తండ్రి ఒక ఆర్కిటెక్ట్ (భవన నిర్మాత). ఫోర్‌స్టర్ పసివాడుగా ఉండగానే ఆయన మరణించాడు. తల్లీ, మేనత్తలూ అతనిని పెంచి పెద్ద చేశారు. కెంట్ లోని టామ్ బ్రిడ్జ్ స్కూల్‌లోని అతని అనుభవాలే



అనంతర కాలంలో ఇంగ్లీష్ పబ్లిక్ స్కూల్ వ్యవస్థ మీద అతడు చేసిన విమర్శలకు ఉత్తేజాన్ని కలిగించాయి. తరువాత ఫోర్‌స్టర్ కేంబ్రిడ్జ్‌లోని కింగ్స్ కాలేజ్‌లో చదివాడు.

కేంబ్రిడ్జ్ విడిచి పెట్టగానే ఫోర్‌స్టర్ రచన కోసమే తన జీవితాన్ని అంకితం చేయడానికి నిశ్చయించుకొన్నాడు. ఆయన తొలి నవలలలోనూ, కథానికలలోనూ విక్టోరియన్ యుగం నాటి బంధనాలను ఛేదించుకొనే ఉద్యమ ఛాయలు కనిపిస్తాయి. ఆది నుంచి అతని నవలలలో సాంఘిక విమర్శ లక్షణం ప్రధానంగా కనిపిస్తూ వచ్చింది. తొలి నవలలో *ది లాంగెస్ట్ జర్నీ* (1907) అనే నవలలో భూమిని అంటిపెట్టుకొని ఉండడం, భావనా శక్తిని పెంపొందించుకోడం రెండూ మానవులకు సమానంగా అవసరమని ఫోర్‌స్టర్ సూచిస్తాడు.

మొట్టమొదట ఫోర్‌స్టర్‌కు ఘన విజయం చేకూర్చిన *హోవర్డ్స్ ఎండ్* లో కూడా అదే ఇతివృత్తం కొనసాగుతుంది. మొదటి ప్రపంచ సంగ్రామంలో ఫోర్‌స్టర్ అలెగ్జాండ్రియాలో యుద్ధానికి సంబంధించిన సివిల్ పనులను చేస్తూ గడపాడు. 1912-13 లో ఒకసారీ, 1921 లో ఒకసారీ రెండుసార్లు ఫోర్‌స్టర్ ఇండియాను సందర్శించాడు. యుద్ధానంతరం అతడు రచించిన *ఏ పాసేజ్ టు ఇండియా* విశేష ప్రశస్తి సంపాదించింది.

చివరి రోజులలో ఫోర్‌స్టర్ రచనలలో సత్యానికీ, దయకూ ఎక్కువ ప్రాధాన్యం కనిపిస్తుంది. రెండవ ప్రపంచ సంగ్రామ కాలంలో అతని నియంతృత్వ ప్రతికూల భావాలకు ఎక్కువ గౌరవం లభించింది. 1946 లో ఆయన వెనుక చదువుకున్న కాలేజ్‌వారు ఆయనకు గౌరవ ఫెలోషిప్ ఇచ్చారు. దాని వలన అతడు మరణ పర్యంతం కేంబ్రిడ్జ్‌లలో స్థిరపడి ప్రాత, క్రొత్త తరాల వారితో భావ వినిమయం చేసికోడానికి తగిన అవకాశం లభించింది.

వ్యాసాలు, కథానికలు, నవలలే కాక ఫోర్‌స్టర్ తన అవ్వ (great aunt) *మేరియానే థార్న్టన్* (1886) జీవిత చరిత్రను కూడా వ్రాశాడు. దానిలో ఇండియాలోని తన అనుభవాలను అతడు వర్ణించాడు. *ది హిల్ ఆఫ్ దేవి* (1953), *అలెగ్జాండ్రియా, ఏ హిస్టరీ అండ్ ఏ గైడ్* (1922), *మారిస్* (ఏక లింగ సంపర్కాన్ని వర్ణించే ఒక నవల) చాలా సంవత్సరాలకు ముందే రచించబడినా, అతని మరణానంతరం 1971 లో ప్రచురించబడ్డాయి.

ఇంగ్లండ్‌లో వార్విక్ షైర్‌లోని కోవెంట్రీలో 1970 జూన్ 7 న ఫోర్‌స్టర్ మరణించాడు.

బా.శ్రీ.

*బాలెడెన్* (1861, Ballads) వంటి జనాదరణ పొందిన ప్రష్యన్ చరిత్రకు సంబంధించిన జానపద వీరగాథలను కూడా ఆయన రచించాడు.

లిబరల్ వార్తా పత్రిక *వాసిషె జైటుంగ్* లో నాటక విమర్శకుడుగా చేరి వెనుకటి కన్సర్వేటివ్ ప్రతి బంధకాలు తొలగిపోయిన తరువాతనే ఫోన్‌టేన్ తన సర్వోత్కృష్టమైన రచన చేశాడు. తన 56 వ ఏట *వోర్ డెమ్ స్టుర్మ్* (1878, Before the storm) అనే ఆ చారిత్రాత్మక నవలను రచించాడు. దానిలో ప్రష్యన్ రాజవంశీకులను సానుభూతితోనూ, విమర్శక దృష్టితోనూ కూడా చిత్రించాడు. ఆయన మాటలలోనే అది 'మనం గడపే జీవితానికి అతిశయోక్తులు లేని అచ్చమైన ప్రతి బింబం'. ఫోన్‌టేన్ తాను రచించిన పలు నవలలలో సంఘంలో స్త్రీ స్థానాన్ని గురించి కూడా చర్చించాడు. *ఫ్రౌ యెన్నీ ట్రైబెల్* (1893), *ఎఫీ బ్రీస్ట్* (1898) అట్టి నవలలో ప్రశస్తమైనవి. ముఖ్యంగా *ఎఫీ బ్రీస్ట్* లోని అద్భుతమైన పాత్ర చిత్రణ, ఫోన్‌టేన్ స్వస్థలమైన బ్రాండెన్ బుర్గ్‌లోని సంకీర్ణ జీవన చిత్రణ మెచ్చుకోదగినవి. ఆయన రచించిన ఇతర ప్రధాన గ్రంథాలు: *డెర్ ష్టెష్లిన్* (1899), *షాక్ వాన్ వుడెన్* (1883).

థియొడోర్ ఫోన్‌టేన్ 1898 సెప్టెంబరు 20 న బెర్లిన్‌లో జీవితం చాలించాడు.

బొ.శ్రీ.

**ఫోర్‌స్టర్, ఇ.ఎమ్ (1879-1970) :** ప్రముఖ బ్రిటిష్ నవలా రచయిత, వ్యాస రచయిత, సాంఘిక సాహిత్యిక విమర్శకుడు. ముఖ్యంగా *హోవర్డ్స్ ఎండ్* (1910), *ఏ పాసేజ్ టు ఇండియా* (1924) అనే నవలల వలనా, విస్తారంగా వ్రాసిన విమర్శక వ్యాసాల వలనా ఆయన ప్రసిద్ధిలోకి వచ్చాడు. ఎడ్మండ్ మోర్గన్ ఫోర్‌స్టర్ తండ్రి ఒక ఆర్కిటెక్ట్ (భవన నిర్మాత). ఫోర్‌స్టర్ పసివాడుగా ఉండగానే ఆయన మరణించాడు. తల్లీ, మేనత్తలూ అతనిని పెంచి పెద్ద చేశారు. కెంట్‌లోని టామ్ బ్రిడ్జ్ స్కూల్‌లోని అతని అనుభవాలే



అనంతర కాలంలో ఇంగ్లీష్ పబ్లిక్ స్కూల్ వ్యవస్థ మీద అతడు చేసిన విమర్శలకు ఉత్తేజాన్ని కలిగించాయి. తరువాత ఫోర్‌స్టర్ కేంబ్రిడ్జ్‌లోని కింగ్స్ కాలేజ్‌లో చదివాడు.

కేంబ్రిడ్జ్ విడిచి పెట్టగానే ఫోర్‌స్టర్ రచన కోసమే తన జీవితాన్ని అంకితం చేయడానికి నిశ్చయించుకొన్నాడు. ఆయన తొలి నవలలలోనూ, కథానికలలోనూ విక్టోరియన్ యుగం నాటి బంధనాలను ఛేదించుకొనే ఉద్యమ ఛ్ఛాయలు కనిపిస్తాయి. ఆది నుంచి అతని నవలలలో సాంఘిక విమర్శ లక్షణం ప్రధానంగా కనిపిస్తూ వచ్చింది. తొలి నవలలలో *ది లాంగెస్ట్ జర్నీ* (1907) అనే నవలలో భూమిని అంటిపెట్టుకొని ఉండడం, భావనా శక్తిని పెంపొందించుకోడం రెండూ మానవులకు సమానంగా అవసరమని ఫోర్‌స్టర్ సూచిస్తాడు.

మొట్టమొదట ఫోర్‌స్టర్‌కు ఘన విజయం చేకూర్చిన *హోవర్డ్స్ ఎండ్* లో కూడా అదే ఇతివృత్తం కొనసాగుతుంది. మొదటి ప్రపంచ సంగ్రామంలో ఫోర్‌స్టర్ అలెగ్జాండ్రియాలో యుద్ధానికి సంబంధించిన సివిల్ పనులను చేస్తూ గడపాడు. 1912-13 లో ఒకసారీ, 1921 లో ఒకసారీ రెండుసార్లు ఫోర్‌స్టర్ ఇండియాను సందర్శించాడు. యుద్ధానంతరం అతడు రచించిన *ఏ పాసేజ్ టు ఇండియా* విశేష ప్రశస్తి సంపాదించింది.

చివరి రోజులలో ఫోర్‌స్టర్ రచనలలో సత్యానికీ, దయకూ ఎక్కువ ప్రాధాన్యం కనిపిస్తుంది. రెండవ ప్రపంచ సంగ్రామ కాలంలో అతని నియంతృత్వ ప్రతికూల భావాలకు ఎక్కువ గౌరవం లభించింది. 1946 లో ఆయన వెనుక చదువుకున్న కాలేజ్‌వారు ఆయనకు గౌరవ ఫెలోషిప్ ఇచ్చారు. దాని వలన అతడు మరణ పర్యంతం కేంబ్రిడ్జ్‌లలో స్థిరపడి ప్రాత, క్రొత్త తరాల వారితో భావ వినిమయం చేసికోడానికి తగిన అవకాశం లభించింది.

వ్యాసాలు, కథానికలు, నవలలే కాక ఫోర్‌స్టర్ తన అవ్వ (great aunt) *మేరియానే థార్న్‌టన్* (1886) జీవిత చరిత్రను కూడా వ్రాశాడు. దానిలో ఇండియాలోని తన అనుభవాలను అతడు వర్ణించాడు. *ది హిల్ ఆఫ్ దేవి* (1953), *అలెగ్జాండ్రియా, ఏ హిస్టరీ అండ్ ఏ గైడ్* (1922), *మారిస్* (ఏక లింగ సంపర్కాన్ని వర్ణించే ఒక నవల) చాలా సంవత్సరాలకు ముందే రచించబడినా, అతని మరణానంతరం 1971 లో ప్రచురించబడ్డాయి.

ఇంగ్లండ్‌లో వార్విక్ షైర్‌లోని కోవెంట్రీలో 1970 జూన్ 7 న ఫోర్‌స్టర్ మరణించాడు.

బొ.శ్రీ.

*బాలెడెన్* (1861, Ballads) వంటి జనాదరణ పొందిన ప్రష్యన్ చరిత్రకు సంబంధించిన జానపద వీరగాథలను కూడా ఆయన రచించాడు.

లిబరల్ వార్తా పత్రిక *వాసిషె ట్సైటుంగ్* లో నాటక విమర్శకుడుగా చేరి వెనుకటి కన్సర్వేటివ్ ప్రతి బంధకాలు తొలగిపోయిన తరువాతనే ఫోన్‌టేన్ తన సర్వోత్కృష్టమైన రచన చేశాడు. తన 56 వ ఏట *ఫోర్ డెమ్ స్టుర్మ్* (1878, Before the storm) అనే ఆ చారిత్రాత్మక నవలను రచించాడు. దానిలో ప్రష్యన్ రాజవంశీకులను సానుభూతితోనూ, విమర్శక దృష్టితోనూ కూడా చిత్రించాడు. ఆయన మాటలలోనే అది 'మనం గడపే జీవితానికి అతిశయోక్తులు లేని అచ్చమైన ప్రతిబింబం'. ఫోన్‌టేన్ తాను రచించిన పలు నవలలలో సంఘంలో స్త్రీ స్థానాన్ని గురించి కూడా చర్చించాడు. *ఫ్రౌ యెన్నీ ట్రైబెల్* (1893), *ఎఫీ బ్రీస్ట్* (1898) అట్టి నవలలో ప్రశస్తమైనవి. ముఖ్యంగా *ఎఫీ బ్రీస్ట్* లోని అద్భుతమైన పాత్ర చిత్రణ, ఫోన్‌టేన్ స్వస్థలమైన బ్రాండెన్ బుర్గ్‌లోని సంకీర్ణ జీవన చిత్రణ మెచ్చుకోదగినవి. ఆయన రచించిన ఇతర ప్రధాన గ్రంథాలు: *డెర్ ‌స్టెష్లిన్* (1899), *షాక్ వాన్ వుడెన్* (1883).

థియొడోర్ ఫోన్‌టేన్ 1898 సెప్టెంబరు 20 న బెర్లిన్‌లో జీవితం చాలించాడు.

బా.శ్రీ.

**ఫోర్‌స్టర్, ఇ.ఎమ్ (1879-1970) :** ప్రముఖ బ్రిటిష్ నవలా రచయిత, వ్యాస రచయిత, సాంఘిక సాహిత్యిక విమర్శకుడు. ముఖ్యంగా *హోవర్డ్స్ ఎండ్* (1910), *ఎ పాసేజ్ టు ఇండియా* (1924) అనే నవలల వలనా, విస్తారంగా వ్రాసిన విమర్శక వ్యాసాల వలనా ఆయన ప్రసిద్ధిలోకి వచ్చాడు. ఎడ్మండ్ మోర్గన్ ఫోర్‌స్టర్ తండ్రి ఒక ఆర్కిటెక్ట్ (భవన నిర్మాత). ఫోర్‌స్టర్ పసివాడుగా ఉండగానే ఆయన మరణించాడు. తల్లీ, మేనత్తలూ అతనిని పెంచి పెద్ద చేశారు. కెంట్‌లోని టామ్ బ్రిడ్జ్ స్కూల్‌లోని అతని అనుభవాలే



అనంతర కాలంలో ఇంగ్లీష్ పబ్లిక్ స్కూల్ వ్యవస్థ మీద అతడు చేసిన విమర్శలకు ఉత్తేజాన్ని కలిగించాయి. తరువాత ఫోర్‌స్టర్ కేంబ్రిడ్జ్‌లోని కింగ్స్ కాలేజ్‌లో చదివాడు.

కేంబ్రిడ్జ్ విడిచి పెట్టగానే ఫోర్‌స్టర్ రచన కోసమే తన జీవితాన్ని అంకితం చేయడానికి నిశ్చయించుకొన్నాడు. ఆయన తొలి నవలలలోనూ, కథానికలలోనూ విక్టోరియన్ యుగం నాటి బంధనాలను ఛేదించుకొనే ఉద్యమ ఛాయలు కనిపిస్తాయి. ఆది నుంచి అతని నవలలలో సాంఘిక విమర్శ లక్షణం ప్రధానంగా కనిపిస్తూ వచ్చింది. తొలి నవలలలో *ది లాంగెస్ట్ జర్నీ* (1907) అనే నవలలో భూమిని అంటిపెట్టుకొని ఉండడం, భావనా శక్తిని పెంపొందించుకోడం రెండూ మానవులకు సమానంగా అవసరమని ఫోర్‌స్టర్ సూచిస్తాడు.

మొట్టమొదట ఫోర్‌స్టర్‌కు ఘన విజయం చేకూర్చిన *హోవర్డ్స్ ఎండ్* లో కూడా అదే ఇతివృత్తం కొనసాగుతుంది. మొదటి ప్రపంచ సంగ్రామంలో ఫోర్‌స్టర్ అలెగ్జాండ్రియాలో యుద్ధానికి సంబంధించిన సివిల్ పనులను చేస్తూ గడపాడు. 1912-13 లో ఒకసారీ, 1921 లో ఒకసారీ రెండుసార్లు ఫోర్‌స్టర్ ఇండియాను సందర్శించాడు. యుద్ధానంతరం అతడు రచించిన *ఎ పాసేజ్ టు ఇండియా* విశేష ప్రశస్తి సంపాదించింది.

చివరి రోజులలో ఫోర్‌స్టర్ రచనలలో సత్యానికీ, దయకూ ఎక్కువ ప్రాధాన్యం కనిపిస్తుంది. రెండవ ప్రపంచ సంగ్రామ కాలంలో అతని నియంతృత్వ ప్రతికూల భావాలకు ఎక్కువ గౌరవం లభించింది. 1946 లో ఆయన వెనుక చదువుకున్న కాలేజ్‌వారు ఆయనకు గౌరవ ఫెలోషిప్ ఇచ్చారు. దాని వలన అతడు మరణ పర్యంతం కేంబ్రిడ్జ్‌లో స్థిరపడి పాత, క్రొత్త తరాల వారితో భావ వినిమయం చేసికోడానికి తగిన అవకాశం లభించింది.

వ్యాసాలు, కథానికలు, నవలలే కాక ఫోర్‌స్టర్ తన అవ్వ (great aunt) *మేరియానే థార్న్‌టన్* (1886) జీవిత చరిత్రను కూడా వ్రాశాడు. దానిలో ఇండియాలోని తన అనుభవాలను అతడు వర్ణించాడు. *ది హిల్ ఆఫ్ దేవి* (1953), *అలెగ్జాండ్రియా, ఎ హిస్టరీ అండ్ ఎ గైడ్* (1922), *మారిస్* (ఏక లింగ సంపర్కాన్ని వర్ణించే ఒక నవల) చాలా సంవత్సరాలకు ముందే రచించబడినా, అతని మరణానంతరం 1971 లో ప్రచురించబడ్డాయి.

ఇంగ్లండ్‌లో వార్విక్ షైర్‌లోని కోవెంట్రీలో 1970 జూన్ 7 న ఫోర్‌స్టర్ మరణించాడు.

బా.శ్రీ.

**ఫోలెంగో, టియోఫిలో (1491-1544) :** ఇటాలియన్, లాటిన్ భాషలను సమ్మేళనం చేసి, 'మకరానిక్స్' అనే కొత్తశైలిని సృష్టించి దానిలో కవిత్వం వ్రాసిన మేధావి. ఈయన అసలు పేరు *గిరోలమో ఫోలెంగో*. ఇతని రచనలలో మణి పూస అని చెప్ప దగినది *బాల్డస్* అనే కావ్యం. ఇది 1517, 1552 ల మధ్య నాలుగు ముద్రణలను పొందింది. 1927-28 లో దీనిని *లె మేఖరోనీ* (Le meccheronee) అనే పేరుతో ప్రచురించడం జరిగింది. మధ్య యుగాల నాటి ఐతిహాసిక నాయకుడు రోలండ్ వంశీకుడైన బాల్డస్ గాథ ఇది. వ్యంగ్యం, హాస్యం అద్భుతమైన ఊహ, ఈ కావ్యంలోని ప్రత్యేకతలు.



మతం పట్ల ప్రేమతో 'బెనిడిక్టిన్ ఆర్డర్' లో చిన్న నాడే చేరి బ్రెసికా, మాంట్యువా, పడోవా, మఠాల (Monasteries) లో నివసించి ఫోలెంగో అవివాహితు డుగానే ఉండి పోయాడు.

కె.జి.మూర్తి.

**ఫోస్కోలో, ఉగో (1778-1827) :** ప్రముఖ ఇటాలియన్ కవి. నవలా రచయిత. ఫ్రెంచి విప్లవం, నెపోలియన్ యుద్ధాలు, ఆస్ట్రియన్ పాలనా పునఃస్థాపన ఒక దాని వెనుక ఒకటిగా ఇటలీ రాజకీయ జీవితాన్ని కల్లోల పరిచిన సంఘటనలు. ఆ సంఘటనల నాటి ఇటలీ దేశస్థుల మనోభావాలను తన కవిత్వం ద్వారా, నవలల ద్వారా ప్రపంచానికి చాటి చెప్పిన మహా రచయిత ఫోస్కోలో.



ఇటలీ లోని పాడ్యువా విశ్వవిద్యాలయంలో చదువుకొని తండ్రితో పాటు వెనిస్ నగరంలో ఉన్నప్పుడు ఫోస్కోలో ఆనాటి సాహితీ వర్గాలకు సన్నిహితు డయాడు. ఇతని తల్లి గ్రీక్ దేశస్థురాలు, తండ్రి వెనిస్ నగరానికి చెందినవాడు.

1797 లో ఇతని విషాదాంత నాటకం *థయెస్టీ* ప్రదర్శన విజయవంతమైంది. 1797 లో వ్రాసిన *ఎ బోనాపార్టీ లిబరేటర్* అనే పద్యంలో నెపోలియన్ పట్ల ఇతనికి గల గౌరవాభిమానాలు వ్యక్తం కాగా, 1802 లో వ్రాసిన *ఆల్టిమ్ లెటర్ డి జాకోపో ఆర్టిస్* అనే నవలలో నెపోలియన్ కాంపొ ఫార్మియో సంధి ప్రకారం వెనీషియాను తిరిగి ఆస్ట్రియాకు అప్పచెప్పటం పట్ల ఆగ్రహ నిస్పృహలు వ్యక్తం అయాయి. ఇదే నవలలో ఆనాటి ఇటలీలోని సాంఘిక, రాజకీయ పరిస్థితి పట్ల జుగుప్సను రచయిత వెల్లడిస్తాడు. ఇటాలియన్ సాహిత్యంలో బహుశః ఇదే తొలి నవల.

1799 లో ఆస్ట్రియన్‌లు, రష్యన్‌లు ఇటలీపైకి దండెత్తి నప్పుడు ఇతర దేశభక్తులతో పాటు ఫోస్కోలో కూడ ఫ్రెంచి సైన్యంలో చేరి మాతృదేశ విమోచనకై పోరు జరిపాడు. ఈ సందర్భంగా మిలాన్, బొలోనా, ఫ్లోరెన్స్ నగరాలలో ఎక్కువకాలం గడపవలసి వచ్చింది. 1804-06 లో ఫ్రాన్స్‌లో ఉంటూ కొన్ని ప్రాచీన కావ్యాలను ఇటాలియన్ భాషలోకి అనువదించాడు. కొన్ని ఓడ్‌లను, సానెట్‌లను కూడా వ్రాశాడు. *డై సెపోల్క్రి* అనే దేశభక్తి గీతంతో కవిగా ఫోస్కోలో గుర్తింపు పొందాడు. సమాధులపై ఆ మరణించిన వారి జీవితానికి సంబంధించిన విశేషాలను చెక్కే ఆచారాన్ని నెపోలియన్ నిషేధించటం పట్ల ఆగ్రహాన్ని, నిరసనను ఈ గీతంలో కవి వ్యక్తం చేశాడు. *అయేస్* (1811), *రికియార్డా* అనే విషాదాంత నాటకాలలో కనిపించే వ్యంగ్యం నెపోలియన్ పట్ల విమర్శగా అధికారులు అనుమానించారు. కవిగా ఇతనికి ఎక్కువ గుర్తింపు తెచ్చింది ఇతడు అసంపూర్తిగా వదిలి వేసిన *గ్రేజి* అనే కావ్యం. 1814 లో నెపోలియన్ పడిపోవటంతో ఆస్ట్రియన్‌లు తిరిగి తమ దేశాన్ని ఆక్రమించుకొన్నారు. ఆ పాలనకు తల ఒగ్గలేక దేశాన్ని వదలి ఫాస్కోలో స్విట్జర్‌లాండ్‌కు, ఆ తరువాత ఇంగ్లండుకు వెళ్లాడు. అక్కడ ఎడింబరో రెవ్యూ, ది క్వార్టర్లీ రెవ్యూ పత్రికలకు డాన్టె, బొకాషియో, పెట్రార్క్‌ల వంటి ఇటాలియన్ రచయితలపై వ్యాసాలు వ్రాస్తూ కాలం గడిపాడు. 1871 లో ఫోస్కోలో ఇంగ్లండులో మరణించగా, అతని భౌతిక కాయాన్ని

గౌరవ మర్యాదలతో ఫ్లొరెన్సుకు తీసుకుపోయి, అక్కడి స్టాక్రోస్ చర్చిలో భూస్థాపితం చేశారు.

కె.జి. మూర్తి.

**ఫ్రాన్స్, అనటోల్ (1844-1924) :** ప్రముఖ ఫ్రెంచ్ నవలా రచయిత, విమర్శకుడు. తన సమకాలంలో ఆదర్శప్రాయుడైన ఫ్రెంచ్ విద్వాంసుడుగా గుర్తింపబడినవాడు. 1896 లో 'అకాడమీ ఫ్రాన్సాయిస్' సభ్యుడుగా ఎన్నుకోబడ్డాడు. 1921 లో సాహిత్యానికి నోబెల్ బహుమతి అందుకున్నాడు. 'అనటోల్ ఫ్రాన్స్' ఈయన కలం పేరు. అసలు పేరు: జేక్విస్ అనటోల్ ఫ్రాన్సాయిస్ తిబౌల్ట్.



ఒక పుస్తక విక్రేత కుమారుడైన అనటోల్ ఫ్రాన్స్ 1844 ఏప్రిల్ 16 న పారిస్‌లో జన్మించాడు. పుస్తకాల మధ్య పుట్టి పెరిగాడు. స్కూలులో చదువుకునే రోజుల లోనే మానవతా వాద సంస్కృతికి బలమైన పునాదులు ఆయనలో ఏర్పడ్డాయి. ఆనాడే తన జీవితాన్ని సాహిత్య సేవకు అంకితం చేయాలని ఆయన నిశ్చయించుకున్నాడు. ఆయన తొలి కవితలలోనే ప్రాచీన సంప్రదాయాన్ని పునరుద్ధరించాలనే 'పర్నస్సియన్' (Parnassian) పునరుజ్జీవనోద్యమ ప్రభావం కనిపించింది. మౌలికత అంతగా లేకపోయినా, భావుకత గల 'రీతివాది' (Stylist) ఆ కవితలలో కనిపించాడు. మానవ కల్పిత సంస్థల పట్ల అప్పటికే ఆయనలో విశ్వాస రాహిత్యం కనిపిస్తూ వచ్చింది.

ఆయన తొలి నవలలు *లా క్రైమ్ డీ సిల్వెస్ట్రీ బోన్నార్డ్* (1881), *లా రోటిస్సేరి డీ లా రైనే పెడాక్* (1893), *లస్ ఒపీనియన్స్ డీ జెరోమే కాయిగ్నార్డ్* (1893) లలో ఆయన 'సంశయ వాదం' అభివ్యక్తమైంది. వీటిలో తొలి నవల పుస్తకాలను అమితంగా ప్రేమిస్తూ నిత్య జీవితాన్ని చూసి గాభరా పడే ఒక భాషా శాస్త్రవేత్త కథ. రెండవది అతీంద్రియ శక్తులను పరిహాసం చేసే నవల. మూడవ దానిలో ఒక విమర్శకుడు వ్యంగ్యంగా ప్రభుత్వ సంస్థలను విమర్శిస్తాడు. అనటోల్ ఫ్రాన్స్ వ్యక్తిగత జీవితంలో ఎన్నో ఒడుదుడుకులు ఎదురయాయి. 1877 లో ఆయన వివాహమాడిన 'మరీ-వాలరీ గ్వేరిన్ డీ సావిల్లే' కి 1893 లో ఆయన విడాకు లిచ్చాడు. 1888 లోనే 'మదాం ఆర్మన్ డీ కైలవెట్' ను ఆయన కలుసుకున్నాడు. ఆమెతో ఆయన కేర్పడిన అక్రమ సంబంధమే *థాయిస్* (1890), *లే లిస్ రౌజే* (1894; *The Red Lily, 1908*) అనే నవలలు వ్రాయడానికి తగిన ప్రేరణ చేకూర్చింది. *థాయిస్* చివరికి సన్న్యాసినిగా మారిన ఒక వేశ్య కథ. ఈ కథకు రంగస్థలం ప్రాచీన కాలపు ఈజిప్ట్. *లే లిస్ రౌజే* (ఎఱ్ఱ లిల్లీ పూవు) ఫ్లొరెన్స్‌లో జరిగిన ఒక సమకాలీన ప్రణయ కథ.

*ల హిస్టాయిరీ కాంటెంపరైని* (1897-1901) అనే పేర వెలువడిన నాలుగు సంపుటాలలో అనటోల్ ఫ్రాన్స్ రచనలలో ప్రధానమైన మార్పు కనిపించింది. వాటిలోని తొలి మూడు సంపుటాలు: *లార్మే ద్యు మెయిల్ (1897; The Elm-tree on the Mail, 1910)*, *లే మన్నెక్విన్ డోసియర్ (1897; The Wicker Work Woman, 1910)*, *లాన్నేవ్ డామెతిస్టే (1899; The Amethyst Ring, 1919)* ఇవి ఒక చిన్న పట్టణంలోని అంతఃకలహాలను చిత్రిస్తున్నాయి. చివరి సంపుటం *మాన్సీర్ బెర్గెరెట్ ఏ పేరిస్* (1901; *Monsieur Bergeret in Paris, 1922)* లో నాయకుడు మొదట రాజకీయ సంరంభానికి దూరంగానే ఉంటూ వచ్చినా, చివరికి ఆల్‌ఫ్రెడ్ డ్రేఫస్ (రాజద్రోహ నేరం ఆరోపించబడిన ఫ్రెంచ్ సేనాని) వ్యవహారంలో జోక్యం కలిగించుకోడం వర్ణించబడింది. ఈ సంపుటంలోని కథ అనటోల్ ఫ్రాన్స్ స్వీయ చరిత్రే! ఖులాసాగా కూర్చుని తాత్త్విక చర్చలు కొనసాగిస్తూ జీవితాన్ని అంటీ ముట్టనట్టుగా అవలోకిస్తూ ఉండే అనటోల్ ఫ్రాన్స్ చివరికి డ్రేఫస్ ను సమర్థించవలసి వచ్చింది. 1900 తరువాత వ్రాసిన చాలా కథలలో తన సాంఘిక కార్య కలాపాలను ఆయన ప్రవేశపెట్టాడు. *క్రేన్‌క్వైబిల్లే* (1903) అంతకు ముందున్న ఒక చిన్న కథను మూడంకాల హాస్య నాటికగా మలచిన రచన. ఒక చిన్న వర్తకునిపట్ల జరిగిన అన్యాయాన్ని నాటకీకరిస్తూ అనటోల్ ఫ్రాన్స్ దీనిలో బూర్జువా తత్త్వం పట్ల తన వ్యతిరేకతను చాటాడు. జీవిత అంత్య దశలో ఆయన సానుభూతి కమ్యూనిజం వైపు మళ్లింది. అయినా, *లే డియుక్స్ ఓన్ట్ సాయిఫ్* (1912, 'దప్పిక గొని ఉన్న దేవతలు'), *ల్లీలే డెస్ పింగోయిన్స్* (1908, 'పెంగ్విన్ దీవి') అనే రచనలలో సౌభ్రాత్రంతో కూడిన సమాజం అవతరిస్తుందనే విశ్వాసం ఏ మాత్రం వ్యక్తం కాలేదు.

మొదటి ప్రపంచ యుద్ధం ఆయనలోని నిరాశావాదాన్ని మరింత ప్రగాఢం చేసింది. తన చిన్న నాటి రోజులను తలుచుకుంటూ ఆయన ఈ క్రింది రెండు రచనలను చేశాడు: *లె పెతాల్ పీరే* (1918), *లావీ యెన్ ఫ్లూర్* (1922). ఆయన వ్రాసిన *లే లివ్‌రె డీ మోన్ అమి* (1885; 'నా స్నేహితుని పుస్తకం', 1913) అనే రచనకు ఈ రెండూ పూరకాలు అని చెప్పవచ్చు.

అనటోల్ ఫ్రాన్స్ రచనలు విస్తృతమైన ఆయన పాండిత్యానికీ, చమత్కారంతో కూడిన చక్కని మలుపులకూ, సాంఘిక న్యాయం పట్ల ఆయనకు గల అభినివేశానికీ, అర్థ వ్యక్తికీ దర్పణాలై డెని డిడెరో, వోల్టేర్ సంప్రదాయాలకు ఆయన తగిన వారసుడని చాటుతున్నాయి.

ఫ్రాన్స్‌లోని సాంట్-సిర్-సర్‌లోయిరెలో 1924 అక్టోబరు 12 న అనటోల్ ఫ్రాన్స్ తన భౌతిక యాత్ర చాలించాడు.

బొ.శ్రీ.

**ఫ్రాస్ట్, రాబర్ట్ (1874-1963) :** అమెరికా సంయుక్త రాష్ట్రాలకు చెందిన ప్రసిద్ధ ఆధునిక కవి. సాధారణ వాడుక భాషకు, జానపదులు పాడుకునే పాటల పలుకుబళ్లకు కవిత్వంలో స్థానం కల్పించిన మహనీయుడు. సామాన్య జీవితంనుంచి ఎన్నుకొన్న ప్రతీకల ద్వారా న్యూ ఇంగ్లండు జీవన స్రవంతిలోని గంభీరమైన విలువలను సాహిత్యంలో పదిల పరిచిన ప్రజ్ఞావంతుడు. తండ్రి విలియం ప్రెస్కాట్ ఫ్రాస్ట్ హార్వర్డ్ పట్టభద్రుడు. ఒక ఉన్నత పాఠశాలలో ప్రధానాధ్యాపకుడుగా పనిచేస్తూ స్కాట్లండ్‌లో పుట్టి అమెరికాలో స్థిరపడ్డ 'ఇజబెల్ మూడి' అనే అధ్యాపకురాలిని వివాహం చేసుకొన్నాడు. ఆయన ఉద్యోగం వదలి శాన్ ఫ్రాన్సిస్కో వెళ్లి అక్కడ పత్రికా విలేఖకుడుగా పనిచేశాడు. 1885 లో విలియం మరణించటంతో ఇద్దరు పిల్లలతో ఇజబెల్ లారెన్స్ వెళ్లి అక్కడే స్థిరపడి పోయింది. రాబర్ట్ ఫ్రాస్ట్ జీవితంపై ఆమె ప్రభావం చాలా ఉంది. స్కాటిష్ జాతిలో కనిపించే బలమైన అనుబంధాలు, ఆమెలో మతం పట్ల ఉన్న విశ్వాసం అతనిని చాల ప్రభావితుని చేశాయి. దీనికి నిదర్శనమే అతని కవిత్వంలో మనకు కనిపించే క్రియాశీలత, నిగూఢ ఆధ్యాత్మికతల మేళవింపు.

ఫ్రాస్ట్‌ను న్యాయవాదిని చేయాలని అతని తాతగారు ఆశించారు. కాని కళాశాల నియమాలకు కట్టుబడలేక చదువును మధ్యలోనే వదలి, ఉపాధ్యాయుడుగా కొంత కాలం పనిచేసి, వ్యవసాయదారుడుగా మారి తాతగారిచ్చిన భూములను సాగుచేయటం, కోళ్లను పెంచటం వంటి వ్యాపకాలను చేపట్టాడు. కాని అందులోనూ అతడు రాణించలేదు. ఇన్ని వ్యాపకాల మధ్య కవితలు వ్రాయడం పత్రికలకు పంపటం చేస్తూనే ఉండేవాడు. విద్యార్థిగానే పాఠశాల పత్రికలకు వ్రాశాడు. కాని పత్రికలకు పంపిన కవిత లెన్నో తిరిగి వచ్చేవి. 1894 లో *మై బటర్‌ఫ్లై -ఆన్ ఎలిజీ* అనే ఆయన కవిత తొలిసారిగా పారితోషికం పొందింది.

1911 లో తాతగారి నుండి లభించిన వ్యవసాయ క్షేత్రాన్ని అమ్మివేసి ఇంగ్లండు వెళ్లి, బకింగ్‌హామ్‌షైర్‌లోని బీకన్స్ ఫీల్డ్‌లో రాబర్ట్ స్థిరపడ్డాడు. పూర్తి సమయాన్ని కవిత్వానికి వెచ్చించాలని నిశ్చయించుకొన్నాడు. లండన్‌లోని ఒక ప్రచురణ కర్త ఇతని *ఎ బాయ్స్ విల్* (A Boy's will) అనే సంపుటిని ప్రచురించాడు. 1714 లో *నార్త్ ఆఫ్ బోస్టన్* (North of Boston) అనే సంపుటిని అదే ప్రచురణ కర్త ప్రచురించటంతో ఫ్రాస్ట్‌కు ఇంగ్లండులో కవిగా గుర్తింపు లభించింది. బ్రిటిష్ విమర్శకులు, సమీక్షకులు మంచి అభిప్రాయాలను వ్యక్తం చేయటంతో అమెరికన్ ప్రచురణ కర్తలు కూడా ఆయన రచనల పట్ల ఆసక్తి చూపటం ప్రారంభించారు. ఇంగ్లండులో ఉన్న సమయంలో ఎజ్రా పౌండ్, ఎడ్వర్డ్ థామస్, గిబ్సన్, ఎబర్‌కొంబి వంటి ప్రముఖ రచయితలకు సన్నిహితుడయాడు. 1914 లో మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభం కావటంతో ఫ్రాస్ట్ అమెరికాకు తిరిగి వెళ్లిపోయాడు. అదే సమయంలో ఇతని మొదటి రెండు గ్రంథాలు అమెరికాలో ప్రచురితం కావటంతో స్వదేశంలో ఇతనికి ఘనస్వాగతమే లభించింది.

అమ్‌హర్స్ట్ కళాశాలలో ఆచార్యుడుగా 1916 నుండి 1920 వరకు పనిచేశాడు. ఆ తరువాత మిచిగన్ విశ్వవిద్యాలయంలో 'పొయట్-ఇన్-రెసిడెన్స్' (ఆస్థాన కవి)గా పనిచేశాడు. 1939 నుండి 1943 వరకు హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో ఎమర్సన్ పీఠాన్ని అధిరోహించాడు. 1949 నుండి చివరివరకు అమ్‌హర్స్ట్‌లో ఆచార్యత్వం నిర్వహించాడు.

రాబర్ట్ వ్యక్తిగా స్నేహశీలి, దయార్ద్ర హృదయుడు. కాని సన్నిహితులకు తప్ప అర్థంగాని క్లిష్టవ్యక్తిత్వం ఆయనది. ప్రధానంగా తాను వ్యవసాయదారుడనే నని విశ్వసించి ప్రకృతిని ఆరాధించి, అందులో దైవత్వాన్ని ఊహించి, జీవన రహస్యాలను అందుండి కనుగొనాలని చేసిన ప్రయత్నం ఆయన కవనంలో కనిపిస్తుంది. ఇతని కవిత్వాన్ని పాఠకులు, విమర్శకులు తమ తమ పద్ధతులతో అవగాహన చేసుకోటానికి వీలుకావడంతో అది బహుజనామోదాన్ని పొందింది. 20 వ శతాబ్దపు కవుల ప్రయోగాత్మక ధోరణులు ఇతని కవిత్వంలో కనిపించవు. ప్రాత రీతులకు నూతనత్వాన్ని ఆపాదించిన ఈ రచయిత వర్డ్స్‌వర్త్ వలె జానపదుల భాషను, రాబర్ట్ బ్రౌనింగ్ వలె ఏకపాత్ర నాటక (Dramatic monologue) ధోరణిని అనుసరించాడు. గ్రీక్, లాటిన్ కవుల పద్ధతిలో పల్లె వాతావరణపు కవితలను కూడా ఇతడు రచించాడు. అయితే సామాన్యంగా కనిపించే పల్లె ప్రాంతపు దృశ్యాలకు ఆధ్యాత్మిక, తాత్త్విక ప్రాముఖ్యాన్ని ఆపాదించ గలగటంతో ఇతడు మహాకవి అయాడు.

కె.జి.మూర్తి.

**ఫ్రిశ్చ్, మాక్స్ (1911-1991) :** ప్రఖ్యాత జర్మన్-స్విస్ నవలా రచయిత, నాటకకర్త. జర్మన్ సాహిత్యాన్ని, వాస్తు శాస్త్రాన్ని అధ్యయనం చేసి యూరప్ దక్షిణ, తూర్పు భాగాలు విస్తృతంగా పర్యటన చేసి పత్రికా విలేఖకుడుగా కొంతకాలం పనిచేసి చివరకు రచయితగా స్థిరపడ్డాడు. స్వీయ చరిత్ర ఆధారంగా మొదటి నవల *జర్గ్ రీన్ హార్డ్* (Jurg Rein Hardt) 1934 లో వ్రాశాడు. ఇతని తొలి నాటకం *శాంటాక్రూజ్* (Santa cruz-1946) లో నాయకుడు ఆధునిక మానవుడే. ఆధునిక మానవుడు నివసించే ప్రపంచం చాలా సంక్లిష్టమైనది. అందుచేత అతని స్వభావం చాల సంక్లిష్టమైనదే. అతడు సందేహ పీడితుడు. సమాజం, ప్రవర్తనా సరణులు అతని గేయాన్ని ఎలా ప్రభావితం చేయగలవో, చేస్తున్నాయో ఆ నాటకం చూపిస్తుంది. అతని అనంతర రచనలన్నింటిలోను కూడా ఇదే ఇతివృత్తము కనిపిస్తుంది. *నన్‌సింగెన్ సై వీడర్* (Nunsingen Sie Wieder- తొలి ప్రదర్శన 1945) అధివాస్తవికత (surrealism) ధోరణిలో వ్రాసింది. జర్మన్ నాజీలు తన బందీలను ఘోరంగా హత్యచేయటం వలన మానవ జాతికి కలిగిన జుగుప్స దీనిలోని ఇతివృత్తం. *డై చైనీష్ మాయర్* తొలి ప్రదర్శన 1946 (ఆంగ్లంలో The chinese wall), *ఆల్స్‌డర్ క్రీగ్‌జు యండ్‌వార్* (Alsder Kriegzu Endewar, 1949 (ఆంగ్లంలో (When the war was over) అనేవి ఇతని ఇతర యుద్ధ సంబంధమైన నవలలు. అమానుషత్వమూ, హత్య, అవి కల్పించే జుగుప్స, మానవ ప్రవర్తనపై, ఆలోచన తీరుపై అవి మనకు తెలియకుండానే తెచ్చే మార్పులు వీటిలో రచయిత చూపిస్తాడు.

*గ్రాఫ్ ఓడర్ లాండ్* (Graf order land- (ప్రదర్శన, ప్రచురణ 1951), *డాన్‌జువాన్ ఓడర్ డైలీ జూర్ జామెట్రి* (తొలి ప్రదర్శన, ప్రచురణ 1953) లలో అపరాధ భావము, నేరం అనే విషయాలను క్షుణ్ణంగా ఫ్రిశ్చ్ విశ్లేషించాడు.

*బీడర్ మన్ డై బ్రాండ్ స్టిఫ్టర్* (Bieder man Die Brand Stifter, 1958 : ఆంగ్లంలో The fire Raisers) అనేది ఈయన రచించిన నైతిక ప్రబోధాత్మక నాటకం. ఇహలోక సంపదల పట్ల మక్కువ గల బీడర్ మన్ తాను అతి నిజాయితీ పరుడనని, నీతిమంతుడనని అనుకొంటూ ఉంటాడు. నరకలోకం నుండి అగ్ని కీటకాల రూపంలో వచ్చిన రాక్షసుల వలలో చిక్కుకొన్న ఇతడు తన ప్రపంచాన్ని మొత్తంగా వాళ్లు భస్మం చేస్తున్నా, తన నిజ స్వరూపాన్ని బహిర్గతం చేయని మొండివాడు.

ఫ్రిశ్చ్ నవలల్లో పేర్కొనదగినవి: *స్టిల్లర్* (stiller: 1954, ఆంగ్లంలో I'm not stiller, 1958), *హోమోఫేబర్,* (Homo faber, 1957), *మైనేమ్ సై గాంటన్ బీన్* (Mein Name sei Gantenbein, 1964 - ఆంగ్లంలో Wilderness of mirrors, 1965). ఆధునిక మేధావిని కల్లోల పరిచే అస్థిరతలు, ఇష్టపూర్వకంగా గాని, బలవంతంగా గాని మనిషి నిర్వహించి పోషించే పాత్రలూ, వాస్తవాన్ని మార్చటం కోసం గాని, జయించటం కోసం గాని కృషి జరిపేవారు ఎదుర్కోవలసిన వైఫల్యాలూ ఈ నవలల్లో మనకు కనిపిస్తాయి.

*టేజ్‌బుచ్* (Tagebuch 1946-49, 1966-71) అనే ఇతని డైరీలు ఇతని జీవితం గురించి తెలుపుతాయి. *మోంటాక్ ఐన్ ఎర్జాలంగ్* (Montauk: Eine Erzahlung, 1975 ఈయన చివరిదశలో వ్రాసిన చెప్పుకో దగిన నవల.

20 వ శతాబ్దపు మధ్య కాలంలోని యూరపియన్ రచయితలలో అంతర్జాతీయ ఖ్యాతినార్జించిన వాడు ఈ మాక్స్‌ఫ్రిశ్చ్.

కె.జి. మూర్తి.

**ఫ్రెడ్రో, అలెక్సాండర్ (1793-1876) :** పోలండ్ దేశపు ప్రముఖ హాస్య నాటక రచయిత. మోలియర్,

గోల్డోనీల ప్రభావంతో ఈయన రచించిన నాటకాలలో విస్మయావహమైన పాత్ర చిత్రణ, అసాధారణమైన సంవిధాన నైపుణి, పద్య ఛందస్సులను నడపడంలో గడుసరితనం కనిపిస్తాయి.

ఒక సంపన్న భూస్వాముల కుటుంబంలో 1793 జూన్ 20 వ తేదీన గెలీషియా రాష్ట్రంలోని 'సుచారో' లో అలెక్సాండర్ ఫ్రెడ్రో జన్మించాడు. ప్రయివేట్ ట్యూటర్ల వద్ద విద్య నభ్యసించాడు. తన 16 వ ఏట పోలండ్ సైన్యంలోని అశ్విక దళంలో చేరి మాస్కో పోరాటంతో సహా ఫ్రెంచ్‌వారి నెపోలియానిక్ యుద్ధాలలో పాల్గొన్నాడు. 1814 లో కొన్ని నెలల పాటు పారిస్‌లో గడిపి, ఫ్రెంచ్ నాటకాలు చూసి, వారి నాటక కళను సునిశితంగా పరిశీలించాడు. 1815 లో తన ఎస్టేటు పనులు చూసుకోడం కోసం సైన్యంలో ఉద్యోగ విరమణ చేసిన తరువాత ఆయన గ్రంథ రచనకు పూనుకున్నాడు. ఆ రోజులలో ఆయన రచించిన నాటకాలలో చెప్పుకోదగ్గవి: *మాజీ జోనా* ('భార్య-భర్త; 1822 లో ఇది ప్రదర్శితమైంది), *స్లబీ పానీస్ స్కీ* ('కన్యల శపథాలు', 1833), *జెమ్‌స్త* ('పగ', 1834). వీటిలో మొదటిది సాంసారిక జీవితంలోని అవినీతికి సంబంధించిన ప్రహసనం. రెండవది మానసిక పరిణామాన్ని చిత్రించే రూపకం. మూడవ నాటకంలో సంవిధాన రచన అద్భుతమైంది. అదే ఆయన నాటకాలలో సర్వశ్రేష్ఠమైంది అని భావిస్తున్నారు. 1835 లో తీవ్రవాది కాల్పనిక కవి సెవెరిన్ గోజింగ్‌స్కీ ఒక పత్రికా వ్యాసంలో ఫ్రెడ్రో నాటకాలు జాతీయతా విరుద్ధమైనవనీ, అవి అసందర్భాల పుట్టలు అనీ విమర్శించడంతో ఫ్రెడ్రో గ్రంథ రచనకు స్వస్తి చెప్పాడు. అయితే 19 సంవత్సరాల అనంతరం మళ్లీ ఆయన కలం చేతబట్టి, చమత్కారమైన నాటకాలనేకం వ్రాశాడు. కాని అవి తొలి దశలోని రచనలతో సాటిరావు. తన జ్ఞాపకాలను వివరిస్తూ *ట్రిజీ పో ట్రిజీ* ('తల్లక్రిందులు ప్రసంగాలు') ఫ్రెడ్రో తన చివరి రోజులలో చేసిన రచనలు. పోలిష్ వచన రచనలో అవి ఆణిముత్యాలుగా పరిగణించబడుతున్నాయి.

1876 జూలై 15 న పోలండ్‌లోని 'ల్వోవ్' నగరంలో ఫ్రెడ్రో తుది శ్వాస విడిచాడు.

బొ.శ్రీ.

**ఫ్రేయేర్, గిల్‌బెర్టో డీ మెల్లో (1900-1987):** బ్రెజిల్ దేశస్థుడైన ప్రముఖ సాంఘిక శాస్త్ర రచయిత. బ్రెజిల్‌లో ఈశాన్య ప్రాంతంలో సాంఘిక శాస్త్ర రచనలకు వైతాళికుడుగా ప్రసిద్ధి పొందినవాడు.

1900 వ సంవత్సరం మార్చి 15 వ తేదీన 'రెసి ఫే' లో జన్మించిన ఫ్రేయేర్ అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని బెయ్‌లర్ విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసం చేసి, బి.ఏ. పట్టభద్రు డయాడు. 1923 లో కొలంబియా విశ్వవిద్యాలయం నుంచి ఎమ్.ఏ. పట్టం పొందాడు. 1926 లో మొదటి ఈశాన్య ప్రాంతపు కాంగ్రెసును రెసిఫేలో జరిపి *రీజినలియలిస్ట్ మేనిఫెస్టో* ను ప్రకటించాడు. ఈ ఉద్యమంలో ఈశాన్య ప్రాంతపు రచయితలు జార్జ్ లిమా, జోస్ అమెరికో డీ అమెల్డ్ వెంట ఉండి ఇతనికి ప్రోత్సాహం ఇచ్చారు.

ఫ్రేయేర్ రచించిన అసంఖ్యాకమైన సాంఘిక శాస్త్ర సంబంధమైన వ్యాసాలు బ్రెజిల్‌లోని ఈశాన్య ప్రాంతపు సాంఘిక, ఆర్థిక అభివృద్ధికోసం ఉద్దేశించబడ్డాయి. ఈ విధానాన్ని పోర్చుగీస్ భాష మాట్లాడే ఆఫ్రికా జాతులకు కూడా అన్వయించేందుకు ఆయన ప్రయత్నించారు. ఫ్రేయర్ ప్రతిపాదించిన ప్రధాన సిద్ధాంతం: బ్రెజిల్ మీది ఆఫ్రో యూరపియన్ సంస్కృతుల ప్రభావం కారణంగా పోర్చ్‌గీస్ జాతివారు ఒక అద్భుతమైన బహు సంస్కృతి సమాజాన్ని నిర్మించగలిగారనీ, ప్రపంచంలో ఇతరత్ర కూడా అది అనుకరించ దగిందనీ!

పోర్చుగీస్ భాషలోను, ఇంగ్లీష్ భాషలోను ఫ్రేయర్ చేసిన అసంఖ్యాకమైన రచనలలో చెప్పుకోదగ్గవి: *కాసా-గ్రాండే ఏ సెంజాలా* (1933, 'యజమానులు-బానిసలు'), *శాబడోస్ ఏ ముకంబోస్* (1936, 'ధనికులు-సేవకులు'), *బ్రెజిల్: ఆన్ ఇంటర్ ప్రెటేషన్* (1945), *నార్దెస్తే* (1937, ఈశాన్య ప్రాంతం), *ఓర్దెమ్ ఏ ప్రోగెసో* (1959, 'క్రమశిక్షణ-ప్రగతి'). బ్రెజిల్‌లోనూ, విదేశాలలోనూ కూడా విరివిగా పఠించబడిన *కాసా గ్రాండే ఏ సెంజాలా* అనే గ్రంథానికి 'పైతృక కుటుంబ వ్యవస్థ పద్ధతిలో బ్రెజీలియన్ కుటుంబ వ్యవస్థకు రూపకల్పన' అనే ఉప శీర్షిక కూడా ఉంది. *సోబడోస్ ఏ ముస్కంబోస్* లో పట్టణాల అభివృద్ధి, గ్రామాలలోని పైతృక సమాజం క్షీణించడం వివరించబడ్డాయి.

ఫ్రేయేర్ బ్రెజిల్‌లో వివిధ విశ్వవిద్యాలయాలలో సాంఘిక శాస్త్ర విభాగాలను నెలకొల్పాడు. 1934 లో జరిగిన 'ఆఫ్రో బ్రెజీలియన్ స్టడీస్' కు సంబంధించిన మొదటి కాంగ్రెసుకు ఆయనే ప్రధాన సంచాలకుడు. 'కొలంబియా' మొదలైన వివిధ దేశాలలోని పలు విశ్వవిద్యాలయాల నుండి ఆయన గౌరవ డాక్టరేట్ పట్టాలను

అందుకున్నాడు. 1949 లో యునైటెడ్ నేషన్స్ జెనరల్ అసెంబ్లీలో బ్రెజిల్‌కు ప్రాతినిధ్యం వహించాడు.

బొ.శ్రీ.

**ఫ్రేయ్‌టేగ్, గుస్తావ్ (1816-95)** : జర్మన్ నవలా రచయిత. వాస్తవిక దృక్పథంతో, మధ్యతరగతి వారిని గురించి ప్రశంసాత్మకంగా నవలా రచన చేసినవాడు. బ్రెస్లో (Brelow) లోను, బెర్లిన్ (Berlin) లోను జర్మన్ భాషకు అధ్యాపకుడుగా నియమింపబడ్డాడు. తరువాత ఆ ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి రచనా వ్యాసంగం ప్రారంభించాడు. 1848 లో జరిగిన తిరుగుబాటు ఉద్యమం వలన ప్రభావితుడై 'జూలియన్ షిమిడ్ట్' (julian schmidt) అనే సంపాదకునితో కలసి ఒక వారపత్రికను నడపాడు. మధ్య తరగతి వారికి పనికి వచ్చే విధంగా ఈ పత్రికను తీర్చి దిద్దాడు.

'ఫ్రెయ్‌టేగ్ గుస్తావ్' 'సర్ వాల్టర్ స్కాట్' (Sir Walter Scott), 'ఛార్లెస్ డికెన్స్' ( Charles Dikens) మొదలైన ఆంగ్ల రచయితల రచనలను, కొన్ని ఫ్రెంచ్ నాటకాలను క్షుణ్ణంగా చదివాడు. ఆ ప్రభావం ఇతని రచనల మీద ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. *ది జర్నలిస్ట్స్* ( The Journalists) అన్న హాస్య రచన ఇతనికి ఎంతో పేరు తెచ్చింది. *సోల్ అండ్ హేబెన్* (Soll and Haben 1855, Debit and credit-1857) అన్న నవల అనేక భాషలలోకి అనువదింపబడి ఇతనికి విశ్వ విఖ్యాతిని చేకూర్చింది. దీనిలో జర్మనీ దేశపు వ్యాపారస్థుల మనస్తత్త్వాలనూ, ప్రజల గుణ గణాలనూ చక్కగా విశ్లేషణ చేశాడు.

ఫ్రెయ్‌టేగ్ రచించిన నవలలలో జర్మనీదేశపు చరిత్రను మనోహరంగా చిత్రించాడు. ఈయన రచనల సమగ్ర సంకలనం (1886-88) ఇ. ఎల్స్‌టర్ (E. Elster) సంపాదకత్వంలో 12 సంపుటాలలో తిరిగి ప్రచురింప బడింది.

వేదవతి

**ఫ్రైలిగ్రాత్, ఫెర్డినాండ్ (1810-76)** : ప్రముఖ జర్మన్ కవి. 19 వ శతాబ్దంలో గొప్ప రాజకీయ స్పృహ కలిగిన కవిగా ప్రసిద్ధి పొందినవాడు. కొన్నాళ్లపాటు బ్యాంక్‌లో పనిచేసినా అది వదలి కవిత్వం వ్రాయడానికి ప్రారంభించాడు. ముందుగా శృంగార కవిత్వం వ్రాశాడు. 'విక్టర్ హ్యూగో' ప్రభావంతో కొంత భావుకతతో కూడిన రచనలు చేశాడు. వీటిని మెచ్చి ప్రష్యా చక్రవర్తి 'ఫ్రెడరిక్ విలియమ్' కొంత నగదును ఈ కవికి సమర్పించాడు. రాను రాను 'ఫ్రైలిగ్రాత్' ఆలోచనల్లో తీవ్రమైన మార్పు వచ్చింది. ఇతని కవితా సంపుటి *స్టేట్‌మెంట్ ఆఫ్ కాన్షస్* 1844 లో ప్రచురణ అయిన తరువాత ఆ నగదును స్వీకరించటానికి ఇతడు నిరాకరించాడు. ఇతని కవితలను ప్రభుత్వం నిషేధించినందువలన 'ఫ్రైలిగ్రాత్' జర్మనీదేశాన్ని వదలి వెళ్లిపోవలసిన పరిస్థితి ఏర్పడింది. బెల్జియమ్, స్విట్జర్లాండ్, ఇంగ్లండ్ దేశాలలో కొన్నాళ్లు ఉండి, 1848 లో జరిగిన తిరుగుబాటు ఉద్యమానికి అనుకూలంగా రచనలు చేసి జర్మనీకి తిరిగి వచ్చాడు. రాచరికపు వ్యవస్థను ఖండిస్తూ, సామాజిక స్పృహతో కూడిన కవితలు వ్రాశాడు. జర్మనీ తిరుగుబాటు ఉద్యమాన్ని సమర్థిస్తూ ఫ్రైలిగ్రాత్ సునిశిత విమర్శనా వైఖరితో అనేక రచనలు చేశాడు.

1848 లో వ్రాసిన కవిత *ఫ్రమ్ ది డెడ్ టు ది లివింగ్* ఇతనిని కారాగారానికి కూడా పంపించింది. విడుదల అయిన తరువాత ఈకవి కోలోన్ (cologne) కి వెళ్లి కార్ల్‌మార్క్స్‌తో స్నేహం చేశాడు. అతనితో కలసి *న్యూరెనిష్ న్యూస్ పేపర్* కు సంపాదకత్వం వహించాడు.

ఇతని ఇతర రచనలలో ప్రధానంగా చెప్పుకోదగినవి అనువాద గ్రంథాలు. 'విలియమ్ వర్డ్స్‌వర్త్' (William words worth), *హెన్రీ వడ్స్‌వర్త్*, 'లాంగ్ ఫెలో' (Long Fellow), 'వాల్ట్ విట్‌మాన్', 'రాబర్ట్ బర్న్స్' (Robert Burns) ల కవితలనే కాక, ఫ్రెంచి కవులు 'విక్టర్ హ్యూగో' (Vitor Hugo), 'మోలియర్' (Moliere) ల రచనలను కూడా అనువాదం చేశాడు. యథాతథంగా సాగిన ఈ అనువాదాల వలన జర్మనీ దేశస్థులకు ఆ యా కవుల రచనలతో పరిచయం ఏర్పడే అవకాశం కలిగింది.

వేదవతి

**ఫ్రోడింగ్, గుస్తావ్ (860-1911)** : ప్రముఖ స్వీడిష్ కవి. సాదా వాడుక భాషను మృదువైన, సంగీత ధోరణులతో నడిపించి స్వీడిష్ కవిత్వాన్ని సాంప్రదాయిక పద్ధతుల నుండి నూతనత్వం వైపు మరలించినవాడు. వాస్తవికత, సామాజిక న్యాయం ఈయన సృజనాత్మకతకు ఊపిరి. అయితే ఆహ్లాదకరమైన గ్రామీణ జీవితం పట్ల ఆయన చూపిన మోజు, ఆ నాటి రొమాంటిక్స్ మెప్పును కూడా పొందింది. గొయిథె, బైరన్, స్కాట్ వంటి గొప్ప రొమాంటిక్ కవుల ప్రభావం ఇతని రచనలపై కనిపిస్తుంది.

కార్ల్‌స్టాడ్ లో 10 సంవత్సరాల పాటు పత్రికా రచయితగా పనిచేశాడు. నరాల సంబంధమైన వ్యాధులతో

బాధ పడుతూ ఉండేవాడు. 1880 లో 'స్వాభావికత' (Naturalism) కు వ్యతిరేకంగా సాహిత్యంలో వచ్చిన తిరుగుబాటు ఇచ్చిన ప్రోత్సాహంతో 1891 లో *గిటార్ ఆచ్ డ్రాగర్ మోనికా* (ఆంగ్లంలో Guitar and concertina, 1925) అనే కవితా సంపుటిని ప్రచురించాడు. 1894 లో *న్యాడిక్టర్* (ఆంగ్లంలో New poems), 1896 లో *స్టాంక్ ఆచ్ ఫ్లికార్* (Stank och Flikar ఆంగ్లంలో Splashes and Rags) అనే సంపుటాలు వెలువడ్డాయి. అయితే వీటిలో చివరి సంపుటిలో కొన్ని కవితలు అశ్లీల సాహిత్యం అని ఆ నాటి ప్రభుత్వాధికారులు భావించి ఆయనను శిక్షించటం జరిగింది. ఇది ఆయనను విపరీతంగా క్రుంగదీసింది.

1897 లో *న్యాల్ట్ ఆచ్ గమ్మల్ట్* (Nylt och Gammalt- ఆంగ్లంలో New and old pieces), 1898 లో *గ్రాల్ స్టాంక్* (Gralstank- ఆంగ్లంలో Grail Splashes) అనే చిన్న గ్రంథాలను వెలువరించాడు. 1898 నుండి 1905 వరకు మానసిక చికిత్సాలయంలో ఉన్నాడు. మానసిక రుగ్మత నుండి కోలుకొన్న తరువాత 1910 లో *ఎఫ్టర్ స్కార్డ్* (Efter skord) అనే గద్య, పద్య సంకలనాన్ని ఆయన ప్రచురించాడు. ఇవే గాక అనేక సాహిత్య వ్యాసాలు, వార్తా పత్రికలలో హాస్య వ్యంగ్య రచనలు ఆయన ప్రచురించాడు.

ఈయన కవిత్వం పైకి ఆనందంగా, ఆహ్లాదకరంగా కనిపించినా, అంతర్గతంగా ఆయనలోని క్షోభ, నిస్పృహ, తిరుగుబాటు ధోరణులను కూడా వ్యక్తం చేస్తుంది. జీవితంలోని అర్థంలేని సమస్యలను ఛేదించి శాంతిని ప్రసాదించ గలిగిన సిద్ధాంతం కోసం అన్వేషణ కూడా ఇతని రచన లన్నింటిలోను కనిపిస్తుంది.

కె.జి. మూర్తి.

**ఫ్లెచర్, జాన్ (1579-1625)** : ఇంగ్లీష్-జాకోబియన్ నాటక రచయిత. ఫ్రాన్సిస్ బోమాంట్ మొదలైన నాటక రచయితలతో కలసి పని చేసినవాడు.

ఇతని తండ్రి రిచర్డ్ ఫ్లెచర్ కొంతకాలం ఇంగ్లండ్ రాణికి గురువుగాను, ఆ తరువాత అనేక నగరాలకు క్రైస్తవ మతాధికారిగాను ఉండేవాడు.

జాన్ ఫ్లెచర్ తన తండ్రి వలె మతమౌఢ్యం గలవాడు కాడని అతని నాటకాల ద్వారా తెలుస్తున్నది. *వోల్పోన్* (Volpone) అనే బెన్ జాన్‌సన్ (Ben Johnson) గ్రంథ ప్రచురణలో ఫ్లెచర్ తొలిసారిగా బోమాంట్ (Beaumont) తో కలిసి పనిచేశాడని ప్రతీతి.

మొదటగా బోమాంట్ తో కలిసి ఫ్లెచర్ సుమారు 1607 ప్రాంతాలలో రచనలు చేయడం ప్రారంభించాడు. *గ్లోబ్* (Globe), *బ్లాక్ ఫ్రయర్స్* (Black Friars) అనే థియేటర్‌ల వారికి ఆయన ఎక్కువగా రచనలుచేశాడు.

52 నాటకాల సంపుటిలో ఫ్లెచర్, బోమాంట్‌ల రచనా శైలి ప్రస్ఫుటంగా తెలుస్తున్నది. వీటిని ఇద్దరూ కలసి రచించినా ఎక్కువభాగం ఫ్లెచర్ ఒక్కడే రచించినట్లు శైలిని బట్టి తెలుస్తున్నది. *ఫైలాస్టర్* (Phylaster), *ది మెయిడ్స్ ట్రాజడీ* (The Maides Tragedy) *ఏ కింగ్ అండ్ నో కింగ్*(A King and No King) లలోని వారి రచనా శైలికి, షేక్స్పియర్, చాప్‌మాన్ (Chapman), జాన్ వెబ్‌స్టర్‌ల రచనా విధానానికి చాలా భేదం కనిపిస్తుంది.

ఫ్లెచర్, బోమోంట్‌ల రచనలు సాధారణంగా సుదీర్ఘంగా ఉంటాయి. ఊహాజనితమైన చారిత్రక కథలూ, జానపద గాథలూ వీరి రచనల్లో ప్రధాన ఇతివృత్తాలు. పదునైన పదాలతోనూ, వ్యంగ్యంగా సాగే సంభాషణలతోనూ కథను చిత్రిస్తూ సుఖాంతంగా కాని, విషాదాంతంగా కాని, రచయితలు తమకు ఇష్టమైన రీతిలో మలుపులు త్రిప్పుతూ రచన సాగించారు.

ఫ్లెచర్ స్వంతంగా రచించిన నాటకాలు *ది మాడ్ లవర్, ది లాయల్ సబ్జెక్ట్, ది హ్యూమరస్ లెఫ్టినెంట్, విమెన్ ప్లీజ్, ది ఐలాండ్ ప్రిన్సెస్, ఏ వైఫ్ ఫర్ మోనెత్* అన్నీ తీవ్రమైన సంభాషణలతో, అసాధారణ సన్నివేశాలతో సాగినవి. అన్నింటిలోనూ *ది లాయల్ సబ్జెక్ట్* (The Loyal Subject), *ఏ వైఫ్ ఫర్ ఏ మానెత్* (A Wife for a Moneth) అన్న నాటకాలు ఉత్తమ మైనవని చెప్పవచ్చు.

బోమాంట్‌తో మాత్రమే కాక ఇతర రచయితలతో కలిసి ఫ్లెచర్ మరికొన్ని నాటకాలను రచించాడు. *విట్ ఎట్ సెవరల్ వెపన్స్* అన్నది హాస్య భరితమైన రచన. *ది వైల్డ్ గూస్‌చేజ్* అనే నాటకంలోని ఘట్టాలన్నీ చమత్కారభరితమైనవి. విమర్శ ప్రధానంగా ఉండి హాస్య ధోరణిలో సాగటం ఈ రచనలోని ప్రత్యేకత.

ఫ్లెచర్ రచించిన నాటకాలలో *ది ఫాల్స్ వన్, ది బెగ్గర్స్ బుష్* అన్నవి కూడా ప్రముఖమైనవి.

ఫ్లెచర్ 1925 లో ప్లేగు వ్యాధితో మరణించాడు. బట్టలు కుట్టించుకొనే నిమిత్తం లండన్ నగరానికి వెళ్లి అక్కడే ఆ వ్యాధికి ఫ్లెచర్ గురి అయినాడు.

వేదవతి

**ఫ్లోబేర్, గుస్టేవ్ (1821-80)** : ఫ్రెంచ్ నవలా రచయిత. ఫ్రెంచ్ సాహిత్యంలో వాస్తవికతా వాదాన్ని ప్రవేశ పెట్టి దానికి తగిన బలాన్ని చేకూర్చిన ఘనత ఈయనకు దక్కుతుంది. *మేడం బొవరీ* (1857) అనే ఈయన నవల ఆనాటి బూర్జువా (మధ్య తరగతి) జీవన సరణికి అద్దం పట్టింది. ఈ నవల ఆయనకు అఖండమైన పేరు ప్రఖ్యాతులు తెచ్చి పెట్టింది. జీవితాన్ని యథాతథంగా చిత్రించటానికి ప్రయత్నించటంతో అందులో అశ్లీలత కనిపిస్తోందనే ఆరోపణపై ఆయనను విచారించటం కూడా జరిగింది.



తండ్రి ప్రముఖ శస్త్రవైద్యుడు. తల్లి ఒక వైద్యుని కుమార్తె. చిన్నతనం నుండే ఆసుపత్రులు, రోగులు, వీటితో కూడిన వాతావరణంలో పెరగటం కూడ అతని వాస్తవికతా వాదానికి బలం ఇచ్చింది. ఇవన్నీ అతని మేధకు పదును పెట్టాయి. చిన్నతనం నుంచే అందరూ అంగీకరించే సాంప్రదాయిక భావాలపట్ల ఇతనికి విముఖత ఏర్పడింది. న్యాయశాస్త్రం చదువడానికి 1841 లో పారిస్ వెళ్లాడు. కాని అనారోగ్య కారణంగా దానిని వదిలి వేయవలసి వచ్చింది. తరువాత పూర్తి సమయాన్ని సాహిత్యసేవకు అంకితం చేశాడు.

*ఎల్ ఎడ్యూకేషన్ సెంటిమెంటేల్* అనే నవల జూలై రాచరికపు పాలనలో నలిగిపోయిన ఫ్రెంచ్ దేశ చరిత్రను విపులంగా తెలియ జేస్తుంది. తాను వ్రాసినది ఉత్తమ శ్రేణికి చెందేవిగా ఉండాలనే తపన ఇతనిలో బలంగా ఉండటంతో తన నవలలను రెండుమూడు సార్లు సవరణలు చేస్తూ తిరిగి వ్రాసేవాడు. వీనికి ఉదాహరణగా *లా టెంటేషన్ డి సెయింట్ ఆంటాయిన్* (La Tentation de Saint Antoine, 1874) ని పేర్కొనవచ్చు. 1839 లో ప్రారంభించిన ఈ నవలను 1874 లో పూర్తి చేసి ప్రచురించాడు. దీనికి నాలుగు ప్రతులు మనకు లభిస్తాయి. 1849 లో వ్రాసిన దానిలో స్పెనొజా తాత్త్విక భావాలు కనిపించగా, 1870 లో పూర్తిచేసి ప్రతిలో మతం పట్ల గౌరవం కనిపిస్తుంది. చివరి దాంట్లో విజ్ఞాన శాస్త్రం, మతం ఒకదాని కొకటి వ్యతిరేకమైనవికావని, అవి ఒకే తత్త్వచింతన యొక్క రెండు దృక్పథాలని ఒప్పుకొంటాడు. దీనిని మొదలు పెట్టి పూర్తి చేసేలోపల ఇతని భావాలలో కలిగిన మార్పులను ఈ నవల వివిధ రూపాలు ప్రతిబింబిస్తున్నాయి.

1849-51 ల మధ్య ఫ్లోబేర్ ఈజిప్ట్, పాలస్తీనా, సిరియా, టర్కీ మొదలైన దేశాలను పర్యటించాడు. ఒక ప్రబంధం వంటి నవల వ్రాయాలని అతనిలో ఆరాటం మొదలైంది. మిత్రులు కూడా ప్రోత్సహించారు. ఫలితమే 1856 లో సీరియల్‌గా ప్రచురణ ప్రారంభమైన *మేడం బొవరీ* అనే నవల అయిదు సంవత్సరాల కృషి ఫలితం ఇది. వాస్తవంగా జరిగిన, జరుగుతున్న సంఘటనలను, తనకు తెలిసిన అనేక మంది లక్షణాలను క్షుణ్ణంగా పరిశీలించి, ఆయా పాత్రలు వాస్తవికంగా కనిపించటానికి అవసరమయే అనేక చిన్న చిన్న విషయాలను కూడ చక్కగా చిత్రించటం ద్వారా పాత్రలకు, కథకు వాస్తవికతను, శాశ్వతత్వాన్ని కల్పించి, ఫ్రెంచ్ సాహిత్యంలోనే ఒక నూతన శకానికి ఫ్లోబేర్ నాంది పలికాడు.

ఆ తరువాత *సాలాంబో* అనే నవల, *లె ఛాటొడెస్ కోయర్* (Le Chateau des Coeurs ఆంగ్లంలో The castle of Hearts, 1914) అనే నాటకం ఇతడి ఇతర రచనలలో చెప్పుకోదగ్గవి. చివరి రోజులలో *బోవర్డ్ ఎట్ పెకుఛెట్* (Bouvard et pecuchet) అనే పెద్ద నవల వ్రాశాడు. అయితే దీనిని అసంపూర్తిగానే వదలి వేశాడు.

వాస్తవాన్ని చిత్రించటంతో, సత్యాన్ని ప్రకటించటంతో నైతిక, సాంఘిక నియమాలకు సంప్రదాయాలకు విలువ నివ్వకపోవటంతో ఈ రచయిత అనేక విమర్శల నెదుర్కోవలసి వచ్చింది. కళలో సుందరత్వాన్ని సృష్టించటమే అతని ధ్యేయం. మనోహరమైన కవిత్వం వలె కదనుతొక్కేది, విజ్ఞాన శాస్త్రపు విస్పష్టతను ప్రదర్శించగలిగేది అయిన శైలిని అలవరచుకోవాలనే ఆకాంక్ష ఈయన రచనలలో వ్యక్తం అవుతుంది. రచయిత తన భావాన్ని వ్యక్తం చేయటానికి అవసరమయే పద సంపదను తానే సమకూర్చుకోవాలని ఇతని సిద్ధాంతం. రచనలు పాఠకుల మేధను స్ఫురింపచేసేవిగా మాత్రమే గాక వారి అంతశ్చేతనను కదిలించేవిగా ఉండాలంటాడు ఫ్లోబేర్.

కె.జి.మూర్తి

**బక్, పెర్ల్ ఎస్. (1892-1973)** : చూ. పెర్ల్ ఎస్. బక్.

**బట్లర్, శామ్యూయెల్ (1835-1902) :** ఇంగ్లీష్ నవలారచయిత, వ్యాస రచయిత, విమర్శకుడు. *ఇరివాన్* (Erewhon-1872) అన్న వ్యంగ్య పరిహాస పూరితమైన రచనలో విక్టోరియా హయాంలో అభివృద్ధి కార్యక్రమాల లోని లోటుపాట్లను, మోసాన్ని విమర్శించాడు. *ది వే ఆఫ్ ఆల్ ఫ్లెష్* (The way of All Flesh-1903) ఇతని స్వీయ చరిత్రే. ఈ రచన ఈయన గ్రంథాలన్నిటి లోకీ పేరెన్నిక గన్నది.

బట్లర్ తండ్రి రెవరెండ్ థామస్ బట్లర్ 6 సంవత్సరాలు షూస్‌బరీలో చదివిన తరువాత కేంబ్రిడ్జ్ విద్యాలయం నుంచి 1858 లో పట్టభద్రు డయాడు. 'బట్లర్' తండ్రికి ఇతడు మతాచార్యు డుగా స్థిరపడాలని కోరికగా ఉండేది. కాని శామ్యుఎల్ మనస్సులోని మత విరుద్ధ భావాలు, స్వతంత్ర బుద్ధి తన తండ్రి ఆశయాలకు దూరం అయేట్టు చేశాయి. కేంబ్రిడ్జ్‌నీ, చర్చినీ, ఇంటినీ వదలి న్యూజి లాండ్ వెళ్లాడు. డార్విన్ వ్రాసిన *ఆరిజిన్ ఆఫ్ స్పీసిస్* (Origin of Species) శామ్యుఎల్‌ను ప్రభావితం చేసింది. అప్పుడే అతడు క్రైస్తవ మతాన్ని పూర్తిగా త్యజించినట్లు తెలుస్తున్నది.



కాని, తరువాతి పరిణామాలను బట్టి చూస్తే క్రైస్తవం అతనిని పూర్తిగా వదలినట్లు తోచదు. తన తండ్రి నమ్మిన దైవాన్ని విస్మరించేట్టు చేసింది కనుక మొదట్లో శామ్యుఎల్‌కు డార్విన్ సిద్ధాంతం పైన గురి కుదిరింది. తరువాతి కాలంలో తానే తన దైవాన్ని కనుక్కోడం వలన దైవం లేడనే డార్విన్ సిద్ధాంతాన్ని అతడు త్యజించాడు. ఈ కారణంగా శామ్యుయెల్ ఈ రెండు వర్గాల వారి నిరసననూ ఎదుర్కొని వెలివేయబడి ఒంటరివాడయాడు. న్యూజిలాండ్ పత్రికకు చాలా వ్యాసాలు వ్రాసి ప్రచురించాడు.

న్యూజిలాండ్ లో పుష్కలంగా ధన సముపార్జన చేసిన తరువాత శామ్యుయెల్ లండన్‌కు తిరిగి వచ్చి అక్కడే స్థిరనివాసం ఏర్పరచుకొన్నాడు. 1865 లో క్రీస్తు తిరిగి పునర్జన్మ పొంది జీవించాడా లేదా అన్న విమర్శనాత్మక రచన (Evidence for the Resurrection of Jesus Christ) శామ్యుయెల్ పేరు లేకుండా అనామకంగా ప్రచురితమైంది.

శామ్యుయెల్ చిత్రకారుడు కూడా లండన్‌లోని టేట్ గాలరీ (Tate Gallery) లో *మిస్టర్ హీదర్ లేస్ హాలీడే* అనే అతని చిత్రం ప్రదర్శితమై ఉంది. ఇంకొకటి *కుటుంబ ప్రార్థనలు* (Family prayers) అన్న చిత్రం కేంబ్రిడ్జ్‌లోని సెంట్‌జాన్స్ కాలేజ్ లో ఉంది. సంగీత జ్ఞానం కూడా ఉన్న శామ్యుఎల్ పియానో వాద్యానికి సంగీతపు బాణీలను సమకూర్చాడు. *ఒడిస్సీ* (Odyssey) అనే రచన సిసిలీ లోని ఒక రచయిత్రి వ్రాసిందని నిరూపిస్తూ *ది ఆథరెస్ ఆఫ్ ది ఒడిస్సీ* (The Othoress of the Odyssey) అనే గ్రంథం వ్రాశాడు.

శామ్యుయెల్ బట్లర్ రచన *ఇరివాన్* ఇతనికి కొంత ప్రఖ్యాతిని తెచ్చి పెట్టింది. *ది మ్యూజికల్ ది ఫెయిర్ హెవెన్* (The Fair Haven) అనే రచన వ్యంగ్య పరిహాస ధోరణిలో క్రైస్తవాన్ని సమర్థిస్తూ వ్రాసింది. తనతోటి వాళ్లచేత ఏదో ఒక విధంగా మోసగింపబడినాననే వ్యథ అతనిని జీవితాంతం వరకూ పీడిస్తూనే ఉండేది. జీవితమనేది వట్టి భ్రమ, మాయతో కూడిన దన్న నమ్మకం అతని మనస్సులో ఏర్పడింది. తను ఒకప్పుడు నమ్మిన డార్విన్ సిద్ధాంతం కూడా ఒక మోసంతో కూడినదేనా అన్న సందేహం కలిగింది. *లైఫ్ అండ్ హాబిట్* (1878), *ఎవల్యూషన్ ఓల్డ్ న్యూ* (1879), *అన్ కాన్షస్ మెమొరి* (1880), *లక్ ఆర్ కన్నింగ్* (1887) అన్న రచనలు ఇటువంటి ఆలోచనలతో చేసినవే.

*ది వే ఆఫ్ ఆల్‌ఫ్లెష్* బట్లర్ మరణానంతరం ప్రచురింపబడింది. ఇది అతని రచన లన్నిటిలోనూ ఉత్తమమైనదిగా భావింప బడుతున్నది. తన నిజ జీవితం లోని అనుభవాలను శామ్యుఎల్ ఈ గ్రంథంలో పొందుపరిచాడు. జార్జ్ బెర్నార్డ్‌షా శామ్యుయెల్ బట్లర్‌ను 19 వ శతాబ్దపు ఉత్తమ రచయితగా అభివర్ణించాడు.

*వేదవతి*

**బన్యన్, జాన్ (1628-1688) :** ప్రసిద్ధి పొందిన ఆంగ్ల మతగురువు, బోధకుడు. *ది పిల్గ్రిమ్స్ ప్రోగెస్* (The Piligrims Progress) అన్న గ్రంథం ఇతని ప్రఖ్యాత రచన. దీనిలో క్రైస్తవ మతంలోని పరిశుద్ధాత్మ విషయం అతి విలక్షణంగా వర్ణింపబడింది. ఇతని ఇతర రచనలు: పారమార్థిక విషయాలను తెలిపే ఆత్మకథ

*గ్రేస్ అబౌండింగ్* (1666), *ది హోలీ వార్* (The Holy War) అన్నవి పేర్కొనదగినవి.

బన్యన్ ఒక కమ్మరి వాని కుమారుడు. మామూలు పాఠశాలలో నేర్చుకొన్న విద్యకన్నా, వాస్తవ జీవితంలోని



స్థితిగతులు ఇతని మీద ఎక్కువ ప్రభావాన్ని చూపాయి. పన్నెండు సంవత్సరాల బాలుడుగా ఉన్నప్పుడే బైబిల్ మత గ్రంథ పఠనంలో నిమగ్నుడయాడు. తల్లిదండ్రుల నుండి సనాతన ధర్మాలను గురించిన విశాల భావాలను జీర్ణించుకొంటూ పెరిగాడు. బన్యన్ ఆత్మకథలో తాను ఎన్నో భయంకరమైన కలలను కనేవాడనని వ్రాసుకొన్నాడు. బహుశః అందుకు కారణం అతని యౌవన దశలో కలిగిన మత సంక్షోభాలే అయి ఉండవచ్చును. 1644 లో దురదృష్టకరమైన సంఘటనల మూలంగా బన్యన్ తన తల్లితండ్రులకు దూరమై బయటి ప్రపంచంలోకి అడుగు పెట్టవలసి వచ్చింది. కొంతకాలం యుద్ధంలో పనిచేశాడు. యుద్ధంలో క్రామ్‌వెల్ సైన్యంలో పనిచేసినప్పుడు కొందరు సైనికాధికారులు మతాన్ని గురించిన బూటకపు ఛాందసపు బోధలు చేస్తూ వ్యక్తిగత దూషణలు చేసేవారు. ఈ సమయంలోనే బన్యన్ కు కొంతమంది ప్యూరిటన్ మతస్థులు పరిచయమయారు. వారు బోధించిన సూత్రాలు అతని మీద ముద్రవేశాయి.

1647-1649 మధ్యలో బన్యన్ వివాహం చేసుకొన్నాడు. భార్యతో కాపురం పెట్టుకొనేనాటికి చాలా బీదరికం అనుభవిస్తూ ఉండినట్లు తన ఆత్మకథలో వ్రాసుకొన్నాడు. కొంతకాలం వైరాగ్యభావంతోను, మత పరమైన అనేక సమస్యలు, సందేహాలతోను సతమతమయాడు. మానసికమైన అంధకారం నుండి తప్పించుకొనే మార్గం వెతుక్కొంటూ అతడు చివరకు జాన్ గిఫ్ఫర్డ్ ఆధ్వర్యంలో నడుస్తున్న 'సెపరేటిస్ట్ చర్చ్' లో చేరాడు.

జాన్ బన్యన్ చెరసాలలో ఉన్నప్పుడు తన ఆధ్యాత్మిక సంబంధమైన ఆత్మకథను వ్రాసి ప్రచురించాడు. దాని పేరు *గ్రేస్ అబౌండింగ్* (Grace Abounding-1666). *ది పిల్‌గ్రిమ్స్ ప్రోగ్రెస్* లో ఒకరకమైన కాల్పనిక రీతిలో బోధనా పద్ధతిలో మానవునికి ఉపయోగించే విషయాలను విశదీకరించాడు. కొంతవరకు తన స్వానుభవాలనే అందులో చిత్రీకరించాడు. *ది లైఫ్ అండ్ డెత్ ఆఫ్ మిస్టర్ బాడ్ మాన్* (1680) నిజ జీవితాన్ని చిత్రించేదిగా ఉంది. *ది హోలీ వార్* (1682) బన్యన్ రెండవ గ్రంథం.

బన్యన్ మత బోధకుడుగా తీరని పనులలో ఉన్నప్పటికీ తన చివరి పది సంవత్సరాల కాలంలో అనేకమైన వివాదాస్పదమైన రచనలు చేశాడు. వాటిలో *ఏ బుక్ ఫర్ బాయిస్ అండ్ గర్ల్స్* (1686) అన్న పద్య రచన పేరెన్నిక గన్నది. అది బాలలకోసం వ్రాయబడిన మంచి రచన.

బన్యన్ రచన లన్నిటిలోకీ విశిష్టమైనది, విభిన్న వర్గాల, జాతుల, సంస్కృతులకు సంబంధించిన వారి సమస్యలతో చెరగని ముద్ర వేసుకొన్నది: *ది పిల్‌గ్రిమ్స్ ప్రోగ్రెస్.*

వేదవతి

**బరోస్, విలియమ్ (1914--)** : కొన్ని ప్రయోగాత్మక నవలలను వ్రాసిన అమెరికన్ రచయిత. భీతిని కలిగించే సన్నివేశాలతో హాస్యమయ రచనలు చేశాడు. మాదక ద్రవ్యాలకు అలవాటు పడిన వ్యక్తిగా ఇతడు తన అనుభవాలను, శృంగారపరమైన ఊహలను అతి సహజంగా, నిజాయితీగా వర్ణించటం వలన ఇతని రచనలు 'బీట్' అనే ఉద్యమకారులను ఆకర్షించాయి.

కూడికలు చేసే ఒక యంత్రాన్ని కనిపెట్టిన బరోస్ అనే అతని మనుమడు విలియమ్ హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో 1936 లో పట్టభద్రుడై చారిత్రక పరిశోధన లోను, మత విషయికమైన శాఖలోను ఉన్నత విద్యను కొనసాగించాడు. కొన్ని ఉద్యోగాలు చేసిన అనంతరం కొంతకాలం రెండవ ప్రపంచ యుద్ధకాలంలో అమెరికన్ సైన్యంలో పనిచేశాడు. మాదక ద్రవ్య వ్యసనాలకు లోనై న్యూయార్క్ నగరం నుండి మెక్సికోకు 1944 లో భార్యతో కలిసి వెళ్లాడు. విధి వశాత్తు జరిగిన ఆకస్మిక సంఘటనలో ఇతడు భార్యను కాల్చి చంపటం జరిగింది. దక్షిణ అమెరికాలోని అమెజాన్ ప్రాంతంలో తిరుగుతూ, మాదక ద్రవ్యాలను గురించిన పరిశోధనలు జరుపుతూ వచ్చాడు. 'అలెన్ గిన్స్‌బర్గ్' తో జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా అప్పటి అతని జీవిత విశేషాలు కొన్నింటిని తెలుసుకోవచ్చును.

ఇతని మొదటి పుస్తకం *జన్కీ కన్‌ఫెషన్స్ ఆఫ్ ఏన్ అన్ రిడీమ్డ్ డ్రాగ్ ఎడిక్ట్* (1953) లో వ్యసనానికి

లోనైన వాని జీవితకథ ఉంది. దీనిని అతడు 'విలియమ్ లీ' అనే మారుపేరుతో ప్రచురించాడు. *నేకెడ్ లంచ్* (1959) అనే పుస్తకాన్ని మాదక ద్రవ్య వ్యసనానికి వైద్యం చేయించు కొన్న తరువాత వ్రాశాడు. అన్ని రకాల వ్యసనాలూ రచనలు చేయటానికి ప్రేరకాలుగానే ఉంటాయని విలియమ్ అభిప్రాయం.

పదిహేను సంవత్సరాల పాటు మాదక ద్రవ్య వ్యస నానికి లోనైన మనిషి ఏ విధంగా అనేక వికారాల చేత పీడింపబడుతాడో తన రచనల్లో కాచి వడపోసినవాడు. స్వలింగ సంపర్క విషయాలను గురించి, పోలీసుల జులుమును గురించి *నేకెడ్ లంచ్* అనే పుస్తకంలో వివరంగా వ్రాశాడు.

బరోస్ విలియమ్ ఇతర రచనలు: *ది సాఫ్ట్ మెషీన్* (1961), *ది టికెట్ దట్ ఎక్స్‌ప్లోడెడ్* (1962), *నోవా ఎక్స్‌ప్రెస్* (1964), *ది వైల్డ్ బాయిస్* (1971), *ఎక్స్‌ట్ర్మినేటర్* (1973), *ది లాస్ట్ వర్డ్స్ ఆఫ్ డచ్ షుల్జ్* (1975), *సిటీస్ ఆఫ్ ది రెడ్ నైట్* (1981), *ది ప్లేస్ ఆఫ్ డెడ్ రోడ్స్* (1983).

*బరోస్ 1983* (1983) జీవితాన్ని హోవర్డ్స్ బ్రూక్నర్ అనే చలనచిత్ర నిర్మాత చలన చిత్రంగా చిత్రీకరించాడు.

వేదవతి

**బరోహా, పియో (1872-1956) :** తన సమకాలీన స్పెయిన్ దేశపు నవలా రచయితలలో అగ్రగణ్యుడుగా పేరు పొందినవాడు. వైద్య శాస్త్రంలో పట్టభద్రుడై కొంత కాలం వైద్యవృత్తిని కొనసాగించాడు. *జెనరేషన్ ఆఫ్ 98* లో సభ్యుడుగా ఉంటూ స్పెయిన్ దేశస్థుల వ్యర్థ జీవన విధానాన్ని తీవ్రంగా విమర్శించాడు. ఇతని ఆలోచనా విధానానికి ప్రాతిపదికలుగా బరోహా వ్రాసిన రెండు గ్రంథాలను పేర్కొనవచ్చు. అవి: 1. *విడాస్ సాంబ్రియాస్* (1900; Sombre Lives) అనే కథల సంపుటి. రెండవది *లా కాసా ఔజ్ గోరీ* అనే నవల. వీటిలో ఆనాటి సాంఘిక సమస్యలను ప్రతిబింబించే రచనలు చేస్తూ బరోహా ప్రజలలో ఉత్తేజాన్నీ, చైతన్యాన్నీ కలిగించే ప్రయత్నం చేశాడు. *లా లుహ పోర్ లా విడా* (1904, The Struggle for Life-1922-24) మాడ్రిడ్ నగరంలోని అట్టడుగు వర్గాల వారి బాధలనూ, కష్టాలనూ ఎంతో ఆర్తితో చిత్రించాడు. బరోహా స్వతః మత సూత్రాలకు వ్యతిరేకి, తిరుగుబాటుదారు కనుక అటు వంటి వారిని గురించే తన రచనలలో చిత్రించాడు. ఈ రచనలు అతని ఆలోచనా విధానానికి అద్దం పట్టేవిగా ఉన్నాయి. *ఎల్ ఆర్బోల్ డి లా సియెన్సియా* (1911 Tree of knowledge- 1928) అనే రచనలో ఈయన స్వీయచరిత్ర కనిపిస్తుంది. *మెమోరియాస్ డీ అన్ హొంబ్రే డీ ఆక్సియన్* (1913-28 Memories of a Man of Action) అనే గ్రంథం బరోహా రచన లన్నిటిలోకీ విశిష్టమైంది. ఇంకా ఈయన వ్రాసిన 14 నవలలు, 8 కథల సంపుటులలో 19 వ శతాబ్దపు తిరుగుబాటు ధోరణి లక్షణాలు కనిపిస్తాయి. ఇతని నవలల్లో *జాలా కాయిన్వెల్ అవెంటిరెరో* (1909) అనే రచన పేరెన్నికగన్నది.

క్రైస్తవ మత వ్యతిరేక భావాలతోను, మత సూత్రా లను ఉల్లంఘించమని ఉద్బోధించే ప్రయత్నంతో, నిరాశా వాదంతో బరోహా రచించిన నవలలు ఎక్కువ ప్రసిద్ధిని పొందలేదు. బరోహా పాత్రల లోని పొందిక, నిరాడం బరత ఎర్నెస్ట్ హెమింగ్ వే ని ఎక్కువగా ప్రభావితం చేశాయి.

వేదవతి

**బర్క్, కెనెత్ (1897--) :** అమెరికన్ సాహిత్య విమర్శకుడు. మానసిక సంబంధమైన ఇతివృత్తాలు ఆధా రంగా వైజ్ఞానిక విషయాలను గురించి విశదీక రించాడు. 20 వ శతాబ్ది ఉత్తరార్ధంలో అమెరికా దేశపు సాహిత్య విమర్శకులలో ప్రముఖ స్థానం వహించాడు.

ఓహియో స్టేట్ విశ్వవిద్యాలయం (1916-17) లోను, కొలంబియా విశ్వ విద్యాలయంలోను (New York City, 1917-18) విద్యాభ్యాసం చేశాడు. కాని పట్టాను పుచ్చుకోలేదు. అతని ముఖ్య రచనలు: *కలెక్టెడ్ పోయెమ్స్* (1915-67;1968), *టువార్డ్స్ ఏ బెటర్ లైఫ్* (1932). *ది కంప్లీట్ వైట్ ఆక్సెన్: కలెక్టెడ్ షార్టర్ ఫిక్షన్* (1966). ఇంకా కొన్ని జర్మన్ భాష నుంచి అనువదించిన రచనలు కూడా బర్క్ ప్రచురించాడు.

ఇతడు సంగీత శాస్త్ర విమర్శకుడుగా ఉండి ది డయల్ సాహిత్య బహుమతిని (1928) గ్రహించాడు. ది నేషన్ (1934-36) బహుమతి కూడ ఇతనికి దక్కింది. ఆ తరువాత ఇతడు సాహిత్య విమర్శకుడు కూడా అయాడు. చికాగో విశ్వవిద్యాలయంలోను, (1938, 1949-50), బెన్నింగ్టన్ కాలేజిలోను సాహిత్యోపన్యా సకుడుగా పనిచేశాడు. అమెరికా, యూరప్ దేశాలలో అనేక చోట్ల పర్యాటక అధ్యాపకుడిగా పనిచేశాడు.

సాహిత్య విమర్శకుడుగా మానవుని విజ్ఞాన సర్వస్వ మంతటినీ ప్రయోజనకారిగా రూపొందించాలని అతని

ఆశయం. బర్క్ ప్రధాన రచనలు: *కౌంటర్ స్టేట్ మెంట్* (Counter Statement-1931), *ది ఫిలాసఫీ ఆఫ్ లిటరరీ ఫార్మ్* (1941), *పర్మనెన్స్ అండ్ చేంజ్ ఏన్ ఎనాటమీ ఆఫ్ పర్పస్* (1935), *ఏటిట్యూడ్స్ టువార్డ్ హిస్టరీ* (2 vols-1937). *ఏ గ్రామర్ ఆఫ్ మోటివ్స్* (1945), *ది రెటారిక్ ఆఫ్ రెలిజియన్, స్టడీస్ ఇన్ లోగాలజీ* (1961), *లాంగ్వేజ్ ఆజ్ సింబాలిక్ ఆక్షన్* (1966).

బర్క్ తన అభిప్రాయాలలో వచ్చిన మార్పులకు అనుగుణంగా లోగడ రచించిన గ్రంథాలను తిరిగి సవరించుకొంటూ వచ్చాడు. ఇవి కాక పుంఖాను పుంఖంగా వ్యాసాలను వ్రాసి పత్రికలలో ప్రచురించాడు. బర్క్ 19 వ శతాబ్దపు ప్రముఖ విమర్శకుడు శామ్యూయెల్ టేలర్ కోలెరిడ్జ్ తరువాత చెప్పుకోదగిన ప్రసిద్ధ సాహిత్య విమర్శకుడు. భాషా విషయంలో ఇతడు వెలువరించిన అభిప్రాయాల వలన తరువాత పెక్కుమంది నవలా రచయితలు, కవులు, విమర్శకులు ప్రభావితులయారు.

*వేదవతి*

**బర్న్స్, రాబర్ట్ (1759-96) :** ఇతడు స్కాట్లండ్ దేశపు జాతీయకవి. అనేక గేయాలను వ్రాశాడు. ప్రాచీన మత సంప్రదాయాలకు ఇతడు వ్యతిరేకి. నీతిమీద, మతం మీద నమ్మకం లేని స్వేచ్ఛా జీవి.

క్రమ పద్ధతిలో పాఠశాలకు వెళ్లి చదువుకొనక పోయినా బర్న్స్ లాటిన్ భాష బాగా నేర్చుకొన్నాడు. 18 వ శతాబ్దపు రచయితలు షేక్స్పియర్, మిల్టన్, డ్రైడన్ వంటి వారి రచనలు చదువు కొన్నాడు. మానవత్వమే మతం అన్నభావం చిన్నతనంలోనే ఏర్పడింది.

1784-85 మధ్యలో 'బర్న్స్' కొన్ని గేయాలను, పద్యాలను వ్రాశాడు. ప్రేమను, స్నేహాన్ని, ఉత్సాహాన్ని సమకాలీన సమాజస్థితి గతులను గురించిన తన ఆలోచనలను తన కవితలలో పొందు పరచాడు.

ప్రేమ సంబంధమైన కొన్ని చిక్కులను, చికాకులను ఎదుర్కొంటూనే బర్న్స్ తన మొదటి కవితా సంపుటిని ప్రచురించాడు. జూలై 31, 1786 లో, స్కాటిష్ ప్రాంతపు మాండలిక భాషలో ప్రచురించిన ఈ కవితా సంపుటి అనతి కాలంలోనే పరితల ప్రశంసలను అందుకొన్నది. పండిత పామరులందరినీ ఈ కవితలు అలరింప జేశాయి.

ఎడిన్ బర్గ్ (Edin Burgh) లో ఉన్నప్పుడు జేమ్స్ జాన్సన్ (James Johnson) తో కలసి స్కాటిష్ పాటలను సేకరించి, పరిష్కరించి, బాణీలు కట్టి, సంకలనంగా ప్రచురించటంలో ఉత్సాహంగా పనిచేశాడు బర్న్స్. జాన్సన్ ప్రచురించిన *స్కాట్స్ మ్యూజికల్ మ్యూజియమ్* అన్న గ్రంథానికి ముఖ్య సంపాదకుడుగా పనిచేశారు. 1787-1803 లో వచ్చిన ఈ గ్రంథంలోను, థామ్సన్ (George Thomson) ప్రచురించిన *సెలెక్ట్ కలెక్షన్ ఆఫ్ ఒరిజినల్ స్కాటిష్ ఎయిర్స్ ఫర్ ది వాయిస్* (1793-1818) లోను ఎక్కువ భాగం బర్న్స్ వ్రాసిన గేయాలే చోటు చేసుకొన్నవి.

తరువాతి కాలంలో బర్న్స్ స్కాట్లండ్ దేశపు గీతాలను సేకరిస్తూ తాను స్వయంగా పాటలు రచిస్తూ ఉండేవాడు. తాను చేస్తున్న పనివల్ల స్కాట్లండ్ దేశానికి ఎంతో సేవ చేస్తున్నాననే భావంతో, తనకు వచ్చిన పారితోషికాన్ని సైతం నిరాకరించేవాడు. అఖండమైన తెలివితేటలతో పాటు, స్థిరమైన మనఃప్రవృత్తి కలిగిన బర్న్స్ ఆ కారణంగానే ఆ నాటి సమాజంలో ఇముడలేక పోయాడు. ప్రతికూల వాతావరణంలో కూడ బర్న్స్ అంతటి సాహిత్య సృజన చేసి స్కాట్లండ్ దేశపు జాతీయ కవి కావడం అతని ప్రతిభకు నిదర్శనం.

బర్న్స్ వ్రాసిన వ్యంగ్య పరిహాస రచనలలో ఎక్కువగా అతని కవితాశక్తి కానవస్తుంది. బ్రిటన్ దేశపు గేయకవులలో అతడు అత్యంత ప్రముఖుడుగా పరిగణింపబడి విశ్వవిఖ్యాతిని ఆర్జించాడు.

పాత జానపద గేయాలకు క్రొత్తబాణీలు కట్టడంలోను, ఒక్కొక్క బాణీలోకి సరిపోయేట్లు అనేక గేయాలను వ్రాయటంలోను బర్న్స్ ప్రతిభ వెల్లడి అవుతుంది.

*వేదవతి*

**బసీల్, జ్యాంబతీస్తా (1575-1632) :** నేపిల్స్ భాషలో రచనలు చేసిన కవి, కథారచయిత మాత్రమే గాక ప్రభుత్వంలోను, సైన్యంలోను అనేక ఉన్నత పదవులను నిర్వహించివాడు. ఏబది ఉత్సాహపూరితమైన కథలు గల *లో కన్టో డి లికన్టి* అనే ఈయన రచన యూరప్ ఖండంలోని జానపద సాహిత్యానికి ఒక విధంగా పునాది అని చెప్పవచ్చు. 17 వ శతాబ్దిలో ఫ్రెంచ్ రచయిత ఛార్లస్ పెరాల్ట్ 19 వ శతాబ్దిలో జర్మనీలో గ్రిమ్ సోదరులు వ్రాసిన *ఫెయిరీ కథల* కూ, 18 వ శతాబ్దిలో కార్లో గోజి ఇటలీలో వ్రాసిన కొన్ని నాటకాలకూ ఈయన కథలు ప్రధాన భూమికలు అయాయి.

ప్రభుత్వ పదవులలో కొనసాగుతూ కూడ నేపిల్స్ ప్రజల ఆచార వ్యవహారాల పట్ల, జానపద గాథలపట్ల, వారి సాహిత్య, సంగీతాల పట్ల ఈయన ఆసక్తిని పెంచు కొన్నాడు. ముఖ్యంగా అనేక జానపద గాథలను, ఫెయిరీ

కథలను సేకరించి ప్రకటించాడు. వీటిలో ప్రముఖమైనది *లో కంటో డి లికంటి* (1634). *ది స్టోరి ఆఫ్ స్టోరీస్* అనే పేరుతో బి క్రోస్ 1925 లో చేసిన అనువాదం అత్యుత్తమమైనది. అది ఈ రచయిత మరణానంతరం ప్రకటితమైంది. *జియాన్ ఆలీ సియో అబ్బాటియస్* అనే మారు పేరుతో ఇది ప్రకటితమైంది. ఒక బానిస రాజకుమారిగా నటిస్తూ 5 రోజులపాటు 10 మంది స్త్రీల సేవల నందుకొంటుంది. ఆ స్త్రీలు ఆ 5 రోజులలో చెప్పిన 50 కథలు ఇందులో ప్రచురితమైనవి. వీటిలో *సిండరెల్లా, పస్ ఇన్ బూట్స్, ది త్రీ ఆరెంజెస్* మొదలైనవి బహుళ జనాదరణ పొందినవి. చివరి రోజున అసలు రాజకుమారి రావడంతో మోసం చేసిన బానిస బండారం బయటపడి కథలు ముగుస్తాయి.

కథలే కాక ఇటాలియన్, స్పానిష్ భాషలలో బసీల్ కవిత్వం కూడ వ్రాశాడు. *లె మ్యూజ్ నెపోలిటేనె* (Le muse napolitane-1635) అనే కావ్యం వీటిలో పేర్కొనదగినది. ఇందులో నేపిల్స్ ప్రజల ఆచార వ్యవహారాలను పద్య సంభాషణల రూపంలో ఈ రచయిత తెలుపుతాడు.

కె.జి. మూర్తి

**బాండియేరా, మనుయేల్ (1886-1968) :** 20 వ శతాబ్దం ప్రారంభంలో బ్రెజిల్ సాహిత్యం ప్రాచీన పండితుల ప్రభావానికి, యూరప్ సాహిత్యాల ప్రభావానికి లోనయి ఉన్నప్పుడు ఆ సాహిత్యాన్ని ఆధునికత వైపు మళ్లించిన వారిలో మనుయేల్ బాండియేరా ఒకడు. వచనకవిత్వం వ్రాయడం, వ్యావహారిక భాషను ఉపయోగించడం, వాక్యనిర్మాణంలో క్రొత్తపోకడలు చూపడం, బ్రెజిల్ జానపద సాహిత్యం నుంచి ఎన్నెన్నో ఇతివృత్తాలు స్వీకరించడం వంటివి చేసి ఆధునిక బ్రెజిల్ రచయితలలో ఆయన ప్రముఖ స్థానం గడించారు ఆయన.

మనుయేల్ తొలి కవితా సంకలనం *ఎ సింజా దె హోరాస్* ('Destruction of the Hours') 1917 లో వెలువడింది. ఆ సంకలనమూ, 1919 లో వెలువడిన *కార్నివాల్* ('సంబరం') అనే సంకలనమూ మనుయేల్‌ను ప్రత్యేక వ్యక్తిత్వం ఉన్న కవిగా నిలబెట్టాయి. రియో డి జనీరోలో సాహిత్యాధ్యాపకులుగా పనిచేసిన ఆయన 1940 లో *నోకోస్ దె హిస్టారియా దాస్ లిటెరేచర్స్* ('సాహిత్య చరిత్ర') సిద్ధాంతాలు పేరిట ప్రపంచ సాహిత్య చరిత్రను ప్రకటించారు. ఆ గ్రంథంలో బ్రెజిల్ సాహిత్యం గురించిన విభాగంలో తమను గురించి ఒక్క చోట మాత్రమే ప్రస్తావించుకొన్న మనుయేల్ తాము ఆధునికతను ఆదరించినా, వ్యక్తి స్వేచ్ఛను కొంతవరకు పరిరక్షించుకొన్నా మని పేర్కొన్నారు. మనుయేల్ బాండియేరా రచనా వ్యాసంగం ఆయన మరణించే వరకు సాగడం విశేషం.

1936 లో మనుయేల్ బాండియేరాకు యాభై ఏళ్లు నిండిన సందర్భాన్ని పురస్కరించుకొని తక్కిన బ్రెజిల్ రచయితలు కొందరు కలిసి *హోమె నెజమ్ ఎ మనుయేల్ బాండియేరా* (Homage to Manuel Bandeira) అనే పేర ఆయన సాహిత్యకృషిని వివరించే గ్రంథం ఒకటి ప్రచురించారు.

పి.ఎస్.జి.

**బాండెల్లో, మాటియో (1485-1561) :** ఇటలీ దేశపు రచయిత. బాండెల్లో రచించిన కథలు 16 వ శతాబ్దినాటి విశిష్ట సాహిత్య రీతులను తెలుపుతూ ఇంగ్లండు, ఫ్రాన్స్, స్పెయిన్ దేశాలలో ప్రఖ్యాతి పొందాయి.

బాండెల్లో రచయిత మాత్రమే కాక, రాజనీతిజ్ఞుడు, సైనికుడు, మతగురువు కూడా. మిలన్, పావియా విశ్వవిద్యాలయాలలో విద్యను అభ్యసించాడు. లూక్రేజియా గోన్‌యాగాకు చదువు చెప్పడానికి నియమింపబడి అతనికి తాను రచించిన ఒక సుదీర్ఘ కవితను అంకితం చేశాడు. స్పెయిన్ మిలన్ మీద 1522 లో దండెత్తినప్పుడు బాండెల్లో తన రచనకు సమకూర్చుకొన్న సమాచార మంతా నాశనమైంది. అప్పుడు అతడు ఫ్రాన్స్ దేశానికి వెళ్లిపోయి జీవితాంతం అక్కడే ఉండి తన రచనలు కొనసాగించాడు.

1554-73 లో బాండెల్లో వ్రాసిన నోవెల్లె 214 కథలతో నాలుగు పెద్ద సంపుటాలుగా ప్రచురింపబడ్డాయి. ఇటలీలోని ఆనాటి సాంఘిక కుట్రలను గూర్చి, పునరుద్ధరణలను గురించి ఆ కథలలో చక్కగా వివరించాడు. ఇతని భాషా శైలి విమర్శలకు గురి అయినా అది ఇటాలియన్ భాషను పటిష్ఠం చేయటానికి ఉపకరించింది.

బాండెల్లో కథలు చాలా వరకు ఫ్రెంచ్, ఇంగ్లీష్ భాషల లోకి తర్జుమా చేయబడ్డాయి. ఈ తర్జుమా చేయడంలో ఎక్కువగా నీతిని ప్రబోధించడం ధ్యేయంగా అనువాదకులు రచనను సాగించారు. బాండెల్లో వ్రాసిన ఒక కథ ఆధారంగానే షేక్స్పియర్ *రోమియో అండ్ జూలియట్* ను వ్రాయటం జరిగింది. ఇంకా *మచ్ అడో అబౌట్ నథింగ్, ట్వెల్త్ నైట్* అనే షేక్స్పియర్ నాటకాలకు కూడా బాండెల్లో రచనలే మాతృక. బాండెల్లో రచనా శైలి ప్రభావం ఫ్రెంచి, స్పానిష్ భాషా సాహిత్యాలపైన కనిపిస్తుంది.

వేదవతి

**బాకిలైడిస్ (క్రీ.పూ. 5 వ శతాబ్ది) :** ఈజియన్ ద్వీపమైన సియోస్‌కు చెందిన గ్రీక్ గీత రచయిత. అప్పట్లో ప్రసిద్ధకవి అయిన సైమనైడిస్‌కి మేనల్లుడు, సుప్రసిద్ధకవి పిండార్ కి సమకాలికుడు. ఆ రోజుల్లో క్రీడోత్సవాల్లో విజేతలైనవారు తమను కీర్తిస్తూ గేయాలు వ్రాయమని కవులను కోరేవారు. అలా వ్రాసిన గేయాలే *ఎపినికన్* గేయాలు. ఇవి వ్రాయటంలో పిండార్ సిద్ధహస్తుడు. బాకిలైడిస్ ఈ రంగంలో పిండార్ ను మించిపోయాడు. అయితే ఈ రచయితను గురించి 1896 వరకు మనకు ఎక్కువగా తెలియదు. ఈజిప్ట్‌లో లభ్యమైన *పాపిరస్ ఖండికలు* (Popyrus Fragments) 1896 లో బ్రిటిష్ మ్యూజియంకు చేరిన తరువాతనే ఈయనకు గుర్తింపు లభించింది. లభ్యమైన 21 కవితలలో 14 *ఎపినికన్* గేయాలే. మిగతావి ఏథెన్సులో జరిగిన డయనీషియా ఉత్సవాల కోసం వ్రాసినవి. ఇవి అందరూ కలిసి పాడుకోటానికి వీలయ్యే పాటలు (Choric Songs). ఇవి కాక కొన్ని భోజనానంతర వినోదం కోసం పాడుకోటానికి ఉపయోగించే *ఎన్కోమియమ్స్* (గొప్ప వారిని శ్లాఘిస్తూ వ్రాసే పద్యాలు) కూడా లభ్యమయాయి.

సైరాక్యూస్ పాలకుడు మొదటి హైరాన్ క్రీ.పూ. 476 లో జరిగిన ఒలింపియన్ క్రీడలలో ఆశ్విక పోటీ లలో సాధించిన విజయాన్ని శ్లాఘిస్తూ వ్రాసిన ఒక *ఓడ్* ఈ కవి కాలాన్ని సూచించటానికి ప్రముఖ ఆధారం. పిండార్ కూడా ఈ పాలకుని విజయాలను శ్లాఘిస్తూ కవితలు రాశాడు. కనుక వీరిద్దరూ పోటీదారులనేది కూడా స్పష్టమవుతూంది. బాకిలైడిస్ శైలి, పిండార్ శైలి అంతటి ఉదాత్తమైనది కాకపోయినా దానికంటె సరళమైనది. బాకిలైడిస్ రచనలలో మృదుత్వం, భావప్ర కటనా సౌలభ్యం మనలను ఆకట్టుకొంటాయి. 18 వ ఓడ్‌లో ఈ కవి అవలంబించిన నాటకీయమైన నూతన ప్రక్రియ నాటకాభివృద్ధికి ఎంతవరకు దోహదకారి అయిం దనే విషయంపై విభిన్న అభిప్రాయాలు వ్యక్తమైనా, ఈయన ప్రభావం తదుపరి రచనలపై ఉన్నదనే విషయం మాత్రం కాదనటానికి వీలులేనిది.

కె.జి. మూర్తి

**బాక్స్టర్, జేమ్స్, కె. (1926-1972) :** న్యూజి లాండ్ దేశపు కవి పద్య నిర్మాణ చమత్కృతిలోను పదచిత్ర నిర్మాణ కౌశలంలోను ఒక విశిష్ట స్థానాన్ని సంపాదించుకొన్నవాడు. రెండవ ప్రపంచ యుద్ధానంతర కవులలో బాక్స్టర్ అగ్రగామి. 1944 లో ఈయన ప్రచురించిన *బియాండ్ ది పాలిసేడ్* ఈయనలో గొప్ప కవి అయే లక్షణాలున్నాయని తెలియజేసింది. 1948 లో ప్రచురితమైన *బ్లో విండ్ ఆఫ్ ఫ్రూట్‌ఫుల్‌నెస్* పైకి ఆషామాషీగా, రసహీనమైనదిగా కనిపించినా తరచిన కొద్దీ అందమైన భావాలను వెదజల్లే మణిపూస. 1951 లో ప్రచురితమైన *రీసెంట్ ట్రెండ్స్ ఇన్ న్యూజి లాండ్ పొయెట్రీ* ఆయన మొదటి విమర్శనా గ్రంథం. ఇందులో ఆయన వెలిబుచ్చిన భావాలు, అభిప్రాయాలు ఆయనలోని వయస్సును మించిన వైజ్ఞానిక పరిణతిని తెలుపుతాయి. *ది ఫాలెన్ హౌస్* (1953), *ఐరన్ బ్రెడ్‌బోర్డ్* (1957), *పిగ్ ఐలండ్ లెటర్స్* (1968), *ఆస్పెక్ట్స్ ఆఫ్ పొయెట్రీ ఇన్ న్యూజిలాండ్* (1968) మొదలైనవి ఈయన ఇతర ప్రముఖ రచనలు.

కె.జి. మూర్తి.

**బాచ్చెలీ, రికార్డో (1891--) :** ఇటాలియన్ కవి, నాటకకర్త, నవలా రచయిత, సాహిత్య విమర్శకుడు. 19 వ శతాబ్ది సాహిత్యపరులకూ, సాంస్కృతిక పునరు జ్జీవనానికీ సంబంధించిన సాహితీ శైలిని సమర్థిస్తూ, ఇటాలియన్ ప్రయోగాత్మక రచయితల నూతన ప్రక్రియ లను గట్టిగా ఎదుర్కొన్నవాడు.

పట్టా తీసుకోకుండానే 1912 లో బొలోనా విశ్వవి ద్యాలయాన్ని వదలివేసి, సాహితీ పత్రికలకు వ్యాసాలు వ్రాయటం ప్రారంభించాడు. 1914 లో మొదటి ప్రపంచ యుద్ధంలో సైన్యంలో పనిచేస్తూనే *పొయమి లిరికి* (Lyric poems) అనే సంపుటిని ప్రచురించాడు. యుద్ధా నంతరం *లా రోండా* (La Ronda) అనే సాహితీ పత్రికలో సమకాలీన రచయితలు తొక్కుతున్న కొత్త పుంతలను తీవ్రంగా విమర్శించాడు.

1927 లో ఈయన రచించిన *ఇల్ డయబలో ఆల్ పోన్టిలన్* (The devil at the long bridge) 1929 లో ప్రచురితమైంది. చెప్పుకోదగిన చారిత్రక నవల. ఇందలి ఇతివృత్తం ఇటలీలో సోషలిస్ట్ విప్లవాన్ని తేవటా నికి జరిగిన ప్రయత్నం. బాచ్చెలీ చారిత్రక నవలలలో ప్రసిద్ధమైనది *ఇల్ మూలినొడెల్‌పొ* (1938-40). దీని ఇతివృత్తం అనేక దశాబ్దాల ఇటలీ సాంఘిక, రాజకీయ చరిత్ర. 'పో' నదీ తీరాన నివసించే ఒక వంశంలోని అనేక తరాల వారిని పాత్రలుగా తీసుకొని ఆ యా కాలాల రాజకీయ, సాంఘిక ఒత్తిడులు, సంఘటనలు, సంఘర్షణలు వారిజీవితాలపై చూపిన ప్రభావాన్ని చరిత్ర పరంగా వివరించటమే ఈ నవలల ఉద్దేశ్యం. ఇందులో మూడు భాగా లున్నాయి. మొదటిది *డయో టి సాల్వ్*

(Dio to Salve) 1812 లో నెపోలియన్ రష్యా పై జరిపిన దాడితో ప్రారంభమై 1848 లో జరిగిన విప్లవాత్మమైన సంఘటనలవరకు సాగుతుంది. రెండవదైన *లా మిజరియా వియన్ ఇన్ బార్కా* (Misery comes to a Boat-1939). దీనిలో కథ ఇటలీలో రాజకీయ ఐక్యత కోసం 19 వ శతాబ్దిలో జరిగిన ఉద్యమం వరకు సాగుతుంది. అయితే ఆ రాజకీయ సంఘటనలు, ఉద్యమాలు క్రింది తరగతుల ప్రజల జీవితాలపై చూపిన ఆర్థిక సాంఘిక ప్రభావాలను చూపటమే రచయిత ప్రధాన ఉద్దేశ్యం. మూడవ దైన *మోన్డో వెచియో సెమ్ప్రె న్యూవో* (1940) మొదటి ప్రపంచ యుద్ధంలోని విట్టురియోవెనెట్టో పోరాటంతో ముగుస్తుంది.

తనకు ప్రత్యక్షంగా సంబంధంలేని రాజకీయ సంఘటనల సాలెగూడులో చిక్కుకున్న సామాన్య మానవుని బాధల పట్ల జాలి ప్రధానంగా కనిపించే ఈ *ఇన్ మూలి నోడెల్ పో* సామాన్య మానవుని ఇతిహాసం అని ఆనాటి పండితులే పేర్కొన్నారు. అనంతర కాల రచనలలో *ఐ ట్రెటి షిడ్వి డి గలియో సీజర్* (The Three Slaves of Caesar-1958) చెప్పుకోదగిన చారిత్రక నవల. *కన్ఫెషని లెటరెయిర్* (1932-Confessioni letterarie) (1932), *లెప్టార్టి ఎమన్జోని* (1960) ఈయన ఇతర రచనలలో పేర్కొనదగినవి.

కె.జి.మూర్తి

**బాప్, ఫ్రాంజ్ (1791-1867) :** జర్మన్ భాషా శాస్త్రవేత్త, ఇండో యూరపియన్ భాషలను సరిపోల్చి అధ్యయనం చేయటంలో సంస్కృత భాషకున్న ప్రాముఖ్యాన్ని ధ్రువపరచి, భాషా విశ్లేషణకు విలువైన శాస్త్రీయ పద్ధతులను ఏర్పరచిన పండితుడు. ఈయన తొలి రచన *అబర్‌డాస్ కాంజుగేషన్స్ సిస్టమ్ దర్ సన్‌స్క్రిట్స్‌ప్రాచె* (1816-The System of Conjugation in Sanskrit) ముందు ముందు ఆయన సాధించే ఘన విజయాలను సూచించింది. ఇందులో ఆయన సంస్కృతం, పర్షియన్, గ్రీక్, లాటిన్, జర్మన్ భాషలన్నిటికీ మూలం ఒకటేనని రుజువు చేయటానికి



ప్రయత్నించాడు. క్రియా పదాన్ని చారిత్రక విశ్లేషణ చేసి భాషల చరిత్రలను ఎలా కనుగొని వివరించవచ్చునో ఈయన తెలియజెప్పాడు. తరువాత ఈ సిద్ధాంతాన్ని వ్యాకరణాంశాలన్నిటికీ విస్తరింపచేశాడు.

బెర్లిన్ విశ్వవిద్యాలయంలో ప్రాచ్య సాహిత్యంలో ఆచార్యుడుగా పనిచేస్తూ సంస్కృత వ్యాకరణాన్ని (1827), సంస్కృత, లాటిన్ భాషలలోని కొన్ని పదాలను, వాటి అర్థాలను (Glossary-1830) ప్రచురించాడు. ఆయన ప్రధాన రచన *కంపారటివ్ గ్రామర్* (1833-52) లో ఆయా భాషల మూల వ్యాకరణ పద్ధతులను వివరించి, ఉచ్చారణా రీతులలోను, వ్యాకరణ రూపాలలోను ఉండే పోలికలను గుర్తించి వాటి విశ్లేషణ సహాయంతో కొత్త భాషా సిద్ధాంతాలను నిర్మించిన ప్రజ్ఞాశాలి. ఈతడు అనేక యూరపియన్ భాషా కుటుంబాలపై పరిశోధన చేసి, అనేక వ్యాసాలను ప్రచురించాడు. ఆస్ట్రోనీషియన్ (మలయో-పోలినేషియన్) భాషలపై, ఇండో యూరపియన్ భాషలపై పరిశోధన వ్యాసాలను కూడా ప్రకటించాడు. సంస్కృత భాషకు, గ్రీక్ భాషకు ఉన్న సామ్యాన్ని వెలుగులోకి తెచ్చి అవి రెండూ ఒకే మూలభాష నుంచి వచ్చాయని రుజువు చేయటానికి ఈ రచయిత చాలా కృషి చేశాడు. కె.జి.మూర్తి

**బార్బే డొరెవెలీ, జూల్స్-అమెడీ (1808-89) :** ఫ్రెంచ్ నవలా రచయిత, విమర్శకుడు. ఆ రోజుల్లో సాహిత్యంలోను, సమాజంలోను ఆయన పెట్టిన ఒరవడి చాలామందిని ఆకట్టుకొనేది. నార్మండీ జమీందారీ కుటుంబం నుంచి వచ్చిన ఈయన తన నార్మన్ భావాలను, పద్ధతులను గర్వంగా కాపాడుకొన్నాడు. ప్రజాస్వామ్యానికి, భౌతికవాదానికి వ్యతిరేకంగా రాజరికాన్ని ఆయన బలపరిచాడు. కేథలిక్ గా తన మతంలో అచంచల విశ్వాసం కలవాడైనా, సాంప్రదాయిక ఛాందసానికి బద్ధుడు కాలేదు.



న్యాయ శాస్త్రాన్ని కూడా అభ్యసించిన బార్బే డొరెవెలీ 1837 లో సాహిత్య కృషీవలుడుగానే జీవితంలో స్థిరపడ దలుచుకొని 1837 లో పత్రికలకు సాహిత్య

విమర్శలను వ్రాయటం ప్రారంభించాడు. దానిపై వచ్చే ఆదాయంతో పారిస్‌లో జీవించడం కష్టమే అయినా పట్టుదలగా అక్కడే స్థిరపడ్డాడు. జీవితం అనుభవించటానికే అన్నట్లు వస్త్రధారణలోను, ఇతర జీవన విధానాలలోను తానే ఇతరులకు ఒరవడి పెట్టాలనుకొని విపరీతంగా ధనాన్ని వెచ్చించేవాడు.

1868 లో *లె క్నాస్టిట్యూషనల్* అనే సాహితీ పత్రికకు విమర్శకుడుగా నియమితుడయాడు. ఆయన విమర్శలు బహుళ ప్రచారం పొంది, ఆయనకు సాహిత్యరంగాన్ని శాసించే ఒక ఉన్నత పోలీస్ అధికారి అనే బిరుదును తెచ్చి పెట్టాయి. ఆయన విమర్శలు ఏకపక్షంగాను, తీవ్రంగాను, ఎక్కువ వ్యక్తిగతాత్మకంగాను ఉండేవి. ముఖ్యంగా 'జోలా' పట్ల సహజత్వ సిద్ధాంతాల (Naturalist school) పట్ల ఆయన విమర్శలు చాలా ఘాటుగా ఉండేవి. అయినప్పటికి ఆయన నిర్ణయాలు ఈనాటికీ నిలిచి ఉన్నాయి. బాల్జాక్, స్టెన్థాల్, బోద్లేర్‌ల గొప్పతనాన్ని ఇతరులు పూర్తిగా గుర్తించకముందే వారిని గొప్ప రచయితలుగా ఈయన పేర్కొనటం జరిగింది.

బార్బే డారెవెలీ వ్రాసిన నవలలపై సర్ వాల్టర్ స్కాట్, లార్డ్ బైరన్‌ల ప్రభావం విస్తృతంగా కనిపిస్తుంది. ఫ్రెంచి రిపబ్లిక్‌పై నార్మన్ తిరుగుబాటుదార్లు లేవదీసిన విప్లవం ఆధారంగా వ్రాసిన *లె కెవిలియర్ డెస్ టచెస్* (1864), విప్లవానంతర పాలనలో ఒక మతాధికారి పడ్డ పాట్లను గురించి చెప్పే *అన్ ప్రీత్రే మారె* (A Married priest-1865) అనే నవలలు ఈయన రచనలలో అత్యుత్తమమైనవి. *సైతాన్* (satan) పైనా, దుష్టశక్తులపైనా విశ్వాసం ఆధారంగా *లెసీ డైబాలిక్స్* (1878) అనే ఆరు చిన్న కథల సంపుటిని ప్రచురించాడు. ఈ సంపుటి ఆయన అత్యుత్తమ రచనగా గుర్తింపు పొందింది.

కె.జి.మూర్తి

**బాల్జాక్, ఓనోర్ డి (1799-1850) :** జగత్ ప్రసిద్ధ ఫ్రెంచ్ నవలా రచయిత. *లా కామెడీ హ్యూమేన్* (La Comedie humaine) అనే సంపుటిలో ఆయన వ్రాసిన అసంఖ్యాక కథలు, నవలలు ప్రచురణ పొందాయి. సాంప్రదాయిక ప్రామాణిక నవలకు రూపాన్నిచ్చి, జీవం పోసి, స్థిరంగా నిలబెట్టిన మహా రచయిత బాల్జాక్. ఆయన నవలలలో తర్కపరంగా సమర్థనీయమైన సంఘటనలు, అన్ని హంగులు గల ఆసక్తి దాయకమైన పాత్రలు, గంభీరమైన శైలి కనిపిస్తాయి. తండ్రి సివిల్ సర్వీస్‌లో ఉన్నత పదవులను అధిరోహించి ఎక్కువగా పారిస్‌లోనే ఉండేవాడు. తల్లి నరాల బలహీనతతో బాధ పడుతూ నాటు వైద్యాలకు అలవాటు పడింది. బహుశః అందువల్లనేమో బాల్జాక్‌కు చిన్నతనం నుంచి మంత్ర, తంత్రాలు, కనుకట్టు విద్య, జాతకాలు చెప్పటం, అయస్కాంత వైద్యం, ఇత్యాది సూడోసైన్స్‌తో పరిచయమేర్పడింది. ఈ పరిచయాన్ని తన నవలల్లో ఆయన చక్కగా వినియోగించుకొన్నాడు.

న్యాయవాద వృత్తికై కొంతకాలం శిక్షణ పొందినా, మనసంతా రచనా వ్యాసంగం పైనే ఉండటంతో రచననే వృత్తిగా స్వీకరించాడు. 1819 లో *క్రాంవెల్* అనే విషాదాంత నాటకాన్ని వ్రాశాడు. కాని అది అంత విజయవంతం కాలేదు. దానితో నవలలు వ్రాయటం ప్రారంభించాడు. మనస్సును ఉద్రేక పరిచి, రక్తాన్ని ఉప్పొంగించే నవలలను వ్రాయటం మొదలు పెట్టాడు. ఆ విధానం వల్ల అతనికి మంచి పేరు వచ్చింది. మానవాతీత శక్తులను, చారిత్రక సంఘటనలను హాస్యంతో జోడించి మధ్య తరగతి జనం మెచ్చే రీతిలో కథ చెప్పగలగటం వీటిలో మనకు కనిపిస్తుంది. సాంఘిక నాటికలు, కొన్ని *పారడీలు* కూడా వ్రాసి తానే ఆ రచనలను ముద్రించి వ్యాపారంలోకి దిగాడు. ఫలితంగా ఉన్న డబ్బంతా పోవటమే గాక జీవితంలో తిరిగి బయట పడలేనంతగా అప్పుల ఊబిలో కూరుకు పోయాడు. రచనలు మారుపేరు తోనే ఎక్కువగా సాగించిన ఈ రచయిత 1799 లో ఏ పేరూ లేకుండా *లా ఫిజియాలజి దు మారేజ్* (The physiology of Marriage) అనే గ్రంథాన్ని వ్రాశాడు. భర్తను చెప్పు చేతలలో ఉంచుకొని స్వేచ్ఛా విహారం చేసే స్త్రీల మనస్తత్వాన్ని, ఆ భార్యా భర్తల ప్రవర్తనలకు ఉండే కారణాలను హాస్యధోరణిలో విశ్లేషించటమే ఇందలి ఇతివృత్తం. స్త్రీల పట్ల అవగాహన, సానుభూతి ఇందులో మనకు కనిపిస్తుంది.

1828-34 ల మధ్య పారిస్‌లో అతి విలాస వంతమైన జీవితాన్ని గడుపుతూనే బాల్జాక్ రోజుకు 15 గంటలవరకు రచనా వ్యాసంగంలో గడిపేవాడు. 18 వ లూయీ, 10 వ ఛార్లెస్‌ల పాలనా కాలంలో సిద్ధాంతపరమైన, వ్యంగ్యపూరితమైన అనేక పత్రికలు ప్రారంభమయాయి. ఉదారతా భావాలను (liberalism) వెలిబుచ్చే కొన్ని పత్రికలకు బాల్జాక్ వ్రాసేవాడు. కాని త్వరలోనే ఆ ఉదార భావాలకు స్వస్తిచెప్పి రాజరికాన్ని సమర్థించే వాటినే ఎక్కువగా వ్రాయటం ప్రారంభించాడు.

నవలను నాటకం యొక్క మరొక రూపంగా భావించిన ఈ రచయిత *సీన్స్ డిలా వై ప్రైవీ* (Scenes

from Private Life) ని ప్రచురించాడు. *లెక్యూర్ డి టూర్స్* (The Vicar of Tours), *యూజిని గ్రాండెట్* అనే రెండు నవలలు ఈ కాలానికి చెందినవే. వీటిలో బాల్జాక్ చిన్న చిన్న పట్టణాలలోని జీవితాన్ని చిత్రించాడు.

1834 లో బాల్జాక్ తన రచనలను మూడు వర్గాలుగా విభజించి ప్రకటించాలని అనుకొన్నాడు. మానవ జీవితాన్ని, సమాజాన్ని నియంత్రించే మూల సూత్రాలకు సంబంధించిన *ఎటూడ్స్ అనలిటీక్స్* ('Analytic studies') అనేది మొదటి భాగం. మానవ ప్రవర్తనకు మూలమైన సూత్రాలను పేర్కొనే *ఎటూడ్స్ ఫిలసాఫిక్* రెండవ వర్గానికి సంబంధించిన రచనల సముదాయం. మూడవదైన *ఎటూడ్స్ డిమోర్స్* (Studies of Manners) పైన మానవుల అలవాట్లను తెలిపే రచనల సముదాయం. 1834-37 ల మధ్య 12 సంపుటాలుగా ఈ మూడు సముదాయాలను ప్రచురించాడు.

1842-48 ల మధ్య *లా కామెడి హ్యూమెన్* అనే పేరుతో 17 గ్రంథాలను బాల్జాక్ ప్రచురించాడు. 1834 ప్రాంతంలో వెలువడిన *లా పెరి గోరియట్* అనే నవలలో 'తిరిగి తిరిగి కనిపించే పాత్రలు' అనే క్రొత్త ప్రక్రియను ప్రవేశపెట్టి, తన వాస్తవికతా వాదానికి పుష్టిని సమకూర్చుకున్నాడు. కొన్ని పాత్రల సముదాయాన్ని ఏర్పరుచుకొని వాటినే తిరిగి తిరిగి తన నవలల్లో ప్రవేశపెడుతూ పాఠకునికి తనకి తెలిసిన ప్రపంచంలోనే తిరుగుతున్నాననే భావం కలిగించటంలో ఈ ప్రక్రియ చాలా వరకు సఫలమైందని చెప్పవచ్చును.

నవలలలో వాస్తవికతను, సహజత్వాన్ని ప్రవేశ పెట్టిన గొప్ప రచయితగా ఆయనకు ఈ నాటికీ గుర్తింపు ఉంది. అయితే అటు శ్రామిక ప్రజలను, ఉన్నత శ్రేణి వారిని వదిలివేసి ఎంతసేపూ మధ్య తరగతి ప్రజలనుండే పాత్రలను, సంఘటనలను అనుభవాలను తీసుకొన్నాడనేది బాల్జాక్ విషయంలో కాదన లేని సత్యం. అయినప్పటికి మానవ స్వభావాన్ని అర్థం చేసుకోటంలోను, ఆ అర్థం చేసుకొన్న దాన్ని వ్యక్తీకరించటంలోను బాల్జాక్ కృతకృత్యుడయాడు. నాటక రచనలలో షేక్స్పియర్ ఎంతటివాడో, నవలా రచనలో బాల్జాక్ అంతటివాడని పెక్కుమంది విమర్శకులు అంగీకరించారు.

కె.జి. మూర్తి.

**బాల్డ్విన్, జేమ్స్ (1924--)** : అమెరికన్ రచయిత. నవలలు, వ్యాసాలు, నాటకాలు రచించాడు. 1924 అగస్ట్ 2 న న్యూయార్క్ లోని ఒక నీగ్రో బస్తీలో జన్మించిన బాల్డ్విన్ హైస్కూలు చదువు ముగించి, చిన్న చిన్న ఉద్యోగాలు అనేకం చేసి, 1948 లో పారిస్ చేరుకొన్నాడు. ఇతని తొలి నవలలో *గో టెల్ ఇట్ ఆన్ ది మౌంటెన్* (1953) లో స్వీయ జీవిత విశేషాలను కొంత వరకు పొందు పరిచాడు. పారిస్‌లో గడిపిన ఎనిమిదేళ్ల లోనూ ఇతడు *నోట్స్ ఆఫ్ ఎ నేటివ్ సన్* (1955) అనే వ్యాస సంకలనాన్ని, తన రెండవ నవల *గియొవానీస్ రూమ్* (1956) ప్రకటించాడు. పారిస్‌లో నివసిస్తున్న ఒక అమెరికన్‌కి ఒక పురుషుని తోను, స్త్రీతోను ఏర్పడిన ప్రేమల మధ్య సంఘర్షణ ఈ నవల ఇతివృత్తం.



1957 లో అమెరికా తిరిగి వచ్చి, బాల్డ్విన్ అప్పుడు చెలరేగుతూ ఉండిన పౌరహక్కుల ఉద్యమంలో చురుకైన పాత్ర వహించాడు. అమెరికాలో తెల్ల, నల్ల జాతుల మధ్యన ఉన్న సంబంధాలను విశ్లేషిస్తూ బాల్డ్విన్ *నోబడీ నోస్ మైనేమ్*(1961) అనే వ్యాస సంకలనాన్ని *అనదర్ కంట్రీ* (1962) అనె నవలను ప్రకటించాడు.

పౌర హక్కుల ఉద్యమంలోని వివిధాంశాలను వివరిస్తూ ఇతడు రచించిన ఒక సుదీర్ఘ వ్యాసాన్ని 1962 నవంబరు 17 నాటి *ద న్యూయార్కర్* పత్రిక సంచికలోని పుటలన్నీ దానికే కేటాయించి ప్రకటించింది. ఆ పిదప అది *ద ఫైర్ నెక్స్ట్ టైమ్* (1963) అనే పుస్తకంగా వెలువడి, విరివిగా అమ్ముడు పోయింది. జాత్యహంకారంతో శ్వేత జాతీయులు అనుసరించే అణచివేత విధానాన్ని నిరసిస్తూ ఇతడు *బ్లూస్ ఫర్ మిస్టర్ చార్లీ* అనే నాటకం రచించాడు. అది 1964 లో బ్రాడ్వేలో ప్రదర్శితమైంది. ఆ పిదప 1965 లో అంతకు పదేళ్లముందే ఇతడు రచించిన *ద అమెన్ కార్నర్* ప్రదర్శితమైంది.

బాల్డ్విన్ తరువాతి రచనలలో *గోయింగ్ టు మీట్ ది మాన్* (కథలు-1965), *టెల్ మి హౌ లాంగ్ ది ట్రెయిన్ హాజ్ బీన్‌గాన్* (Tell me How Long the Train's Been Gone; నవల-1968) *ఇఫ్ బీల్*

స్ట్రీట్ కుడ్ టాక్ (If Beale Street Could talk: నవల-1974), జస్ట్ అబవ్ మై హెడ్ (Just Above My Head: నవల-1979) పేర్కొనదగినవి.

ము.వీ.

**బాషో (1644-94)** : జపాన్ దేశపు కవి. ఇతని పూర్తి పేరు 'మత్‌సువొ బాషో' మత్‌సువొ మునెఫుస, మారు పేరు. జెన్ బౌద్ధ ప్రేరణతో 'హైకు' సంప్రదాయపు 17 మాత్రల ఛందంలో రచనలు కావించిన కవులలో ఇతనికి అగ్రస్థానం ఉంది.



తన కవితా ప్రీతిని ప్రక్కకు నెట్టి బాషో మొదట ఒక స్థానిక ప్రభువు కొలువులో యోధుడుగా పనిచేశాడు. 1666 లో ఆ ప్రభువు మరణించిన తరువాత కవితా సృష్టికే అంకితం కాదలచి ఇతడు ఇడొ (ప్రస్తుత టోక్యో) చేరుకొన్నాడు. కాలక్రమాన కవిగా, విమర్శకుడుగా ఖ్యాతిని ఆర్జించాడు. సూటిగా వర్ణించటం, పరస్పర సంబంధం లేని రెండు భిన్న అంశాలను చేర్చి సాదృశ్యం, భేదం కల్పించటం ఇతని ప్రత్యేకత(ఉదా. వాడిపోయిన కొమ్మ మీద ఒక కాకి వాలింది; ఆకురాలు కాలంలో రాత్రిపడింది). 1679 లో బాషో తొలి రచన చేశాడు. అతని కొత్త పుంతకు ఆదరం లభించింది. జెన్ బౌద్ధం అధ్యయనం చేసిన బాషో గంభీర భావాలను సులువైన శైలిలో చెప్పడం ద్వారా, స్వల్ప విషయాలలో నిగూఢంగా ఉండే అంశాలనూ, ప్రపంచం లోని విభిన్నాంశాల పరస్పర ఆధారాన్నీ ఆవిష్కరించడం ద్వారా బాషో ప్రసిద్ధుడయాడు.

1684 నుంచి బాషో విశేషంగా పర్యటించి తన యాత్రానుభావాలను చక్కని వచన శైలిలో (ఒకు నొ హొసొమిచి-1694) వివరించాడు. ఈ పర్యటనలలో ఇతడు స్థానిక కవులను కలిసి వారితో 'రెన్‌గా' అనబడే ఒక పద్యంతో అతికి ఉండేటట్లు మరో పద్యం చెప్పటం అనే పోటీలలో పాల్గొనేవాడు. చాలా మంది దృష్టిలో బాషో ఉత్తమ కవిత అట్టి 'రెన్‌గా' కవితే! ఆ అతుకు శాబ్దిక చమత్కారం మీద, శ్లేషలమీద ఆధారపడి ఉండేది. అయినా బాషో శబ్ద చమత్కారం కంటె ఉత్తమ గుణాలు కవితలో ఉండాలని బోధించాడు.

తాను అవలంబించిన మత ధర్మాల కనుగుణంగా బాషో నిరాడంబర జీవితం గడిపాడు. తరుచు 'బాషో-అన్' (అరటి చెట్టు) ఆశ్రమంలో ఏకాంత నివాసం చేసేవాడు. బాషో అనే అతని కవితా నామం దాని నుంచే వచ్చింది. తరువాతి తరాలవారు అతనిని హైకు సంప్రదాయపు యోగిగా ఆరాధించారు.

ము. వీ.

**బాస్వెల్, జేమ్స్ (1740-95)** : ప్రసిద్ధ ఆంగ్ల విద్వద్ రచయిత. స్కాటిష్ జాతీయుడు, తనకు స్నేహిత డైన జాన్‌సన్ జీవిత చరిత్రను రచించి బాస్వెల్ సుప్రసిద్ధుడయాడు. ఇతడు ఒక ఉన్నత కుటుంబంలో జన్మించాడు న్యాయశాస్త్రం అభ్యసించాడు. భోగ విలాస జీవితం పై మక్కువ గల బాస్వెల్ కొంత



విశృంఖలంగానే యౌవన జీవితం గడిపాడు. ఆనాటి ప్రసిద్ధ వ్యక్తులతో ఇతనికి సన్నిహిత సంబంధం ఉండేది. శామ్యూల్ జాన్సన్ రచన లన్నీ చదివి బాస్వెల్ అతనిపై అభిమానం పెంచుకొన్నాడు. దాదాపు మూడు దశాబ్దాలు తన కంటె పెద్దవాడైన జాన్సన్‌తో బాస్వెల్‌కు 22 ఏళ్ల ప్రాయంలో సఖ్యం కుదిరింది. 1784 లో జాన్సన్ మృతి చెందిన తరువాత అతని జీవిత చరిత్ర రచించ డానికి బాస్వెల్ పూను కొన్నాడు. అప్పుడప్పుడు కొంత కొంత వ్రాస్తూ బాస్వెల్ మొత్తానికి 1791 లో *ద లైఫ్ ఆఫ్ శామ్యూల్ జాన్సన్* మొదటి భాగం ముగించాడు. రెండవ భాగం 1793 లో వెలువడింది. మూడవ భాగం వ్రాస్తూ ఉండగా 1795 లో బాస్వెల్ మరణించాడు. ఎంత సుఖమయ జీవితం అతడు కాంక్షించాడో అంత అస్తవ్యస్తంగా అతని జీవితం గడిచింది. పోయిన వనుకున్న అతని పత్రాలు 1920 లో లభించేదాకా బాస్వెల్ కీర్తికి జాన్సన్ జీవిత చరిత్ర ఒక్కటే మూలమైంది. అయితే అప్పుడు లభించిన అనేక పత్రాలలో అతడు తన దైనందిన జీవితాన్ని నమోదు చేసినవి లభించాయి. ఆ యా సంఘటనలను గూర్చి తరువాతి కాలంలో రచించినా, ఏ నాటి కథ ఆనాడు ఎంత జరిగిందో అంతే చక్కని

శైలిలో బాస్వెల్ రచించేవాడు. ఈ పత్రాల ద్వారా అతని ఖ్యాతి మరింత ఇనుమడించింది.

ము. వీ.

**బుజాటీ, డినో (1906-72) :** ఇటాలియన్ పత్రికా రచయిత, నాటక కర్త, కథానికా రచయిత, నవలా కారుడు. ఇతడు అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిన ప్రతిభాశాలి. మిలన్ నుంచి వెలువడే ఒక దినపత్రికలో ఉద్యోగంతో 1928 లో ఇతని రచనా జీవితం ప్రారంభ మైంది. జెక్ రచయిత 'కాఫ్కా' ధోరణిలో అధివాస్తవికత, ప్రతీకాత్మకత, అసంబద్ధత (absurdity) లను తన నవలల ద్వారా ఇతడు ఇటాలియన్ సాహిత్యంలో ప్రవేశ పెట్టాడు. ఇతని నవలలలో ప్రసిద్ధమైనది, ఉత్తమమని భావింపబడేది *ఇల్ డెజర్టొ దియ్ తార్తారి* (1952). ఏ క్షణాన అయినా శత్రువులు దాడి చెయ్యవచ్చునన్న పరిస్థితులలో అగ్రస్థావరంలో నిత్య ప్రతీక్షలో ఉండే సేనల కథ ఇది. ఆ శత్రువులు రారు. వీళ్లు ముందుకు గాని, వెనక్కి గాని పోలేరు. బుజాటి ఈ కథను ఎంతో శక్తిమంతంగాను, వ్యంగ్య పూరితంగాను చెప్పాడు. బుజాటి ఇతర నవలలు *బర్నబో దెల్లె మౌన్ టేన్* (1933), *ఇల్ సిక్రెతో దెల్ బొస్కొ వెఛియొ* (The secret of the Ancient wood-1935), *ఇల్ గ్రాండె రితేతో* (1960-Larger than life; 1962), *అన్ అమోర్* (1963, A love affair; 1963). బుజాటి రచించిన నాటకాలలో మిక్కిలి ప్రజాదరణ పొందినది *అన్ కేసొ క్లినికొ* (1953, A clinical case). 'కాఫ్కా' శైలిలోని ఈ నాటకంలో వైద్య నిపుణులు యంత్ర పరికరాలు కలసి ఒక ఆరోగ్యవంతుని ఆరోగ్యం పాడు చెయ్యటం ఇతివృత్తం. ఈ నాటకం ఇటలీలోనే కాక బెర్లిన్, పారి స్‌లలో కూడా ప్రదర్శితమైంది. జాడ తెలియకుండా పోయాడనుకొన్న ఒక సైనికుడు తిరిగి రావటం, చివరకు అతడు సైనికుని ప్రేతాత్మకావటం ఇతని మరో నాటకం *ద ఓవర్ కోట్* లోని కథ. *ఎల్ ఉబమొచె అన్‌ద్ర ఇన్ అమెరికా* (1962- The man who will go to America) అనే నాటకంలో ఒక వృద్ధ చిత్రకారునికి ప్రతిష్ఠాత్మకమైన అమెరికా దేశపు బహుమతి రావటం, ఆ వార్త తెలియగానే అతడు అదే తన జీవిత కృషికి స్వస్తి, మృతి అని భావించడం ఇతివృత్తం. బుజాటి కథలు, వ్యాసాలు కూడా ప్రచురించాడు. ఇతని రచనలు ఇతర భాషల లోకి అనువదింపబడ్డాయి. కాఫ్కా ప్రభావం ఉన్నా బుజాటి వ్యంగ్య హాస్యంతో నిండిన ఒక ప్రత్యేక శైలిని తనకు తాను ఏర్పరచుకోగలిగాడు. ము.వీ.

**బుజేద్రా, రషీద్ (1941--) :** ప్రయోగాత్మక నవలా రచయితగా పేరొందిన అల్జీరియా రచయిత. తన తొలి నవల *లా రెప్యూడియేషన్* (తిరస్కారం) తో అతడు సంచలనం సృష్టించాడు. దీనితో అతనికి అపకీర్తి * ఎదురైంది. అయినా ఇసుమంతైన చలించకుండా తన ధోరణిలో విప్లవాత్మక నవలలను వ్రాస్తూనే ఉన్నాడు.

ఇతడు అల్జీరియాలో ఒక సాంప్రదాయిక మహ్మదీయ కుటుంబంలో జన్మించాడు. స్వగ్రామంలోనే సంప్రదాయ పద్ధతిలో ప్రాథమిక విద్య నభ్యసించాడు. అనంతరం టునీషియా, స్పెయిన్, ఫ్రాన్సు దేశాల్లో విద్యాభ్యాసం సాగించాడు. ఫ్రాన్సులోని విఖ్యాత విశ్వవిద్యాలయం సెర్బోన్ నుండి తత్త్వశాస్త్రంలో డిగ్రీ పొందాడు. అల్జీరియాలోనూ, మొరాకోలోని రాబత్‌లోనూ తత్త్వశాస్త్రం కొంతకాలం బోధించి, అల్జీరియాలోని 'బ్యూరో ఆఫ్ సినిమాటోగ్రఫీ' లో అధికారిగా చేరాడు.

ఇతని మొదటి నవల *ది రెప్యూడియేషన్* (తిర స్కారం, 1969) కు స్ఫూర్తి కొంతవరకు ఇతడు తన తొలి యౌవన దశలో గడిపిన కష్టమయ జీవితమే అని చెప్పాలి. ఈ నవలలో ఇతడు అల్జీరియా దేశపు సాంప్ర దాయికమైన విలువలను, వ్యవస్థలను తృణీకరించాడు. పగ్గాలెరుగని లైంగిక స్వేచ్ఛా జీవితాన్ని చిత్రించాడు. ఏదో విధంగా సర్దుకుపోయే జీవితాన్ని హేయమని హేళన చేశాడు. తాను విద్యాభ్యాసం చేసిన నాటి పారిస్ నగర జీవితాన్ని, విలువలను కూడా తీవ్రంగా, ఘాటుగా విమ ర్శించాడు. *ది సన్ స్ట్రోక్* (వడదెబ్బ 1972) లో ప్రయోగశీలతను ప్రదర్శించాడు. స్వప్నానికి, వాస్తవానికి మధ్య సరిహద్దు రేఖను చెరిపి వేశాడు. మూడవ నవల *అయిడియల్ టోపోగ్రఫీ ఫర్ ఏ మార్కెట్ అగ్రెషన్* (1975) లో ఒక నిరక్షరాస్యుడైన పల్లెటూరి రైతును నాయకుడుగా చేసి అతనికి నగరంలోని సబ్ వే (సొరం గదారి) లో ఎదురైన విచిత్రానుభవాలను వర్ణించాడు. *ది స్టబ్బర్న్ స్నెయిల్* (పట్టువిడని నత్త) లో అల్జీరియా స్వాతంత్ర్యోద్యమం వల్ల నిజంగా ప్రజాజీవనంలోను, మధ్య తరగతి జీవితాలలోను ఎటువంటి మార్పు రాలేదని ఒక చిన్న ప్రభుత్వోద్యోగి పాత్రచిత్రణ ద్వారా వెల్లడించాడు. *1001 ఇయర్స్ ఆఫ్ నోస్టాల్జియా* (వేయిన్నొక్క ఏళ్ల బెంగ, 1979) అనే మరో నవలలో ఇతని ఊహలు విజృంభించడమే కాక అధిక్షేపాన్ని కూడా జోడించుకొ న్నాయి. సహారా ఎడారిలోని ఒక జనపదంలో సినిమా ప్రవేశించాక వచ్చిన మార్పులను చిత్రించాడు. అతని దృష్టిలో చలనచిత్ర పరిశ్రమ సామ్రాజ్యవాద తత్త్వానికి

సరైన ప్రతీక. స్వచ్ఛమైన గ్రామీణ నాగరకతను దుష్టమైన పెట్టుబడిదారీ సంస్కృతి కబళించిందని ఇతని నిర్ణయం.

గం. శ్రీ.

**బునిన్, ఇవాన్ అలెక్సెజెవిక్ (1870-1953) :** ప్రముఖ రష్యన్ కవి, నోబెల్ బహుమతి గ్రహీత, నవలా రచయిత, పత్రికారచయిత, అనువాదకుడు. రష్యాలోని వోరానెఝ్ లో 1870 అక్టోబర్ 23 న ఇతడు జన్మించాడు. ప్రాచీన రష్యా సంప్రదాయాలను, పద్ధతులను గొప్ప నైపుణ్యంతో ప్రదర్శించినందులకు 1933 లో ఈయనకు నోబెల్ బహుమతి లభించింది. బునిన్ 20 వ శతాబ్దపు అగ్రశ్రేణి రచయితలలో ఒకడుగా ప్రసిద్ధి పొందాడు. ఈయన మొదట పత్రికారచయిత గాను, గుమాస్తాగాను పనిచేశాడు. తర్వాత గ్రంథ రచనా వ్యాసంగం, పద్యాల అనువాదం ప్రారంభించాడు.

బునిన్ తన మొదటి పద్య సంపుటిని 1891 లో ప్రచురించాడు. *లిస్టోపాడ్*('The fall of the Leaf') కు చాలా మంచి పేరు వచ్చింది. లాంగ్ ఫెలో వ్రాసిన హైవాథా ను 1930 లో అనువాదం చేశాడు. దానికి రష్యన్ అకాడమీ బహుమతి లభించింది. 1909 లో రష్యన్ అకాడమీ సభ్యుడుగా ఎన్నికయాడు. బైరన్ వ్రాసిన *మేన్ ఫ్రెడ్* ను కూడా బునిన్ అనువదించాడు.

బునిన్ కథా రచయితగా మంచి పేరు తెచ్చుకొన్నాడు. ఇతని కథల పుస్తకాలు : *గోస్పొదిన్ ఇజ్ శాన్ ఫ్రాన్సిస్కో (1916, Gospodin iz san Fransisko* 'The Gentleman from san Fransisko' 1922), *ట్యోమ్నీ అలె (1943, Tyomnye alley* 'Dark Avenues', 1949).

ఇతని ఇతర రచనలు : *డెరెవ్నియా (1910 Derevnya* 'పల్లెటూరు') *సుఖోదోల్ (1911-12 Sukhodol) మిటిన ల్యు బోవ్ (1925, Mitina lyubov* 'Mitinas love', 1926) *జీన్ అర్సెన్యేవ* Zhizn Arsenyeva (The life of Arsenev, 1930), *ఇస్తోకి ద్నే (1930, Istoki dney* 'The well of Days'- 1933), *జన్యే ద్ని* (1926: శాపగ్రస్త దినాలు), *వొస్ పొమిననియ* (1950 Vospominaniya '*Memories and Portraits*', *1951).* ఈ చివరి రెండూ స్మృతి కవిత్వ సంపుటాలు. ఈయన టాల్‌స్టాయ్ మీద కూడా ఒక పుస్తకం వ్రాశాడు. అన్‌తొనె చెకొవ్ మీద కూడా ఒక పుస్తకం వ్రాశాడు. వీళ్ళిద్దరితోనూ బునిన్‌కి వ్యక్తిగత పరిచయం ఉంది. తర్వాతి రచన *ఓ చెకోవ్* (O Chekove) పుస్తకం ఆయన మరణానంతరం రెండు సంవత్సరాలకు అంటే 1955 లో ప్రచురింపబడింది. బునిన్ 1953 నవంబర్ ఎనిమిదో తేదీ పారిస్‌లో కన్నుమూశాడు.

నాగరాజ్

**బుల్గాకోవ్, మిఖాయెల్ అఫనస్యేవిచ్ (1891-1940) :** రష్యన్ నాటకకర్త, నవలా రచయిత, కథకుడు. సునిశిత హాస్యానికి, వ్యంగ్యానికి పేరు పొందినవాడు. వైద్యవృత్తిని విడిచి పెట్టి ఇతడు రచనా వ్యాసంగం లోకి వచ్చాడు. ఇతని మొదటి ప్రధాన రచన ఒక నవల పత్రికలో సీరియల్‌గా వెలువడిందే కాని పుస్తకరూపం దాల్చలేదు. అంతర్యుద్ధం సమయంలో బోల్షివిక్ ప్రతికూల ధోరణులతో వ్యవహరించిన శ్వేతజాతి అధికారులను కొంత సానుభూతితో చిత్రించిన ఈ నవల అధికార వర్గాలకు రుచించలేదు. బుల్గాకోవ్ దీనినే తిరిగి నాటకంగా కూడా మలచాడు. 1926 లో అది విజయవంతమైన ప్రదర్శనలకు నోచుకొన్నా, త్వరలోనే నిషిద్ధమైంది. 1925 లో ఇతడు *ద్యావోలియాదా* (Dyavoliada-Deviltries) అనే పేర వ్యంగ్య అభూత కల్పనలను ప్రచురించాడు. సోవియెట్ కమ్యూనిస్ట్ సమాజాన్ని కానరాకుండా దుయ్యబట్టిన ఈ పుస్తకం కూడా అధికార వర్గాల ఆగ్రహానికి గురి అయింది. అదే ఏడు బుల్గాకోవ్ శాస్త్రవిజ్ఞానంగా చలామణీ అవుతున్న దానిని అపహసిస్తూ *సొబాచ్యె సెర్ద్ త్సె* (sobachye serdtse-heart of a dog, 1968) అనే తీవ్ర అధిక్షేప హాస్య రచన చేశాడు. వాస్తవికత, హృద్యమైన హాస్యం ఉండటం వలన బుల్గాకోవ్ రచనలు ప్రజాదరాన్ని బాగా సాధించినాయి. అయినా అతని విమర్శనను సహించలేని అధికార వర్గాలు అతనిని హర్షించలేదు. 1930 నాటికి అతడు రచనలు చేయరాదన్న ఆంక్ష స్పష్టంగా కాకున్నప్పటికీ అమలులోకి వచ్చింది. దేశాంతరం పోవడానికి అతడు చేసిన అభ్యర్థనను స్టాలిన్ తిరస్కరించాడు. బుల్గాకోవ్ దాదాపు చివరి వరకు ఒక విధమైన ఒంటరితనం పాలయాడు. అయినా 1936 లో అతడు మాస్కో ఆర్ట్ థియేటర్ సలహాదారుగా ఉంటూ ఫ్రెంచి నాటకకర్త మోలియర్ మృతిపైన ఒక విషాదాంత నాటకం రచించి ప్రదర్శింపజేశాడు. వారంరోజుల ప్రదర్శన తరువాత ఆనాటకంలో అన్యాపదేశంగా స్టాలిన్ పై వచ్చిన విసురులను గమనించి దానిని నిషేధించారు.

మృతుని పత్రాలు (Notes of A Dead Man) అనే పేరిట బుల్గాకోవ్ వ్రాసిన ఒక అసంపూర్ణమైన నవలలో ఆత్మకథాంశాలనే అతడు పొందుపరిచాడు. దీనిలో స్టానిస్లేవిస్కీని, నాటి మాస్కో ఆర్ట్ థియేటర్

లోని వ్యక్తిగత జీవిత విధానాన్ని బాహాటంగా అతడు అవహేళన చేశాడు. *మ్యాస్టర్ ఇ మ్యార్గరిటా* అనే మరో రచన (1967) గోగోల్ శైలిలో రచించిన ఒక కల్పన. దీనిలో వర్తమానంలోను, సుదూర గతంలోను జరుగుతున్నట్లుండే సంఘటనలను ఒక దానితో ఒకటి చేర్చి కథనం చేశాడు. దీనిలో ఒక ప్రొఫెసరు రూపంలో డెవిల్ మాస్కోలో ఉంటూ సంస్కృతి పరుల మనుకునే వారి నిజరూపాలు బయలుపెట్టడం, ఒక రచయిత మానసిక రోగశాలలో ఉంటూ జీసస్ కథ వ్రాయటానికి ప్రయత్నిస్తూ ఉండటం చిత్రించ బడ్డాయి. వ్యంగ్యం, విషాదం మిళితం చేసి వ్రాసిన ఈ నవల 1966-67 లో రష్యాలో ప్రచురితం అయింది. అటు తరువాత దీనిలో కొన్ని భాగాలు తొలగించి ప్రచురించారు.

స్టాలిన్ మరణానంతరం మారిన పరిస్థితుల వలన వచ్చిన సడలింపు ధోరణి బుల్గాకోవ్ రచనల విషయంలో నిదానంగా కాని వర్తించలేదు. 1962 తరువాత బుల్గాకోవ్ కృతులు సంపుటాలుగా వెలువడ్డాయి.

ము.వీ.

**బెకెట్, శామ్యుయెల్ (1906-1969)** : ఐర్లాండ్ దేశపు రచయిత, విమర్శకుడు, నాటక కర్త. 1969 లో నోబెల్ సాహిత్య పురస్కారాన్ని అందుకున్న బెకెట్ ఫ్రెంచ్, ఆంగ్ల భాషలు రెండింటా రచనలు చేశాడు. శామ్యుయెల్ బెకెట్ డబ్లిన్ నగర పరిసరాలలో 1906 ఏప్రిల్ 13 న జన్మించాడు.



డబ్లిన్‌లోని ట్రినిటీ కాలేజిలో రొమాన్స్ భాషలను అభ్యసించి పట్టభద్రుడయాడు. కొద్దికాలం బెల్‌ఫాస్ట్‌లోని ఒక పాఠశాలలో ఉపాధ్యాయుడుగా ఉండి బెకెట్ ఆ పిదప పారిస్‌లోని ఇకొల్ నార్మేల్ సుపీరియల్‌లో ఆంగ్లశాఖలో రీడరుగా చేరాడు (1928). పారిస్‌లో అతనికి తనకు తానుగా ప్రవాసం విధించుకున్న ఐరిష్ నవలా కర్త జేమ్స్ జాయిస్ తో సన్నిహితత్వం ఏర్పడింది. బెకెట్ 1930 లో స్వదేశం తిరిగి వచ్చి ట్రినిటీ కళాశాలలో ఫ్రెంచి ఉపాధ్యాయుడుగా కొద్దికాలం పనిచేశాడు. 1931 వ సంవత్సరంలో ఆ ఉద్యోగానికి రాజీనామా చేసి లండన్, ఫ్రాన్స్, జర్మనీ, ఇటలీలలో విశేషంగా యాత్రలు చేశాడు. 1937 లో బెకెట్ పారిస్‌లో స్థిరపడాలని అనుకొన్నాడు. ద్వితీయ ప్రపంచ యుద్ధ కాలంలో జర్మనీ దాడికి విరుద్ధంగా ప్రచ్ఛన్నదళంలో సభ్యుడుగా చేరి పని చేశాడు. తన తోటి సభ్యులను గెస్టపో అరెస్టు చేయటంతో జర్మన్ ఆక్రమణలో లేని ఫ్రాన్సు ప్రాంతానికి పోయి వ్యవసాయ కూలీగా పొట్టపోసుకొన్నాడు. 1945 లో శామ్యుయెల్ బెకెట్ ఐర్లాండ్ చేరుకొని ఐరిష్ రెడ్‌క్రాస్‌లో చేరి, స్వచ్ఛందంగా నార్మండీలోని ఒక ఆస్పత్రిలో దుబాసీగా పనిచేయడానికి మళ్లీ ఫ్రాన్సు వెళ్లాడు. 1945 ఆఖరుకు బెకెట్ తిరిగి పారిస్ చేరుకొన్నాడు.

ప్రపంచ యుద్ధానికి ముందు అతని రచనలు: జాయిస్ పైన, ఫ్రెంచి నవలా కర్త అయిన 'మార్సెల్ ప్రౌస్ట్' పైన వ్రాసిన రెండు వ్యాసాలు, *మోర్ ప్రిక్స్ దేన్ కిక్స్* (More Pircks Than Kicks, 1934) అనే కథల సంపుటి, *మర్ఫీ* (Murphy, 1938) అనే నవల, *హోరోస్కోప్* (whoroscope, 1930), *ఇకోస్ బోన్స్* (Echo's Bones, 1935) అనే కవితలు. ఇవి కాక బెకెట్ అనేక పత్రికలలో కథలు, కవితలు కూడా ప్రచురించాడు. 1945 లో పారిస్‌లో స్థిరపడిన తరువాత అతని రచనా జీవితంలో ఉజ్జ్వల దశ ఆరంభమైంది. 1946-49 ల నడుమ బెకెట్ అనేక కథలు, వచన ప్రబంధాలు (prose narratives) రచించాడు. *మోలయ్* (Molloy 1951,) ఆంగ్లానువాదం 1955), *మెలోన్‌మ్యూర్ట్* (Malone muert, 1951 ఆంగ్లానువాదం Malone dies, 1956) ల *ఇన్నోమబిల్* (1953) అనే నాటకాలు ఆ దశకు చెందినవి. ఈ రచనల ప్రచురణకు కొన్ని ఇబ్బందులు కలిగినా బెకెట్ రచించిన *ఎన్‌ఎటెండెంట్ గోడోట్* (enattendant Godot) విజయవంతంగా ప్రదర్శనకు నోచుకొన్న తరువాత అతనికి ప్రఖ్యాతి వచ్చింది. బెకెట్ తన సృజనాత్మకత పైనే దృష్టి కేంద్రీకరించి రేడియో, టెలివిజన్, పత్రికా గోష్ఠుల వంటి ప్రచార కార్యక్రమాలను పూర్తిగా పరిహరించాడు. 1969 లో నోబెల్ బహుమానం ప్రకటించినప్పుడు ఆ బహుమానాన్ని స్వీకరించడానికి అంగీకారం తెలిపి కూడా సభలో ఉపన్యాసం చేయడం తప్పించుకోవడానికి స్టాక్ హోమ్ పోయి దానిని అందుకోడం మానివేశాడు.

బెకెట్ రచనలలో అతని విశేష విజ్ఞానం వెల్లడి అవుతుంది. అనేక సాహిత్య, ధార్మిక, తాత్త్విక గ్రంథాలతో బెకెట్ కు ఉన్న పరిచితి అడుగడుగునా గోచరిస్తుంది.

అయితే ఆ మూలాలను ఎరుగని పాఠకునికి కూడా బెకెట్ సాహిత్యం ఆసక్తి జనకంగానే ఉంటుంది. ఇటాలియన్ కవి డాంటే, ఫ్రెంచి తత్త్వవేత్త డెస్కార్ట్ (Descartes), డచ్ తత్త్వవేత్త ఆర్నాల్డ్ గియోలింక్స్ (Arnold Geulincx), జేమ్స్ జాయిస్‌ల ప్రభావం బెకెట్‌పై విశేషంగా ఉంది.

బెకెట్ ఎంత సేపూ మానవ జీవితంలోని జుగుప్సావహమైన అంశాలనే ఎన్నుకొని రచనలు చేస్తాడని ఒక అపవాదు ఉంది. నిజానికి అతడు ఒక తాత్త్విక దృక్పథంతో మానవ జీవితాన్ని పరిశీలించ బూను కొని అందులో ఒక భాగంగా జుగుప్సామయ అస్తిత్వాన్ని గ్రహించాడని గమనించాలి. 'ఈ ప్రపంచంలో పుట్టాలని మనం ఎప్పుడైనా కోరుకోలేదు గదా! అయినా పుట్టిన మనం ఎవరం? ఎందుకిలా అయింది? కోఽహం?' అనే జిజ్ఞాసే ఆ దృక్పథం. దానిని బలీయంగా చిత్రించే నిమిత్తమే జీవితంలోని సంక్లిష్టతలను దుస్థితులను బెకెట్ చిత్రించాడు. అయితే, దురవగాహమైన ఈ అనంత రహస్యాన్ని, మానవ జీవితంలోని అధమాధమ పరిస్థితులను తన రచనలకు మూలంగా చేసుకొన్నప్పటికీ బెకెట్ హాస్యదృష్టిని కోల్పోలేదు. మానవ జీవితాలలో పలు సందర్భాలలో అల్పాతి అల్పమైన, అర్థరహితమైన విషయాలపై అమిత శ్రద్ధ చూపడం వలన ఎట్లా వృథా ప్రయాసలతో అమూల్యమైన కాలాన్ని వెచ్చించడం జరుగుతున్నదో 'బెకెట్' తన రచనలలో హాస్యదృష్టితో చిత్రీకరించాడు. ఒక విధంగా ఇది మనః ప్రక్షాళనకే దారి తీస్తుంది.

శిల్ప దృష్టితో కూడా బెకెట్ ఎంతో ప్రతిభ కనబరిచాడు. నాటకాలలో, రేడియో, టెలివిజన్ రూపకాలలో సైతం రచనా నిర్మితిలో సమగ్ర సంఘటితత్వాన్ని అతడు ప్రదర్శించాడు. బెకెట్ చివరి రచనలలో *కమ్ అండ్ గో* (Come and Go, 1967) అనే నాటిక, వచన రచన *లెస్‌నెస్* (Lessness), *రాక్‌బై* (Rockabye) మున్నగు వాటిలో అతి సంక్షిప్తత, ప్రాధాన్యం సంతరించుకొన్నది. మొత్తం మీద 20 వ శతాబ్దపు ముఖ్య రచయితలలో 'బెకెట్' కు ఒక ప్రముఖ స్థానం ఉంది. నిరాడంబరత, స్వచ్ఛత మేళవించిన అతని సాహితీ దృక్పథం అందుకు ఒక కారణం. నిస్సారమైన ఈ విశ్వంలో మానవ జీవితపు అస్థిరత్వం పై అతడు రచనలు చేశాడు. అస్తిత్వవాదపు అనుభూతులు అతని రచనలలో కనబడతాయి.

ము.వీ.

**బెక్వెర్, గుస్తావో అడల్ఫో (1836-70) :** స్పానిష్ కవి, వచన గాథా రచయిత. 1836 ఫిబ్రవరి 17 న జన్మించిన బెక్వెర్ 11 వ ఏటనే తల్లి దండ్రులు లేని అనాథయై, తన సోదరుడు, చిత్రకారుడు అయిన 'వెలరియానొ' రక్షణ క్రిందికి వచ్చాడు. 17 వ ఏట బెక్వెర్ మాడ్రిడ్ చేరుకొని 1861-68 ల నడుమ ఒక వార్తా పత్రిక నిమిత్తం రచనలు చేశాడు. దాదాపు 100 *రీమాలు* (Rimas), గద్యంలో 20 గాథలు, కొన్ని విమర్శక వ్యాసాలు ఇతని రచనలు. ఇతని కవితలలో అధికభాగం ఆ వార్తా పత్రికలోనే ప్రకటించబడ్డాయి. ఇతని మరణానంతరం మిత్రులు వాటిని రెండు సంపుటాలుగా పుస్తకరూపంలో ప్రకటించారు. ఇతని *రీమా*లలో సున్నితమైన భావాలను సంయమనంతో చెప్పిన ఆత్మాశ్రయ కవిత గోచరిస్తుంది. బెక్వెర్ ముఖ్యంగా ప్రేమ, విరహం, విషాదం, ఒంటరితనం గూర్చిన కవితలు అల్లాడు. ఇతని గాథలు (legends) మధ్య యుగ వాతావరణంలో జరిగినట్లు చెప్పిన కథలు. వీటిలో అధిభౌతిక పాత్రలు కూడా కనబడతాయి. ప్రేమ, మృత్యువు, పరలోకం వీటి ఇతివృత్తం. తన అంతరంగ జీవితాన్ని *డెస్డీ మికెల్డా* (Desde mecelda), అనే పేరిట లేఖల పరంపర రూపంలో ఇతడు రచించాడు.

ము.వీ.

**బెజ్రూక్, పెట్ర్ (1867-1958) :** జెక్‌కవి అసలు పేరు 'వ్లాడిమిర్ వాసెక్'. 'కవులకు కవి' అని చెప్పదగిన మేటి కవి. బెజ్రుక్ ప్రాగ్‌లో విద్యాభ్యాసం చేసి, మొరేవియాలో ఉద్యోగం చేసి, 1927 లో రిటైరయాడు. 1899-1900 మధ్యకాలంలో రచించి 1899-1903 మధ్య 'కాస్' అనే పత్రికలో ఇతడు ప్రచురించిన కొన్ని ఉత్తమ కవితలు ఇతనికి ఖ్యాతిని సమకూర్చాయి. సైలీషియా జెకొస్లొవేకియాలోని ఒక చిన్న భాగం. అక్కడి ప్రజలకొక చరిత్ర, సంస్కృతి ఉన్నాయి. ఆ తెగ జర్మన్ వ్యాపార వేత్తల, పోలిష్ మతాచార్యుల మూలంగా ఛిన్నాభిన్నమై తనదైన రూపును కోల్పోతున్నదనే బాధ ఈ రచయితలో తీవ్రంగా కనిపిస్తుంది. ఆ అంశంపైనే తన కవితలను రచించాడు. ఇతివృత్తం స్థానికమే అయినా, అది అతని కవితలో ఒక జాతీయ లేదా విశ్వజనీన ప్రమాణానికి ఎదిగింది. అప్పుడప్పుడు తాను వ్రాసిన 32 కవితలను ఇతడు 1956 లో *సైలీషియన్ సాంగ్స్* అనే గ్రంథంగా ప్రకటించాడు.

ము.వీ

**బెటీ, ఊగో (1892-1953)** : 20 వ శతాబ్దపు తొలి అర్ధ భాగంలోని ప్రముఖ ఇటాలియన్ నాటక రచయిత. తన రచనల ద్వారా అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించినవాడు. న్యాయశాస్త్రాన్ని అధ్యయనం చేసి మేజిస్ట్రేటుగా, జడ్జిగా పనిచేశాడు. మొదటి ప్రపంచ యుద్ధంలో పాల్గొని 1917-18 లో జర్మన్‌ల బందీగా ఉన్న సమయంలో తాను వ్రాసిన కవితలను *ఇల్ రె పెన్సియారోసో* (1922 The Thoughtful King) అనే పేరుతో ప్రకటించాడు. ఇది గాక ఇంకా రెండు కవితా సంపుటాలు, మూడు కథా సంకలనాలు, ఒక నవల, ఇరవై ఆరు నాటకాలు ఈయన రచించాడు.

ఇతని నాటకాలు చాలా విజయవంతం అయాయి. *ఫ్రానా అల్లో స్కేలో నార్డ్* (తొలి ప్రదర్శన; 1933 ఆంగ్లంలో Land slide, 1964) ప్రకృతి బీభత్సం, సామూహిక అపరాధం అనే ఇతివృత్తం గలది. *డెలిట్టో ఆల్ ఇసోలా డెల్లి కేపర్* (తొలి ప్రదర్శన 1950), అనే నాటకం ప్రేమను, పగను చిత్రిస్తుంది. *లాఫుగిటివా* (తొలి ప్రదర్శన 1953, ఆంగ్లానువాదం The Fugitive 1964) లో న్యాయశాస్త్రాలే ప్రపంచ ముక్తికి సాధనాలని రచయిత ప్రతిపాదిస్తాడు. *కొరజియోన్ ఆల్ పాలజ్జోడి గస్టిజియా* (తొలి ప్రదర్శన 1949, ఆంగ్లానువాదం Corruption in the Palace of Justice, 1962) లో నీతి నియమాలు లేని ఒక న్యాయాధ్యక్షుడు చివరకు తన తప్పును గ్రహించి తనకు తానుగా బోనులో నిలబడి శిక్షను కోరుకుంటాడు.

1950 నుండి ఇతని నాటకాలు పారిస్‌లో ప్రదర్శింపబడటంతోను, ఆ తరువాత వాటి ఆంగ్లానువాదాలు ప్రచురితమవటంతోను ఇతని కీర్తి ప్రతిష్ఠలు అంతర్జాతీయ స్థాయిని అందుకొన్నాయి.

కె.బి. మూర్తి.

**బెటీ, మోంగో (1932)** : నవలా రచయిత ఆఫ్రికన్, రాజకీయ వ్యాసకర్త. ఆఫ్రికాలోని వలస వాదులను నామరూపాలు లేకుండా నిర్మూలించడమే ధ్యేయంగా బెటీ నవలలు వ్రాశాడు.

బెటీ మోంగో వ్రాసిన నవలల్లో *లె పవ్ రె క్రిస్ట్ డె బోంబ* (1956; The poor christ of Bomba) ప్రధానమైనది. ఆఫ్రికాలోని కేమరూన్ దేశంలో క్రైస్తవ మిషనరీలు సాగించే కార్యకలాపాల దుష్ప్రభావాలను వ్యంగ్యంగా రచయిత ఈ నవల్లో చిత్రించాడు. క్రైస్తవ మత ప్రచారకులు ఎంత సదుద్దేశంతో పనిచేసినా చివరకు వలస రాజ్యాధిపతుల చేతుల్లో కీలు బొమ్మలుగా మారక తప్పదని ఈ నవలలోని ముఖ్యపాత్ర అయిన ఫాదర్ డ్యుమాంట్ అంటాడు.

*మిస్సిన్ టెర్మి నే* (Mission to Kala, 1958) మరో ఉత్తమ నవల. వలస రాజ్యాధిపతులైన ఫ్రెంచి దేశస్థులను ఎదిరించిన ఆఫ్రికన్ యువకుని విజయగాథ ఈ నవలలో చిత్రింపబడింది. కాలేజీ పరీక్షల్లో తప్పినా, వలస అధికారులతో పోరాడి గెలిచినందుకుగాను, స్వగ్రామానికి తిరిగి వచ్చిన యువకునికి గ్రామవాసులు బ్రహ్మరథం పట్టడం ఈ నవలలోని కథా వస్తువు.

బెటీ మోంగో రచించిన మరో మహత్తరమైన నవల *మైన్ బస్సె సర్ లె కెమరూన్* (1972; Rape of Cameroun) విదేశీయులు వచ్చి, కేమరూన్‌లో వలస రాజ్యం స్థాపించి, దేశ సంపదను కొల్లగొట్టే విధానాన్ని బెటీ మోంగో ఈ నవలలో చిత్రించాడు. ఈ నవల వెలువడగానే ఆఫ్రికా, ఫ్రాన్సులలో ఇది నిషేధింపబడింది. కొత్త వలసరాజ్యానికి, వెనుక బడిన సంప్రదాయాలకు చెందిన దుష్టశక్తులు ఒక యువతిని రహస్యంగా హత్యచేసిన ఉదంతాన్ని *పెర్పెటువ ఎత్ ల హేబిటూడ్ దు మల్ హెర్* (1974) అనే నవలలో నిరూపించాడు. ఫ్రెంచి దేశస్థుల మద్దతుతో పాలనం సాగిస్తున్న అధికారులతో పోరాడి స్వాతంత్ర్యం సంపాదించిన కొంతమంది విప్లవ వీరుల సాహసగాథను *రెమెమ్బ్రర్ రూబెన్* అనే నవలలో బెటీ మోంగో గొప్పగా చిత్రించాడు. గ్రామీణ ప్రాంతాల్లో గెరిల్లాలు సాధించిన విజయం *ల రూయిన్ ప్రెస్కె కోక స్సేదున్ పోలిచినెల్లె (1979,* ‘The Nearly comical *Ruin of a Puppet*’) అనే నవలలో చిత్రింపబడింది. దుష్ట ఫాసిస్టు పాలకులపై న్యాయ విచారణ జరిగిన ఉదంతం *ది ప్రికేరియస్ అండ్ కేయాటిక్ చైల్డ్‌హుడ్ ఆఫ్ గిలామె జెవతామా* (1981) అనే నవలగా రూపొందింది.

బెటీ 1978 లో ఆఫ్రికాలోని వలస అధిపతుల బండారాలను బట్టబయలు చేసి, ఆఫ్రికా విప్లవ వీరులు సాగించే పోరాటాలను వర్ణించిన రచనలను ప్రచురించే ఒక రాజకీయ, సాంస్కృతిక ద్వైమాస పత్రికను ప్రారంభించాడు.

నల్లజాతి జనుల సాహస విజయాలను చిత్రించిన రచయితగా బెటీ మోంగో చిర యశస్సు సంపాదించాడు.

జి.అ.నా.

**బెనావెంతే-యి-మార్తినెజ్, జాసింతో (1866-1954) :** 20 వ శతాబ్దపు ప్రముఖ శ్వానిష్ నాటక రచయితలలో ఒకడు. 1922 లో సాహిత్యానికి నోబెల్ బహుమతి గ్రహీత. సాంఘిక విమర్శ ద్వారా వాస్తవికత వైపు ఈయన శ్వానిష్ నాటక రచనను మళ్లించాడు. నాటకంలో పద్యాల స్థానే వచనాన్ని, ఆశ్చర్యకర సన్నివేశాలస్థానే హాస్య సన్నివేశాలను, లాక్షణిక రూపం స్థానే స్వంత అనుభూతిని ఈయన ప్రవేశ పెట్టాడు. బెనావెంతే ఆరంభంలో సౌందర్య శాస్త్రం మీద, అనంతరం నీతి శాస్త్రం మీద ఎక్కువ ఆసక్తి చూపాడు. బెనావెంతే నాటకాలలోని వైవిధ్యం వలన నాటక ప్రభావ పరిధిని ఆయన ఎంతగా విస్తృతం చేశాడో బోధపడగలదు. బెనావెంతే రచించిన నాటకాలలో ముఖ్యమైనవి: *లాస్ ఇంటరీసెస్ క్రియాడోస్* (ప్రదర్శన-1903, ప్రచురణ-1907; The Bonds of Interest), *లాస్ మ్హాలెహెరిస్ డెల్ డీన్* (ప్రదర్శన-1905, The Evil Doers of Good), *లానోకేడెల్ సెబడో* (ప్రదర్శన-1903, Saturday Night), *లా మాల్కెరిడా* (1913, The Passion Flower). వీటిలో మొదటి నాటకం ఆయన నాటకా లన్నింటిలో మిక్కిలి ప్రసిద్ధి చెందింది. ఇటాలియన్ కామెడీలు ఆధారంగా ఇది రచింపబడింధి. చివరి నాటకం ఒక గ్రామీణ దుర్ఘటనను వర్ణించేది. నిషిద్ధ ప్రణయం దీని ఇతివృత్తం. స్పెయిన్‌లోనూ, ఉత్తర, దక్షిణ అమెరికాలలోనూ ఈ నాటకం విశేషంగా విజయవంతం అయింది. *సెనోరా అమాన్* (1908) అనే నాటకం వ్యక్తిగతంగా బెనావెంతేకి మిక్కిలి ఇష్టమైంది.



1928 లో బెనావెంతే రచించిన *పేరా ఎల్ సీలో యి లోస్ ఆల్టారెస్* (Toward Heaven and the Altars) అనే నాటకం రాబోయే శ్వానిష్ రాజరికపు పతనాన్ని సూచించడం వలన ప్రభుత్వం దానిని నిషేధించింది. శ్వానిష్ అంతర్యుద్ధ కాలంలో బెనావెంతే బార్సిలోనా, వాలెన్షియాలలో జీవిస్తూ కొంతకాలం జైలులో కూడా ఉన్నాడు. 1941 లో *ది ఇన్‌క్రెడిబుల్* (The incredible) అనే నాటకం రచించి తిరిగి బెనావెంతే ప్రజాదరణను చూరగొన్నాడు. 150 పై చిలుకు నాటకాలను రచించిన ఈ రచయిత లోప్ డీ వేగా నాటి స్వర్ణయుగాన్ని గుర్తుకు తెచ్చాడు. ఆయన నాటకాలలో చాలా భాగం ఆంగ్లంలోకి అనువదింపబడ్డాయి.

*నాగరాజ్(బా.శ్రీ.)*

**బెనెడెటీ, మరియో (1920) :** ఉరుగ్వేకు చెందిన మరియో బెనెడెటీ లాటిన్ అమెరికన్ నవలా కారుడుగా, కథారచయితగా, కవిగా, వ్యాసకర్తగా, ఖ్యాతి గడించాడు. వివాదాస్పదుడయిన రచయితగా పేరు పొందాడు.

వివిధ కార్యాలయాలలో అధికారిగా పనిచేసిన మరియో తన తీరిక వేళలలో రచనలు సాగించాడు. ఆయన తొలి కథా సంకలనం 1949 లో వెలువడింది. *ఎస్టామనానా* ('ఈ ఉదయం') అనే ఆ సంకలనం లోని కథలలో మధ్య తరగతి సమస్యలను ఆయన చిత్రించాడు. మరియో తొలి నవల *క్వియెన్ ద నోస్ట్రోస్* (మనలో ఎవరు?) 1953 లో వెలువడింది. అందులో ముగ్గురు ఆప్తమిత్రుల నిరాశా నిస్పృహల చిత్రీకరణ కనిపిస్తుంది. 1954-60 ల మధ్య మరియో మూడు సార్లు ఉరుగ్వేలోని ప్రముఖ వారపత్రిక *మర్చా* నిర్వాహకుడుగా పని చేశాడు. 1956 లో మరియో గ్రామ్య ధోరణిలో వ్రాసిన *పాయెమాస్ ద లా ఆఫీసినా* (ఆఫీసు కవితలు) సంకలనం ప్రచురించాడు. అది ఎంతో ప్రసిద్ధి కెక్కింది. ఆధునన తాను ఎక్కువ కాలం నివసించిన మొంటెవిడియో నగరం నేపథ్యంగా తీసుకొని ఎన్నో కథలు వ్రాశాడు. మోంటేవిడియోవాస్ (1959) అనే కథాసంకలనాలలో చోటు చేసుకొన్న ఆ కథలు నగర జీవితంలోని చీకటి వెలుగులకు అద్దం పట్టేవి.

ఉరుగ్వే రాజకీయంగా, ఆర్థికంగా, నైతికంగా చితికి పోతున్న దన్న వ్యథతో మరియో వ్రాసిన వ్యాసాలు *ఎల్ పయస్ ద లా కొలా ద పజా* (గడ్డితోకగా గల దేశం) పేరిట పుస్తకరూపంలో 1960 లో ప్రచురితమైంది. 1965 తరువాత ఆయన రచనలలో రాజకీయ సిద్ధాంతాల ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది.

1967-71 ల మధ్య క్యూబా ప్రభుత్వం వారి అంతర్జాతీయ సాంస్కృతిక వ్యవస్థ సభ్యుడుగా పనిచేసిన మరియో తన క్యూబా అనుభవాలగురించి 1969 లో ఒక పుస్తకం ప్రచురించాడు. పద్య రూపంలో సాగిన *ఎల్ కంప్లియనోస్ ద జువాన్ ఏంజెల్* అనే నవలలో మరియో తమ స్వీయ చరిత్రే వ్రాసుకున్నాడని విమర్శకుల అభిప్రాయం.

1971 లో క్యూబా నుంచి ఉరుగ్వేకు తిరిగి వచ్చిన మరియో అక్కడి ఎన్నికలలో పాల్గొనడానికి వామపక్షాల సమాఖ్యను ఏర్పాటు చేసే ప్రయత్నం చేశాడు. ఉరుగ్వేలో సైన్యం అధికారాన్ని కైవశం చేసుకోడంతో మరియో తిరిగి క్యూబా చేరుకొని అక్కడ ప్రవాసంలో జీవించసాగాడు. అక్కడ హింసనూ ప్రవాస జీవితంలోని ఒడిదుడుకులను చిత్రించే కథానికలను వ్రాసి, 1977 లో సంకలనరూపంలో వెలువరించాడు. పి.ఎస్.జి.

**బెన్నెట్, ఆర్నాల్డ్ (1867-1931) :** ఆంగ్ల నవలా రచయిత. మధ్య ఇంగ్లండులో ఫైవ్ టవున్స్ (Five Towns) పేరిట చలామణీ అయి, ఆ తరువాత స్టోకవ్ పాన్ ట్రెంట్ నగరంలో కలసిపోయిన పాటరీస్ ప్రాంతానికి చెందిన ఆర్నాల్డ్ బెన్నెట్ ఫైవ్ టవున్స్‌ను నేపథ్యంగా తీసుకొని ఎన్నో నవలలు వ్రాశాడు. ఆయన నవలలే కాక నాటకాలు కూడా వ్రాశాడు; విమర్శకుడుగానూ, వ్యాసకర్తగానూ కూడా పేరు గడించాడు. న్యాయవాదిగా పనిచేస్తున్న తండ్రి దగ్గర గుమాస్తాగా చేరిన ఆర్నాల్డ్ 1889 లో లండన్ చేరుకొన్నాడు. అక్కడ వకీలు గుమాస్తాగా పనిచేస్తూనే సీరియల్ నవలా రచయితగా పేరు తెచ్చుకొన్నాడు; స్త్రీల పత్రిక ఒక దానికి సంపాదకత్వం వహించాడు.



1898 లో ఆర్నాల్డ్ తొలి నవల *ఏ మాన్ ఫ్రమ్ ది నార్త్* వెలువడింది. ఆ తరువాత ఆయన రచననే తన వృత్తిగా స్వీకరించాడు. తండ్రి మరణానంతరం 1903 లో పారిస్ చేరుకొన్న ఆర్నాల్డ్ అక్కడ ఎనిమిదేళ్లు ఉన్నాడు. 1907 లో ఫ్రెంచి నటి మార్గరెట్ సౌలీని పెండ్లాడాడు. పారిస్ జీవితం ఆర్నాల్డ్‌కు యూరప్‌లో అప్పుడు ప్రాచుర్యంలో ఉన్న వివిధ సాహిత్య ధోరణులతోనూ, కళారూపాలతోనూ సన్నిహిత పరిచయాన్ని కలుగజేసింది. యూరప్ వాస్తవిక సాహిత్య ధోరణులను తన నవలలలో అనుసరించిన ఆర్నాల్డ్ రచనా విధానం మీద ఫ్రెంచ్ వాస్తవిక వాదులయిన ఫ్లొబెర్, బాల్జాక్‌ల ప్రభావం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

ఆర్నాల్డ్ 30 నవలలు వ్రాసినా, వాటిలో ఫైవ్ టవున్స్ నేపథ్యంలో వ్రాసిన *ఆనా ఆఫ్ ది ఫైవ్ టవున్స్* (1902 'ఫైవ్ టవున్స్‌కు చెందిన ఆనా'), *ది ఓల్డ్ వైవ్స్ టేల్* (1908 ముసలమ్మల కథ), *క్లేహేంగర్* (1910), *హిల్డాలెస్ వేస్ (Hilda Less ways-1911)*, *ది క్లే హేంగర్ ఫామిలీ* (1925: 'క్లే హేంగర్ కుటుంబం') మొదలైనవి ప్రధానమైనవి. లండన్‌లోని దిగువ మధ్య తరగతి కుటుంబాల సమస్యలను చిత్రిస్తూ ఆర్నాల్డ్ 1923 లో వ్రాసిన *రైసీమాన్ స్టెప్స్* పాఠకుల దృష్టిని ఆకర్షించిన నవల.

విమర్శకుడుగా ప్రముఖ స్థానం గడించిన బెన్నెట్ తమ తరువాతి తరానికి చెందిన జేమ్స్ జాయిస్, డి.హెచ్. లారెన్స్, విలియం ఫాక్నర్, ఎర్నెస్ట్ హెమింగ్‌వే మొదలయిన రచయితల తొలి రచనలను చదివి వారి గొప్ప తనాన్ని ప్రశంసిస్తూ సమీక్షా వ్యాసాలు వ్రాశాడు.

1920 తరువాత ఆర్నాల్డ్ కీర్తి తరిగినా, 1930 తరువాత ఆయనపట్ల కృతజ్ఞత తెలియచేస్తూ కొందరు యువ రచయితలు మూడు సంపుటాలుగా ప్రచురించిన *ది జర్నల్స్ ఆఫ్ ఆర్నాల్డ్ బెన్నెట్* 1896-1928 తో ఆయన కీర్తి చిరస్థాయిగా నిలచిపోయింది.

పి.ఎస్.జి.

**బెరీమన్, జాన్ (1914-1972) :** అమెరికన్ కవి. తొలి అమెరికన్ రచయిత్రి ఆనీ బ్రాడ్‌స్ట్రీట్‌కు నివాళి అర్పిస్తూ 1956 లో వెలువడిన *హోమేజ్ టు మిసెస్ బ్రాడ్‌స్ట్రీట్* అనే సుదీర్ఘ కవిత ద్వారా ప్రసిద్ధి కెక్కినవాడు. అమెరికాలోనూ, ఇంగ్లండ్‌లోనూ విద్యాభ్యాసం చేసిన జాన్ అమెరికాలోని వివిధ విశ్వవిద్యాలయాలలో అధ్యాపకుడుగా పనిచేశాడు.

1931-40 మధ్య జాన్ వ్రాసిన కవితలు ఎన్నో పత్రికలలో ప్రకటితమయాయి. 1940 లో వెలువడిన *ఫైవ్ యంగ్ అమెరికన్ పొయెట్స్* అనే సంకలనంలో జాన్ వ్రాసిన 20 కవితలు చోటు చేసుకొన్నాయి. జాన్ 1942 లో *పొయెమ్స్* అనే కవితా సంకలనాన్నీ, 1948 లో *ది డిస్‌పొసెస్డ్* అనే కవితా సంకలనాన్నీ వెలువరించారు. 1967 లో వెలువడిన *బెరీమన్స్ సానెట్స్* అనే రచనకు బెరీమన్ జీవితంలోని శృంగారానుభవాలు ప్రేరణలు.

కథకుడుగా కూడా విశేషఖ్యాతి గడించిన జాన్ బెరీమన్ వ్రాసిన *ది లవర్స్* అనే కథానికను 1946 లో వెలువడిన *ది బెస్ట్ అమెరికన్ షార్ట్ స్టోరీస్* సంకలనంలో చేర్చారు. 1945 లో ఆయన వ్రాసిన *ది*

*ఇమాజినరీ జ్యూ* ఎన్నో సంకలనాలలో కనిపించే ఉత్తమ కథానిక. జాన్ బెరీమన్ జీవితంలో వివిధ సంఘటనల ప్రతిబింబాలు ఆయన 1964 లో వ్రాసిన *77 డ్రీమ్ సాంగ్స్* (77 కలల పాటలు) అనే సంకలనంలోనూ, 1968 లో 385 "కలల పాటలతో" కూర్చిన *హిస్ టాయ్, హిస్ డ్రీమ్, హిస్ రెస్ట్* అనే సంకలనంలోనూ, 1970 లో వెలువడిన *లవ్ అండ్ ఫేమ్* ('ప్రేమా, కీర్తి') అనే కవిత్వ రచనలోనూ కనిపిస్తాయి. మంచుగడ్డలతో నిండిన మిసిసిపీ నదిలో దూకి జాన్ బెరీమన్ 1972 లో ఆత్మహత్య చేసుకొన్నాడు. ఆయన త్రాగుడుకు బానిస అయి, తాను పడ్డ అవస్థలను వివరిస్తూ వ్రాసిన *రికవరీ* ('కోలుకోవడం') 1973 లో వెలువడింది.

పి.ఎస్.జి.

**బెర్గ్‌మన్, బో హాల్మార్ (1869-1967)** : 20 వ శతాబ్దిలో స్వీడిష్ కవిత్వాన్ని ఎంతో ప్రభావితం చేసిన ప్రముఖ కవి బో హాల్మర్ బెర్గ్‌మన్ స్వీడిష్ పోస్ట్ ఆఫీస్‌లో ఉద్యోగిగా పనిచేస్తున్నప్పుడే గేయకవిత్వం వ్రాయడం ప్రారంభించిన బో హాల్మర్ మొదట నిరాశా వాదాన్నీ, నియతివాదాన్నీ ప్రతిబింబించే రచనలు చేశారు. ఆ తరువాత మానవతా వాదాన్ని అవలంబించిన ఆయన రచనలలో సమకాలీన, రాజకీయ, సాంఘిక ప్రమాదాల పట్ల హెచ్చరికలు కనిపిస్తాయి. ఆయన నిజాయితీ, స్వచ్ఛమైన శైలీ ఎందరో రచయితలకూ, కవులకూ మార్గదర్శకా లయాయి.

బెర్గ్‌మన్ తొలి కవితా సంకలనం 1903 లో వెలువడిన *మారియో నెటెర్నా* ('కీలు బొమ్మలు'). ఈ సంకలనంలో వ్యక్తిగతమైన ఏకాంత దుఃఖచిత్రణ కనిపిస్తుంది. తరువాతి కవిత్వ సంకలనాలలో యూరప్‌లోని సమకాలీన, రాజకీయ స్థితిగతుల పట్ల తీవ్రమైన విమర్శలు కనిపిస్తాయి. రాజకీయ విమర్శలు కనిపించే బెర్గ్‌మన్ కవిత్వ సంకలనాలలో *ట్రాట్స్ ఆల్ట్* ('అన్నీ ఉన్నా'), *గామ్లా గుడార్* ('ప్రాత దేవుళ్లు'), *రికెట్* ('సామ్రాజ్యం') అనే మూడూ ప్రసిద్ధాలు.

బెర్గ్‌మన్ ఎన్నో కథా సంపుటాలు ప్రచురించాడు. ఐదు నవలలూ, ఐదు జీవిత చరిత్రలూ వ్రాశాడు. తన జీవితంలోని ఎన్నో సంఘటనలను గురించి అడపా దడపా వ్యాసాలు వ్రాశాడు.

పి.ఎస్.జి.

**బెర్గ్‌సన్, హెన్రీ (1859-1941)** : ఫ్రెంచ్ దార్శనికుడు. 'స్థితి' విలువలకు కాకుండా 'గతి' విలువలకు ప్రాధాన్యం ఇచ్చే ప్రక్రియా దర్శనానికి (Process philosophy) ఆయనే శ్రీకారం చుట్టాడు. విశిష్టమైన రచనా శైలితో విద్వాంసులనూ, సామాన్య జనులనూ సరిసమానంగా ఆయన ఆకట్టుకున్నాడు. 20 వ శతాబ్దపు అగ్రశ్రేణి పండితులలో ఎన్నదగినవాడు. 1859 అక్టోబర్ 18 న బెర్గ్‌సన్ పారిస్‌లో జన్మించాడు. ఈయన తండ్రి పోలిష్ యూదు కుటుంబానికి చెందినవాడు. ఆ కుటుంబ మూలపురుషుడు 'బెరెక్' 'బెరెక్-సన్' 'బెర్గ్‌సన్' అయింది. తల్లి ఇంగ్లీష్ యూదు కుటుంబానికి చెందింది. బెర్గ్‌సన్ జీవితకాలమంతా ఫ్రాన్స్‌లోనే, ముఖ్యంగా పారిస్‌లోనే గడిచింది. పారిస్‌లోని 'లైసీ కండోర్ సెట్' లోనూ, 'ఎకోలే నార్మలే సుపీరియూర్' లోనూ విద్యాభ్యాసం చేసి పట్టభద్రుడైన తరువాత తన దృష్టిని ఆయన దర్శనశాస్త్రం వైపు మళ్లించాడు. బెర్గ్‌సన్ మొదట ప్రావెన్సీస్‌లో ఉపాధ్యాయ వృత్తి అవలంబించాడు. ఆయన రచించిన తొలి వ్యాసం *ఎస్సేయ్ సర్ డొన్నెస్ ఇమ్మీడియట్స్ ద లకన్సెన్స్* (*టైమ్ అండ్ ఫ్రీవిల్ : ఆన్ ఎస్సే ఆన్ ది ఇమ్మీడియేట్ డేటా ఆఫ్ క్షాసస్‌నెస్*, 1889). ఆ వ్యాస రచనకు ఆ ఏడాదే ఆయనకు డాక్టర్ పట్టం లభించింది.

1891 లో బెర్గ్‌సన్ లూయిస్ ల్యూబెర్గర్‌ను వివాహ మాడాడు. ఈమె ప్రసిద్ధ ఫ్రెంచ్ నవలా రచయిత మార్షల్ ప్రౌస్ట్‌కు వరుసకు సోదరి అవుతుంది.



తరువాత బెర్గ్‌సన్ మనస్సుకు, దేహానికి ఉన్న సంబంధాన్ని పరిశీలింపనారంభించాడు. దాని ఫలితంగా ఆయన రచించిన గ్రంథం *మెటీరె ఎ మెమోయర్: ఎస్సేయ్ సర్‌ల రిలేషన్ ద్యు కార్ప్స్ అల్ స్పిరిట్* (*మేటర్ అండ్ మెమరీ* 1896). ఈ పుస్తకం అర్థం చేసుకోడం చాలా కష్టం. అయినా బెర్గ్‌సన్ రచనలలో మిక్కిలి ప్రశస్తమైన రచన ఇదే అని విమర్శకుల అభిప్రాయం. అటు తరువాత మొదటి ప్రపంచ సంగ్రామం వరకూ 'బెర్గ్‌సనిజమ్' ఎక్కువ ప్రచారంలో ఉంది. బెర్గ్‌సన్ రచనలను విలియమ్ జేమ్స్ మిక్కిలి ఆసక్తితో చదివాడు. వారిద్దరూ గాఢమైన మిత్రులయారు. బెర్గ్‌సన్ దర్శన ప్రభావం ప్రౌస్ట్ రచించిన

*రిమెంబరెన్స్ ఆఫ్ థింగ్స్ పాస్ట్* (1913-27) అనే గ్రంథం మీదా, జార్జ్ బెర్నార్డ్ షా రచించిన *బాక్ టు మెతూసిల* (1921) వంటి రచనలమీద కనిపిస్తుంది. అలాగే ఫ్రెంచ్ రాజనీతి శాస్త్రవేత్త 'జార్జస్ సోరెల్, ఫ్రెంచ్ ఇంప్రెషనిస్ట్ కళాకారుడు 'క్లాడ్ మోనిక్', ఫ్రెంచ్ గాయకుడు 'క్లాడ్ డిబసీ' మొదలైనవారు కూడా బెర్గ్‌సన్ దర్శనం వలన ప్రభావితు లయారు.

బెర్గ్‌సన్ రచనలలో మిక్కిలి ప్రసిద్ధి పొందింది *ల ఎవల్యూషన్ క్రియేట్రైస్ (1907: 'క్రియేటివ్ ఇవల్యూషన్'* 1911). మానవుని ఆలోచనలమీద జీవ శాస్త్రీయ ప్రక్రియల ప్రభావాన్ని ఇది ప్రకటించింది.

బెర్గ్‌సన్ రచించిన ఇతర రచనలలో పేర్కొనదగి నవి: లరైర్: ఎస్సేయ్ సర్‌ల సిగ్నిఫికెన్స్ దు కామిక్: (1900, 'లాఫర్: ఆన్ ఎస్సే ఆన్ ది మీటింగ్ ఆఫ్ ది కామిక్'-1911), *ఇంట్రడక్షన్ అ ల మెటాఫిదిక్* (1903, *ఆన్ ఇంట్రడక్షన్ టు మెటాఫిజిక్స్*-1913). 1900-1921 మధ్యకాలంలో బెర్గ్‌సన్ తత్త్వశాస్త్ర అధ్య క్షుడుగా ఉన్నాడు.

మొదటి ప్రపంచ యుద్ధం జరుగుతున్న కాలంలో అనేక దౌత్య కార్యాలను ఆయన నిర్వహించాడు. ఈయన అకాడమీ ఫ్రాన్స్వాయిస్ (Academie Francais) కు 1914 లో ఎన్నికయాడు. ఈయన నానాజాతి సమితి 'కమీషన్ ఫర్ ఇంటలెక్చువల్ కో ఆపరేషన్' కు 1921 నుంచి 1926 వరకు అధ్యక్షుడుగా ఉన్నాడు. 1927 లో బెర్గ్‌సన్‌కు సాహిత్యానికి నోబెల్ బహుమతి లభించింది.

అటు తరువాత 25 ఏళ్లకు *లెస్ డెక్స్ సోర్సస్ ద ల మొరల్ ఎల్ ద రెలిజియన్ (ది టూ సోర్సెస్ ఆఫ్ మొరాలిటీ అండ్ రెలిజియన్*-1932) అనే గ్రంథం రచించాడు. బెర్గ్‌సన్ 1941 జనవరి 4 వ తేదీన పారిస్‌లో తుదిశ్వాస విడిచాడు.

*నాగరాజ్(బా.శ్రీ.)*

**బెర్డిచెవ్‌స్కీ, మికా జోసెఫ్ (1865-1921) :** హీబ్రూ, జర్మన్, యిడ్డిష్ భాషా రచయిత. "మికా జోసెఫ్ బిన్ గొరియన్" అనే మారుపేరుతో ప్రసిద్ధులయిన మికాజోసెఫ్ బెర్డిచెవ్‌స్కీ భగవద్భక్తినీ, సంతోషంగా భగవత్సేవ చేయడాన్నీ ఉద్బోధించిన "హసిద్" (ఖాసిద్) అనే యూదుల తెగవారి మత గురువుల కుటుంబంలో జన్మించాడు. ఆధ్యాత్మిక స్వేచ్ఛకోసం ఆయన ఆరా టపడ్డారు. ఆ ఆరాటం ఆయన వ్రాసిన కథలు, నవలలు, వ్యాసాలు మొదలయిన వాటిలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

తమ జీవిత చరమదశలో బెర్లిన్‌లో దంతవైద్యు లుగా పనిచేస్తూ *మె-ఒట్‌జర్ హా-అగ్గడా* (1913-14; 'అగ్గడా నిక్షేపాల నుంచి) అనే సంకలనాన్ని హీబ్రూ భాషలో బెర్డిచెవ్‌స్కీ ప్రచురించాడు. ఈ సంకలనంలో యూదుల ప్రాచీన గాథలకూ, జానపద వృత్తాంతాలకూ ఆకరమైన 'అగ్గడా' నుంచి సేకరించిన కథ లెన్నో చోటుచేసుకొన్నాయి.

మికా జోసెఫ్ రచనలు చాలావరకు ఆయన మరణానంతరం సంకలనాలుగా వెలువడ్డాయి. ఆయన కథలు 1922-23 లలో *మె-హట్జ్ లె-తహూమ్* ('అవ రణ దాటి'), *బెన్‌హ హోమొత్* ('గోడల మధ్య') వంటి సంకలనాలలో వెలువడ్డాయి. ఈ కథలలో రచ యిత యూదుల జీవిత విధానంలోని ఒడిదుడుకులను చిత్రీకరించారు. తరతరాలుగా సాగివస్తున్న యూదు సంప్రదాయవాదం నుంచి బయట పడడానికి విఫల ప్రయ త్నాలు చేస్తున్నవారూ, సంప్రదాయం ఆవరణలోనే జీవించడానికి శ్రమించే వారూ ఈ కథలో కనిపిస్తారు.

మికా జోసెఫ్ వ్యాసాలు తొమ్మిది సంకలనాలుగా 1922 లో వెలువడ్డాయి. ఆ వ్యాసాలలో సాహిత్య విమర్శ, యూదు సంప్రదాయంలో కరడుగట్టిన ప్రాచీనత మీద విమర్శలు, 'హసిద్' సంప్రదాయం గురించిన ప్రశంసలు చోటు చేసుకొన్నాయి. *అగ్గడా* లో కనిపించే సుందర భావాలనూ, మానవతా ధోరణులనూ వివ రిస్తూ వ్రాసిన *హోరెబ్* అనే వ్యాస సంకలనం కూడా పేర్కొనదగిందే.

యూదులకు సమగ్రమైన ఆధ్యాత్మిక తత్త్వం లేదంటూ మికా జోసెఫ్ ప్రతిపాదించిన చారిత్రక సిద్ధాంతాన్ని చాలా మంది యూదు పండితులు మూర్ఖవాదంగా తోసి పుచ్చారు.

మికా జోసెఫ్ రచనలను విమర్శనా దృష్టితో పరిశీ లించిన పండితులు ఆయన సాహిత్య సేవలో *అగ్గడా కథల సంకలనమే* పేర్కొనదగింది అని అభిప్రాయపడ్డారు.

పి.ఎస్.బి.

**బెర్నార్డ్, జీన్-జేక్విస్ (1888-1972) :** ఫ్రెంచ్ నాటక కర్త. నాటక పాత్రల నిజమైన మనోభావాలను సంభాషణల ద్వారా వ్యక్తం చెయ్యని 'అవ్యక్త నాటక పద్ధతి' కి ప్రధాన ప్రతినిధి. అవ్యక్త నాటక పద్ధతి 'మౌన పద్ధతిగా' ప్రసిద్ధి కెక్కింది. జీన్-జేక్విస్ 1922 లో వ్రాసిన *మ్యార్టిన్* నాటకం అవ్యక్త నాటక పద్ధతికి మంచి ఉదాహరణ. అందులోని పాత్రల స్వభావాలను

గ్రహించడానికి ఆ పాత్రల సైగలు, ముఖ భంగిమలు, వాటి పొడిపొడి మాటలు, మౌనం తోడ్పడుతాయి.

జీన్ జేక్విస్ తండ్రి ట్రిస్టాన్ బెర్నార్డ్ కూడా నాట కకర్తగా ప్రసిద్ధుడే. జీన్ జేక్విస్ తొలి నాటకాలలో మనోవైజ్ఞానిక సమస్యలు ఇతివృత్తాలు. *లె ఫ్యుక్సీ ర్ఫెండ్ మాల్* (1921), *లె ఫ్రింటెమ్ప్స్ డె ఆటెస్* (1924) అనే రెండు నాటకాలలో అకారణ ద్వేషం ఇతివృత్తం. 1926 లో వెలువడిన *లామెన్ పెయిన్* లో పరస్పరం పరిచయం లేని రెండు పాత్రలు ఒకదాన్ని మరొకటి సమీపించేటప్పుడు అనుభవించే అశాంతి ఇతివృత్తం.

యూదు జాతికి చెందిన వాడన్న కారణంగా రెండవ ప్రపంచ యుద్ధకాలంలో జర్మనీ వారి 'కాన్సెన్ట్రేషన్ కాంప్' లో బందీగా ఉన్న జీన్ జేక్విస్ ఆ సజీవ నరకంలో తాను పొందిన అనుభవాలను *లె కాంప్ ద లా మార్ట్ లెంటె (1944; 'The Camp of Slow Death' 1945)* పేరిట 1944 లో ఒక స్మృతి గ్రంథంగా ప్రకటించాడు. తన నాటకానుభవాలను గురించి 1958 లో *మొన్ అమి లె థియేటర్* అనే పుస్తకం వ్రాశారు. జీన్ జేక్విస్ వ్రాసిన నాటకాలు కొన్నిటిని జె.ఎల్. ఫ్రిత్ ఆంగ్లంలోకి అనువదించి 1939 లో *ది సల్కీ ఫెయిర్* పేరిట సంకలనంగా ప్రచురించాడు.

పి.ఎస్.జి.

**బెర్నార్డ్ షా, జార్జ్ (1856-1950) :** జగద్విఖ్యాతుడైన ఐరిష్ హాస్య నాటక రచయిత, సాహిత్య విమర్శకుడు, సోషలిస్ట్ ప్రచారకుడు. 1925 లో సాహిత్యానికి నోబెల్ బహుమతి గ్రహీత. *సీజర్ అండ్ క్లియోపాత్ర* (ప్రచురణ, ప్రదర్శన 1901), *మాన్ అండ్ సూపర్ మాన్* (ప్రచురణ 1903, ప్రదర్శన 1905), *మేజర్ బార్బరా* (ప్రచురణ 1905, ప్రదర్శన 1907), *సెయింట్ జోన్* (ప్రచురణ 1923, ప్రదర్శన 1924) వంటి ప్రసిద్ధ నాటకాల రచయిత. జార్జ్ కార్ షా, లూసిండా ఎలిజబెత్ గుర్లీ షా దంపతుల మూడవ, కడగొట్టు సంతానం జార్జ్ బెర్నార్డ్ షా. ఇతడు వారి ఏకైక పుత్రుడు. దారిద్ర్యంతో బాధపడుతూ షా మొదట ఒక మతోద్యోగి అయిన తన పినతండ్రి వద్ద ట్యూషను చదువుకొన్నాడు. తరువాత కొద్దికాలం పాటు ప్రొటెస్టెంట్, కాథలిక్ స్కూళ్లు రెండింటిలోనూ చేరి చదువుకొన్నాడు. 16 ఏళ్లు నిండక మునుపే ఒక భూముల ఏజెంటు కార్యాలయంలో పనిలో చేరాడు.

షా కుటుంబం వారు సంగీత ప్రియులు. షా తల్లి తన సంగీత గురువు జార్జ్ జాన్ వాండెరియన్ లీతో 1875 లో తన భర్తను డబ్లిన్‌లోనే వదలి తన కుమార్తెలతో సహా లండన్ వెళ్లగా, ఆ మరుసటి ఏడాది బెర్నార్డ్ షా కూడా ఆమె వద్దకు వెళ్లాడు. షా తన 20 వ, 30 వ సంవత్సరాల మధ్య విశేష నైరాశ్యాన్నీ, దారిద్ర్యాన్నీ ఎదుర్కోవలసి వచ్చింది. కొద్దికాలం 'లీ' పేరుతో సంగీత విమర్శక వ్యాసాలు వ్రాశాడు. 1879 నుంచి 1980 లో సగం వరకూ లండన్‌లోని ఎడిసన్ టెలిఫోన్ కంపెనీలో పనిచేశాడు. అదే అతడు చేసిన చిట్టచివరి సాహిత్యేతర ఉద్యోగం. తల్లీ, పెద్ద అక్క లూసీతో కలసి తల్లి సంగీతం టీచరుగా సంపాదించే జీతంతోనూ, తన స్వల్ప ఆదాయంతోనూ షా ఎలాగో కాలం గడిపేవాడు. అతని రెండవ అక్క ఆగ్నిస్ 1876 లో చనిపోయింది. సాయంత్రం వేళలలో షా బ్రిటిష్ మ్యూజియంలోని రీడింగు రూములో కూర్చుని పుస్తకాలు చదవడం, నవలలు వ్రాయడం చేసేవాడు.

అతని నవలలు ఏ మాత్రం విజయవంతం కాలేదు. అతడు వ్రాసిన *ఇమెచ్యూరిటీ* (1829) అనే నవలను లండన్‌లోని ఏ ప్రచురణ కర్తా ప్రచురించడానికి అంగీకరించలేదు. తరువాత వ్రాసిన నాలుగు నవలలకూ కూడా అదే గతి పట్టింది. 1881 లో లండన్‌లో మశూచి వ్యాధి విజృంభించినపుడు షా కూడా ఆ వ్యాధికి గురి అయాడు.

నవలా రచయితగా విఫలుడైనా 1890-90 మధ్య షా లో పరిణతి ఏర్పడింది. అతడు శాకాహారి అయాడు. సోషలిస్టులలో చేరి, గొప్ప వక్త అయాడు. 1854 లో స్థాపించిన ఫేబియన్ సొసైటీలో ప్రముఖ వ్యక్తి అయాడు.

1884 లో నాటక రచయితగా 'షా' తన ప్రయోగాలను ప్రారంభించాడు. 1892 లో షా తొలి నాటకం *విడోయర్స్ హౌసెస్* ప్రదర్శింపబడి, పత్రిక లన్నింటి చేత అభినందించబడింది. షా ప్రచురించిన తొలి నాటక సంకలనం *ప్లేస్ ప్లెజెంట్ అండ్ అన్‌ప్లెజెంట్* (1898). నాటక రచనతోనూ, ఇతర వ్యాసంగాలతోనూ

శక్తికి మించి శ్రమించడంతో 1898 లో ఆయన స్వల్ప అస్వస్థతకు గురి అయాడు. ఆ అస్వస్థత నుండి కోలు కొంటున్న సమయంలోనే తన నర్స్ *చార్లట్ పెయిన్ టౌన్‌షెండ్* ను ఆయన వివాహ మాడాడు.

షా ప్రచురించిన ఆటు తరువాతి నాటక సంకలనం *త్రీ ప్లేస్ ఫర్ ప్యూరిటన్స్* (1901). ఈ సంకలనం లోనే షా తన నాటకాలకు సుదీర్ఘమైన ఉపోద్ఘాతాలను రచించడం ఆరంభించాడు.

మొదటి ప్రపంచ సంగ్రామానంతరం కొంత కాలం షా నాటకాలు వ్రాయడం మాని *కామన్‌సెన్స్ అబౌట్ ది వార్* అనే కరపత్రాన్ని ప్రచురించాడు. దానిలో జర్మనీ తోపాటు గ్రేట్ బ్రిటన్, దాని మిత్ర రాజ్యాలూ కూడా దోషులే అని షా అన్నాడు. *హార్ట్ బ్రేక్ హౌస్* (1920) లో యుద్ధ ప్రారంభంలో ఆధ్యాత్మికంగా దివాలా తీసిన ఒక తరం ప్రజలు యుద్ధంలో జరిగిన రక్తపాతానికి బాధ్యులు అని షా ఆరోపించాడు. 1922 లో *బాక్ టు మెథుసిలా* అనే పేరుతో అయిదు పరస్పర సంబంధం గల నాటకాలను షా ప్రచురించాడు. ఆ నాటకాలలో ఏడెన్‌గార్డెన్ నాటి నుంచి క్రీస్తుశకం 31,920 వరకూ మానవుల క్రమపరిణామం వర్ణించబడింది. షా రచించిన చిట్టచివరి నాటకం *వై షీ వుడ్ నాట్* (1956) లో షా లోని వెనుకటి ప్రతిభ తాలూకు చెణుకులు మాత్రమే మనకు కనిపిస్తాయి. ద్వితీయ ప్రపంచ సంగ్రామం జరుగుతున్న కాలంలో 1943 లో షా భార్య చార్లట్ చనిపోయిన తరువాత షా లండన్‌లోని తన బసను వదలి, హెర్ట్‌ఫోర్డ్‌షైర్‌లోని అమోట్ సెంట్ లారెన్స్ అనే తన గ్రామీణ నివాసానికి మారాడు. అక్కడే 1950 లో తన 94 వ ఏట షా తన తుదిశ్వాస విడిచాడు.

బొ.శ్రీ.

**బెలక్, హిలేర్ (1870-1953) :** 20 వ శతాబ్దపు పూర్వార్ధంలోని ప్రతిభావంతులైన ఆంగ్ల రచయితలలో ఒకడు. కవిగా, చరిత్రకారుడుగా, వ్యాసకర్తగా ప్రసిద్ధుడు. బెలక్ పిల్లలకోసం సరళసుందర మైన హాస్య కవితలు వ్రాసి ఖ్యాతి గడించాడు. అతి సాధారణ విషయం మొదలు అతి గంభీర విషయం దాకా అన్నీ బెలక్ రచనకు ప్రేరణ నిచ్చాయి. బెలక్ ఎలాంటి విషయాన్నైనా సరే, ఆసక్తికరంగా వ్యాసరూపంలో మలచగల సిద్ధహ స్తుడు. ఎడ్వర్డు యుగం నాటి వివాద గ్రస్త విషయాలను కుతూహలజనకమైన వ్యాసాలుగా తీర్చి దిద్దిన నిపుణుడు బెలక్.

బెలక్ ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయంలో చరిత్ర ప్రధాన విషయంగా ప్రథమశ్రేణి ఆనర్సులో ఉత్తీర్ణుడయాడు. ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయ వక్తృత్వ సంఘం అధ్యక్షుడుగా విద్యార్థిలోకంలో రాణించాడు. ఫ్రెంచ్ దేశీయుడైన బెలక్ బ్రిటిషు పౌరసత్వం స్వీకరించి, పార్లమెంటు సభ్యుడు (1906-10) గా కూడా ఆ దేశానికి సేవ చేశాడు.

బెలక్ తొలి రచనలలో *వెర్సెస్ అండ్ సానెట్స్* (1895), *ది బాడ్ చైల్డ్స్ బుక్ ఆఫ్ బీస్ట్స్* (1896) పేర్కొనదగినవి. విక్టోరియా యుగం నాటి ఆడంబ రాలను, అట్టహాసాలను ఎద్దేవా చేస్తూ పేరడీలుగా వ్రాసిన కవితా సంకలనం *కాషనరీ టేల్స్* (1907) బెలక్‌కు అపారమైన ఖ్యాతిని తెచ్చి పెట్టింది. ఈ కవితా సంకలనం అతన్ని ఆంగ్ల సాహిత్య ప్రపంచంలో బాల సాహిత్య స్రష్టగా స్థిరపడేలా చేసింది. *డాంటన్* (1899), *రాబ్స్‌పియర్* (1901) అనే గద్య కృతులలో బెలక్ చారిత్రక దృష్టి, శక్తిమంతమైన శైలి వెల్లడి అయాయి. *లాంబ్‌కిన్స్ రిమెయిన్స్* (1900), *మిస్టర్ బర్డెన్* (1904) అనే రచనలలో బెలక్ పదునైన వ్యంగ్యం, అవహేళన రాటు తేలాయి. యాత్రా చరిత్ర *ది పాత్ టు రోమ్* (1902) లో ప్రకృతి సౌందర్య వర్ణన, యూరప్ చరిత్రను గురించి బెలక్ చేసిన వ్యాఖ్యలు విలక్షణంగా రూపొందాయి.

బెలక్ రోమన్ కాథలిక్కు. అతని మత దృక్పథం అతని రచన లన్నింటిలో కొద్దో గొప్పో ప్రతిఫలించింది. *యూరప్ అండ్ ది ఫెయిత్* (1920), *హిస్టరీ ఆఫ్ ఇంగ్లాండ్* నాలుగు సంపుటాలు (1925-31), *జేమ్స్ జీవిత చరిత్రలలో* బెలక్ మత దృక్పథం కొట్టవచ్చినట్లు కనపడుతుంది. చరిత్రను కళ్లకు కట్టినట్లు చిత్రించడంలో బెలక్ ప్రతిభ నిరుపమానం.

*ది ఫోర్‌మెన్* (1912) లో బెలక్ తాను జీవించిన ససెక్స్ పరిసరాలను రమణీయంగా చిత్రించాడు. *ది క్రూయిస్ ఆఫ్ ది నోనా* (1925) లో నౌకా ప్రయాణం పట్ల బెలక్‌కు గల అభిరుచి వ్యక్తమయింది.

*ది మాడర్న్ ట్రావెలర్* (1898), *హీరోయిక్ పొయెమ్ ఇన్ ప్రైజ్ ఆఫ్ వైన్* (1932) బెలక్ కవితా సంకలనాలలో ముఖ్యమైనవి. బెలక్ వ్యంగ్య నవలలకు, అతని ప్రాణమిత్రుడైన జి.కె. చెస్టర్‌టన్ బొమ్మలు గీశాడు. సమకాలీన చరిత్రకారులు హెచ్.జి.వెల్స్, జి.సి. కౌల్టన్‌లతో బెలక్ సాగించిన సాహిత్య వాదోపవాదాలు సుప్రసిద్ధం. ఆంగ్ల వ్యాసకర్తలలో బెలక్ స్థానం విశిష్టమైనది.

జి.అ.వా.

**బెలీ, ఆంద్రేయ్ (1880-1934)** : ప్రముఖ రష్యన్ సైద్ధాంతికుడు, కవి. రష్యన్ ప్రతీకా వాద సంప్రదాయానికి చెందినవాడు. ఆధ్యాత్మిక భావాలనూ, నిగూఢ, అమూర్త లక్ష్యాలనూ అన్యాపదేశాల ద్వారా అభివ్యక్తీకరించే సాహిత్య సంప్రదాయం ఇది.

ఆంద్రేయ్ బెలీ ఇతని కలంపేరు. అసలు పేరు 'బోరిస్ నికొలాయ్‌విచ్ బుగాయేవ్'. 1880 అక్టోబరు 26 న ఇతడు మాస్కోలో జన్మించాడు. తండ్రి గణిత శాస్త్ర ఆచార్యుడు. మాస్కోలోని సాహిత్య వర్గాలతో బెలీ సన్నిహితంగా మెలగేవాడు. 19 వ శతాబ్దపు చివర ఉన్న దార్శనికుడూ, యోగీ అయిన 'వ్లాదిమిర్ సోలోవ్యోవ్' నుంచి జగత్ప్రళయానికీ, జీవిత గమ్యానికీ సంబంధించిన భావాలను ఈయన ఆకళించుకొన్నాడు. తన తొలి ప్రముఖ రచన *సెవెర్నయా సింఫోనియా* (1902, 'The northern symphony') ను బెలీ 1901 లో ముగించాడు. ఈ వచన పద్యంలో వచనాన్ని, కవిత్వాన్ని, సంగీతాన్ని కొంతవరకు చిత్రకళను కూడా సమ్మిళితం చేయడానికి ఆయన ప్రయత్నించాడు. ఈ నూతన సాహిత్య ప్రక్రియలో మరి మూడు *సింఫనీ* లు ఆయన రచించాడు. ఇతర కావ్యాలలో ఆంద్రీ బెలీ కల్పనాత్మక శైలిని, క్రమరహితమైన ఛందస్సును వాడి రష్యన్ కవితలో 'రూపం' విషయంలో విప్లవం తేవడానికి నాంది పలికాడు. ఈతని సాహిత్య సహచరుడు అలెక్సాండర్ బ్లాక్ ఆ విప్లవాన్ని ఫలవంతం చేశాడు.

బెలీ ప్రకటించిన తొలి మూడు పద్య కావ్యాలు: *జొలోతొ వి లజూరి* (1904, 'Gold in Azure'), 2. *పెపెల్* (1909, 'Ashes'), 3. *అర్న* (1909 'Urn'). ఇవి బ్లాక్ రచనలవలె డైరీల రూపంలో ఉంటాయి. 1909 లో బెలీ తన తొలి నవల *సెరెబ్రియనీ గోలబ్* (1910, 'The Sliver Dove') ముగించాడు. ఆయన సుప్రసిద్ధమైన రచన *పీటర్ బర్గ్* 1913-14 మధ్య సీరియల్‌గా ప్రకటించబడింది. ఇది తన పూర్వపు సింఫనీలకు అనుబంధ ప్రాయంగా గ్రహించదగిన రచన. 1913 లో బెలీ ఆస్ట్రియన్ సాంఘిక తత్త్వవేత్త రుడోల్ఫ్ స్టెనర్' అనుయాయిగా చేరి స్విట్జర్లాండ్‌లోని 'బేసెల్' లో ఆయన స్థాపించిన కాలనీలో చేరాడు. బౌద్ధుల ధ్యాన సంబంధమైన అనుభూతిలో కలిగే కొన్ని ఆధ్యాత్మిక విశ్వాసాలను సమర్థించే వర్గం ఇది. స్విట్జర్లాండ్‌లో ఉన్న కాలంలోనే బెలీ సంగ్రహ ఆత్మ కథారూపమైన నవల *కోటిక్ లెతయేవ్* (1922) రచించడం ప్రారంభించాడు. దీనిలోని శైలి జేమ్స్ జాయిస్ శైలిని గుర్తుతెస్తుంది. 1916 లో బెలీ మాస్కో తిరిగి వచ్చి ఇతర ప్రతీకావాదులందరి వలెనే మొదట 1917 నాటికి బోల్షివిక్ విప్లవాన్ని అత్యంతావేశంతో అభినందించాడు. ఆయన సంగ్రహ పద్యకావ్యం *క్రిస్తోస్ వోస్‌క్రేస్* (1918) రష్యన్ సోషలిజం రేకెత్తించిన ఆశాభావాన్ని ప్రశంసించింది. అయితే 'బ్లాక్' మరణించడం, తన సాహిత్య సహచరులు కొందరు ఉరితీయబడడం జరిగిన తరువాత నిరుత్సాహం చెందిన బెలీ విదేశాలకు పోయాడు. 1923 లో ఆయన రష్యా తిరిగి వచ్చాడు. ఆంద్రే బెలీ ప్రవేశపెట్టిన నూతన రచనా ప్రక్రియలు అనంతర రష్యన్ పద్య రచననూ, వచన శైలినీ చెప్పుకోదగినంతగా ప్రభావితం చేశాయి. 1934 జనవరి 7 వ తేదీన ఆంద్రెయ్ బెలీ మాస్కోలో పరమపదించాడు.

బా.శ్రీ.

**బెల్లీ, గైసెప్పి జియోచినో (1791-1863)** : ప్రసిద్ధ రోమన్ కవి. క్రైస్తవ మతాధిపత్యంలో ఉన్న 19 వ శతాబ్దపు పూర్వార్ధం నాటి రోములోని ప్రజల జీవితాన్ని తన వ్యంగ్య కవితల ద్వారా చిత్రించిన ప్రజ్ఞాశాలి.

బెల్లీ బాల్యం కష్టాలతో, కడగండ్లతో గడిచింది. యౌవనంలో చిన్న ఉద్యోగం చేస్తూ రోజులు నెట్టుకొస్తున్న సమయంలో ఓ ధనిక వితంతువును పెళ్లాడటంతో బెల్లీ దశ తిరిగింది. హాయిగా కాలం వెళ్లబుచ్చుతూ కవితా రచనలు చేయసాగాడు. బెల్లీ గైసెప్పి చర్చి ఉద్యోగిగా యథాస్థితి వాది (కన్సర్వేటివ్). 1848 నాటి విప్లవం అతని అభిప్రాయాలను తీవ్రంగా దెబ్బతీసింది. 1849 లో రోమన్ రిపబ్లిక్ ఏర్పడటంతో బెల్లీ కవితా రచనకు స్వస్తి చెప్పాడు. బెల్లీ తన చరమ దశలో తన కవిత లన్నింటినీ కాల్చివేయమని కుటుంబ సభ్యులతో చెప్పాడు.

బెల్లీ రెండు వేలకు పైగా *సానెట్స్* వ్రాశాడు. అతని ఆచరణకు అభిప్రాయాలకు గల వైరుధ్యం ఈ కవితలలో స్పష్టంగా గోచరిస్తుంది. 1830-39 మధ్య కాలంలో రచింపబడిన ఈ కవితలలో అతని అంతరాళాల్లో అణిగిఉన్న భావాలు వ్యక్త మయాయి. సాహిత్య సంప్రదాయానికి, అకడమిక్ వాతావరణానికి, క్రైస్తవ మతాధిపత్యంలో జరిగే సాంఘిక అన్యాయాలకు విరుద్ధంగా బెల్లీ రచనలు సాగించాడు. బెల్లీ చర్చి అనుసరించే విధానాలను, విధించే నైతిక ప్రమాణాలను విమర్శించాడు. బెల్లీ ఇటాలియన్ భాషలో సంప్రదాయ బద్ధంగా రచనలు చేసినా రోమన్ మాండలికంలో వ్రాసిన *సానెట్లే* అతనిని సుప్రతిష్ఠునిగా చేశాయి. బెల్లీ

వ్రాసిన *శృంగార గీతాలు* అశ్లీల భావాలను ప్రకటించ కపోయినా, పవిత్ర భావనను కాదని లౌకిక దృక్పథాన్ని వెల్లడిస్తాయి. బెల్లీ *సానెట్లు* మూడు సంపుటాలుగా 1952 లో వెలువడ్డాయి. హెరాల్డ్ నోర్సే ఆంగ్లంలోకి అనువదించి ప్రచురించిన *46 సానెట్లు* (1960, 1974) అమితంగా ప్రజలను ఆకర్షించాయి.

ఘ.అ.నా.

**బెల్లో, ఆంద్రేస్ (1781-1865) :** కవి, విద్వాంసుడు. దక్షిణ అమెరికా మేధావులలో ప్రథమ గణ్యుడు. బెల్లో కవితా శైలిని, సిద్ధాంతాలను గ్రీక్ మహాకవి వర్జిల్ రచనలు గాఢంగా ప్రభావితం చేశాయి. బెల్లో వెనిజులా విశ్వవిద్యాలయంలో తత్త్వ, న్యాయ, వైద్య శాస్త్రాలను చదివాడు. ప్రసిద్ధ జర్మన్ యాత్రికుడు అలెగ్జాండర్ వాన్ హమ్ బోల్ట్‌తో స్నేహం చేసి, భూగోళ శాస్త్రంలో ప్రావీణ్యం సంపాదించాడు. బెల్లో దక్షిణ అమెరికాకు విముక్తి కలిగించిన సైమన్ బోలివర్‌కు మిత్రుడూ, గురువూనూ. 1810 లో అతనితో పాటు రాజకీయ కార్యార్థమై లండన్ వెళ్లాడు. చిలీ, కొలంబియాల న్యాయ కార్యదర్శిగా లండన్‌లో 19 సంవత్సరా లున్నాడు. తీరిక సమయాన్ని సాహిత్యాధ్యయనం, పాఠ ప్రవచనాల్లో గడపాడు.

బెల్లో కీర్తి పతాక లనదగిన రెండు కవితలు *సిల్వాస్ అమెరికానాస్.* దక్షిణ అమెరికా ప్రకృతి సౌందర్యాన్ని, ఘనతను వర్ణించే ఈ కవితలు ఇంగ్లాండులో 1826-27 లో అచ్చయాయి. ఈ రెండు కవితలు బెల్లో ఆంద్రేస్ వ్రాయాలని సంకల్పించిన అసంపూర్ణ మహా కావ్యం *అమెరికా* లోని భాగాలు మాత్రమే. దక్షిణ అమెరికా గ్రామీణ సౌందర్యాన్ని, సౌభాగ్యాన్ని గ్రీకు మహాకవి వర్జిల్ వలె నెమరు వేసుకొంటూ వ్రాసిన కవిత *సిల్వా అల అగ్రికల్చుర డి ల జోన టోరిడా* 19 వ శతాబ్దపు శ్వానిష్-అమెరికన్ సాహిత్యంలో పేరెన్నిక గన్నది.

బెల్లో 1829 లో చిలీ ప్రభుత్వ విదేశాంగ శాఖలో బాధ్యతాయుతమైన పదవిని చేపట్టి సాంటియాగో నగరంలో స్థిరపడ్డాడు. ఆ నగరంలోని రాజకీయ మేధావి వర్గంలో ప్రముఖుడుగా పేరు పొందాడు. బెల్లో విశిష్ట సేవలను గుర్తించి చిలీ ప్రభుత్వం అతనిని సెనేటరుగా నియమించింది. బెల్లో 1843 లో చిలీ విశ్వవిద్యాలయాన్ని స్థాపించి, జీవితాంతం రెక్టారుగా పనిచేశాడు. చిలీ సివిల్ కోడ్ 1855 లో అమలులోనికి రావడానికి అతడే ప్రధానకారకుడు. యూరపులో నెపోలియన్ కోడ్‌లాగా దక్షిణ అమెరికా అంతటా ఈ చిలీ సివిల్ కోడ్ ప్రచారంలోకి. వచ్చిందంటే, దానికి మూలకారణమైన బెల్లో మేధా సంపత్తి ఎంత గొప్పదో ఊహించుకోవచ్చు.

బెల్లో న్యాయ, తత్త్వ, భాషా శాస్త్ర, సాహిత్య విమర్శ క్షేత్రాలలో ఎన్నో రచనలు చేశాడు. బెల్లో వ్రాసిన *గ్రమెటికా డిల లెంగ్వా కేస్టెల్లన* (1847, 'స్పానిష్ భాషా వ్యాకరణం') శ్వానిష్ భాషా శాస్త్ర క్షేత్రంలో ఆణిముత్తెం వంటి రచన.

జి.అ.నా.

**బెల్లో, సాల్ (1915--) :** నేటికీ సజీవుడై ఉన్న ప్రముఖ అమెరికన్ నవలా రచయిత. సంఘం ప్రభావం తగ్గినా, జీవశక్తి కోల్పోని ఆధునిక అమెరికన్ నగర వాసుల జీవిత చిత్రణలో చూపిన నైపుణికి 1976 లో సాహిత్యానికి ఆయన నోబెల్ బహుమతిని అందుకున్నాడు. 1915 జూన్ 10 వ తేదీన కెనడాలోని క్వెబెక్ రాష్ట్రంలోని 'లచీనే' లో ఒక యూదు కుటుంబంలో బెల్లో జన్మించాడు. యూదుల మాతృభాష 'యిడ్డిష్' ను ఆయన ధారాళంగా మాట్లాడేవాడు. ఆ యిడ్డిష్ భాష శక్తి ఆయన ఆంగ్ల భాషాశైలిలో కూడా ప్రతిఫలించింది. రెండవ ప్రపంచ యుద్ధం తరువాత అమెరికాలో ఒక ప్రముఖ వర్గంగా ఏర్పడిన 'జ్యూయిష్ అమెరికన్' రచయితలకు ప్రధాన ప్రతినిధిగా ఆయనను పేర్కొవచ్చును.



బెల్లో తల్లిదండ్రులు 1913 లో రష్యా నుంచి మాంట్రీల్ (కెనడా) కు వలస వెళ్లారు. బెల్లోకు తొమ్మిదేళ్ల వయస్సప్పుడు వారు అక్కడ నుంచి చికాగోకు మారారు. చికాగో, నార్త్ వెస్టర్న్ విశ్వవిద్యాలయాలలో చదివి 1937 లో సాల్ బెల్లో పట్టభద్రు డయాడు. తరువాత మెన్నెసోటా విశ్వవిద్యాలయంలో ప్రిన్స్‌టన్, న్యూయార్క్ యూనివర్సిటీ, బార్డ్ కాలేజీ, చికాగో విశ్వ విద్యాలయాలతో సహా అనేక విశ్వవిద్యాలయాలలో ఒక వంక విద్యా బోధన చేస్తూనే, మరొక వంక ఆయన రచనలు కొనసాగిస్తూ ఉండేవాడు.

సైన్యంలో చేరడానికి ఎదురుచూస్తూ ఒక డైరీ ఫారంలో కాలం గడుపుతున్న వ్యక్తి కథ *డాంగ్లింగ్ మాన్* (1944; 'ఖులాసా మనిషి'). ఒకరినొకరు ఆహుతి చేసుకుంటున్న ఒక యూదు జాతీయునికి, ఇతర జాతీయునికీ మధ్య గల సంబంధాన్ని సునిశితంగా

పరిశీలించే కథ *ది విక్టిమ్* (1953; 'బలిపశువు') ఈ తొలి రెండు నవలల వలన బెల్లో తనను అభిమానించే ఒక చిన్న పాఠక వర్గాన్ని సంపాదించుకోగలిగాడు. తరువాత రచించిన *ది అడ్వెన్చెర్స్ ఆఫ్ ఆగీమార్చ్* (1953; 'ఆగీ సాహస యాత్రలు') అనే నవలకు మరింత విస్తృత ప్రచారం లభించడం, 1954 లో అది నేషనల్ బుక్ అవార్డ్ అందుకోడం జరిగింది. చికాగోకు చెందిన ఒక నిరుపేద యూదు యువకుడు 20 వ శతాబ్దం జీవితంలో హాస్య భరిత సన్నివేశాలతో నెగ్గుకురావడం, ఆ జీవితానికి ఒక అర్థాన్ని కల్పించేందుకు ప్రయత్నించడం ఈ నవలలోని ఇతివృత్తం. ఈ నవలలోనే బెల్లో మొట్టమొదటిసారిగా అంతకు ముందు ఉన్న రూప ప్రాధాన్యం మీద తిరుగుబాటు చేస్తూ ఒక ఆషామాషీ శైలిని ఉపయోగించాడు. *హైండర్‌సన్ ది రెయిన్ కింగ్* (1959) లో విచిత్ర స్వభావం గల ఒక అమెరికన్ కోటీశ్వరుడు ఆఫ్రికాలో శాంతిని అన్వేషించడం కళ్లకు కట్టినట్లు వర్ణించబడింది. *సీజ్ ది డే* (1956) ఒక చిన్న నవలిక. బెల్లో అనేక కథానికలు- *మోస్‌బీస్ మెమాయిర్స్* (1968), *టు జెరూసలెమ్ అండ్ బాక్* (1976) కూడా రచించాడు.

చివరి దశలో సాల్ బెల్లో రచించిన నవలలలో చెప్పుకోదగ్గవి: *హెర్జాగ్* (1964). ఇది 1965 లో నేషనల్ బుక్ అవార్డ్ పొందింది), *మిస్టర్ సామ్లర్స్ ప్లానెట్* (1970), ఇది 1971 లో నేషనల్ బుక్ అవార్డ్ పొందింది), *హంబోల్ట్స్ గిఫ్ట్*, (1975;1976 లో పులిట్జర్ బహుమతి), *ది డీన్స్ డిసెంబర్* (1982). ఈ రచనలలో బెల్లో రచనాశక్తి పరాకాష్ఠ పొందింది. ఈ నవలలలోని నాయకులు యూదు మేధావులు. వారి స్వగతాలు ఒక్కొక్కప్పుడు మహా గంభీరంగానూ, ప్రతి భావంతంగానూ, మరొకప్పుడు హాస్య రస భరితం గానూ, అసందర్భంగానూ సాగుతాయి.

బ్రా.శ్రీ.

**బెహాన్, బ్రెండన్ (1923-64) :** ఐరిష్ నాటక రచయిత. పదునైన వ్యంగ్యానికి పెట్టింది పేరు. ఘాటైన రాజకీయ వ్యాఖ్యలు బెహాన్ 'అసంబద్ధ' నాటకాలకు ప్రసిద్ధి చేకూర్చాయి. బెహాన్ తన రచనలలోనూ, జీవితంలోనూ ఆంగ్లేయ వ్యతిరేక ధోరణిని అవలంబించాడు.

బెహాన్ కుటుంబం వామపక్ష ధోరణులకు, విప్లవ కార్యకలాపాలకు, ఆంగ్లేయ విరుద్ధ భావాలకు ఆలవాలం. బెహాన్ తన 14 వ ఏటనే ఐరిష్ రిపబ్లికన్ ఆర్మీలో వార్తా హరుడుగా పని చేశాడు. విధ్వంసక చర్యల్లో పాల్గొన్నందుకుగాను బెహాన్ 1940 లో శిక్షకు గురై, మూడేళ్ల పాటు సాధారణ పాఠశాలకు పంపబడ్డాడు. ఈ నిర్బంధిత కాలం నాటి అనుభవాలను, జ్ఞాపకాలను బెహాన్ *బోర్‌స్టల్ బాయ్* (1958) అనే గ్రంథంలో ప్రకటించాడు. 1942 లో డబ్లిన్‌కు పంపబడినప్పుడు బెహాన్ పోలీసుపై కాల్పులు జరిపినందుకుగాను 14 ఏళ్ల కారాగార వాస శిక్షకు గురి అయాడు. క్షమాభిక్ష వేడి 1946 లో జైలు నుంచి విడుదల అయాడు. బెహాన్ జైలులో ఉన్నప్పుడు తన ఐరిష్ భాషా సామర్థ్యాన్ని పెంపొందించుకొన్నాడు. *ది క్వేర్ ఫెలో* (1954), *ది హోస్టేజ్* (1958) బెహాన్ కు చిర యశస్సు నార్జించి పెట్టిన నాటకాలు.

బెహాన్ రేడియో, టెలివిజన్లకు రచనలు చేసేవాడు. వాటి కార్యక్రమాలలో పాటలు పాడేవాడు. పత్రికలకు రచనలు పంపేవాడు.



బెహాన్ డబ్లిన్ గురించి ఐరిష్ పత్రికలో వ్రాసిన వ్యాసాలు *హోల్డ్ యువర్ అవర్ అండ్ హావ్ అనదర్* పుస్తకంగా వెలువడ్డాయి. *ది క్వేర్ ఫెలో* అనే నాటకం 1954 లో డబ్లిన్‌లో విజయవంతంగా ప్రదర్శింపబడింది. ఒక ఖైదీని ఉరితీయడం గురించి తోటి ఖైదీల, జైలు అధికారుల భావాలు, అభిప్రాయాలు శక్తిమంతంగా ఈ నాటకంలో నిరూపించబడ్డాయి. ఈ నాటకం లండన్, న్యూయార్క్ నగరాలలో కూడ ప్రదర్శింపబడి, ప్రేక్షకుల మన్ననలు పొందింది.

బెహాన్ రచనలలో విశిష్టమైనది *ది హోస్టేజ్*. ఐరిష్ రిపబ్లికన్ ఆర్మీ ద్వారా ఒక వేశ్యా వాటికలో నిర్బంధింపబడిన ఒక ఆంగ్ల సైనికుని అవస్థ ఈ నాటకంలో చిత్రింపబడింది. ఆనాటి సాంఘిక పరిస్థితులు కథా గేయాల, ఫాంటసీల ద్వారా విడంబనాత్మకంగా ఈ నాటకంలో నిరూపింపబడ్డాయి. *ది హోస్టేజ్* నాటకం లండన్, న్యూయార్క్ నగరాలలో ప్రదర్శింపబడి బెహాన్‌కు గొప్ప పేరు ప్రఖ్యాతులు సంపాదించి పెట్టింది.

బెహాన్ రచనలలో వైవిధ్య ముంది. *బ్రెండాన్ బెహాన్స్ ఐలండ్* (1962) ఐరిష్ సంఘటనల సంక

లనం దొంగ వస్తువులను అక్రమంగా రవాణా చేసే ఇతి వృత్తంతో కుతూహలజనకంగా సాగే నవల *ది స్కా రైరర్* (1964). ఐరిష్ విప్లవకారుడుగా తన అనుభవాలను, జ్ఞాపకాలను క్రోడీకరించి *కన్ ఫెషన్స్ ఆఫ్ ఆన్ ఐరిష్ రెబెల్* (1965) అనే గ్రంథంగా బెహాన్ వెలువరించాడు.

*జి.ఆ.నా.*

**బేబెల్, ఇసాక్ ఇమ్మాన్యులోవిచ్ (1894-1941):** సోవియట్ కథా రచయిత. ఈయన రచించిన యుద్ధ కథలు, ఒడెస్సా గాథలు బహుళ ప్రచారం పొందాయి. రష్యాలోని విప్లవానంతరం తొలికాలంలో ముఖ్యంగా 1930 దశకంలోని తొలి సంవత్సరాల వరకు నూతన ప్రక్రియా ప్రారంభకుడుగా జనాదరణను, ప్రభుత్వ మన్ననలను పొందినవాడు.

యూదు కుటుంబంలో జన్మించిన కారణంగా వేధింపు వాతావరణంలో పెరిగిన ఈ రచయిత మనస్సు చిన్నప్పుడే గాయపడింది. అది అతనిలో అతి సౌకుమార్యాన్ని, నిరాశా వాదాన్ని, ఒక విధమైన విషాదాన్ని పెంచింది. ఆయన కథలలో ఈ రకమైన వాతావరణం బాగా కనిపిస్తుంది. మాక్సిమ్ గోర్కి సంపాదకత్వంలోని ఒక పత్రికలో ఈ రచయిత తొలి రచనలు సెయింట్ పీటర్స్ బర్గ్‌లో వెలువడ్డాయి. తరువాత *ఒడిస్కీ రస్కేయ్* (*Odesskiye Rasskay* ఆంగ్లంలో *Odessa Tales'*) అనే సంకలనంలో వీటిని ఆయన పొందు పరచాడు. కాని ఈ తొలి రచనలలో కొన్నింటిని అప్పటి జారిస్టు అధికారులు (Censors) మోటైనవి గాను, అశ్లీల పూరిత మైనవిగాను ప్రకటించారు. కాని గోర్కి ఈ యువ రచయిత సహజమైన శైలిని, స్పష్టతను కొనియాడాడు. అయితే ఇంకా ప్రపంచాన్ని చూసి అవగాహన చేసుకోమని సలహా కూడా ఇచ్చాడు. ఆ సలహాను శిరసా వహించి బేబెల్ ఆశ్విక దళంలో చేరాడు. ఆ తరువాత 7 సంవత్సరాలపాటు పత్రికలకు వ్రాస్తూనే వివిధ ఉద్యోగాలు చేశాడు. పోలండుతో జరిగిన యుద్ధంలో పాల్గొని అతడు సంపాదించిన అనుభవంతో *కొనార్మియా* (*Konarmiya*-1926 ఆంగ్లంలో *Red Cavalry* 1929) అనే కథల సంపుటిని వ్రాశాడు.

ఈ యువ మేధావి యుద్ధాన్ని వివిధ కోణాలలో చిత్రిస్తాడు. చెప్పేది సూటిగా, క్లుప్తంగా, స్పష్టంగా చెప్పటం, చిత్రనిర్మాణంలో వలె వివిధాంశాలను కళ్లకు కట్టినట్లు చూపటం ఈ కథ లోని విశిష్టత. అర్థంలేని క్రూరత్వం ఈ కథలన్నింటిలో ఎక్కువగా కనిపించినా, సుఖ సంతోషాలు ఊహామాత్రంగానే అయినా ఎక్కడో తప్పకుండా ఉన్నాయనే విశ్వాసం కూడా వీటిలో బలీయంగా కనిపించటంతో ఈ కథలు ఆసక్తిదాయకంగా ఉంటాయి.

1931 లో *ఒడెస్సా టేల్స్* అనే కథా సంపుటి వెలువడింది. ఇవే కాక రెండు నాటకాలు *జకత్* (*Zakat* 1928), *మరియా* (*Mariya* 1935) కూడా ఈయన వ్రాశాడు.

1935 తరువాత స్టాలినిస్ట్ యుగంలోని సాంస్కృతిక శృంఖలాలు ఈ రచయిత స్వేచ్ఛను హరించి వేశాయి. 1935 లో ఈయన పారిస్ వెళ్లినపుడు తన దేశాన్ని వదలి వేసే అవకాశం వచ్చినా, స్వదేశాభిమానంతో బేబెల్ రష్యాకు తిరిగి వెళ్లిపోయాడు. 1938 లో గోర్కీకి నివాళులర్పిస్తూ వ్రాసినదే ఆయన చివరి రచన. 1939 లో ప్రభుత్వం ఆయనను నిర్బంధించి సైబీరియాకు పంపింది. అక్కడే కారాగార శిబిరంలో బేబెల్ మరణించాడు. అయితే స్టాలిన్ మరణానంతరం ఆయన రచనలను రష్యా ప్రభుత్వం ఆమోదించటం సాహితీ రంగంలో ఆయనకు ప్రముఖ స్థానాన్ని సమకూర్చింది.

*కె.బి.మూర్తి*

**బైబిల్ :** బైబిల్ క్రైస్తవ మతస్థులకు వేదం వంటి ప్రామాణికమైన గ్రంథం. బైబిల్ రెండు రకాలు. ఒకటి: కేథలిక్‌లు ఉపయోగించేది. రెండు: ప్రొటెస్టాంటులు ఉపయోగించేది. ప్రొటెస్టాంటులు ఉపయోగించే బైబిలే ఈ నాడు ఎక్కువగా వాడుకలో ఉంది.

బైబిల్ అనేక గ్రంథాల సముచ్చయం. దీనిలోని గ్రంథాలు వివిధ వ్యక్తుల చేత వేర్వేరు కాలాలలో కూర్చబడినవి. క్రీస్తుకు పూర్వం జరిగిన సంఘటనల సముచ్చయాన్ని ప్రాత నిబంధన (Old Testament) అనీ, క్రీస్తు పుట్టుకతో ఆరంభమైన చరిత్రను వివరించే సముచ్చయాన్ని క్రొత్త నిబంధన (New Testament) అనీ విభజించారు.

బైబిల్‌లోని మొత్తం గ్రంథాల సముచ్చయాన్ని తిరిగి ప్రామాణిక గ్రంథాలు, అప్రామాణిక గ్రంథాలు అని కూడా రెండు భాగాలుగా విభజించారు. హీబ్రూ భాషలో ఉన్న భాగాలనే కాక, ఏసుక్రీస్తు ప్రత్యక్ష శిష్యుల వ్రాతలను కూడా ప్రామాణికాలుగా భావించారు. ప్రస్తుత బైబిల్‌లోని విషయాలు గాక ఇంకా 16 గ్రంథాలలో కనిపించే మత విషయాలనూ, చరిత్రనూ, పౌరాణిక కథలనూ తెలిపే రచనలను అప్రామాణిక గ్రంథాలు లేదా అపోక్రిఫా (Apocrypha) అంటారు. 'అపోక్రిఫా' అనగా 'దాచ

బడినది' అని అర్థం.జెరోమ్, లాటిన్ భాషలలోకి తర్జుమా చేయబడిన వల్గెట బైబిల్‌లోని విషయాలు దీనిలో కనిపిస్తాయి. కొందరు క్రైస్తవులు ఈ అప్రామాణిక గ్రంథాలను అంగీకరించరు.

ఆనందన్

**బైరన్, జార్జ్ గోర్డన్ బైరన్ (1788-1824):** బైరన్ ఆంగ్ల కాల్పనిక వాద కవులలో విశిష్టుడు. "ఏ గతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే కదా"! అన్న కావ్యోక్తికి చక్కని ఉదాహరణ బైరన్. స్వదేశమైన బ్రిటనులో కన్న, పరదేశమైన గ్రీసులో పూజలందు కొన్న కవిశ్రేష్ఠుడు లార్డ్ బైరన్. ఒక వైపు కలం నుంచి రవ్వలు రాల్చి, మరొకవైపు కత్తినుంచి నిప్పురవ్వలు కురిపించిన సవ్యసాచి లార్డ్ బైరన్.



బైరన్ పసితనంలోనే తండ్రిని కోల్పోయాడు. పుట్టుకచే అవిటివాడు కావడం చేత తల్లి ప్రేమకు కూడ నోచుకోలేక, నిర్లక్ష్య, నిరాదరణలకు గురయాడు. బైరన్ తన పదవ ఏట పూర్వార్జిత సంపత్తికి వారసుడై, లార్డ్ బిరుదం పొందాడు. యుక్త వయస్సు వచ్చిన తరువాత, 1809 లో బ్రిటిషు రాజ్యపు 'హౌస్ ఆఫ్ లార్డ్స్' లో స్థానం అలంకరించాడు.

బైరన్ కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో చదివే రోజుల్లో *ఫ్యుగిటివ్ పీసెస్* (1806) అనే చిన్న కవితా సంకలనాన్ని ప్రచురించి పదిమంది మెప్పు పొందాడు. బైరన్ ఆ ప్రోత్సాహంతో మరుసటి సంవత్సరమే *అవర్స్ ఆఫ్ ఐడిల్‌నెస్ (Hours of Idle ness)* అనే మరో కవితా సంకలనాన్ని వెలువరించాడు. ఈ కొత్త సంకలనంలో సాధారణ కవితలతోపాటు కొన్ని ఉత్తమ కవితలు కూడా సంగ్రహింపబడ్డాయి. *ది ఎడింబరో రివ్యూ* అనే పత్రికలో బైరన్ కవిత్వాన్ని ఘోరంగా విమర్శించడం జరిగింది. బైరన్ *ఇంగ్లీషు బార్డ్స్ అండ్ స్కాచ్ రివ్యూయర్స్ (English Bards and Scotch Reviewers-A Satire)* అనే వ్యంగ్య రచన ద్వారా తన కవిత్వంపై వచ్చిన విమర్శకు ఘాటుగా ప్రత్యుత్తర మిచ్చాడు.

బైరన్ వలె దేశాలు చూసిన సమకాలీన ఆంగ్ల కవులు అరుదు. బైరన్ స్పెయిన్, పోర్చుగల్, బాల్కన్ ద్వీపకల్పం వగైరా ప్రాంతాల్లో పర్యటించి అక్కడి ప్రకృతి సౌందర్యానికి పరవశించి పోయాడు. ఆ సమయంలో బైరన్ వ్రాసిన *చైల్డ్ హెరోల్డ్ (Childe Harold- 1812)* కావ్యంలోని రెండు సర్గలు కవికి గొప్ప ప్రసిద్ధి సమకూర్చాయి. కావ్యంలోని చైల్డ్ పాత్ర బైరన్‌కు దాదాపు ప్రతిబింబ మని విమర్శకుల అభిప్రాయం.

బైరన్ సౌందర్యారాధకుడు. కాని అతని వైవాహిక జీవితం మటుకు దుఃఖదాయకంగానే పరిణమించింది. బైరన్ రచనలలో అతని జీవితంలో లాగానే చీకటి వెలుగులు, ఎగుడు దిగుళ్లు ఎక్కువ కావడంతో అతని ప్రతిభను విమర్శకులు సరిగ్గా అంచనా వేయలేక పోయారు.

బైరన్ తొలి రచనలు *అవర్స్ ఆఫ్ ఐడిల్‌నెస్, ఇంగ్లీష్ బార్డ్స్ అండ్ స్కాచ్ రివ్యూయర్స్, సీజ్ ఆఫ్ కోరింత్* (1816) ప్రయోగదశలోని వని చెప్పవచ్చు. ఈ రచనల్లో బైరన్ బౌద్ధిక శక్తి ఎక్కువగా వ్యక్త మవుతుంది. కాని అక్కడక్కడ కవి భావుకత మెరుపుతీగలా మెరుస్తూ పాఠకులను లోగొంటుంది.

కాల్పనిక వాదకవులైన కీట్సు గతాన్ని, షెల్లీ భవిష్యత్తును కీర్తిస్తే బైరన్ వర్తమానాన్ని చిత్రించాడు. బైరన్ ప్రకృతి సౌందర్యాన్ని విలక్షణంగా చిత్రించాడు. ప్రకృతి సౌందర్యం పట్ల ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని తన కవితలలో వ్యక్తం చేశాడు. ఇతర కాల్పనికవాద కవుల్లాగ ప్రకృతి పట్ల గాఢచింతన కాని, గూఢత కాని బైరన్ కవితలలో కనపడవు.

బైరన్ రచనలలో అత్యంత విశిష్టమైనది *డాన్ జువాన్* (1819) అనే కావ్యం. వస్తువైవిధ్యం, చిత్రణాసామర్థ్యం, పద్య రచనాశక్తి *డాన్‌జువాన్* లో ఎక్కువగా వ్యక్తం అయింది.

బైరన్ గొప్ప నాటక రచయిత కూడా. *సర్దానా పలస్* (1812) విశిష్టమైన విషాదాంత నాటకం. కథా వస్తువు చిత్రణలోనూ, శిల్పరీత్యానూ ఈ నాటకం చాలా విలువైనది. *విజన్ ఆఫ్ జడ్జిమెంట్* (1822) లో కూడ బైరన్ నాటక రచనా ప్రతిభ వ్యక్తమయింది.

బైరన్ గ్రీసును తుర్కీ కబంధ హస్తాలలోనుంచి విముక్తి చేసేందుకు సాహసోపేతంగా పోరాడాడు. అతడు పోరాటం జరుగుతున్న రోజులలోనే జ్వరపీడితుడై మరణించాడు. బైరన్ మరికొంతకాలం జీవించి ఉంటే గ్రీసు రాజ్యానికే అధిపతి అయి ఉండేవాడు. బైరన్

బహు వర్ణమయ వ్యక్తిత్వం, కావ్య రచనా సామర్థ్యం ఆంగ్ల సాహిత్య చరిత్రలో అపురూపమైనవి.

జి.ఆ.నా.

**బొకాచియో, జివానీ (1313-1375) :** ఇటాలియన్ కవులలో తలమానికం వంటివాడు. అతడు రచించిన *డెకమెరాన్* సాంస్కృతిక పునరుజ్జీవన యుగంలో వెలువడిన అత్యుత్తమ రచనలలో ఒకటి. బొకాచియో ప్రియ మిత్రుడైన పెట్రార్క్‌తో కలసి మానవతా వాదానికి గట్టి పునాదులు వేశాడు. బొకాచియో రచనా సామర్థ్యం వల్ల ఇటలీ సాహిత్యం గ్రీక్, లాటిన్‌ల స్థాయికి చేరుకోగలిగింది. *డెకమెరాన్* రచన ద్వారా అతడు విశ్వకవుల శ్రేణిని అందుకోగలిగాడు.



బొకాచియో చిన్నప్పటి నుంచి సాహిత్యం పట్ల ఎంతో ఆసక్తిని కనపరిచేవాడు. కాని అవేమీ పట్టని తండ్రి ప్రోద్బలం వల్ల అతడు 1328 ప్రాంతంలో వ్యాపారం నిమిత్తమై నేపిల్స్‌కు వెళ్లవలసి వచ్చింది. సూక్ష్మగ్రాహి అయిన బొకాచియో నేపిల్స్ రాజాస్థానంలోని వ్యవహారాలను, వీరుల సాహస పరాక్రమాలను, రాజకీయపు ఎత్తుగడలను చక్కగా పరిశీలించగలిగాడు. ఆ సమయంలోనే పెట్రార్క్ రచనల వైపు అతడు మొగ్గు చూపాడు.

బొకాచియో సుమారు 1340 లో నేపిల్స్ నుంచి స్వస్థలానికి తిరిగి వచ్చాడు. అతడు 1338 లో ట్రాయ్‌లస్-క్రిసిడాల ప్రేమకథను *ఇల్ ఫిల్ స్ట్రాటో* అనే చిన్న కవితగా మలచాడు. తరువాత చాసర్, షేక్‌స్పియర్ వంటి ఆంగ్ల రచయితలు ఆ కవితను చదివి ప్రేరితులై ఆదే వస్తువుతో ఇంగ్లీష్ భాషలో కావ్యనాటకాలను సృష్టించారు.

బొకాచియో 1348-53 మధ్య రచించిన *డెకమెరాన్* ఇతివృత్తం, రచనా నైపుణ్యం, సందేశం రీత్యా విశిష్టమైన కృతి. *డెకమెరాన్* గద్యశైలి నిరుపమానమై తరువాతి ఇటాలియన్ రచయితలకే కాక, యూరప్‌లోని ఇతర దేశాల రచయితలను కూడా ఎన్నో విధాల ప్రభావితం చేసింది. *డెకమెరాన్* అంటే 'పదిరోజుల పని' అని అర్థం. ఏడుమంది యువతులు, ముగ్గురు యువకులు 1348 ప్రాంతంలో ప్లేగు వ్యాపించిన ఫారెన్స్ నగరం నుండి ప్రకృతి ఒడిలోనికి వెళ్లి 15 రోజుల పాటు ఆనందోత్సాహాలతో గడపిన వృత్తాంతం ఈ రచనలో వర్ణింపబడింది. ఆ పదిమంది పది రోజుల పాటు వంతులు వంతులుగా చెప్పిన 100 కథలు *డెకమెరాన్* లో వర్ణింప బడ్డాయి. బొకాచియో వాడిన భాష జన సామాన్యానికి అందుబాటులో ఉండి, శైలి కుతూహల జనకం కావడంతో *డెకమెరాన్* కు బహుళ ప్రచారం ఏర్పడింది. బొకాషియో ఈ రచనలో మానవుణ్ణి జీవిత సమరంలో నిలబడి పోరాడే వ్యక్తిగా చిత్రించాడు. నిరాశకు లోనుగాక, జీవిత సంగ్రామంలో లభించే జయాపజయాలను సహజంగా స్వీకరించే కర్మవీరుడుగా మానవుణ్ణి చిత్రించడం బొకాచియో ప్రతిభకు పరాకాష్ఠ.

బొకాచియో 1350 లో పెట్రార్క్‌తో కలిశాక, సృజనాత్మక సాహిత్యం నుంచి మానవతా వాదంతో కూడుకొన్న పాండిత్యపూర్ణమైన రచనలవైపు దృష్టి సారించాడు. *డీ జీనియలాజియా డియోరమ్ జెంటీలియమ్* రచనా విధానంలో మధ్య యుగానికి చెందిన నూత్నమైన మానవతా వాదంతో అలరారే రచన. బొకాచియో ప్రఖ్యాత మహిళల జీవిత చరిత్రలను గురించి, ప్రసిద్ధ పురుషుల అదృష్టం గురించి వ్రాసిన పుస్తకాలు పెట్రార్క్ రచనలచే గాఢంగా ప్రభావిత మైనవే. పర్వతాలు, అడవులు, నదీ నదాలు, సముద్రాలను గురించి వ్రాసిన పుస్తకం కూడ బొకాచియో అభిరుచి వైవిధ్యాన్ని తెలియచేస్తుంది.

బొకాచియో చివరి దశలో మహాకవి డాంటే *డివైన్ కామెడీ* ని గురించి ఉపన్యసిస్తూ, ఆ కావ్యపు సౌందర్యాన్ని వివరిస్తూ గడిపాడు. కాని పండితుల నిరాదరణ, పేదతనం, ప్రియమిత్రుడైన పెట్రార్క్ చావు– ఈ బాధలు భరించలేక బొకాచియో 1375 లో తనువు చాలించాడు.

జి.ఆ.నా.

**బోద్లేర్, ఛార్లెస్ (1821-67) :** ఎడ్గార్ ఆలెన్ పో కథలను ఫ్రెంచ్ భాషలోకి అనువదించిన ఫ్రెంచ్ కవి. కవిత్వంలో, కథలలో, విమర్శనలో. కళాపరమైన సౌందర్య సిద్ధాంత రూపకల్పనలో తన కాలా. కి అంతుపట్టని గొప్ప మేధావి. అశ్లీలత పేరిట, దైవదూష. పేరిట ఆనాడు శిక్షలకు గురి అయిన . ఈ బహుము. ప్రజ్ఞాశాలి 20 వ శతాబ్దిలో 19 వ శతాబ్దికి చెందిన మేధావిగా, భవిష్యద్వాణిగా గుర్తింపు పొందాడంటే ఈ ౧చయిత

ఆలోచనలు, సిద్ధాంతాలు ఎంత గొప్పవో అంచనా వేయ వచ్చు. సంకేతాత్మక ఉద్యమానికి అంకురం ఈయన రచనలలో ఉన్నదని ఆయన మరణం తరువాత గుర్తిం చటం జరిగింది. ఆయన ప్రవచించిన కళాపరమైన సౌందర్య సిద్ధాంతం ఆ రోజుల్లో వెక్కిరింతలకు, వేళాకోళాలకు గురిఅయినా ఈనాడు ఆ సిద్ధాంతం మేధావుల, విమర్శకుల ఆమోదాన్ని పొందటమే కాక, ఈ శతాబ్ది లోని ప్రతీకావాద ఉద్యమానికి అదే ఆధారమని ఒప్పుకోడం కూడా జరిగింది.

బోద్లేర్ వ్యక్తిగతంగా జీవితంలో చాలా ఒడుదుడు కులకు గురి అయాడు. వ్యక్తిగా విశృంఖల స్వేచ్ఛను వాంఛించి చేజేతులా జీవితాన్ని కష్టాల పాలు చేసు కొన్నాడు. మత్తు మందులకు బానిస అయి, స్త్రీ లోలుడై, అప్పులపాలై అనేక విధాలుగా జీవితాన్ని భ్రష్టు పట్టించుకొన్నాడు ఈ రచయిత.

20 సంవత్సరాల లేత ప్రాయంలోనే *లెస్ ఫ్లోర్స్ డు మాల్* (Les Fleurs du mal) అనే రసవత్తరమైన కవితా సంపుటిని వెలువరిం చాడు. ఇందలి కవి తలు తిరుగుబాటు ప్రవృత్తిని, దిగజారుడు తత్త్వాన్ని ప్రోత్సహిస్తున్నాయని, శృంగార పరంగా అశ్లీలాన్ని ప్రోత్సహి స్తున్నాయని విమర్శకులు దుయ్యబట్టటంతో ఈ రచయిత మాన సికంగా క్రుంగిపోయాడు.



ఈయన రచించిన *సెలాన్ డి 1846* కళాపరమైన సౌందర్య ప్రమాణాలను నిర్ధారించటానికి ఆయన చేసిన ప్రయత్నం. ప్రకృతికి, కళకు అవినాభావ సంబంధము న్నదని, చిత్రకళ కూడ సంగీతంలాగే తనదైన వెలుగు నీడలతో కూడిన ఒక సామరస్యాన్ని కలిగి ఉంటుందని, ప్రకృతిలోని రంగులు సంగీతంలోని సుమధుర స్వరాలకు ప్రతీక లని ఈయన సూచించాడు.

1847 లో *లా ఫాన్‌ఫార్లో* (La Fanfarlo) అనే ఏకైక నవలను వెలువరించాడు. ఇది కొంతవరకు ఆయన స్వీయ చరిత్ర ఆధారంగా వ్రాసిందే. 1852 నుండి 1865 వరకు రచనలను అనువదించటంలోనే అతని జీవితం గడిచిపోయింది. ఫ్రెంచ్ గద్య రచనలలో ఇవి ప్రామాణికంగా నిలిచి పోయాయి. ఈ రచయిత పశ్చిమ యూరప్ దేశాలలోని రచయితల రచనా పద్ధతు లలో నూతన ధోరణులకు ఒరవడి చుట్టిన మహామేధావి.

కె.జి.మూర్తి

**బోమాంట్, ఫ్రాన్సిస్ (1584-1616) :** ఆంగ్ల సాహిత్యంలో ప్రసిద్ధకవి, నాటకకర్త. ఫ్రాన్సిస్ బోమాంట్ పేరు చెప్పగానే మరో ప్రసిద్ధ నాటక రచయిత 'జాన్ ఫ్లెచర్' పేరు గుర్తుకొస్తుంది. వారిద్దరూ ఒక విడదీయరాని జంట. ఒకే కంచం, ఒకే మంచం, ఒకే కాంతగా విచిత్రమైన సహజీవనం వారిది. జంట కవిత్వానికి వారు ఆద్యులు కారు కాని జంట కవిత్వానికి సార్థక్యం, సరసత వీరి వల్ల కలిగాయి. సుమారు 59 నాటకాలు వీరి పేరు మీద ప్రచారంలో ఉన్నాయి. అయితే అన్నీ వీరివే అని చెప్పేందుకు అవకాశాలు తక్కువ. కాని 10 ప్రసిద్ధ నాటకాలైనా వీరివి అనడంలో ఎవరికీ సందేహం లేదు. షేక్స్‌పియర్ రచనగా చెప్పబడు తున్న *ది ట్రూ నోబుల్ కింగ్స్‌మన్* లో వారి హస్తం ఉందని ప్రతీతి. 'మెసెంజర్' అనే మరో నాటక కర్తతో కూడా వీరు కలసి రచించినట్లు ఆధారా లున్నాయి. బోమాంట్ చనిపోయాక ఫ్లెచర్ స్వయంగా, విడిగా ఎన్నో నాటకాలు వ్రాసినా వాటికి ప్రశస్తి రాలేదు. అందువల్ల కవిత్వంలోనూ, నాటక శిల్పంలోనూ కూడా బోమాంట్‌దే పై చెయ్యి అని విమర్శకుల అభిప్రాయం.

బోమాంట్ సంస్కృతి సంపన్నమైన ఒక సాహిత్య కుటుంబంలో జన్మించాడు. ఇతని తండ్రి న్యాయ మూర్తిగా పనిచేశాడు. ఇతని పెద్దన్న ప్రఖ్యాత భక్తకవి 'సర్ జాన్ బోమాంట్'. ఇతడు ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో డిగ్రీ క్లాసులో చేరాడు. కాని తండ్రి మరణించడంతో మధ్యలో చదువు ఆపివేశాడు. తరువాత కొంత కాలా నికి న్యాయశాస్త్రం అభ్యసించాలని లండన్‌లో ఇన్నర్ టెంపుల్‌లో చేరాడు. కాని ఆ విద్య అతనికి అబ్బక పోవడంతో, చదువు చాలించి బ్రతుకు బడిలో చేరాడు. ఇతడికి చదువుకన్నా మద్యపానం, సాహిత్యగోష్ఠి ఎక్కువ ఇష్టమైనాయి. తన ఇరవై మూడవ ఏట ఫ్లెచర్ తో పరిచయమైంది. 1613 వ సంవత్సరంలో ఇతడు 'ఉర్సులా అయిలీ' (Ursula Isaley) అనే భాగ్యవంతుల అమ్మాయిని వివాహం చేసుకొనేవరకు ఇద్దరు మిత్రులూ కలిసే ఉన్నారు.

బోమాంట్ వ్రాసిన కావ్యాలు ఒక సంకలనంగా 1640 లో ఇతని మరణానంతరం అచ్చయింది. 1602

ప్రాంతంలో ప్రాచుర్యం వహించిన శృంగార ప్రధానమైన బృహత్కావ్యం *సాల్మాసిటుస్ అండ్ హెర్మాఫ్రడైస్* కూడా ఇతనిదే అంటారు. ఇతడు కవిగా కన్న నాటకకర్తగానే బాగా రాణించాడు. ఇతడు విడిగా వ్రాసి ప్రచురించిన నాటకాలు రెండు కనిపిస్తున్నాయి. 1. *ది వుమన్ హేటర్* (స్త్రీ ద్వేషి, 1607) 2. *ది నైట్ ఆఫ్ ది బర్నింగ్ పెజల్* (The Knight of the Burning Pestle, 1607- వంటింటి యోధుడు). రెండూ ప్రహసనాలే. రెండింటిలోనూ అధిక్షేపం ప్రధానం. హాస్యం వెల్లువగా ప్రవహించింది. రెండవనాటకం *వంటింటి యోధుడు* బాగా ప్రసిద్ధమైంది. ఇది నిజానికి జంట వచన రచన అని కొందరి అభిప్రాయం. ఏది ఏమైనా ఇది ఉత్కృష్టమైన రచన. కేవలం వినోదం కోసం వ్రాసిన ఈ హాస్య నాటకానికి దీటైన నాటకం ఆంగ్ల సాహిత్యంలో రాలేదు. ఆంగ్ల సాహిత్య చరిత్రలో పునర్వికాస యుగంగా ప్రసిద్ధి చెందిన ఈ కాలం స్వర్ణ యుగమంటారు. ఈ యుగంలో వచ్చినన్ని నాటకాలు మరెన్నడూ రాలేదు. *సిటిజన్ డ్రామా* (నగర నాటకం) అనే ఒక చిన్న తెగ నాటకం థామస్ డెక్కర్, హేఉడ్ చాప్‌మన్ మొదలగు వారి చేతుల్లో బాగా అభివృద్ధి చెందింది. ఈ తరహా నాటకానికి ప్రశస్తమైన పేరడీ 'వంటింటి యోధుడు'.

'ఏకా క్రియా ద్వ్యర్థకరీ' అన్నట్లుంటుంది నాటకం. ఒక వంక ఆనాటి సామాన్య ప్రజాభిరుచిని యద్దేవా చేస్తూనే, మరోవంక ఆనాటి నగర నాగరకతకు అద్దం పట్టి, దానికొక ప్రత్యేకతను, ప్రతిపత్తిని కల్పించిన 'థామస్ డెక్కర్' అనే ప్రసిద్ధ సమకాలీన నాటక కర్తను, నాటకాలను తీవ్రంగా పేరడీ రూపంలో ఆక్షేపించడం ఇందులోని ప్రత్యేకత. ఆనాటి ప్రజా జీవనంలో చోటు చేసుకొన్న కేవల కల్పనా కథల మోజును, కమ్మని కలలను రేకెత్తించి, వారిని కేవలం స్వప్న వీథీ సంచారకులుగా తయారు చేస్తున్న రచనలను అధిక్షేపించడం దీని పరమార్థం. పౌరజీవితాన్నీ, ఏకాగ్రతను ఏకకాలంలో రంగస్థలం మీద ప్రదర్శిస్తోందీ నాటకం. నాటక ప్రారంభంలో ఒక పచారీ వర్తకుడు, అతడిభార్య రంగస్థలం మీద దర్శన మిస్తారు. ఇంతలో ఆరోజు *లండన్ మర్చెంటర్* (లండన్ వ్యాపారి) అనే నాటకం ప్రదర్శిస్తామని ఒక నటుడు ప్రకటిస్తాడు. ఈ ప్రకటనకు ప్రతిస్పందిస్తూ ఆ వర్తక దంపతులు తాము నగర జీవితానికి దర్పణాలైన నాటకాల నెన్నో చూశామనీ, అందుచేత కేవలం పచారీ వర్తకుల ఔన్నత్యాన్ని నిరూపించే నాటకాన్ని ప్రదర్శించమనీ తమ దగ్గర తర్ఫీదు పొందుతున్న 'రాల్ఫ్' అనే యువ నౌకరుకు ఆదేశిస్తారు. దానితో అతడు వికటవీరుడుగా విజృంభించి నవ్విస్తాడు. అయితే రాల్ఫ్‌ను ఆదేశించడంతో ముగిసిపోలేదు వణిగ్దంపతుల పాత్ర. రాల్ఫ్ నటనపై వారు చేసిన ప్రత్యక్ష వ్యాఖ్యలు, అచ్చమైన వీథి మానిసి రసికతకు వీథిభాషలో వ్యక్తం కాగా ప్రేక్షకులు ఆనంద డోలికల్లో ఓలలాడతారు. ప్రసిద్ధ స్పానిష్ భాషా రచయిత సెర్వాంటిస్ వ్రాసిన *డాన్ క్విగ్జోట్* (Don quixote) ప్రభావంతో ఈ వికటపాత్ర సృష్టించాడని లెగ్వీ పండితుని అభిప్రాయం. అయితే బోమాంట్ కాలానికి క్విగ్జోట్ ఆంగ్లంలో అనువదించబడలేదన్నది పరమ సత్యం. ఏ రూపంలోనైనా అది బోమాంట్‌కు అందుబాటులో ఉన్నట్లు సాక్ష్యాలు లేవు. ఈ నాటకం నాడు కాక నేడు రచించాడన్నా నమ్మదగినంత నవ్యత ఇందులో గోచరిస్తుంది. కేవలం వినోదమే ప్రధానమని భావిస్తే బోమాంట్ -అద్వితీయుడని అంగీకరించాలి.

గం.శ్రీ.

**బోర్జే, జోర్గే లూయీ (1899-1986):** ఆర్జెంటినా దేశపు సాహిత్యాన్ని సుసంపన్నం చేయడమేకాక, దానికి ఖండాంతర ఖ్యాతిని సంపాదించిన ఘనుడు. వివిధ సాహిత్య శాఖల్లో పరిశ్రమించినా, ప్రధానంగా కవి. దక్షిణ అమెరికా (లాటిన్ అమెరికా) ఖండంలో 'మోడర్నిస్టు ఉద్యమం' (యుల్ట్రాయిస్టు ఉద్యమం) లో వ్యాస రచయితగా, కవిగా, కథానికా రచయితగా ప్రసిద్ధుడు.



ఆర్జెంటీనాలో బోర్జే కుటుంబం చరిత్ర ప్రసిద్ధమైనది. ప్రాచీన కాలంలో బ్రిటన్ నుంచి వలస వచ్చిన ఈ కుటుంబం ఒక ప్రభు వంశానికి చెందింది. బోర్జె తండ్రి మేధావి. వారి ఇంట్లో మంచి గ్రంథాలయం ఉండేది. బోర్జే మాతృభాష స్పానిష్ అయినా దానికన్నా ముందే ఇంగ్లీషు భాషను నేర్చుకోడమే కాక, స్పెయిన్ సాహిత్యంలో ప్రసిద్ధమైన *డాన్ క్విక్జోట్*

వంటి గ్రంథాలను ఇంగ్లీషు లోనే చదివాడు. తరువాత మొదటి ప్రపంచ యుద్ధ సమయంలో ఇతని కుటుంబం సుమారు ఏడేళ్లపాటు యూరప్ ఖండంలో ఉన్న సందర్భంలో స్విట్జర్‌లాండ్‌లోని జెనీవా నగరంలో ఫ్రెంచ్, జర్మన్ భాషల నధ్యయనం చేసి డిగ్రీ సంపాదించాడు. స్పెయిన్‌లో ఉన్నప్పుడు అక్కడి యువ రచయితలతో పరిచయం ఏర్పడింది. ఆ సమయంలో స్పెయిన్ దేశపు యువ రచయితలు 1890-91 దశకంలో వచ్చిన క్షీణసాహిత్యంపై తిరుగుబాటు ఉద్యమం నడుపుతున్నారు. దీనికి 'యుల్ట్రాయిస్టు ఉద్యమం' అని పేరు. బోర్హే ఈ ఉద్యమం వల్ల విపరీతంగా ప్రభావితుడయాడు. 1923 లో స్వదేశం తిరిగి రాగానే ఆర్జెంటినాకూ ఇతర లాటిన్ అమెరికాదేశాలకూ కూడా ఉద్యమాన్ని విస్తరింపచేసి, దానికి నాయకత్వం వహించాడు. అయితే త్వరలోనే దాని ప్రభావం నుండి బైటపడ్డాడు. ఏళ్ల తరబడి యూరప్‌లో నివసించి వచ్చిన బోర్హేకు స్వనగరమైన బ్యునోస్ అయిరిస్ అందాల రాసిగా కనిపించింది. ఆ నగర సౌందర్యాన్ని గానం చేస్తూ అతడు ఎన్నో కవితల్లాడు. ఈ గేయాల్లో ఆ నగర గత చరిత్రను, వర్తమానాన్ని నైపుణ్యంతో చిత్రించాడు. ఈ కవితలను 1923లో *ఫెడెబ్యూనోస్ అయిరిస్* అన్న పేరుతో ప్రచురించాడు. ఇదే సమయంలో ఇతడు మూడు సాహిత్య పత్రికలను స్థాపించి వాటికి సారథ్యం వహించాడు. కొన్ని వ్యాస సంపుటాలను, కవితా సంకలనాలను, ఒక జీవిత చరిత్రను కూడా ప్రచురించాడు.

1930 నుండి 1969 వరకు ఇతని జీవితంలో రెండవ దశగా గుర్తించ వచ్చును. ఈ కాలంలో ఇతడు కల్పనా చమత్కృతితో కూడిన నవలలు, కథలు విశ్రుంఖలంగా రచించాడు. మొదట చరిత్రలో అప్రతిష్ఠపాలైన వ్యక్తుల జీవితాలను రేఖా చిత్రాలుగా రచించాడు. వీటిని *హిస్టోరియా యూనివర్సల్ దిలాన్ ఫేమియా* అన్న పేరుతో ప్రచురించాడు. 1938 లో ఇతని జీవితం ఒక మలుపు తిరిగింది. అది జరిగిన కొద్ది కాలంలోనే ఆహార కాలుష్యం వల్ల ఆరోగ్యం పూర్తిగా దెబ్బతినగా మృత్యువునీడలో మనుగడ సాగించాడు. కంఠం పోయి మూగతనం ప్రాప్తించింది. మతి భ్రమణం కూడా అనుమానించవలసిన పరిస్థితి ఏర్పడింది. అయితే ఈ తీవ్ర పరిణామాలు అతనిలోని సృజనాత్మక శక్తిని విజృంభింప జేశాయి. అద్భుతమైన కథలు వ్రాశాడు. ఈ కథలను *ఫిక్సియోనిస్* అన్న శీర్షికలో కొన్ని సంపుటాలుగా ప్రచురించాడు. 'అడోల్ఫ్ సజారిన్' అనే మరో రచయితతో కలిసి అపరాధ పరిశోధన కథలను రచించాడు. వాటిని *హెచ్‌బస్టోస్ డోమీక్* అనే మారుపేరుతో ఒక సంపుటంగా *సిక్స్ ప్రోబ్లెమ్స్ ఫర్ డాన్ ఇసిడ్రో పరోడి* అన్న శీర్షికతో 1942 లో ముద్రించాడు. ఈ రచనలో బోర్హే వైయక్తిక ప్రతిభ పరవళ్లు తొక్కింది. భాష, అభివ్యక్తి, ప్రతీకలూ సర్వం విలక్షణ స్వీయ ముద్రను సంపాదించి పెట్టాయి. 1946 లో సంభవించిన రాజకీయ పరిణామాల వల్ల దేశంలో నియంతృత్వ పరిపాలన ఏర్పడింది. బోర్హే జాతీయ గ్రంథాలయంలో తన ఉన్నత పదవిని కోల్పోయాడు. ఈ కష్టకాలంలో ఇతనిని ఇతని స్నేహితులు ఆదుకొన్నారు. ఈ సమయంలో ఉపన్యాసాలివ్వడం, గ్రంథ సంపాదకత్వం ప్రధానంగా అవలంబించాడు. ఇంతలో కాలచక్రం గిర్రున తిరిగింది. 1955 లో నియంత పాలన అంతమై కొత్త ప్రభుత్వం అధికారంలోకి వచ్చింది. బోర్హే మళ్లీ జాతీయ గ్రంథాలయంలో డైరెక్టర్ పదవిని అధిష్ఠించాడు. ఉపాధికోసం బ్యూనోస్ అయిరిస్ విశ్వవిద్యాలయంలో సాహిత్యాచార్యుడుగా చేరాడు. అయితే అదృష్టం కలసి వచ్చే నాటికి ఇతనికి పూర్తిగా అంధత్వం ప్రాప్తించింది. రచనా వ్యాసంగానికి అవరోధం ఏర్పడింది. ఈ ఆఖరు దశలో ఇతడు కొన్ని తన తల్లికి, కొన్ని తన కార్యదర్శికి, కొన్ని తన మిత్రులకు 'డిక్టేట్' చేసి ప్రచురింప చేశాడు. వీటిలో ప్రధానమైనవి: *డ్రీమ్ టైగర్స్, ది బుక్ ఆఫ్ ఇమేజినరీ బీయింగ్స్*. ఈ సంపుటాల్లో పద్యానికీ, గద్యానికీ మధ్య సరిహద్దులు చెరిపివేశాడు. *డాక్టర్ బ్రాడీస్ రిపోర్ట్* (1970) లలో పగ, ప్రతీకారం, హత్యలు, నానా బీభత్స కృత్యాలు వర్ణించడ్డాయి.

బోర్హేకు 1961 వ సంవత్సరం వరకు గుర్తింపు రాలేదు. తోటి ఆర్జెంటీనా రచయితలు కూడా ఇతనికి సామాన్య గౌరవాన్నే ఇచ్చేవారు కాని ఇతని విశిష్ట ప్రజ్ఞను గుర్తించలేకపోయారు. 1961 లో అత్యంత ప్రతిష్ఠాకరమైన ఫోర్మెంటర్ ప్రైజ్‌ను శామ్యుయెల్ బెకెట్‌తో పంచుకోవడంతో ఇతడు పాశ్చాత్య సాహిత్య రంగంలో విద్యుద్దీప్తితో ప్రకాశించాడు. ఇతని కథలు ఫ్రాంజ్ కాఫ్కా కథలకు దీటైన వని లోకం కీర్తించింది.

గం.శ్రీ.

**బోల్, హైన్రిఖ్ (1917-1985) :** ప్రముఖ జర్మన్ రచయిత. 1972 వ సంవత్సరానికి సాహిత్యంలో నోబెల్ పురస్కార గ్రహీత. రెండవ ప్రపంచ సంగ్రామ కాలంలోనూ, అటుతరువాతనూ జర్మన్ ప్రజల యాతనలను అభివర్ణిస్తూ బోల్ రచించిన వ్యంగ్య ప్రధానమైన నవలలు

ఆ కాలంలో జర్మన్ జాతి మనస్తత్త్వంలో వచ్చిన మార్పును ప్రస్ఫుటంగా చిత్రించాయి.

1917 డిసెంబరు 21 న కొలోన్ నగరంలో ఒక వడ్రంగి కుమారుడుగా బోల్ జన్మించాడు. 1937 లో హైస్కూల్ పట్టభద్రు డయాడు. జర్మన్ సైన్యంలో చేరి ఆరేళ్లపాటు వివిధ యుద్ధరంగాలలో పోరాడాడు. యుద్ధానంతరం కొలోన్ నగరంలో స్థిరపడ్డాడు.

బోల్ రచించిన తొలి నవలలు: *డెర్ ట్సుగ్ వార్ పుంక్ట్లిష్* (1949, 'వేళకు వచ్చిన రైలు'), *ఓ వార్ స్ట్ డ్యూ ఆడమ్?* (1951, 'ఆడమ్! ఎక్కడ ఉన్నావు?') లలో సైనిక జీవితంలోని గాంభీర్యాన్నీ, నిరాశనూ చిత్రించాడు. *డస్ బ్రాట్ డెర్ ఫ్రూహేన్ జ్రాహే* (1955, 'తొలి రోజులలో మా పోషణ') అనే నవలలో ఒక మెకానిక్ జీవితంలోని వాస్తవమైన చిరాకునూ, *బిలాడ్ ఉమ్ హాల్బ్ జ్సేన్* (1959, 'తొమ్మిదిన్నర గంటల బిలియర్డ్స్ ఆట') లో ఒక వాస్తుశిల్పుల కుటుంబ వాస్తవికతనూ బోల్ అభివర్ణించాడు. ఈ రెండవ నవల స్వగతాలతోనూ, ఫ్లాష్‌బాక్‌లతోనూ కూడిన మిక్కిలి సంక్లిష్టమైన నవల. మిక్కిలి ప్రజాదరణ పొందిన *అన్‌స్టిక్టెన్ ఐన్స్ క్లౌన్స్* (1963, 'విదూషకుడు') లో నాయకుడు త్రాగుడు వ్యసనానికి వశుడై ఎక్కువ ధనం ఆర్జించే ప్రదర్శకుని స్థాయినుంచి వీథులలో ముష్టి ఎత్తుకునే గాయకుడుగా ఎలా పతనం చెందాడో వర్ణించబడింది.

బోల్ రచించిన ఇతర రచనలలో *ఉండ్ స్ట్రైన్ ఐన్‌ట్సిగెస్ వోర్ట్* (1953, 'రాత్రితో పరిచయం'), *ఎండే ఐనర్ డీన్స్ట్ ఫార్ట్* (1966, 'ఉద్యమ పరిసమాప్తి') చెప్పుకోదగ్గవి. ఈ రెండవ నవలలో ఒక తండ్రీ, కొడుకుల న్యాయస్థాన విచారణ పట్టణ ప్రముఖుల నిజ స్వరూపాన్ని బయటపెడుతుంది. బోల్ రచించిన మిక్కిలి పెద్ద నవల *గ్రుప్పెన్‌బిల్డ్ మిట్ డేమ్* (1971, 'లేడీ తో కలసి బృంద చిత్రం'). దీనిలో ప్రథమ ద్వితీయ ప్రపంచ యుద్ధాల కాలంనుంచీ 1980 దాకా జర్మన్ సమాజంలో వివిధ వర్గాలలో వచ్చిన మార్పులను బోల్ చిత్రించాడు. బోల్ కొన్ని చిన్న కథలు కూడా రచించాడు. వీటిలో ఒక కథ 1933-37 మధ్య కాలానికి సంబంధించిన స్వీయ స్మృతులకు జ్ఞాపిక లాంటిది.

నిజాయితీతో కూడిన క్రైస్తవుడూ, శాంతి కాముకుడూ అయిన బోల్ బోన్ నగరం సమీపంలో 1985 జూలై 16 వ తేదీన పరమపదించాడు.

*బొ.శ్రీ.*

**బోల్డర్‌వుడ్, రోల్ఫ్ (1826-1915) :** ఆస్ట్రేలియా దేశపు ప్రఖ్యాత నవలా రచయిత. అసలు పేరు 'థామస్ అలెగ్జాండర్ బ్రౌన్'.

ఇంగ్లండులో జన్మించిన 'థామస్ బ్రౌన్' పసితనంలోనే ఆస్ట్రేలియా చేరాడు. విద్యాభ్యాసం పూర్తిగా ఆస్ట్రేలియాలోనే జరిగింది. అనంతరం అతడు విక్టోరియా పట్టణ ప్రాంతంలో ఒక పెద్ద వ్యవసాయక్షేత్రం సంపాదించి, కొన్నేళ్లు వ్యవసాయంలోనే గడిపాడు. తరువాత న్యూ సౌత్‌వేల్సు నగరంలోనూ, విక్టోరియా పట్టణంలోనూ పోలీస్ మేజిస్ట్రేట్‌గానూ, బంగారు గనులపై కమీషనర్‌గానూ పనిచేశాడు. 'రాల్ఫ్ బోల్డర్‌వుడ్' అన్న కలంపేరుతో మొట్ట మొదటి సారిగా కొన్ని కథలు వ్రాశాడు. జీవిత చిత్రణలు కూడా చేశాడు. తరువాత 1878-1906 సంవత్సరాల మధ్య ఇరవై నవలలు వ్రాసి ప్రసిద్ధి కెక్కాడు. ఇతని నవలలలో ముఖ్యమైనవి:

1. సాయుధ దోపిడీ (*రాబరీ అండర్ ఆమ్స్*, 1888)
2. గని పనివాడి హక్కులు (*ఏ మైనర్స్ రైట్స్*, 1906).

ఇతనిది కాల్పనిక ప్రవృత్తి. పై చెప్పిన రెండు నవలలలోనూ ఆస్ట్రేలియాలో తొట్టతొలుత స్థిరపడి మార్గదర్శకులైన తెల్లవారి జీవితాలను వాస్తవిక దృష్టితో కన్నులకు కట్టినట్లు చిత్రించాడు.

*గం.శ్రీ.*

**బోవాయ్‌ర్, సిమోన్ డి (1908-1986) :** ప్రఖ్యాత ఫ్రెంచి వనిత, నవలా రచయిత్రి, వ్యాసకర్త్రి. మహిళోద్యమ నాయకురాలు. అస్తిత్వ వాద ప్రవర్తక మేధావి సంఘ సభ్యురాలు. ఈమె రచించిన *సెకండ్ సెక్స్* (1953) మహిళోద్యమ కర్తలకు పరమ ప్రామాణికమైన సిద్ధాంత గ్రంథం.

ఈమె ప్రైవేటు పాఠశాలల్లో చదివి, చివరకు విశ్వవిఖ్యాతమైన సెర్బోన్ విశ్వవిద్యాలయంలో చేరి, 1929 లో తత్త్వశాస్త్రంలో పట్టా పొందింది. అదే సమయంలో అక్కడే ఈమెకు ప్రఖ్యాత నిరీశ్వర అస్తిత్వవాద ప్రవక్త, రచయిత 'జ్యాం పాల్ సార్త్రే' తో పరిచయం ఏర్పడింది. అది క్రమంగా వృద్ధి చెంది, వైవాహిక బంధాతీతమైన, స్వేచ్ఛా సాహచర్యరూపమైన జీవిత భాగస్వామ్యానికి దారి తీసింది.

తాను నమ్మిన సిద్ధాంతం కోసం తన జీవితాన్నే మీదుకట్టిన ఆదర్శమహిళ ఈమె. ధైర్యసాహసాలూ, నీతి నిజాయితీలూ, అపూర్వ మేధాసంపద ఈమె సొత్తు. ఆడది అబల కాదని నిరూపించడానికి కలం పట్టిన వీరవనిత. ఈ లోకంలో సమస్త వ్యవహారాలూ, సమస్త సంబంధాలూ, ఎన్నికలూ, స్త్రీ పురుషుల లైంగిక

వ్యత్యాసాల కతీతంగా, వాటితో ప్రమేయం లేకుండా సాగాలని ఈమె సిద్ధాంతం. అన్ని వృత్తులకు, అన్ని వ్యాపారాలకు లైంగిక సమానత్వం ప్రాతిపదికగా ఉండాలని ఈమె ఆశయం. ఈ ఆశయాల కనుగుణంగా ఈమె ఎన్నో నవలలు, నాటకాలు, వ్యాసాలు వ్రాసింది. విస్తృతంగా పర్యటించింది. గ్రీసు, ఇటలీ, మధ్య యూరప్, ఆఫ్రికా, అమెరికా సంయుక్త రాష్ట్రాలు, దక్షిణ అమెరికా, చైనా దేశాలలో పర్యటించి, ఈమె తన యాత్రల అనుభవాలు కొన్ని సంపుటాలుగా ప్రకటించింది. ఇవి కేవలం సరదాకో, లాభాపేక్షతోనో వ్రాసినవి కావు. ఒక తరం ఫ్రెంచి మేధా జీవితానికి అద్దం పట్టే రచన లివి. ఈ రచనల్లో కొన్ని : *మెమొరీస్ ఆఫ్ ఆఫ్ ఏ డ్యూటీఫుల్ డాటర్* (ధనవంతురాలైన కూతురి జ్ఞాపకాలు, 1959), *ది ఎమ్ ఆఫ్ లైఫ్* (నడి జీవితం, 1969), *ఫోర్స్ ఆఫ్ సర్కమ్‌స్టెన్సెస్* (పరిస్థితుల ప్రాబల్యం, 1965), *ఏ వెరీ ఈజీ డెత్* (సునాయాస మరణం, 1965), *ఆల్ సెడ్ అండ్ డన్* (పర్యవసానంగా, 1974), *అమెరికా డే బై డే, ది లాంగ్ మార్చ్* (దీర్ఘ యాత్ర). ఈమె వ్యాసాలు తత్త్వకోశాలు. అస్తిత్వవాద ప్రతిపాదకాలు. *ఓల్డ్ ఏజ్* (1972) అనే వ్యాస సంపుటిలో ఈమె వృద్ధాప్య సమస్యలను చర్చించింది. రచయితకు సాంఘిక నిబద్ధత అత్యావసరమని ఈమె భావన. ఈమె నవలలు కూడా తాత్త్వికాలే. 1953 లో ప్రచురించిన నవల *షి కేమ్ టు స్టే* (ఆగిపోయిన అతిథి) లో ఈమె ఒక దంపతుల ఇంట్లో అనుకోకుండా చిరకాలం ఉండిపోయిన ఒక అమ్మాయి ఆ దంపతుల అనుబంధ నాశనానికి ఎలా కారణమయిందో వర్ణిస్తుంది. ఒకరి అంతరాత్మకు మరొకరి అంతరాత్మకు మధ్య సంబంధాన్ని సామర్థ్యంతో చిత్రిస్తుంది. *ది బ్లడ్ ఆఫ్ అదర్స్* (ఇతరుల రక్తం, 1948) లో స్వాతంత్ర్యం తెచ్చే బాధ్యతలను చర్చిస్తుంది. *ఆల్ మెన్ ఆర్ మోర్టల్* (1955) అనే నవలను నవల అనడం కన్న సిద్ధాంత గ్రంథం అనడమే సబబంటున్నారు విమర్శకులు. జీవితానికి అర్థం కల్పించేది మృత్యువు అన్న తాత్త్వికాంశ మాధారంగా చేసిన రచన ఇది. *ది మందారిన్స్* (అగ్రశ్రేష్ఠులు, 1954) అన్న నవలలో మేధా సంపన్నులు తమ హోదాను విస్మరించి ప్రజాజీవనంలో భాగస్వాములు అయి రాజకీయాలలో పాల్గొనాలనీ సూచిస్తుంది. *యూస్‌లెస్ మౌత్స్* ఈమె రచించిన ప్రయోజనాత్మక నాటకం. సంఘ శ్రేయస్సు కోసం కొంతమంది ఆత్మార్పణం చెయ్యడం తప్పదా? అన్న ప్రశ్నకు సమాధానం ఈ నాటకం. *ది విమెన్ డిస్ట్రాయ్డ్* (పతితలు, 1969) ముగ్గురు స్త్రీల జీవితాలను వర్ణించే కథా సంపుటి. ఈమె రచనలలో వివేకం, వైవిధ్యం పుష్కలంగా ఉన్నట్లు గమనిస్తాం.

గం.శ్రీ.

**బోస్‌మన్, హెర్మన్ ఛార్లెస్ (1905-51)** : దక్షిణాఫ్రికాకు చెందిన 'బోస్‌మన్' గ్రామీణ 'ఆఫ్రికానర్' జీవిత చిత్రణలో సిద్ధహస్తుడైన కథా రచయిత. దక్షిణాఫ్రికాలో స్థిరపడిన శ్వేత జాతి డచ్చివారిని 'ఆఫ్రికానర్' అని వ్యవహరిస్తారు. వీరు డచ్చి భాషా సంపర్కంతో ఉన్న ఆఫ్రికా భాషనే మాట్లాడుతారు. బోస్‌మన్ తల్లిదండ్రులీ తెగకు చెందినవారు కనుకనే ఈ తెగ గ్రామీణ జీవితాన్ని తన కథలలో ముఖ్యంగా *ఊమ్‌షాక్ లూరెన్స్* (O om Shak Lourens) లో వర్ణించగలిగాడు. బోస్‌మన్ జోహన్స్ బర్గ్ నగరంలోని విట్‌వాటర్ శ్ట్రాండ్ విశ్వవిద్యాలయంలో ఇంగ్లీషు విద్యను అభ్యసించాడు. బోధనా వృత్తిలో డిగ్రీ సంపాదించి, ఉపాధ్యాయవృత్తి చేబట్టాడు. ఇతడు మొదట్లో కొంతకాలం మార్క్సిస్ట్ సిద్ధాంతంచే ఆకర్షితుడై 'ది యంగ్ కమ్యూనిస్ట్ లీగ్' లో సభ్యత్వం స్వీకరించాడు. ఈ సంపర్కపు ప్రభావం వల్లనే ఇతనికి ఉత్తర ట్రాన్స్‌వాల్ రాష్ట్రంలోని దుర్గమ ప్రాంతమైన గ్రూట్‌మారికాలో ఉద్యోగం దొరికింది. అయితే ఇది మంచికే అయింది. అక్కడ అతడు సంపాదించిన అనుభవం జీవితాంతం అతనికి ఉపయోగపడి అతని రచనలకు పునాది రాయి అయింది. అతడొకసారి జోహన్స్ బెర్గ్ వెళ్లినపుడు ఆవేశంలో తన సవతి తల్లిని తుపాకీతో కాల్చి చంపడంతో అతని ఉద్యోగం ఊడిపోయి, జైల్లో పడ్డాడు. ఉరిశిక్ష విధించారు. కాని త్వరలోనే దాన్ని జీవిత ఖైదుగా మార్చారు. ఆ తరువాత ఆ శిక్ష నాల్గు సంవత్సరాలకు తగ్గించారు. జైల్లో ఉండగానే *ఊమ్ షాక్* కథలకు బీజావాపన జరిగింది.

బోస్‌మన్ పాఠశాల దశలోనే కథలు వ్రాయడం, ప్రచురించడం ప్రారంభించాడు. వివిధ పత్రికలలో పడ్డ కథలను సేకరించి తొలి సారిగా *మేఫ్‌కింగ్ రోడ్* అన్న పేరుతో 1947 లో ప్రచురించాడు. మరి కొన్ని కథలను ఇతని మరణానంతరం ఇతని స్నేహితుడు లయోనల్ అబ్రహామ్ కొన్ని సంపుటాలుగా ప్రచురించాడు. అవి *ఆన్ టు డస్ట్, ది బెస్ట్ ఆఫ్ బోస్‌మన్* (బోస్‌మన్ మేలికథలు 1967), *పోస్టాఫీస్* (1967), *ఏ బెక్కర్ మేరథన్* (1971).

కథా రచనలో ఇతనికి మార్గదర్శకులన దగినవారు: 'ఎడ్గార్ అలెన్ పో', 'ఓ హెన్రీ' వారి నుండి ప్రక్రియాపరంగా

నేర్చుకొన్న విద్యను స్థానిక పరిస్థితుల కనుగుణంగా ఇతడు మలచుకొన్నాడు. *ఊమ్‌షాక్* ప్రభృతి కథలలో ఇతడు ట్రాన్స్‌వాల్‌లో ఇటు అరణ్యమనీ, అటు సేద్య భూములనీ చెప్పడానికి వీలుకాని విశాల మైదానాలలో (వీటిని వెల్డ్‌లని వ్యవహరిస్తారు) నివసించే గ్రామీణ జనుల అమాయికత్వాన్నీ, గడుసుదనాన్నీ చిత్రీకరించాడు. 1945 ప్రాంతంలో ఇతని కథలొక మలుపు తిరిగాయి. ఈ కథలు దేశంలో గణనీయమైన మార్పులు తీసుకు వచ్చాయి. అయితే 'బోస్‌మన్' ఆంగ్లేయుల పాలన కెంత వ్యతిరేకో, క్రొత్త జాతీయ నాయకులు అమలు పరుస్తున్న వర్ణవిచక్షణ విధానానికి కూడా అంతే వ్యతిరేకి. ఈ కథలు ఈ దృక్పథాన్ని ప్రదర్శిస్తాయి. కథలన్నీ ఒక దేశానికి, ఒక కాలానికి సంబంధించినందు వల్ల సంకుచితమైనవైనా, శైలీ చాతుర్యం వల్ల బోస్‌మన్ వీటికి శాశ్వతత్వం కల్పించాడు. మాటలను పొదుపుగా వాడడం, చెప్పేది సంక్షిప్తంగా రమణీయంగా చెప్పడం, వ్యంగ్య భంగిమలో విమర్శించడం ఇతని శైలిలోని ప్రత్యేక లక్షణాలు.

గం.శ్రీ.

**బ్యాలిక్, హయీమ్ నహ్మాన్ (1873-1934) :** ప్రసిద్ధ హీబ్రూ భాషా కవి. ఇతడు పేదరికంలో పుట్టాడు. చిన్నతనంలోనే తండ్రిని కోల్పోయాడు. సదాచార సంపన్నుడు, చదువుకొన్నవాడు అయిన తాతగారి పెంపకంలో ఇతడు యూదు మత గ్రంథాలను చిన్నతనంలోనే అధ్యయనం చేశాడు. ఈ అంశాల ప్రభావం బ్యాలిక్ జీవితంపై పడ్డది. కొన్నాళ్లు కలప వ్యాపారం, మరికొన్నాళ్లు బోధన వృత్తి సాగించిన బ్యాలిక్ తన మొదటి దీర్ఘ కవితను ఒక పత్రికలో ప్రచురించాడు. యూదుల ధర్మ గ్రంథమైన టాల్ముడ్ అధ్యయనం చేసే విద్యార్థి అని అర్థం గల *హ-మక్ మిద్* అన్న పత్రికలో ఒక విద్యార్థి నిష్ఠను పవిత్రతను మనోజ్ఞంగా చిత్రీకరిస్తూ, ఆధునిక ప్రపంచంలో అట్టివాని దయనీయస్థితి ఎట్లా ఉంటుందో అభివర్ణించాడు. ఒక విధంగా ఆ విద్యార్థిని సమస్తయూదు జాతికి ప్రతినిధిగా అతడు సంకేతించి ఉండవచ్చును. ఈ కవిత అతనికి గొప్ప కీర్తి తెచ్చి పెట్టింది. 1903 లో రష్యాలోని కిషిన్యావ్ నగరంలో జరిగిన యూదుల సామూహిక వధ పట్ల క్రుద్ధుడై అగ్ని ధారలు కురిపిస్తూ అతడు ప్రకటించిన కవితలలో ముఖ్యమైనది *బె-యిర్ హె-హరెగా* (be-Ir he-Herega), మృత్యునగరంలో). ఇందులో బ్యాలిక్ అటు దౌర్జన్యపరుల అమానుషత్వాన్ని, ఇటు యూదుల నిష్క్రియత్వాన్ని కూడా తీవ్రంగా ఖండించాడు.

బ్యాలిక్ ఇతర రచనలలో ఒక మహాకావ్యం లోని భాగం *మెతెమిద్ బర్* (ఎడారిలో మృతులు), *హ-బెరెఖా* (కొలను) చేరి ఉన్నాయి. డా. క్విజోట్ విల్‌హెల్మ్ టెల్ వంటి యూరపియన్ రచయితల రచనలను ఇతడు హీబ్రూ లోనికి అనువదించాడు. యూదులకు సంబంధించిన సాంప్రదాయిక కథలను సంకలితం చేశాడు. పత్రికా సంపాదకుడుగా, సాహిత్య సంస్థల వ్యవస్థాపకుడుగా, బ్యాలిక్ ప్రచురణ సంస్థ స్థాపకుడుగా ఎనలేని సేవ చేశాడు. ఆధునిక హీబ్రూ భాషను ఇతివృత్త వైవిధ్యంతో ఉత్తమ కవితా మాధ్యమంగా మలచిన ప్రతిభాశాలిగా బ్యాలిక్ మన్నన లందుకొన్నాడు.

ము.వీ.

**బ్యుసోన్ (1716-1784) :** జపాన్ దేశపు చిత్రకారుడు. చిత్రకారుడుగా కంటె కూడా ప్రముఖ 'హైకూ' కవిగా మరింత ప్రసిద్ధుడు. ఇతని అసలు పేరు 'తనిగుచి బూసన్'. ఇతనిని 'యోసాబూసన్' అని కూడా వ్యవహరిస్తారు.

జపాన్‌లోని సెక్ట్సూ రాష్ట్రంలో గల కేయా లో 1716 లో ఒక సంపన్న కుటుంబంలో బ్యుసోన్ జన్మించాడు. కళాకారుడుగా జీవితం సాగించడంకోసం తన ఆస్తినంతటిని ఈయన వదలుకున్నాడు. జపాన్‌లో ఈశాన్య ప్రాంతంలో విరివిగా పర్యటించి హయానో హాజీన్ వంటి వివిధ సిద్ధహస్తుల వద్ద 'హైకూ' రచన అభ్యసించాడు. *హోకుజు రోసెన్ వో ఇతొానము* (1745, 'హోకుజు రోజెన్‌కు శ్రద్ధాంజలి') అనే పుస్తకంలో తన గురువుల నందరినీ ఇతడు కీర్తించాడు. 1751 లో ఒక వృత్తి చిత్రకారుడుగా క్యోటో నగరంలో స్థిరపడి, శేష జీవితం అంతా ఇంచుమించు అక్కడే గడపాడు. అయితే మూడేళ్లపాటు మాత్రం (1754-57) ప్రకృతి దృశ్యాలకు ప్రసిద్ధి చెందిన టాంగో రాష్ట్రంలోని 'యోసా' లో గడపాడు. కవిత్వంలోనూ, చిత్రకళలోనూ కూడా తన శైలిని మెరుగు పరచుకోడం కోసం ఇక్కడ ఇతడు గాఢంగా కృషి చేశాడు. ఇక్కడ ఉండగానే తన ఇంటిపేరును 'తనికుచి' నుంచి 'యోసా' గా మార్చుకున్నాడు. కవిగా బ్యుసోన్ 1772 తరువాత మరింత ప్రసిద్ధుడయాడు. తన పూర్వీకుడైన మట్సువో బాషో సంప్రదాయాన్ని పునరుద్ధరించడానికి ఇతడు ప్రయత్నించాడు. చిత్రకారుడు కావడం వలన తన కవితలో కూడా అందమైన పద చిత్రాలను కట్టాడు. ఇతని దీర్ఘ కావ్యాలలో అక్కడక్కడ

ఈయన చైనీస్ పదాలు వాడాడు. సాంప్రదాయిక హైకూ రూపంలో కూడా ఈయన నూతన ప్రయోగాలు జరిపాడు.

1784 జనవరి 17 వ తేదీన క్యోటో నగరంలో బ్యుసోన్ తన జీవిత యాత్ర చాలించాడు.

బొ.శ్రీ.

**బ్యూఖ్నర్, జార్జ్ (1813-1837)** : జర్మన్ నాటక రచయిత. 20 వ శతాబ్దపు ఆరంభ కాలంలో నాటక రంగంలో వెలసిన ఎక్స్‌ప్రెషనిస్ట్ సంప్రదాయానికి వైతాళికుని వంటివాడు.

1830 లో పారిస్ లో జరిగిన తిరుగుబాటు వలన చెలరేగిన విప్లవోద్యమంలో పాల్గొని బ్యూఖ్నర్ 1834 లో ఒక కరపత్రం ప్రకటించాడు. దానిలో ఆర్థిక, రాజకీయ విప్లవాన్ని ప్రబోధించాడు. అంతేకాక ఒక రాడికల్ సొసైటీని స్థాపించాడు. ఎలాగో అరెస్ట్ కాకుండా తప్పించుకొని 1836 లో జూరిఖ్‌లో నేచురల్ సైన్స్ ఉపన్యాసకుడుగా నియమింపబడ్డాడు.

బ్యూఖ్నర్ రచించిన మూడు నాటకాల శైలిమీద షేక్స్పియర్ ప్రభావం, జర్మన్ రోమాంటిక్ స్టుమ్‌ఉండ్ డ్రాంగ్ ఉద్యమ ప్రభావం స్పష్టంగా కనిపిస్తాయి. ఇతి వృత్తంలోనూ, రూపంలోనూ కూడా వాటిలో ఎంతో ముందు చూపు కనిపిస్తుంది. వాటిలోని హ్రస్వమైన, హఠాత్తుగా ముగిసే దృశ్యాలలో స్వాభావికత, దార్శనిక బలం కనిపిస్తాయి. ఆయన మొదటి నాటకం *డాంటన్స్ టోడ్* (1835). ఇది ఫ్రెంచ్ రివల్యూషన్‌కి సంబంధించిన నిరాశా పూరితమైన నాటకం. ఈ నాటకంలో నాయకుడైన డాంటన్ తాను కారణభూతుడైన రక్తపాతానికి ప్రగాఢంగా విచలితుడైన వ్యక్తిగా చిత్రించబడ్డాడు. *లియోన్స్ ఉండ్ లెనా* (1836) అనే వ్యంగ్య పరిహాస నాటకంలో కాల్పనిక భావాల అస్పష్టత పరిహరించబడింది. ఆయన చివరి నాటకం *వోయిజ్లెక్* (1836) అసంపూర్ణంగా మిగిలిపోయింది. 1890 తరువాత పేద సాదలపై కారుణ్యాన్ని చూపుతూ వచ్చిన సాంఘిక నాటక ప్రక్రియకు దీనిని పూర్వ నిర్దేశకగా భావింపవచ్చును. బ్యూఖ్నర్ రచనలలో చాలా భాగం ఆయన మరణానంతరమే ప్రకటించబడ్డాయి. ఆయన జీవిత కాలంలో ప్రచురింపబడిన *డాంటన్స్ టోడ్* 1902 లో గాని రంగస్థల ప్రదర్శనకు నోచుకోలేదు.

లుడ్విగ్ బ్యూఖ్నర్‌కు అన్నగారైన జార్జ్ బ్యూఖ్నర్ జర్మన్ నాటక సాహిత్య రంగంలో ప్రముఖ రచయితగా ప్రసిద్ధి పొందాడు.

ఇతడు తన 24 వ ఏటనే 1837 ఫిబ్రవరి 19 న జూరిఖ్ నగరంలో అకాలమరణం చెందాడు.

బొ.శ్రీ.

**బ్యూయేరో వలేహో, ఆంటోనియో (1916--):** రెండవ ప్రపంచ యుద్ధానంతరం స్పెయిన్ దేశంలో వర్ధిల్లిన యువతరంలో అతి ప్రసిద్ధుడైన నాటక కర్త. ఇతని నాటకాలలో అధిక సంఖ్యాకమైన వాటికి స్పెయిన్ దేశంలో ప్రతిష్ఠాకరమైన సాహిత్య పురస్కారాలు లభించాయి.

స్పెయిన్ రాజధాని అయిన మాడ్రిడ్ మహానగరంలోనూ, స్వస్థలమైన గాదలజారా లోనూ విద్య గరచి, కళారంగంలో నిష్ణాతుడయాడు. 1936-39 సంవత్సరాల మధ్య స్పెయిన్‌లో చెలరేగిన అంతర్యుద్ధంలో రిపబ్లికన్ పక్షం తరపున సైనికుడుగా యుద్ధంలో పాల్గొన్నాడు. యుద్ధానంతరం నేషనలిస్టు నియంతృత్వం ఇతనికి మరణ శిక్ష విధించినా, వెంటనే దాన్ని జీవిత ఖైదుగా మార్చడంతో బ్రతికి బయటపడ్డాడు. ఆరేళ్లకు పైగా ఇతడు ఖైదులో మ్రగ్గాడు. 1969 లో వ్రాసిన *ది కేస్ ఆఫ్ ఏ స్టెయిర్ కేస్* (సోపానకథ) అనే నాటకంతో ప్రప్రథమంగా ఇతడు ప్రజాభిమానాన్ని చూరగొన్నాడు. ఇందులో మాడ్రిడ్ మహానగరంలోని మురికి వాడలలో అపార్టుమెంటు వాటాల్లో నివసించే నిరుపేదల విషాద గాథలను నైపుణ్యంతో చిత్రించాడు. దానికి స్పెయిన్‌లో అతి ముఖ్యమైన 'లోప్ ది వేగా' సాహిత్య పురస్కారం లభించింది. అదే సంవత్సరం వ్రాసిన ఏకాంక నాటిక *వల్బాన్ ఎన్‌లా ఎరీనా* కూడా మరో సాహిత్య పురస్కారం అందుకుంది. ఇందులో బ్యూయేరో వలేహో పరసతీ గమనాన్ని ఇతివృత్తంగా స్వీకరించి, జీవితంలో కారుణ్యం ఒక ముఖ్యమైన మూల్య మని నిర్దేశించాడు. *ఇన్ ది బర్నింగ్ డార్క్‌నెస్* ఇతని రెండవ మహా నాటకం. ఇది ప్రతీకాత్మకం. దీనిలో గ్రుడ్డివాని గృహం సమాజానికి ఒక ప్రతీక.

ఇతని నాటకాలలో మానవాళి సుఖ శాంతులకు విఘ్నం కలిగించే ప్రతిపశక్తులు ప్రధానంగా కనిపిస్తాయి. ఇతడు ప్రసిద్ధ జర్మన్ నాటకకర్త బెర్టోల్ట్ బ్రెఖ్ట్ రచనలను స్పానిష్ భాషలోకి అనువదించడమే కాక, అతని ప్రభావంతో ఎన్నో నాటకాలు రచించాడు. ఇతడు ఎన్నో చారిత్రక నాటకాలను కూడా రచించాడు. మూడవ చార్లెస్ కాలంలో స్పెయిన్ ఆధునికీకరణం ఎందుకు విఫలమయిందో *ది డ్రీమర్ ఫర్ ది నేషన్* (మహా స్వాప్నికుడు, 1961) లో వివరించాడు. అలాగే

*ది లేడీజ్-ఇన్-వెయిటింగ్* (చెలికత్తెలు) అనే నాటకంలో ప్రసిద్ధ చిత్రకారుడు *వెలాజ్ క్వెజ్* జీవితాన్ని, *ది కాన్‌సర్ట్ ఎట్ సెంట్ ఓవిడ్* (సెంట్ ఓవిడ్‌లో సంగీత కచేరీ, 1967) లో ఫ్రెంచి విప్లవ సమయంలో పారిస్ నగర జీవితాన్ని, *ది బేస్మెంటు విండో* (క్రింది కిటికీ, 1967) లో స్పెయిన్‌లోని అంతర్యుద్ధాన్ని సవిమర్శకంగా చిత్రించాడు. అనంతర రచనలలో *ది డ్రీమ్ ఆఫ్ రీజన్* (హేతు స్వప్నం, 1970), *ది డబుల్ లైఫ్ ఆఫ్ డాక్టర్ వల్మీ* (డాక్టర్ వల్మీ రెండు జీవితాలు, 1978) ప్రధానమైనవి. ఇతనికి 1971 లో ప్రతిష్ఠాత్మకమైన శ్పానిష్ అకాడమీ, సభ్యత్వం లభించింది.

*గం.శ్రీ.*

**బ్యోయ్ కసారెస్, అడాల్ఫో (1914--) :** ఊహా వాస్తవికత (Magic Realism) ను ఉపయోగించి కథలూ, నవలలూ వ్రాసిన అడాల్ఫో బ్యోయ్ కసారెస్ ప్రముఖ ఆధునిక బ్రెజిల్ రచయితలలో ఒకడు.

తన 20 వ యేట నుంచి కథ లెన్నో వ్రాసినా అడాల్ఫోకు రచయితగా గుర్తింపు తెచ్చింది ఆయన తొలి నవల *లా ఇన్‌వెన్‌సియన్ దె మోరెల్* ('మోరెల్ ఆవిష్కరణ'). 1940 లో ముద్రితమైన ఈ నవల 'ఊహా వాస్తవికత' కు చక్కని ఉదాహరణ. ఒక పెద్ద చలనచిత్ర యంత్రంలో ఒక స్త్రీ కదలికలను చిత్రించి ఉంచుతారు. నవలలోని కథానాయకుడు ఆ స్త్రీతో పరిచయం చేసుకోవడానికి ప్రయత్నిస్తాడు. వాస్తవిక ప్రపంచానికి చెందిన ఆ కథా నాయకుడు యంత్రంలోని ఊహాసుందరిని చేరుకొని తాను కూడా ఆ యంత్రంలోని చిత్రణలో భాగం కావడంతో నవల ముగుస్తుంది.

1954 లో ప్రచురితమైన *ఎల్‌సుయెనో దె లోస్ హీరోస్* ('నాయకుల నిద్ర') నవలను బ్యూనస్ ఐరిస్‌లోని బడుగు ప్రజల భాషలో వ్రాశాడు. ఈ నవలలో ఆర్జెంటీనా సంస్కృతిలో నాగరకతకూ, పాశవికతకూ మధ్య జరిగే పోరాటాన్ని రచయిత వ్యంగ్యంగా చిత్రించాడు.

అడాల్ఫో వ్రాసిన కథలు ఎన్నో సంకలనాలుగా వెలువడ్డాయి. వాటిలో 1934 లో వెలువడిన *కేయాస్* ('సంక్షోభం'), 1937 లో ప్రచురితమైన *లూయీ గ్రీవ్ మ్యుర్తో* ('లూయీ గ్రీవ్ మరణం'), 1945 లో ముద్రితమైన *ప్లాన్ దె ఎవేషన్* (తప్పించుకోవడానికి ఒక పథకం), 1948 లో ప్రకటితమైన *లా ట్రామా సెలెస్టె* (దైవికమైన కుట్ర), 1967 లో ప్రకాశితమైన *ఎల్ గ్రాన్ సెరాఫిన్* ('గొప్ప దేవతా స్త్రీ') ప్రముఖమైనవి.

అడాల్ఫో కథానికా రచనలో చూపించిన వైవిధ్యానికి 1972 లో వెలువడిన *హిస్టోరియాస్ దె అమొర్* ('ప్రేమకథలు'), *హిస్టోరియాస్ ఫెంటాస్టికాస్* ('ఊహాతీత కథలు') అనే రెండు సంకలనాలు తార్కాణాలు.

అడాల్ఫో, జార్జ్ లూయీ బోర్జెస్ (Jorge Luis Borges) తో కలిసి 'హానరియో బస్టో డొమెక్' (Honorio Bustos Domecq) అనే మారుపేరుతో - *అంటోలజియా దె లా లిటెరేచురా ఫెంటాస్టికా* ('ఊహాతీత వాస్తవికతా సాహిత్య సంకలనం') 1940 లోనూ, *సీస్ ప్రాబ్లెమాస్ పారాడాన్ ఇసిడ్రో పరోడీ* ('డాన్ ఇసి డ్రో పరోడీకి ఆరు సమస్యలు') అనే కథ 1942 లోనూ ప్రచురించాడు. ఈ కథలలో అపరాధ పరిశోధనతో పాటు ఆర్జెంటీనా జీవితాన్ని గురించిన వ్యంగ్య చిత్రణ కూడా కనిపిస్తుంది.

అడాల్ఫో ప్రసిద్ధ కవయిత్రి 'సిల్వినా ఒకాంపో' (Silvina Ocampo) ను వివాహమాడాడు. ఆమెతోనూ, బోర్జెస్‌తోనూ కలసి 1941 లో ఆర్జెంటీనా కవుల కవితలతో కూర్చిన *అంతొలొజియా పొయెటికా అర్జెంటీనా* అనే సంకలనానికి సంపాదకత్వం వహించాడు. బోర్జెస్‌తో కలసి 1955 లో రెండు కవితా సంకలనాలకు సంపాదకత్వం వహించాడు.

1970 తరువాత అడాల్ఫో తన దృష్టిని అపరాధ పరిశోధక కథలనూ, వైజ్ఞానిక కాల్పనిక సాహిత్యాన్నీ వ్రాయడంలో లగ్నంచేశాడు. ఆ రచనలలో కూడా రాజకీయ వ్యవస్థను గురించిన వ్యంగ్య చిత్రణ ఉండడం విశేషం.

*పి.ఎస్.జి.*

**బ్యోయార్డో, మటేయో మరియా (1440-94):** లాటిన్, ఇటాలియన్ రచయిత. బ్యోయార్డో ప్రభు వంశానికి చెందినవాడు. ఎస్తే నగరాధిపులను సేవించాడు. ప్రభువుల సైన్యాధిపతిగా మొదునా, రెగ్గియో నగరాలలో పనిచేశాడు. ఇటలీ భాషకు ప్రాగ్రూపమైన లాటిన్ భాషలోను, నవీనమైన ఇటలీ భాషలోనూ చక్కని కవితలు చెప్పాడు. ఇటలీ భాషలో తొలిసారిగా ప్రేమ కవిత్వాన్ని సజీవమైన గేయ ఫణితిలో గానం చేసిన ఘనత ఇతనిదే. ప్రేమ కవిత్వం ఒక నిర్జీవ సంప్రదాయంగా మారిన తరుణంలో తన ప్రేయసి అయిన 'అంటోనియా కపారా' పై ప్రణయ కవితను వ్రాసి, ఆ విధమైన కవితకు ప్రాణం పోశాడు. ఇతని గేయ సంకలనం *అమొరమ్ లిబ్రీటీస్* (1499-మూడు ప్రేమ కావ్యాలు) ప్రసిద్ధి కెక్కింది. ఇతని బృహద్రచన *ఆర్లేండో*

*ఇన్నమరెట్టో* అసమగ్రంగా మిగిలిపోయింది. మూడు భాగాలుగా విభజించబడ్డ ఈ ఇతిహాస కావ్యంలో మొదటి రెండు భాగాలు మాత్రం పూర్తిగా ముద్రితం అయాయి. మూడో భాగం కొంతవరకు వ్రాశాక ఇతడు కన్ను మూశాడు. కాల్పనిక సంప్రదాయానికి చెందిన ప్రక్రియా విశేష మిది. మన ప్రబంధాలను జ్ఞప్తికి తెస్తుందీ ప్రక్రియ. బ్యోయార్డో కవితా ప్రాగల్భ్యం గల వాడే అయినా, ఈ కావ్యం ప్రజారంజకం కాలేక పోయింది. బహుశః ఇతని ప్రౌఢశైలి, మాండలిక భాష ఇందుకు కారణం కావచ్చు. పటిష్ఠమైన నిర్మాణలోపం కూడా ఒక కారణం కావచ్చు. ఇతడు ప్రదర్శించిన భావావేశం ఆ నాటి నాగరక సభ్యులకు వెగటుగా కనిపించి ఉండవచ్చు. ఇతని కావ్యం సాధారణ జనరంజకం కాకపోయినా కవి జన మనోరంజక మైంది. దీనికి అనుకరణలు కోకొల్లలుగా వచ్చాయి. అందులో ప్రధానమైనది ఇతని కాలంలోనే ఇతని కావ్యానికి పూరక గ్రంథంగా మలచబడ్డ *ఆర్లెండో ఫ్యూరియోసో* (Orlando Furioso). దీనిని రచించినవాడు అరియొస్టో. ఈ గ్రంథం బాగా ప్రచారం పొందడమే కాక ఆంగ్ల సారస్వత రంగంలో 'కవీనాం కవిః' అని ప్రసిద్ధి వడసిన ఎడ్మండ్ స్పెన్సర్ వ్రాసిన ప్రసిద్ధ ఇతిహాసకావ్యం *యక్షిణీ రాజ్ఞి* (Faiery Queen) రచనకు స్ఫూర్తి నిచ్చింది.

*గం.శ్రీ.*

**బ్యోర్న్‌సన్, బ్యోర్న్‌సెట్ - గెర్న్, మారిటానియస్ (1832-1910)** : నార్వే దేశపు అగ్రశ్రేణి రచయిత. బహుముఖ ప్రజ్ఞాధురీణుడు, నోబెల్ పురస్కార గ్రహీత. కవిగా, నాటక రచయితగా, నవలా రచయితగా, విద్యావేత్తగా, ప్రజానాయకుడుగా ప్రముఖుడు, ప్రసిద్ధుడు. ఇతడు రచించిన గేయం *యా వి ఎల్‌స్కర్ డెట్ లేన్ డెట్* (ఔను, మేమీ భూమిని జన్మాంతం ప్రేమిస్తాం) నార్వేదేశపు జాతీయగీతమైంది.

బ్యోర్న్‌సెట్-గెర్న్ తండ్రి చర్చిలో పాస్టర్. బ్యోర్న్‌సన్ బాల్యం డేలక్ అనే పల్లె పట్టులో చిన్న వ్యవసాయ క్షేత్రంలో గడవడం వల్ల తరువాత ఇతడు రచించిన నవలలలో, ఆ వాతావరణం గ్రామీణ నాగరికత చోటు చేసుకొన్నాయి. ఇతడు దేశభక్తి ప్రేరకాలైన రచనలు చేసి తన జాతి గర్వంతో తలెత్తుకొనేలా చేయించాలన్న దృఢ సంకల్పంతో కలం పట్టాడు. తన తొలి పదేహేనేళ్ల సాహిత్య వ్యవసాయంలో రెండే పంటలను మార్చి మార్చి పండించాడు. ఒకటి తన దేశపు గతవైభవాన్ని, కీర్తించే కవిత, రెండవది సమకాలీన వ్యవస్థను, ముఖ్యంగా గ్రామీణ వ్యవస్థను చాటిచెప్పే నవలా రచన. మొదటి తరహా రచనలలో ప్రసిద్ధ ఇతిహాసాలైన *శాగాలలోని* గాథలను త్రవ్వి తలకెత్తాడు. రెండవరకం రచనలలో, సమకాలీన సమాజపు విలువలను చిత్రించాడు. రెండు రకాల రచనలలోనూ నైతిక విలువలకు అధిక ప్రాముఖ్య మిచ్చాడు. రెండు రకాల రచనల్లోనూ నవ సమాజపు పునాదిరాళ్లు గతకాలపు అగాథంలో పూడుకు పోయాయని గుర్తు చేశాడు. ఈ రచనలలో కొన్ని: నాటకాలు - *రెండు యుద్ధాలమధ్య* (Between Two Battles), *నమ్మిక-కష్టాలు* (Trust and Trials), *నార్వేలో ప్రేమ జీవితం* (Love and Life in Norway-1970), *ఆనందబాలుడు* (The Happy Boy), *వెలుగు కొండ* (The Sunny Hill)- 1817-59 ల మధ్య ఇతడు *హెన్రిక్ ఇబ్సెన్* స్థానంలో బార్జిన్ థియేటర్ డైరక్టరుగా పనిచేశాడు. అదే సమయంలో ప్రఖ్యాత నటి కేరొలిన్ రీమర్స్‌ను వివాహమాడాడు. *బెర్జెన్ పోస్టమ్* పత్రికకు సంపాదకత్వం వహించాడు. ఇతడు పత్రికా నిర్వహణలో చూపిన దీక్ష, దక్షత ప్రజాభిప్రాయాన్నెంతగానో ప్రభావితం చేసి, అనతికాలం లోనే జరిగిన ఎన్నికలలో కన్సర్వేటివ్ పార్టీని బలహీన పరచి, లిబరల్ పార్టీ విజయాన్ని సుకరం చేశాయి. మూడేళ్ల విదేశ పర్యటనానంతరం బ్యోర్న్‌సన్ క్రిస్టియానియా థియేటర్‌కు డైరెక్టరయాడు. *నార్స్ ఫోక్స్ బుల్‌డు* పత్రికకు అయిదేళ్లు సంపాదకత్వం వహించాడు. ఇతని ప్రథమ కవితా సంకలనం *పద్యాలు-పాటలు* (Poems and Songs) 1915 లో ఇంగ్లీషులో ప్రచురితమైంది. 1870 లో వ్రాసిన ఇతని ప్రసిద్ధేతిహాసకావ్యం *ఆర్న్రోటో గెలిని* (Arnroto Galline) 1917 లో ఆంగ్లంలోకి అనూదితమైంది. రాజకీయ యుద్ధాలతోనూ, సాహిత్యసమరాలతోనూ తలమున్కలైన బ్యోర్న్‌సన్ రచనా వ్యాసంగానికి కలిగిన అవరోధాన్ని అధిగమించేందుకు విశ్రాంతి నభిలషిస్తూ రెండేళ్లపాటు ప్రవాసంలో గడపాడు. తనకు తాను విధించుకొన్న ఈ ప్రవాస కాలంలో జగత్ప్రసిద్ధమైన రెండు నాటకాలను రచించాడు. 1. *దివాలా కోరు* (The Bankrupt-1875), 2. *సంపాదకుడు* (The Editor, 1914) ఈ రెండు నాటకాలు ఇతివృత్త ప్రధామైన సంప్రదాయ ధోరణిలో గాక, వాగ్వివాదాత్మకమైన పంథాలో నడిచి, హెన్రిక్ ఇబ్సన్ మాదిరిగా యూరప్‌లో నవ్య నాటకానికి బాటలు వేశాయి. ఇదే కోవకు చెందిన సమస్యా నాటకాలు మరి రెండు వెంటనే వచ్చాయి: *రాజు* (The king), *నూత్నపద్ధతి* (The New systems).

ఇతడు వ్రాసిన రెండు నవలలు కూడా ప్రసిద్ధమయాయి. అవి: *అదే మార్గంలో* (In Dods Way), *ది హెరిటేజ్ ఆఫ్ కుర్ట్* (కుర్టు వారసత్వం, 1892). ఇందులో మొదటి నవలలో క్రైస్తవమతాన్ని, మహిమలను తీవ్రంగా విమర్శించాడు. రెండవ నవలలో సంఘంలో రావలసిన మార్పులను వివరించి, అలాంటి మార్పులకు ప్రాథమిక పాఠశాలలోనే అంకురార్పణ జరగాలని సూచించాడు. ఇతడు తన చరమదశలో వ్రాసిన నాటకాలు ఇతని పరిణత భావాన్ని ప్రతిబింబిస్తున్నాయి. *మన శక్తి కవ్వల* (Beyond Our Power), *మానవాతీతంగా* అనే నాటకాలు ఈ దశకు చెందిన ప్రసిద్ధ నాటకాలు. తన జీవిత చరమదశలో బ్యోర్న్సన్ తనను తాను సోషలిస్టునని అభివర్ణించుకొన్నాడు. సోషలిజంకోసం, ప్రపంచ శాంతికోసం, అంతర్జాతీయ అవగాహన కోసం, అవిశ్రాంతంగా పరిశ్రమించాడు. విస్తృతంగా పర్యటించాడు. నిరంతరంగా రచనలు సాగించాడు. అంతర్జాతీయంగా అఖండ ఖ్యాతిని గడించాడు.

*గం.శ్రీ.*

**బ్రయంట్, విలియం కులెన్ (1794-1878):** ప్రకృతి వర్ణనలో సిద్ధహస్తుడైన అమెరికా దేశపు కవి, పత్రికా రచయిత. అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో ప్రసిద్ధికెక్కిన వార్తా పత్రిక *ఈవినింగ్ పోస్టు* కు సంపాదకుడు, యజమాని. *థేనెటోప్సిస్* అనే కావ్య కర్తగా స్మరణీయుడు. ఇంగ్లండు నుంచి వలస వచ్చిన ఒక పవిత్ర (ప్యూరిటన్) కుటుంబానికి చెందిన బ్రయంట్ మొదట తన 16 వ ఏట విలియమ్స్ కాలేజీలో చేరినా, అచిరకాలంలోనే ఆ కాలేజీని విడిచి పెట్టాడు. ఇతడిలా మధ్యంతరంగా మానివేయడానికి కేవలం ఆర్థిక పరమైన ఇబ్బందులే కాక, ప్రసిద్ధమైన యేల్ యూనివర్శిటీలో చదవాలన్న కుతూహలం కూడా కారణం. అయితే యేల్ యూనివర్శిటీలో చేరే అవకాశం లేదని తెలియడంతో, సొంతగా చదువుకొని న్యాయశాస్త్రంలో ఉత్తీర్ణుడయాడు. తన 21 వ ఏట న్యాయవాద వృత్తి



చేపట్టి, ఒక పదేళ్లపాటు ఆవృత్తిలోనే ఉన్నాడు. అతనికి ఆవృత్తిలో ఆనందం కాని, సంతృప్తి గాని లభించలేదు. 26 వ ఏట ఫ్రాన్సిస్ ఫెయిర్ ఛైల్డ్ అనే యువతిని వివాహమాడి, ఆమెతో 50 ఏళ్లపాటు సుఖంగా సంసారం చేశాడు. 1825 లో న్యూయార్క్ రివ్యూ పత్రిక సహ సంపాదకుడుగా చేరి బేరింగ్టన్ నగరం నుండి న్యూయార్కుకు మకాం మార్చాడు. 1827 లో *ఈవెనింగ్ పోస్టు* పత్రికలో సంపాదకుడుగా చేరి, 1829 లో దానికి ముఖ్య సంపాదకుడయాడు. ఆ పత్రిక యాజమాన్యంలో భాగస్వామ్యం సంపాదించాడు. తెలివిగా పెట్టుబడి పెట్టి, త్వరలోనే ధనికుడు కాగలిగాడు. మత విషయంలో సంప్రదాయవాది కనుక కవిత్వంలో కూడా ప్యూరిటన్ భావాలే ప్రకటించాడు. రాజకీయంగా కూడా గతానుగతికంగా వచ్చే భావాలను ఆదరించి తన *ఎంబర్గో* (1808) అనే కావ్యంలో ప్రకటించాడు. ఈ కావ్యరచన సమయానికి అతని వయస్సు 13 ఏళ్లు. ఇందులో బ్రయంట్ అమెరికా అధ్యక్షుడైన థామస్ జెఫర్సన్‌ను రాజీనామా చేయాలని గట్టిగా కోరాడు. తన 17 వ ఏట వ్రాసిన *థానటోప్సిస్* (Thantopsis) 'మృత్యువును గూర్చి' అనే కవిత ఇతనికి మంచి పేరు ప్రఖ్యాతులు తెచ్చింది. ఇందులో ఇతడు పూర్వపు ప్యూరిటన్ భావాలకు స్వస్తి చెప్పి 'డీయిజం' వైపు మొగ్గు చూపాడు. మరికొద్ది కాలానికి యూనిటేరియన్ చర్చిలో చేరాడు. 'ఫెడరలిజం' ను విడిచిపెట్టి డెమోక్రాటిక్ పార్టీలో చేరి, ఆ పార్టీ ఆదర్శాల ప్రచారానికి తన పత్రిక *ఈవినింగ్ పోస్టు* ను ఉపయోగించాడు. స్వేచ్ఛా వాణిజ్యం, వాక్స్వాతంత్ర్యం, కార్మికుల హక్కులు, బానిసత్వ నిర్మూలనం ధ్యేయాలుగా ప్రతిపాదించాడు. మరి కొంత కాలానికి ఇతడు ఇతర నాయకులతో కలసి రిపబ్లికన్ పార్టీని స్థాపించాడు. 1821 లో ఇతడు ప్రచురించిన *పోయెమ్స్* (కవితలు) అనే గ్రంథం కవిగా ఇతనికి కీర్తి చేకూర్చింది.

*గం.శ్రీ.*

**బ్రాంటే, ఎమిలీ (1818-1848) :** ఆంగ్ల నవలా రచయిత్రి, కవయిత్రి. ఈమె రచించిన నవల ఒక్కటే *వుదరింగ్ హైట్స్* (1847). ఇది విశిష్ట భావనతోనూ, ఆవేశంతోనూ, ద్వేషంతోనూ కూడిన నవల. యార్క్‌షైర్‌లోని మైదానాలు ఈ కథకు రంగస్థలం. ఈమె కలంపేరు 'ఎల్లిస్ బెల్'. ఐరిష్ దేశీయుడైన పాట్రిక్ బ్రాంటే ఆరుగురు సంతానంలో ఈ ఎమిలీ బ్రాంటే నాల్గవ బిడ్డ. ఈమె ఛార్లట్ బ్రాంటే చెల్లెలు. కుటుంబ పోషణకోసం ఛార్లట్ ఆడపిల్లల స్కూలు నడిపింది. ఆ

స్కూలు నిర్వహణలో ఎమిలీ కూడా అక్కకు తోడ్పడింది. 1842 ఫిబ్రవరిలో ఎమిలీ తన అక్కతో విదేశీ భాషలు నేర్చుకోడానికీ, పెన్షన్ హెగర్ వద్ద పాఠశాలా నిర్వహణ పద్ధతులను అభ్యసించడానికీ బ్రసెల్స్ వెళ్లింది. బ్రసెల్స్‌లో చార్లట్ కంటె మరింత గంభీర స్వభావురాలైన ఎమిలీకే ఎక్కువ ఆదరణ లభించింది. అక్టోబర్ నెలలో ఆమె మేనత్త చనిపోవడంతో ఎమిలీ హోవర్త్ తిరిగి రావలసి వచ్చింది.

1845 లో ఎమిలీ వ్రాసిన పద్యాలు కొన్ని ఆమె అక్క చార్లట్ కంట పడ్డాయి. ఒక ఏడాది తరువాత ముగ్గురు బ్రాంటే అక్కచెల్లెళ్ల పద్యాలూ కలిపి పుస్తకరూపంగా ప్రకటించారు. ఆ పుస్తకం పేరు *పొయెమ్స్ బై క్యురెర్, ఎల్లిస్, అండ్ ఆక్టన్ బెల్.* ఆ సంపుటిలో ఎమిలీ వ్రాసిన పద్యాలు 2 ఉన్నాయి. ఆ సంపుటిలోని పద్యాలన్నిటిలో ఎమిలీ వ్రాసిన పద్యాలే నిజమైన కవితా ప్రతిభను ప్రకటిస్తున్నాయని విమర్శకులు అభిప్రాయ పడ్డారు. ఆ పుస్తకం అచ్చువేయడానికి ఆ సోదరీమణులకు 50 పౌండ్లు ఖర్చయాయి. రెండు ప్రతులు మాత్రమే అమ్ముడు అయాయి.

1847 డిసెంబర్ నెలలో ఎమిలీ బ్రాంటే రచించిన *వుదరింగ్ హైట్స్* నవల ప్రచురించబడింది. ప్రచురింపబడిన వెంటనే అది కఠిన విమర్శనలకే గురి అయినా, అనంతరకాలంలో ఆంగ్ల భాషలో వెలువడిన గొప్ప నవలలలో ఒకటిగా అది ప్రసిద్ధి పొందింది. తరువాత కొద్దికాలానికే ఎమిలీ బ్రాంటే ఆరోగ్యం క్షీణించడం ప్రారంభించింది. 1848 డిసెంబర్ 19 న యార్క్‌షైర్‌లో క్షయ వ్యాధితో ఆమె మరణించింది.

బొ.శ్రీ.

**బ్రాంటే, చార్లట్ (1816-1855)** : ప్రముఖ ఆంగ్ల నవలా రచయిత్రి. ఈమె రచించిన నవల *జేన్ ఐర్* (1847) విశేష ప్రశస్తి పొందింది. ఒక స్త్రీ తన సహజమైన వాంఛలతోను, సాంఘికమైన కట్టుబాట్లతోను ఘర్షణపడిన ఇతివృత్తం ఈ నవలలో బలంగా ప్రతిపాదించబడింది. విక్టోరియన్ యుగ కాల్పనిక సాహిత్యానికి అపరిచితమైన 'నిజాయితీ' ఈ నవలలో కనిపిస్తుంది. ఆటు తరువాత ఈమె రచించిన నవలలు: *షర్లీ* (1849), *విల్లెట్* (1853).

పాట్రిక్ బ్రాంటే (1777-1861), మరియా బ్రాంటే దంపతుల ఆరుగురు సంతానంలో ఈమె నాల్గవది. యార్క్‌షైర్‌లోని తారన్‌టన్‌లో 1816 ఏప్రిల్ 21 న ఈమె జన్మించింది. చిన్నతనంలోనే ఈమె తల్లి, ఇద్దరు అక్కలు హఠాత్తుగా మరణించారు. చార్లట్ తన చెల్లెళ్లు ఎమిలీ, ఆన్ లతోనూ, తమ్ముడు పాట్రిక్ బ్రాన్‌వెల్ తోను పాటుగా తన తండ్రి పోషణలోనే పెరిగి పెద్దదయింది. 1824 లో చార్లట్ కోవాన్ బ్రిడ్జ్ లోని క్లెర్జీ డాటర్స్ స్కూల్‌కు వెళ్లింది. చాలాసంవత్సరాల తరువాత *జేన్ ఐర్* అనే నవలలో చార్లట్ ఆ స్కూల్‌లోని దుర్భర పరిస్థితులను విమర్శించింది. 1831 లో చార్లట్‌ని హడ్డర్స్ ఫీల్డ్ సమీపంలోని రో హెడ్ లోని మిస్ వూలర్స్ స్కూల్‌కు పంపారు. అక్కడ ఆమెకు పలువురు యావజ్జీవ మిత్రులు ఏర్పడ్డారు. ఎల్లెన్ నస్సీతో ఆమెకు జీవితాంతం ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగాయి. ఆ ఉత్తర ప్రత్యుత్తరాల సాయంతోనే చార్లట్ జీవిత చరిత్రను కొంతవరకు పునర్నిర్మించడం సాధ్యం అయింది.



చార్లట్‌ను వివాహమాడాలని రెవరెండ్ హెన్రీ నస్సీ (ఆమె స్నేహితురాలి సోదరుడు), తరువాత మరొక క్లెర్జీమన్ ముందుకు వచ్చారు. కాని చార్లట్ అప్పుడు వివాహం చేసుకోడానికి నిరాకరించింది. తరువాత ఆర్థర్ బెల్ నికోల్స్ (1817-1906) అనే ఐరిష్ దేశీయుడు చార్లట్‌ను వివాహమాడగోరాడు. 1854 జూన్ 29 న హోవర్త్ చర్చ్‌లో వారి వివాహం జరిగింది. త్వరలోనే ఆమె గర్భవతి అయి వేవిళ్లు దుర్భరం కాగా 1855 మార్చి 31 వ తేదీన యార్క్‌షైర్‌లోని హోవర్త్‌లో మరణించింది.

చార్లట్ వ్రాసిన తొలి నవల *ది ప్రొఫెసర్.* ఇది

ఆమె మరణానంతరం 1857 లో ప్రచురితమైంది. ఉత్తమ పురుషలో ఒక ఇంగ్లీష్ ట్యూటర్ చెప్పే ఈ కథలో ఛార్లట్ సొంత అనుభవాలే ప్రకటించబడ్డాయి. *జేన్ ఐర్* అనే నవల విజయానికి కారణం స్త్రీ శక్తి పట్ల రచయిత్రికి గల దృఢమైన అభినివేశం. ఆ నవలకు ఆత్మ కథ అనే ఉపశీర్షిక కూడా ఉంది. ఈ నవల కూడా ఉత్తమ పురుషలోనే చెప్పబడింది.

*షర్లీ* అనే నవలను ఛార్లట్ ఎలాంటి కల్పనలూ, హఠాత్ సంఘటనలూ లేకుండా వాస్తవిక ధోరణిలో రచించాలని ప్రయత్నించింది. దీనిలో స్థానిక జనులలో నుంచి పాత్రలను ఎన్నుకోడం కనిపిస్తుంది. షర్లీలో పరిహరించిన ఉత్తమ పురుష కథనం తిరిగి *విల్లెట్* అనే నవలలో కొనసాగించబడింది. ఛార్లట్ నవలలలో కనిపించే విశిష్టత 'కథలోనూ, కథాకథన విధానంలోనూ గాఢంగా ఆమె పాల్గొనడం' అని విమర్శకులు పేర్కొన్నారు.

బొ.శ్రీ.

**బ్రాండిస్, జార్జ్ (1842-1927) :** సుప్రసిద్ధ డేనిష్ విద్వాంసుడు, విమర్శకుడు. అతని మౌలిక రచనలు 1870 నుండి మూడు దశాబ్దాలపాటు స్కాండినేవియన్ సాహిత్య ప్రపంచాన్ని ప్రభావితం చేశాయి. జార్జ్ బ్రాండిస్ 1864 లో కోపెన్ హాగన్ విశ్వవిద్యాలయం నుంచి పట్టా పుచ్చుకొన్నాడు. విద్యాభ్యాసం ముగించిన



తరువాత అతడు యూరపు యాత్ర (1865-71) చేశాడు. ఈ సమయంలో ఫ్రెంచ్ విమర్శకులైన టైన్, రేనన్, ఆంగ్ల రాజకీయ దార్శనికుడైన జాన్ స్టూవర్ట్ మిల్‌లను పారిస్‌లో కలసి వారి ఆశయాల ప్రభావానికి లోనయాడు. డెన్మార్క్ ఇతర ప్రాంతాలతో సాంస్కృతిక సంబంధాలు పెంపొందించుకోకుండా, ప్రాంతీయ తత్త్వంతో సంకుచితమై ఉండటం చూసి, ఏ విధంగానైనా సరే ఆ మచ్చను తొలగించాలని బ్రాండిస్ కంకణం కట్టుకొన్నాడు. అతడు పశ్చిమ యూరపులోని రాజకీయ, సాంస్కృతిక మితవాద ధోరణులను డెన్మార్క్ ప్రజలకు పరిచయం చేశాడు.

బ్రాండిస్ 1871 లో కోపెన్ హాగన్ విశ్వవిద్యాలయంలో "19 వ శతాబ్ది సాహిత్యంలోని ప్రధాన ధోరణులు" అనే అంశం మీద వరుసగా ఉపన్యాసాలిచ్చాడు. ఇవి 1872-90 మధ్యకాలంలో ఆరు సంపుటాలుగా వెలువడ్డాయి. ప్రసిద్ధ నాటకకర్త ఇబ్సన్ బ్రాండిస్‌ను అతడు చేపట్టిన ఉద్యమాన్ని మరింత స్ఫూర్తితో కొనసాగించమని ప్రేరేపించాడు. అతనికి మరికొంత మంది సమకాలీన మేధావులు, రచయితలు ఉద్యమం నడపడంలో చేయూత నిచ్చారు. బ్రాండిస్ తలపెట్టిన ఉద్యమానికి మితవాద విద్యావంతులు ఆసరాగా నిలచారు. కాని, పూర్వాచార పరాయణులైన దేశీయులు అతని సంస్కరణలకు ఎదురు తిరిగారు. శత్రువులు అతన్ని 'నాస్తికయూదు' నిగా చిత్రించారు. బ్రాండిస్ గొప్ప విద్వాంసుడైనా, రాజకీయ వ్యతిరేకత కారణంగా అతనికి కోపెన్ హాగన్ విశ్వవిద్యాలయంలో దక్కవలసిన సౌందర్య శాస్త్ర (Aesthetics) ఆచార్యపీఠం దక్కకుండా పోయింది. బ్రాండిస్ నిస్పృహకు లోనై బెర్లిన్ (1877-83) లో స్థిరపడ్డాడు.

బ్రాండిస్ లోతైన పాండిత్యం కల మేధావి. తన మౌలికమైన భావాలను తెలియజేస్తూ ఎన్నో రచనలు చేశాడు. ధార్మిక దార్శనికుడు కిర్క్‌గార్డ్, సమాజవాద నాయకుడు ఫెర్డినాండ్ లాసల్లీ, డేనిష్ నాటకకర్త లుడ్విగ్ హోల్ బర్గ్‌లను గురించి విమర్శాత్మక గ్రంథాలు రచించాడు. బ్రాండిస్ విమర్శ గ్రంథాల్లో *ఆధునిక విప్లవ నాయకులు, (1883), డేనిష్ కవులు* (1877) పేర్కొనదగినవి.

ఫ్రెడరిక్ నీషే (Nietzsche) భావాలచే ప్రభావితమై ధనిక అతివాదం గురించి బ్రాండిస్ ఒక పుస్తకం వెలువరించాడు. అతడు షేక్‌స్పియర్, గెయ్‌థే, వోల్టేర్, జూలియస్ సీజర్, మైకెలేంజిలోలను గురించి విలువైన పుస్తకాలు వ్రాశాడు. బ్రాండిస్ చివరి దాకా తన ఆశయాలకు కట్టుబడి జీవించాడు. అతని గ్రంథం *జీసస్: ఒక కట్టుకథ* (1925) అతని శత్రువుల సంఖ్యను మరింత ఎక్కువ చేసింది. జీవితాంతం బ్రాండిస్ వివాద గ్రస్త వ్యక్తిగా ఉండిపోయాడు.

జి.అ.నా.

**బ్రాడ్‌స్కీ, జోసఫ్ (1940--) :** రష్యన్-అమెరికా కవి, వ్యాస రచయిత. సౌభ్రాత్రం, మానవత్వం, స్వతంత్ర భావాలతో నిండిన ఇతని కవితలకు 1987 వ సంవత్సరంలో సాహిత్యంలో నోబెల్ బహుమతి వచ్చింది. అతి చిన్న వయస్సులో (47 సంవత్సరాలు) సాహిత్యంలో

నోబెల్ బహుమతి అందుకున్న ఇద్దరిలో బ్రాడ్‌స్కీ రెండవవాడు. ఆల్‌బెర్ట్ కమూ (Albert Camus) 1957 వ సంవత్సరంలో తన 44 వ ఏట ఈ బహుమతిని అందుకున్న మొదటివాడు.

ఐక్య రష్యాలోని లెనిన్ గ్రాడ్ నగరంలో 1940 వ సంవత్సరం మే నెల 24 వ తేదీన ఒక యూదు కుటుంబంలో బ్రాడ్‌స్కీ జన్మించాడు. తండ్రి మొదటి అలెగ్జాండర్, తల్లి మేరీ. 1956 వ సంవత్సరం వరకు లెనిన్ గ్రాడ్ పాఠశాలలోనే విద్య నభ్యసించాడు. 1964 లో 'పారాసిటిజం' (Paracitism) క్రింద రష్యన్ ప్రభుత్వం ఈయనను అరెస్టు చేసి 18 నెలలు ఆర్కిటిక్ కాంప్‌లో నిర్బంధించింది. అటు పిమ్మట 1972 వ సంవత్సరంలో రష్యన్ దేశం నుండి ఇతడు బహిష్కరించబడ్డాడు. ఈ దేశబహిష్కరణ వల్ల అమెరికా దేశానికి ఇతడు శరణార్థిగా వెళ్ళాడు. తన దేశ బహిష్కరణను గురించి విలేఖకులతో మాట్లాడుతూ కేవలం "యూదుడననే వంకతో నన్ను దేశం నుండి బహిష్కరించారు" అని తన ఆవేదనను వ్యక్తపరచాడు. 1977 లో అమెరికా దేశపు పౌరస్వత్వాన్ని పొందాడు. మిచిగన్ విశ్వవిద్యాలయంలో ఇతడు పనిచేశాడు. 1978 వ సంవత్సరంలో యేల్ విశ్వవిద్యాలయం ఈయనను డి.లిట్ (D.Litt) తో గౌరవించింది. ఖ్యాతి గడించిన 'బవేరియన్ అకాడమీ ఆఫ్ సైన్సెస్' 'అమెరికన్ అకాడమీ ఆఫ్ ఆర్ట్స్ అండ్ సైన్సెస్' లలో బ్రాడ్‌స్కీ సభ్యుడు.

ఈయన కవిత్వంలో తరచు మతం, సౌభ్రాత్రం, నిరాశ, సామ్యవాదం, మానవత్వం, నిర్భీతి, మొదలగు అంశాలు కన్పిస్తాయి. సహజంగా కవులకు మధ్య వయస్సులో వచ్చే నిశ్చయాత్మక జ్ఞానం ఈయనకు 33 ఏటనే వచ్చింది. జైలు నిర్బంధం, దేశబహిష్కరణ శిక్షల వల్ల సహజంగానే ఈయన కవిత్వంలో రాజకీయ విమర్శ ఎక్కువగా ఉంటుంది.

రష్యా దేశంలోనే కాక యావత్ ప్రపంచంలోను ఒక గొప్ప కవిగా, వ్యాస రచయితగా పేరు ప్రతిష్ఠలు గడించిన బ్రాడ్‌స్కీ రష్యాదేశంలో 4 కవితా సంపుటాలు ప్రచురించ గలిగాడు. ఈయన కవితా సంపుటాలు సుమారు 12 భాషలలోకి అనువదించ బడ్డాయి. ఇంగ్లీషు, పోలిష్ భాషల కవిత్వాన్ని రష్యన్ భాషలోకి, రష్యన్ కవితలను హీబ్రూ భాషలోకి బ్రాడ్‌స్కీ అనువదించాడు. ఈయన ఇంగ్లీషు భాషలో రచించిన రచనలు కూడా ప్రసిద్ధి పొందాయి.

ఈయన కవితలను జీన్ జాక్విస్ మరీ (Jean Jacques Marie) అనే రచయిత *కొలిన్ ఎ ఆత్రెస్ పొయమె* అనే పేరుతో 1966 లో ఫ్రెంచి భాషలోకి అనువదించాడు. 1967 లో నికోలస్ బెథెల్ *ఎలిజీ టు జాన్ డన్ అండ్ అదర్ పోయమ్స్* అనే పేరుతోనూ, 1973 లో జార్జ్ ఎల్.కె.లైన్ *సెలెక్టెడ్ పోయమ్స్, బ్రాడ్‌స్కీ* అనే పేరుతోనూ ఇంగ్లీషులోకి అనువదించారు.

భారతి

**బ్రాడ్‌స్ట్రీట్, ఆన్ (1612-72) :** అమెరికా వలస స్థావరాల్లో ఆంగ్లంలో కవిత్వం వ్రాసిన తొలి కవులలో ఒకరు. వలస స్థావరపు కొత్త రోజులలో కలం పట్టిన కవయిత్రిగా మాత్రమే చాలాకాలం చారిత్రకంగా ఈమెకు గుర్తింపు ఉండేది. కాని 20 వ శతాబ్దంలో విమర్శకలోకం ఈమెను గొప్ప కవయిత్రిగా అంగీకరించింది. ముఖ్యంగా ఆమె ఆడపా దడపా *కాంటెంప్లేషన్స్* అన్న పేరుతో వ్రాసిన కవితల వల్ల ఆమె కెంతో పేరు వచ్చింది. ఈమె వాటిని తన కుటుంబ సభ్యులు చదువుకొని ఆనందించటానికి మాత్రమే ఉద్దేశించింది. ఈ కవితలు 19 వ శతాబ్ది మధ్యభాగం వరకూ ప్రచురింపబడలేదు.

ఆన్ తండ్రి థామస్ డుడ్లే ప్యూరిటన్ మతాభిమాని. ఆయన లింకన్ ప్రభువు కొలువులో ఛీఫ్ స్టివర్డ్‌గా ఉండేవాడు. అలా ఆమెకు సంస్కృతి, సంస్కారాలతో నిండిన వాతావరణంలో పెరగడం సంభవించింది. ఆమెకు 16 ఏళ్లవయస్సులో లింకన్ ప్రభువు ఆశ్రితులలో ఒకడైన 'సైమన్ బ్రాడ్ స్ట్రీట్' (Simon Broadstreet) తో వివాహ మయింది. పెళ్ళి అయిన రెండేళ్లకు, కొంతమంది ప్యూరిటన్ మతస్థుల (puritans) తో కలసి ఆమె, ఆమెభర్త, ఆమె తల్లిదండ్రులు ఇంగ్లాండ్ నుండి ఓడమీద అమెరికాకు వచ్చారు. మెస్సాచెట్స్ బే కాలనీలో స్థిరపడ్డారు.

తన సంతానం ఎనిమిది మంది పిల్లల్ని పెంచి పెద్ద చేస్తూ, ఇల్లాలుగా గృహ కృత్యాలు నిర్వర్తిస్తూనే వెసులుబాటు చేసుకొని ఆన్ కవితా వ్యాసంగాన్ని చేపట్టింది. ఆమె తరుచుగా తన నివాసం మారుస్తూ ఉండేది. మొదట్లో కేంబ్రిడ్జిలో ఉంటూ, తరువాత ఇప్స్‌విచ్ (Ipswich) కి మారింది. చివరకు ఆండోవర్‌లో స్థిరనివాసం ఏర్పరచుకొంది. ఆమె బావగారు 'జాన్ వుడ్ బ్రిడ్జ్' ఆమెకు తెలియకుండా ఆమె కవితలను ఇంగ్లాండ్‌కు తీసుకుని వెళ్లాడు. అక్కడ ఆమె కవితలు *ది టెన్త్ మ్యూస్ లేట్‌లీ స్ప్రింగ్ అప్ ఇన్ అమెరికా* అనే పేరుతో 1650 లో ప్రచురితం అయాయి. ఆన్

ఆశ్చర్యచకిత అయింది. ఆమె ఆశ్చర్యం ముగ్ధమోహనంగా *ది ఆథర్ టు హర్ బుక్* అనే కవితగా వెలువడింది. ఆ పుస్తకం అమెరికాలో 1678 లో ముద్రించినపుడు ఆకవితను దానిలో చేర్చటం జరిగింది. అమెరికా ముద్ర ణలో దానిపేరు *సెవరల్ పోయెమ్స్ కంపైల్డ్ విత్ గ్రేట్ వైరైటీ ఆఫ్ విట్ అండ్ లెర్నింగ్.*

మొదటి ప్రతిలో ప్రచురింపబడిన ఆమె కవితలు చాల భాగం సుదీర్ఘమైనవి. ఇవి ఇతర కవుల కవిత్వానికి అనుకరణగా కన్పిస్తాయి. కాని ఆ ప్రతిలోని చివరి రెండు కవితలు *ఆఫ్ ద వానిటీ ఆఫ్ ఆల్ వరల్డ్లీ క్రీచర్స్, డేవిడ్స్ లామెంటేషన్ ఫర్ సాల్ అండ్ జొనాథన్* మంచి కవితలే గాక, ఆమె సొంత బాణీని ప్రకటించేవి.

తన కుటుంబ సభ్యులకోసం ఆమె వ్రాసిన తరు వాతి కవితల్లో ప్యూరిటన్ మతం పట్ల ఆమె ప్రగాఢ విశ్వాసం, ఆధ్యాత్మిక వికసనం గోచరిస్తుంది. *ది ఫ్లెష్ అండ్ ద స్పిరిట్* లాంటి ఆమె కవితలలో ఆమె నీతి బోధనను విడవాడింది. *టు మై డియర్ అండ్ లవింగ్ హజ్బెండ్, ఆల్ థింగ్స్ విథిన్ దిస్ ఫేడింగ్ వరల్డ్ హాత్ ఎండ్* లాంటి అందమైన వ్యక్తిగత విషయాలకు ప్రాధాన్యం ఇచ్చే కవితలు కూడా ఆమె వ్రాసింది. *విత్ ట్రుబుల్డ్ హార్ట్ అండ్ ట్రెంబ్లింగ్ హాండ్ ఐ రైట్* అన్న కవిత ఆమె మనుమడు చనిపోయినపుడు వ్రాసిన కవిత. ఆమె వచన రచనల్లో ముఖ్యంగా పేర్కొనవ లసింది *మెడిటేషన్స్*. ఇది ఆమె నైతిక దృక్పథాన్ని చిన్న చిన్న పేరాల పుస్తకం. ఆమె వ్రాసిన వ్రాత ప్రతులను ఆమె సంతతివారు భద్రపరిచారు. 1867 లో 'జాన్ హార్వర్డ్ ఎల్లిస్' సంపాదకత్వంలో వెలువడిన పండితుల ప్రతిలో ఇవి చేర్చ బడ్డాయి. 1956 లో ఆమె రచనలలోని మాటలనే ఉటంకిస్తూ వ్రాసిన ఒక సుదీర్ఘ కవిత *హోమేజ్ టు మిస్ట్రెస్ బ్రాడ్ స్ట్రీట్* లో జాన్ బెర్రీమాన్ ఆమెకు నివాళు లర్పించాడు.

చక్రపాణి

**బ్రెఖ్ట్, బెర్టోల్ట్ (1898-1956)** : జర్మన్ కవి, నాటకకర్త, నాటకరంగ సంస్కర్త. ఈయన అసలు పేరు 'యూజెన్ బెర్తోల్డ్ ఫ్రెడరిక్ బ్రెఖ్ట్'. సాంప్రదాయిక నాటక రంగం కల్పించే భ్రమలను తొలగించి, వామ పక్ష ప్రయోజనాల కనుగుణంగా సామాజిక స్పృహలో ఆదర్శవంతంగా ఇతడు జర్మన్ నాటకాన్ని మలచాడు.

1924 దాకా బ్రెఖ్ట్ బవేరియాలో నివసించాడు. మ్యూనిచ్‌లో వైద్యశాస్త్రం అభ్యసించి (1917-21), సైనిక ఆస్పత్రిలో ఉద్యోగం (1918) చేశాడు. ఈ కాలంలోనే ఆయన తన మొదటి నాటకం *బాల్* (Baal: 1923 లో ప్రదర్శింపబడింది.) వ్రాశాడు. ఆయనకు పేరు తెచ్చిన రచన *ట్రామెల్న్ ఇన్ డెర్ నాఖ్ట్* (1922, Dreams in the Night). ఆయన పాటల, పద్యాల సంక లన గ్రంథం *డీ హౌస్‌పాస్టిల్* (Die Hauspostille: 1924). ఆయన మెచ్చుకొన్న కవులు, కళాకారులు: వేడ్ కింద్ (Wedekind), బాంబోద్ (Bambaud), విల్లాన్ (Villon), 'కిప్లింగ్' (Kipling).

మొదటి ప్రపంచ యుద్ధానంతరం విశ్లథ మవుతున్న నాగరకత పట్ల నిరాశా నిస్పృహలను ద్యోతకం చేసే ధోరణిని ఈ కాలంలోనే బ్రెఖ్ట్ అలవర్చుకొన్నాడు. డాడాయిస్ట్ పక్షానికి చెందిన సభ్యులు చాలా మంది ఈయన స్నేహితులు. వీళ్లు బూర్జువా కళల సత్య ప్రమాణాలను అవహేళన చేసేవారు; వ్యంగ్య రచనల ద్వారా వాటిని ఖండించేవారు. 1920 లో బ్రెఖ్ట్ మార్క్సిజం (Marxism) పట్ల ఆకర్షింపబడ్డాడు.

బెర్లిన్‌లో కొద్దికాలం (1924-33) మాక్స్ రైన్‌హా ర్డ్ట్, ఎర్విన్ పిస్కేటర్ అనే దర్శకుల వద్ద పనిచేశాడు, కాని తన వర్గం వారితోనే ఆయన ఎక్కువగా కలసి ఉండేవాడు. సంగీత దర్శకుడు కుర్ట్‌వీల్ తో కలసి వ్యంగ్య భరితమైన గొప్ప సంగీత నృత్య నాటిక, *డై డ్రీగో స్చేనోపర్* (1928- The three penny opera) ను, అలాంటిదే ఇంకో సంగీత నృత్యనాటిక *ఔఫ్‌స్టీగ్ అండ్ ఫాల్ డెర్ స్టాడ్ మెహాగనీ* (1930, Rise and fall of the town of Mahagonny) లను వ్రాశాడు.

1933 లో బ్రెఖ్ట్ నిర్వాసితు డయాడు. స్కాండి నేవియాలో, ముఖ్యంగా డెన్‌మార్క్ (1933-41) లోనూ, ఆ తరువాత యునైటెడ్ స్టేట్స్ (1941-47) లోనూ ప్రవాసిగా జీవించాడు. అమెరికాలో ఉన్నప్పుడు హాలీవుడ్ సినీ పరిశ్రమలో పనిచేశాడు. జర్మనీలో ఆయన పుస్త కాలు తగులబెట్టబడ్డాయి; ఆయన పౌరసత్వం రద్దు చేయబడింది. ఆయన జర్మనీ నాటక రంగం నుండి వైదొలగి పోయాడు. అయితే 1937-41 మధ్యకాలంలోనే బ్రెఖ్ట్ కొన్ని గొప్ప నాటకాలు వ్రాశాడు. రంగస్థలంపై వ్యాసాలు, *స్వెండ్ బోర్గర్ గెడిఖ్టె* (Svend borger gedichte: 1939) అన్న పేరుతో సంకలితమయిన కవి తలు అప్పుడే వ్రాశాడు. ఈ కాలంలో ఈయన వ్రాసిన నాటకాలు స్వీయ నిర్వహణలోను, ఇతరుల నిర్వహణ లోను ప్రదర్శింపబడి, ఈయన కెంతో పేరు తెచ్చాయి. వాటిలో ముఖ్యంగా పేర్కొనవలసినవి: *మట్టర్ కరేజ్ అండ్ ఇహ్ర్ కిండర్* (1941, Mother courage and Cher Children). ఇది 30 సంవత్సరాల యుద్ధాన్ని వర్ణించే చారిత్రక నాటకం.

'అమెరికన్ విరుద్ధ కార్యకలాపాల సమీక్షా సంఘం' ఎదుట సాక్ష్యం ఇచ్చిన తరువాత బ్రెఖ్ట్ 1947 లో అమెరికా వదలి వెళ్లాడు. జ్యూరిచ్‌లో ఒక సంవత్సరం కాలం గడిపాడు. ఆ కాలంలో ఆయన *అంటిగన్-మోడల్* (Antigone-Modell: 1948) అనే నాటకాన్ని 'హోల్డ ర్లిన్' అనువదించిన *సోఫకిల్స్* నాటకం ఆధారంగా రచించాడు. (ఇది 1948 లో ప్రదర్శింపబడింది). అదే కాక నాటకరంగంపై వ్రాసిన ప్రముఖ గ్రంథం *క్లీన్స్ ఆర్గానన్ ఫర్ దాస్ థియేటర్* (1949 "A Little organum for the Theatre") కూడా ఈ కాలంలోనే రచించబడింది.

1949 లో తన *మట్టర్ కరేజ్ అండ్ ఇహ్ర్ కిండర్* నాటక ప్రదర్శన సందర్భంగా బ్రెఖ్ట్ బెర్లిన్ వెళ్లాడు. (ఈనాటకంలో ఆయన భార్య హెలీన్ వీజెల్ ప్రధాన పాత్రధారిణి.) ఈ ప్రయాణం బ్రెఖ్ట్ తమ స్వంత కంపెనీ 'బెర్లినర్ ఇన్ సెంబల్' స్థాపించుకోడానికి, శాశ్వతంగా బెర్లిన్‌లోనే నివాసం ఏర్పరచుకోవటానికీ దారితీసింది. ఆ తరువాత తన కంపెనీ వ్యవహారాలు చూడటంలోను, తన నాటకాలు ప్రదర్శించటంలోను ఆయన ఎక్కువ కాలం గడపసాగాడు. 1955 లో బ్రెఖ్ట్ 'స్టాలిన్ పీస్ ప్రైజ్' పొందాడు. ఆ మరుసటి సంవత్సరమే ఆయన తూర్పు బెర్లిన్‌లో గుండెపోటుతో మరణించాడు.

చక్రపాణి

**బ్రెజీనా, ఓటకార్ (1868-1929)** : ఇది కలం పేరు. అసలుపేరు 'వాక్లావ్ జిబావీ'. 20 వ శతాబ్దపు జెక్ కవిత్వ వికాసానికి గణనీయమైన కృషి చేసిన జెక్ కవి.

సమ కాలీన రచయితల రచనలను ప్రభావితం చేసిన రాజకీయ, సాహిత్య ఉద్యమాల నుండి దూరంగా, 'మొరేవియా' లో బడి పంతులుగా బ్రెజీనా ఎక్కువ కాలం గడపాడు. ప్రజ లాదరించిన ఆయన సంగీత భరితమైన కవితలు అయిదు సంపుటాలుగా వెలువడ్డాయి. అవి : *తజెమ్నేడాల్కీ* (1895, The Mysterious Distances), *స్వితాని నా జేపేడ్* (1896, Dawn in the West), *వెట్రీ అడ్ పోల్యూ* (1897, Polar Winds), *స్టవి టెల్ఖెమ్* (1899, Builders of the temple), *రూస్* (1901, Hands). *వాక్లావ్ డోస్ హోవ్‌స్కీ* అనే మారు పేరుతో ఆయన వ్రాసిన కవితలు అంతగా పేర్కొనదగినవికావు. నిరాశతో కూడిన తాత్త్విక చింతన నుండి మానవాళి పట్ల పరిపూర్ణమైన ప్రేమ జీవితాన్ని ఉన్నది ఉన్నట్లుగా స్వీకరించగలిగే విశాల దృక్పథానికి ఎదిగినవాడు బ్రెజీనా.

చక్రపాణి

**బ్రెతోన్, ఆంద్రే (896-1966)** : ఫ్రెంచ్ కవి, వ్యాసకర్త, విమర్శకుడు, అధివాస్తవికతా వాద ఉద్యమ స్థాపకులలో ఒకడు.

వైద్య విద్యార్థిగా ఉన్నపుడు బ్రెతోన్‌కు మానసిక రోగాల పట్ల ఆసక్తి కలిగింది. సిగ్మండ్ ఫ్రాయిడ్ పుస్తకాలు చదవటం వల్ల ఆయనకు అజ్ఞాతచేతన (Unconscious) సిద్ధాంతంతో పరిచయం కలిగింది. మానసిక రోగ చికిత్సాశాస్త్రం (psychiatry) వల్లను, ప్రతీకవాద కవిత్వం వల్లను ప్రభావితుడైన బ్రెతోన్ డాడాయిస్ట్‌లలో చేరాడు. 1919 లో లూయీ ఆరగాన్, ఫిలిప్ సోపో లతో కలిసి *లిటరేచర్* అనే సమీక్షా పత్రికను నడిపాడు. దాంట్లో బ్రెతోన్, సోపోలు అధివాస్తవికతా రచనకు మొదటి ఉదాహరణగా *అయస్కాంత క్షేత్రాలు* (1920 - Magnitic Eilds) ప్రచురించారు. బ్రెతోన్ 1924 లో అధివాస్తవికతావాద విధాన ప్రకటన పత్రాన్ని (Manifeste du surrelism) ప్రచురించాడు. దానిలో ఆయన అధివాస్తవికతను వ్యాఖ్యానిస్తూ రచనలు చేశాడు. ఈ అధివాస్తవికతా సిద్ధాంతం స్వప్నానికీ, హేతువుకూ, ఆత్మాశ్రయాత్వానికీ, వస్త్వాశ్రయత్వానికీ మధ్య ఉన్న తేడాలను నిర్మూలించాలని సంకల్పించింది. బ్రెతోన్ వ్రాసిన నవల *నడ్జా* (Nadja:1928), మానసిక వక్రతలను, రోజూ జరిగే సాధారణ విషయాలను కలగాపులగం చేసిన రచన. పాల్ ఎల్యూర్డ్‌తో కలసి 1930లో వ్రాసిన ఇమాక్యులెట్ కన్సెప్షన్ లో రకరకాల మానసిక ప్రవృత్తుల్ని వివరించే ప్రయత్నం జరిగింది. *లెవాజ్ కమ్యూనికా* (1932- The Communicating Vessels) లోనూ, 'లామొర్ ఫౌ' (1937-Mad love) లోనూ స్వప్నానికీ, వాస్తవానికీ ఉన్న సంబంధాన్ని వెలికి తీసే ప్రయత్నం జరిగింది. బ్రెతోన్ నాటక రచనలూ, విమర్శనాత్మక రచనలూ కూడా చేశాడు. అందులో ముఖ్యమైనవి: *లెస్ పాస్ పెర్‌దుస్* (1924-The lost steps), *లెజితీం దీ ఫాన్స్* (1926-Legitimate defense), *లో స్యురియలిస్మ్ ఎట్ ల పైన్‌ట్యూర్* (1926 surrealism and painting), *క్వెస్ట్ సెలో స్యురియలిస్మ్* (1934; What is Surrealism: 1936), *లస్ క్లే దె షాం* (1953, The key to the Fields)

1930 లోనూ, ఆ తరువాత ఏర్పడిన కల్లోల పరిస్థితుల్లోనూ అధివాస్తవికతావాద ఉద్యమం రాజ

కీయాలతో సంబంధం పెట్టుకొంది. బ్రెతోన్, అతని స్నేహితులు కొంతమంది కమ్యూనిస్టు పార్టీలో చేరారు. ఆయన 'ద్వితీయ అధివాస్తవికతా వాద విధాన ప్రకటనా పత్రం' *సెకోన్ మానిఫెస్ట్ ద్యు స్యరియలిస్మ్* (1930) ఉద్యమ తాత్త్వికతను స్పష్టపరిచింది. 1935 లో బ్రెతోన్ కమ్యూనిస్ట్ పార్టీతో సంబంధ బాంధవ్యాలు విచ్ఛేదం చేసుకొన్నాడు కాని మార్క్సిస్టు ఆదర్శాలకు కట్టుబడే ఉన్నాడు. మెక్సికో లో లియాన్ ట్రాట్స్కీతో కలసి *ఫెడరేషియో దలార్డ్ రివొల్యూష్యనెర్ ఇన్‌దిపెండెంట్*ని 1938 లో స్థాపించాడు. జర్మన్‌లు ఫ్రాన్స్ ఆక్రమించి నప్పుడు బ్రెతోన్ అమెరికాకు పారిపోయాడు. 1942 లో 'యేల్' (Yale) విశ్వవిద్యాలయంలో అధివాస్తవికతావాద ప్రచారాన్ని చేయటమేకాక, ఇంకో అధివాస్తవికతావాద విధాన ప్రకటనా పత్రాన్ని వెలువరించాడు. 1946 లో ఆయన ఫ్రాన్స్‌కు తిరిగి వచ్చాడు. ఫ్రాన్స్‌లోనే ఆ తరువాతి సంవత్సరం ఒక అధివాస్తవికతా వాద ప్రదర్శనను ఏర్పాటు చేశాడు. ఆయన కవితా సంకలనం *పొయెమ్స్* 1948 లో పారిస్‌లో ప్రచురిత మయింది. ఆంగ్లంలో అనువదించిన ఆయన కవితా సంకలనం *సెలెక్టెడ్ పొయెమ్స్* లండన్‌లో 1969 లో ప్రచురింపబడింది.

చక్రపాణి

**బ్రోహ్, హెర్మన్ (1886-1951)** : అనేక దృక్కోణాలను ప్రదర్శించే నవలలతో అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించిన జర్మన్ రచయిత. తన నవలలలో జీవజాలం నుండి తత్త్వచింతన వరకూ మానవుల అనుభవాలన్నిటినీ బ్రోహ్ చిత్రీకరించాడు; తన అసమాన ప్రతిభతో నూతన సాహిత్య రీతుల్లో వాటిని ఆవిష్కరించాడు.

బ్రోహ్ 29 ఏళ్ళ వయసులో వారసత్వపు హక్కులను త్యజిస్తూ తనవాటాగా వచ్చిన బట్టల మిల్లును అమ్మేసి, భౌతిక గణిత తత్త్వ శాస్త్రాధ్యయనానికి వియెన్నా విశ్వవిద్యాలయానికి వెళ్ళాడు. ఆయన తొలి ప్రముఖ రచన *డై స్లాఫ్‌వాండ్లర్* (1931-32, 'The sleep walkers', 1932) అన్న నవలాత్రయం. ఇది 1888-1913 మధ్యకాలంలోని యూరప్ సమాజాన్ని కళ్ళకు కట్టినట్టు చూపిస్తుంది. దీనిలో రచయిత కాల్పనికత పైనా, అరాచక వాదం పైనా వాస్తవికత విజయం పొందటాన్ని చిత్రీకరించాడు. ఒక వైపు చరిత్ర గతిని చిత్రిస్తూనే, 'ఎక్స్‌ప్రెషనిస్ట్' రీతిలో 19 వ శతాబ్దపు వాస్తవికతా వాదాన్ని పరిహాస భాజనం చేస్తాడు.

1934-36 మధ్య ఆయన *డెర్ వర్స్‌కర్* (1953, 'The Seducer') అనే నవల వ్రాశాడు. హిట్లర్ సిద్ధాంతాలతో ప్రభావితుడైన వ్యక్తి ఒక పర్వత ప్రాంత గ్రామాన్ని కైవశం చేసుకోటాన్ని చిత్రీకరిస్తూ, గుంపు ఉన్మాద సిద్ధాంతాన్ని బ్రోహ్ దీనిలో ప్రతిపాదించాడు.

1935 లో బ్రోహ్ నాజీ జైలులో ఐదునెలలు నిర్బంధింపబడ్డాడు. జేమ్స్ జాయిస్ ఇంకా తదితర అంతర్జాతీయ కళాకారుల, స్నేహితుల ప్రయత్న ఫలితంగా జైలునుండి విడుదల పొందాడు. యూరప్ ఖండంలో అతడు ప్రసిద్ధుడే కాని అమెరికా ఖండంలో అతనిని గురించి ఎక్కువగా తెలియదు. అలాంటి అమెరికాకు 1940 లో బ్రోహ్ వలస వెళ్ళాడు.

ఆయన ఆ తరువాత వ్రాసిన నవలలలో ఒకటి *డెర్ టాడ్ డెస్ వర్జిల్* (1945, 'The Dealth of Virgil:1945) ఈ నవలలో బ్రోహ్ వర్జిల్ కవి జీవితంలోని 18 గంటల చరమాంకాన్ని చిత్రీకరించాడు. తన కాలానికి భిన్నం కాని ఆనాటి పరిస్థితులను, సంధియుగాన్ని, మారే పరిస్థితులను ఆయన చిత్రించాడు. ఆ తరువాత బ్రోహ్ దృష్టి రాజకీయ సిద్ధాంతాలపైకి మరలింది. యూరప్ ఖండం నుండి పారిపోయి వచ్చే శరణార్థులకు సాయం చేయటంలో ఆయన జీవితం గడిపాడు.

ఆయన ఇతర రచనలు *డీ ఇన్ బెకన్టె గ్రాస్* (1933, The unknown quantity: 1935), *డీ స్కూల్ డ్లోసెన్* (1950 The Innocents). ఇవి కాక ఇంకా ఎన్నో వ్యాసాలు, ఉత్తరాలు, సమీక్షలు కూడా బ్రోహ్ రచించాడు.

చక్రపాణి

**బ్రౌన్, సర్ తామస్ (1663-1704)** : ఆంగ్ల వ్యంగ్య రచయిత. రోమన్‌కవీ, సూక్తి ముక్తక రచయితా అయిన మార్షియల్ వ్రాసిన *నాన్ అమోతీ సబిది* అని ప్రారంభమయ్యే ముక్తకాన్ని ఆశువుగా అనువదించిన ఖ్యాతి పొందిన వాడు. ఆక్స్‌ఫర్డ్ క్రైస్ట్‌చర్చి కళాశాల డీన్ డా. జాన్ ఫెల్ బ్రౌన్‌ని కళాశాల నుండి



బహిష్కరించాడు. అయితే బ్రౌన్ మార్షియల్ ముక్తకాన్ని కనుక ఆశువుగా ఆంగ్లంలోకి అనువదించగలిగితే శిక్షను

రద్దు చేస్తానని ఆయన చెప్పాడు. బదులుగా బ్రౌన్ ఆశువుగా ఇలా ఒక పద్యం చెప్పాడు:

"డాక్టర్ ఫెల్! నువ్వంటే నా కిష్టం లేదు
కారణమేమిటో నేను చెప్పలేను
కాని ఇది నాకు తెలుసు, పూర్తిగా తెలుసు"

బ్రౌన్ లండన్‌లో స్థిరపడ్డాడు; ఇతడు స్వేచ్ఛా ప్రవృత్తి కల వ్యక్తి. లాటిన్, ఫ్రెంచ్ భాషలనుండి ఎన్నో పుస్తకాలను ఇతడు ఆంగ్లంలోకి అనువదించాడు. ఎన్నో సూక్తి ముక్తకాలూ, ప్రహసనాలూ, వ్యంగ్య రచనలూ చేశాడు. *డుడ్లే టాం కిన్‌సన్* అన్న మారు పేరుతో జాన్ డ్రైడన్ మీద మూడు వ్యంగ్య రచనలు చేశాడు. ఆయన వచన రచన *ఎమ్యూజ్‌మెంట్ సీరియస్ అండ్ కామికల్, ఫర్ ది కాల్‌క్యులేటెడ్ మెరిడియన్ ఆఫ్ లండన్* (1700) లో గ్రబ్ స్ట్రీట్ రచయితల (గ్రబ్ స్ట్రీట్ లండన్ నగరంలో ఒక వీథి. బీదరికంతో బాధపడే పేరు లేని రచయితలూ, అధమశ్రేణి రచయితలూ ఈ వీథిలో ఒకప్పుడు నివసించేవాళ్ళు. ఇపుడు దీన్ని 'మిల్టన్ స్ట్రీట్' అంటారు) దృష్టితో లండన్ నగరాన్నీ, నగర పౌరుల్నీ విపులంగా వర్ణించాడు. ఇది చారిత్రకంగానే గాని సాహిత్యపు విలువలేని రచన.

చక్రపాణి

**బ్రౌనింగ్, ఎలిజబెత్ బారెట్ (1806-61) :** ఆంగ్ల కవయిత్రి. ఈమె ప్రేమ కవితలు *సానెట్స్ ఫ్రం ది పోర్చుగీస్* (1850) ఎలిజబెత్‌కు ఎంతో ఖ్యాతిని తెచ్చి పెట్టాయి. ఈమె భర్త ప్రఖ్యాత ఆంగ్లకవి రాబర్ట్ బ్రౌనింగ్.

ఎడ్వర్డ్ బారెట్ మూల్టన్ తరువాతి ఎడ్వర్డ్ మూల్టన్ బారెట్ పెద్దకూతురు ఈ ఎలిజబెత్. వోర్సెస్టర్ షైర్ మాల్ వెర్న్ పర్వత ప్రాంతంలో ఉన్న ఓ పల్లెటూరి ఇంట్లో ఈమె బాల్యజీవనం గడిచింది. ఈమె అక్కడ ఎంతో ఆనందంతో కాలం గడపింది. 15 ఏళ్ళ వయస్సులో బహుశః వెన్నుపూస దెబ్బతినటంతో తీవ్ర అనారోగ్యానికి గురి అయింది. దానితో ఆమె ఆరోగ్యం శాశ్వతంగా దెబ్బతింది. 1832 లో ఆమె కుటుంబం వారు డెవోన్ లోని సిడ్‌మౌత్‌కు నివాసం మార్చారు. ఆ తరువాత 1836 లో లండన్ వెళ్లారు. 1838 లో వింపోల్ స్ట్రీట్‌లో ఉన్న 50 వ నంబరు ఇంటిలో నివాసస్థానం ఏర్పరచుకొన్నారు.

లండన్‌లో ఆమె కవితలు రక రకాల పత్రికలలో ప్రచురితమయాయి. ఆమె మొదటి కవితాసంకలనం *ది సెరాఫిం అండ్ అదర్ పోయమ్స్* 1838 లో వెలుగు చూసింది. అనారోగ్య కారణాలవల్ల ఆ తరువాతి మూడు సంవత్సరాలు ఆమె డెవోన్ లోని టార్క్వే లో కాలం గడపింది. ఆమె సోదరుడు ఎడ్వర్డ్ నీటిలో మునిగి మరణించటంతో తన ఆప్తమిత్రులూ, బంధువులూ తప్ప బయటవారిని ఎవరినీ కలుసుకోలేని భయంకర మానసిక స్థితికి ఆమె గురి అయింది.

అయితే సాహిత్య జగత్తులో ఆమె పేరు అందరికీ సుపరిచితమే. 1844 లో ఆమె రెండవ కవితా సంకలనం *పోయెమ్స్* ను సాహితీలోకం సాదరంగా ఆమోదించింది. జనవరి 1845 లో రాబర్ట్ బ్రౌనింగ్ ఆమెకో తంతి పంపాడు. "ప్రియమైన మిస్ బారెట్, మీ పద్యాలంటే హృదయపూర్వకంగా నాకెంతో ఇష్టం మిమ్మల్ని నేను ప్రేమిస్తున్నాను" అని అందులో ఉంది. వేసవి తొలి దినాల్లో ఇద్దరూ కలుసుకొన్నారు. వాళ్ల ప్రేమ వ్యవహారం వాళ్లు వ్రాసుకొన్న ఉత్తరాల్లో ఈ ప్రేమ ఎలా దిన దిన ప్రవర్ధ మానమయిందో గ్రంథస్థం చేయబడింది. ఆమె తండ్రి నియంతలాంటి వాడు. అందుకే తండ్రికి తెలియకుండా వారి ప్రేమను గోప్యంగా ఉంచారు. *సానెట్స్ ఫ్రం ది పోర్చుగీస్* (1850) లో ఆమె ఎలా పెళ్లికి విముఖత చూపిందో తెలుస్తుంది. అయితే వాళ్ల వివాహం 1846 సెప్టెంబరు 12 న జరిగింది. ఆమె తండ్రికి విషయం తెలియనే తెలియదు. ఎలిజబెత్ ఒక వారం రోజులు తండ్రి ఇంట్లోనే ఉంది.

తరువాత భార్యాభర్తలు పిసా నగరానికి వెళ్లిపో యారు. 1856 లో ఆమె తండ్రి చనిపోయాడు. ఆమె చేసిన తప్పును అతడు క్షమించలేకపోయాడు. *ది రనెవే స్లేవ్ ఎట్ పిల్‌గ్రిమ్స్ పాయింట్* (1848) ను ఆమె పిసా లో ఉండగానే వ్రాసింది. అమెరికా లోని బానిస విధానానికి వ్యతిరేకంగా వ్రాసిన కవిత ఇది. దంపతులు ఫ్లారెన్స్‌లోనే స్థిరపడ్డారు. అక్కడే వారి ఏకైక పుత్రుడు రాబర్ట్ వీల్డ్‌మాన్ బారెటె, (Robert Wielde Man Barret) 1849 లో పుట్టాడు. వారు 1851 లోనూ, 1855 లోనూ లండన్‌కు వచ్చారు. రెండోసారి వచ్చినపుడు ఎలిజబెత్ తనకు ఎంతో ఇష్టమైన *అరోరా లీ* (*Aurora Leigh:* 1857) అనే కావ్యాన్ని పూర్తి చేయగలిగింది. అది సుదీర్ఘంగా బ్లాంక్ వర్స్ లో చిక్కుముడులతో, సంఘటనా భరితంగా సాగిన కావ్యం. దారి తప్పిన ఒక మానవహితాభిలాషికీ, ఒక అమ్మాయికీ మధ్య సాగిన ప్రేమ కథ అది. విమర్శకుల కీకావ్యం అంతగా నచ్చలేదు. కాని అది బహుళ జనాదరణ పొందింది.

ఆమె తన జీవిత చరమాంకంలో ఆధ్యాత్మికత పట్లా, అతీంద్రియ శక్తి పట్లా అభిరుచిని ప్రకటించింది. అయితే ఆమె శక్తిని హరించే విధంగా ఇటలీ రాజకీయాలామెను ఆకర్షించాయి. ఆమె ఆప్తవర్గానికి ఆమె ఈ గాఢరాజకీయ అభినివేశం ఎంతో భయం కలిగించింది. ఫ్లొరెన్స్ వాసుల సానుభూతిని పొందాలన్న ఉద్దేశపూర్వక ప్రయత్నమే ఆమె వ్రాసిన *కేస గూడి విండోస్* (1851). మూడవ నెపోలియన్ సమగ్ర వ్యక్తిత్వం పట్ల ఆమెకు ఎంతో నమ్మక ముండేది. *ఇన్ పోయెమ్స్ బిఫోర్ కాంగ్రెస్* (1860) అనే కావ్యం ఆమె నమ్మకాన్ని తెలియబరుస్తుంది. ఆమె కవిత *ఏ కర్స్ ఫర్ ఏ నేషన్* లో ఇంగ్లాండును దుయ్యబట్టటమే ఆమె ధ్యేయమని ప్రజలు పొరపాటుగా అభిప్రాయ పడ్డారు. నిజాని కది అమెరికాలోని బానిస విధానాన్ని వ్యతిరేకించే కవిత.

1861 వేసవిలో విపరీతమైన చలితో బాధపడి ఎలిజబెత్ బ్రౌనింగ్ చనిపోయింది.

చక్రపాణి

**బ్రౌనింగ్, రాబర్ట్ (1812-89) :** ప్రముఖ బ్రిటిష్ కవి. తండ్రి నుండి సాహిత్యం, తల్లి నుండి సంగీత, చిత్రకళల అభిరుచి వారసత్వంగా పొందిన బ్రౌనింగ్ విక్టోరియన్ యుగంలో గొప్ప కవిగా పేరు గాంచినవాడు. ఇతడు స్కూల్లో నేర్చుకొన్నది చాలా తక్కువ. ఇంటివద్ద స్వయంకృషితో గ్రీక్, లాటిన్ భాషలను నేర్చుకొని తన 12 వ ఏటనే కవిత్వం వ్రాయడం ఆరంభించాడు. ఇతని తొలి రచన *పాలిన్* (1833) మీద బైరన్, షెల్లీ, కీట్స్ వంటి ప్రముఖ కాల్పనిక కవుల ప్రభావం కనిపిస్తుంది.



రష్యాలో విస్తృతంగా పర్యటించి బ్రౌనింగ్ తన అనుభవాలను *హౌ వుయ్ బాట్ ది గుడ్ న్యూస్* (1834) అనే పద్యంలో మనోజ్ఞంగా చిత్రించాడు. రష్యాలో ఇతనికి లభించిన ఒక దేశీయుని సాహచర్యం వలన తత్త్వ వైజ్ఞానిక శాస్త్రాలలో అభిరుచి కలిగింది. దీని పర్యవసానమే ఇతడు రచించిన *పారాసెల్సస్* (1835). 1838 లో ఇతడు ఇటలీకి వెళ్లినపుడు వెన్నిస్ నగర సౌందర్యానికి ముగ్ధుడయాడు. ఇది అతనిపై చెరుగని ముద్ర వేసింది. ఇటలీ నుండి తిరిగి వచ్చిన తరువాత ఇతని దృష్టి ఎలిజబెత్ బారెట్ అనే కవయిత్రి పద్యాలపై పడింది. 1845 లో ఆమెతో బ్రౌనింగ్ కు వ్యక్తిగత పరిచయం ఏర్పడి, త్వరలోనే అది వారి ప్రణయానికి దారితీసింది. ఎలిజబెత్ బారెట్ బ్రౌనింగ్ కన్న 6 సంవత్సరాలు పెద్దది కావడమే కాకుండా జబ్బు మనిషి కూడా. ఆమె తండ్రి వీరి వివాహానికి ఒప్పుకోక పోయినప్పటికి 1846 లో వీరిరువురు ఇటలీకి వెళ్లి ఒక చర్చ్‌లో నిరాడంబరంగా వివాహం చేసుకొని, అక్కడే స్థిరపడ్డారు. 1849 లో ఈ కవి దంపతులకు ఒక కుమారుడు కలిగాడు. 1861 లో బారెట్ ఆరోగ్యం క్షీణించి చనిపోవడంతో బ్రౌనింగ్ ఇంగ్లండు తిరిగి వచ్చాడు. (చూ. బ్రౌనింగ్ ఎలిజబెత్)

బ్రౌనింగ్ గొప్ప కవియే గాక మనస్తత్త్వ వేత్త కూడా. ఆత్మ పరిశోధన ఇతని కవిత్వంలో అగ్రస్థానం వహిస్తుంది. నాటకీయ స్వగత రూపంలో ఉన్న ఇతని పద్యాలలో ఒకే ఒక పాత్ర ఆత్మనివేదనం చేస్తుంది. పాత్రల మనస్తత్త్వాలను చిత్రించటానికి ఈ మార్గం బ్రౌనింగ్‌కు చక్కగా ఉపకరించింది. కవి ఈ పాత్రలలో ప్రవేశించి తన భావాలను ప్రకటిస్తాడు. ఇలాంటి పద్యాలను ఎన్నింటినో సంకలనాలుగా *డ్రమెటిక్ లిరిక్స్* (1842), *మెన్ అండ్ విమెన్* (1855), *డ్రమెటిక్ పర్సనే* (1864) *డ్రమెటిక్ ఐడిల్స్* (1879-80) అను సంపుటాలలో ప్రచురించాడు.

బ్రౌనింగ్ రచించిన పద్యాలలో వివిధ విధాల వ్యక్తులు వారి ఆంతరంగిక జీవనాన్ని బహిర్గతం చేస్తారు. ఈ పాత్రలు వాటంతటవే మాట్లాడుతున్నట్లు కన్పిస్తాయి. కాని 'బ్రౌనింగ్' వాటిని తన సిద్ధాంతం వైపు తిప్పుకొంటాడు. ఇతని సిద్ధాంతం ఆత్మశక్తి, స్వాతంత్ర్యాల మీద ఆధారపడి ఉంటుంది. మానవ జీవితంలో ఒక పరమార్థం ఆదర్శం, ఆశయం ఉంటాయని ఇతని నమ్మకం. ఇతడు ప్రేమతత్త్వాన్ని ఉపాసించాడు. ఆత్మకు నాశనం లేదని ఇతని అభిప్రాయం. ఇతడు రచించిన ప్రతి పద్యంలోను ఆశాభావం కనపడుతుంది. *సొర్డెల్లో* (1840), *పిప్పాపాసెస్* (1841), *ది రింగ్ అండ్ ది బుక్* (1868-69) అనేవి ఇతని ఇతర ప్రసిద్ధ రచనలు. ఇటలీలో స్థిరపడ్డ తన కుమారుని చూసి రావడానికి వెళ్లిన బ్రౌనింగ్ అక్కడే *అసల్యాండో* అనే కావ్యాన్ని

రచించాడు. అది ప్రచురించ బడిన రోజునే 1889 డిసెంబర్ 12 న బ్రౌనింగ్ మరణించాడు.

మల్లేశం

**బ్లాక్, అలెక్సాండ్ర్, అలెక్సాండ్రోవిచ్ (1880-1921) :** రష్యన్ కవి, నాటక రచయిత. సింబాలిస్టు ధోరణిలో కవిత్వం వ్రాయడమే కాకుండా, రష్యన్ సింబాలిస్టు ఉద్యమానికి సారథ్యం వహించాడు. 1880 నవంబర్ 16 న సెయింట్ పీటర్స్ బర్గ్‌లో జన్మించిన అలెక్సాండ్ర్ బ్లాక్ పండిత వంశానికి



చెందినవాడు. ఇతని తండ్రి న్యాయశాస్త్ర కళాశాలలో ప్రొఫెసర్. తల్లికూడా చక్కటి విద్యా సంస్కారాలు కల్గినది. కాని ఇతని తల్లిదండ్రుల మధ్య ఏర్పడిన స్పర్ధల కారణంగా ఇతడు తన తాతగారి సంరక్షణలో పెరిగాడు. సెయింట్ పీటర్స్ బర్గ్ విశ్వవిద్యాలయంలో ఇతడు ఫైలాలజీలో పట్టా పుచ్చుకొని ఆ నాటి సాహితీ పత్రికలలో ఎన్నో వ్యాసాలు, సమీక్షలు, కవితలు ప్రచురించి గొప్ప పేరు సంపాదించాడు. 1903 లో ప్రఖ్యాత రసాయన శాస్త్రజ్ఞుడైన మెండెలెయవా కుమార్తెను వివాహమాడాడు. ఈమె ఒక ప్రఖ్యాత నటి. ఐతే వీరి వైవాహిక జీవితంలో కొద్ది కాలానికే స్పర్ధ లేర్పడి విడిపోయారు.

బ్లాక్ సహజ పండితుడు. చిన్నతనంలోనే ఇతని నోట కమ్మని కవిత్వం వెలువడింది. 19 వ శతాబ్దానికి చెందిన రొమాంటిక్ కవి అలెగ్జాండర్ పుష్కిన్, మార్మిక వాద ధోరణిలో కవిత్వం వ్రాసిన వ్లదిమీర్ సోలియో ప్రభావం ఇతని మీద ఎక్కువగా ఉంది. ఇతని కవిత్వంలో అక్షర రమ్యత, (Musicality) ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. ఇతని వైవాహిక జీవితంలో ఏర్పడిన సంక్షోభం, 1905 లో విఫలమైన విప్లవం, 1917 నాటి విప్లవం పట్ల ఇతనికి గల ఉత్సాహం ఇతని కవిత్వంలో ఇతివృత్తాలు. *వెర్సెస్ అబౌట్ ది బ్యూటిఫుల్ లేడీ* (1901-02) ఇతని తొలి కవితా సంకలనం. ఇందులో ఇతని ఆదర్శవాద దృక్పథం స్పష్టంగా గోచరిస్తుంది. *ది ట్వెల్వ్* ఇతనికి అంతర్జాతీయ ఖ్యాతిని సంపాదించి పెట్టిన కవితా ఖండిక. రష్యన్ విప్లవకాలంలో జరిగిన హింసా, బీభత్సం, అరాచక పరిస్థితితోపాటు ఆ విప్లవ వైభావాన్ని కూడా భావోద్రేకంతో ఈ ఖండికలో బ్లాక్ వర్ణించాడు. చివరి రోజులలో రష్యాలోని సామాజిక పరిణామాన్ని వర్ణించే స్వీయ చరిత్రాత్మకమైన *రిట్రిబ్యూషన్* అనే ఒక సుదీర్ఘ కవితను అసంపూర్ణంగానే వదలి 1921 ఆగస్టు 7 న లెనిన్‌గ్రాడ్ నగరంలో అలెక్సాండ్ర్ బ్లాక్ కన్ను మూశాడు.

మల్లేశం

**బ్లాస్కో ఇబానెజ్, విసెంటె (1867-1928):** శ్పానిష్ రచయిత, రాజకీయ వేత్త. మొదటి ప్రపంచ యుద్ధపు బీభత్స వాతావరణాన్ని ఇతివృత్తంగా తీసుకొని రచించిన ఇతని నవలలు అంతర్జాతీయ ఖ్యాతి పొందాయి. *ది ఫోర్ హార్స్‌మెన్ ఆఫ్ ది అపోకలిప్స్* (1918) ఇతని నవలలలో మకుటాయమాన మైనది. ఈ



నవలను ఆధారంగా చేసుకొని అమెరికాలో రెండు సినిమాలు కూడా తీశారు. 1867 జనవరి 29 న స్పెయిన్ లోని వాలెన్షియాలో జన్మించిన బ్లాస్కో తన 18 వ ఏటనే రచనా వ్యాసాంగాన్ని ప్రారంభించాడు. అప్పుడు అతడు మాడ్రిడ్‌లో న్యాయశాస్త్రం చదువుతూ వివిధ పత్రికలలో రాజకీయ విషయాల పై వ్యాసాలు వ్రాస్తూ ఉండేవాడు. ఆ రోజులలో రాచరిక వ్యవస్థకు వ్యతిరేకంగా ఇతడు వ్రాసిన ఒక పద్యం ఆనాటి పాలకులకు ఆగ్రహం కలిగించింది. తత్ఫలితంగా ఇతడు జైలు శిక్షను అనుభవించ వలసి వచ్చింది. 1891 లో ఇతడు ఒక రిపబ్లికన్ పత్రికను స్థాపించి చాలా కాలం దాన్ని సమర్థవంతంగా నిర్వహించాడు. 1911 లో ఇతడు తొలిసారిగా కార్టెస్ (Cortes) అనగా స్పెయిన్ దేశపు పార్లమెంటుకు సభ్యుడుగా ఎన్నికయాడు. అప్పటినుండి 1923 వరకు 7 సార్లు అవిచ్ఛిన్నంగా పార్లమెంటు సభ్యుడుగా ఎన్నుకొనబడి గణనీయమైన సేవ చేశాడు. 1923 తరువాత ఇతడు స్పెయిన్ దేశంలోని మిలిటరీ నియంతృత్వాన్ని సహించక దేశం నుండి వెళ్ళిపోయి ఫ్రెంచ్ దేశంలోని 'రివేర' అనే ప్రదేశంలో ప్రవాస

జీవితం గడిపాడు. 1928 జనవరి 28 న 'మెంటన్'లో బ్లాస్కో మరణించాడు.

వాస్తవిక వాద ధోరణిలో బ్లాస్కో రచించిన నవలలు శ్పానిష్ సాహిత్య చరిత్రలో అగ్రస్థానాన్ని ఆక్రమిస్తాయి. *మే ఫ్లవర్* (1895), *ది క్యాబిన్* (1899) ఇతని ప్రసిద్ధ నవలలు. వీటిలో ఇతడు ముఖ్యంగా తాను పుట్టి పెరిగిన వాలెన్షియా నగరాన్ని, దానిచుట్టు ప్రక్కల ఉన్న ప్రదేశాలను గూర్చి వర్ణిస్తూ, తన చుట్టూ ఉన్న ఆ నాటి సామాజిక ఆర్థిక పరిస్థితులను తన సృజనాత్మక శక్తితో అద్భుతంగా వర్ణించాడు. తరువాత వచ్చిన ఇతని నవలలలో ముఖ్యమైనవి: *ది వైన్ సెల్లార్* (1906), *ది బ్లడ్ ఆఫ్ ది అరనా, ది నేకెడ్ మాజా* వీటిలో ఇతడు సమాజంలోని వివిధ వర్గాల వ్యక్తుల మధ్య గల సంఘర్షణలను, వారి ఆలోచనా ధోరణులను సజీవంగా చిత్రించాడు.

మల్లేశం

**బ్లెస్ట్ గానా, ఆల్బెర్టో (1830-1920) :** చిలీ దేశానికి చెందిన నవలా రచయిత, దౌత్యవేత్త. శ్పానిష్ నవలా సాహిత్య చరిత్రలో ఇతని రచనలు చిరస్థాయిగా నిలచిపోయాయి. 1830 లో చిలీలో జన్మించిన బ్లెస్ట్ గానా వాస్తవిక ధోరణిలో రచనలు సాగించాడు. ఇతడు ఫ్రాన్స్‌లో మిలిటరీ ఇంజనీరింగ్ చదువుకుంటూ, ఫ్రెంచ్ వాస్తవికతా వాద రచయితలైన బాల్‌జాక్ వంటి వారి రచనలచే ప్రభావితుడయాడు. ఫ్రాన్స్‌లో తన విద్యాభ్యాసాన్ని పూర్తి చేసుకొని 1852 లో చిలీ దేశానికి తిరిగి వచ్చాడు. చిలీ లోని మిలిటరీ అకాడమీలో గణిత శాస్త్రం బోధిస్తూనే తన రచనా వ్యాసంగాన్ని కొనసాగించాడు. ఇతని రచనల వలన వచ్చిన అమితమైన పేరు ప్రతిష్ఠలు ఇతనికి దౌత్య కార్యకలాపాలలో పాల్గొనేట్టు చేశాయి. 1870 తరువాత ఇంగ్లండ్, ఫ్రాన్స్ దేశాలలో చిలీ తరపున రాయబారిగా పనిచేసి, పలువురి ప్రశంసలు పొందాడు.

బ్లెస్ట్ గానా తొలి రచన లయిన *ది అరిథ్ మెటిక్ ఆఫ్ లవ్, మ్యార్టిన్ రివాస్, ఏ ఫూలిష్ ఐడియల్* లు సాటియాగో లోని కొన్ని మధ్యతరగతి కుటుంబాల జీవన సరళిని, ఆలోచనా విధానాలను, వివిధరకాల వ్యక్తుల మధ్య వెలరేగే సంఘర్షణలను సజీవంగా చిత్రించాయి. భౌతిక వాద దృక్పథం వలన, ధనాపేక్ష వలన కలిగే వివిధ అనర్థాల గురించి ఈ నవలలలో రచయిత తన ఆవేదనను వ్యక్తం చేశాడు. ఇతడు దౌత్య కార్యకలాపాలలో మునిగి ఉండటం వలన దాదాపు 30 సంవత్సరాలపాటు రచన జోలికి పోలేదు. కాని చివరి దశలో తిరిగి రచనా వ్యాసంగం కొనసాగించి, *డ్యూరింగ్ ది రీకాంక్వెస్ట్, ది అప్‌రూటెడ్* అనే మహత్తరమైన నవలలు రచించాడు. పాత్రచిత్రణలో, సన్నివేశకల్పనలో, కథా సంవిధానంలో ఈ నవలలు ఇతని ప్రత్యేకతను నిరూపించడమే కాకుండా, చిలీ దేశ సామాజిక, ఆర్థిక, రాజకీయ వ్యవస్థకు దర్పణం పట్టి, శ్పానిష్ సాహిత్య చరిత్రలో ఇతని పేరు ప్రతిష్ఠలను చిరస్థాయిగా నిలుపుతాయి.

మల్లేశం

**బ్లేక్, విలియమ్ (1757-1827) :** ప్రముఖాంగ్ల తాత్త్విక కవి, చిత్రకారుడు, డిజైనర్, యోగి తుల్యుడు. తన భావ గీతాల సంపుటాలు *సాంగ్స్ ఆఫ్ ఇన్నో సెన్స్* (1789), *సాంగ్స్ ఆఫ్ ఎక్స్ పీరియెన్స్* (1794) మొదలైన వాటికి ఆయనే చిత్రాలు వేసుకున్నాడు. లలితకళలలో సరళమైన, సూటి అయిన ఒక నూతన అభి



వ్యక్తీకరణ విధానాన్ని ఆయన కనుగొన్నాడు. అద్భుతమైన శక్తి, మౌలికత గల మహా ప్రతిభాశాలిగా నేడు అందరూ ఆయనను గుర్తిస్తున్నా, సమకాలీనులు ఆయనను ఉపేక్షించారు. ఆ నాటి కవులూ, డిజైనర్లూ ఆయన ఏకాగ్ర దృష్టిని, అప్రాపంచిక ధోరణిని చూచి ఆయనను ఒక ఉన్మత్తునిగా పరిగణించారు. దారిద్ర్యపు సరిహద్దులలో జీవితం గడిపి ఒక అనామకుడుగా 1827 ఆగస్టు 12 న లండన్ నగరంలోనే ఆయన తన జీవితం చాలించాడు.

ఒక గృహాలంకరణ సామగ్రి దుకాణదారుని అయిదుగురు సంతానంలో రెండవ వాడుగా 1757 నవంబరు 28 వ తేదీన లండన్ నగరంలో విలియమ్ బ్లేక్ జన్మించాడు. బ్లేక్ ఏ పాఠశాలకూ వెళ్లి చదువుకోలేదు. ఇంట్లో తల్లి వద్దనే చదువుకున్నాడు. బాల్యంలోనే బహు గ్రంథాలు ఆయన చదివాడు.

ఇతర ఆంగ్లకవులవలె బ్లేక్ పల్లె వాతావరణంలో కాక లండన్ నగరంలో జనసమ్మర్దం ఎక్కువగా ఉన్న ప్రాంతంలో పెరిగి పెద్దవా డయాడు. అయితే ఆనాడు లండన్ నగరం చుట్టూ ఉన్న పల్లెలను ఈయన తరచు సందర్శించి వస్తూ ఉండేవాడు. అనంతర జీవితంలో

తన ఆ ఒంటరి సంచారాలను గూర్చి ఆయన స్మరిం చాడు. తనకు పదేళ్లు కూడా నిండనపుడు ఒకనాడు ఆ విధంగా పెక్‌హామ్‌రై అనే లండన్ పరిసర గ్రామాన్ని సందర్శించినపుడు ఒక యోగ దర్శనంలో ఆయనకు దేవతలతో నిండి ఉన్న ఒక చెట్టు కనిపించింది. ఆ సంగతి ఇంటిదగ్గర చెప్పినపుడు తండ్రి కంటె తల్లి అతని విషయంలో ఎక్కువ ఆసక్తి చూపింది.

బ్లేక్‌కి బలమైన, దార్శనికమైన మనస్సు ఉండేది. తాను ఏది భావన చేస్తే అది ఆయన మనోనేత్రం ఎదుట ప్రత్యక్షంగా కనిపించేది. పదవ ఏట బ్లేక్‌ను డ్రాయింగ్ స్కూల్‌కు పంపారు. 14 వ ఏట చెక్కడం పనిచేసే జేమ్స్ బసైర్ వద్ద ఆయన అప్రెంటిస్‌గా చేరాడు. 1779 లో అప్రెంటిస్‌షిప్ పూర్తిచేసి రాయల్ అకాడమీలో విద్యార్థిగా చేరాడు. ఆ అకాడమీ అధ్యక్షుడు సర్ జోషువా రేనాల్డ్స్ పట్ల అతనికి అమితమైన అనిష్టత కలిగింది. తరువాత కొందరు మిత్రులతో కలసి బ్లేక్ స్వీడెన్ బోర్గ్ యోగ సమాజంలో చేరాడు.

బాల్యం నుంచే బ్లేక్ కవిత లల్లడం మొదలుపెట్టాడు. జాన్ ఫ్లాక్స్‌మెన్ సాయంతో 1783 లో *పొయెటికల్ స్కెచెస్ బై డబ్ల్యు.బి.* అనే పేరుతో ఒక చిన్న కవితా సంపుటి ప్రచురించాడు.

1782 ఆగస్టు 18 న కేతరిన్ సోఫియా బౌచర్ అనే ఆమెను బ్లేక్ వివాహమాడాడు. నిరక్షరాస్యురాలైన భార్యకు బ్లేక్ స్వయంగా చదువు చెప్పాడు. భర్తతో కలసి మిల్టన్ రచించిన *పేరడైజ్ లాస్ట్* చదివే స్థాయికి ఆమె విద్యావతి అయింది. 1784 లో బ్లేక్ తండ్రి చనిపోయాడు.

బ్లేక్ రచించిన *సాంగ్స్ ఆఫ్ ఇన్నోసెన్స్, సాంగ్స్ ఆఫ్ ఎక్స్‌పీరియెన్స్* అనే కవితా సంపుటాలు ప్రచు రింపబడిన వెంటనే ప్రజల మీద ఎలాంటి ప్రభావం చూపకపోయినా అవి చాలా గొప్ప రచనలు. బ్లేక్ చనిపోయిన తరువాత 50 ఏళ్లవరకూ ఎవరూ వాటిని పట్టించుకున్నవారు లేరు. అయినా గతంలో బైబిల్, *ది పిల్‌గ్రిమ్స్ ప్రోగెస్* చూపినంతటి ప్రభావాన్ని 20 వ శతాబ్దంలోని యూరప్, అమెరికాల సంస్కృతులను మలచడంలో అవి ప్రదర్శించాయి.

బ్లేక్ భావగీతాలనే కాక, కథా కావ్యాలవంటి దీర్ఘ కావ్యాలను కూడా రచించాడు. *ఓల్డ్ టెస్టమెంట్* వంటి అంత్యానుప్రాసలు లేని పంక్తులతో 'భవిష్యన్నిర్దేశ' ధోరణిలో సాగిన ఈ దీర్ఘ రచనల శైలి బ్లేక్ వ్యక్తిగతమైన విశిష్ట శైలిగా పరిగణించబడుతూంది. ఈ శైలిలో బ్లేక్ రచించిన తొలి రచన *ది ఫ్రెంచ్ రివల్యూషన్.*

1804 తరువాత బ్లేక్ తన రెండు సుదీర్ఘ కావ్యా లైన *మిల్టన్, జెరూసలమ్* ల రచనకు పూనుకొని 1808 లో మొదటి రచననూ, 1820 లో రెండవ రచననూ పూర్తి చేశాడు. అతని వెనుకటి రచన లలో వ్యక్తమైన మానవ జీవిత లక్ష్యమే వీటిలోనూ వ్యక్తీకరించబడింది. బ్లేక్ విప్లవవాది. సర్వవిధాలైన సాంఘికదురాచారాలనుండి మానవుడు విడివడాలని ఆయన వాదించాడు. ఆదర్శసమాజాన్ని బ్లేక్ 'న్యూ జెరూసలెమ్' అన్నాడు. కేవలం రాజకీయ, సాంఘిక సంస్కరణల వల్లనే అట్టి సమాజాన్ని స్థాపించలేమని ఆయన విశ్వాసం.

చాలాకాలం పాటు బ్లేక్‌ను ఆయన తోటి కళాకా రులూ, కవులూ మాత్రమే మెచ్చుకుంటూ ఉండేవారు. అలెగ్జాండర్ గిల్‌క్రిస్ట్ మొట్టమొదటిసారి *బ్లేక్ జీవిత చరిత్ర*ను రచించాడు. బ్లేక్ పైన ఆల్గెర్నాన్ చార్లెస్ స్విన్ బర్న్ *క్రిటికల్ ఎస్సే ఆన్ బ్లేక్* అనే సుదీర్ఘమైన విమర్శక వ్యాసాన్ని 1868 లో ప్రకటించాడు. 1893 లో డబ్ల్యూ.బి. యీట్స్ బ్లేక్ సంపూర్ణ రచనలను పరిష్కరించి లఘుటీకతో ప్రచురించాడు. 1927 లో బ్లేక్ శతవార్షిక జయంతి సందర్భంలో బ్లేక్‌ను గూర్చి, ఆయన రచనలను గూర్చి పలు వ్యాసాలు వెలువడ్డాయి.

బొ.శ్రీ.

**బ్వాలో, నికోలాస్ (1636-1711)** : ఫ్రెంచ్ కవి, ప్రముఖ సాహిత్య విమర్శకుడు. సాహిత్యంలో సాంప్రదా యిక ప్రమాణాలను తు.చ తప్పకుండా పాటించాలని వాదించి, ఆ నాటి ఆంగ్ల, ఫ్రెంచ్ సాహిత్యాలపై తన ప్రభావాన్ని చూపిన మేటి ప్రామాణికతా వాది.

1658 ప్రాంతంలో బ్వాలో వ్యంగ్య రచనలు చేయటం ప్రారంభించాడు. వీటిలో ఆనాటి ప్రముఖ వ్యక్తులను వ్యంగ్యంగా చిత్రించి, ఆ కవితలను తన మిత్రులకు మాత్రమే చదివి వినిపిస్తూ ఉండేవాడు. వాటిలోని వాడిని కొద్దిగా తగ్గించి వాటన్నిటిని కలిపి మార్చి 1666 లో ఒక సంపుటిగా తానే ప్రచురించాడు. 1667 లో *లె ల్యుటిన్* (Le Lutrin) అనే విజయవంతమైన మాక్ *హీరోయిక్* కావ్యాన్ని వ్రాశాడు. చర్చికి సంబంధించిన ఇద్దరు పెద్ద మతాధికారుల మధ్య చర్చి వేదికపై ఉండవలసిన బల్లను ఎక్కడ పెట్టాలి అనే విషయంపై వచ్చిన వివాదం ఈ కావ్యంలోని ఇతివృత్తం.

1674 లో ప్రామాణిక సంప్రదాయంలో కవిత్వానికి ఉండవలసిన లక్షణాలను నిర్దేశిస్తూ *లె ఆర్ట్ పొయెటిక్*

(L' Art Poetique) అనే కావ్యాన్ని వ్రాశాడు. ప్రామాణిక సూత్రాలకు ఆ కావ్యం ఒక నిర్దిష్టమైన రూపాన్నందించిందని అప్పట్లో పండితులు, విమర్శకులు దానిని ఎంతో గౌరవించారు. ఇంగ్లండు లోని అగస్టీనియన్ కవులు జాన్సన్, జాన్ డ్రైడెన్, అలెగ్జాండర్ పోప్‌లను ఇది బాగా ప్రభావితం చేసింది.

1677 లో ప్రభుత్వ చరిత్రకారుడుగా నియమితుడవటంతో బ్యాలో 15 సంవత్సరాలపాటు సాహిత్య పరమైన వివాదాలకు దూరంగా ఉన్నాడు. 1684 లో 'ఎకాడమీ ఫ్రాన్సాయిస్' కి ఎన్నికయాడు. 1692 లో తిరిగి సాహిత్య రంగంలో ప్రవేశించి *కాంట్రెలెస్ ఫెమ్మిస్* అనే స్త్రీ వ్యతిరేక వ్యంగ్య కావ్యాన్ని వ్రాశాడు.

ఆ రోజులలో అందరూ అనుకొన్నట్లు ఈ ప్రామాణిక సాహిత్య సూత్రాలను ఆయనే సృష్టించలేదు. అంతకు పూర్వమే అవి ఉన్నా, ఆయన వాటిని వెలుగులోకి తెచ్చి, క్రోడీకరించి, తన గంభీర కవితా ధోరణిలో వాటిని ప్రచారం చేయడం వలన ఆయనే వాటి కర్త అనే భావం ప్రబలింది. దానిని ఖండించే ప్రయత్నమేమీ ఆయన చేయలేదు.

లాంజినస్ వ్రాసినట్లు ప్రచారంలో ఉన్న *ఆన్ ది సబ్లైమ్* అనే గ్రంథ భాష్యాన్ని బ్యాలో ఫ్రెంచ్ లోకి అనువదించాడు. వింతల్లో వింత ఏమిటంటే ఈ అనువాదమే తరువాత భావకవితా ఉద్యమానికి (Romantic movement) ఊపిరి పోసింది.

కె.జి. మూర్తి

**మంజోనీ, అలెస్సాంద్రో (1785-1873) :** ఇటాలియన్ నవలా రచయిత, కవి, నాటక కర్త. ఇతడు రచించిన *ఐ ప్రామ్మెసి స్పోసి* అనే నవల ఇటాలియన్ సాహిత్య చరిత్రలో ఒక ప్రత్యేక స్థానాన్ని సంతరించుకొంది. 1785 మార్చి 7 న ఇటలీలోని మిలాన్ నగరంలో ఉన్నత వంశంలో ఇతడు జన్మించాడు. కొంత కాలం ధార్మిక పాఠశాలలో విద్యాభ్యాసం చేసి ఆ తరువాత పారిస్‌కు వెళ్లాడు. అక్కడ ప్రముఖ చరిత్రకారులైన క్లాడ్ ఫారియల్ తో ఇతనికి స్నేహం కుదిరింది. అక్కడే



బ్లాండెల్‌తో పరిచయమేర్పడి, 1808 లో అది వారి వివాహానికి దారి తీసింది. చాలా కాలం మంజోనీ మిలాన్ నగరంలో ప్రశాంతంగా గడిపాడు. 1833 లో ఇతని భార్య చనిపోవడంతో థెరెసాబోరీ అనే ఒక వితంతువును పెళ్లిచేసుకొన్నాడు. కాని ఆమె కూడా కొద్ది కాలానికే చనిపోయింది. ఇతని దురదృష్టం ఏమిటో గాని ఇతనికి గల తొమ్మిది మంది కొడుకులలో ఏడుగురు ఇతనికంటె ముందే మరణించారు. 1806 లో ఇతడు సెనేటర్‌గా ఎన్నుకోబడ్డాడు.

బహుగ్రంథకర్త అయిన మంజోనీ అనేక చారిత్రక తాత్త్విక, ధార్మిక, విమర్శనాత్మక గ్రంథాలే కాక భాషా శాస్త్రసంబంధమైన గ్రంథాలు కూడా రచించాడు. 1815-22 మధ్య కాలంలో ఎన్నో పవిత్ర ధార్మిక గీతాలను రచించాడు. *మార్జో* (Marzo, 1812) అనే ఇతని రచన దేశభక్తి పూరితమైనది. నెపోలియన్ మరణంపై ఇతడు వ్రాసిన గీతం *ఓడ్* లో ఇతనికి గల మానవతా దృక్పథం, క్రైస్తవ మతాభినివేశం కనిపిస్తాయి. షేక్స్‌పియర్ రచనలచే ప్రభావితుడై ఇతడు వ్రాసిన రెండు చారిత్రక నాటకాలు *కార్ మంగోలా* (1820), *అదెల్చి* (1822) లు సెయింట్ బ్యూవే మరియు 'గొయిథె' ల వంటి ప్రముఖ విమర్శకుల ప్రశంసలను అందుకొన్నాయి. ఇతని రచనలలో మిక్కిలి ప్రసిద్ధమైనది *ఐ ప్రామ్మెసి స్పోసి* (1825-27) అనే మూడు సంపుటాల నవల. ఇద్దరు ప్రేమికుల గాథ ప్రధాన ఇతివృత్తంగా గల ఈ నవలలో 'మంజోనీ' కి గల దేశభక్తి, పేద ప్రజలపై ఇతనికి గల సానుభూతి, క్రైస్తవ మతాభినివేశం, చారిత్రక దృక్పథం వ్యక్తమౌతాయి. 17 వ శతాబ్దిలో లంబార్డీ అనే ప్రదేశం స్పెయిన్ పరిపాలనలో ఉన్నపుడు జరిగిన అనేక రాజకీయ, సామాజిక సంఘటనలను ఇతడు సహజంగా చిత్రించాడు. ఈ నవలలో ఆ నాటి సమాజంలోని అవినీతిని, ప్రభువుల నిరంకుశత్వాన్ని అపుడు సంభవించిన కరువు కాటకాలను, ప్లేగు వ్యాధిని సునిశిత హాస్యంతో, వ్యంగ్యంతో, చారిత్రక దృక్పథంతో మంజోనీ చిత్రించాడు. ఈ నవలను మొదటిసారిగా 1827 లో ప్రచురించినప్పటికీ, ఆ తరువాత టస్కన్ మాండలికంలో తిరిగి వ్రాసి, 1840 లో అతడు దానిని పునర్ముద్రించాడు. యూరప్ ఖండంలోని ఆనాటి అనేక ప్రముఖుల ప్రశంసలను అందుకొన్న మంజోనీ 1873 మే 22 న మరణించాడు.

ఉమారాణి

**మండెవిలె, సర్ జాన్ (1356 ప్రాంతం) :** ఆంగ్ల రచయిత. ప్రపంచంలోని యాత్రికుల కథల సంకలనాలను తయారు చేసినవాడు. *ది వాయేజ్ అండ్ ట్రావెల్స్*

*ఆఫ్ సర్ జాన్ మండెవిలె, నైట్* అనే గ్రంథాన్నే *ట్రావెల్స్ ఆఫ్ సర్ జాన్ మండెవిలె* అని కూడా అంటారు. వివిధ యాత్రికుల వద్ద నుండి ఆయన సేకరించిన కథలకు చేర్పులూ మార్పులూ చేసి తన స్వంత సాహసగాథలుగా మండెవిలె వాటిని అభివర్ణించాడు.

మండెవిలెను గురించి మనకు తెలిసిన సంగతు లన్నీ ఆయన *ట్రావెల్స్* అనే ఆ రచన వలన తెలిసినవే! ఆ గ్రంథం వలన మనకు ఆయన పేరు *జాన్ మండెవిలె, చెవలర్* అనీ, ఆయన పుట్టిందీ, చదువు కొన్నదీ ప్రస్తుతం హెర్ట్ ఫోర్డ్ షైర్‌లో ఉన్న సెంట్ ఆల్బన్స్ పట్టణం అనీ, ఆయన తన యాత్రలను 1322 లో మైఖేల్మస్ దినం (సెప్టెంబరు 29) నాడు ప్రారంభించి, 1356 లో తిరిగి వచ్చాడనీ తెలుస్తూంది.



కొందరు మండెవిలె అసలు యాత్రలు చేయనే లేదనీ, ఆయన తన గ్రంథంలో రచించిన విషయా లన్నీ ఆయనకు అందుబాటులో ఉన్న విజ్ఞాన సర్వస్వాలనుంచీ, యాత్రాగ్రంథాల నుంచీ గ్రహించినవే అనీ అంటున్నారు. తన కాలంలో మండెవిలె మధ్య యుగాలనాటి గొప్ప సాహసిక యాత్రికుడు అనే ప్రఖ్యాతి గడించినా, తరు వాతి శతాబ్దాలలో సత్యవాదిగా ఆయన కీర్తికి హాని ఏర్పడి, అంత గొప్ప అసత్యవాది మరి యొకడు లేడని అనిపించుకున్నాడు. అయితే ఆయన రచించిన గ్రంథానికి మాత్రం ఎప్పుడూ విశేషమైన ప్రజాదరణ లభిస్తూనే వచ్చింది. *ది రీడిస్కవరీ ఆఫ్ సర్ జాన్ మండెవిలె* (1954) అనే గ్రంథంలో జోసెఫిన్ వాటర్స్ బెనెట్ ఆయన వ్రాత ప్రతులనూ, 15 వ, 16 వ శతాబ్దాల నాటి వాటి ఎడిషన్‌లనూ పరిశోధించి గ్రంథకర్తృత్వ విషయాన్ని గురించీ, ఆ గ్రంథపు సాహిత్యపు విలువను గురించీ సుదీర్ఘంగా చర్చించాడు.

బ్రా.శ్రీ.

**మచాడో డి ఆసీస్, జోయాక్విమ్ మరియా (1839-1908)** : బ్రెజిల్ దేశానికి చెందిన నవలా రచయిత, కవి, కథా రచయిత. 1839 జూన్ 21 న జానెరో పట్టణంలోని ఒక మురికివాడలో జన్మించిన ఈ కవి జీవితం చాలా విచిత్రంగా సాగింది. ఇతనికి మూర్ఛరోగం ఉండేది. దానికి తోడు నత్తితో కూడా బాధపడేవాడు. ఈ విధంగా ఒక ప్రక్క అనారోగ్యంతో బాధపడుతూనే మరొక ప్రక్క దుర్భర దారిద్ర్యాన్ని అనుభ వించాడు. ఇతడు 'మ్యులాటో' అంటే సంకర జాతివాడు కావడం వల్ల జాతి విచక్షణకు కూడా గురిఅయాడు. అయితే ఇన్ని కష్టాలు ఎదురైనప్పటికీ ఇతనికి చదువుపై అభిలాష సన్నగిల్లలేదు. స్కూల్‌కు వెళ్లడానికి తగిన ఆర్థిక స్తోమత లేకపోవడం వల్ల ఇంటిపద్దనే కష్టపడి చదువుకొన్నాడు. ఒక ప్రింటింగ్ ప్రెస్‌లో చేరి పొట్ట పోసుకొంటూ ఓరిక సమయాలలో చదువుకోడమే గాకుండా రచనలు కూడా చేశాడు.

1881 లో ఇతడు రచించిన *ఎపిటాఫ్ ఆఫ్ ఏ స్మాల్ విన్నర్* అనే నవల ఇతనికి లాటిన్ అమెరికన్ రచయితలలో అగ్రగణ్యుడు అనే ప్రసిద్ధి చేకూర్చింది. ఇతని సమకాలికులందరూ వివిధ జాతీయ, ప్రాంతీయ, సామాజిక సమస్యలను గురించి కాల్పనిక శైలిలో రచనలు చేస్తూ ఉండగా, ఇతడు వారికంటె భిన్నమైన ధోరణిలో, అంటే మనోవిశ్లేషణాత్మక పద్ధతిలో ముఖ్యంగా స్వచ్ఛం దాలోచనా (Free Association) పద్ధతిని ఉపయోగిస్తూ రచన చేశాడు. ఇందులోని పాత్రల జీవితంలో జరిగిన సాధారణ బాహ్య సంఘటనలు వారి ఆంతరంగిక ప్రపంచంలో ఎలాంటి ప్రేరణలను సృష్టించాయి, అనే అంశానికి ప్రాధాన్యం ఇస్తూ ఈ నవల వ్రాయబడింది. ఆ పాత్రల సుప్తచేతనలో కలగాపులగంగా తలఎత్తే వివిధ జ్ఞాపకాలను, ఊహలను, ఆలోచనలను, అనుభవాలను రసవత్తరంగా మచాడో చిత్రీకరించాడు. ఈతని నవల మనకు 'లారెన్స్ స్టెర్న్' రచించిన *ట్రిస్టమ్ శ్యాండీ* ని గుర్తుకు తెస్తుంది. *ఫిలాసఫర్ ఆర్ డాగ్* (1891), *డామ్ కాస్మురో* (1900) అనేవి ఇతని ఇతర ప్రముఖ రచనలు. ఇవే కాకుండా ఇతడు రచించిన వివిధ కథలు, కవితలు ఇంగ్లీష్‌లోకి అనువదించబడి, 1963 లో *ది సైకియాట్రిస్ట్ అండ్ అదర్ స్టోరీస్* అనే సంకలనంగా ప్రచురింపబడ్డాయి. మురికివాడలో జన్మించిన మచాడో గొప్ప రచయితగా అంతర్జాతీయ ఖ్యాతిని గడించడమే కాక, బ్రెజిల్ సాహిత్య అకాడమీకి 1897 లో ప్రథమ అధ్యక్షుడుగా ఎన్నుకోబడి తాను మరణించేంత వరకు (సెప్టెంబర్ 29, 1908) ఆ పదవిలో సాగాడు.

మల్లేశం

**మన్, టామస్ (1875-1955)** : జర్మనీ దేశానికి చెందిన ప్రముఖ నవలా రచయిత, విమర్శకుడు. నోబెల్ బహుమతి గ్రహీత. రచయితలకు ఉండవలసిన సాంఘిక దృక్పథాన్ని బాధ్యతలను గురించి చాటి చెప్పినవాడు. ఇతని పూర్తి పేరు పాల్ టామస్ మన్. 1875 జూన్ 6 న బాల్టిన్ సముద్ర తీరాన గల లుబెక్‌లో జన్మించాడు. ఇతని తండ్రి గొప్ప ధాన్యపు వర్తకుడు, లుబెక్ సెనేట్ సభ్యుడు. 1891 లో ఇతని తండ్రి చనిపోయాడు. దానితో వీరి కుటుంబం మ్యూనిచ్ నగరంలో స్థిరపడింది. 1894 లో ఇతడు ఒక ఫైర్ ఇన్స్యూరెన్స్ బ్యాంక్‌లో అప్రెంటిస్‌గా పనిచేశాడు. అదే సంవత్సరం ఇతడు వ్రాసిన *ది ఫాలెన్ ఉమెన్* (1894) అనే కథ ఇతని సాహితీ జీవనానికి శ్రీకారం చుట్టింది. ఆ తరువాత ఇతడు కొంతకాలం సాంకేతిక విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసం చేశాడు. ఆ కాలంలో ఇతడు షోపెన్‌హేనర్, నీషే, వాగ్నార్ వంటి వారి రచనలచే ప్రభావితుడయాడు. సాహిత్యం సామాజిక చైతన్య రూపాలలో ఒకటని, రచయితలకు స్పష్టమైన సామాజిక బాధ్యత, అవగాహన సామర్థ్యం ఉండాలని ఇతని అభిప్రాయం. రచయితగానే కాకుండా ఒక ప్రజానాయకుడుగా కూడా మన్ పేరు పొందాడు. ఆ నాటి సమాజంలో సాగిన రాజకీయ, సాంస్కృతిక ఉద్యమాలలో చురుకుగా పాల్గొని రచయితగా తనకున్న సామాజిక బాధ్యతను ఆచరణ ద్వారా ప్రకటించాడు. ఇతని రాజకీయ భావాలవల్ల జర్మనీ ప్రభుత్వం 1936 లో ఇతని పౌరసత్వాన్ని రద్దు చేసింది. 'బాన్' యూనివర్శిటీ ఇతనికి ఇచ్చిన గౌరవ డాక్టరేట్ పట్టాను కూడా తిరిగి తీసుకుంది. తరువాత ఇతడు అమెరికాకు వెళ్ళి అక్కడ పౌరసత్వాన్ని తీసుకొన్నాడు. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ఇతడు ఫాసిజమ్‌కు వ్యతిరేకంగా ప్రచారం చేస్తూ అమెరికా అంతటా తిరిగాడు. హిట్లర్ చేసిన దురాగతాలను ఖండిస్తూ అనేక ప్రకటనలు, రేడియో ప్రసంగాలు చేశాడు.



ఆ నాటి సంఘంలో కనపడుతున్న అన్ని అనర్థాలను ఎత్తి చూపటానికి, సాంఘిక న్యాయం సమకూర్చడానికి ఇతడు రచనలు చేశాడు. 1901 లో ఇతడు వ్రాసిన *బుడెన్ బ్రూక్స్* అనే నవలకు ఇతనికి నోబెల్ బహుమతి వచ్చింది. ఈ నవలలో లుబెక్ నగరానికి చెందిన ఒక కుటుంబపు నాలుగు తరాల గాథను ఎంతో వాస్తవంగాను, హృద్యంగాను ఇతడు చిత్రించాడు. 1903 లో *టోనియో క్రోజర్, ట్రిస్టన్* అనే రెండు నవలలు రచించాడు. వీటిలో ఒక కళాకారునికి, తన చుట్టూ ఉన్న మధ్య తరగతి సామాజిక వాతావరణానికి మధ్యచెలరేగిన సంఘర్షణలను మన్ సహజంగా చిత్రించాడు. *ది మ్యాజిక్ మౌంటెన్* (1924) అనే నవలలో ఇతడు పతనావస్థలో ఉన్న సమకాలీన యూరపియన్ సంస్కృతిని విమర్శనాత్మకంగా విశ్లేషించాడు. ఇది 20 వ శతాబ్దపు ప్రపంచ సాహిత్య చరిత్రలో విశిష్టస్థానాన్ని సంతరించుకొంది. 1930 లో ఇతడు రచించిన *మారియో అండ్ ది మెజీషియన్* అనే రచనలో ఫాసిస్ట్ మనస్తత్త్వాన్ని చక్కగా విశ్లేషించాడు. 1933-1944 మధ్య కాలంలో బైబిల్‌లోని జోసెఫ్ కథను ఆధారంగా తీసుకొని *జోసెఫ్ అండ్ హిజ్ బ్రదర్స్* అనే పేరుతో నాలుగు గొలుసు నవలలు రచించాడు. గొయిథే, చెకోవ్, షిల్లర్ లపై ఇతడు వ్రాసిన వ్యాసాలు చాలా ప్రసిద్ధమైనవి. ఇవి రచయితకు గల సామాజిక బాధ్యతలను గూర్చి నొక్కి చెపుతున్నాయి. 1952 లో జ్యూరిట్‌లో స్థిరపడ్డ టామస్ మన్ 1955 ఆగస్ట్ 12 న కన్ను మూశాడు.

మల్లేశం

**మఫూజ్, నగీబ్ (1911--)** : ఈజిప్టు నవలా రచయిత, కథా రచయిత. సామ్యవాద, వాస్తవిక వాద దృక్పథాలతో కూడిన ఈయన రచనలకు 1988 లో సాహిత్యంలో నోబెల్ బహుమతి వచ్చింది. ఈజిప్టు రచయితలలో ఇతడే మొదటి నోబెల్ బహుమతి గ్రహీత.

1911 వ సంవత్సరం డిశంబర్ నెల 11 వ తేదీన ఈజిప్టు దేశంలోని కైరో (Cairo) పట్టణంలో మఫూజ్ జన్మించాడు. ఈయన జన్మించిన సంవత్సరాన్ని గూర్చి కొందరు 1912 గాను, 1914 గాను వ్రాశారు. తండ్రి అబ్దల్ అజీజ్ ఇబ్రహీం, తల్లి ఫాతీమ ముస్తాఫా మఫూజ్. కైరో విశ్వవిద్యాలయం నుండి 1935-36 లో తత్త్వశాస్త్రంలో ఎమ్.ఏ పట్టాను పొందాడు. 1936-71 మధ్య కైరో ప్రభుత్వంలోని అనేక మంత్రిత్వశాఖలలో వివిధ పదవులలో పనిచేశాడు. ఆయన రచించిన *బైన్ అల్‌కస్‌రీన్* కు 1956 లో ఈజిప్ట్ స్టేట్ బహుమతి,

1970 లో సాహిత్యానికి జాతీయ బహుమతి లభించాయి. 1972 లో 'కాలర్ ఆఫ్ రిపబ్లిక్' ప్రదానం చేశారు. ఈజిప్షియన్ ఆర్డర్ ఆఫ్ ఇండిపెండెన్స్, మరియు ఆర్డర్ ఆఫ్ రిపబ్లిక్ (Order of the Republic) లకు ఈయన పేరును ప్రతిపాదించారు.

20 వ శతాబంలో మధ్య ప్రాచ్య దేశాలలో అరబిక్ సాహిత్యానికి ప్రధాన ప్రతినిధిగా విమర్శకుల చేత ఇతనికి గుర్తింపు లభించింది. ప్రాచీన, ఆధునిక ఈజిప్టు సంస్కృతిని ప్రతిబింబిస్తూ 40 నవలలు, అనేక కథా సంపుటాలు ఈయన వెలువరించాడు. నోబెల్ బహుమతి వలన యూరప్ దేశాలలో ఈయనకు గుర్తింపు లభించింది. అరబిక్ సాహిత్యంలో నవలలు, కథలు ప్రవేశపెట్టి, వాటికి ఒక స్థానం కల్పించిన ఘనత ఈయనకు దక్కుతుంది. శతాబ్దాల పర్యంతం అరబిక్ రచయితలు తమ రచనలను కవితా రూపంలోనే వ్రాశారు. సామ్యవాదంతోను, వాస్తవిక వాదంతోను కూడిన ఈయన రచనలు 19 వ శతాబ్దపు బాల్‌జాక్, చార్లెస్ డికెన్స్‌ల రచనలను జ్ఞప్తికి తెస్తాయి. తన రచనలలో ఈజిప్టు ప్రజల చారిత్రక, రాజకీయ జీవనమే కాక, ఆ దేశప్రజల దారిద్ర్యానికి, నిరాశా నిస్పృహలకు కూడా ఈయన దర్పణం పట్టాడు.

1981 లో *మదక్ అలె* అనే నవల ఇంగ్లీషులో అనువదించబడడం వల్ల అమెరికన్ సాహిత్య సంఘాలలో ఇతనికి గుర్తింపు వచ్చింది. ఈ నవల మొదట 1947 లో అరబిక్ భాషలో వ్రాయబడింది. *కైరో ట్రిలోగి* (1956-57) వలన అరబ్ దేశాలలో మహ్ఫూజ్‌కు మంచి గుర్తింపు వచ్చింది. ఈ రచనలో మూడు తరాలకు సంబంధించిన ఒక మధ్య తరగతి కుటుంబ జీవన విధానాన్ని ఇతడు వర్ణించాడు. 1952 వ సంవత్సరంలో జనరల్ అబ్దుల్ నాజర్ తన సైనిక తిరుగుబాటు ద్వారా ఫరూక్ రాజును పదవీభ్రష్టుణ్ణి చేసి, ఈజిప్టులో రాజరికాన్ని రద్దు పరచి, అధికారంలోకి వచ్చిన వృత్తాంతాన్ని తన రచనకు ఇతివృత్తంగా తీసుకున్నాడు. ఈ గ్రంథంలోని పాత్రల ద్వారా ఈజిప్టు ప్రజల ఆధునిక జీవన సరణిని గమనించవచ్చు. *న్యూయార్క్ టైమ్స్* (Newyork Times)లో రోజర్ ఆలెన్ అనే విమర్శకుడు ఈ రచనను చిరస్మరణీయమైనదిగా అభివర్ణించాడు. మహ్ఫూజ్ మొదట గౌజిర్ విప్లవాన్ని సమర్థించినప్పటికీ, 1967 లో తన *చిల్డ్రన్ ఆఫ్ గెబెలావిస్* రచన ద్వారా ఆ విప్లవం పట్ల అసంతృప్తిని వ్యక్తపరచాడు. ఇది 1969 లో సీరియల్‌గా వచ్చిన తరువాత ఇస్లామిక్ ఫండమెంటలిస్టులు ఈ పుస్తక ప్రచురణను వ్యతిరేకించి నిషేధించారు. ఇస్లామిక్ ఫండమెంటలిస్టులు వ్యతిరేకించినప్పటికీ, కొంత మంది విమర్శకులు ఈ రచనలో మహ్ఫూజ్ సాంఘిక అన్యాయాన్ని, అవినీతిని ఎత్తిచూపడమే కాక మనిషికి, మనిషికి మధ్య గల అసూయా ద్వేషాలను, వైషమ్యాలను చక్కగా వివరించారని పేర్కొన్నారు. 1967 లో దీన్ని బీరుట్, లెబనాన్‌లలో ప్రచురించారు.

1967 లో మొదటిసారిగా ప్రచురించబడిన *మీరామార్* అనే నవల 1983 వ సంవత్సరంలో అమెరికాలో విడుదలయినప్పుడు సంచలనాన్ని సృష్టించింది. ఈ నవలలో రచయిత నాజర్ విప్లవం పట్ల తన అనిష్టతను స్పష్టంగా వ్యక్తపరచాడు. ఈ విప్లవాన్ని ఫౌలెస్ మహాశయుడు ఈజిప్టు దేశపు ఆర్థిక సంపదను, ధనవంతులను కదలించిన విప్లవంగా పేర్కొన్నాడు. ఈ నవలతో పాటు ఇంకా 16 నవలలను ఈజిప్టులో సినిమాలుగా విడుదల చేశారు.

1979 లో ఈజిప్టు-ఇజ్రాయేలీయుల మధ్య జరిగిన శాంతి ఒప్పందాన్ని సమర్థించినందున అనేక అరబ్ దేశాలు ఈయన రచనలను నిషేధించాయి. తీవ్రమైన సాంఘికవిమర్శకుడుగా ఈయన చేసిన రచనలు మతాధికారులను, రాజకీయనాయకులను కలవరపరచాయి.

ఈజిప్టు ప్రజల సాంఘిక, చారిత్రక, రాజకీయ జీవన విధానాన్ని నిర్భయంగా వర్ణించినందుకు మహ్ఫూజ్‌పై కొందరు దూషణలు కూడా కురిపించారు.

*భారతి*

**మయకోవ్‌స్కీ, వ్లాదిమిర్, వ్లాదిమిరోవిచ్ (1893-1930)** : రష్యన్ కవి, రచయిత. రష్యన్ విప్లవకాలంలో అద్భుతమైన కవిత్వం వ్రాసి ప్రపంచ సాహిత్య చరిత్రలో ప్రముఖ స్థానాన్ని అలంకరించాడు. 1893 జూలై 19 న జార్జియాలోని బాగ్దాదీ అనే నగరంలో జన్మించిన 'మైకోవ్‌స్కీ' తన 15 వ ఏటనే రష్యన్ డెమొక్రాటిక్



వర్కర్స్ పార్టీలో చేరి, సంఘవిద్రోహ కార్యకలాపాల నేరంపై అనేక సార్లు జైలు శిక్షను అనుభవించాడు. 1909 లో

ఇతడు ఒంటరి గది జైలు జీవితాన్ని అనుభవిస్తూనే కవిత్వం వ్రాయడం ప్రారంభించాడు. 1911 లో ఇతడు విడుదలైన తరువాత మాస్కో ఆర్ట్ స్కూల్‌లో చేరి అక్కడ డేవిడ్ బర్ల్యూక్ (David Buyrlyuk) వంటి ప్రముఖ 'కవి-చిత్రకారుల' తో సాన్నిహిత్యం ఏర్పరచుకొని అచిరకాలంలోనే వారి క్యూబో ఫ్యూచరిస్ట్ ఉద్యమానికి సారథి అయాడు.

రష్యన్ విప్లవకాలంలో (1917) ఇతడు బోల్షివిక్కులకు తన హృదయ పూర్వకమైన మద్దతు నివ్వడమే కాకుండా రష్యన్ కమ్యూనిష్ట్ పార్టీలో సభ్యుడుగా ఎంతో సేవ చేశాడు. ఆ కాలంలో ఇతడు వ్రాసిన *ఓడ్ టు రెవల్యూషన్* (1918), *లెఫ్ట్‌మార్చ్* (1919) వంటి గీతాలు చాలా ప్రసిద్ధి చెందాయి. 1919-21 సంవత్సరాల మధ్యకాలంలో రష్యన్ టెలిగ్రాఫ్ ఏజెన్సీలో చిత్రకారుడుగా పనిచేసి ఎన్నో వాల్‌పోస్టర్లు, కార్టూన్లు గీయడమే కాక వాటికి ఆకర్షకమైన స్లోగన్లు కూడా వ్రాశాడు. 1923-25 మధ్య కాలంలో *లీఫ్* అనే పత్రికకు సంపాదకత్వం వహించాడు. 1925 తరువాత యూరప్, అమెరికా, మెక్సికో, క్యూబాలలో విస్తృతంగా పర్యటించి తన అనుభవాలను *మై డిస్కవరీ ఆఫ్ అమెరికా* (1926) లో ప్రకటించాడు. ఇతడు ఎన్నో సినిమాలకు స్క్రిప్టు వ్రాయడమే కాకుండా వాటిలో నటించాడు. లెనిన్ చనిపోయిన తరువాత ఇతడు వ్రాసిన *వి.ఐ. లెనిన్* (1924) అనే స్మృతిగీతి చాలా ప్రసిద్ధి చెందింది. 1928 లో ఇతడు పారిస్‌లో ఉండగా తాత్యానా అనే ఒక కాందిశీకురాలు పై మోజు పడ్డాడు. కాని ఆమె తిరస్కరించటంతో ఇతనికి కల్గిన బాధ, అదే సమయంలో 'రాప్' (Rap) అనే సోవియట్ రచయితల సంఘంతోను, ఇతర అధికారులతోను ఇతనికి ఏర్పడ్డ మనస్పర్థలు ఇతని ఆత్మహత్యకు దారి తీశాయి.

మయకోవ్‌స్కీ కవిత్వం ఉత్సాహంతో పరవళ్లు తొక్కుతుంది. సంప్రదాయాన్ని ఛేదించి, విలక్షణమైన ఒక ప్రత్యేక శైలిని ఏర్పరచుకొన్నాడు. ఛందస్సులో, భావనలో, శబ్ద ప్రయోగంలో, వాక్య నిర్మాణంలో, సంవిధానంలో ఎన్నో నూతన ప్రయోగాలు చేసి తదనంతర కవులపై చెరగని ముద్ర వేశాడు. *అవర్ మార్చ్* (1917) అనే గేయం ద్వారా పీడిత ప్రజలను విప్లవ పథంలో నడిపించేట్టు ప్రబోధించాడు. *లెఫ్ట్ మార్చ్* (1918) అనే గేయంలో ప్రజా శత్రువుల పతనాన్ని, విప్లవ వాదుల విజయాన్ని చిత్రించాడు. తాను 15 కోట్ల రష్యన్ ప్రజలకు ప్రతినిధి నని చెప్పుకొన్నాడు. *మిస్టరీ బఫ్* (1918) అనే నాటకంలో బూర్జువాలపై ప్రొలిటేరియన్‌ల విజయాన్ని ప్రతీకాత్మకంగా చిత్రించాడు. తన ప్రతిభా పాటవాలచేత తదనంతర రష్యన్ కవులనే గాక వివిధ దేశాల కవులను (తెలుగులో శ్రీ శ్రీ పై కూడా ఇతని ప్రభావం ఉంది) ప్రభావితం చేసిన మయకోవ్‌స్కీ 1930 ఏప్రిల్ 14 న ఆత్మహత్య చేసుకొని మరణించాడు.

మల్లేశం

**మరీనో, జ్యాంబతీస్తా (1569-1625)** : 17 వ శతాబ్ది ఇటాలియన్ కవిత్వాన్ని ప్రభావితం చేసిన 'మరీనిజమ్' అనే రీతిని ప్రారంభించి పోషించిన ఇటాలియన్ కవి. పదాలతో గారడీ చేయటం, అపహ్నవం (Conceit), రూపకం (Metaphor) వంటి అలంకారాలను విరివిగా వాడటం ఈ మరీనిజమ్ ప్రత్యేకతలు. అయితే దానిని మరీనో పోషించిన రీతిలో ఆయనను అనుకరించిన వారు నిర్వహించలేక పోవటంతో మరీనిజమ్ అపహాస్యం పాలయింది. మరీనో రచనలు యూరప్‌లోని అనేక భాషలలోకి అనువాదం పొందాయి.

విచ్చలవిడి జీవితాన్ని గడపటానికి ప్రయత్నించి, 1590 నుండి ఈయన చాల చిక్కులలో పడ్డాడు. కోర్టులలో దావాలు, ఆర్థికమైన ఇబ్బందులు, చట్టంతో చికాకులు ఈయనను కొంతకాలం పాటు వెన్నంటుతూనే ఉన్నాయి. ఈయన తొలి రచనలు వ్రాత ప్రతులుగా బహుళాదరణను పొందాయి. 1596 లో *లా సంపోనా* (The Syrinx) అనేది ఈయన తొలి రచన. దీనిని 1620 లో ప్రచురించాడు.

ఒక రాజకుమారునికి ఆంతరంగిక కార్యదర్శిగా కొంతకాలం పనిచేసిన మరీనోను అవినీతి నేరానికి గాను రెండు పర్యాయాలు కారాగారానికి పంపగా, ఉన్నత పదవులలో ఉన్న ఆయన అభిమానులు ఆయనను విడుదల చేయించారు. ఆ తరువాత రోమ్ నగరానికి మకాం మార్చి పోప్ సన్నిహిత బంధువైన కార్డినల్ పియెత్రో ఆల్డోబ్రాందిని కి సన్నిహితుడయాడు. ఆయనతో కలసి తిరిగే రోజులలోనే పర్మాలో తాను రచించిన కొన్ని ఇంద్రియాకర్షక కవితలను ప్రచురించటానికి ప్రయత్నించగా మత సంబంధ న్యాయస్థానం (Inquisition) ఆ ప్రయత్నాన్ని వమ్ము చేసింది. అయితే ఆయన తన తొలి రచనలను *లె రైమ్* (1602, 'The Rhymes'), *లా లిరా* (రెండు సంపుటాలు-1608, 1614) అనే రెండు గ్రంథాలుగా ప్రచురించ గలిగాడు.

1608 నుండి 1615 వరకు టురిన్ నగరంలో 'సవాయ్' ప్రభువు ప్రాపకంలో గడుపుతూ మరీనో

కవితో వ్యాసంగం జరిపాడు. కాని తోటి కవి గస్పారా ముర్తోలా పై తీవ్ర వ్యంగ్య బాణాలను విసురుతూ వ్రాసిన *లా ముర్తొలీడ్* (1619) అనే వ్యంగ్య కావ్యం ఆయనను తిరిగి కారాగారానికి పంపింది. అభిమానుల చలువ వలన తిరిగి స్వేచ్ఛ సంపాదించుకొని అక్కడ నుండి పారిస్ నగరం చేరి మేరిడిమెసిస్, 13 వ లూయీల ప్రాపకం లో 1623 వరకు గడిపాడు.

పారిస్‌లో ఉండగానే *అడోన్* అనే గ్రంథాన్ని ప్రచురించాడు. 20 సంవత్సరాల కృషి ఫలితమైన ఈ కావ్యం ఆయన రచనలలో ప్రముఖమైనది. 45,000 పంక్తులు గల ఈ కావ్యానికి వీనస్, అడొనిల్ ల ప్రేమ ఇతివృత్తం. 1623 లో ఇటలీకి తిరిగి వచ్చి, 1625 లో మరణించే వరకూ మరీనో నేపుల్స్‌లో గడిపాడు. *లా గెలిరియా* (1620, 'The Gallery'), *లా స్ట్రేజ్ డెగ్లి ఇన్నొసెంటీ* (1632, 'The slaughter of the innocents') అనేవి ఈయన ఇతర రచనలు.

కె.బి.మూర్తి

**మల్లార్మే, స్టెఫాన్ (1842-98) :** ఫ్రెంచ్ కవి, రచయిత, 19 వ శతాబ్దిలో ఫ్రాన్స్‌లో తల ఎత్తిన సింబాలిస్ట్ కవిత్వోద్యమానికి నాయకుడు. ఇతడు కవిత్వం వ్రాసిన తొలిరోజులలో అది అస్పష్టంగా ఉందని చాలా మంది విమర్శించినప్పటికీ, తరువాత ఇతడు సింబాలిస్ట్ కవిత్వ ఉద్యమ ప్రచారానికి సారథ్యం వహించి, తదనంతర కవులను ఎంతగానో ప్రభావితులను చేశాడు. 1842 మార్చి 18 న పారిస్‌లో జన్మించిన మల్లార్మే కు భాషా శాస్త్రం పట్ల మక్కువ ఎక్కువ. ఇతడు ఎడ్గార్ అలెన్ పో కవిత్వాన్ని చదవడం కోసమే ఇంగ్లీష్ నేర్చుకొన్నానని తన తోటి ఉద్యమ కారులలో ఒకరైన 'వర్లేన్' కు వ్రాసిన ఉత్తరంలో పేర్కొన్నాడు. 1863 లో ఇతడు లండన్ వెళ్ళి ఇంగ్లీష్ నేర్చుకోడమే కాకుండా ఇంగ్లీష్ బోధనలో కూడా ఒక సర్టిఫికెట్ సంపాదించాడు. అక్కడే ఒక జర్మనీ జాతికి చెందిన ఒక యువ స్కూల్ టీచర్‌ను పెండ్లాడాడు. 1871 నుండి 1893 వరకు ఫ్రాన్స్‌లోని వివిధ విద్యా సంస్థలలో ఇంగ్లీష్ బోధించడమే కాకుండా ఇంగ్లీష్‌లోని అనేక ఉత్తమ గ్రంథాలను ఫ్రెంచ్‌లోకి అనువదించాడు. ముఖ్యంగా 'పో' (Poe) కవిత్వానికి ఇతడు చేసిన అనువాదం మిక్కిలి ప్రశంసనీయమైనది.



సంగీతంలో రాగాలకు ఎంత ప్రాధాన్యం ఉందో కవిత్వంలోని శబ్దాలకు కూడా అంత ప్రాధాన్య మున్నదని, రాగం భావాన్ని వ్యంగ్యంగా సూచించినట్లే కవిత్వంలోని ప్రతి శబ్దం సూచ్యార్థ ప్రధానంగా ఉండాలని మలార్మే అభిప్రాయం. 1876 లో ఇతడు రచించిన *ది ఆఫ్టర్ నూన్ ఆఫ్ ఏ ఫాన్* అనే కావ్యానికి ప్రసిద్ధ ఫ్రెంచ్ వాగ్గేయ కారుడైన *క్లాడ్ డి బుస్సీ* స్వరకల్పన చేశాడు. భావ ప్రకటన చేయడం కవిత్వ ధర్మం కాదని, భావ సూచనమే దాని లక్ష్యం కావాలనే మల్లార్మే సిద్ధాంతానికి దర్పణం పట్టేదే ఇతని *హిరోడియేడ్* (1871) అనే కావ్యం. చుక్కలతో కూడుకొనిన ఆకాశం పలువురికి శూన్యంగా కనిపిస్తే మల్లార్మే కు అది ఇతరులకు కనిపించని ఊహా సౌధంగా భాసించింది. ఆస్తికులు ఆకాశాన్ని భగవంతుని సౌధంగా భావిస్తారు. ఇతడా విషయాన్ని వాచ్యంగా చెప్పక ధ్వనింపచేశాడు. ఉపమానం వ్యంగ్యానికి భంగం కలిగిస్తుందని సింబాలిస్ట్‌ల అభిప్రాయం. సంగీతం వలెనే కవిత్వం కూడా అవ్యక్త మాధుర్యాన్ని అందించవలెనని ఇతని భావన.

పారిస్‌లోని మల్లార్మే ఇల్లు ఆ నాటి ఎందరో ప్రసిద్ధ కవుల, రచయితల, సంగీతజ్ఞుల చిత్రకారుల చర్చలకు నిలయంగా ఉండేది. ప్రపంచంలోని ఎందరో కవులను తన సింబాలిస్టు ధోరణితో ప్రభావితం చేసిన మల్లార్మే 1898 సెప్టెంబర్ 9 న మరణించాడు.

ఉమారాణి

**మలేయా, ఎడ్వార్డో (1903-1982) :** అర్జెంటీనా దేశానికి చెందిన ప్రముఖ నవలా రచయిత. ఇతని రచనలలో మనోవిశ్లేషణ, అస్తిత్వ వాద ధోరణి ఎక్కువగా కనిపిస్తాయి. 1903 ఆగస్టు 14 న అర్జంటీనాలోని బాహియా బ్లాంకాలో జన్మించిన మలేయా *స్టోరీస్ ఫర్ ఏ డెస్పరేట్ ఇంగ్లీష్ వుమన్* (1926) అనే కథా సంకలనాన్ని ప్రచురించి తన సాహితీ జీవనాన్ని ప్రారంభించాడు. 1934 లో *లా నేషన్* అనే సాహితీ పత్రికకు సంపాదకుడై, దాన్ని ఎంతో సమర్థంగా నిర్వహించాడు. 1934 లో *యూరపియన్ నాక్టర్న్* అనే మరో కథా సంకలనాన్ని అచ్చువేసి తరువాత తన దృష్టిని నవల పైకి మళ్ళించాడు.

మలేయా 1940-50 వ దశకంలో అర్జెంటీనా దేశంలోని వివిధ జాతీయ ప్రాంతీయ సమస్యలను ఇతి వృత్తాలుగా స్వీకరించి నవలా రచన సాగించాడు. *ది బే ఆఫ్ సైలెన్స్* (1940), *ది ఈగిల్స్* (1940) అనే నవలలు చాలా ప్రముఖమైనవి. అర్జెంటీనా లోని ఆనాటి సామాజిక జీవనానికి ఇవి దర్పణం పడుతాయి. ఇతని నవలలలోని ప్రత్యేకత వాటిలోని పాత్రలు, సంఘటనలు పైకి చూడడానికి అర్జెంటీనా దేశానికి సంబంధించి నవి అనిపించినప్పటికి, లోతుగా పరిశీలిస్తే విశ్వజనీనతను సంతరించుకొన్నాయని మనకు అవగత మవుతుంది. 1941 లో ఇతడు రచించిన *ఆల్ గ్రీన్ షెల్ పెరిష్* అనే మనోవిశ్లేషణాత్మక నవల ఇతని రచన లన్నింటిలోకి గొప్పది. ఇందులో అర్జెంటీనా సమాజంలోని ఒక మధ్య తరగతి మహిళ పొందిన ఆవేదనను, చైతన్య స్రవంతిని, అంతరంగిక స్వగతాలు, చలన చిత్రాల్లో వాడే ఎన్నో ఇతర టెక్నిక్‌లను ఉపయోగించి అద్భుతంగా చిత్రించాడు. ఆ మహిళ జీవితంలో జరిగిన సాధారణ బాహ్య సంఘటనలు ఆమె అంతరంగ ప్రపంచంలో ఎలాంటి ప్రేరణలు సృష్టించాయన్న అంశాన్ని వివరిస్తూ వ్రాసిన ఈ నవలలో ఇతడు వాడిన 'ఫ్రీ అసోసియేషన్' (స్వచ్ఛందాలోచన విధానం), అంతర్గత స్వగతాలు వంటి పద్ధతులు ఎంతో ప్రశంసనీయంగా ఉన్నాయి.

కొంత కాలం మలేయా తన రచనా వ్యాసాంగాన్ని ఆపి, దౌత్యవేత్తగా క్రొత్త జీవితాన్ని ప్రారంభించి, అనేక పదవులు స్వీకరించాడు. 1955-58 సంవత్సరాల మధ్య కాలంలో యునెస్కోకు అర్జెంటీనా తరఫున ప్రతినిధిగా పనిచేశాడు. 1967 లో తిరిగి సాహితీ జీవనాన్ని కొనసాగించిన మలేయా, *ది బోట్ ఆఫ్ బిటర్ నెస్* (1967) అనే నవలను రచించి అర్జెంటీనా సాహిత్య చరిత్రలో అగ్రగణ్యుడుగా కీర్తి పొందాడు.

మల్లేశం

**మాండెల్‌స్టామ్, ఓసిప్ ఎమిలీవిచ్ (1891-1938) :** రష్యన్ కవి. 1891 జనవరి 15 న వార్సా (Warsaw) లో జన్మించిన ఇతని రచనలు రాశిలో తక్కువ అయినప్పటికీ, వాసిలో చెప్పుకోదగ్గవి. వార్సా నగరంలో తోళ్ళ వ్యాపారం చేసే ఇతని తండ్రి మరణించడంతో వీరి కుటుంబం సెయింట్ పీటర్స్ బర్గ్ (ప్రస్తుతం లెనిన్‌గ్రాడ్) లో స్థిరపడింది.

ఇతడు సెయింట్ పీటర్స్‌బర్గ్ విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసం చేశాడు. బోల్షివిక్కుల విప్లవాన్ని వ్యతిరే కించటంతో ఇతడు కొన్ని ఇబ్బందులకు గురి అయాడు. 1934 లో స్టాలిన్‌కి వ్యతిరేకంగా ఒక పద్యం వ్రాసి, ఇతడు అరెస్టయాడు. ఇతనికి దేశాంతరవాస శిక్ష కూడా విధించబడింది. చివరకు 1938 డిసెంబర్ 27 న సైబీరియాలోని ఒక లేబర్ క్యాంప్‌లో మాండెల్ స్టామ్ మరణించాడు.

పీటర్స్‌బర్గ్ విశ్వవిద్యాలయంలో చదువుకొన్న రోజు ల్లోనే మాండెల్ స్టామ్ కవిత్వం వ్రాయడం ప్రారంభించాడు. 1913 లో *కామెన్* పేరుతో తొలి కవితా సంకలనం వెలువడింది. 1922 లో *ట్రిస్టియా* అనే పేర మరొక సంకలనం వెలువరించాడు. ఆనా అఖ్మతోవా అనే ప్రఖ్యాత కవయిత్రితో కలసి అక్‌మెయిస్ట్ ఉద్యమానికి సారథ్యం వహించాడు. ఈ ఉద్యమం 20 వ శతాబ్ది తొలి సంవత్సరాలలో సింబాలిజానికి వ్యతిరేకంగా రష్యాలో ప్రారంభ మయింది. ఉద్యమ కర్తలకు చెప్పదలచుకున్న భావాలను సూటిగా గుండెకు తాకేటట్లు చెప్పే గుణం అలవడింది. శబ్దాడంబరం వీరికి నచ్చదు. అందువల్ల 'మాండెల్‌స్టామ్' అనవసరమైన శబ్దార్భటిని, పొల్లుపదాల వాడుకను నిరసించాడు. చౌకబారు పదబంధాలు, పాద పూరణ వ్యర్థపదాలు వాడకుండా, చెప్పదలచుకున్నది స్పష్టంగా, సూటిగా, గంభీరంగా అతి తక్కువ పదాలలో చెప్పడం అలవాటు చేసుకొన్న మాండెల్‌స్టామ్ రష్యన్ సాహిత్య చరిత్రలో చిరస్థాయిగా నిలచి పోయాడు.

ఉమారాణి

**మాకియవెల్లీ, నికోలో (1469-1527) :** ఇటలీకి చెందిన గొప్ప రాజనీతివేత్త, బహుగ్రంథకర్త. 1469 లో ఫ్లారెన్స్ నగరంలో జన్మించిన మాకియవెల్లీ మానవ హృదయ ప్రవృత్తి పరిశోధనలో అపరిమితమైన కుతూ హలం గలవాడు. చారిత్రక గ్రంథ పఠనంలో ఆసక్తుడు కావడం వలన గ్రీక్, లాటిన్ భాషలలోని ప్రముఖ గ్రంథా లన్నీ అధ్యయనం చేశాడు. 1498 లో మాకియవెల్లీ రెండో సచివాలయం (second chancery) కార్యదర్శిగా నియమించబడ్డాడు. రాజ తంత్ర కుశలుడు కావడం వలన ఫ్లారెన్స్ నగర ప్రభుత్వం ఇతనిని ఫ్రాన్స్, రోమ్, జర్మనీ మొదలైన దేశాలకు ప్రత్యేక రాయబారిగా పంపింది. ఆ తరువాత అతని ఉద్యోగం పోవడంతో కొంత కాలం ప్రవాసంలో ఉండి 1527 లో మరణించాడు.

మాకియవెల్లీ రచన లన్నింటిలోనూ ముఖ్యమైనది *ది ప్రిన్స్* (The Prince, 1513). దీనిలో 26 అధ్యా యాలు ఉన్నాయి. ఇది రాజ్యనిర్వహణ కళను (State Craft) వివరిస్తూ రాజకీయ విజయాలు పొందడానికి అవలంబించవలసిన యుక్తులను బోధించే గ్రంథం. ఇతడు

రాజనీతి శాస్త్రానికి స్వతంత్ర ప్రతిపత్తిని కల్పించి, వాస్తవిక, ఆచరణాత్మక రాజకీయాలకు రాజనీతి సిద్ధాంతాన్ని సన్నిహితం చేశాడు. ఇతడు వ్రాసిన *ప్రిన్స్* ను జగద్విఖ్యాతులయిన రాజ్యాంగ వేత్త లెందరో అభ్యసించారు. ఇటలీ నియంత అయిన ముస్సోలినీ డాక్టరేట్ పట్టం కోసం ఈ గ్రంథం మీద సిద్ధాంత వ్యాసం సమర్పించాడు. హిట్లర్ దీనిని ఎప్పుడూ పారాయణం చేస్తూ ఉండేవాడట. *డిస్‌కోర్స్* (1520) అనేది ఇతని రచనలలో ముఖ్యమైన గ్రంథం. దీనిలో మాకియవెల్లీ రిపబ్లికన్ రాజ్యాలను గురించి, రోమన్ ప్రభుత్వ విధానాలను గురించి చర్చించాడు. *ది ఆర్ట్ ఆఫ్ వార్* (1519-20) అనే గ్రంథం యుద్ధ నైపుణ్యాన్ని గురించి, *హిస్టరీ ఆఫ్ ఫ్లారెన్స్* (1522) అనే గ్రంథం ఫ్లారెన్స్ నగర చరిత్రను గురించి తెలియజేస్తుంది.

మాకియవెల్లీ సిద్ధాంతాలు చాలా విప్లవాత్మకంగా ఉండడం వలన అతడు అనేక విమర్శలకు గురి అయాడు. మనుష్య ద్వేషంతో ఆరంభించి నీతిని, మతాన్ని నిర్దాక్షిణ్యంగా విస్మరించినందుకు మాకియవెల్లీని అందరూ నిరసించారు. 'మాకియవెల్లియన్' అనే విశేషణానికి 'ద్రోహంతో కూడిన' అనే అర్థం సంక్రమించింది. ఏది ఏమైనప్పటికీ మాకియవెల్లీ ప్రధానంగా రాజ్యరక్షణ కోసం ఈ గ్రంథాలను రచించాడనే విషయం మనం గ్రహించాలి. మాకియవెల్లీ ని తరచుగా కౌటిల్యునితో పోలుస్తుంటారు.

ఉమారాణి

**మాక్‌లెనన్, హ్యూ (1907--)** : కెనడాకు చెందిన హ్యూ నవలా రచయితగానూ, వ్యాసరచయితగానూ ప్రసిద్ధుడు. ఆయన రచనలలో కెనడాలోని సమకాలీన జీవితం గురించిన మనోవైజ్ఞానిక విశ్లేషణ, సామాజిక విమర్శ కనిపిస్తాయి.

1935 లో పిహెచ్.డి పట్టభద్రుడయిన హ్యూ 1935 నుంచి 1945 దాకా మాంట్రేల్‌లోని దిగువ కెనడా కళాశాలలో లాటిన్, చరిత్ర బోధించాడు. 1951 నుంచి 1963 దాకా మెక్‌గిల్ విశ్వవిద్యాలయంలో ఇంగ్లీష్ శాఖలో ఆచార్యుడుగా పనిచేశాడు.

'హ్యూ' తొలి నవల *బెరోమీటర్ రైసింగ్* 1941 లో వెలువడింది. అది 1917 లో ఒక యుద్ధనౌక పేలిపోవడం వల్ల హాలిఫాక్స్ నగరంలో కొంత మేర నాశనం అయిన సంఘటన ఆధారంగా అల్లిన నీతికథ. కెనడా వారికి ఆంగ్లేయులు, ఫ్రెంచివారు, అమెరికనులు మొదలైన ఇతర జాతుల వారితో ఏర్పడిన అనుభవాల నేపథ్యంలో 'హ్యూ' 1945 లో *టూ సాలిట్యూడ్స్* 1948 లో *ద్విపిసిపిస్*, 1967 లో *ది రిటర్న్ ఆఫ్ ది స్ఫింక్స్* అనే నవలలు వ్రాశాడు. నైతికంగానూ, మానసికంగానూ మానవులు ఎదుర్కొనే సమస్యలను అస్తిత్వవాదం ప్రాతిపదికగా 'హ్యూ' 1959 లో వెలువరించిన *ది వాచ్ దట్ ఎండ్స్ ద నైట్* నవలలో పరామర్శించాడు. 1980 లో హ్యూ ఏడవ నవల *వాయిస్ సెస్ ఇన్ టైమ్* Voices in Time వెలువడింది. ఇది అణుయుద్ధంలో సర్వనాశనం చెందిన కెనడా చరిత్రను పునర్విమర్శించడానికి ప్రయత్నించే ఒక వ్యక్తిని గురించిన కథ.

పి.ఎస్.జి.

**మాచో, గిలోమ్ డి (1300-1377)** : ఫ్రెంచి కవి, వాగ్గేయకారుడు, గొప్ప సంగీత విద్వాంసుడు. 14 వ శతాబ్దానికి చెందిన ఆర్స్‌నోవా అనే సంగీత ఉద్యమంలో ప్రధాన పాత్రను వహించాడు. 'ఛాసర్', 'డీ షాంప్' వంటి కవులను తన కృతులచే ప్రభావితం చేసిన 'మాచో' 1300 వ సంవత్సరంలో ఫ్రాన్స్‌లో జన్మించాడు. ఇతడు మతధర్మ శాస్త్రంలో పట్టా పుచ్చుకొని బొహీమియా (Bohemia) కు రాజయిన జాన్ వద్ద రాజపురోహితుడుగా, అంతరంగిక సలహాదారుగా పనిచేశాడు. కింగ్ జాన్ మరణం తరువాత రెండవ ఛార్లెస్, రెండవ జాన్ రాజుల ప్రాపకాన్ని సంపాదించి అనేక బిరుదులు, సత్కారాలు పొందాడు.

ప్రారంభంలో 'మాచో' ప్రేమ కవిత్వాన్ని, ప్రబోధాత్మకమైన సుదీర్ఘకావ్యాలను రచించాడు. అయితే వీటిలో ఆ నాటి ఇతర కవుల రచనలలో కనపించే సామాన్యమైన ఇతివృత్తాలు, శైలి మాత్రమే ఉండడం వలన ఆధునిక పాఠకులకు ఇతని కవిత్వం అంతగా నచ్చకపోవచ్చు. కాని ఇతడు రచించిన *వాయిర్ డిట్* (Vair-Dit) అనేకావ్యం మాత్రం చెప్పుకోదగ్గది. ఒక ఉన్నత వంశానికి చెందిన యువతి బీదకుటుంబానికి చెందిన యువకుని ప్రేమలో పడటం ఇతివృత్తంగా గల ఈ కావ్యంలో ఇతని కథాకథన శిల్పం మనలను ముగ్ధులను చేస్తుంది. ఆ ఇద్దరు ప్రేమికుల మధ్య నడిచిన ప్రేమలేఖలు, సందేశాలు భావగర్భితాలై శబ్దమాధుర్యంతో శ్రవణ సుభగంగా ఉంటాయి. కవిత్వంలో ఇతడు చేసిన అనేక నూతన ప్రయోగాల వల్ల ఇతని కీర్తి ఫ్రాన్స్ లోనే గాక ఇతర దేశాలలో కూడా వ్యాపించింది. ఇంగ్లండ్‌లో ఛాసర్ వంటి కవులు ఇతని కవితా విన్యాసాలచే ఆకర్షితు లయారు. ముఖ్యంగా ఛాసర్ రచించిన *ది బుక్ ఆఫ్ ది డచ్చెస్* పై 'మాచో' ప్రభావం కొట్టవచ్చినట్లుగా కనిపిస్తుంది.

కవిగానే గాక వాగ్గేయ కారుడుగా, సంగీత విద్వాంసుడుగా కూడా 'మాచో' ఖ్యాతి గడించాడు. వీనుల విందు గొలిపే ఇతని సంగీత కృతులలో ముప్పయి రెండు కృతుల లిఖిత ప్రతులు మనకు ఇప్పుడు లభ్యమవుతున్నాయి. బహు కంఠధ్వనులు గల (Poly phonic) మృదు మధురమైన నూతన సంగీత ప్రక్రియలను సృష్టించి ఫ్రెంచ్ సంగీత శాస్త్ర చరిత్రలో మాచో ఒక నూతనాధ్యాయాన్ని సృష్టించాడు. *రాండో* (Rondeau: 13 పంక్తులు గల పద్యం), *మాటెట్* (Motet- ప్రక్కవాద్యాలు లేని గీతం) వంటి అనేక నూతన ప్రక్రియలతో ఇటలీ, స్పెయిన్‌లు, అనేక ఇతర యూరప్ దేశాలలోని ఎందరో వాగ్గేయకారులను ప్రభావితం చేసిన 'మాచో' 1377 లో మరణించాడు.

మల్లేశం

**మాటర్ లింక్, మోరీస్ (1862-1949) :** బెల్జియన్ కవి, నాటకకర్త. ఎక్కువగా ఫ్రెంచ్ భాషలో రచనలు చేసినవాడు.

1890 నాటికే సుప్రసిద్ధుయిన 'మాటర్ లింక్', మొదటి ప్రపంచ యుద్ధం ముందు సంవత్సరాలలో మరింత ప్రశస్తి సంపాదించాడు. 1911 లో ఇతనికి సాహిత్య రంగంలో నోబెల్ బహుమతి వచ్చింది.

మార్మికత ప్రస్ఫుటించే కవితా సంకలనం *హాట్ హౌస్ బ్లూమ్స్* 1899 లో ప్రచురితం అయింది. *ఫెల్లియాస్ ఎట్ మెలిసాండే* అనే నాటకం ఫ్రెంచ్‌లో 1892 లోను, ఇంగ్లీషులో 1894 లోను విజయవంతంగా ప్రదర్శింపబడింది. సంగీత నాటకాలలో ఆ శతాబ్దికి ఇదే మంచి రచన.

చారిత్రక అంశాలను చొప్పించి మాటర్‌లింక్ నాటకాలు వ్రాశాడు. *ది బ్లూ బర్డ్* (1909) బాగా ప్రాచుర్యం పొందింది. చిన్న పిల్లలకు ఉద్దేశించిన ఈ నాటకంలో సుఖాన్వేషణ పద్ధతులు ఉన్నాయి. 1908 లో ప్రదర్శితమయిన ఈ నాటకం ఆదిలో ఎంతో మన్నన పొందింది. 1918 లో అనాలోచన పరుడైన ఒక జర్మన్ ఆఫీసర్ పాలనలో ఫ్లాండర్స్ ఎన్ని కష్టాలు అనుభవించిందో తెలుపుతూ మరొక నాటకం వ్రాశాడు.

మాటర్ లింక్ మంచి వచన రచయిత కూడా. 1930 వరకు ఆయన రచనలలో తత్త్వ నైరాశ్య దృష్టికి, ప్రకృతి ప్రదర్శనోత్సుకతకు ప్రాధాన్యం కనిపిస్తుంది. ఆయన క్రైస్తవ మతాన్ని నిరాకరించాడు. ఆత్మ అమృతత్వాన్ని గురించి, వ్యక్తుల పరస్పర భావ సంపర్కాన్ని గురించి, జీవితంలో కలిగే కష్టనష్టాలకు మనుష్యులు ఎంతవరకు బాధ్యులు అనే విషయాన్ని గురించి ఇతని రచనలు చర్చిస్తాయి. *ది లైఫ్ ఆఫ్ ది బీ* (1901), *ది ఇన్‌టెలిజెన్స్ ఆఫ్ ఫ్లవర్స్* (1907) ఇతని ప్రముఖ రచనలు. పేరును బట్టి ఇవి జంతు శాస్త్రానికి, ప్రకృతి పరిశీలనకు సంబంధించినవి అని అనుకోగూడదు. అలాగని కేవలం కట్టుకథలుగా కొట్టివేయనూగూడదు. ఒక రకమైన తత్త్వ దర్శనాన్ని ప్రతిపాదిస్తూ, ఈ పుస్తకాలలో మాటర్ లింక్ మానవాళి ఏ రకంగా ప్రపంచాన్ని సజావుగా అర్థం చేసుకోడానికి అవకాశం ఉన్నదో నిరూపిస్తాడు. వాస్తవ పరిస్థితులు అవగాహన అవటానికి ఈ రచనలు మార్గదర్శకంగా ఉంటాయి.

శ్రీవిరించి

**మాటో డి టర్నర్, క్లోరిండా (1854-1909):** లాటిన్ అమెరికన్ నవలా రచయిత్రి, కవయిత్రి. 1854 లో లాటిన్ అమెరికాలోని పెరూ దేశంలో జన్మించిన మాటో డి టర్నర్ 'మానవతా వాదం' చేత బాగా ప్రభావితం అయింది. (యూరపు ఖండంలో రాజరికం, ఫ్యూడలిజం నశించిపోయిన తరువాత విజృంభించిన ఉద్యమం 'మానవతా వాదం'; వ్యక్తి స్వేచ్ఛ ఈ ఉద్యమానికి ఊపిరి). ఈ ఉద్యమ ప్రభావంతో ఈమె ఎన్నో కవితలు, నాటకాలు రచించినప్పటికీ, 1889 లో వ్రాసిన *బర్డ్స్ విదౌట్ ఏ నెస్ట్* (గూడు లేని పక్షులు) అనే నవల ఈమెకు మంచి పేరు ప్రతిష్ఠలు సంపాదించి పెట్టింది.

పెరూ దేశంలో తరతరాలుగా దోపిడీకి గురి అయిన అమెరిండియన్ల (అమెరికన్ ఇండియన్‌ల) దుస్థితిని గురించి *బర్డ్స్ విదౌట్ ఏ నెస్ట్* లో సజీవంగా ఈమె చిత్రించింది. కొంతమంది మధ్య తరగతి అమెరిండియన్ల జీవిత గాథలను, బాధలను ఇతివృత్తంగా తీసుకొని వ్రాయబడిన ఈ నవలలో వ్యక్తి స్వేచ్ఛను బలపరుస్తూ, మానవు లందరికీ సామ్యం ఉండాలని ఈమె ఎలుగెత్తి చాటింది. పాత్రచిత్రణలో, సన్నివేశ కల్పనలో ఈమెపై 'వాస్తవికతా వాద' ప్రభావం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. తన సమకాలీన రచయిత లెందరో కాల్పనికోద్యమం చేత ప్రభావితులై ఊహాలోకాల్లో తేలియాడుతున్న తరుణంలో, వాస్తవికతకు ప్రాధాన్యం ఇచ్చి, సామాన్య మానవునికి తన రచనలలో పట్టం కట్టి, బడుగు వర్గాల సంక్షేమం గురించి ఆలోచించిన క్లోరిండా 1909 లో మరణించింది.

ఉమారాణి

**మాన్స్‌ఫీల్డ్, కాథరిన్ (1888-1923) :** బ్రిటిష్ కథా రచయిత్రి. 1888 అక్టోబర్ 14 న్యూజిలాండ్‌లోని వెల్లింగ్‌టన్ నగరంలో జన్మించిన మాన్స్‌ఫీల్డ్ శైలిలో, కథా కథనంలో, పాత్రచిత్రణలో ఒక ప్రత్యేకతను

ప్రదర్శించింది. ఈమె కొంతకాలం లండన్‌లోని క్వీన్స్ కళాశాలలో చదివి, న్యూజిలాండ్‌కు వెళ్లింది. కాని అక్కడ తన జీవితం సంతోషకరంగా సాగకపోవటంతో తిరిగి 1908 లో ఇంగ్లండ్‌కు వచ్చింది. ఆ తరువాత వివాహం కూడా చేసుకొంది. కాని, త్వరలోనే అది మనస్పర్థలకు దారితీసింది. ఆ తరువాత 1911 లో ఈమెకు ప్రముఖ విమర్శకుడైన జాన్ మిడిల్‌టన్ ముర్రే తో పరిచయం ఏర్పడింది. అతనితో కొంతకాలం సహవాసం చేసి, చివరకు 1918 లో అతనిని వివాహం చేసుకొంది.

*ఇన్ ఏ జర్మన్ పెన్షన్* (1911) అనేది ఈమె తొలి కథా సంకలనం. దీనిలో ఈమె సృష్టించిన కొన్ని జర్మన్ పాత్రల వ్యంగ్య చిత్రణ ప్రశంసించ దగ్గది. 1911 నుండి 1914 వరకు మిడిల్‌టన్ ముర్రే సంపాదకత్వంలో వెలువడిన *రిథమ్, ది బ్లూ రివ్యూ* అనే పత్రికలలో అనేక కథలు ఈమె ప్రచురించింది. 1918 లో *ప్రిల్యూడ్* అనే పేరుతో కథా పరంపరను ప్రచురించింది. వీటిలో న్యూజిలాండ్‌లో తాను గడిపిన బాల్యస్మృతులను, అనుభవాలను అద్భుతంగా చిత్రించింది. *బ్లిస్ అండ్ అదర్ స్టోరీస్* (1920) అనే కథాసంకలనంలో ఎప్పుడూ ఉత్సాహంగా, ఉల్లాసంగా నవ్వులు చిందిస్తూ ఉండే ఒక స్త్రీలో దాగి ఉన్న భయాందోళనలను చాలా సూక్ష్మంగా చిత్రించింది. అప్పుడప్పుడు ఈమె కథలు కవిత్వ ధోరణిలో కొనసాగుతూ ఉంటాయి. ఇందుకు నిదర్శనమే ఈమె రచించిన *ది డాటర్స్ ఆఫ్ ద లేట్ కర్నల్* (1921), *ది గార్డెన్ పార్టీ* (1922) అనే కథా సంకలనాలు. ఈమెపై చెకోవ్ ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది. పాత్రల అంతరంగాన్ని, మానసిక సంఘర్షణలను ఎంతో చాకచక్యంగా వ్యక్తపరచగల ఈమె ఎందరో భావి కథా రచయితలపై తన ప్రగాఢ ప్రభావాన్ని ప్రసరింపచేసి, చివరకు క్షయవ్యాధి గ్రస్తురాలై 1923 జనవరి 12 న మరణించింది.



*ఉమారాణి*

**మాపాసా, గై డి (1850-93) :** సుప్రసిద్ధ ఫ్రెంచి నవలా రచయిత, కథానికా రచయిత. ఫ్రెంచ్ కథకులలో 'మాపాసా' వంటి ప్రతిభావంతుడు మరొకడు లేడని అందరూ అంగీకరించిన అంశం. ఆయన కథానికలు కొన్ని తెలుగులో అనూదితము లయాయి.

'మాపాసా' బాల్యం మధుర స్మృతుల మయం కాదు. ఆయన 11 ఏళ్ల బాలుడుగా ఉన్నప్పుడు ఆయన తలిదండ్రులు విడిపోయారు. ఆ రోజులలో ఫ్రాన్స్‌లో విడాకుల విధానం లేదు. తల్లి పక్షం వైపే మాపాసా మొగ్గు చూపించాడు. జీవితాంతం ఆయన తల్లి పట్ల ఆదరాభిమానాలు ప్రదర్శించాడు. తండ్రి ఏంతగానో సహాయం చేస్తూ అభిమానం చూపుతూ ఉన్నా ఎందుకో ఆయనకు తండ్రి అంటే గౌరవభావం ఏర్పడలేదు. తలిదండ్రుల వివాహోదంతం వారి తనయుడి మీద చెరగని ముద్ర వేసింది. వివాహమంటే విపరీతమైన భయం, పితృవిహీనుడైన కుమారుని ఏకాంత జీవితం, పరిహాస పాత్రుడైన తండ్రి చేష్టలు మొదలైనవి ఆయన కథానికలలో ప్రముఖ స్థానం వహిస్తాయి.

మాపాసా విద్యాభ్యాసం చర్చ్ వాతావరణంలో సాగింది. 13 వ ఏడు వచ్చేసరికి మతగురువు వద్ద నేర్వదగినదంతా నేర్వడం జరిగింది. ఆయనకు మొదటి నుంచీ ఆ వాతారణం అంటే పూజ్యభావం కలుగలేదు. ఏదో ఒక చిన్న తప్పు చేసి అందులో నుంచి బయట పడడానికి ప్రయత్నించి కృతార్థుడయాడు. ఆ తరువాత ఆయన చదువు సంధ్యలు మరొకచోట కొనసాగాయి. అక్కడ పట్టభద్రుడై, అటు తరువాత ఆయన పారిస్‌లో న్యాయశాస్త్రం అధ్యయనం చేయసాగాడు. కాని ఫ్రెంచ్ వారికీ, జర్మన్‌లకూ యుద్ధం ప్రారంభం కావడంతో, ఆయన చదువుకి అంతరాయం కలిగింది. ఆయన సైన్యంలో చేరాడు. ఆ సైనికానుభవం తరువాతి కాలంలో ఆయన వ్రాసిన కొన్ని అత్యద్భుత కథానికలకు అనేక విధాలుగా ఉపకరించింది. సైన్యంలో నుంచి విముక్తుడైన తరువాత, ఆయన మళ్లీ న్యాయశాస్త్రాధ్యయనం కొనసాగించాడు. తండ్రి పలుకుబడితో ఉద్యోగం కూడా సంపాదించాడు. న్యాయవాది అయేందుకు ఆర్థికంగా ఆ ఉద్యోగం తోడ్పడింది. ప్రభుత్వోద్యోగాన్ని ఆయన లక్ష్యపెట్టకపోయినా, ఉద్యోగంలో అంచెలు అంచెలుగా ఆయన ఉన్నతిని సాధించాడు.

మాపాసా ప్రముఖ రచయితగా రూపొందడానికి కారణం ఫ్లాబర్ట్ అనే నవలా రచయిత ప్రోత్సాహం.

ఆయన ఆకస్మిక మరణం మాపాసా కు గొప్ప ఆఘాతం అయింది. ఫ్లాబర్ట్ సహచరుడుగా ఉన్న రోజులలో మాపాసా ఒకటి రెండు కథలు ప్రకటించాడు. కాని, 1880 లో ఆయన ఒక యుద్ధకథల సంపుటికి వ్రాసిన *బోల్‌డిసూయిఫ్* అనే రచన ఆయన్ని వెలుగులోకి తెచ్చింది. ఆ సంపుటిలోని ఆరు కథలలోనే కాక, ఆయన కథానికలలోనే అది సర్వోత్తమమైనదని విజ్ఞుల అభిప్రాయం. ఆ కథ వెలుగులోకి రావడంతో, పత్రికలవారు ఆయన రచనల కోసం ఎగబడ్డారు. 1880-1890 మధ్య కాలం ఆయన సాహిత్య జీవితంలో బంగారు పంటలు పుష్కలంగా పండిన కాలం. ఆ పదేళ్ళలో మాపాసా లేఖిని నుంచి 300 కథానికలు, 6 నవలలు, 3 ప్రామాణిక గ్రంథాలు, ఏకైక కావ్య సంపుటి, ఇతర రచనలు వెలువడ్డాయి. ఈ వివిధ రచనలు ఆయన రచనా వైదగ్ధ్యానికి నికషోపలాలు. *లా మైజన్ టెలియర్* (1881), *కాం టెన్ డి లాజెకాస్సె* (1883), *మాంట్ ఓరియల్* (1887), *నోట్రె క్యూర్* (1891) అనే కథానికలూ, *మ్యూసాటీ* (1891), *లాపైజ్ దూ మేనేజ్* (1893) అనే నాటకాలు ఆయన రచనలలో పేర్కొనదగినవి.

మాపాసా కథలను ఫ్రెంచి జర్మన్ యుద్ధ కథలని, కృషీవలుల కథలని, ఉద్యోగులకు సంబంధించిన కథలని వివిధ వర్గాల వారి భావోద్వేగాలకు చెందినవని వింగడించవచ్చును. ఆ రచనలు 1880-1890 ప్రాంతాల ఫ్రెంచ్ జీవనానికి దర్పణప్రాయము లని విమర్శకులు భావిస్తున్నారు. స్వీయ జీవితాంశాలు ఆ రచనలలో కనిపిస్తున్నట్లుగా కూడా వారు భావిస్తున్నారు. ఆ విఖ్యాత కథకుని పేరు ప్రఖ్యాతులు 20 వ శతాబ్ది ఉత్తరార్ధానికి తగ్గుముఖం పట్టడం దురదృష్టం. అయినా వివిధ వర్గాల వారిని సంతృప్తి పరిచే కథానికా స్రష్టగా ఆయన చిరంజీవి. 1850 ఆగస్టు 5న జన్మించిన మాపాసా 1893 జూలై 6 న మరణించాడు.

పి.ఆర్. శర్మ

**మాఫేయీ, ఫ్రాన్సెస్కో సిపియోనీ (1675-1755)** : ఇటలీకి చెందిన గొప్ప నాటక కర్త, పురావస్తు శాస్త్రవేత్త, మేధావి. ఇతడు రచించిన *మిరోప్* (Merope) అనే విషాదాంత పద్యరూపకం ఇటాలియన్ నాటకరంగ చరిత్రలో ఒక గొప్ప మైలురాయి.

1675 జూన్ 1 న ఇటలీలోని వెరోనా నగరంలో జన్మించిన మాఫేయీ పార్మానగరంలో గల ఒక జెసూట్ కళాశాలలో కొంతకాలం విద్యాభ్యాసం చేశాడు. ఆ తరువాత శ్పానిష్ వారసత్వ యుద్ధంలో పాల్గొన్నాడు. 1710 లో ఆపోస్టోలో జెనో అనే ప్రముఖకవితో కలసి ఇతడు స్థాపించిన ఒక సాహిత్య పత్రిక ఆ రోజులలో ఎంతో ప్రాచుర్యాన్ని పొందింది. ఇటాలియన్ నాటక రంగాన్ని సంస్కరించటానికి ఉద్యుక్తులైన ఆనాటి నాటక రచయితల అభిప్రాయ ప్రకటనలకు ఆ పత్రిక చక్కటి వేదికగా ఉపయోగపడింది. 1737 వ సంవత్సరంలో ఇతడు సొంతంగా మరొక సాహిత్య పత్రికను స్థాపించి, మూడు సంవత్సరాల పాటు దానిని విజయవంతంగా కొనసాగించాడు.



మాఫేయీ కి అంతర్జాతీయంగా పేరు ప్రఖ్యాతులు సంపాదించి పెట్టిన *మిరోప్* (Merop) అనే విషాదాంత పద్య నాటకం 1713 లో రచించబడి, అదే సంవత్సరం ప్రదర్శింపబడింది. గ్రీక్ పురాణాలలోని కొన్ని గాథలను ఇతివృత్తాలుగా స్వీకరించి, యూరిపిడిస్ నాటకాలలోని కొన్ని సంఘటనలతో, సాంప్రదాయిక ఫ్రెంచి నాటకాలలోని కొన్ని సన్నివేశాలతో సమ్మేళనంచేసి ఒక అద్భుత కళాఖండంగా తీర్చిదిద్దిన ఈ నాటకం ఇటాలియన్ నాటక రంగంలో నూతన చరిత్రను సృష్టించడమే గాక అందులో ఆ తరువాత వచ్చిన మార్పులకు మార్గదర్శక మయిందని చెప్పవచ్చు.

పై నాటకంతో పాటు మాఫేయీ అనేక ఇతర రచనలు కూడా చేశాడు. వీటిలో కొన్ని పద్యాలు, నాటకాలు, మరెన్నో అనువాదాలు ఉన్నాయి. వర్జిల్ మహాకవి రచించిన *ఇలియడ్, ఏనియడ్* వంటి మహా గ్రంథాలకు ఇతడు చేసిన అనువాదాలు ప్రశంసనీయమైనవి. వెరోనా నగరంలోని అనేక ప్రాచీన శిల్పకళాఖండాల చరిత్రను అద్భుతంగా వర్ణించిన *వెరోనా ఇలస్ట్రేటా* అనే గ్రంథం పురావస్తు శాస్త్రంలో ఇతనికి గల అభినివేశానికి నిదర్శనం. గ్రీక్ ఫ్రెంచ్ భాషలలోని సాంప్రదాయిక నాటకాలలోని గొప్ప తనాన్ని, నిరాడంబరతను ఇటాలియన్ నాటకాల్లో ప్రవేశపెట్టి తద్వారా ఇటాలియన్ నాటక

రంగంలో అనేక సంస్కరణలకు అవకాశం కల్పించిన మాఫేయీ 1755 ఫిబ్రవరి 11 న వెరోనాలో కన్ను మూశాడు.

ఉమారాణి

**మారినెట్టీ, ఫిలిప్పో తామసో (1876-1944) :** ఇటలీ దేశానికి చెందిన ప్రముఖ కవి, నవలా రచయిత, నాటక కర్త, ఫ్యూచరిస్టు ఉద్యమానికి నాయకుడు.

1876 డిసెంబర్ 22 న ఈజిప్టులో అలెగ్జాండ్రియా నగరంలో జన్మించిన మారినెట్టీ ఈజిప్టు, ఫ్రాన్స్, ఇటలీ, స్విట్జర్లాండ్ దేశాలలో తన విద్యాభ్యాసాన్ని కొనసాగించాడు. మిలాన్ నగరం నుండి వెలువడే ఒక ఇటాలియన్-ఫ్రెంచ్ పత్రికలో పనిచేస్తూ తన సాహితీ జీవనాన్ని ఆరంభించాడు. ఇతడు ఎక్కువకాలం ఫ్రాన్స్ లోనే గడిపినప్పటికి అప్పుడప్పుడు ఇటలీ కూడా వెళ్ళి వచ్చేవాడు. కాబట్టి ఇతనికి ఫ్రెంచ్, ఇటాలియన్ భాషలు ధారాళంగా వచ్చు. ఉభయభాషలలోను ప్రౌఢమైన కవిత్వాన్ని వ్రాశాడు.

20 వ శతాబ్ది తొలి రోజులలోనే యూరప్‌లో వచ్చిన ఫ్యూచరిజమ్ అనే నవ్య కవిత్వోద్యమానికి సూత్రధారుడైన ఇతని నాయకత్వంలో 1909 ఫిబ్రవరి 20 న ఫ్యూచరిస్ట్ ప్రణాళిక ప్రచురించబడింది. ప్రాత బొమ్మలను చూసి ఆనందం ప్రకటించటం చచ్చిన శవంలో జీవం పోయటం వంటిదని, గత చరిత్రజ్ఞానం కేవలం విషపానం వంటిదని, గ్రంథాలయాలలోని పుస్తకాలకు నిప్పంటిచాలని, ఏటి కాలువలను మ్యూజియమ్‌లలోకి మరలించి వాటిని ముంచి వేయాలని, సమస్త కళారూపాలను, సాహిత్య సృష్టిని ధ్వంసం చేయాలని, ఆ శిథిలాలనుండే నూతన సృష్టి వెలువడుతుందని ఇతడు తన ఫ్యూచరిస్టు ప్రణాళికలో పేర్కొన్నాడు. ప్రపంచానికి యుద్ధం ఒకటే ఆరోగ్యాన్ని ప్రసాదించే వరమని ఇతడు ఉద్ఘాటించాడు. ధ్వనులే సంగీతమని, మాటలే కవిత్వమని, రంగులే చిత్రాలని ఇతడు ప్రకటించాడు.

ఇతని ప్రతిభా విశేషాలు అతి త్వరలో విదేశాలకు ప్రసరించాయి. ఎంతో మంది ప్రసిద్ధ ఇటాలియన్ రచయితలు, కవులు, చిత్రకారులు ఇతని శిష్యు లయారు. అంతేకాకుండా ఇతని భావాలచే ప్రభావితులైన శిల్పులు, చిత్రకారులు 1910 లో ఒక ప్రత్యేకమైన మానిఫెస్టోను కూడా ప్రకటించారు. వారు ఆ తరువాత చిత్రించిన శిల్పాలపై, చిత్రాలపై మారినెట్టీ భావాల ప్రభావం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఇతని ప్రభావం రష్యామీద కూడా బలంగానే పడింది. మయకోవ్‌స్కీ వంటి కవులు ఇతని భావాలచే ప్రభావితులు కావడంతో రష్యాలో కూడా 1912 లో ఫ్యూచరిజమ్ మొలకెత్తింది.

మారినెట్టీ తొలి కవిత *డిస్ట్రక్షన్* (1904) లో ఇతని ప్రౌఢత్వం, వైచిత్రీ ప్రియత్వం మనకు స్పష్టంగా కనిపిస్తాయి. ఇతని తరువాతి రచన అయిన *ది ఫీస్టింగ్ కింగ్* (1909) అనే నాటకంలోను, *మఫార్కా ఇల్ ఫ్యూచరిస్టా* (1910) అనే నవలలోను ఈ భావాలు కనిపిస్తాయి. *ఆంటీ న్యూట్రాలిటీ* (1912) అనే నాటకంలోను *సింథటిక్ ఫ్యూచరిస్టు థియేటర్* (1916) అనే వచన గ్రంథంలోను ఇతని ఫ్యూచరిస్టు భావాలు మరింత ప్రస్ఫుటంగా కన్పిస్తాయి. *వార్ ది ఓన్లీ హైజీన్ ఆఫ్ ది వరల్డ్* (1915) అనే కవితా సంకలనంలో మారినెట్టీ ప్రథమ ప్రపంచ సంగ్రామం పట్ల తన హర్షాన్ని ప్రకటించి, ఇటలీ దేశం కూడా యుద్ధంలో పాల్గొంటే బాగుండునన్న ఆశాభావాన్ని వ్యక్తం చేశాడు. ఇతడు ముస్సోలినీని, ఫాసిజాన్ని సమర్థించడమే కాకుండా, ఫాసిజమ్ ఫ్యూచరిజానికి ఒక విస్తరణ మాత్రమే అని పేర్కొన్నాడు. మారినెట్టీ భావాలు ఇటాలియన్ ప్రజల లోని దేశభక్తిని పురికొల్పటానికి కొంతవరకు దోహదం చేసినప్పటికి, ఇతడు ప్రారంభించిన ఫ్యూచరిస్టు ఉద్యమం మాత్రం ఎంతో కాలం కొనసాగలేదు. మారినెట్టీ 1944 డిసెంబరు 2 న ఇటలీలోని బెలాజియోలో మరణించాడు.

ఉమారాణి

**మారివో, పియేర్ (1688-1763) :** ఫ్రెంచ్ నవలా రచయిత, నాటకకర్త, పత్రికా రచయిత. ఈనాటి ఫ్రెంచి నాటకశాలలో ఆడే నాటకాలలో మోలియర్ నాటకాల తరువాతి స్థానం ఈయన నాటకాలదే నని చెప్పవచ్చు. ఉన్నత కుటుంబంలో జన్మించిన మారివో తండ్రి వలెనే న్యాయవాద వృత్తికి శిక్షణ పొందాడు. న్యాయ



శాస్త్రంలో కంటె న్యాయస్థానాలలో జరిగే నాటకీయమైన సంఘటనలను ఎక్కువగా పట్టించుకొన్న ఈయన 20 సంవత్సరాల వయస్సప్పుడే *లెపిరెప్రూడెంట్ ఆఫ్ ఈక్విటబుల్ ఫాదర్, బక్రిస్టిన్స్ హార్ట్స్ పోర్ట్రై* (The

prudent and equitable father) అనే మొదటి నాటకాన్ని వ్రాశాడు. ఈ తొలి రచనలోనే ఆయన ప్రతిభా పాటవాలు అక్కడక్కడ స్ఫుటంగా కనిపించాయి. 1710 నాటికి ఉన్నత వర్గాలవారి భవంతులలోని కచేరి సావిళ్ల (Reception-Rooms) లో చేరే స్త్రీ పురుషుల సమాజంలో కలసిపోయి, ఆ వాతావరణాన్ని, వారి సంభాషణా సరణిని జీర్ణించుకొని వివిధ సామాజిక వర్గాల పద్ధతులపై పత్రికలకు *రిఫ్లెక్షన్స్* అనే వ్యాసాలు వ్రాస్తూ ఉండేవాడు. జోసెఫ్ ఎడిసన్ నడిపిన *ది స్పెక్టేటర్* పత్రిక వంటి పత్రికను *లె స్పెక్టేటర్ ఫ్రాన్స్వాయిజ్* తానే కొంతకాలం (1720-24) నడపాడు.

1720 ప్రాంతంలో ఆస్తినంతా పోగొట్టుకొన్న మారివోకు ఆయన అభిమాని మేడమ్ డి పాంపొడార్ అనే మహిళ కొంత ఉపకారవేతనాన్ని ఏర్పాటు చేసింది. బెర్నార్డ్ డి ఫ్రాంటెల్లి, మోంటెస్క్యూ వంటి తత్త్వవేత్తలకు విమర్శకుడు, రచయిత అయిన లామొట్టి వంటి ప్రముఖులకు ఆ రోజుల్లోనే మారివో, సన్నిహితుడయాడు.

*ఆర్లెక్విన్ పోలివార్ ఎల్ ఎమర్* (1723) Harlequin Brightened by Love), *లె జు డి ఎల్ ఎమర్ ఎట్ డు హెసార్డ్* (1730) The Game of Love and Chance, 1923) అనే సుఖాంత నాటకాలు ఈ రచయిత ప్రత్యేక బాణీని తెలియజేస్తాయి. రసవత్తరమైన సన్నివేశాలు, భావప్రకటనలోని అతి సున్నితమైన భేదాలు, శబ్దచమత్కారాలు ఈయన రచనలలోని ప్రత్యేకతలు. ఈ పద ప్రయోగ చమత్కృతి ఇప్పటికీ, 'మారివడేజ్' అనే పేరుతో పిలువబడుతోంది. ఇది ఆ కాలపు సున్నితత్వాన్ని, మానవ సంబంధాలలోని మర్యాదలను తెలియజేస్తుంది. మారివో రచనలలో నౌకర్ల వంటి వారికి ఉండే సహజ భావాలను చిత్రించటం ద్వారాను, ఆనాటి సామాజిక పరిస్థితులను యథాతథంగా చిత్రించటం ద్వారా వాస్తవికతా ఉద్యమానికి ఈ రచయిత మంచి ఊపును ఇచ్చాడు. ఈయన వ్రాసిన సుమారు 30 నాటకాలలో *ఎల్ ఇనెడెస్ ఎస్లేవ్* (1725, Isle of Reason) అనే వ్యంగ్య రచనలలో *గలివర్స్ ట్రావెల్స్* పద్ధతిలో యూరపియన్ సమాజాన్నీ, అందలి లోటు పాట్లనూ ఎత్తి చూపాడు. *ఎల్ ఎకోల్ డెస్ మియర్స్* (1724; School for Mothers) అనే నవల తల్లి కూతుళ్ల అవగాహనానుబంధాలను చక్కగా విశ్లేషిస్తుంది. భావ ప్రాధాన్యం గల నవలలు (Romance Novels) రెండు వ్రాశాడు గాని అవి అసంపూర్తిగానే ఉండిపోయాయి. వాటిలో మొదటిది *లా వై డి మారియానె* (1731-34) సున్నిత భావాలకు ప్రాధాన్యమిచ్చే *నావెల్ ఆఫ్ సెన్సిబిలిటీ* కి నాంది పలుకుతుంది. ఇది స్త్రీ భావాలను, అంతఃస్ఫూర్తిని చక్కగా విశ్లేషించే నవల. రెండవది అయిన *లె పయిసాన్ పర్వేను* (1734-35) (The Fortunate Peasant) ప్రపంచంలో ముందుకు తోసుకుపోవటానికి గాను వయసు మీరిన స్త్రీలపై తన అందచందాల ప్రభావాన్ని చాకచక్యంగా వాడుకొనే ఒక యువకుని కథను చక్కగా చిత్రిస్తుంది. ఈ రెండూ కూడా మనోవైజ్ఞానిక పరమైన విశ్లేషణను పాత్రల చిత్రీకరణలోను, సంఘటనలను సృష్టించటంలోను ఎట్లా ఉపయోగించుకోవచ్చో తెలియజేస్తాయి. ఈ రెండు నవలలు ఈ రచయితకు అధికార చట్టం పట్లా, మత మౌఢ్యం పట్లా ఉన్న ఏవగింపును తేటతెల్లం చేస్తాయి. సామాన్య నైతిక విలువలూ, సహజత్వమూ ఎంత విలువైనవో కూడ ఇవి తెలియజేస్తాయి.

అయితే ఇంత గొప్ప రచయిత చివరి రోజుల్లో పేదరికంలో మగ్గిపోయి, ఎక్కువ ఖ్యాతినైనా పొందకుండానే మరణించాడు. 19 వ శతాబ్దంలో ప్రసిద్ధ విమర్శకుడు సెయింట్ బ్యూవే మారివో రచనలను పునఃసమీక్షచేసి ఆయన గొప్పతనాన్ని వెలుగులోకి తెచ్చిన తరువాత ఈయనకు రావలసిన గుర్తింపును ఈయన పొందగలిగాడు. సాహిత్యంలో హేతువాద యుగానికి ఈ రచయితను ప్రారంభకుడుగా ఈ నాటికీ పరిగణిస్తున్నారు.

కె.జి.మూర్తి.

**మారిసన్, టోనీ (1931--) :** ప్రముఖ అమెరికన్ నీగ్రో నవలా రచయిత్రి. 1993 వ సంవత్సరానికి సాహిత్యంలో నోబెల్ పురస్కార గ్రహీత్రి. ఘ్లా ఆంథోనీ వోఫర్డ్‌కు కలిగిన నలుగురు సంతానంలో రెండవ బిడ్డగా మారిసన్ అమెరికాలో ఓహియోలోని లొరెయిన్‌లో 1931 లో జన్మించింది. ఆమె హోవర్డ్, కార్నెల్ విశ్వవిద్యాలయాలలో 'హ్యూమానిటీస్' (మానవీయ శాస్త్రాలు) అధ్యయనం చేసింది. టెక్సాస్ సదరన్ యూనివర్శిటీ, హోవర్డ్, యేల్ లలో అధ్యాపక వృత్తిని

నిర్వహించింది. ప్రస్తుతం న్యూజెర్సీలోని ప్రిన్స్టన్‌లో హ్యూమానటీస్ శాఖలో ప్రొఫెసర్‌గా పనిచేస్తూంది.

మారిసన్ రచించిన తొలి నవల *ది బ్లూయెస్ట్ ఐ* 1970 లో ప్రచురించబడింది. 1988 లో ఆమెకు కాల్పనిక సాహిత్యానికి ఇచ్చే పులిట్జర్ బహుమతి వచ్చింది. *బిలవ్‌డ్* అనే నవల ప్రచురించిన ఒక ఏడాదికి ఆమెకు ఈ బహుమతి వచ్చింది.

మారిసన్ రచించిన ఒకే ఒక్క నాటకం *డ్రీమింగ్ ఎమ్మెట్* 1986 లో ప్రదర్శించబడింది. అయితే ఆ నాటకాన్ని ఇంకా ప్రచురించడం జరుగలేదు. ఆమె రచించిన ఇతర నవలలలో చెప్పుకోదగినవి: *శూలా* (1973), *టార్ బేబీ* (1981).

1993 లో 67 లక్షల స్వీడిష్ క్రౌన్‌ల విలువ చేసే నోబెల్ బహుమతిని మారిసన్‌కి ఇస్తున్నట్లు ప్రకటిస్తూ, నోబెల్ బహుమతులను ఇచ్చే అకాడమీ శాశ్వత కార్యదర్శి స్టూరే ఎల్లెన్ స్టాక్‌హోంలోని తమ కార్యాలయం ముందు మెట్ల మీద పత్రికా విలేఖకులతో మాట్లాడుతూ "అమెరికాలోని నీగ్రోల జీవితాలను, మనో వైఖరులను మారిసన్ తన నవలలలో అద్భుతంగా చిత్రించింది" అని ప్రశంసించారు.

సాహిత్యంలో నోబెల్ బహుమతిని అందుకొన్న స్త్రీలలో ఈమె ఎనిమిదవది. 1962 లో స్టైన్ బెక్‌కు నోబెల్ బహుమతి వచ్చిన తరువాత అమెరికన్ రచయితలలో తిరిగి మారిసన్‌కే ఈ బహుమతి లభించింది.

బొ.శ్రీ.

**మారీ, అల్- (973-1057) :** ప్రముఖ అరబ్ కవి పూర్తిపేరు అబొఅల్ అలా మహమ్మద్ ఇబ్న్ అబ్ద్ అబ్దుల్లా అల్‌మారీ. స్వతంత్రమైన భావాలు, బాణీ గలవాడు. నిరాశావాదానికి, నిజాయితీకి గుర్తింపు పొందినవాడు.

తానుఖ్ తెగకు చెందిన ఈ కవి చిన్నతనంలోనే ఏదో వ్యాధికి గురి అయి కనుచూపును పోగొట్టుకొన్నాడు. అలెప్పో, అంటియార్. ట్రిపోలిలలో విద్యనార్జించి, పిత్రార్జితమైన కొద్దిపాటి ఆస్తి ఆసరాతో సాహితీ వ్యాసంగమే వృత్తిగా స్వీకరించాడు. ఈయన తొలిరచనలను *సక్త్ అజ్-జాంద్* (The Tinder spark) గా ప్రకటించాడు. ఇది వెంటనే పండిత పామరులను ఆకట్టుకొంది. దీనికి భాష్యాన్ని కూడా ఆయనే వ్రాశాడు.

1010 ప్రాంతంలో బాగ్దాద్ నగరం చేరి అక్కడి ఉన్నత సాహితీ వర్గాల పరిచయాన్ని సంపాదించుకొన్నాడు. కాని తాను వ్రాసిన 'పానెజిరిక్స్' (Panegyrics) అనే కవితా సంపుటిని అంకితం తీసుకొనేనాథుడు కనపడలేదు. బాగ్దాద్ నగరాన్నీ, ఆ ప్రజా జీవనాన్నీ చూసిన ఈ రచయిత భౌతికపరమైన సంపదను త్యజించి, పట్టణానికి దూరంగా ఒంటరిగా నివాస మేర్పరుచుకొని, మాంసాహారాన్ని పూర్తిగా త్యజించి తన జీవితంలో గొప్ప మార్పును తెచ్చుకొన్నాడు. స్థానికంగా అధిక గౌరవాన్ని సంపాదించుకొన్న ఈయన వద్దకు విద్య నార్జించటానికి అన్ని ప్రాంతాలనుండి విద్యార్థులు వచ్చేవారు. ఈయన ప్రముఖులకు వ్రాసిన లేఖలను 1898 లో 'డి.ఎస్. మార్గోలియథ్' అనే రచయిత ఆంగ్లంలో ప్రచురించాడు. (1898).

*లుజుమ్ మాలామ్ యాల్‌జామ్* అనే రెండవ గ్రంథంలో ఈ కవి అంత్యప్రాస పద్ధతి అవసరమని నిరూపించాడు. అన్నిటినీ ప్రశ్నించే మానవతావాదాన్ని ఈ కవితలలో వెదజల్లుతూ *రిసాలత్ ఉల్ గుఫ్రాన్* (Divine comedy, 1943) అనే కావ్యాన్ని ప్రచురించాడు. ఈ రచయిత ఈ కావ్యంలో స్వర్గానికి చేరి తన పూర్వీకులైన కవులను, రచయితలను కలుసుకొని వాళ్లతో ముచ్చటించి వాళ్ల అభిప్రాయాలను పొందు పరుస్తాడు. ఇస్లాంలో విశ్వాసం లేని కవులు (Healthen poets) కూడా భగవంతుని క్షమను పొంది అక్కడ ఉన్నారని ఈయన వ్రాయగా దానికి మత వర్గాలలో తీవ్రమైన అభ్యంతరాలు వెలువడ్డాయి. సామాన్యరీతి వచనాల్ని ఒక మాదిరి గద్య కవితరూపంలో *అల్ ఫసూల్ వాల్ ఘాయాత్* (Paragraphs and periods) అనే కావ్యం *కొరాన్* ను అపహాస్యం పాలు చేసే అనుకరణ (Parody) గా ఉందని కొందరు విమర్శించారు.

కె.జి. మూర్తి

**మారో, క్లిమెంట్ (1496-1544) :** ఫ్రెంచ్ రినైజాన్స్ (పునరుజ్జీవనం) కు చెందిన ప్రముఖ కవి. తరువాతి తరాల కవులకు నమూనాలా వ్యవహరించిన వాడు. ఈయన తండ్రి 'జీన్' కూడా కవి, రాజాస్థానంలో మన్ననలు పొందినవాడు. 1514 లో రాజ కార్యదర్శి 'నికొలస్ డినే విల్లీ' దగ్గర సహాయకుడుగా చేరాడు. తండ్రి అడుగు జాడలలో రాజాశ్రయకవి అవడం కోసం మొదటి ఫ్రాన్సిస్ సోదరి మార్గరెట్ దగ్గర కొలువులో చేరాడు. ఈమె నవారె (Navarre) రాణి కూడా! తండ్రి మరణానంతరం 'మారో' మొదటి ఫ్రాన్సిస్ దగ్గర ఆస్థానకవిగా నియామకం సంపాదించాడు. ప్రవాసంలో గడపిన 1534-36 సంవత్సరాలు తప్ప, దాదాపు జీవితాంతం ఈ పదవిని మారో నిలుపుకొన్నాడు. 1526 లో

'మార్టిన్ లూథర్' అనుయాయిగా అనుమానింపబడి అరెస్ట్ అయినాడు. కారాగార వాసంలో సృజనాత్మక రచనలు చేయటానికి అవకాశం వచ్చింది. న్యాయ వ్యవస్థ మీద ప్రహసనాలు రచించాడు. 1527 లో తిరిగి కారాగార వాస శిక్ష విధింపబడినా, ఒక పుణ్యాత్ముడు ఇతనికి విముక్తి సాధించగలిగాడు. 1531 లో మాంస భక్షణ చేసిన నేరానికి తిరిగి శిక్షపొందాడు. 1530 నాటికి దేశ వ్యాప్తంగా కీర్తి ప్రతిష్ఠలు సంపాదించాడు. ఆయన రచనలకు బహుళ ప్రచారం ఉండేది. 1534 లో అల్లర్ల పరిస్థితులకు తట్టుకోలేక నవారెకు ప్రవాసం వెళ్లాడు. అక్కడ 'మార్గరెట్' రక్షణలో ఉండేవాడు. అయితే అక్కడనుంచి కూడా పారిపోవలసి వచ్చింది. మొదటి ఫ్రాన్సిస్ ప్రొటెస్టెంట్లను హింస పెట్టడం నిలిపిన తర్వాత ఫ్రాన్స్‌కు తిరిగి వచ్చాడు.

ఆధికారిక రచనా కార్యక్రమం లేనప్పుడు సామ్స్ (Psalms) అనువదించాడు (1539). ఈ రచనలపై 'సోర్బోన్' అభ్యంతరాలు వెలిబుచ్చడంతో తిరిగి దేశాన్ని వదిలి వెళ్లవలసి వచ్చింది. జెనీవాలో 'జాన్ కాల్విన్' ఇతనికి రక్షణ చేకూర్చాడు. మారో ప్రవృత్తికి ఈ నగర జీవనం నచ్చక పోవడంతో అతడు తిరిగి ఇటలీకి వచ్చాడు.

ఇటలీ సాహిత్య వేత్తల సహవాసంతో పూర్వ రచనల పరిచయం ఏర్పడింది. ఆ శైలి, కవన పద్ధతి, ఆలోచనలు ఆకళింపు చేసుకున్నాడు. నూతన కవితా ప్రక్రియలు ఆలోచించటానికి ఈ పరిచయం దోహదం చేసింది. 'సానెట్' ప్రక్రియకు ఫ్రెంచ్‌లో ఆద్యుడు ఇతడే. ప్రాత రచనా రీతులతో క్రొత్త అభిప్రాయాలు ప్రచారం చేశాడు. నూతన గేయ రీతులకు కూడా ఇతడే ఆద్యుడు. *బ్లాసన్* (1536) అనే ఇతని వ్యంగ్య పద కవిత బహుళ ప్రాచుర్యం పొందింది. ఫ్రెంచ్ లఘు కవిత్వ తత్త్వానికి హుందాతనం, గాంభీర్యం తీసుకు వచ్చాడు. మారో మరణానంతరం కొంతకాలం పాటు అతని రచనలు మరుగు పడిపోయినా, ఎలిజబెత్ తరం ఇంగ్లీషు రచయితలపై అతని ప్రభావం ఎక్కువగా కనిపించింది.

శ్రీవిరించి

**మార్కస్, ఆరేలియస్ (క్రీ.శ. 121-180) :** ప్రాచీన లాటిన్ రచయిత, రోమ్ దేశపు చక్రవర్తి. పూర్తి పేరు సీజర్ మార్కస్ ఆరేలియస్ ఆంటోనియస్ ఆగస్టస్.

161 నుండి 180 వరకు రోమన్ చక్రవర్తిగా ఉన్నాడు. ఆయన రచించిన *మెడిటేషన్స్* (Meditations) అనే గ్రంథం వల్ల సాహిత్యరంగంలో కూడా ప్రసిద్ధి చెందాడు. ఇందులో వేదాంతపరమైన తన ఆలోచనలను పొందుపరచాడు. ఈ చక్రవర్తి కాలాన్ని రోమన్ సామ్రాజ్యయుగంలో స్వర్ణయుగంగా ఇప్పటికీ పరిగణిస్తున్నారు.

రాజకుటుంబంతో సన్నిహిత సంబంధం గల కుటుంబంలో జన్మించటం వలన కలిగే ప్రయోజనా లన్నింటినీ అరీలియస్ పొందాడు. 136 వ సంవత్సరంలో అప్పటి చక్రవర్తి హాడ్రియన్ చిత్రంగా లూసియస్ సియోనియస్ కమోడస్ అనే యువకుణ్ణి తన వారసుడుగా ప్రకటించాడు. 138 వ సంవత్సరంలో 'కమోడస్' కూతురు 'ఫేబియా' కు 'ఆరేలియస్' కు వివాహం నిశ్చయమైంది. కాని, కమోడస్, 'హాడ్రియన్‌ల' మరణానంతరం ఆ ప్రతిపాదన రద్దైంది. హాడ్రియన్ తరువాత చక్రవర్తి అయిన ఆంటోనియస్ ఆ కమోడస్ కుమారుణ్ణీ, మార్కస్ నూ దత్తత తీసుకొన్నాడు. ఆ విధంగా సింహాసనం తన 40 వ సంవత్సరంలో ఆరేలియస్‌కు దక్కింది. చక్రవర్తి అయేవరకు మేధాసంపన్నుడైన ఆరేలియస్ తన ఆలోచనలను తాత్త్విక చింతనవైపు మళ్ళించి, ఎపిక్టేటస్ (Epictetus) రచించిన *డయాట్రిబై* (Diatribai ఆంగ్లంలో Discourses) ను పఠించి స్టాయిక్ వేదాంతానికి (Stoic School of Philosophy) అంకితమైనాడు.

నిర్మాణాత్మక పాలనా సంస్కరణల పట్లగాని, ప్రభుత్వ పాలనా విధానాల పట్లగాని మార్కస్ ఎక్కువ ఆసక్తిని చూపలేదు. కాని న్యాయశాస్త్రం పట్ల ఆయనకు మక్కువ ఎక్కువ. సివిల్ చట్టం (civil law) లోని అనేక అవకతవకలను, అసంబద్ధతలను తొలగించి అప్పటి వరకు అన్యాయాలకు గురి అయిన బానిసలు, భర్తృహీనలు, మైనర్లు మొదలగు వర్గాల వారికి న్యాయం చేకూర్చే విధంగా న్యాయశాస్త్రాన్నే ఆరేలియస్ సవరించాడు. ఆయన రక్తసంబంధీకుల వారసత్వపు హక్కులను కూడా గుర్తించేటట్లు చేశాడు. కాని క్రిమినల్ న్యాయపద్ధతులలో మాత్రం వర్గభేదాల కున్న ప్రాధాన్యాన్ని తొలగించలేక పోయాడు. అయితే క్రైస్తవులను ఈయన కాలంలో ఎక్కువగా వేధించటం జరుగలేదు.

ఆరేలియస్ వ్రాసిన *మెడిటేషన్స్* లోని ఆలోచనలను ఆయన ఎంతవరకు ఆచరణలో పెట్టగలిగాడన్నది వివాదాస్పదమే. తన విధి నిర్వహణలో తన్ను తాను స్థిరచిత్తుడుగా ఉంచుకో గలగటం కోసమే ఈ *మెడిటేషన్స్* వ్రాశాడేమో అనిపిస్తుంది. ఇందులో ఆయన చేరలేని గమ్యాలను ఏర్పరచాడు. ఈ భౌతిక ప్రపంచంలోని అర్థం లేని క్రూరత్వాన్ని, అర్థ రాహిత్యాన్ని, తాత్కాలికతను రచయిత పలుసార్లు పేర్కొన్నాడు. ఈ భౌతిక ప్రపంచాన్ని మించిన పరలోక చింతనను అలవాటు చేసుకొన్నాడు. ఆరేలియస్ గొప్ప చక్రవర్తీకాడు, గొప్ప తాత్త్వికుడూ కాడు. కాని తాత్త్విక చింతనను పాలనా పద్ధతులకు అన్వయించాలని శాయశక్తులా కృషి చేసినవాడు.

కె.జి. మూర్తి

**మార్క్విస్, డాన్ (1878-1937) :** అమెరికా సంయుక్త రాష్ట్రాలకు చెందిన పత్రికా రచయిత, కవి, నాటకకర్త. 1920-30 మధ్య జనాదరణ పొందిన ఆర్చీ, క్రాకోచ్, మెహితాబెల్, కాట్ మొదలైన పాత్రలను సృష్టించినవాడు. *అట్లాంటా జర్నల్* కు విలేఖకుడుగా వృత్తిని ప్రారంభించి, 1907 లో *అన్‌కుల్ రెమూస్ మాగజిన్* కు సహ సంపాదకుడు అయాడు. 1912 లో దానిని వదిలి, న్యూయార్క్ చేరి సాహిత్య పత్రికా విలేఖకుడుగా ప్రఖ్యాతి పొందాడు. *ది సన్* అనే పత్రికలో 'ది సన్ డయల్' అనే శీర్షికనూ, *ట్రిబ్యూన్* పత్రికలో 'ది లాంటర్న్' అనే శీర్షికనూ నడిపాడు. ప్రపంచంపై 'ఆర్చీ' కవితా పరమైన ఆలోచనలు, అభిప్రాయాలు, 'మెహితాబెల్' ఆసక్తికరమైన సాహసాలు బహు జనాదరణ పొందాయి.

కవిత్వంలో హాస్యం, వచనంలో వ్యంగ్యం ఈ రచయిత ప్రత్యేకతలు. *డానీస్ ఓన్ స్టోరీ* (1927), *డ్రీమ్స్ అండ్ డస్ట్* (1915), *హెర్మియోన్* (1916), *ది ఓల్డ్ సోక్* (1916-నాటకంగా 1926), *సానెట్స్ టు ఏ రెడ్ హెయిర్డ్ లేడీ* (1922), *ది డార్క్ అవర్స్* (1924), *ఔట్ ఆఫ్ ది సీ* (1927) అనేవి ఈయన ప్రముఖ రచనలు. ఆయన మరణానంతరం ఆయన రచన *ఆర్చీ అండ్ మెహితాబెల్* (1927) ను పెంచి అనేక ఇతర సంఘటనలను దానిలో జొప్పించి *ది లైవ్స్ అండ్ టైమ్స్ ఆఫ్ ఆర్చీ అండ్ మెహితాబెల్* (1940) గా ప్రచురించారు. ఈ కథలలో కొన్నింటిని సంగీత రూపకాలుగా జార్జి క్లీసింగర్, జో డేరియన్ లు 1957 లో రూపొందించారు. 'ఎడ్వర్డ్ ఆంథోనీ' 1962 లో ఈయన జీవిత చరిత్ర వ్రాశాడు.

కె.జి. మూర్తి

**మార్టిన్సన్, హారీ (ఎడ్మండ్) :** చూ. అనుబంధం.I

**మార్టీ, హోసే జూలియన్ (1853-95) :** క్యూబా దేశానికి చెందిన ప్రముఖకవి, రచయిత, క్యూబా స్వాతంత్ర్యోద్యమ రథ సారథి. తన పూర్తి జీవితాన్ని స్పెయిన్ దాస్య శృంఖలాలలో మగ్గుతున్న క్యూబాకు విముక్తి చేకూర్చడానికే అంకితం చేసిన మార్టీ పేరు ప్రఖ్యాతులు ఒక్క క్యూబాలోనే గాక మొత్తం లాటిన్ అమెరికన్ దేశాలన్నింటిలోను వ్యాపించింది.



1853 జనవరి 28 న హవానాలో జన్మించిన మార్టీ తన 15 వ ఏటనే కవిత్వం వ్రాసి, అందరిని ఆశ్చర్యపరచాడు. అంతేకాక తన 16 వ ఏటనే *ది ఫ్రీ ఫాదర్ లాండ్* అనే పత్రికను కూడా స్థాపించాడు. 1868 లో క్యూబాలో చెలరేగిన ఒక విప్లవోద్యమ సమయంలో స్వాతంత్ర్య వాదులకు ఇతడు మద్దతు నివ్వడంతో ఆనాటి ప్రభుత్వం ఇతనికి 6 నెలల పాటు కఠిన శ్రమతో కూడిన కారాగార శిక్షను విధించి, స్పెయిన్‌కు పంపింది. అక్కడే అతడు జారాజోగా విశ్వవిద్యాలయంలో ఎమ్.ఏ. (M.A.) పూర్తి చేయడమే కాకుండా, అక్కడే న్యాయ శాస్త్రంలో పట్టా కూడా పుచ్చుకొన్నాడు. తరువాత కొంతకాలం ఫ్రాన్స్‌లోను, మెక్సికో, గ్వాటిమాలాల లోను వివిధ విద్యాలయాలలో బోధించి, 1878 లో క్యూబాకు తిరిగి వచ్చాడు. అయితే అతడు రాజకీయాలలో చురుకుగా పాల్గొనడం వలన కొద్దికాలానికే దేశబహిష్కరణ శిక్ష విధించారు. అప్పుడు వివిధ దేశాలు తిరుగుతూ చివరకు న్యూయార్క్ పట్టణానికి చేరుకొని, చనిపోయే వరకు అక్కడే ఉన్నాడు.

మార్టీ వివిధ పత్రికలలో ప్రచురించిన వ్యాసాలు, కవిత్వం, ఇతర రచనలు ఇతనికి లాటిన్ అమెరికా దేశాలన్నింటిలో గొప్ప కీర్తి నార్జించి పెట్టాయి. *ఫ్రీ వర్సెస్* (1913) అనే కవితా సంకలనం ఇతనికి గల దేశభక్తిని, జాతీయాభిమానాన్ని ప్రతిబింబిస్తుంది. ఇంత స్పష్టంగా, ఇంత సజీవంగా మాతృభూమిపై గల మక్కు

వను అంతకు ముందు ఏ కవీ గానం చేయలేదు. ఆ నాటి ఎంతో మంది దేశభక్తులను జాగృతం చేసిన ఇతని కవిత్వం చిరస్మరణీయం. ఎమర్సన్, వాల్ట్ విట్‌మన్ వంటి కవుల మీద ఇతడు వ్రాసిన అనేక వ్యాసాలు ప్రముఖ విమర్శకుల ప్రశంసలు అందుకొన్నాయి. ఇతడు వివిధ పత్రికలలో వ్రాసిన వ్యాసాలలో ఇతడుపయోగించిన వచన రచనా శైలి శ్పానిష్ సాహిత్య చరిత్రలో ఒక క్రొత్త ఒరవడిని సృష్టించింది. ఇతని గద్యం సూటిగా, స్పష్టంగా, గంభీరంగా ఉండి, పాఠకుల హృదయాలకు హత్తుకొంటుంది. తన దేశభక్తి కవిత్వంతో, రాజకీయ చైతన్యంతో, ఉద్యమ స్ఫూర్తితో క్యూబా ప్రజలలో నూతనో త్తేజం కలిగించిన 'మార్టీ' తాను కలలు గన్న స్వాతంత్ర్యం రావడానికి ఏడు సంవత్సరాల ముందే అనగా 1875 మే 19 న మరణించాడు.

మల్లేశం

**మార్మోల్, హోసే (1817-71)** : అర్జెంటైనాకు చెందినకవి, నవలా రచయిత. అప్పటి ఆ దేశపు నియంత అయిన జువాన్ మాన్యుయల్ డి రోసాస్‌ను తీవ్రంగా విమర్శించి 'రోసాస్‌ను కవిత్వంతో ఉరితీసినవాడు' (Poetic hangman of Rosas) అనే బిరుదును పొందినవాడు. ఈయన వ్రాసిన *అమాలియా* (1851-55 (Amalia, A Romance of the Argentina, 1919) అనే నవల చాలా మంది విమర్శకుల దృష్టిలో మొట్టమొదటి అర్జెంటిన్ నవల. లాటిన్ అమెరికన్ సాహిత్యంలో, ముఖ్యంగా నవలలలో వాస్తవికతా వాదానికి బలమైన పునాది వేసినవాడు మార్మోల్.

రోసాస్‌కు వ్యతిరేకి గనుక 1839 లో ప్రభుత్వం ఈయనను కారాగారంలో బంధించింది. అతని రాజకీయ భావాలకు గాను చిట్టచివరకు దేశాన్ని వదలి పారిపోవలసి వచ్చింది. 'అమాలియా' లో ఆ నిరంకుశపాలన సృష్టించిన బీభత్సాన్ని ఇతడు చక్కగా తెలియచెప్పాడు. ఫలితంగా లాటిన్ అమెరికా దేశాలలోని మితవాదుల (Liberals) పై ఇతని ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది. 1852 లో రోసాస్ పతనానంతరం 'మార్మోల్' దేశానికి తిరిగి వచ్చినప్పుడు ప్రజల నుండి ఘన సన్మానాన్ని అందుకొన్నాడు. 1858 నుండి సెనేటర్‌గాను, అప్పటి నుండి చనిపోయేవరకు జాతీయ గ్రంథాలయానికి సంచాలకుడు (Director) గాను పనిచేశాడు.

కె.జి.మూర్తి.

**మార్లో, క్రిస్టఫర్ (1564-93)** : ఎలిజబెతెన్ యుగం లోని ఆంగ్ల కవి, ప్రఖ్యాత నాటక రచయిత. షేక్స్పియర్‌కు ముందే కవిత్వంలో ఛందస్సును వదలివేసి 'బ్లాంక్ వర్స్' ను ప్రవేశపెట్టి, దానికి స్థిరమైన రూపాన్ని ఇచ్చి నాటకాలలో దానినే వాడినవాడు. *టాంబర్లేన్ ది గ్రేట్*, *ది ఫేమస్ ట్రాజెడీ ఆఫ్ ది రిచ్ జ్యూ ఆఫ్ మాల్టా*, *ది ట్రబుల్‌సమ్ రెయిన్ అండ్ లామెన్‌టబుల్ డెత్ ఆఫ్ ఎడ్వర్డ్ ది సెకండ్* అనేవి ఈయన వ్రాసిన నాటకాలలో ముఖ్యమైనవి. నాస్తికత్వానికి గాను ప్రభుత్వం ఈయనను బంధించాలని అనుకొన్న రోజులలోనే ఒక తాగుబోతుల తగాదాలో మార్లో ప్రాణం పోగొట్టుకొన్నాడు.

1584 లో కేంబ్రిడ్జిలో బి.ఏ. పట్టాను, 1587 లో ఎం.ఏ. డిగ్రీని తీసుకొన్నాడు. విద్యార్థిగానే ప్రభుత్వ రహస్య సమాచార విభాగంలో పనిచేశాడు. కేవలం 6 సంవత్సరాలు మాత్రమే సాగిన ఈయన రచనా వ్యాసంగం ఈయనకు ఎనలేని కీర్తిని తెచ్చి పెట్టింది. కేంబ్రిడ్జిలో ఉండగానే *టాంబర్లేన్ ది గ్రేట్* ఈయన వ్రాయటం, దానిని 1587 చివరలోనే ప్రదర్శించటం జరిగింది. ఆ రోజుల్లోనే ఓవిడ్ రచించిన *ఎలిజీస్* ను ఆంగ్లంలోకి ఈయన అనువదించాడు. *టాంబర్లేన్* మాత్రమే ఈయన జీవించి ఉండగా ప్రచురితమైంది (1590). ఆయన అసంపూర్తిగా వదలిన *హీరో అండ్ లియాండర్* అనే కావ్యం ఆ రోజుల్లోని గొప్ప కావ్యంగా విమర్శకుల మన్ననలు పొందింది.

ఆయన వ్రాసిన నాటకాలు ఏ వరుసలో వ్రాశాడనేది వివాదాస్పదమే అయినా టాంబర్లేన్ తరువాత ఫాస్టస్, దాని తరువాత సామాజిక పరమైనవని చెప్పదగిన *ఎడ్వర్డ్ ది సెకండ్, ది మాసకర్ ఎట్ పారిస్* వ్రాశాడని ఆయన చివరి నాటకం *ది జ్యూ ఆఫ్ మాల్టా* అనీ చాలా మంది అభిప్రాయం. 1592 లో ప్లేగ్ వ్యాధి కారణంగా నాటకశాల లన్నీ మూతపడిన సమయంలో *హీరో అండ్ లియాండర్* కావ్యం వ్రాసి ఉండవచ్చు. ఆనాటి ప్రఖ్యాత నటుడు 'ఎడ్వర్డ్ ఎల్లెన్' (Edward Allen) ఈయన నాటకాలలో నాయక పాత్ర ధరించాడన్నది వాస్తవం.

29 సంవత్సరాల వయస్సుకే మరణించిన 'మార్లో' రచనలలో విస్తృత పాండిత్యం, భిన్నరీతులలో దర్శనమిచ్చే ఊహా చమత్కృతి (Imagination) కొట్టవచ్చినట్లు కనిపిస్తాయి. *టాంబర్లేన్* లో యూరప్ సరిహద్దులనే దాటి పర్షియా కిరీటం సాధించి, టర్కీ సుల్తాన్ బజాజెత్‌ను చిత్తుచేసి, డమాస్కస్‌ను జయించి, ఈజిప్ట్ దేశపు సోల్దాన్‌ను లొంగదీసుకుని ఆయన కుమార్తె ప్రేమనందుకొని, బాబిలాన్‌ను కూడ తన ఆధిపత్యంలోకి తెచ్చుకొన్న ఒక సామాన్య సిథియన్ గొర్రెల కాపరి

చరిత్ర అత్యద్భుతంగా పొందుపరచాడు. ఫాస్టస్ లో ఈ అనంతమైన విశ్వాన్నే ఇముడ్చగలిగాడు. ఇందులో 'మార్లో' ప్రదర్శించిన మతవిజ్ఞానం (Theology) శ్లాఘనీయమైనది. *ఎడ్వర్డ్ ది సెకండ్, ది మాసకర్ ఎట్ పారిస్* లలో ఇంగ్లీషు, ఫ్రెంచ్ చరిత్ర విజ్ఞానంలో తానేమీ తీసిపోనని మార్లో రుజువు చేసుకొన్నాడు.

'మార్లో' రచనలను బట్టి వ్యక్తిగా ఆయనను అంచనా వేయటం సాధ్యం కాని పని. మొదట్లో ఆయన ఆత్మాశ్రయ నాటక రచయిత (Subjective Dramatist) అనీ, ఫాస్టస్, టాంబర్లేన్ పాత్రలు ఆయన కన్న కలల ఫలితమే అనీ, వాళ్ల పతనం దైవికమే గాని మానవ మాత్రులు కలిగించినది కాకపోవటం 'మార్లో' లోని అహంకారాన్నే తెలియజేస్తుందనీ చాలామంది పండితులు, విమర్శకులు అభిప్రాయపడ్డారు కాని ఈ మధ్య ఆయనపై సాగించిన పరిశోధనల ఫలితంగా ఆయన కేవలం ఎలిజబెతన్ కాలం నాటి ఛాందస క్రైస్తవుడు మాత్రమేననీ, పాపుల పతనం ఎంత ఘోరంగా ఉంటుందో చూపటానికే ఆ నాటకాలు వ్రాశాడనీ చాలామంది నమ్మటం ప్రారంభించారు. అసలు వాస్తవం ఈ రెంటికీ మధ్య ఎక్కడో ఉందని విజ్ఞుల అభిప్రాయం. ఈ రచయిత నాటకాలలో 'సెనెకన్ ట్రాజెడి' పద్ధతులను కొంతవరకు మాత్రమే తీసుకొని స్వదేశీ పద్ధతులనే ఎక్కువగా వాడుకొన్నాడు.

నాస్తికు డవటం, మిత్రులలో కొంతమంది సంఘ విద్రోహులవటం 'మార్లో' కు చాలా ఇక్కట్లు తెచ్చి పెట్టాయి. ఇతనిని ఫ్రైజర్ అనేవాడు ఒక పానశాల వద్ద వీరిద్దరికి వచ్చిన తగాదాలలో కత్తితో పొడిచి హత్య చేశాడు. మరణానంతరం అప్పటి కవులు, నాటక కర్తలు ఆయన రచనా శక్తికి జోహారు లర్పించారు. జార్జ్ పీల్, మైఖేల్ డ్రైటన్, జాన్ మార్స్టన్, షేక్స్పియర్ మొదలైన వారంతా ఈయన గొప్పతనాన్ని కొనియాడినవారే. 20 వ శతాబ్దిలో ఈయనకు మరింత గుర్తింపు లభించింది.

కె.జి.మూర్తి.

**మార్షల్ (38/41-103)** : రోమన్ కవి. పూర్తి పేరు మార్కస్ వలేరియస్ మార్షియాలిస్. రోమన్ సామ్రాజ్యపు తొలి రోజులలో సమాజంలో ప్రజల ఉన్న మానవ బలహీనతలను ఎత్తి చూపుతూ సూక్తులరూపంలో కవిత వ్రాసినవాడు. చివరకు ఊహించని రీతిలో చురక అంటిస్తూ ఎదుటివాని లోపాలను ఎత్తిచూపే చిన్న పద్యాలను, 'సూక్తులు' (Epigrams) అంటారు. వీటిని వ్రాయడంలో ఈయన దిట్ట.

స్పెయిన్‌లోని ఒక రోమన్ ప్రాంతంలో పుట్టిన మార్షల్ విద్యాభ్యాసం తరువాత ఉదరపోషణార్థమై క్రీ.శ. 65 ప్రాంతంలో రోమ్ నగరం చేరాడు. ప్రసిద్ధ సాహితీవేత్త సెనెకా ప్రాపకంలో ఉంటూ లూకాన్, కాల్పూరియస్ పైసో వంటి కవులతో, మేధావులతో పరిచయం సంపాదించాడు. నీరో చక్రవర్తి పై జరిగిన హత్యా ప్రయత్నంలో కాల్పూరియస్ కుట్రదారుడుగా పేర్కొనబడటంతో మార్షల్ నూతన మిత్రులను, పోషకులను వెతుక్కోవలసి వచ్చింది. క్రీ.శ. 80 లో రోమ్‌లో నిర్మితమైన పెద్ద నాట్యశాల కలోసియం (Colloseum) ప్రారంభోత్సవ సందర్భంగా ఈ కవి ఒక చిన్న కవితా సంపుటిని ప్రచురించాడు. అప్పటి చక్రవర్తి టైటస్, ఆయన తరువాతి చక్రవర్తి అయిన డొమీటియన్ లు మార్షల్ కు బిరుదులు, పదవులు ఇచ్చి సత్కరించారు. క్రీ.శ. 84 నాటికి సెనేటర్ కాకపోయినా సెనేటర్ హోదా, రోమ్‌కి దగ్గరలోనే గ్రామీణ ప్రాంతంలో ఒక విశాలమైన భవంతి, కొంత ఆస్తి ఈయనకు లభించాయి. (బహుశా లూకాన్ భార్య ఇచ్చి ఉండవచ్చు)

*ఆన్ ది స్పెక్టకిల్స్* (80) అనే ఈయన తొలి గ్రంథంలో సుమారు 30 సామాన్యమైన కవితలు ఉన్నాయి. అందులో ఎక్కువ భాగం 'టైటస్' చక్రవర్తిని అతిగా పొగడుతూ వ్రాసినవే. తరువాత *క్సెనియా* (Xenia), *అపొఫోరెటా* (Apophoreta) అనే సామాన్య గ్రంథాలను ప్రచురించాడు. ఆ తరువాత 15, 16 సంవత్సరాలలో వ్రాసిన 12 గ్రంథాలు ఈయన రచనా పాటవానికి, మేధాసంపత్తికి నిదర్శనాలై ఎంతో పేరు ప్రఖ్యాతులను తెచ్చి పెట్టాయి. చివరి రోజుల్లో స్పెయిన్ తిరిగి వెళ్లి, అచటనే 103 లో మార్షల్ తనువు చాలించాడు.

అనవసరపు పొగడ్త, అశ్లీలత ఈయన రచనలలో కనిపిస్తాయని ఈయనపై ఒక అభియోగం ఉంది డొమీటియన్ చక్రవర్తిని తెగపొగడిన మాటవాస్తవమే. ధనవంతులనుండి బహుమతులను పొందటానికి తనను తాను కించ పరుచుకొంటూ వాళ్లను ఆకాశానికి ఎత్తుతూ రచనలు చేశాడనేదీ కాదనలేము. ఆ రోజుల్లో రోమ్ నగరంలో ఎన్నో రాజీలు పడకుండా నెగ్గుకు రావటం సాధ్యం కానిపని అని కూడా మనం గమనించాలి. అశ్లీలత విషయంలో అంతకు పూర్వం కాటలస్, హోరేస్‌లు స్పృశించని విషయా లేమీ మార్షల్ ముట్టుకోలేదు. స్వలింగ సంపర్కం, హస్తప్రయోగాది జుగుప్సాకరమైన

విషయాలను కూడ చమత్కారంగా, ఆకర్షణీయంగా, సున్నితంగా అన్నిటికంటె ఎక్కువగా మానవ బలహీనతల పట్ల జాలిగొలిపే విధంగా చిత్రించగలగటం మార్షల్ ప్రత్యేకత. ఆధునిక ఎపిగ్రామ్ (Modern Epigram) అనే సాహిత్య ప్రక్రియకు ఈయనే పితామహు డని చెప్పవచ్చును. ఈయన సూక్తులు (Epigrams) అనేక భాషలలోకి అనువాదం పొందాయి.

కె.జి. మూర్తి

**మాలపార్టి, కర్జియో (1898-1957) :** ప్రముఖ ఇటాలియన్ రచయిత, 1898 జూన్ 9 న ఇటలీ దేశంలోని ప్రేటో నగరంలో జన్మించిన కుర్ట్ ఎరిక్ సూకెర్ట్ "మాలపార్టి కర్జియో" అనే కలంపేరుతో రచనలు చేశాడు. పాత్రికేయుడుగానూ, నాటక, కథా, నవలా రచయితగానూ ఇతడు ప్రసిద్ధుడు. ఫాసిస్టుల కాలంలోను, రెండవ ప్రపంచయుద్ధానంతర కాలంలోను జీవించిన ఇటాలియన్ రచయితలలో మిక్కిలి శక్తిమంత మైన రచనలు చేసిన మేధావి, వివాదాస్పదుడూ అయిన రచయితగా మాలపార్టి గుర్తింపు పొందాడు.

మాలపార్టి మొదటి ప్రపంచ యుద్ధంలో స్వచ్ఛంద సేవకుడుగా పనిచేశాడు. తరువాత పత్రికా రంగంలో ప్రముఖ పాత్ర నిర్వహించాడు. 1924 వ సంవత్సరంలో *లా కాంక్విస్టా డెల్లో స్టాటో* (La conquista dello stato) అనే రోమన్ పత్రికను స్థాపించాడు. 1926 లో మాసిమోబోంటెంపెల్లితో కలిసి *900* అనే సాహిత్య త్రైమాసిక పత్రికను ప్రారంభించాడు. ఈ పత్రిక యొక్క విదేశీ సంపాదక వర్గంలో జేమ్స్ జాయిస్, ఇల్యా ఎరెన్ బర్గ్ మొదలైన ప్రఖ్యాత సాహితీవేత్తలు ఉండేవారు. మాలపార్టి తరువాతి కాలంలో *ఫియెర్రా లెటరేరియా* (Fiera Letteraria) పత్రికకు సహసంపాదకుడుగా, *లాస్టాంపా* (La stampa) అనే ట్యూనిస్ నుండి వెలువడే పత్రికకు సంపాదకుడుగా వ్యవహరించాడు.

ఫాసిస్టు సిద్ధాంతం వల్ల ప్రభావితుడైన మాలపార్టి ఆ పార్టీతో దగ్గరి సంబంధం కలిగిన ప్రముఖ ఫాసిస్టు రచయిత గాబ్రియేలా డానంజియో తరువాతి స్థానాన్ని ఆక్రమించాడు. 'మాలపార్టి' రాజకీయ భావాలు అతని స్వంత సాహిత్య పత్రిక *ప్రాస్పెక్టివ్* (1937) లో ప్రతిఫలించేవి. సమకాలీన ఫాసిస్టు పత్రికలు మరికొన్నిటిలో కూడా 'మాలపార్టి' రచనలు ప్రచురించబడేవి. ఫ్రెంచ్ భాషలోని అతని వివాదాస్పద రచన *టెక్నిక్ డు కూడీ టట్* 1931 లో వెలువడింది. విప్లవ విధానాలను గూర్చి చెప్పే ఈ రచన 'మాలపార్టి' భావాలకు అద్దం పడుతుంది. 'మాలపార్టి' తొలి కాల్పనిక రచన లయిన *అడ్వెంచర్ డి అన్ కాపిటానొడి స్వెంచురా* (1927), *సోడోయా ఏ గొమ్మొర్రా* (1931), మరియు *సాంగ్వె* (1937) లు కూడా ఫాసిస్టు వాదం వైపు మొగ్గు చూపుతాయి. 1940 లో 'మాలపార్టి' ఫాసిజాన్ని వ్యతిరేకించి పార్టీ నుండి బహిష్కృతు డయాడు. రెండవ ప్రపంచ యుద్ధంలో మిత్రదేశాల విలేఖకుడుగాను, తరువాత నేపుల్స్ ఆక్రమణ సందర్భంగా లయజన్ అధికారి గాను పనిచేశాడు. రష్యన్ ఫ్రంట్ నుండి అతడు వ్రాసిన రిపోర్టులు *ఇల్ ఓల్గానేసె ఇన్ యూరోపా* (1943) గా గ్రంథరూపం దాల్చాయి. 'మాలపార్టి' వ్రాసిన రెండు అపూర్వ వాస్తవిక యుద్ధ నవలలు *కపుట్* (1944), *లా పెల్లె* (1949) లు అతనికి ప్రపంచ వ్యాప్తమైన కీర్తిని ఆర్జించి పెట్టాయి. ఆ నవలలలో మాలపార్టి నేపుల్స్ ప్రజల జీవితాలను ధ్వంసం చేసిన భయంకర యుద్ధ దృశ్యాలను అధివాస్తవిక రీతిలో కళ్ళకు కట్టినట్లు చిత్రించాడు.

మాలపార్టి ఒకవైపున కాల్పనిక రచనలను, ఇతర రచనలను చేస్తూ మరో వైపు ఇద్దరు ప్రముఖుల జీవితాలు ఆధారంగా గొప్ప వాస్తవిక నాటకాలను వ్రాశాడు. మార్సెల్ ప్రౌస్ట్ జీవితం ఆధారంగా వ్రాసిన నాటకం *డు కోట్ డి చెజ్ ప్రౌస్ట్* 1948 లోనూ, కార్ల్‌మార్క్స్ జీవితం ఆధారంగా వ్రాసిన నాటకం *దాస్ కాపిటల్* 1949 లోనూ ప్రదర్శించబడ్డాయి. రష్యా ఆక్రమణలోని వియెన్నాలోని జన జీవనాన్ని ఆధారంగా చేసుకుని వ్రాసిన మరో నాటకం *అంచె లే డొన్నె హన్నొ పెర్సొలా గుయెర్రా* (The Women Lost the War Too) 1954 లో ప్రదర్శించబడింది. 1951 లో *ఇల్ క్రిస్టో ప్రోయిబిటో* అనే చిత్రానికి మాలపార్టి స్క్రీన్‌ప్లే వ్రాశాడు. *ఇటాలియన్ టేల్స్* అనే పేరుతో 1957 లో ఒక పుస్తకాన్ని ప్రచురించాడు. మాలపార్టి మొత్తం రచనలు 1957-1971 మధ్యకాలంలో ప్రచురించబడ్డాయి. 1957 వ సంవత్సరం జూలై 19 వ తేదీన రోమ్ నగరంలో మాలపార్టి దివంగతుడైనాడు.

ఎమ్.గు.రా.

**మావో టున్ (1896-1981) :** చైనా దేశపు రచయిత. మావో టున్ అనే కలం పేరుతో రచనలు చేసిన షెన్ యెన్-పింగ్ 1896 వ సంవత్సరంలో చైనా దేశంలోని చెకియాంగ్ రాష్ట్రానికి చెందిన చింగ్ చెన్‌లో జన్మించాడు. చైనా దేశపు అత్యుత్తమ వాస్తవ నవలా రచయితగా ప్రసిద్ధి గాంచిన మావో పత్రికా సంపాదకత్వం

కూడా చేశాడు. 1916 లో ఆర్థికమైన ఇబ్బందుల వల్ల విద్యాభ్యాసాన్ని మధ్యలోనే ఆపివేసిన మావో షాంఘైలోని ఒక ముద్రణాలయంలో ప్రూఫ్‌రీడరుగా చేరాడు. అనతి కాలంలోనే సంపాదకుడుగా, అనువాదకుడుగా పదోన్నతి పొందాడు. 1920 లో మరికొందరు యువ చైనా రచయితలతో కలసి 11 సంవత్సరాలుగా నడుస్తున్న ఒక చిన్న కథల పత్రిక *జియావో-షువో-యుయెహ్-పావో* కు సంపాదకత్వ బాధ్యతలను స్వీకరించి ఆ పత్రికను నూతన పంథాలో తీర్చిదిద్ది నవ్యసాహిత్యాభివృద్ధికి దోహదం చేశాడు. ఆ పత్రిక సంపాదకుడుగా 1923 వరకు షెన్ కొనసాగాడు. 1926 లో 'కొమింటాంగ్' కేంద్ర నిర్వాహక కమిటీ యొక్క ప్రచార విభాగంలో కార్యదర్శిగా చేరాడు. చైనా కమ్యూనిస్ట్ పార్టీని వామపక్ష కొమింటాంగ్ సభ్యులు చీల్చినప్పుడు అనారోగ్యాన్ని సాకుగా చూపి పార్టీ కార్య కలాపాలకు దూరంగా ఉన్నాడు. తరువాతి సంవత్స రంలో మూడు నవలికలను రచించి ఒకే కూర్పుగా *షిహ్* (shih, 1930; గ్రహణం) అనేపేరుతో ప్రచురిం చాడు. వాస్తవిక మానవ మనస్తత్వ చిత్రణతో నిండిన ఈ రచన పాశ్చాత్య విమర్శకులచే 'మావో' రచనలన్నిటి లోను గొప్పదిగా పరిగణించ బడినప్పటికీ చైనాలోని మార్క్సిస్టు విమర్శకుల తీవ్ర ఖండనలకు గురి అయింది. 'మావో' తరువాతి రచన *జూ-యెహ్* (Tzu-yeh: 1933, అర్ధరాత్రి), దానిలోని సామ్యవాద భావాలవల్ల అది మార్క్సిస్టు విమర్శకుల ఆమోదం పొందగలిగింది. 1930 లో మావో వామపక్ష రచయితల సంఘ స్థాపనలో ప్రధాన పాత్ర వహించాడు. 1937-45 మధ్య కాలంలో జరిగిన చైనా-జపాన్ యుద్ధకాలంలో 'మావో' తన వామపక్ష రచనా వ్యాసంగాన్ని కొనసాగించాడు. రెండు దేశభక్తి ప్రధానమైన పత్రికలను స్థాపించి సంపాదకత్వం నిర్వహించాడు. 1949 లో చైనాలో కమ్యూనిస్ట్ ప్రభుత్వ స్థాపన జరిగిన తరువాత 'మావో' అనేక సాహిత్య కళా సంఘాలలో చేరి సారస్వత సేవ చేశాడు. 1970-80 మధ్య చైనా రచయితల సంఘానికి ఉపాధ్యక్షుడై ఒక బాల సాహిత్య పత్రికకు సంపాదకత్వం కూడా నెరపాడు. 1978 లో తిరిగి చైనా కమ్యూనిస్ట్ పార్టీలో ప్రముఖ కార్యకర్తగా ఉన్నాడు. 1981 వ సంవత్సరం మార్చి 27 వ తేదీన పెకింగ్ నగరంలో మావో మరణించాడు.

ఎమ్.గు.రా.

**మిడిల్‌టన్, టామస్ (1570-1627) :** ఆంగ్ల కవి, నాటక రచయిత. 1600 వ సంవత్సరానికి ముందు మిడిల్‌టన్ ఆక్స్‌ఫర్డ్‌లో రెండేళ్లు అధ్యయనం చేశాడు. మూడు పద్య గ్రంథాలను ప్రచురించాడు. నాటక దర్శ కుడు ఫిలిప్ హెన్‌స్లో కోసం థామస్ డెక్కర్, జాన్ వెబ్‌స్టర్ మొదలైన వారితో కలసి నాటకాలు వ్రాశాడు. జనా దరణ పొందిన నాటక రచయితగా మిడిల్‌టన్ అనేక లార్డ్ మేయర్ నాటకాలను, ఇతర రూపకాలను రచించి నిర్వహించాడు. గొప్ప రంగస్థల విజయాన్ని సాధించిన ఇతడి నాటకం *ఏ గేమ్ ఎట్ ఛేయెస్* (A Game at Chaess: 1625) లో స్పెయిన్ దేశాన్ని, జెసూయిట్ లను అన్యాపదేశంగా నల్లజాతికి చెందిన రాజుగాను, అతని అనుచరులుగాను చిత్రించాడు. వీరిని శ్వేత జాతియోధుడైన ఛార్లెస్ రాకుమారుడు ఓడించటం ఈ నాటకంలోని ప్రధానాంశం. ఈ రాజకీయ వ్యంగ్య నాటకం ప్రేక్షకులను విశేషంగా ఆకర్షించింది. స్పెయిన్ దేశపు రాయబారి ఈ నాటకం పట్ల నిరసన ప్రదర్శించిన తరువాత జేమ్స్ ప్రభువు దీని నిషేధానికి ఉత్తర్వు లిచ్చాడు.

మిడిల్‌టన్ ఉత్తమ రచనలుగా *వుమెన్ బివేర్ వుమెన్* (1657), *ది ఛేంజ్ లింగ్* (1653) అనే విషాద నాటకాలను పేర్కొనవచ్చు. మిడిల్‌టన్ సుఖాంత నాట కాలలో డబ్బుకి దాసోహ మనే ఆ నాటి సంఘాన్ని చిత్రించాడు. *మైకేల్‌మస్ టెర్మ్* (1607) అతని వ్యంగ్య రచనలలో సుప్రసిద్ధమైనది. అతని *ఏ ట్రిక్ టు కాచ్ ది ఓల్డ్ వన్* (1608) లో ఒకరికంటె ఒకరు అధికులు కావా లనుకునే ఇద్దరు వడ్డీ వ్యాపారుల ఆట కట్టించే తెలివైన మేనల్లుని పాత్ర ప్రేక్షకులను ఎంతగానో ఆకట్టు కుంటుంది. *ఏ మాడ్ వరల్డ్, మై మాస్టర్స్* (1608) లో ఒక సరదా రాయుడైన పల్లెటూరి పెద్దమనిషి తన దాతృత్వాన్ని తానే విపరీతంగా పొగడుకుంటాడు. కాని అతని దాతృత్వానికి అతని వారసుడైన స్వంత మను మడు మాత్రం నోచుకోడు. 1630 లో ప్రచురింపబడిన *ఏ ఛాస్ట్ మేడ్ ఇన్ చీప్ సైడ్* (ప్రదర్శన: 1613) లో లండన్ నాగరకుల అసహజ స్వభావాన్ని హాస్యరస స్ఫోరకంగా చిత్రించాడు. 1611 లో ప్రచురింపబడిన *ది రోరింగ్ గర్ల్* లో స్వేచ్ఛా వివాహ వ్యవస్థను అభిలషించే అమ్మాయిని చిత్రించాడు. సుఖ విషాద మేళనాలయిన *ఎ ఫెయిర్ క్వారెల్* (1617) లాంటి అతడి రచనలలో కథా బలం తక్కువగా ఉన్నా, నాటకీయ సన్నివేశాలు రక్తి కట్టే విధంగా ఉండి ప్రేక్షకులను అలరిస్తాయి. మిడిల్‌టన్ ఇతర రచనలలో ఎక్కువ భాగం సుఖాంత నాటకాలే. డెక్కర్ సహ కర్తృత్వంలో రచించిన *ది ఆనెస్ట్ హోర్* (1604), రౌలీ, మాసింగర్‌లతో కలసి

రచించిన *ది ఓల్డ్ లా* (1656) లు కూడా మిడిల్‌టన్ రచనలలో ఎన్నదగినవి.

మిడిల్‌టన్ 1627 జూలై 4 న ఇంగ్లండు దేశపు స్ర్రేలోని న్యూయింగ్‌టన్ బట్స్‌లో కీర్తిశేషు డయాడు.

ఎమ్.గు.రా.

**మిలోష్జ్, జెస్లావ్ (1911-)** : పోలిష్-అమెరికన్ రచయిత. 1911 జూన్ 30 న రష్యాలోని లిథువేనియాకు చెందిన సాటెయి నాయిలో జన్మిం చాడు. అనువా దకుడుగా, విమ ర్శకుడుగా ఇతడు ప్రసిద్ధుడు. 1980 లో సాహిత్యంలో నోబెల్ బహుమ తిని పొందాడు. ఒక ఇంజనీర్ కొడు కైనా మిలోష్జ్ తన హైస్కూలు, యూనివర్శిటీ చదువులను ఆ నాటి పోలండుకు చెందిన విల్నో నగరంలో పూర్తి చేశాడు. 21 సంవత్సరాల వయస్సులో తన ప్రథమ పద్య సంకలనం *పోయెమట్ ఓజెసీ జాస్టిగ్లిమ్* వ్రాసే సమయానికి మిలోష్జ్ సామ్య వాదిగా, ప్రపంచ వ్యాప్తంగా దుర్ఘటనలు జరుగుతాయని ఊహించే 'కెటాస్ట్రొఫిస్టు' కవుల నాయకుడుగా ప్రసిద్ధుడు. పోలండ్‌ను నాజీలు ఆక్రమించిన కాలంలో మిలోష్జ్ చైతన్యవంతుడైన వ్యతిరేకిగా అనేక రచనలు, అనువాదాలు చేశాడు. అనేక పుస్తకాలకు సంపాదకత్వం నిర్వహించాడు. 1942 లో పైసెన్ *నియెపోడ్లెగ్లా* ను సంతరించాడు. అతని పద్య సంకలనం *ఒకాలెనీ* (1945) కమ్యూనిస్టు పోలండులో ప్రచురించబడిన మొదటి పుస్తకాలలో ఒకటి. క్రొత్త కమ్యూనిస్టు ప్రభుత్వం విదేశీ సర్వీసులకు మిలోష్జ్ ను నియమించి గౌరవించింది. వాషింగ్టన్ డి.సి. లో సాంస్కృతిక రాయబారిగాను, పారిస్‌లో సాంస్కృతిక వ్యవహారాల ప్రథమ కార్యదర్శిగాను అతడు పనిచేశాడు. 1951 లో ఫ్రాన్స్ దేశపు రాజకీయ ఆశ్రయాన్ని కోరాడు. 1960 లో అమెరికా దేశానికి వలసపోయి బర్క్‌లీ లోని కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలో ఆచార్యుడుగా చేరాడు. 1970 లో అమెరికా పౌరసత్వం పొందాడు.



ప్రప్రథమంగా మిలోష్జ్ కవి అయినప్పటికీ అతని వ్యాస సంపుటి *జ్నీమెవొలోనీ ఉమిసిల్* (1955, The Captive Mind) ఎనలేని ఖ్యాతి నార్జించి పెట్టింది. ఈ సంపుటిలో మిలోష్జ్ కమ్యూనిజానికి బానిసలయిన అనేక పోలిష్ మేధావులను తీవ్రంగా ఖండించాడు. అతని పద్యరచనలు వాటిలోని సాంప్రదాయికశైలికి, వేదాంత, రాజకీయ పరమైన అంశాలకు పేరెన్నిక గన్నవి. దీనికి ముఖ్య ఉదాహరణగా అతని *త్రక్తత్ పొయెటిక్కీ* (1957, The Poetic Treatise) ని పేర్కొనవచ్చు. మిలోష్జ్ ఇతర రచనలలో స్వీయచరిత్ర, *డొలినా ఇస్సీ* అనే నవల, *పోలిష్ వింటర్* (1978), బైబిల్‌కు పోలిష్ అనువాదం ముఖ్యమైనవి.

ఎమ్.గు.రా.

**మిల్టన్, జాన్ (1608-74)** : ఆంగ్ల మహాకవి. 1608 డిసెంబర్ 9 న లండన్‌లో జన్మించాడు. ఆంగ్ల కవులలో చిర యశస్సు నార్జించిన కవులలో పేర్కొనదగి నవాడు. 1667 లో *పేరడైజ్ లాస్ట్* (Paradise Lost) అనే ఇతిహాస కావ్యాన్ని వ్రాశాడు. కవిగా మాత్రమే గాక చరిత్రకారుడుగాను, పండితుడుగాను వ్యాసరచ యితగాను, ఉన్నత ప్రభుత్వోద్యోగిగాను కూడా మిల్టన్ ప్రసిద్ధుడు.

చిన్న వయసులోనే లాటిన్ భాషలో పాండిత్యాన్ని సంపాదించి ఛందోబద్ధంగా కవిత్వం చెప్పగలిగిన మిల్టన్ కేంబ్రిడ్జ్‌లోని క్రీస్ట్ కళాశాల నుండి ఎం.ఏ. పట్టా పొందాడు (1625-32). విద్యార్థి దశలోనే లాటిన్, ఇటాలియన్, ఇంగ్లీషు భాషల్లో కవిత్వం వ్రాశాడు. 1632 నుండి 1638 వరకు తల్లి దండ్రులతో నివసిస్తూ ఇంటివద్దనే సాహిత్యాధ్యయనం కొనసాగించాడు. ఆ తరుణంలోనే తన మొదటి పద్యనాటకం *కోమస్* రచించాడు. ఈ రచనలో మంచి చెడుపై విజయాన్ని సాధిస్తుందన్న సత్యాన్ని మనోజ్ఞంగా చిత్రించాడు. *లైసిడాస్* అనే పద్యాన్ని కూడా ఈ రోజులలోనే సంతరించాడు. తరువాత ఒక సంవత్సరం పాటు ఇటలీ దేశంలో పర్యటించాడు. ఇంగ్లండులో చెలరేగిన ప్యూరిటన్ వాదం కారణంగా అనేక సంవత్సరాలు (1641-60) పౌరస్వేచ్ఛ, మత స్వేచ్ఛలకై కరపత్ర రచనల ద్వారా ప్రచారం నిర్వ హిస్తూ గడిపాడు. కామన్వెల్త్ ప్రభుత్వంలోని విదేశీ భాషల శాఖలో కార్యదర్శిగా నియమితుడై పనిచేశాడు. 1644 లో *ఆఫ్ ఎడ్యుకేషన్ అండ్ ఎరియోపాజిటికా* అనే గ్రంథాన్ని వ్రాశాడు. 1651-52 లో కంటిచూపు కోల్పోయినా, మిల్టన్ తన రచనా వ్యాసంగాన్ని ఆపి వేయలేదు. 1654 లో *ది సెకండ్ డిఫెన్స్ ఆఫ్ ది పీపుల్ ఆఫ్ ఇంగ్లండ్* పూర్తిచేశాడు. 1660 లో

రెండవ ఛార్లెస్ పునఃప్రతిష్ఠితుడైన తరువాత కామన్వెల్త్ మద్దతుదారుడన్న కారణంగా బంధించబడి తిరిగి వెంటనే విడుదల చేయబడ్డాడు. 1671 లో *పారడైజ్ రీగెయిన్డ్, శాంసన్ అగొనిస్టస్* లను ప్రచురించాడు. జీవితపు మలిదశలో అంధుడైన మిల్టన్ తన కవిత్వాన్ని తనకూతురు, ఇద్దరు మేనల్లుళ్ళు, మిత్రులు, శిష్యులు మొదలైన వారి సహాయంతో గ్రంథస్థం చేశాడు. గౌట్ వ్యాధికి గురిఅయి, 1674 నవంబర్ 8వ తేదీన మిల్టన్ మరణించాడు.

ఎమ్.గు.రా.

**మిల్లర్, ఆర్థర్ (1915--)** : అమెరికన్ నాటక రచయిత. 1915 అక్టోబర్ 17 న న్యూయార్కు నగరంలో జన్మించాడు. ఈ రచయిత రచనలలో సాంఘిక దృష్టి మెండుగా ఉండి అతడు సృష్టించిన పాత్రల ఆంతర జీవితాలను ప్రకటిస్తూ ఉంటుంది. మిల్లర్ రచన *డెత్ ఆఫ్ ఏ సేల్స్‌మన్* (1949) బహుజనాదరణ పొందింది.



మిల్లర్ తండ్రి ఒక చిన్నకర్మాగారానికి అధిపతి. ఆర్థికంగా చితికిపోయిన తండ్రి ద్వారా ఆధునిక జీవనంలోని అభద్రత మిల్లర్‌కు అవగతమైంది. అతనిలోని ఆ నిరాశా భావం నుంచే రచయిత మిల్లర్ ఉద్భవించాడు. హైస్కూలు విద్యాభ్యాసం తరువాత మిల్లర్ ఒక గిడ్డంగిలో పనికి కుదిరాడు. తద్వారా ఆర్జించిన డబ్బుతో మిచిగాన్ విశ్వవిద్యాలయంలో చేరాడు. అక్కడ ఉన్నప్పుడే మిల్లర్ నాటకాలు వ్రాయటం మొదలు పెట్టాడు. 1945 లో అతడు వ్రాసిన నవల *ఫోకస్* (Focus) పాఠకలోకాన్ని ఉర్రూత లూగించింది. 1947 లో వ్రాసిన *ఆల్ మైసన్స్* అతని మొదటి ప్రముఖ నాటకం. నాణ్యత లేని యుద్ధ సామాగ్రిని ఉత్పత్తి చేసే ఉత్పత్తిదారుని కథ ఈ నాటకంలోని ముఖ్యాంశం. *డెత్ ఆఫ్ ఏ సేల్స్‌మన్* ఆ నాటి అమెరికన్ నాటకాలలో గొప్ప నాటకంగా ప్రఖ్యాతి కెక్కింది. ఈ విషాద నాటకంలో నాటి సమాజపు అసత్యపు విలువల కోసం బలి అయిపోయిన ఒక సామాన్యుని జీవిత చిత్రణ ఉంది.

1953 లో వ్రాసిన *ది క్రూసిబుల్* 1692 లో సేలెం, మసాచుసెట్స్‌లో క్షుద్ర ప్రయోగాల కుట్రలు జరిగిన నాటి పరిస్థితులు 1950 దశకంలో పునరావృత్తమవుతున్నా యన్న మిల్లర్ భావనకు రూపకల్పన. 1956 లో పార్లమెంటు యొక్క 'అన్-అమెరికన్ ఆక్టివిటీస్ కమిటీ' (Un-American Activities Committee) మిల్లర్‌ను విచారించింది. పదేళ్ళ క్రితం జరిగిన కమ్యూనిస్ట్ రచయితల సమావేశంలో పాల్గొన్న వారి పేర్లను బయట పెట్టటానికి మిల్లర్ నిరాకరించాడు. తరువాత మిల్లర్ ఉన్నత న్యాయస్థానానికి అప్పీలు చేసుకొని గెలుపొందాడు.

1955 లో మిల్లర్ అల్పవ్యవధి నాటకాలైన *ఏ మెమొరీ ఆఫ్ టూ మండేస్, ఏ వ్యూ ఫ్రం ది బ్రిడ్జ్* లు ఒకే టికెట్టుపై ప్రదర్శింపబడ్డాయి. *ఆఫ్టర్ ది ఫాల్* (1964) లో మనుష్యుల మధ్య అనుబంధాల విచ్ఛిన్నతను, తత్పరిణామాలను గూర్చి రచయిత పొందిన ఆవేదన కనిపిస్తుంది. *ది ప్రైస్* (1968) లో ఇద్దరు సోదరుల మధ్య ఏర్పడిన మానసిక అగాథాల పరిశీలనం ఉంది. 1969 లో లండన్‌లో ప్రదర్శించబడిన ఈ నాటకానికి మిల్లర్ దర్శకత్వం కూడా వహించాడు. వాషింగ్టన్ డి.సి. లో 1977 లో ప్రదర్శించబడిన నాటకం *ది ఆర్చ్‌బిషప్స్ సీలింగ్* లో అసమ్మతి రచయితల పట్ల సోవియెట్ ప్రభుత్వ కఠిన ప్రవర్తనను చిత్రించాడు. చార్లస్టన్ ఎస్.సి.లో జరిగిన 1980 సంవత్సరపు *అమెరికన్ స్పోలెటో ఫెస్టివల్* లో ప్రదర్శింపబడిన *ది అమెరికన్ క్లాక్* అనే నాటక సంకలనం తన రెండవ భార్య అయిన ప్రముఖనటి 'మార్లిన్ మన్రో' కోసం *ది మిస్‌ఫిట్స్* (1961) చిత్రానికి స్క్రీన్‌ప్లే వ్రాశాడు. 1967 లో *ఐ డోంట్ నీడ్ యూ ఎనీ మోర్* అనే పేరుతో మిల్లర్ కథానికల సంకలనం వెలువడింది. 1977 లో అతడు వ్రాసిన రంగస్థల వ్యాసాల సంకలనం కూడా ప్రచురించబడింది.

ఎమ్.గు.రా.

**మిల్లర్, హెన్రీ (1891-1980)** : అమెరికన్ రచయిత. 1891 డిసెంబర్ 26 న న్యూయార్కు నగరంలో జన్మించాడు. ఇతడు నిరంతర స్వేచ్ఛా సంచార లాలసుడు. స్వీయ జీవిత సంఘటనలు ప్రతి ఫలించే ఇతని నవలలలో నిష్పక్షపాత వైఖరి గోచరిస్తుంది. ముఖ్యంగా స్త్రీ పురుష సంబంధాల పట్ల తేటతెల్లంగా కనిపించే ఈ వైఖరి 20 వ శతాబ్దం మధ్యభాగపు సాహిత్యంపై తన ప్రభావాన్ని చూపించింది. ఇతరులు దాచుకోవాలనుకునే భావాలను, చెడు ఊహలను కూడా మిల్లర్ బాహాటంగా

తన రచనలలో చిత్రిస్తాడు. అతని ముఖ్య రచనలు వాటిలోని లైంగిక ధోరణుల కారణంగా బ్రిటన్‌లోనూ, అమెరికాలోనూ 1960 వరకూ నిషేధించబడినప్పటికీ ఫ్రాన్స్ నుండి దొంగ చాటుగా రవాణా చేయబడి, విశేష ప్రాచుర్యాన్ని పొందాయి.

బ్రూక్లిన్‌లో పెరిగి పెద్దవాడైన హెన్రీ మిల్లర్ తన బాల్యజీవితపు అనుభవాలను *బ్లాక్ స్ప్రింగ్* (1936) లో వ్రాశాడు. 1924 లో న్యూయార్కులోని వెస్టర్న్ యూనియన్‌లో చేస్తున్న ఉద్యోగాన్ని వదిలి వేసి తన పూర్తి సమయాన్ని రచనలకే కేటాయించాడు. 1930 లో మిల్లర్ ఫ్రాన్స్‌కు వెళ్లాడు. అతని *ట్రోపిక్ ఆఫ్ కేన్సర్* (కర్కాటక రేఖ) 1934 లో ఫ్రాన్స్‌లో ప్రచురితమైంది. పారిస్‌లో గడపిన జీవితాన్ని ఈ నవలలో అతడు చిత్రీకరించాడు. తరువాత 1939 లో తన న్యూయార్కు జీవితం ఆధారంగా *ట్రోపిక్ ఆఫ్ క్యాప్రికార్న్* (మకరరేఖ) రచించాడు. ఈ రెండు నవలలూ 1961 వరకూ అమెరికాలో ప్రచురణకు నోచుకోలేదు.



1939 లో మిల్లర్ గ్రీస్‌దేశాన్ని సందర్శించాడు. ఆ ప్రభావంతో *ది కొలోసస్ ఆఫ్ మారుసి* (1941) వ్రాశాడు. 1940-41 లలో అమెరికా దేశమంతా తిరిగి విమర్శనాత్మకమైన నవల *ది ఎయిర్ కండిషండ్ నైట్ మేర్* వ్రాశాడు. దీనిలో యాంత్రికీకరణ, వ్యాపారాత్మక ధోరణి మానవ సమాజాన్ని ఏ విధంగా అణగద్రొక్కి వేస్తున్నాయో విశదంగా వర్ణించాడు. కాలిఫోర్నియా సాగర తీరంలో 'బిగ్ సూర్' వద్ద స్థిర నివాసమేర్పరచుకున్న మిల్లర్ చుట్టూ అభిమానులు గుమికూడటం మొదలు పెట్టారు. వారిలో చాలామంది రచయితలు కూడా ఉన్నారు. అక్కడ మిల్లర్ *రోసీ క్రూసిఫిక్షన్* అనే మూడు భాగాల రూపకం వ్రాశాడు. దీనిలో *సెక్సస్, ప్లెక్సస్, నెక్సస్* (1965) అనే మూడు భాగా లున్నాయి. ఇవి అమెరికాలో ప్రచురితమైన తరువాత అశ్లీలత ఆరోపణపై విచారణ జరిగింది. చివరకు 1964 లో అమెరికా సుప్రీంకోర్టు ఆ పుస్తకాలలో అశ్లీలమైన దేమీ లేదని తీర్పు నిచ్చింది.

మిల్లర్ ఇతర పుస్తకాలలో *ది కాస్మొలాజికల్ ఐ* (1939), *ది విస్‌డమ్ ఆఫ్ ది హార్ట్* (1941) అనే వ్యాస సంకలనాలు ముఖ్యమైనవి. రచయితగానే గాక చిత్రకారుడుగా కూడా మిల్లర్ సుప్రసిద్ధుడు. అతడు చిత్రకళపై వ్రాసిన పుస్తకం *టు పెయింట్ ఈస్ టు లవ్ అగెయిన్* (1960) అనే శీర్షికతో ప్రచురించబడింది. లారెన్స్ డరెల్, అనాయిస్‌నిస్, వాలస్ ఫౌలీలతో మిల్లర్ జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలు అనేక సంపుటాలుగా ప్రచురింపబడ్డాయి.

1980 సంవత్సరం జూన్ 7వ తేదీన కాలిఫోర్నియాలోని పసిఫిక్ పాలిసెడ్స్ వద్ద హెన్రీ మిల్లర్ పరమపదించాడు.

*ఎమ్.గు.రా.*

**మిషీమా, యుకీయో (1925-70)** : ప్రసిద్ధ జపనీస్ రచయిత. అసలు పేరు 'హిరవోకా కిమిటకే'. 1925 జనవరి 14 న టోక్యోలో జన్మించాడు. ఇతడు మిషిమా యుకీయో అనే కలం పేరుతో ప్రసిద్ధి పొందాడు. జపానీయుల సాంప్రదాయిక జీవనపు విలువలకు, పాశ్చాత్య నాగరకతా ప్రభావానికి మధ్య ఏర్పడిన స్పర్ధ మిషీమా యుకీయో రచనలలో ప్రతిఫలిస్తూంటుంది. ఈ స్పర్ధను మిషీమా యుకీయో తన నిజ జీవితంలో అతి విషాదకరంగా ఆత్మహత్య రూపంలో పరిష్కరించాడు. ఉన్నత ప్రభుత్వోద్యోగి కుమారుడైన 'మిషీమా' టోక్యోలోని అరిస్టోక్రటిక్ పేర్స్ స్కూలులో చదువుకొన్నాడు. రెండవ ప్రపంచ యుద్ధం సందర్భంగా సైన్యంలో చేరాలని ఉవ్విళ్ళూరినా, శరీరపు కొలతలు సరిపోని కారణంగా చేరలేక పోయాడు. టోక్యోలోని ఒక కర్మాగారంలో పనిచేస్తూ యుద్ధం పూర్తయిన తరువాత టోక్యో విశ్వవిద్యాలయంలో న్యాయశాస్త్రాన్ని అభ్యసించాడు. 1948-49 లో జపాన్ ఆర్థిక మంత్రిత్వశాఖలోని బ్యాంకింగు విభాగంలో చేరాడు. అతని తొలి నవల *కామెన్ నో*



*కోకుహాకు* (1949) లో కొంత వరకు తన స్వీయా నుభవాలను గ్రంథస్థం చేశాడు. ఈ నవలలో స్వలింగ సంపర్కం ప్రధాన కథాంశంగా ఉంది. అతడు వ్రాసిన అనేక ఇతర రచనలలో కూడా ఇది కనిపిస్తుంది. ఈ నవల అతనికి వెంటనే ఖ్యాతిని ఆర్జించి పెట్టడంతో 'మిషీమా' రచనా రంగంపై ఎక్కువ దృష్టిని కేంద్రీక రించాడు.

'మిషీమా' రచనలలో రక్తపాతం, మరణం, ఆత్మ హత్య, ఆధునిక జీవనపు నిరాసక్తత పట్ల వ్యతిరేకత ధ్వనిస్తూ ఉంటాయి. అతని తొలి దశలోని రచన లలో భౌతిక, మానసిక సమస్యలతో సతమతమయే పాశ్చాత్య ప్రతినాయకులు దర్శనమిస్తారు. మలి దశలోని రచనలలో జపాన్ సంప్రదాయ సాహిత్యపు రీతిలో గుణవంతులైన నాయకులు కన్పిస్తారు.

*కింకా కూజీ* (The Temple of Golden Pavilion:1956) లో యువకుడైన ఒక బౌద్ధా లయ సేవకుడు తన ప్రార్థనా మందిర సౌందర్యానికి ముగ్ధుడై దానిని తగులబెట్టిన సంఘటన వర్ణించబడింది. *టాయియో టో టెట్సు* (1968, Sun and Steel) లో రెండవ ప్రపంచ యుద్ధంలో జపాన్ పొందిన ఓటమివల్ల కలిగిన సిగ్గును, శారీరక బలాన్ని పెంపొందించుకోవల సిన ఆవశ్యకతను వివరించాడు. పై రెండు రచనలలో కూడా మరణాన్ని గూర్చిన వ్యాఖ్యానాలున్నాయి. అతని చివరి రచన *హోజో నో ఉమి* (1965-70 Sea of Fertility) అనే నాల్గు భాగాల ఐతిహాసిక రచనలో చంద్రునిలోని ఎడారి లాంటి *సీ ఆఫ్ ఫెర్టిలిటీ* తో ఆధునిక జపాన్ దేశాన్ని పోల్చాడు. ఈ గ్రంథంలో *హారూ నో యుకి* (Spring Snow), *హోమ్మా* (Runaway Horses), *ఆకట్సుకి నోటెరా* (The Temple of Dawn), *టెన్నిన్ గోషుయి* (The Decay of the Angel) అనే నాలుగు భాగా లున్నాయి.

'మిషీమా' వ్రాసిన *డెత్ ఇన్ మిడ్ సమ్మర్ అండ్ అదర్ స్టోరీస్*(1966) లోని దేశభక్తి ఆధారంగా *యూకోకు* (Yukoku) అనే చలన చిత్రాన్ని నిర్మించారు. మిషీమా దర్శకత్వం వహించి నటించిన ఈ చిత్రంలో జపాన్ దేశపు కర్మకాండతో కూడిన 'సెప్పుకు' (Seppuku) ఆత్మహత్యా విధానాన్ని చూపించారు. చిత్రాలకు చేసిన రచనలే గాకుండా జపాన్ సంప్రదాయానుసారంగా అనేక నాటక కళారూపాలను కూడా మిషీమా సృష్టించాడు. సాంస్కృతికంగా, మతపరంగా ప్రాక్పశ్చిమాల కలయిక 'మిషిమా' నాటకాల్లో కన్పిస్తుంది.

సమ కాలీన పాశ్చాత్య నాగరకతా ప్రభావిత జపాన్ జీవనపు విలువలకు, గతకాలపు 'సమురాయి' సైనిక రాజ్య సంప్రదాయాల విలువలకు మధ్య 'మిషీమా' మానసి కంగా నలిగిపోయాడు. వ్యక్తిగతంగా 'మిషీమా' పాశ్చాత్య నాగరకతను, జీవన విధానాన్ని అవలంబించాడు. అత నికి పాశ్చాత్య సంస్కృతికి సంబంధించిన అఖండ విజ్ఞానం ఉంది. అయినా తన స్వదేశం పాశ్చాత్య దేశాలను గుడ్డిగా అనుకరించటాన్ని 'మిషీమా' తీవ్రంగా ఖండించాడు. 'మిషమా' జపాన్ దేశపు యుద్ధకళలైన కరాటే మొదలయిన విద్యలను అభివృద్ధి పరచి వివా దాస్పదమయిన 'టాటేనోయ్' (Shield Society) అనే సైన్య దళాన్ని ఏర్పరచాడు. కమ్యూనిస్ట్ లేదా వామపక్ష సైన్యాలు తమ దేశంపై దాడి చేసినప్పుడు ఈ దళాలు తమ సైనిక దళాలకు సహాయపడగల వని 'మిషీమా' ఆశించాడు.

గౌరవప్రదమైన, ఆమోద పూర్వకమైన ఆత్మహత్యపై గల నమ్మకాన్ని 'మిషీమా' తన ఆత్మహత్యతో రుజువు పరచాడు. 1970 నవంబరు 25 న నలుగురు 'టాటే నోకాయ్' అనుచరులు వెంటరాగా టోక్యోలోని మిలిటరీ కేంద్రస్థానంలో ఉన్న కమాండింగ్ జనరల్ కార్యాల యాన్ని స్వాధీనపరచుకొని పది నిముషాల పాటు అక్కడ గుమిగూడిన వెయ్యిమంది సైనికుల ముందు ఉపన్యసిం చాడు. తన ఉపన్యాసంలో రెండవ ప్రపంచ యుద్ధానంతర జపాన్ దేశ రాజ్యాంగాన్ని తీవ్రంగా విమర్శించాడు. తరువాత తన కత్తితో పేగులను చీల్చుకుని 'సెప్పుకు' పద్ధతిలో ఆత్మహత్య చేసుకొన్నాడు. అతని అనుచరు డొకడు అతని తలను ఖండించి మరణయాతన నను భవిస్తున్న 'మిషీమా' కు 'సెప్పుకు' పద్ధతిలో విముక్తి కల్గించాడు.

ఎమ్.గు.రా.

**మిస్ట్రాల్, గాబ్రియేలా (1889-1957) :** ప్రముఖ లాటిన్ అమెరికన్ రచయిత్రి. 1889 ఏప్రిల్ 7 న చిలీ దేశంలోని విక్యునాలో జన్మించిన 'లూసిలా గొడాయ్ ఆల్కయాగా' 'మిస్ట్రాల్, గాబ్రియేలా' అనే కలం పేరుతో సాహితీ రంగంలో ఖ్యాతి గన్నది. ఈమె 1945 లో సాహిత్యానికి గాను నోబెల్ బహుమతిని పొందింది. స్పానిష్, బాస్క్, భారతీయ అనువంశికత గల ఈమె ఉత్తర చిలీలోని ఒక గ్రామంలో పెరిగి పెద్దదై, తన 15 ఏళ్ళ ప్రాయంలో ఉపాధ్యాయ వృత్తిని చేపట్టింది.

తరువాత కళాశాలలో ఉపన్యాసకురాలయింది. రచయిత్రి గాను, సాంస్కృతిక వ్యవహారాల మంత్రిణిగాను, విదేశీ రాయబారిగానూ మిస్ట్రాల్ పేరు గాంచింది. మాడ్రిడ్, లిస్బన్, జెనోవా, నీస్‌లలో ఈమె విదేశీ రాయబారిగా పనిచేసింది.

1914 లో ఈమె వ్రాసిన *సోనెటోస్ డీలా ముయెర్తె* (Sonnets of death) కు చిలీ దేశపు సాహిత్య బహుమతి లభించింది. ఈమెకు అభిమాన పాత్రులైన కవులు గాబ్రియేల్ డానం జియో, ఫ్రెడెరిక్ మిస్ట్రాల్‌ల పేర్లను కలిపి, తన కవితా సంకలనంలో ఆమె చేసిన సంతకాల వల్ల 'మిస్ట్రాల్ గాబ్రియేలా' గా ఆమె పేరు స్థిరపడిపోయింది. ఆమె తొలి రచనలలో *డెసోలేషన్* (Desolation, 1922) పేర్కొన దగినది. దీనిలోని *డోలర్* అనే పద్యంలో ప్రేమ వ్యవహార పర్యవసానంగా మిగిలిన తన ప్రియుని ఆత్మహత్యను వర్ణించింది. ఈ విషాద సంఘటన కారణంగా ఆమె జీవితంలో వివాహం మాట తలపెట్టకుండా బ్రహ్మచారిణిగా గడిపింది. అందుకే ఆమె రచనలలో మాతృత్వపు మార్దవం కోసం తపన కన్పిస్తుంటుంది. *టెర్న్యూరా* (1924, Tenderness) లోనూ, *టాల* (1938, Destrution) లోనూ మానవాళిపై విశ్వాసం, శిశువులపై మమకారం, అణగద్రొక్కబడిన వారిపై అభిమానం ముఖ్యమైన అంశాలుగా కన్పిస్తాయి. 1954 లో ఆమె *లాగార్* (1954, The wine press) అనే పద్య సంకలనాన్ని ప్రచురించింది.



విదేశీ రాయబారిగా 'మిస్ట్రాల్' విస్తృతంగా పర్యటించింది. నానాజాతి సమితి, ఐక్యరాజ్య సమితులలోని సాంఘిక, సాంస్కృతిక సంఘాలలో పనిచేసింది. ఆవేశ భరితమూ, శక్తిమంతమూ అయిన ఆమె కవిత్వం ఆమె ప్రత్యేక బాణీలోని పద బంధాలతో, అలంకారాలతో హృద్యంగా ఉంటుంది. అనేక ప్రపంచ భాషల్లోకి ఆమె కవిత్వం అనువదించబడింది. లాంగ్‌స్టన్ హుగ్స్ చేసిన అనువాదాలు 1957 లోనూ, డోరిస్ డానా చేసిన అనువాదాలు 1971 లోనూ వెలువడ్డాయి. మిస్ట్రాల్ గాబ్రియేలా న్యూయార్క్‌లోని హెంప్‌స్టెడ్ వద్ద 1957 జనవరి 10 న మరణించింది.

ఎమ్.గు.రా.

**మిస్ట్రాల్, ఫ్రెడెరిక్ (1830-1914) :** 1904 లో నోబెల్ సాహిత్య బహుమతిని స్పెయిన్‌కు చెందిన హోసే ఎచెగరాయ్ (Jose Echegaray) తో పాటు పంచుకొన్న ఫ్రెడెరిక్ మిస్ట్రాల్ ఫ్రాన్స్ దక్షిణ భాగంలో వాడుకలో ఉన్న ప్రొవెన్‌కాల్ భాష వికాసం కోసం పాటుపడిన వారిలో ఒకడు. ఫ్రాన్స్‌లో వారు మాట్లాడే ప్రొవెన్‌కాల్ భాషకే 'ఒక్' అని కూడా పేరు (దక్షిణ ఫ్రాన్స్‌లో నాగరకుల భాషగా వ్యాప్తి చెందిన 'ఒక్' భాషను ఇటాలియన్, స్పానిష్ కవులు కూడా వాడేవారు). ఒక సంపన్న కుటుంబంలో పుట్టిన మిస్ట్రాల్ 1851 లో న్యాయశాస్త్రంలో పట్టభద్రులయినా, ఆయన ఆ వృత్తిని చేపట్టక - ప్రొవెన్‌కాల్ జీవిత విధానాలనూ భాషనూ పునరుద్ధరించడమే తమ వ్యావృత్తిగా స్వీకరించాడు. తమ మిత్రులు కొందరితో కలిసి 1854 లో ఫెలిబ్రిజ్ అనే సంఘాన్ని స్థాపించి ప్రొవెన్‌కాల్ భాషనూ, సంప్రదాయాలనూ పరిరక్షించడానికి పూనుకున్నాడు. 20 ఏళ్లు శ్రమించి, 1878 లో 'ఒక్' భాష నిఘంటువును రెండు భాగాలలో ప్రచురించాడు. తమకు నోబెల్ బహుమతి ద్వారా లభించిన ధనంతో ఆయన ఆర్లీస్‌లో ప్రొవెన్‌కాల్ జాతీయ వస్తు సంగ్రహాలయం నెలకొల్పారు. ఆయన 'ఒక్' భాషకు దాని ప్రాచీన వైభవాన్ని సమకూర్చలేకపోయినా, ఆ భాషలో గొప్పకవిగా పేరు గడించాడు.



మిస్ట్రాల్ ఎన్నో కథాకావ్యాలు, గేయాలు, కథలు వ్రాశారు. 12 ఖండాలలో సాగిన *మిరియో, లొ పొవెమొ డవులోన్* మిస్ట్రాల్‌ను మహాకవిగా నిరూపించే కథా కావ్యాలు. మిస్ట్రాల్ తమ అనుభవాలూ, జ్ఞాపకాలూ *మవున్ ఎస్పెండో* పేరిట 1906 లో ప్రచురించాడు.

పి.ఎస్.జి.

**ముటనాబీ, అల్ - (915-965) :** ప్రముఖ అరబ్బీ కవి. ఇరాక్ లోని ఆల్ కుఫాలో 915 లో జన్మించిన 'ముటనాబీ' పూర్తి పేరు 'అబూ-అట్-టాయిబ్ అహ్మద్-ఇబిన్-హుస్సెయిన్-అల్ ముటనాబీ'. అరబ్బీ భాషలోని కవులందరిలోనూ గొప్ప వాడుగా ఇతడు పరిగణించ బడ్డాడు. 'ముటనాబీ' ముఖ్యంగా స్తుతి కావ్యాలు వ్రాశాడు. కుసుమ పేశలమైన శైలితో, ఊహల కందని ఉత్ప్రేక్షలతో నిండిన 'ముటనాబీ' కవిత్వం 19 వ శతాబ్దం వరకూ అరబ్బీ కవిత్వం మీద తన ప్రభావాన్ని చూపించింది. ఇతడు వ్రాసిన *డీవియన్* ఆంగ్లంలోనికి అనువదించబడింది.

'ముటనాబీ' దక్షిణ అరేబియాకు చెందిన ఒక జలవాహకుని కొడుకు. తాత తండ్రుల నుండి సంక్రమించిన పాండిత్యం విద్యాభ్యాసంతో మెరుగులు దిద్దుకొంది. 924 వ సంవత్సరంలో షియా మతస్థులు ఆల్‌కుఫాను ముట్టడించినప్పుడు 'ముటనాబీ' వారితో కలసి జీవిస్తూ వారి ధర్మ శాస్త్రాలను, అరబ్బీ భాషనూ నేర్చుకొన్నాడు. సిరియాలో 932 లో జరిగిన క్వార్మాషియన్ విప్లవానికి నాయకత్వం వహించాడు. ఆ విప్లవం అణచివేయబడి, 'ముటనాబీ' రెండేళ్ళు కారాగార వాసం అనుభవించాడు. విడుదలైన తరువాత సంచార కవిగా తన జీవితం ప్రారంభించాడు.

పూర్వ అరబ్బీ కవులు అబూ తమ్మాయ్ (845 లో మరణించాడు), ఆల్‌బుహ్తూరి (897 లో మరణించాడు) నడచిన దారిలో స్తుతి కావ్యాలు వ్రాయటం మొదలు పెట్టాడు. 948 వ సంవత్సరంలో ఉత్తర సిరియా రాకుమారుడైన 'సయిఫ్ అద్ దౌలా' అనే కవితో సంబంధం నెలకొల్పుకొన్నాడు. అక్కడి రాజాస్థానంలోని ప్రముఖులు - 'అల్ ఇస్ బహానీ' అనే సాహిత్య సంగీత రంగాల చరిత్రకారుడు, 'ఆల్ ఫరాబీ' అనే వేదాంతి, సంగీత శాస్త్రవేత్త, ఛందోబద్ధ కవిత్వం చెప్పగలిగిన 'ఇబాను బటాహ్' అనే పురోహితుడూ వీరందరితోనూ పరిచయాలు ఏర్పరచుకొన్నాడు. 'సయ్యఫ్ అద్ దౌలా' ఆశ్రయంలో ఉన్న 'ముటనాబీ' అతనిపై వ్రాసిన స్తుతి కావ్యం అరబ్బీ కవిత్వంలో ఆణిముత్యం వంటిదిగా కొనియాడబడ్డది. 'ముటనాబీ' జీవితపు తరువాతి దశలు అసూయా, మాత్సర్య మేఘాలచే ఆచ్ఛాదితమయాయి. చివరకు 'ముటనాబీ' సిరియా వదలి వెళ్ళాడు. ఈజిప్టు చేరి అక్కడ రాజప్రతినిధిగా ఉన్న నల్లజాతికి చెందిన నపుంసకుడైన బానిస 'అబూ-అల్-మిస్-కాఫూర్' ఆశ్రయం పొందాడు. కాని వ్యంగ్యాత్మకాలైన పద్యాలు వ్రాసి కాఫూర్‌ను నొప్పించి 960 లో ఈజిప్టును వదలి పారిపోయాడు. ఇరాన్‌లోని షిరాజ్ చేరి బూయిడ్ రాజ వంశానికి చెందిన 'అమీర్ అబుద్ అద్ దౌలా' రక్షణలో 965 వరకు నివసించాడు. 'ముటనాబీ' ఇరాక్ కు తిరిగివస్తున్న సమయంలో బాగ్దాద్ వద్ద అతనిని బందిపోట్లు చంపివేశారు.

'ముటనాబీ' కవిత్వం పఠితలను తీవ్రంగా ప్రభావితం చేయగల రీతిలో వ్రాయబడినప్పటికీ, కళాత్మకంగా నైపుణ్యంతో మలచిన అతని కవితా శిల్పం అతనికి పేరు ప్రతిష్ఠలు సమకూర్చింది. సాంప్రదాయికమైన 'క్వాసిడా' (గీతం) లను ఆ స్వేచ్ఛా పద్ధతిలో వ్రాసి అరబ్బీ కవిత్వంలో నవ్య సంప్రదాయ రీతిని ముటనాబీ నెలకొల్పాడు. *ఎమ్.గు.రా.*

**ముట్‌స్వైరో, సోలొమన్ ఎమ్. (1924--) :** ఆఫ్రికాలో బెజూరూ భాషలోని మొదటి నవలా రచయిత, ఆ భాషలోని అతి ముఖ్యమైన కవి.

ఈయన జాంబియాలో పెరిగి, దక్షిణాఫ్రికాలోని ఫోర్ట్ హేర్‌లో ఉన్న యూనివర్శిటీ కళాశాలలో విద్యనభ్యసించాడు. కొన్నాళ్లు ప్రభుత్వ పాఠశాలలో ఉపాధ్యాయుడుగా పనిచేసి 1955 లో వేరే బడిలో ప్రధానోపాధ్యాయుడయాడు. ఆఫ్రికా ఉపాధ్యాయుల సంఘానికి శాఖలు స్థాపించాడు; ఆఫ్రికా భాషల అభివృద్ధి సంఘాన్ని స్థాపించాడు. తరువాత రొడీసియా ప్రభుత్వ ప్రచురణ సంస్థను కూడా నెలకొల్పాడు. 1960 లో ఫుల్‌బ్రైట్ స్కాలర్‌షిప్‌తో అమెరికా వెళ్లాడు. అక్కడ అనేక విషయాలు అభ్యసించాడు. చాలా పట్టాలు పొందాడు. 1979 లో వాషింగ్టన్‌లో ఉన్న హోవర్డ్ విశ్వవిద్యాలయం నుండి డాక్టరేట్ డిగ్రీ పొందాడు. ఈ డిగ్రీ కొరకు ఆయన బెజూరూ భాషలోని సాంప్రదాయిక సాహిత్యం గురించి సిద్ధాంత వ్యాసం వ్రాశాడు. 1981 లో తన భార్యతో జింబాబ్వే తిరిగి వచ్చి అక్కడ ఉపాధ్యాయవృత్తిని చేపట్టాడు. అంతేకాక రచనా వ్యాసంగం ప్రారంభించాడు.

ఈయన మొదటి నవల *ఫెసో* (1957) త్వరగా ప్రజాదరణ పొంది విజయం సాధించింది. దీని ఇతివృత్తం బ్రిటిష్ వలసదారులూ, జింబాబ్వే వాసుల మధ్య ఘర్షణగా పరిగణించి, దీనిని జాతీయతను పురికొల్పే కేంద్రాలలో తప్పనిసరిగా చదివించేవారు.

ముట్‌స్వైరో 1978 లో ఆంగ్లంలో వ్రాసిన నవల, *మపాన్ డెరా: సోల్జర్ ఆఫ్ జింబాబ్వే*. సెసిల్ రోడ్స్ దక్షిణం నుండి, పోర్చుగీస్ వారు తూర్పునుంచి జింబాబ్వేలో ప్రవేశించడాన్ని మాపాన్ డేరా ప్రతిఘటించడం ఈ ఇతివృత్తం. *చమినూకా, జింబాబ్వే ప్రవక్త* అనే మరో

నవలను కూడ ఇతడు రచించాడు. ఈయన ఇతర రచనలలో 1959 లో ప్రచురించిన నవల *మురంబివా గొరెడేమా*, 1967 లో ప్రచురించిన పిల్లల పద్యాలు *అంబుయముడెరేరె* ఉన్నాయి. ఈయన బెజారూ కవుల రచనలతో కూడిన సంపుటాన్ని కూడా 1959 లో తయారు చేశాడు. ఇది 1962 లో పునర్ముద్రితమైంది.

ఇ.వా.

**మురసాకీ షికిబూ (978-1014) :** ప్రముఖ జపనీస్ కవయిత్రి. మురసాకి వ్రాసిన *గెంజీ మొనోగటరి* (గెంజి కథ) జపానీస్ సాహిత్యంలో ప్రముఖ రచనగా ప్రసిద్ధి గడించింది. 'గెంజికథ' ను ప్రపంచ సాహిత్యంలో తొలి సంపూర్ణ నవలగా పరిగణిస్తున్నారు. మురసాకి అసలు పేరేదో తెలియదు. 'గెంజికథ' లోని నాయిక మురసాకి పేరునే రచయిత్రికీ అన్వయించడం జరిగింది. ఆమె జీవితం గురించి తెలుసుకోవడానికి ఆమె 1007 నుంచి 1010 సంవత్సరాల మధ్య వ్రాసుకొన్న దినచర్య పుస్తకాలే ఆధారాలు. జోటో మోనిన్ మహారాణి కొలువులో పనిచేసిన మురసాకి తన దినచర్య పుస్తకాలలో అప్పటి ఆచార వ్యవహారాలను గురించి, సంప్రదాయాల గురించీ ఎన్నో వివరాలు సమకూర్చింది.

1001 లో మురసాకి భర్త 'ఫుజివారా నొబుటకా' మరణించాడు. ఆయన మరణానంతరం ఆమె 'గెంజికథ' వ్రాయడం మొదలు పెట్టి, 1005 లో రాజాస్థానంలో చేరేముందు ముగించి ఉండవచ్చు నని కొందరు విమర్శకుల అభిప్రాయం. కాని, 'గెంజికథ' విస్తృతినీ, దాని కల్పనలోని వైవిధ్యాన్నీ బట్టి చూస్తే ఆ రచన 1001 నుంచీ 1010 దాకా సాగి ఉండవచ్చు నని మరికొందరి అభిప్రాయం.

'గెంజికథ' ప్రధానంగా ఆ నవలా నాయకుడైన గెంజి యువరాజు ఎందరో స్త్రీలతో సాగించిన ప్రేమ కలాపాలను గురించింది. అయితే ఆ కాలం నాటి సంపన్న కుటుంబాల వారి జీవితాలకూ, కవిత్వం, సంగీతం, చిత్ర లేఖనం మొదలైన కళలలో వారి ప్రావీణ్యానికీ 'గెంజికథ' అద్దం పడుతూంది. కథా గమనంలో ఉత్సుకతను రేపే బలమైన సన్నివేశాలు లేకున్నా, ఆర్థర్ వేలీ *ది టేల్ ఆఫ్ గెంజి* (1935, గెంజి కథ) అనే ఆంగ్లానువాదానికి అంతర్జాతీయ ఖ్యాతి లభించింది. ఆ ఏడాదే మురసాకి దినచర్య ఆంగ్లానువాదం *డయరీస్ ఆఫ్ కోర్ట్ లేడీస్ ఆఫ్ ఓల్డ్ జపాన్* (1935) వెలువడి, ఆమెను గురించి చక్కని అవగాహన కలగడానికి కారణమైంది.

పి.ఎస్.జి.

**మూడీ, సుసానా స్ట్రిక్‌లాండ్ (1803-1885):** ఆంగ్ల రచయిత్రి. ఇంగ్లండ్‌లోని సఫోక్‌కు చెందిన 'బంగే' లో జన్మించిన సుసానా బ్రిటీష్ సైన్యాధి కారిని పెండ్లాడి, భర్తతోనూ తన సోదరి కేథరిన్ పారిస్ట్రిక్ లాండ్ ట్రైల్ తోనూ కలసి 1832 లో కెనడాలో నిర్మానుష్యంగా ఉన్న అరణ్య ప్రాంతాలలో నివసించడానికి వలస వెళ్లింది. అప్పటికి ఆ విధంగా వలస వెళ్లడం క్రొత్త. ఎగువ కెనడాలోని అరణ్యాలలో తాము ఎదుర్కొన్న ప్రతికూల పరిస్థితులనూ, తమకు కలిగిన వివిధ అనుభవాలనూ పుస్తకరూపంలో ఆమె ప్రచురించింది. సత్యదృష్టి, భావోద్వేగం, హాస్యధోరణి ఆమె రచనల ప్రత్యేకతలు. ఆమె వ్రాసిన *రఫింగ్ ఇట్ ఇన్ ది బుష్ (ఆర్) లైఫ్ ఇన్ కెనడా* ఆ తరువాత కెనడాకు వలస వెళ్లిన ఎందరికో మార్గదర్శి అయింది. కెనడాలోని దుర్భర జీవితం పట్ల మొదట విముఖత చూపించిన సుసానా కాలక్రమేణ ఆ దేశం పట్లా, దాని భవిష్యత్తు పట్లా ఎంతో శ్రద్ధ చూపించడం గమనించదగింది.

పి.ఎస్.జి.

**మూరె, జార్జ్ (1852-1933) :** ఐరిష్ నవలా రచయిత, పండితుడు. ఐర్లండ్‌లోని బాలీగ్లాస్‌లో జన్మించాడు. చిత్రకారుడు కావాలన్న కోరికతో తన 18 వ ఏట పారిస్ చేరుకొన్న జార్జ్ తనకు చిత్రలేఖనంలో కన్నా రచనలో ప్రావీణ్యం ఎక్కువని గుర్తించి 1882 లో లండన్ చేరుకొని, రచనా వ్యాసంగం ప్రారంభించాడు. ఆయన తొలి నవలలు *ఏ మాడర్న్ లవర్* (1883), *ఏ మమ్మర్స్ వైఫ్* (1885) ఫ్రెంచ్ ప్రకృతివాద (Naturalism) ధోరణిని ఆంగ్ల సాహిత్య ప్రియులకు పరిచయం చేశాయి. ఆ తరువాత జార్జ్ చేసిన రచనల మీద ఫ్లేబేర్, బాల్జాక్‌ల వాస్తవిక విధానాల ప్రభావం కనిపిస్తుంది. ఆయనకు పేరు తెచ్చిన నవల 1894 లో వెలువడిన *ఎస్తర్ వాటర్స్* (Esther Waters) ఆ నవల సాధించిన విజయంతో జార్జ్ మూరె అటువంటివే అయిన *ఈవ్‌లిన్ ఇన్స్* (1898), *సిస్టర్ తెరెసా* (1901) అనే నవలలు వ్రాశాడు.

1901 లో డబ్లిన్ చేరుకున్న జార్జ్ మూరె తన స్నేహితుడూ, ప్రముఖ కవీ అయిన విలియం బట్లర్ యీట్స్ ప్రారంభించిన ఐరిష్ సాహిత్య పునర్వికాసోద్యమంలో పాల్గొన్నాడు. డబ్లిన్‌లోని ఆబే థియేటర్ రూపకల్పనలో జార్జ్ ప్రధాన పాత్ర వహించాడు. 1903 లో *ది అన్‌టిల్‌డ్ ఫీల్డ్* అనే చక్కని కథల సంపుటి,

1905 లో *ది లేక్* అనే కవితాత్మక నవల వెలువరించాడు. ఐర్లండ్‌లో సంకుచితత్వం పెరిగి పోతున్నదన్న భావనతో జార్జి మూరే 1911 లో తిరిగి ఇంగ్లండ్ చేరుకొన్నాడు. ఇంగ్లండ్‌లో గడపిన రోజులను గురించి *హెయిల్ అండ్ ఫేర్‌వెల్* స్వాగతమూ, వీడ్కోలూ అనే శీర్షికతో మూడు భాగాల రచన చేశాడు. *ఏవ్* (స్వాగతం), *సాల్వ్* (ఉపశమనం), *వేల్* (వీడ్కోలు) అనే మూడు భాగాలూ 1911 నుంచి 1914 మధ్య వెలువడ్డాయి. వ్యంగ్యమూ హాస్యమూ ఆహ్లాదకరంగా మేళవించిన రచన *హెయిల్ అండ్ ఫేర్‌వెల్*.

మహాకావ్యాలను తలపింప జేసే రచనలు చేయాలన్న తపనతో జార్జ్ మూరే వ్రాసిన *ది బ్రూక్ కెరిత్* 1916 లోనూ, *హీలాయిస్ అండ్ ఆబెలార్డ్* 1921 లోనూ వెలువడ్డాయి. తన జీవితానుభవాలూ, ఐరిష్ కథలూ గాథలూ, వ్యంగ్యమూ కలగలిపి 1918 లో జార్జ్ మూరె *ఏ స్టోరీ టెల్లర్స్ హాలిడే* ప్రచురించాడు. 1924 లో *కాన్‌వెర్‌సేషన్స్ ఇన్ ఎంబురీ స్ట్రీట్* అనే పేరిట జార్జ్ మూరె తమ స్వీయచరిత్ర ప్రచురించాడు. ఆయన వ్రాసిన రెండు ప్రణయగాథలు కూడా పుస్తకరూపంలో వెలువడ్డాయి.

పి.ఎస్.జి.

**మెకాలే, జేమ్స్ ఫిలిప్ (1917-1976) :** ఆస్ట్రేలియాకు చెందిన ప్రముఖ కవి. సాంప్రదాయికతకు ప్రాముఖ్యం ఇచ్చి సాంకేతిక నైపుణ్యంతో కవిత్వ రచన చేసినవాడు. సిడ్నీ విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసం చేసిన మెకాలే అక్కడ కొన్నాళ్లు అధ్యాపకుడుగా పని చేశాడు. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ఆస్ట్రేలియా సైన్యంలో చేరి, ఆ తరువాత ఆస్ట్రేలియన్ స్కూల్ ఆఫ్ పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్‌లో ఉన్నతోపన్యాసకుడుగానూ, *క్వాడ్రంట్* (Quadrant) అనే సాహిత్య పత్రికా సంపాదకుడు గానూ, టాస్మానియా విశ్వవిద్యాలయంలో ఆంగ్లశాఖ ఆచార్యుడుగానూ పనిచేశాడు.

మెకాలే తొలి కవితా సంకలనం *అండర్ ఆల్డెబెరాన్* 1946 లో వెలువడింది. 1964 లో ఆయన ప్రచురించిన *క్యాప్టన్ క్వైరోస్* ఆస్ట్రేలియాలో క్రైస్తవ మత వ్యాప్తిని గురించి పద్యరూపంలో చిత్రించిన రచన. ఆయన పద్య రచనలలో తక్కినవి: 1956 లో వెలువడిన *ఏ విజన్ ఆఫ్ సెరిమనీ*, 1969 లో వెలువడిన *సర్‌ప్రైసెస్ ఆఫ్ ది సన్*, 1971 లో వెలువడిన *కలెక్టెడ్ పొయెమ్స్* (1936-70), 1976 లో వెలువడిన *మ్యూజిక్ లేట్ ఎట్ నైట్* (Music Late at Night), 1977 లో ప్రచురితమైన *ఏ వరల్డ్ ఆఫ్ ఇట్స్ ఓన్*.

మెకాలే గద్య రచనలలో 1959 లో ప్రచురితమైన *ది ఎండ్ ఆఫ్ మాడర్నిటీ*, 1975 లో వెలువడిన *ఏ మాప్ ఆఫ్ ఆస్ట్రేలియన్ వెర్స్* అనేవి ప్రముఖమైనవి. *ది ఎండ్ ఆఫ్ మాడర్నిటీ* లో మెకాలే ఆస్ట్రేలియాకు చెందిన ప్రాచీన కవి 'క్రిస్టోఫర్ బెన్నన్' సాహిత్యం గురించిన సమగ్ర పరిశీలన చేశాడు.

పి.ఎస్.జి.

**మెకాలే, టామస్ బాబింగ్‌టన్ (1800-1859):** ఇంగ్లండ్‌లో విగ్ పార్టీకి చెందిన రాజకీయ వేత్త, వ్యాసకర్త, కవి, చరిత్రకారుడు. 5 సంపుటాలలో వెలువడిన *హిస్టరీ ఆఫ్ ఇంగ్లండ్* ద్వారా ఆయనకు పేరు వచ్చింది.

మెకాలే తండ్రి 'జఖారీ మెకాలే' హెబ్రిడీస్ మత గురువుగా, సియెరా లెయోన్‌లో గవర్నర్‌గా పనిచేశాడు. తొమ్మిది మంది పిల్లలలో 'టామస్ మెకాలే' మొదటివాడు. ఎనిమిది సంవత్సరా లున్నప్పుడు ఒక చరిత్రపుస్తకం, ఒక కావ్యం వ్రాశాడు. 1818 లో కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయంలోని ట్రినిటీ కాలేజిలో చేరాడు. అక్కడ 1831 వరకు ఫెలోషిప్ పొందాడు. స్నేహశీలిగా, ప్రాసంగికుడుగా ప్రతిభావంతులైన యువకుల మధ్య పేరు గాంచాడు. 1825 లో ఆయన మొట్టమొదటి సారిగా వ్రాసిన మిల్టన్ పై వ్యాసం *ది ఎడింబర్గ్ రివ్యూ* లో ప్రచురించబడడంతో ఆయనకు ఖ్యాతి లభించింది. ప్రముఖులెందరో ఆయనకు అభిమాను లయారు.

న్యాయశాస్త్రం చదివి 1826 లో న్యాయవాది అయినా, ఆ వృత్తిని ఆయన ఎక్కువగా పట్టించుకోలేదు. తన తండ్రి వ్యాపారం దెబ్బతిన్నప్పుడు, తన కుటుంబ భారాన్నంతా స్వీకరించి, వారిని పోషించడానికి అనేక ఉద్యోగాలు చేశాడు. రచనా వ్యాసంగం, పాఠాలు చెప్పడం, చిన్న ప్రభుత్వ ఉద్యోగం ఇందులో కొన్ని రాజకీయ రంగంలో ప్రవేశించాలని నిశ్చయించుకొని, 1830 లో పార్లమెంటుకు ఎన్నుకోబడ్డాడు.

1832 లో వచ్చిన 'రిఫామ్' చట్టంపై జరిగిన వాదోపవాదాలలో ఈయన ప్రముఖపాత్ర వహించాడు. పార్లమెంటు సంస్కరణలకు మద్దతు ఇస్తూ ప్రసంగించాడు. గొప్ప వక్తలున్న కాలంలో అగ్రశ్రేణికి చెందిన వక్తగా గుర్తింపబడ్డాడు. తరువాత కార్యదర్శిగా పనిచేశాడు. ఈ ముఖ్య కార్యక్రమాల మధ్య వ్యవధి చూసుకొని *ది ఆర్మడా* అనే గేయకావ్యం, సాహిత్యానికి, చరిత్రకి సంబంధించిన 8 వ్యాసాలూ వ్రాశాడు.

1834 లో క్రొత్తగా ప్రారంభించిన సుప్రీమ్‌కౌన్సిల్ ఆఫ్ ఇండియాలో సభ్యత్వం స్వీకరించాడు. ఆ సమయంలో భారతదేశ పాలన ఈస్ట్ ఇండియా కంపెనీ నుంచి బ్రిటిష్ ప్రభుత్వానికి మారుతూంది. భారత దేశంలో ఒక జాతీయ విద్యా విధానానికి రూపకల్పన చేశాడు. శిక్షాస్మృతిని కూడా తయారు చేశాడు. ఆ రోజుల్లో ఆయన సోదరి 'మార్గరెట్' ఇంగ్లండులో చనిపోయింది. 1835 లో ఇంకొక సోదరి 'హానా' పెళ్లి చేసుకొని వేరే వెళ్లిపోయింది. ఇవి రెండూ ఆయనకు బాధ కలిగించిన సంఘటనలు.

1838 లో ఇంగ్లండు వెళ్లి, పార్లమెంటుకు ఎన్నికయాడు. 1839 లో యుద్ధమంత్రిగా నియమించబడి, 1841 వరకు కొనసాగాడు. తన రచనా వ్యాసంగాన్ని సాగిస్తూ, *లేజ్ ఆఫ్ ఏన్షెంట్ రోమ్స్*, కొన్ని వ్యాసాల సంపుటినీ వెలువరించాడు. క్రమేపీ రాజకీయాలలో ఆసక్తి తగ్గి, రచనమీదకు దృష్టి మళ్లింది. *హిస్టరీ ఆఫ్ ఇంగ్లండ్* అనే గ్రంథ రచనకు పూనుకొన్నాడు. దీనికోసం చారిత్రక సత్యాలను వెదకటానికి తరచు ఆ యా సంఘటనలు జరిగిన ప్రదేశాలకు స్వయంగా వెళ్ళాడు. 1849 లో మొదటి రెండు సంపుటాలు రాగానే వాటికి మునుపు ఎన్నడూ లేనంత ఆదరం లభించింది. 1852 లో తిరిగి పార్లమెంటుకు ఎన్నికయాడు. మంత్రి పదవిని తిరస్కరించాడు. కొంతకాలానికి గుండె జబ్బు రావడం వలన రాజకీయాలలో ముఖ్యపాత్ర వహించ లేకపోయాడు. 1855 లో తాను వ్రాసిన చరిత్ర మూడవ, నాల్గవ సంపుటాలు వెలువడి, వాటికి విశేష మైన ప్రచారం లభించింది. ఈ గ్రంథాన్ని అనేక యూరోపియన్ భాషలలోకి అనువదించారు.

1857 లో ఆయనకు 'లార్డ్' బిరుదు ఇచ్చారు. ఆరోగ్యం క్షీణించింది; ఆయన హౌస్ ఆఫ్ లార్డ్స్‌లో ఎప్పుడూ ప్రసంగం చేయలేదు. ఆయన వ్రాస్తున్న చరిత్ర అసంపూర్ణంగా ఉండిపోయింది. కాని, ఆయన సోదరి హానా సంపాదకత్వంలో 5 వ సంపుటం వెలువడింది.

'మెకాలే' మేధాసంపత్తితో ఆయన కోరుకుంటే రాజకీయ రంగంలో అత్యున్నత స్థానాన్ని పొందగలిగేవాడు. కాని ఇంగ్లండు దేశపు చరిత్రని వర్ణించడానికే తన మేధాసంపత్తిని వినియోగించాలని ఆయన నిశ్చయించుకొన్నాడు. ఆయనకు అసాధారణమైన ధారణశక్తి ఉంది. వివిధ యూరపియన్ సాహిత్యాలు ఆయనకు బాగా పరిచయం. ఆయన ఆఖరి దశలో మతం మీద ఎక్కువ నమ్మకం చూపించలేదు. మతపరమైన, తాత్త్వికమైన చింతన ఆయనకు గిట్టదు. శాస్త్ర పరిజ్ఞానంలో, శాస్త్రజ్ఞులు కనుగొనే క్రొత్త విషయాలు కూడా ఆయన పట్టించుకోలేదు. కళంటే తన కేమీ తెలియదని చెప్పాడు. సంగీతం అసలే పనికిరాదు. ఆటలలో, క్రీడలలో, వ్యాయామంలో ఆయనకి ఎంతమాత్రం నేర్పు లేదు. చూడడానికి పొట్టిగా, బొద్దుగా ఉండేవాడు. కాని ఆయన మేధ, కల్ల కపటాలు ఎరుగని ఆయన స్వభావం అందరిని ఆయన పట్ల ఆకర్షించాయి.

'మెకాలే' వివాహం చేసుకోలేదు. ఆయన చెల్లెళ్లు ఆయన అభిమానాన్ని పంచుకొన్నారు. ముఖ్యంగా 'హానా' అనే చెల్లెలు, తన పెళ్ళైనా, ఆయనతో రోజూ ముచ్చటించేది. ఆమె పిల్లల్ని తన స్వంత పిల్లలుగా ఆయన చూసుకునేవాడు. ఆయన ఉదారస్వభావం కలవాడు. తన దగ్గర ధనం ఉన్నపుడు ధారాళంగా దానధర్మాలు చేసేవాడు.

ఆయన వ్రాసిన ఇంగ్లండు చరిత్ర వలన ఆయనకు బ్రిటిష్ చరిత్రకారులలో శాశ్వతస్థానం లభించింది. కాని ఆయన, ఆయన సమకాలీనుడు 'హెన్రీ హల్లం' వ్రాసిన చరిత్రకు విగ్ దృక్పథాన్ని అనుసరించి వ్రాసినదని పేరు పడింది. మెకాలే 1688 మొదలు 1820 (అంటే మూడవ జార్జ్ రాజు మరణం) వరకు బ్రిటిష్ చరిత్ర వ్రాయాలనుకొన్నాడు. కాని ఈ లోగానే ఆయన చనిపోయాడు.

మెకాలే తన గద్యశైలి ద్వారా ఒక క్రొత్త బాణీని ప్రవేశపెట్టాడు. దీనిని 50 సంవత్సరాలపాటు పత్రికా రచనలలో ముఖ్యమైన చర్చనీయాంశాలకు వాడారు.

ఇ.నా.

**మెటాస్టాసియో, పీయెట్రో (1698-1782) :** ఇటాలియన్ కవి. అసలు పేరు 'పీటో అర్మ్యానిడో డొమినికో ట్రపాసీ'. 18 వ శతాబ్దంలో యూరప్‌లో సంగీత రూపకాల రచనలో ప్రఖ్యాతి గాంచినవాడు. 1708 లో ఆయన ప్రతిభను గుర్తించిన గియాన్ విన్ సెంజో గ్రవీనా అనే సాహితీవేత్త ఆయనను చేరదీసి ఆయనకు గ్రీక్



పేరు పెట్టాడు. 1712 లో కాల్‌బ్రియాలోని స్కలియాలో ఉన్న తత్త్వవేత్త 'గ్రిగోరియో కెలో గ్రెపెస్' వద్ద కొన్ని నెలలు ఆయన శిష్యరికం చేశాడు. తన 14 వ ఏట సెనెకా బాణీలో *గియ్యుస్టినో* అనే విషాదాంత నాటకం వ్రాశాడు. 1718 లో ఎకాడమియా డెల్ ఆర్కేడియాలో ప్రవేశించాడు. 1719 లో నేపుల్స్ నగరంలోని న్యాయ శాస్త్ర కార్యాలయంలో ఉద్యోగం సంపాదించాడు. తాను రచించిన శృంగార కవితల ద్వారా ధనిక వర్గాలతో పరిచయం సంపాదించాడు.

ఆస్ట్రియా రాణి జన్మదిన సందర్భంగా *గ్లి ఓర్తి ఎస్పెరిడీ* అనే గేయం 1721 లో వ్రాశాడు. ఈ గేయాన్ని అభినయించి నర్తకి 'లా రోమనీనా' ఈ కవిపై మోజు పడింది. ఆమె ద్వారా 'మెటాస్టాసియో' అనే మరొక ప్రసిద్ధి కెక్కిన గాయకునితో స్నేహం చేశాడు. ఈ గాయకుని పేరు 'కార్లో ఫారినెల్లి'. అప్పుడే 'నికొలా పార్పొరా' అనే వాగ్గేయ కారునితో పరిచయం ఏర్పడింది. ఆయన దగ్గర 'మెటాస్టాసియో' సంగీతం నేర్చుకొన్నాడు. అదే సందర్భంలో డొమినికో సర్రో, 'లియొనార్డో విన్సి' అనే వాగ్గేయ కారులు కూడా ఈయనకు పరిచయ మయారు. వీరిద్దరూ తరువాత 'మెటాస్టాసియో' రచనలకు సంగీత రూపకల్పన చేశారు.

ఈ వాతావరణంలో 'మెటాస్టాసియో' విజయానికి అనుమానం లేదు. తనతో ఉన్న 'లా రోమనీనా' ప్రోత్సాహం వలన న్యాయశాస్త్రం వదలి తన మొదటి 'మెలోడ్రామా' ను రచించాడు. దీని పేరు *డిడోనే అబ్బాండొనాటా* (1723) దీనిలో ప్రేమకూ విధి నిర్వహణకూ మధ్య జరిగే సంఘర్షణను మూడు అంకాలలో గేయ రీతిలో విషాదాంత నాటకంగా పొందుపరచాడు. తరువాత ఇంకో నాలుగు గేయాలు వెలువడ్డాయి. 1729 లో తన స్నేహితురాలైన 'మరియానా పిగ్నటెల్లి' సిఫార్సు వల్ల ఆస్ట్రియా చక్రవర్తి నుంచి ఆహ్వానం వచ్చింది. మార్చి 1730 లో వియెన్నా వెళ్ళి తన జీవితాన్నంతా అక్కడే గడపాడు. అక్కడే ఆస్థానకవి అయాడు. ఆరవ ఛార్లెస్ కాలంలో 'మెటాస్టాసియో' *కంటటాస్, ఆరెటొరియోస్, 11 మెలోడ్రామాలు* అనే వివిధములైన సంగీతరచనలు చేశాడు. వీటిలో ముఖ్యమైనవి *డెమిట్రియో, ఒలింపియాడ్, డెమొఫూంట్*. వీటికి ప్రసిద్ధి కెక్కిన వాగ్గేయకారులు-మొజార్ట్‌తో సహా సంగీతం సమకూర్చారు. 1740 తరువాత మరియా తెరెసా రాజ్యానికి వచ్చాక 'మెటాస్టాసియో' స్థితి అంతబాగాలేదు. 1771 వరకూ ఆయన రచనలు చేస్తూనే ఉన్నాడు. ఆ రచనలకు విశేషమైన ఆదరం లభించేది. 'మరియా తెరెసా' తన ముందు చక్రవర్తి వలె ఈ సంగీత రూపకాల మీద విశేషంగా ధనం వెచ్చించడానికి ఒప్పుకోలేదు. అందువలన 'మెటాస్టాసియో' ప్రతిభ క్షీణించసాగింది.

ఆర్కేడియా సంప్రదాయంలో చేసిన *ఎపిస్టోలారియో, లాలైబీరియా, లాపార్టెంజా* లు ఖ్యాతి గాంచినవి. ఆయన విమర్శన గ్రంథాలు కూడా వ్రాశాడు. ఆయన రచనలను అనేక యూరొపియన్ భాషలలోకి అనువదించారు. పలుసార్లు ముద్రించారు.

ఇ.నా.

**మెనాండర్ (క్రీ.పూ. సుమారు 342 - క్రీ.పూ. సుమారు 292) :** ఏథెన్సుకు చెందిన గ్రీక్ నాటక రచయిత. ప్రాచీన విమర్శకుల దృష్టిలో ఈయన గ్రీక్‌లో నవీన సుఖాంత నాటకాలలో అందరిని మించిన కవి. తన జీవిత కాలంలో ఆయన సాధించిన విజయం పరిమితమైంది. 100 నాటకాలకు పైగా వ్రాసినా ఏథెన్సులో జరిగిన నాటక ఉత్సవాలలో కేవలం 8 మాత్రం విజయం సాధించాయి.

ఆయన రచనలు ప్రారంభించే కాలానికి, సుఖాంత నాటకాల ఇతివృత్తం మారింది. అంతకు పూర్వం ప్రజా సమస్యలను గురించి ఎక్కువగా చర్చ ఉండేది. తరువాత సాధారణ జీవితంలో ఉండే ఊహాజనితమైన పాత్రలపై దృష్టి కేంద్రీకరించారు. బృందగానం పరిమిత మైంది. పాత్రధారులు ముసుగులు (masks) వాడినా వాటి ఉపయోగాన్ని విస్తృతపరిచి ఇంకా ఎక్కువ పరిధిలోని పాత్రలను స్ఫురింపచేసేవిగా ప్రయోగించారు. నాటకాలకు సంబంధించి వివరాలు తెలిపే కరపత్రాలు లేని కాలంలో పాత్రలను వారి ముసుగుల ద్వారా ప్రేక్షకులు గుర్తించేవారు. నాటకాలను 'మెనాండర్' సరళమైన అటిక్ భాషలో వ్రాశాడు. అది ఆయన కాలంలో గ్రీకు ప్రపంచంలో వాడుక భాష. కరుకైన తండ్రులు, యౌవనంలో ఉన్న ప్రేమికులు, కుట్రలు పన్నే బానిసలు మొదలైన పాత్రలను సృష్టించడంలో 'మెనాండర్' ప్రజ్ఞాశాలి. *డిస్కోలస్* అనే నాటకంలో 'నెమోన్' అనే మానవ ద్వేషి పాత్రను ఎంతో నేర్పుతో సృష్టించాడు. *పెరికెయిరొమీన్* అనే నాటకంలో ప్రగల్భాలు పలికే సైనికుని పాత్రను సానుభూతితో ఆయన సృష్టించాడు. దీనిలోనూ, *సెకండ్ ఎడాల్ఫ్* అనే నాటకంలోనూ పాత్రలను నేర్పుతో చిత్రించడం వలన ఇవి ఆయన రచనలలో అత్యంత ప్రశస్తమైనవి.

ఈయన రచనలను, రోమన్ రచయితలైన 'ప్లాటస్',

'టెరెన్స్' అనుకరించారు. వీరి ప్రభావం పునరు జ్జీవన ఉద్యమకాలంలో యూరప్‌లోని సుఖాంత నాటక రచనమీద ఎక్కువగా కనిపిస్తుంది.

మెనాండర్ జీవితం గురించి తెలిసిన విశేషాలు చాలా తక్కువ. ఆయన భాగ్యవంతుల కుటుంబానికి చెందిన వాడని, తత్త్వవేత్త అని థియో ఫ్రాస్టస్ శిష్యుడని చెబుతారు. (థియో ఫ్రాస్టస్ అనే ఆయన అరిస్టాటిల్ అనుచరుడు). 321 లో 'మెనాండర్' తన మొదటి నాటకాన్ని తయారు చేశాడు. దాని పేరు *ఓర్గ్* (కోపం) 316 లో *డిస్కోలస్* అనే నాటకానికి మెనాండర్ బహుమతి పొందాడు. 301 నాటికి సుమారు 70 నాటకాలు వ్రాశాడు. ఆయన తన జీవితంలో ఎక్కువ కాలం ఏథెన్స్‌లోనే గడిపాడు. మాసిడోనియా, ఈజిప్టు దేశాలనుండి వచ్చిన ఆహ్వానాలను ఆయన తిరస్కరించా డంటారు. మెనాండర్ ఏథెన్స్ నౌకాశ్రయంలో ఈదుతూ మునిగిపోయాడని వదంతి.

ఇ.నా.

**మెనెండెజ్ పిడాల్, రామోన్ (1869-1968):** ప్రసిద్ధ శ్పానిష్ విద్వాంసుడు. శ్పానిష్ భాషా ప్రాదు ర్భావం గురించి ఆయన గొప్ప కృషి చేశాడు. పెక్కు శ్పానిష్ కృతులను ఆయన సవిమర్శకంగా ప్రచురించాడు. ఆ వివిధ రచనలు మధ్యకాలపు శ్పానిష్ కవితల, లేఖనాల అధ్యయనానికి పలువురిని ప్రోత్సహించాయి. కాగా, మధ్యకాలపు శ్పానిష్ సాహిత్యం పునరుజ్జీవనానికి ఆయన కారణభూతు డయాడు.

మాడ్రిడ్ విశ్వవిద్యాలయంలో ఆయన 40 యేళ్ల పాటు (1899-1939) రొమాన్సు భాషా శాస్త్రాచార్యు డుగా పనిచేశాడు. రోమనుల భాష అయిన లాటిన నుంచి పుట్టిన భాషలు కావడం వల్ల వాటికి ఆ పేరు వచ్చింది. ఫ్రెంచి, శ్పానిష్, ఇటాలియన్, రుమేనియన్ మొదలైనవి రొమాన్సు భాషలుగా వ్యవహరిస్తున్నారు. ఆ రోజుల్లోనే ఆయన చారిత్రకాధ్యయన కేంద్రా నికి నిర్దేశకులుగా కూడా పనిచేశాడు. ఆయన రచించిన గ్రంథాలలో *శ్పానిష్ భాషా చారిత్రక వ్యాకరణం* బహు ప్రసిద్ధ మయింది. 1914 లో ఆయన *శ్పానిష్‌భాషా శాస్త్ర పత్రిక* ఒకటి స్థాపించాడు. ఆయనే దానికి సంపాదకులు. ఆయన రెండు సార్లు శ్పానిష్ అకాడమీకి అధ్యక్షులుగా వ్యవహరించాడు.

మెనెండెజ్ ప్రతిభా వ్యుత్పత్తులు ఒక్క భాషాశాస్త్రా నికే పరిమితం కాలేదు. జానపద విజ్ఞానం గురించి కూడా ఆయన పరిశోధనలు నిర్వహించాడు. తత్ఫలితంగా సాహిత్య చరిత్రకూ, జానపద విజ్ఞానానికీ సంబంధించిన రచనలు కొన్ని వెలయించాడు. ఆ వివిధ రచనలలోనూ శ్పానిష్ సంస్కృతికి గల మూల బీజాల ప్రాశస్త్యాన్ని ఆయన తెలియచేశాడు. ఆయన రచనలలో స్పెయిన్ దేశచరిత్ర తలమానికంగా భావించబడుతున్నది. ఆయన దాన్ని 1930 లో ప్రారంభించాడు. ఆయన మరణించే నాటికి కూడా అది పూర్తికాలేదు. అయినా ఆ చరిత్ర గ్రంథానికి ఆయన వ్రాసిన ఉపోద్ఘాతం అమూల్య మనీ, అది సామాన్య పాఠకుడికి బహుధా ఉపకరిస్తుందనీ విజ్ఞులు భావిస్తున్నారు.

ప్రముఖ భాషా శాస్త్రవేత్తగా, సాహితీ పరుడుగా విశేష విఖ్యాతి ఆర్జించిన మెనెండెజ్ పిడాల్ 1869, మార్చి 13 న జన్మించాడు. 1868, నవంబరు 14 న మాడ్రిడ్‌లో కన్నుమూశాడు.

పి.ఆర్. శర్మ.

**మెనెండెజ్ యి పెలయో, మార్సిలినో (1856-1912) :** విఖ్యాత శ్పానిష్ భాషా పండితుడు, సాహిత్య విమర్శకుడు, చారిత్రకుడు. 1856 నవంబరు 3 న మెనెం డెజ్ జన్మించాడు. ఆయన విద్వత్తు అపార మయింది. వచన రచనలో అందెవేసిన చెయ్యి. పాశ్చాత్య వాఙ్మయ వికాసానికి శ్పానిష్ సాహిత్యం తోడ్పడిన తీరు తెన్నులను అవగాహన చేసుకోవడానికి ఆయన రచనావళి ఎంతైనా ఉపకరిస్తుంది. శ్పానిష్ సాహిత్యంలోని మధ్యకాలం, పున రుజ్జీవనకాలం, స్వర్ణయుగం మొదలైన కాలాల సాహిత్యం గురించి ఆయన చేసిన కృషి చిరస్మరణీయం. అయినా ఆయన ప్రకటించిన కొన్ని అభిప్రాయాలు నేడు ఆదర ణీయాలు కావు.

మెనెండెజ్-యి-పెలయో మాడ్రిడ్ విశ్వవిద్యాల యంలో 20 యేళ్ల పాటు (1878-1898) శ్పానిష్ సాహిత్యాచార్య పదవిని ప్రతిభావంతంగా నిర్వహించాడు. బిబ్లియోటికా నేషనల్‌కి ఆయన నిర్దేశకులుగా కూడా పనిచేశాడు. ఆయన సొంత గ్రంథాలయంలో 45,000 పుస్తకా లుండేవి. ఆ బృహద్గ్రంథాలయాన్ని తన జన్మస్థలమైన శాన్టన్డర్‌లోని గ్రంథసూచి సంస్థకు విరాళంగా ఇచ్చివేశాడు. ఆయన రచనలు ఎడిసియన్ నేషనల్ డి లాస్ ఒబ్రాస్ కంప్లెటాస్ డి మెనెండెజ్ యి పెలయోలో 43 సంపుటాలలో దొరుకుతున్నాయి. ఆయన 1912 మే 19 న కాలధర్మం చెందాడు.

పి.ఆర్.శర్మ.

**మెయర్, కాన్‌రాద్ ఫెర్డినాండ్ (1825-98) :** ప్రముఖ స్విస్ రచయితగా పేరు ప్రఖ్యాతులు గడించిన

'టెరెన్స్' అనుకరించారు. వీరి ప్రభావం పునరు జ్జీవన ఉద్యమకాలంలో యూరప్‌లోని సుఖాంత నాటక రచనమీద ఎక్కువగా కనిపిస్తుంది.

మెనాండర్ జీవితం గురించి తెలిసిన విశేషాలు చాలా తక్కువ. ఆయన భాగ్యవంతుల కుటుంబానికి చెందిన వాడని, తత్త్వవేత్త అని థియో ఫ్రాస్టస్ శిష్యుడని చెబుతారు. (థియో ఫ్రాస్టస్ అనే ఆయన అరిస్టాటిల్ అనుచరుడు). 321 లో 'మెనాండర్' తన మొదటి నాటకాన్ని తయారు చేశాడు. దాని పేరు *ఓర్గ్* (కోపం) 316 లో *డిస్కోలస్* అనే నాటకానికి మెనాండర్ బహుమతి పొందాడు. 301 నాటికి సుమారు 70 నాటకాలు వ్రాశాడు. ఆయన తన జీవితంలో ఎక్కువ కాలం ఏథెన్స్‌లోనే గడిపాడు. మాసిడోనియా, ఈజిప్టు దేశాలనుండి వచ్చిన ఆహ్వానాలను ఆయన తిరస్కరించా డంటారు. మెనాండర్ ఏథెన్స్ నౌకాశ్రయంలో ఈదుతూ మునిగిపోయాడని వదంతి.

ఇ.నా.

**మెనెండెజ్ పిడాల్, రామోన్ (1869-1968):** ప్రసిద్ధ స్పానిష్ విద్వాంసుడు. స్పానిష్ భాషా ప్రాదు ర్భావం గురించి ఆయన గొప్ప కృషి చేశాడు. పెక్కు స్పానిష్ కృతులను ఆయన సవిమర్శకంగా ప్రచురించాడు. ఆ వివిధ రచనలు మధ్యకాలపు స్పానిష్ కవితల, లేఖనాల అధ్యయనానికి పలువురిని ప్రోత్సహించాయి. కాగా, మధ్యకాలపు స్పానిష్ సాహిత్యం పునరుజ్జీవనానికి ఆయన కారణభూతు డయాడు.

మాడ్రిడ్ విశ్వవిద్యాలయంలో ఆయన 40 యేళ్ల పాటు (1899-1939) రోమాన్సు భాషా శాస్త్రాచార్యు డుగా పనిచేశాడు. రోమనుల భాష అయిన లాటిన్ నుంచి పుట్టిన భాషలు కావడం వల్ల వాటికి ఆ పేరు వచ్చింది. ఫ్రెంచి, స్పానిష్, ఇటాలియన్, రుమేనియన్ మొదలైనవి రొమాన్సు భాషలుగా వ్యవహరిస్తున్నారు. ఆ రోజుల్లోనే ఆయన చారిత్రకాధ్యయన కేంద్రా నికి నిర్దేశకులుగా కూడా పనిచేశాడు. ఆయన రచించిన గ్రంథాలలో *స్పానిష్ భాషా చారిత్రక వ్యాకరణం* బహు ప్రసిద్ధ మయింది. 1914 లో ఆయన *స్పానిష్‌భాషా శాస్త్ర పత్రిక* ఒకటి స్థాపించాడు. ఆయనే దానికి సంపాదకులు. ఆయన రెండు సార్లు స్పానిష్ అకాడమీకి అధ్యక్షులుగా వ్యవహరించాడు.

మెనెండెజ్ ప్రతిభా వ్యుత్పత్తులు ఒక్క భాషాశాస్త్రా నికే పరిమితం కాలేదు. జానపద విజ్ఞానం గురించి కూడా ఆయన పరిశోధనలు నిర్వహించాడు. తత్ఫలితంగా సాహిత్య చరిత్రకూ, జానపద విజ్ఞానానికీ సంబంధించిన రచనలు కొన్ని వెలయించాడు. ఆ వివిధ రచనలలోనూ స్పానిష్ సంస్కృతికి గల మూల బీజాల ప్రాశస్త్యాన్ని ఆయన తెలియచేశాడు. ఆయన రచనలలో స్పెయిన్ దేశచరిత్ర తలమానికంగా భావించబడుతున్నది. ఆయన దాన్ని 1930 లో ప్రారంభించాడు. ఆయన మరణించే నాటికి కూడా అది పూర్తికాలేదు. అయినా ఆ చరిత్ర గ్రంథానికి ఆయన వ్రాసిన ఉపోద్ఘాతం అమూల్య మనీ, అది సామాన్య పాఠకుడికి బహుధా ఉపకరిస్తుందనీ విజ్ఞులు భావిస్తున్నారు.

ప్రముఖ భాషా శాస్త్రవేత్తగా, సాహితీ పరుడుగా విశేష విఖ్యాతి ఆర్జించిన మెనెండెజ్ పిడాల్ 1869, మార్చి 13 న జన్మించాడు. 1868, నవంబరు 14 న మాడ్రిడ్‌లో కన్నుమూశాడు.

పి.ఆర్. శర్మ.

**మెనెండెజ్ యి పెలయో, మార్సిలినో (1856-1912) :** విఖ్యాత స్పానిష్ భాషా పండితుడు, సాహిత్య విమర్శకుడు, చారిత్రకుడు. 1856 నవంబరు 3 న మెనెం డెజ్ జన్మించాడు. ఆయన విద్వత్తు అపార మయింది. వచన రచనలో అందెవేసిన చెయ్యి. పాశ్చాత్య వాఙ్మయ వికాసానికి స్పానిష్ సాహిత్యం తోడ్పడిన తీరు తెన్నులను అవగాహన చేసుకోవడానికి ఆయన రచనావళి ఎంతైనా ఉపకరిస్తుంది. స్పానిష్ సాహిత్యంలోని మధ్యకాలం, పున రుజ్జీవనకాలం, స్వర్ణయుగం మొదలైన కాలాల సాహిత్యం గురించి ఆయన చేసిన కృషి చిరస్మరణీయం. అయినా ఆయన ప్రకటించిన కొన్ని అభిప్రాయాలు నేడు ఆదర ణీయాలు కావు.

మెనెండెజ్-యి-పెలయో మాడ్రిడ్ విశ్వవిద్యాల యంలో 20 యేళ్ల పాటు (1878-1898) స్పానిష్ సాహిత్యాచార్య పదవిని ప్రతిభావంతంగా నిర్వహించాడు. బిబ్లియోటికా నేషనల్‌కి ఆయన నిర్దేశకులుగా కూడా పనిచేశాడు. ఆయన సొంత గ్రంథాలయంలో 45,000 పుస్తకా లుండేవి. ఆ బృహద్గ్రంథాలయాన్ని తన జన్మస్థలమైన శాన్టన్డర్‌లోని గ్రంథసూచి సంస్థకు విరాళంగా ఇచ్చివేశాడు. ఆయన రచనలు ఎడిసియన్ నేషనల్ డి లాస్ ఒబ్రాస్ కంప్లెటాస్ డి మెనెండెజ్ యి పెలయోలో 43 సంపుటాలలో దొరుకుతున్నాయి. ఆయన 1912 మే 19 న కాలధర్మం చెందాడు.

పి.ఆర్.శర్మ.

**మెయర్, కాన్‌రాడ్ ఫెర్డినాండ్ (1825-98) :** ప్రముఖ స్విస్ రచయితగా పేరు ప్రఖ్యాతులు గడించిన

*ది ఎక్జిక్యూషనర్స్ సాంగ్* (1979) అనే నవల గారీ గిల్మోర్ అనే నేరస్థుని జీవితానికి సంబంధించినది. *టఫ్ గైస్ డోన్ట్ డాన్స్* (1984) అనేది ఒక సస్పెన్స్ నవల, భయానక రచన.

శ్రీవిరించి

**మెరిడిత్, జార్జ్ (1828-1909) :** ఇంగ్లీషు కవి, నవలా రచయిత. సున్నితమయిన హాస్యం, సంభాషణా చాతురి, సూత్రప్రాయమయిన భాష ఈయన రచనలలో వ్యక్త మవుతాయి. పాత్రల మనో విశ్లేషణకు, ముందు తరాలకు ఆదర్శప్రాయమయిన విలువలకు, స్త్రీ, పురుషుల నడుమ వ్యక్తిత్వపు వ్యత్యాసాలు లేవని ప్రకటించటానికి ఈయన నవలలు ప్రసిద్ధి పొందాయి. *ది ఆర్డియల్ ఆఫ్ రిచర్డ్ ఫెవెరల్* (1859), *ది ఇగోయిస్ట్* (1979) ఈయన ప్రముఖ రచనలు.



ఈయన సామాన్యమైన దర్జీ కుటుంబంలో పుట్టాడు. 5 వ ఏట తల్లి మరణించింది. తండ్రి మళ్లీ పెళ్లి చేసుకొన్నాడు. దర్జీ దుకాణం దివాళా తీసింది. సాంఘిక వాతావరణం, అందులో తన దుస్థితి అతన్ని క్రుంగదీశాయి. బంధువుల సహాయంతో, రైన్ నదీ తీరంలోని 'న్యూవీడ్' స్కూలులో ప్రవేశించాడు. అక్కడి సుకుమార ప్రకృతి అతనిని జీవితాంతం ప్రభావితం చేసింది.

1844 లో ఇంగ్లండ్‌కు తిరిగి వచ్చి న్యాయవాద వృత్తి చేపట్టాడు. త్వరలోనే దాన్ని వదలి వేశాడు. రచయిత, రాజకీయ చతురుడు అయిన 'బెంజమన్ డిజ్‌రేలీ', నవలారచయిత, 'విలియమ్ టాకరే' ఇతనికి ఆదర్శప్రాయులు.

మెరిడిస్ చుట్టూ యువ రచయితలు, కవులు పోగయేవారు. కవిత్వం, వ్యాసాలు వ్రాయడంతో పాటు అనువాద కార్యక్రమాలు కూడా ఇతడు చేపట్టాడు. దాని వల్ల ధనార్జన ఎక్కువగా సమకూరకపోయినా, 1851 లో కవితా సంకలనం ప్రచురించగలిగాడు. ఈ రచన ప్రముఖులు 'విలియమ్ మైకేల్ రోసెట్టి', 'ఛార్లెస్ కింగ్స్‌లీ' ల మెప్పు పొందింది. 'ఆల్ ఫ్రెడ్ టెన్నిసన్' ఇందులోని కవితా ఖండిక *లవ్ ఇన్ వాలీ* (Love in Valley) తానే వ్రాసి ఉండవలసిందని అసూయా గ్రస్తమైన ప్రశంసా వాక్యం పలికాడు. అయినా ధనాభావం వల్ల 'మెరిడిత్' తన స్నేహితుడు 'పీకాక్' పైన ఆధారపడవలసి వచ్చింది. 1855 లో *ది షేవింగ్ ఆఫ్ షాగ్‌పాట్* అనే ప్రహసనం వ్రాశాడు. *అరేబియన్ నైట్స్* కు ఇది ఉదారమైన అనుకరణ. దారిద్ర్యం వల్ల భార్యా భర్తల మధ్య అనురాగం దృఢపడలేదు. 1861 లో అతని భార్య ఎనిమిదేళ్ల కుమారుణ్ణి ఇతనికి వదలి, పరలోక యాత్ర చేసింది.

1859 లో ప్రచురించిన నవలవల్ల అతనికి ఖ్యాతి వస్తుందని ఆశించాడు. కాని, అనుకున్నంత సంతోషం కలుగలేదు. అసూయాగ్రస్తులు దాన్ని గ్రంథాలయాల చేత బహిష్కరింపచేశారు. బ్రతుకు తెరువు కోసం 'మెరెడిత్' ఓ ప్రచురణ కర్త దగ్గర చిన్న ఉద్యోగిగా చేరాడు. స్థానిక పత్రికలో అడపా దడపా సంపాదక వ్యాసాలు వ్రాయవలసి వచ్చింది. తన సొంత రచనలను విరామ సమయంలోనే వ్రాయవలసి వచ్చింది .

తరువాతి రచన *ఇవాన్ హారింగ్‌టన్* (1860) ఇది దాదాపు ఆత్మకథ. దీని వల్ల కూడా ఎక్కువ డబ్బు రాలేదు. ఆపైన కవిత్వ రచనలు చేశాడు. ఇవి ఈ రోజుకూ చక్కని మచ్చుతునకలుగా విమర్శకులు భావిస్తున్నారు.

యూరప్ పర్యటన చేసి వచ్చిన పిదప మళ్లీ వచన రచన సాగించాడు. 1864 లో ప్రచురించిన నవల *మీలియా ఇన్ ఇంగ్లండ్* అనేది ఒక పల్లెటూరి పిల్ల సాంఘిక వ్యవస్థలో పైకి రావటానికి చేసే ప్రయత్నాలకు చిత్రణ. ఈ నవలతో అతని సాహిత్యస్థాయి స్థిరపడింది. ఈ సంవత్సరమే అతడు మళ్లీ పెళ్లి చేసుకొన్నాడు. అతని దశ ఉన్నతిని అందుకోసాగింది. తరువాత 15 సంవత్సరాల పాటు తీవ్రమైన సాహిత్యకృషి చేశాడు. *రోడా ఫ్లెమింగ్, విట్టోరియా, అడ్వెంచర్స్ ఆఫ్ హారీ రిచ్‌మండ్* అనే నవలలు అతని నవలా రచనా విధానాలకు ఉదాహరణలు. తండ్రీ కొడుకుల మధ్య ఉండే అనుబంధాలను పరిశీలిస్తూ అతడు రచనలు చేశాడు.

*ది ఇగోయిస్ట్* (1879), *డయన ఆఫ్ ది క్రాస్ వేజ్* విమర్శకుల సన్నుతిని అందుకొన్నాయి. 'సెయింట్ ఆండ్రూస్' యూనివర్శిటీ ఇతనికి గౌరవ డాక్టరేట్ సమర్పించింది. 1905 లో ఆర్డర్ ఆఫ్ మెరిట్ వచ్చింది. రచయితల సమాఖ్యకు అధ్యక్షుడుగా ఎన్నిక అయినాడు. అతని ఇల్లు సాహిత్యాలయంగా రూపొందింది.

1885 లో ఈయన ప్రచురించిన కవితా సంకలనాలలో కవిత్వం కంటె తాత్త్విక చింతనం ఎక్కువగా ఉంది. 1891 లో ప్రచురించిన *వన్ ఆఫ్ అవర్ కాంకరర్స్* ఇతని నవల లన్నింటిలోకీ క్లిష్టమయినది. ఎక్కువ అలంకార ప్రాయమయిన భాష, అంతరంగ సంభాషణలు, సమాలోచనలతో నిండి ఉంది. 1894 లో వచ్చిన *లార్డ్ ఓర్మంట్ అండ్ హిజ్ అమింతా* ఇందుకు విరుద్ధంగా స్పష్టమైన శైలితో సరళంగా సాగింది. చివరి నవల *ది అమేజింగ్ మారియేజ్* (1895) లో ముందు నవలలలోని అంశాన్నే పునరావృత్తం చేస్తూ, భర్త తనను సమానంగా చూచుకోక పోయినట్లయితే, భార్య అతనిని వదిలివేయ వచ్చును అని స్పష్టపరుస్తాడు.

సాంఘికంగా క్రింది తరగతి నుంచి వచ్చినా, పై తరగతికి చెందిన పాత్రలు, వాతావరణం ఉపయోగించి నవలలు వ్రాశాడు.

మెరిడిజ్ 80 వ పుట్టినరోజున అనేక సన్మానాలతో సత్కారాలు పొందాడు. 'సాహిత్యరంగంలో భీష్మాచార్యులు' అని ఇతనిని ప్రశంసించారు.

*శ్రీవిరించి*

**మెరిమీ, ప్రోస్పేర్ (1803-70) :** ఫ్రెంచ్ నాటకకర్త, చరిత్రకారుడు, పురాతత్త్వ వేత్త, కథానికా రచయిత. న్యాయ శాస్త్రం చదివాడు. కాని గ్రీక్, శ్పానిష్, ఇంగ్లీషు, రష్యన్ భాషా సాహిత్యాలలో ఎక్కువ కృషి చేశాడు. 19 వ ఏట మొదటి నాటకం *క్రాంవెల్* రచించాడు. స్టెండర్ అనే స్నేహితుడు, నవలా రచయిత ఇతనికి ఎక్కువ ప్రోత్సాహం ఇచ్చాడు. 1827 లో 'ఇల్లీరియన్' రచనల అనువాదాలుగా బుర్రకథలు ప్రకటించాడు. ఈ రచనలు ఆనాటి పండితులను సైతం తికమక పెట్టాయి.



మార్మిక విషయాలు, చరిత్ర, అసాధారణమైన ప్రస్తావనలపై ఇతనికి మక్కువ. 'సర్ వాల్టర్ స్కాట్' వల్ల ప్రభావితుడయి, 1828 లో *లాజెకేరీ* అన్న రచన చేసి అందులో ఫ్యూడల్ వ్యవస్థలోని రైతుల కడగండ్లను చిత్రించాడు. యుద్ధ సమయం, శాంతి సమయాలలో న్యాయపీఠాలు ఎలా వ్యవహరిస్తాయో వివరిస్తూ 1829 లో ఒక నవల వ్రాశాడు.

ఇతని కథానికలు ఊహను, అభూతకల్పనను మిళితం చేస్తాయి. విదేశీ ప్రభావం, స్థానిక పరిస్థితులు ఇందులో సమ్మిశ్రితం అవుతాయి. రష్యన్ సాహిత్యాన్ని ఫ్రెంచ్ వారికి మొట్టమొదటిసారిగా తెలియచెప్పినవాడు ఇతడే! దౌర్జన్యం, క్రూరత్వం - వీటి వెనుక ఉండే మానసిక స్థితి రూపొందించిన 'పుష్కిన్' ఇతనికి ఆదర్శం. కుటుంబ గౌరవాన్ని పాడుచేసినందుకు గాను ఒక తండ్రి తన కుమారుని చంపివేసే కథ *మాయిటో ఫాల్కోన్* (1833). *కొలొంబా* అనే నవలికలో ఒక కోర్సికన్ అమ్మాయి పగ తీర్చుకునే నిమిత్తం తన అన్నను హత్యకు ప్రేరేపిస్తుంది. *కార్మెన్* అనే కథలో తనపట్ల అవిశ్వాసం చూపిన జిప్సీ యువతిని ఒక సైనికుడు హత్య చేస్తాడు.

1831 లో 'జెన్నీ డాకిన్' అనే అమ్మాయిని కలుసుకొని జీవితాంతం ఆమెతో ఉత్తరాల ద్వారా స్నేహం నెరపాడు. ఆమెకు వ్రాసిన ఉత్తరాలు 1874 లో అతని మరణానంతరం పుస్తక రూపంలో ప్రచురణ అయినాయి. ఫ్రెంచి ఆధిపత్యంలో చారిత్రక ప్రదేశాల పర్యవేక్షకుడుగా పనిచేసి ఆ ప్రయాణాల అనుభవంతో 1835-40 లో గ్రీస్, స్పెయిన్, తుర్కీ, ఫ్రాన్స్ దేశాల వ్యవహారాలు వివరించే రచనలు చేశాడు. అనేక చారిత్రక విమర్శలు, పరిశీలనలు ప్రచురించాడు.

1853 లో స్పెయిన్ సెనేటర్‌గా నియమితుడయాడు. అయితే అతనికి ఈ నియామకం పట్ల అంత ఆసక్తి లేదు. ఇతని రచనలు నిర్దుష్టతకు, సంయమనానికి ప్రతీకలు. అభూత కల్పనల వంటి కథలు వ్రాసినా, వాటిలో మానసిక విశ్లేషణకే ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చాడు.

*శ్రీవిరించి*

**మెరెజ్కోవ్‌స్కీ, డిమిట్రీ సెర్జెయేవిక్ (1865-1941) :** రష్యన్ కవి, నవలా రచయిత, విమర్శకుడు. రష్యన్ ఆలోచనా పరుల వర్గాలలో మతం, తత్త్వ పరిశీలనలపై తిరిగి దృష్టిని ప్రసరింపచేయడంలో ఇతని పాత్ర ఉన్నది. సెంట్ పీటర్స్‌బర్గ్ విశ్వవిద్యాలయం నుంచి చరిత్ర, ఫైలాలజీలలో గ్రాడ్యుయేషన్ పూర్తిచేసిన తరువాత 1888 లో మొదటి కవితా సంకలనం ప్రచురించాడు. ఈయన ప్రచురించిన ఒక వ్యాసం (1893) సమకాలీన రష్యన్ సాహిత్యంలో దిగజారుడుకు కారణాలు, రావలసిన కొత్త ధోరణులను వివరిస్తుంది. దీనిని ప్రామాణికమైన వ్యాసంగా ఉదాహరిస్తారు.

20 వ శతాబ్ది ప్రారంభంలో ఈయన తన భార్య 'జినైడా గిప్పియస్' తో కలసి మత తాత్త్విక సమావేశాలు, సమాలోచన రంగాలను ఏర్పాటు చేశాడు. 1903-04 లో *కొత్త మార్గం (Novy Pot)* అనే పత్రికకు సంపాదకుడుగా ఉన్నాడు. 1896-1905 సంవత్సరాల కాలంలో ప్రచురించిన మూడు నవలల సంకలనం ద్వారా రష్యాలో చారిత్రక పరిజ్ఞానానికి, మతనైతిక సిద్ధాంతాల వివరణకు ఇతడు కృషి చేశాడు. అలాగే 1908-33 సంవత్సరాల మధ్య కాలంలో వేరుగా మరో నవలా సంకలనం ప్రచురించాడు. టాల్‌స్టాయ్, డోస్టవిస్కీ, గోగోల్‌లపై ప్రామాణికమైన విమర్శ గ్రంథాలు ప్రచురించాడు.



ఫిబ్రవరి 1917 విప్లవాన్ని సమర్థించాడు గాని బోల్షెవిక్కులు అధికారాన్ని హస్తగతం చేసుకోవడాన్ని ఈ రచయిత హర్షించలేదు. 1920 లో స్వదేశాన్ని వదలి పారిస్‌లో స్థిరపడ్డాడు. 1924-25 లలో మరి రెండు చారిత్రక నవలలు ప్రచురించాడు. నెపోలియన్, జీసస్ క్రైస్ట్, సెయింట్ అగస్టీన్, సెయింట్ పాల్, సెయింట్ ఫ్రాన్సిస్ ఆఫ్ అస్సిసి, జాన్ ఆఫ్ ఆర్క్, దాంతే మొదలైన వారి జీవిత సంగ్రహాలను సమీకరించాడు. వీటిలో చాలా భాగం ఇంగ్లీషులోకి అనూదితం అయాయి. చరమ జీవిత తరుణంలో, ముస్సోలినీ, హిట్లర్‌లను కమ్యూనిజమ్‌ను నిర్మూలించగల నాయకులుగా చిత్రిస్తూ తన అభిప్రాయాలను ప్రచారం చేశాడు.

*శ్రీవిరించి*

**మెల్‌విల్, హెర్‌మన్ (1819-1891) :** అమెరికన్ నవలారచయిత, కథానికా రచయిత, కవి, సముద్రయానంపై వ్రాసిన నవలలకు ప్రసిద్ధుడు. *మోబి డిక్* (Moby Dick, 1851) అనేది ఇతని ప్రసిద్ధమయిన రచన.

నలుగురు అబ్బాయిలు, నలుగురు అమ్మాయిలతో కూడిన కుటుంబంలో మూడవ సంతానం. అమెరికన్ విప్లవంలో భాగస్వామ్యం వహించిన కుటుంబానికి చెందినవాడు. చిన్నతనంలోనే జ్వరం వచ్చి కంటి చూపు కొరవడింది. వ్యాపారంలో పనిచేస్తూనే సాహిత్య వికాసానికి కృషి చేశాడు. 1837 లో సముద్ర ప్రయాణాలు ప్రారంభం చేశాడు. కుటుంబ పోషణకోసం చాలా చిన్న ఉద్యోగాలు చేయవలసి వచ్చింది. 1842 లో ఫ్రెంచ్ ఆధిపత్యంలోని మార్క్వెసాస్ ద్వీపాలకు వెళ్లాడు. అక్కడి అనుభవాలతో *టైపీ* (Typee - 1846) అనే మొదటి నవల వ్రాశాడు.

ఒక తిరుగుబాటు దారుల గుంపులో చేరి టిహిటియన్ జైలు పాలయాడు. అక్కడనుంచి తేలికగా పారిపోగలిగాడు. ఈ అనుభవం వర్ణిస్తూ 1847 లో *ఓమూ* (Omoo) అనే నవల వ్రాశాడు. దానిలో వలస రాజ్య విధానంలో ఉన్న ఇబ్బందులు, ప్రజల దురవస్థలు చక్కగా వర్ణించాడు. 1843 లో హవాయ్ ద్వీపాలకు వెళ్లాడు. 1844 లో లండన్‌లోని అమెరికన్ రాయబారి కార్యాలయంలోని ఒక ఉద్యోగి పంచనచేరి, ఆయన ప్రోద్బలంతో సముద్ర ప్రయాణ కథలు వ్రాశాడు. వీటికి మంచి పేరు వచ్చింది.

1847 లో మూడవ నవల *మార్డి* (Mardi) వ్రాశాడు. సాహిత్య పత్రికలకు వ్యాసాలు, సమీక్షలు వ్రాయసాగాడు.

1849 లో *రెడ్‌బర్న్* 1950 లో *వైట్ జాకెట్* అనే నవలలు వ్రాసి పేరు నిలదొక్కుకొన్నాడు.

1850 లో ముందుగా *ది వేల్* (The Whale) అనే పేరుతో ఒక నవల వ్రాశాడు. ఈ పేరునే *మోబిడిక్* గా మార్చాడు. హాథార్న్‌తో సాన్నిహిత్యం ఇతనిని ఈ తరుణంలోనే తీర్చిదిద్దింది. అయితే ఇద్దరూ విడిపోయి తరువాత 1856 లో దాదాపు క్రొత్త వ్యక్తులుగా లివర్‌పూల్‌లో తిరిగి కలుసుకొన్నారు. అప్పుడు హాథార్న్ అక్కడ అమెరికన్ కాన్సల్‌గా ఉండేవాడు.

*మోబిడిక్* లండన్‌లో అక్టోబర్ 1851 లోను, ఒక నెల తరువాత అమెరికాలోను ప్రచురణ అయింది. ఈ పుస్తకం రచయితకు ప్రశస్తి, ప్రతిఫలం తీసుకు రాలేదు. కెప్టెన్ అహాబ్ అనే అతడు 'తెల్లచేప' ను వెంటాడి, దానిచేత హతుడవడం ఇందులో కథ. మెల్‌విల్ ఇందులో తన అంతరంగ మానవతా వాదాన్ని, సృజనాత్మకతను, హింసా ప్రవృత్తిని జోడించాడు.

1852 లో *పీరె* అనే రచన ప్రచురించాడు. ఇది దాదాపు అతని ఆత్మకథ. చిన్నతనంలోని దారిద్ర్యం, కుటుంబ జీవనంలోని అసంబద్ధత ఇందులో చిత్రించాడు. తల్లిని తన రచనలో ఉన్నతంగా రూపొందించాడు. దీని ప్రచురణ వల్ల కూడా అతని ఆశలు నెరవేరలేదు. 1853

లో అగ్ని ప్రమాదంలో ప్రచురణ కర్త దగ్గర ఉన్న అతని పుస్తకాల ప్రతులన్నీ కాలిపోయాయి. అయినా అతడు రచనా వ్యాసంగాన్ని వదలుకోలేదు.

*ఇస్రాయిల్ పాటర్* (1855), కొంత ఆర్థిక స్తోమత కలిగించింది. 1857 లో ప్రచురించిన *ది కాన్ఫిడెన్స్ మాన్* అమెరికన్ వాణిజ్య జీవిత విధానాన్ని భంగపరచడం మీద వ్రాసిన ఒక వ్యంగ్య రచన. అతని జీవితకాలంలో ప్రచురితమయిన ఆఖరు నవల ఇదే!

1860 తరువాత నవలను వదిలి పద్య రచనను ఆశ్రయించాడు. ప్రభుత్వాశ్రయం కోరాడు గాని అది లభ్యం కాలేదు. 1891 లో ప్రచురించిన *టైమోలాన్* చివరి కవితా సంకలనం. తరువాతి నవల *బిల్లీ బుడ్* అతను చనిపోయిన తరువాత 1924 లో ప్రచురితం అయింది. ఈ నవలా రచన ముగించిన అయిదు నెలలకు అతడు మరణించాడు.

మెల్‌విల్ జీవితకాలంలో రచనల వల్ల ఆర్థిక సంపత్తి, కీర్తి ప్రతిష్ఠలు అంతగా లభ్యం కాకపోయినా, 1840 నాటికి ప్రసిద్ధ అమెరికన్ రచయితల జాబితాలో అతడు చేరాడు.

మరణానంతరం సాహిత్యంలో మెల్‌విల్ స్థానాన్ని విమర్శకులు సుస్థిరం చేశారు.

శ్రీవిరించి

**మొరీకే, ఎడువార్డ్ ఫ్రెడ్రిఖ్ (1804-75) :** ప్రముఖ జర్మన్ గేయకవి. 1804 సెప్టెంబరు 8 న జన్మించాడు. గేయరచనా విధానంలో ఆయనను కొందరు గొయ్‌థేకు తరువాతి వాడని పేర్కొంటారు.

మొరీకే వేదాంత శాస్త్రం అధ్యయనం చేశాడు. ఒక చర్చిలో పాస్టర్ కావడానికి ముందు ఆయన కొన్ని చిన్న పదవులు నిర్వహించాడు. జీవితాంతం ఆయన మాన సిక వేదనకు పాల్పడ్డాడు. అందుకు కారణం బహుశః ఆయనలోని మానవతా భావాలకూ, చర్చ్ సిద్ధాంతాలకూ మధ్య చెలరేగిన తీవ్ర సంఘర్షణే. ఆ రెంటికీ ఒక సమన్వయం కుదురలేదు. కుటుంబ పరిస్థితులు కూడా అందుకు దోహదం చేయలేదు. 39 వ ఏట ఆయన చర్చ్ ఉద్యోగం విరమించాడు. 'మార్గరెట్' అనే ఆమెను వివాహం చేసుకొన్నాడు. 'మొరీకే' సోదరి క్లేరాకూ, ఆమెకూ నడుమ ఏర్పడిన వైమనస్యం వల్ల ఆయన జీవితంలో ప్రశాంతత లోపించింది. తత్ఫలితంగా ఆయన సాహిత్య సృజనశక్తి దాదాపు నశించిందనే చెప్పవచ్చు. చివరికి ఆయన నిర్ధనుడుగా, అసంతుష్టుడుగా కాలధర్మం చెందాడు.

'మొరీకే' చాలా రచనలు చేయలేదు. కాని చేసిన ఆ కొద్ది రచనలే ఆశ్చర్యం గొలుపుతాయి. ఆయన ప్రతిరచన లోనూ ఏదో ఒక విశిష్టత కళ్లకు కట్టినట్లు కానవస్తుంది. రచనా వ్యాసంగానికి ఉపక్రమించిన తొలి రోజులలో ఆయన మీద కాల్పనిక ప్రభావం ఉండేది. 1832 లో ఆయన వ్రాసిన *మాలెర్ న్యాలెన్* అనే నవలలో ఆయన ప్రణయభావాలు ప్రతిబింబించాయి. జానపద బాణీలలో కవితలు, దేవతల కథలు వెలయించాడు. వాటిమీద జర్మన్ కాల్పనిక ప్రభావం కనిపిస్తుంది. ఆయన వ్రాసిన దేవతా కథలు కూడా చిరస్మరణీయాలే. గేయకవిగా ఆయన సాహిత్య ప్రపంచంలో విలక్షణమైన ఒక స్థానం కల్పించుకొన్నాడు. లయాత్మకాలైన లఘు రచనలు (సానెట్స్) చేశాడు. ముక్త ఛ్ఛందంలోనూ, ప్రాచీన ఛందంలోనూ సరిసమానమైన ప్రతిభను ప్రద ర్శిస్తూ రచన చేయగల సిద్ధహస్తుడు. పెరిగ్రినా కవితలు, పూర్వప్రేయసి నుద్దేశించి వెలయించిన గీతాలు జర్మన్ ప్రణయ గీతికా వాఙ్మయంలో మణిపూస లని విమర్శ కులు భావిస్తున్నారు. ఆయన సాహిత్యగురువు గొయ్‌థే. కొంతకాలం ఆయన జర్మన్ సాహిత్యం గురించి ఉపన్యాసాలు చేశాడు. మొరీకే 1875 జూన్ 4 న శాశ్వతంగా కన్నుమూశాడు.

పి.ఆర్. శర్మ

**మోద్రెజెవ్స్కి, ఆంద్రేజెజ్ (1503-1572) :** ప్రఖ్యాత పోలిష్ రచయిత. 16 వ శతాబ్దంలో తలమానికం వంటివాడు.

దహజహేగెలియన్ యూనివర్శిటీలోను (క్రాకో), విటెన్‌బర్గ్-న్యూరెన్‌బర్గ్‌లలోను చదువుకొని పోలండ్‌కు వచ్చాడు.

1543 లో *ది పనిష్‌మెంట్ ఆఫ్ హోమిసైడ్* అనే కరపత్రం ప్రచురించాడు. మరణశిక్ష,కారాగార శిక్షల విష యమై పునర్విమర్శ అవసరమనీ, వీటిని రద్దు చేయడం మంచిదనీ ఈ కరపత్రంలో వాదించాడు. తన అభిప్రా యాలను స్పష్టపరుస్తూ అనేక రచనలు చేశాడు. కాథలిక్, ప్రాటెస్టెంట్ల మధ్య సయోధ్య ఉండాలని, వివాహ సంబం ధాలు ఏర్పడాలని వాదించేవాడు. ప్రీస్ట్‌లకు వివాహ నిషేధం ఉండగూడ దనేవాడు. ఇటు మత గురువులకు, అటు పెద్దమనుషులుగా చలామణీ అవుదామని చూచే వారికి అతని ఆలోచనా సరణి కంటక ప్రాయమైంది. అతనిపై నేరారోపణలు చేసి అతడు పారిపోయేట్టుగా చేశారు.

శ్రీవిరించి

**మోన్టాలె, యూజీనియో (1896-1981) :** ఇటలీ దేశపుకవి, గద్య రచయిత, సంపాదకుడు, అనువాదకుడు. 1975 లో సాహిత్యసేవకు నోబెల్ బహుమతి పొందాడు.

1930-40 సంవత్సరాల మధ్యకాలంలో 'హెర్మెస్' తాత్త్విక సంప్రదాయాల వల్ల ప్రభావితుడయిన కవిగా పేరు పొందాడు. ఇతనిపై ఫ్రెంచి రచయితలు 'మలార్మె', 'రింబాడ్', 'వలేరీ'ల ప్రభావం కూడా ఉంది. రాగ పూరితమైన భావాలను సాంకేతికంగా ఆత్మాశ్రయంగా ప్రదర్శించడంలో మోన్టాలె నిపుణుడు. తరువాతి రచన లలో తన భావాలను నేరుగా సూటిగా వ్యక్తం చేశాడు. సరళమైన భాషలో రచనలు చేసి, ఎన్నో సాహితీ పుర స్కారాలు, బహుమతులు పొందాడు. ఈయన రచనలు ఇతర భాషలలోనికి అనువదింప బడ్డాయి.

తన రచనల ద్వారా ఫాసిజమ్‌ను వ్యతిరేకించాడు. ఈయన మొదటి పద్య సంకలనం *ఓసియా డి సెప్పా* (1925) మొదటి ప్రపంచ యుద్ధం తరువాతి నిరాశా, నిస్తబ్ధలను వర్ణించింది. తరువాత వచ్చిన రచనలలో ఎక్కువ మార్మికత, అసందిగ్ధత ఉన్నాయి. 1956 తరువాతి రచనలలో-ముఖ్యంగా ల బఫెర ఎ అల్‌త్రో (1956; *ది స్టార్మ్*, 1978) అనే కవితా సంకలనంలో కవితా నైపుణ్యం, ఆత్మీయత స్ఫుటంగా కనిపిస్తాయి. 1963 లో మరణించిన తన భార్య స్మృతి చిహ్నంగా మోన్టాలె ప్రణయ గీతాలు వ్రాశాడు.

తన రచనలను ఇంగ్లీషు లోకి అనువదించి జన బాహుళ్యానికి అందించడంతో పాటు, ఈయన షేక్స్ పియర్, టి.యస్.ఎలియట్, గెరాల్డ్ మాన్లే హాప్‌కిన్స్‌ల రచనలను ఇటాలియన్ భాషలోకి అనువదించాడు. హెర్‌మన్ మెల్‌విల్, యూజీన్ ఓనీల్ మొదలయిన వచన రచయితల రచనలను కూడా అనువదించి పరిచయం చేశాడు. తన వచన రచనలన్నీ సంకలనం చేసి, 1956 లో ఇటాలియన్ లోను, 1970 లో ఇంగ్లీషు లోను ప్రచురించాడు.

సాహిత్య పత్రిక *ప్రిమో టెంపో* (1922) అనే దానికి ఈయన సహ వ్యవస్థాపకుడు. అనేక పత్రికల లోను, ప్రచురణ సంస్థలలోను పనిచేసిన అనంతరం 1948 లో మిలాన్‌లో *కొరియర్ డెల్లా సెరా* అనే దానికి సాహితీ సంపాదకుడు, సంగీతశాఖ సంపాదకుడు అయాడు. ఈయన వచన రచనలు - కథలు, చిత్రణలు - ఎక్కువ భాగం ముందుగా ఈ దినపత్రిక లోనే ప్రచురణ అయాయి.

శ్రీవిరించి

**మోంటెస్క్యూ, చార్ల్ లూయీ (1689-1755) :** ఫ్రెంచ్ రాజనీతి తత్త్వ వేత్త, సాహితీ వేత్త. 1689 జనవరి 18 వ తేదీన ఫ్రాన్స్‌లో జన్మించిన మోంటెస్క్యూ బోర్డెక్స్ నగరంలో విద్యాభ్యాసం చేశాడు. న్యాయ శాస్త్రంలో పట్టా పుచ్చుకొని 1708 లో పారిస్‌లో న్యాయవాది వృత్తి ఆరంభించాడు. కొంతకాలం న్యాయవాదిగా పనిచేసి ఆ తరువాత విదేశయాత్రకు బయలుదేరాడు. 1729 లో తన దేశా టనం ప్రారంభించిన మోంటెస్క్యూ జర్మనీ, హంగేరీ, ఇటలీ మొదలైన దేశాలలో విస్తృతంగా పర్యటించి, వివిధ రంగాలలో నిష్ణాతు లయిన ఎందరో ప్రముఖుల సాంగత్యాన్ని సంపాదించి, చివరకు 1731 లో లండన్ నగరం చేరుకొన్నాడు. అక్కడ అతనికి అనేక ప్రముఖుల సాహచర్యంతో పాటు, బ్రిటిష్ రాయల్ సొసైటీలో సభ్యత్వం కూడా లభించింది.

రాజనీతి శాస్త్రం, తత్వశాస్త్రం, న్యాయశాస్త్రం సాహిత్యం వంటి వివిధ రంగాలలో విశేష ప్రతిభ ప్రదర్శించిన మోంటెస్క్యూ ఆయా రంగాలలో అనేక విశిష్ట రచనలు చేశాడు. 1721 లో ఇతడు ప్రచురించిన *పర్షియన్ లెటర్స్* చాలా ప్రసిద్ధమైన రచన. ఇది 14 వ లూయీ పరిపాలనా కాలం గురించి తెలియజేసే వ్యంగ్య రచన. ఉజ్బెక్, రికా (Rica) అనే ఇద్దరు పర్షియన్ యాత్రికులను పాత్రలుగా గ్రహించి వారిరువురి దృష్టికి కనిపించిన ఆ నాటి పారిస్ నగర జీవితాన్ని గురించీ, ఆనాటి సామాజిక, సాంస్కృతిక పరిస్థితులను గురించీ సజీవంగా చిత్రించాడు. ఇస్లాంనీ, క్రైస్తవ మతాన్నీ పదేపదే పోలుస్తూ, రోమన్ కేథలిక్ మతంలోని కొన్ని లోపాలను గురించి ఆయన సునిశితంగా విమర్శించాడు.

ఇంగ్లండ్‌లో ఉన్నప్పుడు వేల్స్ యువరాజుతో ఇతనికి పరిచయం ఏర్పడింది. అతని ప్రోద్బలంతో ఒక ఫ్రెంచ్ పద్య సంకలనాన్ని కూడా ఈయన ప్రచురించాడు. మోంటెస్క్యూ డైరీలను బట్టి ఆయన గొప్ప విలాస పురుషుడనీ, రసికుడనీ మనకు తెలుస్తుంది. 1725 లో

ఒక యువరాణి ప్రోద్బలంతో *ది టెంపిల్ ఆఫ్ గ్నైడ్* అనే ఒక రసవంతమైన శృంగార కావ్యాన్ని రచించాడు. ఈయన విలాస పురుషుడనీ, అనేక సానికొంపల చుట్టూ తిరిగిన వాడనీ కూడా ఆయన డైరీలు వెల్లడి చేస్తున్నాయి.

1760 లో ఈయన రచించిన *ది స్పిరిట్ ఆఫ్ లాస్* అనే గ్రంథం రాజనీతి తత్త్వ శాస్త్రానికి తల మానికం వంటిది. ప్రముఖ ఇంగ్లీషు రాజకీయవేత్త అయిన బోలింగ్ బ్రూక్ ప్రభావం మోంటెస్క్యూ మీద ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఈయన ఫ్రీమేసన్ సొసైటీలో కూడా సభ్యుడు. వివిధ శాస్త్రాలలో విశేష పరిచయ మున్నప్పటికీ ప్రముఖంగా రాజనీతి తత్త్వవేత్త గానే సువిఖ్యాతుడైన మోంటెస్క్యూ 1755 ఫిబ్రవరి 10 న పారిస్‌లో మరణించాడు.

*ఉమారాణి*

**మోబెర్గ్, విల్‌హెల్మ్ (1898-1973) :** ప్రసిద్ధ స్వీడిష్ నవలా రచయిత; నాటక కర్త. స్వీడన్ దేశ వాసులు అమెరికాకు వలసవెళ్లిన యితి వృత్తాన్ని ఆధారంగా చేసుకుని 'మోబెర్గ్' ప్రసిద్ధ నవలలు వ్రాశాడు. ఆయనకు గ్రామ ప్రాంతాల వారి బాధామయ జీవితం, వారి సమస్యలు సుపరిచితాలు. కారణం ఆయన జానప దుడు కావడమే!

*వెన్ ఐ వాజ్ ఎ చైల్డ్* (1944) అనే శీర్షిక గల స్వీయ చారిత్రక నవలలో ఆయన నిరాక్షరాస్యుల కొక పిలుపు నిచ్చాడు. ఆయన ఆ వర్గం నుంచి వచ్చిన వాడు కనుక, వారి స్థితిగతులు ఆయనకు క్షుణ్ణంగా తెలుసు. *అట్వాన్‌దర్న* (1949-59), *ఇన్వాన్ దర్న* (1952) మొదలైనవి ఆయన ప్రసిద్ధ రచనలలో కొన్ని. రెండవ ప్రపంచ యుద్ధకాలంలోని క్రౌర్యాన్నీ, అణచి వేతనూ ప్రతిఘటిస్తూ ఆయన ఒక నవల వ్రాశాడు. స్వాతంత్ర్యం, సాంఘిక న్యాయం మొదలైన విషయాలను గురించి కృషి చేయవలసిన అవసరాన్ని ఆయన ఆ నవలలో విశదీకరించాడు.

*సి.ఆర్.శర్మ*

**మోమ్‌సెన్, థియోడోర్ (1817-1903) :** జర్మన్ చరిత్ర రచయిత, లాటిన్ శాసనాల సంకలనకర్త. ఇతడు వ్రాసిన రోమన్ చరిత్ర అనే గ్రంథం ఇప్పటికీ చాలా ప్రామాణికమైనదిగా పరిగణించబడుతూంది. 1817 నవం బరు 30 న జర్మనీలోని గార్డింగ్‌లో జన్మించిన 'మోమ్‌సెన్' రోమన్ న్యాయశాస్త్రం చదివి, 1843 లో పట్టభద్రు డయాడు. ఇతడు లీప్‌జిగ్ (Leipzig) యూనివర్శిటీలో ప్రొఫెసర్‌గా చేరి, న్యాయశాస్త్రాన్ని బోధించాడు. అయితే అప్పట్లో జర్మనీలో చెలరేగిన ఒక విప్లవంలో పాల్గొని అనేకమంది విప్లవకారులకు స్ఫూర్తి నివ్వడం వలన 1849 లో తన ప్రొఫెసర్ ఉద్యోగాన్ని కోల్పోయాడు. కొంతకాలం తరువాత జ్యూరిచ్‌లోను, మరి కొంతకాలం బ్రెస్‌లోను వివిధ విద్యాలయాలలో బోధించాడు. ఇతడు జ్యూరిచ్‌లో పనిచేసేటప్పుడు రోమన్ చరిత్ర రచనకు పూనుకొని కొద్ది కాలంలోనే 4 సంపుటాల చరిత్రను ప్రకటించాడు. ఆ తరువాత ప్రష్యన్ సైన్స్ అకాడమీ వారి ఆహ్వానం మేరకు ఇతడు లాటిన్ శాసనాల ప్రచురణ బాధ్యతను స్వీకరించాడు. 1861 లో బెర్లిన్ యూనివర్శిటీలో ప్రొఫెసర్‌గా నియమింపబడి ఎంతో కాలం అక్కడ బోధించాడు. 1902 లో ఇతనికి నోబెల్ బహుమతి వచ్చింది.

మోమ్‌సెన్ రచనలలో ప్రసిద్ధమయింది *రోమన్ చరిత్ర*. మొదట ఐదు సంపుటాలుగా ప్రచురించ తల పెట్టాడు. కాని 4 వ సంపుటాన్ని వ్రాయ లేదు. ఒకవేళ ఇది వ్రాసి ఉంటే అందులో సీజర్‌ను గురించి ఇతని అభి ప్రాయాలు మనకు తెలిసి ఉండేవి. చరిత్ర రచయిత గానే కాక శాస నాల పరిశీలకునిగా కూడా ఇతడు పేరు గాంచాడు. ఇతడు వివిధ ప్రదేశాలు తిరిగి అనేక వ్యయ ప్రయాసల కోర్చి ఎన్నో లాటిన్ శాసనాలను సేకరించి, వాటిని పరిష్కరించి ప్రచురించాడు. రోమన్ చరిత్ర రచనలో ఇతడు సేకరించిన శాసనాలు ఎంతగానో తోడ్ప డ్డాయి. ఆ నాటి రోమన్ ప్రజల సంస్కృతికి, వేషభాషా వ్యవహారాలకు సంబంధించిన అనేక నూతన విషయా లను ఈ శాసనాలు మనకు అందిస్తాయి. *రోమన్ కాన్‌స్టిట్యూషనల్ లా, రోమన్ క్రిమినల్ లా* అనేవి ఇతని ఇతర రచనలలో ముఖ్యమైనవి. 1902 లో నోబెల్ బహుమతి పొందిన ఇతడు సంవత్సరం తిరుగకుండానే 1903 నవంబర్ 1 న మరణించాడు.



*ఉమారాణి*

**మొరావియా, ఆల్‌బెర్టో (1907-1990) :** ఇటాలియన్ జర్నలిస్ట్, కథానికా రచయిత, నవలా రచయిత.

ఇందులో ఒక ముసలి న్యాయవాది తన కుటుంబం పట్ల చూపే ఏవగింపు, ధనం సంపాదించటంలో చూపే ఆసక్తి, చివరలో అతనిలో వచ్చే పరివర్తన చిత్రిస్తాడు రచయిత. అన్ని మోరియాక్ నవలలలో మాదిరిగానే ఇందులో కూడ మనుష్యుల మధ్య మనం వాంఛించే ప్రేమానురాగాలు లభించేవి గావని, అవి చివరకు భగవంతుని యందు భక్తి, ప్రేమలుగా మారినపుడే వాటికి అర్థం ఏర్పడుతుందని మోరియాక్ సూచిస్తాడు.

1933 లో అకాడమీ ఫ్రాన్‌సైజ్‌లో 'మోరియాక్' కు సభ్యత్వం లభించింది. 1933 లో వ్రాసిన *లె మిస్టరి ఫ్రాం టెనాక్* The Frontenac Mystery 1951) అతని స్వీయచరిత్రను కొంతవరకు తెలిపే నవల. ఇవి కాక *ఆస్మోడీ* (Asmodee-1938), *లేమాల్ ఎయిమ్స్* అనే నాటకాలు కూడ ఈయన వ్రాశాడు. కాని నవలా రచయితగానే ఈయన గుర్తింపు పొందాడు. *ఁమూస్ని యర్ ఎట్ సెస్ పర్సనేజెస్,* (1933), 4 సంపుటాలు గలిగిన జర్నల్ (1934-1951), 3 సంపుటాల *మెమొయిర్స్* (1959-67) లలో రచయిత తన పాత్రలను, వాటి ప్రయోజనాలను, తన ధ్యేయాన్ని, సమకాలీనపు విలువలను చర్చిస్తాడు.

ఈయన అన్ని రకాల నియంతృత్వాలకు వ్యతిరేకి. నియంతృత్వ రాజ్యవ్యవస్థను, ఇటలీ, స్పెయిన్‌లలోని ఫాసిస్ట్ వ్యవస్థలను ఈయన తీవ్రంగా ఖండించాడు. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో జర్మనీ ఫ్రాన్స్‌ను ఆక్రమించుకొన్నప్పుడు దాన్ని ప్రతిఘటించే 'రెసిస్టెన్స్' ఉద్యమంలో చురుకుగా పాల్గొన్నాడు. ఆ యుద్ధం తరువాత రాజకీయాల పట్ల ఆసక్తిని చూపించి, 1964 లో *డిగాల్* అనే గ్రంథాన్ని వ్రాశాడు. ఫ్రెంచ్ నవలా రచయితలలో ఉత్తమశ్రేణికి చెందిన వాడుగా మోరియాక్ గుర్తింపు పొందాడు.

కె.బి.మూర్తి

**మోరీ, ఓగాయ్ (1862-1922) :** ఆధునిక జపనీస్ వాఙ్మయ నిర్మాతలలో ప్రముఖుడుగా గణించ బడుతున్న 'మోరీ ఓగాయ్' కలం పేరు. అసలు పేరు 'మోరీ రింటారో'. ఆయన జననం 1862 ఫిబ్రవరి 17న.

ఒక ఉత్తమ వంశంలో జన్మించి 'మోరీ' ఒక వైద్యుని కుమారుడు. ఆయన మొదట టోక్యోలోనూ, ఆ తరువాత జర్మనీలోనూ వైద్యశాస్త్రం అభ్యసించాడు. ఆయన 'మైహిమె' అనే ఒక కథ వ్రాశాడు. వేశ్యకు సంబంధించిన ఆ కథ సాహిత్యలోకంలో సంచలనానికి దారితీసింది. ఒక జపాన్ విద్యార్థికి, ఒక జర్మన్ యువతికి మధ్య నడచిన ప్రణయాన్ని తాను కళ్లారా చూసిన అంశాలను ఆయన అందులో అభివర్ణించాడు. అంతవరకూ ప్రచారంలో ఉన్న వైయక్తిక విషయాల నవల కంటె స్వీయ చరిత్రాత్మక కథగా సాగిన ఆ నవల విలక్షణంగా తోచింది. ఆయన ఇతర నవలలు కూడా ప్రసిద్ధి కెక్కాయి. ఆయన ప్రసిద్ధ రచయిత అయిన 'హాన్స్ ఆండర్సన్' స్వీయచరిత్రాత్మక రచనను అనువదించాడు.

1912 లో ఆయనలో ఒక పరిణామం వచ్చింది. ఒక రాజు మరణించిన తరువాత ఒక సైనికాధికారి ఆత్మత్యాగం చేస్తాడు. ఆ విషాద సంఘటనకు ఆయన ఎంతగానో స్పందించాడు. తత్ఫలితంగా నవలా రచనకు స్వస్తిచెప్పి, ఆయన చారిత్రక రచనలు చెయ్యడం మొదలు పెట్టాడు. 'మోరీ' 1922 లో జూలై 9 న టోక్యోలో కాలధర్మం చెందాడు.

పి.ఆర్. శర్మ.

**మోర్గెన్‌స్టెర్న్, క్రిస్టియన్ (1871-1914) :** జర్మన్ కవి, హాస్యరచయిత. ఆధ్యాత్మిక, వ్యక్తిగత గీత రచనల నుండి అర్థరాహిత్య కవిత్వం (Nonsense verse) వరకు అన్ని రకాల రచనలను చేసినవాడు.

బెర్లా, బెర్లిన్ విశ్వవిద్యాలయాల్లో న్యాయశాస్త్రాన్ని అధ్యయనం చేసిన ఈయన క్షయవ్యాధిగ్రస్తు డని 1893 లో కనుగొన్నారు. గాలిమార్పుకై విదేశాలకు వెళ్లాడు. నార్వే వెళ్లి ఇబ్సెన్ పద్య నాటకాలను ఆ రచయిత సహాయంతోనే జర్మన్ భాషలోకి అనువదించాడు. బ్యోర్న్‌సన్, హమ్‌సన్, స్ట్రిండ్‌బెర్గ్‌ల నాటకాలను కూడ అనువదించాడు. స్విట్జర్లాండు వెళ్లి 1908 లో మార్గరెట్ గోస్ బ్రష్ ను వివాహమాడి, 1910 నుండి దక్షిణ టైరాల్‌లో స్థిరపడ్డాడు.

ఈ రచయిత తొలి రచనలలో *నీషె* ప్రభావం కనిపిస్తుంది. *ఇన్‌ఫాంటాస్ స్లాస్* (1895) అనే రచనలో అనంత విశ్వానికి సంబంధించినవీ, పౌరాణికమైనవీ, తత్త్వశాస్త్రపరమైనవీ అయిన అనేక సిద్ధాంతాలను కలగాపులగం చేశాడు. *ఇష్ ఉండ్ డీ వెల్ట్* (1998) (I and the World), *ఐన్ సామ్మర్* (Ein sommer, 1900, (One Summer) లలో భౌతికమైన సౌందర్యాన్ని ఉన్నత శిఖరాలకు తీసుకువెళ్లాడు. *ఐన్ కెర్* (1910-Introspection), *విర్ ఫాండెన్ ఐనెన్ ఫాడ్* (1914- ఆంగ్లంలో Wer Found a Path) అనే కావ్యాలలో బౌద్ధమత ప్రభావం, ఆంత్రోపోసోఫిస్ట్, అయిన రుడాల్ఫ్ స్టైనర్ ప్రభావం కనిపిస్తాయి. ఈయన రచనలలో కొన్నింటి ఆంగ్లానువాదాలు *సెలెక్టెడ్ పోయమ్స్*

ఇందులో ఒక ముసలి న్యాయవాది తన కుటుంబం పట్ల చూపే ఏవగింపు, ధనం సంపాదించటంలో చూపే ఆసక్తి, చివరలో అతనిలో వచ్చే పరివర్తన చిత్రిస్తాడు రచయిత. అన్ని మోరియాక్ నవలలలో మాదిరిగానే ఇందులో కూడ మనుష్యుల మధ్య మనం వాంఛించే ప్రేమానురాగాలు లభించేవి గావని, అవి చివరకు భగవంతుని యందు భక్తి, ప్రేమలుగా మారినపుడే వాటికి అర్థం ఏర్పడుతుందని మోరియాక్ సూచిస్తాడు.

1933 లో అకాడమీ ఫ్రాన్‌సైజ్‌లో 'మోరియాక్'కు సభ్యత్వం లభించింది. 1933 లో వ్రాసిన *లె మిస్టరి ఫ్రాం టెనాక్* The Frontenac Mystery 1951) అతని స్వీయచరిత్రను కొంతవరకు తెలిపే నవల. ఇవి కాక *ఆస్మోడే* (Asmodee-1938), *లేమాల్ ఎయిమ్స్* అనే నాటకాలు కూడ ఈయన వ్రాశాడు. కాని నవలా రచయితగానే ఈయన గుర్తింపు పొందాడు. *లె రొమాన్సి యర్ ఎట్ సెస్ పర్సనేజెస్,* (1933), 4 సంపుటాలు గలిగిన జర్నల్ (1934-1951), 3 సంపుటాల *మెమోయిర్స్* (1959-67) లలో రచయిత తన పాత్రలను, వాటి ప్రయోజనాలను, తన ధ్యేయాన్ని, సమకాలీనపు విలువలను చర్చిస్తాడు.

ఈయన అన్ని రకాల నియంతృత్వాలకు వ్యతిరేకి. నియంతృత్వ రాజ్యవ్యవస్థను, ఇటలీ, స్పెయిన్‌లలోని ఫాసిస్ట్ వ్యవస్థలను ఈయన తీవ్రంగా ఖండించాడు. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో జర్మనీ ఫ్రాన్స్‌ను ఆక్రమించుకొన్నప్పుడు దాన్ని ప్రతిఘటించే 'రెసిస్టెన్స్' ఉద్యమంలో చురుకుగా పాల్గొన్నాడు. ఆ యుద్ధం తరువాత రాజకీయాల పట్ల ఆసక్తిని చూపించి, 1964 లో *డిగాల్* అనే గ్రంథాన్ని వ్రాశాడు. ఫ్రెంచ్ నవలా రచయితలలో ఉత్తమశ్రేణికి చెందిన వాడుగా మోరియాక్ గుర్తింపు పొందాడు.

కె.బి.మూర్తి

**మోరీ, ఓగాయ్ (1862-1922) :** ఆధునిక జపనీస్ వాఙ్మయ నిర్మాతలలో ప్రముఖుడుగా గణించ బడుతున్న 'మోరీ ఓగాయ్' కలం పేరు. అసలు పేరు 'మోరీ రింటారో'. ఆయన జననం 1862 ఫిబ్రవరి 17న.

ఒక ఉత్తమ వంశంలో జన్మించి 'మోరీ' ఒక వైద్యుని కుమారుడు. ఆయన మొదట టోక్యోలోనూ, ఆ తరువాత జర్మనీలోనూ వైద్యశాస్త్రం అభ్యసించాడు. ఆయన 'మైహిమె' అనే ఒక కథ వ్రాశాడు. వేశ్యకు సంబంధించిన ఆ కథ సాహిత్యలోకంలో సంచలనానికి దారితీసింది. ఒక జపాన్ విద్యార్థికి, ఒక జర్మన్ యువతికి మధ్య నడచిన ప్రణయాన్ని తాను కళ్లారా చూసిన అంశాలను ఆయన అందులో అభివర్ణించాడు. అంతవరకూ ప్రచారంలో ఉన్న వైయక్తిక విషయాల నవల కంటె స్వీయ చరిత్రాత్మక కథగా సాగిన ఆ నవల విలక్షణంగా తోచింది. ఆయన ఇతర నవలలు కూడా ప్రసిద్ధికెక్కాయి. ఆయన ప్రసిద్ధ రచయిత అయిన 'హాన్స్ ఆండర్సన్' స్వీయచరిత్రాత్మక రచనను అనువదించాడు.

1912 లో ఆయనలో ఒక పరిణామం వచ్చింది. ఒక రాజు మరణించిన తరువాత ఒక సైనికాధికారి ఆత్మత్యాగం చేస్తాడు. ఆ విషాద సంఘటనకు ఆయన ఎంతగానో స్పందించాడు. తత్ఫలితంగా నవలా రచనకు స్వస్తిచెప్పి, ఆయన చారిత్రక రచనలు చెయ్యడం మొదలు పెట్టాడు. 'మోరీ' 1922 లో జూలై 9 న టోక్యోలో కాలధర్మం చెందాడు.

పి.ఆర్. శర్మ.

**మోర్గెన్‌స్టెర్న్, క్రిస్టియన్ (1871-1914) :** జర్మన్ కవి, హాస్యరచయిత. ఆధ్యాత్మిక, వ్యక్తిగత గీత రచనల నుండి అర్థరాహిత్య కవిత్వం (Nonsense verse) వరకు అన్ని రకాల రచనలను చేసినవాడు.

బెర్లా, బెర్లిన్ విశ్వవిద్యాలయాల్లో న్యాయశాస్త్రాన్ని అధ్యయనం చేసిన ఈయన క్షయవ్యాధిగ్రస్తుడని 1893 లో కనుగొన్నారు. గాలిమార్పుకై విదేశాలకు వెళ్లాడు. నార్వే వెళ్లి ఇబ్సెన్ పద్య నాటకాలను ఆ రచయిత సహాయంతోనే జర్మన్ భాషలోకి అనువదించాడు. బ్యోర్న్‌సన్, హమ్‌సన్, స్ట్రిండ్‌బెర్గ్‌ల నాటకాలను కూడ అనువదించాడు. స్విట్జర్లాండు వెళ్లి 1908 లో మార్గరెట్ గోస్ బ్రష్ ను వివాహమాడి, 1910 నుండి దక్షిణ టైరాల్‌లో స్థిరపడ్డాడు.

ఈ రచయిత తొలి రచనలలో *నీష్టె* ప్రభావం కనిపిస్తుంది. *ఇన్‌ఫాంటాస్ స్లాస్* (1895) అనే రచనలో అనంత విశ్వానికి సంబంధించినవీ, పౌరాణికమైనవీ, తత్త్వశాస్త్రపరమైనవీ అయిన అనేక సిద్ధాంతాలను కలగాపులగం చేశాడు. *ఇష్ ఉండ్ డీ వెల్ట్* (1998) (I and the World), *ఐన్ సొమ్మర్* (Ein sommer, 1900, (One Summer) లలో భౌతికమైన సౌందర్యాన్ని ఉన్నత శిఖరాలకు తీసుకువెళ్లాడు. *ఐన్‌కెర్* (1910-Introspection), *విర్ ఫాండెన్ ఐనెన్ ఫాడ్* (1914- ఆంగ్లంలో Wer Found a Path) అనే కావ్యాలలో బౌద్ధమత ప్రభావం, ఆంత్రోపోసోఫిస్ట్, అయిన రుడాల్ఫ్ స్టైనర్ ప్రభావం కనిపిస్తాయి. ఈయన రచనలలో కొన్నింటి ఆంగ్లానువాదాలు *సెలెక్టెడ్ పోయెమ్స్*

(1973), *ది డే నైట్ లాంప్ అండ్ అదర్ పోయమ్స్* (1973) గా వెలువడ్డాయి.

మోర్గెన్ స్టెర్న్ అంతర్జాతీయ ఖ్యాతి ప్రధానంగా ఆయన వ్రాసిన అర్థరాహిత్య కవిత్వం ( Nonsense Verse) వలన వచ్చిందే. ఈ కవిత్వంలో ఆయన క్రొత్త మాటలను సృష్టించాడు. సామాన్య పదాలకు అర్థాలను తారుమారు చేశాడు. వాక్యనిర్మాణ పద్ధతులను తల్లక్రిందులు చేశాడు. కాని, ఇవన్నీ కూడా ఒక హేతువాద పరమైన విషయాన్ని వ్యంగ్యంగా చెప్పటానికే చేశాడు. వీటిలో *గాల్ గ్లెనియర్* (1905), *పామ్‌స్ట్రామ్* (1910) ముఖ్యమైనవి.

కె.జి. మూర్తి.

**మోలియే (1622-73) :** సుప్రసిద్ధ ఫ్రెంచ్ నాటక కర్త, నటుడు అయిన 'మోలియే' పారిస్ నగరంలో 1622 జనవరి 15 న జన్మించారు. పారిస్ నగరంలోనే 1673 ఫిబ్రవరి 17 న కాలధర్మం చెందారు.

'మోలియే' గా సాహిత్య జిజ్ఞాసువులకు చిరపరిచితుడైన ఆ నాటక కర్త అసలుపేరు 'బాప్టిస్టె పాక్విలిన్' ఫ్రెంచి సుఖాంత నాటక కర్తలలో మణిపూసగా గణించబడుతున్నాడు.

సంపన్న కుటుంబానికి చెందిన మోలియే కి చదువు సంధ్యలు బాగానే అబ్బాయి. కాని నాటక కళ మీది గాఢాభిమానం కొద్దీ ఆయన యిల్లు విడిచి పెట్టి వెళ్లాడు; నటు డయాడు. తొలి రోజులలో ఆయన అంతగా విజయం సాధించలేదు. ఇలస్ట్రే నాటక కంపెనీ స్థాపనకు ఆయన తోడ్పడ్డాడు. నాటక కంపెనీతో ఆయన ఫ్రాన్స్ అంతటా పర్యటించాడు. కంపెనీకోసం నాటకాలు వెలయించాడు. ఆ నాటకాలలో నటించాడు. విజయపరంపర సాధించాడు. ఆ తరువాత ఆయనే స్వయంగా ఒక నాటక సమాజం స్థాపించాడు. వివిధ వర్గాల వారికి నాటకాలు వ్రాశాడు. 'భార్యలకోసం' పాఠశాల (1662), *లెతార్తుఫె* (1664), *ది ఇంపోస్టర్* (1950), *లెబూర్జ్వా జెంటిల్ హోం* (1670) మొదలైనవి ఆయన ప్రసిద్ధ నాటకాలలో కొన్ని. *ఇంపోస్టర్* (వంచకుడు) తొలుత ప్రదర్శించబడినప్పుడు అది మతాధిపతుల ఆగ్రహావేశాలకు గురి అయింది. తత్ఫలితంగా నిషేధించబడింది. ఆ తరువాత ఆ నాటకంలో కొన్ని మార్పులు చేశాడు. ఆయన నాటకాలు కొన్ని తెలుగు చేయబడ్డాయి.

నాటక కళకోసం తన జీవితాన్ని మీదు గట్టిన ఆ ప్రసిద్ధ నాటకకర్త తన చివరి నాటకం ప్రదర్శిస్తూ రంగస్థలం మీద పడిపోయాడు. ఆ రాత్రే ఆయన శాశ్వతంగా కన్నుమూశాడు.

పి.ఆర్. శర్మ.

**మోష్నాచ్కీ, మోరీసీ (1804-34) :** పోలండ్ రచయిత; సాహిత్య విమర్శకుడు. 34 యేండ్ల అల్పాయుష్కుడే అయినా, మోష్నాచ్కీకి పేరు ప్రఖ్యాతులు గడించాడు. రష్యా వారి పరిపాలనకు వ్యతిరేకంగా 1830 లో చెలరేగిన తిరుగుబాటులో ఆయన పాల్గొన్నాడు. అప్పు డాయన ఒక పత్రికా రచయిత. ఆ తిరుగుబాటు సందర్భంగా ఆయన గాయపడ్డాడు. ఫ్రాన్స్‌కి వెళ్లి అక్కడ తలదాచుకొన్నాడు. 1830-31 సంవత్సరాలలో పోలండ్ వారు చేసిన తిరుగుబాటుకి సంబంధించిన *తిరుగుబాటు* అనే ఆయన రచన అత్యుత్తమ ప్రత్యక్ష కథనంగా భావించబడుతున్నది. 19 వ శతాబ్దపు పోలిష్ సాహిత్యం గురించి ఆయన వెలయించిన వ్యాసాలు అమూల్యాలు. సాహిత్యం ద్వారా ఒక జాతి తన విశిష్ట లక్షణాలను గుర్తించగలదని ఆ వ్యాస పరంపరలో ఆయన వ్యక్తీకరించడం గమనించదగిన అంశం. ఒక జాతి ఆధ్యాత్మిక, రాజకీయ జీవితాలలో సాహిత్యానికి గల పరమ ప్రయోజనాన్ని నిర్వచించిన తొలి పోలిష్ విమర్శకుడుగా ఆయన చిరకీర్తి ఆర్జించాడు. మొదట్లో ఆయన కాల్పనిక వాదాన్ని సమర్థించాడు.

పి.ఆర్.శర్మ

**యాసినే, కాటెబ్ (1929--) :** ఉత్తర ఆఫ్రికా దేశీయుడు. ప్రసిద్ధ ఫ్రెంచి కవి, నవలా రచయిత, నాటకకర్త.

1956 లో వెలువడిన *న్జెడ్మా* ఆయన మొదటి నవల. ఆ తొలి రచనతోనే ఆయన ప్రసిద్ధు డయాడు. ఉత్తర ఆఫ్రికా వాఙ్మయాన్ని అది ఎంతగానో ప్రభావితం చేసింది. ఫ్రెంచివారి పరిపాలన ఫలితంగా తలెత్తిన ఆ ప్రశాంత వాతావరణాన్ని సజీవంగా చిత్రించే నవల అది. పైగా అందులో స్థానిక గాథలు, వాడుకలో ఉన్న మత విశ్వాసాలు, వాటి అంతరార్థాలు మొదలైన పెక్కు విషయాలు ఉదాహృతం కావడం వల్ల ఆ నవల ఇతర ఉత్తర ఆఫ్రికా రచయితలను బహుధా ఆకర్షించింది. ఆ నవలలో అనుసరించబడిన కథా సంవిధానాన్ని 'జేమ్స్ జాయిస్', విలియం ఫాక్‌నర్' ప్రభృతుల కథా సంవిధానాలతో పోల్చడం పరిపాటి. మొరాకో యువ రచయితలు కూడా ఆ నవల ప్రభావానికి లోనయారు.

1945 లో 'యాసినే' చదువు సంధ్యలు ఫ్రెంచ్ వలస పాఠశాలలలో జరిగాయి. ఆ ఏడు తలెత్తిన

తిరుగుబాటును నిర్దాక్షిణ్యంగా అణచివేయడంతో, ఆయన తన చదువుకు స్వస్తి చెప్పాడు. కాని అది ఒకందుకు మంచిదే అయింది. ఆ తిరుగు బాటు *నెడ్జియా* మొదలైన ఆయన వివిధ రచనలకు తగినంత కథా సామగ్రిని సమకూర్చింది.

అల్జీరియా, యూరప్, దూర ప్రాచ్య దేశాలలో 'యాసినే' విస్తృతంగా పర్యటించాడు. ఆ సందర్భంగా రేవు కార్మికుడు మొదలుకొని పత్రికా రచయిత దాకా విభిన్న వృత్తులు అవలంబించాడు. తత్ఫలితంగా ఆయన అనుభవం విస్తృత మయింది; సంచార రచయితగా పేరు పొందాడు. ఆయన కవితలు, మరికొన్ని రచనలు కూడా వెలయించాడు. హోచిమిన్‌ని ఆధారంగా చేసుకొని ఆయన ఒక రచన చేశాడు. కొన్ని రచనలలో పెట్టుబడిదారీ విధానాన్ని ప్రతిఘటిస్తూ శ్రమజీవులు సాగించే పోరాటాన్ని ఆయన అభివర్ణించాడు. ఆయన ఒక నాటక సమాజం కూడా స్థాపించాడు. దాని ఆధ్వర్యంలో ఫ్రాన్స్, అల్జీరియాలలో ఆయన ఫ్రెంచ్ నాటకాలు ప్రదర్శితం అయాయి.

సి.ఆర్.శర్మ

**యిమెనెజ్, జ్వాన్ రామోన్ (1881-1958) :** 1956 లో సాహిత్యానికి నోబెల్ బహుమతిని పొందిన శ్పానిష్ కవి.

సాలమాంకా విశ్వవిద్యాలయంలో కొద్దికాలం చదివాక రూబెన్ డెరియా అనే కవి ఆహ్వానం మీద మాడ్రిడ్ వెళ్లాడు. ఆయన కవిత్వం *ఆల్మాస్ డి వయొలాటా*, (ఊదా ఆత్మలు), *నీన్‌ఫేస్* (నీటి కలువలు) అనే రెండు సంపుటాలుగా మొదట వెలువడింది. ఆ రెండు పుస్తకాలను ఊదా, ఆకుపచ్చ రంగుల్లో వరుసగా ముద్రించారు. ఈ రంగులు చివరి రోజులలో యిమెనెజ్‌కు మిక్కిలి మానసికమైన ఒత్తిడిని కలుగ జేశాయి. దానితో అతడు దొరికిన ఆ పుస్తకాల ప్రతులన్నిటినీ నాశనం చేశాడు. దుర్బల శరీరంతో యిమెనెజ్ మాడ్రిడ్ చేరుకున్నాడు. ఆ రోజులలో వ్రాసిన *పేస్టోరెల్స్, ఎల్జియాస్ పురాన్* (1908) మొదలైన సంపుటాలలో డెరియా ప్రభావం యిమెనెజ్ మీద కనిపిస్తుంది. ఈ ప్రభావం వల్లనే అతడు గేయ కవిత్వాన్ని విశిష్టరీతిలో కుదించ గలిగాడు.

1912 లో యిమెనెజ్ మాడ్రిడ్ తిరిగి వచ్చాడు. తరువాతి నాలుగు సంవత్సరాల రెడిడెన్సర్ ఎస్టిడియెట్స్‌లో ఆ విద్యా సంస్థ నడుపుతున్న పత్రికకు సంపాదకుడయాడు. 1916 లో న్యూయార్క్ వెళ్లి, అక్కడ జెనోబియా కంపూచి ఐమర్‌ను వివాహం ఆడాడు. మరల కొద్ది కాలానికే స్పెయిన్ వచ్చి, *డియారియొ డి అన్ పొయెటా రీసీన్ కేసెడో* (1917) ను ప్రచురించాడు. ఇదే పుస్తకం 1948 లో *డియోరియొ డి అన్ పొయెటా యి మార్* అనే పేరుతో వెలువడింది. ఈ సంపుటం యిమెనెజ్ పేర్కొన్న *లా పొయెసియా డెస్నుడా* (నగ్న కవిత్వం) అన్న శైలికి ఉదాహరణ ప్రాయమైంది. ఆయన వచన కవితలో సంప్రదాయ ఛ్ఛందస్సులను విడనాడి, నూతన రీతిలో వ్రాయడానికి చేసిన ప్రయత్నాలు స్పష్టంగా కనిపిస్తాయి. శ్పానిష్ అంతర్యుద్ధ కాలంలో యిమెనెజ్ రిపబ్లికన్‌లతో కలిసి వారి కార్యక్రమాలలో పాల్గొనేవాడు. దాని పర్యవసానంగా అతడు 'పూర్టో రైకో' కు వలస పోయాడు.

యిమెనెజ్ ప్రధానంగా కవే అయినప్పటికీ, అతడు అమెరికాలో తన గద్యరచన అయిన ప్లాటీరొ యి యో (1917) లో ప్రసిద్ధి పొందాడు. మనిషికీ గాడిదకూ సంబంధించిన కథ అది. భార్యతో కలసి ఐరిష్ నాటకకర్త మిల్లింగ్‌టన్ సింగే వ్రాసిన రైటర్ టు ద సీ (1920) ని శ్పానిష్ భాషలోకి అనువదించాడు. అతడు అనేక గ్రంథాలు రచించాడు. వీటిలో *సానెటోస్ ఎస్పిన్‌ట్యుయేల్స్* (1914-15), *పీడా యి సీలో* (1919), *పోయిసియా ఎన్ వెర్సొ* (1917-23) *పొమెసియా ఎన్ పోసా యి వెర్సొ* (1932), *వోసెస్ డి మి కోప్లా* (1945), *ఏనిమల్ డి ఫాండో* (1947) ముఖ్యమైనవి. 1962 లో ఎలోయీస్ రోచ్ ఇంగ్లీష్‌లోకి అనుసరించి ప్రచురించిన 300 యిమెనెజ్ పద్యాలు (1903-53) ప్రశంసలు అందుకొన్నాయి.

వెం.వెం.

**యీట్స్, విలియమ్ బట్లర్ (1865-1939) :** ప్రతిభా సంపన్నుడయిన ఆంగ్లకవి, నాటకకర్త. 1923 లో నోబెల్ పురస్కారం పొందిన మహాకవి. ఆంగ్లంలో కవిత్వం చెప్పినా, జన్మభూమి అయిన ఐర్లండు పట్ల ఎక్కువ ప్రేమ గల వాడు. ప్రొటెస్టెంట్ క్రిస్టియన్ కావడం మూలాన ఐర్లండులో పాలన సాగిస్తున్న కేథలిక్కుల ప్రేమ పొందలేక పోయాడు. ఇక ఇంగ్లండులోని ప్రొటెస్టెంట్ క్రిస్టియన్‌లు కేవలం లౌక్యులు కావడం మూలన వాళ్లతోను సామరస్యంగా ఉండలేక పోయాడు.

యీట్స్ స్వదేశమైన ఐర్లండు బ్రిటిషు సామ్రాజ్యం నుండి వైదొలగి స్వతంత్ర దేశం కావాలని అభిలషించాడు. మాతృభూమి పట్ల ఉన్న ప్రేమాభిమానాలు ఇతని కవిత్వంలో ఆద్యంతం వెల్లడి అయాయి. ఇతని

కవిత్వానికి చాలామటుకు డబ్లిన్‌లోని స్లిగో ప్రాంతం నేపథ్యం అయింది.

యీట్స్ ద్రష్ట. ఆంగ్లకవి విలియమ్ బ్లేక్ కవిత్వంచే ప్రభావితుడై కవితా రచన చేశాడు. *ది వాండరింగ్స్ ఆఫ్ ఓసిన్ అండ్ అదర్ పోయెమ్స్* (1889) అనే సంకలనంలోని కవితలు హృద్యంగా ఉండటమే కాక భవ బంధాల నుంచి విముక్తికోసం అల మటించే ఆర్తిని వెల్ల డిస్తాయి. *ది రోజ్, ది విండ్ అమాంగ్ ది రీడ్స్ ఇన్ ది సెవెన్ వుడ్స్, ది టవర్, ది రెస్పాన్సిబిలిటీస్* యీట్స్ కవితా సంకలనాల్లో ముఖ్యమైనవి.



ఐర్లండు స్వతంత్ర రాజ్యంగా ప్రకటింపబడిన తరువాత యీట్స్ 1922 నుంచి ఆరేళ్లపాటు ఐరిష్ సెనేట్‌లో సభ్యుడుగా పనిచేశాడు. యీట్సు 1923 లో ప్రపంచంలో అత్యున్నతమైన నోబెల్ బహుమతిని పొందాడు. ఇతని ఆధ్యాత్మిక చింతన *ఏ విజన్* గా 1925 లో ప్రచురింపబడింది. 1929 లో వెలువడిన *ది వైండింగ్ స్టైర్* లో యీట్స్ విశిష్టమైన రచనలు చేర్చబడ్డాయి.

యీట్స్ గొప్ప నాటక రచయిత. డబ్లిన్‌లోని ఆబే థియేటర్ (Abbey Theatre) స్థాపకులలో ఒకరు. *ఆన్ బెయిల్స్ స్ట్రాండ్, ఎట్ ది హాక్స్ వెల్* మొదలైన నాటకాలను వ్రాసి ఈ రంగస్థలం పైనే ప్రదర్శింప జేశాడు. ఇతని నాటకాలు కేథలిక్కు మత విరుద్ధమనీ, ఐరిష్ వ్యతిరేకమనీ వివాదగ్రస్త మయాయి. రంగస్థలం మీదనే కాక, డ్రాయింగు రూములో కూడ ప్రదర్శించేందుకు వీలయిన *ఫోర్ ప్లేస్ ఫర్ డాన్సర్స్* అనే నాటకాలను కూడా వ్రాశాడు. *ది కౌంటెస్ కేథలీన్* ఈ రకం నాటకాలకు శైలికి ఉదాహరణం. యీట్స్ నాటకాలన్నీ *కలెక్టెడ్ ప్లేస్* లో సంకలింప బడ్డాయి.

యీట్స్ భారతీయ తత్త్వశాస్త్రం వల్ల కూడ ప్రభావితుడై, కొన్ని ఉపనిషత్తులను *ది టెన్ ప్రిన్సిపల్ ఉపనిషద్స్* అనే పేరుతో ఆంగ్లం లోకి అనువదించాడు. యీట్స్ విశ్వకవి రవీంద్రుని *గీతాంజలి* ని పాశ్చాత్యులకు పరిచయం చేసిన సహృదయుడు. జి.అ.వా.

**యూకెన్, రుడోల్ఫ్ క్రిస్టోఫ్ :** చూ. అనుబంధం.

**యూరిపిడీజ్ (క్రీ.పూ. 484-406) :** గ్రీక్ విషాదాంత నాటక రచయితలు ముగ్గురిలో చివరివాడు. ఈస్కిలస్, సోఫోక్లీసు మిగత ఇద్దరు మహానాటక రచయితలు. మొత్తం 92 నాటకాలు వ్రాశాడనీ, వాటిలో 67 నాటకాల పేర్లు మాత్రమే మనకు తెలిశాయనీ గ్రీక్ సాహిత్య చరిత్రకారుల అభిప్రాయం. ఇప్పుడు మనకు కేవలం 19 నాటకాలు మాత్రమే లభిస్తున్నాయి. డయోనిసియాక్ పండుగల్లో యూరిపిడీజ్ జీవితకాలంలో నాలుగు సార్లు మాత్రమే తన నాటకాలకు బహుమతి గెల్చుకొన్నాడు. మరణానంతరం ఒకసారి అతని నాటకం పురస్కృతి నందుకొన్నది.

యూరిపిడీజ్ వ్రాసిన మొదటి నాటకం *ర్హీసస్*. థ్రేసిన్ రాజైన ర్హీసస్ ట్రాయ్ యుద్ధం జరుగుతున్నప్పుడు ఇద్దరు గ్రీకు వీరులచే ఒక రాత్రి హత్య చేయబడటం ఈ నాటక కథా వస్తువు. కుతూహల జనకంగా శరవేగంతో నడిచే ఈ నాటకం ప్రేక్షకుల మెప్పు పొందింది.

యూరిపిడీజ్ ప్రసిద్ధ నాటకాల్లో *మిడియ* ఒకటి. భర్తకోసం తండ్రిని, అన్నను బలిచేసిన ఒక స్త్రీ కథ ఈ నాటకం. చివరికి ప్రియునిచే మోసగింపబడి ద్వేషంతో ప్రతీకారం ఆమె తీర్చుకొంటుంది. స్త్రీ పురుష సంబంధాలు, నాగరకత, అనాగరకత, న్యాయాన్యాయాలు ఈ నాటకంలో నాటకీయంగా చర్చింపబడ్డాయి. ట్రాయ్ పతనం తరువాత శత్రువులకు బందీ అయిన రాణి హెకొబ తన కొడుకు హత్యకు గురికావడం వల్ల ద్వేష మూర్తి కావడం *హెకొబ* లో చిత్రింపబడింది. *ఎలెక్ట్రా* పౌరాణిక పాత్రలలో మానవీయ రాగద్వేషాలను చొప్పించి వ్రాయబడిన నాటకం. ఇది చాలా ప్రసిద్ధరచన. *ఒరిస్టీస్* నాటకంలో రచయిత పౌరాణిక కథా వస్తువులో అంతర్గతమైన విలువలను ప్రశ్నించి, పరిహాసం చేస్తాడు. *దబ్బాకె* యూరిపిడీజ్ చివరి నాటకం. అతి విశిష్టమైన నాటకం ఇది. దేవతలకు తల వంచే మనుష్య ప్రవృత్తిని తీవ్రంగా ఖండిస్తా డీనాటకంలో యూరిపిడీజ్. *సైక్లోప్స్* వ్యంగ్య నాటకం. మానసికోల్లాసం కోసమే రచింపబడిన నాటకం. ఈ రచనలోని వైవిధ్యం అద్వితీయం.

యూరిపిడీజ్ పౌరాణిక సామగ్రిని కథా వస్తువుగా స్వీకరించి, పౌరాణిక పాత్రలనే చిత్రించినా దృక్పథం మాత్రం భిన్నమైనది. పౌరాణిక పాత్రల ఘనతను తుత్తు

నియలు చేసి, వారిలోని స్వార్థ, ద్వేష, అల్పత్వ, క్రౌర్యాలను శక్తిమంతంగా చిత్రించాడు రచయిత. హోమర్, సోఫోక్లీస్, ఈస్కిలస్ పురాణ పురుషులలోని ఉదాత్త తను చిత్రిస్తే, యూరిపిడీజ్ వారిలోని నైచ్యాన్ని బహిర్గతం చేశాడు. మనిషిలోని రాగద్వేషాలకు కళ్లెం వేయకపోతే, అవి విశృంఖలమై అతని బ్రతుకును ఛిన్నభిన్నం చేస్తాయని నాటకకర్త నిరూపించాడు.

ఇతర నాటక కర్తల రచనలలో దొరకని యాతన, సంఘర్షణ, గందరగోళం, క్రౌర్యం మనకు యూరిపిడీజ్ నాటకాలలో కనపడతాయి. స్త్రీ పాత్రలలోని అనంతమైన వైవిధ్యం మనకు ఆశ్చర్యం కలిగిస్తుంది. గ్రీక్ నాటకాల్లో ఉపక్రమణిక, (Prologue) ఉపసంహారం (Epilogue) చేర్చిన వాడితడే. కోరస్‌ను తక్కువగా వాడుకోడం, హృదయాన్ని తాకే శైలిని ప్రయోగించడం యూరిపిడీజ్ నాటకాలలోని మరికొన్ని విశిష్టతలు.

జి.అ.నా.

**యెన్సెన్, యొహానెస్ వి. (1873-1950) :** ప్రముఖ డేనిష్ నవలా రచయిత, కవి, వ్యాస రచయిత, కల్పితగాథా రచయిత. చివరి రోజులలో డార్విన్ సిద్ధాంతాన్ని అనుసరించి మానవుని పరిణామాన్ని చిత్రించడానికి ఈయన చేసిన ప్రయత్నం పలు విమర్శలకు గురి అయింది. 1944 లో సాహిత్యంలో ఈయనకు నోబెల్ బహుమతి ఇచ్చారు.

ఒక రైతు కుటుంబంలో ఒక పశువైద్యునికి కుమారుడు గా జన్మించిన యెన్సెన్ వైద్య విద్య అభ్యసించడానికి 'కోపెన్ హాగన్' నగరానికి వెళ్లాడు. కాని అక్కడ ఆయన రచనా వృత్తి చేబట్టాడు. మొదట కథానికా రచయితగా ఆయనకు గుర్తింపు వచ్చింది. ఆయన కథలను మూడు వర్గాలుగా విభజించ వచ్చును: 1. హిమ్మర్లాండ్ కథలు, 2. యెన్సెన్ దూర ప్రాచ్య దేశాలలోని పర్యటనకు సంబంధించిన యాత్రా కథలు (ఈ కథల వల్లనే ఈయన డెన్మార్క్ దేశపు క్రిప్లింగ్‌గా ప్రసిద్ధి పొందాడు.) 3. *మైటర్* (Miths) అనే శీర్షికతో ప్రకటించిన 100 పై చిలుకు కథలు. యెన్సెన్ తొలి రచనలలో చరిత్రాత్మకమైన మూడు భాగాలతో కూడిన *ది ఫాల్ ఆఫ్ ది కింగ్* (1900-01), డెన్మార్క్ దేశపు రెండవ క్రిస్టియన్ రాజు కల్పిత జీవిత చరిత్ర చెప్పుకోదగ్గవి.

తరువాత కొద్ది కాలానికే అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ఆయన చేసిన పర్యటన ఫలితంగా *మదామ్ దోరా* (1904), *హ్జులెట్* (చక్రం-1905) అనే రెండు రచనలు వెలువడ్డాయి. 1906 లో ఒక కవితా సంపుటం, తుది రోజులలో 1943 లో *డిగ్టే* అనే మరో కవితా సంపుటం ఆయన ప్రకటించాడు.

యెన్సెన్ ఖ్యాతికి ప్రధాన కారణాలైన ఆరు నవలలు: *డెన్‌లాంగ్ రెజ్‌సే* అనే సామాన్య శీర్షికతో 1908-22 మధ్య ప్రకటింపబడ్డాయి. తరువాత మూడు సంపుటాలలో *ది లాంగ్ జర్నీ* అనే మరొక నవల 1922-24 మధ్య వెలువడింది. మిక్కిలి అనాగరక పరిస్థితుల నుండి మానవుడు క్రమ వికాసం చెందుతూ వచ్చి కొలంబస్ అమెరికాను కనుగొనే సంఘటన వరకూ ఎలా క్రమ పరిణామం చెందిందీ వివరించే ఈ రచనలో యెన్సెన్ భావనాశక్తి, ఔత్సాహిక మానవ శాస్త్ర వేత్త గా ఆయన చూపిన నైపుణి అభివ్యక్తం అవుతాయి. 1950 నవంబరు 25 న కోపెన్‌హాగన్‌లో యెన్సెన్ తుదిశ్వాస విడిచాడు.

శే.వెం.న.

**యెవ్‌టుషెంకో, యెవ్‌జెనీ (1933--) :** స్టాలిన్ తరువాతి తరం రష్యన్ కవులకు నాయకత్వం వహించిన ప్రతిభా సంపన్నుడు. రచయితలకు రచనా స్వాతంత్ర్యం ఉండాలనీ, రాజకీయ నిబద్ధత కన్న, సౌందర్య దృష్టి ప్రధానమనీ ఎలుగెత్తి చాటి, వాటికై పోరాడిన ధీమంతుడు. 1950-60 దశకంలో రచయితలపై రష్యా ప్రభుత్వపు భల్లూకపుపట్టు కొంత సడలడానికి కారణభూతుడు.



యెవ్‌టుషెంకో తొలి రచనలలో ముఖ్యమైనది *స్టాన్ ట్సియా జిమా* (1956; Zim junction 1962) అనే కథాగేయం. స్టాలిను మరణానంతరం ఇతడు ఒక్క వెలుగు వెలిగాడు. గొప్ప వక్త, ప్రచారకుడు, సాహసి అయినందువలన సోవియట్ యువతరానికి నాయకుడు కాగలిగాడు. విప్లవ కవులలో తొలి తరానికి చెందిన వ్లాడిమిర్ మయకోవ్‌స్కి, సెర్జియెసినిన్ కవితలలోని నీరస పదజాలానికి, నినాదాలకు బదులుగా రమణీయమైన పదజాలాన్ని, కోమలమైన భావాలను కవిత్వంలో

ప్రవేశపెట్టిన ఘనుడు. ప్రేమ కవితలు, భావగీతాలు వ్రాసి ప్రసిద్ధి కెక్కాడు.

*బేబియార్* (1961) అనే కవితలో 34,000 మంది యూక్రేనియన్ యూదులను చంపిన నాజీచర్యను ఖండిస్తూ వ్రాసిన శోకగీతం చెప్పుకోదగ్గది. యూరప్, అమెరికాలలో పర్యటిస్తూ తన కవితలను వినిపిస్తూ రష్యాతో ఆ దేశాలకు సామరస్యం కలిగించేందుకు ప్రయత్నించాడు. కాని అతని *ఆత్మకథ* పారిస్‌లో ప్రచురింపబడిన (1963) తరువాత స్వదేశానికి రప్పించబడ్డాడు. *బ్రాట్స్ స్టేషన్* (1966) అనే కవితా మాలికకు మొదట రష్యన్ భాషలో ప్రచురింపబడినప్పుడు గొప్ప కీర్తి లభించింది. యెవ్‌టుషెంకో ఈ కవితామాలికలో సైబీరియాను దేశ వ్యాప్తమైన కారాగారంగాను, సైబీరియాలోని విద్యుచ్ఛక్తి కేంద్రాన్ని వెలుగు నిచ్చే వాహికగాను ప్రతీకాత్మకంగా చిత్రించాడు. అమెరికా సంయుక్త రాష్ట్రాలను గురించి వ్రాసిన కవితలలో నుంచి కొన్నింటిని తీసుకొని, వాటి ఆధారంగా *అండర్ ది స్కిన్ ఆఫ్ ది స్టాట్యూ ఆఫ్ లిబర్టీ* అనే నాటకాన్ని రూపొందించాడు. తొలి నవల *వైల్డ్ బెరీస్* (1984) అనే పేరుతో ఆంగ్లంలోనికి అనువదింపబడింది. అదే సంవత్సరం *ఆర్డాబియోలా* అనే నవల ఆంగ్లంలోకి అనూదిత మయింది.

జి.ఆ.నా.

**యెసెనిన్, సెర్జి అలెక్సాండ్రోవిచ్ (1895-1925) :** రైతు కుటుంబంలో పుట్టి, రైతుల సాధక బాధకాలకు కవితా రూపం ప్రసాదించిన రష్యన్ కవి. వ్యసనాలకు బానిస అయి, ఉద్రేకాన్ని అణచుకోలేక అసభ్యవర్తనలకు దిగడం వల్ల గౌరవం కోల్పోయాడు. రష్యాలో వస్తున్న సామాజిక, రాజకీయ పరిణామాలకు అనుగుణంగా మారలేక, ద్వంద్వావస్థలో చిక్కుకుని, తీరని అశాంతికి గురియై ఆత్మహత్య చేసుకొన్నాడు.

యెసెనిన్ తన 17 వ ఏట స్వగ్రామం వదలి మాస్కో చేరుకొన్నాడు. కొంతకాలం తరువాత పెట్రో గ్రాడ్ (లెనిన్‌గ్రాడ్) వెళ్లి, అక్కడి రైతు కవులతో, విప్లవ కవులతో చెలిమి చేశాడు. అతడు 1916 లో ప్రచురించిన తొలి రచన *రదునిత్స* (Ritual for the Dead) బైబిలు సంప్రదాయానికి చెందిన పదచిత్రాలతో, పాత్రలతో ధార్మిక నేపథ్యంలో నిర్మింపబడిన రచన.

*ఇనోనియా* (Inonia 1918; Other Land) యెసెనిన్ మలిరచన. కవి ఈ కావ్యంలో లక్షలాది రైతులకు, కూలీలకు ఉజ్జ్వల భవిష్యత్తు లభిస్తుందనే ఆశతో రష్యన్ విప్లవాన్ని ఆహ్వానించాడు. ఈ కవి నగర పారిశ్రామికీకరణం కంటె వ్యవసాయాభివృద్ధి ద్వారా గ్రామీణాభ్యుదయానికి పాటుపడటమే శ్రేయస్కరమని భావించాడు. 1920-21 లో వెలువడిన గేయనాటకం *పుగచ్యోవ్* లో బృహత్ కర్షక ఉద్యమాన్ని లేవదీసిన రైతు నాయకుని గొప్పగా కీర్తించాడు. ఇమేజిస్టు కవిగా, కాఫీ క్లబ్బుల్లో కవితాగానం చేసే కవి కుమారుడుగా యెసెనిన్ పేరు పొందాడు.

యెసెనిన్ ఒక అమెరికన్ నర్తకిని పెండ్లాడి, విశృంఖలజీవితం అనుభవిస్తూ అమెరికాలో కొంతకాలం గడిపాడు. ఆమెకు విడాకు లిచ్చిన తరువాత రష్యాకు తిరిగి వచ్చాడు. నిరాశ, ఆత్మాతిశయంతో కూడు కొన్న *ఇస్పొవెద్ ఖులిగానా* (1921: Confessions of Hooligan), *మోస్క్వా కబట్స్కాయా* 1924: (Moscow of the Taverns) అనే కవితా సంకలనాలు వెలువరించాడు. నగర జీవితంతో విసిగి, పల్లె ప్రాంతానికి పోవాలని యత్నించాడు. కాని పల్లీయులు కూడా మార్క్సు సిద్ధాంతాలు చర్చిస్తుంటే, ఆ పరిజ్ఞానమే లేనందువల్ల వాళ్లమధ్య ఇముడలేక పోయాడు. ప్రజాకవిగా రాణించలేక పోయాననే బాధతో జాతీయ జీవన స్రవంతిలో లీనం కావాలని ప్రయత్నం చేశాడు. కాని విఫలుడయాడు. *ది స్టెర్న్ అక్టోబర్ హాజ్ డిసీవ్డ్ మీ* (The Stern October has Deceived Me") అనే కవితలో తాను బోల్షివిక్ విప్లవానికి దూరమై పోయానని స్పష్టంగా చాటుకొన్నాడు.

యెసెనిన్ జీవితం నిరాశ, పరాజయాలతో కూడు కొన్నది. విశృంఖలమైనది. *చెర్నీ చెలోవెక్* (The Black Man) అనే చివరి విశిష్టమైన కవితా సంకలనంలో యెసెనిన్ తన వైఫల్యాలన్నింటినీ చిత్రించాడు. యెసెనిన్ పాటలు బహుళ జనాదరణ పొందాయి. కరుణార్ద్రమైన గీతాల్లోని ఆకర్షణీయమైన పదచిత్రాలు సహృదయులను ఆకట్టుకొన్నాయి. నిజ జీవితంలో భగ్నమనోరథుడైనా యెసెనిన్ రష్యన్ సాహిత్యంలో అజరామరు డయాడు.

జి.ఆ.నా.

**రస్కిన్, జాన్ (1819-1900) :** విఖ్యాత ఆంగ్ల వ్యాస రచయిత, కళావిమర్శకుడు, మేధావి. రస్కిన్‌కు తల్లిద్వారా శీలసంపద, తండ్రి ద్వారా కళాభిరుచి, సాహిత్య రసికత వారసత్వంగా సంక్రమించాయి. తల్లి తన కొడుకు క్రైస్తవ మత గురువు కావాలని ఆశిస్తే, తండ్రి మంచి కవి కావాలని అభిలషించాడు.

జాన్ రస్కిన్ కళా పిపాసువు. అతడు ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో విద్యార్థిగా ఉన్న రోజులలో రోము, వెనిస్, స్విట్జర్లండు మొదలైన ప్రాంతాలు పర్యటించి, అక్కడి ప్రకృతి సౌందర్యానికి పరవశించాడు. తాను

ఎన్నో సుందర చిత్రాలను గీశాడు. రస్కిన్ అంతకు మునుపే జె.ఎమ్. డబ్ల్యు. టర్నర్ చిత్రాలను సేకరించి ఉంచాడు. రస్కిన్ ప్రకృతి దృశ్యాల చిత్రాలను ఒకవైపు గీస్తూ, మరొకవైపు మూర్తి చిత్రకళను ఆరాధించ సాగాడు. గోథిక్ కళను రస్కిన్ అభిమానించాడు. టర్నర్ మీద విశేషమైన అభిమానంతో *మోడర్న్ పెయింటర్స్* మొదటి సంపుటాన్ని 1843 లో వెలువరించాడు. తరువాత నాలుగు సంపుటాలను ప్రకటించాడు. రస్కిన్ మధ్యకాలీన వాస్తుకళను ప్రత్యేకంగా అధ్యయనం చేసి *ది సెవెన్ లాంప్స్ ఆఫ్ ఆర్కిటెక్చర్* అనే గ్రంథాన్ని 1849 లో రచించాడు. *ది స్టోన్స్ ఆఫ్ వెనిస్* మూడు సంపుటాలుగా (1851-53 మధ్య) వెలువడి రస్కిన్‌ను కళావిమర్శకుడుగా సుప్రతిష్ఠితుని చేశాయి. రస్కిన్ మధ్యయుగపు చిత్ర, వాస్తుకళలను అభిమానించినంతగా ప్రాచీన, ఆధునిక కళలను ఆదరించలేదు. రస్కిన్ అభిప్రాయాలు కళా జగత్తులో గొప్ప వివాదాలను రేకెత్తించాయి. రస్కిన్ 1869 లో ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో స్లేడ్ లలిత కళాచార్యుడుగా నియమింపబడ్డాడు. ఆయన ఉపన్యాసాలు, రచనలు అభిమానులను ప్రభావితం చేశాయి.

జాన్ రస్కిన్ సమకాలీన, సాంఘిక, విద్యా, కార్మిక క్షేత్రాలలోని స్థితిగతులను తీవ్రంగా విమర్శించి ఎన్నో రచనలు చేశాడు. అన్ని రంగాలలోనూ కళాత్మక, నైతిక విలువలు దిగజారుతున్నా యని, వ్యాపార విలువలు విజృంభిస్తున్నాయని వాపోయాడు. రస్కిన్ విద్యాక్షేత్రంలోని పరిస్థితులను విమర్శిస్తూ వ్రాసిన రచనలు సమకాలీన మేధావులచే చర్చింపబడ్డాయి. రస్కిన్ వ్రాసిన *అన్ టు దిస్ లాస్ట్* (1862) గాంధీజీని గొప్పగా ప్రభావితం చేసిన వ్యాస సంకలనం.

జాన్ రస్కిన్ గొప్ప వ్యాసకర్త. *సెసేమ్ అండ్ లిలీస్, ది క్రౌన్ ఆఫ్ వైల్డ్ ఆలివ్* అనే వ్యాస సంకలనాలు ఉదాత్తం, నిసర్గసుందరం, సరళం అయిన జీవిత విధానాన్ని ప్రబోధించే రచనలు. శ్రీమంతుడైనా, సుఖశాంతులకు నోచుకోలేక పోయిన రస్కిన్‌ను టాల్‌స్టాయ్ మహారచయితగా ప్రశంసించాడు. రస్కిన్ భావ సరణితో ఏకీభవించనివారు ఆనాడూ ఈనాడూ ఉన్నా ఆయన గద్యశైలీ ప్రసన్నతకు ముగ్ధులు కాని వారు ఎవ్వరూ లేరని చెప్పవచ్చును.

జి.అ.నా.

**రసీన్, జీన్ (1639-99) :** సుప్రసిద్ధ ఫ్రెంచి నాటక రచయిత. జాన్సెనిస్ట్ సంప్రదాయానికి చెందిన పాఠశాలలో విద్యాభ్యాసం చేశాడు. పోర్ట్ రాయల్ మతాధికారులీ పాఠశాలను నడిపేవారు. రసీన్ చిన్నతనంలోనే కేథలిక్ మత సిద్ధాంతాలలో స్థిరపడటానికి అవసరమైన శిక్షణను సమగ్రంగా పొందాడు. చిన్నతనం నాటి మత సిద్ధాంతాల ప్రభావం రసీన్ వ్రాసిన నాటకాలలో స్పష్టంగా గోచరిస్తుంది. మోలియర్, లా ఫాంటెన్, బ్వాలో మొదలైన సాహితీ వేత్తలతో మైత్రిని సంపాదించాడు. కార్నేల్‌తో పోటీ పడటం వలన తన నాటక రచనా వ్యాసంగంలో రసీన్ ఎన్నో ఇక్కట్లను ఎదురుకోవలసి వచ్చింది. *ఫీద్రా* నాటకం ప్రదర్శింపబడిన తరువాత రసీన్ రంగస్థలానికి వీడ్కోలు నిచ్చి ప్రశాంత జీవనాన్ని గడపడానికి నిశ్చయించి పారిస్ నగరాన్ని విడిచి వెళ్ళాడు.

రసీన్ వ్రాసిన నాటకాలలో *ఫీద్రా* అగ్రగణ్యమైంది. సులభశైలిలో సూటిగా మానసిక సంక్షోభాన్ని, పాత్రల మనస్తత్వాన్ని, ప్రకటించడంలో రసీన్ సిద్ధహస్తుడు. *లాతిబైడ్* (1664), *అలెగ్జాండర్* (1665), *అంద్రోమాకీ* (1667), *బ్రిటానికస్* (1669), *బెరెనిసి* (1670), *బజాజెట్* (1672), *మిత్రిదాటి* (1674), *ఇఫిజినీ* (1674), *ఫీద్రా* (1677) మొదలైనవి రసీన్ రచించిన నాటకాలు. రంగస్థలం నుండి విరమించిన వెనుక *ఎస్తర్* (1688), 'అథాలీ' (1690) అనే రెండు నాటకాలను బైబిల్ కథావస్తువుగా రచించాడు. రసీన్ నాటకాలపై 'యూరిపిడీస్' అనే గ్రీక్ నాటక రచయిత ప్రభావం గాఢంగా కన్పిస్తుంది. చారిత్రకాంశాలు ఆధారంగా కూడా కొన్ని నాటకాలను రసీన్ వ్రాశాడు.

శ్రీ.ల.

**రసెల్, బెర్‌ట్రాండ్ (1872-1970) :** తార్కికుడు, తత్త్వవేత్త, శాంతికాముకుడు, మానవతావాది, విశ్వవిఖ్యాతి పొందిన మేధావి. బెర్‌ట్రాండ్ రస్సెల్ నోబెల్ బహుమతి పొందిన సాహితీ వేత్త. బెర్‌ట్రాండ్ రసెల్ 1872 వ సంవత్సరం మే 18 వ తేదీన ఇంగ్లండులోని ఒక కులీన కుటుంబంలో జన్మించాడు. ఇతని పితామహుడు



జాన్ రస్సెల్ రెండుసార్లు బ్రిటన్ ప్రధానమంత్రిగా ఎన్నికై, మొదటి ఎర్ల్‌గా గౌరవం అందుకొన్నాడు

రసెల్ మహామేధావి. అతడు 1892 లో కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయం నుంచి గణితశాస్త్రం ఆనర్సు ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడయాడు. తరువాత 1894 లో నీతి శాస్త్రంలో ప్రథమశ్రేణి పట్టా పొందాడు. రసెల్ మొదట ఆదర్శవాదిగా ఉండి, తరువాత భౌతికవాదిగా మారాడు.

రసెల్ జీవితాన్ని శాస్త్రీయ దృక్పథం, మానవతా వాదం ప్రబలంగా ప్రభావితం చేశాయి.

రసెల్‌కు తర్కం, గణితం అత్యంత ప్రీతిపాత్రమైన విషయాలు. అతడు 1902 లో రచించిన *ది ప్రిన్సిపల్స్ ఆఫ్ మేథమెటిక్స్* బుద్ధి జీవుల ప్రపంచంలో సంచలనం కలగించింది. రసెల్ మిత్రుడైన ఎ.ఎన్.వైట్ హెడ్‌తో కలసి ప్రచురించిన *ప్రిన్సిపియా మేథమేటికా* మూడు సంపుటాలు తర్కశాస్త్ర ప్రపంచంలో గొప్ప చర్చలకు దారి తీశాయి.

రసెల్ దృష్టి తర్కశాస్త్రం నుంచి తత్త్వశాస్త్రం వైపు మళ్లింది. రసెల్ తాత్త్విక రచనలు తత్త్వశాస్త్రంలో విశ్లేషణ ఉద్యమానికి ఉత్తేజం కలిగించాయి. *ఏ క్రిటికల్ ఎక్స్‌పొజిషన్ ఆఫ్ ది ఫిలాసఫీ ఆఫ్ లీబ్‌నిజ్, ఫిలసాఫికల్ ఎస్సేస్, ది ప్రాబ్లమ్స్ ఆఫ్ ఫిలాసఫీ, అవర్ నాలెడ్జ్ ఆఫ్ ఎక్స్‌టర్నల్ వరల్డ్, వై అయామ్ నాట్ ఏ క్రిస్టియన్, హిస్టరీ ఆఫ్ వెస్టర్న్ ఫిలాసఫీ, మై ఫిలసాఫికల్ డెవలప్‌మెంట్* మొదలైన రచనలు రసెల్ తాత్త్విక ప్రపంచానికి అద్దం పడతాయి.

బెర్‌ట్రాండ్ రసెల్ సగటు పాఠకుని కోసం వ్రాసిన రచనలు ప్రపంచంలోని చాలా భాషలలోకి అనువదింపబడి అశేష ప్రచారం పొందాయి. వాటిలో ముఖ్యమైనవి: *ది ఎబిసి ఆఫ్ రిలేటివిటీ, మారేజ్ అండ్ మోరల్స్, ది కాంక్వెస్ట్ ఆఫ్ హాపీనెస్.*

బెర్‌ట్రాండ్ రసెల్ విశ్వశాంతిని కోరి యుద్ధాలను నిరసించాడు. పరమాణు ప్రయోగాన్ని నిరసించాడు. 1958 లో మహామహులతో కలసి విశ్వవ్యాప్తమైన ఉద్యమాన్ని చేపట్టి అణ్వాస్త్ర నిషేధానికై కృషిచేశాడు. రసెల్ వృద్ధాప్యంలో కూడా విశ్రమించక క్యూబా సంక్షోభం, ఇండో చైనా యుద్ధం సందర్భాలలో శాంతి, సామరస్యాలకై త్రికరణ శుద్ధిగా ప్రయత్నించాడు.

బెర్‌ట్రాండ్ రసెల్ ఆసక్తికరంగా, ఆహ్లాదకరంగా విషయగర్భితంగా, ఛలోక్తులతో *స్వీయ చరిత్ర* మూడు సంపుటాలలో వ్రాశాడు. ఎ విలువైన గ్రంథంగా ప్రముఖుల ప్రశంసలు పొందింది. బెర్‌ట్రాండ్ రసెల్ 1950 లో సాహిత్యానికి నోబెల్ బహుమతి పొందాడు. ఈ మహామేధావి 1970 వ సంవత్సరం ఫిబ్రవరి 2 వ తేదీన మరణించాడు.

జి.అ.నా.

**రాంబో, ఆర్థూర్ (1854-91) :** ఫ్రెంచ్ కవి. ప్రతీకావాదానికి ఆద్యుడుగా పరిగణింప బడినవాడు. సర్రియలిజమ్ ఉద్యమానికి కూడా మూలం రాంబో కవిత్వంలో కన్పిస్తుంది. కవిత్వంలో భాషా పరంగానూ, వస్తుగతంగానూ చాలా ప్రయోగాలను చేశాడు. ఫ్రీవర్స్‌ని పాక్షికంగా తన కవిత్వంలో ప్రవేశపెట్టాడు. శబ్దార్థ సంయోగాన్ని, పదబంధాన్ని విడమరచి, ప్రత్యేక మైన శక్తిని సంతరించుకునే రీతిలో రచన చేశాడు. విచిత్రమైన రూపకాలనూ, ఉపమానాలనూ, ప్రతీకలనూ పుష్కలంగా వాడాడు. హేత్వతీతమైన మానసికావస్థలకు, మనోవిభ్రమాలకు, స్వాప్నిక దృశ్యాలకు అత్యంత ప్రాధాన్యం కల్పించాడు. *లెస్ ఇల్యూమినేషన్స్* (వచన పద్యాలు), *ద డ్రంకెన్ బోట్, ఏ సీజన్ ఇన్ హెల్* అనే రచనలు సుప్రసిద్ధాలు. తన అంతరంగ సంఘర్షణను *ఏ సీజన్ ఇన్ హెల్* అనే రచనలో ప్రతిభావంతంగా వ్యక్తం చేశాడు. రాంబో వ్యక్తిత్వం అతి విచిత్రమైంది. బాల్యంలో పేదరికం అనుభవిస్తూ, క్రమశిక్షణ మూర్తీభవించిన జీవితాన్ని గడిపిన రాంబో 15 ఏళ్ల ప్రాయం తరువాత అనియత స్వేచ్ఛా జీవితాన్ని ప్రారంభించాడు. పాపం ద్వారా, పరితాపం ద్వారా భగవద్దర్శనం పొందాలని ప్రయత్నం చేశాడు. ప్లేటో, కబాలా, బౌద్ధం, మంత్ర తంత్రాలు మొదలైన వానిని అధ్యయనం చేశాడు. పాల్ వెర్లేన్ అనే ఫ్రెంచి కవితో గాఢమైన పరిచయం కలిగింది. వెర్లేన్ కవిత్వాన్ని రాంబో ప్రభావితం చేశాడు. దేశద్రిమ్మరిగా జీవితంలో చాలాభాగం వ్యయం చేసిన రాంబో, ఆఫ్రికాలో వ్యాపారిగా కూడా కొన్నాళ్లు గడిపాడు. జీవితాన్ని కూలంకషంగా దర్శించిన తత్త్వవేత్తగా రాంబోను పరిగణిస్తారు. 20 వ శతాబ్దపు కవులపై రాంబో ప్రభావం గణనీయమైంది.

శ్రీ.ల.

**రాబర్ట్స్, సర్ ఛార్లెస్ జార్జ్ డగ్లస్ (1860-1943) :** కవి, కథారచయిత, నవలా రచయిత, చరిత్రకారుడుగా సుప్రసిద్ధుడు. 1867 నాటి కెనడా కూటమి (Confederation) జాగృతం చేసిన జాతీయ భావాలకు కవితా రూపమిచ్చిన తొలి ప్రముఖ కవి. 19 వ శతాబ్దపు చివరి రెండు దశకాల్లో రాబర్ట్స్ కవితల ద్వారా ప్రేరణ పొంది ఎంతో మంది కవి కుమారులు జాతీయోద్యమ కవితలు రచించారు.

రాబర్ట్స్ తొలి కవితా సంకలనం *ఓరియన్ అండ్ అదర్ పొయెమ్స్* 1880 లో వెలువడింది. భావం, వస్తువు, రచన



లరీత్యా సంప్రదాయ ధోరణిలో వెలువడిన కవితల సమాహారం ఈ గ్రంథం. ప్రకృతి, ప్రేమ, జాతీయత రాబర్ట్స్ కవితల ప్రధానవస్తువు. కెనడా రాష్ట్రం లోని న్యూబ్రన్స్‌విక్, నోవా స్కాటియా ప్రాంతాలలోని పల్లె సీమల ప్రాకృతిక సౌందర్యం, ప్రజాజీవితం రాబర్ట్స్ కవితలలో మనోహరంగా చిత్రింపబడి పాఠకుల ప్రశంసలు పొందాయి. అంతేకాక రాబర్ట్స్ రచించిన సరళమైన, సుందరమైన భావగీతాలు ఆయనకు ఎనలేని ఖ్యాతిని కూర్చి పెట్టాయి. ఆయన కవితలు సుమారు 12 సంపుటాలుగా వెలువడ్డాయి. వీరి ప్రముఖ కవితా సంకలనాలలో *ఇన్ డైవర్స్ టోన్స్* (1887), *సాంగ్స్ ఆఫ్ ది కామన్ డే* (1893), *ది వ్యాగాంట్ ఆఫ్ టైమ్* (1927), *ది ఐస్‌బెర్గ్ అండ్ అదర్ పోయమ్స్* (1934) విశేషంగా పేర్కొనతగ్గవి.

రాబర్ట్స్ కథలు కూడా ఎంతో ప్రజాదరణ పొందాయి, జంతుజాలానికి సంబంధించిన ఇతని కథలు అంతర్జాతీయ ప్రసిద్ధి పొందాయి. రాబర్ట్స్ గహనారణ్యాలు, రకరకాల జంతువులు, వాటి జీవన విధానాలను గురించి చేసిన ప్రత్యేకమైన పరిశీలన కథలకు విశిష్టతను సంతరించి పెట్టింది. *ఎర్త్స్ ఎనిగ్మాస్* (1896), *ది కింగ్‌డెడ్ ఆఫ్ ది వైల్డ్* (1902), *రెడ్ ఫాక్స్* (1905), *నైబర్స్ అన్నోన్* (1911) వీరి ప్రసిద్ధ కథా సంకలనాలలో ముఖ్యమైనవి. రాబర్ట్స్ నౌకాజీవితానికి సంబంధించిన కొన్ని నవలలు రచించాడు.

రాబర్ట్స్ గొప్ప విద్వాంసుడు. కెనడా సాహిత్యం గురించి ఎన్నోచోట్ల ఉపన్యాసాలు చేశాడు. ఆంగ్లాచార్యుడుగా, పాత్రికేయుడుగా పనిచేసి పేరు ప్రతిష్ఠలు గడించాడు. 1935 లో 'సర్' బిరుదు పొందాడు. రాబర్ట్స్ రచించిన *హిస్టరీ ఆఫ్ కెనడా* (1897) మార్గదర్శక గ్రంథంగా ప్రఖ్యాతి గడించింది. జి.అ.నా.

**రాబియారీవెలో, జీన్-జోసెఫ్ (1901-37) :** ఫ్రెంచ్‌లో రచనలు చేసిన ప్రముఖ ఆఫ్రికన్ కవి. మెడగాస్కర్ ప్రాంతంలో ఆధునిక సాహిత్యానికి జనకుడుగా ప్రసిద్ధి పొందాడు.

రాబియారీవెలో కవితా ప్రపంచంలో సమష్టి జీవనంకంటె వ్యక్తికే ప్రాధాన్య మెక్కువ. ఇతని భావనా ప్రపంచంలో నిరాశా నిస్పృహలు, మృత్యువు, అన్యీకరణ (Alienation), ఒంటరితనం - వీటికే పెద్ద పీట. కవికి జీవితం అంధకార బంధురంగా తోచినంతగా ఆశావహంగా కనపడదు. ఎప్పుడో కాని కారుమబ్బుల్లో కాంతి కిరణం తళుక్కుమనదు. పశుపక్ష్యాదులు, చెట్లు చేమలు మానవీయ సంవేదనలతో కూడుకొన్న పాత్రలుగా రాబియారీవెలో కవితా జగత్తులో సాక్షాత్కరిస్తాయి. ఇతడు అధివాస్తవిక కవిగా ఆఫ్రికన్ సాహిత్య ప్రపంచంలో ప్రసిద్ధు డయాడు.

స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు, వర్ణ విద్వేషాలు, పోరాటాలు రాబియారీవెలో కవిత్వంలో కనిపించవు. తనలో తానొక స్వాప్నిక జగత్తును నిర్మించుకొని అందులోనే కుమిలి కుమిలి నశించిన కవి ఇతడు. ఒక ప్రెస్సులో ప్రూఫ్ రీడరుగా పనిచేస్తూ ఏడు కవితా సంకలనాలు వెలువరించిన రాబియారీవెలో తాను ఆరాధించిన ఫ్రెంచి కవులను కలుసుకోలేక మాదక వస్తువులకు బానిస అయి, నిరాశామయ జీవితం గడుపలేక 1937 లో ఆత్మహత్య చేసుకొన్నాడు.

రాబియారీవెలో కవితా సంకలనాలలో పేర్కొనదగినవి: *ప్రెస్క్ సాంగ్స్* (1934), *ట్రాడ్యూయిట్ డీ లా న్యూట్* (1935), ఇతని ప్రారంభ కవితలలో ప్రసిద్ధ ఫ్రెంచ్‌కవి బోద్లేర్ ప్రభావం, ఫాంటసీ కవుల ప్రభావం కనపడుతుంది. తరువాతి కవితలలో రూపం రీత్యా బాదిలేర్ ప్రభావం గోచరించినా, ఆత్మీయతా ముద్ర కల విశిష్టశైలి సహృదయులను అలరిస్తుంది. రాబియారీవెలో మరణానంతరం వెలువడిన *కోల్డ్ సాంగ్స్ ఆఫ్ ది ఇమేరినా కంట్రీ* అనే సంకలనంలోని కవితలలో ప్రేమ సంవాదాత్మక రీతిలో వ్యక్తమయింది.

రాబియారీవెలో జీవిత కాలంలో విశాల పాఠక లోకానికి అతడు పరిచయం కాలేకపోయినా, మరణానంతరం ఆయన కవితలు ఆంగ్లంలోకి అనువదింపబడి ప్రపంచ ప్రసిద్ధి పొందాయి.

జి.అ.నా.

**రాబెలే, ఫ్రాన్‌సాయిస్ (1483-1553) :** ఫ్రెంచ్ రచయిత. నామాంతరం: ఆల్కోఫ్రిబాస్ నాసియర్.

సమకాలీనులకు ఆయన ఒక గొప్ప వైద్యుడు, మానవతావాది. తరువాతి తరాల వారికి *పాన్టా గ్రూయెల్* (1532), *గర్గాంటువా* (1534) వంటి వ్యంగ్య పూరిత రచనలను వ్రాసిన సాహిత్యమూర్తి.

ఇతడు టులాన్ లోని ధనిక భూస్వామి, పేరు పొందిన లాయరు 'అంటొని రాబె, కుమారుడు. మొదట న్యాయ విద్య అభ్యసించాడు. తరువాత ఫ్రాన్సిస్కన్ మత సంస్థలో ప్రవేశించి మత గ్రంథాలను క్షుణ్ణంగా అధ్యయనం చేశాడు. *పెయర్ అమి* అనే ప్రసిద్ధ ఫ్రాన్సిస్కన్ మానవతావాది సాన్నిహిత్యాన్ని సంపాదించి, గ్రీక్ గ్రంథాలనెన్నిటినో అధ్యయనం చేశాడు. బెనిడిక్టైన్ మత సంస్థలో ప్రవేశించాడు. కాని అక్కడి వ్యవహారాలు ఆయనకు నచ్చలేదు.

తరువాత పారిస్‌లోని 'సెయింట్ డెనిస్' లో వైద్య విద్యను అభ్యసించాడు. 'పిల్లల పెంపకం' మీద, హిపోక్రటిస్ వైద్య సిద్ధాంతాలమీద గ్రంథాలు రచించాడు. 1532 లో లయన్‌లోని హూటిల్ డియూ ఆసుపత్రిలో వైద్యుడుగా నియమించబడ్డాడు. ఆ సమయంలో ఆయన మొదటి *నవల పాన్టా గ్రుయెల్* ప్రచురించబడింది. ఇటువంటి వ్యంగ్య రచన ఫ్రెంచ్ సాహిత్యంలో అపూర్వం. శబ్దప్రయోగంలో, హాస్యభరిత సన్నివేశ వర్ణనలో, సంభాషణలను, స్వగతాలను నిర్వహించడంలో రాబెలే అద్వితీయమైన ప్రతిభ ప్రదర్శించాడు. న్యాయశాస్త్రంలోని మూఢత్వాన్ని, మత దురాచారాలను,వంచనను ఆయన నిశితంగా విమర్శించాడు. ఆయన తన రెండవ నవల *పాన్టాగ్రుయెల్‌లో* జ్యోతిష్కులను, జాతక చక్రాలను ఆక్షేపించాడు.

1534 ప్రాంతంలో హూటిల్ డియూని వదలి పెట్టి, రోమ్‌లో పర్యటించి లయన్‌కు తిరిగి వచ్చాడు. ఈకాలంలో *గర్గాంటువా* ను ఆయన రచించాడు. పోర్డినల్‌గా నియమితుడైన జీన్ దు బెలె మతాభిప్రాయాలు, ఫ్రాన్సిస్ రాజును బలపరచే ఆలోచనలు ఈ రచనలో కనిపిస్తాయి. సార్‌బోన్ పండితులను అధిక్షేపించడం, తమ ప్రవర్తనలను బలపరచడం ఇందులో కన్పిస్తాయి. పాన్టాగ్రుయెల్ తండ్రి గర్గాన్ట్యువా చరిత్రను వ్యంగ్యాత్మకంగా వివరించాడు. న్యాయశాస్త్ర పండితులను, వైద్యులను ఎదిరిస్తూ మానవతా వాదులను బలపరచాడు. దారిద్ర్యాన్ని, బహ్మచర్యాన్ని, క్రమశిక్షణ పేర జరిగే అత్యంత విధేయతను తిరస్కరించి, ఆయన ధనాన్ని, ధనిక వర్గాన్ని సమర్థించాడు. సంప్రదాయ బద్ధమైన వివాహవ్యవస్థ ఆయనకు ఆనందాన్ని కలిగించేది.

ఆయన చివరి రచనలలో *థేర్స్ ల్రీవే* ప్రధానమైన గ్రంథం. ఇందులోని నాయకుడు ఫెనర్జె (Fenurge). అతడు తనను తానే అతిగా ప్రేమించుకొని మిగతా విజ్ఞానాన్ని లెక్కచేయలేదు. ఎవరినీ, చివరికి తనను కూడా తాను నమ్మేవాడు కాదు. మత సంబంధమైన సూత్రాలు లౌకిక సూత్రాలకు లొంగి ఉండాలని, వివాహాలు తల్లి దండ్రుల అనుమతి లేకపోతే సమర్థనీయాలు కావని ఆయన వాదించాడు. 1552 లో ప్రచురించబడ్డ *క్వార్ల్రీవే* అనే బృహత్ గ్రంథంలో మానవు లంతా కలిసి పనిచేయాలని, ప్రాచీన కాలపు ఉత్తమ విజ్ఞానాన్ని క్రైస్తవ మత సిద్ధాంతాలతో జోడించాలని ఆయన కోరాడు. ఈయన రచనలకు ఆనాటి ప్రభువుల మద్దతు ఉన్నా, మత సంస్థలు ఆయన గ్రంథాలను ఆమోదించలేదు. ప్రభుత్వం కూడా ఒక్కొక్కసారి ఆయన రచనలను ఆమోదించక కారాగారశిక్ష విధించినట్లు కూడా కనిపిస్తుంది. 1553 ప్రాంతంలో పారిస్‌లో ఆయన మరణించాడు.

ఎన్నో విషయాలను లోతుగా పరిశీలించి, నిశితంగా అధ్యయనం చేసి ఆయన రచనలు సాగించాడు. *బైబిల్* సారస్వతాన్ని, వైద్య శాస్త్రాన్ని, న్యాయశాస్త్రాన్ని ఆయన క్షుణ్ణంగా అవగాహన చేసుకొన్నాడు. మానవతావాదిగా ఆయనకు చెక్కుచెరదని స్థానం ఉంది. వోల్తేర్, బాల్జాక్ వంటి ఫ్రెంచ్ రచయితలపైనే కాకుండా స్విఫ్ట్, ట్రొలోప్, కింగ్స్‌లీ వంటి రచయితలపై కూడా ఆయన ప్రభావం కనిపిస్తుంది.

ఎస్.ఎస్.ప్ర.

**రామోస్, గ్రాసిల్యానో (1892-1953) :** ప్రముఖ బ్రెజిల్ నవలా రచయిత. బ్రెజిల్ దేశంలోని ఈశాన్య ప్రాంతపు పల్లెవాసుల కష్టాలను కడగండ్లను హృదయాలను తాకేట్టు, శక్తిమంతమైన మాండలిక భాషలో చిత్రించిన గొప్ప రచయిత.

రామోస్ గ్రాసిల్యానో జీవితంలో చాలా భాగం పాల్మెరాడోస్ ఇండోస్‌లో గడిచింది. అక్కడ ఆయన కిరాణా దుకాణం నడుపుతూ, మేయర్‌గా కొంత కాలం పనిచేశాడు. ఈయన రచనలలో ఈ ప్రాంతపు ప్రకృతి, వాతావరణం, భాష, ఆచార వ్యవహారాలు, సంస్కృతి చక్కగా ప్రతిఫలించాయి. రామోస్ చిన్ననాటి జ్ఞాపకాలను *ఇన్‌ఫెన్షియా* (1945; child hood) లో సుందరంగా పుస్తకరూపంలో వెలువరించాడు. కరువు కాటకాలకు నెలవైన ప్రాంతంలో తల్లిదండ్రులతో పాటు పడిన పాట్లు, వానాకాలం చదువు, జోలాడోస్టోవస్కీ, గోర్కీ

మొదలైన మహారచయితల రచనలు చదివి నేర్చుకున్న పాఠాలు, రచనా వ్యాసంగానికి ప్రేరణ కలిగిన తీరు తెన్నులు ఈ స్వీయ చరిత్రాత్మక రచనలో పొందుపరచ బడ్డాయి.

రామోస్ రచనలలో తలమానికం లాంటిది *సాబెర్నార్డో* (1934). చిల్లర మల్లర దొంగతనాలతో మొదలెట్టి, పెద్ద పెద్ద నేరాలు, హత్యలు చేసిన, బాగా డబ్బు సంపాదించి సెయింట్ బెర్నార్డ్ కాఫీ తోటల యజమాని అయిన పాలొహానోరియో జీవితంలోని విభిన్న దశలను ఈ నవలలో రచయిత నేర్పుగా చిత్రించాడు. సెయింట్ బెర్నార్డ్ కాఫీతోటలలో కూలీగా పనిచేసిన అనుభవం రచయితకు ఈ నవలా రచనలో ఎంతో ఉపకరించింది.

రామోస్ 1937 లో జరిగిన *వర్గాస్ కూప్‌డెట్ అట్* కు కొంతకాలం ముందే కమ్యూనిస్టుగా అనుమానింపబడి జైలు పాలయాడు. జైలునుంచి విడుదల అయిన తరువాత పాఠశాల ఇన్‌స్పెక్టరుగా పనిచేస్తూ జీవితం గడిపాడు. రామోస్ 1938 లో *విడాస్ సెకాస్* అనే నవల వ్రాశాడు. క్షామ పీడిత ప్రాంతం నుంచి అనూహ్యమైన సిరిసంపదలకు నిలయమైన నగర ప్రాంతానికి వలస వచ్చిన ఒక కుటుంబ గాథను ఈ నవల్లో చిత్రించాడు.

జి.అ.నా.

**రామ్‌సే, అలెన్ (1686-1758) :** స్కాటిష్ కవి. స్కాట్లండ్ లినార్క్ షైర్ లెడ్ హిల్స్‌లో 1686 వ సంవత్సరంలో జన్మించాడు. స్కాటిష్ భాషాకవులు ఆంగ్ల ప్రభావానికి లోనై స్కాటిష్ సంప్రదాయాన్ని విస్మరించిన తరుణాన, రామ్‌సే స్కాటిష్ కవిత్వాన్ని వ్రాసి, పూర్వ స్కాటిష్ కవుల రచనలు భద్రపరచి, జాతీయ కవితా సంప్రదాయాన్ని పరిపుష్టం చేశాడు. రాబర్ట్ బర్న్స్ ఈయనను విశేషంగా గౌరవించాడు. 1700 వ సంవత్సరంలో ఎడింబరోలో స్థిరనివాసం ఏర్పరచుకొని ఈజీ క్లబ్ అనే సాహిత్య సంస్థను ప్రారంభించాడు. 'ఐజక్ బిక్కెర్ స్టాఫ్', గెవిస్ డగ్లస్ అనే కలం పేరులతో స్కాటిష్ భాషలోనూ, ఇంగ్లీష్‌లోనూ గద్య పద్య రచనలను విస్తారంగా చేశాడు. చమత్కార రచనలలోనూ, అధిక్షేప రచనలలోనూ స్కాటిష్ భాషను ఉపయోగించాడు. రాబర్ట్ హెన్రీసన్, విలియం డన్-బార్ మొదలైన మధ్య యుగ స్కాటిష్ రచయితల కవిత్వాన్ని సేకరించి ప్రచురించాడు. తరువాతి కాలానికి ఈయన సంకలనాలు మార్గదర్శకా లయాయి.

1721 వ సంవత్సరంలో స్వీయ కవిత్వాన్ని ప్రచురించాడు. లాటిన్ భాషలోని హొరేస్ *ఓడ్స్* కు స్కాటిష్ భాషాంతరీకరణం చేశాడు. 1728 లో ద్వితీయ సంపుటాన్ని కూడా ప్రచురించాడు. *జెంటిల్ షెపర్డ్* అనే స్వతంత్ర నాటకాన్ని వ్రాసి విశేష ఖ్యాతి నార్జించాడు. స్కాటిష్ భాష నుపయోగించిన నాటకం కావడం మూలాన దీనికి విస్తృత ప్రచారం లభించింది. జాన్ గే రచించిన *బెగ్గర్స్ ఆపెరా* ను 'బాలడ్' రూపంలో ఆపెరాగా మార్చాడు. *టీ టేబిల్ మిసెలనీ* మూడు సంపుటాలుగాను, *ది ఎవర్ గ్రీన్* అనే గ్రంథాన్ని రెండు సంపుటాలుగానూ, స్కాటిష్ సామెతలను, జానపద గేయాలను పద్యాలను సంకలనం చేసి *ఫేబిల్స్ అండ్ టేల్స్* అనే సంపుటంగాను ప్రచురించాడు.

ఆయన నివాస గృహం ఒక సాహిత్య మందిరంగా ఉండేది. పుస్తక విక్రేతగా తన ఉపాధిని గడుపుకుంటూ స్కాటిష్ భాషకు సేవ చేయడమే కాక, బ్రిటన్‌లో మొట్టమొదటి సర్క్యులేటింగ్ లైబ్రరీని స్థాపించిన గౌరవం రామ్‌సేకే దక్కింది. చిత్రరచన, నటన మొదలైన విషయాలను నేర్పడానికి ఉద్దేశించి అకాడమీ సెంట్ లూక్ అనే సంస్థను స్థాపించాడు. లైసెన్సింగ్ ఆక్ట్ వలన నిషేధింపబడే వరకూ ఈ సంస్థ గణనీయమైన కృషి చేసింది. 1740 లో విశ్రాంతి గైకొన్న రామ్‌సే 1758 లో కన్ను మూసేవరకు నిర్విరామంగా స్కాటిష్ భాషాసేవ చేస్తూనే వచ్చాడు.

శ్రీ.ల.

**రాయ్, కమీల్ (1870-1943) :** రాయ్ కమీల్ విమర్శకుడుగానే కాక సాహిత్య చరిత్రకారుడుగా కూడా ప్రసిద్ధి పొందిన ఫ్రెంచి-కెనేడియన్ రచయిత. సాహిత్య వికాసం గురించి ఇతడు వ్రాసిన గ్రంథాలు ప్రామాణికాలుగా ప్రసిద్ధి చెందాయి. రాయ్ 1894 లో కేథలిక్కు మతగురువుగా దీక్ష స్వీకరించారు. ఇతడు



1900 లో పారిస్‌లోని కేథలిక్కు విశ్వవిద్యాలయం నుంచి ధార్మిక విషయాలపై సిద్ధాంతగ్రంథం వ్రాసి

పిహెచ్.డి. పట్టా పొందాడు. రాయ్ క్విబెక్‌లోని లావల్ విశ్వవిద్యాలయంలో 1900-26 ల మధ్యకాలంలో ఫ్రెంచ్ సాహిత్యాన్ని బోధించాడు. కొంతకాలం పాటు కెనెడియన్ సాహిత్యాచార్యుడుగా కూడా పనిచేసి మన్ననలు పొందాడు.

*మన సాహిత్య ప్రారంభాలు* (1909: Our literary Origins), *ఫ్రెంచి కెనెడియన్ సాహిత్య చరిత్ర సంగ్రహం* (1918; Hand book of the History of French-Ganadian literature) ఈరెండు రచనలు రాయ్‌కి సాహిత్య ప్రపంచంలో గొప్ప పేరు ప్రతిష్ఠలు సంపాదించి పెట్టాయి. సమకాలీన ఫ్రెంచ్ ప్రభావానికి లోనుగాక 18 వ శతాబ్ది నాటి ఫ్రాన్స్‌లోని క్రైస్తవ వారసత్వాన్ని కాపాడటమే ఆశయంగా రాయ్ రచనలు రూపొందించ బడ్డాయి.

ఫ్రెంచ్ మాట్లాడటం నేర్పే ఒక సంస్థను స్థాపించడంలో కమీల్ రాయ్ మహత్తరమైన పాత్రను నిర్వహించాడు.

జి.ఆ.నా.

**రిక్లర్, మార్డెకాయ్ (1931--)** : కెనడా దేశ నవలా రచయిత. ఈయన 1931 లో మాంట్రియల్ నగరంలో జన్మించాడు.



మానవ జీవిత సమస్యలను, విలువలను క్షుణ్ణంగా, సునిశితంగా పరిశీలించే మేధావిగా రిక్లర్ లబ్ధ ప్రతిష్ఠుడు. మాంట్రియల్ నగరంలో విద్యాభ్యాసం చేసిన తరువాత పారిస్ నగరంలో - కొంత కాలం రిక్లర్ నివాసం ఏర్పరచుకొన్నాడు. ఆ కాలంలోనే అస్తిత్వ వాదంతో, ఆ సిద్ధాంతానికి చెందిన రచయితలతో పరిచయం ఏర్పడి ప్రభావితు డయాడు. 1954 లో *ద అక్రోబాట్స్* అనే నవలను రచించాడు. స్పెయిన్ దేశానికి వలస వచ్చిన విదేశీయుల, విప్లవకారుల జీవిత నైరాశ్యం, వారితో పరిచయం ఏర్పడి ఒక కెనడా దేశపు చిత్రకారుని అనుభవాలు ఇతివృత్తంగా గ్రహించి ఈ నవలను రచించాడు. రిక్లర్ ఇంగ్లండ్‌లో కొంత కాలం గడపి 1970 లో మాంట్రియల్ చేరుకొన్నాడు. తరువాత వ్రాసిన నవలలలో పేదరికం, యూదుల పట్ల వివక్షణ, దాని పరిణామాలు ప్రధాన విషయాలుగా ఉన్నాయి. *సన్ ఆఫ్ ఏ స్మాల్ హీరో* (Son of a Small Hero, 1955), *ఏ ఛాయిస్ ఆఫ్ ఎనిమీజ్* (A Choice of Enemies 1957) అనే నవలలలో ఆధునిక జీవితంలోని గమ్యం తెలియని అయోమయస్థితిని వర్ణించాడు. *ద అప్రెంటిస్‌షిప్ ఆఫ్ డడ్డీ క్రావిట్జ్* (The Appernticeship of Duddy Kravitz, 1959) అనే నవల ఒక యూదు యువకుని జీవితంలోని మార్పును వర్ణిస్తుంది. దీన్ని 1974 లో చలన చిత్రంగా రూపొందించారు. *ద ఇన్ కాంపారబుల్ అటుక్* (The Incomparable Atuk, 1963), *కాక్ ష్యూర్* (Cocksure, 1968), *సెయింట్ అర్బైన్స్ హార్స్‌మెన్* (St. Urbains Horse Men, 1971) రిక్లర్ రచించిన నవలలు. వీటిలో రాజకీయ, సాంఘిక నైతిక విషయాలు విశ్లేషించబడ్డాయి. 1974 *లో నోట్స్ ఆన్ ఏన్ ఎండేంజర్డ్ స్పీషీజ్ అండ్ అదర్స్* అనే హాస్య ప్రధానమైన వ్యాసాలు రచించాడు. *జేకబ్ టు - టు మీట్స్ ద హుడెడ్ ఫాంగ్* (1975) అనే పుస్తకాన్ని చిన్న పిల్లల కోసం వ్రాశాడు. 1980 లో *జాషువా దెన్ అండ్ నౌ* అనే నవలను ప్రచురించినాడు.

శ్రీ.ల.

**రిచర్డ్‌సన్, జాన్ (1796-1852)** : కెనడా దేశీయుడైన రిచర్డ్‌సన్ క్వీన్స్‌టన్‌లో 1796 లో జన్మించాడు.



చారిత్రాత్మకంగాను, స్వీయ చరిత్ర ఆధారంగాను నవలలను వ్రాసి లబ్ధ ప్రతిష్ఠుడయాడు. బ్రిటిష్ వాలంటీర్‌గా 1812 యుద్ధంలో పాల్గొని ఖైదీగా రిచర్డ్‌సన్ పట్టుబడ్డాడు. విడుదల పొందిన తరువాత బ్రిటిష్ ఆఫీసర్‌గా ఇంగ్లండ్, బర్బడోస్, స్పెయిస్ దేశాలలో పనిచేసి, 1838 లో కెనడా చేరుకొన్నాడు. రిచర్డ్‌సన్ *ఎక్టార్టె* (Ecarte) అనే నవలను ప్రచురించాడు. పారిస్ నగరంలో ఉన్నత వర్గాల జీవిత విధానం దీని ఇతివృత్తం. 1832 లో *వకాస్టా* అనే నవలను వ్రాశాడు. 1763 లో పాంటియక్ యుద్ధంగా ప్రసిద్ధి చెందిన ఇండియనుల తిరుగుబాటు దీని ఇతివృత్తం. *టీకమ్స్* (1828) అనే

పద్య కావ్యాన్ని, *వార్ ఆఫ్* 1812 అనే గ్రంథాన్ని వ్రాశాడు. 1812 నాటి యుద్ధంలో తన అనుభవాలను దీనిలో వివరించాడు. *కెనడా లో ఎనిమిది సంవత్సరాలు* (Eight Years in Canada, 1847) అనే స్వీయ చరిత్రను రచించాడు.

1852 లో న్యూయార్క్ నగరంలో మరణించినాడు.

శ్రీ.ల.

**రిచర్డ్‌సన్, శామ్యుయెల్ (1689-1761) :** ఆంగ్ల భాషలో ప్రముఖ నవలా రచయిత. లేఖా సముదాయ (Epistolary technique) పద్ధతిని ప్రవేశ పెట్టి నవలా రచనలో విశేషమైన మార్పును తెచ్చిన రిచర్డ్‌సన్ *పమేలా* (1740), *క్లారిస్సా* (1747-48) అనే ప్రసిద్ధమైన నవలలను రచించాడు. వృత్తిరీత్యా పెద్ద ప్రింటింగ్ ప్రెస్‌ను నెలకొల్పి, పుస్తక ప్రచురణలో గణనీయంగా ధనం సంపాదించి లండన్ నగరంలో స్థిరనివాసం ఏర్పరుచుకొని 'డా. శామ్యూల్ జాన్సన్', 'కోలీ సిబర్' వంటి సాహితీ వేత్తలతోను, డేవిడ్ గారిక్ ఎడ్వర్డ్‌యాగ్ వంటి సుప్రసిద్ధ నటులతో సాన్నిహిత్యాన్ని పొందినాడు.



రిచర్డ్‌సన్ ఒక ప్రచురణ కర్త అభ్యర్థనను పురస్కరించుకొని, ఆ యా సమయాలకు సరిపడేటట్లు అందరికీ ఉపకరించే లేఖా సముదాయాన్ని రచించాడు. ఈ రచనే తరువాతి *పమేలా* అనే నవలకు ప్రేరకమైంది. 'పమేలా' అనే పేరు గల యువతి ఎన్నో ప్రమాదకర పరిస్థితులలో తేలికగా తన శీలాన్ని రక్షించుకొని కలవారి ఇంటికోడలుగా స్థిరపడటం ఈ నవల ఇతివృత్తం. *పమేలా* నవలకే శీలం బహూకరింపబడింది అనే ఉపమానాన్ని కూడా వాడాడు. రిచర్డ్‌సన్ రెండవ నవల *క్లారిస్సా*. ఈ నవల సాంకేతికంగా *పమేలా* కంటె గొప్ప దని విమర్శకుల అభిప్రాయం. రిచర్డ్‌సన్ మూడవ నవల *ది హిస్టరీ ఆఫ్ సర్ చార్లెస్ గ్రాండిసన్*. హెన్రీ ఫీల్డింగ్ అనే సమకాలీన నవలా రచయిత వ్రాసిన *జోసెఫ్ ఆండ్రూస్* అనే నవలకు *గ్రాండిసన్* పోటీగానూ, ఇతివృత్తంలో వ్యతిరేకంగానూ వ్రాయబడింది. ఈ నవలలోని పాత్రలతీరు 18 వ శతాబ్ది నవలా రచనలోని పాత్రపోషణకు ఒరవడి పెట్టింది. రిచర్డ్‌సన్ కీర్తి యూరప్ ఖండమంతా వ్యాపించింది. నవలా రచనలో ఆయనను అనుకరించే వారి సంఖ్య విస్తారమైంది. 'జేన్ ఆస్టిన్' వంటి సుప్రసిద్ధ నవలా రచయితలు కూడా 'గ్రాండిసన్' ను చదివి ప్రభావితులయారు. 18 వ శతాబ్ది అంతానికి రిచర్డ్‌సన్ కీర్తి కాస్త సన్నగిల్లినట్లు కనిపించినా, 20 వ శతాబ్దిలో మళ్లీ బాగా బలపడిందని చెప్పవచ్చు.

శ్రీ.ల.

**రిచర్డ్‌సన్, హెన్రీ హాండెల్ (1870-1946) :** ప్రముఖ ఆస్ట్రేలియన్ నవలా రచయిత్రి. బంగారు గనులలో పనిచేయడానికి ఆస్ట్రేలియాకు వలస వచ్చిన ఒక వ్యక్తి జీవితాన్నీ, చేతలనూ వర్ణిస్తూ, శక్తిమంతమైన పాత్రచిత్రణతో ఈమె రచించిన మూడు భాగాల నవల *ది ఫార్ట్యూన్స్ ఆఫ్ రిచర్డ్ మహోనీ* ఆధునిక ఆస్ట్రేలియన్ కల్పనా సాహిత్యానికి తలమానికంగా పరిగణించ బడుతూంది.

1883-87 మధ్య మెల్‌బోర్న్‌లోని ప్రెస్బిటేరియన్ లేడీస్ కాలేజ్‌లో రిచర్డ్‌సన్ విద్యార్థినిగా ఉంది. 1888 లో ఈమె ఆస్ట్రేలియా వదలి సంగీతం నేర్చుకోడానికి లైప్‌జిగ్ వెళ్లింది. తన శేషజీవితం అంతా ఈమె విదేశాలలోనే గడిపింది. 1912 లో ఒక్కసారి మాత్రం ఆమె ఆస్ట్రేలియాను సందర్శించింది. లైప్‌జిగ్‌లో ఆమె జె.జి.రాబర్ట్‌సన్‌ను కలుసుకొని 1895 లో డబ్లిన్‌లో ఆయనను వివాహ మాడింది. 1904 లో ఆయనను లండన్ యూనివర్సిటీలో జర్మన్ సాహిత్యానికి ప్రొఫెసర్‌గా నియమించారు. పియానో వాద్యంలో కచేరీలలో పాల్గొనాలనే తన ఆశయం వదలుకొని రిచర్డ్‌సన్ గ్రంథ రచనకు పూనుకొంది.

జర్మనీలో తన తొలి నవల *మారిస్ గెస్ట్* (1908) ను ఆమె రచించింది. లైప్‌జిగ్‌లో సంగీతం నేర్చుకొంటూ ఒక దురదృష్టకరమైన ప్రేమ కలాపంలో చిక్కుకొని జీవితాన్ని నాశనం చేసికొన్న ఒక ఆంగ్ల యువతిని గూర్చిన కథ అది. 1904 లో భర్తతో పాటు ఆమె ఇంగ్లండ్‌లో స్థిరపడింది. ఆమె రెండవ నవల *ది గెటింగ్ ఆఫ్ విజ్‌డమ్* తాను మెల్‌బోర్న్‌లో బోర్డింగ్ స్కూలులో గడిపిన రోజులను వర్ణించే కథ. ఆ నవల పూర్తి కాగానే 20 ఏళ్లపాటు కష్టించి ఆమె 3 భాగాలతో కూడిన *ది ఫార్ట్యూన్స్ ఆఫ్ రిచర్డ్ మహోనీ* (192 రచించింది. దానిలోని మూడు భాగాలు:

*ఫెలిక్స్* (1917), *ది వే హోమ్* (1925), *అల్టిమా థూల్* (1929). ఈ పెద్ద నవలలోని నాయక పాత్రను డబ్లిన్ నుంచి ఆస్ట్రేలియాకు వలస వచ్చి 1879 లో చనిపోయిన తన తండ్రి జీవితం ఆధారంగా ఆమె చిత్రించింది. ఆయన లేఖలనూ, డైరీలనూ ఆ రచనలో ఆమె ఉపయోగించుకొంది.

రిచర్డ్‌సన్ రచించిన చిట్టచివరి నవల *ది యంగ్ కోసిమో* (1939). ఆమె కొన్ని చిన్న కథలను కూడా వ్రాసింది. అవి *ది ఎండ్ ఆఫ్ ఏ చైల్డ్‌హుడ్, అండ్ అదర్ స్టోరీస్* (1934) అనే పేర ప్రకటించబడ్డాయి. *మై సెల్ఫ్ వెన్ యంగ్* (1948) అనే ఒక అసంపూర్ణ ఆత్మకథను కూడా ఆమె రచించింది.

బొ.శ్రీ.

**రిల్కే, రెయ్‌నర్ మరియా (1875-1926) :** జర్మన్ కవి. జీవితంలో అధికభాగం దేశాటనలో గడిపాడు. వివిధ ప్రవృత్తులను, మానవ వైవిధ్యాన్ని నిశితంగా పరిశీలించాడు. రష్యా, ఇటలీ, ఫ్రాన్స్, జర్మనీ దేశాలలో నివసించి జీవిత మొక యాత్రగా గడిపాడు. జర్మన్ జానపద గీతాల ప్రభావం, హైనే (Heine) కవిత్వశైలి రిల్కే కవిత్వంలో కన్పించినా, వాటి నధిగమించి తనదైన ప్రత్యేక శైలిని సంతరించుకొన్నాడు. 1896 నుండి వివిధ గ్రంథాలను రచించి ప్రచురించాడు. *గెశిస్టె ఫోమ్ లీబెన్ గోట్* (1900), *ష్టుండెన్ బుక్* (1905), *నాయె గెడిష్టె* (1907-8), *రిక్వెయమ్* (1909), *దీ సొనెట్టె ఆన్ ఆర్ఫియస్, డూయినిజర్ ఎలిజియన్* మొదలైనవి రిల్కే వ్రాసిన సుప్రసిద్ధ గ్రంథాలు. *నోట్‌బుక్ ఆఫ్ మ్యాల్టె లారిడ్స్ బ్రిగ్గె* అనే గ్రంథం కూడా విశిష్టమైంది. పాత్రల అంతరంగ పరిశీలన కిది ప్రసిద్ధమైంది. రిల్కే స్వతంత్ర ప్రయోగాలను చేసినా, కవిత్వ గాంభీర్యానికి లోటు రానీయలేదు. శైశవ సౌందర్యాన్ని, పశుపక్ష్యాదుల రామణీయకాన్ని రిల్కే దర్శించి వర్ణించినంతగా మరే కవీ చేయలేదు. ప్రకృతిలోనున్న ప్రతివస్తువు ఆయనకు అందాన్ని విరజిమ్ముతూనే కన్పిస్తుంది. 20 వ శతాబ్దపు జర్మన్ కవులలో ఇతడు అగ్రేసరుడుగా భావింపబడ్డాడు.

శ్రీ.ల.

**రివేరా, హోసే యుస్టాసియో (1889-1928):** కొలంబియన్ కవి, నవలా రచయిత. ఈయన 1889 లో కొలంబియాకు చెందిన నీవా పట్టణంలో జన్మించాడు. కవిగా, నవలా రచయితగా ఎన్నిక కన్నవాడు. 1924 లో *లావొరాగైన్* (Lavoragine) అనే నవలను రచించాడు. అమేజాన్ నది పరిసర అరణ్యాల్లో రబ్బర్ సేకరించే కార్మికుల కష్ట నష్టాలను, వారిపై జరుగుతున్న దోపిడిని ఈ నవలలో తీవ్రంగా విమర్శించాడు. దక్షిణ అమెరికా అడవులను వర్ణిస్తూ వ్రాయబడిన నవలలలో దీనిని అగ్రగణ్యంగా భావిస్తారు.

వృత్తిరీత్యా రివేరా న్యాయవాది. *టియేరా డి ప్రామిజియోన్* (Tierra de Promidion) అనే కవిత్వ సంపుటాన్ని 1921 లో ప్రచురించి సాహిత్యరంగంలో మేటిగా స్థిరపడ్డాడు. కొలంబియా అటవీ ప్రాంత సౌందర్యం ఈ కవిత్వ సంపుటంలో విశేషంగా వర్ణింపబడింది. కొలంబియా, వెనిజులాల సరిహద్దు తగాదాను పరిష్కరించడానికి నియమింపబడిన కమిషన్ ఉద్యోగిగా రివేరా అమేజాన్ ఒరినోకో నదీ ప్రాంతాలలో విస్తారంగా పర్యటించి, ఆటవికులైన ఇండియన్ జాతివారి జీవిత విధానాన్ని సమగ్రంగా అధ్యయనం చేశాడు. అడవులలో జీవించడానికి ఆటవికులు పడేపాట్లను, వారి హింసా ప్రవృత్తిని సునిశితంగా పరిశీలించి తెలుసుకొన్నాడు. అడవులలో పర్యటిస్తూ జబ్బు పడి, కోలుకుంటున్న సమయంలో *లా వొరగైన్* అనే నవలను రచించాడు. కవిగా తాను దర్శించిన ఆటవిక జీవిత వైవిధ్యాన్ని కన్నులకు కట్టినట్లు సుకుమారంగా వర్ణించాడు. సాంఘిక సమస్యను విశ్లేషణ చేస్తూనే ఒక సాహసోపేత గాథను రచించిన నట్లుగా *లా వొరగైన్* నవలను రివేరా రూపొందించాడు. ప్రపంచంలోని పెక్కుభాషలలోకి అనువదింపబడిన ఈ నవలకు అంతర్జాతీయ ఖ్యాతి లభించింది. రివేరా వ్రాసిన ఒకే ఒక నవల *లా వొరగైన్.*

1928 లో న్యూయార్క్ నగరంలో రివేరా మరణించినాడు.

శ్రీ.ల.

**రుయిూజ్, జువాన్ (1283-1330) :** స్పానిష్ కవి, హీటాలోని మతాధిపతి. 1330 లో ఆయన రచించిన *లిబ్రో డి బూయెన్ అమోర్* 1343 లో విస్తరించబడింది. 1933, 1975 సంవత్సరాలలో 'ది బుక్ ఆఫ్ గాడ్' అనే పేరుతో ప్రచురితమయింది. అన్ని భాషలలోని హాస్యపూర్వక వ్యంగ్య కవితా సంకలనాలలోను ఈ సంకలనం ప్రముఖమైంది. దేశ ద్రిమ్మరులైన విదూషకుల హాస్యభరిత సంభాషణలు ఈ సంకలనంలో స్వీయ చరిత్ర వంటి రచనలని, పౌరాణిక గాథలని, ప్రేమ గీతాలని, మతాధికారులను అధిక్షేపణ చేసే కవితలని, మామూలు స్త్రీలను పొగడే గీతికలని, మేరీ మాతని స్తుతించే గీతాలని ఒక సమాహారంగా సమర్పించ

బడ్డాయి. సాహిత్యరంగంలో మొదటి హాస్యపాత్ర అని చెప్పతగ్గ *ట్రోటాకాన్వెన్టోస్* ఈ రచనలో కనిపిస్తుంది. మధ్యకాలానికి సంబంధించిన గోలియర్డ్ కవుల దగ్గర నుంచి, పౌరాణిక గాథలనుంచి, అరబ్బీ రచనలనుంచి, ప్రజా కవిత్వం నుంచి రూయిజ్ తన కవితా వస్తువును సేకరించాడు. ఆ మౌలిక వస్తువుకు తన ఉత్సాహ వంతమైన, లౌకిక విమర్శనాత్మకమైన మతాధిపతి పాండిత్యదృష్టిని రూయిజ్ జోడించాడు. *లిబ్రో* లో లభించే వివరాలు తప్ప ఆయన జీవితాన్ని గురించిన సమాచారం ఏదీ మనకు లభించడం లేదు. టొలెడోలో విద్యాభ్యాసం చేసి, 1330 నాటికి *లిబ్రో* రచన పూర్తిచేసినట్లు తెలుస్తూంది.

ఎస్.ఎస్.ప్ర.

**రువెదా, లోపె (1510-65) :** స్పానిష్ నాటక రచయిత. ఈయన 1510 లో సెవిల్ నగరంలో జన్మించాడు. స్పానిష్ నాటకరంగ వికాసానికి గొప్పగా కృషిచేశాడు. ప్రజా బాహుళ్యానికి నాటకరంగంతో సాన్నిహిత్యాన్ని ఏర్పరచాడు. తరువాతి కాలాన ప్రసిద్ధి చెందిన *లోప్ డి వేగా* సాహిత్యానికినాంది పలికినవాడు ఈ రువెదాయే! ఇటాలియన్ నటులు నాటకాలు వేస్తూ స్పెయిన్ దేశాన్ని సందర్శించి నిర్వహించిన ప్రదర్శనలతో ప్రభావితుడై రువెదా తానే ఒక సంచార నాటక సమాజాన్ని ఏర్పరచి దానికి రచయితగానూ, యజమానిగానూ బాధ్యతలను చేపట్టాడు. స్పెయిన్ దేశమంతటా పర్యటించి, ఆబాలగోపాలం ఆనందించే నాటకాల నెన్నిటినో ప్రదర్శించాడు. రెండవ ఫిలిప్ చక్రవర్తి నుండి సామాన్య గ్రామీణ ప్రజానీకం దాకా అందరూ రువెదా నాటకాలను చూచి ఆనందించేవారు. సెర్వాంటిస్ వంటి మేధావులు కూడా రువెదా నటనను, పద్యరచనను ప్రశంసించారు. "పాసోస్" అనే హాస్య ప్రధానమైన ప్రవేశికలను తన నాటకాలలో పరిచయం చేసి నూతన ప్రయోగం చేశాడు. "పాసోస్" నిత్య జీవితంలోని కొన్ని ఘట్టాలను ఆధారంగా తీసుకుని హాస్య ప్రధానంగా వ్రాయబడిన ఖండికలు. అందరికీ పరిచితమైన పాత్రలనూ, సహజమైన వ్యావహారిక భాషనూ ప్రవేశపెట్టి, రువెదా స్పానిష్ నాటకరంగానికి ప్రాణం పోశాడు. కామె*డియాస్ మెడోరా, ఐరెర్మలినా, యూఫెమియా, లాస్ ఎంగనాడోస్, కమిలా టింబిరా, పెండస్ దఅయోర్* మొదలైన రువెదా రచనలు ఇటాలియన్ నాటకాల ప్రభావంతో వ్రాయబడినవే. కోర్డొబానగరంలో 1565లో రువెదా మరణించారు.

శ్రీ.ల.

**రెయ్‌మోంట్, వ్లాడిస్లావ్ స్టానిస్లావ్ (1867-1925) :** పోలిష్ రచయిత. పాఠశాల విద్యను పూర్తి చేసుకొనిరెయ్‌మోంట్ ఎన్నో వృత్తులను చేపట్టాడు. తన యౌవనంలో కొట్టులో పనివాడుగా, ఏదో సంస్థలో చిన్న అధికారిగా, రైల్వే ఉద్యోగిగా, నటుడుగా ఎన్నో పనులు చేశాడు. *జీమియా ఒబేకనా* (1899) ఆయన ప్రాథమిక రచనలలో ముఖ్యమైంది. పారిశ్రామికంగా అభివృద్ధి చెందుతున్న లోడ్జ్ నగరం కేంద్రంగా బట్టల మిల్లుల యజమానుల జీవితాలను, మనస్తత్వాలను చిత్రించింది. *స్ప్రోట్‌కానీ* (1897), *కామెడియాన్‌ట్కా* (1896) అనే కథానికల సంకలనాలు చిన్న చిన్న వాక్యాలతో సహజ, శైలిలో రచించబడ్డాయి. 1904-09 మధ్య కాలంలో ఆయన *ఛ్లోపి* అనే నాలుగు సంపుటాల నవల రచించాడు. 1924-25 మధ్యకాలంలో కృషీవలుల మాండలికంలోనే పూర్తిగా *ది పెజెంట్స్* అనే నవలను రచించి, నాలుగు ఋతువులలో రైతుల జీవితాలను ప్రతిభావంతంగా, సహజంగా చిత్రించాడు. ఎన్నో భాషలలోకి అనువదించబడ్డ ఈ నవలకు 1924 లో నోబెల్ పురస్కారం లభించింది. తరువాతి కాలంలో ఆయన సాహిత్య సృష్టి ఉన్నత ప్రమాణాలను అందుకోలేక పోయినా, విస్తరిస్తున్న ఆయన అభిరుచులకు దర్పణం పట్టింది. *వామ్‌పిర్* (1994) లో ఆయన ఆధ్యాత్మిక దృష్టి కనిపిస్తుంది. పోలండు లోని సామాజిక, రాజకీయ పరిస్థితులకు సమగ్రమైన వ్యాఖ్యను తమ రచనలలో అందించాడు.

ఎస్.ఎస్.ప్ర.

**రెయస్, ఆల్ఫోన్సో (1889-1959) :** 20 వ శతాబ్దంలోని మెక్సికన్ రచయితలలో కవిగా, కథానికా రచయితగా, వ్యాస రచయితగా, సాహిత్య వేత్తగా, విమర్శకుడుగా, రాయబారిగా, విద్యావేత్తగా రెయస్ లబ్ధ ప్రతిష్ఠుడు. సాంప్రదాయిక పాండిత్యం, మానవతా దృక్పథం ఆయన రచనా శైలికి ఒక వినూతన సౌందర్యాన్ని సంతరించి పెట్టాయి. 20 వ శతాబ్దంలో మెక్సికో విజ్ఞాన సంప్రదాయాలకు, లాటిన్ అమెరికా దేశాలలోని సాహిత్యానికి ఆయన రచనలు ఒరవడి దిద్దాయి.

తన చిన్నవయస్సులోనే 1711 లో ప్రచురితమైన *ఈస్తటిక్ క్వెస్చెక్స్* లో తన మౌలికమైన విద్వత్తుని, అందమైన శైలీ విన్యాసాన్ని ప్రదర్శించాడు. 1913 లో న్యాయశాస్త్రంలో పట్టా తీసుకుని పారిస్‌లో దౌత్య శాఖలో ఉద్యోగం ప్రారంభించాడు. కాని ఆ ఉద్యోగాన్ని వదలి పెట్టి ఆయన మాడ్రిడ్‌లో 1914-

ప్రాంతంలో విద్యాభ్యాసం చేస్తూ, అధ్యాపక వృత్తిని కూడా చేపట్టాడు. మళ్లీ 1920-39 సంవత్సరాలు మధ్య స్పెయిన్‌లో, ఆర్జెంటీనాలో, బ్రెజిల్‌లో రాయబారిగా పనిచేశాడు. ఎన్నో అంతర్జాతీయ సమావేశాలలో మెక్సికో సాంస్కృతిక రాయబారిగా కూడా వ్యవహరించాడు. ఈ కాలంలోనే ఎన్నో విమర్శనాత్మక, సృజనాత్మక రచనలను గద్య పద్య రూపాలలో ఆయన ప్రచురించాడు. *విజన్ ఆఫ్ అనహు ఆక్* (Vision of Anahfuac, 1917), *ది బ్లీక్ ప్లేన్* (The bblique plane, 1920), *సన్‌డయల్* అనే వ్యాసాలు (1926) ఆయన రచనల వైవిధ్యాన్ని విషయ సమగ్రతను ప్రదర్శిస్తున్నాయి. ప్రాచీన గ్రీక్ సాహిత్యాన్ని, స్పెయిన్ స్వర్ణయుగ సాహిత్యాన్ని ఆయన ప్రత్యేకంగా అధ్యయనం చేశాడు. ఆంగ్ల, ఫ్రెంచ్ సాహిత్యాలనుంచి ఆయన విస్తృతంగా శ్పానిష్ భాషలోకి అనువాదాలు చేశాడు. 'సాహిత్య అనుభూతి' (The Literary Experience, 1942) వంటి రచనలు సామాన్య పాఠకుల కోసం రచించాడు. 1939 లో రాయబారిగా ఉద్యోగ విరమణ చేశాక, ఆయన మెక్సికో తిరిగి వచ్చాడు. అప్పటికే మెక్సికో సాహిత్య సీమలో అగ్రగామిగా స్థానం సంపాదించు కొన్నాడు. ఆ స్థానాన్ని 1959 లో ఆయన స్వర్గస్థుడయే వరకు నిలబెట్టుకొన్నాడు.

ఎస్.ఎస్.ప్ర.

**రైట్, రిచర్డ్ (1908-60)** : తెల్లజాతి వారు నీగ్రో జాతివారిని వర్ణ వివక్ష విధానంతో అవమానాలకు గురిచేస్తున్న అమానుషత్వాన్ని నవలలలో, కథానికలలో ప్రతిఘటించిన నీగ్రో రచయితలలో రిచర్డ్ రైట్ ప్రథముడు, ప్రముఖుడు. 1940 లో ప్రచురించబడిన *నేటివ్‌సన్* అనే నవల ఈ ప్రతిఘటన ఉద్యమానికి నాంది పలికింది. ద్వితీయ ప్రపంచ సంగ్రామం తరువాత ఈ ప్రతిఘటన ఎందరో నీగ్రో రచయితల రచనలలో మహోద్యమ రూపాన్ని దాల్చింది.

రిచర్డ్ పితామహుడు బానిస వర్గానికి చెందినవాడు. రిచర్డ్‌ను 5 సంవత్సరాల వయస్సులోనే తండ్రి వదలి పెట్టి వెళ్లిపోయాడు. ఎందరో బంధువుల ఇళ్లలో వారి దయాధర్మాలపై ఆధారపడి రిచర్డ్ పెరిగి పెద్దవాడయాడు. కాయకష్టం చేసి బ్రతుకుతూ, కమ్యూనిస్టు పార్టీ సభ్యుడుగా చేరి, ఆపార్టీ వారి *డైలీ వర్కర్* అనే పత్రికకు సంపాదకుడు కాగలిగాడు. తరువాత, లీగ్ ఆఫ్ అమెరికన్ రైటర్స్‌కి ఉపాధ్యక్షు డయాడు.

1938 లో నవలికల సంకలనం *అంకుల్ టామ్స్ చిల్డ్రన్* (Uncle Toms Children) ఆయన ప్రచురించాడు. మానవత్వాన్ని కూడా తిరస్కరించే దేశంలో నల్లజాతి వారు ఎలా మనుగడ సాగించగలరు? అనే మౌలిక ప్రశ్న ఈ గాథలకు ప్రేరణ. ఒక్క కథానికలో తప్ప మిగతా అన్ని గాథలలోను నాయకుని అన్వేషణ మరణంతో ముగుస్తుంది. *నేటివ్ సన్* అనే నవలలో ఇతివృత్త నేపథ్యం చికాగో నగరానికి మారింది. ఈ నవలలోని నాయకుడు ఒగ్గర్ థామస్ ప్రమాదవశాత్తు ఒక శ్వేతజాతి వనితను హత్య చేయడం జరుగుతుంది. శ్వేతజాతి వారితో తమ కున్న విరోధానికి ఒక క్రొత్త అర్థం కనిపిస్తుంది. ఆ నవల బహుళ ప్రచారంలోకి వచ్చింది. విరివిగా అమ్ముడు పోయింది. నాటకంగా రూపాంతరం చెంది బ్రాడ్వే నాటకరంగంపై విజయవంతంగా ప్రదర్శించబడింది. 1951 లో ఆర్జెంటీనాలో నిర్మించబడ్డ చిత్రంలో ఒగ్గర్ థామస్ పాత్రను రిచర్డ్ ధరించాడు.

1944 లో వ్యక్తిగత కారణాల వల్ల కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వాన్ని వదలిపెట్టాడు. *బ్లాక్ బాయ్* (1945) అనే స్వీయ చరిత్రలో తన చిన్ననాటి దయనీయ పరిస్థితులను ప్రతిభావంతంగా చిత్రించాడు. శాశ్వతంగా పారిస్‌లో నివాసం ఏర్పరచుకొన్న తరువాత 1953 లో *ది ఔట్ సైడర్* అనే మొదటి అమెరికన్ 'ఎగ్జిస్టెన్షియల్' నవలను ఆయన ప్రచురించాడు. నల్లజాతి వారు మేలు కొన్నారు. అస్తవ్యస్తంగా ఉన్న సాంఘిక వ్యవస్థ వారికి తగిన స్థానాన్ని కలిగించలేక పోతూంది అని తన నవలలో ఆయన స్పష్టీకరించాడు. 1957 లో *వైట్‌మాన్, లిజెన్* అని ఆయన యూరప్‌లో చేసిన ఉపన్యాసాల సంకలనం ఆయన రాజకీయ, సాంఘిక విశ్వాసాలను విశదీకరిస్తుంది. మరణానంతరం స్వీయచరిత్ర వంటి ఆయన రచన 'అమెరికన్ హంగర్' ప్రచురింపబడింది.

ఎస్.ఎస్.ప్ర.

**రైమర్, టామస్ (1643-1713)** : ఆంగ్ల రచయిత. ఇంగ్లండు లోని సాహిత్య విమర్శలో ఫ్రాన్స్‌దేశంలోని నియో-క్లాసికల్ యూప సంబంధమైన (Formelitr) విమర్శన విధానాన్ని ప్రవేశపెట్టిన ప్రత్యేకత టామస్ రైమర్ కు దక్కుతుంది. 1673 లో న్యాయవాద వృత్తిలో ప్రవేశించినప్పటికీ, తన దృష్టిని సాహిత్య రంగం పైనే కేంద్రీకరించాడు. అంతకు ముందు కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయాన్ని పట్టా పుచ్చుకోకుండానే రైమర్ విడచిపెట్టాడు. 1674 రెనె రేపిన్ ఫ్రెంచ్‌భాషలో రచించిన *రిఫ్లెక్షన్స్ ఆన్ అరిస్టాటిల్స్ (టియటైజ్ ఆన్ పాయెటిక్సు)* అనే గ్రంథాన్ని ఆంగ్లంలోకి అనువదించాడు. నాటకం లోని

కథాగమనం సహజంగాను, సహేతుకంగాను ఉండాలని ఆయన విశ్వసించాడు. నైతిక ప్రవర్తన ద్వారా, ఉదాహరణ ద్వారా నాటకాలు మానవులకు నైతిక సందేశాన్ని అందించాలని ఆయన కోరాడు. *పొయెటిక్ జస్టిస్* (కవిత్వ న్యాయం) అనే సమాసాన్ని, రైమరే సమకూర్చాడు. ఆదర్శమూర్తులుగా కాని సగటు మనుష్యులకు ప్రతినిధులుగా కాని నాటకంలోని పాత్రలు వ్యవహరించాలని ఆయన వాదించాడు. *ది ట్రాజెడీస్ ఆఫ్ ది లాస్ట్ ఏజ్* (1678) లో జాకోబియన్ కాలానికి చెందిన బౌమెంటు ఫ్లెచెర్ మొదలైన నాటక రచయితలను, మిల్టన్ రచించిన *పారడైజ్ లాస్ట్* ని ఆయన విమర్శించాడు. *ఏ షార్ట్ వ్యూ ఆఫ్ ట్రాజెడీ* (1693) లో రైమర్ తాలూకు సంకుచితమైన నియో- క్లాసికల్ దృష్టి స్పష్టంగా కనిపిస్తుంది. షేక్స్‌పియర్ రచించిన ఒథెల్లో నాటకాన్ని పసలేని రచన అని ఆయన విమర్శించాడు. ఈ గ్రంథంలోనే ఆధునిక నాటకాలను ఆయన తీవ్రంగా అధిక్షేపించి గ్రీక్‌భాషలో ఈస్కలస్ రచించిన విషాదాంతాలను అనుసరించాలని ఆయన సలహా ఇచ్చాడు.

18 వ శతాబ్దంలో రైమర్ ప్రభావం చెప్పుకో దగింది. ఆయన ప్రభావం వల్లనే నాటకం విషయంలో డ్రైడెన్ తన అభిప్రాయాలను సవరించుకోవడం జరిగింది. 19 వ శతాబ్దంలో ఆయన అభిప్రాయాలు విమర్శకు గురి అయాయి. 'ప్రపంచం అంతటిలో అధమ విమర్శకుడు' అని మెకాలే ఆయనను వర్ణించాడు. 1692 లో రైమర్ ఆస్థాన చరిత్ర కారుడుగా నియమించబడ్డాడు.

ఇంగ్లండులోని రాజకీయ ఒప్పందాలను ప్రకటించాలని మూడవ విలియమ్ ప్రభుత్వం నిర్ణయించి, రైమర్ కవిని ఆ ప్రచురణలకు సంపాదకుడుగా నియమించింది. వీటిలో మొదటి సంపుటం 1704 లోను, 15 వ సంపుటం రైమర్ మరణించిన 1713 వ సంవత్సరంలోను ప్రచురించ బడ్డాయి. ఆయన తరువాత మరొక అయిదు సంపుటాలు 'ట్రీయటీస్' అనే పేరుతో ప్రచురించబడ్డాయి.

ఎస్.ఎస్.ప్ర.

**రోజనోవ్, వాసిలి వాసిల్యేవిచ్ (1856-1919):** సంప్రదాయ విరుద్ధమైన అభిప్రాయాలకు, ప్రశంసనీయమైన మౌలికతకు, వ్యక్తిత్వానికి పేరు పొందిన రష్యా రచయిత. మధ్య తరగతి కుటుంబంలో జన్మించిన రోజనోవ్ మాస్కో విశ్వవిద్యాలయంలో చరిత్ర అభిమాన విద్యగా అభ్యసించాడు. చరిత్రను, భూగోళ విజ్ఞానాన్ని ఆయన కొంత కాలం బోధించాడు. డాస్టొయెవిస్కీ రచించిన *బ్రదర్స్ కరమజోవ్* నవలలోని *లెజెండ్ ఆఫ్ ది గ్రాండ్ ఇన్క్విజిటర్* అనే భాగంపై విమర్శనాత్మకమైన పరిశీలన రచించి అందరి దృష్టిని ఆకర్షించాడు.

1880 వ ప్రాంతంలో సెంట్ పీటర్స్ బర్గ్‌లో నివసిస్తూ క్రైస్తవ మతంలోని ఆనంద విముఖతను నిరసిస్తూ, విషాదానికి, సన్న్యాస ప్రవృత్తికి క్రైస్తవ మతం నిలయం అని విమర్శించాడు. సహజమైన లైంగిక స్వేచ్ఛను, సంతాన వృద్ధిని రోజనోవ్ సమర్థించాడు. స్లావ్ జాతిపై అతని విపరీతమైన అభిమానం ఆధునిక సాహిత్య విమర్శకులకు ఎక్కువ రుచించలేదు. సెమిటిక్ జాతుల పట్ల ఆయన ప్రదర్శించిన విముఖత ఆయన సాహిత్యానికి కొంత లోటు కలిగించింది. 1899 లో న్యూ టైమ్ (నొవోయేవ్రెమ్యా) అనే మార్పుని ఆహ్వానించని (Conservative) పత్రికలో వ్యాసాలు వ్రాయసాగాడు. ఈ పత్రికకు వ్రాసిన వ్యాసాలు ఏ విషయానికైనా సంబంధించి ఉండవచ్చుకాని నిడివి విషయంలో ఆంక్షలు ఉండడం వల్ల సంక్షిప్తంగా విషయాన్ని వ్యక్తం చేసే శైలిని ఆయన అలవరచు కొన్నాడు. 1905 లో విజయవంతం కాని విప్లవాన్ని ఆయన సమర్థించాడు. రూస్ కోయెస్లోవో (రష్యన్ ప్రపంచం) అనే ప్రగతి శీల పత్రికకు వవరిన్ అనే కలం పేరుతో విప్లవాత్మక వ్యాసాలు వ్రాశాడు. తన ఆలోచనలకు అద్దం పట్టే వ్యాసాలను సేకరించి 1912 లో *సాలిటరీ థాట్స్ ప్రింటెడ్ ఆల్మోస్ట్ ప్రైవేట్లీ* అనే పేర ప్రచురించాడు. చిన్న వ్యాసాల, సూత్రాల సముదాయమే కాకుండా, మౌలికమైన, సజీవమైన, స్వచ్ఛమైన గొంతు ఈ సంకలనంలో కనిపిస్తుంది. 1917 లో రష్యా విప్లవం ప్రారంభమయిన తరువాత, మాస్కో సమీపంలో ఒక మత సంబంధమైన ఆశ్రమంలో నివాసం ఏర్పరుచుకొన్నాడు. దుర్భరమైన దారిద్ర్యాన్ని అనుభవిస్తూ, చివరికి సనాతన మతానికి దగ్గర కాసాగాడు. 1919 వ సంవత్సరంలో రోజనోవ్ స్వర్గస్థు డయాడు.

ఎస్.ఎస్.ప్ర.

**రోజాస్, ఫెర్నాందో డి (1465-1541) :** స్పెయిన్ సాహిత్య చరిత్రలోనూ, యూరప్ సాహిత్య చరిత్రలోను ఒక ముఖ్యమైన పరిణామానికి కారణమైన ఒకే వచన నాటక రచన చేసిన ఘనత రోజాస్‌కు దక్కుతుంది. *లా సెలెస్టీనా* అనే ఈ నాటకం వచనంలో రచింపబడ్డ సుదీర్ఘమైన ప్రయోగం.

రోజాస్ తల్లిదండ్రులు యూదు మతస్థులు. 1498 లో సలమాన్కా విశ్వవిద్యాలయంలో రోజాస్ పట్టభద్రుడయాడు. టెలవేరా పట్టణానికి వెళ్లి అక్కడ న్యాయవాద వృత్తి చేపట్టి, వివాహం చేసుకొని కొంతకాలం లార్

మేయర్‌గా కూడా పనిచేశాడు. లా సెలెస్టీనా మొదటి రూపం 1499 లో *లా కమెడియా డి కాలిక్స్టో్యి మెలిబియా* అనే పేరుతో ప్రచురించబడింది. ఇందులో 16 అంకాలు ఉన్నాయి. తరువాతి రూపం 1502 లో *ట్రాజిక మెడియా డి కాలిస్టోయి మలీబియా* అనే పేరుతో ప్రచురించబడింది. ఫ్రెంచ్ అనువాదం, ఇటాలియన్ అనువాదాలతో ఈ రచనకు *లా సెలెస్టీ* అనే పేరు ప్రచారంలోకి వచ్చింది. దైనందిన జీవితంలోని ఆనందాన్ని నాటక రూపంలో ప్రదర్శించిన ప్రథమ రచనలలో *లా సెలెస్టీనా* చెప్పుకోదగ్గది. విషాదాత్మక ప్రణయగాథను రోజాస్ సామాన్య ప్రజల హాస్య భరిత అనుభవాలతో సమ్మిళితం చేసి మరపురాని నాటకంగా మలచాడు.

ఎస్.ఎస్.ప్ర.

**రోలాఁ, రోమ్యాఁ, (1866-1944) :** 20 వ శతాబ్దపు ఫ్రెంచ్ సాహిత్యంలో రోమ్యాఁ రోలాఁ నవలా రచయితగా, నాటక రచయితగా, వ్యాస రచయితగా, గొప్ప వేదాంతిగా ఉన్నత స్థానాన్ని అలంకరించాడు. తన కాలంలోని రాజకీయ, సాంఘిక, ఆధ్యాత్మిక సమస్యలు ఎన్నిటితోనో ఆయనకు సన్నిహిత సంబంధం ఉండేది.



కమ్యూనిస్టు, ఫాసిస్టు శక్తులకు వ్యతిరేక ఉద్యమంతోను, ప్రపంచశాంతి స్థాపన ప్రయత్నాలతోను ఆయనకు సంబంధం ఉండేది.

14 వ ఏట పారిస్‌కు విద్యాభ్యాసానికి వెళ్లినపుడు అక్కడి సంఘం అస్తవ్యస్తంగా ఉన్నట్లు గ్రహించాడు. మతంపై విశ్వాసం నశించింది. స్పినోజా, టాల్‌స్టాయి వంటివారి రచనలు ఆయనను ఆకర్షించాయి. సంగీతంపై అభిరుచి పెంచుకొన్నాడు. చరిత్రను అధ్యయనం చేసి, 1895 లో కళాపరిశోధనలో డాక్టరేట్‌ను తీసుకొన్నాడు. మొదటి దశలో ఆయన నాటకాలు రచించాడు. కాని అవి ఎక్కువ మందిని చేరుకోలేక పోయాయి. రెండు పర్యాయాలు తన నాటికలను సంకలనం చేశాడు. 1913 లో ప్రచురితమైన *ట్రాజెడీస్ డి లా షామ్* అనే సంకలనంలో *ఏర్ట్* అనే నాటిక ఉంది. 1904 లో ప్రచురితమైన *లే థియేటర్ డి లా రెవల్యూషన్* అనే సంకలనంలో *ది ఫుల్స్* (1898), *డాంటన్* వంటి నాటికలు ఉన్నాయి.

పది సంపుటాల బృహత్ నవల *జీన్ క్రిస్టొఫె* (1904-12) ని *లే కెహియర్స్ డి లా క్విన్ జైన్* అనే పత్రికలో ఆయన ప్రచురించాడు. మొదటి ప్రపంచ యుద్ధకాలంలో ఫ్రాన్స్, జర్మనీ సత్వాన్ని, మానవతను గౌరవించాలని ఉద్బోధిస్తూ *ఎబవ్ ది బాటిల్* అనే కరపత్రాన్ని ప్రచురించాడు. 1915 లో ఆయనకు నోబెల్ పురస్కారం లభించింది. 1914 లో ఆయన స్విట్జర్లాండు వెళ్లి 1937 వరకు అక్కడే జీవితాన్ని గడిపాడు.

వీరులపై ఆయన అభినివేశం *బీతోవెన్ జీవిత చరిత్ర, మైకేల్ ఏంజెలో* జీవిత చరిత్ర, *టాల్‌స్టాయ్ జీవిత చరిత్ర*లు రచనలో వ్యక్తం అయింది. 'జీన్‌క్రిస్టొఫె' అనే రచన ఫ్రాన్సులో *గొలుసు నవల* (Novel cycle) ను ప్రవేశ పెట్టింది. రచనలోను, శైలిలోను ఈ నవల ఉన్నతమైనది. కవిత్వ భావపేశలమైన ఈ నవలలో జర్మన్ జాతీయుడైన ఒక వాగ్గేయకారుడు జీన్ క్రిస్టొఫె క్రాఫ్ట్ జీవితంలోని ఒడుదుడుకులను హృదయంగమంగా రోలాఁ చిత్రించాడు. జర్మన్ వాగ్గేయకారుని మధ్య, ఫ్రెంచి యువకుని మధ్య పెంపొందిన మైత్రి రోలా విశ్వసించిన 'వైరుధ్యాల సమన్వయం' గా కనిపిస్తుంది. అదే సర్వజాతి సమన్వయానికి దోహదం చేస్తుందని ఆయన గాఢంగా విశ్వసించాడు. రాజకీయ విభేదాలను, వాటి దారుణ ప్రభావాలను వివరిస్తూ ఏడు సంపుటాల నవలా మాలిక *లామె-ఎన్ బాంటె* ను 1922-33 మధ్య కాలంలో ప్రకటించాడు.

1920 ప్రాంతరంలో ఆయన దృష్టి ఆసియావైపు, ముఖ్యంగా భారతదేశం వైపు మళ్లింది. భారతీయ తత్త్వశాస్త్రాన్ని పశ్చిమ దేశస్థులకు వివరించాలని ఆయన ప్రయత్నించాడు. 1924 లో మహాత్మాగాంధీ జీవిత గాథను రచించాడు. 1935 లో మాస్కో సందర్శించి, మాక్సిమ్ గోర్కీని కలుసుకొన్నాడు. తన కాలపు మేధావులయిన బెర్ట్రాండ్ రసెల్, ఆల్బర్ట్ ఐన్‌స్టైన్, రవీంద్రనాథ్ టాగోర్ వంటి వారితో ఆయన జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలు 1948 లో ప్రచురితమయాయి. మరణానంతరం ఆయన జ్ఞాపకాలు 1956 లో ప్రచురించ బడ్డాయి. ఈ రచన లన్నింటిలో రోలాఁ నిజాయితీ, సకలమానవ జాతిపై అనంతమైన అనురాగమూ ప్రత్యక్ష మవుతాయి. ఒక ఉదాత్త, ఉత్తమ సాహిత్యమూర్తిగా ఆయన దర్శన మిస్తాడు.

ఎస్.ఎస్.ప్ర.

**రోవా బాస్తోస్, అగస్తో (1917--)** : లాటిన్ అమెరికన్ కథారచయిత, నవలారచయిత సినిమా సంభాషణల రచయితగా జాతీయ, అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించిన వాడు. ఒక మారుమూల పల్లెలో జన్మించిన రోవా బాస్తోస్ ఒక మిలిటరీ పాఠశాలలో కొంతకాలం విద్యాభ్యాసం చేసి, 1932-35 మధ్య జరిగిన ఛాకో యుద్ధంలో సైనికుడుగా పోరాడాడు. విద్యార్థి దశ లోనే తన పినతండ్రి ఇంటిలో ఉన్న గ్రంథాలను చదివి, ప్రామాణిక శ్పానిష్ సాహిత్యంలో ప్రవేశాన్ని, ఆసక్తిని, పాండిత్యాన్ని సంపాదించుకొన్నాడు.

1942 లో తన తొలి కవనాలను *ఎల్ రూసినార్ డి లా అరోరా* (El Rusenor de La Aurora') అనే గ్రంథంగా వెలువరించాడు. 1940-50 దశకంలో ఈయన వ్రాసిన నవలలూ, ఎన్ని ప్రదర్శనలకో నోచుకున్న నాటకాలూ, కవనాలూ ఏవీ ప్రచురణ కాలేదు. వాటిలో *ఎల్ నరంజల్ ఆర్డియంటె* (El naranjal ardiente-1960: The Burning Orange Grove) అనే కరపత్రం మాత్రం ప్రచురితమైంది. 1947 లో జరిగిన అంతర్యుద్ధం కారణంగా స్వదేశం వదలి 'బ్యూనోస్ ఎయిర్స్' వెళ్లి అక్కడి రాయబార కార్యాలయంలో సాంస్కృతిక వ్యవహారాలశాఖకు అధిపతిగా పనిచేశాడు.

*ఎల్ ట్రూనో ఎంటర్ లాస్ హోజాస్* (El Trueno entre las hojas-1953 Thunder Among The Leaves) అనేది ఆయన మొదటి కథాసంపుటి. ఆ పేరుతో ఉన్న కథను సినిమాకు పనికి వచ్చే విధంగా ఆయనే త్రిప్పివ్రాశాడు కూడా. ఇందులో పెరాగ్వియన్ అనుభూతులను, ప్రత్యేకించి అక్కడి సాంఘిక అన్యాయాలను, హింసను రచయిత ప్రతిబింబిస్తాడు. *రోహా-బాస్తోస్* తన రచనలలో వాస్తవికతకు పుక్కిటిగాథల (Myths) ను, 'ఎక్స్‌ప్రెషనిస్ట్' పద్ధతులను జోడించి *మాజిక్ వాస్తవికత* (Magic realism) అనే దానిని సృష్టించి వాడుకొన్నాడు.

*హిజోడి హోంబర్* (Hejode Hombre-1960 Son of Men, 1965) అనే ఆయన నవల ఆధునిక పెరుగ్వే చరిత్రనే విమర్శనాత్మకంగా చూపుతుంది. దీనిని కూడా సినిమాకి పనికి వచ్చే విధంగా ఆయనే మలచాడు. 1960-70 దశకంలో ఇంకా అనేక సినిమాలకు రచనలు చేశాడు.

*ఎల్ బాల్డియో* (1966; The Untilled) అనే కథా సంపుటి అవగాహనతోను, సానుభూతితోను ప్రవాస పెరాగ్వన్‌ల సమస్యలను ప్రతిబింబిస్తుంది. *లాస్ పైస్ సోబర్ ఎల్ ఆగ్వా* (Los pies sobre el agua 1967, The Feet on the Water), *మదేరా క్వేమాడా* (Madera quemada; 1967, Burnt Madeira) అనేవి ఈయన ఇతర కథా సంపుటాలు.

1970 లో స్వదేశానికి తిరిగి వెళ్లి అక్కడి విశ్వవిద్యాలయంలో సాహిత్యాన్ని బోధించాడు. ఆయన ఎన్నో ఆశలు పెట్టుకొని రాసిన నవల *యో ఎల్ సుప్రీమో* (Yo el supremo, 1945, "I The Chief). ఫ్రాన్సియా జీవిత చరిత్ర ఆధారంగా వంద సంవత్సరాల పెరుగ్వే దేశ చరిత్రను చిత్రిస్తుంది. 1976 లో ఫ్రాన్స్ వెళ్లి అక్కడ 'యూనివర్శిటీ టిటోలోస్' లో ఆచార్యుడుగా చేరాడు. డి. డబ్ల్యు. ఫాస్టర్ ఆంగ్లంలో ఈయనపై వ్రాసిన గ్రంథం ప్రామాణికమైనది.

కె.జి. మూర్తి

**రోసెట్టీ, దాంతే గాబ్రియెల్ (1828-82)** : కవిత్వానికి, చిత్రకళకు ఉన్న అవిభాజ్య సంబంధాన్ని తన కళాత్మక దృష్టితో ప్రకటిస్తూ ప్రి-రాఫలైట్ (Preraphaelite) ఉద్యమానికి ఇంగ్లండులో రోసెట్టీ నాయకత్వం వహించాడు. నైతిక, మత, మధ్యయుగ సంబంధమైన విషయాలను సహజంగా, సౌందర్యదృష్టితో వీరు పరిశీలించేవారు.

లండన్‌లోని కింగ్స్ కాలేజ్‌లో విద్యాభ్యాసం చేసే సమయంలో చిత్రకళ, కవిత్వాలలో ఏది తనకిష్టమో అభిరుచిని నిర్ణయించుకోలేక 14 వ ఏట చిత్రకళని అభ్యసించాలని నిర్ణయించుకొని రాయల్ ఎకాడమి ఆఫ్ ఆర్ట్‌లో విద్యార్థిగా చేరాడు. అదే సమయంలో షేక్స్పియర్, గొయిథే, స్కాట్ వంటి వారి సాహిత్యాన్ని అధ్యయనం చేశాడు. బ్లేర్ చిత్రాలు, రచనలు ఆయనను బాగా ఆకర్షించాయి.

20 వ ఏటికే ఇటాలియన్ సాహిత్యం నుంచి ఎన్నో అనువాదాలు చేశాడు. జర్మనీలో ప్రారంభమయిన ప్రి-రాఫలైట్ ఉద్యమానికి సంబంధించిన అంశం సాంస్కృతిక పునరుజ్జీవనానికి ముందు ఉన్న స్వచ్ఛమైన శైలీ విధానం. ఆ విధానాన్ని ఇంగ్లండులో ప్రవేశపెట్టాలి అని రోసెట్టీ ఆశించాడు. ప్రకృతి సత్యానికి సాహిత్యం దర్పణం కావాలని భావించాడు. మధ్యయుగ సంస్కృతిని స్వర్ణయుగంగా భావించి ఆ సంస్కృతిని సాహిత్యంలో ప్రదర్శించాలని ప్రయత్నించాడు. సాహిత్యానికి, చిత్రకళకు సాంఘిక ఆదర్శాన్ని కూడ ఈ ఉద్యమం జోడించింది.

గోథిక్ కాలంనాటి మత ఆచారాలు, ఆభరణాలు

అతనిని ప్రభావితం చేశాయి. వాటి సౌందర్యం అతనిని బాగా ఆకర్షించింది. తన ప్రథమ కవితా సంకలనానికి *సాంగ్స్ ఆఫ్ ఏన్ ఆర్ట్-కేథలిక్* అని పేరు పెట్టాడు. వీటిశైలి సులభం, కాని ప్రత్యేకాత్మత ఎక్కువ. *ది బ్లెస్సెడ్ డేమొజెల్* అనే శబ్దచిత్ర సుందరమైన కవిత 1850 లో *ది జెర్మ్* అనే ప్రి-రాఫలైట్ ఉద్యమ పత్రికలో ప్రచురితమయింది.

*ఎక్కె ఏన్సిలాడోమిని* వంటి మత సంబంధ చిత్రాలు తీవ్రమైన విమర్శకు గురిఅయాయి. అందువల్ల, రోసెట్టీ మత సంబంధ చిత్రాలను విడిచి పెట్టి, లౌకికమైన షేక్స్ పియర్ నాటకాలకు, బ్రౌనింగు కవితలకు సంబంధించిన చిత్రాలు రచించాడు. 1856 తరువాత *సర్ థామస్ మెలోడి మార్గ్‌డ్థార్* వంటి కావ్యాలకు సంబంధించిన చిత్రరచన చేశాడు.

తన ఉద్యమంలో తోడుగా నిలచిన, అందగత్తె ఎలిజబెత్ సిడ్డాల్‌ని 1860 లో వివాహం చేసుకొన్నాడు. ఆమె రూపాన్ని అందానికి ప్రతీకగా అతడు రచించిన చిత్రాలు ఆమెపై అతని అమితమైన ప్రేమను వ్యక్తం చేస్తాయి. జాన్ రస్కిన్ వంటి ప్రఖ్యాత కళావిమర్శకుడు రోసెట్టీ చిత్రాలను అభినందించాడు. ఆక్స్‌ఫర్డ్‌లోను, కేంబ్రిడ్జ్‌లోను రోసెట్టీ యువకులను ఆకర్షించసాగాడు. ఎడ్వర్డ్ బర్న్-జోన్స్, విలియమ్ మోరిస్ వంటి యువకులు ఈ ఉద్యమంలో చేరారు. మళ్లీ ఈ ఉద్యమం బాగా పుంజుకొంది. కాని 1860 తరువాత రోసెట్టీ జీవితం సుఖ శాంతులకు దూర మయింది. 1862 లో ఎలిజబెత్ మరణించింది. తన కవితల వ్రాత ప్రతులను ఆమెతో ఖననం చేశాడు. ఆమె అతనికి ఆదర్శప్రేయసి అని 1863 లో అతడు చిత్రించిన బియాటా బయెటిక్స్ వెల్లడిస్తూంది.

1861 లో ప్రచురించబడిన *ఎర్లీ ఇటాలియన్ పొయెట్స్* విజయవంతం అయింది. ఖననం చేసిన వ్రాతప్రతులను బయటకు తీసి *పొయెమ్స్* అనే సంకలనాన్ని 1870 లో ప్రచురించాడు. ఆ సంకలనానికి మంచి ఆదరణ లభించింది. అయితే, మైట్‌లండ్ అనే విమర్శకుడు ఆ సంకలనాన్ని తీవ్రంగా అధిక్షేపించాడు. రోసెట్టీ తగిన సమాధానం ఇచ్చాడు. కాని అప్పటికే అతని ఆరోగ్యం బాగా దెబ్బతింది. 1874 లో అవయవాలు కదపలేని పరిస్థితికి దిగజారింది. అయినా, 1880 లో *డాంటేస్వప్నం* అనే చిత్రాన్ని రచించాడు. *పొయెమ్స్* సంకలనాన్ని మార్పులు, చేర్పులతో తిరిగి ప్రచురించాడు. *బాలెడ్స్ అండ్ సానెట్స్* లో తన బాలెడ్స్‌ని, సానెట్స్‌ని అన్నిటిని కలిపి ప్రచురించాడు. 1881 లో తన కుటుంబ సభ్యులు తనకు శ్రద్ధగా పరిచర్యలు చేశారు. కాని అతని ఆరోగ్యం పూర్తిగా క్షీణించింది. ఆ సంవత్సరం వసంత ఋతువులో రోసెట్టీ స్వర్గస్థుడయాడు.

'లండన్ నరకంలో అస్తమించిన గొప్ప ఇటాలియన్' అని రోసెట్టీని రస్కిన్ అభివర్ణించాడు. అసమాన లేఖా సాహిత్యసృష్టి, అనేక ఛందోరీతుల ప్రయోగం, మంచి స్థాయికి ఎదిగిన చిత్రకళా నైపుణ్యం, ప్రతీకాత్మక కవిత్వం రోసెట్టీని మరువరాని కళాతపస్విగా చేశాయి.

ఎస్.ఎస్.ప్ర.

**ర్యీద్‌బెర్గ్, విక్టోర్ (1828-95) :** స్వీడన్ సంస్కృతిని గాఢంగా ప్రభావితం చేసిన ర్యీద్‌బెర్గ్ 'జోన్ కోపింగ్' నగరంలో 1828 లో జన్మించాడు. సాహిత్యంలో కాల్పనికోద్యమానికి చెందినవాడు. బహుముఖీనమైన ప్రతిభను కనపరచినవాడు. బాల్యంలో అనాథగా జీవితం గడపిన ర్యీద్‌బెర్గ్ 1855 లో వ్రాసిన *గోటెబర్గ్స్ హాండెల్ ఫిడ్నిగ్* అనే నవలను 1859 లో ధారావాహికంగా పత్రికలో ప్రచురించాడు. పురాతన ఏథెన్స్‌లో క్రైస్తవమతం ప్రవేశించిన సమయంలో తదితర సంప్రదాయానికీ, క్రైస్తవానికి మధ్య సంభవించిన ఘర్షణ ఈ నవలలో ఇతివృత్తం. సమకాలీన స్వీడెన్ పరిస్థితులకు అద్దం పట్టినట్లుగా ఈ నవలను ర్యీద్‌బెర్గ్ రూపొందించినాడు. మత మౌఢ్యంపట్ల తన వ్యతిరేకతను దీనిలో స్పష్టం చేశాడు. మధ్య యుగంలో స్వీడెన్ స్థితిగతులు ఆధారంగా *సింగోవల్లా* (Singoalla, 1857) అనే నవలను రచించాడు. దీన్నే పరిష్కరించి 1865 లో పునర్ముద్రించాడు. *బిబెల్న్స్ లారాబయ్ క్రిస్టస్* (క్రీస్తును గూర్చిన బైబిల్ సూక్తులు) అనే గ్రంథాన్ని 1862 లో ప్రచురించాడు. క్రీస్తు దైవత్వాన్ని నిరాకరిస్తూ వ్రాసినందున మతాధికారులతో ఇతనికి వైమనస్యం ఏర్పడింది. ర్యీద్ బెర్గ్‌కి వాదోపవాదాల మూలంగా మనశ్శాంతి లోపించింది. 1870 లో కొంతకాలం స్వీడిష్ పార్లమెంట్ సభ్యుడుగా ఉన్నాడు. స్వీడిష్ భాషను సంస్కరించాలని యత్నించాడు. 1874 లో రోము నగరాన్ని సందర్శించి *రోమర్ స్కాడగార్* అనే గ్రంథాన్ని వ్రాసి, రోము నగర పురాతన వైభవాన్ని ప్రతిభావంతంగా వ్యాఖ్యానించాడు. 1876 లో గొయిథే మహాకవి జర్మన్ భాషలో రచించిన *ఫౌస్ట్* (Faust) అనే నాటకాన్ని స్వీడిష్ భాషలోకి అనువదించాడు. *దిక్టర్* అనే కవితా సంపుటంతో గొప్ప కవిగా కీర్తింపబడ్డాడు. ఇతనికి ఉప్పసాలా యూనివర్శిటీ డాక్టరేట్ పట్టాన్ని

ప్రదానం చేసింది (1877). 1878 లో స్వీడిష్ అకాడమీలో సభ్యత్వాన్ని పొందాడు. 1884 లో స్టాక్ హోం విశ్వవిద్యాలయంలో 'చరిత్ర-సంస్కృతి' ఆచార్యుడుగా నియమితుడయాడు. స్వీడెన్‌లో రిఫర్మేషన్ కాలంనాటి పరిస్థితులను ఆధారంగా చేసుకొని *వాపెన్ స్ప్రెడెడ్* (కవచం) అనే నవలను వ్రాశాడు. *దెన్యా గ్రొట్టా సొంగెన్* అనే కవితా సంపుటాన్ని ప్రచురించాడు. ఈ కవితా సంపుటంలో సామాజికమైన పరిస్థితులపై తీవ్రమైన అధిక్షేపం కన్పిస్తుంది. 1886-89 సంవత్సరాల మధ్య కాలంలో జర్మన్ పురాతన గాథలను అధ్యయనం చేసి, రెండు సంపుటాలను ప్రకటించాడు.

ర్యిడ్‌బర్గ్ స్వీడిష్ సంస్కృతిలో సమున్నత స్థానాన్ని సంపాదించుకొన్నాడు. 1895 లో జుర్స్‌హోం నగరంలో అతడు మరణించినాడు.

శ్రీ.ల.

**లండన్, జాక్ (1876-1916)** : ఆంగ్ల నవలారచయిత, కథా రచయిత. ఈయన రచనలు మనుగడకై



అవిచ్ఛిన్నంగా సాగే మౌలికమైన పోరాటాన్ని ఆసక్తి దాయకంగా కాల్పనికరీతిలో (Romantically) వర్ణించాయి. ఈయన అసలు పేరు 'జాన్ గ్రిఫిత్ ఛానీ'. తండ్రి వదలివేయగా, ఆధ్యాత్మికత పాలు ఎక్కువగా ఉన్న తల్లి, మంచివాడైన సవతితండ్రీ (లండన్ అనేది ఆయన ఇంటిపేరే) ఈయనను పెంచారు. దారిద్ర్య బాధ నుంచి తప్పించుకోడానికి 14 సంవత్సరాల వయస్సప్పుడు స్కూల్ మాని, ఏవో చిల్లర పనులు చేస్తూ, నౌకలలో పనిచేస్తూ అమెరికా సంయుక్త రాష్ట్రాలలో చాలా భాగాన్నీ, జపాన్‌నూ సందర్శించాడు. ఆర్థిక మాంద్యాన్ని కళ్లారా చూశాడు. పనిపాటలు లేకుండా తిరుగుతూ కారాగారవాసం కూడా చేశాడు. ఛార్లెస్ డార్విన్, కార్ల్ మార్క్స్ ఫ్రెడరిక్ నీట్షేల రచనలను చదివి, ఆకళింపు చేసుకొని తీవ్రవాద సోషలిస్ట్‌గా స్థిరపడ్డాడు. శ్వేత జాతుల ఆధిక్యానికి సామ్యవాదాన్ని జోడించి ఒక నూతన మిశ్రమాన్ని తనకై సృష్టించు కొన్నాడు. బ్రతుకు తెరువుకై ఎన్నో పనులు చేసి, కొంతకాలం అప్పట్లో బంగారం కోసం తీసే పరుగు (Gold Rush-1897) లో చేరి ఎక్కడా సాఫల్యం పొందలేక, చివరకు రచయితగా స్థిరపడ్డాడు.

రోజూ కొన్ని గంటలపాటు పత్రికలు, పుస్తకాలు పఠించి, ఎంతో కొంత వ్రాయటం ప్రారంభించాడు. మొదట్లో సాహసగాథలు, భయానక కథలు, హాస్య రచనలు వ్రాసేవాడు. 1909 లో ప్రచురితమైన ఆయన తొలి నవల *మ్యార్టిన్ ఈడెన్* (Martin Eden) ఒక విధంగా ఆయన స్వీయజీవితాన్ని ప్రతిబింబించే నవల అనవచ్చు. ఈ రచయిత తన రచనా వ్యాసంగాన్ని ఎలా ప్రారంభించి, అభివృద్ధి చేసుకొన్నాడో ఇందులో కనిపిస్తుంది. ఆయనకు అమితమైన పేరు ప్రఖ్యాతులను తెచ్చిపెట్టింది ఈ నవల. 1900 వ సంవత్సరంలో *ది సన్ ఆఫ్ ది వుల్ఫ్* (The Son of the Wolf) తో ప్రారంభించి 17 సంవత్సరాలలో 50 గ్రంథాలు రచించాడు. ఆ రోజులలో అత్యధిక పారితోషికం తీసుకొనే రచయితగా పేరు పొందినా, ఈ రచయిత తన ఖర్చులకు సరిపడే సొమ్మును ఏనాడూ సంపాదించలేదు. సామ్యవాద స్థాపనకై వర్గపోరాటం తప్పదనే సిద్ధాంతాన్ని తాను అంతగా పట్టించుకోని చివరి రోజులలో కూడా యువ విప్లవ కారులకు ఈయన ఆదర్శమూర్తిగానే నిలిచాడు. మాదక ద్రవ్యాలను మితిమీరి తీసుకోడం వలన సంభవించిన ఈయన మరణాన్ని ఆత్మహత్యగా పరిగణించడం జరిగింది.

ఈయన రచనలలో *కాల్ ఆఫ్ ది వైల్డ్* (1903), *వైట్ ఫాంగ్* (1906), *బర్నింగ్ డే లైట్* (1910) ప్రముఖమైనవి. వీటిలో మనిషి తన పరిసరాలకు, పరిస్థితులకు అనుగుణంగా ఎట్లా సర్దుకుపోగలడో మనిషిలోని కొన్ని లక్షణాలు కొన్ని తరాలలో మరుగున పడిపోకుండా తిరిగి అవి ఎట్లా ప్రజ్వరిల్లుతాయో ఈ రచయిత చూపిస్తాడు. స్వీయ చరిత్ర ఆధారంగా వ్రాసిన మరి రెండు నవలలు *ది రోడ్* (1907), *జాన్ బార్లీ కార్న్* (1913) బహుళ ప్రాచుర్యం పొందాయి. *ది సీ వుల్ఫ్* (The Sea Wolf, 1904) లో అత్యంత శక్తిమంతుడైన నాయకుణ్ణి చిత్రిస్తాడు. *ది ఐరన్ హీల్* (1907) లో ఏకవ్యక్తి నిరంకుశ పాలనా వ్యవస్థ (Fascism) భయానక అవతరణను ముందుగానే ఊహించినట్లు వ్రాస్తాడు. 1920 తరువాత క్రొత్త తరపు యువ రచయితల మెరుపుతో ఈ రచయిత అమెరికాలో కొంత ప్రాబల్యాన్ని కోల్పోయినా యూరప్‌లో ముఖ్యంగా సోవియెట్ యూనియన్‌లో

తన పలుకుబడిని పెంచుకొన్నాడు. సోవియెట్ యూనియన్‌లో 1956 లో ఈయన స్మృత్యర్థం వెలువరించిన గ్రంథం ప్రతులన్నీ కొద్ది గంటలలోనే అమ్ముడైపోవటం రష్యన్ హృదయాలలో ఈయన స్థానాన్ని తెలియజేస్తుంది. ఆర్. బాల్‌ట్రాప్, ఎ. సింక్లెయిర్‌లు వ్రాసిన ఈయన *జీవిత చరిత్రలు* 1976, 1977 లలో ప్రచురితమయాయి.

కె.జి. మూర్తి

**లాంగ్‌ఫెలో, హెన్రీ వడ్స్‌వర్త్ (1807-82):** 19 వ శతాబ్దిలోని అమెరికన్ రచయితలలో బహుళ ప్రాముఖ్యం పొందినవాడు. విద్యార్థి దశలోనే సర్‌వాల్టర్ స్కాట్ వ్రాసిన కల్పిత కథలు, గాథలు (Romances), 'వాషింగ్‌టన్ ఇర్వింగ్' వ్రాసిన *స్కెచ్ బుక్* (Sketch Book) లాంగ్‌సెలోను ఆకర్షించాయి. కళాశాలలో చదివే రోజులలోనే దేశంలోని ప్రముఖ వార, పక్ష పత్రికలలో ఆయన వ్రాసిన కవితలు ప్రచురితమయేవి. అనువదించటంలో ఈయన ప్రతిభను గుర్తించి ఆధునిక భాషల శాఖలో ఆచార్య పదవినిచ్చి శిక్షణకై యూరప్‌లో కొంతకాలం అధ్యయనం చేసి రమ్మని పంపింది ఒక విశ్వవిద్యాలయం.



యూరప్‌లో ఫ్రెంచ్, స్పానిష్, ఇటాలియన్ భాషలను అధ్యయనం చేసి 1829 లో సంయుక్త రాష్ట్రాలకు తిరిగి వచ్చాడు. ఒక క్రమ పద్ధతిలో విద్యను ఆర్జించటం, విద్యార్థులకు చెప్పటం అనే మూసలో ఇముడలేనని తెలుసుకొని 'బౌడాయిన్' (Bowdoin) విశ్వవిద్యాలయంలో ఆచార్య స్థాయిలో గ్రంథాలయాధిపతిగా చేరాడు. ఆ పదవిలో ఉంటూ పాఠ్య గ్రంథాలను వ్రాశాడు; కొన్నిటికి సంపాదకత్వం వహించాడు; అనేక భాషలలోని ఉత్తమ సాహిత్యాన్ని అనువదించాడు. ఫ్రెంచ్, స్పానిష్, ఇటాలియన్ సాహిత్యాలపై వ్యాసాలు వ్రాశాడు. కాని జీవితంలో ఏకాకినై పోయాననే భావం ఆయనను క్రుంగదీయటం ప్రారంభించింది. అదే సమయంలో (1835) లో హార్వర్డ్ విశ్వవిద్యాలయం ఆచార్య పదవి నిచ్చి జర్మనీ వెళ్లే అవకాశాన్ని కల్పించింది. జర్మనీతో పాటు ఇంగ్లండ్, స్వీడెన్, నెదర్లాండ్స్ లను కూడా ఆయన దర్శించాడు. 1835 లో మొదటి భార్య మరణంతో పూర్తిగా క్రుంగిపోయిన ఈ రచయిత హిడెల్‌బర్గ్‌లో స్థిరపడి జర్మన్ భావకవుల (German Romanticism) ప్రభావానికి లోనయాడు. 1843 లో అమెరికాకు తిరిగి వచ్చి పునర్వివాహం చేసుకొన్నాడు. 1839 లో *హైపీరియన్* (Hyperion) అనే రొమాంటిక్ నవలను, *ఫేసెస్ ఆఫ్ ది నైట్* (Faces of the Night) అనే కవితా సంపుటిని వెలువరించాడు. ఆ కవితలలో *ది సామ్ ఆఫ్ లైఫ్* (The Psalm of Life), *ది లైట్ ఆఫ్ ది స్టార్స్* అనేవి అమితమైన ప్రజాదరణ పొందాయి. 1841 లో *బాలడ్స్ అండ్ అదర్ పొయెమ్స్* ప్రచురించాడు. అందులోని *ది రేక్ ఆఫ్ హెస్పెరస్* జాతి నంతటినీ కుదిపివేసింది. కాని 1842 లో రచించిన *పొయెమ్స్ ఆన్ స్లేవరీ* అంత విజయవంతం కాలేదు. 1854 లో హార్వర్డ్‌లో పదవీ విరమణ చేసిన తరువాత *ది సాంగ్ ఆఫ్ హియవాతా* అనే గ్రంథాన్ని ఉత్తర అమెరికాలో ఇండియన్ తెగలకు సంబంధించిన విషయాలపై వ్రాశాడు. 1861 లో ఈయన రెండవ భార్య మరణం ఈయనను బాగా క్రుంగదీసింది. దానిలో నుంచి బయటపడే ప్రయత్నంలో *డివైన్ కామెడీ* మొత్తాన్ని అనువదించాడు. అప్పటివరకు వచ్చిన అనువాదాలలో అది ఉత్తమోత్తమమైనదని పండితులు, విమర్శకులు ముక్త కంఠంతో కొనియాడారు. దాంతేపై ఈ రచయిత ఆరు సానెట్లను కూడా వ్రాశాడు. 'లాంగ్‌ఫెలో' వ్రాసిన కవితలలో అవి చాలా ప్రసిద్ధి చెందాయి.

ఛాసర్ విరచితమైన *కాంటర్బరీ టేల్స్* మూసలో *ది టేల్స్ ఆఫ్ ఏ వేసైడ్ ఇన్* అనే గ్రంథాన్ని 1863 లో ప్రచురించాడు. ఈ రచయిత కథ చెప్పే తీరు చాలా విశిష్టమై అందరినీ ఆకట్టుకొంటుంది. 1872 లో ఆయన అత్యుత్తమ రచన అని చెప్పదగిన *క్రైస్టస్* ఎ మిస్టరీ అనే మూడు గ్రంథాల మాలను రచించాడు. క్రైస్తవ మత చరిత్ర దాని పుట్టుక నుంచి చాలా వివరంగా ఇందులో కనిపిస్తుంది. *జుడాస్ మెకాబియస్*, *మైఖేల్ ఏంజెలో* (Michael Angelo) అనే నాటికలను కూడా వ్రాశాడు. కాని 1843 లో వ్రాసిన *ది స్పానిష్ స్టూడెంట్* వలెనే అవి కూడా అంత విజయం కాలేదు. 1882 లో ఈయన మరణించిన చాలాకాలం తరువాత ఈ నాటకాల గొప్పతనాన్ని విమర్శకులు గుర్తించటం జరిగింది. ఈయన స్మృతి చిహ్నాన్ని వెస్ట్ మిన్‌స్టర్ ఆబీ లో నెలకొల్పారు.

కె.జి. మూర్తి

**లాంప్‌మన్, ఆర్కిబాల్డ్ (1861-99) :** కాన్ఫెడరేషన్ వర్గానికి చెందిన ప్రసిద్ధ కెనేడియన్



కవి. ప్రకృతిలో కనిపించే రమణీయ దృశ్యాలను, ఆసక్తికరమైన సంఘటనలను కమనీయంగా చిత్రించగలగటం ఈ రచయిత ప్రత్యేకత. టొరంటో విశ్వ విద్యాలయంలో అధ్యయనం, పోస్టల్ శాఖలో ఉద్యోగం. కాని కవిత్వం ఆయన ఊపిరి. ఇంకో ఇద్దరు యువ కవులతో కలసి 'టోరంటో' లోని *గ్లోబ్* (Globe) అనే వారపత్రికలో *ఎట్ ది మెర్మైయిడ్ ఇన్* అనే శీర్షికను 1892-93 లో నిర్వహించాడు. నగర జీవితం లోని యాంత్రికతకు విముఖుడై సమయం దొరకినప్పుడల్లా పల్లె ప్రాంతాలకు వెళ్తూ ఉండేవాడు. ఈ రచయితను ప్రామాణిక రచయితల కవితా రూపాలు, శైలీ పద్ధతులు ప్రభావితం చేశాయి. కాని వర్డ్స్‌వర్త్, షెల్లీ, కీట్స్ వంటి భావ కవుల భావ కవిత్వం కూడా ఈ రచయితను ఆకట్టుకొంది. ఈ రెంటినీ సమన్వయం చేస్తూ సౌందర్యాన్నీ, క్విబెక్‌లోని గాటినో పల్లె ప్రాంతాల ఆహ్లాదకరమైన అందాలను లాంప్‌మన్ కీర్తిస్తాడు. ఒక విధంగా ఈయన ప్రకృతిని కవిత్వంలో ఆరాధించిన కవి. ఈయన సామ్యవాది. పార్టీ పద్ధతి రాజకీయాలకూ, వ్యవస్థాపరమైన మతానికీ వ్యతిరేకి. కాని ఆ విప్లవ భావాలేవీ ఎక్కువగా ఈయన కవితలలో కనిపించవు.

ఈ రచయిత *ఎమాంగ్ ది మిల్లెట్ అండ్ అదర్ పొయెమ్స్* (1888), *లిరిక్స్ ఆఫ్ ఎర్త్* (1893) అనే రెండు కవితా సంపుటాలను తానే వెలువరించాడు. ఆయన మరణానంతరం *ది పొయమ్స్ ఆఫ్ ఆర్కిబాల్డ్ లాంప్‌మన్* (1900), *లిరిక్స్ ఆఫ్ ఎర్త్, పొయెమ్స్ అండ్ బాలడ్స్* (1925) అనే కవితా సంపుటాలను ఆయన మిత్రుడు డంకన్ కాంబెల్ స్కాట్ ప్రకటించాడు.

కె.బి.మూర్తి.

**లాంబ్, ఛార్ల్స్ (1775-1834) :** ప్రఖ్యాత ఆంగ్ల రచయిత, విమర్శకుడు, వ్యాసకర్త. లేఖా రచనకు సాహిత్యంలో ఒక విశిష్ట స్థానాన్ని కల్పించినవాడు. *ఎస్సేస్ ఆఫ్ ఎలియా* అనే వివిధాంశాలపై ఈయన వ్రాసిన వ్యాసపరంపర చిరకాలం నిలచేదీ, ఆయనకు రచయితగా శాశ్వతత్వాన్ని ప్రసాదించేదీ అని చెప్ప వచ్చును. విద్యార్థి దశనుండే కోలరిడ్జ్, లే హంట్‌లతో పరిచయం ఉండేది. ఆ స్నేహం తరువాత బలపడి జీవితకాలపు మిత్రత్వంగా పరిణతి చెందింది. చిన్నతనంలోనే అనేక గ్రంథాలను పఠించి పండితు డనిపించుకొన్నాడు. ఇతనికి కొద్ది నత్తి ఉండేది. అది లేకపోతే ఈయన బహుశః చర్చ్‌సేవలో చాలా ఉన్నత పదవులను చేరుకొని ఉండేవాడు. 1792 లో ఇండియా హౌస్‌లో గుమాస్తాగా చేరి, 1825 లో పదవీ విరమణ చేసేదాకా అక్కడే పనిచేశాడు. 1796 లో అతని సోదరి మేరీ మతి చలించిన ఒక ఘడియలో తల్లిని చంపివేసింది. ఆమెకు ఆ మతి చాంచల్యం తిరిగి తిరిగి వస్తూ ఉండేది. 'లాంబ్' ధైర్యంగా ఆమెను ఆదుకొని, 1847 లో తాను మరణించే వరకు ఆమెకు సంరక్షకుడుగా ఉన్నాడు.

రచనా వ్యాసంగంలో తొలి ప్రయత్నంగా కొన్ని కవితలు వ్రాయగా వాటిలో కొన్నింటిని 1796 లో కోలరిడ్జ్, మరి కొన్నింటిని 1798 లో ఛార్లస్ లాయిడ్ తమ సంపుటాలలో ప్రకటించారు. 1798 లో *ఏ టేల్ ఆఫ్ రోజ్‌మండ్ గ్రే* అనే ఒక గద్య రచననూ, 1802 లో *జాన్ వుడ్ విల్* అనే విషాదాంత పద్యనాటకాన్నీ వ్రాశాడు.



అయితే ఇందులో ఏవీ ఆయనకు ధనాన్ని గాని, ఖ్యాతిని గాని తెచ్చిపెట్టలేదు. 1789 లో వ్రాసిన *ది ఓల్డ్ ఫెమిలియర్ ఫేసెస్*, 1828 లో వ్రాసిన *ఆన్ ఏన్ ఇన్‌ఫెంట్ డైయింగ్ ఏజ్ సూన్ ఏజ్ ఇట్ వజ్ బార్న్* అనే కవితలు ఆయన రచనలలో ఉత్తమమైనవిగా ఎన్నవచ్చు.

1807 లో సోదరి మేరీతో కలసి *టేల్స్ ఫ్రం షేక్‌స్పియర్* వ్రాశాడు. పిల్లలకోసం షేక్స్‌స్పియర్ నాటకాలను కథారూపంలో తిప్పి వ్రాశాడు. ఈ గ్రంథంలో ఇదే మాదిరిగా ఒడిస్సీను *ది ఎడ్వెంచర్స్ ఆఫ్ యులిసెస్* గా 1808 లో వ్రాసి ప్రకటించాడు.

షేక్‌స్పియర్ కాలంనాటి నాటక రచయితల నాటకాలలోని కొన్ని దృశ్యాలను విమర్శన దృక్పథంతో ఎన్నిక చేసుకొని వాటిపై విమర్శలతో సహా *స్పెసిమన్స్ ఆఫ్ ఇంగ్లీషు డ్రమటిక్ పొయెట్స్ హు లివ్డ్ ఎబౌట్ ది టైమ్స్ ఆఫ్ షేక్‌స్పియర్* అనే పేరుతో ప్రకటించాడు. 'లీ హంట్' నడపిన *రిఫ్లెక్టర్* అనే పత్రికకు కొన్ని వ్యాసాలు వ్రాశాడు.

'ఎలియా' అనే కలం పేరుతో 'లండన్ మాగజీన్' కు 'లాంబ్' వ్రాసిన వ్యాసాలు వచన రచనలో ఆయన నైపుణ్యాన్నీ, విమర్శకుడుగా ఆయన సునిశితత్వాన్ని తెలియజేస్తాయి. ఈ వ్యాసాలు చాలా వరకు స్వీయ చరిత్రనుండి వచ్చినవే. సోదరుడు జాన్ పనిచేసే 'సౌత్ సీ హౌస్' పై మొదటి వ్యాసం వ్రాశాడు. జాన్ తన రచనవల్ల కష్టపెట్టుకుంటాడేమో అని 'ఎలియా' అనే మారు పేరు పెట్టుకొన్నాడు. చిన్న నాటి నుండి తనకు పరిచితులైన అనేక వ్యక్తులు, వాళ్ల అలవాట్లు, అభిప్రాయాలు ఆధారంగా ఈ వ్యాస పరంపర సాగుతుంది. వివాదాస్పదం, జుగుప్సాకరం అయే రాజకీయాలు గాని, మత విషయాలుగాని, లైంగిక పరమైన చర్చలుగాని వీటిలో కనిపించవు.

'ఇండియా హౌస్' లో ఉద్యోగం విరమించుకొన్న తరువాత సోదరి మేరీ ఆరోగ్యం మరీ చెడిన కారణంగా లండన్ వదలి ఎడ్మాంటన్ చేరాడు. మద్యాన్ని శ్రుతిమించి త్రాగటం ప్రారంభించి ఆరోగ్యాన్ని పాడుచేసుకొన్నాడు. ఎడ్మాంటన్ లోనే ఆయన మరణించాడు.

ఇ.వి. లూకాస్ లాంబ్ రచనలన్నింటినీ 1903-05 లలో ఏడు సంపుటాలుగా ప్రకటించాడు. లూకాస్ ఈయన జీవిత చరిత్రను 1905 లో వ్రాసి ప్రచురించాడు. లాంబ్ లేఖలను కూడా ఆయనే మూడు సంపుటాలుగా 1935 లో ప్రచురించాడు.

కె.జి.మూర్తి

**లాక్, అలేయెన్ (1886-1954) :** అమెరికాలోని నల్లజాతివారు తమ ప్రత్యేకతను పోగొట్టుకోకుండానే అమెరికా ప్రధాన జీవన సరణిలో అంతర్భాగ మయేందుకు కృషి సాగిస్తున్న తరుణంలో ఈ రచయిత తన శక్తి యుక్తు లన్నింటిని ఆ వైపుకే మళ్లించి తన సాహిత్యం ద్వారా ఆ ఉద్యమాన్ని బలపరిచాడు. విద్యావేత్త, తత్త్వశాస్త్రజ్ఞుడు, రచయిత అయిన ఈయనను ఎక్కువగా 'హార్లెమ్ సాంస్కృతిక పునరుజ్జీవన' పు ప్రధాన భాష్య కారుడుగా గుర్తించటం జరిగింది.

హార్వర్డ్ విశ్వవిద్యాలయం నుండి తత్త్వశాస్త్రంలో 1907 లో ప్రథమ పట్టాన్ని తీసుకొన్నాడు. ఆక్స్‌ఫర్డ్, బెర్లిన్ లలో రోడ్స్ ఉపకారవేతన విద్యార్థి (Rodes Scholar) గా విద్య నభ్యసించిన మొదటి నల్లజాతి వాడు ఈయన. 1918 లో పిహెచ్.డి పట్టాన్ని హార్వర్డ్ విశ్వవిద్యాలయం నుంచి తీసుకొని హోవర్డ్ విశ్వవిద్యాలయంలో 1953 లో పదవీ విరమణ చేసే వరకు తత్త్వశాస్త్ర ఆచార్యుడుగాను, ఆ శాఖాధిపతిగాను పని చేశాడు.

నల్లజాతి కళాకారులను - ముఖ్యంగా చిత్రకారులను, సంగీతకారులను ఆఫ్రికా జీవితాన్ని అర్థం చేసుకోమని తమ ప్రత్యేక వ్యక్తిత్వాన్ని గుర్తించి, పెంపొందించి నిలుపుకోవాలంటే తమ తమ భావప్రకటనలకు విషయాలను నీగ్రో సాహిత్యం నుండీ, నీగ్రో ఆలోచనలనుండి, నీగ్రో జీవితం నుండీ ఏరుకోవాలనీ, అప్పుడే తమను తాము సటిష్ఠం చేసుకొని, అమెరికాలోని శ్వేత జాతీయుల గౌరవాన్ని సంపాదించుకొని ప్రధాన జీవన సరణిలో అంతర్భాగం కాగలరని ఆయన హెచ్చరించాడు.

నల్లజాతి రచయితల నవలలు, కవిత్వం, నాటకాలు, వ్యాసాలు పఠించి వాటిలో విలువైన వాటిని ఎన్నుకొని *ది న్యూ నీగ్రో* అనే సంకలనాన్ని 1925 లో ఈయన ప్రకటించాడు. నల్లజాతి వారి సాంస్కృతిక విజయాలను వెలుగులోకి తెచ్చే *బ్రాంజ్ బుక్‌లెట్* (Bronze Booklet) కు ఈయన సంపాదకత్వం వహించాడు. *ఆపర్ట్యూనిటీ, సైలాన్* పత్రికలలో నల్లజాతివారు వ్రాసిన, లేక వారిని గురించి ఇతరులు వ్రాసిన సాహిత్యాన్ని దాదాపు 20 సంవత్సరాలపాటు సమీక్షించేవాడు. 1940 నుండి మరణించే వరకు ఆయన *బ్రిటానికా బుక్ ఆఫ్ ది ఇయర్* కు నీగ్రోలను గురించి వ్రాసేవాడు. ఆయన రచనలలో *ఫోర్ నీగ్రో పొయెట్స్* (1927), *ఫ్రెడరిక్ డగ్లస్* (1935), *నీగ్రో ఆర్ట్- పాస్ట్ అండ్ ప్రజంట్* (1936), *ది నీగ్రో అండ్ హిజ్ మ్యూజిక్* (1936) ప్రధానమైనవి.

గొప్ప మానవతావాది అయిన లాక్ తన భావ సముదాయానికి 'సాంస్కృతిక బహుముఖత్వం' అని పేరు పెట్టాడు.

కె.జి.మూర్తి

**లాక్స్‌నెస్, హాల్డోర్ (1902--) :** 1955 లో సాహిత్యానికి నోబెల్ బహుమతిని పొందిన ఐస్‌లాండ్‌కి చెందిన నవలా రచయిత, సాహిత్య కోవిదుడు. 1969 లో సానింగ్ పురస్కారాన్ని కూడా పొందినవాడు. బాల్యమంతా తమ వ్యవసాయ క్షేత్రంలోనే గడపిన 'లాక్స్‌నెస్' 17 సంవత్సరాల వయస్సులోనే తొలి రచన చేయటం

ఆ తరువాత స్వదేశాన్ని వదలి ప్రపంచ సంచారానికి బయలుదేరటం జరిగింది. చివరివరకు యూరప్, రష్యా, అమెరికా, తూర్పు దేశాలు తిరుగుతూ మధ్య మధ్య ఐస్‌లాండ్ చేరుతూ ఉండేవాడు. ఐస్‌లాండ్ జీవన సరణి, ప్రకృతి రమణీయత ఆయన రచనలకు ఊపిరి. తోటి రచయితలు బహుళ ప్రచారం కోసం డేనిష్ భాషలోనో, నార్వీజియన్ భాషలోనో రచనలు చేస్తే ఈ రచయిత మాత్రం ఐస్‌లాండిక్ భాషకు, ఆ జీవన సరణికి మాత్రమే కట్టుబడి ఉన్నాడు.

యౌవనంలో దేవుడిమీదా, మతం మీదా విశ్వాసం లేనివాడుగానే కవిపించినా, తనకు సంతృప్తి నివ్వగలిగిన మతం కోసం, తత్త్వ సిద్ధాంతం కోసం అన్వేషిస్తూనే ఉండేవాడు. చివరకు 1924 లో రోమన్ కేథలిక్ మతాన్ని స్వీకరించి దానిని ఎందుకు స్వీకరించాడో చెప్పటానికా అన్నట్లు 1927 లో *వెఫారిన్ మిక్లి ఫ్రా కాశ్మీర్* (Vefarinn mikli fra Kasmir - ('The Greet weaver from Kasmir) అనే తన తొలి నవలను వ్రాశాడు. అయితే ఆ నవల చివరి భాగంలోనే ఆయన రోమన్ కేథలిక్ మతం నుండి బయటపడినట్లు కనిపిస్తుంది. తరువాత అమెరికా సంయుక్త రాష్ట్రాలలో పర్యటించి సామ్యవాది అయాడు.



1930-32 మధ్యకాలం ఐస్‌లాండ్‌లో గడపి *సాల్కా, వాల్కా* అనే రెండు నవలలు వ్రాశాడు. ఈ రెండూ ఒక చిన్న బెస్తవారి పల్లెను తీసుకొని ఆ బెస్తవారి జీవితం చేపలుపట్టటం, కాలక్షేపంకోసం కబుర్లు చెప్పటం అనే వాటిమీద ఎంత ఆధారపడి ఉన్నదో చెబుతూనే, అతి సూక్ష్మమైన జీవిత సత్యాలను ఆ చిన్న చిన్న అంశాలనుండి కూడా ఎట్లా తెలుసుకోవచ్చో చూపుతాయి.

లాక్సనెస్ మరొక నవల *జాల్ఫ్‌స్టాఫోక్* (1935 - Independent People, 1945) ఒక మారుమూల పల్లెలో ఉండే ఒక ఐస్‌లాండ్ రైతు జీవితాన్ని అన్ని కోణాలనుంచీ తెలియజేస్తుంది. ఈ రెండు నవలలు ఈ రచయితకు అంతర్జాతీయమైన గుర్తింపును తెచ్చిపెట్టాయి. ఆ తరువాత అనేక నవలలు చారిత్రకమైనవి, సాంఘికమైనవి రచించాడు. కొన్ని నాటకాలను కూడా వ్రాశాడు.

అయితే ఐస్‌లాండ్‌లోని సంప్రదాయ వాదులు (conservatives) 'లాక్సనెస్' ను తీవ్రంగా విమర్శించారు. ఐస్‌లాండ్ శ్రామికుని తన సాహిత్యంలో వక్రీకరించి చూపాడనీ, ఐస్‌లాండ్ సామాజిక వ్యవస్థకే అన్యాయం చేశాడనీ వారి అభియోగం. కాని అత్యధికులు ఆయనను వాస్తవికతా వాదానికి 'దేవదూత' (Prophet of Reality) వంటివాడని కొనియాడారు. 1970-80 దశకంలో తన స్వీయ చరిత్ర ఆధారంగా ఆయన నాలుగు నవలలు వ్రాశాడు. ప్రపంచ సాహిత్యంలో ఐస్‌లాండ్‌కు స్థానం కల్పించిన మహారచయిత 'లాక్సనెస్'.

కె.జి.మూర్తి

**లాగర్క్విస్ట్, పార్ (1891-1974) :** స్వీడన్‌కు చెందిన ప్రసిద్ధకవి, నాటకకర్త, నవలాకారుడు. బయటి ప్రపంచంలో విస్తృతంగా ఖ్యాతి నార్జించి 1951 లో నొబెల్ పురస్కారాన్ని గ్రహించిన సాహితీవేత్త. తండ్రి, తాత విద్యావాసన లేని వారే అయినా ఈయనకు విశ్వవిద్యాలయంలో చదివే అదృష్టం కలిగింది.



ఆధునిక విజ్ఞాన శాస్త్రపు ప్రభావంలో పడి ఆనువంశిక మతాన్నీ, మత సంప్రదాయాలనూ తిరస్కరించి సాహిత్యపరమైన తీవ్రవాదం (Literary Radicalism) ద్వారా అతివాద సామ్యవాదాన్ని (Socialistic Radicalism) బలపరచటమే తన ధ్యేయమని ప్రకటించాడు. ఈ రకమైన ఆధునిక దృక్పథంతో చేసిన రచనలే *ఆర్డ్ కోన్స్ట్ ఆచ్ బిల్డ్‌కోన్స్ట్* (1913, Literary and Pictorial Art), *థియేటర్* (1918, ఆంగ్లంలో Theatre).

*ఆంగెస్ట్* (1916, Anguish) అనే రచనలో ఈ రచయిత ప్రగాఢ నిరాశావాదిగా కనిపిస్తాడు. కాని *డెట్ ఎవిగా లీనెట్* (1920, The Eternal Smile, 1934), దాని తరువాత ఆయన జీవిత చరిత్ర ఆధారంగా వ్రాసిన *గాస్ట్‌హోస్ వెర్ల్క్‌ఘటెన్* (1925, Quest

of Reality, 1936) అనే నవలలలో ఆ నిరాశావాదం క్రమంగా పలచబడింది. 1927 లో వ్రాసిన *డెట్ బెస్విగేడ్ లివెట్* (The Triumph over life) అనే ఏక పాత్ర నాటికలో మానవునిలో పూర్తి విశ్వాసాన్ని ప్రకటించాడు.

1930-40 దశకంలో ప్రపంచంలో చాలా చోట్ల ప్రజ్వరిల్లుతున్న హింస ఆయనను కలచివైచింది. *బోడెల్న్* (Bodeln, 1933, The Hangman, 1936) లో ప్రపంచంలో హింసకు, క్రూరత్వానికి బహుశః అంతం లేదేమోనని ఆక్రోశిస్తాడు. *మానెన్ ఉటాన్ జాల్* (Mannen utan sjal, 1936, The Man without a soul, 1944) అనే నాటకంలో ఏక పక్ష నిరంకుశత్వం (Fascism) పట్ల తన ఆగ్రహాన్ని ఆవేదననూ ప్రకటిస్తాడు. *లాట్ మానిస్కన్ లెవా* (Lat manniskan leva, 1949, Let man Live, 1951) అనే నాటకంలో అనాదిగా మానవుడు తోటి వారిపై తీర్పులు చెబుతూ వారిని శిక్షలకు గురిచేయటానికి ఎట్లా అలవాటు పడిపోయాడో, ఇది ఎంత అనర్థకారో తెలియజేస్తాడు.

*డ్వార్గెన్* (Dvargen, 1944, The Dwarf, 1945) తో ఆయనకు అఖండ ఖ్యాతి, గుర్తింపు లభించాయి. ఆ నవల స్వీడిష్ విమర్శకుల మన్ననలనందుకుంటే, దాని తరువాత వెలువడిన *బారబ్బాస్* (Barabbas, 1950) ఆయనకు ప్రపంచ వ్యాప్తంగా ఖ్యాతిని తెచ్చి పెట్టింది.

లాగర్క్విస్ట్ రచనలలో చాలా భాగం *ఈవెనింగ్ లాండ్* (1975), *ది మేరేజ్ ఫీస్ట్* (1973) లుగా ఆంగ్లంలో వెలువడ్డాయి.

కె.జి.మూర్తి

**లాగర్‌లోఫ్, సెల్మా (1858-1940) :** ప్రసిద్ధ స్వీడిష్ నవలా రచయిత్రి. నోబెల్ పుస్కారాన్ని అందుకొన్న తొలి మహిళ.

1885 లో 'లాండ్ స్క్రోనా' లో ఉపాధ్యాయినిగా జీవితం ప్రారంభించింది. అక్కడ పనిచేస్తున్నప్పుడే రెండు భాగాలున్న *గోస్టాబెర్లింగ్స్ సాగా* (1891) అనే నవల వ్రాసింది. ఆమె స్వగ్రామమైన 'వార్మ్‌లాండ్' (Varm land), అందులోని చిన్న చిన్న వ్యవసాయ క్షేత్రాలు, అక్కడ పనిచేసే కమ్మరి వారి జీవితాలు ఇందులో కనిపిస్తాయి. 'గోస్టాబెర్లింగ్స్' ఆ ఊరి మతాధికారి, యువకుడు, నైతిక విషయాలలో అంతగా పట్టింపు లేనివాడు. ఇతడే ఈ నవలకు నాయకుడు. భావ గీతంలా సాగే ఈ నవల 1890-1900 దశకంలో స్వీడిష్ సాహిత్యంలో సంభవించిన 'భావ కవిత్వ పునరుజ్జీవనం' (Romantic Revival) లో ప్రముఖ పాత్ర వహించింది. 1894 లో *ఆసిన్‌లిగా లాంకర్* (Invisble links, 1899) అనే కథా సంపుటిని వెలువరించింది. 1895 లో ఒక పర్యటన ఉపకార వేతనం దొరకటంతో అధ్యాపక వృత్తి వదిలి రచననే వృత్తిగా స్వీకరించింది. ఇటలీని సందర్శించి *ఏంటీ క్రిస్ట్స్ మిరాక్లర్* (1897, The Miracles of Antichrist, 1899) అనే సిసిలీని గురించిన సామ్యవాద నవలను ప్రచురించింది. 1922 లో ఆమె రచించిన *ఎన్‌హీర్ గార్డ్‌సాగెన్* (Enherr gard ssagen, Tales of a Manor) అనే కథా సంపుటి ఆమె రచనలలో ఉత్తమమైనది. 1899-1900 శీతాకాలం *జెరూసలెమ్* అనే నవల వ్రాసింది. ఈ నవల ఆమెను స్వీడిష్ రచయితలలో అగ్రగామినిగా నిలబెట్టింది.

మొదటి ప్రపంచ యుద్ధం ఆమెను పూర్తిగా కలచివేసింది. ఆ కారణంగా కొంతకాలం ఆమె రచనా వ్యాసంగం ఆగిపోయింది. తిరిగి 1922 లో 'మార్‌బాక్', 1930 లో *ఎట్ బార్న్స్ మెమోరర్* (Memories of my child hood, 1934) 1932 లో *డాగ్‌బోక్ ఫర్ సెల్మా లాగర్‌లోఫ్* (The Diary of selma lager lof, 1936) అనే గ్రంథాలు రచించింది. వీటిలో ఆమె బాల్యాన్నీ, ఆనాటి మధురస్మృతులనూ కళాత్మకంగా తిరిగి సృష్టించి మన ముందుంచుతుంది. 'వార్మ్‌లాండ్' ట్రియాలజీగా ప్రఖ్యాతి చెందిన *లోవెన్ లాండ్* ట్రయాలజీగా ప్రఖ్యాతి చెందిన *లోవెన్ స్కోల్డ్ స్కారింగెన్* (1925, 'The Ring of iowenskolds, 1931), *ఛార్లటీ లోవెన్‌స్కోల్డ్* (1925), *అన్నా స్వార్డ్* (1928) అనేవి ఆమె చివరి రోజులలో చేసిన గొప్ప రచనలు.

కె.జి.మూర్తి

**లానియర్, సిడ్నీ (1842-81) :** అమెరికన్ కవి, సంగీత విద్వాంసుడు. 1842 ఫిబ్రవరి 3 న అమెరికాలో జన్మించిన లానియర్ ధార్మిక కుటుంబానికి చెందినవాడు. బాల్యంలోనే ఇతనికి సంగీతమంటే మహా ప్రీతి. బాల్యంలోనే కవిత్వం కూడా వ్రాశాడు. ఇతని కవిత్వంలో సంగీత మాధురి వినిపించేది. 1860 లో ఇతడు పట్టభద్రుడై ఆ తరువాత అమెరికాలో జరిగిన సివిల్ వార్ అంతర్యుద్ధంలో పాల్గొన్నాడు. తత్ఫలితంగా ఇతడు ఖైదు చేయబడ్డాడు. ఖైదులో ఉన్నప్పుడు ఇతనికి క్షయవ్యాధి సోకి, అతికష్టం మీద వ్యాధి నయమయింది. 1867 లో "మేరీ డే" (Mary Day) ను వివాహమాడాడు. అదే సంవత్సరంలో *టైగర్-లిల్లీస్* (Tiger-Lilies)అను నవలను ప్రచురించాడు. దీనిలో

తన యుద్ధ అనుభవాలను చక్కగా చిత్రించాడు. కొంతకాలం లానియర్ న్యాయ వాద వృత్తిలో తన తండ్రి వద్ద పనిచేశాడు. కొన్నాళ్లు పాఠశాలలో కూడా పని చేశాడు. ఆ తరువాత ఆరోగ్య కారణాల దృష్ట్యా టెక్సాస్ రాష్ట్రంలోని వివిధ ప్రకృతి రామణీయక ప్రదేశాలలో పర్యటించాడు. ఆ తరువాత 1873 లో "బాల్టిమోర్" లోని పీబాడీ ఆర్కెస్ట్రాలో ఫ్లూట్ వాయిద్య కారుడుగా (flutist) గా కుదిరాడు.

1875 లో *కార్న్* (Corn) అనే మధుర మైన కావ్యాన్ని రచించాడు. దక్షిణ అమెరికాలోని వ్యవసాయ పరిస్థితులను ఇతివృత్తంగా తీసుకొని రచించిన ఈ కావ్యం ఇతనికి బహుళ ఖ్యాతి నార్జించి పెట్టింది. అదే సంవత్సరంలో ఉత్తర అమెరికాలోని పారిశ్రామిక రంగం లోని పరిస్థితులను ఇతివృత్తంగా చేసి కొని *ది సింఫనీ* అనే మరొక కావ్యాన్ని రచించాడు. 1879 లో "జాన్ హాప్‌కిన్స్" యూనివర్శిటీలో ఆంగ్ల సాహిత్య ఉపన్యాస కుడుగా పనిచేశాడు. ఆ సమయంలో ఇతడు కవితా శిల్పంపై, తొలి ఆంగ్ల కవులపై, ఆంగ్ల నవలా చరిత్రపై అనేక ఉపన్యాసాలు చేశాడు. ఇవన్నీ ఆ తరువాత కొంత కాలానికి పుస్తకరూపంలో కూడా వచ్చాయి. తగ్గినట్టే తగ్గి మళ్లీ ఉధృతం అయిన క్షయవ్యాధి వల్ల 1881 సెప్టెంబరు 7 న లానియర్ మరణించాడు.



మల్లేశం

**లా ఫోంటీన్, జాన్ డి (1621-1695) :** ఫ్రెంచ్ రచయిత. ఫోంటీన్ ఫ్రాన్స్‌లోని షాంపేన్ ప్రాంతంలో ఒక మధ్య తరగతి కుటుంబంలో జన్మించాడు. 1647 లో ఒక ధనిక స్త్రీని వివాహం చేసుకొన్నాడు. 1658 లో ఆమెతో సంబంధం తెగతెంపులు చేసుకున్నాడు. ఈయన జీవితంలో ఒక విశేషమేమిటంటే ఆయన జీవనోపాధికి శ్రమపడకుండా సహాయపడే స్నేహితులను ఆకర్షిం చాడు. ఈయన పారిస్‌లో గడపిన కాలంలోనే ఈయన అనేక స్నేహితులను, పోషకులను సంపాదించి, తన సాహిత్య జీవితంలో ఎక్కువ ఫలవంతమైన కృషి చేశాడు. 1683 లో ఈయన ఫ్రెంచ్ ఎకాడమీ సభ్యుడుగా ఎన్నుకొనబడడంతో ఈయనకు బాగా గుర్తింపు లభించింది.

లా ఫోంటీన్ వ్రాసిన పద్యకథా మంజరి *ది ఫేబుల్స్* (The fables) ఈయన రచన లలో ముఖ్యమైనది. ఈ కథలు మన పంచతంత్రం కథలవలె జంతువులు, పక్షులు పాత్రలుగా కలిగి నీతి ప్రబోధకాలైనవి. ఈ కథా ప్రక్రియను గాని, అందలి విషయాలను కాని లా ఫోంటీన్ స్వయంగా రూపొందించకపోయినా, అందలి పాత్ర చిత్రణలలోను, వాక్చాతుర్య ప్రదర్శనలోను, మానవాలోచనా రీతికి సన్నిహితంగా ఉండే వర్ణనలలోను, ఈయన తన వ్యక్తిత్వముద్ర గాఢంగా వేశాడు. ఇంచుమించు 240 పద్యాల పరిధిలో కథా రంగమైన ఫ్రెంచ్ పల్లె ప్రాంతానికీ, ఆనాటి సాంఘిక వ్యవస్థలకూ అద్దం పట్టాడు. ఈ *ఫేబుల్స్* బోధించే నీతులు క్రొత్తవి కాకపోయినా, తర తరాల సాహితీ అభిమానులనూ, విమర్శకులనూ ఆకర్షించి, బాగా చదివించాయి. ఇటు వంటి "ఫేబుల్స్" సంకలనాలు రెంటిని లా ఫోంటీన్ రచించాడు. వీనిలో ఈయన ప్రదర్శించిన ఛందో నైపుణ్యం, శైలి విశేషాలు, 17 వ శతాబ్ది ఫ్రెంచ్‌భాషను బాగా అధ్యయనం చేసిన వారికే గోచరమవుతాయని పండితుల అభిప్రాయం.



ఈయన మిగిలిన రచనలలో చెప్పుకోదగ్గవి: *లెస్ ఆమర్స్ డి పిషే ఎట్ డి క్యూపిడాన్* (1699), (Short Tales) అన్నవి; ఇవికాక ఈయన చాలా రచనలు చేశాడు కాని *ఫేబుల్స్*తో పోలిస్తే అవి గణనీయమైనవి కావు. వీనిలో మొదటిది గద్యరచన. దీనిలో వచనం సరళంగా ఉండి, పాత్రల మనోభావ చిత్రణలోను, స్త్రీ మనస్తత్వ వర్ణనలోను రచయిత ప్రజ్ఞ విదిత మవుతుంది.

ఇక *కాంటీస్* అనే కథా సంపుటంలో పద్య రూపంలో వ్రాయబడిన కథలు మన కాశీమజిలీ కథల వంటివి. ఇటలీ ప్రముఖ రచయిత బొకాచియో "డి కమెరాన్" పద్ధతిలో ఇవి వ్రాయబడ్డాయి. వీనిలోని ముఖ్యాంశమైన శృంగారం తాత్కాలికంగా చదువరులను

ఉల్లాస పరచేదే గాని, వారిని ఆలోచనా పరులను చేసి, మానవ ప్రకృతిని ప్రకటించేది కాదు. ఈ రచనలలో కవి యొక్క శైలి, గద్యరచనా నైపుణ్యం పాఠకులను ఆకట్టుకొంటాయి గాని, విషయ గాంభీర్య కానరాదు.

లా ఫోంటేన్ రచనలు ఫ్రెంచ్ సాహిత్యంలో ఆయ నకు గల విశేష పాండిత్యాన్ని తెలుపుతాయి. కాని ఆయన స్వీయ అనుభవాన్ని కాదు. 16 వ, 17 వ శతాబ్దాల ప్రముఖ ఫ్రెంచ్, ఇటాలియన్ రచయితలను, ప్రాచీనులలో హోమర్, ప్లేటో, వర్జిల్, హోరేస్‌లనూ ఈయన క్షుణ్ణంగా అధ్యయనం చేశాడు. తన రచనా వ్యాసంగంలో ఆ పరిజ్ఞానాన్ని ఉపయోగించుకొన్నాడు. ఈయన *ఫేబుల్స్* ఈనాటి ఫ్రాన్స్‌లో పండిత పామరులందరి చేత చదువబడి వివిధ స్థాయిలలో విశ్లేషించబడుతూంది. ఆంద్రే జీడ్, పాల్ వెలేర్ వంటి ప్రముఖ ఫ్రెంచ్ రచయిత లందరూ ఈయన రచన లను జీర్ణించుకొన్నవారే. 1695 లో మరణించినప్పటికీ ఈయన పేరు, రచనలు నేటికీ మరుగున పడలేదు.

డి.ల.రా.

**లాఫోర్జ్, జూల్స్ (1860-87)** : జూల్స్ లాఫోర్జ్ 27 సంవత్సరాలే జీవించినా ఫ్రెంచ్, ఇంగ్లీష్, అమెరికన్ కవులలో ప్రముఖుల కవిత్వంపై గాఢమైన ప్రభావం చూపించిన చిరస్మరణీయుడు. ఈయన ఫ్రెంచి ప్రతీకా వాద (సింబాలిస్ట్) కవి. ఫ్రీవర్స్‌ను రూపొందించిన వారిలో ఒకడు. 20 వ శతాబ్దంలో అమెరికన్ కవి ఎజ్రా పౌండ్, ప్రముఖ ఇంగ్లీష్ కవి టి.ఎస్.ఎలియట్ ఈయన కవిత్వాన్ని చదివి, దాని వల్ల ప్రభావితు లయారు. లాఫోర్జ్ కవిత్వంలోని గూఢార్థాలను పరిశీ లించి, ఆకళింపు చేసికోడం ఒకప్పుడు తన ఆశయంగా ఎలియట్ పేర్కొన్నాడు. అమెరికన్ కవి హార్ట్ క్రేన్ ఈయన కవితలు కొన్నిటిని *డబుల్ డీలర్* (1922) లో అనువదించాడు. "అధివాస్తవిక" (సర్రియలిస్ట్) కవులు కూడా లాఫోర్జ్ వల్ల ప్రభావితు లయారు.

లాఫోర్జ్ 1866 నుండి 1876 వరకూ బంధువులవద్ద పెరిగాడు. 1876 లో పారిస్‌లో తన కుటుంబం వద్దకు చేరాడు. పాఠశాల విద్యానంతరం పేరుగాంచిన సాహిత్య విమర్శకుడు, చరిత్రకారుడు హిప్పొలిట్ టేన్ ఉపన్యాసాలను విన్నాడు. పాల్ బూర్‌జే అనే రచయిత ద్వారాను, ఛార్లెస్ ఎఫ్రూసీ అనే కళాభిమాని ద్వారాను ఇంప్రెషనిస్ట్ చిత్రకళకు పరిచితుడయాడు. 1881 నవం బర్ నుంచి ఐదేళ్లపాటు జర్మనీలో చక్రవర్తిని అగస్టాకు పాఠకుడు (రీడరు) గా ఉన్నాడు. తన రచనలలో ఎక్కువ భాగం జర్మనీలోని బెర్లిన్‌లో ఉండగా రచించాడు. డిసెంబర్ 1886 లో లీయాలీ అనే ఇంగ్లీష్ యువతిని పెళ్లాడి పారిస్‌కు తిరిగి వచ్చాడు కాని దారిద్ర్యానికీ, క్షయవ్యాధికీ గురి అయి 1887 ఆగస్టులో అకాలమరణం పొందాడు.

లాఫోర్జ్ జీవితంలో ఎక్కువ భాగం ఒంటరితనంతోనూ, మృత్యువును గూర్చిన ఆలోచనతోను గడచింది. దైనందిన జీవిత మంటే కూడా ఈయనకు ఏవగింపు. ఈయన తన రచ నలు *లెజ్ కంప్లెయింట్స్* (Les Complaintes, 1885), *లిమిటేషన్ డనోత్రడమ్ లలూన్* (L 'Imitation de Notre-Dame lalune, 1886), *లకోన్సీల్ ఫీరిక్* (Le Concile feerique, 1886) లలో ఈ ఆలోచనలు కని పిస్తాయి. ఈయన బౌద్ధ సిద్ధాంతాల వల్లనూ, జర్మన్ తత్త్వశాస్త్రం వల్లనూ ఆకర్షితు డయాడు. ట్రిస్ట్రాన్ కోర్బి యేర్, రింబోల ననుసరించి తాను క్రొత్త పదాలను సృష్టించి వాడడం, సామాన్యుల భాషను కవిత్వంలో ప్రయోగించడం, సామాన్యుల నోళ్లలోనూ, నాటకశాలల లోను వినపడే పాటలలోని చరణాలను తాత్త్విక, శాస్త్రీయ పదాల సరసనే వాడడం వంటి విషయాలలో ఈయన ఆధునిక కవులకు మార్గదర్శకు డయాడు. క్రొత్త లయకోసం ఈయన చేసిన అన్వేషణ "వెర్స్ లిబర్" (Vers libre) కనుగొనడంతో ముగిసింది. *మొరాలిటీస్ లెజం డేర్* (Moralites ledgendaires, 1887) అన్న కథా సంపుటిలో షేక్స్‌పియర్, వాగ్నర్, మెలార్మెలు రచించిన రచనలకు క్రొత్త అర్థాలు సూచించాడు. కళాపరమైన ఈయన విమర్శలు *మెలాంజెస్ పోస్థూమ్* (Melanges posthumes, 1923) అన్న గ్రంథంలో పొందుపరచ బడ్డాయి. ఇంప్రెషనిస్టు కళాకారుల మనోభావాలను ఈయన బాగా అర్థం చేసుకొన్నట్లు ఈ గ్రంథం విశదం చేస్తూంది.

డి.ల.రా.

**లామార్టాన్, ఆల్ఫోన్స్ డి (1790-1869)** : ఫ్రెంచ్‌కవి, రాజకీయ వేత్త. *మెడిటేషన్స్ పొయెటిక్స్* (1820) అన్న కవితా సంపుటి ద్వారా ఈయన ఫ్రెంచ్ భావ కవిత్వ ఉద్యమానికి (Romantic Movement) సూత్రధారి అయాడు. ఆల్ఫోన్స్ జీవితం నాటి ఫ్రెంచ్ రాజకీయాలవల్ల చాలా ప్రభావితమైంది. భూస్వామి అయిన ఈయన తండ్రి విప్లవం కడపటిదశలో బందీగా తీసికొనబడ్డాడు గాని, మరణశిక్ష తప్పించుకొన్నాడు. ఆల్ఫోన్స్ సాయుధ దళాలలో గాని, దౌత్య సిబ్బందిలో గాని చేరాలని కోరుకొన్నాడు. కాని నెపోలియన్

చక్రవర్తిగా ఉన్నంత కాలం అది కుదరలేదు. 1814 లో బూర్బన్ వంశస్థుడు 18 వ లూయీ ఫ్రాన్స్ రాజు అయినప్పుడు అల్ఫోన్స్ రాజసేవలో చేరాడు. కాని 1815 లో నెపోలియన్ తిరిగి రాజు కావడంతో ఈయన స్విట్జర్లాండుకు వెళ్లిపోయాడు. నెపోలియన్ ఓటమి తరువాత బూర్బన్ రాజులు సింహాసనాన్ని తిరిగి ఎక్కినా, ఈయన సైనిక సేవలో చేరే ప్రయత్నం విరమించుకొన్నాడు.

సాహిత్యం వైపు ఆకర్షించబడి, ఈయన కొన్ని పద్య నాటికలు, కావ్యాలు రచించాడు. 1816 నాటికి ఈయన అనారోగ్య కారణంగా ఐక్స్ లబేన్స్ అనే ఆరోగ్య కేంద్రానికి వెళ్లి చికిత్స పొందాడు. 1816 అక్టోబర్ లో ఈయనకు జూలీ ఛార్ల్స్ అనే ప్రతిభావంతురాలయిన యువతితో పరిచయ మయింది. ఈమెకు గల సాంఘిక పరిచయాల ద్వారా లా మార్తాన్‌కు పారిస్‌లో ఉద్యోగం దొరకింది. అనారోగ్యవంతురాలయిన జూలీ ఛార్ల్స్ 1817 లో మరణించింది. తనకు ఆమెపై గల అనురాగాన్ని ప్రకటిస్తూ లామార్తాన్ ఆమె స్మృతికి అంకితంగా కొన్ని పద్యాలను రచించాడు.

1820 లో లామార్తాన్ 'మెరయా ఏన్‌బర్చ్' అనే ఇంగ్లీష్ వనితను పెండ్లాడాడు. అదే ఏట తన మొదటి కవితా సంకలనం *మెడిటేషన్స్ పొయెటిక్స్* ను ప్రచురించటమే కాక, నేపుల్స్ (ఇటలీ) లోని ఫ్రెంచ్ దౌత్య వ్యవహర్తగా చేరాడు. ఈ సంకలనంలోని భావుకత్వం, కవి యొక్క నిష్కపటత్వం దానికి ప్రజాదరణను సంపాదించాయి. ఛందస్సు పరంగానూ, ఇతివృత్తం విషయంలోనూ ఈ సంకలనం ఫ్రెంచ్ కవిత్వంలో క్రొత్తదనాన్ని ప్రవేశ పెట్టింది. ఈ ప్రజాదరణను చూచి లామార్తాన్ ఈ కవితా రీతిని కొనసాగిస్తూ *నూవెల్ మెడిటేషన్ పొయెటిక్, 'మోర్ డి సోక్రటీస్* అనే కావ్యాలు వ్రాశాడు. వీనిలో తత్త్వ విచారణలో ఈయనకు గల ఉత్సాహం వ్యక్తమవుతుంది. ఈయన మీద ఇంగ్లీష్‌కవి బైరన్ ప్రభావం కూడా కనిపిస్తుంది. 1830 లో క్రిస్టియన్ సంబంధమైన ఇతివృత్తాలతో రెండు కవితా సంకలనాలను ప్రకటించాడు. 1829 లో ఈయన ఫ్రెంచ్ ఎకాడమీ సభ్యుడుగా ఎన్నిక కావడంతో జాతీయ స్థాయిలో గుర్తింపు పొందాడు.

1830 లో ఫ్రెంచ్ రాజకీయ రంగంలో వచ్చిన మార్పుల కారణంగా ఈయన తన దౌత్య కార్యదర్శి పదవిని విడనాడి రాజకీయాలలో ప్రవేశించాడు. 1833 లో శాసన సభలో సభ్యుడుగా ఎన్నిక అయాడు. అయినా 1821 నుండి వ్రాయాలని అనుకుంటున్న పద్య కావ్యాన్ని ఆయన మరచిపోలేదు. ఈ మహాకావ్యాన్ని ఈయన భాగాలుగా 1836-1838 ల మధ్య ప్రచురించాడు. ఇది ఆధ్యాత్మిక జీవితానికి అంకితమయిన ఒక యువకుడు ఒక స్త్రీ ప్రేమకోసం జీవితాన్ని త్యజించి, తిరిగి తన గురువు ఆదేశ ఫలితంగా శారీరక ప్రేమనుండి ఆధ్యాత్మిక మార్గానికి మళ్లడాన్ని వర్ణిస్తుంది. ఈయన జీవితంలో వాటిల్లిన దుర్ఘటనల మూలంగా రోమన్ కేతలిక్ మతంలో నమ్మకం 1832 నాటికి పూర్తిగా అంతరించింది. 1838 లో తాను తలపెట్టిన మహాకావ్యంలో ఒక భాగాన్ని లా చూట్ డన్ అంగె (ఒక దేవత పతనం) అన్న పేరుతో ప్రకటించాడు.

1839 లో ఒక కవితా సంపుటి ప్రకటించిన తరువాత లామార్తాన్ తాత్కాలికంగా కవిత్వ వ్యాసంగాన్ని ఆపి, రాజకీయాలలో పాల్గొన ప్రారంభించాడు. సంఘంలోని శ్రామిక వర్గం యొక్క నికృష్టమైన పరిస్థితినీ, దానికి కారణమైన ధనిక వర్గాల యొక్క, ప్రభుత్వం యొక్క విధానాలనూ ఖండిస్తూ ఈయన 1838 లోను, 1846 లోనూ రెండు వ్యాసాలను వ్రాశాడు. 1847 లో ఈయన ప్రకటించిన *జిరొండిన్ పార్టీ చరిత్ర* అన్ని రాజకీయ పక్షాల వారి అభిమానాన్ని పొందింది.

ఫ్రాన్స్‌లో 1848 లో జరిగిన విప్లవ ఫలితంగా లామార్తాన్ తాత్కాలిక ప్రభుత్వానికి నేత అయాడు. భూస్వాములు, మధ్యతరగతి వారు మొదట ఈయనను తమ మనిషిగా భావించి, కొంతకాలం బలపరచారు. కాని ఈయన శ్రామిక వర్గానికి నాయకుడని, వారికోసం పోరాడుతాడని తెలుసుకొన్న తరువాత ఈయనకు ఎదురు తిరిగి 1848 జూన్‌లో ఈయనను పదవినుండి తొలగించారు.

1850 నాటికి 60 ఏళ్లు నిండిన లామార్తాన్‌కు సంపదలేకపోగా బాధ్యతలు మిగిలాయి. వీనిని నిర్వర్తించడంకోసం ఈయన కావ్యాలూ, నవలలూ తన రాజకీయ అనుభవాలను గూర్చిన గ్రంథాలూ వ్రాశాడు. ఇంతే కాక రాజకీయ ఉద్యమాల చరిత్రలూ, రష్యా, టర్కీ దేశాల చరిత్రలూ కూడ రచించాడు. ముఖ్యంగా ధనార్జనకోసం రచింపబడినవైనా, ఈ గ్రంథాలు అన్నీ ఆయన పాండిత్యాన్నీ, ప్రతిభనూ చాటుతున్నాయి. రాజకీయాలనుండి నిష్క్రమించినా, ఈయన రాజకీయ వైరులచే వెంటాడబడుతూనే వచ్చాడు. 1869 లో ఈయన చనిపోయేనాటికి ఈయనను ప్రజలు ఇంచుమించు మరచిపోయారు. కాని చరిత్రలో ఈయన గొప్ప కవిగాను, ద్రష్టగాను,

ధైర్యం, నిశిత దృష్టి కలిగిన రాజకీయ యోధుడుగాను చిరస్మరణీయుడుగా మిలిగిపోయాడు.

డి.ల.రా.

**లాయే, కమారా (1928-80)** : సహారాకు దక్షిణ ప్రాంతంలో జన్మించి ప్రపంచ ఖ్యాతి పొందిన తొలి ఆఫ్రికన్ రచయిత. ప్రాథమిక విద్య తరువాత సాంకేతిక విద్యకై కోనాక్రి వెళ్లాడు. ఆ తరువాత ఇంజనీరింగ్ చదువుకోసం ఫ్రాన్స్ వెళ్లాడు.

1956 లో స్వదేశానికి తిరిగి వచ్చి 2 సంవత్సరాలు ఇంజనీరుగాను, తరువాత 'డి ఎటూడ్స్' లోని పరిశోధన సంస్థ 'సెంటర్ డి రిసర్చెస్' కు సంచాలకుడుగాను పనిచేశాడు. ఈ కాలంలోనే 'బ్లాక్ ఆర్ఫియస్', *ప్రెజెన్స్ ఆఫ్రికేన్* అనే పత్రికలకు ఎన్నో చిన్న కథలను వ్రాశాడు.

1954 లో ఈయన రచించిన *లె రిగార్డ్ డురాయ్* (The Radiance of the King, 1956) అనే నవల ఈయన ఉత్తమ రచన అని విమర్శకుల అభిప్రాయం. దీనిలోని ఇతివృత్తం ఎవరిస్థాయిలో వారికి వేరు వేరు అర్థాలను గోచరింపచేస్తుంది. ఒక శ్వేత జాతీయుడు ఒక ఆఫ్రికన్ రాజును కలుసుకోటానికి కీకారణ్యాల గుండా ప్రయాణం చేయటమే ఇందలి విషయం. కొంత మంది దీనిని మానవుడు దైవాన్ని కనుక్కోటానికి సాగించే ఆధ్యాత్మిక యాత్రగా వర్ణిస్తే, మరికొందరు మానవుడు తన్ను తాను తెలుసుకోటానికి సాగించిన యాత్ర అన్నారు. ఈ రచనలోని పటుత్వం, గాంభీర్యం ఫ్రాంజ్ కాఫ్కా, నైజీరియన్ రచయిత ఆమోస్ టుటు ఓలాలను జ్ఞప్తికి తెస్తుంది.

1953 లోనే ఈయన వ్రాసిన *ఎల్ ఎన్ఫాంట్ నాయిర్* (The Dark Child, 1954) అనే నవల ఈ రచయిత స్వీయచరిత్రపై ఆధారపడిందే. గినీలోని చిన్న తనపు తీయటి స్మృతులను గూర్చిన కవిత్వం వలె జాలు వారే వచన శైలిలో వ్రాసిన ఈ నవల. మానవత్వపు విలువల ప్రాముఖ్యాన్ని నొక్కి చెబుతుంది.

1966 లో *డ్రామోస్*(A Dream of Africa, 1968) అనే మరో నవల వెలువడింది. ఇందలి నాయకుడు ఆరు సంవత్సరాలు పారిస్‌లో గడపి ఎన్నో ఆశలతో తన దేశం తిరిగి వస్తాడు. పూర్వపు ఆహ్లాదకరమైన వాతావరణం కోసం వెతుక్కుంటాడు. కాని పూర్వపు మానవత్వపు విలువల స్థానంలో రాజకీయ పరమైన హింస, విధ్వంసం కనిపిస్తాయి. 1964 నుండి అతడు సెనెగల్‌లో ప్రవా సంలో గడపాడు. అక్కడ డాకర్ విశ్వవిద్యాలయంలో ఇస్లామిక్ అధ్యయన శాఖలో పరిశోధకుడుగా పనిచేశాడు. ఈయన రచనలలో మానవత్వపు విలువలు పడిపో వటం పట్ల ఆవేదన, ఛిన్నాభిన్నమై పోతున్న సామాజిక వాతావరణం పట్ల భయం, సుమధురమైన గతస్మృతుల పట్ల ప్రేమ ఎక్కువగా మనకు కనిపిస్తాయి.

కె.జి. మూర్తి.

**లారెన్స్, డేవిడ్ హెర్బర్ట్ (1885-1930)** : డేవిడ్ హెర్బర్ట్ లారెన్స్ 1885 లో నాటింగమ్ షైర్‌లోని ఈస్ట్ వుడ్‌లో జన్మించాడు. ఇతని తండ్రి గని కార్మికుడు. తల్లి మధ్య తరగతి నుండి వచ్చింది. బొగ్గు గనులు, అందలి కార్మికుల జీవితాలు, ఇతనికి బాగా పరిచితాలు. ఇతని నవలలు, కథలు తరచు వీనిని వర్ణిస్తాయి. నాటింగమ్ హైస్కూలులోను, తరువాత నాటింగమ్ యూనివర్శిటీ కాలేజీలోను ఇతడు విద్య నభ్యసించాడు. లారెన్స్‌కు తల్లిపైగల విపరీతమైన అభిమానం అతని రచనలను, జీవితాన్ని ప్రభావితం చేసింది. ఈవిడ పోయిన కొద్ది వారాలకు, అనగా 1911 లో లారెన్స్ మొదటి నవల *ది వైట్ పీకాక్* ప్రచురింపబడింది. ఇంచుమించుగా ఇదే సమయానికి లారెన్స్‌కి జెస్సీ ఛాంబర్స్ అనే యువతితో చాలా కాలంగా ఉంటున్న సంబంధం అంత మయింది. దాదాపు ఒక సంవత్సరం పాటు లారెన్స్ తన నివాసానికి దగ్గరలో ఉన్న 'బ్రిటిష్ స్కూల్' లో ప్రాథమిక ఉపాధ్యాయుడుగా పనిచేసి మానివేశాడు. దీనికి ముఖ్య కారణం బాల్యం నుండి అతనిని పీడిస్తూ వచ్చిన క్షయవ్యాధి.

లారెన్స్ 1912 లో ఫ్రీడా వీక్లీ అనే జర్మన్ వివాహిత స్త్రీతో జర్మనీ వెళ్లి, 1914 లో ఇంగ్లండ్ తిరిగి వచ్చి ఆమెను వివాహమాడాడు. ఈమె లారెన్స్ గురువైన ఎర్నెస్ట్ వీక్లీ భార్య. ఇక్కడి నుండి లారెన్స్ నవలా రచన వృత్తిగా చేసుకొన్నాడు కాని, అతని ఆదాయం స్వల్పంగా ఉండేది. ఇతని నవలలలో అతి ముఖ్యమైన *ది రెయిన్ బో, విమెన్ ఇన్ లవ్* 1915, 1916 లలో పూర్తిచేయబడ్డాయి. వీనిలో మొదటిదానిని పోలీసులు అణచివేశారు. రెండవదానికి ప్రచురణకర్త దొరకలేదు.

మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో తన స్వతంత్ర అభిప్రాయాల వలన, తన భార్య జర్మన్ జాతికి చెందిన దవడం వలన, అధికారుల చేతులలో లారెన్స్ చాలా చిక్కులు పడ్డాడు. యుద్ధం ముగిసిన తరువాత పరిశ్రమ ప్రధానమైన పాశ్చాత్య నాగరకతను అధిగమించి, అంత కంటె సంతృప్తికరమైన జీవన విధానాన్ని అన్వేషిస్తూ ఇటలీ, శ్రీలంక, ఆస్ట్రేలియా దేశాలలో కొద్దికాలం నివ సించి, చివరకు అమెరికాలోని న్యూమెక్సికో రాష్ట్రంలోని

టావోస్ (Taos) చేరుకొన్నాడు. కాని ఇతని అన్వేషణ ఫలించకుండా 1925 లో యూరప్ తిరిగి రావలసి వచ్చింది. లారెన్స్ యొక్క కడపటి నవల *లేడీ చాటర్లీస్ లవర్* (Lady Chaterley's Lover) 1928 లో బహిష్కరింపబడింది. ఈయన గీసిన వర్ణచిత్రాలను 1919 లో పోలీసులు వశం చేసుకున్నారు. ఈయన జీవితమంతా అధికారులతోను, తుదకు తన స్నేహితులతోను తన నమ్మకాలకోసం పోరాడడంలోనే గడచింది. ఈ దశలోని తన మానసిక వేదనను లారెన్స్ తన పద్య సంకలనాలు *పెన్సీస్* (Pansies, 1929), *నెటిల్స్* (Nettles, 1930), *మోర్ పెన్సీస్* (More pansies) లో వ్యక్తం చేశాడు. లారెన్స్ కవిత్వం విశిష్టమైనది. మొదట్లో దీని శైలి, పదజాలం గ్రాంథికంగాను, కృతకంగాను ఉన్నా క్రమంగా ఈయన తన వ్యక్తిత్వానికి అనువుగా వీనిని మలచుకొని, సహజం, శక్తిమంతం అయిన కవిత్వాన్ని రచించాడు. ఇటలీలో నివసిస్తున్నప్పుడు దర్శించిన మధ్యధరా సముద్ర దృశ్యాలను, న్యూ మెక్సికో దృశ్యాలను వర్ణించిన *బర్డ్స్, బీస్ట్స్ అండ్ ఫ్లవర్స్* (Birds, Beasts and Flowers, 1923) అన్న కవితా సంపుటి ఈయన కవితాసంపుటులలో అత్యుత్తమమైనది.

లారెన్స్ యొక్క లేఖలు కూడా అతని బహుముఖ ప్రజ్ఞకు, అతని వ్యక్తిత్వానికి ప్రతిబింబాలు. సాహిత్య లోకానికి అత్యుత్తమ ఉపోద్ఘాతం అతని లేఖలే నని కొందరు విజ్ఞుల అభిప్రాయం.

లారెన్స్ నిస్సందేహంగా గొప్ప రచయిత అయినా ఒక్కొక్కసారి ఆవేశానికి లోనుకావటం వల్ల అతని శైలిలో పునరుక్తి, అస్పష్టత మొదలైన లోపాలు కానవస్తాయి. కాని ఈయన సృజనశక్తి పాటవం మూలంగా ఈయన రచనలు జీవంతో స్పందిస్తాయి. శైలిలోనూ, రచనా శిల్పంలోనూ కూడా ఈయన నవలలు, కథలు, పద్య రచనలూ చదువరుల మనస్సుపై గాఢముద్ర వేస్తాయి.

జీవిత మంతా తన నమ్మకాల కోసం సంఘంతోనూ, తన సహచరులతోనూ కూడా పోరాడిన డేవిడ్ హెర్బర్ట్ లారెన్స్ 1930 మార్చ్ 2 వ ఫ్రాన్స్‌లోని 'వెన్స' అనే గ్రామంలో చనిపోయాడు.

డి.ల.రా.

**లావో షే (1899-1966)** : లావో షే అనేది షూచింగ్ చున్ అనే రచయిత యొక్క కలం పేరు. ఈయన 1899 ఫిబ్రవరి 3 వ చైనాలోని బీజింగ్‌లో జన్మించాడు. చైనాలో హాస్యరస భరితమైన నవలలకూ, అధిక్షేప రచనలకూ, కథానికలకూ పేరు గాంచాడు. చైనా జపాన్ యుద్ధారంభం తరువాత ఈయన దేశభక్తిని పురికొల్పే రచనలను ఎక్కువగా చేశాడు.

లావో షే తన 17 వ ఏట ఒక ప్రాథమిక పాఠశాల ప్రధానోపాధ్యాయుడుగా చేరి, జిల్లా అధికారి అయాడు. 1924 లో ఇంగ్లండ్ వెళ్లి జీవన భృతికి చైనీస్ భాషను బోధిస్తూ మింగ్ రాజవంశాన్ని గూర్చిన నవల *చిన్ పింగ్ మే* (Chin ping mei) ను అనువదించాడు. ఇంగ్లండ్‌లో ఉండగా డికెన్స్ వల్ల ప్రభావితుడై మూడు నవలలు వ్రాశాడు. ధీమంతుడు, శక్తిమంతుడు అయినవ్యక్తే అప్పటి చైనాను పీడిస్తున్న అవినీతి, ఆర్థిక మాంద్యంతో కూడిన క్లిష్ట పరిస్థితి నుండి విముక్తి చేయగలడనే ఇతివృత్తాన్ని ఈ నవలలో లావో షే చిత్రించాడు.

ఇంగ్లండు నుంచి 1931 లో చైనా తిరిగి వచ్చేసరికి తనొక హాస్య నవలా కారుడుగా పేరు గాంచినట్లు గ్రహించి, ఈయన సంచలనాత్మకాలు, హాస్య రసభరితాలు అయిన నవలలు వ్రాయడం కొనసాగించాడు. చైనాకు తిరిగి వచ్చిన తరువాత వ్రాసిన *నియూ టియెంట్స్* (The life of Niu Tientz'u, 1934), *లోటో సియంగ్‌ట్సు* (Lo-to Hsiang tzu, 1936) అనే రెండు నవలల్లోనూ ఈయన ధోరణిలో మార్పు కనిపిస్తుంది. వీనిలో ఈయన సాంఘిక వాతావరణం యొక్క ప్రాముఖ్యం, దానికి వ్యతిరేకంగా వ్యక్తిగత పోరాటపు వైఫల్యం ప్రతిపాదించాడు. చైనా-జపాన్ యుద్ధ సమయంలో ఈయన దేశభక్తి ప్రబోధకాలైన, జపాన్‌కు వ్యతిరేకమైన రచనలు చేశాడు; రచనలు తక్కువ స్థాయిలోని వని చెప్పాలి.

1946-47 లో లావో షే అమెరికాలో పర్యటించి, సాంస్కృతిక ఉపన్యాసాలు చేసి, తన నవలల అనువాదాన్ని పర్యవేక్షిస్తూ గడిపాడు. వీనిలో *ది యెల్లో స్టార్మ్*, (The Yellow Storm, 1951), అతని ఆఖరు నవల *ద డ్రమ్ సింగర్స్* (The Drum Singers, 1952) కూడా ఉన్నాయి. ఇవి చైనీస్ భాషలో అసలు ప్రచురింపబడలేదు.

చైనాకు తిరిగి వచ్చిన తరువాత లావో షే వివిధ సాంస్కృతిక, సాహిత్య ఉద్యమాలలో పాల్గొంటూ ఇంతకు ముందులాగే నాటకాలు వ్రాయడం కొనసాగించాడు. వీనిలో పేర్కొనదగ్గవి *లుంగ్-సూ-కౌ* (Dragan Beard Ditch, 1951), *చా-క్వాన్* (The Tea house, 1957). వీనిలో బీజింగ్ ప్రాంతపు చైనీస్ మాండలిక భాషా కౌశలాన్ని చక్కగా ప్రదర్శించాడు. లావో షే 1966 అక్టోబరు లో చనిపోయాడు. డి.ల.రా.

**లాసన్, హెన్రీ (1867-1922)** : ఆస్ట్రేలియన్ కథానికా రచయిత. ఆస్ట్రేలియాలోని న్యూ సౌత్ వేల్స్ రాష్ట్రంలో గ్రెన్‌ఫెల్ వద్ద 1867 జూన్ 17 న జన్మించాడు. తండ్రి ఒకప్పుడు నార్వీజియన్ నావికుడు, తల్లి స్త్రీ స్వాతంత్రోద్యమంలో ప్రముఖురాలు. బాల్యం నుండీ చెవిటితనం వల్ల, కుటుంబం ఆర్థిక పరిస్థితివల్ల, లాసన్ 14 వ ఏట బడికి వెళ్లటం మాని, తాపీపనిలో తండ్రికి సహాయపడటం ప్రారంభించాడు. 1884 నాటికి సిడ్నీ పట్నం చేరుకొని కథలు, పద్యాలూ వ్రాయడం మొదలు పెట్టాడు. ఇతడు తన తొలి రచనలను 1887-88 మధ్య సిడ్నీ నుండి వెలువడే *బులెటిన్* లో ప్రచురించాడు. 1884-88 మధ్య ఈయన అనేక వార్తా పత్రికలలో పనిచేశాడు. మధ్య మధ్యలో నిరుద్యోగిగా దేశసంచారం చేసేవాడు. వాస్తవికముల్లై, జీవితాన్ని స్ఫురింపచేసే ఈయన రచనలు ఈ అనుభవాలనుంచే ఆవిర్భవించాయి. నిరాశతో నిండి ఉన్న ఈ రచనలు ఆ నాటి ఆస్ట్రేలియాలోని శ్రామిక వర్గ జీవితాన్ని గూర్చిన సత్యాలను వెల్లడిచేస్తాయి. ఈయన జీవితంలో చివరి భాగంలో సుఖ శాంతులు కరువై ఈయన రచనల స్థాయి బాగుగా పడిపోయింది. 1922 సెప్టెంబర్ 22 న న్యూ సౌత్‌వేల్స్ లోని ఏబట్స్‌ఫర్డ్‌లో లాసన్ మరణించాడు.

లాసన్ రచనలలో ముఖ్యమైనవి: *ఇన్ ది డేస్ వెన్ ది వరల్డ్ వాజ్ వైడ్ అండ్ అదర్ వెర్సెస్* (1896), *వైల్ ది బిల్లీ బాయిల్స్* (1890), *జో విల్సన్ అండ్ హిజ్ మేట్స్* (1901), *ట్రయాంగిల్స్ ఆఫ్ లైఫ్ అండ్ అదర్ స్టోరీస్* (1913).

డి.ల.రా.

**లించ్, బెనీటో (1885-1951)** : అర్జెంటీనాకు చెందిన నవలా రచయిత, కథా రచయిత. 1885 జూన్ 25 న అర్జెంటీనాలోని 'ఐరిస్' లో పుట్టాడు. తన నవలలలోను, కథలలోను తన దేశపు సాధారణ ప్రజల జీవన విధానాన్ని, వారి మనస్తత్వాన్ని సులభమైన, సూటియైన శైలిలో వర్ణించాడు. దక్షిణ అమెరికాలోని పచ్చిక మైదానాలకు చెందిన ప్రజాజీవితాన్ని చిత్రించే గాకో నవలకు ఈయన వాస్తవికత చేకూర్చాడు.

లించ్ పూర్వీకులు ఐరిష్‌వారు. బాల్యంలో బ్యూనస్ ఐరిస్ రాష్ట్రంలో పల్లె ప్రాంతంలో పెరగటం వల్ల ఈయనకు అక్కడి గ్రామీణ జీవితం పట్ల మంచి అవగాహన ఏర్పడింది. తన రచనలలో ఆయన ఈ గ్రామీణ జీవితాన్ని ఇతివృత్తం చేసుకొన్నాడు. *ది వల్చర్స్ ఆఫ్ లా ఫ్లోరిడా* అనే నవల ఒక పెద్ద భూస్వామి అయిన తండ్రికీ యూరప్‌లో చదువుకొని తిరిగి వచ్చిన కొడుకుకూ మధ్య సాగిన ఘర్షణను చిత్రించింది. లించ్ తన విశిష్ట పద్ధతిలో *గాకో* నవల (దక్షిణ అమెరికాలోని పశువుల కాపరులను 'గాకో' లంటారు) ను కొనసాగిస్తూ, *రక్వేలా* (1918), *ఎల్ ఇంగిల్స్ డీలాస్ గెసోస్* (1924), *ది ఇంగ్లీష్‌మన్ ఆఫ్ ది బోన్స్* అనే నవలలను రచించాడు. ఈ రెండు నవలలలో ఒక ఇంగ్లీష్ శాస్త్రజ్ఞుడికీ, గాకో యువతికీ మధ్య జరిగిన ప్రణయగాథను చిత్రీకరించాడు. ఇదే ఈయన అత్యుత్తమ రచనగా పరిగణింపబడుతూంది. తదుపరి నవల *ఎల్ రొమాన్స్, డీ అన్ గాకో* (1930), (The Romance of a Gaucho) లో పాత్రలకు విశిష్టత చేకూర్చడానికి మాండలిక భాషను వాడాడు.

లించ్ పైన పేర్కొన బడిన నవలలే కాక *ఎన్ అంటోజో డీలా పట్రోనా* (1925; The Whim of the land-lady) అనే చిన్న నవల, కొన్ని కథాసంపుటాలూ కూడా రచించాడు. వీని వల్ల ఈ ప్రక్రియలలో ఈయనకు గల ప్రజ్ఞ విశద మవుతుంది. దక్షిణ అమెరికా పశువుల కాపరుల జీవితాలనే ఇతివృత్తంగా తీసుకొన్న ఈయన అర్జెంటీనియన్ నవలపై చెరుగని ముద్రవేశాడు. లించ్ 1951 డిసెంబర్ 23 న అర్జెంటీనాలోని లా ప్లాటాలో కన్ను మూశాడు.

డి.ల.రా.

**లిండ్‌సే, సర్ డేవిడ్ (1490-1555):** స్కాట్లండ్ సాహిత్య చరిత్రలోని స్వర్ణయుగం నాటి గొప్ప కవులలో ఒకడు. 1490 లో సంపన్న కుటుంబంలో పుట్టిన లిండ్‌సే 16 వ శతాబ్దంనాటి క్రైస్తవ మతం (ముఖ్యంగా రోమన్ కేథలిక్ శాఖ)లోను ఆనాటి ప్రభుత్వంలోను ఉన్న అవినీతిని అవహేళన చేస్తూ ప్రబోధాత్మక రచనలు చేశాడు. వీనిలో ఆయన ప్రజల వాడుక భాషను ఉపయోగించాడు. లిండ్సే స్కాట్లండ్ రాజు నాలుగవ జేమ్స్ సేవలో చాలాకాలం గడపి, యూర



ప్లోని పెక్కురాజుల వద్దకు స్కాటిష్ రాజదూతగా వెళ్లాడు. ఈయన రచనలు ఎక్కువ భాగం రాజసే వలో ఉన్నత పదవులలో ఉండగా చేసినవే. ఈయన వ్రాసిన *ఏన్ సెటైర్ ఆఫ్ ది త్రీ ఎస్టేయిట్స్* అనే నాటకం నీతి ప్రబోధకమైన స్కాటిష్ నాటికలకు ఈ నాటికీ మిగిలిన మచ్చుతునుక. ఆనాడు మతంలోను, ప్రభుత్వంలోను, సంఘంలోను పేరుకుపోయిన దురాచారాలు ఈ నాటికలో విమర్శించ బడ్డాయి. ఈ నాటిక 1552 లో ప్రదర్శించబడి ప్రజాదరణ పొందింది. 1528 నాటి *ది డ్రీమ్* అనే పద్యకావ్యంలో ఈయన ఆనాటి స్కాట్లండ్ పరిస్థితిని వర్ణించాడు. *ది టెస్టమెంట్ అండ్ కంప్లెయింట్ ఆఫ్ అవర్ సావరన్ లార్డిస్ పేపింగో* (1530) అనే మరొక కావ్యం డగ్లస్‌లు అనే శత్రువర్గం బారినుండి స్కాట్లండ్ రాజు నాల్గవ జేమ్స్ తప్పించుకొనడాన్ని పురస్కరించుకొని వ్రాయబడింది. ఈ కావ్యంలో ఒక చిలుక రాజుకు, ఆయన మంత్రులకు హితోపదేశం చేస్తుంది. ఈయన రచనలలో కడపటిది అయిన *ది కంప్లెయింట్ అండ్ పబ్లిక్ కన్ఫెషన్ ఆఫ్ ది కింగ్స్ ఔల్డ్ హౌండ్ కాలిట్ బగ్‌షె* (1536) లో ఈయన నీతిబోధచేసి, రాజాస్థానంలోని పోకడలను ఒక శునకం వాక్కు ద్వారా విమర్శిస్తాడు. ఈయన తరువాత ఈ పద్ధతి (మానవ ప్రవర్తనను విమర్శించడానికి జంతువులను, పక్షులను ఉపయోగించడం) ఆధునిక స్కాటిష్ సాహిత్యంలో రాబర్ట్ బర్న్స్ అనే కవి తిరిగి ప్రయోగించాడు. లిండ్సే రాజాస్థానంలోని తన అనుభవాన్ని ఆధారంచేసికొని, తన కవితా శక్తి నుపయోగించి, నీతి ప్రబోధాత్మకమైన కావ్యాలను రచించిన స్కాటిష్ కవిగా పేరు గాంచాడు. 1555 లో లిండ్‌సే కీర్తిశేషుడయాడు.

డి.ల.రా.

**లిటన్ ఆఫ్ నెబ్‌వర్త్ (1803-73)** : బ్రిటిష్ కవి, నవలా రచయిత, విమర్శకుడు, రాజకీయ నాయకుడు. ఎడ్వర్డ్ జార్జ్ ఎర్ల్ బుల్వర్ లిటన్ 1803 మే నెల 25 న లండన్‌లో జనరల్ విలియమ్ బుల్వర్, ఎలిజబెత్ లిటన్ దంపతులకు పుత్రుడుగా జన్మించాడు. కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసం ముగించి తరువాత ఫ్రాన్స్‌లో పర్యటించాడు. ఇంగ్లండ్‌కు తిరిగి వచ్చి 1827 లో రోజినాడోయిల్ వీలర్ అనే ఐరిష్ యువతిని వివాహం చేసుకొన్నాడు. ఆ సంవత్సరమే ఒక నవల ప్రచురించాడు కాని అది విశేష ప్రజాదరణ పొందలేదు. 1828 లో *పెల్‌హామ్* (Pelham) అనే నవల ప్రచురణతో ఆయన ప్రజాభిమానాన్ని చూరగొనగలిగాడు. అక్కడనుండి ఆయన ఆ స్థానాన్ని చాలా కాలం నిలుపుకొన్నాడు. లిటన్ చాలా నవలలు వ్రాశాడు. ప్రజల అభిరుచిని గమనించి, వాటిలో రాబోయే మార్పులను పసిగట్టి తదనుగుణంగా రచనలను చేయడం ఆయన కీర్తికి ప్రధాన కారణం. ఆయన నవలలు ఈ నాటికీ పఠనీయాలుగా ఉన్నాయి. లిటన్ దంపతుల ఆడంబర జీవనం మూలంగా ధనార్జన నిమిత్తం లిటన్ ఎక్కువ నవలలు వ్రాయవలసి వచ్చింది. దీని మూలంగా, వీరి మధ్య చికాకులు పెరిగి, చివరకు 1836 లో వీరు విడిపోయారు.

బుల్వర్ లిటన్ 1831 లో లిబరల్ పార్టీ తరఫున పార్లమెంట్ సభ్యు డయాడు. అతని రాజకీయ జీవితానికిది నాంది. కాని 1841 లో లిబరల్ పార్టీ విధానాలతో భేదించడం వలన ఆయన ఆ పార్టీని వదలి "టోరీ" (Tory) పార్టీలో చేరాడు. టోరీ సభ్యుడుగా 1852 లో పార్లమెంటుకు తిరిగి ఎన్నిక అయాడు. అదే కాలంలో ఆయన చాలా సాహిత్యకృషి చేశాడు. కాల గమనాన్ని తట్టుకోలేక పోయినా, తాత్కాలికంగా జనాన్ని ఆకర్షించిన కొన్ని నాటికలను కూడా లిటన్ రచించాడు.

మొదట రచించిన నవలలో బుల్వర్ లిటన్ ధనిక, ఆడంబర జీవిత నేపథ్యంలో ప్రేమ గాథలను చిత్రించాడు. ఈ ధోరణికి *పెల్‌హామ్* చక్కని ఉదాహణ. తరువాత ఆయన ఆనాటి విషయాలను యథాతథంగా చిత్రించే చారిత్రక నవలల రచనకు పూనుకొని ప్రజల మన్ననలను పొందాడు. *ది లాస్ట్‌డేస్ ఆఫ్ పోంపే* (1834), *హేరల్డ్, ది లాస్ట్ ఆఫ్ ది శాక్సన్స్* (1848) అన్న నవలలు ఈ కోవకు చెందినవి. *యూజీన్ అరమ్* (Eugene Aram, 1832) అన్న నవలలో ఆ నాటి పాతకులలో నేరస్థుల పట్ల గల ఆసక్తిని రచయిత బాగా తృప్తి పరిచాడు. తరువాతి నవలలు *ది కాక్స్‌టన్స్* (The Caxtons, 1849), *మై నోవెల్* (1853) లలో ఆనాటి ఇంగ్లీష్ సమాజాన్ని వాస్తవికతా ధోరణిలో చిత్రించి ప్రజల అభిమానం పొందాడు. పైన ఉదాహరింపబడిన నవలలే కాక బుల్వర్ లిటన్ పద్య సంకలనాలనూ, ప్రముఖ ఆంగ్లకవి ఆల్‌ఫ్రెడ్ టెన్నిసన్‌ను విమర్శిస్తూ పద్యరూపంలో వ్రాసిన ఒక నవలనూ, *కింగ్ ఆర్థర్* (1848) అనే మహాకావ్యాన్నీ కూడా రచించాడు.

సమకాలీన సాహిత్య విమర్శకులు, ముఖ్యంగా విలియమ్ టాకెరే (William Thackeray) బుల్వర్ లిటన్

రచనలను నిర్మొహమాటంగా విమర్శించారు. 20 వ శతాబ్దంలో బుల్వర్ లిటన్ పేరు ప్రతిష్ఠలు బాగా క్షీణించాయి.

డి.ల.రా.

**లిన్స్ దో రెగో కావల్ కాంటీ హోసే (1901-1957):** బ్రెజిల్‌లోని ఈశాన్య ప్రాంతంలోని చెందిన వాస్తవిక వాదుల వర్గానికి చెందిన నవలా రచయిత. అయిదు భాగాలతో కూడిన *స్యూగర్ కేన్ సైకిల్* ఇతని ప్రసిద్ధ గ్రంథం. ప్రాచీన ఫ్యూడల్ వ్యవస్థకు చెందిన చెరకు తోటల యజమానులకూ, పారిశ్రామికీకరణ వలన ఏర్పడిన క్రొత్త పద్ధతులకూ మధ్య తలయెత్తిన ఘర్షణ ఈ గ్రంథంలో వర్ణితమయింది.

లిన్స్ దోరెగో బ్రెజిల్‌లో పరైబా లోని పీలార్‌లో 1901 లో జన్మించాడు. 1957 సెప్టెంబరు 13 వ తేదీన రయో డి జీనీరోలో మృతి చెందాడు.

లిన్స్ దోరెగో చెరుకు తోటలలోని *బిగ్‌హౌస్* లో పుట్టి పెరిగాడు. అందుచేత పై నవలా చక్రంలోని మొదటి భాగం *మెనిఓ డి ఎంగెన్ హో* (1932, Palantation lad) అతని బాల్యం, కుటుంబజీవనం ఆధారంగా రచించబడింది. వెనువెంటనే *డోయిడిన్ హో* (1933, Daffy Boy) , *బాంగ్వే*, (1934, Old Plantation), *ఓ మొలెక్ రికార్డో* (1935, Black Boy Richard), *యూసినా* 1936, The Sugar Refinery) అనే 4 భాగాలూ వరుస వరుసగా వెలువడ్డాయి. వీటిలో మొదటి మూడు కృతులూ *ప్లాంటేషన్ బాయ్* అనే పేర 1966 లో ఇంగ్లీషులోకి అనువదింపబడ్డాయి. లిన్స్ సర్వశ్రేష్ఠకృతిగా భావింపబడిన *ఫోగో మార్టో* (1943, Dead Fire) లో అతడు ప్లాంటేషన్ వాతావరణానికి తిరిగి వచ్చాడు.

న్యాయ శాస్త్రం చదివి పట్టా తీసుకొన్న లిన్స్ దో రెగో 1920 ప్రాంతాలలో కొంతకాలం న్యాయవాదిగా ప్రాక్టీసు చేసిన తరువాత బ్యాంకుల, టాక్సుల ఇన్స్పెక్టరుగా పనిచేశాడు.

జె.స్యూ.ప్ర.

**లి పో (701-762) :** చీనా దేశపు కవి బిరుదానికి 'టూఫూ' (Tufu) తో స్పర్ధ వహించిన వాడు.

రాజవంశానికి చెందినవాడ నని చెప్పుకోడం లి పోకు చాలా ఇష్టం. కాని నిజానికి అతడు అదే గృహనామం గల ఒక తక్కువ స్థాయి కుటుంబానికి చెందినవాడు. తన 19 వ ఏటనే అతడు తన ఇంటిని విడిచి, తావోయిస్టు ఏకాంతవాసి (తావోయిస్ట్-లోవోట్సి) తో కలసి జీవింపసాగాడు. ఇలా కొన్నాళ్లు సంచార జీవనం చేశాక అతడు వివాహమాడి అత్తవారి కుటుంబంతో పాటు హాన్ చౌ (Han-chou) ఉత్తర భాగంలో ఉంటూ ఉండేవాడు. అప్పటికే అతడు కవితలు వ్రాయడం ప్రారంభించాడు సెక్రటరీ ఉద్యోగం సంపాదించాలనే ఆశతో కొందరు ప్రభుత్వ ఉద్యోగులకు తన కవితలు చూపించేవాడు. కాని అతని ఆశ ఫలించలేదు. క్రీ.శ. 734 లో ఈశాన్య చీనాలో ఉన్న ఒక స్నేహితుని చూడడానికి వెళ్ళడంతో అతని సంచార జీవనం రెండో దశ ప్రారంభమైంది. క్రీ.శ. 742 లో అతడు రాజధాని నగరం అయిన 'చాంగ్-అన్' (chang-an) చేరుకొని, ఆస్థానపదవిని ఆశించాడు. ప్రభుత్వ పదవి ఏమీ లభించకపోయినా ప్రసిద్ధకవుల జాబితాలో అతనిపేరు చేర్చబడింది. కొద్ది క్షణాల వ్యవధిలో ఆస్థాన సంఘటనలను కవితల రూపంలో వర్ణించి గానం చేయటం ఆ కవుల సంఘం నిర్వహించే బాధ్యత. అలాంటి కృత్రిమ జీవనం అంటే విసుగు పుట్టి క్రీ.శ. 744 శిశిర ఋతువులో మరల సంచార జీవనం ప్రారంభించాడు. ఈ సమయంలో అతడు ఆనాటి మేటి కవులు కొందరిని కలియడం తటస్థించింది. ఈ విధంగా లి పో పేరు ప్రఖ్యాతులు పొందేసరికి ఫూ (Fu) పేరు కూడ ఎవరూ ఎరుగరు. తనకంటె పెద్దవాడైన లి పో అంతకంతకు "తావోయి జమ్" లోను, స్వర్ణకారవిద్య (Alchemical studies) లోనూ నిమగ్నుడై ఉండడటంతో 'టుఫూ' అతని ప్రభావానికి, చొరవకి లోనయాడు. అప్పటికే లి పో ఒక పెద్ద "తావోయిస్టు" ప్రముఖుని ద్వారా 'ఆధ్యాత్మిక ప్రగతి' లో డిప్లమా పొంది, తావోయిస్టుగా ముద్ర పొందాడు.

క్రీ.శ. 756 చీనా చక్రవర్తి 16 వ కుమారుడైన ప్రిన్స్ లీస్ చేసిన సైనిక ఆక్రమణకు సంబంధించి లిపో అనాధికారికంగా ఆస్థానకవి (Poet laureates) గా నియమింపబడ్డాడు. అనంతరం కొద్ది కాలానికే స్వతంత్ర రాజ్యస్థాపనకు ప్రయత్నం చేశాడనే నేరారోపణతో ఆ యువరాజు మరణదండనకు గురికావటం, ఆస్థానకవి అయిన లి పో 'చ్యూ-చియాంగ్' (Chiu-chiang) నగరంలో చెరసాలలో బంధించబడటం జరిగింది. ఈ కల్లోలానికి సంబంధించిన కేసులలో విధించిన ఆజ్ఞలను పునఃపరిశీలించడానికి ఒక ఉన్నతోద్యోగిని నియమించారు. అతడు లిపోకు సంబంధించిన కేసును పరిశీలించి నిర్దోషిగా భావించి, విడుదల చేసి, తన దగ్గరనే స్టాఫ్ సెక్రటరీ గా నియమించుకోడం జరిగింది. కాని క్రీ.శ.

758 లో లి పోపై కేసును తిరుగదోడి అతనికి యేలాంగ్ (Yeh-lang) కు పోవలసినదని దేశబహిష్కార శిక్ష విధించాడు. అతడు అక్కడకు చేరే లోపున దోషు లందరికి మూక ఉమ్మడి (సామాన్య) క్షమ ప్రసాదించబ డడంతో అతడు తూర్పు చైనాకు తిరిగి వచ్చాడు. అక్కడ తన బంధువు ఇంటిలో కొన్నాళ్లు ఉండి తరువాత కాలధర్మం చెందాడు. కాని అతడు తప్పత్రాగి ఒక పడవలో కూర్చుని నీటిలో ప్రతిఫలించిన చంద్రబింబాన్ని పట్టుకోవడానికి ప్రయత్నించడంలో నీటిలో మునిగి చనిపోయాడని ఒక వదంతి ప్రచారంలో ఉంది.

తన జీవన విధానంలోనూ, కవితలోనూ కూడా లి పో కాల్పనిక వాదిగా కనిపిస్తాడు. చైనాలోని ప్రతిభా వంతులైన తత్త్వవేత్తల పరంపరలో ఒకడుగా ప్రసిద్ధి చెందిన లి పో తరచుగా మద్యపాన మహోత్సవాలలో లీనమై ఉండేవాడు. అతడు స్నేహం, ఏకాంతం, కాలగమనం, ప్రకృతి ఆనందహేల మొదలైన విషయాలపై కూడా కవితలు అల్లాడు. *నిర్వాసితాపరాధి* అని పేరు పొందిన లిపో ప్రతిభ, కల్పనా పటిమ గల మహా కవిగా ప్రసి ద్ధుడు. *ఆర్థర్ వేలీ* రచించిన అతని జీవిత చరిత్ర *పొయ్ట్రీ అండ్ కేరీర్ ఆఫ్ లి పో* అనే పేరుతో 1955 లో ప్రచురిత మయింది.

జె.సూ.ప్ర.

**లియోఁ, లూయీ డీ (1527-91) :** స్పానిష్ రహస్యవాది కవి. బెల్మాంట్‌లో క్రీ.శ. 1527 లో జన్మించాడు. 1591 ఆగస్టు 23 న ఆల్టాస్‌లోని మాడ్రి గల్‌లో దేహయాత్ర చాలించాడు. స్పానిష్ పునరుజ్జీవన సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన మహాకవి.

లియోఁ ఒక క్రైస్తవ సన్యాసి. సలమాంకా (Salamanca) లో అధ్యయనం చేసి అక్కడే 1561 లో మతాధికారి పదవి చేపట్టాడు. 1544 లో అతడు సమర్థించిన అగస్టీనియన్ పక్షం వారికి, డొమినికన్లకు ఆధిపత్యం కోసం జరిగిన వివాదం వల్లను, ఆ కాలంలో స్పెయిల్‌లో బలీయంగా ఉన్న *వుల్‌గేట్* (Vulgate) గ్రంథాన్ని, యూదు జాతీయురాలు అయిన తన ముత్తవ్వ విమర్శించినందువల్లను అతడు నిరసనకు గురి అయాడు. 1572 నుండి 1576 వరకు అయిదు సంవత్సరాలు కారాగార శిక్ష అనుభవించిన పిదప అతడు విడుదల పొంది తన పదవిలో పునఃప్రతిష్ఠితుడయాడు. అయినా అతడు తన స్థానంలో తనకు వారసుడుగా వచ్చిన వ్యక్తినిమిత్తం ఆ పదవికి రాజీనామా చేశాడు. అనతికా లంలోనే అతనికి 'సలమంకా' లోనే మరొక క్రొత్త పదవి లభించింది. అతనిపై ఆరోపించబడిన రెండవ నిరసన వీగిపోయింది. 1583-85 మధ్య అతడు రచించిన *డి లోస్ నోంబ్రెస్ డి క్రిస్టో* అనే గద్య గ్రంథం అతని సర్వ శ్రేష్ఠ గ్రంథంగా భావింపబడుతూంది. సంభాషణ రూపంలో ఉన్న ఆ బృహత్ గ్రంథం ఇరాస్మస్ అనుయాయుల చేత బహుళ ప్రచారంలో నికి తీసుకురా బడింది. దానిలో క్రీస్తుకు పవిత్రగ్రంథంలో వాడబడిన వివిధ నామాలను గూర్చి వివరించబడింది. అలంకారిక శైలి అయినా కృతకం కాని ఉదాత్తశైలిలో రచించబడిన ఆ గ్రంథం శ్పానిష్ కావ్యాలలో ఆదర్శ గద్య గ్రంథంగా ఎన్నబడింది. గ్రీక్, లాటిన్, హీబ్రూ, ఇటాలియన్ భాషల నుండి అతడు చేసిన అనువాదాలలో *సాంగ్ ఆఫ్ సోలమన్* (Song of Solomon- దీని ఆధునిక ముద్రణం జె. గిల్లెన్‌చే 1936 లో కావించబడింది.), *ది బుక్ ఆఫ్ జాబ్* అనేవి వ్యాఖ్యానాలతో ముద్రిం పబడ్డాయి. *డి లో నోంబ్రెస్ డి క్రిస్టో* ఉద్దేశాలతో కూడిన లియోఁ పద్యాలు అతని మరణానంతరం 1631 లో క్యూవెడో (Quevedo) చే ప్రకటింపబడ్డాయి. నిజా యితీ తోడి భావప్రకటనకు, శైలికంటె ఇతివృత్తానికి ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వడానికి అవి ప్రసిద్ధి గాంచాయి. భాషను తిరిగి లాటిన్ మయం చేయడానికి 'గాంగో రిస్ట్' లు చేసే ప్రయత్నాలను అడ్డుకోడానికి అతని రచనలు బాగా తోడ్పాడ్డాయి. 18 వ శతాబ్ది శ్పానిష్ సంప్రదాయ వాదులు అతని కావ్యాలను ఆదర్శంగా ఎంచుకొనేవారు. అతని పద్యకృతులలో *విడా రెటీరడ* (1557 (Withdrawn Life); నోక్ శెరీనా: (1571, The Serene Night) అనేవి ప్రజాబాహుళ్యం మెచ్చినవి. అతని ఇతర కృతులలో మతపరమైన గ్రంథాలు, బైబిలు లోని అనేక ప్రార్థనా గీతాలకు లాటిన్ భాషలో వ్రాసిన వ్యాఖ్యలు, *లా ఫెర్ ఫిక్టాకాసడా* (La perfecta casada 1583: "The perfect married women), 31 సామె తల మీద శ్పానిష్‌లో వ్రాసిన వ్యాఖ్యానం ముఖ్యమైనవి. చివరి దానిలో మధ్యయుగం నాడు ప్రబలంగా కన్పించే స్త్రీ జాతిని ద్వేషించి సన్న్యాసి జీవితం గడిపే మనస్త త్వాన్ని ప్రదర్శించే కొన్ని చిత్రపటాలు కూడా చేర్పటం జరిగింది.

జె.సూ.ప్ర.

**లియోపార్డీ, జ్యాకోమో (1798-1837) :** ఇటా లియన్ కవి. పోపు అధికార పరిధిలోని రెకనాటీలో 1789 జూన్ 29 న జన్మించి నేపుల్స్‌లో 1837 జూన్ 14 న మరణించాడు. 19 వ శతాబ్దిలోని మేటి

కవులలో ఒకడైన లియోపార్డీ గొప్పకవి, పండితుడు, తత్త్వవేత్త.

ఉన్నత వంశస్థులైనా ఈతని తలిదండ్రులు అంగ వైకల్యం పొందిన పుత్రుని విషయంలో అంతశ్రద్ధ చూప లేదు. అయినా కుశాగ్రబుద్ధి కాడంతో అతి త్వరలోనే లియోపార్డీ తన ఉపాధ్యాయుల వద్ద గల విద్యనంతా ఆపోశన పట్టాడు. 16 వ ఏటనే ఇతడు స్వయంకృషితో గ్రీక్, లాటిన్‌లతోపాటు మరికొన్ని ఆధునిక యూరోపి యన్ భాషలు కూడా నేర్చుకొన్నాడు. ఎన్నో ప్రాచీన కావ్యాలను ఇటాలియన్‌లోకి అనువదించాడు. రెండు ట్రాజడీలు రచించాడు. ఇటాలియన్ భాషలో రెండు పద్య కావ్యాలు రచించి, పాండిత్య స్ఫోరకమైన ఎన్నో వ్యాఖ్యానాలు రచించాడు. శ్రుతిమించిన ఈ విద్యాకృషి అతని ఆరోగ్యాన్ని దెబ్బతీసింది. కొన్నాళ్లు దృష్టి మాంద్యంతో బాధ పడ్డాక అతని కన్ను ఒకటి పూర్తిగా అంధత్వానికి లోనయింది. దానికి తోడు మెదడు, వెన్నె ముకలకు సంబంధించిన వ్యాధికి గురిఅయి, జీవితాంతం బాధ పడ్డాడు. దాని ఫలితంగా దీర్ఘకాలం చదువుకు స్వస్తిచెప్పవలసి వచ్చింది. తల్లిదండ్రులు అతని స్థితిని పట్టించుకోకపోవడంతో మానసికంగా గాయపడ్డాడు. కాని అతని సోదరుడు, సోదరి సానుభూతి కనపర్చడం వల్ల అతనికి కొంత ఊరట లభించింది. ఈ విధంగా తాను అనుభవించిన ఆశా, నిరాశల స్వరూపాన్ని అతడు తన *ఎప్రెస్సమెంటో డెల్లా మోర్టె* (Approach of Death,) ఇది 1816 లో వ్రాయబడి 1835 లో ప్రచురింపబడింది) వంటి పద్యకృతులలో ప్రతిబింబింపచేశాడు. పెట్రార్క్, డాంటేలను అనుకరిస్తూ వ్రాసిన ఒక కల్పిత గ్రంథం (అంత్య ప్రాసగల త్రిపదీ ఛందం) లో అతని కవితా వైశిష్ట్యంతో పాటు అతడు అనుభవించిన నిస్పృహ కూడా ప్రతిబింబిస్తుంది.

1817 లోను, 1818 లోను అతనికి కలిగిన రెండు అనుభవాలు అతనిలో మిగిలిన ఆ కొంచెం ఆశను కూడా లోపింపచేసింది. వానిలో మొదటిది అతని మరదలు గెర్‌ట్రూడ్ కాసీ వివాహంతో అతనికి సంభవించిన భగ్నప్రేమ (ఈమెను గురించి డైరీ డి అమోర్ లోను, స్మృతి కావ్యమైన ఇల్ ప్రేమో అమోర్ లోను అతడు విశేషంగా వ్రాశాడు.) రెండవది అతని తండ్రి గుర్రపు బగ్గీ నడిపేవాని చిన్న కుమార్తె టెరీస్ ఫుటోరినీ గర్భవతి అయి మరణించటం (అతని గొప్ప పద్య కృతు లలో ఒకటైన *ఎ సిల్వియా* లో ఈమె ఇతివృత్తమే వర్ణించబడింది). ఈ కృతిలోని చివరి పంక్తులు జీవితంలో ఈతడు ఎట్టి మనోవేదనకు గురిఅయినదీ వెల్లడిస్తాయి. అవి: "ఓ ప్రకృతీ! ప్రకృతీ! నీ చక్కని తొలి వాగ్దానం ఎందుకు ఇలా భంగపరిచావు?" అని.

గొప్ప విద్వాంసుడు, దేశభక్తుడు అయిన పియెట్రో గియోర్డానీ 1818 లో లియోపార్డీని సందర్శించడంతో అతనిలో గూడు కట్టుకొనిన అంతర్గత వేదన చాలా వరకు తగ్గింది. బాధాకరమైన ఇంటి పరిసరాలనుంచి కొన్నాళ్లు దూరంగా ఉండమని అతడు లియోపా ర్డీకి సలహా ఇచ్చాడు. చివరకు కొన్ని నెలల పాటు (1822-23 సంవత్సరాలలో) అతడు రోమ్‌లో ఉండి తిరిగి ఇంటికి వచ్చాడు. మరి కొంతకాలం బాధలతోనే గడిచింది. 1823 లో ప్రచురింపబడిన అతని కవితా సంకలనం *కాంటొసే* ఒక్కటి మాత్రమే ఆ సమయంలో అతనికి జరిగిన మంచి. 1825 లో సిసిరో కృతులను మిలాన్‌లో ఉండి అనువదించడానికి అతడు ఒప్పుకొ న్నాడు. ఆ తరువాత కొన్ని సంవత్సరాలపాటు బాలోగ్నా (Bologna), రెకనాటీ (Recanati), పీసా (Pisa), ఫ్లారెన్సు (Florence) నగరాలలో పర్యటించాడు. 1826 లో *వెర్సీ* అనే కృతిని ప్రకటించాడు. 1827 లో *మైనర్ మోరాల్ వర్క్స్* అనే మరో రచనను రచించాడు. ఇది సంభాషణ రూపంలో సాగిన తాత్త్విక కృతి. రచయిత బాధా తప్త హృదయం అందులో ప్రతిబింబిస్తుంది.

ధనాభావం వల్ల లియోపార్డీ 1828 నుంచి 1830 వరకు 'రెకనాటీ' లోనే ఉండిపోయాడు. కాని మిత్రులు చేసిన ధన సహాయంతో ఫ్లారెన్సు వెళ్లి, 1831 లో *ఐ-కాంటీ* అనే కవితా సంకలనం ప్రచురించాడు. 'ఫాన్నీ టార్గిఓనీటోజ్జోట్టీ' అనే ఫ్లారెంటైను వనితవల్ల భగ్న ప్రేమికుడైనట్లు అతని కొన్ని విషాద గీతాలలో గోచరి స్తుంది. ఆంటోనియో రానియెరీ (Antonio Ranieri) అనే యువకుడు, నెపోలియన్ వలె ఏకాంత వాసం గడపేవాడు లియోపార్డీ ఏకమాత్ర మిత్రుడై ఊరట కలిగించాడు.

లియోపార్డీ రోమ్, ఫ్లారెన్సు నగరాలు తిరిగి తిరిగి చివరకు 1833 లో నేపిల్స్‌లో స్థిరపడ్డాడు. అక్కడ ఉండగా అతడు *గినెస్ట్రా* (Ginestra, 1836) అనే దీర్ఘకావ్యాన్ని వ్రాశాడు. అతని మరణానంతరం 1845 లో 'రానియేరీ' ప్రచురించిన కవితా సంకలనంలో ఇది చేర్చబడింది. చిరకాలం అతని కవితలలో ఏకైక విశ్రాంతి స్థానంగా వర్ణింపబడిన మృత్యువు నేపిల్స్‌లో కలరా వ్యాధి వ్యాపించిన సమయంలో అతనిని వరించింది.

లియోపార్డీ తొలి రచనలలో మేటి కృతి *ఎ సిల్వియా* (A Silvia) మొదలైన వానిలోని అతని శ్రేష్ఠకవితలు ఐడిల్లీ (Idillii) అనేపేరుతో ప్రచురింపబడ్డాయి. జేమ్స్ థామ్సన్ 1905 లో కూర్చిన *వ్యాసాలు, సంభాషణలు, ఆలోచనలు* అనే గ్రంథంలో అతని గద్యకృతుల ఆంగ్లానువాదాలు వెలువడ్డాయి. ఆర్.సి. ట్రెవిలియన్ 1941 లో కూర్చిన *లియోపార్డీ కవితల అనువాదాలు* (Translations of leopardirs poetry), 1963 లో జె.పి. బాయ్‌సెల్లి కూర్చిన కవితలు (Poems) లియోపార్డీ ఆంగ్లానువాదాలలో ముఖ్యమైనవి.

జె.సూ.ప్ర.

**లీకాక్, స్టీఫెన్ (1869-1944) :** శబ్ద చిత్రాలు, అక్షర చిత్రాలు, వ్యాసాలతో కూడిన సుమారు 30 కృతులు వ్రాసి, అంతర్జాతీయ ఖ్యాతిగాంచిన కెనడియన్ హాస్య రచయిత.

అతని 6 వ ఏటనే అతని తలిదండ్రులు కెనడాకు వలస వెళ్లారు. అప్పర్ కెనడా కాలేజీలో 1882 నుంచి 1887 వరకు విద్యనభ్యసించిన లీకాక్ 1891 లో టొరెంటో యూనివర్సిటీ నుంచి బి.ఏ. డిగ్రీ పొందాడు. అప్పర్ కెనడా కాలేజీలో ఎనిమిది సంవత్సరాలు ఉపన్యాసకుడుగా ఉన్న తరువాత చికాగో యూనివర్సిటీలో జేరి, 1903 లో పిహెచ్.డి. పట్టా పుచ్చుకొన్నాడు. అదే సంవత్సరం మాంట్రియల్ లోని మాక్‌గిల్ (Mc Gill) యూనివర్శిటీలో ఉపన్యాసకుడుగా జేరి 'ఆర్థిక, రాజకీయ విజ్ఞానాలశాఖ' (Department of Economics and political Sciences) కు అధ్యక్షుడై, 1908 నుంచి 1936 లో విశ్రాంతి గైకొనే వరకూ పనిచేశాడు. చరిత్ర, రాజకీయ, ఆర్థిక శాస్త్రాలకు చెందిన 20 కృతులు రచించాడు. ఉపన్యాసకుడుగానూ, రచయితగానూ లీకాక్ హాస్యానికి ప్రాముఖ్య మిచ్చాడు.

ముఖ్యంగా అతనికి పేరు ప్రతిష్ఠలు కలిగించినవి కల్పిత కథలతో కూడిన *లిటరరీ లాప్సెస్* (1910), *నాన్సెన్స్ నావెల్స్* (1911) లీకాక్ హాస్యం ముఖ్యంగా సమాజంలో ఉన్న సాంఘిక వైపరీత్యాలు, మానవ స్వభావంలో చేతలకు, మాటలకు సమన్వయం లేకపోవడం వంటి వాటిపై ఆధారపడి ఉంటుంది. నిశిత వ్యంగ్యానికి అతని రచనలలో చోటు లేదు. దానికి బదులుగా అతని రచనలలో పరవళ్లు త్రొక్కే యువత ఉత్సాహం దైనందిన జీవితంలో హాస్య సంఘటనలు ఎక్కువగా చిత్రించబడి ఉన్నాయి.

1935 లో అతడు రచించిన *హ్యూమర్: ఇట్స్ థియరీ అండ్ టెక్నిక్* అనే గ్రంథంలో తన హాస్య విధానం గురించి చర్చించాడు. 1946 లో ప్రారంభించిన *ది బోయ్ ఐ లెఫ్ట్ బిహైండ్ మి* అనే అతని జీవిత చరిత్ర అసంపూర్ణంగా మిగిలిపోయింది.

జె.సూ.ప్ర.

**లీవిస్, ఫ్రాంక్ రేమండ్ (1895-1978) :** ప్రఖ్యాత ఆంగ్ల సాహిత్య విమర్శకుడు. 1895 జూలై 14 న ఇంగ్లండ్‌లోని కేంబ్రిడ్జ్‌లో జన్మించిన లీవిస్ కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసం చేశాడు. మొదటి ప్రపంచ యుద్ధకాలంలో ఇతడు అంబులెన్స్ వాహకుడుగా పని చేసాడు. 1925 నుండి కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయానికి చెందిన ఎమ్మాన్యూల్ కళాశాలలో ఉపన్యాసకుడుగా పని చేశాడు. 1930 లో అక్కడినుంచి వెళ్ళి డేనింగ్ కళాశాలలో చేరాడు. అక్కడ అతనికి 1936 లో ఫెలోషిప్ కూడా వచ్చింది. 1962 లో పదవీ విరమణ చేసి ఆ తరువాత కూడా ఇంగ్లండ్‌లోని అనేక ప్రముఖ విశ్వవిద్యాలయాలలో విజిటింగ్ ప్రొఫెసర్‌గా పనిచేశాడు. 1967 లో ఇతడు ట్రినిటీ కళాశాలలో ఇచ్చిన ఉపన్యాస పరంపర 1969 లో పుస్తక రూపంలో ప్రచురించబడింది. 1932 లో ఇతని భార్యతో కలిసి *స్క్రూటినీ* అనే త్రైమాసిక సాహిత్య విమర్శ పత్రికను ప్రారంభించి, 1953 వరకూ నిరాటంకంగా కొనసాగించాడు. ఆంగ్ల సాహిత్య విమర్శ పరిణామంలో ఈ పత్రిక ఎంతో దోహదం చేసింది. సాహిత్యం జీవిత విమర్శకు సాధ్యమైనంత చేరువలో ఉండాలని, రచయిత యొక్క నైతిక స్థితిని దృష్టిలో ఉంచుకొని అతని రచనలను అంచనా కట్టాలని ఇతని విశ్వాసం.

సాహిత్య విమర్శకుడుగా లీవిస్ చేసిన సేవ బహుముఖమైనది. ఇతని విమర్శ ముఖ్యంగా రెండు దశలుగా పరిణామం చెందిందని చెప్పవచ్చు. మొదట టి.యస్. ఎలియట్ చేత బాగా ప్రభావితుడై ఇంగ్లీషు కవిత్వంపై దృష్టి సారించాడు. 1932 లో ఇతడు ప్రచురించిన *న్యూ బేరింగ్స్ ఇన్ ఇంగ్లీష్ పొయెట్రీ* అనే విమర్శ గ్రంథం ఆంగ్ల సాహిత్య విమర్శ చరిత్రలో ఒక మైలురాయి వంటిది. ఆంగ్ల కవిత్వాన్ని అవగాహన చేసుకోడానికి అది ఒక నూతన పంథాను చూపింది. 1936 లో *రివాల్యుయేషన్: ట్రెడిషన్ అండ్ డెవలప్‌మెంట్ ఇన్ ఇంగ్లీష్ పొయెట్రీ* అనే మరొక గ్రంథాన్ని ప్రచురించాడు. ఆ తరువాత ఇతని అభిరుచి నవలలపైకి మళ్లింది. దానితో 1948 లో *ది గ్రేట్ ట్రెడిషన్* అనే ఒక గొప్ప విమర్శన గ్రంథం ప్రచురించాడు. ఇది ఆంగ్ల

నవలా సాహిత్యంపై వెలువడ్డ ప్రముఖ విమర్శక గ్రంథం. ఈ గ్రంథంలో జేన్ ఆస్టిన్, జార్జ్ ఇలియట్, హెన్రీ జేమ్స్, జోసెఫ్ కాన్‌రాడ్ లను గొప్ప నవలా కారులుగా పేర్కొని, డి.హెచ్. లారెన్స్‌ను కేవలం వారి వారసుడు మాత్రమే నని లీవిస్ నొక్కి చెప్పాడు. 1955 తరువాత డికెన్స్, టాల్‌స్టాయ్ వంటి రచయితలు ఇతనిని ఆకర్షించారు. వారి రచనలను బాగా అధ్యయనం చేసి, 1967 లో *అన్నా కెరేనినా అండ్ అదర్ ఎస్సేస్* అనే గ్రంథాన్ని రచించాడు. ఆ తరువాత తన భార్యతో కలిసి 1970 లో *డికెన్స్ ది నావెలిస్ట్* అనే మరొక గ్రంథాన్ని ప్రచురించాడు. 1952 లో ఇతడు ప్రచురించిన *ది కామన్ పర్‌స్యూట్* అనే గ్రంథం ఇతనికి విశేష ఖ్యాతిని ఆర్జించి పెట్టింది. రెండు దశాబ్దాల పాటు ఆంగ్లసాహిత్య విమర్శరంగంలో విశేష ప్రతిభా పాటవాలను ప్రదర్శించి అనేక భావి విమర్శకులకు స్ఫూర్తి నిచ్చిన లీవిస్ 1978 ఏప్రిల్ 14 న కేంబ్రిడ్జ్‌లో మరణించాడు.

మల్లేశం.

**లీవిస్, సింక్లేర్ (1885-1951) :** అమెరికన్ నవలా రచయిత, సంఘ విమర్శకుడు. తన వ్యంగ్య పూరితమైన, బహుళ జనాదరణ పొందిన నవలలతో అమెరికన్ ప్రజల అలసత్వం వదలగొట్టినవాడు. 1930 లో సాహిత్యానికి నోబెల్ బహుమతి అందుకొన్నాడు. మొట్టమొదటిసారి ఒక అమెరికన్‌కి ఆ బహుమతి రావడం అదే మొదలు.

యేల్ విశ్వవిద్యాలయం నుంచి 1907 లో లీవిస్ పట్టభద్రు డయాడు. కొంతకాలం పత్రికా విలేఖకుడుగానూ, ప్రచురణకర్తల వద్ద ఎడిటర్‌గానూ పనిచేశాడు. ఆయన వ్రాసిన తొలి నవల *అవర్ మిస్టర్ రెన్* (1914). అది మంచి విమర్శలను అందుకొన్నా, పాఠకులను ఎక్కువగా ఆకర్షించ లేకపోయింది. అదే కాలంలో ఆయన విశేష ప్రజాదరణ పొందిన *ది శాటర్ డే ఈవెనింగ్ పోస్ట్, కాస్మాపోలిటన్* వంటి పత్రికలలో తన రచనలను ఎక్కువగా ప్రచురించేవాడు. తరువాత లీవిస్ *మెయిన్ స్ట్రీట్* అనే గొప్ప నవలను వ్రాయడానికి పూనుకొన్నాడు. 1920 లో దాని ప్రచురణ ఆయనకు విశేషప్రశస్తి చేకూర్చింది. ఆ నవలలో లీవిస్ శ్రద్ధగా స్థానిక మాండలిక భాషనూ, ఆచారాలనూ, అందుబాటులో ఉన్న వారి సౌకర్యాలనూ వాస్తవికంగా చిత్రించాడు. దానిలోని వ్యంగ్యం రెండు వైపులా పదును గలది. అటు నగరవాసులనూ, ఇటు వారిని ఏవగించుకొనే కుహనా మేధావులనూ కూడా అది పరిహసించింది.

1922 లో లీవిస్ *బబ్బిట్* అనే రచన చేశాడు. దానిలో రోటరీ క్లబ్‌లద్వారా, వాణిజ్య లక్ష్యాల ద్వారా తన వ్యక్తిత్వాన్ని కోల్పోయిన అమెరికన్ పౌరుణ్ణి అద్భుతంగా చిత్రించాడు. *బబ్బిట్* అనే పేరు అలా వ్యక్తిత్వం కోల్పోయిన అమెరికన్ వాణిజ్య వేత్తలకు పరిహాస నామంగా వాడుకలోకి వచ్చింది.

తరువాత లీవిస్ *ఏరో స్మిత్* (1925), *ఎల్మర్ గాంట్రీ* (1927), *డాడ్స్‌వర్త్* (1929) అనే నవలలలో అమెరికన్, యూరపియన్ జీవితపు విలువలను తులనాత్మకంగా పరిశీలించాడు.

అనంతరం లీవిస్ వ్రాసిన రచనలు వెనుకటి రచనల ప్రమాణాన్ని అందుకోలేకపోయాయి. అలాంటి రచనలలో పేర్కొనదగినవి: *ఇట్ కాంట్ హాపెన్ హియర్* (1935), *కింగ్స్ బ్లడ్ రాయల్* (1947). మొదటి రచనను 1936 లో నాటకంగా కూడా ఫెడరల్ థియేటర్‌లో ప్రదర్శించారు.

చివరి రోజులలో లీవిస్ ఎక్కువ కాలం విదేశాలలో గడిపాడు. 1930 తరువాత ఆయన ప్రసిద్ధి క్రమంగా క్షీణింపసాగింది. ఆయన చేసుకొన్న రెండు వివాహాలూ విడాకులతో విచ్ఛిన్నం అయాయి. అమితంగా మద్యపానం అలవరచుకొన్నాడు. *సింక్లేర్ లీవిస్-ఏన్ అమెరికన్ లైఫ్* (1916) అనే ఆయన జీవిత చరిత్రను మార్క్ షోరర్ రచించాడు.

బొ.శ్రీ.

**లుక్రీషియస్ (క్రీ.పూ. 1 వ శతాబ్ది ప్రాంతం) :** లాటిన్ కవి, దార్శనికుడు. ఆయన రచించిన *డీ రీరమ్ నేచురా* (On the Nature of things) అనే సుదీర్ఘ కావ్యం వలన ఆయన సుప్రసిద్ధులు. గ్రీక్ దార్శనికుడు ఎపిక్యురస్ ప్రవచించిన భౌతిక సిద్ధాంతాన్ని ఈ కావ్యం విపులంగా వర్ణించింది. ఎపిక్యురస్ తాలూకు నైతిక, తార్కిక సిద్ధాంతాల ప్రస్తావన కూడా దీనిలో వస్తుంది.

లుక్రీషియస్ రచించిన ఈ కావ్యం తప్ప ఆయన జీవితాన్ని గురించిన ఇతర విశేషా లేమీ మనకు తెలియవు. ఒక ప్రముఖ లాటిన్ చర్చి ఫాదర్ జెరోమ్ క్రి.పూ. 94 వ సంవత్సరంలో (ఇది 96 కాని 93 కాని కూడా కావచ్చును) వ్రాసి పెట్టుకొన్న డైరీలో లుక్రీషియస్ ఆ సంవత్సరమే జన్మించినట్టూ, తరువాత కొన్నేండ్లకు ఆయన ఒక ప్రేమ రసాయనం సేవించి ఉన్మత్తుడైనట్టూ, ఆ ఉన్మాదం కొంచెం తక్కువగా ఉన్న సమయాలలో గ్రంథరచన చేసినట్టూ, అనంతరం ఆ రచనలను సిసిరో పరిష్కరించినట్టూ, తన 44 వ ఏట (క్రీ.పూ. 51 లో గాని, 50 లోగాని) లూక్రీషియస్

ఆత్మహత్య చేసికొన్నట్టూ పేర్కొన్నాడు.

వ్యాకరణ వేత్త, అలంకార శాస్త్ర బోధకుడు ఈలియస్ డొనేటస్ తాను రచించిన *వర్జిల్ జీవితం* లో వర్జిల్ తన 17 వ పుట్టినరోజు నాడు (అనగా క్రీ.పూ. 54 లేదా 53) వయోజనుని 'టోగా' (ఉడుపు) ధరించినట్టూ, ఆ రోజునే ల్యుక్రీషియస్ మరణించినట్టూ వ్రాశాడు. తన సమకాలికులలో ల్యుక్రీషియస్ మెమియస్‌ని మాత్రమే పేర్కొన్నాడు. అతనికి తన కావ్యాన్ని ఆయన అంకితం ఇచ్చాడు. బహుశః ఆ మెమియస్ క్రీ.పూ. 58 లో 'ప్రేటర్' గా ఉన్న 'సుల్లా' అల్లుడైన గయస్ మెమియస్ అయి ఉండవచ్చు నని భావిస్తున్నారు.

తన *డీ రీరమ్ నేచురా* లో ల్యుక్రీషియస్ తన నాయకుడైన ఎపిక్యురస్ రచించిన *పెరీ ఫిజియోస్* (On Nature) నూ, ఎంపిడోక్లీస్ రచించిన *నీతి శాస్త్రాన్నీ* అనువదించాడు. ల్యుక్రీషియస్‌కి ఎపిక్యురస్ అంటే ఎంత గౌరవమో, ఎంపిడోక్లీస్ అన్నా అంత ప్రశంసా భావం కనిపిస్తుంది.

ల్యుక్రీషియస్ తన కావ్యాన్ని ఆరు ఖండాలుగా విభజించాడు. ప్రతి ఖండం ముందూ ఉదాత్తమైన అవతారిక రచించాడు. మొదటి రెండు ఖండాలలోనూ పరమాణువులతో నిర్మితమైన ఈ విశ్వానికి సంబంధించిన ప్రధాన సూత్రాలను ప్రతిపాదించి, సోక్రటీస్‌కు ముందు ఉన్న తత్త్వవేత్తల వాదాలను ఖండించాడు. మూడవ ఖండంలో ఆత్మ పరమాణువులతో కూడిందనీ, అది నశిస్తుందనీ చెబుతూ 'మృత్యువుకు ఎలాంటి ప్రాధాన్యం లేదు' అంటూ అద్భుతమైన ఉపదేశాన్ని అందజేస్తాడు. నాలుగవ ఖండంలో ఇంద్రియ జ్ఞానానికీ, ఆలోచనలకూ కొన్ని శారీరక ప్రక్రియలకూ సంబంధించిన తాత్త్వికాంశాలను పేర్కొంటూ, లైంగిక ప్రవృత్తిని నిరసిస్తాడు. అయిదవ ఖండంలో సృష్టి, అది పని చేసే తీరు, దేవతా మూర్తులు, మానవ సమాజ క్రమపరిణామం వర్ణిస్తాడు. ఆరవ ఖండంలో భూమ్యాకాశాల తత్త్వాన్ని వివరిస్తూ, ముఖ్యంగా మెరుపు, పిడుగుల తత్త్వాన్ని విశదీకరిస్తాడు. ఈ కావ్యంలో చివర ఏథెన్స్‌లో సంభవించిన ప్లేగ్ జాడ్యపు వర్ణన కూడా ఉంది.

బొ.శ్రీ.

**లుగోనెస్, లియోపోల్డొ (1874-1938) :** అర్జెంటీనా దేశపు కవి, సాహిత్య, సామాజిక విమర్శకుడు, సాంస్కృతిక రాయబారిగా అర్జెంటీనాలో తన కాలం నాటి సాంస్కృతిక జీవన రంగంలో మేరు శిఖరంగా ఇతణ్ణే ప్రజలు గౌరవిస్తారు. జార్జి లూయీ బోర్గెస్ వంటి యువతరానికి చెందిన చిన్న కథల రచయితలు, నవలా రచయితలపై ఇతని ప్రభావం మిక్కుటంగా కనిపిస్తుంది.

లుగోనెస్ మొదట బ్యూనోస్ ఎయిరెస్‌లో సోషలిస్ట్ జర్నలిస్ట్‌గా స్థిరపడ్డాడు. 1897 లో లా మోంటనా (La montana, The mountain) అనే సోషలిస్ట్ పత్రిక స్థాపనకు ఇతడు సహకరించాడు. *నికరాగువన్ రూబెన్ డరయో* అనుయాయులైన ఆధునిక ప్రాయోగిక కవుల (Modernist experimantal poets) బృందంలో ప్రముఖ సభ్యుడయాడు. అతని తొలి కవితా సంపుటి *లాస్ మాంటనీస్ డెల్ ఓరో* ( 1897: Mountains of Gold) రచనను బట్టి ముక్త ఛందస్సులో నూతన కల్పనలకు ఉపయోగించే ఆధునిక లక్ష్యాలపట్ల అతనికి గల మమకారం వ్యక్తమవుతుంది. *లాస్ క్రెపు స్క్యూలోస్ డెల్ జార్డిన్* (1905, Twilights in the Garden), *లునారియో సెంటిమెంటల్* (1909, Sentimental Lunar Almanac) వంటి రచనలలో అతని ఆధునికతా ప్రీతి కొనసాగటం కనిపిస్తుంది.

1911-14 సంవత్సరాల మధ్య లుగోనెస్ పారిస్‌లో *రెవ్యూ సూడ్ అమెరికన్* (Sudamericaine) అనే పత్రికకు ఎడిటర్‌గా పనిచేశాడు. కాని త్వరలోనే మొదటి ప్రపంచ సంగ్రామం మొదలవడంతో అర్జెంటీనాకు తిరిగి వచ్చాడు. అతని రాజకీయ దృష్టిలో చాలా మార్పు వచ్చింది. తీవ్రవాద సోషలిజం నుండి పరిమిత జాతీయత వైపు అతని దృష్టి మళ్లింది. అతని నాటి రచనలో ఆధునికతను విసర్జించి వాస్తవిక శైలిలో జాతీయేతివృత్తాలను రచించడం వైపు అతడు మొగ్గు చూపడం కనిపిస్తుంది. అతని గద్య రచనలు *లాగ్వేరా గౌచా* (1905, The Gaucho War) లో సూచనగా కనిపించిన ఈ మార్పు *ఎల్ లిబ్రొడి లాస్ పైసజేస్* (1917 The Book of Landscapes) అనే రచనలో స్పష్టంగా కనిపిస్తుంది. దీనిలో అర్జెంటీనా గ్రామీణ ప్రాకృతిక సౌందర్యం చక్కగా రూపు కట్టింది. లుగోనెస్ ఇదే జాతీయేతివృత్త స్వీకరణ పద్ధతిని తన గద్యరచనలైన *క్వెంటోస్ ఫటేల్స్* (1924 Tales of Fate) అనే కథానికల సంపుటిలోను, *ఎల్ ఏంజిల్ డిలా సోంబ్రా* (The Angel of the shadow) అనే నవలలోను కొనసాగించాడు.

లుగోనెస్ 1914 నుండి 1938 వరకు జాతీయ విద్యాసమితి (National Council of Education) కి డైరెక్టరుగా ఉన్నాడు. 1924 లో అంతర్జాతీయ సమితికి చెందిన మేధావి సహకార సంఘానికి (Committee on

Intellectual Cooperation the league of Nations) అర్జెంటీనా తరఫున ప్రతినిధిగా పాల్గొన్నాడు. అర్జెంటీనా చరిత్రకు చెందిన అనేక సంపుటాల రచనకు, ప్రాచీన గ్రీక్ సంస్కృతి సాహిత్యాల అధ్యయనానికి, ఇలియడ్, ఒడెస్సీల శ్పానిష్ అనువాదాలకూ కూడా ఇతడు ప్రసిద్ధి చెందాడు.

అంతర్ముఖమైన ఆలోచనా సరణి గల లుగోనెస్ తనను తాను ప్రాథమికంగా కవిగా భావించుకొన్నాడు. కనుకనే ప్రజాజీవనంలో తనకు ప్రాముఖ్యం కలగడం తద్వారా ఎన్నో బాధ్యతలు పెరగడం వలన నిజాయి తీగల వ్యక్తిగా ఎంతో ఇబ్బందికి గురి అయాడు. 1929 లో ఫాసిస్టుగా మారిన లుగోనెస్ తరువాతి కాలంలో భావోత్తేజానికి గురిఅయి, ఆ ఒత్తిడికి తాళలేక 1938 లో ఆత్మహత్య చేసుకొన్నాడు.

జె.సూ.ప్ర.

**లూ హన్ (1881-1936) :** చౌషూజెన్ అనే చీనాకవి కలంపేరు లూ హన్. 20 వ శతాబ్దపు చీనా సాహిత్య కారులలో మేటి. మొదట్లో డాక్టరు అవాలని కోరుకొన్నాడు. కాని 1918 నాటి చీనా సాహిత్యోద్యమంలో పాల్గొని స్నేహితుల బలవంతంపై *ఏ మాడ్ మాన్స్ డైరీ* (A Mad Man's Diary) అనే ప్రసిద్ధ కథానికను ప్రచురించాడు. అదే శీర్షిక గల 'గొగోల్' కథ దీనికి నమూనా. దీనిలో సామాన్య మానవుని వేధించే ఆలోచనలతో కూడిన ప్రాచీన కన్ఫ్యూసియన్ సంస్కృతిని ఒక పిచ్చివాని ఊహలు, చేష్టల ద్వారా దుయ్యబట్టడం జరిగింది. చైనాభాషలో మొదటగా పూర్తి పాశ్చాత్య ప్రభావంతో రచించినది కావడం చేత నైపుణ్య ప్రదర్శనకు మచ్చుతునుక అయి, చిన్నకథ శక్తిమంత మైన భావవాహిక అని నిరూపించి ఇతర రచయితలకు మార్గదర్శకమైంది.

*ది ట్రూ స్టోరీ ఆఫ్ ఆహ్క్యూ* (1921 చీనా భాషలో రచింపడి, 1941 లో *ఆహ్-అండ్ అదర్స్* గా ఆంగ్లంలోకి అనువదించ బడింది. హాస్యం, వ్యంగ్యం రంగరించిన ఆ రచన సనాతన ధోరణులపై తిరుగుబాటు బావుటా ఎత్తింది. ఆధునిక చీనా భాషలో అపజయాన్ని ఆధ్యాత్మిక విజయంగా చిత్రించే భావనా ధోరణిని తెల్పడానికి 'ఆహ్క్విజమ్' అనే పదం రూఢం అయింది. *నా-హన్* (Na-han 1923: Call to Arms) లోని కథలు అతనికి 'మేటి చీనా రచయిత' గా పేరు తెచ్చాయి. *పి-అంగ్ హ్వాంగ్* (Panghung: 1926-Hasitation) ఇతర ప్రతీకాత్మక వచన కవితలు, జ్ఞాపకాలు, తిరిగి చెప్పిన పురాణాలు - ఇవి అన్నీ హాస్యంతో వ్యంగ్యంగా రచించే అతని మార్మికతను తెలియజేస్తాయి.

కల్పనా కథలతో పాటు వచన వ్యాసాల రచయితగా కూడా లూహన్ లబ్ధ ప్రతిష్ఠుడయాడు. జీవితం చివరిదశలో వ్యాసమే అతని ప్రధాన భావవాహిక అయింది. అతని *చాంగ్ కువో హిషియావో, షువోషిహ్, యురేష్* దానితో పాటు అతడు సంపాదకత్వం వహించిన కావ్యాలు ఉన్నత స్థాయి రచనలుగా పేరు పొందాయి. అతని సంపూర్ణ కృతులలో రష్యన్ నుంచి చేసిన అనువాదాలు కూడా ప్రముఖమైనవిగా పేరు పొందాయి.

రాజకీయపు ఒత్తిడుల వలన 1926 లో అతడు పీకింగ్ (Peking) కు పారిపోయి అంతర్జాతీయ నగరం అయిన షాంగై (Shanghai) లో చివరకు రక్షణ పొంది స్థిరపడ్డాడు. చీనా రాజకీయ భవితవ్యం కోసం నిరాశ చెందిన కమ్యూనిస్ట్ ఉద్యమం ఒక్కటే దేశానికి ముక్తి మార్గం అని భావించి 1930 లో ఆ పార్టీ అభిమానిగా మారాడు. తోటి రచయితలను ఆపార్టీ సభ్యులుగా చేర్పించి మరెందరినో పార్టీ సానుభూతిపరులుగా మార్చాడు. నేటి చైనా కమ్యూనిస్ట్ లోకం ఇతనిని ఆదర్శ సోషలిస్ట్ యథార్థవాది (Exemplar of Socialist Realism) గా ప్రశంసించి మరణానంతరం విప్లవవాదిగా గౌరవించింది.

జె.సూ.ప్ర.

**లూకన్ (39-65) :** రోమన్ కవి. 'మార్కస్ అన్నేయస్ లుకానస్' ఇతని పూర్తి పేరు. ఇతడు స్పెయిన్ లోని కోర్డూబా లో 39 లో జన్మించి 65 లో రోమ్‌లో మృతి చెందాడు. ఇతడు పెద్ద సెనేకాకు మనుమడు; చిన్న సెనేకాకు మేనల్లుడు. లూకన్ రోమను రిపబ్లికన్ పార్టీకి చెందిన దేశభక్తుడు. అతని చారిత్రక కావ్యం *ది బెల్లమ్ సివిలీ 'ఫార్సలియా'* అనే పేరుతో ప్రసిద్ధి కెక్కింది. అది దేవతలు కూడా పాల్గొనిన ఫ్రాజిలా యుద్ధాన్ని విశదంగా వర్ణించిన గొప్ప ప్రాచీన లాటిన్ కావ్యం.

లూకన్ గ్రీక్ వేదాంతి కార్నుటస్ వద్ద కొంతకాలం విద్య నభ్యసించి తరువాత ఏథెన్స్‌లో అధ్యయనం కొనసాగించాడు. చిన్న వయస్సులోనే ప్రతిభావంతుడుగాను ఆలంకారిక శైలి గల ఉపన్యాసకుడుగాను ప్రసిద్ధి పొందడంతో ఆనాటి రోమన్ చక్రవర్తి నీరో దృష్టిని ఆకర్షించాడు. కాని అనతికాలంలోనే కవిగా అతడు పొందిన ప్రశస్తి చూచి నీరోకు అసూయ కలిగింది. ఫలితంగా బహిరంగ వేదికల మీద అతడు కవితా గానం చేయకూడ

దని శాసించాడు. అప్పటికే నీరో నిరంకుశత్వానికి విసుగు చెందిన లూకన్ తన కవితా గానాలను నిషేధించటంతో ద్వేషం పెంచుకొని నీరోను హత్య చేయడానికి గయాస్ కల్పూర్నియస్ నడపిన పీసో కుట్రలో ప్రధాన పాత్ర వహించాడు. ఆ కుట్ర భగ్నమై బట్టబయలు అవటంతో తన సిర (రక్త నాళాన్ని) ను ఛేదించుకొని ఆత్మహత్య చేసికోవలసి వచ్చింది.

లభ్యమైన అతని ఏకైక గ్రంథం *ది బెల్లం సివిలి* లో పాంపే, సీజర్‌ల మధ్య యుద్ధాన్ని వర్ణిస్తూ పాంపేను హత్య చేసిన తరువాత సీజరు ఈజిప్టు దేశం చేరిన ఉదంతంతో (10 వ భాగం మధ్యలో) ఆగిపోయింది. లూకన్ గొప్పకవి కాకపోయినా, మిక్కిలి చిన్న వయస్సులో దానిని రచించినా, అతడు వాడిన ఆలంకారిక శైలి, రాజకీయాలు, చరిత్రలో గల అతని నిశిత జ్ఞానం ఆశ్చర్యం గొలుపుతాయి. నాటకీయత లేకపోయినా దీనిలో వర్జిల్ రచనను అనుకరించిన ధోరణి కల్పిస్తుంది. శైలి, పదజాలం సామాన్యమైనవిగా కనిపించి, ఛందస్సు విసుగు కొలిపేదిగా ఉన్నా, ఇందలి అలంకారిక సంపద వల్ల, ఇది వాస్తవమయిన కవిత్వంగా ఎన్నబడింది. 'పాంపే' ను గూర్చి కాటో చేసిన అంతిమ సంస్కార ప్రసంగం (funeral speech) సర్వోత్కృష్ట మైనదిగా భావించబడింది. ఓజస్సు, సూటిగా చెప్పబడిన సూక్తులు, వ్యాఖ్యానాలు ఈ కవితలో పెక్కుచోట్ల చోటు చేసుకొన్నాయి. కావ్యం ముందుకు సాగినకొద్దీ కవి ఆశించిన ప్రజాస్వామిక లక్ష్యం స్పష్టపడుతూ ఉంటుంది. నీరో నిరంకుశత్వం విశృంఖలం అయిన కొద్దీ అతనిపట్ల లూకన్‌కు గల ఏహ్యాభావం, ప్రాచీన రోమన్ ప్రజాస్వామ్యం పట్ల అతనికి గల ఆసక్తి వెల్లడి అవుతాయి. ఈ కావ్యంలో కాటో యే నిజమైన నాయకుడుగా కన్పిస్తాడు. పాంపే పతనం తరువాత కూడా యుద్ధాన్ని కొనసాగించడంలో చూపిన ఉదాత్త ధైర్య స్థైర్యాల్లో లూకన్ ఆత్మీయ గుణమైన గ్రీక్ తాత్త్వికత గోచరిస్తుంది.

మధ్య యుగ సాహిత్యంలో లూకన్ కవిత మిక్కిలి ప్రజాదరణ పొందింది. క్రిస్టొఫర్ మార్లో 1600 వ సంవత్సరంలో *బెల్లం సివిలి* మొదటి సంపుటాన్ని అనువదించాడు. 1718 లో నికొలస్ రోవే చేసిన అనువాదాన్ని చదివిన శామ్యూల్ జాన్సన్ 'ఆంగ్ల పద్య సాహిత్యంలో ఒక అపురూప సృష్టి' అని దానిని ప్రశంసించాడు. పదే, షెల్లీ అనే ఆంగ్ల కవులు తమ తొలి రోజుల్లో వర్జిల్, కాంబే, లూకన్‌లు అంటేనే ఎక్కువ అభిమానం చూపించేవారు. ప్రాచీన రూపక కర్తలు ఈతని ఈ కృతి వలన ఎక్కువగా ప్రభావితులయారు. *ఏ.యి.హౌస్‌మన్* 1926 లో రచించి, 1950 లో పునర్ముద్రించిన *లూకన్* అనే రచన ఈ కవిని గురించి తెలిపే గొప్ప రచనలలో ప్రధానమైనది.

జె.సూ.ప్ర.

**లూయిస్, వైంధ్హామ్ (1882-1957) :** ప్రముఖ ఇంగ్లీష్ కళాకారుడు, రచయిత. 'అబ్‌స్ట్రాక్ట్ వోర్టిసిస్ట్' (Abstract- Vorticist) ఉద్యమ స్థాపకుడు. 1882 నవంబరు 18 న కెనెడాలోని "ఆమ్‌హర్స్" లో జన్మించిన లూయిస్ తన తల్లితో పాటు 1893 లో లండన్ చేరుకొన్నాడు. తన 16 వ యేటనే లండన్‌లోని ఒక ప్రముఖ 'స్లేడ్ స్కూల్ ఆఫ్ ఆర్ట్' (Slade School of Art) లో స్కాలర్‌షిప్ పొందాడు. అయితే ఆ స్కూల్లో కోర్సు పూర్తికాకముందే పారిస్ వెళ్ళి అక్కడ "సోర్బన్" విశ్వవిద్యాలయంలో చేరాడు. అక్కడ అతడు చిత్రకళను అభ్యసించడమే గాక వృత్తిగా కూడా స్వీకరించాడు. 1909 లో లండన్ తిరిగి వచ్చి కథలు వ్రాయడం ఆరంభించాడు. అప్పుడప్పుడు తన చిత్రకళా ప్రదర్శనను కూడా ఏర్పాటు చేస్తూండేవాడు. ఇమేజిస్టు కవితోద్యమం చేత ప్రభావితుడై అనేక పత్రికలలో వ్యాసాలు ప్రచురించాడు.

మొదటి ప్రపంచ యుద్ధకాలంలో ఇతడు ఫిరంగి దళంలో అధికారిగా నియమించబడి ఆ తరువాత ఆర్టిస్ట్‌గా కూడా నియమించబడ్డాడు. ఆ సమయంలో ఇతడు చిత్రించిన యుద్ధ దృశ్యాలు అద్భుత కళా ఖండాలు. 1918 లో *టార్* (Tarr) అనే నవలను ప్రచురించాడు. ఆ తరువాత 1926 వరకు ఏకాంత జీవితం గడపి అద్భుతమైన రచనలు చేశాడు. వాటిలో ముఖ్యమైనవి: *ది ఆర్ట్ ఆఫ్ బీయింగ్ రూల్డ్, టైమ్ అండ్ వెస్టర్న్ మాన్.* వీటిలో మొదటిది రాజకీయ తత్త్వ శాస్త్ర గ్రంథం; రెండవది ఆధునిక కళ గూర్చి వ్రాసిన ఉత్తమ విమర్శ, వీటితోపాటు *ది లయన్ అండ్ ది ఫాక్స్* అనే గ్రంథం కూడా ప్రచురించాడు. దీనిలో 'షేక్స్‌పియర్', 'మాకియవెల్లి' ల గురించిన విమర్శ ఉంది.

1938 లో ఇతడు వేసిన టి.ఎస్. ఎలియట్ చిత్రం పలువురి ప్రశంసలకు పాత్రమైంది. ఆర్థికంగా నిలద్రొక్కుకొనడానికి లూయిస్ 1939 లో భార్యతో కలసి అమెరికా వెళ్లాడు. అక్కడ తన చిత్ర ప్రదర్శనల ద్వారా, ఉపన్యాసాల ద్వారా కొంత సొమ్ము నార్జించి లండన్ తిరిగి వద్దామనుకొన్నాడు. కాని రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభం కావడంతో తిరిగి రాలేక న్యూయార్కు నగరంలో తలదాచుకొన్నాడు.

ఆ తరువాత కెనడా చేరుకొని టొరాంటొలోని ఒక హోటల్లో మూడు సంవత్సరాలపాటు దుర్భర జీవితాన్ని అనుభవించాడు.

మల్లేశం

**లూసియన్ (క్రీ.శ. 120-180) :** ప్రాచీన గ్రీక్ అలంకారికుడు. కరపత్ర రచయిత. వ్యంగ్య రచయిత. *దేవతల సంభాషణలు* (Dialogues of the Gods,) *మృతుల సంభాషణలు* (Dialogues of the Dead) అనేవి ఇతని రచనలు.

స్వీయ రచనలలో ప్రసక్తమైన విషయాలు తప్ప అతనిని గురించి తెలుసుకోడానికి ఇతర ఆధారాలు ఏమీ లేవు. అవి కూడా ఖచ్చితమైనవి అనలేము. అతని జీవిత సంఘటనల ముందు వెనుకలు, రచనల పౌర్వాపర్యం స్పష్టంగా తెలియవు.

తుర్కీలోని నేటి 'సంసత్' అనబడే 'సమాసటా' నగరంలో జన్మించి ఉంటాడని భావన. 72 తరువాత అది రోమన్ సామ్రాజ్యంలో ఒక రాష్ట్రంగా మారిపోయింది. అతని తల్లి వంశం వారు తర తరాలుగా విగ్రహ శిల్పులు. తండ్రి వంశంవారు కూడా కళాకారులే. ధనవంతులు కాకపోయినా జరుగుబాటుకు లోటులేని కుటుంబం. ఆ నాటి నగర రాజకీయాధికారానికి, గ్రీక్ సంస్కృతికి వారు అపరిచితులు. కొన్ని శతాబ్దాలుగా ఉన్నత వర్గాలవారు గ్రీక్ భాష మాట్లాడుతున్నా, సామాన్యులు మాత్రం నగరంలోని అధికారిక భాష 'ఆర్మెయిన్' (Armaine) భాషలోనే మాట్లాడేవారు.

బాల్యంలో లూసియన్ మృత్తికా శిల్పంలో నేర్పరి కావడంతో అతని పినతండ్రి అజమ్మాయిషీలో శిల్పంలో కొంతకాలం శిక్షణ పొందాడు. త్వరలోనే అతనితో తగాదా పడి పశ్చిమాసియా దేశాలు తిరిగాడు. అలా పర్యటించినపుడే గ్రీకు సాహిత్యాన్ని అధ్యయనం చేశాడు. ఆ భాషలో అతడు ఉపన్యసిస్తూ మధ్యలోపాడే పాటలను అంత శ్రద్ధగా ప్రజలు వినేవారు. ఆ భాషలోనే అతడు కోర్టులో విచారణకు పూనుకొనేవాడు ఇటలీ యాత్ర తరువాత ఇటలీ, గాల్ దేశాలలో ఉపన్యసిస్తూ సంచారం చేశాడు. గ్రీక్ ఉపన్యాసాలు వినడానికి ప్రజలు బాగా మోజు పడేవారు. అతని రచనలలో పురాణ ఫక్కీకి చెందినవి ఎక్కువగా ఈ సమయంలో రచింపబడినవే. *ఫాలారిస్* (Phalaris), *ది టీరన్నిసైడ్* (The tyrannicide); *హిప్పియాస్* (Hippias); *ప్రెయిజ్ ఆఫ్ ది ఫ్లై* (Priase of the Fly) వంటి కావ్యాలు; *హిరోడొటస్* (Herodotus), *ది స్కీథియన్* (The scythian) వంటి ఉపక్రమణికలు (Prologues) ప్రధానమైనవి. లూసియన్ తన వృత్తి రీత్యా లభించిన హోదాను చలాయించి తన అనుయాయుల మీద మంచి ప్రభావాన్ని చూపాడు. సెనేటర్లు, గవర్నర్లు అయిన ఆనాటి ప్రముఖ రోమన్ల స్నేహానికి పాత్రుడై ధనం బాగా సంపాదించినా, రాజకీయ ప్రముఖులలో ఒకడు కాలేక పోయాడు. ప్రముఖ సాహిత్య వేత్తలలో ఒకడుగా మాత్రం పేరు పొందాడు. 2 వ శతాబ్ది నడిమి భాగంలో ఏథెన్సులో స్థిరపడ్డాడు. 157 వ సంవత్సరంలో జరిగిన ఒలింపిక్స్ క్రీడలకు వ్యాఖ్యాతగా ఉండే గౌరవం పొందాడు. మేనిప్పస్ అనే సిరియన్ రచయిత ప్రభావానికి లోనై లూసియన్ ఆనాటి మేధావుల జీవితాన్ని గ్రీక్ పౌరాణిక విషయాలను, ఉన్నత వర్గాల వారి వ్యర్థ విలాస జీవనాన్ని విమర్శిస్తూ ఎన్నో వ్యంగ్య రచనలు-గద్య పద్యాత్మకాలు వ్రాశాడు. *నిగ్రినస్* (Nigrinus), *డయలాగ్స్ ఆఫ్ ది కోర్టిజాన్స్, ప్రొమేథియస్, చరాన్, జియస్ కన్ఫ్యూజెడ్, ప్రాజిక్ జియాస్* మొదలైనవి వానిలో ప్రముఖమైనవి.

మంచి వక్తగాను, రచయితగాను ప్రసిద్ధి పొందడమే కాక వీరస్ (Verus) చక్రవర్తి భార్య అయిన రాణి పాంథియాను *ఇమాజినస్* (Imaginies) అనే రచనలో విశేషంగా శ్లాఘించడంతో లూసియస్ వీరస్ దృష్టి నాకర్షించి అతనికి సన్నిహితు డయాడు. 162 లో చక్రవర్తి పార్థియన్సు (Parthians) పై దండెత్తినపుడు ఆంటియోక్, కు అతనిని అనుసరించి వెళ్లాడు. తిరుగు ప్రయాణంలో తన జన్మభూమి సామాసటాకు వచ్చి, అక్కడ తన అభిమానులకు తన జీవిత విశేషాలను వివరించాడు. అదే *ది డ్రీమ్ లేక ది విజన్* (The Dream or The Vision). అచటి రాజకీయ వాతావరణం భయానకం అవడంతో తండ్రితో కలసి ఏథెన్సు ప్రయాణం అయాడు. దారిలో అలెగ్జాండర్ ది పఫ్లగోనియన్ అనే ఇంద్రజాలికునితో స్నేహం కలిపి *అలెగ్జాండర్ లేక ది ఫాల్స్ ప్రొఫెట్* అనే రచనలో అతనిని చక్కగా చిత్రించాడు. మరియొక సహ యాత్రికుడు సైనిక తత్త్వవేత్త అయిన పెరిగ్రినస్‌తో పరిచయం కలిగింది. అతడు 165 లో జరిగిన ఒలింపిక్స్ క్రీడల సందర్భంలో ఆత్మహత్య చేసికొన్నాడు. లూసియస్ ఈ సంఘటనను *డెత్ ఆఫ్ పెరిగ్రినస్* లో చిత్రించాడు. 169 ఒలింపిక్స్ క్రీడలకు వెళ్లేనాటికి అతడు *డెమన్, ది అసెంబ్లీ ఆఫ్ ది గాడ్స్, ట్వైస్ ఎక్యూస్‌డ్ ది ఆక్షన్ ఆఫ్ లైవ్స్; హౌ టు రైట్ హిస్టరీ* వంటి

రచనలు చేశాడు. కాని అతని తీవ్ర వ్యంగ్య ధోరణి కారణంగా అతనికి చాలామంది శత్రువులు అయారు.

170-175 మధ్య లూసియన్ అలెగ్జాండ్రియా కు ఆర్చిస్టేటర్‌గా నియమితుడయాడు. (అది సెనేట ర్‌కు కొంచెం తక్కువైన హోదా). కాని, వృద్ధుడైన లూసియన్ దానిని స్వీకరించలేదు. ఈజిప్ట్‌లో ఉన్నపుడే *అపాలజీ ఆన్ హిజ్ ఫెయిల్యూర్ టు గివ్ గ్రీటింగ్స్*, మరి కొన్ని ఇతర కృతులు రచించాడు. తరువాత ఏథెన్సుకు తిరిగి వచ్చి బహిరంగ వక్తగా కొనసాగుతూ, *లెక్సీ ఫేన్స్ ది యూనక్ ది ఫాల్స్ సోఫిస్ట్*, హెర్క్యులెస్ మొదలైన కృతులు రచించాడు. ఆలస్యంగా వివాహితుడైన ఇతనికి చిరకాలానికి ఒక పుత్రుడు కలిగాడు.

ఒక అజ్ఞాత సంగ్రాహకుడు కూర్చిన వ్రాతప్రతియే లూసియన్ కృతులకు మొదటి మాతృక. వానిలో ప్రాచీన తమమైనది 913 నాటిది. సుమారు 83 కృతులు అతనివిగా పరిగణింపబడుతున్నాయి. సమకాలీన సాహిత్యంలోని లోపాలు, అవకతవకలు ఎత్తి చూపే స్వభావం అతని రచనలలో ఎక్కువగా కనిపిస్తుంది. అయితే లోపాలను ఎత్తిచూపి ఎద్దేవా చేయడమే గాని వానిని సరిదిద్దే సలహాలు ఇవ్వని కారణంగా అతని సాహిత్యం ఉదాత్తమైనదిగా భావింపబడలేదు.

తరువాత రోమన్ సామ్రాజ్యంలో వచ్చిన 'బైజాన్ టైన్' యుగ రచయితలకు లూసియన్ కావ్యశైలి ఆదర్శప్రాయమైంది. లూసియన్ ప్రభావం తరువాతి యూరోపియన్ వ్యంగ్య రచయితలు జొనాథన్ స్విఫ్ట్ హెన్రీ ఫీల్డింగ్ (Henry Fielding), క్రైరెనో-డి-బెర్జె రాక్ వోల్టేర్, జ్యాకోమో లియోపార్డి మొదలైన వారిపై మిక్కుటంగా పడింది.

జె.సూ.ప్ర.

**లెయ్‌టన్, ఇర్వింగ్ (1912--)** : కెనడా దేశానికి చెందిన గొప్పకవి. 1912 మార్చి 12న లెయ్‌టన్ రోమ్‌లో జన్మించాడు. అతని కుటుంబం మరుసటి సంవత్సరమే కెనడాకు వలసపోయి, అక్కడే స్థిరపడ్డారు. ఇతని విద్యాభ్యాసమంతా కెనడాలోనే సాగింది. 1939 లో ఇతడు వ్యవసాయ శాస్త్రంలో డిగ్రీ పుచ్చుకొన్నాడు. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ఇతడు కెనేడియన్ ఎయిర్‌ఫోర్స్‌లో పనిచేశాడు. యుద్ధానంతరం మాంట్రియల్‌లో లెక్చరర్‌గా పనిచేశాడు. ఆ తరువాత కొంత కాలానికి టొరంటోలోని యార్క్ విశ్వవిద్యాలయంలో ఆంగ్ల సాహిత్య విభాగంలో ప్రొఫెసర్‌గా పనిచేశాడు.

లెయ్‌టన్ కవిత్వంలో కాల్పనిక ధోరణి ప్రముఖంగా కనిపిస్తుంది. 1945 లో ఇతడు ప్రకటించిన *హియర్ అండ్ నౌ* అనేది ఇతని తొలి కవితా సంకలనం. దీనిలోని వన్నీ లిరికల్ భావగీతాలు. రొమాంటిక్ కవిత్వ ప్రభావంచే వ్రాయబడ్డ ఇతని కవితలు స్పష్టంగా, స్వచ్ఛంగా, పాఠకుల హృదయాలకు హత్తుకునేవిగా ఉంటాయి. ఆ తరువాత 1948 లో *నౌ ఈజ్ ది ప్లేస్* అనే మరొక సంకలనాన్ని ప్రచురించాడు. అనంతరం 1954 లో *ఇన్ ది మిడ్‌స్ట్ ఆఫ్ మై ఫీయర్*, 1955 లో *ది కోల్డ్ గ్రీన్ ఎలిమెంట్* (The Cold Green Element) అనే సంకలనాలను ప్రచురించాడు. బూర్జ్వా వ్యవస్థపై ఇతనికి గల ద్వేషం వీటిలో స్పష్టంగా కనిపిస్తుంది. ఇతని ఇతర రచనలలో ముఖ్యమైనవి *ది స్విమ్మింగ్ ఫ్లెష్* (1961), *బాల్స్ ఫర్ ఏ వన్ ఆర్మ్‌డ్ జగ్లర్* (1963), *ఫర్ ఐ బ్రదర్ జెసూట్స్* (1976), *ఫర్ మై నైబర్స్ ఇన్ హెల్* (1980), *కలెక్టెడ్ పొయెమ్స్* (1965).

మల్లేశం

**లెర్‌మాంటోవ్, మిఖాయెల్ (1814-41)** : ప్రముఖ రష్యన్ కవి, రచయిత. 1814 అక్టోబర్ 15 న మాస్కోలో జన్మించిన లెర్ మాంటొవ్ ఒక రిటైర్డ్ ఆర్మీ కెప్టెన్ కుమారుడు. తన మూడవ ఏటనే తల్లిని కోల్పోవడంతో 'పెంజన్‌స్కాయా' రాష్ట్రంలోని ఒక ఎస్టేటుకు వారసురాలైన తన మాతామహి సంరక్షణలో పెరిగాడు. అక్కడి గ్రామీణ వాతావరణం ఇతనిపై ప్రగాఢ ప్రభావం చూపింది. అక్కడి ప్రకృతి రామణీయకం, జానపద గేయాలు, గాథలు, అక్కడి ప్రజల ఆచార వ్యవహారాలు ఇతనిని బాగా ఆకట్టుకొన్నాయి.

1827 లో తన ముత్తవతో పాటు లెర్‌మాంటోవ్ కూడా మాస్కోకు మకాం మార్చాడు. అక్కడ ఒక బోర్డింగ్ స్కూల్లో చేరి చిత్రకళను అభ్యసించాడు. ఇదే కాలంలో అతడు కవిత్వ రచనకు శ్రీకారం చుట్టాడు. ప్రముఖ ఇంగ్లీష్ కాల్పనిక కవి లార్డ్ బైరన్ కవిత్వం చేత ప్రభావితుడై ఆ ప్రభావంతో 1828 లో *సర్కాసియన్స్*, *ప్రిజనర్ ఆఫ్ ది కాకసస్* అనే రెండు కవితా ఖండికలను ప్రచురించాడు. ఆ తరువాత రెండు సంవత్సరాలకు *స్ప్రింగ్* అనే మరొక కవితను ప్రచురించాడు. అదే సంవత్సరంలో మాస్కో విశ్వవిద్యాలయంలో చేరాడు. అక్కడ అనేక అభ్యుదయ వాదులతో ఇతనికి పరిచయ మేర్పడి, వారి ద్వారా ఇతనికి సంక్రమించిన నూతన ప్రగతిశీల భావజాల ప్రభావంతో *ఏ స్ట్రేంజ్ మాన్* అనే నాటకాన్ని రచించాడు.

ఆ నాటి జార్ చక్రవర్తుల నిరంకుశత్వాన్ని, వ్యవసాయ కూలీలపై భూస్వాముల పెత్తనాన్ని దుయ్య బడుతూ రచించిన ఈ నాటకం ఆ నాటి యువకులలో విశేష ప్రచారాన్ని పొందింది. 1832 లో ఒక ప్రొఫెసర్‌తో అభిప్రాయభేదం రావడంతో మాస్కో విశ్వవిద్యాలయం వదలి పెట్టి 'సెయింట్ పీటర్స్ బర్గ్' కు వెళ్ళి అక్కడ ఒక కాడెట్ స్కూల్లో చేరాడు.

1837 లో మహాకవి పుష్కిన్ మరణం ఇతని హృదయాన్ని బాగా కలచివేసింది. దానితో పుష్కిన్ మరణంపై ఒక గొప్ప విలాపగీతాన్ని రచించాడు. పుష్కిన్ మరణానికి కారకులైన ఆనాటి రాజు మొదటి 'నికొలస్', అతని ఆస్థానంలోని కొందరు ఉన్నతాధికారులపై ఈ కావ్యంలో పరోక్ష విమర్శ ఉండటం వలన ఇతడు శిక్షిం పబడి, కాకసస్ ప్రాంతంలో ప్రవాస జీవితం గడిపాడు. అయితే కొంత కాలం తరువాత ఇతని ముత్తవ పలుకుబడితో తిరిగి వచ్చి, అనేక కవితలు భావగీతాలు (Lyrical Poems) వ్రాశాడు. *సష్కా* (Sashka: 1839), *రోడినా* (Rodina) వంటి అనేక ఉత్తమ కావ్యాలను రచించి పుష్కిన్ వారసునిగా గొప్ప పేరు తెచ్చుకొన్నాడు. తన ప్రతిభా విశేషాల చేత టాల్‌స్టాయ్, డోస్టవ్‌స్కీ, మయకోవ్‌స్కీ ల వంటి గొప్ప రచయితలకు స్ఫూర్తి నిచ్చిన లెర్‌మాంటోవ్ 1841 జూలై 27 న ఒక ఆర్మీ ఆఫీస్‌లో జరిగిన ద్వంద్వ యుద్ధంలో మరణించాడు.

మల్లేశం

**లెవీ, కార్లో (1902-75)** : ఇటాలియన్ రచయిత, చిత్రకారుడు, రాజకీయ జర్నలిస్టు, 1902 నవంబరు 29 న ఇటలీలోని "ట్యూరిన్" లో జన్మించిన లెవీ మొదట్లో వైద్య వృత్తి స్వీకరించాడు. అయితే అప్పుడప్పుడు చిత్రాలు కూడా వేస్తూ ఉండేవాడు. ఇతడు ఫాసిజంను తీవ్రంగా వ్యతిరేకించాడు. తత్ఫలితంగా ఇతనిని లూకానియా జిల్లాకు రాజకీయ ఖైదీగా పంపారు. 1936 లో ఇతడు విడుదలఅయాడు. ఆ తరువాత 1945 లో ఇతడు ప్రచురించిన *క్రైస్ట్ స్టాప్డ్ ఎట్ ఇబోలీ* అనే గ్రంథం ఇతని రచనలన్నింటిలోకి మకుటాయమానమైనది. అది త్వరలోనే దేశ మంతటా ప్రాచుర్యంలోకి వచ్చి ఎన్నో భాషలలోకి అనువదించబడింది. 1947 లో ఇతడు *ఆఫ్ ఫియర్ అండ్ ఫ్రీడమ్* అనే మరొక గ్రంథాన్ని ప్రచురించాడు. దీనిలో భావస్వాతంత్ర్యం యొక్క ఆవశ్యకతను గూర్చి నొక్కి చెప్పాడు.

1950 లో ఇతడు రచించిన *ది వాచ్* అనే గ్రంథంలో రోమ్‌లో యుద్ధానంతరం ఏర్పడిన మంత్రివర్గ క్లిష్ట పరిస్థితిని వర్ణించాడు. ఇతడు 1959 లో రచించిన *ది లిండెన్ ట్రీస్* అనే గ్రంథంలో యుద్ధానంతరం జర్మనీని వర్ణించాడు. ఇవే కాక ఇతడు వివిధ పత్రికలలో ఎన్నో వ్యాసాలు, విమర్శలు ప్రకటించాడు. ఒక పత్రిక కూడా నిర్వహించాడు. ఇటాలియన్ సాహిత్య చరిత్రలో ఒక ప్రముఖ స్థానాన్ని నిలబెట్టుకొన్న లెవీ జనవరి 1975 4 న లో రోమ్ నగరంలో మరణించాడు.

మల్లేశం

**లెస్సింగ్, గోట్ హోల్డ్ (1729-81)** : జర్మన్ నాటకకర్త, విమర్శకుడు. 1729 జనవరి 22 న జర్మనీలోని 'కామెంజ్' అను ప్రదేశంలో జన్మించిన లెస్సింగ్ లైప్‌ట్సిగ్ (Leipzig) విశ్వవిద్యాలయంలో మత ధర్మశాస్త్రాన్ని, వైద్య శాస్త్రాన్ని అభ్యసించాడు. 1748 లో ఇతడు బెర్లిన్ నగరం వెళ్లి అక్కడ 'విటెన్‌బర్గ్' విశ్వవిద్యాలయంలో ఎం.ఏ పట్టా పుచ్చుకొన్నాడు. ఇతడు కొన్నాళ్లు జర్నలిస్టుగా, అనువాదకుడుగా వివిధ ప్రాంతాలలో పనిచేశాడు. అయితే బైబిల్ క్రిస్టియన్ మతానికి మూలగ్రంథం కాదు అనే అతని అభిప్రాయం వివాదాస్పద విషయమై చాలా కాలం అనేక వాగ్వివాదాలకు దారితీసింది.

ఇతడు ఎన్నో అధిక్షేప నాటకాలు రచించాడు. 1747 లో ఇతడు ప్రచురించిన *ది యంగ్ స్కాలర్* (The Young Scholar) అనే నాటకం చాలా ప్రసిద్ధి చెందింది. 1749 లో *ది జ్యూస్* అనే మరొక ప్రసిద్ధ నాటకాన్ని ప్రచురించాడు. దీనిలో మత సహనాన్ని గురించి సుదీర్ఘంగా చర్చించడమే కాక, మనిషిని బాహ్య రూపాన్ని బట్టి గాక అంతర్గతమైన వ్యక్తిత్వాన్ని బట్టి గౌరవించాలని ఈ నాటకంలో అతడు ప్రకటించాడు. అదే సంవత్సరంలో *ఫ్రీ థింకర్* అనే మరొక నాటకాన్ని రచించాడు. ధర్మబద్ధమైన జీవితమే మతానికి హృదయం అని ఈ నాటకం ద్వారా నొక్కి చెప్పాడు.

1767 లో *మిన్నా* అనే ఒక హాస్య నాటకాన్ని రచించాడు. జర్మను సాహిత్య చరిత్రలో ఇది ఒక గొప్ప సంప్రదాయ బద్ధమైన హాస్య నాటకంగా పేరు గాంచింది. ప్రసిద్ధ జర్మన్ కవి 'గొయిథే' కూడా దీనిని చాలా ప్రశంసించాడు. *ఎమీలియా* (Emilia, 1772), *నాథన్* (1779) వంటి ఎన్నో ఇతర నాటకాలు కూడా రచించిన లెస్సింగ్ తన జీవితం చివరి రోజులలో ఒంటరిగా గడపి దుర్భర దారిద్ర్యంతో 1781 ఫిబ్రవరి 15 న కన్నుమూశాడు.

మల్లేశం

**లోపెజ్ - ఇ - ఫుయెంటెస్, గ్రెగోరియా (1895-1966)** : ప్రఖ్యాత మెక్సికన్ నవలా రచయిత. 1895 నవంబరు 17 న మెక్సికోలోని హాస్టికా అనే ప్రదేశంలో జన్మించిన లోపెజ్ తన బాల్యమంతా తన తండ్రి నడపే కిరాణా కొట్టులో గడిపాడు. ఆ రోజులలో ఇతనికి రక రకాల వ్యక్తులతో పరిచయ మేర్పడింది. ఆ కిరణా కొట్టుకు ముఖ్యంగా రైతులు, కూలీలు ఇంకా ఇతర బడుగు వర్గాల వాళ్లు ఎక్కువగా వచ్చేవారు. అందువల్ల వారి జీవితాలను క్షుణ్ణంగా పరిశీలించే అవకాశం ఇతనికి కలిగింది. ఆ తరువాత కొంతకాలానికి కవిత్వం వ్రాశాడు. కాని అందులో రాణించలేకపోయాడు. అనంతరం నవలా రచనకు ఉపక్రమించాడు.

1937 లో *ఎన్‌క్యాంప్‌మెంట్* అనే అద్భుతమైన నవలను రచించాడు. మెక్సికో విప్లవం ప్రధానేతివృత్తంగా కలిగిన ఈ నవల మెక్సికన్ నవలా సాహితీ చరిత్రలో ఒక మైలురాయి. ఆ తరువాత 1932 లో *ఎర్త్* అనే మరొక నవల ప్రచురించాడు. ఇది మెక్సికన్ విప్లవకారుడైన ఎమిలియాన్ జపాటి జీవితగాథ. 1934 లో *మై జనరల్* అనే మరొక నవలను ప్రచురించాడు. ఇందులోని ప్రధాన ఇతివృత్తం విప్లవానంతరకాలంలో మిలిటరీ జనరల్స్ గడపిన జీవితం. ఇవే కాక మెక్సికన్-ఇండియన్‌ల జీవన విధానాన్ని గురించి తెలియజేసే ఒక మహత్తర గ్రంథాన్ని 1935 లో *ఎల్ ఇండియా* అనే పేరుతో ప్రచురించాడు. మెక్సికో నవలా సాహితీ చరిత్రలో ప్రముఖ స్థానాన్ని ఆక్రమించిన లోపెజ్ 1966 డిసెంబర్ 10 న మెక్సికో నగరంలో మరణించాడు.

మల్లేశం

**లోమోన్‌సోవ్, మిఖాయిల్ వాసిల్యేవిచ్ (1711-65)** : రష్యన్ కవి, వ్యాసకర్త. గొప్ప విజ్ఞాన శాస్త్రవేత్త, గొప్ప భాషా సంస్కర్త. రష్యాలో ఇతడు ఎన్నో ప్రముఖ సంస్థలను స్థాపించాడు. సెయింట్ పీటర్స్ బర్గ్‌లోని ఇంపీరియల్ ఎకాడమీ ఆఫ్ సైన్సెస్‌ను ఇతడు పునర్వ్యవస్థీకరించాడు. మాస్కో విశ్వవిద్యాలయ సంస్థాపకుడు కూడా ఇతడే!

1711 నవంబర్ 19 న రష్యాలోని కోల్‌మొగరి అనే ప్రదేశంలో ఒక బెస్త కుటుంబంలో లోమోన్‌సోవ్ జన్మించాడు. ఇతని తండ్రితో పాటు ఇతడు కూడా చేపలు పట్టేవాడు. అయినప్పటికీ ఇతనికి జ్ఞాన తృష్ణ ఎక్కువ. దొరకి నన్ని పుస్తకాలు చదివేవాడు. అయితే ఇతని తృష్ణను తీర్చగలిగినన్ని సదుపాయాలు ఆ ఊరిలో లేకపోవడం వలన 1730 డిసెంబరులో వారి ఊరు వదలి పెట్టి మాస్కోకు వెళ్ళాడు. ప్రయాణానికి డబ్బులు కూడా లేవు. అయినా నిరాశ చెందక కాలినడకను వెళ్ళాడు. ఇతని ముఖ్య ఆశయం ఏమిటంటే ఉన్నత విద్య నభ్యసించి తాను కూడా మేధావుల వర్గంలో చేరడం. ఆ ఆశయ సాధన కొరకు అతడు మాస్కోలోని ఒక ఎకాడమీలో చేరాడు. తిండి కూడ సరిగ్గా దొరకనప్పటికీ చదువుపై శ్రద్ధ మాత్రం తగ్గలేదు. ఎనిమిది సంవత్సరాలలో పూర్తి చేయవలసిన కోర్సును అయిదు సంవత్సరాలలోనే పూర్తి చేసి తన అధ్యాపకుల చేత మెప్పు పొందాడు. కొంతకాలం తరువాత జర్మనీకి వెళ్ళి మార్బర్గ్ విశ్వవిద్యాలయంలో చేరాడు.

అక్కడ పాశ్చాత్య తత్త్వశాస్త్రాన్నీ, విజ్ఞాన శాస్త్రాన్నీ అధ్యయనం చేశాడు. ఆ తరువాత కొంత కాలానికి రష్యా తిరిగి వచ్చి కవిత్వ రచన చేశాడు. అప్పటి రాణి ఎలిజబెత్ పై కొన్ని *ఓడ్స్* రచించాడు. వీటితో పాటు ఎన్నో విజ్ఞాన శాస్త్ర గ్రంథాలను కూడా లాటిన్ నుండి రష్యన్ భాషలోకి అనువదించాడు. ఇతనికి ఎన్నో సన్మానాలు, అవార్డులు లభించాయి. అయినప్పటికీ 1765 ఏప్రిల్ 15 న ఇతడు మరణించేవరకు అతిసామాన్యమైన జీవితాన్నే గడపాడు.

మల్లేశం

**లోవెల్, జేమ్స్ రసెల్ (1819-91)** : ప్రముఖ అమెరికన్ కవి, విమర్శకుడు, దౌత్యవేత్త. న్యూ ఇంగ్లండ్‌కు చెందిన ఒక ప్రముఖ కుటుంబంలో 1819 ఫిబ్రవరి 22 న జన్మించిన లోవెల్ హార్వర్డ్ యూనివర్శిటీలో విద్య నభ్యసించాడు. 1840 లో న్యాయశాస్త్రంలో పట్టా పుచ్చుకొన్నాడు. 1845 నుండి 1850 మధ్య కాలంలో బానిసత్వ నిర్మూలనకు మద్దతుగా వివిధ పత్రికలలో దాదాపు 50 వ్యాసాలు ప్రచురించాడు. ఇవి ఇతనికి విశేష ఖ్యాతిని ఆర్జించి పెట్టాయి. వీటికంటె ఇంకా ముఖ్యమైనవి ఇతడు ప్రచురించిన *బిగ్‌లో పేపర్స్* (Biglow Papers). న్యూ ఇంగ్లండ్ మాండలికంలో సాగిన ఈ గ్రంథ మెక్సికన్ యుద్ధంపై చక్కని వ్యంగ్య రచన.

చిన్నప్పటి నుండి ఇతడు హాస్యప్రియుడు. కవిత్వమంటే ఇతనికి అభిరుచి ఎక్కువ. ఇతడు గొప్ప వక్త కూడా. తన ఉపన్యాసాలచే శ్రోతలను ముగ్ధులను చేసే వాడు. 1855 లో ఇతడు లోవెల్ ఇనిస్టిట్యూట్‌లో ఆంగ్ల కవిత్వంపై ఇచ్చిన ఉపన్యాసాలు బహుళ ప్రజాదరణ పొందటం వలన రోజుకు రెండు సార్లు ఇవ్వవలసి వచ్చింది. తద్వారా వ్యాపించిన ఇతని కీర్తి

'హార్వర్డ్' యూనివర్శిటీలో ప్రొఫెసర్‌షిప్‌ను ఆర్జించి పెట్టింది. ఆ తరువాత కొంతకాలం జర్మనీ, ఇటలీ దేశాలను సందర్శించిన తరువాత 1856 లో తిరిగి అమెరికాకు వచ్చాడు. అనంతరం అట్లాంటిక్ మంత్‌లీకి, సంపాదకత్వం వహించి ప్రముఖ వ్యాసాలు ప్రచురించాడు. ఇతడు రాజకీయాలలో కూడా మంచి దిట్ట. స్పెయిన్‌లో మూడు సంవత్సరాలపాటు, బ్రిటన్‌లో ఐదు సంవత్సరాలపాటు అమెరికా తరపున రాయబారిగా నియమింపబడ్డాడు. ఇంగ్లండ్‌లో రాయబారిగా ఉన్నపుడు వర్డ్స్‌వర్త్ సొసైటీకి ప్రెసిడెంట్‌గా ఉండి, ఆ సంస్థకు ఎంతో సేవ చేశాడు. ఇతడు ఇంగ్లండ్‌లో ప్రజాస్వామ్యంపై ఇచ్చిన ఉపన్యాసాలు చాలా ప్రసిద్ధి పొందాయి. ఆ తరువాత ఇతడు అమెరికాకు తిరిగి వచ్చాడు.

లోవెల్ రచించిన కావ్యాలలో ప్రముఖమైనవి: *విజన్ ఆఫ్ సర్ లాన్‌ఫాల్* (రెండు రోజులు నిద్రాహారాలు మాని ఈ సుదీర్ఘ కావ్యాన్ని రచించాడు. తత్ఫలితంగా అతని ఆరోగ్యం దెబ్బతిన్నది), *ఎమాంగ్ మై బుక్స్* (సాహిత్య విమర్శక వ్యాసాలు 1870), *మై స్టడీ విండోస్* (1871). కవిగా ఇతని ఖ్యాతి ముఖ్యంగా *బిగ్‌లో పేపర్స్* పై ఆధారపడి ఉంది. అబ్రహంలింకన్, వాషింగ్టన్‌ల మీద ఇతడు వ్రాసిన పద్యాలు రసవత్తరమైనవి. జాతీయతను, కళాభిరుచిని, హాస్యరసాన్ని సమ్మేళనం చేయడంలో అమెరికన్ కవులలో ఇతనిని పోలినవారు లేరు. కాల్‌రిడ్జ్, డాంటే, షేక్స్‌పియర్‌లపై ఇతడు వ్రాసిన విమర్శనా వ్యాసాలు ఇతని బహుముఖ పాండిత్యాన్ని చాటుతున్నాయి. కవిగా, విమర్శకుడుగా, దౌత్యవేత్తగా పలువురి మన్ననలను పొందడమే కాక 'బ్యారెట్ వెండెల్', 'జార్జ్ వుడ్ బెరీ', 'ఎడ్మండ్ స్టెడ్‌మాన్' ల వంటి గొప్ప శిష్యులను తయారు చేసిన లోవెల్ 1891 ఆగస్టు 12 న కేంబ్రిడ్జ్‌లో మరణించాడు.

మల్లేశం

**లోవెల్, రాబర్ట్ జూనియర్ (1917-77)** : ప్రఖ్యాత అమెరికన్ కవి. 1917 మార్చి 1 న "బోస్టన్" లో జన్మించిన రాబర్ట్ లోవెల్ పండిత వంశానికి చెందినవాడు. ఇతడు ఎడ్వర్డ్ విశ్వవిద్యాలయంలో కొంతకాలం విద్యాభ్యాసం చేసి తరువాత లోహియో లోని కెన్యన్ కాలేజికి వెళ్ళాడు. అక్కడ ప్రముఖ విమర్శకుడైన 'జాన్ క్రీరానేసమ్' శిష్యుడయాడు. 1940 లో అక్కడే పట్టా పుచ్చుకొని 'జేన్ శ్టాఫర్డ్' (Jean stafford) అనే నవలా రచయిత్రిని వివాహమాడాడు. కాని వీరి వివాహం చాలాకాలం నిలువలేదు. 1948 లో ఆమెకు విడాకు లిచ్చాడు. మరుసటి సంవత్సరమే 'ఎలిజబెత్ హార్ట్‌విక్' అనే ప్రఖ్యాత రచయిత్రిని, విమర్శకురాలిని వివాహమాడాడు. 1972 లో ఈమెకు కూడా విడాకులిచ్చాడు.

నిర్దుష్టమైన తన రాజకీయ అభిప్రాయాల వలన లోవెల్ రెండవ ప్రపంచ యుద్ధకాలంలో కారాగార శిక్షకు గురి అయాడు. *ఇన్ ది కేజ్*అనే కవిత ఇతని రచనలలో ప్రముఖమైంది. —కారాగారంలో ఇతడు పొందిన అనుభవాలను ఇందులో చక్కగా వర్ణించాడు. ఇతని తొలి కవితా సంకలనం *లార్డ్ ఆఫ్ అన్‌లైక్‌నెస్* 1944 లో ప్రచురించబడింది. సంక్షోభంలో కొట్టుమిట్టాడుతున్న ప్రపంచాన్ని, ప్రజల్లోని వివిధ రకాల వైరుధ్యాలను ఇందులో ప్రతిభావంతంగా అతడు వర్ణించాడు. ఆధ్యాత్మిక రక్షణకోసం తహతహ లాడుతున్న మానవాళి ఆవేదనను కూడా ఇందులో చక్కగా వివరించాడు. 1946 లో *లార్డ్ వియరీస్ క్యాజిల్* అనే మరొక కవితా సంకలనాన్ని ప్రచురించాడు. ఇతనికి బాగా ఖ్యాతి నార్జించి పెట్టిన *ది క్వేకర్ గ్రేవ్‌యార్డ్* అనే శోకగీతం ఈ కవితా సంకలంలోనిదే. ఇతడు కొంతకాలం పౌరహక్కుల సంఘంలో చురుకుగా పనిచేసి యుద్ధానికి వ్యతిరేకంగా ఉద్యమం నడిపాడు. *ఫర్ ది యూనియన్ అండ్ డెడ్* (1964), *నియర్ ది ఓషన్* (1967), *నోట్‌బుక్* (1968) అనేవి ఇతని ప్రఖ్యాత నాటక త్రయం. ఇవి పౌరహక్కుల ఉద్యమస్ఫూర్తితో చేసిన రచనలు. *ది ఓల్డ్ గ్లోరీ* (1965) అనే గ్రంథంలో ఇతడు తర తరాల అమెరికా దేశపు సంస్కృతిని సవివరంగా విశదీకరించాడు. వీటితోపాటు అనేక ఇతర అనువాదాలు, అనుసరణలు చేసిన లోవెల్ 1977 సెప్టెంబరు 12 న న్యూయార్కు నగరంలో కన్నుమూశాడు.



ఉమారాణి

**వర్గాస్ లోసా, మరియో (1936--)** : పెరూ దేశపు నవలా రచయిత, నాటకరచయిత. వర్గాస్‌లోసా పెరూ దేశంలోని ఆరెక్విపాలో 1936 మార్చి 28 న జన్మించాడు. సాంఘిక పరిణామాన్ని అపేక్షించిన ఈ

ఆశయం రచయిత తన నవలలు, నాటికలు, వ్యాసాలు అన్నిటిలోను ప్రతిఫలిస్తుంది.

వర్గాస్ తాతగారు బొలీనియాలో పెరూ దేశపు రాయబారిగా ఉండడం వల్ల ఇతని ప్రాథమిక విద్యాభ్యాసం బొలీవియా దేశంలోని కొచాబాంబాలో జరిగింది. తరువాతి కాలంలో పెరూలోని విద్యాలయాలలోనే అతని విద్యాభ్యాసం కొనసాగింది. 1950 లో లీమాలోని లియోన్సిమో ప్రాడో అనే సైనిక పాఠశాలలో చేరి అతడు చదువుకొన్నాడు.

వర్గాస్ మొదటి రచన *లాహుయిడా డెల్ ఇంకా* (1952, The Escape of the Inca) అనే ఒక మూడం కాల నాటకం. ఇది ప్రచురించబడిన తరువాత అతని కథలు పెరూ సాహిత్య సమీక్షలలో చోటుచేసుకున్నాయి. 1956-57 లో *కువాడెర్నోస్ డి కాంపోసిషన్* (Composition Book) అనే గ్రంథానికీ, 1958-59 లో *లిటరేటురా* అనే గ్రంథానికీ సహసంపాదకత్వం నెరపాడు. పాత్రికేయుడుగానూ, ఇతడు రేడియో ప్రసారకుడుగానూ పనిచేశాడు. మాడ్రిడ్ విశ్వవిద్యాలయానికి వెళ్లాడు. 1959 వ సంవత్సరంలో పారిస్‌కు వెళ్లి, 1966 వరకూ అక్కడ నివసించాడు.

వర్గాస్ లోసా తొలి నవల *లాసియుడడ్ వై లోస్ పెర్రోస్* (1963, The City and the Dogs, 1963) పాఠకులను విశేషంగా ఆకర్షించింది. దాదాపు పన్నెండు భాషల్లోకి ఈ నవల అనువదించబడింది. లియోన్సియో ప్రాడో మిలటరీ స్కూలు నేపథ్యంగా గల ఈ నవలలో హింసాత్మక వాతావరణంలో మనుగడకోసం పోరాడే 20 ఏళ్లలోపు పిల్లల మానసిక క్షోభ వర్ణించబడింది. మిలిటరీ స్కూల్‌లోని అవినీతికి పెరూ దేశాన్ని పీడిస్తున్న సామాజిక రుగ్మతలకు అద్దం పట్టే ఈ నవల వర్గాస్‌కు కీర్తి చేకూర్చింది.

1966 లో వ్రాసిన *లాకాసా వర్డె* (The Green House, 1968) కు పెరూ దేశపు అటవీ ప్రాంతం రంగస్థలం. తరువాతి నవల *లాస్ కాకొరోస్* (1967; The Cubs and Other Stories, 1979) లో ప్రమాద వశాత్తు పురుషత్వం తొలగించబడిన ఒక యువకుని మానసిక విశ్లేషణ ఉంది. మరొక నవల *కాన్వర్‌సేషన్ ఎన్ లా కాట్డెడల్* ((1669; Conversation in The Cathedral, 1974) లో మాన్యుయెల్ ఆడ్రియా పాలన (1948-56) వర్ణించబడింది. లాకాసావర్డెలో వలెనే అన్యాపదేశంగా ఆ నాటి ఆడ్రియా నియంతృత్వంలోని పెరూ దేశపు రాజకీయ వ్యవస్థను, అసత్యపు విలువలను ప్రతిఫలింపజేస్తూ ఈ నవలలో నాలుగు పాత్రల జీవితాలను, మానసిక క్షోభను రచయిత చిత్రించాడు.

*పాంటలియోన్ ఇలాస్ విసిటడొరస్* (1973; Captain Pantoja and the Special Service 1978) అనే నవలలో పెరూ దేశపు సైన్యాన్నీ, మతమౌఢ్యాన్నీ వ్యంగ్యంగా రచయిత నిరసించాడు.

*లాటియా జూలియా ఇఎల్ ఎస్క్రిబిడార్* (1977; Aunt Julia and the Scriptwriter, 1982) అనే నవలలో రెండు పరస్పర వ్యతిరేక అంశాలను కలగలిపి అల్లిన అల్లిక కనిపిస్తుంది.

గేబ్రియల్ గార్సియా మార్క్వెజ్ కాల్పనిక రచనలపైన, గస్టేవ్ ఫ్లాబర్ట్ రచనలపైన, జీన్‌పాల్ సార్త్రే, ఆల్బర్ట్ కామూల రచనలపైన వర్గాస్ విమర్శనాత్మక పరిశీలన జరిపాడు.

1966 నుండి 1969 వరకు లండన్‌లో నివసించాడు. వాషింగ్టన్ స్టేట్ యూనివర్సిటీలో రైటర్ ఇన్ రెసిడెన్స్ పదవికి ఆహ్వానించబడ్డాడు. 1970 లో బార్సెనాలో స్థిరపడ్డాడు. తిరిగి 1974 లో లిమా చేరుకొన్నాడు. ఉపన్యాసా లిస్తూ ప్రపంచ వ్యాప్తంగా బోధ చేశాడు. అతని విమర్శక వ్యాసాలకు ఆంగ్లానువాదాలు 1978 లో వెలువడ్డాయి. *లాగుయెర్రా డెల్ ఫిన్ డెల్ మున్‌డో* (1982; The War of the End of the World, 1984) లో బ్రెజిల్ దేశపు రాజకీయ కుట్రలు వర్ణించబడ్డాయి. శ్పానిష్ భాషను మాట్లాడే దేశాలలో ఈ పుస్తకం విపరీతంగా అమ్ముడు పోయింది. 1983 లో వర్గాస్ లోసా వ్రాసిన నాటకం *లా సెనోరిటా డెటాక్నా* న్యూ యార్క్ నగరంలో ఆంగ్లభాషలో ప్రదర్శించబడింది.

ఎమ్.గు.రా.

**వర్జిల్ (క్రీ.పూ. 70-19) :** రోమన్ మహాకవి. లాటిన్ భాషలో ఇతడు *ఈనియడ్* (Aeneid) అనే ప్రపంచ ప్రసిద్ధి గాంచిన గ్రంథాన్ని రచించాడు. అగస్టస్ చక్రవర్తి ప్రేరణతో విరచితమైన రోమన్ సామ్రాజ్య వైభవాన్ని చిత్రించే ఈ గ్రంథం తదనంతరం యూరపియన్ రచయితల నెందరినో ప్రభావితులను చేసింది.

ఒక పేదరైతు కుటుంబంలో జన్మించిన వర్జిల్ పట్టుదలతో సాహిత్యాన్ని, తత్త్వశాస్త్రాన్ని, తర్క శాస్త్రాన్ని అభ్యసించాడు. తన జీవిత కాలంలో చాలాకాలం నేపిల్స్ (Naples) లో గడిపాడు. క్రీ.పూ. 30 వ సంవత్సరంలో *ఈనియడ్* రచనను ప్రారంభించి క్రీ.పూ. 19

వ సంవత్సరంలో ముగించాడు. అయినా తన కావ్యం తా ననుకున్నట్టుగా లేదని భావించి ఇంకా మెరుగు పరచాలని నిశ్చయించుకొన్నాడు. తత్ఫలితంగా వర్జిల్ గ్రీకు, ఆసియాలలో విస్తృతంగా పర్యటించాడు. అయితే అతని ఆశయం నెరవేరకముందే అతడు మరణించాడు. అతడు మరణశయ్యపై ఉన్నపుడు తాను రచించిన కావ్యం సమగ్ర సౌష్ఠవంతో కూడినది కాదని, కాబట్టి దానిని తగులబెట్టమని చక్రవర్తిని కోరాడు. కాని ఆ చక్రవర్తి అలా చేయలేదు. పైగా వర్జిల్ మిత్రులైన 'వేరియస్', 'టక్కా' లను పిలిపించి వారిచే ఆ గ్రంథాన్ని పరిష్కరింపజేసి ప్రకటించాడు.

*ఈనియడ్* రోమ్ జాతీయ మహేతిహాసం. ప్రపంచ వాఙ్మయంలోని ఉదాత్త గ్రంథాలలో ఒకటి. ఇందులో నాయకుడైన "ఈనియస్" పాత్రకంటె అతని ప్రేమకై తన ప్రాణాలు అర్పించిన "కార్తేజ్" రాణి "డిడీ" యొక్క పాత్ర అద్భుతంగా పోషించబడిందని పలువురు విమర్శకులు ప్రశంసించారు.

ఉమారాణి

**వర్డ్స్‌వర్త్, విలియమ్ (1770-1850) :** ప్రముఖ ఇంగ్లీష్ కాల్పనిక కవి, ఇంగ్లండ్ దేశపు ఆస్థానకవి. 1770 ఏప్రిల్ 7 న ప్రకృతి రామణీయకానికి ప్రసిద్ధి చెందిన లేక్ డిస్ట్రిక్టులోని కాకర్మత్‌లో జన్మించాడు. హాక్‌షెడ్ గ్రామరు స్కూలులో విద్యాభ్యాసం ప్రారంభించిన వర్డ్స్ వర్త్‌కు బాల్యం నుండే కవిత్వం పై ఆసక్తి



కలిగింది. నాటినుండి ప్రకృతిని ఆరాధిస్తూ ఉండేవాడు. ఆ తరువాత కొన్ని సంవత్సరాలు కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసం చేసి, 1792 లో ఫ్రాన్స్‌కు ప్రయాణమయాడు. ఫ్రెంచ్ విప్లవం ఇతనిపై ప్రగాఢమైన ప్రభావం చూపించింది. ఫ్రాన్స్‌లో ఉన్నప్పుడు ఆనెట్ వాలెన్ అనే ఫ్రెంచ్ యువతిని ప్రేమించాడు. ఆమె ద్వారా కారోలీన్ అనే కుమార్తెను కన్నాడు. అయినా ఆమెను వివాహమాడే ధైర్యం ఇతనికి లేకపోయింది. కొంతకాలం తరువాత ఇంగ్లండుకు తిరిగి వచ్చాడు.

ఫ్రాన్స్ అంటే ఇతనికి కొన్నాళ్ళవరకు అభిమానం ఉంది. కాని, ఫ్రెంచి విప్లవంలోని దౌర్జన్యం భూలోకంలో స్వర్గం నిర్మించగలమనే ఇతని ఆశను నిరాశ చేసింది. ప్రఖ్యాత తత్త్వవేత్త అయిన విలియమ్ గాడ్విన్ రాజకీయ సిద్ధాంతాలను, హేతువాదాన్ని పరిశీలించాడు. తత్ఫలితంగా ఇతని మనస్సు అనేక సంశయాలతో, వైరుధ్యాలతో సతమతమయి విసిగిపోయింది. అయితే ఇతని ప్రకృతి ఆరాధన, కవితా వ్యాసంగం ఇతని సోదరి డోరతి వాత్సల్యం ఇతని జీవితానికి వెలుగు నిచ్చాయి. 1798 లో 'కోల్ రిడ్జ్' తో ఇతనికి స్నేహం ఏర్పడంతో వర్డ్స్‌వర్త్ ఎంతో ఉత్సాహాన్ని పొందాడు. కోల్‌రిడ్జ్‌తో కలసి అదే సంవత్సరంలో *లిరికల్ బాలెడ్స్* ను ప్రచురించాడు. అది ఆంగ్ల కవిత్వ చరిత్రలో ఒకమైలురాయి వంటిది. లిరికల్ బాలెడ్స్‌లో వర్డ్స్‌వర్త్ వ్రాసిన పద్యాలు ఒక నూతన మార్గాన్ని సూచించాయి. గ్రామీణ జీవనంలోని సామాన్య సంఘటనలనుండి, గ్రామస్థుల బాలుర సంభాషణల నుండి, గ్రామీణ ప్రాంతంలోని విభిన్న దృశ్యాలు తనలో రేకెత్తించిన భావాల ఉద్రేకాల నుండి కవితా వస్తువును అతడు స్వీకరించాడు. ఈ నూతన విషయాలకు నూతన శైలిని, నూతన భాషను వాడాడు. సామాన్య ప్రజల భాషలోనే కవిత్వం వ్రాయడం లక్ష్యంగా పెట్టుకొన్నాడు. *డెఫోడిల్స్* (Daffadils), *సాలిటరీ రీపర్* (Solitary Reaper) వంటి పద్యాలు ఇతని కవిత్వ లక్ష్యానికి చక్కని ఉదాహరణ.

వర్డ్స్‌వర్త్ రచనలలో ప్రముఖమైంది *ది ప్రిల్యూడ్* అనే మహాకావ్యం. ఇందులో ప్రకృతి తనకు ఏ విధంగా పాఠాలు నేర్పిందో వర్డ్స్‌వర్త్ చక్కగా విశదీకరించాడు. ప్రకృతి ఇతనికి గురువు, సచివుడు, బాంధవుడు, ఆరాధ్యదైవం. తాను ప్రకృతికి ఎంత ఋణపడి ఉన్నాడో 14 భాగాలుగా వ్రాయబడిన ఈ కావ్యంలో వర్డ్స్‌వర్త్ వివరించాడు. తన బాల్యంలోను, యౌవనంలోను తనలో కవితాశక్తి ఏ విధంగా పరిణామం చెందుతూ వచ్చిందో ఇందులో తెలియచేశాడు. ఇదే కాలంలో *ఎక్స్‌కర్షన్* అనే మరొక కావ్యాన్ని రచించాడు.

*లైన్స్ రిటెన్ ఏ ఫ్యూ మైల్స్ ఎబౌ టిన్‌టెర్న్ అబి, ఓడ్ ఇంటిమేషన్స్ ఆఫ్ ఇమ్మోర్టాలిటీ* అనేవి ఇతని ఉత్తమ కావ్యాలు. 1834 లో 'రాబర్ట్ సేదే' మరణానంతరం ఇంగ్లండ్ ఆస్థానకవిగా నియమింపబడి ఏడు సంవత్సరాల తరువాత అంటే 1850 ఏప్రిల్ 23 న గ్రాస్మియర్ అనే ప్రదేశంలో కన్ను మూశాడు.

ఉమారాణి

**వలేరా ఇ అల్కాలా గలియానో, జువాన్ (1824-1905) :** ప్రముఖ స్పానిష్ నవలా రచయిత, దౌత్యవేత్త, రాజకీయవేత్త. 1824 అక్టోబర్ 18 న స్పెయిన్ దేశంలోని కాబ్రాలో జన్మించాడు. ఇతడు బహుముఖ ప్రజ్ఞాశాలి. రచయితగా నవలా రంగంలో ఒక ప్రత్యేక శైలిని, ఒరవడిని ఏర్పరచుకోడమే కాక రాజకీయ వేత్తగా, దౌత్యవేత్తగా కూడా ఒక ప్రత్యేక వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకొన్న శేముషీ ధురంధరుడు. ఇతడు యూరప్, అమెరికాలలో దౌత్యవేత్తగా విస్తృతంగా పర్యటించాడు. కొంతకాలం డిప్యూటీగా, కొంతకాలం సెనేటర్‌గా, మరి కొంత కాలం మాడ్రిడ్‌లో అండర్ సెక్రెటరీగా తన సేవలను అందించాడు.

నవలా రచయితగా ఇతనికి స్పానిష్ సాహితీ చరిత్రలో ప్రత్యేక స్థానం లభించింది. ఇతని నవలలన్నీ మనోవిశ్లేషణాత్మకమైనవి. ముఖ్యంగా ఇతని నవలలలోని స్త్రీ పాత్రలు ఎంతో సజీవమైనవి. పాత్రల అంతరంగంలోకి ప్రవేశించి అక్కడ చెలరేగుతున్న సంఘర్షణలను, వ్యథలను ప్రస్ఫుటంగా కవిత్వ ధోరణిలో వలేరా చిత్రించాడు. *నాచురలిజమ్* (Naturalism) పద్ధతిలో కొనసాగే రచనలంటే ఇతనికి ఇష్ట ముండేది కాదు. ఇతని దృష్టిలో నవలలన్నీ కవిత్వంగా భాసిస్తాయి. ఇతని రచనలలో ముఖ్యమైనవి: *పెపిటు జిమనేజ్* (1874), *జానిటా లాలార్జా* (1895). వీటిలో ఇతడు చేసిన పాత్ర చిత్రణ, ఇతని శైలి ఇతని ప్రత్యేకతను చాటుతాయి. *డాక్టర్ ఫాస్టినో* (Los ilusiones del doctor Faustino: 1875), *మోర్ సమర్* (Morsamor: 1899) అనేవి ఇతని ఇతర నవలలు. ఇవే గాక ఇతడు ఎన్నో అనువాదాలు కూడా చేశాడు. జర్మన్ కవి గోయ్‌థే రచన అయిన ఫౌస్ట్ ను చక్కగా అనువదించి గొప్ప అనువాదకునిగా పేరు గాంచాడు. ఇతడు అనేక విమర్శనా వ్యాసాలు, కథలు రచించాడు. తత్త్వశాస్త్రంపై, చరిత్ర, రాజకీయాలు, మతం మున్నగువానిపై ఇతడు వ్రాసిన అనేక వ్యాసాలు ఇతని బహుముఖ ప్రజ్ఞకు తార్కాణాలు. ప్రముఖ వ్యక్తులకు వ్రాసిన ఇతని లేఖలలో కూడా కవిత్వ ధోరణి, గాఢమైన తాత్త్విక చింతన వ్యక్తమవుతాయి. అనేక రంగాలలో ఖ్యాతి గాంచిన వాలేరా 1905 ఏప్రిల్ 18 న మాడ్రిడ్‌లో మరణించాడు.

ఉమారాణి

**వలేరీ, పాల్ (1871-1945) :** ఫ్రెంచ్ కవి, వ్యాస రచయిత, విమర్శకుడు. పూర్తిపేరు ఆంబ్రోయిస్-పాల్-టస్సెయింట్-జూల్స్-వలేరీ, 1871 అక్టోబరు 30 న ఫ్రాన్స్‌లోని సేటెలో జన్మించాడు. *లాజూనెపార్కే* (1917 The Young Fate) అతని విఖ్యాత పద్య రచన. *ఆల్బమ్ డి వెర్స్ ఏన్సియెన్స్* 1890-1900 (1920) *ఛార్మెస్ ఓవు పోయెమ్స్* (charmes ou poemes, 1922) అతని తరువాతి రచనలు. పేరు పొందిన *లె సిమెటెయిర్ మారిన్* (The Graveyard by the sea) అనే పద్యం అతడి ఛార్మెస్ ఓవు పోయెమ్స్‌లోనిదే. వలేరి అనేక వ్యాసాలు వ్రాశాడు. విజ్ఞాన శాస్త్ర నూత్న ఆవిష్కరణలు, రాజకీయ సమస్యలు అతని వ్యాసాలలో చర్చించబడ్డాయి.

వలేరి ఒక చిన్న మధ్యధరా సముద్రపు రేవు పట్టణంలో జన్మించాడు. అతని తండ్రి అక్కడ కస్టమ్స్ అధికారిగా ఉండేవాడు. మాంట్ పెల్లియర్ నగరంలో న్యాయ శాస్త్రం చదువు కొన్నాడు. కవిత్వం మీద, వాస్తు శాస్త్రం మీద అభిరుచి పెంపొందించు కొన్నాడు. వలేరి సిగ్గరి అయిన యువకుడు. ఆ రోజులలో అతనికున్న కొద్దిమంది స్నేహితులలో గస్టేవ్ ఫోర్మెంట్, పియెర్రె లూయిస్, ఆండ్రె గిడేలు ఉండేవారు. వీరిలో గస్టేవ్ ఫోర్మెంట్ తరువాతి కాలంలో తత్త్వశాస్త్రంలో ఆచార్యపదవిని పొందాడు. లూయిస్, ఆండ్రె గిడేలు రచయితలుగా పేరు తెచ్చుకొన్నారు. తొలి దశలలో వలేరీకి సాహితీవేత్తలైన ఎడ్గార్ అలెన్ పో, జె.కె. హుయస్మన్స్, స్టీఫెన్ మలార్మెలు ఆరాధ్యులుగా ఉండేవారు.



1888-1891 మధ్యకాలంలో వలేరీ అనేక పద్యాలు వ్రాసాడు. వాటిలో కొన్ని నాటి సింబాలిస్టు ఉద్యమ పత్రికలలో అచ్చయి అనుకూలంగా సమీక్షించబడ్డాయి. ప్రేమ వ్యవహారంలో వైఫల్యం, కళావిరక్తి అతనిని 1892 లో అన్ని ఆవేశపూరిత వ్యాసంగాలకూ దూరం చేశాయి. చాలా వరకు పుస్తకాలను అమ్మివేశాడు. 1894 నుండి మరణించేవరకూ ప్రతిరోజూ తెల్లవారు జాముననే లేచి అనేక గంటలు ధ్యానం చేసేవాడు. ధ్యాన నిమగ్నుడైన వేళ తనలో మెదిలిన వైజ్ఞానిక, ఆత్మావలోకన, భాషా సంబంధ భావాలను చిన్న పుస్తకాలలో వ్రాసుకొనేవాడు.

తరువాతి కాలంలో ఆ పుస్తకాలలోని వలేరీ భావాలు *కాహియెర్స్* (cahiers) పేరుతో ప్రచురించబడి ఖ్యాతి పొందాయి.

1897 నుండి 1900 వరకు ఫ్రెంచ్ యుద్ధ కార్యాలయంలో వలేరీ ప్రభుత్వోద్యోగిగా పనిచేశాడు. 1900 లో మలార్మెకుమార్తె యొక్క స్నేహితురాలిని పెళ్ళి చేసుకొన్నాడు. 1922 వరకు ఫ్రెంచ్ పత్రికా సంఘం డైరక్టర్‌కు ఎడువార్డ్ లెబే వద్ద కార్యదర్శిగా పనిచేశాడు. ఆ ఉద్యోగంలో ఉండగా ప్రతిరోజూ పత్రికలలోని ముఖ్యవార్తలను, పారిస్ స్టాక్ ఎక్స్ఛేంజి లావాదేవీలను గూర్చిన అంశాలను ఆ డైరక్టర్‌కు వినిపించటం అతని దినచర్యలో భాగంగా ఉండేది. అందువల్ల వలేరీకి దేశ వ్యవహారాలకు సంబంధించిన విషయాల పరిజ్ఞానం లభించి నిపుణుడైన వ్యాఖ్యాతగా పేరు పొందాడు.

1912 లో ఆంద్రీ జీడ్ బలవంతం మీద తన తొలి రచనల సవరణ చేపట్టాడు. తన *లాజూనె పార్కె* కావ్యపు సవరణలో ఐదు సంవత్సరాల కాలాన్ని వెచ్చించాడు. చివరకు మూడు దశలను సింబాలిక్‌గా చూపించే ఈ సవరింపబడిన కావ్యం అతని కెనలేని పేరు ప్రఖ్యాతులు తెచ్చిపెట్టింది. వలేరీ తరువాత వ్రాసిన కావ్యాలు *ఆల్బుండి వెర్స్ ఆన్సియెన్స్, ఛార్మె స్ ఓవు పోయెమ్స్* సమకాలీన ఫ్రెంచ్ కవులలో అతని స్థానాన్ని సుస్థిరం చేశాయి.

1922 తరువాత వలేరీ కవిత్వం వ్రాయక పోయిన ప్పటికీ ప్రముఖకవిగా అతని స్థానం భద్రంగానే ఉంది. అతనికి పేరు ప్రఖ్యాతులు రావడానికి అతని కవిత్వమే కారణభూతమైనప్పటికీ, సాహిత్యం మీద తన కంతగా మక్కువ లేదని వలేరీ స్వయంగా చెప్పకొనేవాడు. వలేరీకి అనేక అంశాలపై గల ఆసక్తి అతని వ్యాసాలు, పుస్తకాలకు వ్రాసిన ముందు మాటల ద్వారా తెలుస్తుంది. రచయితలు, రచనలు, తత్త్వవేత్తలు, భాష, చిత్రకారులు, నాట్యం, వాస్తుశాస్త్రం, లలితకళలను గూర్చిన వివిధాంశాలు క్రొత్త పంథాలో వలేరీ రచనలలో దర్శన మిస్తాయి. చైనా, జపాన్ యుద్ధాన్ని గూర్చి వ్రాసిన వ్యాసం *లే యలోవ్* (Le yalou, 1895) లోనూ, జర్మనీ దండయాత్రాభయం గూర్చి వ్రాసిన వ్యాసం *లా కాంక్వెట్ ఆల్లెమాండ్* (1897) లోనూ, వోల్టేర్ గురించిన అతని చివరి *ఉపన్యాసం* (1944) లోనూ పాశ్చాత్య నాగరకత ఎదుర్కొంటున్న సవాళ్ళపై వలేరీ వెలిబుచ్చిన ఆందోళన ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

1922 లో లెబే మరణించిన తరువాత, విశ్రాంతి తీసుకుంటున్న వలేరీ తిరిగి ప్రముఖ సాహితీ వేత్తగా ప్రజాజీవనంలో ప్రవేశించాడు. అతని పాండిత్యం, మర్యాద, అనర్గళ వాగ్ధాటి సంఘంలో అతనికి ఉన్నత స్థానాన్నిచ్చి, సమకాలీన అంతర్జాతీయ రచయితలు, శాస్త్రవేత్తలు, సైన్యాధ్యక్షులు, ప్రభుత్వాధినేతలు మొదలైన ఉన్నత వ్యక్తులతో కలసి మెలసి తిరుగ గలిగిన అవకాశం కల్పించాయి. గణితశాస్త్రం, ఆధునిక భౌతిక శాస్త్రాలపట్ల వలేరీకి ఎక్కువ ఆసక్తి ఉండేది. గ్రంథ పఠనం వల్లనూ, ప్రముఖ శాస్త్రజ్ఞుల స్నేహాల వల్లనూ ఆయా శాస్త్రజ్ఞుల పరిశోధనాంశాల గురించి వలేరీ క్షుణ్ణంగా అవగతం చేసుకోగలిగాడు. మారిస్, డక్ డి బ్రోగ్లీ, బెర్న్ హార్డ్ రైమన్, మైకేల్ ఫేరడే, ఆల్బర్ట్ ఐన్‌స్టీన్, జేమ్స్ క్లర్క్ మాక్స్‌వెల్ లు వలేరీకి పరిచితులైన ప్రముఖ శాస్త్రజ్ఞులు.

అనేక జాతీయ ఉత్సవ కార్యక్రమాలలో వలేరీ ఉపన్యసించాడు. 1925 లో అకాడమీ ఫ్రాంన్సాయిస్‌కు ఎన్నుకోబడ్డాడు. 1933 లో నీస్‌లో ఉన్న 'సెంటర్ యూనివర్సిటైర్ మెడిటరేనియన్' కు పరిపాలనాధికారిగా నియమితు డయాడు. 1937 లో కాలేజి డీ ఫ్రాన్సులో అతని కొరకై సృష్టించబడిన కవిత్వ ఆచార్య పదవిలో నియమితు డయాడు.

వలేరీ మేధావుల సమస్యలపైనే తన దృష్టిని కేంద్రీకరించి సర్రియలిస్టుల ఆవేశపూరిత కవిత్వాన్ని ఖండించి వారి అసంతృప్తిని చూరగొన్నప్పటికీ, వలేరీ రచనలలో అతని ఇంద్రియ లోలత్వం ప్రతిఫలిస్తూ ఉంటుంది. అతని *లగ్జూరియస్ ఆన్ బెయిన్, లా డోర్మియయుస్* లలోని స్త్రీ నగ్నత్వ చిత్రణ, *ఈబాష్ డియయున్ సెర్పెంట్* లో ఈవ్ చిత్రణ, లెసిమిటియెర్ మారిన్, *ఫాగ్మెంట్స్ డు నార్సైస్* లలోని ప్రేమికుల కౌగిళ్ళ వర్ణన వలేరీ లౌల్యానికి ఉదాహరణగా పేర్కొనవచ్చును.

అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిన వలేరీ 1945 జూలై 20 న పారిస్ నగరంలో మృతి చెందాడు. అతనికి అధికార లాంఛనాలతో అంతిమ సంస్కారాలు జరిగాయి.

ఎమ్.గు.రా.

**వా, ఈవ్‌లిన్ (1903-66)** : ఆంగ్ల వ్యంగ్య నవలా రచయిత. వా ఈవ్‌లిన్ ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో చదివాడు. కొంతకాలం కళను అభ్యసించి, కొంతకాలం పాఠశాలలో అధ్యాపకత్వం చేసి, అనంతరం తన సమయాన్ని దేశాటనకు, రచనా వ్యాసంగానికి వెచ్చించాడు. వా ఈవ్‌లిన్ అనతికాలంలోనే వికట వ్యంగ్య రచయితగా ప్రసిద్ధి చెందాడు. రెండవ ప్రపంచ యుద్ధ

సమయంలో రాయల్ నౌకాదళం లోనూ, రాయల్ ఆశ్విక దళంలోను పనిచేశాడు. యుద్ధం ముగిసిన తరువాత రచనా వ్యాసంగంతో విశ్రాంత జీవితం గడపాడు.

వా ఈవ్‌లిన్ విస్తృతంగా పర్యటనలు చేసి, తన నవలలకు కథా వస్తువును జీవితాను భవం నుంచే ఎన్నుకొన్నాడు. ఇతని నవలలు క్లుప్తంగా, గొప్ప నగిషీతో పాత్రలను ఆకట్టుకొంటాయి. 1939 వ సంవత్సరానికి ముందు వెలువడిన నవలలను వ్యంగ్య రచనలుగా పేర్కొన వచ్చును. *డిక్లైన్ అండ్ ఫాల్* (1928), *వైల్ బాడీస్* (1930), *బ్లాక్ మిస్‌చీఫ్* (1932), *ఏ హేండ్‌ఫుల్ ఆఫ్ డస్ట్* (1934), *స్కూప్* (1938) ఇతని ప్రసిద్ధ రచనలలో ముఖ్యమైనవి. కాలిఫోర్నియాలోని వడ్రంగి పనివాళ్లమీద వ్రాసిన వ్యంగ్య నవల *ది లవ్డ్ వన్* (1948) కూడ ఈ కోటికి చెందినదే!



రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో 'వా' రచనా వ్యాసంగం చరిత్రాత్మకమైన మలుపు తిరిగింది. 'వా' *బ్రైడ్స్ హెడ్ రీవిజిటెడ్* (1945) అనే నవలలో విధి విలాసాన్ని, దేవునిపై కోల్పోయిన నమ్మకాన్ని తిరిగి తెచ్చుకొన్న ఒక కేథలిక్ కుటుంబ జీవితాన్ని 'వా' సమర్థంగా చిత్రించాడు. 1950 లో 'వా' రచించిన మరొక నవల *హెలెనా* (Helena) వెలువడింది. ఈ నవలలో కాన్‌స్టాంటైన్ ది గ్రేట్ తల్లి కథ వర్ణింపబడింది. క్రైస్తవ మత చరిత్రలోని ఒక పారమార్థిక విషయాన్ని పునఃసృష్టి చేయడానికై ఈ నవలను 'వా' రచించాడు. 'వా' రెండవ ప్రపంచ యుద్ధానికి సంబంధించిన మూడు నవలలు వ్రాశాడు. అవి *మెన్ ఎట్ ఆర్మ్స్* (1952), *ఆఫీసర్స్ అండ్ జెంటిల్‌మెన్* (1955), *అన్‌కండిషనల్ సరెండర్* (1961) రెండవ ప్రపంచ యుద్ధం నేపథ్యంగా అనాదిగా మంచి చెడులకు మధ్య వాటిల్లుతున్న సంఘర్షణను, నవలలలో ఆయన చిత్రించాడు.

'వా' తన విస్తృత పర్యాటనానుభవాన్ని పురస్కరించుకొని కొన్ని యాత్రా గ్రంథాలను కూడా వ్రాశాడు. అవి: *లైఫ్ ఆఫ్ డాంటే గేబ్రియల్ రోజెట్టి* (1928), *ఎడ్మండ్ కాంపియన్* (1935), *రోనాల్డ్ నాక్స్* (1959) వా స్వీయ చరిత్రలో మొదటి భాగం *ఏ లిటిల్ లెర్నింగ్* 1964 లో వెలువడింది.

1975 లో క్రిస్టాఫర్ సైక్స్ *'వా' జీవిత చరిత్రను* వెలువరించాడు. 'వా' లేఖలు 1980 లో పుస్తక రూపంలో వెలువడ్డాయి.

జి.అ.నా.

**వాంగ్ అన్-షీ (1021-1086) :** చైనా దేశపు కవి, రచయిత, గొప్ప సంస్కరణవాది. పరిపాలనా రంగంలో ఇతడు చేపట్టిన సంస్కరణలు కొన్ని శతాబ్దాల పాటు చైనాదేశంపై ప్రభావాన్ని చూపించాయి. 1021 లో చైనా లోని కియాంగ్సీ (Kiangsi) రాష్ట్రంలో జన్మించిన వాంగ్ తన 21 వ ఏటనే సివిల్ సర్వీసులో డాక్టరేట్ పట్టా పుచ్చుకొన్నాడు. ఆ తరువాత రెండు దశాబ్దాల పాటు వివిధ పరిపాలన శాఖలను సమర్థంగా నిర్వహించి గొప్ప పరిపాలన దక్షుడుగా పేరు తెచ్చుకొన్నాడు. ఇతని అసమాన ప్రతిభకు ముగ్ధులయిన తన పై అధికారులు అతనికి కేంద్ర ప్రభుత్వశాఖకు ప్రమోషన్ ఇస్తా నన్నారు. కాని కొన్ని వ్యక్తిగత కారణాలవల్ల ఆ ప్రమోషన్‌ను అతడు స్వీకరించలేదు. ఆ తరువాత కొంత కాలానికి కేంద్ర ప్రభుత్వ ఉద్యోగంలో ప్రవేశించాడు. అప్పుడు ఇతడు చేపట్టిన ఆర్థిక సంస్కరణలు ఇతనికి గొప్ప పేరు తెచ్చాయి. అయితే వీటిని వ్యతిరేకించినవారు కూడా కొందరు లేకపోలేదు. ఇతడు సివిల్ సర్వీస్ పరీక్షల విధానాన్ని పూర్తిగా సంస్కరించి క్రొత్త సిలబస్‌ను రూపొందించాడు. ప్రభుత్వోద్యోగులకు కొన్ని ఇన్‌సెంటివ్స్ (Incentives) కల్పించటమే కాక వారిపై ఆజమాయిషీ కూడా ఎక్కువ చేశాడు. ఏది ఏమైనప్పటికి చైనాలోని రాచరిక వ్యవస్థలో మార్పులు రావడంతో ఇతని సంస్కరణలకు కూడా కొంత విఘాతం ఏర్పడింది. వాంగ్ పరిపాలన రంగంలో ఎంత దక్షుడో సాహితీ రంగంలో కూడా అంత దక్షతను చూపించాడు. ఇతడు ముఖ్యంగా ప్రాచీన కావ్యాలన్నిటిపై సరిక్రొత్త వ్యాఖ్యానాలు రచించి, అవి ప్రామాణిక గ్రంథాలుగా నిర్ణయించాడు. ఇతని శైలి సూటిగా స్పష్టంగా ఉండి పాఠకుల మనస్సులకు హత్తుకునేది. ఇతని రచనలలో అక్కడక్కడ "జెన్ బుద్ధిస్ట్" వాసనలు కనిపిస్తాయి. ఇతనికి భాషా శాస్త్రంపై కూడా అభిరుచి ఎక్కువ. వాంగ్ రచించిన వ్యుత్పత్త్యర్థ పదకోశం చైనీస్ భాషా

చరిత్రలో ప్రత్యేక స్థానాన్ని ఆక్రమిస్తుంది. ఇతని కవిత్వంలో కూడా "జెన్ బుద్ధిస్ట్" ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది. సాహిత్య రంగంలోను, పరిపాలనా రంగం లోను నవ్యత్వాన్ని ప్రదర్శించిన వాంగ్ ఆన్-షీ 1086 లో మరణించాడు.

*ఉమారాణి*

**వాండెల్, జూస్ట్ వాండెన్ (1587-1679) :** డచ్చి దేశపు కవి, నాటక రచయిత. 1587 నవంబరు 17 న ఒక సామాన్య కుటుంబంలో జన్మించిన వాండెల్ స్వయంకృషితో పైకి వచ్చాడు. అతడు స్వంతంగా ఫ్రెంచి భాష నేర్చుకొని ఫ్రెంచ్ కవిత్వాన్ని అధ్యయనం చేశాడు. ప్రఖ్యాత ఫ్రెంచ్ కవి అయిన డూ బార్టాస్ కవిత్వం ఇతనికి బాగా నచ్చింది. బార్టాస్ ప్రయోగించిన అలెగ్జాం డ్రైన్ రూపాన్నే ఇతడు స్వీకరించాడు. ఇతడు లాటిన్ భాషను కూడా నేర్చుకొని వర్జిల్ మరియు సెనకా ల రచనలను అనువదించాడు. క్రైస్తవ పురాణ గాథలను ఇతివృత్తాలుగా స్వీకరించి అద్భుతమైన నాటకాలు రచిం చాడు. బైబిల్‌లోని "ఎక్సోడస్" ను ఆధారంగా చేసికొని *ది పాసోవర్* (The Passover) అనే నాటకాన్ని 1612 లో రచించాడు.

ఇతనికి నియంతృత్వ మంటే అసహ్యం. ఆ రోజు లలో *ఆమ్‌స్టర్ డామ్* లో ప్రాబల్యం వహించిన సనాతన కాల్వినిస్ట్ మతాన్ని ఇతడు నిరసించాడు. వాండెల్ హ్యూ *గ్రేటియస్* అనే ప్రఖ్యాత న్యాయశాస్త్ర కోవిదునితో పరిచయ మేర్పడింది. తత్ఫలితంగా అతని నాటకాలను డచ్చి భాషలోకి అనువదించాడు. అతని ప్రభావంతోనే రోమన్ కేథలిక్ మతాన్ని స్వీకరించి దానివలన మానసిక ప్రశాంతిని పొందాడు. గ్రేటియస్ ప్రభావం వలన గ్రీకు నాటకాలపై ఇతడు తన దృష్టి సారించాడు. ప్రఖ్యాత గ్రీకు నాటకకర్త అయిన సాఫోక్లస్ రచించిన ఎలెక్ట్రా అనే నాటకాన్ని డచ్చిలోకి అనువదించాడు. బైబిల్ గాథ లను ఆధారంగా చేసికొని రచించిన ఇతని నాటకాలలో ముఖ్యమైనవి. *లూసిఫర్* (1654), *ఆడమ్ ఇన్ ఎక్సైల్* (1664) *నోహా* (1667). సాహిత్యంలోని ప్రక్రియ లన్నింటిలో విషాదాంత నాటకం గొప్ప ప్రక్రియ అని విశ్వసించిన వాండెల్ 1679 ఫిబ్రవరి 5 న "ఆమె స్టర్‌డామ్" లో కన్ను మూశాడు.

*ఉమారాణి*

**వాన్ డోరెన్, మార్క్ (1894-1972) :** ప్రఖ్యాత అమెరికన్ కవి, రచయిత, సాహిత్య విమర్శకుడు. గొప్ప ఉపాధ్యాయుడుగా కూడా ఇతనికి పేరుంది. కొలంబియా యూనివర్శిటీలో 39 సంవత్సరాలు అధ్యా పకుడుగా పనిచేసి ఎన్నో తరాల విద్యార్థులపై తన ప్రభావాన్ని చూపాడు.

1894 జూన్ 13 న ఇల్లినాయిస్ రాష్ట్రంలోని హోప్ (Hope) అనే గ్రామంలో జన్మించిన ఈ వాన్‌డోరెన్ ఒక డాక్టర్ కుమారుడు. ఇతడు అర్బానా అను పట్టణంలో తొలుత విద్యాభ్యాసం చేసి ఆ తరువాత కొలంబియా యూనివర్శిటీలో చేరాడు. న్యూయార్క్ నుండి వెలువడే *ది నేషన్* అనే ప్రముఖ పత్రికకు 1924-28 సంవత్సరా లలో సాహిత్య సంపాదకుడుగా పనిచేశాడు. ఆ తరువాత 1935-38 మధ్య కాలంలో అదే పత్రికకు ఫిల్మ్ క్రిటిక్‌గా కూడా తన సేవల నందించాడు. ఇతడు జాన్ డ్రైడన్ కవిత్వం పై పరిశోధించి కొలంబియా యూనివ ర్శిటీ నుండి పిహెచ్.డి పట్టా పొందాడు. ఆ తరువాత కొలంబియా విశ్వవిద్యాలయంలో ఇంగ్లీష్ ప్రొఫెసర్‌గా పనిచేశాడు.

షేక్స్‌పియర్ నాటకాలపై వాన్ డోరెన్ వ్రాసిన అనేక మౌలిక వ్యాసాలు 1939 లో పుస్తకరూపంలో ప్రచురించబడ్డాయి. *నథేనియల్ హాతార్న్* రచనలపై ఇతడు చేసిన విమర్శ ఆంగ్ల సాహిత్య విమర్శ చరిత్రలో ప్రధానమైనది. సాహిత్య విమర్శకుడుగా బైరన్ వరకు గల వివిధ కవులపై ఇతడు అద్భుతమైన వ్యాసాలు వ్రాశాడు. 1922 లో *డోరతీ గ్రాఫ్* అనే నవలా రచయిత్రిని వివాహమాడాడు.

దాదాపు 20 కవితా సంకలనాలను ప్రచురించి కవిగా కూడా అసమాన కీర్తి గడించాడు. 1924 లో ఇతడు రచించిన *స్ప్రింగ్ థండర్* అనే కవితా సంకలనం ఇతని కవితా ప్రస్థానంలో తొలి మజిలీ. ఆ తరువాత 1940 లో ఇతడు ప్రచురించిన *కలెక్టెడ్ పోయెమ్స్* అనే కవితా సంకలనానికి పులిట్జర్ బహుమానం వచ్చింది. *ది లాస్ట్ డేస్ ఆఫ్ లింకన్* అనే పేరుతో 1959 లో ఒక గొప్ప గేయ నాటకాన్ని రచించాడు.

*ది ట్రాన్సియెంట్స్* (1935), *విండ్‌లెస్ కాబిన్స్* (1940), *టిల్డా* (Tilda: 1943) అనే మూడు నవలలు రచించి గొప్ప నవలా రచయితగా పేరు తెచ్చుకొన్నాడు. ఇవే గాక ఇంకా ఎన్నో కథా సంకలనాలు ప్రచురించి, మరెన్నో ఇతర సంకలనాలకు సంపాదకత్వం వహించి, సాహిత్యంలోని అన్ని ప్రక్రియలలో తన విశిష్టతను నిలబెట్టుకొన్నాడు. 1972 డిసెంబర్ 10 న వాన్‌డోరెన్ మరణించాడు.

*ఉమారాణి*

**వారెన్, రాబర్ట్ పెన్ (1905-1989) :** ప్రఖ్యాత అమెరికన్ కవి, నవలా రచయిత, సాహిత్య విమర్శకుడు ఉత్తమ అధ్యాపకుడు. 1905 ఏప్రిల్ 24 న అమెరికాలోని కెంటకీ రాష్ట్రంలో జన్మించిన వారెన్ "వాండర్ బిల్ట్" విశ్వవిద్యాలయంలో విద్య నభ్యసించాడు. ఆ రోజులలో "ఫ్యూజిటివ్స్" అనే పేరుతో వ్యవహరించబడే కొందరి కవులతో ఇతనికి పరిచయం ఏర్పడింది. ఈ ఫ్యూజిటివ్ వర్గానికి చెందిన కవులు గ్రామీణ జీవన విధానాన్ని ఎక్కువగా ఇష్టపడేవారు. ముఖ్యంగా దక్షిణ అమెరికాలోని గ్రామీణుల జీవన సరణిని ఇతివృత్తంగా చేసుకొని వీరు ఎన్నో రచనలు చేశారు. వారెన్ వీరితో కలిసి 1930 లో *ఐ విల్ టేక్ మై స్టాండ్* అనే వ్యాస సంకలనాన్ని ప్రచురించాడు.



1927 లో కాలిఫోర్నియా విశ్వవిద్యాలయం నుండి ఎమ్.ఏ. పట్టా పుచ్చుకొన్న తరువాత "రోడ్స్" స్కాలర్‌గా ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయానికి వెళ్లాడు. అక్కడనుండి తిరిగి వచ్చాక అమెరికాలోని వివిధ విశ్వవిద్యాలయాలలో పనిచేశాడు. *క్లియాంత్ బ్రూక్స్* అనే ప్రఖ్యాత విమర్శకునితో కలసి *ది సదరన్ రివ్యూ* అనే ఒక సాహిత్య పత్రికను కూడా నిర్వహించాడు. 1942 వరకూ నిరాఘాటంగా కొనసాగిన ఈ పత్రిక అమెరికన్ సాహిత్య పత్రికలన్నిటిలోను గొప్పదని చెప్పవచ్చు. 1938 లో *అండర్ స్టాండింగ్ పొయిట్రీ* అనే ఒక గ్రంథాన్ని క్లియాంత్ బ్రూక్స్‌తో కలసి ప్రచురించాడు. ఆ పుస్తకం ఈ నాటికీ ప్రపంచంలోని అనేక దేశాల్లోని ఆంగ్ల సాహిత్య విద్యార్థులు మౌలికమైన పాఠ్య గ్రంథంగా పఠిస్తున్నారు. న్యూ *క్రిటిసిజం* ఉద్యమ ప్రభావంచే రచించబడ్డ ఈ గ్రంథం కవిత్వాన్ని అవగాహన చేసుకోడంలో పండితుల నుండి పామరుల వరకు చక్కటి మార్గదర్శినిగా ఉపకరిస్తూంది.

నవలా రంగంలో కూడా వారెన్ కృషిచేశాడు. 1939 లో *నైట్ రైడర్* అనే ఒక నవలను ప్రచురించాడు. కెంటకీ రాష్ట్రంలో జరిగిన పొగాకు యుద్ధాన్ని ఇతివృత్తంగా చేసుకొని రచించిన ఈ నవల ఆ నాటి సాహితీ లోకంలో ఒక సంచలనాన్ని సృష్టించింది. ఇతని ఇతర నవలలలో ముఖ్యమైనవి *హెవెన్స్ గేట్* (1943), *ది కింగ్స్ మెన్* (1946). ఇంకా మరెన్నో నవలలను, కవితా సంకలనాలను ప్రచురించినప్పటికి సాహిత్య విమర్శకుడిగానే వారెన్ ఎక్కువ పేరు ప్రఖ్యాతులు పొందాడు.

*ఉమారాణి*

**వారో, మార్కస్ టెరెంటియస్ (క్రీ.పూ. 116-27) :** రోమన్ విద్వాంసుడు. వ్యంగ్య రచయిత. క్రీ.పూ. 116 సంవత్సరంలో ఇటలీ దేశంలో జన్మించాడు. 'సెటూరె మెనిప్పియె' ద్వారా ఖ్యాతి నార్జించాడు. గాఢమైన దేశభక్తి చేత ఉత్తేజితుడై వారో సృష్టించిన సాహిత్యం నీతిని, ఉత్తమ గుణాలను ప్రతిబింబిస్తూ రోమన్ ఔన్నత్యాన్ని మరింతగా పెంపొందించడానికి ఉద్దేశించబడినది. ఉజ్జ్వలమైన రోమ్ గత వైభవాన్ని పునరుద్ధరించే లక్ష్యంగా చేసిన వారో రచనలు రోమన్ సామ్రాజ్యస్థాపనకు (క్రీ.పూ. 27) ముందు కాలాన్నే గాకుండా, తరువాతి కాలాన్ని కూడా తీవ్రంగా ప్రభావితం చేశాయి.

వారో ఒక ప్రఖ్యాత లాటిను పండితుని వద్దనూ, ఏథెన్సుకు చెందిన ఆంటియోకస్ అనే తత్త్వవేత్త వద్దనూ విద్య నభ్యసించాడు. రాజకీయాల పట్ల ఆకర్షితుడు కాకపోయినప్పటికీ, ప్రజాజీవనంలో ప్రముఖ పాత్ర వహించి ఉన్నత న్యాయాధికారి పదవికి చేరాడు. స్పెయిన్‌లో 'పాంపే ది గ్రేట్' క్రింద న్యాయ విచారణాధికారిగా పని చేశాడు. సముద్రపు దొంగలతో పాంపే జరిపిన యుద్ధం (క్రీ.పూ. 67) లో పాల్గొన్నాడు.

క్రీ.పూ 59 వ సంవత్సరంలో వారో *త్రికరనోస్* (Trikaranos) అనే పేరుతో సీజర్ మొదలైన నాయకులను గూర్చి ఒక రాజకీయ కరపత్రం వ్రాశాడు. క్రీ.పూ. 49 లో స్పెయిన్‌లో పాంపే వైపు చేరినప్పటికీ అతని పతనానంతరం జూలియస్ సీజర్ చేత క్షమాభిక్ష పొంది అతనిచే గ్రంథాలయాధికారిగా నియమితుడయాడు. వారో తన రచన *ఆంటిక్విటేట్స్ రీరమ్ హ్యూమనే రమ్ డివినేరమ్* (Antiquities of Human and Divine Things) అనే గ్రంథం రెండవ భాగాన్ని సీజర్‌కు అంకిత మిచ్చాడు. తరువాతి కాలంలో మార్క్ ఆంటోనీ చేత బహిష్కృతుడైన వారో పండితుని గ్రంథాలన్నీ తగులబెట్టబడ్డాయి. కాని అగస్టస్ ప్రభువు చేత వారో ఆస్తిపాస్తులు పునరుద్ధరించబడ్డాయి. శేష జీవితకాలాన్ని వారో గ్రంథపఠనం, గ్రంథరచనలోనే గడిపి వేశాడు.

వారో దాదాపు 74 రచనలను రచించాడు. అతని రచనలలో న్యాయశాస్త్ర, చరిత్ర, ఖగోళశాస్త్రం, భూగోళ

శాస్త్రం, విద్య, సాహిత్య చరిత్ర మొదలయిన వైవిధ్యం గల అనేక విషయాలు చర్చించబడ్డాయి. వ్యంగ్య రచనలు, పద్యాలు, ఉపన్యాసాలు, లేఖలు మొదలైన అనేక ప్రక్రియలు అతని సాహిత్యంలో చోటుచేసుకొన్నాయి. వారో కృతుల్లో *డీ రేర్‌స్టికా* (Farm Topics) అనే ఒక్క రచన మాత్రం సంపూర్ణంగా లభిస్తూంది. ఈ గ్రంథం వ్యవసాయ, పశుగణాభివృద్ధులను గురించిన విజ్ఞానాన్ని అందజేస్తుంది.

సిసిరోకు అంకిత మిచ్చిన *డీ లింగ్వా లాటినా* (On the Latin Language) భాషా శాస్త్ర గ్రంథంగానే గాక వివిధ శాస్త్రాల సమాచారాన్ని సందర్భానుసారంగా చర్చించే ఉత్తమ గ్రంథంగా పరిగణించబడింది. మూలంలోని 25 భాగాలలో నేడు 5 వ భాగం నుండి 10 వ భాగం వరకు మాత్రం గ్రంథపాతాలతో లభిస్తున్నాయి. వారో వ్రాసిన *సెటూరె మెనిప్పియెలోని* 150 పుస్తకాలలోని 90 అధ్యాయాలు దాదాపు 600 ఖండాలు నేడు లభిస్తున్నాయి. అతని వ్యంగ్య రచనలు హాస్యపూరితాలై పద్య గద్యాత్మకంగా ఉండి క్రీ.పూ. 3 వ శతాబ్దపు సినిక్ తత్త్వవేత్త మెనిప్పస్ రచనలను తలపిస్తాయి. తినడం, త్రాగడం వంటి సామాన్య విషయాలు మొదలుకొని సాహిత్యం, తత్త్వశాస్త్రం వంటి అనేక అంశాలు అతని రచనలలో కనిపిస్తాయి.

వారో ప్రాచీనుడే అయినప్పటికీ అతని రచనలు ఆధునిక కాలానికి కూడా వర్తిస్తాయి. నేటి సమాజ దోషాలను, వికృతులను పరిహసిస్తున్నట్లు కనిపిస్తాయి. పవిత్రమైన రోమన్ సంప్రదాయానుగుణమైన నిరాడంబర జీవితాన్ని వారో ప్రభోదించాడు. వారో రచనలలో ఛందో వైవిధ్యం, శైలీ నైపుణ్యం గోచరిస్తాయి.

*డీ రే రస్టికా* కు డబ్ల్యు.డి హూపర్, హెచ్.బి. ఆష్‌లచే చేయబడిన ఆంగ్లానువాదం (1934) లోయెబ్ క్లాసికల్ లైబ్రరీ లో లభిస్తుంది. *డి లింగ్వా లాటినా* కు ఆర్.జి.కెంట్ చే చేయబడిన ఆంగ్లానువాదం (1938) కూడా అక్కడ లభిస్తుంది.

ఎమ్.గు.రా.

**వాల్‌కాట్, డెరెక్ (1930--)** : వెస్ట్ ఇండియన్ మహాకవి, నాటకకర్త, రచయిత. సాహిత్యంలో నోబెల్ బహుమతి గ్రహీత. 1930 జనవరి 23 న కరేబియన్ ద్వీపం సెయింట్ లూసియాలోని కేస్ట్రైన్ లో ఇతడు జన్మించాడు. డెరెక్ తండ్రి వార్‌విక్ వాల్కాట్ ఆంగ్లేయుడు. డెరెక్ తల్లి అలిక్స్ ఆఫ్రికన్. ఈమె ప్రముఖ సంఘ సేవిక. వాల్‌కాట్ సెయింట్ లూసియాలోని సెయింట్ మేరీస్ కాలేజ్‌లోను, ఆ తరువాత జమైకా దేశం మోనాలోని వెస్ట్ఇండీస్ విశ్వవిద్యాలయంలోను చదివాడు. ఇంగ్లండ్‌లో కొంతకాలం గడపి, 1953 లో ట్రినిడాడ్ (ఆఫ్రికా) చేరి అక్కడ స్థిరపడ్డాడు. ఈయన నాటకరంగ, చిత్రకళా విమర్శకుడుగా పేరుపొందాడు.

1948 లో 18 ఏళ్ళ వయస్సులో ఆయన 25 కవితా కండికలతో తన తొలి కవితా సంకలనాన్ని ప్రచురించాడు. 1962 లో ప్రచురించిన *ఇన్ ఏ గ్రీన్ నైట్* తో ఆయన మంచి పేరు ప్రఖ్యాతులు సంపాయించాడు. 1959 లో స్వయంగా నెలకొల్పిన ట్రినిడాడ్ థియేటర్‌లో వర్క్‌షాప్ ద్వారా తన తొలి నాటకాలలో ఎక్కువ భాగం ప్రచురించాడు.

తాను స్థిరపడిన కరేబియన్ ప్రాంతానికి భావప్రకటనా మాధ్యమంగా ఎంచుకొన్న ఆంగ్లభాషకు, తన ఆఫ్రికా జాతీయతకు నిబద్ధుడైన వాల్‌కాట్ *ఏ ఫార్ క్రై ఫ్రమ్ ఆఫ్రికా* అనే కవితలో 'ఎలా ఎంచుకోను నా ఈ ఆఫ్రికాను? నేను ప్రేమించే ఆంగ్ల భాషలో నేను దేనిని ఎంచుకోను?' అంటాడు. భిన్న సంస్కృతుల వాతావరణంలో సాగిన తన విద్యాభ్యాసానికి, జీవితానికి మిక్కిలి ప్రాచుర్యం పొందిన *ఎనదర్ లైఫ్* అన్న దీర్ఘ కవితలో ఆయన హృద్యమైన రూప మిచ్చాడు. ఇది డెరెక్ జీవిత చరిత్రను వివరించే కవిత-వర్ణ వివక్షణకు గురి అయిన బాలునిగా వాల్‌కాట్ ఈ కవితలో దర్శన మిస్తాడు. అదే సంవత్సరం వ్రాసిన *అన్యాస్ టెస్ట్‌మెంట్* లో ఆయన డబ్ల్యు.హెచ్. ఆడెన్‌కు అంకిత మిచ్చాడు. రెండేండ్ల క్రితం రచించిన తన తాజా కవితా సంకలనం *ఒమెరాస్* లో కరేబియన్ జీవితాన్ని 64 అధ్యాయాల్లో రమ్యంగా వాల్‌కాట్ వర్ణించాడు. చక్కని నాటికలు కూడా వ్రాసినప్పటికీ ప్రధానంగా కవి గానే వాల్‌కాట్ ప్రసిద్ధి చెందాడు. అతని నాటకాలలో *డ్రీమ్ ఆఫ్ మంకీ మౌంటెన్* (Dream on Monkey Mountain) ఆయనకు మంచి పేరు తెచ్చింది. కరేబియన్ జీవిత సౌందర్యాన్ని కన్నులముందు ఆవిష్కరిస్తూ స్వప్న జగత్తుకు తీసుకుపోయే వాల్‌కాట్ కవితలలోని ప్రతిభ ఆయన వ్రాసిన పలు నాటకాలలోనూ దర్శనమిస్తుంది. వాల్‌కాట్ కవిత్వం ఆఫ్రికా గుండె చప్పుళ్ళను ప్రతిధ్వనించే శ్రావ్యమైన సంగీతం.

వాల్‌కాట్‌కు అనేక పురస్కారాలు, ముఖ్యంగా బ్రిటన్‌లో లభించాయి. ఆయన వ్రాసిన *ఒమెరాస్* కు 1991 వ సంవత్సరానికి డబ్ల్యు.హెచ్. స్మిత్ సాహిత్య అవార్డు లభించింది. ఆయన కవితా సంకలనం *ది*

కాస్ట్రారేస్ కు 1966 వ సంవత్సరం రాయల్ సొసైటీ ఆఫ్ లిటరేచర్ బహుమతి, వెల్ష్ ఆర్ట్స్ కౌన్సిల్ బహుమతి లభించాయి. అమెరికా విశ్వవిద్యాలయాల ఆహ్వానాలను ఎన్నో సార్లు అందుకొని ఫెలోషిప్పులమీద ఆయన అమెరికా వెళ్ళాడు. బోస్టన్ విశ్వవిద్యాలయంలో ఇంగ్లీష్ శాఖాధ్యక్ష పీఠాన్ని అలంకరించాడు.

ఆఫ్రికా యూరోపియన్ జాతుల ప్రతినిధి అయిన 63 ఏళ్ళ వాల్‌కాట్ నల్లజాతి ప్రజల అనుభవాలకు, ఆవేదనకు, ఆక్రోశానికి, ఆశలకు, కలలకు, సమానత్వం కోసం వారు జరిపే పోరాటానికి, విచక్షణపట్ల వారి నిరసనకు అక్షర రూపం ఇచ్చిన వెస్ట్ ఇండియన్ మహాకవి.

ఈయన సాహిత్యంలోని చరిత్రాత్మక దృక్పథం, బహుసంస్కృతుల నేపథ్యం, నిబద్ధత, కవితా సౌరభం, అద్భుతమైన శైలి ఈయనకు 1992 సాహిత్యంలో నోబెల్ బహుమతిని సంపాదించి పెట్టింది. నోబెల్ బహుమతి కన్నా ముందు జమైకా బహుమతి, గిన్నిస్‌బుక్ బహుమతులు కూడా ఈయనకు లభించాయి. ఈయన కవిత్వమూ, చిత్రకళ తండ్రి నుండీ, నాటకప్రక్రియను తల్లి నుండి వారసత్వంగా పొందాడు. ఆలోచన రేకెత్తించే అనేక కవితలనే కాక, వాల్‌కాట్ 30 నాటకాలను కూడా రచించాడు.

*నాగరాజ్*

**వాలాఫ్రిడ్, స్ట్రాబో (808-849) :** ప్రముఖ లాటిన్ రచయిత. 808 లో స్వాబియాలో జన్మించాడు. ఇతడు బెనెడిక్టైన్ పీఠాధిపతి, ఆస్తికుడు, కవి. ఇతని లాటిన్ రచనలు జర్మన్ కరోలింగియన్ సంస్కృతికి ముఖ్య ఉదాహరణలు. ఫ్రాంకోనియాలోని కాన్‌స్టన్స్ సరస్సు వద్ద గల రైచెనావ్ మఠంలో విద్యాభ్యాసం చేశాడు. ఫుల్డా మఠానికి చెందిన మిక్కిలి ప్రతిష్ఠ గల రెబానస్ మారస్ అనే గురువు వద్ద మరి కొంత విద్యార్జన చేసి, 829 లో చక్రవర్తి లూయీ కుమారుడైన 'ఛార్లెస్ ది బాల్డ్' గురువుగా నియమితు డయాడు. ఆస్థానంలో అతని సేవలకు ప్రతిఫలంగా 838 లో రైచెనావ్ మఠాధిపతి పదవిని పొందాడు. చక్రవర్తి లూయీ పుత్రుల రాజ్యాధికారపు పోరాటంలో మొదటి లోథయిర్‌ను బలపరిచిన కారణంగా 839 లో జర్మన్ లూయీచే దేశ బహిష్కార దండనకు గురి అయాడు. 842 లో లోథయిర్ ఓటమి పొందినప్పుడు తిరిగి రెచెనావ్ మఠాధిపతిగా పునః ప్రతిష్ఠితుడై జర్మన్ లూయీ తరఫున ప్రత్యేకదూతగా 'ఛార్లెస్ ది బాల్డ్' వద్ద ఉన్నాడు.

వాలాఫ్రిడ్ సమకాలీనులు అతని కవిత్వం కంటె ఎక్కువగా అతని ఆస్తిక భావాలను, రచనలను ఆదరించారు. విఖ్యాతి చెందిన అతని ఆస్తిక రచన *లిబర్ డి ఎక్సోర్డిస్ ఎట్ ఇంక్రిమెంటిస్ క్వారండమ్ ఇన్ అబ్సర్వేషన్ బస్ ఎక్లెసియాస్టిసిస్ రీరమ్* (841; Book on the Origins and Development of Certain Matters in Church Practice) లో కరోలింగ్ మత సంప్రదాయాలకు, మత పాలనా వ్యవహారాలకు సంబంధించిన విలువైన సమాచారం పొందు పరచబడింది.

826 లో రైచెనావ్‌లో యువ సన్యాసిగా ఉన్నప్పుడు తన తొలి గురువు వర్ణించిన పారలౌకిక అనుభవాల్ని గూర్చి *విసియో వెట్టిని* (The vision of Wettin) అనే పద్య రచన చేశాడు. డాంటే వ్రాసిన *డివైన్ కామెడీ* లో వలె *విసియో వెట్టిని* లో స్వర్గ నరకాలను గూర్చి, మరణానంతరం జరిగే ఆత్మశుద్ధీకరణ గూర్చి వివరించబడింది. తరువాత కాలంలో వాలాఫ్రిడ్ వ్రాసిన ప్రధానగ్రంథం *లిబర్ డి కల్చురా హార్టోరం* (Book on the Art of Gardening). దీనిలో 23 రకాల పుష్పాలను, మూలికలను, వాటి పౌరాణిక, మతసంబంధ ప్రాముఖ్యాన్ని, వాటి ఔషధ గుణాలను విపులంగా చర్చించాడు. వాలాఫ్రిడ్ ఇతర రచనలలో *డె ఇమాజిన్ టెట్రిసి* (On the Statue of Theodoric) అనే పద్యం, ప్రముఖ ఫ్రాంకిష్ చరిత్రకారుడు ఎయిన్ హార్డ్ వ్రాసిన *లైఫ్ ఆఫ్ ఛార్లెమాగ్నె* (Life of Charlemagne) కు చేసిన సవరణ పేర్కొనదగినవి. శైలీ సౌలభ్యం, చారిత్రక వాస్తవికతల దృష్ట్యా మధ్య యుగపు జీవిత చరిత్రలన్నిటిలో అతి ముఖ్యమైనదిగా ఇతని ఛార్లెమాగ్నె పరిగణించబడింది.

వాలాఫ్రిడ్ పద్యకావ్యాలను ఎర్నెస్ట్ డమ్లర్ (1884) విమర్శనాత్మకంగా ప్రచురించాడు. జె.పి. మిగ్నే సంపాదకత్వంలో ప్రచురితమైన పాట్రొలాగియా లాటినా (Patrologia Latina) గ్రంథమాలలో 113-114 భాగాలలో వాలాఫ్రిడ్ రచనల సమీక్షలు ఉన్నాయి (1879).

వాలాఫ్రిడ్, స్ట్రాబో 849 ఆగస్టు 18 న రైచెనావ్‌లో స్వర్గస్థు డయాడు.

*ఎమ్.గు.రా.*

**వాలె ఇంక్లాన్, మరియా డెల్ (1866-1936):** శ్పానిష్ నవలా రచయిత, కవి, నాటకకర్త 1866 అక్టోబర్ 28 న స్పెయిన్‌లోని 'విలనోవాడి ఆరోసా' లో జన్మించిన వాలె ఇంక్లాన్ న్యాయశాస్త్రం అభ్యసించి మాడ్రిడ్‌లో స్థిరపడ్డాడు. ఇతడు ఎన్నో సార్లు మెక్సికోలో పర్యటించాడు. తరువాత రాజకీయాలలో ప్రవేశించి *ప్రైమో డీ రివేరా* (Primo de Rivera) నియంతృత్వాన్ని వ్యతిరేకించాడు. తత్ఫలితంగా 1929 లో

జైలుశిక్ష అనుభవించాడు. ఆ తరువాత కొంత కాలానికి 1936 జనవరి 5 న 'శాంటియాగో' లో మరణించాడు.

కవిగా, నాటకకర్తగా, నవలా రచయితగా తాను ప్రకటించిన ప్రతిభా విశేషాలవల్ల వాలె ఇంక్లాన్ రెండవ రిపబ్లిక్ కాలంలో రోమ్ లోని శ్పానిష్ అకాడమీ ఆఫ్ ఫైన్ ఆర్ట్ కు డైరెక్టరుగా నియమితు డయాడు. ఇతని కవిత్వం, నాటకాలు "మోడర్నిస్ట్" సంప్రదాయానికి చెందినవి. ఇతని వచన రచనలు ప్రసన్న గంభీరమైనవి. 1905 లో ఇతడు ప్రచురించిన *సోనాటాస్* స్వీయచరిత్రాత్మక రచన. ఇతని వచన శైలికి ఇది ఒక మచ్చు తునుక. ఇతడు 1920 లో *లైట్స్ ఆఫ్ బొహీమియా*, 1921 లో *డాన్ ఫ్యూరియోలెరాస్ హార్న్స్* అనే ఉత్తమ నాటకాలను రచించాడు. ఇతడు రచించిన ఈ నాటకాలలో శ్పానిష్ ప్రజల కష్టాలను, కడగండ్లను వారి విషాద భరిత జీవితాలను అద్భుతంగా చిత్రించాడు.

1926 లో ప్రచురించబడ్డ *ది స్టోరీ ఆఫ్ ఏ డిక్టేషన్* అనే వచన రచన ఇతనికి విశేషఖ్యాతి నార్జించి పెట్టింది.

ఉమారాణి.

**వాలెహో, సెజార్ (1892-1938) :** పెరూవియన్ కవి. సామాజిక పరివర్తనను కాంక్షించే అభ్యుదయవాది. శ్పానిష్ అమెరికన్ సాహిత్య చరిత్రలో ప్రత్యేక స్థానాన్ని పొందిన మహాకవి.

1862 మార్చి 16 న పెరూలోని శాంటియాగోలో ఒక సనాతన కుటుంబంలో జన్మించాడు. వాలెజో తన తల్లిదండ్రులకు 11 వ సంతానం. బాల్యం నుండి దుర్భర దారిద్ర్యాన్ని, ఆకలి దప్పులను ప్రత్యక్షంగా అనుభవించాడు. ఎన్నో కష్టాల కోర్చి ఇతడు త్రుజిలో విశ్వవిద్యాలయంలో సాహిత్యాన్ని అభ్యసించి *రొమాంటిసిజమ్ ఇన్ కాస్టిలియన్ పొయెట్రీ* అనే అంశంపై ఒక సిద్ధాంత వ్యాసం ప్రచురించాడు.

1918 లో *ది బ్లాక్ హెరాల్డ్స్* అనే పుస్తకం ప్రచురించాడు. ఆ తరువాత ఇతడు రాజకీయాలలో ప్రవేశించి దాదాపు మూడు నెలల జైలు శిక్ష కూడా అనుభవించాడు. ఆ తరువాత తనకు కలిగిన మాతృవియోగం అతనిని మానసిక క్షోభకు గురిచేసింది. ఆ తరువాత 1922 లో *మ్యూజికల్ స్కేల్స్* అనే ఒక కథా సంకలనాన్ని ప్రచురించాడు. ఇందులో చాలా కథలు తాను జైలు శిక్ష అనుభవిస్తున్న రోజులలో వ్రాసినవే. కవిత్వంలో ఇతడు చేసిన ప్రయోగాలు స్పానిష్ అమెరికన్ కవిత్వ చరితలో ప్రముఖ స్థానాన్ని ఆక్రమిస్తాయి. ఇతడు వాడిన నూతనశైలి, ప్రతీకలు, ఇమేజరీ నూతన పదాల సృష్టి తరువాత కవులనేకులపై ప్రభావం చూపాయి. 1923 లో *శావేజ్ స్టోరీ* అనే మనోవిశ్లేషణాత్మకమైన నవలను ప్రచురించి ఆ తరువాత పారిస్‌కు వెళ్లాడు. పారిస్‌లో అతనికి జీవనం గడవటం చాలా కష్టమైపోయింది. పలు రకాల అనువాదాలు చేసి, పిల్లలకు పాఠాలు చెప్పి కొన్ని రాజకీయ వ్యాసాలు ప్రచురించి, ఎలాగో కొంతకాలం పొట్ట పోసుకొన్నాడు. అయినా ఇతడు పెరూ తో సంబంధాలు మాత్రం పూర్తిగా తెంచుకోలేదు. పారిస్‌లో ఉంటూనే "పెరూ" నుంచి వెలువడే *ఎమౌటా* అనే ప్రఖ్యాత జర్నల్‌లో వ్యాసాలు వ్రాసేవాడు. 1927 లో ఇతడు వ్రాసిన ఒక వ్యాసం వలన కవిత్వంపై ఇతనికి గల భావాలు మనకు వ్యక్త మవుతాయి. కవిత్వ భాష సూటిగా, స్పష్టంగా, స్వచ్ఛంగా ఉండాలనీ, సంప్రదాయబద్ధమైన, అలంకార ప్రాయమైన భాషను విడనాడాలనీ ఇతని అభిప్రాయం. సాహిత్యానికి, ముఖ్యంగా కవిత్వానికి ఒక సామాజిక ప్రయోజనం ఉండా లనీ, అది సామాజిక పరివర్తనకు దోహదం చేసేదిగా ఉండా లనీ అతని ఉద్దేశ్యం. పారిస్‌లోని **అనేక కళాకారులతో** ఇతడు సంబంధం ఏర్పరచుకొని **సాహిత్య** కళా రంగాలతో జరిగిన వివిధ సదస్సులలో, సమావేశాలలో పాల్గొన్నాడు. ఇతనికి మార్క్సిజంపై మక్కువ ఎక్కువ. 1928-29 ల మధ్య కాలంలో ఇతడు రష్యాను సందర్శించాడు. దానితో కమ్యూనిజంపై ఇతని కున్న నమ్మకం మరింత బలపడింది. తత్ఫలితంగా 1931 లో కమ్యూనిస్ట్ పార్టీలో చేరాడు. అయితే ఇతనికి గల రాజకీయ అభిప్రాయాల వల్ల పారిస్‌నుండి బహిష్కరించబడ్డాడు. దానితో తిరిగి మాడ్రిడ్ వెళ్ళాడు. 1931 లో ఇతడు *రష్యా ఇన్ 1931* అనే గ్రంథాన్ని రచించాడు. అదే సంవత్సరంలో *టంగ్‌స్టన్* అనే ఒక నవలను కూడా ప్రచురించాడు. పెరూవియన్ సమాజంలోని ప్రజల బాధలను ఇందులో చక్కగా వర్ణించాడు. ఇతని ఇతర రచనలలో ముఖ్యమైనది *హ్యూమన్ పోయెమ్స్*. ఇతని మరణానంతరం ఇవి ప్రచురించబడ్డాయి. వివిధ రంగాలలో నిష్ణాతుడయిన వాలెహో 1938 ఏప్రిల్ 15 న పారిస్‌లో మరణించాడు.

- ఉమారాణి

**వాల్టెర్ వాన్ డెర్ వోగెల్ వైడ్ (1170-1230):** మధ్య యుగాలనాటి జర్మన్ మహాకవి. 1170 వ సంవత్సరంలో జన్మించాడు. ఇతని కవిత్వం సాంఘిక, వ్యక్తిగత జీవితాల మధ్య ఉండవలసిన సమతౌల్యాన్ని చాటి చెబుతుంది. దీనికి వ్యతిరేకులైన వ్యక్తులను, చర్య

లను, నమ్మకాలను వాల్టెర్ తన కవిత్వంలో ఖండించాడు. వాల్టెర్ తన అభిప్రాయాలకు అడ్డు వచ్చే వ్యక్తులు ఎంత గొప్ప వారయినా వారిని గౌరవించలేక పోయేవాడు. చివరకు 'పోప్' కూడా ఈ కవి కోపానికి గురి అయాడు.

వాల్టెర్ జన్మస్థలం ఖచ్చితంగా ఎవరూ నిర్ధరించ లేదు. సమకాలీనులైన ఇతర కవు లిచ్చిన 'హెర్' బిరుదం వల్ల ఇతడు యోధుల కుటుంబంలో పుట్టి ఉండవచ్చు నని ఊహించబడింది. వాల్టెర్ సాధారణ విద్యను ఒక విద్యాపీఠంలో అభ్యసించాడు. ఆస్ట్రియా రాజయిన 5 వ లియోపాల్డ్ ఆస్థానంలో కవిత్వపు లోతుపాతులను గ్రహించాడు. తరువాతి కాలంలో 6 వ లియోపాల్డ్ పాలనాధికారాన్ని చేజిక్కించుకొనగా అతని మన్ననను వాల్టెర్ పొందలేకపోయాడు. 1197 లో 6 వ హెన్రీ చక్రవర్తి మరణానంతరం రాజరికం కోసం వెల్ఫ్‌వాదులకు, హోహెన్ స్టాఫెన్‌వాదులకు మధ్య జరిగిన వారసత్వపు పోరాటంలో స్వాబియా అధిపతి అయిన హోహెన్ స్టాఫెన్ ఫిలిప్‌కు అనుకూలంగా వ్రాసి అతని ఆశ్రయం పొందాడు. అనంతర కాలంలో వెల్ఫ్ పక్షీయుడైన 3 వ ఇన్నొసెంట్ అధికారం పొందినప్పటినుండి వాల్టెర్ కవిత్వంలో పోప్‌కి వ్యతిరేక ధోరణులు చోటుచేసుకొన్నాయి.

హోహెన్ స్టాఫెన్ ఫిలిప్ తన పట్ల చూపిన ఉదాసీనతకు కలత చెందిన వాల్టెర్ 1212 వరకు ఎందరో మంది రాజులను సేవించాడు. 1212 లో వెల్ఫ్ చక్రవర్తి 4 వ ఓటో కు, 3 వ ఇన్నొసెంట్ కు మధ్య జరిగిన పోరాటంలో 4 వ ఓటోను బలపరిచాడు. ప్రతిఫలంగా తానూహించిన గౌరవాలను ఓటో చక్రవర్తి నుండి కూడా పొందలేక పోయాడు. అదే సంవత్సరంలో 2 వ ఫ్రెడరిక్ హోహెన్ స్టాఫెన్ వర్గీయుల తరపున కిరీటాన్ని అభిలషించినపుడు అతనికి అనుకూలుడుగా మారాడు. 1215 లో 2 వ ఫ్రెడరిక్ రాజ్యాధికారాన్ని పొందగా వాల్టెర్ అతనినుండి లబ్ధి పొందాడు. వాల్టెర్ శేషజీవితం వుర్జ్‌బర్గ్‌లో గడిపినట్లు 14 వ శతాబ్దానికి చెందిన రికార్డులు ఆధారంగా ఊహించబడింది.

వాల్టెర్ వ్రాసిన దాదాపు 200 పద్యాలలో సగం వరకూ రాజకీయ, నీతి ప్రబోధక, మతసంబంధ రచనలు, మిలిగినవి ప్రేమ గీతాలు. అతడు మత సంబంధ పద్యాలలో సృష్టికర్తయైన దేవుని పట్ల మానవుడు చూపవలసిన భక్తి తాత్పర్యాలను గూర్చి తెలిపాడు. నీతి ప్రబోధ పద్యాలలో మానవునిలోని విశ్వాసం, నిష్కాపట్యం, దాతృత్వం, క్రమశిక్షణ మొదలైన వాటి ఔన్నత్యాన్ని కీర్తించాడు. ప్రేమకవిగా రాజాస్థానాలలోని ప్రేమగాథా వర్ణనలు చేశాడు. కాని *ఉంటెర్ డెర్ లిండెన్* వంటి పద్యాలలో స్వేచ్ఛారీతిలో గ్రామీణ జనుల సహజమైన అనురాగాలను వర్ణించాడు.

వాల్టెర్ క్రీ.శ. 1230 లో వుర్జ్‌బర్గ్‌లో పరమపదించాడని చరిత్రకారులు భావిస్తున్నారు.

ఎస్.గు.రా.

**వాల్పోల్, హోరెస్ (1717-97)** : ఆంగ్ల రచయిత, కళాభిమాని, గ్రంథ సంగ్రహణాభిలాషి. ఇతడు 4 వ ఆక్స్‌ఫర్డ్ రాకుమారుడు. అసలు పేరు హొరేషియో వాల్పోల్. 1717 సెప్టెంబర్ 24 న లండన్ లో జన్మించాడు. అతని మధ్య యుగపు 'హారర్' కథ *ది కేజిల్ ఆఫ్ ఒట్రాంటో* (The Castle of Otranto) చాలా పేరు పొందిన రచన. దీనిలో గోథిక్ ప్రణయ గాథావర్ణన ఉంది. ఆంగ్ల సాహిత్యంలోని లేఖా రచయితలలో కూడా వాల్పోల్ ప్రసిద్ధుడు.



ప్రధానమంత్రి సర్ రాబర్ట్ వాల్పోల్ చిన్న కుమారుడయిన హోరెస్ వాల్పోల్ ఈటన్‌లోనూ, కేంబ్రిడ్జ్‌లోని కింగ్స్ కాలేజిలోనూ విద్యాభ్యాసం చేశాడు. 1739 లో ఈటన్ స్కూలులో చదువుకునే రోజులలో (తరువాతి కాలంలో కవిగా విఖ్యాతుడైన) థామస్‌గ్రే అతని సహవిద్యార్థిగా ఉండేవాడు. ఫ్రాన్స్, ఇటలీలలో జరిపిన ఒక యాత్రలో వారిద్దరూ పోట్లాడుకొని విడిపోయారు. అనంతరం పశ్చాత్తప్తులై తమ స్నేహాన్ని పునరుద్ధరించుకొన్నారు. వాల్పోల్ తన జీవిత కాలమంతా థామస్ గ్రే కవిత్వాభిమానిగా ఉన్నాడు. 1741 లో ఇంగ్లండుకు తిరిగి వచ్చిన తరువాత ఇంగ్లండు పార్లమెంటుకు ఎన్నికయాడు. 1768 వరకు క్రమం తప్పకుండా పార్లమెంటు సమావేశాలకు హాజరవుతున్నా పెద్దగా గుర్తింపు పొందలేక పోయాడు. 1791 లో రాబర్ట్ వాల్పోల్ మనుమని ద్వారా ఈ వాల్పోల్‌కు 'పీరేజి' (యోధత్వ బిరుదు) సంక్రమించింది. జీవితాంతమూ అవివాహితుడుగా ఉండిపోయిన వాల్పోల్ మరణం తరువాత వారి

కుటుంబంలో వారసత్వంగా వచ్చే 'ఎర్లడమ్' అంతరించి పోయింది.

వాల్పోల్ జీవితంలోని ముఖ్య సన్నివేశాలలో పేర్కొనదగినవి అతని వ్యక్తిగత స్నేహాలూ, 1747 లో అతడు ట్వికెన్‌హామ్‌లో సంపాదించుకొన్న ఒక పెద్ద భవంతి మాత్రమే. ఈ భవనం 'సూడో గోథిక్' కళారూపంగా మలచబడి స్ట్రాబెరీ హిల్ పేరుతో ప్రసిద్ధి కెక్కింది. ఈ భవనాన్ని అనేక చిత్రాలతోను, అపూర్వ కళారూపాలతోను అలంకరించాడు. ఒక విలువైన గ్రంథాలయాన్ని సమకూర్చాడు. ఈ భవనం ఒక ముద్రణాలయాన్ని కూడా నెలకొల్పుకొన్నాడు. ఈ భవనంలో తన రచనలను, తన స్నేహితుల రచనలను అచ్చువేయించేవాడు. 1757 లో థామస్ గ్రే కవితలను ఇక్కడే ముద్రించాడు. స్ట్రాబెరీ హిల్ భవంతి గోథిక్ కళా పునరుజ్జీవనానికి, ఆంగ్ల వాస్తు నైపుణికి చిహ్నంగా వెలసింది.

వాల్పోల్ సాహిత్య సృష్టి బహుముఖం. 1765 లో అతడు వ్రాసిన *ది కేజిల్ ఆఫ్ ఓట్రాంటో* సమకాలీన సృజనాత్మక సాహిత్యానికి ప్రాతినిధ్యం వహిస్తుంది. వాల్పోల్ 1768 లో వ్రాసిన *మిస్టీరియస్ మదర్* ఒక విషాద భరితమైన కథ. ఈ నవల అంతా వావి వరుసలు లేని కాముకత్వం ప్రధానాంశంగా సాగింది. వాల్పోల్ రచించిన *హిస్టారిక్ డౌట్స్ ఆన్ ది లైఫ్ అండ్ రెయిన్ ఆఫ్ కింగ్ రిచర్డ్ ది థర్డ్* (1768), చిత్రకళాచరిత్రను వివరించే *అనెక్‌డోట్స్ ఆఫ్ పెయింటింగ్ ఇన్ ఇంగ్లండ్* (Anecdotes of Painting in England, vol. 4; 1762-71) కూడా పేర్కొనదగినవి.

వాల్పోల్ ముఖ్య రచనలన్నీ అతని మరణానంతరం ప్రచురించబడ్డాయి. వాల్పోల్ వ్యక్తిగత లేఖాసాహిత్యంలో దాదాపు 3000 ఉత్తరాలున్నాయి. వీటిలో చరిత్ర, సమకాలీన ప్రజల అభిరుచులు, ఇష్టానిష్టాలు వంటి సమాచారం లభిస్తుంది. 1626-96 ల మధ్య మేడమ్ డీ సెవిగ్నె వ్రాసిన లేఖా సాహిత్యం వల్ల ప్రేరితుడై వాల్పోల్ లేఖా రచనను ఒక కళగా అభ్యసించాడు. వాల్పోల్ వ్రాసిన ఉత్తరాలలో చాలా వరకు హోరేస్ మన్‌కు వ్రాసినవే. బ్రిటిష్ రాయబారి అయిన హోరేస్ మన్‌ను వాల్పోల్ తన విస్తృత యాత్రాకాలంలో కలుసుకొన్నాడు. తిరిగి ముఖాముఖి వారెన్నడూ కలసికోలేకపోయినా ఆ పరిచయాన్ని పురస్కరించుకొని వర్ధితమైన వారి స్నేహం 45 సంవత్సరాలు కొనసాగి, వాల్పోల్ చేత ఉత్తమ లేఖా సాహిత్య సృష్టి చేయించింది.

డబ్ల్యు.ఎస్. లెవిస్ మున్నగు వారి సంపాదకత్వంలో వాల్పోల్ *లేఖా సాహిత్యం* 42 సంపుటాలుగా వెలువడింది (1937-80). వాల్పోల్ వ్రాసిన *మెమొయిర్స్* (Memoirs, జ్ఞాపకాలు; 1822-59) జార్జిII, జార్జి III కాలపు రాజకీయ సంఘటనలకు గ్రంథ రూపాలు. వాల్పోల్ 1797 మార్చి 2 న కీర్తి శేషుడయాడు.

ఎమ్.గు.రా.

**విటియర్, జాన్ గ్రీన్‌లీఫ్ (1807-93)** : అమెరికన్ రచయిత. అమెరికాలోని మసాచుసెట్స్ రాష్ట్రానికి చెందిన హేవర్ హిల్ దగ్గర 1807 డిసెంబర్ 17 న విటియర్ జన్మించాడు. విటియర్ బానిస విధాన వ్యతిరేకి.

విటియర్ ప్యూరిటన్, క్వాకర్ విశ్వాసాలు గల ఒక కుటుంబానికి చెందిన వ్యవసాయక్షేత్రంలో జన్మించాడు. జిల్లా స్కూలులోనూ, హేవర్ హిల్ అకాడెమీలోనూ విద్యాభ్యాసం చేశాడు. తొలి రోజులలో బర్న్స్, బైరన్, స్కాట్‌ల రచనల పట్ల ఉత్సాహాన్ని కనబరచేవాడు. తరువాతి కాలంలో స్పెన్సర్, షేక్స్పియర్, మిల్టన్, మార్వెల్‌లనూ; చివరగా వర్డ్స్‌వర్త్, కోలెరిడ్జ్, లాంబ్‌లనూ అభిమానించాడు. స్వేచ్ఛా ప్రీతిని, సక్రమమార్గ జీవనాన్నీ చాటిన మిల్టన్ కవిని ఆరాధించాడు. కవిగా, పాత్రికేయుడుగా (1826-32), బానిస విధాన వ్యతిరేక ఉద్యమకారునిగా (1833-42), రచయితగా, మానవతావాదిగా (1843-65), క్వాకర్ రచయితగా (1866-92) విటియర్ ఖ్యాతి నార్జించాడు.

బానిస వ్యతిరేకోద్యమ రచయిత విలియం గారిసన్ రచనల ప్రేరణతో ఉత్సాహపూరితుడై విటియర్ విస్తృతంగా రచనలు చేశాడు. తండ్రి పదే పదే చెప్పటం వల్ల పాత్రికేయవృత్తిని స్వీకరించాడు. బోస్టన్, హేవర్ హిల్‌ల నుండి వెలువడే దినపత్రికలకు సంపాదకత్వం వహించాడు. హార్డ్‌ఫోర్డ్, కనెక్టికట్‌ల నుండి వెలువడే *న్యూ ఇంగ్లండ్ వీక్లీ* రివ్యూకు సంపాదకు డయాడు. ఈ సమయంలోనే పద్యాలు, స్కెచ్‌లు, కథలు వ్రాశాడు. 1831 లో *లెజెండ్స్ ఆఫ్ న్యూ ఇంగ్లండ్* అనే పద్య సంకలనాన్ని ప్రచురించాడు. 1832 లో తండ్రి మరణం కారణంగా ఇంటికి వెళ్ళిపోయాడు. సాహిత్య రంగంలో గుర్తింపు లేకపోవడం, ప్రేమ వైఫల్యం, అనారోగ్యం కూడా దీనికి తోడయాయి. కాని వ్యర్థ గర్వం వల్లనే తనకీ నిరాదరణలు ఎదురయాయని భావించి పూర్తిగా పరోపకార పారీణుడై గ్యారిసన్ బానిసత్వ వ్యతిరేకోద్యమంలో చేరాడు. అతని తీవ్రమైన కరపత్రం *జస్టిస్ అండ్ ఎక్స్‌ప్రెడియెన్సీ* బానిసత్వ వ్యతిరేకోద్యమంలో విటియర్‌కు

సుస్థిరస్థానం చేకూర్చింది. దాదాపు ఒక దశాబ్దం వరకూ ప్రముఖ బానిసత్వ వ్యతిరేకోద్యమ రచయితగా విటియర్ పేరు పొందాడు. మసాచుసెట్స్ శాసన సభలో కొంత కాలం సేవ చేశాడు. బోస్టన్, వాషింగ్టన్‌లలో ఖ్యాతిగల 'లాబీయిస్టు' అయాడు. 1836 తరువాత తల్లి, అత్త, చెల్లెండ్లతో కలసి ఆమెస్‌బరీలో నివసించాడు.

1843 లో గ్యారిసన్‌తో అభిప్రాయభేదా లేర్పడినా బానిసత్వ వ్యతిరేకులైన లింకన్ మొదలైన నాయకులను బలపరిచాడు. సాహిత్య పరంగా చైతన్యవంతుడయాడు. 1843 లో లోవెల్ క్రొత్త పత్రిక '*ది పయొనీర్*' లో *లేస్ ఆఫ్ మై హోమ్* ప్రచురించాడు. మరో రెండు దశాబ్దాల కాలంలో 8 పద్య సంపుటాలను ప్రచురించాడు. వాటిలో *సాంగ్స్ ఆఫ్ లేబర్* (1850), *మాడ్ ముల్లర్* (1854), *ది బేర్ ఫుట్‌బాయ్* (1855), *బార్బరా ఫ్రీయెట్చీ* (1863) ముఖ్యమైనవి. అతని వచన రచనలలో ఎక్కువ భాగం, అతని నవల *లీవ్స్ ఫ్రమ్ మార్గరెట్ స్మిత్స్ జర్నల్* Leaves from Margaret smiths journal, 1849) కూడా ఈ కాలంలోనే ప్రచురితమయ్యాయి. అనేక వ్యాసాలు, సమీక్షలు కూడా వ్రాశాడు. అమెరికా స్వాతంత్ర్య సంగ్రామ కాలంలో విట్టీయర్ కుటుంబ వైద్యుడు ఎలియాస్ వెల్డ్; చిన్ననాటి స్కూలు మాస్టరు జాషువా కాఫిన్; విట్టియర్ ముద్దుల చెల్లెలు ఎలిజబెత్ మరణించారు. ఆనాటి జాతీయ దుస్సంఘటనలు, వ్యక్తిగత దుఃఖాలు, విట్టియర్ మానసిక పరిణతిని మరింత వృద్ధి చేశాయి. 1866 లో విఖ్యాతమైన అతని పద్యం *స్నో బౌండ్* (snow bound), దాని తరువాత *ది టెంట్ ఆన్ ది బీచ్* (1867), *ఎమాంగ్ ది హిల్స్* (1868), *ది పెనిసిల్వేనియన్ పిల్‌గ్రిం* (1872) ప్రచురింపబడ్డాయి.

విటియర్ జీవిత కాలమంతా పేదరికంలోనే గడచినా *స్నో బౌండ్* అతనికి పదివేల డాలర్లను ఆర్జించి పెట్టింది. విటియర్ చనిపోయేనాటికి 1,34,000 డాలర్ల విలువగల ఆస్తిపాస్తులు ఉన్నాయి. బోస్టన్ సాటర్‌డే క్లబ్బులో విటియర్‌కు సభ్యత్వం ఉండేది.

విటియర్ 1893 సెప్టెంబరు 7 న మసాచుసెట్స్ వద్దగల హాంప్టన్‌ఫాల్స్ వద్ద పరమపదించాడు.

ఎమ్.గు.రా.

**వితోరినీ, ఎలియో (1908-66) :** ఇటాలియన్ నవలా రచయిత, అనువాదకుడు, సాహితీ విమర్శకుడు. 1908 జూలై 23 న సిసిలీలోని సిరాక్యూస్‌లో జన్మించాడు. 20 వ శతాబ్దపు మానవుని సాంఘిక, రాజకీయ, వేదాంత భావనలకు, ఫాసిస్టు అనుభవాలకు దర్పణం పట్టే ప్రఖ్యాత ఇటాలియన్ నవ్య వాస్తవిక నవలలు రచించాడు. *సీసేర్ పావేస్* వ్రాసి ఆంగ్ల, అమెరికన్ రచయితల రచనలకు ఇటాలియన్ అనువాదాలను అందించటంలో మార్గదర్శకు డయాడు.

వితోరినీ ఒక రైల్వే ఉద్యోగి కుమారుడు. 17 సంవత్సరాల వయస్సులో స్కూలు వదలి పెట్టాడు. ఉత్తర ఇటలీలో రోడ్లు వేసే కార్మికుడుగా చేరాడు. ఫ్లోరెన్సుకు వెళ్ళి ప్రూఫురీడరుగా పనిచేస్తూ ఆంగ్లభాషను నేర్చుకొన్నాడు. సొలారియా అనే పత్రికలో చిన్న కథలు వ్రాసేవాడు. 1941 వరకూ అనువాదాలు చేస్తూ జీవితం గడిపాడు. విలియం సరోయన్, డి.హెచ్. లారెన్స్, ఎడ్గార్ అలెన్ పో, విలియం ఫాక్నర్, డేనియల్ డెఫో, ఎర్నెస్ట్ హెమ్మింగ్వే, టి.ఎస్. ఎలియట్, డబ్ల్యు.హెచ్. ఆడెన్, లూయిస్, మాక్‌నీస్‌ల రచనలను వితోరినీ ఇటాలియన్ భాషలోకి అనువదించాడు.

వితోరినీ తొలి నవల *ఇల్ గరొఫానొ రోసో* (1933-35, The Red Carnation, 1952). ఈ నవలలో యౌవనంలో అడుగు పెట్టబోతున్న ఒక బాలుని వ్యక్తిగత, విద్యా సంబంధి సమస్యలనే గాకుండా ఫాసిస్టు రాజకీయ విషపూరిత వాతావరణాన్ని కూడా వర్ణించాడు. 1936 లో విట్టోరిని తన ప్రముఖ నవల *కాన్వర్సేషియన్ ఇన్ సిసీలియా* (1941) వ్రాయటం మొదలు పెట్టాడు. దీని ఆంగ్లానువాదం *కాన్వర్సేషన్ ఇన్ సిసిలీ* అనే పేరుతో 1948 లో వెలువడింది. ఈ నవలలో వితోరినీ ఫాసిస్టు వ్యతిరేక భావాలను ప్రకటించాడు. ఈ నవల శక్తిని గుర్తించిన ఫాసిస్టు ప్రభుత్వం, *లెటరేట్యూరా* (1936-38) అనే పత్రికలో దీని సీరియల్ ప్రచురణపై నిషేధం విధించింది. ఒక 'ఇష్యూ' ను పూర్తిగా సర్క్యులేషన్ జరుగకుండా స్వాధీనపరుచుకొంది. 1942 లో ఈ నవల ప్రచురణ జరిగిన తరువాత ఫాసిస్టు ప్రభుత్వం వితోరినీని 1943 లో బంధించింది. జర్మన్ ఆక్రమణ తరువాత అతనిని వదలి వేశారు. కాని వితోరినీ ఫాసిజంపై తన పోరాటాన్ని ప్రతిఘటనోద్యమం ద్వారా కొనసాగించాడు.

యుద్ధానంతరం వితోరినీ రాజకీయ, సాంస్కృతిక పత్రిక అయిన *ఇల్ పొలిటెక్నికో* (1945-47) ను ప్రచురించాడు. మిలాన్ సాహిత్య త్రైమాసిక పత్రిక *ఇల్ మెనాబో* ను ఇటాలో కాల్వినో సహసంపాదకత్వంతో వెలువరించాడు. తరువాత ఒక పెద్ద ఇటాలియన్ ప్రచురణ సంస్థలో విదేశీ సాహిత్య విభాగానికి అధిపతి అయాడు.

విటోరినీ ఇతర ముఖ్య రచనలలో తన ప్రతిఘటనా నుభవాలను వివరించే *హోమిని ఏనో* (1945; Men and Non-men), దృష్టాంతాత్మక మార్క్సిస్టు నవల *ఇల్ సెంపియోన్ స్ట్రిజ్జా టోకియో ఆల్ ఫ్రెజుస్* (1947; The Twilight of the Elephant, 1951), మరొక దృష్టాంతాత్మక నవల *లేడొన్నెడి మెస్సినా* (1949; women on the road, 1961), విమర్శల సంకలన మైన *డయేరియో ఇన్ పబ్లికో* (1957; Public Diary), విటోరినీ మరణానంతరం ప్రచురించబడిన *లెద్యూ టెన్షన్ అపుంటి పెర్‌యునా ఐడిమొలా జియాడెల్లా లెటరేట్యురా* (1967; The two tensions; Notes for an Ideology of literature) లు పేర్కొనదగినవి.

విటోరినీ 1966 వ సంవత్సరం ఫిబ్రవరి 13 వ తేదీన మిలాన్‌లో మరణించాడు.

ఎమ్.గు.రా.

**విట్మన్, వాల్ట్ (1819-92) :** అమెరికన్ కవి, పత్రికా రచయిత, వ్యాసకర్త. 1855 లో ఈయన ప్రచురించిన *గడ్డి పోచలు* (Leaves of Grass) అనే కావ్యం అమెరికన్ సాహిత్య వీధులలో సరిక్రొత్త ధోరణులు తీసుకువచ్చింది. ఈకావ్యం మొదటి ప్రచురణలో ప్రచురణకర్త, గ్రంథకర్తల పేర్లు లేవు. అట్టమీద మాటుకు 'విట్మన్' ఫోటో ఉన్నది. ఈ కావ్యరచనకు ముందు 'విట్మన్' 36 సంవత్సరాలపాటు న్యూయార్క్ సిటీని, లాంగ్ ఐలండ్‌ను పరిశీలిస్తూ, అనేక ఉద్యోగాలు చేస్తూ గడిపాడు. షేక్స్‌పియర్ రచనలు, నాటక రంగం తన కావ్యానికి ఆలంబన అని 'విట్మన్' తెలిపాడు.



ఉదారత, ఏకతా భావన మొదలైనవి ముఖ్యంగా ఉండవలసినవని విట్మన్ అమెరికన్ పౌరులను ఈ కావ్యంలో ఉత్తేజపరచాడు. ఈ పుస్తకాన్ని అందుకొన్న ఎమర్‌సన్ (Emerson) ఇది ఉత్తమ హాస్యానికి, విజ్ఞతకు ప్రతీక అని అభివర్ణించాడు. 1856 లోనే ఈ పుస్తకం రెండవ ముద్రణకు వచ్చింది. దానిలో మరికొన్ని కొత్త పద్యాలు, విమర్శలు విట్మన్ చేర్చాడు.

1857-59 సంవత్సరాలలో విట్మన్ బ్రూక్లిన్ టైమ్స్ సంపాదక బాధ్యత వహించాడు. 1860 లో వచ్చిన మూడవ ముద్రణ *గడ్డి పోచలు* మరింత విస్తృతి పొందింది. 1861 సివిల్ వార్ తరువాత విట్మన్ కవితా స్వరూపం మారింది. 1865 లో ప్రచురించిన డ్రమ్‌టాప్స్ (రణ భేరులు) యుద్ధ ప్రమాదాలను, విలయాలను ప్రస్ఫుటపరిచింది. దీని రెండవ ముద్రణలో లింకన్ మీది విలాపగీతం (Degy) చేర్చబడింది. 1867 లో *గడ్డిపోచలు* నాలుగవ ముద్రణ అనేక సవరణలతో వెలువడింది. సమాజాన్ని ఆధ్యాత్మికం చేయవలెననే సంకల్పంతో ఈయన కొన్ని వచన రచనలు చేశాడు. జనంలో పరస్పర అవగాహన, మైత్రి పెంపొందించాలని, భ్రష్టమయిన ప్రభుత్వ పాలన రూపం మార్చాలని శ్రమించాడు. సాహిత్యం, కళలు మాత్రమే నిజమయిన మానవ సమాజ నిర్మాణానికి దోహదం చేస్తాయని విట్మన్ విశ్వసించాడు.

1860 తరువాత ఆయన రచనలకు మంచి ప్రాచుర్యం లభించింది. ఆయనను గురించి పలువురు విమర్శగ్రంథాలు కూడా వ్రాశారు.

*పాసేజ్ టు ఇండియా* (ఇండియాకు రహదారి) అనే బృహత్కావ్యంలో సూయజ్‌కాలువ అందరికీ అందుబాటులోనికి రావడం వంటి సూచనలు చేశాడు. ఈ కావ్యానికి ప్రపంచ విఖ్యాతి లభించింది.

1872 తరువాత 'విట్మన్' అనారోగ్యం పాలయాడు. 1876 తరువాత అమెరికాలో ఈయన కొంత ప్రతిఘటనను ఎదుర్కోవలసి వచ్చింది. అయినా కెనడా, ఇంగ్లండ్‌లలోని స్నేహితులు ఆయనను ఆదుకొన్నారు. 1884 లో అతికష్టం మీద *గడ్డిపోచలు* మరో ముద్రణ తీసుకురా గలిగాడు. దీని మీద సంపాదనతో కాండెన్ (Camden) లో ఇల్లు కట్టుకోగలిగాడు.

1888 లో క్రొత్తగా వ్రాసిన 62 పద్యాలతో *నవంబర్ లేస్* అనే ఒక సంకలనం తీసుకువచ్చాడు. అమెరికన్ ప్రజల సమగ్రోన్నతి కోసం ఈయన చేసిన రచనలు యీట్స్, ఎలియట్ వంటివారి మన్ననలు పొందాయి. విశ్వజనీనమైన విలువలు ప్రతిపాదించే రచనలు చేసిన 'విట్మన్' దాదాపు మరణించే వరకూ రచనలు చేస్తూనే ఉన్నాడు.

శ్రీవిరించి

**విడాల్, గోర్ (1925--) :** అమెరికన్ నవలా రచయిత, నాటక రచయిత, వ్యాసకర్త. రాజకీయ వ్యాఖ్యాత, టి.వి. రచయిత, నటుడు, నాటక విమర్శకుడు, వార్తా

పత్రికల వ్యవస్థాపకుడు, ప్రచురణాలయ సంస్థాపకుడు, కవి. సెంట్రల్ అమెరికా, యూరప్, ఉత్తర ఆఫ్రికాలలో విడాల్ విరివిగా పర్యటనలు చేశాడు.

న్యూ హామ్ షైర్ లోని ఫిలిప్స్ ఎక్సెటర్ అకాడమీ నుంచి పట్టభద్రుడు అయి అమెరికన్ సేనలో చేరాడు. *విల్లివా* (1946) *ఇన్ ఏ ఎల్లో వుడ్* (1947 తొలి రెండు నవలలూ బహుజన ఆదరం, ఆమోదం పొందాయి. తరువాతి నవలలు: *ది సిటీ అండ్ ది పిల్లార్* (1948), *ది సీజన్ ఆఫ్ కంఫర్ట్* (1949), *ఏ సెర్చ్ ఫర్ ది కింగ్* (1950), *డార్క్ గ్రీన్, బ్రైట్ రెడ్* (1950), *ది జడ్జ్‌మెంట్ ఆఫ్ పారిస్* (1952), *మెసయాలి* (1954). ఆ తరువాత విడాల్ నాటక రచయితగా కూడా ప్రసిద్ధి కెక్కాడు. టెలివిజన్‌కు, సినిమాలకు, రంగస్థలానికి నాటకాలు వ్రాశాడు.

1955-64 మధ్యకాలంలో చేసిన ఇతని ప్రసిద్ధమైన రచనలు: *విజిట్ టు ఏ స్మాల్ ప్లానెట్ ది బెస్ట్‌మాన్, ది కాటర్డ్ ఎఫేర్, ది స్కేప్‌గోట్, సడెన్లీ లాస్ట్ సమర్.* తరువాతి నవలలు: వాషింగ్‌టన్ డి.సి. (1967), *టూ సిస్టర్స్* (1970), *కల్కి* (1978), *క్రియేషన్* (1981).

చరిత్రాత్మక విషయాలపై వ్రాసిన మూడు నవలలు (1974-84) బహుళ ప్రచారం పొందాయి. విడాల్ వ్యంగ్యాత్మక నవలలను కూడా వ్రాశాడు. వివాదగ్రస్తమైన అంశాలపై వ్రాసిన వ్యాసాలు కూడా కొన్ని సంపుటాలుగా ప్రచురించ బడ్డాయి.

శ్రీవిరించి

**విన్నీ, ఆల్ఫ్రెడ్ విక్టర్, కోమ్ట్ డి (1797-1863):** ఫ్రెంచ్ కవి, నాటక రచయిత, నవలారచయిత. ఫ్రెంచ్ రొమాంటిక్ రచయితలలో అగ్రగణ్యుడు. 1797 మార్చి 27 న ఫ్రాన్సులోని లోచెస్‌లో జన్మించాడు. లార్డ్ బైరన్, థామస్ మూర్ కవుల పద్యాల శైలిని, సర్ వాల్టర్ స్కాట్ నవలా శైలిని ఫ్రెంచి సాహిత్యం లోకి తెచ్చిన మహనీయుడు విన్నీ.

విన్నీ ఫ్రెంచ్ విప్లవం కారణంగా సాధారణ స్థాయికి దిగజారిన ఒక కులీనుల కుటుంబంలో జన్మించాడు. విన్నీ జన్మించే సమయానికి అతని తండ్రి 60 ఏళ్ల వృద్ధుడు. 7 సంవత్సరాల యుద్ధంలో పాల్గొని పేరు పొందిన రిటైర్డు సైనికుడు. విన్నీ మాతామహుడు మర్క్విస్ డీబారొడిన్. ఇతడు రాయల్ నేవీలో 'కమెండోర్' పదవిలో ఉండేవాడు. విన్నీ పారిస్ నగరంలో పెరిగాడు. లైసీ బోనపార్టెలోని ఎకోల్ పాలిటెక్నిక్‌లో చదువుకొన్నాడు. నాటి యువకు లందరివలెనే విన్నీకి కూడా ఆయుధ ధారణపై మక్కువ ఉండేది. కుటుంబ సంప్రదాయానుసారంగా విన్నీ రాజసేవాభావంలో పెరిగాడు. 1814 లో బోర్‌బోన్స్ అధికారం లోకి వచ్చినప్పుడు 17 సంవత్సరాల యువకుడైన విన్నీ రాజరక్షకదళంలో రెండవ లెఫ్టినెంటుగా చేరాడు. 1822 లో మొదటి లెఫ్టినెంట్‌గాను, తరువాతి సంవత్సరంలో కెప్టెన్‌గాను పదోన్నతి పొందినప్పటికీ, అప్పటి నిర్యుద్ధసమయంలో తన మిలటరీ ఉద్యోగం పట్ల నిరాసక్తు డయాడు. సాహితీరంగంపై తన దృష్టి సారించిన విన్నీ చివరకు 1827 లో సైనికోద్యోగాన్ని వదులుకొన్నాడు. 1820 నాటికే అతని మొదటి పద్యం *లే బాల్* (Le Bal) ప్రచురిత మయింది. మరి రెండేళ్ళకు విన్నీ తొలి కవితా సంకలనం వెలువడింది. విక్టర్ హ్యూగో తాలూకు కన్సర్వేటివ్ సాహిత్య పత్రిక *లామ్యూస్-ఫ్రాన్యాయిస్* (La Muse Francaise) కు రచనలు చేశాడు. పారిస్ లోని గ్రంథ సమీక్షకులు ఈ క్రొత్త కవి ఆవిర్భావాన్ని అభినందించారు. విన్నీ వ్రాసిన *పోయెమ్స్ ఆంటిక్స్ ఎట్ మోడర్న్స్* (1826) విశేషాదరణ పొందింది.

విన్నీ కవితా రచనతో తృప్తిపడలేదు. తన కథా రచనా నైపుణ్యాన్ని *సింక్ మార్స్* (1826) అనే చారిత్రక నవలలో చూపాడు. రాజుకు ఆత్మీయుడైన మార్క్విస్ డి సింక్ మార్స్ అనే వ్యక్తి మరొక రాజోద్యోగి అయిన కార్డినల్ డి రై చెలియా చుట్టూ పన్నిన కుట్రను ఈ నవలలో వర్ణించాడు. ప్రఖ్యాత నవలా రచయిత వాల్టర్ స్కాట్ కూడా ఈ రచనను మెచ్చుకొన్నాడు. కాని నవలలో చారిత్రక వాస్తవాల వక్రీకరణ జరిగిందన్న సమీక్షకుల విమర్శలను దృష్టిలో ఉంచుకొని విన్నీ, 1829 లో నాల్గవ ముద్రణకు ముందుమాటను వ్రాస్తూ, కళ, చరిత్రల మధ్య గల సంబంధాన్ని గూర్చి వివరించాడు. షేక్స్‌పియర్ నాటకాలు *ఒథెల్లో, మర్చెంట్ ఆఫ్ వెనిస్* లకు ఫ్రెంచి భాషలో స్వేచ్ఛానుసరణలను వ్రాసి ప్రదర్శింపజేశాడు. యౌవన ప్రాయంలో విన్నీ ఆనందమయ జీవనుడుగా కనిపించేవాడు. భావకవి 'ఆల్ఫ్రన్స్ డిలా మెర్టిన్' కూడా విన్నీ రచనా నైపుణ్యాన్ని మెచ్చుకొన్నాడు. విక్టర్ హ్యూగో, ఛార్లెస్ సెయింట్ బొవేలు విన్నీని మిత్రునిగా ఆదరించారు. అయినప్పటికీ విన్నీ రొమాంటిక్ కవుల సంఘానికి కొంత దూరంగానే ఉన్నాడు. ఫ్రెంచ్ దేశపు సరస్వతిగా పిలువబడే రచయిత్రి 'డెల్ఫిన్ గే' తో విన్నీ స్నేహం చేశాడు. 1825 లో ఓలొరాన్‌లో పరిచయమైన ఒక ఆంగ్ల ధనికుని కుమార్తె 'లైడియా బన్బరీ' ని పెండ్లాడాడు.

1831 లో తొలగి పోయిన తన భ్రమను తెలుపుతూ *పారిస్* అనే పద్యం వ్రాశాడు. దీన్ని అతడు ఒక ఉన్నత దశ (Elevation) గా భావించాడు. తన చిన్ననాటి విశ్వాసాలు విచ్ఛిన్నం కావటం వల్ల మానసిక అశాంతికి లోనయాడు. ఒక దశలో అతని ఆలోచనలు ఆత్మహత్య వైపు కూడా సాగాయి. 1831-38 సంవత్సరాల మధ్య కాలంలో నటి డోర్వెల్ తో ప్రేమాయణం సాగించాడు. 1835 లో వ్రాసిన చాటర్టన్‌లో ఆమెకోసం కిట్టీ బెల్ అనే పాత్రను సృష్టించాడు. కాని ఆమె రచయిత అయిన జార్జ్ శాండ్‌తో సాన్నిహిత్యం పెంచుకొని విన్యీకి ద్రోహం చేసింది.

విన్యీ 1832 లో వ్రాసిన *స్టెల్లో* లో కవుల పట్ల రాజకీయ నాయకత్వాలు చూపే క్రూరత్వాన్ని, నిరాద రణను మూడు ఆఖ్యానాలుగా వర్ణించాడు. లూయీ చూపిన నిరాదరణ కారణంగా నికోలాస్ గల్బర్ట్ కవి ఎంతటి హీనస్థితిలో మరణించినదీ;, రిపబ్లికన్ నియంత అయిన రాబెస్పియర్రె యొక్క రాజకీయ ఉన్మాదం ఆంద్రె చెనియర్ కవిని ఏవిధంగా ఉరికంబానికి కెక్కిం చిందీ; లండన్ మేయర్ అయిన విలియం బెక్ ఫోర్డ్ ఆహంభావం థామస్ చాటర్టన్ కవిని ఆత్మహత్యకు ఎలా పురిగొల్పినదీ ఈ రచనల్లో అన్యాపదేశంగా వర్ణిం చబడ్డాయి. మానసిక విశ్లేషణాత్మకమైన తన రచన స్టెల్లోను నల్లజాతీయుడైన డాక్టర్ నోయిర్‌కు వినిపిం చాడు. అతడు విన్యీకి కవితా జీవితాన్నీ, రాజకీయ జీవితాన్నీ వేరు చేసి పరిశీలించవలసినదిగా సలహా ఇచ్చాడు.

స్టెల్లోలోని ఛాటర్టన్ ఆత్మహత్యా ఆఖ్యానాన్ని ప్రధా నాంశంగా తీసుకుని ఛాటర్టన్ అనే 3 అంకాల వచన నాటకాన్ని విన్యీ వ్రాశాడు. ఈ నాటకం నాటకరచయి తగా విన్యీకి కీర్తి నార్జించి పెట్టింది.

1835 లో వ్రాసిన *సెర్విట్యూడ్ ఎట్ గ్రాండ్యూర్ మిలిటైర్స్* (Servitude et grandeur militaires) లో కూడా ఛాటర్టన్, స్టెల్లోలలో కనిపించిన తీవ్ర నిరాశా వాదం గోచరిస్తుంది. 1836 లో ప్రేమ పట్ల గల అతని భ్రమలు తొలగి పోయాయి. కవితా వ్యాసంగం మానివేశాడు. 1837 లో తన పద్యాలను పునస్సమీ క్షించుకొన్నాడు. ఆ తరువాత దాదాపు అజ్ఞాతంగా జీవితాన్ని గడపాడు.

1841 లో హోనోర్‌డె బాల్జాక్, లామనైస్‌లతో కలిసి 'కాపీరైటు' ఉద్యమాన్ని నిర్వహించాడు. విన్యీ 1841 జనవరి 15 న *రివ్యూడేస్ డ్యూక్స్ మోండెస్* లో వ్రాసిన *డెమూడమోయిసెల్లె సెడెయిన్ ఎట్ డి లా ప్రాపిమెట్టీ లిటరైర్* అనే వ్యాసం గొప్ప చర్చనీయాం శంగా మారి, కాపీరైటు బిల్లు తయారు కావటానికి కారణం అయింది. సాహితీవేత్తల రక్షణకోసం ఉద్యమిం చిన విన్యీ 'అకాడమీ ఫ్రాన్సాయిస్' కు 1845 మే 8 న అతికష్టం మీద ఎన్నుకోబడ్డాడు. విన్యీ సాంఘికంగా వైఫల్యం పొందిన కవి. రెండవసారి రిపబ్లిక్‌గా అవతరిం చిన ఫ్రాన్స్ ప్రభుత్వం తరఫున లండన్‌లో సాంస్కృతిక రాయబారి పదవిగాని, ఛారెంటె సాహిత్య సంఘంలో పదవిగాని దక్కుతాయని విన్యీ ఆశించి విఫల మనోర థుడయాడు. 1839 లో దేశబహిష్కృతుడై లండన్‌లో తలదాచుకొన్న నెపోలియన్ III ను కలుసుకొన్నపుడు కూడా విన్యీకి తిరస్కారమే ఎదురైంది. ఈ వైఫల్యాలే అతని చేత *స్టెల్లో* వ్రాయించాయి.

చనిపోబోయే ముందు కొద్దిరోజులు విన్యీకి సంతృ ప్తికలిగించే ప్రేమానుభవం లభించింది. మరణశయ్యపై ఉన్న భార్య లైడియాను గూర్చిన దుఃఖంతో ఒకవైపు బాధపడుతున్న 60 ఏళ్ల విన్యీ హృదయానికి 'అగస్టాబో వర్డ్' అనే ఒక యువ ఉపాధ్యాయిని ప్రేమతో సేదదీర్చి ఊరట గలిగించింది. విన్యీ భార్య లైడియా పిల్లలను కనకుండానే మరణించింది. కాని బోవర్డ్ అతనికొక కొడుకును ప్రసాదించింది.

1863 సెప్టెంబరు 17 న విన్యీ పారిస్ నగరంలో మరణించాడు.

విన్యీ తన జీవిత కాలంలో గొప్ప గుర్తింపును, ఖ్యాతిని పొందలేక పోయినా తరువాతి తరాల రచ యిత లనేకులు అతని ఆలోచనలకు విలువ నిచ్చారు. ఛార్లెస్ బోద్లేర్, హెన్రీ డి రిగ్నెయిర్, ఛార్లెస్ పెగ్యే, ఆంద్రె బ్రెటన్, జూల్స్‌రాయ్ మొదలైన వారు విన్యీ మరణానంతరం దాదాపు ఒక శతాబ్దం తరువాత అతనికి అనుయాయులై అతని భావాలను అధ్యయనం చేశారు. పాశ్చాత్య దేశాన్ని ఊపివేసిన అధిభౌతిక విప్లవానికి సారథులైన తొలి విజ్ఞానులలో ఒకడుగా విన్యీ పేర్కొనదగిన వాడు.

ఎమ్.గు.రా.

**వియేరా, ఆంటోనియో (1608-1697)** : పోర్చు గీస్ గద్య రచయిత, జెస్యూట్ మిషనరీ వక్త. పోర్చు గీస్-బ్రెజిల్ చరిత్రలో ప్రధాన పాత్రధారి.

అతని రచనలు, ఉత్తరాలు, ప్రస్తావనలు 17 వ శతాబ్దంలో, పోర్చుగల్, బ్రెజిల్ దేశాల వాతావరణాన్ని తెలియ జేస్తాయి.

60 ఏళ్ల పనివాడుగా వియేరా తన తలిదండ్రులతో బ్రెజిల్‌కు వెళ్లాడు. 1635 లో మతాచార్యుడుగా నియమితుడయాడు. అనేక స్థానిక భాషలను నేర్చుకొని వాటిని అతడు మత ప్రచార సాధనాలుగా వాడాడు.

1641 వరకూ వియేరా ఇండియన్, నీగ్రో బానిసల మధ్య పనిచేశాడు. కింగ్ జాన్ IV ను అభినందించటానికి పోర్చుగల్ వెళ్లిన బృందంలో వియేరా కూడా ఉన్నాడు. అక్కడ రాజాదరం, అభిమానం పొందగలిగాడు. రాజ దర్బారులో పదవి సంపాదించాడు. అతడు రాజుకు ఎంతగా భక్తుడై పోయాడంటే, 1656 లో జాన్ రాజు చనిపోయిన తరువాత అతడు తిరిగి శాంతి సౌభాగ్యాలను పునఃస్థాపితం చేయటానికి వియేరా అవతరిస్తాడని ప్రగాఢంగా విశ్వసించేవాడు.

1646, 1650లలో వియేరా హాలండ్‌కు దౌత్య కార్యాల మీద వెళ్లాడు; ఫ్రాన్స్ ఇటలీలకు వెళ్లాడు. అయితే ఇతని అతిమంచితనం, సహనం, పోర్చుగల్లులోనే ఇతనికి ఎక్కువ మంది శత్రువులను తయారు చేసింది. 1652 లో తెలివిగా ఇక్కడ నుంచి బ్రెజిల్‌కు వెళ్లిపోయాడు. 1654 లో లిస్‌బన్‌కు వెళ్లాడు. పోర్చుగీస్ దేశంలో ఉన్నప్పుడు నీగ్రోల ఇండియన్ల సౌకర్యం కోసం అనేక రాజఫర్మానాలను సంపాదించగలిగాడు.

జాన్ రాజు తిరిగి వస్తాడని చెబుతూ ఉన్నందుకు 1665-67 లలో కారాగారవాసం చేశాడు. విడుదల అయాక రోమ్ వెళ్లాడు. 6 ఏళ్లు అక్కడ ఉండి రాజాశ్రయం, సాహిత్య ప్రతిపత్తి సంపాదించాడు. 1681 లో బాహ్లియాకు తిరిగి వచ్చి అక్కడి ప్రజల స్వాతంత్ర్యం కోసం మరణించే వరకూ పోరాటం సాగించాడు.

పోర్చుగీస్‌లోను, బ్రెజిల్‌లోను ఇతనికి సాహితీ వేత్తగా పేరు ప్రసిద్ధులు ఉన్నాయి. రచనా ప్రక్రియ ప్రాత ధోరణులకు చెందినా ఇతని ధైర్య స్థైర్యాలు, భావపటిమ, సహనం-ఇవన్నీ ముందు తరాలకు చెందినవి.

శ్రీవిరించి

**విలియమ్స్, టెన్నిసీ (1911-1983) :** సుప్రసిద్ధ అమెరికన్ నాటక రచయిత. ఈయన నాటకాలలో మానవజీవన వైఫల్యంతో, మితిమీరిన లైంగిక ప్రవృత్తితో, హింసతో కూడిన వాతావరణం ప్రధానంగా కనిపిస్తుంది. ఈయన అసలు పేరు థామస్ లేనియర్ విలియమ్స్. కొలంబియాలోని మిస్సోరి యూనివర్సిటీలోనూ, సెంట్ లూయిాలోని వాషింగ్టన్ యూనివర్సిటీలోనూ విద్యాభ్యాసం చేస్తున్న కాలంలోనే విలియమ్స్ నాటకాలను వ్రాయడం మొదలు పెట్టాడు. ఆర్థిక మాంద్యం రోజులలో సెంట్ లూయిాలోని ఒక చెప్పుల దుకాణంలో పనిచేస్తూ కూడా విలియమ్స్ నాటక రచన కొనసాగించాడు. చిన్న చిన్న నాటక సమాజాలవారు ఆయన రచించిన కొన్ని నాటకాలను ప్రదర్శించేవారు. ఆ ప్రోత్సాహంతో ఆయన అయోవా విశ్వవిద్యాలయంలో చేరి, నాటక రచనా కళను అధ్యయనం చేసి, 1938 లో బి.ఏ. పట్టాను పొందాడు.

1939 లో ఆయన రచించిన *అమెరికన్ బ్లూస్* అనే ఏకాంకికల సంకలనానికి గ్రూప్ థియేటర్ అవార్డు రావడంతో ఆయన నాటకాలకు మొదటి సారిగా గుర్తింపు లభించింది. అయినా విలియమ్స్ *ది గ్లాస్ మెనేజరీ* (1944) తో పూర్తి విజయం సాధించే వరకూ థియేటర్‌లో ప్రేక్షకులకు సీట్లు చూపే ఉద్యోగం మొదలు హాలీవుడ్‌లో చలన చిత్ర రచయిత వరకూ ఎన్నో ఉద్యోగాలు చేస్తూనే వచ్చాడు. *ది గ్లాస్ మెనేజరీ* అనే నాటకంలో విలియమ్స్ చితికి పోయిన ఒక దక్షిణాది కుటుంబాన్ని వాస్తవికత ఉట్టిపడేట్టు చిత్రించాడు. తన వెనుకటి కుటుంబ వైభవాన్ని తలచుకొని అధికారం చలాయించజూచే 'అమందా' అనే తల్లీ, నిరాశోపహతుడైన ఆమె కుమారుడు టామ్, అవిటితనంతో, సిగ్గరితనంతో బాధపడుతూ జంతువుల గాజు బొమ్మలు సేకరించి ఎప్పుడూ తన ఊహా ప్రపంచంలో విహరిస్తూ ఉండే తన చెల్లెలు లారాకు అతడు తగిన వరుణ్ణి అన్వేషిస్తూ ఉండడం ఈ నాటకంలో రసవత్తరంగా చిత్రించబడ్డాయి.



విలియమ్స్ రచించిన మరొక గొప్ప నాటకం *ఏ స్ట్రీట్ కార్ నేమ్డ్ డిజైర్* (1947). దానికి పులిట్జర్ బహుమతి వచ్చింది.

1953 లో విలియమ్స్ రచించిన *కామినో రియల్* అనే నాటకం విజయవంతం కాలేదు. దానిలో లార్డ్ బైరన్, డాన్ క్విక్సోట్‌లు కూడా పాత్రలుగా వస్తారు. కాని, 1955 లో అతడు రచించిన *కాట్ ఆన్ ఏ హాట్ టిన్ రూఫ్* గొప్ప విజయం సాధించి, పులిట్జర్ బహుమతిని అందుకోడమే గాకుండా, దానిని చలన

చిత్రంగా కూడా తీశారు. తరువాత *ది నైట్ ఆఫ్ ది ఇగ్వానా* (1961), *సడెన్లీ లాస్ట్ సమ్మర్* (1958), *స్వీట్ బర్డ్ ఆఫ్ యూత్* (1959) అనే నాటకాలు కూడా విజయవంతం అయాయి.

1960-70 మధ్య విలియమ్స్ తరచు అనారోగ్యానికి గురి అవుతూ వచ్చాడు. నిద్ర మాత్రలు మింగడం వలన, మద్యపానం వలన అతని ఆరోగ్యం పాడయింది. అనంతరం అతడు రచించిన నాటకాలు విజయవంతం కాలేదు. అవి: *వియెక్స్ కారే* (1977), *ఏ లౌలీ సన్ డే ఫర్ క్రీవ్ క్రోయెల్* (1978-79), *క్లోడ్స్ ఫర్ ఏ సమ్మర్ హోటెల్* (1950).

విలియమ్స్ *ది రోమన్ స్ప్రింగ్ ఆఫ్ మిసెస్ స్టోన్* (1950), *మోయిసే అండ్ ది వరల్డ్ ఆఫ్ రీజన్* (1975) అనే రెండు నవలలూ, కొన్ని వ్యాసాలూ, కవితలూ, చిన్నకథలూ, ఆత్మకథ, స్మృతులూ (1975) మొదలైన రచనలు కూడా చేశాడు. ఈయన నాటకాలు ప్రపంచంలోని వివిధ భాషలలోకి అనువదింపబడి ప్రదర్శింపబడ్డాయి.

బొ.శ్రీ.

**విలోన్, ఫ్రాన్స్వా (1431-63) :** ఫ్రెంచ్ గేయకర్త, వ్యక్తిగత జీవితం లో నేరస్థుడుగా పరిగణన పొంది, చాలా సంవత్సరాలు జైలులో గడపాడు; ఫ్రాన్స్ నుంచి బహిష్కృతుడయాడు.

చిన్న తనంలోనే తండ్రిని కోల్పోయాడు. 1449 లో పారిస్ యూనివర్శిటీ నుంచి పట్టభద్రుడు అయాడు. 1452 లో ఎం.ఏ. డిగ్రీ పొందాడు. 1455 లో ఒక చిలిపి తగాదాలో ఫిలిప్ సెర్మాయిస్ అనే మతాచార్యుని చంపి, అందుకుగాను దేశ బహిష్కరణ శిక్ష పొందినా 1456 లోనే రాజ క్షమాపణ పొందగలిగాడు. అయితే ఆ సంవత్సరాంతంలోనే మరో చిన్న నేరంలో ఇరుక్కొని, దేశ బహిష్కృతుడు అయాడు.

తన ఆస్తి పాస్తులన్నిటినీ ఇతరులకు ధారాదత్తం చేసేస్తున్నట్లు వ్యంగ్యాత్మకమైన కవిత *లే లాయిస్* (The legacy) వ్రాశాడు.

పారిస్ నుంచి ఆంగర్స్ అనే చోటుకు వెళ్లి ఛార్లెస్ డ్యూక్ ఆర్లీన్స్కు చెందిన ఎస్టేట్లో స్థావరం ఏర్పరచుకొన్నాడు. అక్కడ కూడా దురుసుతనపు కవిత్వం వ్రాసినందుకు జైలు అవస్థ తప్పలేదు. తరువాత, 1461 లో మరొక మారు జైలు శిక్ష అనుభవించాడు.

11 వ లూయీ చనిపోయిన సందర్భంలో జైలు వాసులందరినీ విడుదల చేయడంతో ఇతడు కూడా బయటకు వచ్చాడు. అప్పుడు సుదీర్ఘ కవిత్వం *లే గ్రాన్ టెస్టమెంట్* వ్రాశాడు. తన జీవిత పరామర్శ అంతా దీనిలో కనిపిస్తుంది.

1463 లో చివరి మారుగా విలోన్కి పదేళ్లపాటు పారిస్నుంచి బహిష్కార శిక్ష విధించబడింది. ఆ తరువాత అతనిని గురించిన సమాచారం తెలియదు.

అతని రచనల మీద మార్మిక వ్యాఖ్యానాలు అనేకం వచ్చాయి. సంప్రదాయ కవిత్వ రచనలో ఇతడు దిట్ట. మద్యపానం, వ్యభిచారం నుంచి భక్తి వరకు అన్నీ అతని రచనలలో కనిపిస్తాయి. జీవితం, మృత్యువులను గురించిన ప్రస్తావనలు, మానవాళిపట్ల అనుకంప, హృదయానికి సూటిగా హత్తుకునే ధోరణిలో విలోన్ తన కవిత్వాన్ని మలచగలిగాడు.

విలోన్ మధ్య యుగ కవులలో చివరిదశలోనివాడు. ఒక విమర్శకుడు చెప్పినట్లుగా అతని ధోరణిని, వైవిధ్యాన్ని అర్థం చేసుకోడం అంత సులభమైన పనికాదు.

శ్రీవిరించి

**విల్సన్, ఎడ్మండ్ (1895-1972) :** అమెరికన్ విమర్శకుడు, వ్యాసరచయిత. సాహితీవేత్తగా సమకాలికుల చేతనే ప్రామాణికుడుగా పరిగణింపబడ్డవాడు. ప్రిన్స్టన్ లో చదువుకొని, న్యూస్ పేపర్ రిపోర్టింగ్ నుంచి మేనేజింగ్ ఎడిటర్ దాకా ఎదిగాడు. 'వానిటీ ఫెయిర్' (1920-21) కు సంపాదకుడు. 1926-31 లలో *ది న్యూ రిపబ్లిక్*కు సంపాదకుడు. *ఆక్సెల్స్ కాజిల్* (1931) అనే పుస్తకం ప్రతీకావాద కవుల రచనలపై విమర్శగ్రంథం. రష్యన్ విప్లవానికి నాందీ ప్రస్తావనలు పలికిన భావుకుల చరిత్రలను వర్ణిస్తూ *టు ది ఫిన్లాండ్ స్టేషన్* అనే గ్రంథం వ్రాశాడు.



*ట్రావెల్ ఇన్ టు డెమోక్రసీస్* (1936), *ది ట్రిపుల్ థింకర్స్* (1938), *ది ఊండ్ అండ్ ది బౌ*, *ది బాయిస్ ఇన్ ది బాక్ రూం* (1941), *ది న్యూ యార్కర్* పత్రికకు విల్సన్ పుస్తక సమీక్షలు వ్రాశాడు.

రెండవ ప్రపంచ యుద్ధం తరువాత హీబ్రూ భాషతో పరిచయం ఏర్పరుచుకొని *ది స్క్రోల్స్ ఫ్రమ్ ది డెడ్ సీ* (1955) అనే పుస్తకం వ్రాశాడు. తరువాత చాలా పుస్తకాలు ప్రచురించాడు. నాటకాలు, కవిత్వము, కథానికలు ఇవన్నీ సంపుటాలుగా వచ్చాయి. తన స్నేహితుడు ఎఫ్. స్కాట్ ఫిజెరాల్డ్ రచనలను అతని మరణానంతరం సంపుటీకరించి ప్రచురించాడు.

వైవిధ్యం ఉన్న ఎన్నో అంశాలను విల్సన్ చర్చించాడు. అన్నిటిపైన సరళంగా, సూటిగా ఉండే వ్యాఖ్యానాలను చేశాడు. అమెరికన్ నవలా రచయితలకు ఇతని విమర్శక గ్రంథాలు ప్రామాణికాలు అయాయి.

శ్రీవిరించి

**విసెంటీ, గిల్ (1465-1536) :** పోర్చుగల్‌కు చెందిన ప్రముఖ నాటకకర్త, కవి. పోర్చుగీస్ భాషలోనే కాక స్పానిష్ భాషలోనూ రచనలు చేశాడు.

ఇతని ప్రారంభదశను గురించి ఇదమిత్థమని చెప్ప దగిన వివరాలు లేవు. ఇతని మొదటి రచన *ది హెర్డ్స్ మన్స్ మోనోలాగ్.* 1502 జూన్ 7 వ తేదీని (మూడవ) జాన్ పుట్టినరోజు సందర్భంగా ఈ నాటకం ప్రదర్శింప బడింది.

ఆ సంవత్సరం క్రిస్టమస్ సందర్భంగా మరొక నాటకం ప్రదర్శితం అయింది.

తరువాత 34 సంవత్సరాలు ఇతడు ఆస్థాన విద్వాంసుడుగా ఉన్నాడు. పండుగలకు, పర్వదినాలకు నాటకాలు ప్రదర్శింప జేస్తూ ఉండేవారు. జాతీయత, దేశప్రేమ ఇతని నాటకాలలో ప్రస్తావింపబడతాయి.

1512 లో కింగ్ మాన్యువల్ చనిపోయిన తరువాత, తాను ఆర్థికంగా చితికి పోయానని చెప్పుకొనేవాడు. అయితే రకరకాల పెన్షన్లు, మూడవ జాన్ చక్రవర్తి స్నేహం ఇతనికి అండగా ఉండేవి.

జీవితాంతం నాటక రచనకే అంకితమయి రాజులకు, ప్రజాసామాన్యానికి హృదయరంజక మైన రచనలు చేశాడు.

మొత్తం వ్రాసిన 44 నాటకాలలో, 11 స్పానిష్ భాషలో ఉన్నాయి. 14 పోర్చుగీస్‌భాషలో ఉన్నాయి. తక్కినవి మణిప్రవాళ భాషలో ఉన్నాయి. పాత్రోచితంగా ఇటాలియన్, ఫ్రెంచి, లాటిన్ భాషలు ఇతడు ప్రవేశపెట్టాడు. ఇతని నాటకాలను మత ప్రాతిపదికతో కూడినవి, మామూలుగా జనరంజక మయినవి, వ్యంగ్యంతో, ప్రణయ ధోరణులతో కూడినవి అని విభాగం చేయవచ్చును. వీటి ప్రదర్శనలలో ఎన్నో ఏర్పాట్లు జరిగేవి. ఉదాహరణకు పడవ రంగస్థలం మీదకు వచ్చేది.

1513-19 నడుమ వ్రాసిన నాటకాలలో హాస్య ప్రవృత్తి ఎక్కువ.

శ్రీవిరించి

**వీలండ్, క్రిస్టోఫ్ మార్టిన్ (1733-1813) :** రొకాకో (Rococo) రీతికి చెందిన జర్మన్ కవి, పండితుడు. హేతువాద, మనోవికాస రంగాల నుండి సంప్రదాయ వాద, (Classicism), కాల్పనిక కవితా యుగ ప్రారంభం వరకు ఆనాటి సాహిత్యంలో వచ్చిన, పోకడ కన్నిటికీ తన రచనలలో అద్దం పట్టిన మహనీయుడు.

తలిదండ్రుల నుండి అలవడిన ధార్మిక నిష్ఠ తానార్జించిన విద్య వల్ల బలపడి ఆయన తొలి రచనలను ప్రభావితం చేసింది. 1750-60 మధ్య ఈయన రచనలలో భక్తిభావన, పవిత్రత గోచరిస్తాయి. కాని 1760 లో బైబరాక్ పట్టణానికి వెళ్లినప్పటి నుండి జీవితాన్ని మరో దృక్పథాన్నుంచి కూడా చూడవచ్చునని ఆయన గ్రహించాడు. ఇహలోక ధర్మానికున్న ప్రాధాన్యాన్ని గుర్తిస్తూ తనలోని ఇంద్రియ పిపాసకు, ప్రాపంచికత్వానికి ప్రాధాన్యాన్నిస్తూ క్రమంగా హేతువాద మార్గాన్ని ఎన్నుకొన్నాడు. అప్పటి 'మైంజ్' ఛాన్సలర్ అయిన గ్రాఫ్ స్టాడియన్, ఆయన అనుచరులు ఫ్రెంచ్ సాహితీ రీతుల పట్ల చూపే మక్కువ, భోగలాలసత్వంతో కూడిన వారి జీవిత విధానాలు ఈ రచయితలోని ఈ మార్పుకు కొంత వరకు కారణమని చెప్పవచ్చు. భౌతికవాదం వైపుకు పయనించే తొలి దశలో కొన్ని కామవికారం కలిగించే కవితలను వ్రాసినా, త్వరలోనే ఇంద్రియ లోలత్వానికి, హేతువాదానికి మధ్య సమతౌల్యాన్ని సాధించటానికి కృషిసాగించి *గెషిష్తే డెస్ అగథాన్* (History of Agathon, 1773) అనే రెండు సంపుటాల ఉద్గ్రంథాన్ని రచించాడు. మనస్సు గతిని సాహిత్య పరంగా చిత్రించిన తొలి నవలగా దీనిని ప్రశంసించారు.

1762-66ల మధ్య 22 షేక్స్పియర్ నాటకాలను జర్మన్‌భాష లోకి ఈయన అనువదించాడు. *స్ట్రొం అండ్ డ్రాంగ్* (Storm and Stress) నాటక రచయితలమీద ఈ అనువాదాల ప్రభావం ఎంతైనా ఉంది. కొంత కాలం తత్త్వశాస్త్ర ఆచార్యుడుగాను, వీమర్ రాకుమారులకు అధ్యాపకుడుగాను పనిచేశాడు. కాని అధ్యాపక వృత్తి తనకు సరిపడదని త్వరలోనే తెలుసుకొని రచనా వ్యాసంగానికే తన శక్తి యుక్తులను అంకితం చేశాడు. *డే ట్యూట్షే మెర్కూర్* (The German Mercury) అనే సాహిత్య పత్రికను స్థాపించి 37 సంవత్సరాల పాటు సమర్థంగా నిర్వహించాడు. జీవితంలో చివరిదశలో ప్రామా

జిక సాహిత్యం వైపుకు దృష్టి మరలించి గ్రీక్, రోమన్ రచనలను కొన్నింటిని జర్మన్ భాషలోకి అనువదించాడు. 1780 లో ఆయన రచించిన *ఓబరాన్* (Oberon) అనే ద్వంద్వార్థ మహాకావ్యం (epic) రానున్న భావకవితా యుగానికి నాంది అనిచెప్పవచ్చును. అయితే భావ కవితా వాదానికి బద్ధశత్రువునని చెప్పుకొన్న ఈయన రచనలలోనే దాని ఛాయలు కనిపించటం విచిత్రమైన విషయం.

కె.జి. మూర్తి

**వీసెల్, ఎలీ(జర్) (1928--) :** రొమేనియాలో పుట్టిన అమెరికన్ నవలా రచయిత. రెండవ ప్రపంచ యుద్ధంలో యూరప్ అంతా ఎలా ధ్వంసం అయిందో ఇతని రచనలు వర్ణిస్తాయి. ఇతని బాల్యం యుద్ధ ప్రసక్తి లేని ప్రశాంత ప్రాంతంలో ప్రార్థన, కీర్తనల నడుమ జరిగిపోయింది. 1944 లో వీసెల్‌తో సహా నగరంలోని యూదు లందరినీ నాజీలు ఆష్విజ్ ప్రాంతా లకు తరిమివేశారు. అతని కుటుంబ సభ్యులు దాదాపు అందరూ చంపబడ్డారు. బాలసీడుగా బుకెన్‌వాల్డ్‌కు వెళ్లాడు వీసెల్. యుద్ధానంతరం పారిస్‌లో స్థిర పడి సోర్బోన్‌లో చదువుకున్నాడు(1948-51). అప్పుడే ఫ్రెంచ్, ఇజ్రేయిల్ పత్రికలకు రచనలు చేయడం ఆరంభించాడు. 1956 లో అమెరికా వెళ్లి, 1963 నాటికి ఆదేశపు పౌరసత్వం సంపాదించాడు. 1972 నుంచి న్యూయార్క్ సిటీ కాలేజిలోనూ, 1976 నుంచి బోస్టన్ కాలేజిలోనూ ప్రొఫెసర్‌గా ఉన్నాడు.

ఫ్రాన్స్వాయిస్ మారియక్ అనే స్నేహితుడు, నవలా కారుడు యుద్ధ వాతావరణం, పరిణామాలను గురించి రచనలు చేయమని ఇతన్ని ప్రోత్సహించాడు. ఫలితంగా *అండ్ ది వరల్డ్ హాజ్ రిమెయిన్డ్ సైలెంట్* (1956) అనే రచన వెలువడింది. ఇది యిడ్డిష్ భాషలో వచ్చి తరువాత ఆంగ్ల అనువాదం పొందింది. *ది టౌన్ బియాండ్ ది వాల్* (1964) మానవ నిరసనను పరిశీలించే నవల. 1970 లో ప్రచురిత మయిన *ఏ బెగ్గర్ ఇన్ జెరుసలేం* మనిషి ఎందుకు హత్యాకాండ లకు దిగుతాడు, ఏ హక్కుతో తాను జీవిస్తాడు అనే అంశాలపైన చేసిన తాత్త్విక పరిశీలన. సంప్రదాయ పూర్వ రచనకేగాక, కామూ, సార్త్రే వంటి ఫ్రెంచ్ రచయితలు ఇతనిని ప్రభావితుని చేశారు. వీసెల్ రచ నలన్నిటిలోనూ మానవుడు పడే యాతన, మానవాళి లక్షణాలపై వ్యాఖ్యానాలు, వాటిలోని అవ లయలకు పరిష్కార మార్గాలు సూచితం అవుతాయి. శ్రీవిరించి

**వుల్ఫ్, తామస్ (1900-38) :** అమెరికన్ నవలా రచయిత. మొదటి నవల *లుక్ హోమ్‌వార్డ్ ఏంజెల్* (1929) మంచి పేరు తెచ్చుకుంది.

తల్లి దండ్రులను తన నవలలలో పాత్రలుగా చేసి, వారి నిజ జీవితాన్ని ప్రదర్శించాడు. 1916 లో నార్త్ కెరొలినా యూనివర్శిటీలో చేరి, అక్కడే అనేక ఏకాంకి కలు వ్రాశాడు. నాటక రచయిత అవడంకోసం 1920 లో హార్వర్డ్ వర్క్ షాప్ లో చేరాడు. 1923 లో *వెల్‌కం టు అవర్ సిటీ* ప్రదర్శించబడింది. మొదటి నవల 1957 లో నాటకీకరించబడింది.

1923 లో న్యూయార్క్‌కు వచ్చి మధ్య మధ్య ప్రయాణాలు మినహాయించి జీవితాంతం అక్కడే ఉండి పోయాడు. *ఆఫ్ టైం అండ్ ది రివర్* (1935) అతని ప్రధాన రచన. అతని మరణానంతరం ఎడ్వర్డ్ ఆస్వెల్ అనే స్నేహితుడు సంపాదకత్వం వహించి అతని వ్రాత ప్రతుల నుండి రెండు నవలలు పరిష్కరించి ప్రకటించాడు.

*ది వెబ్ అండ్ ది రాక్* (1939), *యూ కాంట్ గో హోం ఎగైన్* (1940) మరి కొన్ని అసంపూర్తి రచనలను కూడా అతడు ప్రకటించాడు.

వుల్ఫ్‌కి సంబంధించిన అనేక పత్రాలు హార్వర్డ్‌లో భద్రపరచబడ్డాయి.

*ది స్టోరీ ఆఫ్ ఏ నావెల్* (1936) అనే రచనలో తాను ఎడిటర్ మాక్స్‌వెల్ పెర్కిన్స్‌తో కలిసి పని చేసి మొదట రెండు నవలలను ఎలా వెలికితేగలిగాడో వివరిస్తూ వ్రాశాడు. ఆత్మాశ్రయమయిన ఇతని రచ నలు ఆనాటి సమకాలీన సమాజ వ్యవహారాలు అవగతం చేసుకోటానికి దోహదం చేస్తాయి.

శ్రీవిరించి

**వుల్ఫ్, వర్జీనియా (1882-1941) :** నూతన భావాలతో, నూతన ప్రయోగాలతో నవలా ప్రక్రియకే నూతన రూపాన్ని సమకూర్చిన మహారచయిత్రి. అంతే కాక ఆనాటి విమర్శకులలో మేటి. తండ్రి 'సర్ లెస్లీ స్టీఫెన్' వద్ద బాల్యంలో అభ్యసించిన విద్య తప్ప, పాఠశాలలు, కళాశాలలు ఆమె ఎరుగదు. తండ్రి మరణానంతరం లండన్‌లో నివాస మేర్పరచు కోడంతో సాహితీ ప్రియుల పరిచయాన్ని, గౌరవాన్ని సంపాదించుకుంది. ప్రసిద్ధి చెందిన బ్లూమ్స్‌బరీ వర్గానికి ఆమె సన్నిహితురాలైంది. 1912 లో లియోనార్డ్ వుల్ఫ్‌ను వివాహం చేసుకుంది. ఆమె రచనలను ఆమె భర్త తన స్వంత ముద్రణాలయంలో ముద్రించి ప్రచురించేవాడు.

వుల్ఫ్ 1915 లో *ది వాయేజ్ ఔట్* (The Voyage Out), 1919 లో *నైట్ అండ్ డే* (Night and Day) అనే నవలలు వ్రాసి ఆ తరువాత నవలా ప్రక్రియలో నూతన ప్రయోగాలు ప్రారంభించింది. అనుభవమనేది ఒక నిరవధిక ప్రవాహ మనే విషయాన్ని నొక్కి చెప్ప దలచుకొంది. మనస్సును చేతనా స్రవంతి (Stream of consciousness) గా భావించి దానిని పట్టి చూపించటానికి ప్రయత్నించింది. కాలాన్ని గురించిన మీమాంస పట్ల కూడా ఆమె ఆసక్తిని చూపించింది. మన అనుభవంలో అది క్షణాలనే వేరు వేరు పూసలతో కూర్చిన దండగానూ, సంవత్సరాలు, శతాబ్దాలుగా సాగిపోయే మహా ప్రవాహంగానూ ఎలా కనిపిస్తుందో ఆమె అవగాహన చేసుకొని, ఈ విషయాలను తన రచనలలో చూపటానికి యత్నించింది.



1922 లో ఆమె వ్రాసిన *జాకబ్స్ రూమ్* అనే నవల నుండి ఆమె రచనలలో ఈ వినూత్న భావాలు కనిపిస్తాయి. ఆమె సృష్టించిన పాత్రలు చారిత్రకమైన కాలము పట్ల అవగాహనతోపాటు, వ్యక్తి అనుభవంలో గడుస్తున్న కాలం, (వర్తమాన కాలము) పట్ల కూడా అవగాహన కలిగి ఉంటాయి. *మిసెస్ డాలోవే* (1925), *టు ది లైట్ హౌస్* (1927) అనే నవలలలో ఆమె సాంకేతిక పరంగా నవలా రూపాన్ని పటిష్ఠం చేసింది. కథా కాలపరిధిని సంకుచిత పరచటం ద్వారానూ, తిరిగి తిరిగి కనిపించే పదచిత్రాల (Images) వాడుక ద్వారానూ నవలకు ఆమె క్రమ బద్ధమైన రూపాన్ని చేకూర్చింది. 1928 లో ఆమె వ్రాసిన *ఆర్లేండో* మొదటి ఎలిజబెత్ రాణి కాలం నుండి 1928 వరకు సాహిత్య పరమైన ఇంగ్లండ్‌ను చిత్రించే చారిత్రక ఫాంటసీ. (ఊహాచిత్రం). పురుషాధిక్య ప్రపంచంలో రచయిత్రుల పాట్లను వివరిస్తూ సాగిన రచన 1928 లో ఆమె వెలువరించిన *రూమ్ ఆఫ్ వన్స్ ఓన్.*

చేతనా స్రవంతి అనే క్రొత్త పంథాలో సాగిన ఆమె నవలలలో 1931 లో వెలువడిన *ది వేవ్స్* మరొకటి. పాఠకుడు నవలలోని ఆరు పాత్రలలో ఏదో ఒక దాని మనస్సులో జీవిస్తాడు. నవల చదివినంత సేపూ పాత్రలకంటె, సంఘటనలకంటె మానవ అనుభవమే ప్రధానపాత్ర వహిస్తుంది ఈ నవలలో. 1937 లో *ది యియర్స్*, 1941 లో *ఇన్ బిట్వీన్ ది యాక్ట్స్* అనే నవలలు వెలువడ్డాయి. తిరిగి తిరిగి బాధిస్తూ వచ్చిన మానసిక రుగ్మతలో ఆమె నీటిలో మునిగి చనిపోయింది. వుల్ఫ్ జీవిత చరిత్రను *వుమన్ ఆఫ్ లెటర్స్, ఏ లైఫ్ ఆఫ్ వర్జీనియా వుల్ఫ్* (Woman of Letters - A Life of Virginia Woolf-1978) గా క్వెంటిన్ బెల్ (Quentin bell) వ్రాసి ప్రచురించాడు.

కె.జి. మూర్తి

**వెరిస్సిమో, ఎరికో లోప్స్ (1905–75) :** బ్రెజిల్ దేశపు నవలా రచయిత, సాహిత్య చరిత్ర రచయిత, విమర్శకుడు. బ్రెజిల్ సాహిత్యంపై ఇంగ్లీషు, పోర్చుగీస్ భాషలలో పెక్కు వ్యాసాలు వ్రాసి దానిని మిగతా ప్రపంచానికి పరిచయం చేసిన మహామహుడు. తన రచనల ద్వారా ఆధునిక బ్రెజిల్ సాహిత్యంలో వీస్తున్న కొత్త పవనాలను గూర్చి, ఆ దేశపు సాంఘిక వ్యవస్థను గూర్చి, సాంస్కృతిక వారసత్వపు సంపదను గూర్చి మిగతా ప్రపంచానికి చాటి చెప్పినవాడు.

'రియో గ్రాండిడో' లోని ఒక పోర్చుగీస్ కుటుంబంలో జన్మించిన వెరిస్సిమో కుటుంబ ఆర్థిక పరిస్థితుల వల్ల విద్యాభ్యాసాన్ని కొనసాగించలేక పోయాడు. బాల్యంలోనే ఒక దుకాణంలోనూ, బ్యాంకులోనూ క్లర్కుగా పనిచేశాడు. ఆ పిమ్మట మందుల తయారీ సంస్థలో భాగస్వామిగా ఉన్నాడు. ఆ పిదప 1930లో పోర్టో ఆలిగ్రెలోని ఒక ప్రచురణ సంస్థలో ఉప సంపాదకుడుగా చేరాడు.

1933లో ఈయన రచించిన క్లారిస్సా పండిత పామరుల దృష్టిని ఆకర్షించి అనుకోని విజయాన్ని సాధించింది. ఇది విస్తృతంగా అనువాదం పొందింది. *కామినోస్ క్రుజాడోస్* 1935 (Cross roads, 1943 *ఓల్హై ఓస్ లిరియోస్ డో కాంపో* 1938 Consider the Lilies of the Field, 1947), *ఓ రెస్టో ఏ సైలెన్సో* 1943 (The Rest is silence, 1946) అనే నవలలు ఈయనకు విస్తృత కీర్తిని తెచ్చిపెట్టాయి. శిల్పంలోను, భాషను వాడటంలోను ఆయన చేసిన క్రొత్త ప్రయోగాలు ఈ నవలలో కనిపిస్తాయి. మారుతున్న సాంఘిక వ్యవస్థలో వ్యక్తి ఉనికి, పరిస్థితి ఈ రచయిత

ఆలోచనలో ఎంత ప్రముఖ స్థానం వహించాయో ఈ నవలలు తెలుపుతాయి.

అమెరికా సంయుక్త రాష్ట్రాలలో బ్రెజిలియన్ సాహిత్యాన్ని కొన్ని సంవత్సరాల పాటు ఆంగ్లంలో బోధించాడు. అక్కడి విశ్వవిద్యాలయంలో ఈయన చేసిన ఉపన్యాసాలు *బ్రెజిలియన్ లిటరేచర్: ఏన్ అవుట్‌లైన్* అనే సంపుటిగా ఆంగ్లంలో ప్రచురించటం జరిగింది.

వీరు అమెరికాకు తిరిగి వచ్చి వాషింగ్టన్ (1953-56) లో సాంస్కృతిక వ్యావహారిక శాఖకు డైరెక్టర్‌గా పనిచేశారు. *ఓ టెంపో ఎ వెన్టో* (1949-62) అనే మూడు భాగాల నవలా మాలికలో బ్రెజిల్ చరిత్ర యావత్తు ఒక కుటుంబంలోని అనేక తరాల కథా రూపంలో చాలా ప్రశంసనీయంగా వెరిస్సిమో చిత్రించాడు. దక్షిణ అమెరికాలోని మిశ్రజాతి (Gaucho) పరిస్థితిని యథాతథంగా చిత్రించినన రచన బహుశః అదేనేమో!!

కె.జి. మూర్తి

**వెర్గా, జ్యొవానీ (1840-1922) :** నవలలు, కథలు, నాటకాలు అనేకం వ్రాసి ఇటాలియన్ సాహిత్యం లోని వాస్తవిక వాదులలో 'వెర్సిమో' (అగ్రగణ్యుడు) గా గుర్తింపు పొందినవాడు. ఈ నాడు విమర్శకులు ఆయనను అత్యుత్తమ ఇటాలియన్ నవలా రచయితగా గుర్తిస్తున్నారు. రెండవ ప్రపంచ యుద్ధానంతర ఇటాలియన్ రచయితలపై ఈయన ప్రభావం విస్తృతంగా కనిపిస్తుంది. సినిమా రంగంలోని *నవ వాస్తవికతా* (Neo-Realist) పంథాకు ప్రతీక అని చెప్పదగిన లూకీ విస్కాంటి నిర్మించిన *టెర్రా ట్రెమా* (1948- The Earth Trembles) అనే సినిమా *ఐ మాలవోగ్లియా* అనే వెర్గా నవల ఆధారంగా తీసిందే.



కొంత కాలం ఫ్లారెన్స్, మిలాన్ నగరాలలో నివసించి 1893 లో వెర్గా తిరిగి కెటానియాకు చేరుకొన్నాడు. చారిత్రక, దేశభక్తిపూరిత నవలలతో ప్రారంభించి మనోవిశ్లేషణ, భావావేశ లక్షణాలకు (Romance elements) ప్రాధాన్యాన్ని ఇచ్చే *ఈవా* (1873), *టైగర్ రియాలె* (1873), *ఈరోస్* (1875) వంటి నవలలను కూడా ఈ రచయిత రచించాడు.

*విటా డీ కాంపి* (1880 - Life in the Fields), *నావెల్లి రస్టికానా* (1883 - Rustic Tales) అనే కథానికలు, *ఐ మాలవోగ్లియా* (1881), *మాస్ట్రో - డాన్ గెసువాల్డో* (Maestro-don Gesualdo, 1889) అనే నవలలు, *కెవెలిరియా రస్టికానా* (1884) అనే నాటకం ఈయనకు అపారమైన కీర్తి ప్రతిష్ఠల నార్జించి పెట్టిన రచనలు. ప్రగాఢమైన అనుభూతి, నిర్ద్వంద్వమైన స్పష్టత ఈయన రచనలలోని వాస్తవికతకు వన్నె తెచ్చాయి. భౌతిక సంపదకోసం మనిషి పడే ఆరాటం, దాని పర్యవసానం వెర్గా కథానికలలో తరచు కనపడే వస్తువులు. ఈయన రచనలలో చాలా వాటిని ఆంగ్లంలోకి అనువదించటం జరిగింది.

కె.జి. మూర్తి

**వెర్గ్‌లాండ్, హెన్రిక్ ఆర్నాల్డ్ (1808-45) :** నార్వేదేశపు ప్రముఖ జాతీయ కవి. వెర్గ్‌లాండ్ మానవతా దృక్పథంతో కూడుకొన్న పనులు, విప్లవాత్మకమైన భావాలు, స్వాతంత్ర్య ప్రియత్వం అతనిని మహోన్నత వ్యక్తిగా తీర్చిదిద్దాయి. అతడు నార్వే దేశ స్వాతంత్ర్యానికి ప్రతీకగా నిలచాడు. వెర్గ్‌లాండ్ నాయకత్వం వహించిన 'దేశభక్తు' ల వర్గానికి, జోహాన్ వెల్ హేవన్ నాయకత్వం వహించిన డేనిష్ మేధావి వర్గానికీ మధ్య ప్రారంభమైన ఆదర్శాల సంఘర్షణ 19 వ శతాబ్దం చివరి వరకూ కొనసాగింది.

వెర్గ్‌లాండ్ చాలా సాహిత్య ప్రక్రియలలో విపులంగా రచనలు సాగించినా, అతని కవిత్వం మాత్రం శాశ్వతంగా నిలచిపోయింది. *స్కేబెల్సెన్, మెనెస్కెట్ ఆగ్ మెసియాస్* (1830, Creation, Humanity and Messiah), *డిగ్టె ఫోర్స్టె రింగ్* (1829; Poems, First Cycle), *స్పానియోలెన్* (1933; The Spaniard), *ఫర్ ఆర్బైడ్స్ క్లాసెన్* (For the Working Class), *జోడెన్* (1842; The Jew)- ఇవి వెర్గ్‌లాండ్ ప్రసిద్ధ రచనలలో కొన్ని. *జాన్‌వాన్ హుయిసన్సు బ్లోమ్‌స్టెర్‌స్టెకె* (1840; "Jan van Huysums Flowerpiece) *డేన్ ఎంజెల్స్కె లోడ్స్* (1844; The English Piolot) ఈ రెండూ వెర్గ్‌లాండ్ విశిష్ట కావ్యాలుగా పేరు పొందాయి.

వెర్గ్‌లాండ్‌కు క్రొత్త నార్వే అన్నా, ఆ దేశ ప్రజలన్నా 1814 నాటి ఆదేశ సంవిధానమన్నా అచంచలమైన

భక్తి విశ్వాసా లుండేవి. అట్లని అతని స్వదేశాభిమానం దురభిమానంగా ఎన్నడూ మారలేదు. అతడు తన అభిప్రాయాలను ఎప్పుడూ నిర్మొహమాటంగా వెలిబుచ్చేవాడు. అందువలన ఎప్పుడూ అతనికి ప్రబలమైన విరోధి పక్షం ఉండేది. విరోధి పక్షంతో పోరాడటంలోనే అతని కాలం ఖర్చయ్యేది. అతని కవిత్వంలో సాధించరాని ఆశాభావం తొంగి చూసేది. యూదులను దేశ పౌరులుగా అంగీకరించక పోవడం గురించి నార్వే సంవిధానంలో ఉన్న పేరాగ్రాఫును రద్దు చేయాలని వెర్గ్‌లాండ్ తీవ్ర పోరాటం సాగించాడు. కాని తన పోరాటం ఫలించకముందే అతడు కన్ను మూశాడు.

జి.ఆ.నా.

**వెర్ఫెల్, ఫ్రాంజ్ (1890-1945) :** జర్మన్ కవి, నాటక కర్త, నవలా రచయిత. వాస్తవికతకు ప్రాధాన్యమివ్వకుండా ఆత్మగతమైన స్వీయ అనుభవాన్ని స్వంత బాణిలో తెలియజెప్పే 'ఎక్స్ప్రెషనిస్ట్' (Expressionist) కవిగా అనన్యమైన కీర్తి నార్జించినవాడు. నాజీ చర్యలతో ప్రత్యక్ష అనుభవం గల ఈ రచయిత విశ్వమానవతా వాదాన్ని, మత విశ్వాసాన్ని బలపరిచాడు.

చిన్న చిన్న ఉద్యోగాలు చేసుకొంటూనే ఒక గీత సంపుటిని ప్రచురించాడు. మొదటి ప్రపంచ యుద్ధంలో ఇటాలియన్, గెలీసియన్ రణరంగాలలో పోరాడిన తరువాత యుద్ధ వ్యతిరేకిగా మారి, పదిమంది చేరే చోటల్లా శాంతికాముకతను ప్రేరేపించే కవితలను చదవటం ప్రారంభించాడు. ఫలితంగా కారాగారం పాలయాడు. యూరిపైడీజ్ రచించిన *ట్రోజన్ విమెన్* ను కొద్ది మార్పులతో తన తొలి నాటకంగా 1916 లో ప్రదర్శింపచేశాడు. అది బెర్లిన్‌లో విజయవంత మైంది. 1924 లో *వెర్డి, రోమన్ డెర్ ఒపర్* (Verdi, A Novel of the Opera, 1925) అనే అతని తొలి నవల వెలువడింది. *డీ వర్జిగ్ టేజ్ డెస్ మూసా డాగ్* (The forty Days of musa dagh, 1934) తో ఈ రచయితకు అంతర్జాతీయ ఖ్యాతి వచ్చింది. ఫ్రెంచ్‌వారు తమను రక్షించే వరకు తమని తాము ఆర్మీనియన్లు ఎట్లా వీరోచితంగా రక్షించుకొన్నారో తెలిపే గొప్ప నవల ఇది.

నాజీ వికృత చర్యలను ముందుగానే పసిగట్టగల ఈ యూదు రచయిత ముందుగానే ఫ్రాన్స్‌కి వెళ్లి ఫ్రాన్స్‌ను జర్మనీ ఆక్రమించిన తరువాత అతికష్టం మీద అమెరికాకు వెళ్లగలిగాడు. ఫ్రాన్స్ పతనాన్ని ఇతివృత్తంగా తీసుకొని *జాకొబిస్కీ అండ్ డెర్ ఒబర్‌స్ట్* అనే నాటకాన్ని 1944 లో రచించి న్యూయార్క్‌లో విజయవంతంగా ప్రదర్శింపచేశాడు. అమెరికాను సురక్షితంగా చేరితే 'సెయింట్ బెర్నాడెట్' ను గురించి కావ్యం వ్రాస్తానని మ్రొక్కుకొన్న ఈ యూదురచయిత *డాస్ లైడ్ వాన్ బెర్నాడెట్టి* (1941: The song of Bernadette, 1942) వ్రాసి ఆ మ్రొక్కును తీర్చుకొన్నాడు.

కె.జి. మూర్తి

**వెర్లెయ్న్, పాల్ (1844-96) :** ఫ్రెంచ్ భావకవి. ఉద్వేగం కంటె ఛందోరూపాలకు ఎక్కువ ప్రాధాన్యమిచ్చే 'పర్నాసియన్స్' (Parnassians) తో కొంతకాలం సన్నిహితంగా ఉన్నాడు. తరువాత కొంతకాలం 'సింబాలిస్ట్' (Symbolists) లకు నాటకాలు వ్రాసేవాడుగా ఉన్నాడు. 'స్టెఫేన్ మల్లార్మె' (Stephane Mallarme), 'ఛార్లస్ బోద్లేర్' (Charles Baudelaire) లతో కలిపి ఈయనను కూడా 'డికేడెంట్స్' (Decadents) లో ఒకడుగా వ్యవహరించటం జరిగింది.

వెర్లయ్న్ 14 సంవత్సరాల వయస్సులోనే ఒక కవిత వ్రాసి అప్పట్లో మహాకవి అయిన విక్టర్ హ్యూగోకు పంపి ఆయన మెప్పును పొందాడు. 1862 లో లాటిన్ అనువాదానికి *కాలారియట్* (ఒకపట్టా) ను పొంది, ఒక భీమాసంస్థలో గుమాస్తాగా చేరాడు. అయితే రచనా వ్యాసంగాన్ని సాగిస్తూనే ఉన్నాడు. కవులు సమావేశమయ్యే హోటళ్లలోనూ, గొప్పవారి ఇళ్లలోనూ ఆ నాటి ప్రముఖ కవులందరితోటి పరిచయ మేర్పరచుకొన్నాడు. 'మల్లార్మే' (Mallarme), విలయర్స్ డి ఎల్ ఐల్‌యాడం, అనటోల్ ఫ్రాన్స్ వంటి రచయితలకు సన్నిహితుడయాడు. 1866 లో సమకాలీన కవితా సంకలనం ఒకటి *లె పర్నాశి కాంటెంపోరియన్*, అనే పేరుతో వెలువడింది. అందులో ఈ రచయిత కవితలు ఎనిమిది ఉండటం గమనించదగిన విషయం.

అదే సంవత్సరంలో ఈ రచయిత తన తొలి కవితా సంపుటిని ప్రచురించాడు. ఇందులో బాడిలైర్, లెకాంటి డి లైల్‌ల కవితలకు అనుకరణలు కొన్ని ఉన్నా, ఈ *పొయెమ్స్ శాటర్నియన్స్* లో తన బంధువు ఎలిసా పట్ల తన ప్రేమ, దాని వైఫల్యం వల్ల కలిగిన విషాదం ప్రతిబింబించే కవితలు కూడా ఉన్నాయి. 1870 లో 'మాథిల్డె మాట్' (Mathilde Maute) ను వివాహం చేసుకొన్నాడు. ఆ వివాహం తనను ఎంతగా మార్చగలదని ఆశించాడో *లా బోన్ ఛాన్సన్* (La Bonne chanson) లో వ్యక్తపరుస్తాడు. దురదృష్టవశాత్తు ఆ వివాహం విఫలమై అతనిని విషాదంలో ముంచివేసింది. అదే సమయంలో ఆయనకు పరిచయమైన యువకవి 'ఆర్థర్ రింబాడ్' తో

అత్యంత ప్రేమ పూరితమైన సాన్నిహిత్యం ఏర్పడి, అతనితో కలిసి ఇంగ్లండు, బెల్జియంలు పర్యటించాడు. ఈ కాలంలో *రోమాన్సెస్ సాన్స్ పెరోల్స్* ('Songs without words') అనే ఎక్స్ప్రెషనిస్ట్ గీతికా సంకలనాన్ని ప్రకటించాడు. బ్రసెల్స్‌లో రింబాడ్‌తో కలహించి అతనిని రివాల్వరుతో పేల్చి గాయపరిచినందుకుగాను ఈ కవి 2 సంవత్సరాల కారాగారా శిక్ష అనుభవించాడు.

పశ్చాత్తాపం, కారాగారవాసానుభవం, ఉత్తమ గ్రంథ పఠనం అతనిలో చాలామార్పును తెచ్చింది. రింబాడ్ చేత పూర్తిగా తిరస్కరించబడిన తరువాత ఇంగ్లండు వెళ్లి అక్కడ ఫ్రెంచ్ భాష, చిత్రకళ బోధిస్తూ తన హుందాతనంతోను, రచనలతోను అక్కడి వారి మన్ననలను పొందాడు. టెనిసన్, స్విన్‌బర్న్ వంటి కవుల అభిమానాన్ని సంపాదించుకొన్నాడు. ఆయన కేథలిక్ క్రైస్తవుడై ఆ మత విశ్వాసాలను తన రచనలలో ప్రస్ఫుటింపచేశాడు. 1880 లో ప్రకటితమైన *సాజెస్సీ* (Wisdom) సంపుటిలోని చాలా గీతికలు ఈ కోవకు చెందినవే!

సాహిత్య పరంగా 1882 నుండి ఆయనకు గుర్తింపు లభించింది. 1874 ప్రాంతంలో వ్రాసిన *ఆర్ట్ పొయిటిక్* లోని కొన్ని కవితలను యువ 'సింబాలిస్టులు' ఎంతో ఉత్సాహంగా కొనియాడారు. అయితే ఆ సింబాలిస్టులు సాంప్రదాయిక రూపాలను, అంత్యప్రాసలను పూర్తిగా వదలివేయటంతో ఈ రచయిత వారితో సంబంధాలను త్రెంచి వేసుకొన్నాడు.

చివరి రోజులలో ఈ రచయిత మద్యానికి, వ్యభిచారానికి బానిస అయి బతుకు తెరువుకోసం వ్రాయవలసిన దుర్భర పరిస్థితికి లోనయాడు. *ఆమర్* అనే కవితా సంపుటి, *లె పొయటిస్ మాడిట్స్* అనే ఆరుగురు కవుల సంక్షిప్త జీవిత చరిత్రల సంపుటి, *మెస్‌హాపిటాక్స్, మెస్ ప్రిజన్స్* (Mes Prisons). *కన్ఫెషన్స్, నోట్స్, ఆటో బయాగ్రఫిక్స్* (Confessions, notes, autobiographiques) మొదలైనవి ఈయన చివరి రోజులలోని కొన్ని రచనలు.

కవిగా వెర్లెయ్న్ రొమాంటిక్ కవులకు, సింబాలిస్టులకు మధ్యస్థంగా ఉన్నాడని చెప్పవచ్చు. ఫ్రెంచ్ భాష యొక్క సంగీత లక్షణాన్ని చక్కగా వెలికి తీసుకువచ్చిన వాడుగా ఈయనను ఈ నాటికీ చెప్పుకొంటారు. కవితా రూపానికే ఎన్నో వన్నె చిన్నెలను దిద్దిన మహారచయిత వెర్లెయ్న్.

కె.జి.మూర్తి

**వెర్హాయిర్న్, ఎమిలీ (1855-1916) :** ఫ్రెంచ్ భాషలో రచనలు చేసిన బెల్జియం దేశపు మహాకవి. రచనల పటిమలోను, విస్తృతిలోను ఈయనను విక్టర్ హ్యూగో, వాల్ట్‌విట్‌మన్‌లతో పోల్చటం జరిగింది. 'లొవైన్' లో న్యాయ శాస్త్రాన్ని అధ్యయనం చేసే రోజులలో (18575-81)



*లాజీన్-బెల్జిక్* (1881) అనే ప్రసిద్ధ పత్రికను స్థాపించి నడుపుతున్న 'మేక్స్ వాలర్' (Max Waller) తో పరిచయ మేర్పడింది. 1890-99 మధ్యలో బెల్జియంలో సాహిత్య, కళా రంగాలలో కనిపించిన పునరుజ్జీవనానికి కారణభూతులైన రచయితల సంఘంలో ఈ రచయిత ప్రధానపాత్ర వహించాడు.

*లెజ్ ఫ్లామాండిస్* అనే పేరుతో ఈయన ప్రచురించిన తొలి కవితా సంపుటి (1883) పండిత పామరుల దృష్టిని వెంటనే ఆకట్టుకుంది. భావకవి (Lyric poet) గా ఈయనకు కీర్తి తెచ్చిపెట్టిన రచనలలో కొన్ని: *లెజ్ విసేజెస్ డి లావె* (1899), *లెజ్ ఫోర్సెస్ టుమట్టొసెస్* (1902), *లెజ్ బెంగ్రెడెసెస్ ప్రిమియర్స్* (1904), *హెలెన్ ఆఫ్ స్పార్టా* (1916).

భాష ఆయన చేతిలో కుమ్మరివానిచేతిలో మట్టిముద్ద వంటిది. దానిని ఎలా మలుచుకోవాలంటే అలా మలుచుకునేశక్తి ఆయనలో ఉన్నది. దానికి ఎట్టి సొగసులు అమర్చకుండానే పటిష్ఠతను చేకూర్చి తన భావ ప్రకటనకు వాడుకొన్నాడు. పటిష్ఠమైన, విస్తృతమైన ఆయన ఆలోచనా దృష్టి, భాషపై ఆయనకున్న అధికారం ఆయన నొక గొప్ప భావకవిగా (lyrical poet) చేశాయి.

ఈయన ఇతివృత్తాలను 3 రకాలుగా విభజించవచ్చు. ఫ్లాండర్స్ నగరానికి సంబంధించినవి, మానవ కళ్యాణానికి, శ్రామిక జీవుల విమోచనానికై సాగే పోరాటానికి ఉపయోగపడేవి, మానవునిలోని శక్తికి, భార్యపట్ల ఆయనకు గల అవగాహనతో కూడిన ప్రేమకు సంబంధించినవి. కుటుంబపరమైన సుఖ సంతోషాలను వ్యక్తం చేయటంలో వెర్హాయిర్న్ దిట్ట. ఫ్లాండర్స్ నగరాన్ని కేంద్రంగా చేసుకొని

పారిశ్రామిక యుగపు సౌందర్యాన్నీ, ప్రకృతిపై మేధ సాధించిన విజయాన్నీ చిత్రించిన గీతాలు ఎక్కువగా ప్రజాదరణ పొందాయి.

కొన్ని నాటకాలూ, కథానికలూ కూడా వ్రాసినా కవిగానే ఈయనను ప్రధానంగా గుర్తించారు.

కె.జి. మూర్తి

**వెల్స్, హెర్బర్ట్ జార్జ్ (1866-1946)** : ఇంగ్లీషు నవలా కారుడు, పత్రికా రచయిత, చరిత్రరచయిత, సామాజిక శాస్త్రవేత్త, ప్రసిద్ధ సైన్స్ నవలా (Science fiction) రచయిత. *ది టైమ్ మెషీన్* (1895), *ది ఇన్‌విజబుల్ మాన్* (1897), *ది అవుట్ లైన్ ఆఫ్ హిస్టరీ* (1920) అనే చరిత్ర గ్రంథము ఈయనకు శాశ్వత కీర్తిని తెచ్చిపెట్టాయి.

ఒక పేద కుటుంబంలో జన్మించిన వెల్స్ లండన్ లోని 'నార్మల్ స్కూల్ ఆఫ్ సైన్స్' లో అధ్యయనం చేశాడు. అక్కడ డిగ్రీ తీసుకోలేకపోయాడు గాని సైన్స్ పట్ల, సైన్స్ సాధించగలవాని పట్ల ఒక రకమైన వ్యామోహాన్ని పెంచుకొన్నాడు. ముందు ముందు సైన్స్ రచనలు చేయటానికి ఈ వ్యామోహమే ఎంతో ఉప యోగించింది. అనారోగ్యం, అనాసక్తికరమైన వైవాహిక జీవితం ఆయనను క్రుంగదీశాయి.

రెండవ వివాహం తరువాత రచయితగా స్థిరపడవల సిన అవసరాన్ని గుర్తించి పత్రికలకు వ్రాస్తూ ఉండటం ప్రారంభించాడు. 1895 లో వ్రాసిన *ది టైమ్ మెషీన్*, 1898 లో వ్రాసిన *ది వార్ ఆఫ్ ది వరల్డ్స్* అనే నవలలు కీర్తినీ, ధనాన్నీ తెచ్చిపెట్టటంతో పల్లె ప్రాంతా లలో స్థిరపడి తన కాలాన్ని పూర్తిగా నవలా రచనకే వినియోగించ గలిగాడు. దానితో ఆయన ఆరోగ్యం కూడా మెరు గయింది.

1902 లో వ్రాసిన *స్త్రీ లేడీ* అనే నవలలో ఎటువంటి జీవిత భాగస్వామికోసం తాను వెతుక్కుంటున్నాడో తెలుపుతాడు. తరువాత ఆయన బుద్ధి రాజకీయాలవైపుకి మళ్లింది. అప్పట్లో ప్రముఖ పాత్ర వహిస్తున్న 'ఫేబియన్ సోషలిస్టు' లతో కలిసి పనిచేశాడు. కాని శ్రామిక వర్గాల కష్టాలను చూచిన వారే తప్ప, అనుభవించిన వారెవరూ లేరని తెలిసి వారి పట్ల హేళన, నిరసన ప్రదర్శిస్తూ, 1909 లో *ఆన్ వెరోనికా* అనే నవల వ్రాశాడు. 1911 లో *ది న్యూ మెకియవెల్లి*, 1915 లో *బూన్* (Boon) వ్రాశాడు.

మొదటి ప్రపంచ యుద్ధం, దాని ఫలితాలు ఈయనలో యుద్ధం పట్ల ఏహ్యభావాన్ని కలిగించాయి. రాజకీయ నాయకులు, పాలనాదక్షులు న్యాయమైన సంధి కుదుర్చు కోలేక పోవటంతో మానవజాతి మనుగడే ప్రమాదంలో పడకూడదనే భావాన్ని ప్రజలలో కలిగించటానికే *ది ఔట్‌లైన్ ఆఫ్ హిస్టరీ* అనే ఒక మిలియన్ పదాలు ఉండే గ్రంథాన్ని ఒక సంవత్సర కాలంలోనే వ్రాశాడు. 1919 లో *ది సైన్స్ ఆఫ్ లైఫ్*, 1932 లో *ది వర్క్, వెల్త్ అండ్ హేపినెస్ ఆఫ్ మాన్‌కైండ్*, 1934 లో *ఎక్స్పెరిమెంట్ ఇన్ ఆటోబయాగ్రఫీ* గ్రంథాలు వ్రాసి చిన్నతనంలో బ్రతకటానికి బడిపంతులై అష్టక ష్టాలు అనుభవించిన వెల్స్ మానవజాతికే అధ్యాపకు డయాడు. ప్రపంచశాంతి అవసరాన్ని ప్రచారం చేయటమే చివరి రోజులలో ఆయన ధ్యేయం. ఈ సందర్భంగా రూజ్‌వెల్ట్‌ను, స్టాలిన్‌ను కూడా కలసి సిద్ధాంతపరమైన వారి విభేదాలను తగ్గించటానికి కృషి చేశాడు.

కె.జి. మూర్తి

**వేగా, గార్సిలాసో డి లా (1539-1616)** : దక్షిణ అమెరికాలోని ఇండియన్స్ చరిత్ర, స్పానిష్ సాహస యాత్రికుల, సైనికుల వీరగాథలు రచించిన ప్రసిద్ధ స్పానిష్ చరిత్రకారుడు.

తండ్రి సెబాస్టియన్ గార్సిలాసో డి లా వేగా పెద్ద స్పానిష్ భూస్వామి. తల్లి 'ఇన్‌కా ఇండియన్' రాకుమారి. ఆ రాకుమారి సెబాస్టియన్‌ను వివాహం చేసుకోకుండానే వేగాకు జన్మనిచ్చింది. అందుచేత ఈయనకు ఇన్‌కాల సంప్రదాయాలు, స్పానిష్ లక్షణాలు అలవడ్డాయి. స్పానిష్, లాటిన్ భాషలను అధ్యయనం చేశాడు. అప్పుడు పెరూలో జరుగుతున్న అంతర్యుద్ధాన్ని ప్రత్యక్షంగా చూసి తరు వాత తన చరిత్రలో దాన్ని పొందుపరిచాడు. 1560 లో స్పెయిన్‌కు వెళ్లి సైన్యంలో చేరాడు. అందులో కెప్టెన్ స్థాయికి వెళ్లి దానిని వదలి వేసి చివరకు మతాచార్యుడుగా స్థిరపడ్డాడు.

యూదు జాతీయుడు, మానవతావాది అయిన 'లియాన్ హిబ్రియో' ఇటాలియన్ భాషలో వ్రాసిన *డైలాగి అమోర్* (Dialogues of Love) ను స్పానిష్ భాషలోకి అనువదించటంతో ఈయన సాహితీ జీవితం ప్రారంభమైంది. ఈయనకు కీర్తిప్రతిష్ఠలు తెచ్చిపెట్టినవి రెండు గ్రంథాలు. మొదటిది: *లా ఫ్లోరిడా డెల్ ఎన్ కా*, రెండవది *హిస్టరీ ఆఫ్ పెరూ*. మొదటిది మెక్సికో ఉత్తర ప్రాంతాలకు సాగిన సాహసయాత్రల గాథ అయితే, రెండవది పెరూను స్వాధీనం చేసు కొన్న స్పానిష్ విజేతల మధ్య సాగిన **అంతర్యుద్ధాల** చరిత్ర.

శ్పానిష్ సాహితీ పునరుజ్జీవన రచయితలలో ముఖ్యంగా పేర్కొనదగినవాడు.

కె.జి. మూర్తి

**వేగా, లూప్ డి (1562-1635) :** శ్పానిష్ స్వర్ణయుగానికి చెందిన ప్రతిభావంతుడైన నాటకకర్త. 'సెర్వాంటిస్' ఈ వేగాను 'సృష్టిలోని అద్భుతం' అని వర్ణించాడు. వేగా రచనలలో నేడు మనకు 431 నాటకాలు, 50 లఘు ధార్మిక నాటకాలు లభిస్తున్నాయి. వేగా అల్పిక పని చేసే కుటుంబంలో జన్మించినా, స్వయంకృషితో, అపారమైన మేధాశక్తివలన సాహిత్య ప్రపంచంలో దేదీప్యమానంగా వెలుగొందగలిగాడు. వేగా 'వేలెన్షియన్' నాటక కారుడైన క్రిస్టాబాల్ డి వైరూస్ (1550-1609) రచనలవల్ల గాఢంగా ప్రభావితు డయాడు. తన సృజన సామర్థ్యం వల్ల సంప్రదాయ, నవ్య సంప్రదాయ సిద్ధాంతాలను కాదని, ఛందో వైవిధ్యాన్ని ప్రదర్శిస్తూ మోదాంత, విషాదాంత నాటకాలను మేళవించి క్రొత్త రకమైన *కామెడియా* (Comedia) ను రూపొందించాడు.



వేగా నాటకాలను ముఖ్యంగా రెండు రకాలుగా విభజించవచ్చును. వీరరస ప్రధానమైన ఇతివృత్తం, శ్పానిష్ దేశ వాతావరణం కలిగిన చారిత్రక నాటకాలు మొదటి వర్గంలోనివి. సమకాలీన సంయోగ వియోగ ప్రణయ కథలు ఆధారంగా రచింపబడిన సాంఘిక నాటకాలు రెండవ వర్గంలోనివి. లూప్ డీ వేగా తన చారిత్రక నాటకాలకు మధ్యయుగ చరిత్రలోని రొమాంటిక్ కథలను, జనప్రియ జానపద కథలను వస్తువులుగా స్వీకరించాడు. శ్పానిష్ జాతి గౌరవాన్ని సముజ్జ్వలం చేసే విధంగా నాటకాలను మలచాడు. రాజరికం పట్ల భక్తి శ్రద్ధలు, కేథలిక్ మతం పట్ల గౌరవ విశ్వాసాలు, మానవ వ్యక్తిత్వం పట్ల నమ్మకం, స్త్రీల శీలం పట్ల ఆదరం అనే భావాలను ప్రజల్లో నాటుకొనేలా నాటకాలను శక్తిమంతంగా నిర్మించాడు. లూప్ డి వేగా రచనల వల్ల శ్పానిష్ ప్రజలలో జాతీయాభిమానం పెల్లుబికింది. శ్పానిష్ సంస్కృతిని వెల్లడించే వాహికగా కామెడియా రూపొంద గలిగిందంటే అది లూప్ డీ వేగా చలువే.

లూప్ డీ రచించిన 'పౌరు లందరూ సైనికులే' అనబడే నాటకంలో దుష్టులైన మాండలిక ప్రభువులను గ్రామీణులందరూ చేరి అంతమొందించి చక్రవర్తి మెప్పు పొందటం కథా వస్తువు. వేగా చారిత్రక నాటకాలు జాతీయాభిమానాన్ని ప్రబోధించి జాతీయ గౌరవాన్ని తీర్చిదిద్దేందుకు ఎంతో ఉపకరించాయి.

వేగా సాంఘికనాటకాలు వీరుల, ఉన్నత కుటుంబాల వ్యక్తుల ప్రణయగాథలు ఆధారంగా నిర్మింపడ్డాయి. వీటిలో నౌకర్లు తమ యజమానుల అలవాట్లను, బుద్ధులను అనుకరించడం, ఎద్దేవా చేయడం కనిపిస్తుంది. ప్రేక్షకులను కడుపుబ్బ నవ్వించడం వల్ల ఈ సాంఘిక నాటకాలు అత్యంత ప్రజాదరణ పొందాయి.

వేగా నాటకాలు శ్పానిష్ సంస్కృతి పరిమళాన్ని వ్యాపింపచేయటానికి దోహదం చేసిన మాట తిరుగులేని సత్యం. వేగా దృష్టి ఎప్పుడూ ప్రేక్షకుల కరతాళధ్వనులను పొందే లక్ష్యంతోనే రచింపబడటం వల్ల, రచనలలో కళాత్మక లక్షణం లోపించిందని విద్వాంసుల అభిప్రాయం.

వేగా తన యుగం నాటి శ్పానిష్ సంస్కృతిని చాటిన శ్పానిష్ జాతీయ నాటకకర్త.

జి.అ.నా

**వేడ్‌కింద్, ఫ్రాంక్ (1864-1918) :** జర్మన్ నటుడు, నాటకరచయిత. మొదటి ప్రపంచ యుద్ధ సమయంలో సమకాలీన జర్మన్ కళాకారులను ప్రభావితం చేసిన ప్రతిభా సంపన్నుడు. వేడ్‌కింద్ 'అసంబద్ధ నాటక' (Theatre of the absurd) ఉద్యమంలో అగ్రేసరుడు. ఇతడు ప్రాసంగిక దృశ్యాలు, అర్థరహిత సంభాషణలు, విరూపత, విడంబన మొదలైన లక్షణాలతో తన నాటకాలను విలక్షణంగా రూపొందించాడు. ఇతని రచనలు జర్మనీ నాటక సాహిత్యాన్ని ఫోటోగ్రాఫిక్ వాస్తవికత నుంచి అభివ్యక్తి వాదం వైపు మళ్లించి, క్రొత్త ఒరవడి సృష్టించాయి.



వేడ్‌కింద్ 1872 నుంచి 1884 వరకు స్విట్జర్లాండ్‌లో నివసించి, శేష జీవితాన్ని మ్యూనిచ్‌లో గడిపాడు. ఉదర నిమిత్తం బహుకృత వేషం అన్నట్లు ఇతడు రక రకాల వృత్తులు చేపట్టాడు. భోగ లాలస, సమాజంలో లైంగిక శక్తికి గల ప్రాధాన్యాన్ని వ్యతిరేకించడం ఇతని నాటకాల ప్రధాన ఇతివృత్తం. 1891 లో వెలువడిన ఇతని విషాదాంత నాటకం *ఫ్రూలింగ్స్ ఎర్వాచెన్ (ద అవేకెనింగ్ ఆఫ్ స్ప్రింగ్,* 1909) జర్మన్ సాహిత్య ప్రపంచంలో గొప్ప కలకలం సృష్టించింది. ముగ్గురు తరుణుల్లో జాగృతమైన లైంగిక వాంఛలకు సంబంధించిన ఇతివృత్తాన్ని వేడేకింద్ కళాత్మకంగా నిర్వహించాడు ఈ నాటకంలో. కవితాత్మకంగాను, సుకుమారంగాను, మొరటుగాను, నిర్మొహమాటంగాను రూపొందిన సంక్షిప్త దృశ్యాల పోహళింపు ఈ నాటకం. "లూలు" నాటక చక్రంలో *ఎర్డ్‌గీస్ట్* (1895), *ఆర్త్ స్పిరిట్,* (1914), *డీ బుక్స్ డెర్ పండోరా* (1904; *పండోరాస్ బాక్స్,* 1918) అనే మూడు నాటకా లున్నాయి. ఈ రెండు విషాదాంత నాటకాలలో అధోజగత్తుకు సంబంధించిన లైంగిక చిత్రణ జరిగింది. లైంగిక స్వాతంత్ర్యానికి, కపట బూర్జువా నైతికతకు మధ్య జరిగిన సంఘర్షణలో చంపబడ్డ లూలు (Lulu) అనే స్త్రీ పాత్ర శాశ్వతమైన, నీతికి అతీతమైన స్త్రీపాత్ర వేడ్‌కింద్ అమరసృష్టి. ఈ రెండు నాటకాలూ ఎన్నో సార్లు ప్రదర్శింపబడి ప్రేక్షకుల ప్రశంసలు పొందాయి.

వేడ్‌కింద్ నాటకాలే కాక కవితలు, నవలలు, పాటలు, వ్యాసాలు కూడ రచించాడు. ఇతని నాటకాలలో ప్రసిద్ధమైనవి కొన్ని: *డెర్ మార్క్విస్ ఫాన్ కైత్ కోనిగ్ నికోలో ఓజెర్ సో ఈస్ట్ దస్ లెబన్* (1901), *హిదల్లా* (1904), *ఫ్రాంటిట్‌స్కా* (1912).

జి.ఆ.నా.

**వైట్, పాట్రిక్ (1912-1990)** : 20 వ శతాబ్ది ఉత్తరార్ధంలో ఆస్ట్రేలియా సాహిత్యాన్ని గొప్పగా ప్రభావితం చేసిన మహా రచయిత. వైట్ 1973 లో సాహిత్యానికి నొబెల్ బహుమతిని పొందాడు.

పాట్రిక్ వైట్ లండన్‌లో జన్మించాడు. ఇతని విద్యాభ్యాసం ఆస్ట్రేలియా, ఇంగ్లాండులలో సాగింది. ఇతడు కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయానికి చెందిన కింగ్స్ కాలేజీలో ఆధునిక భాషలను అభ్యసించాడు. రెండవ ప్రపంచ యుద్ధంలో కొంత కాలం పాటు రాయల్ ఏర్‌ఫోర్స్‌లో పనిచేశాడు. అప్పటికే అతడు సాహిత్య క్షేత్రంలోను, నాటక రంగంలోను కొంత కృషి చేసి, గుర్తింపు పొందాడు. రెండవ ప్రపంచ యుద్ధం ముగిసిన తరువాత వైట్ ఆస్ట్రేలియాకు మరలి వచ్చాడు. అయినా అతడు అప్పుడప్పుడు కొంతకాలం ఇంగ్లాండు, అమెరికా సంయుక్త రాష్ట్రాలలో నివసించాడు.

వైట్ మొదటి నవల *హేపీ వ్యాలీ* (1939) న్యూ సౌత్ వేల్స్ నేపథ్యంగా చిత్రింపబడింది. ఈ నవలలో డి.హెచ్.లారెన్స్, థామస్ హార్డీల ప్రభావ ముద్ర కనపడుతుంది. వైట్ తరువాతి రచనలు ఆస్ట్రేలియా వాతావరణాన్ని చిత్రించినా, మనం వాటిని దేశకాల పరిమితులలో బంధించలేం. వైట్ రచనలలో ఆస్ట్రేలియా వికాస యాత్రలోని కల్లోల దశలు స్వకీయ రూప ఆవిష్కరణకై సాగించే పోరాటం ఇవన్నీ ప్రతిభావంతంగా చిత్రింపబడ్డాయి. ఈ పోరాటంలో ప్రజలు నాగరక మర్యాదలు మరచి, ఆటవిక బర్బరతను పాటించడం కూడా మనం ఈ రచయిత నవలలో చూడగలం. వైట్ ఆస్ట్రేలియాను దర్శించిన తీరు *ద ట్రీ ఆఫ్ మ్యాన్* (1955), *వోజ్* (1957), *రైడర్స్ ఇన్ ద చారియట్* (1961), *ద సాలిడ్ మాండెల* (1966), *ద ట్వీబార్న్ ఎఫైర్* (The Twyborn Affair, 1979) మొదలైన రచనలలో చక్కగా చూడవచ్చు.

ఇతని రచనలలో కల్పన, ప్రతీకలు, అన్యోక్తి, ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. మానవుని అన్యీకరణ స్పృహ, జీవిత పరమార్థం కోసం మనిషి సాగించే అన్వేషణ వైట్ రచనలకు గొప్ప ప్రేరణ కలిగించాయి.

వైట్ నాటకాలు కూడా రచించాడు. *ద సీజన్ ఎట్ సర్సపరిల్లా, నైట్ ఆన్ బాల్డ్‌మౌంటేన్* చెప్పుకోదగ్గ నాటకాలు. 'సిగ్నల్ డ్రైవర్' (1982) వైట్ విశిష్ట కథా సంకలనం.

*ఫ్లాస్ ఇన్ ద గ్లాస్* ఇతని స్వీయ చరిత్రాత్మక రచన. ఆస్ట్రేలియా గవర్నర్ జనరల్ పాత్రకు సంబంధించి 1975 లో తలెత్తిన సంవిధానాత్మక సంక్షోభంలో పాట్రిక్ వైట్ ప్రముఖ పాత్ర నిర్వహించాడు.

జి.ఆ.నా.

**వైదర్, జార్జ్ (1588-1667)** : ఆంగ్లకవి, ప్యూరిటన్ కరపత్రకర్త; పాటలు, గేయాలు వ్రాశాడు. ఆక్స్‌ఫర్డ్‌లోని మాగ్డలీన్ కాలేజీలో 1604 లో ప్రవేశించి, పట్టభద్రుడు కాకుండానే బయటికి వచ్చాడు. అనంతరం 1615 లో న్యాయశాస్త్ర పఠనం ఆరంభించాడు. *ఎబ్యూసెస్ స్ట్రిప్ట్ అండ్ విప్ట్* (1613) అనే రచన దురాశ, అహంకారాల మీద వ్యంగ్యంగా ధ్వజమెత్తి అతనిని కొన్ని మాసాల పాటు జైలు పాలు చేసింది. జైలులోనే *ది షెపర్డ్స్ హంటింగ్* అనే రచన చేశాడు. రూప నిర్మాణంలో

స్పెన్సర్‌ను, భావ ప్రకటనలో 'వర్డ్స్‌వర్త్' ను ఆదర్శంగా తీసుకున్నాడు. *నాదికాదు, నాకు అక్కర్లేదు, నాకు లెక్కలేదు* (I don't Have, I don't want, I don't care) అనే రచనకు తిరిగి జైలు పాలు అయాడు.

1622 లో ప్రణయ కవితలు ప్రచురించాడు. తరువాత 'ప్యూరిటన్' గా మారిపోయి తత్త్వ సంబంధమైన విషయాలకే పరిమితం అయాడు. *ది హిమ్స్ అండ్ సాంగ్స్ ఆఫ్ ది చర్చ్* (1623) అనేది పాత నిబంధనలు ఆధారంగా చేసికొని రచించిన గీతావళి. 1625 ప్లేగ్ వ్యాధి సంక్రమణ సమయంలో వైదర్ లండన్‌లోనే ఉన్నాడు. 1628 లో *బ్రిటన్స్ రిమెంబరెన్సర్* అనే బృహత్కావ్యంలో ఆ అనుభవా లన్నీ అభివర్ణించాడు. మొదట ఛార్లెస్ స్కాట్లండ్‌పై జరిగిన దండయాత్రలలో పాల్గొనడానికీ, సివిల్ యుద్ధంలో పార్లమెంటరీ పక్షం వహించడానికీ మధ్య అనేక మత సంబంధమైన కీర్తనలు ఆయన వ్రాశాడు. *బ్రిటన్స్ రిమెంబరెన్సర్* అనే పేరుతో ఇవి 1641 లో ప్రచురణ అయాయి. హౌస్ ఆఫ్ కామన్స్‌ను ఆక్షేపిస్తూ వ్రాసిన అధిక్షేప రచనలకు 1660-63 మధ్యకాలంలో వైదర్ తిరిగి జైలు శిక్ష అనుభవించాడు.

ఈయన పద్య రచనలు నీరసంగా ఉన్నా వాటి వైవిధ్యం ఎన్నతగినది. గ్రామీణ భాష, చక్కని లయ మేళవించి ఇంపైన పద్యాలు, కీర్తనలు వైదర్ తయారు చేశాడు. క్రమంగా ఇతని పేరు ప్రతిష్ఠలు అంతరించిపోయి, కొంతకాలం కేవలం ప్రచార సాహిత్య కర్తగా మిగిలిపోయినా, తరువాతి కాలంలో ఉత్తమ సాహితీవేత్తగా పరిగణన పొందాడు.

శ్రీవిరించి

**వైల్డ్, ఆస్కార్ (1854-1900)** : ఆంగ్ల కవి, నవలా రచయిత, నాటక కారుడు, వ్యాసకర్త, సంభాషణా చతురుడు, మేధావి. బహుముఖీన ప్రతిభాసంపన్నుడైన వైల్డ్ ప్రజారంజకమైన సాంఘిక నాటక రచయితగా, అద్వితీయ సంభాషణా చతురుడుగా ప్రఖ్యాతుడు.

వైల్డ్ తల్లి దండ్రు లిద్దరూ సాహిత్యవేత్తలే. అతడు ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయంలో ప్రతిభా వంతంగా డిగ్రీ పట్టా పొందాడు. విద్యార్థి దశలోనే విద్వాంసుడుగా, చతుర వచోనిధిగా, కవిగా పేరొందాడు. *రావెన్నా* అనే సుదీర్ఘ కవితకు 1878 లో న్యూడిగేట్ బహుమతి (Newdigate prize) సంపాదించుకొన్నాడు. ఈ కవితలో ఇతని బాల్య జీవితం, ఉరకలువేసే ఉత్సాహం వర్ణింప బడ్డాయి. వైల్డ్ దేశాటనం, ప్రేమ కలాపాలు, పాండిత్య ప్రకర్ష కూడా ఈ కావ్యంలో చిత్రింపబడ్డాయి. *పొయెమ్స్* (Poems) అనబడే మరో కవితా సంకలనంలో డాంటే, మిల్టన్, కీట్స్ మొదలైన మహాకవుల పట్ల వైల్డ్ భక్తిశ్రద్ధలు, వైల్డ్ పదప్రయోగ పాటవం, చమత్కారం సుందరంగా సాక్షాత్కరిస్తాయి.

జాన్ రస్కిన్, వాల్టేర్, పేటర్‌ల రచనల వల్ల వైల్డ్ ఎక్కువగా ప్రభావితు డయాడు. 'కళ కళ కోసమే' అనే సిద్ధాంతాన్ని త్రికరణశుద్ధిగా ఇతడు నమ్మాడు. "కళను ఆవిష్కరించడం, కళాకారుని గోప్యంగా ఉంచడమే కళ పరమార్థం" అని వైల్డ్ అభిప్రాయం. మహా రచయితలెవ్వరూ జీవితాన్ని ఉన్నదున్నట్లు చిత్రించరనీ, ఒకవేళ ఎవరైనా అలా చిత్రిస్తే వాళ్లు కళాకారులు కారనీ వైల్డ్ దృఢ విశ్వాసం. వైల్డ్ జీవితాన్ని ఒక కళగా ఆరాధించి, అట్లే జీవించాడు. కాని రెండేళ్ల కారాగార జీవితం (1895-97) అతనిని సమూలంగా మార్చింది. జైలు జీవితంలోని కష్టాలను, కడగండ్లను *ది బాలెడ్ ఆఫ్ రీడింగ్ జైల్* (1898) అనే రచనలో హృదయానికి హత్తుకొనేలా చిత్రించాడు.

వైల్డ్ వ్రాసిన ఒకే ఒక సాంఘిక నవల *ది పిక్చర్ ఆఫ్ డోరియన్ గ్రే* (1890). విస్తారమైన వివరణలు, ఆలంకారికశైలి, చమత్కార భరితమైన సంభాషణలు, కాల్పనికతలతో కూడుకొన్న ఈ నవలలో వైల్డ్ విశిష్టముద్రను మనం చూడగలం. ఈ నవలలోని *లార్డ్ హెన్రీ వోట్టన్* పాత్ర వైల్డ్ ప్రతిబింబమే.

వైల్డ్ మంచి కథారచయిత కూడా! *ది హేపీ ప్రిన్స్ అండ్ అదర్ టేల్స్* (1888), *ఏ హౌస్ ఆఫ్ పోమ్ గ్రేనేట్స్* (1891), అనేవి ఇతని కథా సంపుటాలు. *ది హేపీ ప్రిన్స్* హృదయానికి హత్తుకొని పోయే అందమైన కథ.

వైల్డ్ శాశ్వతమైన కీర్తిని సంపాదించుకొన్నాడు. నాటకాల ద్వారా, ప్రేక్షకుల మెప్పును సంపాదించాలనే ఏకమాత్ర లక్ష్యంతో వైల్డ్ నాటకాలు వ్రాశాడు. ప్రతి నాటకంలోనూ వైల్డ్ ఏదో ఒక పాత్ర ద్వారా తన వ్యక్తిత్వాన్ని, హాస్య చాతుర్యాన్ని వ్యక్తం చేశాడు. *ది ఇంపార్టెన్స్ ఆఫ్ బీయింగ్ ఎర్నెస్ట్* వైల్డ్ నాటకాలలో శిఖరాయమాణమైనది. విక్టోరియన్ యుగంలోని కాపట్యాన్ని అద్భుతంగా ఎద్దేవా చేయడం ఈ నాటకంలో కనిపిస్తుంది. *ఏ వుమన్ ఆఫ్ నో ఇంపార్టెన్స్, ఏన్ ఐడియల్ హజ్బెండ్*-వైల్డ్ నాటకాలలో ప్రసిద్ధమైనవి. చమత్కారమైన సంభాషణలు, వక్రోక్తులు, వ్యంగ్యోక్తులు నామమాత్రమైన కథా వస్తువు గలిగిన వైల్డ్ నాటకాలు

19 వ శతాబ్దపు ఆంగ్ల నాటక సాహిత్యాన్ని సంపన్నం చేసి, క్రొత్తదనంతో నింపాయి.

"ఆస్కార్ వైల్డ్ సమకాలంలోనే కాదు, అన్ని కాలాల లోను అద్వితీయమైన మాటకారి, సంభాషణ చతురుడు" అని జార్జి బెర్నార్డ్ షా వైల్డ్‌కు నివాళులు అర్పించాడు.

జి.ఆ.నా.

**వోజ్నెసెన్‌స్కీ, అంద్రే అంద్రేవిచ్ (1933--):** ప్రసిద్ధ రష్యన్ కవి. స్టాలిన్ శకం ముగిసిన తరువాత వెలుగులోకి వచ్చిన యువ కవులలో ప్రముఖుడు. రెండవ ప్రపంచ యుద్ధం బాలుడైన వోజ్నెసెన్‌స్కీ పసి హృదయంపై చెరగని ముద్ర వేసింది. ఇతని కవిత్వంలో చిన్ననాటి భయంకర, అమానవీయ అనుభవాల ఛాయలను చూడవచ్చు. మాస్కోలో చదువుతున్నప్పుడు కవిత్వం వ్రాసి బోరిస్‌పాస్టర్ నాక్‌కు అభిప్రాయం నిమిత్తమై పంపుతూ ఉండేవాడు. బోరిస్ పాస్టర్ నాక్ ప్రోత్సాహంతో రచనా వ్యాసంగానికే త్రికరణశుద్ధిగా అంకిత మయాడు. బోరిన్ పాస్టర్‌నాక్ స్టాలిన్ యుగంలో రష్యన్ సాహిత్యభాష పెంపొందించు కొన్న కాఠిన్యాన్ని తొలగించేందుకు భగీరథ ప్రయత్నం చేశాడు. అతనినే తన గురువుగా వోజ్నెసెన్‌స్కీ భావించాడు.



వోజ్నెసెన్‌స్కీ 1958 లో ప్రచురించిన కవితలు భాషా లాలిత్యానికి, జీవశక్తికి పేరు గాంచాయి. స్టాలిన్ మరణానంతరం రష్యన్ కవితా క్షేత్రంలో ఎన్నో క్రొత్త ప్రయోగాలు మొదలయాయి. కవితా పునరుజ్జీవనం మొదలయింది. కవి సమ్మేళనాలకు, కవితా గానాలకు ప్రజలు వేలం వెర్రిగా హాజరు కాసాగారు. వోజ్నెసెన్‌స్కీ కవితాగానం ప్రజలను సమ్మోహితం చేసేది.

1963 లో ఉన్నట్టుండి పాశ్చాత్య ప్రభావంతో రచనలు చేసే సాహిత్య వేత్తల పట్ల, కళాసృష్టి చేసే కళాకారుల పట్ల ప్రభుత్వ దమనకాండలు ఎక్కువయాయి. ఏడు నెలలపాటు వోజ్నెసెన్‌స్కీ ప్రభుత్వ విమర్శకు గురి అయాడు.

1960, 70 దశకాలలో వోజ్నెసెన్‌స్కీ కవిత్వంలో అస్పష్టత వుందనీ, ప్రయోగాత్మకత ఎక్కువనీ, భావజాలం అపక్వంగా ఉందనీ విమర్శలు వచ్చాయి. వోజ్నెసెన్‌స్కీ సోవియెట్ ప్రభుత్వాన్ని నిర్మొహమాటంగా ఖండించినా అతని కవిత్వంలో మాత్రం వైయక్తిక బాధ, ఆక్రోశం, కోపం వ్యక్త మయేవి.

వోజ్నెసెన్‌స్కీ విశిష్టమైన కవిత *గోయ్యా* (1960) లో రెండవ ప్రపంచ యుద్ధాన్ని గూర్చిన జ్ఞాపకాలు, అర్థవంతమైన పదచిత్రాలతో శక్తిమంతంగా వ్యక్త మయాయి. *అఖిలెసోగో సెర్డ్‌ట్సె* (My Achilles Heart), *అవ్‌టో పోర్ట్రెట్* (self Portrait) కవితలలో వోజ్నెసెన్‌స్కీ 1963 ప్రభుత్వ దమనకాండకు గురిఅయి నాటి బాధ, కోపం వ్యక్త మయాయి. అతని కవితలు *వైపుట్‌స్టి ప్టిట్సు* (1974: Let the Bird Free) *సోబ్లాజ్న్* (1978 Temptation) అనే సంపుటాలుగా వెలువడ్డాయి. అతని ప్రముఖ కవితలు రష్యన్ మూలంతోను, ఆంగ్లానువాదంతోను సహ ఆంటీ వర్ల్‌డ్స్ అనే రెండు సంపుటాలుగా వెలువడి విశేషాదరణ పొందాయి.

జి.ఆ.నా.

**వోల్తేర్ (1694-1778) :** 18 వ శతాబ్దానికి చెందిన యూరపియన్ రచయితలలో అగ్రగణ్యుడైన ఫ్రాంస్వా యిస్ మేరీ యార్వెట్ "వోల్తేర్" అనే కలంపేరుతో రచనలు సాగించాడు. వ్యంగ్యం, హాస్యం, విమర్శనాత్మకత మిళితమైన వోల్తేర్ రచనలు నిరంకుశత్వాన్ని, పక్షపాత ధోరణులనూ తూర్పారబట్టేవిగా పేరొందాయి.

మధ్య తరగతి కుటుంబంలో జన్మించిన వోల్తేర్ పారిస్‌లోని లూయీ-లే-గ్రాండ్ కళాశాలలో జెసూయిట్ గురువుల వద్ద విద్యాభ్యాసం చేశాడు. కొంత కాలం న్యాయ శాస్త్రాన్ని చదివి, దానిని వదలివేసి రచనా వ్యాసంగంలో నిమగ్ను డయాడు. సాంప్రదాయిక విషాదాంత నాటకాలు వ్రాసి లబ్ధ ప్రతిష్ఠుడైన వోల్తేర్ తన జీవితాంతం నాటక రంగానికే అంకిత మయాడు. అతడు వ్రాసిన ఐతిహాసిక పద్యం *లా హెన్రియేడ్* (La Henriade) పాఠకులను విశేషంగా ఆకర్షించింది. కాని దానిలోని రాజ వ్యతిరేకత, మత వ్యతిరేకత కారణంగా వోల్తేర్ శిక్షకు గురిఅయి బాస్టిల్లె జైలులో ఒక సంవత్సరంపాటు బంధించబడ్డాడు (1717). 1726 లో దేశ బహిష్కరణ దండన పొంది ఇంగ్లాండుకు వెళ్లాడు. అక్కడ అతని వేదాంతభావాలు వృద్ధి పొందాయి. 1728, 29 లలో ఫ్రాన్స్‌కు తిరిగి వచ్చి వోల్తేర్ నాటక రచనను కొనసాగించాడు. అతని చరిత్రాత్మక రచనలు *ఛార్లెస్-12* (Charles XII,

1731), *లే సియెకిల్ డి లూయిస్-14* (Le Siecle de louis XIV, 1751) గణుతికెక్కాయి. 1734 లో *లెటర్స్ ఫిలసాఫిక్స్* ప్రచురించిన తరువాత దానిలోని రాజకీయ మత విమర్శ కారణంగా చెలరేగిన దుమారం వల్ల వోల్తేర్ పారిస్ వదలి ఛాంపేన్‌లోని సిరే నగరానికి పారిపోయాడు. అక్కడ మేడమ్ డు ఛాట్‌రెట్ ఆశ్రయం పొంది తరువాతి కాలంలో ఆమెను వివాహం చేసుకొన్నాడు. సిరేలో వోల్తేర్ విజ్ఞాన పరిశోధనలపట్ల ఆసక్తు డయాడు. మతాలను గూర్చి, సంస్కృతి గూర్చి అధ్యయనం సాగించాడు. వేదాంతం, నీతి ప్రబోధకాలైన అనేక గ్రంథాలు వ్రాసిన వోల్తేర్ కొన్ని కథలు కూడా వ్రాశాడు. *మైక్రో మిగాస్* (Micromiegas, 1752), *జాడిగ్* (Zadig, 1747), *కాండిడె* (Candide, 1758) లు వాటిలో పేర్కొన దగినవి. వోల్తేర్ అన్యాయాలను ఎదిరించే తత్త్వం గలవాడు. ముఖ్యంగా మత పక్షపాతంతో జరిగే అన్యాయాలతో పోరాడటంలో ఏ మాత్రం రాజీ పడకపోవటం వోల్తేర్ అలవాటు.

వోల్తేర్ కవి 1750 లో రష్యా రాజు ఫ్రెడరిక్ ఆహ్వానాన్ని మన్నించి బెర్లిన్‌కు వెళ్లాడు. 1754 లో స్విట్జర్లాండులో స్థిరనివాసం ఏర్పరచుకొని తన శేష జీవితాన్ని అక్కడే గడిపాడు. 1778 మే 30 న పారిస్ నగరంలో తనువు చాలించాడు.

ఎమ్.గు.రా.

**వోల్‌ఫ్రామ్, వాన్ ఏషెన్‌బాహ్ (1170-1220):** జర్మన్ మహాకవి. ఇతడు రచించిన మహాకావ్యం *పార్జివాల్* (Parzival) జర్మన్ మధ్యయుగ సాహిత్యానికి తలమానికం వంటిది. ఈ ఇతిహాసకావ్యం ఉదాత్తమైన నైతిక విలువలకు, సృజనాత్మక శక్తికి అద్భుతమైన నిదర్శనం. వోల్‌ఫ్రామ్ 'సర్' బిరుదాంకితుడు. ఇతడు కొంత మంది క్రమాగత ఫ్రాంకోనియన్ ప్రభువులను సేవించాడు. ఇతడు ఎబ్సెన్‌బెర్గ్, వైల్డెన్‌బెర్గ్, వెర్థీమ్ లాంటి కొన్ని ప్రాంతాలను తన రచనలో పేర్కొన్నాడు. ఇతనికి తురింజియా రాజైన మొదటి హెర్మన్ ఆస్థానంతో పరిచయం ఉన్నట్లు తెలుస్తున్నది. ఈ ఆస్థానంలోనే వోల్‌ఫ్రామ్ మధ్యయుగ భావకవులలో విశిష్టుడైన వాల్టర్ వాన్ డెర్ వోగెల్ వైడ్ ( Walther Von der Vogel weide) ను కలసినట్లు దాఖలా లున్నాయి. వోల్‌ఫ్రామ్ తాను నిరక్షర కుక్షినని చెప్పకున్నా, అతనికి ఫ్రెంచ్, జర్మన్ సాహిత్యాలతో గాఢపరిచయం ఉన్నట్లు తెలుస్తున్నది. బహుశః అతనికి వ్రాయడం రాకున్నా, చదవడం తెలిసి ఉండవచ్చునని విద్వాంసుల అభిప్రాయం.

వోల్‌ఫ్రామ్ రచనలలో మనకు నేడు కొన్ని మాత్రమే లభిస్తున్నాయి. లభ్యమైన ఎనిమిది భావ కవిత (Lyric poems)లలో *టూగెలిడెర్ డాన్ సాంగ్స్* అనే రచన ప్రధానంగా పేర్కొనదగింది. 'వేకువ పాటలు' అనబడే ఈ గీత సంకలనంలో ఉషఃకాలంలో ప్రేయసీప్రియులు విడిపోయే మనఃస్థితిని గురించి చిత్రించబడింది. *పార్జివాల్* (Parzival) వోల్ ఫ్రామ్ రచనలలో మకుటాయమానమైనది. *విల్లెహామ్* అసంపూర్ణ మహాకావ్యం. ఈ రచనలో క్రైస్తవ మత యుద్ధ వీరుడైన *గిలామె డీ ఆరంజ్* సాహసగాథ వర్ణింపబడింది. *టిట్యురెల్* అనబడే మరోకావ్యంలోని కొన్ని భాగాలు కూడా లభ్య మవుతున్నాయి. *సిగునే* (Sigune) విషాదాంత ప్రేమకథ ఈ కావ్యంలో చిత్రిత మయింది.

*పార్జివాల్* మహాకావ్యం క్రీ.శ. 1200 క్రీ.శ. 1210 మధ్య రచింపబడి ఉండవచ్చునని పండితులు అభిప్రాయపడుతున్నారు. ఈ ఇతిహాసం 25,000 పంక్తులు కలిగి 16 గ్రంథాలుగా విభజింపబడి ఉన్నది. *క్రెటీన్ డి ట్రాయ్స్* రచించిన *పెర్సివాల్ ఔ లే కాంటి డ్యు గ్రాల్* అనే అసంపూర్ణ రొమాంటిక్ రచన ఆధారంగా రూపొందించబడిన ఇతిహాస కావ్యం *పార్జివాల్*. ఈ కావ్యం *హూలీ గ్రెయిల్* ఇతివృత్తాన్ని జర్మన్ సాహిత్యంలో ప్రవేశ పెట్టింది. ఈ కావ్యంలోని ఆద్యంతాలు మాత్రం క్రొత్తవి. బహుశః వోల్ ఫ్రామ్ సృష్టి కావచ్చును. కాని రచయిత తాను వీటిని కూడ ఒక అజ్ఞాత కవినుంచి ఎరువు తెచ్చుకొన్నానని చెప్పకొన్నాడు. ఆ అజ్ఞాతకవి *గియట్* అనబడే ఒక ప్రాంతీయ కాల్పనిక కవి అని అభిజ్ఞుల అంచనా. *పార్జివాల్* లో పార్జివనాల్ అనే ఒక మూర్ఖుని కథ వర్ణింపబడింది.

వోల్‌ఫ్రామ్ పార్జివాల్‌ను జానపద కథలోని మూర్ఖుని స్థితినుంచి వివేకి దశకు ఎదిగేలా నాటకీయంగా చిత్రించాడు. ఈ కావ్యంలో మానవుని ఆధ్యాత్మిక వికాసం అన్యోక్తి ద్వారా చెప్పబడింది. 'పార్జివాల్' కావ్యం చాలా గంభీరమైనది. వస్తు గాంభీర్యానికి తగినట్లే శైలి కూడ సాగింది. ఆలంకారికంగా, గూఢంగా సాగిన శైలి సహృదయుని సామర్థ్యానికి పరీక్షే అనవచ్చును. కవి భావాలు మౌలికమే అయినా, చాలా చోట్ల గూఢంగా తోస్తాయి.

వోల్‌ఫ్రామ్ ప్రభావం తరువాతి కవులపై గాఢంగా ప్రసరించింది. వోల్‌ఫ్రామ్ మధ్యయుగ జర్మన్ మహాకవిత్రయంలో ఒకడుగా పరిగణింపబడటం అతని గొప్పతనానికి నిదర్శనం.

జి.అ.వా.

**శాండ్, జార్జ్ (1804-76) :** ప్రఖ్యాత ఫ్రెంచ్ నవలా రచయిత్రి. కథా రచయిత్రి, ప్రేమ కలాపాల్లో మునిగి తేలిన విలక్షణమైన వ్యక్తి. ఈమె అసలు పేరు *అమాంటిన్ ఆరోరె లూసిలిడు పెంట్*. 1832 లో ఈమె జార్జ్ శాండ్ అనే కలం పేరు పెట్టుకొంది. గ్రామీణ వాతావరణంతో కూడిన నవలలు వ్రాయటంలో సిద్ధహస్తురాలుగా పేరు మోసింది. శాండ్ ఫ్రాన్స్‌లోని నోహంత్‌లో మాతామహుల గ్రామంలో జన్మించింది. ఆమె బాల్యం రమణీయ ప్రకృతి మధ్య పల్లె పరిసరాలలో గడవడం వల్ల ప్రకృతి ప్రేమ, పల్లీయుల పట్ల ఆదరాభిమానాలు ఆమె రచనలలో వెల్లివిరిశాయి.



శాండ్ వివాహం 1822 లో జరిగినా అది కొద్ది కాలానికే భగ్నమైంది. తరువాత ఆమె ఎంతో మందితో ప్రేమ కలాపాలు జరిపింది. కొంత కాలం కొంత మందితో కలసి జీవించింది. మొత్తం మీద ఆమె వైవాహిక జీవితం ఎలాంటి కట్టుబాట్లకు లోనుగాక స్వతంత్రంగా, స్వేచ్ఛగా సాగిం దని చెప్పవచ్చు.

ఆమె మొదట్లో మరొకరితో కలసి రచనలు చేసినా, 1832 లో 'జార్జ్ శాండ్' అనే కలంపేరుతో *ఇండియానా* అనే నవలను స్వతంత్రంగా రచించింది. ఈ నవల ఆమెకు అనతికాలంలోనే పేరు ప్రతిష్ఠలు తెచ్చిపెట్టింది. భర్త అదుపాజ్ఞలకు లోనై వ్యక్తిత్వం చంపుకొని బ్రతికే భార్యల అస్వతంత్ర జీవితాన్ని ఎదుర్కొనడం ఈ నవలలో కథావస్తువు. స్త్రీ సామాజిక బంధనాలను త్రెంచుకొని స్వతంత్రంగా, స్వేచ్ఛగా బ్రతకాలని జార్జ్ శాండ్ తన నవల ద్వారా నిరూపించింది. ఒక విధంగా ఆమె స్వేచ్ఛా ప్రణయాన్ని చాటిందని భావించవచ్చు. *వాలెంటైన్* (1832), *లేలియా* (1833) అనే నవలలలో ఆమె వివాహబంధనాలకు అతీతమైన సహజీవనాన్ని చిత్రించింది.

శాండ్ స్వేచ్ఛాజీవి. ఆమె తొలి రచనలైన *లేలియా మ్యోప్రాట్* (1837), *ఫ్రాన్స్వాయిస్ లే చంపి* (1848), *లా పిటైల్ ఫెడెట్టి* (1849) అనే నవలలలో ఆమె తాను పుట్టి పెరిగిన గ్రామీణ పరిసరాలను, తనకు ఇష్టమైన స్వేచ్ఛా ప్రణయ జీవితాన్ని చిత్రించింది. ఈ నవలలు శాండ్‌ను నవలా రచయిత్రిగా సుప్రతిష్ఠితను చేశాయి. ఆమె ఆత్మకథ *హిస్టాయిర్ డీ మావీ* (1854-55; Story of My Life) జనాదరణ పొందిన రచన. ఆమె తన మనుమలు, మనుమరాండ్రకోసం రచించిన కథలు *కోంటెస్ డీ ఉనెగ్రాండ్‌మేరే* (1873; Tales of a Grand mother) కూడ విశిష్టమైన రచన.

శాండ్ ఆదర్శవాదంతో కూడుకొన్న రచనలు చేసింది. ఆమె నవలలోని పాత్రలు మూర్తీభవించిన అమాయకత్వంగా చిత్రింపబడ్డాయి. పనిపిల్లల అమాయికత్వం, జీవితం పట్ల అచంచలమైన ప్రేమ ఆమె రచనలను అద్భుత ప్రపంచంగా చిత్రించేందుకు దోహదం చేశాయి. "నవల జీవితంలోని వాస్తవికతను చిత్రించి తీరాలనే నియమం ఏదీ లే" దన్న ఆమె అభిప్రాయానికి ఆమె రచనలు దర్పణాల వంటివి.

జి.అ.నా.

**శాండ్‌బర్గ్, కార్ల్ (1878-1967) :** అమెరికన్ కవి, చరిత్రకారుడు, నవలా రచయిత, జానపద గాయకుడు. ఉదర పోషణార్థం చిన్నతనం నుంచే రక రకాల వృత్తులు చేపట్టవలసి వచ్చింది. స్పానిష్ అమెరికన్ యుద్ధంలో 6 వ ఇల్లినాయిస్ పదాతి దళంలో చేరాడు. శాండ్‌బర్గ్ తన చిన్ననాటి జ్ఞాపకాలను *ఆల్వేస్ ది యంగ్ స్ట్రేంజర్స్* (Always the Young Strangers) అనే స్వీయ చరిత్రలో వర్ణించాడు. శాండ్‌బర్గ్ 1914 లో *పొయెట్రీ* అనే పత్రికలో *చికాగో పొయెమ్స్* అని ఎన్నో కవితలు వ్రాశాడు. అవి 1916 లో పుస్తక రూపంగా వెలువడ్డాయి. శాండ్‌బర్గ్ *చికాగో* అనే ప్రసిద్ధ కవితలో నగర జీవితంలోని శత సహస్ర రూపాలను చిత్రించాడు. శాండ్‌బర్గ్ కవితలు అతి త్వరలో బహుళ ప్రజాదరణ పొందాయి. అతడు 1920 లో ప్రచురించిన *స్మోక్ అండ్ స్టీల్* (Smoke and Steel) కవితా సంకలనంలోని



వచన కవితలలో కార్మికుని ఘనంగా కొనియాడాడు.

శాండ్‌బర్గ్ ప్రజాస్వామ్యంలో గొప్ప విశ్వాసం ఉన్న రచయిత. 1910-12 ల మధ్య సోషల్ డెమోక్రటిక్ పార్టీకి సంచాలకుడుగా పనిచేసిన వ్యక్తి. కాని రాను రాను ప్రజాస్వామ్యం మీద అతనికి నమ్మకం సన్నగిల్లసాగింది. *గుడ్‌మార్నింగ్, అమెరికా* (1928), అనే కవితా సంకలనంలో తన భావాలను శక్తిమంతంగా వ్యక్తం చేశాడు. కాని ప్రజలను ప్రగతి పథంలో సాగమని ప్రబోధిస్తూ శాండ్‌బర్గ్ హృదంతరాళం నుండి వెలువరించిన కవితలు *ది పీపుల్, యెస్,* సంకలనంగా 1936 లో అచ్చయ్యాయి. శాండ్‌బర్గ్ సుమధుర గాయకుడు. అతడు పాడి, ప్రజాదరణ పొందిన గీతాలు *ది అమెరికన్ సాంగ్ బాగ్* (1927), న్యూ అమెరికన్ సాంగ్ బాగ్ (1950), అనే సంకలనాలుగా వెలువడ్డాయి. శాండ్‌బర్గ్ వ్రాసిన *అబ్రహాం లింకన్ జీవిత చరిత్ర ది ప్రేరీ యియర్స్* సంపుటాలుగా 1926 లో వెలువడింది. అంతేకాక అతను నాలుగు సంపుటాలుగా వెలువరించిన *అబ్రహాం లింకన్, ది వార్ ఇయర్స్* 1939 లో వెలువడి అతనికి ఎనలేని కీర్తి తెచ్చిపెట్టింది. అతను *స్టీచెన్ ది ఫోటోగ్రాఫర్* (1919), అనే మరో జీవిత చరిత్ర కూడా రచించాడు. అతడు వ్రాసిన పెద్ద నవల *రిమెంబ్రెన్స్ రాక్* కూడ పాఠకుల ఆదరణ పొందింది. శాండ్‌బర్గ్ పిల్లలకోసం వ్రాసిన నాలుగు పుస్తకాలు: *రూటాబాగా స్టోరీస్, రూటాబాగా పిజియన్స్, రూటాబాగా కంట్రీ, పొటాటో ఫేస్* విశేషంగా ప్రజాదరణ పొందాయి.

*జి.అ.నా.*

**శాఫో** (క్రీ.పూ. 610-580 ప్రాంతం) : నేటికీ ప్రపంచ కవులందరి చేతా ప్రశంస లందుకొంటున్న గ్రీక్ భావకవయిత్రి. గ్రీక్ సాహిత్యంలో ఆర్కిలోకస్, ఆల్కేయియస్ అనే ఇద్దరు గ్రీక్ కవులు తప్ప తక్కిన కవులెవ్వరూ పాఠకులతో ఆత్మీయమైన అనుబంధం ఏర్పరచుకోడంలో శాఫోకు సాటిరారు. తన కవిత్వంలో ఆమె వాడిన పదజాలం, మాండలిక భాష ప్రజా వ్యవహారానికి మిక్కిలి సన్నిహితమైనవి. ఆమె పదబంధాలు ఇమిడిక కలిగి, సూటిగా పాఠకుల హృదయాలను తాకుతాయి. తాను దూరంగా నిలచి తన ఆవేశాలనూ, ఆవేదనలనూ సవిమర్శకంగా పరిశీలించుకోగల శక్తి శాఫోలో కనిపిస్తుంది.

ఆండ్రోస్ దీవిలోని ఒక సంపన్నుడైన శర్కొలాస్‌ను శాఫో వివాహమాడినట్లు చెబుతున్నారు. ఇతర సంపన్నులతో పాటు ఆమెకు కూడా దేశ బహిష్కార శిక్షను విధించినట్లూ, ఆ విధంగా ఆమె కొంత కాలం పాటు సిసిలీలో గడిపినట్లూ ప్రచారంలో ఉన్నకథ బహుశః నిజమే కావచ్చును. అయితే, ఆమె జీవితంలో ఎక్కువ భాగం లెస్‌బోస్ దీవిలోని మైటిలీన్‌లో గడిపిన మాట మాత్రం వాస్తవం. ఆమె సోదరుడు చరాక్సెస్ ప్రసక్తి ఆమె రచించిన చాలా కవితలలో కనిపించినా, ఎక్కువగా ఆమె తన తోటి స్త్రీలతో తనకు గల మిత్రత్వ, శత్రుత్వాలను గూర్చి మాత్రమే వ్రాసింది. తన సమకాలికుడైన ఆల్కేయియస్ కవితలలో వలె శాఫో కవితలలో సమకాలీన రాజకీయ సంక్షోభాల ప్రస్తావన లేదు.

తన కాలంలో ఆమె పద్యాలు ఏ విధంగా ప్రచురింపబడి వ్యాప్తి చెందినదీ మనకు తెలియదు. క్రీస్తుపూర్వం 3 వ, 2 వ శతాబ్దాలలో ఆమె రచనలలో శేషించిన వాటిని సేకరించి తొమ్మిది భావ గీతాల సంపుటాలనూ, ఒక *ఎల్జియాక్* పద్యాల సంపుటినీ భద్రపరచారు. కాని క్రీ.శ. 8 వ, 9 వ శతాబ్దాల నాటికి ఇతర కవులు శాఫో కవితలనుండి ఉదాహరించిన పద్యాలు మాత్రమే మిగిలాయి. 28 పంక్తులు గల ఒక పద్యం మాత్రమే సంపూర్ణంగా లభించింది. తరువాతి పెద్ద పద్యం 16 పంక్తులు గలది. 1898 లో పాపిరస్ ప్రతులను కనుగొనడంతో శాఫో రచించిన మరి కొన్ని పద్య శకలాలు దొరకినా ఇతర కవులు ఉదాహరించిన పై రెండు సంపూర్ణ పద్యాలతో సరిపోల్చదగినది ఏదీ లభించలేదు.

*బొ.శ్రీ.*

**శాలింజర్, జె.డి.** (1919--) : అమెరికన్ రచయిత. ఇతని నవల *ది కాచర్ ఇన్ ది రై* (1951) సవిమర్శకమైన ప్రశంసలు పొందింది. ముఖ్యంగా ద్వితీయ ప్రపంచ సంగ్రామం తరువాతి తరం కాలేజి విద్యార్థులలో దీనికి ఎక్కువ మంది అభిమానులు ఉన్నారు. ఇతడు 1948-59 మధ్య ఆ నవలను, మరి 13 చిన్న కథలను మాత్రమే వ్రాశాడు.

ఒక యూదు తండ్రికీ, క్రైస్తవ మతపు తల్లికీ శాలింజర్ జన్మించాడు. *ది కాచర్ ఇన్ ది రై* అనే నవలలోని నాయకుని లాగే న్యూయార్క్ సిటీలో పబ్లిక్‌స్కూళ్లలోను, మిలిటరీ అకాడమీలోనూ ఇతడు విద్యాభ్యాసం చేశాడు. కొద్ది కాలం న్యూయార్క్, కొలంబియా విశ్వవిద్యాలయాలలో గడపిన తరువాత తన పూర్తి సమయాన్ని రచనకే అతడు వినియోగింపసాగాడు. 1940 నుంచి పత్రికలలో అతని కథలు ప్రచురింపబడుతూ వచ్చాయి. 1942-46 మధ్య అమెరికన్ సైన్యంలో పనిచేసి తిరిగి వచ్చిన తరువాత శాలింజర్ తన రచనలను పూర్తిగా

*ది న్యూ యార్కర్* మేగజైన్‌లోనే ప్రచురింప సాగాడు. అతని మేలి కథలు కొన్నిటిలో అతని యుద్ధ కాలపు అనుభవాలు ప్రతిఫలిస్తాయి. *ది కాచర్ ఇన్ ది రై* అనే నవలలోని హాస్యం, ఆలంకారికమైన శైలీ మార్క్‌ట్వెయిన్ వ్రాసిన *అడ్వెంచర్స్ ఆఫ్ హకిల్ 'బెరీ ఫిన్ నీ, రింగ్ లార్డ్‌నర్* కథలనూ గుర్తుకు తెస్తాయి. నైన్ స్టోరీస్ (1953, తొమ్మిది కథలు) అనే సంపుటం లోని శాలింజర్ రచించిన ప్రశస్తమైన కథలు అతని కీర్తిని ఇనుమడింపజేశాయి.

బొ.శ్రీ.

**షఫ్వీ అహ్మద్ (1868-1932) :** ఈజిప్టు దేశీయుడైన అరబ్బీ మహాకవి. ఖడీన్ ఆస్థానికుల కుటుంబంలో జన్మించి, ఫ్రాన్స్‌లో విద్యాభ్యాసం చేసి, ఉన్నతోద్యోగాలు నిర్వహించి, త్వరలోనే మహాకవిగా ప్రశస్తి పొందాడు. కొంతకాలం స్పెయిన్‌లో ప్రవాస జీవితం గడపి తిరిగి వచ్చిన తరువాత ఇతని ఖ్యాతి ఇనుమడించి 'కవి రాజు' (Amirash-shuara) గా గుర్తింపు పొందాడు. భాషా, శైలీ, ఛందస్సుల మీద ఇతనికి గల అధికారం నిరుపమానం. కవితా వస్తువు సాంప్రదాయిక స్తోత్రాల దగ్గరనుండి షేక్స్‌పియర్, కోర్నీల్, రాసినేలను తలపింపజేసే పద్య నాటకాల వరకు విస్తృతమైంది. ఆధునిక అరబ్బీ పద్యనాటకాలకు ఇతడే మార్గదర్శి. *క్లియోపాత్ర పతనం* (Masra Kulyubatarah) మొదలైన నాటకాలలో ప్రాచీన అరబ్బీ మహాకవుల అనుకరణలు కనిపిస్తాయి.

జయలక్ష్మి.

**షా, జార్జ్ బెర్నార్డ్:** చూ. బెర్నార్డ్‌షా, జార్జ్.

**షాతోబ్రియాండ్, ఫ్రాన్స్వాయిస్ ఆగస్టే రెనీ (1768-1848) :** ఫ్రెంచ్ తొలి కాల్పనికోద్యమ రచయితలలో ఒకడు. తన కాలం నాటి యువ రచయితల మీద అధిక ప్రభావం నెరపిన వాడు. అమెరికన్‌లను గురించి, అమెరికన్ ఇండియన్‌లను గురించి విచిత్ర రచనలు చేసినవాడు. కాని తనను గురించి తాను చెప్పుకొన్న *నాస్మృతులు* అనే రచనే ఎక్కువ ప్రసిద్ధి పొందింది.

షాతో బ్రియాండ్ ఫ్రాన్స్‌లోని బ్రిటన్ రాష్ట్రంలోని సెంట్‌మాలో అనే గ్రామంలో 1768 సెప్టెంబర్ 4 వ తేదీన జన్మించాడు. బ్రతికి చెడిన ఒక 'ప్రభు' వంశానికి చెందిన ఈ రచయిత వ్యక్తిత్వం విచిత్రమైంది. ఇతడు అహంకార ప్రవృత్తి, స్వేచ్ఛా ప్రియత్వం, భావావేశం, సౌందర్యోపాసన, స్త్రీ లౌల్యం, సాహస ప్రవృత్తి గలవాడు. 19 వ శతాబ్దంలో అటు రాజకీయ రంగంలోను, ఇటు సాహిత్యా రంగంలోను కూడా అతిరథు డనిపించుకున్న షాతో బ్రియాండ్ జీవితం ఒక విషాదాంత కావ్యం అయింది. ప్రముఖ ఫ్రెంచ్ రచయిత రూసోతో కొన్ని పోలిక లున్నా రూసోలో కనిపించే నిజాయితీ ఇతనిలో మృగ్యం. వోల్తేర్‌లోని హేతువాద ధోరణి కొంత అలవడినా, ఇతడు పూర్తిగా హేతువాది కాడు.

విద్యాభ్యాసం ముగియగానే షాతో బ్రియాండ్ ఆశ్విక సైన్యంలో ఆఫీసర్‌గా చేరాడు. అంతలో ఫ్రెంచ్ విప్లవం ఆరంభమైంది. ఫ్రెంచ్ చక్రవర్తి 16 వ లూయీ మీద ప్రజలు తిరుగబడగా ప్రభువును సమర్థించడానికి మనస్కరించక అమెరికా సంయుక్త రాష్ట్రాలకు వలస పోయాడు. అక్కడ ఉన్ని వర్తకులతో కలసి అరణ్యాలలోను, కొండ కోనలలోను తిరిగి, ఆదిమ వాసులైన ఎఱ్ఱ ఇండియన్‌లతో సాన్నిహిత్యం సంపాదించు కొన్నాడు. అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని ప్రకృతి సౌందర్యాన్ని తనివి తీరా గ్రోలి ఆదిమవాసుల అంతర్యం అవగతం చేసుకుని *లానేషే* అనే ఒక యాత్రా గ్రంథం వ్రాశాడు. లూయీ రాజు దేశం నుంచి పరారీ అయిన సంగతి తెలిసి స్వదేశం తిరిగి వచ్చాడు. అప్పుడు అతడు రాజును సమర్థించడానికి నిశ్చయించుకుని ఆయన పక్షాన పాల్గొనిన ఒక యుద్ధంలో తీవ్రంగా గాయపడ్డాడు. అతని అన్నను, వదినెను ప్రజలు ఉరితీశారు. తల్లినీ, చెల్లినీ బంధించారు.

నెపోలియన్ పాలనలో బెర్లిన్‌లోను, రోమ్‌లోను, ఇంగ్లండ్ లోను ప్రభుత్వ రాయబారిగా షాతో బ్రియాండ్ పనిచేశాడు. కాని నెపోలియన్ నియంతృత్వ ధోరణికి నిరసనగా పదవీ పరిత్యాగం చేసి స్వదేశంలోనే రచయితగా స్థిరపడ్డాడు. కొన్నాళ్లు ప్రభుత్వ దృష్టి నుంచి తప్పించు కొని తిరిగాడు. నెపోలియన్ తరువాత వచ్చిన బూర్బన్ రాజవంశాన్ని సమర్థించి తిరిగి రాజకీయ రంగంలో ప్రవేశించాడు. ప్రభుత్వం వల్ల 'వైకౌంట్' బిరుదం పొందాడు. పార్లమెంట్ ఎగువసభ అయిన 'హౌస్ ఆఫ్ పీర్స్' లో స్థానం లభించింది. విదేశాంగ శాఖా మంత్రిగా స్పెయిన్‌తో యుద్ధం ప్రకటించాడు. బూర్బన్ రాజవంశాన్ని సుప్రతిష్ఠితం చేసి ప్రజల అభిమానానికి దూరం అయాడు.

షాతోబ్రియాండ్ సాహిత్య వ్యాసంగం 19 వ శతాబ్దపు తొలి పాదానికి పరిమితమైందని చెప్పవచ్చు. ఇంగ్లండ్‌లో బైరన్ కవిలాగే ఇతడు కూడా తనకు ప్రతిరూపంగా 'రెనే' అనే విషాద నాయకుణ్ణి సృష్టించి

తరువాతి తరం కవులను ప్రభావితులను చేశాడు. ఫ్రెంచ్ వచన శైలి ఇతని చేతిలో ఎన్నో క్రొత్త సొగసులను సంతరించుకుంది. ఇతని రచనలలో ప్రధానమైనవి: 1. *ఎస్సే ఆన్ ది రివల్యూషన్* (1797 - దీనిలో సంప్రదాయ క్రైస్తవ మతాన్ని హేతువాద దృష్టితో విమర్శించాడు). 2. *ది జీనియస్ ఆఫ్ క్రిస్టియానిటీ* (1802 - క్రైస్తవ మతంతో రాజీ పడి చేసిన రమ్య రచన ఇది.) 3. *అతలా, రెనే* అనే రెండు చిన్న చారిత్రక నవలలు, 4. *ల మార్టిర్స్* (దీనిలో అతని ప్రవాస జీవితం ప్రతిఫలిస్తుంది), 5. *మెమొయిర్స్ బియాండ్ ది టూంబ్* (ఈ రచన ఇతని మరణానంతరం ప్రకటితమై మిక్కిలి ప్రసిద్ధి చెందింది.)

1811 లో ఫ్రెంచ్ సాహిత్య అకాడమీ షాతోబ్రియాండ్ ను సభ్యుడుగా ఎన్నుకొని గౌరవించింది. 1847 జూలై 4 న పారిస్ లో ఇతడు పరమపదించాడు.

*గం.శ్రీ.*

**షాన్యే, ఆంద్రే డి (1762-94)** : ఫ్రెంచ్ కవి, రాజకీయ వ్యాఖ్యాత, పత్రికా రచయిత. 18 వ శతాబ్దిలో అగ్రగణ్యుడైన ఫ్రెంచ్ కవిగా గుర్తింపు పొందిన వాడు. మరణించిన 25 సంవత్సరాల వరకూ ఈయన రచనలను గూర్చి లోకానికి చాలా తక్కువగా తెలుసు. అవి బహు విరళంగా ప్రచురిత మయాయి. షాన్యే కవితా సంకలనం ముద్రణ 1819 లో మొట్టమొదటి సారి వెలువడినప్పుడు వెంటనే అది గొప్ప విజయం సాధించింది. కాల్పనికోద్యమ కవులే కాక వారికి వ్యతిరేక వర్గం వారు కూడా దానిని ప్రశంసించారు. 19 వ శతాబ్ది కవిత్వాన్ని ఈయన కవిత ప్రభావితం చేసింది. ఈయన జరిపిన రాజకీయ పోరాటం, వీర మరణం కూడా ప్రసిద్ధి పొందాయి. యూరప్‌లో విప్లవకవి వీరుడుగా ఆయన ప్రసిద్ధి కెక్కాడు. ఎందరో గొప్ప రచయితలు ఆయన జీవితేతివృత్తాన్ని కావ్యంగా వ్రాశారు.

షాన్యే తల్లి గ్రీక్ వనిత. షాన్యేకు పురణేతిహాస కావ్యాల పట్ల మక్కువ ఎక్కువ. ముఖ్యంగా స్మృతి కావ్యాలంటే ఆయనకు ఇష్టం. డినవ్రేలో అభ్యుదయ కళాశాలలో ఆయన చదివాడు. 1782-88 లో సైనికోద్యోగంలో చేరాలని ప్రయత్నించినా అది ఫలించలేదు. 5 సంవత్సరాల కాలం పూర్తిగా అధ్యయనానికే వినియోగించాడు. 1787 లో లండన్‌లోని ఫ్రెంచ్ దౌత్య కార్యాలయంలో ఒక ఉద్యోగం చేపట్టాడు. ఆ కాలంలో ఆయన ఒక మహా కావ్యం రచించాలని తలపెట్టాడు. ముఖ్యంగా ఆధునిక ప్రపంచాన్ని గూర్చి మహాకావ్యం వ్రాయాలని ఆయన అనుకున్నాడు కాని మానసిక సంక్షోభాల వల్ల ఆ ప్రయత్నా లేవీ ఫలించలేదు. లండన్‌లో ఆయన ఉన్న సంవత్సరాలు చాలా విచారంగా గడిపాడు. ఏ కోరికనూ సాధించలేక పోవడంవల్ల, ఆత్మవిశ్వాసం లోపించడం వల్ల ఆయన చాలా బాధ పడ్డాడు.

1789 లో సంభవించిన విప్లవ సంక్షోభం ద్వారా ఆయన ఈ నిరాశా నిస్పృహల నుంచి కొంత తేరుకోగలిగాడు. ఆయన పారిస్‌కు తిరిగి వచ్చి, ఆ నాటి రాజకీయాలను గూర్చి పత్రికలలో వ్రాయడానికి పూను కున్నాడు. రెండు పక్షాలవారి అతివాదాన్నీ, అంటే చక్రవర్తి తాలూకు ప్రగతి నిరోధక వాదాన్నీ, విప్లవ పక్షంవారి హింసా దృక్పథాన్నీ కూడా ఆయన తీవ్రంగా ఖండిస్తూ వ్రాసేవాడు. దీనివల్ల తనకు రాబోయే ప్రమాదాన్ని ఊహించలేనంత అమాయికుడు కాడాయన. అవసరం లేకపోయినా కొన్ని సందర్భాలలో ఆయన బయట పడిపోయేవాడు. తీవ్ర నైతిక తత్పరత్వం వల్ల ఆయన ఉదాసీనంగా ఉండలేక పోయేవాడు. 1794 లో ఆయనను నిర్బంధించి సెయింట్ లాజరీ జైల్లో ఉంచారు. నాలుగు నెలల తరువాత ఆయనకు శిరశ్ఛేద శిక్ష విధించారు. అది జరిగిన కొద్ది రోజులలోనే విప్లవనాయకుడు మాక్సిమిలియన్ రోబస్ ఫెర్రీ పతనం సంభవించింది. ఇదే ముందు జరిగి ఉంటే షాన్యే ప్రాణాలు పోగొట్టుకొని ఉండేవాడు కాడు. గ్రీకు గేయాలు ఫ్రెంచ్ కవిత్వాన్ని ఏ విధంగా శక్తిమంతం చేయగలవో చూపడం షాన్యే సాధించిన ఘన విజయం. స్వేచ్ఛా న్యాయాలను గూర్చి ముక్తకంఠంతో షాన్యే ప్రకటించాడు. చివరగా, ఆయన ఉరితీతకు కొద్ది రోజుల ముందు రచించిన *ఇయాంబ్స్* అనే రచనలు మానవుని ఆత్మశక్తి ఎంత అజేయమో హృదయావర్జకంగా చిత్రించాయి.

*మంజుశ్రీ*

**షిగా, నవోయా (1883-1971)** : ఆధునిక జపాన్ కాల్పనిక సాహిత్యానికి గురుపీఠమైనవాడు. 'సమురాయి' అనే రాచ కుటుంబంలో జన్మించాడు. యువకుడుగా క్రైస్తవ మతాచార్యుల ప్రభావానికి లోనైనా, క్రైస్తవ మతం ఇతనిని ప్రభావితుణ్ణి చేయలేకపోయింది. పట్టభద్రుడైన తరువాత విశ్వ విద్యాలయంలో చేరి డిగ్రీ తీసుకోకుండానే చదువు మాని వేశాడు. కొందరు మిత్రులతో కలసి *శ్వేతాశ్వత్థం* (Shirakaba) అనే పత్రిక ప్రారంభించాడు. ఈ పత్రిక వైయక్తిక, మానవతావాదాలకు ప్రాధాన్యమిచ్చేది. కాని కాలక్రమేణ ఈ పత్రికతాలూకు ఆదర్శవాదానికీ,

తన వాస్తవికతాదృష్టికి పొత్తుకుదరనందున దానిని వదలివేశాడు.

అతిసూక్ష్మ స్పందనలకు కూడా సున్నితంగా ప్రతి స్పందించే పాత్రలను నిశిత పరిశీలనతో స్వభావ సిద్ధంగా చిత్రించటం ఇతని ప్రత్యేకత. ప్రసన్న కథా కథనానికి పేరు తెచ్చుకొన్నాడు. ప్రతిభా విశిష్టమైన విన్నాణంతో కూడిన ఇతని ప్రౌఢ శైలి "షిగా శైలి" అని పేరు పొందింది. ఇతని చిన్న కథలు, నవలలు చాలా వాటిలోని ప్రధానపాత్రలు కుటుంబ సంబంధమైన కలతలను గురించి ఉత్తమ పురుషలో చెప్పకొంటూ ఉంటాయి. *రాజీ* (Reconciliation), *కాళరాత్రి* (A Dark Night's Passing), *అన్యాకోరో* (Anya koro) అనే ఒక పెద్ద నవల ఇతని రచనలు. ఇతనిలోని రచనా ప్రవృత్తి కొన్నాళ్ళపాటు విజృంభిస్తూ, దీర్ఘకాలాలు నిద్రాణంగా ఉంటూ ఉండేది. ఇతడు బ్రతుకు తెరువుగా రచనలపై ఎప్పుడూ ఆధార పడినవాడు కాదు.



చ.తి.

**షిల్లర్, ఫ్రెడరిక్ వాన్ (1759-1805)** : ప్రముఖ జర్మన్ కవి, నాటక రచయిత, సాహిత్య విమర్శకుడు, చరిత్రకారుడు, తత్త్వశాస్త్రవేత్త.

షిల్లర్ తండ్రి ఒక ప్రభువుకు ఆశ్రితుడు. ఆ ప్రభువు నియంత. షిల్లర్‌ను అతని అభిరుచికి, అతని తల్లిదండ్రుల ఇష్టానికి విరుద్ధంగా నిర్బంధంగా సైనిక శిక్షణలోను, తరువాత వైద్య విద్యలోను ప్రవేశ పెట్టాడు. విద్యార్థి అయిన షిల్లర్ 'మానవుని లోని జంతు, ఆత్మప్రవృత్తులు' అనే వ్యాసం వ్రాసినందుకు విద్యాశాల నుండి బహిష్కృతు డయాడు. చిన్నతనం నుండి నియంతృత్వ బాధ రుచి చూస్తున్న షిల్లర్ నిరసన భావం ఇతని తొలి నాటకమైన *దోపిడి దొంగలు* ( Die Rauber) లోనే బహిర్గతమైంది. ఇందులో ఒక యువకుడు నిరంకుశ నిర్బంధాలతో విసిగి సమాజ శత్రువుగా మారుతాడు. ఈ నాటకపు తొలి ప్రదర్శనకు షిల్లర్ తన ప్రభువు అనుమతి లేకుండా హాజరైనందుకు శిక్షగా, అతడు షిల్లర్‌ను 15 రోజులపాటు కారాగృహంలో బంధించటమే కాక, ఇకముందు నాటకాలు వ్రాయకూడదని ఆంక్ష విధించాడు. షిల్లర్ ఆ నియంత నుండి ఎలాగో తప్పించుకొని పారిపోయాడు. చాల కాలం వరకు స్థిరమైన ఆశ్రయం లభించక దుర్భర దారిద్ర్య జీవితం గడిపాడు. ఈ స్థితిలో ఇతడు వ్రాసిన *కార్లోస్ రాకుమారుడు* (Don Carlos) నాటకం విజయవంతం కావటంతో ఇతని దశ తిరిగింది. ఈ నాటకంలో కథ మన సారంగధర కథకు సరిగ్గా విరుద్ధం. కార్లోస్ రాకుమారుడు తన మారుతల్లిని ప్రేమిస్తాడు. తండ్రి కొడుకులకు మనస్తాపాలు ప్రబలి రాజ్యంలో సంక్షోభానికి దారి తీస్తుంది. ఆర్థికంగా కుదుట బడిన షిల్లర్ *ఆనంద గీతం* రచించాడు. దీన్ని ప్రసిద్ధ గాయకుడు 'బీతోవెన్' (Beethoven) అభిమానంతో గానం చేసేవాడు. షిల్లర్‌కు మహాకవి గొయ్‌థే (Goethe) మైత్రి లభించింది. వీరిద్దరి మైత్రి జర్మన్ సాహిత్య చరిత్రలో ఒక సువర్ణాధ్యాయానికి వస్తువు అయింది.

షిల్లర్ దృష్టి చరిత్ర వంకకు మరలింది. *స్పెయిన్ ప్రభుత్వంపై హాలండ్ తిరుగుబాటు, ముప్పై సంవత్సరాల యుద్ధం* అనే చరిత్ర గ్రంథాలు రచించి, గొయ్‌థే సిఫారసుతో జెనా విశ్వవిద్యాలయంలో చరిత్రాధ్యాపకుడయాడు. ఈ గ్రంథం రచనకై రాత్రింబవళ్లు పనిచేసి షిల్లర్ రోగగ్రస్తు డయాడు. జీవిత మంతా రోగిష్టిగానే గడపి అకాలమృత్యువుకు లోనయాడు. చరమదశలో షిల్లర్ తత్త్వశాస్త్రం వంక ఆకర్షితుడయాడు. 'కాంట్' ను బాగా అధ్యయనం చేశాడు. 'కాంట్' పరిచయం కూడా సంపాదించాడు. సాహిత్యాన్ని తత్త్వశాస్త్రంతో సమన్వయం చేస్తూ అనేక వ్యాసాలు వ్రాశాడు.

విషాదాంత నాటకానికి షిల్లర్ క్రొత్తరూపం ఇచ్చాడు. తప్పు చేసిన నాయకుడు బుద్ధి పూర్వకంగా ఆత్మత్యాగం చేసి నైతికంగా పునర్జన్మ పొందటమే ఇతడు చెప్పిన నూతనార్థం. *మేరీ స్టూవర్ట్* (Maria stuart) దీనికి చక్కని ఉదాహరణ. ఇంగ్లండు రాణి మొదటి ఎలిజబెత్ స్కాట్లండ్ రాణి అయిన మేరీని బందీ చేసి, మరణశిక్షకు లోను చేసింది. ఈ నాటకంలో మేరీ జీవితంలోని తుది మూడు రోజులు చిత్రింప బడ్డాయి. మేరీ తాను నిర్దోషిననీ, తనకు విధించబడ్డ శిక్ష అన్యాయమనీ వాదిస్తుంది. అయితే, ఇది తాను పూర్వం చేసిన నేరాలకు భగవంతుడు విధించిన శిక్షగా గ్రహించి ఎంతో సంతోషంతో స్వీకరిస్తుంది. దీనితో మేరీ

పాత్ర న్యాయాధిపతులకంటె, ఎలిజబెత్ కంటె కూడ ఉన్నతంగా పెరిగిపోతుంది.

షిల్లర్ సాహిత్య జీవితాన్ని గొయ్‌థే ఇలా సమీక్షించాడు. "స్వేచ్ఛాభావం షిల్లర్‌లో క్రమ పరిణతి పొందుతూ వచ్చింది. మొదట్లో ఇతడు అభిలషించింది మానవుని భౌతిక, రాజకీయ, సామాజిక స్వేచ్ఛ. చరమ దశలో ఇతడు కోరింది ఆధ్యాత్మిక స్వేచ్ఛ; భౌతిక బంధాలనుండి ఆత్మకు విముక్తి". ఇతని నాటకాలు ఈ ఉభయ విధాలైన సంఘర్షణను నిరూపించేవి కాగా, ఇతని కవిత్వం ఆధ్యాత్మిక సమతౌల్యాన్ని సాధించేందుకు కళ ఎలా సహాయభూత మౌతుందో నిరూపిస్తుంది.

చ.తి.

**షెపర్డ్, శామ్ (1943--) :** అమెరికన్ నాటక రచయిత, నటుడు; పూర్తిపేరు 'శామ్యూల్ షెపర్డ్ రోజర్స్'. ఇతని తండ్రి సైనికోద్యోగి కావడం వలన ఇతని చిన్నతనం చాలావరకు సైనిక స్థావరాలలో గడిచింది. కళాశాల చదువు ముగించకుండానే నటుడుగా షెపర్డ్ న్యూయార్క్ చేరాడు. ఇతని తొలి రచనలైన ఏకాంకికలు ప్రదర్శింపబడి విజయవంతం అయాయి. *చికాగో, రెడ్ క్రాస్* మొదలైన నాటికలకు తన 22 వ ఏటనే ఓ.బీ (Obie) పారితోషికాలు సంపాదించాడు. కొన్నేళ్లపాటు లండన్‌లో నివసిస్తూ *టూత్ ఆఫ్ క్రైమ్* (Tooth of Crime) మొదలైన నాటకాలు రచించాడు. శాన్‌ఫ్రాన్సిస్కోలో మాజిక్ థియేటరుకు 'నిలయ నాటక రచయిత' గా స్థిరపడ్డాడు.

జీవిత సంఘటనలను సింహావలోకనం చేసుకొనే ఏకపాత్ర నాటిక ఇతని అభిమాన ప్రక్రియ. *కిల్లర్స్ హెడ్* (Killer's Head) అనే నాటికలో మరణశిక్ష విధింపబడిన హంతకుని చివరి రాత్రి, కడపటి ఆలోచనలే వస్తువు. *ఏంజెల్ సిటీ* (Angel City) లో హాలీవుడ్ చలన చిత్ర పరిశ్రమలోని విధ్వంసక యంత్రాంగం వస్తువు. *కర్స్ ఆఫ్ ద స్టార్వింగ్ క్లాస్, బ్యరీడ్ చైల్డ్, ట్రూ వెస్ట్* మొదలైన నాటకాలలో ఛిన్నాభిన్నమైన ఆధునిక కుటుంబాలలోని రక్త సంబంధాల పరిశీలన కనిపిస్తుంది. *బ్యరీడ్ చైల్డ్* పులిట్జర్ పారితోషికాన్ని గెలుచుకొంది. 'డేస్ ఆఫ్ హెవెన్', 'రిసరెక్షన్' మొదలైన చలన చిత్రాలలో నటించి శామ్ విమర్శకుల ప్రశంసలను పొందాడు. *ద అన్‌సీన్ హాండ్, సెడ్యూస్డ్, ఫూల్ ఫర్ లవ్* మొదలైన చాలా నాటకాలు రచించాడు.

చ.తి.

**షెరిడన్, రిచర్డ్ బ్రిన్‌స్లీ బట్లర్ (1751-1861) :** ఆంగ్ల నాటక రచయిత, నాటక ప్రయోక్త, వక్త, రాజకీయవేత్త, పుట్టుకచే ఐరిష్ జాతీయుడు; చిన్నతనంలోనే తలిదండ్రులతో లండన్ చేరి అక్కడ స్థిరపడ్డాడు. ఇతని తాత ప్రసిద్ధ ఆంగ్ల రచయిత జొనాథన్ స్విఫ్ట్‌కు ఆంతరంగికుడు. తండ్రి ఒక నిఘంటుకర్త, వక్తృత్వానికి ప్రాధాన్యమిచ్చిన విద్యావేత్త; తల్లి నాటక రచయిత్రి. విద్వత్కుటుంబంలో పుట్టిన షెరిడన్ మీద తలిదండ్రుల, తాతగారి ప్రభావం ఎక్కువగా ఉంది. ఆక్స్‌ఫర్డ్‌లో విద్యార్థిగా ఉండగానే షెరిడన్ ఒక మిత్రునితో కలసి ఒక ప్రహసనం, కొన్ని కవితలు, కొన్ని అనువాదాలు రచించాడు. ఎలిజబెత్ అనే గాయకురాలిని ప్రేమించి ఆమె ప్రేమ విషయంలో ప్రతిద్వంద్వియైన ఒక భూస్వామితో ద్వంద్వ యుద్ధాలు చేశాడు. తండ్రి ఇష్టానికి విరుద్ధంగా ఎలిజబెత్‌ను పెండ్లాడి, చదువుమాని, జీవికకై నాటక రంగాన్ని ఆశ్రయించాడు. ఇతని మొదటి నాటకం ప్రహసన ప్రాయమైన *ప్రతి ద్వంద్వులు* విజయవంతమైంది. ఇందులోని 'మిసెస్ మాలెప్రాప్' కంఠాభరణ నాటకంలోని సోమావధాని పాత్రకు మాతృక అనదగిన 'అపశబ్ద శాసకురాలు'. విజయవంతమైన మరోనాటకం *ది డ్యూయెన్నా* సమకాలీన సభ్య సమాజంలోని కృత్రిమత్వాన్ని అపహాస్యం చెయ్యటమే ఇతని నాటకాలలోని ఇతివృత్తం. ఆర్థికంగా బలపడిన షెరిడన్ 'డ్రూరీ లేన్ థియెటర్' యాజమాన్యవర్గంలో భాగస్వామి అయాడు. ఇతని నాటకా లన్నిటిలోకి అత్యంత ప్రసిద్ధమైంది *ఏ స్కూల్ ఫర్ స్కాండల్* (1777) సున్నితమైన హాస్యం, సునిశితమైన విమర్శలకు దీని కిదేసాటి. దీనితో షెరిడన్ 'అభినవ కాంగ్రేవ్' బిరుదు సంపాదించాడు. ఇతని నాటకాలు నేటికీ ప్రదర్శింపబడుతున్నాయి.

ఆ తరువాత షెరిడన్ రాజకీయ వ్యాసాలు వ్రాయటం ప్రారంభించాడు. జాన్సన్ పండితుని ద్వారా బర్క్, ఫాక్స్‌ల పరిచయం సంపాదించి, 1780 లో పార్లమెంటు సభ్యుడై, 'విగ్' పక్ష రాజనీతి వేత్తగా ప్రసిద్ధు డయాడు. పార్లమెంటులో ఇతడు సభ్యుడుగా ఉన్న 32 ఏళ్ళలో విశేషకాలం విగ్‌పక్షం ప్రతిపక్షంగానే ఉండేది. కొద్దికాలం పాటు విదేశాంగ వ్యవహార సహాయ కార్యదర్శి, కోశాధికారి, ప్రివీ కౌన్సిల్ సభ్యుడు మొదలైన పదవులు నిర్వహించినా, తన పక్షానికి ప్రధాన నాయకుడు కావలెననే ఇతని ఆశలు అడియాసలే అయాయి. దానికి కారణం ఇతడు వ్యక్తిగతంగా త్రాగుబోతు, చంచల స్వభావుడు, నమ్మదగనివాడు కావటమే!

షెరిడన్ భారతీయులకు అభిమాన పాత్రుడైన సందర్భ మొకటి ఉన్నది. ఈస్టిండియా కంపెనీ పాలనలో తొలి గవర్నర్ జనరల్ వారన్ హేస్టింగ్స్ ఇంగ్లండు చేరిన తరువాత, అతడు భారతదేశంలో చేసిన అక్రమాలకై పార్లమెంటు న్యాయ విచారణకు పూనుకొన్నప్పుడు షెరిడన్ ప్రధాన అభియోగకర్త పాత్ర వహించాడు. తన అభినయ, వక్తృత్వ ప్రతిభ నంతటినీ అతడు ప్రదర్శించాడు. అయినా హేస్టింగ్స్ శిక్ష తప్పించుకొన్నాడు.

చివరి రోజులలో షెరిడన్ పార్లమెంట్ సభ్యత్వాన్ని కోల్పోయాడు. డ్రూ లేన్ థియేటర్ అగ్ని ప్రమాదానికి గురిఅయింది. అప్పులపాలై, అనారోగ్యంతో షెరిడన్ కృశించి మరణించాడు. మహాకవి బైరన్ ప్రభువు 'గౌరవ నీయుడైన షెరిడన్ మృతికై' స్మృతిగీతాన్ని రచించాడు.

చ.తి.

**షెర్వుడ్, రాబర్ట్ ఇ. (1896-1955) :** అమెరికన్ నాటక రచయిత. న్యూయార్క్‌లో పుట్టి అక్కడనే మృతి చెందాడు. విద్యార్థిగా చదువులో రాణించక పోయినా, కళాశాలా పత్రికలోను, నాటక ప్రదర్శనలలోనూ రచయితగా, నటుడుగా రాణించాడు. పట్టభద్రుడు కాకుండానే సైన్యంలో చేరి, విషవాయువు



సోకి, ఉద్యోగం నుండి విడుదల పొంది, పత్రికా పరిశ్రమలో ప్రవేశించాడు. క్రమంగా *లైఫ్* అనే హాస్య పత్రికకు సంపాదకుడయాడు. ఇతని తొలి నాటకం *ద రోడ్ టు రోమ్* యుద్ధపు నిరర్థకత్వాన్ని నిరూపిస్తుంది. ఇతని చాల రచనలలో ఇదే ప్రధాన వస్తువు. *ద పెట్రిఫైడ్ ఫారెస్ట్, ది ఇడియట్స్ డిలైట్* లలో నాయకులు అనాసక్తులుగా, మానవ ద్వేషులుగా ప్రారంభమై, తమ నిరర్థకత్వాన్ని గుర్తించి, చివరకు తమ సహచరులకోసం ఆత్మార్పణం చేస్తారు. *ఇల్లినాయిస్ . ఏబ్ లింకన్, దేర్ షెల్ బి నో నైట్* లలో నాయకులు యుద్ధ విరోధులుగా ప్రారంభమై చివరకు యుద్ధం చేసేందుకు నిశ్చయించుకొంటారు. ఇతరులకోసం ఆత్మార్పణం చెయ్యటమే జీవితానికి సార్థక్యం అన్నదే ఇతని రచన లన్నిటిలో గల సందేశం. *లింకన్* నాటకం వల్ల ఇతడు అమెరికా అధ్యక్షుడైన రూజ్‌వెల్టుకు సలహాదారుగానూ, ఉపన్యాస రచయితగాను చేరాడు. నౌకాదళ కార్యదర్శి, యుద్ధవార్తా ప్రసార కార్యాలయ నిర్దేశకుడు మొదలైన బాధ్యత గల పదవులు నిర్వహించాడు. ఇలా సంపాదించిన అనుభవాలతో *రూజ్‌వెల్ట్, అండ్ హాప్కిన్స్, ఏన్ ఇంటిమేట్ హిస్టరీ* అనే గ్రంథాన్ని రచించాడు. ఇతని *ద బెస్ట్ ఇయర్స్ ఇన్ అవర్ లైవ్స్* అనే నాటకం చలన చిత్రంగా రూపొంది అకాడమీ బహుమతిని గెలుచుకొన్నది. *మూర్ఖుని ఆనందం, ఇల్లినాయిస్‌లో ఏబ్ లింకన్, రాత్రి ఉండరాదు, రూజ్‌వెల్ట్* అండ్ *హాప్కిన్స్* నాలుగూ నాలుగు పులిట్జర్ బహుమతులను గెలుచు కొన్నాయి. హాస్య ప్రధానమైన *రాణి గారి మగడు* ప్రణయ ప్రధానమైన *వియన్నాలో పునర్మిలనం,* ఆదర్శ ప్రధానమైన *వాటర్లూ వంతెన* (Waterloo Bridge) ఇతని ప్రతిభకు సంకేతాలు.

చ.తి.

**షెల్లీ, పెర్సీ బీషి (1792-1822) :** జగత్ ప్రసిద్ధుడైన ఆంగ్ల కాల్పనిక గేయకవి, సంస్కరణ వాది, తాత్త్వికుడు. షెల్లీ గొప్ప సంపన్న కుటుంబంలో జన్మించాడు; తండ్రి పార్లమెంటు సభ్యుడు; తల్లి కవితా ధోరణి గలది. షెల్లీ చిన్నతనంలోనే కవిత లల్లుతూ ఉండేవాడు. విద్యార్థిగా ఉండగానే కొన్ని కవితా సంకలనాలు ప్రకటించాడు. ఆక్స్‌ఫర్డ్‌లో విద్యార్థిగా ఉండగా పదిమందితో కలవని విలక్షణ ప్రకృతివల్ల 'పిచ్చి షెల్లీ' అనే పేరు సంపాదించుకొన్నాడు. మిత్రుడైన జఫర్‌సన్ హాగ్‌తో కలసి 'నాస్తికత్వపు ఆవశ్యకత' అనే కరపత్రం ప్రచురించి మతగురువులకు, కళాశాలల ఆచార్యులకు అందరికీ పంపాడు. గాలి గుమ్మటాల ద్వారాను, సీసాలలో బిగించి సముద్రంలో వదలి పెట్టడం ద్వారాను కూడా ప్రచారం చేశాడు. ఫలితంగా విద్యాలయం నుండి బహిష్కృతు డయాడు. 19 వ ఏట హారియట్ అనే 16 ఏండ్ల అందగత్తెను ప్రేమించి పెండ్లాడాడు. ఆమె కూడా ఇతని వంటి 'అభ్యుదయ భావాలు' కలదే! రాబర్ట్ సదీ, తామస్ లవ్ పీకాక్ మొదలైన కవుల మైత్రితో షెల్లీ కవితా ప్రతిభ వికసించింది. *మేబ్ రాణి* (Queen Mab) అనే కావ్యం రచించాడు. దానిలో ప్రభుత్వం, మత వ్యవస్థ, దేవుడు, ప్రపంచం అన్నింటిమీద తీవ్రంగా దాడి చేశాడు. దాన్ని ప్రకటించేందుకు ఎవరూ సాహసించకపోగా, తానే ప్రచురించి మిత్రులకు పంచి పెట్టాడు. ఈ మధ్యలో షెల్లీ గాడ్విన్ రచితమైన *రాజకీయ న్యాయవిచారణ* అనే గ్రంథం చూశాడు. అది అతనికి జీవితాంతం వేద

గ్రంథమైంది. గాడ్విన్ పరిచయం సంపాదించి, అతనిని గురుతుల్యునిగా ఆరాధించేవాడు. ఇంతలో షెల్లీకి గాడ్విన్ కూతురు 16 ఏళ్ళ అందగత్తె మేరీ కనిపించింది. పెళ్లి చేసుకొన్న మూడేళ్ళలోనే భార్యను వదలి మేరీని లేవదీసికొని ఫ్రాన్స్ వెళ్లాడు. ఆమె కూడా ఇతనిలాగే విప్లవాత్మక భావాలున్నదేగాక, సాహిత్య తృష్ణ కూడా కలిగింది. కనుక వీరికి బాగా అన్యోన్యత కుదిరింది. భార్యను కూడా తమతో పాటు ఉండమని షెల్లీ ఆహ్వానించాడు. కాని ఆమె అందుకు నిరాకరించి ఆత్మహత్య చేసుకుంది. షెల్లీకి అడ్డుతొలగిపోయి మేరీని పెళ్లి చేసుకొన్నాడు. కాని ఆ తరువాత వీరి సాంసారిక జీవితం అంత సంతోషకరంగా సాగలేదు. షెల్లీ దంపతులు మధ్యలో కొన్ని రోజులపాటు ఇంగ్లండులో గడపినా, పూర్తిగా ఫ్రాన్స్, ఇటలీ, స్విట్జర్లండులలోనే నివసించేవారు. షెల్లీ అత్యుత్తమ రచన లన్నీ ఈ ప్రవాస జీవితంలో రచించినవే. మధురకవి కీట్స్, ప్రసిద్ధ సాహితీ విమర్శకుడు లే హంట్, సామాజిక విప్లవవాది మహాకవి బైరన్ ప్రభువులతో షెల్లీకి మైత్రి ఏర్పడింది. షెల్లీ, బైరన్‌లు కొన్నాళ్లు పిసా నగరంలో ఉండేవారు. ఇద్దరూ కలిసి *ఉదారవాది* అనే సాహిత్య పత్రిక ప్రారంభించేందుకు ప్రణాళికలు సిద్ధం చేసుకొన్నారు. దానికి సంపాదకత్వం వహించేందుకు లే హంట్‌ను ఆహ్వానించారు. లే హంట్‌కు స్వాగతం చెప్పేందుకు షెల్లీ తన అందమైన పడవలో లెగ్ హారన్ వెళ్ళాడు. తిరుగు ప్రయాణంలో పడవ మునిగి 30 వ ఏటనే షెల్లీ మరణించాడు. అతని మిత్రులు అతని జీవిత చరిత్రలు, స్మృతులు వ్రాశారు. భార్య మేరీ అతని అముద్రిత రచనలను తన టిప్పణులతో సహా ప్రచురించింది. కాని అతని తండ్రి మాత్రం చనిపోయిన తన కొడుకును క్షమించలేదు; అతని మహాకవి విఖ్యాతిని హర్షించలేదు.

నిజానికి షెల్లీని అతని జీవిత కాలంలో ఆంతరంగికులు తప్ప బయటి ప్రపంచం కవిగా గుర్తించనే లేదు. అతని గ్రంథాలు అమ్ముడు పోయేవి కావు. కారణం అతని రచనలు మేధావి వర్గానికి మాత్రమే ఉద్దిష్టమైనవి కావడమే. లోకం అతనిని ఒక నాస్తికుడుగా మాత్రమే గ్రహించింది. షెల్లీ రచనలలో *అడొనాయి* (Adonais) అనే కీట్స్ శోకగీతం, *భరద్వాజ పక్షికి* (To a Skylark), *జలధరం* (The cloud) చాలా గొప్పవి. అతని *ప్రామిథియస్ విముక్తి* (Prometheus Unbound) మిల్టన్ *నష్ట స్వర్గము* (Paradist Lost) తరువాత చెప్పుకోవలసిన మహాకావ్యం. దీనిలో జూపిటర్ అసత్తుకూ, ప్రామిథియస్ సత్తుకూ ప్రతీకలుగా అంతిమ విజయం సత్తుదే అని నిరూపించబడుతుంది. 'దృశ్యమాన జగత్తంతా మిథ్య' అన్న షెల్లీ మన శంకరాచార్యులను జ్ఞప్తికి తెస్తాడు. 'సోక్రటీసు', ఏసుక్రీస్తు తప్ప మిగిలిన మానవు లంతా జీవితానికి బలిపశువు లైన వారే' అన్న షెల్లీ నిజమైన క్రైస్తవుడుగా కనిపిస్తాడు. షెల్లీ రాజకీయ, సాంఘిక, మత వ్యవస్థ లన్నిటి మీద తిరుగుబాటు చేసిన స్వాతంత్ర్య ప్రియుడు. మానవత్వాన్ని ప్రేమించినవాడు. పేదలను ఆదుకొనేవాడు. అతడు జమీందారీ పోకడలు గల ఉదారవాది; కార్యశూరుడైన కవి. గ్రీక్, ఇటాలియన్, జర్మన్, ఫ్రెంచ్ ఇత్యాది అనేక భాషలలో ప్రగాఢమైన పాండిత్యం కలవాడు.

చ.తి.

**షేక్స్పియర్, విలియమ్ (1564-1666) :** ఆంగ్ల సర్వశ్రేష్ఠ మహాకవి, నాటక రచయిత. ఏవన్ నదీ తీరాన గల స్ట్రాట్‌ఫర్డ్ అనే గ్రామంలో మధ్యతరగతి కుటుంబంలో జన్మించాడు. పెద్దగా చదువుకొన్నవాడు కాడు. 18 వ ఏట తన కంటె ఎనిమిదేళ్ళు పెద్దదైన 'ఏనీ హాతవే' (Anne Hathaway) అనే యువతిని పెండ్లి చేసుకొన్నాడు. కొంత కాలం ఉపాధ్యాయవృత్తి చేపట్టి ఉండవచ్చు. ఒక చిన్న దొంగతనం చేసి శిక్షను తప్పించుకొనటానికి లండన్ పారిపోయాడని ఒక కథ వ్యాప్తిలో ఉంది. లండన్‌లో జీవికకై నాటక రంగాన్నాశ్రయించి చిన్న చిన్న వేషాలు వేసేవాడు. ఎలిజబెత్ రాణి గారి ఆస్థాన నట బృందం (Queen's Men) లో చేరాడు. క్రమంగా నాటక రచన ప్రారంభించాడు. మొదట్లో వినోద నాటకాలకు రోమన్ నాటక రచయిత ప్లాటస్ (Plautus) ను, గంభీర నాటకాలకు సెనెకా (Seneca) ను ఆదర్శంగా గ్రహించాడు. కాని పోను పోను తన సొంతబాణీని స్థిరపరచుకొని మొత్తం 37 నాటకాలు వ్రాశాడు. ప్రపంచ నాటక రచయిత లందరిలో సర్వ శ్రేష్ఠు డనే ఖ్యాతిని సంపాదించుకొన్నాడు. నాటకాలు గాక రెండు సుదీర్ఘ కావ్యాలు, మూడు లఘు కావ్యాలు, 160 గీతాలు రచించాడు. నాటకాలు వ్రాయకపోయినా, కావ్యాల వల్లనైనా మహాకవులలో ఒకడుగా పరిగణింపబడేవాడే. గ్లోబ్ నాటకశాల యాజమాన్యంలో భాగస్వామి అయినాడు. కీర్తి, ధనం బాగా సంపాదించి జీవిత చరమదశలో తాను పుట్టిన స్ట్రాట్‌ఫర్డ్ చేరి, అక్కడనే మృతి చెందాడు. అతని సమాధి, స్మృతి మందిరము నేడు సాహితీ ప్రియులకు ఒక యాత్రా కేంద్రమైంది.

షేక్స్పియర్ తన రచనా కాలమంతా, మొదటి నుండి చివరి వరకు వినోద, గంభీర, విషాద చారిత్రక,

తాత్త్విక నాటకాలు వ్రాస్తూనే ఉండేవాడు. ఐనా, ఇతని రచనా జీవితాన్ని కొన్ని దశలుగా గుర్తించవచ్చు. తొలి దశలో ఎక్కువగా వినోద ప్రధాన నాటకాలు వ్రాశాడు. *తబ్బిబ్బుల ప్రహసనం* (Two Gentlemen of Verona), *గయ్యాళి లొంగదీత* (The Taming of the Shrew) ఈ కాలపు రచనలు. రెండవ దశలో ఎక్కువగా చారిత్రకాలు వ్రాశాడు. *జూలియస్ సీజర్, రెండవ రిచర్డ్, నాల్గవ హెన్రీ, ఐదవ హెన్రీ* ఈ కాలపు రచనలు. మూడవ దశలో ఎక్కువగా గంభీర విషాద నాటకాలు వ్రాశాడు. *హామ్లెట్, ఒథెల్లో, కింగ్ లియర్, మెక్బెత్* ఈ దశలో రచించినవే. జీవితం పట్ల నైరాశ్య భావం ఈ అన్నింట్లో కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. చివరి దశలో ఈ నైరాశ్య భావం తొలగి సత్య ధర్మాల అంతిమ విజయం పట్ల ఆశాభావం కనిపిస్తుంది. దీన్ని తాత్త్విక దశ అనవచ్చు. *శిశిర గాథ* (The Winter's Tale), *పెరిక్లీజ్, సింబలిన్, తుఫాను* (Tempest) ఈ దశ లోని రచనలు. తొలి దశలో అంత్యానుప్రాసను ఎక్కువగా పాటించేవాడు. అలాగే తొలి దశలో మాటల గారడీని ఎక్కువగా అభిమానించేవాడు. కాని పరిణతి చెందిన కొలది అర్థ గాంభీర్యానికే ప్రాధాన్యం ఇస్తూ వచ్చాడు.

సజీవ పాత్ర చిత్రణ షేక్స్‌పియర్‌లో చెప్పుకోదగిన మొదటి సద్గుణం. అతని పాత్రలలో మన పరిచిత బంధు మిత్రులను దర్శించవచ్చు. అంతేకాదు, కొంచెం జాగ్రత్తగా గమనిస్తే, అతని ప్రతి పాత్రలోను మన పోలికలను కూడా కొన్నిటిని గుర్తింపగలం. 'ఇతర కవుల కీర్తికి కోత పెట్టే కాలప్రవాహం, మహాపర్వత సదృశుడైన షేక్స్‌పియర్ కీర్తికి ఏ మాత్రం క్షతి కలిగించలేకపోయింది' అంటాడు జాన్సన్ పండితుడు. షేక్స్‌పియర్ ఒక కాలానికి చెందినవాడు కాడు, అతడు సార్వకాలికుడే కాదు, సార్వభౌమికుడు కూడా! కనుకనే జాతి, మత, సంస్కృత్యాదుల్లో భిన్నమైన ఏ భాషలోకి అనువదించినా, అతని రచనలలోని జీవశక్తికి భంగం కలగలేదు. ఇతని రెండు దీర్ఘ కావ్యాలు - *వీనస్, అడొనిస్‌లు* (Venus and Adonis) *ది రేప్ ఆఫ్ ల్యూక్రీస్*, లఘు కావ్యాలు, గేయాల్లో ఉండే శైలీ మాధుర్యం, శయ్యా సౌభాగ్యం, వీటికి మించిన భావ శబలత అననుకరణీయాలు.

ప్రతి శతాబ్దమూ షేక్స్‌పియర్‌ను తన విశిష్ట దృక్కోణంతో విమర్శిస్తూనే ఉన్నది. ఏ దృక్కోణం నుండి విమర్శించినా, అతడు సర్వశ్రేష్ఠుడనే తీర్మానానికి వస్తున్నది. ఒక్క హామ్లెట్ విషయం తీసుకొంటే బైబిల్ తరువాత ఏ ఒక్క గ్రంథాన్ని గురించి అంత విమర్శ జరుగలేదు.

ఇటీవల ఒక విరసపు మాట వినబడుతున్నది. షేక్స్‌పియర్ పేరుతో నేడు ప్రచారంలో ఉన్న రచనలను నిజంగా రచించినవాడు అతడు కాడనీ, వాటిని రచించటానికి కావలసిన విద్యా సంస్కారాలు అతనికి లేవనీ, మరెవరో వ్రాసి కారణాంతరాలవల్ల ఇతని పేరుతో ప్రకాశింప చేశారనీ, ఆ ఎవరో బేకన్ (Bacon) అనీ, క్రిస్టోఫర్ మార్లో (Christopher Marlowe) అనీ, మరొకరనీ కొందరు వాదిస్తూ ఉన్నారు. కాని షేక్స్‌పియర్ సమకాలీనులు ఇట్టి సందేహాలకు తావులేని ప్రశంసలు చేసి ఉండడంవలన ఈ వాదనలకు బలం చాలటం లేదు.

జయలక్ష్మి

**షోలోకోవ్, మిఖాయెల్ అలెక్సాండ్రోవిచ్ (1905-84):** నోబెల్ పారితోషిక గ్రహీత యైన రష్యన్ నవలా రచయిత. తండ్రి రష్యన్, తల్లి కోసక్ జాతీయురాలు. జన్మస్థలం డాన్ నదీ తీరమందలి కోసక్ రాష్ట్రంలోని ఒక కుగ్రామం. 15 వ ఏటనే ఎర్ర సైన్యంలో చేరి, రెండేండ్లు పనిచేసి స్వగ్రామం చేరుకొన్నాడు. ఇతడు 17 వ ఏట ప్రచురించిన *డాన్ కథలు* (Donskie Rasskazy) అంతగా గుర్తింపు పొందలేదు. ఏవో చిల్లర ఉద్యోగాలు చేసుకొంటూ 20 వ ఏట ప్రచురించిన *మూగ డాన్* (Tikhy Don) తొలి భాగం ఇతనికి రచయితగా గుర్తింపు తెచ్చింది.



*మూగ డాన్* ముగించేందుకు 12 ఏళ్లు, అలాగే *అహల్య క్షేత్రం* (Podnyataya tselina) అనే పెద్ద నవల పూర్తి చేసేందుకు 20 ఏళ్లు తీసుకొన్నాడు. రెండింట్లో ప్రధాన వస్తువు ఒకటే! బోల్షివిక్కులకూ, నిర్బంధ వ్యవసాయానికి విరుద్ధంగా కోసక్ జాతీయులు సాగించిన విషాదాంత వీరోచిత పోరాటం నిజాయితీతో కళాత్మకంగా నిరూపించబడింది. *మూగ డాన్* సామ్యవాదం వాస్తవికతోద్యమానికి వేగుచుక్కయై, ప్రజా

దరణ పొందింది. స్టాలిన్ బహుమతిని గెల్చుకొన్నది. *మాతృభూమి కోసం పోరాటం* (Oni Srazhalis za rodinu) లో ద్వితీయ ప్రపంచ యుద్ధంలో జర్మన్ దండయాత్రకు రష్యన్ల వీరోచిత ప్రతిఘటన వర్ణితమైంది. *మూగ డాన్* పూర్తిగా ఇతని స్వంత సృష్టి కాదనీ, దీనిలో చాల గ్రంథ చౌర్యం ఉందనీ కొంద రంటున్నారు.

జయలక్ష్మి

**ష్నిట్జ్‌లర్, ఆర్థర్ (1862-1931) :** ఆస్ట్రియన్ నాటక రచయిత, నవలా రచయిత. మనస్తత్త్వ విశ్లేషణాత్మకమైన రచనలకూ, 19 వ శతాబ్ది చివరి భాగపు వియన్నీస్ బూర్జువా జీవితాన్ని విశ్లేషించి చూపిన నాటకాల రచనకూ ప్రసిద్ధుడు. సుప్రసిద్ధ యూదు వైద్యుడు ష్నిట్జ్‌లర్ కుమారుడైన ఆర్థర్ వైద్య పట్టభద్రుడై, జీవితంలో ఎక్కువ భాగం వైద్యుడుగానే గడిపాడు. ముఖ్యంగా ఆయనకు 'సైకియాట్రీ' (మనోవ్యాధి చికిత్స) లో ఎక్కువ ఆసక్తి ఉండేది. ఏడు ఏకాంక నాటికల సంకలనం అయిన *ఆనటోల్* (1893) ప్రచురణతో రచయితగా ఆయనకు గుర్తింపు వచ్చింది. ఈ నాటికలు ఒక సంపన్న వియనీస్ యువకుని ప్రేమ కలాపాలను చిత్రిస్తాయి. ఈ నాటికలలో పాత్రచిత్రణలో ఆర్థర్‌కు గల విశేషమైన ప్రతిభ అభివ్యక్తమైంది.



ష్నిట్జ్‌లర్ రచించిన *రైగన్* (1897, (Merry-go-round, 1953) 10 నాటకీయ సంభాషణల సంకలనం. కామోద్రేకంలో చిక్కుకొన్న స్త్రీ పురుషుల హృదయ రాహిత్యాన్ని ఈ సంభాషణలు చిత్రిస్తాయి. 1950 లో దానిని మాక్స్ ఓ ఫ్యూల్స్ *లా రోండే* అనే ఫ్రెంచ్ చలనచిత్రంగా తీశాడు. ప్రేమలోని అహంభావాన్నీ, మృత్యుభీతినీ, శృంగారజీవితంలోని క్లిష్టపరిస్థితులనూ ష్నిట్జ్‌లర్ శక్తిమంతంగా తన రచనలలో చిత్రించాడు. *లీబెలై* (1896, Playing with Love), *ఫ్రైవిల్డ్* (1896, Free game), అనే నాటకాలలో ఆస్ట్రియన్ సైనిక వర్గాలలోని అంతస్సార రాహిత్యాన్ని ష్నిట్జ్‌లర్ చిత్రించాడు. ఇతని మిక్కిలి విజయవంతమైన నవల *లెఫ్టినెంట్ గస్ల్* (1901, None but the Brave, 1926) కూడా ఇలాంటి రచనే! *ఫ్లక్ట్ ఇన్ డీ ఫిన్‌స్టెర్నిస్* (1931, Flight in to Darkness, 1931) అనే నాటకంలో దశల వారీగా ఉన్మాదం ఎలా వ్యక్తిని ఆవహిస్తుందో రచయిత చిత్రించాడు. *ప్రొఫెసర్ బెర్న్‌హార్డీ* (1912) అనే నాటకం, *డెర్‌వెగ్ ఇన్స్ ఫ్రీ* (1908, The Road to the Open, 1923) ఆస్ట్రియాలోని యూదుల పరిస్థితిని వర్ణించే రచనలు. ష్నిట్జ్‌లర్ నాటకాలూ, నవలలే కాక, కథానికలూ, కొన్ని వైద్య గ్రంథాలూ కూడా రచించాడు.

బొ.శ్రీ.

**క్రేటియెన్ డి త్రాయ్స్ (1165-80) :** ఐదు 'ఆర్థరియన్ రొమాన్స్' ల కర్తగా కీర్తి నార్జించుకొన్న ఫ్రెంచి కవి. ఈయన జీవితాన్ని గురించి తెలిసింది చాలా తక్కువ. *ఎరెక్, క్లిజిస్, లాన్స్‌లట్ ఓలి ఛెవెలియర్ ఎలా ఛార్రెట్టీ, యవైన్, ఓలి ఛెవెలియర్ ఆలయన్* పెర్సివాల్ ఓవికాంటియ్యాగ్రాల్ అనే ఐదు రొమాన్స్ (ప్రేమ, సాహసాలతో కూడిన అతిలోక సుందర గాథలు) లను ఇతడు రచించాడు. షాంపేన్ రాణి అయిన మేరీ ఆస్థానంలో ఈయన తరచు కనిపించేవాడనటానికి కొన్ని నిదర్శనా లున్నాయి. ఇతని గాథలను ఇతర రచయితలు అనుకరించారు, అనువదించారు. తరువాతి శతాబ్దాలలో ఇతని కథా కథన పద్ధతిని విస్తృత పరచి, హంగులు చేర్చటం జరిగింది. ఉదాహరణకు *సర్ గవాయిన్ అండ్ ది గ్రీన్ నైట్* అనే 14 వ శతాబ్దపు కావ్యానికి క్రేటియెన్ వ్రాసిన *ఎరిక్* అనే కథే మూలం.

వేర్వేరు సాహస పూరిత సంఘటనలను ఒక చక్కని కథగా కూర్చగలిగిన నిపుణుడు ఈ రచయిత. అణగి మణగి విధేయురాలుగా ఉండే ఒక భార్య భర్త ఆజ్ఞలను ధిక్కరించటం ద్వారా అతని పట్ల తన ప్రేమను వ్యక్తం చేయటం *ఎరిక్* కథలో కనిపిస్తుంది. *క్లిజిస్* లో ఒక బలవంతపు పెళ్లికి గురి అయిన అబల మరణాన్ని నటించి, ఉత్సాహపూరితమైన క్రొత్త జీవితం లోకి కన్ను తెరవటం ఇతివృత్తం. *యవైన్* లో ఒక వితంతువు తన భర్తను హత్య చేసిన వానిని తొందరపడి పెళ్లి చేసుకోడం, ఆ తరువాత అతనిని ద్వేషించటం, చివరకు అతడు ఆమెను తిరిగి గెలుచుకోడం అనే సంఘటనలను రసవత్తరంగా కూర్చాడు. పెర్సివల్ లో 'హోలీగ్రెయిల్' లోని మతపరమైన ఇతివృత్తాన్ని ఒళ్లు గగుర్పొడిచే సాహస కృత్యాలతో ముడి వేయాలని ప్రయత్నించాడు. ఈ కథను ఆయన అసంపూర్తిగానే వదలి వేశాడు.

ప్రేమ సంఘటనలను, జానపద ఇతివృత్తాలను

కొంచెం హాస్యంతో మేళవించి జనాన్ని రంజింప జేయ గలిగిన కథలను, కావ్యాలను వ్రాసిన మహా రచయిత ఇతడు. కమ్మని కథలను తీయని కావ్యరూపంలో తొలి సారిగా వ్రాసిన ఫ్రెంచ్ రచయితగా ఇతనిని 'దాంతే' అంతటివాడు ప్రశంసించాడు. కె.జి. మూర్తి

**ష్లెగెల్, ఫ్రెడరిక్ వాన్ (1772-1829) :** జర్మన్ విద్వాంసుడు, విమర్శకుడు, ప్రాచ్య భాషాకోవిదుడు. ఆగస్ట్ విల్హెల్మ్ వాన్ ష్లెగెల్‌కి తమ్ముడు. జర్మన్ కాల్ప నికోద్యమానికి స్ఫూర్తి నిచ్చిన అనేక వినూత్న స్వతంత్ర భావాలకు ఆవిష్కర్త. గోటింగెన్, లీప్జిగ్‌లలో విద్యా భ్యాసం చేసి, కొంతకాలం 'జెనా' విశ్వవిద్యాలయంలో అధ్యాపకుడుగా ఉన్నాడు. తన అన్న ఆగస్ట్ విల్హెల్మ్ వాన్ ష్లెగెల్‌తో కలసి కాల్పనికోద్యమ ప్రచారానికై *అతె నామ్* అనే త్రైమాసిక పత్రికను ప్రారంభించాడు. కాల్పనిక కవిత్వ మంటే వసుధైక ప్రగతిశీల కవిత్వ మని ఇతని నిర్వచనం. డాంటే, సెర్వాంటెస్, షేక్స్‌పియర్లు ఆధునిక కవిత్వానికి గురు పీఠాలని ఇతని పరిగణన. గ్రీక్ భాషా, సాహిత్య, సంస్కృతుల అభ్యాసంతో గాని విద్య సమగ్రంకాదని ఇతని భావన. ఆధునిక చరిత్ర, సాహిత్య చరిత్రలను గూర్చిన ఇతని ఉపన్యాసాలు గ్రంథరూపంగా ప్రచురితమై విద్వల్లోకానికి మధ్య యుగాలను గురించిన వినూతన దృష్టిని కలిగించాయి. మతం, తత్త్వశాస్త్రం, పురాణం, వ్యంగ్యం-ఇన్నింటి సమ్మేళనమే కాల్పనిక కవి త్వమని ఇతని నిర్ధారణ. క్రమంగా ఇతడు కేథలిక్ మతం వంకకు మొగ్గి కాల్పనికోద్యమానికీ, కేథలిక్ మతా నికీ భావసమైక్యాన్ని గుర్తించాడు. పర్యవసానంగా ఇతడు కేథలిక్‌గా మారి తన పూర్వపు ప్రొటెస్టెంట్ మతాన్ని తీవ్రంగా విమర్శించసాగాడు. దానితో అన్న ఆగస్ట్ విల్‌హె ల్మ్‌కూ, ఇతనికీ సంబంధం తెగిపోయింధి. అన్నవలెనే ఇతడు కూడ సృజనాత్మక రచయితగా రాణించలేదు. ఆత్మకథా ప్రాయమైన *లుసిండే* (Lucinde) అనే అసంపూర్ణ నవలలో స్త్రీ స్వాతంత్ర్యాన్నీ, స్త్రీ పురుష సమానత్వాన్నీ ప్రతిపాదించాడు. నెపోలియన్‌ను విరో ధించి జర్మన్ స్వాతంత్ర్యోద్యమంలో ప్రముఖపాత్ర వహించాడు.

పారిస్‌లో సంస్కృతం అభ్యసించి పాశ్చాత్యుల భార తీయ భాషాభ్యసనానికీ, ఇండో జర్మానిక్ తులనాత్మక భాషా శాస్త్రానికీ ఆద్యు డయాడు. అవిభాజ్య ప్రపంచ చారిత్రక తులనాత్మక సాహిత్యం అనే ఇతని భావన సాహిత్యాధ్యయనంలో క్రొత్త పుంతలకు దారి తీసింది. జయలక్ష్మి

**సబాతో, ఎర్నెస్తో (1911--) :** అర్జెంటీనా నవలా రచయిత, వ్యాస రచయిత; పత్రికా రచయిత. భౌతిక శాస్త్రంలో డాక్టరేట్ సంపాదించి కొంత కాలం అధ్యాపక వృత్తిలో ఉన్నాడు. పెరాన్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పత్రికలలో వ్యాసాలు వ్రాసినందున ఉద్యోగం పోయింది. సాంఘిక, రాజకీయ, తాత్త్విక విషయాలపై ఇతనికి గల అభిప్రాయాలు *ఒకటే విశ్వము* అనే గ్రంథంలో వ్యాసాలు, సూక్తులు, సుభాషితాలుగా సంకలిత మైనాయి. *మనుష్యులూ, మీటలూ* అనే వ్యాస సంపుటిలో హేతువాద, వైజ్ఞానిక ప్రధాన దృష్టి గల ఆధునిక యాంత్రిక సంస్కృతికి మరో ప్రత్యామ్నాయం సూచించే ప్రయత్నం చేయబడింది. *నేటి సాహిత్యపు విలువలు* అనే వ్యాస సంపుటిలో జీన్ పాల్ సార్త్రే, జార్జ్ లూయీ బోర్జెస్ మొదలైన వారి కృతులు సమీక్షిం చబడ్డాయి. *సొరంగం* అనే నవలలో ప్రధాన పాత్ర ఒక తరహా అస్తిత్వవాది. ఎవరితోనూ ఇముడలేక అంత ర్ముఖు డవుతాడు. *వీరులూ, సమాధులూ నాశనకర్త అబడాన్* అనే నవలలో లోగడ వ్యాసాలలో ప్రక టించబడిన అభిప్రాయాలే పునరుద్ఘాటన చేయబడ్డాయి. ఆధునిక సాహిత్యం, కళ, తత్త్వశాస్త్రం, హేతువాదం- అన్నింటిపైన వ్యంగ్య గర్భితమైన నిశిత విమర్శ ఇతని రచనలన్నిటిలోను కనిపించే ప్రధాన లక్షణం.

జయలక్ష్మి.

**సాక్స్, నెలీ లియోనీ (1891-1970) :** జర్మన్ కవయిత్రి, నాటక రచయిత్రి. నాజీ ఘాతుకాలను ప్రత్య క్షంగా చూసి అమి తంగా క్షోభపడిన ఈ యూదు కవయిత్రి. ఆ నాజీ అనుభ వాల వల్ల తోటి యూదుల విషాదా నికి, ఆశలకు ప్రతీక అయింది. 1966 లో సాహిత్యానికిచ్చే నోబెల్ పురస్కా రాన్ని 'షమ్యూల్ యోసెఫ్ ఆగ్నోన్'



కూ, ఈమెకూ ఉమ్మడిగా ఇచ్చినప్పుడు *ఆగ్నన్ ఇజ్రా యిల్* (Israel) కి ప్రాతినిధ్యం వహిస్తే తాను యూదు ప్రజల విషాదానికి ప్రాతినిధ్యం వహిస్తున్నా నన్నది ఈ రచయిత్రి.

సంపన్నుల ఇంట జన్మించిన సాక్స్ 17 సంవత్సరాల పిన్న వయస్సులోనే కవిత అల్లటం ప్రారంభించింది. భావావేశ పూరితమైనా ఆమె కవితలు సంప్రదాయ ఫక్కీ లోనే నడిచాయి. 1920 నుండి ఆమె రచనలు వివిధ పత్రికలలో ప్రచురణ పొందాయి. కాని జర్మనీలో హిట్లర్ ప్రాబల్యం పెరిగి నాజీల ఆగడాలు మితిమీరిపోతున్న ఆ చీకటి రోజులలో సాక్స్ పురాతన యూదు గ్రంథాలను పఠించటం ప్రారంభించింది. 'శ్రామిక ఆవాసము' (Forced labour camps) అని పిలువబడే ఆనాటి మృత్యు వాటికలోనికి తనను పంపబోతున్నారని తెలిసిన ఈ కవయిత్రి స్వీడెన్‌లోని ఒక కలం స్నేహితురాలి సాయంతో జర్మనీ నుండి పారిపోయి, స్వీడెన్‌లో తలదాచుకొంది. ఆ స్వీడెన్ రచయిత్రి 'సెల్మా లాగర్‌లోఫ్' సాక్స్ తరఫున స్వీడన్ రాజకుటుంబంతో మాట్లాడి ఆమెకు సాయం చేయగలిగింది. ఒక చిన్న ఇంట్లో తన తల్లితో పాటు ఉంటూ స్వీడెన్‌లోనే తన రచనా వ్యాసంగాన్ని ఈమె కొనసాగించింది. ఈమె స్వీడిష్ భాషను నేర్చుకొని జర్మన్ కవిత్వాన్ని స్వీడిష్ భాషలోకి అనువదించింది. సున్నితమైన, పదునైన ఆధ్యాత్మికతతో కూడిన శబ్దచిత్రాలను వాడి తన భావాలను పాఠకుల హృదయాలకు హత్తుకునే రీతిలో ప్రస్ఫుటం చేయగలిగిన మేటి కవయిత్రి ఈమె. *ఓడై స్కార్న్‌స్టీన్* (O die schornsteine) అనే ఆమె ప్రఖ్యాత కవితలో *నాజీ మరణ గుహల* (Nazi death camps) నుండి వచ్చే పొగలో ఇజ్రేయిల్ భౌతిక శరీరం ఎట్లా పైపైకి పోతున్నట్లు కనిపించిందో వర్ణిస్తుంది.

ఆమె రచించిన ప్రఖ్యాత నాటకాన్ని *ఎలి ఐన్ మిస్టరిన్ స్ప్రియల్ వోమ్‌లీడెన్ ఇజ్రేయిల్స్* (A Mystery play of the Sufferings of Israel) ని జర్మన్ రేడియో ప్రసారం చేసింది. జర్మనీలో ఈ నాటకాన్ని ప్రదర్శించటం కూడా జరిగింది. 1965 లో జర్మన్ ప్రచురణ కర్తలు ప్రతి ఏటా ఇచ్చే శాంతి పురస్కారాన్ని ఈమెకిచ్చి తమను తామే గౌరవించుకొని తమ జాతీయ పాపాన్ని కొంతవరకు ప్రక్షాళనం చేసుకొన్నారు. ఆ పురస్కారాన్ని తీసుకొంటూ 'గతంలో ఎన్ని ఘోరాలు జరిగినా, ఇంకా మీపై నాకు నమ్మకం ఉంది' అని ప్రకటించి సాక్స్ తనలోని క్షమాగుణాన్ని తెలియజేసింది.

కె.వి. మూర్తి

**సా డీ మిరాండా, ఫ్రాన్సిస్కో డి (1481-1558):** పోర్చుగీసు పునరుజ్జీవన యుగ కవులలో ప్రథముడు. ఒక మతాచార్యుడి అక్రమ సంతానంగా పుట్టి, పదేండ్లకు గుర్తింపు పొందాడు. లిస్బన్‌లో విద్యాభ్యాసం చేసి కొన్నాళ్ల పాటు అక్కడే అధ్యాపక వృత్తి చేస్తూ, రాజాస్థానంలో కవితా గోష్ఠుల్లో పాల్గొంటూ ఉండేవాడు. తరువాత ఇటలీలో ఐదారేండ్లు నివసించి ప్రసిద్ధ సాహితీ పరుల పరిచయం సంపాదించాడు. ప్లుటార్క్, దాంతే మొదలైన మహాకవుల కవితా శైలి నలవరచుకొన్నాడు. స్వదేశానికి తిరిగి వచ్చి స్వగ్రామంలో స్థిరపడి ఇటాలియన్ ఛందస్సుల్లోనూ, దేశీయ ఛందస్సుల్లోనూ కవితలు రచించాడు. ఇతని *విదేశీయులు* (Estrangeiros) పోర్చుగీసు భాషలో విరచితమైన తొలి వచన నాటకం. ఇతని అత్యుత్తమ రచన *బస్టో* (Busto) అనే సంభాషణాత్మకమైన గ్రామీణ గేయం. *క్లియోపాత్రా, మాండెగో కథ* (Fabulado Mondeego), *అలెక్సో* (Alexo), ఇతని ఇతర రచనలు. సమకాలీన సమాజాన్నీ, భౌతిక వాదాన్నీ నిశితంగా విమర్శించటం ఇతని రచనలలోని ప్రధానవస్తువు. మూడవ జాన్ రాజుకు ఇతడు వ్రాసిన ఉత్తరాలలో ఇతని స్వాతంత్ర్య ప్రీతి, సాహసం ప్రకటిత మవుతాయి. భావాల్లో మృదుత్వం, ఊహల్లో సౌకుమార్యం, అభివ్యక్తిలో సారళ్యం - ఇవి ఇతని కవితా గుణాలు. ఇతని నేతృత్వంలో పోర్చుగీసు కవితకు లక్ష్యాల్లో ఔన్నత్యం, దృక్పథంలో వైశాల్యం, శైలిలో నైర్మల్యం లభించాయి.

జయలక్ష్మి

**సాది (1213-91) :** అత్యంత ప్రసిద్ధ పారశీకకవి. పూర్తిపేరు ముషారిఫ్ ఉద్దీన్ ముష్లీ ఉద్దీన్. ఇరాన్‌లోని షిరాజ్ నగరంలో జన్మించి, చిన్నతనంలోనే తండ్రిని కోల్పోయి, బాగ్దాద్‌లో మత విద్య నభ్యసించాడు. సూఫీ షేక్ సాహేబ్ ఉద్దీన్ సురవర్ది ప్రభావానికి లోనై ఉదారమైన ఉత్తమ ఆత్మ సంస్కారాన్ని సంపాదించాడు. హిందూ దేశాన్ని దర్శించాడట. ఉత్తర ఆఫ్రికాలో సంచరిస్తూ ఉండగా క్రూసేడర్లకు బందీగా చిక్కి కొంతకాలం బానిస జీవితం గడిపాడు. ఒక ధనిక వర్తకుడు ఇతనిని విడుదల చేయించి, తన కుమార్తె నిచ్చి పెండ్లి చేశాడు. తరువాత ఇతని జీవిత మంతా షిరాజ్‌లోనే గడిచింది. సాదీన్ జంగ్ అనే స్థానిక ప్రభువు నుండి సాదీ అనే కలం పేరు పొందాడు.

అత్యంత సరళమైనశైలిలో మానవత్వంతో ఒక, సర్వజనామోద యోగ్యంగా ఉండే ఇతని రచనలు *బుస్తాన్* (పూలతోట), *గులిస్తాన్* (గులాబితోట), *గజలియాత్* మొదలైన గ్రంథాలలో సంకలితం అయాయి. 'పదిమందికి చెరుపుచేసే సత్యం కంటె మేలు చేసే అసత్యం

మేలు!', 'చంచల చిత్తులైన ప్రభువుల అనుగ్రహానికి అంగలార్చే కంటె దయాళువైన పరమేశ్వరుని నమ్ముకొని బ్రతకటం మేలు' ఇలాంటి సూక్తులతో నిండి పారశీక విజ్ఞాన సర్వస్వా లనదగిన ఇతని గ్రంథాలు కొన్ని శతాబ్దుల వరకు పారశీక బాలురకు పాఠ్య గ్రంథాలుగా ఉండేవి.

చ.తి.

**సానట్జారో, యాకోపో (1456-1530) :** ఇటాలియన్ కవి, సుభాషిత కారుడు. ఇతని జనన మరణాలు రెండూ నేపుల్స్‌లోనే జరిగినవి. ఆరగాన్ వంశపు ఫ్రెడ్రిక్ రాజుకు ఆస్థానకవి. ఫ్రెడ్రిక్ రాజ్య భ్రష్టుడైనప్పుడు, అతనితో పాటు ఫ్రాన్సుకు ప్రవాసం పోయాడు. మరుగువడిన అనేక ప్రాచీన లాటిన్ కావ్యాలను వెలుగుకు తెచ్చాడు. ఫ్రెడ్రిక్ మరణానంతరం నేపుల్స్‌కు తిరిగి వచ్చి జీవితాంతం అక్కడనే గడిపాడు. ఇటాలియన్, లాటిన్ - రెండు భాషలలోను కవితలు రచించాడు. ఇతని *ఆర్కేడియా* 16 వ శతాబ్దిలోనే 60 ముద్రణలు పొందింది. ఇది కాల్పనిక యుగానికి ముందే రచింపబడిన గ్రామీణ కవితా కావ్యం. గేయ రూపమైన ఏకపాత్ర స్వగతాలు, ద్విపాత్ర సంభాషణలు, మధ్యలో వచనపు అతుకు తునుకలు! ఈ లఘు కవితా సంకలనంలో కొంత ఆత్మకథాత్మకం, కొంత మార్మికం అయిన ధోరణిలో మానవ ప్రవృత్తుల విశ్లేషణ, స్వాప్నిక లోకపు సుందర కల్పన హృదయంగమంగా చేయబడినవి. పెట్రార్క్ శైలిలో మరికొన్ని కవితలు రచించాడు. భావాభివ్యక్తిలోను, సౌకుమార్యం, కవితా సౌందర్యాలలోను ఇతడు 'క్రైస్తవ వర్జిల్' అనే పేరు సంపాదించాడు.

జయలక్ష్మి

**సారోయన్, విలియమ్ (1908-1981) :** ప్రముఖ అమెరికన్ రచయిత. ఆర్థిక మాంద్యం రోజులలో దారిద్ర్యం, ఆకలి, అభద్రతా భావం ఎంత క్రుంగదీస్తున్నా జీవించి ఉండడంలోని ఆనందాన్ని గుర్తు చేస్తూ ఆహ్లాదకరమైన రచనలు చేసినవాడు.

సారోయన్ ఒక ఆర్మీనియన్ వలసదారుని కుమారుడు. తన 15 వ ఏటనే స్కూలు చదువుకు స్వస్తి చెప్పి గ్రంథపఠనం ద్వారానూ, రచనల ద్వారానూ తన విజ్ఞానాన్ని అతడు పెంపొందించుకొన్నాడు. అతని తొలి కథానికల సంపుటి: *ది డేరింగ్ యంగ్ మాన్ ఆన్ ది ఫ్లైయింగ్ ట్రాపెజ్* (1934). ఆ తరువాతి సంకలనం *ఇన్ హేల్ అండ్ ఎక్స్ హేల్* (1936). సారోయన్ రచించిన తొలి నాటకం *మై హార్ట్ ఈజ్ ఇన్ ది హైలాండ్స్*. 1939 లో గ్రూప్ థియేటర్ వారు దానిని ప్రతిభావంతంగా ప్రదర్శించారు. 1940 లో తన నాటకం *ది టైమ్ ఆఫ్ యువర్ లైఫ్* (ప్రదర్శన: 1939) కు పులిట్జర్ బహుమతి ప్రకటించగా, దానిని ఆయన నిరాకరించాడు. అందుకు ఆయన చెప్పిన కారణం: "అది నా ఇతర రచనలకన్నా ఏ విధంగానూ గొప్పది కాదు" అని.

సారోయన్ ప్రధానంగా మానవు లందరిలోనూ, ముఖ్యంగా సామాన్య మానవులలో కనిపించే మంచితనాన్ని గురించీ, జీవితపు విలువను గురించీ వ్రాశాడు. సజీవమైన శైలితో సారోయన్ ప్రాణంతో స్పందించే పాత్రలను చిత్రించాడు. ఆయన కథలలో చాలా భాగం ఆయన బాల్యాన్ని గురించి, ఆయన కుటుంబాన్ని గురించి వర్ణించేవి. అలాంటి రచనలలో ముఖ్యమైనవి: *మై నేమ్ ఈజ్ ఆరామ్* (1940) అనే కథల సంపుటి, *ది హ్యూమన్ కామెడి* (1943) అనే నవల. ఆయన నవలలలో *రాక్ వేగమ్* (1951), *ది లాఫింగ్ మేటర్* (1953) తాను వివాహం చేసుకోడం, కొడుకుల నెత్తడం, విడాకులు తీసుకోడం మొదలైన స్వీయజీవిత విశేషాలు ఆధారంగా వ్రాసినవి.

1958 తరువాత సారోయన్ ఎక్కువగా పారిస్‌లో గడిపాడు. అయితే, తాను పుట్టి పెరిగిన కాలిఫోర్నియా రాష్ట్రంలోని 'ఫ్రెస్నో' లో ఉన్న తన ఇంటిని మాత్రం అట్టేపెట్టుకొన్నాడు. సారోయన్ రచనలలో ఆయన జీవిత విశేషాలే ఎక్కువగా కనిపిస్తాయి. అయితే చివరి రోజులలో ఆయన రచించిన ఈ క్రింది రచనలు ప్రత్యేకమైన విలువ గలవి: 1. *హియర్ కమ్స్, దేర్ గోస్ యూ నో హూ* (1961), 2. *నాట్ డైయింగ్* (1963), 3. *డేస్ ఆఫ్ లైఫ్ అండ్ డెత్ అండ్ ఎస్కేప్ టు ది మూన్* (1971), *ప్లేసెస్ వేర్ ఐ హేవ్ డన్ టైమ్* (1975).

1981 మే 18 న ఫ్రెస్నోలో విలియమ్ సారోయన్ తుది శ్వాస విడిచాడు.

బొ.శ్రీ.

**సార్జెసన్, ఫ్రాంక్ (1903-1982) :** ప్రముఖ న్యూజిలాండ్ రచయిత. అసలుపేరు 'నోరిస్ ఫ్రాంక్ దవే'. ప్రత్యేకమైన, విలక్షణమైన శైలి కలిగిన నవలారచయిత, కథానికా రచయిత. ఆ లక్షణాల వల్ల న్యూజిలాండ్‌లో సమకాలీన రచయితలలో మిక్కిలి ప్రసిద్ధి గడించాడు. ఆయన న్యాయశాస్త్రం చదువు

కాని 'సొలిసిటరు' (Solicitor) గా జీవితం ప్రారంభించాడు.

ఆయన 1902 లో రచనా వ్యాసంగం ఆరంభించి, తొలి దశలో ఎక్కువగా కథానికలు వ్రాశాడు. వాటిలో ఎక్కువ కథానికలు అమెరికాలో ప్రచురణ పొందాయి. అయితే ఆయన జీవిత మంతా న్యూజిలాండులో గడపడం విశేషం. ఆయన సంకలనాలలో *కాన్వర్ జేషన్ విత్ మై అంకుల్* (1936), *ఏ మాన్ అండ్ హిజ్ లైఫ్* (1940), *దట్ సమ్మర్* (1946) మొదలైనవి ఉన్నాయి. *ఐ సా ఇన్ మై డ్రీమ్* (1946) అనే నవలను ప్రారంభదశలోనూ, *జాయ్ ఆఫ్ ది వుమెన్* (1969), *సన్ సెట్ విలేజ్* (1976) అనే నవలలను తరువాతి దశలోనూ సార్జెసన్ రచించాడు. వాటిలో సమాజంలోని అవినీతిని, వ్యక్తి స్వేచ్ఛను మనోహరమైన శైలిలో వర్ణించాడు. అతని రచనా సంకలనాలు: *ది కలెక్టెడ్ స్టోరీస్* (1964), *ది స్టోరీస్ ఆఫ్ సార్జెసన్* (1973) లు. ఇతనికి అంతర్జాతీయ ఖ్యాతి రావడమే కాక అంతర్జాతీయ పాఠకులు కూడా ఏర్పడ్డారు.

చంద్ర

**సార్త్రె, జ్యాఁపాల్ (1905-1980) :** సుప్రసిద్ధ ఫ్రెంచ్ నవలా రచయిత, నాటక రచయిత, అస్తిత్వవాద ప్రవక్త. 1964 లో సాహిత్యానికి ఆయనకు నోబెల్ బహుమతి ప్రకటించగా, దానిని ఆయన నిరాకరించాడు. సార్త్రెకి చిన్న తనంలోనే తండ్రి పోయాడు. కార్ల్ ష్వీట్జెర్ అనే తన మాతామహుని ఇంట అతడు పెరిగి పెద్దవాడయాడు. కార్ల్ ష్వీట్జెర్ సార్బోన్ విశ్వవిద్యాలయంలో జర్మన్ భాష బోధించే ఆచార్యుడు. చిన్నతనంలో సార్త్రె పారిస్‌లోని లగ్జెంబర్గ్ గార్డెన్స్‌లో సావాస గాళ్లకోసం వెదుకుతూ తిరిగేవాడు. *లెస్ మోట్స్* (1963 Words, 1964) అనే ప్రతిభావంతమైన తన ఆత్మకథలో సార్త్రె తనూ, తన తల్లీ ఆపార్కులో చేసిన వ్యర్థ ప్రయత్నాలనూ, చివరికి 'కలలు కాపురం ఉండే' తన ఆరవ అంతస్తు అపార్ట్‌మెంట్‌కు చేరుకోడం చక్కగా వర్ణించాడు.



తన తల్లి పారిస్‌లో లైసీని తిరిగి వివాహం చేసు కొన్న తరువాత సార్త్రె ఆమెతో కూడా లైసీ ఇంటికి మారాడు. అక్కడ ఉండగానే 'ఎకోల్ నార్మేల్ సూపరీర్' లో చేరి 1929 లో పట్టభద్రుడు అయాడు. 'బూర్జువా వివాహాన్ని' నిరసించిన సార్త్రె విద్యార్థిగా ఉండగానే సిమోన్ డీ బోవాయిర్ (చూ. బోవాయిర్) ను జీవిత భాగస్వామినిగా స్వీకరించి జీవితాంతం ఆమెతో గడిపాడు. సిమోన్ డీ బోవాయిర్ వ్రాసిన *మెమొయిర్స్* మొదలైన రచనల వలన విద్యార్థి దశనుంచి 55 ఏళ్లవరకూ గడచిన సార్త్రె జీవిత విశేషాలు మనకు తెలియవస్తున్నాయి. విద్యార్థిగా ఉండగానే సార్త్రెకి రేమండ్ ఆరన్, మారిస్ మెర్లూ పోంటీ, సైమోన్ వీల్, ఎమాన్యువల్ మోనియర్, జ్యాఁహిపొలైట్, క్లాడ్ లెవీ స్ట్రాస్ వంటి అనంతర కాలంలో విశ్రుతులైన అనేక ఫ్రెంచ్ రచయితలు మిత్రు లయారు. 1931 నుంచి 1945 వరకు సార్త్రె పారిస్ మొదలైన స్థలాలలో ఉపాధ్యాయవృత్తిని అవలంబించాడు. మధ్యలో రెండు సార్లు ఈ వృత్తికి అంతరాయం ఏర్పడింది. మొదటిసారి ఒక సంవత్సరం బెర్లిన్‌లో చదువుకోడానికి వెళ్లినపుడు; రెండవసారి 1939 లో ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో సైన్యంలో చేరినపుడు. 1940 లో యుద్ధ ఖైదీగా చిక్కి, ఒక ఏడాది తరువాత సార్త్రె విడుదల అయాడు.

లే హావ్రేలో ఉపాధ్యాయుడుగా ఉన్న కాలంలోనే సార్త్రె *లా నాసీ* (1938, Nausea, 1949) ప్రచురించాడు. రాక్వెంటిన్ అనే వ్యక్తి యొక్క విచిత్రమైన భావనలను డైరీ రూపంలో చిత్రించిన ఈ నవల వలన సార్త్రెకు మంచి పేరు వచ్చింది. అనంతర కాలంలో సార్త్రె విపులీకరించిన తాత్త్విక భావా లెన్నో బీజరూపంలో ఈ నవలలో మనకు కనిపిస్తాయి.

జర్మన్ తత్త్వవేత్త ఎడ్మండ్ హూసెర్ల్ నుండి 'ఫెనామినలాజికల్' విధానాన్ని అలవరచుకొని సార్త్రె తరువాతి తన మూడు రచనలలో అతి నైపుణితో దానిని వినియోగించాడు. ఆ రచనలు: *లా ఇమేజినేషన్* (1936, Imagination: A psychologicla crictique 1962), *ఎస్ క్వీసే డూనే థియరీ డెస్ ఎమోషన్స్* (1939, Sketch for a Theory of Emotions, 1962) *లా ఇమాజినైర్* (1940, The Psychology of Imagination, 1950). కాని సార్త్రె సంపూర్ణ ప్రతిభ *లా ఎత్రె ఎట్ లె నియాంట్* (1943, Being and nothingness, 1956) లో గాని పూర్తిగా అభివ్యక్తం కాలేదు. దానిలో సార్త్రె మానవుని చైతన్యానికి 'వస్తు'త్వం లేదని ప్రతిపాదించాడు. చైతన్యం

పదార్థం కాదు; అందుచేతనే అది ఎలాంటి 'నిర్ణీత స్థితి' (Determinism) కి వశం కాదు. ఈ గ్రంథంలోని సందేశం ఆశావహమైనదే అయినా, మానవ యత్నం నిరర్థకం అనే మాట కొంత నిరాశను కూడా కలిగిస్తుంది.

మానవుణ్ణి యథాతథంగా చిత్రించడమే రచయిత కర్తవ్యం అని సార్త్రి అంటాడు. *ది ఫ్లైస్, ఇన్ కెమెరా, డర్టీ హాండ్స్, లూసిఫర్ అండ్ ది లార్డ్* వంటి ఎన్నో నాటకాలను సార్త్రి రచించాడు. వాటిలో కొన్ని అమెరికాలో కూడా ప్రదర్శించబడ్డాయి.

చివరి సంవత్సరాలలో 1960 నుంచి 1971 వరకు సార్త్రి *ఫ్లాబర్* అనే నాలుగు భాగాల జీవిత చరిత్రను వ్రాయడంలో గడిపాడు. 2,130 పుటలతో కూడి మొదటి రెండు సంపుటాలూ 1971 లో వెలువడ్డాయి. ఇది ప్రముఖ ఫ్రెంచ్ నవలా రచయిత గుస్టేవ్ ఫ్లోబేర్ జీవిత చరిత్ర. 1971 తరువాత సార్త్రి ఎలాంటి రచనలూ చేయలేదు. చివరి రోజులలో సార్త్రిని అంధత్వం, నిస్సత్తువ క్రుంగదీశాయి. 1980 ఏప్రిల్ 15 న పారిస్‌లో సార్త్రి తుదిశ్వాస విడిచాడు. ఆయన అంత్యక్రియలకు 25,000 మంది అభిమానులు హాజరయారు. విక్టర్ హ్యూగో అంత్యక్రియలను అవి జ్ఞాపకం తెచ్చాయి.

*నాగరాజ్.(బొ.శ్రీ.)*

**సార్మియెంతో, డొమింగో ఫాస్టీనో (1811-1888) :** అర్జెంటీనా విద్యావేత్త, రచయిత, రాజనీతిజ్ఞుడు. 15 వ ఏటనే గ్రామీణోపాధ్యాయుడుగా జీవితం ప్రారంభించి, స్వయం కృషితో గొప్ప విద్యావేత్తగా, రచయితగా రూపొందాడు. అర్జెంటీనా నియంతయైన రోజాస్ (Rosas) కు వ్యతిరేకంగా రచనలు చేసి



దేశబహిష్కృతుడై, 'చిలీ' చేరాడు. చిలీలో విద్యాశాఖలో ఉన్నత పదవులు నిర్వహిస్తూ, రోజాస్ వ్యతిరేకంగా ఉద్యమాన్ని నడుపుతూ వచ్చాడు. చివరకు ఆ నియంతను త్రోసివేసి, అర్జెంటీనాకు అధ్యక్షుడు కాగలిగాడు. దేశ ప్రగతికి విద్యా ప్రచారమే ప్రథమ సోపానమని గట్టిగా నమ్మినవాడు కనుక నిరక్షరాస్యతతో మునిగి ఉన్న అర్జెంటీనాలో ప్రాథమిక పాఠశాలలనుండి సర్వవిధ వృత్తి, సాంకేతిక విద్యాశాలలవరకు నెలకొల్పాడు. దేశ పారిశ్రామిక పురోగతికి కృషి చేశాడు. ఇతడు రచించిన 52 గ్రంథాలలో ఎక్కువభాగం విద్యా విషయిక మైనవే.

*జయలక్ష్మి*

**సాల్టీకోవ్, మిఖాయిల్ (1826-1889) :** రష్యాకు చెందిన అధిక్షేప రచయితల్లో సుప్రసిద్ధుడు. రాడికల్ వాదం పట్ల సానుభూతి కలిగిన రచయిత.

సాల్టీకోవ్ మిక్కిలి కోమల హృదయుడు. తన తల్లిని రైతులు హింసించుటను చూసి మిక్కిలి వ్యథ చెందాడు. ఆ ఇతివృత్తాన్నే తన తరువాతి రచన *పొషెఖొన్ స్కాయస్తరినా* (పొషెఖొనాలో పాతరోజులు 1887-89) లో చిత్రించాడు. 1838 లో రష్యాలోని ఉన్నతాధికారుల శిక్షణ స్థావరమైన *త్సార్స్కాయెసెలో* లోని ఇంపీరియల్ లైసెకు పంపబడ్డాడు. అక్కడ ఆయన రచనా వ్యాసంగం ప్రారంభించి, ప్రచురించడం మొదలు పెట్టాడు. బ్యూరో క్రసీ పాలనకు ప్రతిస్పందించి ఆయన విప్లవ కూటమిలో చేరాడు. పిట్స్‌బర్గ్‌లోని 'విసారియన్ బెలిన్‌స్కీ' వంటి విమర్శకులను కలుసుకొన్నాడు.

ఆయన 1847 లో సాహిత్య జీవితం ప్రారంభించి *సొవెమెన్నీక్* (సమకాలికం) 'బతెచెస్తె వన్న్యెజపిస్కి' (పితృభూమిపై నోట్సు) పత్రికలలో సమీక్షకుడుగా పని చేశాడు. *జపుతన్నొ యెదెలో* (క్లిష్ట సమస్య, జటిల సమస్య, 1948) అనే కథలో ఫ్రెంచ్ ఊహాస్వర్గ వాదులను విమర్శించాడు. తత్ఫలితంగా ఆయన 'వ్యాత్కా' కు ప్రవాసితు డయాడు. అక్కడ ప్రావిన్షియల్ గవర్నర్ల కార్యాలయంలో పనిచేశాడు. 1855 లో పీటర్స్‌బర్గ్ నుండి తిరిగి వచ్చిన తరువాత *బెర్న్‌స్కి మిడెబెర్కీ* (1856-57) అనే రచనలో వ్యాత్కా అధికారులను వ్యంగ్యంగా చిత్రించాడు. ఈ గ్రంథ మతనికి మంచి పేరును ఆర్జించింది. *స్మెర్త్ పజుఖినా* (1857) అనే హాస్య రచనలో రష్యా వ్యాపారులను వర్ణించాడు.

1862 లో ఉద్యోగ విరమణ చేసిన పిమ్మట తన జీవితాన్ని సాహిత్యానికే అంకితం చేశాడు. *స్వొవెమెన్నిక్* పత్రిక సంపాదకుడుగా, రాడికల్ కవి 'నికొలాయ్ నెక్రోసొల్' ప్రచురిస్తున్న *బతిచెస్తె వన్న్యెజపిస్కి* పత్రిక సహ సంపాదకుడుగా నెక్రొసెల్ మరణానంతరం (1878) సంపాదకుడుగా పనిచేశాడు. అతని రచనలు: *ఇస్తొరియా ఒద్నొగొ గోరూదా* (ఓ పట్టణ చరిత్ర) 1869-70 లోనూ, *పొంపదుర్రై ఇ పొంపదుర్షి* ని 1863-74 మధ్యనూ రచించాడు. ఈ రెండు రచన

లలో రష్యా ఉన్నతాధికారులపై తీవ్రమైన వ్యంగ్యాత్మక విమర్శ ఉంది.

చంద్ర

**సింకివిచ్-హెన్రిక్ (1846-1916) :** ప్రముఖ పోలిష్ రచయిత, ఇతని మారుపేరు 'లిట్‌వోస్' (Litwos). పోలిష్ భాషలో ప్రజాదరణ పొందిన నవలలు వ్రాసి విశేష ప్రసిద్ధిని పొందడమే గాక, 1905 లో సాహిత్యానికి ఇచ్చే నోబెల్ బహుమతిని అందుకొన్నాడు. పోలండ్ లోను, తదితర ప్రాంతాలలోను, ఆరో



జులలో విశేష ప్రభావం గల 'పాజిటివిజమ్' హెన్రిక్‌పై గాఢమైన ప్రభావం చూపింది. ఆధునిక శాస్త్రవిజ్ఞానం సాధించిన ఫలితాల ప్రాధాన్యాన్ని చాటే తాత్త్విక దృక్పథం ఇది. హెన్రిక్ 1869 లో పోజిటివిజమ్‌ను గురించి విమర్శనాత్మకమైన వ్యాసాలను ప్రచురించడం ప్రారంభించాడు.

హెన్రిక్ వార్సా విశ్వవిద్యాలయంలో సాహిత్యం, చరిత్ర, భాషాశాస్త్రాలను అధ్యయనం చేసి, 1871 లో డిగ్రీ తీసుకోకుండానే ఆ విశ్వవిద్యాలయం వదలిపెట్టాడు.

హెన్రిక్ వ్రాసిన మొట్టమొదటి నవల *నామర్త్వే*, మొట్టమొదటి కథానిక *స్టారీ స్లుగా* (1875, An Old Retainer). 1876-78 మధ్య *గజెటాపోల్స్కా* (Polish Gazetteer) తరఫున రిపోర్టరుగా అమెరికా సందర్శించి, తిరుగుప్రయాణంలో ఇటలీ, ఫ్రాన్స్‌లమీదుగా పోలండు చేరుకొన్నాడు. అప్పటినుండి అతడు ప్రసిద్ధి పొందిన అనేక కథలను ప్రచురించాడు. వాటిలో *జాంకో ముజికాంట్* (1879, Yanko the Mnsician), *ల టార్నిక్* (1882, The lighthouse), *బార్ టెక్ జ్విసీజ్‌కా* (1882, Bartek the gonqueror) ముఖ్యమైనవి. 1882 నుండి 1887 వరకు అతడు *స్లోవో* దిన పత్రికకు సహసంపాదకుడుగా పనిచేశాడు.

పోలిష్ ప్రజలు 1900 వ సంవత్సరంలో హెన్రిక్ రచనా జీవితానికి 30 ఏళ్లు పూర్తయిన సందర్భాన్ని పురస్కరించుకొని 'కీల్స్' దగ్గర ఓబ్లెగోరెక్ అనే ఒక ఎస్టేట్‌ను తమ అభిమాన చిహ్నంగా అతనికి బహూకరించారు. 1914 వరకు ఆయన అక్కడ నివసించాడు. పోలిష్ ప్రజల స్వాతంత్ర్యసిద్ధికై హెన్రిక్ మొదటి ప్రపంచ యుద్ధంలో గొప్పకృషి చేశాడు. యుద్ధ బాధితులకు పెద్ద పెట్టున సహాయక చర్యలు చేపట్టి సేవ చేశాడు.

సింకివిచ్ హెన్రిక్ 1883 నుంచి మూడు భాగాలు గల తన చారిత్రక నవలను స్లోవో అనే దినపత్రికలో ప్రచురింప సాగాడు. ఈ నవలలోని మూడు భాగాలు: *ఆగ్నీం ఇ మీక్జెం* (1884, With fire and Sword), *పాటోప్* (1886, The Deluge), *పాన్ ఓటో డై జోస్కీ* (1887-88, Pan Mipchael). ఈ నవలలో 17 వ శతాబ్ది తుది భాగాన పోలండ్ ప్రజలు 'కోశాక్' లు, 'టాటార్' లు, 'స్వీడ్' లు, 'టర్క్' లతో జరిగిన పోరాటం, వారి ధైర్య సాహసాలు నిరాడంబరమైన, ప్రసన్నమైన పౌరాణిక కావ్య శైలిలో వర్ణించబడ్డాయి.

హెన్రిక్ ఇతర రచనలలో ప్రసిద్ధి కెక్కిన చారిత్రక నవల *కో వాడిస్.* వివిధ ప్రపంచ భాషలలోకి అనువదింపబడి ప్రపంచ వ్యాప్తంగా సింకివిచ్‌కి పేరు ప్రతిష్ఠలు తెచ్చిన ఈ నవలలో నీరో (Nero) చక్రవర్తి రోము దేశాన్ని పరిపాలించిన విధానం చిత్రించబడింది.

సింకివిచ్ నవలలలో చారిత్రక వివరాలు కచ్చితంగా లేవనీ, కృతకంగా, నాటకీయంగా ఉన్నాయనీ అభియోగం వచ్చినప్పటికీ, వాటిలో గొప్ప కథనశక్తి, స్పష్టమైన పాత్రచిత్రణ ఉన్నాయని చెప్పకతప్పదు.

*నాగరాజ్., డి.మా.రా.*

**సింక్లెయర్, అప్టన్ (1878-1968) :** అమెరికన్ నవలారచయిత, సామ్యవాది. అతని రచన *ది జంగిల్* (అరణ్యం) స్వాభావికవాద, శ్రామిక వర్గవాద నవలలలో మైలురాయి వంటిది. 1897 లో న్యూయార్క్ సిటీ కళాశాల నుండి పట్టభద్రు డయాడు. పత్రికా రచనలు చేస్తూ, తనను తాను పోషించుకొంటూ కొలంబియా విశ్వవిద్యాలయంలో కూడా అధ్యయనం చేశాడు.



*ది జంగిల్* ఆయన రచించిన అయిదవ నవల. అది ఆయనకు మంచి పేరు ప్రఖ్యాతులు తెచ్చిపెట్టింది. చికాగో లోని పరిస్థితులను పరిశోధించడానికి *అపీల్ టు రీజన్* అనే సామ్యవాద పత్రిక ఆయనను చికాగో పంపింది. ఆ నివేదిక నవలగా వెలువడింది. మాంసం పాకింగు పరిశ్రమలో కార్మికుల పట్ల సానుభూతి కలిగించడానికి ఆయన ఆ నవల వ్రాశాడు. ప్రాసెస్ అయిన మాంసం నాణ్యతలోని లోటుపాట్లను ఆ రచన వెలువరించింది. తత్ఫలితంగా 'ఆహారం తనిఖీ చట్టాలు' వచ్చాయి. "నేను ప్రజల హృదయాలను చూరగొనాలనుకొన్నాను, అయితే ప్రమాదవశాత్తు ప్రజల పొట్ట కొట్టాను" అని సింక్లేయర్ అన్నాడు. ఈ నవల ప్రచురణ కర్తలు ముందుకు రానందున అతడు సొంతంగానే ప్రచురించాడు. నవల బాగా అమ్ముడు పోయింది.

అనేక అంశాలపై ఆయన సుదీర్ఘ నవలలు రచించాడు. అయితే అవి ఏవీ *ది జంగిల్* వలె ప్రసిద్ధి గడించలేదు. వాటిలో *టీ పాట్ డోమ్* కుంభకోణం ఆధారంగా వ్రాసిన *ఆయిల్* (1927), సాక్కో వాంజెట్టీ కేసు ఆధారంగా రచించిన *బోస్టన్* (1928) లు చెప్పుకోదగ్గవి. ఆయన రష్యాలో 1917 విప్లవం ముందు, తరువాత బాగా పేరు సంపాదించారు. కమ్యూనిస్టు పాలనను వ్యతిరేకించినందున రష్యాలో ఆయన ప్రఖ్యాతి తగ్గింది. అయితే 1930-40 మధ్య ఫాసిస్టు వ్యతిరేక రచనల వల్ల అతని పేరు తిరిగి ఎక్కువ అయింది.

1930 నాటి ఆర్థిక సంక్షోభం, సామ్యవాద సంస్కరణ ఉద్యమం *ఎపిక్* (ఎండ్ పావర్టీ ఇన్ కాలిఫోర్నియా) ను నిర్వహించారు. అతని ఆత్మకథ *అమెరికన్ ఔట్ పోస్ట్ : ఏ బుక్ ఆఫ్ రెమినిసెన్సెస్.*

చంద్ర

**సింక్లేయర్, కీత్ (1922--) :** న్యూజిలాండ్ కవి, చరిత్ర పరిశోధకుడు. న్యూజిలాండు లోని మావోరీ ప్రజలను నిశితంగా అర్థం చేసుకోడానికి అతని రచనలు దోహదం చేస్తాయి. ఆయన 1954 లో ఆక్లాండు విశ్వవిద్యాలయంలో అధ్యాపకుడుగా చేరి 1962 లో చరిత్ర విభాగంలో ఆచార్య పదవిని అలంకరించాడు.

ఆయన మొదటి కవితా సంకలనం *సాంగ్స్ ఫర్ ఏ సమ్మర్ అండ్ అదర్ పొయెమ్స్* 1952 లో వెలువడింది. *స్ట్రేంజర్స్ ఆర్ బీస్ట్స్: పొయెమ్స్* (1954), *ఏ టైమ్ టు ఎంబ్రేస్* (1963), *ఫైర్‌వెల్ ట్రీ* (1973) ప్రచురణ పొందాయి. *ది ఆరిజన్ ఆఫ్ మావోరీ వార్* (1957) అనే చారిత్రక రచన అతనికి ఎనలేని కీర్తిని ఆర్జించింది.

*ఏ హిస్టరీ ఆఫ్ న్యూజిలాండ్* (1959), *ది లిబరల్ గవర్నమెంటు 1891-1912: ఫస్ట్ స్టెప్స్ టువర్డ్స్ ఏ వెల్ఫేర్ స్టేట్* (1967) అనే గ్రంథాలు రచించారు.

చంద్ర

**సింగర్, ఐజాక్ బషెవిస్ (1904-1991) :** 1978 వ సంవత్సరంలో సాహిత్యానికి నోబెల్ బహుమతి అందుకొన్న పోలిష్ నవలా రచయిత, కథానికా రచయిత, వ్యాసకర్త. సింగర్ రచనలలో పోలండు, అమెరికాలలోని యూదుల జీవితాలు ప్రతిబింబిస్తాయి. అతని రచనలో వ్యంగ్యాత్మక హేళన, హాస్యం, విజ్ఞత కలసి ఉంటాయి.

వార్సా రబ్బినిక సెమినరీలో సంప్రదాయ రీతులలో విద్య నభ్యసించాడు. అతని సోదరుడు ఐ.జె. సింగర్ వలె యూదులమత గురువు కాకుండా రచయిత అయాడు. అతని మొదటి నవల *దెర్ సాత్న్ ఇన్ గొరే* (గొరే లో శాటన్ 1955) ఆయన అమెరికాకు బయలుదేరడానికి ముందు పోలండులో 1935 లో విడిభాగాలుగా ప్రచురణ పొందింది. నాజీలు పోలండుపై దండెత్తి, ఆక్రమించుకుంటారేమోనని ఆయన అమెరికాకు 1935 లో వచ్చారు. ఆయన న్యూయార్క్ నగరంలో స్థిరపడి యూదు దినపత్రికలలో 'ఫార్వర్డ్' అనే కలం పేరుతో వ్యాసాలు వ్రాశాడు. 1943 లో అమెరికా పౌరు డయాడు.

తన రచనలకు ఆంగ్లంలో ప్రాచుర్యం లభించిన తరువాత కూడా కేవలం యిడ్డిష్‌భాష లోనే వ్రాస్తూ అనువాదాలను వ్యక్తిగతంగా పరిశీలిస్తూ ఉండేవాడు. ఆయన నవలలలో *ది ఫామిలీ మొస్కట్* (1950), *ది మెజీషియన్ ఆఫ్ లుబ్లిన్* (1960), *ది స్లేవ్* (1962), *ది మానొర్* (1967), *ది ఎస్టేట్* (1969), *ఎనిమీస్, ఏ లవ్ స్టోరీ* (1972), *షోష* (1978) ప్రధానమైనవి. అతని ప్రతిష్ఠను అత్యంతంగా ఇనుమడింపజేసిన కథానికా సంపుటాలలో *జింపెల్ ది ఫూల్* (1957), *ది స్పినోజా ఆఫ్ మార్కెట్ స్ట్రీట్* (1961), *షార్ట్ ఫ్రైడే* (1964), *ది సీయన్స్* (1968), *ఏ క్రౌన్ ఆఫ్ ఫెదర్స్* (1973), *ఓల్డ్ లవ్* (1979) ముఖ్యమైనవి. *ఏ క్రౌన్ ఆఫ్ ఫెదర్స్* కు జాతీయ పుస్తక బహుమతి లభించింది. 1982 లో *ది కలెక్టెడ్ స్టోరీస్ ఆఫ్ ఐజాక్* ప్రచురించబడింది.

*ఫెమిలీ వెంట్ టు వార్సా, అండ్ అదర్ షార్ట్ స్టోరీస్* (1968) అనే బాలల కోసం చేసిన రచన బాగా ప్రసిద్ధి పొందింది. *ఇన్ మై ఫాదర్స్ కోర్ట్* అనే ఆత్మకథలో వార్సాలోని తన బాల్య జీవితాన్ని వర్ణించాడు. ఇది 1966 లో వెలువడింది.

ఆయన *మ్యాజిక్ మౌంటెన్* ను యిడ్డిష్‌భాష లోకి అనువదించాడు. సింగర్ అమెరికన్ అకాడమీ ఆఫ్ ఆర్ట్స్ అండ్ సైన్స్‌లోనూ, జ్యూయిష్ అకాడమీ ఆఫ్ ఆర్ట్స్ అండ్ సైన్సులోనూ సభ్యుడు.

చంద్ర

**సింజ్, జాన్ మిలింగ్‌టన్ (1871-1909) :** ఏట్సు కంటే ప్రతిభావంతుడైన ఐరిష్ నాటక రచయిత. వాస్తవికత, ఇంద్రజాలం, హాస్యాలకు సమన్వయించి ఐరిష్ ప్రజల హృదయాలను చూరగొన్నాడు. ఐరిష్ సాహిత్య పునరుజ్జీవన ఉద్యమకారులలో ముఖ్యుడు. ఆరన్ దీవులలోని పశ్చిమ ఐరిష్ సముద్రతీర ప్రాంతపు ఆదిమ జాతివారి జీవితాలను అత్యంత నైపుణ్యంతోను, ఆలంకారిక శైలితోను వర్ణించిన నాటకకర్త. డబ్లిన్ ట్రినిటీ కళాశాలలో భాషలను అధ్యయనం చేసిన పిమ్మట సంగీత విద్వాంసుడు కావాలని నిశ్చయించుకొన్నాడు. 1893 నుండి 1897 వరకు జర్మనీ, ఇటలీ, ఫ్రాన్స్ మొదలైన దేశాలలో పర్యటించాడు. 1899 లో పారిస్‌లో విలియం బట్లర్ యేట్స్‌ను కలుసుకొన్న తరువాత సాహిత్య విమర్శ వైపు మళ్లాడు. ఆయన ప్రోత్సాహంతో ఐరిష్ పునరుజ్జీవనం వైపు దృష్టి మళ్లించాడు. యేట్సు ఆదేశం మేరకు ఆరన్ దీవులలోని ప్రజల జీవితాలను కళ్లారా చూసిరావడానికి ఆయన 1902 లో ఆరన్ దీవులలో పర్యటించాడు. ఆ ప్రజల భాష నేర్చుకొని, వారి జీవితాలను పరిశీలిస్తూ, అభిప్రాయాలను వ్రాసుకొన్నాడు. తత్ఫలితంగా *ది ఆరన్ ఐలాండ్* (1907), *ది షాడో ఆఫ్ ది గ్లెన్* ఏకాంకిక (1903 లో మొదటిసారిగా ప్రదర్శితం), *ది రైడర్స్ టు ది సీ* (1904) మొదలైన రచనలు వెలువడ్డాయి. *ది వెల్ ఆఫ్ ది సెయింట్స్* మూడు అంకాల నాటకం 1905 లో ప్రచురించబడింది.



*ది రైడర్స్ టు ది సీ* లో నిరాశ గూడుకట్టుకొన్నది. ఇందలి పాత్రలు పేద జాలరులు. వారు సముద్రంలో మునిగి మరణించడం ఇందలి ఇతివృత్తం. ఇది ఉత్తమ విషాదాంత నాటకంగా పేరు పొందింది.

*ది ప్లే బోయ్ ఆఫ్ ది వెస్టరన్ వరల్డ్* (1907) లో ఐరిష్ మతాన్ని, జాతిని సింజ్ దుయ్యబట్టాడు. ఈ విమర్శను తట్టుకోలేక దేశభక్తులు ఆయనను ఖండించి, ఆయనపై దౌర్జన్యానికి దిగారు. ఈ సంఘటనతో ఆయన కీర్తి ఇతరదేశాలకు కూడా వ్యాపించింది. ఈ నాటకం సెర్వాంటిస్ మాతృదేశం స్పెయిన్‌ను అవహేళన చేస్తూ రచించిన డాన్ క్విక్సాట్ వంటిది. *డయర్‌డ్రీ ఆఫ్ ది సారోస్* (1910) ఆయన రచించిన ఆఖరి నాటకం. అందులో అందమైన భాషను వాడాడు. *జాన్ మిల్లింగ్టన్ సింజ్* అనే రచన (1959) ఆయనను గూర్చిన సమగ్రమైన జీవిత చరిత్ర. దీన్ని డి.హెచ్. గ్రీన్, ఇ. స్టీఫెన్స్‌లు రచించారు.

చంద్ర

**సింబాలిస్ట్ (ప్రతీక వాద) ఉద్యమం :** 19 వ శతాబ్ది తుది భాగంలో ఫ్రాన్స్‌లోని కవుల బృందం ఒకటి ప్రారంభించిన సాహిత్య ఉద్యమం. క్రమంగా ఇది చిత్రకళకూ, నాటక రంగానికీ కూడా ప్రాకింది. 20 వ శతాబ్దపు యూరపియన్, అమెరికన్ సాహిత్యాల మీద ఈ ఉద్యమం ప్రభావం వేరు వేరు పరిమాణాలలో కనిపిస్తుంది.

సింబాలిస్ట్ కవులలో ముఖ్యంగా పేర్కొన దగిన ఫ్రెంచ్ కవులు: స్టీఫేన్ మలార్మే, పాల్ వెర్లెయిన్, ఆర్థర్ రింబో, జూల్స్ లాఫోర్గ్, హెన్రీ డీ రెగ్నీర్, రెనీ ఘిల్, గుస్టేవ్ కాన్;బెల్జియన్‌కవులు: ఎమిలీవెర్హేరన్,జార్జెస్ రోడెన్ బాఖ్; గ్రీస్‌లో జన్మించిన జీన్ మోరియన్; జన్మతః అమెరికన్‌లు అయిన ఫ్రాన్సిస్ వీలే గ్రిఫిన్, స్టూవార్ట్ మెరిల్‌లు. సింబాలిస్ట్ విమర్శకులలో ప్రధానులు: రెమీ డీ గౌర్మాండ్. సింబాలిస్ట్ ఉద్యమ సూత్రాలను నవలలకు అత్యంత ఫలవంతంగా అన్వయించినవాడు: జోరిస్ కార్ల్ హూస్‌మన్స్. అలాగే నాటక రంగానికి దీనిని అన్వయించినవాడు బెల్జియన్ రచయిత మోరిస్ మాటర్ లింక్. ఈ ఉద్యమానికి 20 వ శతాబ్దంలో ఫ్రెంచ్ కవులు పాల్ వాలరీ, పాల్ క్లాడెల్ ప్రత్యక్ష వారసులు అని పరిగణించడం పరిపాటి.

సాంప్రదాయిక ఫ్రెంచ్ కవిత్వంలో వస్తువు విషయంలోనూ, శిల్పం విషయంలోనూ కూడా ఉన్న కచ్చితమైన పడికట్టు రాళ్ల వంటి విధానాల మీద తిరుగుబాటుగా ఈ సింబాలిస్ట్ ఉద్యమం ఆరంభమైంది. కవిత్వానికి నిర్ణీతమైన విధానాల నుండి విముక్తి కలిగించాలని సింబాలిస్టులు ప్రయత్నించారు. మానవుని అంతరంగంలోని సహజమైన అనుభూతులనూ, ఆవేశాలనూ స్వేచ్ఛగా, వైయక్తికమైన

రూపకాల కారాలతోనూ, మూర్తుల (images) తోనూ అభివ్యక్తం చేయడానికి వారు పూనుకొన్నారు. వారి పద్యాలలో అర్థం విస్పష్టంగా లేకపోయినా, కవి యొక్క విలక్షణమైన మనస్థితిని ఆ పద్యాలు పాఠకులకు అందజేస్తాయి.

సింబాలిస్ట్ ఉద్యమ వైతాళికులైన వెర్లైయిన్, రింబోల మీద ఛార్లెస్ బోడ్లేర్ ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది. వివిధ ఇంద్రియాల మధ్య అనువృత్తి (correspodance) ఉండాలి అనే బోడ్లేర్ సిద్ధాంతాన్ని వారు అనుసరించారు. పద్యం యొక్క గాన లక్షణానికి వారు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చారు.

వెర్లైయిన్ రచించిన *రొమాన్సెస్ శాన్స్ ఫెరోస్* (1974; Song without Words), మలార్మే రచించిన *ల్యాపెస్ మెడి డ్యూన్ ఫానె* (1876) అనే మహాకావ్యాలు ఫ్రెంచ్ అభ్యుదయ కవితలోని నూతన ప్రయోగాల పట్ల కవులలో ఎక్కువ ఆసక్తి కలిగించాయి. 1886 సెప్టెంబరు 18 న జీన్ మోరియాస్ *లీఫి గారో* లో సింబాలిస్టు ఉద్యమపు మేనిఫెస్టో ప్రకటించాడు. దానిలో 'పర్నేషియన్' కవితలోనూ, 'నేచురలిస్టిక్' నవలలలోనూ, 'రియలిస్ట్' నాటక రంగంలోనూ కనిపించే వర్ణనాత్మక వైఖరులను ఆయన నిరసించాడు. 1880-90 మధ్య సింబాలిస్ట్ పత్రికలు అనేకం వెలువడ్డాయి. వాటిలో ఈ ఉద్యమాన్ని గూర్చి తీవ్రమైన వాదోపవాదాలు చెలరేగాయి. మలార్మే ఆ ఉద్యమానికి నాయకుడయాడు. ఆయన రచించిన *డివగేషన్స్* (1879) ఆ ఉద్యమపు సౌందర్య సిద్ధాంతానికి ప్రామాణిక రచన అయింది.

1890 లో ఈ ఉద్యమం పరాకోటిని అందుకొని, 1900 ప్రాంతానికి క్రమంగా ప్రజాదరణను కోల్పోసాగింది. కాని సింబాలిస్టు ఉద్యమంలోని ప్రాయోగిక శిల్పాలు ఆధునిక మహాకవులైన డబ్ల్యు.బి. యీట్స్, టి.ఎస్.ఎలియట్‌లలోనూ, ఆధునిక నవలా రచయితలు జేమ్స్ జాయ్స్, వర్జీనియా వుల్ఫ్‌లలోనూ విశేషంగా ఫలవంతమైనట్లు కనిపిస్తుంది. 20 వ శతాబ్దపు అమెరికన్ విమర్శకుడు ఎడ్మండ్ విల్సన్ సింబాలిస్టు ఉద్యమంపై రచించిన *ఆక్సెల్స్ కేజిల్* (1931) ఆధునిక విమర్శక గ్రంథాలలో మిక్కిలి ప్రామాణికమైనదిగా భావించబడుతూంది.

బొ.శ్రీ.

**సిడ్నీ, సర్ ఫిలిప్ (1554-1586) :** ప్రముఖ ఆంగ్ల రచయిత. ఎలిజబెతెన్ యుగపు రాజనీతివేత్త, సైనికుడు, కవి, కవిపండిత పోషకుడు. ఆ నాటి లక్ష్యప్రాయుడైన 'పెద్దమనిషి' గా ఆయన పరిగణింపబడేవాడు. షేక్స్పియర్ సానెట్ల తరువాత సిడ్నీ రచించిన *ఎస్ట్రొఫెల్ అండ్ స్టెల్లా* అనే సానెట్ల సముదాయమే అత్యుత్తమమైన ఎలిజబెతెన్ సానెట్లుగా పరిగణించబడుతున్నాయి. సిడ్నీ వ్రాసిన *ది డిఫెన్స్ ఆప్ పొయిజీ* ఇంగ్లండులోని పునరుజ్జీవన యుగ విమర్శకులకు నూతన భావాలను పరిచయం చేసింది.

ఫిలిప్ సిడ్నీ సర్ హెన్రీ దంపతుల జ్యేష్ఠపుత్రుడు. మొదటి ఎలిజబెత్ సింహాసనం ఎక్కగానే ఆమె ఇతని తండ్రి హెన్రీ సిడ్నీని వేల్స్ కి లార్డ్ ప్రెసిడెంట్‌గా నియమించింది. ఆ తరువాత మూడు దఫాలు ఆయన ఐర్లండ్‌కు 'లార్డ్ డెప్యూటీ' ఆయాడు. ఇతని మేనమామ రాబర్ట్ డుడ్లీని లైసెస్టర్ ప్రభువుగా చేసి, రాణీగారికి ఆంతరంగిక సలహాదారుగా నియమించారు. అలాంటి ఉన్నత వంశంలో పుట్టిన ఫిలిప్ సిడ్నీ గొప్ప రాజనీతివేత్త అవుతాడనీ, సేనాని అవుతాడనీ భావించారు. తన 10 వ ఏట ఫిలిప్ సిడ్నీ ష్రూస్‌బరీ స్కూలులో చేరాడు. 1568 లో ఆక్స్‌ఫర్డ్‌లోని 'క్రైస్ట్ చర్చ్' లో మూడు సంవత్సరాల కోర్స్‌లో చేరాడు. అనంతరం 1572 మే మొదలు 1575 జూన్ వరకు యూరప్‌లో సంచారం చేసి, సిడ్నీ తన లాటిన్, ఫ్రెంచ్, ఇటాలియన్ భాషల పరిజ్ఞానాన్ని సమగ్రం చేసికొన్నాడు. యూరప్ రాజకీయాలతోనూ, యూరప్‌లోని ప్రముఖ రాజనీతి వేత్తలతోనూ తగినంత పరిచయం కూడా సంపాదించుకొన్నాడు.

1576 లో రాణీగారి కొలువులో తన తండ్రి ఉద్యోగం ('కప్ బేగర్' ఉద్యోగం) లో ఆయనను నియమించారు. 1577 లో సిడ్నీ 22 ఏళ్ల చిరుప్రాయంలో ఉండగానే అతనిని జర్మన్ చక్రవర్తి రెండవ రొడోల్ఫ్ వద్దకు ఆయన తండ్రి మరణానికి రాణీగారి సంతాప సందేశాన్ని అందజేసే రాయబారిగా పంపారు. రాజకీయాలలో తలమున్కలుగా నిమగ్నుడై ఉన్న కాలంలో కూడా సిడ్నీ కళాకారులతోనూ, విద్వాంసులతోనూ సన్నిహిత సంబంధాలు పెట్టుకొనేవాడు. 'నికొలాస్ హిలియార్డ్' అనే పెయింటరుతోనూ, 'జాన్‌డీ' అనే రసాయన శాస్త్ర వేత్తతోనూ ఆయన తరచు చర్చిస్తూ ఉండేవాడు. కవి పండితులను తన చుట్టూ చేరదీసి ఆదరిస్తూ ఉండేవాడు. ఇంగ్లీష్ రచయితలు, యూరపియన్ రచయితలు 40 కంటె ఎక్కువ గ్రంథాలను ఆయనకు అంకితం ఇచ్చారు. ఆయన ఆదరణ పొందిన ప్రముఖ కవులలోను, రచయితలలోను ఎడ్మండ్ స్పెన్సర్, థామస్ వాట్సన్, అబ్రహామ్

ఫ్రాన్స్, థామస్ లాడ్జ్ ముఖ్యంగా పేర్కొనదగినవారు.

రాణీగారు తనకు ప్రధానమైన బాధ్యతను ఒప్పగించనందువలన 1575 లో ఆయన సాహిత్యం వైపు తన దృష్టిని మళ్లించాడు. ముందుగా *ది లేడీ ఆఫ్ మే* అనే ఒక గ్రామీణ నాటికను రాణీగారికోసం ఆయన రచించాడు. 1580 నాటికి తన *ఆర్కేడియా* అనే వచనరచనను ఆయన పూర్తిచేశాడు. అది 1,80,000 మాటలతో కూడిన క్లిష్టమైన సంవిధానం గల గొప్ప కథ.

పెనెలోప్ డెవెరియక్స్ అనే ఆమెను సిడ్నీ ప్రేమించాడు. కాని అప్పటికే ఆమె వివాహిత. 1582 వేసవిలో ఆయన *ఆస్ట్రోఫెల్ అండ్ స్టెల్లా* అనే సానెట్లను వ్రాయడం మొదలు పెట్టాడు. అదే కాలంలో *డిఫెన్స్ ఆఫ్ పొయిజీ* అనే రచనను కూడా ఫిడ్నీ కొనసాగించాడు. 1584 లో *ఆర్కేడియా* ను పూర్తిగా సవరించడం మొదలుపెట్టాడు. దానిని అసంపూర్ణంగానే ఆయన వదలినా 16 వ శతాబ్దం నాటి కల్పనా సాహిత్యంలో మిక్కిలి ప్రధానమైన రచనగా అది ప్రసిద్ధి పొందింది.

1586 సెప్టెంబరు 22 న స్పెయిన్ దేశీయుల మీద ఒక యుద్ధ రంగంలో ఆయన పాల్గొన్నాడు. తొడమీద తుపాకీ గుండు గాయం తగిలి క్రమంగా అది చీము పట్టి ఆయన మరణానికి దారితీసింది. 1587 ఫిబ్రవరి 16 న లండన్‌లోని సెంట్‌పాల్స్ కెథెడ్రల్ లో ఆయనను సమాధి చేశారు.

బొ.శ్రీ.

**సిన్యావ్‌స్కీ, ఆంద్రీ దొనతోవిచ్ (1925--) :** రష్యన్ విమర్శకుడు, నవలా రచయిత, కథానికా రచయిత. ఇతని కలంపేరు అబ్రాంటెర్ట్స్. 1966 లో రష్యా ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి ప్రయత్నం చేశాడనే ఆరోపణ ఈయనపై మోపారు.

సిన్యావ్‌స్కీ 1952 లో మాస్కో విశ్వవిద్యాలయం నుండి డిగ్రీ తీసుకొన్న తరువాత గోర్కీ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ వరల్డ్ లిటరేచర్ ప్రవేశించాడు. సాహిత్య పత్రిక 'నోవీమీర్' కు వ్యాసాలు వ్రాశాడు. 'బోరిస్ పాస్టర్‌నాక్' రచించిన కవితా సంపుటికి పీఠిక వ్రాశాడు. సిన్యావ్‌స్కీ కథానికలు ఏవీ రష్యాలో ప్రచురణ పొందలేదు. అవి దొంగచాటుగా పశ్చిమ దేశాలకు చేరుకొని అబ్రాంటెర్ట్స్అనే పేరుతో ప్రచురణ పొందాయి.

ఆయన రచించిన *ది ట్రయల్ బిగిన్స్* అనే నవల ఆంగ్లంలోకి అనువాదం పొందింది. అప్పటినుండి ఆయన రచనలు ఆంగ్ల పాఠకులకు పరిచయ మయ్యాయి. దీనిలోని ఇతివృత్తం డాక్టర్ల కుట్రకు సంబంధించినది. దీనిలో 9 మంది డాక్టర్లపై అన్యాయంగా రాజద్రోహ నేరం మోపడం జరిగింది. *ఫాంటాస్టిక్ స్టోరీస్* (1963) అనే కథానికా సంకలనంలో నిరంకుశపాలన, విధ్వంసం, ఆధ్యాత్మిక ఏకాంతం మొదలైన అంశాలు వర్ణింపబడ్డాయి.

*ది మేక్ పీస్ ఎక్స్‌పెరిమెంట్* (1965) అనే నవలలో గ్రామ పెత్తందారు తన ప్రజలను అద్భుతాలు, ఆశ్చర్యాలతో మోసం చేస్తాడు. *ఆన్ సోషలిస్ట్ రియలిజం* (1960) అనే వ్యాసం కూడా పాశ్చాత్య దేశాలకు దొంగచాటుగా రవాణా అయింది. దీనిని రష్యన్ సాహిత్యంలో 'నవ్య దర్శనం' అని కూడా పిలుస్తారు.

సిన్యావ్‌స్కీతో పాటు యూలీడేనియల్ అనే రచయితను కూడా 1965 సెప్టెంబరు 13 న అరెస్టు చేసి, వారు రచనల ద్వారా రష్యా వ్యతిరేక భావాలను ప్రచారం చేస్తున్నారనే నేరం మోపారు. తత్ఫలితంగా 1971 వరకు వారికి కారాగారశిక్ష పడింది. సిన్యావ్‌స్కీ జైలు నుండి విడుదల అయిన పిమ్మట పారిస్‌కు వెళ్లి సార్బోనె లో రష్యన్ సాహిత్యాన్ని బోధించాడు.

జైలులో నిర్బంధంలో ఉన్నప్పటికీ సిన్యావ్‌స్కీ తన రచనా వ్యాసంగాన్నికొనసాగించాడు. ఈ కాలంలో అతని రచనలు ఆంగ్లంలోకి అనువాదం చెందాయి. వాటిలో *ఫర్ ఫ్రీడం ఆఫ్ ఇమాజినేషన్* (1971), *అన్ గార్డెడ్ థాట్స్* (1972), *ఏ వాయిస్ ఫ్రం ది కోరస్* (1976) ప్రధానంగా పేర్కొవచ్చును.

చంద్ర

**సిమ్స్, విలియం గిల్మోర్ (1806-1870) :** సుప్రసిద్ధ నవలారచయిత. బాలమేధావి, బహుముఖ ప్రజ్ఞావంతుడు, కవి, విమర్శకుడు, కథానికా రచయిత. సిమ్స్‌కు రెండేళ్ల వయసు లోనే తల్లి చనిపోయింది. అవ్వ పెంపకంలో పెరిగాడు. అవ్వ చెప్పిన కథల్లో చరిత్ర పాఠాలు నేర్చుకొన్నాడు. తండ్రి గ్రీక్ యుద్ధాలలో పాల్గొన్నాడు. పబ్లిక్ స్కూలులో 4 సంవత్సరాలు చదివిన పిమ్మట చార్లెస్టన్ కాలేజిలో 10 వ ఏట ప్రవేశించాడు.



అప్పటికే అనువాదాలకు తగినంత ఫ్రెంచ్, లాటిన్, జర్మన్, స్పానిష్ భాషలను నేర్చుకొన్నాడు. 12 వ ఏట ఔషధ శాస్త్రాధ్యయనం పూర్తిచేసి ఔషధాల తయారీలో శిక్షితు డయాడు. 16 వ ఏటినుండే *చార్లెస్టన్* పత్రికలలో కవిత్వం ప్రచురించడం ప్రారంభించాడు. దేశ ద్రిమ్మరి అయిన తన తండ్రిని మిసిసిపీ ఫ్రాంటియర్‌లో కలుసుకొన్నాడు. అక్కడి ప్రజల జీవన స్థితిగతులను పరిశీలిస్తూ, తన రచనలలో అనంతర కాలంలో వాటిని వర్ణించాడు. 19 వ ఏటనే ఒక పత్రికకు సంపాదకత్వం వహించి, ఒక కవితా సంపుటిని వెలువరించాడు. 20 వ ఏట వివాహమైంది. 21 వ ఏట న్యాయవాదిగా నమోదయాడు.

శాసన సభ్యుడుగాను , పత్రికా సంపాదకుడుగాను ఆయన రాజకీయ, సాహిత్య వివాదాలలోకి దిగాడు. ఆయన ఎక్కువగా వ్రాయడమే గాక, అజాగ్రత్తగా రచించాడనే విమర్శ ఉంది. ఆయన రచనలో కథాకథన పద్ధతిలో హాస్యం చోటు చేసుకొంది. సిమ్స్ రచనలలో *పెలయో* (1938), *వాస్కొ న్సెలోస్* (1853), *ది యమస్సే* (1835) లు ఆయన కథాకథన నైపుణికి నిదర్శనాలుగా పేర్కొనవచ్చు. *ది పార్టిజాన్* (1835), *మెల్లిచాంపె* (1836), *ది కిన్స్‌మెన్* (1841), *కథెరిన్, వాల్టన్* (1851), *వుడ్ క్రాఫ్ట్* (1854) మొదలైన విప్లవాత్మక రచనలను కూడా సిమ్స్ వెలువరించాడు. *రిచర్డ్ హర్డిస్* (1838), *బార్డర్ బీగల్స్* (1840) వంటి కాల్పనిక రచనలు చేశాడు. 19 కవితా సంపుటాలు ఆయన ప్రచురించాడు.

చంద్ర

**సిలన్ పా, ఫ్రాన్స్ ఎమిల్ :** చూ. అనుబంధం.1

**సిలోనీ, ఇగ్నాజియో (1900-78) :** ప్రఖ్యాత ఇటలీ రచయిత. నవలాకారుడుగా, కథకుడుగా, రాజకీయ నాయకుడుగా పేరు పొందాడు. రెండవ ప్రపంచ యుద్ధం సమయంలో ఫాసిస్టుల ధోరణికి వ్యతిరేకంగా అతడు వ్రాసిన నవలలు ఎంతో ప్రభావం చూపాయి. ఈయన మారుపేరు 'సెకండో ట్రాక్విల్లి '. రైతు కుటుంబంలో జన్మించిన సిలోనీ 15 ఏళ్ల ప్రాయంలో ఉండగా, పెద్ద భూకంపం వచ్చి, తల్లి, ఇద్దరు సోదరులు మరణించారు. మిగిలిన ఇద్దరు సోదరులలో ఒకరిని ఫాసిస్టులు అక్రమంగా అరెస్టు చేసి, జైల్లో చంపి వేశారు. అది సిలోనీ మనస్సుపై తీవ్ర ప్రభావం చూపింది. ఎన్నో ఇబ్బందు లెదురైనా బెదరక ఆత్మవిశ్వాసంతో చదువు పూర్తి చేసి 1917 లో సోషలిస్టు గ్రూపులో చేరి వారి కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొన్నాడు. రోమన్ సోషలిస్టు ఆర్గన్ వారి *అవన్‌గార్డియా* (Avanguardia) అనే పత్రికలో అనేక వ్యాసాలు వ్రాశాడు. 1921 లో ఇటలీలో కమ్యూనిస్టు పార్టీ స్థాపించటంలో అతని కృషి ఉంది. 1922 లో ఆ పార్టీకి సంబంధించిన *ఇల్ లావొరేటర్* (The Worker) అనే పత్రికకు సంపాదకుడై కార్మికులను రెచ్చగొట్టే వార్తలు, ఇతర దేశాలలోని తిరుగుబాటుదారులు అవలంబించిన పద్ధతులను గూర్చి వ్రాయసాగాడు. దానితో ఫాసిస్టులు అతనికి దేశబహిష్కరణ శిక్ష విధించారు.

1930 లో అతడు స్విట్జర్లాండు వెళ్లి, అక్కడ తాను చేసిన పనులను విశ్లేషించు కొన్నాడు. తను చేసిన పనికి పశ్చాత్తాపపడి కమ్యూనిస్టు పార్టీకి తిలోదకాలు ఇచ్చి రచనా వ్యాసంగంపై దృష్టి మరల్చాడు.

తన కుటుంబాన్ని ఫాసిస్టుల బారినుండి తప్పించు కోటానికి సిలోనీ మారుపేరుతో రచనలు చేసి ప్రసిద్ధు డయాడు.



ముఖ్యంగా 1930 లో ప్రచురింపబడిన *ఫాంటామరా* (Fontamara) అనే నవల ప్రపంచ సాహిత్య చరిత్రలో సంచలనం సృష్టించింది. అది 14 అంతర్జాతీయ భాషలలోకి అనువదించబడింది. ఆ నవల దక్షిణ ఇటలీలో రైతుల ఇక్కట్లను కళ్ళకు కట్టినట్లు చిత్రిస్తుంది. 1937 లో వచ్చిన *పానెవినో* (Bread and wine), 1940 లో వచ్చిన *ఇల్ సెమె సాటో లా నెవె* (The Seed Beneath the Snow) అనే నవలలలో రైతుల బాధలను వర్ణించి, వారికి ఆత్మ విశ్వాసం కలిగిస్తూ సూచన లిచ్చాడు. 1938 లో అతడు రచించిన *లా స్కోలా డై డిట్టటోరి* (The School for Dictators) ఫాసిస్టుల గుండె లదిరేట్టు చేసింది.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం సిలోనీ ఇటలీ తిరిగి వచ్చి తన శేష జీవితాన్ని సాహిత్య సేవలో గడిపాడు. 1952 లో *ఊనా మన్సిటా డై మోర్* (A Handfulld of Blackberries- 1954), 1956 లో *ఇల్ సెగ్రిటో డై లూకా* (The Secret of Luca-

1958) అనే నవలలు వెలువరించాడు. ఇవి అతనికి రైతాంగం మీద ఉన్న ప్రేమను సూచిస్తాయి. 1965 లో రచించిన *ఉస్పీటా డై సీకూరేజా* (Emergency Exit-1968) లో తాను కమ్యూనిజం నుండి మారడానికి గల కారణాలు వివరించాడు. 1968 లో రచించిన *లావ్వెన్ మరా దూన్ పావెరో క్రిస్టియానో* ( The Story of a Humble Christian) అందరి ప్రశంసలను అందుకొంది.

పట్టాభిరామ్

**సిల్వా, హోసే అసన్సియో (1865-96) :** కొలంబియాదేశపుకవి. తన ఛందః ప్రయోగాలతో, స్పానిష్-అమెరికన్ (Spanish- American) కవిత్వ సంప్రదాయానికి వినూత్నమైన విషాద గేయ కావ్యరీతులను పరిచయం చేసినవాడు. ఈయన ఆత్మాశ్రయ కవిత్వం బహుళంగా అనుకరింపబడి, స్పానిష్ అమెరికన్ ఆధునిక కవితను ఎంతో ప్రభావితం చేసింది.

సున్నితమైన మనస్తత్వం వల్ల సిల్వా జీవితంలో ఎన్నో కష్టాలు ఎదుర్కొన్నాడు. గొప్పగా బ్రతికిన అతని కుటుంబం ఆర్థికంగా చితికిపోయింది. కష్టసుఖాలు చెప్పుకొని ఓదార్పు పొందే తన ఒక్కగానొక్క సోదరి 'ఎల్‌విరా' (Elvira) మరణించింది. పడవ ప్రమాదంలో తన రచనల వ్రాతప్రతులన్నింటినీ కోల్పోయాడు. ఇన్ని బాధలతో సిల్వా జీవితం గడిపాడు. ఉజ్జ్వల కవితామయ జీవనం గడిపిన సిల్వా, 30 యేళ్ళ వయస్సులో ఆత్మహత్యకు ఒడిగట్టాడు.. సిల్వా రచనలలో ముఖ్యమైనవి : *క్రెపూస్కూలోస్* (Twilights), *నాక్టూర్నోస్* (Nocturnes). ఆయన రచనలన్నీ కలిపి కవితా సంకలనం *ఒబ్రా కంప్లీట డి జోస్ ఎసనీ సిల్వా* 1956 లో ప్రచురింపబడింది.

చక్రపాణి

**సిసెరో, మార్కస్ టుల్లియస్ (క్రీ.పూ. 106-క్రీ.పూ.43) :** ప్రముఖ రోమన్ పండితుడు, న్యాయవాది, వక్త, రాజనీతి నిపుణుడు, సాహితీవేత్త. సాహితీ రంగంలో అపూర్వ ప్రయోగాలు చేసి, ఎన్నో గ్రంథాలు రచించి, తరువాతి తరం రచయితలకు సహాయపడినవాడు. సాహిత్యంలో ఈ నాటికీ సిసిరోనియన్ శైలి అనే ఒరవడి ప్రచారంలో ఉంది.

ఒక ధనిక కుటుంబంలో జన్మించిన సిసిరో విద్యాభ్యాసం గ్రీసు, రోమ్‌లలో జరిగింది. క్రీ.పూ. 89 లో 'పాంపియస్ స్ట్రాబో' వద్ద మిలిటరీ శిక్షణ పొందాడు. అనంతరం న్యాయవాద వృత్తి చేపట్టి పట్టుదలతో పరిశ్రమించి, అచిరకాలంలోనే అగ్ర న్యాయవాదుల కోవలోకి చేరుకొన్నాడు. అపారమైన మేధాశక్తి కలిగి ఉండటం వలన, అంచెలంచెలుగా ఉన్నత పదవులు చేపట్టి అత్యంత ప్రతిష్ఠాత్మకమైన విదేశీ రాయబారి పదవిని కూడా అలంకరించాడు. అతని కీర్తి చూసి ఓర్వలేక అసూయతో ఇతనిని హతమార్చాలని ప్రయత్నించిన వారిని తెలివిగా పట్టుకొని, కష్టపడి పనిచేస్తే ఎవరైనా ఆస్థితికి చేరుకోవచ్చునని ఉపదేశించాడు. కృషి, దీక్ష, పట్టుదల, పరిశ్రమ అతనిని అత్యున్నత స్థితికి తీసుకువెళ్ళాయి.

క్రీ.పూ 60 లో సీజరు సిసిరో గురించి తెలుసుకొని, తనతో చేతులు కలుపుమని కోరాడు. అయితే సిసిరో అందుకు అంగీకరించలేదు. కాని స్నేహం మాత్రం పెంచుకోసాగాడు. ఆ కాలంలో తన అనుభవాలను క్రీ.పూ. 55 లో *డి అరేటర్*, క్రీ.పూ. 54 లో *డి రిపబ్లికా*, క్రీ.పూ. 52 లో *డి లేజిబస్* (De legibus) అనే గ్రంథాలు రచించాడు. క్రీ.పూ. 51 లో పశ్చిమ ఆసియాలోని 'సైలీషియా' కు గవర్నరుగా నియమింపబడ్డాడు.

రాజకీయాలలో తలమున్కలయినప్పటికీ సిసిరో తన వ్యాసంగాన్ని ఏనాడూ విడిచి పెట్టలేదు. బహిరంగ రచనా ఉపన్యాసాలు, స్నేహితులకు లేఖలు వ్రాయడం ఇతర సాంస్కృతిక కార్యక్రమాలకు హాజరవుతూ ఉండటం అతని దినచర్యలో భాగాలు. అతడు చేసిన రచనలలో *బ్రూటస్, పారాడాక్సా, ఆపరేటర్, డి ఫినిబస్, టుస్కులానే డిస్‌ప్యుటేషన్స్, డి నేచురా డీరోమ్, డి ఆఫీసిస్* (De officis) లు బాగా ప్రాచుర్యం పొందాయి.

సిసిరో వివిధ సందర్భాలలో చేసిన ప్రసంగాలు సంకలన రూపంలో ఇరవై సంపుటాలకు పైగా వెలువడ్డాయి. అవి రాజకీయ నాయకులకు, న్యాయవాదులకు, ఇతర ఉపన్యాసకులకు ఎంతగానో ఉపయోగపడ్డాయి. అలాగే సిసిరో తన స్నేహితులకు వ్రాసిన లేఖలు కూడా 36 సంపుటాలుగా ప్రచురింపబడ్డాయి. అతని రచనలు 16 ప్రపంచ భాషలలోకి అనువదింపబడ్డాయి.

పట్టాభిరామ్

**సీజర్ (గైయస్) జూలియస్ (100-44) :** క్రీ.పూ. ప్రఖ్యాత రోమన్ రాజనీతిజ్ఞుడు. గాల్ (Gaul) ని జయించిన వీరుడు (క్రీ.పూ. 58-50). క్రీ.పూ. 49-4 లో జరిగిన సివిల్ యుద్ధంలో విజయపతాకాన్ని ఎగురవేసిన విజేత. రాజకీయ, సాంఘిక సంస్కరణలెన్నో ప్రవేశపెట్టి, వాటిని అమలుపరచటానికి తగిన చర్యలు తీసుకొన్న నిరంకుశుడిగా (క్రీ.పూ 46-44)

పేరు పొందాడు. దురదృష్ట వశాత్తు అతని సలహాదారులైన కొందరు మేధావులే అతనిని సంహరించారు.

రాజవంశంలో జన్మించిన సీజరు క్రీ.పూ. 84 లో 'కార్నీలియా' అనే స్త్రీని వివాహమాడాడు. (ఆమె క్రీ.పూ. 67 లో మరణించిందని చరిత్రకారుల భావన). రోమ్ నగరంలో సీజరు క్రీ.పూ. 78 వ సంవత్సరంలో న్యాయవాదవృత్తి చేపట్టి రాజకీయాలలో కూడా చురుకుగా పాల్గొనసాగాడు. అంచెలంచెలుగా ఉన్నత పదవులను చేపట్టి ప్రజలకు బాగా దగ్గ రయాడు. క్రీ.పూ. 61-60 లో 'ఫార్దర్ స్పెయిన్' (Farther Spain) కి గవర్నరుగా నియమింపబడ్డాడు. సీజరు, 'పాంపే', 'క్రాసస్' లతో కలసి మొట్టమొదటి సారిగా (క్రీ.పూ. 60లో) ముగ్గురు ప్రభువుల ప్రభుత్వం అనే ప్రక్రియను ప్రవేశపెట్టాడు. సీజరు క్రీ.పూ 59 లో విదేశ రాయబారిగా నియమింపబడ్డాడు. క్రీ.పూ. 58 నుండి 50 వరకు నిర్విరామంగా పోరాడి, చివరకు గాల్‌ని ఆక్రమించుకొన్నాడు. అయితే అనుకోకుండా, అధిష్ఠానవర్గం అయిన సెనేట్ ఆదేశాల మేరకు పదవినుండి క్రీ.పూ. 49 లో తప్పుకొన్నాడు. అనంతరం రూబికాన్ నది దాటి ఈజిప్టుకు చెందిన క్లియోపాత్ర సహాయంతో రోమన్ సివిల్ యుద్ధానికి నాంది పలికాడు. క్రీ.పూ. 49-45 మధ్య అనేక పర్యాయాలు దాడి జరిపి "నియంత" గా మారాడు. అయితే సెనేట్‌లో "గయాస్", "కేసియస్ లాంగినస్", "మార్కస్ జూనియస్ బ్రూటస్" లు కుట్రపన్ని ఒక పథకం వేసి సీజర్‌ని హతమార్చారు.

రాజకీయ, యుద్ధ రంగాలలో పేరు గాంచిన సీజరు అనేక గొప్ప రచనలు చేసి సాహిత్యవేత్తగా కూడా పేరు పొందాడు. ముఖ్యంగా గాలిక్ యుద్ధంపై క్రీ.పూ. 52-51 లో ఆయన రచించిన *కామెంటరీ డి బెల్లో గాల్లికో*, సివిల్ యుద్ధంపై 45 లో వ్రాసిన *కామెంటరీ డి బెల్లో సివిలీ* అనేరచనలు మిక్కిలి ప్రసిద్ధి పొందాయి.

పట్టాభిరామ్

**సూడెర్మన్, హెర్మన్ (1857-1928) :** జర్మనీ నేచురలిస్ట్ ఉద్యమం గురించి వ్రాసిన రచయితలలో అగ్రగణ్యుడు. సూడెర్మన్ రచయిత కావాలని అతని చిన్నతనంలో అనుకోలేదు. గొప్ప శాస్త్రజ్ఞుడు కావాలనుకొని, రసాయన శాస్త్రం అభ్యసించాడు. తరువాత కోనిన్‌బెర్గ్ యూనివర్సిటీలో కూడా శిక్షణ పొంది కొంతకాలం ఉపాధ్యాయుడుగా పనిచేశాడు. తన వద్ద చదువుకొంటున్న యువతీ యువకుల మానసిక ప్రవృత్తులను గమనించి, వారిని గురించి ఒక రచన చెయ్యాలని అనుకొనేవాడు. అదే అతనిని రచయితగా మార్చింది. కొంతకాలం పత్రికా విలేఖకుడుగా పనిచేసి, చివరకు నవలా రచయితగా స్థిరపడ్డాడు. పెరిగే పిల్లల మానసిక ప్రవృత్తిపై అతడు రచించిన *సోర్జ్* (1887- Dame Care 1891), అలాగే *డెర్‌కాట్ జెన్ స్టెగ్* (1889, Regina, 1894) అతనికి బాగా పేరు తెచ్చాయి.

నవలా రచయితగా ఎంత గుర్తింపు ఉందో, నాటక రచయితగా అంతకన్నా ఎక్కువ గుర్తింపు అతనికి లభించింది.



అతడు రచించిన *డైఈర్* (What Money cannot Buy, 1906) మొట్ట మొదటిసారి అంటే 1889 నవంబరు 27న బెర్లిన్‌లో ప్రదర్శింపబడినప్పటినుంచి, నేచురలిస్ట్ ఉద్యమం బలపడసాగింది. 1893 లో ప్రదర్శించిన *హేమట్* (Magda 1896) అనే నాటకం అతనికి అంతర్జాతీయ ఖ్యాతి నార్జించి పెట్టింది. ఒక గాయకురాలి దయనీయగాథ దీనిలోని ఇతివృత్తం.

ఒక సామాజిక సమస్యను విశ్లేషించి, దానిని పరిష్కరించే మార్గం సూచించటం అతని రచనలలో ఎక్కువగా కనబడుతుంది. అతని నాటకాలలో *గ్లక్ ఇమ్ వింకెల్* (1895 The Wale of Content-1915), *మోరిటూరి* (1896), *ఎస్ లె బెడాస్ లెబెన్* (The Joy of Living 1902), *డెర్ గు టె రఫ్* (1913- A Good Reputation 1915) ఆ కాలంలో ప్రదర్శింపబడి, ప్రేక్షకుల ప్రశంసలు విశేషంగా అందు కొన్నాయి. అయితే రాను రాను సమాజంలో వచ్చిన మార్పుల వలన కళాకారులు వాటిని ప్రదర్శించటం తగ్గించారు.

సూడెర్మన్ ఇతర రచనలలో *డాస్ హోపే లీడ్* (1908, The Song of Songs-1909) అనే నవల బాగా ప్రసిద్ధి పొందింది. ఒక పతిత జీవితం దీనిలోని ఇతివృత్తం. అలాగే తన చిన్ననాటి అనుభవాలను, పల్లెటూరి వాతావరణాన్ని ప్రతిబింబింపజేస్తూ చేసిన అనేక రచనలను *లిటా షెజెషి టెన్* (1917, The Excursion - to Tilsit-1930) అనే పేరుతో సంకలనం చేశాడు. తూర్పు ప్రష్యాలో తన అనుభవాలను *డాస్ బిల్డెర్ బచ్*

*మైనెజుగెండ్* (1922- The Book of My Youth) అనే రచన కూడా అతనికి మంచి పేరు తెచ్చింది.

పట్టాభిరామ్

**సెండార్, రామోన్ హోసే (1902-82) :** స్పెయిన్ నవలా రచయిత. ఈయన తన నవలలలో స్పెయిన్ చరిత్ర, సాంఘిక సమస్యలు, వైయక్తికమైన ఆత్మజ్ఞానాన్వేషణం, నైతిక సూత్రాలు మొదలైన వాటిని చిత్రించాడు.

సెండార్ తన విద్యాభ్యాసాన్ని మాడ్రిడ్ విశ్వవిద్యాలయంలో పూర్తిచేశాడు. తరువాత తన జీవితకాలమంతా ప్రజాస్వామ్య వాదిగా దేశాభివృద్ధికి కృషిచేశాడు. ఇతడు తన రాజకీయ కార్యకలాపాల వల్ల ఒకసారి చెరసాల పాలయాడు. క్రీ.శ 1920 లో ఇతడు మొరాకో (Morocco) లోని స్పెయిన్ సైన్యానికి తన సేవలను అందించాడు. తరువాత మాడ్రిడ్‌లోని ఎల్‌సోల్‌లో పనిచేశాడు.

సెండార్ తన మొట్టమొదటి నవల *ఇమన్* లో మొరాకో యుద్ధాన్ని తీవ్రంగా విమర్శించాడు. ఇతడు తన నవలలలో సాంఘిక న్యాయానికి ప్రముఖ స్థానాన్ని కల్పించాడు. *ఆర్డెన్ పబ్లికో* అనే నవలలో పోలీసుల క్రూర కృత్యాలను గురించి *సియేతే డొమింగోస్ రోజోస్* అనే నవలలో కార్మికుల అశాంతిని గురించి ప్రధానంగా చిత్రించాడు.

*మిస్టర్ విట్ ఎన్ ఎల్ కాంటన్* (Mr. Witt en el canton) అనే నవల సెండార్‌కు సాహిత్యానికి ఇచ్చే జాతీయ బహుమతిని సంపాదించి పెట్టింది. తద్వారా సాహిత్యంలో అతనికి ప్రముఖ స్థానం, ఖ్యాతి లభించాయి. ఈ నవలలో ముఖ్య పాత్రధారి 'మిస్టర్ విట్' అనే ఆంగ్లేయుడు. ఇతడు వేర్పాటు వాదుల, తిరుగుబాటుదారుల అభిరుచులకంటె, అభిలాషలకంటె వేరైన ఆలోచనల్ని కలవాడుగా సెండార్ చిత్రించాడు. ఈ నవల 1873 లో కార్టజేనా (Cartagena) లో జరిగిన తిరుగుబాటులు ఆధారంగా రచింపబడింది.

1936-39 మధ్య జరిగిన ప్రజాపోరాటాలు సెండార్ పై గాఢమైన ప్రభావాన్ని చూపాయి. ఇతడు ప్రజాస్వామ్య సైన్యంలో బాధ్యత గల అధికారిగా పనిచేశాడు. ఇతని భార్యను జాతీయ వాదులు హత్య చేశారు. ఇతడు తన యుద్ధ అనుభవాలను ఆధారంగా చేసుకొని *కాంట్రా అటాకే* (Contraataque) అనే నవలను రచించాడు. ఈ నవలా రచన ప్రధాన ఉద్దేశం ప్రజాస్వామ్య వాదులకు తగిన మద్దత్తును సంపాదించి పెట్టడమే.

సెండార్ తాను ప్రచురించిన నవలలను తిరుగ వ్రాసి, పునస్సమీక్షించి మళ్లీ ప్రచురించేవాడు. ప్రజా పోరాటంలో జాతీయ వాదులు విజయం సాధించారు. సెండార్‌కు దేశబహిష్కరణ శిక్ష విధిస్తే అతడు 1946 లో అమెరికా సంయుక్త రాష్ట్రాలు చేరి అక్కడి పౌరసత్వాన్ని స్వీకరించాడు.

1943-44 సంవత్సరాలలో సెండార్ 'మసాచుసెట్స్' లోని అంహెర్స్ట్ కళాశాలలోను, 1947 నుండి 63 వరకు న్యూమెక్సికో విశ్వవిద్యాలయంలోను, 1965 నుండి 73 వరకు దక్షిణ కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలోను స్పెయిన్ సాహిత్యాన్ని బోధించాడు.

సెండార్ రైతు జీవితాన్ని, యుద్ధ వాస్తవాలను ఆధారంగా చేసుకొని వ్రాసిన *మోజెన్ మిల్లన్* అనే నవల మొట్టమొదటిసారిగా మెక్సికోలో ప్రచురింపబడింది. ఈ నవల ప్రచురణ స్పెయిన్‌లో ఫ్రాంకో పరిపాలన కాలంలో నిషేధింపబడింది. 1960 నుండి సెండార్ రచనలు మళ్లీ స్పెయిన్‌లో ప్రచురింపబడడం మొదలైంది.

దాదాపు రెండు దశాబ్దాల వరకూ సెండార్ *క్రోనికా డెల్ ఆల్బా* అనే పేరుతో తొమ్మిది నవలలను వరుసగా ప్రచురించాడు. వీటిలో వ్యక్తికి, సమాజానికి కావలసిన అవసరాల విషయమై ఇద్దరి మధ్య ఉండే సంబంధాన్ని వెలికితీసి నిరూపించాడు. ఇతడు *ఇన్ లాస్ క్రియేచరస్ శాటర్నియేనస్* అనే గ్రంథంలో పౌరాణికమైన, మార్మికమైన అనేక విషయాలను పరిశోధించి ఆవిష్కరించాడు.

డి.మా.రా.

**సెనెకా, లూసియస్ అనేయస్ (క్రీ.పూ. 65):** రోమ్‌కి చెందిన గొప్ప రాజకీయ ధురంధరుడు, తత్త్వవేత్త, వక్త, నాటకకర్త, సమాజంలో పలుకుబడిగల వ్యక్తి, నీరో మహారాజుకి అత్యంత సన్నిహితుడు. ఈయన మరోపేరు "సెనెకా ది యంగర్".

సెనెకా తండ్రి "సెనెకా ది ఎల్డర్" రోమ్ లో ప్రముఖ వ్యక్తి. సాహిత్యం బోధించేవాడు. సెనెకాకు చిన్నతనం నుంచే తత్త్వ, న్యాయ, రాజకీయ శాస్త్రాలలో ఆసక్తి ఉండేది. అందువలన అవి అభ్యసించి, రోమ్ రాజకీయాలలో చురుకుగా పాల్గొనసాగాడు. అయితే అది చక్రవర్తికి నచ్చలేదు. అందుచేత లేనిపోని నేరాలు మోపి అతనిని దేశబహిష్కృతుని చేశాడు. కష్ట సుఖాలను సమదృష్టితో చూడగలిగే ఆత్మ విశ్వాసం గల సెనెకా అందుకు భయపడక 'కార్సికా' కు వెళ్ళి అక్కడ అనేక చక్కని రచనలు చేశాడు. అవి చదివి ఉత్తేజి

తురాలైన అతని భార్య 'అరిప్పినా' అతనిని తిరిగి దేశానికి పిలిపించింది. ఉన్నత పదవిని అధిష్ఠింపజేసింది. అంచె లంచెలుగా బాధ్యతలు పెంచుతూ, రాజమంది రంలో అతిముఖ్య పదవినిచ్చింది. 'అరిప్పినా' కుమారుడైన యువరాజు 'నీరో' కు విద్యాబుద్ధులు నేర్పించే బాధ్యత కూడా అతనికే అప్పగించింది. కోట్లకు పడగలెత్తిన 'పాంపియా పౌలినా' అనే అమ్మాయిని పెళ్ళి చేసుకొని తిరిగి రోమ్‌లో స్థిరపడ్డాడు.

క్రీ.పూ. 54 వ సంవత్సరంలో చక్రవర్తిని శత్రువులు హత్య చేయటంతో సెనెకా బాధ్యత మరీ పెరిగింది. శత్రువులు దండెత్తేలోగా యువరాజును, చక్రవర్తిగా ప్రకటించి పరిపాలన క్రమబద్ధం చేశాడు. అనేక ఆర్థిక, సాంఘిక సంస్కరణలు చేసి స్వచ్ఛమైన పాలనను అందించటానికి తోడ్పడ్డాడు. విరామ సమయాలలో రచనలు చేసేవాడు.

క్రీ.శ. 62 వ సంవత్సరంలో పదవీ విరమణ చేసి, శేష జీవితాన్ని సాహిత్య రంగానికి అంకితం చేశాడు. అయితే 65 వ సంవత్సరంలో శత్రువులు అతనిని ముట్టడించి, బలవంతంగా విషం తాగించి, ఆత్మహత్య చేసుకునేలా చేశారు.

బాగా ప్రచారం పొందిన అతని రచనలలో *అపోకాలో సింటోసిస్ దివి క్లాడి* (The pumpkinification of the Divine Claudius) లో హాస్యం, తత్త్వం, జీవన సారం, సుఖ దుఃఖాలు సమపాళ్లలో రంగరించి, చక్కని పాత్రలు సృష్టించాడు. అతడు రచించిన 10 ట్రాజెడీలు యూరప్ ఖండమంతటా ప్రదర్శింపబడ్డాయి. ఆ విషాదాంత నాటకాల్లోని కొన్ని సంఘటనలు తరువాతి తరం రచయిత లైన షేక్స్‌పియర్, జాన్ వెబ్‌స్టర్, సిరిల్ టార్నర్‌లపై ప్రభావం చూపాయి.

సెనెకా జీవితం ఆదర్శప్రాయమైంది. రాజ బహిష్కరణ కు గురిఅయి కష్టాలను అనుభవించినపుడు ఎలా ఉన్నాడో, రాజగురువుగా భోగభాగ్యాలు అనుభవించినపుడూ అలాగే ఉన్నాడు. సుఖ దుఃఖాలను ఒకే విధంగా స్వీకరించిన మహా తత్త్వవేత్త సెనెకా.

పట్టాభిరామ్

**సెయింట్ బ్యూవే, ఛార్లెస్ ఆగస్టీన్ (1804-1869) :** ఫ్రెంచ్ సాహిత్య చరిత్ర రచయిత; సాహిత్య విమర్శకుడు. చారిత్రక ఘటనలను సమకాలిక రచనలకు అన్వయించినవాడు. పునరుజ్జీవన యుగం నాటి నుంచి 19 వ శతాబ్ది వరకు వచ్చిన ఫ్రెంచ్ సాహిత్యాన్ని గూర్చి ఆయన చేసిన రచన వివరాలతో కూడిన సమగ్రమైన ప్రామాణికమైన రచనగా భావింప బడుతూంది.

ఒక టాక్స్ కలెక్టర్‌కు మరణానంతరం జన్మించిన ఏకైక పుత్రుడు సెయింట్ బ్యూవే. పారిస్‌లోనే సాహిత్యాధ్యయనం చేసి ఒక సంవత్సరం వైద్య విద్యను అభ్యసించిన తరువాత దానిని వదలి, పారిస్ విశ్వవిద్యాలయంలో సాధారణ విద్యాభ్యాసం కొనసాగించాడు. 1825 లో తన వెనుకటి ఉపాధ్యాయుడు పాల్ డ్యుబాయ్ *లే గ్లోబ్* అనే క్రొత్త పత్రికను స్థాపించి సెయింట్ బ్యూవేను పత్రికా రచనా రంగంలో ప్రవేశ పెట్టాడు. ఆ పత్రికలోనే విక్టర్ హ్యూగో కవితలను గూర్చి తన తొలి వ్యాసాలను అతడు రచించాడు. కాల్పనిక కవుల సంఘంలో సభ్యు డయాడు. అతని తొలి రచన *హిస్టారికల్ అండ్ క్రిటికల్ డిస్క్రిప్షన్ ఆఫ్ ఫ్రెంచ్ పొయెట్రీ అండ్ థియేటర్ ఇన్ ది సిక్స్టీన్త్ సెంచరీ* (1828).

1828 లో కొద్ది కాలం ఇంగ్లండు సందర్శించి రావడంతో వర్డ్స్‌వర్త్, కోలెరిడ్జ్‌ల కవితల పట్ల అతని అభిరుచి పెంపొందింది. అప్పటికి వారిరువురిని గూర్చి యూరప్ ఖండంలో ఎక్కువగా తెలియదు. ఆయన ఇంగ్లండ్ సందర్శనం వలననే సెయింట్ బ్యూవే కవితలో విలియమ్ కౌపర్, జార్జ్ క్రాబ్‌ల శైలుల ప్రభావం ఎక్కువగా కనిపించడం కూడా జరిగింది.

1830-40 మధ్య సమకాలిక రచయితలను గూర్చి సెయించ్ బ్యూవే *పోర్ట్రెయిట్స్* (పదచిత్రాల) లో ఆ రచయితల మనోవైఖరులను చిత్రించే ఒక నూతన విధానాన్ని ప్రదర్శించాడు.

1832 లో సెయింట్ బ్యూవే పారిస్‌లోని సాహిత్య పత్రిక లన్నింటిలోనూ రచనలు చేస్తూ ఉండే వాడు. అయితే క్రొత్తగా ఏర్పడిన కింగ్ లూయీ ఫిలిప్ హయాము ఆయనకు ఆగ్రహం కలిగించింది. అందుచేతనే విద్యా సంబంధమైన అనేక పదవులను ఆయన నిరాకరించాడు. వాటిని అంగీకరించి ఉంటే ఆయనకు దారిద్ర్యబాధ కొంత తగ్గి ఉండేది. అయినా తన స్వాతంత్ర్యంతో ఆయన రాజీ పడ దలచుకోలేదు.

1834 లో *వోల్ప్టే* అనే ఒక నవలను కూడా బ్యూవే ప్రచురించాడు. దానిలో నిరాశ, అపరాధి భావం, ఆధ్యాత్మిక సాధన, వైరాగ్య భావం ప్రకటితం అయాయి. సాహిత్యరంగంలోనే కాక రాజకీయ రంగంలో కూడా సెయింట్ బ్యూవే తన స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకొన్నాడు. 1865 లో సెయింట్ బ్యూవే సెనేటర్‌గా చేయబడినా ఎగువ సభలో ఆయన ఎక్కువగా పాల్గొనినట్లు కనిపించదు.

1869 అక్టోబరు 13 న మూత్రకోశంలోని రాయిని ఆపరేషన్ చేసి తీయడంకోసం ప్రయత్నించగా, ఆ ఆపరేషన్ విఫలమై పారిస్‌లో సెయింట్ బ్యూవే మరణించాడు.

డి.మా.రా.

**సెయింట్స్‌బరీ, జార్జ్ (1845-1933) :** ఆంగ్ల రచయిత. సహజమయిన శైలితో విజ్ఞాన యుతమైన రచనలు వెలువరించి 20 వ శతాబ్దంలో ఆంగ్ల సాహిత్య విమర్శకులలో ప్రముఖ స్థానాన్ని ఆక్రమించినవాడు.

1868 లో ఎమ్.ఏ చదవడానికి ఆక్స్‌ఫర్డ్‌లోని మెర్టన్ కాలేజ్‌లో ఉపకారవేతనం దొరకనందుకు నిరుత్సాహం చెంది, ఒక దశాబ్దంపాటు సెయింట్స్ బరీ ఉపాధ్యాయుడుగా పనిచేశాడు. అదే సమయంలో ఫ్రెంచ్ సాహిత్యాధ్యయనం చేస్తూ *అకాడమీ* అనే పత్రికకు సమీక్షలు పంపడం మొదలు పెట్టాడు. 1875 లో *ఫోర్ట్ నైట్లీ రివ్యూ* పత్రికలో బోద్లేర్ మీద వ్రాసిన వ్యాసం సాహిత్య ప్రపంచంలో సంచలనం కలిగించింది. 1876 లో బోధనకు స్వస్తి చెప్పి రచనకే జీవితాన్ని అంకితం చేశాడు. *ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా* (9వ ముద్రణలో) 35 జీవిత చరిత్రలను, ఫ్రెంచి సాహిత్యంపై ప్రధాన వ్యాసాన్ని రచించాడు. *ప్రీమియర్ ఆఫ్ ఫ్రెంచ్ లిటరేచర్* (1880), *ఏ షార్ట్ హిస్టరీ ఆప్ ఫ్రెంచ్ లిటరేచర్* (1882), *స్పెసిమెన్స్ ఆఫ్ ఫ్రెంచ్ లిటరేటర్ ఫ్రమ్ మిలాన్ టు హ్యూగో* (1883) బహుళ జనాదరణ పొందాయి. 1881 లో డ్రైడెన్ మీద *ఇంగ్లీష్ మెన్ ఆఫ్ లెటర్ సీరిస్* రచించి ఆంగ్ల సాహిత్యంలో కాలు నిలదొక్కుకొని, తరువాత *స్పెసిమెన్స్ ఆఫ్ ఇంగ్లీష్ ప్రోజ్ స్టయిల్ ఫ్రమ్ మలోరీ టు మెకాలే* (1885), *ఏ హిస్టరీ ఆఫ్ ఎలిజబేతియన్ లిటరేచర్* (1887) అనే గ్రంథాలను రచించాడు.

1895 లో ఎడింబరో విశ్వవిద్యాలయంలో ఆంగ్ల సాహిత్య, అలంకార శాస్త్రాలకు సంబంధించిన రేగస్ స్థానానికి ఆచార్యులుగా నియుక్తు డయాడు. ఆ కాలంలోనే *ఏ షార్ట్ హిస్టరీ ఆఫ్ ఇంగ్లీష్ లిటరేచర్* (1898), *ఏ హిస్టరీ ఆఫ్ క్రిటిసిజమ్ ఎండ్ లిటరరీ టేస్ట్ ఇన్ యూరప్, ఫ్రమ్ ది ఎర్లియెస్ట్ టెక్స్ట్ టు ది ప్రెజెంట్ డే* (మూడు సంపుటాలు 1900-04), *హిస్టరీ ఆఫ్ ఇంగ్లీష్ ప్రాసడీ ఫ్రమ్ ది ట్వెల్త్ వ సెంచరీ టు ది ప్రెజెంట్ డే* (మూడు సంపుటాలు -1906-10) దీనికి అనుబంధంగా *హిస్టారికల్ మాన్యూవల్ ఆఫ్ ఇంగ్లీష్ ప్రాసడీ* (1910), *హిస్టరీ ఆఫ్ ఇంగ్లీష్ ప్రోజ్ రిథమ్* (1912) అనే గ్రంథాలను రచించి, ఆచార్య పదవినుండి (1915) విరమించాడు.

తరువాతి కాలంలోనూ *ది పీస్ ఆఫ్ ది అగస్టియన్స్, ఏ సర్వే ఆఫ్ ఎయిటీంత్ సెంచరీ లిటరేచర్ ఏజ్ ఏ ప్లేస్ ఆఫ్ రెస్ట్ ఎండ్ రిఫ్రెష్‌మెంట్* (1916) అన్న గ్రంథాన్ని రచించాడు. మధువుపై *నోట్స్ ఆన్ ఏ సెల్లార్ బుక్* (1920) రచించి సెయింట్స్‌బరీ క్లబ్ ప్రతిష్ఠాపనకు కారణం అయాడు. డ్రైడెన్, షాడ్వెల్ నాటకాలను ఉద్ధరించేందుకు ఉపయోగపడిన *మైనర్ పొయెట్స్ ఆఫ్ ది కరోలీన్ పీరియడ్* (మూడు సంపుటాలు 1912) లో 17 వ శతాబ్ది కవిత్వాన్ని వివరించే ప్రయత్నం చేశాడు.

గు.శం.

**సెర్వాంటిస్, సావెద్రా మిజయెల్ డి (1547-1616) :** శ్పానిష్ సాహిత్యంలో *డాన్ క్విక్సోట్* (1605) అనే జగత్ ప్రసిద్ధమైన నవలను సృష్టించిన రచయిత, నాటక కారుడు. సాహిత్య చరిత్రలో చిరస్మరణీయుడు.

మాడ్రిడ్‌లో చదువు ముగించుకొని ఇటలీ వెళ్ళి, సిపాయిగా మారి *లాపాంటో* (1571) సముద్ర యుద్ధంలో పాల్గొని ఎడమ చేయి పోగొట్టుకొన్నాడు. టర్క్‌ల బందీగా అయిదేళ్లు ఉండి, 1580 లో స్పెయిన్‌కి తిరిగి వచ్చి *లా గాలాటియా* అన్న ప్రబోధాత్మక నవలను 1585 లో వెలువరించాడు. *ఎల్ ట్రాటో దె ఆర్జెల్, లా న్యూమాన్షియా* (1587) వంటి ఎన్నో నాటకాలు వ్రాశాడు. కొద్ది కాలం ప్రభుత్వ సర్వీసులో దిగువస్థాయిలో గడపాడు. సాహిత్య జీవితమూ అంధకారంలోనే గడిచింది. 1605 లో వెలువడిన *డాన్ క్విక్సోట్* అనుకోని విజయం సాధించి పెట్టింది. తరువాత 12 చిన్న కథలు, *నోవెలాస్ ఎయెంప్లారెస్* (1613), *వియాజె దెల్ పర్నాసో* (1614), *ఒకో కమెడియాస్ యికో ఎంత్రెమెసెస్ నూవోస్* (హాస్య రచనలు 1615), *డాన్ క్విక్సోట్* రెండవ భాగం (1615) వెలువరించాడు. మరణానంతరం సెర్వాంటిస్ రచించిన *లాస్ ట్రాబాయోస్ దె పెర్సిలీస్ యిసిగిస్ముండా* అనబడే *హిస్టారియా సెటింట్రియోనెల్* (1617) వెలువడింది.

గు.శం.

**సెర్వీస్, రాబర్ట్ విలియమ్ (1874-1958) :** కెనడా దేశపు వీరగాథా రచయిత. *'ఫ్రొజెన్ నార్త్'* ను గురించి *ది షూటింగ్ ఆఫ్ డాన్ మాక్ గ్రా* వంటి

వినోద గేయ గాథలను రచించి 'కెనేడియన్ కిప్లింగ్' గా ప్రసిద్ధుడైన వాడు.

కెనడాకు 1894 లో వలస వచ్చి, యూకాన్ లో 8 ఏళ్లపాటు విక్టోరియా బి.సి.కి. కెనేడియన్ బాంక్ ఆఫ్ కామర్స్‌లో పనిచేశాడు. 1912-13 లో బాల్కన్ యుద్ధ సమయంలో టోరంటోలోని స్టార్ పత్రికకు విలేఖకుడు గాను, మొదటి ప్రపంచ యుద్ధకాలంలో అంబులెన్స్ డ్రైవర్ గాను పనిచేశాడు.

సెర్విస్ రచించిన *సాంగ్స్ ఆఫ్ ఏ సోర్ డఫ్* (1907) *బేలాడ్స్ ఆఫ్ ఏ చెచ్కా* (1909) అనే గేయాలలో ఉత్తర కెనడా జీవనం ప్రతిబింబించి అవి అధికంగా ప్రజాదరణ పొందాయి. తరువాతి కాలంలో *రైమ్స్ ఆఫ్ ఏ రెడ్ క్రాస్ మాన్* (1916), *బార్ రూం బాడ్స్* (1940) అనే గేయ సంపుటాలను వెలువరించాడు. 1910 లో *ది ట్రెయిల్ ఆఫ్ 98* అనే నవల రచించి క్లోండికెలోని జీవన స్థితి గతులను వివరించాడు. *ప్లోమాన్ ఆఫ్ ది మూన్* (1945), *హార్బర్ ఆఫ్ హెవెన్* (1948) వంటి జీవిత చరిత్రలను కూడా సెర్విస్ రచించాడు. 1912 నుంచీ వద్ద యూరోప్‌లోనే, ముఖ్యంగా ఫ్రెంచ్ రివేరాలో ఉండిపోయాడు.

*గు.శం.*

**సేడ్, మార్క్విస్ డి (1740-1814) :** ప్రముఖ ఫ్రెంచ్ రచయిత. ఇంగ్లీషులో 'శాడిజమ్' అనే మాట ఏర్పడడానికి కారణభూతు డైనవాడు. డీ సేడ్ వ్రాసిన నవలలలో మిక్కిలి ప్రసిద్ధమైంది: *లెస్ ఇన్ ఫార్ట్యూన్స్ డి లా వెర్ట్* (1787 -The Adversities of Virtue). దీని తరువాత కథల సంపుటి *లెస్ క్రైమ్స్ డి లామర్* (1788-Crimes of Passion), *జస్టిన్* (1791), *జూలియెట్* (1798) అనే గ్రంథాలు కూడా సేడ్ రచించాడు.

'కోండే' రాచవంశంలో సేడ్ జన్మించాడు. ఈయన పూర్వీకుడైన 'లారే డీ నోవెస్' మీద 14 వ శతాబ్దినాటి ప్రముఖ ఇటాలియన్ కవి పెట్రార్క్ అజరామరమైన ఒక కావ్యం రచించాడు. మార్క్విస్ డీ సేడ్ 'కోండే' రాజ ప్రాసాదంలో జన్మించినప్పుడు అతని తండ్రి ఎలెక్టర్ ఆఫ్ కొలోన్ ఆస్థానానికి రాజదూతగా వెళ్లి ఉన్నాడు. అతని తల్లి మేరీ ఎలియనోర్ మైలీ డీ కార్మర్ 'కోండే' రాకుమార్తెకు, 'ప్రియసఖి' (Lady-in-Waiting) గా ఉండేది. సేడ్ విశాలమైన జాగీర్లను వారసత్వంగా పొందాడు.

ఆరంభంలో కొన్నాళ్లు పినతండ్రి *ఆబే డీ సేడ్* వద్ద చదివి, అనంతరం పారిస్‌లోని *లైసీ లూయీ లే గ్రాండ్* లో సేడ్ విద్యాభ్యాసం చేశాడు. 1754 లో సైన్యంలో చేరాడు. ఏడు సంవత్సరాల యుద్ధం పూర్తికాగానే 1763 లో అతడు సైన్యం నుండి విడుదల పొందాడు. ఆ ఏడాదే ఒక సంపన్నుని కుమార్తె *మాంట్రెయిల్స్‌*ను వివాహమాడాడు. ఆమె వలన సేడ్‌కు ఇద్దరు కుమారులూ, ఒక కుమార్తె కలిగారు. వివాహమైన క్రొత్తలోనే *లా బ్యూ వాయిసిన్* అనే ఒక నటితో అతడు ప్రణయ కలాపం సాగించాడు. ఆర్క్యుయిల్‌లోని తన ఇంటికి సేడ్ వేశ్యలను పిలిపించి లైంగికంగా వారిని పలు విధాలుగా హింసించేవాడు. ఆ నేరానికి రాజుగారి ఆదేశం మీద అతనిని 'విన్సెన్నెస్' దుర్గంలో బంధించారు. కొన్ని వారాల అనంతరం విడుదలైన తరువాత కూడా తిరిగి వ్యభిచారం కొనసాగించి అతడు అప్పుల పాలయాడు. 1768 లో రోజ్ కెల్లర్ 'అపవాదు' (Scandal) ప్రచారంలోకి వచ్చింది.

ఒక ఈస్టర్ ఆదివారంనాడు పారిస్‌లో అతడు కలుసుకొన్న యౌవనంలో ఉన్న వేశ్య రోజ్ కెల్లర్. అతడు ఆమెను అర్క్యుయిల్‌లోని తన ఇంటికి తీసికొనిపోయి బంధించి లైంగికంగా అనేక హింసల పాలు చేశాడు. ఆమె ఎలాగో నిర్బంధం నుంచి తప్పించుకొని అతడు పెట్టిన హింసలను గూర్చి అందరికీ చెప్పి, అతడు చేసిన గాయాలు అందరికీ చూపించింది. వెంటనే సేడ్‌ను లియాన్ సమీపంలోని పీరే ఎన్‌సైజ్ దుర్గంలో తిరిగి బంధించారు. అక్కడి నుంచి విడుదలైన తరువాత కూడా సేడ్ పరిసరాలలోని బాల బాలికలను లైంగికంగా హింసించి ఆనందించే ప్రవృత్తిని విడనాడక పోవడంతో అనేక సార్లు జైలు పాలయాడు. జైలులో ఉండగా తన నైరాశ్యంనుంచీ, ఆగ్రహం నుంచీ తప్పించుకోడం కోసం 1782 లో *డైలాగ్స్ బిట్వీన్ ఏ ప్రీస్ట్ అండ్ ఏ డైయింగ్ మాన్* రచించాడు. దానిలో తాను నాస్తికుడ నని సేడ్ ప్రకటించుకొన్నాడు. తన లాయర్‌కీ, భార్యకీ అతడు వ్రాసిన ఉత్తరాలలో చురుకైన హాస్యం, తిరుగుబాటు ధోరణీ కనిపిస్తాయి. 1784 లో పారిస్‌లోని బాస్టిలీ దుర్గానికి మార్చిన తరువాత 39 అడుగుల పొడవున్న ఒక కాగితం చుట్టమీద *వన్ హండ్రెడ్ అండ్ ట్వెంటీ డేస్ ఆఫ్ సోడమ్* అనే గ్రంథం రచించాడు. దానిలో వేరు వేరు రకాల లైంగిక హింసలను అతడు వర్ణించాడు. 1787 లో అతని సుప్రసిద్ధ రచన *లెస్ ఇన్ ఫార్ట్యూన్స్ డీ లా వెర్ట్* వ్రాసిన తరువాత 1788 లో కొన్ని నవలికలూ, కథలూ వ్రాశాడు. అవే అనంతర కాలంలో *లెస్ క్రైమ్స్ డీ లామర్* అనే గ్రంథంగా వెలువడ్డాయి.

ఫ్రెంచ్ విప్లవ కారులు 1789 జూలై 14 న బాస్టిలీ

దుర్గాన్ని ముట్టడించినపుడు సేడ్ ఒక కిటికీలో నుంచి "ఇక్కడ వీళ్లు ఖైదీలను చిత్రహింస పెడుతున్నారు. మీరు వచ్చి వీళ్లను రక్షించండి" అని అరచాడు. తరువాత అతనిని ఛారెంటన్ పిచ్చి ఆసుపత్రికి తరలించారు. 1790 ఏప్రిల్ 2 వరకు అత డక్కడ ఉన్నాడు.

విడుదలైన తరువాత సేడ్ కామెడీ, ఫ్రాన్సాయిస్ మొదలైన నాటక సంఘాలకు అనేక నాటకాలను వ్రాసి ఇచ్చాడు. వాటిలో అయిదు మాత్రం వారు అంగీకరించారు. అయితే అవి కూడా అన్నీ ప్రదర్శింపబడలేదు. భార్యకు దూరంగా యౌవనంలో ఉన్న ఒక నటితో జీవిస్తూ సేడ్ *జస్టీన్, జూలియెట్* అనే నవలలను రచించాడు. 1792 లో పారిస్‌లోని 'లెస్ పిక్స్' యొక్క విప్లవాత్మక శాఖకు కార్యదర్శి అయి, పారిస్‌లోని ఆసుపత్రులను సందర్శించే డెలిగేషన్‌లో సభ్యుడై, దేశభక్తి పూరితమైన అనేక ప్రసంగాలు వ్రాశాడు. అదృష్టవశాత్తు విప్లవ వర్గ నాయకుడైన రాబెస్ పియెరే అధికారచ్యుతుడు కావడానికి ఒక రోజు ముందు సేడ్ ఉరిశిక్షను తప్పించుకొన్నాడు.

1801 మార్చి 6 న మళ్లీ సేడ్‌ను అరెస్ట్ చేసి ఛారెన్‌టన్ జైలుకు పంపారు. అక్కడ కూడా అనేక అపవాదులకు (Sandals) కు అతడు గురి అయాడు. సేడ్ ప్రార్థనలను నెపోలియన్ పట్టించుకోక అతనిని నిర్బంధంలోనే ఉంచాడు. ఛారెన్‌టన్ జైలులోనే కొంత మంది ఖైదీలు నటులుగా తన నాటకాలను సేడ్ ప్రదర్శింపచేశాడు. పది సంపుటాలలో తాను వ్రాయతలపెట్టిన బృహత్ నవలలో రెండు సంపుటాలు మాత్రం ఆతడు పూర్తి చేశాడు. ఆ నవల పేరు *ది డేస్ ఆఫ్ ఫ్లోర్ బెల్* లేక *నేచర్ అన్ వీల్డ్*. సేడ్ చనిపోయిన తరువాత అతని పెద్దకుమారుడు ఆ రచనలను, తండ్రి తాలూకు ఇతర వ్రాత ప్రతులను తగులబెట్టించాడు.

సేడ్ చిత్రపటం ఏదీ మిగులలేదు. 1806 లో తాను వ్రాసుకొన్న వీలునామాలో సేడ్ "తన సమాధి తాలూకు ఛాయలు ఏవీ ఈ భూమిమీద మిగిలి ఉండ కూడదు మానవుల మనస్సుల నుండి నా స్మృతులు చెరిపివేయబడతా యని నేను ఆశపడుతున్నాను" అని ప్రకటించాడు.

బొ.శ్రీ.

**సేల, కమీలో హోసే** : చూ. అనుబంధం.

**సైఫర్ట్, యారోశ్లావ్ (1901--)** : జెకోస్లవేకియా దేశపు కవి, పత్రికా రచయిత. 1984 లో సాహిత్యానికి నోబెల్ బహుమతి అందుకొన్న మొట్టమొదటి జెకొస్లవేకియన్ రచయిత. 1950 వరకూ పత్రికా రచయితగానే సైఫర్ట్ జీవితం గడిపాడు. అయితే, 1920 లోనే ఆయన మొదటి కవితా సంకలనం *మెస్టో వీ శ్లాక్* (City in Tears) ప్రచురించ బడింది. ఈయన తొలి కవితలు 'కార్మిక వర్గ' (Prolitarian) కవితలు. యువకుడుగా సోవియెట్ యూనియన్‌లోని కమ్యూనిజం భవిష్యత్తును గురించి అతడు కన్న కలలు ఆ కవితలలో ప్రతిఫలించాయి. కాని కాలక్రమేణ సైఫర్ట్‌లో ఒక పరిణతి ఏర్పడి, కమ్యూనిస్ట్ ప్రభుత్వ విధానం మీద వ్యామోహం తగ్గింది. ఆయన శైలిలో పరిణతి ఏర్పడింది. *నా వినాక్ టి.ఎస్.ఎఫ్.* (1925, Wireless waves), *శ్లావిక్ జ్పివా స్ప్రాత్నే* (1926, The Nightingale Sings Wrong) అనే కవితా సంపుటాలలో భావ కవితా ధోరణి, విశుద్ధ కవిత లక్షణం ఎక్కువగా కనిపించాయి. 1929 లో సైఫర్ట్ కమ్యూనిస్ట్ పార్టీ నుండి విడిపోయాడు

తన దేశంలో జరిగిన సంఘటనలూ, తన దేశ స్వభావమే సైఫర్ట్‌కు కవితా వస్తువులు. *ఝూస్నెట్ స్వెట్లా* (1938, Switch off the Lights) అనే కవితా సంపుటిలో జెకొస్లవేకియాలోని కొంత భాగాన్ని జర్మనీకి ధారాదత్తం చేసిన మ్యూనిక్ ఒడంబడికను గూర్చి సైఫర్ట్ వ్రాశాడు. *స్వెట్లానా ఒడేనా* (1940, Clothel in Light) అనే కవితా సంపుటికి 'ప్రేగ్' నగరం ఇతివృత్తం. *ప్రిల్బా హ్లినీ* (1845, The Helmet of Clay) అనే కవితా సంపుటి ప్రేగ్‌లోని 1945 నాటి తిరుగుబాటును వర్ణించేది. మొత్తం 30 కవితా సంపుటాలను ప్రచురించడంతో పాటు సైఫర్ట్ వివిధ పత్రికలకు వ్యాసాలు కూడా వ్రాశాడు; పిల్లలకు పుస్తకాలు వ్రాశాడు. 1966 లో సైఫర్ట్‌ను జాతీయ కవి (Poet of the Nation) గా ప్రకటించారు. 1968 లో జెకొస్లవేకియా మీద సోవియెట్ దండయాత్రను నిరసించి నందుకు ఫలితంగా మౌనం వహింపవలసి వచ్చిన రచయితలలో ఆయన ఒకరు. జెక్ భాషలో సైఫర్ట్ రచించిన *నా స్మృతులు* అనే గ్రంథం 1881 లో ప్రకటించబడింది.

బొ.శ్రీ.

**సైమన్, క్లాడ్ (యూజీన్ హెన్రీ) (1913--)** : ఫ్రెంచ్ రచయిత. ఫ్రాన్స్‌లో 1950-60 మధ్య చెలరేగిన *నావో రోమన్* ('క్రొత్త నవల') ఉద్యమానికి ప్రాతినిధ్యం వహించిన ప్రముఖ రచయిత. విశాలమైన అతని చారిత్రక దృక్పథానికీ, మౌలికమైన రచనా శిల్పాలకూ ప్రశంస లందుకొన్నవాడు. పారిస్, ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జ్‌లలో విద్యాభ్యాసం చేసి, విస్తృతంగా దేశ పర్యటన కొన

సాగించి, ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో సైన్యంలో చేరి పోరాడి, అనంతరం దక్షిణ ఫ్రాన్స్‌దేశంలో ద్రాక్ష తోటలు పెంచుతూ కాలం గడుపుతున్నాడు.

*లే వెంట్* (1957,The Wind, 1959) లో తన కవితా లక్ష్యాలను సైమన్ ఈవిధంగా పేర్కొన్నాడు: 1. తన కాలం నాటి ముక్కలు ముక్కలుగా చూసే ప్రవృత్తిని సవాలు చేయడం, 2. సమకాలీన చరిత్రలో ఉపద్రవాలను ఎదుర్కొని నిలచిన జనుల, వస్తువుల నిత్యత్వాన్ని తిరిగి ఆవిష్కరించడం. *లే కార్డే రైడే* (1947, The Tant Rope), *లే శ్యాకే డ్యు ప్రిన్ టెంప్స్* (1954, The Crowning of Spring) అనే రచనలలో శ్పానిష్ అంతర్యుద్ధం నాటి కల్లోలాన్ని వర్ణించాడు. అలాగే *లే ట్రిచూర్* (1945, The Trickster) లో 1940 నాటి ఫ్రాన్స్ పతనాన్ని వర్ణించాడు. *ఎల్ హెర్బె* (1958, The Grass, 1960), *లా రౌట్ డెస్ ఫ్లాండర్స్* (1960, The Flanders road, 1961), *లా పాలేస్* (1962, The palace), (1963) *హిస్టాయిర్* (1967, History, 1968) అనే నాల్గు నవలల పరంపరలో పాత్రలూ, సంఘటనలూ పునరావృత్తం అవుతాయి. చాలామంది విమర్శకుల దృష్టిలో ఈ నాలుగు నవలలూ, ముఖ్యంగా *లా రౌట్ డెస్ ఫ్లాండర్స్* సైమన్ రచన లన్నిటిలోకి మిక్కిలి ప్రశస్త మైనది. తరువాత కూడా 1973 వరకూ మరి అయిదు నవలలను క్లాడ్ సైమన్ రచించాడు.



సైమన్ శైలిలో కథన విధానం, చైతన్య స్రవంతి విధానం కలగలసి కనిపిస్తాయి. ఎక్కడా విరామ చిహ్నాలు ఉండవు. 1,000 మాటలతో కూడిన సుదీర్ఘ వాక్యాలు ఉంటాయి. అలాంటి పద సముదాయాల ద్వారా జీవన ప్రగతిని అందుకోవాలని సైమన్ ప్రయత్నించాడు. ఆయన నవలలలో ఒక క్రమ పద్ధతి లేకుండా పూర్తి అరాజకత కనిపించినా, అవి పఠన యోగ్యాలుగానే ఉంటాయి.

బ్రా.శ్రీ.

**సోఫోక్లీస్ (క్రీ.పూ. 496-406) :** గ్రీస్ దేశపు ట్రాజెడీ నాటక మహా రచయితలు ముగ్గురిలో ఒకడు. ఆయన మొత్తం 123 నాటకాలు వ్రాసినా 7 మాత్రమే ఇప్పుడు మనకు లభిస్తున్నాయి. సోఫోక్లీస్ రచనలలో మిక్కిలి ప్రసిద్ధమైనది *ఈడిపస్ రెక్స్*.

సోఫోక్లీస్ జీవితాన్ని గురించిన ఒకే ఒక సంగ్రహ జీవిత చరిత్ర లభిస్తూంది. అది ఎప్పుడు రచించ బడిందీ తెలియదు. అంతకు ముందున్న జీవిత చరిత్రల నుంచి సంకలితం చేయబడి ఆయన వ్రాత ప్రతులలో చాలా వాటికి ముందు అది చేర్చబడింది. దీనిలో స్థూల సత్యాలు, ఊహలు, కట్టుకథలు ఎక్కువ.

సోఫోక్లీస్ హుందాగా జీవిస్తూ తన పౌరులచేత ప్రేమించబడుతూ, సాధుజన సాంగత్యంలో కాలం గడుపుతూ జీవిత సౌఖ్యాలను పరిపూర్ణంగా అనుభవించినవాడు. ఆయన తండ్రి సోఫిల్లస్. బహుశః ఆయన వృత్తి కవచాలను తయారుచేయడం. ఆయన సంపన్నుడు. కుమారునికి మంచి చదువు చెప్పించాడు. సోఫోక్లీస్‌కి సంగీతం నేర్పిన గురువు 'లాంప్రస్'! ఆ కాలంలో మిక్కిలి ప్రసిద్ధి పొందిన సంగీత విద్వాంసుడు. ట్రాజెడీ రూపక రచనా, ప్రదర్శనలను గూర్చి ఈస్కిలస్ వద్ద ఆయన అధ్యయనం చేసినట్లు భావించబడుతూంది. సోఫోక్లీస్ అందగాడు, నాట్యం బాగా చేసేవాడు; లైర్ అనే వాద్యం వాయించే వాడు; కుస్తీలు పట్టేవాడు. క్రీ.పూ. 480 లో పర్షియన్‌లమీద విజయం సాధించినపుడు జరిగిన ఉత్సవాలలో ఒక కోరస్‌లో పాల్గొనే బాలురలో ఒకనిగా అతనిని ఎంచుకొన్నారు. నాటకాల పోటీలో ఆయన ఎప్పటినుంచి పాల్గొన్నదీ తెలియదు. తన తొలి విజయాన్ని ఈస్కిలస్ మీద క్రీ.పూ. 468 లో సోఫోక్లీస్ సాధించాడు. క్రీ.పూ. 3 వ శతాబ్దినాటి ఒక శాసనం సోఫోక్లీస్ 18 విజయాలను సాధించాడనీ, క్రీ.శ. 10 వ శతాబ్ది నాటి 'సూడా లెక్సికన్' 24 విజయాలను సాధించాడనీ పేర్కొన్నాయి. సోఫోక్లీస్ రచించిన ఖండకావ్యాలలో ఏమీ లభించలేదు.

యూరిపిడీజ్ లాగ కాకుండా సోఫోక్లీస్ ఏథెన్స్ నగర ప్రజా జీవనంలో ప్రముఖపాత్రను నిర్వహించాడు. క్రీ.పూ. 443-42 లో ఆయన 'హెలెనోటామియాస్' (ఏథెన్స్ సామంతుల నుండి పన్నులు వసూలు చేసే సంఘానికి అధ్యక్షుడు) గా ఉన్నాడు. క్రీ.పూ. 440 లో 10 మంది సేనానులలో ఒకడుగా సోఫోక్లీస్ ఎన్నిక అయాడు. *ఆంటిగొనె* అనే నాటకం వ్రాయడం వలన ఆ పదవికి ఆయన ఎన్నిక అయినట్లు అరిస్టోఫనీజ్

వ్రాశాడు. విదేశాలలో రాయబారిగా కూడా సోఫోక్లీస్ పనిచేసినట్లు తెలుస్తుంది. దియాసోస్‌టాన్ మౌసన్ (Royal Society for Music and Literature) అనే సంస్థను సోఫోక్లీస్ స్థాపించాడు. తనకంటె 12 సంవత్సరాలు చిన్న అయిన యూరిపిడీజ్ మరణం తరువాత కొద్ది మాసాలు జీవించి, పెలొపొనీషియన్ యుద్ధానికి ముందు క్రీ.పూ. 406 లో ఏథెన్స్ నగరంలో సోఫోక్లీస్ మరణించాడు.

బొ.శ్రీ.

**సోయింకా, వోలే (1934--)** : ప్రముఖ నైజీరియన్ నాటకకర్త, కవి, నవలా రచయిత, సాహిత్య విమర్శకుడు.



మానవ జాతి తిరోగతికి కారణమైన సమకాలీన రాజకీయ వ్యవస్థను వ్యంగ్యంగా చిత్రించిన వోలె సోయింకా నాటకాలు న్యూయార్క్, లండన్ నగరాలలో కూడ ప్రదర్శించబడ్డాయి. వోలే సోయింకా నైజీరియాలోని అబెయెకూటలో 1934 జూలై 13 న జన్మించాడు. ఇబడాన్‌లోని యూనివర్శిటీ కళాశాలలో నుండి పట్టా పొందాడు. సోయింకా ఇంగ్లండులోని లీడ్స్ విశ్వవిద్యాలయంలో పై చదువులు చదువుకొన్నాడు. అక్కడి ఉపాధ్యాయుడు, ప్రఖ్యాత ఆంగ్లకవి, విమర్శకుడు అయిన జి. విల్‌సన్ నైట్ వల్ల ప్రభావితుడై, చదువు ముగించుకొని తిరిగి వచ్చిన తరువాత నైజీరియాలో 'మాస్క్' అన్న పేరుతో ఒక జాతీయ నాటక సంస్థను నెలకొల్పాడు. (కొన్నేళ్ల తరువాత ఇదే ఒరిసన్‌గా వ్యవహరింపబడింది.)

*ది డాన్స్ ఆఫ్ ది ఫారెస్ట్స్* (అడవి చేసిన నృత్యం) అనే ఇతని మొదటి నాటకం నైజీరియా స్వాతంత్ర్య దినం సందర్భంగా ప్రదర్శింపబడి అందరి మెప్పును పొందింది. స్వర్ణయుగంగా పేరు పొందిన చరిత్రాత్మకమైన సంస్కృతిని కాదనుకొని ఆధునీకరణ పేరుతో ఆ వ్యవస్థను సృష్టించిన రాజకీయాలను ఇతివృత్తంగా తీసికొని వ్రాసిన వ్యంగ్య రచన ఇది. పాశ్చాత్య అనుకరణను హేళన చేస్తూ వ్రాసిన హాస్య నాటిక. *ది లయన్ అండ్ ది జ్యూయెల్* (1959). చర్చిని ఆధారంగా చేసుకుని బ్రతుకుతున్న మత గురువుల ప్రలోభాలను ఎత్తిచూపుతూ వ్రాసిన రెండు నాటకాలు *ది ట్రయల్ ఆఫ్ బ్రదర్ జీరో* (1960), *జీరోస్ మెటామోర్ఫసస్* (1972) గంభీరమైన ఇతివృత్తాలతో వ్రాసిన నాటికలు. *కాంగీస్ హార్వెస్ట్* (1965), *ది రోడ్* (1965) *ది స్ట్రాంగ్ బ్రీడ్* (1963) అనే నాటకాలలో సమాజంలోని అమానుషమైన ఆచారాలను, నరబలిని ఖండించాడు. ఆధునిక సామాజిక వ్యవస్థను విమర్శించేటప్పుడు సంప్రదాయాల ముసుగులోని అవకతవకలను కూడా ఎత్తిచూపడం ఈయన మరచి పోలేదు.

యోరుబా సంప్రదాయానికి చెందిన వోలే సోయింకా పాశ్చాత్య ధోరణి మేళవించి సంప్రదాయ బద్ధమైన నాటికలు వ్రాసినా, ప్రదర్శన విధానాలలో నూతన ప్రయోగాలు చేశాడు. సునిశితమైన హాస్యం, చురకలు పెట్టే వ్యంగ్యం, చక్కని కవితా శైలి కలపోసిన ఈయన నాటకాలలో ఆంగ్ల భాష ఎంతో పటిష్ఠంగా రూపొందింది.

1964 లో బ్లాక్ ఆర్ఫియన్ అనే ఒక ప్రసిద్ధ సాహితీ పత్రికకు ఎడిటరుగా పనిచేశాడు. అతని దేశం వారైన నీగ్రోలు తమ జాతి విశిష్టతను ప్రపంచానికి తెలియచేయడానికి 'నెగ్రిట్యూడ్' (నీగ్రో జాతీయత) అనే ఒక సామాజిక సిద్ధాంతాన్ని ప్రతిపాదించినపుడు దానిని సోయింకా ఒక సంకుచిత తత్త్వ మని ఖండించాడు. అసాధ్యమైన ఆదర్శాల కన్నా ఆచరణయోగ్యమైన నీతి సూత్రాలను, సామాజిక విలువలను ప్రజలకు తన రచనల ద్వారా చెప్పగలిగిన వాడే ఆయన దృష్టిలో నిజమైన రచయిత. అలా చేయడం ఒక కళాకారుని బాధ్యత అని కూడా ఆయన అన్నాడు.

*ది ఇంటర్‌ప్రెటర్స్* (1965) *సీజన్స్ ఆఫ్ అనోమి* (1973) అనే రెండు నవలలు ఆయన ప్రచురించాడు. జేమ్స్ జాయ్స్ వంటి గొప్ప రచయితల శైలిలో, సున్నితమైన పాత్ర పోషణ ద్వారా చక్కగా వ్రాసిన నవలలుగా విమర్శకులు వాటిని మెచ్చు కొన్నారు. వోలె సోయింకా వ్రాసిన మరికొన్ని నాటకాలు - *మాడ్‌మెన్ అండ్ ద స్పెషలిస్ట్స్* (1970), *డెత్ అండ్ ద కింగ్స్ హార్స్‌మాన్* (1975). ఇడాన్రే, *ఇతర కవితలు, ఏ షటిల్ అండ్ ది క్రిప్ట్* (1972) అనేవి ఇతని కవితా సంకలనాలు. క్రొత్త పంథాలో ఆలోచింపచేసే సోయింకా కవితలలో ఆంగ్ల భాష ఎంతో అందంగా మలచబడింది. ఇఫే, లాగోస్ నగరాలలో (1969) ఆచార్యుడుగా పని చేసిన సోయింకా 1966 లో బయఫ్రాలో జరిగిన స్వదేశీ ఉద్యమంలో రెండేళ్లు కారాగారవాసం అనుభవించాడు

సమకాలీన రాజకీయాలలోని మంచికీ, చెడుకూ స్పందించాడు. కారాగారంలోని ఆయన అనుభవాలను *ది మాన్ డైడ్* అన్న పుస్తకంలో ప్రచురించాడు. *ఆకెడ్ ది యియర్స్ ఆఫ్ చైల్డ్‌హుడ్* (1981) అన్న పుస్తకం ఆయన ఆత్మకథ. ఈయనకు 1987 లో ప్రతిష్ఠాత్మకమైన నోబెల్ బహుమతి లభించింది. ఆ సాహితీ పురస్కారం అందుకొన్న మొదటి నీగ్రో రచయిత ఈయనే!

భార్గవి

**సోరోమెన్హో, ఫెర్నాండో (1910-1968) :** అంగోలా రచయిత. ఫెర్నాండోసోరో మెన్హో 1910 జనవరి 31 న మొజాంబిక్‌లోని షింద్ నగరంలో పుట్టాడు. ఈయన ఆఫ్రికన్ తెగలను గురించి, వారిపై ఆంగ్లేయులు జరిపిన అమానుషమైన దౌర్జన్యాలను గురించి పోర్చుగీసు భాషలో వ్రాశాడు. తాను నీగ్రో కాకపోయినా, వారిలో ఒకనిగా కలిసిపోయి వారి కష్ట సుఖాలను పంచుకొని తెల్లవారి దొరతనాన్ని, అహంభావాన్ని ఖండించాడు.

ఆరవ ఏట ఫెర్నాండో తలితండ్రులు అతనిని పోర్చుగల్‌లోని బడిలో చేర్పించారు. చదువు ముగించుకొని గనులలో పనిచేసే కార్మికులను ఎంపిక చేసే ఉద్యోగంలో చేరాడు. ఆ దశలో అతనికి ఆఫ్రికన్లతో సన్నిహిత సంబంధం ఏర్పడింది. తెల్లవారి క్రింద పనిచేయడం బానిసత్వంగా అనిపించింది. ఉద్యోగం మానివేసి పత్రికా విలేఖకుడుగా 'లావుండా' లోను, 'లిస్బన్' లోను పని చేశాడు. 1937 లో *హ్యూమన్ దాడీ* అనే పత్రికకు సంపాదకత్వం వహించాడు. 1943 లో తనే ఒక ప్రచురణ సంస్థను ప్రారంభించాడు.

ఫెర్నాండో సోరోమెన్హో ఐదు నవలలు, నాలుగు కథానికా సంకలనాలు, సమాజానికి సంబంధించిన వ్యాసాలు, (Travel books) రచించాడు. *నహరి-ఒడ్రామాదా గెంటే నెగ్రా* (1938 నహరి- నల్ల ప్రజల జీవన నాటకం) అనే ప్రథమ కథా సంకలనంలో ఆఫ్రికన్ తెగల వారిని గురించిన కథ లున్నాయి. *టెర్రామర్టా* (1949, చనిపోయిన ప్రపంచం) అనే నవలలో యూరపియనులు వలస రావడం వలన ఆఫ్రికనుల జీవన విధానంలో వచ్చిన మార్పులు, చేర్పులు, లావుండా ప్రాంతంలో నివసించే ఆఫ్రికన్ల సంప్రదాయం ఎలా దెబ్బతిన్నదో వివరంగా చెప్పబడింది. 'పాసిఫికేషన్' ను విమర్శించినందుకుగాను బ్రెజిల్ దేశం ప్రచురించిన ఈ పుస్తకాన్ని పోర్చుగీసు అధికారులు నిషేధించారు. దీనితో పాటు ఈ రచయిత ఇతర ప్రచురణలు కూడా నిషేధించబడ్డాయి. 1960 లో ప్రభుత్వం ఇతనిని బంధించాలనుకొన్నపుడు ఫ్రాన్సు దేశంలో తల దాచుకొని, అక్కడినుండి అమెరికా చేరుకొన్నాడు. అక్కడ విస్కాన్సిన్ విశ్వవిద్యాలయంలో ఉపాధ్యాయుడుగా పనిచేశాడు. ఆ తరువాత పారిస్‌లోని గాలిమార్డ్ పబ్లిషర్స్ వద్ద పనిచేశాడు. 1965 లో బ్రెజిల్ వెళ్లి కొన్ని రోజులు మళ్లీ పాఠాలు చెప్పాడు.

ఫెర్నాండో వ్రాసిన రచనలు: *నాయ్తద అంగ్విస్టియా* (1939-కాళరాత్రి), *హోమెన్స్ సెమ్ కామినో* (1942 దారి తప్పిన మనుష్యులు), *ఏ విరాగెమ్* (1957-మలుపు), *ఏ ఛాగా* (1978-ఒక గాయం); *ఎవిరాగెమ్‌*కు అనుబంధంగా రచించిన మరొక నవల ఆయన మరణానంతరం ప్రచురించబడింది.

సోరోమెన్హో 1968 జూన్ 18 న బ్రెజిల్‌లో మరణించాడు.

భార్గవి

**సోల్జెనిట్సిన్, అలెగ్జాండర్ (1918--) :** రష్యన్ నవలా రచయిత, చరిత్రకారుడు. సోల్జెనిస్టిన్ 1918 డిసెంబరు 11 న రష్యాలోని కిస్లో వొడస్క్‌లో జన్మించాడు. 1970 లో సాహిత్యంలో నోబెల్ బహుమానం అందుకొన్న సోల్జెనిట్సిన్ 20 వ శతాబ్దపు రచయితలలో అతి ముఖ్యుడుగా పరిగణించబడ్డాడు. మేధావుల కుటుంబంలో



జన్మించిన ఈ రచయిత పుట్టక ముందే తండ్రిని కోల్పోయాడు. ఇతని పోషణ భారమంతా తల్లిపైనే పడింది. 'రాస్టోక్-నా-దోను' విశ్వవిద్యాలయంలో గణిత శాస్త్ర ప్రధాన విషయంగా తీసుకొని పట్టా పొందిన ఇతడు కరెస్పాండెన్స్ కోర్సు ద్వారా సాహిత్యాధ్యయనం చేశాడు. కాని ఇతడు స్టాలిన్ ప్రభుత్వ వైఖరిని నిరసిస్తూ వ్రాసిన ఒక లేఖ వల్ల ఎనిమిది ఏళ్లు చెరసాలలో గడపవలసి వచ్చింది. విడుదల అయాక కూడా మూడేళ్ళు అజ్ఞాతవాసం చెయ్యవలసి వచ్చింది. ఆ తరువాత 1956 నుండి మధ్యరష్యాలో సోల్జెనిట్సిన్ గణిత శాస్త్ర ఉపాధ్యాయుడుగా పనిచేస్తూ, రచనా వ్యాసంగాన్ని కూడా కొనసాగించాడు.

సాంస్కృతికంగానూ, రాజకీయ పరంగానూ 1960 లో స్టాలిన్ ప్రభావం కొంత తగ్గినట్టుగా అనిపించి సోల్జెనిస్టిన్ తన మొదటి నవల *ఒదిన్ దిన్ ఈవ్ జింజి ఇవానా డెనిసోవిచా* (డెనిసోవిచా జీవితంలో ఒకరోజు-1962) ప్రచురించాడు. ఇది ఒక ప్రముఖ సోవియెట్ పత్రికలో ప్రచురించబడి బహుళ ప్రజాదరణ పొంది, ఇతనికి పేరు ప్రఖ్యాతులు తెచ్చిపెట్టింది. తన ఆత్మకథనే ఇతివృత్తంగా తీసుకొని వ్రాసిన నవల ఇది. అతడు జైలులో పడ్డ కష్టాలు, స్టాలిన్ ప్రభుత్వంలోని బలాత్కార కార్మిక కేంద్రాలు కళ్ళకు కట్టినట్లుగా ఈ నవలలో చిత్రించాడు. అనుభవంతో ఏర్పడిన నిజాయితీ, సరళమైన భాష ఉండడం వల్ల వీటిని ప్రజలు హర్షించి ఆదరించారు. ఈ నవల ప్రభావం రష్యాలోనే కాక ఇతర దేశాల రాజకీయాలపై కూడా పడింది. ఈ పద్ధతిలోనే చాలామంది రచయితలు తాము జైలులో పడ్డ కష్టాలను ప్రజలకు తమ రచనల ద్వారా తెలియజేశారు.

1964 లో కృశ్చేవ్ ప్రభుత్వం అంతమైన తరువాత, సోల్జెనిట్సిన్‌కు లభించిన అధికారం ఆ నాడు మెప్పూ, గుర్తింపూ పొందలేదు. రాజకీయాలను విమర్శించినందుకుగాను చాలా కష్ట నష్టాలను ఎదుర్కొనవలసి వచ్చింది. 1963 లో అతని కథా సంకలనం ప్రచురించిన తరువాత అతని ఇతర రచనలకు అధికారుల ఆమోదం, ఆదరణ లభించలేదు. తన ఖర్చుతోనే స్వంతంగా అచ్చువేసి దేశ విదేశాలలో పంపిణీ చేసిన రచనలను అశ్లీల సాహిత్యం అని అణచి వేశారు.

ఆ తరువాత సోల్జెనిట్సిన్ వ్రాసిన నవల లన్నీ విదేశీ ప్రచురణ కర్తలు అచ్చువేసినవే. అవి ఆయనకు దేశ విదేశాలలో పేరు ప్రఖ్యాతులు తెచ్చి పెట్టాయి. *వ్రికు గీ పెర్ వోమ్* (1968- మొదటి వృత్తం) గణిత శాస్త్రాన్ని, జైలు జీవితాన్ని కలిపి వ్రాసిన నవల. ఈ నవలలో శాస్త్రజ్ఞులు తమ పరిశోధనా ఫలితాల్ని పోలీసులకు భయపడి ఎలా వెల్లడించకుండా ఉన్నారో వివరంగా తెలుపబడింది. రాకొవీ కార్పస్ (1968-కాన్సర్ వార్డ్) అన్న పుస్తకం కూడా సోల్జెనిస్టిన్ జీవితానుభవమే. అజ్ఞాతవాసంలో ఉన్నపుడు, 1950 లో కేన్సరు వ్యాధికి గురిఅయి ఆస్పత్రిలో చికిత్సపొందిన వివరాలతో వ్రాయబడింది.

1970 లో నోబెల్ బహుమతిని ఇస్తున్నట్లుగా ప్రకటించినప్పటికి తనను బంధిస్తారనే భయంతో సోల్జెనిట్సిన్ స్టాక్‌హోమ్‌కు వెళ్ళలేదు. 1971 లో వ్రాసిన 'ఆగష్టు 1914' మొదటి ప్రపంచ యుద్ధకాలంలో రష్యన్లపై జర్మనీ విజయాన్ని గురించి వ్రాయబడింది. 1973 లో *ఆర్కి పెలాగ్ గులాగ్* (గులాగ్ ద్వీప సముదాయం) అన్న నవల ప్రచురించ బడింది. రష్యన్ జైలు జీవితం (Labour camps) గురించిన వివరాలతో 1973, 74, 78 లలో మూడు సంపుటాలుగా వెలువడిన ఈ గ్రంథం సాహిత్య చరిత్రలో ఒక గొప్ప గ్రంథంగా నిలిచిపోయింది.

1974 ఫిబ్రవరి 12 రష్యన్ ప్రభుత్వంచే అరెస్టు చేయబడి, తప్పించుకొని స్విట్జర్లాండు చేరి, తనకు రావలసిన నోబెల్ బహుమతిని సోల్జెనిట్సిన్ అందుకొన్నాడు. రష్యాను గురించిన తప్పు అభిప్రాయాలను తుడిచివేస్తూ ప్రజాప్రభుత్వం కంటె దయార్ద్ర హృదయంతో ఆలోచించే నిరంకుశ ప్రభుత్వమే దేశానికి మేలు చేస్తుందని చెప్పిన సోల్జెనిట్సిన్ కలకాలం నిలచే రచనలు చేసి, సాహిత్య సేవ చేశాడు.

భార్గవి.

**సౌతీ, రాబర్ట్ (1774-1843) :** ఆంగ్ల కవి. వర్డ్స్‌వర్త్, సామ్యూల్ టేలర్, కాల్‌రిడ్జ్‌లకు సన్నిహితుడు. భావ కవిత్వానికి ఊపిరిపోసిన రొమాంటిక్ కవులకోవకు చెందినవాడు. కవితల కన్నా, వచన రచనలే ఈయనకు పేరు తెచ్చిపెట్టాయి. *మై డేస్ ఎమాంగ్ ద డెడ్ ఆర్ పాస్ట్, ఆఫ్టర్ బ్లెన్‌హేమ్, ద ఇంచ్‌కేప్ రాక్* ఈయనకు పేరు తెచ్చిపెట్టిన కవితలు. ఈయన వ్రాసిన నెల్‌సన్ జీవిత చరిత్ర (1813) ఇప్పటికీ ఆదరించబడుతున్నది. *ది డాక్టర్* (1834-47), *థలాబా* (1801), *ద కర్స్ ఆఫ్ కెహామా* (1810) వంటి రచనలు ప్రాచ్య విషయాలను ఆధారంగా చేసుకొని వ్రాయబడ్డాయి.



వెస్ట్ మినిస్టర్ స్కూల్‌లో, లండన్‌లో చదువుకొనే రోజులలో పిల్లలను శిక్షించే పద్ధతులను ఖండిస్తూ స్కూలు మాగజైనులో వ్యాసం వ్రాసినందుకు అధికారులు సౌతీని బడి నుండి పంపివేశారు. ఫ్రెంచ్ తిరుగుబాటు ఆదర్శాలు వంట బట్టిన యువకుడు సౌతీ ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీలో చదువు కొనేటప్పుడు *జోన్ ఆఫ్ ఆర్క్* (1792) ప్రచురించాడు. పట్టా పొందకముందే విశ్వవిద్యాలయం నుండి బయటపడి, కాల్‌రిడ్జ్‌తో చేతులు

కలిపాడు. అతను కలలు కన్న, ఆదర్శవంతమైన అగ్రేరి యన్ సమాజాన్ని, సెసక్వానీ నది ఒడ్డున స్థాపించాలని ప్రయత్నం చేశాడు. కాని కాల్‌రిడ్జ్‌తో అభిప్రాయభేదాలు వచ్చి, 1795 లో ఎడిత్ ఫ్రికర్‌ను రహస్యంగా పెళ్లి చేసుకొని పోర్చుగల్‌కి వచ్చాడు. అక్కడకి వచ్చి "నేను ఇంగ్లీషు వాడనయినందుకు సంతోషిస్తున్నాను" అని నిట్టూర్చాడని ప్రతీతి. ఈ దశలో సౌతీ రాజకీయ దృక్పథంలో తిరుగుబాటు ధోరణి తగ్గి మార్పు వచ్చింది. ఈ సమయంలో కొన్ని కవితలను, పోర్చుగీసు చరిత్రను వ్రాయడం ప్రారంభించాడు.

1803 లో కెస్విక్‌లోని గీటా హాల్ లో ఉన్న కాల్‌రిడ్జ్‌ను కలవడానికి భార్యతో సహా వచ్చి అక్కడే ఉండిపోయాడు. వర్డ్స్‌వర్త్ కవితో స్నేహం సౌతీ జీవితాన్ని అర్థవంతం చేసింది. 1804-12 మధ్య ఇతనికి ఆరుగురు పిల్లలు పుట్టడంతో ఆర్థికంగా దెబ్బతిన్నాడు. నిలద్రొక్కుకోడానికి కవితలు, విమర్శనా వ్యాసాలు, చరిత్ర, జీవిత కథలు అనువాద రచనలు చేశాడు. లార్డ్ బైరన్ అనే ప్రఖ్యాత ఆంగ్లకవి తన రచన డాన్ జువాన్‌ను సౌతీకి అంకిత మిచ్చాడు.

కుటుంబ సమస్యలతో, మతి స్తిమితంలేని భార్యతో చివరి రోజులలో సౌతీ చాలా ఇబ్బంది పడ్డాడు. భార్య మరణించిన తరువాత మరొక పెళ్లి చేసుకొన్నాడు.

భార్గవి

**స్కాట్, డంకన్ కాంప్‌బెల్ (1862-1947) :** ప్రకృతిని చూసి పరవశించి పద్యా లల్లిన కెనేడియన్ కవి. ఇతడు 1862 ఆగస్టు 2 న ఒట్టావాలో జన్మించాడు. అడ్డు అదుపు లేకుండా పెరిగిన అరణ్యాలలోని అందాలు ఈయనను ఆకర్షించాయి. భారతదేశం పట్లా, భారతీ యుల జీవనవిధానం పట్లా ఈయనకు కుతూహలం ఉండేది. వీటిని గురించి కాంప్‌బెల్ ఎన్నో కవితలు వ్రాశాడు. మధ్య 1879-1932 అంటే దాదాపు 50 సంవత్సరాలు భారతీయ అడ్మినిస్ట్రేషన్ లో అధికారిగా పనిచేశాడు. ఇతని ఆప్తమిత్రుడు, ప్రముఖ ఒట్టావా కవి ఆర్కిబాల్డ్ లాంప్‌మన్ కవిత్వం వ్రాయడానికి కాంప్‌బెల్‌ను ప్రోత్సహించాడు. 1899 లో ఆర్కిబార్డ్ మరణానంతరం ఆర్కిబాల్డ్ కవితలు కాంప్‌బెల్ సంపాద కత్వంలో వెలువడ్డాయి. కాంప్ బెల్ ప్రచురించిన కవితా సంపుటాలు *ది మాజిక్ హౌస్ అండ్ అదర్ పోయమ్స్, ది సర్కిల్ ఆఫ్ ఎఫెక్షన్ ఇన్ ది విలేజ్ ఆఫ్ వైగర్,* (1896), *ది విచింగ్ ఆఫ్ ఎల్సీ* (1923) అనే కథా సంకలనాలు కూడా ఈయన రచనలలో పేర్కొనదగినవి. 1947 డిసెంబరు 19 న ఒట్టావాలో స్కాట్ మరణించాడు.

భార్గవి

**స్కాట్, ఫ్రాన్సిస్ రెజినాల్డ్ (1899-1985) :** కెనడా దేశపు ఆంగ్లకవి. 1899 ఆగస్టు 1 న క్యూబెక్‌లో జన్మించిన ఈ కవి మాంట్రియల్ కవుల కూటమికి చెందినవాడు. 1920 లో స్థాపించబడిన ఈ సాహితీ సంస్థ కెనేడియన్ కవితా ధోరణిలో ప్రగతికరమైన మార్పులకు దోహదం చేసింది.

ఫ్రాన్సిస్ రెజినాల్డ్ స్కాట్ ఎన్నో సాహిత్య పత్రికలను ప్రారంభించాడు. పద్య సంకలనాలకు సంపాదకత్వం వహించాడు. వ్యంగ్య ధోరణిలో సమాజాన్ని విమర్శిస్తూ వ్రాసిన రచనలు ఈయనకు చాలా పేరు తెచ్చి పెట్టాయి. ఈయన వ్రాసిన *ఓవర్చ్యూర్* (1945-రాజీ ప్రతిపాదన), *ఈవెంట్స్ అండ్ సిగ్నల్స్* (1954-సంఘటనలు, ఆదేశాలు), మరియు *ది వే ఆఫ్ ది నీడిల్* (1957, సూదిలోని బెజ్జం) వ్యావహారిక శైలిలో, సరళమైన భాషలో చేసిన రచనలు. *సెలెక్టెడ్ పోయమ్స్* (1966), *ది డాన్స్ ఈజ్ వన్* (1973, నాట్యాలన్నీ ఒక్కటే) అనే కవితా సంపుటాలను ప్రకటించాడు.

సాహితీ రంగంలో కృషిచేస్తూనే, స్కాట్ న్యాయవా దిగా ప్రజాకార్యక్రమాలలో విరివిగా పాల్గొనేవాడు. రోడ్స్ స్కాలర్ షిప్ (1920-23) ను పొంది ఆక్స్‌ఫర్డ్‌లో విద్యా భ్యాసం చేసిన తరువాత కెనడాలోని మాక్‌గిల్ యూనివ ర్శిటీలో న్యాయశాస్త్రంలో పట్టభద్రుడయాడు. 1928-69 మధ్య అదే విశ్వవిద్యాలయంలో ప్రొఫెసరుగానూ, డీన్ గానూ పనిచేశాడు. స్కాట్ రాజ్యాంగ సూత్రాలను వివరించడంలో నిపుణుడు, సామ్యవాది. ఈయన చేసిన మరికొన్ని రచనలు: *సోషియలిస్ట్ ప్లానింగ్ ఫర్ కెనడా* (1935), *ఎస్సేస్ ఆన్ ద కాన్‌స్టిట్యూషన్* (1977), అంతర్జాతీయ సంస్థ (U.N) తరఫున బర్మాలో వారి ప్రతినిధిగా కూడా కొంతకాలం ఉన్నాడు. 1985 జనవరి 31 న మాంట్రియల్ నగరంలో దివంగతుడయాడు.

భార్గవి

**స్కాట్, సర్ వాల్టర్ (1771-1832) :** ప్రముఖ ఆంగ్లకవి, నవలా రచయిత, జీవితచరిత్ర రచయిత. మొదటి సారి బ్రిటిషువారు 'బారొనెట్' బిరుదు నిచ్చి సత్కరించిన వాల్టర్ స్కాట్ 1771 ఆగస్టు 15 న ఎడింబరో నగరంలో జన్మించాడు. స్కాట్లండు దేశానికి చెందిన ఈ రచయిత, ఆంగ్ల నవలా రచయి తలలో ప్రసిద్ధుడు. చరిత్రలోని సంఘటనలకు కల్పన

జోడించి నవల వ్రాసే ప్రక్రియను ఈయనే మొదటి సారిగా ప్రవేశపెట్టాడు. ఈయన రచనలలో ముఖ్యమైనవి *వేవర్లీ* (1814), *రాబ్ రాయ్* (1818), *ది హార్ట్ ఆఫ్ మిడ్లోథియన్* (1818), *ఐవాన్‌హో* (1819), *కెనిల్ వర్త్* (1821).

సర్ వాల్టర్ స్కాట్ తండ్రి గొప్ప జమీం దారీ వంశానికి చెందిన న్యాయవాది. తల్లి పేరు పొందిన ఒక వైద్యుని కుమార్తె. తమ కుటుంబ సభ్యు లందరూ దేశ చరిత్రను గురించి చర్చించుకోడం చిన్న తనం నుండి విని స్కాట్ చరిత్ర పట్ల మక్కువ, సంప్రదాయం పట్ల గౌరవం పెంచు కొన్నాడు. స్కాట్ ఎడింబరో లోని హైస్కూలులోనూ, కెల్సోలోని గ్రామరు పాఠశాలలోను చదువుకొని తండ్రి వద్దే అప్రెంటీస్‌గా చేరాడు. న్యాయశాస్త్రంలో పట్టా పొందిన ఇతనికి న్యాయ వాద వృత్తిలో ఆసక్తి కలుగలేదు. ఇటాలియన్, స్పానిష్, ఫ్రెంచ్, జర్మన్, లాటిన్ భాషలు అభ్యసించి, ఆ భాష లలోని సాహిత్యాన్ని క్షుణ్ణంగా ఆకళింపు చేసుకొన్నాడు. వివిధ ప్రదేశాలను చారిత్రక దృష్టితో సందర్శించాడు. ఒక యువతిని ప్రేమించి, ఆ ప్రేమ ఫలించక నిరాశ చెంది, 1797 డిసెంబరు 24 న 'చార్లెట్ కార్పెంటర్' అనే ఫ్రెంచ్ రాజవంశానికి చెందిన యువతిని వివాహం చేసుకొన్నాడు.



వాల్టర్ స్కాట్ పురాతనమైన బ్రిటిష్ పద్యకావ్యా లను పునరుద్ధరించా లనుకొన్నాడు. ఎడింబరో రివ్యూకు ఎన్నో వ్యాసాలు వ్రాశాడు. ఆ కాలంలోని ప్రసిద్ధ ఆంగ్ల కవులయిన వర్డ్స్‌వర్త్, రాబర్ట్ సౌతీలతో ఇతనికి స్నేహం ఏర్పడింది. లార్డ్ బైరన్ ఈయన ప్రాణస్నేహితుడు. ఆత్మీయతతో ఆదరించి, ఎదుటి వారిలోని గొప్పతనాన్ని ఒప్పుకునే గుణం ఉన్న స్కాట్‌ను ఆ కాలంలోని సాహితీ వేత్తలందరూ మెచ్చు కొనేవారు.

ఆ తరువాతి కాలంలో అతనికి కవిగా మంచి పేరు వచ్చింది. నిజాయితీ, సరళమైన శైలి, చక్కని వర్ణనలు ఉన్న ఇతని కవిత్వాన్ని ప్రజలు మెచ్చుకొన్నా తానొక గొప్ప కవి నని స్కాట్ గర్వించలేదు. 1814 లో ప్రచురించిన *వేవర్లీ* అనే నవల ఇతని రచనా వ్యాసంగంలో ఒక పెద్దమలుపు. కాని, ఆ నవలలో స్కాట్ తన పేరును గుప్తంగా ఉంచాడు. అలా చేయడానికి కారణాలు స్పష్టంగా తెలియవు. కాని చాలా మంది ఆ నవల వ్రాసినది స్కాట్ అని గుర్తు పట్టారు. దీని వెనువెంటనే చాలా రచనలు వెలువడ్డాయి. *గై మానరింగ్, ఓల్డ్ మోర్టాలిటీ, ది హార్ట్ ఆఫ్ ది మిడ్లోథియన్* ఆ నాలు గైదేళ్ళలో వెలువడిన రచనలు. ఎవరూ లేవకముందే, తెల్లవారు జామున లేచి వ్రాయడం ఈయనకు అల వాటు. ఉదయ మంతా తనవారికి, తన స్నేహితులకు కేటాయించి రాత్రీ, పగలూ శ్రమపడడం వల్ల స్కాట్ ఆరోగ్యం దెబ్బతింది.

ఆ రోజులలో స్కాట్ ఆదాయానికి, ఖర్చుకి పొంతన లేకుండా, ఎప్పుడో డబ్బు వస్తుందనే అంచనాతో ప్రచురణ కర్తలతో లావాదేవీలు పెట్టుకొని దెబ్బతిన్నాడు. 1824 లో *రెడ్ గాంట్‌లెట్* అనే నవల వ్రాశాడు. శ్రమ పడకుండా తక్కువ కాలంలో వ్రాయగలిగిన ఇతని శైలి చివరి వరకూ దెబ్బతినలేదు. 1825 లో ఒక పత్రికకు (జర్నల్) వ్రాసిన ఇతని రచనలలో నిస్సహాయత, అనారోగ్యం, జీవితంలో తగిలిన ఎదురు దెబ్బలు చోటు చేసుకొని నిరాశ ప్రతిఫలించింది. సర్ వాల్టర్ స్కాట్ జీవిత కథను వ్రాసిన జె.జి. లాక్‌హార్ట్ - "వాల్టర్ స్కాట్ మరణవార్తను విని యావత్ ప్రపంచం ఒక రారాజును పోగొట్టుకొన్నట్టుగా దుఃఖించింది" అని వ్రాశాడు.

భార్గవి

**స్కారోన్, పాల్ (1610-60)** : పారిస్‌లో పుట్టి అక్కడనే మృతి చెందిన ఫ్రెంచి హాస్యకవి, నాటక రచయిత, హాస్యర చయిత. జమీం దారీ కుటుంబంలో పుట్టినవాడు. 30 వ ఏటనే పక్షవాత వ్యాధికి గురియై జీవి తాంతం అవిటి బ్రదుకునే గడిపినా, ఇతని చమత్కార హాస్య సంభాషణ లకు ఆకర్షితులై అభి మానులు ఇతని చుట్టూ మూగి ఉండేవారు. ఇతని భార్య ఫ్రాన్సా



యిస్ డాబినే ఈ గోష్ఠులను క్రమబద్ధంగా నిర్వహిస్తూ ఉండేది. తరువాత ఈమె 14 వ లూయీ రాజుకు ఉంపుడుకత్తెయై మదాం డిమేంటనాన్ (Madame de Maintenon) గా పేరు పొందింది.

ప్రసిద్ధ మహాకావ్యాలకు పేరడీలు రచించటం ఇత నికి ముందే ప్రారంభమైనా, దాన్ని ఒక విశిష్ట కావ్య ప్రక్రియగా ఇతడు రూపొందించాడు. వర్జిల్ మహాకవి రచించిన *ఈనిడ్* అనే కావ్యానికి ఇతడు రచించిన *వర్జిల్ విడంబన* (Virgil Travesty) సమకాలీనుల మెప్పుకు పాత్రమైంది. నాటక రచయితగా మోలియర్ మీద ఇతని ప్రభావం చాలా ఉన్నది. ప్రస్తుతం ఇతని రచనగా *లె రోమన్ కోమిక్* అనే ఒక అసంపూర్ణ నవల మాత్రమే వ్యాప్తిలో ఉన్నది. దీనిలో ఒక సంచార నాటకమండలి వారి అనుభవాలు హాస్యజనకంగా నిరూపితమయాయి. ఇందులోని సంఘటనలు అకృత్రిమంగాను, వాస్తవికతకు దగ్గరగాను ఉండడం వలన 17 వ శతాబ్ది ఫ్రెంచి రాష్ట్రాలలోని జన జీవన పరిస్థితులను తెలుసుకోడానికి ఇది ప్రధాన ఆకరంగా ఉపయోగ పడుతున్నది.

చ.శి.

**స్కెల్‌టన్, జాన్ (1460-1529) :** ఆంగ్ల కవి. 15 శతాబ్దిలో పుట్టిన ఈ ట్యూడర్ కవి జననం, బాల్యం గురించిన వివరాలు సరిగా తెలియవు. వ్యంగ్య ధోరణిలో రాజకీయ, మతపరమైన రచనలు చేసిన ఈ కవికి 20 వ శతాబ్దం వరకూ గుర్తింపు రాలేదు. వ్యావహారిక భాషలోని లయను కవితలలో వాడుకొని 'స్కెల్టానిక్స్' అనే పేరుతో కొత్త ప్రయోగం చేశాడు ఈ కవి.

స్కెల్‌టన్ ఆక్స్‌ఫర్డులోని కేంబ్రిడ్జ్ యూనివర్శిటీలో పొయెట్ లారియంట్ బిరుదు పొందాడు. ప్రాచీన గ్రీక్, రోమన్ రచనలను ఆంగ్లంలోకి అనువదించాడు. 7 వ హెన్రీ 1489 లో ఇతనిని తన ఆస్థాన కవిగా నియమించు కొన్నాడు. ఆ తరువాతి రాజు 8 వ హెన్రీ (డ్యూక్ ఆఫ్ యార్క్) స్కెల్‌టన్‌ను జీవిత కాలమంతా తన ఆస్థానంలో సలహాదారుడుగా నియమిం చాడు. చర్చికి సంబంధించిన మతపరమైన విషయాలను గురించి, ప్రజాసమస్యలను గురించి రాజు ఇతనిని సంప్ర దిస్తూ ఉండేవాడు.

స్కెల్‌టన్ రచనలు అప్పట్లో ప్రచారంలో ఉన్నట్లు దాఖలా లేదు. పునరుజ్జీవన కాలంలో పేరు పొందిన వ్యక్తి 'డిసిరియస్ ఇరాస్మస్' ఇంగ్లండుకు వచ్చినపుడు (1499) స్కెల్‌టన్‌ను "ఆంగ్ల సాహిత్యంలో అసమా నమైన ప్రతిభ గల ఒక ఉజ్జ్వలమైన ప్రకాశం" అని ప్రశంసించాడు. స్కెల్‌టన్ ఆస్థానకవిగా ఉన్నపుడు రాజాస్థానంలోని లోటుపాట్లను, అక్కడి కట్టుబాట్లను విమర్శిస్తూ *బౌజ్ ఆఫ్ కోర్టు* అన్న వ్యంగ్య కవితను వ్రాశాడు. 'స్కెల్టానిక్స్' శైలిలో వ్రాసిన *ఫిలిప్ స్పారోలో* ఒక స్త్రీ తన పెంపుడు పక్షి చనిపోతే ఎలా విలపిస్తుందో వర్ణించబడినా అది మనం చనిపోయిన వారి పట్ల చూపే ఉపేక్షను గురించిన కవిత. *వేర్ ది హాక్* లో చర్చిని విమర్శిస్తూ, *ఏ బాలాడ్ ఆఫ్ స్కాటిష్ కింగ్* (1513) లో శత్రురాజులను విమర్శిస్తూ ప్రతిభావంతమైన కవి తలను స్కెల్టన్ వ్రాశాడు. జాన్ స్కెల్‌టన్ వ్రాసిన మరి కొన్ని రచనలు *మాగ్నిఫిషియన్స్* (1513), *ది టన్నింగ్ ఆఫ్ ఎలినార్ రుమ్మేంజ్* (1516), *స్పీక్ పారట్* (1521), *కోలిన్ క్లౌట్* (1522), *వైకమ్ ఇ నాట్ టు కోర్ట్* (1522).

పై రచనలలో చాలా భాగం మత, రాజకీయ విమర్శలే! అప్పటి అధికారి 'కార్డినల్ థామస్ వోల్సీ' మానవతా వాదం పేర చేసిన దోషాలు సూటిగా ఎత్తి చూపబడ్డాయి. ప్రొటెస్టెంటు మతాన్ని అవలంబించి, ఇటాలియన్ కవుల ననుసరించి కవితలు వ్రాసే స్కెల్ టన్‌కు 16 వ శతాబ్దిలో గుర్తింపు తగ్గి, 20 వ శతాబ్దంలో పేరు ప్రఖ్యాతులు లభించాయి.

భార్గవి

**స్టార్మ్, (హాన్స్) థియోడర్ వోల్డ్‌సెన్ (1817-1888) :** జర్మన్‌కవి, నవలా రచయిత. 1817 సెప్టెంబరు 14 న జన్మించాడు. వాస్తవికత ఉట్టిపడే విధంగా ఇతడు వ్రాసిన నవలికలకు జర్మను సాహిత్యంలో గొప్ప స్థానం ఉంది. ప్రజలకు దైనందిన జీవితంలో ఉపయోగపడే విలువలను చెప్పాలన్న ధ్యేయంతో ఈయన రచనలు చేశాడు. ఆంగ్ల సాహిత్యంలోని భావ కవులు (రొమాంటిక్స్) స్టార్మ్‌కు ఆదర్శప్రాయులు. ఎడ్యురాడ్ మొర్కీ, గాట్ ఫ్రెడ్‌కెల్లర్, పాల్ వాన్ హేమ్స్, రష్యన్ రచయిత, పత్రికా విలేఖకుడు ఇవాన్ తుర్గ్‌నేవ్ ఇతనికి స్నేహితులు. 1852 లో స్టార్మ్ ప్రచురించిన కవితా సంకలనం పాడుకోడానికి వీలుగా, ఆహ్లాదకరంగా సాగిన రచన. ప్రేమను, ప్రకృతిని, దేశభక్తిని గురించి స్టార్మ్ వ్రాసిన కవితలు బహుళంగా ప్రజాదరణ పొందాయి.

స్టార్మ్ 1853 లో హసుమ్‌లో న్యాయవాది గా పనిచేశాడు. డేనిష్‌వారు స్కెల్స్‌విగ్‌ను ఆక్రమించిన పుడు పోట్స్‌డామ్‌కు తరలి వెళ్లాడు. ఈ దశలోని స్టార్మ్ రచనలలో ప్రగాఢమైన దేశభక్తి కనిపిస్తుంది. 1864 లో మేజిస్ట్రేటుగా పనిచేసి, స్కెల్స్‌విగ్ స్వాతంత్ర్యం

పొందిన తరువాత తిరిగి అక్కడికి వెళ్ళాడు. ఆయన భార్య మరణానంతరం 1865 లో *టిఫే స్కాటన్* అనే కవితా సంకలనం ప్రచురించాడు. అప్పటికే ఆయన నవలా రచనపై మొగ్గు చూపటం ప్రారంభించాడు.

1850 లో వ్రాసిన నవల *ఇమ్మెన్సీ* లో బాల్యావస్థ లోని ఆనందాన్ని గురించి వ్రాశాడు. పెరిగే వయస్సు తరిగే ఆనందం గురించి *నా స్టాల్జిక్ టోన్* (గతాన్ని స్మరించి దిగులు చెందే రీతి) లో వ్రాయబడిన నవల ఇది. రచయితగా ఎదిగిన తర్వాత మనశ్శాస్త్రం, వాస్తవిక సమస్యలు, సామాజిక సమస్యలు, విధితో మనిషి పోరాటం వంటి గంభీరమైన ఇతివృత్తాలతో రచనలు చేశాడు. ఈయన వ్రాసిన ఇతర రచనలు *పోల్ పోపెన్స్ పాలర్* (1874), *ఆక్విస్ సైబిమస్* (1875), *ఇమ్ స్కాలాన్* (1861), *డెర్‌స్కిమిల్ రైటర్* (1888), *ది రైడర్ ఆన్ ది లైట్ హార్స్* (1917) పేర్కొనదగ్గవి. ఇతడు 1888 జూలై 4 న మరణించాడు.

భార్గవి.

**స్టాషియస్ (45-96) :** ప్రముఖ లాటిన్ రచయిత. లాటిన్ సాహిత్య రజతయుగం (18-133) లోని ప్రముఖ సాహితీపరులలో ఒకడు. రోమన్ మహాకావ్య (Epic) రచయితగా, భావగీత (Lyric) రచయితగా ఆనాటి కవులలో మేటి అనిపించుకొనిన వాడు. ఆయన అప్పు డప్పుడు వ్రాసిన కవితలను అనువదించి *సిల్వే* (Forests) అనే పేరుతో ప్రచురించటం జరిగింది. ఈ కవితలు సాహిత్యపు విలువలకే గాక ఆ నాటి భాగ్యవంతుల జీవన పద్ధతులను తెలియజేసేవిగా కూడా ప్రాముఖ్యాన్ని సంతరించుకొన్నాయి.

ఆ నాటి చక్రవర్తి 'డొమీషియన్' (Domitian) ఆస్థానంలో ఉంటూ 89 ప్రాంతంలో ఆయన నుండి పారితోషికాన్ని పొందాడు. ఆస్థాన విద్వాంసుల మూస లోనే ఈ కవి చక్రవర్తి పొగడ్తకు తన మేధను, విద్వత్తును చాలా భాగం వెచ్చించాడు. ఆయన కవితా రీతి దోష రహితం కాకపోయినా ఒడ్డును ఒరుసు కొంటూ ఉత్సాహంగా పరుగులు తీసే వాగు వంటిది. *సిల్వే* లోని 32 కవితలలో 5 చక్రవర్తిని, ఆయన అనుయాయులను పొగడటానికే వ్రాశాడు. మరి కొన్ని ధనవంతులైన తన మిత్రుల, పరిచయస్థుల భోగ లాల సనూ, వారి భవంతులనూ, తోటలనూ వర్ణించటానికి వ్రాశాడు. వ్యక్తిగత బాధలు, కుటుంబంలోని ఆదరణ, ఆప్యాయతలు మొదలైన అంశాల మీద తక్కువ కవితలు వ్రాశాడు.

ఈ రచయిత *థెబియాడ్* అనే 12 సంపుటాల మహా కావ్యాన్ని వ్రాశాడు. పాలినీసిస్, ఎటియోక్లీస్ అనే ఇద్దరు సోదరుల మధ్య ఆనాటి 'థెబిస్' సింహాసనానికై జరిగిన సంఘర్షణ దీని ఇతివృత్తం. దీనిలో వర్జిల్ పోకడలు, అను కరణలు చాలా కనిపిస్తాయి. ఈ నాటకంలో అతిశయోక్తి మితిమించి కనిపిస్తుంది. కాని, నాటకానికి ప్రాణమైన సంఘర్షణతో కూడిన వాతావరణం, శక్తిమంతమైన విషాద సూచనలు ఈ రచనకు ప్రాణం పోశాయి. *అఖిలీడ్* (Achilleid) అనే మరొక మహాకావ్యాన్ని స్టాషియస్ ప్రారంభించాడు గాని దానిలో 2 భాగాలు మాత్రమే పూర్తిచేయగలిగాడు. జె. హెచ్. మోజ్లీ ఈయన రచన లన్నింటినీ ఆంగ్లంలోకి అనువదించాడు.

కె.జి.మూర్తి.

**స్టిఫ్టర్, అడాల్ బర్ట్ (1805-1868) :** ఆస్ట్రియన్ నవలా రచయిత. ఈయన రచనలలో సామాన్యుల జీవితాలలోని సుగుణాలను ఏర్చి పేర్చి మహోన్నత కావ్యాలుగా మలచాలన్న తపన కనబడుతుంది. ఇతని తండ్రి లినన్ బట్టలు నేసి, అమ్మేవాడు. స్టిఫ్టర్‌కు తన చుట్టూ పనిచేసే కార్మికుల, శ్రామికుల జీవితాలను పరిశీ లించి, తన రచనలకు ఇతివృత్తంగా ఎన్నుకోడానికి మంచి అవకాశం లభించింది.

స్టిఫ్టర్ బాల్యంలో 'క్రెమ్‌సన్‌స్టర్ అబే' అనే స్కూలులో చదువుకొని, వియన్నాలో న్యాయశాస్త్రం అభ్యసించాడు. సైన్సు మీద మక్కువతో దానిని కూడా అధ్యయనం చేశాడు కాని డిగ్రీ తీసుకోలేదు. రచయితగా, కళాకారు డుగా నిలద్రొక్కుకోవడానికి చాలా శ్రమ పడ్డాడు.

ఇతని రచనలు: *డెర్ కాండర్* (1840), *ఫెల్డ్ బ్లూమెన్* (1841), *మై గ్రేట్ గ్రాండ్ ఫాదర్స్ పోర్ట్ ఫోలియో* (1842), *బింటా* (1944).

1848-50 లో రాజకీయాలలో పాల్గొని స్టిఫ్టర్ విద్యావిధానాల సంస్కరణ కొరకు పోరాడాడు. 1850 లో లింజ్ పాఠశాలలకు ఇన్‌స్పెక్టర్‌గా నియమించ బడ్డాడు. *డెర్ నాక్సోమర్* (1857) అనే నవలలో ఒక యువ కుడు చిన్నతనం నుండి చదువుకొనడానికి పడే పాట్లను, సమాజంతో అతని ఘర్షణను చక్కగా చిత్రించాడు. *విటికో* (1865-67) అనే ఇతని ప్రముఖమైన నవలలో కూడా న్యాయం కొరకు, శాంతి కొరకు యువకులు పడే తపన, పోరాటం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

భార్గవి

**స్టీఫెన్, సర్ లెస్లీ (1832-1904) :** ఆంగ్ల రచ యిత, పేరెన్నికగన్న విమర్శకుడు, పండితుడు, *డిక్షనరీ*

*ఆఫ్ నేషనల్ బయోగ్రఫీకి* తొలి సంపాదకుడు. ఈటన్, లండన్, కేంబ్రిడ్జ్‌లలో విద్యాభ్యాసం చేసి, మతాధికారిగా కొంతకాలం పనిచేసి, డార్విన్ ప్రకటించిన పరిణామ సిద్ధాంత ప్రభావంతో మతంలో విశ్వాసాన్ని కోల్పోయి, తన పదవులను వదులుకొని లండన్‌లో స్థిరపడి రచనా వ్యాసంగానికే జీవితం అంకితం చేశాడు.

అనేక వార, పక్ష, మాస పత్రికలలో ఈయన వ్యాసాలు ప్రకటితం కావటంతో రచయితగా, పండితుడుగా గుర్తింపు లభించింది. ఈయన విమర్శనా వ్యాసాలు *అవర్స్ ఇన్ ఏ లైబ్రరీ* (1874-79) గా ప్రకటితం అయాయి. నవలా సాహిత్యం పట్ల శ్రద్ధ చూపి, నవలల మీద తొలి విమర్శకుడుగా విమర్శ చరిత్రలో సుస్థిరమైన స్థానాన్ని సంపాదించుకొన్నాడు. సంపాదకుడుగా ఈయన థామస్ హార్డీ, ఆర్. ఎల్. స్టీవెన్సన్, ఎడ్మండ్ గాస్, హెన్రీ జేమ్స్ వంటి రచయితలను ప్రోత్సహించాడు.

*హిస్టరీ ఆఫ్ ఇంగ్లీష్ థాట్ ఇన్ ది ఎయిటీన్త్ సెంచరీ* (1876) అనేది ఈయన రచనలలో ఉత్తమోత్తమ మైనది. 1882 లో ప్రచురితమైన *సైన్స్ ఆఫ్ ఎథిక్స్* హేతువాద సంప్రదాయానికి స్టీఫెన్ అందించిన మణిపూస. *డిక్షనరీ ఆఫ్ నేషనల్ బయాగ్రఫీ* లోని మొదటి 26 సంపుటాలకు సంపాదకత్వం వహించటమే గాక, వాటిలోని అనేక జీవిత చరిత్రలను ఆయనే స్వయంగా వ్రాశాడు. ఈ డిక్షనరీ ఆయనకు గౌరవాన్ని, గుర్తింపును తెచ్చిపెట్టింది. 1902 లో *నైట్ కమాండర్ ఆఫ్ ది బాత్* బిరుదును అందుకొన్నాడు.

కె.జి.మూర్తి.

**స్టీల్, సర్ రిచర్డ్ (1672-1729) :** ప్రముఖ ఆంగ్ల వ్యాసకర్త, నాటక రచయిత, పత్రికా రచయిత, రాజకీయ నాయకుడు.



ఈయన 'ఎడిసన్' తో కలసి నడిపిన *ది టేట్లర్* (The Tatler), *ది స్పెక్టేటర్* (The Spectator) పత్రికలతో బహుజనాదరణ పొందాడు. 'ఎడిసన్' తో ఈయనకు ఏర్పడిన సాహిత్య స్నేహబంధం చెప్పకోదగింది, చాలా ఫలవంతమయింది. 1701 లో *ది క్రిస్టియన్ హీరో* అనే ఒక నీతి చంద్రిక వంటి రచన చేశాడు. సైన్యంలో తాను పని చేసేటప్పుడు ప్రత్యక్షంగా చూసిన క్రమశిక్షణా రాహిత్యం, అవినీతి పట్ల ఏర్పడిన విముఖతే ఈ రచనకు ప్రోద్బలం. అయితే తన వ్యక్తిగత జీవితంలో వాటిని ఎన్నడూ అమలు పరిచినవాడు కాకపోవటంతో శ్రీరంగనీతులు వల్లెవేసే మోసగాడుగా విమర్శించబడ్డాడు. కాని ఆయన నిజాయితీని మాత్రం శంకించవలసిన అవసరం లేదు. ఆ విమర్శలతో విసుగెత్తి 1701 లో *ది ఫ్యూనరల్* అనే సుఖాంత నాటకాన్ని వ్రాసి ప్రచురించాడు. అది విజయవంతకావడంతో 1703 లో *ది లైయింగ్ లవర్* అనే సుఖాంత నాటకాన్ని ప్రచురించాడు. ఇందులో కూడా నీతిపాఠాలు ఎక్కువగానే ఉన్నప్పటికీ సాహిత్య చరిత్రలో తొలి 'సెంటిమెంటల్ కామెడీ' గా దీని కొక స్థానమేర్పడింది. నాటకంగా ఇది విఫలమైనా ఈ రచయితను గురించి తెలుసుకొనేందుకు ఇది ఉపయోగ పడుతుంది.

1705 లో ప్రచురితమైన *ది టెండర్ హజ్‌బెండ్* కొంత వరకు జనాదరణ పొందిందని చెప్పవచ్చు. దీని కర్తృత్వంలో ఎడిసన్ హస్తం కూడా ఉంది. ఇవేవీ ఆయనకు ధనాన్ని సంపాదించి పెట్టకపోవటంతో ధనార్జనకై ఇతర మార్గాలను వెతుక్కోవలసి వచ్చింది. జార్జ్ రాకుమారునికి లేఖలు, ఉపన్యాసాలు వ్రాసి పెట్టే ఉద్యోగంలో నియమితు డయాడు. 1705 లో 'మార్గరెట్ స్ట్రెచ్' అనే ధనిక వితంతువును వివాహం చేసుకొన్నాడు. ఆమె ధనం కోసమే ఆమెను వివాహం చేసుకొని ఉండవచ్చును. ఈమెతో ఆయన వైవాహిక జీవితాన్ని గురించి మనకు ఎక్కువగా తెలియదు. 1706 లో ఆమె మరణించటంతో స్టీల్‌కి ఆమె ఆస్తి సంక్రమించింది. సంవత్సరం తిరుగకుండానే ధనవంతురాలైన 'మేరీ స్కర్లాక్' ను తిరిగి వివాహం చేసుకొన్నాడు. ఆమెను అమితంగా ఆరాధించినట్లు వారిద్దరిమధ్య సాగిన ఉత్తర ప్రత్యుత్తరాలు తెలియజేస్తాయి. ఆ ఉత్తరాలు స్టీల్ వ్యక్తిత్వాన్ని, ఆశలను, అభిప్రాయాలను కూడా చక్కగా తెలుపుతాయి.

*ది లండన్ గెజిట్* రచయితగా కొంతకాలం పని చేశాడు. ఆ సందర్భంగా విగ్ (Whig) నాయకులతో పరిచయం ఏర్పడింది. 1709 లో వారానికి 3 సార్లు ప్రకటితమయే *ది టేట్లర్* (The Tatler) అనే పత్రికను ప్రారంభించి సాహిత్యంలో తనపేరును శాశ్వతం చేసుకొన్నాడు. 'ఐజాక్ బికర్ స్టాఫ్' అనే కలం పేరుతో ఇందులో ఆయన విజ్ఞాన వినోదాలకు ప్రాధాన్య మివ్వ

టంతో ఈ పత్రిక బహుజనాదరణ పొందింది. స్టీల్ ఈ పత్రికలోని తన రచనల ద్వారా 'సత్యం, నిష్కపటత్వం, గౌరవ మర్యాదలు, స్వచ్ఛత అనేవే జీవితానికి నిజమైన ఆభరణాలు' అని ప్రచారం చెయ్యటమే తన ధ్యేయమని పేర్కొన్నాడు. నైతిక విలువల పట్ల విశ్వాసం, నిర్భీతి, నిజాయితీ, దయాశీలత ఆయన వ్యక్తిత్వపు లక్షణాలు. శైలీ సౌలభ్యం ఆయనకు సహజంగా అబ్బిన విద్య. *ది టేట్లర్* పత్రికకు సంబంధించి 271 సంచికలను ఆయనే వ్రాశాడు. ఎడిసన్ 46 మాత్రమే వ్రాశాడు. ఈ పత్రిక విఫలం కావటానికి బహుశః అప్పటి రాజకీయ వాతావరణమే కారణమై ఉండవచ్చు.

1711 మార్చి 1 న ప్రారంభమైన *ది స్పెక్టేటర్* పత్రిక రాజకీయాలకు దూరంగా ఉంటూ ఎక్కువ విజయాన్ని సాధించింది. ఎడిసన్ పాండిత్యమూ, స్టీల్ పత్రికా రచనా నైపుణ్యమూ ఒకదాని కొకటి తోడై ఈ పత్రిక బహుజనాదరణ పొందటానికి కారణం అయాయి. ఈ పత్రిక ఆ నాటి సామాజిక, సాంఘిక వ్యవస్థకు అద్దం పడుతుంది.

ఇవే కాక రాజకీయపు రంగు పులుముకొన్న *ది ఇంగ్లీష్‌మన్* అనే మితవాద పత్రిక *ది గార్డియన్* అనే పత్రికలకు కూడా స్టీల్ విస్తృతంగా వ్రాశాడు. *ది లవర్, ది రీడర్, టౌన్‌టాక్, ది ప్లెబియన్* అనే పత్రికలు కూడా- ఆయన రచనల వల్ల లబ్ధి పొందాయి. ఆయన వ్రాసిన వ్యాసాలు ఆ నాటి సామాజిక, రాజకీయ పరిస్థితులపై విమర్శలు, వ్యాఖ్యానాలుగా మాత్రమే గాక సాహిత్య పరంగా కూడా చాలా విలువైనవి.

విగ్గుల తరపున 1713 లో పార్లమెంటుకు ఎన్నికై, తన పత్రికలలో, కరపత్రాలలో టోరీలను విపరీతంగా దూషించినందుకు పార్లమెంటునుండి బహిష్కరణ పొందాడు. 1714 లో డ్రూరీ లేన్ థియేటర్‌కు గవర్నర్‌గా నియమితు డవటం, 1715 లో 'నైట్' (Knight) బిరుదాన్ని స్వీకరించటం జరిగింది. అదే సంవత్సరంలో తిరిగి పార్లమెంటుకు ఎన్నికయాడు.

ఆయన నాటకాలలో *ది కాన్షస్ లవర్స్* బహుశా ఆ శతాబ్దంలోనే ఎక్కువ జనాకర్షణ సంపాదించుకొన్న నాటకం అని చెప్పవచ్చును. అంతేకాదు, అది అత్యుత్తమ 'సెంటిమెంటల్ కామెడీ' గా గుర్తింపు పొందింది.

కె.బి.మూర్తి

**స్టీల్ హోల్ స్టీన్, అన్నె-లూయీ- జర్మైన్ నెకర్ (1766-1817) :** ఫ్రెంచ్-స్విస్ రచయిత్రి, రాజకీయ సిద్ధాంత ప్రవక్త్రి, సంభాషణ చతుర. ఈమె ఆనాటి యూరప్ సంస్కృతికి ప్రతీక అని చెప్పవచ్చు. సాహిత్య వేత్తలను, రాజకీయ తాత్త్వికులకు సమావేశ స్థలంగా ఆమె ఒక సెలూన్ నడిపింది. తన రచనలతో కంటె కూడా తన భావాలతో మేటి రచయితలను, విమర్శకులను ముగ్ధులను గావించిన మేధావిని ఈమె. అనేక నవలలు, నాటకాలు, వ్యాసాలు, చరిత్ర, స్వీయ అనుభవాలు, కొన్ని కవితలు ఆమె రచించింది.

21 సంవత్సరాలు—నిండకపూర్వమే *సోఫీ ఔ లె సెంటిమెంట్స్ సీక్రెట్స్* (1786) అనే రొమాంటిక్ నాటకాన్ని, *జేన్ గ్రే* (1790) అనే విషాదాంత నాటకాన్ని ఆమె రచించింది. *లెటర్స్ సర్ లె ఒవరేజెస్ ఎట్ లె కేరక్టర్ డి జె.జె.రూసో'* (1788), (Letters on the works and the character of J.J. Rousseau, 1789) అనేది ఈమెకు బహుళ ప్రచారాన్ని సమకూర్చింది. ఆమె భావనా స్రవంతిలో ఒకే మూసలోకి రావటానికి వీలులేని రూసోలోని ఉత్సాహం, ఆవేశం, 'మోంటెస్క్యూ' లోని హేతువాదం ఒక అసాధారణ రీతిలో సంయోగం చెందటం ఈ లేఖలలో, వ్యాసాలలో మనకు కనిపిస్తుంది. ఫ్రెంచ్ విప్లవాన్ని సమర్థిస్తూనే బ్రిటిష్ పార్లమెంటరీ రాజరికాన్ని ప్రయోజనకారిగా ఆమె వర్ణించింది.

విప్లవానంతరపు భయంకర వాతావరణంలో ఇముడలేక 1793 లో స్విట్జర్లాండులోని కాపెట్ లో గల తమ ప్రాచీన గృహానికి ఆమె తరలి వెళ్లింది. కాపెట్‌లోని ఆ గృహం పశ్చిమ జర్మనీలోని ఆ నాటి మేధావులందరికి సమావేశస్థల మైంది. దీనితో ఈ రచయిత్రి కీర్తి దేశ దేశాలా వ్యాపించింది. 1794 లో ఫ్రాన్స్‌లో శాంతి నెలకొనడంతో తిరిగి పారిస్ చేరింది. అనేక రాజకీయ, సాహిత్య వ్యాసాలు ప్రచురించటం మొదలు పెట్టింది. వాటిలో 1796 లో వ్రాసిన *డెల్ ఇన్‌ఫ్లుయెన్స్ డెస్ పాషన్స్ సర్ లె బోన్‌హిర్ డెస్ ఎండివిద్యు సే ఎట్ డెస్ నేషన్స్* (A Treatise on the influence c. .he passions upon the happeness of individuals and of nations, 1798) అనే వ్యాసం యూరప్ లోని రొమాంటిక్ ఉద్యమానికి అతిముఖ్యమైన పత్రంగా భావించడం జరిగింది.

1800 వ సంవత్సరంలో ఆమె రచించిన *ఏ ట్రీటియ ప్రైజ్ ఆన్ ఏన్షెంట్ అండ్ మోడర్న్ లిటరేచర్* అనేది సాహిత్య పరంగా అది ఏ జాతి నుండి ఉద్భవించిందో ఆ జాతి నైతిక, చారిత్రక వాస్తవ పరిస్థితిని తెలియ

జెప్పేదిగా ఉండాలనేదే ఆమె ప్రగాఢ విశ్వాసం. దీనినే హిపోలైట్ టేన్ *పాజిటివిజమ్* అనే సిద్ధాంతంగా రూపొందించాడు. ఇంతేకాక యూరప్‌లోని ఉత్తర, దక్షిణ ప్రాంతాల సాహిత్య సంప్రదాయాలు ఒకదాని కొకటి సంబంధం లేనివని, పరస్పర విరుద్ధమైన వని ఆమె విశ్వసించింది. అయితే ఉత్తర ప్రాంతపు (Mordie) సంప్రదాయాలను కూడా ఆమె బలపరిచినా, దక్షిణ ప్రాంతపు (Classical) సంప్రదాయాలు అంటే వ్యక్తి గతంగా ఆమెకు ఇష్టం. ఆమె 1802 లో వ్రాసిన *కోరిన్* అనే నవలలు ఆమె సాహితీ సిద్ధాంతాలను కొంతవరకు తెలియజేస్తాయి.

నెపోలియన్‌కు వ్యతిరేకినిగా గుర్తింపు పొందటంతో ఆమెను పారిస్‌నుండి 1803 లో బహిష్కరించారు. అప్పటినుండి ఆమె జర్మన్, ఇటలీలలో పర్యటించటం ప్రారంభించింది. 1810 లో ఆమె వ్రాసిన *డి ఆలిమేన్* (Germany - 1813) జర్మన్ మర్యాదలను, సాహిత్యాన్ని, కళను, తత్త్వశాస్త్రాన్ని, నైతిక విలువలను విశ్లేషిస్తూ ఆమె వ్రాసిన గ్రంథం. నెపోలియన్ ఆగ్రహాన్ని తట్టుకోలేక చివరకు 1813 లో ఆమె ఇంగ్లండు చేరింది. కాని ఫ్రాన్స్‌లో పరిస్థితులు చక్కబడ్డ తరువాత ఆమె స్వదేశానికి తిరిగి వెళ్లింది. 1817 లో ఆమె మరణం ఆనాటి సాహితీ కారులకు సాహితీ పరులకు, అత్యంత విషాదాన్ని కలుగ జేసింది. ఆమె చేసిన రచనలు, వ్రాసిన గ్రంథాల కంటె సాహిత్య పరమైన, తత్త్వపరమైన, చరిత్రపరమైన భావ సంపదకే ఆమె ఎక్కువ కీర్తి ప్రతిష్ఠలను సంపాదించింది.

కె.జి. మూర్తి

**స్టీవర్ట్, డగ్లాస్ (1913--) :** ఆస్ట్రేలియన్ కవి, విమర్శకుడు, నాటక రచయిత. కల్పనల ద్వారా గతానికి ప్రాణం పోసి తన నాటకాలలో సజీవంగా నిలబెట్టి ఆస్ట్రేలియన్ జాతీయ సంప్రదాయం ఒకటి ఉన్నదనే అభిప్రాయాన్ని కలిగించిన మేటి రచయిత. విక్టోరియా విశ్వవిద్యాలయంలో చదువు పూర్తిచేసికొని పత్రికా రచనను వృత్తిగా స్వీకరించాడు. 1937 లో తన తొలి కవితా సంపుటి *గ్రీన్ లయన్స్* (Green Lions) ను తానే ప్రచురించు కొన్నాడు. 1938 లో *ది బులెటిన్* అనే పత్రికలోని *రెడ్ పేజ్* (Red Page) కి సంపాదకుడుగా నియమితు డయాడు. 1940 నుండి 1961 వరకు దానిని నిర్వహించాడు. ఆ తరువాత 1972 వరకు ఒక ప్రచురణ సంస్థకు సలహాదారుడుగా ఉన్నాడు.

రంగస్థల నాటకాలలో కంటె రేడియో నాటకాలలో ఎక్కువ విజయం సాధించాడు స్టీవర్ట్. స్కాట్ అంటార్కిటికా యాత్రను తెలిపే *ది ఫైర్ ఆన్ ది స్నో* అనే రేడియో నాటకం 1941 లో ప్రసారమైంది. తన స్వదేశమైన న్యూజీలాండ్ లోని 'మావోరీ' తెగకు చెందిన గాథ ఆధారంగా దీనిని రూపొందించాడు. 1943 లో *నెడ్ కెల్లీ*, 1947 లో *షిప్‌రెక్*, 1960 లో *ఏన్ హిస్టారికల్ కామెడీ* అనే మూడు చారిత్రక నాటకాలు కూడా వ్రాశాడు.

1936-67 ల మధ్య ఈయన వ్రాసిన కవితలను *కలెక్టెడ్ పొయెమ్స్* అనే సంపుటిగా 1967 లో ప్రచురించటం జరిగింది. 1944 లో *ఏ గర్ల్ విత్ రెడ్ హెయిర్ అండ్ అదర్ స్టోరీస్* అనే పేరుతో ఆయన వ్రాసిన కథ లన్నింటినీ చేర్చి ప్రచురించటం జరిగింది. 1948 లో *ది ఫ్లెష్ అండ్ ది స్పిరిట్-ఏన్ ఔట్‌లుక్ ఆన్ లిటరేచర్*, 1975 లో *ది బ్రాడ్ స్ట్రీమ్: ఏ స్కెచ్ ఆఫ్ ఆస్ట్రేలియన్ లిటరేచర్* అనే విమర్శక గ్రంథాలు కూడా స్టీవర్ట్ రచించాడు.

కె.జి.మూర్తి

**స్టీవెన్స్, వాలెస్ (1879-1955) :** అమెరికన్ కవి. వాస్తవికతకూ, వాస్తవికతను గూర్చిన వ్యక్తి భావనకూ మధ్య జరిగే సంఘర్షణను చిత్రించడానికి ప్రయత్నించిన కవి. జీవితంలో చివరి రోజులలో గాని స్టీవెన్స్‌కి ప్రముఖ రచయితగా గుర్తింపు రాలేదు.

స్టీవెన్స్ మూడు సంవత్సరాలు హార్వర్డ్ యూనివర్సిటీలో చదివాడు. కొద్ది కాలం పాటు న్యూయార్క్‌లోని హెరాల్డ్ ట్రిబ్యూన్‌లో పనిచేసి, 1904 లో న్యూయార్క్ లా స్కూల్ నుంచి పట్టభద్రుడై, న్యూయార్క్ సిటీలోనే లాయరుగా ప్రాక్టీసు చేశాడు. *పొయెట్రీ* అనే ఆయన తొలి కావ్యం 1914 లో వెలువడింది. తరువాత అడపాదడపా ఆయన సాహిత్య పత్రికలలో పద్యాలు ప్రచురిస్తూ వచ్చాడు. 1916 లో హార్ట్‌ఫర్డ్‌లోని ఒక ఇన్స్యూరెన్స్ ఫర్మ్‌లో చేరి, 1934 లో దానికి వైస్ ప్రెసిడెంట్ అయాడు. చనిపోయేవరకూ అతడు ఆ పదవిలో కొనసాగాడు.

*హార్మోనియం* (1923) అనే ఆయన తొలి గ్రంథం 100 కాపీలు కూడా ఖర్చు కాలేదు. అయితే దాని మీద అనుకూలమైన సమీక్షలూ, విమర్శలూ వచ్చాయి. 1931 లోనూ, 1947 లోనూ అది పునర్ముద్రణ పొందింది. మూడు దశాబ్దాల అనంతరం అతని మరొక కవితా సంకలనం *ది హోల్ ఆఫ్ హార్మోనియం* వెలువడింది.

తన తొలి రచనలలో ఆశ్చర్యకరమైన శబ్ద సౌందర్యాన్ని ఆయన ప్రదర్శించాడు. తరువాతి రచనలలో

శాబ్దికమైన మెరుగులు తగ్గి తాత్త్వికశక్తి ప్రాబల్యం వహించింది. *హార్మోనియం* అనే సంకలనంలోని *లీ మోనోకిల్ డీ మోన్ ఓంకుల్, సండే మార్నింగ్* వంటి స్టీవెన్స్‌కి మిక్కిలి ఇష్టమైన పద్యాలు ఉన్నాయి. *డామినేషన్ ఆఫ్ బ్లాక్, ది ఎంపరర్ ఆఫ్ ఐస్‌క్రీమ్* వంటి పద్యాలు అనేక కవితా సంకలనాలలో చేర్చబడ్డాయి. *ది ఆరోరాస్ ఆఫ్ ఆటమ్* (1950) తరువాత *స్టీవెన్స్ కలెక్టెడ్ పొయెమ్స్* (1954) ప్రచురించాడు. దానికే అతనికి కవిత్వానికి ఇచ్చే పులిట్జర్ బహుమతి వచ్చింది. *ది నెససరీ ఏంజెల్* అనే విమర్శక వ్యాసాల సంపుటిని కూడా స్టీవెన్స్ 1951 లో ప్రచురించాడు.

1955 లో స్టీవెన్స్ మరణించిన తరువాత 1957 లో *శామ్యూయెల్ ఫ్రెంచ్ మోర్స్* అంతవరకూ గ్రంథ రూపంగా రాని ఆయన పద్యాలనూ, నాటకాలనూ, వచన రచనలనూ ఎడిట్ చేసి *ఓపస్ పోస్ట్యుమస్* అనే గ్రంథంగా ప్రచురించాడు. ఈ కవి కుమార్తె హోలీ స్టీవెన్స్ *సూవెనీర్ అండ్ ప్రొఫెసీస్, ది యంగ్ వాలెస్ స్టీవెన్స్* (1977) లలో స్టీవెన్స్ చిన్న నాటి రచనలనూ, డైరీలనూ ప్రచురించింది. స్టీవెన్స్ కవితల మీద హెరాల్డ్ బ్లూమ్ *వాలెస్ స్టీవెన్స్; ది పొయెమ్స్ ఆఫ్ అవర్ క్లైమేట్* (1977) అనే విమర్శనాత్మక రచన ప్రచురించాడు.

బొ.శ్రీ.

**స్టీవెన్సన్, రాబర్ట్ లూయీ (1850-94)** : స్కాటిష్ కవి, వ్యాసకర్త, నవలా రచయిత. ఈయన అనేక యాత్రా గ్రంథాలను కూడా వ్రాశాడు. *ట్రెజర్ ఐలాండ్* (1881), *కిడ్‌నాప్‌డ్* (1886), *స్ట్రేంజ్ కేస్ ఆఫ్ డాక్టర్ జెకిల్ అండ్ మిస్టర్ హైడ్*(1886), *ది మాస్టర్ ఆఫ్ బాలంత్రె* (1889) ఈయన రచించిన సుప్రసిద్ధ నవలలు. వృత్తి పరంగా న్యాయవాది, కాని న్యాయవాదిగా కంటె రచయితగానే ఎక్కువకాలం గడిపాడు. విశ్వవిద్యాలయంలో చదువుకొనే రోజులలోనే మధ్యతరగతి గౌరవ మర్యాదల పేరిట జరిగే



అన్యాయాలను, అక్రమాలను, బానిస పద్ధతులను తీవ్రంగా గర్హించి బాహాటంగా ఎదుర్కొన్నాడు ఈయన. విస్తృతంగా ప్రయాణాలు చేసిన ఈ రచయిత 1878 లో *ఏన్ ఇన్‌లాండ్ వాయేజ్*, 1879 లో *ట్రావెల్స్ విత్ ఏ డాంకీ ఇన్ ది సివెన్నెస్* అనే గ్రంథాలు వ్రాశాడు. చిన్నతనంలోనే ఆయన వ్రాసిన అనేక వ్యాసాలు పత్రికలలో ప్రచురితంకావటంతో రచయితగా త్వరలోనే గుర్తింపు పొందాడు.

1895 లో వ్రాసిన *ది అమెచూర్ ఎమిగ్రెంట్*, 1892 లో వ్రాసిన *ఎక్రాస్ ది ప్లెయిన్స్* అనే గ్రంథాలు ఈ రచయిత తీవ్ర అనారోగ్యంతో బాధపడుతూ, చేతిలో దమ్మిడీ కూడ లేకుండా అమెరికా ఎట్లా చేరాడో తెలుపుతాయి. 1880 లో *ఫానీ వాండర్ గ్రిఫ్ట్ ఆస్బార్న్* అనే విడాకులు పొందిన అమెరికన్ మహిళను వివాహమాడాడు. తండ్రి ముందు అభ్యంతరం తెలిపినా వివాహమైం దని తెలిసిన వెంటనే ఆర్థికంగా ఈయనను ఆదుకొన్నాడు.

1881 లో *ట్రెజర్ ఐలాండ్* అనే కాల్పనిక నవల *యంగ్ ఫోక్స్* అనే బాలల పత్రికలో సీరియల్‌గా ప్రచురించాడు. ఆ పత్రికలో దానికి 'సీ కుక్' అని పేరుపెట్టాడు. అనారోగ్యం వెంటాడుతున్నా దానిని పూర్తిచేసి 1885 లో *ప్రిన్స్ ఆటో*అనే నవలను ప్రచురించాడు. *ట్రెజర్ ఐలాండ్* లో సాహస కార్యాలను చేయాలనే ఉత్కంఠ, దానికి అనువైన వాతావరణం, పాత్రసృష్టి, చక్కని శైలి అనే ఆకర్షణీయమైన హంగులతో సర్వసుందరంగా చూపటంతో ఆ నవల అందరి మన్ననలను పొందింది. ఈ నాటికీ అది అత్యుత్తమ నవలలలో ఒకటిగా భావింపబడుతూనే ఉంది. అందులోని సాహస కార్యాలు పిల్లల నాకర్షిస్తే, మనిషిలోని ద్వంద్వ ప్రకృతిని ఈ నవల చూపిన రీతి పెద్దల నాకట్టుకొంటుంది.

అనారోగ్య కారణంగా స్టీవెన్సన్ దక్షిణ ఫ్రాన్స్‌లో కొంతకాలం ఉండవలసి వచ్చింది. అక్కడే 1881 లో *ఏ చైల్డ్స్ గార్డెన్ ఆఫ్ వర్స్* పూర్తిచేసి, 1888 లో *ది బ్లాక్ ఏరో-ఏ టేల్ ఆఫ్ టూ రోజెస్* ప్రారంభించాడు. 1884 నుండి 87 వరకు ఇంగ్లండులోని బోర్న్‌మౌత్‌లో గడిపాడు. ఆ సమయంలోనే ప్రముఖ నవలా రచయిత హెన్రీ జేమ్స్‌తో పరిచయమైంది. అక్కడ ఉన్నప్పుడే *కిడ్‌నాప్‌డ్* (Kidnapped), *స్ట్రేంజ్ కేస్ ఆఫ్ డాక్టర్ జెకిల్ అండ్ మిస్టర్ హైడ్* నవలలను వ్రాశాడు. *కిడ్‌నాప్డ్* నవలలో స్కాట్లండ్ లోని ప్రకృతి సౌందర్యాలు, 18 వ శతాబ్దపు స్కాటిష్ చరిత్రకు సంబంధించిన

పరిశోధనా ఫలితాలు కనిపిస్తాయి. స్థానిక వాతావరణం, చరిత్ర, పాత్రలు ఒక దానితో ఒకటి పెనవేసుకొని ఒకదాని ప్రాముఖ్యాన్ని మరొకటి వెలుగులోకి తెచ్చేటట్లు రచింపబడిన ఈ నవల బహుజనాదరణ పొందుతూ ఉండటంలో ఆశ్చర్య పడవలసినదేమీ లేదు. 'డాక్టర్ జెకిల్' ఈ రచయితకు శాశ్వతత్వాన్ని తెచ్చి పెట్టినపాత్ర.

ఆగస్టు 1887 లో స్టీవెన్సన్ అమెరికా చేరాడు. ఆ వాతారణమైనా తన ఆరోగ్యాన్ని బాగుచేస్తుందేమో అని ఆశపడ్డాడు. కాని ఏమీ ప్రయోజనం కనబడ లేదు. అమెరికాలో ఈయనకు అమితమైన ఆదరణ లభించింది. తనకంటె ముందే తన కీర్తి అక్కడకు చేరిందని సంతోషించాడు. పత్రికలవాళ్లు, ప్రచురణ కర్తలు ఆయనకు పెద్ద మొత్తాలలో పారితోషిక మిచ్చి రచనలు చేయించుకొన్నారు. *స్క్రిబ్నర్స్* పత్రికకు వ్యాసాలు వ్రాశాడు. *ది మాస్టర్ ఆఫ్ బాలాంత్రె* అనే నవల ప్రారంభించాడు. నైతిక సందిగ్ధాల గజిబిజిని ఛేదించటానికి ఆయన చేసిన మరో ప్రయత్నమే ఈ నవల. నవల ఆసక్తికరంగానే సాగినా ముగింపు మాత్రం కృత్రిమంగా కనిపిస్తుంది.

1888 లో ఒక పెద్ద పడవను తన స్వంతానికి కుదుర్చుకొని కుటుంబంతో సహా దక్షిణ సముద్రాలలో విహారానికి బయలుదేరి, మార్క్వెసా దీవులకు, ఫాక రవా అటోల్, తాహితి, హోనలూలూ దర్శించాడు. ఈ యాత్రల ఫలితంగా *ఇన్ ది సౌత్ సీస్* (1896), *ఏ ఫుట్ నోట్ టు హిస్టరీ* (1892) అనే యాత్రా గ్రంథాలు వెలువడ్డాయి.

ఈయన తన జీవితకాలంలోనే రచయితగా ఘనమైన కీర్తిని పొందాడు. కాని మరణానంతరం విమర్శకులు ఆయనను అనుకరణ రచయితగా, చిన్నపిల్లల రచయితగా హేళన చేయటం జరిగింది. 1950 నుండి ఆయన పట్ల గౌరవం, ఆయన రచనలపట్ల ఆదరం పెరిగాయి, విజ్ఞులు ఆయనను శక్తిమంతమైన రచయిత అని అంగీకరించారు. విమర్శకులు ఆయన వ్యాసాలలో అపార మానవతా వాదాన్ని, మానవ ప్రకృతి విశ్లేషణను మెచ్చుకొన్నారు. ఆయన నవలలలో చరిత్రపరంగా, భౌగోళిక తత్త్వ పరంగా, మనో విశ్లేషణ పరంగా మనిషి చర్యలను విశ్లేషించి చూపాడని మెచ్చుకొన్నారు. ఆయన కథలు భయానకత, ఉత్కంఠలను సమపాళ్ళలో జీర్ణించుకొం టూనే నైతిక విలువలకు ప్రాముఖ్యాన్నిస్తాయి.

కె.జి. మూర్తి

**స్టెండాల్ (1783-1842)** : 19 వ శతాబ్దపు ఫ్రెంచ్ నవలా రచయిత. ఆయన నవలలు రాజకీయ, మనో వైజ్ఞానిక అంతర్ దృష్టికి ప్రసిద్ధి చెందాయి. స్టెండాల్ రచించి *లె రూజ్ ఎట్ లె నాయిర్* (1830 The Red and the Black), *లా ఛార్ట్రూస్ డి పార్మె* (1839) The Charterhouse of Parma) ప్రపంచ ఖ్యాతి గాంచిన నవలలు.

ఈ రచయిత బాల్యం అంత ఆహ్లాదకరంగా సాగ లేదు. క్రమశిక్షణ పేరుతో తండ్రి, పినతల్లి, ఇంటికి వచ్చి చదువు చెప్పే ఉపాధ్యాయుడు విధించిన ఆంక్ష లతో ఒంటరితనం, పగటి కలలు కనటం, అధికారం పట్ల, సమాజం పట్ల నిర్లక్ష్యం, కారణం లేని ఆగ్రహం అతనిలో అంకురించాయి. వీటి ప్రభావం ఆయన జీవితకాల మంతా కనిపిస్తూనే ఉంది. 17 సంవత్సరాల వయస్సప్పుడు ఉన్నతవిద్యకై స్టెండాల్ పారిస్ చేరాడు.

కాని 1800 వ సంవత్సరం మే నెలలో నెపోలియన్ సైన్యంలో చేరి మిలాన్ నగరానికి వెళ్లాడు. మిలాన్ నగర సౌందర్యం, ముఖ్యంగా అక్కడి స్త్రీల సౌందర్యంచూసి అతడు ముగ్ధు డయాడు. దాదాపు 18 మాసాల తరువాత సైన్యాన్ని వదిలి తిరిగి పారిస్ నగరం చేరుకొన్నాడు. నాటకాలు వ్రాసి మోలియర్‌కు వారసుడు కావా లనుకున్నాడు. కాని చదవటానికి పుస్తకాలు లేవు. పారిస్ సాంఘిక వాతావరణంలో ఇముడటానికి అవసరమైన ధనంగాని, వస్త్రాలుగాని తన వద్ద లేవు. పల్లె ప్రాంతపు తన ఉచ్చారణ, తన అలవాట్లు కూడ ఈయనను క్రుంగదీశాయి. ప్రేమ వ్యవహారా లన్నీ బెడిసికొట్టాయి. పద్య నాటకాలు వ్రాయాలని సంకల్పించి విఫలు డయాడు. అయితే బాధలు, వైఫల్యాలు, చేదు అనుభవాలు అన్నీ కలసి ఆయనను మహా నవలారచయితను చేశాయి.

కలం పేర్లతో ఆయన అనేక రచనలు చేశాడు. కాని స్టెండాల్ పేరుతో చేసిన తొలి రచన *రోమ్, నేపుల్స్ ఎట్ ఫ్లొరెన్స్ ఎన్.* 1822 లో *డి ఎల్ ఎమర్,* 1823 లో *రేసిన్ ఎట్ షేక్స్‌పియర్,* 1823 లో *వైడి రోశిని,* 1827 లో తొలి నవల *ఆర్మాన్స్,* 1829 లో *ప్రోమినేడ్స్ డాన్స్ రోమ్* వ్రాశాడు. 1830 లో వ్రాసిన *లెరూజ్ ఎట్ నాయిర్* ఆయనకు అమితమైన కీర్తిని ఆర్జించి పెట్టింది. 1830 జూలై విప్లవం తరువాత ఫ్రెంచ్ కాన్సల్‌గా కొన్ని చిన్న చిన్న దేశాలకు వెళ్లాడు. కాని అవేమీ ఆయనకు నచ్చ లేదు. ఆ కాలాన్ని రచ నలకు ఉపయోగించుకొన్నాడు. 1892 లో *లూసియన్ ల్యూవెన్* అనే నవల, 1890లో *వైడిహెన్రీ బ్రులార్డ్*

అనే స్వీయచరిత్రను (ఇది అసంపూర్ణము) వ్రాశాడు. తన జీవితంలో దాదాపు విజయ వంతమైనవని చెప్పదగిన కొన్ని ప్రేమ వ్యవహారాలను తలుచుకొంటూ ఆనందించిన ఈ రచయిత వాటి నన్నింటిని పొందు పరుస్తూ కేవలం 52 రోజులలో *లా ఛార్ట్రూస్ డిపర్మె* ను రచించాడు.

సుఖ సంతోషాలు జీవితంలో ఎండమావులే అయిన ఈ రచయితకు చివరి దశలో *లా ఛార్ట్రూస్ డి పర్మె* ను శ్లాఘిస్తూ బాల్జాక్ వ్రాసి ప్రకటించిన వ్యాసం పన్నీటి జల్లు అయింది. ఆయన జీవిత చరిత్ర వ్రాసిన అనేకులు ఆయనను అన్ని రంగాలలో విఫలమైనవాడుగా చిత్రించారు. కాని ఈ నాడు ప్రతి విమర్శకుడు ఆయనను 19 వ శతాబ్దపు మేటి ఫ్రెంచ్ రచయితలలో ఒకడుగా పేర్కొంటున్నారు. ఫ్రాన్స్, బ్రిటన్, అమెరికా దేశాలలోని యువతరం ఆయన రచనల పట్ల ఎక్కువ ఆసక్తిని చూపిస్తున్నది. ఆయన నవలలలోని నాయకులు తమ చుట్టూ ఉన్న సమాజంపై, సాంఘిక నియమాలపై సాగించిన ఒంటరి పోరాటం ఈ నాటి యువతను ఆకర్షిస్తూంది.

కె.జి. మూర్తి

**స్టెర్న్‌హైమ్, కార్ల్ (1878-1942)** : జర్మన్ నాటకకర్త. ఇతని పూర్తిపేరు 'విలియం అడోల్ఫ్ కార్ల్ స్టెర్న్‌హైమ్'. మధ్య తరగతి ప్రజల విలువ లను, ఆశయాలను ఇతివృత్తంగా చేసుకొని సుఖాంత నాటకాలను వ్యంగ్యాత్మకంగా రచించిన నాటక కర్తగా పేరు గడించాడు. ఆయన ఒక బ్యాంకరు కుమారుడు. బెర్లిన్‌లో పెరిగాడు. దర్శనశాస్త్రం, మనోవిజ్ఞానశాస్త్రం, న్యాయశాస్త్రాలను మ్యూనిచ్, గొటీన్‌జిన్, లీప్‌జిగ్ విశ్వ విద్యాలయాలలో అభ్యసించాడు. కావల్రీ రెజిమెంటులో సైనిక సేవలు అందించాడు.

తన 15 వ ఏటనే నాటక రచనకు నాంది పలికాడు. కాని 1911-1916 మధ్య ఉత్తమ నాటకాలను రచించాడు. వీటిని *బూర్జువా నాయకుల చరిత్రల నుండి* అనే సంపుటంగా వెలువరించాడు. మొదటి నాటకం *డైహోస్, డెరైజెర్* (రాక్షసి)గా 1911 లో ప్రచురితమై ప్రదర్శిత మైంది. దీనిలో అధికంగా అవినీతి ఉన్నందున దీని అసలుపేరుతో ప్రచురించడానికి బెర్లిన్ పోలీసులు అడ్డు చెప్పారు. దీనిని 1957 లో *అండర్ ప్యాంట్స్* గా *ఎరిక్ బెంట్లీ* ఆంగ్లంలోకి అనువదించాడు. 1963 లో లండన్ లో దీనిని *ది నిక్కర్స్* గా ప్రదర్శించారు. దీనిలో ప్రధాన పాత్ర 'తియోబాల్డ్ మాస్కె'. 1914 లో ప్రదర్శితమై, ప్రచురితమైన *దెరెస్నోబ్* లోనూ, 1923 లో ప్రదర్శితమై, 1925 లో ప్రచురితమైన *దాస్ ఫోస్సిల్* లోనూ అతడు, అతని కుటుంబ సభ్యులు కూడా పాత్రలు పోషించారు. ఆయన నాలుగు నాటకాలు *మాస్కె-టె ట్రాలజీ* అనే పేరుతో ఒక సంపుటంగా వెలువడ్డాయి.

స్టెర్న్‌హైమ్ చివరి రోజులలో వ్రాసిన నాటకాలు అంతగా విజయవంతం కాలేదు ప్రారంభ కాలంలో స్టెర్న్ హైమ్ వాడిన 'టెలిగ్రాఫిక్ భాష' ఫ్రాంక్ వేడ్ కింద్ (ఇతని కూతురు స్టెర్న్‌హైమ్ మూడవ భార్య), బెర్టోల్ట్‌కు మధ్య సేతువుగా నిలిచింది. అతని నవలలు, నవలికలలో శైలి ధారాళంగా ఉంటుంది. స్టెర్న్‌హైకు ఆత్మకథ 1936 లో వెలువడింది. అతని 5 నాటకాలు ఆంగ్లంలోకి అనువదింపబడ్డాయి.

పి.ల.నా.

**స్టేర్న్, లారెన్స్ (1713-1768)** : ఐర్లండ్‌లో జన్మించిన ఆంగ్ల నవలా రచయిత, హాస్యరచయిత. *ట్రైస్ట్రామ్ షాండీ, ఏ సెంటిమెంటల్ జర్నీ త్రూ ఫ్రాన్స్* (1768) ఈయన ప్రసిద్ధ నవలలు.ఈయన బాల్య మంతా పేదరికంతో గడిచింది. తండ్రితో పాటు ఒకచోట నుండి ఒక చోటికి తిరుగుతూ తండ్రి సైన్యంలో చిన్న ఉద్యోగం చేసేవాడు. ప్రాథమిక విద్యాభ్యాసం తరువాత కేంబ్రిడ్జ్ వెళ్ళాడు. ఒక బంధువు సాయంతో, అక్కడ జాక్‌లాక్ తత్త్వశాస్త్ర భావాలపట్ల ఆకర్షితు డయాడు. పట్టభద్రుడైన తరువాత మత సంబంధమైన ఉద్యోగంలో చేరాడు. 'సర్ రాబర్ట్ వాల్పోల్' ను సమర్థిస్తూ కొన్ని రాజకీయ వ్యాసాలు వ్రాశాడు కాని త్వరలో వాటిపట్ల విసుగు పుట్టి రాజకీయాల జోలికి వెళ్లటం మానివేశాడు. 1741 లో 'ఎలిజబెత్ మాంటేగు' ను ప్రేమించి వివాహం చేసుకొన్నాడు. కాని ఆయన వైవాహిక జీవితం సజావుగా సాగలేదు.



1759 లో *ఏ పొలిటికల్ రొమాన్స్* (తరువాత దీనినే *ది హిస్టరీ ఆఫ్ ఏ గుడ్ వార్మ్ వాచ్ కోట్*

అన్నారు) అనే వ్యంగ్య రచన చేశాడు. దీనిలో ఆధ్యాత్మిక న్యాయస్థానాల (Spiritual courts) లో పనిచేసే కొందరు పెద్దలపై ఘాటైన విసుర్లు విసిరాడు. కాని మతాధికారుల ఆదేశాల మేరకు దానిని తగులబెట్టారు. దీనితో ఉద్యోగపరంగా ఉన్నత పదవులు ఆయనకు దూరం అయాయి. చిన్నతనంలోనే క్షయవ్యాధికి గురి అయిన స్టేర్న్ 1762 లో అదే వ్యాధి వలన తన గొంతును కొంతవరకు పోగొట్టుకొన్నాడు. మతపరమైన తన బాధ్యతలను మరొకనికి అప్పగించి రచనా వ్యాసంగాన్ని చేబట్టి *ట్రిస్ట్రామ్ షాండీ* ప్రారంభించాడు. దాని ముద్రాపకుడు రాబర్ట్ డాడ్స్‌లీ దానిని యథాతథంగా ప్రచురించటానికి నిరాకరించటంతో, చాలా వరకు సవరించి 1759 లో తానే అందులోని మొదటి రెండు భాగాలను ప్రచురించాడు. డాడ్స్‌లీ దానిని అమ్మిపెట్టాడు. 3 మాసాలలోనే పుస్తకాలన్నీ అమ్ముడుపోవటంతో ఈ రచయిత కీర్తి అన్ని చోట్ల వ్యాపించింది. 1776 లో *ఏ సెంటిమెంటల్ జర్నీ* (A Sentimental Journey) అనే యాత్రాగ్రంథం వ్రాశాడు. దానిని ప్రచురించటం, ఆయన మరణించటం వెంట వెంటనే జరిగాయి.

ఈయన గ్రంథాలు సాంప్రదాయిక పద్ధతిలో నడవవు. వాటిలో విషయమూ ఎక్కువ ఉండదు. కాని పదునైన వ్యంగ్యం, మృదువైన హాస్యం చదువరులను ఆకట్టు కొంటాయి. అక్కడక్కడ లైంగిక పరమైన విసుర్లు కనిపించినా ఆయన రచనలు నైతిక పాఠాలు అని థామస్ జెఫర్సన్ అన్నాడు. ఆయన నవలలు ఆధునిక మనోవైజ్ఞానిక నవలకు నాంది పలికినవిగా నేడు గుర్తింపు పొందాయి.

**కె.బి. మూర్తి**

**స్టైన్, గెర్ట్రూడ్ (1874-1946) :** అమెరికన్ రచయిత్రి. ఆ నాటి ప్రఖ్యాత రచయితలను, చిత్రకారులను పారిస్‌లోని తన ఇంటికి తరచు ఆహ్వానిస్తూ ఉండేది. ముఖ్యంగా రెండు ప్రపంచ యుద్ధాల మధ్యకాలం లోని ప్రముఖ రచయితలు, చిత్రకారులు తరచు ఆమె ఇంట సమావేశ మవుతూ ఉండేవారు. ప్రఖ్యాత తత్త్వశాస్త్రజ్ఞుడు విలియం జేమ్స్‌వద్ద మనోవైజ్ఞానిక శాస్త్రాన్ని ఈమె పఠించింది. పారిస్‌లో స్థిరపడి సోదరుడు 'లియో' తో కలసి 'క్యూబిస్టు' (Cubist) ల కళాఖండాలను, పాబ్లో పికాసో, హెన్రీ మేటిస్, జార్జిస్ బ్రాక్ వంటి ప్రయోగాత్మక చిత్రకారుల (Experimental Painters) చిత్రాలను పోగుచేసింది. ఆమె సాహితీ ప్రతిభను విన్న ప్రవాస అమెరికన్ రచయితలు షేర్‌వుడ్ ఆండర్సన్, ఎర్నెస్ట్ హెమింగ్‌వేలు ఆమెకు సన్నిహితు లయారు. సాహిత్యపరంగాను, కళల పరంగాను ఆమె అభిప్రాయాలకు చాలా విలువ ఉండేది. ఆమె యథాలాపంగా చేసిన విమర్శలు కూడా కొందరి రచయితల, చిత్రకారుల జాతకాలనే మార్చివేశాయి. ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయాలలో ఆమె చేసిన ప్రసంగాలు ఆధారంగా 1926 లో వెలువడిన *కాంపోజిషన్ అండ్ ఎక్స్‌ప్లనేషన్* అనే గ్రంథం ఆమె రచనా సిద్ధాంతాలను తెలుపుతుంది. ఆమెపై 'క్యూబిజమ్' చూపిన ప్రభావం 1914 లో ఆమె రచించిన *టెండర్ బటన్స్* లో కనిపిస్తుంది. గడుస్తున్న క్షణాలపై వెలుగును ప్రసరింప చేయటం (Illumination of the present moement), అతిగా సూక్ష్మీకరించాలనే ఆమె ప్రయత్నం ఈ రచనలో కనిపిస్తాయి.

1909 లో *థ్రీ లైవ్స్* అనే ముగ్గురు శ్రామిక మహిళల కథలను ఆమె వ్రాసింది. 1906-08 లో వ్రాసి 1925 లో ప్రచురించిన *ది మేకింగ్ ఆఫ్ అమెరికన్స్* సాధారణ పాఠకునికి అర్థం కాని రీతిలో సాగుతుంది. 1933 లో ప్రచురితమైన *ది ఆటో బయాగ్రఫీ ఆఫ్ ఆలిస్ బి. టోక్లాస్* అనే రచన మాత్రమే బహుజనాదరణ పొందింది. 1934 లో రచించిన *ఫోర్ సెయింట్స్ ఇన్ థ్రీ యాక్ట్స్*, 1947లో ప్రచురితమైన *ది మదర్ ఆఫ్ అజ్ ఆల్* అనేవి సంగీత నాటకాలుగా ప్రదర్శన పొంది సామాన్య జనాన్ని ఆకర్షించగలిగాయి. 'క్యూబిస్ట్' లు తమ చిత్రకళలో వాడే సూక్ష్మీకరణ కోసం వస్తువును చిన్న చిన్న ముక్కలను చేసి వస్తువుకు బదులు ఏదో ఒక భాగాన్ని చూపటం (Fragmantation), వస్తు లక్షణాలను వస్తువు లేకుండా చూపాలనే ప్రయత్నం (Abstraction) వంటి ప్రక్రియలను సాహిత్యంలో కూడా ప్రవేశపెట్టాలని ఆమె ప్రయత్నించింది. అందుకే ఆమె రచనలు పండితులకు మాత్రమే అర్థమయే రీతిలో సాగాయి. ముఖ్యంగా పైన పేర్కొన్న *టెండర్ బటన్స్* ఈ కోవకు చెందిందే. సాహిత్యానికి నూతనత్వాన్ని కల్పించాలని ఆమె చేసిన కృషి శ్లాఘనీయమయింది.

**కె.బి. మూర్తి**

**స్టైన్‌బెక్, జాన్ (1902-19068) :** సుప్రసిద్ధ అమెరికన్ నవలా రచయిత 1962 లో సాహిత్యానికి నోబెల్ పురస్కారాన్ని అందుకొన్నవాడు. 1930-40 దశకంలోని భయంకర ఆర్థిక మాంద్యం కలిగించిన వ్యథను మనస్సుకు హత్తుకునే రీతిలో చిత్రీకరించి, పనికోసం వలస పోతూ ఉండే వ్యవసాయ కూలీల దుర్భరస్థితి పట్ల నాగరక ప్రపంచపు సానుభూతిని సంపాదించి పెట్టిన *ది గ్రేప్స్ ఆఫ్*

*రాథ్* (1939) ఈయనకు ప్రపంచ ఖ్యాతిని సమకూర్చింది. విశ్వవిద్యాలయంలో పఠించినప్పటికి ఎట్టి డిగ్రీ తీసుకోలేదు. రచనలు చేస్తూ తన్ను తాను పోషించుకోటానికి ఒక కార్మికుడుగా పనిచేయడం వలన, కార్మికుల సమస్యలను, జీవన విధానాలను వారిలో ఒకడుగా ఉంటూ తెలుసుకోటం వలన ఈయన రచనలకు వాస్తవికత, నిజాయితీ సిద్ధించాయి. మెక్సికన్-అమెరికన్ల పట్ల సానుభూతి ఉట్టిపడే *టార్టిలా ఫ్లాట్* (1935) అనే కథ ఈయన తొలి రచన. అయితే ఇందులో కనిపించే మృదువైన హాస్యం తరువాతి రచనలలో కనిపించదు. వ్యవయసాయ కార్మికుల సమ్మె, దానిని తమ స్వార్థానికి ఉపయోగించుకొన్న రెండు మార్క్సిస్టు కార్మిక సంఘాలు ఇతివృత్తంగా గల *ఇన్ డ్యూబియస్ బేటిల్* (1936) అనే రచనలో ఆ హాస్యం స్థానంలో ఒకవిధమైన కరకుదనం, తీక్ష్ణత గోచరిస్తాయి. *ఆఫ్ మైస్ అండ్ మెన్* (1937) అనే చిన్న నవల ఇద్దరు ప్రవాస కార్మికుల మధ్య ఏర్పడిన క్లిష్టమైన ప్రేమ బంధాన్ని చిత్రిస్తుంది. ఇది తరవాత నాటకంగా, ఆ తరువాత సినిమాగా విడుదలయింది. 1940 లో *ది గ్రేప్స్ ఆఫ్ రాథ్* ను సినిమాగా తీసి విడుదల చేయగా అది అఖండ విజయాన్ని సాధించింది. ఈ నవలకు 'పులిట్జర్ పురస్కారం' కూడా లభించింది.



రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ప్రచారానికి గాను 1942 లో *ది మూన్ ఈజ్ డౌన్* అనే నవల వ్రాశాడు. ఇందులో నార్వే దేశస్థులు నాజీ ఆక్రమణలో అనుభవించిన దుర్భర స్థితిని వర్ణించాడు. యుద్ధానంతరం 1945 లో *కానరీ రో*, 1947 లో *ది పెరల్*, 1947 లోనే *ది వేవర్డ్ బస్* అనే నవలలు రచించాడు. సామాజిక విమర్శ వీటన్నింటిలో కనిపించే సామాన్య విషయం. 1950 లో *బర్నింగ్ బ్రైట్*, 1952 లో *ఈస్ట్ ఆఫ్ ఈడెన్*, 1961 లో *ది వింటర్ ఆఫ్ అవర్ డిస్కంటెంట్* ఈయన చివరి దశలోని రచనలు. తొలి రచనలలోని వాడి, వేడి వీటిలో ఎక్కువగా కనిపించవు. *ది పెరల్, ది రెడ్ పోనీ* అనే ఈయన కథలను సినిమాగా తీసినప్పుడు వాటికి సంభాషణలు తానే స్వయంగా వ్రాశాడు. ఇవే కాక కొన్ని ఇతర ప్రముఖ సినిమాలకు కూడా ఈయన సంభాషణలు (Film Scripts) వ్రాశాడు.

శ్రామిక వర్గపు బాధలను, వ్యథలను ఇతివృత్తంగా తీసుకొని సహజత్వం ఉట్టిపడేటట్లుగా ఈయన వ్రాసిన నవలలు, వాటిలోని పాత్రలను ఈయన తీర్చిదిద్దిన తీరు పండిత, పామరుల మన్ననలను పొందాయి.

కె.జి. మూర్తి

**స్టోర్నీ, ఆల్ఫోన్సినా (1892-1938) :** దక్షిణ అమెరికా సాహిత్యంలో ప్రముఖ స్థానం వహించిన నవలా రచయిత్రి. బాల్యం నుంచే జీవన సమరం సాగించి, తన కాళ్లపై తాను నిలబడిన రచయిత్రి. మొదట ఒక నాటక సమాజంలో చేరి, ఆ పిమ్మట అర్జెంటీనా గ్రామీణ ప్రాంతంలో అధ్యాపకురాలుగా వృత్తి స్వీకరించింది. ఆమె 1913 లో బ్యూనోస్ ఐరీస్‌కు వెళ్ళింది. అక్కడ పాఠశాలలో బోధిస్తూ, యువ నాటక సమాజంలో పనిచేసింది. ఆమె తొలి రచన *లా ఇన్ క్వేట్యూడ్ డెల్ రూసల్* (1916) ఆమెకు బ్యూనోస్ ఐరీస్ సాహిత్య సమాజంలో గుర్తింపు తెచ్చింది. అయితే *ఎల్ దుల్స్ డానో* (1918-తీపి గాయం) ఆమెకు మంచి ప్రచారం, విజయం చేకూర్చాయి. ఆమె పురుషులను ద్వేషించినప్పటికీ ప్రేమ ఆవశ్యకతను గాఢంగా నమ్మి, ప్రేమలోని ఉద్విగ్నతను, ఆవేశాన్ని, ప్రేమ, ద్వేషం వంటి పరస్పర విరుద్ధ భావాలను తన కవిత్వంలో సరళంగానూ, నిశితంగానూ అభివ్యక్తీకరించింది. కాని ఈ భావాలను ఆఖరి రచనలు *ఎల్ ముండో దె సీదే పోజోస్* (1934) లోనూ, *మాస్కరిల్లా య ట్రె బోద్* లోనూ ఆమె కొనసాగించలేదు. ఈ రచనలు తొలి రచనల వలె సరళంగా లేవు. ఆమె తీవ్ర అస్వస్థతకు గురిఅయి 1938 లో ఆత్మహత్య చేసుకొనింది.

పి.ల.నా.

**స్టోవ్, హారియెట్ (ఎలిజబెత్) బీచర్ (1811-1896) :** అమెరికన్ రచయిత్రి. వితరణ శీలిని. *అంకుల్ టామ్స్ క్యాబిన్* ను రచించింది. ఈ నవల బానిస విధాన వ్యతిరేక భావాలను బాగా ప్రచారం చేసి 'అమెరికా సివిల్ వార్' రావడానికి కారణమైందని భావిస్తున్నారు.

ఆమె సుప్రసిద్ధ ఫాదరీ లైమన్ బీచర్ కుమార్తె. హార్డ్‌ఫోర్ట్ లోని తన సోదరి పాఠశాలలో విద్యాభ్యాసం సాగించి, మొదట అందులోనే అధ్యాపకురాలుగా చేరి,

పిమ్మట 1882 నుండి 'సిన్సిన్నతి' లో ఉద్యోగం చేసింది. అక్కడ ఆమె విద్యా విషయాలలోనూ, పాఠశాల కార్యక్రమాలలోనూ చురుకుగా పాల్గొన్నది. పాఠశాల మూతపడేవరకు, అంటే 1836 వరకు ప్రాంతీయ పత్రికలకు కథలు, స్కెచ్‌లు వ్రాసింది. పాఠశాల భూగోళ గ్రంథాన్ని సంకలనం చేసింది.

1836 లో 'కాల్విన్ ఎల్లిస్ స్టోవ్' తో ఆమెకు వివాహం అయింది. ఆయనకు మతబోధనలో, అధ్యాపనలో, బైబిలులో మంచి ప్రవేశం ఉంది. ఆమె రచనా వ్యాసంగానికి వెన్ను తట్టి ఆయన ప్రోత్సహించాడు. 1843 లో *ది మే ఫ్లవర్, లేక స్కెచెస్ ఆఫ్ సీన్స్ అండ్ క్యారెక్టర్స్ అమాంగ్ ది డిసెండెంట్స్ ఆఫ్ ది పిల్గ్రిమ్స్* ను రచించింది.



ఆమె సిన్సిన్నతిలో 18 ఏళ్లు నివసించింది. ఈమె నివసించిన ప్రాంతానికి, బానిస నివాస ప్రాంతానికి మధ్య అడ్డంగా ఓహిమో నది మాత్రమే ఉండేది. కాందిశీక బానిసల జీవితాలను మిత్రులద్వారాను, కుటుంబ సభ్యుల ద్వారాను తెలుసుకొన్నారు. 1850 లో ఆమె భర్త బౌడాయిన్ కాలేజ్‌లో ప్రొఫెసర్‌గా నియుక్తుడు కావడంవల్ల వారి కుటుంబం మెయిన్‌లోని బ్రన్స్‌విక్‌కి మారింది.

బ్రన్స్‌విక్‌లో నున్నపుడు స్టోవ్ వ్రాసిన *అంకుల్ టామ్స్ కేబిన్ లేదా లైఫ్ అమాంగ్ ది లోలీ* ని వాషింగ్టన్ నుండి వెలువడే బానిస వ్యతిరేక పత్రిక *నేషనల్ ఎరా* లో ధారావాహికంగా ప్రచురించింది. ఆమె పేరు దక్షిణ ప్రాంతంలో ఉచ్చరించరానిది అయింది. ఇతర ప్రాంతాలలో ఆ పుస్తకం మిక్కిలి ప్రచారం పొందింది. అది కనీసం 23 భాషలలోకి అనూదిత మయింది. దీనిని నాటకంగా రూపొందించగా అది అశేష ప్రేక్షకుల ఆదరణ పొందింది. బానిస వ్యతిరేకతకు సంబంధించిన మరి కొన్ని డాక్యుమెంట్లను, టెస్టిమోనియల్స్‌ను ఆ నవలకు అనుబంధంగా *ది కీటు అంకుల్ టామ్స్ క్యాబిన్* అని 1853 లో ప్రచురించింది. ఆమె 1853 లో యూరప్‌లో పర్యటించింది. 1869 లో ఒక పత్రికలో వ్రాసిన వ్యాసం *ది ట్రూ స్టోరీ ఆఫ్ లార్డ్ బైరన్స్ లైఫ్* లో కవికి తన సోదరి పట్ల అసభ్యమైన ప్రేమ (Incestuous love) ఉందని ఆమె చెప్పింది. 1865 లో *డ్రెడ్: ఏ టేల్ ఆఫ్ ది గ్రేట్ డిస్మల్ స్వాంప్* లో బానిస విధానం వల్ల క్షీణిస్తున్న సమాజాన్ని స్టోవ్ చిత్రించింది. *అట్లాంటిక్ మంత్లీ* ప్రారంభంలో ఆమె రచనలకు పట్టుకొమ్మ అయింది. ఆమె సోదరుడు హెన్రీ కార్డ్ బీచర్ సంపాదకుడుగా ఉన్న న్యూయార్క్‌లోని *ఇండిపెండెంట్* పత్రికలోనూ, తరువాత క్రిస్టియన్ యూనియన్ లోనూ ఆమె రచనలు ప్రచురించబడ్డాయి

తరువాతి కాలంలో విద్యావంతురాలుగా, నవలా రచయిత్రిగా ఆమె పేరు గడించింది. ఆమె రచించిన *ది మినిస్టర్స్ వూయింగ్* మిక్కిలి ప్రశస్తి పొందింది. సామాజిక జీవితాన్ని బాగా అధ్యయనం చేసి తన నవలలలోనూ, వ్యాసాలలోనూ ప్రతిబింబింప చేసింది. మతపరమైన పద్యాల సంకలనాన్ని ఆమె ప్రచురించింది.

పి.ల.నా.

## స్ట్రిండ్ బెర్గ్, (యోహాన్) ఆగస్ట్ (1849-1912)

: స్వీడిష్ నాటకకర్త, నవలా రచయిత, కథానికా రచయిత. మనస్తత్త్వశాస్త్రాన్ని, స్వాభావిక వాదాలను రంగరించి యూరప్ నాటకరంగంలో అభివ్యక్తి వాద (Expressionist) నాటకాన్ని సృష్టించాడు. *ది ఫాదర్* (1887), *మిస్ జూలీ* (1888), *క్రెడిటర్స్* (1888), *ఏ డ్రీమ్ ప్లే* (1902), *ది ఘోస్ట్ సొనటా* (1907) లు ఇతని రచనలలో ముఖ్యమైనవి.

ఇతని తండ్రి 'కార్ల్ ఆస్కార్ స్ట్రిండ్ బెర్గ్' బతికి చెడినవాడు. ఇతని బాల్యంలో అనుభవించిన దారిద్ర్యం, ఉద్వేగం, సంరక్షణ రాహిత్యం, అవ్వగారి మతమౌఢ్యం, తృణీకారాలను తన ఆత్మకథ *జన్ స్టైక్వెన్సాన్స్ సన్* (సేవకుని కుమారుడు 1886-87) లో అభివర్ణించాడు. ఆయన ఉప్సా విశ్వవిద్యాలయంలో చదివాడు. కాని ఎలాంటి డిగ్రీ తీసుకోలేదు. జీవనోపాధికై స్టాక్ హోంలో స్వచ్ఛంద పాత్రికేయుడుగా ఉన్నాడు. ఈ కాలంలో తన మొదటి ప్రధాన రచన అయిన చారిత్రక నాటకం *మాస్టర్ ఒలోఫ్* (1872) పూర్తిచేయడానికి ప్రయత్నించాడు. ఇది స్వీడెన్ సంస్కరణలపై ఆధారపడిన రచన. దీనిమీద షేక్స్పియర్ హెన్రిక్ ఇబ్సెన్‌ల ప్రభావం అధికంగా ఉంది. ఈ నాటకాన్ని 'రాయల్ థియేటర్' తిరస్కరించినందున అతనిలో నిరాశంతో పాటు, ఆధికారిక వ్యవస్థపట్ల,

సంప్రదాయాలపట్ల తిరస్కారం ఎక్కువ అయింది. తరువాత దీనిని స్వీడెన్‌లో మొదటి ఆధునిక నాటకంగా గుర్తించారు. ఆ విధంగా ఆయనకు నాటక కర్తగా గుర్తింపు రావడానికి కొంత జాప్యం జరిగింది.

1874 లో రాయల్ లైబ్రరీకి లైబ్రేరియన్ అయాడు. స్టాక్‌హోం సమాజంలోని అవక తవకలను వ్యంగ్యంగా చిత్రిస్తూ తన తొలి నవల *ది రెడ్ రూమ్* రచించాడు. ఇది స్వీడెన్ నవలా రంగానికి ప్రథమం కావడం వల్ల ఆయనకు ఎక్కువ ప్రచారం లభించింది. సమాజాన్ని విమర్శిస్తూ 1881 లో *లక్కీ పీటర్స్ ట్రావెల్* ను రచించాడు. 1883 లో *డెట్ న్యా రికెట్* (నవ్య సామ్రాజ్యం) ను వ్రాశాడు. ఇందులో కూడా నాటి స్వీడెన్ సమాజాన్ని వ్యంగ్యంగా వర్ణించాడు. ఇదే కాలంలో *ది ఫాదర్, మిస్ జూలీ, ది క్రెడిటర్స్* ను సమకాలిక సమాజాచారాలపై తిరుగుబాటు చేస్తూ రచించాడు. నాటకాలలో క్రొత్త ధోరణులను, సంభాషణా శైలిని, రంగస్థల అలంకరణను ప్రవేశపెట్టాడు. ఇవి యూరపియన్ నాటకరంగంలో కొత్త ఉద్యమానికి దారితీశాయి. ఈ దశలోనే *పీపుల్స్ ఆఫ్ హెమ్సో* కూడా వెలువడింది.

1889 లో స్వీడెన్ తిరిగి వచ్చిన తరువాత ఏకాకిగా దుఃఖమయ జీవితం గడిపాడు. అయినప్పటికీ ఆధునిక స్వీడెన్ సాహిత్యానికి పట్టుగొమ్మ అయాడు. తాగుడుకు బానిస అయినందున స్థిరమైన ఉద్యోగం సంపాదించలేక పోయాడు. మానసిక, శారీరక వత్తిడుల వల్ల, మానసిక చాంచల్యం వల్ల ఆయన తన మనస్సును ఆధ్యాత్మికత వైపు మళ్లించాడు. ఈ కాలంలో ఆధ్యాత్మికతమీద, రసవాదంపైన ప్రయోగాలు జరిపాడు.

మార్మికవాదంపై గల క్రొత్త నమ్మకం అతనిని తిరిగి రచయితగా మలచింది. తత్ఫలితంగా *డమాస్కస్* నాటకాన్ని మూడు భాగాలలో రచించాడు. అందులో తనను తను ఆధ్యాత్మిక ప్రశాంతి కోసం అన్వేషించే అపరిచిత వ్యక్తిగా వర్ణించుకొన్నాడు.

స్ట్రిండ్‌బెర్గ్ స్వీడెన్‌కు తిరిగి వచ్చిన తరువాత మరణించే వరకు స్టాక్‌హోంలో నివసించాడు. ఈ కాలంలోని రచనలలో *గుస్తవ్ వాసా* అనే చారిత్రక నాటకం పాత్ర పోషణకు, సంభాషణా వైచిత్రికి పేరుపొందింది.

స్ట్రిండ్‌బెర్గ్ తన మూడవ వివాహాన్ని 'చలికాలంలో వసంతం' అని వర్ణించుకొన్నాడు. ఈ వివాహం *ది డాన్స్ ఆఫ్ డెత్, ఏ డ్రీం ప్లే* నాటకాలకు, ఎన్సా (ఒంటరి) అనే ఆత్మకథకు ప్రేరణ ఇచ్చింది. స్వర్త ఫానొర్ (నల్ల బ్యాంకర్) ను 1907 లో రచించాడు. చివరి నాటకాలలో తన జీవితాన్ని సంకేత ప్రాయంగా చిత్రించుకొన్నాడు.

స్ట్రిండ్‌బెర్గ్ 1877 ప్రాంతంలో సిరిషాన్ ఎస్సెన్‌ను వివాహమాడి 1891 లో విడాకు లిచ్చాడు. ఆపైన 1892 ప్రాంతాలలో ఆస్ట్రియన్ పత్రికలో పనిచేసే ఫ్రిడా ఉహ్ల్ అనే ఆమెను వివాహం చేసుకొని 1895 లో విడిపోయాడు. 1901 లో నార్వే చలన చిత్ర తారను పెళ్లిచేసుకొని 1904 లో విడాకులు తీసుకున్నాడు. తన జీవితంలో ఎక్కువ కాలం స్ట్రిండ్‌బెర్గ్ విదేశాలలోనే గడిపాడు.

పి.ల.నా.

**స్నోరీ, స్టుర్లూసన్ (1179-1241)** : ఐస్‌లాండ్ దేశపు కవి, చరిత్ర రచయిత, సామంతుడు, *ప్రోజ్ ఎడ్డా* గ్రంథ రచయిత. ఐస్‌లాండ్ దేశంలో కుటుంబ గాథలలో మిక్కిలి ప్రశస్తమైన *ఎగిల్స్ శాగా* కూడా బహుశః ఇతడే రచించి ఉండవచ్చు నని భావిస్తున్నారు.

*ఎగిల్స్ శాగా* లోని కథా నాయకుడు, మహాకవి అయిన ఎగిల్ స్కాలాగ్రిమ్సన్ వంశానికి చెందిన స్నోరీ మూడేళ్ల వయస్సు నుండి 'ఓడీ' లో ఐస్‌లాండ్‌లోని ప్రధాన సామంతుడైన జాన్ లాక్సన్ ఇంటిలో పెరిగాడు. ఆ లాక్సన్ ఐస్‌లాండ్ చరిత్ర రచయితలలో మనకు తెలిసినంతలో మొట్టమొదటివాడు. ఆయన నుంచే స్నోరీ ఐస్‌లాండిక్ సంప్రదాయాన్ని గూర్చి, యూరపియన్ విశాల దృక్పథాన్ని గూర్చి ప్రగాఢమైన విజ్ఞానాన్ని సంపాదించాడు.

1199 లో స్నోరీ వారసత్వంగా పెద్ద ఆస్తిని పొందిన ఒక యువతిని వివాహమాడి భూములూ, అధికారం ఆర్జింప సాగాడు. 1206 లో అతడు రెయిక్ జెహోల్ట్‌లో స్థిరపడ్డాడు. అక్కడే 1223 నుంచి 1235 వరకూ అతడు తన రచన లన్నీ రచించాడు. 1215-18 మధ్య, 1222-32 మధ్య స్నోరీ ఐస్‌లాండిక్ హైకోర్ట్‌కు ప్రెసిడెంటుగా వ్యవహరించాడు. 1218 లో నార్వే రాజు నాల్గవ హాకోన్ ఆహ్వానం మీద అతడు నార్వేను సందర్శించాడు. స్వీడెన్‌లోని సంపన్న కుటుంబాలను కూడా అతడు సందర్శించాడు.

రాజకీయాలలో ప్రవేశించి స్నోరీ దేశబహిష్కృతుడై, 1237 లో నార్వేలో తలదాచుకోవలసి వచ్చింది. 1239 లో అతడు ఐస్‌లాండ్‌కు తిరిగి వచ్చి హాకోన్ రాజు ఆదేశం మీద తన అల్లుడైన గిస్సూర్ తోర్వాల్డ్‌సన్ చేత హత్య చేయబడ్డాడు.

స్నోరీ రచనలు వాటి పరిధి దృష్ట్యా, ప్రామాణికత దృష్ట్యా విశేష ప్రశస్తి సంపాదించాయి. *ప్రోజ్ ఎడ్డా*

సాహిత్య శాస్త్రానికి (Poetics) సంబంధించిన రచన. స్నోరీ *సెంట్ ఓలఫ్ ఆఫ్ నార్వే* జీవిత చరిత్రను కూడా రచించి, నార్వీజియన్ రాజుల చరిత్ర అయిన *హైమ్స్ క్రింగ్లా* లో దానిని చేర్చాడు.

బొ.శ్రీ.

**స్పిట్టెలర్, కార్ల్ (1845-1924) :** దార్శనిక భావన (Visionary imagination) కల స్విస్ కవి. 1919 వ సంవత్సరపు నోబెల్ బహుమతి గ్రహీత. నిరాశా పూరిత రచనలు చేసినా వీరోచిత కావ్యాలు కూడా వెలువరించాడు. ఆయన రష్యా, ఫిన్లాండ్ లలో 8 సంవత్సరాలపాటు ప్రైవేటు ట్యూటరుగా పనిచేశాడు. *ప్రొమిథీసియస్ ఉండ్ ఎపిమిథీసియన్* అనే పౌరాణిక ఇతిహాసం రచించాడు. దీని ఆంగ్లానువాదం 1931 లో వెలువడింది. ఆయన అధ్యాపకత్వం సాగిస్తూ, పత్రికారంగంలో పని చేస్తూ వివిధ సాహిత్య ప్రక్రియలలో రచనలు సాగించి, ప్రజలలో పేరు గడించాడు 1892 లో వారసత్వరీత్యా ఆస్తి సంక్రమించడంవల్ల ఆయన టాజెర్న్‌లో స్థిరపడి సృజనాత్మక రచనలకు తన జీవితం అంకితం చేశాడు. ఆయన రెండవ రచన అయిన ఇతిహాస కావ్యం *రెడ్ ఓలిం పిషె ఫ్రులింగ్* ను 1900-05 ప్రాంతంలో రచించాడు. దీనిని 1910 లో పునస్సంశోధించి ప్రచురించాడు. ఈ కావ్యానికే 1919 వ సంవత్సరపు నోబెల్ బహుమతి లభించింది. ఆయన చివరి రోజులు తన మొదటి రచనలను తిరిగి వ్రాయడంలోనే గడచిపోయాయి.



ఆయన నడిమి వయసులో అనేక కావ్యాలు వెలువడ్డాయి. 1883 లో *ఎక్స్‌ట్రాముండేనా* అనే పద్యకావ్యం రచించాడు. ఆయన రచించిన 7 విశ్వగాథల (కాస్మిక్ మిత్) ను *బాలాడెన్* (1896) లో పొందుపరచాడు. *లిటరారిషే గ్లిక్నిస్సే* (సాహిత్య నీతి కథల) ను 1889 లో రచించాడు. అంతేకాక *ష్మట్టర్లింగె* (సీతాకోక చిలుకలు) ను 1889 లోనూ, *గ్రాస్ ఉండ్ గ్లొకెన్‌లైడర్* ను 1906 లో గేయగాథాలుగాను వ్రాశాడు. *డై మడ్చెన్ ఫీండె* ను 1907 లోనూ, *డెర్ లెఫ్టినెంట్* నాటకాంత నవల 1898లోను వెలువడ్డాయి. 1906 లో రచించిన *ఇమేజ్* నవలలో సృజనాత్మక దర్శనానికి, మధ్య తరగతి విలువలకు నడుమ తనలో సాగుతున్న సంఘర్షణలను మిక్కిలి నిశితంగా వివరించాడు. రాజకీయాల ప్రభావితమైన, యుద్ధంలో జర్మన్‌ను ఏక పాక్షికంగా సమర్థించే దృష్టికి వ్యతిరేకంగా రచనలు 1914 లో చేశాడు. 1928 లో స్పిట్టెలర్ *సెలెక్టెడ్ పొయెమ్స్* ఆంగ్లంలోకి అనూదితమయాయి.

పి.ల.నా.

**స్పెన్సర్, ఎడ్మండ్ (1552-1599) :** ఆంగ్ల కవి. *ది ఫెయిరీ క్వీన్* రచయిత. బాల్యంలో పేదరికాన్ని అనుభవించాడు. మర్చెంట్ టేలర్స్ గ్రామర్ స్కూలులో చదువుకొన్నాడు. అక్కడ లాటిన్, హిబ్రూ, గ్రీకు భాషలను, సంగీతాన్ని అభ్యసించాడు. పాఠశాలలో ఉచిత భోజన సదుపాయాలు పొందే బాలునిగా గుర్తింపు పొందాడు. 1573 లో పట్టభద్రుడయాడు. కళాశాలలోలాటిన్, ప్రాచీన అలంకార శాస్త్రం, తర్కం, దర్శనశాస్త్రం చదువు కొన్నాడు. మాస్టరు డిగ్రీలో గ్రీకు భాష, సాహిత్యం, అంక గణితం, రేఖాగణితం, టాలమీ ఖగోళశాస్త్రం చదువుకొన్నాడు., 1574 లో కేంబ్రిడ్జి వదలి వెళ్లి, 1756 లో ఎం.ఏ డిగ్రీ తీసుకొన్నాడు.

కేంబ్రిడ్జిలో ఇతనికి పండితుడు, చతురుడు, ప్రాచీన ఆధునిక సాహిత్యాలలోని నిష్ణాతుడైన గేబ్రియల్ హార్వే మిత్రుడు అయాడు. కేంబ్రిడ్జిలో చదువుకొన్న చదువు తరువాతి రచనలకి భూమిక అయింది.

వర్జిల్, లుడోవిక్ ఆరియోస్తో, టూర్కొటొ టాసోల రచనలను, ఇటలీ, ఫ్రాన్సులలో వచ్చిన ప్రకృతి చిత్రణ కవిత్వాలను చదవి ఉండకపోతే *ది ఫెయిరీ క్వీన్, ది షెపర్డ్స్ కాలెండర్* లను రచించగలిగి ఉండేవాడు కాదు.

స్పెన్సరు రచించిన ఉత్తమ కావ్యం *ఫెయిరీ క్వీన్* అది జాతీయ జీవన స్రవంతిని ప్రతిబింబింపజేసే ఉత్తమ రచన. దీనిలోని వ్యంగ్యం అంత సులభంగా అర్థం కాదు. లలిత లలిత పదబంధాలతో సుందర చిత్రాలను తీర్చిదిద్దాడు. దీనిలో హితబోధ ఉంది. ఈ కావ్యంలో ఈయన రచించిన తొమ్మిది పాదాల పద్యభాగానికి ఆయన పేరిట 'స్పెన్సీరియన్ స్టాంజా' అని పేరు పెట్టారు. తరువాతి కవులు బైరన్, కీట్స్, టెన్నిసన్ వంటివా రీ స్టాంజాలను విరివిగా వాడుకొన్నారు.

స్పెన్సరు రచించిన మరొక కావ్యం *ది షెపర్డ్స్ కేలండర్* (1579). ఇది ఆంగ్ల సాహిత్య పునరుజ్జీవనానికి నాంది పలికింది. ఇది దేశభక్తి ప్రధాన కావ్యం.

కవితా వస్తువు కొత్తది కాదు. కాని పాత కొత్తల మేలు కలయిక లాగా పాతపదాలను, కొత్త వ్యావహారిక పదాలను మేళవించి సజీవ భాషలో కవిత్వం వ్రాశాడు. కావ్యంలోని 12 కాండల (ఎకొలోగ్స్) కు సంవత్సరంలోని 12 మాసాలు సంకేతాలు. ఇదే కాలంలోనే *హిమ్స్ ఇన్ ఆనర్ ఆఫ్ లవ్ అండ్ బ్యూటీ* ని రచించాడు. ఇందులో ప్లేటోనిక్ ప్రేమ భావాన్ని సమన్వయపరచాడు. 1951 లో *కంప్లెయింట్స్* ను రచించాడు.

*ది టియర్స్ ఆఫ్ మ్యూజెస్* వంటి సామాజిక విమర్శన కావ్యాలను వెలువరించాడు. సర్ ఫిలిప్స్ సిడ్నీ మరణం పట్ల *ఆస్ట్రోఫెల్* అనే స్మృతి కావ్యం రచించాడు. 1589 లో లండన్ లోని అనుభవాలను *కాలిన్ క్లౌట్స్ కం హోం అగైన్* అనే ప్రకృతి చిత్రణ కావ్యంలో వర్ణించాడు. సిడ్నీ కావ్యాలకు ప్రచారం కలిగించడం వీటన్నిటికంటె ప్రధానమైనది.

స్పెన్సరు కవులకు కవి. అతని రచనా వైశిష్ట్యం భావనాశక్తి, ఔన్నత్యం మిక్కిలి ప్రశంసనీయం. ఇతని రచనలోని గాన మాధుర్యం, పద లాలిత్యం పాఠకులను స్వప్నలోకాలలో విహరింపజేస్తాయి. రచన ధారాశుద్ధి కలిగి, చాసరులోని పద లాలిత్యాన్ని అలవరచుకొన్నట్లు కనిపిస్తుంది.

పి.ల.నా.

**స్మాలెట్, టోబియాస్ (1721-1771) :** ఆంగ్ల నవలా రచయిత, పత్రికా రచయిత, వైద్యుడు. వ్యంగ్యాత్మక నవలా రచనకు, వాస్తవ రచనలకు ప్రసిద్ధి చెందాడు. సాహసోపేత కృత్యాలను వర్ణించడంతో పాటు, భావోద్రేకతను ప్రదర్శించాడు. 1727-28 లో డంబర్టన్ గ్రామర్ స్కూల్లోనూ, గ్లాస్గో విశ్వవిద్యాలయంలోనూ చదివాడు. గ్లాస్గోలోని సర్జన్లు విలియం స్టెర్లింగ్, జాన్ గోర్డన్‌ల దగ్గర శిష్యరికం చేశాడు. అయితే 1739 లో విశ్వవిద్యాలయం నుంచి డిగ్రీ తీసుకోకుండానే లండన్ వెళ్లాడు. 1750 లో ఎం.డి. డిగ్రీ తీసుకున్నాడు. ఆయన గ్రీకు భాష, గణితశాస్త్రం, నీతిశాస్త్రం, ప్రాకృతిక దర్శనశాస్త్రం, తర్కం, సాహిత్యం చదివాడు.



1740 లో రాయల్ నౌకాదళంలో వైద్యుడుగా నియమితు డయాడు. జమైకా వంటి దీవులను సందర్శించాడు.

1748 లో *రాడరిక్ రాండం* ను రచించాడు. దీనిలో రచయిత ఆత్మకథ ఎక్కువగా ప్రతిబింబించింది. నావికుల జీవితం ఎక్కువగా వర్ణిత మయింది. ఈ నవలలోని మార్గన్, టాం బౌలింగ్ పాత్రలు పాఠకుల హృదయంలో చెరగని ముద్రలు వేస్తాయి. పెరిగ్రిన్ పికిల్ లో చిత్రణ అందంగా లేదు. సాహస కృత్యాల వర్ణన ఎక్కువగా ఉన్నప్పటికీ ఏకత్వం కొరవడింది. కథా చిత్రణ శక్తిమంతంగా లేదు. *హంఫ్రీ క్లింకర్* (1771) ను లేఖా రూపంగా రచించాడు. ఇది జీవితంలో చరమ దశలో రచించినందున పరిణతి, అనుభవం, రచనా ధోరణిలో మార్పు కనిపిస్తాయి. కథా వస్తువులేనప్పటికీ ఉత్తర ప్రత్యుత్తరాలలో విదేశీ పర్యటన, ఆ నాటి అభిరుచులు, చమత్కారాలు కనిపిస్తాయి.

1756 లో *ది క్రిటికల్ రివ్యూ* పత్రికకు సంపాదకుడు అయాడు. 1758 లో 58 సంపుటాల *యూనివర్సల్ హిస్టరీ* కి ప్రధాన సంపాదకుడు అయాడు. అందులో ఆయన కొన్ని వ్యాసాలు - ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీ దేశాలను రచించారు. బ్రిటిష్ మాగజైనుకు సంపాదకుడుగా ఉన్నపుడు తన నవల *సర్ లాన్స్‌లోట్ గ్రీవ్స్* ను ధారావాహికగా ప్రచురించాడు. *ది బ్రిటన్* వారపత్రికకు సంపాదకుడు అయాడు. 8 సంపుటాలలో *ప్రెజెంట్ స్టేట్ ఆఫ్ ఆల్ నేషన్స్* ను రచిస్తూ, వోల్టేర్ రచనలను 36 సంపుటాలుగా అనువదించాడు. 1752 లో ప్రచురించిన *ఏన్ ఎస్సే ఆన్ ది ఎక్స్‌టర్నల్ యూజ్ ఆఫ్ వాటర్* మిక్కిలి ప్రఖ్యాతి పొందింది.

పి.ల.నా.

**స్మిత్, ఏ.జె.ఎం. (1902-1980) :** కెనడా కవి, సంకలనకర్త, విమర్శకుడు, 1920-30 దశకంలో కెనడా కవిత్వాన్ని పునరుద్ధరించిన ఉద్యమ నాయకుడు.

మాంట్రీల్‌లోని మిక్‌గిల్ విశ్వవిద్యాలయంలో డిగ్రీ చదువుతున్నపుడు *మెక్‌గిల్ ఫోర్ట్‌నైట్లీ రివ్యూ* (1925-27) ను స్థాపించి దాని సంపాదకత్వ బాధ్యతలు వహించాడు. ఇది కెనడా సాహిత్యంలోని ప్రాంతీయ తత్త్వానికి విముక్తి కల్పించడానికి అంకితమైన మొదటి పత్రిక. కెనడా యువ రచయితలు అంతర్జాతీయ దృష్టినీ, విశాల దృక్పథాన్నీ పెంపొందించుకోవాలని, ఉన్నత సాహిత్య ప్రమాణాలను

అలవరుచుకోవాలని ఆయన ప్రోత్సహించాడు. ఆయన 1932 లో ఎడింబరో విశ్వవిద్యాలయం నుండి డాక్టర్ పట్టా తీసుకొన్నాడు. ఆయన అమెరికాలో మిచిగన్ స్టేట్ విశ్వవిద్యాలయం (1936-72) లో పనిచేశాడు. 1941 లో అమెరికా పౌరసత్వం తీసుకొన్నాడు.

*ది బుక్ ఆఫ్ కెనెడియన్ పొయిట్రీ* (1943) సంకలనం మొదలుకొని అనేక కవితా సంకలనాల పరంపరలో కెనడా సాహిత్యాన్ని ఎంతో విజ్ఞతతో పరిశీలిస్తున్నందున ఆయన ఆధునిక కెనడా సాహిత్య విమర్శకు మైలురాయి అయాడు. *ది బ్లాస్టెడ్ పైన్* (1957), *మోడర్న్ కెనెడియన్ వెర్స్ ఇన్ ఇంగ్లీష్ అండ్ ఫ్రెంచ్* (1967), *ది కలోనియల్ సెంచరీ* (1973) మొదలైనవి స్మిత్ అనంతరకాలంలో ప్రచురించిన కవితా సంకలనాలు. *న్యూస్ ఆఫ్ ది ఫోనిక్స్* (1943) *కలెక్టెడ్ పొయెమ్స్* (1967) లో స్మిత్ స్వీయ కవితలు సంకలితం అయాయి. అతని కవితలలో చక్కని శిల్పం కనిపిస్తుంది.

పి.ల.నా.

**స్యుటోనియస్ (69-122) :** రోమన్ చరిత్ర రచయిత, పురావస్తు పరిశోధకుడు. రోమను ప్రధాన సాహిత్యపరుల జీవిత చరిత్రను సంగ్రహంగా *డె విరిస్ ఇల్లస్ట్రిబస్* అనే సంకలనంగాను, *డె విటా సీజరం* అనే పేరుతో సీజరు జీవిత చరిత్రను రచించాడు. రెండో పుస్తకంలో 11 మంది రాజుల కుంభకోణాలను, బాధ్యతా రాహిత్యాన్నీ వర్ణించడం వల్ల అతనికి విశేషఖ్యాతి లభించింది.

ప్లినీతో కలసి చదువుకొన్నాడు. ఆయన ద్వారా మిలిటరీలో ఉద్యోగం సంపాదించాడు. ఆయనతో పాటు మిషనరీగా ఆసియామైనర్‌లో పర్యటించాడు. ప్లినీ మరణం తరువాత స్యుటోనియస్‌కు సెప్టిషియస్ క్లారస్ అనే మరో పోషకుడు దొరికాడు. ఈయనకు *ది విటా సీజరం* ను స్యుటోనియస్ అంకితం ఇచ్చాడు. హాడ్రియన్ మహారాజు సింహాసనం అధిష్ఠించిన (117) వెంటనే స్యుటోనియస్ ఇంపీరియల్ సర్వీసులో చేరి రోమన్ లైబ్రరీల కంట్రోలరుగాను, అభిలేఖాగారం సంరక్షకుడుగానూ, మహారాజుకు సాంస్కృతిక విషయాల సలహాదారుగానూ పనిచేసి ఉండవచ్చును. 121 లో ఇంపీరియల్ కరెస్పాండెన్స్ సెక్రెటరీగా ఉన్నతపదవి పొంది, 122 లో కోర్టు నియమాలను నిరాదరించినందున పదవీచ్యుతుడు అయి ఉండవచ్చును. అటు పిమ్మట తన జీవితాన్ని స్యుటోనియస్ సాహిత్య రచనలకు అంకితం చేశాడు. స్యుటోనియస్ రచనలు ఎక్కువగా పురా వస్తు పరిశోధనకు సంబంధించినవి. అయినా రోమన్ సామ్రాజ్యానికి చెందిన ప్రముఖ రచయితల వంశ వృక్షాలను తెలిపే మిక్కిలి ప్రామాణిక గ్రంథం *డె విరిస్ ఇల్లస్ట్రిబస్* ను కూడా ఆయన రచించాడు. దీనిలో కొంత భాగం మాత్రమే లభ్యమవుతున్నది. హోరేస్, లూకాస్, థెరెన్స్, వర్జిల్ వంటి ప్రముఖ రచయితల జీవిత వాస్తవాలను ఈ గ్రంథాన్ని ఆధారంగా చేసుకొని నిర్ణయించాడు.

జూలియస్ సీజరు నుండి డామిషియన్ వరకు గల రాజుల చరిత్రను *డె విటా సీజరం* లో వర్ణించాడు. తద్వారా రోమన్ సమాజపు, నైతిక, రాజకీయ దోషాలను నిశితంగా విమర్శించాడు. జీవిత చరిత్రలను ఒక క్రమపద్ధతిలో రచించాడు. రాజవంశ చరిత్ర సింహాసనం అధిష్ఠించక పూర్వపు జీవితం, ప్రజల అభిప్రాయం, వ్యక్తి గత జీవితం, స్వరూపం, వ్యక్తిత్వం, మరణం వంటి అధ్యాయాలుగా విభజించి జీవిత చరిత్రలను రచించాడు. కుంభకోణాలు, అవినీతులను లోతుగా స్పృశించాడు కాని రాజ్యం, అభివృద్ధి, పాలన, రక్షణ వంటి వాటిని ఎక్కువగా వివరించలేదు. రోమన్ ప్రజా జీవితం, సంప్రదాయాల దృష్ట్యా ఆయా రాజుల ప్రమాణాల దృష్ట్యా వ్యక్తిత్వాలను నిరూపించాడు. *డె విటా సీజరం* ఒక ఉద్వేగాత్మకమైన రచన.

పి.ల.నా.

**స్లోవాకీ, జూలియజ్ (1809-49) :** పోలిష్ కవి, రచయిత, నాటకకర్త. భావకవిత్వోద్యమంలో పేరు ప్రఖ్యాతులు సంపాదించిన ఈ కవి భావము, భాష, శిల్పం మొదలైన విషయాలలో ఎన్నో క్రొత్త ప్రయోగాలు చేశాడు.

జూలియజ్ తండ్రి విశ్వవిద్యాలయంలో ప్రొఫెసరు లిథూనియాలోని విలినియస్‌లో 1829 వరకు చదువుకొని, తల్లి మాట మేరకు వార్సాలోని ప్రభుత్వ కార్యాలయంలో ఆర్థిక శాఖాధికారిగా జూలియజ్ ఉద్యోగంలో చేరాడు. కాని అతనిలోని సాహిత్య పిపాస, కవితా రచనల పట్ల ఆసక్తి జూలియజ్‌ను ఆ ఉద్యోగంలో కొనసాగనీయ లేదు. 1830 లో ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి, పారిస్, లండన్ దేశాలు పర్యటించాడు. 1833-35 సంవత్సరాలలో స్విట్జర్లాండు, ఇటలీ దేశాలు చూసినప్పుడు కలిగిన స్ఫూర్తితో *స్విట్జర్లాండులో* అన్న ప్రేమ గీతాన్ని వ్రాశాడు. అది ఆయన మరణానంతరం ప్రచురించబడింది. ఇదే సమయంలో ప్రఖ్యాత ఆంగ్లకవి బైరన్ వ్రాసిన చైల్డ్ హెరాల్డ్ ని అనుసరించి కూడా అతడు గేయ కవిత్వం వ్రాశాడు. దీనిపేరు *వాయేజ్*

*టు ది హోలీ లాండ్* పోలండులో ఏర్పడిన రాజకీయ సంక్షోభం వల్ల దేశం వదలి జూలియజ్ పారిస్‌లో తల దాచుకున్నాడు. ఆ రోజులలో పోలండులో ఉన్న తన తల్లికి ఆయన వ్రాసిన లేఖలు మంచి సాహిత్యానికి మచ్చుతునుకలుగా భావించబడుతున్నాయి.

స్లోవాకీ వ్రాసిన మరి కొన్ని రచనలు: 1838లో *వచన కవిత్వం,* 1847 లో *ది స్పిరిట్ కింగ్* అన్న కవితా సంపుటి. షేక్స్‌పియర్ రచనలు, గ్రీకు రోమన్ రచయితల నాటకాలు ఇతణ్ణి చాలా ప్రభావితుణ్ణి చేశాయి. అప్పట్లో ఆయన వ్రాసిన *లిల్లా వెనెడా* (1840) నాటకాలు ఇప్పటికీ పోలండులో ప్రదర్శింపబడి ప్రేక్షకుల ఆదరణ పొందుతున్నాయి. పోలండులోని యువ రచయితలకు స్లోవాకీ నాటకాలు నేటికీ మార్గ దర్శకాలు.

భార్గవి

**స్విన్‌బర్న్, అల్గెర్‌నాన్ చార్లెస్ (1837-1909) :** స్విన్‌బర్న్ ప్రఖ్యాత ఆంగ్లకవి, విమర్శకుడు. విక్టోరియన్ కవుల తరువాత 'ప్రిరాఫలైట్ మూవ్‌మెంట్' కాలంలో కలం పట్టినవారిలో ముఖ్యమైనవాడు. కవితా శిల్పంలో క్రొత్తపోకడలు సృష్టించి ప్రయోగాలు చేశాడు. అంత్య ప్రాసలకు ప్రాధాన్యం ఇవ్వడం వల్ల ఇతని కవితలలో సంగీతం వినిపిస్తుంది. తనదే అయిన బాణీలో వ్రాశాడు. పదాల పొందికలో చిత్రాలు, రంగుల విన్యాసాలు కనిపిస్తాయి. ఇతనిపైన మాజినీ, విక్టర్ హ్యూగోల ప్రభావం బాగా ఉంది. స్విన్‌బర్న్ నాస్తికుడు. మనిషికి సంపూర్ణ స్వాతంత్ర్యం ఉండాలని నమ్మినవాడు. ఈయన రచనలలో స్వేచ్ఛా కాంక్ష స్పష్టంగా కనబడుతుంది.



లండన్‌లో జన్మించిన స్విన్‌బర్న్ తన బాల్యాన్ని వైట్ దీవిలోనూ, తాతగారి ఎస్టేట్ నార్తంబర్‌లాండ్ లోనూ గడిపాడు. ఈటన్ కళాశాలలో చేరి 1860 వ సంవత్సరంలో చదువు పూర్తిచేయకుండానే బయట బడ్డాడు. ప్రిరాఫలైట్‌ల ప్రభావంతో బర్న్స్, విలియమ్ మోరిస్, దాంతే, గ్రేబియల్ రోసెట్టీ మొదలైన వారితో కలసి రచనలు చేశాడు. గొప్ప వంశంలో పుట్టినవాడనని ఎంతో గర్వంగా చెప్పుకొనే స్విన్‌బర్న్ ఆయన తండ్రి సంపాదన మీదే కాలక్షేపం చేస్తూ సాహిత్యమే వ్యాపకంగా చాలా ఏళ్ళు గడిపాడు. స్విన్‌బర్న్‌కు పేరు తెచ్చిన పుస్తకం *అట్లాంటా ఇన్ కాలిడన్* (1865). కవితలు-గేయాల సంపుటి 1866 లో ప్రచురించబడింది. స్వేచ్ఛను ఉద్బోధిస్తూ వ్రాసిన దేశభక్తి గేయాలు: *సాంగ్స్ బిఫోర్ సన్‌రైస్* (1871). దీని రెండవ భాగం మరొక సంపుటిగా 1878 లో వెలువడింది. స్విన్‌బర్న్ ఇటాలియన్ నాయకుడు మాజినీని కలుసుకొన్న సంఘటనలు, ఆయన సిద్ధాంతాల ప్రభావం ఈ గేయాలలో కనిస్తాయి. ఈ సమయంలో స్విన్‌బర్న్ ఆరోగ్యం బాగా దెబ్బ తింది. ఆవేశం పాలు ఎక్కువై, ఆయన మనస్తత్త్వంలో వచ్చిన మార్పు ఆయన ఆరోగ్యంమీద కూడా ప్రభావం చూపింది. ఫిట్స్ రావడం మొదలయ్యింది. ఆ తరువాత ముప్పై ఏళ్ళ జీవితం అతని స్నేహితుడు థియోడర్ వాట్స్ డంటన్ గార్డియన్‌గా ది పైన్స్ అన్న ప్రాంతంలో గడిపాడు. స్నేహితుడు థియోడర్ ఆధ్వర్యవంలో ఆరోగ్యం కాపాడుకొంటూ, భోజనం విషయంలో జాగ్రత్త వహించి సాహిత్య సృష్టి చేసి, 23 సంపుటాలలో కవితలు, నాటకాలు, వ్యాసాలు ప్రచురించాడు. వీటిలో *ఎస్సేస్ అండ్ స్టడీస్* (1875) షేక్స్‌పియర్, విక్టర్ హ్యూగో, బెన్ జాన్‌సన్‌లపై వ్రాసిన సమగ్ర వ్యాసాలు ముఖ్యమైనవి.

భార్గవి

**స్విఫ్ట్, జొనాథన్ 1667-1745) :** ప్రముఖ ఐరిష్ రచయిత. తండ్రి మరణానంతరం జన్మించిన స్విఫ్ట్ మేనమామల దయాదాక్షిణ్యాల మీద ఆధారపడి పెరిగాడు. తల్లి తండ్రుల ప్రేమ, ఇంటి వాతావరణం కరువైన స్విఫ్ట్‌కు ఒక విధమైన ఆత్మ న్యూనతాభావం (inferiority complex) ఉండేది.



ఐర్లండ్‌లోని ప్రసిద్ధిగాంచిన కిల్‌కెన్నీ స్కూలులోనూ,

డబ్లిన్‌లోని ట్రినిటీ కాలేజీలోనూ చదువుకొనే అవకాశం కలిగింది. కాని చదువులో అతనికి ఎక్కువ ఆసక్తి కలుగ లేదు. దీనికి కారణం ఇంట్లో కరువైన ప్రేమానురాగాలు, చుట్టాలు చూసిన చిన్నచూపు అని తరువాత అతడు తన ఆత్మకథలో వ్రాసుకొన్నాడు. 1686 లో బి.ఏ. పట్టా పుచ్చుకొన్నాడు. ఎమ్.ఏ. చదువుతున్న రోజులలో అతని విప్లవాత్మక భావాలు తోటి విద్యార్థులను పెడత్రోవ పట్టించేవిగా ఉన్నవని నిర్ణయించి కాలేజీ నుండి అతణ్ణి బహిష్కరించారు. ఆ తరువాత తల్లిని కలుసుకొని, దూరపు బంధువైన సర్. విలియమ్ టెంపుల్ ఇంట్లో తల దాచుకొన్నాడు. సాహితీవేత్త, విమర్శకుడు అయిన విలియం టెంపుల్ స్విఫ్ట్‌లోని ప్రతిభను గుర్తించి మూర్‌పార్క్‌లోని అతనికి తన స్వగృహంలో నివాసం కల్పించాడు. స్విఫ్ట్ ప్రతిభకు మెరుగులు దిద్ది, అతని ఆలోచనలకు పదును పెట్టినవాడు సర్ టెంపుల్. సర్ విలియం టెంపుల్ సంగ్రహించిన పుస్తకాలన్నీ స్విఫ్ట్ చదివాడు, అతని వద్ద పనిచేసే అమ్మాయి 'ఎస్తర్ జాన్‌సన్‌ని' అతడు ప్రేమించాడు.

1691-94 లో స్విఫ్ట్ తన రచనా వ్యాసంగాన్ని ప్రారంభించాడు. ఎన్నో కవితలూ, గేయాలూ వ్రాశాడు. చాలామంది విమర్శించినా యేట్స్ (Yeats) లాంటి ప్రముఖులు మెచ్చుకొనడంతో స్విఫ్ట్‌కు ఉత్సాహం పెరి గింది. *ఎ టేల్ ఆఫ్ ఎ టబ్, బాటిల్ ఆఫ్ ది బుక్స్* అనే ముఖ్యమైన గ్రంథాలు ఈ కాలంలో ప్రచురించబడ్డాయి గాని అవి స్విఫ్ట్ పేరు మీద అచ్చు కాలేదు. కొన్ని కారణాల వల్ల స్విఫ్ట్ తనపేరును గుప్తంగా ఉంచడానికే నిర్ణయించుకొన్నాడు.

సర్ విలియం టెంపుల్ మరణానంతరం స్విఫ్ట్ జీవితం కొత్తమలుపు తిరిగింది. వ్యంగ్య రచయితగా, పత్రికా విలేఖకుడుగా అతనికి గుర్తింపు వచ్చింది. తరచు ఇంగ్లండు వెళ్లడం వలన రాజకీయంగా పరపతి పెరి గింది. రాజకీయాలను విమర్శిస్తూ ఈయన వ్రాసిన వ్యాసాలు చాలామందిని ఆకర్షించాయి. ఇంగ్లండులోని అప్పటి ప్రముఖ రాజకీయ పార్టీలు రెండు, విగ్స్ టోరీస్. స్విఫ్ట్ టోరీస్ పార్టీ పత్రిక *ది ఎక్సామినర్* కు సంపాద కత్వం వహించాడు. కాని అతని రచనలు ముఖ్యంగా *ది టేల్ ఆఫ్ ది టబ్* మత సంప్రదాయాలను కించ పరిచేదిగా ఉందని, అతడు జన్మతః ఇంగ్లీషువాడు కాదని అతనికి 'డీన్' పదవిని ఇవ్వలేదు.

1714 లో ఐర్లండుకు తిరిగి వచ్చిన స్విఫ్ట్ మళ్లీ ఇంగ్లండుకు వెళ్ళలేదు. భార్య స్టెల్లాతో స్థిరపడి పూర్తిగా సాహిత్య నిర్మాణంలో లీన మయాడు. ఇంగ్లండులో పరిచయమైన స్నేహితురాలు 'వనెస్సాకు' కూడా స్విఫ్ట్ పైన ప్రగాఢమైన ప్రేమ ఉండేది. *డ్రేపియర్ లెటర్స్, ఏ మోడెస్ట్ ప్రొపోజల్* అనే పుస్తకాలు ఈ కాలంలో రచించినవే.

స్టెల్లా జనవరి 1728 లో మరణించింది. అప్ప టికే స్విఫ్ట్ ప్రఖ్యాత నవల *గల్లివర్స్ ట్రావెల్స్* ప్రచురించ బడింది. ఇది వ్రాయడానికి నాలుగేళ్లు పట్టింది (1721-25). 1739 వరకూ రచనలు చేసిన స్విఫ్ట్ చివరికాలాన్ని గురించి ఎన్నో కథలు, ఆపోహలు, ప్రచారంలో ఉన్నాయి. అతనికి మతి భ్రమణం కలిగిందనీ, పక్షవాతం వచ్చిందనీ ప్రతీతి. స్విఫ్ట్ 1745 అక్టోబరు 19 న డబ్లిన్‌లో మరణించాడు. సెయింట్ పాంట్రిక్ కెథెడ్రెల్‌లో అతని అంత్యక్రియలు జరిగాయి.

భార్గవి

**స్వేవో, ఇటాలో** (1861-1928) : నవలాకారుడు, ఇటాలియన్, కథా రచయిత. మనస్తత్త్వశాస్త్రాన్ని ఆధా రంగా చేసుకొని రచనలు చేయడాన్ని ఈయనే మొదట ప్రారంభించాడు.

స్వేవో తండ్రి జర్మన్ దేశస్థుడు. తల్లి ఇటాలియన్ దేశస్థురాలు. తండ్రి వ్యాపారం దెబ్బతినడంతో, పన్నెం డేళ్ళ వయసులోనే చదువుకొనే అవకాశం కోల్పోయాడు. స్వయంకృషితో పైకి వచ్చి ఒక బాంకులో గుమాస్తా ఉద్యోగం సంపాదించుకొని స్వంతంగా చదువుకొంటూ, రచనలు చేయడం మొదలు పెట్టాడు.

స్వేవో మొదటి నవల *ఉనావిటా 1892* లో ప్రచురించబడింది. దీనిలో ఒక మేధావి తన జీవితంలో ఆత్మపరిశీలన చేసుకొంటూ, ఆలోచనలలో కొట్టుకుపోతూ ఎలా కష్టపడుతాడో చిత్రించబడింది. కథా సంవిధానంలో కొత్తదన మున్నా, విషయాన్ని విశ్లేషించి చెప్పినా నవలలో అమరిక లేదనీ; చెప్పే విధానంలో పొంతన లేదనీ దీని పట్ల విమర్శలు వెలువడ్డాయి. *సెనిలిటా* అనే రెండవ నవలలో మనిషి అవసాన దశలో పడే బాధలు వర్ణించబడ్డాయి. ఈ రెండు నవలల తరువాత స్వేవో అతని మామగారి వ్యాపారాభివృద్ధిపై దృష్టి కేంద్రీకరించి ఎక్కువగా రచనలు చేయలేదు.

వ్యాపార రీత్యా ఇంగ్లండు వెళ్లినపుడు ప్రసిద్ధ ఆంగ్ల నవలారచయిత జేమ్స్ జాయ్స్‌తో పరిచయమైంది. ఆ పరిచయం స్నేహంగామారి జాయ్స్ ప్రభావంతో మళ్ళీ స్వేవో రచనలు చేయడం మొదలుపెట్టాడు. స్వేవో *లా కాన్షియన్స్ దిజెనో* అన్న రచన స్వేవోకి చాలా పేరు

తెచ్చిపెట్టింది. ఇది ఫ్రెంచ్, ఇంగ్లీషు భాషలలోకి అనువదింపబడి విమర్శకుల మన్ననలు పొందింది. ఈ నవల రెండవ భాగం వ్రాయడానికి పూనుకొన్న కొద్దిరోజుల లోనే స్వేవో ఒక రోడ్డు ప్రమాదంలో మరణించాడు. ఈయన మరణానంతరం స్వేవో అసంపూర్తి నవలతో పాటు, కథానికా సంకలనాలు కూడా వెలువడ్డాయి. స్వేవో పేరు ఇటాలియన్ సాహితీ చరిత్రలో ప్రముఖంగా గుర్తించబడింది. *ది నైస్ ఓల్డ్ మాన్ అండ్ ది ప్రెటీ గర్ల్* (1930), *ఎ స్పేస్ ఆన్ ద శాటర్డే పేజెస్* (1954) *కామెడీ* (1960) అనే హాస్య నాటికల సంకలనం స్వేవో రచనలలో ముఖ్యమైనవి.

భార్గవి

**హడ్సన్, డబ్ల్యూ. హెచ్. (1841-1922) :** హెన్రీ విలియం హడ్సన్ ప్రఖ్యాత బ్రిటిషు రచయిత. ప్రకృతీ, పక్షులూ ఇతనికి ఇష్టమైన విషయాలు. *గ్రీన్ మాన్షన్* (పచ్చని ఇల్లు) అన్న పుస్తకం ఇతనికి చాలా ప్రఖ్యాతి కూర్చింది. హడ్సన్ తల్లితండ్రులు అర్జెంటీనాలో గొర్రెల పెంపకం చేసుకొంటూ ఉండేవారు. హడ్సన్ ఆనాటి అనుభవాలను, చిన్నతనంలో ప్రకృతినుంచి, జీవితంనుంచి నేర్చుకొన్న పరిజ్ఞానాన్ని *ఫార్ ఎవే అండ్ లాంగ్ ఎగో* (1918) అనే పుస్తకంలో వివరించాడు. పదిహేనేళ్ళకే ఆరోగ్యం దెబ్బతిని, తల్లిదండ్రుల్ని పోగొట్టుకొని కొన్నేళ్లు ఏ లక్ష్యంలేకుండా తిరిగాడు. పేదరికం, అనారోగ్యం భయపెట్టినందున ఒక తోడు కావాలనుకొని 1876 లో తనకంటె వయస్సులో పెద్దదయిన స్త్రీని వివాహం చేసుకొన్నాడు.



రచనా వ్యాసంగం మొదలు పెట్టిన కొత్తలో దక్షిణ అమెరికా నేపథ్యంలో చేసిన రచనలు చాలా మామూలుగా ఉన్నాయి. పాత్రల చిత్రణ అంత గొప్పగా లేకపోయినా, ప్రకృతి వర్ణనలు అద్భుతంగా ఉన్నాయి. అప్పట్లో వీటికి అంతగా ప్రచారం లభించలేదు. హడ్సన్ వ్రాసిన మొదటి నవల *ది పర్పుల్ లాండ్ దట్ ఇంగ్లండ్ లాస్ట్* (The Purple Land that England Lost) (1885), రెండు భాగాలుగా వచ్చింది. ఆ తరువాత చిన్నవీ, పెద్దవీ చాలా కథలు వ్రాశాడు. *గ్రీన్ మాన్షన్*‌లోని ప్రేమకథలో సగం పక్షి సగం స్త్రీ రూపంలో రీమా అనే పాత్రను సృష్టించాడు. దీని ప్రభావం, పాత్రచిత్రణ చాలామందిని ఆకట్టుకుంది. 1925 లో లండన్‌లోని హైడ్ పార్క్‌లో మ్యూజియం నిర్మించినపుడు ఈ రీమా శిల్పాన్ని హడ్సన్ స్మృతి చిహ్నంగా అక్కడ ప్రతిష్ఠించారు.

హడ్సన్‌కి చాలామంది రచయితలతో పరిచయం ఉండేది. జోసెఫ్ కాన్రాడ్, ఫోర్డ్, ఎడ్వార్డ్ గార్నెట్, జార్జ్ గిస్సింగ్ వీరిలో ముఖ్యులు. ఇంగ్లండ్ దేశంలోని పల్లె ప్రాంతాలలోని అక్కడి ప్రకృతి వర్ణనలతో చేసిన రచనలు చాలా ప్రజాదరణ పొందాయి.

హడ్సన్ ఇతర రచనలు: *ఏ ఫూట్ ఇన్ ఇంగ్లండు* (1909), *ఏ షెపర్డ్స్ లైఫ్* (1910), *డెడ్ మాన్స్ ప్లాక్, ఏ ట్రావలర్ ఇన్ లిటిల్ థింగ్స్* (1921), *ఏ హింద్ ఇన్ రిచ్‌మండ్ పార్క్* (1922). తన రచన ప్రకృతికి దగ్గరగా ఉండాలని నమ్మి, ఆ పంథాలో రచనలు చేసి పేరు తెచ్చుకొన్న రచయిత హడ్సన్.

భార్గవి

**హంట్, లీ (1784-1859) :** ప్రముఖ ఆంగ్ల రచయిత. పత్రికా రచనలు సాహిత్య ప్రక్రియగా పరిగణించబడ్డ రోజులలో మంచి సాహితీ విలువలతో కూడిన పత్రికలు నడిపిన ఘనత 'లీ హంట్' ది. విమర్శన వ్యాసాలు, కవితలు వ్రాసి పేరు తెచ్చుకొన్న లీ హంట్ ప్రఖ్యాత ఆంగ్ల భావకవులు షెల్లీ, కీట్స్‌లకు బాగా కావలసినవాడు. ఈయన కవితలలో *అబూబెన్ ఆడమ్, జెన్నీ కిస్ట్* అన్నవి బహుళ ప్రాచుర్యం పొందాయి.

గొప్పకవి అనే పేరు లేకపోయినా లీ హంట్ *ఆత్మ కథ* (1850) *లార్డ్‌బైరన్ అతని సమకాలీనులు* (1828) అనే రచనలు బాగా ప్రజాదరణ పొంది తోటికవుల మెప్పును గడించాయి. రాజకీయాలలో అభిరుచి లేకపోయినా పత్రికా విలేఖకుడుగా రచయితలను బేరీజు వేయడంలో అందెవేసిన చేయి అనిపించుకొన్నాడు.

1801 లో ప్రచురింపబడిన లీ హంట్ కవితా సంపుటి *జువెనెలియా* ఇతనికి ఇటాలియన్ సాహిత్యం పట్ల ఉన్న మక్కువను ప్రతిబింబిస్తుంది. కీట్స్ ప్రభావంతో వ్రాసిన కవితలు *ది స్టోరీ ఆఫ్ రిమిని* (1816). పద్దెనిమిదో శతాబ్దంలో భావ ప్రాధాన్యంతో వ్రాసిన *ఫేబర్స్* ను ఇతడు మళ్లీ ప్రచారంలోకి తేవాలనుకొన్నాడు. లీ హంట్ ప్రభావం కీట్స్ మీద కూడా ఉంది. పదాలలో భావుకత,

రంగులు, చిత్రాల నిర్మాణం, ఇటాలియన్ కవితాశైలి లీ హంట్ నుండే కీట్స్ నేర్చుకొన్నాడు.

*ఎగ్జామినర్* అనే పత్రికను లీ హంట్ తన తమ్ముడు జాన్ హంట్‌తో కలసి నడిపేవాడు. ఆ పత్రికలో బానిసత్వం రూపుమాపాలని వాదిస్తూ, పార్లమెంటునీ, వర్చినీ విమర్శిస్తూ వ్రాసిన వ్యాసాలు న్యాయసమ్మతమైనవి కావని అప్పటి ప్రభుత్వం లీ హంట్‌ను ఖైదులో పెట్టింది. జైలులో ఉంటూనే తన రచనా వ్యాసంగాన్ని ఒక ఉద్యమంగా అతడుకొనసాగించాడు. 1817 లో విడుద లయాక కీట్స్ ద్వారా లీ హంట్‌కి షెల్లీతో కూడా పరిచయం కలిగింది. *బ్లాక్ వుడ్స్ మేగజైన్* అనే పత్రికలో భావకవిత్వాన్ని ఖండిస్తూ, విమర్శిస్తూ ప్రచురించిన వ్యాసాలకు *ఎగ్జామినర్* ప్రతివిమర్శ ప్రచురించింది.

లీ హంట్‌కి లలిత కళలపట్ల, నాటకరంగం పట్ల చక్కటి అవగాహన ఉండేది. *ఇమేజినేషన్ అండ్ ఫాన్సీ* (1844) చక్కని విమర్శనా కావ్యంగా పేరు తెచ్చుకుంది. *ది కంపానియన్, ఇండికేటర్* లాటి పత్రికల్లో కూడా మంచి రచనలు ప్రచురించిన లీ హంట్ చివరివరకూ పత్రికా రంగంలో కృషిచేసి మంచిపేరు తెచ్చుకొన్నాడు.

భార్గవి

**హాఫిజ్ (1325/26-1389/90) :** 14 వ శతాబ్దికి చెందిన గొప్ప పర్షియన్ కవి. ఈయన సాంప్రదాయికమైన, మతపరమైన విద్యను అభ్యసించి *ఖురాన్* గ్రంథంపై ఉపన్యాసాలు చేసేవాడు. షిరాజ్‌లోని రాజుల ఆశ్రయంలో ఎన్నో ఉద్గ్రంథాలకు వివరణలు, వ్యాఖ్యానాలు వ్రాశాడు.

సూఫీమత సిద్ధాంతాలను గాఢంగా నమ్మిన హాఫిజ్ ఆత్మ పరమాత్మల ఐక్యాన్ని గురించి ప్రచారం చేశాడు. 1368 లో రాజానుగ్రహం కోల్పోయి, ఇరవై ఏళ్ళ పాటు స్వతంత్రంగా రచనలు చేశాడు. ఇతని రచనలలో అప్పటి షిరాజ్‌లోని రాజకీయాలు, చారిత్రక సంఘటనలు, సామాజిక పరిస్థితులపై వర్ణనలు విశేషంగా కనబడతాయి.

ప్రస్తుతం బహుళ ప్రాచుర్యంలో ఉన్న గజల్స్‌ని మొట్టమొదటిసారిగా వ్రాసిన కవి హాఫిజ్. ఆరు నుండి పదిహేను పంక్తులను మించకుండా చిన్నకవితలో ఒక భావాన్ని చెప్పి మరొక రెండు పంక్తులలో అన్నిటినీ కలిపి క్లుప్తంగా చెప్పడం ఈ గజల్ కవితలోని ప్రత్యేకత. మధువు, ఆనందం, స్వేచ్ఛా ప్రణయం ఈ గజల్ కవితలకు కవితా వస్తువులు. పాడుకొనడానికి వీలుగా, అందరికీ అర్థమయే భాషలో వ్రాసిన ఈ కవితలు ఎంతో ప్రజాదరణ పొందాయి. మోసాన్నీ, స్వార్థాన్నీ నిరసిస్తూ దైనందిన అనుభవాలనే దైవికంగా కూడా చూడవచ్చునని హాఫిజ్ చెప్పినమాటలు సూఫీ మత సిద్ధాంతాలను ప్రతిఫలిస్తాయి. ఈయన కవితలు అన్ని భాషలలోనూ అనువదింపబడ్డాయి. *ది దివాన్* (1891) *ఫ్యాబ్లై హాఫిజ్ కవితలు* (1947) అనేవి హాఫిజ్ ఆంగ్లానువాదాలు.

భార్గవి

**హమ్సున్, నట్ పెడెర్సెన్ (1859-1952) :** నార్వే దేశానికి చెందిన నవలా రచయిత, నాటక కర్త, కవి. 1920 లో సాహిత్యానికి నోబెల్ బహుమతి విజేత. 1859 ఆగస్టు 4 నాడు నార్వేలోని 'లోమ్' లో అతడు జన్మించాడు. నవకాల్పనికోద్యమానికి ఇతడు నాయకుడు. ఈ శతాబ్దారంభంలో నవలను అవధులు మీరుతున్న వాస్తవికతా చిత్రణ నుండి విడిపించి, తిరిగి కవితా స్పర్శతో కూడిన శైలికి, కమనీయ భావనకు ఈయన స్థానం కల్పించాడు. సామాన్య కర్షక కుటుంబానికి చెందిన ఇతడు క్రమబద్ధమైన విద్యాభ్యాసానికి నోచుకోలేదు. 19 వ ఏటనే రచనా వ్యాసంగం ప్రారంభించాడు. రెండు సార్లు అమెరికా వెళ్ళి, చిల్లర ఉద్యోగాలు చేసి వచ్చాడు.

ప్రచురితమైన తొలి రచన 1890 లో వ్రాసిన *సుల్ట్* అనే నవల. తరువాత 1899 లో *హంగర్* అనే నవల అచ్చయింది. నార్వే దేశంలో ఆకటితో అలమటిస్తున్న ఒక యువరచయిత జీవితం *సుల్ట్* నవలలోని ఇతివృత్తం. అప్పటి నార్వీజియన్ నవలలలోని సాంఘిక వాస్తవికతకు అది భిన్నంగా ఉన్నది. ఆ నవలలో కనిపించే దృక్పథంలోని నవ్యత, భావానుగుణమైన రమణీయశైలి యూరపియన్ రచయితలను స్పందింపజేశాయి. వారికి ఆరాధ్యులైన ఇబ్సెన్, టాల్‌స్టాయ్ వంటి రచయితలను విమర్శిస్తూ హమ్సున్ ఎన్నో ఉపన్యాసా లిచ్చాడు. ధారావాహికంగా యావజ్జీవితం రచనలు చేశాడు. అతని నవలలలో కథానాయకులు సాంఘిక చైతన్యం లేనివారు, ప్రగతి అంటే హర్షించని వారు. తిరిగి సహజ సుందరమైన గ్రామీణ జీవితమే వాంఛనీయమని విశ్వసించేవారు. ఈ ధోరణి 1917 లో వెలువడిన *మార్కెన్స్ గ్రోడ్* లోనూ, 1920 లో వచ్చిన *గ్రోత్ ఆఫ్ ది సాయిల్* లోనూ స్పష్టంగా కనిపిస్తుంది. ఆధునిక పాశ్చాత్య నాగరకతకు అతడు వ్యతిరేకి. వ్యక్తి ప్రాధాన్యవాది కావటం వల్ల రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో జర్మన్‌లు నార్వేను ఆక్రమించుకొన్నప్పుడు అతడు వారిని సమర్థించాడు. యుద్ధం ముగిసిన తరువాత అతనిని దేశద్రోహిగా పరిగణించి, అతనికి జైలు శిక్ష విధించారు. కాని వయోవృద్ధుడని విడిచి పెట్టారు.

అతడు నాజీలతో సహకరించటం వల్ల అతని ఖ్యాతికి దెబ్బ తగిలింది. కాని, 1952 లో అతడు మరణించిన తరువాత విమర్శకులు అతని రచనల విశిష్టతను తిరిగి గుర్తించారు. అనువాదాల ద్వారా తిరిగి అతని రచనలు వివిధ భాషలలో లభ్యమవుతూ, జనాదరణ పొందుతూ వచ్చాయి. బుద్ధి పూర్వకంగా హేతువాదాన్ని అతడు వ్యతిరేకించటం, అతని స్వచ్ఛందమైన, సరళమైన శైలి, యూరప్ ఖండంలో ఎందరో రచయితలను ఆకర్షించాయి. మాక్సిం గోర్కీ, థామస్ మాన్, ఐజాక్ బషేవిస్ సింగర్ వంటి రచయితలు అతనిని నవలా రచనలో సిద్ధహస్తు డని మెచ్చుకొన్నారు.

*నాగరాజ్, అ.రా.కృ.*

**హవెల్స్, విలియం డీన్ (1837-1920):** అమెరికన్ నవలా రచయిత, విమర్శకుడు, సాహిత్యంలో వాస్తవికతా వాద ప్రవక్త. 19 వ శతాబ్దపు ఉత్తరార్ధంలోని అమెరికన్ రచయితలలో ప్రముఖుడు. మార్క్ ట్వెయిన్, హెన్రీ జేమ్స్‌లకు సన్నిహిత మిత్రుడు, సలహాదారుడు. ఈయన తండ్రి సంచార ముద్రాపకుడు, పత్రికా సంపాదకుడు. హవెల్స్ బాల్యం ఒహాయో పట్టణంలో గడిచింది. ఆయన 'టైప్ సెట్టర్' గా జీవితం ప్రారంభించి, విలేఖకుడుగా స్థిరపడ్డాడు. ఈ కాలంలో జర్మన్, స్పానిష్ భాషలను స్వయంగా నేర్చుకొని, వాటిలో ప్రావీణ్యం గడించాడు. అంతేకాక ఇంగ్లీషు మహాకావ్యాలను చదివాడు. *ది అట్లాంటిక్ మంత్లీ* పత్రికలో కవితలు ప్రచురించాడు. 1860 లో అబ్రహాం లింకన్ జీవిత చరిత్ర రచించాడు. దానిద్వారా ఆయనకు న్యూ ఇంగ్లాండులో పర్యటించడానికి కావలసిన ఆర్థిక సహాయం లభించింది. ఈ పర్యటనలో ప్రముఖ సాహితీ వేత్తలను కలుసుకున్నాడు. అట్టివారిలో *ది అట్లాంటిక్ మంత్లీ* సంపాదకుడు జేమ్స్ రస్సెల్ లోవెల్‌ను ప్రధానంగా పేర్కొనవచ్చును. అంతేకాక *ఆలివర్ వెండెల్ హోమ్స్*, హాతోర్న్, ఎమర్సన్ మొదలైన వారిని కూడా చెప్పవచ్చు.



ఆయన 1861-65 లో వెనిస్‌లో రాజదూతగా ఉన్నాడు. ఈ కాలంలో ఆయన వివాహం చేసుకున్నాడు. అమెరికాకు తిరిగి వచ్చిన తరువాత *ది అట్లాంటిక్ మంత్లీ* సహాయ సంపాదకుడు (1866-71) గానూ, సంపాదకుడు (1871-81) గానూ పనిచేశాడు. ఆయన తన సమకాలికులతో నిర్మొహమాటంగా వ్యవహరించేవాడు. జేమ్స్ హెన్రీలోని గొప్పతనాన్ని గుర్తించాడు. మార్క్ ట్వెయిన్‌ను కళాకారునిగా పసికట్టాడు.

మధ్య తరగతి జీవితాన్ని వర్ణిస్తూ *దేర్ వెడ్డింగ్ జర్నీ* (వారి వివాహయాత్ర-1872) *ఏ ఛాన్స్ అక్వెంటెన్స్ (1873)* అనే వాస్తవికతా వాద నవలలు రచించాడు. *ఏ మోడరన్ ఇన్‌స్టాన్స్ (1882)* అనే నవల అతిశయోక్తితో కూడిన రచన. *ది రైజ్ ఆఫ్ సిలాస్ లఫమ్ (1885)* నవల అతనికి మంచి పేరు ప్రతిష్ఠలు సంపాదించింది. ఇందులో స్వయంశక్తితో బోస్టన్ సమాజస్థాయికి ఎదిగిన వ్యక్తి జీవితం వర్ణిత మయింది. *అన్నీ కిల్బర్న్* (1888) లోను, *ఏ హజార్డ్ ఆఫ్ న్యూ ఫార్చ్యూన్స్* (1890) లోనూ అతనిని సమూలంగా కలచివేసిన సామాజిక విశ్వాసాలు ప్రతిబింబించాయి. వాటిలో న్యూయార్కు జీవితం వర్ణితమయింది.

హవెల్స్ విమర్శనాత్మక రచనలు అనేక మందిని ఆకర్షించాయి. హామ్లిన్ గార్లాండ్, స్టీఫెన్ క్రేన్, ఫ్రాంక్ నోరిస్ వంటి స్వాభావిక వాద నవలా రచయితలు, ఇస్పెన్‌జోలా, టాల్‌స్టాయ్ వంటివారు ఇతని రచనలకు ముగ్ధు లయ్యారు.

*చంద్ర*

**హాజ్లిట్, విలియమ్ (1778-1830) :** ప్రసిద్ధ ఆంగ్ల రచయిత. ఆయనకు ఒక వ్యాస రచయితగా మంచి పేరున్నది. సాహిత్యపు జిలుగు వెలుకులు లేక సమాజాన్ని నిశితంగా పరిశీలించి, మానవతా దృక్పథంతో మంచి రచనలు చేశాడు. హాజ్లిట్ విద్యాభ్యాసం అమెరికాలో మొదలైంది. ఇతని తండ్రి అమెరికా తిరుగుబాటుదార్లకు మద్దతుగా ఉపన్యాసా లిచ్చేవాడు. పదేళ్ళ



వయస్సప్పుడు హాజ్‌లిట్ ఏ కారణం వల్లనో నిర్లిప్తత అలవరచుకొన్నాడు. ఎవరితో కలవకుండా, ఒంటరిగా ఎప్పుడూ ఆలోచనలలో మునిగిపోయి ఉండేవాడు. అతని భావాలు చిత్రాలలోనే ఎక్కువ బయటపడేవి. 1802 లో పారిస్ పర్యటన తరువాత హాజ్‌లిట్‌కు మంచి రచయితల సాంగత్యం లభించింది. వారిలో చార్ల్స్ లాంబ్, వర్డ్స్‌వర్త్, కాల్రిడ్జ్ మున్నగువారు ముఖ్యులు. చార్ల్స్ కుటుంబానికి సన్నిహితురాలైన 'సారా స్టొడ్డర్ట్' ను వివాహం చేసుకొని, ఫిలాసఫీ అధ్యయనం చేస్తూ రచనలు చేసుకొంటూ జీవితం గడిపాడు.

1811 వ సంవత్సరంలోగా ఎన్నో రచనలు చేసి పేరు సంపాదించిన హాజ్‌లిట్ డబ్బు మాత్రం సంపాదించ లేకపోయాడు. ఫిలాసఫీ గురించి ఉపన్యాసాలు చేస్తూ, *మార్నింగ్ క్రానికల్* అనే లండన్ దిన పత్రికకు వ్యాసాలు వ్రాసేవారు. *ఏ వ్యూ ఆఫ్ ది ఇంగ్లీష్ స్టేజ్* (ఆంగ్ల నాటక రంగం) అని హాజ్‌లిట్ వ్రాసిన విమర్శనా వ్యాసావళి 1818 లో వెలువడింది. దాని వెంటనే *ది రౌండ్ టేబుల్* అన్న సంపుటి రెండు భాగాలుగా వెలువడింది. షేక్స్‌పియర్ పాత్రలను విశ్లేషిస్తూ వ్రాసిన వ్యాస సంపుటి కూడా అప్పుడే ప్రచురించబడింది. హాజ్‌లిట్‌కు అభిమాను లెంతమందో విమర్శకులు కూడా అంతమంది ఉండేవారు. చాలామంది అభిప్రాయాలతో ఏకీభవించక, ఆ బేధాభిప్రాయాలను గురించి అతడు పత్రికలలో వ్రాసేవాడు. *లండన్ మాగజైను* ఆయన అభిమాన పత్రిక. హాజ్‌లిట్ వ్యాసాలు అందులో ఎక్కువగా ప్రచురించబడేవి.

1822 లో హాజ్‌లిట్ తన భార్యతో విడాకులు తీసుకొని లండన్‌లోని తన ఇంటి యజమాని కుమార్తెను పెళ్లి చేసుకోవాలనుకొన్నాడు కాని అది జరుగలేదు. ఈ సంఘటనను గురించి *నోట్స్ ఆఫ్ ఏ జెర్నీ ఇన్ ఫ్రాన్స్ అండ్ ఇటలీ* (1826) అనే పుస్తకంలో హాజ్‌లిట్ ప్రస్తావించాడు. 1824 లో బ్రిడ్జ్ వాటర్ అనే వితంతువుని వివాహం చేసుకొన్నాడు. కాని హాజ్‌లిట్ ఎంతో ప్రేమగా చూసుకొనే కొడుకుకూ, ఆమెకూ పడక హాజ్‌లిట్ మూడేళ్ల తరువాత ఆమెకు విడాకులిచ్చాడు. ఈయనకు పేరు తెచ్చిన రచనలు: *టేబిల్ టాక్* (1821), *ది ప్లెయిన్ స్పీకర్* (1826), *స్కెచెస్ అండ్ ఎస్సేస్* (1829), *లిటరరీ రిమెయిన్స్* (1836), *వింటర్‌స్లోస్* (1850). హాజ్లిట్ మరణానంతరం ఆయన కొడుకు ఆయన రచనలను ప్రచురించాడు.

భార్గవి

**హాథార్న్, నథేనియల్ (1804-64) :** నథేనియల్ హాథార్న్ ప్రఖ్యాత అమెరికన్ నవలా రచయిత. అన్యాపదేశ శైలిలో రచించిన ఈయన రచనలు, చిన్న కథలు ప్రపంచ వ్యాప్తంగా ప్రఖ్యాతి గాంచినవి. *ది స్కార్లెట్ లెటర్* (1850), *ది హౌస్ ఆఫ్ సెవెన్ గేబల్స్* (1851) నథేనియల్‌కు పేరు తెచ్చిపెట్టిన రచనలు. ప్రసిద్ధ రచయిత హెర్‌మెన్ మెల్‌వెల్ ఈయన స్నేహితుడు. హాథార్న్ రచనల ప్రభావం హెన్రీ జేమ్స్, ఫ్లానెరీ ఓకానర్, రాబర్ట్ పెన్ వారెన్ మొదలైన వారి పైన ఎంతగానో ఉంది అని విమర్శకులు అభిప్రాయపడుతున్నారు.

హాథార్న్ పూర్వికులు చాలా గొప్పగా బ్రతికిన వారనీ, వారి తాత ముత్తాతలు ఒక స్త్రీని అన్యాయంగా శిక్షించినందుకు ఆమె ఉసురు తగిలి వీరి కుటుంబం చితికి పోయిందనీ చెప్పుకొంటారు. నథేనియల్ తండ్రి ఒక ఓడలో కెప్టెన్ గా పనిచేస్తూ మరణించినప్పుడు ఇతనికి నాలుగేళ్ళు. మేనమామలు చేరదీసి పెంచి, బోడన్ కాలేజీలో శిక్షణ ఇప్పించారు. ప్రఖ్యాతకవి హెచ్.డబ్ల్యూ. లాంగ్‌ఫెలో ఇతని సహాధ్యాయి. అప్పట్లో ఇతడు వ్రాసిన కథలు *ది హాలో ఆఫ్ ద త్రీ హిల్స్, ఏన్ ఓల్డ్ వుమన్స్ టేల్* (1832) ఇతనికి మంచి పేరు తెచ్చిపెట్టాయి. కాని ఆర్థికంగా ఆదుకోలేదు. *యంగ్ గుడ్ మన్ బ్రౌన్* (1835) చేతబడి, తాంత్రిక విద్యలపైన వెలువడిన పుస్తకం. ఇది బాగా అమ్ముడు పోయింది. ఎలాగైనా రచయితగానే స్థిరపడ దలుచుకొని నథేనియల్ తన రచనా వ్యాసంగం కొనసాగించాడు. 1842 లో సోఫియా పీబాడీ అనే అమ్మాయిని వివాహం చేసుకున్నాడు.

కాన్‌కార్డ్‌కు మకాం మార్చాక ఆ తరువాతి మూడు ఏళ్ళూ నథేనియల్ జీవితంలో సంతోషంగా గడిపిన రోజులు. అప్పుడు కొన్ని మంచి రచనలు చేశాడు గాని, సలేమ్‌కు తిరిగి వచ్చాక కొద్ది నెలల వ్యవధిలోనే *ది స్కార్లెట్ లెటర్* వ్రాశాడు. ఇందులో తన తల్లి చనిపోయిన సంఘటనలు, విధివశాత్తు విడిపోయిన ప్రేమికుల గాథ, కష్టాలు మనిషిని ఎలా రాటు తేలుస్తాయో అన్న విషయాలు చక్కని శైలిలో వ్రాశాడు. ఆ తరువాత వ్రాసిన పుస్తకం *ది హౌస్ ఆఫ్ ది సెవెన్ గేబల్స్‌*లో *నథేనియల్* తమ హథార్న్ వంశంపైన ఉన్న శాపం గురించి ప్రస్తావిస్తాడు. ఈ రెండు పుస్తకాలూ అతనికి రచయితగా మంచి గుర్తింపు తెచ్చాయి.

హెర్మెన్ మెలెవిల్ స్నేహంతో నథేనియల్ వ్యాసంగం బలం పుంజుకుంది. డబ్బు చేసుకోవాలని, తను

తొందరగా పూర్తి చేయగలిగిన రచనలు అప్పట్లో చాలా చేశాడు. కాని అవి అతనికి పేరు తెచ్చిపెట్టలేదు. వార్ధక్యంలో ఆరోగ్యం దెబ్బతిని, మతిస్తిమితం లేక, మొదలుపెట్టిన రచనలను పూర్తిచేయలేక నథేనియల్ చాలా మనోవ్యథను అనుభవించి 60 ఏళ్ళవయసులో మరణించాడు.

భార్గవి

**హాప్కిన్స్, జెరార్డ్ మాన్లీ (1844-1889) :** విక్టోరియన్ ఆంగ్ల రచయితలలో ప్రముఖుడు. జెసూట్స్ ప్రీస్ట్‌గా పనిచేసేవాడు. 1918 వరకూ ఆయన రచన లేవీ ముద్రింపబడక పోయినా ఒక తరం కవులను ప్రభావితులను చేసిన మహాకవి హాప్కిన్స్. హవాయ్ దీవులలో ఆంగ్లేయుల ప్రతినిధిగా ఆంగ్లికన్ చర్చి వ్యవహారాలు చూస్తున్న హాప్కిన్స్ తొమ్మిది మంది సంతానంలో జెరార్డ్ పెద్దవాడు. చిన్నప్పటినుండి చదువులో చురుకుగా ఉండి, బహుమతులు తెచ్చుకొంటూ, స్కాలర్‌షిప్ సంపాదించుకొని ఆక్స్‌ఫర్డ్‌లో చదువుకొన్నాడు. చదువుకొనే రోజులలోనే క్లాసిక్స్ చదవడం, కవితలు వ్రాయడం మొదలు పెట్టాడు. ఆంగ్లికన్, రోమన్ కేథలిక్ చర్చ్‌ల వివాదాలలో పాల్గొని జాన్ హెన్రీ న్యూమన్ ప్రభావంతో కేథలిక్కుల వైపు మొగ్గుచూపాడు. 1868 లో ప్రీస్ట్ వృత్తిని చేపట్టి, తను వ్రాసిన కవితలను కాల్చేసి, తను చేపట్టిన వృత్తికి, కవితలు వ్రాయడానికి పొంతన కుదరదని, మరెప్పుడూ వ్రాయననీ హాప్కిన్స్ ప్రకటించాడు.



1874 లో సెయింట్ బ్యూనోస్ కాలేజ్ (నార్త్ వేల్స్) లో థియాలజీ (మతపరమైన విద్య) చదువుకోడానికి వెళ్ళినపుడు వెల్ష్ భాష నేర్చుకొన్నాడు. ఆ భాషలోని మాధుర్యం, అందులోని కవితల ప్రభావం హాప్కిన్స్ మీద పడింది. 1875 లో పడవ మునిగి అందులో ఐదుగురు సన్యాసినులు మునిగిపోయినపుడు, ఆ సంఘటనకు స్పందించి వ్రాసిన కవిత *ది రెక్ ఆఫ్ ది డ్యాస్ లాండ్* ఏడేళ్ళుగా కవిత వ్రాయకపోవడం వల్ల అతనిలో గూడుకట్టుకొన్న భావాలు అన్నీ ఆ కవితలో గుప్పించినట్టుగా ఉంది. ఆ కవిత ప్రచురణకు నోచుకోలేదు. ఆ తరువాత హాప్కిన్స్ ఎన్నో సానెట్స్ వ్రాసి తోటి కవులైన *రాబర్ట్ బ్రిడ్జెస్, కవెంట్రీ పాట్‌మోర్, రిచర్డ్ వాట్‌సన్* మొదలైన వారికి వినిపించేవాడు. వారందరూ ఆ కవితలలోని వింతవైఖరిని, సంప్రదాయానికి విరుద్ధమైన ఛందస్సులను మెచ్చుకొన్నా, అవి వ్రాతప్రతులుగానే మిగిలిపోయాయి.

1877 లో మతప్రచారకుని వృత్తిని స్వీకరించి లండన్, లివర్‌పూల్, ఆక్స్‌ఫర్డ్, గ్లాస్గోలలోని జెసూట్ చర్చ్‌లలో పనిచేశాడు. 1884 లో డబ్లిన్ యూనివర్శిటీలో గ్రీక్ క్లాసిక్స్‌ని బోధించడానికి ఆచార్య పదవినిచ్చి అతనిని గౌరవించారు. కాని ఐర్లండు వాతావరణం నచ్చక, నిరాశావాదంలో *కారియన్ కంఫర్ట్* అనే సానెట్స్ వ్రాశాడు. ఈ కవితలలో హాప్కిన్స్ మానసిక సంఘర్షణ, స్పష్టంగా కనిపిస్తుంది. కవితలు వ్రాయడంలోనే కాక సంగీతం, చిత్రలేఖనాలలో కూడా ఇతనికి ఆసక్తి ఉండేది. హాప్కిన్స్ *స్పిరిట్యుయల్ ఎక్సర్‌సైజెస్* అనే రచన చేస్తూండగా ఆరోగ్యం దెబ్బతిని టైఫాయిడ్ జ్వరంతో మరణించాడు. ఆయన మరణానంతరం రాబర్ట్ బ్రిడ్జెస్ హాప్కిన్స్ రచనలను ప్రచురించాడు. 'స్ప్రంగ్ రిథమ్' అనే ప్రత్యేక ఛందస్సును ప్రవేశపెట్టిన కీర్తి హాప్కిన్స్‌దే. టి.యస్. ఎలియట్, డిలన్ టామస్, ఆడెన్ వంటి కవులను ఉత్తేజపరచిన మహాకవి జెరార్డ్ మాన్లీ హాప్కిన్స్.

భార్గవి

**హాప్ట్‌మన్, గెర్‌హార్ట్ (1862-1946) :** గణనీయమైన పద్య కావ్యాలూ, నవలలూ, నాటకాలూ వ్రాసి, నోబెల్ బహుమతిని అందుకొన్న జర్మన్ రచయిత. జర్మనీ దేశంలోని సైలీషియాలో 1862 నవంబరు 15 నాడు జన్మించాడు. చిన్నప్పుడు చదువు చక్కగా సాగలేదు. సేద్యం చేయటానికి చేసిన ప్రయత్నం కూడా ఫలించలేదు. కొంతకాలం బ్రెస్లావ్‌లోని ఆర్ట్స్ ఎకాడమీలో చేరి శిల్పకళను అభ్యసించాడు. దక్షిణప్రాంతంలోని రమణీయ ప్రకృతికీ, నగరాలలో కనిపించే దారిద్ర్యానికీ, విశృంఖల వర్తనకూ నడుమ ఉన్న వ్యత్యాసాన్ని గమనించి అతడు వ్యథ చెందాడు. 1885 లో మేరీ థియనెమన్ అనే యువతిని వివాహమాడిన తరువాత, అతని ఆర్థిక క్లేశాలు తొలగిపోయి, బెర్లిన్ నగరంలో సుఖంగా జీవించటానికి వీలు కలిగింది. తమ భూములలో చమురు గను లున్నట్లు కనుగొన్న తరువాత హఠాత్తుగా సంపన్నులైన కర్షకుల జీవితాలలో కలిగిన నైతిక, భౌతిక పతనం ఇతివృత్తంగా అతడు రచించిన *బిఫోర్ డాన్*

("సూర్యోదయానికి పూర్వం") అనే నాటకం (1889) అతనికి విశేషంగా కీర్తిని తెచ్చింది. ప్రత్యేకించి ఒక రచనా సంప్రదాయానికి కట్టుబడకపోయినా, హోప్ట్‌మన్ రచనలు వాస్తవికతకు పేరు పొందాయి. తరువాత *ది వీవర్* (1892), *ది బీవర్ కోట్* (1893), *ది ఎసెన్షన్ ఆఫ్ హానిలా* (1893), *ది సంకెన్ బెల్* (1896) అనే నాటకాలు వెలువడి బహుళ జనాదరణ పొందాయి. ఆ రోజులలోనే అతని వైవాహిక జీవితంలో చిక్కులు పొడసూపాయి. ఒకవంక ఆలుబిడ్డల పట్ల తన కర్తవ్యం నిర్వర్తించవలెననే సంకల్పం, మరొక వంక వయొలిన్ వాదనలో నైపుణ్యం గల మార్గరెట్ మార్స్‌చాక్ అనే సుందరాంగిపై వలపు అతనిని సంకటంలో పెట్టాయి. చివరకు 1904 లో ఆమెను వివాహం చేసుకొన్నాడు. 1910 లో *ది ఫూల్ ఇన్ క్రైస్ట్ ఇమాన్యుయెల్ క్వింట్* అనే తాత్త్విక నవల ప్రకటిత మయింది. హోప్ట్‌మన్ రెండు ఇతిహాస కావ్యాలను కూడా వ్రాశాడు.

1912 లో హోప్ట్‌మన్‌కు నోబెల్ పురస్కారం లభించింది. మరికొన్ని అంతర్జాతీయ సన్మానాలను కూడా అతడు పొందాడు. ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీ అతనికి గౌరవ డాక్టరేట్ డిగ్రీ ప్రదానం చేసింది. నాజీ పార్టీ అధికారంలోకి వచ్చాక, ఆ ప్రభుత్వ విధానాలు తనకు సమ్మతం కాకపోయినా, ఇతర మేధావుల వలె దేశం విడిచి ప్రవాసజీవితం గడపక, కొన్నాళ్లు అనిశ్చిత స్థితిలో కాలం గడిపాడు. 1946 జూన్ 6 నాడు ప్రష్యాలో మరణించాడు.

ఆ.రా.కృ.

**హోఫ్‌మన్, ఇ.టి.ఏ. (1776-1822) :** జర్మన్ రచయిత, సంగీత విద్వాంసుడు, చిత్రకారుడు. ముఖ్యంగా భూత పిశాచాల వంటి అలౌకిక పాత్రలతో అద్భుత, భయానక కథారచనకు ఖ్యాతి గడించినవాడు. అతడు ప్రష్యాలోని కోనిగ్స్‌బెర్గ్‌లో 1776 జనవరి 24 నాడు జన్మించాడు. న్యాయశాస్త్రం అభ్యసించి, 1806 లో నెపోలియన్ ప్రష్యాను యుద్ధంలో జయించే వరకూ ప్రష్యన్ లా ఆఫీసర్‌గా పనిచేశాడు. తరువాత తనకు అత్యంత ప్రియమైన సంగీతంపై దృష్టి కేంద్రీకరించి, సంగీత విమర్శకుడుగా, నిర్దేశకుడుగా, సంగీత కార్యక్రమ నిర్వాహకుడుగా వివిధ పదవులను నిర్వహించాడు. ఆ రోజులలోనే *ఆర్రెవైన్* అనే సామూహిక నాట్యాన్నీ, *ఉండీన్* (1816) అనే సంగీత నాటకాన్ని కూర్చాడు. అద్భుతమైన, అవాస్తవికమైన సంఘటనలతో కూడిన కథల రచనకు పేరు పొందాడు. తమ వికృత ప్రవృత్తులను వెల్లడించే దుష్ట పాత్రలు మనుష్యుల జీవితాలలో కలిగించే కల్లోలం ఆ కథలలో ఆకర్షణీయంగా చిత్రించాడు. రెండు నవలలను, 50 పైన కథలను రచించాడు. అయినా, పక్షవాతంతో క్రమంగా దుర్బలుడై 1822 జూన్ 25 న బెర్లిన్ నగరంలో మరణించే వరకూ న్యాయవాదవృత్తిలోనే ఉన్నాడు. హోఫ్‌మన్ కథల సంపుటాలు ఇంగ్లండ్, ఫ్రాన్స్, అమెరికా దేశాలలో కూడా జనాదరణ పొందాయి. *ది గోల్డెన్ పాట్* అనే కథను థామస్ కార్లైల్ 1827 లోకి "జర్మన్ రొమాన్స్" లోకి అనువదించాడు. నిన్న మొన్నటి వరకు అతని కథలు పునర్ముద్రితం అవుతూ ఉండటం వాని ప్రజాదరణకు నిదర్శనం. ప్రభుత్వోద్యోగిగా తన దైనందిన జీవితానికీ, కళామయమైన తన ఆదర్శ జగత్తుకూ మధ్య చెలరేగే సంఘర్షణను అతడు తన కథలలో తరచుగా చిత్రించాడు. వాగ్నర్ వంటి ప్రఖ్యాత నృత్య నాటికా కర్తలు అతని అలౌకిక, భయానక కథల నుండి ఇతివృత్తాలను స్వీకరించటం అతని ప్రతిభను తెలియజేస్తుంది.

ఆ.రా.కృ.

**హోఫ్‌మన్‌స్టాల్, హ్యూగో ఫాన్ (1874-1929):** ఆస్ట్రియా దేశపు కవి, నాటకకర్త, వ్యాసకర్త. రిచర్డ్‌స్ట్రాస్ అనే జర్మన్ గేయ నాటికా కర్తతో జంటగా వ్రాసిన రచనలకు అంతర్జాతీయ ప్రఖ్యాతి లభించింది. వియెన్నా నగరంలో 1874 ఫిబ్రవరి 1 నాడు జన్మించాడు. న్యాయ శాస్త్రం అభ్యసించాడు. 16 వ ఏట లోరిస్ అనే మారుపేరుతో తన పద్యాలు ప్రకటించాడు. ఆ పద్యాలలోని కావ్యగుణం, శబ్ద మాధుర్యం, స్వప్నలోకాలకు తీసికొనిపోయే పదాల ఇంద్రజాలం వియెన్నాలోనూ, జర్మనీలోనూ సంచలనం కలిగించాయి. అధ్యాపక వృత్తిలో చేరాలని కొన్నాళ్లు భాషాశాస్త్రం అభ్యసించాడు. కాని, 1901 లో వివాహం చేసుకొని స్వచ్ఛంద రచయితగా జీవించాడు. మోరిస్ మాటర్‌లింక్, రాబర్ట్ బ్రౌనింగ్ ప్రభృతుల ప్రభావానికి లోనై హోఫ్‌మన్‌స్టాల్ 1891 నుండి 1899 వరకు *గెస్టెర్న్, ది డెత్ ఆఫ్ టిషియన్, డెత్ అండ్ ది ఫూల్* మొదలైన పద్య నాటికలను రచించాడు. అతని పద్యాల వలెనే ఈ నాటికలు కూడా కావ్య శిల్ప సౌందర్యానికి గణుతి కెక్కినవి. మానవ వ్యక్తిత్వంలో బహి రంతరాల నడుమ, పరిణామానికీ, స్థిరత్వానికీ నడుమ, క్షణికానికీ, నిత్యానికీ నడుమ గోచరించే వ్యత్యాసాన్ని అతడు ఆ రచనలలో చిత్రించాడు. 20 వ శతాబ్దం ఆరంభమైన తరువాత అతని దృక్పథంలో కొంత మార్పు వచ్చింది. ప్రతీక వాదపు

పోకడలకు స్వస్తి చెప్పాడు. ప్రాచీన విషాదాంత నాటకాల ఒరవడిలో నాటక రచన సాగించాడు. 1903 లో అతడు రచించిన *ఎలెక్ట్రా* ఈ కోవకు చెందినది. తరువాత స్ట్రాస్‌తో కలసి రచనలు చేశాడు. *ది వుమన్ విథౌట్ ఏ షాడో* (1919), *హెలెన్ ఇన్ ఈజిప్ట్* (1928), *అరబెల్లా* (1933) వంటి గేయనాటికలు ఇరువురు చేరి వ్రాసినవి. మొదటి ప్రపంచ యుద్ధం ముగిసిన తరువాత యూరప్ ఖండపు సభ్యతా సంస్కృతులు విచ్ఛిన్నం కావటం *డెర్ టుర్మ్* అనే అతని రాజకీయ నాటకానికి ఇతివృత్తం. అతని రచనలలో కావ్య శిల్పసౌందర్యం సర్వత్ర కనిపిస్తుంది. కాని 20 వ శతాబ్దపు పోకడలు అతనికి నచ్చలేదు. అతడు 1929 జూలై 15 న మరణించాడు.

అ.రా.కృ.

**హార్ట్, బ్రెట్ (1836-1902) :** అమెరికన్ కథా వాఙ్మయంలో స్థానిక వాతావరణ చిత్రణ పద్ధతి వ్యాప్తి కావటానికి కారకుడైన రచయిత. అసలుపేరు 'ఫ్రాన్సిస్ బ్రెట్ హార్ట్'. న్యూయార్క్ రాష్ట్రంలోని ఆల్బనీలో 1836 ఆగస్టు 25 న జన్మించాడు. న్యూయార్క్‌లో చదువుకున్నాడు. 11 వ ఏటనే అతని పద్యాలు కొన్ని ప్రకటితమయాయి. 1854 లో అతడు పశ్చిమ ప్రాంతంలోని కాలిఫోర్నియా రాష్ట్రానికి వెళ్ళాడు. బడిలో చదువుచెప్పటం, ముద్రాక్షరశాలలో అక్షరాలు కూర్చటం, మందులు నూరటం, టంకశాలలో ఉద్యోగం, పత్రికలకు రచనలు చేయటం వంటి పను లనేకం నిర్వహించి, శాన్‌ఫ్రాన్సిస్కో నగరంచేరి, అక్కడ వివాహం చేసుకొని, *ది గోల్డెన్ ఈరా* అనే పత్రికకు వ్యాసాలు, కథలు వ్రాయటం ఆరంభించాడు. *ది ఓవర్ లాండ్* అనే మాస పత్రిక రెండవ సంచికలో *ది లక్ ఆఫ్ రోరింగ్ క్యాంప్ అండ్ అదర్ స్కెచస్* (1870) అనే అతని కథ ప్రచురితమై అతని రచనా పాటవం వ్యక్తం చేసింది. స్థానిక ప్రజల వేషభాషలు, రీతి నీతులు యథాతథంగా చిత్రించటమే ఆ రచనను అందరూ విశిష్ట మైనదని గుర్తించటానికి కారణం అయింది. అనేకులు అతని శిల్పాన్ని అనుకరించారు. ఆ విధంగానే మాండలికాలలో అతడు వ్రాసిన *ప్లెయిన్ లాంగ్వేజ్ ఫ్రమ్ ట్రూత్‌ఫుల్ జేమ్స్* (1870) అనే పద్య కావ్యం కూడా అటువంటి రచనలకు మార్గదర్శక మయింది.

1871 లో బ్రెట్ హార్ట్ తిరిగి తూర్పు తీరాన ఉన్న బోస్టన్ నగరానికి వెళ్ళాడు. తరువాత విదేశాలకు వెళ్ళాడు. జీవితంలో చివరి 24 సంవత్సరాలు జర్మనీ, స్కాట్లండ్, ఇంగ్లండ్ వంటి విదేశాలలోనే గడపి, లండన్ నగరంలో 1902 మే 5 న మరణించాడు. యావజ్జీవితం కథలు వ్రాస్తూనే ఉన్నాడు. కాని వాటిలో చాలా భాగం అతని మొదటి రచనలకు అనుకరణాలే. ఐనా అమెరికన్ కథా వాఙ్మయచరిత్రలో స్థానిక జీవన చిత్రణ శిల్ప నిర్మాతగా అతని కీర్తి నిలిచి ఉంటుంది.

అ.రా.కృ.

**హార్ట్‌మన్, వాన్ ఆ (12వ, 13వ శతాబ్దాలు):** రాజాస్థాన సంబంధమైన ఇతిహాస కావ్య రచనలో సిద్ధహస్తుడైన జర్మన్ కవి. అతని రచనల వల్ల అతడు క్రైస్తవాశ్రమ పాఠశాలలో విద్యాభ్యాసం చేసి పాండిత్యం గడించాడనీ, స్వేబియన్ ఆస్థానంలో ఉద్యోగిగా ఉన్నాడనీ, క్రైస్తవులకు, మహమ్మదీయులకు నడుమ 1196 లో ఆరవ హెన్రీ నాయకత్వంలో జరిగి, విఫలమైన మత యుద్ధంలో పాల్గొన్నాడనీ తెలుస్తున్నది. లభ్యం అవుతున్న అతని రచనలలో *ఎరెక్, గ్రెగోరియస్, డెర్ ఆర్మె హెయిన్‌రిచ్, ఇవెయిన్* అనే నాలుగు సుదీర్ఘ కథా కావ్యాలూ, రెండు అన్యాపదేశ కావ్యాలూ, 16 గేయాలూ ఉన్నాయి. ఈ గేయాలలో 13 ప్రేమ గీతాలు, మిగిలిన మూడూ మతయుద్ధ పరమైనవి. అతడు గేయాలను మొదట వ్రాసినట్లు, తరువాత అతని రచనలలో అతి ప్రధానమైన కథా కావ్యాలను రచించినట్లు తెలుస్తున్నది. *గ్రెగోరియస్, డెర్ ఆర్మె హెయిన్‌రిచ్* అనే కావ్యాలు రెండూ మత సంబంధమైనవి, ప్రబోధాత్మకమైనవి. హార్ట్‌మన్ రచనలలో సర్వోత్కృష్టమైనది *డెర్ ఆర్మె హెయిన్‌రిచ్* అనే కావ్యం. నిర్మలవర్తన గల ఒక బాలిక త్యాగశీలం వల్ల ఒక కుష్ఠువ్యాధిగ్రస్తుడు రోగవిముక్తుడు కావటం దాని ఇతివృత్తం. లౌకిక ఇతివృత్తాలతో కూడిన *ఎరెక్, ఇవెయిన్* అనే కావ్యాలు రాజాస్థానాలకు చెందిన వీరులు తమ వర్తనలో చూపవలసిన నిగ్రహాన్ని, దాక్షిణ్యాన్ని, వక్రమార్గం లోనికి పోయిన వీరులు తిరిగి సభ్యతా సంస్కారాలను అలవరచుకోడాన్ని వర్ణిస్తాయి.

హార్ట్‌మన్ తన కావ్యాలను ప్రధానంగా నీతి బోధకు ఉపకరణాలుగా పరిగణించాడు. రమణీయమైన శైలి కంటె ఉదాత్తమైన ఇతివృత్తం ముఖ్యమని అతని విశ్వాసం అతని రచనలలో కవితాశిల్ప విన్యాసం కంటె సరళత స్పష్టత ఎక్కువగా కనిపిస్తాయి.

అ.రా.కృ.

**హార్డీ, థామస్ (1840-1928) :** ప్రముఖ ఆంగ్ల కవి, సుప్రసిద్ధ 'ప్రాంతీయ' నవలా రచయిత. ఆయన ప్రముఖ నవలలలోని ఇతివృత్తాలకు నేపథ్యం దక్షిణ ఇంగ్లండ్‌లోని వెసెక్స్ అనే ఊహాకల్పిత మండలం.

*ది రిటర్న్ ఆఫ్ ది నేటివ్* (1878), *ది మేయర్ ఆఫ్ కేస్టర్ బ్రిడ్జ్* (1886), *టెస్ ఆఫ్ ది డూర్‌బెల్ విలెస్* (1891), *జూడ్ ది అబ్స్క్యూర్* (1895) మున్నగు ప్రముఖ నవలల రచయిత.

హార్డీ తండ్రి భవన నిర్మాత; తాపీపనిలో గొప్ప నిపుణుడు. తన తల్లితండ్రులకు కలిగిన నలుగురు సంతానంలో హార్డీ పెద్దవాడు. తన ఎనిమిదవ ఏట హార్డీ బోకాంప్టన్ స్కూలులో చేరాడు. ఒక ఏడాది తరువాత డోర్చెస్టర్‌లోని స్కూలుకు మారాడు. ఆ స్కూలు హెడ్మాస్టరు గొప్ప లాటిన్ విద్వాంసుడు. ప్రాచీన మహా రచయితలంటే హార్డీకి ఆయన ఎక్కువ ఇష్టం కలిగించాడు. ఆయన బోధనల ప్రభావం హార్డీ రచనలలో కనిపిస్తుంది. 1856 లో స్కూలు చదువుకు హార్డీ స్వస్తి చెప్పి జాన్ హిక్స్ అనే ఒక ఆర్కిటెక్ట్ (భవన నిర్మాణకుశలుడు) వద్ద చేరాడు. ఆ రోజులలోనే హార్డీ విరివిగా పుస్తకాలు చదివాడు.

1862 లో హార్డీ డోర్చెస్టర్ నుండి లండన్ వచ్చి ఆర్థర్ బ్లోమ్‌ఫీల్డ్ అనే సుప్రసిద్ధుడైన ఒక ఆర్కిటెక్ వద్ద ఉద్యోగంలో చేరాడు. 1867 వరకూ అక్కడ పనిచేసి, అనారోగ్య కారణాల వలన అతడు తిరిగి డోర్‌సెట్ చేరుకొని హిక్స్‌తో కలసి పనిచేయసాగాడు. లండన్‌లో ఉన్న కాలంలో హార్డీ కవిత్వం వ్రాయడం మొదలు పెట్టాడు. ఆయన రచించిన *న్యూట్రల్ టోన్స్* కు మంచి ప్రశస్తి వచ్చింది.

1867-68 లో హార్డీ తన తొలి నవల *ది పూర్ మాన్ అండ్ ది లేడీ* రచించాడు. ఇద్దరు ప్రచురణ కర్తలు దాని ప్రచురణకు నిరాకరించారు. ప్రచురితమైన హార్డీ మొదటి నవల *డెస్పరేట్ రెమెడీస్* (1871).

1870 లో హార్డీ ఒక ఆర్కిటెక్ట్ సలహా మీద కార్న్‌వాల్‌లో బోస్ కాసిల్ దగ్గర ఉన్న సెంట్ జూలియట్‌కి వెళ్లాడు. అక్కడే అతడు ఎమ్మా లావీనియా గిఫర్డ్‌ను కలసికొని, అనంతరం ఆమెను వివాహ మాడాడు. 40 ఏళ్ల తరువాత వారి ఆ తొలి కలయికను *వెస్టీజెస్ ఆఫ్ ఏన్ ఓల్డ్ ఫ్లేమ్* అనే కవితలో హార్డీ వర్ణించాడు.

*డెస్పరేట్ రెమెడీస్* ను తన పేరు పెట్టకుండా ప్రచురించాడు. 1872 లో హార్డీ లండన్ తిరిగి వచ్చి *అండర్ ది గ్రీన్ వుడ్ ట్రీ* ప్రచురించాడు. ఆ నవలలో కొంత హాస్యాన్ని కూడా హార్డీ జోడించాడు. హార్డీ రచించిన తరువాతి నవల *ఏ పెయిర్ ఆఫ్ బ్లూ ఐస్*. 1872-73 లో అది *టిన్‌స్లీ* మేగజైన్‌లో సీరియల్‌గా వచ్చింది. 1974లో *ఫార్ ఫ్రమ్ ది మేడింగ్ క్రౌడ్* అనే నవల పేరు లేకుండా మొదట కార్న్‌హిల్ మేగజైన్‌లో సీరియల్‌గా వచ్చింది. అదే మొదటి సారి ఎక్కువగా ప్రజాదరణ పొందిన హార్డీ నవల.

1874 ఆగస్ట్‌లో హార్డీ ఎమ్మా గిఫర్డ్‌ను వివాహమాడాడు.

1878 నుండి 1895 వరకు హార్డీ జీవితంలో ఉచ్చదశ. ఆ కాలంలోనే ఆయన ప్రధానమైన నవల లన్నీ ప్రచురించబడటం జరిగింది. *ది డైనాస్ట్స్* అనే ప్రదర్శించడానికి వీలులేనంత పెద్ద నాటకం 1903-1908 మధ్య వెలువడింది. నెపోలియన్ యుద్ధాలను వర్ణించే ఈ నాటకం 'బ్లాంక్ వెర్స్' (వచన పద్యం) లో వ్రాయబడింది. 1910 లో హార్డీని 'ఆర్డర్ ఆఫ్ మెరిట్' ఇచ్చి గౌరవించారు. 1912 నవంబరు 27 న హార్డీ భార్య మరణించింది. భార్యా వియోగం వలన అతనికి కలిగిన దుఃఖాన్ని *వెటెరిస్ వెస్టీజియే ఫ్లామే* అనే కవితా సంచయంలో హార్డీ ప్రకటించాడు.

1914 లో హార్డీ తన సెక్రటరీ ఫ్లారెన్స్ ఎమిలీ డుగ్ డేల్‌ను వివాహమాడాడు. హార్డీ మరణానంతరం ఆమె అతని జీవిత చరిత్రను వ్రాసింది. చనిపోయే వరకూ హార్డీ కవిత్వం వ్రాస్తూనే ఉన్నాడు. ఆయన చితాభస్మం వెస్ట్ మినిస్టర్ ఆబీలో భద్రపరిచారు.

హార్డీ నవలలు అనేకం చలన చిత్రాలుగాను, టెలివిజన్ సీరియల్స్‌గాను వెలువడి, నేటికీ ప్రజలను అలరిస్తూనే ఉన్నాయి.

బొ.శ్రీ.

**హేలెర్, ఆల్‌బ్రెఖ్ట్ వాన్ (1708-1777) :** స్విట్జర్‌లాండ్ దేశానికి చెందిన ప్రముఖ జీవశాస్త్రజ్ఞుడు, కవి. జీవ శాస్త్రానికి చెందిన వివిధ శాఖలలో గణనీయమైన శాస్త్రరచనలను ప్రకటించటమే గాక, గ్రంథాదుల ఇతివృత్తాలను శాస్త్రీయ పద్ధతిలో కూర్చటంలో కూడా కృషి చేశాడు. గొట్టిన్‌గెన్ విశ్వవిద్యాలయంలో 1736 నుండి 1753 వరకు వైద్యశాస్త్రంలో ఆచార్యుడుగా ఉన్నాడు. అక్కడ అతడు సాగించిన పరిశోధనలు ఆధారంగా 8 సంపుటాలలో *ఎలిమెంటా ఫిజియాలాజియే కార్పొరిస్ హ్యూమాని* (1757-66: Physiolgical Elements of the Human Body) అనే సుప్రసిద్ధ వైద్య గ్రంథాన్ని రచించాడు. హఠాత్తుగా ఆ పదవిని వదలి తిరిగి స్విట్జర్‌లాండ్‌లోని బెర్న్ నగరానికి వెళ్ళి, అక్కడ వైద్యవృత్తిలో ఉంటూ, పరిశోధనలు కొనసాగిస్తూ, అసంఖ్యాకమైన గ్రంథాలు రచించాడు. స్నాయుశాస్త్రంలో అతడు సాగించిన పరిశోధనలు, ప్రకటించిన రచనలు ఆ రంగంలో నేటి

మన పరిజ్ఞానానికి ప్రాతిపదిక లైనవి. శాస్త్రసంబంధ మైన సాహిత్యాన్ని వర్గీకరించి, పట్టికలు సిద్ధంచేయటానికి అతడు కొంతకాలం కృషి చేశాడు. ఈ రచనలవల్ల వైద్య శాస్త్ర వాఙ్మయానికి చాలా ఉపకారం జరిగింది. అతడు కవిత్వ రచనలో కూడా ప్రసిద్ధుడే. *డీ ఆల్పెన్* అనే కావ్యం 1732 లో వెలువడింది. దానిలో అతడు వ్యక్తంచేసిన పర్వత ప్రశస్తి జర్మన్ కవితలో ప్రకృతి రామణీయకానికి ప్రాముఖ్యం కలిగించింది.

అ.రా.కృ.

**హిస్‌డాయ్, ఇబ్న్ షప్రూత్ (10 వ శతాబ్ది):** యూదు జాతికి చెందిన వైద్యుడు, అనువాదకుడు, రాజకీయవేత్త. పూర్తిపేరు: 'హిస్‌డాయ్ అబూ యూసఫ్ బెన్ ఈసాక్ బెన్ ఎజ్రా ఇబ్న్ షప్రూత్'. స్పెయిన్ దేశంలోని హీబ్రూ సాహిత్యంలో స్వర్ణయుగారంభానికి తోడ్పడిన సాహితీవేత్త. రాజకీయ రంగంలో ముఖ్యమైన దౌత్య కార్యాలను కూడా నిర్వహించినవాడు.

ఉమయ్యద్ ఖలీఫా మూడవ అబ్దుల్ రహమాన్ ఆస్థానంలో వైద్యుడుగా చేరిన తరువాత అరబ్ దేశీయులలో పలుకుబడి గడించాడు. హీబ్రూ, అరబిక్, లాటిన్ భాషలలో ప్రావీణ్యం ఉన్న వాడు. మహమ్మదీయ, క్రైస్తవ పాలకుల మధ్య ముఖ్యమైన రాయబారాలు నిర్వహించాడు. ఒక సందర్భంలో బైజాంటైన్ సామ్రాజ్యంతో సంధి చేసుకోవటానికి కూడా తోడ్పడ్డాడు. బైజాంటైన్ చక్రవర్తి ఆ సందర్భంలో ఖలీఫాకు బహుమతిగా పంపిన ప్రాచీన గ్రీక్‌వైద్య గ్రంథాన్ని అరబిక్ భాషలోకి అనువదించడంలో హిస్‌డాయ్ సహాయపడ్డాడు. అబ్దుల్ రహమాన్ మరణానంతరం అతని కొడుకు రెండవ అల్-హకమ్ ఆస్థానంలో ఉంటూ ముఖ్యమైన రాచకార్యాలు నిర్వహించాడు.

స్పెయిన్ దేశంలో యూదు మత వ్యాప్తికి హిస్‌డాయ్ కృషి చేశాడు. దునాష్ బెన్ లబ్రత్, మెనాహెమ్ బెన్ సరూఖ్ వంటి సుప్రసిద్ధ యూదు రచయితలు అతని పోషణలో ఉంటూ, యూదు సాహిత్యం సంపన్నం కావటానికి కారకు లయారు. యూదుజాతి ధర్మశాస్త్రాధ్యయనాన్ని అతడు ప్రోత్సహించాడు. అతడు వ్రాసిన రెండు లేఖలు చారిత్రకంగా చాలా ముఖ్యమైనవి. 16 వ శతాబ్దంలో ప్రకటితమైన ఆ లేఖలు నిజంగా అతడు వ్రాసినవే అని నిర్ధారణ చేయటం జరిగింది.

అ.రా.కృ.

**హెక్ట్, బెన్ (1894-1964) :** అమెరికన్ నవలా రచయిత, నాటకకర్త, సినీరచయిత. 1920-30 మధ్య పత్రికా రచయితగా మానవత్వంలో ఆసక్తి కలిగించే 'స్కెచ్' అనే ఒక నూతన సాహిత్య ప్రక్రియలో ఆయన సిద్ధహస్తు డయాడు. ఆ తరువాత ఆయన ఒరవడిని ఎందరో అనుసరించారు. ఆయన నాటకం *ది ఫ్రంట్ పేజ్* (1928-ముఖపత్రం) - ఛార్లెస్ మెక్ ఆర్థర్‌తో కలసి రచించిన నాటకం - వార్తాపత్రికా ప్రపంచాన్ని పాఠకులకు పరిచయం చేస్తూ, పత్రికా రచయిత స్వరూపాన్ని రచయిత గుర్తించేట్టు చేసింది.

హెక్ట్ ఒక రష్యన్-యూదు వలసదారుల కుటుంబంలో జన్మించాడు. విస్కాన్‌సిన్‌లోని రెసీన్ హైస్కూలులో విద్య పూర్తి చేసి, తరువాత కళాత్మక, సాహిత్యాత్మక పునరుజ్జీవనంలో చిక్కుకొని ఉన్న చికాగో నగరానికి ఆయన వెళ్ళాడు. *చికాగో జర్నల్* కు 1910-14 వరకూ రిపోర్టర్‌గా పని చేశాడు. తరువాత *చికాగో డెయిలీ న్యూస్* పత్రికకు మారి, ఆ పత్రిక తరపున ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరం విప్లవ కల్లోలంలో చిక్కుకొని ఉన్న బెర్లిన్ నగరానికి రిపోర్టర్‌గా వెళ్లాడు. బెర్లిన్‌లోని తన అనుభవాలనే తన మొదటి నవల *ఎరిక్ డార్న్* (1921) లో ఆయన చిత్రించాడు. *డెయిలీ న్యూస్* పత్రికకు *ఎ థౌజండ్ అండ్ వన్ ఆఫ్టర్ నూన్స్ ఇన్ చికాగో* (1922-చికాగో నగరంలో 1001 సాయంతనాలు) అనే పేరుతో ఒక కాలమ్ వ్రాసేవాడు.



హెక్ట్ రచించిన *ఫాంటాజియస్ మల్లారే* (1922) అనే నవలను అశ్లీలంగా ఉందనే ఆరోపణలతో ప్రభుత్వం స్వాధీనం చేసుకొన్నప్పుడు *డెయిలీన్యూస్* పత్రికనుంచి ఆయనకు ఉద్వాసన చెప్పారు. చికాగోలో స్వచ్ఛంద ప్రవృత్తిగల నవలా రచయిత, కవి 'మాక్స్‌వెల్ బోడెన్ హైమ్'తో ఆయనకు సన్నిహిత పరిచయం ఏర్పడింది.

జీవం ఉట్టిపడే తన చికాగో నగర స్మృతులను *గెయిలీ, గెయిలీ* (1963, దాని చలన చిత్రరూపం *చికాగో* 1969), *లెటర్స్ ఫ్రం బొహీమియా* (1946-బొహీమియా నుంచి వ్రాసిన లేఖలు), తన ఆత్మకథ అయిన *ఏ*

*చైల్డ్ ఆఫ్ ది సెంచరీ* (1954) అనే రచనలలో హెక్ట్ పొందుపరిచాడు.

తరువాత కొంత కాలం న్యూయార్క్ సిటీలోను, కొంత కాలం హాలీవుడ్‌లోను హెక్ట్ గడుపుతూ వచ్చాడు. *ట్వంటీయెత్ సెంచరీ* (1923) అనే మరొక విజయవంతమైన రంగస్థల నాటకరచనలో కూడా మెక్ ఆర్థర్‌ను తన సహరచయితగా ఆయన గ్రహించాడు. హాలీవుడ్‌లో తరచు మెక్ ఆర్థర్‌తో కలసి సినిమాలకు స్క్రిప్ట్ తయారుచేసేవాడు. *ది ఫ్రెంట్ పేజ్* (1931), *ది స్కాండల్* (1935), *నథింగ్ స్కేర్డ్* (1937), *నొటోరియస్* (1946), *స్పెక్టర్ ఆఫ్ ది రోజ్* (1946) అనే చిత్రాలకు హెక్ట్ చిత్రకథ తయారు చేశాడు. ఇవి ఘన విజయం సాధించాయి.

చిట్టచివరి సారి బ్రాడ్వే థియేటర్‌లో విజయం సాధించిన హెక్ట్ నాటకం *లేడీస్ అండ్ జెంటిల్‌మెన్* (1939-ఇది కూడా మెక్ ఆర్థర్‌తో కలసి వ్రాసిందే). హెక్ట్ ఇతర రచనలలో *ఏ గైడ్ ఫర్ ది బిడెవిల్డ్* (1944), *కలెక్టెడ్ స్టోరీస్* (1945), *పెర్ఫిడీ* (1961) ముఖ్యంగా పేర్కొనవచ్చును. 1964 ఏప్రిల్ 18 న తన 70 వ ఏట న్యూయార్క్ నగరంలో బెన్ హెక్ట్ మరణించాడు.

బొ.శ్రీ.

**హెన్రీ, ఓ (1862-1910) :** జగత్ప్రసిద్ధి పొందిన అమెరికన్ కథానికా రచయిత. 'ఓ హెన్రీ' ఈయన కలం పేరు. అసలు పేరు 'విలియం సిడ్నీ పోర్టర్'. ఈయన కథానికలు సామాన్య సన్నివేశాలనే, ముఖ్యంగా న్యూయార్క్ సిటీ లోని సామాన్య జనం జీవితాలనే కాల్పనిక దృష్టితో చిత్రించాయి. కాక



తాళీయంగా జరిగే సంఘటనల ప్రభావం పాత్రల మీద ఎలా ఉంటుందో హాస్యరస భరితంగా చిత్రించిన ఈయన కథానికలలో ఆశ్చర్యకరమైన 'కొసమెరుపు' కనిపిస్తుంది.

తన మేనత్త టీచరుగా ఉన్న స్కూల్లో చదువుకుని ఓ హెన్రీ తన మేనమామ డ్రగ్ స్టోర్‌లో గుమాస్తాగా చేరాడు. 1882 లో ఆయన టెక్సాస్ వెళ్లి కొంతకాలం ఒక వ్యవసాయ క్షేత్రంలోనూ, తరువాత ఆస్టిన్‌లోని 'ఫస్ట్ నేషనల్ బాంక్' లో టెల్లర్‌గానూ పనిచేశాడు. ఆయనకు 'ఆతోల్ ఎస్టీస్' (Athol Estes) తో వివాహం జరిగిన 1887 ప్రాంతంలోనే ఆయన చిన్న చిన్న 'స్కెచ్‌లు' వ్రాయడం ప్రారంభించాడు. 1894 లో *ది రోలింగ్ స్టోన్* అనే హాస్య పత్రిక స్థాపించాడు. ఆ పత్రిక విజయవంతం కాకపోవడంతో ఓ హెన్రీ *హ్యూస్టన్ పోస్ట్* లో రిపోర్టర్‌గా చేరాడు. అప్పుడప్పుడు ఆ పత్రికకు కార్టూన్‌లు కూడా వేసేవాడు.

1896 ఫిబ్రవరిలో బాంకు నిధులను దుర్వినియోగం చేసినందుకు ఆయన మీద నేరారోపణ జరిగింది. ఆయన 'హొండ్యురాస్' కు పారిపోయాడు. అయితే తన భార్య మృత్యుముఖంలో ఉందనే వార్త విని తిరిగి ఆయన 'ఆస్టిన్' కు వచ్చాడు. అతని పట్ల సానుభూతి గల అధికారులు అతని భార్య చనిపోయేవరకూ అతనిమీద కేసు పెట్టలేదు. తరువాత కేసు విచారణ జరిగి 1898 లో తేలిక శిక్షను విధించి ఓహియో రాష్ట్రంలోని కొలంబస్ జైలుకు ఆయనను పంపారు. సత్ప్రవర్తన ఫలితంగా ఆయన జైలు శిక్ష 3 సంవత్సరాల 3 నెలలకు తగ్గించబడింది. జైలు ఆసుపత్రిలో రాత్రిపూట 'డ్రగ్గిస్ట్' గా పనిచేస్తూ, ఆ సమయంలో రచనలు చేస్తూ వాటి మీద వచ్చిన డబ్బును తన కుమార్తె 'మార్గరెట్' కు ఆయన పంపుతూ ఉండేవాడు. నైర్ృతి అమెరికా, మధ్య అమెరికాలలోని ఆయన సాహస కృత్యాల గాథలు పత్రికా పాఠకుల ఆదరణను చూరగొన్నాయి. జైలు నుంచి బయటికి వచ్చిన తరువాతనే అంతవరకు డబ్ల్యు.ఎస్. పోర్టర్‌గా ఉన్న రచయిత 'ఓ.హెన్రీ' గా ప్రసిద్ధి పొందాడు.

1902 లో ఓ హెన్రీ న్యూయార్కుకు వచ్చాడు. 1903 డిసెంబరు నుంచి 1926 జనవరి వరకూ న్యూయార్క్‌లోని *వరల్డ్* పత్రికకు వారానికి ఒక కథ చొప్పున వ్రాసి ఇస్తూ వచ్చాడు. అదే కాలంలో ఇతర పత్రికలకు కూడా వ్రాస్తూ ఉండేవాడు.

ఓ.హెన్రీ మొదటి పుస్తకం *కేబేజెస్ అండ్ కింగ్స్* (1904) లో హొండ్యురాస్‌కు చెందిన విచిత్ర పాత్రలు చిత్రించబడ్డాయి. *ది ఫోర్ మిలియన్* (1906), *ది ట్రిమ్ లాంప్* (1907) న్యూయార్కు నగర వాసుల దైనిక చర్యలను కన్నులకు కట్టేట్టు వర్ణిస్తాయి. *హార్ట్ ఆఫ్ ది వెస్ట్* (1907) టెక్సాస్ ప్రాంతపు కథలను ఆసక్తికరంగా చెప్పింది.

ఆటు తరువాత *ది వాయిస్ ఆఫ్ ది సిటీ* (1908), *ది జెంటిల్ గ్రాఫ్టర్* (1908), *రోడ్స్ ఆఫ్ డెస్టినీ* (1909), *ఆప్షన్స్* (1909), *స్ట్రిక్లీ బిజినెస్* (1910), *వెర్లీ గిగ్స్* (1910) అనే పుస్తకాలు వెంట వెంటనే వెలువడ్డాయి. వెర్లీ గిగ్స్ అనే సంపుటంలో ఓ.హెన్రీ వ్రాసిన మిక్కిలి హాస్య రసభరితమైన కథ *ది రాన్సమ్ ఆఫ్ రెడ్ ఛీఫ్* చేర్చబడింది.

ఎంత ప్రజాదరణ పొందినా ఓ హెన్రీ చివరి రోజులు అనారోగ్యంతోనూ, ఆర్థికమైన ఇబ్బందులతోనూ, మద్యపాన వ్యసనంతోనూ మిక్కిలి దుర్భరంగా గడచాయి. 1907 లో ఆయన చేసుకున్న ద్వితీయ వివాహం సుఖప్రదం కాలేదు. ఆయన మరణానంతరం *సిక్సెస్ అండ్ సెవెన్స్* (1911), *రోలింగ్ స్టోన్స్* (1912), *వెయిఫ్స్ అండ్ స్ట్రేస్* (1917) అనే మరి మూడు కథా సంపుటాలు వెలువడ్డాయి. అనంతరం *ఓ హెన్రీయానా* (1920), *లిటో పోలీస్* కు వ్రాసిన లేఖలు (1922), మరి రెండు ఆయన తొలి రచనల సంపుటాలు ప్రకటించబడ్డాయి. ఆయన రచనలు పలు విదేశీ భాషలలోకీ, సినిమా, టెలివిజన్ వంటి వివిధ కళా రూపాలలోకీ పరివర్తన పొందడం ఆయన రచనలకు గల విశ్వజనాదరణను సూచిస్తుంది. *గెరాల్డ్ లాంగ్ ఫోర్డ్* రచించిన *ఎలియాస్ ఓ. హెన్రీ* అనే ఆయన జీవిత చరిత్ర 1957 లో వెలువడింది. ఓ హెన్రీ 1910 జూన్ 5 వ తేదీన న్యూయార్క్ సిటీలో పరమపదించారు.

బొ.శ్రీ.

**హెన్లీ, విలియమ్ ఎర్నెస్ట్ (1849-1903) :** బ్రిటిష్ కవి, విమర్శకుడు, సంపాదకుడు. తాను సంపాదకుడుగా ఉన్న పత్రికల ద్వారా 1890-1900 ప్రాంతపు ఆంగ్ల మహా రచయితల నెందరినో మొదటిసారి లోకానికి పరిచయం చేసిన మహనీయుడు.!

బాల్యంలోనే హెన్లీ క్షయవ్యాధికి గురి అయాడు. తత్ఫలితంగా అతని పాదం ఒకటి ఖండించవలసి వచ్చింది. ఎడింబరోలో హెన్లీ ఆశ్రయించిన 'జోసెఫ్‌లిస్టర్' అనే సర్జన్ ప్రదర్శించిన నైపుణి వలన రెండవ కాలు అతనికి దక్కింది. ఎడింబరోలో 20 మాసాల పాటు (1873-75) ఒక వికలాంగుల శరణాలయంలో హెన్లీ ఉండిపోవలసి వచ్చింది. ఆ రోజులలోనే ఆ ఆసుపత్రి వాతావరణాన్ని చిత్రిస్తూ హెన్లీ వచన పద్యాలు వ్రాశాడు. కవిగా ఆయన కీర్తికి అవే ప్రాతిపదిక లయాయి. *ఏ బుక్ ఆఫ్ వెర్సెస్* అనే పేరుతో 1888 లో అవి వెలువడ్డాయి. హెన్లీ వ్రాసిన మిక్కిలి ప్రజాదరణ చూరగొన్న పద్యం *ఇన్ విక్టస్* 1875 లో వెలువడింది. ఆ కావ్యంలో చివరి రెండు పంక్తులు "నా విధికి నేను చోదకుణ్ణి! నా ఆత్మకు నేను నాయకుణ్ణి!".

ఆయన కావ్యాలలో చెప్పుకోదగిన మరో రెండు: *లండన్ వాలంటరీస్* (1893), *ఇన్ హాస్పిటల్* (1903).

రాబర్ట్ లూయీ స్టీవెన్‌సన్‌తో సుదీర్ఘకాలం సాగిన హెన్లీ మైత్రి 1874 లో అతడు ఇంకా 'పేషెంట్' గా ఉన్నపుడే ఆరంభమైంది. స్టీవెన్‌సన్ వ్రాసిన *ట్రెజర్ ఐలెండ్* అనే నవలలోని లాంగ్ జాన్ సిల్వర్ అనే పాత్రలో కొంత భాగం తన ప్రాణమిత్రుడు హెన్లీనే అతడు చిత్రించాడు.

హెన్లీ సంపాదకత్వం వహించిన పత్రికలలో ముఖ్యంగా చెప్పుకోదగినది ఎడింబరో నుంచి వెలువడిన *స్కాట్స్ అబ్జర్వర్.* 1889 లో అది లండన్‌కి మార్చబడి *నేషనల్ అబ్జర్వర్* అనేపేరుతో వెలువడసాగింది. రాజకీయాలలో మితవాద దృష్టిని ప్రదర్శించినా, సాహిత్యాభిరుచిలో ఉదారవాద దృక్పథంతో థామస్ హార్డీ, బెర్నార్డ్ షా, సర్ జేమ్స్ మాచ్యూబేరీ, హెచ్.జి. వెల్స్, రుడ్‌యార్డ్ కిప్లింగ్ మొదలైన మహామహుల తొలి రచనలను ఆ పత్రిక ప్రకటించింది. రాబర్ట్ బర్న్స్ కవితల శత వార్షికోత్సవ సంపుటానికి టి.ఎఫ్. ఎండర్సన్‌తోపాటు హెన్లీ కూడా సంపాదకుడుగా పనిచేశాడు. చివరి రోజులలో స్టీవెన్‌సన్‌తో ఏర్పడిన మనస్పర్థ (1888 నుంచి), వివాహమైన 10 ఏళ్లకు పుట్టిన ఒక్కగానొక్క కూతురి అకాలమరణం హెన్లీ జీవితాన్ని విషాద భరితం చేశాయి.

1903 జూలై 11 వ తేదీన లండన్ సమీపంలోని వోకింగ్‌లో హెన్లీ తుది శ్వాస విడిచాడు.

బొ.శ్రీ.

**హెబెల్, ఫ్రెడ్రిక్ (1813-63) :** జర్మన్ కవి, నాటక కర్త. మనస్తత్త్వ విషయాలను నాటకీయంగా చెప్పి, రక్తికట్టించి నాటకరంగంలో ఒక కొత్త పంథాను ప్రవేశ పెట్టినవాడు. ప్రఖ్యాత చరిత్రకారుడు హెగెల్ దృష్టికోణం లోంచి కొన్ని చారిత్రక ఘట్టాలను రంగస్థలానికి అనువుగా మలచాడు. వర్తమానంలోని మారిన విలువలకు చరిత్రే కారణమని తన నాటకాల ద్వారా నిరూపించాడు. హెబెల్ ఒక పేద కుటుంబంలో జన్మించాడు. చిన్న తనంలోనే తండ్రిని పోగొట్టుకొని ఏడేళ్ళు ఒక మతాధికారి వద్ద ఊడిగం చేశాడు. సాహిత్యాభిలాష గల ఒక బృందాన్ని తయారుచేసి కవితలు వ్రాస్తూ ఒక స్థానిక దినపత్రికలో కొన్ని కవితలు ప్రచురించాడు. 1835 లో ఆ పత్రిక సంపాదకుడు హెబెల్‌కు ఉన్నత విద్యను అభ్యసించడానికి వసతి కల్పించాడు. ఆ సమయంలో

*ఎల్సీ లెన్‌సింగ్* అనే ఒక దర్జీ అమ్మాయి హెబెల్‌ను ఆదుకొంది. 1885-87 లో *టేగెబుకర్* (డైరీ) అనే ఒక పత్రికను నడపడానికి ప్రయత్నించి ఆరోగ్యం, డబ్బు రెండూ పోగొట్టుకొన్నాడు. ఈ పత్రిక జర్మన్ సాహిత్యచరిత్రలో ఒక మైలురాయిగా మిగిలిపోయింది. *జూడిత్* అనే నాటకం. *బైబిల్* కథను ఆధారంగా చేసికొని వ్రాసింది హెబెల్‌కు పేరు తెచ్చిపెట్టింది. 1841 లో *జెనెవీవా* అనే గేయ నాటకాన్ని వ్రాసి ప్రదర్శించాడు. ఆర్థికంగా అప్పటికీ కోలుకోని హెబెల్‌కు డేనిష్ రాజు ద్వారా కొంత విరాళం అందినందువలన పారిస్, ఇటలీ దేశాలను సందర్శించి సాహిత్యాధ్యయనం చేసే అవకాశం లభించింది. మధ్య తరగతికి చెందిన ప్రజల జీవితాలలో ప్రతిబింబించే విషాదాన్ని *మేరియా మెగ్డియేనా* అన్న పేరుతో నాటకంగా వ్రాసి, 1844 లో హెబెల్ ప్రచురించాడు. ఇది ఎంతో నేర్పుగా, కళాత్మకంగా వ్రాయబడిన నాటకంగా పేరు పొందింది.



1846 వ సంవత్సరంలో హెబెల్ క్రిస్టీన్ ఎంగాస్ అనే నటిని పెళ్లిచేసుకొన్నాడు. జీవితంలో ఒడిదుడుకులు తగ్గినా, ఆరోగ్యం పూర్తిగా దెబ్బ తింది; కాని రచనా వ్యాసంగం మటుకు ఉధృతంగా సాగింది. *హెరొడిస్ ఉండ్ మరియమ్* (1850), *ది ఇన్‌వల్‌నరబుల్ సీగ్ (ఫెడ్, సిగ్ (ఫెడ్స్ డెల్, క్రీమ్‌హిల్డ్స్) రివెంజ్* అప్పట్లో అతడు చేసిన రచనలు. 1914 లో హెబెల్ వ్రాసిన *గైజెస్ ఉండ్ సైన్ రింగ్* పరిణతి పొందిన రచనగా పేరు తెచ్చుకొంది. 1841 లో *ది డైమండ్* అన్న వ్యంగ్య నాటకం ప్రజల మన్నన పొందలేదు. హెబెల్ 50 వ జన్మదినాన మరణించడానికి తొమ్మిది నెలలకు పూర్వం అతని రచనలకు స్కిలర్ ప్రైజ్ లభించింది.

భార్గవి

**హెమింగ్వే, ఎర్నెస్ట్ (మిల్లర్) (1899-1961) :** ప్రముఖ అమెరికన్ నవలా రచయిత, కథానికా రచయిత. 1954 లో సాహిత్యానికి ఆయనకు నోబెల్ బహుమతి లభించింది. సాహసోపేతమైన ఆయన జీవితాన్ని ఆయన రచనలు ప్రతిబింబిస్తాయి. ఇలినాయిస్ రాష్ట్రంలోని ఓక్ పార్క్‌లో 1899 జూలై 21 న ఎర్నెస్ట్ హెమింగ్వే జన్మించాడు. ఆయన తండ్రి "క్లారెన్స్ ఎడ్మండ్స్ హెమింగ్వే" వేటలోను, చేపలు పట్టడం లోను ఆసక్తి గల ఒక డాక్టరు. తల్లి 'గ్రేస్ హాల్ హెమింగ్వే." ఆమెకు లలితకళల పట్ల ప్రీతి హెచ్చు.!

హెమింగ్వే పబ్లిక్ స్కూళ్లలో విద్యాభ్యాసం చేసిన రోజులలోనే రచనలు చేస్తూ నలుగురి దృష్టిని ఆకర్షించాడు. తన రచనలలో ఆయన ఓక్‌పార్క్ను, దాని పరిసరాలను నిరసించాడు. ఆయన తరువాతి రచనలలో వెల్లడి అయినట్లు ఆయన బాల్యంలో చెప్పుకోదగిన కాలం తన కుటుంబంతో కలసి వేసవులలో అప్పర్‌మిచిగాన్ రాష్ట్రంలోని వాలూన్ సరస్సు వద్ద గడపిన రోజులు. హైస్కూలు చదువు అయిన తరువాత కాలేజీలో చేరకుండా హెమింగ్‌వే 1917 లో కాన్సాస్ సిటీకి వెళ్లి ఆ రోజులలో ప్రముఖ పత్రిక *స్టార్* రిపోర్టర్‌గా చేరాడు. అక్కడ హెమింగ్‌వేకు విలువైన వృత్తి శిక్షణ లభించింది. సైన్యంలో చేరాలని ఎన్నిసార్లు ప్రయత్నించినా కొంచెం దృష్టిలోపం ఉండడం వల్ల ఆయన ప్రయత్నాలు ఫలించలేదు. చివరికి ప్రథమ ప్రపంచ సంగ్రామకాలంలో అమెరికన్ రెడ్‌క్రాస్ వారి అంబ్యులెన్స్ కారు డ్రైవర్‌గా చేరి, ఆయన యుద్ధ రంగంలో పనిచేశాడు.



1918 జూలై 8 న తన 19 వ ఏట ఆస్ట్రో ఇటాలియన్ ఫ్రంట్‌లో ఆయన గాయపడ్డాడు. మిలాన్‌లో ఆసుపత్రిలో చికిత్స పొందుతూ తన వీరోచితమైన సేవలకు పతకాలు అందుకున్నాడు. రెడ్‌క్రాస్ సంఘంలోని నర్సు 'యాగ్నిస్ వాన్ కురొస్కీ' ని ప్రేమించగా, ఆమె అతనిని వివాహమాడడానికి నిరాకరించింది. ఆ అనుభవాలను ఆయన జీవితాంతం మరచిపోలేక పోయాడు.

అస్వస్థత నుంచి కోలుకున్న తరువాత హెమింగ్వే తిరిగి రచన కొనసాగించే ప్రయత్నం చేశాడు. కొంతకాలం పాటు చికాగోలో ఏవేవో చిన్న ఉద్యోగాలు నిర్వహించాడు.

హాడ్లీ రిచర్డ్‌సన్‌ను వివాహమాడి *టోరంటో స్టార్* పత్రిక విదేశీ విలేఖకుడుగా ఓడ ఎక్కి ఫ్రాన్సుకు బయలు దేరాడు. పారిస్‌లో ఉన్న ఇతర అమెరికన్ రచయితలైన ఎఫ్. స్కాట్ ఫ్రిట్జ్ గెరాల్డ్, గర్ట్రూడ్ స్టైన్, ఎజ్రా పౌండ్ మొదలైన వారి ప్రోత్సాహం వల్ల పత్రికా రచన కంటె భిన్నమైన రచనలను ఆయన అచ్చువేయసాగాడు. 1925 లో ఆయన తొలి రచన *ఇన్ అవర్ టైమ్* అనే కథానికా సంపుటం న్యూయార్క్‌లో ప్రచురించబడింది. ఆ మరుసటి ఏడాదే *ది సన్ ఆల్సో రైసెస్* అనే నవల వెలువడింది. అదే హెమింగ్వే చేసిన మొదటి విజయవంతమైన రచన!

యుద్ధానంతర కాలంలో గ్రంథరచనే హెమింగ్వేకు ప్రధాన మైన వ్యాసంగ మైంది. అంతలో ఆయన మొదటి భార్యకు జాన్ అనే కుమారుడు కలిగిన తరువాత ఆ వివాహం విచ్ఛిన్నమై 'పాలిన్ ఫైఫర్' (Pauline Pfeiffer) ను తిరిగి ఆయన వివాహ మాడాడు. పాట్రిక్, గ్రిగరీ అనే ఇద్దరు బిడ్డలు ఆమెకు జన్మించారు. పారిస్‌లో ఉంటూనే స్కీయింగ్, బుల్ ఫైటింగ్ (ఎద్దులతో పోరాటం) చేపలు పట్టడం, వేట మొదలైన వ్యాపృత్తుల మీద విశేషంగా దేశ పర్యటన జరిపాడు. అప్పటికే ఆ క్రీడలన్నీ ఆయన జీవితంలో భాగంగా ఏర్పడి, ఆయన తరువాతి రచనలకు ఇతివృత్తాలను సమకూర్చాయి. 1927 లో వెలువడిన *మెన్ వితౌట్ వుమెన్*, 1933 లో వెలువడిన *విన్నర్ టేక్ నథింగ్* కథానికా రచనలో సిద్ధహస్తుడుగా ఆయన కీర్తిని సుప్రతిష్ఠితం చేశాయి. అయితే ప్రజల దృష్టిలో *ఏ ఫేర్‌వెల్ టు ఆరమ్స్* (1929) పై రెండింటిని తలదన్నిన రచన! చాలామంది విమర్శకుల దృష్టిలో హెమింగ్వే జీవితంలో ఉద్గ్రంథాలు రచించే దశ అప్పటికే ముగిసిపోయింది. అటు తరువాత చాలా అరుదుగా ఆయన రచనలు వెలువడుతూ వచ్చాయి. చేపలు పట్టడంలోను, వేటాడటంలోనూ అంత ఎక్కువ సమయాన్ని తాను వినియోగించి ఉండకపోతే తాను మరికొన్ని రచనలు చేయగలిగి ఉండేవాడినని హెమింగ్వే ఒకసారి అన్నాడు.

స్పెయిన్ దేశం పట్ల, బుల్ ఫైటింగ్ పట్ల హెమింగ్వేకు గల ప్రేమకు ఫలితంగా *డెత్ ఇన్ ది ఆఫ్టర్‌నూన్* (1932) అనే నవల వచ్చింది. అలాగే ఆఫ్రికాలో ఆయన జరిపిన వేటకు ఫలితంగా *గ్రీన్ హిల్స్ ఆఫ్ ఆఫ్రికా* (1935) అనే నవల వెలువడింది. చేపలుపట్టడం పట్ల ప్రీతితో 'పిలార్' అనే ఒక చేపలు పట్టే నౌకను కూడా ఆయన కొనుక్కున్నాడు. 1937 లో ఆ అనుభవంతోనే *టు హావ్ అండ్ హావ్‌నాట్* అనే చిన్న నవల వ్రాశాడు. అటు తరువాత హెమింగ్వే దృష్టి సాంఘిక సమస్యలవైపు మళ్లింది.

అప్పటికి స్పెయిన్ అంతర్యుద్ధంలో చిక్కుకుంది. అయినా ఆ దేశం మీద ఉండే మమకారం వల్ల హెమింగ్‌వే కరెస్పాండెంట్‌గా నాలుగు సార్లు ఆ దేశం వెళ్లి వచ్చాడు. *ది ఫిఫ్త్ కాలం* (1938) అనే ఆయన నాటకానికి ముట్టడిలో ఉన్న 'మాడ్రిడ్' నగరమే రంగస్థలం. అటు తరువాత హెమింగ్‌వే రచయిత్రి, జర్నలిస్టు అయిన 'మార్తా గెల్హారమ్' ను వివాహమాడాడు.

స్పెయిన్ అంతర్యుద్ధం నాటి హెమింగ్‌వే అనుభవమే *ఫర్ హూమ్ ది బెల్ టోల్స్* (1940) అనే నవల రచనకు కారణమైంది. అమ్మకమైన ప్రతుల సంఖ్య దృష్ట్యా చూస్తే హెమింగ్‌వే రచనలన్నింటిలోకీ ఇదే ఎక్కువ విజయవంతమైంది. హెమింగ్వే జీవితం అంతా యుద్ధం పట్ల విపరీతమైన ఆసక్తితోనే గడిచింది. చివరికి *ఇన్ ఏ ఫేర్‌వెల్ టు ఆరమ్స్* అనే నవలలో ఆయన యుద్ధాల నిరర్థకతను చాటాడు. అయినా రెండవ ప్రపంచ సంగ్రామం కాలంలో కూడా ఆయన యుద్ధం పట్ల ఆసక్తిని ప్రదర్శించాడు.

యూరప్‌లో యుద్ధం ముగిసిన తరువాత హెమింగ్వే క్యూబాలోని తన స్వగృహానికి తిరిగి వచ్చాడు. ఆయన మూడవ వివాహానికి కూడా మొదటి రెండు వివాహాలకు పట్టిన దుర్గతే పట్టగా నాల్గవ భార్యగా మేరీ వెల్ష్‌ను హెమింగ్వే చేబట్టాడు. లండన్‌లో మొదట ఆయన ఆమెను కలుసుకున్నాడు. తరువాత జీవితాంతం ఆమెతోనే హెమింగ్వే గడపాడు. క్యూబాలోని ఒక చేపలు పట్టేవానిని దృష్టిలో ఉంచుకుని *ది ఓల్డ్‌మాన్ అండ్ ది సీ* (1952) అనే చిన్న నవలను హెమింగ్వే వ్రాశాడు. 1954 లో హెమింగ్వే కు నోబెల్ బహుమతి రావడంలో ఈ నవల ప్రధానపాత్ర వహించింది. ఆ నవల కంటె ముందు వెలువడిన *ఎక్రాస్ ది రివర్ అండ్ ఇన్‌టు ది ట్రీస్* (1950) కూడా విశేష ప్రశంసలు అందుకుంది.

1960 లో ఫిడెల్ కాస్ట్రో లేవదీసిన విప్లవం వల్ల హెమింగ్ వే క్యూబా నుంచి తరలిపోవలసి వచ్చింది. తరువాత ఆయన ఇదాహో (Idaho) రాష్ట్రంలోని కెచ్చుమ్ (Kitchium) లో మరొక ఇల్లు కొనుక్కున్నాడు. అకారణమైన ఆతురత, నిరాశ, నిస్పృహలతో బాధపడుతూ హెమింగ్‌వే రెండు సార్లు ఆసుపత్రిలో చేరి ఎలక్ట్రిక్ షాక్ ట్రీట్‌మెంట్ తీసుకున్నాడు. తరువాత

రెండు రోజులకే తుపాకీని తన కణతకు గురిచూసి పేల్చుకొని, 1961 జూలై 2 న హెమింగ్వే తుదిశ్వాస విడిచాడు.

బొ.శ్రీ.

**హెమోన్, లూయీ (1880-1913) :** కెనడాలోని ఫ్రెంచ్ నవలా రచయిత. కెనడా ఫ్రెంచ్ నవలలలో విశేష ప్రశస్తి పొందిన *మరియా ఛాప్ డిలేన్* నవలా రచయిత.!

ఫ్రాన్స్ లోని బ్రెస్ట్ నగరంలో 1880 అక్టోబరు 12 న హెమోన్ జన్మించాడు. కొద్ది సంవత్సరాలపాటు ఇంగ్లండ్ లో పత్రికా రచయితగానూ, క్రీడారంగ రచయితగానూ పనిచేసిన తరువాత 1911 లో హెమోన్ కెనడా వెళ్లాడు. అక్కడ ఒక వ్యవసాయ క్షేత్రంలో పనిచేస్తూ *మరియా ఛాప్ డిలేన్* నవలను రచించాడు. క్వెబెక్ లోని సెంట్ జాన్ సరస్సు ప్రాంతంలో భూస్వభావాన్ని, వాతావరణం ప్రతి కూలంగా ఉన్న పరిస్థితులలో అక్కడి స్త్రీ పురుషులు వాటితో కొనసాగించిన పోరాటాన్ని వాస్తవిక దృష్టితో ఆ నవల చిత్రిస్తుంది. ఫ్రెంచ్ కెనడియన్‌ల జీవితాన్ని ఆదర్శప్రాయంగా చిత్రించినందుకు విమర్శకులలో మొదట కొంత ఆగ్రహం కనిపించినా, త్వరలోనే స్థానిక కెనెడియన్ రచయితలకు అది ఒక నమూనా అయింది. మొదట ఆ నవల *లే టెమ్స్* (1914) అనే పారిస్ మేగజైన్ లో సీరియల్‌గా వచ్చింది. 1915 లో పుస్తకరూపంలో అది వెలువడింది. తరువాత పలు ముద్రణలు పొందింది. ఇతర ప్రధాన భాషలన్నింటిలోకీ అనువదించబడింది. అయితే ఆ నవల విజయాన్ని కన్నులారా చూసుకోడానికి హెమోన్ నోచుకోలేదు. దాని ప్రచురణకు పూర్వమే 1913 లో ఒక రైలు ప్రమాదంలో హెమోన్ చనిపోయాడు. *నికోలే డిషేమ్స్* 1950 లో హెమోన్ తొలి వ్రాత ప్రతిని ఆధారంగా చేసికొని *మరియా ఛాప్ డిలేన్* నవలకు నూతన ముద్రణను వెలువరించాడు.

బొ.శ్రీ.

**హెయ్‌స్, పాల్‌యోహాన్ లుడ్విగ్ వాన్ (1830-1914) :** సంప్రదాయ బద్ధమైన సాహిత్య సృష్టికి కృషిచేసిన జర్మన రచయిత. 1910 వ సంవత్సరంలో నోబెల్ బహుమతి పొందినవాడు.

లాటిన్, రోమను భాషలను అభ్యసించి, విద్యాభ్యాసం ముగించుకొని స్కాలర్‌షిప్‌తో ఇటలీ మొదలైన దేశాలలో ఒక సంవత్సరం పాటు పర్యటించాడు. పాల్‌వాన్ తరువాత మ్యూనిచ్ నగరానికి వచ్చి, అప్పటి ప్రముఖ కవులైన ఇమ్మాన్యుయల్ గేబెల్‌తో స్నేహం పెంచుకొని రచయితల సంఘంలో హెయ్స్ గుర్తింపు పొందాడు. వాస్తవికత, రాజకీయాలు, అతివాదం మొదలైన వాటి నీడలు సాహిత్యంపై పడకూడదని, వీటి కారణంగా సాహిత్యంలో సౌందర్యం, కళాత్మకత తగ్గిపోతున్నా యని ఈ రచయిత నమ్మి ఆచరించినవాడు. సంప్రదాయం, భావుకతలను కలబోసి తనదే అయిన ఒక ఒరవడిని సృష్టించి కథలు వ్రాశాడు. వీటిలో ముఖ్యమైనది *ఎల్ అరేబియాటా* (1855). *చిల్డ్రన్ ఆఫ్ ది వరల్డ్* అనే నవలను, ఎక్కువగా ప్రాచుర్యం లభించని కొన్ని నాటకాలను వ్రాశాడు. ఇటాలియన్ కవులకు హెయ్స్ చేసిన జర్మన్ అనువాదాలకు మంచి గుర్తింపు వచ్చింది. 'ఫాల్కన్ థియరీ' అన్న ప్రతిపాదనలో నవలా స్వరూపం ఎలా ఉండాలో విశదీకరించాడు. ఆదర్శవాది అయిన ఈ రచయిత జీవితంలోని లోటుపాటులను, కష్టనష్టాలను విస్మరించి జీవితం ఒక అందమైన అనుభూతి మాత్రమే అని చెప్పడం చాలామందికి కోపం తెప్పించింది. వాస్తవికతకు అద్దం పట్టేలా వ్రాయా లనుకొన్న వారితో ఇతడు శత్రుత్వం పెంచుకొన్నాడు. నోబెల్ బహుమతి అందుకొనేటప్పటికే ఈ రచయిత పేరు ప్రఖ్యాతులు తగ్గిపోయాయి.

భార్గవి

**హెర్డర్, యోహాన్ గోట్ఫ్రీడ్-వాన్ (1744-1803) :** ప్రముఖ జర్మన్ సాహిత్య విమర్శకుడు, భగవచ్ఛాస్త్రవేత్త, దార్శనికుడు. 'స్టర్మ్ ఉండ్ డ్రాంగ్' సాహిత్యోద్యమం నడపిన ప్రధాన వ్యక్తులలో ఒకడు. చరిత్ర, సంస్కృతులతాత్త్విక విచారణలో కొత్త పుంతలు త్రొక్కినవాడు. ఆయన ప్రభావం, దానికి



తోడు అప్పటికి యువకుడుగా ఉన్న జె. డబ్ల్యూ గొయిథేతో ఆయన పరిచయం, జర్మన్ సాహిత్యంలో కాల్పనికోద్యమానికి ఆయనను వైతాళికుణ్ణి చేశాయి. 1802 లో ఆయనకు 'ఫాన్' (Von) బిరుదం లభించింది.

ఒక నిరుపేద కుటుంబంలో 1744 ఆగస్టు 25 వ తేదీన తూర్పు ప్రష్యాలోని మోహ్రుంగెన్‌లో హెర్డర్ జన్మించాడు. 1762 లో 'కోనిక్స్ బెర్గ్' లో భగవచ్ఛాస్త్రం, దర్శనశాస్త్రం, సాహిత్యం అధ్యయనం చేయడం మొదలు పెట్టాడు. ఆ రోజులలోనే ఆయనకు 'ఇమాన్యువల్ కాంట్', యోహాన్ జార్జ్‌హమాన్ లతో పరిచయం ఏర్పడింది.

1764 లో 'రిగా' లో టీచర్‌గానూ, బోధకుడుగానూ పనిచేయడానికి హెర్డర్ వెళ్లాడు. అక్కడ ఉండగానే ఆయన తొలి రచనలు *ఊబర్ డీ నాయియరే డాయిచె లిటరేటూర్ ఫ్రాగ్మంటె* (1767; On Recent German Literature: Fragments), *క్రిటిషే వాల్డర్, ఓడెర్ బెట్రాఖ్టుంగెన్ డీ విసెన్ షాఫ్ట్ ఉండ్ కున్‌స్ట్ డెస్ షోనెన్ బెట్రెఫెండ్* (1769-Critical Forests, or Reflections on the Science and Art of the Beautiful) వెలువడ్డాయి.

1769 వేసవిలో 'రిగా' నుంచి నాన్టీస్‌కు ఆయన నౌకాయాత్ర సాగించాడు. ఆ యాత్ర హెర్డర్ జీవితధ్యేయాన్ని స్పష్టం చేసింది. ఆ యాత్రకు సంబంధించి ఆయన వ్రాసుకున్న డైరీ ఆ ఏడాది డిసెంబరు నెలలో పారిస్‌లో పూర్తిచేయబడింది. ఆయన జీవితంలో ఆ యాత్ర తెచ్చిన పరిణామాన్ని ఆ డైరీ సూచిస్తుంది. హెర్డర్ తన సమకాలీన పరిస్థితులను గూర్చి చేసిన విమర్శలు కొన్ని తరాల తరువాత జర్మనీలో బౌద్ధికంగా ఏర్పడిన పరిణామాలపై జోస్యం చెప్పాయి. అనంతరం గొయ్‌థే, ఆగస్ట్ విల్‌హెల్మ్ మొదలైనవారు కవితా సిద్ధాంతంలో తెచ్చిన మార్పులకు బీజాలు హెర్డర్ రచనలలోనే కనిపిస్తాయి.

1770 లో పీటర్ ఫ్రెడరిక్ విలియం రాకుమారునితో కలసి స్ట్రాస్‌బర్గ్ సందర్శించినపుడు హెర్డర్ మొదటిసారిగా అప్పటికి యువకుడుగా ఉన్న గొయ్‌థేను కలుసు కున్నాడు. ఆయన హోమర్, పిండార్, షేక్స్పియర్, జానపదగీతాలు మొదలైన విషయాలను గూర్చి వెలిబుచ్చిన అభిప్రాయాలు గొయ్‌థేలోని సృజనాత్మక శక్తులను ఆవిష్కరించడానికి తోడ్పడ్డాయి.

1771 లో హెర్డర్ ఆస్థాన 'బోధకుడు' గా బుకెన్‌బుర్గ్ వెళ్లాడు. అక్కడ ఆయన చేసిన రచనలు *స్టర్మ్ ఉండ్ డ్రాంగ్* సాహిత్యోద్యమానికి ప్రాతిపదిక సూత్రాలను సమకూర్చాయి. ఈ కాలంలో ఆయన చేసిన రచనలలో ముఖ్యమైనవి: *ప్లాస్టిక్* (1778), *అభాండ్‌లుంగ్ ఊబెర్ డెన్ ఉర్‌స్ ప్రుంగ్ డెర్ స్ప్రాకె* (1772, Essay on the Origin of Language), *ఆల్ టెస్టే ఉర్కుండే డెస్ మెన్షెన్ గెష్ లెఖ్ట్స్* (1774-76; Oldest Records of the Human Race) మొదలైనవి.

గొయిథే ప్రాబల్యం వల్ల హెర్డర్ 1776 లో 'వైమార్' ప్రభుత్వంలో జనరల్ సూపరిండెంట్‌గా నియమింపబడ్డాడు. ఆ రోజులలో ఆయన చేసిన రచనలు *వామ్ ఎర్కెనెన్ ఉండ్ ఎంప్ ఫైండెన్ డెర్ మెన్‌ష్లిషెన్ సీల్* (1778-Of the Knowing and Sensing of the Human Soul), *బ్రీఫెడస్ స్టూడియమ్ డెర్ థియోలజీ బెట్రెఫెండ్* (1780 - Letters Concerning the Study of Theology), *వామ్ గైస్ట్ డెర్ ఎబ్రాయిషెన్ పొయెసీ* (The Spirit of Hebrew Poetry), *వోల్క్స్ లీడెర్* (1778-79, Flok Songs).

హెర్డర్ వాస్తవికతతో సమన్వయం సాధించడానికి కవిత్వాన్ని ఒక సాధనంగా గ్రహించాడు. ఆయన కాలంలో ఇతరులు చాలా మంది కవిత్వం పాండిత్య ప్రదర్శకమైనదనీ, వినోద దాయకమైనదనీ భావించేవారు.

ఆర్థికమైన ఇబ్బందులు, ఫ్రెంచ్ విప్లవం విషయంలో అభిప్రాయభేదాలు, స్వాతిశయభావం మొదలైనవి హెర్డర్‌కు గొయిథేతో మనోవైషమ్యాలకు దారి తీశాయి.

హెర్డర్ ఇంకా ఎన్నో రచనలు చేసి 1803 డిసెంబరు 18 న వైమార్‌లో శాశ్వతంగా కన్ను మూశాడు. ఆయన మరణానంతరం ఆయన భార్య హెర్డర్ రచనలన్నిటినీ 45 సంపుటాలుగా అచ్చువేయించింది.

డి.మా.రా.

**హెర్న్, లఫ్కాడియో (1850-1904)** : జపాన్ దేశపు సాహిత్యాన్నీ, సంస్కృతినీ పాశ్చాత్య దేశాలకు అందజేసి అపూర్వమైన సేవ చేసిన రచయిత, అనువాదకుడు, ఆచార్యుడు!.

1850 జూన్ 27 న గ్రీస్‌లోని అయోనియన్ దీవులలో జన్మించిన హెర్న్ డబ్లిన్ నగరంలో పెరిగి పెద్ద వాడయాడు. ఇంగ్లండ్, ఫ్రాన్స్‌లలో కొద్దికాలంపాటు విద్యాభ్యాసం కొనసాగించిన తరువాత తన 19 వ ఏట యునైటెడ్ స్టేట్స్‌కు వలస వెళ్లాడు. ఓహియో రాష్ట్రంలోని 'సిన్సినాటి' నగరంలో స్థిరపడి ఏవో చిల్లర పనులు చేస్తూ, చివరకు *ట్రేడ్ లిస్ట్* అనే వాణిజ్య పత్రికలో చేరాడు. తరువాత *ది సిన్సినాటి ఇంక్వైరర్*, అనంతరం *ది సిన్సినాటి కమర్షియల్* అనేక పత్రికలకు రిపోర్టర్ అయాడు. ఆ పత్రికలకు వచన పద్యాలే కాక, 'నగరవాసులైన నీగ్రోల జీవన విధానం' వంటి అసాధా

రణమైన విషయాలమీద పరిశోధక వ్యాసాలు కూడా వ్రాస్తూ ఉండేవాడు. సిన్సినాటీలో ఉండగానే గాషియేర్ (Gottier 1811-72) అనే ఫ్రెంచ్‌కవి కథలను *వన్ ఆఫ్ క్లియోపాట్రాస్ నైట్స్* అనే శీర్షికతోనూ, ఫ్లాబర్ట్ (1821-80) అనే ఫ్రెంచ్ నవలా రచయిత రచనను *టెంప్టేషన్ ఆఫ్ సెంట్ ఆంథోనీ* అనే శీర్షికతోనూ అనువదించాడు.

1877 లో హెర్న్ న్యూ ఆర్లియన్స్‌కు వెళ్లి లూయిజియానా రాజకీయాలను గురించి కమర్షియల్ పత్రికలకు వ్యాసాలు వ్రాస్తూ ఉండేవాడు. ఆ కాలంలోనే *ఐటెమ్* (అనంతరం *టైమ్స్ డెమోక్రాట్*) పత్రికలో ఫ్రెంచ్ కథలకు అనువాదాలూ, స్వతంత్ర కథలూ, స్కెచ్‌లూ, విదేశీ సాహిత్యాల నుండి అనుసరణలూ చేస్తూ ఉండేవాడు. ఈ రచనలే హెర్న్ ప్రకటించిన *స్ట్రే లీవ్స్ ఫ్రమ్ స్ట్రేంజ్ లిటరేచర్* (1884) *సమ్ చైనీస్ ఘోస్ట్స్* (1887) అనే రెండు తొలి సంపుటాలుగా వెలువడ్డాయి. ఆయన వ్యాసాల ఇతివృత్తాలు వైవిధ్యంతో కూడి ఉండేవి. 'బుద్ధిజం', 'ఇస్లామ్' వంటి విషయాల దగ్గర నుంచి ఫ్రెంచ్, రష్యన్ సాహిత్యాల వరకు అవి విస్తరించి ఉండేవి. ఆయన సంపాదకీయాలు వైజ్ఞానిక విషయాల నుంచి రష్యా ఫ్రాన్స్‌లలో 'ఆంటీ సెమిటిజమ్' వరకూ వివిధ విషయాలను చర్చించేవి. ఉప్పెన వచ్చి అందరూ చచ్చిపోగా మిగిలిన ఒకే ఒక వ్యక్తి జీవితాన్ని చిత్రించే *చీట* (Chita-1889) అనే సాహసిక నవల ఆయన ఈ కాలంలో వ్రాసిందే.

1887 నుండి 1889 వరకూ *హార్పర్స్ మేగజైన్* తరఫున హెర్న్ వెస్టిండీస్‌లో ఉన్నాడు. దాని ఫలితమే ఆయన రచించిన *టూ ఇయర్స్ ఇన్ ఫ్రెంచ్ వెస్టిండీస్* (1890) ఆయన నవల *యూమా* (Youma, 1890). బానిసల తిరుగుబాటుకు సంబంధించిన ఆ నవల చాలా మౌలికమైనది.

1890 లో హార్పర్స్ పత్రిక తరఫుననే హెర్న్ జపాన్ వెళ్లాడు. త్వరలోనే ఆ పత్రికకు పనిచేయడం మానివేసి, ఉత్తర జపాన్‌లోని 'ఇజుమో' లో ఒక స్కూలు టీచర్‌గా ఆయన చేరాడు. అక్కడ జపనీస్ ఉన్నత కుటుంబానికి చెందిన (సామురాయ్-క్షత్రియ) 'సెట్సుకో కోయిజుమి' అనే ఆమెను 1891 లో వివాహమాడాడు. త్వరలోనే జపాన్‌ను గూర్చి హెర్న్ రచించిన వ్యాసాలు *ది అట్లాంటిక్* మంత్లీలోను, యునైటెడ్ స్టేట్స్‌లోని అనేక ఇతర పత్రికలలోను వెలువడసాగాయి. ఇలా ప్రచురింపబడిన రచనలన్నీ అటు తరువాత *గ్లిమ్ప్సెస్ ఆఫ్ అన్ ఫెమిలియర్ జపాన్* అనే పేర రెండు సంపుటాలుగా వెలువడ్డాయి (1894).

1891 లో హెర్న్ 'కుమామాటో' లోని ప్రభుత్వ కళాశాలకు బదిలీ అయి అక్కడ మూడేళ్లపాటు ఉన్నాడు. 1895 లో జపాన్ పౌరసత్వం పొంది 'కోయిజుమీ యాకుమో' అని తన పేరు మార్చుకున్నాడు. 'కోయిజుమీ' అనేది తన భార్య కుటుంబనామం.

హెర్న్ జీవితంలో సర్వోచ్చదశ 1896-1903 మధ్య కాలం. టోక్యోలోని ఇంపీరియల్ యూనివర్సిటీలో ఇంగ్లీష్ ప్రొఫెసర్‌గా ఆ కాలంలో ఆయన పనిచేశాడు. అక్కడ ఆయన ప్రకటించిన నాలుగు గ్రంథాలు: 1. *ఎక్సోటిక్స్ అండ్ రిట్రాస్పెక్టివ్* (1898), 2. *ఇన్ ఘోస్ట్లీ జపాన్* (1899), 3. *షేడోయింగ్స్* (1900), 4. *ఏ జపనీస్ మిసెలెనీ* (1901). జపాన్ ఆచారాలను గురించి, మతాన్ని గురించి, సాహిత్యాన్ని గురించి హెర్న్‌కి క్షుణ్ణంగా తెలుసు. *క్వాయిడాన్* (1904) అనే సంకలనంలో అతి మానవ సంఘటనలను గూర్చిన కథలు 'హైకూ' కవితలకు అనువాదాలు ఉన్నాయి. 1965 లో జపాన్‌లో వెలువడిన *క్వాయిడాన్* అనే ఫిలిమ్‌కు ఈయన రచించిన మూడు ఘోస్ట్' కథలే ఆధారం. కార్నెల్ యూనివర్సిటీలో ఈయన ఇవ్వడంకోసం వ్రాసిన ఉపన్యాసాలు, *జపాన్, ఏన్ ఎటెంప్ట్ ఎట్ ఏన్ ఇంటర్‌ప్రెటేషన్* (1904) అనే సంపుటంగా వెలువడ్డాయి. అయితే ఆ ఉపన్యాసాలు ఇచ్చేందుకు అమెరికా బయలుదేరడానికి ముందే 1904 సెప్టెంబరు 26 న జపాన్‌లోని 'బకూబో' లో హెర్న్ తనువు చాలించాడు.

డి.మా.రా.

**హెర్నాండెజ్, హోస్ (1834-1886)** : అర్జంటీనా దేశపు కవి. 'గాచో' లు అనబడే దక్షిణ అమెరికాలోని పశువుల కాపరుల జీవితాలను చిత్రించడంలో విశేషనైపుణి ప్రదర్శించాడు.

తన 14 వ ఏట అస్వస్థత కారణంగా బ్యూనస్ ఐరిస్ నగరాన్ని వదలి 'పాంపాస్' అనబడే మైదానాలలో ప్రవేశించాడు. అక్కడే పశువుల కాపరుల (గాచో) ల జీవన విధానాన్ని ఆయన సూక్ష్మంగా పరిశీలించాడు. 1853 మొదలు 1868 వరకు బ్యూనస్ ఐరిస్‌కు విరుద్ధంగా ఆ రాష్ట్రం సాగించిన పోరాటంలో పాల్గొన్నాడు. అధ్యక్షుడు 'డామింగో సార్మింటో' ప్రభుత్వానికి వ్యతిరేకంగా 1870 లో సాగిన విఫలమైన తిరుగుబాటుకు ఫలితంగా హెర్నాండెజ్ 1871 జనవరిలో బ్రెజిల్‌కు పారిపోయాడు. బ్యూనస్ ఐరిస్‌కు తిరిగి వచ్చిన తరు

వాత పీడితులైన గౌచోల జీవితాన్ని చిత్రిస్తూ *ఎల్ గౌచో మ్యార్టిన్ ఫీరో* (1872) అనే కావ్య సంపుటాన్ని ప్రకటించాడు. 'గౌచో' కవితకు అత్యుత్తమమైన దృష్టాంతంగా అది పరిగణించ బడుతూంది. దాని ద్వితీయ భాగం అయిన *లా వుయెల్ టా డి మ్యార్టిన్ ఫీరో* (1879-The Return of Martin Fierro) కావ్యసంపుటిలో కథా నాయకుడు తాను పరిత్యజించిన సంఘంలో తిరిగి విలీనుడు కావడం వర్ణించబడింది.

1886 అక్టోబరు 21 న హోస్ హెర్నాండెజ్ బ్యూనస్ ఐరిస్ సమీపంలో ఉన్న 'బెల్‌గ్రానో' లో తన దేహయాత్ర చాలించాడు.

బ్రా.శ్రీ.

**హెర్క్యులానో డి కార్వాల్హో ఏ అరౌజో, అలెక్సాండ్ర్ (1810-1877) :** పోర్చుగల్ దేశపు చరిత్ర రచయిత, నవలా రచయిత, కవి. గారెట్‌తో కలసి ఈయన కాల్పనిక వాద కవితాధోరణిని పోర్చుగల్ దేశంలో ప్రవేశపెట్టాడు. చరిత్ర రచయితగా ఉదారదృష్టిని ప్రకటించి ఫ్రాన్స్‌లో 'విక్టర్ హ్యూగో' తో పోల్చదగినంత జాతీయ గౌరవాన్ని పోర్చుగల్ దేశంలో ఈయన పొందాడు.

యువకుడుగా ఉన్నప్పుడు హెర్క్యులానో నియంత అయిన 'డామ్ మిగ్వెల్' పరిపాలనకు వ్యతిరేకంగా సాగిన ఒక విఫలమైన తిరుగుబాటులో పాల్గొని తత్ఫలితంగా ఇంగ్లండ్, ఫ్రాన్స్‌లలో ప్రవాస శిక్షను అనుభవించాడు. 1832 లో ఆయన డామ్‌పెడ్రో తాలూకు ఒక చిన్న సైన్యంతో పోర్చుగల్‌కు తిరిగివచ్చి మిగ్వెల్‌ను పదవీ చ్యుతుణ్ణి చేసి ఉదార పరిపాలనను స్థాపించాడు. రాజకీయంగా వచ్చిన మార్పుతో పాటు దేశంలో ఒక సాంస్కృతిక విప్లవం కూడా లేవదీయడం అవసరమని భావించి ఆయన తన కవిత్వానికి స్వస్తిచెప్పి *ఓ పనోరమ* (1837-39) అనే పత్రికకు సంపాదకత్వ బాధ్యతను స్వీకరించాడు. ఆ పత్రికలో ఆయన వ్రాసిన చారిత్రక కథలు మొదలైన రచన లన్నీ అటుతరువాత రెండు సంపుటాలలో ప్రకటించబడ్డాయి (1851). 1840 లో 'కోర్టిస్' (Cortes) అనబడే పోర్చుగల్ పార్లమెంటుకు ఎన్నికై విద్యారంగంలో ప్రజాస్వామ్య సంస్కరణలకోసం హెర్క్యులానో ఉద్యమం సాగించాడు. అయితే 1841 లో ఆయన రాజకీయాలనుంచి విరమించాడు. 1839 లో 'రాయల్ లైబ్రరీ ఆఫ్ అజూడా' లో లైబ్రేరియన్‌గా చేరి *హిస్టారియా డి పోర్చుగల్* అనే తన బృహద్గ్రంథ రచనకు పూనుకున్నాడు. సర్ వాల్టర్ స్కాట్‌లాగ కొన్ని చారిత్రక నవలలు కూడా హెర్క్యులానో రచించాడు. ఈ సాహిత్య ప్రక్రియను పోర్చుగల్‌లో ప్రవేశపెట్టినవాడు ఆయనే!

హెర్క్యులానో రచించిన *హిస్టారియా డి పోర్చుగల్* మొదటి సంపుటం 1846 లో వెలువడింది. సృజనాత్మకమైన చరిత్ర రచనలో అది ఒక మైలురాయిగా పరిగణించబడుతూంది. 1279 వరకూ నడిచిన పోర్చుగల్ ప్రాచీన చరిత్రను వర్ణించే ఈ సంపుటంలో హెర్క్యులానో ప్రాచీన లిఖిత ప్రమాణాలను పరిశీలించి అంతవరకూ పుక్కిటి పురాణాలుగా ప్రచారంలో ఉన్న కథల నెన్నింటినో నిరాధారాలని ఖండించాడు.

1851 లో రీ జెనరేషన్ ఉద్యమం, కోస్టాకాబ్రల్ పరిపాలనకు స్వస్తి చెప్పింది. ఆ ఉద్యమంలో కూడా హెర్క్యులానో పాల్గొన్నాడు. నూతన ప్రభుత్వాన్ని సమర్థించడానికి రెండు వార్తాపత్రికలను ఆయన స్థాపించాడు. ఆ కాలంలో ఆయన చేసిన రచన *డా ఓరిజెం ఏ ఎస్టాబెలసిమెంటో డ ఇంక్విజికా ఓ ఎం పోర్చుగల్* (1854-59, History of the Origin and Establishment of the Inquisition in Portugal).

హెర్క్యులానో వ్రాసిన పోర్చుగల్ చరిత్రలో చివరిదైన నాలుగవ సంపుటం 1853 లో వెలువడింది. 1856 లో ఆయనకు వ్యక్తిగత శత్రువు 'నేషనల్ ఆర్కైవ్స్' కి అధికారిగా రావడంతో ఆయన పదవీ విరమణ చేసి సెంటేరమ్ సమీపంలో ఉన్న 'వేల్ డీ లాజోస్' లో వ్యవసాయం చేసుకుంటూ జీవితం గడపసాగాడు.

1877 సెప్టెంబరు 13 న సెంటేరన్‌లో హెర్క్యులానో తుదిశ్వాస విడిచాడు.

డి.మూ.రా.

**హెరేరా-ఇ-రైసిగ్, జూలియో (1875-1910) :** 20 వ శతాబ్దిలో స్పానిష్ భాషలో మిక్కిలి మౌలికమైన కవిత రచించిన ఉరుగ్వే దేశపు కవి. భాష విషయంలోనూ, రూపం విషయంలోనూ ఆ కాలంలో వివిధ వాదోపవాదాలకు దారితీసిన అతని కవితను అటు తరువాత ఎందరో కవులు అనుకరించారు. తరువాతి 'స్పానిష్-అమెరికన్' కవిత మీద అతని కవిత్వపు ప్రభావం ఎంతగానో కనిపిస్తుంది.

ఒక సంపన్న కుటుంబంలో 'హెరేరా' జన్మించాడు. ఆ నాడు తన చుట్టూ వ్యాపించి ఉన్న బూర్జువా భౌతిక వాదాన్ని అతడు నిరసించాడు. కావాలని స్వచ్ఛంద వర్తనుడు (Bohemian) గానూ, పలాయనవాది గానూ 'మాంటేవీడియో' నగరంలో కాలం గడుపుతూ త్వరలోనే

కొంతమంది యువ కవులను తన చుట్టూ తన అనుయాయులుగా ప్రోగుచేశాడు. వారి ఒకే ఒక లక్ష్యం: సాంప్రదాయిక కవితా నియమాలను ఉల్లంఘిస్తూ, ప్రజలను నిర్ఘాంతపరిచే విచిత్ర ఇతివృత్తాలను స్వీకరిస్తూ, చిత్ర విచిత్ర పద్ధతులలో భాషను ప్రయోగిస్తూ సాహిత్య వివాదాలను రెచ్చగొట్టడం.!

అయితే, తన అనుయాయుల కవిత కంటె హెరేరా కవితలో మరింత ఎక్కువ కవితాశక్తి ప్రకటించబడడం, వాటికి మరింత ఎక్కువ జనాదరణ లభించడం జరిగింది. *లాస్ మైటినీస్ డీ లా నాఖే* (1902), *పోమాస్ వయొలీటాస్* (1906-Violet Poems) అనే ఆయన రచించిన రెండు కవితా సంపుటాలలోనూ సాహిత్య విమర్శకులు సర్వసాధారణ దృశ్యాలను విస్పష్టంగా కళ్లకు కట్టేట్టు వర్ణించగలశక్తినీ, భాషను పటిష్ఠంగా వాడగల నైపుణినీ గుర్తించారు. తన కవితలకు *పియానోస్ క్రెపస్క్యులారీస్* (1910-Twilight Pianos) వంటి చిత్రమైన శీర్షికలు పెట్టినప్పటికీ హెరేరా సర్వసాధారణ విషయాలను గురించే ఆ కవితలను వ్రాశాడు. స్వయంగా క్రొత్త కవితా రూపాలను సృష్టించినా సాంప్రదాయిక కవితా రూపాల వాడుకలో కూడా అతడు సిద్ధహస్తుడనిపించుకున్నాడు.

తన అల్పాయుర్దాయంలో ఒక ప్రక్క అనారోగ్యంతో తీసుకుంటూనే మరో ప్రక్క కవిత్వం ఇతివృత్తం విషయంలోనూ, సాంప్రదాయిక కవితా రూపాల విషయంలోనూ ప్రజలకు గల నమ్మకాలను హెరేరా సవాలు చేయగలిగాడు. అయితే అతని మరణానంతరం గాని ఒక గొప్ప కవిగా ఆయనకు గుర్తింపు లభించలేదు.

తన 35 వ ఏట 1910 మార్చి 18 న మాంటివీడియోలో హెరేరా తనువు చాలించాడు.

డి.మూ.రా.

**హెరేరా, ఫెర్నాండో డి (1534-1597)** : మధ్య యుగాలనాటి స్పానిష్ మహాకవి. 'ఎల్ డివిన్' అని పిలువబడిన ఈ కవి పదహారవ శతాబ్దపు పండితులలో ప్రఖ్యాతి గడించిన వాడు. భాషలోని ఇంపు సొంపులను చక్కగా వాడుకొనాలని, సాహిత్యం మానవతా విలువలను పెంచేదిగా ఉండాలనీ నమ్మినవాడు.

హెరేరా తన జీవితాన్ని చర్చిలోని మతాధికార (పూజారి -Benefice) వృత్తితో మొదలు పెట్టాడు. ఆ వృత్తిని అతడు కోరుకోలేదు. అందులో చేరాలని తరిఫీదు పొందలేదు. కాని ఆ వృత్తిలో వచ్చిన ఆదాయంతో చదువుకొంటూ, వ్రాసుకొంటూ కాలం గడిపాడు. ఇతని భావాలు, ఆదర్శాలు చాలా ఉన్నతంగా (Aristocratic) ఉండేవి. 1582 లో ఇటాలియన్ కవి 'గార్సిలాసో డి లా వేగా' ను గొప్పగా చిత్రించి వ్రాసిన కృతిలో ఇతని ఆదర్శాలు ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. అలంకారాలు ఎక్కువగా గుప్పించి, కృతకమైన శైలిలో 16 వ శతాబ్దంలో స్పెయిన్ దేశంలో ప్రచారంలో ఉన్న శైలిలో ఈయన రచనలు చేశాడు. ఈయన రచనలలో ప్రేమ గీతాలు ప్రజాదరణ పొందినా, దేశభక్తి గీతాలు, *బైబిల్* లోని *ఓల్డ్ టెస్టమెంట్* లోని కొన్ని ఘట్టాలను గేయాలుగా వ్రాసినవి చక్కటి సాహితీ విలువలతో నిండి ఉన్న రచనలు. 1572 లో ఒక చరిత్రాత్మకమైన గ్రంథాన్ని, 1592 లో *థామస్ మోర్ జీవిత చరిత్రనీ* హెరేరా రచించారు.

భార్గవి

**హెర్రిక్, రాబర్ట్ (1591-1674)** : షేక్స్పియర్ కాలం నాటి ప్రముఖ ఆంగ్లసాహితీవేత్త బెన్‌జాన్సన్‌ను అనుసరించి రచనలు సాగించిన ఆంగ్ల కవి, విమర్శకుడు. సంప్రదాయ బద్ధమైన కవితారీతులను కాపాడుకోవాలని నమ్మి రచనలు సాగించినవాడు. రాబర్ట్ మామగారు ఇంగ్లండులో పేరు పొందిన స్వర్ణకారుడు. సర్ విలియమ్ హెర్రిక్ అతని ఆశ్రయంలో చదువుకొంటూ 1617 లో కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయంలో ఇతడు ఎం.ఏ. పాసయాడు. ఆ కాలం నాటి సాహితీ వేత్తలతో, మేధావులతో పరిచయం ఏర్పరచుకొన్నాడు. బెన్ జాన్‌సన్ మొదలైన సాహితీ వేత్తల, గాయకుల సహవాసంతో చక్కటి రచనలు చేశాడు. 1629 లో డ్యూక్ ఆఫ్ బంకింగ్ హామ్ బృందంలో ఒక మతాధికారిగా ఫ్రాన్సుదేశం వెళ్ళి అక్కడే స్థిరపడిపోయాడు.



రాబర్ట్ హెర్రిక్ ఎన్నో కవితలు, భక్తిగీతాలు వ్రాసినా అవి అక్కడక్కడ పత్రికల్లో ప్రచురించబడ్డాయే గాని పుస్తకరూపంలో రాలేదు. ఈయన వ్రాసిన కవితా సంకలనం *హెస్ పెరిడిస్* (1648) ప్రచురించబడింది.

దీనిలో 1400 కవిత లున్నాయి. 'హెన్రీ లూయిస్' అనే సంగీతకారుడు వీటిలో కొన్నిటికి సంగీతాన్ని సమకూర్చాడు. రాబర్ట్ హెరిక్ కవితలలో వ్యంగ్య కవితలు, ప్రేమగీతాలు, భక్తి పాటలు, పెళ్లి పాటలు, స్నేహితుల పైన వ్రాసిన గేయాలు, స్మృతి కవితలే గాక అన్ని రకాలైన కవితలూ ఉన్నాయి. చక్కటి సంప్రదాయ బద్ధమైన శైలిలో, నిజాయితీతో చేసిన ఈ రచనమీద లాటిన్ కవుల ప్రభావం, *బైబిల్* ప్రభావం కొట్టవచ్చినట్టు కనబడుతుంది.

*భార్గవి*

**హెస్, హెర్మన్ (1877-1962) :** 1946 లో నోబెల్ బహుమానం అందుకొన్న జర్మన్ కవి, నవలా రచయిత. మనిషి ఆత్మను సంప్రదాయాల గోడల మధ్య బంధించడాన్ని వ్యతిరేకిస్తూ, విభిన్నమైన ఇతివృత్తాలతో, ప్రాచ్య మార్మికవాద దృష్టితో నిగూఢమైన రహస్యాలను అన్వేషిస్తూ రచనలు చేసిన సాహితీ వేత్త.



హెర్మన్ హెస్ తండ్రి ఒక మతప్రవక్త. కొడుకును కూడా ఆధ్యాత్మికంగా తీర్చిదిద్దాలని మత సంబంధమైన విషయాలు బోధించే కళాశాలలో ప్రవేశపెట్టాడు. కాని హెస్ అటువంటి శిక్షణలో మొగ్గు చూపక ఉద్యోగంలో చేరాడు. గడియారాలు మరమ్మత్తు చేసే షాపులోనూ, పుస్తకాల షాపులోనూ అసిస్టెంటుగా పనిచేశాడు. తెలివైన విద్యార్థులు సాంప్రదాయికమైన విద్యా విధానంలో ఎలా నలిగి పోతున్నారో అన్న విషయాన్ని *అన్‌టర్మ్ రాడ్* (1906) లో రచించాడు.

1904 వ సంవత్సరంలో పుస్తకాల వ్యాపారం నుండి బయటపడి స్వేచ్ఛగా రచనలు సాగించటం మొదలుపెట్టాడు. ఇతని మొదటి రచన *పీటర్ కామెన్ జింద్* కు పెద్ద గుర్తింపు రాలేదు. 1910 లో *గెర్‌ట్రూడ్* అన్న నవలలో ఒక కళాకారుని ఆత్మసంక్షోభాన్ని చిత్రించాడు. (ఆంగ్లానువాదం - 1915), *రోషాల్డే* (1914-ఆంగ్లానువాదం 1970) అనే రచన, ఇండియా వెళ్లి వచ్చాక వ్రాసిన *సిద్ధార్థ* అనే నవల హెర్మన్ హెస్‌కు పేరు తెచ్చిపెట్టాయి.

మొదటి ప్రపంచ యుద్ధకాలంలో స్విట్జర్లాండు దేశానికి వెళ్ళి తటస్థ దేశమైన మిలిటరీ నిరంకుశత్వాన్ని నిరసిస్తూ జర్మన్ భాషలో యుద్ధఖైదీల కోసం ఒక పత్రిక నడిపాడు. 1919 లో స్విట్జర్లాండు దేశ పౌరసత్వం పొంది అక్కడే స్థిరనివాస మేర్పరుచుకొన్నాడు.

జె.బి.లాంగ్ అనే సుప్రసిద్ధ మనస్తత్త్వవేత్తతో కలసి మనిషిలోని ద్వంద్వ ప్రవృత్తిపైనా, ఆదర్శాలు, మనసు పొరలలోని ఆవేశాలు మొదలైన సున్నితమైన విషయాల మీదా పరిశోధనలు జరిపాడు. *స్టెప్పెన్ వూల్ఫ్* (1929), *నార్సియస్ అండ్ గోల్డ్‌మండ్* (1930) అనే రచనలు ఈ పరిశోధనల ఫలితాలను ఆధారంగా చేసుకొని వ్రాసినవే. *గ్లాస్ పెర్లెన్‌స్పీల్* హెస్ రచనలలో సుదీర్ఘమైనది. ఒక మేధావిగా గుర్తింపు పొందిన ఈయన రచనలమీద విస్తృతంగా పరిశోధనలు జరిగాయి. వాటిలో ముఖ్యమైనవి జి.డబ్ల్యు. ఫీల్డ్ (1970), జె. మిలెక్ (1958), ఎమ్. సెరానో (1966) రచించిన పుస్తకాలు.

*భార్గవి*

**హెసియడ్ (క్రీ.పూ. 8వ-9వ శతాబ్దులు) :** ప్రాచీన గ్రీక్ కవి. 'ప్రబోధాత్మక గ్రీక్ కవితా పితామహు' డని పేరు పొందినవాడు. *థియోగనీ, వర్క్స్ అండ్ డేస్* అనే రెండు ప్రసిద్ధమైన ఇతిహాస కావ్యాలను రచించిన ప్రముఖ కవి. గ్రీసు దేశంలోని బొయీషియా మండలంలో జన్మించాడు. ఆస్తిలో తనకు న్యాయంగా రావలసిన భాగం తనకు దక్కనీయకుండా కుట్రపన్నిన సహోదరుని గురించి *వర్క్స్ అండ్ డేస్* కావ్యంలో ప్రస్తావన ఉన్నది. ధర్మం దేవత అని, ధర్మచ్యుతి వినాశకర మని అతడు ఆ కావ్యంలో హెచ్చరిస్తాడు. మనుష్యుల క్లేశాలు ధర్మపాలన వల్లనే పరిహార మవుతాయని అతడు బోధించాడు. ఆమ్ఫిడేమస్ అనే పౌరుని అంత్యక్రియల సందర్భంగా జరిగిన గేయ కవిత్వపు పోటీలో హెసియడ్ బహుమతి గడించాడు. అతనికి కవితాశక్తి అలవడటాన్ని గూర్చి ఒక కథ ప్రచారంలో ఉన్నది. అతడు మొదట గొర్రెల కాపరిగా ఉండేవాడట. గ్రీక్ దేవతల వరప్రసాదం వల్ల అతనికి కవిత్వం అలవడినదట. "అమరులైన దేవతల వంశానుక్రమాన్ని వర్ణించవలసిన" దని వారు ఆదేశించారట. వారి ఆజ్ఞ ననుసరించి తాను *థియోగనీ* అనే ఇతిహాస కావ్యం రచించినట్లు అతడు చెప్పుకొన్నాడు. ఆ కావ్యంలో అతడు వివిధ గ్రీక్ దేవతల ఆవిర్భావాన్ని గురించి, వారి నడుమ నెలకొన్న స్నేహ, వైషమ్యాలను గురించి, వారిలో వారికి సాగిన యుద్ధాలను గురించి సవిస్తరంగా వర్ణించాడు. అది అతని రచన కాదని ఒక వాదం పొడసూపింది

గాని, నేటి విద్వాంసులు అది అతని రచనే అని, అక్క డక్కడ ఇతరులు చేర్చిన అంశాలు కూడా ఉన్న వని విశ్వసిస్తున్నారు. రెండవ కావ్యం *వర్క్స్ అండ్ డేస్* లో వ్యక్తిగత విషయం కొంత ఉంది. మొదటి భాగంలో తన ఆస్తి దోచుకోగోరుతున్న పెర్సెస్ అనే సోదరుని ఉద్దేశించి హితబోధ ఉంది. నీతిగా కష్టపడి పనిచేసి జీవనం సాగించడంలో ఉండే శ్రేయస్సును గురించిన ప్రస్తావన ఉంది. రెండవ భాగంలో సంవత్సరంలో ఏ కాలం ఏ పనికి అనుకూలమో, ఆ కృషి ఏ విధంగా చేయాలో వివరంగా వర్ణించాడు. గ్రామీణ జీవనంలో ఋతువుల ప్రాముఖ్యాన్ని సొగసుగా చిత్రించాడు. చివరకు పల్లె ప్రజల విశ్వాసాలు, ఏ యే రోజులు వ్యవసాయంలో ఏ యే పనులకు అనుకూలం అన్న అంశంపై సూచనలు ఉన్నాయి. మొత్తానికి మానవ జీవితాన్ని గురించి హోమర్ తన ఇతిహాస కావ్యాలలో వ్యక్తం చేసిన ఆశాపూర్ణ దృక్పథానికి హెసియడ్ భావన భిన్నంగా ఉంది. మానవ సమాజంలోని లోటు పాట్లను అతడు సహజంగా వర్ణించాడు.

అ.రా.కృ.

**హేడన్‌స్టామ్, వెర్నెర్ ఫాన్ (1859-1940) :** 1916 లో సాహిత్యంలో నోబెల్ బహుమతిని అందుకున్న హేడన్ స్టామ్ స్వీడెన్ లోని నేచురలిస్ట్ (ప్రకృతివాద) ఉద్యమాన్ని ప్రతిఘటిస్తూ విప్లవం లేవదీసిన రచయిత. రచన అందంగా, ఆలోచింపచేసేదిగా, ఊహాలోకంలో విహరింప చేసేదిగా ఉండాలని ఒక వాదనను లేవనెత్తాడు.

యౌవనంలోనే అనారోగ్యం పట్టి పీడించడం వలన చాలా ఏళ్లు మెడిటరేనియన్ దేశాలలో కాలం గడిపాడు. హేడన్‌స్టామ్ *పిల్గ్రిమేజ్ అండ్ వాండరర్ యియర్స్* (1888) లో మొదటి కవితా సంకలనం ప్రచురింపబడింది. ప్రాచ్య దేశపు సిద్ధాంతాలను చాటి చెప్పే ఈ కవితలను స్వీడెన్ దేశ ప్రజలు ఎంతగానో ఆదరించారు. 1889 లో నేచురలిజమ్‌ను ఖండిస్తూ వ్రాసిన వ్యాసం ప్రచురింపబడింది.

స్వీడెన్ సాహితీ చరిత్రలో ఒక మార్పు తేవాలని కృషి చేస్తూ ఈయన ప్రచురించిన రెండు సంకలనాలు *డిక్టర్* (1895), *న్యాడిక్టర్* (1915) అనే చరిత్రాత్మక వ్యాసాలు విశేష ప్రశస్తి పొందాయి. హేడన్‌స్టామ్ వ్రాసిన వ్యాస సంపుటాలలో ముఖ్యమైనవి *కాణలి నెర్మా* (1897-98) *ది ట్రూ ఆఫ్ ది ఫోకుంగ్స్* (1925). ఆ తరువాత జనాదరణ తగ్గిపోయి, 25 సంవత్సరాలు ఏ రచనలూ చేయకుండానే హేడన్‌స్టామ్ తనువు చాలించాడు.

భార్గవి

**హేవుడ్, జాన్ (1497-1575) :** 16 వ శతాబ్దికి చెందిన ఆంగ్ల నాటక రచయిత. మతపరమైన విషయాలనే నాటకాలుగా వేసే సంప్రదాయం నుండి సాహిత్యాన్ని బయటికి తెచ్చి సామాన్య మానవుని జీవితానికి దగ్గరగా తెచ్చి, నాటకాలు వ్రాసిన హేవుడ్ ఎలిజెబెతన్ కామెడీలను ప్రచారం చేశాడు.

1519 లో 8 వ హెన్రీ ఆస్థానంలో గాయకుడుగా పేరు తెచ్చుకొన్న హేవుడ్ నాటక రంగంలో చాలా కృషి చేశారు. ఆర్థిక సహాయం, రాజాశ్రయం ఈ రచయితకు నాల్గవ ఎడ్వర్డు కాలం వరకూ లభించింది. *ది ప్లే కాల్డ్ ఫోర్ పీస్* అన్న నాటకం 1544 వరకూ పుస్తకరూపంలో రాలేదు. అత్యుత్తమమైన అబద్దం ఎవరు చెప్పగల రన్న విషయాన్ని హాస్య ప్రధానంగా చిత్రించిన నాటక మిది. అప్పట్లో అనామకంగా ప్రచురించబడిన కొన్ని నాటికలు కూడ హేవుడ్ వ్రాసినవి అని చెబుతున్నారు. చర్చిలో ఏర్పడిన అంతఃకలహాల ప్రభావాలనుండి తప్పుకొని చివరి వరకూ రోమన్ కాథలిక్‌గానే ఉన్న ఈ రచయిత బెల్జియంలో మరణించాడు.

హేవుడ్ పేర ప్రచురించబడిన కొన్ని రచనలు: *ఏ మెర్రీ ప్లే బిట్వీన్ ది పార్ట్‌నర్, ది క్యూరేట్స్ అండ్ నేబర్ ప్రేట్, ఏ మెర్రీ ప్లే బిట్వీన్ జోహాన్-జోహాన్ ది హజ్‌బెండ్, టిబ్ హిజ్ వైఫ్ అండ్ సర్ జాన్ ది ప్రీస్ట్, ఏ డైలాగ్ కంబెయినింగ్ ఆల్ ది ప్రావర్బ్స్ ఇన్ ది ఇంగ్లీష్ టంగ్* (1549), *జాన్ హేవుడ్స్ వర్క్స్* (1562), *ఎపిగ్రామ్స్* (సూక్తులు), జానపద గేయాలు కూడా ఈ సంపుటిలో ఉన్నాయి.

భార్గవి

**హైన్, హెన్రీక్ (1797-1856) :** ప్రపంచ విఖ్యాతి పొందిన జర్మన్ కవి. 1827 లో ఇతడు వ్రాసిన కవితా సంకలనం *ది బుక్ ఆఫ్ సాంగ్స్* వలన ఇతడు ప్రసిద్ధిలోకి వచ్చాడు. దీనిలోని కవితలు సంగీతం కూర్చి పాటలుగా పాడుకోడానికి అనువుగా ఉన్నాయి.

యూదు తల్లితండ్రులకు జన్మించిన హైన్ చదవులో ఎప్పుడూ పెద్దగా ఆసక్తి చూపించలేదు. మేనమామ ప్రోద్బలంతో తండ్రి వ్యాపారాన్ని అభివృద్ధి చేయాలని చూశాడు. కాని నిలుకడలేక ఆ పనిలో విఫలుడయాడు. తల్లి ప్రోత్సాహంతో బోన్, బెర్లిన్ యూనివర్శిటీలలో

చేరి న్యాయశాస్త్రంలో పట్టా పొందాడు. సంగీతం, సాహిత్యం చరిత్రలలో ఇతనికి ఆసక్తి ఉండేది.

విద్యార్థి దశలో మేనమామ 'సాలమన్ హైన్' కుమార్తెలపై మోజు పెంచుకొని భావ కవుల ధోరణిలో వ్రాసిన పాటలు *ది బుక్ ఆఫ్ సాంగ్స్*. అప్పటికే జర్మన్ సాహిత్య చరిత్రలో గొయ్‌థే, స్కిల్లర్ వంటి కవులు కాల్పనిక్కోత్తర క్లిష్ట పరిస్థితిని తెచ్చిపెట్టారు. వాస్తవికతకు, కళకు మధ్య ఏర్పడే ఘర్షణలో నుంచే కవిత్వం పుడుతుంది అన్నది హైన్ వాదన.



1820 నుంచి ఇతడు గద్య రచనలు కూడా చేయడం ప్రారంభించాడు. హార్జ్‌కొండల ప్రాంతంలో కాలినడకను ఒంటరిగా తిరిగి అక్కడి తన అనుభవాలకు భావుకతను జోడించి *ది హార్జ్‌జర్నీ* అనే పుస్తకం వ్రాశాడు. *ఐడియాస్, ది బుక్ లి గ్రాండ్* అనేది ఆత్మపరిశీలన చేసుకొంటూ తనను తనే మథించుకొంటూ వ్రాసిన కృతి. ఈ రచనలో హైన్ బాల్య స్మృతులు, భగ్న ప్రేమ, నెపోలియన్ పట్ల అతనికి గల ఆరాధనాభావం అన్నీ చోటుచేసుకొన్నాయి.

1830 లో ప్రబలిన ఫ్రెంచ్ విప్లవంలో హెన్రీక్ హైన్ పాల్గొన దలచుకోలేదు. కాని మరుసటి సంవత్సరం పారిస్‌కు వెళ్లి అక్కడే స్థిరపడిపోవలసిన పరిస్థితి ఏర్పడింది. అక్కడి సామాజిక, సాంస్కృతిక పరిస్థితులను విమర్శిస్తూ ఫ్రెంచ్ పత్రికలలో వ్రాసిన వ్యాసాలు *లు టేజియా* అనే పేరుతో ప్రచురించబడ్డాయి. జర్మన్ దేశపు ప్రసిద్ధ ఆర్థిక శాస్త్రవేత్త కార్ల్‌మార్క్స్‌తో 1843 వ సంవత్సరంలో ఇతనికి పరిచయం కలిగింది. అతని పట్ల గౌరవం కలిగినా, కమ్యూనిజం హెన్రీక్ హైన్‌ని ఎక్కువగా ఆకర్షించలేదు. *న్యూ పొయెమ్స్* (1844), *జర్మనీ, ఏ వింటర్స్ టేల్* (1844) అప్పట్లో ప్రచురించబడిన రచనలు. పారిస్‌కు వెళ్ళిన క్రొత్తలో హైన్ చాలా సంతోషంగా ఉన్నాడు. సాహితీ మిత్రుల పరిచయం, పేరు ప్రఖ్యాతులు అన్నీ అతనిని వెతుక్కొంటూ వచ్చాయి. ఇదివరకు పరిచయం ఉన్నా ఎక్కువగా చదువుకోని 'మిథిల్డే' అన్న అమ్మాయిని అతడు పెళ్లి చేసుకొన్నాడు. కాని కొన్ని రోజులకే జర్మన్ దేశాన్ని విమర్శిస్తూ వ్రాసిన హైన్ రచనలు అతనికి అనుకోని సమస్యలు తెచ్చిపెట్టాయి. ఇతని రచనలను నిషేధించారు. పోలీసుల నుండి తప్పించుకొని ఎక్కడెక్కడో తలదాచుకొన్నాడు. ఆరోగ్యం బాగా క్షీణించింది. సుఖరోగాలతో మంచం పట్టి, 1856 లో మరణించాడు. 'కవితలు- 1853-54' హైన్ చివరి రచన.

జర్మన్ దేశంలో కంటె ఫ్రాన్స్, ఇంగ్లండ్, అమెరికా దేశాలలో రచయితగా ఎక్కువ గుర్తింపు పొందిన హెన్రీక్ హైన్ అతని జీవితకాలంలో వివాదాస్పదమైన రచయిత. ఇతని రచనలు ఎంతమందికి ఆహ్లాదం కలిగించేవో దానికి రెట్టింపు ప్రజలకు ఆగ్రహం కూడా కలిగించేవి.

భార్గవి

**హొరేస్ (క్రీ.పూ.65-8) :** అగస్టస్ కాలానికి చెందిన ప్రముఖ లాటిన్ కవి. ఇతని *ఓడ్స్* (Odes) 'ఇపిసిల్స్' (Episltes) అన్ని ప్రపంచ భాషల్లోకి వేలాది సార్లు అనువదించబడ్డాయి. ఈ కవితలలో ప్రేమ, స్నేహం, జీవిత తత్త్వాలు, లలిత కళలు అన్నీ చోటు చేసుకొన్నాయి. ఇతని తండ్రి సెబేలియన్-కొండ జాతికి చెందినవాడై ఉండవచ్చునని చరిత్రకారులు భావిస్తున్నారు. కొన్ని రోజులు బానిసగా ఉన్న తరువాత బానిసత్వపు సంకెళ్ళు తెంచుకొని కొడుకు హొరేస్‌ను రోమ్ నగరానికి పంపి విద్యా వంతుణ్ణి చేశాడు. క్రీ.పూ. 46 లో ఏథెన్సు నగరానికి వెళ్ళి హొరేస్ అక్కడి అకాడెమీలో ఉపన్యాసాలు విన్నాడు. జూలియస్ సీసర్ మరణానంతరం, బ్రూటస్ సైన్యంలో చేరి 'ట్రిబునస్ మిలిటమ్' అనే అధికారాన్ని సంపాదించాడు. ఆక్టేవియన్ ప్రభువు కాలంలో ప్రఖ్యాత కవి మెసినాస్‌తో కలసి ఆస్థాన కవిగా గుర్తింపు పొందాడు.



క్రీ.పూ. 35 లో హొరేస్ వ్రాసిన *సెటైర్స్*-ప్రథమభాగం (పది వ్యంగ్య కవితలు) పుస్తక రూపంగా

వెలువడ్డాయి. మిత్రుడు 'మెసినాస్' బహుమతిగా ఇచ్చిన ఇల్లు పొలం హొరేస్‌కి ఆర్థిక సమస్య లేకుండా చేసింది. సెటైర్స్ (2వ భాగం) సంకలనాన్ని, *ఎపోడ్స్* (క్రీ.పూ. 30-29) లో ప్రచురించాడు. సున్నితమైన విషయాలను నిశితంగా పరిశీలించి, కళాత్మకంగా చేసిన హొరేస్ రచనలు ప్రపంచ సాహిత్య చరిత్రలో ఆదర్శ కవితలకు ప్రతీకగా నిలిచిపోయాయి. *ఆర్స్ పొయెటికా* అనే కృతిలో ఉత్సాహవంతులైన యువ కవులకు ముప్పై చిట్కాలు చెప్పాడు హొరేస్. క్రీ.పూ. 17-15 లో వ్రాసిన చివరి కృతి *ఎపిసల్స్ బుక్* (ప్రథమభాగం) ఆగస్టస్ చక్రవర్తికి అంకిత మిచ్చాడు. తను అంతవరకూ ఇంత గొప్ప కృతిని అంకితం అందుకోలేదని చక్రవర్తి హొరేస్‌కు వ్రాసిన ఉత్తరంలో పేర్కొన్నాడు. మెసినెస్‌తో బాటు ఆస్థానకవిగా గుర్తింపు పొందిన హొరేస్ క్రీ.పూ. 17 లో *సెక్యులర్ హిమ్* అనే గ్రంథాన్ని రచించాడు. దీనిలో సెక్యులర్ గేమ్స్ ఆడేటప్పుడు చేప ట్టవలసిన విధులు చెప్పబడ్డాయి. *15 ఓడ్స్* అన్న చివరి పుస్తకం ముగించి క్రీ.పూ. 8 లో మరణించిన హొరేస్‌ను అతని మిత్రుడు మెసినెస్ సమాధి పక్కనే సమాధి చేశారు.

పొట్టిగా లావుగా ఉన్న ఈ కవిని గురించి ఎక్కువ చారిత్రక ఆధారాలు లేవు. ఇతని రచనలు ఆధారంగా రచించిన జీవిత చరిత్రలు కొన్ని ప్రచారంలో ఉన్నాయి. గ్రీస్, రోమన్ దేశాలు పర్యటించి లాటిన్ భాషలో పాండిత్యం సంపాదించిన హొరేస్ తన 'ఓడ్స్' ద్వారా ఒక ప్రత్యేకమైన ఒరవడిని సాహిత్యంలో సృష్టించాడు. సులభమైన శైలిలో జీవిత సత్యాలను బోధించే ఈయన కవితలు విశేష ప్రశస్తి పొందాయి.

భార్గవి

**హోమర్ (క్రీ.పూ. 9వ, లేదా 8 వ శతాబ్ది):** ప్రాచీన గ్రీస్ దేశంలో వెలసిన ఇలియాడ్, ఒడెస్సీ అనే మహాపురాణాల గ్రంథకర్తగా పరిగణింపబడుతున్న మహాకవి.!

నిజానికి హోమర్ జీవితాన్ని గురించి స్పష్టంగా మనకు ఏమీ తెలియదు. అయితే ఆయన అయోని యాకు చెందినవాడై ఉండవచ్చు నని, క్రీ.పూ. 9 వ, లేదా 8 వ శతాబ్దిలో జీవించి ఉండవచ్చునని విద్వాం సులందరూ అంగీకరిస్తున్నారు. చాలా వరకు మౌఖిక సంప్రదాయంలో వస్తున్న కథలను అనుసరించి ఆయన *ఇలియడ్* పురాణం రచించాడు. కనీసం *ఒడిస్సీ* పురాణ రచనకు ఆయన ప్రేరణ అయినా ఉంది. ప్రాచీన గ్రీకులు హెలెనిస్టుల ఏకత్వానికి ఈ పురాణాలు ప్రతీక లని, వారి వీరత్వాన్ని, నైతిక, లౌకిక బోధనలను ఇవి చాటుతున్నా యని వీటిని ఎక్కువగా ఆదరించేవారు. ఆ నాటి నుంచి ఇలియడ్, ఒడిస్సీ పురాణాలు పాశ్చాత్య సాహిత్యం మీద ప్రగాఢ మైన ప్రభావం ప్రసరించాయి. ఆధునిక భాషలలో ఈ పురాణాలకు లెక్కలేనన్ని అను వాదాలు వెలశాయి. ముఖ్యంగా ఈ పురాణాలలోని కవిత్వమే వాటికి గొప్ప విలువను చేకూర్చింది. ఆ కవిత్వంలో దేవతలను, మహావీరులను వర్ణించే ఉదాత్త భాగాలు మొదలు ప్రగాఢమైన మానవ ఉద్వేగాలను ప్రదర్శించే భాగాల వరకూ మనకు కనిపిస్తాయి.

ఇలియడ్ పురాణం గ్రీస్‌కీ, ట్రాయ్‌కీ మధ్య సుదీర్ఘ కాలం కొనసాగిన యుద్ధాన్ని 23 భాగాలలో అభివర్ణించే మహాకావ్యం. ఈ కావ్యంలో నిజానికి ప్రధానమైన అంశం 'ఎకిలీస్' ఆగ్రహం.

*ఒడిస్సీ పురాణ* నాయకుడు 'ఒడిసియస్' ఈ 'ఒడిసియస్' ఇతాకా దేశపురాజు. ఆయన వివేకం, వాగ్ధాటి, ఉపాయజ్ఞత, ధైర్యం, సహనం ఈ పురాణంలో అద్భుతంగా వర్ణించబడ్డాయి.

బొ.శ్రీ.

**హోల్డర్లిన్, ఫ్రీడ్రిక్ (1770-1843) :** ప్రముఖ జర్మన్ భావకవి. గ్రీక్ పౌరాణిక పద్య రూపాలను జర్మన్ భాషలో సహజంగా సృష్టించడంలోనూ, క్రైస్తవ, పౌరాణిక ఇతివృత్తాలను సమ్మిళితం చేయడంలోనూ సిద్ధ హస్తుడు.

1770 మార్చి 20 న నెకార్ నదీ తీరాన ఉన్న ఒక చిన్న స్వాబియన్ నగరంలో హోల్డర్లిన్ జన్మించాడు. ఆయన తండ్రి 1772 లో మరణించగా, మరి రెండేళ్లకు ఆయన తల్లి న్యూర్టింజెన్ నగరంలోని 'బుర్గోమాస్టర్' (మేజిస్ట్రేట్) ను వివాహమాడింది. ఆ నగరంలోనే ఫ్రీడ్రిఖ్ హోల్డర్లిన్ విద్యాభ్యాసం ప్రారంభమయింది. కాని, 1779 లో ఆయన తల్లికి తిరిగి వైధవ్యం ఏర్పడడంతో హోల్డర్లిన్‌ను, అతని సోదరి హైన్రికేను, సవతిసోదరుడు కారల్‌ను ఆయన తల్లే పోషించవలసి వచ్చింది. కుమారుణ్ణి చర్చ్‌సేవలో చేరవలసిందని ఆమె కోరింది. అలా చేరితే అతనికి ఉచిత విద్యాభ్యాస సౌకర్యం లభిస్తుంది. మొదట అతనిని 'మొనాస్టరీ స్కూల్స్' కి తరువాత ట్యూబింజన్ విశ్వవిద్యాల యంలోని 'థియలాజికల్ సెమినరీ' (1788-93) కి విద్యాభ్యాసం నిమిత్తం పంపారు. అక్కడ అతడు ఎమ్.ఏ. పట్టం సాధించి మతదీక్షకు అర్హత పొందాడు.

అయితే హోల్డర్లిన్ తాను అర్హత పొందిన మతసేవలో చేరడానికి ఇష్టపడలేదు. విశ్వాసానికీ, హేతువాదానికీ మధ్య అసందర్భమైన రాజీని బోధించే ఆనాటి ప్రొటెస్టెంట్ భగవచ్ఛాస్త్రం (Theology) అతనికి ఆధ్యాత్మికమైన సుస్థిరతను చేకూర్చలేక పోయింది. గ్రీక్ మైథాలజీని పూర్తిగా విశ్వసిస్తూ గ్రీక్ దేవతలు వాస్తవిక జీవ శక్తులనీ, సూర్యునిలోనూ, భూమిమీదా, సముద్రంలోనూ, ఆకాశంలోనూ వారు మానవులకు ప్రత్యక్షంగా కనిపిస్తారని భావించే హోల్డర్లిన్ క్రైస్తవుల నమ్మకాలతో పూర్తిగా సరిపుచ్చుకోలేక పోయాడు. రెండు పడవల మీద కాళ్లువేసే లక్షణం హోల్డర్లిన్ జీవితంలో చివరి వరకూ నిలచి ఉంది. తాను ఒక 'లూథరన్ పాస్టర్' నని అతడు భావించుకోలేకపోయినా, మత సంబంధమైన వృత్తిలో అతనికి గాఢమైన అభినివేశం ఉంది. కవిగా జీవించడమే దేవతలకూ, మనుష్యులకూ మధ్య రాయబారిగా ఉండవలసిన మతబోధకుని కర్తవ్యం అని ఆయన విశ్వాసం.

1793 లో హోల్డర్లిన్‌కు ఫ్రెడరిఖ్ షిల్లర్‌తో పరిచయం ఏర్పడింది. షిల్లర్ సిఫార్సు మీదనే మొట్ట మొదటిసారి ఆయన ట్యూటర్‌గా నియమించబడ్డాడు. *న్యూయే తాలియా* (Neue Thalia) అనే తన పత్రికలో హోల్డర్లిన్ వ్రాస్తున్న పద్యాలనూ, హైపీరియన్ అనే ఆయన నవలలో కొంత భాగాన్నీ షిల్లర్ ప్రచురించాడు. గ్రీస్ విముక్తికోసం పోరాడిన ఒక యోధునికి కలిగిన కనువిప్పును గూర్చిన విషాదగాథ అయిన హైపీరియన్ నవల అసంపూర్ణంగానే ఉండి పోయింది. హోల్డర్లిన్‌కి, షిల్లరంటే చాలా గౌరవం. ఆయన తొలి పద్యాల మీద షిల్లర్ ప్రభావం స్పష్టంగా కనిపిస్తుంది. ఫ్రెంచ్ విప్లవం తొలి దశలో ఆశ కలిగించిన 'నూతన ప్రపంచాన్ని' వాటిలో చాలా పద్యాలు అభినందించాయి. వాటిలో కొన్ని స్వేచ్ఛనూ, మానవత్వాన్నీ, సామరస్యాన్నీ, మైత్రినీ, ప్రకృతినీ కీర్తించే గీతాలు కూడా ఉన్నాయి.

1795 డిసెంబర్‌లో దారిద్ర్యం కారణంగా హోల్డర్లిన్ ఫ్రాంక్‌ఫుర్ట్‌లోని ఒక ధనిక వడ్డీవ్యాపారి 'జె.ఎఫ్ గోంటార్ట్' ఇంటిలో ఒక చిన్న ఉద్యోగం చేయడానికి ఒడబడవలసి వచ్చింది. అక్కడ రూపవతీ, వివేకవతీ అయిన యజమాని భార్య ప్రేమ కలాపంలో పడ్డాడు. హోల్డర్లిన్ పద్యాలలోనూ, హైపీరియన్ అనే నవలలోని (ఈ నవల ద్వితీయ సంపుటం 1799 లో వెలువడింది) 'డియోటిమా' అనే పాత్రలోనూ కొంతవరకు 'సుసెట్టీ' మనకు కనిపిస్తుంది. కాని, ఆ ప్రేమకలాపం మూణ్ణాళ్ల ముచ్చటే అయింది. సుసెట్టీ భర్త కల్పించిన ఒక బాధాకరమైన సన్నివేశం వలన హోల్డర్లిన్ 1798 సెప్టెంబరులో ఫ్రాంక్‌ఫుర్ట్‌ను వదలవలసి వచ్చింది.

శారీరకంగానూ, మానసికంగానూ దెబ్బతిని పోయినా హోల్డర్లిన్ *హైపీరియన్* రెండవ సంపుటం పూర్తిచేసి *డెర్‌టాడ్ డెస్ ఎంపిడోక్లీస్* (The death of Empedocles) అనే విషాదాంత నాటకం కూడ వ్రాయడం మొదలుపెట్టాడు. అంతలో అతనిలో నరాల సంబంధమైన వ్యాధి లక్షణాలు కనిపించి అతని కుటుంబాన్ని, మిత్రులను కలవర పరిచాయి.

షిల్లర్ పలుకుబడితో 'ఏనా' (Aena) లో గ్రీక్ సాహిత్యంలో ఉపన్యాసక పదవికోసం ప్రయత్నించి విఫలుడై, తిరిగి ఫ్రాన్స్‌లోని బోర్డో (Bordeaux) లో ట్యూటర్‌గా చేరాడు. సుసెట్టీ గోంటార్ట్ 1802 లో మరణించింది. ఆ వేసవిలోనే హోల్డర్లిన్ బోర్డోలోని ఉద్యోగం వదలివేసి కాలినడకన న్యూర్టింజెన్ వచ్చాడు. అప్పటికే ఆయనలో ఉన్మాద లక్షణాలు కనిపించాయి. ముదిరిన ష్కిజో ఫ్రేనియా వ్యాధితో ఆయన బాధపడసాగాడు. ఇంటివద్ద జరిగిన ఉపచారాల వలన కొంచెం తేరుకున్నట్టు కనిపించాడు. 1802-06 మధ్య ఆయన వ్రాసిన పద్యాలలో ముఖ్యమైనవి: *ఫ్రీడెన్స్ ఫైయర్స్* (Celebration of peace), *డెర్ ఐన్ ట్సిగే* (The Only one), *ప్రాట్ మోస్.*

సోఫోక్లీస్ రచించిన *ఆంటిగొనే, ఈడిపస్ టిరనస్* లకు జర్మన్‌లో పద్యానువాదం కూడా హోల్డర్లిన్ పూర్తి చేశాడు. 1805 లో హోల్డర్లిన్‌కి తిరిగి ఉన్మాదం తిరగబెట్టడం, 36 ఏళ్లు ఆ ఉన్మాదంతోనే జీవించి 1843 జూన్ 7 న ట్యూబింజన్‌లో ఆయన మరణించడం జరిగింది.

మనోవైకల్యం ఏర్పడడానికి రెండేళ్ళ ముందు హోల్డర్లిన్ తన జీవిత పరమార్థాన్ని *డీ హైమట్* (Home) అనే పద్యం తుది నాలుగు పంక్తులలో ఈ క్రింది విధంగా పేర్కొన్నాడు.

*దివ్య వహ్నిని సమకూర్చు దేవతలె ప*
*విత్రమౌ శోకమును గూడ వెలయ జేయ*
*'భూమి' కనిన బిడ్డడ నేను పొడమినాడ*
*నవని ప్రేమింప, బాధల ననుభవింప!*

తన జీవితకాలంలో హోల్డర్లిన్‌కి కవిగా ఎలాంటి పేరు ప్రతిష్ఠలూ రాలేదు. తరువాత కూడా ఒక నూరేళ్ల పాటు లోకం అతనిని పూర్తిగా విస్మరించింది.

20 వ శతాబ్ది తొలి దశాబ్దాలలోనే ఆయనను జర్మన్ భాషలోని అత్యుత్తమ భావకవిగా గుర్తించడం, ఆయన కీర్తి యూరప్ అంతటా వ్యాపించడం జరిగింది. ఈ నాడు జర్మన్ కవులకు తలమానికంగా ఆయన పరిగణింప బడుతున్నాడు. ముఖ్యంగా శైలి విషయంలో ఆయనకు ముందుగాని, అటు తరువాత గాని ఆయనతో సాటి రాగల జర్మన్ కవి లేడని ఆయనను ప్రశంసిస్తున్నారు. పౌరాణిక గ్రీక్ పద్య రూపాలను జర్మన్ భాషలో సహజంగా పునస్సృష్టి చేసిన మహాకవి హోల్డర్లిన్!

బా.శ్రీ.

**హోల్ బెర్గ్, లుడ్విగ్ (1684-1754) :** స్కాండినేవియన్ సాహిత్య చరిత్రలోని 'వికాసయుగం' (Enlightenment period) నాటి మహోన్నత రచయితగా సువిఖ్యాతుడు. నార్వే, డెన్మార్క్ దేశాలు రెండూ తమ తమ సాహిత్యాల మూల పురుషునిగా హోల్ బెర్గ్‌ను పరిగణిస్తున్నాయి.

1684 డిసెంబరు 3 వ తేదీన నార్వేలోని బెర్గెన్‌లో జన్మించిన హోల్ బెర్గ్ చిన్నతనంలోనే తల్లిదండ్రులను కోల్పోయి, బెర్గెన్ నగరం 1702 లో అగ్నిప్రమాదంలో నాశనం అయేవరకూ అక్కడే తన బంధువుల ఇంటిలో ఉండి చదువుకుంటూ ఉండేవాడు. తరువాత అతనిని కోపెన్ హేగెన్ విశ్వవిద్యాలయానికి పంపించారు. అక్కడ పట్టభద్రుడయిన తరువాత లోకం చూడాలని 1704 లో హాలండు వెళ్లాడు. అక్కడ 'ఆఖెన్' నగరంలో అస్వస్థతకు గురై, తిరిగి రావడానికి డబ్బులేక కాలినడకను నార్వే చేరుకున్నాడు. కొంతకాలం ఫ్రెంచ్ ట్యూటర్‌గా పనిచేసి 1706 లో లండన్, ఆక్స్‌ఫర్డ్‌లకు వెళ్లాడు. అక్కడ ఫ్లూట్, వయొలిన్ వాద్య సంగీతంలో ట్యూషన్‌లు చెప్పి తనను తాను పోషించుకుంటూ, రెండేళ్ల పాటు విద్యాభ్యాసం చేశాడు. అక్కడ ఉన్న కాలంలో తన *ఇంట్రడక్షన్ టిల్ డి ఫార్నెంస్టే యూరోపీస్కె రిగర్స్ హిస్టోరీ* (ప్రముఖ యూరపియన్ జాతుల చరిత్ర - ఒక పరిచయం) అనే గ్రంథ రచన ప్రారంభించాడు. అతడు డెన్మార్క్ తిరిగి వచ్చిన తరువాత 1711 లో గాని ఆ గ్రంథం ప్రచురించబడ లేదు. అధ్యయనానికీ, దేశసంచారానికీ అతనికి అవకాశం కలిగించిన ఒక రాయల్ గ్రాంట్‌ను పొందడానికి ఆ గ్రంథం ప్రచురణ దారితీసింది.

ఆ గ్రాంట్‌తో హోల్ బెర్గ్ 1714 లో బయలుదేరి కాలినడకను యూరప్‌లోని ప్రధాన నగరా లనేకం సందర్శించి, 1716 లో తిరిగి డెన్మార్క్ చేరుకొన్నాడు. తరువాత 'ప్రాకృతిక న్యాయం - ప్రాకృతిక హక్కులు' అనే గ్రంథం ప్రచురించాడు. 1717 లో కోపెన్ హాగన్ విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్‌గా నియమించబడడంతో హోల్ బెర్గ్ ఆర్థిక సమస్యలు తీరిపోయాయి.

ఒక 'కవిత్వపు ఆవేశం' (Poetic fit) వంటిది వచ్చి 'హాన్స్ మిక్కెల్ సెన్' అనే కలంపేరుతో ఒక కొత్త తరహా హాస్య సాహిత్యాన్ని హోల్ బెర్గ్ సృష్టించడం మొదలు పెట్టాడు. 'హాస్య-గాంభీర్య' ప్రధానమైన *పీడర్ పార్స్* అనే మహాకావ్యం 1719 లో ప్రచురించబడింది. డేనిష్ భాషలో వెలువడిన తొలి మహాకావ్యం అదే! 1722 లో కోపెన్ హాగన్‌లో డేనిష్ భాషా నాటక రంగం ఆరంభం అయిన తరువాత హోల్ బెర్గ్ శర పరం పరగా అనేక కామెడీలు రచించాడు. ఇతడు 'మోలియర్ ఆఫ్ ది నార్త్' (ఉత్తర ప్రాంతపు మోలియర్) గా ప్రసిద్ధి చెందాడు. నిత్య నూతనాలు కావడం వల్ల నేటికీ అవి ప్రదర్శింపబడుతున్నాయి. ఆ కామెడీలలో చెప్పుకోదగినవి: *డెన్‌పొలిటిస్కె కాండె స్టోబెర్* (The Political Tinker), *జప్పెపాజ్బెర్గెట్* (Jeppe of the Hilld) మొదలైనవి. పాత్రల చిత్రణలో 'మైల్స్ గ్లోరియోసెస్' వంటి మోలియర్ పాత్రలను హోల్బెర్గ్ తన పాత్రలకు ఆధారంగా తీసికొన్నా ఆచారాలూ, అలవాట్లూ ఆ నాటి డేనిష్ ప్రజలవే! తన అవహేళనకు లక్ష్యాలు సమకాలీనంగానూ, విశ్వజనీనంగానూ కూడా ఉండేట్లు ఆయన చూశాడు. ఆయనకు ఇష్టమైన అట్టి లక్ష్యాలలో ఒకటి పండిత భిషక్కుల భాషా భేషజం. నిధులు లేక 1727 లో డేనిష్ భాషా నాటకరంగం మూతపడడానికి ముందు ప్రదర్శించబడిన ఆఖరు కామెడీ హోల్ బెర్గ్ రచించిన *ఫ్యూనరల్ ఆఫ్ డేనిష్ కామెడీ.* 1731 లో అంతవరకు ప్రదర్శించబడిన నాటకాలను, మరొక 5 క్రొత్తనాటకాలను కలిపి ఒక సంపుటంగా ప్రకటించి అంతటితో హోల్ బెర్గ్ తన నాటకరచనా వ్యాసంగానికి స్వస్తి చెప్పాడు.

అటుతరువాత ఆయన ఊహా నౌకాయాత్రలకు సంబంధించిన రచనలూ, మరికొన్ని ఇతర విధాల రచనలూ చేశాడు. అట్టి రచనలలో *నికొలాయ్ క్లిమిఇ టెరేనియమ్* (1741- The Journey of Niels Klim to the world under ground) వంటివి చెప్పుకోదగినది. 1747 లో ఆయన బారన్ హోల్ బెర్గ్ (హోల్ బెర్గ్ ప్రభువు) అయాడు.

వోల్టేర్ తరువాతఆ తరంలో చెప్పుకోదగిన యూరపియన్ రచయిత హోల్ బెర్గ్! 1754 జనవరి

28 న కోపెన్ హాగన్‌లో ఆయన తనువు చాలించాడు.

బొ.శ్రీ.

**హౌస్‌మన్, ఏ. ఈ. (1859-1936) :** ఆంగ్ల విద్వత్కవి. ఈయన భావగీతాలు కాల్పనిక నిరాశతో, సరళమైన, మధురమైన శైలితో పాఠకులను విశేషంగా అలరిస్తాయి.

ఆల్‌ఫ్రెడ్ ఎడ్వర్డ్ హౌస్‌మన్ 1859 మార్చి 26 న ఇంగ్లండ్‌లోని వార్సెస్టర్‌షైర్‌లో జన్మించాడు. ఈయన తండ్రి ఒక సొలిసిటర్ (లాయర్). ఆయన ఏడుగురి సంతానంలో ఈయన ఒకరు. తల్లిపట్ల ఈయనకు ఎక్కువ మక్కువ. తన 12 వ పుట్టినరోజు పండుగనాడు తల్లి చని పోవటం ఈయనకు పెద్ద మానసిక అఘాతమైంది. ఈయన కవితలలో వ్యక్తం అయే నిరాశా నిస్పృహలకు అది ఒక కారణంగా భావించబడుతూంది. దీనికి తోడు ఆక్స్‌ఫర్డ్‌లో విద్యార్థిగా ఉన్న కాలంలో స్వలింగ సంప ర్కానికి అలవాటు పడి, తన సాటి విద్యార్థులలో ఒక యువ క్రీడా కారుణ్ణి గాఢంగా ప్రేమించగా దానికి అతడు ప్రతిస్పందించలేదు. మానసికమైన సంక్షోభంతో ఎంత ప్రతిభావంతుడైన విద్యార్థి అయినా హౌస్‌మన్ ఆక్స్‌ఫర్డ్ ఫైనల్ పరీక్షలో కృతార్థుడు కాలేకపోయాడు.

1882 నుండి 1892 వరకు లండన్‌లోని ఒక పేటెంట్ ఆఫీసులో హౌస్‌మన్ ఒక గుమాస్తాగా పని చేశాడు. సాయంసమయాలలో బ్రిటిష్ మ్యూజియంలోని రీడింగ్ రూంకి వెళ్లి అక్కడ లాటిన్ గ్రంథాలు చదివి, వాటిలోని దోషాలను ఎత్తిచూపేవాడు. లాటిన్ భాషలో అఖండమైన పాండిత్యం ఉండడం వల్లా, కవి హృదయం గ్రహింపగలవాడు కావడం వల్లా ఆ ప్రజ్ఞ ఆయనకు అలవ డింది. ఆయన పత్రికలకు వ్రాసిన వ్యాసాలు విద్వాంసుల దృష్టిని ఆకర్షించి లండన్‌లోని యూనివర్సిటీ కళాశాలలో 1892 లో లాటిన్ ప్రొఫెసర్‌గా నియమింపబడటానికి దారితీసింది.

ప్రేమకు నోచుకోని ఏకాంత జీవితం గడుపుతూ హౌస్‌మన్ మనశ్శాంతికోసం తన నోట్ బుక్‌లు తిరు గవేస్తూ, వాటిలో ఏవేవో పద్యాలు వ్రాయడం మొదలు పెట్టాడు. అవే 1896 లో *ఏ షార్ప్‌షైర్ లాడ్* అనే సంపుటంగా వెలువడ్డాయి. పద్యాలు వ్రాయడానికి ఈయన హైన్రిఖ్ హైన్ పద్యాలనూ, షేక్స్‌పియర్ గీతాలనూ, స్కాట్‌లాండ్ సరిహద్దు ప్రాంతపు జానపద గీతాలనూ (Ballads) నమూనాలుగా గ్రహించాడు. అవి ఆయనకు తన ఉద్వేగాన్ని స్ఫుటంగానూ, అయినా కొంత దూరస్థంగానూ ప్రకటించడం అలవరచాయి. అందుకే ఆయన షార్ప్‌షైర్ లోని ఒక వ్యవసాయ కూలీ నోట ఆ పద్యాలు పలికించాడు. తన తొలి పద్యాలు రచించే నాటికి ఆయన ఆ షార్ప్ షైర్ దర్శించలేదు. *ఏ షార్ప్‌షైర్ లాడ్* అనే సంపుటానికి క్రమక్రమంగా ప్రజాదరణ లభిస్తూ ఉండగా, 1922 లో వెలువడిన *లాస్ట్ పొయెమ్స్* అనే సంపుటం అఖండ విజయం సాధించింది.

హౌస్‌మన్ తాను ప్రధానంగా లాటిన్ విద్వాంసుడ నని భావిస్తూ ఆనాటి సాహిత్య జగత్తుకు దూరంగా ఉండేవాడు. 1911 లో కేంబ్రిడ్జ్‌లో లాటిన్ ప్రొఫెసర్ అయి జీవితాంతం అక్కడే పనిచేశాడు. పరిశోధనలో ఆయన చేసిన గొప్ప కృషి 30 ఏళ్ల పాటు కొనసాగిన *మనీలియస్* (Manilius) కవితా నూతన ముద్రణ. *మనీలియస్* కవిత హౌస్‌మన్‌కు అంతగా రుచించక పోయినా ఆయన పరిష్కరణ ప్రతిభా ప్రదర్శనకు అది చక్కని అవకాశ మిచ్చింది.

*ది నేమ్ అండ్ నేచర్ ఆఫ్ పొయెట్రీ* (1933) అనే ఉపన్యాసంలో కవిత్వాన్ని గురించి హౌస్‌మన్ అభిప్రాయాలు స్పష్టంగా ప్రకటించబడ్డాయి. ఆయన సోదరుడు లారెన్స్ *మోర్ పొయెమ్స్* (1936) అనే సంపుటిని మరణానంతర ప్రచురణగా వెలువరించాడు. హౌస్‌మన్ లేఖలు 1971 లో వెలువడ్డాయి. హౌస్ మన్ జీవిత చరిత్రలలో ముఖ్యమైనవి: 'ఏ.ఎస్.ఎఫ్.గౌ' రచించిన *ఏ.ఈ.హౌస్‌మన్* (1936), రిచర్డ్ పెర్సివల్ గ్రేవ్స్ వ్రాసిన *ఏ.ఈ.హౌస్‌మన్ : దిస్కాలర్ పొయెట్* (1979).

1936 ఏప్రిల్ 30 న ఏ.ఈ.హౌస్‌మన్ కేంబ్రిడ్జ్ నగరంలో తనువు చాలించాడు.

బొ.శ్రీ.

**హ్యూగో, విక్టర్ (1802-1885) :** జగత్ ప్రసిద్ధుడైన ఫ్రెంచ్ కవి, నాటకకర్త, నవలా రచయిత. ఫ్రెంచ్ కాల్పనిక రచయితలలో ప్రముఖుడు. చివరి రోజులలో రాజనీతి వేత్త అయి బోనపార్టిజమ్, నియంతృత్వాలను ఖండిస్తూ రాజకీయ రచనలు చేశాడు. ఆయన జగత్ప్రసిద్ధమైన రచనలు *నోటర్ డామ్ డీ పారిస్* (1831-The hunch back of Notre Dame), *లె మిజరబుల్స్* (1862). నెపోలియన్ సైన్యంలో మొదట మేజర్‌గాను, తరువాత జనరల్‌గాను పనిచేసిన జోసెఫ్-లియోపాల్డ్- సిగిస్ బర్ట్ హ్యూగో మూడవ కుమారుడుగా విక్టర్ హ్యూగో 1802 ఫిబ్రవరి 26 న ఫ్రాన్సులోని బెసాన్‌కాన్‌లో జన్మించాడు.

రెండేళ్ల వయస్సులో తల్లితో కలసి పారిస్ వెళ్లి అక్కడ స్థిరపడ్డాడు. పారిస్ నగరాన్ని హ్యూగో తన 'ఆత్మ' కు జన్మస్థలం అని పేర్కొన్నాడు.

న్యాయశాస్త్రంలో మెట్రిక్యులేషనుకోసం చదువుతున్నా, 1816 నుంచే ఇతర విషయాలలో హ్యూగో ఆసక్తి చూపడం మొదలు పెట్టాడు. అప్పటికే ఆయన ఎన్నో నోట్‌బుక్‌లు పద్యాలతో నింపేవాడు. తరువాత వాటిని ఆయన 'నా జన్మకు ముందు వ్రాసిన అసందర్భపు రచనలు' అని పేర్కొన్నాడు. వాటిలో వర్జిల్ అనువాదం, రెండు ట్రాజెడీలు, ఒక రూపకం, కొన్ని ఎలిజీలు కూడా ఉన్నాయి. తల్లి ప్రోత్సాహంతోను, కళ్లు మిరుమిట్లు గొలిపే ఫ్రాన్స్వాయిస్ రెనే ద షాతోబ్రియాండ్ దృష్టాంతం తోను హ్యూగో *కన్సర్వేటియర్ లిటరరీ* (1819-21) అనే ఒక రివ్యూ ప్రారంభించాడు. ఆ పత్రికలో ఆయన ప్రచురించిన రచనలలో ముఖ్యమైనవి: *ఆల్ఫాన్సె ద లామర్టిన్, ఆంద్రే ద చెనీర్* కవులమీద ఆయన వ్రాసిన వ్యాసాలు.



1821 లో హ్యూగో తల్లి చనిపోయింది. ఆ మరుసటి ఏడాది అతడు తన బాల్య స్నేహితురాలు ఎడిలీ ఫౌచర్‌ని వివాహమాడాడు (ఆమెకు అతడు కొన్ని చక్కటి ప్రేమలేఖలు వ్రాశాడు). ఆ ఏడాదే అతడు తన తొలి కవితా సంపుటి *ఓడ్స్ ఎట్ పొయెసీస్ డైవర్సెస్* ప్రకటించాడు. దాని వలన 18 వ లూయీ నుంచి ఆయనకు పెన్షన్ లభించింది. ఒక ఏడాది అనంతరం ఆయన తొలి నవల *హాన్ ద ఐలాండ్* వెలువడింది.

1827 లో తన పద్యరూపకం *క్రామ్‌వెల్* వెలువడిన తరువాత గాని నిజానికి హ్యూగో వాస్తవమైన కాల్పనిక కవిగా గుర్తింపబడలేదు. ఆ రూపకం ప్రదర్శించడానికి వీలులేనంత సుదీర్ఘంగా ఉన్నా శక్తిమంతమైన పద్యాలు, మౌలికమైన భావాలు దానికి విశిష్టతను చేకూర్చాయి.

ఆదిలో నాటక కర్తగానే హ్యూగోకు పేరు వచ్చినా 1831 లో *ది హంచ్‌బేక్ ఆఫ్ ది నోటర్ డామ్* అనే చారిత్రక నవల వ్రాసిన తరువాతనే ఆయన కీర్తి సుప్రసిద్ధమైంది.

'జూలై మోనార్కి' రోజులలో హ్యూగో కవితా సంపుటాలు నాలుగు వెలువడ్డాయి. వీటిలో ఆయన ఆత్మీయత, రాజకీయ దర్శనం, తాత్త్విక దృక్పథం కళ్లకు కట్టినట్లు మనోహరంగా చిత్రించబడ్డాయి.

మూడు సార్లు విఫల ప్రయత్నాలు చేసిన తరువాత హ్యూగో 1841 లో 'ఎకాడమి ఫ్రాన్స్వాయిస్' కు ఎన్నుకోబడ్డాడు. 1845 లో 'చాంబర్స్ ఆఫ్ పీర్స్' సభ్యుడుగా నియమించబడ్డాడు. మూడు సుదీర్ఘ కావ్యాల అనంతరం హ్యూగో మళ్లీ వచన రచన వైపు తన దృష్టిని మళ్లించి అంతకు ముందు అసంపూర్తిగా వదలిపెట్టిన *ల మిజరబుల్స్* అనే రచనను పూర్తి చేశాడు. 1862 లో అది ప్రకటించబడగానే ఫ్రాన్స్‌లోని అన్ని వర్గాల పాఠకులు దానిని అభినందించారు. అది అనేక ఇతర భాషలలోకి అనువదింపబడి హ్యూగో కీర్తిని నలు దిశలా వ్యాపింపచేసింది. డిటెక్టివ్ కథలాంటి ప్లాటుతో కూడిన పారిస్ ప్రజల మహాపురాణం అది.

చివరి రోజుల (1870-85) లో హ్యూగో పారిస్ తిరిగి వచ్చి నేషనల్ అసెంబ్లీలో ఒక డిప్యూటీగా ప్రజాహిత కార్య క్రమాలలో పాల్గొనసాగాడు. కాని నెల రోజులకే దానికి రాజీనామా చేశాడు. 1863 లో ఆయన కూతురు ఒకామె ప్రియునితో అమెరికా లేచిపోయి, తొమ్మిదేళ్ల తరువాత ఉన్మాదస్థితిలో ఫ్రాన్స్‌కు తిరిగి వచ్చింది. 1868 లో ఆయన భార్య ఎడిలీ మరణించింది. 1871 లో ఒక కుమారుడు, 1873 లో మరొకడు మరణించారు. నిర్లిప్తతతో జీవిస్తూ 1870 లో ఆయన రచించిన *లా నిటెరిబుల్* అనే కావ్యం ఆయనను జాతీయ మహాపురుషునిగా చేసింది.

1878 లో ఆయనకు సెరిబ్రల్ పక్షవాతం వచ్చింది. తరువాత కొన్ని సంవత్సరాలు ఆయన "అవెన్యు డైలవ్" లో గడిపాడు. ఆయన 80 వ పుట్టిన రోజున ఆ అవెన్యు కు 'అవెన్యు విక్టర్ హ్యూగో' అని పేరు పెట్టారు.

1885 మే 22 న పారిస్ లో విక్టర్ హ్యూగో తనువు చాలించాడు.

హ్యూగో అసంఖ్యాకమైన రచనలు చేశాడు. ప్రతి ఉదయం ఆయన 100 పంక్తులు కవిత్వం, 20 పుటల వచనం వ్రాసేవాడని ప్రతీతి. ఆయన అనేక గౌరవాలను అందుకున్నాడు. ఫ్రాన్స్‌లోని ప్రతి పట్టణంలోను ఒక విక్టర్ హ్యూగో వీధి ఉంది. బా.శ్రీ.

**హ్యూడోబ్రో, విసెంటె గార్సియా (1893-1948):** చిలీ దేశపు కవి, "క్రియేషనిజమ్" అనే నూతన కవితోద్యమానికి నాయకుడు. చిలీలోని శాంటియాగోలో 1893 జనవరి 10 న జన్మించాడు. మొదటి ప్రపంచ యుద్ధం తరువాత పారిస్, మాడ్రిడ్ నగరాలలోనూ, చిలీ దేశంలోనూ విజృంభించిన నవ కవితా ధోరణుల వ్యాప్తిలో ముఖ్య పాత్ర వహించాడు. సమకాలిక యూరోపియన్ కవితలో, ముఖ్యంగా ఫ్రెంచ్ కవితలో జరుగుతున్న ప్రయోగాలను తన దేశస్థులకు పరిచయం చేయటానికి చాలా కృషి చేశాడు. అతడు గతంలోని కవితా సంప్రదాయాలను తిరస్కరిస్తూ 1914 లో *నాన్ సెర్వియమ్* అనే ఒక ప్రకటన ప్రతాన్ని (మేనిఫెస్టో) ప్రకటించాడు. చాలా కవితా సంపుటాలను ప్రకటించి ప్రసిద్ధుడైన తరువాత, 1916 లో పారిస్ వెళ్లాడు. అక్కడ అభ్యుదయ కవులతో కలసి రచనలు చేశాడు. అప్పుడే "క్రియేషనిజమ్" అనే సాహిత్యోద్యమం రూపొందింది. దాని రూపకల్పనలో అతడు ప్రముఖ పాత్రను నిర్వహించాడు. క్రమం లోపించిన మాటల కూర్పు, పొందిక లేని వస్తువులను జోడించటం వంటి అసంబద్ధ ప్రయోగాలతో కూడిన తన కవితా సిద్ధాంతాలను *ఆర్కెటిక్ పొయెమ్స్, చోజెన్ సీజన్స్* అనే కవితా సంపుటాలలో వ్యక్తం చేశాడు. 1918 లో హ్యూడోబ్రో అభ్యుదయ మార్గాను గామియైన కవిగా మాడ్రిడ్ నగరంలో సాహితీ పరుల మన్నన లందుకొని, క్రియేషనిజమ్ రూపాంతరమైన "ఆల్ట్రాయిజమ్" ఉద్యమ స్థాపనలో పాల్గొన్నాడు. తరచుగా యూరప్‌నుంచి చిలీ వెళుతూ, అక్కడ కవితా రంగంలో నూతన ప్రయోగాల వ్యాప్తికి కృషి చేశాడు. *శాటిర్* వంటి నవలలు కూడా రచించాడు. దక్షిణ అమెరికా ఖండ కవులపై అతని ప్రభావం గాఢంగా కనిపిస్తుంది. అతడు శాంటియాగోలో 1948 జనవరి 2 న మరణించాడు. 1981 లో అతని కవితా ఖండికలలో కొన్నింటికి ఇంగ్లీషు అనువాదాల సంకలనం వెలువడింది.

అ.రా.కృ.

**హ్యూస్ (జేమ్స్ మెర్సర్) లాంగ్‌స్టన్ (1902-1967) :** అమెరికాలోని నీగ్రో కవి. అమెరికన్ నీగ్రోల అనుభూతిని అనేకమైన అనువాదాల ద్వారా ప్రపంచానికి చాటిన రచయిత. హ్యూస్ పుట్టిన కొద్ది కాలానికే అతని తల్లిదండ్రులు విడిపోయారు. తల్లీ, ముత్తవ తల్లీ హ్యూస్‌ను పెంచి పెద్దను చేశారు. ముత్తవతల్లి మరణానంతరం హ్యూస్, అతని తల్లీ ఒక అరడజను నగరాలు తిరిగి, చివరికి క్లీవ్‌లాండ్‌లో స్థిరపడ్డారు. క్లీవ్‌లాండ్ హైస్కూల్‌లో పట్టభద్రుడయిన తరువాత ఆ వేసవిలో వ్రాసిన *ది నీగ్రోస్ స్పీక్స్ ఆఫ్ రివర్స్* అనే కావ్యం 1921 లో 'క్రైసిస్' లో ప్రచురించబడి, విశేష ప్రజాదరణ పొందింది.

కొలంబియా యూనివర్సిటీ (1912-22) లో విద్యాభ్యాసం కొనసాగించిన తరువాత 'గాఢాంధకార నగరం' (Great dark city) అని అతను పేరు పెట్టిన హార్లెమ్ (న్యూయార్కు సిటీలో నల్లవారు నివసించే ప్రాంతం) జీవితాన్ని హ్యూస్ గాఢంగా పరిశీలించాడు. ఆఫ్రికాకు పయనించే ఒక సరుకుల ఓడలో అతడు 'స్టీవార్డ్' గా పనిచేశాడు. ఆఫ్రికాకు, యూరప్ కు సముద్ర ప్రయాణాలు చేసి తిరిగి వచ్చిన తరువాత 1825 లో *ఆపర్చ్యునిటీ* అనే పత్రిక ఇచ్చే కవిత్వపు బహుమతి అందుకున్నాడు. 1926 లో 'అండర్ గ్రాడ్యుయేట్' లకు ఇచ్చే 'విట్టర్ బిన్నర్' (Witter Bynner) కవిత్వపు అవార్డు అతనిని వరించింది.

'వాషింగ్టన్' డి.సి. లోని ఒక హోటల్‌లో 'బస్ బోయ్' (వెయిటరుకు సహాయకుడు) గా పనిచేస్తూ ఒక రోజు డైనింగ్‌రూమ్‌లో 'వాచెల్ లిండ్‌సే' ప్లేట్ పక్కన తన మూడు పద్యాలు వ్రాసిన కాగితం పెట్టాడు. మరునాడు వార్తాపత్రికలలో దేశం అంతటా లిండ్‌సే గుర్తించిన నీగ్రో 'బస్ బోయ్' కవిని గురించిన వార్త వెలువడింది. పెన్సిల్‌వేనియాలోని లింకన్ యూనివర్సిటీ అతనికి స్కాలర్‌షిప్‌ను ప్రకటించింది. 1929 లో హ్యూస్ డిగ్రీ తీసికోడానికి ముందే అతని తొలి రెండు కవితా సంపుటాలూ వెలువడ్డాయి.

*ది వియరీ బ్లూస్* (1926) అనే కవితా సంపుటానికి మంచి ప్రజాదరణ లభించింది. అయితే *ఫైన్ క్లోద్స్ టు ది జ్యూ* (1927) దాని శీర్షిక విషయంలోనూ, నిర్మోగమాటపు ధోరణి విషయంలోను తీవ్ర విమర్శలకు గురిఅయింది. డిగ్రీ తీసికొన్న తరువాత కొద్ది నెలలకే వచ రచన వెలువడి ప్రజల ప్రశంసలు చూరగొన్నది. 1930-40 మధ్య హ్యూస్ కవిత రాజకీయ ఉగ్రవాదం (Political militancy) వైపు మొగ్గింది. సోవియట్ యూనియన్, హైటీ, జపాన్‌లలో ఆయన విరివిగా పర్యటించాడు. 1937 స్పానిష్ అంతర్యుద్ధంలో ఒక వార్తాపత్రికకు విలేఖకుడుగా పనిచేశాడు. హ్యూస్ రచించిన కథల సంపుటాలు: *ది వేస్ ఆఫ్ వైట్ ఫోక్స్* (1934), *ది బిగ్ సీ* (1940). ఆయన ఆత్మకథ 28 వ సంవత్సరం వరకు మాత్రమే సాగింది.

హ్యూస్ *ఏ పిక్టోరియల్ హిస్టరీ ఆఫ్ ది నీగ్రో ఇన్ అమెరికా* (1956) అనే గ్రంథాన్ని, ఆర్నాబోంటెంప్స్‌తో కలసి *ది పొయిట్రీ ఆఫ్ ది నీగ్రో* (1949) *ది బుక్ ఆఫ్ నీగ్రో ఫోక్లోర్* (1959) అనే సంకలనాలను ఎడిట్ చేశాడు. రంగస్థలం కోసం కూడా హ్యూస్ అనేక రచనలు చేశాడు. *ది ఫాంథర్ అండ్ ది లాష్* (1967) అనే కవితా సంపుటి ఆయన మరణానంతరం వెలువడింది. 1960-67 మధ్య నీగ్రోల ఆగ్రహం ఆ కవితలలో వ్యక్తం అయింది. 'ఫెడెరికో గార్షియా లోర్కా', 'గాబ్రిలా మిస్ట్రాల్' ల కవిత్వాన్ని హ్యూస్ అనువదించాడు. ఆయన సృష్టించిన 'జెస్సీ బి. సింపుల్' అనే హాస్య పాత్ర బాగా ప్రజాదరణ పొందింది.

1967 మే 22 న లాంగ్‌స్టన్ హ్యూస్ న్యూయార్క్ నగరంలో మరణించాడు.

బ్రా.శ్రీ.

**హ్యూస్‌మన్స్, జోరిస్ కార్ల్ (1848-1907) :** ప్రముఖ ఫ్రెంచ్ రచయిత. 19 వ శతాబ్దపు ఫ్రాన్సు దేశ సాహిత్య చరిత్ర కళాత్మకంగా, ఆధ్యాత్మికంగా ఎలా అభివృద్ధి చెందిందో దశలవారీగా పరిశీలించ దలచుకొన్న వారికి హైస్‌మన్స్ నవలలు తోడ్పడుతాయి. ఈ రచయిత నిజమైన పేరు 'చార్ల్స్ మేరీ జార్జ్ హైస్‌మన్'.

హ్యూస్‌మన్స్ తల్లి ఫ్రాన్సు దేశస్థురాలయినా, తండ్రి హాలండు దేశస్థుడు. ఒక్కడే కొడుకుగా పెరిగి, చదువుకొని 20 వ ఏటనే ఫ్రాన్స్ ప్రభుత్వంలో ఉద్యోగం సంపాదించుకొన్నాడు. అప్పటినుండి ఆఫీసు వేళలలోనే, ఆఫీసు కాగితాలపైనే రచనలు చేయటం మొదలు పెట్టాడు. రచనా వ్యాసంగం మొదలుపెట్టిన క్రొత్తలో సమకాలీన రచయితల ప్రభావం ఇతని మీద ఎక్కువగా ఉండేది. 1876 లో *మార్తే* అనే నవల, 1880 లో *పాన్ ఆన్ ది బాక్* అనే నవల ప్రచురించబడి రచయితగా హ్యూస్‌మన్స్‌ని సుప్రతిష్ఠితుని చేశాయి. ఫ్రాన్స్ జర్మనీ దేశాల మధ్య జరిగిన యుద్ధం యొక్క పరిణామాలను చిత్రిస్తూ వెలువడిన చిన్న కథల సంకలనం ఎమిలీ జోలా 'మేడన్' గ్రూపుతో కలసి ప్రచురించారు. కాని వీరి నుండి విడిపోయి 1881 లో *డీన్ స్ట్రీమ్* అన్న నవలను, *అగీన్‌స్ట్ ది గ్రీన్* (1882) అన్న నవలను హ్యూస్‌మన్స్ వరుసగా ప్రచురించాడు. వీటిలో శైలి, కథా సంవిధానం అప్పటి రచనలకు చాలా భిన్నంగా ఉండి విమర్శకుల దృష్టిని ఆకర్షించింది. *అగీన్‌స్ట్ ది గ్రీన్* నవలల్లో ఒక మామూలు గుమాస్తా తన శృంగార అనుభవాల్లో ఎలా విఫలం అయాడో ట్రాజిక్‌గా చిత్రించబడింది. కళాత్మకంగా మనిషి ఎంత దిగజారిపోయాడో చాలా హృద్యంగా వ్రాశాడు. 1891 లో *రాసిలా-బాస్* అనే వివాదాస్పదమైన రచన ఫ్రాన్స్ దేశంలోని చేతబడిని (అకల్ట్ సైన్స్) గురించి వ్రాయబడింది. 'గిల్స్ డిరేస్' అనే పైశాచిక ప్రవృత్తి గల ఒక నాయకుని ఎన్నుకొని సమాజంలో ఇటువంటి వ్యక్తులు సృష్టించే బీభత్సాన్ని చిత్రిస్తూ *ఎన్‌రూట్* మొదలైన మూడు నవలలు వెలువరించాడు. రోమన్ కాథలిక్‌ల సమస్యలను చిత్రిస్తూ 1898 లో *ది కెథడ్రిల్* అనే నవలను, 1903 లో *ది ఓబ్లాట్*ను వెలువరించాడు.

హ్యూస్‌మన్స్ రచనలలో ఆయన వ్యక్తిత్వం, జీవితపు ఛాయలు స్పష్టంగా కనబడుతాయి. ఆయన రచనలు వ్యక్తిగా ఆయనలోని ఆధ్యాత్మిక తృష్ణను తెలుపుతాయి. కేన్సర్ వ్యాధితో బాధపడి మరణించిన హ్యూస్‌మన్స్ జీవితంలో బాధను ఓర్పుతో భరించాలని తను నమ్మిన సత్యాన్ని నిరూపించాడు. రచనలనే కాక చిత్రరచనలను కూడా కళాత్మకంగా విమర్శించ గలిగిన ప్రతిభవలన హ్యూస్‌మన్స్‌కు చక్కటి గుర్తింపు లభించింది. రాబర్ట్ బాల్డిక్స్ (1955), జేమ్స్ లేవిర్ (1955) ఇతనిని గూర్చి గ్రంథాలు రచించారు.

భార్గవి

అనుబంధం-I :

**ఎలిటిస్, ఒడిస్సియస్ (1911--) :** 1979 లో సాహిత్యానికి నోబెల్ బహుమానం పొందిన గ్రీక్ కవి. *క్రీట్* లో



సబ్బుల వ్యాపారం చేసి సంపన్నమైన ఒక కుటుంబంలో ఇరాక్లియన్ లో నవంబరు 2 వ తేదీన ఎలిటిస్ జన్మించాడు. యువావస్థలోనే ఆయనకు తమ కుటుంబ వ్యాపారం నచ్చక, అలెపౌదెలిస్ అనే తమ ఇంటిపేరు ఆ వ్యాపారంతో ముడిపడి ఉండడం వల్ల దానిని పరిహరించి తాను చేసే సాహిత్య వ్యాసంగానికి అనుకూలమైన ఉపనామం ధరించి తన కుటుంబానికి దూరం అయాడు.

ఏథెన్స్ విశ్వవిద్యాలయంలో ఎలిటిస్ న్యాయశాస్త్రాన్ని అభ్యసించాడు. ఆ కాలంలో అప్పుడప్పుడు ఆయన తమ కుటుంబ వ్యాపారంలో పనిచేస్తూ ఉండేవాడు. తరువాత 'ఫ్రెంచి సర్రియలిజమ్' వల్ల ఆకర్షితుడై పాల్ ఎల్యువార్డ్ అనే కవి వల్ల ప్రభావితుడై, 1930-40 మధ్య తను రచనలన్నీ *నియా గ్రమటా* అనే పత్రికలో ప్రచురించాడు. '1930 యువతరానికి' ఆనాడు చాలా ప్రభావం ఉండేది. మొట్టమొదటి గ్రీక్ నోబెల్ బహుమాన గ్రహీత జియోర్గొస్ సెఫెరిస్ కూడా దీనిలో సభ్యుడే! ఎలిటిస్ ప్రారంభదశలోని కవిత్వం ఆయన వ్యక్తిత్వాన్ని సర్రియలిజమ్ నేపథ్యంలో ప్రతిబింబించింది. ఆనాటి ఆయన కవిత్వానికి ప్రతినిధిగా 1940 లో ఆయన ప్రచురించిన *ప్రొసనటోలిస్మోయ్* అనే కవితా సంకలనాన్ని (Orientations) గ్రహించవచ్చును.

నాజీ జర్మనీ 1941 లో గ్రీస్‌ను ఆక్రమించినప్పుడు, ఫాసిస్ట్ శక్తులను ప్రతిఘటించి పోరాడే సముదాయంలో ఆల్బేనియా లో ఇటలీ దురాక్రమణను ఎలిటిస్ ఎదుర్కొన్నాడు. గ్రీక్ యువతకు ప్రతినిధి కవిగా పేరు పొందాడు. ఆయన వ్రాసిన *అస్మ హిరో యక్కోకై పెన్థిమేగియా టోన్ ఖమెనో అంథై పోలో ఛగో టేస్ ఆల్బేనియా* (Heroic and Elegiac Song for the Lost Second Lieutenant of the Albanian Campaign) అనే గేయం ప్రతిఘటన శక్తుల జాతీయ గీతంగా ప్రసిద్ధి పొందింది. యుద్ధం ముగిసిన తరువాత 15 సంవత్సరాలపాటు సాహిత్య పరంగా ఎలిటిస్ గొంతు మూగవోయింది. 1959 లో *టో ఆక్సియన్ ఎస్తి* (The Axion Esti-1974) అనే బృహత్కావ్యం వెలువరించి అతడు తన మౌన వ్రతాన్ని త్యజించాడు. ఇది, విట్‌మన్ వ్రాసిన *సాంగ్ ఆఫ్ మై సెల్ఫ్* ను జ్ఞాపకం చేస్తుంది.

1967 లో గ్రీసులో సైనిక రాజ్యం ఏర్పడడంతో ఎలిటిస్ పారిస్ వచ్చి స్థిరపడ్డాడు. దీని తరువాత వచ్చిన రచనలలో *హో హెలియోస్ హో హెలియటొరస్* (1971; The Sovereign Sun, 1974), *టా ఎటెరోథలే* (1974; The step children) ప్రధానమైనవి.

కా.వీ.

**కనెట్టి, ఎలియస్ (1905 --) :** బల్గేరియాలో జన్మించిన జర్మన్ నవలా రచయిత, నాటక కర్త. బల్గేరియా లోని రస్ట్‌షుక్ లో 1905 జూలై 25 వ తేదీన ఒక స్పానిష్ సెఫార్డిక్ యూదు జాతి కుటుంబంలో ఎలియస్ కనెట్టి జన్మించాడు. ఆయనకు మూడు భాషలతో ప్రత్యక్ష సంబంధం ఉంది. అవి:



స్పానిష్, ఇంగ్లీష్, జర్మన్ భాషలు. వీటిలో తృతీయ భాష అయిన జర్మన్ భాషనే తన సాహిత్య భాషగా ఆయన ఎన్నుకొన్నాడు. ఆయన తల్లిదండ్రులు ఇంగ్లండులో నివసిస్తూ ఉన్నప్పుడు ఇంగ్లీషు ఆయనకు పట్టుబడింది. తండ్రి 1913 లో మరణించడంతో, తన తల్లితో కలిసి ఆయన వియన్నా నగరానికి వచ్చాడు. ఆయన విద్యాభ్యాసం జ్యూరిచ్, ఫ్రాంక్‌ఫర్ట్, వియన్నా నగరాలలో జరిగింది. వియన్నా

విశ్వవిద్యాలయం నుండి 1929 లో రసాయనశాస్త్రంలో ఆయన డాక్టరేటు డిగ్రీని తీసుకొన్నాడు.

చదివిన చదువు రసాయన శాస్త్ర సంబంధి అయినా, అభిరుచి సాహిత్య సంబంధి గనుక తన హృదయ గతాభిప్రాయాలను వ్యక్తం చేయడానికి సాహిత్యాన్ని మాధ్యమంగా ఆయన ఎన్నుకొన్నాడు. వివిధ నగరాల లోని జీవిత విధానాలను ప్రత్యక్షంగా గమనించిన వ్యక్తి గనుక ఆయన రచనలకు మానవ సముదాయాల మానసికోద్రేకాలు, వాటి మధ్య జీవించ వలసి వచ్చిన వ్యక్తుల సమస్యలు, కష్టనష్టాలు ఇతివృత్తాలు అయాయి. సమాజంతో రాజీపడలేని వ్యక్తుల జీవితాలను కనెట్టి రచనలు ప్రతిబింబిస్తాయి. ఈ వైశిష్ట్యాన్ని పురస్కరించుకొనే 1981 లో కనెట్టికి సాహిత్యంలో నోబెల్ బహుమానం లభించింది.

ద్రవ్యోల్బణం మీది కోపంతో 1920 లో ఫ్రాంక్‌ఫర్ట్ నగరంలోని ప్రజావాహిని పెల్లుబికి వీథులలో కొట్లాటలకు, ఘర్షణలకు దారితీయడం కళ్లారా చూచిన కనెట్టికి, వాటివెనుక నున్న మానసిక పరిస్థితులను అవగాహన చేసుకోవాలనే సంకల్పం కలిగింది. ఇగాగే, 1927 లో అల్లరి గుంపులు కోపోద్రేకంతో వియన్నాలోని న్యాయ సౌధాన్ని అగ్నికి ఆహుతి చేయడంతో ఆ సంకల్పం బలపడి స్థిర రూపాన్ని పొంది ఆయన దృక్పథాన్ని గాఢంగా ప్రభావితం చేసింది. ఆయనకు కలిగిన ఈ ప్రజోన్మాద ప్రత్యక్షానుభవ ప్రతిరూపమే *డి బ్లెన్డుంగ్* (1935; *ఆటోడఫే*, 1946; అమెరికాలో ప్రచురణ: Tower of Babel, 1947; ఆటోడఫే అనే పేరుతో అమెరికాలో పునర్ముద్రణ, 1964) అనే రచన. విద్వాంసుని జీవితం ఒక నగరంలోని దుష్ట శక్తుల చేతులలో ఎలా నాశనమయిందో ఇది వివరిస్తుంది. ద్వితీయ ప్రపంచ సంగ్రామానికి కొంచెం ముందు కనెట్టి ఇంగ్లండుకు వలసపోయి, సాహిత్య వ్యాసంగం కట్టిపెట్టి మనుష్యులలో వారి అధికార దాహానికి వెనుక నక్కిఉన్న దుర్బల మానసిక పరిస్థితుల పరిశీలన, పరిశోధనలకు తన కాలాన్ని వినియోగించాడు. *మాస్ ఉన్డ్ మాఖ్ట్* (1960; Crowds and Power, 1962) అనేది ఆయన చేసిన పరిశోధనల ఫలితంగా వెలువడిన రచన. ఆయన వ్రాసిన *హోక్‌జైట్* (1932; The Wedding), *కమొడి డెర్ ఐ టెల్‌కీట్* (1950; Comedy of Vanity), *డీ బెఫిస్టెటెన్* (1964; The Numbered) అనే మూడు రూపకాల ఇతివృత్తాల మీదను ఈ ప్రభావం కనబడు తుంది. మొదటి రెండు రూపకాలు 1965 లో పశ్చిమ జర్మనీలో *బ్రౌన్ ష్వైగ్* లో ప్రదర్శితా లయాయి. మూడోది 1956 ఆక్స్‌ఫర్డ్‌లో ప్రదర్శితమైంది. ఇవి 1964 లో *డ్రామెన్* అనే పేరుతో ప్రచురణ పొందాయి. తన నోటుపుస్తకాల నుండి *ఔఫ్‌జైక్ నుంగెన్* 1942-1972 (1978); *డెర్‌ఓహ్-రెన్‌జూగ్-ఫున్ఫ్‌జిగ్ కర్టెక్టేర్* (1974; Ear Witness: Fifty Characters, 1979) అనే రూపకాలను; *డీ గెరెటేట్ జుంగే* (1977; The Tongue set fire 1979); *డీ ఫకెల్ ఇమ్‌హోర్* (1980, The Torch in the Ear) అనే ఆత్మకథాత్మకమైన సంపుటాలను కనెట్టి వెలువరించాడు.

కా.వీ.

## గోల్డింగ్, విలియమ్ (గెరాల్డ్) (1911- -)

: ప్రముఖ ఆంగ్ల నవలా రచయిత. 1983 లో సాహిత్యానికి నోబెల్ బహుమానం అందుకున్నాడు. ఇంగ్లండులోని సెయింట్ కొలంబ్ మైనర్ (న్యూక్వే దగ్గిర, కార్న్‌వాల్) లో 1911 సెప్టెంబరు 19 న గోల్డింగ్ జన్మించాడు. ఈయన



విద్యాభ్యాసం మార్ల్‌బరో గ్రామర్ స్కూలులోను, ఆక్స్‌ఫర్డ్ బ్రేసనోస్ కళాశాలలోను జరిగింది. 1935 లో ఈయన పట్టభద్రుడై, సాలిస్‌బరీలో ఉన్న బిషప్ వర్డ్స్‌వర్త్ స్కూలులో కొంతకాలం అధ్యాపకుడుగా పని చేశాడు. 1940 లో రాయల్ నౌకాదళంలో చేరి, జర్మన్ యుద్ధనౌక బిస్మార్క్‌ను ముంచి వేసిన నౌకాయుద్ధంలో పాల్గొన్నాడు. 1944 లో ఫ్రాన్స్‌పై జరిగిన దండ యాత్రలో రాకెట్ ప్రయోగించే ఒక నౌకకు కమాండరుగా వ్యవహరించాడు. యుద్ధం ముగిసిన తరువాత తిరిగి అధ్యాపకత్వం చేబట్టి 1960 వరకూ ఆ వృత్తిలో కొనసాగాడు.

మానవ జీవితంలోని విలక్షణ సంఘటనలను ఇతివృత్తాలుగా స్వీకరించి ఈయన రచనలు చేశాడు. ద్వితీయ ప్రపంచ సంగ్రామం తరువాత బయలుదేరిన యువతరాన్ని ఈయన రచనలు విశేషంగా ఆకర్షించాయి. ఈయనను ఆదర్శంగా తీసుకొన్న యువతరం ఈయనకు అనుయాయులు అయారు.

గోల్డింగ్ ప్రచురించిన మొదటి నవల *లార్డ్ ఆఫ్ ది ఫ్లైస్* (1954; ఇది చలనచిత్రంగా 1963 లో వచ్చింది). ఒక కోరల్ ద్వీపం మీద చిక్కుకొని పోయి, విధిలేక ఏకాంత వాసం చేయవలసి వచ్చిన కొందరు పిల్లల కథ ఇది. ఈ ఏకాంతవాసం వల్ల వారిలో నిద్రాణంగా ఉన్న పాశవిక ప్రవృత్తు లన్నీ బహిర్గతమై, వారిలో పారస్పరిక క్రౌర్యానికి దారితీస్తాయి. సభ్య ప్రపంచంలోని సామాజిక నియమాలు, విలువలు అన్నీ సడలిపోయి నశిస్తాయి. ఈ పరిస్థితులనన్నింటిని గొప్ప భావనా పటిమతో గోల్డింగ్ వర్ణించాడు. విలక్షణ పరిస్థితులలో మనుష్యులు ఎంతగా దిగజారిపోతారో కళ్లకు కట్టేటట్లు చిత్రించాడు. ఈ చిత్రణ పాఠకులను విశేషంగా ఆకర్షిస్తుంది. *ది ఇన్హెరిటర్స్* (1955) అనే నవల 'నియాండర్తల్' మనుష్యుని (ప్రాక్తన మానవుని) చివరి దినాల జీవితాన్ని ఇతివృత్తంగా తీసుకొని వ్రాసినది. మానవ ప్రవృత్తిలో సహజంగా అంతర్గతంగా ఉన్న ఈర్ష్యాద్వేషాదులు, హింస మొదలైన వాటిని ఈ నవలలో గోల్డింగ్ అత్యద్భుతంగా చిత్రించాడు. *పించర్ మార్టిన్* అనే నవల (1956) లో ఒక టార్పెడో తాకిడికి గురియై మునిగిపోతూ ఉన్న ఓడలోని ఒక ఆఫీసరు పాపపంకిలమైన తన జీవితాన్ని సింహావలోకనం చేసుకొని, ఆ స్మృతిలో నిశ్చేష్టుడై, బాధాకరమైన చావుకోసం ఎదురుచూస్తూ ఉండడం ఇతివృత్తం. *ఫ్రీ ఫాల్* (1959), *ది స్పైర్* (1964) అనే నవలలలో కూడా మానవుడు దుర్మార్గుడు అని విశ్వసించే గోల్డింగ్ "తేనెటీగ తేనెను సృష్టించినట్లు మానవుడు దుష్టతను సృష్టిస్తాడు" అని నిర్ణయిస్తాడు. *డార్క్‌నెస్ విజిబుల్* (1979) అనే నవలలో ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో జర్మన్ బాంబింగ్ వల్ల లండన్‌లో ఘోరంగా గాయపడిన ఒక బాలుని దయనీయస్థితిని ఇతివృత్తంగా తీసుకొని రచన సాగించాడు. తరువాతి రచనలలో బుకర్ మెకనెల్ బహుమానం పొందిన *రైట్స్ ఆఫ్ ప్యాసేజ్* (1980), *ఏ మువింగ్ టార్గెట్* (1982) అనే వ్యాస సంపుటి, *ది పేపర్ మాన్* (1983) పేర్కొనదగినవి.

కా.వీ.

**జాన్సన్, ఐవింద్ (1900-1976) :** స్వీడిష్ నవలా రచయిత. శ్రామిక కుటుంబం నుంచి వచ్చిన ఈ రచయిత తన ఇతివృత్తాలలోను, రచనా శిల్పంలోను అనేక నూతనాంశాలను ప్రవేశపెట్టి, అత్యంతాధునికమైన సాహిత్య ప్రక్రియలకు, దృక్పథాలకు ప్రగతి స్ఫోరకంగా తన రచనలలో స్థానం కల్పించాడు. స్వీడిష్ సాహిత్యానికి అంతర్జాతీయ ఖ్యాతిని సమకూర్చాడు. 1974 లో హారీ ఎడ్మండ్ మార్టిన్సన్‌తో కలసి సాహిత్యంలో నోబెల్ బహుమతి అందుకొన్నాడు.

1900 జూలై 29 న ఒక నిరుపేద కుటుంబంలో స్వర్త్‌బోర్స్‌బిన్ (ఇది *బోడెన్* కు దగ్గిర) లో స్వీడన్ దేశంలో



జాన్సన్ జన్మించాడు. సతత హిమ భరితమైన ధ్రువ ప్రాంతంలోని తన గ్రామంలో కష్టభరితమైన బాల్య జీవితాన్ని గడిపి, 20 ఏళ్ల వయస్సులో ఏ విధమైన విద్యాశిక్షణ లేకుండా దక్షిణంగా పయనించి యుద్ధం మూలంగా సర్వనాశనమై దుర్భిక్షానికి గురియై ఉన్న పశ్చిమ యూరప్‌లో అడుగు పెట్టాడు. తన సరిహద్దులలో విలయతాండవం చేస్తూ ఉన్న ఘోర పరిస్థితులను స్వీడన్ పట్టించుకోకపోవడం చూసి, స్వదేశానికి వచ్చినప్పుడల్లా జాన్సన్ బాధ పడేవాడు. ఆయన వ్రాసిన మొదటి నవల మీద ప్రూస్ట్, జీద్, జోయిస్‌ల ప్రభావం ప్రస్ఫుటంగా కనబడుతుంది. వాటిలో మానవుని నిరాశ, నిస్పృహ ప్రతిబింబిస్తూ ఉంటాయి. *బాబినాక్* అనే నవలలో నేటి ధనిక స్వామ్య వ్యవస్థ వేసే వెట్టి తలలనూ, పన్నే పన్నాగాలనూ నిష్కర్షగా, నిర్దాక్షిణ్యంగా జాన్సన్ వివరించాడు. *రెగ్న్ ఇగ్రినింగెన్* (1933, Rain at Daybreak) అనే నవలలో ఈనాటి ఆఫీసులలోని దుర్భర పరిస్థితులను, అర్థరహితమైన చాకిరీని, అవి వ్యక్తుల మీద చూపించే ప్రభావాన్ని కన్నులకు కట్టేటట్లు చిత్రించాడు. *రొమాన్స్ ఓమ్ ఓలఫ్* (4 సంపుటాలు, 1934-1937) లో ఆర్కిటిక్ ప్రాంతంలోని తన జీవితానుభవాలు, అక్కడి వాతావరణ పరిస్థితులు ఏ విధంగా మనుష్యునిలో నైరాశ్యాన్ని పెంచుతాయో వ్యక్తం చేశాడు. ద్వితీయ ప్రపంచ సంగ్రామానికి కొంత ముందుగాను, సంగ్రామ కాలంలోను ప్రభుత్వ దమన విధానాలను, సామాన్య జన హింసను జాన్సన్ తన నవలలలో తీవ్రంగా విమర్శించాడు. వీటి నన్నింటిని గమనిస్తూ కూడా ప్రపంచ ప్రభుత్వాలు తటస్థవిధానాన్ని అవలంబించడాన్ని ఆయన గర్హించాడు.

*ఫ్రైన్ డెర్షస్ స్టల్* (1946; Return to Ithaca 1952), *హన్స్ నా దిస్ తిద్* (1960; The Days of His Grace, 1968) అనేక భాషలలోకి అనూదితాలయాయి. ఐవింద్ జాన్సన్ 1976 ఆగస్టు 25 న స్టాక్‌హోమ్‌లో మరణించాడు.

కా.వీ.

**జెల్లెరప్, కార్ల్ అడోల్ఫ్ (1857-1919) :** ప్రముఖ డేనిష్ కవి, నవలా రచయిత. డేనిష్ ఉన్నత వర్గాలలో కనిపించే సంకుచిత మనస్తత్త్వాన్ని పరిహసిస్తూ ఆయన చేసిన వ్యంగ్య రచనలు నేటికీ డెన్మార్క్‌లో విశేష ప్రజాదరణ పొందుతున్నాయి. 1917 లో జెల్లెరప్ సాహిత్యానికి నోబెల్ బహుమతి అందుకున్నాడు. ఒక క్రైస్తవ మతాచార్యుని కుమారుడుగా 1857 జూన్ 2 న డెన్మార్క్‌లోని రోహోల్టేలో జెల్లెరప్ జన్మించాడు. ఆరంభంలో క్రైస్తవ భగవచ్ఛాస్త్రం అధ్యయనం చేసినా, క్రమేణ డార్విన్ సిద్ధాంత ప్రభావం వల్లా, జియోర్గ్ బ్రాండిస్ విప్లవ భావాల వల్లా జెల్లెరప్ నాస్తికుడుగా మారి, క్రైస్తవ మతంతో తెగతెంపులు చేసికొన్నాడు.



తన తొలి రచన *ఏన్ ఐడియలిస్ట్* (1878) లోనూ, *ది అ్ప్రెంటిస్ ఆఫ్ ది ట్యూటాన్స్* (1882) లోనూ తాను నాస్తిక వాదాన్ని స్వీకరించినట్లు జెల్లెరప్ ప్రకటించాడు. *బ్రిన్ హెల్డ్* (1884), *హోగ్‌బార్ట్ ఓగ్ సైన్* (1888), *హెర్మాన్ వాండెల్* (1891), *వుల్ హోర్న్* (1893), *కాంగ్ జార్లే* (1893), *గిఫ్ట్ ఓగ్ మోడ్ గిఫ్ట్* (1898) వంటి విషాదాంత కావ్యాలను జెల్లెరప్ రచించాడు. తన జీవితంలో చివరికాలంలో బౌద్ధ సిద్ధాంతం అన్నా, ప్రాచ్య మతాలన్నా ఆయనకు ఎక్కువ ఆసక్తి కలిగింది. సమకాలీన జర్మన్ సమాజాన్ని చిత్రిస్తూ ఆయన ప్రచురించిన నవల *మోలెన్* (1896), ఇండియాలో జరిగినట్లు రచించిన ఒక పునర్జన్మకథ, భారతదేశ నేపథ్యంలోనే వ్రాయబడిన *డి వెల్డ్ వాండరర్* (The World Travellers, 1910) విశేష ప్రశస్తి పొందాయి.

1919 అక్టోబరు 11 న తూర్పు జర్మనీలోని క్లోట్జ్‌షే లో జెల్లెరప్ తుదిశ్వాస విడిచాడు.

బొ.శ్రీ.

**మార్టిన్సన్, హారీ (ఎడ్మండ్) (1904-1978) :** స్వీడిష్ కవి, నవలా రచయిత. శ్రామిక కుటుంబంలో పుట్టి, స్వయం కృషివల్ల ప్రఖ్యాతి పొంది గౌరవప్రదమైన స్వీడిష్ అకాడమీలో సభ్యుడయాడు (1949). శ్రామిక కుటుంబం నుంచి వచ్చిన స్వీడిష్ అకాడమీలో సభ్యులైనవారిలో ఈయనే ప్రథముడు. 1974 లో ఐవింద్ జాన్సన్‌తో పాటు ఈయన కూడా సాహిత్యంలో నోబెల్ బహుమానం అందుకొన్నాడు.



స్వీడన్‌లోని జామ్‌షోగ్‌లో మే 6 వ తేదీని హారీ మార్టిన్సన్ జన్మించాడు. బాల్యంలో దారిద్ర్యం వల్ల పెంపుడు పిల్లల వసతి గృహాలలో చాలా చోట్ల గడిపాడు. తన ప్రథమ యౌవనాన్ని, తరువాత కొంత కాలాన్ని వాణిజ్య నౌకలలో కూలివాడుగాను, నావికుడుగాను దేశద్రిమ్మరి గాను ఈయన వెళ్లబుచ్చాడు. ఈయన ప్రథమ కవితా సంకలనం *స్పోక్‌స్కెప్* (గోస్ట్‌షిప్) 1929 లో వెలువడింది. దీని మీద కిప్లింగ్ *సెవెన్ సీస్* ప్రభావం బాగా ఉంది. తన జీవిత ప్రారంభ దశలోని అనుభవాలను ఆత్మకథ లనదగిన *నస్లోర్నబ్లోమ* (1935; Flowering Nettle, 1936), *వాగెన్ ఉత్* (1936; The Way out) అనే నవలలలోను; *రెసోర్ ఉతన్ మల్* (1932; Aimless Journeys), *కప్ ఫర్వాల్* (1933, laape Farewell, 1934) అనే యాత్రా గ్రంథాలలోను సునిశితంగాను, కోమలంగాను, హృదయంగమంగాను చిత్రించాడు. బాగా ప్రచారాన్ని పొందిన ఈయన రచనలలో *పసద్* (1945, Trade wind) అనే కవితా సంపుటి, *వాగెన్ తిల్ క్లాక్ రికె* (1948; The Road, 1955) అనే నవల (ఇది దేశదిమ్మరుల, సంఘ బహిష్కృతుల జీవితాలను సానుభూతితో చిత్రిస్తుంది); *అనియార* (1956; Aniara, A Review of Man in Time and Space, 1963) అనే అంతరిక్షయాత్ర ఇతివృత్తంగా వ్రాసిన బృహ

